విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్

సంగ్రహ

# ఆంధ్ర విజ్ఞాన కోశము

మొదటి సంపుటము

## అ - ఆర్ష


మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం. ఏ.

*అధ్యక్షులు - సంపాదకీయవర్గము*





ప్రకాశకులు

సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి

హైదరాబాదు

**1958**

# విషయసూచిక

౧


1. తొలిపలుకు ౫
బెజవాడ గోపాలరెడ్డి, అధ్యక్షుడు
2. నివేదన వాక్యములు ౯
ఖండవల్లి లక్ష్మీరంజనం, కార్యదర్శి
3. కార్యనిర్వాహకవర్గము ౨౧
4. సంపాదకీయవర్గము ౨౩
5. రచయితలు ౨౬—౩౬


౨


6. అకారాది వ్యాసములు (109)
7. ఆకారాది వ్యాసములు (65) 422—800

1. సూచిక ౧
2. పారిభాషిక పదములు ౨౦
3. Acknowledgements ౨౫
4. శుద్ధ పత్రము ౨౮—౩౦


✶

# ప్రముఖ చిత్రములు


| | | |
|---|---|---|
| * | 1. ఆంధ్రప్రదేశ్ | |
| * | 2. బుద్ధ ధర్మచక్రప్రవర్తన ముద్ర | 88–89 |
| | 3. అజంతా 19 వ గుహ | ,, |
| | 4. నాగరాజు | 92–93 |
| * | 5. అప్సరస | ,, |
| | 6. అజంతా 19 వ గుహ లోపటి దృశ్యము | 96–97 |
| * | 7. బోధిసత్వుడు పద్మపాణి | ,, |
| | 8. బుద్ధుడు – అజంతా 19 వ గుహ | 100–101 |
| * | 9. ప్రసాధనము – అజంతా గుహ 17 | ,, |
| * | 10. పైకప్పుమీది చిత్రము | 104–105 |
| * | 11. మహాజనక జాతకము | ,, |
| | 12. అమరావతీ స్తూపము – ఆకృతి చిత్రము | 264–265 |
| * | 13. అశోకుని సామ్రాజ్యము | 388–389 |
| | 14. కాకతీయరాజ్యము | 464–465 |
| | 15. అనుమకొండలోని వేయి స్తంభాల గుడిలోని నంది | ,, |
| | 16. ఓరుగల్లుకోటలోని ద్వార తోరణములు | ,, |
| | 17. వేయి స్తంభాల గుడి – అనుమకొండ | ,, |
| | 18. ఆంధ్రప్రదేశపు ఖనిజ సంపద | 512–513 |
| | 19. పండరంగని అద్దంకి శాసనము (క్రీ. శ. 849) | 556–557 |
| | 20. కందుకూరి శాసనములు (క్రీ. శ. 850) | ,, |
| | 21. యుద్ధమల్లుని బెజవాడ శాసనము (క్రీ. శ. 930 ప్రాంతము) | ,, |
| | 22. చాళుక్య రాజరాజు నందంపూడి శాసనము (క్రీ.శ. 1053) | ,, |
| | 23. చేబ్రోలు శాసనములోని భాగము (క్రీ. శ. 1145) | ,, |
| | 24. శ్రీనాథునికాలమునాటి లిపి | ,, |


* గుర్తు గలవి వర్ణచిత్రములు.

★

# తొలి పలుకులు

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము మొదటి సంపుటమును ఆంధ్రప్రజానీకమున కర్పించుట సంతోషదాయకమైన కర్తవ్యముగా భావించుచున్నాను. ఈ విజ్ఞానకోశ ప్రచురణ విషయము 1953 ప్రాంతములందు ఉస్మానియా విశ్వవిద్యాలయ మహాభవనమున నొకమూల చిన్న గదిలో తళుక్కుమని మెరసినది. ఐదు సంవత్సరములలో నీ విధముగా నవతరించినది. దీని ధ్యేయమును ప్రకాశకు లొకచోట ఈ విధముగ చెప్పినారు: "విశ్వ విజ్ఞానమును సంక్షేపరూపములో ఆంధ్రకుటీరప్రాంగణములకు గొని వచ్చుటే ఈ కోశముయొక్క లక్ష్యము." కనుక గ్రంథపఠనము వంటి నిర్మాణ కార్యములకు అవకాశము చాలని ఈ దినములలో విజ్ఞాన సారమును సంగ్రహముగా తెలుపుటకూడ గొప్ప సేవగనే భావింపవలెను. ఇట్టి లక్ష్యముతో ఆరంభింపబడిన ఉద్యమము ఆంధ్రమహా జను లందరకును ఆదరణీయమే కాగలదు. ఇంకొకవిధముగాకూడ ఈ యుద్యమము సంభావ్య మగుచున్నది. ఈ శతాబ్దారంభము నుండియు తెలంగాణములో విద్య, భాష, సంస్కృతి విషయములందు నవచైతన్యము కలిగి ఒకప్పుడు మందముగను, మరొకప్పుడు వేగముగను పురోగమించుట మేమందరము గమనించి సంతోషపడుచుంటిమి. ఆంధ్రభాషలో సంపూర్ణ విజ్ఞానసర్వస్వము లేని లోపమును పూరించవలె నని తెలంగాణ సాహిత్యకులు కోరుటయు, నడుము కట్టుటయు, కొంత విజయమును సాధించుటయు యావదాంధ్రమునకును మోదకారణము.

ఈ యుద్యమమును ప్రథమమున హైదరాబాద్ ప్రభుత్వమువారును, ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారును ప్రోత్సహించి ఆర్థికముగా సహాయపడుట అభినందింపదగిన విషయము.

విజ్ఞానకోశ లక్ష్యములను, కార్యవిధానమును మొదటి సంపుటము విశేషములను సమితి కార్యదర్శిగారు తమ విపుల పీఠికలో చక్కగా వివరించి యున్నారు. సంపుటములో 328 పుటలాంధ్రదేశ ప్రశస్తి కంకితమగుట నాదృష్టిని ముఖ్యముగా నాకర్షించిన విషయము. ప్రాచీనార్వాచీన విజ్ఞాన జలములను ఆంధ్రులు నిరంతరము చేదుకొనుట కుపకరించు తఱుగని మోటబావిగ ఈ కోశము వర్ధిల్లవలె నని కోరుచు ఆంధ్రావళి దీనిని హార్దికముగా నాదరించి ఆర్థికముగా పోషింపగలరని ఆశించుచున్నాను.

హైదరాబాద్
విలంబి, అధిక శ్రావణ బహుళ ౭ గురువారం
7 ఆగస్టు 1958

బెజవాడ గోపాలరెడ్డి
అధ్యక్షుడు,
సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి.



# నివేదన వాక్యములు

*భారతీ శుభ గభస్తి చయంబుల తేజరిల్లు నో ఆంధ్ర మహాజనులారా,*

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ ప్రథమ సంపుటమును తమ కరకిసలయ రంజితముగ సమర్పించుచు సమితి పక్షమున మేముచేయు నివేదనమును ఆలింపుడు. మేము తెచ్చిన ఉలుపాను సాదరముగ స్పృశించి సావధానము వెంట, సానుభూతితో పరికింపుడు. కానుకలు రెండు విధములు. కానుకను స్వీకరించు వ్యక్తి మహత్త్వమున కది అనురూపముగ ఉండవలెను. లేదా సమర్పించువాని సామర్థ్యమును బట్టియు అది వలయుతము కావచ్చును. శ్రీకృష్ణునకు కుచేలుడు అటుకులు మాత్రమే మూటగట్టి తేగలిగినాడు. మనసు చలువయే ప్రధానముకాని వస్తువు విలువ కాదుగదా!

"కానుకయే సమర్పింప దలచినచో సృజనాత్మకమైన పద్య కావ్యమో, గద్య కావ్యమో, నవలయో, నాటకమో, ప్రహసనమో, ఏకాంకికయో, కథానికయో, గల్పికయో, స్కెచ్చియో, ఏదేనొక యపూర్వ కథానిబంధనముగ వ్రాసికొని రాలేదేమి? నీరసమై వ్యుత్పత్తిమాత్ర పర్యవసాయులై, చాలవరకు సంకలనాత్మకమైన ఈ ప్రయత్నమేమి? దీని ప్రయోజనమేమి?" అని మీరు పెదవి విరువబోకుడు. ప్రతి భాషయందును సృజనాత్మక సాహిత్యమును, ప్రయోజనాత్మక సాహిత్యమును – రెండును ప్రాణాధారములే. జీవితపు పరమ ప్రయోజనమైన నిస్స్వార్థానందమును సమకూర్చునది సృజనాత్మకమైన సాహిత్యము. అది ఆధేయము. ఆధారము లేక ఆధేయము నిలుచుట యరుదు. నిస్స్వార్థానందమునకు ఆధారమేమి? సుసమృద్ధమై, సుసంపుష్టమైన జీవితము. మానుషానందమును నిరూపించుచు ఉపనిషన్మహర్షు లేమనుచున్నారు? "యువా స్యాత్సాధు యువాధ్యాయకః। ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః। తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణాస్యాత్। సఏకో మానుష ఆనందః" మానుషానందమునకు మానదండ మెవడు? రూపసియైన యువకుడు, అధ్యయనపరుడు, కార్యములందు చురుకైనవాడు, మనోదార్ఢ్యముగలవాడు, బలిష్ఠుడు అయిన ఎవని కొరకు ఈ భూమి అంతయు విత్తపూర్ణమై యుండునో అట్టి యువజనుడు మానుషానందమునకు గజముబద్ద. ఏవం విధమైన ఆనందమునకు ఆధేయముగా ఒక వ్యక్తినిగాని, ఒక జాతినికాని చేయు సాహిత్యమేది? ప్రయోజనాత్మక సాహిత్యమే అని మనవిచేయ సాహసించుచున్నాము. సృజనాత్మకమైన నాకృతియందు దీనినిగూడ నేను వ్యంగ్య మర్యాదగా సాధించుచునే యున్నానుగదా, అని యొక కవికుమారుడు సవాలు చేయవచ్చును. నాయనా! నిజమే. అంతవరకును సాహిత్యము యొక్క ప్రయోజనాత్మక ఆవశ్యకమును నీవు గుర్తించుచున్నావుగదా! సుకుమార బుద్ధులకు కావ్యము. జనసామాన్యమునకు అది చాలదు. వారికి విశదముగను, సుస్పష్టముగను, అసందిగ్ధముగను తెలియచెప్ప వలెను. ప్రయోజనాత్మక సాహిత్యమే ఇచ్చట మనకు ఆశ్రయణీయము. కవులకును మాకును గతిభేదమే కాని గమ్యభేదము లేదు.

ప్రయోజనాత్మక సాహిత్యమునందు "విజ్ఞాన సర్వస్వము" మూర్ధన్యమైనది. ఆంగ్లమునందు **Encyclopaedia** అను పదముచే నిది చెప్పబడుచున్నది. **Enkyklios** (చక్రరూపమైన) **paideia** (విద్య) అను గ్రీకుభాషాపదముల కూడికచే నిది యేర్పడినదని తెలియవచ్చుచున్నది. అనగా విద్యాచక్రము లేక జ్ఞానచక్రము అని దీని యర్థము. కళాశాస్త్రములు, విజ్ఞానశాస్త్రములు – వీటి ఆవృత్తియే విజ్ఞానవలయము. దీనికే మనవారు విజ్ఞాన సర్వస్వమని చక్కగా పేరిడినారు. దీనినే కొందరు 'కోశ' శబ్దాంతముగా వఠించుచున్నారు. మహారాష్ట్రభాషయందలి ఈతెగ గ్రంథము 'జ్ఞానకోశము' అని వ్యవహరింపబడినది. విజ్ఞాన సర్వస్వమును ఒకవిధముగా కోశమే. నిఘంటు రూపములో నుండుటచే కూడ దీనికీపేరు వచ్చియుండవచ్చును. నిఘంటువునందు పదముల వాచ్యార్థ

ములు, పర్యాయ పదములు మాత్రము కూర్చబడును. ఉదాహరణమునకు వాయువు అనగా గాలి యను అర్థమీయబడును. నిఘంటువు పని ఇంతటితో ముగిసినది. విజ్ఞానకోశము యొక్క పని ఇక్కడనుండి యారంభించును. వాయువు లేక గాలి అను పదార్థమెట్టిది? దాని స్వరూపమేమి? అది ఘనపదార్థమా? ద్రవపదార్థమా? మరొక పదార్థమా? అది ఏక పదార్థమా? లేక ద్రవ్యాంతర సంయోగముచే నేర్పడినదా? దాని గుణము లెవ్వి? శబ్ద గుణకత్వము, గంధవాహిత్వము. దీనిని ద్రవ్యాంతరముగా మార్చనగునా? దీనిని సర్వనాశము చేయవచ్చునా? ద్రవ్యాంతరరూప స్వీకృతిని మాత్రము పొందింపగలమా? ఇత్యాది అసంఖ్యాక ప్రశ్నములకు విజ్ఞానకోశమే సమాధానమీయగలదు. ఈ ప్రమేయమున నిఘంటువు మూకీభావము వహించుచున్నది.

ప్రజల జీవితమును సుఖవంతముగను ఆనందతుందిలముగను చేయుటకు, వారికి జ్ఞానచక్రపరిచయము కావించుట అవసరమని తెలుచున్నది. ఎట్టి విజ్ఞానమును మన ప్రజల కందించవలెను? పూర్వ విజ్ఞానమా? ఆధునిక విజ్ఞానమా? పూర్వ విజ్ఞానము విస్తారముగా తర్కమూలము, దార్శనికము అని భావింపవలసి యున్నది. అణిమాది సిద్ధులు కలవనియు, పూర్వ మహర్షుల కవి కరతలామలకములై యుండెననియు, పురాణములలో చదువుదుము. కళాపూర్ణోదయములోని మణిస్తంభుడను సిద్ధుడు దూరశ్రవణము, దూరదర్శనము, కామ గమనము మొదలగు అపూర్వ శక్తులను సాధించెనని కవి వర్ణించెను. వీటిలో మొదటిశక్తి ఇప్పటి 'టెలివిషన్' వంటి దనుకొందము. ఈ శక్తుల నాత డెట్లు సాధించెను? తపస్సుచే సాధించెనని సులభముగ సమాధానము చెప్పుదురు. ఈ సమాధానముచే ఆధునిక దృష్టికి, హేతువాదరతబుద్ధికి, సంతృప్తి కలుగుట లేదు. మీకు ఆస్తికబుద్ధి లోపించుటవలన తపోమహత్త్వమును నమ్మలేకున్నారు, మీరు హాతాశులు, అని పెద్దలు గదమాయింతురు. ఎట్లయినను ఫలితము శూన్యము. పోనిండు. కృచ్ఛ్ర చాంద్రాయణాదులచేతను, పవన పర్ణాంబు భక్షణముచేతను కొన్ని సిద్ధులను సాధించగలమే యనుకొందు. ఆ శక్తులు సాధకులకు మాత్రమే పరిమితములై యుండును. కాని ఇతరులకు సంక్రమింపచేయుటకు వీలు కానివి. పూర్ణోదయ సిద్ధుడు దూరమునుండియే మణికంధరుని నైతిక పతనము మున్నగునవి వీక్షించి నవ్వుకొనగల్గెను కాని, తహతహ పడుచున్న కలభాషిణికి ఆ దృశ్యములను చక్షుర్గోచరము చేయించగలిగెనా? లేదు. నేటి కాలమందన్ననో, ప్రపంచపు మారుమూలలలో దృశ్యములను, శబ్దములను ఎప్పటికప్పుడు నిరుపేదకూడ చూచి, వినగలుగు చున్నాడు. పూర్వ విజ్ఞానమునకును, ఆధునిక విజ్ఞానమునకును భేదము సుస్పష్టమగుటలేదా? భారతీయ ప్రాచీన విజ్ఞానమును మనము అవిశ్వాసముతో చూడనక్కరలేదు. పరిహసించుట మరియు అవివేకము. కాని దాని సంబంధమైన పరంపరాజ్ఞానము, ప్రయోగ కౌశల్యము, అనుభవ సుఖము దూరదూరగతములై పోయినవి. నోటిలో లేని పటిక బెల్లమును చప్పరించి మాత్రము లాభమేమి? మహత్త్వపూర్ణమై యుండునని విశ్వసించుచు, ఒక నమస్కారముచేసి మనదారి మనము చూచుకొనవలసి యున్నది. దానిని పునః ప్రతిష్ఠింపగోరుట కుందేటి కొమ్ము సాధించుటకై తిరుగుటవంటిదే యగునేమో!

ఇక మిగిలినది ఆధునిక విజ్ఞానము. ఇది యంతయు తెల్లవాని మాయ అన్నను ఇది మనలను వదలుట లేదు. దీని సంబంధమైన పరంపరాజ్ఞానము, ప్రయోగ కౌశల్యము, అనుభవ సుఖము మనకు ప్రత్యక్ష ప్రతీతిలో ఉన్నవి. దీనిని కాదనుట యెట్లు? ఉపాసింపకుండుట యెట్లు? కావున ఆధునిక విజ్ఞానమే సర్వథా ప్రతిపాద్యమగుచున్నది. పూర్వ విజ్ఞానము విశ్వాసముపై నాధారపడి యున్నది. ఆధునిక విజ్ఞానము ప్రయోగమూలమై యున్నది. ప్రయోగసాధనములు, కౌశలము అలవడినచో ఎల్లవారును దీనిని పరీక్షింపవచ్చును. హేతువాదము, సంభావ్యత దీనికి పునాదిరాళ్లు. పూర్వయుగము విశ్వాసయుగము. ప్రస్తుతయుగము వివేచనా యుగము. వివేచనకు ప్రయోగము మూలము. కావున విజ్ఞానసర్వస్వములో కళాశాస్త్రములతోపాటు విజ్ఞానశాస్త్రములు కూడ ప్రాధాన్యము వహింపదగి యున్నవి.

నిద్రాణమైన జాతియందు నవచైతన్యమును నూత్న జీవితమును ప్రబోధించుటలో విజ్ఞానకోశమే అనితర సాధనమని ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వచరిత్రవలన తెలియుచున్నది. రూసో, వాల్టేరు, డిడిరో మున్నగు ఫ్రెంచి మహాశాత్త్వికుల – విప్లవవాదుల – రచనలచే జ్వలితాంగారకుండ సన్నిభమైనది ఫ్రెంచి ఎన్‌సైక్లోపీడియా,

పరాసు విప్లవనినాదములు – స్వాతంత్ర్యము, సమానత్వము, సౌభ్రాతృత్వము – అను మంత్రత్రయ మీ గ్రంథము మూలముననే ఉద్ఘోషింపబడెనని తజ్ఞులు చెప్పుదురు. విజ్ఞానసర్వస్వ ప్రయోజనమును గూర్చి ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వ సంపాదకులలో ప్రముఖుడైన డెనిస్ డిడిరో మహాశయు డిట్లు వ్రాసెను: "ప్రపంచ వీథులలో వికీర్ణమై పడియున్న విజ్ఞానమును రాశిచేసి సమకాలికులకు పరిచయము చేయుటయే విజ్ఞానసర్వస్వపు టాదర్శము. అనంతర తరముల వారికి ఈ జ్ఞానభాండారము నందిచ్చుటయు దీని లక్ష్యమే. ఇట్లు చేయుటవలన పూర్వ పూర్వ తరముల విజ్ఞానము ఉత్తరోత్తరతరములవారికి అందుబాటులోనికి వచ్చుచున్నది. లేకున్నచో అది నష్టమగు ప్రమాదముగలదు. మనసంతతివారు ఈ విజ్ఞానావలోడనముచే జ్ఞానవంతులు, సుఖవంతులు కాగలుగుట మన లక్ష్యము. ఇక మనమును నిరర్థకముగ జీవించి మరణించినవారము కాకుందుముగాక యనియు, లోకము మనలను కృతజ్ఞతతో స్మరించవలెననియు ఆశించి విజ్ఞాన సర్వస్వరచన సాగింతము."

అయినచో రూసో, వాల్టేరు, డిడిరోవంటి మహా రచయితలు సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమును తమ రచనలచే ప్రకాశింపచేసిరాయని మీరడుగవచ్చును. ఉన్నారు కాని యొక పరమభేదమును గుర్తించవలెను. శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య, పద్మభూషణ, డాక్టరు పి. టి. రాజు, ఉప్పులూరి గణపతిశాస్త్రి, బులుసు అప్పన్నశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, కురుగంటి సీతారామయ్య, దూపాటి వేంకటరమణాచార్యులు, ఆదిరాజు వీరభద్రరావు మున్నగు పలువురు పలితకేశులు, ఏకదంతులు, గళితదంతులు వారివారి అభిమాన విషయములలో దుర్దాంతులు అయినవా రెందరో సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశములో వ్యాస చంద్రికలను వెదజల్లినారు. "పాశ్చాత్య విజ్ఞాన మదదంతావళములైన రూసో, వాల్టేరు మున్నగువా రెక్కడ ? దేవుడని, సత్యమని, శాంతియని, అహింసయని ప్రసన్నారావములు చేయుచు హరిణశాబక సదృశులైన వేంకట రంగయ్య, గణపతి శాస్త్రివంటి వారెక్కడ ? ఔపమ్యభంగమైనది" అని అట్టహాసము చేయుదురు నేటి యువకులు. మేమందుము గదా, తొందరపడవలదు. వారికిని వీరికిని భేదము గుర్తించుడు. పాశ్చాత్య చింతకులు కృశానుసదృశులు. భారతీయ చింతకులు వరుణసదృశులు. సప్తజిహ్వుని చూచి శిశువులు కూడ దూరదూరముగ ప్రాకిపోవుదురు. శీతల జలపూర్ణ కుంభమును చూచి ఆ శిశువులే అల్లరిచేయుచు ఆలింగనము చేసికొందురు. భారతీయులది పూర్ణకుంభ సంస్కృతి. పాశ్చాత్యులది విద్యుద్ఘట నాగరకత. ఏది లేకున్నను లోకము తావన్మాత్ర దరిద్రమగును. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమునందు పూర్ణకుంభ – విద్యుద్ఘట – సమ్మేళనమును సాధింప యత్నించుచున్నాము. లక్ష్యసాధనమున మావి దుర్బల హస్తములు కావచ్చును. లక్ష్యమునే అభినందింపుడు.

ఈ విచిత్ర సమ్మేళనమును తాటిపండ్లు ఆవగింజలు కలబోసినట్లు – మీరెట్లు సాధింప బూనుకొన్నారని మీరడుగుదురు. 1. ప్రతి శాస్త్రమునందును ప్రాచీన భారతీయులు సాధించిన విజయములు సమీక్షించుటకు తగినట్లు శీర్షికలను ఏర్పాటు చేయుట. 2. ప్రాచీన భారతీయ మహావ్యక్తుల చరిత్రములను యథా సంభవముగ వ్రాయించుట. ఉదా: ఆపస్తంబుడు, అన్నంభట్టు, 3. ఇంతటితో తృప్తిపడక "భారతదేశపు ప్రాచీన విద్యలు – కళలు" అను క్రొత్త విభాగమునే ఈ కోశమునందు చేర్చితిమి. 4. అట్లే ఆయుర్వేదము అను ప్రత్యేక శాఖను గూడ ప్రవేశపెట్టితిమి. పాశ్చాత్య వైద్యపద్ధతినే కాక ఆయుర్వేద మహత్త్వమును గూడ దీనిముఖమున లోకమునకు ప్రకటింప యత్నించితిమి. వీటిలో మూడవదగు "భారతదేశపు ప్రాచీన విద్యలు – కళలు" అను విభాగము మాకు మిక్కిలి అప్యాయమైనది. అయినను ఇందలి శీర్షికలపై వ్యాసములు వ్రాయువారు మిక్కిలి అరుదుగా లభించినారు. ప్రాచీనవిద్య లెరిగిన పండితవరేణ్యులు ఈ శాఖను విజయవంతముగా నిర్వహించుటకు తోడ్పడ ప్రార్థితులు. లేనిచో ప్రాచీన భారత విజ్ఞానము ఆర్భాటము కలదేకాని సత్తాలేనిది యని విమర్శకులు మమ్ముల దుయ్యబట్టగలరు. ఈ సంపుటమునందు 'అభ్యవహారము – ఆర్షపద్ధతి' 'ఆర్షగణితము' 'ఆర్షభూగోళము' మొదలగు విద్వత్తాపూర్ణములైన వ్యాసములు వ్రాసిన పండితులు మా కృతజ్ఞతలకు పాత్రులు. ఈ విధముగ ప్రాచీన విజ్ఞానమునకును, ఆధునిక విజ్ఞానమునకును ఈ విజ్ఞానకోశము సేతువుగా నుండగలదని మా ఆశయము.

మరియు భారతీయులు శాంతిప్రియులు. అహింసావాదులైనను వీరు నిరస్త్రులు, నిరాయుధులు, నిస్తేజస్కులు కారు, కారాదు, అని చాటుట మా ఆశయము. శ్రీరామచంద్రుని గూర్చి వాల్మీకి చెప్పినట్లు "కస్య బిభ్యతి దేవాశ్చ, జాతరోషస్య సంయుగే" అనునదియే భారతీయులకు సమీచీనమైన ఆదర్శము. దీనిని మనసునం దుంచుకొని సంగ్రామ శాస్త్రమను విభాగము నొకదాని నిందు చేర్చితిమి. కాని దీని నిర్వహణము మాకొక సమస్య యైనది. చిరకాలము పారతంత్ర్యమునందు పడియుండుటచే భారతీయులకు-తత్రాపి ఆంధ్రులకు యుద్ధ విజ్ఞానమే కొరవడినది. ఆంగ్ల విజ్ఞానసర్వస్వమువంటి ఉద్గ్రంథములలో సంగ్రామ శాస్త్రము దక్షతతో చర్చింపబడినది. వాటి ననుకరించుట సాధ్యమే యైనను కేవల గ్రంథ జ్ఞానము అనుభవ జ్ఞానమునకు సాటిరాదు కదా యని సంకోచించుచున్నాము.

సంగ్రహ విజ్ఞానకోశ నిర్మాణమునందు మాకు గల్గిన మరియొక సౌభాగ్యము స్మరింపదగియున్నది. దీని సంపాదకులలో పలువురు, ఉస్మానియా విశ్వవిద్యాలయపు ఆచార్యులుగనో, దాని అనుబంధ సంస్థలతో సంబంధము కలవారుగనో ఉండుట ఏర్పడినది. నిజమునకు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు ఈ యుద్యమముతో ప్రత్యక్షసంబంధ మేమియును లేదు. కాని సమర్థులైన సారథుల నెందరినో అయాచితముగ ప్రసాదించిన ఉస్మానియా విశ్వవిద్యాలయము పరోక్షమిత్రమనుటలో సందేహములేదు. నిర్వహింపబడునది విజ్ఞానకోశము. నిర్వాహకులు చాలవరకు విశ్వవిజ్ఞాన ప్రతిబింబమైన విశ్వవిద్యాలయమునందలి అధ్యాపకులు. వారి బాధ్యతలను గూర్చి వేరే మనవిచేయనేల? ప్రశంసింపనేల? మరియొక అంశము పేర్కొనదగియున్నది. హైదరాబాదు నగరము పెక్కు భాషలకును సంస్కృతులకును కూడలిగ నుండినది. ఈ భాషాసంస్కృతుల ప్రతినిధులయొక్క ఆదరసహాయములు సంగ్రహ విజ్ఞానకోశమునకు లభించుట ముదావహము. అందును మన ముసల్మాను సోదరులలో విజ్ఞులు విద్యాధికులు అయిన పలువురు విజ్ఞానకోశముతో సన్నిహితసంబంధము కలిగి మాకు చేదోడు వాదోడుగానుండుట సంతోషదాయకము. వీరిలో డాక్టరు వహీదుద్దీను, ప్రొఫెసరు హారూన్‌ఖాన్ షేర్వానీ, డాక్టరు యూసుఫ్ హుస్సేన్‌ఖాన్, జనాబ్ అబ్దుల్ మజీద్ సిద్దికి, డాక్టరు అబ్దుల్ మొయీద్‌ఖాన్, డాక్టరు సయీదుద్దీన్ మున్నగు ప్రముఖు లెందరో ఉన్నారనుట మాకు గర్వకారణముగనున్నది. సోదర భాషా భాషీయులలో కన్నడ శాఖాధ్యక్షులు ఆచార్య డి. కె. భీమసేనరావు, కవిలె భాండార శాఖాధిపతి శ్రీ ఆర్. యం. జోషి మున్నగువారు పెక్కుమందిగలరు. విజ్ఞాన బాంధవ్యమునకు దగ్గర ఏమి? దూరమేమి? కటక్ విశ్వవిద్యాలయాచార్యులు శ్రీ గోపాలచంద్ర మిశ్రా, గౌహతీ విశ్వవిద్యాలయాచార్యులు డాక్టరు మహేశ్వర నియోగ్ అను వారు చక్కని వ్యాసములను వెలయించినారు. ఇట్లెందరిని పేర్కొనగలము? మాది తామరకొలనువంటి సంస్థ. నీటి కొలది తామర సుమ్మీ!

సంగ్రహ విజ్ఞానకోశ నిర్మాణయత్న మెట్లు పొటమరించినది? ఎందుకు తలయెత్తినది? "కారణంబులు ఉద్బోధకములు" ఏవి అని తెలిసికొనుటకు మీకు కుతూహలము ఉండవచ్చును. లేకున్నను మేము వినిపింతుము లెండు. ప్రోద్యమానుడగు కవికుమారుడు తన కావ్యములు వినుమని నిర్బంధించినట్లు. విజ్ఞానకోశము ఊర్ధ్వమూలము, అధశ్శాఖము అయిన వింత అశ్వత్థవృక్షమా! లేక నేలనుండి వ్రేళ్లు తన్నుకొనివచ్చిన వృక్షమా? ఇది భూజమే గాని ఆకాశజము కాదని మనవి చేయుచున్నాము. ఎట్లన ప్రభుత్వము ఒక ఉద్యమము అవసరమని భావించి, స్థాపించి, నిరంతర ధనజలసేచనముచే పెంపొందించిన వృక్షము ఊర్ధ్వమూలము. ఒక ఉద్యమము అవసరమని భావించిన ప్రజలచే ఏర్పాటు కావింపబడి, నిర్ధనతాగ్రీష్మమున మలమల మాడుచు, ఏ పుణ్యవంతులో పోసిన ఉద్ధరణి నీళ్లతో తలయెత్తుచు, ఎన్నటికైన వర్షాగమము కాకుండునా యని నీరసపు బలముతో లేచిన వృక్షమే అధోమూలమైన వృక్షము. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమట్టి అధోమూలమైన వృక్షమని సవినయముగనే చాటుచున్నాము.

"ఏవీ-దీని వ్రేళ్లెచ్చట నున్నవి?" అందురా - ఓపికతో, ఉపాయముతో త్రవ్వి చూడుడు. లేదా మా గ్రంథమందు ప్రకటింపబడిన వ్యాసము 'ఆంధ్రోద్యమము - (తెలంగాణములో)' అను దానిని చిత్తగింపుడు.

అసఫ్ జాహి పరిపాలనము తెలంగాణపు భాషా సంస్కృతులకు సుదీర్ఘ నిదాఘమైనది. ఆసన్నవర్షమైన కాలమున వేసగి మరింత చెలరేగును. ఈ శతాబ్దారంభమున ఆంధ్రభాషను, సంస్కృతిని రక్షించుకొనవలెనను మహత్తరాశయముతో హైదరాబాదు నగరమునందు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ మను మట్టి విత్తనమును శ్రీయుతులు రాజా నాయని వేంకట రంగారావు, కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, ఆదిపూడి సోమనాథరావు, మైలవరపు నరసింహశాస్త్రి మున్నగు మహనీయులు నాటిరి. ఐదుగురుకూడి ఒక గింజను మొలవేయుటయా ? తొమ్మండుగురు వడ్రంగులు కలిసి డోలు చేయబోయి సోలచేసినట్లున్నదీ వృత్తాంత మందురేమో. కాని వారి సంకల్ప బలమెట్టిదో ఆసోలయే తవ్వ అయి, మాన అయి, అడ్డ అయి, కుంచ మయి, పుట్టి అయి, గరిసె అయి, రోదసీ కుహరమంత కొలపాత్రయైనది. ఇంతలో ఏమూలనుండియో శ్రీ మాడపాటి హనుమంతరావను తోటమాలివచ్చి పూర్వోక్తులైన మహనీయులు వేసిన బీజమును చీమ ఓపికతో పెంచి, పెద్దది చేసెను. అదియొక పెద్ద కథ లెండు. ఈ చిన్న విత్తన మాధారముగా ఎన్నియో రాజకీయ వృక్షములు, సారస్వత తరువులు తెలంగాణపు ఉద్యానము నలంకరించినవి.

సమగ్ర విజ్ఞానసర్వస్వ ప్రచురణమునకు ఆంధ్రదేశము నోచుకొనక పోయెనే అను చింత తెలంగాణపు సారస్వత వ్యవసాయకులను పెక్కు దినములనుండి వెన్నంటుచుండెను. కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు గారు ఆంధ్ర విజ్ఞానసర్వస్వమును ఆరంభింపగాచూచి, తమ భాషలో అట్టి యుద్యమము లేకపోయెనే యని మథన పడి మహారాష్ట్రవిద్వాంసు లయిన కేత్కరుగారు మహారాష్ట్రజ్ఞానకోశము నారంభించి, 28 సంపుటములుగల యుద్గ్రంథమును ప్రకటించి పెట్టిరి. ఆంధ్రమునందు విజ్ఞాన సర్వస్వ ప్రచురణము నాటికిని నేటికిని సమగ్రతను చెందకుండుట ఏ సాహిత్యకునకు [illegible] రణముగ నుండదు ? కుందేలు - తాబేలు కథ ఆవృత్తి యగు చున్నదా ? దేవిడీ జమీందారు [illegible] భూపాలు డొక్కడు తానుద్దేశించిన విజ్ఞానసర్వస్వ గ్రంథమును సమాప్తికి కొనిర [illegible] ! అని ఆధునిక విజ్ఞానమునకు సరియగు నద్దమగునా, కాదా, యను ప్రశ్నలు ఒరకు పె [illegible] ఏణిలో నుంచబడిన నిర్వ్యృత్తవస్తువు. సమగ్రమైన విజ్ఞానసర్వస్వమును ఆంధ్రు లేల సృజింప మహా [illegible] గ సమాధానము చెప్పవలయు నన్న వ్యష్టికృషియందు ఆంధ్రు లెంత ప్రగల్భులో స [illegible] ంటన విస్సె ప్రగల్భులని చెప్పదగియున్నది. తెలంగాణమునందు సాహిత్యజాగృతి యేర్పడినప్పటినుండియు [illegible] ధ్యయుగ [illegible] మును నిర్వర్తించి చూపవలె నను యోగ్యతృష్ణ సాహితీపరులను త్వరపెట్టుచుండెను. విజ్ఞ [illegible] క్రీ. శ. 1 [illegible] థమండలియొక్క ఆదర్శములను కొనసాగించుటకై ఆంధ్ర చంద్రికా గ్రంథమండలి కొంత క [illegible] ను ప్రారం [illegible] సారస్వతపరిషత్తు కృషి ఇప్పటికిని సాగుచునే యున్నది. ఉద్యమము లను, సంస్థలను, ఉపాయ [illegible] సముచ్చ [illegible] టట, ఓర్పుతో నిర్వహించుట తెలంగాణీయులకు శ్రీ మాడపాటి హను మంతరావు పంతులు, రా [illegible] మొదటివ వేంకటరామరెడ్డి మహాశయులవంటివారు నేర్పిన విద్య. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమును తెలంగాణము శేషము. ఈ [illegible] ర్ధము చేయవలయునను ప్రయత్నములు క్రీ. శ. 1946 ప్రాంతమున జరిగియుండెను. ప్రణాళిక పై [illegible] క చర్చింపబడుచుండెను. కాని కాల మింకను అనుకూలింపలేదు.

పోలీసుచర్య అనంత [illegible] ఏడిన గొప్ప సాహిత్య ప్రభాతమునందు దాశరథి, కాళోజీ ప్రభృతి కవి శకుంతారావముల నడుమ విజ్ఞాన సర్వస్వ నిర్మాణముపై కొందరికి తిరిగి అభిలాష తలయెత్తెను. ఈ సన్నివేశ మును గూర్చి మేము ఇదివరలో ప్రకటించిన కొన్ని వాక్యములనే తిరిగి ఉద్ధరించుచున్నాము. "1953 వ సంవత్సరమునందు, ఒకనాడు ఉస్మానియా విశ్వవిద్యాలయ గణితశాస్త్ర శాఖాచార్యుడయిన డాక్టరు బేతవభట్ల విశ్వ నాథముగారు తెలుగుశాఖకు చెందిన శ్రీ లక్ష్మీరంజనంగారి దగ్గరకు హఠాత్తుగా వచ్చి యిట్లు ప్రసంగించిరి:-

విశ్వ : వెనుక మనము విడిచిపెట్టిన విజ్ఞానసర్వస్వ నిర్మాణ తంతువులను మరల చేపట్టవలెను.

లక్ష్మి : అమ్మయ్యో, అంతభారమును వహించుటకు మనకు శక్తిచాలదు. అదియునుగాక తెలుగు భాషాసమితి వారు విజ్ఞానసర్వస్వమును వ్రాయించుచున్నారని వినుచున్నాముగదా!

విశ్వ: కావచ్చును. దాని తీరు తియ్యములు మనకు తెలియవు. మన ప్రణాళిక భిన్నముగ నుండగలదు. ఆంగ్లము వంటి గొప్ప భాషలలో ఎన్ని తీరుల విజ్ఞానసర్వస్వములు లేవు ?

లక్ష్మి: "కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన." మీరు నాయకత్వము వహింపుడు. నేను అనుసరించి వత్తును. కనీసము సుస్పష్టమైన ప్రణాళికనైనను మనము సిద్ధము చేయగల్గినచో అది భావి సాహిత్యకులకు ముడిసరకుగ ఉపయోగపడవచ్చును"

అట్లే జంకుకొంకులతో 1953 సం. 15 అక్టోబరు ప్రాంతమున ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగుమందిరమునందు పై ఇరువురును సమావేశమై గణాధిపతిని స్తుతించి, సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ నిర్మాణ యత్నమును ఆరంభించిరి. కోశమునందు చెప్పవలసిన ప్రధాన విషయములకు విశ్వవిద్యాలయమే ఒరవడిగా చేకొనబడెను. ప్రతి శాస్త్రమునకు సంబంధించిన ముఖ్య విజ్ఞానమును సంగ్రహరీతిలో జనుల కందజేయుట లక్ష్యముగా గ్రహింపబడెను. విజ్ఞానము అనంతమైనది. దానిని ఒక్క గ్రుక్కలో ఆపోశనము పట్టలేము. కావున ప్రతి శాస్త్రమును గూర్చియు పరిమిత సంఖ్యగల శీర్షికలు పర్పాటుచేయ నిశ్చయము జరిగెను.

ప్రణాళికానిర్మాణము చాలవరకు పూర్తిఅయినతర్వాత అప్పటి హైదరాబాదు ముఖ్యమంత్రులును, బహుభాషావేత్తలును, సహృదయులును అయిన డాక్టరు బూర్గుల రామకృష్ణారావుగారికి ప్రణాళికను సమర్పించుటయు, దీని నిర్వహణభారము వహింప సమితికి అధ్యక్ష పదవిని స్వీకరింపగోరుటయు జరిగినవి. శ్రీవారిట్లు సెలవిచ్చిరి.

ముఖ్యమంత్రి: విజ్ఞానసర్వస్వ నిర్మాణమా! సుసంపన్నమైన తెలుగు భాషాసమితి నిర్వాహకులే దీనితో పెనగులాడుచున్నారు. మీకు విజయమెట్లు కలుగును ?

లక్ష్మి: ఇది సంగ్రహకోశము. మన సాహిత్యకులు దీనిని నిర్వహించుటకై ఉత్సాహవంతులై యున్నారు.

ముఖ్యమంత్రి: సంగ్రహ కోశమైనచో అది వేరుమాట. నిదానముగా సాగింపుడు. ప్రభుత్వమునుండి ధనసహాయము జరుగునని పెద్ద ఆశ పెట్టుకొనవలదు.

తెలంగాణములో అన్ని సదుద్యమములకును పితామహులైన ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు "జాగ్రత్తతో, అచంచల దీక్షతో దీనిని కొనసాగించు"డని హృదయ భారముతో మమ్ముల నాశీర్వదించిరి.

అక్టోబరు 2, 1956 సంవత్సరము మహాత్మాగాంధి పవిత్ర జన్మదినోత్సవ సందర్భమున విజ్ఞానకోశ ప్రథమ సంపుట ముద్రణమునకు ప్రారంభోత్సవము జరిగెను. అప్పటి కిప్పటికి రెండు సంవత్సరములు దశములు రాల్చుకొన్నవి. ఒక్క సంపుటమును ముద్రించుటకు 20 మాసములు దీర్ఘకాలమే. కాని ఈనడుమ కార్యనిర్వాహకుల నెదుర్కొన్న ఆర్థిక సమస్యలు, గ్రంథనిర్మాణ సమస్యలు, జాగునకు కారణమయ్యెను.

అన్యభాషలలో ప్రకటింపబడిన విజ్ఞానసర్వస్వముల సంఖ్యను, వానిసంపదను చూచినచో తెలుగువారు నిశ్చ్కముగ ముగ్ధులగుదురు. సాధారణ విజ్ఞానసర్వస్వములే కాక, ఒక్కొక్క శాస్త్ర శాఖకే ఒక ప్రత్యేక విజ్ఞానకోశము, వయోభేదమునుబట్టి ఆయా వర్గములవారికి, బాలకులకు, యువకులకు, ప్రౌఢులకు వేర్వేరు విజ్ఞానకోశములు — ఇట్లసంఖ్యాకముగా ఈశాఖ వ్యాపించినది. ఆంగ్లభాషయందు ఉత్పత్తికివచ్చిన విజ్ఞానసర్వస్వములు (1) New Popular Encyclopaedia (2) New Century Encyclopaedia of Names (3) The New Encyclopaedia of Sports (4) Pears Encyclopaedia (5) Children's Encyclopaedia (6) Neunes' Pictorial-Knowledge (7) Encyclopaedia Britannica (8) The New Encyclopaedia (9) Encyclopaedia of Religion and Ethics (10) The Encyclopaedia and Dictionary of Education (11) Cyclopaedia of Education (12) Children's Dictionary (13) Encyclopaedia of social sciences (14) The New Educator Encyclopaedia (15) Harmsworth's universal Encyclopaedia (16) The Modern Encyclopaedia. ఇట్లింకెన్ని కలవో తెలియదు. పులగముమీద పప్పువలె ఆంగ్లములోనున్న విజ్ఞానసర్వస్వములు చాలవన్నట్లు అమెరికా

సంయుక్త రాష్ట్రప్రజలు **'Encyclopaedia Americana'** అను పేర 30 సంపుటములు వ్యాపించిన ప్రశస్త మహా గ్రంథమును ఆంగ్లభాషలో నిర్మించిరి. ఈ విజ్ఞానరాశితో పోల్చినప్పుడు మద్రాసు తెలుగుభాషాసమితివారును, హైదరాబాదు సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితివారును సేకరింపగల జ్ఞానసంచయము – ఇసుకలో పిల్లలు కట్టుకొను పిచ్చిక గూడును మించదేమో యను వెరపు జనించును. ఇంక పునరుక్తి, చర్విత చర్వణము అను భయమేల?

విజ్ఞానసర్వస్వములు మొదటి దశయందు వ్యక్తి ప్రజ్ఞాధీనములుగనే యుండినట్లు తెలియుచున్నది. అవి సమష్టికృషి ఫలితములుగాలేవు. ఒక వైజ్ఞానికుడు వివిధ శాస్త్రములపై వ్రాసిన వేర్వేరు లఘు గ్రంథముల సంపుటి విజ్ఞానసర్వస్వనామమున పరగుచుండెను. అట్టివి ముఖ్యముగ అధ్యయన గ్రంథములుగ ఉపయోగపడుచుండెనేకాని పరామర్శ **(Reference)** గ్రంథములుగ ఉద్దేశింపబడినట్లు కానిపించదు. ప్రపంచమునందు మొట్ట మొదటి విజ్ఞానసర్వస్వ గ్రంథము ప్రాచీన గ్రీకుదేశమున వెలువడెనని తలచుచున్నారు. అరిస్టాటిలు (క్రీ. పూ. 384-322) దీని కర్తయని కొందరును, స్ప్యూసిప్పసు అను నాతడు కర్తయని కొందరును భావించుచున్నారు. వీరిద్దరును మహాతత్త్వ చింతకుడైన ప్లేటోకు శిష్యులని తెలియుచున్నది. ప్రాచీన రోము దేశమున మార్కస్ టెరెన్షియస్ వారో (క్రీ. పూ. 116-27) అను నాతడొక విజ్ఞానసర్వస్వమును కూర్చెను. ఈతడు ప్రసిద్ధ విజేతయైన జూలియస్ సీజరునకు సమకాలికుడు. దీనియందు కావ్యశాస్త్రము, గణితము, జ్యోతిశ్శాస్త్రము, వైద్యము సంగీతము, వాస్తుశాస్త్రము మున్నగునవి చర్చింపబడెను. వర్తమానకాలపు విజ్ఞానసర్వస్వములను పోలిన గ్రంథమును మొట్టమొదట కూర్చినవాడు 'ప్లినీ' యనువాడు. ఈతని 'నాచురల్ హిస్టరీ' అను గ్రంథము 37 సంపుటములుగా నున్నది. ఇప్పటి విజ్ఞానసర్వస్వముల వలెనే ఇది బహుకర్తృకమైన రచనా విశేషము. దీనిలో భూగోళశాస్త్రము, మానవజాతి శాస్త్రము, జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, వృక్షాయుర్వేదము, ఖనిజ శాస్త్రము వంటి వివిధ విషయములు సమకూర్పబడెను. ఇందు అసంఖ్యాక విషయములపై అసంఖ్యాకు లయిన రచయితలు కృతులు రచియించిరి.

మధ్య యుగములందును యూరపు ఖండమున విజ్ఞానసర్వస్వ నిర్మాణము సాగెను. ఫ్రాన్సుదేశపు పాదిరీ బ్యూవే నగరమునకు చెందిన విన్సెంటు అనునాతడు (క్రీ. శ. 1190-1264) 'స్పెక్యులమ్ మాజస్' అను గొప్ప గ్రంథమును సమకూర్చెను. మధ్యయుగ విజ్ఞానమున కిది అద్దమువంటి గ్రంథమని చాలకాలము ప్రశస్తి వహించెను. జర్మనీ దేశమునందు క్రీ. శ. 1630 ప్రాంతమున ప్రకటింపబడిన లాటిను భాషాగ్రంథము విజ్ఞానసర్వస్వ నిర్మాణములో నూతన దశను ప్రారంభించెను. పూర్వ గ్రంథములు, ఆయా శాస్త్రములు వర్గీకరింపబడి, వానిపై వ్రాయబడిన లఘు కృతుల సముచ్చయముగ నుండెనని చెప్పనైనది. ఆల్‌స్టెడ్ అను ఈ జర్మను పండితుడు కూర్చిన గ్రంథమునకు మొట్టమొదటి 'ఎన్‌సైక్లోపీడియా' అను పేరు వాడబడెనట. ఇది అకారాది క్రమమున కూర్పబడుట విశేషము. ఈ కాలమున ఆంగ్లభాషలో కూడ అకారాది వర్ణక్రమమున విజ్ఞానసర్వస్వ రచన సాగ మొదలిడెను. జాన్ హారిస్ అను నాతడు (క్రీ. శ. 1667-1719) **"An universal English Dictionary of Arts and Sciences"** (కళలు, ప్రకృతిశాస్త్రములను గూర్చిన ఆంగ్ల విశ్వకోశము) అను గ్రంథమును ప్రకటించెను. సమకాలికులైన పలువురు శాస్త్రజ్ఞులు పలువురు దీనిలో రచన సాగించుట విశేషము. సుప్రసిద్ధ వైజ్ఞానికుడు సర్ ఐజక్ న్యూటను మహాశయుడు 'ఆమ్లములు' అను నంశముపై దీనిలో వ్యాసము వ్రాసెనట. మరియు ఆధార గ్రంథముల పట్టిక ఇచ్చుట ఈ సంకలనమందలి విశిష్టత. జగద్విఖ్యాతమైన ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వమును గూర్చి ఇదివరకే కొంత ముచ్చటింపనైనది. విశ్వకోశ నిర్మాణ చరిత్రయందు ఇది యొక ఉజ్జ్వల ఘట్టమని భావింపబడుచున్నది. విప్లవాత్మక చింతకులైన ఆ కాలపు ఫ్రెంచి శాస్త్రీవకు లందరును దీనిలో రచన సాగించిరి. ఇది ప్రభుత్వాగ్రహమునకు గురియై, వెలుతురు చూచుట సందేహాస్పదమయ్యెను. 35 సంపుటముల ఈ మహాగ్రంథము 1751 లో ఆరంభింపబడి 1780 నాటికి సమాప్తి చెందెను.

భారతీయులకు చిరపరిచితమైన ఆంగ్లవిజ్ఞానసర్వస్వము **'Encyclopaedia Britannica'** ఒక నాటిలో కాని, ఒక తరములోకాని నిర్మింపబడిన ఉద్గ్రంథము కాదు. దీనికిముందే ఆంగ్లమునందు విజ్ఞానసర్వస్వరచన

సాగెను. మధ్యయుగములో విలియమ్ కాక్స్టను అనునాతడు (క్రీ. శ. 1481 ప్రాంతము) "ప్రపంచము అద్దము" అను గ్రంథమును కూర్చెను. క్రీ. శ. 1728 ప్రాంతమున చేంబర్సు అను పండితుడు మరియొక ఆ విజ్ఞానసర్వస్వమును సేకరించెను. ఇదియే ఫ్రెంచి విజ్ఞానకోశమునకు మార్గదర్శక మైనదని చెప్పుచున్నా ఇప్పుడు మనకు పరిచితమగు ఆంగ్ల విజ్ఞానసర్వస్వము 1768 లో ఆరంభింపబడి 1771 లో మొదటిమ ప్రకటింపబడెనట! మొదటి ముద్రణములో అందు మూడు సంపుటములు, 2670 పుటలుమాత్ర ముండెన ఇప్పుడు మనము చూచుచున్నది ఆంగ్ల విజ్ఞానసర్వస్వముయొక్క పదునాల్గవ ముద్రణము. సుదీర్ఘము పాండిత్య స్ఫోరకములు అగు వ్యాసముల రచనాపద్ధతికి స్వస్తిచెప్పి సర్వజన సుబోధకమైన సులభ సంగ్ర వ్యాసరచనాపద్ధతి ఈ పదునాల్గవ ముద్రణమునందు అవలంబింపబడెనని చెప్పుచున్నారు. అమెరికా సంయు రాష్ట్రములందును 1829 వ సంవత్సర ప్రాంతమునుండి విజ్ఞానసర్వస్వ ప్రకటనము సాగెను. వీని పరిణామ ఇప్పుడు మనము చూచు సుందరతరమును, వైశద్యగుణ భూషితమును అగు "ఎన్సైక్లోపీడియా అమెరికా అను గ్రంథరాజము. జర్మనీ దేశస్థులు విద్వత్తునందును పరిశ్రమ సహిష్ణుతయందును యూరపు ఖండము దగ్రేసరులు కదా! సువిస్తృతములైన గొప్ప విజ్ఞానసర్వస్వములు మౌలికము లైనవి ఎన్నియో జర్మను భ యందు కలవని తెలియవచ్చుచున్నది. ఇటలీ భాషయందును, స్పానిషు భాషయందును కూడ సమగ్ర విజ్ఞానక ములు కలవట. రష్యన్ భాషయందు సోవియట్ ప్రభుత్వ - ఆధ్వర్యవమున 32 సంపుటముల విజ్ఞాన సర్వస్వ ప్రకటితమైనది.

భారతదేశమునందలి ముఖ్యభాషలలో విజ్ఞాన సర్వస్వ ప్రచురణోద్యమము సాగి కొన్ని భాషల విజయము సాధింపబడినట్లు తెలియుచున్నది. ముఖ్యముగ ఆంధ్రులకు సన్నిహిత భాషయైన మహారాష్ట్ర భ యందు పలురకముల విజ్ఞాన కోశములు వెలువడినవి. ప్రసిద్ధ మహారాష్ట్ర జ్ఞానకోశము కాక, వ్యాయ జ్ఞానకోశము, సులభ విశ్వకోశము, వ్యావహారిక జ్ఞానకోశము, చరిత్ర కోశము, స్థల నామకోశము, ముల జ్ఞానకోశ్ (బాల విజ్ఞానకోశము) మున్నగునవి నిర్మింపబడినవి. మహారాష్ట్ర సోదరుల విజ్ఞాన ప్రీతికిని, కార్య కును ఇవి స్థిరోదాహరణములు. కన్నడ భాషయందు 'బాల ప్రపంచము' అను పేరుతో మూడు చిన్న స టముల సుందరమైన విజ్ఞానకోశము నిర్మింపబడినది.

సంగ్రహ విజ్ఞానకోశ నిర్మాణములో మమ్మెదుర్కొన్న కష్టసురములను సోదరాంధ్రులకు నివేదిం పుట్టినింటి గుట్టు వెలిబుచ్చినట్లు కాకపోవచ్చును. ఆంధ్రభాషను ఆధ నవాహికగ చేయుటకు మనమె పురోగమింపవలసి యున్నదో ఉదాహరించుట మాత్రమే దీని ప్రయోజనమే. (1) పద్యరచనపైగల మోజు రచనపై మనవారియం దింకను పర్యాప్తముగా వ్యాప్తి కాలేదని ను. ఆధునిక విజ్ఞాన విషయము గూర్చి వ్రాయవలెనన్నచో బహుగ్రంథ పరిశీలనము చేసి సమన్వయము ధించుకొనుటకు శ్రమించవలెను. తిక సోమయాజి వలె "తుదముట్టన్" శ్రమియించుట ఇంకను మనవారు ంపవలసియే యున్నది. (2) వై నిక విషయములపై వ్రాయవలెనను ఉత్సాహము గలవారికి ఆం పాటవము చాలుట లేదు. ఈ తర వారును, వెనుకటి తరమువారును చాలవరకు ఆంగ్లము నందే వ్యాసంగము చేసినవారు. ఆంధ్రమున భావప్రకటనము చేయుట కంతగా అలవడినవారు కారు. ఆం చేయవలెనని ఉత్సాహము కలిగి వీరు సంకోచించు చున్నారు. మైత్రీ నిర్బంధముచే వ్రాయవలసి చో ఆంగ్లభాషయందే వ్యాసములు పంపుచున్నారు. దీనినే గొప్ప సేవగ మేము భావించుచున్నాము. (3) ఆంగ్ల వ్యాసముల మూలమున అను కార్యక్రమము మేము మొదట ఊహించిన దానికన్న విపులతరమై కాలహరణమునకు మూలమైనది. అనువాద స్వతంత్రరచనవలె ప్రసన్నతావిభూషితమై యుండుట కష్టము. మరియు పారిభాషికపదజాలము మన భాషయ స్థిరపడలేదు. స్థిరపరచుటకు జరిగిన సుస్థిరప్రయత్నమును లేదు. ఇవి యన్నియు దీర్ఘకాలిక ప్రణాళికమీద భూ ఓర్పువంటి ఓర్పుతో నిర్వహించవలసిన పనులు. తెలుగు భాషాసమితివారు 'అకారాదిక్రమము'న గాక శాస్త్ర కథనపద్ధతిని అవలంబించుటకు హేతువును పద్మశ్రీ మోటూరి సత్యనారాయణగారు చక్కగా వివరించిరి. "ఆ

భాషలో పారిభాషిక పదజాలము స్థిరపడలేదు, అట్టి అవ్యవస్థిత పదములను శీర్షికగా పెట్టుకొన్నచో నిశ్చయజ్ఞానము కలుగదు. పలువురు పలువిధముల ఈపదములను వాడుచున్నారు. కావున మేము శాస్త్రకథా కథన పద్ధతికే ప్రాధాన్య మిచ్చి యున్నాము. అకారాది పద్ధతికి రెండవస్థాన మిచ్చియున్నాము" అని సెలవిచ్చియుండిరి. ఈ వాదమునందు గురుతరమైన సత్యము ఇమిడి యుండకపోలేదు. కాని ఎప్పటికైనను మనము దీనిని ఎదుర్కొనవలసియేయుండును. కావున ఈ గ్రంథమునందు మేము పారిభాషిక పదములను సృష్టించుకొని వాటినే అకారాది క్రమములో కూర్చితిమి. ప్రయుక్తమైన శాస్త్రపదము వెంటనే ఆంగ్లపదమునుకూడ ఒకటి రెండుసార్లు వాడుటకు రచయితలను కోరియుంటిమి. అట్లు చేయుటవలన ఏవిషయము ఉపన్యస్తమగుచున్నదో సుబోధము కాగలదు. మా సంపాదక బృందమునందును పారిభాషిక పదప్రయోగము విషయమై ఏకవాక్యత సాధింపబడలేదు ఆధునిక రసాయన శాస్త్రమువంటి గహన వ్యాప్తిగల శాస్త్రమునందు దేశీయ పదజాలమును ప్రయోగించుట కొంతవరకు మాత్రమే సాధ్యమనియు, లోతు లోతులకు దిగినకొలదియు రచన సాగక వెనుకకు రావలసినవార మగుదుమనియు మా సంపాదకులు భావించుచున్నారు. అంతర్జాతీయ పదజాలమునే ఆశ్రయించుట కార్యకారియని వీరి తలంపు. ఇందును బలము లేకపోలేదు. రసాయన శాస్త్రమునందలి సంయోగ పదార్థములను గూర్చి చెప్పునప్పుడు సంస్కృతభాష కొంత ఉపయోగించును. కాని కేవలాంధ్రపదములు మరియు కార్యకారులుగ నుండుటలేదు. కావున కొన్ని శాస్త్రముల సందర్భమున అంతర్జాతీయ పదములను తప్పనిసరిగ వాడవలసిన ఆవశ్యక మేర్పడినది ఇచ్చట తెలుగుతనము బలియయిపోలేదా అని ఆక్షేపకు లనవచ్చును. విషయ ప్రతిపాదనము సులభార్థ బోధకత్వము మా లక్ష్యములు. పిడివాదమునకు తావులేదు. ఆధునిక విజ్ఞాన సందర్భమున మన భాష చెందిన వ్యక్తావ్యక్తపుష్టినిబట్టి రచన సాగించవలసిన వారమైతిమి. ఈ గ్రంథమునందు వాడబడిన అంతర్జాతీయ పదములు ఆంగ్ల పదములు వాటికి కల్పింపబడిన పర్యాయపదములు తెలుపుటకై సాంకేతిక పదముల పట్టికనుకూడ చేర్పించినాము. భాషా విషయమున సులభ గ్రాంథికమునే తెలంగాణా రచయితలు అభిమానించినట్లు తోచినది. దీనిని శిష్టవ్యావహారికమునకు వీలయినంత దగ్గరగ ఉండునట్లు నిర్వహింపవలెనని మా సంపాదకీయ వర్గమువారు ఆదేశించిరి. ఇట్టి ప్రయత్నమే కొనసాగింపబడెను.

ఈ సంపుటమునందు 174 వ్యాసములు కలవు. వీటిలో అనువాదక వ్యాసములు 44 కలవు. రచయితలు 123 మంది, అనువాదకులు 19 మంది. "అ"కారమందలి వ్యాసములు 109. దీని పుటల పరిమితి 422. "ఆ" కారమందలి వ్యాసములు 65. వీటి పుటలపరిమితి 378. విషయ వర్ణనాత్మక పటములసంఖ్య 223. ఇవిగాక, ప్రముఖ చిత్రములు కొన్ని రంగులలోను, ఆర్టుపేపరుమీదను ముద్రింపబడినవి. 174 వ్యాసములలోను 89 చరిత్ర–సంస్కృతులకు సంబంధించినవి, 73 విజ్ఞాన శాస్త్రాదులకు సంబంధించినవి, 12 ఇతరములు. మొత్తము మీద ఈ సంపుటములో ఆంధ్రులకు, ఆంధ్రభాషకు, ఆంధ్ర దేశమునకు సంబంధించిన వ్యాసములసంఖ్య 55. ఆంధ్ర సంబంధ వ్యాసముల పుటలసంఖ్య 328.

సంగ్రహ విజ్ఞానకోశము యొక్క ఆర్థికపు సమస్యలను కూడ ఊకొట్టుడు. ఈ యుద్యమమును ప్రజా మూలమని కదా మేము వాకొంటిమి. ఎట్లన మా సంపాదకులందరు గౌరవ కార్యకర్తలే. వారి విద్వత్కృషికై ధన్యవాదములను తప్ప సమితి ఎట్టి పారితోషికమును వారికిచ్చుటలేదు. వ్యాస రచయితలకు మాత్రము అచ్చు పుటకు రు. 5 వంతునను, అనువాదకులకు అచ్చుపుటకు రు. 2-50 న.పై. వంతునను పారితోషికము ఈయనగు చున్నది. దీనిని కూడ స్వీకరించని పెద్దలు కొందరు కలరు. ఈ గ్రంథము ఐదు సంపుటములని మొదట భావించి మొత్తము గ్రంథము వెల నూరు రూప్యములని మదింపబడెను. ప్రణాళికా రచనానంతరము ఇది ఆరు సంపుటముల గ్రంథమగునని తెల్లమాయెను. అయినను ఆరంభమునందే విరాళ రూపమున రు. 100 ఇచ్చువారికి ఆరు సంపుటములును ఇయ్యవలెనని నిర్ణయించి ప్రకటనము జరిగెను. మొదటి సంపుటమునందు 'అ' నుండి 'క' వరకు కల వ్యాసములు ప్రకటించుటకు ఉద్దేశించియుంటిమి. కాని వ్యాసములు నిర్దిష్టపరిమితిని మించి సుదీర్ఘములుగ నుండుటచే "ఆ" వర్ణము పూర్తికాకుండగనే సంపుటము ముగిసినది. ఈ యనుభవమును బట్టి విజ్ఞానకోశము

6 సంపుటములు మించిపోవునట్లు సూచనలు కాన్పించుచున్నవి. ఒక్కొక్క సంపుటము యొక్క నిర్మాణ వ్యయము రు. 40,000 చొప్పున పూర్తి గ్రంథమునకు దాదాపు రు. 2,50,000 వ్యయము కాగలదని అంచనా వేయబడినది. ప్రతి సంపుటము వెల రు. 20 ఏర్పాటు చేయనైనది.

కార్యకర్తల ఉత్సాహము సంపాదకుల భాషానిరతి మాత్రమే ఈ యుద్యమమునకు మూలధనముగా నుండెను. ఉద్యమ స్థాపకులైన డాక్టరు బి. విశ్వనాథముగారి రు. 100 విరాళముతో దీనికి శ్రీకారము చుట్టబడెను. ఉద్యమరేఖ లింకను సుస్పష్టము కానిదినములలోనే, అప్పుడు ఆదిలాబాదు జిల్లా బోథ్ గ్రామములో తహసిల్దారుగా నుండిన మా మిత్రులు శ్రీ వి. బి. నరసారెడ్డిగారు విజ్ఞానకోశమునకు రు. 100 మొట్టమొదటి మనియార్డరు పంపి చుక్క వ్రాయించుకొనిరి. వెనువెంటనే శ్రీ జి. వి. సుధాకరరావుగారును, శ్రీ ఇ. వి. రామిరెడ్డిగారును రోజుకొనుచు వచ్చి చిన్న దెబ్బలను అందుకొని మురిసిపోయిరి. శ్రీ రాజా వేంకట మురళీమనోహరరావుగారిచ్చిన రు. 300 లతో సమితి కార్యాలయము ఒక టైపు లేఖినితో ఆరంభింపబడెను. ఇట్టిది చీమ గంగా యాత్రగా సాగజొచ్చెను. ప్రారంభ సంవత్సరము లందే మాకు ఆదిలాబాదు జిల్లానుండియు, వరంగలు జిల్లా నుండియు, సభ్యత్వ రుసుములు కొన్నివచ్చి కాలు నిలువదొక్కుకొనుటకు తోడ్పడినవి. అప్పటి హైదరాబాదు ప్రభుత్వములో వ్యవసాయశాఖా మంత్రులును సమితికి ఇప్పుడును ఉపాధ్యక్షులునుఅయినమర్రి చెన్నారెడ్డిగారు మాకు గొప్ప చేయూత నిచ్చిరి. అట్లే అప్పటి హైదరాబాదు శాసనసభా సభ్యులు కొందరు మా యుద్యమమును ఆదరించి తమ నైతిక సహాయము మా కొసంగి అండయై నిలిచిరి. శ్రీమతి ఆరుట్ల కమలాదేవిగారును శ్రీయుతులు కే. వి. నారాయణరెడ్డి, కె. పెదవెంకట్రామారావుగార్లును శాసనసభా వర్గమునందు మా కొఱకు చేసిన సేవ ప్రశంసనీయము.

ఈ తొలిదినములందే వనపర్తి రాజా రామదేవరావు బహద్దరుగారు రు. 500 విరాళమునిచ్చి తోడ్పడిరి, సికింద్రాబాదు పురపాలక సంఘమువారు 1955 లో రు 1000 ల విరాళమును మంజూరుచేసి స్థానిక పరిపాలనా సంస్థలకు మార్గదర్శకులైరి. ఈ సంవత్సరాంతమున అప్పటి హైద్రాబాదు ప్రభుత్వమువారు రు. 10,000 లు సహాయముగా ప్రసాదించి సమితికి వెన్నెముక ఏర్పడునట్లు చేసిరి. వెనువెంటనే హైదరాబాదు పురపాలక సంఘమువారు రు. 2000 లును, మరికొంత కాలమునకు నల్లగొండ జిల్లాబోర్డువారును, మహబూబు నగర్ జిల్లాబోర్డువారును చెరియొక రు. 2500 ల విరాళము లంపిరి. సామాన్య గృహస్థులు పలువురు సభ్యత్వ రుసుముల పంపుచునే యుండిరి. యాదగిరి నరసింహస్వామి దేవాలయమునుండి రు. 500 ల విరాళము లభించెను. మొదటి సంపుటము ముద్రణమునకై కావలసిన కాగితమునంతను సిర్పూరు కాగిత కర్మాలయాధిపతులు శ్రీ బిర్లా సోదరులు మాకు మూడవవంతు ధరకు మాత్రమే ఇచ్చి గొప్ప ఉపకారము చేసిరి. దీని వలన సమితికి దాదాపు రు. 6000 లు కిఫాయతు ఏర్పడెను.

ఇంతలో ఆంధ్రప్రదేశపు శుభావతరణ మయ్యెను. గౌ. శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు తమ అధ్యక్ష కవచమును ఆంధ్రప్రదేశ ముఖ్య మంత్రులు గౌ. డాక్టరు నీలం సంజీవరెడ్డిగారికి అర్పించి తాము కేరళ రాజ్యపాలకులుగా వెడలిరి. ఇట్టి ప్రజోపయోగమైన కార్యమునకు ప్రభుత్వమే చేయూత ఈయదగునని శ్రీ సంజీవరెడ్డిగారు ఆరంభముననే సంకల్పించి మాకు ధైర్యోత్సాహములు కలిగించిరి. రాజ్యకార్య బాహుళ్యముచే తమకు సమితి కార్యజాతమును నడిపించుటకు సమయము చాలక అప్పుడు ఆర్థిక శాఖామాత్యులుగ నుండిన గౌ. డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారిని అధ్యక్షులునుగ చేసికొండని ఆదేశించిరి. సాహిత్య పోషణమునందును కళాభిరుచి యందును శ్రీ గోపాలరెడ్డిగారు ఆంధ్రదేశమునందు ముఖ్యజ్యోతిగ ఉన్నారనుట అతిశయోక్తి కానేరదు. సమితి ఉపాధ్యక్షులు ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు గౌ. యస్. బి. పి. పట్టాభిరామారావుగారును, డాక్టరు గోపాలరెడ్డిగారును సంప్రదించుకొని సంగ్రహ విజ్ఞానకోశ సమితికి సుస్థిరమైన ఆర్థిక వ్యవస్థ ఏర్పడు ప్రణాళికను రచించిరి. దీనికి ఆంధ్రప్రదేశ ప్రభుత్వామోదము లభించుట ముదావహము. ఈ పథకము ప్రకారము ఆంధ్రప్రభుత్వమువారు సమితికి సంవత్సరమునకు రు. 25,000 చొప్పున నాలుగు సంవత్సరములు ధనసహాయము

చేయుదురు. దీనికొక షరతు కలదు. సమితివారు ప్రజలనుండియు ప్రజాహిత సంస్థలనుండియు సంవత్సరమునకు రు. 12,500 లు విరాళములు సంపాదించుకొని ప్రభుత్వమునకు చూపవలెను. ఈ ప్రణాళికక్రింద ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు తొలిసారిగా రు. 15,000 ధనసహాయము చేయించుటచే మొదటి సంపుటము ముద్రణము జయప్రదముగ సాగినది. ఈలోగడ వ్యాపార సంస్థలును మాకు చక్కగా తోడ్పడినవి. సింగరేణి బొగ్గుగనుల నిర్వాహకులు రు. 1,500 లును, నిజాం చక్కెర కర్మాగారమువారు రు. 500 లును విరాళము లిచ్చిరి.

ఇంతవరకును విజ్ఞానకోశ సమితికి లభించిన ఆర్థిక సహాయము తెలంగాణము నుండియే లభించెను. మొదటి సంపుటమైనను ముద్రణమయిన తరువాత ఆంధ్రప్రాంత సోదరులను సహాయ మభ్యర్థింప వచ్చుననియు అది మాకు కొంగు బంగార మనియు వేచియున్నాము. ఇట్లుండ మా కార్యవర్గ సభ్యులును సింహాచల శ్రీ లక్ష్మీ నృసింహస్వామి ఆలయ ధర్మకర్తలును అగు శ్రీ పి. వి. జి. రాజుగారి సంకల్పముచే స్వామి భాండారమునుండి సమితికి రు. 5,000 లు ధన సహాయము వాగ్దానము చేయబడి యున్నది. అది ఇంతలో రాగలదు. వడ్డికాసుల దైవమగుటచే కాబోలు శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి వెనుకముందు లాడుచున్నాడు. కాని ఆయన తలచు కొన్నచో కొదువ ఏమి? వేములవాడ శ్రీ రాజరాజేశ్వర స్వామివారు ఉపేక్ష వహింతురా! భారత ప్రభుత్వము వారుకూడ మున్ముందు విజ్ఞానకోశ సమితి కార్యక్రమమును గుర్తించి సాదర సహాయము చేయగలరని విశ్వసించు చున్నాము. ఆంధ్ర భాషాభిమానులును, గ్రంథాలయములు, కళాశాలలు, పాఠశాలలు, మున్నగు సంస్థలును ధర్మనిధులు కల పారిశ్రామిక వ్యాపార సంస్థలును సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితికి భూరి విరాళము లిచ్చి తోడ్పడగలరని విన్నవించుచున్నాము.

సమితి సమకూర్చ గలిగిన సాధన సామగ్రియు, ఇతర సౌకర్యములును తక్కువయైనను, భాషాభిమాన ముతో కృషిచేసి యీ సంపుట ప్రకటనమునకు ముఖ్య కారకులైన మా సంపాదకులకును, వారికి చేదోడువాదో డుగానుండిన శాఖా సంపాదకీయ వర్గసభ్యులకును మా కృతజ్ఞతలు తెల్పుచున్నాము. అల్ప వేతనములపై పనిచేయు చుండియు కార్యసిద్ధినే ఆశించి ప్రశంసనీయమైన కృషి చేసిన కార్యాలయోద్యోగు లందరికిని, ముఖ్యముగ దీనికి మెదడుగా వ్యవహరించిన పెద్దలు శ్రీ ఆదిరాజు వీరభద్రరావు, ఆచార్య గరికపాటి లక్ష్మీకాంతయ్య గార్లకును మేము కృతజ్ఞులము. ఆరంభము నుండియు నీ యుద్యమమునకు చేయూత నిచ్చియు, ఉచిత విరా ళముల నిచ్చియు, గ్రంథ ముద్రణ కార్యమును విజయవంతముగ సాగించిన ముద్రాపకులు శ్రీ అజంతా ప్రింటర్సు వారికి సమితి ఋణపడి యున్నది. ఇంతపెద్ద యెత్తున ముద్రణకార్యము నిర్వహించుటకు శక్తియు, యుక్తియు, రక్తియు గల అచ్చు కార్యాలయములు తెలంగాణములో కలవని అజంతావారు నిరూపించి కీర్తి సంపాదించుకొన్నారు. సికింద్రాబాదు దుర్గా బ్లాక్ మేకింగు కంపెనీవారు బ్లాకులను సత్వరముగను, ముచ్చటగను సిద్ధముచేసి మాకు తోడ్పడి యున్నారు.

ఎందరో మిత్రులు, హితైషులు - వారందరకును మా కృతజ్ఞతా నమోవాకములు.

హెచ్. జి. వెల్సు మహాశయుని "ప్రపంచ విజ్ఞాన సర్వస్వ" భావనతో నీ పీఠికను సమాప్తి చేయు దుము. ఆదర్శప్రాయమైన ప్రపంచ విజ్ఞాన సర్వస్వ మిట్లుండవలెనని ఆతడు భావించెను. "ఈ గ్రంథ మెన్నియో సంపుటముల వరుస నాక్రమించును. విషయములు ఎక్కువగ వెదకుకొన నక్కరలేకయే దీనియందు లభించును. భాష సులభమై, సుగ్రాహ్యమై యుండగలదు. ఆధునిక సాంఘిక వ్యవస్థయొక్క మూల భావములును, విజ్ఞాన మును అన్ని రంగములకు సంబంధించిన ఆకార సూత్రములును ముఖ్యాంశములును, మనము నివసించు విశ్వ మునుగూర్చి నిర్దుష్టమయి సాధ్యమైనంతగా వివరణాత్మకమగు జ్ఞానమును, ప్రపంచ దేశముల సామాన్య చరిత్ర మును, విజ్ఞానముయొక్క మూలాధారములైన ప్రాతిపదిక సామగ్రియు, పరామర్శ గ్రంథముల విశ్వసనీయమైన క్రోడీకరణమును ప్రపంచ విజ్ఞాన సర్వస్వములో చూడగలము."

"మరియు ఈ విశ్వ విజ్ఞానకోశము భూమండలము నందలి ప్రతి వివేకశాలియైన వ్యక్తికిని మానసిక భూమికగా నుండదగును. ప్రపంచమునందలి విజ్ఞానవేత్తల చేతులలో ఇది తరచు పునర్నవీకృత రూపమును

పొందుచు, సజీవమై పెరుగుచు, నిత్యప్రవర్ధమాన చైతన్యవంతమై యుండును. ప్రతి విశ్వవిద్యాలయమును ప్రతి పరిశోధనసంస్థయు దీనికి బలసంధాయక మార్గముగ నుండవలెను. నూత్న దీశాలులలో ప్రతియొక్కనికిని ఏతత్స్థోళ స్థాయి సంపాదకవర్గముతో సంబంధము కల్పింపబడవలెను, ఇట్టి విశ్వ విజ్ఞానకోశము ప్రపంచ సంస్కృతికి మూఢ దీక్షా ప్రతిబంధకములేని బైబిలు గ్రంథము కాగలదు. విద్యారంగమునందు దీని ప్రాముఖ్య మపారము. పాఠ శాలల యందును, కళాశాలల యందును విద్యాబోధనమున కిది సహాయకమై, ప్రామాణికమై ప్రాతిపదిక జ్ఞాన విషయముల నిధిగా నుండగలదు. వేద్యాంశముల పరామర్శమునకును, వక్కాణముల పరిశీలనమునకును ఇది మూలాధారము కాగలదు. వేయేల, ఈ నాటి మన బౌద్ధిక సంస్థలు — చెల్లాచెదరై పెడదారి త్రొక్కియున్న ఈ సంస్థలు — సాధింపలేని మహత్తర ప్రయోజనమును ఈ ప్రపంచ విజ్ఞాన సర్వస్వము సాధింపగలదు. ప్రపంచము నంతను మానసిక బాంధవ్య సూత్రములచే సంహితపరచుటయే ఆ మహత్తర లక్ష్యము."

ఇదిగో! ఒక దళము విరిసిన షట్చక్రకమలము. దీనిని సాదరముగ పరికింపుడు. "అలినీగరుదనీక మలినీకృతము" చేయుడు.

విలంబ - అధిక శ్రావణ బహుళ ౩ - గురువారం
7 ఆగస్టు 1958
విద్యానగరం, హైదరాబాదు.

బుధవిధేయుడు
ఖండవల్లి లక్ష్మీరంజనం
కార్యదర్శి



# కార్యనిర్వాహక వర్గము



1. అధ్యక్షులు : గౌ. డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి
మంత్రి, రివెన్యూ - పౌర వ్యయము - భారతప్రభుత్వము, క్రొత్తఢిల్లీ.
2. ఉపాధ్యక్షులు : డాక్టరు యం. చెన్నారెడ్డి ఎం. ఎల్. ఏ.
మాజీ వ్యవసాయశాఖామాత్యులు, హైదరాబాదు.
3. ,, శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు
విద్యాశాఖామాత్యులు, ఆంధ్రప్రదేశ్.
4. ,, ,, కె. సదాశివరెడ్డి
ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యాయులు, హైదరాబాదు.
5. కార్యదర్శి : శ్రీ దివాకర్ల లక్ష్మీరంజనం
ఆంధ్రశాఖాధ్యక్షులు, ఉ. వి.
6. సంయుక్త కార్యదర్శి : డా. చేతనభట్ల విశ్వనాథం
గణితశాస్త్రశాఖ, ఉ. వి.
7. సహాయ కార్యదర్శి : డా. బి. రామరాజు
తెలుగుశాఖ, ఉ. వి.
8. కోశాధిపతి : డా. రావాడ సత్యనారాయణ
భౌతికశాస్త్రశాఖాధ్యక్షులు, ఉ. వి.
9. సభ్యులు : శ్రీ పి. వి. జి. రాజు
విజయనగరం రాజావారు.
10. ,, డా. వి. యస్. కృష్ణ
ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
11. ,, శ్రీ జటప్రోలు రాజావారు
హైదరాబాదు.
12. ,, పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ
పార్లమెంటు సభ్యులు - మద్రాసు.
13. ,, శ్రీ కల్వ సూర్యనారాయణ గుప్త
వర్తకులు, హైదరాబాదు.
14. ,, శ్రీ బెల్దె జగదీశ్వరయ్య గుప్త
వర్తకులు, హైదరాబాదు.
15. ,, డా. యస్. వేంకటేశ్వరరావు
ఆనరరి ఫిజిషియన్, ఉస్మానియా ఆసుపత్రి, హైదరాబాదు.
16. ,, డా. పుట్టపర్తి శ్రీనివాసాచారి
డైరెక్టరు, పురావస్తుశాఖ, హైదరాబాదు.

17. సభ్యులు శ్రీ పల్లూరి సుబ్బరాజు

అగ్రికల్చరల్ ఇంజనీరు, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి, ఖరగ్‌పూరు.

18. ,, శ్రీ జి. వి. సుధాకరరావు

అధ్యక్షులు, పరిపాలన విధానశాస్త్రశాఖ, ఉ. వి.

19. ,, శ్రీ కాసుగంటి రాజేశ్వరరావు

అడ్వకేటు, హనుమకొండ.

20. ,, శ్రీ కంచెనేపల్లి పెదవెంకట్రామారావు

అడ్వకేటు, నల్లగొండ.

21. ,, శ్రీ యం. ఆర్. అప్పారావు, ఎం. ఎల్. ఏ.

నూజివీడు, కృష్ణాజిల్లా.

22. ,, శ్రీ కె. నరసింహాచారి

సభ్యులు- హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషను.



# సంపాదకీయ వర్గము

శ్రీ మామిడిపూడి వేంకట రంగయ్య, ఎం. ఏ.,

*అధ్యక్షులు, సంపాదకీయవర్గము*

| *విషయము* | *సంపాదకులు* |
| --- | --- |
| 1. భాష, సారస్వతము, లిపి | శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ.,<br>ఉస్మానియా విశ్వవిద్యాలయము |
| 2. చరిత్ర | శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం. ఏ.,<br>నిజాం కళాశాల, హైదరాబాదు |
| 3. తత్త్వశాస్త్రము | డా. వహీదుద్దీను,<br>తత్త్వశాస్త్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము<br>&<br>డా. శ్రీపతి శ్రీదేవి, ఎం. ఏ., పిహెచ్. డి.,<br>ప్రిన్సిపాలు, ప్రభుత్వ మహిళా కళాశాల, హైదరాబాదు |
| 4. భూగోళశాస్త్రము | శ్రీ వైజ్యనాథ్, ఎం. ఏ.,<br>ప్రొఫెసరు, భూగోళశాస్త్రశాఖ, ఉస్మానియా వి.<br>&<br>శ్రీ బి. యన్. చతుర్వేది<br>భూగోళశాస్త్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము |
| 5. అర్థశాస్త్రము | డా. రాంపల్లి విశ్వేశ్వరరావు, ఎం. ఏ., పిహెచ్. డి.,<br>జాయంటు డైరెక్టరు, వాణిజ్య పరిశ్రమలశాఖ, ఆంధ్రప్రదేశ్ |
| 6. మానవశాస్త్రము, సాంఘికశాస్త్రము | శ్రీ జి. వి. సుధాకరరావు<br>పరిపాలన విధానశాస్త్రశాఖ, ఉస్మానియా వి. హైదరాబాదు |
| 7. రాజనీతిశాస్త్రము | ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం. ఏ.,<br>మాజీ ప్రొఫెసరు, ఆంధ్ర-బొంబాయి విశ్వవిద్యాలయములు |
| 8. మతములు | ఆచార్య కురుగంటి సీతారామయ్య, ఎం. ఏ.,<br>సంస్కృత అకాడమీ ఉ. వి. |
| 9. సంగ్రామశాస్త్రము | శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం,<br>ఉస్మానియా విశ్వవిద్యాలయము |
| 10. క్రీడలు | శ్రీ బి. అనంతరావు,<br>సికింద్రాబాదు కళాశాల |
| 11. వార్తాశాస్త్రము | శ్రీ యన్. నరోత్తమరెడ్డి, ఎం. ఏ.,<br>సంపాదకులు, గోలకొండ పత్రిక, హైద్రాబాదు |

| | |
|---|---|
| 12. న్యాయశాస్త్రము | శ్రీ వల్లూరి వెంకటేశ్వర్లు,<br>సుప్రీంకోర్టు అడ్వకేటు, హైద్రాబాదు |
| 13. వాణిజ్యశాస్త్రము | శ్రీ బి. రాఘవేంద్రరావు,<br>వాణిజ్య శాఖాధ్యక్షులు, ఉ. వి. |
| 14. వినోదములు | శ్రీ కె. వేంకటాచారి,<br>ఆంగ్లోపన్యాసకులు, నిజాం కళాశాల |
| 15. యాత్రలు, అన్వేషణము | శ్రీ దేవులపల్లి రామానుజరావు,<br>బి. ఏ., ఎల్. ఎల్. బి., హైదరాబాదు |
| 16. కళ | డా. పుట్టపర్తి శ్రీనివాసాచారి,<br>డైరెక్టరు, పురావస్తుశాఖ, హైదరాబాదు |
| 17. గానశాస్త్రము | శ్రీ పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి,<br>సంగీత పరిశోధక విద్వాంసులు, హైదరాబాదు |
| 18. చిత్రకళ | శ్రీ కె. శేషగిరిరావు,<br>ఉపన్యాసకులు, లలితకళల కళాశాల, హైదరాబా |
| 19. నృత్యకళ | శ్రీ నటరాజ రామకృష్ణ,<br>డైరెక్టరు, నృత్య నికేతనము, హైదరాబాదు |
| 20. వాస్తు విద్య | డా. పుట్టపర్తి శ్రీనివాసాచారి, హైదరాబాదు |
| 21. గణితశాస్త్రము | శ్రీ రాఘవేంద్రరావు,<br>అధ్యక్షులు, గణితశాస్త్రశాఖ, ఉ. వి. |
| 22. భౌతికశాస్త్రము | డా. రావాడ సత్యనారాయణ,<br>అధ్యక్షులు, భౌతికశాస్త్రశాఖ, ఉ. వి. |
| 23. రసాయనశాస్త్రము | డా. నండూరి వేంకట సుబ్బారావు,<br>అధ్యక్షులు, రసాయనశాస్త్రశాఖ, ఉ. వి. |
| 24. వృక్షశాస్త్రము | శ్రీ బి. వి. రమణారావు, ఎం. ఎస్. సి.<br>వ్యవసాయ కళాశాల, ఉ. వి. |
| 25. జంతుశాస్త్రము | డా. బాపురెడ్డి,<br>వ్యవసాయ పరిశోధన సంస్థ, హైదరాబాదు<br>&<br>శ్రీ వి. జగన్నాథరావు, ఎం.ఎ.<br>లెక్చరర్, సైన్సు కాలేజి, హైదరాబాదు |
| 26. భూగర్భశాస్త్రము | డా. కె. వి. రావు<br>భారతదేశ భూగర్భశాస్త్ర, సర్వేశాఖ, హైదరాబాద<br>&<br>డా. ఎస్. బాలకృష్ణ<br>భూగర్భశాస్త్రాచార్యులు, ఉ. వి. |
| 27. ఖగోళశాస్త్రము | డా. బేతనభట్ల విశ్వనాథం<br>గణితశాస్త్రశాఖ, ఉ. వి. |

| | |
|---|---|
| 28. వైద్యశాఖ | డా. ఎస్. వేంకటేశ్వరరావు<br>ఆనరరీ ఫిజీషియను, ఉస్మానియా ఆసుపత్రి, హైదరాబాదు |
| 29. స్థాపత్యము | శ్రీ వల్లూరి సుబ్బరాజు<br>అగ్రికల్చరల్ ఇంజనీరు, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి - ఖరగ్‌పూరు |
| 30. వ్యవసాయశాస్త్రము | శ్రీ కంభంపాటి భాస్కరము<br>వ్యవసాయ కళాశాల, ఉ. వి. |
| 31. సంఖ్యాశాస్త్రము | శ్రీ డి. వి. ఎస్. ద్వారక<br>గణితశాస్త్రశాఖ, ఉ. వి. |
| 32. మానసికశాస్త్రము | శ్రీ కె. వేదాంతాచారి<br>బోధనాభ్యసన కళాశాల, ఉ. వి. |
| 33. విద్యాశాస్త్రము | శ్రీ సత్తిరాజు కృష్ణారావు<br>ప్రభుత్వ బోధనాభ్యసన కళాశాల, హైదరాబాదు |
| 34. వాతావరణశాస్త్రము | డా. యస్. రాజేశ్వరరావు<br>భౌతికశాస్త్రశాఖ, నిజాంకళాశాల, హైదరాబాదు |
| 35. వివిధములు | డా. టి. సత్యనరసింహమూర్తి<br>నిజాంకళాశాల, హైదరాబాదు |
| 36. ఆంధ్రదేశము - విశేషశీర్షికలు | శ్రీ ఆదిరాజు - వీరభద్రరావు<br>కార్యదర్శి. లక్ష్మణరాయ పరిశోధక మండలి, హైద్రాబాదు |
| 37. ఆయుర్వేదము | పండిత, శతావధాని శ్రీ వేదాల తిరుమల రామానుజస్వామి,<br>ఆయుర్వేదాచార్య, అధ్యక్షులు, ఆయుర్వేద మహామండలి, హైదరాబాదు |
| 38. ప్రాచీన విద్యలు - కళలు | శ్రీ శిరోమణి చెలమచర్ల రంగాచార్యులు<br>ఆంధ్రోపన్యాసకులు, ఉ. వి. |
| 39. పశువైద్యశాస్త్రము | డా. సి. వేంకటేశ్వరరావు<br>వెటర్నరీ కాలేజి, ఉ. వి. |



# రచయితలు

| వ. సం. | పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|---|
| 1. | అ. వై. | శ్రీమతి అల్లాడి వైదేహి, ఎం. ఏ.<br>చరిత్రోపన్యాసకురాలు, మహిళా కళాశాల<br>హైదరాబాదు (ద.) | అశోకుడు |
| 2. | అ. హు. | శ్రీ అఖ్తరు హుస్సేన్,<br>ఎం. ఎస్. సి. బి. ఎస్. ఎల్. (యు. ఎస్. ఎ.)<br>బి. ఎస్. మెక్ (యు. ఏస్. ఎ.)<br>ఉపన్యాసకుడు, ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్<br>డిపార్టుమెంటు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అంతర్విద్యుత్ప్రతిష్ఠ |
| 3. | ఆర్. ఎన్. ఎస్. | శ్రీ ఆర్. ఎన్. శర్మ, ఎం. ఏ., బి. ఎల్.<br>హైదరాబాదు | ఆంధ్ర వాణిజ్యసంఘము |
| 4. | ఆర్. న. రావు. | డా. ఆర్. నరసింహారావు, ఎం. ఏ., పి. హెచ్. డి.<br>చరిత్రోపన్యాసకుడు, నిజాం కళాశాల,<br>హైదరాబాదు | 1. అబ్రహాం లింకను<br>2. అమెరికా సంయుక్తరాష్ట్రములు (చరిత్ర)<br>3. అమ్మరాజ విజయాదిత్యుడు |
| 5. | ఆర్. వా. పి. | శ్రీ ఆర్. వాసుదేవ పిళ్ళె,<br>బి. ఏ., ఎల్. ఎల్. ఎమ్.<br>అడ్వకేటు, ఉపన్యాసకుడు ఇంటర్ నేషనల్<br>లా, లా కళాశాల, హైదరాబాదు | అంతర్జాతీయ న్యాయశాస్త్రము (సార్వజనికము) |
| 6. | ఆర్. వేం. స్వా. | శ్రీ ఆర్. వేంకటస్వామి,<br>మేనేజరు, భాగ్యనగర్ డైయర్స్, అండ్<br>ప్రింటర్స్ ఇండస్ట్రియల్ &కో-ఆపరేటివ్<br>వర్క్సు సెంటరు, హైదరాబాదు (ద.) | అద్దకము - రంగువేత |
| 7. | ఆ. పి. | శ్రీ ఆదిరాజు వీరభద్రరావు,<br>రిటైర్డు తెలుగు పండితుడు, ప్రభుత్వోన్నత<br>పాఠశాల, చాదర్ ఘాట్, హైదరాబాదు | 1. అనంతపురము జిల్లా - అనంతపుర పట్టణము<br>2. అల్లూరి సీతారామరాజు |
| 8. | ఉ. గ. శా. | వేదభాష్య విశారద<br>శ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రి,<br>కాకినాడ | 1. అథర్వ వేదము<br>2. అభ్యవహారము |

| వ. సం. | పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|---|
| 9. | ఉ. రా. | శ్రీ ఉరుపుటూరి రాఘవాచార్యులు, బి. ఏ., బి. ఇ. డి.<br>ఉపాధ్యాయుడు, ప్రభుత్వ పాఠశాల, చంచల్ గూడ, హైదరాబాదు | 1. అబిసీనియా (చ)<br>2. అర్మీనియా |
| 10. | ఎం. ఎల్. ఎన్. | శ్రీ ఎం. ఎల్. నారాయణరావు, ఎం. ఏ.<br>లెక్చరరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు | అంకములు |
| 11. | ఎం. కు. | శ్రీ మడుపు కులశేఖరరావు, ఎం. ఏ.<br>ఆంధ్రోపన్యాసకుడు, సికింద్రాబాదు కళాశాల, సికింద్రాబాదు | ఆదిలాబాదు |
| 12. | ఎం. జి. కృష్ణ | డా. ఎం. జి. కృష్ణ<br>సైన్టిఫిక్ ఆఫీసరు, సెంట్రలు లేబరేటరీస్, హైదరాబాదు | అగ్గిపుల్లలు |
| 13. | ఎన్.వి.బి.ఎస్.డి. | శ్రీ నడింపల్లి వి. బి. ఎస్. దత్తు, ఎం. ఎస్. సి.<br>జియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, హైదరాబాదు | ఆంధ్రదేశపు ఖనిజసంపద |
| 14. | ఏ. యం. జ. | శ్రీ ఏ. యం. జయరావు,<br>ఉపన్యాసకుడు, ఫిజిక్సు డిపార్టుమెంటు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అయస్కాంతము |
| 15. | ఓ. స. మూ. | శ్రీ ఓరుగంటి సత్యనారాయణమూర్తి, ఎం. ఏ.<br>చరిత్ర, ఆర్థిక రాజకీయ శాస్త్రముల శాఖాధ్యక్షుడు, హిందూకాలేజి, గుంటూరు | 1. అధికార పరావృత్తి - అధికార విభజనము<br>2. అధికారవర్గము |
| 16. | క. రా. మా. | శ్రీ కస్తూరి రాజమాణిక్యం, ఎం. ఏ., బి. ఇ. డి.<br>ప్రధానోపాధ్యాయుడు, ఎల్లెందు, ఖమ్మం జిల్లా | 1. అండమానుదీవులు<br>2. ఆఫ్రికాఖండపు భాషలు |
| 17. | క. ల. శా. | శ్రీ శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి,<br>అసిస్టెంటు డైరెక్టరు, ప్రభుత్వ సమాచార శాఖ, హైదరాబాదు | అలంకారశాస్త్ర చరిత్ర |
| 18 | కు. సీ. | శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులు, ఎం. ఏ.<br>రిటైర్డ్ సంస్కృతాంధ్రోపన్యాసకులు, నిజాం కళాశాల, హైదరాబాదు | అద్వైతానంద తీర్థులు |
| 19. | కె. గో. | శ్రీ కె. గోపాల కృష్ణరావు, ఎం. ఏ.<br>ఆంధ్రోపన్యాసకులు, నిజాంకాలేజి, హైదరాబాదు | ఆంధ్ర విష్ణువు |
| 20. | కే. పు. | శ్రీ కే. పురుషోత్తం, బి. ఏ. (ఆనర్సు)<br>వేంసూరు | అపేక్ష - పరపరా |

| వ. సం. పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|
| 21. కే. వి. యస్. | శ్రీ కే. వి. శ్రీనివాసరావు, ఎక్సెక్యూటివ్ ఇంజనీరు, కాలువల నిర్మాణ శాఖ, తుంగభద్రా ప్రాజెక్టు, మునీరాబాదు | ఆనకట్టలు |
| 22. కే. వి. రె. | శ్రీ కే. విఠలరెడ్డి, ఎం. ఏ. ఉ. వి. హైదరాబాదు | అంగోలా |
| 23. కే. స. | శ్రీ కే. సన్యాసయ్య, బి. కాం. (ఆనర్సు) కామర్సు శాఖాధ్యక్షులు, డబ్లియు. జి. బి. కాలేజి, భీమవరం | అంతర్జాతీయ వ్యాపారము (ఒడంబడికలు) |
| 24. కే. న. శా. | శిరోమణి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి, హైదరాబాదు | ఆంధ్ర లక్షణ గ్రంథములు |
| 25. కొం. శే. | శ్రీ కొండపల్లి శేషగిరిరావు, ఉపన్యాసకులు, ప్రభుత్వ ఫైన్ ఆర్ట్సు కళాశాల, హైదరాబాదు | 1. అమృత షేర్గిల్<br>2. అలంకరణ కళ |
| 26. కొ. భూ. రా. | శ్రీ కొమరగిరి భూపాలరావు, ఎం. ఏ. తహసీల్ దార్, ఎల్లెందు, ఖమ్మముజిల్లా | 1. అక్కన్న - మాదన్న<br>2. అబుల్ హసన్ తానాషా<br>3. ఆనెగొంది |
| 27. కొ. వీ. | డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావు, ఎం. ఏ., పి. హెచ్. డి. ప్రాచ్యభాషా శాఖాధ్యక్షులు, మహారాజా కళాశాల, విజయనగరం | ఆనంద గజపతి |
| 28. ఖం. న. శా. | సాహిత్య, వ్యాకరణ శిరోమణి శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి, పండితులు, వేదాంతవర్ధనీ సంస్కృత కళాశాల, హైదరాబాదు | ఆపస్తంబుడు |
| 29. ఖం. బా. శే. | శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం. ఏ. ఆంగ్లోపన్యాసకులు, నిజాంకాలేజి, హైదరాబాదు | 1. అబ్దుల్ రజాకు<br>2. అరేబియా చరిత్ర<br>3. అస్సీరియా |
| 30. గం. జో. | ప్రొఫెసర్ గంటి జోగి సోమయాజి, ఎం. ఏ. ఎల్. టి. (విద్వాన్) ఆంధ్ర శాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు | ఆంధ్ర భాషా చరిత్రము |
| 31. గ. రా. శ. | పండిత శ్రీ గడియారం రామకృష్ణశర్మ, అలంపురము | అలంపురము |

| వ. సం. పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|
| 32. గ. ల కాం. | విద్వాన్<br>*శ్రీ గరికపాటి లక్ష్మీకాంతయ్య*, ఎం. ఏ.<br>రిటైర్డు సంస్కృతాంధ్రోపన్యాసకులు, నిజాం కాలేజి, హైదరాబాదు (ద.) | అన్నంభట్టు |
| 33. గ. శి. శా. | *శ్రీ గరికపాటి శివరామశాస్త్రి*, ఎం. ఎస్. సి.<br>లెక్చరరు, ఫిజికల్ లేబొరేటరీస్, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | 1. అచ్చు యంత్రముల నిర్మాతలు<br>1. అచ్చుయంత్రములు-ముద్రణకళ |
| 34. చ స. శా. | శిరోమణి, ఉభయభాషా ప్రవీణ<br>*శ్రీ చతుర్వేదుల సత్యనారాయణశాస్త్రి*, ఎం. ఏ.<br>రిటైర్డు సంస్కృతాంధ్రోపన్యాసకులు, ప్రభుత్వకళాశాల, కాకినాడ | ఆంధ్ర సాహిత్య పరిషత్తు |
| 35. చె. రం | శిరోమణి<br>*శ్రీ చెలమచర్ల రంగాచార్యులు*, (విద్వాన్)<br>సంస్కృతాంధ్రోపన్యాసకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | 1. అశ్వశాస్త్రము<br>2. ఆనందవర్ధనాచార్యులు |
| 36. జి. ఎస్. ఎస్. | *శ్రీ జి. నాగభూషణశర్మ*, ఎం. ఏ.<br>చరిత్రాచార్యుడు, డి. ఎ. వి. కాలేజి, షోలాపూరు | 1. అక్వినాస్ థామస్<br>2. అరిస్టాటిల్ (రాజకీయములు) |
| 37. జి. ల. | *శ్రీ. జి. లక్ష్మీనారాయణ*, ఎం. ఏ.<br>లెక్చరరు, గణితశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అనువర్తిత గణితశాస్త్రము |
| 38. జి. స. | *శ్రీ జి. సత్యమూర్తి*, ఎం. ఎస్. సి.<br>సికిందరాబాదు | 1. అడవులు<br>2. అమెరికా ఖండము (ఉ. ద)<br>3. ఆంధ్రప్రదేశము II<br>4. ఆఫ్రికా |
| 39. జి. జి. కె. ఎస్. | *శ్రీ జి. జి. కె. శాస్త్రి*.<br>జియాలజిస్టు, జియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, కలకత్తా | అభ్రకము |
| 40. జె. జో. | *శ్రీ జయంతి జోగారావు*, ఎం. ఎస్. సి.<br>లెక్చరరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు | ఆర్కీనియన్ |
| 41. జె. సి. కా. రా. | *డా. జయంతి చినకామేశ్వరరావు* డి. యస్. సి.,<br>ప్రిన్సిపాలు, నాగార్జున కళాశాల, నల్లగొండ | అణుబాంబు |

| వ. సం. పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|
| 42. జొ. ల. | శ్రీ జొ. లక్ష్మీకాంతం. ఎం. ఎస్. సి. ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | ఆమ్లజని |
| 43. టి.కె.వి.ఎన్.సు. శిరోమణి | శ్రీ టి. కే. వి. యన్. సుదర్శనాచార్యులు, పండితులు, శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్, తిరుపతి | 1. అభినవ గుప్తుడు<br>2. ఆగమశాస్త్రము |
| 44. టి. శే. రా. | డాక్టరు. టి. శేషగిరిరావు, ఫిజిక్సు లెక్చరరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అతి శ్రుతి ధ్వనిశాస్త్రము |
| 45. డా. ఆర్.వి.రా. | డాక్టరు. ఆర్. వి. రావు, ఎం ఏ., పి. హెచ్. డి. జాయంట్ డైరెక్టరు, ఇండస్ట్రీస్ & కామర్సు హైదరాబాదు | 1. అర్థశాస్త్ర ప్రమేయము<br>2. ఆంధ్రబ్యాంకు చరిత్ర<br>3. ఆర్థిక వ్యవసాయ ప్రణాళిక |
| 46. డా. ఎం. అ. ఎం. | డాక్టరు. అబ్దుల్ మోయీదుఖాను అరబ్బీభాషా శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అరబ్బీభాషా సాహిత్యములు |
| 47. డా. ఓడెల్ | డాక్టరు డి. ఫారెస్టు ఓడెల్ జర్నలిజము శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అమెరికన్ సాహిత్యము |
| 48. డా. జి. రా. రెడ్డి | డాక్టరు జి. రామకృష్ణారెడ్డి ఎం. ఏ., పి. హెచ్‌డి., ప్రొఫెసరు ఆఫ్ ఎకనామిక్సు, మహారాజా కాలేజి, మైసూరు | 1. అంతర్జాతీయ వాణిజ్యము<br>2. అర్థశాస్త్ర సిద్ధాంతముల చరిత్ర |
| 49. డా. బా. రె. | డాక్టరు బాపురెడ్డి ప్రొఫెసర్ జూఆలజి, అగ్రికల్చరల్ రిసర్చి ఇన్‌స్టిట్యూటు. హిమాయత్ నగరు హైదరాబాదు | 1. అంతర్గుహాకములు<br>2. అరిస్టాటిల్ (జం.) |
| 50. డా. పు. శ్రీ. | డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచారి, ఎం. ఏ., పి. హెచ్‌డి. (లండన్) డైరెక్టరు, పురాతత్త్వశాఖ, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు | అజంతా |
| 51. డా. మ. ని. | డాక్టరు మహేశ్వర నియోగ్ ఎం. ఏ., డి. ఫిల్. ప్రొఫెసరు, గౌహతి విశ్వవిద్యాలయము, గౌహతి, అస్సాము | అస్సామీ భాషా సాహిత్యములు |
| 52. డా. యస్. బా. | డాక్టరు యస్. బాలకృష్ణ భూగర్భశాస్త్ర శాఖాధ్యక్షుడు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | 1. అంతర్జలము<br>2. అగ్ని పర్వతములు |

| వ. సం. | పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|---|
| 53. | డా. యూ. హు. ఖా. | డాక్టరు యూసుఫ్ హుస్సేన్ ఖాన్ ఎం. ఏ., చరిత్ర శాఖాధ్యక్షుడు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అబుల్ ఫజల్ |
| 54. | డా. వ. | డాక్టరు వహీదుద్దీన్ రీడరు, ఫిలాసఫీశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అరిస్టాటిల్ (తత్వ) |
| 55. | డా. వి. య. | డాక్టరు వి. యశోదాదేవి, ఎం. ఏ., ఎం. లిట్. డి. లిట్., మదరాసు | 1. అలెగ్జాండరు<br>2. ఆంధ్రదేశ చరిత్రము III 1323-1675<br>3. ఆఫ్ఘనిస్థానము |
| 56. | డా. ఎస్. వేం. రా. | డాక్టరు ఎస్. వేంకటేశ్వరరావు, ఎం. డి. (ఆంధ్ర) ఆనరరీ ఫిజిషియన్, ఉస్మానియా జనరల్ హాస్పిటలు, హైదరాబాదు | 1. అంటువ్యాధులు (ఎల్లోపతి)<br>2. అన్నజీవ పరివర్తన వ్యాధులు<br>3. అవిసెన్నా<br>4. ఆంద్రియాస్ వెసేలియస్ |
| 57. | డా. సి. రా. | డాక్టరు సి. రాధాకృష్ణరావు, ఎం. ఏ. పి. హెచ్. డి. థియొరెటికల్ రీసర్చి ప్రొఫెసరు, ట్రైనింగ్ డివిజన్ అధ్యక్షులు. ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్స్టిట్యూట్. కలకత్తా | అనువర్తిత సంఖ్యాశాస్త్రము |
| 58. | డి. డి. బి. | శ్రీ డి. దినకరబిందు జి. డి. (ఆర్కిటెక్చరు), ఎ. ఆర్. ఐ. బి. ఎ., క్రొత్తఢిల్లీ | 1. ఆకృతి రచన - ఆధునిక నిర్మాణ ద్రవ్యములు<br>2. ఆకృతి రచనాసూత్రములు<br>3. ఆధునిక వాస్తువాదములు |
| 59. | డి. వి. కె. | శ్రీ డి. వి. కృష్ణయ్య, ఎం. కాం. (ఆనర్సు) ప్రిన్సిపాలు, ఎస్. ఆ. ఆర్. అండ్ సి. వి. ఆర్. కాలేజి, విజయవాడ | 1. అంటార్కిటికా<br>2. అమెరికా సంయుక్తరాష్ట్రములు (భూగో.)<br>3. అర్జంటైనా<br>4. ఆంధ్ర ప్రదేశము I<br>5. ఆంధ్రులు - వాణిజ్యము<br>6. ఆఫ్ఘనిస్థానము (భూగో.) |
| 60. | డి. హ. | శ్రీ డి. హనుమంతరావు. రసాయనశాస్త్రశాఖ. ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అల్యూమినియం |
| 61. | త. స. న. | డాక్టరు తమ్మా సత్యా నరసింహమూర్తి, ఎం. ఏ. పి. హెచ్. డి. లెక్చరరు, నిజాంకళాశాల, హైదరాబాదు | ఆర్కెమెడీసు |

| వ. సం. పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|
| 62. తి. కో. రా. | శ్రీ తిమ్మావఝుల కోదండరామయ్య, బి. ఓ. ఎల్. (ఆనర్సు) తెలుగుశాఖాధ్యక్షులు, శ్రీ త్యాగరాయ కళాశాల, మద్రాసు | అన్నమాచార్యులు - తాళ్లపాక |
| 63. తి. రా. | శ్రీ తిరుమల రామచంద్ర, సంపాదకుడు, 'పరిశోధన'- మద్రాసు | అడివి బాపిరాజు |
| 64. దం. వే. సు. | శ్రీ దండిపల్లి వేంకటసుబ్బాశాస్త్రి, ఆంధ్రోపన్యాసకులు, కళాశాల, కర్నూలు | అహోబిలము |
| 65. ది. పి. | శ్రీ దిగంబర పిళ్ళె లెక్చరరు, కాలేజి ఆఫ్ ఫైన్ ఆర్ట్సు, హైదరాబాదు | అద్దకము |
| 66. ది. రా. | శ్రీ దివాకర్ల రామమూర్తి ఎం. ఏ., తెలుగు శాఖాధ్యక్షులు, ఎ.వి.ఎన్. కాలేజి, విశాఖపట్టణము | అరసవెల్లి |
| 67. దు. వి. ర. | శ్రీ దూపాటి వేంకట రమణాచార్యులు, శతావధానులు రిటైర్డు తెలుగు పండితులు, అనుమకొండ | 1. అనపోతనాయడు<br>2. అనుమకొండ |
| 68. ది. వేం. అ. | డాక్టరు దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ., పి. హెచ్. డి., రీడరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | 1. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము I (1508 వరకు)<br>2. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము II (1509-1800) |
| 69. ది. వేం. శి. | శ్రీ దిగవల్లి వేంకటశివరావు బి. ఏ., బి. ఎల్., అడ్వొకేట్, విజయవాడ | 1. ఆంధ్రదేశ చరిత్రము IV (1675-1900)<br>2. ఆంధ్రదేశ చరిత్రము V (1900 - నేటి వరకు) |
| 70. దే. రా. | శ్రీ దేవులపల్లి రామానుజరావు బి. ఏ., ఎల్. ఎల్. బి కార్యదర్శి, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి, హైదరాబాదు | 1. ఆంధ్ర సారస్వత పరిషత్తు<br>2. ఆంధ్రోద్యమము (తెలం) |
| 71. న. రా. | శ్రీ నటరాజ రామకృష్ణ, బి. ఏ., డైరెక్టరు-నృత్యనికేతనము, హైదరాబాదు | 1. ఆంధ్రులు - నృత్యకళ<br>2. ఆటవిక నృత్యములు |
| 72. ని. వేం. | శ్రీ నిడదవోలు వేంకటరావు ఎం. ఏ., ఆంధ్ర శాఖాధ్యక్షులు, మదరాసు విశ్వవిద్యాలయము, మదరాసు | ఆంధ్రలిపి పరిణామము |

| వ. సం. | పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|---|
| 73. | నో. నా. | కళానిధి, సంగీతరత్న శ్రీ నోరి నాగభూషణం, జంత్రగాత్ర గాన విశారద, గవర్నమెంటు స్కూల్ ఆఫ్ మ్యూజిక్ అండ్ డాన్సు, హైదరాబాదు | అహోబలుడు |
| 74. | నో. రా. శా. | ఆయుర్వేద భూషణ, పండిత శ్రీ నోరి రామశాస్త్రి ఎ. కె. ఎ. సి., విజయవాడ | ఆయుర్వేద గ్రంథములు |
| 75. | పం. గో. | శ్రీ పండిత గోపదేవు, హైదరాబాదు | ఆర్యసమాజము |
| 76. | ప. దు. | శ్రీ పల్లా దుర్గయ్య ఎం. ఏ., ఆంధ్రోపన్యాసకులు, నిజాంకాలేజి, హైద్రాబాదు | అల్లసాని పెద్దన |
| 77. | పి.ఎల్.ఎన్.శర్మ | శ్రీ పేరి లక్ష్మీనరసింహ శర్మ ఎం ఎ., ప్రిన్సిపాలు గిరిరాజ కాలేజి, నిజామాబాదు | ఆంధ్ర విశ్వవిద్యాలయము |
| 78. | పి. టి. ఆర్. | శ్రీ పి. తిరుమలరెడ్డి, హైదరాబాదు | ఆధునిక పాశ్చాత్య చిత్రకళ |
| 79. | పి. టి. రా. | పద్మభూషణ డా. పి. తిరుపతిరాజు, ప్రొఫెసరు ఫిలాసఫీ-సైకాలజీశాఖ రాజస్థాన విశ్వవిద్యాలయము. జోధ్‌పూరు | అతి భౌతిక శాస్త్రము |
| 80. | పి. బి. వి. యస్. | శ్రీ పి. బి. వేంకటసుబ్రహ్మణ్యం, ఎం. ఏ., ఎం. లిట్. బి. సి. ఎల్., అడ్వకేట్, హైదరాబాదు | అంతర్జాతీయ న్యాయము (వైయక్తికము) |
| 81. | పి. య. రె. | శ్రీమతి పి. యశోదారెడ్డి, ఎం. ఏ., ఆంధ్రోపన్యాసకురాలు, మహిళా కళాశాల, హైదరాబాదు | 1. అనపోతారెడ్డి<br>2. అనవేమారెడ్డి<br>3. అనితల్లి<br>4. అమరావతి |
| 82. | పి. వేం. | శ్రీ పి. వేంకటేశ్వరరావు, జియలజిస్టు, జియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, హైదరాబాదు | ఆర్థిక ఖనిజములు - వాని సేకరణ సమస్యలు |
| 83. | పు. నా. | సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, లైబ్రేరియన్, సాహిత్యఅకాడమి, న్యూఢిల్లీ | అపభ్రంశము |

| వ. సం. పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|
| 84. పు. వ. శా. | శ్రీ పుచ్చా వరబ్రహ్మశాస్త్రి ఎం. ఏ., ఉపాధ్యాయులు, కేశవ మెమోరియల్ హైస్కూలు, హైదరాబాదు | ఆర్యభటుడు<br>ఆర్షగణితము |
| 85. పెం. స. | శ్రీమతి పెండేల సత్యభామ, పిఠాపురము | అభినయము |
| 86 పె. గా. | శ్రీ పెద్దాడ రామస్వామి ఎం. ఏ., ప్రిన్సిపాలు కావలి కాలేజి, కావలి | ఆంగ్లభాషా సాహిత్యములు |
| 87. పె. లిం. శా. | భాషాప్రవీణ శ్రీ పెరవలి లింగయ్యశాస్త్రి, ప్రధానాంధ్రోపాధ్యాయుడు, ప్రభుత్వోన్నత పాఠశాల, చాదర్ ఘాట్, హైదరాబాదు | అహోబల పండితుడు |
| 88. పో. రా. | శ్రీ పోలవరపు రామచంద్రరావు బి. ఏ. బి. ఎల్., అడ్వకేటు, విజయవాడ | ఆధునిక సంగీతము |
| 89. పో. శ్రీ. రా. | శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు ఎం. ఏ., ఇండియా ప్రభుత్వపు రిసెర్చి స్కాలరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము. హైదరాబాదు | అరిస్టాటిల్ (సాహి) |
| 90. పో. సు. | ప్రొఫెసర్ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి. ఎం. ఏ., ఎం. లిట్. పి. హెచ్. డి., ఇంగ్లీషు ప్రొఫెసరు, సాగర్ యూనివర్సిటీ, సాగరు | అప్పయ దీక్షితులు |
| 91. వి. ము. | ప్రొఫెసర్ విశ్వనాథ ముఖర్జీ, ఎఫ్. ఆర్. ఎస్. ఏ., (లండన్) ప్రిన్సిపాల్, కాలేజి ఆఫ్ ఫైన్ ఆర్ట్సు, హైదరాబాదు | 1. అవనీంద్రనాథ టాగోరు<br>2. ఆధునిక భారతీయ చిత్రకళా రీతులు |
| 92. బి. యస్. చ. | శ్రీ బి. యస్. చతుర్వేది, ఎం. ఏ., ఎఫ్. ఆ. జి. ఎస్. (లండన్) సాహిత్యరత్న అలహాబాద్ ప్రొఫెసర్, జాగ్రఫీ డిపార్టుమెంటు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | 1. అరేబియా (భూగో)<br>2. అలాస్కా<br>3. ఆర్థిక భూగోళశాస్త్రము |
| 93. బి. యస్. ఎల్. హా. గా. | శ్రీ బి. యస్. ఎల్. హనుమంతరావు ఎమ్. ఏ., హిస్టరీ లెక్చరర్, హిందూ కాలేజి, గుంటూరు | 1. అక్బరు<br>2. అళియ రామరాజు |
| 94. బి. రా. | డా. బి. రామరాజు, ఎం. ఏ., పి. హెచ్. డి. రీడరు, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | ఆంధ్ర జానపద గేయ వాఙ్మయము. |

| వ. సం. | పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|---|
| 95. | బి. రా. రా. | శ్రీ బాదు రాఘవేంద్రరావు ఎం. ఏ. (కామర్సు)<br>కామర్సు శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వ<br>విద్యాలయము, హైదరాబాదు | అబిసీనియా (భూగోళము) |
| 96. | బి. వి. ఎన్. ఎ. | శ్రీ బి. వి. ఎన్. ఆచార్య<br>శ్రీ రాజరాజేశ్వరీ ఫిల్ముకంపెని, మద్రాసు | ఆంధ్ర సినిమా పరిశ్రమ |
| 97. | బి. వి. రా. | శ్రీ బి. వి. రామనర్సు ఎం. ఏ.,<br>ప్రిన్సిపాలు, ప్రభుత్వ కళాశాల, వరంగల్లు | అద్దె |
| 98. | బి. వేం. శే. | శ్రీ బిదురు వేంకటశేషయ్య బి. ఏ.,<br>ప్రధానాంధ్రోపాధ్యాయుడు, మహబూబు<br>కాలేజి హైస్కూలు, సికిందరాబాదు | అభినయ దర్పణము |
| 99. | బు. అ. శా. | తర్కరత్న, న్యాయ వేదాంతవిద్యాప్రవీణ<br>శ్రీ పండిత బులుసు అప్పన్నశాస్త్రి<br>భట్నవెల్లి, తూర్పుగోదావరిజిల్లా | అద్వైతము |
| 100. | బు. వేం. | శ్రీ బులుసు వేంకటేశ్వర్లు ఎం. ఏ.,<br>ఆంధ్రోపన్యాసకుడు, పి. ఆర్. కాలేజి,<br>కాకినాడ | అనుభవ మూలవాదము |
| 101. | బు. సు. | శ్రీ బుర్రా సుబ్బారాయుడు బి. ఏ., ఎల్. ఎల్. బి.,<br>అడ్వకేటు, హైదరాబాదు | ఆపత్స్థితి చట్ట నిర్మాణము |
| 102. | బే. వి. | డా. బేతవభట్ల విశ్వనాథం, ఎం. ఏ., పి. హెచ్.డి.,<br>రీడరు, గణితశాస్త్రశాఖ, ఉస్మానియా విశ్వ<br>విద్యాలయము, హైదరాబాదు | ఆయ్‌లర్ |
| 103. | భో. వ. | డా. భోగరాజు పట్టాభిసీతారామయ్య,<br>గవర్నరు, మధ్యప్రదేశ్, నాగపూరు | ఆంధ్ర జాతీయ కళాశాల |
| 104. | మ. జ. రా. | శ్రీ మహీధర జగన్మోహనరావు,<br>4147 వై గ్రాంరోడ్డు, రాజమహేంద్రవరము | అఫనాసినికితిన్ |
| 105. | మ. సూ. శా. | 'అభినవ వాగనుశాసన'<br>శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి,<br>ఆంధ్రాచార్యులు (రిటైర్డు), ఆంధ్ర విశ్వ<br>విద్యాలయము, ధవళేశ్వరము | ఆరణ్యకములు |
| 106. | మా. వేం. రం. | శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం. ఏ.,<br>రిటైర్డుప్రొఫెసరు ఆఫ్ పాలిటిక్సు, బొంబాయి<br>యూనివర్సిటీ, హైదరాబాదు | అంతర్జాతీయ సంస్థలు |
| 107. | మొ. కృ. | శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి,<br>చిత్రకారులు, ఏలూరు | ఆంధ్రులు - చిత్రకళ |
| 108. | రా. ప్ర. | శ్రీ రామచంద్ర ప్రసాదు, ఎం. ఏ.,<br>లెక్చరరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము<br>హైదరాబాదు | 1. అమెరికను ఇండియనులు<br>2. ఆదిమజనుల సంస్కృతుల |

| వ. సం. పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసములు |
|---|---|---|
| 109. రా. సు. | ప్రొఫెసర్ రాళ్ళబండి సుబ్బారావు, ఎం. ఏ. ఎల్. టి., గౌరవ కార్యదర్శి, ఆంధ్ర హిస్టారికల్ రిసర్చి సొసైటీ, రాజమహేంద్రవరము | 1. ఆంధ్రదేశ చరిత్రము II (625-1323)<br>2. ఆంధ్రేతిహాస పరిశోధకమండలి |
| 110. వ. బ్ర. | శ్రీ వసంతరావు బ్రహ్మాజీరావు, అడ్వకేటు, విజయనగరము. | ఆదిభట్ల నారాయణదాసు |
| 111. వా. రా. బ్ర. | శ్రీ వారణాసి రామబ్రహ్మం, ఎం. ఏ., లెక్చరరు, కాలేజి, అమలాపురము | అంతర్వేది |
| 112. వి. ఎల్. కె. | శ్రీ వంగీపురం లక్ష్మీకాంతం, ఎం. ఏ., లెక్చరరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు | 1. అంక గణితము<br>2. అంకములు |
| 113. వి. జ. | శ్రీ వి. జగన్నాథరావు, ఎం. ఎస్. సి., జూఆలజీ, లెక్చరరు, సైన్సుకాలేజి, హైదరాబాదు | అనువంశికము |
| 114. వి. భ. | డా. విశ్వేశ్వరభట్టు, ఎం. ఏ., లెక్చరరు ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | అరవిందుడు |
| 115. వి. వ. న. | శ్రీ వింజమూరి వరాహ నరసింహాచార్యులు, సంగీత విద్వాన్, కాకినాడ | అష్టోత్తర శతతాళములు |
| 116. వే. చం. | శ్రీ వేలూరి చంద్రశేఖరం, బి. ఏ., చిరివాడ | అరవిందుడు |
| 117. వే.తి. వేం.రా. స్వా. | పండిత కళావధాని శ్రీ వేదాల తిరుమల వేంకటరామానుజస్వామి, ఆయుర్వేదాచార్య, ఆయుర్వేద కళా పరిషత్తు, హైదరాబాదు | 1. అంటువ్యాధులు (ఆయుర్వేదము)<br>2. ఆయుర్వేద ధర్మములు |
| 118. వే. శి. శా. | కళావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రి, చిరివాడ | అర్ధ భూగోళము |
| 119. వై. వి. ఆర్. | శ్రీ వై. విఠలరావు ఎం. ఏ., బి. ఇడి., హిస్టరీ లెక్చరరు, డబ్లియు. జి. బి. కాలేజి, భీమవరము | ఆంధ్రదేశ చరిత్రము I (క్రీ. శ. 625 వరకు) |
| 120. శ్రీ. శ్రీదేవి | డా. శ్రీపతి శ్రీదేవి ఎం. ఏ., పి. హెచ్. డి., ప్రిన్సిపాలు, మహిళాకళాశాల, హైదరాబాదు | 1. అఖిలేశ్వరవాదము<br>2. అభ్యసన మనస్తత్వము |
| 121. సి. ఎస్. ఆర్. | శ్రీ సి. శ్రీనివాసరావు, శ్రీ రాజరాజేశ్వరీ ఫిల్ముకంపెని, మద్రాసు | ఆంధ్ర సినిమా పరిశ్రమ |
| 122. సో. రా. | శ్రీ సోమరాజు రామదాసు, బి. ఏ. ఎం. ఇ. డి., ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు, నల్లగొండ | అరిస్టాటిల్ (జీ) |
| 123. హెచ్. కె. షె. | శ్రీ హరూన్ ఖాన్ షెర్వాణి ఎం. ఏ., (ఆక్సను) ఎఫ్. ఆర్. హెచ్. ఎస్. బార్. ఎట్ లా., రిటైర్డు ప్రిన్సిపలు, నిజాం కాలేజి, హైదరాబాదు | అల్బెరూని |

★

విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్

# సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము

**అంకగణితము** — గణితశాస్త్రములలో నెల్ల అంకగణితము మిక్కిలి పురాతనమైనది. పూర్వ మిది సాంఖ్యసిద్ధాంతముగా పరిగణింపబడుచుండెడిది. కాల క్రమమున సాంఖ్యసిద్ధాంత మొక ప్రత్యేకశాఖ యైనందున నేడు అంకగణితము, గణనక్రియకు, దాని అనుప్రయోగములకు సంబంధించినదిగా గుర్తించబడుచున్నది.

సంఖ్యాక్రమ విధానము : ప్రాచీనజాతులవా రందరును మొట్టమొదట వేళ్ళలోనే లెక్క పెట్టెడివారు. సంఖ్యలను మాటలవలన తెలిపెడివారు. అంకములకు, సంఖ్యలకు ప్రత్యేక గుర్తులు లేకుండ పదములలోనే వ్రాయుచుండినచో, గణితశాస్త్రమే సంకుచితమై యుండెడిది. కనుకనే అంకములకు చిహ్నముల నేర్పరచు ఆవశ్యకము గల్గినది. చరిత్రకు తెలిసినంతవరకు సంఖ్యలను వ్రాయుటలో "ఫినీషియను" పద్ధతి మిక్కిలి పురాతనమయినది. వారు తొమ్మిదివరకు అంకెలను నిలువు గీతలచే తెలిపెడివారు. మన మిప్పటికిని కొన్ని నిర్దిష్ట కార్యములకై వాడు రోమను సంఖ్యలు, రోమనులు సంఖ్యాక్రమ నిరూపణమున గ్రీకులమార్గము నవలంబింపక వేరొకత్రోవ త్రొక్కిరి అని తెలుపును. రోమనుల సంఖ్యాసంకేతము లివి :

I, II, III IV, V, VI, VII, VIII, IX, X, L, C, D, M.
1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, 50, 100, 500, 1000.

హిందువుల సంఖ్యాస్వరూపము (System of Notation) తదితర జాతులవారిదానికంటె భిన్నము. అంకగణితమున హిందువులు అత్యంతపురాతనకాలముననే మిక్కిలి పరిశ్రమ చేసిరి. క్రీ. శ. 12 వ శతాబ్దినాటికే హిందువులు నవీన అంకగణితసారము నంతయు గ్రహించిరి. 'సంఖ్యావళియందు స్థానభేదమును, సంఖ్యలేనిచోట సున్న పెట్టుటయు, సంఖ్యాతత్వ నిరూపణమునందు ధన, ఋణ సంఖ్యాభేదములును, కరణి, వికరణ్యాంక (Irrational and rational quantities) వివక్షయు, మొట్టమొదట కనుగొన్నవారు హిందువులే. 11 వ శతాబ్ది ఆరంభమున అల్బెరూని యను మహమ్మదీయ చరిత్రకారుడు హిందువుల సంఖ్యావిధానమునుగురించి వ్రాయుచు, హిందూ దేశమున సంఖ్యావళిలో 9 అంకెలును, ఒక సున్నయు నుండి, స్థానమునుబట్టి యేదేని యొక సంఖ్యయొక్క మొత్తము పదిరెట్లు హెచ్చుటగాని, తగ్గుటగాని కలదని వ్రాసియుండెను. మన దేశమున క్రీ. శ. 876 లో సున్న వాడుకలో నున్నట్లు నిదర్శనములు గలవు. సంఖ్యాక్రమమున మనము వాడు అంకెలను గురించి, క్రీ. శ. 662 లోనే సిరియా దేశస్థుడగు సెవెరస్ సెబోఖ్తు అను నతడు ఇతరదేశములకు వెల్లడిచేసి యుండుట గమనింపదగినది.

సంఖ్యావళియందున్న అంకెలకు రెండర్థములుగలవు. మొదటిది అంకెలయొక్క గుర్తునుబట్టి కలుగుచున్నది. అనగా "4" అను సంకేతమునకు, "నాలుగు" అను అర్థము గుర్తువలన దెలియుట. ఇయ్యది సాంకేతికార్థము. ఇక రెండవ అర్థము, ఈ యంకెలకే, స్థానభేదమువలన గలుగుచున్నది.

ఉదా : '5' గుర్తునకు ఐదని సాంకేతికార్థము. కాని '52' అను అంకములో, 'ఐదు' నకు స్థానమును బట్టి యేబది యను అర్థము కలుగుచున్నది. ఇట్లొక్కొక్క స్థానము హెచ్చినకొలది, అంకెయొక్క విలువ పదిరెట్లు చొప్పున హెచ్చుచుండును. మన సంఖ్యాక్రమమునందు

ఇట్టి స్థానములు 36 ఉండుటవలన పూర్వు లెంత పెద్ద సంఖ్యల నూహించి యుండిరో తెలియనగును. ఈ ముప్పది యారు స్థానభేదములు దిగువ వివరింపబడినవి :

1. ఏకము, 2. దశము, 3. శతము, 4. సహస్రము, 5. అయుతము (దశసహస్రము), 6. లక్ష, 7. దశలక్ష, 8. కోటి, 9. దశకోటి, 10 శతకోటి, 11. అర్బుదము, 12. న్యర్బుదము, 13. ఖర్వము, 14. మహాఖర్వము, 15. పద్మము, 16. మహాపద్మము, 17. క్షోణి, 18. మహాక్షోణి, 19. శంఖము, 20. మహాశంఖము, 21. క్షితి, 22. మహాక్షితి, 23 క్షోభము, 24. మహాక్షోభము, 25. నిధి, 26. మహానిధి, 27. పర్వతము, 28. అత్యంతము, 29. పరార్థము, 30. అనంతము, 31. సాగరము, 32. అవ్యయము, 33. అచింత్యము, 34. అమేయము, 35. భూరి, 36. మహాభూరి.

ఉదా : మహాభూరి సంఖ్యయందు ఒకటి అను అంకె వెనుక (35) ముప్పదియైదు సున్నలుండును.

లలితవిస్తరమను బౌద్ధగ్రంథమునందు శతకోటి మొదలుకొని, నూరు నూరు రెట్లధికముగ ఈ క్రింది సంఖ్యలు చెప్పబడినవి :

శతకోటి, అయుతము, వియుతము, కంకరము, వివరము, అక్షోభ్యము, వివాహము, ఉత్సంగము, బహుళము, నాగబలము, తటలంబము, వ్యవస్థాన ప్రజ్ఞప్తి, హేతుహిల, కరహు, హేత్వింద్రియము, సమాప్తలంబము, గణనాగతి, నిరవత్యము, ముద్రాబలము, సర్వబలము, విసంజ్ఞగతి, సర్వసంజ్ఞ, విభూతంగమ, తల్లక్షణ, ధ్వజాగ్రవతి, ధ్వజాగ్రనిషామణి, వాహన ప్రజ్ఞప్తి, కురుత, సర్వనిక్షేపము, అగ్రసారము, పరమాణువు, రజఃప్రవేశానుగతము.

కల్పనాతీతమగు అంకెలకు పేర్లు పెట్టిన వారి గణిత జ్ఞానము మన మించుక యూహించవలసి యుండును.

పురాతన బౌద్ధ గ్రంథములయం దింతకంటె నెక్కుడు సంఖ్యలు గూడ చెప్పబడినవి. ఇట్టి సంఖ్యలను లెక్కించుటకు 'కోటి' యను సంఖ్యను మూలము (Radix) గా తీసికొనవలయును. కో, కో², కో⁴, కో⁸, . . . కో² ⁽¹²⁸⁾. అన్ని సంఖ్యలకు వేరువేరు పేర్లు పెట్టబడినవి. కో² ⁽¹²⁸⁾ అను సంఖ్య కల్పనాతీతము. ఇది వ్రాయుటకు ఒకటి అను అంకె వెనుక ఎన్ని సున్నలు పెట్ట వలయున చెప్పుటకు గావలసిన సంఖ్యలోనే 40 సున్న లుం వలయును.

అర్జును డను గణితశాస్త్రజ్ఞుడు గౌతమ బుద్ధుని ఖ క్షించెననియు, అప్పు డాత డీ పైన జెప్పిన పేర్లు చె ననియు లలిత విస్తర గ్రంథమునం దున్నది. అన ప్రాచీన కాలమునందే మన పూర్వులు లెక్కపెట్టు యందు అసమాన ప్రావీణ్యము గలవారని స్పష్టమ చున్నది. అంతేగాక మన సంఖ్యావద్ధతియే, నాగ ప్రపంచమునం దంతటను వ్యాపించి, గణితశాస్త్ర వృద్ధికి కారణమైనది. ఇట్టి అసమాన ప్రతిభా విశేషము వెలిబుచ్చు సంఖ్యాక్రమ విధానమును గనిపెట్టిన గౌ వము మన పూర్వులకే దక్కినది.

పూర్ణ సంఖ్యలు : సంఖ్యలు రెండు భాగములు విభజింప బడినవి.

1. గణన సంఖ్యలు (Cardinal numbers).

2. క్రమసూచక సంఖ్యలు (Ordinal numbers).

ఒక సముదాయమును (class) లెక్కపెట్టగా వచ్చి ఫలితమును తెలుపుటకు ఉపయోగింపబడు సంఖ్య 'గణనసంఖ్య' యందుము.

ఉదా : ధృతరాష్ట్రునకు 'నూర్గురు' పుత్రులు. ఇచ 'నూర్గురు' గణన సంఖ్య.

అనుక్రమము (Sequence) లోని స్థానమును తెలు సంఖ్యను 'క్రమసూచక సంఖ్య' యందురు.

ఉదా : సహదేవుడు పాండవులలో 'ఐదవ' వీరుడ ఇచట 'ఐదవ' క్రమసూచక సంఖ్య.

పూర్ణసంఖ్యలయందు, అవిభాజ్య సంఖ్యలు (Prin Numbers) అనియు, విభాజ్యసంఖ్యలు (Composi Numbers) అనియు మరొక విభజనముగలదు. ఈ భేదవ సాంఖ్య సిద్ధాంతమున చూడనగును.

సంఖ్యలను, ధనాంకము (Positive Number అనియు, ఋణాంకము (Negative Numbers) లనియు మరి రెండు విధములుగా భాగింప నగును. సంఖ్యలల మొట్టమొదట ఈ భేదమును గనిపెట్టినవారు హిందువు

భిన్నములు (Fractions) : భిన్నములను గురించి ప్రా నుల భావనలు, వాటిని వ్రాయుటకై ఏర్పరచిన సంకే

ములు, వాని ప్రయోగ విధానములు (Operations) అంకగణితమున తెలియనగును.

అన్నిటికంటె పురాతనమైన భిన్నాంకములు ఈజిప్టు దేశీయులవి. మన ప్రాచీనుల భిన్నాంకవిధానము బఖాలి పురమున దొరకిన తాళపత్రములవలన దెలియగలదు. ఇవి క్రీ. శ. 3, 4 శతాబ్దములనాటివి అని నిర్ణయింప బడినది. ఇందు భిన్నాంకములను వ్రాయునపుడు లవమున కును, హారమునకును మధ్యగీటు వదలివేయబడియున్నది.

సాధారణ భిన్నములను (Common Fractions) మూడు భాగములుగ విభజించిరి.

1. లవముకంటె హారము హెచ్చుగనున్న భిన్నాంకములు సవ్యభిన్నములు (Proper Fractions).

2. లవముకంటె హారము తక్కువగలవి అపసవ్య భిన్నములు (Improper Fractions).

3. పూర్ణాంకములతోగలసియున్న భిన్నములు మిశ్ర భిన్నములు (Mixed Fractions).

సాధారణ భిన్నములుగాక మరి రెండు భాగములుగా భిన్నములు విభజింపబడినవి.

1. షష్ట్యంక గుణిత భిన్నములు (Sexagesimal Fractions).

2. దశాంశ భిన్నములు (Decimal Fractions).

పదునారవ శతాబ్ది ప్రాంతమున దశాంశభిన్నములు వాడుకలోనికి వచ్చినట్లు గన్పట్టుచున్నది. వీని రాకవలన భిన్నములపై క్రియలప్రయోగము సులభసాధ్యమైనది.

అంక గణిత వ్యవహారములు (Arithmetical Operations) : మన ప్రాచీనులు అంకగణిత వ్యవహారములను క్రింద వ్రాసిన 8 భాగములుగా విభజించిరి.

(1) సంకలనము (Addition), (2) వ్యవకలనము (Subtraction), (3) గుణకారము (Multiplication), (4) భాగహారము (Division), (5) వర్గము (Squaring), (6) వర్గమూలము (Square root), (7) ఘనము (Cube), (8) ఘనమూలము (Cube root). వీనికి 'పరికర్మాష్టకము' అని పేరు.

భాస్కరాచార్యుని కాలము నాటికి పై క్రియలు నాలుగైనవి. అవి సంకలన, వ్యవకలన, గుణకార, భాగహారములు. క్రియలన్నిటికి మూలాధారము సంకలన, వ్యవకలనములే అనియు, తక్కిన క్రియలు వీటి రూపాంతరము లనియు ఆయనయే స్పష్టపరచినాడు. అనగా అంకగణితమున క్రియలు రెండే.

భాస్కరుని తరువాత సంకలనక్రియ గమనింపదగిన మార్పులను పొందలేదు. బహుశః నాటి హిందువులుగాని, రోమనులుగాని ప్రస్తుత శతాబ్దములయందు ఉండిరేని, పెక్కు మార్పులను జేసియుండెడి వారేమో !

వ్యవకలన క్రియమాత్రము అనేక ప్రయోగములకు గురియైనది. 423 నుండి 46 ను తీసివేయవలయుననిన 423 ను 300+100+23 గా మార్చి, తరువాత వ్యవకలన క్రియను ఉపయోగించుట పూర్వుల సులభ మార్గము. మరికొన్ని యుక్తులు హిందువుల అంకెల రాక వలన ప్రసిద్ధికి వచ్చినవి. మన దేశమున 12 వ శతాబ్దమున వెలసిన, కోటిపూరక పద్ధతి వానిలో నొకటి. ఇది క్రింది సర్వసమాన సమీకరణముపై ఆధారపడియున్నది.

$$a-b \equiv a+(10-b)-10$$

ఉదా: $12-7 \equiv 12+(10-7)-10=12+3-10=5$. అంటె 7 కు కోటి పూరకసంఖ్య (Complement number) $=10-7$ అనుట స్పష్టము. నేటి లెక్కలు చేయు యంత్రము (Calculating machine) నందు ఈ కోటి పూరక పద్ధతి అర్థ్వమగు ఉపయోగమును బొందినది. ఇందులో కోటి పూరక సంఖ్యను కలిపి, వ్యవకలనమును సాధింతురు.

గుణకారమును సాధించుటలో పెక్కు మార్గములు గలవు. మన ప్రాచీన గణిత శాస్త్రజ్ఞులు గుణకారమును అనేక విధములుగా చేసినట్లు కనిపించుచున్నది. భాస్కరుని 'లీలావతీ గణితము' నందు గుణకారమునకు 'ఆరు' మార్గములు చెప్పబడినవి. వాటిలో (1) ఖండగుణన విధానపద్ధతి, (2) విలోమ విధానపద్ధతి ఉదాహరింప బడుచున్నవి:-

(1) *ఖండగుణన పద్ధతి* :- $625 \times 15$

15 గుణకమును ఇష్టభాగములు చేయుము. అవి 7, 8 అనుకొనుము.

తరువాత $625 \times 7 = 4,375$

$625 \times 8 = \underline{5,000}$

$\therefore \ 625 \times 15 = \underline{9,375}$ లబ్ధము.

(2) విలోమ విధానము :- ఇందు పై లెక్కనే మూడు విధములుగా చూపవచ్చును.

(i)

| | |
|---|---|
| 625 | గుణ్యము |
| 15 | గుణకము |
| 625 | |
| 3125 | |
| 9,375 | లబ్ధము. |

(ii)

| | | | | |
|---|---|---|---|---|
| 1×6 | 6 | | | |
| 1×2 | | 2 | | |
| 1×5 | | | 5 | |
| 5×6 | 3 | 0 | | |
| 5×2 | | 1 | 0 | |
| 5×5 | | | 2 | 5 |
| లబ్ధము— | 9 | 3 | 7 | 5 |

(iii)

625
15

| | | | |
|---|---|---|---|
| | 6 | 2 | 5 |
| 1 | 3 / 0 | 1 / 0 | 2 / 5 |
| 5 | | | |
| 9 | 3 | 7 | 5 |

ఇట్టి లబ్ధమునందలి తప్పొప్పులను కనుగొనుటకు ఒక సూత్రము చాలకాలముక్రిందనే మన పూర్వులు ఉపయోగించెడివారు. నేటి గణితశాస్త్రజ్ఞులును దానినే వాడుచున్నారు. అది ఎట్లన :

గుణ్యమునందును గుణకమునందును గల అంకెల మొత్తములను, 9 చే భాగించగా లభించు శేషముల లబ్ధమునుగూడ 9 చే భాగించిన వచ్చు శేషమును, గుణ్య గుణకముల లబ్ధములోగల అంకెల మొత్తమును 9 చే భాగించగావచ్చు శేషమును, సమానములైనచో లభించిన లబ్ధము ఒప్పు.

ఉదా : 625×15=9375

6+2+5ను 9 చే భాగించిన మిగులు శేషము =4
1+5 ,, ,, ,, =6
∴ 6×4ను ,, ,, ,, =6
మరియు, 9+3+7+5 ,, ,, =6

రెండు సమానములు. కావున వచ్చిన లబ్ధము ఒప్పు.

పేసియోలి (Paciolī క్రి. శ. 1494) అను గణిత శాస్త్రజ్ఞుడు గుణకారమున ఎనిమిది మార్గములు చూపెనట.

వ్యవకలనమును పెక్కుసారులు ఉపయోగించుటచే భాగహారమును సాధించుట మన పూర్వీకులనుండి సంక్రమించిన పద్ధతి. సగము చేయుట (Mediation), రెట్టించుట (Duplication) మనకు పూర్వీకులనుండి లభించిన పద్ధతులే.

ఏదైన ఒక రాశిని సున్నచే భాగించినపుడు లబ్ధము అనంతమగు నని భాస్కరుడు స్పష్టముగ వచించియుండుట మనము గమనింపదగిన విషయము. పాశ్చాత్య సిద్ధాంతముల ప్రకారము, బీజగణిత వ్యవహారములను బట్టియే అనగా సమీకరణములతోనే చేయదగిన లెక్కలు, కొన్ని అంకగణిత సూత్రముల సహాయముచేత మాత్రమే, భాస్కరాచార్యుని లీలావతీ గణితమున, చేయబడియుండుట, అంకగణితమున మన పూర్వులకుగల ప్రజ్ఞను తెలుపును.

నిత్యకృత్యములయందు అంకగణితమువలె ఉపయోగపడు శాస్త్రము వేరొక్కటిలేదు. లోక వ్యవహారమునకు ప్రతి మానవునకును కొంచెమో, గొప్పయో అంకగణిత జ్ఞాన మవసరము. వడ్డీ లెక్కలు, హుండీల మారకము, వినిమయము (Exchange), ఉమ్మడి వ్యాపారము, లాభ నష్టములు- ఇవి నిత్యవ్యవహారములందు ఉపయోగించు లెక్కలు. కేవలము శాస్త్రజ్ఞానమును బట్టియేగాక యుక్తిచేతను, ప్రపంచజ్ఞానము మొదలగువాటివలన చేయదగిన లెక్కలు గూడ గలవు. ఇట్టి యుక్తిలెక్కల నిచ్చి చేయు మనుట ప్రాచీనులనుండి వచ్చిన యలవాటు.

లెక్కలు చేయు యంత్రములు : మానవుని బుద్ధిబలము వలన చేయవలసిన అంకగణిత క్రియల నన్నిటిని లెక్కలు చేయుయంత్రము సులభముగాచేయును. ఇచ్చిన అంకెలను

దశకోట్ల స్థానము వరకును కూడిపెట్టును. వ్యవకలనము, గుణకారము, భాగహారము, వర్గమూలము మొదలగు క్రియలన్నిటిని మానవుడు చేయగలకాలముకంటె తక్కువ కాలములో చేసియిచ్చును. ఈ యంత్రములవల్ల మానవునికి మానసిక పరిశ్రమ తగ్గినదనియే చెప్పవచ్చును.

వం. ల.

**అంకములు** — ఉన్నతమగు అంకగణితమునే అంకశాస్త్రమని నవీనులు నిర్వచింతురు. పూర్ణసంఖ్యల సంబంధ బాంధవ్య శోధనమే అంకశాస్త్ర మనికూడ నిర్వచింపవచ్చును. పూర్ణసంఖ్యలు ధన, ఋణ సంఖ్యలుగ వచ్చును. "అంకశాస్త్రమున అతి సుందర సత్యములు కలవు. అవి విడివిడిగానుండునవిగాక ఒకదానికొకటి సన్నిహితములు" అని గౌసు అను పాశ్చాత్య గణిత శాస్త్రజ్ఞుడు చెప్పిన మాటలు సత్యము.

అంకశాస్త్రమును గూర్చి తెలిసికొనుటకు పూర్వము సంఖ్యను గురించి చర్చించుట అవసరము. సాధారణముగా 'సంఖ్య' అను పదము పూర్ణ సంఖ్యలకును, భిన్నములకును, కరణీయాంకములకును(Irrational numbers) వాడబడుచున్నది. అయినను, సంఖ్యా నిర్వచనము నిగూఢము. సంఖ్యను నిర్వచించుటకు పూర్వము సముదాయమును (Class) నిర్వచింప వలయును. కాంటర్ శాస్త్రజ్ఞుని ప్రకారము 'మన సహజ జ్ఞానముచే నిర్దుష్టముగా ప్రత్యేకపరచబడి ఒకే సమూహమున చేర్చబడిన గుంపునకు సముదాయమని పేరు'. బెర్ట్రాండు రసెలు యొక్క సంఖ్యా నిర్వచనము ఈ విధముగ నున్నది. 'ఒక సముదాయము యొక్క సంఖ్య, ఆ సముదాయమునకు అనురూపమగు అన్ని సముదాయముల సముదాయము.' ఈనిర్వచనమును వ్యాఖ్యానించుట కష్టము. దీని భావమును ఎవరికివారే గ్రహింపయత్నించుట ఉచితము.

అంకశాస్త్రమున సంఖ్యను పూర్ణ సంఖ్య అను అర్థములో వాడుదురు. పూర్ణ సంఖ్యలను ప్రధాన సంఖ్యలనియు (Prime numbers), మిశ్రమ సంఖ్యలనియు (Composite numbers) రెండు విధములుగా భాగింపనగును. ప్రతి సంఖ్యకు 'ఒకటి' అను సంఖ్య కారణాంకమగును. అందుచే 'ఒకటి'అను సంఖ్యను ప్రధాన సంఖ్యగా నెంతురు. ఇదిగాక, ప్రతి సంఖ్యయు తనకు తాను కారణాంకమగును. ఈ రెండును గాక, ఇతర కారణాంకము లేని సంఖ్యను ప్రధాన సంఖ్య అందురు. రెండు సంఖ్యల 'గరిష్ఠ సామాన్య భాజకము' (G. C. F.) ఒకటి అయినచో ఆ సంఖ్యలు ఒకదాని కొకటి ప్రధానములని అందుము.

ఫర్మా సిద్ధాంతము(Fermar : 1601—1665): '$P$ ప్రధాన సంఖ్యయై, $N$ మరియు $P$ ఒకదానికొకటి ప్రధాన సంఖ్యలైనచో ($N^{p-1}1$) ను $P$ నిశ్శేషముగా భాగించును'. ఈ సిద్ధాంత ఫలితమును సర్వసమత్వమున (Congruence) ఈ క్రింది విధమున వ్రాయవచ్చును.

$$N^{p-1}-1\equiv O \ (mod\ P).$$

ఇపుడు సర్వ సమత్వములను గూర్చి కొంత వివరింపబడును. $a\equiv b \ (mod\ c)$ అనగా, $a$ అను సంఖ్యను, $b$ అను సంఖ్యను, $c$ అను సంఖ్యచే భాగించిన వచ్చు శేషములు సమములని అర్థము.

ఫర్మాసిద్ధాంతమునకు ఉదాహరణము: 5 ప్రధానసంఖ్య గావున 5, 3 ఒకదాని కొకటి ప్రధానములు గాబట్టి, $3^{5-1}-1=80\equiv 0(mod\ 5)$.

ఇట్లే $5^{3-1}-1=24\equiv 0(mod\ 3)$.

ఫర్మాసిద్ధాంతసాధారణీకరణమును (Generalisation) ఆయిలరు (1707 – 1783) 1760 లో ఈక్రింది విధముగా ప్రకటించెను:-

"$m$, $n$ అను రెండు సంఖ్యలు ఒకదాని కొకటి ప్రధానములైనచో $n^{\phi(m)}-1\equiv 0(mod\ m)$".

ఇచట $\phi(m)$ అనగా $m$ కంటె చిన్నవియు, $m$ కు ప్రధానములును అగు ధనాంకముల సంఖ్యయని తెలియనగును. $P$ ప్రధాన సంఖ్యయైన $\phi(P)=P-1$ అగును.

ఉదా : $m=12$ అయిన $\phi(m)=4$.ఎందుకన 1,5,7,11 మాత్రమే పై ధర్మమును కలిగియున్నవి. అనగా 12 కంటె చిన్నవియు, 12 కు ప్రధానములును అగు అంకములు నాలుగు మాత్రమే. కావున, $5^{\phi(12)}-1=5^4-1=624$. ఇది 12 చే నిశ్శేషముగా విభాజ్యమనుట స్పష్టము.

విల్సన్ (Wilson 1741—1798) సిద్ధాంతము అంకశాస్త్రమున మరొక ముఖ్యమగు సిద్ధాంతము. దానిని ఈ క్రింది విధమున వివరించవచ్చును:-

"$P$ ప్రధానసంఖ్యయైన $1+1\times2\times3\times\ldots\times(P-1)\equiv0(mod\ P)$." ఈ సిద్ధాంతముయొక్క విలోమము (Converse) గూడ నిజమని రుజువుచేయబడినది. అనగా ప్రధానసంఖ్యలను కనుగొనుటకు ఈ విలోమసిద్ధాంత మొకమార్గము. దీని నిట్లు నిర్వచింపగలము :

"ఒకవేళ $1+1\times2\times3\times\ldots\times(P-1)\equiv0(mod\ P)$ అయినచో $P$ అనునది ప్రధానసంఖ్య కావలయును."

ఉదా : $n=7$ అయిన $1+1\times2\times3\times4\times5\times6=1+720=721$. దీనిని 7 నిశ్శేషముగా భాగించును. కారణము 7 ప్రధానసంఖ్య యగుటయే. ఇట్లే 6 ప్రధాన సంఖ్య కాదు. కావున

$1+1\times2\times3\times4\times5=121$. ఇది 6 చే భాగింపబడదు. చిన్నచిన్న సంఖ్యలను పరీక్షించుటకేగాని పెద్ద సంఖ్యకు ఈ సిద్ధాంతము అనువైనదికాదు. ఎందుకన, పెద్ద సంఖ్యల వితతలబ్ధము (Factorial) లను కనుగొనుటలో చాల శ్రమయగును.

ఇంతవరకు మనకు తెలిసిన ప్రధాన సంఖ్యలను గురించి కొంత తెలిసికొనుట అవసరము. అవి 2, 3, 5, 7, 11, 13, 17, 19...101...257 ..65, 537... 1950 సంవత్సరము వరకు మనకు తెలిసిన పెద్ద ప్రధాన సంఖ్య క్రింద వ్రాయబడినది. 170, 141, 183, 460, 469, 231, 731, 687, 303, 715, 884, 105, 727.

ప్రధానసంఖ్య లెన్ని గలవు ? వీటిసంఖ్య పరిమితమా? అనంతమా ? ప్రధాన సంఖ్యల సంఖ్య అనంతమని తేలికగా రుజువుచేయగలము.

ప్రధాన సంఖ్యలను గురించి డిరిష్లె (Dirichlet 1805–1859) వివరించినసూత్రము మరొకటి ఇట్లున్నది:-

"$a$ , $b$ లు ఒకదానికొకటి ప్రధానములైనచో $an+b$, $n=0, 1, 2,\ldots$లో అనంతముగా ప్రధాన సంఖ్యలు గలవు."

$n$ చాలపెద్దసంఖ్యయైనపుడు, దానికంటె చిన్నవి అగు ప్రధానాంకముల సంఖ్య రమారమి $\frac{n}{10\,g^{n}}$ అగునని హాడమార్డ్ (Hadamard), డిలవెల్లపొస్సిన్ (Dela Vella Poussin) అను గణిత శాస్త్రజ్ఞులు కనుగొనిరి.

వర్గావశిష్ట, వర్గావశిష్టేతరములు (Quadratic residues and Quadratic non-residues) : ఏదైన సహజ సంఖ్య యొక్క వర్గమును ఒక ప్రధానాంకముచే భాగించగా మిగులు శేషమును ఆ ప్రధానాంకము యొక్క వర్గావశిష్టమందురు. వర్గావశిష్టములు కాని అంకెలను వర్గావశిష్టేతరములందురు.

$1^2, 2^2, 3^2$ లను 7 చే భాగించగా వచ్చు శేషములు వరుసగా 1, 4, 2. అట్లే $4^2, 5^2, 6^2$ లను 7 చే భాగించినను వచ్చు శేషములు 2, 4, 1 మాత్రమే యని గమనించుట సులభము. ఇదే విధముగా $8^2, 9^2, 10^2\ldots$లను 7 చే భాగించినను వచ్చు శేషము 1, 4, 2 అంకెలు మాత్రమే. (సున్నను శేషముగా పరిగణించము) అనగా, సహజ సంఖ్యల వర్గములను 7 చే విభజించగా మిగులు శేష మెప్పటికిని 1, 2, 4 అంకెలలో నొకటి మాత్రమే యగును. 1, 2, 4 అంకెలను 7 యొక్క వర్గావశిష్టము లనియు, మిగిలిన 3, 5, 6 అంకెలను 7 యొక్క వర్గావశిష్టేతరము లనియు పేర్కొందురు.

వర్గావశిష్ట, వర్గావశిష్టేతర లబ్ధ ధర్మములు :

1. రెండు వర్గావశిష్టముల లబ్ధము వర్గావశిష్ట మగును.
2. వర్గావశిష్టేతరములలబ్ధము వర్గావశిష్టమేయగును.
3. వర్గావశిష్ట, వర్గావశిష్టేతరముల లబ్ధము వర్గావశిష్టేతరమగును.

ఇంతవరకు వివరించిన ఉదాహరణముయొక్క సాధారణీకరణమును ఇట్లు వివరింపవచ్చును:-

"$m, n$ అను అంకెలు ఒకదాని కొక్కటి ప్రధానములై, $x^2\equiv r\ (mod\ n)$ సర్వసమత్వము సరియగునట్లు $x$ విలువను పూర్ణసంఖ్యలలో సాధించగలిగిన, $r$ అను అంకె $m$ అను అంకెయొక్క వర్గావశిష్టమనియు, అటుల సాధింపజాలకున్న $r$ అను అంకె, $m$ యొక్క వర్గావశిష్టేతరమనియు అందురు."

పై సర్వసమత్వమును సాధించగలుగుటకు ఆవశ్యకము, సమర్థము ఐననిబంధన (Necessary and sufficient condition) $r^{\frac{\phi(m)}{a}}\equiv1(mod\ m)$ అని రుజువుచేయబడినది. ఇందులో $\phi(m)$ గురుతు మనకు తెలిసినదే. $a$ అను అంకె $\phi(m)$, 2 ల యొక్క గరిష్ఠసామాన్యభాజకము.

పై అంకె $m$, బేసి ప్రధానసంఖ్యయైన, వలయు నిబంధన $r^{\frac{m-1}{2}} \equiv 1 (mod\ m)$ గా మారును. ఎందుకన $\phi(m)=m-1$ అని మనము ముందే గమనించితిమి. ఇచట $d=2$. కారణము $(m-1)$, 2 అంకెల గ. సా. భా. $=2$.

లెజండర్ సంకేతము (Legendre's Symbol) : $P$ అను సంఖ్య 2 కంటె భిన్నమైన ప్రధానసంఖ్యయై, $P, S$ అను అంకెలు ఒకదానికొకటి ప్రధానములైన, లెజండర్ సంకేతము $\left(\frac{S}{P}\right)$ ని క్రిందివిధమున వివరించనగును:-

$S$ అను అంకె $P$ యొక్క వర్గావశిష్టమైన $\left(\frac{S}{P}\right)=1$.

$S$ అను అంకె $P$ యొక్క వర్గావశిష్టేతరమయిన $\left(\frac{S}{P}\right)=-1$.

మనము పైన వ్యాఖ్యానించిన ఉదాహరణమును (అనగా 1, 2, 4 అంకెలు 7 యొక్క వర్గావశిష్టములు; 3, 5, 6 అంకెలు 7 యొక్క వర్గావశిష్టేతరములు అనుటను) లెజండర్ సంకేతముద్వారా ఈ క్రింది విధమున వ్రాయవచ్చును:-

$\left(\frac{1}{7}\right)=\left(\frac{2}{7}\right)=\left(\frac{4}{7}\right)=+1$

$\left(\frac{3}{7}\right)=\left(\frac{5}{7}\right)=\left(\frac{6}{7}\right)=-1$

సాధారణముగా నుపయోగించు ముఖ్యసూత్రములు:

(1) $\left(\frac{S.t}{P}\right)=\left(\frac{S}{P}\right)\left(\frac{t}{P}\right)$

(2) $\left(\frac{-1}{P}\right)=(-1)^{\left(\frac{P-1}{2}\right)}$

(3) $\left(\frac{2}{P}\right)=(-1)^{\left(\frac{P^2-1}{8}\right)}$

పై మూడు సూత్రములలో $P$ బేసి ప్రధాన సంఖ్య. (2 తప్ప తక్కిన ప్రధానాంకము లన్నియు బేసి సంఖ్యలే యగుట గమనింప నగును.)

4. వర్గ పారస్పర్య సిద్ధాంతము (Quadratic Reciprocity Law): "$q, p$" లు బేసి ప్రధాన సంఖ్యలైనచో

$$\left(\frac{q}{p}\right)\left(\frac{p}{q}\right)=(-1)^{\left(\frac{P-1}{2}\right)\left(\frac{q-1}{2}\right)}$$

పై సూత్రములను ఉపయోగించి ఏదయిన ఒక సంఖ్య $P$ అను బేసి ప్రధాన సంఖ్య యొక్క వర్గావశిష్టమో, వర్గావశిష్టేతరమో సులభముగా కనుగొనవచ్చును. ఒక ఉదాహరణముతో అట్టి పద్ధతిని విశదీకరింతము.

ఉదా : 51 అను సంఖ్య 73 అను ప్రధాన సంఖ్య యొక్క వర్గావశిష్టమా ? వర్గావశిష్టేతరమా ?

లెజండర్ సంకేతమున $\left(\frac{51}{73}\right)$ అని వ్రాని విలువ కనుగొందము. $(73-22)\equiv -22\ (mod\ 73)$ కావున

$\left(\frac{51}{73}\right)=\left(\frac{-22}{73}\right)$

$\left(\frac{-22}{73}\right)=\left(\frac{-1}{73}\right)\left(\frac{2}{73}\right)\left(\frac{11}{73}\right)$ అని 1 వ సూత్రము సహాయమున వ్రాయగలము. కుడిపైపునగల మూడు లెజండర్ సంకేతముల విలువలు వేరువేరుగా కనుగొందము:

(a) $\left(\frac{-1}{73}\right)=(-1)^{\frac{73-1}{2}}=+1$ ఇచట రెండవసూత్రము నుపయోగించితిమి.

(b) $\left(\frac{2}{73}\right)=(-1)^{\frac{73^2-1}{8}}=+1$ ఇచట మూడవ సూత్రము ఉపయోగింప బడినది.

(c) $\left(\frac{11}{73}\right)\left(\frac{73}{11}\right)=(-1)^{\frac{73-1}{2}\cdot\frac{11-1}{2}}=+1$.

వర్గ పరస్పర సిద్ధాంతము చూడవలెను.

కావున $\left(\frac{11}{73}\right)=\left(\frac{73}{11}\right)=\left(\frac{7}{11}\right)$

మరియు $\left(\frac{7}{11}\right)=\left(\frac{-11}{7}\right)$ మరొకమారు వర్గపారస్పర్య సిద్ధాంతమును ఉపయోగించితిమి.

$\left(\frac{-11}{7}\right)=\left(\frac{-4}{7}\right)=-\left(\frac{2}{7}\right)\left(\frac{2}{7}\right)=-1$

కాబట్టి $\left(\frac{-22}{73}\right)=(+1)(+1)(-1)=-1$

అనగా $(-22)$ లేక 51, 73 ప్రధాన సంఖ్య యొక్క వర్గావశిష్టేతరము. అనగా—

$x^2=-22\ (mod\ 73)$ ని సాధించలేము.

జాకోబి సంకేతము (Jacobi's symbol) : ఈ సంకేతము లెజండర్ సంకేతముకంటె సాధారణ ధర్మ సంకేతము. దీనినిట్లు వివరించనగును:-

"$P$ యేదేని బేసిసంఖ్య యనుకొనుము. $P=1$ అయిన $\left(\frac{S}{P}\right)=\left(\frac{S}{1}\right)=+1$. ఇచట $S, P$ లు ఒకదానికొకటి ప్రధానములు. $P=P_1\times P_2\times P_3\times\cdots\times P_r$ కావచ్చును.

$P_1, P_2 \cdots P_r$ లు ప్రధాన సంఖ్యలు ; $P$ యొక్క ప్రధాన కారణాంకములు. $\left(\frac{S}{P}\right)=\left(\frac{S}{P_1}\right)\left(\frac{S}{P_2}\right)\cdots\left(\frac{S}{P_r}\right)$"

ఈ సంకేత వివరణము లెజెండర్ సంకేతమునకు భిన్నమయినను, ఈ సంకేతమునకుగూడ (1), (2), (3), (4) లే వర్తించును.

బీజసంఖ్యా క్షేత్రము (Algebraic number field) : కొన్ని ధర్మములు గల సంఖ్యాసమూహమును సంఖ్యా క్షేత్ర మందురు. ఇట్టి సంఖ్యా క్షేత్రములోని $a_0$, $a_1$, $a_2 \cdots a_n$ సంఖ్యలచే $a_0x^n+a_1x^{n-1}+\cdots a_nx^0=0$ అను బహుపద సమీకరణము నేర్పరించినచో, అట్టి సమీకరణము యొక్క మూలమును "ఆ క్షేత్రముపై బీజసంఖ్య" అందురు. ఈ బీజసంఖ్య ఆ క్షేత్రములోని సంఖ్యలలో నొకటిగా ఉండవలసిన నిర్బంధము లేదు. వికరణ్యాంక క్షేత్రములోని అంకెలతో $x^2-2=0$ అను సమీకరణమును నిర్మించిన, దాని మూలము $\sqrt{2}$ వికరణ్యాంకము కాదుగదా! దీనికి విలోమముగా $\phi$ అనునది $F$ అను క్షేత్రముపై బీజసంఖ్యయైనచో, ఆ క్షేత్రములోని సంఖ్యలతో నిర్మింపబడిన ఒకానొక సమీకరణమునకది మూలమగును అని సులభముగా రుజువు చేయవచ్చును. ఇట్టి బీజసంఖ్యలసముదాయము కూడ ఒక క్షేత్రమగును.

క్షేత్ర వ్యాపనము (Extension of a field): $F$ ఒక క్షేత్రమైన, $F$ అంతర్భాగముగాగల మరి యే క్షేత్రమునైనను $F$ యొక్క క్షేత్రవ్యాపన మందుము.

ఉదా: ప్రతి సంఖ్యా క్షేత్రమును, వికరణ్యాంక క్షేత్రముయొక్క క్షేత్ర వ్యాపనమే.

$\phi$, $F$ పై బీజసంఖ్య యగుచో $K=F(\phi)$ ను రెంటిని అంతర్భాగముగాగల సూక్ష్మతను క్షేత్ర నిర్వచింతుము. అట్టిచో $\phi$, $F$ బీజసంఖ్య యగుచో, యొక్క ప్రతిమూలమును $F$ పై బీజసంఖ్య యగ

బీజ పూర్ణాంకములు (Algebraic integers) : సంఖ్య యొక్క సూక్ష్మతమ బహుపద సమీకరణ వికరణ్యాంక గుణకము లుండినచో అట్టి బీజ సం బీజపూర్ణాంక మందురు.

బీజపూర్ణాంక సమస్తము ఒక వలయము (Ring)

ఐ. ఎ.

ఎం. ఎల్

అంగోలా— అఫ్రికాదేశమందు నైరృతి భాగ ఉన్న పోర్చుగీసువారి వలసదేశము అంగోలా. దీనికి మున, బెల్జియన్ కాంగోయును, తూర్పున ఉత్తర యాయును, దక్షిణమున నైరృతి ఆఫ్రికా భాగ పశ్చిమమున అట్లాంటిక్ మహాసముద్రమును ఎల్ల




దీని సముద్ర పొడవు 920 మైళ్ల మొత్తము వైశాల 4,50,000 చద మైళ్ళు. ఈ సవ తీరము ఎక్కువ నుగా నున్నది. అచ్చటచ్చట ఎఱ్ఱ రాతితో కూడిన గుట్టలును, ఎత్తైన కొండలును ఉన్నవి. సముద్రతీరపు నము దేశములోని మైళ్లు మొదలుకొని మైళ్ళవరకు చొచ్చు యున్నది. మధ్య భూమి హెచ్చుతగ్గులుగల ఉపరితలములతో 5,100 అడుగుల ఎత్తు ఉండును. తూర్పున, ఉత్త నుండి దక్షిణము వైపునకు వ్యాపించిన పర్వతశ్రే కనిపించును. ఈ రాష్ట్రమునందలి అత్యున్నతమైన

రము పేరు "లోవిటి". దీని ఎత్తు 7,790 అడుగులు. మధ్యగతమైన పర్వతపంక్తి పుష్కలముగా పెరిగిన తరుగుల్మములతో నిండియుండును. తూర్పున ఈ పీఠభూమి కాంగో, జాంబెజీల నిమ్నభాగములవైపు ఒరిగియున్నది. దక్షిణమున ఇది చెట్లుచేమలు లేని ఇసుక ఎడారిలో కలిసిపోవును.

అంగోలా దేశములో పశ్చిమ ముఖముగా సముద్రమునకు పెక్కునదులు ప్రవహించుచున్నవి. అవి అన్నియు చాలవరకు పైపర్వతమండలములోనే జన్మించినవి. అచ్చటి ముఖ్యమైన నదులు కాంగో, క్వాంగో అనునవి. లుంగ్వే, బుంగు అనునవి జాంబెజీనది యొక్క ముఖ్యమైన ఉపనదులు. అమితమైన వేడిమి, అమితమైన తేమ ఇచ్చట గల శీతోష్ణ పరిస్థితులు. ఇచ్చటి సామాన్యమైన శీతోష్ణ పరిమాణము 75° ఫా. గా నున్నది. సముద్రతీరమునందలి మైదాన ప్రదేశములు యూరోపియనుల నివాసమునకు అనుకూలముగా లేవు. పీఠభూమియందలి శీతోష్ణస్థితి మిక్కిలి ఆరోగ్యకరముగాను, పుష్టికరముగాను ఉండును. అచ్చటి శీతోష్ణస్థితి, అచ్చటి వ్యాపారపవనముల ప్రభావమునకు లోనగుచుండును. ఏప్రిల్ నెలలో అచ్చట వానలు మెండు. ఉగ్రమైన తుపానులుకూడ చెలరేగును. ఈ మండలపు ఉత్తరభాగమందు అంతటను దట్టమైన ఉష్ణమండల అరణ్యములు కలవు. దక్షిణభాగమున చిట్టడవులు వ్యాపించియున్నవి. అచ్చట టేక్యులా, దేవదారువు, టేకు, నూకమ్రాను మున్నగు కలపకు పనికివచ్చు చెట్లు విరివిగాకలవు. మ్యూసెంబా యొక్క బెరడును, తోళ్ళను పదను చేయుటకు ఎక్కువగా ఉపయోగింతురు.

అంగోలా యందలి ముఖ్యమైన పంటలు వరి, జొన్న, చోళ్ళు, చెరకు, దుంపలు, కాఫీ, పొగాకు, వేరుసెనగ మొదలగునవి. ఇవిగాక పామ్ ఆయిలు, కొబ్బరి, కోకో మొదలగునవియు, తీరుతీరులపండ్లును లభించును. అంగోలా ఈశాన్యభాగమునందు వజ్రములు దొరకును. ఇచ్చట మాంగనము, బొగ్గు, రాగి, ఇనుము మొదలగు ఖనిజములుకూడ దొరకును. ఇచ్చట చక్కెర కర్మాగారములు కలవు. వీటియందు రమ్ (rum) అను సారాయి, తదితర అనుబంధ వస్తువులు కూడ తయారగును. ఈ రాష్ట్రము యొక్క అభ్యుదయము అంతయు అడవులకు, తోటలకు సంబంధించిన వస్తువుల ఉత్పత్తిపై ఆధారపడియుండును. 1950 సంవత్సరములో ఇచ్చటిజనాభా 41,25,266. ఇచ్చట నివసించు వారిలో పెక్కుమంది బంటూ, నీగ్రో జాతులవారు. దక్షిణమున అనేక రకముల జాతుల ఆటవికులు (బుష్ మెన్) కలరు. ఉన్నత ప్రదేశములందును, సముద్రతీరపు మైదానప్రదేశములందును పోర్చుగీసువారు నివసించుదురు.

అంగోలా యొక్క ముఖ్యపట్టణము సెయింటుపాల్ డిలోయాండా అనునది. దీనిని సాధారణముగ లోయాండా అందురు. లోయాండానుండి అంబకా, మలాంజే వరకు వేయబడిన రైలుమార్గమును రాయల్ ట్రాన్సు ఆఫ్రికను రైలుమార్గ మందురు. ఇదిగాక, సముద్రతీరపు రేవులను, అందలి ఎగుమతులకు వలసిన వస్తువుల నుత్పత్తిచేయు పరగణాలతో, అనేక చిన్న రైలుమార్గములు కలుపుచున్నవి. రైలుమార్గము యొక్క మొత్తము పొడవు 1,442 మై. 22,708 మైళ్ళ పొడవుకల రహదారులును, దేశదేశాంతర విమానమార్గములును కలవు.

ఈ దేశమందు యంత్రములును, నేత వస్త్రములును ముఖ్యమైన దిగుమతులు. ఎగుమతులలో ముఖ్యమైనవి కాఫీ, జొన్న, వజ్రములు, రాగి, చక్కెర, ప్రత్తి, రమ్ అను సారాయి, వేరుసెనగ, కొబ్బరి, కోకో, పొగాకు మొదలగునవి. బెంగో అఖాతమునందు బెంగ్వేలా అనునది గొప్పరేవు. వర్తకము విశేషముగా పోర్చుగీసు దేశముతోనే జరుగుచుండును.

కె. వి. రె.

**అంటార్కిటికా**— అంటార్కిటికా దక్షిణధ్రువము మీద నున్న ఆరవఖండము. దీనిని మూడవ ప్రపంచము అని పేర్కొనుచున్నారు. అంటార్కిటికు మండలమును మొట్టమొదట తరించినవాడు ఆంగ్లనావికుడు జేమ్సుకుక్ (1773). అమెరికా సంయుక్తరాష్ట్ర వాసి పామరు అను వాడును, రష్యానావికుడు బెల్లింగ్ షౌసెన్ అనువాడును (1820) అంటార్కిటికాను కనిపెట్టిరి. క్రీ. శ. 1840 ప్రాంతమున అమెరికాదేశీయుడగు విల్క్సు అను నాతడు ఈ ఖండమును పరిశోధించెను. 1933-1935 లో జరిగిన బిర్డ్ సంచారము చాల ముఖ్యమయినది. ఈనాటివరకు పెక్కుమంది దానిని

పూర్తిగా కనుగొని విషయసేకరణకు తయారగుచున్నారు. కాని 1,500 మైళ్ళమేర మంచుకట్టిన ప్రదేశముమీద ప్రయాణము చేసి విషయాలు తెలిసికొన వలసియున్నది. ఈ ఖండము 60°దక్షిణ అక్షాంశములో నుండుట వలన దీని ప్రాముఖ్యము ఇనుమడించినది. మిక్కిలి విలువగల అడవులు 60° అక్షాంశము దాటిన భూమిలో ఉన్నవి. ఇందు 10,00,000 మంది మానవులు కూడ ఉన్నారు. ఇక్కడ చెట్లు లేవు. చేపల పరిశ్రమకు అవకాశమున్నది. తిమింగిలములు అను పెద్దరకపు జలజంతువుల పరిశ్రమకు ఈ ప్రదేశము చాల అనుకూలముగా ఉండగలదు. అంటార్కిటికా యొక్క ప్రత్యేకత అది భూభాగాలన్నిటికీ దూరముగాను, సంబంధము లేనిదిగాను ఉండుటయే. 55°—65°ల మధ్య భూమి లేదు. లోతులేని సముద్రముగుండ ప్రయాణముచేసి ఈ ఖండమును చేరవచ్చును. ఈ ఖండములోకూడ కొన్ని ప్రదేశములు మంచులేకుండ నుండును. దక్షిణధ్రువము 10 వేల అడుగుల ఎత్తున నున్నది. ఇక్కడ మనుష్యులకుకాని, జంతువులకుకాని, తగిన ఆకర్షణకాని, అవకాశముకాని లేదు. రాస్ అను పరిశోధకుడు నీళ్ళలోతేలుచున్న మంచుగడ్డలగుండ వెళ్ళవలసి వచ్చినది. దీనిని "రాస్ ప్రతిబంధకము"అని అందురు.




దీనిమందము 500 అ. మొదలు 15,00 అడుగులవర ఉండును. ఇంకను ఇటువంటిప్రతిబంధకాలు ఎన్నోసముద్ర గర్భములో ఉం తీరునని భావిం బడుచున్న ఒక్కొక్కచోట ప్రతిబంధకము 3 మైళ్ళ వరకు ఉం వచ్చును. కాబ ఈవిధమైన సవ ద్రము అడగ పర్వతమయ పై ాఖండము ఉం వలననే దాని అంటార్కిటి ఖండము అనే పేరులో పిలువవ వచ్చినది. 86° ద పుఅక్షాంశము ఉన్న విక్టోరియ ప్రదేశమునుగురిం అనేక వివరాల సేకరించినా ఇందులో పర్వ శ్రేణులున్నట్లు యుచున్నది. 8,000; 10,000; 15,000 అడుగ ఎత్తుగల శిఖరాలు మంచుచే కప్పబడి ఉన్నవి. ఎరిబ శిఖరము చాలపెద్దది. ఈ శిఖరాలు న్యూజీలాం పర్వతాలను పోలియున్నవి. శీతోష్ణస్థితి చాల విపరీతము నుండును. 77° ఫా. ఉండవచ్చును. గాలి ఒత్తిడిలోకూ మార్పులు ఉండి తదనుగుణముగా ఈ ప్రదేశములో పె గాలివీచుచుండును. భూమిమీద పచ్చని ప్రదేశము తక్కు సముద్రములో జంతు, వృక్ష జీవనము అధికము ఉన్నది. ఇక్కడ సీళ్ళు, అనేకరకాల పక్షులు ఎక్కువ నున్నవి. 30,00,000 పౌండ్ల విలువగల తిమింగిలప లను, చేపలను, సీళ్ళను ఏటేట పట్టుకొనుచున్నారు. రా

ప్రదేశము, ఫాక్‌లాండ్ దీవుల ప్రదేశము ఇందులోనున్న ముఖ్యభాగాలు.

డి. వి. కె.

**అంటువ్యాధులు (ఆయుర్వేదము)**— ఒకరినొకరు కలిసికొని తిరుగుటచే ఒకరినుండి మరియొకరికి కలుగు వ్యాధులకు "అంటువ్యాధులు" అని లోకమున వ్యవహారము. వ్యాధికలవారితో కలిసిమెలిసి తిరుగుటచే మంచివారి కా వ్యాధులు అంటుకొనును గనుక "అంటుడు వ్యాధులు" అని పిలువబడుచు ఆనాటనానాట "డు" అను నక్షరము లోపించి "అంటుడువ్యాధులు" అను పదము "అంటువ్యాధులు"గామాత్రమే వాడుకయందు నిలిచినది.

ఈ అంటువ్యాధులకు సంస్కృతమున "సాంక్రామిక వ్యాధులు" అని వాడుక. ఇట్లు అంటువ్యాధులుగా చెప్పబడినట్టియు, చెప్పతగినట్టియు రోగములెట్టివి? అట్టివ్యాధు లంటుకొనుటకు గల కారణము లేమి? అనుటలో భారతీయ ఆరోగ్య తత్వ దర్శనమగు ఆయుర్వేదమున ప్రాధాన్యముగల శస్త్రచికిత్సా గ్రంథమందు రాజర్షియగు సుశ్రుతు డిట్లు వర్ణించెను :

ప్రసఙ్గా ద్గాత్ర సంస్పర్శా
న్నిశ్వాసా త్సహ భోజనాత్
సహ శయ్యాసనాచ్చాఽ పి
వస్త్రమాల్యానులేపనాత్
కుష్ఠం జ్వర శ్చ శోష శ్చ
నేత్రాభిష్యంద ఏవ చ
ఔపసర్గికరోగా శ్చ
సంక్రామంతి నరా న్నరమ్.

సు. ని. అ 5—33

రోగగ్రస్తులగువారితో అతిగా కలిసియుండుటచేతను, పదేపదే రోగుల శరీరమును ముట్టుకొనుచుండుటచేతను, రోగులతో కలిసి భుజియించుటచేతను, రోగులతో కూడి పండుకొనుట చేతను, రోగులకడ కూర్చుండుట చేతను, రోగులు కట్టుకొను బట్టలను, రోగులు ధరించిన పూవులను, రోగులు వాడి మిగిల్చిన చందనాది అనులేపనములను ఉపయోగించుటచేతను, వ్యాధిగ్రస్తులనుండి ఆరోగ్యవంతు లగువారికి ఆవ్యాధులు సంభవించును. అట్లు కలుగునట్లుగా నిర్దేశింపబడిన వ్యాధు లివి :

1. కుష్ఠము, 2. జ్వరము, 3. క్షయ, 4. నేత్రరోగములు, 5. స్త్రీపురుషుల సంయోగమువలన కలుగు "బట్టంటు" "కొరుకు" మొదలగు జననేంద్రియ సంబంధము లైన రోగములు.

ఇది అంటువ్యాధులకును, అంటువ్యాధులు కలుగుటకును గల సామాన్య వివరణము. ఏ విషయము నైనను ఆయుర్వేద శాస్త్రమునందు మొదలు సంగ్రహముగా చెప్పి తిరిగి దానిని మిక్కిలి విపులముగను, తేలికగను, నిస్సంశయముగను, అర్థమగునట్లుచెప్పుట సంప్రదాయమై యున్నది. ఇందువలన రోగములను నిర్ణయించుట యందును, చికిత్స చేయుటయందును సులభత యేర్పడుట జరుగును.

ఇట్లొకరినుండి మరియొకరికి సంక్రమించునట్లు చెప్పబడిన యీయైదు విధములగు వ్యాధులును, ఈ వ్యాధులు కలుగుటకు కారణములుగా చెప్పబడిన తొమ్మిది విధములగు మార్గములును, సవిమర్శనముగ, సూక్ష్మాతిసూక్ష్మములుగా విభజింపబడి రోగములును, కారణములును, వేరువేర రెండువందలతొమ్మిది మార్గములు కలవిగ పరికల్పన చేయబడినవి. ఈ పరికల్పనకంతకును వాత పిత్త కఫములను త్రిదోషములును, త్వగ్రక్తమాంసాదు లను, సప్తధాతువులును ఆధారముగ చేయబడును. సప్తధాతువులలో అంశాంశకల్పనయందు రసమును విడిచి చర్మమును గ్రహింపవలసి యుండుట శాస్త్రనిర్దేశ్యము. ఇవిగాక యీ విభజనయందు చేర్పతగిన మరికొన్ని అంటువ్యాధులు "జనపదోద్ధ్వంసకములు" అను పేర నాలుగు తెగలుగను, పదుమూడు విభాగములుగను బ్రహ్మర్షియగు చరకుని మతమును అనుసరించి ప్రత్యేకముగ కలవు. (మనుష్యులు నివసించుపల్లెలు, పట్టణములు పాడగునట్లుచేయు రోగములకు జనపదోద్ధ్వంసకములని వాడుక.) చరకుని మతమున ప్రత్యేకింపబడిన నాలుగు విధములగు ఈ వ్యాధులు కలుగుటకును గలకారణము గాలియు,నీరును దూషితములగుట. సకల జీవ జీవం జీవనము లగు జలవాయువులు దూషితము లగుటకు ప్రజలయందు అధర్మవర్తనమును, ప్రభుత్వస్థాయియందుగల ప్రజారోగ్యశాఖాధికారుల అధికార దుర్వినియోగవర్తనమును కారణములు. ఈ జనపదోద్ధ్వంసకములగు పదుమూడురోగములను పైసంఖ్య

యందు చేర్చిన మొత్తము అంటువ్యాధులు రెండువందల యిరువదిరెండుగా లెక్కకు తేలును. ఈ వ్యాధుల యొక్కయు కారణముల యొక్కయు వివరము లిట్లు తెలియనగును:

మొదలీ యంటువ్యాధులు కలుగుటకు చెప్పబడిన కారణములు తొమ్మిదియు, పదునెనిమిది భాగములుగా విభజింపబడెను. ఆవివర మీవిధముగ తెలియగలదు:

(1) ప్రసఙ్గము : విశేషముగ కలిసియుండుట. ఈకలిసి యుండుట యనునది మూడువిధములు.

1. కౌగిలించుకొనుట.
2. మిథునధర్మమున రమించుట.
3. క్రీడించుట. (వనవిహారము, ఆటలాడుట, జలక్రీడ.) (ప్రసఙ్గమాలింగన రతిజలక్రీడాదీని.) స్మరదీపనము, ప్ర-3-సు 12.

(2) గాత్రసంస్పర్శనము : పదేపదే శరీరమును తాకు చుండుట. ఇది మూడువిధములు.

1. ముద్దులాడుట.
2. ఒకరినొకరు కలిసికొని తిరుగులాడుట.
3. మాటిమాటికి రహస్యావయవములను ముట్టుకొనుచుండుట. దీనివలన రక్తమునందు ఉష్ణతయు, శుక్రశోణితములయందు తైజనతయు, అవయవములయందు ఉద్రేకతయుకలుగును.

(3) నిశ్వాసము : రోగినోటితో విడుచుగాలిని పీల్చుట. (నిశ్వాసమనగా పనివలన శ్రమచెందిగాని, లేక వ్యాధివలన అలసటచెందిగాని నోటివెంట విడుచు శ్వాసమునకు పేరు.)

(4) సహభోజనము : కలిసి భుజించుట, ఇది నాలుగు విధములు.

1. రోగితోకలిసి ఒకేపాత్రయందు భుజించుట.
2. రోగి తినివిడిచినఆహారమును భుజియించుట.
3. రోగిచేపెట్టబడిన ఆహారమును భుజియించుట.
4. రోగితో సరసన పంక్తియందు భుజించుట.

(5) సహశయ్యా : ఒకేపడక నుపయోగించుట. ఇది రెండు విధములు.

1. రోగి పండుకొనుచున్న పక్కయందు పండుకొనుట.
2. రోగితో కలిసి పండుకొనుట.

(6) సహాసనము : ఒకే పేదిక నుపయోగించుట. రెండువిధములు.

1. రోగి కూర్చుండుట కుపయోగింపబడుచు పీట, చాప, అరుగు పీటిపై కూర్చుండుట
2. రోగితోకలిసి ఒకేయాసనమున కూర్చుండు

(7) వస్త్రము : రోగి ఉపయోగించిన బట్టలను అ ఉపయోగించుట.

(8) మాల్యము : రోగిధరించిన పూవులను, మాలల ధరియించుట.

(9) అనులేపనము : రోగి ఉపయోగింపగా మిగి గంధము, సున్నిపిండి మొదలగు మైపూతల వాడుకచేయుట.

ఈ పదునెనిమిది కారణములను ఆధారముగాచేసిక శరీరమున గల వాతపిత్తకఫము లనబడు త్రిదోషము ఎగుడు దిగుడులై పెడత్రోవలను బట్టి, అనులోమవిలో గతులచే (అనులోమగతి—వాతాదిదోషము లొకదానిం దొకటి కలిసి లీనమై పుష్టినొందించుకొనుచు తిరుగు విలోమగతి—ఒకదానినొకటి రెచ్చగొట్టి ఉన్మార్గగాము సంబంధములేక చరించుట. దోషములకు అనులోమ యనునది ఆరోగ్యమునకు కారణము. విలోమగతి య నది అనారోగ్యమునకు కారణము.) త్వగ్రక్తమా మేదోస్థిమజ్జాశుక్రము అను సప్తధాతువులను చెడగొ రెండు వందల తొమ్మిది గతులు గలవిగా అంటురోగమ వ్యాప్తికి వాహకము లగును. వీటి విభజన మిట్లు గల దీనికి అంశాంశకల్పన మని పేరు.

**ధాతువికల్పము**

| | |
|---|---|
| 1. కేవల వాతాంతర్జనితములు | 1( |
| 2. కేవల పిత్తాంతర్జనితములు | ⁄ |
| 3. కేవల కఫాంతర్జనితములు | ! |
| 4. సప్త ధాతుపరిణామాంతర్జనితములు | ⁄ |
| 5. దేశభేదాంతర్జనితములు | |
| మొత్తము | 2( |

**వ్యాధివికల్పము**

1. కుష్ఠములు :

| | | |
|---|---|---|
| మహాకుష్ఠములు | 7 | 18 |
| క్షుద్రకుష్ఠములు | 11 | |
| 2. జ్వరములు | | 8 |
| 3. క్షయలు | | 20 |
| 4. నేత్రవ్యాధులు | | 96 |
| 5. ఔపసర్గికములు | | 67 |
| మొత్తము | | 209 |

ఈ సంఖ్యయందుగల ఔపసర్గికరోగముల వివరము కొంతవిపులముగ తెలిసికొనవలసి యున్నది. స్త్రీపురుష సంసర్గములవలన కలుగు సంతానమార్గికములగు వ్యాధులకు ఔపసర్గికము అని శాస్త్రపరిభాషయందు వాడుక. ఇవి సుఖసంకటములని తెలుగునాటప్రసిద్ధములు. కొరుకు, సవాయి, (శ్వవాయువనునది సవాయిగామారి యీనాడు వాడుక కలిగినది. ఈవ్యాధి కుక్కల సంసర్గత వలన వ్యాప్తికి వచ్చినది. దీన ఈపేరు కలిగినది.) బట్టంటు అనునవి ఇవియే. ఈకులమునందు అనేకభేదములతో చిలవలు పలవలుగా ప్రాకిపోవు స్వభావముగల వ్యాధులు నానా నామరూపభేదములతో బహుముఖములుగ గలవు. ఇది వరకు అరువదియేడుగా చెప్పబడిన యీ వ్యాధుల పరికల్పన మిట్లు చికిత్సాసౌకర్యమునకై చేయనైనది.

**ఔపసర్గిక వ్యాధులు**

| | | |
|---|---|---|
| 1. | శుక్రదోషమువలన కలుగునవి. | 8 |
| 2. | రజోదోషమువలన కలుగునవి. | 8 |
| 3. | యోనివ్యాపత్తులవలన కలుగునవి. | 20 |
| 4. | అయోనిసంపర్కమువలన (నోరు, గుదము, హస్తము, మంచము) కలుగు వ్యాధులు. | 5 |
| 5. | విజాతియోని (ఆవు, గేదె, గుఱ్ఱము, గాడిద, మేక, కుక్క) సంపర్కము వలన కలుగువ్యాధులు. | 5 |
| 6. | దుష్టయోని సంపర్కమువలన కలుగు వ్యాధులు. | 21 |
| | మొత్తము | 67 |

సాధారణముగ నీ యంటువ్యాధులన్నియు భయంకర పరిణతి చెందునవియే. ఇవి యన్నియు విరూపంకరణములును, బాధాకరములును, కాలాంతరప్రాణహారములును, వంశక్షయకరములును అయియున్నవి. అనగా ఈ వ్యాధులు తమ కాశ్రయ మొసంగినవారిని విడువక ఆ జీవితమును బాధించుచు కొన్ని తరములవరకును వారి కుటుంబములయందు నిలిచి అల్పాయుష్కము, దుర్బలేంద్రియము, ఆజన్మ రోగపీడితము, విరూపము, కురూపమును అగు సంతానమును కలిగించుచు తుదకు వంశ నిర్మూలన మొనరించి యంతరించును. కావుననే శుక్రమును చెడగొట్టుకొనరాదని ఆయుర్వేదమున హితము ఉపదేశింపబడి యున్నది.

"న వా సంజాయతే గర్భః పతతి ప్రస్రవ త్యపి
శుక్రం హి దుష్టం సాపత్యం సదారం బాధతే నరం"

"గర్భమే కాకపోవచ్చును. గర్భము నిలిచినచో స్రావమగుటగాని లేక పిండము జారిపోవుటగాని సంభవించును. అందువలన చెడునడతలచే శుక్రము చెడగొట్టుకొనిన పురుషుడు స్వయముగ రోగపీడితు డగుటయేకాక భార్యను సంతానమునుగూడ సదారోగపీడితులనుగా చేయును" అని భారతీయఆరోగ్యశాస్త్రము సిద్ధాంతముగూడచేసెను.

ఇందుకనియే స్త్రీపురుషసంయోగములందు వయసు, కాలము, ఆహారము, వంశశుద్ధి (ఇచట వంశశుద్ధి యనగ వివాహమునకుముందు వధూవరుల కుటుంబములయందు తల్లిపక్షమున అయిదుతరములనుండియు తండ్రి పక్షమున అయిదు తరములనుండియు ఏవిధమగు చెడువ్యాధులును లేకుండునట్లు చూచుకొనవలయుననుట. ఇట్లయిన మాతృ పితృపక్షములుకలిసి దశపురుషాంతరములగును. ఇది వంశ శుద్ధియనబడును. వివాహ నిర్ణయము నందు మను, వామదేవ, గౌతమ, వసిష్ఠ, అగస్త్య, పులస్త్యాదులగు పదునెనమండుగురు ఈ సిద్ధాంతమును జేసిరి. ఈ విషయములను శౌనక సూత్రములందును నృసింహపారిజాత ప్రయోగమునందును చూడనగును.) మొదలగు విధి నిషేధము లనేకములు చెప్పి నీరోగము, వీర్యవంతము, తేజోవంతము, మేధావంతమును అగు సత్సంతానముతో విశుద్ధమగు జాతిని నిర్మించుటకై భారతధర్మరక్షాధికారులగు పరిపాలకులు మంచి కట్టుదిట్టములు చేసిరి. మచ్చునకీప్రమాణములు చూడనగును.

స్త్రీసంబంధే దశైతాని
సుతరాం పరివర్జయేత్
హీనక్రియం నిష్పురుషం
నిశ్ఛందో రోమశా ర్శసం

క్షయామయా వ్యవస్మారి
శ్విత్రి కుష్ఠి కులాని చ
చతుర్దశకులా నీమా
న్యపి బాహ్యాని నిర్దిశేత్
అత్యుచ్చక మతిహ్రస్వం
అతివర్ణం చ వర్జయేత్
హీనాంగ మతిరిక్తాంగ
మామయాని కులాని చ
సదా కామకులం వర్జ్యం
రోమశానాం చ యత్కులం
అపస్మారకులం య చ్చ
పాండురోగకులం భవేత్.

"కులానురూపాః ప్రజాః సంభవంతీతి హారీతవచనాత్ హీనక్రియం విహితక్రియారహితం నిష్పురుషం, స్త్రీ మాత్రపరిశేషం,నిశ్ఛందః,విద్యాహీనం, రోమశం, సర్వావయవసంరూఢరోమకం, అర్శసమ్, అర్శోరోగపీడితం" అని ధర్మనిర్ణయాధికారియగు యముడుకూడ ఇట్లే చెప్పెను. ఇట్టి ప్రమాదభరితము లగు కొన్నివ్యాధులుగల స్త్రీ పురుషులకు మరణదండన సయితము విధించి తుద కీ వ్యాధుల యొక్క వ్యాప్తి దేశమునం దరికట్టవలసినదిగా ప్రభుత్వస్థాయియందు దండనాధికారముగా శాసించిరి. ఈ అంటు వ్యాధులను గురించి యింతవరకు జరిగిన చర్చ యంతయు సుశ్రుతుని మతము ననుసరించి చేయబడినది.

ఇక బ్రహ్మర్షి యగు చరకునిమతము ననుసరించి అంటు వ్యాధులుగా, జనపదోద్ధ్వంసకములుగా వాడుకకలిగి తీవ్ర వేదనాత్మకములును, సద్యః ప్రాణహారములునగు విషూచి, మశూచి, విసర్పి, విస్ఫోటము లను నాలుగు విధములగు వ్యాధులను అంశాంశకల్పనమున పదుమూడు భేదములుగా విస్తరించి సద్యః ఫలప్రదములగు చికిత్సా సహితముగ తెలియచేయబడును. ఆ కల్పనవిధ మిది :

1. *విషూచి :* ఇది ఒకేవిధముకలదు. త్రిదోషజనితము. (కలరా యని వాడుకయందు ప్రసిద్ధి కలదు.)

2. *మశూచి :* ఇది రెండు విధములు.

(1) శీతల : ఇది మందకఫము, క్షీణవాతముగల పిత్తాధిక్యతచే జనించును. శరీరము నిండుగా ఎఱ్ఱని, సన్నని పొక్కులు కలుగును. ‹ వేపపూత, ఆటలమ్మ, చిన్నమ్మవారు తెలుగునాట వాడుక కలదు.

(2) మహాశీతల : ఇది క్షీణపిత్తము, కఫోల్బ‹ గల వాతాధిక్యతచే జనించును. తీవ్రవే‹ త్మకము, సెనగలవలె బొబ్బలు పెద్ద‹ లేచును. సద్యఃప్రాణహరముగాగాని, వి‹ కురూపములను కలుగ జేయునదిగా పరిణమించును. దీనిని పెద్దమ్మవారందుర‹

3. *విసర్పము :* ప్రాకి వ్యాపించు స్వభావము క‹ "సర్పి" యని వాడుక. మహా తీవ్రవేద‹ కలిగించును. స్థానభేదములచే సద్యః ప్ర‹ హారము. ఇది ఏడువిధములు—

(1) కాలవిసర్పము: కేవలవాతజనితము. చంక‹ కణతలు, గజ్జలు, రొమ్ము, వీపు, మో‹ మడతలు, వీటియందు పళ్ళికలవలె కాలి‹ చిన్నచిన్న బొబ్బలు లేచును. రసి కారుట‹ లేకుండుటయు కలుగును.

(2) రక్తవిసర్పము : పై వాతజమువలెనే తక్కి‹ లక్షణములు కలిగి బొబ్బలు ఎరుపుర‹ కలిగియుండును.

(3) జలవిసర్పము : కేవల కఫజనితము. ‹ పిత్తజములవలెనే తక్కిన లక్షణములు క‹ బొబ్బలు తెలుపుగను, నీరు నిండియున్న‹ నిగారింపుగను కనుపడుచుండును. ఇ‹ రసియు తేలికగా నీరువలె నుండును.

(4) విషవిసర్పము:త్రిదోషజనితము. పైలక్షణ‹ లన్నియు నుండును. కందిన కంచుర‹ కలిగియుండు బొబ్బలు కలుగును.

(5) అగ్నివిసర్పము : వాతపిత్తజము. ల‹ ములు పూర్వోక్తములే. బొబ్బలు మిక్కి‹ మంటలు కలిగియుండును.

(6) గ్రంథివిసర్పము : వాతకఫజనితము. సం‹ యందు మాత్రమే గ్రంథులు కలుగును. ‹ ష్యుని ధనువువలె ముందునకు వంచి వేయ‹

(7) కర్దమవిసర్పము : కఫపిత్తజనితము. నోటి యందును అంగుటినుండి గొంతునందును కలుగును. దీనిని "డిఫ్తీరియా" యని పాశ్చాత్యులనిరి. ఇది గొంతునుండి పెద్ద పేగుద్వారా హృదయము, ఆసూశయమువరకు వ్యాపించుటయు ప్రత్యేకముగ ఆమాశయమునందే జనించి గొంతు మూసికొనిపోవుటయు, ఆమాశయమునందును, గొంతునందును తీవ్రవేదన కలిగించుటయు గలదు. మహా భయంకరమగు వ్యాధి.

4. విస్ఫోటము : ఇది మూడు విధములు.

(1) కాలస్ఫోటము: వాతోత్తరముగా కలది. శరీరమంతయు వేదనాత్మకముగ ఉసిరిక కాయల వలె పెద్ద బొబ్బలు లేచును.

(2) గళస్ఫోటము : వాతకఫోద్భవము. వైలక్షణములు కలిగి కంఠమునందు మాత్రమే బహిః ప్రదేశమున కలుగును.

(3) విషస్ఫోటము: త్రిదోషజనితము. వీపునందును, వక్షస్థలమునందునుకలుగును. దుశ్చికిత్సితము.

| | |
|---|---|
| ఇట్లీ మొత్తము | 13 |
| పూర్వోక్తములు | 209 |
| ఉభయము ఏకరాశిగా ధ్రువాంకము | 222 |

ఇట్లు రెండువందల ఇరవై రెండుగా పరిగణనకు తేలిన ఈ అంటువ్యాధులలో రెండువందలతొమ్మిది వ్యాధులు తీవ్రవేదనాత్మకములుగాని, సద్యః ప్రాణహారములుగాని కావు. ఇవి తెలియనిబాధలను కలిగించుచు కాలాంతర ప్రాణహారణములుగా నుండును. జనపదోద్ధ్వంసకములగు పదుమూడు వ్యాధులును ఆశుచికిత్సావశ్యకత కలవి, తీవ్రవేదనాత్మకములును, సద్యఃప్రాణహారణములును అయి యున్నవి. ఈవ్యాధులకు "క్షుద్రవ్యాధు"లనియువాడుక. ఇందొక "మశూచికము" తప్ప మిగిలిన "విస్ఫోట, విషూచి, విసర్పములు" మహాత్వరితముగ ప్రాణములు తీయును. "మశూచికము" కొలది దినములు బాధించి చంపుటగాని, మనుజుని సౌందర్యహీనునిగా చేయుటగాని, చేయి, కాలు, కన్ను, ముక్కు, చెవి మొదలగు అవయవములయం దేదేని చెడగొట్టుటగాని చేసి విడుచును.

మిగిలిన విస్ఫోట, విసర్పములు, నాలుగైదు దినముల నుండి ఒకవారమువరకు మనుష్యుని చంపుటకు గడువిచ్చును. "విషూచి" మాత్ర మీచంపుటయందు నిర్దాక్షిణ్యముగ కొన్నిగంటలకన్న ఎక్కువకాల మవకాశమీయదు. భయంకరములగు ఈవ్యాధులనిదానచికిత్సలన్నియుచరక, సుశ్రుత, వాగ్భట, బృందమాధవ, మాధవనిదాన, బసవరాజీయ, యోగరత్నాకరములందును, దైవవ్యపాశ్రయ చికిత్సాధారముగ కర్మవిపాకమునందును చూడనగును.

జనపదోద్ధ్వంసకములగు ఈ వ్యాధులు పుష్యమాసాంతము వరకుగల వర్షాశరద్ధేమంత కాలములయందు తరుచు కలుగుచుండుటయు, ప్రతిపల్లెపట్టులను, విశేషముగా పట్టణములను, సంగులసమరమువలె అల్లకల్లోలముగ చేయుటయు జరుగుచుండును. ఫాల్గున చైత్రము లాదిగాగల శిశిర వసంత గ్రీష్మములందు విషూచి మహాభయంకరముగ వ్యాపించి తాండవ మాడుచుండును. శీఘ్రముగ బలమగు చికిత్స లభించనిచో ఈ విషూచి నూటికి నూర్గురను చంపియే తీరును.

శాక్తేయులీజనపదోద్ధ్వంసకములగు వ్యాధులు దేవతామహత్వము కారణముగా కలుగు నని దేవీతంత్రములయందు వర్ణించిరి.

దేవీభాగవత, త్రిపురాసిద్ధాంతశేఖర, ఖిన్నలక్షణము లిందుకు ప్రమాణము. అందీవ్యాధులకు గ్రామదేవతారాధనము, జంతుబలి, జపహోమాదికములు, శాంతికరములుగా చెప్పబడినవి. కొలుపులనియు, జాతరలనియు ఈ విశ్వాసమున జనబాహుళ్యమునం దీనాడును వాడుకగ జరుపబడుచునే యున్నవి. అందుచేత వ్యాధులు దేశవ్యాప్తములు గాకుండుటయు, శాంతిచెందుచుండుటయు చూడబడుచున్నది సత్యమేయైనను దేవతారాధనమును, ఈ జపహోమాది శాంతికర్మముల నాచరించుటయు ఆయుర్వేద మంగీకరించినది. ఇందు చరకప్రమాణ మిట్లు కలదు. విమానస్థానము, 3 వ అధ్యాయము, పదుమూడవ శ్లోకమునుండి 21½ శ్లోకమువరకునుగల అభిప్రాయమిచట సూచింపబడినది. ప్రమాణమును కాంక్షించువారు మూలమును చూడనగును. ఆ అభిప్రాయమిది:

వికృతిచెందిన వాయు, జల, దేశ, కాలములు స్వభావముగ ఒకదానికంటె నొకటి బలమైనవిగా నుండును. గాలి

కన్న జలము, జలముకన్న దేశము, దేశముకన్న కాలము ఎక్కువ శక్తిమంతము అని నిశ్చయింపబడినది. గాలి, నీళ్లు, దేశము, కాలము, దూషితమైన యపుడు అందుకు తగిన యౌషధములను జాగ్రత్తచేసి వాడుకొనినయెడల అందు కనుబంధములగు వ్యాధులు సోకనేరవు సోకినను బాధింపనేరవు.

ఇదియుగాక ఉపద్రవకరములగు అట్టివ్యాధులు సంభవించు సమయములందు సత్యము, భూతదయ, త్యాగము బలి, దేవతారాధనము, మంచినడవడిక (శుచిత్వము) ఇతరులకు మేలుచేయుట పుణ్యకర్మలనుచేయుట, బ్రహ్మచర్యనియతి, బ్రహ్మణ్యులు, జితేంద్రియులు నగు మహర్షులయొక్క ధర్మబోధనలను వినుట, జ్ఞానవయోవృద్ధులను సేవించుటచే ధార్మికమైన నడవడికయు, సాత్వికమైన మనఃప్రవృత్తియు అలవడినవారితో కలిసియుండుట ఆయుష్యరక్షణకు చికిత్సగా చెప్పబడియున్నది.

ఈ వ్యాధులనుండి రక్షింపబడుటకు శీఘ్రఫలప్రదములు సకల జనోపయోగములు నగు ఒకటి, రెండు, మూడు యోగములిట ఉదాహరింపబడును. అందు 'విషూచి' యందీయోగము వాడుకొనవలయును.

ప్రాణప్రదవటి :-

| | | |
|---|---|---|
| 1. బాలింతబోలు | తు. | 3 |
| 2. మృద్దారు శృంగి | తు. | 1 |
| 3. ఇంగిలీకము | తు. | 1 |
| 4. రససిందూరము | తు. | 1 |

కల్పన : ఈ ద్రవ్యములు శుద్ధి అక్కరలేకయే ఒక్కచో కలిపి, కల్వమున బాగా మంచినీటితో నూరి, గురిగింజలంత మాత్రలుచేసి యుంచుకొనవలయును.

ప్రయోగవిధి :- ఒకమాత్రను ఇచ్చి, ఒక గిద్దెడు పులిచల్లను త్రాగించవలయును. ఇట్లు ఆరారు గంటల కొక పర్యాయము వ్యాధిపూర్తిగా నిలిచిపోవువరకు ఒక్కొక్క మాత్రను ఇచ్చి తగినట్లు చల్ల త్రాగించుచుండవలయును. విషూచి(కలరా) దీనివలన నిలిచిపోయి రోగి బాగుపడును.

ఒకవేళవ్యాధి ఉద్ధృతముగా నున్నయెడల వ్యాధి నిలచి నెమ్మదించువరకు గంట కొక మాత్ర ఇచ్చుచు, నాలుగైదు తులములు సుమారు మజ్జిగ త్రాగించుచుండవలయును. ఇది వ్యర్థముకాని ఔషధము. ఈ వ్యాధి చుట్టుప్రక్కల వ్యాపించియున్నపుడు ఈదిగువ యో మును సేవించినచో విషూచి వారివరికి చేరదు.

యోగము :-

| | | |
|---|---|---|
| 1. పాలు | తు. | 10 |
| 2. నీళ్లు | తు. | 5 |
| 3. సల్లని జీడిగింజ | | 1 |

జీడిగింజను కత్తిరించి పాలలో వేసి నీళ్ళు ఇగురున సన్నని మంటపై కాచి ఆ పాలలోని జీడిగింజను తీసి పాలకు తగినట్లు పంచదార కలిపి, ఉదయము పరగ నవే త్రాగవలయును.

ఇది ఒక మనుష్యునకు కావలసిన ప్రమాణము. కాచినపాలు పిల్లల వయసునుబట్టి ఒక తులమున హెచ్చించుచు, తగ్గించుచు త్రాగించవలయును. ఇది రోజు తీసికొనిన చాలును. ఆ కారున కా వ్యాధి తగు అనగా ఆరుమాసముల కీ యౌషధబలము శరీర నిలిచియుండి యీ వ్యాధిని దరికి జేరనీయదు. ఇం పథ్యపాన నియమములు అనుసరింప పనిలేదు.

మశూచి, విసర్పి, విస్ఫోటములవిషయములో ణ్యముగల చికిత్సకులు వెంటనంటి చికిత్స నీయ యుండును. ఈ వ్యాధు లన్నియు అసలు బాధింపక నట్లు ఎవరికివారు వసంతారంభమగు చైత్రమాసమున గాని, వైశాఖ మాసమునందుగాని ప్రతి సంవత్స ఈ దిగువ కల్పమును సేవించుచుండవలయును. ఆ త్సరమంతయు, ఎట్టి దుష్టవ్యాధులును వారిని బా జాలవు.

నింబకల్పము :-

| | | |
|---|---|---|
| 1. వేప ఈనెలు | తు. | 5 |
| 2. జీలకర్ర | తు. | $\frac{1}{4}$ |
| 3. పటికబెల్లపుపొడి (దీనిని కలకండ, మిశ్రి, నాబోతు అని వాడుదురు.) | తు. | 1 |
| | తు. | $6\frac{1}{4}$ |

కల్పన : వేప యీనెలు పచ్చివి రోటిలో గాని, ములో గాని బాగా దంచి తగినట్టుగా నీళ్ళుపోసి తే నీళ్ళు పిండుకొనవలయును. వడియబోసికొనవలయు

ఈ కల్కము $6\frac{1}{4}$ తులాలకన్న ఎక్కువ ఉండ జీలకర్ర వేయించి పొడుము చేయవలయును.

మామూలుగా వంటలయందు ఉపయోగించు జీలకర్రనే ఉపయోగించవలయును. జీలకర్ర చూర్ణమును, పటిక బెల్లపు పొడియు, ఈ కల్కమునందు కలిపి త్రాగవలయును. ఇది ఉదయము పరగడుపుననే సేవించవలసి యున్నది. ఇట్లు మూడు దివసములు, మూడు ఉదయ కాలములయందు త్రాగవలయును.

సేవనవిధి:- ఈ కల్కము త్రాగిన వెంటనే దిగువ చెప్పబడిన విధిప్రకారము సిద్ధము చేయబడిన "సిరా"ను అయిదునుండి పదునైదు తులముల వరకు తినవలయును. ఆ దినమంతయు ఉప్పు, కారము, పులుపుగల పదార్థములను తినరాదు. పాలు, పంచదారలతోగాని, తియ్యని చల్లతోగాని వరియన్నము భుజింపవచ్చును. పెనముపై వేపి, పండునిప్పులపై కాల్చిన గోధుమ రొట్టెలను ఈ "సిరా"తోగాని పాలు పంచదారలతోగాని యథేచ్ఛగా తృప్తియగువరకు భుజించవచ్చును. మధుర పదార్థమే యెక్కువగా తీసికొనుట మంచిది. ఈ ఔషధసేవా కాలమున ఆహారవిధి యిట్లే యుండవలయును. నాలుగవ దినము మొదలు పులుపు, ఉప్పు, కారములను కొంచెము కొంచెముగా వాడుకొనుచు నేయి, పాలు, పంచదారలను తృప్తిగా తీసికొనుచు ఏడు దివసముల వరకు క్రమాభివృద్ధితో ఈ విధి ననుసరించవలయును.

ఏడు దివసముల పిమ్మట స్వేచ్ఛాహార విహారములతో మెలగవచ్చును. ఆ ఏడు దివసములయందును పులుపు ఎంత తక్కువగ వాడిన అంత మంచిది. అట్టి ఔషధ సేవవలన ఆ సంవత్సరమంతయు ఎట్టి భయంకరమైన వ్యాధులును దరిజేరవు. మరియొక విశేషము. ఈ ఔషధసేవనము వలన శరీరమునగల ఔపసర్గిక రోగములన్నియు పోవును. బలము, వర్చస్సు కలుగును. ఆరోగ్యము సరిగానుండును. శుక్రరజో దోషములు పోయి సంతానము కలుగును. గర్భిణీస్త్రీలకు మూడవమాసమునందును, ఏడవమాసమునందును ఇచ్చు ఆచారము గలదు. దీనివలన సంతానమున కెట్టి మహావ్యాధులును కలుగవు. తల్లి దండ్రులకుగల యే యితర వ్యాధులైనను సరే గర్భస్థ శిశువునకు అంటజాలవు.

సిరాచేయువిధానము:-

| | | |
|---|---|---|
| 1. గోధుమరవ | తు. | 20 |
| 2. నేయి | తు. | 10 |
| 3. పంచదార | తు. | 30 |

కల్పన :- గోధుమ రవను ఈ నేతియందు దోరగా వేయించి యుంచుకొనవలయును. పంచదారకు తగినట్లు పాకమునకు నీళ్ళుపోసి ఉడికించి, లేతపాకములోనే ఈ పాకను వడియగట్టి అందీ రవ కలిపి మందాగ్నియందు తిరిగి పక్వము చేయవలయును. ఇక్కడికి సిరా సిద్ధమైనది. ఈ పరికల్పనచే భాగములను పెంచుకొని, యెంత ఎక్కువగానైనను సిద్ధము చేసికొనవచ్చును. దీని యందు పచ్చికర్పూరము (ముద్దకర్పూరము), కుంకుమపువ్వు, ఏలకులు, జాజికాయ, జాపత్రి చేర్చిన సుగంధముగను, పౌష్టికముగను ఉండును. ఇందు సీమబాదము పప్పు చేర్చవచ్చునుగాని అది యీ చెప్పిన భాగము ననుసరించి గోధుమ రవలో నాలుగవ భాగము చేర్చవలయును. అట్లు చేర్చునెడల బాదము పలుకులను తగినంత నేతితో దోరగా వేయించి, మెత్తగానూరి పై పాకమునందు బాగుగా కలియునట్లు పొయిమీదనే వేసి దింపవలయును. మిగతా చెప్పబడిన సుగంధ ద్రవ్యము లన్నియు పొయి మీద నుంచి దించిన పిమ్మట వేసి, కలిపి, మూత మూయవలయును. ఇది యే దినమున కాదినము చేసికొనిన మంచిది. అది రుచ్యము, బలవర్ధనము అగుటయేగాక ఔషధ సేవనానంతరము వెంటనే తీసికొనుటవలన పైత్యోద్రేకమును కలుగనీయదు. పై ఒకటి, రెండు, మూడు యోగములును మచ్చున కీయబడినవి.

ఇది గాక ఆయా ఋతువులందుగల కాలదోషముచే వాతోదకములు దూషితములై వ్యాపింపగల దుష్టములైన క్షుద్రవ్యాధు లంకురింప కుండునట్లు నిరోధించుటకై ఆయుర్వేద చికిత్సా సిద్ధాంతమునందు సంగ్రహింపబడిన అనేక దివ్యౌషధీ కల్పములు, సిద్ధ యోగములు కలవు. నీటిని, వాయువును శుభ్రముచేయుటకు అనేక ఉపాయములు చెప్పబడినవి. నీటిని బావులందుగాని, చెరువులందుగాని శుభ్రముచేయవలయునన్న కొన్ని ప్రక్షేప ద్రవ్యములను అందు వేయవలసి యున్నది. వాయువును శుభ్రము చేయుటకై ధూపములు, అగదభేరీ నినాదములు, ఔషధ లేపములతో కూడిన ధ్వజపతాకారోహణములు కలవు. అవి చరక సుశ్రుతములందును, అగ్ని, గరుడ పురాణము

లందును, వరాహ సంహిత, మానసోల్లాసము, అభిలషితార్థ చింతామణి, కౌటిల్య అర్థశాస్త్రములందును చూడవలయును.

కాలధర్మము ననుసరించి షడ్రుతువు లందును భిన్న భిన్నములగు అయా వ్యాధులు కలుగుచున్నను, విశేషముగ విసర్గ ఆదాన కాలములయందు మధ్య ఋతువులగు శరద్వసంతములు మిగుల భయంకరములగు వ్యాధుల కునికిపట్టు లని వర్ణింపబడినవి. విసర్గకాలము వర్షా శరద్ధేమంత ఋతువులు. ఈ ఋతువులందు సూర్యుడు తన కిరణ ప్రసారమున భూమికిని, అందలి పదార్థములకును బలమొసంగును. ఆదానకాలము శిశిర, వసంత, గ్రీష్మ ఋతువులు. ఈ ఋతువులందు సూర్యుడు తీవ్రమగు తన కిరణ ప్రసారముచే భూమి నుండియు, అందలి పదార్థములనుండియు సారవంతమగు బలమును లాగుకొనును. ఇది ఆయుర్వేద సిద్ధాంత పరిచయము.

దీని నిట్లుంచి విజ్ఞాన విషయ విశేషాత్మకములగు పురాణేతిహాసములయందు సహితము ఆయా ధర్మము లుపదేశించు సందర్భములలో శరద్వసంతములు వ్యాధులకు ఆకరము లని చెప్పబడినది. కొమ్మనామాత్య పుత్రుడగు సోమయాజి తిక్కనామాత్యుడు తన ఆంధ్రీకృత మహాభారతమునం దిట్లు వర్ణించెను:—

అరయన్ సర్వజనౌఘ నాశనములై
యత్యంత ఘోరమ్ములై
పరమవ్యాధి కరమ్ములయ్యు గడు శో
భా స్ఫూర్తి నొప్పారి శాం
కరికిం బ్రీతి కరమ్ములై మిగుల వే
డ్కల్ జేయు లోకాళి కి
శరదారంభ వసంతముల్ శమన దం
ష్ట్రా ప్రాయముల్ భూవరా!

ఇందు శరద్వసంతములు యముని కోరలవలె మహా అపాయకరము లని బోధింపబడినది. శరద్ధేమంతఋతువు లందలి కార్తీక మార్గశీర్ష కృష్ణ శుక్ల పక్షములు యమదంష్ట్రలుగా వర్ణించి "స్వల్ప భుక్తోహి జీవతి" కొద్దిగా ఆహారము చేయువాడే సుఖముగ జీవించునని ఆయుర్వేదమున చెప్పబడెను. అందుకనియే ఏ ఋతువులందైనను సరే ఏ రోగములచేతను చిక్కకుండునట్లు మంచి నడవడి కలిగియుండ వలయునని ఆయుర్వేద మాదేశించినది.

నరో హితాహార విహార సేవీ
సమీక్ష్యకారీ విషయే ష్వసక్తః
దాతా సమః సత్యపరః క్షమావాన్
ఆప్తోపసేవీ చ భవ త్యరోగః
చ. శా. 2—46

దేశకాలములకును, శరీరమునకును హితములగ ఆహారవిహారముల నుపయోగించుటయు, మంచి చెడుల నాలోచించి పనుల జేయుటయు, ఇంద్రియ నిగ్రహము త్యాగ శీలతయు, సమత్వబుద్ధి, సత్యనిష్ఠ, ఓరుపు కలిగి జ్ఞానానుభవములు గల వారిని సేవించు నాతడు రోగముల పాల్పడక సుఖముగా నుండును.

మతి ర్వచః కర్మసుఖానుబంధం
సత్త్వం విధేయం విశదా చ బుద్ధిః
జ్ఞానం తపః తత్పరతా చ యోగే
యస్యాస్తి తం నానుతపన్తి రోగాః
చ. శా. 2—47

భవిష్యదారోగ్యోదయమును గోరు మనోవాక్కర్మములు కలిగి సాత్వికత, వినయము, వినిర్మలబుద్ధి, ఆత్మ వివేకము, తపోభిరతి, యోగతత్పరత ఎవరికి కలిగి యుండునో అట్టివారిని క్రూరములగు రోగములు వేధింపజాలవు.

మానవ ధర్మ తత్త్వ బోధన మగు ఈ ఆయుర్వేద సిద్ధాంతాదేశమును అనుసరించి నడచినచో భయంకరము లగు అంటు రోగముల పాల్పడక వంశవర్ధనులై, శతాయుష్మంతులై, వీర్యవంతము, మేధాయుష్మంతము నగు సత్సంతాన సౌభాగ్య సంపదలు కలిగి, మనుజులు మనుజులుగా మనుష్యానందము సంపూర్ణముగా ననుభవించి దేవతాత్ము లగుదురు.

వే. తి. వెం. రా. స్వా.

## అంటువ్యాధులు-ఎల్లోపాతి—

**ఘటసర్పి (డిఫ్తీరియా)** :— ఇది ఘటసర్పి సూక్ష్మ క్రిములవలన సంభవించును. ఇది తుంపరల వలన కలిగిన సంపర్క దోషమువలనను, రోగి ఉపయోగించిన గ్లాసులు,

చెంచాలు మొదలగు పరికరముల ద్వారమునను వ్యాపించును. కొందరు ఘటసర్పి వాహకులు నోటిలో క్రిములున్నను తామిందులకు గురికాకుండుటయు కలదు. ఇది గొంతుకవద్ద ప్రారంభించి, పిమ్మట ముక్కులోనికిని, గొంతులోపలి ఊపిరిగొట్టములోనికిని వ్యాపించవచ్చును. చెవి, కంటిగ్రుడ్డు పైపొర, భగరంధ్రము, చర్మమునందలి గాయములు మున్నగు తావులందుకూడ ఘటసర్పి రావచ్చును. ఉపరితలముపై ఈ క్రిములు వృద్ధిచెంది సన్నని పొరను ఉత్పత్తి చేయును. శరీరజన్య విషము (టాక్సిన్)కూడ క్రిముల మూలమునసే ఉత్పత్తి యగును. అవి శరీరములోనికి ఇంకి హృదయ కండరములను సరిదిద్దు నాడులకు హానిచేయును. పిల్లలయొక్క స్వరపేటికా మార్గములందు ఊపిరి పీల్చకుండా అడ్డు కలుగుట తీవ్ర ఫలితములకు కారణమగును. అంకురించు కాలము 2 మొదలు 4 దినములవరకుండును. ప్రతి పిల్లకు ఆల్ము ప్రెసిపిటేటెడ్ టాక్సాయిడ్ సూది టీకాల నిచ్చుటయు, బిడ్డ మొదటిసారిగా బడికి పోవునపుడు మరియొక అదనపు మోతాదును ఇచ్చుటయు ఇందులకు తీసికొనవలసిన నిరోధక చర్య. విదేశములలో ఈ పద్ధతిని అవలంబించి వ్యాధిని కనీస సంఖ్యకు తగ్గింపజాలిరి. ఈ వ్యాధి వచ్చిన పిల్లలను వేరుగ నుంచవలెను. వారికి శరీరజన్య విషవ్యతిరేకమయిన ఔషధములను (ఆంటీ టాక్సిన్ సీరం) అవసరమైన మోతాదులో ఉదయము, సాయంకాలము వ్యాధి నిర్మూలింపబడువరకు ఇవ్వవలెను. కనీసము మూడు వారముల విశ్రాంతి అవసరము. స్వరపేటికా మార్గమునకు అడ్డు కలిగినయెడల శస్త్రచికిత్స అవసరము. పెన్సిలిన్, ఘటసర్పి క్రిములపై పనిచేయగలదు. కావున దానిని ఇవ్వవచ్చును. శరీరజన్య విష వ్యతిరేకౌషధము ఉపయోగించుట వలన ఈ వ్యాధిచే చనిపోవువారి సంఖ్యను నూటికి 25 మొదలు 50 వరకు ఉన్నదానిని నూటికి 2.5నకు తగ్గింపజాలిరి.

**విష పైత్యజ్వరము (ఇన్ఫ్లుయంజా)** :- ఇది రసి వలన కలుగును. తుంపురులచే సంపర్కదోషము వలన వ్యాపించును. శీతకాలములో నిది దేశప్రాధాన్యముకల వ్యాధి. అంటువ్యాధుల కాలములో ఇది వ్యాపించుట కవకాశము కలదు. అంకురించు కాలము 1 మొదలు 3 దినముల వరకు ఉండును. పొడిదగ్గుతో 5 దినములపాటు జ్వరము ఉండుట దీనియొక్క లక్షణము. శ్వాస ప్రాంతపు పైభాగమునకు చిక్కు కలుగుటయే పొడిదగ్గు వచ్చుటకు కారణము. జ్వరము తగ్గిన కొన్ని దినముల వరకు రోగికి బలహీనత పొడిదగ్గు ఉండును. ముక్కున కిరుప్రక్కల నున్న యెముకలలో వాపు, చీము ఏర్పడుట (ప్రైనొసైటిస్), శ్లేష్మాధిక్య జ్వరము (న్యూమోనియా) వచ్చుట మున్నగు క్లిష్ట పరిస్థితులు ఇందు ఏర్పడవచ్చును. ఈ వ్యాధిని క్రిమి వ్యతిరేక ఔషధముల ద్వారా తగ్గింప వీలు కలుగును.

**కోరింతదగ్గు (హూపింగ్ కాఫ్)**:- ఇది బహు తీవ్రమైన సంపర్కదోషము వలన సంభవించు వ్యాధి. క్రిములచే కల్గి, తుంపురుల వలన సంపర్కదోషముచే వ్యాపించును. అంకురించుకాలము 7 మొదలు 14 దినముల వరకు ఉండును. ప్రారంభదశలో పడిసెము, దగ్గు ఉండును. ఒక వారము దినముల తర్వాత తీవ్రమైన దగ్గు, బాధ, బొబ్బరించుట ప్రారంభమగును. రక్తములో (సహజముగా 20 శాతమునకు బదులు) 70–80 శాతము లింఫొసైట్సు ఉండుట కాననగును. సంవత్సరము లోపు వయస్సుగల పిల్లలకు ఇది వచ్చినయెడల మరణించు ప్రమాదము ఎక్కువగా నుండును. శ్వాసనాళశ్లేష్మాధిక్య జ్వరము, లోపలనున్న క్షయవ్యాధి బైటపడుట, చంటి బిడ్డగుణము మొదలగునవి కలుగవచ్చును. ఈ వ్యాధి 6 మొదలు 8 వారముల వరకు ఉండును. ఉపశమనౌషధములను, ఆరోమైసిన్ వంటి బ్రాడ్ స్పెక్ట్రం క్రిమి వ్యతిరేకౌషధములను ఇచ్చుట ఇందులకు చేయవలసిన చికిత్స. ఇందుమూలమున వ్యాధి తీవ్రత తగ్గి, దగ్గుబాధ రోజునకు పెక్కు పర్యాయములు రాకుండ ఉపశాంతి కలుగును. ఇందులకు తీసికొనవలసిన నిరోధక చర్యలు– 1. నిరోధక సూదిమందు ఇచ్చుట, 2. ఆ వ్యాధిగల పిల్లలను వేరుగా నుంచుట.

**గవదబిళ్లలు (మంప్సు)**:- ఈ వ్యాధి రసి (వైరస్) వలన కలుగును. అంకురించు కాలము 17 మొదలు 18 దినముల వరకు ఉండును. కొద్ది జ్వరము, బుగ్గలయొద్ద మాంసగ్రంథుల వాపు ఉండును. ఇందు వచ్చు క్లిష్ట పరిస్థితులు– 1. వృషణములు వాచుట, 2. కీళ్ళ నొప్పులు,

3. స్వాదుపిండము(పాంక్రియాస్)వాయుట, 4. మెదడు వాపు. వ్యాధి లక్షణానుసారముగా చికిత్సచేయవలెను.

**గ్లాండులరు జ్వరము :-** ఇది పిల్లలలోను పెద్దలలోను ఒక రకపు రసివలన వ్యాపించు వ్యాధి. అంకురించు కాలము 5 దినములు మొదలు 10 దినముల వరకు ఉండును. ఈ క్రింది రకములుగా ఈ జ్వరము వ్యాప్తిలో నున్నది. 1. మెడలగ్రంథులు వాచి, పెద్దవై, జ్వరము వచ్చుట, 2. గొంతు నొప్పి యుండుట. రక్తములో తెల్ల కణములు హెచ్చుగా నుండును. సహజముగ 4 శాతము నకు బదులు మానొసైటులు 60—75 శాతము ఉండును. వ్యాధి లక్షణానుసారముగ చికిత్స చేయవలెను.

**స్కార్లెటు జ్వరము :-** ఇది ఇంగ్లండు మొదలగు శీతలదేశములలో మాత్రమే వచ్చును. ఇది సంపర్కదోషమువలన సంచలించెడు జ్వరము. స్ట్రెప్టొకాకస్‌హిమలిటికస్ అను ప్రత్యేక క్రిముల వలన కలుగును. గొంతు కంఠము మంటతో వాచుట, చర్మముమీద పొక్కులు లేచుట ఉండును. నాలుకయొక్క కొనలు ఎఱ్ఱబడి మధ్య భాగము తెలుపెక్కును. జ్వరముండును. విషజన్య రక్తదోషము కలిగినచో వ్యాధి తీవ్రరూపములు ధరించును. రోగిని తక్కినవారి నుండి వేరుచేయుట, స్ట్రెప్టొ కోకల్ ద్రవమును సూదిమందుద్వారా ఇచ్చుట, పెన్సిలిన్ మొదలగు సూదిమందు లిచ్చుట- ఇందులకు జరుగవలసిన చికిత్సలు.

**విషసర్పి రోగము (ఎరిసెపెలస్):-** తీవ్రమగు ఈ అంటురోగము హిమొలైటిక్ స్ట్రెప్టొకోకస్‌తో స్థానిక సంపర్కదోషము వలన సంభవించును. జ్వరము, చర్మముమీద ఎఱ్ఱటి వాపు ఉండును. ఇది సాధారణముగా ముఖముమీద, పిల్లలకు నాభిస్థానము ప్రక్కన కలుగును. పెన్సిలిన్ ఇచ్చుట ఇందుకు తగిన చికిత్స.

**దొమ్మరోగములు (ఆంత్రాక్స్) :-** జంతువులకును, లేక వాటి చర్మములకును, రోమములకును సమీపమున నుండు వారికి సంపర్కదోషముచే క్రిములవలన వచ్చు వ్యాధి. రోగపీడితమైన జంతువుల రోమములచే చేయబడిన కుంచెలను క్షురకర్మకు ఉపయోగించి దీనికి గురియగుదురు. అంకురించుకాలము 24 మొదలు 72 గంటల వరకుండును, చర్మముమీద ఒక పొక్కు లేచి అందు చీము కలిగి దాని చుట్టును ఉబ్బును. జ్వరము వచ్చును. ఒకప్పుడు ఊపిరితిత్తులుకూడ దీనికి గురికావచ్చును. పెన్సిలిన్ మరియు ఆంత్రాక్సు సీరం ఇచ్చుట ఇందులకు సరియగు చికిత్స.

**సెంబారోగము (గ్లాండర్సు) :-** ఇది ఒక అంటు రోగము. ముక్కునుండి కారుట, ఒకప్పుడు చర్మముపై పొక్కులు లేచుట, ఎముకలందు, కీళ్లయందు నొప్పులు ఉండును. జబ్బుగల గుఱ్ఱములను కాచువారికి సూక్ష్మక్రిములు లోన ప్రవేశించుట వలన కలుగును. ఇది చాల ప్రమాదకరమయిన రోగము.

**టులరీమియా :-** గుఱ్ఱపు ఈగ కాటువలన కలుగు ఈ రోగము క్రిములచే అంకురించును. అమెరికా సంయుక్తరాష్ట్రములు, రష్యా, జపాన్ దేశములలో ఈ వ్యాధి విస్తారముగా కన్పడును. మెడ క్రింది మాంసగ్రంథులు పెరుగుట, టైఫాయిడ్‌ను పోలిన జ్వరము వచ్చుట దీని లక్షణములు. ఒక రకపు ఆంటీసీరము మరియు స్ట్రెప్టొమైసిన్ ఈ రోగమును అరికట్టుటలో మంచి ప్రయోజనకారులుగ నున్నవి.

**సిటాకోసిస్ :-** ఇది రామచిలుకలకు ఒక రసి వలన వచ్చు వ్యాధి. ఈ వ్యాధిగల పక్షులు విసర్జించిన పదార్థపు గాలిని పీల్చుట వలన ఆ వ్యాధితో సంపర్కదోషము వాటిల్లును. అంకురించుకాలము 7 మొదలు 12 దినముల వరకు ఉండును. పిమ్మట రోగికి టైఫాయిడ్‌ను పోలిన ఒక రకపు జ్వరము వచ్చును. ఊపిరి తిత్తులకు వ్యాధి సోకిన చిహ్నములు కానవచ్చును. దీనినుండి కోలుకొనుటకు రెండు మూడు వారములు పట్టును. ఇందు వలన సంభవించు మరణముల శాతము 16—85 వరకు ఉండును. రోగ లక్షణానుసారముగా చికిత్సచేయవలెను.

**బోర్‌హంవ్యాధి :-** ఛాతిలో తీవ్రమగు నొప్పి, జ్వరము ఉండును. ఇందులకు గురియైన కండరములను నొక్కినచో నొప్పి కలుగును. ఈ వ్యాధి రెండు మూడు దినములలో తగ్గిపోవును. వ్యాధి లక్షణానుసారముగా చికిత్స చేయవలెను.

**రొంప (Common Cold) :-** ఇది సాధారణముగ వచ్చు వ్యాధి. ఇది రసివలన వచ్చును. జనసమ్మ

ర్ధముగల ప్రదేశములలో ఎక్కువమంది ఈ వ్యాధికి గురి యగుట జరుగును. తుంపురుల వలన, సంపర్కదోషము ద్వారా ఇది వ్యాపించును. మొదట తలనొప్పి, ముక్కులో తేమ లేకుండుట— వీనితో ప్రారంభమై తర్వాత ముక్కునుండి కారుట మొదలిడును. దీని వలన చెవి నొప్పి, దగ్గు కలుగవచ్చును. ఇందులకు వ్యాధి లక్షణాను సారముగ చికిత్సయు, ఒకటి రెండు రోజుల విశ్రాంతియు అవసరము.

సంపర్కదోషజన్యమైన కాలేయరోగము (**Infective Hepatitis**) :— ఇది రసివలన కలుగును. అంకురించు కాలము 17 మొదలు 35 దినముల వరకు ఉండును. ఈ వ్యాధి అంతర్గతముగా నున్నవారికి కామెరల బాధ కలుగదు. అవియే సంపర్కదోషమును వ్యాపింపజేయు ముఖ్యసాధనములు. కాకి రసి వలన, తుంపురుల వలనను, మలమూత్రముల వలనను, ఈ వ్యాధి వ్యాపించును. ఈ వ్యాధి మొదటి వారములో ఆకలి లేకుండుట, తలనొప్పి, జ్వరము, వాంతులు ఉండును. తర్వాత కామెర్లు వచ్చును. మూత్రములో పైత్యరసముండుటచే మూత్రము ఎఱ్ఱగా నుండును. ఒడలు దురదపెట్టును. ఇది 6 లేక 8 వారము లలో తగ్గిపోవును. కాలేయము పూర్తిగా చెడి, మరణము సంభవించుట అరుదు. సూదులను సంపూర్ణముగా శుభ్రము చేయకుండ సూదిమందు ఇచ్చినయెడల కూడ ఇది ఒకరి నుండి మరియొకరికి వ్యాపించుటకు అవకాశము గలదు. ఇది అంకురించుకాలము 56—289 రోజులు. (సగటు 101 రోజులు). దీనికి జరుగవలసిన చికిత్స యందలి ముఖ్య విషయములు 1. విశ్రాంతి, 2. గ్లూకోసు నీళ్ళు త్రాగుట, 3. వ్యాధి లక్షణానుసారముగ చికిత్స. ఆరోగ్యము చక్కబడువరకు రోగి పనిలో ప్రవేశింపరాదు.

మెనింజైటీస్ (**Meninjitis**) :- మెదడు చుట్టునుగల పొరలలో మెనింగోకోకస్ అను క్రిముల వలనను, లేక రసి వలనను వాపు వచ్చును.

సెరిబ్రోస్పైనల్ జ్వరము (**Serebro Spinal fever**):— దగ్గు తుమ్ముల మూలకముగ, తుంపురులు చిందుట వలన ఇది ఒకరినుండి మరియొకరికి ప్రాకును. మెనింగోకాకై దీని యుత్పత్తికి కారణము. శరీరమందంతటను వ్రేళ్ళ యందును నొప్పులతోను, జ్వరముతోను భరించరాని తల నొప్పితోను ప్రారంభమయి శరీర మంతయు ఒకప్పుడు వివర్ణమగును. మెడ బిగువుగా నగును. మడమ పట్టుకొని కాలు పైకెత్తిన, తొడలలో నొప్పి కలుగును. తల నొప్పి, వాంతులు ఉండును. ఒకప్పుడు అసాధారణముగ రోగి శరీరము చల్లబడును. సూదిని వెన్నెముకల మధ్యనున్న సందులోనికి పోనిచ్చి పొరలలోపలి ద్రవమును (సెరిబ్రో స్పయినల్ ద్రవము) తీసినయెడల దానిలో చీము, క్రిములు ఉండును.

**ఇందుకు జరుగ వలసిన చికిత్స**:-1. ప్రతిదినము పెన్సిలిన్ సూదిమందు వెన్నెముకద్వారా మజ్జపైనుండు పొరలలోనికి ఇచ్చుట, 2. సల్ఫా ఔషధములను నోటి ద్వారా ఇచ్చుట, 3. శరీరము చల్లబడిన యెడల ఎడ్రినల్ కార్టికల్ ఎక్‌స్ట్రాక్టును ఇవ్వవలెను. ఇతర రకముల మెనంజైటీస్ వ్యాధులను గూర్చి వ్యాధి నిరూపణ చేయు టకు మార్గములు:—

1. వెన్నెముక మధ్యనుండి ద్రవమును తీసి క్రిములను పరీక్షించవలెను. న్యూమోకాకై, స్టిఫిలో కాకై, స్ట్రెప్టో కాకై వలన కలిగిన ఎడల పై చికిత్స చేయవలెను.

2. క్షయవలనకలిగిన మెనంజైటీస్ అగుచో, వెన్నె ముకనుండి తీసిన ద్రవము స్వచ్ఛముగా నుండును. కాని పరీక్షించిన, క్షయవ్యాధి క్రిములుండవచ్చును. ప్రతిదినము స్ట్రెప్టోమైసిన్ సూదిమందు ద్వారమునను, నొకొటినిక్ ఆసిడ్ హైడ్రజైడ్ గోళీలను ఇచ్చుటవలనను చాలమంది ఇందుండి విముక్తులై బ్రతికిరి. ఈ వ్యాధికి 6 నెలలనుండి 2 ఏండ్ల వరకు చికిత్స చేయవలెను.

**బినైన్ లింపసైటిక్ మెనింజైటీస్**:- ఇది రసివలన సంభవించు రోగము. వెన్నెముకల మధ్యనుండి తీసిన ద్రవము నందు లింపోసైటస్ ఉండును. రోగి త్వరలోనే స్వస్థత పొందును.

**మెనంజిజం**:- అనగా వైద్యశాస్త్రరీత్యా మెనంజైటీస్ వ్యాధియొక్క లక్షణములు గోచరించెడు పరిస్థితి. వెన్నెముకమధ్య ద్రవమును తీసి చూచిన అది నిర్మలముగా నుండును. ఈ పరిస్థితి తనంతట తానే చక్కబడును.

**మెదడువాపు (Encaphalitis Lethargica)** :- నాడీ మండలమునకు ఒక విధమైన రసివలన సంపర్క దోషము

వాటిల్లును. ఇది తీవ్రముగను దీర్ఘముగను ఉండు లక్షణ ముగల వ్యాధి. ఈ వ్యాధి తీవ్రమైన పరిస్థితిలో— నిద్ర, మత్తు, కనురెప్పవాయుట, మెల్ల, ఒకేవస్తువు రెండుగ కనబడుట, జ్వరము, అధికనిద్ర ఉండును. ఇది అంటు వ్యాధిగ వ్యాపించినచో పెక్కుమంది మృతికి కారణ మగును. కాని సాధారణముగ ప్రారంభమునుండియు సాధువుగనేయుండి కష్టనష్టములు లేకుండగనే గడచి పోవును. తర్వాత రోగియందు వణుకు రోగము (పార్కిం సన్ వ్యాధి) లక్షణములు కనుపించును. రోగలక్షణాను సారముగ ఇందుకు చికిత్స చేయవలెను.

పొంగు, మసూచి, గవదబిళ్ళలు, రసులుకూడ మెదడు వాపు వ్యాధికి కారణములు కావచ్చును. ప్రాథమిక మైన టీకాలు వేసిన 6 మొదలు 14 దినముల తరువాత రోగి మెదడు వాపు వ్యాధికి గురియై చనిపోవుటగాని, శారీరకమైన లేక మానసికమైన స్వస్థతను కోల్పోవుట కాని జరుగవచ్చును. ఇందు సాధారణముగ క్లిష్టపరి స్థితులు రావు. ప్రాథమికమైన టీకాలను ఆలస్యముగా వేయించుట ఇట్టి పరిస్థితుల రాకకు దారితీయును. శిశువు నకు మొదటి సంవత్సరములోనే టీకాలు వేయించుట ఇందులకు తీసికొనవలసిన నిరోధక చర్య.

(ఇతర అంటువ్యాధులు ఉష్ణమండల వ్యాధులు అను వ్యాసములో వర్ణింపబడినవి).

డా. వెం. రా.

**అండమాన్ దీవులు**— ఈ దీవులగుంపు బంగాళా ఖాతపు తూర్పుభాగమున నున్నది. అగ్నిపర్వత సంబంధ ములగు నీదీవులు హుగ్లీ ముఖద్వారమునకు 590 మైళ్ల లోను, ఆసియా భూభాగమున మిక్కిలి సమీప స్థలమగు బర్మాలోని నెగ్రెయిస్ అగ్రము (Cape Negrais) నకు 120 మైళ్లలోను కలవు. 1955 భారత ప్రభుత్వపు లెక్కల ననుసరించి, వీని వైశాల్యము 3,148 చదరపు మైళ్లు. బ్రిటిష్ ప్రభుత్వకాలములో 1858 నుండి యావ జ్జీవ దేశాంతరవాస శిక్షితుల కిది నిర్బంధ ప్రదేశముగా (Penal settlement) నుపయోగింప బడెను. ఈనాడు భారత ప్రభుత్వ రాష్ట్రములలో నొకటియై, ఇవి దక్షిణ ముననున్న నికోబార్ దీవులతో కలిసి "అండమాన్ మరియు నికోబారు దీవులు" అను పేరుతో, డి-విభాగ రాష్ట్రములకు చెంది, "ఛీఫ్ కమిషనర్" అను అధికారిచే పాలింపబడు చున్నవి. భారత జాతీయ పతాకచ్ఛాయ క్రింద నేడిచ్చట 30,948 మంది ప్రజలు నివసించు చున్నారు (1951).




పెద్దవియు చిన్నవియును కలసి, ఇందు మొత్తము 204 దీవులు కలవు.

వీనిలో దగ్గరగా చేరియున్న ఐదు పెద్దదీవులు కలసి మహా-అండమాన్ (Great Andaman) అని పిలువబడు చున్నవి. వీటిలో ముఖ్యములైనవి:— (1) ఉత్తర-అండ మాన్ (2) మధ్య-అండమాన్ (3) దక్షిణ-అండమాన్.

చిన్నదీవులు దాదాపు 200 కలవు. వీనిలో ముఖ్య ములైనవి. (1) అండమాన్ ద్వీప సమూహము (Andaman Archipelago) (2) లేబిరిన్త్ ద్వీపము (Labyrinth Island).

మహా-అండమాన్ 219 మై. పొడవును, 32 మై. వెడల్పును గలిగియున్నది. నాలుగు ఇరుకైన జలసంధులు ఈ దీవులను విడదీయు చున్నవి.

చిన్న అండమాన్ (Little Andaman) ఈ దీవుల సమూహములో దక్షిణపుకొన నున్నది. దీని పరిమాణము దాదాపు 26 మైళ్ళ పొడవును, 16 మైళ్ళ వెడల్పును నైయున్నది. ఇది రట్‌లండ్‌దీవికి (Rutland Island)

31 మైళ్ళదూరములో నున్నది. దీనికి సమీపమున (రట్‌లండ్ దీవికి) నున్న మేనర్సుజలసంధి (Manners Strait) మద్రాసు తీరప్రాంతమునకును, అండమాన్ దీవులకును మధ్య ప్రధానమైన వర్తకపు రహదారి (Commercial Highway) గా నున్నది.

పేరు:—అండమాన్‌అనుపేరు మలయాభాషలో "హన్ డుమాన్" (హనుమాన్. సం.) నుండి ఏర్పడియుండుట సంభవమని చెప్పబడుచున్నది.

వర్ణన (Topography); భౌతికలక్షణములు:- మహా-అండమాన్ దీవులు కొండల పరంపరలచే నిండియున్నవి. వీటి మధ్య మిక్కిలి ఇరుకైన లోయలున్నవి. మిక్కిలి దట్టములైన ఉష్ణమండలారణ్యములచే ఈ భాగము లన్నియు ఆవరింపబడి శ్యామవర్ణము (Lush green) గా కనబడు చుండును. తూర్పు తీరమున ఈ కొండలు ఎక్కువ ఎత్తుగలవిగా నున్నవి. వీటిలో "సేడిల్ శిఖరము" (Saddle Peak) ఎత్తు 2,400 అడుగులు. ఇది ఉత్తర అండమానులో నున్నది.

"చిన్న అండమాన్" (Little Andaman) దాదాపు చదునుగా నున్నది. సెలయేరులుగాని, ఎడతెగకపారు నదులుగాని ఈ దీవులలో లేవు.

ఎల్ల తావులయందును ప్రకృతి దృశ్యము హృదయాకర్షకమైన సౌందర్యముగలిగి, వైవిధ్యముతో గూడి యుండును. నౌకాశ్రయముల దాపునగల అఖాతము లందు పగడపు తలములు రంగు రంగులతో సమ్మోహన కరములై యుండును.

తీరరేఖ చీలియుండుటచే చక్కని నౌకాశ్రయము లేర్పడి యున్నవి. వీటిలో పోర్టు బ్లెయిర్ (Port Blair), పోర్టు కారన్ వాలిస్, బోలింగ్టన్ అనునవి ప్రసిద్ధికెక్కినవి. వీనిలో పోర్టు బ్లెయిర్ (దక్షిణ అండమాన్) దక్షిణ ఆసియాలోని ఉత్తమ నౌకాశ్రయములలో నొకటియై ఈ దీవులకు రాజధానియై యున్నది.

బర్మాలోని ఆరకాన్ యోమా (Arakan yoma) పర్వత పంక్తులలోనున్న నెగ్రెయిస్ అగ్రము (Cape Negrais) నుండి సుమత్రా దీవిలోని అచిన్‌హెడ్ (Achin Head) వరకు 700 మై. పొడవుగల ఎత్తైన పర్వత పంక్తులు సముద్రములోనుండి అడ్డముగా వ్యాపించి యున్నవి. అండమాన్ దీవులు ఈ పర్వత శ్రేణిలో ఒక భాగమై యున్నవి. 'నూతన జాతి' శిలానిర్మాణములు (Newer Rocks) అండమాన్ ద్వీపసమూహములోను, నికోబార్, సుమత్రా దీవులయందును కనబడుచున్నవి.

శీతోష్ణస్థితి:- అండమాను దీవులు ఉష్ణమండలములో చేరి, ఎప్పుడును వెచ్చదనము గలిగియున్నను, చక్కని సముద్ర వాయువుల ప్రభావముచే, ఆరోగ్యవంతముగా నున్నవి. ఉత్తరాయణ కాలములో ఇచట అధికమైన వేడిమి యుండును. వర్షపాతము క్రమము లేక హెచ్చు తగ్గులతో గూడి యుండును. నైరృతి ఋతుపవన కాలములో అత్యధికములైన వర్షములు కురియుచుండును. తుపాను లంతగా ఈ ప్రాంతమునకు తగులవు. కాని బంగాళాఖాతములో వీచెడి ప్రతి తుపానుయొక్క ప్రభావమును ఇక్కడ కనబడు చుండును. వీచెడి తుపానుల దిక్కును, తీవ్రతయును తెలిసికొని, బంగాళాఖాతములో తిరిగెడి అనేకములైన ఓడలకు తెలియజేయుటకు మిక్కిలి అనుకూలమైన స్థానములో నీ దీవులున్నవి. అందుచే 1868 సం॥ నుండి, పోర్టు బ్లెయిర్‌లో నొక చక్కని వాతావరణ పరిశీలనా కేంద్రము నెలకొల్పబడి యున్నది.

సహజవృక్షసంపద, జంతుజాలము:- 1883 సంవత్సరములో ఆటవికశాఖా కార్యాలయ మొకటి ఇక్కడ నెలకొల్ప బడినది. పోర్టు బ్లెయిర్ చుట్టును 156 చ.మై. అటవీ పరిశోధన కార్యకలాపమునకు ప్రత్యేకింప బడినది. ఖైదీలను కూలీలుగా నుపయోగించి, ఈ పని సాగింప బడెను. "పేడాక్" (Padouk) (pterocorpus dalbergioides) అను ఒక జాతివృక్షము ఇచ్చట పెరుగుచున్నది. ఇది కేవల మీ ప్రాంతజన్యమైనట్టిది. ఇండ్లు, పడవలు, కట్టెసామగ్రి మొదలగు వానికి చేవ, మెహాగనీలవలెనే ఇది ఉపయుక్త మగుటచే, ఇది యూరపులోని వర్తక కేంద్రములకు విరివిగా ఎగుమతి చేయబడు చున్నది.

కోకో (koko), 'సేటిన్‌ఉడ్' మొదలగు మేలిజాతి కలప ఇచ్చట లభ్యమగు చున్నది.

తేయాకు, సైబీరియాకాఫీ, కోకో, మేనిలాజనుము, చేకు, కొబ్బరి, పూలజాతులు, పండ్లచెట్లు, కూరగాయలు మొదలగునవి ఫలసాయము చేయుటకయి ఇచ్చట ప్రవేశ పెట్టబడినవి. కొబ్బరి ఇచటి ప్రజల ముఖ్యాహారము.

సంవత్సరమునకు 1,50,00,000 కొబ్బరికాయలు ఎగుమతి అగుచున్నవి. అడవులు బర్మా అడవులజాతికి చెంది, కొన్ని మలయాజాతులనుగూడ కలిగినవై యున్నవి. చిత్తడినేలలో పెరుగు రావిచెట్లవంటి చెట్లు (**Mangrove swamps**) నుండి ప్రశస్తమగు వంటచెరకు దొరకుచున్నది. రెండవ ప్రపంచ సంగ్రామము తరువాత 'షార్క్ లివర్ ఆయిల్' పరిశ్రమ అభివృద్ధి చెందసాగినది. జంతుజాలము విషయములో నిచటిఅడవులు కొరవడి యున్నవి. చిన్నరకపు పంది (**Sus andenesis**) ఒకటి ఇచటి ఆదిమవాసుల ఆహారమునకు ఉపయోగ పడుచున్నది. ఒక మాంసాహార జంతువు (**Paradoxirus tytleri**) కూడ కనబడు చున్నది. మొత్తము 19 రకముల జంతుభేదములిచ్చట కలవు. గబ్బిలములును, ఎలుకలును జంతువులలో 75 శాతముగానున్నవి. ఇట్లు జంతుజాలము తక్కువగా నుండుటను బట్టి ఈ దీవు లొకానొకప్పుడు ఆసియా భూభాగముతో కలిసియుండెడివన్న సిద్ధాంతము సంశయాస్పద మగుచున్నది. డేగ, బుల్‌బుల్ మొదలగు అనేక పక్షిజాతులు కనబడుచున్నవి. కాని ఇవే నికోబార్ దీవులలో వేరురకముగా నున్నవి. చేపలలో ప్రత్యేక జాతులు లభ్యమగు చున్నవి. తాబేళ్లు (**Turtles**) సమృద్ధిగా దొరకుచు, కలకత్తా మార్కెటుకు ఎగుమతి చేయబడుచున్నవి.

ప్రజలు:- నీగ్రోజాతి భేదమునకు చెందిన ఆదిమనివాసులు ఇచట కలరు. మగవారి సగటు ఎత్తు 4అ.10½అం. ఆడువారి సగటు ఎత్తు 4అ. 6అం. మరుగుజ్జువారైనను సుపరిమాణములైన శరీరములు కలిగియుందురు. వీరు కారు నలుపు రంగు, కొంచెము గుండ్రముగా నుండు తల; చిన్నదియై, వెడల్పుగల ముఖము; వెడల్పు ముక్కు ఆకారముగలవారు. పొట్టిగా నల్లగా నుండు వీరి జుట్టు ఉంగరములు తిరిగి, మిరియపు గింజలవలె కనబడును.

తీరవాసులు, దేశాంతర్భాగవాసులు అని ప్రజలు రెండు తెగలుగా నున్నారు. తిరిగి వీరు 12 ప్రత్యేక వర్గములు (**Tribes**) గా కనబడుచున్నారు. మలయాలోని సెమాంగ్ (**Semangs**) లకును, న్యూగినీలోని 'పాపువాను' (**Papuans**) లకును వీరు పోలిక కలిగి యున్నారు. వీరిలో ప్రభుత్వ వ్యవస్థ లేదు. కాని కొందరి నాయకులను (**Heads**) వీరు అనుసరించుచుండుట కలదు. సంగీతము, నాట్యము సాధన చేయబడుచున్నవి. విండ్లు, బాణములు వీరి ఆయుధములు. తాళ్ళు పేనుటలో, తట్టలు, చాపలు అల్లుటలో వీరికి నేర్పుగలదు. నిప్పు రగుల్చుట వీరికి తెలియదు. కాన, వీరు దానిని పదిలపరచుకొని, కుండలు చేయుటకును, వంటకును ఉపయోగింతురు. తీరప్రదేశములను దాటి, వారు సముద్రపు దూరప్రదేశములలోనికి పోరు. చనిపోయినవారిని చెట్టు తొఱ్ఱలలో భద్రపరచుట, మృతులయెడగల ప్రత్యేక గౌరవమును సూచించు ఆచారము.

భాషాశాస్త్రదృష్టితో, వీరి భాషలు మిక్కిలి గమనింపదగినవిగా నున్నవి. సంధి ప్రధానములై ఇవి వ్యాకరణ సంబంధమగు వికాసములేనివై యున్నవి. వ్యుత్పత్తితో గూడిన వృద్ధిమాత్రము కనబడుచున్నది. ధాతువులు, ప్రత్యయములును భాషనునిర్మించు అంగములై యున్నవి. సామాన్య ధాతువులు తరచు నామవాచకములై యున్నవి. మిక్కిలి సామాన్య భావములను వెల్లడించుచు, మాట్లాడుటకు మాత్రమే ఉపకరించుచు, ఈ భాషలు వ్రాతకు కావలసిన సవరణల విషయములో కొరవడి యున్నవి. ముఖవైఖరిని బట్టియు, సంజ్ఞలను బట్టియు చాలవరకు వారి భావములు వెల్లడియగుచుండును.

"ఇచటి ప్రజలు ఉత్సాహవంతులుగాను, ఆనందశీలురుగాను, ఆటపాటలయందు ఆసక్తి గలవారుగాను ఉన్నారు. వీరు అసూయాపరులును, మోసకాండ్రును, పగబట్టువారును అయియున్నారు. కోపము వచ్చినచో ఎంతటి ఘోరమునకయినను తలపడెదరు. అభిమానముతో చూడదగినవారేకాని, నమ్మదగినవారు కారు" అని బ్రిటీషువారు తమ అనుభవముల ననుసరించి ఆదిమవాసులను గూర్చి అభిప్రాయము వెల్లడించియున్నారు.

కొన్ని చారిత్రక విషయములు:- 1858 నుండియు బ్రిటీషు వారిచే నీ దీవులు ప్రభుత్వ శిక్షితుల ఆవాస భూములుగా వాడబడెను. ఫిబ్రవరి 8, 1872లో రాజ ప్రతినిధియగు మేయోప్రభువు ఈ దీవులకుపోగా, అప్పుడు ఆయనను ఒక ఖైదీ చంపెను. 1942నుండి, రెండవ ప్రపంచ యుద్ధము ముగియువరకును ఇవి జపాను వారిచే ఆక్రమింపబడియుండెను.

నేడివి భారతరాష్ట్రములలో నొకటిగా పరిగణింపబడి యున్నవి.

**నవభారత వ్యవస్థలో అండమాన్ దీవులు:-** "అండమాన్ మరియు నికోబార్ దీవులు" అని పిలువబడు నీ భారత రాష్ట్రమునకు సంబంధించిన యీనాటి కొన్ని వివరములు ఈ దిగువ నీయబడుచున్నవి.

**(1956 భారత ప్రభుత్వ ప్రచురణ ననుసరించి) మతముల ననుసరించి జనాభా:-**

హిందువులు: 9,294; సిక్కులు: 126; జైనులు: 1 బౌద్ధులు : 1,604; జోరాస్ట్రియన్లు : 2; మహమ్మదీయులు : 4,788; క్రైస్తవులు : 9,494; ఆదిమ వాసులలో వర్గములకు **(Tribals)** చెందినవారు : 20; వర్గములకు చెందనివారు **(Non-tribals)** : 5,646.

**అక్షరాస్యత:-** పురుషులు: 34.2 శాతము. స్త్రీలు: 12.3 శాతము. మొత్తము 25.8 శాతము.

**ఆర్థికము:-** (కోట్ల రూపాయలలో)

| సంవత్సరము | ఆదాయము | ఖర్చు | మిగులు లేక తగులు (+ లేక —) |
|---|---|---|---|
| 1953—54 | 1.36 | 2.38 | —1.02 |
| 1954—55 | 1.30 | 2.91 | —1.61 |

**పరిశ్రమలు:-** కలపపని ముఖ్యము. పోర్టు బ్లెయిర్‌లో రంపపు మిల్లు ఆరణ్యశాఖచే నడపబడుచున్నది. ఇచ్చటనే ఒక అగ్గిపెట్టెల కర్మాగారము "వెస్టర్న్ ఇండియా మేచ్ ఫ్యాక్టరీ" అను కంపెనీచే నడుపబడుచున్నది. చేనేత మగ్గములతో బట్టలు నేయబడుచున్నవి. కొబ్బరిపీచుతో చేయబడు పరిశ్రమలు గలవు.

**విద్య:-** ఇచ్చట నేడు 1 ఉన్నత పాఠశాల, 2 మాధ్యమిక పాఠశాలలు, 22 ప్రాథమిక పాఠశాలలు కలవు. ప్రాథమిక పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడుచున్నవి. 1955లో విద్యార్థులసంఖ్య 200.

**ఆరోగ్యశాఖ:-** 5 హాస్పిటళ్ళు, 12 చిన్న వైద్యశాలలు కలవు. పోర్టు బ్లెయిర్‌లో మంచి "సివిల్ హాస్పిటల్" కలదు.

**సహకారోద్యమము:-** 29 సహకారసంఘములు పనిచేయుచున్నవి. వీనిలో 14 అమ్మకము-కొనుగోలు సంఘములై యున్నవి.

**భవితవ్యము:-** ప్రస్తుతపు భారత ప్రభుత్వమువారు అండమాను దీవుల అభ్యుదయమును గూర్చి ఆలోచించి పథకములు వేయుచున్నారు. అండమాన్ దీవులకు బ్రిటీషువారి కాలములో నేరస్థుల ఆవాస భూమిగా ఏర్పడిన అపఖ్యాతిని ప్రజలు విస్మరించి, అచ్చటికి కొందరు వలస పోవలయును. వ్యవసాయ రంగమున, పారిశ్రామిక రంగమున అభివృద్ధికర కార్యకలాపములను ప్రవేశపెట్టి స్వయంపోషక రాష్ట్రముగా చేయవలయును. నౌకా శిక్షణ కేంద్రముగా దీనిని చేయవలయును. ఈ సుందర భూములు విహార యాత్రాపరులకు దర్శనీయ క్షేత్రముగా వాసికెక్కునట్లు తగు చర్యలు గైకొనవలయును. ఇట్లు కృషిచేసినయెడల అండమాను దీవుల భావిదశ ప్రకాశవంతముగా నుండుననుటకు అవకాశములు గలవు.

**క. రా. మూ.**

**అంతర్విద్యుత్ప్రతిష్ఠ**— విద్యుత్ప్రవాహము **(Electric current)** యొక్క సంపూర్ణ మార్గమును విద్యుద్వలయమని **(Electric Circuit)** యందురు. ముఖ్యముగా విద్యుద్వలయము మూడు భాగములు కలిగి యుండును.

1. విద్యుద్వలయమునకు శక్తిని **(energy)** అందించు విద్యుత్ప్రభవము**(Source of Electricity):-** అంతర్విద్యుత్ప్రతిష్ఠాపనములకు సాధారణముగా ఈ క్రింది జాతులు పనికివచ్చును.
   - (అ) ఏకముఖ వికల్ప విద్యుత్ప్రవాహము **(Single phase A.C.)**, అనగా ద్వితంత్రీ ప్రేషణము **(2 wire supply)**
   - (ఆ) త్రిముఖ వికల్ప విద్యుత్ప్రవాహము **(Three phase A.C.)** అనగా త్రితంత్రీ ప్రేషణము **(3 wire supply)**. ఏ రెండు దశల మధ్యనైనను వోల్టేజి **(Voltage)** సమానము.
   - (ఇ) త్రిదశా వికల్ప విద్యుత్ప్రవాహము **(Three phase A.C.)**, అనగా చతుస్తంత్రీ ప్రేషణము **(4 wire supply)** దశ **(Phase)** కును తటస్థ

మునకును (neutral) మధ్యనున్న వోల్టేజి, ఏ రెండు దశల మధ్యనున్న వోల్టేజికైనను $\frac{1}{\sqrt{3}}$ రెట్లుండును.

(ఈ) ఋజు విద్యుత్ప్రవాహ ద్వితంత్రీ ప్రేషణము (two wire D.C. Supply)

(ఉ) ఋజు విద్యుత్ప్రవాహ త్రితంత్రీ ప్రేషణము (Three wire D. C. Supply)- బహిర్గత అంతముల (outers) మధ్యనున్న వోల్టేజి బహిర్గత మధ్యమముల మధ్యనున్న వోల్టేజికి రెండు రెట్లుండును.

2. విద్యుచ్ఛక్తిని (Electrical energy) వాంఛిత రూపములుగా మార్చు వినియోగ సాధనములు (consuming devices) [దీపములు (lamps), బల్బులు, పంకాలు, గంటలు, ఇస్త్రీ పెట్టెలు, ఉష్ణోత్పాదకములు (Heaters), రిఫ్రిజిరేటర్లు (Refrigerators) మున్నగునవి.]

3. జనకము (Generator) నుండి వినియోగ సాధనములకు అవసరానుగుణముగా శక్తి నందిచ్చు తంత్రులు, మరియు వశీకరణ యంత్రసాధనము (control gear). ఈ భాగమునే విద్యుత్ప్రతిష్ఠాపకులు (Electricians) విద్యుద్వలయ (Electric circuit) మని సాధారణముగా చెప్పుదురు.

సరళ విద్యుద్వలయము:— (Simple circuit) (చూ. ప. 1 మరియు ప. 2) మూడు తంత్రులను కలిగి యుండును. వాటిలో ఒక తంత్రి జనకమును దీపముతో గాని, గంటతోగాని కలుపునది. రెండవ తంత్రి జనకము యొక్క ఇంకొక ముఖమును స్విచ్చితో కలుపునది. మూడవది స్విచ్చిని దీపముతో కలుపునది.

అన్ని అంతర్విద్యుద్వలయములను ఈ సరళ విద్యుద్వలయము నాధారముగా గైకొని నిర్మింప వచ్చును.




ప.1. సరళవిద్యుద్వలయము.




ప.2. మఱియొక సరళ విద్యుద్వలయము.

వివిధ విద్యుద్వలయములను నిర్మింపవలసి వచ్చినపుడు, వలయములు సమాంతర (Parallel) పద్ధతిలో (చూ.ప.3) జనకముతో కలుప బడును.




ప.3. సమాన వోల్టేజకల సమాంతర విధానపు విద్యుద్వలయము

అనగా స్విచ్చితంత్రుల నన్నిటిని ఒక కేంద్రమునకు (main), దీపపు తంత్రుల నన్నిటిని ఇంకొక కేంద్రమునకు కలుపుట. ఈ విధముగా విద్యుత్ప్రేషణము యొక్క సంపూర్ణ పీడనము (Pressure) ప్రతి వలయమునకు ఇతర వలయములచే వినియోగింపబడు బలము (Power) విషయమున సంబంధము లేకయే పంపిణీ చేయబడును. ఈ వలయముల ప్రేషణ అగ్రములను (Supply ends) భవనము నందలి ఒకానొక అనుకూల ప్రదేశమునకు తెచ్చి సమాంతరవిధానమున (Parallel) పంపిణీపెట్టెపై (distributing board) కలుపవలెను. ప్రతి వలయమునందలి తంత్రులును ఫ్యూజు తీగలచే (Fuse wires) సంరక్షింపబడవలెను. పెద్ద విద్యుత్ప్రతిష్ఠాపనము కలిగిన (large electrical installation) ఒకానొక భవనమునందలి వేరువేరు అంత

స్తులకును, భాగములకును సరఫరా చేయుటకై వివిధ పంపిణీ పెట్టెలుండును. అంతర్విద్యుత్ప్రతిష్ఠాపన కవసర పడు విద్యుత్ప్రవాహమును గ్రహింప సమర్థములగు రెండు ప్రధాన తంత్రులు (cables) పంపిణీ పెట్టెకు ప్రేషణ చేయును.

ప్రధాన స్విచ్చి (main switch), మరియు ఫ్యూజు తీగల ద్వారా ప్రధాన తంత్రులు పంపిణీ పెట్టెకు కలుప బడును. దీని సహాయమున అంతర్విద్యుత్ప్రతిష్ఠాపనము నంతను నిర్జీవముగ ('dead') చేయవచ్చును.

**తంత్రులను సమాంతర విధానములో సమర్చుటలోగల ముఖ్య ప్రయోజనములు:—** 1. విద్యుత్ప్రతిష్ఠాపనములో నొక భాగములో నేదేని మరమ్మతు చేయవలసి వచ్చినప్పుడుగాని, మార్పులను చేయవలసి వచ్చినప్పుడుగాని, ఇతరభాగములతో సంబంధము లేకయే ప్రతి ప్రమాణమును (each unit) ప్రత్యేకింపబడును (isolated).

2. మొత్తము విద్యుద్భారము (Load) వివిధ వలయములలోనికిని సర్దుబాటు చేయవచ్చును. దీనివలన ప్రతి వలయములో ఏకరీతియైన పీడనయొక్క పతనము (Pressure drop) సాధ్యపడును.

ప్రేషకపు వోల్టేజి (Supply voltage) వినియోగ సాధనముల కవసరమగు వోల్టేజికంటె అధికమగుచో, మరిరెండు కాని, అంతకంటె అధికముగ కాని వినియోగ సాధనములను శ్రేణి విధానమున (In series) సమర్పవచ్చును. (చూ.ప. 4)




**ప.4. శ్రేణీ విధానపు వలయము.**

శ్రేణి విధానమున ఒకే విద్యుత్ప్రవాహము ప్రతి దీపములోనికి ప్రవహించును కనుక వలయము నందలి ప్రతిదీపమును ఒకే బలమును (Power) కలిగి యుండవలెను. కాని ఈ శ్రేణీ విధానమున ఒక అననుకూలత ఉన్నది. అది ఏమన, ఏదేని ఒక దీపము చెడిపోయినచో వలయము ఖండింపబడి, అన్ని దీపములును నిష్ప్రయోజకము లగును. మరియు మనకు ఇచ్చవచ్చిన దీపము నొక దానినే వాడుట కవకాశ ముండదు.

విద్యుత్ప్రతిష్ఠాపనములందు తంత్రులకు రంగుల నుపయోగించుట యొకా నొక సాంకేతిక పద్ధతి. ఇట్లు చేయుటవలన ప్రతిష్ఠాపన సమయమున పొరపాట్లకు (స్ఖాలిత్యములకు) తావుండదు. సులభతరమునుగూడ అగును. సాధారణముగ, వినియోగ ప్రేషక మార్గములకు నలుపురంగును, స్విచ్చి ప్రేషకమార్గములకు ఎరుపు రంగును ఉపయోగింతురు. స్విచ్చిని దీపముతో కలుపు తంత్రులు ఎరుపు రంగుతోగాని, కొన్ని ప్రత్యేక పరిస్థితులలో నారింజ (orange) రంగుతోగాని గుర్తింప బడును. (చూ.ప. 5)




**ప.5. ఒకటే దీపము గల వలయము.**

**పంపిణీ పెట్టెనుండి సరఫరా చేయబడి ఏకధృవ స్విచ్చి (Single pole switch) చే వశీకరింపబడిన వలయము:-**

దీపపు పాయింటు (Point) నిర్జీవముగ (Dead) నుండవలెను. అనగా స్విచ్చి తెరువబడినప్పుడు (When switch is open) పాయింటుకు ప్రధాన తంత్రుల భూసంబంధము వైపు (Earthed side) కలుపవలెను. ఇట్లు చేయుటవలన ప్రధానతంత్రులకు విద్యుదాయాస ముండదు (Electrical strain) మరియు దీపములను మార్చునప్పుడు విద్యుత్తు యొక్క పెనుతాకుడు వలని (Electric shock) అపాయ ముండదు.

**వలయాత్మక పటములు (Wiring Diagrams):**—ఇట్టి పటములను చిత్రించునపుడు సామాన్య వలయము నందలి ధాతువులను (Elements) ఈక్రింది పద్ధతిలో సాంకేతింప వలెను.



1. ఒక ధ్రువముగల స్విచ్చి



2. ఫ్యూజు తీగ



3. ద్విమార్గపు స్విచ్చి



4. నొక్కుడు స్విచ్చి



5. రెండు ధ్రువములుగల స్విచ్చి



6. దీపము లేక బల్బు





7—8. మధ్యస్థపు స్విచ్చి యొక్క రెండు రీతులు



9. రెండు మార్గముల ప్రసారము ఒక మార్గమున అపసారమును కలుగజేయు స్విచ్చి

**'ట్రీ' మరియు 'లూప్' తంత్రివిధానములు:— ('Tree' and 'Loop' system of wiring)**

క్రింది పటములను పరీక్షింపగా ఈ విషయములు వ్యక్తమగును:—

'ట్రీ' విధానమందు అతుకులు (Joints) దాగి ఉండును. ఒక్కొక్కప్పుడు వాటిని గుర్తించుటకూడ కష్టము.




ట్రీ విధానము

పటము 7

'లూప్' విధానమందు విస్తారముగా రాగితో చేయబడిన తంత్రులను వాడుటవలన అతుకులు ఉండవు. మరియు ప్రతిష్ఠాపనములో పొరపాట్లనుసవరించుటకూడ సులభము.




"లూప్" విధానము

పటము 8

ఈ క్రింది 'లూప్' విధానపు వలయాత్మక పటముల అంతర్విద్యుత్ప్రతిష్ఠాపనములలో సాధారణముగా ఉపయోగింపబడును.



పటము 9

వీధిలోనున్న తంత్రులనుండి మాపకమునకు చేరు తంత్రులు మాపకము వద్దనున్న రెండు కంపెనీవారి ఫ్యూజుతీగలచే సంరక్షింపబడును. ఈ ఫ్యూజుతీగలు "మీటరు" (లేక మాపకము) అమర్చబడిన పెట్టెకే అమర్చబడును. రెండు ఫీడర్లు పంపిణీపెట్టెను పోషించుచుండును. ఇవి ఒక ద్విధ్రువ ప్రధాన స్విచ్చిచేతను, ఫ్యూజుచేతను సంరక్షింపబడుచు ఆధీనములో నుంపబడు చుండును.



ప. 10 త్రిమార్గపు పంపిణీ పెట్టె

3 వ సంఖ్యగల విద్యుద్వలయపు తంత్రీవిధానము సంపూర్ణముగా నున్నది. పంపిణీపెట్టె రెండు కేబుల్సు ద్వార పోషింపబడు చున్నది. ఇవి ప్రధానస్విచ్చి (ప. 9)తో కలుపబడి యున్నవి. ఈ స్విచ్చి పెట్టెకు కలుపబడిన తంత్రీవిధానము నంతను ఆధీనములో నుంచుచున్నది.



ప. 11 ద్విమార్గపు స్విచ్‌లతో ఆధీనములో నుంచబడుదీపము

'అ' వద్దగాని, 'ఆ' వద్దగాని స్విచ్చిని ఉపయోగించి దీపమును ఉపయుక్తముగను, అనుపయుక్తముగను చేయవచ్చును. ద్విమార్గపు స్విచ్ యొక్క ఏకాంతర స్థానములు చుక్కలతో చూపబడి యున్నవి.



పటము 12

పటమున చూపబడిన వలయమును 'అ' వద్ద 'ఆ' వద్ద, 'ఇ' వద్దనున్న ఏదేని ఒక స్విచ్చిచే వశీకరింప వచ్చును. కొనస్థానము లందున్న ఆ, ఇ లవద్ద ద్విమార్గపు స్విచ్చులు ఉపయోగింప బడుచున్నవి. మధ్యనున్న వశీకరణ స్థానమువద్ద ఒక మధ్య స్విచ్చి అమర్చబడినది. స్విచ్‌ల ఏకాంతర స్థానములు చుక్కలతో చూపబడి యున్నవి.



ప. 13 సూచకము మరియు గంటను కలిగిన వలయము

రెండు ఘటముల (Cell) చే ప్రేషింపబడి, 3 వేరు వేరు నొక్కుడు స్విచ్చిలచే వశీకరింప బడిన గంటయు, సూచకమును గల వలయము.

ప. 14 చతుస్తంత్రీ - త్రిదశా వికల్ప విద్యుత్ప్రవాహము

ప్రతిష్ఠాపనమునందు కాంతి భారము (Lighting load) మరియు శక్తి భారము (Power load) నున్నవి. కాంతిభారము మూడు భాగములుగా విడగొట్టబడినది. ప్రతి భాగమును తటస్థ తంత్రికిని (Neutral), జీవన తంత్రులలో నొకదానికిని (Live wire) కలుపబడి వాటిచే పోషింపబడినది. శక్తి భారము మూడు జీవన తంత్రులచే పోషింపబడినది. చతుర్ధ్రువస్విచ్చిచే ప్రతిష్ఠాపన మంతయు వశీకరింపబడినది. 1, 2, 3 జీవన తంత్రులు ప్రత్యేకముగా ఫ్యూజుతీగలచే సంరక్షింపబడి, ప్రతిష్ఠాపనమున కంతకును రక్షణ నిచ్చుచున్నవి.




ప. 15 ద్విమార్గపు గంటవలయము

గంట నెం. 1 గంట నెం. 2 ⟶ ఈ రెండును ద్విమార్గపు స్విచ్చికి వలయములో కలుపబడినవి నొక్కుడు స్విచ్చిని, ద్విమార్గపు స్విచ్చిని ఆధారముగా జేసికొని మనకు కావలసిన గంటలను ఉపయోగములోనికి తెచ్చుకొనవచ్చును.

గృహాంతర్విద్యుత్ప్రతిష్ఠాపనములలో, తంత్రుల ప్రతిష్ఠాపనా పద్ధతులు (House wiring systems) ప్రధానముగా మూడు రీతులుగ నున్నవి.

1. క్లీటు పద్ధతి (Cleat system)
2. దారుపేటికా విధానము (Wood casing system)
3. సీసపు తొడుగు పద్ధతి (Lead covered system)
4. సి. టి. యస్. పద్ధతి (C T. S. system)
5. నాళ విధానము (Conduit system)

విద్యుత్ప్రతిష్ఠాపనము యొక్క ప్రకృతి (Nature), రక్షణ (Protection), ఖర్చుల (Expenditure) ననుసరించి, ఈ పైనుదహరింపబడిన పద్ధతులలో నేదో ఒకదానిని ఉపయోగింప వచ్చును.

**క్లీటు పద్ధతి:—** (Cleat system) ఈ పద్ధతిలో, రెండు పోర్సిలీను క్లీటు (బిళ్ళ) లుండును (Porcelain cleats). ఈ రెండు క్లీటుల నడుమ వి. ఐ. ఆర్. తంత్రులు (Volcanised India Rubber) పోవుటకు వీలుండును. రెండు క్లీటులును స్క్రూతో కఱ్ఱదూలమునకు (Wooden beam)గానీ, కఱ్ఱబద్దీలకుగాని బిగింప బడును. కాంక్రీటుతో గాని, ఇటుకతోగాని చేయబడిన గోడలకు ఈ పోర్సిలీను క్లీటులను స్క్రూతో బిగింపలేము. అందుచే గోడలోనికి ముందుగ కఱ్ఱబిళ్ళలన (Wooden plugs)దింపి, సిమెంటుతో వాటిని గోడలో నతికి, ఆ కఱ్ఱబిళ్ళలకు పై పోర్సిలీను క్లీటులను బిగింతురు. (చూ. ప. 16).










ప. **16** క్లీటువిధానము

తంత్రులు తేమకుగాని, రసాయనిక ధూమములకు (Chemical fumes) గాని, తదితర విధ్వంసక శక్తులకు గాని గురికాకూడదు. గోడలలో నుండిగాని, ఇంటి కప్పులో నుండిగాని తంత్రులు పోవలసి వచ్చినప్పుడు, వాటిని పోర్సిలీను గొట్టముల ద్వారాగాని (Porcelain tubes), దిట్టమైన లోహపు నాళముల (Metallic conduit) ద్వారాగాని గొంపోవలెను.

క్లీటు పద్ధతి ననుసరించిన ప్రతిష్ఠాపనము చాల సులువు. మరియు మార్పులనుగాని, వ్యాప్తిని (Extensions) గాని చాల సులభతరముగ చేయవచ్చును. కాని ప్రస్తుతకాలమున ఈ పద్ధతి ననుసరించిన ప్రతిష్ఠాపనము వాడుకలో లేదు. ఇది శీఘ్రకాలములో విధ్వంసక శక్తులకు గురియై చెడిపోవునుగాన తాత్కాలికమైన (Temporary) ప్రతిష్ఠాపనములకు మాత్రము ఈ పద్ధతి ననుసరింతురు.

**దారుపేటికా విధానము (Wood casing system):—** వి. ఐ. ఆర్. తంత్రులు, గాడీలుగల పేటికగుండా గొంపోబడును. దీనికి కఱ్ఱ బద్దీ కప్పు (లేక మూత) ఉండును. ఈ ఏర్పాటువలన, తంత్రులకు విధ్వంసక శక్తులవలన అపాయము ఉండదు. పేటికను (Casing) సమాన దూరములలో స్థాపింపబడిన పోర్సిలీను బిళ్ళల సహాయమున గాని, లేక క్లీటు పద్ధతియందుదాహరింపబడిన కఱ్ఱబిళ్ళల సహాయమునగాని, గోడకుగాని, సీలింగుకుగాని స్క్రూ సహాయముతో బిగింపవచ్చును. (చూ.ప. 17)

పేటికయును, పైకప్పును రెండు మారులు షెల్లాక్ వార్నిష్‌తో పూతపూయబడవలెను. లోపలను, వెనుక భాగమునను ఒక మారును; ప్రతిష్ఠాపన తరువాత రెండవ మారు బయట నుండియును ఈ వార్నిషు వేయవలెను. బయటి వార్నిషుకు బదులు రంగు వేయవచ్చును. (ఈ




ప. 17 దారుపేటికా విధానము

వార్నీషు స్వచ్ఛమైన షెల్లాకును స్పిరిట్‌లో కలుపుట వలన తయారు చేయవచ్చును.)

పాళ్ళు:— 3 పౌన్ల షెల్లాకునకు ఒక గాలన్ స్పిరిట్ కలుపవలెను.

విజాతి ధ్రువత్వముగల (Opposite polarity) తంత్రులు వేరువేరు గాడీల గుండా (Separate grooves) గొంపో బడవలెను. మరియు తంత్రులపైనున్న విద్యుద్బంధనము (Insulation) న కపాయము కలుగకుండ అతుకుల వద్దనున్న వాడియైన కొనలను సరిగా (సాఫుగ) చేయవలెను.

ఈ ఏర్పాటునంతను తేమ ప్రదేశములందు గాని, అగ్నివలని అపాయమున్న ప్రదేశములందుగాని ఉపయోగింపరాదు. ఈ విధానములోని సదుపాయమేమన- గది లోని లేకభవనములోని అలంకారమునకిది తగియుండును.

సీసపుతొడుగు పద్ధతి (Lead Covered System):— రబ్బరుగాని, కాగితముగాని కప్పుగాగల విద్యుద్వాహకములపై (Conductors) అతుకులేని సీసపు తొడుగు వలన వాహకములకు తేమనుండియు, వాతావరణము నందలి తినివేయు స్వభావముగల (Corrosive) విధ్వంసక శక్తుల నుండియు రక్షణ సమకూరును. క్లిప్పులచే సమాన దూరములలో కట్టిదూలములకుగాని, కట్టిబ్యాటనులకుగాని (Battens), తంత్రులు కాంక్రీటు, ఇటుక గోడలపై నమర్చుటకు ముందుగా బిగింప బడును. కట్టిబ్యాటనులు గోడలకు స్క్రూలు లేక రాల్ ప్లగ్గుల (Rawl plugs) చే బిగింప బడును. (చూ. ప. 18).




ప. 18 సీసపు తొడుగుపద్ధతి

ఈ పద్ధతిని లఘుప్రతిష్ఠాపనములకు ఉపయోగింతురు. ఈ పద్ధతి ఎడతెగని బంధమును (Continuous bond), శ్రేష్ఠమైన భూసంబంధమును (Efficient earthing) కలిగియుండవలెను.

సి. టి. యస్. పద్ధతి(Cab tyre sheathed system):-

ఈ పద్ధతిలో వి. ఐ. ఆర్. తంత్రులకు పైన దృఢమైన రబ్బరు తొడుగుండును. ఈ రబ్బరు తొడుగు క్యాబ్ టైర్ల కుపయోగించు రబ్బరుతో తయారు చేయబడినది. ఈ రబ్బరు తొడుగు తేమనుండియు, తదితర రసాయనికధూమములనుండియు, పూత (Paint) నుండియు రక్షణ నీయగలదు.




ప. 19 సి. టి. యస్. పద్ధతి

తంత్రులు కట్టి దూలములకుగాని, కట్టి బ్యాటనులకుగాని క్లిప్పులచే బిగింపబడును. బ్యాటన్లు ప్లగ్గులతో గోడలలో బిగింపబడును. (చూ.ప. 16.)

ఈ పద్ధతి ననుసరించిన ప్రతిష్ఠాపనము ఇతర పద్ధతుల ననుసరించు దానికన్న చవుక. ఇట్టి ప్రతిష్ఠాపనమును అతి

త్వరితముగను, సులభతరముగను ఏర్పాటు చేయవచ్చును. అందుచే ఈ పద్ధతి విస్తృతముగా వాడుకలో నున్నది. కాని ఇట్టి ప్రతిష్ఠాపనమును తంత్రులకు సూర్యరశ్మి సోకుచోట్ల ఉపయోగించరాదు.

**నాళ విధానము (Conduit system)** :— ఇందు వి. ఐ. ఆర్. తంత్రులు ఉక్కుతోగాని, ఇనుముతోగాని చేయబడిన గొట్టములగుండా గొనిపోబడును. ఈ గొట్టములు దృఢముగ నుండుటవలన, అగ్నిప్రమాదముల వలనగాని, యాంత్రిక సంబంధమైన దెబ్బల వలనగాని **(Mechanical injury)** గొట్టములోనున్న తంత్రులకు (చూ.ప. 20) రక్షణ కలుగు చున్నది.



నాళవిధానము

**పటము 20**

కాన్‌డ్యూట్లు (నాళములు) రెండు రకములు:

1. స్క్రూడ్ నాళము (Screwed conduit).
2. చీలికతో కూడిన కాన్‌డ్యూట్ (Solid conduit)

**1. స్క్రూడ్ నాళ విధానము** :— స్క్రూతో గూడిన కాండ్యూట్‌లు మధ్యరకపు పీడనము **(medium pressures)** గల (250—600 వోల్టులు) విద్యుద్వలయముల కుపయోగింతురు. విద్యుద్వలయములను తేమ నుండియు, ఇతర ఆఘాతములనుండియు సంరక్షించుటకు ఈ కాండ్యూట్లను వాడుదురు. కాండ్యూట్లకొనలను ప్రత్యేకమైన చుట్లువాడి **(Threads)** ప్రతిష్ఠాపనములలో బిగింతురు. (చూ.ప. 21.)

పరిశ్రమలలోను, వివిధ ప్రజాసంబంధికములలోను చీలిక కాండ్యూట్లు **(Split conduits)** అత్యంతోపయోగకరములుగా నుండును. తేమగానుండు స్థలములలోను వాతావరణ విధ్వంసక శక్తులకు గురియగు చోట్లలోను ఈ చీలికకాన్‌డ్యూట్ల నుపయోగింపరాదు. రాపిడిపై నాధారపడు జారుడు బంధములను **(Friction type slip fittings)** కాండ్యూట్ల కొనలను కలుపుట కుపయోగింతురు. కాండ్యూట్లను గోడలపై మోపుల **(Saddles)** సహాయమునబిగింతురు. మోపులను గోడలలో నతుక బడిన కట్టబిళ్ళలపై బిగింతురు. తేమగానుండు స్థలములలో, ఈ కాండ్యూట్లను తేమను రక్షించుటకై గోడకును, నాళమునకును మధ్య కట్టి దిమ్మలు సరియైన విరామముతో స్థాపింతురు. కాండ్యూట్లు ముందుగ ప్రతిష్ఠింతురు. పిమ్మట తంత్రులను వాటిలోనికి లాగుదురు. కావున చాల జాగరూకతతో కాండ్యూట్లు ముందుగ ప్రతిష్ఠాపింప వలెను. మధ్య మధ్య కొన్ని పరీక్షార్థపు బిగింపుల **(Inspection fittings)** నుంచుట వలన నాళవిధానము ననుసరించిన ప్రతిష్ఠాపనమును సుప్రతిష్ఠితముగ చేయవచ్చును. తీగలతో పేనిన వాహకములను **(Stranded conductors)** కాండ్యూట్ గుండా లాగుదురు. తంత్రులు సులభముగ నాళము లోనికి జారుటకొఱకు ఫ్రెంచి సుద్ద **(French-Chalk)** నుపయోగింతురు.



స్క్రూడ్ నాళము



వెల్డు చేయబడిన స్క్రూడ్ నాళము



చీలిక నాళము

**పటము 21**

మంచి బంధము నేర్పరచుట **(Proper bonding)** వలనను, శ్రేష్ఠమైన భూసంబంధమును కల్పించుట **(efficient earthing)** వలనను, కాండ్యూట్ నంతను భూపీడనము **(earth potential)** నం దుంచుదురు.

**బంధము నేర్పరచుట మరియు భూసంబంధమును కల్పించుట (Bonding and earthing)**:— విద్యుత్ప్రవా



5

హము స్ఖలనము (Leakage) నొందినపుడు, తంత్రుల పై నున్న లోహపు తొడుగులు కూడ విద్యుద్వాహకములుగ పనిచేసి, తీవ్రమైన అపాయములకు హేతువులగును. కాని తొడుగు అతుకులవద్ద (Joints) శక్తిమంతమైన బంధనము నేర్పరచి స్ఖలనమువలన కాండ్యూట్‌లోని విద్యుత్ప్రవాహము నుత్రెంపులేనిదిగాచేసి, ఏదో ఒక స్థలమునుండి భూసంబంధమును కల్పింపవలెను. దీనివలన లోహపు తొడుగు భూపీడనమునం దుంచబడి (Earth potential) విద్యుత్తుయొక్క ఘాతమునుండి (Electric shock) రక్షణ సమకూరును. లోహపు తొడుగునకు లేక కాండ్యూటునకు విద్యుత్ప్రేషకముయొక్క ఉత్పాదన స్థానమువద్ద (Entry of the supply) భూసంబంధమును కల్పింతురు. ఒక కొనకు రాగి వాహకముతో బిగింపబడిన భూసంబంధమును కల్పించు క్లిప్పును (Earthing clip) (చూ.ప.22) మరియొక కొనకు జలవాహకమును (Water supply mains)గాని, భూమినిగాని భూసంబంధమును కల్పించు పళ్ళెమును గాని (Earthing plate) కలిపి, భూసంబంధమును కల్పింతురు. భూసంబంధమును కల్పించు వాహకముయొక్క ఛేదన విస్తృతి (Cross sectional area) 0.0045 చ. అం (7/0.029 లేక 14 యస్. డబ్ల్యు. జి. లకు తక్కువ కాకుండ లేక రక్షణమును పొందు వాహకముల మందములోసగము నుందమునకు తక్కువ కాకుండ గాని యుండవలెను. భూసంబంధమును కల్పించు పళ్ళెము యొక్క వైశాల్యము 1 నుండి 2 చ. అంగుళముల వరకును ఉండవలెను. ఇది కనీసము భూమిలో 6 అడుగుల లోతున తడియైన లేసుతో (Damp lace) బంధింప బడవలెను. విస్తృత ప్రతిష్ఠాపనములలో ఒకటికన్న ఎక్కువగ భూసంబంధమును కల్పించు పళ్ళెములు ఉపయోగింపబడును. మఱల ఈపళ్ళెముల నన్నిటిని అంతర సంబంధులుగ చేసెదరు.



పటము 22
భూసంబంధమును కల్పించు క్లిప్పు

నియమముల ననుసరించి లోహపుతొడుగు లేక కాండ్యూట్ యొక్క నిరోధమును; భూమియొక్క విద్యుద్ద్వారము (Earth electrode) తో సంబంధ ప్రదేశము నుండి సంపూర్ణమైన ప్రతిష్ఠాపనలోని ఏ స్థలమునకుగాని మధ్యగల భూసంబంధమును కల్పించు సీసపు ప్రమాణము యొక్క నిరోధమునుకలిపి ఒక ఓము కంటె మించరాదు.

ప్రతిష్ఠాపనములను పరీక్షించుట (Testing electrical Installations).— నియమముల ననుసరించి ప్రతిష్ఠాపనమును పరీక్షించుట అత్యవసరము. ప్రతిష్ఠాపనయొక్క సామాన్య స్థితిని తెలిసికొనుట కొఱకు విద్యుద్బంధనము యొక్క నిరోధమును (Insulation resistance), భూసంబంధము యొక్క వాహకత్వమును (conductance), విద్యుద్వాహకము స్విచ్చిల సంబంధములను పరీక్షించుట అవసరము. దీనికై ఈక్రింది పరీక్షలు చేయబడుచుండును:

భూనిక్షిప్త విద్యుద్బంధనము యొక్క నిరోధము:— మెగ్గర్ (Megger) అను సాధనముతో ఈ పరీక్షను కొనసాగింతురు. విద్యుద్వలయములందు సాధారణముగా నుండు వోల్టేజికి సుమారు రెండు రెట్లున్న ఋజువిద్యుత్ప్రవాహపు వోల్టేజి (D.C. Voltage)పరీక్షకుపయోగింతురు. (త్రిదశా వికల్ప విద్యుత్ప్రవాహము వాడినట్లయినచో ఆర్. యమ్. యస్. (వికల్ప) విలువకు రెండు రెట్లు అవసరము). ఈ పరీక్షను ప్రతిష్ఠాపనమున కంతటకును కంపెనీవారి ప్రధాన ప్రేషక తంత్రులను కలుపు ద్విధ్రువ




ప. 23 భూమికిని, సర్వవాహకములకును మధ్య పరీక్ష
(దీపములు తీసివేయవలెను. స్విచ్చిలు తెరచియుంచవలెను.)

స్విచ్చి వద్ద కొనసాగింపవలెను. 'మెగ్గరు' యొక్క భూసంధి కొన (Earth terminal) జలవాహకమునకో

లేక మంచి భూసంబంధమునకో కలుపవలెను. 'మెగ్గరు' యొక్క విద్యుద్వాహిని యొక్క కొనను (Line terminal) ప్రధాన తంత్రులలో (Main leads) నేదో నొకదానికి కలుపవలెను. ఈ పరీక్ష నొనరించునపుడు ప్రతిష్ఠాపనమునందలి స్విచ్చిల నన్నిటిని మూసివేయవలెను. ఫ్యూజు తీగలు వాటి వాటి స్థలములలో నుండవలెను. దీపములన్నియు వాటి వాటి స్థలములలో నుండవలెను. ఇట్టి స్థితిలో విద్యుద్బంధనము యొక్క నిరోధము $\left(\frac{50}{\text{పాయింట్ల సంఖ్య}}\right)$ మెగోముల (Megohms) కన్న తక్కువగ నుండరాదు. కాని ప్రతిష్ఠాపనమున కంతకును నిరోధము మెగోము కన్న అధికముగ నుండరాదు. (చూ. ప. 23)

**విద్యుద్వాహకముల మధ్య విద్యుద్బంధనము యొక్క నిరోధము (Insulation resistance between conductors):—** వాహకములను సరఫరాచేయు కంపెనీవారు వాహకముల నిరోధము విషయమున పట్టుదల వహింపరు. కాన ఈ పరీక్ష సాధ్యపడినచో మాత్రమే చేయవచ్చును.

ఈ పరీక్షలో, బిగింపుల (Fittings) యొక్క రెండు విద్యుద్వాహకముల మధ్య విద్యుద్బంధనపు నిరోధమును కనుగొన వచ్చును. ఈ పరీక్షను కొనసాగించు నపుడు ప్రతిష్ఠాపనమునందలి ఫ్యూజు తీగలు వాటి వాటి స్థానములలో నుండవలెను. స్విచ్చిలు తెరచియుంచవలెను (On). దీపములను తీసివేయవలెను (Out). (చూ.ప.24.)




ప. 24 విద్యుద్వాహకముల మధ్య పరీక్ష

విద్యుద్బంధనము యొక్క నిరోధము $\left(\frac{50}{\text{పాయింట్ల సంఖ్య}}\right)$ (Megohms) మెగోముల కంటె తక్కువగ ఉండరాదు.

విద్యుద్బంధనము యొక్క అత్యల్ప (Minimum) నిరోధమును "అత్యధిక (Maximum) స్ఖలనపు విద్యుత్తు (Leakage current) విద్యుద్వలయములోని విద్యుత్తులో $\frac{1}{5000}$ కంటె అధికముగ నుండరాదు" అను సూత్రమును బట్టి కూడ కనుగొనవచ్చును.

**ఒక ధ్రువముతో కూడిన స్విచ్చిల వద్దనుండు తంత్రుల కలయికను పరీక్షించుట:-** ప్రతిష్ఠాపనమునకు సాధారణముగా రెండు వాహకము లుండును. ఒక వాహకము భూపీడనమం దుంచబడవలెను. ఇంకొకటి ప్రేషణము (Supply) యొక్క నిర్ణీతమయిన వోల్టేజి (Rated Voltage) వద్ద ఉంచబడవలెను. విద్యుత్ప్రవాహమును ఆపునపుడెల్ల ఎలక్ట్రిక్ ఫాన్ (Electric fan), ఇస్త్రీపెట్టె (Electric iron), మొదలగు విద్యుత్పరికరములను నిర్జీవముగా (అనగా విద్యుత్ జీవతంత్రినుండి విడిపడుట) చేయుట భద్రత కొరకు అవసరము. ఈ పరీక్షను చేయునప్పుడు స్విచ్చి యొక్క ఏదేని ఒక కొనను భూమితో (ఉ॥ నీటి గొట్టముతో) కలుపుచు, ఒక పరీక్షా దీపమునుంచి స్విచ్చిని తెరచినట్లయిన స్విచ్చి వద్ద కలియు తంత్రులు సరియైన విధానమున స్థాపించినచో దీపము వెలుగును, లేనిచో వెలుగదు.

**భూసంబంధి యొక్క అవిచ్ఛిన్నతను (Continuity) పరీక్షించుట:-** తంత్రి చుట్టునున్న లోహపు తొడుగు పైని ఏ చోటికైనను భూమితో సంబంధమును కల్పించు విద్యుత్ద్వారమునకును (earth electrode) మధ్య నున్న విద్యున్నిరోధమును కనుగొనుట కీ పరీక్ష చేయవలెను.

తంత్రుల పైనున్న లోహపు తొడుగును, ఎమ్మీటరు (Ammeter) ను మార్పదగు విద్యున్నిరోధకమును (Adjustable Resistance) సుమారు ఆరు (6) వోల్టుల విద్యుద్ఘటమును శ్రేణీవిధానమున అమర్చుట వలన పీడనము యొక్క పతనమును (Drop in the potential) కన్గొన వచ్చును.

**ప్రధాన స్విచ్చినుండి తంత్రుల కొట్టకొననున్న దీపమునకుగల వోల్టేజి పతనమును కన్గొనుట:-** నియమమును

బట్టి, ప్రేషక విద్యుత్తులో సుమారు మూడు (3) శాతమునకు మించి వోల్టేజి పతనముండరాదు. అనగా 230 వోల్టుల ప్రేషక విద్యుత్తునకు దాదాపు 8 వోల్టులకన్న అధికముగ వోల్టేజి పతన ముండరాదు. ఈ పరీక్షను చేయుటకు ప్రేషకమువద్ద వోలు మీటరుతో వోల్టేజి కనుగొనవలెను. తరువాత ప్రధాన స్విచ్చినుండి అతి దూరముననున్న దీపము వద్ద వోల్టేజి కన్గొనవలెను. ఈ రెండు విలువల తేడా పై చెప్పబడిన నియమమును మించి యుండరాదు. ఈ పరీక్షను చేయునపుడు అన్ని దీపములు, తదితర విద్యుత్పరికరములు పనిచేయు చుండవలెను ('On')

ఒక్కొక్కప్పుడు పై చెప్పబడిన నియమములను శాస్త్ర ప్రకారము పాటించుట కవకాశముండదు. వ్యక్తుల యిండ్లలోను,దుకాణములలోను మనము ప్రతిష్ఠాపనమును చేయుటకగు ఖర్చును తగ్గించుట కొఱకు కొంత వస్తుగుణ ప్రమాణమును (Quality) త్యాగము చేయవలసి యుండును.

ప్రతిష్ఠాపనమును ఏర్పాటు చేయుటకు ముందు ఈ దిగువ అంశములను మొదట నిర్ధారణ చేయవలెను.

1. వినియోగింపబడు వస్తువుల (Material) రకమును, నాణ్యమును (Quality).
2. తంత్రుల ప్రతిష్ఠాపనా విధానము.
3. ప్రతిష్ఠాపన పని సాగుచుండగా, నియమముల నుద్దేశించుట.
4. వివిధ అంగముల యొక్క (మీటరు, ప్రధానమగు స్విచ్చి మొదలగు వాటి) స్థాననిర్దేశము, వివిధ అంగములను, పాయింట్లను చూపుపటము (Plan), కావలసిన పరికరముల, వస్తువుల జాబితా.
5. అవసరమైన విద్యుద్వలయములు సంఖ్య. అయిదు (5) ఏంపియర్లకు మించని శక్తితోగూడిన ఒక ఉపవిద్యుద్వలయము 40 వాట్లు, 220 వోల్టులు, ప్రమాణము గల 20 పాయింట్లకు సరఫరా చేయగలదు.
6. భూసంబంధమును కలుగజేయుట.
7. ప్రతిష్ఠాపనములను పరీక్షించుట. ఎంత జాగరూకతతో ప్రతిష్ఠాపనమును ఏర్పరచినను కొన్ని ప్రమాదములకు దారి దీయగల పొరపాట్లు సంభవించు చుండును. ప్రతిష్ఠాపనములో విద్యుత్తు ప్రవహింపజేయుటకు ముందు (Switch on) విరిగిన తంత్రులు, తప్పుడు కలయికలును లేకుండ సరిచూచినచో, ఇట్లు ప్రమాదముల బారినుండి రక్షణలు పొందవచ్చును.

అ. హు.

**అంతర్గుహాకములు:-** (Celenterata) అంతర్గుహాకములు, సీలెంటరేటా (Celenterata) లేక 'కొనిడేరియా' అనునవి నిర్దిష్టమగు (సీలెంటరేటా) కణజాలమును కలిగిన హీనాతిహీనమగు ఒక తరగతి జంతువులు. (ఇది గ్రీకుభాషనుండి వచ్చినది. (Koilos = Hollow) గుల్లగానుండు (Enteron = Intestine) ప్రేగు, ఆంత్రము.) ఈ వర్గమునందలి అతి సామాన్యమగు రూపములు అతి సామాన్యమైనస్పాంజీలకన్న ఎక్కువ తరగతిలో నుండవు. అయినప్పటికిని ఈ తరగతికి చెందిన జాతులు ఎక్కువ అభివృద్ధిలో నున్నవి. ఈ జాతియందలి పెక్కుజీవులు సుస్పష్టమైన ధాతుమండలము (Tissue) యొక్కయు, అంగముల యొక్కయు, ప్రారంభదశను వ్యక్తము చేయును. అంతర్గుహాకజాతిలో అనేక రకముల అంగవర్తులత్వ సౌష్ఠవము (Radial symmetry) కన్పించును. మరి కొన్ని పార్శ్వ (Lateral part) సౌష్ఠవోపేతములై యుండును. పెక్కు అంతర్గుహాకములు ఉత్పత్తికి తోడ్పడునవి; అట్లేర్పడిన చిన్నచిన్న గుంపులు అన్యోన్య సహకారమునకును, శ్రమవిభాగమునకును చక్కని ఉదాహరణములు.

అంతర్గుహాకములందు పరిచిత్రములు, సుందరములును అయిన రూపములు అధిక సంఖ్యాకముగా నున్నవి. సముద్రపు పోటు పాటు గల ప్రదేశములలోను, వాటికి దూరముగా ఉండు ప్రదేశములలోను ముత్యపుచిప్పలను, రాళ్ళను జాలరు కట్టునట్లుగా కటు 'జూఫైట్సు' అనబడు అందమైన కణజీవులును; గుంటలలో తేలుచు, పారదర్శకములైన (Transparent) చిరుగంటల వంటి జీవులును; రాళ్ళసందులలో గుంపులు కటు 'సముద్రపు అనిమోన్సు' అనబడు గాలిపువ్వులును; అలలపై అతిచురుకుగా ఈదగల జెల్లిచేపలును; అంతర్గుహాక జాతికి చెందిన అలస స్వభావము కల పోలిపాయిడ్ (పుర్వగకములు) లకును, చురుకైన స్వభావముగల మెడుసాయిడ్ (ఛత్రికలు) లకును కొన్ని నిదర్శనములు. టినోఫోరా ప్రత్యేక జాతికి చెందినటువంటి

'గ్లోబ్సు' అను జీవులు మృదువులును, చిత్రవర్ణములు కలవియు అయి, మిక్కిలి చురుకుగా ఉండును.

అంతర్గుహాకములలో హైడ్రావంటి మూడు నాలుగు రకములే మంచినీటిలో నుండునవి; మిగిలినవన్నియు సముద్రవాసులు. లోతులేని వెచ్చని సముద్రములలో అంతర్గుహాకములు అన్నివిధములయిన సుందరాకారము లను సాధారణముగా ప్రదర్శించవు. ఎత్తుగా పెరిగిన పుర్వగకముల ('పాలిప్సు' **Polypes**) గుంపులు, గట్లవలె దట్టముగా పెరిగిన పగడపు గుట్టలు సముద్రపు టడుగు భాగమున నుండును. వీటి ప్రభావము వెన్నెముక లేని ఇతర జంతువులపైనను, చేపలపైనను కూడ ఉండును.

**సామాన్య లక్షణములు:-** చాలవరకు అంతర్గుహాకములు ఎల్లప్పుడును, అంగవర్తులపు సౌష్ఠవముగల జంతువులు. జీర్ణకోశ కుహరము, దాని శాఖలు తప్ప వేరొక శరీర కుహరము వాటికి లేదు. సామాన్యమైన రూపములలో ఈ కుహరము యొక్క ప్రధానద్వారము ఎదిగిన జీవు లలో నోరుగామారును. కొన్ని ప్రత్యేక రూపములలో శరీరవు పైభాగమునకు చెందినదియో లేక ముఖసంబంధ మయినదియో అగు కోశము ఉండును. ఇదియే గొంతు గొట్టముగా ఏర్పడును.

శరీర కుడ్యవు అంతశ్చర్మమునకును బహిశ్చర్మమునకు నడుమ వాటిని బలపరచుచు, జేగుడువంటి పొరయొకటి ఉండును. 'టినోఫోరా' జాతిలో జీవి పెరుగుదలయొక్క ప్రాథమిక దశయందే స్పష్టమగు మధ్యచర్మ మేర్ప డును. ఈ జీవులలో అధిక భాగమునందు గుచ్చుకొనునట్టి కణము లున్నను, టినోఫోరాలో వాటి స్థానమున అతుకుకొనునట్టి కణము లుండును. అంతర్గుహాకములలో 'పుర్వగక,' 'ఛత్రిక' అను నిర్మాణాత్మకములగు రెండు వర్గములు కలవు. ఒకే ప్రాణియొక్క జీవ చరిత్రయం దీ రెండు వర్గ లక్షణములును ఒక్కొక్కప్పుడు కన్పిం చును. ప్రాణులలో ఒక తరము విడిచి, మరొక తరము నందు కొన్ని లక్షణములు కన్పటు దృశ్యమున కిది నిదర్శ నము. ఒక్కొక్క తరమునందు లింగ సహితోత్పత్తి, మరొక తరమున లింగరహితోత్పత్తి కలుగు దృశ్యము నకు కూడ ఇది నిదర్శనము. పుర్వగకములచే ఏర్పడు ఖటిక పంజరము పగడముల ఉత్పత్తికి దారి తీయును. 'మొగ్గల' మూలమున సంఖ్యాభివృద్ధి సామాన్యముగా అవి గుంపులుగా ఏర్పడి, వాటియందు శ్రమ విభాగము చేసికొనుట చూపట్టు చుండును.

**జీవిత చరిత్ర :-** అంతర్గుహాకములలో వ్యతిరేకము లైన రెండు జీవితవిధానము లుండుటచే అవి దృష్టి నాకర్షించునవి. పుర్వగకము, ఛత్రిక అనునవి ఆ రెండు విధములకు సంబంధించినవి. పుర్వగకము కదలక స్థిర ముగా నుండును. ఛత్రిక శారీరకమగు పెరుగుదలను విస్తారమగు కార్యక్రమమును, నిర్మాణమును, గనబర చుచు ఒక ప్రదేశమునుండి వేరొక ప్రదేశమునకు పోవుట యందు మిక్కిలి చురుకుగా నుండును. పెక్కు అంతర్గుహా కములలో 'పుర్వగకజాతి' మాత్రమే కనిపించును. తక్కిన వాటిలో రెండు రకములు ఒకే జీవియందు గాని, ఆ జీవులతో నేర్పడిన సమూహమునందుగాని కనబడును.

ఛత్రిక స్వేచ్ఛగా జీవించుచు, వెడల్పు గల శరీర మును కలిగియుండును. ప్రధానమగు జఠర కుహరము ఏర్పడి, ఆ జఠర కుహరమునుండి వ్యాపించు నాళికా మండలము దగ్గర అంతశ్చర్మ వలయము ఏర్పడును.

పుర్వగకముయొక్క ఆదిమమైన మీసములను వహించు ఈ అంచు నోటినుండి వేరుచేయబడి ఘంటా కారముగా క్రిందిపైపునకు వంగియుండును. తరచుగా మూతిపై మీసములయొక్క రెండవజత (**Manubrium**) అథోభాగముపై పెరుగును. పుర్వగకమునందున్న అంగ వర్తుల సౌష్ఠవము ఛత్రికలో వ్యాసార్థగామిగా అభివృద్ధి చెందిన నాళికామండలముద్వారా మరింత అధికముగా స్ఫుటము చేయబడుచున్నది.

అంతర్గుహాకములలో కనుపించు ఉత్పాదక జీవ కణ ములు జంతుకోటియందు అంతటను సామాన్యముగా అగపడును. అండములు, శుక్రాణువులు వేరు వేరు జీవు లచేగాని లేక సమూహములచేగాని వహింపబడును. ఫలదీ కరణము నొందిన అండము సమానముగా విభజనము నొంది మొదటి పొర అయిన బహిశ్చర్మము ఒక ఏక బత్తిక (**Blastulla**) అను ఒక మధ్య కుహరమును చుట్టు కొని ఉండును. ఈ కుహరము . అంతశ్చర్మకణసంహతిచే నిండియుండును. బహిశ్చర్మమునకు నూగు ఏర్పడును. ఇట్టి డింభమును ''చికిటకము'' (**Planula**) అందురు. అది


పటము-1. హైడ్రా


పటము-4. సీ అనిమూన్
( Sea Anemoon )


పటము-2. ఫైజేలియా


పటము-5. సెస్టను
( Cestus )


పటము-3. మాడ్రిపొరా
(Stone Coral)


పటము-6. మస్తిష్క-ప్రవాళము.
( Brain's Coral )

ప్రవాహముతో కదలుచుండును. "అప్లైటిస్" (Aplitis) అను బహిశ్చర్మమును, జీర్ణాశయబిలమును తరువాత కనుపించును. ఆ డింభము నీటి అడుగుభాగమునకు మునిగి ఒక కొనతో అంటుకొనియుండును. ఇంకొక చివర నోరు, మీసములు ఏర్పడి ఆ జీవి "పుర్వగకము"గా మారును. పై రీతిగా గాక అండము నేరుగా మెడూసాగా పెరుగగల జీవులును కొన్ని గలవు.

ఉదా:– జలియకము (Hydra); ఒబీలియా (Obelia); మోనోసొసిస్ట్ (Monosocyst).

**పునరుత్పత్తి:–** వీటిలో పునరుత్పత్తి రెండు రకములుగా జరుగును. ఒక జీవియొక్క దేహకుడ్యముపై తొలుత పార్శ్వములయందు మొటిమలవంటి 'మొగ్గలు' బయలుదేరును. ఈ మొటిమలవంటి మొగ్గ తనకు కారణభూతమైన తల్లి జీవివంటి రూపమును పొందువరకు పెరుగుదల నొందును. దానిచుట్టును మూలమందు ఒక విధమగు నొక్కు ఏర్పడిన తర్వాత ఈ క్రొత్తజీవి, స్వతంత్రముగా జీవించుటకు తల్లినుండి వేరుపడుటగాని, లేక ఆ జీవ సమూహ నిర్మాణమున రెండవజీవిగా కలిసి వుండుట గాని జరుగును. ఇదేవిధముగా ఆ సంఘమునందలి మిగిలిన జీవులు ఉత్పత్తి అగుచుండును. చాలరకముల అంతర్గుహాకములలో లైంగిక పునరుత్పత్తి మరియొక విధానము. ఈ విధానమున స్త్రీబీజములు (Ovum), శుక్ల బీజములు ఉత్పత్తియగును. శుక్లకణ మొకటి స్త్రీ బీజముతో కలియుటవలన పిండము తయారగును. ఈ పిండము మొదట క్రిమిగా ఏర్పడి తరువాత క్రొత్త జీవిగా రూపొందును. కొన్ని రకములలో కణవిభజనము లేక నిలువున విభజనము నొందుట సంభవించును. కొన్ని రూపములలో పునరుత్పత్తి (ఖండిలనము) (Strobilation) అడ్డముగ విభజనము నొందుటచే జరుగును.

**వికల్ప ఉత్పత్తి విధానము (Alternation of Generation):–** అంతర్గుహాకములలో వికల్ప ఉత్పత్తివిధానము ఒక విశేషలక్షణము. మొగ్గల రూపమున పునరుత్పత్తి జరుగు లింగరహితదశయును, ఫలదీకరణమును చెందిన అండముద్వారా పునరుత్పత్తి జరుగు లింగసహిత దశయును, ఒకటి విడిచి ఇంకొకటి సంభవించుచుండును. లింగరహితదశ హైడ్రా (మంచినీటి పుర్వగకముల)వలెను, లింగసహితదశ మెడూసా (ఛత్రిక)వలెను ఉండుటచే ఈ మార్పు ఇంకను క్లిష్టముగా నుండును. ఈ జీవులలో ఒకదానినుండి మరియొకదానికి ఒక చక్కని క్రమము కనిపెట్టబడినది. మొదట హైడ్రా అను ప్రాణియు, దాని నుండి సెర్టులేరియా వంటి రూపముల ద్వారా 'ఒబీలియా' ప్రాణులకును, ఎరియోప్ వంటి ప్రాణులకును, జెరియోనియా రూపములకును ఈ క్రమము వ్యాపించుచున్నది. హైడ్రా (జలియకము) ప్రాణియందు 'ఛత్రిక' కానబడదు. సెర్టులేరియాయందు ఛత్రికరూపము తక్కువగను, అప్రధానముగను కనబడును. ఒబీలియాలో జలియకము, ఛత్రిక సమప్రాధాన్యములో నుండును. ఎరియోప్‌నందు జలియకరూపము తగ్గుదలనొంది ఉండును. జెరియోనియాలో జలియకరూపము మృగ్యమై యుండును.

**బహురూపత (Polymorphism):–** బహురూపతతో కూడిన సమూహరూపముల అభివృద్ధి అంతర్గుహాక జాతి యొక్క చక్కని లక్షణము. కొన్నిటిలో సమూహము ఒకేపోలికగల జలియక రూపములను కలిగియుండును. ఛత్రికలు ఫలదీకరణమునొందిన అండములను తయారు చేయును. ఈ అండములనుండి తగిన పరిసరములో ఒక్కొక్కటి ఒక క్రొత్త సమూహరూపముగా రూపొందగల క్రిములు ఏర్పడును. కొన్ని సమూహరూపములలో ఆహారమును పట్టుకొనుటకు కొన్నియు, ఆహారమును జీర్ణించుకొనుటకు కొన్నియు వ్యక్తులు ఏర్పడియుండును. అత్యుత్తమమగు బహురూపత గొట్టములవలె నుండు జెల్లి చేపలలో (సైఫనోఫోరో) ఏర్పడును. ఒక సమూహమున కొన్ని వ్యక్తులు చలనమునకును, కొన్ని నీటిలో తేలియుండుటకును, కొన్ని ఆహారమును జీర్ణించుకొనుటకును, కొన్ని బలముగా గ్రుచ్చుకొను పొడుగైన దారములతో కూడిన మీసములవంటి అవయవములుగా ఏర్పడుటకును ప్రత్యేకింపబడి యుండును. ఇవి ఆ సమూహమును రక్షించుటకును, శత్రువును బలహీన పరచుటకును ఉపయోగింపబడుచుండును. కొన్ని పొలుసులవంటి రక్షణాంగములను గలిగి సమూహమందున్న కడుసున్నితమగు జీవులను కప్పియుండును. కొన్ని ప్రాణులు సమూహముయొక్క పునరుత్పత్తి కొరకు లింగసంబంధమగు కణములను మాత్రమే ఉత్పత్తిచేయును.

పునఃసృష్టి (Regeneration):- అంతర్గుహాకములలో పునరుత్పత్తిచేయు శక్తి గమనించ దగినది. లోపించిన భాగములను తిరిగి సృష్టించుకొనుటలోను, ఆ జీవి యొక్క ఒకానొక శరీరభాగము సంపూర్ణమైన జీవిగా పెరుగుట యును గూడ, వానికిగల పునరుత్పాదక శక్తిచే జరుగు చుండును. ఉదా॥ జలీయకము యొక్క మీసములలో నొకటి తెగిపోయినచో, దానిస్థానమున క్రొత్త మీస మొకటి బయలుదేరును. లేక జలీయకము కొన్ని ముక్కలుగా తెగిపోయినచో ప్రతిముక్కయును సంపూర్ణమైన క్రొత్తజీవిగా వృద్ధిచెందును.

పగడము:- సమూహములుగా జీవించు అంతర్గుహాకములయొక్క ఖటిక (కాల్షియ) పంజరమే పగడము. పగడములు ఒకప్పుడు మొక్కలవలె శాఖోపశాఖలుగను, మరియొకప్పుడు పక్షిఈకవలెను, ఇంకొకప్పుడు మెదడువలె గట్టి ఉపరితలములు గలిగిన అర్ధగోళము లేక పూర్ణగోళము వలెను, వివిధరూపములతో నుండును. పగడములు అందమైన రంగులతోనుండును. ప్రత్యేకముగా విలువగల పగడములు అనబడునవి సామాన్యముగా కొంత ఎరుపురంగును కలిగియుండును. అవి ఆభరణములలో ఎక్కువగా ఉపయోగింపబడుచున్నవి. ఎక్కువవిలువైన పగడపు రాళ్ళు, మధ్యధరా సముద్రము నుండి లభించుచున్నవి.

పగడములు, మహాసముద్రములలో వెచ్చని భాగములయందు పగడపు దీవులుగా నేర్పడును. ఉదా॥ బహమియాదీవులు, ఫిజీదీవులు, బెర్ముడా, ఆస్ట్రేలియా, క్యూబా, హవాయి, ఫ్లోరిడా, యుకటాను మొదలగునవి ఇట్టివి. నీటిముంపులో నుండు గట్టులపై పగడపుదీవులు నిర్మిత మగును. అవి భూమిదగ్గర సన్నని రాతి గట్టువలె ఏర్పడును. పగడపు గట్టులు చేపలు, ఎండ్రకాయలు మొదలగు సముద్రపు జీవులు దాగి యుండుటకు అనుకూలముగా నుండును.

కంకతినములు (టెనోఫోరా) :- టెనోఫోరాను, అప్పుడప్పుడు అంతర్గుహాకములలో ఒక తరగతిగా పరిగణింతురు. కాని కొన్ని ప్రధానమగు వ్యత్యాసములను చూపుచుండుట వలన ఇది మరియొక ప్రసృష్టిగా వ్యవహరింప బడుచున్నది. కంకతినములకు (టెనోఫోరా) శరీరముపై దువ్వెనలవంటి పలకలను కలిగియుండుట వలన దువ్వెన ఛత్రికలు అనియు (Jelleys), నిడివివైపున కట్లు కట్లుగా నుండుటవలన సముద్ర అక్షోటములు (Sea-walnuts) అనియు అందురు. ఛత్రికలు సున్నితమైన శరీరము కలిగి పారదర్శకములై యుండును. వాటి శరీరములు కొన్నిటిలో స్తంభాకారముగాను, కొన్నిటిలో గోళాకారముగాను, కొన్నిటిలో రిబ్బనువలె చదునుగాను ఉండును. వీటిలో కొన్ని రకములు అధిక సంఖ్యలలో మహాసముద్రములయందు నివసించుచు, తరుచుగా అందమైన వర్ణములను కలిగియుండును. వీటి శరీరమున ఒక చివర నోటిని, రెండవ చివర జ్ఞానప్రదమైన స్థితికోష్ఠము (Statocyst) అను దానిని కలిగియుండు రెండు కొన లగపడును. కొన్ని కంకతినములు లోనికి ముడుచుకొనిపోవు రెండు మీసములను కలిగియుండును. ఈ మీసములు 'లాసో' కణములతో కప్పబడి యుండును. లాసోకణము లందలి దారమువంటి పదార్థము ఆహార కీటకములను పట్టుకొని బంధించుటకు ఉపయోగపడును. వీటి శరీరముపై నూగుతో ఏర్పడిన ఎనిమిది కట్లు తలనుండి తోక వరకును (Meridional) వ్యాపించియుండును. అవి చలనమునకు ఉపయోగించును. కంకతినములకు సంబంధించిన కొన్ని సామాన్య ఉదాహరణములు:— "సముద్రపు గోళీ" అనబడు పూరోబ్రేకియా:- దీని శరీరము సున్నితమై, పారదర్శకమై యుండును. దేహవర్ణము గులాబిరంగు. దీనికి నూగు కలిగిన పొడవైన రెండు మీసము లుండును ఇది గోళీకాయ పరిమాణములో నుండును. ఇవి న్యూ ఇంగ్లాండు సముద్ర తీరము పొడుగునను విస్తారముగా నుండును.

సముద్ర అక్షోటములు (Sea-walnuts):- అనబడు బొలినాప్సిస్, నెమియాప్సిస్:- వీటికి మీసము లుండవు. ఇవి స్తంభాకారముగాగాని, శంఖాకారముగాగాని ఉండును. ఇవి పారదర్శకమైన శరీరముగల జీవులు. అవి అధికసంఖ్యలలో గుంపులు గుంపులుగా నుండును. వానిలో కొన్ని రకములు రాత్రులయందు భాస్వరపు కాంతులను ప్రసరించుచు వింతగా ప్రవర్తించుచుండును. 'సెస్టస్ వెనెరిస్' (Cestus veneris) అను జీవులు ఒకటి రెండు అంగుళముల వెడల్పుతో పొడుగైన చదునైన

చేపువలెనుండు జీవులు. శరీరము ప్రకాశవంతమగు వర్ణములతో పారదర్శకముగా నుండును.

**ఆహారము:-** జెల్లి చేపలును, సముద్రపు 'ఆనిమోన్సు' అనబడు గాలిపువ్వులవంటి పెద్ద జీవులును పెద్ద పరిమాణముగల ఎరను మ్రింగివేయగల శక్తిని కలిగియున్నవి. చురుకుగా నుండు టెనిఫోరాలు ఒకదానితో మరియొకటిగాని, చిన్న జంతువులకు గాని కణ సహాయముచే అతుకుకొనియుండి మాంసాహారులుగా నుండును. అంతర్గుహాకములలో ఎక్కువ రకములు అతి సూక్ష్మజీవులను ఆహారముగా చేసికొనును. అవి వాని ఎరను పట్టుకొనుటకును, చంపుటకును 'దంశఘటములు' **(Cnidobcosts)** అను (కుట్టుటచే నొప్పి కలుగజేయు) కణములను, మీసములను ఉపయోగించుకొనును. సూచ్యంగములు **(Endoblasts)** అనబడు గ్రుచ్చుకొను కణములను కలిగియుండుట అంతర్గుహాకజాతియొక్క సహజలక్షణము. కంకతినముల (టినోఫోరా) తరగతియందు తప్ప మిగిలిన అన్నిజాతులకును సూచ్యంగములు కలవు. ప్రతి దంశఘటమునకును సూచ్యంగము అనబడు నొక గుల్ల యుండును. ఆ గుల్లలో విషసంబంధమగు జిగురు పదార్థముండును. ఆ పదార్థమున సున్నితమై బోలుగా నుండు సూత్రమొక్కటి చుట్టలుగా నుండును ఈ సూచ్యంగము కణమునందలి ఎక్కువభాగమును ఆక్రమించును. ఈ కణముయొక్క చివర **(Cnidocil)** అను మీటగాని, ముతకగానుండు వెంట్రుకల కుచ్చుగాని యుండును. దంశఘటము ముడుచుకొనుట వలన కలిగిన ఒత్తిడిచే సూచ్యంగము బ్రద్దలగును. దారము రాసాయనికముగను, యంత్రమువలెను పనిచేయును. ఈ కటారులు ఆహార కీటకము యొక్క శరీరమునందు నాటబడి, అప్పుడు వెడలు స్రావము గాయమును విషపూరితముగా చేయును. ఈ విధముగా చిన్నచిన్న జంతువులు కదల కుండ చేయబడి చంపబడును. అప్పుడప్పుడు ఆ స్రావము కరిగించు ద్రావకము **(Solvent)** గా కూడా పనిచేయును. ఏది ఎట్లున్నను, 'సూచ్యంగములను' (నిమాటోసిస్టులు **Nematocysts**) ఆయుధములనుటకన్న పట్టుకొనుటకు తగిన పాశములు వల వలె వ్యాపించి యుండు నాడీమండలము శరీరమందంతటను సరిసమానముగా వ్యాపించి యుండును అనుట ఎక్కువ తగియుండును.

**నాడీమండలము:-** అంతర్గుహాకముల నాడీమండలము అతిప్రాచీన దశకు చెందినది. కేంద్ర నాడీమండలము వానికి లేదు. మేధస్సుకూడా లేదు. ఎట్లైనను త్వరితముగ ప్రేరణములను నిర్ణీతమైన దిక్కునకు తీసికొనిపోవు నాడీమార్గము వీనిలో కలదు. అది ఉన్నత జీవులందు స్థానికముగాను, స్థిరముగను ఉండు నాడీ పద్ధతిని సూచించును.

**పారస్థిక విషయములు:-** ఇంచుమించు అంతర్గుహాకములన్నియు సముద్రజీవులు. సామాన్యముగు జలీయకము (హైడ్రా) మీసములేని సూక్ష్మాతిసూక్ష్మమైన జలీయకము (మైక్రోహైడ్రా) ప్రారంభదశయందు మత్స్య-అండములపై పరాన్నభుక్కుగా నుండిన 'పాలిపోడియం', **(Poly Podium)** సంయోగ జీవులుగా నుండు 'కార్డిలోఫోరా' **(Cardylophora)** మంచినీటి యందుండు ఛత్రికలు మొదలగునవి, మంచినీటి అంతర్గుహాకములకు ఉదాహరణములు. వీటిలో మిక్కిలి చురుకుగా ఈదు పెక్కుజీవులు లోతులేని నీటిలో నుండును. కొన్ని లోతైన నీటిలోకూడ కనబడును. చాలరకముల పుర్వగకములు ఇతరజంతువుల శరీరపుచిప్పలను ఆధారముచేసికొని పెరుగుచుండును. అప్పుడప్పుడు అవి ఆ చిప్పలనుపూర్తిగా కప్పివేయుచుండును. 'మునీశ్వరపీత'కును, సముద్ర 'కుసుమాభముల'కును ఎడతెగని భాగస్వామ్యము అంతర్గుహాకములయందు విచిత్రమైనదృశ్యము. మునీశ్వరపీతసముద్రకుసుమాభముచే కప్పబడి, దానిగ్రుచ్చుశక్తిచే రక్షింపబడు చుండును. సముద్ర కుసుమాభమును మునీశ్వరపీత మోసికొని తిరుగుచుండును. ఇట్టి పరస్పర లాభకరమగు బాహ్యభాగస్వామ్యమునే 'సహభోజనము' **(Commensalism)** అందురు. 'సహజీవనము' **(Synb:osis)** అను శారీరక భాగస్వామ్యము చాలరకములగు 'కుసుమాభము'లయందును, 'అల్సియొనేరియన్సు' **(Alcyonarians)** యందును కలదు. అతిసూక్ష్మమైన ఏకకణశైవలములు ఈ జంతువుల యొక్క శరీరకణములలో నివసించును. అంతర్గుహాకముల ప్రసృష్టిలో దాదాపు 9,000 జాతులు గలవు. వాటిని మూడు తరగతులుగా విభజించిరి.

**1. జలీయకవర్గము ( హైడ్రోజోవా Hydrozoa) :-** మంచినీటియందుండు పుర్వగకములు చాలా చిన్నవిగా

సుంకు జెల్లి చేపలు, రాతివంటి కొన్ని పగడములు ఈ తరగతిలో చేరును. వీటికి అన్నకోశము ప్రత్యేకముగ లేదు. జీర్ణాశయబిలమునందు విభాగములును, సూచ్యంగములును లేవు. మెడూసా సామాన్యముగా సన్నని పొరతో చిన్నదిగా నుండును. ఇవి ముఖ్యముగా లోతు లేని ఉప్పునీటిలో గుంపులుగాగాని, లేక ఒంటరిగాగాని, ఓదించును.

2. ఛత్రికవర్గము ( స్కైఫోజోవా Scyphozoa ) :- పెద్ద జెల్లి చేపలు ముఖ్యముగా చతుర్భాగ అంగవస్తు లత్వ సౌష్ఠవము గలిగి, ఘంటాకారముగనో, ఛత్రాకారముగనో ఉండి స్వేచ్ఛగా ఈదగల ఛత్రికలు ఈ జాతిలో చేరును. వీటిలో ప్రత్యేకమగు అన్నకోశము లేదు. జఠరసంబంధమగు మీసము లుండును. లింగసంబంధమగు పుర్వగకములు ఉత్పత్తిచేయు ఛత్రికలు అన్ని సముద్ర జీవరూపములను ఉత్పత్తిచేయుచున్నవి.

3. పుష్పజీవములు (ఆంథోజోవా Antho Zoa):- ఈ తరగతిలో పగడములు, కుసుమాభములు మొదలగునవి గలవు. అన్నియు పుర్వగకములు మాత్రమే. ఛత్రికలు ఉండవు. ఏదైన ఆధారమును అంటిపెట్టుకొని యుండును. గుల్లగానుండు మీసములతో మౌఖికవలయము చదునుగా నుండును. జీర్ణాశయబిలము అరలుగా నుండును. సూచ్యంగములు ఉండును. ఈ జీవులు ఒంటరిగను, సమూహములుగను ఉండును. ఇవి అన్నియు సముద్ర జీవులు.

డా. డి. బా. రె.

**అంతర్జలము:-** భూమిమీద పడెడు వర్షపునీరు కొంతభాగము ఆవిరిగా మారుట, కొంతభాగము సెలయేరులద్వార సముద్రములకు ప్రవహించుట, మరి కొంతభాగము భూమిలోనికి ఇంకుట అందరికి తెలిసిన విషయమే. ఇట్లు భూమిలోనికి ఇంకుచున్న నీరు, ఇంక ఇతర కారణములవలన కూడ భూమి ఉపరిభాగమున కొంతవరకు వ్యాపించియుండిననీరు అంతర్జల మన డును. నూతులు, నీటిబుగ్గలు (Springs) మొదలయినవి, ఈ అంతర్జలపు ఉనికిని కొంతవరకు తెలియచేయును. అనాదినుండియు నీరు రాళ్ళలోనికి పీల్చబడుచు, వాటిలోనుండు పగుళ్ళను (Cracks), బీటికలను(Fissures) ఇంక ననేక ఖాళీప్రదేశములను నింపుచున్నది. ఇందులో కొంతభాగము నీటిబుగ్గలుగాను, మరికొంత భాగము రాళ్ళలో నుండెడు సూక్ష్మరంధ్రముల ద్వారాను (Pores) అనేక వృక్షముల ద్వారాను, తిరిగి భూమి ఉపరిభాగమును చేరుచుండును. వర్షము, మంచు, చెరువులు, నదులు, మొదలయినవాటినుండి ఇంకుటవలన ఏర్పడిన అంతర్జలమును వర్షపాతజలము (Meteoric) అనియు, నీటిలో నేర్పడిన ఒండ్రుమట్టి పొరల ( Sediments ) మధ్య ఉండిపోయిన నీటిని కాన్నేటు జలము (Connate Water) అనియు అందురు.

భూమి ఉపరిభాగమునుండి లోతుగ పోయినపుడు కొంత దిగువున మన్ను రాళ్ళు మొదలయినవన్నియు తడిగానుండి సంపృక్తత (Saturation) చెంది ఉండును. ఈ మండలమును సంపృక్త మండలము (Zone of saturation) అందురు. దీని ఉపరిభాగము సంపృక్త జలమట్టము (Water table) అని పిలువబడును. ఇది తేమగా ఉండెడు ప్రదేశములలో తక్కువ లోతులోను, ఎడారివంటి ప్రదేశములలో వందలకొలది అడుగులు లోతుగాను ఉండును. ఈ మట్టము వర్షకాలములో పైకివచ్చుచు, ఇతరకాలములో క్రిందికి దిగుచుండును. ఈ సంపృక్త జలమట్టము వివిధ ప్రదేశములలో మారుచు నుండును. ఇది ఆయా ప్రదేశములలో లభ్యమగు అంతర్జల పరిమాణముపై నాధారపడి యుండును. ఈ పరిమాణము, తిరిగి శీతోష్ణస్థితి, శిలల స్వభావములు (Character of rocks) వీనిపై ఆధారపడి యుండును. శీతోష్ణస్థితి, ఆవిరియగుట (Evaporation), వర్షపాతము అను రెండు క్రియలద్వారా భూమిమీద జల పరిమాణమును అదుపులో నుంచును. సచ్ఛిద్రత (Porosity), భేద్యత (Permeability) అను శిలాస్వభావములు, రాళ్ళు పీల్చుకొను నీటి పరిమాణమును అదుపులో నుంచును.

అంతర్జలము ఉపరిభాగమునకు ఊటలుగా (Seepages) గాని లేక నీటిబుగ్గలు (Springs) గా గాని వచ్చును. నీటిబుగ్గలు సాధారణముగా సంపృక్తజలమట్టము భూమి ఉపరిభాగమును తాకి అతిక్రమించునపుడును; భేద్యమైన శిలలు (Permeable rocks) అభేద్యమైన శిలలను (Impermeable rocks) తాకు చోటను సంభవించ గలవు.

అంతర్జలచలనము (Ground water movement) ఆయా చోటులనుండు రాళ్ళయొక్క లక్షణములపై ఆధారపడి యుండును. బాగా తెరవుకలిగిన బీటికలు (Fissures) అతిఛిద్రత కలిగిన రాతిపొరలవలెనే పనిచేయును. ఈ నీటి ప్రవాహము తిరిగి వివిధములైన రాతిపొరల భేద్యత లోని వ్యత్యాసములపై కూడను ఆధారపడిఉండును.

సాధారణపు బుగ్గలుగాక, కొన్ని చోట్లలో వేడి నీటి బుగ్గలుకూడ ఉండును. ఇవి చాల ఉష్ణోగ్రత కలిగి ఉండును. ఈ ఉష్ణోగ్రత వివిధప్రదేశములలో వేరువేరుగ నుండును. దీనికి రెండు ముఖ్యకారణము లున్నవని చెప్ప వచ్చును. అందులో మొదటిది నీరు అగ్నిపర్వతములున్న ప్రదేశములగుండ ప్రవహించుటవలన వేడెక్కుట; రెండ వది— నీరు చాల లోతైన ప్రదేశములగుండ ప్రవహించు నపుడు, అక్కడ నుండెడు అధిక ఉష్ణోగ్రత (Thermal gradient) వలన వేడెక్కుట, రసాయనక్రియ (Chemical action), సంఘర్షణ (Friction) కూడ ఉష్ణమునకు ఆధారములు. అమెరికాలోని ఎల్లో స్టోనుపార్కు, న్యూజిలాండు, ఐస్‌లాండులలోని కొన్ని ప్రదేశములలో అంతర్జలము వేడినీటి ధారలుగాను లేక ఉష్ణోదక స్రోత స్సులు (Geysers) గాను ఇవి బహిర్గతమగుచున్నవి. ఇవి చాలభాగము అగ్నిపర్వత ప్రదేశములలోనే కన్పడు చున్నవి. ఈ బుగ్గలు ఏర్పడుటకు అంతర్భాగములో అత్య ధిక ఉష్ణోగ్రత, చాల పొడవైన బీటికలు భూమిలోనికి వ్యాపించియుండుట చాల ముఖ్యమగు పరిస్థితులు. ఈ నీటిబుగ్గలు ఎల్లప్పుడును బహిర్గతమగుచునే యుండక మధ్యమధ్య విరామము చెందుచుండుట కద్దు. ఎల్లోస్టోన్ పార్కులోనున్న "ఓల్డుఫెయిత్‌ఫుల్" అను వేడి నీటి బుగ్గ చాల ఆశ్చర్యకరమైనది. ఇది చాల సంవత్సరములనుండి సమాన విరామ కాలములతో వేడినీటిని బహిర్గతము చేయుచున్నది. ప్రతి 70 నిమిషములకు వేలకు వేల గాలనుల నీరు అతి తీవ్రమైన శక్తితో 2,300 అడుగులు ఎత్తువరకు పోవుచుండును.

వేడి నీటిబుగ్గలే కాక, ఖనిజ పూరితమగు నీటి బుగ్గలు (Mineral springs) కూడ ఉన్నవి. వాటినుండి వివిధ పరిమాణములలో ఖనిజములు వెలువడును. వీటిలో కొన్నింటిని ఔషధములకు కూడ ఉపయోగించుదురు.

నీటి బుగ్గల తరువాత చెప్పదగినవి నూతులు. ఇవి మట్టిలోను, ఇసుకలోను, లేక అంతర్జలముతో నిండిన భేద్యమైన రాతి పొరలలోగాని, బీటికలతో నిండిన స్ఫటికమయ శిలలో గాని త్రవ్వుటవలన ఏర్పడును. అంతర్జలము నూతి అడుగు భాగములోనికి రంధ్రముల ద్వార చొచ్చుకొని కొంత మట్టము వరకు వచ్చును. ఈ మట్టము క్రింద ఉండెడు జలపీడనముపై ఆధారపడి యుండును.

మరొకరకము నూతులు ఆర్టీసియన్ నూతులు (Artesian wells). వీటిని పాతాళగంగ అనవచ్చును. వీటి నుండి నీరు ఎడతెరిపిలేని ధారలుగా నేల పైభాగమున కొంత ఎత్తువరకు, చాలపీడనశక్తితో చిమ్ముచుండును. అంతర్జలము అత్యధిక జలపీడనశక్తి కలిగి ఉండుటయే దీనికి కారణము. ఈ విధముగ, అంతర్జలము వివిధ రీతులలో, భూమి ఉపరిభాగము చేరి, మేఘములుగాను, వర్షముగాను, మార్పుచెంది, తిరిగి భూగర్భములోనికి ఇంకిపోవుచున్నది.

అంతర్జలము గురుత్వాకర్షణశక్తి ప్రాబల్యమున (Influence of gravity) సంపృక్త జలమట్టపు వాలులను అనుసరించుచు ప్రవహించును. నీరు భూతలముయొక్క స్వరూపమును ఏర్పరచుటయేగాక, భూమిలోపల కూడ పెక్కు మార్పులను కలిగించుటలో చాల ప్రముఖపాత్ర వహించును. ఇది సున్నపురాయి మొదలయిన పెక్కు రాళ్ళగుండ ప్రవహించు నపుడు వాటి పొరలమధ్యను, అతుకులలోను రాతిని కరగించుచు అంతర్మార్గములను విస్తరింప చేయును. ఆ మార్గములు కొన్నిచోట్ల భూమిపై ప్రవహించు నీటిచే మరింత పెద్దవై గెరాటీని బోలిన పెద్ద సొరంగ మార్గములుగా తయారగును. వీటినే మ్రింగు సొరంగములు (Swallow holes) అందురు. ఇటువంటి మ్రింగు సొరంగములు ప్రసిద్ధికెక్కిన మేమత్ గుహ ఉన్న కెంటకీ పీఠభూమిలో 60,000 పైగా ఉన్నవి. ఇట్లు రాళ్ళను కరగించుటవలన ఏర్పడిన ద్రవము పెద్ద పెద్ద కీలులు (Master points), అతుకులు, రాతి పొరలు మొదలయిన వాటిగుండా ప్రవహించి పెక్కు సొరంగ మార్గములను (Caverns) గుహలను కూడ నిర్మించును. ఇటువంటి గుహలు, మెక్సికోలోని కారల్స్

బాడ్‌లో ఉన్నవి. అక్కడ ఉన్నవాటన్నింటిలోను పెద్ద దగు ఒక గుహ 4000 అ॥ పొడవు, 625 అ॥ వెడల్పు, 350 అ॥ ఎత్తుకలిగి ఉన్నది. ఇట్లు ఏర్పడిన గుహలు అగాధములైన (Chasms) సొరంగ మార్గములతో అన్నియు కూడ ఒకదానినుండి మరియొకదానికి మార్గము కలిగి ఉండును. వీటినుండి, అంతర్జలము నదులవలె ప్రవహించును. ఇట్లు పెక్కు సెలయేరులై ప్రవహించెడు నీరు, కొంత దిగువున, ఒక పెద్ద నదీప్రవాహమువలె బయల్వెళలును. సున్నపురాతిగుండ ప్రవహించెడి నీరు కొంత కర్బని ద్విఆమ్లజని (Corbondioxide) కలిగియున్నందున, దానిని కరగించును. ఈ ద్రవము కొంత కర్బని ద్విఆమ్లజని ఆవిరిరూపమున కోల్పోయిన, కరగియున్న కొంత కార్బనేటు (Carbonate) కాల్సైటుగా నిక్షేపించబడును. భూమిలోని గుహలలో పైభాగమునుండి వ్రేళ్ళాడు నట్లుండు కాల్సైటును "స్టాలిక్టైట్సు"అనియు, క్రిందిభాగమున స్తంభములవలె నిలువబడియుండు కాల్సైటును "స్టాలగ్మైట్లు" అనియు అందురు. అంతర్జలములలో నుండెడు పదార్థము ఖటిక కర్బనితము (Calcium carbonate) ఒక్కటే కాదు. ఇసుక పదార్థము కూడ తరుచుగా నుండును. ఉదాహరణకు, చెకుముకిరాయి (Flint concussion) సులభముగ కరుగని రాళ్ళచుట్టును ఏర్పడుట, చెప్పవచ్చును. డెంఢ్రైట్సు అనునవి యినుము, మాంగనీసు యొక్క ఆమ్లజనిదముల ఉత్పాదనీయమైన అవిక్షేపరూపములు (Secretionary forms).

ఇంక ఎడారులలో ఒయాసిస్ లనబడెడు ఫలవంతమైన ప్రదేశములు చాల ఎన్నతగినవి. ఇవి అంతర్జలము ఉపరిభాగమును చేరుటవలన ఏర్పడును. ఇట్లు అంతర్జలము పైకి ఉబుకుటవలన, ఆ ప్రదేశములు సారవంతముగా మారుచుండును. అచ్చట చెట్టు చేమ లుండుటవలన, అంతవరకు ఇసుకపఱ్ఱగా ఉండెడు ప్రదేశముల మధ్య అవి స్వర్గతుల్యముగా కన్పడును.

అంతర్జలపు ఉనికి, కొన్నిచోట్ల భూతత్వశాస్త్రరీత్యా కనిపెట్టవచ్చును. ఇటీవల భౌతికశాస్త్ర పద్ధతుల ద్వార (Geographical Methods) కనుగొనుట కూడ జరుగుచున్నది. విద్యుత్పరిశోధనల ద్వారా (Electrical prospecting methods) అంతర్జలపు ఉనికి కనిపెట్టుటకు, శిలల నిరోధకతలోని వ్యత్యాసము (Variation of resistance in rocks) కొంతవరకు తోడ్పడుచున్నది.

డా. యస్. బా.

## అంతర్జాతీయ న్యాయము (వైయక్తికము)

న్యాయ (విధి) వైరుధ్యము :- ఒక విదేశాంశ ప్రసక్తి కలిగిన అభియోగములను నిర్ణయించుటకు ఉపకరించు నిబంధనలతోగూడిన న్యాయ సూత్ర సముదాయమునకు 'న్యాయ వైరుధ్యము' (Conflict of Laws) అను పేరు ఒసగబడుచున్నది. స్వీయవిచారణాధికారమునకు లోబడిన ప్రదేశములో ఈ దిగువ సందర్భములలో బయలుదేరు వివాదములను గుర్తించి విచారణలోనికి తీసికొనుటకై ఒక దేశములోని న్యాయ విచారణ సభలు స్థాపింపబడియున్నవి, ఆనాడు సభల విచారణాధికారమునకు లోబడిన ప్రదేశములలో నివసించుచున్న లేక వ్యాపారము చేయుచున్న వ్యక్తులమధ్య ఘటిల్లిన వివాదములు, లేక, వాటి విచారణాధికారము గల ప్రదేశములోని అభియోగ విషయములు, లేక పూర్తిగాగాని, కొంతవరకుగాని వాటి విచారణాధికార ప్రదేశములలో నున్న వివాద విషయములును - ఇట్టి న్యాయసభలు విచారణలోనికి తీసికొని పరిష్కరింపనగును. అట్టి అభియోగములలో నుపయోగింపబడు న్యాయము, ఆ న్యాయవిచారణ సభకుచెందిన న్యాయమై యుండును. దానికి "లాఫోరి" (Lex Fori) అని పేరు.

వాది ప్రతివాదులు ఆ న్యాయ విచారణాధికారము గల ప్రదేశములో నివసింపనివారయినను, అన్య జాతీయులయినను, వివాదకారణము దేశాంతరములో బయలుదేరినదైనను, ఆ వివాదకారణము రెండుగాని, అంతకెక్కువగాని న్యాయశాస్త్ర విధానములతో సంబంధించియున్నయెడలను పై పరిస్థితులలో న్యాయ విచారణ సభలు ఆ అభియోగమును పరిష్కరింపవలసి వచ్చినను లేదా పరిహారములు (Relief) ప్రసాదింపవలసి వచ్చినను, రెండు ప్రాథమిక సమస్యలు అట్టి అభియోగముల విషయమున బయలుదేరును:- (1) ఆ న్యాయ సభయొక్క విచారణాధికారము. (2) ఆ వాద విషయమునకు ఉపయోగింపదగు న్యాయశాస్త్ర విధానము.

ఉదా :- ఒక ఆంగ్లేయుడు, ఒక ఫ్రాన్సు దేశీయుడును ఇటలీదేశములో అమలుపరుపదగిన ఒక ఒడంబడికను జర్మనీలో చేసికొన్నారు. వారిలో నొకరు ఆ ఒడంబడికకు భంగముగా ప్రవర్తించుటచే, ఒక ఇంగ్లండు దేశపు కోర్టును ఆ వివాద విషయమును పరిష్కరించవలసినదిగా కోరినచో అట్టి పరిస్థితిలో మొదట నిర్ణయింపవలసిన సమస్య ఆ అభియోగమును స్వీకరించుటకు ఇంగ్లీషు కోర్టుకు అధికారమున్నదా, లేదా అనునది. (2) ఈ మొదటి విషయమున ఇంగ్లండుదేశపు కోర్టున కధికారమున్నట్లుగా నిర్ణయమైనయెడల, అటుతరువాత ఏ న్యాయ విధానము అవ్విషయమున ఉపయోగింపవలసియుండు నను ప్రశ్న బయలుదేరును.

పై పరిస్థితిలో ఉపయోగింపవలసిన న్యాయమేది? ఒడంబడిక జరిగిన ప్రదేశపు న్యాయమా, అనగా జర్మనీ దేశపు న్యాయమా? లేక, ఒడంబడిక అమలు జరుగవలసియున్న ప్రదేశపు న్యాయమా, అనగా ఇటలీదేశపు న్యాయమా? అట్లుగాక, అభియోగము తీసికొనిరాబడిన ప్రదేశపు న్యాయమా, అనగా ఇంగ్లండు దేశపు న్యాయమా? అనునవి కొన్ని ప్రశ్నలు.

పై ప్రాథమిక సమస్యలను నిర్ణయించుటకు వేర్వేరు దేశములు అనుసరింపవలసిన నిబంధనావళికి ప్రైవేటు (Private) అంతర్జాతీయ న్యాయము లేక "న్యాయ వైరుధ్యము" అని పేరు.

ప్రపంచములో ఒకదానితో నొకటి పరస్పరముగా భిన్నముగానున్న న్యాయశాస్త్ర విధానములుండుటచేత, న్యాయశాస్త్ర విధానములో ఈ నియమములుండుట ఆవశ్యకమైనది.

వ. వేం.

## అంతర్జాతీయ న్యాయము (సార్వజనికము)

[Public International Law] :- అంతర్జాతీయ న్యాయశాస్త్ర మనగా నేమి? పరిణామము యొక్కయు చారిత్రికావసరముల యొక్కయు మందప్రవృత్తిచేత సార్వజనికమయిన(Public)అంతర్జాతీయ న్యాయశాస్త్రము యొక్క నియమములు అంతర్జాతీయ సమాజములో పెంపుగాంచియున్నవి. సార్వజనికమగు (Public) అంతర్జాతీయ న్యాయశాస్త్రము వైయక్తికమగు అంతర్జాతీయ న్యాయశాస్త్రముకంటె భిన్నమయినది. ఇందు సాధారణముగా రాజ్య సముదాయములు పరస్పరముగా ప్రదర్శింపదగిన నడవడిని నిర్ణయించెడి నియమము లుండును. వైయక్తికమగు (Private) అంతర్జాతీయ న్యాయశాస్త్రము విశదముగా వ్యక్తులతో సంబంధము కలిగియున్నది. సార్వజనికమగు అంతర్జాతీయ న్యాయశాస్త్రసూత్రములు అట్లుగాక, ఒకటి అంతకంటె ఎక్కువసంఖ్యాగాగల రాజ్యముల మధ్య గల సంబంధమును వివరించుచు సాధారణముగా రాజ్యమును పరస్పరము అవశ్యకర్తవ్యముగా గుర్తింపదగిన నడవడిని నిర్ణయించును. కాని ఆధునిక కాలపువరిణామము ననుబట్టి చూచినచో, అంతర్జాతీయ న్యాయము రాజ్యములకుమాత్రమే సంబంధించినదని శాసించిచెప్పుటతప్పు. వివిధ రాజ్యముల మధ్య క్రమమును న్యాయబద్ధమునైన జీవనమును, సహజమైన మైత్రిని స్థాపించుటలో ఈ సూత్రములును నియమములును విశేషముగా కారకములయ్యెననుటలో సందేహములేదు. గడచిన రెండు ప్రపంచ యుద్ధములు, తరువాతి సంఘటనలును కలిగించిన ఫలితముగా, జటిలములును,సుసంఘటితమును అయిన అనేకసంస్థలును, అంతర్జాతీయ న్యాయశాస్త్ర సమ్మత వ్యక్తిత్వముగల అంతర్జాతీయ జనసంఘములును బయలుదేరినవి. వాటికి అంతర్జాతీయ న్యాయసూత్రములు వర్తింపజేయబడినవి. అంతర్జాతీయ సంస్థలయొక్క ప్రత్యక్ష నిర్వహణమునకు సంబంధించిన నియమములకును, ఆ సంస్థలలో ఒకదానితో మరియొకదానికి గల భిన్నసంబంధములు, భిన్నరాష్ట్రములతో వాటికి గల సంబంధములకును సార్వజనికమయిన (Public)అంతర్జాతీయశాస్త్రన్యాయములో స్థానమొసంగబడినదని గమనించుట ముఖ్యవిషయము. అంతేకాక, రెండవ ప్రపంచయుద్ధము ముగిసిన తర్వాత అంతర్జాతీయ న్యాయశాస్త్రములో కొన్ని క్రొత్తసూత్రములు బయలువెడలినవి. అవి ముఖ్యముగా కొన్ని తరగతుల వ్యక్తులకు మాత్రమే సంబంధించినవి. న్యూరెంబర్గు, టోకియోలలో అంతర్జాతీయ సైనిక న్యాయసభలచే విచారింపబడిన యుద్ధాపరాధుల విషయము దీనికి ఉదాహరణము. అంతర్జాతీయ న్యాయము భిన్న రాష్ట్రముల మధ్యనుండు నియమములకు మాత్రమే ముఖ్యముగా వర్తించును అను న్యాయశాస్త్రజ్ఞుల పూర్వాభిప్రాయమును ఈ పరిణా

నము పూర్తిగా రద్దుచేసినది. ప్రత్యేక వ్యక్తులు కూడ అంతర్జాతీయ న్యాయము ననుసరించి నిర్వర్తింపవలసిన కొన్ని హక్కులును, ఆవశ్యక కార్యములును కలవను విశ్వాసమును యుద్ధాపరాధములను గూర్చిన భావన కలిగించినది. ఐక్యరాజ్య సమితిచే ఆమోదింపబడిన రీతిగా మానవుని హక్కుల యొక్క ప్రతిపాదనము ఈ విశ్వాసమును ఇంకను ఎక్కువగా బలపరచినది. అందుచే ఈ ఆధునిక పరిణామములనుబట్టి అంతర్జాతీయ న్యాయశాస్త్రము తిరిగి యిట్లు నిర్వచింప బడవలసియున్నది. ఎట్లనగా:- చాలవరకు రాష్ట్రజనులు మనస్సాక్షిగా తమకు అవశ్యాచరణీయము లని భావించునట్టియు, పరస్పర అలవాటు ప్రకారము ఒక రాష్ట్రమువారు అన్యరాష్ట్రీయుల పట్ల అనుసరించునట్టియు న్యాయసూత్రముల యొక్క సముదాయమే అంతర్జాతీయ న్యాయము. అయినను దానియందు అంతర్జాతీయ సంస్థల యొక్కయు లేక వ్యవస్థల యొక్కయు ప్రవృత్తులకును,వాటి అన్యోన్య సంబంధములకును చెందిన నియమములుగూడ ఇందులో చేరియున్నవి. మరియు ప్రత్యేకవ్యక్తులకును, ఇతరరాష్ట్రీయులకును సంబంధించి, వారికి కొన్ని హక్కులను, ధర్మములను విధించెడి న్యాయశాస్త్ర నియమములు గూడ ఇందులో చేరియున్నవి.

**అంతర్జాతీయ న్యాయశాస్త్రముయొక్క ఉద్దేశము:**- శాంతి కాలములోగాని, యుద్ధకాలములోగాని, అంతర్జాతీయ సమాజములోని న్యాయపరిపాలన **(Rule of Law)** సూత్రమును వర్తింపజేయుట "సార్వజనికమగు అంతర్జాతీయ న్యాయము" యొక్క ప్రధానోద్దేశమై యున్నది. సార్వజనికమగు అంతర్జాతీయ న్యాయశాస్త్రముయొక్క నియమములు తరచుగా శాంతి సమయమందే గాక, యుద్ధమువంటి అసాధారణ పరిస్థితులయందును తటస్థ స్థితియందునుగూడ అలవాటును బట్టి అనుసరింపబడుచున్నవి.

**అంతర్జాతీయ న్యాయశాస్త్రముయొక్క ఉత్పత్తి వికాసములు :**- అంతర్జాతీయ న్యాయముయొక్క నియమములు మానవ నాగరికత యొక్క ఉదయకాలమునుండి ఉద్భవించియున్నవి. రాజదూత, లేక రాయబారులను రక్షించు నియమములు, యుద్ధధర్మములు, ప్రాదేశిక ఆధిపత్య నియమములు మున్నగు సూత్రములు ప్రాచీన గ్రీసునందలి రోమన్ విజయమునకు పూర్వయుగముల నుండియును, ప్రాచీన భారతము నందలి పురాణయుగము నుండియును అనుసరింపబడుచున్నట్లు తెలియుచున్నది. అతి ప్రాచీనకాలపునాటి అంతర్జాతీయ న్యాయశాస్త్రముకంటె భిన్నమైన ఆధునికకాలపు అంతర్జాతీయ న్యాయశాస్త్రము గడచిన నాలుగు, ఐదు శతాబ్దముల నుండిమాత్రమె క్రమపరిణామమును పొందినది. దీనికి నేటి యూరపుదేశము నందలి క్రైస్తవ నాగరికతతో గాఢమైన అనుబంధము కలదు అందుచేత అంతర్జాతీయ న్యాయశాస్త్ర నియమములలో పెక్కులు పాశ్చాత్య దేశముల యొక్క జాతీయ సర్వాధిపత్యము, ప్రాదేశిక పూర్ణత, రాష్ట్ర స్వాతంత్ర్యము మున్నగు భావముల ప్రభావమునకు లోనై యుండుటలో ఆశ్చర్యములేదు.

రోమన్ సామ్రాజ్యము విచ్ఛిన్నమై, యూరపులో స్వతంత్ర రాష్ట్రములు బయలుదేరిన కాలమునుండియు నేటి అంతర్జాతీయ న్యాయశాస్త్రము యొక్క చరిత్ర ప్రారంభమగు చున్నది. అంతర్జాతీయ న్యాయశాస్త్రమునకు రోమనులు గావించిన పుష్టి మిక్కిలి స్వల్పమైనది. ఏ మనగా రోము సామ్రాజ్యరాష్ట్రము గనుక, దానితో సమానప్రతిపత్తిగల ఎట్టిసంబంధము వృద్ధిపొందుటకు అవకాశము లేదు. ఐనను, చాలకాలముతర్వాత, అంతర్జాతీయ వ్యవహారముల యొక్కయు,కార్యకలాపముల యొక్కయు విషమ సమస్యలతో గూడిన పరిస్థితులను మారియోపాయముచే దాటుటకు అంతర్జాతీయ న్యాయశాస్త్రజ్ఞులు రోమను న్యాయముయొక్క సూత్రముల సహాయము నర్థించి వాటిని స్వేచ్ఛగా ఉపయోగించుచుండెడివారు.

మధ్య యూరపులోను, అంతకంటె ఎక్కువగా ఇటలీలోను ,చిన్నచిన్న స్వతంత్ర రాజ్యములు పెంపుగాంచుటతో, ఒకదానితో నొకటి రాజ్యతంత్ర సంబంధము లేర్పరచుకొనుటకు రాష్ట్రములకు అవసరము కలిగెను. అందుచే రాయబారులను పరస్పరము మార్చుకొనుట, వారిని నియోగించుట, వారిని స్వీకరించుట, వారికి తగు మర్యాద నొసగుట, వారికి రక్షణ మొసగుట మున్నగు నియమములును, న్యాయశాస్త్రోక్తమయిన యుద్ధమునకును తాటస్థ్యమునకును సంబంధించిన మరికొన్ని

నియమములును నెమ్మదిగా అంకురింపఁదొడగెను. ఈ కాలముననే కొందరు తొలి రచయితలు న్యాయశాస్త్ర విషయమున ఎన్నదగిన కృషిని సలిపియుండిరి. వీరిలో నీ క్రిందివారు ముఖ్యులు :-

విటోరియా (1482-1546) - ఇతడు సాలమన్కా విశ్వవిద్యాలయము నందలి ఆచార్యుడు; ఆయలా (1548-1584) - ఇతడొక స్పెయిన్ న్యాయశాస్త్రజ్ఞుడు; సూరస్ (1548-1617), గెంటిలిస్ (1552-1608)- ఇటలీ దేశీయుడగు నితడు తర్వాత ఆక్సుఫర్డులో "సివిల్" న్యాయాచార్యుడయ్యెను. కాని ప్రాథమిక రచయితలలో మిక్కిలి గొప్పవాడు హ్యూగోవాన్ గ్రూటు అనునాతడు. ఇతడు అంతర్జాతీయ న్యాయ రచయిత గ్రోషియస్ (1583-1645) అను పేరుతో ఇతడు ప్రసిద్ధికెక్కెను. ఇతడు "జాతీయ న్యాయపిత" అని ప్రశంసింపబడి, ఆరాధింపబడుచున్నాడు. "డిజూర్ బెల్లి ఏక్ పేసిస్ (Dejure belli acpacis) (అనగా యుద్ధము యొక్కయు, శాంతి యొక్కయు న్యాయము) అను నితని సమగ్రమైన గ్రంథము 1625 లో మొదట ప్రచురింపబడినది. ఇది అంతర్జాతీయ న్యాయశాస్త్రమును గూర్చి వ్రాయబడిన మొదటి గ్రంథము. ఇది అన్ని న్యాయశాస్త్ర గ్రంథములలోనెల్ల విశిష్టమైనదిగాను, ప్రామాణికమైనదిగాను అంగీకరింపబడినది. అయినను ఇతనిని అంతర్జాతీయ న్యాయశాస్త్రమునకు "స్థాపకుడుగా" పేర్కొనుట అత్యుక్తి కాగలదు. ఇతడొనర్చిన కార్యమిది: చరిత్రలో తొలిసారిగా ఇతడు విషయజ్ఞానమునకు పనికి వచ్చు కొన్ని అంశములను, కొంత సామగ్రిని ప్రోగుచేసి, రాష్ట్ర నిర్వహణమునకు సంబంధించిన కొన్ని ప్రాతిపదిక సిద్ధాంతములను చేసి వాటిని బట్టి రాష్ట్రములు అనుసరింపవలసిన అన్యోన్య ప్రవర్తనమునకు చెందిన నియమములను తర్కించి, రాష్ట్రములమధ్య ప్రవర్తిల్లుచున్న వ్యవహారములు, ఆచారములు, అలవాట్లు - మున్నగువాని యొక్క శిక్షణమును క్రమబద్ధమొనర్చెను.

గ్రోషియసుకు తరువాత వచ్చిన రెండు శతాబ్దుల యందును, అంతర్జాతీయ న్యాయశాస్త్రము యొక్క పరిశీలనమునకు ఆక్సుఫర్డులో ఆచార్యుడగు జౌక్ (Zouche) (1592-1660), జర్మన్ ఆచార్యుడగు పూఫెన్‌డార్ఫు (Pufendorf) (1632-1694); బైన్‌కర్ షాక్ (Bynkershock) (1673-1743); ఊల్ఫు అను డచ్చి న్యాయశాస్త్రజ్ఞుడు (1679-1754); వేటల్ (Vattel) (1714-1767) మున్నగువారు ఎంతో దోహదము కలిగించిరి.

1815 లో జరిగిన వియన్నా కాంగ్రెసు సమయమందే అంతర్జాతీయ న్యాయశాస్త్రము యొక్క నియమములు నెమ్మదిగా సుస్పష్టమైన వాక్యములలో ప్రతిపాదింపబడుటకు మొదలయ్యెను. ఇంతకు పూర్వము అంతర్జాతీయ న్యాయశాస్త్ర నియమములు వివిధన్యాయశాస్త్రజ్ఞుల పరస్పర విరుద్ధాభిప్రాయము లనెడు విషమ వ్యూహమున చిక్కువడియుండెను. 19 వ శతాబ్ది ఉదయించినతోడనే ప్రకృతము అస్పష్టముగ వ్యవహరింపబడుచున్న అంతర్జాతీయ శాసన నిర్మాణ విధానము పెంపొంద నారంభించెను. ఈ శతాబ్దియందే అంతర్జాతీయ సంబంధములయొక్క ఆచార వ్యవహారములు నిశ్చయ ప్రమాణమును అందుకొని స్పష్టరూపస్థితిని వహించెను. అనేకములయిన అంతర్జాతీయ పరిషత్తులచేత సుస్పష్టముగ నియమములు నిర్వచింపబడెను. 1899, 1907 సంవత్సరములలో హేగ్‌నందు పరిషత్తులు ఏర్పాటు చేయుటతోడను; వివాద పరిష్కారమునకై శాశ్వతమైన న్యాయసభ స్థాపింపబడుటతోడను: నానాజాతి సమితి (League of Nations) ఉద్భవించుటతోడను; అంతర్జాతీయ న్యాయశాస్త్రము యొక్క ఉద్దేశపరిధి విశాలమయ్యెను. ఇంతే కాక "పారిస్ ప్రకటనము" (1856) "జెనీవా సమావేశము" (1864), "లండన్ నావిక ప్రకటన" (1910) వంటి అనేక ప్రకటనములు "ఒడంబడికల ప్రాథమిక పత్రములు (Protocols) మొదలగు వాని వలన, అంతవరకును కేవలము అనిశ్చితములుగాను, కేవలము అంతర్జాతీయ న్యాయశాస్త్రజ్ఞుల అభిప్రాయములుగాను, వివిధ రాష్ట్రముల విశ్వాసము మీదనే విశేషముగా ఆధారపడునవి గాను ఉన్న అంతర్జాతీయ న్యాయశాస్త్రము యొక్క నియమములకు స్పష్టత, నిశ్చయత సిద్ధించెను.

మొదటి ప్రపంచ యుద్ధమునకు సంబంధించిన ద్వేషములు ఉపశమించినపిదప, హేగుపట్టణము (హాలెండు)లో

శాశ్వతముగా అంతర్జాతీయ న్యాయసభ స్థాపింపబడెను. ఆ స్థాపనచే అంతర్జాతీయ న్యాయశాస్త్ర చరిత్రములో "న్యాయ విచారణ శాసన నిర్మాణము" నకు చెందిన ఒక నూతన యుగము ప్రారంభమయ్యెను. ఈ "శాశ్వత న్యాయసభ" చే గావింపబడిన న్యాయనిర్ణయముమూలమున శాశ్వతమయిన లాభము కలిగెను. ఎందుచేతననగా అంతర్జాతీయ న్యాయశాస్త్రమునందలి సందర్భములును వివాదగ్రస్తములును ఐన యంశములు న్యాయసభచే పరిష్కరింపబడును. అట్లు పరిష్కరించుటలో న్యాయసభ ఇంకను నవీనములైన న్యాయశాస్త్రవిధులను ప్రవచించి ప్రతిపాదించెను. శాశ్వత న్యాయసభయొక్క స్థానములో నేడు "అంతర్జాతీయ న్యాయశాస్త్ర విచారణ సభ" పని చేయుచున్నది. ఇదికూడ అంతర్జాతీయన్యాయశాస్త్రము యొక్క నియమములను వ్యాఖ్యానించుట యందును, అన్వయించుటయందును నిమగ్నమైయున్నది.

మొదట ప్రపంచయుద్ధమునందు పాల్గొనిన జాతుల వారు తాము నూతనముగా కనిపెట్టియున్న అపాయకరములగు యుద్ధాయుధములను అందు ఉపయోగించిరి. ఇట్టి యుద్ధానంతరము అంతర్జాతీయ న్యాయశాస్త్రము యొక్క సామాన్య సూత్రములందు పెక్కు మార్పులు ఘటిల్లెను.

1899, 1907 సంవత్సరములలో జరిగిన హేగ్ పరిషత్తులు నిర్ణయించిన భూయుద్ధ - సముద్రయుద్ధ నియమముల నన్నింటిని యుద్ధానుభవము ననుసరించి సవరించి, యుద్ధము ముగిసినతోడనే ఉదయింప దొడగిన అంతర్జాతీయ సంబంధముల విషయమున మార్పు నొందుచున్న ఆశయములకు అనుగుణముగా క్రొత్తనియమములేర్పరుపవలసిన అవసరము కలిగెను. యుద్ధములో విమానములయొక్కయు, జలాంతర్గాముల యొక్కయు ఉపయోగము అంతర్జాతీయ న్యాయశాస్త్రము నందు విచ్ఛేదమును కల్పించెను. ఇంతకుమునుపు ఊహించుటకు కూడ సాధ్యపడని పరిస్థితుల నెదుర్కొనుటకై క్రొత్త నియమములను పర్పరుపవలసి వచ్చెను. ఆధునికములైన యుద్ధావసరములను ఎదుర్కొనుటకయి 1919 లో విమాన యాత్రాపరిషత్తును, 1925 లో బాష్పప్రయోగముతోను,క్రిమిప్రయోగముతోను కూడిన యుద్ధమునకు సంబంధించిన జెనీవా ఒడంబడికను, 1929 లో జెనీవా సమావేశమును, 1936 లో లండన్ జలాంతర్గామి నియమములకు సంబంధించిన ఒడంబడికను ఏర్పరచ వలసివచ్చెను. అంతర్జాతీయ న్యాయశాస్త్రముయొక్క నియమములను విశేషసంఖ్యగల రాష్ట్రములు బద్ధములగుటకు అంగీకరించిన నియమములను దోషరహితములయిన పదములచే నిర్వచించుటకును నానాజాతి సమితి కూడ ప్రయత్నించెను. అట్లే, రెండవ ప్రపంచయుద్ధము ముగియుటతోడనే, క్రొత్త నియమములను ఏర్పరచి, ప్రాత నియమములను సమంజసముగా కాలానుకూలముగా మార్చవలసివచ్చెను. అంతర్జాతీయ న్యాయశాస్త్రమును కాలానుగుణముగా సవరించి ప్రగతియుక్తముగా స్మృతి బద్ధము చేయు (codify) నవకాశములను అన్వేషించుటకై ఐక్యరాజ్యసమితి ఒక నిపుణుల సంఘమును నియమించెను.

సభ్యత్వము (membership) గల రాష్ట్రముల అంగీకారముతో అంతర్జాతీయ శాస్త్రముయొక్క నియమములను స్పష్టమును, శక్తియుతమునైన పదములతో నిర్వచించునట్టి దుర్వహమైన కార్యమునందు 1948 లో ఐక్యరాజ్య సమితియొక్క సాధారణ సమితిచే నియుక్తమయిన అంతర్జాతీయన్యాయశాస్త్రసంఘము నిమగ్నమైయున్నది. అణుసంబంధములగు అస్త్రములను, బహిష్కరించు విషయము నేటి వివాదగ్రస్తములును చర్చనీయములునైన అంశములలో నొకటి. ఇది సర్వ ప్రపంచములోని, రాజ్యతంత్రజ్ఞుల యొక్కయు, న్యాయశాస్త్రజ్ఞుల యొక్కయు దృష్టిని సమానముగా నాకర్షించుచున్నది.

ఇట్లు న్యాయశాస్త్రజ్ఞులు అంతర్జాతీయ న్యాయమును స్మృతిబద్ధము (codify) చేయుటకు యత్నించుచున్నారు. కాని ఇది యింకను వృద్ధిపొందుచు, ఎడతెగక పరిణామము పొందుచున్న న్యాయముగానున్నది. అంతర్జాతీయ సంబంధముల వైఖరిమీదను, జాతులయొక్క ఔదార్యము మీదను అంతర్జాతీయసంస్థల నిర్మాణము మీదను ఇది చాలవరకు ఆధారపడియున్నది. అందుచేత, శిక్షా విషయకములును, విధి విషయకములును లేక వ్యక్తి విషయకములును అగు న్యాయశాస్త్ర స్మృతులు మున్నగు నగరపరిపాలనా న్యాయస్మృతులవలె సమగ్ర

మైన రూపములో న్యాయశాస్త్ర స్మృతిగా అంతర్జాతీయ న్యాయము రచింపబడుటకు సాధ్యపడ లేదు.

అంతర్జాతీయ న్యాయశాస్త్రము వెనుకనున్న అనుమతి (sanction) కచ్చితముగా ఏది ? అను ముఖ్య ప్రశ్నము నిర్ణయింపదగియున్నది. ఇట్టిస్థితిలో ఏ న్యాయశాస్త్రమునుగూర్చియు చేయబడు తుది విమర్శనమైనను బాహ్యముగాను, ఆంతరముగాను అది విధించెడి విధులకు బద్ధులగు ప్రజలు దానివిషయమున చూపునట్టి విధేయతా ప్రమాణముపై నాధారపడియుండును.

అంతర్జాతీయ సమాజములో ఒక రాష్ట్రములోవలె, నిర్బంధకశక్తి లేదు ; అందుచే, న్యాయశాస్త్రములో ఆజ్ఞా సిద్ధాంతమును ప్రబలముగా సమర్థించువాడగు సర్ జాన్ ఆస్టిన్ వంటి ప్రసిద్ధ న్యాయశాస్త్రజ్ఞుడు అంతర్జాతీయ న్యాయము, యథార్థము చెప్పవలసినచో అది ఒక న్యాయశాస్త్రమే కాదని చెప్పియున్నాడు. ఆస్టిన్ యొక్క దృష్టిలో, ఒక న్యాయశాస్త్రము నిజముగా న్యాయశాస్త్రము కావలయునన్నచో దాని వెనుక ఆధారభూతముగానున్న శక్తి లేక నిర్బంధమునుబట్టి దానిని నిర్ణయింపవలసి యుండును. ఒక సంఘమునందలి మానవ బృందముచేత కొన్ని సూత్రములు లేక నియమములు అలవాటు చొప్పున అనుసరింపబడుచు వచ్చి, అవి స్పష్టతను, నియతత్వమును, సామాన్యతను పొందినచో, అట్టి సూత్రములు లేక నియమములు ఒక సర్వాధికారములు గల ప్రభువుయొక్క ఆజ్ఞతోగూడిన న్యాయశాస్త్రమునకు ఎట్టి శక్తిగాని, ఎట్టి న్యాయాధికారముగాని గలదో అట్టి శక్తినే, అట్టి అధికారబలమునే పొందును. ఆచారము. పూర్వోదాహరణము, అభ్యాసక్రమము, అవగతి మున్నగునవి ఆధారముగా ఇంగ్లండునందలి న్యాయశాస్త్రము ఏర్పడియున్నది. అంతర్జాతీయ నియమములు ఇంగ్లండునందలి అట్టి సామాన్య న్యాయశాస్త్రముయొక్క దృష్టిచేతనే పరిశీలించబడవలయునన్న అంశము అందరు ఎరిగినదే. అందుచేత రాష్ట్రములును అందలి ప్రజలును తప్పక అనుసరింపవలసిన ఇతర ఆచారగతములగు న్యాయముల వంటిదే అంతర్జాతీయ న్యాయమగుచున్నది. ఎందుచేతననగ, దాని సూత్రములు అభ్యాసవశమున ఆచరింపబడి, అనుసరింపబడి, అమలులో పెట్టబడుచున్నవి. న్యాయమూర్తియైన గ్రే అను నతడు ఒకమారు ఇట్లు చెప్పియున్నాడు : "అది (అంతర్జాతీయ న్యాయశాస్త్రము) మన న్యాయములో ఒక భాగమై యున్నది. దానిమీద ఆధారపడియున్న హక్కులతో సంబంధముగల ప్రశ్నలు నిర్ణయముకొరకు క్రమముగా దాఖలు చేయబడినప్పుడెల్ల తగిన న్యాయాధికారము గల న్యాయవిచారణ సభలచే అవి విచారింపబడి, శాసింపబడుచుండవలెను.

ఏన్యాయముగాని ఉల్లంఘింపబడినంత మాత్రముచేత. అది అసలే లేకుండనున్నదానితో సమానము కాజాలదు. తరచుగా చేయబడిన న్యాయభంగములు, ఉల్లంఘనములు లేక గొప్ప నిరాకరణములు, చేయబడినంతమాత్రమున అంతర్జాతీయ న్యాయము అంతర్జాతీయ సమాజములో రూపుమాసిపోయినదని ఊహింపరాదు.సవరింప సాధ్యము గాని దగు జాతీయ అధిరాజ్యము అను సిద్ధాంతము ఒక్కటిమాత్రమే అంతర్జాతీయ సంబంధములలో ముఖ్య లోపముగానుండి, అంతర్జాతీయ న్యాయశాస్త్రము యొక్క నియమములను బలహీనము కావించుచున్నది. కాని శాంతికాలములో వలెనే యుద్ధకాలములోగూడ, అంతర్జాతీయ న్యాయశాస్త్ర నియమములు సాధారణముగా అనుసరింపబడి దృఢముగా ఆచరింపబడుచున్నవి, అను విషయమును న్యాయశాస్త్రజ్ఞుడుగాని సాధారణ మనుష్యుడుగాని సరిగా తరచు గ్రహింపజాలకున్నాడు. "ఒకే ప్రపంచము" అనెడు భావన క్రమక్రమముగా అనివార్యమైన సత్యముగా రూపొందుచున్నది. అందుచేత, "సర్వగతమగు అంతర్జాతీయ న్యాయము," కాలక్రమమున, భావి ప్రపంచరాష్ట్రముయొక్క సార్వజనికమైన న్యాయముగా పరిణమింపగలదని నిశ్చయించుట కేవలము ఊహాజనితము కాజాలదు.

ఆర్. వా. పి.

**అంతర్జాతీయ వాణిజ్యము :-** వివిధములు, ఉన్నతములు, అనేకములు అగు మానవావసరము అన్నియు క్రమ విభజనమని మనము వర్ణించు సిద్ధాంతము ననుసరించియే తీర్చబడుచున్నవి. ఒక ఆర్థికవ్యవస్థయందలి సభ్యులు ఒక ప్రత్యేక వస్తువును ఉత్పత్తిచేయుటయందే శ్రద్ధ వహించి తమసుస్థితికిఅవసరమైనతక్కినవస్తువుల నితరులతో మార్పిడి చేసికొందురనుటయే ఈ సిద్ధాంతముయొక్క

తాత్పర్యము. శ్రమవిభజన మను సిద్ధాంతముపై ఆధార పడి సరకుల ఉత్పత్తి మార్పిడి సాగించు ఆర్థికవ్యవస్థ నాగరిక ప్రపంచము నంతను ఆవరించియున్నదను విష యము ఒక్కనిముస మాలోచించినచో మనము గ్రహింప గలము. ఇట్టిపద్ధతి ననుసరించి ప్రపంచమునందలి అన్ని ప్రాంతముల జనులు ఒండొరుల అవసరములను తీర్చు కొనుటకై పరస్పరము సహకరించుచున్నారు. ఆర్థిక ముగా మిక్కిలి ఉన్నతిని బడసిన జాతులును తమ లాభ మునకై అంతర్జాతీయ వాణిజ్యముపై నెక్కువగా ఆధార పడుచున్నవి.

శ్రమ విభజనము, పరిశ్రమల కేంద్రీకరణము అను సూత్రముల వెనుకనున్న సత్యములే అంతర్జాతీయ వాణి జ్యాభివృద్ధికిని కారణములు. జాతుల ఉత్పత్తిని, సామర్థ్య మును అభివృద్ధిచేసి ప్రతిజాతి ప్రపంచమునందలి సరకుల వినియోగమును పొందగల లాభమును అధికముచేయునది అంతర్జాతీయ వాణిజ్యమే. తాను నారింజల పండింప జాలదు కావున ఇంగ్లండు, స్పెయినులనుండి ఆ పండ్లను దిగుమతి చేసికొనును. స్పెయినుకు యంత్రములను నిర్మిం చుటకు తగినంత శక్తిలేదు, కావున ఆదేశము బ్రిటనునుండి యంత్రములను దిగుమతి చేసికొనును. ఒకవస్తువును తయారుచేయుటయందు ఏదైన దేశమునకు ఒక నిర్దిష్ట సౌకర్యముండుటయే అంతర్జాతీయ వ్యాపార మారంభ మగుటకు కారణ మగును.

ఒకదేశమునందు కొన్నిసరకులను ఉత్పత్తిచేయుటకు వీలుండవచ్చును. కాని అందులకు దారుణమగు వ్యయము అవసరము కావచ్చును. ఇటీవల జర్మనీ కృత్రిమమైన సిల్కు, పెట్రోలు, విపరీతమగు ఖర్చుతో ఉత్పత్తి చేయ జాలినది. జర్మనీ యిట్టిపనికి పూనుకొనుటకు కారణములు రాజకీయమైనవి కాని ఆర్థికమైనవి కావు. ఇట్టి సంఘట నలు అరుదు. ప్రతిదేశము ఇతరదేశములకంటె, తాను ఏయే సరకులు తక్కువధరకు ఉత్పత్తిచేయగలదో ఆయా సరకులనే ఉత్పత్తిచేసి, తానే ఉత్పత్తిచేయుటవలన ఎక్కువ వ్యయమగు వస్తువులను వానితోమార్పిడి చేసికొనును.

విదేశములలోఅగు ఖర్చుకన్న తక్కువ ఖర్చుకే తాను సరకులను ఉత్పత్తిచేయగలిగినపరిస్థితులలోకూడ ఆ సరకు లను విదేశములనుండి దిగుమతి చేసికొనుటయే ఒక్కొ క్కప్పుడు ఒకదేశమునకు లాభకరము కావచ్చును. అంత కన్నను ఎక్కువ లాభసాటియగు వస్తువులను తయారు చేయుటయందే దిగుమతిచేసికొను దేశము ప్రత్యేక నైపుణ్యము కలిగియుండుటయే దీనికి కారణము. దీనినే తారతమ్యవ్యయ సిద్ధాంతము (థియరీ ఆఫ్ కంపేరిటివ్ కాస్ట్స్) అని యందురు.

అంతర్జాతీయ వాణిజ్యముయొక్క లక్ష్యము ఒక వస్తువును ఇంకొక వస్తువుతో మార్పిడి చేసికొనుటద్వార వీలయినంత ఎక్కువ లాభము పొందవలెననుటయే. అంతర్జాతీయ వాణిజ్య సిద్ధాంతమునకు దేశాంతర్గత వాణిజ్యసిద్ధాంతమునకు మధ్య భేదముకలదు. దేశాంతర్గత వ్యాపారమునందు ఉత్పత్తిసాధనములు తమకు అధిక ప్రతిఫలము లభించు ప్రాంతములకు వృత్తులకు పారు చుండును. ఉత్పత్తిసాధనముల మార్పు వివిధదేశముల మధ్య అంత స్వేచ్ఛగా జరుగదు. ఒకదేశమునుండి కార్మికులు మరియొకదేశము వలసపోవుటకు విశేషమైన ఖర్చులు, భాష, భావ భేదములు అడ్డంకు లగుచున్నవి. పెట్టుబడిని ఇచ్చిపుచ్చుకొనుట అంతకష్టమైనది కాకపోయి నను, పెట్టుబడిదారుల అజ్ఞానము విదేశములలో పెట్టుబడి పెట్టుటలోగల అపాయములు ఇందుకును కొంతవరకు అడ్డంకు లగుచున్నవి.

వివిధ రాజకీయప్రాంతముల నడుమ కార్మికులు పెట్టుబడి, సులభముగా రాకపోకలు సాగించలేకపోవుటకు భాష, చట్టములు, ద్రవ్యమానము, మత, సాంఘిక విష యములందుగల తారతమ్యములు, భయము, అజ్ఞానము, పేదతనము, భావభేదములు కారణము లగుచున్నవి. పెట్టుబడివిషయములందుకంటె కార్మికవిషయములలోనే ఈ అడ్డంకులు ఎక్కువగా వర్తించును. పెట్టుబడిదారులు కూడ కార్మికులవలెనే సాధ్యమైనంతవరకు స్వదేశమందే తమధనమును పెట్టుబడి పెట్టుటకు ఇష్టపడుదురు.

అంతర్జాతీయ దేశాంతర్గత వ్యాపారముల మధ్యగల మరియొక ముఖ్యభేదము రెండుదేశములలోను వేరువేరు ప్రభుత్వములుండుటవలనసరకులరాకపోకలు సులభముగా జరుగుటకు రాజకీయపు ఆటంకము లేర్పడుట.

పోటీవిధానము ఈకారణములవలన ఒకేదేశమునందు వలె ఒకేవిధమైన వస్తువుల ఉత్పత్తికగు ఖర్చులు సరి

సమానముచేయ లేదు. అనేకములగు వస్తువులను తయారుచేయుటయందు వివిధదేశములకు ఈవిధముగా అసమానములుకాని లాభములు వచ్చుట ఈ విధముగా సంభవించును. ఈ కారణముచే వివిధదేశముల కూటములు ఒకదానితో నొకటి పోటీచేయు అవకాశము సన్నగిలుచున్నది. ఇంతేగాక శీతోష్ణస్థితి మొదలగు ప్రకృతి కారణములు అవకాశములందు వ్యత్యాసములుకూడ సంభవించుచుండును. ప్రాంతీయ శ్రమవిభజనము, పరిశ్రమల కేంద్రీకరణము ఈ విధముగా సంభవించుచున్నవి. ఉదాహరణమునకు ఖనిజసంపద ఒకదేశమునందు ఎక్కువగా నుండవచ్చును. బెంగాలువంటి కొన్ని ప్రదేశములు జనుము మాదిరి పంటలను పండించుట కనుకూలమైన శీతోష్ణస్థితి, సారవంతమైన భూమి కలిగియుండవచ్చును. ఇట్టి సౌకర్యములను ఒకదేశమునుండి మరియొక దేశమునకు మార్చుట అసాధ్యము కావచ్చును. లేదా అట్టిది సాధ్యమైనను మిగుల వ్యయకరము కావచ్చును.

**అంతర్జాతీయ వాణిజ్యము - తారతమ్యవ్యయ సిద్ధాంతము :-** అంతర్జాతీయ వ్యాపారము, అందు పాల్గొనువార లెల్లరకు లాభకారియను విషయము ఇటీవలనే గుర్తింపబడినది. అంతర్జాతీయశ్రమ విభజన మను సిద్ధాంతమును డేవిడ్ హ్యూం, ఆడమ్‌స్మిత్ అను ఆధునిక అర్థశాస్త్రప్రవక్తలు 18 వ శతాబ్దపు అంత్యభాగమున ప్రవచించిరి. వివిధ దేశములమధ్య సరకుల మార్పిడియు దేశాంతర్గత వ్యాపారమునందువలెనే శ్రమ విభజనము, పరిశ్రమల కేంద్రీకరణము అను సూత్రములపై ఆధారపడి నడుచు ననుటయే ఈ ప్రవచనముయొక్క అర్థము. ప్రతివారును తమకు ఏ వస్తువును ఉత్పత్తి చేయుటయందు ఎక్కువలాభములున్నవో ఆవస్తువులనే ఉత్పత్తిచేసి తమకు ఆర్థికముగా క్షేమకరములైన ఇతర వస్తువులను మార్పిడిచేసికొనవలెను. ఏదేని విదేశము మనకన్న తక్కువధరలకు ఒక వస్తువును తయారుచేసి ఈయగలిగిన యెడల ఆదేశమునుండియే ఆ వస్తువును మనకు అధికప్రావీణ్యముగల వస్తువులను ఉత్పత్తిచేసి అమ్మగా వచ్చిన ధనముతో తీసికొనవలెను.

రాగి, బట్టలు, అను రెండు సరకులలో బ్రిటను, అమెరికాలమధ్య వ్యాపారము జరుగుచున్నదనుకొందము. అంతేగాక ఆ రెండు సరకుల తయారుచేయుటయందు అమెరికాకు బ్రిటనుకన్న అనుకూలమగు పరిస్థితులు గలవనియు, కాని బట్టలు తయారుచేయుటకన్న రాగి నుత్పత్తి చేయుటయందు ఇంకను ఎక్కువ లాభములు గలవనియు అనుకొందము. అట్టి పరిస్థితులలో సరకుల మార్పిడి జరుగును. ఫలితమేమన అమెరికా, రాగిని ఉత్పత్తి చేయుటయందు ప్రత్యేకతవహించి, బట్టలు ఉత్పత్తిని బ్రిటనుకు వదలివేయును. అమెరికన్‌రాగి బ్రిటిష్ బట్టలకు మార్పిడియగును. ఏవస్తువులు తయారుచేయుటయందు అమెరికాకు మిక్కిలి ఎక్కువ ఆధిక్యము గలదో ఆ వస్తువులు తయారు చేయుటయందే తన యుత్పత్తి సాధనములను వినియోగించుటయే ఇందుకుగల కారణము. ఈ మాదిరి పరిస్థితులలో రెండుదేశముల మధ్య వ్యాపారము జరుగుట తథ్యము.

పై ఉదాహరణమునందు రెండు దేశములమధ్య జరుగు అంతర్జాతీయవ్యాపారములను నిర్దిష్టవ్యయమునకు మారుగా తారతమ్య వ్యయముపై ఆధారపడియున్నది. "ఆర్థికశాస్త్ర సిద్ధాంతములు మరియు పన్నులవిధానము" అను గ్రంథమునందు రికార్డో అను రచయిత ప్రవచించిన తారతమ్యవ్యయ సిద్ధాంతములోని అంతరార్థమిదియే. ఒకదేశమందు వివిధవృత్తులనడుమ కాలక్రమేణ లాభములు సరిసమానములగుట జరుగును. కాని వివిధదేశముల మధ్య అట్టిది అసంభవమని రికార్డో తెలిపెను. అంకెలతో కూడిన ఒక ఉదాహరణము నిచ్చుచు అతడు పోర్చుగలు దేశముబట్టలను, ద్రాక్షసారాయిని ఇంగ్లండుకంటె తక్కువ ఖరీదుకు ఉత్పత్తి చేయగలిగినను ద్రాక్షసారాయిని తయారుచేయుటయందు ఎక్కువలాభసాటి అవకాశములు కలిగినయెడల పోర్చుగలు ద్రాక్షసారాయమునే తయారుచేసి బట్టలను ఇంగ్లండునుండి దిగుమతిచేసికొనుట మంచిదని నిరూపించెను. రాగిని ఉత్పత్తిచేయుటకన్న బట్టలను తయారుచేయుటయందే ఇంగ్లండు తనశ్రమను పెట్టుబడిని వినియోగించినచో ఇంగ్లండుకు ఎక్కువ ధనసంపద సమకూడును. ఇదే కారణమువలన అమెరికా ఇంగ్లండుకు రాగిని ఎగుమతిచేసి బట్టలను ఇంగ్లండునుండి కొనును. దీర్ఘకాల ప్రయోజనదృష్ట్యా ఈవిధానము రెండుదేశములకు లాభకరమగును.

తారతమ్య వ్యయ సూత్రము విదేశవ్యాపారమునకు మాత్రమే వర్తించుననుట పొరపాటు. ఒకేదేశమందు వివిధజిల్లాలయొక్క ప్రత్యేక ఆధిక్యములననుసరించి ఆ జిల్లాలనడుమ వస్తువులమార్పిడి జరుగుచుండును, ఉత్పత్తి యొక్క అన్నిశాఖలయందును ఏదైనా జిల్లా తక్కిన జిల్లాలకన్న ఎక్కువ ఆధిక్యమును కలిగియున్నయెడల, కార్మికులు పెట్టుబడి తక్కువ జిల్లాలనుండి ఈజిల్లాకు వలసపోయి ఉత్పత్తిలో పాల్గొని లాభమును పొందుట జరుగును. ఒకదేశమందైనను, ఒక స్థిరనిశ్చల పరిస్థితి పొందునటుల శ్రమ, పెట్టుబడిపోకడ సాగింపజాలవు. రెండుజిల్లాలనడుమ అట్టి స్థిరనిశ్చలత్వము ఏర్పడనంతవరకు సరకులమార్పిడి జరుగుచునే యుండును.

దేశాంతర్గత వ్యాపారములలోకూడ శ్రమ, పెట్టుబడుల గమనము అడ్డంకులతోకూడిన విషయమే. విదేశ వ్యాపార విషయములో ఈ గమనము మరింత బాధాకరము. జె. ఇ. కైర్న్‌ మహాశయుడు పేర్కొనినట్లు పెట్టుబడిని, కార్మికులను పోటీలేని వర్గములమధ్య మార్పు చేయుట అంతర్జాతీయవాణిజ్యమంచు మనము యోచించవలసిన విషయము. ఈ యుత్పత్తి సాధనములు అంతర్జాతీయ సరిహద్దులగుండ ప్రయాణించుటకు అనుకూలమైనవికావు. రికార్డో ప్రథమమున తారతమ్య వ్యయ సిద్ధాంతమును ప్రవచించిననాటినుండి అంతర్జాతీయముగా ఉత్పత్తిసాధనముల స్వేచ్ఛాగమనము ఎంతయో సులభమాయెను. కాని దేశాంతర్గత గమన మంతగా కాదు. సిద్ధాంతమునే తలక్రిందుచేయునటుల అంతకన్నను కాదు. సరకుల దిగుమతిచేసికొన్న దేశములు ఎగుమతిచేయు ప్రాంతముల అంతకన్న తక్కువ శ్రమ పెట్టుబడులతో ఆయా సరకులు తయారుచేసికొనగలిగినను అంతర్జాతీయ వ్యాపార మార్గములద్వార అనేకములగు సరకులు గమించుచున్నవి. ఆ సరకులు దిగుమతిచేసికొనుటకు కారణము దిగుమతిచేసికొనుచు దేశములకు ఇతర వస్తువులను తయారుచేయుటయందు ఇంకను హెచ్చగు ఆధిక్యముండుటయే. ప్రతిదేశము ఒక సరకును ఏదేని ఒక విదేశముకన్న తక్కువ ఖరీదుకు ఉత్పత్తిచేయగలిగినంత మాత్రమున దానిని తప్పక తయారుచేయుననుట కాక, మిక్కిలి హెచ్చగు లాభసాటి అవకాశములకు మిక్కిలి తక్కువయగు లాభసాటి ఖర్చులకు తయారుచేయగల సరకులనుమాత్రమే ఉత్పత్తిచేయుననుటయే అంతర్జాతీయ వాణిజ్యమునకు సంబంధించినంతవరకు తారతమ్య వ్యయ సిద్ధాంతము. ఏ ఏ సరకులను ఉత్పత్తిచేయుటయందు తన ఆధిక్యము సుస్పష్టములేక ఏయే సరకులను ఉత్పత్తి చేయుటయందు తన అసామర్థ్యము హెచ్చుగా కానరాదో అట్టి సరకులనే ప్రతిదేశము తయారుచేయును. ఈ సూత్రము దాని పునాదులయిన శ్రమవిభజనము, పరిశ్రమల కేంద్రీకరణము అను ఆర్థిక సిద్ధాంతములు అమలు జరిగినకొలది ప్రపంచమందంతటను ఉత్పత్తి ఆర్థిక సామర్థ్యము వృద్ధినొందదు. ప్రతి వ్యక్తిని సంక్రమించు భాగముకూడ హెచ్చగును.

**పరిమితులు:-** సరకులు ఉత్పత్తియందు తారతమ్య వ్యయభేదములున్నంతవరకే రెండు దేశముల మధ్య వ్యాపారము సాగునను రికార్డో సిద్ధాంతము సత్యమే. కాని రికార్డో ప్రవచించిన రూపమున అది పెక్కు అంశములలో అసంపూర్ణము. తారతమ్య వ్యయములు అంతర్జాతీయ వ్యాపారములోనికి వచ్చుసరకుల జాబితాను మాత్రమే నిర్ణయింపగలవుకాని మార్పిడి సరకులను అనగా ఎన్నిసరకులు దిగుమతి చేసికొనబడునో ఎన్నిసరకులు ఎగుమతి చేసికొనబడునో మార్పిడి అగునది ఎన్నిసరకులు అను విషయమును నిశ్చయింపవు. 'క'అనుదేశమునకు నూలుబట్టలు తయారుచేయుటయందు ఎక్కువ లాభసాటియగు అవకాశములు కలవు, కావున వానిని ఉత్పత్తిచేయుచున్నచో ''చ'' అను దేశము అట్లే ఉన్నిబట్టలను తయారుచేయుచున్నచో ఏసూత్రము ననుసరించి ఆరెండుదేశములు తారతమ్యవ్యయ సిద్ధాంతమును అమలుజరుపుట వలన వచ్చినలాభములను పంచుకొనును అనుప్రశ్నఉదయింపగలదు. అది మారకపురేటుపై ఆధారపడియుండును. ఈమారకపురేటు ఎట్లునిర్ణయించబడును? విపణియందలి బేరముచేసికొను పద్ధతినిబట్టి అని ఆడమ్‌స్మిత్‌ ఉద్దేశానుసారముగా రికార్డో అనుచరులిచ్చినసమాధానము సంతృప్తికరముగా లేదు. ఆధునిక ఆర్థిక సిద్ధాంతము ననుసరించి వేరొకదేశముయొక్క సరకులపట్ల ఒక దేశమునకుగల ''అపేక్ష విస్తరణశక్తి'' (యెలాస్టిసిటీ ఆఫ్‌ డిమాండు) పై ఆధారపడి మార్పిడి నిష్పత్తియుండును.

పై ఉదాహరణమునందు చూపబడినటుల "క" నూలుబట్టల నుత్పత్తి చేయుటయందును, "చ" ఉన్నిబట్టలు తయారు చేయుటయందును శ్రద్ధవహించుచుండగా 'క' 'చ' యను రెండుదేశములనడుమ లాభకరమగు వ్యాపారము సాగు చుండినచో, "క" దేశమునకు ఉన్నిబట్టలయెడల "చ" దేశమునకు నూలుబట్టలయెడలగల అపేక్ష విస్తరణశక్తుల ననుసరించి మార్పిడిరేటు ఉండును. "చ" దేశమునకు నూలుబట్టలయెడలగల అపేక్ష విస్తరణశక్తికన్న 'క' దేశ మునకు ఉన్నిబట్టలయెడగల అపేక్షవిస్తరణశక్తి ఎక్కువైన మార్పిడిషరతులు "క" దేశమునకనుకూలముగనుండును. కొన్నినూలుబట్టలకుబదులు అంతకన్న యెక్కువ ఉన్నిబట్టలు "క" పొందును. ఇదియే "చ"కును వర్తించును.

సనాతన (క్లాసికల్) ఆర్థికశాస్త్రజ్ఞులు వ్యయ మును, శ్రమించినదినములను బట్టియే నిర్ణయించుట వారి యొక్క తారతమ్య వ్యయసిద్ధాంతమునందలి మరియొక లోపము. శ్రమాధార మూల్యసిద్ధాంతమందు వారికిగల నమ్మికయే దీనికి కారణము. ఆధునిక వాదులు ఉత్పత్తి కగు వ్యయమును, శ్రమను బట్టి నిర్ణయించుటలేదు. ఉత్పత్తి సాధనముల యెక్కువ తక్కువ కొలతలను స్ఫురింపచేయునటుల అదనపువ్యయము (మార్జినల్ కాస్టు ఆఫ్ ప్రొడక్షను) సిద్ధాంతపు పరిభాషలో వారే సిద్ధాంతీక రింతురు. దీని ననుసరించి ఒకదేశము సమృద్ధియైన ఉత్పత్తి సాధనముల ఫలితముగ తయారైన సరకులను ఎగుమతి చేసి కొరతగానున్న యుత్పత్తి సాధనములచే తయారు కావలసిన సరకులను దిగుమతి చేసికొనును.

అంతర్జాతీయ వాణిజ్యార్థమై సరకుయొక్క అవశ్య కత పెరిగి తత్ఫలితముగ కలుగు ఉత్పత్తి పెంపుదల స్థిర ఫలిత సూత్రమునకు లోబడి వర్తించునని రికార్డో భావించెను. కాని అంతర్జాతీయ పారిశ్రామిక ప్రత్యేకతల వలన ఉత్పత్తి పెరుగుదల ఎల్లప్పుడు స్థిరపరిస్థితిలోనే జరుగదు. ఉత్పత్తి అధికమగుకొలది ఖర్చుతగ్గుచుండినచో తారతమ్య సౌకర్యము హెచ్చుచుండును. కాని ఉత్పత్తి ఎక్కువగుకొలది వ్యయముకూడ హెచ్చుచుండినయెడల తారతమ్య సౌకర్యము తగ్గిపోవును. కొన్ని సందర్భము లలో అది అంతరించుటయు జరుగును. అట్టి సరకులపట్ల అంతర్జాతీయ వాణిజ్యము ఆగిపోవును.

రెండుదేశములనడుమ ఉత్పత్తికగు వ్యయములో తేడా కనుపించినచో అది ఆయాప్రాంతములలోనున్న ఉత్పత్తిసాధనములకొలతనుతెలియజేయునను అంశమును మనస్సునందుంచుకొనినచో రికార్డో పరిశీలనములను ఆధునికసిద్ధాంతములతో అన్వయింపగలము. ఫలితమేమన, ప్రతిదేశము తన ఉత్పత్తిసంపద ఏసరకులను తయారు చేయుటకు హెచ్చు పుష్కలముగా అవకాశమున్నదో ఆసరకులనే తయారుచేయును. ఏ ఉత్పత్తి సంపదయందు కొరతగలదో ఆ ఉత్పత్తి సంపద నుపయోగించి తయారు చేయు వస్తువుల ఉత్పత్తిని తగ్గించివేయును.

అంతర్జాతీయ ఉత్పత్తి ప్రత్యేకతల విషయములో నిది చాల ప్రాముఖ్యముగల అంశము.

**తారతమ్యవ్యయ సిద్ధాంతముయొక్క నిజస్వభావము :-** వ్యయము అనుమాటకు అర్థములు అనేకములు. తార తమ్యవ్యయ సిద్ధాంతమునకు అర్థము చెప్పునప్పుడు ధన రూపకమైన వ్యయమునే మనము సూచించితిమి. వివిధ ప్రాంతముల నడుమ ఉత్పత్తికగు ధనవ్యయములో తార తమ్యములే అంతర్జాతీయ వ్యాపారగమనమును నిర్ణ యించునను విషయము యదార్థమే. కాని ధనరూప వ్యయమున సరకుమార్పిడి సంబంధములే ప్రతిబింబించును. ఏమైనను వ్యయము కొంతవరకు అంతర్జాతీయ వ్యాపార ఫలితమే. ఏలయన అంతర్జాతీయ వ్యాపారము లేనిచో కొన్నిదేశములందు ధనరూపవ్యయము వేరుగానుండును.

రికార్డో దృష్టిలో నిజమైన వ్యయము శ్రమవ్యయమే. శ్రమ విభిన్నతలేని ఒకే ఉత్పత్తిసాధనగా పరిణమించు టపై అతని సిద్ధాంతము ఆధారపడియున్నది. ఉత్పత్తి వ్యయము వివిధ తెగలకు స్థాయీలకు చెందిన పెక్కు విషయములపై ఆధారపడును. ఇందు కొన్ని యంశ ములు నిర్దుష్టమైనవి. తక్కినవి బహుళ ఉపయోగములు గలవి. వాస్తవమైన సిద్ధాంతము ఈ అంశములన్నిటినీ గమనించవలెను.

మార్పిడి సంబంధముల నిశ్చయించునవి తరతమ భేదములు, తెలియజేయు వ్యయములు లేక అవకాశ వ్యయములు. ఈ ఖర్చులకు, కారణము ఉత్పత్తి కవసర మగు సంపద దానిపైగల అపేక్షతో పోల్చినపుడు ఏ దేశ మందయినను కొరతగా నుండుటయే. కావున ఆ కొలది

లైన సంపదను ఏ విధముగా ఉపయోగించవలెనని యోంచి చూడవలసియున్నది. "క" అను వస్తువును తయారు చేయుటయందు ఒకదేశము తన సంపదనంతయు వినియోగించినయెడల నిజముగా అది "చ" అను వస్తువును కొలదిపాటిగాకూడ తయారు చేయజాలదు. అది యొక యూనిటు. "చ" అను వస్తువును తయారు చేసికొన దలచినను "క" యను వస్తువును తయారు చేయుటలో ఒక యూనిటుగాని అంతకన్న ఎక్కువగాని త్యాగము చేయవలసి యుండును.

"చ" అను వస్తువును ఒక యూనిటు తయారు చేయుటకు, "క"అను వస్తువుయొక్క 3 యూనిట్లు ఆ దేశము త్యాగము చేయవలయు నని మనమూహించినచో, ఈ రెండు సరకుల ఉత్పత్తి నడుమ మనమొక నిష్పత్తి నిర్మింప జాలితిమి. దీనినే తారతమ్య వ్యయ నిష్పత్తి యనిగాని, అవకాశ వ్యయ నిష్పత్తి (ఆపర్చ్యూనిటీ కాస్టు రేషియో) అనికాని అనదగును. ఏలయన ప్రతిదేశము ఒక వస్తువు నెక్కువగను, ఇంకొక వస్తువును తక్కువగను తయారు చేయదలచినపుడు ఒకదానికి బదులుగా మరియొక దానిని తయారుచేయుటయే జరుగుచున్నది.

ప్రత్యామ్నాయపు నిష్పత్తులు వివిధ దేశములకు వేరు వేరుగానుండును. ఉత్పత్తి సాధనములు పుష్కలముగా నుండుట, తక్కువగానుండుట, వాటి భేదముల హెచ్చు తగ్గులు, వివిధ దేశములకు వేర్వేరుగా నుండుట ఇవియే కారణములు. ఈ తారతమ్యములే అంతర్జాతీయ వ్యాపారము లాభకరము చేయుచున్నవి. "చ" అను వస్తువు యొక్క ఒకయూనిటు తయారుచేయుటకు 3 యూనిట్ల "చ" అను వస్తువును ఒక దేశము కోల్పోవలసివచ్చినచో మరియు "చ" అను వస్తువుయొక్క ఒక యూనిటు ఏదేని వేరు ప్రత్యామ్నాయపు నిష్పత్తిగల విదేశమునుండి 3 యూనిట్ల "క" కన్న తక్కువ మార్పిడి నొసంగి తెచ్చుకొనగల్గినచో (రవాణాలకు అగు ఖర్చులు లేవనుకొనిన పక్షమున) ఆ దేశమునకు "క" ను మాత్రమే తయారు చేసికొని 'చ' ను పొందకలుగుటయే లాభకరము.

ఈ ప్రత్యామ్నాయపు నిష్పత్తులు ఏ దేశమునందును మార్పుచెందక ఒకేవిధముగా నుండవు. ఉత్పత్తి హెచ్చిన కొలది ఆరోహణ ఫల సూత్రము, అవరోహణ ఫల సూత్రము అను ఆర్థిక సిద్ధాంతములపై ఆధారపడి మారుచుండును.

రెండు వస్తువులకు రెండు దేశములకు సంబంధించినవిగా చెప్పబడిన ఈ అంశములన్నియు రెండుకన్న ఎక్కువ దేశములకు, ఎక్కువ వస్తువులకు అన్వయించునటుల విస్తరింపనగును.

డా. జీ. రా. రెడ్డి.

## అంతర్జాతీయ వ్యాపారము : ఒడంబడికలు :

19. వ. శతాబ్దమున అంతర్జాతీయ వ్యాపారవిషయమున అనేకదేశములు విచక్షణారహిత సిద్ధాంతమును **(The Principle of Non - discrimination)** అవలంబించినవి. ఈ సిద్ధాంతము ననుసరించి ఏఇతరదేశమునకైనను ఇచ్చు వ్యాపారసౌకర్యములను అన్నిదేశములకు వర్తింపజేయవలయునని భావము. దీనిని తొలుత ఆమోదించి ఆచరించినది, బ్రిటనుదేశము. ఫ్రాన్సు, అమెరికాలు ప్రథమమున ప్రతిఘటించియు కాలక్రమమున అంగీకరించి అవలంబించినవి. దానితో ఈ సిద్ధాంతము సర్వామోదమును బొందినట్లయినది.

1929 లో ఆరంభమయిన ఆర్థికమాంద్యము **(Economic depression)** అంతర్జాతీయ వ్యాపారమునందును, వ్యాపార పద్ధతుల యందును అనేకములగు మార్పులేర్పడుటకు కారణ భూతమయినది. వ్యవసాయము ప్రధానముగాగల దేశములందు ప్రథమమున ప్రారంభమై ప్రపంచమంతట నావరించిన యీ ఆర్థిక మాంద్యము అపారమైన ఆర్థిక విచ్ఛిత్తికి మార్గదర్శకమయినది. దీనివలన ఉత్పత్తి తగ్గినది. నిరుద్యోగము బలిసినది; కొనుగోలుశక్తి క్షీణించినది; అంతర్జాతీయ వ్యాపారము మిక్కిలిసన్నగిల్లినది. అనేకముఖ్యదేశములు, తమతమ దేశములలో ఉత్పత్తిచేసిన సరకులను ఇతరదేశములకు పూర్వమువలె ఎగుమతిచేయలేకపోయినందున దిగుమతులనుగూడ తగ్గించుకొనవలసివచ్చినది.

ఎగుమతి దిగుమతులకు పొత్తుకల్పించుటకై వివిధదేశములు వివిధమార్గములను అవలంబించినవి. అంతర్జాతీయ వ్యాపార విషయములలో ప్రభుత్వములు సంబంధము కల్పించుకొన జొచ్చినవి. దిగుమతి సుంకములను వృద్ధి

చేయుట, కరెన్సీ మారకపు విలువలను నిర్ణయించుట, దిగుమతులపై పరిమాణ పరిమితులను (Quantitative restrictions) విధించుట, మున్నగు ననేక మార్గములను అవలంబించి ఎగుమతులను హెచ్చించి దిగుమతులను తగ్గించి రెండిటికిని ప్రోత్సాహకల్పింప వివిధదేశములందు ప్రయత్నములుజరిగినవి. ఈప్రయత్నములు ఏదేశమునకాదేశమే ఇతరదేశముల ప్రమేయము లేక ఇతరదేశములపై, తన విధానముల ప్రభావమును లెక్కచేయక, జరుపుటవలన అంతర్జాతీయ వ్యాపారరంగమున అరాజక మేర్పడినది. ఆర్థికమాంద్యము వలన వివిధదేశములు అనుభవింపక తప్పని చిక్కులతోపాటు ఇతర దేశముల ఆర్థికవిధానముల వలన కలిగిన చిక్కులనుగూడ ఎదుర్కొనవలసి వచ్చెను. రాజకీయ రంగమందువలెనే ఆర్థికరంగమందుకూడ అంతర్జాతీయ సహకారావసరమును మొన్నమొన్నటి వరకు అనేకదేశములు గుర్తింపనేలేదు.

బ్రిటనుదేశము :- ఆర్థికమాంద్యమువలన కలిగిన విషమ ఫలితములను ఎదుర్కొనుటకు అంతర్జాతీయ వ్యాపారము యొక్క ఒడంబడికల మార్గమవలంబించిన మొదటి దేశము బ్రిటను.

1930 వ సంవత్సరమున బ్రిటను దేశమున దిగుమతులకంటె ఎగుమతులు 1030 లక్షల పౌన్లు ఎక్కువగ నుండెను. ఆర్థికమాంద్యము కారణముగ, 1931 లో ఎగుమతులకంటె దిగుమతులే 1040 లక్షల పౌన్లు అధికమయినవి. ఈ అసాధారణ పరిస్థితుల నెదుర్కొనుటకు బ్రిటను అనేక పద్ధతులను అవలంబించినది. అందు మొదటిది పౌను మారకపు విలువను తగ్గించుట. తత్ఫలితముగ బ్రిటను ఎగుమతులు హెచ్చి, దిగుమతులు తగ్గినవి. 1932 నాటికి ఎగుమతులకంటె దిగుమతులు 580 లక్షల పౌన్లు మాత్రమే అధికమయ్యెను. మరుసటి సంవత్సరము రెండును సమానములైనవి.

కాని మారకపు విలువను తగ్గించినందువలన కలిగిన లాభమును బ్రిటను ఎంతయో కాలము అనుభవింపలేక పోయినది. 1933 లో అమెరికాదేశము, 1936 లో ఫ్రాన్సుదేశము, తమతమ కరెన్సీల మారకపు విలువలను తగ్గించినవి. తత్ఫలితముగ బ్రిటనుకు కలిగిన లాభమదృశ్యమయినది.

విదేశములతో వ్యాపారము యొక్క ఒడంబడికలను గావించుకొనుట బ్రిటను అనుసరించిన రెండవ పద్ధతి. 1932 లో బ్రిటిషు కామన్వెల్తు ఇతర దేశములన్నియు 'అట్టావా' లో సమావేశమై కామన్వెల్తు దేశముల నుండి వచ్చు దిగుమతులపై కామన్వెల్తులోలేని ఇతర దేశములనుండి వచ్చు దిగుమతులపైకంటె తక్కువ దిగుమతి సుంకములను విధించుటకు నిర్ణయించినవి. ఉదాహరణకు:- జపానుదేశమునుండి ఎగుమతియగు వస్త్రములకంటె బ్రిటనునుండి ఎగుమతియగు వస్త్రములకు కామన్వెల్తు దేశములలో రక్షణలభించినది. అట్లే ఇతరములగు సరకులకును రక్షణము లభించినది. ఇంతమాత్రమే కాక కేవలము కామన్వెల్తుదేశములనుండి మాత్రమేకాక బ్రిటిషుసరకులపై విశేషముగ ఆధారపడు ఇతరదేశముల నుండికూడ బ్రిటను ఇట్టి సౌకర్యములను సంపాదింపగలిగినది. కాని ఈ యొడంబడికలవలన బ్రిటిషుసరకులకు కామన్వెల్తుదేశములతో వ్యాపారమది హెచ్చినను, ఇతర దేశములతో వ్యాపారము తగ్గినది. తుదకిందువలన బ్రిటను లాభమును పొందినదా లేదా యనునది వివాదగ్రస్తమై మిగిలిపోయినది.

ఇట్లు అంతర్జాతీయ వ్యాపారములో తనభాగమును అధికము చేసికొనుటకు బ్రిటనుపడిన తాపత్రయము సుఖదముగ నుండినట్లు కన్పించినను అవి తాత్కాలికములేయైనవి. ముఖ్యముగ ఇతరదేశములుగూడ బ్రిటను చూపిన మార్గములనే అనుసరించుటతో ఆదేశమునకు తొలుతకలిగిన లాభము మాయమయినది. మరి ఇతరదేశములతో సంప్రదింపక, తన కరెన్సీ మారకపు విలువలను తగ్గించి, తన విదేశవ్యాపారమును వృద్ధినొందించుకొను ప్రయత్నములు చేసికొనుట ప్రతి దేశమునకు పరిపాటియైనది. దానితో కరెన్సీ మారకపువిలువలలో స్థిరత్వము నశించినది. ఇది అంతర్జాతీయ వ్యాపారమునకు బలమైన అంతరాయముగ పరిణమించినది. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరము అంతర్జాతీయ ద్రవ్యనిధి ( International Monetary Fund ) ను స్థాపించునంతవరకు ప్రతిదేశమును తనమారకపు విలువలను తగ్గించుటవలన అది లాభమును పొందుటకు ప్రయత్నించు నను భయము పోలేదు.

ఈ విధముగనే వ్యాపారము నందలి ఒడంబడికలవలన కూడా అంతర్జాతీయ వ్యాపారము క్షీణించినది. కామన్వెల్తు దేశములతో ఒడంబడికల ద్వారమున బ్రిటను తన విదేశ వ్యాపారమును హెచ్చించుకొనుటకు చేసిన ప్రయత్నములను ఇతర దేశములు చూచుచు నూరకుండ లేదు. ఆ దేశములు కూడ ఇతర దేశములతో సంప్రదింపులు జరిపి పరస్పర నిర్ణయములు (Bilateral-Agreements) చేసికొనుట కారంభించినవి. ఆ కారణమున అంతర్జాతీయ వ్యాపారము సహజమార్గమున గాక పరస్పర నిర్ణయ ఫలితమగు కృత్రిమ మార్గమున నడిచినది. అన్ని దేశములును కలిసి, అన్యోన్య సహకారముతో, ఆర్థికమాంద్యమును ఎదుర్కొనియుండినచో అంతర్జాతీయ వ్యాపారము అంతగా తగ్గియుండెడిదికాదు. అట్టి అంతర్జాతీయ సహకారములేని కారణమున ఏదేశమున కాదేశము తన యార్థికస్థితిని చక్కబెట్టుకొనుటకును, ఎగుమతి దిగుమతులకు పొత్తు కల్పించుటకును విడివిడిగా ప్రయత్నించినందున, కరెన్సీ విలువలలో స్థయిర్యము నశించుట, రెండు రెండు దేశములకు వ్యాపారపు టొడంబడికలు జరుగుట, సామాన్యములయినవి. ఈ విధముగ అంతర్జాతీయ వ్యాపారము తగ్గిపోవుటకు ఈ పద్ధతులను ప్రథమ పర్యాయముగ అవలంబించిన బ్రిటనుదే బాధ్యతయని చెప్పకతప్పదు.

**జర్మనీదేశము :-** ఆర్థికమాంద్యమును ఎదుర్కొనుటకును, ఎగుమతి దిగుమతులకు పొత్తుకల్పించుటకును. జర్మనీ అవలంబించిన పద్ధతులు అపూర్వములు. ఆర్థికమాంద్యమువలన కలిగిన నిరుద్యోగ సమస్యను యుద్ధ పరికరముల నుత్పత్తిచేయు వ్యాజమున పరిష్కరించినది. అదివిషయాంతరము. విదేశవ్యాపారములో దిగుమతుల అనుమతి విధానము (Import licensing) ను, ఎక్ఛేంజి కంట్రోలును ప్రవేశపెట్టినది. అనగా జర్మనీలోనికి విదేశ వస్తువులను దిగుమతి చేసికొనుటకు వ్యాపారస్థులకు ప్రభుత్వానుమతి (License) యుండవలెను. ఎక్ఛేంజికంట్రోలు అనగా విదేశములకు ఎగుమతిచేసిన సరకులవలన సంపాదించిన 'విదేశకరెన్సీ' ని, ఎగుమతి వ్యాపారస్థులు ప్రభుత్వాధీనముచేసి, తత్ప్రతిఫలముగ 'జర్మనుకరెన్సీ' ని తీసికొనవలెను. ఇట్లు విదేశవ్యాపారమును క్రమబద్ధముచేయు నధికారము ప్రభుత్వపరమయ్యెను. ఈ అధికారమును పురస్కరించుకొని జర్మనుప్రభుత్వము ఆగ్నేయ-ఐరోపాదేశములతోను, లాటిన్ - అమెరికా దేశములతోను అనేక వ్యాపారపు టొడంబడికలను గావించుకొనినది. ఆ ఒడంబడికలలోని ముఖ్యసూత్రమేమన—ఒకదేశము జర్మనీనుండి ఎంతవిలువగల సరకును దిగుమతిచేసికొనునో అంతే విలువగలసరకును జర్మని ఆదేశమునుండి దిగుమతి చేసికొనును. జర్మనీ దేశమునకు తమ సరకులను ఎగుమతిచేయుదేశము లన్నియు తమకుకావలసిన సరకులను జర్మనీదేశమునుండి దిగుమతి చేసికొనవలసివచ్చినది. ఈపద్ధతులను ఇతర పారిశ్రామికదేశములు తీవ్రముగ విమర్శించినవి. కాని చేయునదిలేక యుద్ధము పరిసమాప్తి యగునంతదనుక వేచియుండక తప్పినదికాదు.

**అమెరికాదేశము :-** ఆర్థికమాంద్యము నెదుర్కొనుటకు ప్రెసిడెంటు రూజ్‌వెల్టు అధ్యక్షుడుగా అమెరికా అవలంబించిన విధానమునకు 'న్యూడీల్' (New Deal) అనిపేరు. ఈవిధానము అమెరికా ఆర్థికవ్యవస్థకు తిరిగి స్వస్థత చేకూర్చినది. విదేశవ్యాపార విషయమున ఇతరదేశములతో వ్యాపారపుటొడంబడికలుచేసికొనుటకు అధ్యక్షునకు అధికార మీయబడినది. ఇది వ్యాపారపు టొడంబడికల చట్టము (Trade Agreements Act, 1934) గా రూపొందినది.

అమెరికాదేశమున దిగుమతిసుంకముల ద్వారమున దేశపరిశ్రమలకు, వ్యవసాయమునకు రక్షణకల్పించుట చిరకాలసంప్రదాయముగనున్నది. ఈదిగుమతిసుంకములు ఇతరదేశములతో వర్తకపు టొడంబడికలు చేసికొనుటయందు ఆదేశమునకు లాభదాయకమగు నియమములను పొందుపరచుటకు ఉపయోగింపబడినవి. అంతర్జాతీయ వ్యాపారముయొక్క పునర్జీవనమే 1934 లోని వ్యాపారపు టొడంబడికల చట్టము (Trade Agreements Act, 1934) యొక్క ముఖ్యోద్దేశము. ఆ చట్టము ననుసరించి అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షునకు ఆనాటికున్న దిగుమతిసుంకములను సగమువరకు తగ్గించుటకు అధికార మీయబడినది. అట్లు దిగుమతి సుంకములను తగ్గింపవలెను. ద్వితీయ ప్రపంచ సంగ్రామమునాటి కీవిధముగ నిరువదియొక్క వర్తకపు టొడంబడికలుజరిగి అమె

రికా దిగుమతులపై గల దిగుమతిసుంకములు 48శాతము నుండి 28 శాతమునకు తగ్గినవి. ఈ వర్తకపు టొడంబడికలవలన చాలవరకు ముందుగాసూహించిన యుద్దేశములు ఫలవంతములైనవి. దిగుమతి సుంకములు పెరుగుటమాని తరుగుట కారంభించినవి. ఈ పునాది పైననే యుద్ధానంతరకాలమున ఈ సమస్యను పరిష్కరించుటకు వలసిన ప్రయత్నములు జరిగినవి.

అంతర్జాతీయ వ్యాపారపు టొడంబడికల చట్టము ఆమోదించిన కాలము నుండియు (1934) అమెరికా దేశము అంతర్జాతీయ వ్యాపారమును పెంపుచేయు పద్ధతుల నవలబించుచు వచ్చినది. అమెరికా 1934 నుండి 1939 వరకు గడచిన కాలములో ఇరువదియొక్క దేశములతో వ్యాపారపు టొడంబడికలను గావించుకొని అంతర్జాతీయ వ్యాపార విస్తరణమునకుగల అంతరాయములను నిర్మూలించుటకు గట్టిప్రయత్న మొనర్చినది. యుద్ధకాలమునందే జరిగిన 'అట్లాంటిక్ ఛార్టరు' అను బ్రిటను అమెరికాల సంయుక్త ప్రకటనమునందు అన్ని దేశములకు వ్యాపారమునందును, ముడిసరకుల సేకరణయందును సమానావకాశములను కల్పించుటకు అనువుగ తీర్మాన మున్నది.

అంతర్జాతీయ వ్యాపార విస్తరణమునకు యుద్ధానంతర కాలములోని ప్రయత్నములు :- 1943-45 మధ్యకాలమున బ్రిటను, అమెరికా, కెనడా దేశముల ప్రతినిధులు అనేక పర్యాయములు సమావేశమై సమాలోచనములను జరిపిరి. 1945లో అమెరికాదేశము అంతర్జాతీయ వ్యాపార విస్తరణమునకును, సర్వ దేశములయందును నిరుద్యోగ నిర్మూలనము (Full Employment Policy) నకును కొన్ని సూచనలు గావించెను. ఈ సూచనలను అనేక దేశముల ప్రభుత్వములు పరిశీలించి 1947 సంవత్సరాంతమున 'హవానా' యందు జరిపిన సమావేశమున చర్చించినవి. ఈ సమావేశమున 56 దేశముల ప్రతినిధులు పాల్గొనిరి. 1948 వ సంవత్సరము మార్చి నెలనాటికి "అంతర్జాతీయ వ్యాపార పథక నియమావళిని" (International Trade organization charter) 53 దేశము లామోదించినవి. ఈ నియమావళి ననుసరించి అంతర్జాతీయ వ్యాపారపు టొడంబడికలు రెండు రెండు దేశములమధ్యగాక అన్ని దేశములును పాల్గొనుటకు అవకాశము కలిగిన యొడంబడికల మూలమున అంతర్జాతీయ వ్యాపారవిస్తరణమే, ప్రధానాంశమయినది. అంతియేకాక 'అంతర్జాతీయ ద్రవ్యనిధి' (International Monetary Fund) సక్రమముగసాగి, వివిధదేశములమధ్య ఋణపరిష్కారము నిర్నిరోధముగ జరుగవలయుననిన ఇట్టియొడంబడికలు అవసరమని గుర్తింపబడినది.

వ్యాపారమును, దిగుమతి సుంకములనుగురించిన సాధారణసమ్మతి (General Agreement on Trade and Tariff లేక Gatt) : పై ప్రయత్నముతోపాటు వాణిజ్యసమ్మతుల చట్టము (Trade Agreements Act) క్రింద అమెరికా, 1947లోనే, 15 దేశములతో సంప్రదింపులు ప్రారంభించెను. ఆతరువాత మరి 8 దేశములుకూడా ఈ 'జినీవా' సంప్రదింపులలో పాల్గొనినవి. ఈసంప్రదింపులలో ఒకముఖ్యవిశేషముగలదు. సంప్రదింపులు రెండుదేశముల మధ్య జరుగును. అందు ఒకదేశము తాను రెండవదేశమునుండి దిగుమతి చేసికొను సరకులపైగల నిర్బంధములను తొలగించుటకు గల అవకాశములను పరిశీలించి, తన అంగీకారమును తెలుపును. అట్లు తాను తొలగించిన నిర్బంధముల వలన కలుగులాభము, సంప్రదింపులుజరిపిన రెండవదేశమే కాక, సమావేశములో పాల్గొనిన అన్నిదేశములకును గలుగును. అట్లు 1947 వ సంవత్సరము అక్టోబరు మాసాంతమునకు 123 సంప్రదింపులుజరిగి 50,000 సరకులపై గలనిర్బంధములుకొంతవరకు తొలగింపబడినవి. ఈ సమావేశముల ఫలితములు, వ్యాపారమును, దిగుమతి సుంకములను గురించిన సాధారణ సమ్మతులలో (General Agreement on Trade and Tariff, 1947) పొందుపరుపబడినవి.

రెండు సంవత్సరముల తరువాత 1949 లో 'అన్నెసీ' (Annecy) లో 31 దేశముల ప్రతినిధులు సమావేశమయిరి. ఆ సమావేశములవలన కలిగిన ఫలితములుకూడ ఆ తరువాత Gatt లో పొందుపరుపబడినవి.

ఈ Gatt వలన ప్రపంచ వ్యాపారములో సగము భాగమునకు లాభము కలిగినది. ఈ సమాలోచనములు ఇంకను కొంతకాలమువరకు అప్పుడప్పుడు జరుగుచునే యుండును. ఈ సమాలోచనముల ఫలితముగ అంత

ర్జాతీయ వ్యాపారమునకు ప్రస్తుతముండిన నిరోధములు, అంతరాయములు, తగ్గి అంతర్జాతీయ వ్యాపార విస్తరణమునకు దారి ఏర్పడు నని అనేకుల అభిప్రాయము. ఆర్థికముగ వెనుకబడియున్న దేశముల ప్రత్యేకావసరము లను గుర్తించి ఆ దేశముల పరిస్థితుల కనుగుణముగ ఆయా దేశములు వ్యవహరించుటకు అవకాశములు కల్పించుట ఈ వ్యాపార సంస్థలోని విశేషము. ఈ కారణమువలన ఆర్థిక పురోభివృద్ధిని సాధించిన దేశములును, వెనుకబడిన దేశములును, సమానముగ ఈ సంప్రదింపులలో పాల్గొను టకు వీలైనది. కాని రష్యా చైనా దేశము లీవ్యాపార సంస్థలలో పాల్గొనకుండుట గమనార్హము.

అంతర్జాతీయ ద్రవ్యనిధి. (International Monetary Fund) :– అంతర్జాతీయ వ్యాపారమునకు అంతరాయము కల్పించిన కారణములలో ఏ దేశమున కాదేశము ఇతర దేశముల ప్రమేయము లేకయే, తన దేశపు కరెన్సీ మారకపు విలువలను నిర్ణయింపబూనుట అని ఇదివరకు సూచింపబడినదిగదా ! కరెన్సీ విలువలలో స్థయిర్యము లేనంతకాలమును అంతర్జాతీయ వ్యాపారము ఒడుదుడు కులపాలుకాక తప్పదు. అట్టి స్థిరత్వమును సాధించుటకై అంతర్జాతీయ ద్రవ్యనిధి(International Monetary Fund) 1947 వ సంవత్సరము మార్చినెల మొదటి తేదీనుండి ప్రారంభింపబడి పనిచేయుచున్నది. ఈ ద్రవ్యనిధి నేర్పర చిన సభ్యదేశములు తామానాటికి నిర్ణయించిన తమతమ కరెన్సీ విలువలను పరస్పరానుమతిలేక మార్చకూడ దనుట నిర్ణయము. ఎగుమతి దిగుమతులకు తాత్కా లికముగా పొత్తు కుదురని కారణమున, ఏ దేశమయి నను ఇతరదేశములు చెల్లింపవలసినంత విదేశపు కరెన్సీ లను సేకరింపలేనియెడల, నిధినుండి ఋణము తీసి కొనవచ్చును. ఈ ఏర్పాటువలన తమకష్టము తొలగనిచో ఎగుమతి దిగుమతులకు పొత్తుకల్పించుటకు తమదేశపు కరెన్సీ విలువలను తగ్గించుట (Devaluation) మొదలగు చర్యలను తీసికొనవచ్చును.

ఈనిధి నియమములు వివిధదేశముల ప్రత్యేకావసర ములను దృష్టిలోనుంచుకొని నిర్ణయింపబడినవి. కరెన్సీ విలువలలో మాటిమాటికి మార్పులు జరుగకుండ చేయు టయే దీని ప్రధానాశయము. ఇది వ్యాపారపు ఒడం బడికకాక, కరెన్సీవిలువల విషయమై చేసికొన్ననిర్ణయ మైనను అంతర్జాతీయ వ్యాపారవిస్తరణమునకు దోహద మిచ్చు ప్రయత్నమగుటచే, ఒకదృష్టితో చూచినయెడల అది అంతర్జాతీయ వ్యాపారపు ఒడంబడికయే యగును.

ఆర్థికమాంద్యము ప్రారంభమయిన అనంతరమున ఉక్కు, రబ్బరు, టీ, పంచదార మున్నగు సరకుల 'గిరాకీ' తగ్గిపోయినది. ఉత్పత్తి యథాప్రాప్తికముగ సాగుచుండిన కారణమున ధరలు విపరీతముగ తగ్గిపోయినవి. ఉత్పత్తిని తగ్గించి తక్కువసరకును అమ్ముటవలన వచ్చు ఆదాయము కంటె, ఎక్కువసరకును ఉత్పత్తిచేసి విక్రయించుటవలన వచ్చు ఆదాయము తక్కువ. ఆ కారణమున ఆయా సరకుల నుత్పత్తిచేయు దేశములు తమతమ ఉత్పత్తి పరి మితులను నిర్ణయించుటకు తీర్మానించినవి. అట్టి నిర్ణ యములు ఉక్కు, రబ్బరు, టీ, పంచదార పరిశ్రమల విషయమున జరిగినవి. ఈ నిర్ణయములు చేసికొనిన సభ్య దేశముల ప్రభుత్వములు ఈ సంప్రదింపులు, నిర్ణయములు జరుపుట ఇందలి వైశిష్ట్యము.

అంతర్జాతీయ వ్యాపారపు ఒడంబడికలవలన వ్యాపా రము సహజమార్గమునగాక కృత్రిమమార్గముల జరుగును. తత్ఫలితముగ అంతర్జాతీయ వ్యాపారము క్షీణించును అనుటలో వివాదములేదు. ఈ నాడు సుదూరముననున్న దేశములందే ఉత్పత్తియగు వస్తుసంచయమును మనము అనుభవింపగలుగుట, అంతర్జాతీయ వ్యాపార మూలము ననే. ఈ వ్యాపారమెంతగా వృద్ధిగాంచిన ప్రపంచదేశము లందలి ప్రజల జీవితసౌభాగ్యము అంతగా విలసిల్లును. అంతర్జాతీయ వ్యాపార నిరోధకము లగు వర్తకపు ఒడంబడికలు అట్టి అవకాశములను తగ్గించునని వేరుగ చెప్పనక్కరలేదు. అన్నిదేశములందలి ప్రజలు ప్రపంచ మందలి వస్తుసంపదను వీలైనంత అనుభవించుటకు చేయ తగిన మార్గములలో ముఖ్యమయినది ఈ వర్తకపు ఒడంబడికలను సాధ్యమయినంతవరకు నిర్మూలించు టయే యగును. ఈ యుద్దేశముతోనే నేడు అంతర్జాతీయ వ్యాపారరంగమున తీవ్రకృషిజరుగుచున్నది. సర్వమానవ ఆర్థికాభ్యుదయమునకు అట్టి కృషి విజయవంతమగుట శ్రేయస్కరము.

కె. స.

**అంతర్జాతీయ సంస్థలు :-** ప్రపంచమందు ప్రస్తుతము సుమారు ఎనుబది స్వతంత్ర రాజ్యములున్నవి. ఇవి తమ ఆశయములను సార్థకపరచుకొనుటకు ఏర్పరచుకొనిన సంస్థలు జాతీయము లని, అంతర్జాతీయము లని రెండురకములుగ నున్నవి. ప్రత్యేకముగ ఏ రాజ్యమున కారాజ్యము— ఇతర రాజ్యముల ప్రసక్తి ఏలాటిదిలేక— ఏర్పరచుకొనిన విజాతీయ సంస్థలు, ప్రతిరాజ్యమందుండు శాసనసభలు, మంత్రుల సభలు, న్యాయస్థానములు మొదలైనవి ఈ లాటివి. ఇట్లుగాక, ఇతరరాజ్యము లనేకములతో కలసి ఏర్పరచుకొనిన సంస్థలు మరికొన్ని కలవు. అనేక రాజ్యములు కలసి ఏర్పరచుకొనిన కారణమున వీనికి అంతర్జాతీయసంస్థ అనుపేరు చెల్లుచున్నది.

అంతర్జాతీయ సంస్థలు సాధింపదలచు ప్రయోజనములు తాత్కాలికములుగాక దీర్ఘకాలికములుగను, శాశ్వతములుగను ఉన్నవి. వీనినిగురించి గుర్తించతగ్గ విశేషములలో ఇదియొకటి. ఈ ప్రయోజనములుకూడ అన్నిరంగములకు— రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగములన్నిటికి—చెందిన సాధారణ ప్రయోజనములుగగాని, లేక ఏదో ఒక ప్రత్యేక రంగమునకు చెందినవిగగాని ఉండవచ్చును. ఈ విభేదమునుబట్టి అంతర్జాతీయ సంస్థలను సాధారణ (General) సంస్థలని, ప్రత్యేక సంస్థలని (Specialized) రెండువర్గములుగ విభాగము చేయనగును. మానవుల అభ్యుదయమునకై సర్వవిధముల పాటుబడుటకును, యుద్ధముల నివారించుటకును స్థాపింపబడిన "ఐక్యరాజ్యసమితి" యు (United Nations) దాని అంగములును, శాఖలును మొదటివర్గములో చేరినవి, అలాగుకాక ఉత్తరములను, వస్తువులను ప్రపంచములో ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు సుకరముగ పంపుటకై ఏర్పాటు చేయబడిన యూనివర్సల్ పోస్టల్ యూనియన్ (Universal Postal Union) రెండవవర్గములో చేరినది. అంతర్జాతీయ కార్మికసంఘము (International Labour Organisation), ప్రపంచ ఆరోగ్య సంఘము (World Health Organisation), ఆహార,వ్యావసాయిక సంఘము (Food and Agricultural Organisation), అంతర్జాతీయ విద్యా వైజ్ఞానిక, సాంస్కృతిక సంఘము (United Nations Educational, Scientific, Cultural Organisation) మొదలైనవికూడ ఏదియో ఒక ప్రత్యేక ప్రయోజనమును మాత్రమే సాధించునవి గనుక రెండవవర్గములో చేర్పదగియున్నవి.

దీనితోపాటు మరియొక విభేదముకూడ గమనింప తగియున్నది. ప్రస్తుతము ప్రపంచములో పనిచేయుచుండు అంతర్జాతీయ సంస్థలలో కొన్నిప్రభుత్వములచే స్థాపింపబడి నిర్వహింపబడుచుండునవి ; ఐక్యరాజ్యసమితి, యూనివర్సల్ పోస్టల్ యూనియన్ మొదలైనవి ఈలాటివి. వీనిసంఖ్య సుమారు ఎనుబదియని, చెప్పవచ్చును. మరికొన్ని ప్రభుత్వములతో జోక్యములేని అనధికారులచే స్థాపింపబడి నిర్వహింపబడునట్టివి. వివిధరాజ్యములలోని వర్తకులు, కార్మికులు, వ్యవసాయదారులు, మతప్రచారకులు, శాస్త్రపరిశోధకులు, గ్రంథకర్తలు మొదలైనవారు వారివారి ప్రత్యేకోద్దేశములను నెరవేర్చుకొనుటకై ఏర్పరచుకొన్న సంఘములు వందలకొలదిగ నున్నవి. అంతర్జాతీయ వర్తకసంఘము (International Chamber of Commerce), అంతర్జాతీయ కార్మికసంఘముల సమాఖ్య (International Federation of Trade Unions), దివ్యజ్ఞాన సమాజము (Theosophical Society), అంతర్జాతీయ రాజ్యాంగవేత్తల సంఘము (International Political Science Association) మొదలైనవి ఇట్టివి. దీనినిబట్టి అంతర్జాతీయ సంస్థలను అధికార (Governmental) సంస్థలనియు, అనధికార (Non-governmental) సంస్థలనియు విభాగము చేయవచ్చునని స్పష్టమగుచున్నది.

ఇటీవలికాలమున అంతర్జాతీయ సంస్థల సంఖ్య విస్తారముగ పెరుగజొచ్చెను. ప్రకృతిశాస్త్ర జ్ఞానము విపరీతముగ వృద్ధిగాంచి దాని ఫలితముగ ఆర్థిక, రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక రంగము లన్నిటియందును రాజ్యము లన్నియు పరస్పరాశ్రయములగుట దీనికి మూలకారణము. రవాణా సౌకర్యములు పెరుగుట ; ఆర్థిక స్వయంపోషకత్వము సాధ్యముకాకపోవుట, పారిశ్రామిక వృద్ధిగాంచిన రాజ్యములు ముడి పదార్థములను ఉత్పత్తిచేయు దేశములపై ఆధారపడవలసివచ్చుట. ఈలాటి మార్పుల మూలమున అనేక విషయములలో అనేక రాజ్యములవారు కలసి పనిచేయవలసిన అవసరమధికమయ్యెను. యూనివర్సల్ పోస్టల్ యూనియన్,

అంతర్జాతీయ కార్మిక సంఘము, అంతర్జాతీయ వర్తక సంఘము మొదలైనవి స్థాపింపబడుటకు ఇట్టి పరిణామమే ప్రధాన కారణము.

ప్రకృతిశాస్త్ర పరిశోధనాభివృద్ధి యుద్ధముల స్వరూపమును మార్చి ఐక్యరాజ్యసమితివంటి అంతర్జాతీయ సంస్థకు అవసరమును కల్పించెను.

రాజ్యములమధ్య వివాదములు తప్పవు. వివాదములను పరిష్కరించుకొనుటలో సామ దాన భేదోపాయములేగాక యుద్ధము (దండము - బలప్రయోగము) కూడ న్యాయమైన సాధన మన్న భావము ప్రపంచమం దనాదిగ వ్యాపించియున్నది. అందుచేత వివాదము లనేకములు యుద్ధముల మూలమున పరిష్కృతము లగుట సర్వసాధారణమయ్యెను. ప్రపంచచరిత్రలో చాలభాగముయుద్ధముల చరిత్రయే కాని ఇటీవలికాలమున యుద్ధముల స్వరూపము పూర్తిగ మారిపోయెను. వానిలో పాల్గొను సైనికుల సంఖ్య కొన్ని వేలనుండి కొన్ని కోట్లవరకు పెరిగెను. ఆధునిక యుద్ధములన్నిటికి మూలస్థానమని చెప్పతగ్గ యూరపు ఖండమందు పదునారవ శతాబ్దపు యుద్ధములలో ముప్పదివేలకు మించిన సైన్యములు పాల్గొనియుండ లేదు. పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభమున నెపోలియన్ నాయకత్వముక్రింద జరిగిన యుద్ధములలో పది లక్షల సైనికులు పాల్గొనిరి. ఇరువదవ శతాబ్దములో జరిగిన మొదటి ప్రపంచయుద్ధమందు ఆరుకోట్ల సైనికులును, రెండవదానియందు సుమారు ఎనిమిదికోట్ల సైనికులును పాల్గొనిరి. పదునెనిమిదవ శతాబ్దమందు జరిగిన యుద్ధములన్నిటియందును హతులైనట్టియు, గాయపడినట్టియు సైనికులసంఖ్య నలుబదియైదు లక్షలు; రెండవ ప్రపంచయుద్ధమందు హతులసంఖ్య 220 లక్షలు, వికలాంగులసంఖ్య 340 లక్షలు; హిరోషిమాలో ఆటంబాంబు ప్రేలుడువలన ప్రాణములగోల్పోయినవారిసంఖ్య 78,000. ఈకాలపు యుద్ధముల మూలమున సైనికులేకాక - విమానముల నుండి ప్రేలు బాంబుల కారణమున - సామాన్యజనులు కూడా హతులగుటయు, వికలాంగులగుటయు సంభవించుచున్నది. పట్టణములు, పల్లెలు లెక్కలేనన్ని నేలమట్టము లగుచున్నవి. ఆస్తినష్టమునకు మితిమేరలు లేవు. రెండవ ప్రపంచయుద్ధములో ఒకయూరపు ఖండమునందు కలిగిన నష్టము 1,500,000,000,000 రూపాయలకు మించియుండునని అంచనా వేసియున్నారు. యుద్ధము ముగిసిన తర్వాతకూడ అగ్రరాజ్యములమధ్య పెరిగిన విరోధముల కారణమున, మరియొక ప్రపంచయుద్ధము రానున్నదను భయముచేత, అట్టి ప్రమాదమునుండి తప్పించుకొనుటకు ప్రతిరాజ్యము దాని ఆదాయములో అర్ధభాగమును సైనిక, నావిక, విమాన బలములను చేకూర్చుకొనుటకై ఖర్చుపెట్టుచున్నది. రెండవ ప్రపంచయుద్ధములో ఆటంబాంబు నొక్కదానినే ప్రయోగించిరి. కాని ఇప్పుడు ఆటంబాంబులేగాక హైడ్రోజన్ బాంబులుకూడ తయారగుచున్నవి. ఇవి బ్రహ్మాస్త్రమునకంటె నెక్కుడుశక్తి గలవి. వీనిప్రయోగము మూలమున దేశములకు దేశములే తుడుచుకొని పోవుననుటలో అతిశయోక్తి లేదు.

యుద్ధస్వరూపమందు ఇట్టి విపరీతమైన మార్పులు కలుగుటచేత రాజ్యములమధ్య సంభవించు వివాదములను సర్వనాశకరమగు యుద్ధసాధనమున పరిష్కరించుకొనుట ఆత్మహత్యవంటి దన్న అభిప్రాయము మొదటి ప్రపంచయుద్ధకాలమందే వ్యాపించెను. సాధనాంతరమొకటియున్నగాని వివాదపడు రాజ్యములు యుద్ధమును మానుట జరగదన్న హేతువున అట్టి సాధన మొకదానిని కల్పించు ఉద్దేశముతో 1919 లో నానాజాతిసమితి **(League of Nations)** ని స్థాపించిరి. ఇది కొన్నిసంవత్సరములపాటు పనిచేసెను. దాని నిర్మాణములో కొన్ని లోపములున్నట్లు అనుభవముమూలమున తెలియవచ్చుటచేత, వాటినన్నిటిని సవరించి రెండవ ప్రపంచ యుద్ధానంతరము విజేతలైన రాజ్యములన్నియు కలసి 1945లో ఐక్యరాజ్యసమితిని స్థాపించినవి. అంతర్జాతీయ సంస్థలన్నిటిలో దీనిదే అగ్రస్థానము. దీనినిగురించిన వివరములను కొన్నిటిని తెలిసికొనుట అవసరము.

ప్రపంచమందంతట శాంతి భద్రతలను స్థాపించుట, రాజ్యములమధ్య సంభవించు వివాదములను అంతర్జాతీయ న్యాయసూత్రముల ననుసరించి శాంతిమార్గమున పరిష్కరించుట, దురాక్రమణోద్దేశముతో యుద్ధములకు ఉపక్రమించు రాజ్యములను శిక్షించుట, రాజ్యముల మధ్య వివాదములు సంభవింపకుండ చేయగల వాతావరణములు సృష్టించుట, ప్రపంచమందలి ఉత్పత్తికిని,

సంఘర్షణములకును కారణములైన దారిద్ర్యము, జాత్యహంకారము, మొదలగువానిని తొలగించుట, ఎట్టి వివక్షతలేక మానవులందరకు— స్త్రీలకు, పురుషులకు— ప్రాథమిక హక్కులను సమకూర్చుట, మానవకల్యాణమునకు సమస్తవిధముల తోడ్పడుట — ఇవియే సమితియొక్క ఆశయములు.

ఇవి నెరవేరుటకు ప్రపంచములోని రాజ్యములన్నిటియొక్క సహకారమవసరము. దీనిని గ్రహించి 1945 లో 51 రాజ్యములు కలిసి సమితిని స్థాపించెను. ప్రపంచములోని తక్కిన రాజ్యములకుకూడ సభ్యత్వమును లభింపజేయుటకు సమితి మూలశాసనములో (Charter) కొన్నిసూత్రములు చేర్చబడెను. శాంతిని కాంక్షించునట్టియు సమితి సభ్యత్వ విధులను నిర్వహించుట కిష్టపడునట్టియు, సమర్థత కలిగినట్టియు రాజ్యములు సభ్యత్వము పొందవచ్చును. దరఖాస్తు పెట్టికొనిన రాజ్యమునకు ఇట్టి అర్హతలు ఉండునదీ లేనిదీ మొదలు భద్రతాసంఘము పరిశీలించును. అర్హతయున్నట్లు అది అభిప్రాయపడినయెడల దాని నాధారముచేసికొని మహాసభ (General Assembly) దరఖాస్తును మంజూరుచేయును. భద్రతాసంఘముయొక్క ఆమోదములేక మహాజన సభ ఏరాజ్యమునకుగాని సభ్యత్వము కల్పించుటకు వీలులేదు. 1945 తర్వాత ఇరువదియైదు రాజ్యములు సమితిలో క్రొత్తగ చేరగలిగెను.

సమితి వ్యవహారములను జరుపుటకు (1) మహాసభ (General Assembly), (2) భద్రతాసంఘము (Security Council), (3) ఆర్థిక సాంఘిక సంఘము (Economic and Social Council), (4) ధర్మకర్తృత్వ సంఘము (Trustee-ship Council), (5) ఉద్యోగవర్గము (Secretariat), (6) అంతర్జాతీయ న్యాయస్థానము అను ఆరు అంగము లున్నవి.

1. మహాసభ :- సమితిలో సభ్యత్వముగల ఒక్కొక్క రాజ్యము మహాసభకు అయిదుగురు ప్రతినిధులను పంపవచ్చును. కాని ఒక్కొక్క రాజ్యమునకు ఓటు (Vote) ఒకటే. కార్యనిర్వహణమునకై మహాసభ ఏటేట ఒక అధ్యక్షుని, ఏడుగురు ఉపాధ్యక్షులను, ఆరు కమిటీలను తప్పక ఎన్నుకొనును. ఇవిగాక మరికొన్ని కమిటీలుగూడ నున్నవి. మహాసభ అధమపక్షము సంవత్సరమునకొక పర్యాయమైన సమావేశము కావలసియున్నది. అంతర్జాతీయములగు రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయములనన్నిటినిగురించి (కొన్ని స్వల్పమినహాయింపులకు లోబడి) మహాసభ ఆలోచించి, శిఫార్సురూపములైన తీర్మానములు గావింపవచ్చును. భద్రతాసంఘముతో భాగస్వామియై ఇది సమితిప్రధానకార్యదర్శిని, అంతర్జాతీయన్యాయస్థాన న్యాయాధికులను ఎన్నుకొనుచున్నది. ఇదిగాక భద్రతాసంఘపు తాత్కాలిక సభ్యులను, ఆర్థిక సాంఘిక సంఘ సభ్యులను, ధర్మకర్తృత్వ సంఘములోని సభ్యులలో కొందరిని ఇది ఎన్నుకొనును. సమితి జమాఖర్చుల నిర్ణయము దీనిదే. సమితియొక్క తక్కిన అంగములు సమర్పించు నివేదికలను విమర్శించి సూచనలుచేయు అధికారము దీని కున్నది. ఇందులో జరుగు ప్రధానమైన తీర్మానములు హాజరై ఓటింగు చేయువారిలో మూడింట రెండువంతుల సభ్యుల ఆమోదమును పొందవలెను. మహాసభ ఒకవిధమైన పర్యవేక్షణసంఘ మని చెప్పతగియున్నది.

2. భద్రతాసంఘము :- భద్రతాసంఘము సమితియొక్క కార్యనిర్వాహకశాఖ. ఇందులో ఐదుగురు శాశ్వత సభ్యులు, ఆర్గురు తాత్కాలిక సభ్యులు-మొత్తము పదునొకండుగురు సభ్యులు - ఉన్నారు. అగ్రరాజ్యములని పేరుగాంచిన సోవియట్ రషియా, యునైటెడ్ స్టేట్సు, బ్రిటన్, ఫ్రాన్సు, చైనాలది శాశ్వత సభ్యత్వము. తాత్కాలిక సభ్యులను రెండేండ్ల కాలపరిమితితో మహాసభ ఎన్నుకొనుచున్నది. భద్రతాసంఘమునుగురించి గుర్తించదగిన గొప్ప విశేషము అగ్రరాజ్యములకుగల అడ్డుపెట్టు (Veto- వీటో) అధికారము. కార్యక్రమమునకు సంబంధించిన (Procedural) విషయములుగాక తక్కిన విషయములను గురించిన తీర్మానము లన్నిటికి అధమపక్షము మొత్తము సభ్యులలో ఏడ్గురి ఆమోదమును, ఆ ఏడ్గురిలో శాశ్వత సభ్యు లందరి ఆమోదమును ఉండవలెను. తీర్మానమును పదిమంది సభ్యు లంగీకరించినను అగ్రరాజ్య సభ్యుడొక్కడు ఆమోదించక అడ్డుతగిలినయెడల అది వీగిపోవలసినదే. సమితివ్యవహారములను నడుపుటలో అగరాజ్యములను కాదని ఏపని చేయుటకు వీలులేదని

ఇది స్పష్టము చేయుచున్నది. ఇదిగాక అగ్రరాజ్యాసు లైదును ఐకమత్యముగలవై ఒక త్రాటిమీద నడిచినప్పుడే భద్రతాసంఘము ఏపనినైనను చేయగలదనికూడ దీని నుండి స్పష్టమగుచున్నది. అట్టి ఐకమత్యము కుదిరిన పను లను మాత్రమే తలపెట్టుట యుక్తమను భావముతో ఈ సంఘనిర్మాణము జరిగెను. రాజ్యములమధ్య సంభవించు వివాదములను గుర్తించుట, వివాదములు యుద్ధములకు దారితీయకుండ చూచుట, యుద్ధములు సంభవించినపుడు ఉభయ పక్షములవారితో సంప్రదించి శాంతినిస్థాపించుట. దురాక్రమణ యుద్ధములలో దిగిన రాజ్యములను శిక్షించుట, ఇదంతయు భద్రతా సంఘము చేయవలసిన పనులు. కాని గత పది సంవత్సరములనుండి సోవియట్ రషియా యునైటెడ్ స్టేట్సులమధ్య విపరీతమగు వైరు ధ్యమేర్పడిన కారణమున భద్రతాసంఘము కార్యనిర్వ హణసంఘ మగుటకు బదులు, గొప్ప వాద ప్రతివాద రంగముగ మారిపోయెను.

**3. ఆర్థికసాంఘిక సంఘము:-** ప్రపంచమందు కొన్ని రాజ్యములు ఆర్థిక సాంఘిక రంగములందు వృద్ధిగాంచు నట్టివిగను, కొన్ని వెనుకబడినట్టివిగను ఉన్నవి. ఈ తరతమ భేదములు తగ్గుటకుకావలసిన చర్యలను సంస్కరణములను సూచించుటకును, వెనుకబడినదేశములలోనిదారిద్ర్యమును తొలగించుటకును, అన్నిరంగములలో పురోభివృద్ధి మార్గ ములను సూచించుటకును ఆర్థికసాంఘికసంఘము స్థాపింప బడెను. ఇందు పదునెనిమిదిరాజ్యములకు సభ్యత్వమున్నది. సమితిలో సభ్యత్వముగలరాజ్యములన్నియు ఈసంఘమున కెన్నుకొనబడుటకు అర్హులు. ఏ పదునెనిమిది రాజ్యములను ఎన్నుకొనవలెనో నిర్ణయించు అధికారము మహాసభది. సభ్యత్వ కాలపరిమితి మూడుసంవత్సరములు. ఆర్థికాభి వృద్ధి, నిరుద్యోగనిర్మూలము, రవాణా సౌకర్యములు, మానవుల ప్రాథమిక హక్కులు, సంఘమందు స్త్రీలకుండ వలసిన గౌరవము, మత్తుపదార్థముల నిషేధము, జన సంఖ్యాసమస్యలు మొదలగు వివిధవిషయములనుగురించి ఈ ఆర్థిక సాంఘిక సంఘము అనేకపరిశోధనలనుగావించి, అభ్యుదయకరము లగు సూచనలను చేయుచున్నది.

**4. ధర్మకర్తృత్వ సంఘము :-** ఇదివరకు వలసలుగ (Colonies) నుండిన ప్రాంతము లనేకములు రెండవ ప్రపంచ యుద్ధానంతరము స్వతంత్రరాజ్యములుగ మారి నను ఇప్పటికికూడ పరాయిప్రభుత్వమునకు లోబడిన ప్రాంతము లనేకము లున్నవి. ఆప్రాంతములలోని ప్రజలు రాజకీయముగ వెనుకబడినవా రనియు ఇప్పటికిప్పుడే స్వరాజ్యము ననుభవించుట కర్హులు కారనియు అందుచేత కొంతకాలమువరకు ఆ ప్రాంతములలో పరాయి ప్రభు త్వము ఉండుట తప్పదన్న అభిప్రాయమొకటి ఉన్నది. కాని వానిని పాలించు పరాయి ప్రభుత్వములవారు స్వలాభపరులుగాక పాలితుల శ్రేయస్సుకై పాటుపడు నట్లు చేయుట ఐక్యరాజ్యసమితి కర్తవ్యములలో నొకటి యని సమితి నిర్మాతలు అంగీకరించి, ఆ ఉద్దేశము నెరవేరుటకుగాను ధర్మకర్తృత్వసంఘమును స్థాపించిరి. ఇందు భద్రతాసంఘములోని శాశ్వత సభ్యులు, వలస ప్రాంతముల పాలించు రాజ్యముల ప్రతినిధులు, సమితిమహాసభ ఎన్నుకొన్న మరికొందరు ప్రతినిధులు ఉన్నారు. సభ్యులలో సగముభాగము వలసలను పాలించు రాజ్యముల ప్రతినిధులుగను, తక్కిన సగము ఇతరులుగను ఉండవలెనను ప్రాతిపదికపై ధర్మకర్తృత్వ సంఘ నిర్మాణము గావింపబడెను. ఇది ఏటేట రెండు పర్యాయములు సమావేశమై, వలసల పరి పాలనముగురించి పరిపాలకులు సమర్పించిన నివేదికలను చర్చించి, ప్రజలకు అన్యాయము జరుగకుండుటకును, శీఘ్రకాలమున వారికి స్వరాజ్యార్హత లభించుటకును కావలసిన సూచనలను చేయుచుండును.

**5. ఉద్యోగవర్గము :-** ప్రతిరాజ్యముయొక్క పరిపా లనమునకు నిపుణులతో కూడిన ఉద్యోగవర్గమున్నట్లు సమితి వ్యవహారములను జరుపుటకుకూడ ఒక ఉద్యోగ వర్గము (Secretariat) ఉన్నది. వీరందరిపై పెత్తనము వహించువాడు సమితి ప్రధాన కార్యదర్శి (Secretary General). ఉద్యోగులు సమితిలో సభ్యత్వముగల వివిధ రాజ్యముల పౌరులు; ఏ ఒక్క రాజ్యమునకు సంబంధిం చినవారు కారు.

**6. అంతర్జాతీయన్యాయస్థానము:-** అంతర్జాతీయన్యాయ స్థానమందు పదునైదుగురు న్యాయాధీశులున్నారు. వీరిని భద్రతాసంఘము, మహాసభ కలసి నియమించుచున్నవి. వీరి ఉద్యోగకాలము తొమ్మిది సంవత్సరములు. వివాద

పడు రాజ్యము లీన్యాయస్థానము యొక్క మధ్యవర్తిత్వము నపేక్షించినయెడల న్యాయాధీశులు తమ అభిప్రాయములను వ్యక్తపరచుచుందురు. అంతర్జాతీయ న్యాయశాస్త్రమునుగురించి సమితికిసంబంధించిన అంగములు సలహాలను కోరినయెడల అట్టి సలహాల నొసగుటకిది సంసిద్ధముగనున్నది.

ఐక్యరాజ్యసమితి కార్యములన్నియు మూడు ప్రధాన సూత్రములతో సమన్వయము కావలసియున్నది. అది తలపెట్టు కార్యమేదియు రాజ్యముల సర్వస్వామ్యమును (Sovereignty) నిరోధించునదిగ నుండరాదనునది మొదటి సూత్రము. ఎట్టి పరిస్థితులలోకూడ ఏరాజ్యము యొక్క ఆంతరింగిక (Domestic) వ్యవహారములలోను సమితి జోక్యము కలిగించుకొనరాదనుట రెండవసూత్రము. అగ్రరాజ్యము లైదింటి యొక్క అంగీకారమును పొందిన గాని శాంతిభద్రతలస్థాపించుటకు కావలసిన కార్యములను సమితి కార్యనిర్వాహకసభ యగు భద్రతాసంఘము చేయరాదనుట మూడవసూత్రము. ఇట్టి సమన్వయము కుదురుట సులభసాధ్యముగా కనబడుటలేదు. అయినను, సమితి ఆదర్శసిద్ధికై అందరు చిత్తశుద్ధితో కృషిసలుపుట ప్రపంచక్షేమమున కవసరము.

మా. వెం. రం.

**అంతర్వేది:-** ఆంధ్రదేశమును పవిత్రముగావించు గోదావరీనది రాజమహేంద్రవరమునుండి, కాశ్యప (తుల్యభాగ), అత్రి (కోరింగనది), గౌతమి, భరద్వాజ, కౌశిక, జమదగ్ని, వశిష్ఠ అను ఏడుపాయలుగా చీలి సముద్రముతో సంగమించుచున్నది. వీటిలో భరద్వాజ. జమదగ్నిపాయ లంతరించినవి. కౌశిక, తుల్యభాగలు చిన్న కాలువలవలెనున్నవి. యాత్రికులీసప్తసంగమస్థలములందును స్నానముచేయుటకు "సప్తసాగర యాత్ర" చేయుదురు. వీటిలో మిక్కిలి పడమటిది వసిష్ఠాసాగర సంగమము. ఇచ్చట వసిష్ఠపాయకు ఎడమఒడ్డున అంతర్వేది క్షేత్రమున్నది. ఇది నరసాపురమను ప్రాచీనచారిత్రక పట్టణమునకు ఏడుమైళ్ళ దూరములోనున్నది. క్రీ. శ. 1602 వ సంవత్సరమున హాలెండుదేశస్థులగు డచ్చివారు ఈప్రాంతమునకు ఓడవర్తకముకొరకు వచ్చిరి. మన దేశస్థులు హాలెండువారిని వలందువారు అనుచుండిరి. సముద్రములోనిల్పిన వలందుల ఓడలనుండి గొప్పపడవలు అంతర్వేదిమీదుగా నరసాపురమునకు జేరుచుండెను. ఓడలకు మార్గసూచనకొరకు డచ్చివారు అంతర్వేదిదగ్గర ఒక గొప్ప స్తంభమును కట్టిరి. ఇది దీపమున్న స్తంభముకాదు. పెద్దఓడలు ఒడ్డునకు రాకూడదని హెచ్చరిక తెల్పుటకీ స్తంభముపయోగించెడిది. ఈప్రాంతమును పిమ్మట ఆక్రమించుకొన్న ఆంగ్లేయులీస్తంభమును బాగుచేయించిరి. 1951 వ సంవత్సరమున ఆగస్టులోవచ్చిన ఉప్పెనలో ఈ స్తంభపు పైభాగము పడిపోయినది. అప్పుడు సముద్రమించుమించుగ నొకమైలుదూరము భూమిమీదికి చొచ్చుకొనివచ్చినది. పూర్వము సముద్రజలమున కరమైలు దూరముననుండెడి యీ స్తంభమిప్పుడు సముద్రములోనున్నది. దీనికి కొంతదూరములోనుండెడి ఆంజనేయస్వామి ఆలయమునుగూడ సముద్రుడు మ్రింగివేసినాడు. ఆలయము కూలిపోయినది. ఆంజనేయవిగ్రహము అంతర్వేది చెరువుగట్టున నొక ఇటుకగుడిలో భద్రపరుపబడినది.

ఈప్రదేశమున కృతయుగమున బ్రహ్మ నూరేండ్లు యాగముచేసి యజ్ఞశాలలో అంతర్వేదికాస్థలమున నీలకంఠేశ్వరుని ప్రతిష్ఠించి క్షేత్రపాలకునిగావించెను. పిమ్మట వసిష్ఠమహర్షి యిట నాశ్రమమేర్పరచుకొని గోదావరి నుండి వసిష్ఠపాయను తీసికొనివచ్చెనట. హిరణ్యాక్షపుత్రుడగు రక్తలోచనుడు ఈశ్వరవరగర్వమున కన్నుగానక, విశ్వామిత్రప్రేరితుడై వసిష్ఠపుత్రులను చంపగా, వసిష్ఠుడు విష్ణువును ప్రార్థించెను. హరి, లక్ష్మీనృసింహరూపమున మునికి ప్రత్యక్షమై, మాయాశక్తియు తన సోదరియునగు అశ్వారూఢాంబ (గుఱ్ఱాలక్క) రాక్షసుని రక్తము భూమిమీదబడకుండ దననాల్కతో పీల్చివేసి తోడ్పడుటవలన, రక్తలోచనుని సంహరించెను. పిమ్మట రాక్షసరక్తమును గుఱ్ఱాలక్క విడిచివేయగా నది రక్తకుల్యయను పేరున ప్రవహించెను. వసిష్ఠుని ప్రార్థనచే లక్ష్మీనృసింహస్వామి అర్చారూపమున నట నిల్చిపోయెను. వసిష్ఠుడు లక్ష్మీనృసింహ విగ్రహమును ప్రతిష్ఠించి అర్చాదులుగావించెను. ఈస్థలమునకు కొంతదూరమున రక్షణగా ఆంజనేయస్వామినిగూడ వసిష్ఠుడు ప్రతిష్ఠించెను. ఆస్వామి ఆలయమే 1951 లో సముద్ర గర్భమునపడెను.

వసిష్ఠుని యనంతరము నృసింహ విగ్రహమొక పుట్టలో నణగియుండెను. కలియుగమున కేశవదాసను గొల్లవాడు తన కపిలగోవు ప్రతిదినమును ఆపుట్టమీద తనపొదుగు పాలు విడుచుచుండుటచూచి అట త్రవ్వింపగా స్వామి విగ్రహము దొరికెను. దానికతడు దారువులతో ఆలయము నిర్మించి పూజాదికము లారంభించెను. స్వామి పెక్కు మహిమలు చూపెను. స్వామివారి అర్చాదులు నిర్వహించుటకు కేశవదాసు కొన్ని భూములను దానముచేసెను. కేశవదాసు నిర్మించిన కొయ్య గుడిస్తంభములు చక్కని శిల్పపు చెక్కడపుపనితనముతో నొప్పుచు, ఉక్కుస్తంభములవలె గట్టిగనున్నవి. ఈ దార్వాలయపు స్తంభములును ప్రస్తుతపు శివాలయము ప్రక్కను భద్రపరువబడి స్వామివారి పాకశాలగా నేర్పడియున్నది. కేశవదాసు పాలెమను గ్రామము నేటికిని అంతర్వేదికి సమీపమున నున్నది. కేశవదాస నిర్మిత దార్వాలయము శిథిలావస్థకు రాగా బెండమూర్లంక కాపురస్థులును, అగ్నికుల క్షత్రియులును అగు కొపనాతి ఆదినారాయణగారు జీర్ణాలయోద్ధరణమునకు పూనుకొనిరి. ఇసుకతప్ప ఏరాయియు దొరకని. యీ దూరసముద్ర ప్రాంతమునకు మహాలయ నిర్మాణమునకు గావలసిన శిలాస్తంభములును, రాళ్లను గొనిరాబడుట వింత. ఆదినారాయణ కొడుకు కృష్ణమ్మ. వీరు ఓడవర్తకము చేయుచుండిరి. ఆనాడు బెండమూర్లంక నుండి ఓడల మూలమున, బట్టలు మొదలగునవి సరకుల వర్తకము విదేశములతో జరుగుచుండెను. పోయినవను కొన్న ఓడలు నృసింహస్వామియనుగ్రహమున విశేష ధన సంపదతో తిరిగిరాగా కృష్ణమ్మగారు, తండ్రిసంకల్పించిన ఆలయమండపాదుల నిర్మాణము పూర్తిగావించిరి. ఈపని శాలివాహనశకము 1745 వ. సంవత్సరమునకు సరియయిన క్రీ. శ. 1823 న ముగిసినట్లు ఆలయపు గోడ మీద నొక శిలాశాసనమున్నది.

గర్భాలయముననున్న స్వామి విగ్రహము పశ్చిమ ముఖముగానుండును. గర్భాలయమునకు నెదుట దానికి జేరి బలమైన మండపములున్నవి. నృసింహాలయమునకు కుడిప్రక్కను రామాలయమున్నది. ఈయాలయ మండపములందు గాఢాంధకారము నెలకొనియున్నను సాయంకాలమున పడమటనస్తమించు సూర్యుని కిరణములు స్వామి విగ్రహ వక్షస్థలమున ప్రసరించి బంగరుకాంతులతో వెల్గులీనుట రమ్యముగ నుండును. ఆ సొగసు ఆలయనిర్మాణమునందేగలదు. స్వామి ఆలయమున కెడమ వైపున కల్యాణ మండపమున్నది. దీనికిచుట్టును నాల్గు వైపులను మండపమున్నది. పశ్చిమ ద్వారముమీది గోపురముకాక, పది చుట్టుకోవెల లున్నవి. నృసింహస్వామి చుట్టును రాజలక్ష్మి తాయారు, వెంకటేశ్వరస్వామి, భూదేవి తాయారు, శ్రీరంగనాయకస్వామి, సంతాన గోపాలస్వామి, కేశవస్వామి, పన్నిద్దరాళ్వారులు, ఆంజనేయస్వామి, శ్రీరాములవారు, గోపాలస్వామియు గలరు. వీరందరును సన్నిధి దేవతలు. మండపములమీది విమానములు కొన్నిగుండ్రముగను, కొన్ని కూచిగను ఉండును. నీలకంఠేశ్వరస్వామి వారి కొక రెడ్డి ప్రభువు ఆలయము కట్టించెను. అది శిథిలముకాగా, దుడ్డు బాబయ్యగారను పేరూరు వాస్తవ్యులును, ఆత్మూరి చినతాతయ్య యను నరసాపురపు ఓడ వర్తకులును జీర్ణాలయోద్ధారము గావించిరి. ఈ యాలయము నేడు శిథిలమగుచున్నది.

ప్రతి సంవత్సరమును మాఘ శుద్ధ దశమినాడు నృసింహస్వామి కల్యాణము జరుగును. ఏకాదశినాడు రథోత్సవమున స్వామి రథము గుఱ్ఱాలక్క గుడివరకు పోవును. వేలకొలది యాత్రికులు భీష్మైకాదశి మొదలు పూర్ణిమ వరకును ఉదయములందు సాగర సంగమ స్నానము గావించి పాపక్షయము నొందుదురు. ద్వాదశితోకూడిన ఆదివారమున సముద్ర స్నానము పుణ్యప్రదము. త్రయోదశినాటి రక్తకుల్యాస్నానము పీడాహరము. చతుర్దశినాడు చోరోత్సవము. పూర్ణిమనాడు స్వామి చక్రతీర్థస్నానముకొరకు సముద్రమున కేగును. ఆ స్థలమున స్వామివారు నిలుచుటకు కట్టబడిన మండపము చక్కగనున్నది. పూర్వ మీప్రాంతము గోల్కొండ నవాబు పాలనలో నుండగా క్రీ. శ. 1582 సంవత్సరమున స్వామివారి చక్రము సముద్రములో కొట్టుకొని పోయెనట. ఎంత వెదకించినను చక్రము దొరకలేదు. అంత పేరూరు ద్రావిడ బ్రాహ్మణు లగు అంతర్వేది చయనులుగారు పదునొకం డహోరాత్రములు మంత్రజపము చేయగా సముద్రుడు చక్రమును బ్రాహ్మణుని పాదములకడ జేర్చెనట. నాటినుండియు పేరూరి

బ్రాహ్మణులకు స్వామి కల్యాణమున ప్రముఖస్థానమేర్పడినది. వారు వచ్చి స్వామి రథముమీద సురటులువీచినగాని రథము కదలదట. స్వామికి నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవాదులు జరుగును.

ఈ సముద్రతీర ప్రాంతమును మొదట పరాసు వారాక్రమింపగా 1758 వ సంవత్సరమున పరాసుల నోడించి ఆంగ్లేయు లాక్రమించుకొనిరి. దేశమంతయు నొక నిర్ణీత ప్రభుత్వముక్రింద లేదు. పెద్దాపురపు సంస్థానపు రాజులగు వత్సవాయి వారీ ప్రదేశమునకు ప్రభువు లయిరి. పెద్దాపురపు రాజులు సుమారు వేయి ఎకరముల భూమి నృసింహస్వామి వారికిచ్చిరి. స్వామి వారికి లక్షయు ముప్పదివేల రూపాయల విలువగల జవాహరి నిర్మింపబడెను. సంస్థానపు మర్యాదలనుబట్టి స్వామి వారికి నగారావాద్యములు, పవళింపు సేవలు మొదలయినవి జరుగుచుండెడివి. 1844 లో పెద్దాపురపు కోట ఆంగ్లేయుల వశమాయెను. అందుచే నాటినుండి ఆ రాజ్యపు సామంతులగు మొగలితుర్రు సంస్థానపు రాజులు, కలిదిండి వంశస్థులు, ఈ ఆలయములకు ధర్మకర్తలై కల్యాణోత్సవాదులు జరిపించుచున్నారు. నేడీ ఆలయ పరిపాలన ప్రభుత్వపు ధర్మాదాయ దేవాదాయసంస్థచేతిలో నున్నది.

వా. రా. బ్ర.

**అక్కన్న మాదన్నలు:**—అక్కన్నమాదన్న లిద్దరు అచ్చపుటాంధ్రపుత్రులు. అయినను వీరు నేడంకాపురస్థులగు కులకర్ణివంశపు కన్నడ బ్రాహ్మణులనియును, మహారాష్ట్రులనియును, శివాజీ ప్రధాని యగు మోరోపంతు పింగళే యొక్క దాయాదులనియును కొంత ప్రచారమున్నది. ఈ వాదమును సమకాలికులగు ఏ యితర చారిత్రకులచేతను చెప్పబడలేదు. చారిత్రక నిదర్శనములు గాని, స్థల పురాణములు గాని ఈ వాదమునకు బల మొసంగుటలేదు. వీరి పింగలివంశము, ఆ పింగళేవంశము వేరు. ఋషులు వేరు. వీరు ఆంధ్రులనుట చారిత్రక సత్యము. అయితే, ఎచ్చటివారో నిష్కర్షగా చెప్పుటకు వీలుపడదు. ప్రస్తుతము అందుబాటులోనున్న చారిత్రక సాధనములను బట్టి వీరు భానుజయ్య, భాగ్యమ్మల సంతానము. భానుజయ్య హనుమకొండలో 'ఆమిలు' నొద్ద పనిజేయు ప్రభుత్వోద్యోగి. ఈ దంపతులకు నలుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలిగినారు. కొడుకుల పేర్లు వరుసగా అక్కన్న, మాదన్న, విస్సన్న (విశ్వనాథుడు), మల్లన్న (మృత్యుంజయుడు). ఆడపిల్లల పేర్లు తెలియుటలేదు. అయినను వీరి సంతానముగ కంచర్ల గోపన్న (రామదాసు), పొదిలి లింగన్న, పులిపల్లి ఎంకన్న (రుస్తుంరావు) అనువారు కలరు. అక్కన్నకు "మల్లు" అను కొడుకును, పేరు తెలియని ఒక కూతురును ఉండిరి. మాదన్నకు మల్లన్న యను కుమారుడును, పేరు తెలియని ఒక కుమార్తెయు ఉండిరి. మూడుతరముల వంశవృక్షము క్రింద ఈయబడినది :



భానుజయ్యపంతులు తనకొమరులకు యుక్తవయస్సున ఉపనయనములు చేసెను. ఆ దినములలో అవసరములుగా


అక్కన్న

నుండిన పారసీ, హిందీ, సంస్కృతము, ఆంధ్రము మున్నగు భాషలను వారికి చెప్పించెను. వివాహానంతరము అక్కన్న మాదన్నలు ఉద్యోగము కొరకు రాజధానియగు హైదరాబాదునకు ఏతెంచిరి. అప్పుడు వీరి వయస్సు ఇరువది రెండు, ఇరువది సంవత్సరములు ఉండవచ్చును. కొంత ప్రయత్న ఫలితముగా మీర్జామహమ్మదు సయీదు మీర్జుమ్లా నొద్ద స్వల్ప వేతనములపై ఇద్దరును ఉద్యోగములలో కుదిరిరి(1650). వీరు క్రమముగా తమ ధీ విశేషముచేతను, అవిరళ పరిశ్రమ వలనను ఒక్కొక మెట్టెక్కుచు పైకివచ్చిరి.

క్రీ. శ. 1656 లో మీర్జుమ్లా చేసిన తిరుగుబాటులో ఈ అన్నదమ్ములు పాల్గొనలేదు. అందుచే భూమ్యాదాయ శాఖలోని వారి పదవులట్లే యుండెను. తరువాత మరి పది సంవత్సరములు కష్టించి పనిచేయుచురాగా వీరిరువురిలో ఎక్కుడు ధీశాలియగు మాదన్న గోలకొండ సర్వసైన్యాధ్యక్షుడగు "బఖ్షీ - ఉల్ ముమాలిక్" కడ పేష్కారుగ ప్రతిష్ఠితు డయ్యెను (1666). అప్పటినుండి భూమ్యాదాయశాఖ క్రీ. శ. 1673 వరకు ఈ అన్నదమ్ముల పర్యవేక్షణలోనే ఉండెను. ఉద్యోగములో ప్రవేశించినప్పటినుండి క్రీ. శ. 1673 తుదివరకు రమారమి 25 సంవత్సరములు గోలకొండ భూమ్యాదాయ శాఖ వీరి అధీనములో నుండెను.

క్రీ. శ. 1674 వ సంవత్సరపు విప్లవానంతరము మీర్జుమ్లా యగు సయ్యదు ముజప్ఫరు పతనమొందెను. 1674 జూన్‌లో మాదన్న గోలకొండ ప్రధాని (మీర్జుమ్లా) గ నియుక్తుడయ్యెను. సుల్తాన్ అబుల్ హసన్ తానాషా అతనికి "సూర్యప్రకాశరావు" అను బిరుదు, ఏనుగు, గుఱ్ఱము, కత్తి, నగారా, రాజాంబరములు ప్రసాదించెను. అక్కన్న పేష్కారు పదవియందు ప్రతిష్ఠితుడయ్యెను. మాదన్న తమ్ముడగు విశ్వనాథుడు హనుమకొండ "ఆమిలు" గను, మేనల్లుండ్రలో నొకడగు ఎంకన్న దండనాయకుడుగను నియమితులైరి.

మాదన్నను ప్రధానిగ నెన్నుకొనుటలో సుల్తాను 3 సూత్రములను దృష్టియందుంచుకొనినట్లు అగపడుచున్నది.

(1) మాదన్న బుద్ధివిశేషము ఆతనికి తనయెడ గల భక్తివిశ్వాసములు.

(2) తన వంశ్యులగు ఉమ్రావులకు, సర్దారులకు మంత్రిత్వ మొసగినచో వారు తనయెడ భక్తి వినయ విశ్వాసములను జూపరు.

(3) మతోన్మాదముగల ఔరంగజేబునకు ముస్లిములు వశ్యులగుదురు.

మాదన్న ప్రధానియగునప్పటికి గోలకొండ రాజ్యపు కోస్తా శ్రీకాకుళమునుండి చెంగల్పట్టువరకు 480 మైళ్ళు వ్యాపించి యుండెను. ప్రధానియైన తదుపరి మాదన్న దేశములో శాంతిభద్రతలు నెలకొల్పుటలో నాలుగు నెలలు గడిపెను. ఆపై నవంబరునుండి డిసెంబరు తుది వరకు రెండు నెలలు రాజుతోగూడి రాజ్యమంతయు తిరిగి 1675 జనవరిలో రాజధానికి మరలవచ్చెను.


మాదన్న

గోలకొండ చరిత్రలో ఈ విధముగ రాజును, ప్రధానియు, ఊరూరు తిరిగి ప్రజల బాగోగులు విచారించుట అపూర్వమగు విశేషము. ప్రతి స్థలమునందును, ముఖ్యముగ మచిలీపట్టణ మందును వీరికి ఘనమగు సత్కారము జరిగెను. ప్రధాని యగునాటికి మాదన్న వయస్సు రమారమి 52 సంవత్సరములు ఉండియుండును.

మాదన్న పరిపాలనమును కొన్ని ముఖ్యశాఖలుగ విభజింపవచ్చును. 1. ఆంతరంగికశాఖ, 2. దేశీయశాఖ, 3. అంతర్జాతీయశాఖ, 4. రక్షణశాఖ, 5. సైన్యసంస్కరణశాఖ, 6. భూసంస్కరణశాఖ.

1. ఆంతరంగిక విధానము :- పెక్కు సంస్కరణలు ప్రవేశపెట్టి పరిపాలనా యంత్రమును నిర్దుష్టమొనరించి, వివిధశాఖలుగ విభజించెను. కేంద్ర, ప్రాంతీయ, గ్రామ పరిపాలనములను వేర్వేరు చేసెను.

కేంద్రములో రాజు, ప్రధాని, విదేశీయాంగ మంత్రి, దేశీయమంత్రి, ముజ్మూలేదారు, బక్షీఉల్ మూమిలిక్, సరేఖేల్, దారోగాయే ఆజం, సదరుఖాజీ, దబీరు, మహెల్దారు, మంత్రివర్గముగ నేర్పడెను.

ప్రాంతీయ పరిపాలనా వర్గమున తరఫ్దారు, దివాను, సరేఖేల్, ఖాజీ, పండితులు ఉండిరి.

సర్కారు, సిమ్తు, పరగణా, మహాల్, పాలకవర్గము గూడ దాదాపు ఈ విధముగనే యుండెను. కాని అచ్చటి సైన్యాధిపతులు వరుసగ ఫౌజ్దారులనియు, హవల్దారులనియును, న్యాయాధికారులు "ఖాతిబు" లనియు పిలువబడెడువారు. మాదన్నకు ముందు వీరికి జాగీరులుండెను. వీరికి జీతములు ఏర్పాటుచేసి మాదన్న వారలను విధేయులుగను, రాజ భక్త్యధికులుగను కావించి, నీరసులుగ నొనర్చెను.

గ్రామపరిపాలన :- పట్వారీ, మాలీపటేలు, కొత్వాలీ పటేలు, శేఖు సనదు, పురోహితుడు, వీరు పాలకవర్గముగా నేర్పడిరి. వీరికి జీతములుగాక మాన్యములుండెను.

పరిపాలన :- మాదన్నకు పూర్వము దేశమున కొక రాజ్యాంగము, ప్రజలకు భద్రత లేకుండెను. దేశము సారవంతమయ్యును, సుభిక్షము గాకుండెను. మీర్జుమ్లా మొదలు బంట్రోతువరకు అందరును బాహాటముగనే లంచములు అడిగి పుచ్చుకొనెడివారు. మిర్జామహ్మాదు సయీదు, మహమ్మదు అమీను, సయ్యదు ముజఫ్ఫరు అనువారలు మీర్జుమ్లాలుగా నున్నపుడు సైతము ప్రజలకు ఈ గోడు తప్పలేదు.

మాదన్నకు పూర్వము దేశములోని "తరఫు" లు మొదలుకొని గ్రామముల వరకు అన్నియు వార్షికములకు వేలము వేయబడుచుండినవి. అందుచేత అస్థిరత, అవిశ్వాసము దారిద్ర్యము బాగుగ పాదుకొనిపోయినవి. ఇజారాదారుల దౌర్జన్య క్రౌర్యములకు తాళజాలక గ్రామములకు గ్రామములే మనుష్యరహితములైనవి. ముల్లాలకు, బ్రాహ్మణులకు అనేక గ్రామములు మాన్యములుగ నీయబడుచుండెడివి. ఈ కారణముల వలన ప్రభుత్వము భూమ్యాదాయ విషయమున విపరీతముగ నష్టపడినది. అడవులు నరకి క్రొత్త గ్రామములు నిర్మించుట, పాడుపడిన గ్రామముల పునరావాస మొనర్చుట, అగ్రహారములు, మాన్యములు మున్నగువాటి నుండియు స్వల్ప మొత్తములు కిస్తుల రూపమున రాబట్టుట అను మూడు పద్ధతులను అవలంబించి మాదన్న గొడ్డుబోయిన భూమ్యాదాయమును కామధేనువుగ నొనర్చెను. వ్యవసాయము, తోటలు అభివృద్ధిపరచి వాటి ఫలసాయమును సరసమగు ధరలకు విక్రయించు వ్యవస్థ చేసెను. ఈస్టిండియా కంపెనీతో జరిగిన సుదీర్ఘ సంఘర్షణము ఇందులకొక నిదర్శనము. గ్రామములను వేలము వేయు పద్ధతులను మాన్పించి గ్రామాధికారులను మాదన్న నియమించెను. దేవాలయ పోషణము కొరకును, పురోహితుడు, వడ్రంగి, కురుమ, కమ్మరి, కుమ్మరి, మంగలి, చాకలి, దాసరి, తంబళి, సర్రాఫ్, పట్వారి, పటేలు, షేఖుసనది, వెట్టి, మాదిగ మున్నగు పనివారల జీవనము కొరకును మాన్యము లీయబడెను. చోరుల బాధలు అరికట్టబడెను. శాంతిభద్రతలు నెలకొల్పబడెను.

ప్రభుత్వపు అయోమయ స్థితివలన మూసివేయబడిన విఖ్యాతములగు వజ్రపుగనులను మాదన్న మరల తెరపించెను. భూసముద్ర వ్యాపారములను అభివృద్ధిపరచెను. రేవు సుంకముల ద్వారమునను విశేషాదాయము వచ్చునట్లు చేసెను. నయాంతో జరిగిన నౌకాయుద్ధము సముద్ర వ్యాపార రక్షణకు జరిగినదే. మందుగుండు, నేత, అద్దకము, శిల్పము, చిత్రలేఖనము మున్నగు ననేక ముఖ్యవరిశ్రమలను అభివృద్ధిపరచెను.

నాణెముల ముద్రణాధికారము ఇంతవరకు ఇతరుల కీయబడియుండెను. మాదన్న ఆ పద్ధతిని రద్దుపరచి ప్రభుత్వపు టంకసాలలో నాణెములు ముద్రించు నేర్పాటు చేసెను. ఈ క్రింద బేర్కొనిన నాణెములు సిద్ధమగు

చుండెను. 1. వరహా, 2. ఫనము, 3. నేవలము, 4. కాసు, 5. తార, 6. గవ్వ. వరహా కి అంగుళముల వెడల్పును, 52కి గురిగింజల బరువును, 21కి క్యారెట్ల వన్నెను కలిగియుండెను. ఇది విజయనగరపు నాణెము.

మాదన్న చట్టబద్ధ మొనర్చినకొలతమానములో గజము, మూర ఉండెను. తులామానములో పులము, శేరు, వీసె, పుట్టి, ఉండెను.

మంత్రిపదవి వహించినతోడనే మాదన్న రాజ్యమున పర్యటనము చేసియుండెనుగదా ! ఆ పర్యటనమువలన పరిపాలనా యంత్రమందలి దోషములు మాదన్నకు బాగుగ బోధపడెను. చీకులు, భోగలాలసులు, స్వార్థులు, అసమర్థులును అగు ఉన్నతోద్యోగులను తొలగించి, వారి స్థానములలో సమర్థులగు యువకులను నియమించెను. ఇంతవరకు ఉన్నతాధికారులు తమస్థానములకు బోవక పట్టణములందే యుండెడివారు. మాదన్న యీపద్ధతిని మాన్పించి అధికారులు తమతమ ప్రాంతములందు వసించునట్లు కట్టడిచేసెను. అంతియేగాక, ప్రతి రెండు, మూడు సంవత్సరములకొకసారి అధికారులను మార్పుచేయు నాచారమును ప్రవేశపెట్టెను. దీనివలన పరిపాలనా యంత్రాంగము పరిపుష్టమై, చైతన్యవంతమైనది.

సిమ్తులను (రాష్ట్రములను), తరఫులను (మండలములను) మరలనిర్మించి, వాటిపై విశ్వాసపాత్రులు, సమర్థులును అగు యువకోద్యోగులను నియమించెను. వాపీ, కూపతటాకములు, రహదారులు, అన్నసత్రములు, ఉచిత విద్యా వైద్య ప్రసూతిశాలలు, ఏర్పాటు చేసెను. క్రొత్తగ జయింపబడిన కర్ణాటకమందు శాంతి నెలకొల్పెను. ఆ ప్రాంతమును "ఇబ్లాపట్టీ" యనియును, అచ్చటి నాయకులను అహోభం అనియును పేర్కొనెడువారు. ఈ క్రొత్తపద్ధతులపై రెండు సంవత్సరములు పరిపాలన జరిగినమీదట తన సంస్కరణ ఫలితములను పరిశీలించుటకై మాదన్న 1676 జనవరిలో మరల రాజయుక్తముగ మూడు నెలలు దేశసంచారముచేసి మార్చితుదకు గోలకొండకు పతెంచెను.

ఉద్యోగములు, మన్నబులు, ఇతర ప్రత్యేకతలు కోలుపోయిన ఉన్నతాధికారులు, ఉమ్రావులు మున్నగువారు 1676 మధ్యలో తిరుగుబాటు చేసిరి. వీరికి గజపతి కుమారుడు నాయకత్వము వహించెను. అయితే రాజవంశీయుడగు అప్పలరాజును మాదన్న తనకు వశంవదుని చేసికొని అతని సాయమున తిరుగుబాటుదారుల నణచి, శ్రీకాకుళము వరకు దేశమును మరల స్వాధీనపరచుకొనెను. అప్పలరాజునకు "అప్పలపాయకరావు బహద్దరు" అను బిరుదును, అనేక జాగీరులను ఒసగెను. (పాయకరావనగా యుద్ధమున ముందుండు వాడని యర్థము.)

ఆర్థికనీతి :- దేశములో శాంతినెలకొల్పుట యందును, బీజాపురముతో, మొగలులతో జరిగిన ఒప్పందమును నెరవేర్చుటయందును, పాడుపడిన దుర్గములను బాగుచేయుటయందును, సైన్యమును బలిష్ఠము చేయుటయందును, పశ్చిమోత్తర సరిహద్దులను సురక్షిత మొనర్చుటయందును మాదన్న ధనము విశేషముగా వ్యయము చేసెను. ఆదాయము సరిపడునదిగాకుండెను. అందుచే మాదన్న వ్యయము తగ్గించియు, పెద్ద జీతములు మన్నబులు తగ్గించియు, ఆయవ్యయములను సరిపుచ్చుటకు ప్రయత్నించెను. ఈ మార్పులు జన సామాన్యపు శాంతజీవనమునకు ఎంతో దోహదము కలిగించెను. ప్రజలకు అగ్రహారీకులనుండియు, అధికారులనుండియు ఎట్టి అలజడి కలుగకుండ కట్టుదిట్టములు చేసెను. దేశము సస్యశ్యామలమయ్యెను. ప్రజలు సిరిసంపదలతో హాయిగ నుండిరి. ప్రభుత్వాదాయము వృద్ధిచెందెను. ఇట్టి ఘనవిజయమునకు సుల్తాను మిక్కిలి సంతోషించి మాదన్నకు "అలంపనా" అను బిరుదును ప్రసాదించెను.

క్రీ. శ. 1657 నాటి మీర్జుమ్లా తిరుగుబాటు వలనను, మొగలాయీల యుద్ధములవలనను రాజ్యములో అశాంతి ఏర్పడెను. ఆ కారణమున రాజ్యములోని వజ్రపు గనులు మూసివేయబడెను. 1660 నుండి 1674 వరకు వజ్రాల గనులలో పనులు జరుగలేదు. మాదన్న ఆగనులను తెరపించి సక్రమముగా పనిచేయునట్లు ఏర్పాటుచేసెను. గనులలోపనిచేయు కూలివారికి అనుకూలముగనుండునట్లు భృతినిర్ణయములు గావించెను. తిరిగి గోలకొండరాజ్యము యథాప్రకారము "రత్నకోశము" గా ప్రసిద్ధిచెందెను.

దేశీయ విధానము :- ఆంగ్లేయులు జబర్దస్తీగా వ్యవహరింప మొదలిడిరి. తమ గిడ్డంగులను సైనిక స్థావరములుగా

మార్చిరి. దేశీయ వర్తకులను పీడింపసాగిరి. ప్రభుత్వ ఫర్మానాలను నిర్లక్ష్యము చేయసాగిరి. స్వంత నాణెములను చలామణి చేయసాగిరి. న్యాయస్థానములను ఏర్పాటుచేసి ప్రభుత్వము నెరపసాగిరి. ఆంగ్లేయుల విధానము గోలకొండ ప్రభుత్వ వ్యాపారముపై దెబ్బతీయునదిగా నుండెను. అంత ప్రధాని మాదన్న ఆంగ్లేయుల అధికార విజృంభణమును అధికార దర్పముతో అణచివేయుటకు కడగెను. కర్ణాటకములోని పరిస్థితులను చక్కదిద్దుటకు సమర్థులగు పాలకులు నియమింపబడిరి. వీరిలో అక్కన్న, లింగన్న లిద్దరు ఆంగ్లేయులకు కొరకరాని కొయ్యలయిరి. ఆంగ్లేయుల ఆటలు సాగవయ్యెను. మాదన్నను తమ కనుకూలునిగా చేసికొనుటకు ఆంగ్లేయులు పడరానిపాట్లు పడిరి. వారి ప్రయత్నము లన్నియు వ్యర్థమయ్యెను. దేశీయ ప్రభుత్వమునకు, దేశీయ వ్యాపారులకు ప్రాబల్యమునుచేకూర్చునట్టి మాదన్న యొక్క రాజనీతి ప్రయోగ విధానమునకు తట్టుకొనలేక ఆంగ్లేయులు గోలకొండ రాజ్యమందున్న తమ గిడ్డంగులను, నిర్మాణశాలలను ఎత్తివేసి, జింజీకి ప్రయాణమయిరి. దేశభద్రత, ఆర్థిక బలము, గౌరవము, వర్తకము, దేశీయవర్తకుల మర్యాదలు వృద్ధినొందెను.

**విదేశీయ విధానము :-** మొగలులు దక్షిణ రాజ్యములను జయించుటకు కడగి కొంతవరకు జయముపొందిరి. బీజపూరు గోలకొండ రాజ్యములకు ప్రమాదము కనుచూపుమేరలోనికి వచ్చెను. బీజాపూరునందు రాజగు రెండవ అలీ ఆదిల్‌షా మరణించెను (1672). అతని కుమారుడు పంచవర్ష ప్రాయుడు సికిందరు రాజయ్యెను. రాజ్యములో అంతఃకలహములు ప్రబలసాగెను. మాదన్న కల్పించుకొని నాయకప్రతినాయకుల మధ్య సంధిచేసెను. ఈ సంధి సూత్రముల ప్రకారము బీజపూరు రాజ్యమును గోలకొండ రాజ్యము రక్షించునట్లును, గోలకొండ రాజ్యపు విదేశాంగ నీతి ననుసరించి బీజాపూరు వర్తించునట్లును, మాదన్న నిబంధించెను. బీజాపురము దర్బారు నందు గోలకొండ ప్రతినిధి నియుక్తుడయ్యెను. కాని సర్దారులు నాయకుడు "వకీల్-ఉల్-సుల్తనతు" అగు సిద్దీమసూదు ఈ సంధిషరతులకు విరుద్ధముగ ప్రవర్తించెను. మాదన్న విధానమునకు విఘాతము కలిగినది.

అయినను అతడు నిస్పృహచెందక బీజాపురమందు గోల్కొండ ప్రతినిధిగనున్న అక్కన్నను వాపసుపిలిపించుకొనెను. అయినను మొగలులు బీజాపూరుపై దండెత్తినప్పుడు సికందరుయొక్క అభ్యర్థనమును పాటించి మాదన్న ప్రచండసైన్యమును పంపెను. ఈ సైనిక సహాయమువలన ఔరంగజేబు మాదన్న మీద క్రుద్ధుడయ్యెను. మహారాష్ట్రశక్తి ప్రళయ తాండవమునకు బలిగాకుండ గోలకొండ రాజ్యమును సంరక్షించుటకును, మొగలుల ఉపద్రవమునుండి కాపాడుటకును, దూరమాలోచించి మాదన్న అబుల్ హసన్ తానాషాకును, శివాజీకిని మైత్రి కుదిర్చెను. శివాజీ హైదరాబాదునకు విచ్చేసి ఒక సంధి పత్రముపై సంతకము చేసెను. ఈ సంధి షరతులప్రకారము మొగలులకు వ్యతిరేకముగ పరస్పరము సహాయముచేసికొనుటకు నిశ్చయింపబడెను. సుశిక్షితులయి లక్షసంఖ్యాకులగు మహారాష్ట్ర సైనికులు గోలకొండ రక్షణమునకు లభించిరి. ఈ సంధి కారణముగా గోలకొండరాజ్యమునకు శాంతిభద్రతలు చేకూరెను. ఇది మాదన్నమంత్రి రాజనీతి చతురతకు పరాకాష్ఠయని చెప్పవచ్చును. అయితే దీనివలన అలంఘీరునకు కోపము హెచ్చినది. ముసల్మానులిది దేశద్రోహముగా భావించిరి. విద్వేషపూరిత ప్రచారములు సాగెను. మాదన్నయున్నంతవరకు గోలకొండమీద తనయాటలు సాగవని ఔరంగజేబునకు తోచెను. గోలకొండ సైన్యము సదాసంసిద్ధమై బలోపేతమై యుండెను. మొగలుసేనలు 1677లో మార్ఖేకునొద్ద గోలకొండ సేనల పరాక్రమమును చవిచూచెను. ఆ యుద్ధమున సామ్రాజ్య సేనలు ఘోర పరాజయము పాలయ్యెను. ఇరువది మైళ్ళలో నున్న గుల్బర్గాను చేరుటకు మొగలుసేనలకు 12 దినములు పట్టెను!



తానాషా

మాదన్న ప్రతిభ అట్టిదిగా నుండెను. ఇగంతయు ఆత్మ రక్షణకొరకు మాదన్న చేయవలసివచ్చెను. కాని సార్వభౌమ ప్రభుత్వమునకు కట్టవలసిన కప్పము యథాప్రకారము మాదన్న చెల్లింపసాగెను. అంతియెగాదు. 1682 లో చక్రవర్తి దక్షిణాపథమునకు రాగా, మాదన్న పదునైదు ఏనుగులను, కొన్ని మణుగుల బంగారమును, కప్పమును బురహానుపురములోనున్న యాతనికి సత్కారపూర్వకముగా బంపెను. అయినను అక్కన్న మాదన్నలయెడ క్రోధము విడనాడక ఔరంగజేబు "జన్నారుదారానె దక్కన్ ఖాబిలె గర్దజదన్" (దక్షిణపు యజ్ఞోపవీతధారులు అక్కన్న - మాదన్న - వధార్హులు.) అని తానాషా ప్రభువునకు వ్రాయుచుండెడివాడు.

మాదన్న పరిశ్రమలకు, వాణిజ్యములకు ఎక్కుడు ప్రోత్సాహమిచ్చెను. గోలకొండ వణిజులు ఓడలనిండ సరకుల నింపుకొని తూర్పు, పడమరలనున్న దూరదేశములకు పోయి, వ్యాపారము చేయుచుండిరి. ఆంగ్లేయులు, పరాసువారు, సయాం చక్రవర్తిని ప్రోత్సహించి గోలకొండ వర్తక నౌకలను దోపిడి చేయించుచుండిరి. రెండుమూడు పర్యాయములు మాదన్న ఉపేక్షించెను. అయితే అది మాదన్న నిరసతగ నెంచి గోలకొండ వర్తకనావలను తరుచు కొల్లగొట్టసాగిరి. అందుచే మాదన్న తన నౌకాబల సహాయముచే సయాం, ఆంగ్ల, పరాసుల సంయుక్త నౌకాబలమును 1685 ఉత్తరార్థమున నోడించి, తన వ్యాపారమును సురక్షితము చేసెను. మాదన్న భూసైన్యములనేగాక, సముద్ర సైన్యములను సహితము సంస్కరించి, సత్వసంపన్నములనుగా నొనర్చియుంచెనని తెలియుచున్నది.

దేశరక్షణ వ్యవస్థ:- దేశరక్షణ విషయములో మాదన్న అత్యంతము జాగరూకతను వహించి సువ్యవస్థగావించెను. భువనగిరి, ఓరుగల్లు, ఖమ్మముమెట్టు, కొండపల్లి, కొండవీడు మొదలగు దుర్గములను వృద్ధిపరచెను. ప్రతి దుర్గమునందును ఉండు పంన్రెండువందల సైనికుల సంఖ్యను రెండువేలకు పెంచెను. (1682). మన్సబుదారి పద్ధతిపైన జాగీరుదారులు కొంత సైన్యమును రాజునకు సహాయార్థము సిద్ధముచేసి యుంచెడివారు. కాని జాగీరుదారులతోనే యుద్ధము సంభవించినచో జాగీరు సైన్యము జాగీరువారి పక్షముననే యుండునుగదా. అందుచే మాదన్న ఈ విధానమును మార్చివైచెను. సైనిక నిర్మాణ వ్యవస్థయంతయు రాజాధీనముననే యుండునట్లేర్పరచెను. దేశీయ, విదేశీయ సైనికుల జీతములందుగల హెచ్చుతగ్గులను మాదన్న సవరించెను. అశ్విక దళమును, శతఘ్ని దళమును విస్తృతపరచెను. సామ్రాజ్యపు ప్రబలసైన్యములను ఎనిమిదినెలల పదిరెండు దివసములు కాలూననీక అదలించిన దీ శతఘ్ని దళమే.

రాజ్య వ్యవస్థ:- భూమ్యాదాయ, పరిపాలనాశాఖల సౌలభ్యముకొరకు మాదన్న దేశమును ఖండములుగను, ఖండములను సర్కారులుగను, సర్కారులను పరగణాలుగను విభజించెను. తెలంగాణ ఖండములో ఇరువది సర్కారులును, రెండువందల ఇరువదినాలుగు పరగణాలును; కర్ణాటక ఖండములో ఇరువదిరెండు సర్కారులును, మున్నూట పదునాలుగు పరగణాలును; ఆర్కాటు (తమిళ) ఖండమునందు పదునారు సర్కారులును, నూట పదునారు పరగణాలును ఉండెను. గోలకొండ రాజ్యము మూడు ఖండములు, ఏబది ఎనిమిది సర్కారులు, ఆరువందల ఏబదినాలుగు పరగణాలు కలదిగా నుండెను.

అక్కన్న మాదన్నల హత్య:- క్రీ. శ. 1685 అక్టోబరు నాటి సంధి ననుసరించి ఈ యన్నదమ్ములు పదభ్రష్టులయి, కారాగారవాసులయి యుండవలసి యుండెను. సుల్తాను దాని నమలుపరచలేదు. కాని ఆ సంధి నియమముల వలన మాదన్న విరోధులకు ధైర్యమెక్కువయినది. రాజాంతఃపురమునందును, వెలుపలను ఈ యన్నదమ్ములను హత్యచేయుటకు కుట్రలు ప్రబలెను. 1686 మార్చి నెల తుదిభాగమున ఒకనాటి రాత్రి మొదటి యామమున రాచకార్యములు ముగించుకొని, రాజాజ్ఞ గైకొని అక్కన్న మాదన్నలు ఇంటికి బోవుచున్న సమయమున కుట్రదారులు తటాలున వారిపైబడి కనుమూసి తెరచునంతలో వారిని హత్యచేసిరి. విశేషముగ లంచముల కావరకే అంగరక్షకులు లోబడియుండుటచే ఈ హత్యాకాండ సునాయాసముగ జరిగిపోయినది. తరువాత హంతకులు నగరముపైబడి రుస్తుంరావును (పులిపల్లి ఎంకన్న) రెండువేల బ్రాహ్మణ కుటుంబములను సమూలముగా హత్యగావించిరి. వారి యిండ్లను దగ్ధమొనర్చిరి.

అసంఖ్యాకములగు తాళపత్ర గ్రంథములను అగ్నిలో పడవైచిరి.

అక్కన్న మాదన్నల శిరములను రోహీరులోనున్న పాఅలమునకు పంపిరి. అతడు వాటిని షోలాపురములో నున్న చక్రవర్తి కడకు పంపెను. ఆతడు గోలకొండ తనకు వశమయినట్లే భావించి సంతసించెను. ఆ శిరములను ఏనుగులచేత త్రొక్కించెను. వీరి మరణమునకు సుల్తాను అబుల్‌హాసన్ తానాషా మిక్కిలి దుఃఖించెను.

అక్కన్న మాదన్నలు పలుభాషలయందు అసమాన పాండిత్యము కలవారు. సనాతన ధర్మావలంబకులయి ననుపురోగాములు, రాజకీయశాస్త్రకోవిదులు, అర్థశాస్త్ర ప్రవీణులు, కార్యదక్షులు, రాజభక్తి పరాయణులు, శిష్ట జన సంరక్షకులు, దుష్టజన భయంకరులు. మాదన్న ప్రపంచములోని మహామంత్రులతో సమానముగా నెన్న దగినవాడు. జ్యేష్ఠుడగు అక్కన్నయు అసామాన్యప్రతిభా శాలిగా పేరొందెను. అక్కన్న పేష్కారుగను, దేశీయాంగ, రక్షణ, వాణిజ్య, నౌకా మంత్రిగను, సైన్యాధ్యక్షుడు గను, రాయబారిగను, పెక్కు బాధ్యతాయుతములయిన పదవులను అత్యంత సామర్థ్యముతో నిర్వహించెను. అక్కన్న సాహసికుడు, యథార్థవాది, అరిభయంకరుడు, తమ్మునిలోనున్న సౌమ్యత ఈతనియందు కొంత లోపించి నట్లు కనపడును.

కొ. భూ. రా.

**అక్బరు :-** అక్బరు భారతదేశ సామ్రాజ్యము నేలిన మొగలాయి పాదుషాలలో నగ్రగణ్యుడు. విశ్వవిఖ్యాత కీర్తి నార్జించిన చక్రవర్తులలో నొకడు. అక్బరు తండ్రి హుమాయూను. తల్లి హమీదాబానుబేగం. అక్బరుఅమర్ కోటలో క్రీ.శ. 1542 నవంబరు 32వ తారీకున జన్మించెను.

హుమాయూను మరణించినపుడు అక్బరు తన సంరక్షకుడగు బైరంఖానుతో పంజాబునందుండెను. నాటి కతనికి పదుమూడేండ్ల ప్రాయము. ఐనను, వెంటనే బైరం ఖాను అక్బరును చక్రవర్తిగా ప్రకటించెను. కాని దేశమున మొగలుల అధికారము నామమాత్రమై యుండెను. నలువైపులను సర్దారులు విజృంభించి స్వతంత్రులగు చుండిరి. ఇది ఇట్లుండ హేము అను హైందవ వీరుడు ఢిల్లీ ఆగ్రాలను ఆక్రమించెను.

ఈ క్లిష్ట పరిస్థితులలో అక్బరు బైరంఖానుతో హేముపై నడచెను. పానిపట్టు క్షేత్రమున క్రీ. శ. 1556 లో జరిగిన ఘోరసంగ్రామమున హేము పరాజితు డయి వధింపబడెను. ఢిల్లీ, ఆగ్రాల నాక్రమించి అక్బరు సింహాసన మధిష్ఠించెను.

అక్బరు బాలుడగుటచే పరిపాలనాభారమును బైరం ఖాను వహించెను. బైరంఖాను సమర్థుడు, విశ్వాస పాత్రుడు, ప్రభుభక్తి పరాయణుడు. కాని దురహంకారి అగుటచే సర్దారులకు ఈతనిపై ద్వేషము జనించుట గమనించి క్రీ. శ. 1564 లో అక్బరు స్వయముగ పరిపాలనము సాగించుటకు నిర్ణయము చేసెను. అధికార వ్యామోహముతో బైరంఖాను ఒనర్చిన తిరుగుబాటు నణచి అక్బరాతనిని సగౌరవముగ మక్కాయాత్ర కంపెను.

అక్బరు మహావీరుడు. గొప్పవిజేత. భారతదేశమున నేకచ్ఛత్రాధిపత్యము నెలకొల్పుట ఆతని మహాశయము. సింహాసన మెక్కినది మొదలు 25 సంవత్సరములు నిర్విరామముగ విజయయాత్ర లొనర్చి ఆతడు నిర్మించిన మహాసామ్రాజ్యమునకు సాటిరాగలది సమకాలిక ప్రపంచమున లేదు.

సింహాసన మధిష్ఠించిన తరువాత కొలదికాలముననే అజ్మీరు, గ్వాలియరు, జేన్పూరు, మాళవము, గోండు వనముల నాక్రమించి ఢిల్లీ పరిసరముల తన యధికారము నెదిరింపగల శత్రువర్గమును అక్బరు నిర్మూలించెను.

రాజనీతి విశారదుడగు అక్బరు రసపుత్రుల మైత్రి మొగలాయి సామ్రాజ్య విస్తరణకును, సుస్థిరత్వమునకును అత్యావసరమని గుర్తించెను. నాటికి రాజపుత్రుల బలము కూడ క్షీణించినది. అందుచే సాధ్యమైనంతవరకు శాంతి యుతముగ తన సార్వభౌమత్వము వారిపయి విస్తరింప జేయుటయే అక్బరు సంకల్పము. 1562 లో జయ పురాధీశ్వరుడగు బీహారీమల్లు తన కుమార్తెను అక్బరున కిచ్చి వివాహమొనర్చెను. అతని కుమారుడగు భగవాన్ దాసును, మనుమడగు మాణసింహుడును మొగలుల కొలువునందు ఉన్నత పదవులను బడసిరి. కాని, మీవాడ్ రాజవంశము మాత్రము అక్బరును ప్రతిఘటించినది. క్రీ. శ. 1567 లో అక్బరు వారిపయి యుద్ధమును

ప్రకటించి వారి రాజధానియగు చిత్తూరును ఆక్రమించెను. మీవాడ్ రాణా ఉదయసింహుడు అక్బరునకు లొంగక ఉదయపూరునందు స్వతంత్ర ప్రభుత్వమును స్థాపించెను. అతని కుమారుడగు ప్రతాపసింహుడును, అనంతర మాతని కుమారుడగు అమరసింహుడును మీవాడ్ స్వాతంత్ర్య పోరాటమును సాగించిరి. అక్బరుకూడ వారి స్వాతంత్ర్య దీక్ష నభినందించి వారియందు ఉదారత వహించెను. రత్నభోరు, బికనీరు, జైసల్మీరు, కలంజరు మున్నగు రసపుత్ర సంస్థాన ప్రభువులు అక్బరునకు సామంతులయిరి.

ఈ లోగా గుజరాతు, బెంగాలు, ఒరిస్సాలుకూడ అక్బరు సామ్రాజ్యమున చేర్చబడినవి. అక్బరు రసపుత్రుల తోడి యుద్ధములందు నిమగ్నుడయి యున్న సమయమున కాబూలును పాలించుచున్న అక్బరు సవతి తమ్ముడు మీర్జాహకీము ఢిల్లీ సింహాసన మాక్రమింపవలెనను దుర్బుద్ధితో పంజాబుపై దండెత్తి వచ్చెను. హకీము యుద్ధమున నోడి పాదాక్రాంతుడగుటచే జాలిదలచి అక్బరాతని రాజ్యమును ఇచ్చివేసెను. క్రీ. శ. 1585 లో హకీము మరణానంతరము కాబూలు మొగలు సామ్రాజ్యమున కలుపబడెను. తరువాత నీ చక్రవర్తి కాశ్మీరము, బెలూచిస్థానము, సింధురాష్ట్రమును స్వాధీనపరచుకొని వాయవ్య సరిహద్దుల నివసించు అనాగరక కొండజాతులను తన యేలుబడిలోనికి తెచ్చి, వారు మొగలు సామ్రాజ్య శాంతి భద్రతలకు భంగము కలిగించకుండ కట్టుదిట్టములు చేసెను.

ఉత్తర హిందూస్థానమును ఆక్రమించినపిమ్మట అక్బరు దక్షిణాపథముపై దృష్టిని మరలించెను. క్రీ. శ. 1596 లో చాందుబీబీనుండి అహమదునగరరాజ్యమును, 1601 లో ఖాందేషునుజయించి వశపరచుకొనెను. 1601లో ఖాందేషునందు దుర్భేద్యమగు అసీర్ ఘరు దుర్గమును ముట్టడించుచుండ, సలీము రాకుమారుడు తిరుగుబాటొనర్చి రాజ కుటుంబమునందు అశాంతికి కారకుడయ్యెను. ఈ అశాంతియే అక్బరు ఆశయ పూర్తికి ఆటంకమాయెను.

పైన వివరించిన విజయపరంపరలలో హిమాలయముల నుండి అహమదునగరము వరకును, హిందూ కుష్‌పర్వతములనుండి బెంగాలు వరకును వ్యాపించిన సామ్రాజ్యమును అక్బరు పదునెన్మిది సుబాలుగా విభజించి సుస్థిరమగు రాజ్యాంగ విధానమును ఏర్పరచెను. తోడరుమల్లు సహాయమున పంట పొలములను మషాయిత్ చేయించి పంట ననుసరించి మధ్యవర్తుల ప్రమేయము లేకుండ ప్రభుత్వోద్యోగుల ద్వారమున పన్నులు వసూలుచేయు పద్ధతిని అమలు జరిపెను. రైతులపయి పన్నుల భారము తగ్గించి వారి కనేక సౌకర్యములు కలుగచేసెను. నెల జీతములపయిన ఆధారపడిన మన్సబుదారుల ద్వారమున సైన్యమును బలపరచెను.

అక్బరు దైవచింత గలవాడు. బాల్యమునుండియు హిందూ మహమ్మదీయ మతవైషమ్యములు ఆతనిని కలవరపెట్టుచుండెను. మతసమస్యను పరిష్కరించుటయు, హిందూ మహమ్మదీయులనుండి సమైక్య భారతజాతిని రూపొందించుటయును అక్బరు జీవితలక్ష్యములైనవి. ఈ లక్ష్యసాధనకయి ఫతేపూరు సిక్రీలో అక్బరు మత చర్చలు జరిపెను. నిరక్షరాస్యుడయిన అక్బరు వివిధ మతాచార్యుల వాదములను శ్రద్ధతో నాలకించి తుదకు అన్ని మతములందును సత్యము గలదను నిర్ణయమునకు వచ్చెను. పిదప సర్వమత సారమగు "దీన్ ఇ ఇలాహి" అను క్రొత్త మతమునకు ప్రవక్తయయ్యెను. వ్యక్తి స్వాతంత్ర్యము, పరమత సహనము ఈ మతమునందలి మూలసూత్రములు. మతసహన విషయమున అక్బరు చిత్తశుద్ధి కిది చక్కని నిదర్శనము.

అక్బరనేక సంస్కరణములను ప్రవేశపెట్టెను. తన సామ్రాజ్యమున ముస్లిము మతగురువుల ప్రత్యేకాధికారములను తొలగించెను. నాణెములపయి గల ఇస్లాముచిహ్నములను మాన్పించెను. మహమ్మదీయులలో గోమాంస భక్షణము, బహుభార్యాత్వము, బహిరంగ ప్రార్థనా సమావేశములను మాన్పించెను. హిందువులపై జిజియా మున్నగు పన్నులను తొలగించి వారికి ప్రభుత్వమున సమానహక్కుల నొసగెను. బాల్యవివాహము, సహగమనము, నిర్బంధవైధవ్యము మున్నగు హిందూ దురాచారములను మాన్పుటకు ప్రయత్నించెను.

అక్బరు నిరక్షరాస్యుడు. కాని, కవిత్వమునందును, వేదాంత చర్చలలోను సంగీత చిత్రలేఖనములయందును ఆతనికి గొప్పఅభిమానము. అతడు కవి పండిత గాయక కల్పతరువు. కవి, చరిత్రకారుడు, వేదాంతి. అక్బరునకు గురువులు దీన్‌ఇలాహికి వ్యాఖ్యానకారుడు అగు అబుల్

ఫజుల్ అను నాతడు అక్బరు ఆస్థానమునకు మణిదీపము. అక్బరునామా, ఐనీ అక్బరీ అనునవి అబుల్ ఫజుల్ యొక్క సుప్రసిద్ధ రచనలు. ఆతని తమ్ముడు ఫైజీకూడ గొప్పకవి. హిందువులలో, అక్బరుచే "కవిప్రియ" బిరుదమును పడసిన బీర్బలుమల్లు ముఖ్యుడు. తాన్‌సేన్ అను నాతడు అక్బరు ఆస్థాన గాయకుడు. ప్రశస్త హిందూ గ్రంథములగు రామాయణము, భారతము, అధర్వణ వేదము, లీలావతీ గణితము, అక్బరు ప్రేరణచే పారశీక భాషలోనికి తర్జుమా చేయబడెను. అక్బరు స్వయముగ చిత్రకారుడు. భారతీయ, పారశీక శిల్పులు, చిత్రకారులు అనేకులు ఇతని ఆస్థానమందుండిరి. అక్బరు సేకరించిన 24,000 సంపుటములు గల గ్రంథాలయము ఆతని విద్యాభిమానమునకు నిదర్శనము.

ఈ సార్వభౌముని చివరిరోజులు కష్టములమధ్య కడతేరెను. అక్బరు కుమారులు ముప్వురును దుర్వ్యసన పరులు. అందిద్దరు అక్బరునకు పూర్వమే గతించిరి. పెద్ద కుమారుడగు సలీము అధికారలోభముతో తండ్రిమీద నే కత్తి గట్టెను. 1601 లో సలీము అలహాబాదులో స్వతంత్రుడగుటయే గాక అక్బరునకు ప్రాణమిత్రుడగు అబుల్ ఫజుల్‌ను హత్య చేయించెను. ఈ సంఘటనలు అక్బరునకు తీవ్రసంతాపకారణములయి ఆరోగ్యమును పాడుచేసెను. సలీము దురాకృతములను అవకాశముగా గ్రహించి, కొలువుకూటమునందలి సర్దారులు కొందరు అక్బరు మరణానంతరము సలీము కుమారు డగు ఖుస్రూను సింహాసనమెక్కించ కుట్రలు పన్నుచుండిరి. ఇట్టి విషాద సంఘటనల మధ్య, పుత్రవత్సలుడగు అక్బరు సలీము నే తన యనంతరము చక్రవర్తిగా ప్రకటించి క్రీ. శ. 1605 అక్టోబరు 17 వ తారీఖున మరణించెను.

అక్బరు ఆజానుబాహువు. ప్రత్యణువునను రాజఠీవితో నిండిన విగ్రహ మాతనిది. శౌర్యసాహసములం దాతడు అసమానుడు. శరణాగతుడయినచో గర్భశత్రువు నైనను రక్షించు దయాస్వరూపుడు. కపటమెరుగని గంభీరస్వభావముగలవాడు. విద్యావిహీనుడయినను ఉత్తమ సంస్కారమును పొందినవాడు. ప్రజాక్షేమమే ఇతని పరిపాలనకు ఆశయము. ఇతనివలె ప్రజాభిమానమును పడసిన మహమ్మదీయ చక్రవర్తి మరియొకడు లేడు. జహాంగీరు చెప్పినట్లు "అక్బరు మానవమాత్రుడు కాడు. అతని ప్రతి చర్యలోను భగవంతుని అంశము ప్రత్యక్షమగుచుండెను."

బి. ఎస్. ఎల్. హ. రా.

**అఖిలేశ్వర వాదము :-** అఖిలేశ్వరవాదమన నేమి?- అఖిలేశ్వర వాదమను పదము యొక్క నిర్వచనము మిక్కిలి సందిగ్ధముగ నున్నది. ఆ పదమును భిన్నభిన్న రచయితలు వివిధ రీతులలో ప్రయోగించిరి. వాటిలో పెక్కులు స్పష్టముగ లేవు. కాని విజ్ఞానకోశములకు, నిఘంటువులకు ఆపద నిర్వచన విషయమున అభేదత కనిపించుచున్నది. అఖిలేశ్వరవాదము అనునది ఒక సిద్ధాంతము. అందు దేవునకును, విశ్వమునకును అభేదత నిరూపింపబడును.

అందుగూడ స్వల్పభేదమున్నది. దీనికి కారణము రెండు భిన్నములయిన పక్షముల ఉనికియే. ఒకపక్షమువారు "దేవుడన్నను, ప్రకృతి యన్నను ఒకటే. దేవుడే కర్త, దేవుడే ఉపాదానము, అతడే కులాలుడు, అతడే మృత్తు" అందురు. ఇదియే క్రమమైన అఖిలేశ్వరవాదము. రెండవ పక్షమునకు చెందినవారు ఈ విషయమును విశ్వసింతురు. కాని వారు భగవంతుడు కేవలము స్రష్ట అని కాని, స్రష్టయు సృష్టియు గూడ అని కాని దేవునిగూర్చి తమ ఆశయమును తెలుపుటకు నిరాకరింతురు. 'ప్రకృతి విషయక మయిన యథార్థజ్ఞానమే భగవద్విషయకమయిన యథార్థ జ్ఞానము' అను విషయమున మాత్రము వీరు అఖిలేశ్వర వాదులతో ఏకీభవింతురు. ఇంక వీరిట్లు వాదింతురు. "ఒకవేళ దేవుడు స్రష్టయు, సృష్టియునై యున్నచో, ప్రకృతియందలి భిన్నభిన్న దృశ్యములు ప్రతిభాస-ఆధారమగు భగవంతునియొక్క ఆవిర్భావములేయైయున్నచో, ప్రకృతియందలి భిన్నభిన్న సౌందర్యముల యొక్కయు, అందలి అపూర్వవస్తువుల యొక్కయు దృఢమైన పరిచయమే భగవంతుని యొక్క సంపూర్ణతా వైవిధ్యము యొక్క పూర్ణమయిన పరిచయము అనునర్థము సిద్ధించుచున్నది. అట్లుగాక దేవుడు కేవలము సృష్టికర్తయే యైయుండి, ప్రకృతి ఆతని చేతిపనియే యైయున్న యెడల, ఆతని కృత్యములను, భక్తిపూర్వకముగ మీమాంస యొనర్చుటయే ఆతనిని గూర్చి జ్ఞానమును, భక్తిని సంపాదించుటకు అనన్యమార్గము."

ఇట్లు రెండు పక్షములవారిచే నిరూపింపబడిన అఖిలేశ్వర సిద్ధాంతము యొక్క ప్రాథమికావస్థ యందైనను మృణ్మయములు, శిలామయములు, చిత్రమయములు, సాంప్రదాయికములు నగు విగ్రహముల యొక్క ఆరాధనకు తావు లభించియుండలేదు. అఖిలేశ్వర వాదు లిట్లు వాదింతురు. ''దేవుడు తన కృత్యముల ద్వారముననే స్వాత్మను ఆవిష్కరించుకొనెను. భగవంతుని కృత్యములను తెలిసికొనుటచేతనే మానవునకు భగవంతుని గూర్చి జ్ఞానము లభించును.'' దీనిని బట్టి అఖిలేశ్వర సిద్ధాంతమునందు భగవంతుని సాకారునిగ నిరూపించుట గాని, ప్రకృతి యందలి వస్తువులందు చైతన్యము నారోపించుట గాని జరిగియుండలేదని తెలియును. ఇదియే ఈ సిద్ధాంతము నందలి ప్రత్యేకత.

దేవ విషయకమయిన ఇట్టి భావన, మనుష్యాత్మారోపము నొక వైపునను, అనాత్మ వాదమును మరియొక వైపునను నిరాకరించుచున్నది. " దేవుడు శక్తివిశిష్టుడు, శాశ్వతుడు, అనంతుడు. ప్రకృతి యందలి ప్రతిరూపము యొక్కయు, సంఘటన యొక్కయు ద్వారమున అతడు స్వాత్మను ప్రకటించుకొనును. భగవంతుడు నశ్య పదార్థము కంటె భిన్నుడు. ఆత్మకు శరీరమునకు గల సంబంధము వంటిదే భగవంతునకును ద్రవ్యమునకును గల సంబంధము. ఒక సుప్రసిద్ధ తత్త్వజ్ఞుడు వచించినట్లు మహాసముద్రము ప్రకృతమునకు తార్కాణము. సముద్రము అనంతము, శాశ్వతము. అట్టిదాని యందు సంఖ్యాతీతములయిన రూప భేదములతో పెక్కు బుద్బుదములు, చిన్న తరంగములు, గొప్ప తరంగములు పుట్టును. అవి అందే భాసించి, అందే లయించి, దాని రూపమునే పొందుచున్నవి. ఆ బుద్బుదాదులన్నియు జలము కంటె భిన్నమయినవి కావు. ఎప్పుడును జలరూపమున నుండునవే. శరీరము యొక్క ఆకృతులు నశ్యములు. ఆత్మ శాశ్వతమైనది. అది ఏకము, అద్వితీయము, సార్వకాలికము '' అని ఈ సిద్ధాంతము. కావున అఖిలేశ్వరవాదము ద్వైతమును గాక అద్వైతమునే ప్రతిపాదించుచున్నది.

**అఖిలేశ్వర వాదము యొక్క సంగ్రహ చరిత్ర:-** మత చరిత మెంత పురాతనమైనదో, అఖిలేశ్వర వాదముకూడ అంత ప్రాచీనమయినది. అన్ని యుగములందును అఖిలేశ్వర వాదమునందు అభిరుచిగలవా రుండిరి. అది ప్రపంచమున ప్రాచీనతములయిన నాగరకులలో వ్యాప్తి నొందెను. అన్ని దేశములలో, అన్ని కాలములలో అది ఆదరమును గాంచెను. ప్రాక్పశ్చిమ దేశములలో అందరికి దీని యందు అభిముఖ్య మేర్పడెను. హిందువుల అఖిలేశ్వర వాదమును వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత బోధించెను. గ్రీకు అఖిలేశ్వర వాదమును ప్రబోధించినవారు ఐయోనియన్స్, ఈలియాటిక్సు, అర్వాచీనమయిన ప్లేటో మతమును అనుసరించినవారు. మధ్య యుగములలో దేవాలయాధికారుల యొక్క నిర్బంధ పర్యవేక్షణము కారణముగ మత మీమాంసకు అవకాశము లేదయ్యె. జానుస్కోటను ఎంజెన అను వేదాంతి యొక్కడే మత మీమాంసకు డుండెను. అతడు ప్రాచీన, అర్వాచీనములయిన అఖిలేశ్వర వాదముల మధ్య ఒక గొలుసువలె భావింపబడెను. పశ్చిమ దేశములలో గయార్డానో బ్రూనో బెనెడిక్టు, స్పినోజా, ఫిక్టే, హెగెల్ అనువారు అర్వాచీనమయిన అఖిలేశ్వర వాదమునకు ప్రతినిధులు. హిందూదేశమున దివ్యజ్ఞాన సమాజస్థులలో రాజా రామమోహన రాయ, కేశవ చంద్రసేనులు మొదలుకొని స్వామి వివేకానంద, రవీంద్రనాథ ఠాకూరుల వరకు దానికి ప్రతినిధులు పలువురున్నారు.

**హిందూ - అఖిలేశ్వర వాదము :-** వేదములయందు విగ్రహారాధనకు ప్రసక్తి లేకుండెను. హిందూదేశమున మూర్తిపూజ అనునది మిక్కిలి అనంతరీయమయిన కాలమున ఏర్పడిన వ్యవస్థ. అది సామాన్యముగ పెక్కురు గ్రహించిన బహుదేవతావాదమునకు ఎంతమాత్రము సంబంధించినది కాదు. వేదములందు సూర్యుడు, అగ్ని, ఉషస్సు మున్నగు దేవతలనుగూర్చి ప్రార్థనలున్నవనుట సత్యమే. అయితే ఆ దేవతలలో ఏ యొక్క దేవత ప్రత్యేకముగ ప్రార్థింపబడినను, ఆ దేవత, శేషంచిన దేవతల అధికారమునకు లోబడినదిగాగాని, ఇతర దేవతలకంటె గౌరవ ప్రతిపత్తులలో న్యూనతాధిక్యములు కలదిగాగాని భావింపబడలేదు. మహత్త్వవిషయమున ప్రతి దేవతకు ఇతర దేవతలతో సమత కల్పింపబడెను. ఆరాధ్య దేవత యొక్క దేవతాత్మత, ప్రాధాన్యము, పరమాత్మత, మున్నగు గుణములను గూర్చి ఆరాధకుని మనమున ఎట్టిశంకకును

తావే లేకుండెను. బహుదేవతాత్వ భావనచే మన మనస్సు నందు జనింపదగిన పరిచ్ఛిన్నతాబుద్ధి, ఆరాధ్యదేవతా విషయమున భక్తుని మనమున పొడమలేదు. ఇది బహు దేవతావాద మనుకొనబడినది గాని, బహుజను లనుకొనునట్టి ఏకేశ్వరవాదముకాని కాదు. ఒక్కడును, అద్వితీయుడు నగు పరమాత్మయొక్క స్వరూపమే సర్వదేవతాగణము. ఆ పరమాత్మ ఒక్కడే భిన్నభిన్నములయిన ఆకృతులతో కనిపించును. దేవతలు, మనుజులు, ప్రకృతికృత్యములు, ఈ సర్వమును ఒక్కడు, సర్వవ్యాపి, సత్య స్వరూపుడు నగు పరమాత్మయొక్క క్షణిక ప్రతిభాసయై యున్నది అను జ్ఞానమే హిందూ - అఖిలేశ్వరవాద హృదయము.

వేదములందలి హిందువు ప్రజ్ఞాసంస్కృతి విశేషము నపేక్షించు సమస్యలలో వ్యాపృతుడై యుండెను. అవి సత్యస్వరూపము నెరుంగు శక్తి నొసంగజాలియుండెను. మోక్షముల్లరు నుడివినట్లు, అతడు (హిందువు) ఈ ప్రపంచ సమస్యా పరిష్కార విషయమున మగ్నుడై యుండెను. ఆద్యమానవునందువలె ఆతనియందును వాంఛలు లోపములు కన్పట్టెను. ఆహారమును, ధనమును, ఆధిపత్యమును, పెద్దకుటుంబమును, దీర్ఘాయువును తన దైనందిన ప్రార్థనలలో ఆత డర్థించెను. విశ్వమునగల సర్వభూతములకు అతడు నామకరణమొనర్చెను. వాటిని ప్రార్థించెను; స్తుతించెను; పూజించెను; తన హృదయాంతరమందు ఒకశక్తిని అతడు గుర్తించెను. ఆ శక్తి తనయందుండి ప్రార్థనను బోధించినట్లు, ఆ ప్రార్థనల నాలకించినట్లు, తన పరిసరముల నున్నవారికి తోడ్పడినట్లు ఆతనికి గోచరించెను.

దీనినే అతడు 'బ్రహ్మము' అనెను. ఆ వైయక్తికమయిన ఈ 'బ్రహ్మము' కూడ కాలక్రమమున ఒక చిత్రము దివ్యమునైన వస్తువుగా మారెను. తుదకది నేటికిని పూజింపబడుచున్న త్రిమూర్తులలో నొకడుగా నేర్పడెను. ఐన నాతని హృదయమునందలి భావనకు నిజమైనపేరు లేకుండెను. అనన్యమును, సర్వదేవతలకు, సర్వలోకమునకు, సర్వమునకు ఆధారభూతమునయిన శక్తివిశేషమొకటి వాచ్యముగాక, భావితమై ఆతని మనము నెదుట ప్లవమానమై గోచరించెను. తుదకాతడు దానిని 'ఆత్మ' యనెను. ఆదియందు, ఆత్మశబ్దమునకు ప్రాణము, లేక, చైతన్యము అను నర్థము లుండెను. ఆ శబ్దము పిదప 'ఆత్మ' యను అర్థముననే స్థిరపడెను.

భిన్నభిన్న దేవతలను గూర్చి, పౌనఃపున్యముగ, సర్వత్ర ప్రార్థనలు జరుగుచున్నంతలో, చాల స్వల్పసంఖ్యాగల దేశములందలి జనులుమాత్రమే, సర్వవ్యాపి, విశ్వాత్ముడు నగు దేవుడొక్కడే కలడను విషయమును నొక్కి వక్కాణింపగల్గిరి. యథార్థముగ దేవుడొక్కడే. అతడే సర్వాత్మ; అతడే పరమాత్మ; ఈ విశ్వ మాతనికృతి. ఇతర దేవతలు వేరువేరు నామములచే వ్యవహరింపబడుచురుగాక ! విశ్వమును, మనుజులను, దేవతలనుగూడ వ్యాపించి "పరమాత్మ ఒక్కడే ఉన్నాడు" అనుసత్యము విస్మృతము కావగదు.

బ్రాహ్మణముల కాలమున యాగాది కర్మ కలాపముల వలన మతము క్రమముగా సన్నగిల్లెను. అందుచేత శుద్ధమును, ఆధ్యాత్మికమును, వైదికము నగు ఈశ్వర విషయక మయిన భావము నందలి ఉన్నతికి భంగము వాటిల్లెను. పురోహిత వర్గముయొక్క అధికారము, నీచ ప్రమాణమునకును దుర్నీతికిని దారితీసెను.

ఈ పరిస్థితులు బౌద్ధ ధర్మము, సాంఖ్యము మున్నగు హిందూ మతమునందలి సంస్కారాత్మక దర్శనములకు మార్గదర్శకము లయ్యెను. ఇవి పురోహిత వర్గముపైని, భగవద్విషయక భావనపైని, సవాలు చేసెను. అయితే ఈ దర్శనములు పూర్వోక్త విధమున అఖిలేశ్వరవాదము నందలి రెండవ పక్షమునకు చెందినవై యున్నవి.

ఉపనిషత్తుల యందుగూడ అఖిలేశ్వరవాద తాత్పర్యము కలదు. ఒక పాశ్చాత్య వేదాంతి దాని నిట్లు సంగ్రహించెను : "జగత్తునకు భగవంతుడు సర్వజ్ఞతాయుతము, సర్వశక్తి విశిష్టము నైన కారణము; ఇచ్ఛా మాత్రమున అతడు సృష్టియొనర్చును. అతడు విశ్వమునకు సమర్థకారణము, ఉపాదాన కారణము - ఉభయమునై యున్నాడు. అతడు స్రష్ట, సృష్టి; నిర్మాత; నిర్మితి; కర్త, కృత్యము. ప్రళయకాలమున సర్వము అతనియందే లీనమగును. పరమాత్మ ఒక్కడు, అద్వితీయుడు, అఖండుడు, నిరవయవుడు, అనంతుడు, వాచామగోచరుడు. అతడు సర్వజీవుల్లకు, ఉత్పత్తికి, వివేకమునకు, బుద్ధికి, సుఖమునకు అధీశుడు. ఆతనినుండి పుట్టిన వ్యక్తిగతజీవులు ప్రజ్వలించు నగ్నినుండి జనించిన అసం

భ్యాకము లయిన అగ్నికణములవంటివారు. జీవులు భగవంతుని అంశములు. అందుచే వారు ఆతనియందే జనించి, ఆతనినే చేరుదురు. జీవాత్మ, శరీరమును, దాని అవయవములను నియమించును. అతనికి ఉత్పత్తి నాశములు లేవు. జీవాత్మ దివ్య వస్తువు (పరబ్రహ్మము) యొక్క అంశము. అందుచేత అతడు అనంతుడు, అమరుడు, ప్రాజ్ఞుడు, చేతనుడు, వాస్తవికుడు. దేహాంతర ప్రాప్తికి లోనగుచు, జీవుడు, లోకాంతర ప్రవిష్టుడయి, అచ్చట తనయొక్క సుకృత దుష్కృతముల ఫలములను అనుభవించును.

శిక్షను అనుభవించు నిమిత్తమై పాపులు వేరు వేరు లోకముల కేగుదురు. సుకృతవంతులు చంద్రలోకమునకు అరుగుదురు. అరిగి, అచట నిజ సుకృతఫలమును అనుభవింతురు. పుణ్యము క్షీణింపగా, వారు మర్త్యలోకమున నిజ కర్మానుగుణము లయిన దేహముల నొంది, విధివశమున ప్రవర్తింతురు. జ్ఞానవంతులు ప్రాపంచిక బంధములనుండి ముక్తులయి, ఉన్నతతర మయిన బ్రహ్మలోకమున ప్రవేశింతురు; జ్ఞాన పరిపూర్ణు లగు జీవులు వెంటనే బ్రహ్మైక్యము నొందుదురు.

**గ్రీకుల అఖిలేశ్వర వాదము :-** హిందువుల వేదాంతమునందువలె గ్రీకుల వేదాంతమునందు కూడ అఖిలేశ్వర వాద సూచనలు పెక్కు లుండెను. థేల్సు, గ్రీకు వేదాంతులలో ఆద్యుడు. అతడు సర్వవస్తువులకు మూలము ఉదక మని నిరూపించెను. అత డిట్లు వాదించెను, "మనుజుడు ప్రథమ సృష్టి యనుట పొసగదు. ఎందుచేత నన- అతడు తనకంటె ముందు పుట్టిన నీటిపై ఆధారపడెను. దేవతల సృష్టికూడ మొదటిది అనుటకు వీలులేదు. దేవతలుకూడ మనుజులవలె నీటి అవసరము కలవారే. వారు ఆకసములో నివసింతురని భావింప బడుచున్నది. ఆకసమునుండియే వాన పడును. నీరు లేనియెడల ప్రాణివర్గము నశించును. నీరులేక ఏ వస్తువు పుట్టియుండదు. అందుచేత నీరే అన్ని వస్తువులలో మొదటి సృష్టి."

థేల్సు పుట్టిన తరువాత, ముప్పది సంవత్సరములకు, క్రీ. పూ. 610 ప్రాంతమున జన్మించినవాడు అనాగ్జిమాండరు. అతడు భూమియే ఆద్యసృష్టి యని నిరూపించినట్లు ప్రసిద్ధికలదు. అతడు భూగోళశాస్త్రజ్ఞుడు. అతడు భూగోళశాస్త్ర సాధనములను కనిపెట్టినట్లు ఆ శాస్త్ర విషయమున తన ప్రజ్ఞను వినియోగించినట్లు తెలియుచున్నది. పిదప చెప్పదగినవాడు ఎనాగ్జిమీనసు. అతడు థేల్సు పుట్టినపిదప, నూరు సంవత్సరములకు జన్మించెను. ఐయోనియను వేదాంతులలో అతడు తృతీయ స్థానమును ఆక్రమించెను. అతడు పూర్వులగు వేదాంతు లొనర్చిన సిద్ధాంతములతో తృప్తినొందడయ్యె. "వాయువు ఆద్య తత్త్వము. జలము, భూమి, గుణమునందు పరిమితములు. వాతావరణము సర్వత్ర వ్యాపించునది. దానికి దేవునితో తాదాత్మ్యము కలదు" అని ఆతని సిద్ధాంతము. హిరాక్లిటసు అను వేదాంతి అగ్నిని ప్రథమ తత్త్వముగా నిరూపించెను. అతడు క్రీ. పూ. 6 వ శతాబ్దివాడు. "అగ్ని సర్వముగాను, సర్వము అగ్నిగాను మార్చుటకుశక్యము." అనునది ఆతని సిద్ధాంతము — కాగా పై సిద్ధాంతములన్నియు సృష్టికెల్ల మూలబీజము ప్రకృతి యను విషయమున నైకమత్యము కలిగియున్నవి. అనగా నివన్నియు అనాత్మవాదమును ప్రతిపాదించునవే. పైథాగరసు, ఈలియాటిక్సు అను వేదాంతులు అనంతరీయులు. వారిరువురు అయోనియను వేదాంతమును పెంపొందించిరి. పైథాగరసు విశ్వైక్యమును స్పష్టముగ దర్శించెను. "ఏకమునుండి సర్వము పుట్టుచున్నది. దేవుడు సర్వవ్యాపి. సర్వ ప్రేరకుడయ్యు, అతడొక్కడే. సర్వావస్థలు గళితములుకాగా, పరమాత్ముడొక్కడే అద్వితీయుడును, సంపూర్ణుడునై శేషించుచున్నాడు." అని అతడు వాదించెను. హిందూ వేదాంతుల వేదాంతమునందలి అత్యంతనిర్గుణత. ఆధ్యాత్మికత, అను నంశములను ఈలియాటిక్సు అంగీకరించెను. పిదప పేర్కొనదగినవారు అర్వాచీనమయిన ప్లేటో మతమునకుచెందిన గూఢతత్త్వ ద్రష్టలు. తదనంతరీయులు అరేబియను సూఫీమతస్థులు. వారు భగవదైకాగ్ర్యమును సర్వజనులకు ప్రీతి పాత్రము కావించిరి. వారు దూరస్థుడగు నీశ్వరుని భజింపరు. ఈశ్వరుడు వారి హృదయమునం దుండవలయును. "అత్యున్నత సత్యములను స్వాధ్యాయమువలన అందుకొనజాలము. ఆనంద పారవశ్యమునందలి ఆత్మపరివర్తనముచేతనే వాటిని పొందగలుగుదుము." అని వారు వక్కాణించిరి.

**అర్వాచీనమయిన అఖిలేశ్వరవాదము :—** దీనికి అనుయాయులు పెక్కురు గలరు. దీనిని ప్రకాశింపజేసిన ప్రముఖులలో సెర్విటసు, బ్రూనో, వానిని (vanini), స్పినోజా, ఫిక్టే, హెగెల్—పేర్కొనదగుదురు. బ్రూనో ప్రతిపాదించిన వాదములు రెండు. వాటిని అఖిలేశ్వరవాదము యొక్క ముఖ్యలక్షణములు అనవచ్చును. దేవతలు లోనుండి వ్యవహరింతురు; బహిఃస్థితులయి వ్యవహరింపరు. విశ్వము ఏకము. అనంతము, అనునవి ఆవాదములు. విశ్వైక్యమును చింతించుచు బ్రూనో ఇట్లు వచించెను. "జాతమయిన వస్తు వెట్టిదైనను మార్పునొందును. నిత్యవస్తువు మాత్రము మారునదికాదు. ఆ వస్తువు ఏకము, దివ్యము, శాశ్వతము. వస్తుజాతము విశ్వమునందున్నది; విశ్వము వస్తుజాతమున గలదు. మనము 'తత్' అనుదానియందున్నాము. 'తత్' అనునది మనయందున్నది. అందరము పరిపూర్ణ-అద్వైతమున సమాగమము నొందుదుము."

ఆధునిక వేదాంతులలో స్పినోజా ప్రముఖుడు. అతడు అఖిలేశ్వరవాదమునకు ప్రవక్తగ పరిగణింపబడెను. స్పష్టతయందు తర్కకౌశలమునందు ఆతని వాదము అద్వితీయము. "దేవుడుసర్వము తానయైయున్నాడు.అతనికంటె భిన్నమొండు లేదు. ఆతనిలో నీ విశ్వము ఇమిడియున్నది. దేవుడు అనంతుడు. ప్రపంచమునకు అంతముకలదు. అనంతవస్తువునకును, నశ్యవస్తువునకును పొత్తుకుదరదు.

నశ్యములగు వస్తువులు యథార్థముగలేనివే. వికారరహితమయిన పదార్థము యొక్క ఖ్యాపనములు లేక ఆకృతులుగా తెలియబడునంతవరకు అవి సత్యములు. ఆధ్యాత్మిక పరిభాషలో అవి సత్యవస్తువు యొక్క ప్రతిరూపములు. అన్యవస్తువునందున్నదానికే ప్రతిరూపమని పేరు, ఆ అన్యవస్తువుచేతనే దాని స్వరూపము గోచరించును. సర్వము భగవంతునియందే కలదు. భగవంతుని యందు లేనిది లేనేలేదు. సముద్రమునకును, తరంగములకును గల సంబంధము వంటిదే సద్వస్తువునకును, ప్రతిరూపములకునుగల సంబంధము. అవి సత్యవస్తువుయొక్క భిన్నభిన్నములయిన ఆవిర్భావములు. ఆ వస్తువుకంటె నవి అభిన్నములు. దానియందే అవి లయించును." అని అతడు ప్రవచించెను. ఇట్లు సర్వమునకు అంతర్గతమయిన కారణముగా, సర్వసారముగా విశ్వమునందలి సర్వ వస్తుజాతముపైని విశేషముగ మానవుని హృదయముపైని ప్రభావముతోగూడిన ఆత్మజ్ఞత, సంకల్పము, ప్రజ్ఞ, వ్యక్తిత్వము కలవాడుగా భగవంతుడు స్పినోజాకు గోచరించెను. శాశ్వతమును సర్వగతమునగు కారణమగుటచే భగవంతునకు ఆంగ్లేయములో 'నాచురనాచురన్స్' అని వ్యవహారము. సృష్టియందు ఆవిష్కృతుడగుటచే అతనికి "నాచురనాచురట" అని పేరు. ప్రకృతి అనగా, విశ్వము భగవంతుని ముఖ్యాసారము. అందుచే నది ఆతని శక్తి. కాగా భగవంతుడు, అతనియందలి ప్రకృతి, ఆద్యము, అనౌపాధికమునగు కారణము. ప్రకృతికార్యము అనగా, ఆతనిశక్తియొక్క ఔపాధికమయిన ఆవిర్భావము. భగవంతునికంటెవ్యతిరిక్తమయినది ఏదియులేదు."

ఫిక్టే, మరియొక అర్వాచీనుడగు అఖిలేశ్వరవాది. అతడు దేవుని, విశ్వమును గూర్చి గాఢముగ విమర్శన మొనర్చెను. ప్రతిరూప భేదమునకు వెనుక నున్నవాడు దేవుడే యైనను అతనిని గూర్చి స్వల్పముగానే మనము తెలిసికొనగల్గుచున్నాము. అతనిని రాయిగా, మొక్కగా, ప్రాణిగా లేదా ప్రకృతిసూత్రముగా, నైతికసూత్రముగా మాత్రమే మనము తెలిసికొనుచున్నాము. ఇవియన్నియు ఆతనికంటె భిన్నములు. ఆకృతియే సత్యవస్తువును మన దృష్టి నుండి మరుగుపరచుచున్నది. ఈ పరిదృశ్యమానమే ఆసత్యవస్తువును దాచుచున్నది. మన దృష్టి ఇంకకంటె విశేషమును గుర్తింపజాలకున్నది" అని ఫిక్టే వచించెను.

అర్వాచీనులయిన హిందూ వేదాంతులలో, రాజా రామమోహనరాయలు మొదలుకొని రవీంద్రనాథ ఠాకూరు వరకు పెక్కురు కలరు. మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు, కేశవచంద్రసేను మొదలగు మతోపదేశకులున్నారు. బ్రహ్మజ్ఞాన సమాజస్థులలో ప్రముఖులుకలరు. వివేకానందస్వామి యొకడున్నాడు. వీరి మత-వేదాంత విషయకములయిన ఆశయములు అఖిలేశ్వరవాదమునకు అనుకూలములైనవి. వీరి వేదాంతము ఏకేశ్వరుని ప్రతిపాదించు ఉపనిషత్తత్త్వమే. ఇది ఆధ్యాత్మిక గూఢతత్త్వము కంటె అభిన్నము.

**అఖిలేశ్వర వాద సిద్ధాంతములు:-** "సత్య వస్తు వొకటి కలదు. అది సర్వ వ్యాపి. పరిదృశ్యమానమగు సర్వ ప్రపంచమున కది మూలతత్త్వము. అదిఏకము, అవిది

తము, అవేద్యము. బాహ్యప్రకృతి దాని ఆవిర్భావమే '' అనునది సంగ్రహముగ అఖిలేశ్వరవాదము యొక్క ముఖ్య సిద్ధాంతము. అఖిలేశ్వరవాదము యుక్తిసిద్ధము. దీనికి స్పెన్సరు వేదాంత మొక ఉత్తమోదాహరణము. స్పెన్సరు యొక్క అవేద్య విషయక భక్తియు, నిర్గుణాత్మకమయిన అఖిలేశ్వరవాదమే. వేదకాలపు ద్రష్టల నుండి ఆధునికులగు తత్త్వజ్ఞుల వరకు భగవంతునియందలి విశ్వాసము పెంపొందుచున్నదని నిరూపింపబడినది. '' దేవుడు ఒక్కడు అద్వితీయుడు, సర్వవ్యాపి, పరిదృశ్యమానమగు విశ్వమెల్ల అతని బాహ్యస్వరూపము ''అనునదే ఆ దృఢవిశ్వాసము. నేటికి ప్రకృతిశాస్త్రము దీనిని సరిచూచుటకు ఉపక్రమించుచున్నది. 'సత్త' పూర్వమందు ఉన్నట్టిది. ముందు అది పరిమాణమునందును, తత్త్వమందును మార్పునొందనిది. ఆకృతియందే దానికి మార్పు ఘటిల్లును - అను విషయమును ప్రకృతి యొక్క అనశ్వరత్వము, శక్తి యొక్క సంరక్షణము - అనువాటిని గూర్చిన సిద్ధాంతములు నిరూపించుచున్నవి. ఈ ప్రకటనముల పరిణామమే అఖిలేశ్వర వాదముగ దోచును. అవిజ్ఞాత (వస్తువు) ము లేకయే జ్ఞాతమును గూర్చి ఆలోచింపజాలనట్లు ప్రతిభాస- ఆధారముగ నంగీకరింపకయే, ప్రతిభాసములను అంగీకరింపజాలము. వీటిలో ఒకటి, రెండవదాని పూర్వభావనయే. మనుజుడు ప్రతిభాస- ఆధార స్వరూపమును తెలిసికొనుశక్తి తనకు లేదని యంగీకరించినను, దానియొక్క సత్తను మాత్రము, తర్క ప్రాబల్యమునకు లోనై, అంగీకరింపవలసినవాడగుచున్నాడు. ఆతడు తన శక్త్యభావమును సవినయముగ అంగీకరించుటయే అతని వివేకమునకు లక్షణము. ప్రతిభాస- ఆధారము యొక్క రూపములు అనంతములుగా ఆవిష్కృతములు. అవి సంకల్పము, బుద్ధివైభవము, స్రష్ట, సృష్టి, సత్యము - మున్నగునవి. ఈ నామములు, నామమాత్రములుగా (చిహ్నములుగా) అంగీకరింపబడువరకు అవి యున్నవనుకున్నను బాధయుండదు. ఈ నామము లన్నియు అనిర్వాచ్యమగు సత్యపదార్థము యొక్క స్వరూప నిరూపణమున అపర్యాప్తములు- అను భావము ఉత్సుకుల హృదయ కుహరమున లక్షితమగుచున్నది. సి. ఇప్లంప్రుట్రీ అనునాతడు వ్యాఖ్యాకరును ఇట్లనువదించు మన్నాడు. "భగవంతుని యథాస్థితినిగూర్చి మనకేమియు తెలియదని గుర్తించుటయే ఆతని గూర్చి మనకు గల సంపూర్ణ జ్ఞానమగుచున్నది. అతడు అవేద్యుడు. ఆతనిని గూర్చి మనము ప్రదర్శింపగల వాగ్వైభవము మౌనము వహించుటయే."

ఇందలి ముఖ్యమైన లోపములు (Limitations) :- అఖిలేశ్వర వాదమున బుద్ధివైభవము మెండు. అందలి లక్షణములు చిత్తాకర్షకములు. ఐనను అది మతస్థాయిని అందుకొనలేక పోయినది. ఎందుచేతనన అది పాపము, తదుత్పత్తి మున్నగు సమస్యలను వివరించియుండలేదు. సర్వము దేవుడేయైనచో, లోపములు కూడ దివ్యములే యగును. ఆ పక్షమున దేవుడు అసంపూర్ణుడగుట గాని, పాపమనునది లేనేలేకుండుట గాని సంభవించును. కాని ఇది మన ప్రత్యక్షానుభవమునకు విరుద్ధమైనది. దేవుడు ప్రతి సంఘటనకు(దృశ్యము)ప్రతిభాస- ఆధారమయినచో అతడు ప్రపంచమునందలి పాపములకెల్ల ప్రతిభాస- ఆధారమగునని అంగీకరింపవలసియుండును. అట్లంగీకరించుట నాస్తికతను ప్రతిపాదించుటయే యగును. బేకను వచించినట్లు దేవునిగూర్చి అనర్హమయిన అభిప్రాయమును ప్రకటించుటకంటె, ఊరకుండుటయే మేలు. ఎందుచేతనన-ఒకటి అవిశ్వాసముగా, రెండవది అవజ్ఞగా పరిగణింపబడును. అఖిలేశ్వర వాదమున గల లోప మొక్కటే. పాపమును గూర్చి, వివరణ మిందు లేకుండుటయే ఆ దోషము. ఈ వాదమునకు మత గౌరవము చేకూరకుండుటకు గల ప్రతిబంధక మిదియే. అన్ని మతములకు గల నిక్కమయిన ప్రతిబంధక మిదియే.

అఖిలేశ్వరవాదము ప్రగతికి సాధనము కాదను నాక్షేపము ఇందలి రెండవ లోపము. కారణములు- అనంతవస్తువునకును, నశ్యమయిన వస్తువునకును భేదాభావమే ఇందలి సారాంశమగుట ; తన్మూలమున నశ్యవస్తువు అనశ్య వస్తువును పెక్కురీతుల పోలియుండుట ; అందుచేత నశ్య వస్తుసముదాయము అనంత వస్తువవలె పరిపూర్ణతను చెందవలసివచ్చుట - ఇందలి యుక్తి ఇది ; నశ్య వస్తుసముదాయము సంపూర్ణమే యైనచో, పురోగతికై, లేదా ఆదర్శ సంపాదనమునకై ప్రయత్నము అనవసరమగును. పూర్వస్థితియే చాలును. కాబట్టి ఈ

వాదమున నైతికముగా లేదా ఆధ్యాత్మికముగా అభివృద్ధికి అవకాశమేలేదు.

ఇది మరల వ్యక్తిత్వ నిరసనమునకు మార్గదర్శకమగును. అనంత వస్తువికాసము నశ్య వస్తువును కల్పించుచో; 'సర్వము దేవుడే' అను అఖిలేశ్వర వాదమును బట్టి, నశ్యవస్తువు అనంతవస్తువునకు సమాన మయినచో; ఈ రెండింటికిని భేదము శూన్య మగును. ఆత్మ, దేవుని ప్రతిచ్ఛాయాంశ మగుటచే, పరిచ్ఛిన్నాత్మలకు విశ్వాత్మ గుణాధిరోహణము సాధ్యమా అను విషయమున బౌద్ధాసీన్య మేర్పడును. భావ మేమన- శాస్త్రీయముగా మాత్రము ఆత్మ విశ్వాత్మతో స్వీయమైన వ్యక్తిత్వమును కోల్పోవు నంతగా లీనమగును. పూర్వోక్తము లయిన కారణములను పుర్కరించుకొని ఈశ్వరవాదులు అన్యులతోపాటు అఖిలేశ్వర వాదమొక వేదాంతమనియు అది తృప్తికరమగు మతస్థాయిని అందుకొనజాలక పోయినదనియు భావించుచున్నారు.

శ్రీ శ్రీ దేవి

**అగ్గిపుల్లలు** :- నిప్పును తయారుచేసికొనుట మానవుడు తన నిత్యజీవితమందు ఎదుర్కొనిన తొలి సమస్య. ఎండుకట్టల రాపిడిచే అగ్నిని రగుల్కొల్పు పురాతన విధానము నేటికిని భారతదేశ గ్రామములలో గానవచ్చుచున్నది. రాతి యుగములోను, కంచు యుగములోను రెండు రాళ్ళను ఇందుకొరకై ఉపయోగించెడివారు. వీనిలో నొకటి పైరైట్సు రూపమున ఇనుమును కలిగియుండును. క్రమేణ, ఈ పద్ధతి ఉక్కు చెకుముకిరాయి నుపయోగించు టిండరు బాక్సు (Tinder Box) విధానముగా మార్పుచెందెను. "టిండర్" పెట్టె నుండి వెలువడు నిప్పు రవ్వలను దూదిపైగాని, మాడిన నారపైగాని, గంధకపు పూతగల్గిన పుల్లలపైగాని పట్టి, నిప్పు తయారుచేసెడివారు. రసాయనిక పదార్థముల సహాయముచే, తయారుచేయబడు అగ్గిపుల్లలకిది నాంది అని చెప్పవచ్చును.

1673 లో 'హాంబర్గు' నివాసియగు 'బ్రాండు' అను శాస్త్రజ్ఞుడు భాస్వరమును కనుగొనినప్పటి నుండియు, దాని నుపయోగించి కృత్రిమముగా నిప్పు తయారుచేయుటకై చేయబడిన ప్రయత్నములన్నియు వ్యర్థమాయెను. ఈలోగా 'బెర్దెలాట్' అను శాస్త్రజ్ఞుడు, దహ్యాపదార్థములను గాఢామ్లముల సమక్షమున హరితములతో ఆమ్లజనీకరణము చేయుట కనుగొనెను. ఈ పద్ధతి హరిదామ్లపు అగ్గిపుల్లలను (Eximuriated Matches) తయారుచేయుటకు దారితీసెను. దీని ప్రకారము గంధకము, పొటాషియ హరితము, చక్కెర, బంక, రంగు పదార్థములు కలిపి తయారుచేసిన ముద్దను సన్నని పుల్లల కొనలకు పట్టించి, ఆ కొనలను గాఢగంధకి కామ్లములో ముంచినచో పుల్లలు మండెడివి. కాని ఎల్లప్పుడును గాఢ గంధకి కామ్లము నొక సీసాలో తీసికొనిపోవలసి వచ్చుటచే, ఈ పద్ధతి చాల అసౌకర్యమనిపించెను. 1809 లో 'పారిస్' నగరవాసియైన 'డెరిపాస్'నకు, భాస్వరము నుపయోగించి కృత్రిమముగా నిప్పును కల్పించు విధానమునకై పేటెంటు (Patent) ఈయబడెను.

1827 వ సంవత్సరములో 'రాపిడి అగ్గిపుల్లల' ను ఇంగ్లాండు దేశీయుడగు జాన్‌వాకరు మొదటిసారి జయప్రదముగా తయారుచేసెను. ఈ పుల్లల కొనలు అంటిమొనిగంధకిదము, పొటాషియ హరితము, తుమ్మబంక కల్గినముద్దచే పూయబడినవి. ఈ కొనలను గాజుపొడుము కలిగిన గరుకు కాగితముపై రాచినప్పుడు మంట కలుగును.

భాస్వరము నుపయోగించి తృప్తికరమైన రాపిడి అగ్గిపుల్లలను 1831 లో తొలిసారిగా ఫ్రాన్సు దేశీయుడైన 'ఛార్లస్‌సోరియా' అను నతడు తయారు చేసెను. అతడు పొటాషియం హరితమును ఆమ్లజనీకరణ సాధనముగా నుపయోగించుటచే, మందులోనికి కావలసిన పచ్చభాస్వరము నూటికి 50% నుండి 5% వరకు తగ్గిపోయెను. కాని ఇంతవరకు భాస్వరము నుపయోగించి చేయబడిన అగ్గిపుల్ల లన్నింటిలోను, పచ్చభాస్వరము వాడుటచే కార్మికులకు 'ఫాసీజా' (Phossy jaw) అను ప్రమాదమైన దౌడజాడ్యము సంభవించు చుండెను. 1864 లో 'లెమూయిన్' కనుగొనిన 'భాస్వరత్రిగంధకిదము' ను పచ్చభాస్వరము (Sesanisulphide of Phosphorus) నకు బదులుగా నుపయోగించి, ఫ్రాన్సు దేశములో 'సెవీన్' మరియు 'కహన్' అను వారలు 1898 లో మొదటిసారి, అగ్గిపుల్లల మందును తయారు

చేసిరి. 20 వ శతాబ్ది ప్రారంభమునకు ప్రపంచమంతటను అగ్గిపుల్లల మందు చేయుటకై భాస్వరత్రిగంధకిదము వాడుకలోనికి వచ్చెను.

అగ్గిపుల్లలలో, ఇష్టమువచ్చినచోట గీయతగినవి (strike-anywhere), పెట్టె మీద గీయతగినవి (strike-on-box or safety) అనునవి రెండు ముఖ్యమైనరకములు. వీటిలో మొదటిరకపు పుల్లలను, ఏ ప్రదేశముమీద గీచినప్పటికి మంట బయలుదేరును. రెండవరకపు 'క్షేమ' అగ్గిపుల్లలను స్వీడనుదేశీయుడైన 'జాంకోపింగ్' 1855 లో తయారుచేసెను. ఇవి ప్రత్యేకతలములపై గీచినప్పుడు మాత్రమే మండును. కావున వీటిని సురక్షితముగ నుపయోగింపవచ్చును. పుస్తకరూపముననుండు పెట్టెలలో దొరుకు మరియొకరకపు పుల్లలు కూడ క్షేమకరమైనవి. ఇవిగాక 'మైనపు అగ్గిపుల్లలు' 'రెండుకొనల అగ్గిపుల్లలు' రంగుపుల్లలు, ఫ్యూజీ; గాలిలో మండునవి ('Fuzee', 'Wind flamer') మొదలగు వివిధరకములు గలవు. ఇవి ప్రత్యేకావసరములకు వాడబడును.

అగ్గిపుల్లలను తయారుచేయుటకు కావలసిన ముడిపదార్థములు కఱ్ఱ, రసాయనిక పదార్థములు, జిగురుపదార్థములు, పైన చుట్టు కాగితముపట్టీలు మొదలగునవి. పుల్లలను తయారుచేయుట కుపయోగించు ముడిపదార్థములలో కఱ్ఱ ముఖ్యమైనది. అగ్గిపుల్లలనాణ్యము చాలవరకు దీనిపై ఆధారపడియుండును. ఈ కఱ్ఱ మెత్తగను, చదునుగను, శుభ్రముగను, పగుళ్ళు, బొడిపెలు లేకుండగను ఉండవలెను. అగ్గిపుల్లలను తయారుచేయుటకు చాలరకముల కలపల నుపయోగించెదరు. 'ఆస్పెన్,' 'పోప్లార్,' 'బర్చ్,' మున్నగు రకములను పాశ్చాత్యదేశములలో తరచు వాడుచున్నారు. భారతదేశములో, 'పైనస్‌లాంగిఫోలియా' (Pinus longifolia) 'పైనస్ఎక్సెల్సా' (Pinus exelsa), 'విల్లో' (Willow), 'పాప్యులస్ సిలియాటా' (Populus ciliata) అడవిమామిడి, మునిమోదుగ, పెద్దమాను, అడవిగుమ్మడి, గుగ్గిలము, బూరుగ మున్నగు వృక్షముల కలపలను ఈ పరిశ్రమలో వాడుచున్నారు.

అగ్గిపుల్ల మందు తయారుచేయుట కుపయోగించు రసాయనిక పదార్థములలో పొటాసియ హరితము, పొటాసియ ద్విక్రోమితము, గంధకము, మాంగనద్విఆమ్లజనిదము, కాల్షియగంధకితము, ఫెర్రిక్ ఆక్సైడ్, బేరియంగంధకితము మున్నగునవి ముఖ్యమైనవి. అగ్గిపెట్టెప్రక్కల నుపయోగించు 'రాపిడి' మందులో, ఎఱ్ఱభాస్వరము, భాస్వర త్రిగంధకిదము, అంటిమొని గంధకిదము, సుద్ద మున్నగువాటిని వాడెదరు. బంక, 'జలెటిన్,' తుమ్మజిగురు, కేసిన్ (casein) పిండిపదార్థము మున్నగువాటి నుండి జిగురుపదార్థములను తయారుచేసి మందులలో వాడెదరు. క్రొవ్వొత్తుల మైనము, అమ్మోనియా భాస్వరితము, గాజుపొడి మున్నగు ఇతర పదార్థములను కూడ అగ్గిపుల్లల పరిశ్రమలో వాడెదరు.

అగ్గిపుల్లలను తయారుచేయువద్ధతి చాలాకాలమునుండి వృద్ధిచెందుచు అత్యుచ్చదశకు వచ్చినది. పురాతన పద్ధతులకును నవీన పద్ధతులకును గల భేదము, ఉపయోగించెడు స్వయం చాలక యంత్రములయందును, ప్రమాదరహితలేక క్షేమమగు అగ్గిపుల్లలకు కావలసిన మందుసామగ్రుల యందును, సరియైన మంటను కల్గించు లక్షణముల యందును, ముడిపదార్థముల నాణ్యమునందును గలదు. కాని పరిశ్రమయందలిమూలసూత్రములలో మార్పులేదు. 'క్షేమ' మగు అగ్గిపుల్లలను తయారుచేయు నూతనపద్ధతి సూక్ష్మముగ ఈ దిగువ వర్ణింపబడినది.

అడవులనుండితేబడిన దూలములను సుమారు రెండడుగుల పొడవుగల స్తంభాకారపు ముక్కలుగా కోయుదురు. వాటిపై బెరడు యంత్రసహాయముచే తీసివేయబడును. తరువాత ఈ ముక్కలను కడిగి నీటిలో ఉడకబెట్టుటయో, ఆవిరిలో వేడిచేయుటయో జరుగును. ముక్కలు మెత్తబడిన తరువాత వాటిని చీలికలుచేయు యంత్రములవద్దకో, పైన పూతపూయు యంత్రముల దగ్గరకో పంపుదురు. ఇక్కడ ఈ ముక్కలనుండి, జాగ్రతగా నమర్చబడిన కత్తితో, ఒకే మందముగల పొరను విడదీయుదురు. ఈ పొర ఒక పొడవైన రేకువలె వచ్చును. దీని వెడల్పు స్తంభాకారపు ముక్కల పొడవునకు సమానము. దీని మందము, అగ్గిపెట్టెలకొరకు $\frac{1}{34}$ అంగుళము, పుల్లలకొరకు $\frac{1}{15}$ అంగుళము ఉండును. ఈ రేకులను దొంతరలుగా చేసి, పెట్టెలకు పనికివచ్చునట్లు ముక్కలుగను, పుల్లలుగను కోసెదరు. వీటిని మందులను పట్టించుటకై వేర్వేరు విభాగములకు పంపెదరు.

పుల్లలను తయారుచేయు విభాగములో, కఱ్ఱపుల్లలను ముందుగా వేడియైన 'మోనో అమ్మోనియం' భాస్వరితము ద్రావణములో నానబెట్టి ఎండబెట్టెదరు. ఇది పుల్లలను అంటించినతర్వాత మంట ఆరిపోయిన వెంటనే పూర్తిగా నిప్పు ఆరిపోవుటకై అవసరము. పూతపూసి యెండిన పుల్లలను ఒక యంత్రములో మెరుగుపెట్టి, మరియొక యంత్రములో నమర్చబడిన పళ్లెములలో వరుసలుగా పేర్చెదరు. తరువాత ఈ పళ్లెములు అగ్గిపుల్లలను తయారుచేయు స్వయంచాలకయంత్రముల వద్దకు తీసికొనిపోబడును. ఈ యంత్రములు సింప్లెక్సు, ఆటోమాట్, ఆదర్శ ('Simplex', 'Automat', 'Ideal') మొదలగు పేర్లతో పిలువబడుచున్నవి. ఇవి వేరు వేరు యంత్ర నిర్మాతలచే తయారు చేయబడినవి. ఈ యంత్రములు పనియంతయు స్వయముగానే మనుష్య సహాయము లేకుండా చేయగలవు. ఆగకుండా విద్యుచ్ఛక్తి సహాయముచే పనిచేయును. మొదట, పళ్లెములలోనున్న పుల్లలు, ఒక పట్టాపైనుండు సన్నని రంధ్రములలో నిలువుగా వరుసలలో అమర్చబడును. ఈ పట్టా, వేడిచేయబడిన లోహపు పట్టీమీద కొంతదూరము ప్రయాణముచేయును. ఈ ప్రక్రియవలన, పట్టాపై అమర్చబడిన పుల్లలు వేడియెక్కును. తరువాత ఈ పట్టా, 220° ఫా. ఉష్ణోగ్రత వద్ద నుంచబడిన మైనముపై పోవును. అప్పుడు పుల్లల కొనలకు ½ సెం॥ మీ॥ పొడుగున మైనపు పూత పూయబడును. అదనముగా అంటిన మైనమును కరగించి తీసివేయుటకై పుల్లలను తిరిగి ఒక వేడిపట్టాపై వంపుదురు. తరువాత పుల్లలు చల్లార్చబడును. పిమ్మట పుల్లలతో నున్న పట్టాను, తిరుగుచున్న ఒక పాత్రముపై వంపెదరు. ఈ పాత్రము అగ్గిపుల్ల మందుంచిన ఒక తొట్టెలో తిరుగుచుండును. కావున పట్టా పాత్రముపై పోయినప్పుడు ప్రతి పుల్ల కొనకును కొంచెము మందు పట్టించ బడును. పుల్లల చివర మందును ఎండబెట్టి చల్లార్చెదరు. అంతట తయారైన పుల్లలను పెట్టెల సొరుగులలో యంత్ర సహాయమున నింపెదరు. ఒక్కొక పెట్టెలో సుమారు 60 పుల్లల చొప్పున సమానముగా నింపబడును. సొరుగులను యంత్ర సహాయమున పెట్టెలలోనికి అతికించెదరు.

అగ్గిపెట్టెలను తయారుచేయుటకు కఱ్ఱనుండి తయారు చేసిన చదునైన ముక్కలను వాడెదరు. ఈ ముక్కలపై పెట్టెకు సరిపోవునట్లు కొంచెము లోతు కల్గిన గాడులు గీయబడును. ఈ గాడుల వెంబడి ముక్కలను వంచి కావలసినట్లు సొరుగులను, పెట్టెలను తయారుచేయుదురు. సొరుగుల పైనను, పెట్టెల పైనను రంగుకాగితము అంటించబడును. ఈ పనియంతయు యంత్రముల చేతనే చేయబడును. పుల్లలతో నింపిన పెట్టెలు రెండు గుండ్రని కుంచెల మధ్య ప్రయాణముచేయును. ఈ సమయములో పెట్టెల కిరుపైపులను 'రాపిడి' మందు సమానమందముతో పూయబడును. తరువాత పెట్టెలను ఎండబెట్టి, రవాణా కొరకు వీలగునట్లు డజనుల చొప్పున, గ్రోసుల చొప్పున కట్టలుగా కట్టెదరు. కట్టలు కట్టుటగూడ యంత్ర సహాయముననే జరుగును.

అగ్గిపుల్లలను కుటీరపరిశ్రమలలో తయారుచేయునపుడు పై వివరించిన పనులలో చాలవరకు యంత్రములచే గాక మనుష్యులచే చేయబడును. ఇట్టి పనులలో దుంగలను కోయుట, పళ్ళెములలో నింపుట, పుల్లలకు మందు పూయుట, పెట్టెలలో నింపి కట్టలు కట్టుట, సామగ్రులను ఒకచోటి నుండి మరియొకచోటికి కొంపోవుట మొదలగునవి ముఖ్యమైనవి.

ఇష్టమువచ్చినచోట గీయు రకపు అగ్గిపుల్లలను మంచి తెల్లని 'పైన్' కఱ్ఱనుండి తయారుచేయుదురు. వీటిలో మండెడు పదార్థములతోను, ఆమ్లజనీకరణ పదార్థములతోను పుల్లల కొనలకు రెండు పూతలు ఒకదానిపై నొకటి పూయబడును. ఈ రకపు పుల్లలను మండించుటకు వేరే 'రాపిడి మందు' అనవసరము. ఏ గరుకు ప్రదేశము మీద నైనను గీచినచో ఈ పుల్లలు మండును. సామాన్యమైన వాడుకకును, ప్రత్యేకావసరములకును పనికివచ్చు అగ్గిపుల్లల రకములలో చిన్న పుస్తకరూపమున కుట్టబడి తయారగునవియు, సైనికావసరముల కుపయోగపడు 'విండ్ ఫ్లేమర్' (గాలిలో మండునవి), 'ఫూజీ' అనునవియు, రంగుమంట నిచ్చెడు పుల్లలును ముఖ్యమైనవి. రంగుమంట నిచ్చుటకై 'స్ట్రాన్షియం', 'బేరియం' లవణములు కల్గిన మందులతో మొదట పూతపూసి, దానిపై మంట కల్గించెడు పదార్థములతో పూతనిచ్చెదరు.

'సేఫ్టీ' అగ్గిపుల్లల కుపయోగించెడు మందుల పాళ్లు ఉదాహరణకై ఈ దిగువ నీయబడినవి. (పాళ్ళు బరువు లలో సూచింపబడినవి.)

'పుల్లల మందు':- పొటాసియ హరితము 36; ఎఱ్ఱ మాంగనము 4; పొటాసియ ద్విక్రోమితము 1; యశద అమ్లజనిదము ½; పారిస్‌గార (ప్లాస్టర్ అవ్ పారిస్) ½; గంగ సింధూరము 1; **Caput Mortuum** 4; గాజు పొడి 8; చౌడు(**infusional earth**) ½;గుగ్గిలము(**Rosin**) ½; గంధకము 3; బంక 8; నీరు 35.

'ప్రక్కలకు పూయు రాపిడిమందు':- ఎఱ్ఱభాస్వరము 400; ఆంటిమొని గంధకిదము 320; సుద్ద 52; గాజుపొడి 48; బంక 18; తుమ్మబంక 186; ఖారము బంక (**gum tragacanth**) 7; డెక్‌స్ట్రైను (**Dextrine**) 24; నీరు 750.

భారతదేశములో అగ్గిపుల్లలు చేయు మొదటి కర్మాగారము భారతీయుల యాజమాన్యమున 1895 లో అహమ్మదాబాదు నగరములో స్థాపింపబడెను. అయినప్పటికీ, మొదటి ప్రపంచ సంగ్రామమునకు పూర్వము మన దేశములో అగ్గిపుల్లలు తయారుకాలేదనియేచెప్పవచ్చును. 1922 లో దిగుమతి సరకులపై పన్నులు విధించిన తరువాతను, 1928 లో రక్షణ సుంకములను విధించిన తరువాతను, మనదేశపు అగ్గిపుల్లల పరిశ్రమ త్వరితముగా అభివృద్ధిచెందెను. 1926 నాటికి మనకు కావలసిన అగ్గిపుల్లలు చాలవరకు భారతీయ పరిశ్రమయే తయారుచేయ గలిగెను. దేశములో అమలులో నున్న రక్షణసుంకములను చెల్లించుకొనలేక పాశ్చాత్య ఎగుమతిదారులు భారత దేశములోనే అగ్గిపుల్లల కర్మాగారములను నెలకొల్పుటకు నిశ్చయించిరి. ఈ విధముగ పశ్చిమఇండియా అగ్గిపెట్టెల పరిశ్రమ కంపెనీ (**Western India Match Co., Ltd. Wimco**) అను పేరుతో స్వీడనుదేశపు సంస్థ యొకటి మన దేశములో బెరైలీ, అంబరనాథ్, కలకత్తా, మద్రాస్ పట్టణముల యందు కర్మాగారములను స్థాపించెను. ఈ విమ్‌కో సంస్థ మనదేశములో ప్రస్తుతము కావలసిన అగ్గిపుల్లలలో నూటికి ఎనుబదివంతులు సరఫరాచేయుచున్నది. అయినప్పటికీ, అనేకచోట్ల మనదేశములో భారతీయ కర్మాగారములు పనిచేయుచున్నవి. ప్రస్తుతము దేశమంతటను 150 అగ్గిపుల్లల కర్మాగారము లున్నవి. వీటిలో మొత్తము 16,000మంది కార్మికులు పనిచేయుచున్నారు. ఇవి కాక, అనేక పల్లెలలోను, పట్టణములలోను, కుటీరపరిశ్రమల ద్వారా కొంతవరకు అగ్గిపుల్లలు తయారగుచున్నవి.

1950-1951నాటికి మొత్తము కర్మాగారములలో 353లక్షల గ్రోసుల పెట్టెలు తయారుచేయు శక్తియున్నదని అంచనా వేయబడినది. కాని ఆ సంవత్సరములో 291 లక్షల గ్రోసులు మాత్రమే తయారుచేయబడినవి. అదే సంవత్సరములో కుటీరపరిశ్రమ ద్వారా ఆరులక్షల గ్రోసులు తయారయినట్లు అంచనావేయబడెను. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ప్రకారము 1955-56 నాటికి దేశములోని కర్మాగారములు 388 లక్షల గ్రోసులు తయారుచేయు శక్తి కల్గియుండవలెననియు, అధమము 353 లక్షల గ్రోసులు తయారుచేయవలెననియు నిశ్చయింపబడినది. కుటీర పరిశ్రమలలో 1955-56 నాటికి 18 లక్షల గ్రోసులు తయారుకావలెనని ప్రణాళిక నిశ్చయించెను. భారతదేశపు కర్మాగారములలో వాస్తవముగా తయారయిన అగ్గిపుల్లల పెట్టెలు- 1946 లో 206 లక్షల గ్రోసులు; 1950 లో 262 లక్షల గ్రోసులు; 1952 లో 304 లక్షల గ్రోసులు; 1954 లో 270 లక్షల గ్రోసులు.

ఎమ్. జి. కృష్ణ

**అగ్ని పర్వతములు:—** అగ్నిపర్వతముల యొక్క ముఖ్యాంశములు :- ప్రకృతిలో అనేకనదులు, పర్వతములు, ఎడారులు ఉన్నట్టుగానే అగ్నిపర్వతములుకూడ పెక్కుచోట్లలో నున్నవి. సాధారణముగ అగ్ని పర్వతములు ఎక్కువ ఏటవాలులేని శంఖాకారమును (**cone-shaped**) కలిగిఉండును. దీనిశిఖరమునుండి మధ్యగా భూగర్భములోనికి గెరాటీనిపోలిన ఒక సొరంగమార్గముండును. దీనినే అగ్నిపర్వతపు కంఠనాళమందురు. దీనిపైభాగమున నుండు బిలము 'క్రేటరు' (**crater**) అనబడును. ఈక్రేటరు ద్వారా కొన్ని సమయములలో అనేక వాయువులు, రాళ్ళు, శిలాద్రవము(**Lava**), "లావాగుండ్లు"(**Volcanic bombs.**) వెలువడుచుండును. కనుక అగ్నితర్వత మనునది ఒక జ్వాలా ముఖద్వారమనియు, దానిచుట్టును శిలా

ద్రవము ఘనీభవించుటచే జనించిన శంఖాకారపు రాతిగుట్ట గలిగియున్న పర్వతమనియు చెప్పవచ్చును. క్రేటరు అగ్ని పర్వతపు ముఖ్యాంగము. ఇది అగ్నిపర్వత శిఖరములనే కాకుండ ఒకటిరెండు ప్రక్కలయందుకూడ ఉండవచ్చును.

అగ్నిపర్వతభేదములు:- ఇటలీలోనుండెడు "వెసూవియస్" (Vesuvious) అనునది అగ్నిపర్వతము లన్నింటిలోనికి చాల ప్రఖ్యాతిచెందినది. దీని ఆకారము, లక్షణములు మొదలైనవి సిసలైన అగ్నిపర్వతమునకు ఉండవలసినవిగా ఎంచబడినవి. కాని ప్రపంచములో నుండెడు అగ్నిపర్వతములను పరిశీలించినచో ఈలక్షణములు అన్నిటియందును కన్పించకపోవచ్చును. సరియైన అంచనాలు ఇంతవరకును వేయబడనప్పటికిని భూమిమీదఉండెడు అగ్ని పర్వతముల సంఖ్య వేనవేలుండునని చెప్ప వచ్చును. వీటన్నిటిలోనికి సుమారు నాలుగయిదు వందలుమాత్రమే చైతన్యము కలిగి యున్నవి (Active Volcanoes). భూమిపై మానవజాతి ఉద్భవించిన పిదప ఏర్పడిన అగ్ని పర్వతములు చైతన్యము కలవిగాను, మిగతావన్నియు చల్లారి జడమైనవిగాను (Extinct Volcanoes) విభజించుట పరిపాటి. కాని ఈవిభజనము అంతసమంజసమైనదికాదు. ఎందువల్లననగా ఒకే అగ్నిపర్వతము కొన్ని కాలముల పాటు చైతన్య రహితముగా కనబడుచు మందకొడిగానుండి తిరిగి చైతన్యము పొందవచ్చును. ఒకప్పుడు స్తబ్ధతతోకూడిన విరామకాలము, మరొకప్పుడు భీభత్స సంఘటనలతో నిండియుండవచ్చును.

అగ్నిపర్వతములనుండి అనేక పదార్థములు వెలువడుటను ప్రేలుడు, లేక బ్రద్దలగుట (Eruption) అందురు. అగ్నిపర్వతము ప్రేలుచున్నప్పుడు బయల్వెడలెడుశక్తులు, వాటివలన సంభవించెడు దారుణ ఫలితములు మిగుల భయంకరమైనవి. పరిమాణములో అగ్నిపర్వతములు చాల మార్పుకలిగి తేనెపట్టంత చిన్న శంఖాకృతులు మొదలు బ్రహ్మాండమైన ఎత్తుకలిగినవికూడ ఉండును. ఇటువంటి అగ్నిపర్వతములు దక్షిణఅమెరికాలోని ఆండీసు (Andes) పర్వతాలలో నున్నవి. అక్కడి పర్వత శిఖరాలు చాలవరకు అగ్నిపర్వతాలే - ఉదాహరణకు : ఈక్వెడారులోని "కోటోపాక్సీ" (cotopaxi) ప్రపంచములోని అగ్నిపర్వతాలన్నిటిలోను చాల ఎత్తయినది. దీని ఎత్తు 19,600 అడుగులు ; క్రేటరు వెడల్పు అరమైలు; లోతు 1500 అడుగులు. ఇంత విపరీత పరిమాణము కలిగినవి హవాయిదీవులలో కూడ ఉన్నవి. అక్కడ ఉండెడు పర్వతములు సముద్రమట్టమునకు 4 మొదలు 15 వేల అడుగుల దిగువనుండి పైన 14,000 ఎత్తు వరకు వ్యాపించి, మొత్తము సుమారు ముప్పది వేల అడుగులకు వ్యాపించియున్నవి.

"లావా" :- భూగర్భమునుండి వెలువడెడు వాయు, ఘన పదార్థముల బహిర్గతక్రియకు సంబంధించిన శాస్త్ర విషయములనన్నిటిని అగ్నిపర్వతశాస్త్రమందురు (Volcanology). ఈ మహోన్నత కార్యము భూనిర్మాణమునకు సంబంధించిన క్రియలలో నొకటిగా (Earth's Building Activity) ఎంచబడినది. బహిర్గతమయ్యెడు పదార్థము ఒకప్పుడు పూర్తిగా శిలాద్రవమే కావచ్చును; అట్లు కానిపక్షములో పూర్తిగాగాని, అసంపూర్తిగాగాని ఘనీభవించిన రాళ్ళసముదాయముగనే యుండవచ్చును. ఇవికాక నీటిఆవిరి, అనేకవాయువులు వివిధపరిమాణములలో వెలువడును. అందువల్లనే అగ్నిపర్వతము ప్రేలినపుడు దట్టమైన మేఘములు ఆకాశమును ఆవరించును. అట్టి సమయములయందు భీభత్సపరిస్థితుల మూలమునను, వెలువడిన వాయువులు పైనున్న గాలిలో అత్యంత త్వరితముతో కలిసిపోవుట వలనను, వాటియొక్క సమ్మేళనము (composition) సరిగా తెలిసికొనుట సాధ్యముకాదు. కాని ఈ వాయువులు చాలవరకు నీటియావిరి అని చెప్పుటకు ఆధారములున్నవి. ఒక్కొక అగ్నిపర్వతమునుండి వంద రోజులలో సుమారు 46 కోట్ల గాలనుల నీరు వెలువడునని అంచనా వేసిరి. నీటిఆవిరితోపాటు మరికొన్ని ఇతరపదార్థములు—ముఖ్యముగా కర్బనద్విఆమ్లజనిదము (Carbōn-Dioxide), ఉదజహరికామ్లము (Hydrochloric acid), గంధకమిశ్రమ ద్రవ్యములు (Sulphur compounds), ఉదజని (Hydrogen) మొదలైనవి వెలువడును. ఇవికాక అగ్నిపర్వతమునుండి వెలువడు రాతి ముక్కల సముదాయమును పైరోక్లాస్టికు పదార్థము (Pyroclastic material) అందురు. ఈ వెదజిమ్మబడెడు శిలాఖండములు కొంతభాగము గట్టిగాను, మరికొంత భాగము అనేక సూక్ష్మరంధ్రములుకలిగి స్పాంజివలెను

(Sponge-like) ఉండును. వీటన్నిటికంటె ముఖ్యమైనది శిలాద్రవము; దీనినే భూమిఅంతర్భాగములో నున్నపుడు 'మాగ్మా' (Magma) అనియు, భూమిపైన పడినపుడు 'లావా' (Lava) అనియు అందురు. లావాఘనీభవించగా ఏర్పడిన శిలారూప లక్షణములు మాగ్మా ద్రవపుసమ్మేళనము (composition), దాని ఉష్ణోగ్రత (Temperature), జిగటతనము (Viscosity) మొదలైన పరిస్థితులపై ఆధారపడియుండును. కనుక ఇప్పుడు మాగ్మా పరిస్థితులను గురించి కొంత తెలిసికొనుట అవసరము.

భూమి పైభాగమునుండి లోతుగా వెళ్ళినకొలది ఉష్ణోగ్రత పెరుగుచునుండును. చాలమైళ్ళ దిగువనుండెడు ఉష్ణోగ్రత భూమిపైన ఉండెడు రాళ్ళను కరిగించునంత ఎక్కువగా ఉండునని అంచనా వేయబడినది. ఈ ఉష్ణోగ్రతతోబాటు భూమిలోపల పీడనము (Pressure) ఎక్కువ అగుచుండును. కనుక భూగర్భములోనుండెడు అత్యధిక పీడనశక్తి రాళ్ళను కరగనియ్యదు. కొన్నిప్రదేశములలో పీడనశక్తి తక్కువగానుండి ఉష్ణోగ్రత ఎక్కువగా నుండవచ్చును. అట్టిపరిస్థితులలో అక్కడ ఘనస్థితిలో నుండెడు శిలాపదార్థము మాగ్మారూపము చెందును. మాగ్మాద్రవము 1200 సెం. డిగ్రీల ఉష్ణోగ్రతకలిగిఉండునని అంచనా వేయబడినది. ఈ మాగ్మా ద్రవాశయములు భూగర్భములో విపరీతముగా నుండును. ఈ మాగ్మా అతి తీవ్రమైన శక్తితో భూమిని భేదించుకొని బయటపడుటయే అగ్నిపర్వతోద్గారము (Volcanic eruption) అనబడును. కొన్నిమైళ్ళ పొడవున సొరంగ బీటికల ద్వారా మాగ్మా మెల్లగా భూమిపైకి ప్రవహించుచు వచ్చినచో దానిని రంధ్రోద్గారము (Fissure eruption) అందురు.

అగ్నిపర్వతముల నన్నింటిని పరిశీలించినచో వాటి స్వభావ లక్షణములలో ఎక్కువతేడా కన్పించును. ఇవి తీవ్రజాతి (Violent), మాధ్యమిక జాతి (Intermediate), సాత్వికజాతి (Quiet) అని మూడు తెగలుగ విభజింప బడినవి. బ్రహ్మాండమైన శక్తితో బ్రద్దలగువాటిని తీవ్రజాతిగాను, అతి నెమ్మదిగా బ్రద్దలగువాటిని సాత్విక జాతిగాను, ఈ రెండింటికి మధ్యగా నుండెడువాటిని మాధ్యమిక జాతిగాను పేర్కొనుచున్నారు. తీవ్రజాతి పర్వతములనుండి ముఖ్యముగా ఘన, వాయు పదార్థములే ఎక్కువగా బహిర్గత మగును. సాత్వికజాతినుండి ముఖ్యముగా 'లావా' పదార్థము వెలువడును; మధ్యరకపు జాతినుండి ఘన, ద్రవ, వాయు పదార్థములు అన్నియు సమానముగనే బహిర్గతమగును.

చైతన్యము కలిగిన ప్రతి అగ్నిపర్వతపు జీవిత ప్రమాణము వేరువేరుగా నుండును. ఇటలీలో నున్న "ఎట్నా" (Etna) అనెడు అగ్నిపర్వతము ఇప్పుడు ఎంత తీవ్రముగా ప్రేలుచున్నదో అంతటి శక్తితో గత 2500 సంవత్సరముల నుండియు ప్రేలుచు వచ్చినదట. బ్రహ్మాండముగా నున్న దీని పరిమాణము అతి సూక్ష్మముగా ఉండుచున్న పెరుగుదలతో సరిపోల్చినట్లైన దీనిని నిర్మించుటకు అధమపక్షము 8 లక్షల సంవత్సరములైనను కావలసి యుండును. కాని భూగర్భశాస్త్రరీత్యా ఈ పర్వతము అంత పురాతనమైనదికాదని, ఆ శాస్త్రయుగములలో ఇటీవలదైన "ప్లిస్టోసిన్" (Pleistocene) మధ్యభాగమువరకు ఇది ప్రేలియుండలేదని తెలియుచున్నది. ఈ ఆధారమునుబట్టి ఈ పర్వతమింకను యౌవనదశలోనే ఉన్నదని నిర్ధారణ అయినది. అగ్నిపర్వతపు జీవిత కాలము వాతావరణమునకు, సంబంధించిన గాలి, నీరు, మొదలైనవి చేయు వినాశకరమైన క్రియలకు గురియగును. ఒక నియమితకాలములో అగ్నిపర్వతపు స్వరూపము, ఎత్తు, దాని నిర్మాణమునకు తోడ్పడెడు శక్తులకు (constructive forces) వినాశనమునకు దారితీయు శక్తులకు (destructive forces) ఉండెడు తారతమ్యముపై ఆధారపడియుండును. వాతావరణ శక్తుల ప్రాబల్యము అధికమైనకొలది అగ్నిపర్వతపు క్షీణత అధికమగుచుండును.

అతి భయంకరమైన సంఘటనలతో నిండిన జాతిలో "క్రాకటోవా" (Krakatoa) అను అగ్నిపర్వతము ముఖ్యముగా చెప్పదగినది. ఇది జావా, సుమత్రా దీవుల మధ్య 'సుండా' జలసంధిలో ఉన్నది. ఇది ప్రేలినపుడు సంభవించిన ప్రమాదములు చరిత్రాత్మకమైనవి. సుమారు రెండువందల సంవత్సరములు ఈ పర్వతము మందకొడిగానే ఉండి దానిపై భాగము చెట్టుచేమలతో నిండిఉండెడిది. కాని అకస్మాత్తుగా ఒక రోజున (1883 ఆగస్టు 27 తారీఖున) భయంకరమైన శబ్దముతో యావ

త్ర్పపంచము దద్దరిల్లినట్లు అది ప్రేలినది. దీని ఫలితముగా సముద్రమట్టమునకు 1500 అడుగుల ఎత్తున ఉన్న శిఖరము పూర్తిగా ఎగిరిపోయి, సముద్రమట్టమునకు దిగువ 1000 అడుగుల లోతుగల పెద్ద అగాధము ఏర్పడినది. దీనినుండి వెలువడిన ధూళి ఆకాశమును అంటునట్లు 17 మైళ్ళు ఎత్తువరకు ఎగిరినది. ఈ బూడిద వేలకు వేలు మైళ్ళు ప్రయాణముచేసి 11,000 మైళ్ళు దూరములో నున్న యూరపు ఖండవీథులలోకూడ పడినదట ! ఈ దారుణ సంఘటనకు సముద్రములో 50 అడుగుల ఎత్తు వరకు కెరటములు లేచినవట ! సుమారు 40,000 మంది ప్రాణములు కోల్పోయిరి. ఇది ప్రేలినపుడు ఉద్భవించిన ధ్వని 3000 మైళ్ళ దూరమువరకు వినిపించినదట ! కనుక అగ్నిపర్వత మనునది ప్రేలినట్లయిన అది కలుగజేసెడు భీభత్సము వర్ణనాతీతము.

అగ్నిపర్వతములు ప్రతిచోటను ఉండవు. ఇవి సాధారణముగ భూకంపములు వచ్చెడు ప్రదేశములలోను, భూమ్యుపరిభాగపు పెచ్చు (Earth's Outer Crust) బలహీనముగా ఉండెడు ప్రదేశములలోను, మడత పర్వతములు ఏర్పడుచోట్లను ఉండును. ఈ ఉష్ణోగ్రత, భూమి పైభాగమునందు గాలియందున్న ఉష్ణోగ్రతలతో పోల్చినచో అధికముగ నుండును. అందుచేఉష్ణోగ్రత తన సహజ లక్షణము ననుసరించి పైకి వచ్చుటకు ప్రయత్నించుచుండును.

చాలభాగము అగ్నిపర్వతములు పసిఫికు మహాసముద్రము చుట్టును కొంచెము ఇంచుమించు వలయాకారమునుండి పసిఫిక్ ప్రాంతమునందలి అగ్నిమయమండలాకారరేఖ (Pacific girdle of fire) అని పిలువబడుచున్నవి. ముఖ్యమైన మరొక పర్వతపంక్తి భూమధ్యరేఖకు ఉత్తరముగాను సమాంతరముగాను, భూమిని చుట్టుకొనియున్నది.

డా. ఎన్. బా.

**అచ్చుయంత్రముల నిర్మాతలు :—** 1. మెర్జెన్ థాలరు :- మెర్జెన్ థాలర్ ఆట్మన్ అనునాతడు ఒక అమెరికా కల్పకుడు (inventor). అతడు 1854 వ సంవత్సరమున మే నెల 10 వ తేది యందు జర్మనీదేశములో వర్టెంబర్గు అనుచోట జన్మించెను. బాల్టిమూర్ లో 1899 వ సంవత్సరమున అక్టోబరు నెలలో 28 వ తేదియందు అతడు కాలధర్మమునొందెను. గడియారములు చేయుట అతని వృత్తి. అతడు పదునెనిమిదవయేట అమెరికా సంయుక్తరాష్ట్రములకు పోయెను. వాషింగ్టనులో సంయుక్తరాష్ట్ర ప్రభుత్వోద్యోగమున ప్రవేశించెను. అచటి ప్రభుత్వభవనము లన్నింటియందు నున్న 'క్లాక్కు' లను, విద్యుద్ఘంటలను సరిచేసెను. సాంకేతిక శాఖయందు వాడుచున్న సాధనములను అభివృద్ధిచేసెను. 1876 వ సంవత్సరమున అతడు బాల్టిమూర్ నకు వచ్చి, ముద్రాక్షరములను కూర్చు నొక యంత్రమును దోషరహితముగ చేయుటలో నిమగ్నుడయ్యెను. అతడు కొన్ని సంవత్సరము లీ విషయమున గడపెను. అతని కల్పన (scheme) కొన్ని దశలలో జరిగినది. వాటిలో 'పంక్తిముద్రణము' (Linotype) అనునది కడపటిది. ఈ యంత్రవిషయమున అతడు నూతన కల్పనాధికారమును పొందిన తరువాత, దానిని వాడుకలోనికిదెచ్చుట అతనికి చాలకష్టమయ్యెను. ఎడముల నేర్పరచు 'రోజర్సుసాధనము' ను ఇంకను పెక్కు ఉపకల్పనలను చేర్చి ఫిలిఫ్ టి డాడ్జి ప్రభృతులు దానికి సంపూర్ణత్వమునిచ్చిరి. అందుచే దానిని కల్పనచేసినవానికి విశేషమగు లాభము దొరకినది. అది ఇప్పుడు పెద్దపెద్ద ముద్రణ సంస్థలలో సాధారణముగ విశేషమయిన ఉపయోగమును కాంచుచున్నది. ఫలములు సమర్పించుటకు ఉపయోగపడు బుట్టలను "వెనీర్డు" (veneered wood) చెక్కతో తయారుచేయుటకై ఒక యంత్రమును కూడ మెర్జెన్ థాలర్ కల్పనచేసెను.

**2. రిచర్డుమార్చ్ హో :—** రిచర్డుమార్చ్ హో అమెరికా దేశస్థుడు. సామానులుచేయుట అతని వృత్తి. అతడు 1812 వ సంవత్సరమున సెప్టెంబరు నెల 12 వ తేదిని న్యూయార్కు నగరమున జన్మించెను. 1886 వ సంవత్సరమున జూన్ నెల 7 వ తేదిని ఇటలీలో ఫ్లారెన్సు నగరమున చనిపోయెను. అతడు రాబర్టు హో (1784-1833) అనునాతని కొడుకు, మరియొక రాబర్ట్ హో (1839-1909) అనునాతనికి పినతండ్రి. తండ్రి అనంతరము ఆర్. హో అండ్ కంపెనీయొక్క నిర్వహణము వహించి, 1847 వ సంవత్సరమున "హో" పరిభ్రమణముద్రణయంత్రమును కల్పనచేసెను. అతడు

అల్లికవలెనుండు ముద్రణయంత్రములను (వీటిపై కాగితముయొక్క రెండువైపులను ఒకేసారి అచ్చువేయుటకు వీలగునట్లు) నిర్మించెను. అచ్చుపడిన కాగితములను మడత పెట్టుటకు ముక్కోణాకారపు సాధనమునుకల్పనచేసెను.

3. గూటెన్‌బెర్గు జొహాన్నిస్, లేక, హెన్నె:- జొహాన్నిస్ గూటెన్‌బెర్గ్ అనువాడు కదలించుటకు వీలైన ముద్రాక్షరములతో ముద్రణ విధానమును కల్పించిన జర్మను కల్పకుడు. ఇతడు క్రీ. శ. 1400 సంవత్సర ప్రాంతమున మెయింజ్ అనుచోట జన్మించి, క్రీ. శ. 1468 వ సంవత్సరమున ఫిబ్రవరి నెల 23 వ తేదిని అచటనే చనిపోయెను. అతని బాల్యదశనుగూర్చి మన కేమియు తెలియదు. 1434 వ సంవత్సరమున అతడు స్ట్రాస్‌బర్గులో నివసించుచుండెను. రహస్యమైనవియును, అద్భుతమైనవియు నగు తనకళలనన్నిటిని వారికి బోధించునట్లును, వాటిని వారి ఉమ్మడి ప్రయోజనము కొరకు వినియోగించునట్లును 1436 వ సంవత్సరమున అతడు ఆండ్రియాడ్రైజెల్మ్ మున్నగు వారితో ఒడంబడికచేసికొనెను. 1438 వ సంవత్సరాంతమున డ్రైజెల్మ్ చనిపోవుటచే ఆకంపెనీ ఒడంబడికకు భగ్నముకలిగెను. తరువాత 1448 వ సంవత్సర ప్రాంతమున అతడు మెయింజ్‌కు తిరిగివచ్చి, వెంటనే ధనికస్వర్ణకారుడగు జోహాన్‌ఫాస్టుతో భాగస్వామిగాచేరెను. ఫాస్టు ఒకముద్రణాలయమును స్థాపించుటకు వలయుధనము సమకూర్చెను. ఆముద్రణాలయమునందు లాటిన్ భాషలోనున్న బైబిలు గ్రంథము మొదట అచ్చువేయబడెను. 1450 వ సంవత్సరమున ముద్రణము ప్రారంభింపబడి 1455 వ సంవత్సరమున పూర్తిచేయబడిన 'మజారిన్ బైబిలు' అను గ్రంథము చలనాత్మక ముద్రాక్షరములతో ముద్రింపబడిన ప్రథమగ్రంథముగా తెలియుచున్నది. కొన్నియేండ్ల తరువాత ఈసంబంధము విడిపోయినది. ఫాస్టు ముందుగా పెద్దమొత్తములను పెట్టుబడిపెట్టెను. వాటిని తీర్చవలసినదని అతడు గూటెన్‌బెర్గును నిర్బంధించెను. గూటెన్‌బెర్గు వాటిని తీర్చుటకు శక్తి లేకయో, ఇష్టము లేకయో ఊరకుండుటచే, ఈ విషయము న్యాయస్థానమునకు తీసికొని పోబడెను. దానిఫలితముగా ముద్రణాలయము ఫాస్టునకు అధీనమయ్యెను. అతడు దానిని అభివృద్ధిచేసి, జెరన్‌షీమ్ వాస్తవ్యుడగు పీటర్ షోఫర్ అనునాతనితో చేరి ఉపయోగించుచుండెను.

మెయింజ్ వాస్తవ్యుడగు కోనార్డుహమ్మర్ అను నొక వకీలు పోషకత్వముచే ఆమరుసటి సంవత్సరము గూటెన్‌బెర్గు మరలనొక ముద్రణాలయమును స్థాపింపగలిగెను. ఆముద్రణాలయమునుండి 1460 వ సంవత్సరములో ఒకచక్కని "కాథొలికన్", 1454, 55 వ సంవత్సరములలో "లెటర్సు ఆఫ్ ఇండల్జెన్స్" అను గ్రంథములు వెలువడినవి. అతని ముద్రణాలయమునుండి వెలువడిన ఏగ్రంథము పైనను గూటెన్‌బెర్గు యొక్క పేరు కనిపించదు. అతనిస్నేహితులుగాని, పోషకులుగాని ముద్రణ విషయమగుకల్పనల సందర్భమున గూటెన్‌బెర్గు నామము పేర్కొనరు.

గ. శి. శా.

**అచ్చు యంత్రములు - ముద్రణకళ:** (1)ముద్రాక్షరములనుగాని ముద్రాక్షరముల అచ్చుముక్కలనుగాని కూర్చి వాటిని ముద్రణము కొరకు పంక్తులలోను వరుసలలోను (columns) ఏర్పరచు అన్నితరగతుల యంత్రములను సాధారణముగా అచ్చుకూర్పు యంత్రములు అని వర్గీకరింపవచ్చును. ఈ యంత్రములలో 'పంక్తి ముద్రణము' (Linotype), 'ఏక ముద్రణము' (Monotype) అనునవి ప్రధానమయినవి.

చారిత్రకముగా చూచినచో కానెక్టికట్ వాస్తవ్యుడగు విలియం చర్చ్ అను నాతడు కనిపెట్టిన ముద్రాక్షర యంత్రము మొట్టమొదటిది. ఇంగ్లాండులో 1822 వ సంవత్సరమున దాని కల్పనాధికారము పొందబడినది. ఆత డొక 'మీటల బల్ల' (Key Board) ను నియోగించి ముద్రాక్షరములను కాలువలలో (Channels) చేర్చియుంచెను. 1842-1872 వ సంవత్సరము వరకును అమెరికా సంయుక్త రాష్ట్రములలో 57 అచ్చుకూర్పు యంత్రములకు కల్పన రక్షణాధికారములు (Patents) ఒసగబడెను. గ్రేటు బ్రిటనులో కూడ సుమారు ఆ సంఖ్యలోనే కల్పన రక్షణాధికారములు పొందబడినవి.

1. పంక్తి ముద్రణయంత్రము:-అచ్చును కూర్చుట, పోతపోయుట అను రెండు పనులను చేయునట్లు ఇది కల్పింపబడినది. విడివిడిగా నున్న అక్షరములను పంక్తులనుగా

కూర్చుటకు బదులుగా ఇందు లోహపు పట్టెలమీదగాని, లోష్టకముల మీదగాని అక్షర పంక్తులు అమర్చబడును. ఈ పట్టెలు పేజీగా అమర్చినపుడు విడిముద్రాక్షరములతో కూర్చిన పేజీవలెనే కనపడును. ఇవి నేరుగా అచ్చువేయుటకుగాని, మామూలు పద్ధతిలో విడదీయుటకు వీలు లేకుండ కూర్చి గట్టిచేసివేయబడిన ముద్రాక్షరములు గల దిమ్మలను లేక విద్యున్ముద్రాక్షరముల దిమ్మెలను తయారుచేయుటకుగాని ఉపయోగించును. ఈయంత్రము మనకు కావలసిన వివిధ రీతులుగల అచ్చు అక్షరములను తయారుచేయును. ముద్రాక్షరశాలలలో చేతికూర్పుమీద అయిదుగురు లేక ఆరుగురు వ్యక్తులు చేయగల పనిని ఒక్క వ్యక్తియే ఈ యంత్రసాహాయ్యమున చేయగల్గును.

1866 వ సంవత్సరములో బాల్టిమోర్ వాస్తవ్యుడగు ఆట్మర్ మెర్జెన్‌థాలర్ అను నాతడు పంక్తి ముద్రణమును కనిపెట్టెను. అతడు పుట్టుకచే జర్మనీ దేశస్థుడు. ప్రప్రథమమున 1886 వ సంవత్సరమున న్యూయార్కు 'ట్రిబ్యూను' అను పత్రికను ప్రచురించుటయందు ఇది ఉపయోగపడెను. అది మొదలు వార్తా పత్రికల కార్యాలయముల యందును, ప్రపంచమందలి ముద్రణాలయముల యందును సాధారణముగా ఈ రకపు యంత్రములు ఉపయోగింపబడుచు వచ్చెను.

ఈ యంత్రమున వందలకొలది ఇత్తడి అచ్చుముక్కలు (Matrices) కలవు. ప్రతిఅచ్చుముక్కలోను ఒక చదునైన రేకుపై ఒక్కొక్క సంజ్ఞ చెక్కబడియుండును. ఆ అచ్చు ముక్కల యొక్క పైభాగమున పండ్లు (Teeth) కలవు. యంత్ర - ఆధారఫలకములో అచ్చు ముక్కలు వాటి యొక్క స్థానములకు చేరుటకు ఆ పండ్లు ఉపయోగపడును. అచ్చుముక్కలు రెండురకముల సంజ్ఞలతో తయారగును.

ఉదా :- రోమను అక్షరములు, ఏటవాలు (Italics) అక్షరములు. వీటిలో మనకు కావలసిన రకపు అక్షరములను ఉపయోగించుకొనవచ్చును. యంత్రములో ప్రతి యక్షరమునకును పెక్కు అచ్చుముక్కలుండును. ప్రత్యేక సంజ్ఞల కొరకును, మాటమాటకు నడుమ ఎడము పర్పరచుట (space) కొరకును కూడ అచ్చుముక్కలుండును.

ఇందులో యంత్రము యొక్క సామాన్య నిర్మాణము సంగ్రహముగా వివరింపబడినది. 'ఎ' అనునది ఏటవాలుగా నున్న ఒక స్థిరమైన యంత్ర - ఆధారఫలకము అయి యున్నది. దానిలో కాలువ లుండును. ఆ కాలువలలో క్రమపద్ధతిలో అచ్చు ముక్కలు చేర్చబడియుండును. ఆ కాలువలలోని అచ్చుముక్కలు ఒక్కొక్కటి చొప్పున పై కొననుండి జారుచు ప్రవేశించి, క్రింది కొన గుండా బయటికి వచ్చుచుండును. యంత్ర - ఆధార ఫలకములో నున్న ప్రతి కాలువకును క్రిందికొన వద్ద 'బి' అను నిష్క్రమణ ద్వారముండును. అది 'సి' అను కడ్డీ మూలమున 'డి' అను వ్రేలిమీటకు కలుపబడియుండును. ఆ వ్రేలిమీట, కాలువలలో నున్న అచ్చుముక్కల అక్షరములను గాని, సంజ్ఞలను గాని తెలియజేయుచుండును. ప్రతి సంజ్ఞకును ఒక మీట యుండును. అక్షరముల నడుమ ఎడము కొరకు ఉంచుకణికలకును, మధ్యమధ్య స్థలములను కల్పించుటకై దిగగొట్టబడిన ముక్కలకును మీట లుండును.

కావలసిన అచ్చుముక్కలును, ఖాళీస్థలములను పర్పరచు వస్తువులును, వివిధములగు మీటలను ఉపయోగించుటచే 'జి' అను అచ్చు చట్రములోనికి వచ్చి చేరును. ఈ విధముగ అచ్చులో ఒక పంక్తిలో నుండవలసిన సంజ్ఞలన్నియు దానిలో చేరిన తరువాత, కూర్పబడిన ఆ పంక్తి, రెండవ బొమ్మలో చుక్కలతో చూపిన దారి గుండా, యంత్ర సహాయముచే తీసికొనిపోబడి, 'కే' అను చక్రము గుండా దాని ముందు వైపునుండి వెనుక వైపునకు వ్యాపించియున్న మూసకట్టు లేక నిడుపైన కన్నమునకు ముందు ఒక స్థానమున నిల్చును. మాటకును మాటకును మధ్య ఎడములను సర్దుటకై చీలలు మూసకట్టునకు ఎదురుగానున్న ముద్రణ పంక్తిలో చేర్చబడును. అవి ఆ ముద్రణ పంక్తిని సరియైన ప్రమాణమునకు తెచ్చును.

మూసకట్టునకు (mould) వెనుకభాగమున 'ఎమ్'అను కరుగు పాత్ర యొకటి కలదు. అది వాయువుచే గాని, గాసొలీనుచే గాని, విద్యుత్ తాపకముచే గాని, వేడిచేయబడును. (రెండవ బొమ్మలో చూపబడినట్లు) పోతపోయవలసిన అచ్చుముక్కల పంక్తి, మూసకు ముందుభాగముననున్నపిదప కరగిన లోహద్రవము కరుగుపాత్ర

నుండి ఒక పంపుయొక్క సహాయమున అచ్చుమూస లోనికి పోయబడును. ఆ లోహద్రవము ఆ సంజ్ఞలతో పడినవెంటనే ఘనీభవించును. ఆవిధముగ తయారయిన లోష్టకముయొక్క పై భాగమున అచ్చుముక్కలచే నేర్పడి యెత్తైన సంజ్ఞలయొక్క ముద్రలు ఏర్పడును. సరియయినపొడవు మందము ఉండునట్లుగా ఆ లోష్టకను కోయబడి, స్వతశ్చలనముచే (automatically) అచ్చునుండి తొలగిపోవును. తరువాత ఆ పంక్తి మూసకట్టునుండి ఎత్తబడి ప్రక్కకు జరపబడును. అప్పుడు అచ్చుముక్కలకు పైభాగముననున్న పండ్లు (teeth) బొమ్మలో 'ఆర్' అనుచోట గల కడ్డీయొక్క కొక్కెములను పట్టుకొనును. దీని ఫలితముగా యంత్రముయొక్క ఉపరిభాగమున నున్న విభాగమునకు (Distributor) ఆ అచ్చుముక్కలు పైకి లేవబడి చేరుకొనును. ఆ అచ్చుముక్కలు యంత్రాధార ఫలకముయొక్క అడుగుభాగమునుండి బయలుదేరి అక్షరపంక్తిలోచేరి అక్కడనుండి మూసకట్టు ద్వారమున ఆధార ఫలకముయొక్క పైభాగమునకు తిరిగిచేరును. ఈ ప్రదక్షిణ క్రమమువలన ముద్రణకార్యము అతివేగముగా జరుగును. అది టైపు వేగమును ఎన్నోరెట్లు మించును. ప్రస్తుతము భిన్నభిన్న ముద్రణ కార్యములను నిర్వహించుటకు అనువైన వేరువేరు రకముల పంక్తి ముద్రణములు అమలులో నున్నవి. ఆధునిక యంత్రములు, ప్రకటనములకు, ప్రదర్శనములకు సంబంధించిన విషయములనే కాక పఠనవిషయములను గూడ అచ్చుకూర్చ గలవు. లోహమును కరగించుటకు విద్యుచ్ఛక్తిచే వేడి చేయబడు లోహపాత్రమును ఉపయోగించుట, ఇటీవల జరిగిన అభివృద్ధియైయున్నది. దీనివలన సీసపుపొగలచే గలుగు బాధతగ్గుటయేగాక లోహముయొక్క ఉష్ణోగ్రతను మిక్కిలి సూక్ష్మముగా క్రమపరుచుటకు కూడా వీలుకలుగుచున్నది. 1928వ సంవత్సరమున ప్రపంచమందంతటను 60,000 పంక్తిముద్రణ యంత్రములు ఉపయోగమునందుండెను.

2. ఏకముద్రణ యంత్రము (Monotype) :- ఈ యంత్రమునందు ప్రతి సంజ్ఞయు విడిగా అచ్చుపోయబడి అక్షరపంక్తులయందు స్వయముగా కూర్చబడుటచే దీనికి ఏకముద్రణ యంత్రము అను పేరు సార్థక మగుచున్నది. దీనిలో మీటలబల్ల, పోతపోయు యంత్రము అను రెండు వేరు వేరు యంత్రభాగములుండును. దీనిని తరచుగా ఒకే పనివాడు నడిపించుచుండును. మీటలబల్లయు పోతపోయు సాధనమును ఒకేపనిని ఎడతెగక చేయుచుండుట వలన, వీటిలో ఏదైన తాత్కాలికముగ ఆగినయెడల, రెండవదానికి ఆటంకములేకుండ, ముద్రణకార్యము జరుగునట్లు ఈ సామగ్రి అమర్పబడియున్నది. మీటల బల్లపై కూర్పుజరుగును. అది పోతయంత్రము కొరకు కాగితమును స్వాధీనమునందుంచు రిబ్బనుపై రంధ్రములు చేయును. ఈ మీటబల్లపై 225 మీటలుండును. టైపుకొట్టు అన్ని ప్రమాణపు (standard) టైపుయంత్రములలో ఉండునట్లుగానే ఇందు ప్రతి అక్షరమునకును సంజ్ఞాక్రమము ఒకే విధముగా నుండును. ఆ మీటలు మీట కడ్డీల మూలమున పిధాన (Volves) ములతో చేర్చబడియుండును. ఆ పిధానములు చిన్నముషలకముల (Pistons) క్రిందినుండి గాలిని ప్రవేశపెట్టును. కార్యకర్త (Operator) మీటనొక్కగానే పిధానముల ద్వారా ప్రవేశించిన గాలి కాగితపు రిబ్బనునందు సంజ్ఞానుకూలములైన రంధ్రములను చేయును. మీటను వదలినతోడనే కాగితమును స్వాధీనమునందుంచు కొను రిబ్బను ముందునకు జరిగి తరువాతి సంజ్ఞను గ్రహించుటకు సిద్ధముగనుండును. కాగితపురిబ్బనునం దేర్పడిన రంధ్రసముదాయము పోతపోయు యంత్రమువద్ద మూసపై నున్న వలసిన సంజ్ఞను గ్రహించుటకు వీలుగా అచ్చుముక్కను అమర్చునట్లుగా రంధ్రములుచేయు ఇనుప సాధనములు ఏర్పాటు చేయబడినవి. రంధ్రములు చేయు యంత్రసామగ్రి, వీటితోపాటు లెక్కించుటకును, సరిచూచుటకును కావలసిన పరికరములు మీటబల్లపై నుండును. లెక్కించు సాధనము, పంక్తిలో కొట్టబడిన ప్రతిసంజ్ఞయు ఎంత వెడల్పుగానున్నదో లెక్కించి, పంక్తిలో ఇదివరకు కొట్టబడిన సంజ్ఞలయొక్క వెడల్పునకు కలుపును. దానినిబట్టి ఒక్కసారిచూడగానే, పంక్తిలో ఇంక ఎంతస్థలము మిగిలియున్నదో కార్యకర్త తెలిసికొనగలడు. సరిచూచుయంత్రమునందు ఒకసూచికయుండును. ఎడమును సూచించు పట్టీని (space-bar) నొక్కినవెంటనే ఆ సూచిక ఒక్కొకసారి ఒక్కొక్క గంటును పైకి లేవనెత్తుచుండును. అప్పుడు పదములమధ్య సరియైన ఎడము



బుద్ధ ధర్మచక్రప్రవర్తన ముద్ర - అజంతా గుహ 19



అజంతా - 19 వ గుహ

ఏర్పడును. సరిచూచు యంత్రమునందు కొలతబద్ద కల ఒక స్తూపము కూడ కలదు. కార్యకర్త కావలసిన సంజ్ఞలను, ఎడములను పంక్తిలో అమర్చినతరువాత, ఆ స్తూపము పంక్తిని సరిచేయుటకై స్వతశ్చలనముచే గిరగిర తిరుగును. కొలతబద్ద యొక్క పైభాగము చిన్న సమకోణ చతురస్రములుగా **(Rectangles)** విభజింపబడి యుండును. ఒక్కొక్క చతురస్రములో మీటబల్లపై నున్న మీటలతో సంబంధమును చూపు సంఖ్యలుండును. పంక్తిలో కావలసిన సంజ్ఞలు చేర్చబడినపిదప సూచిక సూచించిన ఈ రెండు సంఖ్యలకు అనుగుణముగా నుండు మీటలను కార్యకర్త నొక్కుచుండును. మీటల వలన ఏర్పడిన రంధ్రములు, ఎడములను ఏర్పరచుటకును, పంక్తి యొక్క ఎడమును సరిచేయుటకును చీలలను పోతయంత్రమువద్ద అమర్చును. పోతయంత్రము సంపూర్ణముగా స్వతశ్చలనముచే పని చేయును. అది మీటబల్లపై రంధ్రములు చేయబడిన రిబ్బను అధీనములో నుండును. అచ్చుపెట్టెలో 225 అచ్చు ముక్క లుండును. వివిధ సమ్మేళనములకు ప్రత్యామ్నాయముగా వివిధ సంజ్ఞల నుంచవచ్చును. లేదా ప్రాత అచ్చుముక్కల పెట్టెను తీసివైచి, క్రొత్తపెట్టెను యంత్రములో నమర్చవచ్చును. అచ్చుముక్కలపై ముద్రాక్షరముల స్వరూపము పోతపోయబడును. అచ్చు అక్షరము యొక్క క్రింది భాగము మూసకట్టులో పోతపోయబడును. ఇదివరలో వర్ణించిన విధమున పోతయంత్రముపై ముద్రాక్షరములు (అక్షర) పంక్తిగా ఏర్పడును. అచ్చు అక్షరములను కూర్చి అమర్చిపెట్టు సాధారణ చట్రములో ఈ పంక్తులన్నియు కూడుకొని సిద్ధముగా నుండును. ఇట్లు బహు విధముల ఉపయోగకరమయిన ఏక ముద్రణయంత్రము వార్తాపత్రికలు, గ్రంథములు, చిల్లర విషయములు ముద్రించు ననేక కార్యస్థానములలో ముద్రణమునకు వలసిన వివిధ కార్యములను ఒకేచోట జరుగుటకు వీలును కలిగించునదై యున్నది. ఒకసారి ఉపయోగించిన అన్ని అచ్చు అక్షరములను తిరిగి కరగించి, క్రొత్త సంజ్ఞలను తయారుచేయుటకు ఈ యంత్రము తోడ్పడును. అందుచే ఈ క్రొత్తపద్ధతి ఆర్థిక సౌలభ్యమును చేకూర్చినది. ఏకముద్రణ యంత్రము ఈ విధముగా ఒక అచ్చుకూర్పు యంత్రముగానే కాక అచ్చు వేయు కార్యస్థానమునకు కావలసిన వస్తువులలో పెక్కింటిని సమకూర్చ గల ముద్రాక్షర సంధానిగా కూడ ఉపయోగపడుచున్నది.

డా. గ. ఓ. శా.

**అజంతా :-** అజంతా హిందూదేశమునందు మిక్కిలి ప్రాచీనమయిన కళాక్షేత్రముగా విఖ్యాతమైయున్నది. ఇది వాస్తుశాస్త్ర శిల్పశాస్త్రములను సరసముగా సమీకరించి రచింపబడిన ప్రాచీన హైందవ భిత్తి చిత్రలేఖనములకు ఒక అసదృశమును, అద్వితీయమును అగు నుదాహరణము.

## 1. ప్రవేశిక

**స్థలము :-** అజంతా అను గ్రామము సుప్రసిద్ధిచెందిన గుహా మందిరములకు ఏడుమైళ్ళ దూరములో నున్నది. (20-30 ఉ. 75-45. తూ.) ఈ గుహాలు ప్రస్తుతపు బొంబాయి రాష్ట్రమున ఔరంగాబాదు జిల్లాయందలి ఫరద్‌పూరు అను గ్రామమునకు మిక్కిలి సమీపమున గలవు. ప్రకృతి సౌందర్య రసజ్ఞుడగు ఒకానొక కళా నిష్ణాతునిచే ఈస్థలము వరింపబడినది. హరిత తృణాది సౌందర్యముతో ఇరుదరుల నొరయుచు పారు సెలయేటితో లోయ అత్యుత్తమముగా భాసించు తరుణమున భిక్షువులకు ఏకాంత వర్షావాసముగా ఉపయోగపడుట కయి ఈ అజంతా గుహాలు తొలుచబడినవి.

ఈరీతిగా గుహాలు సుందరసుందర పరిసరములలో నిర్మితములయినవి. ఇచ్చటి సహజశోభయు, వివిక్తతయు, భిక్షువులు ప్రశాంతముగా ధ్యానము చేసికొనుటకును, కళాభిజ్ఞులును, వాస్తుశాస్త్ర పండితులును ఆవేశపూరితులగుటకును తోడ్పడెను.

**భూగర్భశాస్త్ర విషయము :-** వాఘోరా **(waghora)** నదినానుకొనియున్న చరియ పొడుగునను, దాని మధ్యభాగమునందును ఈ గుహాలు త్రవ్వబడినవి. ఈ చరియ అర్ధచంద్రాకారమును కలిగియున్నది. మొదటి గుహ మొదలుకొని ఏడవగుహావరకు చరియయొక్క ముఖపాతము సాపేక్షముగా క్రమముగాను, పిమ్మట ఆకస్మికముగా మిక్కిలి నిలువుగాను పరిణమించుచున్నది. వస్తుతః ఈగుహాలలో సగపాలు గుహాలు పశ్చిమాభిముఖముగాను, తక్కు సగపాలు గుహాలు ప్రాఙ్ముఖముగాను

కనిపించును. మొదటి గుహ మొదలుకొని పదవ గుహ వరకు పైనున్న కొండలవరుస కత్తిరాయివలెను, ఆగుహ లన్నిటిని దాటి జలపాతమునకు చేరువరకు క్రమముగా విస్తృతమగుచు కనిపించును. జలపాతముయొక్క ఎత్తు మొత్తముమీద 178 అడుగులు. అందు ఏడు కత్యలు కలవు. అంత్య కత్యకు "సత్కుండు" అనిపేరు. సత్కుండము నుండి వాఘోరానది తిరిగి ప్రవాహరూపమున బయలుదేరును.

ఈ గుహాలయములు ప్రచండ శిలాఖండముల నుండి నిర్మితములై యున్నవి. వీటి పొడవు 600 గజములకు పైగా నున్నది. అసంపూర్తిగా నున్నవాటితో కలుపుకొని ఈ గుహలన్నియు ముప్పదియై యున్నవి. వీటి అడుగు తలము సమముగాలేదు. ఎనిమిదవ గుహ అన్నింటికంటె మిక్కిలి తగ్గుగాను, నీటిదరికి విశేషముగా దగ్గరగాను ఉన్నది. 29 వ గుహ అన్నిగుహలకంటె ఎత్తయినది. ఈ గుహలను నదితోను, ఈగుహల నొండొంటితోను కలుపుచున్నట్టి ప్రాచీన సోపానములు ఇప్పటికిని అచ్చటచ్చట కాననగును. మిక్కిలి ప్రాచీనములయిన గుహలకు సామీప్యము నందును, ఎదుటనున్న కొండల యొక్క ఉన్నత ప్రదేశములందును కొన్ని ఇటుక కట్టడముల అవశేషములు అచ్చటచ్చట కనుపించుచున్నవి.

ఈముప్పది గుహలలో 9, 10, 19, 26, 29 సంఖ్యలుకల గుహలు చైత్యశాలలు (లేక సామాజిక ఆరాధనశాలలు), శేషించిన గుహలు సంఘారామములు లేక విహారములు (అనగా భిక్షువులకు నివాసస్థానములు).

త్రవ్వుపద్ధతి :- అసంపూర్తిగా త్రవ్వబడి నేటికిని ప్రాథమిక స్థితియందు నిలచియున్న (కొన్ని) గుహలను బట్టి ఈ గుహలను త్రవ్వుటయందు అనుసరింపబడిన పద్ధతిని మనము సులభముగా ఊహింపవచ్చును. మున్ముందుగా వాస్తు శాస్త్రాభిజ్ఞ సార్వభౌము డొకడు సమగ్రముగా ఈ గుహానిర్మాణ విధానమును పరికల్పించి యుండు ననుట స్పష్టము. అంద్ధతడు వాస్తుశాస్త్రము, అలంకరణము, ధ్వనిశిల్పము, తక్షణాలంకరణము (అది ప్రలంబ శిల్ప పట్టికా రూపమునగాని జ్యామితి రీతులలోగాని ఉండవచ్చును) మున్నగు వాటి వివరములను, సమృద్ధిగా వెలుతురు కల్పించుటకును, చూపరులకు మనోహరమగు దృశ్యములభించుటకును వలసిన ఏర్పాట్లను చిత్రణముల విస్తీర్ణమును, సన్నివేశములనుకూడ అతడు తొలుదొల్తనే పథకము వేసి యుండును.

దేశీయమైన చిన్న ఉలిచేతను, సుత్తెచేతను, ఒకప్పుడు శిలయందు లోతైన సందులు కల్పింపగల బరువైనట్టి మొనగల ఒకరీతి గునపము చేతను, గుహలను తొలుచు పని సాక్షాత్తుగా జరిగినట్లు కనిపించును. మొట్టమొదట కట్టెబొగ్గుతో కాని, రంగుల బలపపు రాతితో గాని రూప రేఖను గీచి, వితానమునుండి క్రిందిభాగమునకు తొలుచు పని ఆరంభింపబడెను. రాతిలో రెండు మూడు అడుగుల లోతుగల సందులను కొట్టిన మీదట, మధ్యనున్న రాతి కట్టలను పగులగొట్టి తీసివైచి, అవసరమయిన తావులలో స్థూలశిలాఖండములను వదలిపెట్టుచు, వాటిని పిమ్మట స్తంభములుగా గాని, విగ్రహ శిల్పములుగా గాని, ఇతర వాస్తుశాస్త్ర - శిల్పశాస్త్ర ఉక్తలక్షణములు గలవాటినిగా గాని, నిర్దిష్ట విధానానుసారముగాగాని మలచుచుండిరి. ఈ విధముగా నేలమట్టము నగులువరకు ఖనన కృత్యము సాగెను. అయితే గండశిలను తొలుచుట, మలుచుట, తీర్చిదిద్దుట- ఈ పనులన్నియు తోడ్తోడనే జరిగెననుటను అసంపూర్తిగ నిర్మాణములయిన గుహలు తెలివిడిచేయు చున్నవి.

వర్ణచిత్ర విధానము:- రంగువేయుటకు ఆధారముగా భిత్తితలమును, వితానమును సిద్ధముచేయు విధానమును, వర్ణచిత్ర విధానమునందు సాంకేతిక విద్యా ప్రగల్భతను చూచినచో చిత్రకారునకు గొప్ప కౌశల్యము, ఊహా సమృద్ధి గలదని స్పష్టమగుచున్నది. రాతిపొడిగాని, ఇనుప మట్టిగాని, బంకమట్టి, ఆవుపేడ తరుచుగా పొట్టుతోనో, ఊకతోనో, వనస్పతి పీచుతోనో కలిపి, వెనర కషాయముతో గాని, బెల్లపు నీటితో గాని, జిగురుపదార్థముగా నూరి ఆ పదార్థమును కఠినముగాను, గరుకుగాను ఉన్న శిలాతలముపై గట్టిగాను, సమముగాను లేపనపట్టిగా మెత్తుదురు. ఆ లేపన పట్టిక విషమ శిలాతలమును గట్టిగా పట్టుకొనును. అట్లు గట్టిగా పట్టుకొన్న ఆ లేపన పట్టిక, తడిగా నుండగనే దాని నొక కర్ణికతో చదునుగాను, నునుపుగాను చేయుదురు. దానిపై చక్కగా సున్నము కొట్టగా, ఆ లేపన పట్టిక ఆ సున్నము సాకర్షించును.

ఆ స్థలమంతయు ఎండినమీదగాని దానిపై రంగు వేయరు. రంగు వేయబడునపుడు శ్రీ కుమారస్వామిగారు తలంచి నటుల ఆ ప్రదేశమంతయు తడిగా నుంచబడుననుట అను మానాస్పదము.

మొదట రూపరేఖలు గీచి, వాటిలో రంగులతో చిత్ర లేఖనము జరుపబడును. ఆ రూపరేఖలు సర్వదా మొట్ట మొదట ధాతురాగముచే గాని, ఎఱ్ఱ మద్దచే గాని స్పష్ట ముగా గీయబడును. ఆ రేఖాకృతులలో ఎరుపు రంగు నింపబడును. దాని మీద మిక్కిలి పలుచనై అచ్చమైన పచ్చనిమట్టి పూయబడును. అపుడు దానిగుండా ఎఱ్ఱదనము కనిపించుచుండును. స్థానికముగా లభించు రంగులు భిన్న చ్ఛాయలతో పూయబడుచుండగా కపిశవర్ణముచే గాని, గాఢమైన ఎఱుపు లేక నలుపు రంగుచే గాని, స్థూల సూక్ష్మములైన ఛాయలచే గాని, బిందువులచే గాని, పత్ర రేఖలచే గాని రూపరేఖయు నవీకృత మొనర్పబడును. దీనిచే రూపరేఖకు సంపూర్ణముగా ప్రమాణ భూతమును, వలయితమునగు ఘనపరిమాణగుణము ఘటిల్లును.

ఇందు ఉపయోగింపబడిన రంగులలో ధాతురాగము, కుంకుమ లేక సిందూరము, హరిదళము, నీలిమందురంగు, నీలి మైలుతుత్తము (Lapis lazuli blue), కజ్జలము, ఖడి మట్టి, జేగురుమట్టి, ఆకుపచ్చరంగు మున్నగునవి పేర్కొన దగినవి. రంగులన్నియు స్థానికముగ లభించియుండును. నీలి మైలుతుత్తము (Lapis lazuli blue) మాత్రము జయ పూరు నుండి గాని, దేశపు బహిర్భాగమునుండి గాని తెప్పింపబడియుండును. మిశ్రవర్ణములు కూడ అపురూప ముగా ఉపయోగింపబడెను. ఉదా:- బూడిద వర్ణము. వర్ణములన్నియు సమసాంద్రతతో ఉపయోగింపబడలేదు. అది విషయమును బట్టియు, స్థానిక వాతావరణమును బట్టియు నిర్ణయింపబడెను.

అజంతా చిత్రలేఖనమునందు సాధారణముగా ప్రాచీన హైందవ చిత్రలేఖనము నందువలె వర్ణ సాంకర్య వైలక్ష ణ్యము ప్రధానలక్ష్యము కాదు. భిత్తి తలమును ప్రధాన ముగా జాజుమన్ను, పచ్చమన్ను మున్నగు సాంద్రమును, గాటునయినవన్నెలతో అమేయములయిన భావములతో, ఛాయలతో నింపుటకై యత్నించుటయే ప్రధానలక్ష్యము. ఇట్లు పరిపూర్ణ రచనతో, గాటయిన రంగులతో భిత్తి తలమును నింపుట ప్రాచీన చిత్రలేఖన గౌరవమును అతిశయింపజేయును.

**కాల గణనము :-** పదవ గుహ ఒక చైత్యశాల. అందు రెండు శాసనములు కలవు. అవి ఆ గుహా నిర్మాణకాల మును నిర్ణయించుటకు తోడ్పడుచున్నవి. ఆ శాసనము లలో నొకటి ఆ గుహా ముఖతలమున చెక్కబడియున్నది. రెండవది దాని యెడమ వసారాగోడమీద చిత్రింపబడి యున్నది. ప్రాచ్య పాశ్చాత్య శాసన పరిశోధకులలో ప్రముఖుడయిన ప్రొఫెసరు లైడర్సు (Lüders) యొక్క అభిప్రాయము ప్రకారము ఆ రెండు శాసనములలో చిత్రింపబడిన శాసనము క్రీ. శ. రెండవ శతాబ్ది మధ్యభాగ మునకు చెందియున్నది. గుహా ముఖతలమున చెక్కబడిన శాసనము అంతకంటె ప్రాచీనమయినది. ఇట్లనుటకు కారణము అందలి కొన్ని వర్ణములు అశోకుని శాసనము లందలి వర్ణాకృతులను కలిగియుండుటయే. ఈ శాసనము నందు ఈ గుహా పురోభాగమును "వాసిష్ఠీ పుత్త కటహాడి" అనువాడు మలిపించి, దానమొసగినట్లు వ్రాయబడి యున్నది. ఈ శాసనము మహాచైత్య వాతాయనమునకు కుడివైపున నెదుట చెక్కబడియున్నది. ఆ కాలమున దక్షిణాపథమునందు అత్యంత విస్తృతమయిన రాజ్య మును ఆంధ్ర శాతవాహనులు పరిపాలించుచుండిరి. దక్షిణాపథము నందును ప్రస్తుతము ఆంధ్రప్రదేశముగా ఏర్పడియున్న ప్రాచ్య ప్రదేశము నందును, ప్రస్తుతము బొంబాయి రాష్ట్రములో ఒక భాగముగా ఏర్పడియున్న పశ్చిమప్రదేశమందును బౌద్ధశిల్పము యొక్కయు, వాస్తు శాస్త్రము యొక్కయు అభివృద్ధిని కల్పించి, శాతవాహ నులు విఖ్యాతులయిరి. దక్షిణాపథము నందలి స్మృతి చిహ్నములు- అవి కొండనే, బేడ్సా, కార్లే మున్నగు స్థలములందలి ప్రస్తరములను తొలిచి నిర్మించిన గుహా మందిరముల వంటివైనను సరే, (లేక) భట్టిప్రోలు, అమ రావతి, జగ్గయ్యపేట మొదలగు తావులందు గల నిర్మా ణాత్మక నిదర్శనముల వంటివైనను సరే- నిర్మాణ విధా నము, సాంకేతిక రచన, సన్ని వేశములయందలి సామ్యము మున్నగువానిచే పూర్వోక్తమయిన అజంతా యొక్క పూర్వకాలికతను ధ్రువపరచుచున్నవి. పదవగుహ యొక్క ఎడమగోడ యందలి చిత్రలేఖనమునకును, దీనికి సమకా

లికమయి, రెండవ శతాబ్దికి చెందిన కొండనే, కార్లేవద్దను గల శిల్ప విన్యాసమునకును, వస్త్రధారణము నందును ఆభరణములు, నైతిక లక్షణములు మానవ విగ్రహము లందు ప్రదర్శించుటయందు సన్నిహితమయిన సామ్యము కలదు.

తొమ్మిదవ గుహకూడా ఒకచైత్యశాలయై యున్నది. దానికిని పదవ గుహకును నిర్మాణ రచనా విషయమున పోలిక కలదు. ఈరెండును దాదాపుగ సమకాలికములు. తొమ్మిదవ గుహ 10 వ గుహకంటె కొంచెము పూర్వ కాలికమని కొందరు వాదించుచున్నారు. కొంద రది 10వ గుహకంటె కొంచెము అనంతరకాలికమని వాదించు చున్నారు. 12 వ గుహ ఒకవిహారము. అందు కుడి మూలనున్న ఒక కొట్టునకు ఎడమవైపున వెనుకనున్న గోడపై ఒక శాసనము కలదు. అందు దీనిని (గుహను) ఘనమడదుడను వణిజుడు కట్టించి యిచ్చెనని వ్రాయబడి యున్నది. ఈ శాసనము 10 వ గుహాయందలి వాశిష్ఠీ పుత్రకటహాది శాసనలిఖితముకంటె అనంతరకాలికమనుట స్పష్టము.

13వ గుహ ఒక చిన్న విహారము. దీని ముఖభాగము పడిపోయినది. 12వ గుహాయందువలె ఇందొక స్తంభరహిత శాల (Astylar) కలదు. అందు మూడుప్రక్కలందు కొట్టి డీలు ఉన్నవి. ఒక్కొక్క కొట్టిడీలో రెండేసి రాతిసెజ్జలు కలవు. ఒక కొట్టిడీలో ఎత్తైన రాతి దిండ్లుగూడ నున్నవి. ఎనిమిదవ గుహాలయముకూడ ఒకవిహారము. అది అత్యం తము నిమ్నతలముననున్నది. ఆ గుహాలయము విశేష ముగా నాశనము కావింపబడియున్నది. అందలి తలము విద్యుద్దీపములను సమకూర్చు విద్యుదుత్పాదక యంత్ర ములను స్థాపించుటకు అనుకూల ప్రదేశముగా ఉపయోగ పడుచున్నది.

8, 9, 10, 12, 13 సంఖ్యలుకల అయిదుగుహలు క్రీస్తుశకముకంటె పూర్వకాలమునకు చెందినవిగా కనిపిం చుచున్నవి.

ఇయ్యాద్య గుహాఖనన కార్య సంరంభానంతరము వాకాటక రాజుల ఆధిపత్యకాలము వచ్చువరకు ఈ సృజ నాత్మక కార్యమునందు ఒక విధమగు స్తబ్ధత యేర్పడి నట్లు కనిపించును. వాకాటక రాజుల రాకతో శిలాఖన నము అత్యధికముగా ఫారీయెత్తున ఆరంభింపబడెను. వాకాటక రాజులును, ఉత్తర హిందూస్థానమునందు సామ్రాజ్యాధిపత్యమును వహించిన గుప్తరాజులును సమ కాలికులై యున్నారు. ఈ రెండు రాజకుటుంబములును వైవాహిక సంబంధమును కలిగియుండెను. పూర్వమందు నిర్మింపబడిన గుహాలయములయొక్క ఆదర్శము, వాటి యందలి చిత్రలేఖన సంపదకారణములుగానో - కళాత్మక మును, సృజనాత్మకమునగు నీ కార్యమునందు గుప్త చక్రవర్తులను మించవలెనను సముచిత స్పర్థాభావమే కారణముగానో ఈ పునరుజ్జీవన విషయకమయిన ప్రచో దక శక్తి ఎద్దియైననుసరే— ఈ కాలమునందు మనకు రమణీయములయిన గుహాలయములు లభించినవి. ఇవి ఈకాలమున ప్రవర్తిల్లిన వాస్తువిద్య, మూర్తి నిర్మా ణము, చిత్రలేఖనము మున్నగువాటికి అత్యుత్తమ నిదర్శనములు. వీటిలో పెక్కింటి ఉత్పత్త్యభివృద్ధులకు కారణము ఉద్యోగులయొక్కయు, వత్సగుల్మము నందలి (నేటి బేసిమ్, అకోలా జిల్లా, బెరారు) వాకాటక రాజుల సామంతుల యొక్కయు, ఔదార్యమే. వాకాటక రాజగు హరిసేనుని (క్రీ. శ. 475-500) మంత్రి వరాహదేవుడు, 16 వ గుహాలయమును బౌద్ధ సంఘము నకు సమర్పించెను. 17 వ గుహాలయమును హరిసేనుని సామంతుడు అశ్మకుడను రాజకుమారుడు దాన మొన ర్చెను.

1, 2, 16, 17 సంఖ్యలుకల గుహాలయముల కాలానుక్రమమును గూర్చి విమర్శించినచో, 1, 16 సంఖ్యలుకల గుహాలయములు సమకాలికము లనియు, 17 వ గుహ, వాటికి అత్యంత సన్నిహితోత్తర కాలిక మనియు, 2 వ గుహ ఆ గుహాలయ శ్రేణిలో తుట్ట తుదకు నిర్మితమయినదనియు, విద్వాంసు లందరును అంగీకరించిన విషయమే. కాబట్టి ఈ నాలుగు గుహాలయ ములను క్రీ. శ. 5 వ శతాబ్దికి చెందినవనియు, క్రీ. శ. 5 వ శతాబ్ది మధ్యభాగమున నిర్మాణ కార్యశక్తికి సంబంధించి నట్టియు, అత్యంతోగ్రమును, ఫలప్రదమునగు కాలము ఘటిల్లిన దనియు తేటపడుచున్నది.

26 వ గుహ కొంచెము అనంతరకాలమునకుచెందినది. కుడివైపు దర్వాజా పైభాగమున వరండాకు వెనుకనున్న



అప్సరస - అజంతా గుహ 17

గోడపై శాసనమొకటి చెక్కబడియున్నది. అందు సుగతాలయము (బుద్ధాలయము)ను బుద్ధభద్రు డను నొకభిక్షువు ధర్మముచేసినట్లు వ్రాయబడినది. ఇతడు భవ్వి రాజునకు స్నేహితుడు. భవ్వి రాజు అశ్మకుడను రాజునకు మంత్రి. ఇతడు 17వ గుహాలయమునుకట్టించి యిచ్చినవాడుగాని, అతని ఉత్తరాధికారిగాని యైయుండవచ్చును. లేఖన శాస్త్రానుసారముగ, ఈశాసనము క్రీ. శ. 450-525 సం॥రముల మధ్యకాలమునకు చెందినదిగా నిర్ణయింపబడినది. కావున క్రీ. శ. 6 వ శతాబ్ది ప్రథమార్ధ భాగమునందు శిల్పవిద్యా విషయకమును, కళాత్మకమునగు క్రియా సంరంభము ప్రవర్తిల్లినట్లును ఏడవశతాబ్దిలో ఎట్టిప్రయత్నములేనట్లును తలంచుట కవకాశముగలదు. అయినను, 26 వ గుహాకోణమునకు ఎడమవైపునగల సమతలమునకు సంబంధించిన కుడిగోడపై వ్రాయబడిన ఒకానొక రాష్ట్రకూట శాసన ఖండము ఈగుహాలయములు క్రీ. శ. 8, 9 శతాబ్దులలో ఉపయోగమున నుండెనని రుజువు చేయుచున్నది.

## 2. వాస్తువు

అజంతా యందలి ముప్పది గుహలలో రెండు గుహలు (9, 10 సంఖ్య గలవి) హీనయాన బౌద్ధమత శాఖకు చెందిన చైత్యాలయములని తెలిసికొనియున్నాము. ఇవి క్రీస్తు పూర్వయుగమునకు చెందినవి. మరి మూడు గుహలు (19, 26, 29 సంఖ్య గలవి. మహాయాన బౌద్ధశాఖకు చెందిన చైత్యాలయములు. ఇవి హీనయాన చైత్యముల కన్న చాల అర్వాచీనములు. క్రీ.శ. 5, 6 శతాబ్దుల కివి చెందియుండవచ్చును. మిగిలినవి గుహా విహారములు. ఇక్కడకూడ రెండు స్థూల విభాగములను మనము గుర్తింపవచ్చును. నాలుగు గుహలు (8, 12, 13, 30 సంఖ్య గలవి) క్రీస్తు పూర్వపు హీనయాన బౌద్ధశాఖకు సంబంధించినవి. మిగిలినవి అర్వాచీన కాలమున విలసిల్లిన మహాయాన బౌద్ధశాఖకు సంబంధించియున్నవి. ఈ విహారములు పైన పేర్కొన్న మహాయాన చైత్యములతో సమకాలికములై యుండియుండును.

చైత్యాలయము లన్నిటికిని సామాన్యమగు ముఖ్య లక్షణములు కొన్ని కలవు. వీటి పై కప్పు గుమ్మటము లేక కమానురూపములో నుండును. చైత్యము వెలుపలి ముఖభాగము (facade) నందు ద్వారముపైన గుఱ్ఱపు డెక్క ఆకారములో నున్న ఒక పెద్ద వాతాయనము కొట్టవచ్చిన ట్లుండుట మరియొక విశేష లక్షణము. చైత్యాంతర్భాగము స్తూపాకృతి స్తంభములతో వేరు చేయబడి, గర్భగుడి (నడిబొడ్డు), విశ్రాంతి మండపము (apse)చుట్టివచ్చు వసారాలు కలిగియుండును. వసారాయే విశ్రాంతిమండపము వెనుకభాగమునుగూడ చుట్టియుండి, ప్రదక్షిణ పథముగా ఉపయోగపడును. విశ్రాంతిప్రదేశపు నట్టనడుమ పూజాస్థానముండును. అది చైత్యాకారమును గాని, లఘు స్తూపాకారమును గాని, దగోబా (ధాతు గర్భము) ఆకారమునుగాని కలిగియుండును. ఇవియు పర్వతగర్భమున తొలువబడినవియే.

మొదటి దశ చైత్యములు :- క్రీస్తుపూర్వము వెలసినవియు, హీనయాన బౌద్ధుల నిర్మాణములును అయిన ప్రాచీన చైత్యములలో బుద్ధవిగ్రహములు కాన్పించవు. బుద్ధభగవానుని భౌతికరూపమును యథాతథముగ ప్రదర్శించుట వారి సంప్రదాయమునకు విరుద్ధము. దీనిని వారు పట్టుదలతో పాటించిరి. శతాబ్దములు గడచి మహాయాన బౌద్ధము మహోన్నత స్థితికి వచ్చినప్పుడు ఈ లోపమును పూరించుటకై ప్రయత్నములు సాగెను. 9వ సంఖ్యగల గుహా బహిర్భాగమునందు బుద్ధని సమున్నత విగ్రహములు ముందున్న చెక్కడములపై తిరిగి చెక్కబడెను. అయినను పూర్వచైత్యాలయములందలి వాస్తువు నిరాడంబరమై, అర్వాచీన చైత్యముల వాస్తు నిర్మాణముతో అత్యంతము భిన్నించుచున్నది.

9వ సంఖ్య గుహ:- ఈ గుహయొక్క వాస్తు లక్షణములను సంగ్రహముగ వీక్షించినచో పై అంశము విశదమగును. ఈ గుహ చతురస్రాకారములో నున్నది. దాని వెనుక కొనను దగోబాయు, దాని చుట్టివచ్చుచు, వర్తుల స్తంభపరంపరయు గలవు. ఇది విశ్రాంతి మందిరస్థానము. దగోబా మీది యండము అర్ధవర్తులముగా నుండి, విషమ వృత్తాకారమైన దిమ్మపై నిలచినది. ఈ దిమ్మ ఎత్తుగా నుండి నిరలంకృతముగా నున్నది. దాని చుట్టును కంచె కట్టు ఉన్నది. మీదికి పోయినకొలదియు ఇది తలక్రిందైన పిరమిడు రూపములో నున్నది. శిఖరభాగమునందు రెండు దారునిర్మిత ఛత్రము లుండిన ట్లూహింపదగియు

న్నది. ఛత్రదండములను నిలుపుటకు పైభాగమున కల్పింపబడిన గుంటలు దీనికి నిదర్శనములు. ఈ గుహయందలి స్తంభములు సాధారణాలంకారము మాత్రము కలవియై అష్టకోణాకృతి కలిగి, క్రింది దిమ్మకాని, మీది దిమ్మకాని లేకుండనున్నవి. విశ్రాంతి మందిర భాగముల పైకప్పు చదునుగా నుండి రెండు చిన్న కిటికీల గుండ వెలుతురు లోనికి ప్రసరించుచున్నది.

ఈ కాలపు చైత్యముల ప్రధానలక్షణ మేమన, అవి దారు నిర్మాణములను అంధప్రాయముగ ననుకరించుచున్నవి. వాటి పూర్ణాకృతులును ముఖ్య వివరములును గూడ దారు నిర్మాణముల యనుకృతులే. నాటి శిలా శిల్పులు వీటిలో కట్టె దూలములను, వాసములను గూడ నిష్ప్రయోజనముగనే చొప్పించుటకు సిద్ధపడిరి.

**అర్వాచీన చైత్య సభలు :-** అనంతర కాలమున వెలసిన మహాయాన చైత్య సభలు మూడింటిలో ఒక్కటైన 29 వ సంఖ్య గుహ అసంపూర్తి నిర్మాణము. మిగిలిన రెండును అనగా 19, 26 సంఖ్యల గుహలు ప్రాచీన చైత్యముల కెమురవడినే ఆకృతిగా గలిగియున్నవి. అత్యంత ముఖ్యమైన భేద మేమన, వీటిమీది యలంకరణము సువిపులమై, అణువణువునకు శ్రద్ధతో చేయబడియున్నది. దగోబామీదనే గూళ్ళలో బుద్ధ విగ్రహములు చెక్కుట జరిగినది. బుద్ధుడు సింహాసనముపై కూర్చున్నయట్లును, నిలుచున్నట్లును, వివిధరీతులలో బుద్ధ విగ్రహములు లాజుల పైభాగపు కుడ్యముల మీదను, విశ్రాంతి మందిరపు వెనుక గోడలమీదను చెక్కబడియున్నవి. బుద్ధాకృతులు కుప్పలు తిప్పలుగా వీథి నదరున (Fracade) మలచబడియున్నవి. వాస్తవమునకు గుహాంతర్బహిర్భాగము లన్నియు సమానముగ శిల్ప బాహుళ్యముచే అలంకృతములై యున్నవి. ప్రాచీన చైత్యములందలి ప్రశాంత గంభీర వాతావరణము తొలగి దానిస్థానే ప్రభూతాద్భుత శిల్ప సంపద చెలువారుచున్నది. అర్వాచీన చైత్యములలో నడికప్పునకును, చైత్యవాతాయనముల గవ్వ పనికిని గూడ కట్టెవాసములను వాడు ఆచారము త్యజింపబడెను. సభాభవనమునందలి స్తంభములు నిట్టనిలువుగా తొలువనైనది. పిరమిడు ఆకృతిలోని పిట్టగోడ వీటియందు కాన్పించదు. స్తంభములు వర్తులములై చక్రాకృతిలో నున్న వలయపు గుంటలుగల్గి, లతాలంకరణములు, ఆభరణాకృతులు వీటిపై చెక్కబడి యున్నవి.

19 వ సంఖ్య గుహ బౌద్ధుల గుహా నిర్మాణ వాస్తువునకు సమగ్ర ప్రతినిధియైన మచ్చుతునకగా పరిగణింపబడుచున్నది. గుహాంతర్భాగము నందలి స్తంభము లన్నిటికిని స్తంభపు పైదిమ్మెమీద మధ్యభాగమున ఆసీన బుద్ధుని విగ్రహములు చెక్కబడియున్నవి. దూలముల తన్నులు (Brackets) ముందుకు చొచ్చుకొని వచ్చిన ట్లుండును. ఇవి మావటీలతోగూడిన ఏనుగులు, శార్దూలములు, ఎగురుచున్న మిథునములు, సన్న్యాసులు, గాయకులు మున్నగు రూపములలో చెక్కబడినవి. అగ్రభాగమునందున్న రెండు స్తంభములపైని తన్నులు సాలభంజికల రూపమున నున్నవి. లాజులమీది కుడ్యముపైన బుద్ధ విగ్రహములు ఆసీన స్థితిలోను తిష్ఠదాకారములోను, గదులు గదులుగ చెక్కబడినవి. వీటికి నడుమ నడుమ జంతు మనుష్య విగ్రహములలో అల్లుకొనిన జిలుగుపని కూర్పబడినది.

ఈ గుహ వీథినదరు అత్యద్భుతమైన చిత్రములతో నలంకరింపబడి యున్నది. ద్వారమంటపము చిన్నదయ్యు, అందలి స్తంభములు లలితలలితములై యున్నవి. ముంజూరుపైన చైత్య వాతాయనము గంభీరముగా కాననగును. దీనికిరుప్రక్కలను స్థూలాకృతి యక్షవిగ్రహములు చెక్కబడియున్నవి. వీటికి తిరోభాగమున సున్నితమైన స్తంభపు అంచుకట్టు పనితనము గలదు. ఈ భాగమంతయు చిత్రభావన యందును, పనితనమునందును, శిఖరముల నందుకొన్నది. చిత్రవివరణములయందు నిస్తుల సంపదయు, చిత్రముల పరిమాణములయందు లాలిత్యమును ముఖ్యముగ గమనింపదగినవి.

26 వ సంఖ్యగల గుహకూడ మహాయాన చైత్య సభా మంటపమే. అయినను అది 19 వ గుహకన్న పెద్దది. కాని గుహానిర్మాణము నందును, అలంకరణము నందును ఇది 19 వ గుహకు తీసికట్టు అని చెప్పవచ్చును. ఇచ్చటి చిత్రాలంకరణము కడుశ్రద్ధను చూపెట్టుచున్నను, చిత్రకారుడు అతిగాపోయి శిల్పించినాడను భావము తోచును. చిత్రపరిమాణములలో సమత్వలాలిత్యములు కొరవడి లయ సమన్వయము చెడినట్లనిపించును.

మొదటిదశ : విహారములు :-క్రీస్తుపూర్వపువిహారములు నిరలంకృతములై, ఆకృతినిష్ఠురములై కాన్పించును. వీనిలో మధ్య గది యొకటి యుండును. దీని చుట్టును మూడు ప్రక్కలను అరలు (cells) ఉండును. ఈ యరలు చిన్న పరిమాణములలో నుండును. ప్రధాన మందిరముతో కలుపుటకు వీటికి ఇరుకుద్వారములు కలవు. అరలలో నిడుపు బల్లలరీతిగ చెక్కి, ఒకభాగము తలగడవలె నుండుటకై కొంచెము ఎత్తుగ ఏర్పరుపబడి యున్నది. ఇది బౌద్ధ సన్యాసుల శయన సౌకర్యములు.

12 వ గుహ మిక్కిలి ప్రాచీనమైన విహారముల విభాగమునకు చెందును. కాని 13 సంఖ్య గుహ ప్రాచీన విహారములకు చక్కని యుదాహరణము కాగలదు. దీని నడిమిగది 13¾ అడుగుల వెడల్పు, 16¾ అడుగులలోతు, 7 అడుగుల ఎత్తు కలిగియున్నది. మధ్య మందిరమునుండి వెలువడు అరలు సప్తసంఖ్యలోనున్నవి. ఇందు మూడు అరలు ఎడమభాగమునను, కుడిభాగమునను వెనుకవైపునను రెండేసి యరలును గలవు. బౌద్ధ భిక్షువులందుకూడ అలంకరణ ప్రీతినిసర్గమగుటచే, వారు తొలికాలమునుండియు ఈయరలమీద బుద్ధ పవిత్రచిహ్నములను, దగోబా, పవిత్రమైన కటకటాలు, రాతితెరలు మున్నగువాటిని చెక్కుచుండిరి. ఈయంశమున అజంతా విహారములు, సమకాలికములైన భాజా, బేడ్సా, జున్నారు, నాసికు మొదలగు ప్రదేశములందలి గుహావిహారములను బోలియున్నవి. ఇవియన్నియు క్రీ. పూ. రెండవ లేక ఒకటవ శతాబ్దమునకు చెందినవి.

అర్వాచీన విహారములు :- క్రమముగ బౌద్ధమతము జనాదరణమునందు బలీయమగుచు వచ్చిన కొలదియు, భిక్షుకుల సంఖ్య హెచ్చుదొడగెను. విహారముల విస్తీర్ణతా పరిమాణములు పెద్దవయ్యెను. మహాయాన మత విజృంభణముతో విహారములు దేవాలయములుగ మారజొచ్చెను. పూజావిధానమునకై బుద్ధుని మనుష్యాకార విగ్రహములను నిర్మించుటకు మహాయానము అనుమతించెను. ఈకాలపు విహారములందు విహారమునకు వెనుకభాగమున విగ్రహస్థానమైన మందిర ముండుట ఆచారమయ్యెను. 4 వ సంఖ్య గుహలో మొట్టమొదటిసారిగా పూజావిగ్రహమును, పూర్వమందిరమును ప్రవేశపెట్టుట చూడనగును. ఇది అత్యంత ప్రాచీనమైన మహాయాన విహారము. దీనిలో 87 చదరపు టడుగుల విస్తీర్ణముగల చావడికలదు. వెనుకభాగమున పూర్వ మందిరమును, పూజావిగ్రహమును ఉన్నవి. బౌద్ధజీవితము యొక్క ఉత్తమలక్షణములు దీనియందు ప్రతిబింబించు చున్నవి. గుహ మిక్కిలి విస్తీర్ణము కలిగియున్నది. దీనివాస్తులక్షణములు బృహదాకార సంపన్నములై యున్నవి. అలంకార చిత్రము మితిమీరిలేక పొదుపరిలక్షణము కలిగియున్నది. ఈలక్షణములు బౌద్ధమతము యొక్క సంయమనశీలమును, ఆధ్యాత్మిక జీవితముయొక్క నిరతిశయ వైపుల్యమును సూచించుచున్నవి. ఈ విహారము క్రీ. శ. మూడవ శతాబ్దిలోకాని అంతకుపూర్వముకాని తొలువబడియుండునని తోచును. ద్వారబంధముమీదను, వాతాయనములమీదను కనబడు చెక్కడపుపని అనంతరకాలములో జరిగియుండును.

11 వ సంఖ్య గల గుహ నిర్వివాదముగ మహాయాన గుహలలో పూర్వపూర్వతర కాలమునకు చెందినదని చెప్పవచ్చును. నాసికు నందలి శ్రీయజ్ఞ గుహతో దీనిని పోల్చుట వలన ఇది క్రీ. శ. నాల్గవ శతాబ్ది నిర్మాణముగా భావింపబడుచున్నది. ఈ గుహయందలి హాలు (చావడి) మధ్యమమున నాలుగు స్తంభములున్నవి. 7 వ సంఖ్య గుహలో ఈ స్తంభములు ఒకదాని సరసన మరొకటిగా రెండు వరుసలలో నున్నవి. 6 వ సంఖ్య గుహలో మధ్య స్తంభములు చతుస్సంఖ్యలో నున్నను అన్నివైపుల చుట్టువారుగ మరొక వరుస స్తంభములు కలవు. అజంతాయందు రెండు అంతస్తుల గుహానిర్మాణమునకు 6 వ గుహయే ప్రథమోదాహరణము. ఈరీతి స్తంభ కల్పన సంతృప్తినీయజాలకపోయెననుట తెల్లము. చావడి చతురప్రాకారముతో వలయాకార స్తంభములకు పొత్తు కుదురకున్నది. మరొక లోపమేమన, రెండువరుసల స్తంభములుండుటచేత చావడి క్రిక్కిరిసినట్లగుచున్నది. దీని పర్యవసానమే చావడిచుట్టును సుసంగతములై, సమైక్యమైన ఆకృతిగల స్తంభయుగళ నిర్మాణము (colonnade). ఇట్టి రచన 1, 2, 16, 17 సంఖ్యల గుహలలోను, 6వ గుహ పైయంతస్తులోను కాన్పించును. సమతా లక్షణముగల స్తంభయుగళ నిర్మాణమును, సుసమృద్ధమైన అలంకరణ

చిత్ర సంపదయు ఈ గుహల కొక యద్భుత సౌందర్యము నాపాదించుచున్నవి. ఈ సౌందర్యము కొన్ని గుహలలో విస్తారమైన వర్ణచిత్ర కల్పనముచే ద్విగుణీకృతమైనది.

శేషించిన అజంతా విహారములలో 16, 17, 1, 2 సంఖ్యల గుహలు మిక్కిలి ప్రాముఖ్యము వహించినవి. మొదటి రెండును క్రీ. శ. 5 వ శతాబ్ది చరమపాద నిర్మాణములని నిశ్చయించుటకు వీలగు శాసనలేఖనములు కలిగియున్నవి. 16 వ గుహలో 65 అడుగుల చదరము చావడియున్నది. చుట్టును 20 స్తంభయుగళము లేర్ప రుప బడినవి. దీని వెనుకభాగమున ప్రలంబ పాదాసనమున చెక్కబడిన బుద్ధుని విగ్రహముగల పూజామందిరమున్నది. ముందరి భాగమున ఐదు స్తంభములపై మోపిన కప్పుగల వసారా కలదు. వసారాకును చావడికిని రెండు ప్రక్కల 14 అరల వరుస యున్నది. మరి రెండు అరలు పూజా మందిరము రెండుప్రక్కలను చావడి లోపలి భాగమున కానవచ్చును. చావడియందు 20 స్తంభములు కలవు.

17 వ సంఖ్య గుహ :- ఇది పై గుహతో సమానమైన యాకృతి రచన కలిగియున్నది. దాని స్తంభములుకూడ పై గుహా స్తంభముల వలె అలంకార సంపద వహించి యున్నవి. అవి శిఖరప్రదేశము నందును అడుగుభాగము నందును చతురస్రముగా నున్నవి. వీనికి మధ్యభాగమున మాత్రము అంచుకట్టుపని కలదు. వసారాయందలి స్తంభ ములకు క్రింద చెక్కుడు దిమ్మలును, పైన చెక్కడపు తన్నులునుగలవు. విగ్రహమున్న మందిరపు ద్వారముపై పవిస్తరమైన శిల్పము కలదు. దీనిపై లతాగుల్మాకృతులు, బుద్ధవిగ్రహములు, ద్వారపాలికలు, రింగులు రింగులు, పెనవేయబడిన మోకు నమోనాలు, గోడలో తాపిన చదరపు స్తంభములు, కమలపత్రములు మున్నగునవి చెక్కబడియున్నవి. మూలలందలి ఉబ్బు ప్రదేశములలో మకరములపై నిలిచియున్నట్లు చెక్కబడిన నారీ విగ్రహ ములు నేత్రానందకరముగ నున్నవి. పూర్వమందిరము నందలి స్తంభములు, చతుష్కోణ స్తంభములు ప్రశస్తా లంకరణమునకు నెలవులై యున్నవి.

1 వ సంఖ్య గుహ :- స్తంభముల యింపు సొంపుల లోను, తదితర వాస్తు అంగ ప్రత్యంగముల కళా ప్రభా వము నందును, 16, 17 సంఖ్యల గుహలు, 1 వ గుహ కన్న మిన్నగా ఉన్నను మొత్తముమీద పరికించినచో ఆకృతి రమ్యతయందు ఈ గుహ వాటిని అధఃకరించు చున్నది. ఈ నాల్గు విహారములలోను ఇదియే విశాల తమమైనది. దీనిలో ద్వారమంటపము, వసారా, నాల్గు వైపుల సన్నత్రోవలుగల చావడి, పూర్వ మందిరము (Ante-chamber), బుద్ధభగవానుని అంబర చుంబియైన విగ్రహము చెక్కబడియున్నవి. విహారముయొక్క అంత ర్భాగమునందు 14 అర లున్నవి. వసారాకు రెండు ప్రక్కలను మరిరెండు చిన్నగదులు గలవు. వసారా 64 అడుగుల నిడివియు, 9 అడుగుల వెడల్పును, 12 అడు గుల 6 అంగుళముల ఎత్తును కలిగియున్నది. దీనిమధ్యలో ఒక పెద్దద్వార మున్నది. ద్వారబంధము, స్తంభోపరి భాగములు మిక్కిలి సుందరముగ చెక్కబడినవి. ద్వారము 64 అడుగుల చదరమైన పెద్ద చావడిలోనికి తెరచు కొనును. దీని కప్పు భారమును 20 స్తంభయుగళములు మోయుచున్నవి. చుట్టును 9 అడుగుల 6 అంగుళముల వెడల్పు వసారా యున్నది. చావడి వెనుక భాగమున ఉన్న పూర్వమందిరము 10 × 9 అడుగుల కొలతలతో నున్నది. దీనినుండి పూజామందిరమునకు పోవు ద్వారము కలదు. ఇది యద్భుత శిల్పములతో కూడియున్నది పూజామందిరము దాదాపు 20 అడుగుల చదరముగా తీర్చబడినది.

ఈ గుహాంతర్భాగము నందలి స్తంభములు ఆకృతి యందలి వైవిధ్యముతోను, అలంకార శిల్పము నందలి చమత్కృతితోను, వాటిని శిల్పించిన విశ్వకర్మల బుద్ధి వైశద్యమును నిరూపించుచున్నవి. ఈ గుణములతోపాటు గుహావిస్తీర్ణతవలన నిరవధిక భావము కలిసి భారత దేశము నందలి సుందరతమమగు గుహావిహారములలో నొక్కటిగా ఇది పరిగణింపబడుచున్నది. ద్వార మంట పము విధ్వంస మొనర్పబడుటచే ఈ గుహావిహారము యొక్క వెలుపలి భాగము కొంత సొంపు చెడియున్నది బుద్ధభగవానుని జీవిత సన్నివేశములును, గజయుద్ధముల, వేట చిత్రములు ఇక్కడ అద్భుత కౌశల్యముతో చెక్క బడి యున్నవి. ఇవి శిల్పముయొక్క అగ్రశిఖరము నం కొన్నవి. గుహయొక్క వీథి నదరు అలంకార శిల్పము నందు నిస్తులమై అత్యంత సుందరమై విపులమై యున్నది



అజంతా - 19 వ గుహ లోపటి దృశ్యము



బోధిసత్త్వ పద్మపాణి - అజంతా గుహ 1

దివ్యసుందరముగ శిల్పించిన స్తంభములును, స్తంభోపరి శిల్పపు విన్నాణము మొత్తమయి విహారముయొక్క అద్భుత రామణీయకతను, గాంభీర్యమును పెంపొందించుచున్నవి.

2 వ సంఖ్యా గుహ, 1 వ సంఖ్యా గుహకు చాలా వరకు ఆమ్రేడితమని చెప్పవచ్చును. దాని చావడి మొదటి గుహకన్న చిన్నదిగా నున్నది. స్తంభములును వాటి కొలతలలో కొంత భేదించుచున్నవి. కాని ఈ గుహయొక్క ఆకృతిరచన యందలి క్రమసంపదయు, సమైక్యతయు కలిసి ఒకటవ సంఖ్యా గుహకన్న యిది భావనాసీమ యందు విశిష్టతరమైనదిగా భాసించుచున్నది.

ఈ కాలమున వాస్తుశాస్త్రము మహోన్నతస్థితి నందెననియు, ఉత్తమ వాస్తు సంప్రదాయములు క్రమ పరిణామ దశయం దుండెననియు నిరూపించుటకు మరియొకటి రెండు గుహలనుగూర్చి ప్రసంగింపవచ్చును. దీని తరువాత ఏ కారణముననో కాని అజంతాయందు సృజనాత్మకమైన చైతన్యము ఒక్క మారుగా అంతర్ధానమొందెను. ఉదాహరణమునకు 24 వ సంఖ్యా గుహను చెప్పవచ్చును. దీనియందలి చావడి 75 అడుగుల చదరమై 20 స్తంభములు కలదిగా కల్పింపబడినది. కాని యిది అసంపూర్ణముగ విడువబడినది. వసారాయు, వీథి నదరు స్తంభములు మాత్రము శిల్ప సమగ్రతను పొందినవి. ఇచ్చటి స్తంభములన్నియు ఒక్కటిమాత్రము వెల్తిగా విధ్వంసక మగుట దురదృష్టము. కాని గుహ - ఆకృతి రచనా సౌందర్యమును, వైకప్పునందలి ముఖ్య దూలమునకు సంబంధించిన స్తంభోపరిభాగములను మలచుట యందు ప్రదర్శింపబడిన శిల్పాచార్యకమును బట్టి ఇచ్చటి విహారము లన్నిటిలోని కిది తలమానికముగాను, అద్భుత నిర్మాణముగల గుహగాను సిద్ధముచేయుట కుద్దేశించిరని తోచును. 21 సంఖ్యా గుహ యందు అజంతా గుహా స్తంభముల సామాన్య లక్షణమగు 'శెర' రూపమయిన స్తంభ శిరస్సు అదృశ్యమగుట గణింపదగిన విషయము. ఇప్పటినుండియు 'కలశము - పర్ణావళి' రూపమైన స్తంభ శీర్షము శిల్పరంగమున ప్రవేశించినది. భారతదేశపు అనంతర వాస్తువునం దిది సర్వజనాదరణము పొందినది. 24 వ గుహలో ఈ వస్తువే కొలదిగా అభివృద్ధినొందిన పథకములో కాన్పించుచున్నది. ఈ గుహ మూడవ సంఖ్యా గుహకన్న అనంతర కాలమునకు చెందినది కావచ్చును.

### 3. శిల్పము

అజంతాశిల్ప మంతయు చాలామట్టుకు మహాయాన సంప్రదాయమునకు చెందినదై యున్నది. క్రీస్తుపూర్వపు నాటి ప్రాచీన గుహలలో శిల్పమేమియు లేదనవచ్చును. వాటిలో గోడలమీద వర్ణచిత్రలేఖనము, కళాద్యోతకము లగు అలంకరణములు మాత్రము కలవు. నిజమునకు 'భాజ' మొదలుకొని చాలవరకన్ని గుహాలయములలో నిదియేస్థితి కలదు. శిల్పము క్రీస్తుతరువాత రెండవశతాబ్ది నుండి మాత్రమే కానవగును.

శిల్పప్రారంభమునకు చెప్పబడిన ఈకాలమును బట్టి భారతీయ శిల్పకళకూడ కొయ్య చెక్కడపు పనులనుండి ఉత్పన్నమైనదని వాదింపబడుచున్నది. కాని భారతశిల్పకారుడు ఇంతకుపూర్వము కొన్ని శతాబ్దులనుండియు రాతిచెక్కడమునందును తొలుచుటయందును అభ్యాసము కలిగియుండెనని స్పష్టముగా తెలియ వచ్చుచున్నది. మౌర్యుల రాజధానులును, భార్హుత్ శిల్పములును గొప్పనేర్పుతో కూడిన హస్తలాఘవముతో రాతిచెక్కడమందు శిక్షితులైన శిల్పకారులచే నిర్మింపబడెను.

**శిల్పమందలి సాంకేతికత :-** భారత శిల్పకారుని చే అనుసరింపబడిన సాంకేతిక విధానము మిక్కిలి కౌశలముతోకూడినదై వంశపరంపరాగతమును, సాంప్రదాయకమును అగు శిల్పవిజ్ఞానముయొక్క అనేక శతాబ్దముల అనుభవమును నిరూపించు చున్నది. స్థూలాకారమును తయారుచేయుటకు వెడల్పగు ఉలియు, సున్నితమైన వివరములను చెక్కుటకు సన్నని ఉలియు వాడబడెడివి. బొమ్మలపై ఉలిచెక్కడముల చిహ్నములేమియు కనుపించకుండ నుండునట్లు చెక్కబడెడివి. ముఖములు, చేతులు నునుపుగా రుద్దబడెడివి. ఈపని అన్నియెడలను అత్యంత నిర్దుష్టముగ చేయబడినది. ఈ ప్రాచీన శిల్పములలో చాలాభాగము సవ్యహస్త శిల్పులచే చెక్కబడెను. శిల్పముల వామభాగములను చెక్కుటయందు ఆకృతి రచనలోను, నునుపుదనమునందును స్వల్పలోపములు కనబడుచున్నవి.

అజంతా శిల్పము సంప్రదాయగతమైన సాంకేతిక చిహ్నములకును, బుద్ధుని మానవాకారములో చిత్రించగూడదను నిషేధమునకును అతీతమైన దగుచు పలువిధములగు రీతులలో కాన్పించును. బుద్ధుని యొక్కయు, బోధిసత్వుల యొక్కయు, ఇంకను ఇతరమైన బొమ్మలయొక్కయు పూర్ణ చిత్రణము చేయుటయందు అప్పటికి సాధింపబడిన శిల్పప్రాశస్త్యమును ఇవి ప్రదర్శించును. ప్రాచీనమగు అమరావతి, నాగార్జునకొండ లందు వలెనే ఇచ్చటను ఉబ్బెత్తుబొమ్మలశిల్పము (Bas-relief) తన విశిష్ట జీవచైతన్యమును నిలుపుకొన్నది. వర్ణచిత్రలేఖన మభివృద్ధిగాంచిన పిదప కథనాత్మకమగు దృశ్యముల చిత్రణమునందు ఉబ్బెత్తు చిత్ర శిల్పము ప్రాచీన కాలమందువలె ప్రత్యేకతను ఎక్కువకాలము నిలుపుకొనలేక పోయెను. అయినను వర్ణ చిత్రలేఖనముగాని కేవల వాస్తువివరణముగాని ప్రత్యామ్నాయముగా వినియోగపడని పరిస్థితులలో అలంకరణ ప్రభావముకొరకై ఉబ్బెత్తు చిత్రముల శిల్పమే యింకను ప్రత్యేకమైన విలువను కలిగి యుండెడిది. నిజమునకు వర్ణ చిత్రలేఖనము అత్యున్నత దశనందిన యీకాలములో ఉబ్బెత్తు చిత్రముల శిల్పము వాస్తువుతో సమైక్యత పొందినది. విగ్రహనిర్మాణ సమస్యలు శిల్పవిద్యకు వదలిపెట్టబడెను. ఈనాటి విగ్రహ శిల్పులు భక్తులను, కళాభిజ్ఞులనుకూడ సంతోషపెట్టగల అపురూపమైన శిల్పవరాకాష్ఠను సాధించిరి.

స్తంభఫలక చిత్రణశిల్పము (Pillar Medallion) అమరావతియందు అసమానమగు పరిపూర్ణతను పొందెను. అజంతాశిల్పి ఈ అమరావతీ కళాకౌశలమును వారసత్వముగా గైకొనుచు ఉబ్బెత్తు చిత్రముల అలంకరణ మందు తన అసమాన ప్రజ్ఞను వెలిబుచ్చెను. పత్రసంపద, పుష్పసమృద్ధి, పీటి నిర్మాణములోని నాణ్యము, కమల సౌందర్యమును, తు, చ, తప్పకుండ శిల్పించుట - " స్తంభ ఫలకముల మధ్యభాగమున చిత్రితములై, విచ్ఛిన్నమై తీగెచుట్టలుగా పరిణమించు జలముల చిన్న సుడులలో తేలియాడు శతపత్రముల శిల్పము - వేయేల, ఆకృతిరచన యందలి నిరతిశయానందము, దాని సజీవచైతన్యశక్తియు అజంతాశిల్పమునందు నిస్సందేహముగాపొడగట్టుచున్నవి. అజంతా పనితనము అమరావతీ శిల్పమునుండి ఆవిర్భవించి పరిణామము నొందిన శిల్పమని యిది నిదర్శించుచున్నది.

శిల్పము వాస్తువు యొక్క సమన్వితాంశముగా అజంతాలో స్పష్టముగా కనిపించును. ఇచట కొన్ని దృష్టాంతములు చెప్పవచ్చును ; మొదటి గుహలోపలను, వసారాలోను, స్తంభముల ఆమలకములు (capitals) శిల్పము - వాస్తువు - వీని సౌందర్య సమ్మేళనమును చక్కగా నిరూపించుచున్నవి. నాలుగుమూలలందు ఉన్న మరుగుజ్జు బొమ్మలు, ఆధార - ఆమలకముల (bracket-capitals) సవిస్తరాలంకరణము, రెండు మధ్యస్తంభముల నడిమి నిడుపాటి దూలముల మీది మిక్కిలి సున్నితమై అద్భుత సౌందర్యము వెలార్చు శిలాలంకార రీతులును, ఆమలకముల మధ్య కూర్చొనియున్న మరుగుజ్జుబొమ్మలు, కప్పుచూరువంటి భాగము మీద పూలమాలలు పట్టుకొని యెగురుచున్నట్లు చిత్రింపబడిన బొమ్మ జంటలును, సున్నితమగు మకరముల చెక్కడములు కలిగి, మరుగుజ్జులచే వహింపబడుచున్న ఆమలకముల క్రింది చదరపు ఫలకములును, కాండముల మధ్య సంపీడితమైన మెత్తవంటి ఆమలకమును, వసారాలోని గోడలో కలిసిన రెండు స్తంభములమీద చెక్కబడిన అర్ధకమలములు, పూర్ణకమలములు గల ఫలకములును, ముత్యపు సరులను వెడలగ్రక్కుచుండిన కీర్తిముఖమును, మరియు దాని చివరభాగములను పట్టుకొని యెగురుచున్నట్లు బయటి స్తంభముల మీది ఆమలకముల క్రింది చతురస్ర ఫలకముల మీద చెక్కబడిన రెండు బొమ్మలును, కొన్ని పెద్ద స్తంభములమధ్య ఫలకముల మీద చెక్కబడిన ఉపదేశ బుద్ధుని ప్రతిమలును, కుడివైపున పూర్తిగా బయటనున్న స్తంభముయొక్క మధ్య ఫలకము మీద చిత్రింపబడిన మన్మథ చైత్రయాత్ర, బుద్ధుని ప్రలోభనము- ఇవి అన్నియు శిల్పమునకు వాస్తువునకు గల సమైక్యత యొక్క పరిపూర్ణతను నిస్సందేహముగా వెల్లడించు దృష్టాంతములు.

16 వ, 17 వ గుహలు శిల్పదృష్టిలో నెట్లు ముఖ్యమైనవో అట్లే వర్ణచిత్ర లేఖనమందును, వాస్తు సంపద యందును అంతముఖ్యములై యున్నవి. 16 వ గుహలోని ఆధారప్రతిమలు, ముఖ్యముగా ఎగురుచున్న జంటలు, ప్రశంసనీయమగు సౌందర్యమందును, ఆకృతులయందును

సాటిలేనివై యున్నవి. చావడిలో వెనుకవరుసలోని అతి రమణీయమగు అలంకరణములుగల రెండు మధ్యస్తంభముల అడుగుభాగమును నాలుగుతలలతో మోయు సింహముల యొనిమిదిబొమ్మలు చెప్పతగినవై యున్నవి. ఈ సింహములు ఒకదాని వెన్నును మరియొకటి ఆనుకొని కూర్చున్నట్లు చెక్కబడినవి. ఈ గుహలోని గర్భాలయ ద్వారము, దానిమీద అనేక భాగములలో తొలువబడిన పుష్పసంబంధమగు విపులచిత్రములతోను, బుద్ధ విగ్రహములతోను, ద్వారపాలికలతోను, వలయాలంకారములతోను, త్రాటిమెలికలతోను, కుడ్య స్తంభములతోను, పద్మదళములతోను, ఆశ్చర్యజనకముగానుండును. మూలలందలి చూరులమీది మకరములపై నిలిచియున్న స్త్రీ ప్రతిమలు, ముందుగదిలోని స్తంభములు, కుడ్యస్తంభములమీది అలంకరణములు కూడ విశేషముగా మనోరంజకములై యుండును.

సంగ్రహముగా చెప్పదలచినచో, ఊహాతీతమైన అల్లిక పనితనమునకును, శిల్పగతమైన వాస్తువిన్యాసములకును, అజంతా ఒక గొప్ప చిత్రప్రదర్శనశాల యని నుడువ వచ్చును. ప్రాచీనమైన భారతదేశపు కళాక్షేత్రమునకు గాని పురాభవనమునకుగాని యిది తీసిపోదు. వాస్తు నిర్మాతలైన యీ ప్రాచీన కళావిదుల శక్తిని గూర్చియు, వారికిగల ఉపధీపరిజ్ఞానమునుగూర్చియు గ్రిఫిత్సు చెప్పినది అతిశయోక్తి కాదు.

వర్ణచిత్రలేఖనము మాసిపోయిన అన్నిగుహలలోను ఉబ్బెత్తు చిత్రములందు కనబడు అలంకరణాత్మకమగుపని నిజముగా అత్యాకర్షణీయమై యున్నది. పౌరాణిక వృత్తాంతములను, రేఖాగణితాకృతులను, పుష్పవితానములను, పక్షుల యొక్కయు, జంతువుల యొక్కయు బొమ్మలను కలిగియున్నదై యీ అలంకరణము విన్యాసములయొక్క అనంత వైవిధ్యమును చూపును. పక్షి, జంతు చిత్రములలో ముఖ్యముగా మకరముల యొక్కయు బాతుల యొక్కయు చిత్రణము శిల్పి యొక్క కల్పనాచమత్కృతి ననుసరించి అపురూపమగు అలంకరణములతో కూడి చిత్రవిచిత్రమగు ఆకారములు కలదై యున్నది. ఇచట బుద్ధుని యొక్క వ్యక్తిత్వమును సంపూర్ణముగా శిల్పమందును చిత్రమందును ప్రకటించుటకు తగిన ఆదర్శపూర్వరంగమును సృష్టించుటలో శిల్పి యొక్క అద్భుత కల్పనాశక్తియు, పరిపూర్ణ కౌశలమును తోడ్పడినవి.

**జంతువులు** : అజంతాలోని బుద్ధ విగ్రహమునకు సంబంధించిన గొప్ప చెక్కడములను పరిశీలించుటకు ముందు వాటికి ఏ విధమునను తీసిపోక శిల్పిచే గైకొనబడిన మరికొన్ని యితివృత్తములనుగూర్చి సంగ్రహముగా చెప్పతగియున్నది. ఉదాహరణముగా అజంతాలో చెక్కబడిన జంతువుల బొమ్మలు వాటి అలవాట్లను, వాస్తవికత ఉట్టిపడునట్లు ప్రకటించగల సామర్థ్యమును వెల్లడించు చున్నవి. ఏనుగు, ఆ జంతువునకు స్వభావ సిద్ధమగు అనేకమైన తీరులలో చూపబడెను; అట్లే యితర జంతువుల శిల్పములు కూడ శిల్పియొక్క సూక్ష్మ పరిశీలనను నిరూపించుచు జీవ ముట్టిపడు చున్నది. అజంతాలో అనేక స్థలములందు కనబడు లేడి, సింహము, తుదకు పొట్టేలు (రెండవ సంఖ్య గుహలో పొట్టేళ్ళ పోరాటము చిత్రితమైనది) మొదలగు జంతువులు వాటి అవయవ నిర్మాణము నిర్దుష్టముగను, కళాత్మకముగను ఉండురీతిని వాటి వాటి కుచితమగు పరిసరములలో నున్నట్లు శిల్పింపబడినవి.

ఒక స్తంభము యొక్క ఆమలకముపై ఒకేశిరస్సు కలిగిన నాలుగులేళ్ళు చెక్కబడిన ఫలకము ముఖ్యముగా పేర్కొన దగియున్నది. ఈ ఆమలక విషయమునందు శిల్పి యొక్క ప్రతిభ, నాలుగు శరీరముల నొకశిరస్సుతో కలుపుటయందలి 'కౌంశలత' మందుగాక, వాటిలో ప్రతిబొమ్మ యందు నిజమగు లేడియొక్క జీవకళతో కూడిన తీరును చూపుటయందు గలదు. క్రిందియెడమలేడి నేలమీద కూర్చుండి అపాయమును శంకించినట్లు తల యెత్తి ముందునకు చూచుచున్నది. అదేశిరస్సు వేరొక తీరులో కుడిప్రక్కనున్న దాని సహచర మృగమునకు వెనుకతోచిన అపాయమును పసిపట్టుటకు మెడవంచి జాగరూకతతో నున్నట్టి భంగిని కల్పించుచున్నది. అదే శిరస్సుతోకూడిన పైభాగమందలి లేళ్ళజంటలో ఎడమలేడి శత్రువుయొక్క ఉపసరణమును పరికించు చున్నట్లు మెడనుక్రిందికివంచి ముట్టెను ముందుకు చాచినట్లును, కుడివైపుది కాలిగిట్టతో ముట్టెను గోకుకొనుటకు మెడను

వెనుకకు త్రిప్పియున్నట్లును అచ్చుపులేళ్ళవలె కనుపించును. ఈ నాలుగు బొమ్మలలోని లేళ్ల శరీరములును ఘనాకారమునకు తగిన సరియగు కొలతలతో సజీవాకృతులలో మలువబడెను.

అజంతాలో మానవాకృతులు సంఖ్యాధిక్యతలోను భంగిమలలోను ఆశ్చర్యకరముగా చెక్కబడెను. వీనిని మనము నాగరాజుగను, నాగినిగను, గంధర్వునిగను, యక్షునిగను, హారీతి లేక పంచికగను, ద్వారపాలుడు లేక ద్వారపాలికగను, అప్పుడప్పుడు భగవత్ప్రార్థనలు సలుపు భక్తునిరూపములోను చూడగలము. ఒకే ఒకచోట చేతియందు బెత్తముకలిగి, కొంతమంది బడిపిల్లలతో ఒక బడిపంతులు కానవచ్చును. ఆ పిల్లలలో కొందరు పాఠము అందు నిమగ్నులై యుందురు. మరికొందరు పొట్టేళ్ళ పందెమును చూచి వినోదముగా ముచ్చటించుకొనుచుందురు. ఎచ్చటను మానవుని యొక్క ఆంతరంగిక గాంభీర్యమును, శివిని వెలిబుచ్చుటలో శిల్పి యే విధముగను పొరపడలేదు.

అసంఖ్యాకములగు నాగరాజ ప్రతిమలలో రెండు, కళాదృష్టితో సర్వోత్కృష్టమగు ప్రాశస్త్యమును కలిగి పేర్కొనదగియున్నవి. 19 వ గుహ యొక్క యెడమ వైపు చిట్టచివర తొలువబడిన ఫలకమందు నాగరాజు, నాగినియు ఒక సింహాసనము మీద కూర్చుండియున్నట్లు చూపబడెను. మరొక నాగిని తన కుడిచేతియందొక చామరముతో సింహాసనము ప్రక్కన పరిచారిక వలె చూపబడెను. ఈ ఇద్దరు నాగస్త్రీల భంగిమములలో ఎంతో విన్యాసము సంభవించినను ఆమూడు విగ్రహముల ముఖవైఖరులలోని ఆంతరంగిక ప్రశాంతతను బట్టి, బౌద్ధ శిల్పములో ఆధ్యాత్మిక ప్రభావ ప్రకటనమునకు ఎట్టి ప్రముఖ స్థానము కలదో వెల్లడియగుచున్నది.

ఇద్దరు నాగరాజులు 23 వ గుహా ద్వారమున కిరువైపుల ద్వారపాలకులుగా తొలువబడిన మరొక ఉదాహరణము కలదు. ఆ బొమ్మలు ఎక్కువ పెద్దవిగా లేవు. కాని వాటి శిరస్సుల ఆకార నిర్మాణము శిల్పి యొక్క పనితనములోని ఉత్కృష్టతను వెలిబుచ్చుచున్నది. ఆ యాకృతులు సుకుమారములు. ముఖవైఖరులు గాంభీర్యమును, మనః ప్రశాంతతను స్ఫురింపజేయును.

కథనాత్మక శిల్పము :- శిల్పమందు గాథల కూర్పు అనగా బుద్ధుని కథలను లేక జాతకములను (పూర్వ జన్మలు) లేక జీవిత విశేషములను తెలుపు శిల్పము అజంతా యందు చాలవరకు లేదనవచ్చును. కాని వర్ణ చిత్రలేఖనము ఇట్టి యితివృత్తమును గూర్చియే ప్రవర్తించినది. ఉబ్బెత్తు శిల్పమునకు అమరావతి, నాగార్జున కొండ, సాంచి, భార్హూత్ వంటి స్థలములందు చూపబడిన అత్యంత శ్రద్ధ అజంతాలో చాలమట్టుకు సన్నగిలినది. ఇది వాస్తువునకు అంగమై, సహాయక కృత్యములను పూర్తి చేయుచు అప్రధానమైయున్నది.

ఐనప్పటికిని మొదటిగుహ యొక్క వీథినదరు (Facade) మీది నాలుగు దృశ్యములను దెల్పు నాలుగు రంగములును, 26 వ గుహాలోని ప్రలోభన దృశ్యము, మహా పరినిర్యాణ దృశ్యము మొదలగునవి అజంతాలో ఉబ్బెత్తు చిత్ర శిల్ప సంప్రదాయ మింకను నశింపలే దనియు, అమరావతి మున్నగు ప్రాచీన స్థలములందు ఈ రీతి శిల్పమున విశ్వకర్మలు సాధించిన పరినిష్ఠితత్వమును అజంతా శిల్పి కోల్పోవలేదనియు, కథనాత్మక శిల్ప విన్యాసము పరాకాష్ఠను పొందినదనియు ఈ దృశ్యములు వ్యక్తము చేయుచున్నవి. వివత్కరమైన నాలుగు దృశ్యములు అనగా గౌతముడు తన విహార సమయములందు చూచినట్టియు, చివరకు అతని సన్యాస నిర్ణయమునకు కారణమైనట్టి దృశ్యములు - వ్యాధిగ్రస్తుడు,వృద్ధుడు శవము, (నాలుగవది శిథిలము) - అమరావతీ శిల్పి యొక్క అశేష నైపుణ్యముతో చెక్కబడెను.

ప్రలోభన దృశ్యము (మొదటి గుహ) జనరంజకమును, ఆనాటి కళావేత్త యొక్క అభిమాన విషయమును అయియున్నది. అజంతాలోని అత్యుత్తమ వర్ణ చిత్రములలో నొకటి దానికై వినియోగింపబడెను. కాని 26 వ గుహాలోని శిల్పము "బహుశః, ఈ రెంటిలో, దృశ్య ప్రకటనలో అత్యుత్తమమైనది." బుద్ధునికి ఎడమ వైపున మారుడు చేతిలో ధనుర్బాణములతో నిలచియుండును ; మారుని ముందు ఒక గొడుగు లాంఛనముగనో లేక బుద్ధుని దివ్యశక్తినుండి తన రక్షణ కగు చిహ్నముగనో పట్టియుంచబడెను. మారుని ముందు భాగమున కొందరు స్త్రీలు ఆసీనలై, మరికొందరు



ప్రసాధనము - అజంతా గుహ 17

నాట్యమాడుచు ఉన్నారు. వారిలో తప్నా, రతి, రంగ అను నాతని ముగ్గురు కుమార్తెలు వారి అనర్ఘ శిరో భూషణములచే గుర్తింపదగియున్నారు. మారుడు తాను జైత్రయాత్రకై పోవుచున్నట్లు చూపబడినపుడును, తరువాత శృంగభంగమునొంది బుద్ధునిచే పరాజయమును అంగీకరించుచున్నట్లు చూపబడినపుడును చక్కని యోధ వేషములో కనబడును. కాని మధ్యనున్న బుద్ధ విగ్రహము శిల్పి యొక్క అభీష్టమునను సరించి మొత్తము దృశ్యముపై అధికార ముద్ర వహించుచున్నది. ఈ చిత్రము దానిలోని కథాసన్ని వేశములనుబట్టి కథనాత్మక చిత్రముగా నుండవలసియుండును. ప్రకృతచిత్ర మట్లు గాక బుద్ధుని మాహాత్మ్యమును అలౌకిక ప్రభావమును మాత్రము ప్రదర్శించు చిత్రగుళికవలె నున్నది.

అదే గుహాలో తొలువబడిన బుద్ధ నిర్వాణ దృశ్యము మూర్తి నిర్మాణసూత్రముల కనుగుణముగనే చెక్కబడి, విషయ సంపత్తి అధికముగా నున్నను కథనాత్మకత యందు మిక్కిలి కొరవడియున్నది. ఇందు అనేకములగు ప్రతిమలును, నాటకీయ విశేషములును కలవు. బుద్ధ భగవానుడు శిరస్సును తలగడపైనుంచి కన్నులు మూసి కొని శయ్యపై పరుండియున్నట్లు చూపబడెను. అతని కుడిచేయి గడ్డముక్రింద ఉంచబడినది. బుద్ధుని ప్రతిమలు తాళవృత పరిమాణము (23 అ.ల 4 అం.ల పొడవు) లో నున్నను వాస్తవికతకు కొంచెమైనను భంగము రాకుండ చెక్కబడినవి. ఇట్టి స్వాభావికతయే దుస్తుల యొక్కయు, తలగడల యొక్కయు ముడుతలలోకూడ కానన గును. ఆతని ముఖము గాఢనిద్రలో నున్నట్లు నిశ్చలత్వమును, ప్రశాంతతను వెలిబుచ్చుచున్నది. శయ్యయొక్క కోళ్ల మీది శిల్పపు తీరులలో నిప్పటికి పదునాలుగు, పదునేను వందల సంవత్సరములు గడచినను ఎక్కువ మార్పులు రాలేదు. అట్టి మాదిరి చెక్కడపు కోళ్లుగల మంచములు నేటికిని భారతదేశపు నగరములందు కానవచ్చును. నీటి కూజా నుంచుట కేర్పరుపబడిన ముక్కాలి పీట కూడ ఒక మనోహర శిల్పముగల గృహోపకరణము. ఆ శయ్య ప్రక్కన సుమారు ఇరువది మంది భిక్షుకుల యొక్కయు, భిక్షుణుల యొక్కయు విగ్రహములు, తమ గురుదేవుని నిర్వాణమునకై పరితపించుచున్నట్టి భావమును స్పష్టముగా ముఖములమీద వ్యక్తము చేయు చున్నవి. శయ్యపైని గుహాకుడ్యముమీద ఎత్తుగా ఇంద్రాది దేవతలు, దేవదూతలు, గంధర్వులు, ఈ మహామహుని (బుద్ధుని) యొక్క స్వర్గ పునరాగమనమును ఆహ్వానించుటకై క్రిందికి దిగి వచ్చుచున్నట్లు చూపబడినది. శయ్య ప్రక్కనున్న ప్రతిమలందు (మొదట) చూపబడిన విషాదముతో పోల్చిచూచినచో తరువాత దృశ్యభాగములో సమ్మోదభావము గోచరించును. ఈ శిల్పము మొత్తముపై కలుగుభావము సామూహికతయందు కన్న కరుణరసాత్మకతయందు పరాకాష్ఠ నందుకొన్నది. ఈ దృశ్యమునందలి శోకచ్ఛాయయే నేత్రములను, మనస్సును అధికముగా ఆకర్షించును.

గుహాలయములలోని బ్రహ్మాండమగు బుద్ధ విగ్రహములు చైత్యముల సమున్నత ముఖభాగములు భావ గాంభీర్యమును, ఆదర్శమహత్త్వమును చాటుచున్నవి. సారనాథయందలి శిల్పములందుకూడ, అవి యెంత మనోరంజకముగను, రమణీయముగను ఉన్నను ఇట్టి విశేష స్ఫూర్తి కలుగదు. ఇట్టి పరిణామము అనివార్యమై తోచును. ఏలయన, ఇతర విగ్రహములు బుద్ధుని జీవితముతో సంబంధించినవైనను పరిమాణమునందును, ప్రాముఖ్యమునందును హ్రస్వీకృతములై యున్నవి. బుద్ధ భగవానుని విగ్రహమునకు ప్రత్యేక సమున్నత స్థానమొసంగబడజొచ్చెను. ప్రాచీన బౌద్ధులు బుద్ధుని యొక్క విగ్రహ కల్పనమును నిషేధించియుండగా, తరువాతివగు అజంతా శిల్పము అట్టి నియమములను విసర్జించి, ఆతని విగ్రహములను అసంఖ్యాకముగా అనేక ఆకృతులలో తొలుచుటయందు స్వేచ్ఛను వహించెను. బుద్ధ ప్రతిమలు విహారములందును, చైత్యములందును మాత్రమే గాక ద్వారమంటపముల మీదను, గోడ గూళ్లలోను, చూరుల మీదను అలంకరణ వస్తువుగా తొలువబడి యున్నవి.

బుద్ధవిగ్రహములు :- బుద్ధమూర్తుల శిల్పకళా ప్రాశస్త్యమును నిరూపించుటకు ఈ ఒక్క ఉదాహరణము చెప్ప వచ్చును. మొదటి గుహాలోని పూజామందిర మందలి బుద్ధవిగ్రహము ధర్మచక్ర ముద్రతో ధర్మోపదేశము చేయుచున్నట్టి వైఖరిలో అట్టి ప్రతిమలకు ఒరవడి శిల్పముగా నున్నది. ఆతడు సింహాసనముమీద పాదతలములు

కనబడునట్లు పద్మాసనాసీనుడై యుండెను. ఆత డొక పారదర్శకమగు దుస్తును ధరించి యుండెను. ఆ దుస్తు యొక్క క్రింది అంచు చీలమండలకు కొంచెము పైగా ఒక రేఖచే గుర్తింపబడెను. కేశ సముదాయమును సాంప్రదాయకమగు రీతిలో మెలివేయబడి నడినెత్తిన ఉష్ణీషమువలె ముడి అమర్చబడెను. శిరస్సునకు వెనుక వైపున ఒక చిత్రితమగు చక్రాకార ఫలకము కలదు. ఇది ప్రభాపరివేషమును సూచించును. ఇద్దరు మత్త గంధర్వులు స్వర్గధామమునుండి పుష్పోపహారములను తెచ్చుచున్నారు. సింహాసనమునకు వెనుక, బుద్ధున కిరు వైపుల గొప్ప కిరీటమును ధరించిన ఒక్కొక్క రాజ భృత్యుడు కలడు. సింహాసనమునకు ముందు మధ్యభాగ ములో ధర్మచక్రము చెక్కబడెను. ఆ చక్రమున కిరు వైపుల లేళ్ల బొమ్మలుకూడ కలవు. లేళ్ల వెనుకభాగ మందు కొందరుభక్తుల ప్రతిమలుకూడ కానవగును. ఆ భక్తులు పలురకములగు భంగిమలలో చూపబడిరి; కొందరు నేలమీద ఆసీనులై యుండిరి, కొందరు మోకాళ్ళమీద నిలుచుండిరి, మరికొందరు కాళ్ళను చేర్చి, ఒకటి భూమిని తాకునట్లును, మరొకటి పైకెత్తబడినట్లును కూర్చుండి యుండిరి. ఆ సింహాసనముపై తొలువబడిన విషయము సారనాథమందలి మృగదావములోని బుద్ధుని ధర్మోపదేశమును స్పష్టముగా వ్యక్తపరచుచున్నది. ఆ బుద్ధప్రతిమ మామూలు మానవ పరిమాణమునకు పూర్తిగా మూడు రెట్లు కలదు. సింహాసనాధిష్ఠితమైన యీ విగ్రహము 10 అడుగుల 8 అంగుళముల యెత్తున ఉన్నది.* ఆ మూర్తి ఒక సంప్రదాయకమగు రీతిలో మలుచబడినను దాని ముఖవైఖరి అంతర్గత ప్రశాంతతను, ఉదాత్తతను వెల్లడించుచు అత్యద్భుతమై యున్నది. ఆ మూర్తి యొక్క ఆధ్యాత్మిక ప్రభావము ఆ కాలమున అహర్నిశలు వెలుగుచుండు దీపముల సువర్ణకాంతిచే అనల్పాధిక్యము నొందింపబడినది. ఆ దీపముల కాంతిలో ఆ మహావ్యక్తి యొక్క పెదవులమీది ఆతని దయాళు స్వభావమును సూచించు చిరునగవుకూడ వ్యక్తమగు చుండును.

గుప్తయుగము నాటి సారనాథ క్షేత్రము నిస్సందేహ ముగా బౌద్ధ శిల్పము యొక్క అభివృద్ధికి అపారమగు దోహదమిచ్చినను, గుప్తయుగము అవశ్యముగా హిందూ మతము యొక్క పునరుద్ధరణకు, బౌద్ధమతము యొక్క క్షీణదశకును చెందిన కాలమని మరువకూడదు. ఇట్టి పున రుద్ధరణాత్మకమగు మతోద్రేకముచే స్పృశింపబడనట్టియు విదేశీయ కళా సంపర్కముచే మిశ్రితము కానట్టియు ఏకైక బౌద్ధ కేంద్రము క్రీ. శ. అయిదవ, ఆరవ శతాబ్ద ముల నాటి అజంతాయే అయియున్నది. కనుక అజంతా యందలి శిల్పము, వర్ణచిత్రలేఖనము వాటి మతవిషయక, ఆధ్యాత్మిక ప్రభావములం దొక విశిష్ట స్థానమును అలంక రించియున్నవి. అత్యున్నత కళాప్రమాణములతో పరిశీలిం చిన అజంతా శిల్పము ఆధ్యాత్మికకృషి యొక్క అత్యంత పరిపూర్ణ సాధనముగను, ఆధ్యాత్మిక భావములను, అభి లాషలను, ఉద్రేకములను, అనుభవములను ప్రకటించుట యందు ఆదర్శసాధనముగను తోడ్పడుచున్నది. ఆశిల్పము బహుశః తరువాత హిందూ ప్రతిమలందు సాధింప బడిన నిగూఢ ఆధ్యాత్మిక భావములందును, విశ్వాత్మకత యందును కొరవడియుండవచ్చును. కానిఇది అనివార్యము కావచ్చును. ఏలయన బౌద్ధులు భగవంతు డొకడు కలడని యంగీకరింపలేదు. అట్టి సర్వాంతర్యామియైన భగవం తుని అర్చారూపమైన విగ్రహ కల్పనమును గూడ వారు సమర్థింపలేదు. బౌద్ధమతము దాని సిద్ధాంతమునను సరించి అవశ్యముగా భౌతికవాద మతమైయున్నది; కాని అది నేడు మనము గాంచు తర్కప్రభేదము లందలి ప్రాపంచక భౌతికవాదము వంటిది కాదు. అది యొక ఉదాత్తమగు భౌతిక వాదము. అనంతుడును, సర్వశక్తిమంతుడును అయిన భగవంతుని అధికారమును గాని, ఆతని నిశ్వసిత ములై మార్పురానివైన ఆధ్యాత్మిక గ్రంథముల ప్రభావ మునుగాని బౌద్ధు లంగీకరింపరు. వీరి భౌతికవాదమునందు ఈశ్వరుని చేతను, వేదము చేతను నిబద్ధము కాని ఆధ్యా త్మిక సాధనకు స్వేచ్ఛ యొసంగబడినది. సాధారణముగా బుద్ధ ప్రతిమ యొక్క ఆధ్యాత్మికతయు, అలౌకిక మహ త్త్వమును నటరాజ విగ్రహమువంటి హైందవ ప్రతిమల

*ఆ ప్రతిమయొక్క వెడల్పు ఛాతి భుజములతోగూడ ముందు 6 అడుగుల 8 అంగుళములు మరియు మోకాలినుండి మోకాలి వరకు సింహాసనముమీద 8 అడుగుల 10 అంగుళములు.

ప్రభావముకంటె అత్యంత విలక్షణమై యున్నవి. కాని బౌద్ధ సన్యాసుల శతాబ్దుల ఆధ్యాత్మికానుభవమును, అట్టి అనుభవ ప్రకటనమునకై కల్పింపబడిన కళాత్మక చిహ్నములును, మానవోద్యమ పూర్ణ పరిధిలో మహోన్నత స్థానము నలంకరించుచున్నవనుటకు వెనుదీయనక్కరలేదు.

## 4. చిత్రలేఖనము

పదవగుహలో ఇప్పటికిని నిల్చియున్న కొన్ని చిత్రలేఖనములు క్రీ. పూ. 2 శతాబ్దికి చెందినవని నిస్సంశయముగా చెప్పవచ్చును. పడమటి భారతదేశము నందలి కొన్ని గుహలలోని చిత్రలేఖన చిహ్నములను, కాలము నిర్ణయించుటకు వీలులేక సాధారణముగా శిలాయుగమునకు సంబంధించినవిగా తలపబడుచున్న శిలాచిత్రలేఖనములను, రామఘర్ కొండలలోని జోగిమర గుహ యందలి అస్పష్టములును, సందేహాస్పదములునైన చిత్రలేఖన ఖండములను విడిచినచో నివియే ప్రాచీన చిత్రలేఖనమున నిప్పటికిని నిల్చియున్న నిదర్శనములని చెప్పవచ్చును. కాని క్రీ. పూ. 2 వ శతాబ్దికి చెందిన పదవ గుహయందలి చిత్రములలోని అతి పరిణతమైన కౌశలమును చూచినచో అవి ఆ స్థితిని చెందుటకు ఒకటో, రెండో, ఇంకను ఎక్కువో సహస్రాబ్దులు పట్టియుండునని వ్యక్తమగును. ప్రాచీన భారతదేశమున చిత్రలేఖన కళ మిక్కిలి పరిపక్వమైన స్థితిని చెందియుండెనని సారస్వత నిదర్శనముల వలన తెలియుచున్నది. క్రీస్తు పూర్వపు శతాబ్దులలో ఇతర లలితకళలు, ముఖ్యముగా శిల్పకళ, పొందిన అభ్యుదయము భారతదేశ చిత్రలేఖన కళాప్రాచీనతనుగూర్చిన ఈ అభిప్రాయమును బలపరచుచున్నది.

చిత్రలేఖనకళయొక్క దేశీయ స్వభావమునుగూర్చి కూడ ఎక్కువగా వాదోపవాదములు చేయనక్కరలేదు. అతి ప్రాచీనకాలమున చిత్రలేఖనములో అంత మహాభ్యుదయము సాధించిన ఏ విదేశమును భారతదేశముపై సాంస్కృతిక ప్రభావమును ముద్రించెనని నిరూపించుటకు వీలులేదు. ప్రాచీనకాల మందలి శిల్ప వాస్తు శాస్త్రము అను నిష్పాక్షికముగా పరిశీలించినచో నెవ్వరైనను దక్షిణాపథమునందలి గుహా దేవాలయముల పుట్టుక యందును పరిణామమందును దేశీయములే యను నిర్ణయమునకు వత్తురు. అప్పటి శిల్పము సమకాలమునందో అంతకుముందో ఉండిన దారు, ఇష్టక శిలానిర్మాణముల నుండి అనుకరింపబడినను ఆ మూలప్రకృతులుకూడ నిశ్చయముగా దక్కనుకు సంబంధించినవే. అవి లలితకళలు దక్కనులో స్వతంత్రముగా నుప్పతిల్లియుండుటయేకాక ఉత్తరహిందూస్థానము నందుకంటె ప్రాచీనతరములై ఉండెనని నిరూపించుచున్నవి.

క్రీ.పూ. రెండవ శతాబ్దిలోని చిత్రలేఖనము :- పదవ గుహలోను, సుమారు రెబదియో, పందయో సంవత్సరము లంతకంటె అర్వాచీనమైన తొమ్మిదవ గుహలోను గల ప్రాచీన చిత్రలేఖనములందు చిత్రితనులైన మానవ రూపములు ప్రత్యేకమైన రూపురేఖలు, వేషభూషణములు కల దేశీయప్రజలవేయై యున్నవి. చిత్రకారుడు వానిని చిత్రించునపుడు తన జాతికే చెందిన అప్పటి ప్రజలను దృష్టిపథమున నుంచుకొని యుండెననుట స్పష్టము. వారు అండాకార ముఖములును, పొట్టి ముక్కులును, దళమైన పెదవులును, సామాన్యమైన ఉన్నతియుగల దక్కనునందలి నేటి దేశీయప్రజలను పోలియుందురు. పురుషులు నడుము లందంతగా వెడల్పులేని వస్త్రములు ధరింతురు. స్త్రీ అధోభాగమున నట్టి వస్త్రాచ్ఛాదనమే కలిగియుందురు. కాని పైనొక చోళీయు, తలపై ఆధునిక భారతీయ పద్ధతి నొక వోణికూడ ధరింతురు. వారు దీర్ఘములైన తమ కేశములను సర్పముల పడగల ఆకారమున తమ యొందలలపై రిబ్బనులతో కట్టి యుంచుకొందురు. వారికి వివిధములైన భూషణములు కలవు. అందు చక్రాకారములైన పెద్ద కర్ణాలంకారములును పలుమాదిరులుగల లోహ నిర్మిత కంఠహారములును, ముఖ్యములైనవి.

వారు యోధజాతికి చెందిన ప్రజలనుట స్పష్టము. యోధులకు బల్లెములు, గదలు, ధనుర్బాణములు, ఖడ్గములు, కొడవలివంటి వంకరకత్తులు కలవు. వారు పొట్టి చేతుల చొక్కాలు ధరింతురు. వారిలో నొకని కగ్రమున తలపాగ రూపముగల యొక పెద్ద శిరస్త్రాణముకలదు. కర్ణ సంరక్షణమునకై దానినుండి ఇరువంకల రెక్కలవంటి వస్త్రఖండములు వ్రేలాడుచుండును. అట్లే ఆ శిరస్త్రాణమును తలపై సుస్థిరముగా నుంచుటకు కాబోలుగడ్డము క్రిందినుండి వచ్చునట్లుగా ఒక పట్టీకట్టబడి యున్నది.

సంగీత నాట్యము లీ ప్రజలకు సాంప్రదాయిక లక్షణములుగా ఉండెను. మతాలయములకు సంబంధించిన సాంప్రదాయిక సంస్థలలో పరిణతములైన వాద్య పరికరములును, సుశిక్షితములైన నర్తకుల మేళములును నెలకొని యుండెను. గాయక నర్తకులతో కూడిన ఈ మేళమున పదునైదుగు రుండురు. అందరు స్త్రీలే. అం దిద్దరికి పొడుగైన బాకాలు కలవు. మిగిలినవారు చేతులతో తాళము వేయుచునో, నాట్యము చేయుచునో కనిపించుచున్నారు. కాలమును సూచించుటకో సంగీతమునందు లయా పరాకాష్ఠను కలిగించుటకో కరతాళపద్ధతి ఇంకను అవలంబింపబడుచునే యున్నది. నర్తకులలో పవిత్ర వృక్షమునకు మిక్కిలి సమీపమున నున్న ఆమె శరీరమునకు సగ్గాకారమున మెలికలతో కూడిన చలనము కలిగించుటకో యన చేతులను పైకెత్తి వింతగా త్రిప్పియున్నది. మిగిలిన యిరువురు నర్తకుల విన్యాసములును, అడుగులును ప్రత్యేక భారతీయ సంప్రదాయమునకు చెందియున్నవి. ఆధునిక నాట్యములలో కూడ నట్టివానిని మనము చూడవచ్చును.

కొందరు గాయకులును, నర్తకులును అందమైన అల్లికతో కూడిన బల్లల(Stools)పై కూర్చుండియున్నారు. వారి వేషములును, భూషణములును ఈ దృశ్యమునందలి రాజాంతఃపుర వనితల వానికంటె భిన్నములుగా లేవు. ఈ వివరములను బట్టి దేవాలయములకు సంబంధించిన ఈ గాయనులును, నర్తకులును జీవితమున గౌరవార్హమైన స్థితిని పొందియుండిరే కాని, ఏ విధముగను నిరసింపబడుచుండలేదని తెలియుచున్నది.

నర్తకుల కేశాలంకరణ విధానములు రాజాంతఃపుర స్త్రీలవానివలెనే వివిధ విన్యాసములు కలిగి యున్నవి. అందు కొన్ని మిక్కిలి విస్తృతములై యుండగా కొన్ని తల ఎడమవైపున పాపటతీయు పద్ధతితో కూడి మిక్కిలి సరళములుగా నున్నవి.

అంతఃపురకాంతల వేష భూషణములు నర్తకుల వేష భూషణముల వలెనే యున్నవి. వారు ధరించు నగలలో కర్ణభూషణములును, కంఠహారములును, దండకడియములును, గాజులును కలవు. గాజు లా కాలమున దక్కనులో ప్రచారమం దుండినవానివలెనే శంఖద్రవ్యము (couch) తోడనో, దంతముతోడనో చేయబడినట్లు కనబడుచున్నవి. మాస్కి, పైఠను, కొండాపురము మున్నగుచోట్ల జరిగిన ఖననములలో నట్టివి కుప్పతెప్పలుగా కనిపించినవి. ముంజేయి అంతయు ఆచ్ఛాదిత మగునట్లుగా అట్టివి పెక్కు ధరింప బడుచుండెడివి. దక్కనునందలి లంబాడీల వంటి ఆదిమ జాతులవారిలో అట్టి ఆచార మిప్పటికిని నిల్చియున్నది. కొందరు స్త్రీలకు తలలను, వీపులను ఆచ్ఛాదించు పెద్ద రుమాళ్లో, అవకుంఠనములో కలవు. ఇవి ఈ గచ్చు చిత్రము (Fresco) నందే కాని తరువాతి అజంతా చిత్రలేఖనములలో కానవచ్చుటలేదు.

ఈ దృశ్య మెచ్చటిదో ఇంకను పూర్తిగా గుర్తింపబడలేదు. ఇది యొక రాజు తన పరివారముతో బోధివృక్షమును పూజించుటకై వచ్చు సన్నివేశమును సూచించుచున్నది. బహుశః ఆ చెట్టునకు సమీపముగా నిలబడి యున్న బాలుని విషయమైన మ్రొక్కు చెల్లించుటకై ఆత డరుదెంచి యుండును. ఆత డేదో ప్రార్థనను పఠించుచున్నాడు. అంతఃపురకాంత లందరును ఆ కర్మకలాపమున పాల్గొనుచున్నారు. ఒక కాంత శిరస్సు మూడు నెమిలి ఈకలచే నలంకరింపబడి యున్నది. రాజు కిరీటమేదియు ధరింపలేదు. కాని జుట్టుముడిచుట్టును పాము పడగ ఆకారమున అమర్చబడిన కొన్ని భూషణములను ధరించి యున్నాడు.

ఈ చిత్రముల చిత్రణము భావనయందును, నిర్వహణమందును కూడ సుపరిపక్వమైన శిల్పమును సూచించుచున్నది. ఈ శిల్ప మిట్టి స్థితిని పొందుటకు పెక్కు శతాబ్దులు పట్టియుండును. ఈ గచ్చు చిత్రమునందు చిత్రింపబడిన బొమ్మలకును కొండనే, బెడ్సా, కార్లేల యందలి చైత్యములలోని భవనాంగణము లందును, గోడలపైని, స్తంభములపైని చెక్కబడిన శిల్పములందలి బొమ్మలకును ఆలంకారిక వివరముల విషయమున సన్నిహితమైన సాదృశ్యము కనవచ్చుచున్నది.

ఈ చిత్రలేఖకుడు మానవజీవితమును మత ప్రాపంచిక రంగములు రెంటను నిరూపించుటకు యత్నించినాడు. ఈ గచ్చుచిత్రము నందలి బొమ్మల చిత్రణము సాత్త్విక భావములనే కాక ప్రపంచ సుందర సన్నివేశముల యెడ గల సానంద దృక్పథమునుగూడ వ్యక్తముచేయుచున్నది.



పైకప్పుమీది చిత్రము - అజంతా

ఈ చిత్రలేఖన మత్యుత్తమ వైజ్ఞానికలక్షణములను కలిగి యుండుటేకాక మార్దవ సౌందర్య చిహ్నితమైన వనితన మునుగూడ ప్రదర్శించుచున్నది. ఈ గచ్చు చిత్రమున పసుపుపచ్చమన్ను, జేగురు మన్ను, ఆకుపచ్చ మన్ను (Terra Verta), దీపపు మసి మున్నగునవి రంగుల కుప యోగింప బడినవి. అధరోష్ఠమునకును, కంటి కొలుకు లకును చిత్రకారు డెఱ్ఱమట్టినుండి (Red-ochre) తయారు చేయబడిన ఒకరకమైన కెంపు వన్నెను వాడియున్నాడు. వెలుతురు నీడలను సూచించుటకు ఒకటవ రెండవ గుహ లందలి తరువాతి గచ్చు బొమ్మలలో కనవచ్చు లేత ముదురురంగు లుపయోగింపబడియుండలేదు. దేహముల బాహ్యరేఖలు ముదురు కెంపులోకాని, నలుపులోకాని వ్రాయబడినవి. చిత్రణము స్థిరమును లలితమునై యున్నది. శరీరములు నిశ్చల మృతవిన్యాసములతోకాక జీవకళతో నుట్టిపడుచున్నట్లుగా చిత్రింపబడియున్నవి.

క్రీ. పూ. మొదటి శతాబ్ది యందలి చిత్రలేఖనము : తొమ్మిదవ గుహాయందెడమభాగమున గల స్తంభము లపై నున్న చిత్రములలో నొక్క చిత్రము మాత్రమే క్రీ. పూ. మొదటి శతాబ్దిలో చిత్రింపబడినట్లు తలపబడు చున్నది.

ఈ గచ్చుబొమ్మ భీమబలుడైన ఒక పౌరాణిక గోపా లుని కథను సూచించుచున్నది. అతడు కంఠములను, తోకలను పట్టుకొని క్రూరములైన వన్యమృగముల చల నములను గూడ అరికట్ట గలడు. ఆ గోపాలుడు మిక్కిలి సుందరాకారుడు. అతని విలాస ప్రవృత్తిలో మధురా బృందావన శాద్వలములందు గోవులను కాచిన గోపాల కృష్ణుని సాదృశ్యము కొంతవరకు కనవచ్చుచున్నది. ఈ సన్నివేశమే కుద (Kuda) నాసిక్ మున్నగు నితర స్థలములందుకూడ చెక్కబడి యుండుటచే ఆకాలపు బౌద్ధ చిత్రకారులయందు అది బహుళ ప్రచారము నంది యున్నట్లు కానబడుచున్నది.

ఈ గచ్చుబొమ్మ చైత్యనిర్మాణముతో సమకాలికమై యుండుననుట స్పష్టమె. క్రీ. పూ. మొదటి శతాబ్దిలో కూడ అజంతా చిత్రకారులు తమ కళా ప్రతిభ భావింప జాలిన ఏ విన్యాసముతోనైనను బొమ్మలను చిత్రింప గలిగి యుండుటయు, శారీరక చలనమును, సంఘర్షణమును సునాయాసముగా సూచింప గలిగియుండుటయు వింత కలిగించును.

వ్యవధానము :- క్రీ. పూ. మొదటి శతాబ్దినుండి క్రీ. శ. 3వ శతాబ్ది వరకు భారతదేశ చిత్రకళా చరిత్రలో కొంత వ్యవధానమున్నది. తొమ్మిదవ, పదవ గుహల లోని కొన్ని చిత్రములకు ఆధార రహితముగనే కొంత ప్రాచీనత నాపాదించుచు, కొందరు గ్రంథకర్త లీ వ్యవ ధానము లేదని చెప్పుటకు యత్నించినారు. శిల్ప వాస్తు కళా చరిత్రములందు సైతము అట్టి వ్యవధాన ముండుటను పరికించి చూచినచో, అజంతాలో సుమారు నాలుగు శతాబ్దుల కాలము సృజనశక్తి లోపించియుండెనని నిశ్చ యించుట యుచితముగా ఉండును. శాతవాహన సామ్రా జ్యము యొక్క కేంద్రము అమరావతికిని, ఆ సామ్రాజ్య మునకు సంబంధించిన ప్రాగ్భాగమునకును, మారుట యో క్షాత్రపులకును, ఆంధ్ర శాతవాహనులకును నిరంతర యుద్ధములు జరుగుచుండుటచే శాతవాహను లా భాగ మున శ్రద్ధవహింపకపోవుటయో, క్షాత్రపులు సైతము స్థిరపడి లలితకళాదులను పోషించుటకు తగిన అధికార మును సంపాదింపజాలకపోవుటయో దానికి కారణమై యుండును.

క్రీ. శ. మూడవ శతాబ్దిలోని చిత్రలేఖనము :- పదవ గుహలోని కుడిగోడ మీద చిత్రింపబడిన షడ్దంత జాతక ముతో ఒక శాసనము కూడ చిత్రితమై యున్నది. అది బహుశః మూడవ శతాబ్దిదని నిశ్చయింపబడిన ఆ చిత్ర ముతో సంబంధించినదేయై ఉండును. అందుచే ఈచిత్రము భారతీయ చిత్రలేఖన చరిత్రలో తరువాతి గొప్ప ఘట్ట ముగా కానబడుచున్నది. దాని నిచ్చట కొంత సవివర ముగా పరిశీలన చేయవచ్చును.

చిత్రకారుడు షడ్దంత జాతకములోని సర్వ సన్నివేశ ములను చిత్రించినాడు కాని వాని క్రమము కొంత మార్చినాడు. అతడు నక్రములతోను, అజగరములతోను (Pythons) గూడిన బురద నేలలు గల దుర్గమమైన అడవి లోని గజముల వన్యజీవితముతో ఆరంభించి, మానవ మూర్తులతో నిండిన ప్రాసాద దృశ్యములతోను, ఒక స్తూపము తోడను, విహారముల తోడను గూడిన పవిత్ర క్షేత్రమునకు పోవుచున్న రాజాంతఃపుర పరివారము

తోడను దానిని ముగించినాడు. మధ్యభాగమున అతడా గజరాజు పద్మసరస్సున స్నానమాడుటయు, ఒక పెద్ద మఱ్ఱిచెట్టు క్రింద గల దాని ప్రియమైన ఆశ్రయ స్థలమును చిత్రించియున్నాడు. ఈ విధముగా జంతుజీవితమునకును, ప్రకృతి సౌందర్యమునకును సంబంధించిన దృశ్యములు దుఃఖక్లేశ తమస్సు భక్తి విశ్వాసాలోకముచే ప్రకాశింప జేయబడు మానవ భావములను చిత్రించు దృశ్యముల నుండి వేరుగా ఉంచబడినవి.

అడవియందలి జంతు జీవితమునకు సంబంధించిన దృశ్యములలో ఒక ఏనుగునకును మొసలికిని జరిగిన పోరాటమును వర్ణించు దృశ్యమును చిత్రకారుడు మిక్కిలి నేర్పుతో చిత్రించియున్నాడు. అందే నుగు తన శత్రువును వెలికిలబడవైచి, దానిపొట్టపై తన ముంగాలొకటి పెట్టి, దానిని తుత్తునియలు చేయుటకై తొండముతో గట్టిగా నొక్కుచున్నట్లు చిత్రితమైయున్నది. దానికి సమీపముననే భీకరమైన మహానాగము ఏనుగు కాలి నొకదానిని పట్టుకొనగా అది దురంతరమైన వేదనపొందుచు తన తోడి ఏనుగుల సాయము నర్థించుటకై ఆర్తనాద మొనరించుటకో అన తొండమును పైకెత్తినట్లుగా చిత్రింపబడి యున్నది. గజయూథమొకటి పద్మసరోవరమున స్నానము చేయుచు తొండముల నెత్తి వివిధ స్వాభావికవిన్యాసములతో వానిని వంకరగా త్రిప్పుచు జలక్రీడోత్సాహమున ఉప్పొంగు దృశ్యమొకటి మిక్కిలి మనోజ్ఞముగా ఉన్నది.

రాణి గజదంతములను చూచి మూర్ఛాక్రాంతురాలైన ఆస్థానదృశ్యము నాటకీయ ప్రభావముతో కడు మనోహరముగా ఉన్నది. ఆ షడ్దంతనాగము పూర్వము ఒక అవతారములో ఆమెకు ప్రియదయితుడై యుండెను. తనపైకంటె అప్పుడింకొక భార్యపై అత హెచ్చుకువప్రీతి కలిగిఉండిన ట్లామె భావించుటచే కోపావేశమున దాని దంతములను కొనిరమ్మని ఆమె వేటకాండ్రను పంపి యుండెను. వర్తమాన జన్మమున ఆమెకు భర్తయైన కాశీరాజు ఆమెకు దగ్గరగా కూర్చుండి, తన చేతులలో నొకదాని నామె వీపువెనుక నుంచియు, రెండవదానితో నామె కుడిభుజమును పట్టుకొనియు ఆమెకు అవలంబ మొసంగుచున్నాడు. పరిచారిక ఒకతె రాణికి విసనకఱ్ఱతో విసరుచున్నది. తలపై పోయుటకో, ముఖముపై చల్లుటకో వేరొకతె జలము తెచ్చియున్నది. మూడవయామె రాణి కేదో పానీయ మొసగుచున్నది. దృశ్యమునకు కుడివైపున నున్న నాల్గవయామె భారతీయులకు సహజమైన విధమున విచారభావముల నడచుటకై తనచేతిని ముఖముపై పెట్టుకొనియున్నది. ఛత్రధారిణియైనపరిచారిక ఆస్థానమునంతను భయకంపిత మొనరించిన ఆ దంతములవంక చూచుచున్నది. భూతలాసీనయైయున్న వనిత యొకతె రాణిని తెప్పిరిల్ల జేయుటకై ఆమె అరకాళ్ళను రాయుచున్నది. దృశ్యమునంతను ఆవరించియున్న సామాన్య కరుణ వాతావరణముమాట అటుండ, వ్యక్తుల వర్గీకరణమును, మనోహరములైన విన్యాసములును స్త్రీల భూషణ కేశాలంకరణ విధానములును, అల్పమయ్యు కళా సంపన్నమైన వివిధ వ్యక్తుల వస్త్రధారణ ప్రకారమును, చిత్రకారుని సజీవమైన భావనాశక్తిని, సరసమైన అభిరుచిని మాత్రమేకాక సుపరిపక్వమైన అతని సాంకేతిక కళాకౌశలమును తనఊహా ననుసరించి ఏ వస్తువునైనను ఏరీతిగనైనను యథేచ్ఛముగా చిత్రింపగల అతని సామర్థ్యమును ప్రదర్శించుచున్నది.

క్రీస్తుపూర్వ యుగమునందలి చిత్రలేఖనములవలె ఈ చిత్రమున చిత్రింపబడిన వ్యక్తు లందరునుకూడ అనార్యులుగనే కానవచ్చుచున్నారు. చిత్రణమునందలి సాంకేతిక విధానమును, వస్తుసామగ్రియు కేవల దేశీయములైయున్నవి. అందు పరదేశములకు సంబంధించినదేకాక మిక్కిలి సమీపమునందున్న ఉత్తర హిందూస్థానమునకు సంబంధించినదియు ప్రభావ మిసుమంతయు గోచరించుట లేదు. కాని దృశ్య సౌందర్యమును కల్పించుటలో చిత్రకారుడుచూపిన ఉత్సాహమును, అతడుమృగ జీవితమును గూర్చి కావించిన సునిశిత పరిశీలనమును, మత ముద్రతో కూడిన కరుణరస భావములను చిత్రించుటలో ప్రదర్శించిన నైపుణ్యమును, సూక్ష్మ వివరములతోకూడిన అలంకరణ విధానమందలిప్రీతియు, ఎడమకుడిగోడలపై చిత్రములను చిత్రించుటలో కలిగిన నాలుగు శతాబ్దుల వ్యవధానమున చిత్రలేఖన కళ వైజ్ఞానికముగను, సాంకేతికముగను కూడ మిక్కిలి అభివృద్ధిని పొందెనని సూచించుచున్నవి.

క్రీ. శ. నాలుగవ శతాబ్దిలోని చిత్రలేఖనము :- పైని వర్ణింపబడిన షడ్దంత జాతకమునకు ఎడమవైపునగల

శ్యామజాతకమును, పదవ గుహాలో గోడలమీదను, స్తంభములపైనను గల ఇతర చిత్రములును వసారా స్తంభములమీది బుద్ధుని చిత్రములును శాసన లిపి నిదర్శనమునుబట్టికాని, సాంకేతిక పరిణామమునుబట్టికాని క్రీ. శ. నాలుగవ శతాబ్దికి చెందినవిగా తలంపవచ్చును.

ఈ కథ శ్రావణకుమార దశరథ శాప వృత్తాంతములకు బౌద్ధులు కల్పించిన రూపాంతరము. గచ్చుబొమ్మలో సూచింపబడిన ముఖ్య సన్నివేశములు పెక్కు వివరములలో జాతకమున చెప్పబడినవానితో సరిపోవుచున్నవి. సమగ్ర వేషధారులయిన పరిచారకు లైదుగురును, అల్ప వేషధారులయిన పరిచారకు లైదుగురును (వీరు బహుశః వాద్యములు వాయించువారును, వేటకాండ్రును కావచ్చును) శస్త్రాస్త్ర సన్నద్ధులై రాజు ననుసరించి యున్నారు. రాజు (అస్పష్ట చిత్రితమైన) గుఱ్ఱమునుండి దిగి తాను జంతువని శంకించిన యొక అదృశ్యవస్తువుపై ధ్వనినిబట్టి, లక్ష్యముంచి, విల్లెక్కు పెట్టుచున్నాడు. ఆ వస్తు వాత డనుకొనినట్లుకాక పొదల వెనుకనున్న నదీ ప్రవాహములో కమండలువును ముంచుచున్న బ్రాహ్మణ కుమారుడగుట సంభవించినది. వనదేవత యెవ్వరో రాజును మందలింప యత్నించెను కాని లాభము లేక పోయెను. రాజు పశ్చాత్తప్తుడై శ్యాముని అంధ పితరులను సేవింప ప్రతినపట్టును. వనదేవతా ప్రభావముచే శ్యాముడు రక్షింపబడును; అతని అంధ పితరులకు దృష్టి సంపద కలుగును; రాజు శ్యామునినుండి "ధమ్మ"బోధ గ్రహించును.

జాతక కథలో కథన సౌందర్యముతోపాటు కొన్ని దృశ్యకావ్య లక్షణములుకూడ ఉన్నవి. చిత్రకారుడు వానిని గచ్చుబొమ్మలో అత్యద్భుతముగా అనుకరించినాడు. శ్యాము డమరుడా నాగుడా అని రా జెరుంగ కోరుట, శ్యాముని మన స్థైర్యము, అతని తల్లి దండ్రుల దీనాక్రందనములు, వేగముతో కూడిన వేడి చలనములు, అన్నిటికన్న మిన్నగా జంతువులను మానవులతో కలుపు అనురాగ బంధములు మున్నగున విందుకు నిదర్శనములు. జలకమండలువును మోయుచున్న శ్యాముని చిత్రమున గ్రీకు శిల్పులు వేల్పుల విగ్రహములలో చూపిన లాలిత్యము కానవచ్చుచున్నది. అట్లే శ్యాముని తండ్రి తల నవవిజ్ఞాన యుగమునందలి (**Renaissance**) ఇటలీ దేశపు చిత్రములలో ముఖ్యముగా ఏసుక్రీస్తు చిత్రములలో కన వచ్చు కరుణమును సూచించును. లేడి చిత్రములు జంతు పరిశీలనమునకు చక్కని నిదర్శనములు.

**క్రీ. శ. 5 వ శతాబ్ది యందలి చిత్రలేఖనములు :** క్రీ. శ. 5 వ శతాబ్దిలో ఇతర కళాపములందువలెనే అజంతా యందలి చిత్రలేఖన కళలోకూడ అమితమైన ఉత్సాహము గోచరించుచున్నది. వానిలో పెక్కు 1, 2, 16, 17 వ గుహలలో ఇప్పటికిని నిల్చియున్నవి. ఈ గుహలందు చిత్రితములును, శిలాఖచితములును, అగు శాసనముల వలన ఇవన్నియు క్రీ. శ. 5వ శతాబ్దికి చెందినవని నిరూపింపవచ్చును. కళా సంకేతములనుబట్టి చూచినచో 1, 16 గుహలు సమకాలికములవలె తోచును. 17 వ గుహ వాని తరువాతను, రెండవగుహ అన్నిటికంటె చివరను వచ్చును. గుహల పౌర్వాపర్యమును నిర్ణయించు నప్పు డీ విషయ మిదివఱకే చెప్పబడినది. మొదటి గుహలో బుద్ధుని మహాభినిష్క్రమణ వృత్తాంతమునకును, 16 గుహలో అతని జనన బాల్యములకు సంబంధించిన కథలకును, సన్యాస జీవితమునకు సంబంధించిన ఇతర గాథలకును ప్రాధాన్య మొసంగబడినది. 17 వ గుహ యందు బుద్ధుడు తొల్లింటి అవతారములలో - ఉదారుడైన రాకుమారుడుగనో, గజము, వానరము, లేడి, బాతు, మత్స్యము, నాగము మున్నగు ఉత్తమమైన జంతువులుగనో వివిధ రూపములలో ఉద్భవించిన కథలు చిత్రింపబడినవి. రెండవ గుహలో బుద్ధుడు సిద్ధార్థుడుగా నున్నప్పటి కథలును, పూర్వజన్మలలో మతిమంతుడైన బ్రాహ్మణుడు, విధుర పండితుడు, శాంతివాది, సన్యాసి మున్నగు రూపములను పొందిన కథలును వర్ణింపబడినవి.

అలంకారిక రచనారీతులు :- వర్ణచిత్రములందలి వస్తువు ముత్త్రివిధములుగా నుండును - అలంకరణ విధానము, రూపకల్పనము, కథనము. అలంకార రచనా రీతులలో పత్రావళులు (**Scrolls**) జంతువులయు, వృక్ష లతాపుష్పములయు బొమ్మలు ఇమిడి యున్నవి. ఇచ్చటి వైవిధ్య మనంతముగా ఉన్నదనియు, సూక్ష్మాతిసూక్ష్మ వివరములు కూడ ప్రదర్శింపబడి ఉన్నవనియు, ఎచ్చటను

పునరుక్తి గోచరింపదనియు గ్రిఫ్ఫిత్సు చెప్పుచున్నాడు. సుపర్ణులు (పక్షిశరీరము మానవ పూర్వకాయముతో కూడి యుండును.) గరుడులు, యక్షులు, గంధర్వులు, అప్సరసలు మున్నగు కల్పిత కథా పాత్రలయు, పౌరాణిక వ్యక్తులయు బొమ్మలు స్థలమును నింపుటకై ఉపయోగింపబడి ఉన్నవి. అవి బాణకవి కాదంబరిలో వర్ణించిన ఉజ్జయిని యందలి చిత్రిత మందిరములను స్మరణకు తెచ్చుచున్నవి.

**అజంతా చిత్రములందలి ప్రకృతి :-** చిత్రకారునికి గల ప్రకృతి ప్రీతియు, వివిధ ప్రకృతి దృశ్యములను సౌందర్య వైభవములతో వర్ణించుటయం దాతడు చూపు నేర్పును ఇక్కడ వేరుగా నొక్కి వాక్రువ్వనక్కరలేదు. 17 వ గుహలో చిత్రింపబడిన పెక్కు జాతకకథలలో ఉత్తమ శ్రేణికి చెందిన కథనాత్మక చిత్రములకు అసంఖ్యాకములైన నిదర్శనములు ఉన్నవి. ఇతర గుహలలో కూడ ఇట్టివి కొన్ని కలవు. ఈ గుహలో చిత్రింపబడిన ఛద్దన్త, మహాకపి, హస్తి, హంస, శరభంగ, మత్స్య, మహిష, రురు, శిబి, నిగ్రోధ, మిగ జాతకములను గూర్చి సంగ్రహముగ సూచించుటకు కూడ ఇచ్చట తావు చాలదు. వెస్సంతర, సుతసోమ, మాతుపోషక జాతకములనుగూర్చి సంగ్రహముగా చెప్పవలసియున్నది. వెస్సంతర జాతకము గోడతో కలిసిపోయినట్లు కట్టబడిన రెండు స్తంభముల నడుమ గల ఎడమప్రక్క గోడనంతను ఆవరించియున్నది. అది ఎడమప్రక్కనుండి ఆరంభించును. అచ్చట వెస్సంతర రాజకుమారుడు తన నిష్కాసన వృత్తాంతమును భార్యయైన మద్దీ(Maddi)కెరిగించును. అతని యందలి లోపము అతిమాత్రమైన ఔదార్యగుణము. వర్షమును కలిగింపజాలు శక్తిగల ఒక దివ్యదంతావళము నాతడు దానము చేసివైచినప్పుడు, ప్రజలు గగ్గోలుచేసి రాజైన అతని తండ్రిని అతనిని దేశ బహిష్కృతునిచేయుమని బలవంత పెట్టిరి. అతడు తన తల్లిదండ్రులకు వీడ్కోలు చెప్పుట, నాలుగు గుఱ్ఱములను పూన్చిన రథముపై అతడు తన కుటుంబముతో కూడ విపణివీథిని పోవుట, ఆశ్రమమున అతని జీవితము, వన్య మృగములచే ఆశ్రమమునకు రాకుండ ఆపివేయబడిన మద్దీ పరోక్షమున అతడు తన బిడ్డలను జూజకున కిచ్చుట, బంధవిమోచన ధనముగా వారి తాత ఆ బిడ్డలను తిరిగి యిచ్చుట, మద్దీయు, వెస్సంతరుడును తిరిగి రాజధాని కరుదెంచుట మొదలగు సన్నివేశము లీ మనోహరమైన కథలో అతి సుందరముగా చిత్రింపబడినవి.

వివిధ దృశ్యముల క్రమము కొంత క్లిష్టముగా ఉన్నమాట నిజమేయైనను ముందరి గది కెడమవైపున గల వెనుక గోడపై నున్న చిత్రములో సుతసోమ జాతకము కూడ మిక్కిలి చక్కగా చిత్రింపబడినది. సుదాసు డశ్వారూఢుడై తన పరివారముతో కూడ మృగయార్థమై పురద్వారమునుండి బయల్వెడలుటతో ఈ కథ ఆరంభించుచున్నది. ఆ పరివారములో కొన్ని వేటకుక్కలు కూడ ఉన్నవి. అవి ఒక లేడిని తరుముచున్నట్లు కనబడుచున్నవి. తరువాతి దృశ్యములో వన్యమృగసంకులమైన అడవియందొంటరిగా అశ్వారూఢుడైయున్న రాజు చిత్రింపబడి ఉన్నాడు. ఇంకను కొంతపైని ఈ రాజు నిద్రించుచుండగా ఒక సింహి అతని పాదములను నాకుచున్నట్లున్నది. తరువాత అత డొకరాతిపై కూర్చుండియుండును. సింహి ఆతనిముం దుండును. సింహి గర్భిణియై ఒక మానవ శిశువును- రాజునకు ప్రియకుమారుడు- కనుట మొదలగు సన్నివేశములు తొలగింపబడినవి. తరువాత చూపరులు ఆశ్చర్యచకితులై చూచుచుండ ఆ సింహి బజారువీథిని ప్రాసాద ద్వారము వంక కరుగుచున్న సుందరమైన దృశ్యము కానబడును. కుడిప్రక్క ఆ సింహి రాజసన్నిధికి ప్రవేశపెట్టబడిన దృశ్యమున్నది. రాజు కుమారుని గ్రహించి తన తొడపై కూర్చుండబెట్టుకొనును. దీనిక్రింద సుదాస రాజకుమారుని విద్యాభ్యాసము చిత్రింపబడినది. కుడిప్రక్క అత డొక బల్లపై వ్రాయుచున్నాడు. ఎడమప్రక్క అతడు బాణములువేయుట అభ్యసించుచున్నాడు. దాని కెడమవైపున సుదాసుని పట్టాభిషేకము చూపబడినది, అతని తల్లి సింహి అగుటచే అతడు నరమాంస భక్షకుడగును. తరువాత నున్న మూడు దృశ్యములలో తొలుత వేయబడిన మనుష్యుని దేహమునుండి మాంసము కోయుట, అట్లు తెచ్చిన మాంసమును వండుట, దానిని రాజునకు వడ్డించుట మున్నగువానిచే అది సూచింపబడినది. తరువాత సుదాసుడు వేట కరుగుచున్నట్లు చిత్రింపబడిన చట్రమునకు వెనువెంటనే పైని అంతఃపుర

హూదకుని వారినుండి ఒకడు తప్పించుకొని పారిపోవు మండుట వర్ణింపబడినది. దీనికి పైని వినాశకరమైన ఈ ఆఖ్యానమును వర్జింపుమని ప్రజలు సుదాసుని వేడుకొనుచున్నట్లు కనవచ్చుచున్నది. జాణక్షేపమును సూచించు దృశ్యమునకు క్రింద సుదాసుడు తనపై దండెత్తివచ్చిన సేనలతో స్థిరముగా నిల్చి పోరాడుట వర్ణింపబడినది. ఈ చిత్రరచన కెడమవైపున నిష్కాసనానంతర మడవిలో జరిగిన వృత్తాంతములను సూచించుచున్న చిత్రములన్నియు శిథిలములై పోయినవి. సర్వావయవ హోమమునకై సుదాసుడు పట్టుకొన్న ఏకశత రాజకుమారులలో ఒకను, కడకు ఆతని పరివర్తనమునకు కారణభూతుడైన వాడును అగు బోధిసత్వసుత సోముడు పద్మాకరమున తాను పట్టుకొనబడిన సమయమున సుదాసుని భుజముపై నున్నట్లు కానిపించును.

చిత్రరూపమున చెప్పబడిన సుందరములైన కథలలో మాతృపోషకజాతక మొకటి. అది మాతృదేవోభవ అను వేద సూక్తికి నిదర్శనమైనట్టిది. బోధిసత్వు డొకప్పు డేనుగుగా జన్మించి ఒక వనేచరునిచే వంచింపబడెను. అడవిలో దారి తప్పియున్న సమయమున ఇంటికిపోవు త్రోవచూపి అది వనేచరుని కంతకుముందు ఉపకార మొనరించియుండెను. ఆ గజము పట్టుకొనబడి రాజ గజశాలకు కొనిరాబడెను. తనకు మిక్కిలి ప్రేమపాత్రురాలయిన చీకుముసలితల్లి దీనావస్థను తలంచుకొని అది అచ్చట ఎట్టి ఆహారమును గ్రహింప నొల్లకుండెను. రాజు జాలిపడి దానిని విడిచివైచెను. అన్ని దృశ్యములును చక్కగా అమర్పబడినవి. రాజ పరిచారక పరివృతమై అది తన ప్రియజననీజనకుల కలసికొనుటకై ఉత్సాహమున ఇంటికి పరెగెత్తుటను, పితాపుత్ర సుఖసమాగమమును సూచించు చివర దృశ్యములు మిక్కిలి సుందరముగా చిత్రింపబడినవి.

కుడిగోడమీద చిత్రింపబడిన సింహళావదానమును గూడ ఇట పేర్కొనవలసియున్నది. ఇందలి కథ దివ్యావదానము నుండి గ్రహింపబడి వలాహస్సజాతకములోని కొన్ని వివరములచే పుష్టినొందినది.

చిత్రముయొక్క కుడిచివర అడుగున సింహళుని సముద్రప్రయాణమున జరిగిన నౌకాభంగముతో కథ ఆరంభించుచున్నది. అతడును తదనుచరులైన 500 మంది వర్తకులును రాక్షసాంగనలతోకూడిన ఒక ద్వీపమునకు త్రోయబడిరి. అచ్చటి రాక్షస స్త్రీలు సుందరాకారమును వహించి సగౌరవముగా వారికి ఆతిథ్యమొసంగిరి. సింహళుడు మాత్రము వారిచే వంచితుడుకాలేదు. అతడు గుఱ్ఱముగా జన్మించిన బోధిసత్వుని ఆతిథ్యము గ్రహించెను. ఆ గుఱ్ఱము ఆతనిని కొందరనుచరులను తిరిగి వెనుకకు కొనిపోయెను. ఈ చిత్రము రాక్షసాంగనల వినోదోత్సాహములను సూచించు దృశ్యమున కింశుక పైని రమణీయముగా చిత్రింపబడినది. కొంతసేపైన తరువాత ఆ రాక్షస స్త్రీలు చిత్రములో కనబడునట్లుగా తమ యథార్థ రూపములు గ్రహించి మూర్ఖులై అచ్చట ఉండిపోయిన సింహళుని అనుచరులను కబళించిరి. తన్ను తప్పించినందుకు సింహళుడా గుఱ్ఱమునకు కృతజ్ఞతావందనములర్పించును. ఆతడొక ద్వారముకడ ఆగుఱ్ఱము ముందు కృతజ్ఞతతో మోకరిల్లియున్నట్లు చిత్రింపబడియున్నది. కాని వెంటనే ఒక రాక్షసి సుందరవనితాకారమున ఒక బిడ్డ నెత్తుకొనివచ్చి ఇతడే నా నిజమైన భర్తఅని పల్కును. ఆస్థానదృశ్యమున గల మంత్రి విజ్ఞరూప మాతడు ప్రయత్నించియు రాజు నా సాహస కృత్యమునుండి మాన్పలేకపోయెనని సూచించుచున్నది. దాని ఫలితము ఎడమచివర చూపబడినది. ఆ రాక్షసి రాజును చంపి తినివేయును. ఆమె అనుచారిణులు అంతఃపురమున నున్నవారి నందరిని సంహరింతురు. సంవృతమైన ప్రాసాదద్వారముపై రాబందులెగురుట చూచి ప్రజలు భీతులైరి. కాని సింహళు డొక నిచ్చెనసాయమున ప్రాసాదకుడ్యము నెక్కి లోని రాక్షసాంగనల నందరిని బయటికి తరిమెను. సింహళుని సేనలు సముద్రమును దాటుట, గజములు చదునైన అధోభాగముగల పడవలపై ఎక్కుట, మున్నగు తుది దృశ్యములు మిక్కిలి సహజముగా చిత్రింపబడినవి. సముద్రతీరమున సింహళుని సేనలకును శస్త్రాస్త్రసన్నద్ధులైన రాక్షసస్త్రీలకును జరిగిన యుద్ధమును విజేతయైన సింహళుని పట్టాభిషేకమును మిక్కిలి ఉత్తమతరగతికి చెందిన దృశ్యములు.

16వ గుహ యందలి చిత్రములు చిత్రించిన చిత్రకారుడు సంస్కృతమున అశ్వఘోషునిచే రచింపబడిన

మిక్కిలి రమణీయమైన కావ్యమునందలి నందుని కథను వస్తువుగా గ్రహించినట్లు తోచుచున్నది. కాని ఒకటి రెండు దృశ్యములు తప్ప మిగిలిన చిత్రమంతయు పూర్తిగా పాడైపోయినది. నందుని శిరోముండనము, బలవత్సన్న్యాస స్వీకారముచే అతడు పొందిన విచారము, వాయుమండల ప్రయాణము కల దృశ్యములను మాత్రము కొంచెము గుర్తు పట్టవచ్చును. "మరణించుచున్న రాకుమారి" అని పేరుపొందిన తుది దృశ్యము మిక్కిలి ప్రసిద్ధమైనది. నందుని ప్రియురాలైన సుందరి ఆతనికై విరహవేదన పొందుచు, పరిచారకు డొకడు పైకెత్తి పట్టుకొన్న ఆతని కిరీటమువంక ఆత్రముతో చూచుచుండుట అందు వర్ణితమైనది.

కృతహస్తులైన చిత్రకారులచే అత్యంత నిపుణముగా చిత్రింపబడిన మరి రెండు ముఖ్య జాతకకథ లున్నవి. అందొకటి మొదటి గుహాలోని మహాజనక జాతకము, రెండవది రెండవ గుహాయందలి విధుర పండిత జాతకము. "ధమ్మ" వైభవమును ప్రత్యక్షముగా ప్రదర్శించు మొదటి జాతకమునందలి కథలందు ముఖ్యములును, నాటకోచితములు నైన అంశములందే దృష్టి కేంద్రీకృత మగునట్లుగా ఎన్నుకొని అమర్పబడియున్నవి. ఇరువురు సోదరుల నడుమ యుద్ధము జరుగుట, అందొకడు రెండవవానిని చంపుట, గర్భవతియైన రాణి మరొక రాజ్యమునకు పారిపోవుట మున్నగు నీరస విషయములతో కూడిన కథయందలి తొలి సన్నివేశములు విడిచి వేయబడినవి. నిజమునకు అసలైన కథ తరువాత ఆరంభించును. గర్భిణియైన రాణికి ఉదయించిన కుమారుడు మహాజనకు డను పేరుతో పెరిగి, యువకుడై పణ్య వస్తుసముదాయముతో సముద్రముపై సువర్ణ భూమికి పయనించును. రూపకోచితమైన నౌకాభంగ దృశ్యమును, తిమినక్ర సంకులమైన సముద్రమున మునిగి పోవుచున్న మనుష్యుని ముఖమునందలి దారుణమైన భయాధిక్యమును, మిక్కిలి సహజముగా చిత్రింపబడినవి. అత డొక దేవతచే రక్షింపబడి మిథిలానగరము చేరుకొనును. తరువాత కొన్ని దృశ్యములు మరల విడిచివేయబడినవి. కారణ మేమన ఇవి అంతకుముందే మరణించిన రాజ్యాపహర్త కుమార్తెను మహాజనకుడు వివాహము చేసికొన్న విషయమునకు సంబంధించినవి. వైరాగ్య ప్రధానమైన ఈ కథా నిర్మాణములో ఇట్టిదాని కంతగా ప్రాధాన్యము కనుపింపదు. లౌకిక భోగసుఖములయెడ వైముఖ్యము వహించిన మహాజనకుని నిర్విణ్ణప్రకృతియు, గీత నృత్యాదులచే రాణి అతని మనస్సు నాకర్షింప యత్నించుటయు మిక్కిలి విస్తృతముగా వర్ణింపబడినవి. పరిచారిక పాద సంవాహన మొనరించుచుండగా రాణి రాజున కానుకొని శిబిరమున కూర్చున్న దృశ్య మొకటి కలదు. కుడిప్రక్క గానముతో కూడిన దృశ్యము సాగుచున్నది. నర్తకి చిత్రము మిక్కిలి కోమలమును, మనోజ్ఞమునై యున్నది. శిబిరమునకు క్రిందుగా స్త్రీ యొకతె గుడిసెలో లేప నౌషధమును తయారుచేయుచున్నది. రాజు ముఖరేఖలనుబట్టి అత డీ వినోదమునం దేమియు ఉత్సాహము చూపుటలేదని తెలియుచున్నది. తరువాత శిలా గుహాలోనున్న ఒక సన్యాసిచేయు మత బోధలు వినుటకై రాజు గజారూఢుడై పురద్వారము వెలువడి వచ్చుచున్నట్లును, గుహ ముందు కూడియున్న జనసమూహము నడుమ అతడు ముకుళిత హస్తుడై నిలబడినట్లును చిత్రింపబడినది. పిమ్మట ప్రాసాదమున మహాజనకుడు తాను ప్రపంచమును పరిత్యజింప నిశ్చయముచేసికొన్నట్లు రాణి కెరిగించుట సూచితమైనది. అనంతరము రాజు గుఱ్ఱము నెక్కి రాజధాని విడిచి వెళ్ళును. దీనిక్రింద భర్త ననుసరించి ఏగుచున్న రాణి 'సివలి' దీనమైన చిత్రము కనిపించును. దురదృష్ట వశమున ఇచ్చటి చిత్రమంతయు పూర్తిగా శిథిలమయిపోయినది. దేవాలయమువంటి ఒక కట్టడముదగ్గర ఉన్న బొమ్మల ఊర్ధ్వభాగములు మాత్రమే దృశ్యము లగుచున్నవి. ఆ జనసమూహమున రాజు చిత్రము మిక్కిలి ప్రాధాన్యము వహించియున్నది.

విధుర పండిత జాతకమును సూచించు చిత్రము-పైదానికంటె మేలుగా రక్షితమైనది. అది రెండవ గుహలోని కుడి కుడ్యమునందు చాల భాగమును ఆవరించి యున్నది. దానిక్రింద ఉన్న స్వల్ప వైశాల్యముగల స్థలములో దివ్యావదానమునుండి గ్రహింపబడిన పూర్ణావదాన మను మరొక కథ చిత్రింపబడినది.

విధుర పండితుడు ఇంద్రప్రస్థ రాజునకు మంత్రిగా ఉదయించిన బోధిసత్త్వుడు. అతడు సుప్రసిద్ధు డగుటచే

విమల అను నాగరాణి అతని బోధలు వినుట కువ్విళ్ళూరు చుండెను. కాని అతనిని తన రాజ్యమునకు రప్పించుట కెట్టి అవకాశమును లేకపోయెను. ఇరందాతి అను ఆమె ముద్దుకూతురు తన ప్రియుడైన పున్నకుడను యక్షదండ నాథునిపై ఆకార్యభారము మోపెను. అతడు ద్యూత క్రీడయందు ఇంద్రప్రస్థ రాజును జయించి విధుర పండితు నోడుచుకొనెను. ఇరందాతి తూగుటుయ్యాలలో ఊగు చుండుట, పున్నకుడు ఇరందాతిని కలిసికొనుట, నాగ రాజు తన కూతును పున్నకుడు వివాహ మాడదలచిన విషయమునుగూర్చి తన చుట్టములతో ఆలోచించుట, ఇంద్రప్రస్థరాజు కొలువుకూటము, అక్షక్రీడ, పున్నకునితో కూడ విధుర పండితుడు పయనించుట, నాగరాజు ప్రాసా దమున ఆతడు మతబోధ కావించుట, సంతోషకరమైన వివాహము. మున్నగు దృశ్యము లన్నియు కథ విచ్ఛి న్నము కాకుండ మిక్కిలి మెలకువతో చిత్రింపబడినవి.

మొదటిగుహ యందలి శంఖపాల శిబి జాతకములు, రెండవగుహ యందలి హంసజాతకము, 16 వ గుహ యందలి హస్తి, వుమ్మగ్గజాతకములు మున్నగు పెక్కితర జాతకములు ఆనాటి నిరుపమానమైన చిత్రరూప కథన కళకు నిదర్శనములుగా నున్నవి. శిథిలప్రాయములై పోయినను బుద్ధుని జీవితమునుండి గ్రహింపబడిన పెక్కు చిత్రములు రూపకోచితరామణీయకములో అప్రతిమాన ములై ఒప్పారు చున్నవి.

డా. వు. శ్రీ

**అడవులు** :—1. ఉపోద్ఘాతము :- సాంకేతికముగా 'అడవి' అనగా అతి సూక్ష్మమగు ఉద్భిజ్జము మొదలుకొని అత్యున్నతమగు వృక్షములవరకు వివిధ పరిమాణ భేద ములతో కూడికొనియున్న జీవ ప్రపంచపు సంఘము అని వర్ణింపబడుచున్నది. కాని దానికిగల సామాన్యభావమునకే ఈ దిగువ వ్యాసమునందు ప్రాధాన్య మీయబడుచున్నది.

"అడవి" "అరణ్యము" అనబడుచున్న వృక్షసంఘముల పెరుగుదల పరిణామములు ఒక ప్రదేశముయొక్క శీతోష్ణములమీదను, భూగర్భ సంబంధమగునవియు, నేల యొక్కయు స్థితిగతులమీదను ఆధారపడి యుండును. ఉష్ణోగ్రత, వర్షపాతము, నేలలు - వీనిలోని భేదముల ద్వారా స్థితిగతులలో కలుగు మార్పుల ఫలితముగ. ఉద్భిజ్జ జాతిలో మార్పు లేర్పడును. పై కారణములు మార్పు లేక ఒక స్థితియం దున్నపుడు ఆ ఉద్భిజ్జ జాతిలో సామ రస్య మేర్పడును. బాహ్యాకారణములు, ముఖ్యముగా మానవుడు జోక్యము కలుగజేసికొన్నచో దానికి భంగము కలుగును.

నేటి ఉద్భిజ్జ జాతి అతి ప్రాచీన యుగములలో (Geological ages) నున్న ఉద్భిజ్జముల సంతానమే యని శిలారూప జీవపరిశీలన వలన తెలిసినది. ఊర్ధ్వ మత్స్య యుగపు శిలారూప జీవముల (Upper Domain Fossils) వలన అప్పటి ఉద్భిజ్జ జాతికిని నేటి ఉద్భిజ్జ జాతికిని చాల వ్యత్యాసమున్నట్లు తెలియుచున్నది. తక్కినవానితోపాటు దేవదారు (Coniferous) జాతి మొక్కలలో మొదటి రకములు అంగారయుగము (Carboniferous period)లో చక్కగా పెరిగినవి. గట్టి దారువుగల మొక్కలు ఖటీ యుగము (Cretaceous period) లో నున్నవి. కాని, నేటి జాతులను బోలిన మొక్కలు తృతీయ యుగము (Tertiary period) లో నున్నవి.

జంతుజాతివలెనే ఉద్భిజ్జజాతికూడ మొదట ఉత్పత్తియై, తరువాత అభివృద్ధిచెంది, అటుతరువాత కాలము గడచిన కొలది పరిణామమున వివిధ రూపములను బొందును. ఉద్భిజ్జములలోను, వాని జాతులలోను గల ఈ వివిధ భేద ములనుబట్టి వివిధ మండలము లగుపడుచున్నవి. ఉష్ణో గ్రత, వర్షపాతము, గాలిఒత్తిడి, నేలలు, అక్షాంశములు, ఎత్తు అనువానిపై ఆధారపడి ఆయా మండలములలో వేరు వేరు పారస్థిక (Ecological conditions), బాహ్యా స్థితిగతులు ఏర్పడుచున్నవి.

2. ప్రపంచవ్యాప్తి :- వివిధశీతోష్ణ పరిస్థితులు, వానితో గూడిన వర్షపాతములు ఎట్లు వ్యాప్తిచెందియున్నవో దానికి అనుగుణముగా వివిధ తరగతుల అరణ్యముల వ్యాప్తియుండును. అనగా ఒక్కొక్క రకపు శీతోష్ణ పరిస్థితులలో ఒక్కొక్క లక్షణముగల అరణ్యముండును. ఇట్టి అరణ్యములు సహజమగు ఉద్భిజ్జజాతి. మానవుని జోక్యముగాని, మార్పుగాని లేకున్నచో ఆ ఉద్భిజ్జములు ఉష్ణోగ్రత, వర్షము, నేల వీనియొక్క పరస్పర క్రియల ఫలితముగా పెరుగును. అరణ్యముల స్థూలవర్గీకరణము, వ్యాప్తి ఈ దిగువ నీయబడినది :-

(అ) 'సెల్వాలు' అనబడు భూమధ్య రేఖాప్రాంతపు సదాహరితారణ్యములు భూమధ్యరేఖ పొడవున నున్న వర్షపాతమండలములో నున్నవి. సంవత్సరమునకు 80 అంగుళములకు మించి వర్షపాతముగల ఋతుపవన ప్రదేశములలోగూడ అవి యుండును. అచట సంవత్సరము పొడుగునను సూర్యరశ్మి బాగుగానుండును. గాలి, నేల ఎప్పుడును తడిగానుండును. ఆ అరణ్యములు పొడవైనవి. పొట్టివియగు వేలకొలది రకముల మొక్కలతో దట్టముగా, ఏపుగా పెరుగును. అవి భూమధ్య రేఖాప్రాంతమందంతటను ఉన్నను అమెజాన్, కాంగోపరీవాహ ప్రదేశములలోను, భారతదేశము, సింహళము, మలయా, ఈస్టు ఇండీస్, బర్మాలోను ఉన్న అడవులు అత్యుత్తమమైనవి. రబ్బరుచెట్లు, సింకోనా, కోకో, మానియోక్, కొబ్బరి చెట్లను కలిగియుండుటచే నివి చాలముఖ్యమైనవి. భారతదేశపు ఋతుపవనారణ్యములనుండి వర్తకమునకు పనికి వచ్చు కలప, ముఖ్యముగా టేకు సాలవృక్షములనుండి లభించును. 40 అంగుళములకు తక్కువ వర్షపాతమున్నచోట్ల అడవులు కొంచెము పలుచగను, కొట్టివేయుటకు సులభముగను పెరుగును. వీటియందు కలప నిచ్చు వృక్షములు, వెదురు, తాడి, తృణధాన్యములు, వరి, ప్రత్తి, కొన్ని పర్వతపు వంపులందు తేయాకు, కాఫీ లభించును. ఆహారధాన్యపు పైరులను పెంచుటకు ఈ ప్రాంతము చాల అనుకూలముగ నుండును. అందువలన అచట జనసంఖ్య ఎక్కువగానుండును.

(ఆ) వెచ్చని సమశీతలారణ్యములు ఋతుపవనారణ్యములను ఇంచుమించు పోలియుండును. కాని వేరురకముల వృక్షములు కలిగియుండును. ఆహారసంబంధమగు పైరులను సేద్యముచేయుటకొరకు పెక్కుప్రదేశములలో నున్న ఆరణ్యములు చాలాకాలముక్రిందటనే కొట్టివేయబడినవి. వీటిలో 5 ముఖ్యమగు ప్రదేశము లున్నవి - (1) రొంపినేలలో మాత్రమే అరణ్యములు గల ప్రాంతములు, విశాలమగు ప్రత్తినేలలు, మొక్కజొన్న నేలలు కల అమెరికా సంయుక్త రాష్ట్రములోని ఆగ్నేయ భాగము, (2) విలువైన కలపనిచ్చు అరణ్యములుగల బ్రెజిల్‌లోని దక్షిణ భాగము. (3) చెరకు, మొక్కజొన్న పైరు చేయుటకు అరణ్యములను నరకివేసిన దక్షిణాఫ్రికాలోని నేటాలు. (4) మధ్య చైనా, ఉత్తర చైనా. (5) యూకలిప్టసు అరణ్యములకు ప్రాముఖ్యమొందిన ఆస్ట్రేలియాలోని తూర్పుభాగము.

**(ఇ) చల్లగానుండి, ఆకురాలు సమశీతలారణ్యములు :-** చల్లగా సమశీతలముగానున్న ప్రదేశములలో చలినుండి రక్షించుకొనుటకై శీతకాలమున వృక్షములఆకురాలును. అందుచే వాటికి ఆకురాలు వృక్షములనిపేరు. ఓక్, ఎల్మ్, బీచ్, బర్చ్, మేపుల్ అను వృక్షములు విలువైన కలప నిచ్చును. ఇట్టి వృక్షములుగల అరణ్యములు ఉత్తర యూరప్‌లో, అమెరికా ఈశాన్య భాగములో, మంచూరియాలో కలవు. గోధుమ, బార్లీ, రై, మెదలగు ఆహార ధాన్యపు పైరులను పెంచుటకొరకు ఈ ప్రదేశములలో మొదటనున్న ఉద్భిజ్జజాతి నరకివేయబడినదను విషయము గమనించతగినది.

**(ఈ) చల్లని సమశీతల కోనిఫరు అరణ్యములు :-** కోనిఫరు వృక్షములు ఎక్కువ చలిప్రదేశములలో పెరుగును. అందుచే, మంచునుండి కాపాడుకొనుటకును, బాష్పోత్సేకమును తగ్గించుకొనుటకును, వాటిపత్రములు సూదులవలెనుండును. ఆవృక్షములు మెత్తని దారువు కలిగి, కాగితపు పరిశ్రమలకు చాల ఉపయోగపడును. ఉత్తరార్ధగోళముయొక్క ఉత్తరపు సరిహద్దులయందును, మధ్య యూరప్ (జర్మనీ, స్విట్జర్లాండు, కార్పేథియన్సు) పర్వతములలోగల ఉన్నత ప్రదేశములయందును, న్యూజీలాండు, టాస్మేనియా, ఆస్ట్రేలియాలలో ఆగ్నేయ భాగములందుగల పర్వత ప్రదేశములయందును కోనిఫరు అరణ్యములు విస్తృతముగానున్న భాగములు వరుసగా గలవు. ఈ ప్రదేశములలో నివసించు ప్రజల కార్యకలాపములు అరణ్యములతో సంబంధించియుండును.

**(ఉ) మిక్కిలి ఎత్తయిన (ఆల్పైన్) ఉద్భిజ్జజాతి :-** భూమధ్య రేఖనుండి గల దూరమునుబట్టి ఉష్ణోగ్రతలు, వర్షపాతము నేలలు ఎట్లు మార్పుచెందునో, అట్లే అవి పర్వతపార్శ్వములందు భూమట్టము నుండి గల ఎత్తునుబట్టి కూడ మారుచుండును. అందుచే ఉన్నత పర్వతశ్రేణులలో క్రిందినుండి శిఖరమువరకును పైన చెప్పిన తరగతుల అరణ్యములన్నియు ఉండవచ్చును. పర్వతపార్శ్వములందు అరణ్యము లిట్లు మాండలికముగ

వ్యాప్తిచెందుట 'ఆల్పైన్ వ్యాప్తి' అనబడును. ఇది హిమాలయ పర్వతములను ఆరోహించినచో స్పష్టముగ చూడనగును.

3. **భారతదేశ మందలి అరణ్యముల రకములు :-** శీతోష్ణ స్థితులకు కారకములగు ఉష్ణోగ్రత, ఆర్ద్రత అనునవి నేలల అభివృద్ధికిని, తత్ఫలితమగు ఉద్భిజ్జ నివాసమునకును ముఖ్యమగు కారణములు. ఈ దేశములో నున్న వివిధ ఉద్భిజ్జ జాతులు, వృక్షశాస్త్ర దృష్ట్యా ఈ దిగువ ప్రత్యేక లక్షణములు గల ప్రదేశములుగా విభజింపబడినవి-

1. తూర్పు హిమాలయము, 2. పశ్చిమ హిమాలయ ప్రదేశము, 3. సింధు మైదానము, 4. గంగా మైదానము, 5. పశ్చిమ సముద్రతీరము, 6. దక్కను.

ఈ ప్రదేశములలో నున్న అరణ్యముల రకములు, వాటి వ్యాప్తి ఈ దిగువ నీయబడినవి :-

(1) **ఉష్ణమండలస్థ సదాహరితార్ద్రారణ్యము :-** ఇది ఛత్రాకారముగ విజృంభించిన సదాహరితములగు మధ్యోద్భిదములతో (**Mesophytes**) ఎత్తుగా, దట్టముగా నున్న అరణ్యము పడమటి కనుమల యొక్క పశ్చిమ ముఖమునను, అస్సాంలో ఊర్ధ్వభాగమున నైరృతిమూల నుండి కాచార్ గుండా దక్షిణమున చిట్టగాంగు పర్వత ప్రదేశముల గుండా వ్యాపించిన పీలిక యందును ఇట్టిది కలదు.

(2) **ఉష్ణమండల సదా అర్ధహరితారణ్యము :-** ఇది ఆకురాలు జాతులు, స్వల్పకాలము పత్రరహితముగనుండు సదా హరితములును కలిసియున్నది. పడమటి కనుమలలో నున్న ఉష్ణమండల సదాహరితారణ్యమునకు ప్రక్కను, తూర్పుహిమాలయముల క్రిందివాలులందును ఇట్టి అరణ్యమగపడును.

(3) **ఉష్ణమండలపు చెమ్మగల ఆకురాలు అరణ్యము :-** (ఇది ఆకురాలు వృక్షములే ప్రముఖముగను, సదాహరితములు స్వల్పముగను గలది.) దీనికి ఋతుపవన మండలారణ్యమని కూడ పేరు. ఇది భారతదేశపు టరణ్యలక్షణములకు చక్కని ఉదాహరణము. హిమాలయ పాద ప్రదేశమందును, పడమటి కనుమలలో తూర్పు దిక్కునను, ఛోటా నాగపూర్‌లో కొన్ని భాగములందును, ఖాశీ పర్వతములలో గాలి మరుగుదిక్కునను, ఇట్టి అరణ్యము కలదు.

(4) **ఉష్ణమండలపు పొడియయిన ఆకురాలు అరణ్యము:-** (ఇది ఇంచు మించు సంపూర్ణముగా ఆకురాలు ఎత్తుగాని వృక్షములు గల అరణ్యము.) ఇది భారతదేశము యొక్క మధ్యభాగమున ఉత్తర దక్షిణముగా హిమాలయ పాద ప్రదేశమునుండి కన్యాకుమారి అగ్రమువరకును వ్యాపించి యున్నది. ఇచట 40 అం. లు మొదలు 50 అం. ల వరకు వర్షము పడుటయు, 6 నెలలు వానలు లేకుండుటయు ప్రత్యేక లక్షణములు.

(5) **ఉష్ణమండలపు కంటకారణ్యము:-** ఇందు తక్కువ ఎత్తుగల చెట్లుండును. ఇది దట్టముగా నుండదు. ఇందలి వృక్షములు వేడిమిని కానలేమిని తట్టుకొనగలిగి యుండును. ఇందుగల వృక్షములు ముండ్లుగలిగి ప్రధానముగా కాయధాన్యముల జాతికి చెందినవై యుండును. ఇట్టి అరణ్యము దక్షిణపంజాబులో సింధు పరీవాహప్రదేశమందును, రాజపుత్రస్థానములోను, సింధులోను 10 అం. మొదలు 30 అం.ల వరకు వర్షపాతము కలిగియుండును. ఊర్ధ్వ గంగా మైదానమందును, దక్కను పీఠభూమి యందును ఇట్టి అరణ్యము కలదు.

(6) **తడిలేని ఉష్ణమండల సదాహరితారణ్యము:-**(ఇందు చిన్న ఆకులు, ముండ్లు కల ఉద్భిజ్జములు ఎక్కువగా నుండును.) ఇట్టి అరణ్యము కర్నాటక సముద్ర తీరమున కనబడును.

(7) **ఉప-ఉష్ణమండలపు ఆర్ద్ర పర్వతారణ్యము :-** (ఇది ఎత్తుగా, బాగుగా పెరిగిన సదాహరితవృక్షములతో కూడిన అరణ్యము). హిమాలయముల క్రిందివాళ్ల యందును. బెంగాలు నందును, అస్సాములోను, ఖాశీ, ఉదకమండల, మహాబలేశ్వర పర్వతపంక్తులపైని ఇట్టి అరణ్యమగపడును.

(8) **ఉప-ఉష్ణమండలపు 'పైను' చెట్ల అరణ్యము:-** (ఇది సదాహరితములయినట్టి గాని, హరితములు కానట్టి గాని సులభముగా కాలునట్టి వృక్షములతో వలుచగానుండును.) ఇట్టి అరణ్యము, మధ్య, పశ్చిమ హిమాలయములలో, ఖాశీపర్వతములలో 3000 అడుగుల ఎత్తునుండి 6000 అడుగుల ఎత్తువరకు ఉండును.

(9) **పొడియైన ఉప-ఉష్ణమండలసతతహరితారణ్యము:-** (ఎండ వేడిమిని, వానలేమిని తట్టుకొనగల (**xerophytic**) ముండ్లజాతులు, చిన్నచిన్న ఆకులుగల 'ఆలివ్' వంటి సతత

హరితములు ఇది కలిగి ఉండును.) ఇది భారతదేశమున వాయవ్య భాగమున నున్నది.

(10) ఆర్ద్ర సమశీతలారణ్యము :-(ఇది క్రిందిభాగమున దట్టముగా పెరిగిన ఉద్భిజ్జములతో సదాహరితము, అర్ధ సదాహరితములు గల మిశ్రారణ్యము.) తూర్పు హిమాలయములలో 6,000 అడుగుల నుండి 9,500 అడుగుల వరకు గల భాగమందును, దక్షిణ భారతదేశములో పర్వత శిఖరములపైనను ఇట్టి అరణ్యము లగపడును.

(11) చెమ్మగల సమశీతలారణ్యము :- (సూచీముఖ వృక్షజాతి (కోనిఫరు) మరియు ఓక్ వృక్షములతో సదా హరితములు, క్రింది భాగమున ఆకురాల్చు ఉద్భిజ్జము లుండును.) మధ్య హిమాలయములు, పశ్చిమ హిమాలయములందు 40 అంగుళములకు మించి వర్షపాత మున్న ప్రదేశములలో ఇట్టి అరణ్యము లుండును.

(12) తడిలేని సమశీతలారణ్యములు:-దేవదారు,పైన్, జ్యూనిపెర్ వృక్షములును, విశాలమగు ఆకులుగల వేడిమిని వానలేమిని తట్టుకోగల (xerophytic) వృక్షములును ఉండును.) హిమాలయ పర్వతముల లోపలి పంక్తులలో నిట్టి అరణ్యముండును.

(13) "అల్పైన్" (alpine) అరణ్యము :- సదాహరితములగు 'కోనిఫరు' వృక్షములు, ఎత్తు తక్కువ, విశాలమగు ఆకులు గల వృక్షములు ఉండును.) 10,000 అడుగులకు మించిన ఎత్తులో 'కలపహద్దు' వరకు హిమాలయములందంతటను ఇట్టి అరణ్యమగుపడును.

14. **ఆంధ్రదేశములోని అడవులు :-** ఈ రాష్ట్రము ఉష్ణమండలములో నున్నది. ఈశాన్య ఋతుపవనముల వలన ఇచట కొన్ని తావులలో వర్షము కురియును. తూర్పు కనుమలలో ఇంచుమించు 40 అంగుళముల వర్షము కురియును. పడమట తెలంగాణాయందు 20 మొదలు 30 అంగుళముల వరకు వర్షపాతముండును. స్థూల వర్గీకరణమున ఆంధ్రరాష్ట్రపు టడవులు ఋతుపవనారణ్యముల తరగతికి చెందును. అవి ఆకురాలు లక్షణముగలవి. పశ్చిమ భాగములలో ఆకురాలునట్టివి, ఉష్ణమండలపు ముండ్లతో గూడినట్టివి మిశ్రారణ్యములుగా నుండును. సముద్ర తీరమున నున్న రొంపి నేలలో, ముఖ్యముగా గోదావరీ, కృష్ణా ముఖద్వారములందు గొప్ప సముద్రపు పోటులకు, ఉప్పునీటికి తగియున్న వాయుశిఫలు (mangroves) పెరుగును.

ఆంధ్రరాష్ట్రమున నున్న అడవులను భౌగోళికముగా ఈ క్రింది తరగతులుగా విభజింపవచ్చును.

(అ) గోదావరి లోయలోనున్న అడవులు చక్కని మురుగుపారుదల గలదియు, సారవంతమైనదియు, చాల లోతువరకు మెత్తని మట్టిగలదియు నగు నేలలో పెరుగును. అచటి వృక్షములలో టేకు ముఖ్యమైనది. అది 60 అడుగులు మొదలు 100 అడుగుల ఎత్తు వరకు పెరుగును. కొంచెము మరియొక రకపు అడవి తడిలేని, లోతులేని వంకు నేలలలో పెరుగును. అచటి టేకు వృక్షములు 25 మొదలు 50 అడుగుల వరకు పెరుగును.

(ఆ) కృష్ణానది లోయలోని అడవులలో ఏపి, చిరుమ్రాను, అబ్నస్ (Abnus), నల్లమద్ది వృక్షములు ముఖ్యమైనవి. ఈ అడవులు విడివిడిగా లోతులేని ట్రాపియన్ (Trappean) ప్రదేశముల యందు పెరుగును. కాని ఇసుకరాతి ప్రదేశములలో విస్తారముగా వ్యాపించెందును.

(ఇ) తూర్పు కనుమలలో నున్న అడవులలో పలు రకముల వృక్షము లుండును. వానిలో టేకు, వెదురు, కాగితపు గుజ్జుకొరకు పనికివచ్చు ఇతరమైన రకములు ఉండును.

(ఈ) డెల్టాలలో రొంపిగానుండు సముద్ర తీరములలో 'వాయుశిఫలు' అను జాతి (Mangrove) అడవులు పెరుగును. వృక్షములు చాలవరకు వంటచెరుకుగా ఉపయోగపడును.

5. **అరణ్య సంబంధమగు పదార్థములు :** అరణ్యప్రదేశములలో దొరకు అన్ని రకముల జంతు, వృక్ష, ఖనిజ పదార్థములు ఉప అరణ్య పదార్థములు, ఇందు దొరకును. కలప, వంటచెరుకు, ముఖ్య పదార్థము. భారతదేశపు ఉప - అరణ్య పదార్థములను ఈ క్రింది తరగతులుగా విభజింపవచ్చును :

1. నార, పీచు : చేవగల చాల జాతులయొక్క నార పొరనుండి నారలు లభించును. వానిలో కొన్నిటినుండి త్రాళ్ళు పేనుటకు వీలుగా పొడవుగల బలమైన నార లభించును. కొన్నిటినుండి నేతపనుల కుపయోగించు పట్టు మాదిరి సన్నని పోగులు దొరకును. ఆయా జాతులను

బట్టి నారను తయారుచేయు పద్ధతులు చాలవరకు వేరుగా నుండును. కాని పోగులను ఒకదాని నుండి మరియొక దానిని వేరుచేయు పద్ధతి "రెట్టింగు" అనబడును. ఉపయోగకరమగు నారనిచ్చు మొక్కలు స్టెర్క్యులియేసీ, టీలియేసీ, లెగూమినోసీ, అస్కిపియడేసీ, అర్టికేసీ అను కుటుంబములకు చెందినవి. అనగా జనుపనార మొక్కలు 'లినెన్' అను నారమొక్కలు, 'హెంప్', 'మానిల్లాహెంప్' ముఖ్యముగా లభించు అరణ్యపదార్థములు.

పీచు, కపోక్, ఇండియన్ కపోక్ అనునవి అరణ్య వృక్షముల యొక్క ముదుక పట్టువలెనుండు రకములు.

2. గడ్డిరకములు, వెదురు, పేములు :- సన్నబట్టనేతకు పనికివచ్చు ప్రోగులను (Fibres) ఇచ్చు గడ్డి జాతులు భారతదేశములో లేవుకాని, పకులకు, చాపలకు, కాగితపు గుజ్జుకు పనికివచ్చురకములు చాల ఉన్నవి. కాగితపుగుజ్జు తయారుచేయుటకు ఎంతయో ఉపయోగపడుచు బీహార్, ఒరిస్సా, బెంగాల్, మధ్యప్రదేశ్, తూర్పు పంజాబు రాష్ట్రములనున్న 'బైబ్' అనుగడ్డి అన్నిటికంటెను ముఖ్యమైనది. 'ముంజ్' గడ్డి ప్రఖ్యాతి చెందిన ఢిల్లీచాపలు తయారుచేయుటకు విస్తారముగా నుపయోగపడును. వట్టివేళ్ళు సువాసననిచ్చు చాపలు తయారుచేయుటకు ప్రసిద్ధి చెందినది.

వేర్వేరురకముల వెదురు భారతదేశ మందంతటను కనబడును. దాని ఉపయోగములు అందరకు బాగుగ తెలిసినవే. పేము లేక రటన్ అనునది 'పామ్' కుటుంబములో పెక్కుగణములకు చెందిన ఎగబ్రాకు మొక్కల యొక్క కాండములు. వాటిలో క్లామస్ (Clamus) అను గణము అన్నింటికంటె ముఖ్యమైనది. వీటిని త్రాళ్ళకుబదులుగా నుపయోగింతురు. ఒక్కొక్కప్పుడు 300 - 400 అడుగుల పొడవుగల పేము బెత్తములను వ్రేలాడు వంతెనలకు ఆధారముగా నుపయోగింతురు. కుర్చీలు, కర్రసామాను, పిల్లల తిరుగుడు బండ్లు, బుట్టలు, జల్లెడలు, చాపలు, త్రాళ్ళుమొదలైనవి తయారుచేయుటకు కూడ వానిని ఉపయోగింతురు.

3. స్వేదనమువలన, కషాయము తీయుటవలన లభించు ద్రవ్యములు :- అడవిగడ్డిజాతులనుండి స్వేదన క్రియవలన లభించు పరిమళతైలములు 5 ముఖ్యమైనవి భారతదేశమున గలవు - పామరోజా లేక జెరేనియంతైలము, నిమ్మగడ్డినూనె, నింబతైలము, అల్లపుగడ్డినూనె, వట్టివేరు తైలము, చందన తైలము, అగరు నూనె, దేవదారు తైలము, ఆయావృక్షముల దారువులనుండి లభించును.

కర్పూరతైలము, యూకలిప్టసు తైలము, దాల్చిన తైలము, వింటర్‌గ్రీన్ తైలము అనునవి ఆయాపత్రములనుండి లభించువానిలో ముఖ్యమైనవి. వింటర్‌గ్రీన్ తైలము తక్క మిగిలినవి చాలప్రసిద్ధములైనవి. వింటర్ గ్రీన్ తైలమునుండి సాలిసిలికామ్లము కార్బాలికామ్లము తయారుచేయవచ్చును. 'ఆస్పిరిన్' అనుదానిని సాలిసిలిక్ ఆమ్లము నుండి తయారుచేయవచ్చును.

4. నూనెగింజలు :- అవిసె, నువ్వులు, ఆవ, రేప్ (Rape) వంటి నూనెగింజలు చాలవరకిప్పుడు క్షేత్రసస్యములుగా పైరుచేయబడుచున్నవి. అమెరికా, యూరప్ బజారులలో భారతదేశపు అరణ్యలబ్ధమగు చౌల్‌మూగ్ర తైలము కుష్ఠు చర్మవ్యాధులకు ముఖ్యమైన ఔషధముగా అమ్మబడుచున్నది. 'సేపియం సాబిఫెరమ్' అను వృక్షమునుండి లభించు తెల్లనిమైనము చైనాలో సబ్బులు, క్రొవ్వు వత్తులు చేయుటకు ఉపయోగ పడుచున్నది. 'జపానుమైనము' అనునది దీనిలో మరియొక రకము.

5. రంగులు, అద్దకములు : తుమ్మ, తంగేడు, సాల వృక్షముల యొక్క పట్టనుండి రంగులు తయారు చేయుదురు. వీనిలో తుమ్మపట్టరంగు అన్నిటికంటె ముఖ్యమైనది. భారతదేశ మందంతటను ఇది ఉపయోగములో నున్నది. మిగిలినవి పండ్లరంగులు ఆకురంగులు అని రెండు విధములుగా విభజింపబడినది. కరక్కాయలు, తుమ్మకాయలు, డివిడివికాయలు వీనినుండి లభించురంగులు పండ్లరంగులు. ఇతరవృక్షములనుండి లభించునవి ఆకురంగులు.

కొన్ని తరగతులకు చెందిన మొక్కల చెక్కలు, పట్టలు, పువ్వులు, పండ్లు, వ్రేళ్ళు, రంగులు తయారు చేయుట కుపయోగ పడును. ఎనిలైన్ సంబంధమగు రంగులు వచ్చినప్పటినుండి శాకసంబంధమగు రంగుల ప్రాముఖ్యము తగ్గినది.

6. జిగురులు, రజనములు :- జిగురులు చెట్లనుండి పట్టలనుండి, బయటికి స్రవించు పదార్థములు. అవి

సంపూర్ణముగనో, కొంతవరకో నీటిలో కరగును. రజనములు (Resins) నీటిలో కరగవు. సాధారణముగ మధుసారము (alcohol) లో కరగును. అరబిక్ జిగురు, తుమ్మ జిగురు, బెంగాల్ కినో అనునవి భారతదేశపు అరణ్య వృక్షములనుండి లభించు కొన్ని ముఖ్యములైన జిగురులు. పైనస్‌లాంజిఫోలియస్, ఎక్సెల్సా, ఖాసిల్ మెర్కుసై అను నాలుగుజాతుల పైనువృక్షములు వ్యాపారరీత్యా విలువైన రజనములను ఇచ్చును. ఉద్భిజ్జ ద్రవములు సహజముగ ఇగిరిపోవుటవలనగాని, ప్రత్యేకముగు గ్రంథుల వలనగాని తయారై, సహజముగా వృక్షమునుండి బయటికి వచ్చును. లేదా గంటుపెట్టిన యెడల పట్టలోనికి, దారువులోనికి వచ్చును. ఈ సందర్భమున చిర్ పైన్ రజనము, టర్పెంటైన్ పరిశ్రమ చెప్ప దగినవి,

7. వాసన ద్రవ్యములు. విషపదార్థములు, ఓషధులు :- భారతదేశమున హిమాలయములందును, ఇతర పర్వత శ్రేణులందును ఉన్న అరణ్యములలో అనేకములగు ఓషధులున్నవి. వానిని తీయు ఉద్భిజ్జభాగములనుబట్టి ఓషధులు వర్గీకరింప బడినవి. వేరు ఓషధులు, పట్ట ఓషధులు, (ఉదా :- క్వినైన్) పండు, గింజ ఓషధులు (ఉదా:- స్ట్రిక్నైన్) పత్ర-ఓషధులు (ఉదా :- గంజాయిమొక్క నుండి తీయు గంజాయి).

ఏలకులు, మిరియాలు, దాల్చినచెక్క చాలా ప్రసిద్ధమైన సువాసన ద్రవ్యములు.

8. జంతు, ఖనిజాది సంబంధమగు ద్రవ్యములు :- అరణ్యములనుండి లభించు మైనము, తేనె, కొమ్ములు తోళ్ళు, దంతము, సీకాయ, కుంకుడు వంటి చాల దినుసులు తక్కువ ప్రాముఖ్యము కలవి.

అరణ్య లభ్యమగు పదార్థములలో మిక్కిలి ముఖ్యమైనవి లక్క, షెల్లాక్. వీటివిషయమున ప్రపంచములో భారతదేశము ఒకటే ఉత్పత్తిస్థానముగా నున్నది. అచ్చులు పోయుటకును, గ్రామఫోను పరిశ్రమలకును, చక్కని వార్నీసులు, మెరుగులు, లక్క, టోపీలు, కురువింద కూపములు (emery wells) మందుగుండు సామాగ్రిని, విద్యుత్పరికరములను, విద్యుత్తంత్రుల కప్పులు మొదలగువానిని చేయుటకును ఉపయోగపడును.

రజనము తయారుచేయుటలో భారతదేశము క్రమముగా అభివృద్ధి గనబరచు చున్నది. లైనోలియం, లక్క, నూనెగుడ్డలు, కందెన సమ్మేళన ద్రవ్యములు (lubricating compounds,) సిరాలు తయారు చేయుటకును, లోహములను అతుకుట, రంగులు, వార్నీసులు ఆర బెట్టుట, యంత్రముల పట్టాలను కప్పుట మొదలగు పనులకును రజనము ఉపయోగపడును.

భారతదేశమున మంచిరకము టర్పెన్‌టైన్ తయారగును. అది చాలవరకు రంగులు, వార్నీసులు, ఔషధములు తయారు చేయుటకు ఉపయోగపడుచున్నది.

(9) కాగితము, కాగితపుగుజ్జు :- భారతదేశమున అరణ్యలబ్ధ పదార్థములలో కాగితపుగుజ్జు తయారుచేయుటకు గడ్డిజాతి కుటుంబమునకు చెందినవి మంచివి. హిమాలయములయందున్న 'కోనిఫరు'లు, కొన్ని ఆకురాలు వృక్షములు కాగితపు పరిశ్రమకు మంచి పదార్థములు. హిమాలయ పాదపర్వతములపైని, బీహారు, ఒరిస్సా, మధ్యభారతములలో కొన్ని భాగములయందును ఎల్లప్పుడు పెరుగుచుండు సబాయ్‌గడ్డి ఈ పరిశ్రమకు ముఖ్యమైన ముడిపదార్థము.

గడ్డిజాతి కుటుంబమునకు చెందిన వెదుళ్ళు, మద్రాస్ బెంగాల్, బీహారు, ఒరిస్సా, బొంబాయి, తిరువాన్కూరు రాష్ట్రములలో విస్తారముగా దొరకును. అవి కాగితపు పరిశ్రమకు పనికివచ్చును.

(10) భూసార విశేషమును పదిలపరచుట (Soil Conservation) : మధ్య శతాబ్దములలో జరిగిన విస్తారమగు ఆక్రమణ కార్యక్రమములలో అరణ్య నిర్మూలనమువలన కలిగిన నష్టములు గత శతాబ్దాంతమున తెలిసినవి. సహజముగు ఉద్భిజ్జ కోశగల అరణ్యములు ఎంత ముఖ్యమైనవో దట్టమగు వర్షమేఘములు (Cukulo-nimbus Clouds) ఏర్పడుటకు అవి ఎట్లు తోడ్పడునో, పూర్వమునుండియు గుర్తింపబడినది. ఈ మేఘములు ఏర్పడుటకు అవసరమైన చల్లదనము, ఆర్ద్రిత, విస్తృతమగు అరణ్యముల వలన కలుగును. అరణ్యములు, వానియందున్న దట్టమగు ఉద్భిజ్జజాతి భూమిపైపడు వర్షపాతమును అదుపులో నుంచును. భూమిని నల్లగా నుంచుటయందును, అధికముగ నీటిని పీల్చుకొనుటకును అరణ్యవృక్షములు తమ

ఛత్రాకార పత్ర సమూహముతో తోడ్పడును. అంతే గాక, ఉద్భిజ్జావరోధము వలన భూసార విశేషము (soil) కొట్టుకొనిపోక నిలిచియుండును.

వ్యవసాయము కొరకు నిర్మూలనము చేయుటవలన పూర్వము దట్టమగు అరణ్యములతో నిండియున్న పెద్ద భూభాగములు (దక్కను పీఠభూమిపై నున్న దండాకారణ్యము) ఇప్పుడు బయళ్లుగా నున్నవి. అందుచే ప్రపంచమందన్ని దేశముల యందును భూసార విశేషమును పదిలపరచియుంచుట ఒక పెద్ద సమస్యయైనది. నాగరక దేశములన్నిటి యందును ఇప్పుడు క్రమపద్ధతిని మొక్కలు నాటుట, అరణ్యములు పెంచుట అను కార్యక్రమములు విరామములేకుండ జరుపబడుచున్నవి. అడవులను పెంచుట (ఇది భారత దేశమున 'వనమహోత్సవము' అనబడుచున్నది). ఒక ప్రత్యేకమగు శాస్త్రజ్ఞానము. దానిని పరిశీలించి, వ్యవసాయ, ఆర్థికసంబంధమగు లాభములకే గాక ఆ యా ప్రదేశ సౌందర్యము కొరకును ఆచరణలో పెట్టవలెను.

బంజరుభూములకు తగిన ప్రత్యేక జాతుల మొక్కలను నాటుట, క్రమక్రమముగా వాని స్థానమున ఎక్కువ శ్రేణికి చెందిన వృక్షజాతులను పెంచుట, వర్షజలము యొక్క వేగమును తగ్గించుట కొరకు వంకర టింకర కాలువల నేర్పరచుట భూసారపు క్షేమను పదిలపరచు పెద్ద కార్యక్రమములో జరుగుచున్న కొన్ని పద్ధతులు.

ప్రకృతి శాస్త్రజ్ఞులు, వ్యవసాయదారులు, ఇంజనీయర్లు కల ప్రత్యేక సంఘములు ఎడతెగని పరిశోధన చేయుటకును, ప్రస్తుతము ఉన్న అరణ్యములను సంరక్షించుటకును, దూరదృష్టి లేక వెనుక కాలమున నాశనము చేయుటచే లోపించిన విశాలారణ్య ప్రదేశములను పునరుద్ధరించుటకును సంస్థాపితములయినవి.

స. జీ.

**అడవి బాపిరాజు :-** కళలోనే పుట్టి, కళలోనే పెరిగి, కళలకు జీవిత మంకితముచేసి, కళాసేవలోనే కాలధర్మముచెందిన కళాతపస్వి శ్రీ అడవి బాపిరాజుగారు.

ఆయన జననము 1895 అక్టోబరు 8 వ తేది. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, గురుజాడ అప్పారావుగార్లు ఆధునిక సాహిత్య సౌధ నిర్మాణమునకు పునాదులు వేసిన కాలమది.

కళామయుడైన శ్రీ బాపిరాజుగారు ఆ సౌధమున కొక స్తంభము. అదొక విశిష్ట స్తంభము. హంపీ హజార రామాలయ స్తంభమువలె ఇసుమంత స్పందనమునకైనను చెమ్మగిలునట్టిది; విఠలాలయ శిలా స్తంభము వలె రాగ రంజనలు చిలుకరించునట్టిది; కష్టాలు పైకొన్నప్పుడు మందరమువలె మథించునట్టిది.

కథకుడు కవి యగుట, కవి నవలారచయిత యగుట, నవలారచయిత చిత్రకారు డగుట - వీటన్నిటను నిష్ణాతుడు, నాట్యకోవిదుడు అగుట అరుదు. కాని శ్రీ బాపిరాజుగారు కథకుడు, కవి, నవలారచయిత, చిత్రకారుడు, నాట్యాచార్యుడు "ఒకరికీ చేయినిచ్చి, ఒకరికి కాలునిచ్చి, ఒకరికి నడుమునిచ్చి కూరుచున్నానోయ్" అని ఆయన అభినయించుచు పాడుచున్న పాటవలె, తనచేతిని, కాలును యావచ్ఛరీరమును కళలకు అంకితము చేసినాడు.

ఇంతటి కళామయుడు మధురమూర్తి యగుటలో ఆశ్చర్యమేమున్నది ? అమలిన హృదయము, అజాత శత్రుత్వము, బహుముఖ ప్రజ్ఞాప్రాభవము - అనెడు త్రివేణుల సంగమము ఆయన. సహృదయత, సరసత, సదయత పెనవేసికొన్న మానవు డాయన.

" ద్వేషమేనా బ్రతుకుమార్గం
వేషమేనా సత్యరూపం
మోసమేనా నిత్యకర్మం
మూర్తి మంతులకుశ్. "

అని వాపోయి, వ్యత్యాసాలెరుగని సుందర సమాజము నెలకొనవలెనని అంగలార్చిన ఆదర్శ జీవి.

బాపిరాజుగారు జన్మించినది గోదావరీ తీరమున భీమవరము సమీపములోని సరిపల్లెలో. ఈ గోదావరి "గద్గద నదద్గోదావరి కాదు." అన్నిటిని గుండెలలో పెట్టుకొని, విస్తృత గంభీరముగా ప్రవహించెడి గోదావరి. ఆ గోదావరి గంభీరత బాపిరాజుగారి గుండెల లోతులలోనికి, గోదావరి విస్తృతి ఆయన దృక్పథములోనికి తొంగి చూచుటలో వింతయేమున్నది ? ఈయన తండ్రి శ్రీ కృష్ణయ్యగారు. రసవత్తరమయిన కథలను ఆశువుగా అల్లి వీనులవిందుగా వినిపించుటలో ప్రజ్ఞాశాలి. తల్లి

శ్రీమతి సబ్బమ్మగారు. అమలిన హృదయ, ఉదార స్వభావ. ఈ లక్షణాలు బాపిరాజుగారికి ఉగ్గుపాలతో అలవడినవి. కనుకనే శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు—



"మీయమ్మ యే తార చాయలో నినుగాంచె
ఏ యోషధులపాల పాయసంబిడి పెంచె
లేకున్న నీశిల్ప లీలాభిరుచి రాదు
కాకున్న నీస్వాదు కంఠమబ్బగ బోదు
అడివోరి చిన్నవాడ
అమృత ధారలవాడ"

అని ఆశ్చర్యము ప్రకటించినారు.

బాపిరాజుగారి విద్యార్థిదశ రాజమహేంద్రవరములో ఓస్వాల్డ్ కూల్ డ్రేగారి అంతేవాసిత్వములో గడచినది. కూల్డ్రేగారి ఒజ్జరికము బాపిరాజుగారిలో నిద్రాణమైన కవితను, కళను మేల్కొల్పినది. దీనికితోడు పాల్, లాల్, బాల్ అనెడు త్రిమూర్తులలో ఒకరైన బిపినచంద్రపాల్ ఆవేశపూరిత ప్రసంగములు బాపిరాజుగారి హృదయములో దేశభక్తి నారులుపోసినవి. దాని ఫలితమే ఆయన 1921 లో సత్యాగ్రహోద్యమములో పాల్గొని కారాగారవాసము అనుభవించుట. తర్వాత ఆయన బి. ఎల్. పట్టముపొంది, కొన్నాళ్ళు న్యాయవాదివృత్తి సాగించినను, నాలుగేళ్ళపాటు బందరు జాతీయ కళాశాల ప్రిన్సిపాలుగా పనిచేసినను, పిదప చలనచిత్రరంగంలో కళాదర్శకుడుగా పనిచేసినను, గుంటూరులో కళాపీఠము స్థాపించి "కులపతి" అయినను, పదపడి హైదరాబాదులో 1943 నుంచి నాలుగేండ్లపాటు "మీజాన్" తెనుగు దినపత్రిక సంపాదకత్వము నిర్వహించినను, అనంతరము 1952 సెప్టెంబరు 22 వ తేదీన చెన్నపురిలో "పాహి మృత్యుంజయా - పాహి మృత్యుంజయా" అని సంస్మరించుచు, తుదిసారిగా కన్నుమూసెడు వరకు ఆయన హృదయ నైర్మల్యము చెక్కుచెదగ లేదు. ఆయన కళాతృష్ణ కలకబారలేదు. సాహిత్యారాధన పని చెడలేదు. పది నవలలు, పది కథాసంపుటాలు, వంద చిత్రాలు, వందపాటలు పూర్తిచేయవలెనని ఆయన కోరిక.

శ్రీ బాపిరాజుగారివలె ఇన్ని కళలలో, కావ్యరూపాలలో కలం నడిపినవారు చాల అరుదు. కలము నడపిన ప్రతి రంగములోను ఆయనవలె కన్నాకు అగుట అంతకన్న అరుదు. ఏకకాలములోనే అన్నింటిని ప్రారంభించి, ఇంద్రజాలికునివలె నిర్వహించెడువారు మరీ అరుదు. ఇంతటి బహుముఖ ప్రజ్ఞాశాలి కనుకనే ఆయన తన కోరికకు అనుగుణముగా పది నవలలు (పదవది "మధురవాణి" అసంపూర్ణము), ఏబదింటికి పైగా కథలు, శతాధికముగా గేయాలు వ్రాసినారు. పెక్కు చిత్రాలు గీసినారు.

తెలుగు నవలా సాహిత్యములో బాపిరాజు గారిది తొట్టతొలిబంతిలో మొట్టమొదటిపీట. ఆయన హిమబిందు, గోన గన్నారెడ్డి, అడవి శాంతిశ్రీ, అంశుమతి, మధురవాణి (అసమగ్రము) ఆంధ్రుల ఇతిహాసము ఇతివృత్తముగా గలవి. "హిమబిందులోని ఇతివృత్తము ప్రథమాంధ్ర సామ్రాజ్య స్థాపకులయిన శాతవాహనులనాటిది. అడవి శాంతిశ్రీ ఇక్ష్వాకులనాటి కథ. అంశుమతిలోనిది ఆంధ్రచాళుక్య సామ్రాజ్యస్థాపన కథ. "గోన గన్నారెడ్డి" కాకతి రుద్రమదేవినాటి గాథ. "మధురవాణి" తంజావురాంధ్ర రాజులనాటి సంగతి. ప్రాచీనాంధ్ర చరిత్రను ప్రామాణికముగా గ్రహించి, జాతి జీవనమును చిత్రించుటకు నవలలు రచించినవారిలో ప్రథముడు, ప్రధానుడు బాపిరాజుగారే.

ఆయన తక్కిన నవలలు నారాయణరావు, కోనంగి, తుఫాను, జాజిమల్లి, నరుడు సాంఘికమైనవి.

బాపిరాజు గారి నవలలోని ప్రత్యేక లక్షణా లివి :

1. చరిత్రాత్మకమైన నవలలో, చరిత్రానుసరణ విషయములో, ఆయనది అసిధారావ్రతము. కథా గమనము కోసమో, చమత్కారముకోసమో చరిత్రను తారుమారు చేయుట - ససేమిరా పనికిరాదు. ఏ రాజుల కాలపు కథ తీసికొని నవల వ్రాయదలచినా, మొదట ఆకాలపు శాసనాలు మొదలు కవిలెకట్టలదాక క్షుణ్ణముగా చదివి, చరిత్రకారులతో తర్క వితర్కాలు జరిపి, సమన్వయించుకొని, అప్పటి ఆచార వ్యవహారాలకు, సంప్రదాయాలకు లోటు రాకుండ రచన సాగించేవారు. తుదకు రాజుల బిరుదానళులను కూడ వదలెడువారు కారు. ఇందులకు "గోన గన్నా రెడ్డి"ని ప్రత్యేకముగా ఉదహరించవచ్చును.

2. సాంఘికమయిన నవలలలో తన దృష్టిని కేవలము పాత్రల మీదనే కేంద్రీకరించక పరిసర పరిస్థితులను, దేశములోని ఘటనల్లో ప్రధాన పాత్ర వహించిన వ్యక్తులను కలిపివేసి, వాస్తవికతను మరింత స్పష్టముగా తోపజేసెడువారు. కనుకనే "నారాయణరావు" లోని జమీందారీ పద్ధతి నిర్మూలనము గాని, తుఫానులోని శర్వరీభూషణుని కళాతృష్ణ కాని, "నరుడు"లోని హరిజన-ఆంగ్లో ఇండియను వనిత వివాహము కాని, విడ్డూర మనిపించవు సరిగదా, పాఠకునికి సన్నిహితముగాను, వాస్తవికముగాను కనుపించును. "నారాయణరావు" ఆంధ్ర విశ్వవిద్యాలయము మన్ననపొందినది.

3. దేనికి తగినభాష దానికి అనేది బాపిరాజుగారి రచనలోని మొదటి కిటుకు. "హిమ బిందు"లో భాష ప్రాచీన ప్రబంధ ధోరణిలో కదం తొక్కును. 'కోనంగి', 'నరుడు' వంటి సాంఘికాలలో వ్యవహార భాషలో నల్లేరుపై బండి వలె సాగును. భాష యేదయినా ఈ శైలిలో కవిత్వము తొంగిచూచుచుండును.

4. చరిత్ర విషయములో వలెనే భూగోళ విషయము లోను ఆయనకు పట్టుదల యెక్కువ. ఆయన ఏ నవల చదివినను (ఏ కథ చదివినా) ఆ.యా ప్రాంతాలలో విహరించినట్లు పాఠకులు తన్మయులయ్యేదరు. తనదేశ పర్యాటనానుభవాలను యుక్తాయుక్త విచక్షణతో క్రోడీకరించి, అక్కడక్కడ చొప్పించుట ఆయనకు పరిపాటి. "తుఫాను" లో ఆయనవి విధరాష్ట్రాల ప్రజల జీవితాలకు సంబంధించిన సూక్ష్మాతి సూక్ష్మవిషయాలను అద్భుతముగా చర్చించుట చూడవచ్చు.

5. ఆయనపాత్రలలోని ఉదాత్తత నిరుపమానము. సంఘములోని ఎగుడు దిగుళ్ళను సరిచేసే ఆవేశము పాత్రలలో తొణికిసలాడుచు ఉండును. ఆయన సిసలైన గాంధీ వాది. తనకు నచ్చని విధానాలను, సిద్ధాంతాలను వికారముగాచూడక సానుభూతితోపరిశీలించేసహనముగలవాడు. రచయితకు అవసరమయిన ఈనిజాయితీ గిలవాడు-కనుక ఆయన పాత్రలుకూడ ఈఉదాత్తతను పోతపోసికొన్నవి. ప్రతిపక్షుల వాదాలను ఎంతఉదాత్తతతో తర్కించునది "తుఫాను" సాత్యమియ్యగలదు.

కథలు :- బాపిరాజుగారి కథలు కళా మూర్తులు, రసగుళికలు. అతి సామాన్యవిషయముతో అసాధారణ కథ అల్లగల మొనగాడాయన. బాపిరాజుగారితో తెనుగు కథారంగములో నూతన కళాత్మకాధ్యాయము ప్రారంభమై, మహోన్నతిని పొందిన దనుట నిస్సందేహము. ఆయన కథలలో "శైలబాల, భోగీరలోయ, వీణ" - దివ్యపారిజాతాలు. ఆయనకథలుకొన్ని, "రాగమాలిక, తరంగిణి, అంజలి" అనే మూడు సంపుటాలుగా వెలువడినవి. కొన్ని కథలు శైలబాలవంటివి, ఆంగ్ల, కన్నడ, హిందీభాషలలోకి అనువదింపబడినవికూడ.

బాపిరాజుగారి కథలలో ధగధగలు, ఘుగఘుగలు కనుపించవు, వినిపించవు. నిస్పృహా, దౌర్బల్యాము అగుపించవు. "ఆయనకాళ్ళు నేలమీదనే యున్నను ఆయన చూపు నింగిమీదే. అందుచేత, ఆయన కథలు ఇతరుల కథలవలె కన్పట్టవు. అవి ఆయన దివ్యస్వప్నాలుగా ఉండును. ఆయన కనెడుకలలనే కథలుగా చెప్పినాడు... ఆయన తన కల్పనద్వారా హృదయస్పందన లెన్నింటినో కథాత్మకముగా చేసినాడు."

ఇంతమాత్రాన ఆయన కాల్పనిక జగములోనే విహరించినారనికాదు. వాస్తవికజగత్తుకూడ ఆయన విహారభూమియే. "వాన, నేలతల్లి, గాలివాన" వంటి కథలలో ఆయన భూమిబిడ్డల సంగతులువ్రాసి పేదలపెద్దతనమును పెద్దచేసి ధనికులదౌర్జన్యమును ఖండించినారు.

ఆయన కథలలో 'శైలబాల' శిల్పమునకు, "నేలతల్లి" సంఘపు ఆవేదనకు, "భోగీరలోయ" చిత్రలేఖనమునకు ప్రతీకమని గ్రహించవచ్చును. "రజాకార్" కథలో ఆయన మూడు ముక్కచెక్కలయిన తెనుగునాడు ఏకము కావలయునని ఆవేదనపడినాడు.

" గజపతిదేశం - రాయలసీమా
కళింగరాజ్యం - కాకతిభూమి
ఆంధ్రులందరూ - ఒకటౌతారని
ఏకకంఠమున - పాటనిండునని
మోగింపమ్మా - జయజయఢంకా. "

అని ఏనాడో గొంతెత్తిపాడిన విశాలాంధ్రవాది ఆయన.

కన్నుతెరచినది మొదలు కన్నుమూయునంత దనుక సమకాలిక విషయాలను వస్తువుగా తీసికొని దేశమును బాగుపరిచు జీవముతో అతిసన్నిహితత్వముగల పదునైన కలముగలవారాయన.

పాటలు :

" అతడుగీసినగీత బొమ్మయి
అతడు పలికిన పలుకు పాటై
అతని హృదయములోని మెత్తన
అర్థవత్కృతియై"

అన్న శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి మాటపూర్తిగా అర్థవంతమైనది. ఇట్టి బాపిరాజుగారు కళాదేవిని "శశికళా" మూర్తిగా భావించుకొని తన్మయులై ఆరాధించెడువాడు. తమ గీతాలన్నింటికిని ఆ "శశికళే" అధిష్ఠానదేవి యని భావించి పాడినారు. ఆమెనిజస్వరూప సాక్షాత్కారము కోసము అంగలార్చినారు. ఆవేదన పడ్డారు.

" నీకు ఇవతల
నాకు అవతల
తెర ఉన్నది బాలా !
తెర ఉన్నదే !
కన్నులు కానని రూపం పిలిచీ
కౌగిలి కందని భావం తలచీ
తెరవైపున నాచేతులు మోడ్చి
అరమూతలునా తీరని కలలై
చీల్చిన చిరగని తెర ఇవతలనే
చేరగరానీ నీ వవతలనే
తెర ఉన్నది బాలా!
తెర ఉన్నదే ! "

ఉపాస్య దేవీదర్శనము లభించనప్పుడు పడే ఆవేదన, తెలిపే పదాలు, కల్పన ఇంతకన్నను ఉండవను కొందును.

" ఒక్కటే ! ఇసుక బయలు
ఒక్కటే ! నీరుదెసలు
కదలిపోవు దూరాలు
బెదరిపోవు మేఘాలు
మరచి పోవకే."

ఒంటరిబ్రతుకు చూపుచు కదలిపోయే దూరాలు, బెదరి పోయే మేఘాలు మనకు మరపురావు. సుకూరాదర్శాల కోసము ప్రాకులాడే "శశికళ" రస హృదయమునకు, కళాహృదయమునకు ప్రతిబింబము. "అల్పభావము లెట్లు శిల్పవిషయము లౌను?" అను మతము ఆయనది.

" ఉప్పొంగి పోయింది గోదావరీ-తాను
తెప్పున్న ఎగసింది గోదావరీ !

అనే గేయము గోదావరి వరదలను మన కనులకు కట్టినట్లు చేయును.

పట్టిసములోని శివాలయము పూజా పురస్కారాలకు నోచుకోలేదన్న విషయమును ఆయన చమత్కారముగా చెప్పిన పద్ధతి అపూర్వము.

" గోదారి మద్దేన కొండొకటి వెలసింది
కొండపయి జంగమయ కొలువు వేంచేశాడు
గోదావరి వడులలో కూడె తీర్థాలన్ని
కొండపై జంగమయ కోటి అభిషేకాలు
గోదావరి వరదలో కోటిపూవులపత్రి
కొండపై జంగమయ వెండిపూవులపూజ
గోదారి కెరటాల కొండతో గుసగుసలు
కొండపై జంగమయ కునుకు బంగరుడోలి"

ఆయన రసహృదయము బెంగాలు, పంజాబులలో జరిగిన దురాగతాలకు వికలమయి పోయినది. వెంటనే

" ఏమైనారు నా వాళ్లంతా
ఏమైపోయిరి ఈ ఊళ్ళో
కళకళలాడే గల్లీలన్నీ
కలమోస్తరుగా కలిగి పోయినవి. "

అని ఆరాట పడినది.

లేపాక్షి బసవన్నను ఎన్నికోట్లమంది చూచుచుండుట లేదు! కాని బాపిరాజుగారివలె ఎవరు దానిని చూచి, ముగ్ధులై

"లేపాక్షి బసవయ్యా లేచిరావయ్యా!
కైలాస శిఖరివై కదలిరావయ్యా!"

అని ఆంధ్రదేశమునంతను కదిపించ గలిగినారు?

బాపిరాజుగారు వివిధ భావనలతో కల్పనలతో రూపొందించిన, ఆలపించిన గీతాలలో కొన్ని "గోధూళి, తొలకరి, శశికళ" అనే సంపుటాలుగా వెలసినవి.

చిత్రాలు: "కవి చిత్రకారుడు కాలేడు. చిత్రకారుడు కవి కాజాలడు." అని సుప్రసిద్ధాంగ్లకవి జార్జి బెర్నార్డుషా అన్నారు, కాని, బాపిరాజుగారు దీనికపవాదము. చిత్రకళలోను విశిష్టస్థానము సంపాదించుకొన్నాడాయన. పాశ్చాత్య చిత్రకళకు వెలుగునీడలు ముఖ్యమైనవి. భారతీయ చిత్రలేఖనములో రేఖ ప్రధానము. దీనిలో బాపిరాజుగారు అందెవేసినచేయి. ఆయన కవులలో చిత్రకారుడు, చిత్రకారులలో కవి. ఆయన శ్రీ ప్రమోదకుమార చటర్జీవద్ద చిత్రకళ అభ్యసించినవ్వటికిని అజంతా రేఖలతో, అమరావతి వంపులతో, మేళవించి తెనుగుచిత్ర సంప్రదాయమునకు క్రొత్తవన్నెలు కూర్చినారు.

ఆయన చిత్రాలలో "శబ్దబ్రహ్మ" డెన్మార్కు ప్రదర్శనశాలను, "భాగవతపురుషుడు" తిరువాన్కూరు రాజ సౌధమును, "సూర్యదేవ" కూచ్ బీహారును, "సముద్రగుప్త" అల్లాడి కృష్ణస్వామయ్య గారింటిని, "తిక్కన" "మృత్యుంజయ" మున్నగునవి మిత్రుల మందిరాలను అలంకరించినవి. మద్రాసు ప్రభుత్వపు పనుపుపై లంకలోని "సిగిరియా" గుహాచిత్రాలకు ఆయన ప్రతికృతులు సిద్ధపరచి తెచ్చినారు. ఇవి నేడు మద్రాసు మ్యూజియంలో ఉన్నవి. ప్రతికృతికల్పనములో వీరికి శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, పిలకా నరసింహమూర్తి, కోడూరు రామమూర్తి, శ్రీనివాసులుగార్లు తోడ్పడ్డారు.

ఇంతటి చిత్రకళాచార్యుడు వెండితెరపయి కళాదర్శకుడుగా విలసిల్లుటలో ఆశ్చర్యమేమున్నది? ఆంధ్రులలో ప్రథమ కళాదర్శకుడు కాగల ఘనత పొందినవాడుకూడ ఆయనే. "సతీ అనసూయ", "ధ్రువ విజయము", "మీరాబాయి" చిత్రములలో ఆయన తన చిత్రలేఖనములో వలెనే ఉత్తమాదర్శాలు గడించుకొన్నారు.

కళలలోనేకాక వైద్యశాస్త్రములో, సాముద్రిక, జ్యోతిష శాస్త్రాలలో, భరతశాస్త్రములో ఆయనకు అపారమయిన పాండిత్యము ఉండెడిది. ఒక్క మాటలో ఆయన ఒక విజ్ఞాన సర్వస్వము. ఆధునికాంధ్ర కళాసాహిత్య వైభవమును దిగంతములకు వెలార్చిన మహనీయుడు.

ఓ. రా.

అణుబాంబు :- రసాయన శాస్త్రజ్ఞులు పృథివిలోనున్న భౌతిక పదార్థమంతయు 92 మూలపదార్థముల సంయోగవియోగములవలన కలిగినదని నిర్ధారణచేసిరి. ఈ మూలపదార్థములను తిరిగి పరమాణువులనుగా విభజింపవచ్చుననియు, అంతకంటె చిన్నవి ఉండవనియు, ఒక మూలపదార్థమునకు చెందిన పరమాణువుల గుణములు సమానములనియు వారు కనుగొనిరి.

1896 సంవత్సరములో బెకెరెల్ అను పేరుగల ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు యురేనియం అను మూలపదార్థము, $\alpha\ \beta\ \lambda$ (ఆల్ఫా, బీటా, గామా) అనుకొన్ని కిరణములను తనంతటతానే వెలిబుచ్చునని కనుగొనెను. ఇంకను ఇటువంటి పదార్థములు పొలోనియం, రేడియం మొదలైనవి కలవని శ్రీమతి క్యూరి మొదలైన శాస్త్రజ్ఞులు కనుగొనిరి. ఈ మూలపదార్థముల (**Elements**) విశేషమేమనగా, వాటి పరమాణువులు వాటంతట అవే అన్య పరమాణువులుగా మారుచు ఈ కిరణములను వెలిబుచ్చుచుండుటయే; కొన్ని సంవత్సరముల తరువాత 1919లో రుథర్‌ఫర్డు మహాశయుడు నత్రజని (నైట్రోజను) పరమాణువులమీద 'ఆల్ఫా' కిరణములను ప్రయోగించి, వాటిని ఆమ్లజని (**oxygen**) పరమాణువులనుగా మార్చగలిగెను. శక్తిమంతములైన కణములవలన మూలపదార్థములను మార్చవచ్చునని దీనివలన స్థిరపడినది.

పరమాణువులను భేదించుటకు సిద్ధముగా దొరకిన 'ఆల్ఫా' కిరణములే 1932 వరకు మొదట ఉపయోగపడెను. క్రమముగా అన్ని పదార్థముల పరమాణువులను భేదించుటకు వాటిశక్తి చాలదని తెలియవచ్చెను. ఎందుకనగా ప్రతి అణువుగర్భమందున్న బీజము (**Nucleus**)

మహత్తరమైన ధనవిద్యుత్తును కలిగియుండును. ఆల్ఫా కిరణములు కూడ ధనవిద్యుత్తును కలిగియుండుటవలన వాటిశక్తి ఎంతో ఎక్కువగా ఉండినగాని బీజముచుట్టును ఉండు విద్యుత్ - మండలమునుదాటి బీజమును భేదింప లేదు. అందుకు ఆల్ఫాకిరణశక్తి చాలదు.

1932 లో ఛాడ్విక్ అను బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు బెరిలియం అను పదార్థమును ఆల్ఫాకిరణములచే భేదించి న్యూట్రాను (Neutron) అనుక్రొత్తకణము (particle)ను కనిపెట్టెను. ఈ కణములు విద్యుత్ రహితముగా నుండి, శక్తిమంత మగుటవలన తత్తిమ్మా అణువులచుట్టును ఉండు విద్యుత్ మండలము ప్రవేశించుటకు ఏ మాత్రము అడ్డులేకుండెను. అందువలన క్లీబాణువులు (న్యూట్రానులు) ఏ అణువులను పగులకొట్టుటకయిన మిక్కిలి ఉపయోగకారులుగా నుండు నని తెలియవచ్చెను. 1938లో రెండవ ప్రపంచయుద్ధపు ప్రారంభములో ఓటోహాన్ అను జర్మను రసాయన శాస్త్రజ్ఞుడు యురేనియంఅణువులను క్లీబాణువుల (న్యూట్రాన్) వలన పగులగొట్ట గలిగెను. హాన్ విజ్ఞాని, యురేనియం పరమాణువు పగిలి బేరియం, లాంథనం పరమాణువుల క్రింద మారినట్లును, అవి అతిశక్తిమంతములై యున్న ట్లును కనుగొనెను. అదియును గాక ఈ క్రియ యందు రెండు క్రొత్త క్లీబాణువులు (న్యూట్రానులు) ఉత్పత్తి అయినట్టు తేలినది. ఇదే గొప్ప విషయము. ఈ క్లీబాణువులు తిరిగి యురేనియం అణువులను బ్రద్దలుచేయుటకు పనికివచ్చును. బ్రద్దలు అయిన తునుకలు కూడ బహు శక్తి మంతములుగా నుండును. ఆ శక్తి అంతయు వేడిగా మారును. ఇట్లు గొలుసుకట్టుగామార్పుచెంది యురేనియం అంతయు భిన్న భిన్న అణువులుగా మారి బ్రహ్మాండమైన వేడిమిని ఉత్పత్తిచేయును. ఇదియె ఆటంబాంబు యొక్క మూలసూత్రము.

ఈసందర్భములో ద్రవ్యరాశి (Mass), శక్తి (Energy)- వీటిని గురించి కొంచెము తెలిసికొనవలసియున్నది. బహు కాలము వరకు ద్రవ్యరాశి నిత్యత్వము, శక్తి నిత్యత్వము (Conservation of Mass and Energy) అను రెండు ప్రత్యేక సిద్ధాంతము లుండెడివి. కాని ఐన్‌స్టయిన్ అను మహా తత్త్వవేత్త ఆ రెంటిని మేళవించి ఒక సిద్ధాంత మును చేసెను. ఆ సిద్ధాంతము ప్రకారము ద్రవ్యరాశి $E=mc^2$ ప్రకారము శక్తిగా మారవచ్చును. దీని ప్రకారము ఒక గ్రాముపదార్థములో రెండున్నరకోట్ల కిలో వాట్ గంటలకు సమానమైన శక్తి యిమిడి ఉన్నదని తేలును. (విద్యుత్ ఉన్న ఇండ్లలో ఉన్న మీటర్ తెలుపు ప్రమాణము కిలోవాట్ గంట). దీనినిబట్టి రసాయనికము లయిన మార్పుల వలన కలిగిన శక్తి కంటె అణువుల మార్పు వలన కలిగెడు శక్తి పదిలక్షల రెట్లు అధికముగా ఉండునని విశదముకాగలదు. రెండు పరమాణువులు కలిసి వేరొక పరమాణువుగ మారి, దీని రాశి ఆ రెండు పరమాణువుల రాశికంటె తక్కువ అయినచో, ఈ తక్కువయిన రాశి శక్తిగా మారును. ఉదా:- హీలియం పరమాణువును గాని, ఆల్ఫాకిరణమును గాని పరిశీలించినచో అందులో రెండు ప్రాణువులు (ప్రోటానులు) రెండు క్లీబాణువులు (న్యూట్రానులు) ఉండును. లేక నాలుగు ఉదజని (హైడ్రోజన్) పరమాణువులైనను ఉండవచ్చును. వాటి రాశికి హీలియం (యానాతి) రాశికిని భేదము కలదు. అందువలన ప్రతి హీలియం అణువు నాలుగు హైడ్రోజన్ అణువుల నుండి ఉత్పత్తిఅయినచో ఇంత విపరీతపు శక్తి ఉద్భవించును. మన సూర్యునిలో వేడిమిశక్తి ఈ రీతిగానే ఉత్పత్తి అగుచున్నట్లు శాస్త్రజ్ఞుల నమ్మకము.

అణువులలో కెల్లను యురేనియం అణువు మిగుల బరువు కలది. ఆ అణువుమీద న్యూట్రాన్ ప్రయోగించినచో అది రెండు తునుకలుగా పగులును. ఆ తునుకల రాశి అసలు అణువురాశికంటె తక్కువ. అది శక్తిగా మారును. అయితే ఇంత శక్తి ఉద్భవించుటకు కొన్ని షరతులున్నవి. న్యూట్రాన్ వేగము మందముగా నుండవలెను. ఇంకొక సంగతి! కిరణాతువు (యురేనియం)లో రెండు తరగతుల అణువులున్నవి. 1. యురేనియం 238 రాశి అనియు, 2. యురేనియం 235 రాశి అనియును. రెండవది సాధారణపు యురేనియంలో 139-వ భాగము మాత్రమే. ఈ తేలిక యురేనియమే మందగతి క్లీబాణువుల(న్యూట్రానుల)వల్ల భేదింపబడును. కాని యురేనియం 238 అంతసులభముగా భేదింపబడదు. రెంటికిగల ఈ భేదము బోర్ మహాశయుడు మొదట నిరూపించెను. అయితే యురేనియంలో నున్న ఈ రెండు తరగతుల అణువులను వేరుచేయుట మిక్కిలి కష్టసాధ్యమైన పని.

దానికి రెండు మూడు మార్గములున్నవి. కాని ప్రతి మార్గము గొప్ప వ్యయప్రయాసములమీద ఆధారపడి యున్నది. విస్తార ధనవ్యయముతోకూడిన పని. అయినను అత్యంతమైన అవసరము వలన గత యుద్ధమందు ఆ పని నెరవేర్పబడినది. ఇంకొక సంగతి :- యురేనియం 238 యందు వేగముగల న్యూట్రానులను ప్రయోగించినచో, అది సోపానక్రమముగా చతుర్నివాతువు(ప్లూటోనియం) అను ఇంకొక క్రొత్త అణువుక్రింద మారును. ఈ ప్లూటోనియం కూడా న్యూట్రానులవలన సులభముగా భేదింపబడి గొప్ప శక్తినిచ్చును. అందువలన యురేనియం 235 తోపాటు ప్లూటోనియం కూడ అణుబాంబునకు మిక్కిలి అవసరమైన పదార్థము. ఈ రెండు పదార్థములు మందగతి న్యూట్రానుల వలన భేదింపబడగలవు. భేదింపబడుటయేకాక ఆ పగులుడు (Fission) లో న్యూట్రానుల వరకు కూడ ఉత్పత్తి అగును. కాని ఇట్లుత్పత్తియగు న్యూట్రానుల వేగము చాలా ఎక్కువగా నుండును.

సాధారణపు మందుగుండు బాంబువలెగాక యీ అణుబాంబు ప్రేలుడుకు వ్యవధి మిక్కిలి తక్కువ. కాలము సెకండులో పదిలక్షల వంతు. సామాన్యపు బాంబుకు సెకండులో వెయ్యి వంతు. ఇంత త్వరితముగా జరుగుటకు న్యూట్రానులు అత్యధికముగా ఉత్పత్తి కావలెను. పైనచెప్పిన ప్రకారము యూరేనియం 235 వగిలినచో రెండు న్యూట్రానులు బయలుదేరవచ్చును. ఆ రెండును మరినాల్గింటిని ఉత్పత్తిచేయును. ఇటుల డెబ్బది పురుషాంతరాలకు పదివేలకోటికోట్లు న్యూట్రానులు సృష్టి అగును. వీటివలన తయారగుశక్తి పదిటన్నుల T. N. T మందుగుండునకు సమానము. కాని ఒక ఆటంబాంబుశక్తి యిరవైవేల T.N.T తో సమానము. అందుకుగాను ఇంకొక పదిపురుషాంతరాలు అవసరము. ఇంతతొందరగా వెళ్ళుచున్న న్యూట్రానులు ఇంత అధికమగుటకు వలసిన కాలము సెకండులో పైనిచెప్పినట్టు పదిలక్షలవంతు మాత్రమే. ఇంత తక్కువకాలములో ప్రేలుడు జరుగవలయును. కాని నిజమునకు న్యూట్రానులు ఇంతత్వరితముగా అధికముకావు. ఎందుచేతననగా అందులో కొన్ని తక్కిన అణువులవలన పీల్చుకొన (absorb)బడును. కొన్ని పదార్థమును విడిచి పైకిపోవును. అయితే ఇన్నివిధములుగా నష్టపడినను అణువు పగులుడు (Fission) వలన ఒక న్యూట్రానుకు ఎక్కువమొత్తముపైన ఉత్పత్తి అయిన యెడల ఈ పరంపరా సంఘటనము (chain reaction) జరుగుటకు పూర్తి అవకాశము కలదు.

పైనచెప్పిన విషయములనుబట్టి కొన్ని సంగతులు విశదమైనవి. యూరేనియం 235, ప్లుటోనియం, న్యూట్రానులవలన భేదింపబడి అత్యల్పకాలములో గొప్పశక్తిని ఇయ్యగలవని నిరూపింపబడినది. అయితే యీ ప్రేలుడుకు యురేనియంముద్ద కొంత అవధిపరిమాణము ఉండవలెను. ఆ ముద్దను రెండుతునకలుచేసి ఆ రెంటిని దగ్గరకు తీసుకొని వచ్చుటలో న్యూట్రానులు ఉత్పత్తిఅయి పైని చెప్పినట్టు అతిస్వల్పకాలములో ప్రేలును. ఆముద్ద కొన్ని పౌనులుండవచ్చునని అంచనా వేయబడినది. ఆ రెండు ముక్కలను ఎట్లు దగ్గరకు తీసుకొనివచ్చుట అనునది ఇంకను రహస్యముగానున్నది. ఈ సందర్భములో కొన్ని ఆర్థిక పరిస్థితులను గమనించుటయుక్తము. మొదటి ఆటంబాంబుకు రెండువందలకోట్ల డాలర్లు వ్యయమైనట్టు తెలిసినది. అనగా అదిమన ఇండియా కేంద్ర, రాష్ట్రముల రెండుసంవత్సరముల ఆదాయము. ఆబాంబు తయారు అగుటకు ముఖ్యకారణము యుద్ధపు ఒత్తిడి. అనగా జర్మనులు ముందుతయారు చేయుదురేమోఅని భయము. శాంతిసమయములో ఐతే ఆ బాంబును తయారుచేయుటకు ఏ పదునైదు సంవత్సరాలకాలమో పట్టియుండెడిది. కాని యుద్ధసమయము అగుటవలన అది మూడు నాలుగు సంవత్సరములలోనే సాధింపబడెను. సర్వశక్తులు దీని క్రింద వినియోగింపబడెను. అటువంటి పని ధనముతో తులతూగుచున్న అమెరికాలో మాత్రమే సాధ్యము. తరువాత రమారమి అటువంటి పరిస్థితు లుండుటచేతనే రష్యాలో కూడ ఆ పని సాధ్యమయ్యెను.

ఈ బాంబునకు గల నాశనశక్తికి హిరోషిమా, నాగసాకి పట్టణములు నిదర్శనము. బాంబు ప్రేలుడువలన కలిగెడు వేడియొక్క ఉగ్రత కోటి డిగ్రీలు. అనగా సూర్యునిలోనున్న ఉష్ణోగ్రతకు దగ్గరదగ్గరగా సమానమన్నమాట. ప్రేలుడు వలన ఉత్పత్తి అయ్యెడు అగ్నిగోళము నూరు అడుగులుండును. అది మేఘమువలె పైకిలేచి కుక్కగొడుగు యొక్క రూపమును దాల్చును.

కొన్ని నిముసములలో అది విచ్ఛిన్నమయి చెదరిపోవును. అయితే యింత విపరీతపు నాశనమునకు కారణము ఈ వేడియే కాదు. ఈ అపరిమితమైన వేడిమివలన గాలిలో గొప్ప యొత్తిడికలిగి, ఆ విపరీతపు ఒత్తిడి వలన నూరు తుపానులు ఒకేసారి వచ్చినప్పటి వాయువు కెరటపు (Shock wave) శక్తికలిగి, అది గోడలు, ఇండ్లు ఒక్కసారి భూమట్టము చేయును. దీని వెనువెంటనే గామా కిరణములు మనుష్యుల శల్యములలో ప్రవేశించి ప్రాణములు తీయును. మొత్తముమీద నాలుగైదు చతురపు మైళ్ళలో నున్న ఏ జంతుకోటి కూడ మిగులదు.

మీద చెప్పబడిన బాంబు యురేనియం అణువుల పగులుడు వలన తయారు చేయబడినది. బరువు అణువు పగిలి మిగిలిన తునుక అణువుల రాశి తక్కువగా నుండుటవలన ఆ భేదరాశి శక్తిగా మారును. ఇంకొక విధముగా కూడ శక్తి ఉత్పత్తి అగునని మీద నిరూపింపబడినది. హైడ్రోజన్ అణువులనుండి హీలియం అణువులు తయారు అయినప్పుడు కూడ శక్తి ఉత్పత్తి అగును. కాని ఈ శక్తికి కోటి డిగ్రీల వేడిమి అవసరము. ఆ వేడి యురేనియం 235, ప్లుటోనియం బాంబువలన కలుగజేసినచో హైడ్రోజన్ బాంబును ప్రేల్చవచ్చును. ఈ బాంబునకు నాశనమొనర్చు శక్తి యింకను హెచ్చు.

ఈ బాంబులు ప్రేలునప్పుడు అక్కడిప్రదేశము నాశనమగుటయే కాక, విషకిరణములు ఉత్పత్తి అయి వాయువువలన అవి వ్యాపించి, చుట్టుపట్లనున్న ప్రదేశములను కూడ నాశనమొనర్చును. ఇంకొక ప్రపంచయుద్ధము జరిగి ఈ ఆటంబాంబులు ఉపయోగింపబడినచో మన భూప్రపంచమంతకు ప్రమాదము వచ్చునని వేరుగా చెప్పనక్కరలేదు.

జె. సి. కా. రా.

**అతి భౌతిక శాస్త్రము :-** మోటా ఫిజిక్సు అను శబ్దము తొలుత అరిస్టాటిల్ చేత ఉపయోగింపబడెను. మెటా అనగా పరము, ఫిజిక్సు అనగా భౌతికశాస్త్రము. భౌతికతత్త్వమునకు పరమైన తత్త్వము యొక్క శాస్త్రము మెటా ఫిజిక్సు. దీని ముఖ్యోద్దేశము సత్తయొక్క స్వరూపమును నిరూపించుట. అందుచేత దీనిని పారభౌతిక శాస్త్రమని, సత్తాశాస్త్రమని, తత్త్వశాస్త్రమని కూడా పిలువవచ్చును. "తత్" అనగా, "అది" అనగా సత్తయే. అందుచేత సత్తకు, తత్త్వమునకు అర్థము ఒక్కటిగానే గ్రహింపవచ్చును. అరిస్టాటిలు అర్థము ఏమయినను ప్రస్తుతము ఈ శాస్త్రమును ప్రమాణశాస్త్రమునుండి, తర్కశాస్త్రమునుండి విడదీయుటకలదు. సత్తాశాస్త్రము సత్తా స్వరూపమును, ప్రమాణశాస్త్రము సత్య స్వరూపమును, తర్కశాస్త్రము అనుమాన పద్ధతిని నిరూపణము చేయును.

సత్యము (truth) అనునది జ్ఞానమునకు చెందినది. "కలము నల్లగా ఉన్నది" అను వాక్యమునందు "ఉండుట" కలమునకు చెందినది. కలము నిజముగా ఉన్నచో ఈ వాక్యము సత్యము ; ఎఱ్ఱగా ఉన్నచో అసత్యము. అందుచేత సత్యాసత్యములు వాక్యమునకు చెందును. ఒకప్పుడు మనము వాక్యమును ఉచ్చరించక పోవచ్చును. అయినను, "కలము నల్లగా ఉన్నది" అను ప్రత్యక్షజ్ఞానమందు కూడ సత్యాసత్యములు ఉన్నవి. ఉదాహరణము రజ్జుసర్ప జ్ఞానము. రజ్జువునుచూచి సర్పమని అనుకొనవచ్చును. సత్యమునకు ప్రమ అని, అసత్యమునకు భ్రమ అని పర్యాయములు.

ఇప్పుడు సత్తాశాస్త్రము అను పదము అన్ని శాస్త్రముల సంపుటికి ఉపయోగించు వాడుక కలదు. ద్రవ్య స్వరూపము, కార్యకారణ స్వరూపము, ధర్మస్వరూపము, జీవ స్వరూపము, ఆత్మస్వరూపము, ప్రపంచ స్వరూపము, టూకీగా సర్వ సత్తాస్వరూపము నిర్ణయించు శాస్త్రము సత్తాశాస్త్రము.

వస్తుసత్త జ్ఞానవేద్యమయినప్పుడే గుర్తించబడును గనుక, సత్తాశాస్త్రమునకు, సత్యతాశాస్త్రమునకు సంబంధము గలదు. సత్త సత్యమయినప్పుడే సత్త యగును. లేనిచో అసత్తయే. అందుచేత సత్తాశాస్త్రము చదివినప్పుడు సత్యతాశాస్త్రముకూడ చదువవలసి యున్నది. పరసత్త అనేది ఒకటి ఉన్నదా ? ఉన్నచో దానిని ఎట్లు తెలిసికొనుట ? అను ప్రశ్నలు సత్యతాశాస్త్రము యొక్క విషయములు.

మొట్టమొదట యూరోపు దేశమున ప్లేటో వస్తుసత్త బుద్ధి (reason) గోచరముగాని, ఇంద్రియ (sense) గోచరము కాదని అనెను. అరిస్టాటిలు బుద్ధిగోచర

మయినను ప్రత్యక్షకృత విషయమందే అది ఉంకునని చెప్పెను. తర్వాత మధ్యయుగము లందలి దార్శనికులు ప్రపంచసత్త ఈశ్వరసత్తనుండి వేదితవ్యమని నుడివిరి. కాని నవీన యుగమున ప్రకృతిసత్తాస్వరూప గ్రహణము ద్వారా ఈశ్వరసత్తాస్వరూపమును గ్రహింపవలెనని దార్శనికుల అభిప్రాయము.

పదునారవ శతాబ్దమున డెకార్టు ప్రతి ప్రత్యక్షము సంశయాస్పదమని ప్రారంభించెను. నేను చూచుచున్న వస్తువు లన్నియు స్వప్నతుల్యములు ఎందుకు కాకూడదు? ఎవడైనా ఒక మాయావి యీ దృశ్యములను సృష్టించుచున్నాడేమో? నేను చదువుచున్న పుస్తకము నిజమైన పుస్తకము ఎందుకు కావలెను? అది నిజమైనదని నిర్ధారణ చేయుట ఎట్లు? కనుక ప్రతి జ్ఞానము సంశయ విషయము అయినచో సత్తారూపమును నిర్ణయించుట ఎట్లు? "నేను సంశయించుచున్నాను" అనుచోట సంశయకర్త నిజముకావలెను. సంశయ విషయము నిజము కాకపోవచ్చును. అందుచేత సత్తాశాస్త్రము "నేను" నుండి ప్రారంభము కావలెను. అయితే "నేను" అనునది ఉత్పన్న వస్తువు: కార్యముగాని, నిత్యము కాదు. ప్రతి కార్యమునకు కారణ ముండవలెను. ప్రతి మానవునకు మాతాపితరులు కారణభూతులు; వారికి వారి మాతాపితరులు. ఇట్లు అనంతముగా కార్యకారణ నిరూపణము సాగును. ఇది సాంతము కావలెనన్నచో అందరికి ఈశ్వరుడే కారణభూతుడని చెప్పవలెను. ఈశ్వరుడు పరంపరగా ఆ జ్ఞానమునకు కూడ కారణ భూతుడు. ఆయన నిష్కపటి, వాత్సల్య స్వరూపుడు. అందుచేత మానవులకు మాయాదృశ్యములు చూపించి మాయ చేయడు. తత్కారణముగా మానవుల జ్ఞానములు యథార్థములు. మనము మనస్సును రాగాది దోషముల నుండి శుద్ధము చేసినచో యథార్థమునే సర్వదా తెలిసికొందుము.

డెకార్టు సర్వసత్త ద్రవ్యస్వరూపమని భావించెను. ఈ ద్రవ్యము రెండు విధములు, జడము, మానసము. జడ ద్రవ్యస్వరూపము విస్తృతత్వము, మానసద్రవ్యస్వరూపము జ్ఞానము. ఈ రెంటికి సామాన్య గుణము ఏదియు లేదు. జడము చలనహీనము. మానసము చలనసహితము.

డెకార్టు సిద్ధాంతము స్పినోజాకు నచ్చలేదు. వస్తుజ్ఞానోత్పత్తి మానసజడ ద్రవ్యసంయోగము వలన కలుగును. గాని అవి ఏకాంతభిన్నములయినచో ఎట్లు జ్ఞానోత్పత్తి కొరకు కలిసికొనగలవు? సంయోగశీలత వస్తువులకు సామాన్యగుణము ద్వారానే కలుగగలదు. మనస్సునకు జడపదార్థమునకు సంయోగసంబంధశీలత లేనపుడు జ్ఞానము అసంభవము. కాని జ్ఞానము సర్వజనవేద్యము. అందుచేత మనోజడములు ఏకాంతభిన్నద్రవ్యములుకావు. ద్రవ్యము ఒక్కటియే, అది ఈశ్వర స్వరూపము. దానికి పెక్కు విశేష గుణములు కలవు. వాటిలో రెండు మనస్సు, జడత. కాగితముయొక్క రెండు ప్రక్కలవలె ఈ రెండును పరస్పరాపేక్ష కలవి. ఒకదానిలో మార్పు కలిగినప్పుడు రెండవ దానిలో తదుచితమైన మార్పు కలుగును. ఈ మార్పు మానసమున జ్ఞానాకారము పొందును. జంతుకోటియు, జడవస్తుకోటియు ఈశ్వరుని విశేషగుణముల విశేషణములు (modes).

ద్రవ్యము ఒక్కటియే అను సిద్ధాంతము లైబ్నిజ్జు స్వీకరింపలేదు. ద్రవ్యము ఒక్కటే అయినచో మానవుల వేరు వేరు అనుభవములకు కారణము ఏమి? వారివారి స్వతంత్ర కర్మలకు కారణమేమి? అందుచేత ద్రవ్య బహుత్వము స్వీకరించవలెను. అదియునుగాక మానసము ఒకటే మాత్రము చలనశీలము కాదు. జడద్రవ్యము కూడ చలనశీలమే. దానిలోను శక్తి (force) ఉన్నది. చలన శీలత మానసత్వసూచకమైనచో జడద్రవ్యముకూడ మానసమే. అది అనావిర్భూతమానసము. ప్రపంచమున కేవల జడమాత్రమనునది లేదు. సర్వము అణుపరిమిత మానసోపేతము. ఈ మనస్సులకు లైబ్నిజ్జు మొనాడులు (monads) అని పేరిడెను. అవి అణువులకంటె చిన్నవైనను మహత్తుకంటే మహత్తరములు. వాటికి పరస్పరము ఏ జోక్యములేదు.

అయినను ప్రతి మొనాడు ప్రపంచమునంతటిని అంతరంగికముగానే గ్రహించును. బహిర్ముఖముగా చూచుటకు దానికి కిటికీలులేవు. (The monads are windowless) జ్ఞానము బహిర్వస్తుజనితము కాదు. అంతరంగిక వికాసము. ఈ వికాసము కొన్ని మొనాడులలో ఎక్కువగాను, కొన్నిటియందు తక్కువగాను ఉండును.

మిక్కిలి తక్కువ వికాసముకలవాటిని జడములని, ఎక్కువ వికాసములుకలవాటిని మానసములని మనము తెలిసికొందుము. ఈశ్వరుడుకూడ ఒక మొనాడుమాత్రమే. అతడు మొనాడులన్నిటిని సృజించినపుడు పరస్పరసంగతి (harmony) దృష్టితో సృజించెను. గడియారము చేయువాడు అన్ని గడియారములు ఒకే సమయమును చూపునట్లు ఏలాగుచేయునో, ఆలాగే ఈశ్వరుడుగూడ ఒకే విధమైన ప్రపంచజ్ఞానమును, పొందునట్లు మొనాడులను సృజించెను. వీరందరు హేతు ప్రాధాన్యవాదులు (rationalists) అని పిలువబడుదురు. సత్యము వస్త్వపేక్షితముగాని, బుద్ధ్యపేక్షితము గాదని ఇంగ్లాండులో లాకను తన సిద్ధాంతమును వెల్లడించెను. ప్రపంచమున ఏ ఏ సత్తలు కలవు? అవి ఎన్ని విధములు? ఏ స్వరూపములు కలవి? అను విషయము బుద్ధియొక్క స్వరూపమును, స్వభావమును పరిశీలించినంతమాత్రమున తెలియదు. అది ప్రత్యక్షానుభవమువలననే తెలియగలదు. ప్రపంచములో అయిదు మహాభూతములు కలవా? అరువది భూతములు కలవా? అరువదికంటె హెచ్చుగా నున్నవా? అను విషయము బుద్ధిని పరిశీలించిన మాత్రమున ఎట్లు తెలిసికొనగలుగుదుము? అందుచేత ఇంద్రియ జ్ఞానాధారమే సర్వజ్ఞానము. ఈ మతమునకు అనుభవ మూలవాదము (empiricism) అని పేరు. లాకను గొప్ప దార్శనికుడు కాడు. అయినను అతడు ఈ వాదమునకు పునాది వేసినవాడు. దీనిని పురస్కరించుకొని లాకు, బెర్కిలీ, హ్యూము అనువారు తమ దర్శనములను నిర్మించిరి. ప్రత్యక్షానుభవమే ప్రధానమైనచో లైబ్నిట్జు చెప్పిన ప్రకారము అంతరంగముగా బుద్ధివికాసమే సత్యమును సత్తను జ్ఞాతము చేయజాలదు. అదియునుగాక జాతిజ్ఞానము (knowledge of the universal) ప్రత్యక్షోద్భూతమేగాని ప్రత్యక్షకారకముకాదు; బుద్ధ్యంతరంగోద్భూతముకాదు. మనము పెక్కుమంది మనుష్యులనుచూచి, వారి సామాన్య గుణములను సంగ్రహించి, ఆ గుణసంపుటికి మనుష్యజాతి పదము వాడుదుము. మనుష్యజాతికి మనుష్య వ్యక్తి సత్తాభిన్నమైన వేరొక సత్తలేదు. వేరుగా మనము వాడినప్పుడు అది నామమాత్రము, బుద్ధ్యాకృతి మాత్రము, మనోవృత్తి మాత్రము అని లాకు వాదము.

లాకు ప్రారంభించిన వాదమును బెర్కిలీ విస్తరించెను. అనుభవైకవేద్యమే సత్త అయినచో జడద్రవ్యముయొక్క సత్త ఏ అనుభవముయొక్క గోచరము? నారింజకాయ ఆకుపచ్చగాను, పుల్లగాను ఉన్నదని, రంగు యొక్కయు రుచి యొక్కయు సత్త నారింజకాయయందు ఉన్నదని, నారింజకాయ ఈ రంగుకు రుచికి ఆధారమని భావింతుము. కాని నా కన్ను రంగు గ్రుడ్డి అయినచో రంగు కనిపించదు. పైత్య భూయిష్ఠమైనచో సర్వము పసుపుగా కనిపించును. అందుచేత రంగు నా మానసిక వృత్తిగాని, విషయవృత్తి గాదు. ఆలాగుననే పులుపు గూడ మానసిక వృత్తియే. ఈ గుణములన్నిటికి భిన్నమైన నారింజయను జడద్రవ్యమును చూచినవాడెవ్వడు? జడద్రవ్యము గుణాధారమని అందురు. గుణములుమాత్రమే ప్రత్యక్షములు. తదాధారము ఎవ్వరికి గోచరము కాదు. తదుపరి గుణములు మానసికములు. అందుచేత జడద్రవ్యము అసత్య పదార్థము. దానికి సత్తలేదు. సత్త సర్వదా మానసికద్రవ్యమే.

బెర్కిలీ జడద్రవ్యమును నిరాకరించినరీతినే హ్యూము మానసద్రవ్యమును కూడ నిరాకరించెను. జడద్రవ్యము ప్రత్యక్షవేద్యము కానిచో మానసద్రవ్యము మాత్రము ప్రత్యక్షవేద్యమా? పంచజ్ఞానేంద్రియములలో దేనికిని మానసము ప్రత్యక్షముకాదు. నేను నా అంతరంగమున చూచినప్పుడు కొన్ని భావములు, సుఖదుఃఖములు, జ్ఞానములు, కల్పనలు మొదలగునవి ప్రత్యక్షమగును గాని మనస్సు మాత్రము ప్రత్యక్షముకాదు. అందుచేత మనోద్రవ్యమనునదిఉన్నదని రూఢిచేయలేము. అటులనే జాతిపద విషయములకు (universals) వ్యాప్తులకు (universal - judgments) సత్త ఉన్నదని నిర్ధారణ చేయలేము. దేని సత్త అయినను, ఇంద్రియ విషయము అయినగాని, తత్సంబద్ధము అయిన గాని ఒప్పుకొనబడదు.

అయినచో ఈశ్వరునికి సత్తలేదా? ఆత్మకు సత్తలేదా? కార్యకారణభావము అసత్యమా? కార్యకారణభావమే అసత్యమయినచో శాస్త్రజ్ఞానమే అసంభవమగును. శాస్త్రముల నిర్వచనములన్నియు దానిమీదనే ఆధారపడియున్నవి. లేనిచో ప్రపంచకమంతయు యాదృచ్ఛికమగును. కార్యకారణద్యోతకము వ్యాప్తివాక్యము;

అనగా సామాన్య వాక్యము. ధూమమునుండి అగ్నిని అనుమానము చేసినప్పుడు అగ్ని ధూమమునకు సర్వత్ర సర్వదా కారణమని ఒప్పుకొనియే అనుమానము చేయుదుము. కాని ఎవడు సర్వాగ్నులను సర్వత్ర సర్వదా చూచినవాడు ? లేనప్పుడు, మన జ్ఞానము సర్వము సంశయాస్పదమగును. తత్ఫలితము సంశయతాసిద్ధాంతము (skepticism). ఈ ఫలితమును తొలగించుటకు కాంటు పూనుకొని ప్రపంచానుభవమునకు కారణములు రెండని, అవి అంతఃకరణము వస్తు స్వసత్త (thing in itself) అని చూపెను. కాంటు అంతఃకరణమునకు మూడుభాగములు అని చెప్పెను. అవి ఇంద్రియవేదన (sensation) (వేదన అను పారిభాషిక పదమును బౌద్ధులు వాడుదురు), మనోవృత్తి, బుద్ధివృత్తి, వస్త్వంతఃకరణముల సంయోగము వలన సర్వ ప్రపంచము ఉద్భవించును. కేవలము వస్తువు గాని, కేవలము అంతఃకరణముగాని ప్రపంచమునుసృజింప నేరదు. "ఆత్మా మనసా సంయుజ్యతే। మన ఇంద్రియేణ। ఇంద్రియ మర్థేన తతః ప్రత్యక్షం" అన్నట్లు వస్తు స్వసత్త ఇంద్రియముల ద్వారా అంతఃకరణముతో సంబంధమైనప్పుడు ఇంద్రియచేతన ఉద్భవించును. ఇంద్రియచేతనలే దృశ్య ప్రపంచముయొక్క ద్రవ్యసామగ్రి. కాని మైనము ముద్రలను స్వీకరించునట్లు అంతఃకరణము ఇంద్రియవేదనలను స్వీకరింపదు. వాటిని తన ద్వారముల ద్వారా తీసికొనుచు వాటికి తన రూపములను ఇచ్చును. అట్లు చేయని ఇంద్రియచేతనలు ఈ రూపములు. ఈ రూపములు మూడు విధములు. ఇంద్రియచైతన్యరూపములు, మానసచైతన్య రూపములు, బుద్ధిచైతన్య రూపములు (forms of sensation, understanding and reason) మొదటివి దిక్కాలములు (space and time). ప్రతి ఇంద్రియచేతనను అంతఃకరణము దిక్కాలములద్వారా లోపలికి ప్రవేశపెట్టుకొనును. అందుచేత ప్రతివస్తువు దిక్కాలనియమితమైనట్టు మన అనుభవము. దిక్కాలరూపితములైన ఇంద్రియచేతనలకు అంతఃకరణము మనస్సుద్వారా ద్రవ్యగుణ, కార్య కారణాది రూపములను ఇచ్చును. అందుచేత మనము ప్రతివస్తువును కార్యముగను, కారణముగను, ద్రవ్యముగను, గుణముగను, అనుభవగోచరము చేసికొందుము. అనుభవ విషయములనన్నింటిని బుద్ధి సంచితముచేసి, పరస్పర సంబంధములు కల్పించి, ఏకీకృతముచేసి, ఏకవస్త్వంగములుగా నిరూపించును. ప్రపంచములోని నియామక సూత్రములన్నింటికి అంతఃకరణమే మూలము. పద్ధతిబద్ధమైన ప్రపంచము అంతఃకరణ సృష్టము. అందుచేత అంతఃకరణము, ఆ నియామక సూత్రములను తదాధారములైన వ్యాప్తులను తెలిసికొనగలదు. తత్కారణముగా శాస్త్రజ్ఞానము అసంభవము కానేరాదు.

ప్రపంచకము యాదృచ్ఛికముగాక, సూత్రబద్ధమైనది. ఈ సూత్రములు బుద్ధినిర్మితములగుటచేత ప్రపంచముగూడ బుద్ధినిర్మితమే. బుద్ధికిగోచరముకానిది, ఇంద్రియ చేతనలకు కారణమైనది, వస్తుస్వసత్త (Thing in itself) అనునది వేరొకటిలేదు. దృశ్య ప్రపంచము వెనుక అదృశ్య ప్రపంచము వేరొకటి ఒప్పుకొనము. వ్యావహారికసత్త అని, పారమార్థికసత్త అని, రెండుసత్తలులేవు. సత్త అన్నది బుద్ధిగ్రాహ్యము; బుద్ధినిర్మితము. స్వార్థాయత్తసత్తాకమైన వస్తువు ఒకటి ఉన్నదని కాంటు పొరపాటు బడెనని హెగెలు వాదించెను. బుద్ధినిరూప్యమే సత్త, సత్తయే బుద్ధినిరూప్యము. (The rational is real, and the real is rational). బుద్ధియొక్క అంతరంగ తత్త్వములను (Categories) తెలిసికొనినచో ప్రపంచస్వభావమును తెలిసికొనగలము, బుద్ధికి ఏకసత్తాన్వేషణయే పరమగతి. ఏకసత్తావాదమే సత్యము (Monism) పరమాత్మస్వరూపమే (Absolute consciousness) ఏకసత్త. హెగెలు ప్రపంచపు దార్శనికులలో మొదటితరగతిలోనివాడు. ఆయన ప్రభావము రమారమి నూటఏబదిసంవత్సరములు ప్రపంచము మీద వ్యాపించెను. మార్క్సు కూడ ఆయన సిద్ధాంతమును మార్చి స్వీకరించెను.

కాని యీ హెగెలువాదము ప్రత్యక్ష ప్రాధాన్యవాదులకు నచ్చలేదు. బుద్ధి స్వభావమును గ్రహించినను ప్రపంచ స్వభావమును గ్రహింపలేము. ప్రత్యక్షము, ప్రత్యక్షాధారమయిన అనుమానము అవసరములు. జడద్రవ్య స్వభావము భౌతికవిజ్ఞానము వలనను, జంతు స్వభావము జంతుశాస్త్రము వలనను, మనఃస్వభావము మనశ్శాస్త్రమువలనను, ప్రత్యక్షమును, అనుమానమును, యంత్రములను (instruments of knowledge) ఉపయోగించియు తెలిసికొనవలెను. బుద్ధిమీద మాత్రము ఆధార

పడుట వ్యర్థము. అందుచేత సత్యాన్వేషణకు సత్తాన్వేషణకు వేరువేరు విధానములను కలుగజేసికొనవలెను. ఈశ్వరాన్వేషణ కూడ అట్టి విధానములనే ఉపయోగించి సాగించవలెను. విజ్ఞానశాస్త్రములను (sciences) ఇందు కొరకు ఉపయోగించుకొనవలెను. ఇట్లు ప్రస్తుతపు దార్శనికులలో ఎక్కువమంది అభిప్రాయపడుచున్నారు.

కాని ప్రకృతిశాస్త్రములకు (Natural Sciences) కూడ సత్తాన్వేషణ ఆవశ్యకము. కార్యకారణవిధానము అసత్యమైనచో ఏ శాస్త్రము పనిచేయలేదని ఇదివరకే సూచింపబడినది. ప్రతి శాస్త్రము తాను పరిశోధించు వస్తువునకు కారణము కనిపెట్టును. ఇదియే దాని నిర్వచన పద్ధతి (method of explanation). నిజముగా కార్యకారణభావమునకు సత్త లేనిచో శాస్త్రము నిష్ప్రయోజనమగును. ఉన్నచో దానిని సమర్థించుట ఎట్లు? తత్త్వశాస్త్రజ్ఞులు ఈ సమర్థనము చేయకపోయినను సత్యమని స్వీకరించియే తమ పని చేయుదురు. కాని సత్తాశాస్త్రము, కార్యకారణభావము సత్యమా అసత్యమా అనుదానిని రూఢిచేయును. అటులనే కర్మ సత్యమా అసత్యమా? అసత్యమైనచో ధర్మశాస్త్రము నిర్మూలమగును. అటులనే మానవబహుత్వము సత్యమా అసత్యమా? అసత్యమైనచో సంఘశాస్త్రములు (Social Sciences) నిర్మూలములగును. సత్యమైనచో నేను చూచువాడు నా సజాతి జీవుడని నేను ఎట్లు గ్రహింపగలను? ప్రత్యక్షముగా అతని ప్రాణమునుగాని, మనస్సునుగాని చూడలేను. నాకు కనుపించునవి అతని రంగు, ఆకృతి అనుమానమును పురస్కరించుకొని అతడు పురుషుడనుటకు వీలులేదు. వలన అనుమానమునకు ప్రత్యక్షము ఆధారము. ప్రత్యక్షముగా ఎక్కడైన ఇతరుల మనస్సు నేను చూచిఉండవలెను. కాని ఎక్కడను ఇది అసంభవము. నిరాధారమైన అనుమానము ఇతర మానవసత్తను ఎట్లు స్థాపింపగలదు? విజ్ఞానశాస్త్రములకు మూలభూతములైన యీ ప్రశ్నలన్నియు తత్త్వశాస్త్రము విమర్శింపవలయును.

వర్తమాన యుగమున జడద్రవ్యము నిశ్చలముకాదని స్థిరీకరింపబడినది. మూలసత్త జడము కాదని, అది చైతన్యోపేతము, ఉత్తేజస్సంకలితము అయిన ప్రాణరూపమని (life), అదియే కాలము (time) అని, బెర్గ్‌సను బోధించెను. దానిస్వరూపము పరిణామిత్వము కాదు, పరిణామమే. అనగా, పరిణమించే వస్తువు ఒకటి, దాని పరిణామము వేరొకటి. బెర్గ్‌సను మతానుసారము మూలసత్త ఒక వస్తువుయొక్క పరిణామము కాదు. పరిణామ స్వరూపమే. దానిస్వరూపము స్వభావముకూడ పరిణామమే. అది ఏదైనా ఒక ఆకృతి (pattern) స్వీకరించి నప్పుడు, ఆ యాకృతికి మనము ఒక పేరుపెట్టి ద్రవ్యము (substance) అని అందుము.

బెర్గ్‌సను వాదములోని ఈ పరిణామమాత్ర భాగమునే వైజ్ఞానిక తత్త్వజ్ఞులు (Scientific Philosophers) స్వీకరించిరి. ఐన్‌స్టైను అను భౌతిక గణితశాస్త్రవేత్త, కాలము దిక్కు వేరువేరు తత్త్వములు కావనియు, దిక్కాలమనునది space-time ఒకటే తత్త్వమనియు, నిరూపించెను. దానినుండియే ప్రపంచము ఉద్భవించినదని అలెగ్జాండరు వాదించెను. దిక్కాలము నుండి జడద్రవ్యము, జడద్రవ్యము నుండి ప్రాణికోటి, ప్రాణికోటినుండి చిత్తవంతములను (mental-beings) చిత్తవంతములనుండి సర్వేశ్వరుడు ఉద్భవించుట - ఇది దిక్కాలముయొక్క పరిణామకృత్యమని ఆయన మతము. లాయడ్‌మార్గము కొంచము అదేవిధముగా బోధించెను. ఈయన జడద్రవ్యముతో ప్రారంభించును. ఈశ్వరుని కూడ మొదటనే పెట్టి, అతనిని జడద్రవ్యపరిణామమునకు ప్రేరకునిగా భావించును. వైటుహెడ్డు కూడ కొంచము ఈ మోస్తరు పరిణామమునే స్వీకరించెను. ఈయన అధునాతన సత్తాశాస్త్రజ్ఞులలో అగ్రగణ్యుడు. గొప్ప గణితశాస్త్రవేత్త. మూలసత్త అనునది ఘటనా సమూహము (events). అది మానవదృగ్గోచరము కాదు; అనుమేయము. ఈ ఘటనలు (events) ఒక సంప్రదాయమును, ఒక ఆకృతిని అనుసరించినచో స్థాయి ద్రవ్యము ఉద్భవించును. మన పూర్వకాలికులు చెప్పిన పరమాణువులు ఘటనాసమూహములు. అవి అవిభాజ్యములు కావు; అవి భేద్యములు కావు; అవి భాజ్యములు; అవి భేద్యములు; క్షణికములగు ఘటనలు మాత్రమే. ఈశ్వరుడు వీటిని సంఘములుగాను, సంప్రదాయములుగాను ప్రవాహాకృతిని పొందుటకు ప్రేరేపించును.

ఈ ప్రేరణవల్ల దృశ్య జడపదార్థములు, ప్రాణులు, చైత్యములు ఉద్భవించును. ఇవి అన్నియు ఈ ఘటనాప్రవాహములు ధరించిన ఆకృతి రూపములు. ఘటనలు అన్నియు అనేక విధములుగా పరస్పర సంబద్ధములు. ఈ ఆకృతులు కూడ అనంతవిధములు. ఘటనలకు ఆకృతికారకుడు ఈశ్వరుడు. ఆకృతులన్నియు నిత్యవస్తువులు ( exteranal objects ); ఈశ్వరుని బుద్ధిరూపములు ( conceptual forms); ఆయన బుద్ధిస్వభావసంఘటితములు. ఘటనలు నిరాకారములు అయినప్పుడు ఈశ్వరుడు కేవలము బుద్ధి స్వరూపమున ఉండును. ఆకృతులకు అప్పుడు సత్త ఉండదు. ఘటనలకు మాత్రమే సత్త ఉండును. ఘటనలు ఆకృతులను స్వీకరించినప్పుడు, ఆకృతులకు కూడ సత్త చెందును. మనము ద్రవ్యము అని పిలుచునది ఘటనల యొక్క ఒక ఆకృతి. ఈ ఆకృతులకు సత్త కలిగినప్పుడు ఈశ్వరునికి కూడ సత్త కలుగును. అందుచేత ఈశ్వరునికి రెండు భావములు : కేవల బుద్ధిభావము, సత్తా భావము (conceptual and actual) అని.

పాశ్చాత్య దర్శనములందు సత్త పరిపరివిధముల నిర్వచింపబడినది. కొందరిచే కేవలము ఈశ్వరసత్తతో ప్రారంభించి మానవసత్త జడసత్త నిర్వచింపబడినవి. అధునాతనులచే జడసత్తతో ప్రారంభించి, మానవసత్త ఈశ్వర సత్త నిర్వచింపబడినవి. ఈ రెండు రీతులయందు మానవ సత్త తన ప్రాముఖ్యమును కోల్పోయినది. అందుచేత ధర్మ శాస్త్రమునకు హానికలిగినది. ఈశ్వరసత్తను స్వీకరించుట గాని, నిరాకరించుటగాని మానవుడే తన బుద్ధివలన చేయవలెను. అటులనే జడసత్తను స్వీకరించుటగాని, నిరాకరించుటగాని మానవునిదే. కనుక ధర్మశాస్త్ర ప్రారంభమునకు మానవుడు మూలమని, కేంద్రమని, చెప్పవచ్చును. ఈశ్వరసత్తను స్వీకరించి, తత్సాక్షాత్కారమునకు ప్రయత్నము చేయునది మానవుడు. ఈశ్వరుడు నిత్య సంపూర్ణ స్వరూపుడైనందున అతనికి ప్రయత్నా ప్రయత్నములు, కోరికలు, మనోరథము యొక్క సఫలత్వ విఫలత్వములు లేవు. కనుక ధర్మశాస్త్రములు, విజ్ఞాన శాస్త్రములు మానవునికొరకు ఉద్దిష్టములు. మానవుడే అప్రధానుడైనచో ఈ శాస్త్రములన్నియు నిరర్థకములు. జడసత్త మానవునకు అనుకూలముగా నున్నను, ప్రతికూలముగా నున్నను ఉదాసీనతయే. ప్రపంచకము సార్థకమైనచో దాని సార్థకత మానవాపేక్షచేతనే కలుగును. ఈశ్వర దృష్టిచే ప్రపంచమునకు సార్థకత నిరర్థకత అనునవి లేవు. జడదృష్టిచే కూడ అవి లేవు. అందుచేత ఏ సత్తాశాస్త్రమైనను ప్రథమమున మానవుని జీవనమును, కర్మమును నడపడిని, ధర్మమును, వీటి సార్థకతను చూపవలెను. ఈ అభిప్రాయముననే ఇప్పుడు ప్రపంచమున ప్రాధాన్యము లభించుచున్నది.

డెకార్టు చెప్పినట్లు మానవుడు సర్వమును సంశయింపగలడు. కాని తన సత్తను సంశయింపలేడు. తాను అనిత్యుడు మర్త్యుడు అయినను అతని సత్తయే ప్రథమమున నిశ్చయవేద్యము ; అనిరాకరణీయము. బుద్ధిని ఉపయోగించినకొలది తన సత్త, తన దేహ పరిమితమే గాక తనను అతిక్రమించి ఉన్నట్లు మానవుడు తెలిసికొనును. ఇది సంకుచితముగాని ప్రతిబుద్ధికి వేద్యము. ఈ అతిక్రమణ (Transcendence) విధాన మెట్టిదో తెలిసికొనుట సత్తాశాస్త్రము యొక్క ఒక ముఖ్య విషయము. ఈ అతిక్రమణమును అంతఃక్రమణముగా చేయు విధానమే ధర్మము. తదనుకూల ప్రవర్తనమే ధర్మ ప్రవర్తనము. తదనుకూల జీవనమే జీవన వికాసము. ఈ వికాసమునకు ఈశ్వర సాక్షాత్కారము అంతిమకోటి. ఇట్లు మానవ జీవనమునకు, ధర్మమునకు, కర్మకు ప్రాధాన్యము ఇచ్చిన సత్తాశాస్త్రమే సత్యము కాగలదు. తక్కినవాటి సత్యాసత్యములు నిరూపించుట వ్యర్థ ప్రయత్నము. సత్తా శాస్త్రములలో పరస్పర వైరుధ్య ముండుటచే అన్నియు సత్యములు కాజాలవు. అయినచో ఒక్కటియే సత్యము కాగలదు. సత్యము ఏక స్వరూపము. అసత్యములు అనంతములు. రెండు రెండు కలిసిన ఎంతవచ్చును ? అను ప్రశ్నకు నిజమైన ఉత్తరము ఒక్కటియే. తప్పులు అనంతములు. నాలుగుసంఖ్య తప్ప తక్కిన సంఖ్యలు అన్నియు తప్పు జవాబులు. అటులనే ధర్మశాస్త్రములు, సత్తాశాస్త్రములు. వాటిలో సత్యము లెవ్వియో సత్యేతరము లెవ్వియో భగవంతునకే ఎరుక. మానవుడు తనబుద్ధిని ఉపయోగించి సత్యమును తెలిసికొనుటకు సర్వ ప్రయత్నములు అనేక శతాబ్దులనుండి చేయుచున్నాడు. కొంచెముకొంచెముగా అతని ప్రయత్నములు సఫలములు

కూడ అయినవి. అయినను పరసత్త ఎట్టి స్వభావము కలదియో నిర్ణయింపగలుగుదాక తన జీవితమునుగాని, కర్మనుగాని, అతడు ఆపలేడు. కావున ఈ రెండింటిని ప్రథమమున స్వీకరించి దర్శనశాస్త్రము నిర్మించవలసి యుండును.

సత్తాశాస్త్రమును ప్రస్తుతకాలమున దర్శనశాస్త్రమునకు పర్యాయముగా కూడ వాడుట కలదు. సర్వప్రపంచమునకు సామాన్య సత్తాస్వరూపము ఎట్టిదో తెలిసికొనుటకంటె వేర్వేరు సత్తల స్వరూపము తెలిసికొనుట సులభము. కనుక తత్త్వశాస్త్రము ప్రపంచశాస్త్రము (cosmology) సత్తాశాస్త్రము (ontology) పురుషార్థశాస్త్రము (philosophy of values) మతవిజ్ఞానము (philosophy of religion) మొదలగు శాఖలుగా విభజింపబడినది. అన్నిటియందును సత్తావిషయక ప్రశ్నలు ఎత్తుకొనబడును.

పి. టి. రా.

**అతి శ్రుతి ధ్వని శాస్త్రము :- (Ultrasonics)** మానవకర్ణమునకు సెకండునకు 20 నుండి 20,000 పరివర్తనముల (cycles) మధ్యనుండు కంపన ప్రమాణము (frequency) గల ధ్వని తరంగములనుమాత్రమే గ్రహింపగల శక్తికలదు. 20,000 పరివర్తనములకంటె ఎక్కువ కంపనప్రమాణము గల ధ్వనితరంగములు మానవ కర్ణముపై ఎట్టి ప్రభావమును కలుగచేయలేవు. ఇట్టి ధ్వని తరంగములను అతి శ్రుతి ధ్వని తరంగములు (Ultrasonic Waves) అందురు. ఈతరంగముల యొక్క ఉనికి 1883వ సంవత్సరమునుండి తెలియవచ్చినదని చెప్పవచ్చును.

**అతి శ్రుతి ధ్వని తరంగముల పుట్టుక :** అతి శ్రుతి ధ్వని తరంగముల ఉత్పత్తిచేయు విధానములను స్థూలముగా నాలుగు విభాగములు చేయవచ్చును.

1. యాంత్రిక ఉత్పాదకములు (Mechanical generators).

2. ఉష్ణతా ఉత్పాదకములు (Thermal generators).

3. మేగ్నెటోస్ట్రిక్షను ఉత్పాదకము (Magneto-striction generator).

4. పీడనజనిత విద్యుత్తు ఉత్పాదకము (Piezoelectric generator).

**1. యాంత్రిక ఉత్పాదకములు :** 1899 వ సంవత్సరములో కోనిగ్ అను శాస్త్రజ్ఞుడు కొలది మిల్లిమీటర్లపొడవు గల చిన్న శ్రుతిదండము (Tuning fork) ల సహాయమున గాలిలో దాదాపు సెకండునకు 90,000 పరివర్తనముల వరకు కంపన ప్రమాణముగల అతి శ్రుతి ధ్వనులను ఉత్పత్తి చేసెను. ఈవిధముగా ఉత్పత్తికాబడిన తరంగములు అధికముగా మాంద్యమునొంది (Heavily damped) త్వరలో నశించిపోవుటచేత ప్రయోగమునకు పనికిరావు. దాదాపు సెకండునకు 1,00,000 పరివర్తనముల వరకు కంపన ప్రమాణముగల తరంగములను గాల్టను ఈల (Galtan whistle) సహాయమున పొందవచ్చును. ఇందు, ఒక దీర్ఘ ఛిద్రము (narrow slit) నుండి వెలువడు గాలిప్రవాహము పదునైన అంచునకు తగిలి, ఆ అంచునకు సంబంధించియుండు గొట్టములోని గాలిని కంపింప చేయును. ఇట్లు గాలి కంపించుటలో ఒక సంగీత ధ్వని వెలువడును. ఈ కంపనములు స్థిరమైన కంపన ప్రమాణమును, విస్తృతి (amplitude) ని కలిగియుండుటచే ప్రయోగములలో ఎక్కువ ఉపయోగకరములుగా ఉండును. ఈ పద్ధతిని అనుసరించియే హార్టుమను, హోల్ట్జమను అనువారు సెకండునకు 1,20,000 పరివర్తనముల వరకు కంపన ప్రమాణముగల ధ్వని తరంగములను ఉత్పత్తిచేయు రెండు ఉత్పాదకములను (Hartmann's gas current genenator and Holtzmann's ultrasonic generator) కనుగొనిరి.

**2. ఉష్ణతా ఉత్పాదకములు :** మాంద్యమునొందిన (damped) డోలకపు (oscialltory) పరిపథము (circuit) వలన ఏర్పడిన విద్యుత్ విస్ఫులింగము (Spark) యొక్క సహాయమున ఆల్టుబెర్గ్ అను శాస్త్రజ్ఞుడు సెకండునకు 3,00,000 పరివర్తనములవరకు కంపనప్రమాణముగల అతి శ్రుతి ధ్వని తరంగములను ఉత్పత్తి చేసెను. వికల్ప విద్యుత్ప్రవాహము (Alternating current) చే కప్పబడిన ఏకముఖ ప్రవాహ (Direct current) చాపము సహాయమున సెకండునకు దాదాపు 20 లక్షల పరివర్తనములవరకు కంపన ప్రమాణముగల అతి శ్రుతి ధ్వని తరంగములను ఉత్పత్తి చేయవచ్చును. నేటికాలమున ఈ ఉష్ణతా ఉత్పాదకములు అంత ఎక్కువగా ఉపయోగింపబడుటలేదు.

3. **మేగ్నెటోస్ట్రిక్షను ఉత్పాదకము : (The Magnetostriction generator)** నికెలు మున్నగు అయస్కాంత లోహసంబంధమగు కడ్డీగాని గొట్టముగాని పరివర్తిత అయస్కాంతక్షేత్రము (Alternating magnetic field) లోనికి తేబడినపుడు అయస్కాంతీకరణము వలన కడ్డీ లేక గొట్టముయొక్క పొడవు నియమిత కాలములో మారును. ఇట్టి సంఘటనను "మేగ్నెటోస్ట్రిక్షను ఉత్పాదకము" అందురు. వికల్ప విద్యుత్ప్రవాహము యొక్క కంపనప్రమాణము, నికెలు కడ్డీయొక్క స్వాభావిక కంపనప్రమాణము సమానముగా నున్నపుడు, అనునాదము (resonance) పుట్టి, కంపనవిస్తృతి గరిష్ఠముగా నుండి, కడ్డీ చివరనుండి అదే కంపనప్రమాణము గల ధ్వని తరంగములు వెలువడును.

4. **పీడన జనిత విద్యుత్ ఉత్పాదకము :** నేడు అతి శ్రుతిధ్వని తరంగములను ఉత్పత్తి చేయుటకు ఈ విధానమే విరివిగా నుపయోగింప బడుచున్నది. ఈ పద్ధతిని ఉప యోగించి సెకండునకు దాదాపు 3,000 లక్షల పరివర్త నముల వరకు కంపన ప్రమాణముగల ధ్వనితరంగములు ఉత్పత్తి చేయబడినవి. ఇంతకంటె హెచ్చు కంపన ప్రమాణము గల ధ్వనితరంగములు నేటివరకును ఉత్పత్తి కాలేదు.

శిలా స్ఫటికములను ఒత్తిడికిగాని వ్యాకోచపు శక్తికి (tension) గాని గురిచేసినప్పుడు, ఆ స్ఫటికములయొక్క నిర్దిష్ట ఉపరితలములపై విద్యుత్తు పుట్టునని 1880 వ సంవత్సరములో క్యూరీ దంపతులు కనుగొనిరి. ఈ సంఘటనను పీడనజనిత విద్యుత్ప్రభావము అందురు. ఈ ప్రభావము క్రింది స్ఫటికములలో కూడ కాననగును. టూరుమలైను (Tourmaline) యశదగంధకిదము (Zinc blende), సోడియ హరితము (Sodium chlorate) తింత్రిణ్యామ్లకము (Tartaric acid), కండచక్కెర (Cane sugar), రాచెలి లవణము (Rochelle salt) పొటాసియ ద్వి ఉదజ భాస్వరితము (Potassium dihydrogen Phosphate), అమ్మోనియా ద్వి ఉదజ భాస్వరితము (Ammonium dihydrogen Phosphate), ఎథిలిన్ డైఎమైన్-టార్ట్రేటు (Ethylene diamine tartrate మొదలగునవి.

తరువాత కొలదికాలములోనే పీడనజనితవిద్యుత్ప్రభావమునకు విరుద్ధమైన ప్రభావమును కూడ క్యూరీ దంపతులు కనుగొనిరి. ఒక శిలాస్ఫటికమును నిర్దిష్టదిశలో వికల్ప విద్యుత్ క్షేత్రమునందు ఉంచినచో ఆ శిలా స్ఫటికము నిర్దిష్ట దిశలలో సంకోచించుట (Contract) గాని వ్యాకోచించుట (expand) గాని జరుగును. శిలా స్ఫటికము యొక్క పీడనజనిత విద్యుత్తు అక్షము (Piezoelectric axis) విద్యుత్ క్షేత్రపు అక్షముతో ఏకీభ వించవలెను. ఇట్లు ఉంచినచో ఆ శిలాస్ఫటికము విద్యుత్ క్షేత్రపు మొదటి అర్ధ పరివర్తనములో పొట్టిదిగా నొక్కబడి రెండవ అర్ధ పరివర్తనములో ఆ ప్రమాణము గానే సాగును. ఈ విధముగా శిలాస్ఫటికము స్థితిస్థాప కత్వముగల డోలనములను (Elastic oscillations) పొందును. ఈ డోలనముల ఆవర్తన కాలము (Period) వికల్ప విద్యుత్ క్షేత్రపు ఆవర్తనకాలమునకు సమాన




*ప్రేరక విద్యుత్ వాహకముల నడుమ శిలాస్ఫటిక ఫలక నిక్షేపము.*
*$l, d$ = శిలా ఫలకము $x, y, z$ = సంకోచ వ్యాకోచ దిశలు*
*$s$ = వికల్ప విద్యుత్ క్షేత్రము*

ముగా నుండును. శిలాస్ఫటిక ఫలకము యొక్క స్వాభావికమగు యాంత్రిక కంపన ప్రమాణముతో విద్యుత్కంపన ప్రమాణము అనునాదము జరిపినపుడు, కంపనముల విస్తృతి గరిష్ఠముగా నుండును. ఈ విధముగా అనునాదమునందు శిలాస్ఫటిక ఫలకము అతిశ్రుతి ధ్వను లను పుట్టించును. స్వాభావిక కంపన ప్రమాణమునకు సంబంధించిన ఏ బేసి అనుస్వరమువద్ద నైనను ఆ శిలా స్ఫటికము అనునాదపు కంపనములను పొందునట్లుగా చేయవచ్చును. అందువలన సెకండునకు 20,000 పరివర్త నములనుండి కొన్నివేల లక్షల పరివర్తనముల వరకు కంపన ప్రమాణముగల అతిశ్రుతి ధ్వనులను విద్యుత్పీడన జనకముచే పొందగలము. అనునాదమునందు శిలాస్ఫటి

కపుప్రకంపనములు అధిక తీక్ష్ణముగా (sharp) నుండును. అందువలన స్థిరమైన కంపన ప్రమాణములు గాను, ప్రేషణ యంత్రముల నడుపుటలోను, డోలన వలయము లను (Oscillating circuit s) స్థిరీకరించుట యందును అనునాదముపద్ద ప్రకంపించు శిలాస్ఫటిక ఫలకములను ఉపయోగించెదరు. కొలదికాలమునుండియే స్వాభావిక ముగా లభించు విద్యుత్పీడన స్ఫటికములకు బదులుగా మట్టి సంబంధమగు ద్రవ్యముల (Ceramic materials) నుండి రాసాయనికముగా తయారు చేయబడిన బేరియం టిటానేటి (Barium titanate) మొదలగు వాటిని అతి శ్రుతి ధ్వని జనకములుగా ఉపయోగించుచున్నారు. ఇట్టి అతిశ్రుతిధ్వని జనకములు ఎక్కువ పరిమాణమును (Large size) కలిగి యుండుటచే ఎక్కువ వెడల్పగు తరంగజాలమును ఇచ్చును.

అతి శ్రుతి ధ్వనుల పరిశోధనము (Detection):- సామాన్యముగా శబ్దతరంగముల పరిశోధనకు ఉపయోగ పడు విధానము లన్నియు అతిశ్రుతి ధ్వనులను గుర్తించు టకు వినియోగింపవచ్చును. చెవినిమాత్రము ఉపయో గించుటకు వీలుపడదు. అతిశ్రుతి ధ్వనులను గుర్తించుటకు ఉపయోగపడు వేరువేరు గ్రాహిణులను మూడు రక ములుగా విభజింపవచ్చును.

1. యాంత్రిక గ్రాహిణులు (Mechaincal detectors) : పొగ, ధూళి, బిందుకణములు, పటలములు (Films), జ్వాలలు, వికిరణమానములు (Radiometers).

2. విద్యుత్ గ్రాహిణులు (Electrical detectors) : ప్రతిరోధకములు (Resistors), వేడి తీగెలు (Hot wires).

3. దృగ్విధానము (Optical methods) : ఛాయా రేఖలు (Shadowgraphs), ష్లీరెన్ (Schlieren) విధానము నమన విధానము (Diffraction method).

యాంత్రిక, విద్యుత్‌గ్రాహిణులు ద్రవద్రవ్యముల (Fluids) లోను, దృగ్విధానములు ద్రవములలోను సంపూర్ణకిరణ భేద్యమగు (Transparent) ఘనపదార్థము లలోను ఉపయోగింపబడు చున్నవి.

1. యాంత్రిక గ్రాహిణులు : తేలికయగు ఘనపదార్థపు కణములనుగాని ద్రవపు బిందువులనుగాని (ఉదాహరణకు చుట్టపొగలో నుండు నట్టివి) వాయువుతోకూడిన ధ్వని క్షేత్రములోనికి ప్రవేశపెట్టబడినపుడు, ఆ కణములు వాయుకణముల చలనమును అనుసరించుటచే ధ్వనితరంగముల చిత్రమును ఇచ్చును. ధ్వనితరం గముయొక్క నిష్పంద బిందువుల (Nodes) వద్ద బుడగలు ఏర్పడునట్లు చేయుటచే ఆ తరంగముయొక్క రూపము కనుపించునట్లు చేయవచ్చును. పురిగల నారచే (Torsion fibre) వ్రేలాడ తీయబడిన గుండ్రని బిళ్ళపై (disc) అతిశ్రుతిధ్వని తరంగజాలమును పడునట్లు చేసినచో, ఆ పురి పై భాగమున ఏర్పడు మెలిక (Twist)యే తరంగజాలపు తీవ్రత (Intensity) కు ప్రమాణమగును. అతిశ్రుతిధ్వనిజాలమును గుర్తించుటకు ఉపయోగపడు వికిరణమానమునందు ఈ సూత్రమే ఉపయోగింపబడు చున్నది. అతిశ్రుతిధ్వనిజాలమును గుర్తించుటకు సబ్బు పటలము (Soap film) ను గాని సునిశితమగు జ్వాలను (Sensitive flame) గాని ఉపయోగింపవచ్చును.

2. విద్యుత్ గ్రాహిణులు : ఒక ద్రవద్రవ్యముయొక్క ఉష్ణోగ్రతలో, దానియందు జరుగు సంపీడన విరళీకరణ ముల (Compressions and rarefactions) మూలమున, కొద్దిమార్పులు జరుగును. దాని ఉష్ణోగ్రత అతికొంచె ముగా మారుటచే అతి సున్నితమగు ఉష్ణోగ్రతా మాపక ములు మాత్రమే ఆ మార్పును గుర్తింప గల్గును. ధ్వని తరంగమార్గములో ఒక వేడితీగెను (Hot wire) ఉంచి నచో అది చల్లబడును. ఈ చల్లబడుటను (అనగా ఉష్ణో గ్రతలో మార్పును) తరంగముయొక్క వేగమునకును విస్తృతికిని ప్రమాణముగా తీసికొనవచ్చును. ధ్వనిక్షేత్ర మును అన్వేషించుటకు ఉపయోగించు హాట్ వైర్ మైక్రోఫోను (Hot wire microphone) నందలి మూల సూత్రము ఇదియే. దీనియందు ఒక సన్నని ప్లాటినము లేక నికెలు తీగను ఉపయోగింతురు. ఈ తీగను ధ్వని క్షేత్రములో ఉంచినపుడు దాని ఉష్ణోగ్రత మారును. దీని ఫలితముగా ఆ తీగయొక్క నిరోధకత్వము నందును మార్పు కల్గును. నిరోధకత్వమునందలి మార్పు ధ్వనితరంగముల విస్తృతికి ప్రమాణమగును.

దృగ్విధానములు : ఒక ద్రవద్రవ్యమునందు ధ్వనితరంగ జాలమును పంపినపుడు, తరంగముఖరంగము (Wave-front) న సంపీడనము, విరళీకరణములు జరుగును. అందు

వలన తరంగముఖమార్గమున వేరువేరు ప్రదేశములలో స్రవద్రవ్యముయొక్క సాంద్రత మారును. దీనివలన వక్రీభవన ఘాతాంశము (Refractive index) నందును మార్పు సంభవించును. ధ్వనిక్షేత్రము (Q) నకు సమకోణ మార్గములో కాంతిజాలమును పంపినచో, అతిశ్రుతి ధ్వని తరంగముల ఛాయను ఒక తెరపైగాని లేక కొద్దిదూరము నందుండు ఛాయాగ్రహణ చిత్రఫలకము (S) పైగాని పడునట్లు చేయవచ్చును. ఆ ఛాయయొక్క రూపము, తరంగముఖముయొక్క ఆకారముపై ఆధారపడి యుండును. తరంగముఖము గోళాకారముగా నున్నచో ఛాయ గుండ్రముగాను, సమతలము కలదిగా నున్నచో, సరళ రేఖాకారముతోను ఉండును. దృగ్విధానము




అతి శ్రుతి ధ్వని తరంగముల మూలమున కలుగు కాంతి నమనము యొక్క పరిశీలనార్థమై సాధనముల కూర్పు


a — ధ్వనితరంగములు లేనప్పటి దృశ్యము


b — ప్రధాన తరంగ దృశ్యము


c — తృతీయ క్రమ తరంగ దృశ్యము


d — పంచమ క్రమ తరంగ దృశ్యము

*జయిలాలులో (Xylol) ధ్వనితరంగములవలన కలుగు నమన విచ్ఛిన్న కిరణములు

అన్నింటిలో ఇదియే మూలసూత్రము. ఒక స్రవద్రవ్యము నందు ధ్వని తరంగమును పంపినపుడు ఆ స్రవద్రవ్యము యొక్క వక్రీభవన ఘాతాంశము వికల్పముగా హెచ్చుటయు, తగ్గుటయు జరుగును. అందుచే ధ్వనిక్షేత్రము ఒక దృక్ - రేఖాఫలకము (Optical grating) గా పని చేయును. ఒక దీర్ఘ ఛిద్రమునుండి వచ్చు కాంతికిరణ జాలమును ధ్వనిక్షేత్రమునకు సమకోణమార్గములో పంపినచో ఆ కాంతికిరణజాలము నమనము నొందును. ధ్వనిక్షేత్రము లేనపుడు తెరపై దీర్ఘ ఛిద్రము యొక్క ప్రతిబింబము ఒక్కటే కనుపించును (a). ధ్వనిక్షేత్రము వున్నపుడు, కాంతి కిరణజాలము నమనము నొందును గాన దీర్ఘ ఛిద్రముయొక్క మధ్య ప్రతిబింబమునకు ఇరువైపుల అనేక ప్రతిబింబములు కనుపించును (b, c, d).

చేతిలోనుండు సమస్యా స్వభావముపై ఆధారపడి వేరువేరు పనులకు వేరువేరు గ్రహణ ఉపాయములు ఉపయోగింపబడుచున్నవి. స్రవద్రవ్యములలోని శోషణము (absorption) ను, వేగమును నిర్ణయించుటకు గల పద్ధతులలో కాంతి నమన విధానము ఎక్కువ వాడుకలో నున్నది. దీనికి కారణములు కొంతవరకు దాని క్రొత్తదనము, అది ప్రదర్శించు దృశ్యము అయి ఉండవచ్చును.

**అతిశ్రుతి ధ్వని శాస్త్రముయొక్క ప్రయోజనములు (Applications):** అతిశ్రుతి ధ్వని శాస్త్రము ఒక మాదిరిగా క్రొత్త శాస్త్రమనియే చెప్పవచ్చును. భౌతిక శాస్త్రజ్ఞుల యొక్కయు భౌతిక రసాయనిక శాస్త్రజ్ఞుల యొక్కయు హస్తములలో ఈ శాస్త్రము సునిశితమైన ఉపకరణము అయినది. ద్రవపదార్థములను వాయు పదార్థములను పరిశోధించుటయందు అతిశ్రుతి ధ్వని తరంగములు విస్తారముగా ఉపయోగింప బడినవి. వివిధ స్రవ ద్రవ్యములందు ఈ తరంగముల వేగమును, శోషణమును నిర్ణయించుటచే ఆ స్రవద్రవ్యముల అణునిర్మాణము (Molecular structure) ను గూర్చి తెలిసికొనవచ్చును. తక్కువ కంపన ప్రమాణముగల (అనగా చెవికి వినబడునట్టి) శబ్ద తరంగములను ఉపయోగించి స్రవద్రవ్యము లందు వేగము, శోషణము నిర్ణయించుట్లలో పెక్కు చిక్కులు కలవు. ఎక్కువ కంపన ప్రమాణముగల అతిశ్రుతి ధ్వని తరంగములను ఉపయోగించుటచే ఈచిక్కులు మాయమగును. అందుచే అతిశ్రుతి ధ్వని తరంగములను ఉపయోగించి వేగమును, శోషణమును వివిధ స్రవ ద్రవ్యములందు నిర్ణయించుటకు అనేక సునిశితమైన పనిముట్లు (Highly accurate instruments) కనుగొనబడినవి. వీనిలో అల్ట్రాసోనికు ఇన్‌టర్‌ఫెరోమీటర్ (Ultrasonic interferometer) అతి సునిశితమైనది. దీనిని దృక్శాస్త్రమందు దీని ప్రతిరూపమయిన రేఖా ఫలకవు కిరణ పృథక్కరణమానము (Grating spectrometer)తో పోల్చవచ్చును. స్రవద్రవ్యములనేకాక ఘనపదార్థములను కూడ పరిశోధించుటయందు అతిశ్రుతి ధ్వనితరంగములు ఎక్కువగా ఉపయోగింపబడినవి. ఘనపదార్థములలో కొన్ని ఏక స్ఫటికములు (Single crystals) గాను మరికొన్ని స్ఫటిక సముదాయములు (Polycrystalline aggregates) గాను ఉండును. వీని స్థితి స్థాపక ధర్మము లను సమగ్రముగా పరిశోధించుటయందు అతిశ్రుతి ధ్వని తరంగములు విరివిగా ఉపయోగింపబడుచున్నవి. ఇట్టి పరిశోధన కొరకు అనేక పద్ధతులు కనుగొనబడినవి. నేటికాలమున ఘనపదార్థములందును ద్రవపదార్థములందును ధ్వని తరంగవేగమును, శోషణమును కనుగొనుటకు ఒక నూతనపద్ధతి ఉపయోగింపబడుచున్నది. దీనిని పల్సు టెక్నిక్ (Pulse Technique) అందురు. అల్ట్రాసోనిక్ ఇన్‌టర్ ఫెరోమీటరు కంటె ఇది ఎక్కువ సునిశితమైనది. ఇందు అతిశ్రుతి ధ్వని తరంగములకు బదులు పల్సులను (Pulses) వాడుదురు. ఈ అల్ట్రాసోనిక్ పల్సులను ఆయా పదార్థములలో పంపించి, అవి ఒక నిర్ణీత దూరము ప్రయాణము చేయుటకుపట్టు కాల వ్యవధిని సునిశితమైన పద్ధతులచే నిర్ణయింతురు. దీనివలన ఆయా పదార్థములలో పల్సుల వేగమును కనుగొనవచ్చును. పల్సుల నుపయోగించి మరికొన్ని సాధనముల ద్వారా శోషణమునుగూడ నిర్ణయింప వచ్చును. ఇట్టి పరిశోధనముల మూలమున దశాత్రయమునందుండు పదార్థముల అణునిర్మాణమును నిరూపింప వచ్చును.

రసాయన శాలలో శాస్త్ర పరిశోధనములకే గాక అతిశ్రుతి తరంగములు సాంకేతికముగా కూడ అనేక విధములుగా ఉపయోగింపబడుచున్నవి. లోహశోధన కార్యము (Metallurgy) వాయు పృథక్కరణము (Gas analysis) పీడన మాపకములు (Pressure gauges) పింగాణి సంబంధమగు మట్టి పరిశోధనలు (Ceramic research) ప్రతిస్ఫటిక పరిశోధనము (Colloid research) ఔషధపు పరిశోధనములు, జీవశాస్త్రపు పరిశోధనములు లోహపుపూత (అనగా మాలామా చేయుట), ధ్వని సాంకేతిక కార్యములు (Sound signalling) - వీనియందు అతిశ్రుతి ధ్వని తరంగముల సాంకేతిక ప్రయోగములు కాననగును.

అతిశ్రుతి ధ్వని తరంగముల ప్రథమ సాంకేతిక ప్రయోగములలో ధ్వని సాంకేతిక కార్యము ఒకటి. అధిక కంపన ప్రమాణముగల ధ్వని తరంగములను ఉపయోగించుటవలన కలుగు గొప్ప లాభక్షేమమన, ఈతరంగములను అతిసులభముగా ఒక పుంజము (beam) గా ఏర్పడునట్లు చేయవచ్చును. ఇట్లేర్పడుటచే నిర్దిష్టమైన దిశయందు సంకేతముచే సమాచారమును పంపుటకు వీలగుచున్నది. 1914 నుండి 1918 వరకు జరిగిన ప్రథమ ప్రపంచ సంగ్రామ సందర్భమున నీటియందు మునిగియుండు శత్రువుల జలాంతర్గాముల ఆచూకీలను తెలిసికొనుటకు లాంజెవాన్ (Langevin) అనుశాస్త్రజ్ఞుడు అతిశ్రుతి ధ్వని తరంగములను మొట్టమొదట ఉపయో •

గించెను. అతి శ్రుతి ధ్వని పరంగ సాంకేతికములు లఘు అంతరములలో (Short intervals) ఒక ప్రేషణ యంత్రమునుండి (Transmitter) సముద్రము అడుగు భాగమునకు పంపబడును, ఇట్లు పంపబడిన ధ్వని కిరణము నీటి అడుగున ఉన్న వస్తువు (Object) నకు తగిలి పరావర్తనము చెందును. పరావర్తనము చెంది తిరిగి వచ్చు ధ్వనికిరణము ప్రేషణయంత్రము చేతనే గ్రహింపబడును. పరావర్తనము చెందిన ధ్వనికిరణముయొక్క తీక్ష్ణతను (Intensity) బట్టి పరావర్తనమునకు కారణభూతమైన వస్తువుయొక్క స్వభావమును తెలిసికొనవచ్చును. వస్తువు వద్దకుపోయి తిరిగి వచ్చుటకు ధ్వనితరంగములకు వలసిన కాలమును కొలుచుటవలన, తరంగవేగము తెలియును గాన, వస్తువుయొక్క దూరమును కనుకొనవచ్చును. ఈ ప్రతిధ్వని సూత్రమువలన సముద్రముయొక్క లోతును నిర్ణయింపవచ్చును. దీనివలన సముద్రగర్భముయొక్క స్వభావము (అనగా బురద, ఇసుక, బంకమన్ను-వీనిలో ఏది సముద్ర గర్భములో నున్నదో) ను కూడ గ్రహింపవీలగును.



ప్రతిధ్వని సహాయమున
సముద్రముయొక్క లోతును కనుగొను పద్ధతి

ఈ ప్రతిధ్వనిసూత్రము ఇటీవల సముద్రపు అడుగుభాగమునందు చేపలను పట్టుటకు మిక్కిలి ఉపయోగపడుచున్నది. బెస్తలు చేపలను పట్టుటకు అనువయినలోతును, చేపల గుంపుల ఉనికిని కనిపెట్టుటకు ఈ సూత్రము ఉపయోగించును.

అతిశ్రుతి ధ్వని తరంగములచే లోహములందలి లోపములను పరిశోధించు విధానము ఇప్పటికే భారీ యెత్తున యంత్రాగారములలో ఉపయోగింపబడు చున్నవి. పల్సు టెక్నిక్‌ను ఉపయోగించి లోహములయొక్క పరీక్ష జరుపబడుచున్నది. ఈ విధానములో సెకండునకు సుమారు 50 లక్షల పరివర్తనముల కంపనప్రమాణముగల ధ్వని పల్సును పరిశోధింపవలసిన నమోనాద్వార పంపింతురు. ధ్వని పల్సు పోవుమార్గములో నమోనాయందు బీటగాని, పగులుగాని ఉండినచో ఆ పల్సుయొక్క శక్తి నలువైపులకు వెదజల్లబడుటగాని (Scattered), ఉత్పాదకమునకు (Transducer) పరావర్తనముచే తిరిగి పంపబడుట గాని సంభవించును. ఇట్లు తిరిగివచ్చు సాంకేతికము (received signal) స్వంకితమైన (Calibrated) విద్యుత్కణ డోలన లేఖకము (Cathode-ray oscillograph) పై చూపబడును. దీనినిబట్టి లోహములందు లోపము లున్నదీ లేనిదీ తెలిసికొననగును. లోపములు లేని లోహముల యొక్క స్థితిస్థాపక ధర్మములను తెలిసికొనుటకు అతి శ్రుతి ధ్వనిని ఉపయోగింతురు. ద్రవీభూత లోహముల నుండి వాయువును తీసివేయుటకు అనగా రాసాయనిక విక్రియ (Chemical reaction) వలన ఏర్పడిన బుడగలను తీసివేయుటకుకూడ అతిశ్రుతి ధ్వని తరంగములు ఉపయోగింపబడుచున్నవి. అట్లు వాయువు తీసివేయబడనిచో, ఆ బుడగలు లోహమునందే దాగియుండి లోహముయొక్క అవిచ్ఛిన్నతను (Continuity) పాడు చేయును.

1927వ సంవత్సరమునాటికే వుడ్ (Wood) మరియు లూమిస్ (Loomis) అను శాస్త్రజ్ఞులు ఒకదానితో నొకటి కలియని, నీరు, నూనె; నీరు, పాదరసము వంటి ద్రవ పదార్థములను తీక్ష్ణమైన అతిశ్రుతి ధ్వని తరంగముల సాయమున సుస్థిరమైన రసాయనము (Stable emulsion) గా మార్చవచ్చునని చూపిరి. తక్కువ ద్రవీభవన స్థానము (low melting point) కలిగిన లోహములను గాని మిశ్రలోహములను (alloys) గాని ఎక్కువ ద్రవీభవన స్థానముగల నీటితో లేక నూనెతో ద్రవస్థితియందు కలిపి, హద్దు ఉపరితలము (boundary surface) పై అతి

శ్రుతి ధ్వని వికిరణము (radiation) సోకునట్లు చేయబడెను. ఈ విధముగా మారినెస్కో (Marinesco) అను శాస్త్రజ్ఞుడు సోడియము, పొటాసియము, పాదరసము, సీసము మున్నగు లోహములను అతిశ్రుతి ధ్వని తరంగముల చర్యవలన సారాయి, నూనె, నీరు మున్నగు ద్రవములలో చెదరగొట్టెను (dispersed). అధిక కంపన ప్రమాణముగల ప్రకంపనముల సహాయమున ఛాయాగ్రహణమునందు ఉపయోగించు రసాయనమును అభివృద్ధి పరచవచ్చునని కనుగొనబడినది. ఉక్కును నత్రజని సహాయమున వేగముగా గట్టిపరచుటకును, అభివృద్ధి చేయుటకును అతిశ్రుతిధ్వని తరంగములను ఉపయోగింపవచ్చును.

ఒక ద్రవములో అతిశ్రుతి, ధ్వనిక్షేత్రము ఉన్నపుడు ఉష్ణోగ్రత అధికమగును. ఈ ప్రభావము వలన అతిశ్రుతి ధ్వని తరంగములు వైద్య శాస్త్రములో ఉపయోగింపవచ్చునని తెలియుచున్నది. ఎముకకు ఎట్టి హానియు కలుగకుండ ఎముక యొక్క మధ్య భాగమునందు గుజ్జును వేడిచేయ వచ్చును. కీళ్ళగుండ ధ్వని శక్తిని ప్రవహింపచేయుటకు కూడ వీలుకలదు. ఇప్పటివరకును శరీరమునందలి ఒక భాగమును వెచ్చచేయుటకు ఉపయోగింపబడు విద్యుదుష్ణ విధానము (Electrical diathermy) స్థానే అతిశ్రుతి ధ్వనిని ఉపయోగింప వీలు కలదో లేదో ఇంకను తెలియదు. అతిశ్రుతి ధ్వని తరంగముల ప్రభావము జీవ జంతువులపై కూడ చూడవచ్చును. అతిశ్రుతి ధ్వని తరంగములు సోకుటచేత కప్పలు, చేపలు మొదలగు అల్పజంతువులు కుంటివగుటయు, ఒక్కొక్కప్పుడు చనిపోవుటయుగూడ సంభవించును. ఈ తరంగములకు సృష్టిలోని ఏకకణ జీవులను (Protozoa) నశింపచేయు ప్రభావము కలదు. పొడవైన వృక్ష జీవకణములు ఆల్గే (Algae) మున్నగునవి అతిశ్రుతి ధ్వని తరంగముల వలన చిన్న చిన్న ముక్కలుగా చేయబడును. అతిశ్రుతి ధ్వని తరంగముల ప్రభావము చల్లని రక్తము కలిగిన జంతువుల హృదయములపై కూడ కన్పించును. వీనివలన హృదయస్పందనముల విస్తృతి తగ్గి, గుండె కొట్టుకొను ప్రమాణము ఎక్కువగును. అతిశ్రుతి ధ్వని తరంగములు సోకుటచే మధుశిలీంధ్ర కణముల (Yeast cells) యొక్క ప్రత్యుత్పత్తి శక్తి నశించును. ప్రకాశముకల బాక్టీరియా (Luminous Bacteria) తమ ప్రకాశమును పోగొట్టుకొనును. అతిశ్రుతి ధ్వని తరంగముల సహాయమున పాలయందలి అతి సూక్ష్మ క్రిములను నాశనము చేయవచ్చును. ఇటీవల అతిశ్రుతి ధ్వని తరంగములు వస్త్రములను శుభ్రపరచుటయందు కూడ ఉపయోగపడుచున్నట్లు తెలియుచున్నది. అధిక కంపన ప్రమాణముగల ప్రకంపనముల సహాయమున బట్టలను ఎడతెగక కదలునట్లు చేయుటచే వానినుండి మురికి తొలగిపోవును.

ఈ విధముగా వివిధ క్షేత్రములలో అతిశ్రుతి ధ్వని తరంగములు అత్యంత ప్రయోగోపయోగములై యున్నవి. పైన ఉదహరింపబడిన వాటిలో పెక్కు విషయములు ఇంకను ప్రయోగశాల ఆవరణమును దాటి రాలేదు. దీనికి కారణము ఏమన అతిశ్రుతి తరంగముల ఉత్పాదకములలో ఉత్పత్తిస్థానము యొక్క ఉపరితలము సాధారణముగా చిన్నదిగా నుండుటచే ఈ అధిక కంపన ప్రమాణముకల వికిరణమును ఘన పదార్థముల యొక్కగాని ద్రవపదార్థముల యొక్కగాని అధిక పరిమాణముకల ఉపరితలముపై పడునట్లు చేయుట సులభసాధ్యము కాదు. అయినను ఇప్పటికంటె భవిష్యత్తునందు, అతిశ్రుతి ధ్వని శాస్త్రము పారిశ్రామిక విషయములలో విశేషముగా ఉపయోగింప బడునని మనము గట్టిగా విశ్వసింప వచ్చును.

టి. శే. రా.

**అద్దకము** :- అను పదము ప్రత్యేకముగా బట్టల పరిశ్రమకు సంబంధించినదై యున్నది. బట్టల ఉత్పత్తిలో విస్తారముగా ఉపయోగింపబడు ముఖ్యములగు దారములు మూడు రకములు. అవి ప్రత్తి, సిల్కు, ఉన్ని అను వాటిచే నిర్మితములు. దారపు పోగులను మూడు ముఖ్యరకములుగా విభజింపవచ్చును : (1) వృక్షజన్యములు, ఉదా : ప్రత్తి, జనుము, లెనిన్ ; (2) జంతుజన్యములు, ఉదా : ఉన్ని, సిల్కు ; (3) కృత్రిమ జన్యములు, ఉదా : రేయాన్సు, లోహ లవణ జన్యములగు బంగారము, వెండి, ఏస్‌బెస్టాస్‌వంటి వాటికి అద్దకము విషయములో ప్రాముఖ్యము తక్కువ.

రంగువేయుట : ఒక దారపు పోగుపైగాని, బట్టపై గాని, రంగును కనబరచు విధానమును రంగువేయుట అందుము. దారపు పోగులపై కేవలము రంగు కనబడునట్లు చేయుటకంటె గాఢమైన అర్థము ఈ పదమునకు గలదు. దారపు పోగులందు అంతటను సమానముగా రంగు విస్తరించి యుండుటయే అద్దకపు పని అనబడును. పై భాగమున కేవలము పై పూతగా రంగు పూయుట అద్దకము కాజాలదు ; ఇట్టిపని చిత్రలేఖన మనిపించుకొనును. దారపు పోగు, లేక బట్ట రంగు వేయబడినదని చెప్పబడుటకు అట్టి దారపుపోగు, లేక బట్ట ఈ క్రింది విశిష్ట ధర్మములను కలిగియుండవలెను.

1. రంగు సరిసమానముగా అంతటను విస్తరించి యుండవలెను. రంగు అంటని భాగములు ఉండరాదు.

2. ఉపయోగింపబడిన రంగు కేవలము పై భాగమున అంటినదిగా నుండరాదు.

3. రంగు వేయబడిన వస్తువు ఉతుకును, వెలుగును, చెమటను నిరోధించునంత మన్నిక కలిగియుండవలెను.

రంగువేయు విధానమునందు ముఖ్య విషయములు రెండు. (1) దారపుపోగు. (2) రంగు పదార్థము. రంగువేయు విధానము ఈ రెండింటిపైగాని, వీటిలో నొకదానిపైగాని ఆధారపడియుండును. రంగువేయు విధానము దారపు పోగులనుగాని, రంగు పదార్థమును గాని అనుసరించి మారుచుండును. ఈ విధానమును నిర్ణయించు మూడవ అంశ మొకటి కూడ కలదు. అది "సహాయక ద్రవ్యము" (Mordant) అని పిలువబడును. సహాయక ద్రవ్య మనగా దారపుపోగునకు రంగు పదార్థముతో సన్నిహిత సంబంధమును పొందుటకు సహాయపడు నొక వస్తువు. "సహాయక ద్రవ్యము" (Mordant) యొక్క సహాయము లేనిచో కొన్ని రంగుపదార్థములు కొన్నిరకముల దారపుపోగులకు రంగువేయుటకు శక్తి గలిగియుండవు. సహాయక ద్రవ్యముచే దారపుపోగు రంగు పదార్థమును తనలోనికి గ్రహించుకొను గుణమును పొందును. అప్పుడు దానికి రంగు హత్తుకొనును. "సహాయక ద్రవ్యము" నేడు ఎక్కువగా నుపయోగింప బడుట లేదు. పూర్వకాలములో 'ఎనిలైన్' అను రంగు పదార్థములు దొరకని దినములలో సహాయక ద్రవ్యములు వాడబడుచుండెడివి. ఆ దినములలో ప్రకృతినుండి తీయబడిన రంగు పదార్థములచే రంగులు వేయబడు చుండెడివి. "సహాయక ద్రవ్యములు" దారపు పోగుల యొక్క సూక్ష్మ రంధ్రములను పెద్దవిగా చేయునవియు, ఇట్లవి రంగుపదార్థములతో సన్నిహిత సంబంధమును గూర్చుటకు సహాయ పడుననియు నమ్మబడు చుండెను. దీని పని ఇంతమాత్రమే కాదని తరువాత తేల్చబడినది. "సహాయక ద్రవ్యము" ప్రత్యక్షముగా రంగుపదార్థములతో రాసాయనిక సంయోగమునుపొంది, కరగని ఒక అవక్షేపము (precipitate) గా నేర్పడునని ఇప్పుడు ఋజువు చేయబడినది. ఈ అవక్షేపము "సరస్సు" (Lake) అని పిలవబడును. ఈ రాసాయనిక సంయోగము దారపు పోగు మీద జరుగును. పూర్వము వాడబడుచుండెడి "సహాయక ద్రవ్యములు" బరువు లోహములయొక్క లవణములై యుండెడివి. అవి జంతు లేక వృక్ష సంబంధమైనవనియు (organic) ఖనిజ సంబంధమైనవనియు (inorganic) రెండు రకములుగా నున్నవి. లోహ సంబంధముకల "సహాయక ద్రవ్యము"లలో గురుత్వముగల లోహ లవణము లున్నవి. ఉదా : ఇనుము, క్రోమియం, అల్యూమినియము, తగరము, రాగి మొదలగు వాటి లవణములు. జంతు లేక వృక్ష సంబంధమైన "సహాయక ద్రవ్యము"— అనగా వివిధములగు నూనెలు, వాటి రాసాయనిక సంయోగములు (compounds) (ఉదా : సబ్బులు) టేనిన్ పదార్థములు మొదలగునవి.

**సహాయకములు (Assistants) :** సహాయకములు అనగా దారపుపోగులోనికి రంగు చొచ్చుకొని పోవుటకు సహాయపడు వస్తువులు. అవి లేకుండ కూడ రంగు వేయవచ్చును. కాని దారపుపోగులు రంగును సులభముగా గ్రహించుటకు సహాయకములు తోడ్పడునేగాని వాటి వలన రంగులకుగాని, దారపుపోగులకుగాని, ఎట్టి ప్రమాదములేదు. రంగు వేసిన తర్వాత సహాయకములను సులభముగా కడిగివేయ వచ్చును. దారపు పోగులతో గాని రంగు పదార్థముతోగాని అవి ఎట్టి రాసాయనిక సంయోగమును పొందవు. ఈ సహాయకములు బజారులో వేర్వేరు కంపెనీ పేరులతో విక్రయింపబడును.

నేడు లభ్యములగు ఎనిలిన్ రంగులలో ప్రతిదానిలోను ఒక సహాయకము ఉండును. దాని సహాయముననే రంగు వేయుటను జయప్రదముగా నిర్వహింప వచ్చును.

ఎట్టి దారపుపోగునకైనను రంగువేయుటకు ఒక ప్రత్యేకపు ఛాయగల రంగుగాని రంగు ద్రవ్యముగాని కావలసి యుండును. అప్పుడు రంగుద్రవ్యమునుగాని రంగునుగాని దారపు పోగులలోనికి ప్రవేశపెట్టుటకును అక్కడ దానిని స్థిర పరచుటకును ఒక సాధనము అవసరమగును. తడిరంగు వేయు విధానములో సాధారణముగా నీరు అవసరము. అట్టి నీరు తగినంత శుభ్రముగా నుండవలెను. స్వాదుజలము ఇందుకు పనికివచ్చును. కఠిన జలము పనికిరాదు.

రంగు వస్తువును దారపు పోగులను ఉంచబడిన పాత్రను నిప్పుమీద ప్రత్యక్షముగా నుంచుటచేగాని పాత్రలోనికి ప్రత్యక్షముగా ఆవిరిని పంపించుటచేగాని రంగువేయుటకు వలసిన వేడిమిని సంపాదింప వచ్చును. రంగుద్రవ్యమును దారపు పోగులునుగల పాత్ర ఆవిరి **(steam bath)** లో నుంచి వేడిచేసెడి విధానము "పరోక్ష విధానము అనబడును. దారపు పోగులకు రంగువేయుటకు ఉపయోగించు పాత్రను **(Dye bath)** లోహముతో గాని కఱ్ఱతోగాని పింగాణితోగాని చేయుదురు. లోహ పాత్రలలో రాగి పాత్రలు స్టెయిన్‌లెస్ స్టీలు పాత్రలు




రంగువేయు తొట్టె

1. పెద్ద కొయ్య తొట్టె
2. ఆవిరి గొట్టము
3. లోనికి ఆవిరి వచ్చు ద్వారము
4. ఆవిరి బైటికి పోవు ద్వారము
5. కొయ్య రూలర్లు
6. రంగు మట్టము
7. దారము లేక బట్ట
8. వచ్ఛిద్రముగ కల్పితమైన అడుగు.

రంగువేయుటకు ఉపయోగింతురు. యంత్రాగారముల యందును పెద్ద అద్దకపు కర్మాగారవంలందును దీర్ఘ చతురస్రాకారముగల కఱ్ఱతొట్టిని ఉపయోగింతురు. ఒక ఆవిరిగొట్టము అమర్చబడి యుండును. దీనిని "రంగు తొట్టి" అందురు. రంగువేయుటకు ఉపయోగించు పాత్ర రంగువేయబడు దారపుపోగుల స్థితిపై ఆధారపడి యుండును. ప్రత్తి, ఉన్ని, సిల్కు—ఇవి విడివిడి దారపు పోగులుగా రంగు వేయబడును. నిడుపైన బ్రద్దలకు దూదిపింజ చుట్టిగాని, పోగులుగాగాని చుట్టిగాని, నూలు పిడిగాగాని, నూలు చిట్టముగాగాని, కండెలుగాగాని, వస్త్రరూపమున ఉన్న నూలుపోగులుగాగాని రంగు వేయబడును. దూది పింజలు, నూలు పిడులు మున్నగు వాటికి రంగువేయునపుడు **(packed system)** రంగు ద్రావకమును వీటిగుండా ప్రవహింపజేయుదురు. చిట్టము **(Hank)** రూపములోనున్న నూలునకు తఱచుగా రంగు వేయునపుడు ఒక పెద్ద తొట్టెలో నుంచుదురు. రంగు వేయుటకు పూర్వము వస్తువును కడిగి, తడిగా నుండగనే రంగుపాత్రలో నుంచుదురు. కడుగని వస్తువులో కొన్ని సహజ మలినములుండును. వీటిని వ్యతిరేకించు ధర్మము వీటికుండును. కడుగుటచే ఇట్టి సహజ మలినములు తొలగిపోవును. దారపుపోగుల స్థితినిబట్టి మలినములు ఆధారపడియుండును. బట్ట తయారగు స్థితివరకు అవి సమానముగానే యుండును. కాని బట్ట స్థితిలో సహజ మలివములేకాక ఇతర మలినములుకూడ నుండును. నూనె మరకలు, దుమ్ము— ఇట్టి మలినములు నేతనేయు సందర్భములో ఏర్పడును.

ఉన్ని విషయములో, ముద్దగానున్న ఉన్నిలో దుమ్ము, ఎండుటాకులు మొ. సహజ మలినములు ఉండును. కాని నూలులో రంగు వృక్షసంబంధమయిన నూనెలు తప్ప ఇతర సహజ మలినము లుండవు. ఉన్ని బట్టయందుకూడ ఉన్నినూలులో గల మలినములే కనిపించును. సిల్కు విషయములో విడిదారపు పోగులు, నూలు, బట్ట మున్నగు వాటియందు 'జిగురు' లేక 'సెరిసిన్' అను మలినము ఉండును. ప్రత్తి, మైనమునందు **(wax)** నీటిని వ్యతిరేకించు ధర్మమును ప్రత్తికి కలిగించును. ఇది సబ్బుగా మార్పరాని ఒక రకపు నూనె. నీటిని, నూనెను కలుపగా

ఏర్పడు పాలవంటి ద్రవమును ఉపయోగించి (Emulsification) ప్రత్తిమైనమును తొలగింపవచ్చును. ప్రత్తిలో నుండు క్రొవ్వుసంబంధమగు ఆమ్లము 'మార్గరిక్ ఆమ్లము' 'పాల్మిటిక్ ఆమ్లము' అను రెండు ఆమ్లముల మిశ్రమముచే నేర్పడును. ఈ ఆమ్లములు 55.5° సెంటిగ్రేడ్ వద్ద కరగును. ఇవి క్షారములందు మిశ్రితములగును. రంగు వేయు పదార్థమునందు నత్రజని సంబంధమైనవియు, అస్ఫటికాకారముగా నేర్పడ నవియును అను రెండు రంగువేయు వస్తువులు ఉండును. వీటిలో ఒకటి 'ఆల్కహోల్'లో కరగును. రెండవది ఆల్కహోలునందు అత్యల్పముగా కరగును. ఈ రంగులు చలవచేయుటవల్ల నశించి పోవును. మలినములన్నియు కలసి విడి ప్రత్తిలో 5% ఉండును. 'పెక్టిక్ ఆమ్లము' ఈ మలినములలో అత్యధికాంశముగా ఉండును.

**చలువ చేయుట :** పూర్వకాలము 'చలువ చేయుట' చాలమోటును, సుదీర్ఘమును, శ్రమతోగూడినదియునగు విధానము ననుసరించి జరుగుచుండెడిది. ఇందుకొరకు పాట్ - ఆష్ (Pot ash = $K_2 CO_3$) ఉపయోగించుచుండెడివారు. పులియపెట్టుటకై మజ్జిగయు, తెలుపు జేయుటకై సూర్యరశ్మియు సాధనములుగ ఉండెడివి. రంగువేయుటకు పూర్వము బట్టలను చలువ చేయుటకై ఆరు నెలలు పచ్చగడ్డిపై పరచెదరు. ఈ విధానమునకు తృణప్రక్రియ అనిపేరు.

ప్రస్తుతము చలువచేయుటకు చాలవరకు బ్లీచింగ్ పౌడరు (కాల్షియం హైపోక్లోరైట్) వాడుచున్నారు. ప్రస్తుతము విశేషముగా వస్త్రరూపమున చలువ చేయుదురు. నూలు దారము రూపమున స్వల్పముగను, వైద్యావసరముల కొరకు నీరు పీల్చెడి స్వభావముగల దూదిపింజల రూపమున అత్యల్పముగను చలువచేయుదురు. దూదిపింజలను తోటాలు చేయుటకును తుపాకీప్రత్తి కొరకును చలువచేయుచున్నారు. ఈ దూదిపింజ రూపమున చలువచేయునపుడు నారపోగులు బలముగా నుండ అవసరము లేదు. దారమును బట్టలను తయారు చేయు విషయమున దారపుపోగులు బలముగా నుండుట అవసరము- ప్రత్తిదారమును పెద్దయెత్తున తెలుపు చేయుటకై మూతలేని తొట్టిలో అనగా తక్కువ ఒత్తిడిగల తొట్టిలో దానిని ఉడకపెట్టుదురు. చలువ చేయుటకై ఉడకపెట్టుటలో దారపుపోగులలోని ప్రత్తిమైనమును, క్రొవ్వుసంబంధములగు ఆమ్లములను, తదితరములగు జీవకణ నిర్మాణద్రవ్యములు కాని (Non-cellulosic) మలినములను, పూర్తిగా తొలగించుట అవసరమైయున్నది. పెద్దతొట్టిలో ఉడకపెట్టుటకు వేరువేరు పద్ధతులు ఉన్నవి. 'మూతలేని తొట్టిపద్ధతి' లో తగిన కొలతలుగల ఒక గుండ్రని నిలువుతొట్టిని ఉపయోగింతురు.




వివృతాంతస్స్రావణ ద్రోణి

1. పెద్ద కొయ్య తొట్టె
2. ఆవిరిని చిమ్ము గొట్టము
3. సచ్ఛిద్రముగ కల్పితమైన అడుగు
4. బోలు గొట్టము
5. ఆవిరిని క్రమబద్ధముచేయు మూత
6. వస్తువుల మట్టము
7. క్షారద్రావణ మట్టము

అడుగున రంధ్రములు పొడువబడిన ఒక కృత్రిమ నిర్మాణము అమర్పబడి యుండును. దానిలో రంగువేయబడు పదార్థము ఉంచబడును. ఈ కృత్రిమపు టడుగునకును, నిజమైన అడుగు భాగమునకును మధ్య జానెడు ఖాళీ స్థలము ఉంచబడును. ఈ స్థలము ద్రవము చేరుకొనుటకును, ఆవిరిగొట్టము లుంచుటకును ఉద్దేశింపబడినది. బయటికి తీసినపుడు అది చిక్కులు పడకుండ నుండుటకై చలువచేయబడు వస్తువును తగు జాగ్రత్తతో తొట్టియందుంచవలెను. చలువచేయు పదార్థమునకు సమముగా రంగుపట్టుటకయి, దానిని తొట్టిలో క్రమమైన రీతిలో నుంచవలయును. మొదట నొక వేడివీళ్ళ తొట్టిగుండా పోనిచ్చి, తరువాత "ఒత్తుడు రోలర్ల"చే ఒత్తుదురు.

"మూతలేని తొట్టిపద్ధతి" (Openkier) ననుసరించి పదిపం|డెండు గంటలవరకును వస్తువును ఉడకబెట్టుదురు. ఇట్లు మూతలేని తొట్టిలో ఉడకబెట్టుట మిక్కిలి ప్రశస్తము కాదు. ఏమనగా అది ఈ పద్ధతియందు ఎక్కువఖర్చగును. ఇందలి దీర్ఘకాల ప్రక్రియమూలమున "ఆక్సిసెల్లులోస్" మరియు, "హైడ్రో సెల్లులోస్" అనునవి ఏర్పడి చలువ చేయు వస్తువు మెత్తబడి, చెడిపోయెడి ప్రమాదము కలుగును. తక్కువ ఒత్తిడితో గూడిన తొట్టిలో రంగు వేయబడు వస్తువు 10, 12 గంటలవరకు ఉడకబెట్టుచు ఆ వస్తువుయొక్క బరువులో "సోడా-ఆష్"ను కలుపుదురు. ఈపని తర్వాత ఆ వస్తువు భ్రమణ ముద్రాయంత్ర (Washing mangle) సాహాయ్యమునను ఒత్తుడు రోలర్సు యొక్క (Squeeze Rollers) సహాయమునను శుభ్రముగా నుతకబడును. దీనివలన రంగుపదార్థముతప్ప తక్కిన మలినములన్నియు తొలగిపోవును. నూలు పోగులలోని సహజమైన రంగుపదార్థమును తొలగించుటకు "బ్లీచింగ్ పౌడరు" ను, ద్రావకమును ఉపయోగింతురు. ఈ ప్రయోగమును "కెమికింగ్" అందురు.

2° టి. డబ్లియు. బ్లీచింగ్ పౌడరు ద్రావకముగాని ½° ¼° టి. డబ్లియు పెర్‌కోరన్‌గాని, సుమారు 6 నుండి 8 గంటల కాలము చలువచేయు నిమిత్తము వాడుదురు. ఈస్థితియందు వేడిచేయుట అనవసరము. "బ్లీచింగ్" చేయ బడిన తర్వాత, దారము చన్నీళ్ళలో తడవకు 15 నిమిష ముల చొప్పున రెండుసార్లు కడుగబడును. గంధకిత ఆమ్లము ¾ నుండి 1° టి. డబ్లియు ద్రావకములో 15 నిమిషములు పులియబెట్ట బడును. ఇట్లు చేయుటలో నూలుపోగులనుండి "బ్లీచింగ్ పౌడర్" యొక్క అవ శేషములను తొలగింపనగును. పులియబెట్టిన తర్వాత ఆమ్లముయొక్క లవలేశములను పూర్తిగా తొలగించు టకై తడవకు 10 నిమిషముల చొ॥న మూడుసార్లు పరిభ్రమించుచున్న తొట్లలో తిరిగి దారము కడుగ బడును. తుది దశలో ఆమ్లముయొక్క తుది లవలేశము లను తటస్థపరచి తొలగించుటకును, ప్రత్తిని మెత్త పరచుటకును సబ్బును వాడుదురు. మజ్జిగకు బదులుగా గంధకిత ఆమ్లము వాడుటవలన చలువ జేయుటకు వల సిన కాలము 6 నెలలనుండి 8 నెలలకు తగ్గును.

"క్లోరిన్" 1774 లో కనుగొనబడినది. కాని దాని తెలుపుచేయుశక్తి 1785 లో మాత్రమే బెర్తొలెట్ చే కనుగొనబడినది. దానిని కర్మాగారములలో తెలుపు చేయుటకు ఉపయోగించినవాడు జేమ్స్‌వాట్ అను నతడు. అతడు క్లోరిన్ నీటిని ఉపయోగించెను. ఈ క్లోరిన్ నీరు అంతగా ఉపయోగించు వస్తువు కాకపోవుటచే 1799 లో చార్లెస్ టెన్నెన్‌చే "బ్లీచింగ్ పౌడరు" వ్యాపారార్థము తయారుచేయబడినది. కాని అది ఉప యోగములోనికి 1800 సం॥లో మాత్రమే వచ్చెను. క్రమముగా "పాట్-ఆష్"నకు బదులుగా సున్నము వాడుకలోనికి వచ్చెను. పిదప సోడియం హైడ్రాక్సైడ్ కాస్టిక్ సోడా 1830 లో వాడుకలోనికి వచ్చెను. అపుడు తెలుపుచేయుట కుపయోగించిన విధానము లీ




అధిక పీడన ద్రోణి

1. పీడన మాపకము
2. మూత
3. చిమ్ముడు గొట్టము
4. క్షారద్రావణ మట్టము
5. నచ్ఛిద్రముగ కల్పితమైన అడుగు
6. కేంద్రావగ ఉదంచము (Centrifugal pump)
7. క్షార ద్రావణము.
8. నీరు
9. ఆవిరి
10. ఖాళీచేయు గొట్టము
11. గుడ్డ లేక నూలు




బహూ నాళీయతాపక ద్రోణి

| | |
|---|---|
| 1. మూతి | 6. క్షారద్రావణ మట్టము |
| 2. పీడన మాపకము | 7. వస్తువుల మట్టము |
| 3. ఆవిరి | 8. సచ్ఛిద్రముగ కల్పితమైన అడుగు |
| 4. సాంద్రీకృతమయిన ఆవిరి | |
| 5. కేంద్రాపగ ఉపచయము (Centrifugal pump) | 9. బహూనాళీయ తాపకము |
| | 10. క్షారద్రావణము |

క్రిందిరీతిగ నున్నవి: 1. నీళ్ళలో ముంచిఎత్తుట, 2. ముడి పదార్థమును కడుగుట, 3. సున్నములో ఉడుకబెట్టుట, 4. కడుగుట, 5. కాస్టిక్ సోడాతో మూడుమారులు ఉడుకబెట్టుట, 6. బట్టను పచ్చికపై పరచుట, లేక "బ్లీచింగ్ పౌడరు", గంధకిత అమ్లము ఉపయోగించుట. సోడా ఆష్ (సోడియం కార్బనేట్) ను యంత్రములను వాడుటవలన ఈ విధానమునకు అభివృద్ధి చేకూరెను.

1. మూతపెట్టబడిన తొట్లలో ఒత్తిడిక్రింద ఉడకబెట్టుట.

2. మరుగుచుండగా "కాస్టిక్ సోడా" ద్రవమును ప్రసరింప జేయుట.

3. సంపూర్ణముగా కడుగుట కొరకు "కడుగుడు యంత్రములు" ఉపయోగించుట.

4. "బ్లీచింగ్ పౌడరు" ద్రవము సహాయముతో చలువచేయుట.

బట్టలమీద అద్దకము (Textile Printing) : అద్దకము కూడ నిజమునకు రంగువేయుటయే ; భేద మేమనగా ఒకే రంగు పదార్థము అంతటను సమముగా బట్టయందు విస్తరించదు. కారణమేమనగా పదార్థము రంగుతొట్టిలో నుంచబడదు. రంగు చిక్కబరచిన స్థితిలో బట్టమీదకు వచ్చునట్లు చేయబడును. ఈ రంగు కొన్ని ప్రత్యేక స్థలములపై వేయబడును. ఇట్లు చిక్కబరచిన రంగును ఉపయోగించుటవలన సూక్ష్మనాళముల గుండా ప్రసరించి వ్యాపించదు. ఏర్పాటు చేయబడినదియు, సునిశితమును అగు అంచు దీనివలన సాధ్యపడును. రంగు ఉపయోగింప బడిన చోట నెల్ల, బట్టలో ఆ ప్రదేశమునకు మాత్రమే రంగు పట్టును.

వివిధములైన బట్టలపై రంగు రీతులు, లేక రూప రచనలు, అచ్చువేసి తయారుచేయుటకు అనేక పద్ధతులు కలవు.

1. చేతి దిమ్మలతో అచ్చువేయుట.

2. పెరొటైన్, లేక యంత్రపు టచ్చులతో అచ్చు వేయుట.

3. చేతికుంచెతో రూపరచన కల్పించుట. (Stencilling by hand-brush)

4. గాలికుంచెతో రూపరచనకల్పించుట. (Stencilling) by air brush) (ఎయిరోగ్రాఫ్ Aerograph).

5. తెర అచ్చు (Screen printing).

6. చెక్కబడిన రాగి పలకలనుండి చదును టచ్చు ముద్రణ. (Flat press printing from engraved copper plates).

7. యంత్రముద్రణము, లేక రూప రచనలు రాగి రోలర్లపై చెక్కి రోలర్లచే అచ్చువేయుట.

దిమ్మలతో అచ్చువేయుటలో రూపరచనలు కట్టెపై ఉబుకునట్లుగా చెక్కబడి యుండును. ఈ ఉబికిన భాగ ములు రంగు భూమిక (colour pad) నుండి రంగును గ్రహించి బట్టపై ఒత్తబడినప్పుడు ఆ రంగును బట్టమీద పడునట్లు చేయును. దిమ్మలలో రూపరచనలను అచ్చు వేయుటలో ఇది చాల సులభమగు విధానము. బట్టలపై అచ్చువేయుట కిది మిక్కిలి పురాతనమైన పద్ధతి. ఇది ఆలస్యముతోను, వ్యయముతోను గూడిన పద్ధతి. అధు

నికమైనరోలర్ ముద్రణముతోపోల్చినచో, దీనికి సంకుచితమును, పరిమితమును, అగు స్థానము మాత్రమే కలదు. మిక్కిలి సున్నితములును, సునిశితములును అగు రేఖలు కఱ్ఱదిమ్మలపై చెక్కుట శక్యము కాదు. చెక్కిననుకూడ అచ్చుకొట్టుటలో అవి పాడైపోవును. అట్లే సన్ననిచుక్కలను చెక్కుటకు కూడ వీలుపడదు. సన్నని రేఖలైనచో రంగును సమముగా గ్రహించును. వాటితో అచ్చు సమముగా వచ్చును. కాని విశాలములైన సమూహ రూపములు రంగును సమముగా గ్రహింపవు. వాటితో అచ్చు ఎగుడు దిగుడుగా కూడ నుండును.

కఱ్ఱదిమ్మలపై లోహ రూప రచనలనుంచి, అభివృద్ధికరమైన మార్పులు చేయుదురు. దిమ్మలలో విశాల సమూహ రూపములు ఉన్న సందర్భములలో ఆ రూపముల మధ్య తొలిచి "ఫెల్టు" (కంబళివంటి పదార్థము) తో నింపుదురు. "ఫెల్టు" అందుచే రంగును సమముగా గ్రహించును. ఈ విధముగా అచ్చువేయుటచే అచ్చులు సున్నితముగను, సమముగను వచ్చును. దిమ్మలతో అచ్చువేయుటలోగల మిక్కిలి గొప్పకష్టములు తిరిగి వేయబడు అచ్చులలో ఒకదానితో ఒకటి సరిగా కలుపుటకు సాధ్యపడకపోవుట ; వేర్వేరు రంగుల ముద్రా రచనయు సరిగా నుండకుండుట.

ఏదైన ఒక రూపరచనకు కావలసిన దిమ్మల సంఖ్య ఆ రూపరచనలో నున్న రంగులసంఖ్యకు సమానముగా నుండును ; ఏమన, ఒక దిమ్మ ఒక రంగును మాత్రమే గ్రహింపగలదు.

**రంగు భూమికలు (Colour Pads) :** అనేక విధములైన రంగు భూమికలు అచ్చువేయుటలో ఉపయోగింపబడును. ఒక దుప్పటి ముక్కను ఒక సమతలముపై పరచి, భూమికగా నుపయోగించుట వీటిలో మిక్కిలి సులువైనది. ఇట్టిదానిలో రంగు ముద్దను గ్రహించుశక్తి చాలా పరిమితమై యుండును. కాన ఎక్కువగా అచ్చు వేయవలసిన సందర్భములలో దీని ఉపయోగము లేదు. దీనిలో దిండువంటి సౌలభ్యము లేకపోవుటచే, కఠినమైన భూమికనుండి దిమ్మలు ఎక్కువరంగును గ్రహించును ; అందుచే, అచ్చు హెచ్చుతగ్గులు కలదిగా నుండును. కనుక, దేశమందంతటను సర్వసామాన్యముగా ఉపయోగింపబడు భూమిక ఒక కఱ్ఱపళ్లెము లేక తొట్టిని కలిగియుండును. ఈ తొట్టిలో ఒక వెదురు జల్లెడ ఉంచబడును. ఈ వెదురు జల్లెడపై దుప్పటి పరచబడి, దానిపై ఒక గుడ్డముక్క ఉంచబడును. వెదురు జల్లెడ వెదురుబద్దలతో చేయబడును. ఇవి రెండు కాళ్ళపై ఆధారపడి యుండును. వెదురు బద్దలు దారముతో కట్టబడును. వెదురుజల్లెడ (జాలి) "స్ప్రింగ్" (Spring) లక్షణము కలిగియుండును. కాన, రంగును సమానముగా గ్రహించుటలో అది సాయపడును. జల్లెడ "స్ప్రింగ్" లక్షణముచే రంగును విడగొట్టును; మరియు సరియగు మార్గములద్వారా దానిని వచ్చునట్లు చేయును. దుప్పటి, రంగును ఇంకను విడగొట్టును. దుప్పటి సందుల నుండి వెలువడు రంగు ఇంకను సూక్ష్మ విభజన పొందిన స్థితిలో దాని పైభాగమునకు వచ్చును; అక్కడనుండి దిమ్మ రంగును గ్రహించును.

**అచ్చువేయు బల్ల :** కూర్చుండు స్థితిలో బట్టలను అచ్చు వేయుటకు ఉపయోగింపబడు సాధారణమైన బల్లకు బలమైన తలమును, బలమైన కాళ్ళును ఉండును. బల్ల పనివాని వైపునకు కొంచెముగా వాలి ఉండును. సాధారణముగా ఈ బల్ల 20″ – 22″ వెడల్పుగల్గి పనిచేయుటకు అనుకూలముగా నుండును. బట్టను పరచెడి ప్రదేశము కూడ అచ్చువేయుట పై ప్రభావము కలిగియుండును. ఆప్రదేశము హెచ్చుతగ్గులుగా నున్నచో, దిమ్మ రంగును సమానముగా గ్రహించినప్పటికీ అచ్చు హెచ్చుతగ్గులుగా నుండును. అందుచే మెత్తని దిండుగల ఉపరిభాగము అవసరము; ఉన్ని ఫెల్టు బట్ట సాధారణముగా ఉపయోగింపబడును. అచ్చు వేయబడు బట్టగుండా ప్రసరించు రంగు ఉన్ని ఫెల్టు లేక 'నాష్ధా' ను పాడుచేయును ; అందుచేత ఈ ఉన్నికప్పుపై ఒక ముదుకబట్ట పరచబడును. "బేక్ గ్రే" అని దీనికి పేరు.

**"పెరొటైన్" లేక యంత్రములతో చేయబడు దిమ్మ-అచ్చు :** "పెరొటైన్" అనునది 4 రంగులను మాత్రము ఒకమారు అచ్చువేయును. పెరొటైన్ కొరకు రూపరచనలు చేయుటలో రంగుపై రంగు రాకుండా చూడవలెను. ఎందుచేతననగా దిమ్మ అచ్చులో రంగు ఇంచుమించు బట్టయొక్క పై భాగమున నుండును; ఈ తడి రంగులు కలిసి పడినచో, అవి తప్పనిసరిగా వాటి హద్దు

లను దాటి ప్రసరించి ప్రతికూల ఫలితమును కలిగించును. రూపరచనయొక్క రీతి పరిమాణములను అనుసరించి, పెరొటైన్ యంత్రములోని దిమ్మలు సాధారణముగా 30" పొడవు 3"–5½" వెడల్పును కలిగియుండును.

యంత్రములో (మూడురంగుల యంత్రము) మూడు దిమ్మకూర్పులుండును. ప్రతి దిమ్మయు రంగు నింపుట, రంగు వ్యాపింపజేయుట, ముద్రను అచ్చొత్తుట, అనుప్రత్యేకములగు ఏర్పాటులను గలిగియుండును. అన్ని దిమ్మలును ఏక కాలమున పనిచేయునట్లు చేయబడును. అచ్చు వేయు సమయములో తరువాతి ముద్రణము పూర్వపు ముద్రణముతో కలియుటకు సరిగా ఎంతచోటు అవసరమో, అంతవరకు మాత్రమే బట్ట ముందునకు జరుగును. మూడు దిమ్మలును రంగులన్నియు పొరపాటులేక సరిగా పడునట్లు సరిచేయబడును.

**పైభాగపు అచ్చులేక "పెగ్" (Peg) అచ్చు:** పై భాగము లేక "పెగ్" (Peg) అచ్చు నేటికాలపు స్థూప ముద్రణము (Cylinder Printing) లేక "రోలరు" ముద్రణమునకు ప్రాతిపదిక. ఈ "పెగ్"– అచ్చులో చెక్కబడిన 'రోలరు' కట్టతో చేయబడును. అనగా దిమ్మ వర్తులాకారముగా నుండును. దీనిలో అనేక లోపములు కలవు. రంగు సమానముగా సమకూర్చ బడదు. ఒత్తిడిని క్రమపరువ వీలుకాదు. ఎడతెగక తడియుట వలనను, ఎండుట వలనను, కట్టరోలరు గుంటలుపడి చెడిపోవును.

దీని తర్వాతి అభివృద్ధి దశలో రంగును సమకూర్చుటకును బాగుపరచుటకును ఒక ఏర్పాటు చేయబడినది. దీని కొరకు నిరంతరమైన (రెండు కొనలు కలుపబడిన) ఒక పెద్ద దుప్పటి ఉపయోగింపబడును. ఈ దుప్పటి రంగుతో సమకూర్పబడి యుండును. రంగు సమకూర్పు సమానముగా చేయుటకై ఒక కట్టగాని ఇనుప "బ్లేడు" గాని (Blade) ఏర్పాటు చేయబడును. "డాక్టరు" అని దీనికి పేరు. ఇది రంగును విస్తరింపజేయుటకు సహాయపడును. ఈ "డాక్టరు" ముందుకును వెనుకకును కొంచెముగా కదలిక గలిగియుండును. మోటు ముద్రణములో ఇది ఉపయోగింపనగును. అందు రేఖలు మిక్కిలి సునిశితముగా, సుస్పష్టముగా నుండవు.

యంత్ర ముద్రణము : దీనికి యంత్ర ముద్రణము, స్థూప ముద్రణము (cylinder printng) లేక "రోలరు" ముద్రణము అని పేరు. ఇతర పద్ధతులలో దిమ్మలు, తెరలు "స్టెన్సిల్లు" (Stencils) వాడబడుచుండును. దీనిలో




తిరుగుడు యంత్రము

1. వర్ణ పేటిక
2. వర్ణ సంపాదకము
3. వర్ణ వ్యవస్థాపకము
4. తొలచబడిన తిరుగుడు చుట్ట
5. స్థూపము
6. బొత్తివలె దూర్చుట
7. దుప్పటి
8. "బాక్ గ్రే"
9. గుడ్డ
10. నారపీచు
11. ముందుకు నడుపు రోలర్లు

రూపరచన కొరకు చెక్కబడిన రాగి 'రోలర్లు' ఉపయోగింపబడును.

'రోలరు' ముద్రాయంత్రము 1783 లో ఇబెల్ అను నాతనిచే కనిపెట్టబడినది. మిక్కిలి సామాన్య రూపము కల ఈ ముద్రాయంత్రములో ఈ క్రిందిభాగములు కలవు.

(1) స్థూపకము (Cylinder) (2) లేపింగ్ (Lapping) (3) దుప్పటి, (4) 'బేక్ గ్రే' (Back Grey) (5) చెక్కడపు పనిగల 'రోలరు' (6) రంగు 'డాక్టరు' (7) లింటు (Lint) (8) రంగు సమకూర్చునది. (9) రంగుపెట్టె.

స్థూపక మనగా అచ్చు వేయబడు బట్ట దేనిమీద గుండ్రముగా తిరుగుచుండునో అట్టి పెద్ద "డ్రం" వంటి

"రోలరు". ఈ స్థూపకముమీద ఒకదట్టమైన ఉన్ని "ఫెల్టు" బట్ట, లేక మైనపుగుడ్డ కొలదిగా చుట్టబడును. ఇది అచ్చు వేయు సమయమున తగినంత స్థితిస్థాపకత్వమును (Elasticity) చేకూర్చును.

అచ్చుయంత్రపు దుప్పటి బిగువుగా నేయబడును. గట్టిగా నేసి పెనవేయబడి అది దట్టమును స్వచ్ఛమును అగు ఉన్నిబట్ట (Lapping) యొక్క స్థితిస్థాపకతను (Elasticity) వృద్ధిచేయును. 'లేపింగ్' నకును అచ్చువేయబడు బట్టకును నడుమ ఒత్తిడి—స్థూపకమును (Pressure cylinder) ఎడతెగకుండా తిరుగునట్లు చేయును. ఆ దుప్పటి గట్టిపడి, బట్టగుండా చొచ్చుకొనివచ్చు తడిరంగుచే మలినము నొందును. ఇట్లు జరిగినప్పుడు సామాన్యముగా దుప్పటిని ఆవలిప్రక్కకు త్రిప్పుచుందురు. ఆ దుప్పటి స్వచ్ఛముగా నున్నచో ఇట్లు చేయవచ్చును. లేనిచో క్రొత్త దుప్పటిని ఉపయోగించవలసి యుండును. 'బేక్ గ్రే'ల నుపయోగించుటవలన దుప్పట్లు ఎక్కువకాలము ఉపయోగపడును. 'బేక్ గ్రే'లు (Back Greys) అనగా దుప్పటికిని అచ్చువేయబడు బట్టకును మధ్య నుంచబడు తెలుపు 'కేలికో' ముక్కలు, ఉన్ని దుప్పట్లకును ,వాటర్ప్రూఫ్ మైనము దుప్పట్లకును అవి తప్పనిసరిగా వాడబడును. ఉతుకుటకు వీలయిన దుప్పట్లు లభించినచో వీటినివాడుట మానివేయవచ్చును.

'రోలర్లు' : అచ్చువేయుటకు ఉపయోగించు రోలర్లు రెండువిధములు : (1) ఘనపదార్థపు రోలర్లు (Solid Rollers): ఇవి రాగి లోహముతో మాత్రమే చేయబడును. (2) 'షెల్ రోలర్లు' (Shell Rollers): ఇవి రాగి ఖరీదును తగ్గించు నుద్దేశముతో ఇనుముతో చేయబడును. వాటిపై విద్యుత్తుచే రాగిపూత వేయుదురు.

'రోలరు'లోపల, పొడుగునను 'నాళము' లేక 'నాలుక' ఒకటి వ్యాపించియుండును. ఈ 'నాళము' (Tab) రోలరు లోనికి పోవునట్లు అమర్పబడిన "మేన్డ్రిల్" లేక ఇనుప ఇరుసులో ననురూపముగానున్న కన్నములో అమర్పబడుటకు వీలుగానుండును. దీనివలన ఇరుసే తిరుగుట జరుగకుండ చేయబడును. అచ్చువేయు రోలర్లు ఒకప్పుడు ఇత్తడితో చేయబడును. కాని దీనివలన ప్రత్యేక లాభము లేదు. రాగి రోలర్ల పై తలముయొక్క గట్టితనమును వృద్ధిచేయుటకై "నికెల్ ప్లేటింగు" ఒకప్పుడు క్రోమియం ప్లేటింగు కూడ చేయబడుచుండును. ఇట్టి ప్లేటింగుచే పై తలముయొక్క గట్టితనము వృద్ధి అగును. రోలర్ల "రోలర్లు" క్షీణింపక ఎక్కువ కాలము మనును.

"మేన్ డ్రిల్స్" : ఇవి పొడవైన ఉక్కు కడ్డీలు. అచ్చు యంత్రములో నుంచబడినప్పుడు ఇవి తాత్కాలికముగా అచ్చువేయు 'రోలర్ల'కు ఇరుసులవలె ఉపకరించును.

**రాగి రోలర్లు చెక్కుట** : అచ్చు రోలర్లను చెక్కుట 'కేలికో' ముద్రణమునందలి చాల ప్రత్యేక శిక్షణమును అపేక్షించు శాఖయై యున్నది. ఇది యొక ప్రత్యేక పరిశ్రమయై యున్నది.

చెక్కడపు పనిలో మూడు ముఖ్య పద్ధతు లున్నవి : (1) చేతి చెక్కడము, (2) యంత్రముచే చేయబడు చెక్కడము, (3) రసాయనికపు చెక్కడము.

ఏ పద్ధతి ఉపయోగింపబడినను, రాగి రోలర్ల చెక్కడపు పని ఉత్కీర్ణపద్ధతిగా (Intaglio) గా నుండును. "ఉబికినవ్రాత" (Relief) గా మాత్రము ఉండదు.

చేతిచెక్కడమునకు చాలకాలము పట్టును. ఇది చిన్నవియు, పెద్దవియునగు వాడి పనిముట్లతో చేయబడును.

చెక్కడముయొక్క అన్ని పద్ధతులలోను, రూపరచన తగు విధముగా నేర్పాటు చేయబడవలెను. రూపరచన యొక్క లంబరూప దైర్ఘ్యము (Vertical length) 'రోలరు' పరిధికి ఒక పూర్ణాంక గుణిజముగా (integral multiple) నుండవలెను. అట్లే 'అడ్డముగా ఉండు పునశ్చరణము' (Horizontal repeat) 'రోలరు' యొక్క వెడల్పు విషయములో ఒక పూర్ణాంకముగా ఉండవలెను.

**చుక్కలతో చెక్కుట** (Stippling) : ఇది రోలర్ల పై భాగమున గుంటలుచేసి, రూపరచనల లిఖించుటచే చేయనగు ఒక విధమగు చెక్కడపుపని. పూర్వము ఇది చేతితోనే చేయబడుచుండెడిది. సన్నని ఉక్కుసాధనముచే దీనిని చేయుచుండెడివారు. ఈ రోజులలో చుక్కల చెక్కడముకూడ యంత్రముతో చేయబడుచున్నది.

**యంత్రపు చెక్కడము** : యంత్రపు చెక్కడములో వాడి పనిముట్లచే రూపరీతి చెక్కబడదు. దీనికి బదులుగా ముందుగా తయారుచేయబడి ఉబికిన రచనగల యంత్రముచే (Mill) రూపరీతి రోలరుమీద ముద్రింపబడును.

రసాయనికపు చెక్కడము, "పెంటగ్రాఫ్": రోలరుపై, 'వాటర్ ప్రూఫ్'ను, ఆమ్లనిరోధకమగు నొక 'వార్నిషు'ను పూతగా పూయుదురు. అట్టి రోలరుపై వజ్రపుగంటము (Diamond Pointer) పనిచేయునపుడు రూపరీతి నొక్కులుగా నేర్పడును.

ఇట్లు తయారుచేయబడిన 'రోలరు' నత్రికామ్లపు తొట్టిలో నుంచబడును; అప్పుడు 'వార్నిష్' మీద నొక్కులుగా త్రవ్వబడిన భాగములు ఆమ్లముయొక్క చర్యకు పాల్పడును. ఇట్లు ఉత్కీర్ణముగా నమూనా (design) ఏర్పడును.

"స్టెన్సిలింగ్" (Stencilling) : బట్టలపై స్టెన్సిలింగ్ పురాతనపద్ధతి; దీనివలన అనేక ఉపయోగములు కలవు. అవి యెవ్వియన, దిమ్మ అచ్చులోకంటె, రూపరచనా నిర్మాతకు అల్లిబిల్లికతో గూడినరీతిని రచించుటలో స్టెన్సిలింగ్ ఎక్కువ స్వాతంత్ర్యము నిచ్చుచున్నది. సన్నని రేఖలతోగూడిన సున్నితపు రచన, గొప్ప ఫలితము,— ఈ రెండును దీనివలన చేకూరును. వేర్వేరు రంగు చాయలను కల్పించుట స్టెన్సిలింగులో సాధ్యపడును. రంగులు సులభముగా మేళవింప వీలగును. "స్టెన్సిల్" సాధారణముగా పలుచని రాగిరేకుతోగాని ఇత్తడి రేకుతోగాని తయారుచేయబడును. అందుచేత ఇది తడుపు ఎక్కువగా నున్నపుడు కూడ చెడిపోదు. "స్టెన్సిల్" తయారు చేయుటలో పెక్కు "బలములు" (Stays) లేక ఆధారములు నేర్పుగా ప్రవేశపెట్ట బడును. ఇవి నమూనాలో అంతర్భాగములుగా కలిసిపోవునట్లు చేయబడును. "స్టెన్సిల్" పలకకు ఇవి తగు బలమునిచ్చును. ఇట్టి బలము లేనిచో "స్టెన్సిల్ బలహీనమై అచ్చువేయబడు వస్తువుపై అంటుకొని యుండదు. అచ్చువేయబడు పదార్థముపై స్టెన్సిల్ ఉంచబడును. కుంచెతో చెక్కిన భాగములగుండా రంగు వేయబడును. కుంచెతో ఒత్తి వ్రాయుట ('డబ్బింగ్') వలన రంగు అంటుకొనును.

గాలికుంచె (Air Brush) ను రంగువేయుటకు ఉపయోగించుట మరియొక పద్ధతి. దగ్గరకు ఒత్తబడిన గాలి యొక్క శక్తి రంగు బిందువులను తుంపురులుగా విడగొట్టును. ఈ సన్నని జల్లులు స్టెన్సిల్ ద్వారమున బట్ట మీదపడును. దీనిని కుంచెవలెనే వాడవచ్చును. దీనిచే తేలికయును, గాటమును అగు చాయలు రచించి, వివిధములగు ఛాయా ఫలితములను సాధింపవచ్చును.

జపాను దేశీయులు స్టెన్సిల్ తయారు చేయుటకు ఒక సున్నితమగు రీతిని అవలంబింతురు. ఒకేమారు రెండు పలుచని కాగితములను కత్తిరించి వాటితో నొక కాగితముపై సిల్కు దారములను సమానముగా పరచి పిదప నీరెండు కాగితములను అంటించుదురు. దీనిచే స్టెన్సిల్ యొక్క బలము అధికమగును.

తెర-అచ్చు : తెర-అచ్చు కూడ స్టెన్సిలింగ విధాన




తెర అద్దకము

1. తెర చట్రము
2. తీగె వల లేక సిల్కు గుడ్డ
3. అదుము రబ్బరు
4. రంగు పిండి
5. రంగు వేయవలసిన గుడ్డ
6. రంగు వేయబడిన గుడ్డ
7. చదునుబల్ల

ములలో చేరినదే. ఒక సన్నని దోమతెర గుడ్డ లేక సిల్కు గుడ్డను ఒక చట్రముపై గ్రహింతురు. నమూనాపై రంగు పూయుదురు. అపుడు రంగువేయబడని భాగము స్టెన్సిల్ పై చెక్కబడిన భాగములవలె సన్నని అల్లిక కలదగుటచే, వేసిన రంగును, తెరక్రింద నున్న బట్టమీదకు దిగునట్లుచేయును. తెరలు సన్నని "వైర్ గాజ్" లేక స్వచ్ఛమగు సిల్కు బట్టతో చేయబడును. తెరలలో పునశ్చరణము చేయబడు రూపములు కలుపుటకు వీలగునట్లు కొన్ని "పట్టుకొను ప్రదేశములు" (Catch points) ఏర్పాటు చేయబడి యుండును. కఱ్ఱనార (Cellulose) రంగు, లేక లక్క రంగు తెరకు రంగువేయుట కుపయోగింపబడును. ఈ రంగులు తడుపును నిరోధించుచు, "గాజుగుడ్డ" లేక బట్టయందలి సూక్ష్మరంధ్రములను బాగుగా పూడ్చివేయగలవు. రంగునీటివలన చేయబడును. రంగు, బట్టపై అంతటను వ్యాపింపకుండుటకై నీరు మిక్కిలి తక్కువ పరిమాణములో అచ్చువేయునప్పుడు ఉపయోగింపబడును. రంగు

ముద్దలను గట్టిపరచు సాధనములుగా జిగురులు, పిండి పదార్థములు మొదలగునవి ఉపయోగింపబడును.

అచ్చువేయు జిగురు రంగును వ్యాపింపకుండునట్లు చేయునదిగను, రంగును సమానముగా పంచుటకు సహాయ పడునదిగను ఉండవలెను. మరియు జిగురు, బట్టపై రంగు ఫలితమును పూర్తిగా ప్రదర్శించుచు, కడిగివేయుటకు సాధ్యపడునదిగా నుండవలెను. రంగును సమకూర్చగలశక్తి, చిక్కపరచెడి సాధనము యొక్క మరియొక ముఖ్య లక్షణము. ఆశక్తి అవసరములను బట్టి మారుచుండును.. ఆశక్తిని అవసరమైన విధముగా సవరింపవచ్చును. తటస్థములును, ఆవిరి కానివియును అగు నూనె పదార్థములను స్వల్ప పరిమాణములలో కలిపి వివిధములయిన చిక్కదనములను పొందవచ్చును. ఈ నూనెలు వృక్షజన్యములుగ గాని, జంతుజన్యములుగ గాని, ఖనిజ సంబంధములుగగాని యుండవచ్చును. అచ్చు రంగులకు మిక్కిలి చౌకగా కావలసిన చిక్కదనమును కలిగించుటకై "మెర్ట్" (Mert) ను, ఇతర ఘనపదార్థములను చేర్చవచ్చును. కొన్ని సందర్భములలో బాగుగా పొడిచేయబడిన చైనామట్టిని (Kaolin), జింక్ ఆక్సయిడ్‌ను, లితోపోనును Lithopone), బ్లేన్‌క్‌ఫై (Blank fie) మొదలగు వస్తువులను, ఉపయోగింతురు. ఇట్టి పదార్థములు ఎక్కువగా వాడినచో అచ్చుపడు ధర్మములకు భంగము కలిగించును. కారణము అచ్చురంగులు, అచ్చు రోలర్ల యొక్క చెక్కడములపై మట్టిపొరలవలె కప్పుకొను గుణము దీనివలన ఎక్కువగుటయే.

నిరోధక శైలికి విసర్జన శైలికి (Resist and Discharge Styles) సంబంధించిన ముద్రణములలో అట్టి వస్తువులు కలుపుట నిరోధకచర్యకు అనుకూల్యమును కల్గించును; మరియు తెలుపు రంగు ఫలితముల రూపమిచ్చు శక్తిగల లక్షణమును ఎక్కువ చేయుటలో సాయపడును. ఏమనగా, అవి శూక్ష్మరూపములో అంతటను విస్తరించి యుండుటచే నూలు పోగులు కొంతవరకు వాటిని నిలుపుకొన గల్గును. కడిగివేయుటకు సాధ్యముకాని కోడిగుడ్డులోని తెల్లని భాగమును పాలవిరుగుడు లేక సరేసు (Glue) వంటి చిక్కపరచు వస్తువులను కలిపి ఈ తెల్లని అణువులను నూలు ప్రోగుల పైభాగమునకు అంటిపెట్టుకొనునట్లు చేయుట తరచు వాంఛింపబడుచున్నది. జింక్ ఆక్సైడ్ విసర్జనశైలిలో వాడబడును. కొన్ని సందర్భములలో అది తెల్లని అణువ్యాప్తికి తోడ్పడును. విసర్జన విధానక్రమమున రాసాయనిక చర్యలోకూడ అది సాయపడును.

గోధుమపిండిని (Starch) తక్కిన చిక్కపరచు సాధనములతో కలిపినచో అదికలిసి ఎక్కువ ఉపయోగపడును. కాని అచ్చువేసిన పదార్థములకు కఠినస్పర్శను ఆపాదించుటయు, ముఖ్యముగా పెద్దదిమ్మలు అచ్చువేయునపుడు అసమఫలితము నిచ్చుటయు, అను ఈ రెండులోపములును దీనియందు కలవు. ఈ లోపములు కొంతవరకు 'బాదముబంకను' గాని బ్రిటిష్ జిగురును గాని ఉపయోగించి తొలగింపవచ్చును. తక్కువరకముల పిండి పదార్థములతో చేయబడిన జిగురులు ముద్దకట్టు స్వభావమును కలిగియుండును. పిండిపదార్థములతో చేయబడు జిగురులు కొలది ఉష్ణోగ్రతచే మార్పుచెందును. ఇవి కొంతకాలము నిలువయున్నచో పుల్లబడుట, చిక్కపడుట, నురుగుపట్టుట, నీటివలె పలుచగా నేర్పడుట జరుగును. క్రిమిసంహారకములు, ఫెనోల్, నెఫ్‌తాల్, సాలిసిలిక్ ఆమ్లము, బోరిక్ ఆమ్లము మొదలైనవి కొలదిగా కలిపి ఈ లోపములను తొలగింపవచ్చును.

ఆర్. వెం. స్వా.

**అద్దకము (రంగువేత):** గుడ్డలపై రంగుల అద్దుట, రంగులతో అచ్చులు వేయుట : రంగులు అద్దుటకు గుడ్డలను సిద్ధపరచు విధము:- రంగులు అద్దుటకు పూర్వము నూలును లేక గుడ్డను శుభ్రపరచుకొనవలెను. నూలునుగాని గుడ్డనుగాని ఉడికించుటకు పూర్వము 10 గ్యాలనుల నీళ్ళలో 10 తులముల క్యాస్టిక్‌సోడా, 5 తు.ల ఐగోపన్ టి (Igapon T) కాని మరియేదైన సహాయ ద్రవ్యముకాని కల్పి, రాత్రి అంతయు తడిపిఉంచి, ఉదయమున కఱ్ఱలతో తిన్నగా నదుమవలయును. 10 పౌండ్ల నూలును లేక గుడ్డను, 20 గ్యాలనుల నీళ్ళలో, 20 తులముల బట్టల సోడా, 10 తులముల టర్కిరెడ్ ఆయిల్, 4 తులముల క్యాస్టిక్‌సోడా కలిపి సుమారు రెండు గంటలవరకు బాగుగా ఉడికించిన పిదప శుభ్రమైన నీటిలో ఉతికి, సిద్ధపరచుకొనవలయును. లేనిచో

చాకలివానిచే నుతికించి ఆరిన గుడ్డలకు లేక నూలుకు రంగులు అద్దవలసినచో 20 గ్యాలనుల నీళ్ళు అనగా 5 కిరసనాయిల్ డబ్బాల నీళ్ళలో మూడునాల్గు తుల ముల బట్టలసోడా (Soda ash), 2, 3 పౌనుల క్యాస్టిక్ సోడా కలిపి ఉడికించవలయును. మరొక విధముగా పొడిగుడ్డను 20 గ్యాలనుల నీళ్ళలో 2 పౌనుల టర్కి రెడ్ ఆయిల్ కలిపి రెండుగంటల వరకు తడిపియుంచిన తరువాత, గట్టిగా పిండి సిద్ధముగా నుంచవలయును.

**సాధారణముగా వాడుకొను రంగులు (14) రకాలు :** 1. బేసిక్ రంగులు, 2. డైరక్టు రంగులు, 3. (అ) సల్ఫర్ రంగులు. (ఆ) హైడ్రాన్ రంగులు, 4, ఇండాన్ త్రీన్ రంగులు, 5. ఆలిజరిన్ రంగులు, 6. నెఫ్తోల్ రంగులు, 7. ఇండిగో రంగులు, 8. ఆసిడ్ రంగులు, 9. ఆసిడ్ క్రోం రంగులు, 10. మార్డెంటు రంగులు. పైని చెప్పబడ్డ 10 రంగులలో కొన్నిమాత్రము ఈ దిగువను విపులముగా చెప్పబడినవి. పై నుదహరించిన రంగులపేర్లు జర్మనీ దేశము వారివి. ఇంగ్లండు, స్విట్జర్లాండు మొదలగు దేశములలో తయారు అయిన రంగులపేర్లు వేరుగా నుండును.

**1. బేసిక్ రంగుల అద్దకము :** పట్టుకు ఉన్ని వస్తువులకు మాత్రము ఈ రంగులు వాడుదురు. 10 పౌనుల నూలుకు లేక గుడ్డకు 1 తులమునుండి 6 తులముల వరకు బేసిక్ రంగును మనకు అవసరమగు ఛాయా ప్రమాణమునుబట్టి వేసికొనవచ్చును. ఆసిటిక్ ఆసిడ్‌తో రంగును మర్దించి అందులో బాగుగా మరుగుచుండెడి నీరుపోసి కలుపవలెను. శుభ్రపరచిన నూలును లేక గుడ్డను, పది పౌనులకు ¼ పౌ. చొ. పటికను 20 గ్యాలనుల నీళ్ళలో కరిగించి, గట్టిగా పిండిన తరువాత దానిని 1% సజల టానిక్ ఆసిడ్‌లో తడియపెట్ట వలెను. ఇట్లు తయారుచేసిన నూలుపై లేక గుడ్డపై, వడియగట్టిన రంగును నీటితో అద్దకము చేయవచ్చును.

బేసిక్ రంగు పైవిధమున సిద్ధపరచి, జిగురులో కలిపి, గుడ్డలపై అచ్చులువేసి, 1½ లేక 2 గంటల వరకు ఆవిరి పట్టినచో ఉన్ని, పట్టు, చీటి గుడ్డలు తయారగును.

**డైరెక్టు రంగుల అద్దకము :** 10 పౌనుల నూలుకు లేక గుడ్డకు 8 తులములు మొదలుకొని 16 తులముల పరిమితిగల రంగును ఒక పాత్రలోనున్న చన్నీళ్ళలో బాగుగా కలిపిన తర్వాత బాగుగా మరుగుచుండెడి వేడి నీళ్ళను ఆ రంగులో పోయవలయును. లేదా అగ్నిపై పెట్టి, కొంతకాలము ఉడికించవలయును. నూలు లేక గుడ్డను అద్దుకొను పాత్రలో నూలుకు 30 పాళ్ళు ఎక్కువ నీళ్ళుపోసి, అందులో 2 తులములు మొదలు 12 తులముల వరకు బట్టల సోడాను ఉడికించి వడియకట్టిన రంగును కలుపవలెను. ఆ రంగులో నూలు లేక గుడ్డను ఉడక పెట్టుచు ఒక గంటవరకు ఆ రంగుపాత్రలోనే యుంచి పిదప వెలుపలకు తీసి శుభ్రమైన నీటితో ఉతికి ఆరవేయ వలెను. రంగుపాత్రలో నుండు రంగును పూర్తిగా వాడుటకుగాను, 2% తినునట్టి ఉప్పును కలిపి అద్దకమును పూర్తి చేయవలెను.

**సల్ఫర్ రంగుల అద్దకము :** పది పౌనుల నూలు లేక బట్టకు సల్ఫర్ రంగు 20 తులములనుండి 40 తులముల వరకు ఉపయోగింపవలెను. సల్ఫర్ నల్లరంగు మాత్రము 80 తులములవరకు గూడ వాడవచ్చును. లైట్ షేడ్ కావలయునన్న, రంగుతో సమమైన బరువుగల సోడియం సల్ఫైడ్‌ను రంగుతో కలుపవలెను. గాఢచ్ఛాయ షేడ్‌ను కోరినచో సోడియం సల్ఫైడ్ రెట్టింపు తీసికొనవలెను. బట్టలసోడా, పది పౌండ్ల నూలుకు లేక గుడ్డకు డార్కు షేడ్ (Dark shade) కావలయునన్న 20 తులములు, లైట్ షేడ్ కావలయునన్న 8 తులములు, రంగుపాత్రలో వేయవలెను. ఆఖరు దశలో తిను ఉప్పు 2 పౌండ్లవరకు రంగుపాత్రలో వేసినచో, రంగును పూర్తిగా వాడుటకు వీలగును. కొంతవరకు టర్కి రెడ్ ఆయిల్ కూడ వేయుట మంచిది. పైన చెప్పబడ్డ రంగును బాగుగా ఉడికించి అనగా 140° *F.* నుండి 180° *F.* వేడివరకు వేడి అయిన పిదప అద్దకము చేయవచ్చును.

తదుపరి ఈవలకు తీసి గాలికి ఆరవేసి సోడా, సబ్బు వేసి నీళ్ళలో ఉడకబెట్టి, శుభ్రమైన నీళ్ళలో ఉతికి ఆర వేయవలయును. పైన చెప్పబడ్డ సల్ఫర్ రంగులు మొదట వేసిన తూకము మరల అద్దుకొను సమయమున ⅔ వంతు రంగు ఇతరములు తగ్గింపుచేసి అద్దుకొన వచ్చును. ఇదే విధముగా నాల్గవ సమయానికి ఏ రంగు వేయకుండగనే అద్దుకొనవచ్చును. రంగులు అద్దుకొన్న తదుపరి నీళ్ళు

పారపోయకూడదు. ఎందుకనగా వాటిలో రంగుఉండును. అది చెడిపోదు. మరల అద్దుకొను సమయాన వాటిలో కొద్దిరంగు కలిపిన పనికివచ్చును.

నెఫ్తాల్ రంగుల అద్దకము : పదిపౌండ్ల నూలుకు లేక గుడ్డకు 8 తులములనుండి 12 తులముల నెఫ్తాల్ రంగు అవసరము. దీనికి సరియైన రంగు ఉప్పులు (1:3) అనగా 8 తులముల నెఫ్తాల్‌కు 24 తులముల రంగు ఉప్పు చొప్పున అందులో 24 తులములు తిను ఉప్పు వేసి సిద్ధము చేసికొనవచ్చును. ఈ రంగులు అద్దుటకు రెండు మట్టిపాత్రలు వెడల్పు మూతులుగలవిగాని, మట్టి తొట్లు గాని అవసరము.

బేస్ తయారుచేయు విధము : నెఫ్తాల్‌ను మోనోపోల్ సోప్‌తో మర్దించి, అందులో వేడినీళ్ళు కలిపి, కాస్టిక్ సోడాను కలుపవలెను. అట్లు కలిపినచో, నెఫ్తాల్ రంగు మారి నీళ్ళలో కరగును.

రంగు ఉప్పు తయారుచేయువిధము : రంగు ఉప్పు తూకమునకు సమముగా తిను ఉప్పు కలిపి, నీళ్ళలో రెంటిని కరుగబెట్టినచో రంగు ఉప్పు సిద్ధమగును. శుభ్రపరచిన నూలును లేక బట్టను నీటిలో తడిపి, పిండి నెఫ్తాల్ బేస్‌లో తడియబెట్టవలెను. దానిని పైకి తీసి, గట్టిగా పిండి, తయారైన రంగు ఉప్పునీళ్ళతో రంగు వేయవచ్చును.

ఇండాన్ థ్రీన్ రంగులువేయు పద్ధతి : ఈ రంగులు అన్నిరంగులకంటె గట్టిరంగులు. కాస్టిక్ సోడానీళ్ళకు గాని, బ్లీచింగ్ పౌడరు నీళ్ళకుగాని, ఈ రంగులు దిగిపోవు.

ఈ రంగుల అద్దకము 3 విధములు : IN, IW, IK.

నూలును లేక గుడ్డను శుభ్రముగా నుతికి రెడ్ అయిల్‌తో వాన్ని మెత్తగా చేయవలెను. 1% నుంచి 4% వరకు అవసరానుసారముగా రంగు ఉప్పును తీసికొని ఒక చిన్నపాత్రలో నీళ్ళతో మర్దించి దానిలో మరుగుచుండెడి నీళ్ళను పోసి, అందులో కాస్టిక్ సోడాను కలుపవలెను. అందులో సోడియం హైడ్రోసల్ఫైట్‌ను కొద్దికొద్దిగా కలుపుచు పోవలెను. మొదటిరంగు మారును. అట్లు రంగు మారినప్పుడే రంగు-ఉప్పు నీటిలో కరిగినదని తెలియును. ఇట్లు మారిన రంగునీటికి గాలి తగిలినచో మొదటిరంగు వచ్చును. ఈవిధముగా రంగుతయారైనదనుకొనవచ్చును. ఇట్లు తయారైన రంగునీటిని నీరుగల పెద్దతొట్టిలోపోసి తగినంత కాస్టిక్ సోడాను, సోడియం హైడ్రోసల్ఫైట్‌ను కలిపి నూలుకు లేక బట్టలకు అద్దకము చేయుటకు వాడవచ్చును. అట్లు అద్దించిన నూలును లేకగుడ్డను పైకి తీసి గాలిలో కొంతసేపు ఉంచినచో మొదటి రంగు మరల వచ్చును. ఆ బట్టను లేక నూలును సబ్బు, సోడానీళ్ళలో ఉడకబెట్టి తరువాత మంచినీటిలో శుభ్రపరచవలెను.

గుడ్డలపై రంగులను అచ్చువేయుట : ప్రస్తుతము మార్కెట్టులలో వాడబడుచున్న రంగులు :

(1) రాపిడ్ (ఫాస్టు) రంగులు, (2) ఇండిగోసోల్ రంగులు.

1. రాపిడ్ (ఫాస్టు) రంగులు అచ్చువేయు పద్ధతి : రంగును సారాయితో మర్దించి కొద్దిగా చన్నీళ్ళు లేక గోరువెచ్చని నీళ్ళు కలిపి అందులో కాస్టిక్ సోడాను మరికొంత నీటిని కలిపినచో ఆ కాస్టిక్ నీళ్ళలో రంగు కరుగును. ఈ రంగు నీటిని తగినంత బంక లేక జిగురులో కలిపి బట్టపై అచ్చువేయుటకు వాడవచ్చును. అచ్చువేసిన తరువాత బట్టను ఎండబెట్టి ఆవిరిలో నుంచినచో రంగు బాగుగా అంటుకొనును. అటుపిమ్మట బట్టను అసిటిక్ ఆసిడ్ జలములో వేసిన అసలురంగు బయటపడును. ఆబట్టను నీళ్ళలో ఉతికి పిదప సబ్బు, సోడా నీళ్ళలో ఉతికించి శుభ్రపరచవలెను.

2. ఇండిగోసోల్ రంగు అచ్చువేయు పద్ధతి : ఇండిగోసోల్ రంగును కొద్దిగా గ్లిసరిన్‌తో మర్దించి వేడినీళ్ళు కలిపి తగినంత సోడియం నైట్రైటు కలుపవలెను. ఈ ద్రావణమును జిగురులో లేక బంకలో కలిపి అచ్చువేయవచ్చును. అచ్చువేసిన బట్టను ఎండబెట్టి ఆసిటి కామ్లము లేక హైడ్రోక్లోరికామ్లపు నీటిలో స్నానబెట్టవలెను. ఇట్లుచేసినపుడు రంగు స్వభావసిద్ధముగ తయారగును. తర్వాత ఆ బట్టను నాల్గు అయిదుమార్లు మంచినీటిలో ఉతికి, తర్వాత సోడా సబ్బు నీళ్ళలో ఉడకబెట్టి, శుభ్రపరచవలెను.

అనిలీన్ హైడ్రోక్లోరైడు లేక అనిలీన్ లవణమును నీళ్ళలో కరిగించి ఇందులో తగినంత పొటాసియ హరితమును, కొద్దిగ మైలుతుత్తమును కలిపి బంక లేక జిగురులో కలిపి అచ్చువేయవచ్చును.

అచ్చువేసిన బట్టలు తీక్ష్ణమైన ఎండలో మూడు నాల్గు గంటలవరకు పెట్టినచో నల్లరంగు తేలును. పిమ్మట బట్టను చాల కొద్దిగ ఆమ్లము కలిసిన నీటిలో నానబెట్టినచో దాని పూర్తిరంగు తేలును. అట్లు అచ్చువేసిన బట్టను మామూలు పద్ధతిని 4, 5 సార్లు మంచినీటిలో కడిగి, సోడా సబ్బుతో మరల శుభ్రపరచవలెను. ఈ రంగు సాధారణముగా డిజైనుయొక్క అంచుకు వాడవచ్చును.

ఆర్. వెం. స్వా.

**అద్దె (Rent) :-** చదువరి ముఖ్యముగా విద్యార్థియగుచో సరకుల ఉత్పత్తి, వాటిని తయారుచేయుట కగు ఖర్చులు, బజారులో వాటి ఖరీదులు — ఈ అంశముల నడుమగల సంబంధముల స్పష్టీకరించు సిద్ధాంతమును తెలిసికొనుటకు కుతూహలమును ప్రదర్శించును.

ఖర్చుల మొత్తమును నిశ్చయించు సిద్ధాంతము కొన్ని సూత్రముల ననుసరించి పనిచేయును. నిర్దిష్టమగు ఖర్చులు, మారు ఖర్చులు, అను ఖర్చుల మధ్యగల తారతమ్యము అల్పకాల వ్యవధికిమాత్రమే వర్తించు అంశమనునది ఒక సూత్రము. మారుచున్న ఉత్పత్తితో కలిసి మారనిఖర్చులు నిర్దిష్టమగు ఖర్చులు. పారిశ్రామికవేత్త కల్గియుండిన ఉత్పత్తిసాధనములు, వేరు అవకాశములు లభించునెడల సంపాదింపగల ధనరూపమైన సంపాదనలు, పారిశ్రామిక వేత్త ఇతరుల కొరకగవలసిన నిర్దిష్టమగు ఖర్చులుకూడ నిర్దిష్టమగు ఖర్చులుగనే ఎంచబడును. నిర్దిష్టమగు ఖర్చులు అనునది తప్పక రాబట్టవలసిన ఖర్చులు ఇవి యను అంశమును తెలియజేయునదని అనుకొనవచ్చును. కాని అల్ప వ్యవధికి సంబంధించినంతవరకు ఇది నిజముకాదు. ఏలయన, ఒక పారిశ్రామికవేత్త తన పెట్టుబడిపైగాని తన కృషిఫలితముగా కాని అల్ప వ్యవధియందు ఏమియు సంపాదింపకుండినను పరిశ్రమ సాగుచునే యుండవచ్చును. ముఖ్యమగు ఖర్చులను రాబట్టగల్గిన పక్షమున, పరిశ్రమ కొంతకాలమువరకు సాగుటకు ఎట్టి అడ్డంకులును ఉండవు. కొలదిగనైనను గొప్పగనైనను ఉత్పత్తి జరుగుటకు అల్పవ్యవధియందు సైతము రాబట్టబడవలసిన ముఖ్యమగు ఖర్చులు కొన్ని గలవు. అన్ని విధములైన మారుచుండు ఖర్చులు, కొన్ని నిర్దిష్టమగు ఖర్చులు, ముఖ్యమగు ఖర్చుల క్రిందకు వచ్చును. ముఖ్యమగు ఖర్చుల జాబితాలోనికి వచ్చు నిర్దిష్టమగు ఖర్చులకు ఉదాహరణముగ కార్యాలయోద్యోగుల కొరకగు వేతనములను పేర్కొనవచ్చును. తక్కిన నిర్దిష్టమగు ఖర్చులను ఉపఖర్చులు అందుము. మొత్తముమీద ఎప్పటికో అప్పటికి నిర్దిష్టమగు ఖర్చులను, మారు ఖర్చులనుకూడ ప్రతి పారిశ్రామికవేత్త రాబట్టవలసినదే. కానిపక్షమున ఆ పారిశ్రామిక సంస్థ వ్యాపారరంగమున నుండజాలదు.

ఒక వస్తువు తయారుచేయబడిన తరువాత, ఆవస్తువు నకుగల అపేక్షలో కల్గు మార్పులననుసరించి దాని మూల్యము మారుచుండు నప్పటికి సామాన్యముగా ప్రతి వస్తువు ఖరీదు దాని ఉత్పత్తికగు ఖర్చునుబట్టి నిర్ణయింపబడునను ఊహ సర్వసాధారణమైనది. ఉత్పత్తికగు ఖర్చులో పారిశ్రామిక వేత్తయొక్క లాభముకూడ ఇమిడియున్నదని దీని భావము. కాని పారిశ్రామికవేత్తయొక్కలాభము, వేరువేరు సమయములయందు వస్తువుయొక్క ఖరీదులో కలుగు మార్పుల ననుసరించి మార్పు చెందుచుండును. ఇంతేగాక ఉత్పత్తి పరిమితి, తయారు చేయబడుచున్న ఆ వస్తువుయొక్క అపేక్షపై ఆధారపడియుండగా, ఉత్పత్తి పరిమితి ననుసరించియే ఉత్పత్తికగు ఖర్చు మారుచుండును. కావున తయారైన వస్తువుల ధరలు ఖర్చులవలనగాని, ఖర్చులు తయారైన వస్తువుల ధరలవలనగాని నిర్ణయింపబడజాలవు. ధరలన్నియు పరస్పరము ఒకదానిపై నొకటి ఆధారపడుచుండును.

కొన్ని ఖర్చులయందు అర్థశాస్త్రమున 'అద్దె' అని వ్యవహరింపబడు దాని లక్షణములు కననగును. ఉత్పత్తి సాధనములు పరిశ్రమయందు నిలచియుండుటకుగాను వెచ్చింపనవసరములేని మొత్తములను 'అద్దె' అని అందుము.

అర్థశాస్త్రమున మనము 'అద్దె' అని వ్యవహరించునది ఉత్పన్నమగుటకు కారణము. అద్దెను ఆర్థికఫలముగా సంపాదించు ఉత్పత్తి సాధనముయొక్క పరిమితి దానికి గల అపేక్షతో వచ్చు మార్పులకు అనుగుణముగా ఎట్టి మార్పును పొందలేకుండుటయే. ఏదేని ఒక ఉత్పత్తి సాధనముయొక్క యూనిట్ అది ప్రస్తుతము ఏ వృత్తియందు గలదో ఆ వృత్తియందుండుటకుగాను అవసరమైన కనీసపు మొత్తముకన్న ఎక్కువ ఆదాయమును సంపాదించుచున్నచో, దాని నష్టయి వెలకన్న

అదనముగా వచ్చు రాబడి అర్థశాస్త్రమున అద్దె అని పిలువబడును. మరియు ఒక ఉత్పత్తి సాధనముయొక్క సప్లయి సంపూర్ణస్థితిస్థాపకతకన్న తక్కువగా నున్నప్పుడే అద్దె ఏర్పడుటకు వీలగును.

ఇట్టి తరగతికే చెందిన అదనపురాబడి లేక అద్దె ఇతర ఉత్పత్తిసాధనములయొక్క కొన్ని యూనిట్లుకూడ పొందుచుండుట మనము చూడవచ్చును. ఏదేని ఒక ఉత్పత్తిసాధనముయొక్క సప్లయి సంపూర్ణస్థితి స్థాపకత కన్న తక్కువగాకున్నప్పుడే అద్దె ఏర్పడుననుట దీని అర్థము. ఒక ఉత్పత్తి సాధనముయొక్క సప్లయి సంపూర్ణ స్థితి స్థాపకతకన్న తక్కువగా నున్నపుడు, లేదా, కనీసపు సప్లయి వెలకే పని చేయుటకు సిద్ధపడు ఒక ఉత్పత్తి సాధనముయొక్క యూనిట్లకు మించి ఎక్కువ యూనిట్లను ఉపయోగింపగలుగునంతటి అపేక్ష ఆ ఉత్పత్తి సాధనమునకు ఉన్నప్పుడు అద్దె ఏర్పడునని చెప్పవచ్చును.

**సాంఘికదృష్ట్యా 'అద్దె' అర్థము :** 'భూమి' పై వచ్చు 'అద్దె' కు సంబంధించిన ఆర్థికాంశములను సరిగా వివరించుటకు, భూమియొక్క ఆర్థికోపయోగములు వాటికి గల అపేక్షకు సంబంధించినంతవరకు వాటి వినియోగమునకుగాను ప్రతిఫలము ముట్టచెప్పవలసినంత కొరతగా నున్నవని మనము చూపగలిగి యుండవలెను.

భూమి అద్దె నొసంగునని చెప్పుటలోగల అర్థమిది :

భూమియొక్క సప్లయి అనగా (1) ఒక ప్రత్యేకమైన ఉపయోగమునకుగాను కేటాయింపబడిన భూమిసప్లయి, (2) యావత్ప్రపంచమునందలి భూమియొక్క విస్తీర్ణము, (3) ఒక దేశమునందలిగాని ఒక జిల్లాయందలిగాని భూమి యొక్క మొత్తము విస్తీర్ణము.

మొదటి అంశము - భూమియొక్క ఉపయోగమునకై గల అపేక్షలోని పెరుగుదలను ఇంతవరకు ఇతర ఉపయోగములకుగాను వినియోగింపబడుచున్న కొంత భూమిని అపేక్ష పెరిగిన ఆ ప్రత్యేకోపయోగమునకు మార్చుటవలన పరిష్కరింపవచ్చును. ఇట్లే ఇతర ఉపయోగముల విషయమునందు సైతము అపేక్ష పెరుగుదల తగ్గుదలలు [illegible] వినియోగమును ప్రత్యేకోపయోగములకు మార్చుటవలన సులభముగా ఎదుర్కొనవచ్చును.

రెండవ అంశము - ప్రపంచమునందలి భూమియొక్క మొత్తము విస్తీర్ణము ఇంచుమించుగా మార్పుజాలనిది. భూమికై గల అపేక్షలోని పెరుగుదల భూస్వాములరాబడి అధికము చేయునని, తద్వ్యతిరేకముగా తగ్గుదల వారి రాబడిని తగ్గించునని దీని అర్థము. శ్రమవిషయమునందును ఇట్లే భూమియొక్కగాని శ్రమయొక్కగాని సప్లయి ప్రత్యేకోపయోగములకు మాత్రమే అధికము చేయబడవచ్చును, తగ్గింపబడవచ్చును.

మూడవ అంశము- ప్రతి ఒక్క ప్రత్యేకమైన ఎకరము యొక్క భౌగోళికస్థానము నిర్ణీతము అను విషయము చాల ముఖ్యమైనది. 'గోదుమలకు' అపేక్షలో కలిగిన పెరుగుదల వేరొక ప్రదేశమునందు భూమి గోదుమల సేద్యమునకు వినియోగింపబడుచున్నదని అర్థము. ఇతర ప్రదేశములయందును గోదుమలు పండింపగల్గి నందువలనను, వారి గోదుమలకు పోటీగా ఇతరులును గోదుమలు అమ్మకలిగినందువలనను ఆ జిల్లాయందలి భూస్వాములు మునుపటికంటె విశేషించి హెచ్చు రాబడిని పొందజాలక పోవచ్చును. కాని ఆ ప్రత్యేకము జిల్లాకు సంబంధించినంతవరకు భూమి అపేక్షయందు కలిగిన పెరుగుదలను ఇతరప్రదేశముల యందలి భూమి తీర్పజాలదు.

భూమి అంతయు ఒకే వస్తువును ఉత్పత్తిచేయుటకు వీలైనదిగా ఉండినను, మరియు పూర్తి పోటీవిధానము క్రిందనుండి, భూమి అంతయు ఒకే ఉత్పత్తి శక్తిని కలిగి యుండినను, ఆ వస్తువునకై హెచ్చగు చున్న అపేక్షను భూమి అంతయు వినియోగము క్రిందకు వచ్చునంత వరకు కనీసపు సరాసరి యూనిట్ ఖర్చుల మొత్తపు బిందువువద్ద ఉత్పత్తిచేయు హెచ్చయిన పారిశ్రామిక సంస్థలు తీర్పగలవు. భూమి అంతయు వినియోగము క్రిందకు తేబడునంతవరకు భూమి కొరతగానున్న ఉత్పత్తి సాధనముకాదు. ఆ వస్తువుధర పరిశ్రమయందలి అన్ని పారిశ్రామిక సంస్థల కనీసపు సరాసరి యూనిట్ ఖర్చుల మొత్తమునకు సమానమై యుండి భూమి యజమానునకు అద్దె పేరున చెందు అదనపు రాబడి ఏమియునుండదు.

భూమి అంతయు ఉపయోగము క్రిందనుండి, ఆ వస్తువునకుగల అపేక్ష ఇంకను హెచ్చగుచో భూమిని ఎక్కువ చేయుటవలన ఉత్పత్తిని అధికము చేయజాలము. ఇతర

ఉత్పత్తిసాధనముల వినియోగమును, అధికముచేయజాలని నిర్ణీతమైన భూమి వినియోగమునకు జోడించుటవలననే ఉత్పత్తి ఎక్కువగును. విషమ నిష్పత్తుల ఉత్పత్తిసూత్రము అమలు జరుగును.

భూమి అంతయు ఉపయోగము క్రింద నున్న తరువాత మిక్కిలి తక్కువ ఖర్చుల కలయికతో ఉత్పత్తి చేయగలిగిన దానికన్న విశేషముగా నొక వస్తువును ప్రజలు వాంఛించుచున్నయెడల వారు మార్జినలు ఖర్చుకు సమమైన ఖరీదు నొసంగవలసినవా రగుదురు. ప్రతి ఉత్పత్తిదారుడును వస్తువు ఖరీదు మార్జినల్ ఖర్చుతో సమమగు నంతవరకు ఉత్పత్తిని సాగించును. కాని ఈ ఉత్పత్తివద్ద సరాసరి యూనిట్టు ఖర్చుల మొత్తము వస్తువు ఖరీదుకన్న తక్కువగా నుండును. మరియు మొత్తమురాబడి, మొత్తము ఖర్చుకన్న ఎక్కువ. ఖర్చులను మించిన అదనపు రాబడి ఇచ్చట కలుగుచున్నది. మార్జినలు రాబడి మార్జినలు ఖరీదులు సరిసమానముగా నుండినచో ప్రతి పారిశ్రామిక సంస్థయు నిశ్చలతను పొందును. ఉపయోగించుటకు వేరుగా భూమిలేనందున, ఈ అదనపురాబడికి ఆశపడి క్రొత్తపారిశ్రామిక సంస్థలు పారిశ్రామిక రంగమును ప్రవేశింపజాలవు. పరిశ్రమయు నిశ్చలతను పొందును. ఈ అదనపు రాబడియే అర్థశాస్త్రమున చెప్పబడు భూమియొక్క అద్దె.

**వ్యత్యాసమును సూచించు అద్దె :** ఒకేవిధమైన ఉత్పత్తి, శక్తి, సారము భూమికంతకు గలదనుమన ఊహను తొలగించి వివిధములగు తరగతులకు చెందిన భూమిగలదను వాదమును అంగీకరించినను మన పరిశీలన తప్పుకానేరదు. స్వల్పవివరణము మాత్రము అవసరమగును.

**ఒకే పరిశ్రమ యందు అద్దె :** పరిశ్రమ వ్యాప్తి చెంది, ఎక్కువగా పెరిగిపోవుచున్న భూమి యొక్క ఇతర ఉపయోగముల నుండి దానిని విడుదలచేయవలసిన అవసరమేర్పడినప్పుడు భూమి వినియోగమునకుగాను ఆ పరిశ్రమ చెల్లించవలసిన మూల్యము పెరిగి పోవును. ఆ పరిశ్రమ చెల్లించవలసిన ప్రతి భూ విభాగము యొక్క కనీసపు సప్లయి ఖరీదు ఆ భూమి మిక్కిలి ఎక్కువ విలువైన తన ప్రత్యామ్నాయపు ఉపయోగమునకు సంపాదింపగల ద్రవ్యమునకు సమానమగును. ఆ పరిశ్రమ యందలి ఉపయోగమునకై భూమి బదిలీచేయబడుటకు అవసరమైన ఖరీదును భూమి యొక్క పెట్టు ధర అని పిలువవచ్చును. భూమి హెచ్చుగా ఉపయోగింపబడుచున్న కొలది భూమి యొక్క బదిలీచేయబడిన ఉపయోగపు వెల అధికమగుచు భూమియొక్క ఆ పెట్టు ధర పరిశ్రమకు ఉత్పత్తి ఖర్చుగా పరిగణింపబడి, ఆ పరిశ్రమ యందే అద్దె అని మనము వ్యవహరించు అదనపు రాబడి సంభవమగును.

**పారిశ్రామిక సంస్థ దృష్ట్యా అద్దె :** పారిశ్రామిక సంస్థ దృష్ట్యా అన్ని ఉత్పత్తిసాధనముల అద్దెలు ఉత్పత్తిఖర్చులుగనే పరిగణింపబడవలయును. ఒక పారిశ్రామిక సంస్థ భూమిని ఇతరుల నుండి బాడుగకు తీసికొనినచో అది ధన రూపమున చెల్లింపవలసిన అద్దె ఖర్చుగా కనుపించుచునే యున్నది. భూమి యజమానుడే దానిని ఉత్పత్తి సాధనముగా వినియోగించినచో దాని నతడు ఇతరులకు బాడుగకు ఒసంగిన యెడల సంపాదింపకలిగిన ద్రవ్యమంతయు అవకాశపు ఖర్చు అగును. అవకాశములలోని తేడాలు కారణముగా నేర్పడు అద్దెను "పారిశ్రామికసంస్థ దృష్ట్యా అద్దె" అని చెప్పవచ్చును.

**స్థానపు విలువ :** ఒకే ఉత్పత్తి శక్తిని కలిగియున్న రెండుభూముల విషయములో (ఉత్పత్తిఖర్చులు రెండింటి యందును సమానమని అర్థము.) అంగడికి అతి సామీప్యమున గల భూమి ఎక్కువ సంపాదన కలిగినదగును. బజారుకు సరకును రవాణాచేయుట కగు ఖర్చులలో గల తారతమ్యమే దీనికి కారణము. భూమియొక్క స్థాన లాభమువలన అదనముగా వచ్చు అద్దెను 'స్థానపు విలువ' అని పిలువవచ్చును.

ఒక చిల్లర వ్యాపారస్థుని కిరాణా అంగడి యొక్క స్థానపు విలువను ఇట్లు పేర్కొననగును. ఆ స్థలమునందు ఎక్కువ వ్యాపారము జరుగగలదు కావుననో, లేదా ఆ స్థలము నందు వ్యాపారస్థులనుండి ప్రజలు ఎక్కువ ఖరీదునకే సరకులు కొనుటకు ఇష్టపడుటవలననో చిల్లర వ్యాపారస్థులకు అద్దె ఏర్పడుచున్నది. పై అంశమునకే సంబంధించిన మరియొక స్థానపు విలువకు తార్కాణముగా ఇతర ప్రదేశముల యందు అంతే వ్యాపారము చేయుట కగు ఎక్కువ ఎడ్వర్టయిజుమెంటు ఖర్చులను ఉదాహరింపవచ్చును.

**పట్టణ ప్రదేశముల అద్దె :** పట్టణ ప్రదేశముల స్థానపు విలువ యందు ఒక ప్రత్యేకమైన మొనాపలీ (గుత్త) లక్షణమును చూడవచ్చును. అలవాటు వలననో బద్ధకము వలననో తమకు అనువగు స్థలములందే వ్యాపారము చేయుటకు జనులు ఇష్టపడుట వలన కొనుగోలు దారులలో ఒక ప్రత్యేక వర్గమువారి వ్యాపారమునంతను వశపరచుకొని మొనాపలీ లాభమును కొంతవర కైనను కొన్ని స్థలములందలి వ్యాపారస్థులు అనుభవింప వచ్చును.

కొనుగోలుదారుల వస్తువుల క్రయము ఒకే ప్రదేశము నందు కేంద్రీకరింపబడుట ఎక్కువగు కొలది నగరము లందలి వ్యాపారపు సంబంధమైన స్థలముల అద్దెలు ఎక్కువగుట జరుగును.

**క్వాసీ - అద్దె :** కాపిటలు వస్తువులపై పెట్టిన పెట్టుబడి, భూమిపై వచ్చు అద్దె వంటి ప్రతిఫలమును పోలిన రాబడిని తరచుగా నొసంగును. ఇట్టి కాపిటలు వస్తువులపై వాటి యజమానులకు తప్పక క్వాసీ-అద్దె ముట్టును.

భూమి యొక్క కనీసపు సప్లయి ఖరీదు సున్న యను కొనినట్లే కేపిటలు వస్తువుల యొక్క కనీసపు సప్లయి ఖరీదు కూడ సున్న యనియే చెప్పవచ్చును. ఈ విధముగా ఇట్టి వస్తువులపై వచ్చు ప్రతిఫలము కూడ అద్దె స్వభావ మునే కల్గియున్నది.

బి. వి. రా.

**అద్వైతము:-** "అద్వైతమ్"-ద్వే-ఇతే యన్యతత్ ద్వితం. ద్వితమేవ ద్వైతమ్, నద్వైతం, అద్వైతమ్- అని విగ్రహము. రెండు విధములు లేనిది. ఒకటే విధము. అనగా విజాతీయమగు జగము మిథ్యగాన విజాతీయమే లేనందున విజాతీయ భేదము ఆత్మకు ప్రాప్తించదు. సజాతీయమగు మరియొక ఆత్మ లేనందున సజాతీయ భేదము గూడ ఆత్మకు ప్రాప్తించదు. ఆత్మ నిరవయవము, నిర్గుణము, నిష్క్రియము అగుటచేత స్వగతమగున దేదియు వృక్షాదులకు శాఖాదులవలె లేనందున నాత్మకు స్వగత భేదము ప్రాప్తించదు. కాన సజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యమగు చిద్రూపబ్రహ్మ మొక్కటియే సత్యము; ప్రపంచమంతయు మిథ్య అని "అద్వైతము" అను పదము వలన తేలిన ఆశయము.

అద్వైతము శ్రుతి, స్మృతి, పురాణేతిహాస ప్రసిద్ధము. దీనిని సదాశివుడు విష్ణువునకును, విష్ణువు చతుర్ముఖ బ్రహ్మకును, బ్రహ్మ వశిష్ఠునకును, వశిష్ఠుడు శక్తికిని, శక్తి పరాశరునకును, పరాశరుడు వ్యాసునకును, వ్యాసుడు శుకయోగీంద్రునకును ఉపదేశించెను. తద్ద్వార మున గౌడ పాదాచార్యులవారును, తద్ద్వారమున గోవింద భగవత్పాదులును, వారి వలన శ్రీ జగద్గురు శంకరభగవత్పాదులును ఉపదిష్టులై ఈ అద్వైతమును భూలోకమున వ్యాపింప జేసిరి.

వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు అనేక చిత్ర విచిత్ర గాథలతో ఈ యద్వైతము నుపదేశించెను. ఆ ఉపదేశ ములే ఛందోబద్ధములై "యోగవాసిష్ఠము" అను పేరుతో ప్రసిద్ధిగాంచి, పామరులకును, పండితులకును, ఆదరణీయములైనవి. అద్వైతమును బోధించుటకే శ్రీ వేదవ్యాసులవారు 192 అధికరణములు, 16 పాద ములు, 4 అధ్యాయములుగల "ఉత్తర మీమాంసా శాస్త్రము" రచించి యుండిరి. ఈ ఉత్తర మీమాంసా శాస్త్రము అనేకన్యాయోపబృంహితమయి యున్నది. గౌడ పాదాచార్యులవారు ప్రధానముగ మాండూక్యోప నిషత్తు ననుసరించి దానికి వివరణముగ "ఆగమము, అద్వైతము, వైతథ్యము, అలాతశాంతి" అను నాలుగు ప్రకరణములుగల కారికలను రచించిరి. ఈ కారికలలో "వైతథ్య" ప్రకరణమున స్వప్నమునకు మిథ్యాత్వమును సాధించి తద్దృష్టాంతము ననుసరించి జగత్తునకు మిథ్యాత్వ మును స్థాపించిరి, అందు దృష్టాంత దార్ష్టాంతికములతో వారు చూపిన హేతువాద పాండిత్య ప్రకర్షకు అక్ష పాదుడు, కణభుక్కు కూడ ఆశ్చర్య చకితులైరి.

శ్రీ శంకరులు, గోవిందభగవత్పాదులకు శిష్యులై, ఉపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు, శ్రీ మద్భగవద్గీత లకు, సనత్సుజాతీయమునకు, విష్ణు సహస్రనామములకు భాష్యములను వివరించియుండిరి. ఇంతియేగాక ఉపదేశ రూపములుగను, స్తోత్రముల రూపముగను శ్రీ శంకరా చార్య స్వాములు తమ అనర్గళ కవితావల్లరి దశదిశల ప్రాకునటుల శతాధిక గ్రంథరాజములను వెలయించిరి.

**ప్రపంచ మిథ్యాత్వ సాధనము :** జంగమ స్థావరాత్మక మగు ఈ ప్రపంచ మింద్రియ గోచరమగుచుండ శుక్తి

రజతాదులవలె, స్వప్న ప్రపంచమువలె, మిథ్య యెట్లగు ననిన, దృశ్యములగు శుక్తిరజతాదులును స్వప్న ప్రపంచ మును ఎటుల సత్యేతరములో అటులనే యీ ప్రపంచము మిథ్య యగును. కావున దృశ్యమను హేతువు వ్యభిచారి యగుటచే ప్రపంచమునకు సత్యత్వమును స్థాపింపనేరదు.

శుక్తియందు రజతభ్రాంతి కలిగిన పిమ్మట "ఇది శుక్తి" అను జ్ఞానము కలిగి అద్దానిచేత రజతభ్రాంతి లోలగును. అచట రజతములేదు, ప్రపంచమనునది ప్రత్యక్షముగ గాన్పించుటయే కాక వస్తుస్థితినిగూడ జూచుచుండ ప్రపంచము మిథ్యయని యెటుల చెప్ప నొప్పును అను విషయము విచారింప తగినది.

భ్రమస్థలమున శుక్తిని జూచిన తోడనే "ఇది శుక్తి" అను జ్ఞానము కలుగలేదు. "ఇది రజతము" అను జ్ఞానమే కలిగినది. ఈ జ్ఞానము ప్రత్యక్షమా? అనుమితియా? ఉపమితియా? శాబ్దమా? అర్థాపత్తియా? అనుప లబ్ధియా? అనినచో శుక్తికకు చక్షురింద్రియమునకు సంయోగము ప్రాప్తించి "ఇది రజతము" అను జ్ఞానము కలిగిన పిమ్మట నేను రజతము నూహించుచుంటిని." అను నీమొదలగు అనుభవములు (అనువ్యవసాయ ములు) లేకుండుటచేత "ఇది రజతము" అను జ్ఞానము అనుమిత్యాదికముకాదు. "ఇది రజతము" అను జ్ఞానము కలిగిన పిమ్మట "నేను రజతమును చూచుచుంటిని" అను అనుభవముండుటచేత "ఇది రజతము" అను జ్ఞానము ప్రత్యక్షమేయని అంగీకరింప వలయును. దేశాంతరము నందుండు రజతమునకును చక్షురింద్రియమునకును సంబంధము ఏర్పడదు గావున "ఇది రజతము" అను జ్ఞానమున దేశాంతరస్థమైన రజతమే భాసించునని చెప్ప నొప్పదు. రజతము లేకున్నను "ఇది రజతము" అను భ్రాంతి కలుగుననిచో, విషయమే లేనితరిఅట్టి జ్ఞానమే కలుగదు. మరియు నేను రజతమును చూచుచుంటిని" అను అనువ్యవసాయము రజతస్థితిని ధ్రువపరచుచున్నది. కావున "ఇది రజతము" అను భ్రాంతిస్థలమున రజత మున్నదని యొప్పుకొని తీరవలెను. కాని ఆరజతమేది యని మాత్రము విచారింప వలయును.

దేశాంతరస్థమయిన రజతమునకు చక్షురింద్రియము నకు సంబంధము పొసగదు కావున దేశాంతరస్థ రజతము "ఇది రజతము" అను భ్రాంతియందు భాసింపనందున "ఇది రజతము" అను భ్రాంతి సమకాలమున నొక రజతము పుట్టి, యా రజతమే "ఇది రజతము" అను జ్ఞానమున భాసించుచున్నదని యొప్పుకొనవలయును. కాని ఇట్టి రజతము పుట్టుటకు కారణ మేమియుండునని మాత్రము విచారింపవలసి యున్నది. చక్షురింద్రియమునకును, పురోవర్తి వస్తువునకును సంయోగము కలిగిన పిమ్మట "ఇది శుక్తిక" అను జ్ఞానము కలుగలేదు. అనగా శుక్త్య జ్ఞానమే యున్నది. ఇది యిట్లుండ పూర్వమునం దెన్నడో సత్య రజతమును జూచినప్పు డాయనుభవము వలన రజత సంస్కారము జనించియుండెను. ప్రకృతమున చక్షు రింద్రియమునకును పురోవర్తి వస్తువునకును సంయోగము ఒనించుతరి పురోవర్తి వస్తుగత చాకచక్యము ప్రత్యక్షమై ఆ ప్రత్యక్షము వలన పూర్వ రజత సంస్కార ముద్బుద్ధ మగును. అట్టి ఉద్బుద్ధ సంస్కారముతో గూడి శుక్త్య జ్ఞానము రజతాకారముగను, రజత జ్ఞానాకారముగను పరిణమించును. ఇట్టి రజతమునే ప్రాతిభాసిక రజత మందురు. కావున "ఇది రజతము" అను జ్ఞానమున భాసించు రజతము శుక్త్య జ్ఞానము వలన పరిణమించి, శుక్తి జ్ఞానము వలన నివర్తించునటుల, ఆత్మాఽజ్ఞానము వలన పరిణమించిన యీ నిఖిలప్రపంచము, నాత్మజ్ఞానము వలన నివర్తించునట్టి దగుటచేత శుక్తిరజతమువలె మిథ్యయేయని యొప్పుకొనవలెను.

శుక్తిరజత మర్థక్రియాకారి యగుటలేదు. భుజించినట్లు స్వప్నమువచ్చినపుడు స్వప్నమునందు స్వప్నసమకాలమున భుజించుటయు, దానివలన తృప్తియు కనిపించుచున్నవి. కావున స్వప్నము సత్యమే యగుచుండ స్వప్నమువలె ప్రపంచము మిథ్య అనుట యెట్లు పొసగుననిన సమా ధాన మిట్టిది. వినుము:

ఒక డేగ తన శక్తికొలది ఇటు నటు ఎగిరి యెగిరి శ్రమమునుపొంది సాయంకాలమునకు తనగూటికేగి రెక్క లను ముడుచుకొని యెట్లు విశ్రమించునో, అట్లే ఆత్మయు అంతఃకరణముతో తాదాత్మ్యాధ్యాసను పొంది, అంతః కరణ ధర్మములయిన అహంకార మమకారాదులను ఆత్మయందారోపించుకొని, "నేను, నాది" అని అహం కార మమకారావిశిష్టమై చక్షురాదీంద్రియముల

ద్వారమునబయలు వెడలిన అంతఃకరణవృత్తులను తనయం దారోపించుకొని "నేను కర్తను, నేను భోక్తను, నేను సుఖిని, నేను దుఃఖిని" అని అనేకవిధముల క్లేశముల నొంది విశ్రాంతినిగోరి పరుండును. ఆ తరుణమున సర్వేంద్రియములు మనస్సునందు లయించును. అట్టి సమయమున జాగ్రదవస్థయందనుభవముల వలన జనించిన సంస్కారములతో గూడిన అవిద్యయొక్క పరిణామము లగు స్వాప్నిక పదార్థములను జూచును. ఆ సమయము నందు గలిగిన జ్ఞానము ప్రత్యక్షాత్మక మగుటచేత స్మృతి యని యనిపించుకొనదు. ప్రత్యక్షాత్మక మగుటవలన పదార్థములకు స్థితి నొప్పుకొనవలయును. ఆ స్వప్న పదార్థములగు గజతురగాదులు స్వీయ నివాసమునకు దగని ఈ శరీరమునందే గోచరించుటచేత, సత్యము లనుటకు వీలులేదు. ఇంద్రజాలికుడు ప్రాసాదమును మ్రింగుచున్నట్లు ఆతని మాయచే కనిపించును. కాని అతని ముఖమున ప్రాసాదమునకు ప్రవేశించు యోగ్యత లేనందున ప్రాసాద నిగరణమునకు అయోగ్యమగు నతని ముఖమువందు అగుపడు ప్రాసాద నిగరణము మిథ్య యగునట్లు, స్వాప్నిక గజతురగాదులు మిథ్యయే అని యొప్పుకొనవలయును. ఈవిషయమునే శ్రీ గౌడ పాదా చార్యులవారు తమచే రచింపబడిన మాండూక్యోపనిష త్కారికలయందు వైతథ్యప్రకరణమున మొట్టమొదటనే

"వైతథ్యం సర్వభావానాం స్వప్న ఆహుర్మనీషిణః।
అంతస్థానాత్తు భేదానాం సంవృతత్వేన హేతునా"

అను కారికచే స్పష్టముగ జెప్పిరి.

పై గౌడపాదకారిక వలన "ఏ పదార్థము తనకు తగని ప్రదేశమున గోచరించునో ఆ పదార్థము మిథ్య" యని తేలినది. స్వాప్నిక పదార్థము లట్టివి కావు. మరే మనిన జీవుడు దేశాంతరమున కేగి యోగ్యస్థలముల యందుండు గజతురగాదులనే జూచును. కావున స్వప్నమునందు గోచరించు గజతురగాదులు సత్యములే కాని మిథ్య కావని శంకింప జనదు. ఇట్టి ఆశంకను తొల గించుటకే శ్రీ గౌడపాదాచార్యులవారు పై నుదహ రించిన కారిక తరువాత,

"అదీర్ఘత్వాచ్చ కాలస్య గత్వాదేశాన్న పశ్యతి"

అని కారికను వ్రాసియుండిరి. అనగా ఒకనికి కాశీ కేగినటుల స్వప్నము వచ్చినది. కాశీ కేగవలెననిన విమా నముచే నేగినను నాలుగు గంటల కాలమైన కావలెను. క్షణకాలమున స్వప్నమునందు కాశీకేగినటులకనిపించును. ఇంత స్వల్పకాలమున దీర్ఘకాలమునందు ప్రయాణము చేయదగిన కాశీకి ఆతడు ప్రయాణముచేయనేరడు కావున స్వాప్నిక పదార్థములు తగని యీ శరీరమునందే గోచ రించునని యొప్పుకొని తీరవలెను. అందుచే స్వాప్నిక పదార్థములు మిథ్యయే యని తేటపడుచున్నది.

స్థూలశరీరముతో కాశీకేగుటకు దీర్ఘకాలము కావలెను కాని లింగదేహముతో కాశీకేగుటకు దీర్ఘకాలము అవ సరములేదు. కావున జీవుడు లింగదేహముతో మాత్రము కూడుకొని శీఘ్రకాలముననే కాశీకి బోవచ్చును. అచట పదార్థములను జూడవచ్చును. అందుచే స్వాప్నిక పదార్థ ములు తగు ప్రదేశముననే గోచరించుటచే సత్యమేయని శంకింపరాదు. అట్టి శంకను తొలగించుటకే శ్రీ గౌడ పాదాచార్యులవారు పై కారికయొక్క ఉత్తరార్ధమును

"ప్రతిబుద్ధశ్చ వై సర్వస్తస్మిన్దేశే న విద్యతే"

అని చెప్పియుండిరి. ఒక పురుషునకు క్షణకాలములోనే కాశీ కేగి కాశీ విశ్వనాథునకు అభిషేకము చేయు చున్నట్లు స్వప్నము కలిగెను. వెంటనే ఆతడు మెలకువ గాంచెను. ఇట్టిసమయమున అత డుండవలసినచోటు తన గృహమా, లేక కాశీవిశ్వనాథుని యాలయమా అనినచో, అతడు తన గృహమున పడకటింటియందు శయ్యపై నున్నట్లు స్వప్నము రాలేదు కావున క్షణమాత్రమున ఇంటికి జేరలేదు. కాశీవిశ్వనాథునకు అభిషేకము జేయు చున్నట్లు స్వప్నములోనుండి మెలకువ గాంచెను. కావున అతడుకాశీవిశ్వనాథుని యాలయములోనే యుండకపడక టింటియందలి శయ్యమీదనే ఉండుటచే స్వప్నమునందు దేశాంతరమునందుండు పదార్థములను జూచుటలేదు. ఇక ఏ మనిన నిద్రాది దోషముతోగూడి, పూర్వానుభవ జనిత సంస్కారసహితమగు అవిద్యవలననే జనించిన స్వాప్నిక పదార్థములను అయోగ్యమగు నీ దేహము నందే జూచును. కావున స్వాప్నిక పదార్థములు మిథ్యయే యని యొప్పుకొనవలయును. అట్లే జాగ్రదవస్థయందు గోచరించు నిఖిల ప్రపంచము మిథ్యయే యని తెలిసి కొనదగును.

స్వాప్నిక పదార్థములు జాగ్రత్తునందు గోచరించక పోవుటచే మిథ్య కావచ్చుననిన, అట్లగుచో జాగ్రదవస్థ యందు గోచరించు పదార్థములు స్వప్నమునందు గోచరించక పోవుటచే నవియు మిథ్యయే యనవలయును. అనగా పరస్పర వ్యభిచారులగుటచే రెండును మిథ్యయే. "స్వప్నకాలమున పదార్థములు సత్యములుగా గోచరించి ప్రబోధావస్థయందు మిథ్య యగునట్లు జాగ్రదవస్థయందు గోచరించు నీ ప్రపంచము అనగా బ్రహ్మ భిన్నమగు ఈ నిఖిల ప్రపంచముకూడ మిథ్య యగుచున్నది. "నేను బ్రహ్మస్వరూపుడను" అను జ్ఞాన నిష్ఠా గరిష్ఠునకు ప్రపంచ భానమే లేనందున నిఖిల ప్రపంచము మిథ్యయే యని యొప్పుకొనవలయును.

ఆత్మైక్య సాధనము : ఆత్మతత్త్వమును విచారించుచో ప్రత్యక్షాది ప్రమాణములకు విరోధము వాటిల్లునుగాన ఆత్మైక్యమును కెప్పుటకు వీలుపడదు. ఎట్లనిన :

"నేను" అనెడి జ్ఞానము వేరువేరుగ ప్రతి దేహమునందును ప్రత్యక్షముగ కన్పట్టుచున్నందున. ఇట్లు "అహం ప్రత్యయ భేదముండు ప్రతి దేహమందును నాత్మ వేరు" అను అనుభవముచే ఆత్మ ప్రతి దేహము నందు వేరగుచున్నది. అట్లుకాక ఆత్మ యొక్కటియే యన్నచో "నేను, వీడు" అను వ్యవహారము లోపించును. అందుచేత ఆత్మలు అనేకములనుటకు ప్రత్యక్షము ప్రమాణము.ఇట్టి ఆత్మ భేదము నొప్పనిచో "నేను, వీడు" వ్యవహారము మరియొక విధమున సిద్ధింపనందున, అను అర్థాపత్తి ప్రమాణముచే గూడ ఆత్మభేదము సిద్ధించుచున్నది. శరీరములు అనేకములు గావున గవాదులవలె వాటియందుండు ఆత్మ లనేకములు. లేక ప్రతిదేహము నందును "నేను, నేను" అను జ్ఞానము వేరుగ నుండుటచే ఆత్మ ప్రతి శరీరము నందును వేరుగ నుండును" అను అనుమాన ప్రమాణముచే గూడ ఆత్మ భేదము సిద్ధించుచున్నది.

"అదితి, ర్దేవా, గన్ధర్వా, మనుష్యాః, పితరో, ఽసురాః" అను శ్రుతి వాక్యమును, "దేవ, దానవ, గంధర్వా, యక్ష, రాక్షస, కిన్నరాః"అను పురాణవచనమును, ఆత్మభేదమునే బోధించుచున్నవి. కావున ఆత్మలు భిన్నములనుటయందు శబ్దము కూడ ప్రమాణము.

ఇన్ని ప్రమాణముల వలన ఆత్మభేదము సిద్ధించుచుండగా "అద్వైతము" అనునది యెట్లు సిద్ధించునను ప్రశ్న ముదయించుచున్నది.

మరియు ఆత్మైకత్వమునే అంగీకరించినచో సర్వదేహములయందుండు ఆత్మ యొక్కటియే గాన ఒకడు దుఃఖించిన నందరు దుఃఖించుటయు, ఒకడు సుఖించిన నందరు సుఖించుటయు సంభవించును. అట్లే దేవాది సర్వ దేహముల యందుండు ఆత్మ యొక్కటి గావున, దేవతలు సర్వజ్ఞు లగుటచే మనుష్యులు గూడ సర్వజ్ఞులు కావలసివచ్చును. అట్లగుచో విధినిషేధశాస్త్రములు వ్యర్థములు కావలసివచ్చును. అట్లే ఒకడు బద్ధుడగుచో నందరు బద్ధులు ఒకడు ముక్తుడగుచో నందరు ముక్తులు కావలసివచ్చును. కావున ప్రత్యక్షానుమాన శబ్దార్థాపత్తి ప్రమాణ సిద్ధమగు ఆత్మానేకత్వమును అంగీకరింప వలయును. అట్లు అంగీకరించినచో నద్వైత మెట్లు పొసగునని శంకింపజనదు.

ఒకనికే బాల్యావస్థయందు "నేను బాలుడను" అను జ్ఞానముండినను, కౌమారావస్థయందు "నేను బాలుడను" అను జ్ఞానముండక, "నేను కుమారుడను" అను జ్ఞానముండును. వానికే యౌవనావస్థయందు "నేను బాలుడను, నేను కుమారుడను" అను జ్ఞానముండక "నేను యువకుడను" అను జ్ఞానముండును. అట్లే వార్ధక్యమునందు "నేను బాలుడను, నేను కుమారుడను, నేను యువకుడను" అను జ్ఞాన ముండక "నేను వృద్ధుడను" అను జ్ఞానమే ఉండును. అట్లగుటచే ఒకనికే ఆయా యవస్థలయందు నేను బాలుడను, నేను కుమారుడను, నేను యువకుడను, నేను వృద్ధుడను" అనునట్టి జ్ఞానభేద మున్నను, జ్ఞాననేకము కాక ఒకడే యగుచుండెను. కావున "నేను, నేను" అను అహం ప్రత్యయభేదము ఆత్మకు అనేకత్వమును స్థాపింపనేరదు. కనుకనే ప్రత్యక్ష ప్రమాణము వలన ఆత్మకు అనేకత్వము సిద్ధింపదు.

మరియు ఆత్మ శైశవాద్యవస్థాభేదముచే ననేకమన్నచో, నొకనిచే ననుభూతమగుదానిని మరియొకడు స్మరింపకపోవుట వలన "బాల్యమునందు నేను కందుకముతో క్రీడించితిని" అని వృద్ధుడు స్మరింపకపోవును. కావున జ్ఞానభేదమున్నను జ్ఞాన విషయ-అహం ప్రత్యయా

ర్థమగు ఆత్మకు భేదము సిద్ధించనందున ప్రత్యక్ష ప్రమాణము వలన ఆత్మభేదము సిద్ధించదు.

స్థూల సూక్ష్మ కారణదేహములు, జాగ్రత్స్వప్న దేహములు వేరైనను, అహం ప్రత్యయార్థమగు ఆత్మకు భేదము లేనందున "శరీరములు భిన్నములు కావున ఆత్మ లనేకములు" అను అనుమాన ప్రమాణము కూడ ఆత్మానేకత్వమును సాధింపనేరదు.

ఎట్లు స్థూలసూక్ష్మ కారణదేహ భేదములచే ఒక్కటియగు ఆత్మకు భోగములు వేరువేరుగ నుండునో, అట్లే ఆత్మ యొక్కటియే యైనను దేవాదిదేహ భేదముచే ఒక యాత్మకే భోగములు వేరు వేరుగ నుండును. కనుకనే దేవాదిదేహములు భోగాయతనములు గాని, ఆత్మ భేద ద్యోతకములు కావు. ఆ దేహములయందే రూప తేజ స్స్వభావముల భేద మగపడుచున్నది కాని, చేతన భేద మగపడనందున, ఆత్మ విషయకమగు "నేను" అను జ్ఞాన మెప్పుడును ఒక విధముగనే యుండుటచే "అదితిర్దేవా గంధర్వా" అను శ్రుతి శరీరభేద ప్రతిపాదన పరమే కాని ఆత్మభేదమును జెప్పునది కాదు.

ఒక శరీరమునందే అవయవ భేదము నాశ్రయించి శిరస్సు, హస్తములు, పాదములు అనెడి వ్యవహార మెట్లు కలుగుచున్నదో, అట్లేయాత్మ యొకటేనను, శరీరభేదము నాశ్రయించి, "నేను, నీవు, అతడు, దేవతలు, దానవులు" అను వ్యవహారము కలుగుచున్నదే కాని, ఆత్మ భేదము ననుసరించి కానందున "దేవ దానవ గంధర్వాః" అను పురాణ వచనములుకూడ ఆత్మభేదమును బోధింప నేరవు. ఇట్లే "నీవు, నేను" అను వ్యవహారముశరీరభేదము నాశ్రయించి ఉపపన్నమగుటచే ఇట్టి వ్యవహారాఽన్యథానుపపత్తి సంభవింప నందున, ఆత్మలకు అనేకత్వమును సాధించుటయందు అర్థాపత్తియు ప్రమాణము కానేరదు.

పుణ్యాపాపములవలన సుఖదుఃఖములు ప్రాప్తించును. అవి యనేక విధములు. అట్టి పుణ్యా పాపములకు కర్మ కారణము. "యత్కర్మకురుతే తదభిసంపద్యతే" "యథా కారీ యథా చారీ తథా భవతి" అను శ్రుతులు "ఆయా కర్మలు ఆయాకర్మ ఫలభోక్తలు ననేకవిధము" లనిబోధించుటవలన కర్మవైచిత్ర్యముచేతనే సుఖదుఃఖాది వైచిత్ర్యము ఉపపన్నమగుచుండ, "నాత్మైకత్వము నొప్పినచో ఒకడుసుఖించుచుండిన నందరు సుఖింపవలయును ఒకడు దుఃఖించిన నందరు దుఃఖింపవలయును" అను నాపత్తియును సంభవింపదు.

అంతటను ఆత్మయే స్వయముగ ఆ యా బుద్ధివృత్తుల ననుసరించి విషయములను తెలిసికొనును. దేహములు అనేకములుగాన దేహముల యందుండు బుద్ధి వృత్తులు గూడ అనేకములు. దానివలన బుద్ధివృత్తియగు జ్ఞానము కూడ ప్రతి దేహమునందును వేరువేరుగ నుండును. ఆ జ్ఞానము చక్షురింద్రియమువలె స్వసంబద్ధమగు విషయమును మాత్రమే భాసింపజేయును. పరిచ్ఛిన్న మగుటచే సర్వ పదార్థ సంబంధము ఆ బుద్ధి వృత్తికి సంభవింపదు. కావున నొకడు సర్వజ్ఞుడైన నందరకు సర్వజ్ఞత్వము ప్రాప్తించదు. ఎట్లనిన శబ్దోత్పత్తి కారణమును, విభువగు నాకాశమునకు నంతటను భేర్యాదులతో సంబంధముండినను, ఎచట భేరి దండముచే కొట్టబడునో అచటనే శబ్దము పుట్టునుకాని భేర్యాదులున్న ప్రతి స్థలమునందు శబ్దము పుట్టుటలేదు. అట్లే ఆత్మ పరిపూర్ణము, ఏకము, అయినను, ఏదేహమునందు బుద్ధివృత్తికి సంబంధముండునో అక్కడనే (ఆదేహావచ్ఛేదముగనే) జ్ఞానము కలుగును కాని మరియొక స్థలమున (ఇతర దేహావచ్ఛేదముగ) జ్ఞానము కలుగనేరదు. కనుకనే బుద్ధివృత్తులు అనేకములగుటచే వ్యాపకములు కానందున "ఆత్మైకత్వ మొప్పినచో ఒకడు సర్వజ్ఞుడగుచో నందరు సర్వజ్ఞులు కావలెను" అను ఆపత్తియు సంభవింపదు.

కనుకనే కించిద్జ్ఞులకు ప్రవృత్తి నివృత్తి హేతువులు కావున విధి నిషేధ శాస్త్రములకు అనర్థక్యము సంభవింపదు. ప్రాణులకు సర్వజ్ఞత్వము లేదని చెప్పుటచే "తద్యోయో దేవానాంప్రత్యబుధ్యత స ఏవ తదభవత్తథర్షీణాం తథా మనుష్యాణాం" అను శ్రుతి ననుసరించి వేదాంత శ్రవణ జన్య జ్ఞానముచేత ప్రత్యభిన్నమగు పరమాత్మను దేవ ఋషి మనుష్యులలో నెవడు తెలిసికొనునో వాడే ముక్తుడగును. అందువలననే ఆత్మ యొక్కటైనను "జ్ఞానాదేవతు కైవల్యం" అను నియమ శ్రవణమున ఆత్మజ్ఞానము చేతనే ముక్తుడగును. కనుకనే "ఆత్మైక్యము నొప్పినచో నొకడు ముక్తుడైనను, బద్ధు

మైనను అందరు ముక్తులుకాని, బద్ధులుకాని కావలెను" అను నావత్తియు సంభవింపదు.

ఇదియునుగాక ఆత్మలు పూర్ణములు, అనేకములని చెప్పు ఈ పక్షమునందే ఈ దోషము లన్నియు సంగ తించును.

పరపక్షమున దోషములు : ఏలన సర్వవ్యాపకములు అనేకములు నగు నాత్మలు పరస్పరము పరస్పర మనో బుద్ధ్యాదులతో అన్ని దేహములయందు కలిసికొనుటచే నొకడు దుఃఖించిన నందరు దుఃఖించుటయు, ఒకడు సుఖించిన నందరు సుఖించుటయు, నొకడు బద్ధుడైన నందరు బద్ధులగుటయు, నొకడు ముక్తుడైన నందరు ముక్తులగుటయు సంభవించును. మరియు "ఏయే వస్తువు ఇతర వస్తువులకంటె వేరుగనుండునో, ఆయా వస్తువు పరిచ్ఛిన్న మనబడును" అను న్యాయముచేత ఆత్మలు అనేకమైనచో వాటికి నితర భేదము ప్రాప్తించునుగావున ఆత్మ లన్నియు పరిచ్ఛిన్నము లగుటచే వాటికి పూర్ణత్వము పొసగదు. పూర్ణత్వమే యున్నచో ననేకత్వము సమ కూరదు. పరస్పర విరుద్ధములగు నీరెంటికి నాత్మల యందు సమావేశమును బ్రహ్మకూడ నిర్వహింపజాలడు. కావున ఆత్మైకత్వము అవశ్యాంగీకార్య మగు చున్నది.

"ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః, ఏక స్తథా సర్వ భూతాంతరాత్మా । ఏకో దేవ స్సర్వ భూతేషు గూఢః, ఏకస్సన్ బహుధా విచచార । ఏక ఏవహి భూతాత్మా, నిరపేక్ష ఏకఏవ, సాక్షీ ఏక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వం, అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్ । మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో నశోచతి" ఇత్యాద్యాత్మై కత్వ నిత్యత్వ పూర్ణత్వ బోధక శ్రుతుల చేతను, "నిత్య స్సర్వ గతస్థాణుః, నిత్యస్సర్వ గతో హ్యాత్మా కూటస్థో దోషవర్జితః । ఏకస్స న్భిద్యతే భ్రాంత్యా మాయయా న స్వరూపతః" ఇత్యాదిస్మృతులచేతను ఘటాదుల యం దున్న ఆకాశమువలె సర్వ శరీరముల యందున్న ఆత్మ పరిపూర్ణుడగుటచేత ఒక్కడే యని నిర్ణయము. ఇట్టి నిర్ణయమే సిద్ధాంతమగుట వలన "పూర్ణములు కాకపోయి నను ఆత్మలు పరిచ్ఛిన్నములు, అనేకములు, చిద్రూప ములు" అను పక్షము గూడ తొలగింపబడెను.

మరియు ఆత్మ అంశరహితముగుట వలనను, సర్వప్రకా శకమగుట చేతను, సర్వసాక్షియగుట చేతను, అంతటను అహం ప్రత్యయార్థమగుట చేతను, ఇంకను ఇట్టి అనేక యుక్తుల చేతను ఆత్మ పరిపూర్ణమని నిశ్చయింపబడు చున్నందునను, ఆత్మ ప్రాక్పోపదర్శిత శ్రుతిస్మృతియుక్తి ప్రామాణ్యము చేతను ఆత్మ ఒక్కటి అనియే సిద్ధాంతము.

పరమాత్మ జీవాత్మైకసాధనము : అద్వైతము శ్రుత్యాది ప్రసిద్ధమని తెలిసికొనియుంటిమి. అద్వైతమును బోధించు శ్రుతులు "తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి" "అయమాత్మా సర్వానుభూః" "ఆత్మైవేదం సర్వం" మొదలగునవి కలవు. అవి అద్వైతమును బోధింప జాలవు. తత్త్వమసి అను వాక్యములో తత్, త్వం, అసి అను మూడు పదములు కలవు. అందు 'తత్' అను పదము సర్వజ్ఞత్వ విశిష్టమగు చిత్తును, 'త్వం' అనుపదము కించిద్జ్ఞత్వ విశిష్టమగు చిత్తును బోధించును. "విరుద్ధ ధర్మములు కల ఘట,పటముల కైక్యము పొసగునటుల విరుద్ధములగు సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వ రూప ధర్మములు గల పరమాత్మ, జీవాత్మలకు ఐక్య మెన్నడు సంభవము కాదు" అని శంకింపరాదు.

తత్త్వమస్యాది వాక్యములు జహదజహల్లక్షణచే చిద్విషయకమగు "చిత్" అను నిర్వికల్పక ప్రత్యక్షమును బోధించును. జహదజహల్లక్షణ యనగా శబ్దార్థమున కొంత భాగమును విడిచి కొంత భాగమును విడువక శబ్దార్థైక దేశమును బోధించునది. అది యెట్లనిన "తత్త్వమసి" అను స్థలమున "తత్" అను పదమున కర్థము సర్వజ్ఞత్వ విశిష్ట చిత్తు. "త్వం" అను పదమున కర్థము కించిద్జ్ఞత్వ విశిష్ట చిత్తు. "తత్, త్వం" పదములు రెండును సమాన విభక్తికములగుట చేత ఈ రెండు పదములకు సామానాధికరణ్యము కలదు. పదములయందుండు సామానాధికరణ్యము ఏకార్థ బోధకత్వమే. అందుచేత "తత్, త్వం" అను రెండు పదములు ఏకార్థమును బోధింపవలయును. పరస్పర విరుద్ధ ధర్మములుకల "తత్, త్వం" పదార్థములగు సర్వజ్ఞత్వ విశిష్ట, కించిద్జ్ఞత్వ విశిష్ట చిత్తులకు అభేదము పొసగనందున ఇచట "జహద జహల్లక్షణా వృత్తిని అంగీకరింప వలయును. అనగా శబ్దార్థైక దేశములగు సర్వజ్ఞత్వ,

కించిద్‌జ్ఞత్వ వైశిష్ట్యములను విడిచి విశేష్యమగు కేవల చిత్తును మాత్రమే బోధించును. కావున జహదజహ త్స్వార్థలక్షణచే "తత్త్వమసి" మొదలగు మహా వాక్యములు కేవల చిద్విషయకమగు "చిత్" అను నిర్వికల్ప బోధను గలుగజేయును

నిర్వికల్ప బోధస్వరూపము : "నిర్వికల్ప బోధ"యనగా పదార్థమునందు ఏధర్మముగాని, ఏసంబంధముగాని భాసింపక, కేవల పదార్థ విషయకమగు బోధయగు చున్నది. శబ్దమువలన కలిగెడి బోధ సవికల్పకమే యగును కాని, నిర్వికల్పకము కానేరదు అను తార్కిక నియమము ఉండగా "తత్త్వమసి" అను మహాకావ్యము వలన నిర్వికల్పకబోధ యెట్లు కలుగు"నని శంకింపజనదు.

శక్తివాదములో విశేషకాండమున ఆకాశపద శక్తి నిరూపణ ప్రస్తావమున ఆకాశ పదము వలన శబ్దాశ్రయ త్వేన ఆకాశబోధ కలుగునని ఉపపాదించి "అస్తువా పదాదపి నిర్వికల్పక బోధః"ఆకాశపదమువలన నిర్వికల్పక బోధ కలుగుగాక అని తార్కికాగ్రేసర చక్రవర్తియగు శ్రీ గదాధర భట్టాచార్యులవారు ప్రతిపాదించిరి. కావున పదమువలన నిర్వికల్పక బోధతార్కిక సమ్మతమేకాని తార్కిక విరుద్ధము కాదు.

"తత్త్వమసి" అను వాక్యమునందుగల "తత్, త్వం" అను పదములు జహదజహత్స్వార్థచేత చిత్తును, చిత్తును బోధించునమనపుడు, ఆ రెండు చిత్తులకు అభేదము చెప్పిన "చిదభిన్నము చిత్తు" అను బోధ కలుగునని చెప్ప వలెను. ఇట్టి బోధ తార్కికాది సర్వమత విరుద్ధము. ఎందువల్లనన శబ్దజన్య జ్ఞానము సంశయ వారకమగును. సంశయమును దొలగింపని శబ్దజన్య జ్ఞానము ఉండనేరదని తార్కికులు "విరూపోప స్థితయోరేవ శాబ్దబోధః" భిన్నములగు ధర్మముల పురస్సరముగ శబ్దముల వలన నుపస్థితములగు పదార్థములకే అభేదాన్వయ బోధ నంగీకరించిరి. కనుకనే "నీలోఘటః" అను స్థలమున నీలత్వ, ఘటత్వరూప భిన్నధర్మ పురస్సరముగ నుపస్థిత మగు నీలఘటముల కభేద బోధ కలుగును. "ఘటో ఘటః" అను స్థలమున నేకధర్మమగు ఘటత్వ పురస్సర ముగ నుపస్థితములగు ఘటములకు అభేద బోధ, సంశయ మును నివారింపనందున, కలుగనేరదని వ్యుత్పత్తి వాద మున స్పష్టముగ చెప్పియుండిరి. కావున "తత్త్వమసి" అను మహావాక్యమువలన చిత్తునకు చిత్తునకు అభేదబోధ కలుగనేరదని శంకింప జనదు.

"తత్త్వమసి" అను వాక్యమువలప "చిదభిన్నము చిత్తు" అను బోధ కలుగునని అద్వైతులు చెప్పియుండ లేదు. "తత్త్వమసి" అను వాక్యమువలన సర్వజ్ఞత్వోప లక్షిత కించిద్‌జ్ఞత్వోప లక్షిత చిద్విషయక "చిత్" అను బోధ మాత్రము కలుగుననియే అద్వైత సిద్ధాంతము. దీనిని మాత్రము విస్మరింప తగదు.

"భూతలము ఘటము కలది" అను జ్ఞానమును నివ ర్తింప జేయునది "భూతలము ఘటాభావము కలది" అను జ్ఞానమే. అనగా తద్వత్తా బుద్ధికి తదభావవత్తా జ్ఞానము (నిశ్చయము) ప్రతిబంధకము (నివర్తకము) అట్లే "నేను బ్రహ్మమును కాను" అని అజ్ఞానికిగల మిథ్యా జ్ఞాన మును బోగొట్టునది "నేను బ్రహ్మమును" అను జ్ఞానమే. అనగా తదభావవత్తా జ్ఞానమును ప్రతిబంధించుటకు తద్వత్తా జ్ఞానము సమర్థమగును. "తత్త్వమసి" అను వాక్యము వలన కలిగెడి "చిత్" అను నిర్వికల్ప జ్ఞానము తదభావవాదుల నవగాహింప జాలనందున "నేను బ్రహ్మ మును గాను" అను నజ్ఞానికి నిరూఢమగు జ్ఞానమును తొలగింపలేక "తత్త్వమసి" అను వాక్యోపదేశము నిరర్థ కమే యగునని శంకింపరాదు.

'తత్త్వమసి' అను వాక్యమువలన జనించిన జ్ఞానము తదభావవాదుల నవగాహింపక అజ్ఞాన జనితమగు 'నేను బ్రహ్మనుగాను' అను జ్ఞానమును తొలగించుననియే, అద్వైతి చెప్పెను. 'తత్త్వమసి' అను మహావాక్య జనిత మగు 'చిత్' అను జ్ఞానము స్వరూపము చేతనే సూర్యుడు తిమిరమును, గారుడమంత్రము సర్పవిషమును దొల గించినటుల, అజ్ఞాన జనితమగు భ్రాంతుల నన్నిటిని తొల గించుననియే అద్వైత సిద్ధాంతము. ఇట్టి నిర్వికల్పకబోధ కలుగజేయుటకే 'తత్త్వమస్యా'ది మహావాక్యములకు అఖండార్థత్వమును అద్వైతులు అంగీకరించియుండిరి. ఈ విషయమునే

శ్లో॥ సంసర్గా సంగి సమ్యగ్ధీహేతుతా యాగిరామియం
ఉక్తాఽఖండార్థతా యద్వా తత్ప్రాతిపదికార్థతా॥

అని చెప్పియుండిరి.

మరియు భ్రాంతి మూలకము లగునట్టి కుశంకలను దొలగించుకొనలేక "స ఆత్మా తత్త్వమసి" అనుచోట 'అతత్, త్వం, అసి' అని కొందరును, 'తస్మై, త్వం, అసి' అని కొందరును, 'తేన, త్వం, అసి' అని అన్యులును, 'తస్య, త్వం, అసి' అని మరికొందరును- ఇట్లు అనేకరీతుల లు ప్తవిభ క్తికముగ 'తత్' అనుపదమును సమర్థింప పూను కొనిరి. ఈ యన్ని విధములచేతనుగూడ జీవేశ్వరులకు భేదమే బోధింపబడుచున్నది. తత్త్వమస్యాది వాక్యముల వలన కలిగెడి జీవ పరభేదజ్ఞానము 'నేను బ్రహ్మముకన్న వేరు' అని జీవునకుగల అనాది భేదజ్ఞానమునే బోధించు చున్నది. ఇట్టి సిద్ధజ్ఞానమునే "తత్త్వమసి" అను మహా వాక్యము బోధించుచో, ఈ మహావాక్యము అనువాద రూపమే యగునుకాని ఉపదేశము కాజాలదు. ఉపదేశ మనగా అజ్ఞాతార్థ జ్ఞాపకము (కావున ఇట్టి విపరీ తార్థములం జెప్పి లోకమును మోసపుచ్చువారలు ఉపేక్ష్యులు) కనుకనే "తత్త్వ మస్యాది వాక్యోత్థ సమ్యగ్ధీ జన్మ మాత్రతః । అవిద్యా సహకార్యేణ నాసీదస్తి భవిష్యతి" అను వార్యోక్తి తత్త్వమస్యాది వాక్యములవలన గలిగిన అఖండార్థ విషయక మగు సమ్యక్ జ్ఞానమువలన అవిద్య, తన కార్యములతో గూడ నివర్తించుచు కాలత్రయము నందుగూడ లేదను టను నిరూపించును.

తత్త్వమస్యాది వాక్యజన్యజ్ఞానముశబ్దజన్య మగుటచేత శాబ్దమే యగును. ఇట్టి శాబ్దము జీవునియందు నిగూఢ మగు భేద ప్రత్యక్షము నెటుల తొలగించుననినచో, సమా ధాన మిది. సన్నికృష్ట స్థలమున 'దశమ స్త్వమసి' అను శబ్దమువలన గూడ ప్రత్యక్షము గలుగునటుల "తత్త్వ మస్యాది" వాక్యములవలన అపరోక్షజ్ఞానము గలిగి, అజ్ఞానమువలన జనించెడి నిఖిల వ్యావహారిక బంధక జ్ఞానమును తొలగించును.

ఆత్మ, "తత్త్వమసి" అను మహావాక్యజన్యమగు ప్రత్యక్ష విషయమగుచో అద్వైతులు జగత్తు మిథ్యయనుటయందు ప్రయోగించిన దృశ్యత్వ మను హేతువు బ్రహ్మమునందు కూడ నుండుటచే ఈ బ్రహ్మము గూడ మిథ్యయనియో లేక దృశ్యత్వహేతు వ్యభిచారి యనియో అనక తప్పదని శంకింపజనదు.

తత్త్వమస్యాది వాక్యజన్య వృత్తి విషయత్వము, బ్రహ్మమునందుండినను, వృత్తి ప్రతిఫలిత చైతన్య విషయ త్వము బ్రహ్మమునందు లేదు. జగన్మిథ్యాత్వమును సంపా దించుటకు ప్రయోగింపబడిన దృశ్యత్వ మను హేతువునకు అర్థము వృత్తి ప్రతిఫలిత చైతన్య విషయత్వము. అట్టి దృశ్యత్వము బ్రహ్మమునందు లేనందున బ్రహ్మమునకు మిథ్యాత్వము ప్రాప్తింపదు. దృశ్యత్వహేతువు వ్యభి చారియగాదు. మరియు దృశ్యత్వమనగ సప్రకారకజ్ఞాన విషయత్వము. "తత్త్వమసి" అను వాక్యమువలన కలిగెడి జ్ఞానము చిద్విషయకమగు నిర్వికల్పకము. సప్రకారకము కానేరదు. కాన తత్త్వమస్యాది వాక్యములవలన కలిగెడి నిర్వికల్పక ప్రత్యక్షవిషయత్వము బ్రహ్మమునందుండినను సప్రకారకజ్ఞాన విషయత్వరూపమగు దృశ్యత్వము బ్రహ్మమునందు లేదు గావున జగన్మిథ్యాత్వము సాధించు టకు ప్రయోగింపబడిన దృశ్యత్వము వ్యభిచారి కానేరదు.

లోకమున ఘటాదులకు కారణమగు కులాలాదిచేతను లకు నిమిత్తకారణత్వమే కాని ఉపాదాన కారణత్వము లేదు. అట్లే జగత్తునకు కారణమగు బ్రహ్మము కూడ జగత్తునకు నిమిత్తకారణమే కాని, ఉపాదాన కారణము కానేరదు. అట్లు ఉపాదాన కారణము గూడ బ్రహ్మమే యగుచో కుండలాదుల కుపాదానమగు సువర్ణమంతయు కుండలములుగ పరిణమించినటుల బ్రహ్మమంతయు జగ ద్రూపముగ పరిణమించి జగత్తుకంటె వేరుగ బ్రహ్మము లేకపోవలసివచ్చును. కొంత బ్రహ్మమే జగద్రూపముగ పరిణమించినచో, బ్రహ్మసావయవము కావలసివచ్చును. బ్రహ్మమునకు సావయవత్వము అంగీకరించినచో, బ్రహ్మ మునకు నిరవయవత్వమును బోధించు శ్రుతులు అప్రమా ణము కావలసివచ్చునని శంకింపజనదు.

ఈ విషయమునే వ్యాసభగవానులు "కృత్స్నప్రసక్తి ర్నిరవయత్వ కోపోవా" అను సూత్రముచే ఆశంకించి 'తదనన్యత్వమారంభణ శబ్దాదిభ్యః' అను సూత్రముచేత తగు సమాధానమును జెప్పిరి. ఉపాదాన కారణము 'పరిణామి' ఉపాదానమనియు, 'వివర్త' ఉపాదానమనియు రెండు విధములు. అందు జగత్తునకు పరిణామ్యుపా దానము అవిద్య, వివర్తోపాదానము బ్రహ్మము. వివర్తో

పాదానమనగా అన్యథాస్థితమైనది అన్యథా భాసించుటయే. పై సిద్ధాంత సూత్రమువలన ఈ విషయమే చెప్పబడెను. జగత్తు బ్రహ్మముకంటె అనన్యము. అనగా బ్రహ్మము కన్న వేరేమియు లేదని తాత్పర్యము. ఎందువల్లననిన 'వాచారంభణం' ఇత్యాది శబ్దములవలన ఘట శరావాదులను విచారించినచో, మృత్తుకన్న వేరుగలేవు. మృత్తికనే ఘట శరావాది శబ్దములచే వాడుచుంటిమని ఛాందోగ్యమున చెప్పబడినదియే సూత్రార్థము. కావున బ్రహ్మము జగత్తునకు నిమిత్త కారణము, ఉపాదాన కారణముగూడ నగును. ఈ విషయమునే "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్" అను సూత్రముచే వ్యాసభగవానులు స్పష్టపరచిరి.

ఇట్లు బ్రహ్మసూత్రముల వలనను, భగవద్గీతల వలనను అద్వైతమే బోధింపబడుచున్నది. 'ద్వాసుపర్ణాసయుజా' ఇత్యాది శ్రుతులు జీవేశ్వరభేదమును బోధించినను, ఆ భేదము ఔపాధికము అనిన ఆ శ్రుతులు ఉపపన్నములగును. అద్వైతబోధకశ్రుతులను అన్యథా వ్యాఖ్యానింప వీలుపడకుండుటచేత అద్వైతమే శ్రుతి, స్మృతి, సూత్ర, పురాణ, ఇతిహాస తాత్పర్యమనుట నిర్వివాదము.

బు. ఆ. శా.

**అద్వైతానంద తీర్థులు:-** వీరి పూర్వాశ్రమ నామము కురుగంటి సుబ్రహ్మణ్య శైనులు గుంటూరు మండలమునందలి తెనాలి తాలూకా వేమూరు వీరి స్వగ్రామము. వీరిది విద్వత్కుటుంబము. వీరి జననము క్రీ. శ. 1841 వ సంవత్సరము. తండ్రిపేరు మాధవ శాస్త్రి. తల్లి పేరు మహాలక్ష్మి. ఈయన హైదరాబాదులో నిజాం ప్రభుత్వమునందలి అబ్కారీశాఖలో శిరస్తాదారుగా పనిచేసెను. ఇతడు సికింద్రాబాదులో ఉద్యోగిగా నున్న కాలముననే అగ్న్యాధానము, జ్యోతిష్టోమము, గరుడ చయనము అను వైదిక క్రతువుల నొనర్చి సుబ్రహ్మణ్య శైనులను పేరు వడసెను. ఈతడు గొప్ప విద్వాంసుడు. వేదాంత శాస్త్రవేత్త. క్రీ. శ. 1917 సంవత్సరమున ఆశ్రమ స్వీకార మొనర్చెను. ఈయన "అద్వైతానంద లహరి" అను పురుష సూక్త భాష్యము భగవద్గీతా తాత్పర్య దీపిక, బ్రహ్మసూత్ర తాత్పర్య దీపిక, ఛాందోగ్యోప నిషద్భాష్యము, పంచోపనిషత్తాత్పర్య దీపిక, బ్రహ్మసూత్ర భాష్యము అను గ్రంథములను రచించి యుండెను. ఈయన తన 85 వ యేట క్రీ. శ. 1926 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో శివరాత్రి దినమున సిద్ధి పొందెను. కురుగంటి సీతారామయ్య ఈయన కుమారుడు.

కు. సీ.

**అథర్వవేదము :-** వేదము లోకమునకు ధర్మాధర్మములను బోధించునది. వేదములు నాలుగు. అవి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అనునవి. ఈ నాలుగు వేదములలో 'త్రయీ' అను పేర బరగు మొదటి మూడును అథర్వవేదముకంటె పురాతనము లనియు, ఆ మూడే యజ్ఞములందు మొదట ఉపయోగమును గాంచుచుండెననియు, అథర్వవేదము తైత్తిరీ యారణ్యకాదులయందు ప్రశంసింపబడి యజ్ఞోపయోగియైన పిదప నాలుగవ వేదముగ పరిగణింపబడినదనియు చరిత్రకారుల ఆశయమై యున్నది. ఈ వాదమును ప్రాచీన పండితులు అంగీకరింపరు. శేషించిన మూడు వేదములతోబాటు అథర్వవేదముకూడ అనాదియే యని వారి యభిప్రాయము. అథర్వ భాష్య పీఠిక యందు ఈ వేదముయొక్క పురాతనత్వమును సాయణాచార్యులు స్థాపించియున్నారు.

అథర్వ సంహిత ఋగ్యజుస్సామ సంహితలకంటె అర్వాచీనమని భావింపబడుచున్నది. తైత్తిరీయారణ్యకము నందును, శతపథ బ్రాహ్మణము నందును, ఛాందోగ్యోపనిషత్తు నందును అథర్వవేదము పేర్కొనబడి యున్నది. ఋగ్వేద బ్రాహ్మణములలో ఈ సంహితా ప్రశంస కానవచ్చుట లేదు. తిలకు మహాశయుని వేదకాల పరిగణనమునుబట్టి కృత్తికాయుగము (క్రీ. పూ. 8000-1400 వరకు యున్నది. అందు తైత్తిరీయ సంహితయు సామవేదమును, బ్రాహ్మణ గ్రంథములును క్రమముగా వెలసినవి. ఈ యంశములను సమన్వయించి చూడగా, అథర్వవేదము తైత్తిరీయ బ్రాహ్మణాదులకు సమకాలికముగ ఈ యుగమునందు సంహితాత్వము నొందెనని ఊహింపదగియున్నది. ఈ వేదము నందలి 19, 20 కాండలు మాత్రము ఇంకను అర్వాచీనముగ పరిగణింపబడుచున్నవి.

ఈ వేదమునకుగల అథర్వవేదము, అథర్వాంగిరో వేదము, భృగ్వంగిరోవేదము, బ్రహ్మవేదము అను నాలుగు నామములలో మొదటి మూడు సంజ్ఞలును ఆయా ఋషులు ప్రవర్తకులగుటను బట్టియు, కడపటిది యాగములందు ఈ వేదము బ్రహ్మ అను ఋత్విక్కు పఠింపదగిన దగుటనుబట్టియు వచ్చినవి. అథర్వవేదోత్పత్తినిగూర్చి గోపథ బ్రాహ్మణము, విష్ణు పురాణము మున్నగునవి వచించు కథలయందలి ముఖ్యాశయమును బట్టి విచారించినచో, భృగు మహర్షియు నథర్వ మహర్షియు అభిన్నులనియు, అథర్వాంగిరో మహర్షులును వారి వంశీయులును ప్రధానులుగా ఈ వేద మావిర్భవించెననియు తెలియవచ్చును. అయినను అథర్వ మహర్షియు అతని సంతతివారును దర్శించిన సూక్తము లిందు అధిక సంఖ్యాకము లుండుటచే దీనికి అథర్వవేద మను సంజ్ఞ లోకమున విశేషముగ ప్రసిద్ధి నొందినది.

అథర్వవేదము ఇతర వేదములవలెనే సంహిత, బ్రాహ్మణము అను రెండు భాగములు కలిగియున్నది. 'చరణ వ్యూహము'నుబట్టి అథర్వవేదమునందు 12,300 మంత్రములు (ఋక్కులు) ఉన్నట్లు విదితమగుచున్నను, ఇప్పుడు కానవచ్చు శౌనకసంహితననుసరించి, దీనియందు 1739 సూక్తములును దాదాపు 6018 మంత్రములును మాత్రము గలవని తెలియుచున్నది.

ఇట్లు సంహితాభాగము కాక అథర్వవేదమునకు అనుబంధరూపమున విశేషముగ వాఙ్మయము కలదు. అందులో బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, సూత్రములు, సర్పవేదము, పిశాచవేదము, అసురవేదము, ఇతిహాస వేదము, పురాణవేదము అను అయిదు ఉపవేదములును, అనుక్రమణికలును వ్యాకరణ జ్యోతిష గ్రంథములును పేర్కొనదగినవి. అథర్వవేదమున కొక్క గోపథ బ్రాహ్మణమే వాడుకలోనున్నది. ముండక, మాండూక్యాదులగు ఉపనిషత్తులు 29 మాత్రమే కనబడును. ఉపవర్షాచార్యుడు అథర్వవేదకల్పములు అయిదు అని వచించెనని శ్రీ విద్యారణ్య యతీంద్రుడు తన భాష్యమున నుదాహరించెను. పంచపటలిక, సర్వానుక్రమణిక అను రెండు అనుక్రమణికలు ఈ వేదమునకు గలవు. వీటిలో రెండవ అనుక్రమణికకు బృహదనుక్రమణిక అనునది నామాంతరము. అథర్వవేద పరిశిష్టములు 22 వరకును గలవు. అథర్వవేదమునకు సంబంధించిన వ్యాకరణ గ్రంథములలో 'శౌనకీయ చతురధ్యాయిక' అను గ్రంథ మొకటి కానవచ్చుచున్నది. దీనికి అథర్వణ ప్రాతిశాఖ్య మనిపేరు. అథర్వణ జ్యోతిష గ్రంథ మొకటి కలదు.

అథర్వణవేదశాఖలు తొమ్మిదనియు, శాఖా ప్రవర్తకులు తొమ్మిదిమంది అనియు చెప్పు పాఠము సార్థకము. తొమ్మిది శాఖలలో ముద్రిత - అముద్రిత - సంహితాపుస్తకరూపమున గనబడుచున్నవి శౌనక పైప్పలాదక శాఖలు రెండే. ఈ శౌనక పైప్పలాదక శాఖలు - రెండింటియందలి సంబద్ధములైన మంత్రములకు ఉదాత్తానుదాత్తాది స్వర నియమము కలదు. ఈ రెండింటిలో శౌనక శాఖకే భాష్య మేర్పడినది. శౌనక సంహితయందు 20 కాండములు కలవు. అందు ప్రతి కాండము కొన్ని ప్రపాఠకములుగాను, ప్రతి ప్రపాఠకము కొన్ని అనువాకములుగాను, ప్రత్యనువాకము కొన్ని సూక్తములుగాను విభజింపబడినది.

ఋగ్వేదమువలె ఈ వేదము కేవలము ఛందోమయము కాక గద్య పద్యాత్మకముగా నున్నది. 15, 16 కాండములు ఐతరేయాది బ్రాహ్మణముల గద్యమును బోలు గద్యముతో నిండియున్నవి. 16 వ కాండమున గల కొన్ని గద్య సూక్తములలో కొంతభాగము ఛందోమయమైనది కూడ కలదు. ఋగ్వేదమునందలి ఛందస్సులే కాక పురస్తాద్బృహస్పతి, ప్రస్తారపంక్తి, శాక్వరగర్భ త్రిష్టుప్పు, విరాడతి జగతి మున్నగు నూతన ఛందస్సులు కూడ కానవచ్చును.

అథర్వ సంహితయందు ప్రతిపాదింపబడిన విషయములు అనంతములు. ఇందు కొన్ని మంత్రములు జ్వరాదులు, గ్రహాదులు, వ్రణములు, కత్తిపోట్లు మున్నగు వాటివలన నేర్పడిన బాధలను తొలగింప సమర్థములైనవి. కొన్ని మంత్రములు ఆయుస్సు, వర్చస్సు, యశస్సు మున్నగువాటి నభివృద్ధి నొనర్చునవి. కొన్ని మంత్రములు స్త్రీ పురుషు లొండొరులను వశపరచుకొనుట కుద్దేశింప బడినవి. కొన్ని కృషి కర్మాభివృద్ధికి ఉపకారకములై యున్నవి. వైవాహిక సంప్రదాయములను, గృహ్య సంస్కారములను, అంత్య సంస్కారము

లను, పంచభూతములను, ఇంద్రియ నిగ్రహ విధిని, జీవాత్మ పరమాత్మల స్వరూపమును వర్ణించు మంత్రములును కొన్ని కలవు. ఋగ్వేదమునందు వలెనే అగ్ని, ఇంద్రుడు, ద్యావాభూములు, సవిత, వరుణుడు, ఉషస్సు మున్నగు దేవతలు ఈ వేదమునందును స్తోత్రములను బడసియున్నారు. వీరిని వేరువేరు దేవతలుగా పొగడుటయేకాక సర్వ ప్రపంచమునకును ఏక కర్త ఉన్నట్లెంచబడి, అయ్యాదిమతత్త్వము ఒకప్పుడు సూర్యరూపముగను, (13 వ కాండము) ఒకప్పుడు కాల రూపముగను, (16, 53, 54) ఒకప్పుడు బ్రహ్మచారి రూపముగను, ఇట్లు వేర్వేరు రూపములతో స్తుతింపబడి యున్నది. సృష్టియందలి స్వభావసిద్ధమైన శోభలను వర్ణించు సూక్తములు కొన్ని ఇందు ఉన్నతమైన కవిత్వ స్ఫూర్తికి నిదర్శనములుగా నున్నవి. ఇట్టి వాటిలో పృథ్వీ సూక్త మనునది మిక్కిలి కొనియాడదగినది. ఇందు సర్వాధారభూతమైన పృథ్వి 63 ఋక్కులు గల పెద్ద సూక్తముచే స్తుతింపబడినది. ఆభిచారిక విద్యయే ఈ వేదము యొక్క ముఖ్యలక్షణము. అందుచే నిందు శత్రువుల ఆయురారోగ్యాదులను హరించుటకును, వారిని నాశమొనర్చుటకును, విరోధికృతములయిన ప్రయోగములను త్రిప్పుటకును, విరోధికృతమైన అపకారమునకు ప్రతీకారమొనర్చుటకును, విధింపబడిన మంత్రములు పెక్కులుకలవు. మొత్తముమీద ఇందు సర్వత్ర స్వీయ క్షేమారోగ్యములను, విరోధిజనుల అనారోగ్య నాశనములను కాంక్షించుచు, చేయు ప్రార్థనలే కానవగును.

సంగ్రహోక్తిచే — అథర్వవేదము, అనంతరకాలమున వెడలిన మంత్రశాస్త్రము, వైద్యశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము మున్నగువాటికి మార్గదర్శకము. విశేషముగా నిది ఐహికసుఖములయు, స్వల్పముగా ఆముష్మిక సుఖములయు బోధకముగా వెలసినదనవచ్చును. ఇందు ఆనాటి వివిధ సాంఘికాచారములు, ముఖ్యముగా బ్రాహ్మణుల శ్రేష్ఠత, వైశిష్ట్యము, ఆనాటిజనులకు మంత్రము మున్నగు వాటిపై గల గొప్ప విశ్వాసము ప్రత్యక్షమగుచున్నవి. ఆనాటి రాజులు సమగ్రముగ అథర్వవేద మంత్రప్రభావమును గుర్తించినవారై తమ ఆస్థానములందు అథర్వవేద పారగులను గౌరవముతో పోషించుచు, అథర్వవేద మంత్రముల యొక్కయు తద్విదుల యొక్కయు సాయమున విరోధివర్గము యొక్క నాశనాదికమును సాధించుచుండిరని తెలియుచున్నది.

"ప్రత్యక్షేణానుమిత్యావా ।
యస్తూపాయో న బుధ్యతే
ఏతం విదంతి వేదేన
తస్మాద్వేదస్య వేదతా"

అనుదానిని బట్టి ప్రత్యక్షాది ప్రమాణములచే తెలిసికొనుటకు శక్యముగాని అర్థమును బోధించు అక్షరరాశి వేదమనబడుచున్నది. తాపనీయోపనిషత్తునందలి "ఋగ్యజుస్సామాథర్వాణ శ్చత్వారోవేదాః" (నృ. పూ. తా. 1); ముండకోపనిషత్తునందలి "తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథర్వవేదః ;" ఇత్యాది వాక్యములచే వేదము ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అను నామములచే నాలుగు విధములుగ విభజింపబడుచున్నది. ఇట్టి వేదములకు అపౌరుషేయత్వమును పూర్వమీమాంసకులు సిద్ధాంతీకరించిరి. వీటియందు పఠింపబడుమంత్రములు ఋక్కులు, సామములు, యజస్సులు అను భేదముచే మూడువిధములు.

పూర్వమీమాంసాశాస్త్రమునందలి

"తచ్చోదకేషు మంత్రాఖ్యా" (జై-సూ-2-1-32)

"తేషామృక్ యత్రార్థవశేన పాదవ్యవస్థా" (జై. సూ. 2-1-35)

"గీతిషు సామాఖ్యా" (జై. సూ. 2-1-36)

"శేషే యజుశ్శబ్దః" (జై. సూ. 2-1-37)

ఇత్యాది సూత్రములచే పాదబద్ధములగు మంత్రములు ఋఙ్మంత్రములనియు, గానయుక్తములగు మంత్రములు సామమంత్రములనియు, ఈ రెండింటికంటె భిన్నములగు మంత్రములు యజుర్మంత్రములనియు తత్తద్వేద లక్షణములు చెప్పబడినవి. శ్రీ విద్యారణ్య యతీంద్రులు పూర్వమీమాంసాజైమినీయన్యాయమాల అను గ్రంథమునందు—

"యాజ్ఞికానాం సమాఖ్యానం లక్షణం దోషవర్జితం" (అ. 2.1) అను శ్లోక పాదముచే లోకములో యాజ్ఞికులు ఏమంత్రములను ఋఙ్మంత్రములనియు, వేటిని సామమంత్రము లనియు, వేటిని యజుర్మంత్రము లనియు

వ్యవహరించుచుండిరో అట్లే వ్యవహరించినచో లక్షణము నిర్దుష్టముగ నుండునని వాక్రుచ్చిరి.

ఋఙ్మంత్రములు బహుళముగనున్న వేదభాగమునకు ఋగ్వేదమనియు, యజుర్మంత్ర బాహుళ్యముగల వేద భాగమునకు యజుర్వేదమనియు, గానయుక్తమంత్ర బహుళమగు వేదభాగమునకు సామవేదమనియు, నీవిధ ముగ తత్తన్మంత్ర బాహుళ్యముచే మూడు వేదములకు పైనామము లేర్పడెను.

యజ్ఞములయందు హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ అనువారు నలుగురు ప్రధాన ఋత్విక్కులు కలరు. వారిలో హోత చేయవలసిన కర్మభాగము ఋగ్వేదమంత్రములచేతను, అధ్వర్యుడు చేయవలసిన కర్మభాగము యజుర్మంత్రములచేతను, ఉద్గాత చేయ వలసిన కర్మభాగము సామవేద మంత్రములచేతను, బ్రహ్మకృత్య మంతయు అథర్వవేద మంత్రములచేతను నిర్వహింపబడ వలయును. ప్రజాపతి సోమయాగముచేయ నుద్యుక్తుడై వేదములను గూర్చి "ఓవేద పురుషులారా! మీలో ఏవేదమును చదివినవానిని యజ్ఞమునందలి నలుగురు ప్రధానులయిన ఋత్విక్కులలో ఏ ఋత్వి క్కుగ వరింపవలయు"నని అడిగెను. ఆ ప్రశ్నమునకు "మాలో ఋగ్వేదవిదుని హోతగను, యజుర్వేదవిదుని అధ్వర్యునిగను, సామవేదవిదుని ఉద్గాతగను, అథర్వాంగిరో విదుని బ్రహ్మగను వరింపు"మని వేదములు ప్రజాపతికి బదులు చెప్పెను— అని గోపథ బ్రాహ్మణము యొక్క పూర్వభాగమునందలి

"అథహ ప్రజాపతి స్సోమేన యక్ష్యమాణో వేదాను వాచ। కంవో హోతారం వృణీయాం। క మధ్వర్యుం। క ముద్గాతారం। కం బ్రహ్మాణం। ఇతి" త ఊచుః। ఋగ్విద మేవ హోతారం వృణీష్వ। యజుర్విద మధ్వర్యుం। సామ విద ముద్గాతారం। అథర్వాంగిరోవిదం బ్రహ్మాణం। తథా హాస్య యజ్ఞ శ్చతుష్పాత్ప్రతి తిష్ఠతి"—అను ప్రశ్నోత్తర ములచే విదితమగుచున్నది. దీనిచే అథర్వవేదవిదునకే యజ్ఞమునందు బ్రహ్మత్వ మొనర్చు నధికారము సిద్ధించు చున్నది. విష్ణుపురాణము, మత్స్యపురాణము, మార్కం డేయపురాణము, మున్నగు పురాణములందు పౌరోహిత్య మునకు గూడ అథర్వవేదవేత్తయే అర్హుడని చెప్పబడినది.

పైరీతిగా యజ్ఞమునందు బ్రహ్మగా నుండవలసిన వాడు అథర్వ వేదజ్ఞుడుగ నుండవలయునను నియమము పుట్టినతరువాత అథర్వవేదమునకు "బ్రహ్మవేదము" అను నామమేర్పడెను. "చత్వారోవా ఇమేవేదా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో బ్రహ్మవేదః" (గో. బ్రా. 2-16) అను శ్రుతి అథర్వవేదమును "బ్రహ్మవేద" మనుటయందు ప్రమాణమగుచున్నది. ఈ వేదమునకు సాధారణముగ అథర్వవేదమని పేరు గలిగియున్నను మొదట దీనికి అథర్వాంగిరసమను నామముండెను.

పూర్వము ప్రజాపతి సృష్టికొరకు తపస్సు చేయు చుండగా అతని రోమకూపములలోనుండి చెమటపుట్టెను. ఆ స్వేదోదకమునందు తన ప్రతిబింబమును చూచుచున్న ఆ ప్రజాపతికి రేతస్సు చలించెను. అట్టి రేతస్సుతోగూడిన జలములు రెండు భాగము లయ్యెను. ఒకభాగమునుండి భృగు మహర్షి పుట్టెను. అతడు ప్రజాపతిని జూడగోరు చుండగా, ఆకాశవాణి "అథార్వా గేనం ఏతా స్వే వాప్స్వ న్విచ్ఛ" (గో. బ్రా. 1—4)—"నీకు ఉత్పాదకుడగు ప్రజాపతిని ఈ ఉదకములందే అభిముఖముగ అన్వే షింపుము"—అని పలికెను. ఇట్టి అశరీరవాక్కు యొక్క ఆదియందు 'అథార్వాక్' అని యుండుటచే, ఈ భృగువునకు 'అథర్వా' అను రెండవపేరుకూడ - లభించెను. ఇక రేతస్సుతోగూడిన రెండవభాగములో నున్న జలముచే ఆవృతు డగుటచే (ఆవృతత్వాత్ వరుణః) వరుణ శబ్ద వాచ్యుడై తపస్సుచేయదొడగిన బ్రహ్మయొక్క సర్వాంగ ముల నుండియు రసము స్రవించెను. అట్టి అంగరసము నుండి అంగిరశ్శబ్దవాచ్యు డగు మహర్షి పుట్టెను. ఇట్లు తనచే సృజింపబడిన అథర్వ — అంగిరో మహర్షుల కభి ముఖముగ ప్రజాపతి తపస్సుచేయగా అతని తపః ప్రభా వముచే ఏకర్చుడు ద్వ్యర్చుడు మున్నగు మంత్ర ద్రష్ట లగు మహర్షులు ఇరువదిమంది ఉత్పన్నులైరి. పిదప ఈ ఇరువదిమంది తపస్సు చేయుచుండగా వారివలన నిస్సృత ములై బ్రహ్మచే చూడబడిన మంత్రములయొక్క సంఘమే అథర్వాంగిరశ్శబ్దవాచ్య మగు అథర్వవేద మయ్యెను. అనగా బ్రహ్మ చూచుచుండగా ఘోర తపోనిష్ఠలోనున్న ఇరువదిమంది అథర్వాంగిరో మహర్షులనుండి వెలువడిన మంత్రసంఘమునకే అథర్వవేద మనియు,అథర్వాంగిరస్సు

అని యు రెండు నానుములచే వ్యవహారమేర్పడెను. ఇట్లు ఇరువదిమంది మహర్షులవలన నిష్పన్నమగుటచే అథర్వవేదము ఇరువది కాండలు కలదయ్యెను. కావుననే ఈ వేదము సర్వశ్రేష్ఠమయ్యెను—అని సాయణ భాష్య పత్రికవలన విదితమగుచున్నది. మరియు, "ఏ శద్వై భూయిష్ఠం బ్రహ్మయద్భృగ్వంగిరసః యేంగిరసస్సరసః యేఽథర్వాణ స్త ద్భేషజం। యద్భేషజం తదమృతం। యదమృతం తద్బ్రహ్మ" (గో. బ్రా. 3. 4.) అనగా బ్రహ్మజ్ఞులగు మహర్షుల తపోమహిమవలన వారి హృద యములందు సంభూతమయిన దగుటచే ఈ అథర్వ వేదము అన్ని వేదములకంటె శ్రేష్ఠమైనది. దీనియందు అంగిరశ్శబ్దవాచ్యమగు భాగము నారము. అథర్వవాచ్య మగు భాగము భేషజము (చికిత్సకము). ఏది భేషజమో అది అమృతము (అమృతత్వ ప్రాపకము). ఏది అమృతమో అది 'బ్రహ్మ స్వరూపము' అను నీ గోపథ బ్రాహ్మణము నందలి వాక్యములవలన అథర్వవేదమునకు అథర్వాంగిరస మను పేరుగాక భృగ్వంగిరస మను పేరు కూడ నున్నట్లు కానవచ్చుచున్నది.

ఇట్టి అథర్వవేదమునకు అంగములుగ సర్పవేదము, పిశాచవేదము, అసురవేదము, ఇతిహాసవేదము, పురాణ వేదము అను నయిదు ఉపవేదములను బ్రహ్మ సృజించి నట్లు "పంచవేదా న్నిరమిమీత సర్పవేదం, పిశాచ వేదం, అసురవేదం ఇతిహాసవేదం పురాణవేదం" అను గోపథ బ్రాహ్మణమునందలి (గో. బ్రా. 1-10) శ్రుతి వాక్యము నుడువుచున్నది.

అథర్వవేదమునకు పూర్వము పైప్పలాద, తైద, మౌద, శౌనకీయ, జాజల, జలద, బ్రహ్మవద, దేవదర్శ, చారణవైద్య—అను తొమ్మిదిశాఖ లున్నట్లు చరణ వ్యూహాది గ్రంథములవలన తెలియుచున్నది. వీటిలో శౌనకీయాది నాలుగు శాఖలలోగల అనువాకములకు, సూక్తములకు, ఋగాదులకు, గోపథ బ్రాహ్మణానుసార ముగ అయిదు సూత్రములచే వినియోగము చెప్పబడినది. ఈ విషయమునే ఉపవర్షాచార్యులవారు కల్ప సూత్రాధి కరణములో నిట్లు చెప్పియుండిరి.

నక్షత్ర కల్పో వైతాన స్తృతీయ స్సంహితా విధిః।
తుర్య ఆంగిరసః కల్ప శ్శాంతి కల్పస్తు పంచమః॥

సంహితామంత్రములన్నిటికిని సంపూర్ణముగ శాంతిక, పౌష్టిక కర్మలందు వినియోగము చెప్పబడుటచే 'సంహితా విధి' అను పదమునకు కౌశిక సూత్రము అని అర్థము. ఇదియే గృహ్యసూత్రము. దీని నవష్టంభముగాచేసికొనియే ఇతర సూత్రములన్నియు నుండుటచే ఈ సూత్రము ప్రధానమైనది.

అథర్వవేదమున ప్రతిపాదితములయిన విషయములలో మీద పేర్కొనబడిన సూత్రములలో కౌశిక సూత్రము నందు, గ్రామ, నగర, దుర్గ, రాష్ట్రాది లాభసంపాదకము లయిన కర్మలును; పుత్ర, పశు, ధన, ధాన్య, ప్రజా, స్త్రీ - కరి - తురగ - రథ - ఆందోళికాది సర్వసంపత్తులను బొందుటకు సాధనములయిన కర్మలును; జను లైకమత్య మును సంపాదించుకొనుటకు ఉపకరించు కర్మలును; రాజ సంబంధమగు కర్మలును; శాంతిక, పౌష్టిక కర్మలును; గో సమృద్ధి - వృషభసమృద్ధి - సంపాదకములైన కర్మలును; వృషోత్సర్జనాది కర్మలును పేర్కొనబడినవి.

వైతానస సూత్రమునందు వేదత్రయ విహితములగు దర్శపూర్ణమాసేష్టి ప్రభృతి యజ్ఞములు, చయనములు, సత్రయాగములు మున్నగు సమస్త క్రతువులందు బ్రహ్మ, బ్రాహ్మణాచ్ఛంసి, ఆగ్నీధ్రుడు, హోత అను నలుగురు ఋత్విక్కులచే పఠింపదగిన శస్త్రమంత్రములును, (శస్త్రములన యజ్ఞములో ఆరాధింపబడు దేవతలను స్తుతించు మంత్రములు) ప్రవచింపబడినవి. అందుచే ఈ శ్రౌతసూత్రమునందలి మంత్రములు కేవలము యజ్ఞాదుల యందే ఉపయోగపడును.

నక్షత్రకల్పమునందు — మొదట, కృత్తికానక్షత్ర పూజా-హోమాదికము, పిదప అమృతాద్యభయాంతము లగు ముప్పది మహాశాంతులు, అనంతరము భయార్తుల కును, రోగగృహీతులకును, బ్రహ్మవర్చస కాములకును, ప్రజా పశ్వన్న సంవత్సరభృతులను కాంక్షించువారికిని - సర్వకామావాప్తికై సాధనములయిన శాంతులు చెప్పబడి నవి. ఆంగిరసకల్పములో అభిచార (ప్రయోగ) సంబంధ మగు అనగా శత్రువధార్థమై ఉపయోగించు కర్మలు మాత్రమేవివరింపబడినవి. శాంతికల్పమునందు వైనాయక శాంతి మొదలుకొని ఆదిత్యాది నవగ్రహ శాంత్యాదిక ములు చెప్పబడినవి. మరియు అథర్వవేద పరిశిష్టములలో

కొన్నింటిలో రాజప్రథమాభిషేకము, పురోహితకర్మలు, మహారాజులు ప్రత్యహము చేయదగిన సువర్ణ-ధేను-తిల-భూదానాదులు కోటిహోమము, లక్షహోమము, అయుత హోమము, గ్రహయుద్ధము, రాహుచార-కేతుచారములు, పటాకప్రతిష్ఠ, పాశుపతవ్రతము మున్నగు ననేక విషయములు ప్రతిపాదింపబడినవి.

అథర్వవేదగతములగు కొన్ని విషయములు : ఉదా:-

(1) వర్షాగమనమునకును కప్పలరచుటకును గల సంబంధము. (అ. వే. 4 వ కాం. 4-15)

లోకమునందు బోదురు కప్పలు నీటియందుండి అరచునప్పుడు "బోదురుకప్పలరచుచున్నవి కావున వర్షము కురియు"ననెడి వాడుకకు అథర్వవేదము మూలము.

"ఖణ్వ ఖా౩ ఇ ఖై మ ఖా౩ ఇ మధ్యేతదురి"— (అ. వే. 4 కాం.-4-15.) అను శ్రుతియందలి 'ఖణ్వఖా, ఖైమఖా, తదురి' అను మూడుపదములు మండూకములలో నొకజాతికి చెందిన ఆడకప్పలకు నామములు. ఆ నామములచే వాటిని సంబోధించి, "ఓ మండూక విశేషములారా! మీ ఘోషముచేత వర్షమును కలుగజేయుడు. వృష్టిద్వారమున పోషించు నో మండూకములారా! మీ ఘోషముచేత వృష్టికి అభిముఖములగు మరుద్గణముల యొక్క మనస్సును స్వాధీనముచేసికొనుడు." అను నర్థమును ఈ శ్రుతి బోధించుచున్నది. దీనిచేత మండూక ఘోషము వృష్టికి కారణమని తెలియుచున్నది. ఇట్టి శ్రుతిసిద్ధమైన పెక్కు విషయములు లోకాచారమున గన్పడుచున్నవి.

(2) 'అను సూర్యముదయ తాం' (అ. వే. 1 కాం. 6-1) అను మంత్రముచేత ఉదకము నభిమంత్రించి, యెఱ్ఱ గోవు యొక్క రోమములతో మిశ్రితములగు నా జలమును త్రాగినచో హృద్రోగము తగ్గునని చెప్పబడినది.

(3) సభాజయమును కోరినవాడిట్లు పఠింపవలయును: (7 వ కాండము 12 వ సూక్తము అనువాదము.)

(i) ప్రజాపతికి కూతులైన సభయు (విదుషుల సమాజము) సమితియు (సంగ్రామీణసభ) నేకమనస్కులై నన్ను రక్షించుదురుగాత. నాకు కానవచ్చినవాడెల్ల నా కనుకూలుడగుగాక— ఓ తండ్రులారా! సభలో నేను చారు వచనములను పలికెదను.

(ii) ఓ సభా ! నీ పేరు 'నరిష్టా' (అలంఘనీయ) యని ఎరుగుదును. ఈ సభలోని సభాసదులందరును నా కేకీభవింతురుగాక.

(iii) ఇందలిసభాసదుల యొక్క వర్చస్సును, విజ్ఞానమును నేను తీసికొనుచున్నాను. ఈ సభయందలి యందరిలోను ఇంద్రా! నన్ను భాగ్యవంతుని (జయశీలుని) చేయుము.

(iv) ఓ సభాసదులారా! మీమనస్సు ఇతరత్ర ఆసక్తమై యున్నను ఇచ్చటచ్చట బద్ధమైయున్నను నా వైపునకు త్రిప్పెదను. అది నాయందు రమించుగాక.

(4) శత్రుసేనకు మోహమును కలిగించుటకు— (3 కాం—1 వ సూక్తము. అనువాదము)

(i) విద్వాంసుడైన అగ్ని మా శత్రువులమీదికి ఎత్తిపోవునుగాక ; ఎక్కువ హింసకుడయిన శత్రువును కాల్చుగాక. సర్వజ్ఞుడైన అగ్ని మా శత్రువులను చేతులులేనివారిగ చేయునుగాక.

(ii) ఓ మఘవన్ ! వృత్రహంతకా ! ఇంద్రా ! అగ్నీ ! శత్రుసేనలను మీరు కాల్పుడు.

(5) పాపపరిహారార్థమై ప్రాయశ్చిత్తము: (6 వకాం. 113 వ. సూక్తము)

(i) దేవతలీపాపమును త్రిత (దేవతా విశేషము) మీద కడిగిరి. త్రిత ఆపాపమును మానవునిమీద పారవైచి కడుగుకొనెను. కావున నన్ను గ్రాహి (పాప దేవత) ఆశించెను. మంత్రములతో దేవతలు దానిని పోగొట్టుదురు గాత.

(ii) ఓ పాపమా ! కిరణములందు ప్రవేశింపుము. ధూమములోనికి పొమ్ము. మేఘమునందు చొరబడుము. మంచులో చేరుము. నదులమీది నురుగులో కలిసిపొమ్ము. ఓ పూషన్! భ్రూణహత్య చేసినవాని దోషముపోగొట్టుము.

(iii) త్రితచే అపమృష్టమైన మానవుని పాపము పండ్రెండుచోట్ల పెట్టబడినది. కావున నిన్ను గ్రాహి పట్టుకొన్న యెడల ఈ దేవతలు మంత్రములతో దానిని పోగొట్టుదురుగాత.

(6) భర్త లభించుటకు స్త్రీ పఠింపదగిన మంత్రము : (6 వ. కాండము. 60వ సూక్తము)

(i) ఈ కన్యకకు పతినిగోరి, ఈ బ్రహ్మచారికి భార్యను కోరి అర్యమ (ఆదిత్యుడు) విహితస్తపుడై పురోభాగమునకు వచ్చుచున్నాడు.

(ii) అర్యమ ! ఈ పడుచు ఇతర స్త్రీల వివాహోత్సవములకు పోయి విసిగినది. ఇక తప్పక ఇతర స్త్రీలు ఈమె వివాహోత్సవమునకు పోయెదరు.

(iii) ధాత ఈ భూమిని, ఆకాశమును, సూర్యుని ధరించెను. (స్వస్వస్థానములయందు నిలిపెను.) ధాత ఈ కన్యకకు ఆమె కోరిన వరుని ఇచ్చుగాక.

(7) భార్య లభించుటకు మంత్రము: (6 వ కాండము; 82 వ సూక్తము) ఇచ్చటికి వచ్చువాని, వచ్చినవాని, వచ్చుచున్నవాని పేరు స్మరించెదను. ఇంద్రుని, వృత్రఘ్నుని, వాసవుని, శతక్రతువును, యాచించెదను. భార్యను కోరుచున్న నాకు ఓ యింద్రుడా! శచీపతీ! నీ యొక్క హిరణ్మయమును, ధనమిచ్చునదియు నగు నీ అంకుశముచే నాకు భార్యనిమ్ము.

(8) కారుచున్న రక్తము నాపుటకు—(అనువాదము)

(i) ప్రవహించుచున్నవియు, రక్తమునకు నివాసభూతములగునవియు నగు ఈ రక్తనాళములు తోడబుట్టిన వాండ్రులేని చెల్లెండ్రవలె హతవర్చసలై ఆగిపోవుగాక.

(ii) ఓ అధోభాగవర్తినియైన రక్తనాళమా ! ఆగిపో; ఊర్ధ్వనాళమా ! ఆగిపో; అన్నిటికంటె చిన్ననాళమా ఆగిపో; అన్నిటికంటె పెద్దనాళమా ! ఆగిపో.

(iii) నూరు ధమనులలో వేయి సిరలలో ఈ నడుమనున్నవి ఆగిపోయినవి. మిగిలిన నాళము లన్నియు నాగిపోయినవి.

ఇట్లే జ్వరము, వరుసజ్వరము, పసరికలు, అజీర్ణము, జలోదరము, కుష్ఠు, గాయములు, క్రిములు పడుట, పశురోగములు విషప్రయోగము మున్నగువాటిని నివారించుటకు పఠింపదగిన పెక్కు మంత్రము లిందు కలవు.

"శ్రేష్ఠోహి వేద స్తపసోధిజాతో, బ్రహ్మజ్ఞానాంహృదయే సంబభూవ. (గో. బ్రా. 1-6). అనురీతి గోపథ బ్రాహ్మణమున ఈ వేదము యొక్క మహిమ వర్ణితమైనది.

"యస్యరాజ్ఞో జనపదే అథర్వా శాంతిపారగః ।
నివసత్యపి తద్రాష్ట్రం వర్ధతే నిరుపద్రవం॥
తస్మాద్రాజా విశేషేణ అథర్వాణం జితేంద్రియం ।
దాన సమ్మాన సత్కారైః నిత్యం సమభిపూజయేత్"

ఏ రాజు యొక్క జనపదమందు సంపూర్ణముగా శాంతి విధుల నెరిగిన అథర్వవేద పండితుడు నివసించునో, ఆ రాష్ట్రము రోగదారిద్ర్యములు మున్నగు నుపద్రవములు లేకుండ వృద్ధినొందును. అందుచేత రాజు విశేష యత్నముచే యోగ్యుడగు నథర్వవేద పండితుని పురోహితునిగ చేసికొని యాతనిని దాన సమ్మానములచే సంతుష్టుని చేయవలయునని అథర్వవేద పరిశిష్టమున చెప్పబడినది. నీతిశాస్త్రమునందలి

"త్రయ్యాంచ దండనీత్యాంచ
కుశలస్స్యా త్పురోహితః ।
అథర్వ విహితం కర్మ
కుర్యా చ్ఛాంతికపౌష్టికం"

అను శ్లోకము వలన రాజునొద్దనున్న పురోహితుడు వేదత్రయమందును, దండనీతియందును కుశలుడై యుండి, రాజ్యమున సంగ్రామాదుల ప్రసక్తి కలిగినప్పుడు, శత్రు పరాభవమును స్వప్రభువు యొక్క విజయాదులును ఘటిల్లు నిమిత్తమై, శాంతిక పౌష్టిక కర్మల నాచరించి రాజ్యరక్షణ మొనర్పవలయునని వచింపబడినది. శ్రీ విద్యారణ్య యతీంద్రులు తన పూర్వాశ్రమమున విజయనగర చక్రవర్తులకడ అమాత్యుడుగను ధర్మోపదేష్టగను ప్రవర్తిల్లుచు నాలుగు వేదములకును రాజనీతి ననుసరించి భాష్యరచన చేసియున్నారు.

ఉ. గ. శా.

## అధికార పరావృత్తి - అధికార విభజనము :

ప్రభుత్వము ప్రజలసౌఖ్యముకొరకు అనేక కార్యములను నెరవేర్చవలసి యున్నది. వీటిని నిర్వహించునపుడు వివిధములైన అధికారములను అది చలాయించును. సక్రమముగా సాగుటకు, ఇవి సాధారణముగ రెండు విధములుగ విభజింపబడును. మొదటిది యధికారములను, వాటివలన నెరవేరు కార్యముల యొక్క స్వభావమునుబట్టి ప్రభుత్వమందలి వివిధ అంగముల మధ్యను విభజించుట; రెండవది, అధికారములను, అవి వర్తించు ప్రదేశము (Territory) ను బట్టి జాతీయ (National), రాష్ట్రీయ (Provincial), స్థానిక (local) ప్రభుత్వముల నడుమ విభజించుట. మొదటిదానిని అధికారపరావృత్తి (Separation of Powers) అనియు, రెండవదానిని అధికార విభజనము (Division of Powers) అనియు అందురు. అయితే ఈ రెంటియందును జరుగునది

అధికారవిభజనమే గాన, వాటిని అధికారవిభజనముపేర వర్ణింపవచ్చును.

ప్రాముఖ్యము: రాజ్యపరిపాలనలో అధికార విభజనము అతిప్రాముఖ్యముకలది. అది సక్రమముగ నున్నచో పరిపాలన సుష్ఠు (efficient) గా సాగును, ప్రజలకు స్వేచ్ఛ (liberty) లభించును. లేనిచో ఈ పరమ ప్రయోజనములకు భంగము కల్గును. కావున పైన సూచించిన రెండు అధికార విభజన పద్ధతులను సరిగా బోధచేసికొని, అవలంబించుట ఆవశ్యకము.

అధికార పరావృత్తి లేక విభజనము (Separation of Powers): అర్థము : ప్రభుత్వమునకు గల అధికారములు ముఖ్యముగ మూడు రకములు. అవి శాసననిర్మాణము (Law making), కార్యనిర్వహణము (Law enforcing), న్యాయనిర్ణయము (Law interpreting). వీటిలో ఒక్కొకదానిని ఒక్కొక ప్రభుత్వ అంగము (లేక శాఖ లేక భాగము) నిర్వహించును. అనగా శాసన నిర్మాణమును శాసనసభయు (Legislature); కార్యనిర్వహణమును కార్యనిర్వాహక వర్గమును (Executive) ; న్యాయ నిర్ణయమును న్యాయస్థానమును (Judiciary) నిర్వహించును. ఇట్లు మూడు రకములైన అధికారములును మూడు ప్రభుత్వభాగముల మధ్య విభజింపబడి, వాటిచే ప్రత్యేకముగ నిర్వహింపబడు పద్ధతిని అధికారవిభజనము అందురు.

పుట్టు పూర్వోత్తరములు : అరిస్టాటిలు మొదలు నేటి వరకు పెక్కుమంది రాజనీతిశాస్త్రజ్ఞులు అధికార విభజనము యొక్క స్వరూప స్వభావములను వివిధరీతుల తీర్చిదిద్దిరి. వీరిలో 18 వ శతాబ్దమున ఫ్రాన్సుదేశమునందున్న మాంటెస్క్యూ ప్రముఖుడు.

మాంటెస్క్యూ సిద్ధాంతము : అధికార విభజనము విశేష వ్యాప్తిలోనికి వచ్చినది మాంటెస్క్యూ పండితునివలన గాన, ఆతని సిద్ధాంతమును కొంతవరకు ఇచట విచారింతము. శాసననిర్మాణము, కార్యనిర్వహణము, న్యాయనిర్ణయము అను మూడు రకములైన అధికారములును మూడు ప్రత్యేక ప్రభుత్వ భాగములమధ్య స్పష్టముగ విభజింపబడి, ఆయాభాగములచే ప్రత్యేకముగను, స్వతంత్రముగను, నిర్వహింప బడవలెను. అపుడే ప్రజలకు స్వేచ్ఛ సిద్ధించును. ఇదే ఆతని సిద్ధాంతమందలి సారాంశము.

మాంటెస్క్యూ సిద్ధాంతమందలి లోపములు : తన సిద్ధాంతమునకు నిదర్శనముగ మాంటెస్క్యూ ఇంగ్లండునందలి పాలనావిధానమును పేర్కొనెను. అయితే, ఇంగ్లండునందు ఆతనికాలమునగాని, తరువాతగాని, ఆతడనుకొనిన అధికారవిభజనములేదు. పార్లమెంటరీ విధానము (parliamentary System) నందు, శాసనసభయు, కార్యనిర్వాహక వర్గమునకు చెందిన మంత్రివర్గమును, విడిగానుండక కలిసిమెలిసి యుండును. అయినను ఇందువలన స్వేచ్ఛా జీవనమునకు భంగము కలుగదు. పై రెండు శాఖలును ప్రత్యేకముగనుండునట్లు ఏర్పాటుచేయబడిన అధ్యక్షవిధానము (Presidential System) నందుగూడ విభజనమునకు తోడుగ కొంత సమన్వయము (Co-ordination) ను పాటింపక తప్పలేదు. ఇక కార్యనిర్వహణ, న్యాయనిర్వహణ శాఖలమధ్యగూడ విభజనము మాత్రమే గాక కొంత పరస్పర సంబంధముండుటయే శ్రేయస్కరమని అమెరికా, ఇంగ్లండు, దేశములలోని న్యాయ నిర్వహణ విధానములు వ్యక్తము చేయును.

ఇంతకు తేలినదేమనగా - స్వేచ్ఛ, మాంటెస్క్యూ నిర్ణయించినట్టి అధికారవిభజనము మీద మాత్రమే ఆధారపడియుండదు; అధికారవిభజనమునకు తోడుగ సమన్వయము గూడ కొంతవరకు స్వేచ్ఛకు దోహదముగ నుండును. అధికారవిభజనము గతకాలపు నిరంకుశప్రభుత్వము (Despotic Government) నందలి పరిస్థితులకు సరిపడునంతగా నేటి ప్రజాప్రభుత్వము (Democratic Government) నందలి స్థితిగతులకు వర్తించదు.

మాంటెస్క్యూ సిద్ధాంతమందలి గుణములు : పై విమర్శనము, మాంటెస్క్యూ పండితుడు అధికారవిభజనము పూర్తిగా నుండవలెననియు, ఆ యధికారములను చలాయించు ప్రభుత్వశాఖలు పూర్తిగా ప్రత్యేకముగ నుండవలెననియు, వాటిమధ్య సహకారము ఉండగూడదనియు, నిర్ణయించెనను ఊహాపై ఆధారపడియున్నది. అతడు అట్లే అభిప్రాయపడెనా లేదా అనునది వివాదగ్రస్తమైనది. కొందరు పండితులు అతడు ప్రభుత్వశాఖలమధ్య పూర్తి విభజనమును కోరలేదనియు, కొంతవరకు

మాత్రమే కోరెననియు వాదింతురు. ఇట్లు పరిమిత విభజనమును మాత్రమే సూచించునదిగా గ్రహించిన యెడల మాంటెస్క్యూ సిద్ధాంతము ఆచరణయోగ్యమును, అభిలషణీయమును అగును. దానివలన ప్రభుత్వోద్యోగులు తమ విధులను శక్తిసామర్థ్యములతో నెరవేర్చుచు, తమ అధికారములను బాధ్యతాసహితముగ చలాయించుటయు ప్రజలు తమ న్యాయ సమ్మతమైన హక్కులను నిరాటంకముగ అనుభవించుటయు సంభవించును.

**నేటి రాజ్యములందున్న అధికారవిభజనము :** పైన సూచించిన పరిమితమైన అధికారవిభజనము ప్రయోజనకారిగనుకనే అట్టి పద్ధతి నేటి రాజ్యములందు, తరతమ భేదములతో అనుసరింపబడుచున్నది. అనగా - శాసనసభ, కార్యనిర్వాహకవర్గము, న్యాయస్థానములు ప్రత్యేక ప్రభుత్వ సంస్థలుగ నుండును. అవి సాధారణముగ ప్రత్యేకముగ పనిచేసినను, అవసరమగు నంతవరకు అన్యోన్యముగ గూడ మెలగును. ఒక్కొక్క శాఖ తన ప్రధాన కార్యముతోబాటు ఇతర కార్యములను గూడ కొంతవరకు నెరవేర్చును. శాసనసభ ప్రధానముగ శాసన నిర్మాణము నొనర్చుచు, కార్యనిర్వాహక వర్గము చేయు పనులపై సమీక్ష, ఆదాయవ్యయములపై అజమాయిషీ, కొన్ని విషయములందు న్యాయ నిర్ణయము చేయును. కార్య నిర్వాహకవర్గము తన ముఖ్య విధియగు కార్యనిర్వహణముతోబాటు శాసననిర్మాణ కార్యమును సరిదిద్దుచు, న్యాయమూర్తులను నియమించుచు నుండును. ఇక న్యాయస్థానము లందలి న్యాయమూర్తులు న్యాయనిర్ణయ సందర్భమున న్యాయచట్టములపై వ్యాఖ్యానించి, న్యాయశాస్త్రమును తీర్చిదిద్దుదురు. శాసనసభ, కార్య నిర్వాహకవర్గముల అధికార పరిమితిని నిర్ణయించును. ఇట్లు ప్రభుత్వ-అధికారముల మధ్యను, వాటిని నిర్వహించు ప్రభుత్వశాఖల మధ్యను, కల విభజనము పూర్తిగకాక పరిమితముగనే యున్నది. అయితే, శాసనసభ, కార్యనిర్వాహక వర్గముల మధ్యగల విభజనము పార్లమెంటరీపద్ధతి ననుసరించు ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలైన దేశములందు తక్కువగను, ప్రెసిడెంటు పద్ధతి ననలంబించు అమెరికా సంయుక్తరాష్ట్రములందు ఎక్కువగను ఉండును. స్వతంత్ర భారతదేశము చాలవరకు ఇంగ్లీషువిధానమునే అవలంబించినది.

**అధికార విభజనము (Division of Powers) :** ఇపుడు అధికార విభజనమనుపేర అధికారములు రాజ్యమునందలి వివిధ ప్రదేశముల (Areas) మధ్యను విభజింపబడుట వర్ణింపబడును. ఇది భౌగోళికము (Territorial) గ చేయబడు విభజనము. దీనిని అధికార వికేంద్రీకరణము (Decentralisation of Power) అనవచ్చును.

**వివిధభాగముల మధ్య విభజనము:** ప్రదేశముననుసరించి ప్రభుత్వపు అధికారములను విభజించు పద్ధతిని సామాన్యముగను, స్థూలముగను ఇట్లు సూచింపవచ్చును.

ప్రభుత్వము నెరవేర్చు విధుల (functions) లో కొన్ని రాజ్యమున కంతకును సమానముగా ప్రాముఖ్యము కలవి. ఉదా : విదేశ వ్యవహారములు, దేశరక్షణము, రవాణా సౌకర్యములు మొదలైనవి. వీటికి సంబంధించిన అధికారములు దేశమున కంతకును ప్రాతినిధ్యము వహించు జాతీయ లేక కేంద్ర ప్రభుత్వమునకు అప్పగింపబడును. కొన్ని వ్యవహారములు దేశమందలి వివిధ భాగములందు లేక ప్రాంతములందు ఒకేవిధముగ గాక వేర్వేరుగ నిర్వహింపబడవలసి యుండును. ఉదా : వ్యవసాయము, విద్య, వైద్యము, మొదలైనవి. వీటికి సంబంధించిన అధికారములు రాష్ట్రప్రభుత్వములకు ఒసగబడును. ఈ ప్రభుత్వ భాగములను రాష్ట్రములనియు, రాజ్యములనియు, ఇంకా ఇతర పేర్లతోను పిలుతురు. మరికొన్ని పనులు దేశమున కంతకునుగాక, రాష్ట్రములకునుగాక, అంతకన్న చిన్నవైన పట్టణములకో, పల్లెలకో సంబంధించినవి. ఉదా : మంచినీటిసరఫరా, మురుగునీటి పారుదల, ప్రాథమిక పాఠశాలలు, ప్రజారోగ్య సౌకర్యములు. మొదలగునవి. వీటిని నెరవేర్చుటకు తగిన అధికారములు స్థానికసంస్థల కొసగబడును. ఇట్లు పాలనాధికారములు జాతీయ, రాష్ట్రీయ, స్థానిక ప్రభుత్వముల మధ్య ప్రత్యేకింపబడును. పై మూడు ప్రభుత్వ భాగములకు నడుమ మరికొన్ని విభాగములు గూడ నుండవచ్చును. ఉదా : మన దేశమందున్న జిల్లాలు.

పై అధికార విభజనము భిన్నరాజ్యములందు భిన్న రీతుల నుండును. వీటినిగురించి వివిధప్రభుత్వ వ్యవస్థల

సందర్భమున విపులముగ తెలిసికొనవచ్చును. కావున అవి ఇచట సూక్ష్మముగ సూచింపబడును.

జాతీయ, రాష్ట్రీయ ప్రభుత్వముల నడుమనుండు అధికార విభజనము ఫెడరల్ (Federal) వ్యవస్థయందు ఒకరకముగను, యూనిటరీ (Unitary) విధానమందు మరొక విధముగను ఉండును. ఫెడరల్ రాజ్యములందు అధికారవిభజనము చాల నిష్కర్షగ నుండును. అనగా అది లిఖిత రూపమున నున్నట్టిదియు, సులభముగ మార నట్టిదియునై యున్న రాజ్యాంగ చట్టములో పొందు పరచబడియుండును. ఈ విభజనమునకు భంగము కలుగకుండ కాపాడుటకును, దానికి సంబంధించిన వివాదములను పరిష్కరించుటకును, స్వతంత్రమైన, ఉన్నతమైన న్యాయస్థానము స్థాపింపబడును. విభజన ఫలితముగ రాష్ట్రప్రభుత్వములకు రాష్ట్రీయ వ్యవహారములను నెరవేర్చుకొనుటలో,సాధారణముగ స్వాతంత్ర్యముఉండును. ఇట్టి విభజనము కొన్ని తారతమ్యములతో అమెరికా, ఆస్ట్రేలియా, కెనడా, ఇండియా మొదలైన రాజ్యములలో కాననగును. ఇక యూనిటరీ విధానము ననుసరించు ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు దేశములలో అధికారవిభజనము ఇంత కట్టుదిట్టముగనుండదు. ప్రాంతములందున్న పాలనాసంస్థలకుగాని, ప్రభుత్వములకుగాని తమ వ్యవహారములను పరిష్కరించుకొనుటలో సిద్ధాంతదృష్ట్యా అంత స్వేచ్ఛయుండదు. ప్రాంతీయపాలనము న్యాయరీత్యా కేంద్రప్రభుత్వపు అదుపు ఆజ్ఞలకు లోనై ఉండును.

ఇపుడు రాష్ట్రీయ, స్థానిక ప్రభుత్వభాగముల మధ్యనుండు అధికారవిభజనమును గమనింతము. ఇది రాజ్యాంగచట్టమునందుగాక, సాధారణ న్యాయ చట్టములందు రూపొందింపబడును. స్థానిక సంస్థలు ఫెడరల్ రాజ్యములందు రాష్ట్రప్రభుత్వపు అజమాయిషీకిని, యూనిటరీ రాజ్యములందు కేంద్ర ప్రభుత్వపు అజమాయిషీకిని లోబడియుండును. స్థానికపాలనమునెడల పై ప్రభుత్వము చలాయించు అధికారముయొక్క పరిమితియు, స్థానిక సంస్థలనుభవించు స్వేచ్ఛయొక్క పరిమితియు, వివిధ రాజ్యములందు వివిధముగ నుండును. ఇంగ్లండు, ఫ్రాన్సు దేశములు రెండును యూనిటరీ విధానము నవలంబించియున్నను, ఇంగ్లండునందు ఫ్రాన్సులో కన్న యెక్కువగ స్థానికపాలనమునందు స్వేచ్ఛగలదు. యథార్థముగ చూచినచో ఇంగ్లండు నందలి స్థానికస్వపరిపాలనము ఫెడరల్ వ్యవస్థను గల్గియున్న అమెరికా సంయుక్తరాష్ట్రములలో నున్నదానితో సరితూగ గలదు. దక్షిణ అమెరికాయందలి కొన్ని ఫెడరల్ రాజ్యములలో కాననగు స్థానిక స్వపరిపాలనము ఇతర ఫెడరల్ రాజ్యములలో నున్న దానికన్న స్వల్పము. ఇక స్వతంత్ర భారత దేశపు పాలనా విధానమునందు అధికార వికేంద్రీకరణము ఒక ప్రధానమైన లక్ష్యముగను, లక్షణముగను గూడ నున్నది. నేటి గ్రామపంచాయితీలు ఇందుకు నిదర్శనము.

**ఉపసంహారము :** అధికారము వివిధ ప్రభుత్వశాఖల నడుమ విభజింపబడుటయు, వివిధ ప్రదేశ ప్రభుత్వముల మధ్య వికేంద్రీకరింప బడుటయు, ప్రయోజనకరమనునది నిర్వివాదాంశము. అందువలన ప్రభుత్వమునకు పటుత్వము (efficiency) ను, ప్రజలకు స్వేచ్ఛ (liberty) యు లభించును. అయితే పై విషయములందు అధికార విభజనము పరిమితముగ నున్నప్పుడే, ఈ ప్రయోజనములు చేకూరును; విపరీతముగ నున్నప్పుడు చేకూరవు. అనగా అధికార విభజనము అత్యధికమైనచో అరాజకత్వము (Anarchy) ను, అత్యల్పమైనచో నిరంకుశత్వము (Tyranny) ను ఏర్పడును. 'అతిసర్వత్ర వర్జయేత్' అను ఆర్యోక్తి అధికార విభజనమునకు గూడ వర్తించును. తగుపరిమితిని తెలిసికొని దానిని అవలంబింపదగును. అధికార విభజనము సుపరిపాలనమునకు సాధనము మాత్రమే అని గ్రహించి, దానిని దేశకాల పాత్రముల కనువుగ సంస్కరించి, అనుసరించుట శ్రేయోదాయకము.

ఓ. న. మూ.

**అధికార వర్గము (Bureaucracy) :** మానవులకు గల వాంఛలలో శాంతి సౌభాగ్యములు ముఖ్యమైనవి. వీటిని సమకూర్చుటకు ఏర్పడినది రాజ్యము (State). ఇది కాలక్రమమున విస్తరించినది. అనగా దీనియందలి సభ్యుల సంఖ్య పెరుగుటయు, ఇది ఆక్రమించిన ప్రదేశము విస్తరించుటయు, ఎదుర్కొనవలసిన సమస్యలు, ఏర్పాటు చేయవలసిన సౌకర్యములు ఎక్కువగుటయు, అందువలన కార్యనిర్వహణభారము వృద్ధియగుటయు జరిగినవి. ఇట్టి

కార్యనిర్వహణమును సక్రమముగను, సమర్థముగను, సంతృప్తికరముగను సాగించుటకు ప్రత్యేకమైన శక్తి సామర్థ్యములుగల ఉద్యోగి బృందము, అవసరమైనది. ఇదే క్రమముగ అధికారవర్గముగ రూపొందినది.

**అర్థము :** అధికారవర్గము అనగా ప్రభుత్వోద్యోగుల సిబ్బంది. ఇది సాధారణమైన అర్థము. అయితే ఈ పదమునకు నిగూఢమైనట్టియు, నిందార్థమైనట్టియు అర్థము గూడ గలదు. ఉద్యోగులందు తమకు పాలనమును నిర్వహించుటలోగల శక్తియుక్తులనుబట్టియు, తద్ద్వారమున అనుభవించు అధికార గౌరవములను బట్టియు, అతిశయము ప్రబలినది. అంతేగాక స్వార్థపరత్వము, సంకుచితదృష్టి, అలసత, అవినీతి మొదలగు అవలక్షణములు గూడ ఏర్పడినవి. ఇవి ఉద్యోగులకు సంభవించిన విపరీత స్థితిని సూచించును. ఈ స్థితిని వర్ణించుటకుగాను **Bureaucracy** అను పదమును వాడుట మొదలిడిరి. ఇది అధికారవర్గము అను పదమునకుగల అశ్లీలార్థము. దీనిని బట్టి ఆ వర్గము విపరీత మనస్తత్వముతో వర్తించు ఉద్యోగుల ముఠాయని గ్రహింపవచ్చును. నేటి రాజ్యములలోని ఉద్యోగి బృందమును సివిలు సర్వీసు (Civil Service) అందురు. దీనికి పైదుర్గుణములు ఏర్పడినచో ఇది అక్రమమైన స్థితికి దిగిన అధికారవర్గము (Bureaucracy) గ భావింపబడును.

**పుట్టుపూర్వోత్తరములు :** అయితే అధికార వర్గము రాజ్యమునందేగాక, విస్తారమైన ఆర్థిక, మత, సంఘము లందును (అనగా ఉత్పత్తి కేంద్రములు, వర్తకుల యొక్కయు, శ్రామికులయొక్కయు, సంఘములు, దేవాలయములు, మఠములు, మతపీఠములు మొదలగు వాటియందును) ఏర్పడియుండును. అయినను అది రాజ్యమునందు ఎక్కువగ ప్రబలినది. కావున రాజ్య పాలనమునందు అధికార వర్గమునకుగల పాత్రకు ఇచట ప్రాముఖ్యమీయబడినది.

సాధారణముగ అధికారవర్గపు ప్రభావము వివిధ రాజ్యములందు ప్రత్యక్షముగ కాక ప్రచ్ఛన్నముగ నుండును. అనగా ఆవర్గము రాజ్యాధినేతలయిన ప్రభువుల క్రిందగాని, ప్రజానాయకుల మరుగునగాని, దాగియుండును. యూరపు ఖండమందలి ఫ్రాన్సుదేశము దీనికి పుట్టినిల్లుగ పరిగణింపబడును. ఫ్రాన్సు, ప్రష్యాదేశములను 17, 18 శతాబ్దులలో పాలించిన నిరంకుశ ప్రభువులు తమ పాలనము సౌష్ఠవముగ సాగుటకై ప్రత్యేక అధికారులను నియమించిరి. వీరు అధికారవర్గముగ పరిణమించిరి. 19 వ శతాబ్దికి పూర్వము ఇంగ్లండునందు ఇది యెక్కువగ కానరాదు. తదుపరి అచటగూడ వ్యాపించినది. యూరపు రాజ్యములందు ప్రభుపాలనము అంతరించి ప్రజాపాలనము అవతరించిన తరువాతగూడ అధికారవర్గము స్థిరముగనే ఉన్నది. అది నేటికిని నిలిచియున్నది.

మనదేశములో నయితము వెనుకటికాలమునగూడ కొద్దిగనో గొప్పగనో ఇదియుండినట్లే తెలియును. బ్రిటిషువారు పాలించినకాలమున మనదేశమున ప్రచ్ఛన్నముగనే గాక చాలవరకు ప్రత్యక్షముగనే ఉద్యోగులు (ముఖ్యముగ I. C. S. ఉద్యోగులు) పరిపాలనమును సాగించిరి. అప్పటి అధికారవర్గము భారతజాతిని బంధించిన ఇనుపబోను (steel frame) అని వర్ణింపబడినది. అంతకుపూర్వము గూడ అధికారులు కొన్ని సమయములందు "అధికార రోగపూరితు"లై వర్తించుచున్నట్లు వెనుకటి వాఙ్మయమునందు నిదర్శనములుగలవు.

**అధికార వర్గమువలన ప్రయోజనములు :** అధికార వర్గము వివిధ దేశకాలములందున్నట్లు ఇదివరకు సూచింపబడినది. ఇపుడు దానివలన వెనుకచేకూరినట్టియు, నేడు నెరవేరుచున్నట్టియు ప్రయోజనములను గమనింతము. 17, 18 శతాబ్దులలో ఫ్రాన్సు మొదలగు యూరపు దేశములలో అధికారవర్గము ప్రభుపాలనమును పటిష్ఠమొనర్చి, ప్రజానీకమునకు శాంతిసౌభాగ్యములను చేకూర్చినది. ఆయా దేశములు క్రమముగ జాతీయైక్యమును, ఆర్థికాభివృద్ధిని పొందగలిగినవి. తరువాతి కాలమున పశ్చిమరాజ్యములందు ప్రబలిన ప్రజాప్రభుత్వపు (Democratic State) శ్రేయోరాజ్య (Welfare State) వ్యవస్థలందు గూడ అధికారవర్గము నిర్వహించినపాత్ర కొన్ని విధముల ప్రశంసాపాత్రమైనదే. ప్రజాశ్రేయస్సు కొరకై శాంతిభద్రతల నిచ్చుటయేగాక, అనేక రకములైన సౌకర్యములను ప్రభుత్వము ప్రజలకు సమకూర్పవలసి వచ్చినది. ఈ సౌకర్యములు వ్యవసాయము వాణి

జ్యము, విద్య, వైద్యము, వినోదము, నైతిక-ఆధ్యాత్మిక వికాసము మొదలగువాటికి సంబంధించినవి. ఈ కార్యములను అభివృద్ధి చేసి వీటిని సామాన్య ప్రజలకు గూడ అందచేసి వారి జీవితమును సౌఖ్యప్రదము చేయవలసి యున్నది. మనదేశమున అమలు జరుగుచున్న పంచవర్ష ప్రణాళికలు ఇందు కేర్పడినవే. ఇటువంటి పథకములను సూచించుటకును, వాటిని ప్రజాప్రతినిధులతో గూడి యున్న ప్రభుత్వము ఆమోదించిన తర్వాత అమలు జరుపుటకును సమర్థులగు ఉద్యోగులు సహాయ పడుదురు. ప్రభుత్వ కార్యాలయములందు పనిచేయు ఉద్యోగులతో పాటు, ఇంజనీర్లు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, ప్రచారకులు, మొదలగు నిపుణుల తోడ్పాటు లేనిదే ప్రజాహిత కార్యములు సరిగ నెరవేరవు. ఇది ఇతర దేశములందు వలెనే మనదేశమునందు గూడ ఇపుడు గుర్తింపబడు చున్నది. ఉద్యోగులందరు తమతమ శక్తిరక్తుల నన్నిటిని వినియోగించి ప్రభుత్వ పథకములు ప్రజాక్షేమమును పెంపొందించునట్లు పాటుబడుదురు. అందుకై తమకుగల ప్రత్యేకమైన పరిజ్ఞానమును, పాలనానుభవమును వినియోగింతురు. కార్యదీక్షను, కార్యదక్షతను ప్రదర్శింతురు. ప్రభుత్వమునకును, ప్రజానీకమునకును, మధ్యవర్తులుగ నుండి ఒకరి సహాయ సానుభూతులను మరొకరికి అందచేయుదురు.

అధికారవర్గమువలన నష్టములు : అధికారవర్గపు పరిస్థితి విపరీతమైనపుడు దానివలన కొన్ని నష్టములు ఏర్పడును. అందుగమనింపదగినవి ఈ క్రింద పేర్కొనబడినవి:

ఉద్యోగులు తమకు లభించిన ప్రత్యేకమైన అధికార శక్తులను పురస్కరించుకొని అహంభావముతో విర్రవీగుదురు. ప్రజలు మంచి, చెడ్డలు తెలియని మూఢులనియు, తమచే పాలింపబడుటకు మాత్రమే అర్హులనియు వారు భావింతురు. అందువలన సామాన్య జనులను సోదర పౌరులుగ గాక, తమ సేవకులవలెగాని, ఆశ్రితులవలెగాని చూతురు. ప్రజలయెడ ప్రేమనుగాని, దయాదాక్షిణ్యములను గాని కనబరచరు. అందువలన ప్రజల అభిమానమును పొందనేరరు. ఇట్లు ప్రజలకును, అధికారులకును మధ్య నుండదగిన సానుభూతి సహకారములకు బదులుగ వైమనస్యము, వైరుధ్యము ప్రబలును. ఇది ప్రజా ప్రభుత్వమునకు గొడ్డలిపెట్టు. ప్రభువుల నిరంకుశత్వము పోయిన తర్వాత వెలసిన అధికారవర్గ విజృంభణమును ఇంగ్లండు దేశమున "నూతన నిరంకుశత్వ" మనిరి. సామాన్య ప్రజయెడ కనబరచు అలక్ష్యభావము క్రముగ తమకు పైనుండి పరిపాలనా చక్రమును త్రిప్పు ప్రజాప్రతినిధులపట్ల గూడ అధికారులు చూపుట కద్దు. చివరకు ఆవర్గములోని పైతరగతులవారు క్రిందితరగతుల వారినిగూడ పీడింప వెనుకాడరు. ఇట్టి విపరీతస్థితిలో మానవత్వము నశించి, మాత్స్యన్యాయము ప్రబలును.

పరిపాలనానుభవమును సంపాదించుకొనిన ఉద్యోగులకు స్వాతిశయముతోపాటు స్వార్థపరత్వముగూడ ఏర్పడును. పరిపాలనములో ప్రజాక్షేమముకన్న తమ వర్గముయొక్క లాభమునకు ఎక్కువప్రాధాన్యమును ఒసగజూతురు. తమపదవులను, అధికారములను, ఆదాయములను నిలువబెట్టుకొనుటకును, వృద్ధిచేసికొనుటకును, అవినీతి మార్గములనుగూడ అవలంబింప యత్నింతురు. లంచగొండితనము, సమ్మె సన్నాహములు ఇందుకు సంబంధించినవి.

సంకుచితదృష్టి వీరి దుర్గుణములలో మరొకటి. ప్రభుత్వ కార్యకలాపములను నెరవేర్చుటలో తమకుతోచినట్లేగాని ఇతరులు సూచించినట్లు వర్తించుట వీరికి గిట్టదు. నిష్ప్రయోజనకరముగ కనబడినను ప్రాతపద్ధతులనే అవలంబింతురుగాని, క్రొత్తపద్ధతులను అనుసరింప యత్నింపరు. ఇందువలన వీరియందు సృజనాత్మకశక్తి సన్నగిల్లును.

దేశకాల పాత్రముల కనువుగ మారుట వీరికిమించిన పని. సామాన్య పరిస్థితులందు సరిగ పనిచేయగలరుగాని అసాధారణ పరిస్థితులందు (అనగా యుద్ధములు, కరవులు, కాటకములు చెలరేగినపుడు) ఈ అధికారులు అసమర్థులగుదురు.

సామాన్య సమయములందు సైతము వీరు కార్యాచరణ సందర్భమునచేయు కాలయాపన సహింపరానిది. ఒకరోజులో పూర్తిచేయదగు పనికి పదిరోజులు తీసికొనుట వీరి అలవాటు. ఇందుమూలముగ కాగితములమీద జరుగు క్రియాకలాపములు పెరుగును. కావుననే ఉద్యోగుల కార్యాచరణ విధానమును దస్త్రాల పెరుగుదల యనియు, ఆశాపాశమువలె అంతులేకుండా పెరుగు

ఎఱ్ఱదారపు విధాన (Red Tapism) మనియు, హేళన చేయుదురు.

మొత్తముమీద ఇటువంటి పద్ధతులవలన కాలయాపన, వ్యయప్రయాసలు, అసంతృప్తి, అలజడి పెరుగును.

కర్తవ్యము : అధికారవర్గము వలన కొన్ని ప్రయోజనములును, కొన్ని అనర్థములును కలవని తెలిసికొంటిమి. అయితే ఆ వర్గము విషయమున అవలంబింపదగు విధాన మేది ? అనర్థములను జూచి అంతమొందించనిచో శ్రేయోరాజ్యస్థాపనము సులభము గాదు. ప్రయోజనములను గాంచి దానిని విచ్చలవిడిగ వదలినచో ప్రజాస్వామ్యము సన్నగిల్లును. కావున దానిని అదుపునందుంచదగును గాని అంతమొందింపరాదు; సంస్కరింపదగును గాని సంహరింపదగదు. అపుడు దానివలన ప్రయోజనములను పొంది, ప్రమాదములనుండి తప్పించుకొనవచ్చును.

సంస్కరించుటెట్లు ? ఉద్యోగులను నియమించునపుడు వారి సామర్థ్యము, శీలము, పరిగిణింపబడవలెను గాని, ఇతర విషయములు ( ఉదాహరణకు జాతి, మత, కుల భేదములు) పాటింపబడరాదు. న్యాయబుద్ధితో నియమింపవలెనుగాని ఆశ్రితపక్షపాతముగాని, బంధుపక్షపాతము గాని పనికిరాదు. నియమించు అధికారము రాజకీయ ముఠాలకుగాక చట్టబద్ధముగ వర్తించు "పబ్లిక్ సర్వీస్ కమిషన్ల" కు అప్పగింపబడవలెను. ఉద్యోగుల నియామకము మాత్రముగాక, వారి ప్రమోషన్లు, సెలవు సౌకర్యములు, క్రమశిక్షణము మొదలైనవి గూడ పై కమిషన్ల పర్యవేక్షణముక్రిందనుండవలెను. మొత్తముమీద ఉద్యోగులు అనుభవించు సౌకర్యములకును, వారుచేయు సేవకును, వీలయినంతవరకు సామ్యముండుట మంచిది. సంతృప్తికరముగ వ్యవహరించు అధికారులకు ఉచితమైనప్రోత్సాహమును, అవినీతిపరులకు తగినశిక్షను ఇచ్చుచుండవలెను.

అధికారులు, శాసనసభలు, మంత్రివర్గములు మొదలగు ప్రభుత్వాంగములందుండి పరిపాలనా-విధానములను నిర్ణయించు ప్రజాప్రతినిధుల యెడల తగిన వినయవిధేయతలతో వర్తించుట అవసరము. ప్రజాప్రతినిధులకు సరియగు సలహాలనిచ్చి, వారి నిర్ణయములను సక్రమముగ అమలుజరుప యత్నించవలెను.

సామాన్య ప్రజలపట్ల అధికారులు స్నేహ సానుభూతులతో మెలగుట ఆవశ్యకము. తాము ప్రజల సేవకులమని గుర్తింపవలెను. ప్రజలను పీడించువారుగ మారగూడదు. అధికారులు శక్తితోబాటు సౌజన్యమును గూడ ప్రదర్శించుట యుక్తము.

ప్రజానాయకులతోను, ప్రజలతోను, సన్నిహితమైనట్టియు సక్రమమైనట్టియు సంబంధము అధికారుల కుండుటకుగాను ముఖ్యముగ అవసరమైనది వికేంద్రీకృత పరిపాలనము (Decentralised administration). అనుభవజ్ఞులు తెలిపినట్లు, కేంద్రీకృతపాలనము (Centralised administration) అధికార వర్గ విజృంభణమునకు దోహదమిచ్చును; వికేంద్రీకృత పాలనము ఆ జాడ్యమునకు విరుగుడుగ పనిచేయును.

ఇంతేగాక నేటి పరిస్థితులలో అధికారులు కార్యాచరణమునందు మాత్రమేగాక కొంతవరకు శాసన నిర్మాణమునందును, న్యాయనిర్ణయము నందును గూడ పాల్గొనుట జరుగుచున్నది. ఇట్టిఐక్యమును సాధ్యమైనంతవరకు పరిమితము చేయుట ప్రజాస్వేచ్ఛకు శ్రేయస్కరము. ముఖ్యముగ కార్యనిర్వాహక వర్గమునకు చెందిన ఉద్యోగులు చేయు న్యాయనిర్ణయ కార్యములను సందర్భమునుబట్టి న్యాయస్థానములందలి న్యాయాధికారులు పరిశీలించుచుండుట క్షేమకరము.

అన్నిటికన్నను మిన్నయైనది మానసికమైన మార్పు. అనగా అధికారులందు సోదరమానవుల యెడ ప్రేమ, ప్రజాసేవయందనురక్తి, పరోపకారబుద్ధి, స్వార్థత్యాగము మొదలగు సద్గుణములు పెంపొందవలెను. అధికారులు తమ అధికారమును దుర్వినియోగము చేయక, సద్వినియోగము చేయుటకై దృఢ సంకల్పముగల్గి, యథాశక్తిగ పాటుపడవలెను. ఇట్టి ప్రయత్నమునందు ప్రజానాయకులును, ప్రజలును గూడ వారికి అనుకూల పరిస్థితిని కల్పించి తోడ్పడవలయును.

సారాంశము : అధికారవర్గ సమస్య రాజకీయ, సాంఘిక, నైతిక, రంగములకు సంబంధించినది. అధికారవర్గము తమ అగ్నివంటి శక్తిని అదుపునందుంచుకొనినచో, అది ప్రయోజనకరముగను, అదుపునందు లేకున్నచో, ప్రమాదకరముగను పరిణమించును. దానిని సక్రమముగ

నుపయోగించుకొని సత్ఫలితములను పొందుటకుగాను ప్రజాసముదాయమునకు తెలివితేటలు అవసరము. ఇక అధికారులు గూడ తమ మానవత్వమును, పౌరసత్వమును మరచిపోక, తమ వర్గము మొత్తము సంఘములో ఒక భాగము మాత్రమే యైయున్నదనియు, వర్గశ్రేయస్సు, సంఘశ్రేయస్సు మీద ఆధారపడి యున్నదనియు, రెంటికిని సంఘర్షము సంభవించినపుడు వర్గక్షేమమును సంఘక్షేమమునకై వినియోగింపవలెననియు, గ్రహించి వర్తింపవలెను. ఇందుకు అధికారులకు మనోనిగ్రహము, నైతికబలము ఆవశ్యకము. కాలక్రమమున వర్గరహిత సమాజము (classless society) ఏర్పడు పరిస్థితి వచ్చినపుడు, ఇతర వర్గములతోపాటు అధికార వర్గముకూడ దానియందు లీనము కాగలదు,

ఓ. న. మూ.

**అనంతపురముజిల్లా :** అనంతపురము జిల్లా ఆంధ్రప్రదేశములోని ఒక జిల్లా. ఈ జిల్లా ఉత్తరఅక్షాంశ రేఖ 13°-40' నుండి 15°-15' వరకును, తూర్పు తులా రేఖ 76°-50' నుండి 78°-30' వరకును విస్తరించి యున్నది. ఈ జిల్లా దీర్ఘచతురాకారమున (oblong) నుండును. నిడివి ప్రాంతము ఉత్తరము నుండి దక్షిణమునకు ప్రాకుచుండును. కల్యాణదుర్గము, మడకసిరా తాలూకాలమధ్య పడమటినుండి మైసూరురాష్ట్ర భాగముచొచ్చుకొనిఉండును. ఈ జిల్లాకుఉత్తరమున బళ్ళారి కర్నూలుజిల్లాలును, తూర్పునకడపజిల్లాయునుదక్షిణమున చిత్తూరు జిల్లాయును, మైసూరు రాష్ట్రమును పడమట మైసూరు రాష్ట్రమును, బళ్ళారి జిల్లాయును, ఎల్లలుగానున్నవి. మడకసిరాతాలూకాలోని కనజనహాళ్ళి, సరజమ్మనహాళ్ళి, కోటగారలహాళ్ళి అను గ్రామములును, హిందూపూరు తాల్యూకాలోని చంటికుంటపల్లి అనుగ్రామమును మైసూరు రాష్ట్రముతో 1950 లో చేర్చబడినవి.




ఈ జిల్లా అంకెలు ఈ క్రిందివిధముగా నున్నవి. జిల్లా మొత్తము : విస్తీర్ణము - 6706 చ. మై; గ్రామములు- 858; పురములు - 14; జనాభా 13,61,556; పురుషులు 7,01,242; స్త్రీలు 6,60,314; గ్రామవాసులు 11,39,998; పురవాసులు 2,21,558; జనసాంద్రత, 203.

ఈ జిల్లాలో తొమ్మిది తాలూకాలుగలవు. వివరములు ఈ క్రిందివిధముగా నున్నవి.

1. అనంతపురం తాలూకా : విస్తీర్ణము, 926 చ.మై. గ్రామములు, 114; పురములు, 9; జనాభా164703; పురుషులు 85459; స్త్రీలు 79244; గ్రామవాసులు 132751; పురవాసులు 31952.

2. గుత్తి తాలూకా: విస్తీర్ణము 896 చ. మై; గ్రామములు 137; పురములు 4; జనాభా 214851; పురుషులు. 109340; స్త్రీలు 105511; గ్రామవాసులు 144938; పురవాసులు 69913.

3. తాడిపత్రి తాలూకా : విస్తీర్ణము 641 చ.మై; గ్రామములు 98; పురములు 2; జనాభా 132794; పురుషులు 67,998; స్త్రీలు 64796; గ్రామవాసులు 105431; పురవాసులు 27363.

4. కల్యాణదుర్గము తాలూకా : విస్తీర్ణము 821 చ. మై. గ్రామములు 74; పురము 1; జనాభా 118394; పురుషులు 61381; స్త్రీలు 57013; గ్రామవాసులు 110231; పురవాసులు 8163.

5. ధర్మవరము తాలూకా : విస్తీర్ణము 786 చ. మై; గ్రామములు 65; పురము 1; జనాభా 114812; పురుషులు 59229; స్త్రీలు 55583; గ్రామవాసులు 100109; పురవామలు 14703.

6. పెనుగొండ తాలూకా : విస్తీర్ణము 682 చ. మై; గ్రామములు 99; పురములు 2; జనాభా 1228[illegible];

పురుషులు 63487; స్త్రీలు 59862; గ్రామవాసులు 105245; పురవాసులు 18104.

7. కదిరి తాలూకా: విస్తీర్ణము 1157 చ. మై; గ్రామములు, 140: పురము 1; జనాభా 219,112; పురుషులు, 113115; స్త్రీలు 105997; గ్రామవాసులు 198758; పురవాసులు 20354.

8. మడకసిర తాలూకా: విస్తీర్ణము 417 చ. మై; గ్రామములు 55; పురము 1; జనాభా 120209; పురుషులు 61766; స్త్రీలు 58448; గ్రామవాసులు 113641; పురవాసులు 6568.

9. హిందూపురము తాలూకా: విస్తీర్ణము 430 చ. మై; గ్రామములు 76; పురము 1; జనాభా 153332; పురుషులు 79467; స్త్రీలు 73865; గ్రామవాసులు 128894; పురవాసులు 24438;

భాషలు: మాట్లాడు ప్రజల సంఖ్య (1) తెలుగు, 10,73,739. (2) కన్నడము 1,82,660. (3) హిందూస్తాని 1,04,580. (4) లంబాడి 19,384. (5) తమిళము 11,004. (6) మరాఠి 7,282. (7) హిందీ 4,310. (8) తులుభాష 3,134. (9) ఎరుకలభాష 2,828. (10) మలయాళము 2071. (11) ఇతరభాషలు 564. మొత్తము 13,61,556.

ఈజిల్లాలో నైసర్గికముగా మూడువిభాగములున్నవని చెప్పవచ్చును. అవియేవనగా: 1. విస్తృతముగా నల్లరేగడిభూములుగల ఉత్తరమందలి గుత్తి, తాడిపత్రి తాలూకాలు. 2. మధ్యనున్న కల్యాణదుర్గము, ధర్మవరము, పెనుగొండ, కదిరి తాలూకాలు. ఇవి జలశూన్యములు. చెట్లులేని విశేష విస్తీర్ణముగల నిస్సారపు ఎట్టమిట్ట నేలలు. 3. మడకసిర, హిందుపురము తాలూకాలలోని ఎత్తైన సమప్రదేశము. ఇది మైసూరు పీఠభూమితో కలియుచు, జిల్లాలోని ఇతర తాలూకాల కంటె ఎక్కువ ఎత్తు కలిగియున్నది. జిల్లా పశ్చిమ భాగమందున్న గుత్తి, కల్యాణదుర్గము అను తాలూకాల భాగములు పశ్చిమదిశగా వాలియుండును. గుత్తి, తాడిపత్రి తాలూకాల ఉత్తర భాగములు దక్షిణముఖముగా వాలి పెన్నానదిలోనికి జారును. ఇక జిల్లాలో శేషించిన భాగము దక్షిణమునుండి ఉత్తరమునకు వంగుచుండును.

విశాలమైదానములు రాతిగుట్టల మూలకముగా గట్టులుగను, పంక్తులుగను, గుంపులుగను చీలియుండును.

పర్వతములు: ముచ్చుకోట గుట్టలు 35 మైళ్ళ నిడివి కలవి. కొన్నిచోట్ల 7 మైళ్ళవరకు వెడల్పుకలిగియున్నవి. ఇవి గుత్తిపట్టణపు ఉత్తరమునుండి తాడిపత్రి తాలూకా చివర దక్షిణపుమూలవరకు వ్యాపించియున్నవి. ఇవి తాడిపత్రి పడమటికొన నానుకొని, గుత్తి, అనంతపురము తాలూకాలలోని తూర్పు సరిహద్దులను అనుసరించిపోవు చుండును. వీటిని తాడిపత్రి తాలూకా నైరృతి మూలయందు చిత్రావతీ నది చీల్చును.

గుత్తితాలూకా పశ్చిమమునుండి ఇంకొక గుట్టలవరుస బయలుదేరును. ఇది గుత్తితాలూకా మధ్యనుండి 50 మైళ్ళవరకు దక్షిణముగా సాగి అనంతపురము, ధర్మవరము తాలూకాలలోనికి పోవును. ఈ గుట్టలవరుసను నాగసముద్రపు గుట్టలందురు. ఈ గుట్టలవరుసలో ఎన్నో విరుగుడులు కలవు. ఇది దక్షిణమునకు పోవుకొలది ఎత్తు పరిణామము తగ్గుచుండును.

మల్లప్పకొండ గుట్టలవరుస ధర్మవరములో ప్రారంభమయి మైసూరురాష్ట్రములోనికి పోవును. ఇది 3,088 అడుగుల ఎత్తుకలది.

మడకసిరా తాలూకాలో మడకసిరా గుట్టలు ఆ తాలూకాను దక్షిణ, ఉత్తర భాగములుగా విడదీయును.

దక్కను భూభాగమునకు విలక్షణమయిన విడి విడి గుట్టలు, శిలల గుంపులు కలవు. ఉదా: గుత్తిశైలము, కల్యాణదుర్గము చుట్టునున్న గుంపులును అనంతపురము తాలూకాలో సింగనమాలయు పేర్కొనదగినవి. తాడిపత్రి తాలూకా తూర్పుభాగమున కర్నూలుకు సంబంధించిన ఎఱ్ఱమల గుట్టల వరుసయొక్క నిమ్నభాగములు కలవు.

హిందూపురము, మడకసిరా అను తాలూకాలలో పుష్కలముగ తృణకాష్ఠ సమృద్ధికలదు. ఇక శేషించినజిల్లా భాగమంతయు ఊసరక్షేత్రము. కొన్ని తోపులలోను లోయలలోను వ్యవసాయము వెదజల్లబడి యుండును.

నదులు: ఈ జిల్లాలో పెన్నానది ముఖ్యమైనది. ఇది మైసూరురాష్ట్రములోని నందిదుర్గమునకు వాయవ్యమున చెన్నకేశవ గుట్టలలో ప్రభవించి, హిందూపురము దక్షిణ

భాగాంతమున ఈ జిల్లాలో ప్రవేశించి, హిందూపురము, పెనుగొండ, ధర్మవరము అను తావుల పడమటి భాగముల ననుసరించి ఉత్తరముగా ప్రవహించును. తరువాత ఇది అనంతపురము తాలూకా పడమటి సరిహద్దున ప్రవహించుచు, తూర్పునకు మరలి, గుత్తి, అనంతపురముల మధ్య నుండి త్రోవచేసికొని, తాడిపత్రి తాలూకాగుండ పోవును. తరువాత ఇది కడప, నెల్లూరు జిల్లాలగుండ పోయి చివరకు బంగాళాఖాతములో పడును. హిందూపురము తాలూకాలోని ఊటుకూరు దగ్గర ఉపనదియగు జయమంగళి దీనితో కలియును.

ఈ జిల్లాలో పేర్కొనదగిన మరొక నది చిత్రావతి. పెన్నానదివలెనే ఇది మైసూరురాష్ట్రములోని నంది దుర్గమునకు ఉత్తరమున నున్న హరిహరేశ్వర గుట్టలో జనించును. ఇది హిందూపురము తాలూకా తూర్పు ప్రాంతమున అనంతపురము జిల్లాలో ప్రవేశించును. హిందూపురము తాలూకాగుండ ఉత్తరముగా ప్రవహించి, ఇది పెనుకొండ తాలూకాలోని బుక్కపట్టణము చెరువులో పడును. అచ్చటినుండి మిగులు పరీవాహముగా (Surplus) బయలుదేరి ధర్మవరము తాలూకాగుండ ఉత్తరముగా ప్రవహించి, ధర్మవరము చెరువులో పడును. తిరిగి మిగులు పరివాహముగా అచ్చటినుండి బయలుదేరును. తరువాత అది ధర్మవరము తాలూకాగుండ తాడిపత్రి తాలూకాదక్షిణపుమూలగుండ ఈశాన్యముగాపోయి ఈ జిల్లానువదిలి కడప జిల్లాలో పెన్నానదిలో కలియును.

హిందూపురము తాలూకాలోని కుశావతి యను నది చిత్రావతీనదికి ఉపనదియై యున్నది.

నాగసముద్రము గుట్టలలో దక్షిణ దిశాంత భాగమున తడకలేరు జనించి, అనంతపురము జిల్లాలోని సింగనమాల చెరువులోనికి ప్రవహించి, తరువాత పెన్నానదితో సంగమించును.

పండమేరు నది అనంతపురము చెరువునకు నీటివసతిని కల్పించును. అచటినుండి మిగులునీరుగా బయలుదేరి తడకలేరుతో కలియును.

స్వర్ణముఖి నది మడకసిరా తాలూకాలోనిది. ఇది మైసూరురాష్ట్రములోని హగరినదిలో కలియును.

మద్దిలేరునది కదిరితాలూకాలో ఉత్తరముగా ప్రవహించుచు చిత్రావతితో కలియును.

పాపఘ్నినది కదిరితాలూకాలోని మరియొక నది.

**అడవులు :** ఈ జిల్లాలో 698.84 చదరపుమైళ్ళ అరణ్యప్రాంతము కలదు. పెనుకొండ తాలూకాలోని రక్షితారణ్యమున వంటచెరకు, వెదురు మున్నగువాటి ఫలసాయము లభించును. కదిరితాలూకాలోని రక్షితారణ్యములో ముండ్లచెట్లజాతులు కలవు. హిందూపురము తాలూకాలోని రక్షితారణ్యసంపద ఇతర తాలూకాలోని సంపదకంటె మెరుగయినట్టిది.

**శీతోష్ణము - వర్షపాతము :** మార్చి, ఏప్రియల్ మే నెలలు అత్యుష్ణముగా నుండును. నైరృతి మేఘవాయువులు (monsoon) వీచుట సాగగానే జూన్ నుండి డిసెంబరువరకు ఉష్ణోగ్రత (Temperature) క్రమముగా పడిపోవును. ఎండకాలమునందలి మూడునెలలు అసౌఖ్యకరమైనట్టివి. నవంబరునుండి జనవరివరకు రాత్రులు ప్రభాత సమయములు మోదావహముగలు నుండును. ఈ జిల్లా మిక్కిలిగ పొడిప్రాంతమయి ఉన్నది.

ఆంధ్రరాష్ట్రములో అత్యల్ప వర్షపాతముగల జిల్లాలలో నొకటిగా ఈ జిల్లాయున్నది. ఈ జిల్లాలో సగటున వర్షపాతము 20.12 అంగుళములు.

తాలూకాలలోని ఉష్ణోగ్రతయందు ఎక్కువ భేదము లేదు. కాని మడకసిరా, హిందూపురము పెనుగొండ తాలూకాలు మిగుల ఎత్తైన ప్రాంతములగుటచే అవి కొంతవరకు చల్లనివాతావరణమును కలిగియుండును.

**నేలలు :** నల్లరేగడి, నల్లగరప (black loam), నల్లయిసుక, ఎఱ్ఱమట్టి, ఎఱ్ఱగరప (Red loam), ఎఱ్ఱయిసుక భూములు కలవు. నల్లరేగడి ఎక్కువ పంటపండుటలో శ్రేష్ఠమైనది. ఎఱ్ఱయిసుకభూమి అన్నింటికన్న చెడ్డది.

**నీటిపారుదల :** తాడిపత్రి తాలూకాలోని ఎల్లనూరు చెరువుతప్ప ఈ జిల్లాలో చెప్పుకొనతగిన నీటివనరులు లేవు. ఈ జిల్లాలోని నదులు మంచివానలు పడినప్పుడు మాత్రమే నీటిప్రవాహములు కలిగియుండి సంవత్సరమునం దధిక కాలము ఎండిపోవును. నదులకు ఆనకట్టలు సరిగా కట్టబడలేదు. తాత్కాలికోపయోగమునకై ఇసుక కట్టలు వాటి కడ్డముగ వేయుదురు. అడవివాగులందు, చెరువు

గర్భమునందు, గుట్టల పార్శ్వపు లోయలందు, ఊట కాలువలు త్రవ్వుదురు. ఇట్లు ఏ కొలది భాగమో వ్యవసాయము చేయుదురు. కొన్ని చిన్నచెరువులుకలవు. కాని పంటలు పండువరకు ఈ చెరువులను నింపవలసియుండును. ఈ చెరువులు కదిరి తాలూకాలో అనేకము లున్నవి. ఈజిల్లాలో కొన్ని నదీప్రవాహపూరితముగల తటాకములు గలవు. అనంతపూరు తాలూకాలోని సింగనమాల చెరువునకు తడకలేరు ఆధారము. పెనుగొండ తాలూకాలోని బుక్కపట్టణ చెరువునకును, ధర్మవరము తాలూకాలోని ధర్మవరము చెరువునకును చిత్రావతీనది ఆధారము. పెక్కుచెరువులు పూడికపడిపోవుచుండును. బావులున్నవి గాని అవి వట్టి పోవుచుండును.

నీటిపారుదల సౌకర్యములంతగా లేనందునను, రెండు మాన్సూనులకొనలు తాకెడు భౌగోళిక పరిస్థితిరూపమయిన దురదృష్టమువల్లను, నేలయొక్క నిస్సారపు గుణము జిల్లాయందర్ధభాగమును మించియుండుటచేతను. జిల్లాయంతయు క్షామపరిస్థితులకు గురియగుచుండును. ఎగువపెన్నా ప్రాజక్టు, కుముదవతి ప్రాజక్టు, భైరవాని తిప్ప ప్రాజక్టు నిర్మాణములు ప్రభుత్వమువారు చేపట్టినందున నీటిపారుదల సౌకర్యములు కొంతవరకు బాగుపడవచ్చును.

ఈ జిల్లాలో 2478 చిన్నరకపు నీటి వనరులుకలవు. వీటిక్రింద 91,258.27 య.ల ఆయకట్టు గలదు. 109 పెద్దరకపు నీటి వనరులుకలవు. వీటిక్రింద 52,687.76 య.ల ఆయకట్టుకలదు.

**పంటలు :** వరి, చోళం, కుంబు, కొఱ్ఱ - ఇవి ముఖ్యమయిన తిండిపంటలు. వరిగె, రాగి, సమై అనునవి స్వల్పముగా పండును. సెనగలు ఎక్కువగా సాగుచేయబడును. వేరుసెనగ, ప్రత్తి - ఈ రెండును ముఖ్యమయిన వ్యాపారపుపంటలు. మడకసిరా, హిందూపూరు తాలూకాలలో కొబ్బరితోటలు, పోకతోటలుకలవు.

**రహదారులు :** బళ్ళారి, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలను కలుపుచు ఈ జిల్లాలో రహదారిబాటలు కలవు. రోడ్ల నిడివి 1,860 మైళ్ళు. ఇందు 106 మైళ్ళు జాతీయ రహదారి మార్గములు. 251 మైళ్ళు రాష్ట్రీయ మార్గములు, 548 మైళ్ళు జిల్లా పెద్ద బాటలు, 124 మైళ్ళు ఇతర జిల్లారోడ్లు, 275 మైళ్ళు గ్రామమార్గములు. 61 మైళ్ళు మ్యునిసిపల్ మార్గములు. ఈ రాజమార్గములలో పెక్కుమార్గములు కరవుకాలమందు ప్రజాపోషణార్థము నిర్మితమయినట్టివి.

**రైలు :** ఈ జిల్లాలో 61 మైళ్ల పెద్దలైను రైలు మార్గముకలదు, 191½ మైళ్ల చిన్నలైను మార్గము కలదు. కల్యాణదుర్గము తాలూకాలోను, మడకసిరా తాలూకాలోను రైలుమార్గములు లేవు.

**తపాలా :** ఈ జిల్లాలో 14 తంతి తపాలా ఆఫీసులు కలవు. 5 సబ్‌పోస్టు ఆఫీసులు కలవు. 207 బ్రాంచి పోస్టాఫీసు లున్నవి.

**వైద్యము :** ఈ జిల్లాలో 8 పెద్దఆసుపత్రులు, 11 చిన్న ఆసుపత్రులు కలవు. అనంతపురములోని ఆసుపత్రి అన్నిటికంటె పెద్దది. ఇచ్చట 100 మంచాలు కలవు. ఈ ఆసుపత్రిలో "ఎక్సురే" యంత్రము గలదు. కుష్ఠురోగ చికిత్సకు ఏర్పాటుచేయబడినది.

పానీయజలమునకు బావులే ముఖ్యాధారములు. అచ్చటచ్చట చెరువునీరు త్రాగుచుండుటకలదు. అనంతపురములో పరిశుద్ధముచేయబడిన జలము లభించును. 678 మంచినీటి బావులను ప్రభుత్వమువారు త్రవ్వించినారు.

**జాతరలు :** ఈ జిల్లాలో 37 యాత్రా స్థలములు, 11 పశువులసంతలు కలవు.

**విద్య :** ఈ జిల్లాలో 892 సంస్థలు విద్యాగరపువవి కలవు. వీటియందు 58,750 మంది బాలురు, 22,208 మంది బాలికలు విద్యనేర్చుచున్నారు. విద్యాసంస్థలలో కళాశాల 1; వృత్తికళాశాల(ఇంజనీరింగు) 1; బాలుర హైస్కూళ్ళు 19; బాలికల హైస్కూలు 1; ఆంగ్లో - ఇండియన్ స్కూళ్ళు 2; శిక్షణ పాఠశాలలు 3; బాలుర మిడిల్‌స్కూళ్ళు 3; బాలికలమిడిల్‌స్కూళ్ళు 2; ఎలిమెంటరీ స్కూళ్లు 834; బేసికు స్కూళ్లు 2; వయోజన పాఠశాలలు 24 కలవు. కళాశాలలో 56 గురు బాలికలును, హైస్కూలులో 896 గురు బాలికలును విద్యనభ్యసించుచున్నారు.

**కుటీర పరిశ్రమలు :** నూలు నేత, నూలుఅద్దకము, ఉన్ని వడకుట, నేయుట, పట్టునేత, చాపలల్లుట, నూనెగాను

గలు, బీడీలు కట్టుట, తోళ్ళు పదునుచేయుట, చెప్పులు, బూట్లు కుట్టుట, కుండలుచేయుట, తట్టలల్లుట, పాడిచేయుట బెల్లము వండుట - ఇవి ఈ జిల్లాలోని కుటీర పరిశ్రమలు.

కళ్యాణదుర్గము, ధర్మవరము, పెనుగొండ, మడక సిరాతాలూకాలలో భారిపరిశ్రమలులేవు. ఇతరతాలూకా లలో 52 ఫ్యాక్టరీలు కలవు.

మతము : హిందువులు 12,01,226. ముస్లిములు 1,46,068, క్రైస్తవులు 13,499, ఇతరులు 763. మొత్తము 13,61,556 మంది.

విశేషాంశములు : గుత్తిలోని కొండమీద గొప్ప కోటగలదు. దీనిని మరాఠాసర్దారు మురారిరావు కట్టించి నాడు. ఇదియును, మరొకటి కట్టించిన ధర్మశాలయు, చరిత్ర ప్రాముఖ్యముకలవి. పెనుగొండలో విజయనగర రాజన్యులు కట్టించిన దుర్గముకలదు. బాబయ్య అను మునల్మాను సాధువుయొక్క కోటయుండుటచే పెను గొండ దక్షిణాపథమునందలి ముస్లిములకు యాత్రాస్థల ముగా తనరారుచున్నది. హిందూపురములోని లేపాక్షి దేవాలయము శిల్పచాతుర్యముగల స్థానము. కళా ప్రియులకు ఇచ్చటి రాతినంది విగ్రహము ఆకర్షణీయ ముగా నుండును.

కదిరిలోని నృసింహస్వామి కోవెలలోనికి రథోత్సవము ముగిసిన తరువాత హరిజనులకు ప్రవేశమిచ్చుట సనాత నాచారముగా వచ్చుచున్నది. కదిరి తాలూకా కటారు పల్లిలో వేమనకవి సమాధి మందిరము కలదు.

అనంతపురము, గుంతకల్లు, హిందూపురము, తాడి పత్రి ఇవి మునిసిపాలిటీ గల పురములు. ధర్మవరము పట్టువస్త్రముల నిర్మాణకేంద్రము. ధర్మవరపు చీరెలు ప్రసిద్ధిచెందినట్టివి. అప్పుడప్పుడు వజ్రములు దొరకెడు ప్రదేశముగా గుత్తితాలూకాలోని వజ్రకరూరు ప్రసిద్ధి కెక్కియున్నది.

**అనంతపుర పట్టణము :** ఇది అనంతపురము జిల్లాకు, డివిజనునకు, తాలూకాకు ప్రధాన కార్య స్థానము. విస్తీర్ణము 2.70 చ. మై. జనాభా, 31,952. ఇందు పురుషులు 17,025; స్త్రీలు 14,927. ఇండ్లు 3,776. చదువుకొన్నవారు: పురుషులు 10899; స్త్రీలు 351. శాస్త్రకళాశాలలు 2; ఇంజనీరింగు కళాశాల 1; హైస్కూళ్ళు 3; శిక్షణ విద్యాలయములు 2 కలవు. గవర్నమెంటు హెడ్‌క్వార్టర్సు ఆసుపత్రి 1; గవర్న మెంటు పోలీసు ఆసుపత్రి 1; ఇంజనీరింగు కాలేజీ డిస్పెన్సరి 1; మ్యునిసిపాలిటీ డిస్పెన్సరీ కలవు.

విజయనగర రాజయిన బుక్కరాయలకు (క్రీ.శ. 1348-1379) మంత్రియగు చిక్కప్ప ఒడయరు తన భార్య అయిన అనంతమ్మపేరిట అనంతపురమునుకట్టించెను. హండెవంశజు డైన హనుమప్పనాయడనువాని పరాక్రమమునకు అళియ రామరాజు (క్రీ.శ. 1542 - 1565) సంతసించి అతనికి అనంతపురమును, మరికొన్ని గ్రామములను, పదవులను ఇచ్చెను. ఇతని కుమారుడు మలకప్ప నాయడు గోలకొండ నవాబునకు సామంతుడయ్యెను. మలకప్ప నాయడు బుక్కసముద్రమున నివసించుచు, ఒకనాడు అనంత పురములోని ఎల్లారెడ్డిఇంటికి తాంబూలమునకుపోయెను. ఎల్లారెడ్డి సంతానసంపదను మలకప్పనాయడు చూచి, అచ్చటనివసించినచో తనకుకూడ సంతానము కలుగునని తలచి అతనినడిగి ఆస్థలముతీసికొని, అచటరాజమందిరము కట్టించి, అచ్చటనే నివసింపసాగెను. అప్పటినుండి ఆగ్రాన మునకు 'హండే అనంతపుర' మన్న పేరువచ్చెను. మలకప్ప నాయని కుమారుడు హంపనాయడు (క్రీ.శ. 1619-1631) ఆతని కుమారుడు సిద్దప్పనాయడు (క్రీ. శ. 1631-1659), ఆతని కుమారుడు పవడప్ప (క్రీ.శ. 1659-1671) వరుసగా, రాజ్యముచేసిరి. తరువాత ఈ ప్రాంతము ఔరంగజేబునకు స్వాధీనమయ్యెను. పిదప నిది కడప నవాబుల పాలనము లోనికివచ్చెను. పిమ్మట దీనిని మరాఠావారు ఆక్రమించిరి. ఇంతవరకు మలకప్ప వంశజులే సామంతులుగా రాజ్యము చేయుచుండిరి. ఈ వంశము వారి నందరను టిప్పూ సుల్తాను చంపించెను. ఈ వంశములోని సిద్దప్పయనువాడు తప్పించుకొని పారిపోయి టిప్పుసుల్తాను మరణానంత రము అనంతపురమును తిరిగి స్వాధీనము చేసికొనెను (క్రీ.శ. 1799). తరువాత సిద్దప్ప నిజామునకు సామంతు డయ్యెను. పిదప నిది దత్తమండలములతోపాటు ఇంగ్లీషు వారి వలుబడిలోనికి వచ్చెను (క్రీ. శ. 1800).

ఆ. వి.

**అనపోతనాయడు :** అనపోతనాయడు వెలమ వంశజుడు. రేచర్ల గోత్రుడు. ఉపలబ్ధములగు శిలాశాస

నముల వలన వెన్నమనాయనితో ఈ వంశము ఆరంభ మగుచున్నది. వెన్నమనాయునకు దాచభూపతి పుత్రుడు. అతని కుమారుడు సింగభూపతి. ఈ సింగభూపతికి అనపోత నాయడును, మాధవనాయడును ఉదయించిరి మనకథా నాయకుడగు అనపోతనాయడు మహావీరుడు. అతడు రాచకొండ (నల్లగొండజిల్లా) రాజధానిగ జేసికొని తెలంగాణమును పాలించిన వీరచూడామణి. తమ్ముడగు మాధవనాయడు అన్న అడుగుజాడలలో నడిచి సంగర రంగములలో అతనికి బాసటగా నుండి విజయముల గడించిన శూరవర్యుడు.

వెన్నమనాయడు రాణియగు రుద్రమదేవి కాలమున ననేక సమరములలో విజయము గడించెను. దాచ భూపతియుసింగమనాయడునుప్రతాపరుద్రమహారాజుకడ సేనానాయకులు. దాచభూపతి కాంచీపురము భేదించి పంచ పాండ్యులను జయించి స్వర్ణమయ సింహాసనమును పెద్దపచ్చనువిజయచిహ్నములనుగా దెచ్చి ప్రతాపరుద్రున కర్పించెను. మరల పాండ్యులు తలయెత్తగా సింగమ నాయడు వారలపైకి ప్రతాపరుద్రదేవుని అనతిపై బోయి పాండ్యరాజ్యలక్ష్మిని రాజునకు కైవసము చేసెనని అయినవోలు శాసనమున చెప్పబడియున్నది.

సింగమనాయడు కాకతీయరాజ్య పతనానంతరము తెలంగాణములో ప్రసిద్ధివహించి రాచకొండదుర్గమును రాజధానిగజేసికొని వలుకుబడి గడించెను. ఇతని తమ్ముడు నాగానాయడు. రాచకొండలో ప్రధాన దుర్గమునకు చేరువలో నొక దుర్గము కట్టించి, రాజధానిని మిగుల విస్తృతముగా చేసెను. కాకతీయరాజ్యాంతమున సింగమ నాయడు చిన్న చిన్న దుర్గములు జయించి రాజ్యము స్థాపించు ప్రయత్నము చేయుచు జల్లిపల్లికి పోయి ముట్ట డించెను. గెలుపుసాధ్యముగాదని లోపలనున్న రాచవారు భావించి చుట్టుపట్టులనున్న రాజులను కూడగట్టుకుని కుట్రబన్ని సింగమనాయని బావమరదియగు చింతలపాటి సింగమనాయని చెరలోనుంచిరి. తమ్మళ బ్రహ్మోజీ అను మోసగాడు రాచవారి పక్షమున రాయబారిగ వచ్చి సింగమనాయనితో "మీరు ముట్టడిమానిన మేము మీ బావమరదిని విడిపింతు"మని సంధివిషయములు మాట లాడుచు ఏమరుపాటుననుండగా, సింగమనాయని ఆయువు పట్టున కత్తితో పొడిచి పారిపోయెను. తన కుమారులగు అనపోతనాయని, మాధవనాయని పిలిచి సింగమనాయడు తన్ను చంపప్రోత్సహించిన రాచవారిని చంపి వారి రక్తముతో తర్పణము లొసగుడని చెప్పి ఈ కార్యము నెరవేర్తుమని ఒట్టు పెట్టించుకొని మరణించెను. ప్రత్యర్థు లగు రాచవారు ప్రాణభీతితో పారిపోయి, ములంగూరు దుర్గమున డాగియుండి, తోడి దుర్గాధిపతులను గూడదీసి కొని చెంజర్లకడ విరోధులను మడియింప కాచియుండిరి. ఇది విని ప్రతిజ్ఞా నిర్వహణమునకై అనపోతనాయడు, మాధవనాయడు సైనికబృందముతో బయలుదేరి రాచ వారిని, వారికి సాయము వచ్చినవారిని తునిమి వారి రక్తముతో పితకు తర్పణము నొసగి "సోమకుల పరశు రామ" అను బిరుదము ధరించిరి. అనపోతనాయడు భువనగిరి, సింగపురము, రాచకొండ, ఓరుగల్లు దుర్గముల నాక్రమించి దిగ్విజయమునకు బయలువెడలి అయినవోలు లోని మైలారుదేవుని సందర్శించి శా. శ. 1291 (క్రీ. శ. 1369) సం॥ లో అయినవోలు సమర్పించి గొప్ప శిలాశాసనములు ప్రతిష్ఠించెను. అందుగల బిరుద ములు చూచిన అతడుమహావీరుడనితోచును. 'రాయబందీ విమోచక', ఇతర శాసనములలోని 'కాకతీయ రాజ్య స్థాపనాచార్య' అను బిరుదములు తండ్రియగు సింగమ నాయనివిగ తోచును. అవి కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నము నొందినపిదప రాజ్యమేలిన అనపోతనాయనివి కావు. వంశపరంపరగా రాజధానియగు రాచకొండలో దుర్గ పునరుద్ధారణము గావించి రాయసముద్రము, అనపోత సముద్రము, రామస్వామి దేవాలయము, వీరభద్రాలయము, రాజమందిరములు, బొడ్డుచౌకీ, కొలువుకూటపు బావి, సంకెళ్ళబావి నేటికి నిలిచి, అనపోత నాయని కీర్తిచిహ్నములుగ నున్నవి. నాగానాయని కొండపై గొప్ప దుర్గము గలదు. రాచకొండతో గలిపి నాగానాయని కొండకు గొప్ప ప్రాకారము కట్టి లోన మహోన్నతములగు నాలుగు ప్రాకారములను అం దిమిడ్చెను. మహైశ్వర్యము ననుభవించిన రాచకొండ దుర్గమునిండ అడవులు బలిసి ప్రవేశింప రాకుండుటచే అందలి విశేషములు చరిత్రమున కెక్కకుండుటలో వింత యేమియు లేదు.

అనపోతనాయడు కావ్య కథన ప్రియుడు. అతని కుమారుడు సింగభూపతి రచించినట్లున్న "రసార్ణవ సుధాకరమున" అనపోతనాయకీయ మను గ్రంథము ఉదాహరింపబడినది. అయినవోలు శాసన రచయిత పశుపతి పుత్రుడగు నాగనాథుడు. ఇతడు మదనవిలాస మను భాణమును సంస్కృతమునను, విష్ణుపురాణమును ఆంధ్రమునను రచించినట్లు వినికి. చమత్కారచంద్రికను రచించిన విశ్వేశ్వరకవి నాగనాథునికి గురువు. విశ్వేశ్వర కవి అనపోతనాయని ప్రశంసగల చమత్కారచంద్రికను సంస్కృతమున రచించెను. ఈ విధముగ అనపోతనాయ నికి వాఙ్మయముతో సంబంధము కలదు. మాధవనాయడు తన అన్నయగు అనపోతనాయనికి రాచకొండ విడిచిపెట్టి దేవరకొండ దుర్గమును రాజధానిగ జేసికొనెను. మాధవ నాయడు శ్రీశైలోత్తర ద్వారమగు ఉమామహేశ్వరమున గొప్ప శివాలయమును కట్టించి శాసనమును నెలకొల్పెను. మాయిభట్టారకుడు ఈశని శాసనకవి. అనపోతనాయడు హేమాద్రి పేర్కొన్న దానము లన్నియు గావించుటయే గాక శ్రీశైలము నెక్కుట కనుకూలముగ సోపానములు గట్టించెను. రాచకొండ హైద్రాబాదునకు తూర్పున 32 మైళ్ళ దూరమున నున్నది. పర్వతముల మధ్యభాగమున నున్న ఈ పట్టణము 15 మైళ్ళు చుట్టుకొలతగలది. నగర చిహ్నములు ఇప్పటికిని గోచరించును. ఈ వంశమున ఇద్దరు ముగ్గురు అనపోత నామధేయులు కలరు గాని అంత ప్రసిద్ధులు గారు.

బహమనీ రాజ్యము క్రీ. శ. 1347 లో నెలకొల్ప బడెను. పిదప మహమ్మద్‌షా రేచర్ల అనపోతనాయని ఏలుబడిలోనున్న ఓరుగల్లు గోలకొండ దుర్గములపై దండయాత్ర సాగించెను. ఓరుగల్లు వశముగాలేదు. గోల కొండ దుర్గమునుమాత్రము అనపోతనాయడు మహమ్మద్ షాహకు ఇచ్చి తన రాజ్యమున ప్రవేశింపకుండ కట్టడి చేసికొనెను. రాచకొండదుర్గమున గాలిబుసాహెబుగోరీ కలదు. ఇతడు రాచకొండను గెలువవచ్చినవాడందురు. ఇతడు క్రీ. శ. 1484 న ఉండెనని తెలియుచున్నది. వెలమవీరుల యేల్బడి అంతతో నశించెను. అక్క పోలమ్మ అను వీరకాంత విగ్రహమునుగూర్చి వింతకథ యొకటి చెప్పుదురు. రాచకొండ ఔద్ధయుగమునగూడ పేరొంది నది. కాకతి గణపతిదేవుని కాలమున విశ్వేశ్వరశంభువు గోళగిమఠమును నెలకొల్పెను. వెలమవీరులు అనపోత నాయనివరకు శైవులే.

అనపోతనాయడు దుర్గమున భైరవ విగ్రహముల నెక్కుడుగ నెలకొల్పెను. శివాలయములను ప్రతిష్ఠించెను. రమణీయమగు శిల్పముగల విగ్రహము లీ కోటలో నెక్కుడుగనున్నవి. ఇంత దృఢతరమగు దుర్గమేలుచున్న అనపోతనాయడు ఒకవైపు విద్యానగర రాజులతోడను, ఇంకొకవైపు కొండవీటి రెడ్లతోడను, మరియొకవైపు మహమూద్‌షాహ తోడను సంగ్రామములను కావించు చుండుటచేత రానురాను బలము సన్నగిల్లి తరువాత రాచకొండదుర్గము క్రీ. శ. 1484 లో అంతరించెను. తెలంగాణమునకు రాజధానికావలసిన రాచకొండ మహా రణ్యములలో లీనమయ్యెను. ఈదుర్గమును కాకతీయులు కట్టించి వెలమవీరుల సంరక్షణమున కుంచిరి. అనపోత నాయనితో దీనివైభవ మంతరించినది. తరువాత మూడు నాలుగు తరములలో ఈ వంశము క్షీణదశకు వచ్చినది.

ది. వి. ర.

**అనపోతారెడ్డి:**— (క్రీ. శ. 1350-1362) ప్రోలయ వేమారెడ్డి అనంతరము అతని జ్యేష్ఠ కుమారుడు పోతా రెడ్డి అద్దంకి సింహాసనమును అధిష్ఠించెను. "వీరాన్న పోతనృపతి" అను బిరుదమును వహించిన ఈతడు తన తండ్రికాలముననే యువరాజుగనుండి, రాజనీతియందు అసమానమైన ప్రావీణ్యముగల మహామంత్రులచేతను యుద్ధనీతి విశారదుడైన పినతండ్రి మల్లారెడ్డిచేతను సుశిక్షితుడై యుండెను.

పట్టాభిషిక్తుడగుటకు పూర్వమే సంపూర్ణ పరిపాలనా పాటవమును ఆర్జించిన ఈతడు తాను ప్రభువై "పటుః పాలన కర్మణి" అను బిరుదము సార్థకమగునట్లు ప్రభుత్వ మును నెరపెను. సప్తవిధ రాజ్యాంగములలో అతిముఖ్య మయిన దుర్గరచనా ప్రాముఖ్యము నెరిగిన ఈతని నీతి కౌశలమునకు పితృక్రమాగతమయిన అద్దంకి అను రాజ ధానిని కొండవీటికి మార్చుటయే ప్రబల నిదర్శనము. ఉత్సాహవంతుడై కృష్ణా గోదావరీ నదీద్వయ మధ్యస్థ మయిన దేశమును జయించుటకు ఉవ్విళ్ళూరుచున్న అన పోతారెడ్డికి శత్రుదుర్భేద్యమగు దుర్గమొకటి ఆవశ్యకమై

యుండెను. కాని అద్దంకి చిన్న నగరమగుట చేతను, అందు బలమైన దుర్గములు లేకుండుటచేతను, తూర్పు పడమరలందు సంగమ వంశీయులు, కాపయనాయకాదులు బలవంతులై యుండుట చేతను, అనపోతారెడ్డి కొండవీటి దుర్గమును యంత్రసనాథముగ జేసి, సౌందర్యయుతమును, నివాసయోగ్యమును అగు నొక నగర నిర్మాణముగావించి తన రాజధానిని అచ్చటకు మార్చెను. తాను సింహాసనారూఢుడైన మూడు నాలుగు సంవత్సరములలోనే అనపోతారెడ్డి బహుళ సైన్యములను కూర్చుకొని కృష్ణను దాటి విజయయాత్రకై బయలుదేరెను. రాజ్యధురంధరుడైన అనపోతారెడ్డికి తన బంధువుల సహాయ సహకారములు అధికముగ లభించెను. దండయాత్రా సందర్భములందు ఇతనికి తనతోబుట్టువుల భర్తలును, సేనాపతులును అయిన నల్ల నూకయరెడ్డియు, విధేయుడును, ప్రచండ సేనానియునగు అనవేమారెడ్డియు మిక్కిలి తోడ్పడిరి.

క్రీ. శ. 1355వ సంవత్సరమునాటి ద్రాక్షారామ శాసనమొకటి ఇతని విజయములను ప్రశంసించుచున్నది. అందు ఇతడు 'ద్వీపజేత' గా పేర్కొనబడెను. వైరివీరమద భంజనుడను ప్రశస్తిని గడించిన ఇతనిరాజ్యము సర్వదా శత్రుకంటకమై, సాటివీరులకు కబళింపవలయునను కుతూహలమునుగలిగించుటచేత, దక్షిణమునుండి కర్ణాటకులును పశ్చిమమునుండి పద్మనాయకులును ఈ రాజ్యము నాక్రమింపవలయునని ప్రబల ప్రయత్నములు సలుపుచుండిరి. ఈ రేచర్ల పద్మనాయకులు కాపయనాయకుని సామంతులు. వీరి నాయకరములు, ఆధిపత్యములు తెలంగాణాలోని కైలాసకోట, ఇందూరు, మెదకు ప్రాంతముల యందుండెను. ఈ రేచర్ల నాయకులగు అనపోతా నాయకునితోను, మాదానాయకునితోను అనపోతారెడ్డికి పోరు సంప్రాప్తమైనప్పుడు అనపోతారెడ్డియొక్క గజ, హయ, రథాది సాధనములన్నియు హతముకాగా, అతడు ప్రాణ రక్షణమునకై పారిపోయెనని వెలుగోటివారి వంశావళి పేర్కొనుచున్నది. కాని తదితరాధారములవల్ల ధాన్యవాటీ పురముయొక్క ముట్టిడి సందర్భములో అనపోతారెడ్డి ప్రచండ విక్రమార్కుడై భూరిసైన్యములతో వారల నెదుర్కొని ఘోర సంగ్రామమును సలిపి శత్రువులను కృష్ణానది కావలిప్రక్కకు తరిమి పరాభవించెనని తెలియుచున్నది. ఈ సందర్భమునందు విజేత లెవ్వరైనను, రేచర్ల పద్మనాయకులకు మాత్రము ఆ రాజ్యము లభింపలేదనుట నిశ్చయము.

క్రీ. శ. 1358 వ సం. నాటికే అనపోతారెడ్డి దివిసీమను, గుడివాడ విషయమును, ప్రస్తుతపు బందరు తాలూకా ప్రదేశములను ఆక్రమించుకొని పాలించుచుండె ననుటకు నిదర్శనములు గలవు. శాలివాహన శకము 1280 వ సంవత్సరమున అనపోతారెడ్డి 'కొల్హారు' గ్రామమును "అనపోతాపురము" అను పేరుతో బ్రాహ్మణులకు సర్వాగ్రహారముగ దానమొసగెను. ఈ విధముగ కృష్ణా గోదావరీ మధ్యస్థ దేశమును జయించుటకు సైన్యముల నడిపిన వీరాన్న పోతన్నపతికి కొన్ని దేశములు స్వాధీనపడియు, కొన్ని కొంతవరకే చేజిక్కియు, కొన్ని అధికతర నిరోధమును కల్పించియు చేజిక్కినవి. అట్లు స్వాధీనపడిన దేశాధిపతులలో భక్తిరాజులు, పరవచోడులు, కోనహైహయులు, మానవ్యస గోత్రకులగు చాళుక్యులు, ఉండీశులు ముఖ్యులు. కొన్ని శాసనములలో అనపోతారెడ్డి "కృష్ణాతటమునుండి గౌతమీ తీరమువరకును రాజ్యమును పాలించినటుల" కానవచ్చుచున్నది.

శ్లో॥ జిత్వా శ్రీ అనపోతభూతలపతి ర్వీరా నరాతీన్ బలా
దాకృష్ణాతటినీతటా ద్ధ్రువ మవ త్యాగౌతమీస్రోతసః।
ఆవింధ్యా దితి యత్ర పీంద్రవచనం తస్యావదానస్తుతౌ।
ప్రత్యబ్దం ప్రతిపక్షదేశజయినస్త త్పూర్వపక్షాయతే॥

చారిత్రకాధారములవల్ల పై విషయము నిరూపితము కాకపోయినను అనపోతారెడ్డి ప్రత్యబ్దము ప్రతిపక్షదేశమును జయించుటకు దాడిసల్పుచుండుట మాత్రము నిశ్చయముగ కానవచ్చును.

అనపోతారెడ్డి కాలములో జరిగిన గొప్ప విషయమొకటికలదు. అది మోటుపల్లిరేవు సంస్కరణము. అది అతని పరిపాలనా కౌశలమును చాటును. అతని శాసనములలో "ముకుళాహ్వాయ" పురమనియు, ముకుళపురమనియు; కాకతీయుల కాలములో వేలానగరమనియు, "ధేనూస్సాయకొండ" పట్టణమనియు పిలువబడి మార్కోపోలోచే 'మొటఫిలి' అని ప్రశంసింపబడిన రేవు పట్టణమే ఈ మోటుపల్లి. ఇది పురాతనకాలమునుండియు

వర్తకస్థానమై మీదుమిక్కిలి నౌకావ్యాపారమునకు ప్రధానస్థానముగ నుండి, మహాప్రసిద్ధి కెక్కిన రేవుపట్టణము. వివిధ ద్వీపాంతములనుండి వ్యాపారము ఈ రేవు ద్వారమున జరుగుచుండెను. కాని కాకతీయ సామ్రాజ్యము తరువాత అస్తమించిన మోటుపల్లినుండి వర్తకులు పరస్థలముల కేగుటయు, వ్యాపారము తగ్గుటయు తటస్థించెను. ఈ రేవుపట్టణమును వృద్ధికితీసుకొనిరావలయునని సంకల్పించిన అనపోతారెడ్డి మోటుపల్లి రేవునకు విజయముచేసి యాత్రికుల (ఓడవర్తకుల) బాధలు విచారించి ధర్మశాసన స్తంభ మొకదానిని నెత్తించెను. ఇతని ఆజ్ఞప్రకార మితని మంత్రులలో నొకడగు సోమయామాత్యుడు వర్తకులందరికిని అభయప్రదానము గావించెను. ముకుళపురమునకు ఏ వర్తకులు వచ్చి నివసింపగోరినను, వారిని గౌరవించి, వారలకు భూములను, నివేశన స్థలములను ఇప్పింతుమనియు, పన్నులకై వారి సరకులను సంగ్రహింపమనియు, వారు మరియొక స్థలమునకు పోదలచుకొన్నపుడు, వారిని నిర్బంధపెట్టి నిలుపక స్వేచ్ఛగా పోవిడుతుమనియు శాసనము వ్రాయించి ప్రకటించెను. కొన్ని వస్తువులపై సుంకముల తీసివేసియు, మరికొన్నిటిపై సుంకములను కొంతవరకు తగ్గించియు మరికొన్నిటిపై పూర్వపు మర్యాదలను పాటించియు, బంగారునకు సుంకము తీసివేసియు వర్తకులకు అతడు ప్రోత్సాహము నిచ్చెను.

తురుష్కాక్రాంతమై, విప్లవ యుతమైన ఆంధ్రదేశమునందు నశించిన కర్షకకృషిని, పతనమొందిన వణిజుల వాణిజ్యమును ఈ విధముగ పునరుజ్జీవింప జేయుటచేత అనపోతారెడ్డి పరిపాలనము సర్వజన రంజకమై శ్లాఘాపాత్రమైనది.

తండ్రివలె ధర్మమార్గానుయాయియైన అనపోతారెడ్డి "రాజ్యం ప్రాజ్యం సుహృద్భాజ్యం యఃకురుతేఽర్థినాం" అని శాసనములందు ఉల్లేఖింపబడినట్లుగ తనరాజ్యమునందలి ముఖ్య పదవులలో బంధువులను, స్నేహితులను నిలిపి రాజ్యతంత్రము నడిపెను.

వైదికధర్మ సంస్థాపనమే ఆశయముగాగల ఈ అనపోత మహీపతి ఆర్యధర్మములను అత్యంతాభిమానముతో పోషించెను. యవనులచే అపహరింపపడిన అగ్రహారములను పునరుద్ధరించుటయేకాక, వేదాధ్యయన సంపన్నులైన బ్రాహ్మణోత్తములకు తాను అనేక అగ్రహారములను దానమొనర్చెను. పూర్వ నృపాలురచే చిరకాలము క్రింద అపహరింపబడిన కృష్ణాజిల్లాయందలి గుడివాడ తాలూకాలోని ఉప్పుగల్లు తిరిగి పూర్వపు అగ్రహారికులకు చెందునట్లుచేసెను. వినుకొండసీమలోని నాగళ్ళ అను గ్రామమును శా. శ. 1278 లో అనపోతయరెడ్డిగారు "కొండుశాస్త్రులంగారికి అలవణం, అకరంగా సర్వాగ్రహారంగా ధారాగృహితంచేసెను" కోడితాడిపట్టు అను గ్రామమును శా. శ. 1246 లో జమ్మలమడక పురుషోత్తమ సోమయాజికి దానమిచ్చెను. ఈవిధముగ ధార్మికుడగు ఈ అనపోతారెడ్డి హేమాద్రి దానఖండమున చెప్పిన ప్రకారము దానముల చేసియు; వైదిక, స్మార్త, జ్యోతిష, ఆయుర్వేదాది విద్యలకు ప్రోత్సాహమిచ్చియు కీర్తనీయ చరితుడయ్యెను.

సర్వజన ప్రియుడగు అనపోతారెడ్డికి కులక్రమాగతులును, రాజనీతిజ్ఞులును అగు మంత్రులయొక్క సహాయ సహకారములు అధికముగ నొడగూడినవి. ఇతడు రాజ్యమునకువచ్చిన ఒకటి రెండు సంవత్సరముల వరకు మల్లనయు, మల్లన స్వర్గస్థుడయిన తరువాత అతని పినతమ్ముడును మంత్రులుగ నియుక్తులైరి. సోమయమంత్రి మోటుపల్లిని వృద్ధికితెచ్చినవాడు. తరువాతివాడు కేతయ మల్లినాథవేమన. ఇతడు కులక్రమాగతముగ మంత్రిత్వమును సేనాపతిత్వమును వహించెను. అనపోతమహీశ్వరునకు కుడిభుజమైయుండి, అతని పెక్కు విజయప్రస్థానములందు తోడుపడినవాడు ఇతడే. ఇతడే శా. శ. 1288, ప్లవ సం॥ శ్రావణ బహుళ పంచమీ గురువారమునాడు ధాన్యవాటీపురమునందు అనపోతయరెడ్డిగారికి ఆయురారోగ్య - ఐశ్వర్యాభివృద్ధి కొరకును, ధనకనకవస్తు వాహన సమృద్ధికొరకును, పుత్రపౌత్రాభివృద్ధికొరకును అమరేశ్వరదేవుని పునఃప్రతిష్ఠించెను.

అనపోతారెడ్డియొక్క ఆస్థానము కవులతోను, జ్యోతిషికులతోను, ధర్మశాస్త్రవేత్తలతోను, వేదపండితులతోను నిండియుండెను. ఇతని ఆస్థాన విద్వాంసుడు బాలసరస్వతి. అనపోతారెడ్డియొక్క శాసన కావ్యములను (శ్లోకములను) పెక్కింటిని బాలసరస్వతియే రచించెను. శాసనముల

చివర "అనపోతనరేంద్రస్య బాలసరస్వతిః అకరోత్ నిర్మలం ధర్మశాసనం" అని ఇతడు లిఖించెడివాడు.

ఈ విధముగ అనపోతారెడ్డి వీరుడై, విజేతయై, ధార్మికుడై, ప్రభువై, ప్రజారంజకుడై ప్రసిద్ధిచెందెను.

పి. య. రె.

## అనవేమారెడ్డి :

"తనబ్రతుకు భూమిసురులకు
దనబిరుదులు పంటవంశ ధరణీశులకున్
తననయము భూమిప్రజలకు
ననవేమన యిచ్చెఁ గీర్తి నధికుం డగుచున్"

అని కీర్తింపబడిన మహాధార్మికుడు, ధర్మవేమన యని ప్రసిద్ధివహించిన అనవేమారెడ్డి. అతడు ప్రోలయ వేమారెడ్డి కుమారుడు. కొండవీటిరాజగు అనపోతారెడ్డితమ్ముడు. అనపోతారెడ్డిఅనంతరము అతనికుమారుడు కుమారగిరి రెడ్డి బాలుడగుటచేగాబోలు అనవేమారెడ్డి పైతృకమగు కొండవీటిసింహాసనమును అధిష్ఠించెను. కొండవీటి రెడ్డి ప్రభువులలో ఉత్తముడగు నీతడు వారసత్వపుటధికారము కంటె రాజ్యక్షేమమే ప్రధానమని భావించెను. శాసనములలో నితడు "మహనీయాంధ్రదేశ పట్టాభిషేక సంప్రృత మహాభాగ్యు" డని వర్ణింపబడినాడు.

"సోయం భ్రాతురనంతరమ్ నిజమహీభారమ్ వహన్ పైతృకమ్
రాజ్యశ్రీరమణీస్వయంవరపతిః శ్రీ అన్నవేమప్రభుః"

అనియు "రాజ్యరమారమణీస్వయంవరలబ్ధ నాయక సౌభాగ్యు" డనియు, శాసనగతశ్లోకములచే కీర్తింపబడిన ఈ అనవేమనృపతి, రాజ్యలక్ష్మి స్వయముగా కోరి వరించిన పతి యని భావింపవచ్చును.

శూరాగ్రగణ్యుడయిన అనవేమారెడ్డి "ఛురికాసహాయు" డనియు, "కరవాలవైనతేయు" డనియు, "విక్రమపంజరనిగృహీత రిపురాజసింహు" డనియు, కీర్తింపబడినాడు. పై బిరుదు లన్నియు బాహుబలశాలి యైన ఈతని విజయప్రస్థాన గౌరవచిహ్నములు కావచ్చును.

రాజ్యారంభమున మొదటి రెండుసంవత్సరములు ఈ వేమనృపతి తనరాజ్యమును సుస్థిరము గావించుటయందు గడిపి, పెక్కుసైన్యములను కూర్చుకొని శా. శ. 1294లో తన సీమావధులను దాటి, తన అన్న అనపోతనృపతికి స్వాధీనముకాని గోదావరీపర్యంత దేశమునందలి స్వతంత్రులగు మండలేశ్వరులను అణచి తద్దేశములను స్వాధీనముచేసికొనుటకై బయలుదేరెను. అనపోతారెడ్డి బాహుబల దర్పముచే జయించిన "దివిసీమ" ను పద్మనాయకులు విజృంభించి స్వాధీనపరచుకొనిరి. ఆవిధముగ పరాయత్తమయిన "దివిసీమ"ను ఈతడు మున్ముందే జయించి "దివిదుర్గవిభాల" అను బిరుదు నొందెను. తరువాత శూరవరపట్టణము రాజధానిగ నేలిన ఉండిరాజులను, కామవరము రాజధానిగ నేలిన భక్తిరాజును ఇతడు జయించెను. పిమ్మట ఇతనిదృష్టి నిరవద్యప్రోలువైపు మరలెను. నేటి పశ్చిమగోదావరిజిల్లాయందలి నిడదవోలుపురమే నాటి "నిరవద్యప్రోలు". తురుష్కాక్రమణకు పూర్వము కాకతీయచక్రవర్తుల బలవత్తరమగు కోటలలో ఇది యొకటిగా నుండెను. తరువాత అన్నదేవచోడున కిది ప్రధానదుర్గముగా నుండెను. అన్నదేవచోడునకును అనవేమారెడ్డికిని జరిగిన యుద్ధమునందు అనవేమునకు ఈదుర్గము స్వాధీనమయ్యెను. ఈదుర్గవిజయముతో అనవేమునకు అన్నదేవునిరాజ్యము స్వాధీనమగుటయేగాక, గోదావరియొక్క ముఖ్యశాఖలగు వాసిష్ఠ, గౌతమి అను నదుల మధ్యస్థమగు సారవంతమైన ప్రదేశము లితనివశ మయ్యెను. క్రి. శ. 1374 నాటి నాదపుర శాసనమువలనను, ద్రాక్షారామశాసనమువలనను, వానపల్లి తామ్రశాసనమువలనను, గౌతమీనదీసాగరసంగమ స్థానమున నున్న కోనసీమ, పానారుసీమ (నేటి రాజోలు తాలూకా) అనవేమునకు వశపడినట్లు గ్రహింపవచ్చును. తనవశమయిన కోనసీమయందలి "నడుపూరు" గ్రామమును వేమవరమను పేరుతో చంద్రగ్రహణసమయమున తనచెల్లెలు వేమసానికి పుణ్యము చేకూరుటకుగాను బ్రాహ్మణులకు దానముచేసి, ఈ ప్రభువు శాసనము వేయించెను. విజయవంతములగు పైదండయాత్రలయందు ఇతనికి సహాయపడినవారు రెండవ కాటయరెడ్డి, రెండవ మారయరెడ్డి, దొడ్డారెడ్డి, దువ్వూరివంశస్థులు మున్నగువారు.

ప్రథమసంగ్రామములందు విజయలక్ష్మిని చేపట్టిన రెడ్డి సేనలు అధికతర జయోత్సాహముతో గోదావరిని దాటి

ముమ్మడినాయకుని రాజ్యసౌధమునకు మూలస్తంభము వంటి రాజమహేంద్రవరదుర్గమును ముట్టడించెను. ఈ యుద్ధ ఫలితముగా రాజమహేంద్రవరదుర్గము అనవేమా రెడ్డికి వశమయ్యెను. మంచికొండదొరలు ఆతనికి సామంతులైరి.

రాజమహేంద్రవర విజయముతో నిరాటంకముగా అనవేమారెడ్డి తనసైన్యములను దక్షిణకళింగమునందలి సింహాచలపర్యంతము నడపెను. దుర్గమారణ్య పర్వత పరిరక్షితమయిన ఈప్రదేశమును అనాగరకజాతులకు నాయకులయి వీరసామంతులని పిలువబడు మన్నెదొరలను వశపరచుకొని అనవేమారెడ్డి తనకాలమునాటి వీరులలో మేటిగా గణనకెక్కెను.

గౌతమీతీరమునుండి ఉత్తరమున కళింగమువరకు వ్యాపించిన ఆంధ్రఖండమండలము అను భాగమునకు దొరలయి వీరసామంతులనబడిన కొప్పులనాయకులను అనవేమారెడ్డి జయించెను. శారదానదీతీరమందలి వడ్డాది రాజధానిగ సింహాచల ప్రాంత దేశమును పాలించుచున్న మత్స్యవంశస్థుడగు వీరార్జునదేవునికూడ ఇతడు జయించెను. వారలచే కప్పములను గొనెను. అనవేమా రెడ్డి గొప్ప విజేత. ఇతడు ''సింహాచలాది వింధ్యపాద ప్రతిష్ఠిత కీర్తిస్తంభు'' డని పొగడబడెను. కాని ఇతడు బ్రతికియున్నంతకాలము రాచకొండ, దేవరకొండ దుర్గముల కధిపతులయి, రాచకొండరాజ్యమును పరిపాలన చేయుచుండెడి అనపోత మాధవనాయకు లోకవంకను, విజయనగరప్రభువు లోకవంకను ప్రబలవిరోధులయి ఇతని రాజ్య మాక్రమించుకొనవలయు నని ప్రయత్నములు సతతము గావించుచునే యుండిరి. ఇతడు ప్రజాపరిచిత చతుర్విధోపాయుడు. కందుకూరు మొదలుకొని విశాఖ పట్టణ మండలములోని సింహాచలపర్యంతదేశమును జయించి, ఈతడు పరిపాలనచేసినట్లు ఊహింపవచ్చును. శ్రీశైలాది శాసనములందు కానవచ్చు బిరుదములలో కొన్ని వంశపారంపర్యముగా ఇతనికి సంక్రమించినవియే అయినను "రాజమహేంద్ర, నిరవద్యనగరాది బహువిధ స్థలదుర్గవర్గ విదళన బలరామ", "సాగర గౌతమీ సలిల సంగమ సకల జలదుర్గ సాధన రఘురామ" అనునవిమాత్రము ఇతని ప్రత్యేక బల ప్రాభవములకు నిదర్శనములయి ఇతడు సాగించిన విజయ ప్రస్థానముల జయగౌరవచిహ్నములయి ఒప్పుచున్నవి.

ఇట్లు దిగ్విజయాలంకృతుడయి, ప్రజాహితకారియై ''భూమీశే చిర మన్న వేమనృపతౌ భూయో లభంతే జనాః
మృష్టాన్నం మృదులాంబరం మృగమదం చామీకరం చామరమ్ "

అను పొగడ్తకు పాత్రుడయి అనవేముడు ప్రజాపరిపాలన మొనర్చెను.

ఇతడు ఆగమశైవాచారపరాయణుడు. పట్కాలము లందు శివపూజచేయు భక్తుడు. అనవేముని రాజ్యము శాంతియుతమయి పాడిపంటలతో, ధనకనకవస్తువాహనములతో తులదూగుచుండెను. ఇతడు గొప్పరసికుడు. కస్తూరీ, కుంకుమ, ఘనసార, సంకుమద, హిమాంబు, కాలాగరు, గంధసారములతో కవి, వాంశిక, వైతాళికాదులకు ఉత్సాహ మధికమగునట్లుగా వసంతోత్సవము (మదనోత్సవము)లను జరిపి వసంతరాయడని పిలువబడెను.

అనవేమభూపాలుడు విద్యాభిమాని అనియు, పండితపక్షపాతి అనియు, కవులపాలిటి కల్పతరు వనియు అనేకములగు చాటుశ్లోకములవలనను, పద్యములవలనను తెలియుచున్నది. ఇతనికాలమున బాలసరస్వతి విద్యాధికారిగ నుండెను. తరువాత త్రిలోచనాచార్యుడు అను కవీశ్వరుడు శాసనాచార్యుడుగ కానవచ్చును. ఉప్పుగల్లు తామ్రశాసనమునకు బాలసరస్వతి కర్త. ఇమ్మడిలంక, వానపల్లి తామ్రశాసనములకు త్రిలోచనాచార్యుడు కర్త. ప్రకాశభారతయోగి అను మరియొక ఆంధ్రకవీశ్వరుడు ఈ మహీపాలుని ఆస్థానమునందున్నట్లు తెలియుచున్నది. ఇతడు తన దాయాదులచేతగూడ పొగడబడెను. కుమారగిరి పరపతిశాసనములో ధర్మతత్పరుడనియు, కాటయవేమారెడ్డి శాసనములో సుజనుడనియు, కోమటివేమారెడ్డి శాసనములో "విశ్వోత్తరుం"డనియు అనవేముడు పేర్కొనబడెను.

అనవేమారెడ్డి గొప్ప వితరణశీలుడు. తన తండ్రియగు ప్రోలయవేమభూపాలునివలెనే బ్రాహ్మణ వృత్తులను, ధర్మములను కాపాడుటయేగాక, శ్రౌతస్మార్తవిద్యలను ప్రోత్సహించుటకై బ్రాహ్మణులకు అగ్రహారములు భూములుదానముచేసిన మహోదాత్తుడితడు. ఈవిషయమున

అనేకశాసనములు ప్రమాణములు. "బహుసహస్రసువర్ణ దానసంతోషితమహాకవీశ్వరు" డనియు "బ్రహ్మాండదాన, కల్పతరుదాన, గోసహస్రదానపరు" డనియు ఈతనిని ప్రజలు విస్తారముగ కీర్తించియున్నారు. శ్రీశైలకుమారాచల పంచారామములందు తనగోత్రనామములతో నిత్యనైవేద్యములకు ఇతడు ఏర్పాట్లుచేసెను. కాశిలో శ్రీ విశ్వేశ్వరునకును, సింహాచలమునందు విష్ణువునకును కైంకర్యార్థమై తుల్యభక్తితో ఇతడు భూదానాదికములను కావించెను.

వీరాన్న వేమనృపతి అని పేరుగాంచిన ఇతడు కులక్రమాగతులయి రాజనీతినిపుణులైన మంత్రి దండనాథుల సహాయముతో క్రీ. శ. 1364 నుండి 1386 వరకు అఖండవైభవముతో రాజ్యమేలి యుద్ధమునందు వీరస్వర్గము నలంకరించెను.

పి. య. రె.

**అనితల్లి :** కాకతీయ సామ్రాజ్య పతనానంతరము యవనప్లావితమైన ఆంధ్రావనియందు, ఆంధ్రసంస్కృతిని తిరిగి కొంతకాలము విలక్షణముగ నిలువగలిగినవారిలో రెడ్డిరాజు లొకరు. ఈ రెడ్డిరాజ్యయుగమునందు ఆర్యధర్మములను పోషించినవారు ప్రభువులగు రెడ్డివీరులే. ఆ రెడ్డివీరులరాణులు సయితము ధర్మసంస్కృతి సంస్థాపనయందు భాగస్వాములై పేరొందిరి. వీరిలో పెద్దకోమటి వేమారెడ్డి భార్యయగు సూరాంబయును వేమాంబిక, మల్లాంబ, అనితల్లి అనువారలు పేర్కొనదగినవారు. అనితల్లి అల్లాడ వీరభద్రారెడ్డి రాణి. ఈమె పుణ్యగుణాభిరామ యని కీర్తి కాంచినది. సాహిత్యశౌర్య సంపద్రాశి యగు కాటయ వేమారెడ్డికిని, కుమారగిరిరెడ్డిసోదరి యగు దొడ్డాంబికకును కూతురు. కాటయవేమునకు రాజ్యము పిత్ర్యముగా సంక్రమించినదికాదు. అది భార్యయగు దొడ్డాంబికమూలమున అరణముగ లభించెను. కావున ఆరాజ్యము అనితల్లికిని ఆమెమూలమున ఆమెభర్త యగు అల్లాడ వీరభద్రారెడ్డికిని సంక్రమించినది. మహాకవి శ్రీనాథ విరచితమగు కాశీఖండమునందు ఈమె సాక్షాదిందిరాదేవతగ కీర్తింపబడినది. "అనితల్లి న్వనితామతల్లి నుదయాస్త్రాద్రీంద్రసీమావనీ, ఘనసామ్రాజ్య సమర్థనాప్రతిమ సాక్షాదింది రాదేవతన్"

సచ్చరిత్ర యగు ఈ అనితల్లి ధర్మానురక్తయై అనేకములగు వితరణములను గావించెను. అందు ముఖ్యముగ పేర్కొనదగినది 'కలువచెరువు' అను గ్రామదానము. ఈమె కలువచెరువు అను గ్రామమును పరహితచార్యుడు అను పరహితపరాయణుడగు వైద్యవరేణ్యునకు క్రీ. శ. 1345వ సంవత్సరమున శ్రావణ బహుళ అష్టమీదినమున దానముగావించి వైద్యవృత్తిని పోషించెను. ఈ దాన సందర్భమున వ్రాయబడిన శాసనమే నేడు చారిత్రకముగ ప్రసిద్ధివహించినది. ఈ శాసనము బయలువెడలుటకు పూర్వము రెడ్డిరాజులందు, మీదుమిక్కిలి రాజమహేంద్రవర రెడ్డిప్రభువులనుగూర్చి కొంత పొరబడుట సంభవించెను.

ఈ శాసనమువలన రాజమహేంద్రవరమును పాలించిన ప్రథమప్రభువు అల్లాడరెడ్డి కా డనియు, కాటయవేముడే అనియు తేటపడుచున్నది. కాటయవేముని యొక్కయు అతని కుమారుడగుకుమారగిరి యొక్కయు మరణానంతరము దేశము "కున్నృపతి జలరాశి మగ్నము" కాగా, కాటయవేముని బంధువగు అల్లాడరెడ్డి రాజ్యము నుద్ధరించి, కాటయవేముని కూతురగు అనితల్లికి పట్టము కట్టినట్లు తెలియుచున్నది.

అనితల్లి కలువచేఱు శాసనమువల్లనే ప్రతాపరుద్రుడు విధివశమున బందీకృతుడై ఢిల్లీకి తీసికొనిపోబడకపూర్వమే సోమోద్భవ యగు నర్మదానదియందు స్వచ్ఛంద మరణమును పొందెనని తెలియుచున్నది. స్వేచ్ఛతో మరణించిన కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి తరువాత త్రిలింగభూమి యవనమయమైన దనియు, మహాజలమునందు మునిగిన భూమి నుద్ధరించిన ఆదివరాహమూర్తివలె ప్రోలయనాయకుడు యవనోదస్థమగు భూమిని పైకెత్తి ప్రతిష్ఠించెననియు తెలియుచున్నది. ఇతనితరువాత ఇతని పినతండ్రి కుమారుడగు కాపయనాయకుడు ప్రభుత్వము నెరపినట్లు కానవచ్చును. ఇతని ఆధిపత్యముక్రింద 72 మంది నాయకులు సేవలొనర్చుచుండిరి.

ఈ అనితల్లి కలువచేఱు శాసనము, గోదావరిమండలమున నున్న కాకినాడతాలూకాయందలి ఆర్యావటమను (ఆర్యవటము) గ్రామమునందు లభించినది. అది ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 4 వ సంపుటముయొక్క 98-112

పుటలందు ప్రచురింపబడినది. మహాసాధ్వియగు నీమె 1423 వ సంవత్సరమున దేవబ్రాహ్మణక్షేత్రముల మీద పన్నును రద్దు కావించెను.

ఈ విధముగా నీమె రాణియై, అల్లాడ వీరభద్రా రెడ్డికి దేవియై, దేవబ్రాహ్మణ భక్తయై, సాధుశీలయై, అనేక భూరి దానముల గావించి చిరస్మరణీయ అయ్యెను.

పి. య. శె.

**అనుభవమూలవాదము (Empiricism)**: ఈ అనుభవమూలవాదము పశ్చిమఖండమున 17,18 శతాబ్దములలో వ్యాప్తినంది గొప్ప సారస్వతమును సృజించినది. బేకను పండితుడు దీనికిమూలస్థాపనాచార్యుడు. తరువాత విఖ్యాతిగాంచిన బెంథామ్, లాకే, హ్యూమ్, జాన్ మిల్, జాన్ స్టూవర్టు మిల్ మున్నగువారు దీనిని బహురూపముల పోషించి, సమర్థించి, ప్రచారముగావించినారు.

ఈ వాదము ఉద్భవించుటకు తగిన కారణములు లేకపోలేదు. పూర్వశతాబ్దములలో మతాచార్యప్రోక్తములైన సిద్ధాంతములను అంధవిశ్వాసముతో స్వీకరించుట ప్రజాసమూహమునకు అభ్యాసమైనది. మతప్రచారకులైన గురువర్గము ఈ యంధవిశ్వాసములనే ప్రోత్సహించి, హేతువాదమునకు ఎట్టి యవకాశమును లేకుండచేసిరి. ప్రకృతిశాస్త్రరవికిరణము అప్పుడే విజ్ఞానప్రపంచమున ప్రసరించుటకు ఆరంభించి, హేతువాదాంకురములను జనింపజేసెను. నిర్హేతుకముగా ఏదియు విశ్వసింపరాదను ఈ వాదవిధానము అన్ని రంగములలో ప్రవేశించినది. రాజకీయరంగమున ఈవాద ఫలితముగా ప్రజాప్రభుత్వ భావములు, సాంఘికరంగమున సర్వమానవ సమానత్వ భావములు, మతరంగమున నాస్తిక,నాస్తికసమ సంశయ వాదములు రేకెత్తినవి.

ఈ అనుభవమూలవాదతత్త్వమునందలి ముఖ్యభావములు ఏవనగా, 1. మనస్సు అనునది నిర్గుణమైన ఒక రూపము. దానికి స్వయంప్రకాశకత్వమువలన గలుగు స్వయంనిర్ణయశక్తి లేదు. మనస్సు స్వయముగా చేయునవి అన్నియును ఊహాజన్యములైన కల్పనములే. వాటికి వాస్తవికజగత్తులోనుండి తెచ్చుకొనిన ఆధారము లేదు. 2. మనకు లభించునవి బాహ్యజగత్తులోని వస్తువులవలన ఇంద్రియములకు గలుగు వేదనములు మాత్రమే (Impressions). ఈ వేదనముల ద్వారాలమున వస్తువుల ఆకృతులు మన మనస్సునందు ముద్రితము లగుచున్నవి. ఈ వ్యక్తులను, వస్తువులను గూర్చిన భావములు క్షణక్షణమునకు జనించి, అంతరించుచున్నవి. ఇవి యొకదాని వెనుక నొకటి కన్పట్టుచున్న వేగాని, వీటి కన్యోన్యసంబంధ మెట్టిదో మనకు తెలియదు. కొన్ని తాటస్థ్యములు కలసి, తిరిగి తిరిగి సంభవించుచుండుటచే, అవి పరస్పర సంబంధములుగలవి యగుటచేతనే అట్లు తటస్థించుచున్నవని యూహించు మానసికభావమునకు ఆధారము లేదు. లోకములో కొన్ని సందర్భములు తిరిగి తిరిగి ఆదేరీతిగా సంభవించుటకే "సాహచర్యసిద్ధాంత" (Associationism) మని పేరిడిరి. వస్తువుల బాహ్యాకృతియేగాని, వాటి యాంతరంగిక స్వరూపముగాని, వాటి అన్యోన్యసంబంధ సూత్రముగాని, మన ఇంద్రియములకు వేదనములరూపములో లభించుటలేదు. వీటినిగూర్చి మనస్సుచేయు కల్పనములు వాస్తవికాధారశూన్యములు.

ఈ సిద్ధాంతముననుసరించి, మతసూత్రములన్నియు మనః కల్పితములైన మానసికాహ్లాదము నొసంగు నిరాధారభావములే. కాని, నిజప్రపంచమునకు సంబంధించినవని రుజువుచేయుట కాధారములేదని ఈ అనుభవమూలవాద తత్త్వజ్ఞుల నిశ్చయము.

అదేవిధముగా నైతికసూత్రము (The Moral Law) శాశ్వతమైన పరమప్రమాణము కాదు. ఆయా కాలముల యందు సమాజాభ్యుదయమునకు అవసరములని తోచిన కొన్ని నియమములను నాటి మేధావులు కల్పించి, ఇవి నీతిధర్మము లనిరి. దేశకాలపాత్రములలోని మార్పులను బట్టి నీతిసూత్రావళియు, తదాచరణ విధానమును పరివర్తనమందుచు వచ్చెనని చరిత్ర మనకు చెప్పుచున్నది. ఈ కారణముచే ఈ అనుభవమూలవాదులు ప్రయోజన సిద్ధాంతమును (Utilitarianism) సమర్థించిరి మనము విశ్వసించుచున్న మతసిద్ధాంతములు, నీతిసూత్రములు, సామాజిక నియమములు, రాజకీయ శాసనాదులు, అన్నియు ఆయా దేశకాల జనావసరములైన కల్పనములే యనియు, వాటికి పరమప్రామాణ్యమును అంటగట్టజూచుట హేతువిరుద్ధమనియు వీరి వాదమై యున్నది. పరమార్థము లేక పరమసత్యమున్న మండవచ్చును. కాని

మన ఇంద్రియవ్యాపారమునకు దానిపోకడ లెవ్వియు గోచరించుటలేదు. మానసికముగా జేయు ఊహాకల్పనములు వాస్తవికతకు సంబంధములేని వని వారి నిశ్చయ సిద్ధాంతమై యున్నది.

ఈ సిద్ధాంతము బలహీనమైనదని నిరూపించుట కష్టము కాదు. మనస్సు అనునది, నిర్గుణనిష్క్రియాత్మక రూపము గాదు. అది వస్తు సత్యాసత్య స్వరూపములను విచారించి, తెలిసికొను స్వయంప్రతిభగలదని తరువాతవచ్చిన తత్త్వజ్ఞులు ఉద్ఘాటించియున్నారు.

ఖు. వేం.

**అనుమకొండ:** అనుమడు, కొండడు అను ఆటవికులవలన ఈ గ్రామమునకు 'అనుమకొండ' యను పేరేర్పడెననియు, అనుమడు హనుమకొండను పర్వరచెననియు, కొండడు కొండిపర్తి గట్టెననియు స్థానికచరిత్రమున గలదు. ప్రాచీనశాసనములలో అమ్మకొండ, అనుమకుండాపురము, అనుమకొండ అను రూపాంతరములు గలవు. హనుమంతుడుగల కొండయగుటచే హనుమకొండయను నామ మేర్పడియుండుననియు, హనుమద్గిరి సంస్కృతరూపము దానికేర్పడెననియు, ప్రతాపరుద్రీయమున విద్యానాథుడు దానినే హనుమదచలమని వ్యవహరించెననియు కొందరి అభిప్రాయము. అనుమకొండ ప్రాచీననగరములలో నొక్కటి. పురబాహ్యమునందు (హంటరురోడ్డు చెంత) రాకాసిగుండ్లు అను అనార్యుల సమాధులు (cairns) కలవు. వాటి విస్తృతినిబట్టి అవి 6000 సంవత్సరములనాటి వని పరిశోధకులు నిర్ణయించిరి. స్థానికచరిత్రములలో 14 మందిరాజులు పాలించిన పిమ్మట త్రిభువనమల్లుడు (రెండవ బేతరాజు) రాజయ్యెనని కలదు. అచటినుండి కాకతీయవంశక్రమము అందు గలదు. అచట పాలించిన 14 మంది రాజులు చరిత్రమున కనుపట్టరు. నందుడు, సోమరాజు, మాధవవర్మ - వీరి చరిత్ర లెంతవరకు నిజమో! నందుడు నందగిరి నెలకొల్పి పాలించెననియు, సోమరాజు కటకవల్లభునితో పోరాటమున మరణింపగా, గర్భవతిగ నున్న అతని భార్య సిరియాలదేవి అనుమకొండలో మాధవశర్మ ఆశ్రయమున సురక్షితగ నుండి కుమారునిగని ఆ బాలునకు మాధవవర్మ యని నామకరణము చేసెననియు, మాధవవర్మ పెద్దవాడై పద్మాక్షీదేవి అనుగ్రహమును బడసి, పితృరాజ్యమునంతయు నాక్రమించెననియు స్థానిక చరిత్రలందు కలదు. మాధవవర్మ కొన్ని రాజకుటుంబములకు మూలపురుషుడుగ కన్పడుచున్నాడు.

అమోఘవర్షుడను రాష్ట్రకూట రాజు హనుమకొండలో తొమ్మిదవ శతాబ్దమున చాళుక్య భీమరుసును ప్రతినిధిగా నుంచెను. మొదటికాకతిప్రోలరాజు త్రైలోక్యమల్లుడను కల్యాణి చాళుక్యునిచే పదునొకండవ శతాబ్దమున అనుమకొండ విషయమునకు అధీశ్వరుడుగ చేయబడెను. ఈ మొదటి ప్రోలరాజు తండ్రి మహావీరుడై, కాకతి పురాధినాథుడయ్యెను. అతనినే మొదటి బేతరాజుగ వ్యవహరింతురు. మొదటి ప్రోలరాజు కొడుకు రెండవ బేతరాజు. ఇతని కుమారుడు రెండవ ప్రోలరాజు. అనుమకొండలో మూడు కొండలను గలిపి ఎత్తైన మట్టి కట్టబోసి కోట నిర్మింపబడినది. కొండలపై దృఢముగా రాతికోట కట్టబడినది. కొండలపై దిగంబర జైనమూర్తులు కలవు. జైనమత మిచ్చట వ్యాప్తమైనది. పద్మాక్షీ యను దేవతయు సిద్ధేశ్వరుడును కోటలోనున్నారు. వీరును జైనదేవతలే. ఇప్పుడు వైదిక దేవతలుగ మారిరి. సిద్ధేశ్వరాలయము చెంతగల కొండపై అనుమకొండ రాజధానిగ నుండి సమస్త సౌభాగ్యముల కాటపట్టుగ నుండెననుచు అతి విస్తృతమైన యొక శాసనము చెక్కుటకు ప్రారంభింపబడి మధ్య ఆపబడినది. చాళుక్యులును, కాకతీయులును దీనిని రాజధానిగ రూపు రేఖలు దిద్దిరి. జైన మందిరములకు, శివాలయములకు, శివలింగములకు లెక్క లేదు. భూగర్భమున నెన్నియో దేవళములున్నవి. గోడలకు పునాదులు తీయునపుడు ఆలయములు, ఇటుకరాళ్ల వరుసలు, విగ్రహములు, కోనేరులు, బావులు కనవచ్చును. విరుగగొట్టబడిన దేవతామూర్తులకు లెక్కయే లేదు. మొదట జైనమతము, తరువాత శైవమతము రాజాదరణమును బడసినవి. ఈ రెండు మతముల సంఘటనము గూడ జరిగిన దిక్కడనే. ఆ విస్తృత కథలు జ్ఞాపకము జేయు చిహ్నములు లిఖితరూపముగ, విగ్రహరూపముగ చెక్కులు గలవు.

అనుమకొండలో బాలసముద్రము, భద్రకాళి చెరువు, సిద్ధసాగరములు పేరుచెందిన తటాకములు. గంగా

ధరమంత్రి ప్రోలరాజు కాలమునందు నగరపాలకుడై, రుద్రదేవుని కాలమున మంత్రియై ప్రసిద్ధిగడించెను. ఇతడు అనుమకొండలో ప్రసన్నకేశవాలయము, రుద్రేశ్వరాలయము, పున్నేశ్వరాలయము, త్రిమూర్తుల ఆలయములు మొదలగునవి కట్టించెనని శాసనములలో గలదు. కాని ఇపుడవి గుర్తింపరాకుండ నాశనమైనవి. గోసగి ఈశ్వరదేవుడు వేయిస్తంభాలగుడిలో సహస్రలింగప్రతిష్ఠ చేసెనట. జగద్దేవుడు సర్వ మాండలికరాజుల సహాయమున రెండవ ప్రోలరాజు కాలమున అనుమకొండను ముట్టడించి పరాజితుడయ్యెను. రామేశ్వర పండితుడు లకులేశ్వర మతమువాడు. ప్రోలరాజుచే సత్కారములొందిన గురువర్యుడు. హానుమకొండలో సుప్రసిద్ధమగు శివపురము ఆకాలమున నుండెను.

రుద్రదేవుడు అనుమకొండలో గట్టించిన వేయి స్తంభముల గుడి మిగుల ప్రశస్తమైనది. మండపము వేరుగను, ఆలయము వేరుగను ఉన్నవి. ఈ రెంటికి మధ్య సజీవముగా నున్నటుల చెక్కబడిన నంది దర్శనీయము. అందలి శిల్పనైపుణ్యము వర్ణనాతీతము. నందికి అభిముఖముగా త్రికూటాలయము గలదు. అందు రుద్రేశ్వరుడు, వాసుదేవుడు, సూర్యదేవుడు ముఖ్యదైవతములు. ద్వారములపై దేవతామూర్తులను అంతరాళములు తొలిచి సుందరముగా చెక్కించినారు. కాకతీయ శిల్పమునకు పరమావధియగు నీ ద్వారశిల్ప మద్భుతమైనది. కాకతి రుద్రదేవుడీ యాలయమును లోకోత్తరముగ శా. శ. 1084 చిత్రభాను సంవత్సర మాఘ శుద్ధ పంచమినాడు (క్రీ. శ. 1162) నిర్మింపించెను. ఆలయ నిర్మాణానంతరము ఓరుగల్లును రాజధానిగా చేసికొనెను.

ఓరుగల్లు కాకతీయుల రాజధానిగ జేసికొనబడినప్పటి నుండి అది మహానగరముగా మారినది. అట్లని, నాడు అనుమకొండను చిన్నచూపు జూడలేదు. రాజపరివారము, రాజులు, విద్వాంసులు హానుమకొండ నుండి ఓరుగల్లునకు రాకపోకలు చేయువారు. రెంటికిని అవినాభావ సంబంధముండెడిది.

ప్రస్తుత కాలమున అనుమకొండ గొప్ప వ్యాపార స్థలముగ ప్రశస్తివహించినది. లలితకళారాధకులు పలువురచటగలరు. అనుమకొండ జిల్లా ముఖ్యస్థానము. ఉద్యోగులందరు ఇట నుందురు. నైజాము దొరతనమున ఇది తెలంగాణమునకు సుబాయై వరలెను. సుబేదా రిట నుండువాడు. బి. యే. వరకు గల మొదటిశ్రేణి కళాశాలయు, బోధనాభ్యసన కళాశాలయు అనుమకొండలోనే ఉన్నవి. తెలంగాణమున రెండవ గ్రంథాలయమనదగిన రాజరాజ నరేంద్ర గ్రంథాలయము గలదు. ఇది సువర్ణోత్సవము జరుపు వయస్సున నున్నది. భద్రకాళి తటాకము జలసమృద్ధము. దాని క్రింద వరిపంట విస్తారము. ఆ చెరువు కట్టపై నున్న భద్రకాళీ దేవాలయము ప్రసిద్ధమైనది. ఆమె కాకతీయుల కులదేవత. శిథిలమైన ఈ ప్రశస్తదేవళమును పునః ప్రతిష్ఠచేసి, నగరవాసులు ఆ దేవతను భక్తిశ్రద్ధలతో పూజించుచున్నారు. ముప్పది యిద్దరు మంత్రులలో గణనీయుడుగా విఠలమంత్రి శాసనము లిందు గలవు. వైష్ణవ మతోద్ధారకుని పేరిట గల శ్రీరామానుజ దేవాలయము ప్రశస్తమైనది. దక్షిణదేశములో నున్నట్లు తీర్చిదిద్దబడిన రామానుజుల విగ్రహము మిగుల ప్రాచీనమైనది. 'యతిపతీ హానుమద్గిరిరాజమందిరా' అను మకుటముగల శతక రాజ మీయనను గూర్చినదే. ఈ రాష్ట్రమును జూడవచ్చు కళాప్రియులు వేయి స్తంభముల గుడిలోని అద్భుత శిల్పములకు ముగ్ధులగుచుందురు. కాకతీయుల కీర్తిచిహ్నమగు నీ దేవళము ఆర్షశాఖవారి కృషి ఫలితముగా ఇప్పుడు దర్శనీయముగా నున్నది.

డి. వి. ర.

**అనువర్తిత గణితశాస్త్రము :**- గణితశాస్త్రమును రెండు భాగములుగా విభజింపవచ్చును. (1) శుద్ధగణితము, (2) అనువర్తిత గణితము. శుద్ధ గణితమున ఒక సముదాయములోని రాసులు కొన్ని నిర్ణీత నిబంధనలకు లోబడినచో వానినుండి యుత్పన్నమగు ఫలితములను సాధింతుము. అనువర్తిత గణితమున నట్లుగాక ప్రయోగ సాధ్యముచే లభ్యమగు ఫలితములను సాధించుటకు ఏ ప్రకృతిసూత్రము అవసరమో కనుగొందుము.

మొదట శాస్త్ర పద్ధతిని సూర్యచంద్రాదుల చలనమును పరిశీలించినవాడు గెలిలియో (1564-1642) ఈతనికి ముందే కొందరు శాస్త్రజ్ఞులు సూర్యచంద్రాదుల గమనమును కొంతవరకును కనుగొన యత్నించిరి. కోపర్నికస్ (1473-1543) అను శాస్త్రజ్ఞుడు సూర్య

కుటుంబమునకు సూర్యుడే కేంద్రమని భావించి ఈ గహన సమస్యను కొంతవరకు తేలికపరచెను. ఆ తరువాత ఈ చలన సిద్ధాంతమున చెప్పుకొనదగిన యభివృద్ధిని ప్రవేశ పెట్టినవాడు కెప్లెర్ (1571-1630). ఆ తరువాత వచ్చిన గెలీలియో పతన వస్తుచలనముపై గావించిన ప్రయోగ ములు న్యూటన్ (1642-1727) చలన సూత్రములు ఖగోళశాస్త్ర వికాసమునకు తగిన దోహద మొసంగుటే గాక చలనశాస్త్రమున కొక నిర్దిష్ట స్థానమును లభింప జేసినవి. దీనినే గెలీలియో - న్యూటన్ సిద్ధాంతమని యందురు. ఈ సిద్ధాంతమున ముఖ్య విషయములు రెండు. (1) యూక్లిడ్ యొక్క రేఖాగణిత ధర్మములు స్థలమున కున్నవి. (2) ప్రతి వస్తువునకును ద్రవ్యరాశి ఉన్నది. ఈ ద్రవ్యరాశి దాని జడత్వముచే మనకు ద్యోతకమగును అని. తరువాతి రెండువందల సంవత్సరములలో జరిగిన కార్యము సూర్యచంద్రాదుల చలనక్రమమున న్యూటను సూత్రములు సరియైనవని ఋజువుచేయుటయే. ఈ న్యూటను సూత్రములు పరమసత్యములు కావని 1915 వరకును కనుగొనలేకపోయిరి. 1915 లో ఐన్‌స్టయిన్ తన సాపేక్ష సిద్ధాంతమును ప్రకటించెను. ఈ సిద్ధాంత ముచే సూర్యచంద్రాదులగమనముల అతి సూక్ష్మపరిశీలనము నకు గురియై న్యూటను సూత్రములు స్థూలముగ సత్యములే యైనను సూక్ష్మపరిశీలన కవి చాలవని తెలిసినది. ఈ విషయము బుధగ్రహకక్ష్యాచలనముచే ఋజువైనది.

19 వ శతాబ్దమున శక్తివాదమున వికాసము కలిగెను. దానిచే వస్తుచలనశాస్త్రమునకును పదార్థవిజ్ఞాన రసా యనశాస్త్రములకును సన్నిహితసంబంధ మేర్పడుటే కాక వస్తుచలనసిద్ధాంతమునకు వ్యాపకత్వ మేర్పడెను. కాని ఈ వాదము అణుసంఘటన (Atomic Structure) కు వర్తింపదని ప్రమాణవాదము (Quantum Theory) ఋజువుచేసెను. ఈ విధముగా 200 ఏండ్లనుండి చెల్లుబడిలో నున్న ఈ సిద్ధాంతముయొక్క పరిధులను 20 వ శతాబ్దపు మొదటి భాగములోనే నిర్ణయించగలిగిరి.

**యంత్రశాస్త్రము :** అనువర్తిత గణితశాస్త్రముయొక్క ఈ శాఖ వస్తుచలనమును గురించియు, చలనమును నిబంధించు శక్తులను గురించియు వస్తువును నిశ్చల స్థితిలో నుంచుటకు వలయు శక్తులను గురించియు చర్చించును.

యంత్రశాస్త్ర మను పదమునకు యంత్రములతో సంబంధమున్నట్లు ధ్వనించును. అనువర్తిత యంత్ర శాస్త్రము (Applied Mechanics) అను శీర్షికలో నేడు ఈ క్రింద శాఖలను చేర్చుట పరిపాటి. (1) స్థితిస్థాపక శక్తివాదము (Theory of Elasticity) (2) ద్రవయంత్ర శాస్త్రము (Hydro-Mechanics) (3) వాయుచలన శాస్త్రము (Aero-Dynamics) (4) యంత్రపద్ధతులు (Mechanisms) (5) ప్రాక్షేపకశాస్త్రము (Ballistics) పై శాఖ లన్నిటికిని సన్నిహితసంబంధముగల యంత్ర శాస్త్ర సిద్ధాంతమును (Theoritical Mechanics) రెండు భాగములుగా విభజింపవచ్చును. (1) వస్తుచలనశాస్త్రము (Dynamics) (2) వస్తుస్థితిశాస్త్రము (Statics). వస్తుచలన శాస్త్రమును మరల రెండుభాగములుగా విభజింపవచ్చును. (1) చలనరేఖాగణితశాస్త్రము (Kinematics) (2) చలన నియమ శాస్త్రము (Kinetics).

**చలనరేఖా గణితశాస్త్రము :** దీనికి సంబంధించిన పదము లీక్రింద నిర్వచింపబడినవి.

1. స్థానాంతరము (Displacement) : ఒక వస్తువు తన స్థానమును A నుండి B కి మార్చుకొనిన A, B ల మధ్య దూరమును ఆ వస్తువుయొక్క స్థానాంతర మందుము.

2. వేగము (Velocity) : ఒక వస్తువుయొక్క స్థానాంతరవృద్ధి క్రమము (Rate of Change of Displacement) ను వేగమందుము.

3. త్వరణము (Acceleration) : ఒక వస్తువుయొక్క వేగవృద్ధి క్రమము (Rate of Change of Velocity) ను త్వరణమందుము.

**చలన నియమశాస్త్రము :** ఇది ఈ క్రింద నుదాహరింప బడిన సూత్రములపై నాధారపడి యుండును.

(1) ఒక వస్తువుపై బలప్రయోగ మేమియు నను జరుగని పక్షమున నది యెల్లప్పుడు స్థాయిగ ఒకచోటనే ఉండును. లేదా ఒక ఋజురేఖపై సమానవేగముతో చలించుచుండును.

(2) ఒక వస్తువుపై ప్రయోగింపబడు బలము దాని త్వరణముతో సమాన విష్పత్తిగలిగి త్వరణదిశలో పని చేయును.

(3) క్రియయు, ప్రతిక్రియయు (Action and Reaction) ఒకదానికొకటి సమానములై వ్యతిరేకదిశలలో పనిచేయును.

**న్యూటను గురుత్వాకర్షణ సూత్రము :** ప్రకృతిలోని ప్రతి రెండువస్తువులును ఒకదానినొకటి ఆకర్షించుకొనును. అట్టి ఆకర్షణక్రమము ఈ క్రింది సూత్రముచే తెలియనగును. ఆకర్షణ $= \frac{క \times బ_1 \times బ_2}{దూ^2}$, ఇందు క అనునది ఒకానొక స్థిరరాసి (constant) $బ_1$, $బ_2$ లు వస్తువుల ద్రవ్యరాసులు. దూ అనునది వాటి మధ్యదూరము.

ఒకానొక వస్తువుపై $p$ అను బలము $t$ కాలము ప్రయోగింపబడిన $p \times t$ ని ఆ బలముయొక్క ప్రేరణ అందుము. ఈక్రింది సూత్రమును సులభముగా సాధింపవచ్చును. ప్రేరణ = వస్తువులో ఉత్పన్నమగు ద్రవ్యవేగ భేదము. సూచన: ఒక వస్తువుయొక్క ద్రవ్యవేగము (momentum) లేక ఉరవడి = ఆ పదార్థముయొక్క ద్రవ్యరాశి × దానివేగము.

పైన చెప్పబడిన న్యూటను సూత్రములు ఒకకణముపై బలప్రయోగము జరిగినపుడు ఉద్భవించు ఫలితములను తెలుపును. అట్లుగాక అనేక కణములు ఒక మండలము (system)గా నేర్పడివానిపై వివిధదిశలలో వివిధబలములు ప్రయోగింపబడినపుడు ఎట్టిఫలితములు కలుగునో తెలిసికొనుటకును ఆ న్యూటను సూత్రములే యాధారము. వానిసాయమువనే ఈ క్రిందివిషయములు సాధింపబడినవి.

(1) ఒక నిర్దిష్టదిశలో జరుగు మండలముయొక్క పరశద్రవ్యవేగ భేదక్రమము అదే దిశలో పనిచేయు బాహ్యబలములఫలితాంశమునకు సమానము.

సూచన : ఈ సూత్రముచే మండలముపై పనిచేయు బాహ్యబలముల ఫలితాంశము ఒకానొక దిశలో శూన్యమైనపుడు ఆ దిశలో మండల ద్రవ్యవేగము మార్పు చెందక స్థిరముగా నుండును.

ఒక బిందువునకుగాని ఒక అక్షమునకుగాని సాపేక్షముగాజరుగు బలప్రభావము (Moment) = ఆ బలము × లంబదూరము.

(2) ఒక స్థిరబిందువునకుగాని స్థిరాక్షమునకుగాని సాపేక్షముగాజరుగు ద్రవ్యవేగ ప్రభావ భేదక్రమము= అదే బిందువునకుగాని అక్షమునకుగాని సాపేక్షముగా బాహ్యబలములయొక్క మొత్తము ప్రభావము.

సూచన : బాహ్యబలములు లేనపుడు మండలముయొక్క ద్రవ్యవేగ ప్రభావము మారదు.

**పని : శక్తి (Work & Energy) :** (1) ఒక కణముపై ప్రయోగింపబడిన బలము $x$ ను, అదే దిశలో కణమునకు జరిగిన స్థానాంతరము $s$ ను అయిన $x \times s$ ను ఆ బలము చేసిన పనియందుము.

(2) $\frac{1}{2} mv^2$ అని దానిని ఆ బలముయొక్క గతిజశక్తి యందురు. పై సూత్రములో $m$ అనునది కణపుద్రవ్యరాశి. $v$ అనునది దాని వేగము.

ఈ క్రింది సూత్రమును గణితశాస్త్రముచే అతి సులభముగ సాధింపవచ్చును.

ఒక బలముచే జరుపబడిన పని దాని గతిజశక్తి భేదమునకు సమానము.

ఇంతవరకు మనము గుర్తించిన చలనము కణములకు సంబంధించినది. అట్టి కణములు బిందువులుగను వాని ద్రవ్యరాసులు ఆ బిందువులవద్ద కేంద్రీకరింపబడినట్లును భావించుచున్నాము. కాని అట్టి కణములు మనకు ప్రకృతిలో లభ్యమగునా ? మనకు లభ్యమగు వస్తువులు ఏక కణములుగాక అనేకకణ సంఘటితములు. ఈ వస్తువులను కఠిన (Rigid) వస్తువులందుము. వీని ముఖ్య గుణము ఏమనగా వీనియందలి ప్రతిరెండు కణముల మధ్యదూరము ఎప్పటికిని మారదు. ఇట్టివానినే కఠిన వస్తువు లందుము. ఈ వస్తువులందలి అణువుల అంతఃప్రక్రియచే మొత్తము ద్రవ్యవేగమునను గతిబలమునను మార్పు కలుగదు అనుభావము కఠినవస్తు చలనశాస్త్రమునకు మూలాధారము. కఠినవస్తు చలనశాస్త్ర విషయ మంతయు ఈ క్రింది మూడు సూత్రములలో సంక్షిప్తపరుపవచ్చును.

(1) ఒక నిర్దిష్ట దిశలో జరుగు కఠినవస్తువు యొక్క పరశద్రవ్యవేగ భేదక్రమము అదేదిశలో ఆ వస్తువుపై పనిచేయు బాహ్యశక్తుల సముదాయమునకు సమానము.

సూచన : ఈ సూత్రముచే కఠినవస్తువుపై బాహ్యబలము లేమియు ఒకానొక దిశలో పనిచేయనపుడు ఆ దిశలో కఠిన వస్తు ద్రవ్యవేగమును మార్పుచెందక స్థిరముగ నుండును.

(2) ఒక స్థిరాక్షమునకు సాపేక్షముగా జరుగు కఠిన వస్తువు యొక్క ద్రవ్యవేగ ప్రభావ భేదక్రమము అదే అక్షమునకు సాపేక్షముగా (పనిచేయు) బాహ్యబలముల యొక్క మొత్తము ప్రభావమునకు సమానము.

సూచన : బాహ్యబలములు లేనపుడు కఠినవస్తువు యొక్క ద్రవ్యవేగ ప్రభావము మారదు.

(3) ఒక కఠినవస్తువు యొక్క గతిజశక్తిభేదము అదే కాలములో దానిపై పనిచేయు బాహ్యబలముల మొత్తము పనికి సమానము.

పై సూత్రములను సాధించుటకు ముఖ్యముగా ఉపయోగపడునది డి' ఎలాంబర్టు సూత్రము.

డి' ఎలాంబర్టు సూత్రము : న్యూటను చలనసూత్రముచే '$m$' ద్రవ్యరాశి గల ఒక అణువు ఏ దిశలోనైనను '$f$' అను త్వరణమును కలిగిఉన్న ఆ దిశలో పనిచేయు బలము $x$ అయిన, $x=mf$. పై సూత్రములో $x$ బాహ్యబలము, $mf$ సార్థకబలము అనబడును.

కఠినవస్తువులోని అణువులపై ప్రయోగింపబడిన బలములు రెండువిధములుగా విభజింపబడును. (1) బాహ్య బలము (2) అంతర్బలము. అంతర్బలములు తమలో తాము కఠినవస్తువుయొక్క కాఠిన్యము నేర్పరచు ననియు; బాహ్యబలములును, వ్యతిరేకదిశలో పనిచేయు సార్థకబలములును, కఠినవస్తువును నిశ్చలస్థితిలో నుంచు ననియును; కావున కఠినవస్తువుపై పనిచేయు బాహ్య బలము అదే దిశలో పనిచేయు సార్థకబలమునకు సమము అనియు డి' ఎలాంబర్టు సూత్రము తెలుపును.

లెగ్రాంజ్ సమీకరణములు : ఏదైన ఒక కణము యొక్క స్థలనిర్దేశమును మూడు లంబాక్షములకు సాపేక్షముగా ఇదివరలో మనము నిరూపకము (Co-ordinates) ల నిర్ణయించి యున్నాము. దీనికై లంబాక్షములు అక్కరలేకయే సాధారణ నిరూపకము (Generalized Co-ordinates) ల సహాయముతో ఒక కణముయొక్క స్థలనిర్దేశమును చేయవచ్చును. ఇట్టి స్థలనిర్దేశముచే 'లెగ్రాంజ్' అను శాస్త్రజ్ఞుడు వస్తుచలన సూత్రములను కనుగొనెను. వానినే లెగ్రాంజ్ సమీకరణము లందుము. వీనిని ఉపయోగించి న్యూటను ప్రతిపాదించిన చలన సమీకరణములను సాధింపవచ్చును.

హామిల్టను సూత్రము : హామిల్టను' అను శాస్త్రజ్ఞుడు ఇంతకంటె ముందునకుపోయి చలించుచున్న మండలము యొక్క గతిజశక్తియు స్థానికశక్తియు తెలిసినచో వానినుండి మండలముయొక్క చలనము నంతయు నిర్ధారణము చేయగల సూత్రము నొకదానిని కనుగొనెను. దీని నుండి లెగ్రాంజ్ సమీకరణములనుకూడ సాధింపవచ్చును.

వస్తుస్థితి శాస్త్రము (Statics) : వస్తుస్థితి శాస్త్రము వస్తు చలనశాస్త్రముయొక్క అంతర్భాగముగా భావింపవచ్చును. ఏలయన చలనశాస్త్రములోని సూత్రములలో కణము యొక్కగాని వస్తువుయొక్కగాని వేగమును త్వరణమును శూన్యముగ భావించినచో వస్తుస్థితిశాస్త్రము నందలి ప్రతి సూత్రమును చలనశాస్త్రమునుండి సాధింపవచ్చును.

ఉదా : న్యూటను రెండవ సూత్రము ప్రకారము '$m$' ద్రవ్యరాశి గల ఒక కణముపై ప్రయోగింపబడిన బాహ్య బలము $p$, త్వరణము $f$ అయిన $p=mf$ అగునుకదా! వస్తువు స్థావరస్థితియం దుండుటకు $f$ శూన్యము కావలసి యుండునుగదా! కావున $p=o$. అందుచే ఒక వస్తువుపై అనేక బాహ్యబలములు ప్రయోగింపబడి వస్తువు స్థావర స్థితియందుండిన ఏ దిశలోనైనను బాహ్యబలముల ఫలితము శూన్యమగును.

ఇట్లే వస్తువు స్థిరముగా నుండునపుడు దాని కోణ వేగము ఉండదు. కావున ఏదైన నిర్దిష్ట బిందువునకు సాపేక్షముగా బాహ్యబలముల మొత్తము ప్రభావము శూన్యమగును.

ఈ రెండు సూత్రములు వస్తుస్థితి శాస్త్రమునకు పునాదులని చెప్పవచ్చును.

జి. ల.

## అనువర్తిత సంఖ్యాశాస్త్రము (Applied Statistics)

:- సంఖ్యాశాస్త్ర ముఖ్యముముగా అనువర్తితము. వాస్తవ సమస్యా పరిష్కరణావశ్యకతచే అది ఉద్భవించినది. నువర్తనముల వలననే ఇది శాస్త్రమై వికసించినది. ఈ శాస్త్రాభివృద్ధి ఇది అనువర్తించగల క్షేత్రములు కనుగొనుట మీదను, దీనిని వివిధముగా ప్రయోగించుట మీదను ఆధారపడును.

ప్రస్తుత శతాబ్దారంభముననే ఒక రూపమునకు వచ్చినను, ఈశాస్త్రము వివిధ ప్రయోగ వైవిధ్యమునందు

ఇతర శాస్త్రములను మించును. ఇది ప్రతి పరిశోధనయందును విలువైన పరికరము. సాధారణ లోహములతో స్వర్ణమును ఉత్పత్తిజేయ నాశించు రసవాదకుని నుండి ప్రకృతి యొక్క ప్రధాన సత్యముల పరిశోధించు శాస్త్రజ్ఞుల వరకును ఈ శాస్త్రము మిక్కిలి ఉపకారకముగానున్నది. పరిశీలకులు పరిశీలనా విధానమును ఏర్పరచుటయందును, పరిశీలితాంశములను సేకరించుట యందును, వానినుండి నిర్ణయములను వెలువరించుట యందును దీనినుపయోగింతురు. సంఖ్యాశాస్త్రముయొక్క ఈ సత్వర విస్తరణములోగల రహస్య మేది అను ప్రశ్నకు సమాధానము ఈ శాస్త్ర పరిణామ చరిత్రయందు కాననగును.

సంఖ్యాశాస్త్రము మొట్టమొదట ఒక రాష్ట్రమునకు లేక దేశమునకు సంబంధించిన అంశములకును, సంఖ్యలకును సంబంధించియుండెను. సులభగ్రహణమునకై సేకరించిన వివరములను క్రోడీకరించి ఒక ప్రత్యేక విధానమున అమర్చవలయును. ఉదా : 1951 వ సంవత్సరపు జనాభా లెక్కలలో ప్రతి వ్యక్తికి సంబంధించిన వృత్తాంతము ప్రత్యేక పత్రములపై వ్రాయబడెను. అట్టి కాగితముల మొత్తము రమారమి 35 కోట్లు. పై కాగితములనన్నింటిని ఒక పెద్ద గదిలో కుప్పగా చేర్చి మన ప్రజల వృత్తాంతమును తెలిసికొనగోరు వ్యక్తికి ఆగదిని చూపినచో ఆత డేమి తెలిసికొనగలడు ? అందుచే సేకరించిన వృత్తాంతమును ఒక్కచో సంగ్రహించి, సుబోధమగు రూపమున అమర్చుట మన ప్రథమ కర్తవ్యము. ఇదియే జనాభా లెక్కల నివేదికలు చేయ యత్నించు పని. అనగా అవి మొత్తము జనాభా యొక్క స్వభావ వర్ణనలను పట్టీల రూపములలో కుదించి అందజేయును. ఉదా : ఫలానా వయస్సునకు లోబడినవారి సంఖ్య లేక రెండు వయఃపరిమాణములకు (మాటవరుసకు 15-55 సం.) మధ్య వయస్సుగలవారి సంఖ్యను తెలుపు వయస్సు పట్టీలును గలవు. బహు సంఖ్యాకములగు ప్రత్యేకపు జాబితాలలో గల వృత్తాంతమును సంగ్రహముచేసి సముదాయమును వర్ణించు ముఖ్యమగు కొన్ని పట్టీలరూపమున సమర్పించు ఈ పద్ధతి అనువర్తిత సంఖ్యాశాస్త్ర విధానము యొక్క పరిణామ విస్తృతిలో మొదటి మెట్టు. అనగా ప్రత్యేక వర్ణనము గాక సాముదాయిక వర్ణనమే దీని ఉద్దేశము.

కేవల వర్తమాన పరిస్థితి యొక్క వర్ణనము, ప్రయోజనకరమగుట నిజమేయైనను, అది భవిష్యత్పరిస్థితి ఎట్లుండునో సూచింపజాలనిచో విజ్ఞానప్రదముకాజాలదు. పదేండ్లలో నిరుద్యోగమును నిర్మూలింపబూనునతడు రాబోవు పదేండ్లలో కార్మికవర్గమునందు ప్రవేశించు జనుల సంఖ్య తెలిసికొనగోరును. అతడు ముందు జరుగబోవుదానిని అడుగుటలో అసాధ్య విషయమును తెలియగోరుటలేదు. ప్రాణహానికి ఆస్తినష్టమునకు పరిహారమొసగయత్నించు భీమాకంపెనీని గురించి ఆలోచింతము. కంపెనీవారు రాబోవు వత్సరములలో మరణింపబోవు వారి సంఖ్యను, ఆకస్మికముగా అగ్నిప్రమాదములకును, దొంగతనమునకును గురియగు ఆస్తి విలువను తెలిసికొనగోరుదురు. పలు విధములైన జూదములలో తన ఆస్తినంతయు ఒడ్డి నిరుత్సాహమునకు గురియైన జూదరినుత్సాహపరచుటయు, చెప్పిన భవిష్యత్ఫలము జరిగిన వెనుక కానుకలు స్వీకరింప వేచియుండు జ్యోతిశ్శాస్త్రజ్ఞులను, సాముద్రిక శాస్త్రజ్ఞులను దయదల్చుటయు, పుత్రికా రూపమైన బాధ్యతాభిముక్తికై నిరీక్షించు గర్భవతికి ధైర్యము గరపుటయు మన కావశ్యకములా ?

వీరందరికిని గల సాధారణ సమస్య భవిష్యత్తునకు సంబంధించినదే. దీనికి తగినంత సామర్థ్యముతో భవిష్యత్ఫలితములను చెప్పుటకు సాయపడు మూల విషయములను గూర్చి పరిశోధనచేయవలెను. ఈ సమస్యా పరిష్కారమునకు రెండు విధములైన పద్ధతులు కలవు. జరిగిన ఫలితముల నుండి హేతువును నిశ్చయించుట, లేక ప్రత్యేక విషయజ్ఞానమువలన సాధారణవిషయమును కనుగొనుట అను ప్రేరకపద్ధతి యొకటి. వివిధ ఫలితముల పునఃపునరావృత్తిని నిర్ణయించు నిగమన పద్ధతి మరియొకటి. ఈ రెండవ పద్ధతి సంభావ్యతాకలన గణితరూపమున **(calculus of probability)** ఫర్మా, పాస్కల్, డిమోవియర్, బేయస్, లాప్లాస్, డిమోర్గన్, గాపూస్ మొదలగు గణితశాస్త్రజ్ఞులచే ఇంతకుపూర్వమే పెంపొందింపబడెను. ప్రేరకపద్ధతిని వాడుకలోనికి తెచ్చు కర్తవ్యముమాత్రము ఈ యుగమునందలి శాస్త్రజ్ఞుల కొరకు మిగిలియున్నది. ఈ విధముగా సంఖ్యాశాస్త్రము అను నూతన విజ్ఞానము ఉదయమగుట సంభవించినది.

ఈ శాస్త్ర మెట్లు వివిధ క్షేత్రములందు అనువర్తితమై ముఖ్యస్థానము నాక్రమించెనో తెలిసికొనకున్నచో దాని చరిత్ర అసంపూర్ణమగును.

"ఈ శాస్త్రము ఇరువదవ శతాబ్దమునకు ప్రత్యేకత నొసగిన మానవాభ్యుదయ విధానమందలి వింత అంశమనియు, ఈ యుగము తన వ్యాపారము లందలి ప్రధాన విషయములకై అనువర్తిత సంఖ్యా శాస్త్రజ్ఞుల వంకకే తిరుగుననియు, ప్రతి ప్రముఖ ప్రయత్నమునకు వారే సూత్రధారులనియు, అతి ముఖ్యమైన శాస్త్ర పరిశోధనములలో ప్రయోగ కార్యక్రమములను లేక పరిశీలన విధానములను ఏర్పరచి నిర్ణయించుటకును, ఫలితములను విభజించుటకును, నిదర్శనములకు విలువకట్టుటకును, విశదముకానిదానిని స్పష్టీకరింపబడినదానినుండి వేరుచేయుటకును సమర్థులు ఈ అనువర్తిత సంఖ్యాశాస్త్రజ్ఞులే" యనియు ఈ శాస్త్ర ప్రతిష్ఠాపకులలో ఒకడైన ఫిషర్ అను నాతడు అభిప్రాయ పడుచున్నాడు.

మనమిప్పుడు ఈ శాస్త్రమును ఉపయోగించు కొన్ని రంగములను పరిశీలింతము.

1. జాతీయ వ్యవహారములు - సంఖ్యాశాస్త్రము : ప్రజల యొక్క యోగక్షేమసాధనమే దేశముయొక్క లక్ష్యము. సాధారణ మానవునియొక్క ఆరోగ్యానంద శ్రేయస్సులను వృద్ధిచేయు టెట్లు? దీనికి దేశమునందున్న వివిధ ద్రవ్యములను సమర్థతతో నుపయోగించుకొనుటకు ఒక చక్కని పద్ధతిని ప్రణాళికను ఏర్పరచుట అవసరము. సంఖ్యాశాస్త్రము, పై విధానమును నిర్మించుటకు మార్గము నుపదేశించుచు, దాని ఆచరణమును స్వాధీనము నందుంచుకొనుటకు సాధనముగా నుపయోగించును. వర్తమాన వ్యవహారముల పరిశీలనానంతరమే ప్రణాళిక పరిణామమును చెందును. రెండవ పంచవర్ష ప్రణాళికలో, మన ప్రభుత్వ మాశించునట్లు కుటీర పరిశ్రమలను ప్రోత్సహించు టెట్లు? సరియైన లెక్కల నమర్చి లక్ష్యములను నిర్ణయించినచో ఈ ప్రశ్నకు సమాధానము సులభమేయగును. వివిధ మూలధనములను మూడు భాగములుగా విభజించనగును. (1) భారీ పరిశ్రమలు (2) ఉపయోగ్య వస్తు యంత్రాగారములు (3) కుటీర పరిశ్రమలు అని. భారీ పరిశ్రమలకు అత్యధిక వ్యయము అవసరము ; అవి కొలదిమందికే పనిని కల్పించును. కాని అవి దేశ శ్రేయస్సునకు దేశ పరిశ్రమల భవిష్యదభివృద్ధికిని ముఖ్యములు. కుటీర పరిశ్రమలు వీనికంటె భిన్నములు. అవి మితమైన మూలధనముతో అనేకులకు ఉద్యోగములను కల్పించును. కాని వాని ఫలాదాయము తక్కువ. ఉపయోగ్య వస్తు యంత్రాగారములు మధ్యతరగతికి చెందినవి. రెండవ పంచవర్ష ప్రణాళికలో అంచనా వేయబడినట్లు పది ఏండ్లలో నిరుద్యోగమును నిర్మూలించుట, ఇరువది ఏండ్లలో జాతీయాదాయమును ద్విగుణీకరించుట అను లక్ష్యములు సిద్ధింప వలెనన్నచో, పై పరిశ్రమల ప్రతి విభాగమునందును ఒక్కొక్కని నియమించుటకు కావలసిన మూలధనమును, ఆ ధనము నుండి రాబోవు ఆదాయమును తెలిసికొన్నచో, వివిధ రంగములకు కావలసిన మొత్తము పెట్టుబడి ధనమును సులభముగా గణించనగును. పి. సి. మహలనోబిస్ **(P. C. Mahalanobis)** గారి గణన ప్రకారము ప్రారంభమున మనము మన దృష్టిని ఎక్కువగా భారీ పరిశ్రమల యందును, కుటీర పరిశ్రమల యందును కేంద్రీకరింప వలసినవారమగుచున్నాము. లెక్కలు లేకుండా ప్రణాళికల నేర్పరచుట సక్రమమైన పద్ధతి కాదు.

ప్రణాళికా నిర్వహణమునకు వివిధ వ్యాపారములతో సామరస్యము కలుగునట్లును, ఆటంకములు తొలగునట్లును జాగ్రత్త వహింపవలయును. అవసరముల పరిమాణమును మెలకువతో గణించి వివిధ రంగములకు కార్మికులను ఆహారమును, ముడిసరకులను తగిన విధమున సమకూర్చ వలయును. ఆపేక్షించిన విధమున అభ్యుదయము చేకూర నిచో కారణములను విమర్శించి అవసరమైనచో ప్రణాళికను మార్చవలయును.

2. స్థాలీపులాక న్యాయమున సమగ్ర విషయమును కనుగొనుట : ఒక ఋతువున ఏదియో యొక పంట పండు భూమియొక్క వైశాల్యము, ఒక నగరమునగల వివిధ ధాన్యముల మొత్తము రోగసంభవము, నిరుద్యోగ వ్యాప్తి, జనుల సాంఘికాభ్యాసములు, వర్తమాన సమస్యలు మొదలగువాటిని గూర్చి ప్రజాభిప్రాయాదులను నిర్ణయించుటకు సమగ్రపరిశీలనము అవసరమని తలచెడివారు.

అట్టి పూర్తి లెక్కల సంపాదనమున కలుగు వ్యయ ప్రయాసలను కాలక్షయమును ఓర్చినను, సరియైన పరిశీలనము లేకున్న అవి విశ్వసనీయములు కాక పోవచ్చును. అంతేగాక పెక్కు సమయములలో కొద్ది వ్యవధిలోనే అంచనాలు కావలసియుండును. కావున పూర్ణ పరిశీలనమునకును సేకరించిన విషయముల క్రోడీకరణమునకును కాలము చాలదు. సముదాయము నందలి ఎల్ల అంశములను పరిశీలింపకుండనే స్థాలీపులాక సిద్ధాంతముచే విశ్వసనీయమైన నిర్ణయమునకు రాగలమని రుజువుచేయబడినది. అధికవ్యయముతో సముదాయమును సమగ్రముగా పరిశీలించి సేకరించిన విషయములకంటె పొలములు, ఇండ్లు మొదలగు స్వల్ప సంఖ్యాకములైన భాగముల పరిశీలనముచే గ్రహింపబడిన విషయములే మేలైనవని గమనించబడినది. క్రోడీకరణము గూడ సమర్థతతో చేయనగును.

మన ప్రభుత్వముయొక్క జాతీయరకముల పరిశీలన సంఘమును (National Sample Survey) ఇచట తప్పక పేర్కొనవలయును. అది సంఖ్యాశాస్త్ర సంస్థ (Indian Statistical Institute) వారి ఉపదేశానుసారము నడపబడుచున్నది. ప్రతి నాలుగునెలలకాలములో రమారమి వేయి గ్రామములలో కొలది గృహములనుమాత్రమే పరిశీలించి, వివరములను సేకరించుచు మన దేశముయొక్క సాంఘిక-ఆర్థిక-వ్యవస్థలపైని జనపరిస్థితులపైని వ్యాఖ్యానించుటకు పూను సంస్థలలో అదియే మొట్టమొదటిది. ఇట్లు విస్తర వైశాల్యమును, సంగ్రహణ పునఃపునరావృత్తిని, శీఘ్ర క్రోడీకరణమును ఏ సమగ్రగణన విధానమందయినను ఊహింప నలవికావు.

3. పరిశ్రమలు : సంఖ్యాశాస్త్ర విధానము ప్రత్యేకముగా ప్రయోగింపబడు క్షేత్రములలో పరిశ్రమ ఒకటి. పరిశ్రమావశ్యకములను తీర్చుటకే కొన్ని ప్రత్యేక సంఖ్యాశాస్త్ర విధానములు వర్ధిల్లినవి. అట్టి పద్ధతులలో (1) వస్తుస్వరూప నియమనమును (Statistical Quality Control or S. Q. C.) విధించుట (2) రకములను పరిశీలించు ప్రణాళికలు (Sampling Inspection Plans) అనునవి. వీనిలో మొదటిదగు S.Q.C. అమెరికాలోని బెల్ టెలిఫోన్ ప్రయోగశాలలో డబ్ల్యు. ఎ. షివర్ట్ (W. A. Shewart) అను శాస్త్రజ్ఞునిచే ప్రవేశపెట్టబడినది. దాని సంభావ్యశక్తుల పరిమితి పరిశోధనములచే కనుగొనబడినది. పరిశ్రమలలో 20 వ శతాబ్దమున కనుగొనబడిన ప్రముఖ పరిశోధనముగా అది పరిగణింపబడుచున్నది. అది అవిచ్ఛిన్నమైన ఉత్పాదనమున వస్తుగుణములో గల సహజములైన మార్పులను గుర్తించుచు, ఉత్పత్తి సాగుచుండగా గుణపరిమాణములో జరుగు పరివర్తనములను పటరూపమగు విధానము ద్వారమున నిరూపించును. ఉత్పాదనమున అంతరాయము ఎచ్చట నున్నదో కనుగొని సరియగు పద్ధతి నవలంబించుటకు అది సూచనలు చేయును. ప్రస్తుత ఉపకరణములతో పని సాగుచుండగా కలుగు మార్పులను గుర్తించి సవరించు ఈ S.Q.C. విధానమే లేకున్న పరిశ్రమ ప్రచోదకులు పెక్కు సవరణలుచేసి తన్మూలమున విరామకాలమున గలుగు ఉత్పత్తి నష్టము ననుభవించుటయో, కొద్ది సవరణలే జేసి ఎక్కువగా శాతము చెడు వస్తువుల ఉత్పత్తిచేయుటయో సంభవించి యుండెడిది.

మన దేశ పరిశ్రమలలో ఇప్పుడు S.Q.C. ఎక్కువగా వాడబడుచున్నది. మూలధన వ్యయము లేక, ఉత్పత్తిని పెంచు జాతీయ మూలద్రవ్యముగా ఇది పరిగణింపబడుచున్నది. సంఖ్యాశాస్త్రజ్ఞుని స్వరూప చిత్రములో గుడ్డి నమ్మక ముంచుటయే ఈ మూలద్రవ్యము !

ఇక రెండవది యగు వస్తు పరిశీలన ప్రణాళికలను మొదట ప్రవేశపెట్టినవారు డాడ్జ్ (Dodge), రోమింగ్ (Romig) అనువారలు. వీటిని అభివృద్ధికి తెచ్చినవాడు అమెరికా యందలి అబ్రహామ్ వాల్డ్ (Abraham Wald) అనునతడు. ఇది నమకూర్పబడు వస్తువుల పరిశీలనమునకగు వ్యయమును సాధ్యమయినంత తక్కువచేయును. ఉత్పత్తిచేయబడిన మొత్తము వస్తువుల గుణపరీక్ష కొన్ని వస్తువుల పరీక్షచేతనే తెలుపబడును.

4. జీవశాస్త్రము : నవీన సంఖ్యాశాస్త్ర విధానములు అనేకములు జీవశాస్త్రమున ప్రయోగించుటకే వెలువడినవి. రకములకొలతలలోని మార్పులను గమనించుటకు ఈ శాస్త్రవిధానములుఅవసరమని జీవశాస్త్రజ్ఞులు అభిప్రాయపడిరి. వారు డార్విన్, గాల్టన్ మహానీయుల భావనా

ప్రాబల్యమువలన మానవుని వంశపారంపర్యసమస్యను పరీక్షింప మొదలిడిరి. లండన్ జీవపరిమాణ ప్రయోగశాలలో కె. పియర్ సన్ అను శాస్త్రజ్ఞుడు గుణ స్వభావము లందలి పరివర్తనములను, సహపరివర్తన స్వరూపములను చాలవరకు పరిశీలించెను. తరువాత ఫిషర్ మహాశయుడు పరివర్తన విశ్లేషణవిధానమును **(Analysis of Variance)** కనిపెట్టెను. ఈ విధానమువలన సముదాయములలో ఆంతరముగా గలుగు మార్పుల గమనించుచు, సముదాయములకు సముదాయములకు నడుమ నుండు భేదమును పరీక్షించనగును. పూర్వ మీపరీక్ష కష్టముగా నుండుట వలన జీవశాస్త్రజ్ఞులు జంతు వృక్ష స్వరూప గుణముల యొక్క పరీక్షతోనే తృప్తిపడుచుండిరి.

నవీన సంఖ్యాశాస్త్ర విధానము యొక్క ప్రయోజనములను గుర్తెరుగువానిలో ఉత్పత్తి క్రమశాస్త్రము తన సత్వరాభివృద్ధికి సంఖ్యాశాస్త్రమున కెంతయు ఋణపడి యున్నది. సంఖ్యాశాస్త్రము, ఉత్పత్తి క్రమశాస్త్రము ఈ రెండును ఇరువదియవ శతాబ్దమునకు ప్రత్యేకత నొసంగిన విధానములు. ఈ రెండును ప్రత్యేకదృష్టి గలిగి శాస్త్రీయ పరిశోధనవిధానములలో తమ ప్రాబల్యమును చూపుచున్నవి. ఉత్పత్తి క్రమశాస్త్రజ్ఞుడు ప్రయోగ ఫలితములను సంఖ్యాశాస్త్రమువలన విభజించి, ఉత్పత్తిక్రమము యొక్క భావనలను సంగతమగు చట్టమున నుంచగలిగెను. అందువలన క్రొత్త విషయములు కనుగొనుటకు అవకాశము చిక్కినది. మనుజులలోని రీసస్ **(Rhesus)** రక్త సముదాయముల యొక్క అనువంశికసూత్రములను అతి శీఘ్రముగా కనుగొనుటయే ఈ రెండు శాస్త్రముల అన్యోన్య సహాయమునకు నిదర్శనము.

ఉత్పత్తి శాస్త్ర విషయ పరీక్షలో సంఖ్యాశాస్త్రము విజయముపొందుటకు గాసెట్, ఫిషర్ మొదలగు శాస్త్రజ్ఞులచే కనుగొనబడిన కొలది రకముల సిద్ధాంతమే **(Small Sample Theory)** ప్రధాన కారణము. ఈ సిద్ధాంత సహాయమున వివిధాధారముల నుండియు, వేరు వేరు దేశముల నుండియు లభించిన స్వల్ప వివరములను పరీక్షించనగును. సంగత భాగములను మేళవించి, మన పరిశీలన విషయజ్ఞానమును వృద్ధిచేసికొనవచ్చును. ఇంతకు ముందు సంఖ్యాశాస్త్రజ్ఞుడు భిన్న-ఆధారముల నుండి సేకరింపబడిన సముదాయ వస్తుజ్ఞానము మీదనే ఆధారపడవలసియుండెను. ఆ వృత్తాంతములను సజాతీయమైన రకముగా నెంచలేము. అందున్న సంకీర్ణతను గుర్తెరుగక చేయు నిర్ణయములు సరిగా నుండజాలవు.

మొక్కల పెంపకపు విధానమును పరీక్షింతము. ఇందు క్రొత్త మొక్కలను, మంచిఫలమునిచ్చు మొక్కలను ఉత్పత్తిచేయుటయే ఉద్దేశము. ఈ విధానము ననుసరించియే అమెరికా దేశము సంకీర్ణధాన్యభేదమును **(Hybrid corn)** పండించగలిగినది. తత్ఫలితముగా వారి జాతీయాదాయము 10% హెచ్చినది. మొక్కల పెంపకమున రెండు విధానములు గలవు. (1) సంకరజాతి పెంపకము, (2) స్వభావ సిద్ధమగు జాతి పెంపకము. ప్రతి రంగమునందును అనేక వ్యత్యాస గుణములు గల జాతులను పోల్చి, మంచి ఫలాదాయము నిచ్చువానిని గ్రహించవలసిన బాధ్యత కలదు. ఈ ప్రయోజనమునకై ప్రయోగ స్వరూప శాస్త్రము **(Design of Experiments)** పెంపు చేయబడినది. దీని వలన సాధ్యమైనంత నిర్దుష్టముగా ప్రయోగఫలితములందలి భేదములను ఊహించుటకు వీలగు పరీక్షలను చేయవచ్చును.

5. విద్య, మనశ్శాస్త్రము : జ్ఞానము, అభిరుచి, మనోభావము మున్నగు పదములు మనము సాధారణముగా వాడునవే. కాని వానిని కొలుచుటలో పెక్కు భావ క్లేశములు మనల నెదుర్కొనును. ఈ కొలతల కావశ్యకమేమి ? ఒక వ్యక్తి ఫలానా ఉద్యోగమును గాని, వృత్తిని గాని. ఈవిధముగా నిర్వహించగలడని అంచనా వేయుటకు ఈ కొలతలు కావలసియుండును. ఆ వ్యక్తి సమర్థుడైన శాస్త్రజ్ఞుడగునో, న్యాయవాది యగునో, వైద్యుడగునో, అధికారి యగునో కనుగొనుటకు మనస్తత్వ వేత్తలయిన బినెట్ సైమన్, స్పియర్ మన్, థామ్సన్ మున్నగువారు అనేక పరిశోధనములను చేసియున్నారు. కొన్ని పరీక్షలలో ఒక వ్యక్తి ప్రదర్శించు సామర్థ్యముపై అతని భావి ప్రవృత్తి ఆధారపడియున్నచో, ఆ పరీక్షలు విశ్వసనీయములుగను, క్రమబద్ధములుగను ఉండవలయును. రెండు భిన్న కాలములయందు జరుపబడు పరీక్షలో ఒకేవ్యక్తి సంపాదించిన ఫలితములం దెక్కువ భేద ముండకుండినచో తత్ఫలము విశ్వసనీయమైనదిగా గుర్తింతుము. అట్టి పరీక్షా

ఫలితములపై ఆధారపడిన అంచన ఎంతవరకు సత్యమగునో తెల్పు ప్రమాణమునే పరీక్షాక్రమ మనవచ్చును. మనస్తత్వవేత్తలు సంఖ్యాశాస్త్రముయొక్క అన్యోన్య సంబంధ సిద్ధాంతముల సహాయమున పై పరీక్షలు మరింత క్రమమైనవిగను, విశ్వసనీయమైనవిగను ఉండునట్లు అభివృద్ధిచేయుచున్నారు. బహుళాపవర్త్య సంఖ్యా శాస్త్ర విభాగము (Multivariate analysis) యొక్క ఆధునికాభివృద్ధి పై సమస్యలపై మరింత ప్రకాశమును ప్రసరింపజేయుచున్నది. నేడు మనము ఈ పరీక్షల సహాయమున సంఖ్యాశాస్త్ర విధానములను నవలంబించుచు, విద్యావృత్తి సంస్థల యందు విద్యార్థులను, కర్మాగారముల యందు విధానజ్ఞులను, ప్రభుత్వ నిర్వహణమునకు కావలసిన నిర్వాహకులను, ప్రశస్తతరముగా ఏరుకొనగలుగుచున్నాము.

6. వైద్యసంబంధోపయోగములు: విచారదశ, మనోవ్యాధి, మానసికచికిత్స మొదలగు నరముల సంబంధమైన రోగముల రకముల విభజనమునకు సంఖ్యాశాస్త్రము ఉపయోగపడును. ప్రస్తుతమున్న పరీక్షలు ఆ వ్యాధుల రకములను స్పష్టముగా చెప్పుటకు అవకాశము నిచ్చుట లేదు. ఫిషర్ మహాశయునిచే కనుగొనబడిన లుప్తీకరణ ప్రమేయములో (Discriminant Function) శోధనముల మేళవించుటవలన కొంతవరకు పై విభజనము జయప్రదముగా చేయనగును. ఇచట వైద్యచికిత్స శస్త్రచికిత్స అవసరమగు రెండువిధములైన కామెల రోగమును వేరుపరచుటకు ప్రయోగించు జీవరసాయనిక శోధనములను చెప్పవలసి యుండును. నరముల సంబంధమైన. రోగ విభజనము వలెనే, ఇచటను రోగులను ప్రత్యేకమగు రెండు తరగతులుగా పై శోధనములు విభజింపలేవు. అందు కొంత సంకీర్ణత కనబడును. అమిత వ్యయముతో పరీక్షల సంఖ్య యెక్కువచేసి రోగ నిర్ణయమును జేయుటయో, లేక అనుకూలములగు పై రెండు పరీక్షలతోనే సంతృప్తి పడుటయో జరుగవలసి యుండును. కాని పై నుదాహరించిన లుప్తీకరణప్రమేయ సహాయమువలన రోగ నిదానము తప్పుగాచేయు ప్రమాదము చాలవరకు తగ్గిపోవును.

7. ఆర్థిక శాస్త్రము: "కచ్చితముగాని కొన్ని విషయములను సంఖ్యాశాస్త్రము యొక్క సామాన్య పద్ధతులు నిర్వహింపలేవు. కాని మానవుని మనస్సు అట్టి విషయములను గూడ నిర్వహింపగలదు" ఆర్థికశాస్త్ర పరిశోధన విషయమున ఇది నిజముగా కన్పించుచున్నది. అనేక ఆర్థికశాస్త్ర సిద్ధాంతములు సహజనుగా గుణప్రధానములైనవి. వానికి ఆధారముగా సంఖ్యా సంబంధమైన వివరములు ఉండవు. కావలసిన అంశముల అభావమే దీనికి కొంతవరకు కారణము. పూర్వపు ఆర్థిక సిద్ధాంతములలో పెక్కు ఒడుదొడుకులు కాననగును. సరియగు వివరములను సేకరించుట, సిద్ధాంతీకరించుట రెండును కలిసిమెలసి వర్తించుచో సమరసభావ స్వరూపము నిర్మింపనగునని తెలిసికొనబడినది. ఆర్థికశాస్త్రమునకును, సంఖ్యాశాస్త్రమునకును సమీప సంబంధము కలుగజేయుటకై ఆర్థిక సంఖ్యాశాస్త్రము (Econometrics) స్థాపింపబడినది. వివిధ కాలపరిమితిగల ప్రణాళికలలో దాని ఉపయోగమునుబట్టి చూడ ఆ ప్రయత్నములు అప్పుడే ఫలోన్ముఖమునకు రావొడగినవి. ఇది హాలండ్ దేశమున టిన్‌బర్గెన్‌చే నిరూపించబడినది.

8. భౌతిక, రసాయన శాస్త్రములు: సునిశ్చితములగు రసాయన భౌతిక శాస్త్రములవంటి శాస్త్రములలోగూడ సంఖ్యాశాస్త్రము ఎట్లు ఉపయోగించునని శంక కలుగవచ్చును. ఈ శాస్త్రములు ప్రకృతియొక్క స్థిరమైన ధర్మములతో సంబంధించియున్నవి. ఈ ధర్మములను కచ్చితముగా కొలువగలము, నిర్ణయించగలము. గావుస్(Gauss) మహాశయునిచే పెంపొందింపబడిన 'పర్యవేక్షణ దోష విభజనము' (distribution of errors of observations) ఒక్కటే భౌతికశాస్త్రజ్ఞునికి సంఖ్యాశాస్త్రమున శ్రద్ధను కలిగించెను. కాని భౌతిక శాస్త్రజ్ఞులచే వృద్ధిచేయబడిన పెక్కు ముఖ్యభావములలో సంఖ్యాశాస్త్ర - అంశములు అంతర్గతములై యున్నవి. అణువేగముల విషయమున గావుస్ మహాశయుని త్రిస్థితిక విభజన సిద్ధాంతమును ఉపయోగించుచు, మాక్స్‌వెల్ కనిపెట్టిన 'బాష్పచలన' సిద్ధాంతము (Kinetic Theory of Gases) యొక్క ప్రవేశమువలన వ్యాప్తి, ఉష్ణసంక్రమణము, చిక్కదనము మొదలగు దృగ్విషయములను స్పష్టముగా అర్థముచేసికొనుటకు అవకాశము కలిగినది. తరువాత సంఖ్యాశాస్త్ర నియమములపై ఆధారపడిన తేజః కణవాదము (Quantum Mechanics) కనుగొనబడినది.

భిన్నమైన కొలతలు, భారములుగల అణుసముదాయములను తలచుకొని, కర్బనార, రబ్బరు, మాంసకృత్తులు మొదలగు పదార్థముల ధర్మములను వివరించుటకు రసాయన శాస్త్రజ్ఞులు మొదలిడుచున్నారు. రసాయనికపు మార్పులవలన పదార్థములలో కలిగిన ధర్మవికారములను సముదాయపుపొడవులో పంపకముయొక్క పునః పునరావృత్తిలోని మార్పు రూపముచే వివరించుచున్నారు. సంఖ్యాశాస్త్ర భావములు మెల్లగా నవీన రాసాయనిక సిద్ధాంతములలో చొచ్చుకొని పోవుచున్నవి.

9. సాహిత్యము : సాహిత్యమువంటి విభాగముల యందు సంఖ్యాశాస్త్రముయొక్క ఉపయోగములు అరుదుగా కాననగును. ఉదా : సాహిత్యములోని పలు రకములలో అక్షరముల పునః పునరావృత్తియొక్క జ్ఞానము రహస్య రచనాశాస్త్రమున ఉపయోగించును. దీనినిబట్టి సాంకేతికభాష గుర్తింపబడినది. ఆంగ్లేయ సాహిత్యములో E అను అక్షరము తరచుగా ఉపయోగింపబడును. అందువలన స్మృతి భాషలో తరచుగా ఉపయోగించు సంకేతము E అని నిరూపింపవచ్చును. అటులనే అక్షరముల యొక్క వివిధ మేళనముల పునః పునరావృత్తి మరికొన్ని వివరములనిచ్చును. రహస్యరచనాశాస్త్రమున సంఖ్యాశాస్త్ర పద్ధతులు వృద్ధిచేయబడి, రెండవ ప్రపంచ సంగ్రామమున శత్రువుల రహస్యవార్తలను కనుగొనుటకు జయప్రదముగా ఉపయోగింప బడినవి.

ఒక రచయితయొక్క శైలిని గురించి చెప్పుటకు సంఖ్యాశాస్త్ర పద్ధతుల నుపయోగింప ప్రయత్నించినవాడు జి. యు. యూల్ (G. U. Yule) అనునతడు. ఇందు ఒకరి రచనలలోని వాక్యముల పొడవు, కల్పనలు మొదలగు వివిధ గుణములయొక్క పునః పునరావృత్తి పరిశీలించబడును. రచయితల శైలిలోగల తారతమ్యము లను కనుగొనుట కిది యొక మంచిసాధనము. ఒకగ్రంథము యొక్క కర్తృత్వము సందిగ్ధమై యున్నప్పుడు దీనినిబట్టి, ప్రాయికముగా గ్రంథకర్తను నిర్ణయించవచ్చును.

మన దేశీయుడగు య్యార్డి అను నతడు బహిరంగ సాక్ష్యములులేని షేక్స్పియర్ గ్రంథములు ప్రకాశపరచిన తేదీలను కనుగొనుటకై సంఖ్యాశాస్త్ర విధానము నుపయోగించి యుండెను. పెక్కు గ్రంథముల విషయమున తేదీలు విదితములై యున్నవి. కాని **Love's Labour Lost, Taming of the Shrew** మొదలగు కొన్నిటి విషయములు తెలియక పోవుటయు, వివాదాస్పదములై యుండుటయు సంభవించెను. రచయితల శైలిలో కొన్ని గుణములు కాలము ననుసరించి మార్పు చెందుచుండును. పై సమస్యను పరిష్కరించుటకు ఇది ఆధారముగా గ్రహింపబడినది. రచయిత శైలిలోని విరామము, ఒత్తిడి (Stress) అను రెండు గుణముల కొలతలు గ్రహింపబడినవి. షేక్స్పియర్ రచించిన అన్ని గ్రంథములయందును కవిశైలికి స్వభావసిద్ధములైన పై రెండు గుణముల కొలతలు తీసికొనబడినవి. తేదీలు తెలిసిన గ్రంథములను మాత్రము పరీక్షించి శైలీ స్వరూపమునకును ప్రచురణకాలమునకును గల సంఖ్యాశాస్త్రీయ సంబంధము స్థాపింపబడినది. శైలీ స్వరూపమును గుర్తించు అట్టి సంబంధమునుబట్టి తెలియని గ్రంథ ప్రచురణకాలమును ఊహింపవచ్చును. ఈ పద్ధతినిబట్టి షేక్స్పియర్ యొక్క **Love's Labour Lost** అను గ్రంథము 1591-92 వసంత ఋతువునందు రచింపబడినట్లు నిశ్చయింపబడినది.

10. సంఖ్యాశాస్త్ర దుర్వినియోగములు : ఒక విధముగా సంఖ్యాశాస్త్రము నిపుణులయొక్క భాషయని చెప్పవచ్చును. అనుభవము లేనివారును చక్కగా తెలియనివారును న్యాయాన్యాయ విచారములేని రాజకీయ వేత్తలును ఈ శాస్త్రమును దుర్వినియోగము చేయవచ్చును. దైనిక సమస్యల పరిష్కరించు ఇతర అనువర్తితశాస్త్రముల వలెనే దీని విషయమున గూడ ప్రమాదము కలదు. ఫలితములను తప్పుగా గ్రహించి వానిని సరిదిద్దుటకై చేసిన యత్నముల వలన ఒక్కొక్కప్పుడు శాశ్వత నష్టములు సంభవింపవచ్చును. అనుకొన్న విషయమును ఋజువు చేయుటకై కావలెనని వలసిన విషయములనే సేకరించుట వలనను, చాలని వృత్తాంతముల వలనను, తారతమ్యము గ్రహించుటకు చాలినంత వస్తువు లేనందు వలనను, తప్పు జాబితాలను సృష్టించుట వలనను, పరిశీలన వివేకము తగినంత లేకపోవుట వలనను దుష్ఫలితములే సంభవించుచుండును.

జనులు వలసిన వివిధ వస్తువుల నెంచుకొనునట్లు బజారు ధరల పరిశీలించి వ్యాపారముచేయువారు వస్తువుల ఉత్పత్తి విషయమును నియమించుటకై సంఖ్యాశాస్త్రమును ఉపయోగించుటకుబదులుగా దానిని ప్రజలను మోసగించుటకై వినియోగించుచుందురు. ఇట్టి దురుపయోగములకై సంఖ్యాశాస్త్రనైపుణ్యమును ఉపయోగించుట తగని పని.

డా సి· రా.

**అన్నంభట్టు** :- అన్నంభట్టు ఆంధ్ర బ్రాహ్మణుడు. వేదశాస్త్ర పండితుడు. ఇతని తండ్రి తాత ముత్తాతలును మహావిద్వాంసులు. శాస్త్రగ్రంథములను నిర్మించినవారు. అన్నంభట్టు తండ్రి తిరుమలభట్టు. అతడు సర్వతోముఖ యాజి యను బిరుదము కలవాడు. సంధ్యావందన భాష్యమును వ్రాసెను. అతని తాత మల్లుభట్టు. 'అగ్నిహోత్రభ' ట్టను బిరుదము కలవాడు. ఆలోకస్ఫూర్తి యను న్యాయగ్రంథమును, తత్త్వవివేచనమను వేదాంత గ్రంథమును మహాభాష్య టీక యను వ్యాకరణగ్రంథమును అతడు రచించెను. అన్నంభట్టు ముత్తాత లోకనాథభట్టు. 'ద్వాదశాహ యజ్వ' యను బిరుదము కలవాడు. వీరందరికి మూలపురుషుడు రాఘవ సోమయాజి అని ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమున కలదు. మరియొక యాధారమును బట్టి అన్నంభట్టు కౌశికసగోత్రుడు. అతని మూలపురుషుడు అద్వైతాచార్యుడగు రాఘవసోమయాజి, తండ్రి మేలిగిరి తిరుమలాచార్యుడు, అన్న సర్వదేవుడు అని తెలియుచున్నది. ఇందు అన్నంభట్టుయొక్క తాత ముత్తాతల పేళ్లు లేవు. పై రెండాధారములందును అన్నంభట్టు అన్నంభట్టు గానే పేర్కొనబడెను. రెండు తావులందును రాఘవసోమయాజియే మూలపురుషుడని కలదు. భేదమేమన ఒకచోట అన్నంభట్టుతండ్రి తిరుమలభట్టనియు, రెండవ తావున తిరుమలాచార్యుడనియు కలదు. ఈ 'ఆచార్య' 'భట్ట' శబ్దములు ఆనాడు నిస్తుల పాండిత్యముకలవారి కొసగబడుచుండెను. అందుచేత తిరుమలభట్టు, తిరుమలాచార్యుడు ఇరువురు నొకడేయని నిశ్చయింపతగియున్నది.

విజయనగరరాజ్యస్థాపనానంతరము ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబము లనేకములు తుంగభద్రాదక్షిణ దేశమునకు వెడలెను. అట్టివాటిలో అన్నంభట్టు కుటుంబమొకటి. అన్నంభట్టువంశమునందలి అత్యంతప్రాచీనపురుషులు మొదట మామిళ్లపల్లి యను గృహనామముతోను, పిదప గరికపాటి యను గృహనామముతోను వ్యవహరింపబడుచువచ్చిరి. అన్నంభట్టువంశమునందలి ప్రాచీన పురుషులకు మామిళ్లపల్లి యను నింటిపేరు మామిళ్లపల్లి యను పేరుగల యొకానొక గ్రామమును బట్టి యేర్పడి యుండవచ్చును.

అన్నంభట్టుపూర్వులు నివసించిన మామిళ్లపల్లి యను గ్రామమెద్ది యని విచారింపతగినది. గుంటూరు మండలస్థమైన తెనాలి తాలూకా యందు మామిళ్లపల్లి యను గ్రామమొకటి కలదు. ఇందు నేటికిని మామిళ్లపల్లి యను నింటిపేరు కల పెక్కు బ్రాహ్మణ కుటుంబములు కలవు. ఈ బ్రాహ్మణులు వెలనాటిశాఖకు చెందినవారు. తెలంగాణమున మహబూబునగరం జిల్లా యందలి అచ్చంపేట తాలూకాలో మరియొక మామిళ్లపల్లి కలదు. నేడిందు మామిళ్లపల్లియను నింటిపేరు కల బ్రాహ్మణులు లేరు. ఐనను అన్నంభట్టు తెలగాణ్య శాఖకు చెందిన బ్రాహ్మణుడయియుండుటచే అతని వంశమునందలి ప్రాచీనులీ తెలంగాణము నందలి మామిళ్లపల్లియందే నివసించి ఉండిరనియు, మామిళ్లపల్లియందుండుటచే మామిళ్లపల్లి వారనియు తెలంగాణమునం దుండుటచే తెలగాణ్యులని ప్రసిద్ధినొంది యుండిరనియు ఊహింపవచ్చును. నేడు వారచ్చట లేకుండుటకు కారణము వారందరును అన్నంభట్టు తలిదండ్రుల కాలమున స్థలాంతరములకు వలసపోయి యుండుటయే కావచ్చును. ఇట్లు తెలంగాణము నందలి మామిళ్లపల్లినుండి వలసపోయిన మామిళ్లపల్లి వారిలో కొందరు కడపజిల్లాలోని ప్రొద్దుటూరునందు స్థిరపడిపోగా అన్నంభట్టు వంశమునందలి పెద్దలు ఉత్తర ఆర్కాటునందలి చిత్తూరునకు సామీప్యమున నున్న యొకానొక గ్రామమున నివాసమేర్పరచుకొనిరి. అక్కాలమున తెనుగునాడు ఉత్తరఆర్కాటు మండలము వరకు వ్యాపించియుండెను.

అన్నంభట్టు బాల్యమున విద్యాశూన్యుడయి యుండెననియు, తండ్రి యాతనిని ప్రహరించెననియు, అప్పుడాతడు స్వగ్రామ త్యాగమొనర్చి తొలుత కొండవీటి పాఠశాలయందు ప్రవేశించి యచట వేదశాస్త్రముల వళ్యా

సించి, పిదప కాశికేగి, అక్కడ వ్యాకరణ శాస్త్రమును శేషవీరేశ్వర పండితుని యొద్ద అభ్యసించి సమస్త విద్యా పారగు డయ్యెననియు నొక ఐతిహ్యముకలదు. కాశియం దితడు పొందిన యఖండ గౌరవము 'కాశీగమన మాత్రేణ నాన్నంభట్టాయతేద్విజః' అనుసూక్తి వలన తేటపడుచున్నది.

అన్నంభట్టు కాశినుండి స్వగ్రామమునకు చేరి తర్కమీమాంసాద్యనేకశాస్త్రగ్రంథములను రచించెను. ఇతడొక పాఠశాలను కొండవీటిలో నేర్పరచి విద్యార్థులకు తర్కశాస్త్రమును బోధించుచుండెను. తర్కశాస్త్రము నభ్యసించువారు క్రమముగా తర్కసంగ్రహము, దీపిక, ముక్తావళి, గాదాధరీయము మున్నగు గ్రంథములను చదువవలె నను పరిపాటి అన్నంభట్టే యేర్పరచెననియు, అప్పటినుండియే ఆ పద్ధతి ఆచరణము లోనికి వచ్చెననియు పలువురు విద్వాంసుల విశ్వాసము. ఇట్లు సుప్రసిద్ధి నొందియున్న అన్నంభట్టునకు విజయనగర సామ్రాజ్యాధిపతులలో నొకడగు శ్రీ సదాశివరాయల కాలమున అళియ రామరాజుచే గరికపాడను గ్రామము దానముగా నొసగబడినట్లు శాసనములవలన తెలియు చున్నది. కావున నీతడు క్రీ. శ. 16 వ శతాబ్ది మధ్య ముననుండెనని నిశ్చయింపనగును. గరికపాడు దానముగ లభించినది మొదలు అన్నంభట్టును తద్వంశ్యులును పారం పర్యముగ ఆ గ్రామమందే స్థిరనివాసమేర్పరచుకొని, ఆ గ్రామమునుబట్టి గరికపాటివారను గృహనామముచే ప్రసిద్ధినొందిరి. నేడు గరికపాటియందును తదితర స్థలము లందును కల గరికపాటివారు తెలగాణ్యులును కౌశిక సగోత్రులునై యున్నారు.

అన్నంభట్టు పుంభావసరస్వతి యనుట అతిశయోక్తి కానేరదు. అన్నంభట్టు తర్క మీమాంసా వేదాంత వ్యాకరణ శాస్త్రములందు నిష్ణాతుడయి పెక్కు శాస్త్ర గ్రంథముల రచియించెను. ఇతడు తర్కశాస్త్రమున - తర్క సంగ్రహము, తర్కసంగ్రహ దీపిక, తర్కభాషా తత్త్వబోధిని, ఆలోక సిద్ధాంజనము, (ఇది జయదేవుని ఆలోకమను తత్త్వచింతామణికి వ్యాఖ్య) సుబుద్ధి మనోహరము (ఇది రఘునాథశిరోమణి కృతమైన దీధితికి వ్యాఖ్య) అను గ్రంథములను వ్రాసెను. 12 వ శతాబ్ది వరకు సూత్రగ్రంథములను, పిదప గంగేశోపాధ్యాయ కృతమైన తత్త్వచింతామణిని ఆధారముగ చేసికొని న్యాయశాస్త్రము వికాసమునొందెను. ఇట్టి భేదమును బట్టియే మొదటిదానికి ప్రాచీన న్యాయమనియు రెండవ దానికి నవీన న్యాయమనియు వ్యవహార మేర్పడెను. తర్కసంగ్రహమున ద్రవ్యాదిసప్తపదార్థముల స్వరూపము సంగ్రహముగ వివరింపబడినది. తర్కసంగ్రహ దీపిక అనునది తర్క సంగ్రహమునకు అన్నంభట్టుచే వ్రాయబడిన టీకా గ్రంథము. తర్కసంగ్రహ నిర్మితి యందలి వైశిష్ట్య మెద్దియన - ప్రాచీనులు ప్రమాణ నిరూపణానంతరము పదార్థనిరూపణ మొనర్చిరి. ఆరంభమున నున్న ప్రమాణనిరూపణము మిక్కిలి కఠిన మైనదై సుబోధ మగుటలేదు. అందుచేత శాస్త్రోద్దేశము ప్రచారమునకు వచ్చుట కష్టమయ్యెను. అన్నంభట్టు ముందుగనే శాస్త్రమందలి ప్రమేయముల నిరూపించి ఆ ప్రమేయ నిరూపణమునకు ప్రమాణములను సాధనములుగా గ్రహించెను. అందువలన శాస్త్రోద్దేశము సుబోధ మగుచున్నది. ప్రాచీనులు ప్రాచీన గ్రంథములయం దొక్కొక్క భాగమునకు మాత్రమే ప్రాధాన్య మొసగి దానినే విపులముగ చర్చించిరి. అన్నంభట్టు శాస్త్రప్రమేయ సామగ్రినెల్ల సమగ్రముగాను క్లుప్తముగాను వివరించెను. తర్క సంగ్రహమందు అన్నంభట్టు క్రమమును మార్చుటచేతను, విషయమును సమగ్రముగా గ్రహించుటచేతను, సుబోధ మొనర్చుటచేతను, ఇది ఆసేతుహిమాచలము సంతత పఠనపాఠనములందు విశేషోపయోగమును కాంచుచుండుటచేతను దీనికి నవీన న్యాయమున ప్రధానస్థానము లభించియున్నది.

మీమాంసాశాస్త్రమున ఇతడు రాణకోజ్జీవిని (ఇది భట్టసోమనాథుని రాణకమునకు టీక. దీనికి సుబోధిని, సుధాహరము అనునవి నామాంతరములు) తంత్రవార్తిక టీక అను రెండు గ్రంథములను రచించెను. వేదాంత శాస్త్రమున - మితాక్షర (ఇది బ్రహ్మసూత్రములపై వ్రాయబడిన వృత్తి), తత్త్వ వివేచనము - అను రెండు గ్రంథములను రచియించెను. వ్యాకరణ శాస్త్రమునందు వ్యాకరణ మితాక్షర (ఇది పాణిని అష్టాధ్యాయిపై అత్యంత సులభమైన వ్యాఖ్య) భాష్య ప్రదీపోద్ద్యోతనము (ఇది కైయటుని ప్రదీపముపై వ్యాఖ్య) అను గ్రంథ

ద్వయమును వ్రాసెను. వేదముపై నితడు స్వరలక్షణమను గ్రంథమును రచించెను. ఇట్లన్నంభట్టు హాటకలేఖని బహుముఖముల బహురంగముల నర్తించెను.

గ. ల. కాం.

**అన్నజీవ పరివర్తన వ్యాధులు :-** పిండిపదార్థముల అన్నజీవ పరివర్తనము (కార్బోహైడ్రేట్ మెటాబోలిజం) : లాలా (ఉమ్మి) జలమందలి టైలిన్, స్వాదుపిండపు ద్రవములోని ఎమైలేస్, చిన్నిపేగు ద్రవములోని యిన్వర్టేస్, మాల్టేస్, లాక్టేస్ అనునవి పిండిపదార్థములను గ్లూకోసుగా మార్చును. పేగులలోని సూక్ష్మజీవులు కొంత గ్లూకోసును బొగ్గుపులుసు వాయువుగను, మిథేనుక్రిందను మార్చును. పేగులద్వారమున గ్లూకోసు రక్తములోనికి పేగులయొక్క పైపొర సహాయముతో పీల్చుకొనబడును. గాలక్టోసు, లీవ్‌లోసు, కాలేయమును చేరి, అచట అవి రెండును గ్లూకోసుగా మార్పునొందును. గ్లూకోసులో చాల భాగము గ్లైకోజను క్రింద మార్చబడి, కాలేయపు కణములలో నిలువచేయబడును. కొంత మాత్రము కాలేయముగుండ రక్తప్రవాహములోనికి పోవును. సుమారు 500 గ్రాముల గ్లైకోజను శరీరమునందు నిలువచేయబడి యుండును. అందు 100 గ్రాములు కాలేయములోను, మిగిలినది అస్థిపంజర కండరములందును ఉండును. సాధారణముగ రక్తమునందు 80-120 మిల్లీగ్రాముల చక్కెర యుండును. 50 గ్రాముల గ్లూకోసును ఇచ్చి రక్తమునందలి చక్కెరను ప్రతి అరగంటకు అంచనకట్టినయెడల అది ఒకగంటలో 130-160 మిల్లీగ్రాములకు పెరుగును. రెండు, రెండున్నరగంటలలో మామూలు పరిస్థితికి తగ్గిపోవును. దీనినే శర్కరాసహన పరీక్ష(సుగర్ టాలరెన్సు టెస్టు) అందురు. రక్తమందలి చక్కెర 180 మిల్లీగ్రాములకు మించియున్నచో, మూత్రమునందు చక్కెర కానవచ్చును. ధాతువులు వ్యయమగుట మూలమున, రక్తమందలి చక్కెర తగ్గిపోయినయెడల, కాలేయమందలి గ్లైకోజను గ్లూకోసుగా మార్పుచెంది రక్తప్రవాహములోనికి విడుదల చేయబడును. పెక్కు అమినో ఆసిడ్లను, బహుళముగ క్రొవ్వును గ్లూకోసుగా మార్చు శక్తి కాలేయమునకు గలదు.

స్వాదుపిండమునందలి సహజకణములతో సంబంధము లేని లాంగరుహాన్సు దీవులలోని బి కణములనుండి యిన్సులిను స్రవించును. ఇదియొక హార్మోను. దీని సంఘట్టమును గూర్చిన వివరములు $C_{254}H_{377}O_{75}$ అని సాంగర్ అను శాస్త్రజ్ఞునిచే 1955 లో కనుగొనబడెను. దీనివలన ధాతువులలోని గ్లూకోసును వినియోగించుటకు వీలు కలుగును. కాలేయములో, కండరములలో, గ్లైకోజను నిలువ చేయుటకు అవకాశము లభించును. అమినో ఆసిడ్సు, క్రొవ్వు, వ్యయము గాకుండ రక్షణము ఏర్పడును.

మూత్రములో చక్కెర ఉండినయెడల దానిని మధుమూత్రవ్యాధి (గ్లైకోసూరియ) అందురు. గ్లైకోజను 100. ఘ. సెం. మీ. రక్తములో 180 మిల్లీగ్రాముల కంటె ఎక్కువగా తయారైనయెడల మధుమేహము (డయాబెటిసు. మెల్లిటసు) సంభవించును.

కొందరి రక్తములో చక్కెర 180 మిల్లీగ్రాముల కన్న తక్కువ యున్నను మూత్రములో చక్కెర యుండును. దీనినే మూత్రపిండ సంబంధమైన మధుమూత్ర వ్యాధియందురు. ఇది ఎక్కువ ప్రమాదకరమైన వ్యాధి కాదు.

మాంసకృత్తులకుసంబంధించిన అన్నజీవ పరివర్తనము : కడుపు ద్రవములోనున్న పెప్సిను, హైడ్రోక్లోరిక్ ఆసిడు, రేనిన్‌స్వాదు పిండములోని ట్రిప్సిను, చిన్నపేగు ద్రవములోని ఎరప్సిను అనునవి మాంసకృత్తులను అమినో ఆసిడ్సుగా మార్పుచేయును. ఇందు నత్రజని (యన్ హెచ్ 2) కలదు. వాటి సంఖ్య 15. ఉదాహరణములు :— అలేనిన్, గ్లైసిన్, లూసిన్ మొ. అవి రక్తప్రవాహములోనికి పీల్చుకొనబడి, కాలేయము చేరును. అందు కొన్ని కాలేయముగుండా సాధారణ ప్రవాహములోనికి తీసికొనబడును. ధాతువులు వాటిని గ్రహించి తమయందలి పదార్థములను పెంపొందించుకొనుటకును, శరీరముయొక్క తరుగుదలను తిరిగి పూర్తిచేయుటకును ఉపయోగించుకొనును. అదనముగ నున్న యెమైనో ఆసిడ్ కాలేయమందే పూర్తిగా యూరియాగా మార్చబడును. సాధారణముగ రక్తములోని యూరియా ప్రమాణము 20-40 మిల్లీగ్రాముల శాతముండును. అది మూత్రములోనికి స్రవిం

చును. యూరియా మూత్రములోనికి స్రవించుటనుబట్టి మాంసకృత్తులు ఎంతలోపలికి తీసికొనుచున్నామో నిర్ణయింపవచ్చును. అత్యావసరమైన ఎమైన్ ఆసిడ్లు ఏవి యనగా (1) లూసిన్ (2) ట్రిప్టోఫేన్ (3) మిథైయొనిన్ (4) థియొనిన్ (5) ఫినైన్ ఎలనిన్ (6) వాలీన్ (7) లైసీన్ (8) ఆర్జనీన్ (9) హిస్టిడీన్ (10) ఐసొలూసిన్. ఇవి పాలు మొదలగు వస్తువులలో కలవు. ఎదుగుటకై వీటిని తీసికొనుట ఆవశ్యకము. ఆరమాటిక్ అమైనో ఆసిడ్సు కాలేయమునందు ఎథీరియల్ సల్ఫేట్సుగా మారి మూత్రములోనికి స్రవించును.

క్రియాటిన్ : రక్తములో 10 మి. గ్రా. శాతము కండరములలోను వృషణములలోను ఉండును. ఇదిస్వల్ప పరిమాణములో రక్తములోను మూత్రములోను 2% కలదు. ఇది శరీర అంతర్గత అన్నజీవపరివర్తనము ద్వారమున వ్యర్థ పదార్థముగా ఏర్పడుచున్నది.

యూరిక్ ఆసిడ్ : ఇది ఆహారమందలి మాంసకృత్తుల నుండియు, న్యూక్లియే ధాతువులనుండియు చెడిన పదార్థముగా ఏర్పడుచున్నది. రక్తములో ఇది 3 మి. గ్రా. శాతముండును. ఇది మూత్రము ద్వారమున విసర్జింపబడును.

క్రొవ్వుయొక్క అన్నజీవ పరివర్తనము : ఆహారమందలి తటస్థమగు క్రొవ్వుపదార్థములపై జీర్ణరసములోని లెపీసు, స్వాదుపిండములోని లెపీసు పనిచేయును. పైత్యరస లవణములు వాటి సామర్థ్యమును 14 రెట్లు హెచ్చించును. పైత్యరస లవణములు, నీరు, మ్యూసిన్ కలసి క్రొవ్వును నీరుక్రింద మార్చును. క్రొవ్వు గ్లిసరిన్ గాను ఫాటీ ఆసిడ్సుగాను పూర్తిగా చితుకకొట్టబడును. ఫాటి ఆసిడు. క్రొవ్వు, ఆమ్లములు మున్ముందు మార్పులు పొందునపుడు ముందుగా కలిసి పేగులలోని పాల గొట్టమును చేరుకొనును. పేగుగోడలో ఫాటీ ఆసిడ్లు పైత్యరస ఆమ్లములు విడిపోవును. పైత్యరసము పేగు బైటికివచ్చి మరల ఫాటీ ఆసిడ్సుతో కలిసి లోపలికి ప్రవేశించును. పేగులోపల ఫాటీ ఆసిడ్సు తటస్థమైన క్రొవ్వుగామారి రక్తమునందుచేరును. అవి రక్తమునందు ఈక్రిందిరూపములతో నుండును. (1) తటస్థమగు క్రొవ్వు (2) లెసితిన్ (3) కొలేస్ట్రోరాలు.(180 మి.గ్రా. శాతము) క్రొవ్వు నిలువయుండు స్థానములనుండి కాలేయపు ధాతువులు క్రొవ్వును తీసికొని పోవును. కండరములు పిండిపదార్థములను,క్రొవ్వును,శక్తికొరకు ఉపయోగించుకొనును. బొగ్గుపులును వాయువుగను, నీరుగను, మారుటకు చక్కెర తగినంత యుండవలెను. మధుమేహము లేక నిరాహారత మొదలగునవి కలిగినపుడు చక్కెర తగినంత ఉండదు. కావున క్రొవ్వు ఆసిటోను బాడీస్‌ను ఇచ్చును. అది మూత్రములో విసర్జింపబడును. ఇన్సులిను కావలసిన గ్లూకోసును సరఫరాచేసి కిటోసిన్‌ను నిర్మూలించును.

ఆల్‌కాప్ట నూరియా; ఇది పుట్టుకతోవచ్చు వ్యాధి. ఇది అరుదైనది. మూత్రము క్షారము అగుచో గాలి కొంతసేపు తగులగనే అది నల్లగానగును. ఇందు హిమోజెంటిసిక్ ఆసిడ్ కలదు.

హెమోక్రొమోటిసిస్ ; ఇది శరీరాంగము లన్నిటి యందును అసాధారణ పరిమాణములో ఇనుము నిలువ యుండు వ్యాధి. ఇది ముఖ్యముగా హెమొసెడరిన్ రూపములో నుండును. అందులకుగల కారణము తెలియదు. అదికూడ అరుదైన వ్యాధి.

మధుమేహము (డయాబిటిస్ మెల్లీటిస్) : స్వాదు పిండములోని లాంగరు హాన్సు దీవులలోని యిన్సులిను ఉత్పత్తిచేయు 'బి' కణములు తక్కువ అగుటవలన ఈ వ్యాధి వచ్చునని ఇదివరలో నమ్మెడువారు. కాని కుక్కలకు ఆంటేరియర్ పిట్యిటరీ ఎక్స్ట్రాక్టు సూదిమందుగా ఇచ్చుటవలన వాటికి మధుమేహము కలుగుచున్నది. పిల్లలయందును యౌవనములోనున్న స్త్రీపురుషులందును ఇది తీవ్ర ఫలితములకు దారితీయును. వృద్ధులందిది చాల సాధువుగ వచ్చును. పిండిపదార్థముల అన్నజీవ పరివర్తనమునందు కలవరము వాటిల్లును. యిన్సులిన్ లేనియెడల కాలేయము గ్లూకోసును గ్లైకోజనుగా మార్పజాలదు. ధాతువులు గ్లూకోసును ఉపయోగింపలేవు. అందువలన రక్తములోని చక్కెర మిక్కుటమగును. అది 180, మి. గ్రా. శాతమును మించును. మూత్రములో చక్కెర కానవగును. గ్లూకోసు లేనియెడల క్రొవ్వు

పదార్థములు పూర్తిగా ఉపయోగించలేక కెటోన్ పదార్థములు ఉత్పన్నమగును. అవి మూత్రముగుండా వచ్చును. రోగి అధికముగా మూత్రముపోయుట, దాహము, ఆకలి, బరువుతగ్గుట ఏర్పడును. మూత్రములో గ్లూకోస్ ఉండుటచేత దాని విశిష్ట గురుత్వము (స్పెసిఫిక్ గ్రావిటీ) హెచ్చును. రోగి తా నధికమగు బలహీనతతో నున్నట్లు చెప్పును. ఇందు రాగల క్లిష్ట పరిస్థితులు :

1. క్షయ కూడ వచ్చుట.

2. మధుమేహముచే స్మృతి తప్పుట. నెత్తురులో అధికముగ చక్కెర యుండుటవలన ఇది జరుగును. స్మృతి తప్పిన రోగికి సరియైన చికిత్స జరుగనియెడల చనిపోవును.

3. మాంసము కుళ్ళుట రాచపుండు మొదలగు శస్త్రచికిత్స అవసరమగు వ్యాధులు కలుగుట.

4. చర్మముపై దురదలు కలుగుట.

5. కాలుచేతుల తిమ్మిరులు ఏర్పడుట.

6. కంటిలో పువ్వు మొలచుట.

7. రెటీనా అను కంటిగ్రుడ్డు లోపలి పొర వాచుట. (రెటినిటిస్)

8. మూత్రకోశపు వాపు.

ఇన్సులిన్ వ్యాప్తిలోనికి రాకపూర్వము చిన్నతనమునందు మధుమూత్రవ్యాధికిగురియైనవారి సరాసరిజీవితము 5 సం. ల పరిమితి ఉండెడిది. ఆ రోగి మధుమూత్ర మూర్ఛచేగాని, క్షయచేగాని చనిపోవుచుండెను. ఇన్సులిన్ అందుబాటులోనున్న నేడు రోగి క్రమబద్ధముగ ఆహారమును తగినంత మోతాదులో ఇన్సులిన్ను తీసికొన్నచో అతడు అకాలమరణమునకు గురికావలసిన అవసర మెంతమాత్రమును లేదు. రోగి, ఆహారమును క్రమబద్ధముగ తీసికొనుచు బరువును ఒక ప్రమాణములో కాపాడుకొనుచు తనకుతానే సూదిమందు తీసికొనుట అలవాటు చేసికొనవలెను. ప్రతి రోగియు ఇన్సులిన్ పెద్ద మోతాదుగా తీసికొని ఆ పిమ్మట త్వరపడి భుజించనియెడల శరీరమందలి చక్కెర తగ్గునని గ్రహించవలెను. అతనికి చెమట, వణకు పుట్టును. అతడు బలహీనుడగును. మనస్సు వికలమై సొమ్మసిల్లుట జరుగవచ్చును. ఇన్సులిన్ తీసికొనున్న మధుమూత్రరోగి తనయొద్ద చక్కెర నుంచుకొని ఆసూచన కానవచ్చిన వెంటనే తినవలెను. ఇన్సులిన్ రెండు రకములు. 1. కరిగెడు రకము. ఇది నాలుగు గంటలసేపు పనిచేయును. రోగికి రోజుకు రెండుమార్లు సూదిమందు తీయవలెను. (2) గ్లోబిన్ ఇన్సులిన్. ఇది చాలసేపు పని చేయును. రోగికి రోజుకు ఒకసారి సూది మందు ఇచ్చిన సరిపోవును.

**అయత్నకృత (స్పాంటేనియస్) హైపోగ్లసీమియా :** స్వాదుపిండముయొక్క లాంగర్హాన్ దీవులనుండి యిన్సులిన్ పుట్టును. అందుండి ఇన్సులిన్ ఎక్కువగా స్రవించుటవలన గాని, దీవులలో గ్రంథి పుట్టుటవలన గాని యెక్కువ ఇన్సులిన్ తయారగును. పొట్టలో అనిర్దిష్టమైన నొప్పి ఉన్నదనియు, బలహీనముగ నున్నదనియు, భోజనము తర్వాత కొంత శాంతించినదనియు, రోగి మొరపెట్టును. వ్యాధి తీవ్రమైనయెడల రోగికి స్మృతి తప్పుటకూడ సంభవింపవచ్చును. రక్తములోని గ్లూకోసు పరీక్షచేయుటవలన రోగమును నిర్ణయింపవచ్చును. ఇది 30 మి. గ్రా. లు మొదలు 60 మి. గ్రాముల వరకుండును. ఇందులకు చికిత్స :— (1) తరచుగా ఆహారమిచ్చుట (2) స్వాదుపిండములోని ఆభాగమునుకాని, లేక ఏదేని గ్రంథి కనుపించినచో దానినికాని శస్త్రచికిత్స మూలమున తీసివేయుట.

**వాన్గార్కీన్ రోగము :** ఈ వ్యాధికిగల కారణమేమో తెలియదు. గ్లైకోజన్ పెద్దపెద్ద మొత్తములలో ఇంద్రియములందు నిలువయుండును. పిల్లలు పెద్దపరిమాణముగల హృదయముతో పుట్టుదురు. అట్టి పిల్లలు సాధారణముగ ఒకటి రెండు సంవత్సరములకంటె ఎక్కువ కాలము బ్రతుకరు.

**వాతరక్తము (గౌటు) :** ఇది యూరిక్ ఆసిడ్ యొక్క అన్నజీవ పరివర్తనమునందు సంభవించు ఒక కల్లోలము. దీనికి గురియగువారు 40 సంవత్సరములకంటె ఎక్కువ వయస్సు కలవారు. వారు చలిలో తిరిగినచో కాలి బొటనవ్రేలి మొదటి కీలునందు తీవ్రమగునొప్పి వాటిల్లును. కీలువాచును. ఎఱ్ఱబడి ఏమాత్రము చలనము కలిగినను నొప్పిగానుండును. యూరిక్ ఆసిడ్ పెరుగును. కాలము గడచినకొలదియు మూత్రములోను చెవిలోను ఆరికాలి

కీళ్ళలోను అరచేతి కీళ్ళలోను సోడియం యూరేటు చేరి కుంటితనము ఏర్పడవచ్చును. తీవ్రపరిస్థితిలో టించర్ కాల్‌సీకమును ఇచ్చిన యెడల అది నొప్పిని పోగొట్టును. మున్ముందు ఈ వ్యాధి రాకుండుటకు రక్తమూత్రామ్లము పెరుగకుండ చూచుట అవసరము. వారమునకు 3, 4 సార్లు సింకోఫేన్ మాత్రలను సేవింపవలెను. ఇది చాల విషసంబంధమైన ఔషధము కావున దీని నుపయోగించుటలో మెలకున అవసరము.

**అతి స్థూలత :** ఈ పరిస్థితి ఈ క్రింది సందర్భములలో వచ్చును. (1) పిట్‌విటరీ మాంసగ్రంథి వలనను (2) థైరాయిడ్ మాంసగ్రంథిలో ద్రవము తగ్గుట వలనను (3) ఓవరీస్ అనగా స్త్రీలకు రజస్సు ఆగుట వలనను. కాని సామాన్యముగా అతిస్థూలత అతిగా తినుటవలన వచ్చును. రోగి ఆహారమును మిగుల తగ్గించుకొనుచు తన శరీరమందలి క్రొవ్వును వ్యయపరచుకొనుచు అదనపు బరువు తగ్గునట్లు యత్నము చేయవలెను. యాంపిటమిన్ గోలీలు తీసికొన్నచో మితిమీరిన ఆకలి ఉండదు. వంకాయలు, టొమేటోలు మొదలగు కూరగాయలను ఉపయోగించినచో అవి తక్కువ కెలోరీల (Calories) ఆహారము నిచ్చుటచే స్థూలత తగ్గుటకు అవకాశమున్నది.

**క్రొవ్వుయొక్క ఆహారజీవపరివర్తనమునందలి అక్రమములు :-** ఇందు గాచర్సువ్యాధి సాధారణమైనది. ఇందు ప్లీహము, కాలేయము మొదలగు అవయవములు క్రొవ్వు కణములతో నిండును. నీమన్‌ఫిక్స్ వ్యాధియు, స్కుల్లరు వ్యాధియు ఇట్టివే. కాని నిలువయుండు క్రొవ్వుపదార్థములలో తేడాకలను. ఇందులకు గల కారణము తెలియదు.

**మిశ్రితాహారము (మిక్స్‌డ్‌డైట్) :** మనము దినచర్యలో శక్తిని వ్యయింతుము. మన ఆహారమునందలి కెలోరీలు దీనిని సరఫరాచేయును. పెరిగెడు పిల్లలకు ఎక్కువ కెలోరీల ఆహారము అవసరము. శరీరముయొక్క ఒక్కొక్క పౌను బరువునకు కనీసము ½ గ్రాము మాంస కృత్తులు కావలెను. పాలలోను, జంతువుల మాంస కృత్తులలోను జీవసంధాయకములగు జంతుక ఆమ్లములు గలవు. పిండిపదార్థములు, మాంసకృత్తులు, గ్రాముకు 4 కెలోరీల శక్తిని ఇచ్చును. క్రొవ్వు గ్రాము 1 కి 9 కెలోరీల శక్తిని ఇచ్చును. పిండిపదార్థములు లేని క్రొవ్వు, కీటోసెస్‌కు కారణమగును. కావున మన ఆహారము మిశ్రమముగా నుండవలెను. అందు పిండి పదార్థములు, మాంసకృత్తులు, క్రొవ్వు, లవణములు, విటమినులు, కూరగాయలు, ఉన్నప్పుడే సరియగు శక్తి లభించును. మనదేశమునందు కేవలము బియ్యమునే తినెడు వారికి మాంసకృత్తులు తక్కువగా లభించును. శాకాహారులకు మాంసకృత్తులు ఇంకను తక్కువగా లభించును. పాలద్వారమున ఈలోటును కూడా తీర్చుకొనవలెను. సామాన్య మానవునకు సగటున రోజునకు 2500-3000 కెలోరీల ఆహారము కావలెను. శ్రమించు కార్మికునకు రోజునకు 4000 కెలోరీల ఆహారము కావలెను. కూరగాయలు, ఆకుకూరలు సమృద్ధిగా తినినయెడల వాటి మూలమున ఆహారమున సెలులోస్ అను పదార్థము లభించి మలబద్ధకము తగ్గిపోవును.

**నిరాహారత (స్టార్వేషను) :** నిరాహారులకు అన్నజీవ పరివర్తనక్రియ యావత్తును తలక్రిందగును. శరీరమందలి క్రొవ్వు నిలువలు వ్యయమగును. పిండిపదార్థములు, క్రొవ్వు మండిపోవుటచే కెటోసెస్ వ్యాధి వచ్చును. మూత్రములో ఎసిటోన్ పదార్థములు కానవగును. క్రొవ్వునుండియు ఆమినో ఆసిడునుండియు గ్లూకోసు తయారుచేయు శక్తి కాలేయమునకు కలదు, కాని ఈశక్తి పరిమితమైనది. నిరాహారతవలన రోగియైన వ్యక్తికి హఠాత్తుగా సంపూర్ణాహారము నిచ్చుట ఎంత ప్రమాదకరమో ఇటీవల యుద్ధకాలములో వంగదేశ క్షామము రుజువుచేసినది. అందువలన అతడు తప్పక మరణించును. అతనికి మొదట గ్లూకోసునీళ్ళు, ఉప్పు, నీళ్లుకలిపిన పాలు, పండ్లరసము ఇచ్చి, అతని జీర్ణశక్తి పెంపొందిన పిమ్మట మెలమెల్లగా క్రమక్రమముగా అతని ఆహారమును అధికము చేయవలెను.

దీర్ఘకాలముగ అసంపూర్ణ ఆహారముపై బ్రతికినవానికి రక్తములో మాంసకృత్తులు తగ్గిపోవును. అందువలన శరీరము వాచిపోవును. వైటమిన్ లోపమువలన పాండురోగము కలుగు రోగముల చిహ్నములు కానవచ్చును. మాంసకృత్తుల అభివృద్ధికి, రక్తవృద్ధికి లివర్

ఎక్స్ట్రాక్ట్సులు, వైటమినులుగల ఆహారములు ఇచ్చుట ఇందులకు జరుగవలసిన చికిత్స.

డా. ఎస్. వేం. రా.

**అన్నమాచార్యులు-తాళ్లపాక :-** తెలుగు సాహిత్య చరిత్రములో తాళ్లపాకవారి కుటుంబము మిక్కిలి ప్రసిద్ధిచెందినది. తెలుగుదేశములో ముఖ్యముగా రాయల సీమయందు 'తాళ్ళపాకవారి కవిత్వము కొంత, నా పైత్యము కొంత' అను సామెత యొకటి ప్రచారములో నుండుటయే అందులకు ముఖ్య నిదర్శనము. సుమారు రెండు వందల సంవత్సరములకింకను పైబడిన కాలమున (క్రీ.శ. 15, 16 శతాబ్దులలో) ఈ కుటుంబమునకు చెందిన వారు అనేక గ్రంథములను రచించి గొప్ప కవులుగాను గాయకులుగాను ప్రసిద్ధిచెందిరి. వారిలో అన్నమయ్య ప్రథముడు. ఇతనికి తరువాత పెద్ద తిరుమలాచార్యుడు, చిన తిరుమలయ్య, చిన్నన్న, తిరువెంగళప్ప అను వారు ఈ కుటుంబమున ప్రసిద్ధి వహించిరి.

వీరు తొలుత నందవరీక నియోగి బ్రాహ్మణులు. ఋగ్వేదులు. ఆశ్వలాయనసూత్రులు. భారద్వాజస గోత్రులు. వీరిలో అన్నమయ్య తొలుత వైష్ణవమును స్వీకరింపగా అతని తరువాత ఆ వంశమువారు అందరును వైష్ణవులైరి.

అన్నమయ్య క్రీ. శ. 1424 వ సంవత్సరమునకు సరియగు క్రోధి సంవత్సరమున వైశాఖమాసములో విశాఖా నక్షత్రమునందు జన్మించెను. ఇతని తండ్రి నారాయణసూరి. తల్లి లక్కమాంబ. పొత్తపినాటిలోని "తాళ్లపాక" గ్రామము వారి నివాసస్థలము. ఈ 'తాళ్ల పాక' యను గ్రామము నేడు కడప మండలములో రాజంపేట తాలూకాయందు ఉన్నది. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశమున అవతరించె నని ప్రసిద్ధి.

ఇతడు బాల్యమునుండియును గొప్ప భక్తుడు. ఎల్లప్పుడు భగవంతునే స్మరించుచు, అతని స్తోత్రపారా యణములే చేయుచు, తక్కిన విషయములందు అంత శ్రద్ధాభక్తులు చూపకుండెడివాడు. ఇతని తల్లిదండ్రులును, వదినె లన్నలును ఏవైన పనులు చెప్పినయెడల ఇతడు పరాకున నవిచేయ మరచి వారిచే చీవాట్లు తినుచుండెడి వాడు. ఇట్లుండగా అతనికి పదునారేండ్లు నిండినవి. పరమ భక్తాగ్రేసరుడై ఎల్లప్పుడును తన్ను స్మరించుచుండుట తప్ప వేరొక్క పనిని చేయనొల్లని ఆ బాలునికి శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రత్యక్షమై అప్రతిహత భక్తిని ప్రసాదించెను. అప్పటినుండి అతడు స్వామివారి యానతి చొప్పున సంకీర్తనములు రచించుటకు ప్రారంభించెను. అతడాడినమాట అమృతకావ్యమును, పాడినపాట పరమ గానమును కాజొచ్చినవి. ఇట్లు కొన్నినాళ్లు సంకీర్తనములు చెప్పుచుండి అతడు శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించుటకై తిరుపతికి ప్రయాణమాయెను. మార్గ మధ్యమున సంకీర్తన గానము చేయుచు అతడు కొన్ని దినములు ప్రయాణముచేసి తిరుపతి చేరుకొనెను. దిగువ తిరుపతిలో అతడు వేకువజామున బయలుదేరి కొండ మీదికి ఎక్కిపోవుచుండెను. కాని సంప్రదాయము తెలియక చెప్పులతోగూడ కొండనెక్కి పోవుచుండిన యా బాలుడు మిక్కిలి యలసిపోయి, మోకాళ్ళపర్వతము దగ్గర ఒక వెదురుపొద నీడలో మైమరచి నిద్రింపజొచ్చెను. అప్పుడు కలలో అలమేలు మంగమ్మ అతనికి దర్శనమిచ్చి, అతని యాకలిని పోగొట్టి, ఆ పర్వతము సాలగ్రామ మయము గుటచే చెప్పులతో ఆ కొండ నెక్కరాదనియు, చెప్పులు విడిచిపోవలసినదనియు బోధించి అంతర్ధానము చెందెను. అతడు నిద్రనుండి మేల్కొని తనకు వచ్చిన కలకు మిక్కిలి ఆశ్చర్యపడి అప్పటి కప్పుడే ఆశువుగా అమ్మవారిపై ఒక్క శతకమును చెప్పెను.

తరువాత అతడు కొండమీదికిపోయి అచట శ్రీ వేంక టేశ్వరస్వామివారిని దర్శించెను. ఆ చుట్టుపట్టుల నుండిన గోగర్భము, ఆకాశగంగ, పాపవినాశము మొదలగు పుణ్యతీర్థములను సేవించెను. అక్కడనే ఒక వైష్ణవా చార్యునియొద్ద అతడు వైష్ణవదీక్షను స్వీకరించి ముద్రా ధారణాది సంస్కారములను పొందెను. ముద్రాధారణా నంతరము ఆ కొండమీది వైష్ణవులు అతనిని తమ పంక్తిలో నిడుకొని భుజించిరి. ఇట్లు భగవత్సంకీర్తనము చేయుచు, గురువుకడ శుశ్రూష సలుపుచు అన్నమయ్య కొండమీద కొంతకాలము నివసించియుండెను. ఇట్లుండ అతని తల్లి యగు లక్కమాంబ తన కుమారుని వెదకుకొనుచు దేశ మంతయు, తిరిగి తిరిగి వచ్చి తుదకు తిరుమలపైనున్న

ఆతనిని చూచి ఇంటికి రమ్మని యాతని పెక్కువిధముల బతిమాలెను. కాని భగవద్భక్తిపరాయణుడయిన అన్నమయ్య తొలుత ఆమె వేడికోలునకు అంగీకరింపలేదు. అందుపై ఆతని గురువర్యుడగు వైష్ణవాచార్యుడు ఆతనికి కొన్ని దివ్యోపదేశములుచేసి తల్లిమాట విని ఇంటికి పొమ్మనగా ఆతడు ఎట్టకేలకు అందులకంగీకరించి తన తల్లివెంట ఇంటికి ఏగెను. బహుకాలమునకు ఇల్లు చేరిన అన్నమయ్యకు ఆతని తల్లిదండ్రులు వివాహప్రయత్నములు చేసిరి. కాని ఎల్లప్పుడును భగవంతునే చింతించుచు ఇతర ప్రపంచము తెలియని అన్నమయ్యకు పిల్లనిచ్చుటకు ఎవరును ముందుకు రాకపోయిరి. అప్పుడు శ్రీ వేంకటేశ్వరస్వామియే కలలో నగపడి ఆతనికి పిల్లనీయవలసినదని యుద్బోధింపగా ఇరువురు భక్తులు తమ పిల్లల నాతని కిత్తుమని వచ్చిరి. పెద్దల సమక్షమున యథావిధిగా వారి వివాహముహూర్తము జరిగినది. వారిలో మొదటియామె తిరుమలమ్మ. రెండవయామె అక్కలమ్మ. వారిలో తిరుమలమ్మ అనబడు తిమ్మక్కయే ఆ తరువాత 'సుభద్రాకల్యాణ' మను పేర ఒక గేయకావ్యమును రచించినది. వివాహమయిన పిదప ఆతడు కొంతకాలము స్వగ్రామమగు తాళ్ళపాకయందును, తిరుమలయందును, అహోబిలమునందును నివసించెను. ఆ కాలములో ఆతడు తన యిష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరస్వామిపై అనేక శృంగారకీర్తనములను రచించెను. అహోబిలములో ఆదివణ్ శఠకోపయతీంద్రుని దగ్గర ఆతడు వేదాంతశాస్త్రమును సంప్రదాయానుసారముగా అధ్యయనము కావించెను. అత డక్కడ ఉండిన కాలములోనే ఆతడు వాల్మీకి రామాయణమును తెలుగులో సంకీర్తనాత్మకముగా రచించినట్లు తెలియుచున్నది.

అన్నమయ్య పాడుచుండిన సంకీర్తనములు కాలక్రమమున లోకములో ప్రఖ్యాతి వహించెను. సాళువగుండ నరసింహరాయడను ప్రభువొకడు కర్ణాకర్ణిగా ఆ ప్రఖ్యాతిని విని ఒకనాడు ఆతని దర్శనమును అపేక్షించి వచ్చెను. ఆతనిని ప్రార్థించి ఆతనిచే కొన్ని సంకీర్తనములు పాడించుకొని ఆతడు అందలి మాధుర్యమునకు ముగ్ధుడయ్యెను. ఆ ప్రభువా కాలమున టంగుటూరు అను గ్రామములో నివసించుచుండెడివాడు. ఆతడు అన్నమాచార్యుని వేడుకొని ఎట్లో యొప్పించి ఆతనిని తనవెంట టంగుటూరునకు పిలుచుకొనిపోయెను. అక్కడ ఆతనికి ప్రత్యేకముగా గుడిప్రక్క ఒక భవనమును కట్టించి యిచ్చి, ఆతనినందు నివసింపజేసెను. "శ్రీకృష్ణుని సహాయముతో అర్జును డీ భూమండలమునెల్ల పరిపాలించినట్లు మీ సహాయముతో నేను ఈ భూమండలము నంతటిని ఏకచ్ఛత్రముగా పరిపాలించెదను" అని నరసింగరాయడు అన్నమయ్యతో చెప్పుకొనెను. వారిరువురును టంగుటూరిలోనే కొంతకాలము నివసించియుండిరి. ఇంతలో నరసింగరాయడు విజయనగర రాజ్యమును ఆక్రమించుకొని చక్రవర్తి యయ్యెను. నరసింగరాయడు పోయిన పిదప అన్నమయ్య టంగుటూరును వదలి తిరిగి తిరుమలకు వచ్చి భగవంతునిపై సంకీర్తనములు పాడుచుండెను.

ఇట్లుండగా ఒకప్పుడు నరసింగరాయడు తన బాల్యస్నేహితుడైన అన్నమయ్యను తన రాజధానియగు పెనుగొండకు రావించుకొని చక్కని సంకీర్తనములు పాడి తనకు సంతోషమును కలుగజేయుమని కోరగా అన్నమయ్య కొన్ని సంకీర్తనములు పాడి వినిపించెను. ఆ సంకీర్తనములను విని రాయడు ఆనంద పరవశుడై ఆతనిని అనేకవిధముల సత్కరించెను. పచ్చల కడియాలు మొదలగు ఆభరణములను, చీని చీనాంబరములను ఒసగి రాయ డతనిని ఆదరించెను. ఇట్లు రాయనిచే అఖండ సత్కారములందుచు ఆతడు కొన్నాళ్ళందే ఉండగా, మరియొకనాడు నరసింగరాయడు ఆతనిని పిలిపించి శ్రీ వేంకటేశ్వరస్వామివారిపై ఆతడు రచించిన శృంగార సంకీర్తనములు కొన్ని పాడి వినిపింపుమని కోరెను. అన్నమయ్య ఆతని యానతిమేరకు కొన్ని సంకీర్తనములు పాడి వినిపించెను. అంత రాయడు యుక్తాయుక్త వివేకమును గోలుపోయి వేంకటపతిమీది పదములవంటి పదములను తనమీదను చెప్పవలసినదని ఆతనిని కోరెను. అది విని ఆతడు నిర్విణ్ణుడై మిక్కిలి ధైర్యముతో "శ్రీ వేంకటేశ్వరస్వామిని నుతించు ఈ నాలుకతో నిన్ను నేను నుతింపజాలను" అని పలికి ఆతని కోరికను తిరస్కరించెను. రాయని కది కోపకారణమయ్యెను. అత డాగ్రహ పరవశుడై కన్నుమిన్ను కానక ఆతనికి 'మూరురాయరగండ' మను పేరుగల సంకెల

వేయించి ఆతనిని చెరసాలలో పెట్టించెను. అప్పు డన్నమయ్య 'ఆకలివేళల నలపైన వేళలను' ఇత్యాదిగాగల ఒక సంకీర్తనమునుపాడి శ్రీ వేంకటేశ్వరస్వామిని స్తుతించెను. వెంటనే ఆతని చేతులకు తగిల్చియుండిన సంకెలలూడి క్రిందపడెను. చెరసాల కావలి కాయుచున్న సేవకులవలన ఆ వృత్తాంతము విని నరసింగరాయడు మరింత ఆగ్రహపరవశుడై ఆతని కడకు వచ్చి తిరిగి ఆతని చేతులయందు తానే స్వయముగా సంకెలలు తగిలించి "ఇప్పుడు విడిపించుకొనుము, చూత" మనెను. అంత అన్నమయ్య తిరిగి అదేపాటను భక్తి పారవశ్యముతో పాడగా మునుపటివలెనే ఆతని చేతులకు తగిల్చియుండిన శృంఖలలూడి క్రిందపడెను. ఆతని మాహాత్మ్యమున కాశ్చర్యమంది నరసింగరాయ డాతని పాదములకు సాష్టాంగముగా నమస్కరించి ఆతని అనుగ్రహమును వేడెను. అన్నమయ్యయు ఆతని దయతో ననుగ్రహించెను.

అతడు పెనుగొండనుండి తిరుమలకు వచ్చెను. అచ్చట స్వామివారి సన్నిధిని సంకీర్తన గానముచేయుచు కాలము గడుపుచుండెను. ఆ కాలమున నత డెన్నో మహిమలు చూపెను. అప్పటి ఒకముచ్చట వింతగానుండును. అదే మనగా: అన్నమయ్య మహిమవిని ఒకప్పు డొక పేద యువకుడు ఆతని దగ్గరకువచ్చి "అయ్యా! నేను బ్రహ్మచారిని. నేను పెండ్లి చేసికొన దలచుచున్నాడను. కాని నాకడ ధనములేదు. కనుక నాయందు దయతలచి నాకు కాసువీసము కలుగునటుల అనుగ్రహింపుడు" అని వేడుకొనెను. అతడు 'అట్లే' యని దీవించి పంపెను. పిదప అతడెందరికడకుబోయి వివాహార్థమై యాచించినను వారాతనికి 'కాసువీసము'నే కాని ఒక్కరును ఒక్క 'రూక'నైన నీయరైరి. ఇట్టి అనుభవమునకు అన్నమయ్య మహిమయే కారణమని గ్రహించి తిరిగి అతనికడకు వచ్చి "అయ్యా! నాపెండ్లికి కావలసినంత ధనము వచ్చునట్లనుగ్రహింపుము" అని వేడుకొనగా నాతడు అతనిపై దయబూని 'అట్లే' అని పలికెను. అతనికడ దీవనబొంది అతడు వీథిలోనికి రాగానే ఒక రాజాతనిని పిలిచి, అత డడిగిన ధనమును ఒసగి సత్కరించెను. అది విని జనులు మిక్కలి యాశ్చర్యమందిరి. ఇట్టి మహిమల నెన్నిటినో అన్నమయ్య ప్రదర్శించి చూపుచు తాను దివ్యధామ మందుదాక అందే నివసించియుండెను. అతడు వృద్ధుడై యుండగా కర్ణాట భాషలో పేలకొలది సంకీర్తనములను రచించి గొప్ప ప్రఖ్యాతినొందెను. శ్రీ పురందరదాస స్వాములవారు అన్నమాచార్యుల సంకీర్తనరచనా ప్రసిద్ధినివిని, ఆతనిని దర్శించుటకై తిరుమలకు వచ్చెను. అచ్చట నాతని ప్రార్థించి సంకీర్తనములు పాడించుకొని విని ఆనందించి యాతడు "నీవు శ్రీ వేంకటేశ్వరుని యవతారమవే" అని సన్నుతింపగా అన్నమాచార్యుడు పురందరదాసులవారి సంకీర్తనములను పాడించుకొని విని 'నీవు శ్రీ పాండురంగ విఠలుని అవతారమ'వని సన్నుతించెనట!

ఇట్లు భక్తిమయముగా దెబ్బది తొంబదేండ్ల నిండు జీవితమును గడిపి అన్నమయ్య క్రీ. శ. 1503వ సంవత్సరమునకు సరియగు దుందుభి సంవత్సరమున ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు దివ్యధామము నలంకరించెను.

మహాభక్తుడును, గాయకుడును, కవీశ్వరుడును అయిన అన్నమయ్య యోగవైరాగ్యశృంగార మార్గములలో ముప్పదిరెండువేల సంకీర్తనములను రచించెనని ఆతని మనుమడగు చిన్నన్న రచించిన 'అన్నమాచార్య చరిత్రము'లో కలదు. పదునారవ సంవత్సరమున శ్రీ వేంకటేశ్వరస్వామివారు తనకు ప్రత్యక్షమయినపుడు ప్రారంభించి, డెబ్బది తొమ్మిదవయేట తాను దివ్యధామము నందుదాక దినమున కొక సంకీర్తనము చొప్పున సంకీర్తనములు రచించినట్లు ఈతడు రచించిన శృంగార సంకీర్తనముల యొక్కయు, ఆధ్యాత్మ సంకీర్తనముల యొక్కయు తొలి రాగిరేకునందు కలదు. అట్లు లెక్కించి చూడగా నించుమించుగా నిర్వదిమూడు వేల సంకీర్తనములు మాత్రమే లెక్కకు వచ్చును. దినమునకు ఒక్కటియైనను తక్కువకాకుండుపద్ధతిని అతడు సంకీర్తనములను రచించు చుండెనని చెప్పుకొనినచో అతడు ముప్పది రెండు వేల సంకీర్తనములను రచించెనమట సంగతమగుచున్నది. శృంగారాత్మకములుగా అతడు రచించిన పదములకు 'శృంగార సంకీర్తనము' లనియు, వైరాగ్య పరములుగా అతడు రచించిన వాటికి 'ఆధ్యాత్మ సంకీర్తనము' లనియు పేర్లు. ఈతడును ఈతని వంశీయులును రచించిన ఇట్టి సంకీర్తనములు ఈతని కుమారుడగు పెదతిరుమలా

చార్యుని కాలమున రాగిరేకులపై చెక్కింపబడి, అవియెల్ల తిరుమలపై శ్రీస్వామివారి సన్నిధిలో శ్రీ భాష్యకారుల సన్నిధిని ప్రక్కగా నొక అరలో భద్రపరచబడినవి. దానికి 'తాళ్ళపాక' అరయని పేరు. ఆఅర కిరుప్రక్కలను అన్నమాచార్యులయు, తిరుమలాచార్యులయు విగ్రహములు శిలలపై చెక్కింపబడి యున్నవి. తెలుగు కవుల భౌతిక స్వరూపములను తెలుపు నిట్టి శిల్పములలో ఇవియే మొట్టమొదటివి. తరువాత రాగిరేకులపై చెక్కిన అట్టి విగ్రహములే అరలోపలను కానవచ్చినవి, వీటినిపట్టి అన్నమాచార్యులయు, పెదతిరుమలాచార్యులయు భౌతిక స్వరూపములు తెలియ వీలగుచున్నది.

అన్నమయ్య తన ఇష్టదైవమగు శ్రీ వేంకటేశ్వర స్వామిపై ఇట్లు శృంగారాధ్యాత్మ సంకీర్తనములను రచించుటమాత్రమేకాక, సంస్కృతమునను, తెనుగునను ఇంకను అనేక రచనలు చేసినట్లు తెలియుచున్నది. సంస్కృతములో అతడు వేంకటాచలమాహాత్మ్యము, సంకీర్తనలక్షణము అను రెండు గ్రంథములను రచించినట్లు ఊహింపబడుచున్నది. చిన్నన్న రచించిన అన్నమాచార్య చరిత్రములో అతడు సంస్కృతభాషయందు వేంకటాచల మాహాత్మ్యమును రచించినట్లు చెప్పబడినది. వరాహపురాణాదులలోనిదిగా సంఘటితమయి నేడు నాగరాంధ్రాక్షరములతో ముద్రితమై వ్యాప్తిగాంచియున్న వేంకటాచల మాహాత్మ్యము తాళ్ళపాక - అన్నమయ్య రచించినదే అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు అభిప్రాయపడుచున్నారు. అంతకుపూర్వమే ఆ "స్థల మాహాత్మ్య" మొకటి కలదని నిరూపింపబడునంతదాక అది యన్నమాచార్య రచితమనియే తలంచుట అసంగతము కాజాలదు.

అతడు సంస్కృతములో రచించిన మరొక గ్రంథము 'సంకీర్తన లక్షణము'. అన్నమాచార్యుని మనుమడగు చిన తిరుమలయ్య తన 'సంకీర్తన లక్షణము' అను గ్రంథము (తెలుగు)న, అన్నమాచార్యుడు సంస్కృతమున, సంకీర్తన లక్షణమను ఒక గ్రంథమును రచించెననియు, దానిని తన తండ్రియగు పెద తిరుమలాచార్యుడు వ్యాఖ్యానించెననియు, ఆ రెండు గ్రంథములను అనుసరించి తాను తెలుగున 'సంకీర్తన లక్షణము'ను వెలయింతుననియు చెప్పియున్నాడు. దానిని బట్టి అన్నమాచార్యుడు సంస్కృతమున 'సంకీర్తన లక్షణము'ను రచించినట్లు తెలియుచున్నది. కాని ఆ గ్రంథ మిప్పుడు లభించుట లేదు.

అన్నమయ్య రచించిన తెలుగు గ్రంథములలో ఆతని ద్విపద రామాయణము తొలుత పేర్కొనదగియున్నది. అతని జీవిత చరిత్రములో ఆతడు, వాల్మీకి రామాయణమును సంకీర్తనాత్మకముగా తెలుగున రచించినట్లు పేర్కొనబడి యున్నది. ఇది దానికంటె భిన్నమయినది. ఆతని ఈ ద్విపద రామాయణము నేడు లభ్యమగుటలేదు.

అతని మరొక గ్రంథము "శృంగార మంజరి". ఇది మంజరీచ్ఛందోమయమయిన శృంగార గ్రంథము. శృంగార మంజరిని రచించి అతడు దానిని తిరువెంగళనాథ దేవునికి విన్నపము చేయగా ఆతడు ఆతనిని అనుగ్రహించెనట !

అన్నమాచార్యుడు ఇవికాక పంన్రెండు శతకములను, వివిధ భాషలలోను ఇంకను ఎన్నో ప్రబంధములను రచించెనట! కాని వాటిలో నేడు 'వేంకటేశ్వరశతకము' మాత్రము ఉపలభ్యమగుచున్నది. ఇది అన్నమయ్య తిరుపతికొండ నెక్కుచు నిదురలో తనకు ప్రత్యక్షమయిన అలమేలుమంగమ్మను గూర్చి ఆశువుగా చెప్పిన శతకము. "వేంకటేశ్వరా" యను మకుట మున్నను ఇందు ప్రతి పద్యమునను అలమేలుమంగా ప్రస్తుతియే కలదు. ఇది ముద్రితము. ఇందలి పద్యములు కొన్ని ప్రబంధ రత్నావళియను సంకలన గ్రంథమున ఉదాహరింపబడినవి. తక్కిన పదునొకండు శతకములును ఏయే వేల్పులమీద రచింపబడెనో, వారిపేళ్ళేవో ఎరుగరావు.

'జో అచ్యుతానంద జోజో ముకుంద
రావె పరమానంద రామ గోవింద'

అని తెలుగుదేశములో బహుళప్రచారము నందియున్న జోలపాట అన్నమయ్య రచించినదే. ఈ జోలపాటలో తుది చరణమునందు ఇట్లు కలదు.

'అంగుగా దాళ్ళపాకాన్నయ్య చాల
శృంగార రచనగా జెప్పె నీ జోల'—

శ్రీ వెంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవ సమయము లందు డోలోత్సవ సందర్భమున అన్నమయ్య తాను

రచించిన ఈ జోలపాటను పాడగా స్వామి దర్శనార్థమై వచ్చిన భక్తకోటికి ఆ పాట జిహ్వాగ్రగతమై లోకమున వ్యాపించియుండును.

గండవరపు బాలగోపాల నామాంకితముగా నున్న 'లాలిపాట' కూడ అన్నమయ్య రచించినదే అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అభిప్రాయపడినారు. ఆ పాటలో ఎచ్చటను అన్నమయ్య పేరు లేకపోయినను గండవరము తాళ్ళపాకవారికి చెల్లుచు వచ్చిన గ్రామ మగుటచే, అన్నమయ్య తమ ఊరి స్వామిమీద ఈ 'లాలి పాటను'— 'జోలపాట' ను రచించినట్లే,— రచించి యుండునని వారి యూహ.

ఇట్లు అన్నమయ్య సంకీర్తనములే కాక ఇతర సారస్వత ప్రక్రియలనుగూడ రచించెను.

అన్నమయ్యకు పూర్వము తెలుగులో పరాశ్రయ రచనములకే వ్యాప్తియుండినది. ఆత్మాశ్రయ రచనమును తొలిసారిగా తెలుగులోనికి తెచ్చినకీర్తి అన్నమయ్యదే అనవలసి యున్నది, ఇతర వ్యక్తుల కంటెను, వారి అనుభవములకంటెను అతడు తన పదరచనములలో తన అంతరంగ బహిరంగానుభవములనే ముఖ్యముగా వెలువరించినాడు. ఇట్టి 'విషయి' ప్రధానమయిన రచనమునకు వర్చస్సు నిచ్చునది 'ఆర్జవము' అనుగుణము. ఆర్జవమనగా తాననుభవించిన భావములనే వెలువరించు అకృత్రిమ స్వభావము. ఇతరుల మెప్పులకో, సంప్రదాయ సంరక్షణ మునకో ఆశపడి తన మనస్సున నిజముగా లేని భావము లను ఆరోపించుకొని అతడు రచనా వ్యాపారమును సాగింపలేదు. ఋజుత్వమే జీవధర్మముగా బ్రతికినవాడు అన్నమయ్య. ఆ ఆర్జవగుణమే అతనికి వ్యవహారములోను కవితలోను భావములకు తీవ్రతతోపాటు భాషకు పదనైన తీర్పునుకూడ ఈయగలిగినది. అన్నమయ్య సంస్కార సిద్ధమై సహజమయిన కవితాశిల్పమును ఎన్నడును పదను చెడని భావనాశక్తిని కలవాడు. తన ఇష్టదైవమైన వేంకటేశ్వరమూర్తినే ఆధిభౌతికమును ఆధ్యాత్మిక మున సర్వ ప్రపంచములోను అంతర్యామిగను, బహిర్యామిగను భావించి, పూజించి, ప్రేమించి, కల హించి, ప్రాధేయపడి, ప్రార్థించి, పొగడి, తెగడి, అనుభ వించి, ఏకీభవించి జీవితములోని అంతరంగ బహిరంగ పరమాణువులన్నిటను అతని బ్రతుకే బ్రతికినాడు. ఆ యనుభవములను మానసికముగాను, కాయికముగాను మాత్రమే కాక వాచికముగా కూడ అనుభవించినాడు. ఆ వాచికానుభవాలే ఆయన 'పదకవితలు'.

ఇట్టి పదకవితలను ఈనాడు వేలకొలదిగా సంకీర్త నాత్మకముగా వ్రాయుటకు వైష్ణవ సంప్రదాయమునకు చెందిన ఆళ్వారుల ద్రవిడ ప్రబంధములు కొంత వరకీతనికి ఉద్బోధకములై యుండవచ్చును. తెలుగునకు సంబం ధించినంతవరకు అన్నమయ్యయే ఇట్టి పదరచనకు ఆద్యుడు. అందుచేతనే ఆతనికిగల 'పదకవితా పితా మహుడు' అను బిరుదము సార్థకమనదగి యున్నది. కృష్ణమాచార్యుని 'సింహగిరి నరహరి వచనములు' ఇంత కంటె పూర్వమే తెలుగున వెలసియున్నను అవి గేయ రచనములేయయ్యు అంగాంగిభావ విభాగము లేక అఖండ గద్యధారగా గేయగంధులుగా మాత్రమే ఉన్నవి. అవికూడ మనకు నేడు లభ్యములగుటలేదు. పదు నైదవ శతాబ్దమునకు కొంచెము ముందుగా కన్నడ భాషలో ముఖ్యముగా వైష్ణవదాసుల రచనములలో పదకవిత ఒక అచ్చుకట్టయిన స్వరూపమును సంపా దించుకొని నిలిచినది. ప్రాచీన సంగీత గ్రంథములలో ప్రబంధములనబడు గేయరచనలు మనదేశములో అసం ఖ్యాకములుగా నుండెడివనియు, రాగము, తాళము, శబ్దము, అర్థము, సందర్భము మొదలయిన వాటినిబట్టి ఆ రచనలలో పెక్కు విభాగములు ఏర్పడియుండిన వనియు తెలియుచున్నది. ఆ చాదస్తములను అన్నిటిని వదలిపెట్టి సుప్రసిద్ధములయిన దేశిరాగములలో, సుగ్ర హము లయిన లయ తాళములలో నిబంధించి సులభీక రింపబడిన రచనములే పదములు. కన్నడభాషలో ఇట్టి రూపముతో వెలసిన పదరచనమును తొలిసారిగా తెలుగు లోనికి దించినవాడు అన్నమయ్య. పదమునకు రెండే అంగములు. అవి పల్లవి, చరణము అనునవి ముఖ్యమై కేంద్ర భూతమయిన అర్థము పల్లవిలో నుండును. దాని విస్తరణమే - వివరణమే చరణములో నిబంధింపబడును. పల్లవిలోని భావ మొక వాక్యములో ముగియకున్న యెడల రెండవ వాక్యమును అనుపల్లవిగా చేర్చి రచించుట కలదు. ఇట్లు పదరచనములకొక అచ్చుకట్టు

స్వరూపమును కల్పించి, తరువాతి పదకర్తలకు అన్నమయ్య ఒక చక్కని పథమును తీర్చి దిద్దినాడు.

రాయలసీమలో వ్యవహారముననున్న ఎన్నో రుచిగల పలుకుబళ్ళు అన్నమయ్య పదములలోనికి ఎక్కినవి. ఆతని పదములనుండి ఆ పలుకుబళ్ళు రాయలనాటి కవీశ్వరుల రచనములలోనికిని ఎక్కినవి. వ్యావహారిక భాషను విశృంఖలముగా వాడి అన్నమయ్య తనకుగల స్వాతంత్ర్య రసికతను వెల్లడించినాడు. ఆపదముల ప్రయోగముతో రచనము సహజముగా, సజీవముగా నుండి భావతీవ్రతను చక్కగా వ్యక్తము చేయజాలినది. ఆధిభౌతికానుభవములలో అన్నమాచార్యులు ఎక్కువగా భావించినది శృంగారము. ఆ శృంగారమును గూడ ఆధ్యాత్మికపు మట్టమునకు ఎక్కించిన మహాపురుషు డాయన. ఆ పదములను పాడుకొని ఆనందింపగలవారు అదృష్టవంతులు. అట్లు పాడలేనివారును పద్యములుగా చదువుకొని ఆనందింప గలిగినంత స్వతంత్రమయిన అర్థభావ రచనల యందచందములతో నిండిన నిధు లాయన పదములు. సంగీత సాహిత్యనిధియగు అన్నమయ్యలోని సాహిత్యాంశము క్షేత్రయ్యగాను, సంగీతాంశము త్యాగయ్యగాను అవతరించెనని శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారి అభిప్రాయము. వారి అభిప్రాయములో అతిశయోక్తి ఆవంతయు లేదు.

తి. కో. రా.

**అపభ్రంశము** :- మనకు తెలిసినంత వరకు అపభ్రంశ శబ్దమును ప్రయోగించిన ప్రాచీనుడు భగవంతుడైన పతంజలియే (భూయాంసో౽పశబ్దాః అల్పీయాంసశ్శబ్దాః, ఏకైకస్యహి శబ్దస్య బహవో౽పభ్రంశాః. తద్యథా-గౌరిత్యస్య శబ్దస్య గావీ గోణీ గోతా గోపోతలికా 'ఇత్యేవ మాదయో అపభ్రంశాః' - మహాభాష్యము). ఆ సందర్భముననే 'అపశబ్ద'మనెడు మాటయు నాతడు వాడినాడు. అనగా, అతని దృష్టిలో ఈ రెండును పర్యాయపదము లన్నమాట. మహాభాష్య కాలము నాటికి "అపభ్రంశము" ఒక భాషగా తయారైనదని చెప్ప వీలులేదు. సంస్కృత భిన్నములైన పదముల నన్నిటిని అపభ్రంశములని భాష్యకారులు తలచినట్లు మన మూహింపవచ్చును. కనుకనే సంస్కృత భిన్నములన్నియు అపశబ్దములే అని దండి అనెను. (శాస్త్రేతు సంస్కృతాదన్య దపభ్రంశతయోదితం - కావ్యాదర్శము) పతంజలి 'గో' శబ్దమున కొసగిన రూపాంతరములు ప్రాకృత భాషలలో-ముఖ్యముగ 'మహారాష్ట్రి'లో కనబడుచున్నవి. శ్వేతాంబరుల భాషయైన యర్ధమాగధిలో గూడ ఈ ప్రయోగములున్నవి. సంస్కృతేతరముల నన్నిటిని కలిపి అపభ్రంశములనుటలోనే-ఆ నాటివారికి-సంస్కృతముపై నున్న అభిమానమును ఇతరములపై నున్న అసమ్మతియు స్పష్టమగును.

ప్రాకృతములు అనుమాటతో ప్రాచీనులు వేటిని వేరుపరచిరో చెప్పుట చాలకష్టము. అట్లే, అపభ్రంశ శబ్దమునకును వారొసగిన వ్యాఖ్యలు ఒకతీరుగలేవు. (ప్రాకృతమేవా౽పభ్రంశః-అని రుద్రటుడు అనెను.) నాట్య శాస్త్రకారుడు సప్తభాషలను విభాగించెను. (మాగధ్య వంతి జా ప్రాచ్యా శూరసేన్యర్ధ మాగధీ, వాహ్లీకాదాక్షిణాత్యాశ్చ సప్తభాషాః ప్రకీర్తితాః - నాట్యశాస్త్రే) వాటిలో ఆయన అపభ్రంశమును జేర్చియుండలేదు. కాని అర్ధమాగధిని మాత్రము చేర్చియున్నాడు. (చేటీనాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాం చార్ధ మాగధీ) భరతుని నాట్యశాస్త్రమందు అపభ్రంశ శబ్దప్రయోగమున్నది. ఆతడు దీనిని 'విభ్రష్ట' మనెను. 'ఆభీర భాష' యని పల్కెను. దండియు భరతుని మతమునే అనుసరించి, కావ్యము నందలి ఆభీరాది భాషలు అపభ్రంశములని పలికెను. (ఆభీరాదిగిరః కావ్యే ష్వపభ్రంశ ఇతీరితాః - కావ్యాదర్శము) ఈ ఆభీరాది భాషలేవో? 'ప్రాకృత లక్షణము' నందు భాషలు ఆరనిచెప్పబడినది. (సంస్కృతం ప్రాకృతం చైవా౽పభ్రంశః పిశాచినీ, మాగధీ శౌరసేనీచ షడ్భాషాశ్చ ప్రకీర్తితాః - ప్రాకృత లక్షణే) వాటిలో అపభ్రంశమునకును స్థానమబ్బెను. కాని అర్ధమాగధి, చూళిక మొదలైనవాటిని అత డెగురగొట్టెను. భరతుని లక్షణములో చోటు దొరకిన అర్ధమాగధికి, ఇందులో పురస్కృతి కలుగలేదు. కొందరు ప్రాకృతములు పదునెనిమిది అనిరి. కువలయమాలా కథాకారుడైన ఉద్యోతనుడు పదునెనిమిది ప్రాకృతములను చూచాయగా చూపుటకు ప్రయత్నించెను. నాటి ఆంధ్రదేశమునందును గర్ణాటకము నందును దేశభేదము లుండెనట. ఇంత లెక్క

బెట్టినను, ఆ భాషలు ముగిసినవికావు. అందుకే అతడు 'పారిస బర్బరాదులు' అని ఆది శబ్దము యొక్క మరుగు జొచ్చెను. మృచ్ఛకటిక- ముద్రారాక్షసకారులు కూడ ఉద్యోతనుని అభిప్రాయమునే అంగీకరించినట్లున్నది. (బహువిధ దేశ వేష భాషాచార సంచారవేదినో, నానా వ్యంజనాః ప్రణిధయః. ముద్రారాక్షసే)

భరతుడు అపభ్రంశమునకు కొన్ని ఉదాహరణము లిచ్చెను. వీటికి పోలికలు అపభ్రంశ వ్యాకరణములలో నున్నవి. ఈ భాషయొక్క ప్రకృతి ప్రత్యయ విభాగ నియమములు కొన్ని శాసన కాలికములైన బౌద్ధ ప్రాకృతములలో కలవు. కొన్ని అపభ్రంశ రూపములు ప్రాచీనులైన 'విమలసూరి' 'సౌమ చరియ' (క్రీ. శ. 1300) లో కనపడును. అవి పాలీభాషలో గూడ నున్నవి. అనగా క్రీ. శ. 300 నాటికే అపభ్రంశము వాడుక భాషగా నుండియుండును. భరతుడు దీనిని అనాగరక భాషయనియు, గొల్లల పలుకుబడి అనియు అవహేళన జేసెను. ఆయన శాబరికిని, అపభ్రంశమునకును, భేద మంతగా గమనించి నట్లులేదు. కాని, ద్రావిడికన్న ఇది భిన్నమనెను. తరువాత మూడు శతాబ్దులకు అనగా భామహుని నాటి కిది కావ్యభాష అయ్యెనని ఊహింప వచ్చును. వలభిరాజగు ధారాసేనుడు మహా ప్రసిద్ధుడు. ('సంస్కృత ప్రాకృతాఽపభ్రంశ భాషాత్రయ ప్రతిబద్ధ ప్రబంధ రచనా నిపుణ తరాంతః కరణః') అతడొక వైయాకరణుడు (క్రీ. శ. 600). చండుడు గూడ వ్యాకరణ కర్తయే. వీరుఇరువురును అపభ్రంశమును ఒక భిన్న భాషగా గమనించిరి. ఈగమనింపుగూడ భామహుని నాటికి ఇది కావ్యభాషయను నిర్ణయమునే బలపరచును. మరి రెండు శతాబ్దములకు ఉద్యోతనుడు తన "కువలయ మాల" యందు అపభ్రంశ భాగములు కొన్నివ్రాసెను. అనగా అప్పటికి అపభ్రంశములో— సంస్కృత ప్రాకృత ములు చేరి— ఆ భాషకు కావ్యత్వమును కల్పించిన వన్నమాట. అపభ్రంశము మనోహరమని ఉద్యోతనుని అభిప్రాయము. కొందరు ప్రాకృత వైయాకరణులు సంస్కృతము దేవభాష అనెడు వాదముపై దండెత్తిరి. శ్వేతాంబరులు అర్ధమాగధి దేవభాష యనిరి. అర్ధమాగధి రానివాడు ఆర్యుడే కాడట! కొందరు మాగధీ భాషయే, నికరముగ, దేవతలు భాషించున దని చెప్పిరి. పాలి దేవ భాషయన్న వారును లేకపోలేదు. శివానుచరులు పైశాచిని భాషింతురని యొకవాదము. వీరి గడబిడలో అపభ్రంశముగూడ దేవభాషయై కూర్చున్నది. వైవారంద రును సంస్కృతమును ద్వేషించినవారే. కువలయమాలా కథాకారుడు, సంస్కృతము "దుర్జన హృదయము వంటిది" అని (దుర్జన హృదయ మివ విషమం) నిస్సంకో చముగ వచించెను.

తొమ్మిదవశతాబ్దిలో రుద్రటుడు అపభ్రంశమనుఃట- కొన్ని భాషలకు సాముహికమైన పేరు 'షష్ఠోఽత్ర భూరి భేదో భూరివిశేషాదపభ్రంశః'(2-12) అనెను. రాజశేఖర మహాకవి పదవశతాబ్దివాడు. ఆయన దానికి సంస్కృత ప్రాకృతములతో సమానమైన గౌరవ మొసగెను. (శ్లో. గిరశ్శ్రవ్యాదివ్యాః ప్రకృతి మధురాః ప్రాకృత ధురః । సుభవ్యోఽపభ్రంశస్సరస రచనం భూతవచనం. రాజశేఖరుని బాలరామాయణము). 'సరస్వతీ కంఠా భరణ' కర్తయగు భోజుడును, దశరూపక కర్తయగు ధనంజయుడును ఇచ్చిన ఉదాహరణములను జూచినప్పుడు అపభ్రంశమందు అప్పటికే పెద్ద సాహితియున్నట్లు తోచును. అందుచే రాజశేఖరుడు న్యాయమేచేసినాడని పించును.

పురుషోత్తము డొక బౌద్ధప్రాకృతవైయాకరణుడు. అతడు తూర్పుదేశపువాడు. అతని నాటికే అపభ్రంశము శిష్టభాష. అత డా భాషకు కొన్ని లక్షణములను వచిం చెను. తాను చెప్పక వదలినవి శిష్ట ప్రయోగముతో ఊహించికొనవలెననెను. (శేషం శిష్ట ప్రయోగాత్). నిమి సాధువు రుద్రటుని కావ్యాలంకారముపై వ్యాఖ్యానిం చుచు, కొన్ని సూత్రములను ఒకానొక ప్రాకృత వ్యాకర ణము నుండి ఉదాహరించెను. ఆ వ్యాకరణము పేరేమో నిమిసాధువు చెప్పలేదు. కాని ఆ ఉదాహరణములను చూచినపుడు అపభ్రంశములో చాలమట్టుకు తూర్పునాట వ్యవహారములో నున్న మహారాష్ట్రి చేరియుండును అనిపించును. నిమిసాధు వొసగిన వ్యాకరణమునే హేమ చంద్రుడు విపులీకరించి వ్రాసెనేమో! నిమిసాధువు "అపభ్రంశమందు చాలమట్టుకు శౌరసేని-మాగధి అను రెండుభాషలలక్షణములు చేరియుండును" అనెను. ఆనాడు

"శౌరసేని" "మాగధి" లేక "మహారాష్ట్రి" అను నీరెంటి కలయికతో అపభ్రంశము రూపొందుచుండెనేమో ! లేక, ఆ భాషలకు పరస్పర వినిమయమైన నుండియుండును. నిమిసాధువు ఈ భాషల కన్నిటికిని ప్రాకృతము అనునది సామాన్య నామ మనెను. ( పాణిన్యాది వ్యాకరణోదిత శబ్ద లక్షణేన సంస్కరణాచ్చ సంస్కృత ముచ్యతే। తథా ప్రాకృత భాషైవ కించిద్విశేష లక్షణాత్ మాగధికా భణ్యతే। తథా ప్రాకృతమేవ కించి ద్విశేషాత్పైశాచికం। శౌరసేన్యపి ప్రాకృత భాషైవ, తథా ప్రాకృతమేవాఽపభ్రంశః-నిమిసాధు కృత కావ్యాలంకార టిప్పణి). అపభ్రంశమునకు ఒక ప్రత్యేకత నంగీకరించినట్టి ఉదారులలో దండిగూడ నొక్కడు. (శబ్దార్థౌ సహితం కావ్యం గద్యం పద్యం చ తద్ద్విధా। సంస్కృతం ప్రాకృతం చాన్య దపభ్రంశ ఇతి త్రిధా - కావ్యాదర్శము).

మమ్మటుడు, వాగ్భటుడు, రామచంద్రుడు, గుణచంద్రుడు, కావ్యకల్ప లతావృత్తికారుడు, అమరచంద్రుడుమొదలగు వైయాకరణులందరు అధునాతనులు, ఈ వైయాకరణులు అపభ్రంశము అన్ని ప్రాంతములందును సమానమైన గౌరవముగల భాష అనిరి. ఈ వైయాకరణులందరును అపభ్రంశ శబ్దమునకు "అన్ని దేశములందున్న వ్యావహారికము" అని అర్థము చేసుకొన్నట్లున్నది. ఈ అభిప్రాయమునే వాగ్భటుడు "అపభ్రంశస్తు యచ్ఛుద్ధం తత్తద్దేశేషు భాషితం." (2-3) అని స్పష్టముగ అనెను. ఇట్లే విష్ణుధర్మోత్తర కారుడు కూడ అది అనంతమనెను. (అపభ్రంశం తృతీయంచ తదనంతం నరాధిప ! దేశభాషా విశేషేణ తస్యాంతో నేహ విద్యతే). హేమచంద్రుని నాటికి అది సంస్కృత-ప్రాకృతములవలె సాహిత్య భాషగా పరిణమించెను. అందుచేత దానినాతడు వ్యావహారికము కంటె వేరు అనెను. హేమచంద్రుని తరువాతి వైయాకరణులు- ఆభాషా స్వరూప నిరూపణములో చాల తారుమారు పడిరి. అట్లే ఈ భాష ప్రచారమునన్న ప్రాంతమును గురించియు, వారికొక విలుకడదైన నిర్ణయములేదు. దాక్షిణాత్య దేశములందు కొన్ని భాగములలో ప్రచారమున నున్న భాష 'అపభ్రంశ' మని వారియూహ. ఇక త్రివిక్రముడు సింహరాజు, రామచంద్రుడు మొదలైనవారికి కేవల సాహిత్యదృష్టి. అందుచే వారి అభిప్రాయములు ఈ విషయమున అంతగా ప్రమాణము లనుటకు వీలులేదు. పాణిని సాధించిన రూపములకంటె భిన్నములైన వన్నియు అపభ్రంశములుగా వారు వ్యవహరించిరి. "సకల జగజ్జంతూనాం వ్యాకరణాదిభి రనాహత సంస్కారస్సహజో వచన వ్యాపారః ప్రకృతిః, తత్రభవం, సైవవా ప్రాకృతం" (నిమిసాధు)—

మూడవ శతాబ్దినాటికి అపభ్రంశము విభ్రష్టభాష. ఆరవ శతాబ్దినాటి కది ఆభీరభాష. అప్పటికి దానికి 'అవహంస-అవహట్ట' అను పదములు పర్యాయములుగ నుండెడివి. ఆ నాటికే-దానిని కొందరు సాహిత్యభాషగా నంగీకరించిరి. ఇది యొక "ప్రాంతీయభాష" అని వారి అభిప్రాయము. ఈ వాదమునకు నాంది యొనర్చినది 'చండు' డను వైయాకరణుడు. వలభిరాజగు ధారాసేనుని తామ్రశాసనము ఈ భాషలో మొదటిది. క్రీ. శ. 1100 వరకు అది శిష్టభాషగా నుండెను. పండ్రెండవ శతాబ్దియందు-గ్రామ్య భాషకంటె ఇది భిన్నమై-సాహిత్య భాషగా పరిణమించెను. ఈ కాలము "అపభ్రంశ" భాషకు వసంతము.

తొమ్మిదవ శతాబ్దినుండి అపభ్రంశ శబ్దమును ప్రాంతీయభాషలకు వాడుచు వచ్చిరిగదా ! అట్లే "దేశి", "దేశ్య", "దేశిమత" "దేశిప్రసిద్ధ" ఇత్యాది శబ్దములను కూడ వ్యావహారికముల నుద్దేశించియే వాడిరి. మరి "అపభ్రంశము" వీటికన్న భిన్నమా ? లేక-వాటిలో చేరినదేనా ? భరతాచార్యుడు దేశ భాషాశబ్దమును- "అపభ్రంశ"మును కొంచెము తక్కువగ జూచినను దానిని ప్రాకృతములకు అన్నిటికిని సామాన్య నామముగ వాడెను. ఆయన దేశిమతశబ్దములకు ఉదాహరణము లేవియు నియ్యలేదు. తరువాత పాదలిప్తుడు- 'దేశివయన' శబ్దముతో అపభ్రంశమునుగాక మహారాష్ట్రిని నిర్దేశించెను. చండుడు దేశిప్రసిద్ధ శబ్దమును-సంస్కృత ప్రాకృతభిన్నముల నన్నిటిని తెలుపుటకై ఉపయోగించెను. అంతేకాని-ఒక నిర్దిష్టమైన వ్యావహారిక భాషను సూచించుటకు కాదు. అపభ్రంశ కవులు మాత్రము తొమ్మిదవ శతాబ్దినుండి "దేశి" పదమును తమ గ్రంథములలో నుపయోగించిరి. కామశాస్త్ర కర్తయైన వాత్స్య

యనుడును - దేశిశబ్దముతో ప్రాకృతముల నన్నిటిని నిర్దే శించెను. "సురతే కర్ణ మూలేషు యచ్చదేశీయ భాషయా। దంపత్యోర్జల్పితం మందం, మన్మనంతం విదుర్బుధాః కామసూత్ర)"- కువలయ మాలాకర్తయైన ఉద్యోతనుడు కూడ ఈ యభిప్రాయమును వాడెను. రుద్రటుడు ప్రకృతి ప్రత్యయమూలమైన వ్యుత్పత్తిలేని శబ్దములు దేశిపదము లనెను. హేమచంద్రుడును ఈ అభిప్రాయమునే ఆమ్రే డించెను. శబ్దముల విషయమం దెట్లున్నను-భాషనుద్దేశించి నపుడు మాత్రము- దేశిశబ్దము ప్రాకృత సామాన్య వాచకమనుటయే చాలమందికి సమ్మతమైన అభి ప్రాయము. "పడమటినాట" మాటలాడు అపభ్రంశ ములో ఎక్కువగ శౌరసేని చేరును- దాక్షిణాత్యమైన అపభ్రంశము గుజరాతు-రాజస్థానీ భాషలకు మూలము. మృచ్ఛకటికములోని శకారుడు "శకారి" యను నొక భాషాభేదమును సూచించెను. ఇది అపభ్రంశ భాషయొక్క చిరుకొమ్మయే కావచ్చును.

అపభ్రంశములో ప్రసిద్ధములైన కావ్యములు అనేకములు కలవు. కాన్హ, శరహులను కవులు క్రోడీక రించిన 'దోహాకోశము' తొట్ట తొలుతటి అపభ్రంశ కావ్యము. కనకామరుని 'కరికండ చరివు' 'సోమప్రభుని' "కుమార పాలప్రతిబోధ", "రామసింహు"ని "పాహుడ దోహా" మొదలైనవి - రమణీయములైన మరికొన్ని కావ్యములు. ఇంకను అనర్ఘములైన రచనలెన్నో యున్నవి. ప్రాకృతకవులకు భావనూత్నత ప్రధానమైన గుణము.

అపభ్రంశము ముఖ్యముగ దిగంబర జైనులభాష. శ్వేతాంబరులు గూడ కొద్దికొద్దిగ దీని నుపయోగించిరి. దిగంబరజైనుల సాహిత్యమంతయు ఇంచుమించుగా అపభ్రంశమే. "సనత్కుమార చరియ" "పరమప్పయ" అనునవి (క్రీ. శ. 600) ఈ భాషలలోగల వేదాంత బోధక ములయిన ప్రాచీనగ్రంథములు. "పరమప్పయా" అను గ్రంథమును వ్రాసినవాడు "జోయిందుడు". హేమ చంద్రుడు కుమారపాల ప్రతిబోధను-కొంత సంస్కృతము నను- కొంత ప్రాకృతముసను వ్రాసెను. లక్ష్మణగని వ్రాసిన సపాసనాచరియమున (క్రీ. శ. 1148) అరువది యొనిమిది అపభ్రంశగాథలు గలవు. శ్రీచంద్రుడు కథాకోశమును వ్రాసెను. దానిలో 537 అపభ్రంశ గాథలున్నవి. హేమవిజయుడు (క్రీ. శ. 1600) కథా రత్నాకరమును రచించెను. అందులో 258 గాథలు గలవు. వాటిలో కొన్ని ప్రాచీనహిందీ- గుజరాతీ భాషలలో కూడ నున్నవి. అపభ్రంశము ముఖ్యముగ పడమటినాట పెరిగినభాష. కావ్యమీమాంసయందు యాయావరరాజశేఖరుడు ఒక రాజదర్బారు నేర్పాటు చేసెను. అతనికి స్వయముగ ప్రాకృతాభిమానము కలదు. రాజునకు తూర్పుదిక్కున ప్రాకృతకవులు గూర్చుండ వలెనట! అపభ్రంశకవులకు పశ్చిమదిశను నిర్ణయించెను. భూత భాషాకవులు దక్షిణదిశయందు ఆసీనులు కావలెను. ("తస్యాం రాజాసనం; తస్యచోత్తరత స్సంస్కృత కవయోని విశేరన్, పూర్వేణ ప్రాకృతాః కవయః పశ్చిమే నాऽపభ్రంశినః. కవయః; దక్షిణతో భూతభాషా కవయ స్తతః పరం భుజంగగణికాః" - కావ్యమీమాంస) ఈ వర్ణనమును జూచినప్పుడు కవిచే నిర్దేశింపబడిన దిక్కులు కేవలము ఏదో యొకటి చెప్పవలెనని చెప్పినవి గావనియు ఆయా భాషలకు ఆయా దిక్కులందలి ప్రాధాన్యమును బట్టి నిర్దేశింపబడె ననియు స్పష్టమగును. ఆ నాటి భారత దేశముయొక్క పూర్వదిక్కున నున్న బౌద్ధులు గూడ కొందరు-అపభ్రంశమును వాడినట్లున్నది. సమ్మితీయులు అపభ్రంశమును-మహాసాంఘికులు ప్రాకృతమును- స్థవిరవాదులు పైశాచిని, ముఖ్యముగ గ్రహించిరని వినీతిదేవుని అభిప్రాయము. విక్రమోర్వశీయమునందు కాళిదాసు పురూరవునిచే కొన్ని అపభ్రంశ "చర్చిక" లు పాడించెను. ఈ భాష, పేరునకు అపభ్రంశమే గాని- ఆ వాఙ్మయములోని తీపి ఈ రచనములకు అంటినది కాదు. పురూరవుడు తీవ్రవిరహమున పిచ్చివాడైనప్పుడు హఠాత్తుగ అపభ్రంశములోనికి దిగును. ఇవి కాళిదాసు వ్రాతలు కావనియు- తరువాత నెవరో కొందరు ఆ నాటకమున వాటిని చేర్చిరనియు కొందరు విమర్శకుల వాదము. ఈ విమర్శన మెట్లున్నను, విక్రమోర్వశీ యమునందు-అపభ్రంశ చర్చలను వాడుటనుబట్టి-పూర్వ కాలమున ఈ భాష, ప్రధానముగ సంగీతమునకు ఉపయోగింప బడుచుండె నని మరికొంద రందురు.. ఇది కొంతవరకు నిజమే కావచ్చును. ఇతర నాటకము

లందును నటి మొదలైన పాత్రలు గానావసరములందు ప్రాకృతమును వాడుచుండుట మన మెరిగినదే.

కువలయ మాలాకారుడు అపభ్రంశము "సంస్కృత ప్రాకృత - ఉభయ శుద్ధాశుద్ధపదసమతరంగ రంగదవల్గు" వన్నాడు. ఆ భాష "నవప్రావృడ్జలద ప్రవాహా పరిప్లావిత గిరి నదీసదృశముగ" సమవిషమమైనదట. "ప్రణయ కుపిత ప్రియ ప్రణయినీ సముల్లాపసదృశ"మట ! కాని, పైశాచి అంతకంటెను మధురమైనదని అతని యూహ.

'భవిసత్తకహా' అనునది అపూర్వమైన కావ్యము. దీనిని "జకోబీ" మహాశయుడు క్రీ. శ. 1918 లో తొట్ట తొలుత ప్రకటించెను. ఇది సాహిత్యమున కాతడు చేసిన గొప్ప సేవ.

పుష్పదంతుడు అపభ్రంశ కవులలో రత్నమువంటి వాడు. అతని పేరెంత సుందరమో పలుకు కూడ నంత సుందరమే. 'మహాపురాణము' 'ణాయకుమార చరివు' 'జసహర చరివు' అనునవి ఈతడు రచించిన గ్రంథములు. ఈ మూటి యందును బోధింపబడినది జైనధర్మమే. కాని ఆ ధర్మమును బోధించుటకు అత డెన్నుకొన్న పద్ధతి చాల మనోహరమైనది. ఆయన వాడిన వృత్తములు ప్రజా జీవితముల నుండి ఏరికొన్నవి. ఆ ఛందస్సునకు పేరులు కూడ మన మీనా డెరుగము. పుష్పదంతుని కావ్యములు చదువునప్పుడు వచ్చనిచేలనడుమ, సువాసితములైనతోటల నడుమ నడచిపోయినట్లుండును. ఆ కవులకు ప్రజాజీవితమే జీవగఱ్ఱ. వారెంత యుత్ప్రేక్షించినను ఆ యలంకారములు సామాన్య ప్రజల హృదయములలో తోచు నుత్ప్రేక్షలే. నేలవిడిచిన సాము వారెన్నడును చేయరు. క్లిష్టములైన విపరీత కల్పనలు, స్వభావముతో సంబంధములేని ఊహాలు సంస్కృత కవులకే చెల్లినవి. పుష్పదంతుడు చెప్పిన మారి దేవళము, పోతులరాజు, బలులొసగుట— ఇట్టి దృశ్యము లను నేటికిని మనము పల్లెలలో చూడవచ్చును. ప్రాకృత కావ్యము వ్రాయగలవానికిని, దానిని చదువగలవానికిని కూడ ఆ కవులు నమస్కారము పెట్టినారు. ఈ ఇరువురి అదృష్ట మంత గొప్పదట ! కుంద ప్రసూనములను మాలగా గ్రుచ్చుటకును, కుపితయైన ప్రియురాలి నోదార్చుటకును, ప్రాకృత కావ్యమును చదువుటకును తెలిసిన అదృష్టవం తులు కొందరే అని 'వజ్జలగ్గ' కారుని సవాలు.

రాగ రాగ ప్రాకృతములను జక్కగా చదువు సంప్ర దాయమే పోయినది. సంస్కృతనాటక కారులు శాస్త్రము కొరకై ప్రాకృతములను వ్రాసిరే కాని వాటిపై సాను భూతి సామర్థ్యములు కలిగి కాదు. అందునను వారు వాడుకొన్నవి మహారాష్ట్రి, మాగధి వంటివే. నీచపాత్ర ములు అరుదుగ పైశాచివంటి భాషలను అక్కడక్కడ వాడును. ఒకరీతిగ వీరందరిలో మృచ్ఛకటికాకారుడు మిగుల సాహసి. ఈనాడు ఈ భాషలలో కృషి యొనర్ప వలసిన భారము పరిశోధకులు, పండితులు, రసజ్ఞులు మున్నగువారిపై నున్నది.

పు. నా.

**అపేక్ష - సరఫరా :-** ఈ ప్రపంచమున ఎల్లెడలను ప్రజలు ఏదో సమయమందు ఏదోకొంత శ్రమపడు చుందురు. రిక్షావాడు ఉదయమునుండి సాయంత్రము వరకు ఎండలో వానలో రిక్షా లాగుచుండును. కూలి వాడు సామానులు మోయుచునో, పొలములో నాట్లు వేయుచునో ఉండును. పదిగంటలగునరికి పట్టణములలో కందిరీగల పుట్టరీతిగా కారులమీద, సైకిళ్ళమీద, కాలి నడకను పిన్నలు పెద్దలు మహాప్రవాహముగ కార్యా లయములకు పోవుచుందురు. ప్రపంచమున ప్రతి మాన వుడు ఏదో ఒక పనిలో నిమగ్నుడై ధనార్జనకై కష్టించు చున్నాడు గదా ! ఎందులకు మానవుడింత కష్టించును ? ఈ ఆర్థిక వ్యాపారము వలన మానవునకు కలుగునదేమి?

అనంతమైన ఈ ఆర్థిక వ్యాపారమునకు మూల కారణము మానవుని వాంఛలు. ఈ వాంఛలను సంతృప్తి పరచుటకై వస్తువులను ఉత్పత్తి చేయవలెను. వస్తూత్పత్తి సాధనములు పరిమితములు. పరిమితములైన వస్తూత్పత్తి సాధనములతో బహుళమగు మానవ వాంఛలను సంతృప్తి పరచు సమస్యయే ఆర్థిక శాస్త్రమందలి ముఖ్య వస్తువు.

**అపేక్ష (Demand) :-** అపేక్ష అనగా ఒకనికి ఒక వస్తువును కొనుటయందు గల వాంఛ. ఒక్క వాంఛ మాత్రమేగాక దానితోపాటు కొనుగోలుశక్తి యుండి ననే అది 'అపేక్ష' అనబడును. ఒక వస్తువునుండి తాను పొందు ప్రయోజనము (Utility) ను బట్టి అతడు ఎక్కువ గాని, తక్కువగాని మూల్యము (Price) ను ఇచ్చుటకు ఇష్టపడును. ఇది ఆ వస్తువునకై అతనియందుగల 'అపేక్ష'

యొక్క బలమును నిర్ణయించును. ఏదైనను ఒక వస్తువు నకై ఒక వ్యక్తికిగల అపేక్ష వేర్వేరు మూల్యములున్నపు డెట్లు మారునో తెలిపెడు దానిని 'అపేక్షపట్టీ' అందురు. ఒకడు అరటిపండ్లు ఒక్కొక్కపండు ఒక పైసయగుచో ఒక డజను పండ్లను కొనును, కాని పండు రెండుపైస లగుచో అరడజను మాత్రమే కొనును. మూడు పైస లగునచో నాలుగింటిని మాత్రమే కొనును. దీనికి కారణ మేమన అతని పరిమిత ఆదాయములో అరటిపండ్లు అతని కొనగు ప్రయోజనమునుబట్టి కేటాయింపబడిన వాటా 12 పైసలు మాత్రమే. అంతకుమించి అరటిపండ్ల కొరకు అతడు ఖర్చుపెట్టినచో తదితరములగు వస్తువులలో ఎంతో కొంత భాగము త్యాగము చేయవలసి యుండును. ఈ 12 పైసలలో మూల్యము హెచ్చుగనున్న తక్కువ పండ్లను, తక్కువగనున్న ఎక్కువ పండ్లను కొనగల్గును. ఇంతియేగాక ఇతర వాంఛలను తీర్చుకొను అవసరము ఎక్కువగ నున్నచో అసలు అరటిపండ్లను కొనుటయే మానివేయవచ్చును. వేర్వేరు వాంఛలు తమతమ ప్రాబల్యమునుబట్టి అతని ఎన్నికలో ప్రాముఖ్యమును పొందును. ఆ ప్రాబల్యమే అత డేయే వస్తువులను యెంతెంత కొనవలయునో నిర్ణయించును. ప్రతివ్యక్తి ఇట్లు వివిధ వాంఛల సంతృప్తివల్ల కలిగెడు ప్రయోజన మును తూచితూచి తన ఆదాయమునుండి సాధ్యమైనంత ప్రయోజనము లభించు విధముగ తన వాంఛలను సంతృప్తి పరచుకొనుచుండును. ఒక వ్యక్తియొక్క ఈ ప్రవర్తన మానవ సమాజములందు కొనువారందరికి వర్తించును. ఈ ప్రవర్తనము ననుసరించియే 'అపేక్షా సిద్ధాంతము' ప్రవచింపబడినది, ఇదియే మన ''మూల్యము హెచ్చిన అపేక్ష తగ్గును. మూల్యము తగ్గిన అపేక్ష హెచ్చును.'' అనెడి సూత్రము.

**సరఫరా (Supplies)** :- ఒక వస్తువు యొక్క నిల్వల నుండి వేరువేరు మూల్యములకు వర్తకులు అమ్మజూపు వస్తు పరిమాణమును 'సరఫరా' అందురు. ఒక వస్తువునకు కొనువారు ఇచ్చుమూల్యమునుబట్టి విపణియందు సరఫరా మారుచుండును. విపణి యందు మూల్యము హెచ్చినచో వర్తకులు అధికలాభములు పొందుటకై ఎక్కువ సరకును అమ్మజూపుదురు. మూల్యము తగ్గినచో తక్కువ సరకును అమ్మజూపుదురు, దీనినే 'సరఫరా' సిద్ధాంతమందురు. ఇది అపేక్షా సిద్ధాంతమునకు వ్యతిరేకముగ నడచుచుండును. ఏలయనగా కొనువారు సాధ్యమైనంత చవుకగ కొనుటకు ప్రయత్నింతురు. వర్తకులు సాధ్యమైనంత ప్రియమగు మూల్యమునకు అమ్మజూతురు. వర్తకులు వేర్వేరు మూల్యములకు ఎంతెంత పరిమాణముగల సరకును సరఫరా చేయుదురో తెలియజేయునది 'సరఫరా పట్టీ' అనబడును.

**మూల్యము (Price)** :- విపణియందు ఏ వస్తువుయొక్క మూల్యమైనను ఆ వస్తువుయొక్క అపేక్ష, సరఫరాలపై ఆధారపడియుండును. ఒక విపణి యందలి అపేక్ష పట్టీని సరఫరాపట్టీతో పోల్చిచూచిన యెడల ఏదోఒక మూల్యము వద్ద విపణియం దా వస్తువునకు గల అపేక్ష, సరఫరాలు సరిసమానముగ నుండును. ఇట్లు సరఫరా, అపేక్షలను సరిసమానము చేయగల మూల్యమే ఆ విపణియం దా వస్తువుయొక్క 'నిశ్చలమూల్యము'(Equilibrium Price) తరచు విపణి యందలి అపేక్ష యొక్కయు, సరఫరా యొక్కయు పరిస్థితులనుబట్టి మారుచుండు మూల్యమును 'విపణి మూల్యము' (Market value) అందురు. గడియా రములోని లోలకము ఏవిధముగ ఒక మధ్య బిందువును ఆధారముగ జేసికొని అటునిటు ఊగునో అట్లే 'విపణి మూల్యము' నిశ్చల మూల్యము నాధారముగ చేసికొని హెచ్చుచు, తగ్గుచు ఉండును. తాత్కాలికముగ విపణి మూల్యము హెచ్చినను, తగ్గినను తుదకు నిశ్చల మూల్య ముతో సమానమగును. నిశ్చల మూల్యముకంటె విపణి మూల్యము హెచ్చుగా నున్నచో వర్తకులు ఎక్కువ సరకును సరఫరా చేయుదురు. 'అపేక్ష' తక్కువగా నుండును. కావున విపణిమూల్యము నిశ్చలమూల్యముతో సమానమగును. నిశ్చలమూల్యముకంటె విపణిమూల్యము తక్కువగానున్నచో అపేక్ష హెచ్చును. సరఫరా తక్కువగా నుండును. అప్పుడును విపణిమూల్యము నిశ్చల మూల్య ముతో సమానముకాక తప్పదు.

**ఉత్పత్తి వ్యయము (cost of production)** ;- ఆర్థిక శాస్త్రవేత్తలు విపణియందు ఒక వస్తువు యొక్క మూల్యము ఎట్లు నిర్ణయింపబడునను ప్రధాన సమస్యను ప్రథమమునుండియు చర్చించుచునేయున్నారు. ఈసమస్య

పైన అనేక వాదోపవాదములు చెలరేగినవి. అయినను కొన్ని ముఖ్యాంశములపై ఏకాభిప్రాయము కలదు. మూల్యము: విపణియందలి సరఫరా, అపేక్షల స్థితిగతులను బట్టి నిర్ణయింపబడును. ఇంకను సునిశితముగ పరీక్షించి నచో సరఫరా పక్షమున ఉత్పత్తి వ్యయమును, అపేక్షా పక్షమున ప్రయోజనమును మూల్యమును నిర్ణయించుచునని తెలుచున్నది. సరఫరా స్థితిగతులను నిర్ణయించునదిగా ఉత్పత్తి,వ్యయము మన దృష్టిలో ముఖ్యాంశమగు చున్నది. ఉత్పత్తివ్యయ మనగా నేమి ? ఒక ఉత్పత్తి దారుడు ఒక వస్తువును ఉత్పత్తిచేయుటకు అవసరమైన ఉత్పత్తి సాధనములను సంతరించుకొనుటకు కొంత ధన రూపమైన వ్యయమగును. దానినే ఉత్పత్తి వ్యయమం దురు. ఇందులో అనేక రకములగు ఖర్చులు చేరును. (అ) ముడిసరకులను కొనుటకగు వ్యయము (ఆ) కూలి ఖర్చులు. జీతములు. (ఇ) వ్యాపారమం దుంచిన పెట్టు బడిపై వడ్డీ. (ఈ) మరమ్మతు ఖర్చులు (ఉ) నిర్వహణకై సామాన్యముగ ఇవ్వబడు ప్రతిఫలము (ఊ) వ్యాపార ఖర్చులు. ఉదా : ప్రకటన ఖర్చులు, అమ్మకపు ఖర్చులు ఉత్పత్తి వ్యయము - మొదలైన ఖర్చులతో కూడియుం డును. పరోక్షముగ కూడ వ్యాపారమున కొంత వస్తు సముచ్చాయము, కొందరి శ్రమ ఉపయోగింపబడి యుండ వచ్చును. ఉత్పత్తిదారు తానే నిర్వాహకుడు, ఆసామి లేదా సొంతదారుడు అగుచో అతనికి చెందిన యంత్రాగార స్థలముపై అద్దె, పెట్టుబడిపై వడ్డీ, నిర్వహణము చేసినందు లకు అతనికిచెందు ప్రతిఫలము-వీటిని అతడు ధనరూపమున చెల్లింపకున్నను వాటిని ఉత్పత్తి వ్యయములో యథార్థ వ్యయభాగములు (Real cost) గా పరిగణింపవలెను.

వస్తువుల విలువలను గూర్చిన చర్చలలో ఇటీవలి వరకు ఉత్పత్తి వ్యయము ధనరూపమైన వ్యయమనియే భావింపబడుచు వచ్చెను. ఇట్టి భావనపై ఆధారపడి చేయ బడిన వాదనల సారాంశము మూల్యము వల్లనే మూల్యము నిర్ణయమగునని చెప్పుట మాత్రమే. ఎందు వలన అనగా ధనరూపమైన ఉత్పత్తివ్యయముకూడా మూల్యమే. ఒక వస్తువుయొక్క మూల్యము ఉత్పత్తి దారునిచేత చెల్లింపబడినపుడు అదియే అతని ఉత్పత్తి వ్యయములో ఒక భాగము అగును. అట్లయిన ఉత్పత్తి వ్యయము యొక్క యథార్థ స్వరూపమేమి ? ధనరూపమైన ఉత్పత్తి వ్యయముల నిజస్వభావమును కనుగొనుటకు అనేకులు యత్నించిరి. ఉత్పత్తి సాధనములు పరిమిత ములు. ఈ పరిమితమైన ఉత్పత్తిసాధనము లొక్కొక్కటి కొంత పరిమాణములో ఒక ఉత్పత్తి శాఖలో వినియో గింపబడు నెడల మరియొక ఉత్పత్తిశాఖ వాటిని వినియోగించు అవకాశము కోల్పోయిన దన్నమాట. మొదటి ఉత్పత్తి శాఖలోనికి ఆయా ఉత్పత్తి సాధనము లను ఆకర్షించుటకు అధమము అది రెండవ శాఖలో గడింపగలిగినంతటి ప్రతిఫలమైనను ఇవ్వజూపవలెను. కావున ఒక వస్తువును ఉత్పత్తి చేయుటకగు వ్యయము, అందు ఉపయోగింపబడిన సాధనములతో మరియొక వస్తువును ఉత్పత్తిచేసిన దానికుండెడి విలువనుబట్టి నిర్ణయ మగును. తుట్టతుదకు తేలునదేమనగా ఒక వస్తువుయొక్క యథార్థ వ్యయము ఆ వస్తువును ఉత్పత్తి చేయుటకు ఉపయోగింపబడిన సాధనములు మరొక విధముగ ఉపయోగింపబడనందువలన త్యాగము చేయబడిన ప్రయోజనమునకు సమానము. పరిమితమైన సాధనము లతో బహుళములగు వాంఛలను సంతృప్తి పరచుట అసాధ్యముగాన కొన్ని వాంఛలను త్యాగము చేయుట తప్పనిసరియగును. అందువలననే యథార్థ వ్యయము త్యాగము చేయబడిన ప్రయోజన పరిమాణమును తెలియ జేయును.

తె. పు.

**అప్పయదీక్షితులు :-** ఆచార్యదీక్షితు లనబడిన నరసింహ దీక్షితులు విజయనగరాధీశుడగు కృష్ణరాయల (క్రీ. శ. 1509-1530) ఆస్థానకవి. ఈయన మొదటి భార్య స్మార్తకుటుంబమునకు చెందినది. రెండవభార్య యగు తోటరాంబ శ్రీ వైకుంఠాచార్య వంశజ. ఈమెకు జన్మించిన నలుగురు కుమారులలో పెద్దవాడు రంగ రాజాధ్వరి. ఈయన 'అద్వైతముకురము', 'వివరణ దర్పణము' అను గ్రంథములను రచించెను. ఈయనబొమ్మ మహీపాలుని (క్రీ. శ. 1528) ఆస్థానకవిగా నుండెను. అద్వైతము, విశిష్టాద్వైతము, పూర్వమీమాంస - ఈ వంశములో పూర్తిగా ప్రవేశించినవి. ఈ రంగరాజా ధ్వరి కుమారుడే అప్పయదీక్షితులు. భారద్వాజసగోత్రుడు.

కాంచీపురమునకుదగ్గరనున్న అడయప్పలంఅను గ్రామమున ఈయన కన్యామాసమున 4654 వ కలివత్సరమున జన్మించెనందురు. అప్పయ దీక్షితేంద్ర విజయములో దీక్షితులు క్రీ. శ. 1558 లో జులై 15వ తేదిన జన్మించెనని శివానంద యోగీంద్రుడు వ్రాసెను. ఈ రెండు తేదీలకు ఆరేండ్ల వ్యవధి కన్పించుచున్నది. పదునేడవ శతాబ్ది చివరిభాగములో నున్న జగన్నాథపండితుడు ఇతని సమకాలికు డను కథ లున్నవి. కాని కాలకంఠేశ్వరుని ఆలయము అప్పయదీక్షితుల ఆధ్వర్యవమున క్రీ. శ. 1582 లో నిర్మింపబడెనని అడయప్పలపు శాసనములు తెలుపుచున్నవి. క్రీ. శ. 1549, 1566, 1601 లకు చెందిన అడయప్పలపు శాసనములలో అప్పయ దీక్షితుల ప్రసక్తిగలదు. చినబొమ్మ భూపాలుని ఆస్థానమున వేలూరులో చాలకాల మీతడు వసించెనని, అచట కనకాభిషేకముతో గౌరవింపబడెనని చారిత్ర కాధారముల వలన తెలియవచ్చుచున్నది. దీక్షితులు యాదవాభ్యుదయ వ్యాఖ్యారంభమున రామరాయ, తిమ్మరాజ, చినతిమ్మరాజులను పేర్కొనినాడు. చినతిమ్మరాజు క్రీ. శ. 1542 నుండి 1550 వరకు సేనాపతిగా నుండెను. ఆతర్వాత అప్పయదీక్షితులను చేరదీసినవాడు వేలూరు వాడగు చినబొమ్మనాయకుడు (1549-1578). మొదటి వేంకటపతి (క్రీ. శ. 1585) కాలమున కువలయానంద విధి రసాయనములు రచింపబడినవి. క్రీ. శ. 1580 నాటికే సెవప్పశాసనములు ఈతని కీర్తిని కొనియాడ సాగినవి. తంజావూరి నేలిన నరసింహుని ఆస్థానమున గూడ అప్పయదీక్షితులు కొంతకాలము గడపెను. పాండ్యదేశమున వసంతమండపములో ఏకపాదమూర్తి ప్రతిష్ఠావిషయమున, శైవులకు, వైష్ణవులకు వివాదములు బయలుదేరగా, తిరుమలనాయకు డీతనిని మధురకు తీసికొనిపోయెననియు అచట దీక్షితులమూలమున ఆ ప్రతిష్ఠ నిర్విఘ్నముగా జరిగెననియు తెలియుచున్నది.

"చిదంబర మిదం పురం ప్రథితమేవ పుణ్యస్థలం
సుతాశ్చ వినయోజ్జ్వలాః సుకృతయశ్చ కాశ్చిత్కృతాః
వయాంసి మమ సప్తతే రుపరినైవ భోగే స్పృహా
నకించి దహ మర్థయే శివపదం దిదృక్షే పరమ్"

అను శ్లోకమును దీక్షితులు అంత్య సమయమున చెప్పిరి. డెబ్బది రెండేండ్లు నిండిన తరువాత చిదంబరమున మరణించిరి. దీనిని బట్టి అప్పయదీక్షితులు క్రీ. శ. 1525 ప్రాంతమున జన్మించిరనియు, క్రీ. శ. 1598 ప్రాంతమున మరణించిరనియు చెప్పవీలగుచున్నది.

అప్పయ దీక్షితులు నూటనాలుగు గ్రంథములను రచించెనని నీలకంఠదీక్షితులు శివలీలార్ణవమునచెప్పినాడు. వీటిలో ఆత్మార్పణ స్తుతి యనబడు శివపంచాశిక, ఆర్యా శతకము, దశకుమార చరిత సంగ్రహము, పంచరత్న స్తవము, శివకర్ణామృతము, వైరాగ్య శతకము, ఆనంద లహరి, భక్తామర స్తవము, శాంతి స్తవము, రామాయణ తాత్పర్య నిర్ణయము, రామాయణ తాత్పర్య సంగ్రహము, రామాయణ సార స్తవము, రామాయణ సార సంగ్రహము, భారత స్తవము, వరదరాజాష్టకము, ఆదిత్య స్తోత్రరత్నము, శివ కామి స్తవ రత్నము, శివమహిమా కలిక స్తవము అనునవి కావ్యములు. వసుమతీ చిత్రసేన విలాసమను నాటకము కూడ ఒకటి ఇతడు రచించినది కలదు. ఇతడు వేదాంత దేశికుని కావ్యములను, గోవింద దీక్షితుని హరివంశసార చరితను, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమును వ్యాఖ్యానించెను.

దీక్షితులు వేంకటపతిరాయల అనుజ్ఞ ననుసరించి, కువలయానంద కారికలు అను అలంకార గ్రంథమును రచించితినని చెప్పికొనినాడు. రంగరాజాధ్వరియే ఈయనను వేంకటపతివద్దకు పంపెనని ఆశాధరు డనినాడు. ఈ కారికలను తన చంద్రాలోకము నుండి దొంగిలించినాడని జయదేవు డీతనిని తన ప్రసన్నరాఘవమున ఎత్తి పొడిచినాడు. కాని చంద్రాలోకములోని అలంకార ప్రకరణమున కీకారికలు వార్తికములవంటివి. చిత్రమీమాంస యను మరియొక అలంకార శాస్త్ర గ్రంథమును ఇతడు రచియించినాడు. ఈ గ్రంథము అతిశయోక్తి (అలంకారము) తో ఆగిపోయినది. దీనిని ఖండించుటకు జగన్నాథ పండితుడు చిత్రమీమాంసా ఖండనమును రచించి, అంతటితో నాగక, తన రసగంగాధరమున మాటిమాటికి దీక్షితులను ఎత్తిపొడుపు మాటలతో నిందించుచు విమర్శించినాడు. కాని అప్పయదీక్షిత రచితమని చెప్పబడు 'ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ నాల్పస్య తపసః ఫలమ్' అను శ్లోకమును బట్టి దీక్షితులు తెలుగుదేశము నందును, తెలుగు భాష

యందును మిక్కిలి యాదరముకలవాడని తెలియుచున్నది. శబ్దార్థ సంబంధములను వివేచించు వృత్తి వార్తికమును దీక్షితులు రచియించినాడు.

భట్టోజీ దీక్షితులు వేదాంత శాస్త్రమును అప్పయ దీక్షితులవద్ద అభ్యసించెను. భట్టోజీ సిద్ధాంత కౌముది మొదలగు వ్యాకరణ గ్రంథములను రచించిన తర్వాత వేదాంతము చదువవలెనని అప్పయ్య దీక్షితుల ఇంటికి చేరినపుడు, ఆతడు తన కౌముదిని శిష్యులకు పాఠము చెప్పుచుండెనట! పాఠమైన తరువాత తనపేరు, వచ్చిన పని, భట్టోజీ విన్నవించుకొనెను, కాని తనపేరు చెప్పక, శిష్యులతోపాటు కౌముదీ పాఠమును వినినందులకు సేతుస్నానము చేసిరానిదే భట్టోజీతో ఇతర విషయము లను ప్రస్తావించ వీలులేదని అప్పయ్యదీక్షితు లన్నారట! యథావిధిగా సేతుస్నానము చేసివచ్చి, భట్టోజీ వేదాంత మును చదువసాగెనట.

అప్పయ్య దీక్షితులు ధర్మశాస్త్రములలో ప్రవీణుడు, బాల వితంతువైన తన పుత్రికకు పునర్వివాహము చేయ సంకల్పించియు ఆతడు ధర్మశాస్త్రములకు,సంఘమునకు. ఆచారమునకు వెరచి, ఊరకుండెనని చెప్పుదురు. అప్పయ దీక్షితులు ఖండదేవునిచే మీమాంసక మూర్ధన్యుడని ప్రశంసింపబడినాడు. అతిదేశ లక్షణ పునరాక్షేపము, పూర్వమీమాంసా విషయ సంగ్రహ దీపిక, ధర్మ మీమాంసా పరిభాష, విధిరసాయనము, ఉపక్రమ పరాక్రమము, నాద నక్షత్రమాల, మయూఖావలి, చిత్ర పటము అను పూర్వ మీమాంసా గ్రంథములు ఇతడు వ్రాసినవి. భాట్ట మీమాంసకుడైనను అప్పయ దీక్షితులు ఇచటగూడ క్రొత్త సిద్ధాంతములను తెచ్చెను. ప్రకర ణాంతరము గూడ కర్మభేద ప్రమాణమేయని బ్రహ్మ సూత్ర శాంకరభాష్య వేదాధికరణమున తన పరిమళ వ్యాఖ్యలో నిరూపించినాడు. వాద నక్షత్రమాలలో నవ్యన్యాయభాష గలదు. వాక్యార్థ విచారమైన ఈ గ్రంథమున ముఖ్యమైన పూర్వోత్తర మీమాంసాధి కరణములు వివేచింపబడినవి, శాస్త్రదీపికపై వ్యాఖ్య మయూఖావళి, శ్లోకవార్తిక దృష్ట్యా లఘువార్తిక మన బడిన చిత్రపటమున పూర్వ మీమాంసా శాస్త్రములోని అధికరణములు సంక్షిప్తముగా ప్రతిపాదితములు.

పూర్వ మీమాంసాశాస్త్ర విషయములను పూర్తిగా వేదాంత గ్రంథములలో గూడ చొప్పించిన అప్పయ దీక్షితులకు స్మార్త వైష్ణవములు రెండును ప్రేమా స్పదములే. అనేక విశిష్టాద్వైత గ్రంథములను వ్యాఖ్యా నించినను,

> "మహేశ్వరే వా జగతామధీశ్వరే
> జనార్దనే వా జగదంతరాత్మని
> నవస్తుభేద ప్రతిపత్తి రస్తుమే
> తథాపి భక్తి స్తరుణేందుశేఖరే"

అని కాంచీపురములో నొక పండితసభలో అప్పయ్య దీక్షితులు పల్కెనట! శివునకును, విష్ణువునకును వస్తుభేద ప్రవృత్తి లేకున్నను తనకు శివునిపైననే చిత్తము నిలిచి యున్నదట.

శ్రీకంఠుని శైవ వేదాంతమును సుప్రతిష్ఠితము చేయుటకు శ్రీకంఠ భాష్యమునకు శివార్కమణిదీపిక అను వ్యాఖ్యను,శివాద్వైత నిర్ణయము అను గ్రంథమును రచించి ఇతడు శైవ విశిష్టాద్వైతమును ప్రవచించి నాడు. విశిష్టాద్వైత వ్యాప్తికై రామానుజుడువలె ఈయన శైవ వేదాంత వ్యాప్తికై నిరంతర కృషి సలిపెను. అనేక మీమాంసా న్యాయములకు విశిష్ట తాత్పర్యము ప్రాముఖ్యము ఇతనిచే చూపబడినవి.

న్యాయ రక్షామణి, పరిమళ, సిద్ధాంతలేశ సంగ్ర హము అను దీక్షితుల వేదాంత గ్రంథములు అతి ముఖ్య మైనవి. శంకరభాష్య వ్యాఖ్యయగు భామతిపైగల కల్పతరు వ్యాఖ్యకు టీకగా వ్రాయబడిన పరిమళ వ్యాఖ్యలో దీక్షితులు అవచ్ఛేద వాదము, నానాజీవ వాదము, క్రమముక్తి, సర్వముక్తి మొదలగు విశిష్ట సిద్ధాంతములను సోపపత్తికముగా నిరూపించినారు. అద్వైత వేదాంతమున గల భిన్న భిన్న సిద్ధాంతములను సమగ్రముగా నొకచో చేర్పబడిన మహాగ్రంథము సిద్ధాంతలేశ సంగ్రహము. వ్యవహారమున భాట్టమీమాంస కుడు, వేదాంత మార్గమున భామతి ప్రస్థానావలంబి. భక్తిమార్గమున శివాద్వైతియు నగు అప్పయ దీక్షితులు సర్వతోముఖ పాండిత్యము, అద్వితీయ ప్రతిభ గల మహా వ్యక్తి.

పో. సు.

**అఫనాశీ నికితిన్ :-** రష్యాదేశములోని త్వెర్ నగరనివాసియైన అఫనాశీ నికితిన్ అను వర్తకుడు, హిందూదేశమునకు యాత్ర కావించిన ఐరోపీయులలో నొకడు. హిందూదేశమును గూర్చియు, ఇచ్చటి జనులను గూర్చియు ఆ కాలములోని రష్యా ప్రజలలో చిత్ర విచిత్రమైన అభిప్రాయములు వ్యాపించి ఉండెడివి. అనేక నదులను దాటి, సముద్రములను తరించి, పర్వతములను అధిగమించి, ఎన్నో కష్టముల కోర్చి హిందూ దేశమునకు అఫనాశీ వచ్చెను. ఇచ్చట తాను కనులారగాంచిన వింతలను, విశేషములను ఆతడొక గ్రంథముగ వ్రాసెను. ఆతని దినచర్యాత్మకమైన ఆ గ్రంథముపేరు "మూడు సముద్రములు దాటి నేను కావించిన యాత్రలు" అనునది.



అఫనాశీ నికితిన్

అఫనాశీ 1469 మొదలు 1472 వరకు హిందూదేశములో ఉండెను. ఆనాలుగేండ్లలో ఆతడు తాను గాంచిన విశేషములను వ్రాసియుంచిన దినచర్యాగ్రంథము చరిత్రకారులకు అత్యంతోపయుక్తమైనది. ఆకాలమునాటి ఐరోపీయులెందరో వ్రాసిన విషయములకంటె అఫనాశీ వ్రాసిన యంశము లెంతో సానుభూతిని, సూక్ష్మగ్రహణశక్తిని, వివేచనను వ్యక్తీకరించుచున్నవి.

రష్యను చారణులు, ఆనాడు తమ దేశములో వ్యాపారాదులు కావించు విదేశీయులందరి పేర్లు, ఊర్లు, కీర్తి ఉగ్గడించుచు, పాటలువ్రాసి, గానము చేయుచుండెడివారు. వాటిలో అనేక హిందూ వర్తకుల పేర్లు కనబడుచున్నవి.

వోల్గానదిమీద పడవ ప్రయాణముచేసి, కాస్పియను సముద్రము చేరుకొని, అచ్చటినుండి డెర్బెంట్, బకూ రేవులమీదుగ పర్షియా దేశమునకును, అచ్చటినుండి హిందూదేశమునకును అఫనాశీ ప్రయాణము చేసెను. హిందూ దేశములో పర్యటన కావించుచు నాలుగేండ్లుండి, తిరుగు ప్రయాణములో ట్రెబిజోండ్ మీదుగ, నల్లసముద్ర తీరముననున్న జెనోవా వర్తకస్థావరములకును, అచ్చటినుండి త్వెర్ నగరమునకును అతడు పోదలచెను. కాని తన జన్మస్థానము చేరకుండగనే, మార్గమధ్యములో అఫనాశీ మృత్యువువాత బడెను.

అఫనాశీ పారసీక దేశములో గుఱ్ఱములనుకొని వాటిని హిందూదేశమునకు తీసికొని వచ్చెను. వాటికిచట మంచి గిరాకీ కలదని యాతడు తెలిసికొనెను. హిందూదేశమునుండి రంగు దినుసులను, సుగంధద్రవ్యములను తీసికొని పోవలెనని ఆతని ఉద్దేశము. కాని స్థలమార్గమున ప్రయాణముచేసిన యెడల త్రోవపొడుగునను పన్నులు చెల్లింపవలసి వచ్చుననియు, సముద్రమార్గమున పోయిన యెడల పన్నులబాధ లేకున్నను ఓడదొంగల చేతులలో పడి సర్వనాశనమగుట తప్పదనియుతాను ఆకులపడియున్నట్లు అఫనాశీ తన దినచర్యాగ్రంథములో వ్రాసికొనెను.

తన దీర్ఘమగు యాత్రాసందర్భములో ఆశ్చర్యకరములయిన విషయముల నన్నిటిని ఆతడు వ్రాసియుంచెను. హిందూదేశములోని జంతువులు, పశులు, జనులు, దేవాలయములు, రాజభవనములు, ఆచార వ్యవహారములు, వాతావరణము మున్నగు విషయముల నన్నిటినిగూర్చి అఫనాశీ తన దినచర్యలో వ్రాసియుంచెను.

ఉత్తర హిందూస్థానములోని ఒక స్థానిక ప్రభువును గూర్చి ఆతడిట్లు వ్రాసెను: "ఈరాజు భవనమున ఏడు ద్వారములున్నవి. ఒక్కొక్క ద్వారముకడ నూర్గురు భటులు కావలియుందురు. రాజభవనము అద్భుతముగను, మహావైభవోపేతముగను ఉన్నది. భవనపు లోపలిభాగమంతయు బంగారునీటి మలామా చేయబడి యున్నది. కుడ్యములనిండ చిత్రములు కలవు. శిలలపై నగిషీపని కలిగిన బంగారు రేకులు పొదిగి యున్నారు. రాజు లోభికాడు. ఆయన కెందరో భార్యలు కలరు ఆతని సైన్యములో పదివేలమంది అశ్వికులు, ఏబదివేల కాల్బలము బంగారు అలంకారములుగల ఇన్నూరు ఏనుగులు కలవు. రాజు ఏనుగుపై ఊరేగుచున్నప్పుడు ఆయన ముందు నూర్గురు కాహాళముల నూదువారు, రెండు

వందలమంది నాట్యకత్తెలు, బంగారు జీనులుగల గుఱ్ఱములపై నెక్కిన మున్నూర్గురు అశ్వికులు, నూరు వానరములు, ఇతర పరివారమును నడచుచుండుట కాననగును.

అన్నిటిని మించి ఒక పవిత్ర క్షేత్రములోని బుద్ధదేవుని మహా దేవాలయము ఈ విదేశీయ యాత్రికుని ముగ్ధుని చేసెను. "బుద్ధ దేవాలయము చాల పెద్దది. విశాలమైనది. ఆ దేవాలయము రష్యా దేశములోని త్వెర్ నగరమంత విశాలమైనది. ఆ దేవళము శిలా నిర్మితమైనది. ఆ శిలలపై బుద్ధదేవుని పవిత్ర కథలన్నియు చెక్కబడి యున్నవి. ఆ మహాత్ముడు ఎన్నిజన్మ లెత్తెనో, ఏయే అవతారములను దాల్చెనో, ఎన్నెన్ని అద్భుత మాహాత్మ్యములను కావించెనో, ఆ వివరము అన్నియు శిలలపై చిత్రించబడినవి. ఒకప్పుడు మానవాకారముతోను, ఇంకొకప్పుడు గజాననాకారముతోను, మరొకప్పుడు వానరాకారముతోను, మరికొన్ని సందర్భములలో భయంకరమైన మృగ శిరస్సుతోను, ఏడడుగుల వాలముతోడను—— ఇట్లే ఎన్నెన్నో రూపములతో ఆ దేవుడు ఈ శిలా శిల్పములలో కన్పించును. బుద్ధదేవుని అద్భుత జన్మవిశేషములను సందర్శించుటకు, హిందూదేశమంతటినుండియు అసంఖ్యాక జనులు ఈ దేవాలయమునకు వత్తురు. రాతిలో చెక్కబడిన ఒక మహోన్నతమైన బుద్ధ విగ్రహ మిచ్చట కలదు. ఆ శిలామూర్తి చేయియెత్తి నిలచియుండును. ఆయన తోక శరీరముచు చుట్టబెట్టుకొని యున్నది. ఆయన ముఖము వానర ముఖమువలె నున్నది. బుద్ధుని ఎదుట నల్లరాతిలో మలచిన మహోన్నతమగు వృషభమొకటి కలదు. ఈ వృషభముపై బంగారు నీటితో చక్కని అలంకారములు చిత్రింపబడి యున్నవి. ఎందరెందరోవచ్చి, ఈ వృషభరాజముయొక్క కాలిగిట్టను ముద్దిడుకొని, దానిని, బుద్ధుని పుష్పములతో పూజించిపోవుదురు."

ఈ విదేశీయుడు హనుమంతుని విగ్రహమునుచూచి బుద్ధ విగ్రహమని పొరబడియుండును. హిందూదేశములోని వివిధ దేవతా విగ్రహములను గుర్తించుటలో విదేశీయులు పలువురు ఇట్లే తికమకలు పడుచుందురు.

ఏది యెట్లున్నను అఫనాశీ నికితిన్ యొక్క దినచర్యా గ్రంథము నేటికి అయిదు శతాబ్దములనాటి భారతీయ దృశ్యములను మనముందుంచి ఎంతయో చారిత్రక ప్రాముఖ్యమును వహించుచున్నదనుటలో సందేహము లేదు.

మ. జ. రా.

**అబిసీనియా (ఇథోపియా):** చరిత్ర : తూర్పు ఆఫ్రికాలోని ఈ రాజ్యము ఎప్పుడు స్థాపింపబడ్డదో తెలిసికొనుటకు సరియైన ఆధారములులేవు. కాని అచటి గాథలనుబట్టి నేటికిని అధికారములోఉన్న రాజవంశము క్రీ. పూ. 1000 ప్రాంతము నాటిదనియు ఆ రాజవంశము వారు సాలమన్ రాజుకుమారుడైన మెనివెక్ యొక్కయు, షేబారాణి యొక్కయు వంశీయు లనియు చెప్పబడుచున్నది. షేబారాణి జ్యేష్ఠ పుత్రుడు ఈ రాజ్యమును సంపాదించినాడట! "షేబా" అనగా ఇథోపియా అనియు, తన తల్లిపేరనే ఈ రాజ్యమునకు "ఇథోపియా" అని పేరు పెట్టినాడనియు వాడుక.

క్రీ. శ. మొదటి శతాబ్దమునాటికి ఇథోపియనులు 'పేగనులు' అనబడెడివారు. అనగా రకరకాలైన దేవతా పూజలను చేసెడివారని అర్థము. క్రీ. శ. నాల్గవ శతాబ్దములో ఇథోపియారాజు "కాపైక్" క్రైస్తవ మతమును స్వీకరించెను. కాపైక్ క్రైస్తవులు క్రైస్తవులం దొక తెగవారు. వీరెక్కువగా ఈజిప్టు, ఇథోపియా మున్నగు ఆఫ్రికా దేశములలోనే వ్యాపించి ఉండిరి. కాపైక్ చర్చికి సర్వాధికారి ఈజిప్టు రాజ్యములోని అలెగ్జాండ్రియాయం దుండువాడు. ఆరవ శతాబ్దములో ఇథోపియారాజు ఎఱ్ఱసముద్ర ప్రాంతమును స్వాధీన పరచుకొని ఆమార్గముగా అరేబియాపై దండయాత్ర సలిపి "యమన్" అనెడు సారవంతమైన రాష్ట్రమును జయించెను. నాటినుండి 50 ఏండ్లదనుక "యమన్" ఇథోపియా రాజ్యభాగముగా ఉండెను. ఈ కాలములోనే ఇథోపియా ప్రపంచములోని వివిధ దేశములతో సంబంధములు కలిగి అభివృద్ధి నొందెను.

క్రీ. శ. ఏడవ శతాబ్దములో మహమ్మదీయులు ప్రబలి ఈజిప్టును జయించిరి. ఎఱ్ఱసముద్ర తీరప్రాంతము వారి స్వాధీనమయ్యెను. ఇథోపియా తన పూర్వోన్నతిని కోల్పోయి ఏకాకియైనది. ఆతరువాత కొన్ని శతాబ్దముల వరకు ఇథోపియా కల్లోల పరిస్థితులలోనుండెను.

అది అంతఃకలహాలతో, విదేశీయుల దండయాత్రలతో విచ్ఛిన్నమయ్యెను. 16 వ శతాబ్దములో ఇథోపియారాజు మహమ్మదీయులనుండి తమ్ము రక్షింపుమని పోర్చుగల్ రాజును కోరెను. కోరిన సహాయము లభించెను. ఇథోపియా మహమ్మదీయుల హస్తగతము కాకుండ రక్షింపబడెను. అదే కాలములో రోమన్ క్యాథలిక్కు ప్రచారకులు ఇథోపియాలో ప్రవేశించి ఇథోపియా రాజును క్యాథలిక్కు మతమును స్వీకరింపుమని బలవంతముచేసిరి. కాని ప్రజలు వారిని ప్రతిఘటించిరి. చివరకు కాప్టిక్ క్రైస్తవమే నిలిచిపోయెను. విదేశీయులందరు బహిష్కరింప బడిరి. అయినను "జేమ్సు బ్రూస్" వంటి పరిశోధకులు ఇథోపియాకు వచ్చుచునే యుండిరి.

ఆపైని రెండు శతాబ్దముల దనుక దేశము అంతఃకలహములకు గురియయ్యెను. ఈ అంతర్యుద్ధములవల్ల అనేక ప్రాచీనభవనములు నాశనమైనవి.




19 వ శతాబ్దములో 'కాసా' అను నొక సరదారు శత్రువులపై విజయముపొంది రెండవ థియొడోర్ అను బిరుదముతో రాజయ్యెను. క్రీ. శ. 1818-1868 మధ్య ఇథోపియా ఇతనికి స్వాధీనమయ్యెను. 2 వ థియొడోర్ ప్రాచీన ఇథోపియా సామ్రాజ్యమును పునరుద్ధరింప వలెనని ప్రయత్నము చేసెను. కాని విఫలుడయ్యెను. థియొడోర్ నిరంకుశుడు. అతనికి బ్రిటిష్ వారితో తగాదా వచ్చెను. 1864 లో ఇథోపియాలోని బ్రిటిష్ రాయబారిని, అతని అనుచరులను బంధించెను. 1867 లో బొంబాయినుండి రాబర్టు నేపియర్ ఆధిపత్యమున బ్రిటిష్ సైన్యము ఇథోపియాపైబడి రాజధానియైన మాగ్దాలాడును 1868 లో స్వాధీనపరచుకొనెను. రెండవ థియొడోర్ ఆత్మహత్య చేసికొనెను. కొంత కాలమునకు బ్రిటిష్ సైన్యము దేశమును విడిచి పోయెను.

తరువాత టైగర్ రాష్ట్ర గవర్నరు ఇథోపియా రాజయ్యెను. కాని 'షోవా' రాష్ట్ర పాలకుడు 'మెనిలిక్' అనువాడు ఇటలీ సహాయముతో ఇథోపియాను ఆక్రమించుకొనెను. 1889 వరకు మెనిలిక్‌కు ఇథోపియా అంతయు స్వాధీన మయ్యెను. ఇటలీకి మెనిలిక్‌కు సహాయము చేయుటలో స్వార్థము లేకపోలేదు. మెనిలిక్ విజయము తరువాత ఇటలీవారు తాము ఇథోపియా (అప్పటికే అబిసీనియా అని పిలువబడు చుండెడిది. అబిసీనియా అనునది అరబీ పదము) సంరక్షకులమని ఉద్ఘాటించిరి. దానితో మెనిలిక్‌కును ఇటలీకిని వైరము ప్రాప్తించెను. 1895 లో ఇటాలియన్ సైన్యములు అబిసీనియాపై దాడిచేసెను. కాని అపజయమునే పొందెను. కొంతకాలము యుద్ధము జరిగిన తరువాత ఇటలీ అబిసీనియా స్వాతంత్ర్యమును అంగీకరించెను. ఎఱ్ఱ సముద్ర తీరప్రాంతమును (నేడు ఎరిట్రియా అనబడుచున్నది) కోల్పోయెను.

మెనిలిక్ ఫ్రాన్స్, బ్రిటన్ దేశాలతో స్నేహము చేసెను. ఇతని కాలములో అబిసీనియా అభివృద్ధి చెందెను. దేశములో రైలుమార్గము నిర్మింపబడెను. న్యాయశాస్త్రము రూపొందింపబడెను. మెనిలిక్‌కు తర్వాత వచ్చిన 'లిజ్‌యాస్' అనురాజు ఇస్లాంమత ప్రచారము చేయబూని తత్ఫలితముగా సింహాసనమును కోల్పోయెను. అతని అనంతరము మెనిలిక్ కుమార్తె 'జుడిత్' రాణి అయ్యెను. 'రాస్ తఫారిమాకొనెన్' అనునతడు సంరక్షకుడయ్యెను.

దేశములో ఆధునిక జీవన పద్ధతిని ప్రవేశపెట్టి అభ్యుదయమునకు రాస్ తఫారిమా కొనెన్ పాటుపడెను. 1928 లో ఇథోపియా నానాజాతి సమితి (League of Nations) లో సభ్యత్వమును పొందెను. జుడిత్ రాణి యొక్క మరణానంతరము 1930 లో మాకొనెన్ "హేలే సెలాషే" అను బిరుదముతో ఇథోపియా చక్రవర్తి యయ్యెను.

ఇటలీ సామ్రాజ్య తృష్ణచేత అబిసీనియాను బెదరించ మొదలు పెట్టినది. 1934 లో ఎరిట్రియావైపు ఎన్నో సరిహద్దు సంఘటనలు జరిగెను. అక్టోబరు 3, 1935 నాడు ఇటలీ అబిసీనియాపై దాడిచేసెను. బ్రిటిష్‌వారు ఫ్రెంచివారు చేసిన సంధి ప్రయత్నములు విఫలమయ్యెను. ఆధునిక యుద్ధ సాధనములతో, విమాన దాడులతో ఇటాలియను సేనలు అబిసీనియాను నాశనము చేసెను. అబిసీనియారాజు నానాజాతి సమితి సహాయమును అర్థించెను. కాని లాభము లేకపోయినది. మే 5, 1936 నాడు ఇటాలియన్ సైన్యములు ఇథోపియా రాజధానియైన "అడిస్ అబాబా" లో ప్రవేశించెను. ఎరిట్రియాను, ఇటాలియన్ సోమాలి లాండును, ఇథోపియాను కలిపి "ఇటాలియన్ తూర్పు ఆఫ్రికా" అని పేరు పెట్టిరి.

ఇటాలియనులు వలస రాజ్యమును బలపరచిరి. అబిసీనియావారు గెరిల్లా యుద్ధమును ప్రారంభించిరి. ఇటాలియనులు దేశములో రోడ్డులు నిర్మించి గెరిల్లా దళములను తరుముటకు ప్రారంభించిరి. 1938 లో "హేలే సెలాషే" బ్రిటనులో తలదాచుకొనెను. ఇంతలో రెండవ ప్రపంచ సంగ్రామము వచ్చెను. అబిసీనియా కూడ యుద్ధ రంగమయ్యెను. అబిసీనియా రాజు 1941 లో బ్రిటిష్‌వారి సహాయముతో స్వదేశము చేరుకొని ఇటాలియనులతో యుద్ధము సాగించెను. విజయము పొందెను. "హేలే సెలాషే" మరల అబిసీనియా చక్రవర్తి (మే 1941) యయ్యెను. తరువాత మిత్ర రాజ్యములతో చేరి జర్మనీ, ఇటలీ, జపాన్ దేశములపై అతడు యుద్ధమును ప్రకటించెను. యుద్ధానంతరము ఐక్యరాజ్య సమితి (U. N. O.) లో అబిసీనియా చేరిపోయెను. 1945 లో ఆసమితి ఛార్టరుపై సంతకము చేసిన 50 దేశాలలో అబిసీనియా కూడ ఒకటి.

అబిసీనియాలో విద్య ఆరోగ్యరక్షణము పరిశ్రమలు రవాణా సౌకర్యములు మున్నగువాటిని అభివృద్ధి చేయుటకై ఐక్యరాజ్య సమితి యందలి వివిధశాఖలు, అమెరికా బ్రిటన్ దేశములు తోడ్పడుచున్నవి. దేశము అభివృద్ధి పొందుచున్నది.

డిసెంబరు 2, 1950 నాడు ఎరిట్రియా, అబిసీనియాలో చేరిపోవలెనని ఐక్యరాజ్య సమితి నిర్ణయించెను. ఆ నిర్ణయము ప్రకారము 1952 లో ఎరిట్రియా ఆంతరంగిక పరిపాలనలో సంపూర్ణ స్వపరిపాలనాధికారము గల రాష్ట్రముగా అబిసీనియాలో అంతర్భాగమై పోయెను. ఎరిట్రియా ప్రతినిధులు అబిసీనియా పార్లమెంటు సభ్యులైరి.

డి. రా.

**అబిసీనియా (భూగోళము) :-** అబిసీనియా లేక ఇథోపియా అనబడు దేశము ఆఫ్రికా ఖండములో నొక పెద్ద స్వతంత్రదేశము. 1936 లో ఇటలీ తనలో అబిసీనియాను కలుపుకొన్నప్పటికి, రెండవ ప్రపంచ యుద్ధానంతరము, అనగా 1942 లో ఈ దేశము మరల స్వాతంత్ర్యమును సంపాదించుకొనెను. దీని చుట్టును బ్రిటిషు, ఫ్రెంచి, ఇటలీ రాజ్యము లున్నవి. ఈదేశము చాలభాగము పర్వతమయము. ఈ దేశము యొక్క విస్తీర్ణత 3,50,000 చదరపు మైళ్ళు. దీని జనాభా షుమారు 1,00,00,000. దేశమంతయు మొత్తముమీద ఎత్తైనభూమి అగుటచేతను, పర్వతప్రాంత మగుటచేతను, అందు రాకపోకలకు ఎంత మాత్రము సౌకర్యములు లేవు. ఈ కారణము చేతనే, ఈ దేశములో కొంత ఖనిజసంపద ఉన్నప్పటికిని ఆర్థిక-అభివృద్ధి చాల మందముగా నున్నది. ఈ దేశమునకు సముద్రప్రాంతము ఎంతమాత్రము లేకపోవుటచేత, ఇతర దేశములతో వ్యాపారమునకై ఫ్రెంచి సోమలీలాండులోని జిబుతిరేవు పట్టణముమీదనే అబిసీనియా ఎక్కువగా అధారపడవలసివచ్చినది. భూమి సారవంతమైన దగుటచేతను, వేసవియందు వర్షములు కురియు కారణము చేతను, ఈ దేశములో వ్యవసాయము ఎక్కువగా అభివృద్ధి నొందినది. ప్రత్తి, గోధుమ, కాఫీ, బార్లి - ఇచ్చట ప్రధానమైన పంటలు. బ్లూనైలు నది ఆధారము వలన ఎల్లప్పుడు భూమి దున్నుటకును, వ్యవసాయము చేయుట

కును ఇచ్చుట అవసరమైన నీటి సదుపాయము ఉన్నది. ఎట్టి పరిశ్రమలు లేవనియే చెప్పవలసియుండును. అడవులు విశేషముగా కలవు. ఇనుము, రాగి, బొగ్గు, సల్ఫరు గనులు ఈ దేశములో ఎక్కువగా నున్నవి. చెప్పదగిన ఖనిజ సంపదయు, వ్యవసాయ సంపదయు ఉన్నప్పటికిని ఈ దేశము ఆర్థికముగా ఉన్నత స్థితిలో లేదు. దీనికి ముఖ్యకారణములు దేశమంతయు పర్వతమయమగుట, రైలు మీద గాని, నీటి మీద గాని ప్రయాణమున కెంత మాత్రము తగిన సౌకర్యములు లేకపోవుట. ఈ దేశమునకు అడ్డిస్ అబాబా ముఖ్య పట్టణము. అడోవా, గండక్ అనునవి ఈ దేశములోని ముఖ్య వ్యాపార కేంద్రములు.

బి. రా. రా.

**అబుల్ ఫజల్ :-** అబుల్ ఫజల్ క్రీ. శ. 1551 జనవరి 14 వ తేది యందు ఆగ్రాలో జన్మించెను. ఖురానుపై వ్యాఖ్యాతయును, సర్వజ్ఞాన సంపన్నుడును అగు షేక్ ముబారక్ నాగోరీ అను నాతనికి ఇతడు రెండవకుమారుడుగా జన్మించెను. అక్బరు ఆస్థానములో సుప్రసిద్ధ కవి యగు ఫయిజీకి ఇతడు తమ్ముడు. తండ్రివైపు విచారించినచో, ఇతడు భారతదేశమునకు వలస వచ్చిన ఒక అరేబియా కుటుంబమునకు చెందినవాడు. ఈ కుటుంబము తొలుత సింధులోను, తరువాత జోధ్‌పూరు నందలి నాగోరులోను స్థిరనివాస మేర్పరచుకొనెను. అందుచేత ప్రజలు అబుల్ ఫజల్ తండ్రియగు షేక్ ముబారకును నాగోరీ యని పిలుచుచుండిరి. అబుల్ ఫజల్ పుట్టుకకు కొన్ని సంవత్సరములకు ముందు షేక్ ముబారక్ పెండ్లి చేసికొని ఆగ్రాలో స్థిరావాస మేర్పరచు కొనెను. ఐనను నాగోరీ యను పేరుతోనే ప్రజ లీతనిని పేర్కొను చుండెడివారు. తల్లి పక్షమున పారసీక దేశమునందు షిరాజ్ దగ్గర నున్న ఇడిజ్‌లో నివసించుచుండెడి రఫియాల్‌దీన్ సఫావీతో అబుల్ ఫజల్ బంధుత్వము కలిగి యుండెను. ఈ సఫావీ, సిద్ధపురుషుడుగా, మహాత్ముడుగా ప్రసిద్ధికెక్కి యుండెను. అందుచే సమ్రాట్టు హుమాయూను ఆతని విరోధియగు షేర్‌షా సూరి - ఇరువురును ఆ మహాత్ముని సలహాలను పొందుచుండిరి.

అబుల్‌ఫజల్ బాల్యమున పఠనాసక్తి గలవాడై తండ్రి రక్షణమున అత్యుత్సాహముతో చదువుకొనుచు వృద్ధినొందెను. మహదవీ సంప్రదాయమునెడ అభిమానమును కలిగియున్న కారణముచేత ఇతని తండ్రియగు షేక్ ముబారక్ పెక్కు క్లేశములకు గురికావలసివచ్చెను. ఆ క్లేశములు అబుల్‌ఫజల్ లేతమనస్సుపై శాశ్వతముద్రను గావించెను. తన్మూలముననే అబుల్ ఫజల్‌కు సహనగుణ మబ్బెను. ఈ సహనగుణాభ్యాసము ఇతనికి ఉత్తరకాలమునందు అక్బరుతో స్నేహమేర్పడుటకు మూలమయ్యెను. అబుల్ ఫజల్, తన మానసిక వికాసమును గూర్చి ఇన్షా యను గ్రంథమున వ్రాసికొనెను. ఆ వ్రాతనుబట్టి ఇట్లు తెలియు చున్నది: ఐదవ సంవత్సరమున ఇతడు చదువ నారంభించి పదునేనవ సంవత్సరము నాటికి ఆనాడు వ్యాప్తిలో నున్న విజ్ఞానశాఖలన్నిటియందును ప్రజ్ఞావంతుడయ్యెను. అటు తర్వాత పది సంవత్సరముల పాటు విద్యార్థులకు విద్యగరపుచు సమకాలికులగు పండితులతో మతవిషయక చర్చలయందు పాల్గొనుటలో కుతూహలుడగుచు ఇతడు కాలము గడపెను. కాని వైజ్ఞానిక వ్యాసంగములవలన ఇతనికి అంతశ్శాంతి లభింపలేదు. అందుచేత సన్యసింపవలయునను కోరిక ఇతనికి కలుగుచుండెడిది. అబుల్‌ఫజల్ అన్నయగు ఫయిజీని ఆస్థానములో చేరవలసినదిగా అక్బరు ఆహ్వానించెను. అది మొదలుకొని అబుల్ ఫజల్‌యొక్క మనమున ఉజ్జ్వలతరమైన తన భవిష్యత్తునుగూర్చి ఆశలు పొడమెను. అక్బరు ఆస్థానములో తన తండ్రి అయిన షేక్ ముబారక్‌ను ద్వేషించినవారు అనేకులుండిరి. ఐనను అక్బరు తన కొసగు ప్రోత్సాహమునుబట్టి ఓరిమితోడను రాజభక్తితోడను తాను సేవచేసినచో అది నిష్ఫలము కాజాలదని అబుల్ ఫజల్‌కు విశ్వాస మేర్పడెను. ఈలోపుగా ఫయిజీ అక్బరుయొక్క స్నేహమును సంపాదించుకొని దానిని నిలుపుకొనుటలో గొప్ప నేర్పును చూపెను. ఆనేర్పు అబుల్ ఫజల్‌యొక్క శ్రేయస్సునకు సాధనమయ్యెను. 1574 ప్రారంభములో అబుల్ ఫజల్ ఫయిజీ యొక్క సోదరుడుగా అక్బరునకు పరిచయము కావింపబడెను. అక్బరు ఇతనిని మిక్కిలి ఆదరముతో స్వీకరించెను. అందుచేత ఇతడు ప్రపంచ పరిత్యాగబుద్ధిని త్యజించెను.

అక్బరునామాలో ఇత డిట్లు తన్నుగూర్చి వ్రాసికొనెను. "కాలము మొదట నాకు అనుకూలపడలేదు. అందుచేత నేను దాదాపు స్వార్థపరుడను, గర్వితుడను అయి సర్వ సంగ పరిత్యాగిని కావలయు నని నిశ్చయించుకొంటిని. నా చుట్టును అనేక శిష్యులు చేరిన కొలదియు నా విద్యా డంబరము అతిశయింప దొడగెను. నిజమునకు విద్యా గర్వముచే ఏకాంతవాసమునకై ఆతురపడితిని. నా అదృష్టవశమున ఏకాంతప్రదేశములలో నిజమైన సత్యా న్వేషకుల సాంగత్యములో కొన్ని రాత్రులు గడపుట సంభవించెను. నిర్ధనులయ్యు జ్ఞానధనులైన పెద్దల సాంగ త్యము నా కానందమును చేకూర్చెను. అందువలన నేను నేత్రములను తెరచితిని. అంతట పండితంమన్యుల స్వార్థ పరత్వము నాకు గోచరించెను. నా తండ్రియొక్క ఉప దేశములు అజ్ఞానోపద్రవమున బడకుండ ఎట్టకేలకు నన్ను రక్షింపగలుగుచుండెను. నా మనస్సునకు శాంతి లేదాయెను. మంగోలియా యందలి యతుల దెసకును, లెబనాన్‌లోని మునులవైపునకును నా హృదయము ఆకర్షింపబడ సాగెను. టిబెట్ దేశపు లామాలతోడను, పోర్చుగలులోని మత గురువులతోడను, పార్శీ మత గురువులతోడను, "జెండాఎవస్తా" పండితులతోడను సమా వేశములకొరకు ఉవ్విళ్ళూరుచుంటిని. నా స్వంతదేశపు పండితుల విషయమున నా కసహ్యాభావ మేర్పడెను. ఉదారవిషయ విచారమార్గమున సమ్రాట్టు నాకు నేత కాగలడను నాశతో ఆతని యాస్థానములో చేరుమని నా సోదరులును తక్కిన బంధువులును నాకు సలహా నొసగిరి. వారి హెచ్చరికలను తిరస్కరించుటకు నేను వ్యర్థప్రయత్నమును చేసితిని. ఇప్పుడు నేను ఆనందినై యున్నాను. ఏమనగా సమ్రాట్టు కర్మప్రపంచమున మార్గ దర్శకుడుగను, ఏకాంతవాసమున ఆశ్వాసకుడుగను నాకు ఉపకరించెను. నా ధార్మిక వాంఛయు నా నిర్దిష్ట కృత్య నిర్వహణ వాంఛయు అతనిలో సాఫల్యము నొందెను."

అబుల్ ఫజల్ తొందరగా ఉన్నతపదవి కెక్కలేదు. పదునొకండు సంవత్సరములు భక్తితత్పరమైన సేవచేసిన తర్వాత మాత్రమే ఇతడు వేయిమందిభటులకు నాయకు డయ్యెను. 1586 లో అనుభవవృద్ధుడైన షాఅలీ మహమ్మ్ తో కలసి ఇతడు ఢిల్లీ యొక్క సంయుక్త పరిపాలనలో పాల్గొనెను. 1592 లో ఇతడు రెండువేల మంది భటులకు నాయకుడయ్యెను. 1600లో నాలుగువేలమంది భటులకు నాయకుడుగా ఇతడు నియుక్తుడయ్యెను.

'ఇబాదత్ ఖానా' లో ప్రతి గురువారము సాయం కాలమున జరుగు సమావేశములలో చర్చలు జరుగుచుం డెను. వీటియందు అక్బరునకు అభిరుచి మెండుగనుండెను. అట్టి తరుణములందు పూర్వాచార పరాయణులగు పండి తుల వివాదములను రెచ్చగొట్టుటలో అబుల్ ఫజల్ కృత కృత్యుడయ్యెను. పూర్వాచార పండితులలో అంతకు ముందుండెడి ఐకమత్యము లోపించెను. అక్బరునకు గల మతవిషయక సంశయములు తొలగలేదు. అవి పెంపొంద జొచ్చెను. అక్బరు తన సభ్యపక్షమునకు అబుల్ ఫజల్‌ను నాయకునిగా నిర్ణయించెను. తుదకు అబుల్ ఫజల్ ఉలేమా మత పండితులను చర్చలలో ఓడింపగలిగెను. ఐహిక విషయములలో మాత్రమే కాక, ఆధ్యాత్మిక విష యములలో గూడ పరిపాలిత ప్రజలు తమ సమ్రాట్టును నాయకునిగా అంగీకరించుట ధర్మముఅనుమాటకు అక్బరు సమ్మతించునట్లుగా అబుల్ ఫజల్ బోధించెను. ఈ నూతన మత సిద్ధాంతము రాజుచే ప్రకటింపబడుట అబుల్ ఫజల్ యొక్క అదృష్టమునకు నాందియయ్యెను. పూర్వాచార పరాయణులగు పండితులు తమ పదవులకు ప్రమాదము వాటిల్లుట చూచి లోబడుటకు సంసిద్ధతను సూచించిరి. కాని ప్రయోజనములేకపోయెను. షేక్ ముబారక్, ఆతని పుత్రులు కలిసి తయారుచేసిన విశిష్టమైన పత్రముపై ఆ పండితులు సంతకములను కూడ చేసిరి. ఈ పత్రము నందు సమ్రాట్టునకు ధర్మపాలకుడనియు "ముజ్‌తాహిద్" (అనగా ఇస్లామునకు సంబంధించిన అన్ని వ్యవహారము లందును) అప్రమాదశీలుడగు అధికారి అనియును రూఢి చేయబడెను. "సత్యవ్రతుడగు రాజు యొక్క విజ్ఞానము" అనునది ఒకటే ఇట్లు శాసననిర్మాణమునకు మూలాధార మయ్యెను. సమస్త పండితులును, న్యాయవాదులును మత విషయములలో అక్బరు విధించు శాసనములకు బద్ధు లగుటకు అంగీకరించిరి. పండితులు తా మింతకు ముందు అనుభవించుచున్న సమున్నత స్థానమును కోల్పోయిరి. అక్బరునకును వారియెడగల అనుమానములు అధికతరము లయ్యెను.

ఈ లోపల "దీన్-ఇ-ల్లాహీ" లేక దివ్యమతము అనబడు నూతన మతమును అక్బరు స్థాపించెను. ఈ నూతన మత పరిణామములు అబుల్ ఫజల్‌కు అక్బరుపై గల పలుకుబడిని ఇంకను అతిశయింపజేయుటకు కారణములయ్యెను. అక్బరు ఆస్థానమునందలి ఉన్నతవంశీయులగు ఉద్యోగులు అబుల్ ఫజల్ యెడల అసూయను వహించిరి. ఇతనిని దక్కనుకు పంపుట మంచిదని వారు అక్బరునకు సలహా చెప్పిరి. అక్కడ పొసగిన ఏదైన ఒక యుద్ధములో గాని, నిర్వహింపవలసిన పరిపాలనములో గాని లోటు వచ్చిన యెడల సమ్రాట్టునకు అబుల్ ఫజల్ యందు గల గౌరవమునకు న్యూనత వాటిల్లునని వారూహించుటయే దీనికి కారణము. యువరాజగు సలీమున (జహంగీరు)కు కూడ అబుల్ ఫజల్ ఎడల అనిష్టము ఏర్పడియుండెను. తనకును తన తండ్రికిని వైమనస్యము ఏర్పడుటకు అబుల్ ఫజలే ముఖ్యముగా కారణభూతుడని గూడ అతడు నిశ్చయించెను. 1601 లో యువరాజగు సలీము యొక్కయు, తదితరుల యొక్కయు ప్రేరణచే అబుల్ ఫజల్ దక్కనుకు సైనిక కార్యనిర్వహణమునకై పంపబడెను. అబుల్ ఫజల్ దక్కనులో అపజయమునొందునని ఇతని విరోధులు ఊహించియుండుట సరికాదు. ఎందుచేతననగా ఇతడు తన సర్వ కృత్యములను అచ్చట సమర్థతతో నిర్వహించెను. సైనికచర్యను నిర్వహించు విషయములో గూడ అత్యంత సమర్థుడు అను కీర్తిని ఇతడు పొందెను.

ఇంతలో యువరాజగు సలీము తండ్రితో కలహింపదొడగెను. అక్బరు యొక్క ఉన్నతోద్యోగులు కొందరు సలీము పక్షమును అభిమానించుచున్నట్లు సమ్రాట్టునకు స్ఫురించెను. అబుల్ ఫజల్ ఒక్కడే అక్బరునకు నమ్మదగిన బంటు అయియుండెను, ఆస్థానములో ఇతని ఉనికి అత్యావసరమై యుండెను. ఆ కారణముచేత ఉత్తర హిందూదేశమునకు తత్‌క్షణమే బయలుదేరి రావలయునని అక్బరు అబుల్ ఫజల్‌కు ఉత్తరువులు పంపెను. రాజాజ్ఞ చొప్పున తన కుమారుడగు అబ్దుల్ రహిమానునకు తన దళాధిపత్యమును అప్పగించి, కొలదిమంది అనుచరులతో మాత్రమే అబుల్ ఫజల్ ఆగ్రాకు బయలుదేరెను. బుందేలా నాయకుడగు రాజా వీర్‌సింగు యొక్క రాజ్యభాగము గుండా అబుల్ ఫజల్ ప్రయాణము చేయవలసివచ్చెను. ఈ అవకాశమును పురస్కరించుకొని ఇతనిని హత్య చేయుటకు సలీము రాజా వీర్‌సింగును ప్రేరేపించెను. ఆస్థానములో అగౌరవమును పొందియున్న వీర్‌సింగు, యువరాజును సంతోషపెట్టుటకై దొరకిన అవకాశమును అనురక్తితో పరిగ్రహించెను. రాజ్యాభిషిక్తుడైన తర్వాత, సలీము వలన తప్పక తనకు గొప్పబహుమానము లభింపగలదని విశ్వసించి, అశ్వికులయొక్కయు, పదాతులయొక్కయు ఒక పెద్ద దళమును వీర్‌సింగు నార్వారువద్ద నిలిపెను. అబుల్ ఫజల్‌ను, ఇతని అశ్వికులును వీర్‌సింగు యొక్క సంఖ్యా బలమునకు లోబడిరి. అబుల్ ఫజల్ ఇట్లు 1602 ఆగస్టు 12 వ తేదినాడు హత్య గావింపబడెను. ఇతని తల అలహాబాదులో నున్న యువరాజు నొద్దకు పంపబడెను. శత్రువగుటచే అబుల్ ఫజల్‌ను తానే హత్యకు పాల్పరచితినని సంపూర్ణమైన నిర్లక్ష్య భావముతో సలీము తన 'జీవన స్మృతులు' అను గ్రంథములో బహిరంగముగా ఒప్పుకొనెను. 'నేను పితృభక్తిగల కుమారుడను, అబుల్ ఫజల్ మొదలగువారు తమ దుస్తంత్రములచేత నా తండ్రి నన్ను ప్రేమింపకుండ జేసిరి' అని సలీము వ్రాసికొనెను. అక్బరు అబుల్ ఫజల్ యొక్క మరణమునకు మిక్కిలి దుఃఖించెను. కొంతకాలము ఎవ్వరికిని దర్శన మొసగుట కాతడు ఇష్టపడలేదు. అబుల్ ఫజల్ దుర్మరణమునొందిన పరిస్థితులను గూర్చి విని "సలీము సమ్రాట్టు కాగోరిన యెడల నన్నే చంపి అబుల్ ఫజల్ ప్రాణములను కాపాడినచో బాగుండెడిది" అనుచు అక్బరు వాపోయెను.

అబుల్ ఫజల్ గొప్ప కార్యశూరుడు. అక్బరు నామా అను నాతని గ్రంథము అతని గొప్ప కృషికి ఒక స్మారక చిహ్నము. దాని తర్వాత మిక్కిలి విలువగలది ఆతని (గ్రంథ భాగమగు) మూడవ సంపుటము. దీనికి 'ఆయిన్-ఇ-అక్బరి' లేక అక్బరుయొక్క నియమావళి అను పేరు కలదు. అక్బరుయొక్క పరిపాలనమునకు చెందిన విషయములు తెలిసికొనుటకు ఇది అన్నిటికంటె ప్రామాణికమైన ఆధారముగా నున్నది. అబుల్ ఫజల్ ఇతర గ్రంథములను పెక్కింటిని రచించెను. "అయార్-ఎ-దానిష్" అనునది "అన్వర్-ఇ-సుహైలీ" అను గ్రంథము యొక్క సంక్షిప్త రచనా రూపము. "మక్తుబత్-ఇ-అల్లామీ" లేక 'ఇన్షాయి అబుల్ ఫజల్' అను శీర్షికతో ఇతని లేఖలు [illegible]

ఇతని మరణానంతరము ఇతని బంధువులచే రెండు సంపుటములుగా ప్రచురింపబడెను. మహాభారతము యొక్క పారశీకానువాదము తోడను, "తారీఖ్-ఇ-అల్ఫీ" అను గ్రంథము తోడను ఇతని నామము సంబంధమును కలిగి యున్నది.

రచయితగా అబుల్ ఫజల్ సాటిలేనివాడు. ఇతని శైలి ఉదాత్తమైనది. ఇతని శక్తియుత పదప్రయోగకౌశలము, వాక్య నిర్మాణ విధానము, సమాస రచనౌచిత్యము, సంపూర్ణ వాక్యముల లాలిత్యము ఎట్టివారికిని అనుకరించుటకు అలవికానివి.

అబుల్ ఫజల్ నేతగా నుండగా అక్బరు తన విధ్యుక్త ధర్మములను బాగుగా గుర్తింపగల్గెను. రాజాస్థానములో ప్రవేశము కలిగినది మొదలుకొని భిన్నజాతులకును, భిన్న మతములకును చెందిన ప్రజలను జయప్రదముగా పరిపాలించు సమస్యను అప్రమత్తుడై ఇతడు పరిశీలింప దొడగెను. దీనికి ఫలితముగా అన్యమత సహనముతో గూడిన పరిపాలనా విధానము రూపొందెను. నూతన విధానమును పరిపాలనలో అమలువరచుటకు అక్బరునకు అవసరము కలిగినపుడెల్ల అబుల్ ఫజల్ ఆ విధానమును లేఖన రూపమున స్ఫుటముగా ప్రతిపాదించి తత్ప్రతికూల వాదములను నిర్భయముగా తన లేఖినిచే నెదుర్కొనెను.

అక్బరు అవలంబించిన నూతనవిధానము మొగలాయి పరిపాలన యెడల ప్రజలు సమాధానపడుటకు ఎక్కువగా తోడ్పడెను. "రాజు ప్రజలకు తండ్రి" అను నాదర్శము భారతదేశమును పాలించిన సమ్రాట్టులలో నెల్ల అక్బరు నందు విశేషముగా అన్వర్థమయ్యెను.

డా. యూ. హు. ఖా.

**అబుల్‌హసన్ తానాషా :-** అబుల్ హసన్ తానాషా కుతుబుషాహి పరిపాలకులలో తుదివాడు. ఇతడు క్రీ. శ.. 1672 నుండి 1686 వరకు గోలకొండ రాజ్యమును పాలించెను. ఇతనిని గురించి ప్రచారములో నున్న కథలు పరస్పర విరుద్ధములయిన చరిత్రలు ఈతని జీవితచరిత్రను దురవగాహ మొనర్చుచున్నవి.. పరస్పర విరుద్ధములయిన గాథలను, చరిత్రలను శోధించి సమన్వయపరచిన స్థూలముగ రెండుసిద్ధాంతములు రూపొందుచున్నవి. 1. అబుల్ హసన్ విదేశీయుడు. 2. అబుల్ హసన్ కుతుబుషాహీ రాకుమారుడు.


అబుల్ హసన్ తానాషా

అబుల్ హసన్ పర్షియా వాడనియు, అరేబియా వాడనియు, హమ్దాన్ వాడనియు, మొగలాయి వాడనియు గ్రంథస్థములు చేయబడిన విషయములు సమన్వయ మగుటలేదు. సిద్దిపేట తాలూకా లోని అనంతగిరి యందును, ఇతర స్థలముల యందును ప్రచార మందున్న కథనములలో సత్యము లేదు.

సమకాలికులును, స్థానికులును, ప్రామాణికులును అగు చారిత్రకు లితడు కుతుబుషాహీ వంశమువాడనియే వ్రాసినారు. శత్రుకూటమువారుకూడ ఈ విషయమును ఒప్పుకొన్నారు. ఇతడు అబుల్లా కుతుబుషా (1626-1672) తమ్ముడగు ఆయినుల్ ముల్కు (ఇమాదుల్ ముల్కు) కుమారుడు. సుల్తాన్ అబ్దుల్లా తల్లియగు హాయాత్ బక్షు బేగం పౌత్రుడు.

హాయాత్ బక్షు బేగం సుల్తాన్ మహమ్మదు కులీ కుతుబుషా (1580-1612) కూతురు: సుల్తాన్ మహమ్మదు కుతుబుషా (1612-1626) భార్య; సుల్తాన్ అబ్దుల్లా కుతుబుషా (1626-1672) తల్లియగుటచే అబుల్ హసన్ రాజవంశీయుడనియు, రాజ్యార్హత కలవాడనియు అసందిగ్ధముగ తెలుచున్నది. ఈతని మేనల్లుడు షరీఫల్ ముల్కు, మంత్రి మసూదుఖాన్, అత్తగారు బేగంసుల్తానా ఈవిషయమును సందేహమున కాస్పదము లేకుండ స్పష్టపరచి యున్నారు.

చరిత్రకులు, సమకాలికులగు యాత్రికుల సంపుటములు అబుల్ హసన్ ప్రారంభ జీవితమును సమగ్రముగ చిత్రింపలేదు. ఆతని బాల్యదశావిశేషములను వివరింపలేదు. అందందు లభ్యములగు శకలములను, సూచనలను

సమన్వయపరచి స్వీకరించినచో ఈతని కౌమార యౌవనదశా విశేషములను గూర్చి తెలిసికొనవచ్చును.

కుతుబ్ షాహి పాదుషాలు విషయలంపటులు, ఆద్యంతముల రాజులిరువురు తప్ప మిగత వా రెవ్వరును షష్టిపూర్తి చేసికొనలేదు. ఇట్టి వీరి యల్పాయుర్దాయమునకు కారణములను ఇతరత్ర వెదకనవసరములేదు. అబుల్ హసన్ పుట్టి పెరిగిన వాతావరణ మెట్టిదో పై విషయముల వలన సుగ్రాహ్య మగుచున్నది. పరిసర పరిస్థితుల ప్రభావమువలన అబుల్ హసన్ విషయ లౌల్యమున నెల్లరను తలదన్నువాడయ్యెను. అంతఃపుర ఆదర్శములు పవిత్రత సడలి మలినమయి పోయినవి. అంతఃపుర స్త్రీల మానములు, పరిచారకుల శీలములు శిథిలములుకా జొచ్చినవి. అతి మెత్తనివాడును, విషయలోలుడును అగు అబ్దుల్లా సుల్తానుకు గూడ నీతని ప్రవర్తనము దుస్సహ మయ్యెను. ఆతడు మందలించెను. రాణులు చులకన చేసిరి. రాజును, రాణులను అనుసరించి తిరుగు పరిచారికా బృందముకూడ ఈ మార్పును గమనించి ఆ రాజకుమారు నవమానించి యుందురు.

అబుల్ హసన్ అవమానములను సహింపలేని వాడయ్యెను. రాజభోగములకు స్వస్తి చెప్పి, అంతఃపుర సౌఖ్యములను త్యజించి ఫత్తేదర్వాజా (విజయద్వారము) కడ నివసించియున్న విఖ్యాత వలీ (యోగి) యగు షా రాజూ ఖత్తాల్‌ను ఆశ్రయించెను. అప్పు డాతని వయస్సు రమారమి ఇరువది సంవత్సరము లని తెలియుచున్నది. ఆతడు భయభక్తులతో, ప్రేమ విశ్వాసములతో గురువును సేవించుచు, ఆతని కృపకు పాత్రుడయ్యెను. అందుచే నా వలీ అబుల్ హసనును "తానాషా" యని ముద్దుగ పిలిచెడువాడు. "తానాషా" యన "బాలయోగి" యని యర్థము. తానాషా పదునాలుగేండ్లు గురు శుశ్రూష చేయుచు ఆ యాశ్రమమందే గడపెను.

ఆ యాశ్రమజీవిత మాతనిని ప్రజాసామీప్యమునకు దెచ్చినది. ప్రజల అవసరములు, ఆవేదనలు, ఆవేశకావేషములు, కష్టసుఖములు తెలిసికొని, వాటిలో భాగస్వామి యగుట కనేక అవకాశములు ఆతనికి లభించినవి. ప్రజాబాహుళ్యములో రాజుగ నాతడు సంపాదించిన అమపమ ప్రేమగౌరవములకు ఈ ఆశ్రమ జీవితము పునాదిరాయియైనది. క్రింది తరగతి వారితో సన్నిహితత్వ మేర్పాటయినది. మతసహనము, పీడిత ప్రజానీకము నెడ సానుభూతి, విశాలదృక్పథము ఏర్పడినవి. అందువలన దక్షిణాపథ మేలిన ముస్లిం ప్రభువులలో నేరికిని లభ్యముగాని గౌరవ ప్రతిపత్తు లీతనికి లభించినవి. ఇతనిలో కలిగిన అద్భుతమగు మార్పును గమనించి మున్నీతని ద్వేషించిన వారిప్పుడు ఈతనియెడ అనురక్తు లయిరి.

అబుల్ హసన్ వివాహము విభ్రాంతి గొల్పు పరిస్థితులలో జరిగినది. సుల్తాన్ అబ్దుల్లా కుతుబుషా తన మూడవ కుమారిక వివాహము చేయవలసి వచ్చెను. పెద్దల్లుడగు సయ్యదు నిజాముద్దీన్ అహమదు ఆలోచనానుసారము అతని గురుపుత్రుడును, అరేబియా దేశీయుడును అగు సయ్యదు సుల్తాన్ అనువానికి ఆమె నిచ్చి పెండ్లిచేయుటకు అబ్దుల్లా కుతుబుషా నిశ్చయించెను. రాజప్రాసాదములో వివాహ సన్నాహములు చురుకుగా సాగుచుండెను.

ఆ సమయముననే ఫతేదర్వాజాకడ నున్న ఆశ్రమములో షా రాజూ ఖత్తాల్ తన శిష్యపుంగవుడగు అబుల్ హసన్ తానాషాను పెండ్లికొడుకును జేసెను. ఆ యోగిపుంగవుడు సొంత పర్యవేక్షణమున అంతఃపురములో జరుగు వివాహ కార్యకలాపములను స్నాతకములవంటి వాటిని ఆశ్రమములోకూడ జరిపించెను. ప్రజలు ఆశ్రమములోని వేడుకలను, ఆ యోగిచర్యలను విడ్డూరముగ చూడసాగిరి. అబుల్ హసన్ వివాహప్రయత్నము జరుగనున్నదని షా రాజూ ఖత్తాల్ వలీ అందరకు వివరించుచుండెను.

చిత్రము! ఇంతలో సుల్తాను పక్షమున పెత్తనము వహించి వరనిశ్చయముచేసిన పెద్దల్లుడు సయ్యదు నిజాముద్దీన్ అహమదునకును, వరుడుగా నిశ్చయింపబడిన సయ్యదు సుల్తానునకును మధ్య దైవప్రేరితముగ తీవ్ర విరోధ మేర్పడెను. కలహాభోజనుల యాదృచ్ఛికమున అవిరోధ జ్వాల యాకసమంటునట్లు ప్రజ్వరిల్లినది. సయ్యదు సుల్తానునకు రాకుమారి నిచ్చి పెండ్లిచేయవలదని ఆతడు పట్టుపట్టెను. తనమాటనుత్రోసిపుచ్చి, నిశ్చయించిన ప్రకారము రాకుమారి వివాహమును జరుపనున్నచో, తాము సపరివారముగ ఔరంగజేబుతో జేరిపోయెదనని పెద్దల్లుడు

పెదరించెను. సయ్యదు సుల్తాన్ సంబంధము మేమొల్ల మనియు, మమ్ము నిర్బంధించినచో ఆత్మహత్య చేసికొందు మనియు పెండ్లికూతురును, ఆమె తల్లియును శపించిరి. సర్వసన్నాహములు పూర్తియగుటచే సుల్తాన్ అబ్దుల్లా కర్తవ్యమును ఊహింపజాలకుండెను. వివాహమాపుట మంచిదిగాదు. గృహకల్లోలము దెచ్చుకొనుటకూడ వాంఛనీయము కాదు. అందుచేత ఆ సుముహూర్తము ననే రాకుమారిని మరియొకని కిచ్చి పెండ్లి చేయుటకు రాజు నిశ్చయించెను. అంతరంగికులును అట్లే అభిప్రాయ పడిరి.

అరిషడ్వర్గముల కతీతుడై సర్వసంగ పరిత్యాగియై సర్వజన రంజకుడైయున్న అబుల్‌హసన్ మాత్రమే ఈ సందర్భమున ఎల్లరకును హృద్గోచరుడయ్యెను. రాణు లును, మంత్రి సామంత హితులును, సర్దారులును ముక్త కంఠముగ అబుల్‌హసనునకు రాజు తన మూడవ కుమార్తెనిచ్చి వివాహము చేయనగునని చెప్పిరి. రాజును అబుల్‌హసన్ విషయమున తాత్పర్యముగలవాడయి యున్నందున మనఃపూర్తిగ నందుల కంగీకరించెను.

పెండ్లినాడు సుల్తానుయొక్క ఆజ్ఞా ప్రకారము సామంతహిత పురోహితులు సాలంకృతమును, సుసజ్జీ కృతమును అగు నుత్తమాశ్వమును తీసికొని గోలకొండ కోట తూర్పు ద్వారమగు విజయ ద్వారమునొద్ద షూజీ బండపై నున్న ఖత్తాల్ ఆశ్రమమునకు వచ్చిరి. పెండ్లి కుమారుని వేషములోనున్న అబుల్ హసనును వివాహ వేదిక కడకు తీసికొనిపోయిరి. సయ్యదు సుల్తానుతో వివాహము కొరకు సిద్ధమయిన సరంజామాతో సుల్తాన్ అబ్దుల్లా కుతుబుషా ఆ సుముహూర్తముననే తన మూడవ కుమార్తెను అబుల్‌హసనున కిచ్చి పెండ్లిచేసెను. సయ్యదు సుల్తాన్ సపరివారముగ ఔరంగజేబు కొలువులో ప్రవే శించెను. అబుల్‌హసనున కీ భార్యవలన అబ్దుల్లా జీవిత కాలములోనే ఇరువురు కుమార్తెలును, ఒక కుమారుడును కలిగిరి. ఈ వివాహము తరువాత సుల్తాన్ అబ్దుల్లా కుతుబుషా పండ్రెండు సంవత్సరములు రాజ్యము చేసెను.

అబుల్‌హసను పట్టాభిషేకము గూడ అత్యద్భుత పరిస్థితులలో జరిగినది. పెద్ద అల్లుడగు సయ్యదు నిజా మొద్దీన్ అహమదు రాజ్యాంగముపై అధికారము నెరపు చుండెను. క్రీ. శ. 1670 లో హాయాత్ బక్షు బేగం చని పోయెను. అప్పటినుండి గోలకొండ పరిపాలనా చక్రము అతనికి సంపూర్ణముగ స్వాధీనమయి పోయెను. 1672 ఏప్రిలులో అబ్దుల్లా కుతుబుషా జబ్బుపడెను. 1672 సం. ఏప్రిలు 19 వ తేదీనాడు అతనికి స్మారకము తప్పినది. అత డెట్టి మరణ శాసనమును వ్రాయలేదు. అబ్దుల్లా రెండవ అల్లుడు మహమ్మదు సుల్తాను అనుమానముపై తండ్రి యగు ఔరంగజేబుచే నిర్బంధింపబడి, చెరసాలయందే కృశించి మరణించెను పెద్ద అల్లుని అవజ్ఞతయు, పెద్దబిడ్డ అహంభావమును అబ్దుల్లాకు సహింపరానివయ్యెను. తన కల్లుడును, కొడుకువంటి వాడును అగు అబుల్ హసనునే రాజుగా చేయవలయునని ఆతడు కోరుచుండినట్లు ఆతని నడవడికయే నిదర్శనముగ నుండెను. పెద్ద బిడ్డకు సంతా నములేదు. అయినను, ఆయమ తన సవతి కుమారుడగు సయ్యదలీ మాసూం అనువానికి పట్టము కట్టవలయునని భావించుచుండెను. సైన్యము, సర్దారులు, రాజ లాంఛన ములు, పరిపాలనా చక్రము, బొక్కసము అన్నియు పెద్దల్లుని స్వాధీనమున నుండెను.

మరణశయ్యపయి నున్న మామను చూడబోయిన అబుల్‌హసనును అంతఃపురములోనికి పెద్దల్లుని పరి వారము రానీయలేదు. ఆతని గుఱ్ఱమును గాయపరచిరి. ఆతని నవమానించి పంపివేసిరి. సైన్యాధ్యక్షుడును, నిజామొద్దీను ననసహ్యించుకొనువాడును అగు సయ్యదు ముజఫరు ఈ సంఘటనను సాకుగ దీసికొని తన కార్య దర్శి, పేష్కారు లగు మాదన్న అక్కన్నల ధీవిశేషమున సైనిక పరిపాలన, ఆర్థిక ప్రాముఖ్యముగల ప్రదేశములను చేజిక్కించుకొని రాజ ప్రాసాదమును ముట్టడి వేసెను. నిజామొద్దీనును లోలోన సేవగించువారెల్లరు ఈ పరిస్థితిని గమనించి అబుల్‌హసనున కండగ నిలిచిరి. అబ్దుల్లా కుతుబుషా 1672 ఏప్రిలు 21 తేదిన మరణించెను. సయ్యదునిజామొద్దీన్ అహమదు, అతని భార్య, అతని కుమారుడు సయ్యదలీ మాసూం బంధింపబడిరి. మాసూం పారిపోయి ఢిల్లీ చక్రవర్తి కొలువులో చేరెను. నిజా మొద్దీను అతనిభార్యయు వధింపబడిరి 1672 సం. ఏప్రిలు 23 వ తేదీయందు అబుల్‌హసన్ తానాషా రాజుగ ప్రకటింపబడెను.

అబుల్ హసను 30-4-1672 (క్రీ. శ.) నాడు పట్టాభిషిక్తు డయ్యెను. పదునైదు సంవత్సరములు అత్యంత వైభవముతో, ప్రజారంజకముగ ఇతడు గోల కొండ రాజ్యమును పరిపాలించెను. ఇతడు 21-9-1687 ఉదయము రమారమి తొమ్మిదిగంటలవేళ గోలకొండను ముట్టడించిన మొగలు సైన్యమునకు వశుడయ్యెను. ఔరంగజేబు ఇతనిని దౌలతాబాదు కోటలో నిర్బం ధించెను.

ప్రతి సంవత్సరము అబుల్ హసను తన రాజ్య ప్రజల బాగోగులను విచారించుటకై దేశభ్రమణము చేయు చుండెడివాడు. ఇతడు పాడుపడిన వందలకొలది గ్రామ ములను పునరుద్ధరించెను. నూతన గ్రామముల ననేకము లను నిర్మించెను. భూముల విస్తీర్ణమును, పంటల పరి స్థితిని అనుసరించి శిస్తులను నిర్ణయించెను. అనేక రాజ మార్గములు, అన్న సత్రములు, దేవాయతనములు, వాపీ, కూప, తటాకములు, విద్యాలయములు, ఔషధాలయ ములు ఏర్పాటుచేసెను. ధనవంతుల దౌర్జన్యమునుండి, అధికారుల క్రౌర్యమునుండి, దొంగల అలజడినుండి, ప్రజ లను రక్షించి, అబుల్ హసన్ వారిని కన్నబిడ్డలవలె కాపాడెను. సర్వమతసహిష్ణు డయి, అందరను అతడు సమముగ చూచుచుండెను అనేక ముఖ్యపదవులపయి తెలుగువారిని, హిందువులను ప్రతిష్ఠించెను. ఈ ఘన కృత్యములచే అతని కీర్తి చంద్రికలు దశదిగంతముల వ్యాపింప జొచ్చెను.

అబ్దుల్లాఖాన్ పానీ అనువాని ద్రోహమువలన గోల కొండ దుర్గము మొగలుల చేజిక్కినది. కర్మయోగియగు అబుల్ హసను ఈ పతనమునకు అవంతయు చింతింప లేదు. అతని గుండె నిబ్బరము, సహజ ధీరోదాత్తత, మొగలు దండనాథులను చకితుల గావించెను. వారి ప్రశ్న కాత డీ విధముగా సమాధాన మిచ్చెను :

"ఈశ్వరునియందు నా కచంచల భక్తి విశ్వాస ములు గలవు... నా పూర్వులు అమిత ధనవంతులు. అయినను చాలకాలము నేను భిక్షాటనము చేసి జీవించి తిని... ఈశ్వరుడు నన్ను రాజుగ చేసినాడు... ఇచ్చిన వాడు నేడు తీసికొన్నచో నేడు వెత్తి, నోరు కొట్టు కొనుట ఏటి న్యాయము ? అదియునుగాక భగవద్దా సుకుడు, నిజ మగు ముసల్మానుడును. అగు ఔరంగ జేబు వంటివాడు నావారసు డగుట నిజముగ సంతో షింపవలసిన విషయము గదా !"

క్రీ. శ. 18-2 1688 తారీఖున అబుల్ హసనును జాను నిస్సారుఖాను నాయకత్వమున దౌలతాబాదు దుర్గమున కంపి, అందు అతనిని కారాకోటలో నిర్బంధించిరి. అతని భరణమునకై పదివేల హొన్నుల వార్షికము ఏర్పా టయ్యెను. పదునాలుగు సంవత్సరములు చెర ననుభవించి 1113 వ హిజరీకి సరియగు క్రీ. శ. 1703 సంవత్సర ప్రారంభమున అతడు రక్త విరేచనములవలన దాదాపు డెబ్బది అయిదు వత్సరముల ప్రాయమున చనిపోయెను. అతని కోరికప్రకారము అతని కళేబరమును దౌలతా బాదు సమీపముననున్న హజరత్ గేసూదరాజులో దంగ్డి సమాధివద్ద నిక్షేపము చేయబడినది.

అబుల్ హసన్ పట్టుపడిన సందర్భమును గురించి దేశీయ, విదేశీయ సమకాలిక చరిత్రకారులు అనేక విధములుగ వ్రాసియున్నారు. అవి యసందర్భములును, అసమర్థనీయములును గావున త్యాజ్యములు.

అబుల్ హసను జననము క్రీ. శ. 1628. వివాహము 1661. పట్టాభిషేకము 1672. రాజ్యచ్యుతి 1687. చెర 1698. మరణము 1708.

అబుల్ హసను పండితుడు, కవి, గాయకుడు, శిల్పి, దైవ భక్తిగల ముసల్మాను, సూఫీ, మతసహిష్ణువు, పవి త్రుడు, న్యాయశీలి, సుందరుడు. అతడు రాజనీతికి పరా కాష్ఠ. దక్కన్ సుల్తానులలో ఐకమత్యమును గూర్చు చునో, విదేశీయవర్తకుల కలహములను దీర్చుచునో, పరి పాలనా చక్రమును, సైన్య వ్యవస్థను, విదేశవిధానమును చక్కబరచుచునో అబుల్ హసను తానాషా చరిత్ర యొక్క పుటలయందు మనకు గానిపించుచుండును.

నూరి, ఫాయిజ్, లతీఫ్, షాహి, మిర్జా, గులాం అలీ ఖాను, మున్నగువారు అతని ఆస్థానకవులు. షారాజూ ఖత్తాల్, రామదాసు అతనికాలపు సుప్రసిద్ధ భక్తులు. గోషామహలు, చారుచమను, ఇమ్లీబాగ్ మొదలగునవి అతడు కట్టించిన సుందర కట్టడములు. సామ్రాజ్య వ్యాపార విస్తృతుల కాటంకముగా అబుల్ హసను నిలుచుండుటచే పారసీక చరిత్రకారులును, విదేశీయ

చరిత్రకారులును ఆతనిని విషయలంపటుడనియు, అవివేకి యనియు, అసమర్థుడనియు పిరికిపందయనియు వర్ణించి నారు. అందు సత్యము లేదని నేటికిని ప్రజాసామాన్య మునకు ఆతనియెడగల ప్రేమ, గౌరవములు నిస్సందేహ ముగ చాటుచున్నవి.

కొ. భూ.

**అబ్దుర్ రజాకు :-** అబ్దుర్ రజాకు అను పారసీక రాయబారి క్రీ. శ. 1443 వ సంవత్సరమున హంపీ—విజయనగరమును సందర్శించి అచ్చట సుమారు ఏడు నెలలు నివసించెను. ఆ కాలమున ఆతడు విజయనగర రాజ్యమునందలి వింతలు, విశేషములు, విజయనగర రాజ్యవైభవమును బాగుగా గమనించి, వాటిని గ్రంథస్థము కావించెను. సమకాలికుడును, విదేశీయుడును, అగుటవలన ఈతడు విజయనగర రాజ్యమునుగూర్చి వ్రాసిన విషయములు మిక్కిలి విశ్వసనీయములై యున్నవి. ఈతని వ్రాతలను ఆధునిక చారిత్రకులు ఉత్తమ చారిత్రక సాధనములనుగా మన్నించుచున్నారు. అబ్దుర్ రజాకు విజయనగరసామ్రాజ్యమును గూర్చియే గాక, ఆనాటి దక్షిణ భారతదేశ స్థితినిగూర్చియు, తన స్వదేశ మునుగూర్చియు, అనేకములయిన అంశములను తెల్పి యున్నాడు. ఈతడు క్రీ. శ. 1441 వ సంవత్సరమున జనవరి నెలయందు స్వదేశమును విడిచి మరల 1444 వ సంవత్సరము జులై నెలయందు హార్మజు రేవును చేరెను. ఈ విధముగ ఈ యాత్రికుడు సుమారు మూడు సంవత్సరముల కాలము ప్రయాణములో గడపెను.

అబ్దుర్ రజాకుయొక్క పూర్తిపేరు కమాలుద్దీన్ అబ్దుర్ రజాకు. ఈతని తండ్రి జలాలుద్దీన్ ఇషకు. ఈ జలాలుద్దీను సమర్కండ్ వాస్తవ్యుడు. అబ్దుర్ రజాకు క్రీ. శ. 1413 వ సంవత్సరము, నవంబరు 16 వ తేది యందు, హిరాట్‌నగరమున జన్మించెను. జలాలుద్దీన్ ఇషకు పారసీక చక్రవర్తి యగు షారుఖ్ కొలువునందు "కాజీ", "ఇమామ్" అను పదవులలో ఉద్యోగిగనుండెను. ఈతడు గొప్ప విద్వాంసుడు. అబ్దుర్ రజాకుకూడ తండ్రి వలెనే విద్వాంసుడు. ఈతడు అరబ్బీభాషయందు పండితుడును, వైయాకరణియునై యుండెను. ఈతడు ఒక ప్రామాణిక వ్యాకరణమునకు వ్యాఖ్యానము వ్రాసి, తన యేలికయగు షారుఖ్‌నకు అంకితము కావించెను. అబ్దుర్ రజాకు పారసీక చక్రవర్తి యగు షారుఖ్ మరణించిన తరువాత మీర్జా అబ్దుర్ లతీఫు, మీర్జా అబ్దుర్ ఖాసిం అను ప్రభువులవద్ద వివిధములగు ఉద్యోగములలో నియోగింపబడెను. అబ్దుర్ రజాకు తాను సేవించిన ప్రభువులయొక్కయు, వారి పూర్వులయొక్కయు, చరిత్రను వర్ణించుచు, "మల్లా ఉస్ సయిదయిన్" అను చారిత్రక గ్రంథమును వ్రాసెను. ఇది పారసీక భాషలో రచింపబడిన రెండు సంపుటముల గ్రంథము. ఇందే, విజయనగర సామ్రాజ్యమునకు సంబంధించిన అనేక అంశములు మనోహరముగ వర్ణింపబడినవి. ఈ గ్రంథము క్రీ. శ. 1480 వ సంవత్సరమునపూర్తియయ్యెను. 1482 వ సంవత్సరమున అబ్దుర్ రజాకు కాలధర్మము నొందెను. అబ్దుర్ రజాకు వ్రాసిన పారసీక గ్రంథమును సి. జె. ఓల్డుఫీల్డు అను బెంగాలు సివిలు సర్వీసు ఉద్యోగి ఆంగ్ల భాషలోనికి అనువాదము చేసెను. సర్ హెన్రీ ఇలియట్ అను నాతనిచే ఈ అనువాదము సంస్కరింపబడినది. ఈ గ్రంథమే ఆధునిక చారిత్రకులకు ప్రామాణికముగ నున్నది.

క్రీ. శ. 1441 వ సంవత్సరమున పారసీక చక్రవర్తి యగు షారుఖ్, అబ్దుర్ రజాకును పిలువనంపి భారత దేశమునకు రాయబారిగా పోవలసినదని ఆదేశమొసగెను. ఆ యాజ్ఞను శిరసావహించి, రజాకు తన ప్రయాణమును ప్రారంభించెను. హార్మజు పట్టణమున ఆతడు ఓడనెక్కెను. హార్మజు నగరము ఆకాలమున గొప్ప విఖ్యాతిగాంచిన రేవుపట్టణము. అచ్చటికి ప్రపంచమందలి అనేక దేశముల నుండి వర్తకులు వ్యాపార నిమిత్తమై వచ్చెడివారు. హార్మజు పట్టణమునుండి ప్రయాణమును ఆరంభించి అనేక కష్టముల నెదుర్కొని అబ్దుర్ రజాకు తుదకు భారత దేశపు పశ్చిమతీరమందలి కాలికట్టు అను ఓడరేవును చేరెను. అచ్చట సామూరి అను రాజు రాజ్యము చేయు చుండెను. ఆ రాజు ప్రభుత్వము రామరాజ్యముగ నుండి నట్లును, అచటి వర్తకులు చోరాదులవలన భయములు లేక స్వేచ్ఛగ తమ వ్యాపారమును సాగించుకొనుచుండి నట్లును, రజాకు వర్ణించియున్నాడు. అచ్చట అనేక మహమ్మదీయ కుటుంబములు సుఖముగ నివసించు చుండెను. అబ్దుర్ రజాకు సామూరిరాజును సందర్శించెను.

కాలికట్టునందు కొంతకాలము నివసించిన తరువాత విజయనగర ప్రభువు అగు రెండవ దేవరాయలకడనుండి అబ్దుర్ రజాకునకు ఆహ్వానము వచ్చెను. అనతికాలములో ఆతడు బయలుదేరి విజయనగరరాజ్యమును చేరెను. త్రోవయందు అతడు బేదునూరు అను ప్రదేశమునగల దేవాలయమును చూచి చాల అద్భుతపడెను. దాని అందము వర్ణనాతీతమని రజాకు వ్రాసెను. 1443 వ సంవత్సరము మార్చినెలయందు అతడు విజయనగరమును చేరెను.

విజయనగరమును ఆకాలమున రెండవ దేవరాయలు పరిపాలించుచుండెను (1423-46). ఈరాజు అబ్దుర్ రజాకును సగౌరవముగ తన రాజధానికి కొనివచ్చుటకేర్పాట్లు కావించెను. విజయనగరమున నివసించినంత కాలమును అబ్దుర్ రజాకునకు చాల గౌరవము జరిగెను. అతనికి అనేక పర్యాయములు రాజదర్శనము లభించెను. ఆ సమయములందు దేవరాయలు పారసీక రాయబారి యగు అబ్దుర్ రజాకును మిక్కిలి ఆదరించి, అతని యేలికయగు పారసీక చక్రవర్తిని గూర్చియు, ఆ దేశపు విశేషములను గూర్చియు ప్రశ్నించెడివాడు. రాయబారి వెడలిపోవునప్పుడు రాజు ఆతనికి ఉచిత సన్మానము కావించెను. విజయనగర ప్రభువగు రాయలు ఉత్తమ రాజన్యుడనియు, అతని రాజ్యము సర్వ సౌఖ్యములకు ఆకరమనియు, అతని రాజధానియగు విజయనగరము ప్రపంచమందలి నగరముల కన్నిటికంటె మిన్నయనియు రజాకు తాను వ్రాసిన గ్రంథములో తెల్పియున్నాడు. విజయనగర సౌందర్యమును గూర్చి అతడు తెల్పిన అంశములు ఇతర విదేశ యాత్రికులు తెల్పిన విషయములతో ఏకీభవించుచు, ఆనాటి విద్యానగర సామ్రాజ్య శోభను మనకు కండ్లకు కట్టినట్లు చూపుచున్నవి. విజయనగర చరిత్ర రచనకు అబ్దుర్ రజాకువంటి వారి వ్రాతలు చక్కని సాధనములు.

ఖం. బా. శే.

**అబ్రహాము లింకన్ :-** అమెరికా సంయుక్త రాష్ట్రముల 16 వ అధ్యక్షుడు అబ్రహాం లింకన్ ప్రఖ్యాతులైన ప్రపంచ రాజకీయ వేత్తలలో ఒకడు. ఆతనియందు మహా పురుషుల కుండవలసిన ముఖ్య లక్షణము లగు, ధైర్యము, మేధ ప్రబలముగ ఉండెడివి. చక్కని సాహార్ద్రమునకు లక్షణము లగు, దయ, దాక్షిణ్యము, ఓర్పు, సానుభూతి అతనిలో మూర్తీభవించి ఉండెడివి. అతనికి కేవలము భౌతిక ధైర్యమేకాక అపారమగు నైతిక ధైర్యముకూడ కలదు. ఈ సద్గుణములు ఆతనిని అమెరికా ప్రజలందరికి ఆరాధ్య దైవముగ పరిణమింప చేసినవి.

అల్పసంఖ్యాకులైన ప్రజలుగల కెంటుకీ రాష్ట్రములో జనసమ్మర్దములేని మారుమూలనున్న ఒక కొయ్య ఇంట్లో (log cabin) లింకను క్రీ. శ. 1809 సం. ఫిబ్రవరి 12 వ తారీఖున జన్మించెను. అతని తండ్రి థామస్ లింకను. అతడు నిరక్షరాస్యుడు. అతడు పురోగమనాభిలాష లేని ఒక సామాన్యుడు. అతని సంపాదనతో కుటుంబము యొక్క భుక్తిమాత్రము ఏదో విధముగా గడిచిపోయెడిది. లింకనుతల్లి నాన్సీహేంక్స లింకను మంచి నమ్రతయు మతములో చాల అభిరతియు కలిగిన వ్యక్తి. అబ్రహాము మీద ఆమె ప్రభావము చాల విశేషముగ ఉండెడిది. అబ్రహాము తన అభివృద్ధి కంతటికిని తన తల్లియే కారణభూతురాలని సగర్వముగా చెప్పుకొనెడివాడు.

లింకను తొమ్మిది సంవత్సరములు పాఠశాలకుపోయి చదివినప్పటికిని, ఒక్క పట్టున వరుసగ ఏడాదికాలమైనను చదివినట్లు కనపడదు. అయినను అతడు స్వయముగానే విద్యను అభ్యసించెను. అతనికి పలక బలపము మొదలయిన సాధనములు దొరకకపోవుటవలన ఒక బొగ్గు ముక్కతో కఱ్ఱపలకమీద వ్రాసికొనెడివాడట! అందువలననే కాబోలు అతనికి పుస్తకములమీద చాలప్రేమ ఉండెడిది. తండ్రికి పనిపాటలలో సహాయపడుచు కొంచెము అవకాశము చిక్కించుకొని అతడు దొరకినపుస్తకములనన్నిటిని చదివెడివాడు. ఈ పుస్తకములను సంపాదించుటకు అతడు చాల దూరము నడిచిపోవలసి వచ్చెడిది. ఈ విధముగ తన ఇంటికి చుట్టుప్రక్కల 50 మైళ్ళ దూరములో లభింపగల ప్రతి పుస్తకమును అతడు చదివెను.

ఒకసారి క్రీ. శ. 1828 వ సం. లో న్యూ ఆర్లియన్సు పోవుచు నీగ్రో బానిసలను కొయ్యలకు గొలుసులతో బంధించి పశువులను అమ్మినట్లు అమ్ముట అబ్రహాము చూచెను. దీనితో అతని మనసు కరగిపోయి సాధ్యమైనంత త్వరలో నీగ్రోల బానిసత్వమును నిర్మూలింపవలెనని అతడు



నిశ్చయించుకొనెను. ఈ యుదారమైన ఆశయము సఫలమగుననియు ఆవిధమున తనకు శాశ్వతమగు కీర్తి లభించుననియు అతడు అప్పుడు అనుకొనియుండడు.

క్రీ. శ. 1832 వ సం. లో లింకను ఇలినాయిస్ రాష్ట్ర శాసన సభకు అభ్యర్థిగా నిలబడి ఎన్నికలలో ఓడిపోయెను. రెండు సంవత్సరముల తరువాత తిరిగి పోటీ చేసి అతడు విజయమును కాంచెను. ఆతరువాత మరి మూడు పర్యాయములు వరుసగా శాసనసభా సభ్యుడుగా ఎన్నుకొనబడెను. ఈ సభలో అతని రాజకీయ సామర్థ్యము వ్యక్తమయ్యెను. ఈ కాలములో ఆతడు నిరంతరముగా కృషిచేసి తన రాష్ట్రమునకు రోడ్లు, రైలు మార్గములు, జలమార్గములు, మొదలైన సౌకర్యములు కల్పించెను. ఈ కాలములోనే న్యాయవాద వృత్తిని అవలంబించి ధర్మ బద్ధములైన వ్యవహారములలోనే సంబంధము కలిగించుకొని ఆ వృత్తికి ఒక గొప్పతనమును కల్పించెను. ఒకసారి ఒక వ్యవహారములో పని చేయుచు అది సక్రమమైనది కాదని తెలియగానే మధ్యలోనే దానిని వదలుకొనెను.

లింకను యొక్క వివాహము మేరీ టాడ్ అను నామెతో 1842 వ సం. లో జరిగెను. ఈ వివాహ సందర్భములో లింకనుకు స్టీఫెన్ డగ్లసు అనే ఆయనతో పోటీ ఏర్పడెను. పెండ్లిలో పోటీచేసిన డగ్లసు తరువాత అమెరికా అధ్యక్ష పదవికి కూడ లింకనుతో పోటీ చేసెను. కొంతకాలమునకు లింకను అమెరికా కాంగ్రెసులో శాఖ అయిన ప్రజా ప్రతినిధి సభకు ఎన్నుకోబడెను. ఆ సమయములో నీగ్రో బానిసత్వ సమస్య తీవ్రరూపమును ధరించియుండెను. ఈ పరిస్థితిలో "బానిసత్వమే తప్పు కాకపోయినచో, ఇక తప్పు అనునది లేనేలేదు" అని ఘోషించి అప్పుడే అభివృద్ధిలోనికి వచ్చుచున్న అమెరికాలోని పశ్చిమ ప్రాంతములకు ఈ బానిసత్వము వ్యాపించకుండ చేయుటకును, కొలంబియా ప్రాంతములోని బానిసలకు విముక్తిని కలిగించుటకును అతడు చాల ప్రయత్నము చేసెను. తరువాత జరిగిన కాంగ్రెసు ఎన్నికలలో ఓడిపోయి లింకను తిరిగి న్యాయవాది వృత్తి సాగించెను. 1858 సంవత్సరములో ఆతడు రాష్ట్ర సభకు **(Senate)** డగ్లసునకు ప్రత్యర్థిగా నియోగింపబడెను. ఈ సందర్భములో జరిగిన ఎన్నికల యాత్రలో లింకను "ఏ మానవునికిని మరియొక మానవునిపై అధికారము నెరపుటకు హక్కులేదు. బానిసత్వము అక్రమము. దానిని నిర్మూలించుట అత్యవసరము. సగము స్వతంత్రముగాను, సగము అస్వతంత్రముగాను ఉన్న అమెరికా ప్రభుత్వము చిరకాలము మనజాలదు." అని అన్నిచోట్ల ప్రచారము చేసెను. తుదకు ఎన్నికలలో ఓడిపోయినను అతనికి గొప్ప వక్త అనియు, మానవ స్వాతంత్ర్య సంరక్షకుడనియు దేశమునందంతటను పేరు వచ్చెను.

1860 సం. లో అబ్రహాం లింకను అమెరికా సంయుక్త రాష్ట్రములకు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. ఇంతలో బానిసత్వములేని ఉత్తర రాష్ట్రములకును బానిసత్వమును అమలుపరుచు దక్షిణ రాష్ట్రములకును వైషమ్యము ప్రబలి, దక్షిణ రాష్ట్రములు సమాఖ్యనుండి వైదొలగి ఒక ప్రత్యేక సమాఖ్యగా ఏర్పడెను. ఈ సమాఖ్యవారు జెఫరసన్ డేవిస్ యొక్క అధ్యక్షత క్రింద 1861 వ సంవత్సరములో ఉత్తర రాష్ట్రములతో

యుద్ధము ప్రారంభించిరి. ఈ యుద్ధము నాలుగు సంవత్సరములపాటు సాగినది. యుద్ధమున మొదట ఉత్తర రాష్ట్రములకు ఓటమి సంభవించుచు వచ్చెను. యుద్ధము జరుగుచుండగనే దక్షిణ రాష్ట్రములనుండి ఉత్తర రాష్ట్రములకు పారిపోయివచ్చిన నీగ్రో బానిసలకు స్వాతంత్ర్య మొసంగుచు అమెరికా కాంగ్రెసు ఒక శాసనము చేసెను. 1863 జనవరిలో లింకను 40 లక్షలమంది నీగ్రోబానిసలకు శాశ్వతముగ స్వాతంత్ర్య మొసగు ప్రకటన మొకటి కావించెను. 1864 వ సంవత్సరములో లింకను రెండవసారి అధ్యక్షపదవికి ఎన్నుకొనబడెను. మరుసటి సంవత్సరము జనవరిలో అమెరికా సంయుక్తరాష్ట్రములో ఎచ్చటను కూడ బానిసత్వము ఉండరాదు అను సవరణ ఒకటి రాష్ట్ర పరిపాలనా ప్రణాళికలో చేర్చబడెను. ఈ విధముగ లింకనుయొక్క చిరకాల వాంఛిత మీడేరెను. కాని ఈ విముక్తినొందిన బానిసల పురోభివృద్ధిని చూచు భాగ్యము మాత్రము లింకనుకు లభింపలేదు. 1865 వ సంవత్సరము ఏప్రిల్ నెల 14 వ తారీఖురాత్రి సకుటుంబముగా ఫోర్డు థియేటరులో, ఒక నాటకమును చూచుచుండగా ఒక దుష్టుడు తుపాకి పేల్చి లింకనును హత్యచేసెను. అమెరికాలో జన్మించిన మహనీయులలో ఒకడును, నిమ్న మానవోద్ధారకులలో అగ్రగణ్యుడును అయిన అబ్రహాము లింకను ఈ విధముగ కీర్తిశేషుడయ్యెను.

ఆర్. న. రావు.

**అభినయదర్పణము** :- 'అభినయదర్పణము' నందికేశ్వర ప్రోక్తమైనది. అది నృత్యమునకు సంబంధించిన చిన్న గ్రంథము. నందికేశ్వరుడు "శంభు ర్గౌరీ తథా బ్రహ్మా, మాధవో నందికేశ్వరః...ఏతే భరతకర్తారో భువనేషు ప్రకీర్తితాః' అని పేర్కొనబడిన భరతశాస్త్ర కర్తలలో, అయిదవవాడు. ఆతడు తననుగూర్చి సూటిగా చెప్పకొనక ప్రకరణమును కల్పించుకొని, గ్రంథారంభమున,

'కల్యాణాచలవాసాయ కరుణారస సింధవే
నమో ఒస్తు నందికేశాయ, నాట్యశాస్త్రార్థదాయినే.'

అని దేవేంద్రునిచే చెప్పించెను. అతడు శివభక్తుడు. సాత్త్వికస్వభావుడు. ఈశ్వరతత్త్వమును చక్కగా నెరిగిన వాడు, కావుననే,

'ఆంగికం భువనం యస్య, వాచికం సర్వవాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది, తం వందే సాత్త్వికం శివం.'

అని శివుని-భరతశాస్త్రకర్తలలో ప్రథముడైన శివుని-తనకు వంద్యుడైన శివుని - పరమ 'గురు' ప్రదాతయగు శివుని - గ్రంథారంభమున - మంగళాచరణ రూపముగా స్తుతించి, తాను 'నటరాజ'గు శివుని ఎట్లు జగద్రూపునిగా నుపాసించెనో తెలుపుచు నాట్యాభిమానులందరును తన వలె నాట్యోపాసనచే శ్రీ శివదయాపాత్రులు కాగలరని సూచించినవాడయ్యెను. అందుచేత నాట్యము కేవలము వినోదాత్మకమగు కళమాత్రమేగాక, యోగులకు, జ్ఞానులకువలె, ఈశ్వరప్రాప్తికి ఉపాసనారూపమగు ఒక సాధనమనికూడ అతడు నిరూపించినవాడయ్యెను. ఈ గ్రంథారంభ శ్లోకము నాట్యోపాసకులకు ఇనుపపెట్టెకు తాళపుచెవి వంటిదని చెప్పిన చాలును.

గ్రంథారంభము కథారూపమైనది. పూర్వ మొక నర్తనశాలను నందికేశ్వరు డలంకరించి, తన శిష్యుడు దానికి తనను అధిపతిని చేసినందులకు ఇంద్రుడు సంతోషమును వెలిబుచ్చెను. ఒకనాడు నందికేశ్వరుని వద్దకు వచ్చి, "స్వామీ! అసురనాట్యశాలయందు 'నటశేఖరు' డను నటుడు గొప్ప కీర్తిశాలియై ప్రకాశించుచున్నాడు. నేను నాట్యప్రదర్శనాదులచే అతనిని జయింపవలయునని యున్నది. మీరు రచించిన 'భరతార్ణవము' అను గ్రంథమును నాకు దయచేసితిరేని, దాని నధ్యయనముచేసి అనుభవమునకు తెచ్చుకొని, నటశేఖరుని జయింప దలచి తిని"అని ఇంద్రుడు ప్రార్థించెను. అందుకు నందికేశ్వరుడు,

'చతుస్సహస్రసంఖ్యాకై, ర్గ్రంథై శ్చ పరిపూరితం
భరతార్ణవశాస్త్రంతు, సుమతే! శృణు సాదరం."

అని దయాళువై భరతార్ణవమును బోధించుటకు పూనుకొనగా, ఇంద్రు డేలనో కొంచెము వెనుదీసి, 'విస్తరాత్ సంవిహాయ మే, సంక్షిప్య నాట్యశాస్త్రార్థం, క్రమపూర్వ ముదాహర' అని భరతార్ణవమును సంగ్రహించి చెప్పునట్లు ప్రార్థించెను. అప్పుడు నందికేశ్వరుడు, 'సంక్షిప్య భరతార్ణవం, దర్పణాఖ్య మిదం సూత్ర మవధారయ' అని 'అభినయ దర్పణ'మును బోధించినట్లు అవతారికవలన తెలియుచున్నది.

పై విషయమునుబట్టి, 'అభినయదర్పణము' నాల్గు వేల శ్లోకములుగల భరతార్ణవమునకు సంక్షిప్త గ్రంథమని యైనను చెప్పవచ్చును. లేదా భరతార్ణవమునందలి నాట్యశాస్త్రార్థములను సంగ్రహించి, 'అభినయదర్పణ' మను నామాంతరముగల మరియొక గ్రంథమును వెలయించెనని యైనను చెప్పవచ్చును. రెండవ విషయమే నిజము కావచ్చునని తోచుచున్నది. 'భరతసారము, భగవద్గీతా సారము' మొదలగు గ్రంథములవలె-మొదటిదే నిజమైనచో ఇదియే 'భరతార్ణవసార' మను పేరిట వెలసి యుండెడిది. అట్లుగాక ప్రత్యేకముగా నామాంతరము వహించుటవల్ల, ఇది నందికేశ్వరకృత మగు రెండవ గ్రంథమని చెప్పుటయే యుక్తము.

'అభినయదర్పణము' ఆంగికాభినయాత్మక మయిన గ్రంథము. ఈవిషయమునే కర్త 'ఆంగికం భువనం యస్య' అను ప్రథమశ్లోకముననే ఉదాహరించినట్లు తోచుచున్నది.

నాట్యశాస్త్రార్థము 'నాట్యం నృత్తం నృత్య మితి, మునిభిః పరికీర్తితం' అని త్రివిధముగా విభాగించి చెప్పబడినది. 'నాట్యం తన్నాటకేష్వేవ యోజ్యం పూర్వకథాయుతం', (అభి. ద. 10 శ్లో.) అని యుండుటచే నాట్యము నాటకములందే ఉపయుక్తమగును. ఇక నృత్త, నృత్యములు ఆనుషంగికముగా అందు ప్రవర్తించునన వచ్చును. నృత్తము కేవలము ఆంగికమై 'రసభావ విహీనంతు నృత్తమిత్యభిధీయతే' (11 శ్లో.) అని చెప్పబడినది. నృత్యము, ఆంగిక, సాత్త్వికాభినయాత్మకమై, 'రసభావ వ్యంజకాదియుతం నృత్య మితీర్యతే' (11) అని కీర్తింపబడినది. అందుచే నిది, నృత్యగ్రంథ మనతగి యున్నది.

"ద్రష్టవ్యే నాట్యనృత్యే చ పర్వకాలే విశేషతః...
నృత్యం తత్ర మహేంద్రాణా, మభిషేకే మహోత్సవే...
తత్ర నృత్యం మహారాజ సభాయాం కల్పయే త్సదా"(17)

అను శ్లోకపాదములచే అభినయదర్పణము నృత్యగ్రంథమని ఏర్పడును.

ఆంధ్రదేశమందు సుప్రసిద్ధివడసిన కూచిపూడివారికేమి, నిన్న మొన్నటివరకు తెలుగుదేశమును నాట్యరసానందములో ముంచి తేల్చిన వేశ్యాజనమునకేమి, నృత్యవిషయమున ఈ అభినయదర్పణము అధారగ్రంథమై యుండవచ్చునని,

'సభాకల్పతరు ర్భాతి, వేదశాఖోపశోభితః
శాస్త్రపుష్పసమాకీర్ణో, విద్వద్భ్రమర సంయుతః
'సత్యాచారసభా, గుణోజ్జ్వల సభా సద్ధర్మకీర్తిస్సభా...
'విద్వాంసః కవయో భట్టాః...సభా సప్తాంగ లక్షణం.
(18, 19, 20. శ్లో.)

అను శ్లోకములచే సులభముగా నూహింపవచ్చును.

అభినయ దర్పణమునందు సభానాయక-మంత్రి లక్షణములు పేర్కొనబడిన పిమ్మట, రంగలక్షణమును, పాత్రాపాత్ర లక్షణములును, నట-కింకిణీ లక్షణములును నిరూపింపబడినవి. అనంతరము 'మృదంగాదులు' పాత్రల బహిః ప్రాణములనియు, 'జవస్థిరత్వ రేఖాచ భ్రమరీ దృష్టి రశ్రమః మేధాశ్రద్ధావచో గీతి, స్త్వంతః ప్రాణా దశస్మృతాః' (37) అని జవాదులు అంతఃప్రాణములనియు పేర్కొనబడినవి. నాట్యక్రమమునుగూర్చి తెలుపుచు,

'తస్మా త్సర్వం సమాలోచ్య, పూర్వకై ర్యదుదాహృతం
దేవతాప్రార్థనాదీని కృత్వా, నాట్య ముపక్రమేత్.

అని ప్రబోధించి, హస్తాద్యభినయమునకును రసమునకును గల్గు సంబంధమును నిర్దేశించుచు,

'యతో హస్త స్తతో దృష్టి, ర్యతో దృష్టి స్తతో మనః
యతో మన స్తతో భావో, యతో భావ స్తతో రసః (42)

అని చక్కగా పలికెను. తన గ్రంథమునకు—

"అత్ర త్వభినయస్యైవ, ప్రాధాన్య మితి కథ్యతే (43)

అని అభినయ ప్రాధాన్యము నిరూపించి,

"అభిపూర్వస్య ణీఞ్ ధాతో, రాభ్యానార్థస్య నిర్ణయః
యస్మా త్పదార్థాన్నయతి, తస్మా దభినయః స్మృతః 44

('అభి' యను నుపసర్గము పూర్వమందు గల 'నీ' ఞ్ అనెడు ధాతువునకు చెప్పుట యని యర్థము. పదార్థము అను తెలుపునదిగాన నిది అభినయ మని చెప్పబడినది.)

ఇట్టి అభినయము 'ఆంగికము, వాచికము, ఆహార్యము సాత్త్వికము అని చతుర్థాకరించి,

'అత్రా ఽఽఽంగికో ఽంగప్రత్యంగోపాంగ భేదా త్త్రిధా మతః' అని మరల ఆంగికాభినయము అంగ - ప్రత్యంగ - ఉపాంగ భేదములచే ముత్తెరగుల చెప్పబడినది. తన గ్రంథమున నందికేశ్వరుడు,

'నృత్య మాత్రోపయోగ్యాని,
కథ్యంతే లక్షణైః క్రమాత్'

అని, చెప్పదగిన విషయము నృత్యమాత్రోపయోగిగా నుండునని తెలియబరచి, ఆ విషయమునుకూడ,

'ప్రథమంతు శిరోభేదః దృష్టిభేద స్తతఃపరం
గ్రీవాహస్తౌ తతః పశ్చా త్క్రమేణైవం ప్రదర్శ్యతే.'

అని శిరోభేదములు, దృష్టిభేదములు, గ్రీవాభేదములు హస్తభేదములు అని నాల్గు విధములుగా విభజించి చెప్పెను. దేవేంద్రుడు అసురనటుడగు నటశేఖరుని నాట్యమునందు తానతిశయించుటకై ఉపదేశము కోరినవాడు గనుక, ఆతని యుద్దేశము నెరవేరుట కెట్టి అభినయ విజ్ఞానము అవసరమో, అంతవరకే సర్వజ్ఞుడగు నందికేశ్వరుడు సంగ్రహించి ఉపదేశించె ననుకొన్నచో, ఈ గ్రంథముయొక్క వైశిష్ట్యము కొంత తేటపడగలదు.

సాధారణముగా సమస్త నాట్యశాస్త్ర గ్రంథములయందును శిరో-దృష్టి-గ్రీవా-హస్తాభినయ భేదములు, తద్వినియోగ పూర్వకముగా నిరూపింపబడుచున్నట్లే, ఇందుగూడ అవి యన్నియు సంగ్రహింపబడినవి. తొమ్మిది శిరోభేదములు, ఎనిమిది దృష్టిభేదములు, నాల్గు గ్రీవాభేదములు, ఇరువది యెనిమిది అసంయుత హస్తభేదములు, ఇరువదినాల్గు సంయుత హస్తభేదములు చెప్పబడినవి. కడమ నాట్యశాస్త్రముల మాట యెట్లున్నను, భరతనాట్య శాస్త్రముతో పోల్చి చూడగా, అందు పదుమూడు శిరోభేదములు, ముప్పదియారు దృష్టిభేదములు, తొమ్మిది గ్రీవాభేదములు, అరువదినాల్గు హస్తభేదములు కానవచ్చుచున్నవి. అభినయ దర్పణము శిరోభేదముల, సంఖ్యా-లక్షణ-వినియోగములయందు భరత నాట్య శాస్త్రము కంటె భిన్నముగా నున్నది. మరియు నాట్య శాస్త్రీయాభినయ మంతయు రసవినియోగము పొందునట్లు నిరూపింపబడినది; అభినయదర్పణము నందలి విషయమో, భావ పర్యవసాయిగా గోచరించుచున్నది. ఒక విషయమున మాత్రము అభినయదర్పణము తన ప్రత్యేకతను నెలకొల్పుకొను చున్నది. సంయుతాసంయుత హస్తభేదములను మొత్తముగా నందు ఏబది రెండుగా గోచరించినను, కొన్ని విశేషాంశముల ప్రదర్శనము నిమిత్తము, నందికేశ్వరుడు మరికొన్ని - అనగా 145 అసంయుత హస్తభేదములను - క్రొత్తవాటిని - చేర్చి - వివరించి యున్నాడు. వాటిలో దంపతీమాత్రాది బాంధవ్య హస్తములు 11, బ్రహ్మాదిదేవతా హస్తములు 16, నవగ్రహ హస్తములు 9, దశావతార హస్తములు 11, బ్రాహ్మణాది హస్తములు 4, సప్తసముద్ర హస్తములు 7, గంగాది నదీహస్తములు 14, ఊర్ధ్వాధోలోక హస్తములు 2, అశ్వత్థాది వృక్షహస్తములు 29, సింహాది మృగహస్తములు 22, పారావతాది హస్తములు 21, భేకాది జలజంతు హస్తములు 5, వెరసి 145 అసంయుత హస్తభేదములు కలవు. సాధారణ హస్త భేదములును ఈ విశేషహస్తభేదములును కలిసి, 197 అయి, అభినయదర్పణము నాట్యారాధకులకు ముఖ్యముగా హస్తాభినయ విషయమున కల్పవృక్షముగా నున్నది.

భరతార్ణవమునకు సంగ్రహరూపమైన అభినయదర్పణమే ఇట్టిది కాగా, మూలగ్రంథమనదగు దానియందే యే విషయము లెంతెంత విపులముగా నిరూపింపబడినవో ఊహించుట దుష్కరము కాదు.

వి. వేం. శే.

**అభినయము** :- "నటుడు తన హృద్గత క్రోధాది భావములను శరీరాది చేష్టల వలన వ్యక్తీకరించుట అభినయము. రామ యుధిష్ఠిరాదుల యవస్థలను రంగాది సాహాయ్యముచేత చూపుట అభినయముయొక్క ప్రయోజనము. అభినయమునకు అనుకరణ మావశ్యకము. లోకమునందు తండ్రి తన కుమారుని ముద్దాడుట అభినయ మనిపించుకొనదు. పితా పుత్రులు కానివారు వారి వేషములు వేసికొని, అందు తండ్రివేషము వేసికొనినవాడు కొడుకువేషము వేసికొనిన వానిని ముద్దాడిన అది అభినయమగును." అట్లే కోతికి సహజమైన చేష్టలు అభినయ మనిపించుకొనవు. కాని ఆ చేష్టలనే మానవుడు అనుకరించి చేసినచో అది అభినయ మనిపించుకొనును. అభినయమున కిది సామాన్య నిర్వచనము. ఇంక శాస్త్ర సమ్మతములైన వివరములు పేర్కొనబడును.

అభినయము భరత శాస్త్రమునకు సంబంధించినది. 'భరతము'ను ఈ క్రింది విధముగా విభజింప వచ్చును.

భరతము
- నాట్యము
- నృత్యము
- నృత్తము
- తాండవము
- లాస్యము
- అభినయము

# 1. అసంయుత హస్తములు



1. పతాక 2. త్రిపతాక 3. అర్ధపతాక



10. శిఖర 11. కపిత్థ 12. కటకముఖ



4. కర్తరీముఖ 5. మయూర 6. అర్ధచంద్ర



13. అరాళ 14. శుకతుండ 15. ముష్టి



7. సర్పశీర్ష 8. మృగశీర్ష 9. సింహముఖ



16. భ్రమర 17. హంసాస్య 18. హంసపక్ష



19. సూచి  20. చంద్రకళ  21. కోశ  22. సందంశ  23. ముకుళ  24. తామ్రచూడ



25. లాంగూల  26. అలపద్మ  27. చతుర



28. త్రిశూల

## 2. సంయుత హస్తములు



1. అంజలి 2. కపోత



3. కర్కట 4. స్వస్తిక



5. డోల 6. పుష్పపుట



7. ఉత్సంగ 8. శివలింగ



9. కటకవర్ధన 10. కర్తరీ స్వస్తిక



11. శకట 12. శంఖ



13. చక్ర 14. సంపుట



15. పాశ 16. కీలక



17. మత్స్య 18. కూర్మ



19. వరాహ 20. గరుడ



21. నాగబంధ 22. ఖట్వా



23. భేరుండ 24. అవహిత్థ

నాట్యమ్ నృత్తమ్ నృత్యమితి మునిభిః పరికీర్తితమ్
నాట్యం తన్నాటకేష్వేవ యోజ్యం పూర్వకథాయుతమ్
రసభావ విహీనంతు నృత్త మి త్యభిధీయతే
రసభావ వ్యంజకాది యుతం నృత్య మితీర్యతే.

నాట్యము, నృత్తము, నృత్యము అని భరతము మూడు విధములు. అందు నాట్యము నాటకములందు పూర్వకథతో గూడియుండునట్టిది.

రసభావ విరహితమయి తాళ లయల నాశ్రయించి యుండు అంగ ప్రత్యంగోపాంగముల విన్యాసము నృత్తము. రసభావములు కలిగియుండి తాళ లయల ననుసరించి, భావానుగుణముగ ప్రదర్శింపబడెడి ఆంగికాభినయము నృత్యము.

ఏతత్త్రయం ద్విధాభిన్నం లాస్య తాండవ సంజ్ఞికమ్
సుకుమారంతు తల్లాస్యం ఉద్ధతం తాండవం విదుః.

సుకుమారమైన అంగవిన్యాసము, భావప్రకటనము కలిగినట్టిది లాస్యము. గంభీరముగా, ఉద్రేక పూరితముగా నుండునట్టి నృత్యము తాండవము. మరియు సభలందు కూర్చుండి రసభావముల నభినయించుట లాస్యముగాను ; నిలబడి తాళలయల ననుసరించి నృత్యమాడుట తాండవముగాను జెప్పుదురు.

**అభినయ విధానము :**

కంఠేనాలంబయేద్గీతం, హస్తే నార్థం ప్రదర్శయేత్
చతుర్భ్యాం దర్శయే ద్భావం, పాదాభ్యాం తాళ
మాచరేత్.

అభినయించువారు కంఠముచే గీతమును శ్రావ్యముగా బాడుచు, ఆ పాటయొక్క అర్థమును పతాకాది హస్తములచేత తెల్పుచు, రసభావములను దృష్టిభేదములతో జూపుచు, తాళమును పాదములతో ప్రదర్శింపవలెను.

మరియు పతాకాది హస్తములతో నర్తకి తానుపాడెడి గీతముయొక్క అర్థమును అభినయించునప్పుడు, దృష్టి యెల్లప్పుడును హస్తమును అనుసరింపవలెను. దృష్టినిల్పిన చోటనే మనస్సు లగ్నమగును. అట్లు లగ్నమైన మనస్సునందు భావము, భావమునుండి రసము పుట్టుచున్నవి.

'రస' మనగా : మనస్సుచే నెరుగదగిన సుఖవిశేషము; భావజ్ఞులచే ఆస్వాదింపబడుచున్నది ; రసిక హృదయముల ద్రవింపజేయునట్టిది.

**అభినయము :**

అభిపూర్వస్యణీఞ్ ధాతో రాభ్యానార్థస్య నిర్ణయః
యస్మా త్పదార్థా న్నయతి తస్మా దభినయః స్మృతః.

అభి- యనెడు ఉపసర్గ పూర్వమందుగల ణీఞ్ ధాతువునకు చెప్పుట అని అర్థము. పదములయొక్క అర్థము ప్రజలకు అభిముఖ మగునట్లు పెంపొందించి తెల్పునట్టిది అభినయము. విభావానుభావముల సహాయముతో ఒక భావమునుగాని, అనుభవమునుగాని ప్రేక్షకులకు తెలియజేయునట్టిది అభినయము.

ఇట్టి అభినయము ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము- అని నాల్గు విధములు.

ఆంగికము అవయవములతో ప్రదర్శింపబడునట్టిది.

**ఆంగికాభినయము :** అనగా ఒకపాటయొక్క అర్థమునుగాని, నాటకములోని ఒక సన్నివేశమునుగాని, ముద్రలతో విపులీకరించుట (ఈముద్రలు నాట్య శాస్త్రాదులందు విపులీకరింపబడినవి). ఇందు భావము ఉండదు. గీతార్థమును దెల్పునట్టి అంగవిన్యాస ముండును. ఇట్టి అభినయము ముఖ్యముగా వర్ణనలతో గూడిన పాటలందు ప్రదర్శింపబడును.

ఉదా. ప. ఇంతి చెంగల్వ పూబంతి,
చెలువల మేల్ బంతి
గుణముల దొంతి వినవే.

అ. శ్రీకాంతుడు గాకున్న, ఖరదూషణాదుల
నావంతలోపలజంప నెంతవారు నరులని
చింతించి దశకంఠు డసురుల శిక్షింప జక్రి
యినకులమున
మంతు కెక్క జనించె శ్రీరామాఖ్య బ్రహ్మాది
సుతుండయి యనె.

ఇట్టి కీర్తనలను నృత్యమందు ప్రదర్శించునప్పుడు— ఇంతి, చెంగల్వపూబంతి, చెలువల మేల్ బంతి, గుణముల దొంతి- ఇట్లు ప్రతిమాటకు ఆ అర్థమునకు సరిపోవు హస్తమును (ముద్రను) పట్టి అభినయింపవలసియుండును. ఇట్టి ముద్రలతో గూడినదే ఆంగికాభినయము.

**వాచికము :** నాట్యమందుగాని, నాటకమందుగాని పాత్రయొక్క రసభావములను పోషించువిధమున సంభాషించుటగాని, గానముచేయుటగాని వాచికమగును.

ఆహార్యము : నృత్య, నాటకాదులందు ఆ యా సన్ని వేశములకు తగినట్లు పాత్రలు అలంకారాదులను ధరించుట, రంగాలంకరణము ఆహార్య మనబడును.

సాత్త్వికము : భారతీయ నృత్యకళయందు ప్రధానమైనట్టిది సాత్త్వికాభినయము.సత్త్వగుణ ప్రధానమైనట్టిది సాత్త్వికము. ఒక దృశ్యమును మనము జూచినప్పుడు గాని, ఒకసంఘటననుగూర్చి విినినప్పుడుగాని మన మనస్సు పొందు అనుభూతియే సాత్త్వికము. ఈ సాత్త్వికక భావములు ఎనిమిది విధములు : స్తంభము, ప్రళయము, రోమాంచము, స్వేదము, వైవర్ణ్యము, వేపథువు, అశ్రువు వైస్వర్యము.

సాత్త్విక భావములను గూర్చి రసమంజరియందు ముచ్చటైన శ్లోకములో చెప్పబడియున్నది.

"భేదో వాచి, దృశో ర్జలం, కుచతటే
స్వేదః, ప్రకమ్పో ఒధరే,
పాణ్డు ర్గణ్డతలే, తనౌ చ పులక
వ్రాతో, లయ శ్చేతసి,
ఆలస్యం నయనద్వయే, చరణయోః
స్తమ్భః, సముజ్జృమ్భతే ;
తత్కిం రాజపథే వ్రజేన్ద్రతనయః
కృష్ణ స్త్వయాఒఒలోకితః ?

సఖి నాయికతో ననుచున్నది :

ఓ మందయానా ! నీ మాటలయందు గాద్గద్యము. కన్నులందు బాష్పములు, చనుదరియందు చెమర్పుట, మోవియందు అదరుపాటు, చెక్కిలియందు తెల్లదనము, మేనియందు పులకరింత, కనులయందు మాంద్యము, పాదములయందు బ్రామనుపాటు ఒకటినిమించి ఒకటి అతిశయిల్లుచున్నది. వ్రజకాంతల యుల్లముల కొల్లగొన్న నవనీత చోరుడు నీ కంటబడెనా యేమీ ? లేనిచో అఖల సాత్త్విక భావములు ఒకేవేళ ఏల యుదయించును ?

పై శ్లోకమువలన సాత్త్వికము లన నేమియో అవి యెట్లు గల్గునో తెలియుచున్నది. సాత్త్వికములు మనస్సునందు బుట్టి మనయందు గల్గు మార్పులు. నృత్యమందు నవరసాభినయమునకుగాని, పదముల అభినయమునకు గాని సాత్త్విక ప్రదర్శనము ముఖ్యము. సాత్త్వికమందు నర్తకుడు ముందు తానా భావమునందు లీనమై అనుభవించి, అభినయద్వారమున ప్రదర్శించి మనచే అనుభవింప జేయును. ఆంగికమందు నర్తకుడు తానా భావమునందు ఐక్యము కానవసరములేదు. అభినయింపవలసిన గీతము యొక్క అర్థములు తీసికొని హస్తములద్వారా వ్యాఖ్యానము చేయును. కనుకనే శాస్త్రము తెలిసిన పండితులు ఆంగిక ప్రధానమైన నృత్యమునకు తక్కువ స్థానమును, అనుభవయోగ్యమైన సాత్త్వికమునకు అగ్రస్థానమునిచ్చిరి.పదాభినయమందుసాత్త్వికముముఖ్యము. నాట్యమందు నవరసములు అభినయింపబడినను, "రతి" స్థాయిగాగల శృంగారమందువలె విజృంభించి అభినయింపగల అవకాశ మితర రసములందు లేదు. కనుకనే పెద్దలు సృష్టి కాధారమైన శృంగారమునందే పదరచనలు చేసిరి. నృత్య నాటకములందు, భాగవత, కలాప, యక్షగానము లందు ఇతర రసముల అభినయమునకు అవకాశ మెట్లున్నను, ఛాయగానైనను శృంగారము లేనిదే ఆ అభినయ ముండుట అరుదు. అట్లే శృంగారము నభినయించు నప్పుడును హాస్య, అద్భుత, భయానకాదిరసములు ఛాయలుగా వచ్చుటయును గలదు. బీభత్సము తప్ప ఇతర రసములు అచ్చటచ్చట వచ్చి సంచారి భావములకు మెరుగులు పెట్టి అభినయమునకు అలంకారములుగా ఉపయోగపడును.

| | నవరసములు | వాటి స్థాయి భావములు |
|---|---|---|
| (1) | శృంగారము | రతి |
| (2) | వీరము | ఉత్సాహము |
| (3) | కరుణము | శోకము |
| (4) | అద్భుతము | విస్మయము |
| (5) | హాస్యము | హాసము |
| (6) | భయానకము | భయము |
| (7) | బీభత్సము | జుగుప్స |
| (8) | రౌద్రము | క్రోధము |
| (9) | శాంతము | శమము |

వీటిలో అభినయమునకు ముఖ్యమైనది శృంగారము. శృంగారాభినయము - సాత్వతి, ఆరభటి, కైశికి, భారతి అనెడి చతుర్విధ వృత్తులలో కైశికీవృత్తియందు మాత్రమే ప్రదర్శింపబడును.

శృంగారము :- సంభోగము, విప్రలంభము అను ఇరు తెరంగులు.

# నవరసములు



1. శృంగారము



2. వీరము



3. కరుణము



4. అద్భుతము



5. హాస్యము



6. భయానకము



7. బీభత్సము



8. రౌద్రము



9. శాంతము

విప్రలంభము :- అయోగ, విరహ, మాన, ప్రవాస, శాపము అని ఐదు విధములు.

అభినయమునకు విప్రలంభమే శ్రేష్ఠము. విప్రలంభము నందే నర్తకి విజృంభించుట కవకాశమున్నది.

భావోదయము, భావసంధి, భావశబలత, భావశాంతి అని నాల్గు అవస్థలు తెలుపబడినవి. ఇవి కాక మన్మథావస్థలు పది కలవు: చక్షుఃప్రీతి, చింత, సంకల్పము, గుణస్తుతి, క్రియాద్వేషము, తాపము, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మృతి.

ఈ దశావస్థలు ముఖ్యముగా 'ప్రోషిత భర్తృక'ను అభినయించునప్పుడు ప్రదర్శింపబడు చున్నవి. 'మృతి' తప్ప మిగిలినవానినెల్ల నర్తకులు తమ అభినయమందు ప్రదర్శింతురు.

**మన్మథ పంచబాణములు :** (1) అరవిందము, (2) అశోకము, (3) చూతము, (4) నవమల్లిక, (5) నీలోత్పలము.

ఇందు నాలుగు బాణములు మాత్రము సంధింపబడును. 'నీలోత్పల' ప్రయోగము మరణమునకు కారణమగునుగాన నిషేధింపబడినది. ఈ బాణమునకు పట్టునట్టి ముద్రను మాత్రము ప్రదర్శించి ముగింపవలెను.

**సంచారి భావములు 33 :** నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమ, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, స్మృతి, ధృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విబోధము, అమర్షము, అవహిత్థము, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము.

**ఇక నాయికా నాయక భేదములు :** స్వీయ, పరకీయ, సామాన్య - భేదములచేత స్త్రీలు త్రివిధముల గలరు. శృంగారనాయికలు అష్టవిధముల నున్నారు: ప్రోషిత భర్తృక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, అభిసారిక, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, స్వాధీనపతిక అని. అభిసారిక జ్యోత్స్నాభిసారిక, తమోభిసారిక, దివాభిసారికా భేదములచేత ముత్తెరగుల గలదు. పద్మిని, హస్తిని, చిత్రిణి, శంఖిని అనువారు చతుర్విధ కళాశాస్త్ర నాయికలు. దూతి, దాసి, సఖి, చేటి, ధాత్రేయి, ప్రాతివేశిని, లింగిని, శిల్పిని - అనువారు నాయికా సహాయలు. పతి, ఉపపతి, వైశికుడు - అను భేదములచేత పురుషులకు త్రైవిధ్యము చెప్పబడినది. శృంగార విషయ నాయకులు- దక్షిణుడు, శఠుడు, ధృష్టుడు, అనుకూలుడు అని నలుగురు. పాంచాలుడు, కూచిమారుడు, భద్రుడు, దత్తుడు - అను వారలు ప్రఖ్యాత కళాశాస్త్ర నాయకులు. పీఠమర్దుడు, విటుడు, చేటుడు, విదూషకుడు- అనువారలు నాయకుని నర్మసచివులు.

ఇచ్చట తెల్పబడిన నాయికా నాయకులు గాక ఇంకను ఎందరో ఉన్నను పేరుమాత్రము అభినయము నందు ముఖ్యులు. ప్రాచీన పండితుల మతానుసారము నాయికలే 1152 విధముల నున్నారు.

ఇందు ధీరోదాత్తుడు మొదలయిన ప్రఖ్యాత నాయకులు నాటకములందు కనిపింతురు. శృంగార నాయకులు పదముల, వర్ణముల అభినయమునందు ముఖ్యులు. నర్మసచివులు నాయకునికి సహాయపడువారు, చేటి, దూతి మొదలయినవారు నాయికకు తోడ్పడునట్టివారు.

**ఇక కళాశాస్త్ర నాయికానాయకులు.** భరతకళ- 'నాట్యధర్మి' 'లోకధర్మి' యని రెండు విధముల గలదు. 'నాట్యధర్మి' యనగా నటులు శాస్త్రము ననుసరించి, హస్తవిన్యాసమును, ఆంగికాభినయమును అభ్యసించుట. 'లోకధర్మి' యందు అట్లు అభ్యసించిన విద్యను లోకానుభవముతో సరిదిద్దుకొని అనుభవ పూర్వకమైన విద్యను ప్రదర్శించుట. కళాశాస్త్రమందు వివిధజాతులకు చెందిన నాయికలు, వారి అవయవ సౌష్ఠవము, హావభావ ప్రదర్శనము మున్నగువాటినిగూర్చి విపులముగా పూర్వులు తెల్పిరి. కావున ఆ శాస్త్రపఠనము నర్తకులకు, అత్యవసరముగా తోచుచున్నది. మరియు సాత్త్విక ప్రధానమైన అభినయమునందు - కళాస్థానముల అభినయమందు, ఆలింగన చుంబనాది శృంగార క్రీడలను నర్తకులు అభినయింపవలసి యుండును. ఈ అభినయమునకుగూడ కళాశాస్త్ర పఠన మవసరము.

*ఉదాహరణములు :* (1) **స్వీయ :** పెండ్లియాడిన పతినే దైవముగా నెంచి పూజించునట్టి పతివ్రత.

*ఉదా:* ప. ఆడుదాని జన్మ మెత్తిన ఫలమేమి
అతివరో వ్యర్థమమ్మా.

**అను.** మేడలు మిద్దెలు - మెండు గలిగిన నేమి
ఈడైన విభునితో - నెనసి యుండకపోతే. ఆ.
అతివ మిక్కిలి రూష - వతియైతేనేమి
సతతము పతిభక్తి - సలిపితేనేమి,
అతులిత వ్రతములు - ఆచరించిననేమి
పతితోడ హితవుగా - పలుకు లేకపోతే ॥

(2) **పరకీయ :** భర్త యున్నను పరపురుషులయం దనురాగము గల్గినట్టి నాయిక.

**ఉదా:** ప. అత్తవా రూరికి - అంపేరు మావారు
అయ్యయో ఇక నేనేమి సేయుదునే
**అను.** కత్తి కోతగాడు మగడేమి జేసునో
పొత్తు మరువకుండు పోయివచ్చెదసామి ॥

(3) **సామాన్య :** ద్రవ్యార్జనమునకు పరపురుషుల యందు అనురాగము ప్రదర్శించునట్టిది.

**ఉదా:** ప. పూసలోని దారమువలె
యెంత చేసెనే నమ్మినందుకు ॥
**అ. ప.** మోన మేమని యడిగితే
తగని రోసమే వేణుగోపాలుడు
అటకమీద నరిగ చీరచాటుగ
నాపె కిచ్చి సేవించు కొనెనట
కటకటా యితని పేరు దలచిన
కాశియాత్ర పోయిన తీరదు.

* * *

(1) **ప్రోషిత భర్తృక :** పతి దేశాంతర మందుండగా వేదన పడునట్టిది.

**ఉదా :** భామరో ! ఊరికి బయలుదేరెడివేళ
ప్రేమమీర నాసామి పిలిచి చెప్పినమాట
ఏమని తెల్పుదు ఏలాగు తాళుదు
ఏమి సేతునే చెలియ ॥
"అన్నమందక అతి వెత నొందకు
కన్నీరు గార్చకు కలవరింపకు" మని
ఎన్నెన్నొ విధముల హితవుల దెల్పుచు
కన్నీరు గార్చుచు కాంతుడు చెప్పినమాట.

(2) **వాసక సజ్జిక :** ప్రియుడు వచ్చుచున్నాడని తెలిసి, తా నలంకరించుకొని అనుభవయోగ్యములైన పదార్థము లను సిద్ధపరుచునట్టిది.

**ఉదా :** అక్కట మరుపాయె నౌర మరే మాయె
అక్కర దెలసి రావైతి వదేమాయె ॥
ఏడాది పండుగ నేడని యెంచి
యీ మేడ శృంగారించితి
జలకమ్ముల నాడి వల్వయు ధరించితి
కస్తూరిబొట్టు వాడిగా నొనరించితి
నాడునాటికి వేడుకల్ బల్పోడిమిగ సేయుదామని
యీ వాడవాడల చేడె లంపిన
లేదు లే దని మరలివచ్చిరి॥

(3) **విరహోత్కంఠిత :** సంకేతస్థలంబునకు ప్రియుడు రాలేదని చింతించునది.

**ఉదా :** సామిని రమ్మనవే సఖియరో
సామాన్య దొరగాడే ॥

(4) **అభిసారిక :** ప్రియునిగూర్చి తాను బోవునది లేక ప్రియుని తనయొద్దకు రప్పించుకొనునది.

**ఉదా :** మగువ తన కేళికా మందిరము వెడలెను.
వగకాడ మాకంచి వరద తెల్లవారె ననుచు ॥

(5) **విప్రలబ్ధ:** ప్రియునిచే వంచింపబడి చింతించునట్టిది.

**ఉదా :** కథితసమయే ఽపిహరి రహహా ! నయ యౌవనం
మమ విఫలమిద మమలరూప మపి యౌవనం
యామి హే ! క మిహాశరణం.
సఖిజన వచన వంచితా ఽహమ్ ॥

(6) **ఖండిత :** అన్యస్త్రీ సంభోగ చిహ్నములు గల్గి ప్రాతః కాలమున ఇంటికి వచ్చిన నాయకుని జూచి కోపించు నాయిక.

**ఉదా :** చల్లనాయెనా మనసు చల్లనాయెనా
చల్లనాయె ప్రాణేశ స్వామి మువ్వగోపాలా.
వద్దికి రావేమోయి వాడిన ముఖమేడదోయి
నిద్దుర కన్నురెప్పలపై నిండియున్న దేమోయి
అద్దపు చెక్కిలి నొక్కి ముద్దిడుకున్న దెవతోయి
దిద్దిన కస్తూరిబొట్టు చెదరెనేమో దెలుపవోయి.

(7) **కలహాంతరిత :** పతిని అవమానించి పిమ్మట పశ్చాత్తాపపడు నట్టిది.

**ఉదా :** మోసమాయెనే నాబుద్ధికి మోసమాయెనే
మోసమాయె ఏమిసేతు మువ్వగోపాలుడునేడు
మ్రొక్కి వేడిన రాడే ఓ చెలియరో.

అందరికి చల్లనైన ఆ చందమామ నాపాలిటి
కనలమాయె నయ్యో ! చెలియ !
ముందు నే నెవ్వరికి పొందెడ బాపితినో
అందుకు నే నీలాగైతినో ఓ చెలియరో.

(8) స్వాధీన పతిక : తన ఆజ్ఞల ననుసరించు పతిగల నాయిక.

ఉదా : ఎందుదాచుకొందు నిన్ను నేమిసేతు నేను
అందమైన నీమోము అయ్యారే
ముద్దు గుల్కుచున్నది.
ముదముతో నాముద్దు మువ్వగోపాలసామి
గుదిగొన్న తమకముననూడి యిద్దరము
నిదురపరవశమున వదలునో కౌగిళ్ళు
పదిలముగ నాజడను పట్టి కట్టుకొందునా ?

* * * *

పదార్థాభినయము, విశేషాభినయము : అభినయమందు ప్రతిమాటకు సరియగునట్టి అర్థమును స్ఫురింపజేయుచు హస్తములను పట్టుట పదార్థాభినయము.

ఉదా : 'గోవు'-నాట్యమందు 'గోవు'ను అభినయించు నప్పుడు 'సింహముఖ' హస్తమునుబట్టి దాని ఆకారమును అనగా గోవుయొక్క ముఖము, కొమ్ములను జూపుట.

విశేషాభినయము : ఒకే విషయమును అనేక విధములుగా వర్ణించుట.

ఉదా : 'కమలాక్షుడు'

(1) తామరరేకులవంటి కన్నులు గలవాడు.

(2) కెందమ్మిరేకులవంటి యెరుపుగలిగిన నేత్రములు గలవాడు.

(8) సూర్యోదయకాలమున సూర్యరశ్మి సోకినంతనే వికసించు కమలముల రేకులవంటి నేత్రములు గలవాడు.

(4) తామర పువ్వువలె వికసించిన నేత్రములు కలవాడు.

(5) భ్రమరముల నాకర్షించు కమలములవంటి నేత్రములు కలవాడు.

ఇట్లు 'కమలాక్షుడు' అనుమాటకు అనేక విశేషణములు గల్పించి అభినయించుట విశేషాభినయము.

అభినయము గూర్చు విధము : ఒక పదమును అభినయించునప్పుడుగాని, అభినయమును గూర్చు నప్పుడుగాని - ముందుగా అపదమును పూర్తిగా జదివి, అందలి నాయికా నాయకు లెట్టివారో తెలిసికొనవలెను. అటుపై అందలి శృంగారమును గూర్చి, అవస్థాభేదములనుగూర్చి, అలంకారములను గూర్చి, సంచారీభావములను గూర్చి చక్కగా తెలిసికొని పిమ్మట అభినయము కల్పింపవలెను. భావములను కూర్చునప్పుడు పల్లవియందే పదములో నుండు అన్ని భావములు అన్వయమగునటుల చేయవలయును. పల్లవి, పదమునకు జీవము. అభినయమును గూర్చు విధము తెల్పుటకుగాను ఇట నొక పదము ఉదాహరణముగా నీయబడు చున్నది.

పదము : 'మంచిదినము నేడే । మహరాజుగ రమ్మనవే'

పదములోని భావము : తన్ను విడనాడిన నాయకుడు మరల తనవద్దకు వచ్చుచున్నాడని దూతిక ద్వారమున ఎరిగిన నాయిక, విరహోత్కంఠితయై నాయకుని రమ్మని ప్రార్థించుచున్నది.

నాయిక : స్వీయ.

నాయకుడు : శఠుడు.

ఈర్ష్యామాన విప్రలంభ శృంగారము.

సంచారులు : శంక, వితర్కము, ఔత్సుక్యము, హర్షము, అమర్షము.

ఆనందభైరవి - త్రిపుట

ప. మంచిదినము నేడే మహారాజుగా రమ్మనవే.
ఔత్సుక్యము, హర్షము.
అను. పొంచిజూచు టేలే ? పొలతీ ? మువ్వగోపాలుడు.
శంక, వితర్కము - హర్షము, ఔత్సుక్యము.

* * *

అభినయవిధానము : ఆంగికప్రధానమైనది.

"మంచిదినము నేడే మహారాజుగ రమ్మనవే"

1. నేడు మంచిదినము—మహారాజువలె రమ్మనవే.
2. నేడు మంచిదినము—ఇప్పుడే రమ్మనవే.
8. నేడు మంచిదినము—సర్వాలంకృతుడై రమ్మనవే.
4. నేడుమంచిదినము—నే నతనిరాక కెదురుజూచు చున్నాను రమ్మనవే.

ఎట్లు ? :

"నేను సర్వసిద్ధమైయున్నాను.

స్వామికి ఇష్టమైన విధమున అలంకరించుకొని యున్నాను.
అతనికొఱకు మంచిగంధము నూరియుంచితిని.
అతని కిష్టమైన అలంకారముల సిద్ధపరచియుంచితిని.
షడ్రసోపేతమైన భోజ్యములను సిద్ధపరచితిని.
కేళీగృహము నలంకరించి యుంచితిని.
హారతి పట్టుటకు అన్నియును సిద్ధపరచితిని.
స్వామి నడిచెడి బాటయందు పూవులబరుచుటకు పుష్పములను సిద్ధపరిచితిని.
వీనులకు విందుగొల్పు సంగీతము వినిపించుటకు శ్రుతి చేసి వీణను సిద్ధముగా నుంచితిని.
తలవాకిట స్వామికొరకు వేచియున్నాను.

5. మంచిదినము నేడే—చల్లనిపిల్లవాయువులు మెల్లన వీచుచున్నవి.
6. మంచిదినము నేడే—'ఝుం'కార ధ్వనులజేయుచు, తుమ్మెదలు, పూచిన మామిడి పూగుత్తులనుండి మకరందమును గ్రోలుచున్నవి.
7. మంచిదినము నేడే—కోకిలలు 'కుహూ' రవముల పంచమస్వరములో పలుకుచున్నవి.
8. మంచిదినము నేడే—చంద్రోదయమైనది.

ఇట్లు ఆయా భావములకు తగినట్లు హస్తములుపట్టి అభినయించుట ఆంగికప్రధానమైనట్టి అభినయమగును.

ఇక సంచారుల నభినయించు తీరు :

(1) ఔత్సుక్యము (2) హర్షము (3) శంక (4) వితర్కము. ఔత్సుక్యమనగా ఉత్సాహము. తానభిలషించిన వస్తువు లభింపకముం దొక క్షణమైనను తాళజాలకపోవుటయే ఔత్సుక్యము. 'ఔత్సుక్యము'నకు అనుభావములు.

(1) సంతాపము (మన్మథతాపము), (2) మనశ్చింత, (3) నిట్టూర్పు, (4) ఎటకైనను పోబూనుట.

**అభినయమందు చూపవలసిన భావములు :**

1. మనస్సు కాకచెందుట.
2. వేగముగ నడుచుట. (ఇది 1-వ సాత్త్వికభావము. అనగా 'స్తంభము')
3. నిశ్వాసములు ప్రదర్శించుట.
4. శరీరము భారమగుట. (4-వ సాత్త్వికము — స్వరభేదము).
5. నిద్ర.
6. చింతించుట. (7-వ సాత్త్వికము — అశ్రువులు. మొదలైనవి పట్టవలెను.)

ఇందు :—

**వేగముగ నడచుటయందు :** 1 వ సాత్త్వికభావము స్తంభమును పట్టవలసిన తీరు ఎట్లన : స్తంభమనగా— కదలకుండుట లేక అనురాగముచే చలించకుండ నుండుట అని అర్థము. ఇది పాదములందు బుట్టును. నాయిక 'వేగము' నభినయింపవలెను. గాని పాదములు మాత్రము ఉన్నస్థానమునుండి కదలుటలేదు. అట్టితరి శరీరమునందు వణకుబుట్టి శరీరము కంపించును. ఈ భావప్రదర్శనము వలన ఆవేగము, ఆతురత వెల్లడియగును. దీనివలన నాయిక మనస్సులోని ఆత్రము వెల్లడియగుచున్నది. ఇది పూర్తిగా సాత్త్వికప్రధానమైనట్టి భావప్రకటనము గాన ఈ విధముగా పట్టబడును. ఆంగికమైనచో నాయిక వడివడిగా అడుగులు వేయుటద్వారా మనస్సులోని ఆందోళన వెల్లడిజేయును. ఇదియే రెంటియందలి భేదము.

**శరీరము భారమగుట :** ఇదు 4-వ సాత్త్వికభావము స్వరభేదము అభినయింపవలెనని తెలుపబడినది. అదెట్లన : స్వరభేదము—సుఖాదులచే గలుగునట్టిది. ఇందు డగ్గుత్తిక మొదలైనవి గల్గును. డగ్గుత్తిక అనగా గద్గదస్వరము. ఇది వాక్కునందు ప్రదర్శింపబడునట్టిది. శరీరము భారమగుటచే—నాయిక ఉచ్ఛ్వాస, నిశ్వాసములు ప్రదర్శించుచు మెల్లన కంఠమును మార్చి గానము చేయుటవలన ప్రదర్శించును.

అట్లే - 'చింతించుట' యందు 7 వ సాత్త్వికము.

**అశ్రువుల ప్రదర్శనము :**

విచార మధికమై అశ్రువులు రాల్చుట, ఆనంద బాష్పములు రాల్చుట - అని రెండువిధములుగా 'అశ్రువుల' అభినయము ప్రదర్శింపబడును.

కన్నీరు విడుల్చుట, కనులు తుడుచుకొనుట — వలన అభినయింపబడును.

ఇట్లే ప్రతి 'సంచారి' యును అభినయింపబడును. ఈ అభినయము సాత్త్వికప్రధానమైన సంచారుల ప్రదర్శనము.

**మన్మథ పంచబాణముల అభినయమునుగూర్చి కొన్ని వివరములు :** నాయికాభినయమందు నాలుగుబాణములు

మాత్రమే వేసి ముగింతురు. అంతటితో అభినయము ముగియుచున్నది. భామాకలాపము, ఉషాపరిణయము, రుక్మాంగద మొదలైన భాగవతములందు నాలుగు బాణముల ప్రయోగము, అభినయముతరువాత-ఐదవబాణము ప్రయోగమునకు బదులుగా 'మూర్ఛపట్టు' అభినయింపబడుచున్నది. మరణము నిషేధము గాన 'మూర్ఛపట్టు' తో ముగించుచున్నారు. భాగవత నాటకాదులందు నాయిక చెలికత్తెలు ఆమె యొద్దనే యుండుటచే, ఉపశాంతిని అభినయింతురు. భరతనాట్య ప్రదర్శనమునందు ఏకపాత్రాభినయమగుటచే అట్టి అవకాశము లేదుగనుకనే 'నవమల్లిక' తో సమాప్తమగుచున్నది.

ఇదియే భారతీయ నృత్యకళకు తలమానికమైన రసాభినయము యొక్క సంక్షిప్తగాథ.

పెం. స.

**అభినవగుప్తుడు :-** (కాశ్మీరము - క్రీ. శ. 11 వ శతాబ్దము) "సరస్వత్యా స్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతామ్" అని కీర్తించినటుల కవి సార్వభౌములగుటచేత సరస్వతీతత్త్వమూర్తులగు శ్రీమదభినవగుప్తపాదాచార్యులవారు, శాస్త్ర సర్వస్వము నెల్లరికిని ప్రసాదించుటకై, అవతరించిన శ్రీపతంజలి మహర్షివలె నొకయవతారమనుటకు సందియము లేదు.

ఈ మహామహోదయుడు - కవిసార్వభౌముడుగను, ధ్వనిమార్గ ప్రవర్తనాచార్యుడుగను, నాట్యశాస్త్ర విశదీకరణ ప్రవీణుడుగను, కాశ్మీర శైవ సంప్రదాయమగు ప్రత్యభిజ్ఞాదర్శనమునకు మూలస్తమ్భాయమానుడుగను, నాలుగు వేదముల ధరించి లౌకిక, వైదిక కళా విద్యాస్థానరంగములయం దన్నిటియందును తన అసాధారణ ప్రతిభా విశేషములను ప్రదర్శించి, చతుర్విధ గ్రంథ రచనాభినయ చాతుర్యమున సకల సహృదయహృదయముల వికసింపజేసిన ఒకానొక అసాధారణవ్యక్తి. వీరిని గూర్చి సమగ్రముగ తెలిసికొనవలయుననిన నెవ్వరికిని సాధ్యము గాదు. అయినను పై నాలుగు విధములైన విద్యా ప్రభేదములలో వారు విరచించిన ఉత్తమోత్తమ గ్రంథముల పరిశీలించితిమేని, వీరి ప్రభావమును, ప్రతిభా సంపత్తిని, వీరు లోకమున కనుగ్రహించిన ప్రబోధమును కొంతవరకు గుర్తెరుగ వచ్చును. ఆయా విభాగములలో వీరు రచించిన ప్రబంధములు ఆదర్శప్రాయములై విరాజిల్లుచున్నవి.

సరస్వతీ విహారరంగస్థలమగు కాశ్మీరమున శివభక్తి పరిపూతమగు నొక విద్వత్కుటుంబమున (క్రీ. శ. ౯౬౦ నుండి ౯౮౮ సంవత్సరములలోపల) వీరు జన్మించిరి.

వీరి వంశకూటస్థుడగు అత్రిగుప్తుడు గంగాయమునలకు మధ్యనుండు కాన్యకుబ్జమునకు రాజగు యశోవర్మ (క్రీ. శ. 720-740) రాజ్యకాలమున "అంతర్వేది" యను గ్రామమున నివసించుచుండెను. అతడు సర్వశాస్త్రపారగు డగుటయేకాక శైవాగమములయందు అద్వితీయ ప్రవచనాచార్యుడై విరాజిల్లుచుండెను. కాశ్మీర రాజగు లలితాదిత్యుడు (క్రీ. శ. 725-761) యశోవర్మను జయించినప్పుడు అత్రిగుప్తుని పాండిత్యమునకు సంతసించి కాశ్మీరమునకు ఇతనిని తోడ్కొని చని, ఇతని నిత్యనివాసమునకై వితస్తా (Jhelam) నదీతీరమున శీతాంశుమాళి దేవాలయమున కెదుట సముచితమైన యొక గృహమును నిర్మించి, ఆ నదీ మూలభాగముననే ఒక జాగీరునుగూడ కల్పించి మిక్కిలి గౌరవించెను. వీరి కుటుంబమున "వరాహగుప్తుడు" అను మహానుభావుడు అవతరించెను. అతని శివభక్తికి మెచ్చి అతనిపై పరమశివుడు విశేష కటాక్షమును ప్రసరింపజేసెను. అతని ఆత్మజుడు "చుఖులక" అను ఉపనామముగల నరసింహగుప్త సకలశాస్త్రములయందును అసమాన పాండిత్యమును గలిగినవా డగుటయేగాక, అత్యంత శివభక్తి పరాయణుడై యుండెను. అతనిభార్య విమలకళ-మహాసాధ్వియు, సనాతన ధర్మాచార పరాయణయునై యుండెను. వీరిట్లు సనాతనధర్మ పరాయణులై, విద్యావ్యాసంగైక తత్పరులై, శివభక్తి భరితులై, అతి పవిత్రమగు దాంపత్యమును నిర్వహించుచుండిరి. ఆ దివ్య దంపతులకే "యోగినీభూ" అని ప్రసిద్ధిచెందిన మన అభినవగుప్తపాదుడుదయించెను.

**జననకాల నిర్ణయము :** కాశ్మీర సంప్రదాయమున సప్తర్షి శకము వాడుకలో నున్నది. అది కలియుగారంభమునకు 25 సంవత్సరములతరువాత నారంభమగుచున్నది అందుచే "బృహతీ విమర్శినీ" గ్రంథము నందు ఇతడు చెప్పినరీతిగ, 4090 వ సప్తర్షి వర్షమున ఆ గ్రంథము సమాప్త

మైనటుల తెలియుచున్నది. "భైరవ స్తవ" మున, 4068వ సంవత్సరమున పుష్యబహుళ దశమీతిథిని అది పూర్తిచేయబడినటులను, "క్రమ స్తోత్ర"మున 4066 సంవత్సర మార్గశీర్ష కృష్ణ నవమియందది పూర్తిచేయబడినటులను తెలిపియున్నాడు. అందుచే 4066 నుండి 4090 వరకును ఇతడు గ్రంథములను రచించుచుండెనని తెలియుచున్నది. అది క్రీ. శ. 990-1014 అగుచున్నది. ఇతని గ్రంథములలో మొదటిది క్రమస్తోత్ర మనియే చెప్పుటకు వీలులేదు. అదియునుగాక నితడు పెక్కుమంది గురువుల నాశ్రయించి అనేక విషయములలో నారితేరినవాడు. దీని కెంత లేదన్నను 30 లేక 40 సంవత్సరముల కాలము పట్టియుండవలయును. అందుచే నితడు క్రీ. శ. 950-960 సంవత్సరములకు మధ్య జన్మించి యుండవలయును.

**విద్యాభ్యాసము : అభినవగుప్తపాదనామ నిర్వచనము:** అతి బాల్యముననే తలిదండ్రు లితనిని సమీపమున నుండు పాఠశాలకు బంపిరి. అప్పటినుండియే ఇతని గొప్పతనము బయలుపడుచుండెను. ఇతని నవనవోన్మేషమగు బుద్ధివైభవమునకును వాగ్మిత్వమునకును ముగ్ధులై, ఉపాధ్యాయు లితనిని పతంజలియవతారమని నిశ్చయించి, "అభినవ గుప్తపాదుడే" (నూతన పతంజలియే) ఇతడని, ఇతని నామధేయమును సమన్వయ మొనర్చిరి. మరియు సహాధ్యాయు లందరును ఇతనిని జూచి మహాసర్పమును జూచినటుల భయభ్రాంతు లగుచుండిరి. అందుచే నితడు అందరిచేతను గుప్తపాదుడగు నాదిశేషుని అవతారముగనే భావింపబడుచుండెను. "బాలవలభీభుజంగు" డని ఇతనిని గురువులు కీర్తించినటుల కావ్యప్రకాశవ్యాఖ్యానమగు బాలబోధినిలో నున్నది. కనుక ఇతని సమగ్ర నామధేయము "అభినవ గుప్తపాదు" డనుటయే యుక్తము. "భట్టాభినవగుప్తార్య పాద ప్రోక్తేన వర్త్మనా" అని కీర్తించుటయు దీని కనుకూలముగనే యున్నది.

**ఇతని ఆచార్యులు :** "బహుభ్యః శ్రోతవ్యం ; బహుధా శ్రోతవ్యమ్" అను నార్యోక్తిని ఆచరణములో పెట్టగలిగిన దిట్ట ఇతడే. ఆయా సంప్రదాయములలో మిక్కిలి ప్రవీణులగు నాచార్య మహోదయుల నాశ్రయించి, మధుకర వృత్తితో సర్వశాస్త్ర విషయ మకరందముల నితడు ఆస్వాదించెను. వేయేల, నాస్తికులగు జైన బౌద్ధాదుల నాశ్రయించి, వారల కడ వారి మత పరమార్థములను దెలిసికొనెను. ఇటుల నితడు సర్వశాస్త్రముల యందును అద్వితీయ పాండిత్య మండితుడై విలసిల్లెను.

| ఆచార్యుల నామధేయములు | వారు బోధించిన శాస్త్రములు |
|---|---|
| 1. నరసింహగుప్త (వీరితండ్రి) | వ్యాకరణము |
| 2. వామనాథుడు | ద్వైతాద్వైత తంత్రములు |
| 3. భూతిరాజతనయుడు | ద్వైత శైవము |
| 4. భూతిరాజు | బ్రహ్మవిద్య |
| 5. లక్ష్మణగుప్త | క్రమ-త్రికదర్శనములు. |
| 6. భట్టేందురాజు | ధ్వనిమార్గము. |
| 7. భట్టతోతుడు | నాట్యశాస్త్రము |

**ఇతనికుటుంబము, దానిపరిస్థితులు :** ఇతని తల్లిదండ్రులే కాక, ఇతనికి వామనగుప్తుడు అనునొక పినతండ్రియు, మనోరథుడను నొక తమ్ముడును, క్షేముడు, ఉత్పలుడు, అభినవుడు, చక్రకుడు, పద్మగుప్తుడు అను నైదుగురు పినతండ్రి కొడుకులును గలరు. గురుపంక్తిలో పినతండ్రి పేరుగూడ నున్నది. వారు అలంకార శాస్త్రగ్రంథముల విరచించినటుల, అభినవభారతిలో ఇతడు ఉదాహరించియున్నాడు. సోదరులందరును సకలశాస్త్రపారగులగుట మాత్రమేగాక, ఉత్తమగ్రంథ రచయితలై యున్నటుల తెలియుచున్నది. "స్పన్దనిర్ణయ" మను శైవగ్రంథమును క్షేముడు (క్షేమరాజు) అను సోదరుడు విరచించెను. ఇట్లు వీరి కుటుంబములోనివా రందరును ప్రౌఢశాస్త్ర ప్రవీణులును, అత్యంత శివభక్తి సమన్వితులునునై యుండిరని తెలియుచున్నది.

ఇతడు సాహిత్యాధ్యయనము చేయుచుండినపుడే ఇతని తల్లి చనిపోయినది. అప్పటికి ఇతని తండ్రి, వయసు చెల్లనివాడయ్యు, వివాహాంతరమును చేసికొన నొల్లక పరమవిరక్తుడై యుండెను. ఈ సంఘటనచే మన అభినవగుప్తుల మనస్సు పారలౌకిక శ్రేయోనుచింతనాదులందే నిమగ్నమయ్యెను. అందుచే నితడు వివాహముచేసికొనుట కంగీకరింపలేదు. అటుపై ఆగమవిజ్ఞానసంపాదనకై కడగి, అందు సంపూర్ణమయిన విజ్ఞానమును నార్జించుటయేగాక, తద్యోగసిద్ధులై తాము తరించి, ఇతరులను గూడ తరింపజేసిరి. ఇతని అతివిపులమైన తంత్రాలోకము ఇతని అస

దృశమగు ఆగమపరిజ్ఞానమునకును, అద్వితీయ పాండిత్యమునకును నిదర్శనము.

**నిర్యాణము :** ఇత డుద్దేశించిన కార్యమును ముగించిన తరువాత, తన 12 వందల శిష్యులతో గూడ భైరవుని గుహాలో ప్రవేశించి మరల తిరిగిరాలేదట. ఆ గుహ మాత్రము ఇప్పటికిని శ్రీనగరుకును, గుల్మార్గు కును మధ్యనుండు "మగమ్" అను ప్రదేశమునకు 5 మైళ్ళ దూరములో నున్నది. అచ్చట నుండు మునల్మానులు కూడ ఈ ఐతిహ్యమును ఇప్పటికిని స్మరించుచున్నారు. అట్లు యోగసిద్ధి నొందిన మహామాహేశ్వరు డితడు.

**ఇత డనుగ్రహించిన గ్రంథములు :** (1) బోధ పంచదశిక (2) మాలినీ విజయవార్తికము (3) పరాత్రింశికా వివృతి (4) తంత్రాలోకము (5) తంత్రసారము (6) తంత్రవటధానిక (7) ధ్వన్యాలోకలోచనము (8) అభినవభారతి (నాట్యశాస్త్రవ్యాఖ్యానము) (9) భగవద్గీతార్థసంగ్రహము (10) పరమార్థసారము (11) ఈశ్వరప్రత్యభిజ్ఞావిమర్శిని (12) ఈశ్వరప్రత్యభిజ్ఞావివృతి విమర్శిని (13) క్రమస్తోత్రము (14) దేవస్థదేవతాచక్రస్తోత్రము (15) భైరవస్తోత్రము (16) పరమార్థద్వాదశిక (17) పరమార్థచర్చ (18) మహోపదేశవింశతిక (19) అనుత్తరాష్టిక (20) అనుభవనివేదనము (21) తంత్రోచ్చయము (22) ఘటకర్పరకులకవివృతి (23) కర్మకేళి (24) శివదృష్ట్యాలోచనము (25) పూర్వపంచిక (26) పదార్థప్రవేశనిర్ణయటీక (27) ప్రకీర్ణకవివరణము (28) ప్రకరణవివరణము (29) కావ్యకౌతుకవివరణము (30) కథాముఖతిలకము (31) లఘ్వీప్రక్రియ (32) భేదవాదవిదారణము (33) దేవీస్తోత్రవివరణము (34) తత్త్వార్థప్రకాశిక (35) శివశక్త్యవినాభావస్తోత్రము (36) బింబప్రతిబింబవాదము (37) పరమార్థసంగ్రహము (38) అనుత్తరశతకము (39) ప్రకరణస్తోత్రము (40) నాట్యాలోచనము (41) అనుత్తరతత్త్వవిమర్శినీవృత్తి. ఇంకను అనేక గ్రంథములు విరచించినటుల ఇతని గ్రంథములయందలి ప్రస్తావనలవలనను ఇతరుల గ్రంథములయందలి ప్రస్తావనలవలనను తెలియుచున్నది.

ఇందు మొదటి 11 గ్రంథములు ముద్రితములు; 12-22 వరకును లిఖితగ్రన్థములు, 23-36 వరకును కొన్ని ముద్రితములు, కొన్ని అముద్రితములు. మిగిలినవి గ్రంథముల పట్టికలవలన తెలియనగుచున్నవి.

అభినవగుప్తుని అభినవభారతినాట్యరసమార్గమునకును, తంత్రాలోకము కాశ్మీర శైవాగమ మార్గమునకును, ఆదర్శప్రాయములును నిరుపమములును నగు మహోత్కృష్టగ్రంథములు. ఇవి, ఆయా మార్గములయందలి ప్రయాణమూర్ధన్యము లగు "ఆకర" గ్రంథములై యలరారును. శ్రీమదభినవగుప్తుల అమోఘ శేముషీ ప్రభావమును, యోగసిద్ధిని, ఇవి బాహాటముగ తెలియజేయుచున్నవి.

ఇతని పాండిత్యము సర్వతోముఖమైనది. అందుచే ఇతనికి పదవాక్యప్రమాణపారావారపారీణ- ప్రబంధ సేవారస- ధ్వనినాటక ప్రత్యభిజ్ఞాదర్శన ప్రవర్తకాచార్య- మహామాహేశ్వర- ఇత్యాద్యనేక బిరుదములు లభించెను. అభినవగుప్తుని లోచనము ధ్వన్యాలోక వ్యాఖ్యలలో నెల్ల మిన్నయైనది. పాణినీయమునకు మహాభాష్యమెట్లో అలంకారశాస్త్రమునకు లోచనవ్యాఖ్యఅట్లు. ఈ వ్యాఖ్య వలననే ధ్వన్యాలోకమునకు అనంతప్రచారప్రసిద్ధులు కలిగెను. లోచనమునురచించుటయందు అభినవగుప్తునకు ఉపకరించినవ్యాఖ్య అతని పూర్వుడే రచించిన చంద్రిక యనునది. ఇతడచ్చటచ్చట చంద్రికను ఖండించుచు మా పూర్వవంశీయునితో కయ్యము చాలును అనుచు తన వ్యాఖ్యను ఉపసంహరించు చుండును.

టి. కె. వి. యస్. ను.

**అభ్యవహారము-ఆర్షపద్ధతి :-** విషయములు : ధాన్యభేద నిరూపణము, దంపు, వంట, వంటకుపాత్ర విశేషము, భోజనము, తదితర ప్రసక్తాంశములు.

లోకములో తరతమభావముచే ( తారతమ్యముచే ) మానవులలో కొందరు జొన్నలు, మరికొందరు గంటెలు, సన్న ధాన్యము, ముతక ధాన్యము, నల్ల ధాన్యము, గోధుమలు మున్నగు ధాన్యవిశేషములు అన్నము, రొట్టె, జావ మున్నగు రూపభేదములచే ఎట్లు భుజించుచుండిరో అటులనే దేవతలలోగూడ అగ్ని(గృహపతి)కి నల్లధాన్యము (కృష్ణవ్రీహులు) తో చేయబడిన పురోడాశము (యజ్ఞార్థమయిన అపూపము) ; సోమునకు చామ-బియ్యపుఅన్నము (చరువు) ; సవితకు ఆశువ్రీహుల (60 దినముల పంట

ధాన్యము) తో చేయబడిన రొట్టె; బృహస్పతికి నివరి ధాన్యపు అన్నము; ఇంద్రునకు మహావ్రీహుల (పెద్దవరి ధాన్యముతోచేయబడిన) రొట్టె; వరుణునకు యవధాన్యపు అన్నము; పూషదేవతకు దంతములు లేకపోవుటచే పిండితో చేసిన జావ మున్నగునవి; అగ్ని, సోముడు మున్నగు దేవతా భేదముచే, నల్లధాన్యము మున్నగు ద్రవ్యభేదముచే రొట్టె, అన్నము, జావ మున్నగు రూప భేదముచే శ్రుతిలో విధింపబడియున్నవి- దీనికి కృష్ణయజుర్వేద సంహితలో—

శ్రు. "అగ్నయే గృహపతయే పురోడాశం - కృష్ణానాం వ్రీహీణాగ్ం; సోమాయ - శ్యామాకం చరుగ్ం; సవిత్రే - పురోడాశం - ఆశూనాం వ్రీహీణాం;- బృహస్పతయే-నైవారం చరుం; ఇంద్రాయ-పురోడాశం- మహావ్రీహీణాం; వరుణాయ - యవమయం చరుం"

(కృ. య. సం. 1-8-10)

"పూషా ప్రపిష్టభాగో ఽదంతకోహి" (కృ. య. సం. 2-6-8) అని కలదు. భావము: లోకములో సైనందిన ప్రక్రియలో గోధుమరొట్టెలు, బన్నురొట్టెలు, జొన్న అన్నము, సన్నబియ్యము అన్నము మున్నగు వాటిని గంజిజావ, గోధుమ జావ మున్నగువాటిని వేరువేరుగా ప్రతి నియతముగా భుజించు మానవులవలె, దేవతలలో గూడ ధాన్యాది భేదముచే ప్రతినియతాహారమును పై శ్రుతివాక్యములు బోధించుచున్నవి.

ప్రకృతములో - పై దేవతలకు తత్తత్కర్మలందు ఆయా ధాన్యములచే (చరుపురోడాశాదులను) అన్నము మొదలగువాటిని చేయదలచినపుడు వీటి అన్నిటికిని మొదట బియ్యము అవసరముగాన అట్టి బియ్యమును తయారుచేయుటకు లౌకిక సాధనము లగు నఖవిదళన మొనర్చుట (అనగా గోళ్ళతో ధాన్యమును ఒలిచి బియ్యముగా తయారుచేయుట), మిల్లులో పోయుట, దంపుట మున్నగువాటిలో దేనిచేనైనను బియ్యమును తయారుచేయుటలో విశేషము కానరాదు గాన ఏ ఉపాయముచే నైనను బియ్యమును తయారుచేయవచ్చునని లౌకికదృష్టిచే సిద్ధమగుచు నుండగా;

**దంపుడు బియ్యము:** శ్రుతిలో "వ్రీహీనవహంతి" (ధాన్యమును దంపియే బియ్యమునుతయారుచేయవలెను) అను విధివాక్యము పూర్వమీమాంసాశాస్త్రములో బహు విపులముగ విచారించి సిద్ధాంతీకరింపబడినది. ఆ నియమ విధి ననుసరించి 'అవహననముచేతనే (దంపుడుచేతనే) బియ్యమును తయారుచేయవలెను గాని నఖవిదళనాది— ఉపాయాంతరములచే తండులములను నిష్పాదనము చేయరాదు' అని సిద్ధమయినది.

**దంపుడు బియ్యపు మహత్త్వము:** నఖవిదళన మొనర్చుట మిల్లులో తయారుచేయుట, దంపుట మున్నగు సాధనములలో దేనిచే సిద్ధముచేసినను బియ్యములో విశేషము కానవచ్చుటలేదుగదా! అట్టిసందర్భములో(అవహననము) దంపుచే తయారుచేసిన బియ్యములో మహత్త్వముండునా అని శంకింపరాదు. దానియందుగల అలౌకికమహత్త్వము నటులనుంచి లౌకిక మహత్త్వమును గమనింపదగును.

"వషట్కారోవై గాయత్రియై శిరోఽచ్ఛినత్తస్యైరసః పరాపతత్సపృథివీంప్రావిశత్సఖదిరో భవద్యస్యఖాదిరస్స్రువో భవతి ఛందసామేవరసేనావద్యతిసరసా అస్యాహుత యోభవంతి" ఇతి (కృ. య. సం. 3-5-7).

పూర్వమువషట్కారదేవతగాయత్రీఛందస్సుయొక్క శిరస్సును ఛేదింపగా దానిసారము పృథివియందు ప్రవేశించి ఖదిర (చంద్ర) వృక్షరూపముగ ఉద్భవించెను. కావున చంద్రకఱ్ఱతో నిర్మించిన స్రువముతో శ్రౌతకర్మ లందు ఆజ్యము మున్నగు ద్రవద్రవ్యములనుగ్రహించిన యెడల ఛందస్సులయొక్క సారముతో గ్రహించిన ట్లగును అని కృష్ణయజుర్వేదములో చెప్పబడినది.

ఈ శ్రుతివలన 'చంద్రకఱ్ఱగాయత్రీఛందస్సుయొక్క సారము అని స్పష్టమగుటచే, లోకములో దంపుటకు, రోకళ్ళను చంద్రకఱ్ఱతోనే తయారుచేయుచుండెడి సంప్రదాయము ఏర్పడినది గాన అట్టి రోకళ్ళచే ధాన్యమును దంపినచో ఛందస్సులయొక్కసారము ఆ బియ్యమునందు ప్రవేశించును. కావుననే దంపుడుబియ్యము ఆరోగ్యమునకు సాధనమగుచున్నవి— ఈ గాథను తెలిసికొనక పోయినను దంపుడుబియ్యము ఆరోగ్యమునకు కారణమని

వైద్యులు పలుకుచుందురు. కాని ఈ శ్రుతిబోధితమగు కారణమును మాత్రము గ్రహింపజాలక, బియ్యము మిల్లులో పోసినచో వేడిమిచే విటమినులు పోవుచున్నవి. అందుచే అనారోగ్యము కలుగుచున్నది అని కొందరును, తవుడు పోవుటచే అనారోగ్యము ఏర్పడుచున్నది అని మరి కొందరును వచించుచున్నారు. ఈవిషయము ఎంతవరకు వాస్తవమో విమర్శింపవలసియుండును. ఎందుకనగ, దంపు నప్పుడుకూడ శ్రౌతకర్మలలో నున్న "సంప్రేష్యతి" త్రిష్ఫలీకర్తవై (ఆ.శ్రౌ.సూ.) అను ఈ ప్రైషమంత్రముచే మరుగుపోటు వేయుమని అధ్వర్యుడు ఆజ్ఞాపింపగా "దేవేభ్య శ్శుంధధ్వం, దేవేభ్య శ్శుంధధ్వం, దేవేభ్య శ్శుంధధ్వం, సుఫలీకృతాన్ కరోతి" అను సూత్రమంత్ర ములచే పత్ని మెరుగుపోటువేసి పిదప చెరుగును. ఆ తవుడు అంత్యమున ఆ ఇష్టిలో దక్షిణాగ్ని యందు ఫలీ కరణ హోమము చేయబడును. లోకములో కూడ మెరుగు పోటుచే తవుడును తీసియే బియ్యమును సిద్ధము చేయు నాచారము పూర్వము నుండియు గలదు.

వైద్యులు తలచినట్లు మిల్లు బియ్యమునకు వేడిమిచే విటమినులు పోవుటగాని, తవుడు పోవుటగాని అనారోగ్య కారణమైనచో ధాన్యమును గోళ్ళతో ఒలిచి, బియ్యమును తయారుచేసినచో పై ఆనారోగ్యకారణములు ఆ బియ్యము నందు ఉండవు గాన అట్టి బియ్యమును స్వీకరింపవలసి యుండును. అట్లు స్వీకరించినచో అవహననవిధికి పూర్వ మీమాంసా శాస్త్రములో విచారణచేసి నిర్ణయింపబడినట్టి (దంపు చేతనే బియ్యమును తయారుచేయవలెను గాని ఇతర సాధనములచే చేయరాదు అను) నియమము వ్యర్థ మగును.

వేద బోధితమయిన విశేషము రుజువుకావలెనన్నచో, కొంతకాలము గోళ్ళతో నొలిచిన బియ్యమును, మరి కొంతకాలము దంపుడు బియ్యమును ఉపయోగించినచో, గోళ్ళతో నొలిచిన బియ్యమునకు మిల్లు బియ్యమునకువలె వేడిమి ప్రసక్తియుండదు. తవుడు ఏమాత్రము పోదుగాన దంపుడు బియ్యమునందు కంటె గోళ్ళతో ఒలిచిన బియ్య మునందు అధికగుణము కనుపింపవలెను. అట్లు కనుపిం చక, దంపుడుబియ్యమును ఉపయోగించినప్పుడే విశే షారోగ్యము కనుపించినచో వేదప్రతిపాదితమయిన ఛంద స్సారము చంద్రరేకలిద్వారమున దంపుడు బియ్యము నందు సంక్రమించుటచేతనే ఆ గుణవిశేషము కన్పట్టు చున్నట్టు స్పష్టమగును. ఛందస్సారము బియ్యమునందు సంక్రమింపవలెనను తాత్పర్యముతోనే శిష్టాచారములో ధాన్యము నలుగుటకు సౌకర్యార్థము చంద్రరేకలకు చుట్టు ఇనుపపొన్నులను వేయించుచున్నను, ఆ చంద్రకట్టె యొక్క మధ్యభాగ సంబంధము ధాన్యమునకు ఉన్నట్లును మనము గ్రహించుచునే ఉన్నాము.

ఈ విధముగ దేవతాహవిస్సులలో అంతటను దంపుడు బియ్యమునే ఉపయోగింపవలెనని, నిరూపించిన పిదప, నిర్‌ఋతి దేవతాకమయిన కర్మలో గోళ్ళతో ఒలిచిన బియ్యమునే ఉపయోగింపవలసినదిగా శ్రుతి బోధించు చున్నది. కృష్ణయజుర్వేదసంహితలో "నైర్‌ఋతం చరుం పరివృక్త్యై గృహే కృష్ణానాం వ్రీహీణాం నఖనిర్భిన్నం" అని కలదు. (1-8-9)

రాజసూయమను మహాక్రతువులో 'రత్నినాంహవి స్సులు' అను ఇష్టిప్రక్రమములో, మహారాజునకు మహిషి, వావాత, పరివృక్తి అను ముగ్గురు భార్యలుందురనియు, వారిలో పట్టాభిషిక్తురాలగు భార్యకు 'మహిషి' అనియు సామాన్య ప్రీతిగల భార్యకు 'వావాత' అనియు, ప్రీతి రహితురాలగు భార్యకు 'పరివృక్తి' అనియు నామములను నిర్దేశించి, వారిముగ్గురిలో 'పరివృక్తి' అను భార్యయొక్క గృహమునకేగి మహారాజు అచ్చట నైర్‌ఋతేష్టిని చేయు నప్పుడు నిర్‌ఋతి దేవతకు నల్లధాన్యమును గోళ్ళతో ఒలిచి బియ్యము చేసి ఆ బియ్యముతోనే చరువును (అన్నమును) వండి ఆ దేవతకు ఆహవిస్సును ఇయ్యవలసి నదిగ శ్రుతి చెప్పుటచే, గోళ్ళ బియ్యమును, మిల్లు బియ్య మును దేవతలకు నివేదనము చేయుట, భుజించుట తగదని శ్రుతిశిష్టాచారములవలన స్పష్టమగు చున్నది.

వంటకు పాత్ర విశేషము : మృణ్మయపాత్రతోనే వండ వలెను. ఎట్లన మహాగ్నిచయనమను క్రతువులో 'ఉఖ' అను కుండలో రంపవుపొట్టు మున్నగువానిని ఉంచి ఆహవనీయ మను అగ్నిపై ఆ 'ఉఖ' ను ఉంచి అడుగున ఆహవనీయాగ్నిని లెస్సగా జ్వలింపచేసినచో, అడుగు మంటచే, ఉఖలో రంపవుపొట్టు మొదలగునవి అంటుకొని,

అగ్ని పుట్టిన పిదప, "ఉఖ్యేజాత ఆహవనీయమనుగమయ్య" (ఆ. శ్రౌ. సూ.) అను సూత్రానుసారము ఉఖాగ్ని పుట్టుట తోడనే, అడుగుననున్న ఆహవనీయాగ్నిని, పూర్తిగా ఆర్పివేసి, ఈ ఉఖాగ్నినే, ఆహవనీయాగ్నిస్థానీయముగా వ్యవహరింతురు. అనగా ఆహవనీయాగ్నియందు చేయ వలసినహోమాదులను ఉఖాగ్నియందే చేయుదురు. ఇట్టిది ఆచారముగా చెప్పబడినది. అనంతరమందు కామనా విశేషముచే కృష్ణ యజుర్వేద సంహితలో "అంబరీషా దన్న కామస్యావరుధ్యా దంబరీషేవా అన్నం క్రియతే సయోన్యేవాన్న మవరుంధే॥ (1-1-10) "లోకములో మృణ్మయపాత్రయందు అన్నము వండుదురు గాన అన్న మును కోరు యజమానునకు అంబరీషము (మృత్పాత్ర) నుండి అగ్నిని తీసికొని వచ్చి ఉఖయందు అగ్నిని ఉత్పాద నము చేసినచో అట్టి యజమానునకు సమృద్ధమైన అన్నము లభించును" అని చెప్పబడినది. ఈ శ్రుతివలన ఆర్షసంప్ర దాయములో మృణ్మయపాత్రచేతనే అన్నమును వండు చున్నట్లు స్పష్టమగు చున్నది.

**మృణ్మయపాత్రను తడుపుట :** లోకములో క్రొత్త మృత్పాత్రలను ప్రథమములో పాలతో తడిపి వాడు చుండెడి సంప్రదాయము కలదు. దీనిని సహేతుకముగ శ్రుతి విధించుచున్నది. కృష్ణ యజుర్వేద సంహితలో

"అసుర్యం పాత్ర మనాచ్ఛృణ్ణ మాచ్ఛృణత్తి దేవత్రా కరజ క్షీరేణాచ్ఛృణత్తి పరమం వా ఏత త్పయోయ దజక్షీరం పరమేణై వైనం పయసాచ్ఛృణత్తి యజుషా వ్యావృత్త్యై. (కృ. య. సం. 5-1-7)

యజ్ఞసాధనమగు మృణ్మయపాత్రను కాల్చిన పిదప ప్రథమములో ద్రవద్రవ్యముచే తడపకుండా వాడినచో ఆ పాత్ర అసురయోగ్యమగును. ద్రవద్రవ్యముచే తడిపి వాడినచో ఆ పాత్ర దేవకర్మలకు యోగ్యమగును. అనంత రము దేనితో తడపవలెను అను శంకపై లోకములో మేకపాలు సర్వవ్యాధులను తొలగించునటుల ప్రసిద్ధి కలదు. కావున అవి ఉత్తమ మయినవని తెలియనగును. వేదములోగూడ "ఆగ్నేయీ వా ఏషా యదజా" (కృ. య. సం. 5-4-8) (ప్రజాపతి ముఖమునుండి అగ్నితో కూడ మేక పుట్టినది గాన మేక అగ్ని సంబంధమైనది. అందుచే అది ఉత్తమమయినది) అని చెప్పబడినది. ఇవ్విధ ముగ లోకమునను వేదములలోను మేక ఉత్తమమైనది గాన దాని పాలచే క్రొత్తకుండలను తడుపవలెను అని చెప్పి "లోకములోవలె మంత్రరహితముగ తడుపరాదు. లోకవైలక్షణ్యముకొరకు యజ్ఞములో మంత్రముచే తడుపవలెను." అని వచించుటచే, లోకములో మంత్ర రహితముగ పాలతో తడుపుచున్నట్లు స్పష్టమగుచున్నది.

లోకములో మేకపాలు తరచుగ సంభవించక పోవు టచే పాలతో మాత్రము తడుపుచుండెడి ఆచారము నేటి వరకు ప్రచారములోనున్నది. ఈ విధముగ శ్రుతిప్రమాణ ములచే క్రొత్తకుండను ప్రప్రథమము పాలతోతడిపి, అనంతరము ఆకుండతో వంటచేయవలెనని స్పష్టమగు చున్నది.

**అన్నము వండుట :** వంటచేయునపుడు దంపుడు బియ్యమును కడుగకుండ అత్తెసరుగా వండవలసినదిగ "న ప్రక్షాళయతి, న ప్రస్రావయతి, న గాలయతి, జీవ తండుల మివ శ్రపయతీతి విజ్ఞాయతే" అని ఆ. శ్రౌ. సూత్రము చెప్పుచున్నది. ఈ సూత్రముచే వంటచేయు బియ్యమును కడుగకూడదు. దానిలో పోసిన నీటిని, కడుగును తీసివేయరాదు. నీటిని పోసినతరువాత గాలించ రాదు. అనగా నొక్కికడిగి నేమరాదు. అత్తెసరుగా వండవలయును. అన్నము చిముడకూడదు. వంట బిరుసు పదునుగా నుండవలయును అని అగ్న్యాధానమునందలి శ్రౌతకర్మలో చెప్పబడినది. దర్శపూర్ణమాసలు అను శ్రౌతకర్మలో "ప్రక్షాళ్య తండులాన్" (తండులములను కడిగి) అని చెప్పబడినది గాని గాలించి కడుగవలయునని చెప్పబడలేదు. అందుచేత బియ్యమును కడుగకుండ అత్తెస రుగా వండుట, బియ్యమును కడిగి అత్తెసరుగా వండుట అను రెండువిధములు కలవనియు, అట్టి అన్నము దేవతా యోగ్యమగుననియు స్పష్టమగుచున్నది.

**రొట్టెను కాల్చుట :** కృష్ణయజుర్వేదమునందు "యో విదగ్ధ స్స నైర్ ఋతో యో ఽశృత స్స రౌద్రో యశ్శృత స్స దేవ స్తస్మా దవిదహతాశ్శృతం కృత్య స్స దేవత్వాయ॥ (కృ. య. సం. 2 కాం. 6 ప్ర. 8 అ.) అని కలదు. పురో డాశము (రొట్టె) మాడునట్లు విశేషముగ కాల్చబడినచో అది రాక్షసులకు ప్రియమగును. కొంచెము పచ్చిగా నుండినచో ఆ పురోడాశము రుద్రునకు ప్రియమగును.

సమముగా శ్రపణము చేయబడినచో అది దేవతాప్రియ మగు హవిస్సగును. అందుచేత విదాహాదులు లేకుండ సమముగా శ్రపణము చేయవలెనని దీని భావము.

వెన్న, నెయ్యి: "ఘృతం దేవానా మస్తు పితౄణాం నిష్పక్వమ్, మనుష్యాణాం తద్వా ఏత త్సర్వదేవత్యం యన్నవనీతం" (కృ. య. సం. 6-1-1) అను శ్రుతివాక్య మొకటికలదు. యజ్ఞములో ప్రథమదినమునయజమానుడు యజ్ఞశాలలో ప్రవేశించిన పిదప తన శరీరమందంతటను వెన్నను నఖశిఖాపర్యంతము రాచుకొనవలెననియు, అట్టి వెన్నను సంపాదించు నిమిత్తము మజ్జిగ చేయునపుడు చల్లగుంజకు త్రాటిని కట్టి పెరుగును చిలికి తీసిన వెన్న దేవతలకు ప్రియమైనదనియు, చల్లగుంజ లేకుండ రెండు చేతులతో (చిన్న కవ్వముతో) మాత్రమే పెరుగును మథించి తీసిన వెన్న పితృదేవతలకు ప్రియమైనదనియు శ్రుతిబోధఅయియున్నది. కావున శిష్టాచారానుసారముగ స్మృత్యాదిబోధితమగు కవ్వముచే మథితమైన వెన్న దేవతాయోగ్యమును సర్వదేవతా ప్రీతిపాత్రమునునై యున్నదని తేటపడుచున్నది. ఈ వెన్నను కాచి నెయ్యిగా తయారుచేయునపుడు పాకజన్యమయిన అవస్థాభేదములచే సర్వదేవతలకు ప్రియమైనట్లు శ్రుతి వక్కాణించుచున్నది. ఎట్లన మామూలుగా కాగిన నెయ్యి దేవతలకు ప్రియ మైనది. అరకాక నెయ్యి పితృదేవతలకు ప్రియము. కాగి పరిమళముతోగూడిన నెయ్యి మనుష్యులకు ప్రియము గాన ఈ తీరున వెన్న సర్వదేవతాప్రీతికరమని చెప్ప బడినది. అట్టి వెన్నకు మూలమగు పాలనుగూర్చి కృష్ణ యజుర్వేదములో "అభివాన్యాయైదుగ్ధేభవతి। సాహిపితృ దేవత్యందుహే॥" (కృ. య. బ్రా.) అను శ్రుతివాక్యము కలదు. దూడ చనిపోయిన గోక్షీరములు పితృదేవతలకు ప్రియమైనవి అని దీని భావము. మరియు దూడగల గోక్షీరములు దేవతలకు ప్రియములయినట్లు దర్శపూర్ణ మాసాది శ్రౌతకర్మలందలి గోదోహనాది పర్యాలోచనచే స్పష్టమగుచున్నది. కావున తత్తద్దేవతాకములగుకర్మలందు తత్తద్దేవతానుగుణమగుక్షీరజన్యమగు నవనీతముచే, తత్త ద్దేవతానుగుణముగ ఆజ్యమును తయారుచేసి తదనుగుణ ముగ హోమాదులయందు ఆజ్యమును వినియోగింపవలసి నట్లు విశదమగుచున్నది.

పాత్ర నిర్ణయము: భోజనము రజతపాత్రలో పితృ దేవతలకును, సువర్ణపాత్రలో దేవతలకును ప్రియమైనట్లు ఆబ్దికమంత్రములో విశ్వేదేవతలకును, పితృదేవతలకును, అర్చనచేయు సందర్భమునందలి "సౌవర్ణ మిదం పాత్రం" "రాజత మిదం పాత్రం" అను వాటిచే స్పష్టమగుచున్నది. వెండి కంచములను ఉపయోగింపువారు దేవతానివేదన చేయుటకు యోగ్యతా సంపత్తి కలుగుటకు, బంగారపు పువ్వును వేయించినచో అది సువర్ణపాత్ర అగును గాన అది దేవతానివేదనకు అనుకూలమగును. శక్తిలేనివారు అరటి ఆకును ఉపయోగించి తత్తత్కర్మానుగుణముగ రాజత, సౌవర్ణపాత్ర భావనచే ఆబ్దికాదులయందు కర్మను నిర్వర్తించెడి ఆచారముకలదు. కాని 'కదళీ గర్భపత్రంచ' అను స్మృతిచే అది నిషేధింపబడినది. అందుచే అరటి డిప్పచే కుట్టబడిన బొంద విస్తళ్ళను ఉపయోగించరాదు.

ఇట్లు యథాసంభవముగను, యథాశక్తిగను పాత్రను సంపాదించి పూర్వోక్త ఆజ్యముచే పాత్రాభిఘారమును చేసి పదార్థములను వడ్డించిన పిదప తిరిగి అన్నాభిఘార మునుచేసి, అనంతరము పూర్వపరిషేచనముచేసి ప్రాణా హుతులను పండ్లకు తగులకుండ మ్రింగవలెను. దీనిని ప్రాణాగ్నిహోత్ర మందురు. ఇట్లు ప్రాణాహుతులను తీసికొనకుండ భోజనమును చేసినచో నరుడు భగ్నవ్రతు డగునని స్మృతులు బోధించుచున్నవి. భోజనముచేయు రీతినిగూర్చి "ప్రాచీ మభ్యాకారం। అగ్నౌ రంతతః। ఏవ మివ హ్యాన్న మద్యతే" (కృ. య. బ్రా. 8-8-1) "హస్తం పురతః పాత్రే ప్రసార్య అభితః భోజ్యా న్యాకృష్య ముఖబిలే ప్రక్షిపతి తద్వత్" అని శ్రుతిస్మృతులు కలవు. దర్శపూర్ణమాసలు అను శ్రౌతకర్మలో స్రువము, జుహువు మున్నగు నామములచే ప్రసిద్ధములగు దారు మయములగు హోమపాత్రలను దర్భాగ్రములచే తుడుచు సందర్భమున, లోకమునందు మానవుడు భోజన సమయ ములో ఎదుటనున్న భోజనపాత్రయందు హస్తమును ప్రసరింపజేసి, ఇరుప్రక్కలగల వ్యంజనములను ఆకర్షించి అన్నములో కలుపుకొని నోటిలో ఎట్లు వేసికొనునో అటు లనే ఈ హోమపాత్రలను తూర్పునుంచి దర్భాగ్రములచే మధ్యభాగమునకు సంమార్జనము చేయవలయునని పై శ్రుతి సూత్రములు బోధించుచున్నవి. గాన ప్రాణా

హుతులను తీసికొనిన పిదప అన్నమును వ్యంజనముల సమ్మేళనముతో భోజనమును చేయుచున్నట్లు లోకము నందును వేదమునందును ప్రసిద్ధి కానవచ్చుచున్నది.

దధి (పెరుగు): ఇవ్విధముగ భోజనమును చేయు సందర్భములో అంత్యమున పెరుగుతో భోజనమును సమాప్తి చేయవలెనని చెప్పి, ఆ పెరుగును తయారుచేయు విధానమును శ్రుతి ఈ క్రిందివిధముగా బోధించుచున్నది: "యత్పూతీకైర్వా పర్ణవల్కైర్వా తంచ్యాత్సౌమ్యం తద్వత్క్వలై రాక్షసం తద్య త్తండులై ర్వైశ్వదేవం తద్యదాతం చనేన మానుషం తద్య ద్దధ్నాతత్సేంద్రం దధ్నాతనక్తి సేంద్రత్వాయ" (కృ. య. సం. 2-5-3) సోమలతా సదృశములగు ఓషధివిశేషములచేగాని పూతీకముచేగాని, మోదుగ చెట్టుయొక్క బెరడుచేతగాని, క్షీరములలో తోడుపెట్టుటచేత నిష్పన్నమయిన పెరుగు సోమదేవతకు ప్రియమైనదిఅని పైశ్రుతిభావము. అటులనే క్షీరములకును స్థూల బదరీఫలసంబంధముచే నిష్పన్నమయిన పెరుగు రాక్షసులకు ప్రియమయినది. తండుల సంపర్కముచే నిష్పన్నమగు దధివిశ్వేదేవతలకు ప్రియము. కొంచెము పులిసినమజ్జిగచే నిష్పన్నమయిన పెరుగు మనుష్యులకు ఇష్టమయినది. క్షీరములలో పెరుగు తోడు పెట్టగా నిష్పన్నమయిన దధి ఇంద్రునకు ప్రియమయినది. అట్టి పెరుగును ఇంద్రునకు హోమము చేయుటకై పాత్రయందు గ్రహించునపుడు పాలను ముందు గ్రహించి అంత్యమున పెరుగును గ్రహణము చేయవలెను. అట్లు చేయుటచే 'ధినోతీతి దధి' అని వ్యుత్పత్తి కావున, 'ధిన్ ప్రీణనే' అను ధాతువువలన ఏర్పడిన 'దధి' శబ్దమునకు 'సంతోషపరచునది' అని అర్థము కావున అట్టి వస్తువును చివర గ్రహణముచేసి హోమమొనర్చుటచే ఇంద్రునకు సంతోషము (తృప్తి) జనించును, అని తెలియుచున్నది. "దధ్నో పరిష్టాద్ధినోతి" అను నీ శ్రుత్యర్థము ననుసరించియే లోకములో పెరుగుతో అంత్యమున భోజనముచేయు నాచారము ఏర్పడెను. ఇట్లు సర్వపదార్థములను భుజించిన పిదప అంత్యమున పెరుగుతో భోజనమును సమాప్తి చేయుటచే, మానవునకు సంతృప్తి జనించుచున్నది.

రెండుసార్లు భోజనము: "ప్రజావై సత్రమాసత తప స్తప్యమానా అజుహ్వతీః ।......మనుష్యా అపశ్యన్ చమసం ఘృతస్య పూర్ణగ్ స్వధాం । తముపోదతిష్ఠన్ తమ జుహావుః । తేన ద్వయీ మూర్ధ మవారుంధత తస్మా ద్ద్విరహ్నో మనుష్యేభ్య ఉపహ్రియతే ప్రాత శ్చ సాయం చ॥" (కృ. య. బ్రా. కాం. 4. ప్ర. 9. అ.) అని కలదు.

పూర్వము ఒకప్పుడు ప్రజలు హోమము లేకుండ ఉపవాస రూపమగు తపస్సును చేయుచు, సత్రయాగ సదృశమగు సుకృతమును సంపాదించిరి. ఇట్లు తపస్సును చేయుచుండగా కొంతకాలమునకు వారికి ఉచితమగు అన్నమును ధరించునట్టియు, ఘృతపూర్ణమగు నట్టియు దారుమయమునగు నొక పాత్రవిశేషము కానవచ్చెను. వారు దానిని చేతబూని నిలువబడి ఆ అజ్యమును అగ్నియందు హోమము చేయగా ఆ హోమ ప్రభావముచేత ఒక దినమున కాలద్వయమందు భోజ్యమగు అన్నము సంప్రాప్తమయ్యెను. అప్పటినుండి నేటివరకును లోకములో సామాన్యులచేతను, శిష్టులచేతను దినమునకు భోజనము రెండుసార్లు (సాయం ప్రాత స్సమయము లందు) చేయబడుచున్నది. ఇవ్విధముగ రెండు పూటల భుజించునపుడు కొంచెము తక్కువగ భుజింపవలెననియు, ఏకాదశి మున్నగు దినములందు దినమున కొకసారే కడుపునిండ భుజింపవలెననియు స్మృతి బోధించుచున్నది. పైవిధముగ, శ్రుతి, స్మృతి, శిష్టాచారములననుసరించి ఆహారమును భుజించు మానవులకు ఆయురారోగ్యములు సంపూర్ణముగ సిద్ధించునని అనుభవపూర్వకముగ స్పష్టమగుచున్నది.

ఊ. గ. శా.

**అభ్యసనమనస్తత్త్వము :-** అభ్యసన మనువిషయమును గురించి ప్రసంగించుటకుముందు మనస్తత్త్వమునకు సమానార్థకమగు సైకాలజీ (Psychology) అను పదము యొక్క అర్థమును స్పష్టముచేయుట అవసరము. శబ్ద వ్యుత్పత్తి ననుసరించి సైకాలజీ అను పదము 'ఆత్మ' అను అర్థమునిచ్చు 'సైకో' అను పదమునుండి ఉద్భవించినది. అందువలన ఈ శాస్త్రమును మొదట ఆత్మసంబంధమైన శాస్త్రముగా పరిగణించిరి. కాని ప్రాచీన తత్త్వజ్ఞులు ఆత్మ యథార్థ వివేచనకై ప్రయత్నించియు విఫలులైరి. అందువలన మొదటి నిర్వచనమును సవరించి వారు సైకాలజీ

అను పదమునకు మనస్సు అని అర్థముచెప్పిరి. వివేచనము వలన మనస్సు అను అర్థము కూడ అసమగ్రమని విదితమయ్యెను. పిదప కొందరు నిపుణులు సైకాలజీని చైతన్య పరిశీలనమని నిర్వచించిరి. ఆ నిర్వచనముచే చైతన్యము కొంచెముగానున్నపుడును, పూర్తిగా లేనపుడును ఏర్పడు సమస్యలకు పరిష్కారములు లభింపవయ్యెను. అందుచేత వారు సైకాలజీఅను పదనిర్వచనమును సమగ్రమొనర్చిరి. ఆ నిర్వచనమును బట్టి సైకాలజీ అను పదము మానవ ప్రవర్తనశాస్త్రమను నర్థమునందు రూఢమయ్యెను. ఒక సుప్రసిద్ధుడయిన మనస్తత్వజ్ఞుడు వచించినట్లు సైకాలజీ అను పదమునకు ఆత్మ, మనస్సు, చైతన్యము అను నర్థములు క్రమముగా మారి "మానవప్రవర్తనశాస్త్రము" అను నర్థము మాత్రమే రూఢియైనది. మానవప్రవర్తన శాస్త్రము విశాలమైనది. ఇందులో శారీరకశాస్త్రము (Physiology), సాంఘికశాస్త్రము (Social Science) వంటి శాస్త్రము లనేకములు ఇమిడియున్నవి.

శారీరకశాస్త్రము ప్రాణియొక్క పనులను నిర్వహించు అవయవములను, జీవాణువులను పరిశీలించును. సాంఘిక శాస్త్రము రాజ్యములను, మానవ సంఘములను పరిశీలించును. ఈ రెండు శాస్త్రములకు మధ్య మరియొక శాస్త్రము కలదు. అదే మనస్తత్వశాస్త్రము. అది వ్యక్తియొక్క పుట్టుక మొదలుకొని అతని శైశవము, బాల్యము, యౌవనము, వార్ధక్యము, అంత్యదశ మున్నగు వివిధ దశలను పరిశీలించు శాస్త్రము. ఒక వ్యక్తియొక్క జీవితములో పెక్కు పరిణామములు కలిగినను, అతని వ్యక్తిత్వము మాత్రము మార్పుచెందదు. అందుకు కారణము అతనియందు వివిధ పరిణామములు జరుగుచుండగా అతని ప్రవర్తనములో అవిచ్ఛిన్నమైన ఐక్యమొకటి కనిపించుటయే. బాలునకును, వయోజనునకును, సామాన్యతకును, అసామాన్యతకును, మానవునకును, జంతువునకును గల తారతమ్యమును సైకాలజీ చూపును. వ్యక్తుల మధ్య గల తారతమ్యములను విద్య, ఆలోచన, ఉద్రేకము మొదలగు వ్యక్తియొక్క కార్యశక్తి నియమములను, సైకాలజీ విశేషముగా పరిశీలించును. సైకాలజీ, వ్యక్తియొక్క ఉత్సాహకృత్యములను పరిశీలించు శాస్త్రమని చెప్పవచ్చును. ఇచ్చట కృత్యము అన్న పదము విశాలమైన అర్థముతో వాడబడినది. ఈ పదములో భౌతిక, ఆంగిక, మానసిక కృత్యములు ఇమిడియున్నవి. సాధారణముగా మనచే మానసికకృత్యములుగా ఎంచబడినటువంటి నేర్చుకొనుట, జ్ఞాపకముంచుకొనుట, ఆలోచించుట, పరిశీలించుట, పన్నుగడచేయుట, నిశ్చయించుట, తెలిసికొనుట, అనుభవించుట, అసహ్యించుకొనుట మున్నగువాటితో సైకాలజీకి ఎక్కువ సంబంధము కలదు. తెలిసికొనుట, అనుభవించుట, చేయుట అను నీ ప్రధాన శీర్షికల క్రింద సులభముగా తెలిసికొనుటకు, పరిశీలించుటకు వీలు కలుగుటకై, ఈ ఉత్సాహకృత్యములన్నిటిని వర్గీకరించినను, వీటిలో ఒకదానినుండి మరొకదానిని విభజించుచు సరిహద్దు గీతలు గీయుట అసాధ్యము. కారణము, ప్రతి మానసికకృత్యము శారీరకకృత్యముగా గూడ పరిగణింపబడుచుండుటయే. వైగా, మెదడు తీవ్రముగా పనిచేయుటకు ఉపక్రమించిన ప్రతి కృత్యమునందును, సాధారణముగా, కండరములు, ఇంద్రియములు కూడ తమ పాత్రను నిర్వహించుచుండును. వివిధ అంగములు తమ తమ కృత్యములను నిర్వహించు రీతిని పరిశోధించుట శారీరశాస్త్రము యొక్క కర్తవ్యము. ఆ శాస్త్రము సంపూర్ణ వ్యక్తియొక్క జీవితమునకు ప్రతి అవయవము ఏమేమి సమకూర్చునో పరిశీలించుటకు ప్రయత్నించును. ఉదా: చూచునప్పుడు కంటిలోను, మాట్లాడునప్పుడు వాగింద్రియములోను కలుగుచున్న పరిణామములను ఈ శాస్త్రము పరిశోధించును. అయితే శారీరకశాస్త్రమే మానవప్రవర్తనమును గూర్చి అన్ని వివరములను తెలియజేయగలిగినచో, ఇక సైకాలజీ అను శాస్త్రముతో మనకేమి అవసరము కలదు అను ప్రశ్న ఉదయింపవచ్చును. ఈ ప్రశ్నకు సమాధానమిది. శారీరకశాస్త్రము మనము తెలిసికొనవలసినవిషయములో కొంతభాగమునుమాత్రమే చెప్పును. ప్రేమించునది, ద్వేషించునది, జయించునది, ఓడిపోవునది యథార్థముగా నొక వ్యక్తియే. అతనికి కర్తవ్యములు కలవు; పరిష్కరింపవలసినసమస్యలు కలవు. అతడు సమర్థతతోను, సంతోషముతోను, ఇతర వ్యక్తులతోను, వస్తువులతోను మెలగవలసియుండును. సంపూర్ణుడైన వ్యక్తికిని, అతని చుట్టునున్న ప్రపంచమునకు మధ్య అనంతమును పారస్పరికమును నగు కార్యసమూహము

కలదు. ఈ పరస్పర క్రియాకలాపమును శాస్త్రీయముగా పరిశోధనచేయుట అవసరము. అందువలన ఒక సంపూర్ణుడైన వ్యక్తి ఇతర వ్యక్తులతోను, ప్రపంచముతోను యథార్థముగా కలిసిమెలిసి సంచరించు విధానమునే సైకాలజీ శాస్త్రీయముగా పరిశీలించుటకు పూనుకొనును.

మనము సైకాలజీని అనుసరించి చూచినచో వ్యక్తి యొక్క కృత్యములన్నిటిలోను మిక్కిలి ప్రధానమైనది అభ్యసనము. తెలివి, వ్యక్తిత్వము, మనోవికారము, ఇంద్రియజ్ఞానము లేక ఆలోచన మున్నగు వాటిలో ఏ విషయమును మనము గ్రహించినను అది అభ్యసనముపైననే ఆధారపడును. మనుష్యుడు గ్రహణశక్తి కలిగిన జంతువు. అతడు నిత్యము నేర్చుకొనుచుండును. అతడు నిస్సందేహముగా సాంఘిక ప్రభావములచే పూర్తిగా కాకున్నను కొంతవరకైనను మారుచుండును. పూర్తిగా మారుటకు అతడు కేవల మొక మంటిముద్ద కాదు. ఒక విధముగా అతనిని "ప్లాస్టిక్" తో పోల్చవచ్చును. అతడు వాతావరణముతో స్పందించి, తన స్వార్థమును స్వీయ యత్నముచేతనే సంపాదించుకొనును. అతడు తన వర్గసంస్కృతిని ఒక క్రమపద్ధతిలో తెలిసికొని, తన ప్రత్యేకపాత్రను అర్థము చేసికొనును. సాంఘిక శాస్త్రములు "వ్యక్తి నేర్చుకొనును" అన్నంతవరకే బాధ్యతను వహించును. కాని సైకాలజీ అనునది ఆ నేర్చుకొను క్రమపద్ధతిని పరిశీలించునట్టి విశేషబాధ్యతనుకూడ నిర్వహించును. అందువలన నేర్చుకొనుట అనుదానికి సరియైన అర్థమేమియో, ఎప్పుడు ఏ పరిస్థితులలో ఏ విధముగా మనము నేర్చుకొందుమో, ఇత్యాది విషయములను సైకాలజీ వివరించును.

అభ్యసనముయొక్క క్రమపద్ధతులను గురించి తెలిసికొనుటకు ముందు, విద్య అను పదముయొక్క నిర్వచనము అవసరము. ఆక్సుఫర్డు నిఘంటువు దీనిని అధ్యయనము వలన లంభించిన విజ్ఞానము అని నిర్వచించినది. అందుచే అధ్యయనముచేతను, ప్రయత్నముచేతను నేర్చుకొనిన విషయమంతయు విద్యయను పదమున నిమిడియున్నది. మరియు అప్రయత్నముగా నేర్చుకొనిన విషయములు, సంభవాత్మకములైన క్రియలవలన నేర్పడిన కౌశల్యము, వస్తువులతోను, మనుష్యులతోను గలిగిన పరిచయము వలనను సంబంధమువలనను లభించిన నిపుణత, అభిప్రాయములుగూడ ఈపదమునందు ఇమిడియున్నవి. ఇచ్ఛాపూర్వకముగ నేర్చుకొనునవి విషయములను వల్లెవేయుట వంటివి కొన్ని గలవు. అభ్యసన మనునది అన్ని పనులకు వర్తించును. చదువుటవలన చదువనేర్తుము. పాడుటవలన పాడనేర్తుము. ఒక మనుష్యుని స్వభావమును అతని ముఖమును చూచుటవలన తెలిసికొందుము. ప్రొఫెసర్ వుడ్‌వర్తు చెప్పినట్లు, ఏ ఉత్తమ కృత్యమునైనను విద్యగా పరిగణింపవచ్చును. కాని ఆ కృత్యము వ్యక్తిని మంచివానిగాగాని, చెడ్డవానిగాగాని వృద్ధిచేసి అతనికి ఉత్తరకాలమున ఏర్పడు ప్రవర్తనమును, అనుభవమును అతని పూర్వకాలికములైన ప్రవర్తన అనుభవములకంటె భిన్నమైన వాటిగా చేయవలెను.

**అభ్యసనమన నేమి ?** : కొన్ని పనులు మనుష్యునకు నేర్చుకొనకుండనే వచ్చును. ఉదా: పుట్టినతోడనే శిశువు శ్వాసమును పీల్చుట. నేర్చుకొను అవకాశము లేకుండగనే శిశువు ఈ పనిని చేయుచున్నది. కాలక్రమమున శ్వాసము పీల్చుటయందు ప్రావీణ్యము లభించగా, శ్వాసము పీల్చుకొనుటయందలి ప్రత్యేకపద్ధతులనుకూడ శిశువు నేర్చుకొనును. ఉదా: శ్వాసమును బిగబట్టుట; శ్వాసమును లోనికి పీల్చుకొని చేయు వ్యాయామములు; క్రొవ్వొత్తిని ఊది ఆర్పివేయుట; మొదలగునవి. స్వతస్సిద్ధములైన శారీరక కార్యములు తప్ప, తక్కిన వన్నియు నేర్చుకొను పనులే అయియున్నవి.

**అభ్యసనము ఎప్పుడు జరుగును ?** : విషయములు అభ్యసింపబడినవని మనము ఎప్పుడు చెప్పుదుము? లేదా ఏ పరిస్థితులలో నేర్చుకొను క్రమపద్ధతి యేర్పడును? అను ప్రశ్న ఇప్పుడు ఉదయించుచున్నది. అభ్యసనముయొక్క స్వభావమును పరిశీలించుటకు అనేక ప్రయోగములు చేయబడి, అమూల్యమైన ఫలితములు సేకరింపబడి యున్నవి. ముఖ్యముగా నీ ప్రయోగాత్మకపద్ధతి ఈ అభ్యసన రంగమునందు చాల సఫలమైనది. మానవుని జ్ఞాపకశక్తిపై మొట్టమొదటగా ప్రయోగములు పందొమ్మిదవ శతాబ్ది చివరి 25 సంవత్సరములలో చేయబడినవి. కొన్ని సంవత్సరముల తర్వాత నిపుణములయిన సంచలనాత్మక కృత్యములపై ప్రయోగములు కావింప

బడెను. పిదప ఆ శతాబ్ది అంతమున ఉత్తములయిన మనస్తత్వజ్ఞులు జంతు విజ్ఞానముపై ప్రయోగములను జరిపిరి. ఇట్టి ప్రాథమిక ప్రయోగములు మనుష్య విజ్ఞానముపైగాక జంతువిజ్ఞానముపై ఏ కారణముచే ప్రారంభింపబడినవి అని మనకు సందేహము కలుగవచ్చును. అందులకు కారణములు రెండు. జంతు విజ్ఞాన మెట్టిదో తెలిసికొనవలయునను మనస్తత్వజ్ఞుల కుతూహల మొకటి. అతి సూక్ష్మమును ప్రాథమికమును నైన జంతువిజ్ఞాన సూత్రములతో నారంభింపదలచుట రెండవది మానవుని స్థితి చిక్కైనది. అల్లే ఆతడు ఆర్జించు విజ్ఞాన పద్ధతులును చిక్కులతోకూడినవే. జంతువిజ్ఞాన పద్ధతియొక్క పరిశీలనము, మానవుడు విజ్ఞానార్జనము చేయు క్రమమును అర్థము చేసికొనుటకు ఎక్కువ ఉపకరించినది. అందులకు కారణము, జంతువులు నేర్చుకొనుటలో కనిపించు అనేక అంశములు, ప్రవృద్ధమైన దశలో, మానవులలో కనిపించుటయే.

జంతువుల అభ్యసనము : జంతువులను గురించి అతి విస్తృతముగా జరుపబడిన ప్రయోగ పరిశీలనయందు, లాయిడ్ మార్గన్ అను నాతడు కృషిచేసి, ప్రాథమికమైన - ఒక మూలసూత్రమును ఏర్పరచెను. దానిని లాయిడ్ మార్గను సూత్ర మందురు. "ఏ క్రియయైనను మనస్తత్వ' పరిధులకంటె అధోభాగమున పనిచేయు శక్తి యొక్క ఫలితముగా పరిగణింపబడినచో, ఆ క్రియను ఒక ఉన్నతమానసిక శక్తియొక్క ఫలితమని ఏ విధను గాను చెప్పలేము. అను నదియే లాయిడ్ మార్గన్ యొక్క సిద్ధాంతము. దీని ననుసరించి పరిశీలించగా, జంతువులలో - ముఖ్యముగా అతితెలివిగల జంతువులగు కోతులలోకూడ సంపూర్ణమగు హేతుజ్ఞానము ఉన్నట్లు కనపడదు. కాని వాటియొక్క ఏమాత్రపు వివేకమును చూపు ప్రవర్తనమైనను హేతుజ్ఞాన పూర్వకముగా చేయబడినదేమో అను విభ్రాంతిని కలిగించును. జంతువుల అభ్యసనమును తెలిసికొనుటకై చేయబడిన వివిధప్రయోగ పద్ధతులును, వాటిలో ముఖ్యముగా ప్రయత్న-ప్రమాద పద్ధతియు ఈ దిగువ చెప్పబడిన సామాన్యాంశములపై ఆధారపడి యున్నవి :

(అ) ఒక లక్ష్యమును చేరుటకు ఒక సంకల్పము.

(ఆ) లక్ష్యమును చేరుటకు స్పష్టమైన మార్గము కనిపించక పోవుట.

(ఇ) పరిస్థితి పరామర్శము.

(ఈ) లక్ష్యమార్గములను వివిధరీతుల ననుసరించుట.

(ఉ) చిట్టచివరకు లక్ష్యమును జేరుట.

ప్రయత్న - ప్రమాద - పద్ధతి : జంతువు ఈ ప్రయోగ విధానము నంతయు నడిపి జయము గాంచినపుడు అది ప్రయత్న - ప్రమాద - పద్ధతి ద్వారమున అభ్యసించినదని మనము చెప్పగలమా ? కాని మనస్తత్వజ్ఞులు ఆ పద్ధతి ప్రకారము అది నేర్చుకొనలేదని అందురు. ఏలనగా ప్రతిదినము కావించిన ఈ సంశ్లిష్టప్రయోగమునందలి ఏ విభాగముయొక్క సాయమున ఆ జంతువు ప్రయత్న - ప్రమాద - పద్ధతియొక్క అవృత్తిని తగ్గించి, విషయ గ్రహణములో నేర్పును సంపాదంచినది అను సంశము విచారణీయము. ఈప్రయోగము జరుగుచున్నంతకాలము జంతువు కదిలి పరిశీలించుచున్నదన్నమాట నిజమే. కాని చలనము, పరిశీలనము అను నీ రెండింటిలో దేనివలన అది నేర్చుకొనుచున్నది ? మొత్తముమీద ఈ నేర్చుకొను క్రమములో చలనాత్మక క్రియకన్న జ్ఞానేంద్రియముల ద్వారమున చేయు పరిశీలనమే ఎక్కువగా ఉపకరించుచున్నది. పరిశీలనమునకు చలనముకూడ అవసరమనుట నిర్వివాదము. అట్టియెడ చలనము కలిగించుటకంటె చలనముయొక్క ఫలితమును పరిశీలించుటయే నిర్ణాయకమైన అంశము. ఈ ప్రయోగములో పెట్టె, వల, మొదలగు ఏ విధమైన వస్తువులను ఉపయోగించినను, జంతువు ఎదురుగా కనిపించు వస్తువుల తత్త్వమును తెలిసికొనును. ఈ స్థితియందు జంతువునకు ప్రయోగమునందలి వస్తువులయొక్క తత్త్వమును తెలిసికొనుట యందుకంటె వాటినుండి తప్పించుకొనుటయందే తాత్పర్యముండును.

ఈ పరిస్థితులలో జంతువులకు అంతర్దృష్టి ఉన్నదా, అను ప్రశ్న ఉదయించును. కారణమేమన, పిల్లులకంటెను కుక్కలకంటెను ఎక్కువ తెలివిగలిగిన కోతులును, చింపంజీలును (ఒకజాతి కోతులు) బాగా క్లిష్టమైన యుక్తులు నేర్చుకొనుట కలదు. ఈ స్థితిలో అంతర్దృష్టి యనగా ముందుచూపు వెనుకచూపునై యున్నది - అని అనుభవమువలన తెలియుచున్నది. మరియును, అంతర్దృష్టి

యనగా వస్తువుయొక్క తత్త్వముయొక్క అవగతియై యున్నది. ప్రొఫెసర్ వుడ్‌వర్తు ఇట్లు చెప్పెను : ఆధునిక యుగములో మనము మోటారుకార్లను, రేడియోలను, వాటి యంత్ర రచనాజ్ఞానము సమాత్రమును లేకయే ఉపయోగించుకొనుచున్నాము. ఏ వస్తువుయొక్కగాని సంపూర్ణమైన అంతర్దృష్టిగలవా రెవ్వరును లేరు. 'అంతర్దృష్టి' అను పదములో పనులను నెరవేర్చుకొనుటకై మనము చేయు సామాన్య పరిశీలనముకూడ ఇమిడియున్నది" కావున అంతర్దృష్టి యొక్క స్థానమున మనము 'పరిశీలనము' అను పదమును వాడవచ్చును. ఈ పదమును వాడుటలోకూడ కొంత చిక్కు లేకపోలేదు. కారణము - పరిశీలన మనగా బుద్ధిపూర్వకమైన పరిశీలన మగుటయే. జంతువు దాని జ్ఞానేంద్రియముల ద్వారమున పరిస్థితియొక్క వివరములను తెలిసికొనును. ముందు చూపు కలిగియున్నచో అది కార్యరంగమును పరిశీలించి లక్ష్యసిద్ధికై మార్గమును అన్వేషించును. తరచుగా జంతువు కేవల పరిశీలనముచేతనే అనగా, యత్న-ప్రమాద పద్ధతి ననుసరింపకయే, లక్ష్యసిద్ధి నొందజాలదు. ఇందులో విశేషముగా వెనుకచూపు అవసరమగుచున్నది.

**పరిస్థితి జనితక్రియ (Conditioned Reflex) :** జంతువుల మనస్తత్వ రంగమున పరిశీలనరహితమైన మరియొక ముఖ్యమైన అభ్యాసక్రమము కలదు. అదియే పరిస్థితి జనితక్రియ. ఈ శతాబ్ది ఆరంభమున (జంతుదేహ ధర్మశాస్త్రజ్ఞుడైన) ఒక రష్యను దేశీయుడు 'పావ్‌ల్లోవ్' అనువాతడు కుక్కలను పరిశోధనవిషయముగా గ్రహించి, వాటియొక్క జీర్ణశక్తిని గురించి పరిశీలించెను. అందు అతడు కుక్కల లాలాజలస్రవణమును నిర్ణయించుటకు ఒక పద్ధతిని కనుగొనెను. కుక్కలకు నోటిలో ఆహారమున్నప్పుడేగాక, అవి ఆహారమునుగాని, ఆహారమును పెట్టు పళ్ళెరమునుగాని, ఆహారమునిచ్చు మనుష్యునిగాని, చూచినపుడును, ప్రక్కగదిలోనున్న ఆ మనుష్యుని కాలి చప్పుడు విన్నప్పుడును, వాటి నోటినుండి లాలాజలము ఊరుటను 'పావ్‌ల్లోవ్' కనిపెట్టెను. నోటియందు ఆహారమున్నప్పుడు లాలాజలము ఊరుట సహజక్రియయై యున్నది. ఆహారపుపళ్ళెరమును చూచుటచేతను, ఆహారమిచ్చు మనుష్యుని పదధ్వనిని వినుటవలనను, లాలాజలము ఊరుట నిస్సంశయముగ అసహజక్రియ, అనగా, అభ్యస్తమైన క్రియ. దీనికి ఆధారము ఆ జంతువునకు అంతకు మునుపు ఆహారము పెట్టబడిన పరిస్థితులు. అందుచేత 'పావ్‌ల్లోవ్' దీనికి 'పరిస్థితిజనితక్రియ' యని పేరిడెను. ఇది యథార్థముగా ఒక ప్రతిక్రియ కాదు. అందుచే దీనిని మనస్తత్వజ్ఞులు సంనియమక్రియ యనిరి. (Conditioned Response).

**మానవుల అభ్యసనము :** జంతువులు నేర్చుకొను సామాన్య విధానమును గూర్చిన వివరములను తెలిసికొనినపిదప మానవులు నేర్చుకొను రీతిని పరిశీలించుట మన కర్తవ్యము. మానవుడు జంతువుకంటె అధికుడు. కొన్ని అంశములలో అతడు నేర్చుకొను పద్ధతి జంతువులు నేర్చుకొను పద్ధతికంటె విశిష్టము.

1. మానవుడు జంతువుకంటె విశేషముగా నేర్చుకొనును.
2. మానవుడు నేర్చుకొను విషయము జంతువు నేర్చుకొను విషయముకంటె ఎక్కువ శక్తికలిగి యుండును.
3. మానవుడు నేర్చుకొనగలిగినదంతయు జంతువు నేర్చుకొనలేదు.

మానవుడు జంతువు నేర్చుకొనునట్లే నేర్చుకొనును. నేర్చుకొను క్రమము, పరిశీలనము- యత్న- ప్రమాదపద్ధతి ఇవి ఉభయత్రసమానములే. అయినను, అతని పరిశీలనము, యత్న-ప్రమాద-పద్ధతి- రెండును ఉన్నత స్థాయికి చెందియుండును. మనుష్యునిపరిశీలనము కేవలము జ్ఞానేంద్రియ జన్యమేకాదు. అతడు నియమములు కలిగినవాడై, అల్పములయిన ఉద్రేకములకు లోనుకాడు. చిక్కులు పెట్టుట, కలవరపెట్టుట, అను ప్రయోగములు మనుష్యుని పరముగా జరుగగా, అతడు వాటిని బోధ చేసికొనుట యందును, వాటినుండి విముక్తిని సంపాదించుకొనుట యందును జంతువులకంటె విశేషమైన ఉత్కృష్టతను ప్రదర్శించునని తెలియుచున్నది.

మానవుని చేతులు కౌశలముతో పనిచేయుటకు ఎక్కువ విలుగానున్నవి. దీనికంటె ముఖ్యమైన విషయ మేమనగా అతని పరిశీలనశక్తి, జంతు పరిశీలనశక్తికంటె గొప్పది. అతడు పరిశీలనమువలన నేర్చుకొనుట అనగా,

కేవలము పరిస్థితులను తెలిసికొనుటయేగాక, వాటి యందలి రహస్య విషయములను తెలిసికొనుట కూడ అయియున్నది. మనుష్యుడు అభ్యసించునపుడు తాను అన్వేషించు పరిస్థితుల యొక్కయు తాను ఉపయోగించు వస్తువుల యొక్కయు లక్షణములను తన మనస్సునకు పట్టించుకొనును. అతడు చలనాత్మక విషయములను అభ్యసించునపుడు, ఒకసారి కదల్పబడిన పిదప స్వతంత్రముగా నడచునట్టి క్లిష్టచలన క్రియలను సాధనముగా చేసికొనును. అభినయించుట, నృత్యము చేయుట, ఉపన్యసించుట అనునవి ముఖ్యోదాహరణములు. ఇట్టి చలనాత్మక అభ్యసన రీతులన్నియు ఆరంభమున పరిశీలనముపై నెక్కువ ఆధారపడినవే అయినను, కాలక్రమమున అవి నిత్యాభ్యాసకారణముగా, నాడీసంప్రదాయమున లీనమై కనీసములైన పరిశీలన నిగ్రహములతో కొనసాగును. అందువలన అభ్యాసవిషయమున, పరిశీలనములోను నిర్వహణములోను భాషను, భావమును అర్థముచేసికొనుటలోను, మనుష్యుడు జంతువుకంటె అనేకరెట్లు అధికుడు. అల్పకృత్యములను చేర్చి వాటిని పెద్ద విషయముగా రూపొందించుటయందే మనుష్యుని కౌశలము విశదమగుచున్నది.

**అభ్యసనము జరుగు విధానము :** జంతువులు, మానవులు అభ్యసించు పరిస్థితులను పరామర్శించిన పిదప, అభ్యసన క్రమమునందలి ముఖ్యాంశములను పరిశీలించుట అవసరము. అభ్యసన క్రమమునుగూర్చి వెలువడిన ఏ చిన్న సిద్ధాంతమునుకూడ ప్రపంచమునందలి మన స్తత్వ శాస్త్రజ్ఞులందరును సర్వసామాన్యముగా ఒప్పుకొని యుండలేదు. అయినప్పటికిని, ప్రతిపాదింపబడిన ప్రతి సూత్రమునందును కొంత సత్యము లేకపోలేదు. ప్రాజ్ఞులింకను అభ్యసన క్రియ విషయమున నూతన సూత్రములను కనుగొనుటకు విశేష ప్రయత్నము చేయుచునేఉన్నారు. అభ్యసనమును గూర్చి వెలువడిన ఆదిమ సూత్రములలో నొకటి 'సన్నిహితత్వమువలన కలుగు భావసంయోగము.' అనగా రెండుభావములు కలిసి అనుభవింపబడుటచే, అవి సంయోగము నొందును. వ్యతిరేకముగా చెప్పబడినచో ఈ సూత్రము ఎక్కువ దృఢముగాను స్పష్టముగాను ఉండును. రెండు భావములును కలిసి అనుభవింపబడినప్పుడుగాని సంయోగమును చెందవు. సంబంధములు సమకూర్చుటలో సన్నిహితత్వముకూడ ఎక్కువ సమర్థము కాదు. రెండు భావములను సమ్మేళనము చేయుటకు నేర్చుకొనువానికి వాటిలో ఏకత్వము గోచరింపవలెను. మరియొక ప్రాచీన సూత్రము కలదు—అది, "సాతత్యము, ఆవృత్తి, అభ్యసన క్రమమునకు తోడ్పడును" అని చెప్పుచున్నది. పరిస్థితి జనితక్రియా విషయమున ఇది సత్యమే. అందు ఆవృత్తి జరుగనిచో సరియైన సమాధానము ఉండజాలదు. అయితే ఈ సూత్రముకూడ పూర్వపక్షము చేయబడినది. ఎంమ చేత ననగా వట్టి ఆవృత్తివలనను అభ్యసనము వలనను, ఎవరును సంపూర్ణులు కాజాలరు. ఎన్ని ఆవృత్తులు జరిగినను సరియగు కృషి లేనిచో, గొప్ప కౌశలముగాని, పాండిత్యముగాని చేకూరజాలదు. ఒక కార్యములో నిమగ్నుడగుటకు వ్యక్తికి సరియగు అభిరుచి ఉండవలెను. అభిరుచియే అతడు చేయు పనిమీద ఎక్కువ శ్రద్ధను చూపుటకు తోడ్పడును. అట్టికృషి అభ్యాస క్రమమునకు దోహదము చేయును. అభిరుచి, శ్రద్ధ అను వాటిని మనము విమర్శించినచో నిక్కముగ, ప్రతిఫలము, శిక్ష అనునవి వాటి లక్ష్యములనియు వీటివలన అభిరుచియు, శ్రద్ధయు జనించుననియు, ఇవియే అభ్యసన క్రమమునకు తోడ్పడుననియు తేటపడగలదు. ఇవి అభ్యసనమును నియమించు ప్రోత్సాహకారణములలో కొన్నియై యున్నవి.

**ముగింపు :** అభ్యసన సూత్రములలో, కొన్ని లోపములు (limitations) ఉన్నను అవి అభ్యసన క్రమమును కొంతవరకు విశదీకరించును. అన్నిరంగములయందువలె, సామాన్యమైన అభ్యసనమునందును, కొన్ని అపవాదములు కలవు. కొందరు వ్యక్తులు తమ ప్రతిభచేతగాని, సులభగ్రహణ శక్తిచేతగాని ఇతరులకంటె అతి త్వరితముగాను, ఉత్తమముగాను నేర్చుకొనగలరు. అట్లే కొందరు సామాన్యమైన తెలివితేటలుకూడ లేనివారుగానున్నారు. ఈ విషయమున ఇతర అంశములుగూడ పరిగణింప దగి ఉన్నవి. మన స్తత్వశాస్త్రమును పరిశీలించునపుడు సంపూర్ణ విషయమును దృష్టిలో నుంచుకొని ఇతర శక్తు లన్నింటి సాయమున దానిని పరిశీలింపవలెను. అభ్యసన క్రమ పద్ధతిని సంపూర్ణముగా అర్థము చేసుకొనుటకు వ్యక్తి యొక్క జ్ఞాపకశక్తి, ఆలోచన, తెలివి, మనోవృత్తి,

మున్నగువాటినికూడ పరిశీలింపవలెను. ఇట్టి బహుళాంశములతో కూడిన వాతావరణమునందే అభ్యసనకృత్యము కొనసాగును. అభ్యసనక్రమ రంగమున ప్రస్తుతము పరిశోధనము జరుగుచున్నది. ఈ రంగమున ఇంకను ఇట్టి పరిశోధనము ఎంతో అవసరము. ప్రతి రంగమునందును లక్ష్యసిద్ధియు, అభివృద్ధియు అభ్యసన మనస్తత్వముపైననే ఆధారపడి యున్నవి.

డా. శ్రీ. శ్రీ.

**అభ్రకము*** :- అభ్రకము (Mica) అను పేరున పిలువబడు కొన్ని శైలస్థ ఖనిజములు అనాదినుండియు మానవులచే విరివిగా ఉపయోగింపబడుచు వచ్చినవి. ఇవి కొన్ని ప్రత్యేక లక్షణములు కలిగి యున్నవి. మైకా (Mica) అను పదము ల్యాటిన్ భాషయందలి మైకేర్ (Micare మిణుకు మిణుకు మనుట) పదమునుండి వచ్చినట్లు భావింపబడుచున్నది. ఈ సంచయమునందలి ముఖ్య ఖనిజముల పేర్లు, వాని రాసాయనిక నిబంధములు (Chemical compositions) క్రింద ఉదహరింపబడినవి.

1. అభ్రకము - మస్కొవైటు (Common mica, Potassium mica) - $H_2$ K Al $(Sio_4)_3$
2. మలాభ్రకము - బయోటైట్ (magnesium iron mica) - $H_2$ K $(Mg, Fe)_3$ (Al, Fe) $(Sio_4)_3$
3. భ్రాజాభ్రకము - ఫ్లొగొపైట్ (magnesium mica) $H_2$ K $Mg_3$ $Al_2$ $(Sio_4)_3$
4. లఘుజాభ్రకము - లెపిడొలైట్ (lithium mica) $(O H F)_2$ K Li $Al_2$ $Si_3$ $O_{10}$
5. క్షారాభ్రకము - పెరాగొనైట్ (Sodium mica) $H_2$ Na $Al_3$ $(Sio_4)_3$

అభ్రకమునకు గల పారిశ్రామిక ప్రాముఖ్యమునకు దానికి గల కొన్ని అనన్యలక్షణములే కారణము. ఈ లక్షణము లన్నియు ఏ ఇతర ప్రాకృతిక పదార్థమందుగాని, సంశ్లేష (Synthetic) పదార్థమందుగాని లేనందున విద్యుద్రాసాయనిక పరిశ్రమలలో అభ్రకముయొక్క ఉపయోగము అనివార్య మగుచున్నది. ముఖ్యముగా విద్యుత్పరిశ్రమలో అభ్రకములేనిదే ప్రస్తుతము సాధ్యమైన పురోభివృద్ధికి అవకాశముండి యుండెడిదికాదు. ఇంత ముఖ్య ఖనిజ మగుటవలననే దీనిని అమెరికాప్రభుత్వపు సైనిక నౌకాస్త్రగణము (Army and Navy Munitious Board) వారు తమ ఇరువదిమూడు యోధన నైతిక (Strategic) ఖనిజములలో చేర్చిరి. క్రీ. శ. 1878 సంవత్సరమున ఎడిసన్ మొదటి మోటారు తయారు చేసినప్పటినుండి నేటివరకు విద్యుత్ శాస్త్రీయ పురోభివృద్ధికి ప్రత్యేకలక్షణ లక్షితమగు ఈ ఖనిజసంచయము చాల దోహద మిచ్చినదని చెప్పుట అతిశయోక్తి కాజాలదు.

**భారతదేశ మందును, అన్యదేశముల యందును గల అభ్రకపుగనులు :** భారతదేశమున మస్కొవైట్ విరివిగా లభ్యమగుచున్నది. ద్రవస్థితినుండి ఘనీభవించిన అనేక రకముల శిలలలో గ్రానైట్లు (granites) ఆఖరున ఏర్పడిన శిలలుగా పరిగణింపబడుచున్నవి. ఈ స్థితిలో మిగిలిన ద్రవపదార్థములోను, వాయురూప పదార్థములోను అభ్రకనిర్మాణమునకు అవసరమగు వివిధపదార్థములు నిల్వయుండును. ఇవి పెగ్మటైట్స్ (Pegmatites) అనబడు శిలలలో అభ్రక పుస్తకములుగా తయారగుచున్నవి. పెగ్మటైట్స్ విభిన్నమగు శిలలలో చొచ్చుకొని అనేకములగు ఆకారములను గలిగియుండును. అభ్రకము ఇట్టి పెగ్మటైట్స్‌నుండి సేకరింపబడుచున్నది. మనదేశమున ఉత్పత్తియగు అభ్రకము బీహారు, ఆంధ్రరాష్ట్రము, రాజస్థాన్ అను తావులనుండి వచ్చుచున్నది. ఇందులో బీహారునందలి 'కోడర్మా' అను అభ్రక క్షేత్రమునందు 'బెంగాల్ కెంపు' (Bengal ruby) అని పిలువబడు మస్కొవైట్ లభ్యమగుచున్నది. మనదేశమున నుత్పత్తియగు అభ్రకములో నాలుగింట మూడువంతు లిచ్చటిదే. కోడర్మా క్షేత్ర విస్తీర్ణము సుమారు 1500 చతురపుమైళ్లు. ఆంధ్రదేశమునందలి నెల్లూరు ప్రాంతమునుండి హరితాభ్రక (green mica) మను మస్కొవైట్ లభ్యమగును. విద్యుత్పరిశ్రమలో బీహారునందలి దానికంటె ఆంధ్రదేశములో ఉత్పత్తియగు అభ్రకమే అధికముగా వాడుకలోనున్నది. దీనికి కారణము ఇచ్చటి అభ్రకపు రేకులు అధికముగా సమతలము కలిగియుండుటయే. రాజస్థాన్ నందు కూడ 'కెంపు' అభ్రకము లభ్యమగును. ఇచ్చటి గనులు చెదురు మదురుగా నున్నవి.

*భారతీయ జాతీయ భూతాత్త్విక పమీక్ష డైరక్టరుగారి అనుమతితో.

ప్రపంచమునందు ఉత్పత్తియగుచున్న అభ్రకములో నూరింట నెనుబదిపాళ్ళు భారతదేశమునందలి నిధులనుండి లభ్యమగుటచే ఈ విషయమున మనదేశము అగ్రస్థానము వహించియున్నది. 1940-53 సంవత్సరముల మధ్య మన దేశమందలి అభ్రకము యొక్క ఉత్పత్తి వివరములు రేఖాపట (గ్రాఫ్) రూపమున నీ క్రింద నీయబడినవి.




రష్యా, కెనడా, రొడీషియా, టాంగనీకా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా, అమెరికా సంయుక్తరాష్ట్రములు, మెడగాస్కర్, ఆర్జంటీనా, బ్రెజిల్, నార్వే, కొరియా, గౌటిమాలా మొదలగు దేశములందలి గనులనుండి గూడ అభ్రకము సంగ్రహించబడుచున్నది.

అభ్రకమును శుభ్రపరచుట, క్రమస్థాపనము (grading) : గనులనుండితీయబడిన అభ్రకపుస్తకములలో మంచివానిని వేరుపరచి భాండాగారములలో నిలువచేసెదరు. ఇట్టి పుస్తకములను దళసరిరేకు (sheet) లలోనికి చీల్చి వాని చివరలను సమముగానుండునట్లు కోసివేయుదురు. ఈ పనికై కొడవండ్లను, కత్తెరలను వాడుదురు. ఈ రేకులలో ఇమిడియున్న ఇతరఖనిజములను బట్టియు, వాటిరంగును బట్టియు వాటిని వివిధరకములలోనికి విభజింతురు. వాటి నుండి లభ్యముకాగల దీర్ఘచతురస్రాకారపు గరిష్ఠ వైశాల్యమును బట్టి వాటిని వేర్వేరు క్రమములలో నుంతురు.

చిన్నచిన్న పుస్తకములుగ లభ్యమగు నభ్రకమును ఎగుమతిచేయుటకుముందు వాటిని సాధ్యమైనంత సన్నని పొరలుగా వేరుచేతురు. బీహారురాష్ట్రమున అభ్రకమును చీల్చుటయే వృత్తిగాగల బాలబాలికలు, స్త్రీలు ఈ పని యందు అత్యంత సామర్థ్యముకలవారై యుండుటవలన అభ్రకమునుచీల్చుటలో ప్రపంచమున బీహారురాష్ట్రమున

కొక విశిష్టస్థానము లభించినది. ఇతరదేశములయందు యంత్రసహాయమున సాధింపబడ నేరని ఈ కార్యమును వీరు తమ హస్తలాఘవముచే సునాయాసముగా చేయ గలుగుటచే ప్రతివత్సరము పొరలుగా చీల్చుటకు కొంత అభ్రకము మనదేశమునకు పంపబడుచున్నదనిన ఆశ్చ ర్యములేదు.

మనదేశమునందలి అభ్రకపు గనులవద్ద మిగిలిపోవు అభ్రకపు ముక్కలు (Scrap mica) విరివిగా పారవేయ బడుచున్నవి. అభ్రక చూర్ణమును తయారుచేయుటలో ఇతర దేశములం దిట్టి అభ్రకము ఉపయోగింపబడు చున్నను మనదేశమున నింకను ఈ విషయముపై దృష్టి మరలలేదు.

**పారిశ్రామిక దృష్ట్యా అభ్రక లక్షణములు :** అభ్రకపు రేకులకుగల ఉపయోగములు వాటి స్ఫటికాకారము (Crystal) పై, వాటి నిర్మాణము (Structure) పై చాల వరకు ఆధారపడియుండును. స్ఫటికములకు ఉండవలసిన ముఖ్య లక్షణములు పగుళ్ళు లేకుండుట, వాటి తలము దృఢముగాను, విశాలముగాను ఉండుట, ఇతర ఖనిజ పదార్థములయొక్కగాని, జీవసంబంధ (Organic) పదా ర్థములయొక్కగాని రంగు వాటియందు లేకుండుట, అంగుళములో $\frac{1}{1000}$ మందముగల పొరలుగా సులువుగా వేరుపరచుటకు అనువుగా నుండుట ముఖ్యమైనవిగా పరి గణింప బడుచున్నవి. ప్రపంచములో ప్రస్తుతము విద్యు త్పరిశ్రమలో ఉపయోగింపబడు అభ్రకపు రేకులలో అధిక భాగము ఒకటినుండి మూడు చతురపు టంగుళముల వైశాల్యముగల చిన్నచిన్న పుస్తకములనుండి లభ్యమగు చున్నది.

సన్నటి పొరలలో అభ్రకము ⅛ అంగుళము వ్యాసము గల కడ్డీ (rod) చుట్టును చుట్టినను ఏమాత్రము తునగకుండ వంచుటకు వీలు (flexible) గా నుండును. సాధారణ పరిస్థితులలో అభ్రకము కరుగదు. అత్యధికోష్ణము సోకి నను ఇది ఏవిధమైన భౌతికములును, రాసాయనికములును నగు మార్పులను చెందదు. అంతియేకాక ఆకస్మిక విద్యు దుష్ణ భేదములవలనగూడ దాని లక్షణములలో ఎట్టి మార్పునుకలుగదు. అందుచే ఇది వొక అద్భుతమగు ఉష్ణవి సంవాహన (Heat insulating) పదార్థమని తేలుచున్నది.

ఇదేవిధముగా అభ్రకము విద్యుత్పరిశ్రమలో విసంవా హన (insulating) పదార్థముగా ఉపయోగపడుచున్నది. అభ్రకమునందు ప్రవేశింపగల విద్యుత్ప్రవాహము అతి సూక్ష్మమైనది. అందుచే అనవసరమగు తావులందు ఆ మాత్రమే ప్రవాహమార్గ ముండుటకును, శేషించిన తావు లందు ప్రవాహమును నిరోధించుటకును ఇది ఉపయోగ పడుచున్నది. స్థితిభేదము చెందకుండ అభ్రకము అత్యధిక శక్తిమంతమగు విద్యుత్ప్రవాహమునకు తాళగలదు. పారద్యుతిక క్షేత్రము (dielectric field) నందు క్షణిక ముగా స్థైతిక విద్యుచ్ఛక్తి (Electrostatic energy) ని పట్టియుంచి అత్యల్ప నష్టముతో తిరిగి దానిని విడువ గలిగి యుండుటచే ఇది విరివిగా రేడియో కండెన్సరుల (Radio Condensers) లో వాడబడుచున్నది.

ఈ ఖనిజమునకుగల ఇతర లక్షణములలో నీటి సన్ని ధిలో స్థిరత్వము (stability) సన్నని పొరలలో దీనికిగల పారదర్శకత (transparency), సంపీడన నిరోధకశక్తి (incompressibility) కూడ ముఖ్యమైనవి. అనునాదము (resonance) యను స్వభావమును గలిగియుండుటచే నిది రేడియో పరిశ్రమలో ముఖ్యముగా వాడబడుచున్నది.

**అభ్రకముయొక్క ఉపయోగములు :** పైన వివరించి నట్లు విద్యుత్పరికరముల నిర్మాణము అభ్రకపు రేకులపై ఆధారపడియున్నది. ఇట్టివాటిలో వ్యత్యయ ఖండములు (commutator segments), V— ఆకారపు బిళ్ళలు (V—rings), ఆర్మచూర్లు (armatures), విమానవహిత్ర స్ఫులింగనిగములు (air plane motor spark plugs), రేడియో నాళములు (radio tubes), పరివర్తకములు (transformers), రేడియోకండెన్సర్లు (radio condensers) దూరశ్రవణయంత్రములు గలవు. ఇవిగాక విద్యుత్ సహా యమున పనిచేయు ఇస్త్రీపెట్టెలు, రొట్టెలనుకాల్చు పని ముట్లు (toasters), నీటిని కాచు సాధనములు (water heaters) మొదలగు గృహోపకరణములుకూడ గలవు. పరితాపనీ వాతాయనముల (stove windows) కును, లాంతరుచిమ్నీగాను, కొలుముల (furnace) దృష్టి రంధ్ర ములు మూయుటకును, పగులని సులోచనములకును, నియోన్ (Neon) దీపములలోను, వలయకములు (wash- ers) గాను కూడ అభ్రకము ఉపయోగింపబడుచున్నది.

చూర్ణము చేయబడిన అభ్రకము గూడ అనేకరీతుల పారిశ్రామికముగా ఉపయోగపడుచున్నది. ఈ చూర్ణము అభ్రకమునుండి ప్రత్యేక సాధనములతో తయారుచేయ బడుచున్నది. తడిపద్ధతి (Wet process) పొడిపద్ధతి (Dry process) అనబడు పద్ధతులలో ఇది తయారగుచున్నది. గోడలకు ఉపయోగించు కాగితములలోను రంగుల (paints) లోను, గుడారములు కురియకుండ చేయుటకును, రబ్బరు పరిశ్రమలోను, గట్టి రబ్బరులోను, కొన్ని రకముల రబ్బరువస్తువులలోను, జడపూరకము (inert filler) గాను, రబ్బరుటైరులను పోత (moulding) పోయుటయందును, గంధ దృంహణము (vulcanising) నందును, కందెన (lubricant) గాను, టైరులకు లోనున్న నాళములతోడి రాపిడి తొలగించుటకును, టైరులు లోపలనున్న నాళ ములతో అతుకుకొనకుండ చేయుటకును తడిపద్ధతిపై తయారగు చూర్ణము వాడబడుచున్నది. కొన్ని ప్లాస్టిక్ (plastic) పదార్థముల తయారునందు కూడ ఇది వాడ బడుచున్నది. పొడిపద్ధతిపై తయారుచేయబడిన చూర్ణము గృహములలోపల కప్పుట కుపయోగించు కాగితమును తయారుచేయుటకు ఉపయోగపడుచున్నది. ఇది యింకను గొట్టములలోను, కాగుల (boilers) లోను, పరివేష్టనము (lagging) నకును, లోహమును కరగి అతుకు పరికరముల (welding rods) పూతగను, నాళికాకాచము (pipeline enamel) నకును, అభితాపనము (annealing) నందును, వస్త్రపరిశ్రమయందును, నూనె బావులను తొలుచుట (oil well drilling) లోను, కాంక్రీటు మొదలగు పదార్థ ములచే తయారుచేయబడు పెంకుల అలంకరణము నందును, గ్రామఫోను రికార్డులయందును, ప్రేలుడు పదార్థముల (explosives) ఉత్పత్తియందును, మార్జన (cleansing) సంయోగములయందు ఆధారము (base) గాను, శిలాముద్రణ (lithographing) మందును కూడ ఉపయోగింపబడు చున్నది. క్రిస్మస్ పండుగయందలి వృక్షాలంకారములకును చలనచిత్ర నిర్మాతలచే కృత్రిమ హిమముగాను ఇది వాడబడుచున్నది. విద్యుత్పరిశ్రమలో వాడబడు మైకాలెక్స్ (micalex) అను విద్యుత్సంవాహ నిరోధ పదార్థ నిర్మాణమునందు ఇది ముఖ్య పదార్థమై యున్నది. మనదేశమున ఆయుర్వేద ఔషధ ములందు కూడ చూర్ణరూపమున అభ్రకము వాడబడు చున్నది.

కృతకాభ్రకము (మైకానైట్) : అభ్రకపు రేకులు అల్ప మగుటలో గల యిబ్బందులవలనను, దాని యధిక మూల్యమువలనను ఇతర దేశములు కృతకాభ్రకమును తయారుచేయుటలో ఉత్సుకతను ప్రదర్శించినవి. తత్ఫలిత ముగా గత శతాబ్దాంతమున మొదటిసారిగా "మైకా నైట్" నిర్మింపబడుట జరిగెను. సన్ననిపొరలుగా నున్న అభ్రకమును జాగ్రత్తగా నమర్చి సరియగు జిగురు (adhesive) పదార్థమును ఉపయోగించి అవసరమగు దళసరితోను, పరిమాణములలోను దీనిని తయారుచేయు చున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రములయందలి అభ్రకపరిశ్రమ అభ్రకపు ముక్కలను వినియోగించి "మైకానైట్" నిర్మించుటపై చాలవరకు ఆధారపడి యున్నది. సుదీర్ఘ పరిశోధనల ఫలితముగా ఈ పరిశ్రమ యందు ఈ దేశము అగ్రస్థానము వహించు నవకాశము పొందగలిగినది.

అభ్రకపు స్థానీయములు (Substitutes for Mica): సాధారణ పరిస్థితులలోను, అంతకంటె ముఖ్యముగా యుద్ధసమయము లందును తమతమ యవసరములకు సరిపడు అభ్రకముతో ఇతర దేశములనుండి దిగుమతి చేసికొనుటలో గల ఇబ్బందులనుబట్టి కొన్ని దేశములు అభ్రకస్థానమున ఉపయోగించుటకు వీలగు పదార్థము లపై తమ దృష్టిని మరల్చినవి. ఇట్టి పదార్థములలో కొన్ని ఖనిజములు, మరికొన్ని కృత్రిమ పదార్థములు కలవు. ఖనిజములలో వెర్మిక్యులైట్ (Vermiculite) మొదలగునవి కొన్ని ప్రత్యేకోపయోగములు కలిగి యున్నను అభ్రకస్థానమును నాక్రమించు ఖనిజ మింకొకటి లేదు. అభ్రకమునుండియేతయారగుచున్న "మైకాలెక్స్" సంగతి ఇదివరకే చెప్పఁబడినది. అభ్రక స్థానమున వాడబడు కృత్రిమ పదార్థములు చాలవరకు కాగితమునందు కృత్రిమనిర్యాసముల (Artificial resins) పూతచే తయారగుచున్నవి. పెర్టినాక్స్ (Pertinax), బేక్ లైట్ (Bakelite), పేక్సోలిన్ (Paxolin), ఫార్మలైట్ (Formalite), ఆల్సిఫిల్మ్ (Alsi film) మొదలగు పదా ర్థము లీ తరగతికి చెందినవే. ఇవి అన్నియు కొన్ని కొన్ని

ప్రత్యేకావసరముల కుపయోగపడునవేకాని అభ్రకము వలె వివిధావసరముల కుపయోగించు పదార్థ మేదియును లేదు. అభ్రకమును దానియందలి వివిధ రాసాయనిక భాగములనుండి కృత్రిమముగా తయారుచేయు ప్రయత్నములుకూడ జరుగుచున్నవి. పెద్దయెత్తున ఈ ప్రయత్నము లింకను ఫలించినట్లు కన్పించదు.

మనదేశమున అభ్రకపరిశ్రమను ఎదుర్కొను సమస్యలు : మన దేశములో అభ్రక పరిశ్రమను ఎదుర్కొనుచున్న సమస్యలు అతిక్లిష్టమైనవి. ఈ పరిస్థితికి ముఖ్య కారణము అభ్రకమును ఉత్పత్తిచేయుటలో అగ్రస్థానము వహించిన ఈ దేశములో ఉత్పత్తిని వినియోగించు నవకాశము లేకపోవుటచే ఉత్పత్తిదారులు ఇతర దేశములందలి అవసరములనుబట్టియు, అచటి కొనుగోలుదారుల దయా ధర్మములను అనుసరించియు ఈ అమూల్య ఖనిజమును ఇతర దేశములకు ఎగుమతిచేయుట తప్పనిసరి అగుటయే అని చెప్పవచ్చును. ఉత్పత్తి అంతయు అనేకములగు చిన్న చిన్న గనులనుండి వచ్చుచుండుటచే, ఉత్పాదనవిషయమై యెట్టిప్రణాళిక తయారు చేయబడలేదు. ఇట్టి ఉత్పత్తిదారులమధ్య నేర్పడు పోటీలు ఈ పరిశ్రమ కింకను చిక్కులు కల్గించుచున్నవి. ఇతరదేశములందు అభ్రక స్థానీయములను ఉత్పత్తిచేయు పరిశోధనలుకూడ నిర్విరామముగా సాగుచున్నవి. ఇట్టి క్లిష్టపరిస్థితులను ఎదుర్కొనుటకు ఉత్పత్తిదారులు సహకారపద్ధతులలో తమ వ్యవహారములను నిర్వర్తించుకొనుటకు కాలహరణము చేయక సన్నద్ధులు కావలయును. ఉత్పత్తిని అధికముచేయుటతో పాటు ఖననరీతులు, విపణిరీతులు ప్రమాణీకరించుట అత్యావశ్యకము. దేశీయముగా అభ్రకము నుపయోగించు పరిశ్రమలను పెంపొందించుట, "మైకానైట్" పరిశ్రమను ప్రోత్సహించుటవలన ఇట్టి ముఖ్య ఖనిజమును ఉత్పత్తిచేయుటలోను, ఉపయోగించుటలోను మనదేశము ఇతరదేశములపై ఆధారపడక స్వయంసమృద్ధమగుటకు అవకాశము కలుగగలదు.

కె. జి. కె. ఎస్.

**అమరావతి :-** అమరావతి మేరుపర్వతముపై గల ఇంద్రుని రాజధాని. దీనికి స్వర్గలోకమని పేరు. ఇందు సుందరమగు నందనవనమును, అద్భుతమగు నింద్రసభయు గలవు. ఇం దప్సరసలు, దేవతలు, యజ్ఞయాగాదు లాచరించిన మానవులు నివసింతురు.

భూలోకమందు అమరావతి యను పేరుకల పురములు అనేకములుకలవు. ఒకప్పుడు నగరహారమను ఉపనామము గల అమరావతీపురము ఆఫ్‌గన్ దేశమునం దుండెను. అది ఇప్పుడు ఆఫ్‌గన్‌స్థానములోని జలాలాబాదునకు పశ్చిమమున 'నగరాక్' అనబడు చిన్న పల్లెటూరును చుట్టియున్న పాడుదిబ్బలుగ మారియున్నది. మధ్యరాష్ట్రమునందు పూర్వపు విదర్భ (వర్హాడు)కు ముఖ్యపట్టణమై వరలిన "ఉమరావతి" యను మరియొక పట్టణము నేటికిని "అమరావతి" యనియే వ్యవహరింపబడుచున్నది.

గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో కృష్ణానది యొడ్డున ఉత్తర అక్షాంశము 16° 34' 45" పైనను, తూర్పు రేఖాంశము 80° 24' 21" పైనను ఉన్న అమరావతీ పట్టణము మరియొకటి. ఇది ఇప్పు డొక చిన్న పల్లెటూరుగా మారినది. దీని కొకప్పుడు నాగరాజుదేశ మను పేరుండెను. "అస్తి శ్రీ ధాన్యకటకపురమ్ సురపురాత్పరమ్..." అను ప్రాచీనశాసనవాక్యమునుబట్టి ఈగ్రామమునకు పూర్వము ధాన్యకటకమను పేరుండినట్లు తెలియును. ఆంధ్రదేశమునందుగల పంచారామములలో నొకటి యగు అమరేశ్వరాలయము నందలి అమరేశ్వరుని బట్టియే ఈ నగరమునకు అమరావతి యను పేరు ఏర్పడినది. ఇందలి శివలింగము ఒకప్పుడు జైన బౌద్ధ విగ్రహములలో నొకటై యుండెననియు తరువాత బ్రాహ్మణులు దానిని శివలింగముగమార్చిరనియు కొందరు చరిత్రకారుల అభిప్రాయమై యున్నది. ఇక్కడ బుద్ధునిపూజయు, అమరేశ్వరుడనుపేర శివుని పూజయు, జరుగుచుండెను. క్రీ. శ. 13 వ శతాబ్ది వరకు ధాన్యకటకమను పేరే దీనికి వ్యవహారమునందుండెను. గౌతమీపుత్ర శాతకర్ణి క్రీ. శ. 78 ప్రాంతమున ధాన్యకటక సింహాసనము నధిష్ఠించెను. ఆనాటి నుండియే దీనికి ప్రసిద్ధికలిగెను. క్రీ. శ. 7 వ శతాబ్దిలో వచ్చిన చీనా యాత్రికుడు యువాన్‌చాంగ్ ధాన్యకటక వైభవమును ప్రశంసించియున్నాడు. ఈ ధాన్యకటకమను పేరు కాలక్రమమున ధరణికోటగ మారినది. ధరణికోట అను పేరు క్రీ. శ. 1409 నాటి శాసనమున కనబడుచున్నది. ఇప్పుడు వ్యవహారమునందున్న ధరణికోట,

అమరావతియను పేరులు పూర్వము ఒక్క నగరమునకే వర్తించియున్నను, నేడు ఆ నగరమున్న పశ్చిమభాగమునకు ధరణికోట యనియు, స్తూపమున్న భాగమునకు అమరావతి యనియు పేరులు స్థిరమై ఆ పూర్వపు పట్టణము ఇప్పుడు రెండు వేరువేరు గ్రామములుగా విడిపోయినది.

రెండువేల ఏండ్లకు పూర్వము నిర్మింపబడిన బౌద్ధస్తూప రాజమును బట్టి ఈ పురమునకు లోకవిఖ్యాతి కలిగినది. భారతీయ బౌద్ధకళాచరిత్రమున అమరావతి చరిత్రము ఒక గొప్ప ప్రకరణముగ నున్నది. బౌద్ధయుగమునాటి ఆంధ్ర శిల్పులు భక్తితత్పరులై బుద్ధభగవానుని దివ్యస్మృతికి కానుకపెట్టిన శిల్పనీరాజనము అమరావతీ స్తూపము. సంప్రదాయమునుబట్టి 'స్తూప' శబ్దము బౌద్ధ నిర్మాణమునకే వర్తించును. బౌద్ధ వాఙ్మయమునందును, అమరావతి శాసనములందును 'స్తూప' పదము కనిపించదు. దానికిబదులుగ 'చైత్య' మను పదమే వ్యవహారమునం దుండెను. చితాశబ్దభవమే ఈ చైత్యము. బౌద్ధకళాస్తూపముల ఉత్పత్తులను గూర్చి "మహాపరినిబ్బానీసుత్తము" నందు ప్రధానములగు రెండువిషయములుగోచరించును. బుద్ధుల యొక్కయు, ప్రత్యేక బుద్ధుల యొక్కయు, అర్హతుల యొక్కయు, చక్రవర్తుల యొక్కయు ధాతువులు చైత్యనిర్మాణమున భద్రపరచి పూజింపవలయును. బుద్ధుని నిర్వాణమునకు పిదప ఆతడు పుట్టిన స్థలమును సంబోధినొందిన స్థలమును, మొట్టమొదట ధర్మమును బోధించినస్థలమును, నిర్వాణమొందిన స్థలమును బౌద్ధులు దర్శింపవలయును అనునవి ఆ రెండువిషయములు. వీటిని బుద్ధుడే ఆనందునితో చెప్పెనట. బుద్ధుని ఆదేశానుసారముగ ఆతడు నిర్వాణమొందిన వెంటనే ఆ మహనీయుని ధాతువులను ఎనిమిదిభాగములుగ చేసి ఒక్కొక్క ధాతువుపై ఒక్కొక్కటిచొప్పున ఎనిమిది చైత్యములును శిష్యులు నిర్మించిరి. వీటికి శారీరక చైత్యములని పేరు. ధాతుగర్భపదము యొక్క భ్రష్టరూపములే దాగొబ, దగ్బ, దబ్బగ అనునవి. వీటినుండియే దిబ్బ అను పదము వచ్చియుండును. అశోకుడు తన రాజ్యమునందలి ప్రజల యొక్క బౌద్ధధర్మ తృష్ణను తీర్చుటకై 7 చైత్యములను త్రవ్వించి అందలి ధాతువులను ఎనుబదినాలుగువేల శకలములుగా చేసి తన రాజ్యమునందలి వేరువేరు భాగములందు వేర్వేరు స్తూపములను వెలయించెను. మతప్రచారమునకై, 'మహిషమండలమునకు అశోకునిచేత పంపబడిన' మహాదేవ భిక్షువను నాతడు అమరావతియందు బుద్ధుని ధాతువును, చైత్యగర్భితము కావించి చైత్యవాదమును స్థాపించినట్లు శాసనములవలన తెలియుచున్నది. సమ్యక్సం బుద్ధుని శారీరక ధాతువును ఇచ్చట స్థాపించుటచేతనే వేర్వేరు సంప్రదాయములకు చెందిన బౌద్ధులు ఇచట స్థావరము లేర్పరచుకొనుట తటస్థించినది. యూవాన్ చాంగ్ వ్రాసిన వ్రాతలనుబట్టియు, అమరావతి శిల్పమును బట్టియు, ధాన్యకటకము మహా బౌద్ధక్షేత్రమై యుండుటనుబట్టియు మహాయానపక్షావలంబకులకువలెనే "హీనయాన" పక్షమువారికి కూడ అమరావతి వాసస్థానముగ నుండినట్లు గోచరించును.

స్తూపము చితాసంబంధియైనను, ధాతుగర్భ సంబంధియైనను దాని ఆకృతినిగూర్చి భిన్నాభిప్రాయములు గలవు. కొందరు దాని యాకారము నగ ముదయించిన సూర్యబింబముయొక్క ఆకారమును పోలియున్నదనియు, మరికొందరు జీవితము బుద్బుద సదృశమను తాత్త్వికాశయమును లోకమునకు వెల్లడించుటకో యన్నట్లు స్తూపము బుద్బుదాకారముతో నిర్మింపబడియున్నదని అందురు. అనగా శరీరము బుద్బుదమువంటిది అను భావము బుద్బుదాకృతి గల స్తూప రూపమున ప్రకటితమైనది. పరమాత్మ స్తూపాంతర్గతమగు ధాతురూపమున వ్యక్తీకరింపబడెను. ఈ స్తూపముపై ఒకటి కాని, మూడుకాని, ఛత్రము లుంచుట వాడుక— (1) దేవతలకు (2) మనుష్యులకు (3) నిర్వాణము అనగా బుద్ధమోక్షమునకు. ఈ ఛత్ర త్రయమే బౌద్ధుల నిర్వాణ, పరినిర్వాణ, మహాపరి నిర్వాణములనుకూడ సూచించును. అండోపరిస్థితమైన హర్మిక (Pavalion) విభాగములు విశ్వ భాగములను సూచించును. ఈ విధముగ స్తూపమందలి వేరువేరు భాగములు వేర్వేరు విషయములకు సంకేతములైనవి. స్తూపమంతయు గలసి మేరుపర్వతమునకు చిహ్నముగా నైనది. శాస్త్రజ్ఞులు ఇతర స్థలములయందుకంటె అమరావతియందు స్తూపలక్షణము పరిపూర్ణత చెందిన దందురు. క్రీస్తు శకము మూడవ శతాబ్దికి

పూర్వమే యమరావతి గొప్ప విద్యాస్థానముగను, బౌద్ధ మత ప్రధాన పీఠముగను విఖ్యాతి చెందియుండెను.

ఈ యమరావతీ స్తూప మెప్పుడు నిర్మితమైనదో స్పష్టముగా తెలిసికొనుట కాధారములు లేవు. స్తూపపు రాలమీద మౌర్య లిపితో శాసనము లుండుటవలన మౌర్యవంశమువారి పరిపాలనలో మాత్ర మిది నిర్మింప బడియుండుననుట నిస్సంశయము. స్తూపము నందలి అపరిణతములైన ప్రాచీన రీతులను, పరిణతములుగా గానవచ్చు అర్వాచీన రీతులను వేరుపరచి చూచినయెడల ప్రాథమిక స్తూపము క్రీ.పూ. 200 సం॥ ప్రాంతమున వెలసినదిగ కనుపట్టును. మొత్తము నిర్మాణమంతయు నాలుగు దశలలో జరిగినదనియు, ప్రథమదశ క్రీ. పూ. 200 సం. నాటిదికాగా చతుర్థదశ క్రీ. శ. 3 వ శతాబ్దినాటి దనియు చెప్పవచ్చును.



బౌద్ధకళ ఆరంభదశలో శిల్పమున బుద్ధుని చిత్రింప వలసివచ్చినప్పుడు భౌతిక మానవిధేయములైన నామ రూపములను విడిచి ఆ మునిపుంగవుడు నిర్వాణము నొందెనని తెలుపుటకు గుర్తుగ నచ్చటి స్థలమును శూన్యముగ నుంచువారు. చిత్రాభావమే బుద్ధ భావమునకు చిహ్నముగ నుండెను. కాలము గడచినకొలది మొదట నీ స్థలమున శాక్యముని శ్రీపాదములును, పిదప రూపమును చిత్రితములైనవి. బౌద్ధ కళయందు బుద్ధుని మహా పరినిర్వాణమునకు స్తూపమును, జననమునకు పద్మమును, మహాబోధి, పరమ సత్య ప్రబోధనమునకు బోధి వృక్షమును మృగదావమునందలి బుద్ధుని మొదటి ధర్మబోధనమునకు ధర్మచక్రమును సంకేతములుగ చిత్రితములైనవి.

స్తూపాధిష్ఠానము రమారమి 138 అడుగుల వ్యాసము కలది. అండము (Dome) ఎత్తు 90 అడుగులకంటె ఎక్కువ. కిట్లు కిట్లుగ మట్టి పోయుచు, దిమ్మెస కొట్టుచు, తేల్చిన స్తూపాకృతిని చివరకు పాలరాతితో చిత్రశోభితము గావించినారు. అండము దిగువభాగమునకు వేదిక యని పేరు. ఈ వేదిక చుటుకొలత 521 అడుగులు. దీని లోపలివైపు భాగము నిర్మాణమునందు పడిపోవుటచేత నిది వెలుపలవైపుమాత్రమే చిత్రితమైనది. ఈ వేదిక పైభాగమును కప్పియుండు శిలాఫలకములలో పెక్కింటి పయి చైత్య చిత్రములు చెక్కబడియున్నవి. దగోబాలు, నాగములు చెక్కిన పలకకు కుడి ఎడమవైపు లందు విడిరాల మీద చెక్కిన స్తంభము లున్నవి. ఈ విడి స్తంభముల మీద బోధి వృక్షము, ధర్మచక్ర ప్రవర్తనము, మారప్రలోభనము మొదలైన చిత్రము లున్నవి. ఈ వేదిక చైత్య శిలాఫలకములకు మీద నంచు కట్టినట్లు చిత్రాలంకృతమైన యొక పట్టిక యుండును. ఇది వేరువేరు రాతిపలకలనుగూర్చి కాని, యొకే రాతిఫలకముపైగాని తీర్చుట చూడ నగును. నాలుగు దిక్కులయందును ఈ వేదిక ప్రతిద్వారమునకు నరుగు తీర్పబడినది. ఈ ప్రతి యరుగుపై వైదేసి స్తంభముల చొప్పున నాలుగు దిక్కులందును ఆయక స్తంభములు (పూజనీయ స్తంభములు) ఇరువది గలవు. ఉత్తర హిందూస్థానమునందలి ఏ స్తూపమందును లేని యీ ఆయక స్తంభ ప్రతిష్ఠాపనము ఆంధ్రదేశ స్తూప విశిష్ట లక్షణమునకు తార్కాణము.

ఈ వేదిక చుట్టును శ్రీవీథియనుపేర ప్రదక్షిణవీథి యుండెడిది. ఈ వీథి నావరించి నిలువ రాతికంబములతో నిర్మించిన కట్టువవంటి శిలాప్రాకారము కలదు. ఆచార్య







FEET 0 20 40 60 80

**A RECONSTRUCTION OF THE**

**AMARAVATI STUPA**

అమరావతీ స్తూపము - ఆకృతి చిత్రము

నాగార్జునునిచేత నిర్మితమైన దని పరికీర్తితమైన ప్రాకార రేఖ యిదియే. ఈ స్తూపప్రాకారమునకు రెండువైపుల మనోహరములగు శిల్పచిత్రములు గలవు. శాసనములందీ నిలువురాతిస్తంభములు ఊర్ధ్వపటలములనియు, అడ్డు కమ్ములు సూచులనియు, పేర్కొనబడినవి. ఈ ప్రాకార మంతయు 9 అడుగుల ఎత్తుగల నిలువరాతిస్తంభముల తోను, రెండు స్తంభములకు నడుమ కుసులుగా చొనిపిన అడ్డుకమ్ములతోను, నిర్మింపబడినది. ప్రాకారమునకు వెలుపలవైపునగల బొమ్మలు ఆచారసిద్ధమైనరీతిని చెక్కబడినవి. ప్రతిస్తంభము మధ్యభాగమునందు దారుమయ ప్రాకారమున గానవచ్చు మేకుతలలవలె వృత్తములు తీర్పబడినవి. ఈ వృత్తములందు పద్మములు చెక్కినారు. ఈ వృత్తముల నడిమిభాగములు మూడేసి నిలువు పట్టికలుగ విభాగింపబడి రకరకముల మనుష్య, జంతు, పుష్ప చిత్రములతో నొప్పుచుండును. ప్రాకారరేఖయందలి శిలాస్తంభోపరితలమున దూలములతో మదురువలె నేర్పడిన భాగమునకు ఉష్ణీషమని పేరు. సూచీస్తంభోష్ణీషములు అతి మనోహరములై దివ్యచిత్రసంపదతో నలరారినవి. వెలుపలివైపున తరంగాకృతిగల పొడుగైన పుష్పదండమును ఎడనెడ మనుష్యులు మోయుచున్నట్లు చిత్రితమైనది. లోపలివైపున జాతక కథలను, బౌద్ధ సంప్రదాయ చరితములను చెక్కినారు.

అండాగ్రభాగమున చతురముగనో, చతురస్రముగనో పేటికవలె నుండు నిర్మాణమునకు హార్మిక యని పేరు. ఈ హార్మిక పార్శ్వములు సాంచీ మొదలగు స్తూపము లందువలె దారుమయ ప్రాకారశోభితములై యున్నట్లు చిత్రితము లయినవి. కొందరీ హార్మికయందే బుద్ధ ధాతువులు నిక్షిప్తము లయి యుండెనని చెప్పుదురు. స్తూప మంతటిలో నిదియే పవిత్రమైన యుచ్చస్థానము.

ఈ విధముగ ప్రాచీన శిల్ప కళాభిజ్ఞతకు అపూర్వోదాహరణముగ పొలుపారిన అమరావతీ స్తూపరాజము కాల విపర్యయమున శతాబ్దులు గడిచిపోవ శిథిలమై భూగర్భస్థ మయినది. ఆయాకాలములందు స్థానికాధికారులగు శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రి నాయడుగారి భవనమునకు మంచిరాతి నిచ్చునదిగా నుండి క్రీ. శ. 18 వ. శతాబ్దమున సౌందర్యకళాభిజ్ఞులగు, 'మాయల్' 'బూలర్' మున్నగు పాశ్చాత్యుల మూలమున తన అస్తిత్వమును బయలుపరచుకొనినది. కొన్ని శతాబ్దులకు పూర్వము, దీపసహస్రాలంకృతమై, విహ్యాకారమై, ప్రార్థనామందిరమై లోకవిఖ్యాతిని సంతరించుకొన్న దీ యమరావతి. బౌద్ధమతావసానదశలో రానురాను తన మహోపఖ్యాతి యెల్ల అంతరించిపోగా దీపాలదిన్నెగ మారినది.

చలువరాతిమీద చిత్రితమైన యీ శిల్పసంపదను జాగరూకతతో పరిశీలించినచో బౌద్ధయుగమునాటి యాంధ్ర శిల్పకళా ప్రవీణుల చేతిలో ఈ చలువరాయి కాఠిన్యమును వీడి వారి భావనానుగుణముగ మైనపు ముద్దవలె మారినదని తోపకమానదు. బౌద్ధ ఆంధ్ర శిల్పి తాను మలచుటకు ప్రత్యేక కథావస్తు వున్నంతకాలము తన సొంతదారినే త్రొక్కెను. కాని, గ్రీకుకళా ప్రభావము నకుమాత్ర మాతడు వశ్యుడుకాలేదని విమర్శకుల యభిప్రాయము. గ్రీకుల ఉత్తమ శిల్ప రచనలను, అనేకములను ఆతడు చూచి యుండవచ్చును. కాని అతడు వాని ననుసరించి యుండలేదు. అమరావతీ శిల్ప చిత్రమునందు గానవచ్చు బుద్ధవిగ్రహ శిల్పముననేగాక మరియే యితర మానవ విగ్రహ రచనమునందుకూడ గ్రీకు విగ్రహ శిల్ప ముఖ్యలక్షణమగు "స్నాయువిస్ఫుటత్వమును" గాంచ లేము. ఇది యొక్కటియే, అమరావతీ మానవవిగ్రహ శిల్పము దేశీయమేకాని గ్రీకు కళానుసరణము కాదని చెప్పుటకు జాలును. స్త్రీ ప్రతిమారచనమునం దమరావతీ శిల్పమున త్రిభంగములను చూపుట వాడుక. గ్రీకుల కీ పద్ధతి కేవల విదేశీయము. కాని కొన్ని గిన్నెలు, దుస్తులు, జంతువులు మొదలయినవాని రచనయందు కొన్ని గ్రీకు శిల్ప సామాన్యలక్షణములు గోచరించును. ఇక స్త్రీపురుషుల జంటలలో స్త్రీపురుషులు వస్త్రములు ధరించుట గ్రీకుపద్ధతి. కాని దేశీయ కళాపద్ధతియందు స్త్రీపురుషులు కొంచె మించుమించుగ విగతవస్త్రులుగనే కనబడుదురు. కొన్నికొన్ని సందర్భమునందు శృంగార రూపమయిన ఆచ్ఛాదనముండిన నుండవచ్చును. బౌద్ధ శిల్ప పవిత్రములైన బుద్ధజీవితగాథలనుకాని, జాతకకథ లనుగాని చెక్కినప్పుడు నగ్నతచూపి యుండలేదు.

లలితకళలలో నొకటియైన సంగీతమునకు గూడ అమరావతీ శిల్పమున ప్రాధాన్యమియ్యబడినది. శిల్పికి

చిత్రరచనమున నెట్టిప్రావీణ్యముకలదో అట్లే ఆ కాలము వారికి నృత్తగాన విద్యలందును విశేషకౌశలాభిమానములు గలవని చిత్రములనుబట్టి ఊహింపవచ్చును. ఒక్క స్త్రీ పురుషులే కాక, నాట్యాభినయానర్హములైన కుబ్జయక్షగణములుకూడ నాట్యముచేయుచుండినట్లు మనము అమరావతీ శిల్పమునందు కాంచగలము. అభినయమును పురస్కరించుకొనియుండు జంత్రగాత్ర సంగీతముకూడ శిల్పమున ప్రదర్శితమైనది.

అమరావతీ శిల్పమున చూపబడిన యుద్ధ చిత్రములను బట్టి అప్పుడు సైన్యము రథ, గజ, తురగ, పదాతిసమేతమని తెలియుచున్నది. యుద్ధచిత్రములుగల అమరావతీ చిత్ర శిలాఫలకములు శిథిలమై యుండుటచే క్షేత్రజీవ్యుచితమైన వేష, భూషా, శిరస్త్రాణాదులనుగురించి విశేషముగ తెలియదు.

అమరావతీ శిల్పమునందు సామాన్యమైన పూరిగుడిసెలు మొదలు రాజహర్మ్యములవరకు చూడగలము. గ్రామప్రాకారద్వారములు, విలాసద్వారములు తోరణసంశోభితములై కానవచ్చును. రాజకుమారు లుష్ణీషమును చిత్రమయినరీతుల మిక్కిలి సొంపుగ రచించువారు. రూపసంపదయందు రాజకుమారు లెప్పుడును యౌవనవంతులే. బ్రాహ్మణులకును, యతులకును, భూషణము లుండవు. యతులు పెక్కురీతుల జటాధారణము చేయువారు. బౌద్ధభిక్షువులు ముండిత శిరస్కులుగ గానవత్తురు. యోధులు శిరస్త్రాణములను ధరించుచుండిరి. దాసజనము మోకాలు దిగని చిన్నపంచెకట్టి నడుమునకు రుమాలు చుట్టుచుండిరి. నడిమితరగతులవా రిప్పటివలెనే దుస్తులను ధరించి కొండిసిగలను, ప్రక్కసిగలను దీర్చుచుండిరి.

అమరావతీ శిల్పమున గానవచ్చు స్త్రీ ప్రతిమలను గాంచినచో ఆకాలపు స్త్రీలు సౌందర్య, శృంగారములమీద నెంతటి లక్ష్యముంచువారో విశదము కాగలదు. ఇంత యెందులకు? క్రీస్తుశక ప్రాథమిక శతాబ్దులందు ఆంధ్రుల ఆచారవ్యవహారములు, దుస్తులు, ఆభరణములు, మతము మొదలగువానిని గురించి తెలుపుటకు అమరావతి పెన్నిధివంటిది. ఈ శిల్ప మాంధ్రభూమిని కళామయము గావించి, నూతన కళావిన్యాసమును సంతరించుకొని "అమరావతీ రీతి" యనుపేర బరగు నొక విశిష్ట కళావిభూతికి సూత్రము పన్నినది. ఆధునిక సభ్యతా సంస్కృతులు, సౌందర్యాలంకార పరిణామములు ఇప్పటికి రమారమి 2000 సం. పూర్వమే మన యాంధ్రులనుభవించినారని తెలుపుటకు నిదర్శనము, శాశ్వత సౌందర్య కళాఖండము అమరావతీ శిల్పము.

పి. య. రె.

**అమృతషేర్గిల్ (Amritha Shergil) :-** అమృత షేర్గిలు బుడాపెస్టునగరము (హంగరీ) లో క్రీ. శ. 1930 సం. 30 తేది జన్మించెను. ఆమె తండ్రి పేరు ఉమ్రావ్‌సింగ్, ఆతడు సిక్కు జాతీయుడు. తల్లి హంగేరియను నారీమణి. సహోదరి ఇందిర. ఉమ్రావ్‌సింగు ప్రాక్ప్రతీచీవేదాంత విజ్ఞానఖని అగుటయేగాక, సంస్కృత భాషాపాండిత్యమును గూడ గడించెను. అతని భార్య కళాప్రవీణయై యుండెను. 1921 వ సంవత్సరము ఏప్రిల్ మాసములో భారతదేశమునకు ఈ కుటుంబము తరలి వచ్చెను.

సిమ్లాలో లేక గోరఖ్‌పూర్ జిల్లాలోని సరాయా మొదలగు గ్రామములు వీరికి వంశానుక్రమముగ సంక్రమించిన జాగీర్లు. అచ్చటనే వీరి నివాసము. "అమృత" యొక్క బాల్యమంతయు యూరపుఖండములో నధికముగా గడచెను. ఆమె భారతదేశమునుండి విద్యాభ్యాసము కొరకై మొదట తల్లిచే ఫ్లోరెన్సు నగరమునకును, పిదప ప్యారిసు (Paris) నగరమునకును తీసికొనిపోబడెను. అప్పు డామె పందొమ్మిది సంవత్సరముల ప్రాయమును మాత్రమే కలిగియుండెను. అమృతషేర్గిల్ యొక్క చిత్రకళాభ్యాసము నేషనల్ 'ఎకోల్ దిబూ' అను కళా కేంద్రములో జరిగెను. అచ్చటి ప్రొఫెసరొకడు ఆమె భవిష్యత్తు ఉజ్వలముగా నుండగలదని భావించి "నీవు నా శిష్యురాలవగుటకు నేనెంతయో గర్వించుచున్నాను" అని చెప్పెనట.

1933 సం. లో ఆమె వ్రాసినచిత్రము 'సంభాషణము' అనునది గొప్ప మన్ననల బడసి, ఆమెకు అమిత ప్రోత్సాహమును కలిగించెను. 'బూ ఆర్ట్సు' లో ఆమె ఆర్ద్రభిత్తి చిత్రములు రచించుట నేర్చుకొనెను. మాతృదేశమునకు మరలివచ్చినపిదప అట్టిపనికి ఆమెకు అవకాశము లభించలేదు. ఆమె రచించిన తైలవర్ణ చిత్రములలో భిత్తి చిత్రముల పోకడలు పొడచూపుచుండును. ప్యారిసు నగర

ములో ఆమె ఉపయోగించిన ఆలేఖ్య పుస్తకములను (Sketch Books) తిలకించినచో అచట ఆమె కావించి యున్న చిత్రాభ్యాసమునందలి విశేష పరిశ్రమ వెల్ల మగును.

ఇట్లు ప్యారిస్‌కు పిల్లగా వెళ్ళియున్న 'అమృత' చిత్ర కళయందు దారితేరిన పడుచై భారతదేశమునకు 1934 సంవత్సరములో తిరిగివచ్చెను. ఇచ్చటికి రాకపూర్వము ప్యారిసునగరమందుగల భారతదేశ విషయకమైన ప్రచార ప్రభావమునుబట్టి ఆమె తన మాతృదేశమును తిలకింప నెంచి దానినిగురించియు, దాని సౌందర్యాతిశయమును గురించియు నానావిధములగు తియ్యని కలలు గాంచెడిది. కాని ఆమె భారతదేశమునకు తిరిగి వచ్చిన తరువాత ఇక్కడ ఆమెకు కనుపించిన దృశ్యములు నెత్తురులేని దేహాలు, సత్తువలేని జీవాలు. ఈ దృశ్యములే అమృత ఇచ్చట రచించిన చిత్రములలో ప్రస్ఫుటముగా ప్రతి బింబితము లయ్యెను. ఆమె జీవించియున్న కాలమందు ఆమె కళ యెంతమాత్రము మన్ననగాంచలేదు. పైగా నది అనేక విమర్శనలకును, పరిహాసములకును గురి యయ్యెను. వంగీయ కళావిమర్శకులుగూడ ఈమె శైలిపై దుమ్మెత్తి పోసిరి. ఐన నామె తన పట్టుదలను విడువక గట్టిగా తన శైలిలోనే చిత్రాలు చిత్రింపసాగెను. ఫ్రాన్సులో నున్నపుడు 'సిజాన్' 'గాగిన్' అను నిరు వురు ఆమెకు సమకాలికులు గాకున్నను వారి ప్రభావ మామె చిత్రములయందు ముద్రిత మయ్యెను.

షేర్‌గిల్ 29 వ యేట డిసెంబరు 1941 లో మృతినొందెను.ఆమె మరణానంతరమే ఆమె చిత్రకళకు విమర్శకుల పొగడ్తలచే అధిక ప్రాశస్త్యము లభించెను. ఆమె కళ బొంబాయి మున్నగు ముఖ్యపట్టణాలలోని చిత్రకారుల ప్రశంసలకు పాత్రమయ్యెను. ఆమె భారత చిత్రకళారంగములో నొక ఉత్తమ నారీరత్నముగావెలు గొందెను.

ఎల్లోరా అజంతా గుహలయొక్కయు, కొచ్చిన్ భిత్తి చిత్రములయొక్కయు, తదితర ప్రాచీన భారత శిల్పములయొక్కయు ప్రభావము షేర్‌గిల్ చిత్రకళపై విశేషముగా ప్రసరించెనని కార్ల్ ఖండల్వాలా అను నాతడు ఆమె జీవితచరిత్రలో పేర్కొనియున్నాడు.

ఆమె దాదాపు అన్ని చిత్రములను తైలవర్ణములలోనే తప్ప, టెంపరా మీడియంలో చిత్రించినట్లు తెలియుట లేదు. ఆమెయొక్క చిత్రములు వర్ణప్రాధాన్యముకలిగి ఒకానొక విధమయిన మాధుర్యమును వ్యక్తీకరించును. ఆమె వ్రాసిన అన్ని చిత్రాలలో ప్రధానముగా నామెకు ప్రఖ్యాతితెచ్చినవి 30 చిత్రము లనవచ్చును. వాటిలో (1) విశ్రాంతి, (2) ఏనుగుల ఈత, (3) బ్రహ్మచారులు, (4) కథలు చెప్పుట, (5) పండ్ల నమ్మువారు, (6) ముగ్గు రక్క చెల్లెండ్రు. నవవధ్వలంకరణము అనునవి ముఖ్య ముగ పేర్కొనదగినవి. ఆకృతిలోని వివరములను కుంచిం చుటలో ఈమె గడించిన నేర్పు ఎన్నదగినది. అమృత షేర్‌గిలు తన ప్రత్యేకశైలినిబట్టి భారతచిత్రకారశ్రేణిలో "అమృత"త్వము నొందియున్నదని ఆమెకుగల అఖండ ప్రఖ్యాతియే సాక్ష్య మిచ్చుచున్నది.

కొం. శే.

**అమెరికను ఇండియనులు :-** కొలంబను అమరి కాను కనిపెట్టినప్పుడు, తాను ఆసియాలో నొక భాగ మునుగాని, హిందూదేశమునుగాని చేరుకొనినట్లు విశ్వ సించెను. కనుకనే 1493, ఫిబ్రవరిలో అతడు వ్రాసిన లేఖలో 'నాతోనున్న ఇండియనులు'అని వ్రాసియున్నాడు. ఈ విధముగా నూతన ప్రపంచమునందలి ఆదిమనివాసులు 'ఇండియనులు' అనియు, హిందూ దేశస్థులకంటె వీరు భిన్నులని తెలుపుటకై 'అమెరికను ఇండియనులు' అనియు పిలువబడుచుండిరి. 'అమెరికను ఇండియనులు' అను పదము పెద్దదిగా నుండుటచే ఒక ప్రసిద్ధ అమెరికా నిఘంటుకారుడు 'అమెరిండ్సు' అను పదమును సూచిం చెను. కొందరు అమెరికాదేశస్థులును, ఐరోపాలోని మానవజాతిశాస్త్రజ్ఞులును, మధ్య అమెరికా, మెక్సికో, పెరూ మొదలగు దేశముల నాగరకతను నిర్మించిన ప్రజ లను, ఇండియనులనుండి ఇప్పటికిని వేరుచేయుచున్నారు. మరికొందరు ఎస్కిమోలను భిన్నజాతివారినిగా భావించు చున్నారు. కాని, శారీరక, సాంస్కృతిక, భాషావిషయక దృష్టితో చూచినయెడల, అమెరికాదేశపు ఆదిమనివాసు లను, వారి సన్నిహిత అనాగరక జాతులవారిని కలిపి, "అమెరికాదేశపు ఇండియనులు" అను పేరుతో, పోవెలు, బ్రింటను అను వారు వ్యవహరించుట ఉచితముగానే

కనబడుచున్నది. ఈ సన్నిహితజాతులను గురించి మన కేమియు విశేషాంశములు తెలియవు. భిన్నభిన్న జాతులుగా కనబడువారుకూడ వారిలో చేరిన అవాంతర శాఖలుగానే పరిగణింపబడవలెను. ఈ ఐక్యమే అమెరికను ఆదిమ ఇండియనుల చరిత్రకు సంబంధించిన మానవజాతి శాస్త్ర ముఖ్యసంఘటనము. ఇండియను జాతుల భాషా పరిశీలనము, పురావస్తుశేషములు, కళలు, పరిశ్రమలు, ఆటలు, సాంఘిక మత సంస్థలు, పౌరాణికగాథలు, జానపద విజ్ఞానము మున్నగునవివారి మానసిక-ఐక్యతనే చాటుచున్నవి. ఈ జాతులలో శారీరకమునైన భేదములు కన్పించుచున్నను, అవి ప్రపంచమునందలి ఇతర గొప్ప జాతులలో కానిపించు భేదముల కంటె మించినవి కావు.



అమెరికన్ ఇండియన్

అమెరికను ఇండియనులు అనేకమయిన తెగలుగా విభజింపబడి యున్నారు. అలాస్కాయొక్క ఉత్తర పశ్చిమప్రాంతములను ఆక్రమించిన ఎస్కిమోలులనువారు వీరిలో ముఖ్యులు. 'ఎతిపాస్కన్సు' (Athepascans) అనువారు ఉత్తర కాలిఫోర్నియా, ఎరిజోనా, మెక్సికో ప్రాంతములను ఆక్రమించి యున్నారు. 'ఇరాక్విస్' (Iraquies) అను జాతివారితో సమ్మిశ్రితులైన 'అల్గోకియన్' జాతివారు, సెంటు లారెన్సు భూములందును అంటారియో సరస్సునకు తూర్పుననున్న భాగమందును నివసించియున్నారు. ముస్కోజియన్ తెగవారు ఎప్లాచియను పర్వత ప్రాంతమునను అట్లాంటికు, మెక్సికో సింధుశాఖ, మిసిసిపి ప్రాంతములందును నివసించుచున్నారు. కడ్డోయను తెగవారు, సియోనులు, సొషోనియనులు లేక, ఉటో-అజ్టియనులు (Vio-Agteean), మాయనులు, అరవాకనులు, టుపియనులు, చిబిహోనులు, క్వెచియనులు అను వివిధ జాతులవారు అమెరికాలోని వివిధ ప్రాంతములందు నివసించియున్నారు. వీరు మంగోలియన్ జాతీయులు. వీరు మధ్య ప్రమాణముగల పొడవును, గోదుమవన్నెగల శరీరములను, వెడల్పయిన ముక్కులను ముఖములను పటవాలు కండ్లను కలిగియుండు మంగోలియా జాతికి చెందుదురు.

అమెరికను ఇండియనుల యొక్క కళలు వారు కనిపెట్టిన విషయములు తమ పరిసరముల యొక్క పరిమితికిని వైవిధ్యమునకును అనుగుణమైనవిగా నున్నవి. ఈ ఖండమును కనుగొనునాటికి, అచ్చటనున్న జనులు రాతియుగమునకు చెందిన వేటగాండ్రుగాను, చేపలు పట్టు వారుగాను, వ్యవసాయదారులుగాను ఉండిరి. వారిలో పెక్కుమంది కుండలు చేయుట కొంతవరకు ఎరిగినవారే. 'అల్ గోకియన్ ఎట్ చెమిన్స్' అనువారు అతురాల తేలిక పడవలను నడుపు మనుష్యులు. ఈ సందర్భమున సముద్రముపై తేలిక పడవలను నడుపుచు చేపలను పట్టుకొను 'అలాస్కా' తీరవాసులును, బ్రిటిష్ కొలంబియా వాసులును పేర్కొనదగినవారు. అమెరికను ఇండియనులలో ఎస్కిమోలు కుక్కలను, అల్గోకియనులు జారుడుబండ్లను

భూమిపై బరువులను మోయుటకు ఉపయోగించెదరు. పెరూదేశస్థులు 'ఇల్మా' అను జంతువును సామానులను మోయుటకు మాత్రమే ఉపయోగించుచుదురు. సవారి చేయుటకు దానిని వారు వాడియుండలేదు. ఆనాటి ఇండియనులచే పెంచబడి మచ్చికచేయబడిన గృహజంతువులు మైదానములయందలి ఇండియనుల పరిశ్రమలలో గుఱ్ఱములును పేర్కొనదగినవి.

అమెరికను ఇండియనులయొక్క పురాణ గాథ అను మతమును గూర్చి 'ముల్లరు', 'బ్రిన్‌టన్', 'హొవెల్' అనువారు విపులముగా వ్రాసియున్నారు. వీరుడు, ప్రవక్త



అమెరికను ఇండియనుల పాటలు రికార్డుచేయుట

కుక్క-ఎల్మా అనునవే. ఆ ప్రజలయొక్క సాంఘిక మత జీవితములలో వాటితో ఎక్కువ ప్రయోజన ముండెడిది. ఎల్మా అను జంతువు "పెరూ" "బొలీవియా" అను ప్రదేశములందు మాత్రమే పెంచబడెడిది. 'నవాహో' అను వారి ప్రాథమిక పరిశ్రమలలో గొఱ్ఱెలును, కొందరు దక్షిణ అమెరికను ఇండియనుల పరిశ్రమలలో ఆవులును, జ్ఞానప్రదాతయు అయిన ఒకానొక దివ్యపురుషుడు తన ముఖ్య కర్తవ్యమును నెరవేర్చి, ఈప్రపంచమును వీడుట, తిరిగి భావికాలమున వచ్చెదనని వాగ్దానము చేయుట,. అను నంశములతో గూడిన వృత్తాంతము ఈ పురాణ గాథలలో అతి ప్రధానమైనదిగా కనబడుచున్నది. ఆజిబ్వా, చెరోకు, 'అపచే అను ప్రదేశములకు చెందిన "ఖిషక్కు"ల

(Medicinal men) యొక్క శక్తి మిక్కిలి గొప్పది. ఆ జనుల యొక్క తెగలనుబట్టి ఈ భిషక్కుల ప్రాధాన్యము అప్రాధాన్యముగ మారుచుండును. కొన్ని తెగలలో ఈ భిషక్కునకు ఏవిధమైన ప్రాధాన్యము ఉండెడిది కాదు. మరికొన్ని తెగలయొక్క లౌకిక మత విషయములందు ఈ భిషక్కులే సర్వాధికారములు గలిగియుండిరి. ఈభిషక్కులకు గోప్యకూటములు, గోష్ఠి మందిరములు ఉండెడివి. వీటిలోనికి ప్రవేశమును గోరు ఆరంభకులు యథావిధిగా ప్రవేశపెట్టబడుచుండిరి. కొన్ని తెగలయందు యౌవనదశ ప్రాప్తించినవారు చేయవలసిన కర్మ కలాపములను చేయించు నధికారము ఈ భిషక్కుల కుండెడిది. ఒకానొకప్పుడు వీరు వ్యవసాయ సందర్భమున వేగుచుక్కను (శుక్రగ్రహమును) పూజించుచు, నరబలి చేయుచుండెడివారు.

అమెరికను ఇండియనులలో ఆత్మనుగురించియు, పరలోకములో దానికిగల భవిష్యత్తును గురించియు భిన్నాభిప్రాయము లుండెడివి. ఈ అభిప్రాయములకు అనుగుణముగానే వారి శవసంస్కారవిధులుకూడ ఏర్పాటు చేయబడియుండెడివి. కొందరు శవములను పారవేసెడివారు. కొందరు మిసిసిపి లోయయందు మట్టి దిబ్బలలో పూడ్చిపెట్టెడివారు. మరికొందరు 'పెరు' దేశములోవలె రాతిసమాధులలో పూడ్చిపెట్టెడివారు. 'కొచ్' (Koch) అని పిలువబడు దక్షిణ అమెరికను జనులయొక్క ఆత్మవాదము, 'టోటెమ్' తెగవారియొక్క ధ్యానవాదము, 'జూనిన్' తెగవంటివారి ఫెటీషిజము, (Fetishism) 'కుమింగు' అను నాతనిచేత పరిశోధింపబడినవి.

అమెరికను ఇండియనుల విలక్షణమైన ఆటలలో పాచికలతో నాడబడు జూదము, హూపు, పోలు అను ఆటలును, సంయుక్తరాష్ట్రములలో నైరృతిభాగమునను, తూర్పు భాగమునను ప్రవర్తిల్లు బంతిఆటలును పేర్కొనతగియున్నవి. జంటబంతులాట, నడకలో పందెములు, మంచుపాములు మొదలయిన ఆటలు స్త్రీ లాడుదురు.

అత్యున్నతమైన స్థానములను అలంకరించిన స్త్రీలు కొందరుండిరి. పరిపాలనా విధానములోను, శాంతిస్థాపనమునకై రాయబారములను నడుపుటయందును కొంతవరకు ఇవాక్వియోస్ అను స్త్రీలు పాల్గొనిరి. సుప్రసిద్ధ లయిన నాయకురాం(డ్రు)కూడ నుండిరి. దేశమాతలుగా భూషింపబడదగిన స్త్రీలుండిరి. మాయన్సులో మతాచార్యత్వమును వహించిన స్త్రీలుకలరు. స్పానియర్డ్సుతో జరిగిన తిరుగుబాటులో కొందరు ఆ తెగలకు నాయకురాం(డ్రు)గా వ్యవహరించిరి. ఉదా:- 'అమెరికన్ జోన్ అఫ్ ఆర్క్' అని పిలువబడు 'మేరియా సిండ్రిల్లా' అట్టి స్త్రీలలో సుప్రసిద్ధురాలు. బ్రెజిలునందలి కూటేనయా (Kootenaya) జాతివారియొక్క సామాన్యమైన ప్రజా ప్రభుత్వముమొదలుకొని ప్రాచీన మెక్సికనులయొక్కయు పెరూ ఇండియనులయొక్కయు సుపరిష్కృతమయిన రాష్ట్రీయ సంస్థలవరకుగల పరిపాలనా విధానములు అమెరికను ఇండియనుల యొక్కయు, వారి జాతీయ నిర్మాతల యొక్కయు ప్రభుత్వ పద్ధతిని అనుసరించెను. నాయకులయొక్క అధికారములకుకూడ కొంత హద్దు ఉండెడిది. కొన్ని తెగలవారు శాశ్వతశాంతి నాయకుని, తాత్కాలిక యుద్ధనాయకుని ప్రత్యేకముగ ఏర్పాటు చేసికొనుచుండిరి. సాధారణముగా నాయకులు ఆ తెగ నుండిగాని, లేక కొన్ని ప్రత్యేకమైన కుటుంబములనుండి గాని ఎన్నుకొనబడుచుండిరి. పెక్కు తెగలలో బానిసత్వము అమలులో నుండెడిది.

రా. ప్ర.

**అమెరికను సాహిత్యము :-** ఆంగ్ల సాహిత్య శరీరమున కొక అంగముగ అమెరికను సాహిత్యము ఆవిర్భవించినది. ప్రప్రథమమున కొన్ని సంవత్సరముల వరకు అమెరికను విద్వాంసులు తమ జాతీయ జీవనమున సంస్కృతి యొక్కయు విద్య యొక్కయు వికాసమునకై ఆంగ్లసాహిత్య భాండారముపైననే ఆధారపడుచు వచ్చిరి. విప్లవమునకు పూర్వమే, వివిధసాహిత్య ప్రక్రియలు విజృంభించియున్నను, అమెరికనులస్వాతంత్ర్య యుద్ధకాలములో నింద్యములై ఉద్రేకమును కలుగజేయునట్టి వీరగీతములు ప్రచురింపబడినను, అమెరికనులు నాటి తమ సారస్వతసాహిత్య ఆహారముకొరకు లండను, కొలనుల దేశము (Lake Country), ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములనే ఆధారముగా గైకొనసాగిరి.

**వలసదినములు-తదనంతరకాలము :** విప్లవమునకు పూర్వమేర్పడిన సాహిత్యమునందు క్రీ. శ. 17 వ శతా

ద్దిలో వర్జీనియాదేశీయుడైన కప్తానుజాన్‌స్మిత్తు, గవర్నరు విలియం బ్రాడ్‌ఫర్డు, జాన్‌విన్‌త్రాఫ్ అనువారు వ్రాసిన చారిత్రక కథలు కలవు. ఇంతకుముందే ప్రప్రథమమున ఏనీబ్రాడ్‌స్ట్రీటు, మైకేల్‌విగిల్‌వర్తు, ఎడ్వర్డు టైలరు అనువారు కవిత్వమును వ్రాసిరి. వలసరాజ్యములపై క్రీ. శ. 1640 లో మొట్టమొదట ప్రచురింపబడినది "బేసామ్" అను గ్రంథము. ఆ దేశములోని మొదటిగొప్ప భావకవియైన ఫిల్‌ఫ్రెన్యూ నాడు ప్రఖ్యాతమైన పత్రికా రచయితలలో నొకడు. 1704 లో బోస్టన్‌లో "బోస్టన్ న్యూ లెటర్" అను మొట్టమొదటి వారపత్రిక వెలువడెను. 1788 లో మొట్ట మొదటిసారిగా "ఫిలడల్ఫియా ఈవినింగ్‌పోస్టు" అను దినపత్రిక స్థాపింపబడెను. "సాటర్ డే ఈవినింగుపోస్టు" అనుదానికి స్థాపకుడైన బెన్‌జమిన్ ఫ్రాన్‌క్లిన్, సాహిత్యమునందు, పత్రికా రచనయందు ఉన్నతస్థానమును ఆక్రమించెను. థామస్ పైనీ, థామస్ జఫర్‌సన్, అలెగ్జాండర్ హేమిల్‌టను, జార్జివాషింగ్టను అనువారు వ్రాసిన వచనరచనలు నాటి రాజకీయ రచనలను వృద్ధిచేసెను. విలియమ్‌హిల్‌బ్రౌన్ మొట్టమొదటి అమెరికను నవల వ్రాసిన గౌరవము పొందియున్నను, చార్లెస్ బ్రాక్టనుబ్రౌన్ అనునాతడు ఆ దేశపు మొదటి కవితావృత్తికి చెందిన నవలా రచయితగా పరిగణింపబడెను. కథలు, సంక్షేపచిత్రణములు అనువాటి ద్వారమున అంతర్జాతీయ ఖ్యాతిని గడించిన మొదటి అమెరికను రచయిత వాషింగ్టను ఇర్వింగు అనునాతడు. క్రీ. శ. పందొమ్మిదవ శతాబ్ద్యారంభమున విలియమ్ కల్లెన్ బ్రయాంటు కవులలో నగ్రేసరుడుగా పేరుపొందెను. ఎమర్సన్, లాంగ్‌ఫెలో, విట్టర్, పో, మొదలగు కవుల రచనలు చాలవరకు ఆనాటి సాహిత్యౌన్నత్యమునకు దోహదమొనర్చెను.

అమెరికాదేశపు మొట్టమొదటి గొప్ప చారిత్రక నవలారచయిత జేమ్స్‌ఫెనీమోర్ కూపరు. క్రీ. శ. పందొమ్మిదవ శతాబ్ది ఆదిమకాలములో విలియంగిల్‌మోరు సిమ్సు, రోబర్టుబర్డ్ అను కవులు కూడ చారిత్రకములయిన నవలలను వ్రాసియుండిరి.

అమెరికను సాహిత్యము యొక్క అభివృద్ధి విషయమున ఆనాటి ఆధ్యాత్మిక తత్త్వవాదులు చాలవరకు ప్రాముఖ్యమును వహించిరి. వారిలో రాల్ఫువాల్డో ఎమర్సను, బ్రోన్సన్‌ఆల్‌కాటు, హెన్రీడేవిడ్‌థోరూ, మార్గరెట్ ఫుల్లరు, థియోడర్‌పార్కరు అనువారు ప్రముఖులు. వారు తమవర్గపు వేదాంతమును దాని ప్రభావమును విశేషముగావ్యాప్తినొందించుటకు మిక్కిలి కృషిచేసిరి. నెథేనియల్‌హాథారన్ అరాచకమైన, తీవ్ర సమాలోచనాయుతమైన ప్రాచీన భావములను, హెర్మన్ మెల్విలి అనునాతడు కల్పనాపరములైన భావములను, తమ వివిధ విషయకమైన నవలాపరంపరలో ప్రతిపాదించిరి. నవలలు, పద్యములు, వ్యాసములు అను సారస్వత ప్రక్రియలందు ఆలివర్ వెండెల్ హోమ్సు అను కవి ఆంగ్లేయుల యొక్క మతజీవిత విధానమును చాలప్రస్ఫుటముగ చిత్రించెను. సంపాదకుడుగా, ఉపాధ్యాయుడుగా, కవిగా పేరుగన్న జేమ్సురస్సెలులోవెలు తన "బిగ్లో-పేపర్సు" అను రచనలలో దేశీయభాష నుపయోగించెను.

ఆ కాలమున అద్భుత కల్పనాశక్తికల ప్రముఖకవి హెన్రీవేడ్స్‌వర్తులాంగ్‌ఫెలో. అతడు వ్రాసిన హైయవథా, ఎవాంజెలైన్ అను రచనలు సర్వులకు ప్రీతిపాత్రములై వెలసెను.

జాన్‌గ్రీన్‌లీఫ్ విట్టియరు యొక్క కవిత్వము వలనను, హారియట్ బీచర్ స్టోవె యొక్క రచనల మూలముననను బానిసతనపునిర్మూలనోద్యమమునకు ఎక్కువ ప్రోద్బలము చేకూరెను. హారియట్ వ్రాసిన "అంకుల్‌టామ్స్‌కేబిన్" అను నవల బహుళవ్యాప్తినొందెను.

ఆధునిక కథానికా రచనకు సృష్టికర్తగా ప్రశంసింపబడిన ఎడ్గార్ ఎల్లెన్‌పో అను కవి ఈ కాలములోనే న్యూయార్కు, రిచ్మండులలో నివసించుచు రచనలు సాగించుచుండెను.

పందొమ్మిదవ శతాబ్దియొక్క పరార్ధమునకు పిదప అమెరికను కవులలో అగ్రగణ్యుడయిన వాల్ట్‌విట్మను ఆనాటి అంతర్యుద్ధములను అత్యుత్తమమైన కవితా రూపమున వర్ణించెను. 1886 సంవత్సరములో చనిపోయిన ఎమిలీడికెన్సను అను నామె గణనీయములయిన గేయకావ్యములు ఆ దినములలో వ్రాయుచుండెను. కాని క్రీ. శ. 1915 సంవత్సరమువరకు ఆమె రచనలు పాఠకలోకమునకు లభింపలేదు. అంతర్యుద్ధానంతరము ఆమె

రికా రాజ్యములలో నాటి ప్రముఖములయిన చారిత్రక రచన లన్నింటియందును, యూరోపియన్ విద్యా సంప్రదాయము యొక్క ప్రభావము కనిపించును. కారణము అమెరికా యందలి నాటి రచయితలలోను, యువకులయిన పండితులలోను పెక్కురు, యూరపునందు విద్యోపార్జనము చేసియున్న వారయి యుండుటయే. విలియం హిక్లింగు ప్రెస్‌కాటు, జాన్ లాద్రోప్ మాట్లే, ఫ్రాన్సిస్ పార్కుమెను, జార్జి బాన్‌క్రాఫ్టు మొదలైన వారి అనంతరీయములైన చారిత్రక రచనలలోను యూరపియన్ విద్యాప్రభావము గోచరించును.

అంతర్యుద్ధము లయిన పిదప స్థానిక వాతావరణమును వర్ణించునట్టి లేక ప్రాంతీయ సాహిత్యము వ్రాయునట్టి రచయితలు వెలువడిరి. వారి రచనలు ప్రజలలో కొందరికి గాఢమైన అభిరుచిని పుట్టించెను. దేశములోని క్రొత్త ప్రాంతములను గురించి వ్రాయబడిన కథానికలు, కావ్యములు, నవలలు ముఖ్యముగా పశ్చిమమునుండి శీఘ్రముగా వెలువడినవి. పశ్చిమమునందలి ఎడ్వర్డు ఎగిల్‌స్టన్, జాక్విన్ మిల్లరు, బ్రెట్ హార్టే దక్షిణమునందలి జార్జి డబ్ల్యు కేబులు, థామస్ నెల్సన్, పేజి, జోయెల్‌చాండ్లెర్, హారిస్సు, జేమ్సు లేన్ ఎల్లెన్ ; న్యూ ఇంగ్లండునందలి సారా ఆర్నె జ్యూయెటు, ల్యూసాయమ్ ఆల్‌కాటు మేరీ, యి. ఫ్రీమను ; మధ్య పశ్చిమ దేశము నందలి జేమ్సువిట్, కూంబ్ రిలే మున్నగు రచయిత లీ వర్గమునకు చెందిన వారై యున్నారు.

ఆ శతాబ్ది అంతిమ కాలములో అమెరికను సాహిత్యమునకు ఔన్నత్యము చేకూర్ప సమర్థులయి రాజకీయ ఆర్థిక దృక్పథములు కలిగిన నవలా రచయితలు కొందరు ఉద్భవించిరి. ఎడ్వర్డు బెల్లమీ, రెబెక్కా హార్డింగు, డేవిసు హెలెన్, హంటి జాక్సను, హెరాల్డు ఫ్రెడరికు, డేవిడ్ రాస్‌లాకె మున్నగువారు ఈ కవిబృందమునకు చెందిన వారు. ఈ కవిబృందపు రచనల బలవత్తరమైన ప్రభావము అప్టన్‌సింక్లేరు, ఫ్రాంక్ నారిసు, థియోడార్ డ్రీజరు వ్రాసిన నవలలపై ప్రసరించెను. హెన్రీజేమ్సు, ఎడిత్ వార్టను అనువారు వ్రాసిన నవల లోకజాతికి చెందినవి. వాటియందు నిశితమైన పాత్ర పరిశీలనము కానవగును. అందుచే నవి పాఠకముగ జనులచే పఠింపబడెను.

అంతర్యుద్ధానంతరము వ్యాప్తిచెందిన పత్రికా రంగమున కథానికా రచనకు గిరాకి ఏర్పడెను. ఇట్టి అవసరమును గురించి కథానికలు రచించినవారు ఓహెన్రీ, రిఛర్డ్‌హార్డింగ్, డేవిసు, ఏంబ్రోసు, బియర్సు, బ్రెట్ హార్టే అను కవులై యున్నారు.

పందొమ్మిదవ శతాబ్ది అంత్యకాలమునందును, ఇరువదవ శతాబ్ది ప్రథమ దినములలోను, ప్రముఖ సాహిత్య సంపాదకుడుగాను, నవలారచయితగాను, విలియమ్ డేన్‌హోవెల్సు సుప్రసిద్ధి నొందెను.

క్రీ. శ. 1890 సంవత్సర ప్రాంతమున వాస్తవిక వాదులును, ప్రకృతి (తత్త్వ) వాదులునయిన కవులు రచించిన నవలా వాఙ్మయము 20 వ శతాబ్ది ఆరంభమునుండి రచింపబడిన నీరసమును, వాస్తవికతాయుతమును ఐన నవలా రచనకు పూర్వరంగముగ నుపకరించెను. అందు పాత్రల మానసిక వృత్తి పరిశోధనము ఉపలక్షితమగుచుండును. ఇట్టి సాహిత్యపు తెన్నులు జాన్‌డాస్‌పాసను, ఎర్స్కిన్ కాల్డ్వెల్లు, విలియమ్ ఫాక్‌నరు, జేమ్సు టి ఫారెలు, ఎఫ్‌స్కాట్ ఫిడ్జిగెరాల్డ్, ఎర్నెస్టు హెమింగ్‌వే, థామస్‌వుల్ఫు మున్నగువారి రచనలలో గోచరించును. ఆ కవుల రచనలయందలి పాత్రల మానసిక వృత్తి చిత్రణములు, పాత్రల సంభాషణములు అత్యుత్తమములు. అమెరికను విప్లవమునకు పూర్వమునందే ఆరంభమయిన అమెరికను సాహిత్యమునందలి వ్యాసరచన పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరభాగమునందు జాన్‌బర్రోసు, జాన్ మ్యూరు అను కవుల రచనలద్వారమున అభివృద్ధిచెంది ఉన్నతస్థాయిని బొందెను. ఇరువదవ శతాబ్దియందు డొనాల్డుకల్రాసు పీట్టి అను నాతడు వ్యాసరచనమున ఈ రంగములో విశిష్టమైన రచనలు కొనసాగించెను.

జార్జిసంతాయనా, విలియంజేమ్సు, జోసియారోయిస్, జాన్‌డ్యూయీ మున్నగువారి రచనలు వేదాంతశాఖయందు అమెరికను సాహిత్యమునకు ఔన్నత్యమును చేకూర్చెను. క్రీ. శ. 1880, 1890 ప్రాంతమున కొన్ని అమెరికను నగరములలో నేర్పడిన దుష్ట రాజకీయ పరిస్థితులపై విప్లవరూపముగా వ్యాపించిన ఒక మూఢమైన వాస్తవికతయే, హేమ్లిన్‌గార్లెండు, స్టెఫీన్‌క్రేన్ రచనలలోని అల్పవాస్తవికతకును, తరువాత థియోడార్ డ్రీజరు,

షెర్వుడ్ యాన్‌డర్‌సను వ్రాసిన నవలలలో ప్రతిబింబించిన సహజత్వ సిద్ధాంతమునకు కారణభూతమయినది.

జాక్‌లండను, ఛార్లెస్ మేజరు, మేరీజాన్‌స్టను, యస్. వీర్ మైకేల్, పాల్‌లీసస్టర్ ఫోర్డు, ఎఫ్. మేరియన్ క్రాఫర్డు విన్స్టన్ చర్చిలు, ఓవెన్‌విస్టరు మున్నగువారు ఊలోపల కాల్పనికతాయుతమైన నవలారచనను పెంపొందించిరి.

పందొమ్మిదవ శతాబ్ది చరమకాలమున అమెరికను సాహిత్యమునందు హాస్యయుత కావ్యరచయితలకు ఒక ప్రముఖస్థానము చేకూరెను. వారిలో మార్క్‌ట్వెన్ అగ్రగణ్యుడు. హాస్యరచనారంగమున ఆర్టిమస్‌వార్డు, పెట్రోలియమ్ వి. నస్బీ, ఫిన్లేపీటర్‌డన్నీ, జాన్‌బిల్లింగ్సు, సీబాస్మిత్తు మున్నగువారును; జార్జి అడె, డాన్‌మార్క్విసు, యూనేఫీల్డు, ఆగ్డన్‌నాష్, జేమ్సు థూర్బరు మున్నగువారు వార్తాపత్రికా— వ్యాసరచనా— పత్రికారచనా రంగములందును క్రీ. శ. 1940, 1950 సం. ప్రాంతమున కృషి యొనర్చిరి.

ఇరువదవ శతాబ్దిలో, నవలా రచయితలకు ప్రాంతీయత్వమునందు అభిరుచి హెచ్చయ్యెను. మేరీఎల్లెన్‌ఛేజు, విల్లాకేథరు, బూత్ టార్కింగుటను, సింక్లేర్ లెవిను, జె. పి. మార్కక్వర్డు, ఎడ్నాఫెర్బరు, జాన్‌స్టీన్‌బెక్ అను కవులు యీ జాతి రచనకు ఉత్తమ ప్రతినిధులు.

పందొమ్మిదవ శతాబ్ది ప్రప్రథమ దశయందు జేమ్సు ఫెన్నీ మోర్ కూపరు అను నాతడు చారిత్రక నవలలను రచించెను. అంతకుపూర్వముననే ఇట్టి రచనలయందు అమెరికాలో పాఠకలోకమునకు విశేషప్రీతి ఉదయించి ఉండెను. ఆ దేశమున ఇట్టి అత్యుత్తమమైన నవలలను, హెర్వే ఎల్లెన్, మార్గరెట్ మిఛెలు, స్టైఫెన్ విన్సెంటు బినెటు, ఈస్టర్ ఫోర్బ్సు, జేమ్సుబోయిడు, కెన్నెత్ రోబర్ట్సు, మాక్‌కిన్లే కాన్‌టరు, స్టార్క్‌యంగు అను కవులు రచియించిరి.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో కథానికా రచనయందు అగ్రగణ్యులుగా పెన్నబడినవారు డొరొతీ పార్కరు, విలియండేనియలు స్టీలు, కేథరైన్ ఆనీ పోర్టరు, విలియం సారోయన్ అను కవులైయున్నారు.

నేడు అమెరికన్ సాహిత్య జీవితములో కవిత్వమునకు గొప్ప గౌరవమేర్పడియున్నది. క్రీ.శ. 1912 వ సం. లో హారియట్‌మన్రో అనునామె "పొయిట్రె" అను పద్యమయమైన పత్రికను స్థాపించెను. అందు ఆనాటి కవితయందలి క్రొత్తపెన్నులు మూర్తీభవించెను.

ఈ పత్రికా ప్రచురణము కవిత్వమునందు గాఢమయిన ఆసక్తిని కల్పించెను. ఆ పత్రిక యందు పెక్కుమంది రచయితలకు తమ రచనలను ప్రచురించుటకు అవకాశములభించెను. స్వల్పపరిమాణము అల్పజీవితము గల పత్రిక లనేకములు వెలువడెను. అంతకుమున్ను తమ కవితను ప్రచురించు భాగ్యమెరుగని రచయితలకు కూడ తమ రచనలను వాటియందు ప్రచురించుట కవకాశము కలిగెను. ఆ యుద్యమము సృజనాత్మకములయిన అశేష కవితా ప్రక్రియల ఉత్పత్తికి గొప్ప దోహదమొసగెను. ఎమీలోవెలు, వాచెల్‌లిండ్సే, కార్ల్‌సాండ్‌బర్గు, ఎజ్రాపౌండు, టి. యస్. ఇలియట్, జాన్‌గోల్డుఫ్లెచరు, కాన్రాడ్ ఎయికెను, కార్ల్ షపీరో, వాలెస్‌స్టీవెన్సు, ఇ. ఇ. కమ్మింగ్సు— వీరందరు ఆ శతాబ్ది యందలి అమెరికను కవిత్వమునందు గణనీయమైన వివిధ సారస్వత ప్రక్రియలకు ప్రతినిధులుగా నున్నారు.

ఎడ్గార్ లీమాస్టర్సు, రోబర్టుఫ్రాస్టు, రోబిన్సన్ జెఫర్సు, ల్యూసారెటు అను రచయితల కవిత్వములలో ప్రాంతీయత్వము ముఖ్యమైన విషయమయ్యెను.

ఈ శతాబ్దియందు అమెరికనుకవిత్వమునందు ప్రముఖ సంప్రదాయవాది యయినవాడు ఇ. ఎ. రోబిన్సను. ఈ సంప్రదాయమునకు చెందిన ఇతరులు విలియమ్ ఎల్లెరీ లీనార్డు, ఎలినోర్ వైలీ, సారాటీస్‌డేలు, హార్టుక్రేను, ఎడ్నా సెంటు, విన్సెంట్‌మిల్లే, ఆర్చిబాల్డు మేక్లీషు అను వారైయున్నారు.

నీగ్రో కవులు కూడ అమెరికను కవిత్వమును తమ విశిష్టమైన రచనలచే పెంపొందించిరి. పాల్‌లారెన్సుడన్‌బారు అను రచయిత యీ వర్గమునకు చెందిన కవులలో విశిష్టతను గన్నవాడు. కౌంటీకల్లెను, జేమ్సువెల్డెన్ జాన్సను, లాంగ్‌స్టన్ హ్యూసు అను వారి ప్రాముఖ్యము గణనీయమైనది.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరభాగమున అనామకముగా పడియున్న అమెరికను నాటకరంగము క్రొత్తయుగమున ప్రబలమైన పాత్రను వహించెను. ఇరువదవ

శతాబ్దినుండి ఈ సారస్వత కళారూపము అత్యున్నత స్థానము నాక్రమించుకొనెను. యూజీన్ ఓనీలు అనునతడు నాటక రచయితలలో నగ్రగణ్యుడు. మాక్స్ వెల్ యాండర్ సను, ఫిలిప్ బారీ, మార్క్ కోనల్లీ, బెన్ హెక్టు, రాచెల్ క్రాథర్సు, సిడ్నే హోవర్డు, జార్జియస్, కాఫ్‌మను, క్లిఫర్డ్ ఆడెట్సు, ఎల్మర్ రైను, టెన్నెసీ విలియమ్సు, థారన్‌టన్‌వైల్డరు అను వారుకూడ ఉత్తమమైన నాటకములను వ్రాసిరి.

ఇరువదియవ శతాబ్ది మొదటి దశకములో, ఇర్వింగ్ బాబిటు, పాల్ ఎల్మర్ మోరు, డబ్ల్యు. సి. బ్రౌంవెలు అనువారి నాయకత్వమున హ్యూమనిస్టు సంప్రదాయము పెంపొందెను. అధికారణముగా సాహిత్యవిమర్శనము విశేషముగా పాఠకులదృష్టి నాకర్షించెను. వాన్‌విక్ బ్రూక్సు, హెచ్. ఎల్. మెంకెను, రాండాల్ఫుబోర్న్, హెన్రీ సీడెల్ కాన్‌బీ మొదలగువారితో కూడిన ప్రతిపక్షవర్గము, పైవారి హక్కులతో పోటీయొనర్చిరి. లూయీమమ్‌ఫర్డు, మాల్కోమ్ కౌలే, ఎడ్మండ్ విల్సను నూతన వాస్తవికతోద్యమమునకు సుముఖులుగానుండి, (అమెరికా) జాతీయ సాహిత్యమునందలి సాంఘిక భావముల విషయమున మార్క్సిస్టు దృక్పథమును అవలంబించిరి. క్రీ. శ. 1930 సం. ర ప్రాంతమున ఈ దృక్పథమును, మాక్స్ఈస్ట్ మను, వాల్డో ఫ్రాంకు, గ్రాన్‌విల్లీహిక్సు అనువారు బలపరచిరి. తరువాతి దశాబ్దిలో వెలువడిన రచనలందు విమర్శనకళయే ప్రధానవిషయమయ్యెను. ఈ కాలములో ఎజ్రాపౌండు, టి. యస్. ఇలియటు, ఆర్. పి. బ్లాక్ మూరు, ఐ. ఎ. రిచర్డ్సు అనువారు ప్రధానముగా విమర్శనాత్మక రచనలు కావించిరి. ఇరువదవ శతాబ్దిలో జాన్ ఫిస్కీ, హెన్రీ ఆడమ్సు, థియొడార్ రూజ్వెల్టు, వుడ్రో విల్సను అను వారు వ్రాసిన రచనల ద్వారమున (అమెరికను) చారిత్రక వాఙ్మయము మిక్కిలి అభివృద్ధి చెందెను. కాలక్రమమున చారిత్రక సంఘటనలను, సాంఘిక–మానసిక–తత్త్వరూపముల వ్యాఖ్యానించుటకు చరిత్రకారులు ఎక్కుడు ప్రాముఖ్యము నొసగిరి.

ఈ కాలమునందు ఛార్లెస్ బీర్డు, ఫ్రెడరిక్ జాక్సన్ టర్నరు, జేమ్సు హార్వే రోబిన్సను అను కవులు విస్తారముగా చారిత్రకరచన లొనర్చిరి. క్రీ. శ. 1920 వ సం. మొదలుకొని చరిత్ర రచనయందు అగ్రగణ్యులుగా వెలువడినవారు, కారల్ టన్ జే. హెచ్. హేసు, అల్లన్ నేవిన్సు, ఆర్థర్ ష్లేసింగరు, ఆర్థర్ ష్లేసింగరు జూనియరు, హెచ్. యస్. కామ్మాగరు, యస్. ఇ. మారిసను మున్నగువారై యున్నారు.

డా. ఓడెల్

## అమెరికాఖండము - ఉత్తరము(భూగోళము):

క్రీ. శ. 1492 లో అమెరికా కనుగొనబడుట కొలంబసు యొక్క పశ్చిమనౌకాయాత్రలకు ఫలితము. కాని, అమెరిగో వెస్పూసి, మధ్య బ్రెజిలుకు వచ్చినప్పు డాఖండమును మొదట కనిపెట్టినట్లు తలంపబడుటచే, క్రీ.శ. 1541 లో మెర్కేటరు ఆ భూభాగమునకు అతని నామమును అనుసరించి అమెరికా అను పేరుపెట్టెను. ఖండముయొక్క ఆక్రమణమును, అంతరప్రవేశమును, అట్లాంటిక్ సముద్ర తీరదేశస్థుల ప్రయత్నములచే అభివృద్ధి చెందెను.

ఉత్తరఅమెరికా, ఆసియా ఖండమునుండి సన్నని బేరింగు జలసంధిచే వేరు చేయబడియున్నది. ఇందలి చాలభాగము మకరరేఖకును, ధ్రువరేఖకును నడుమ 100° పశ్చిమ రేఖాంశమున కిరుప్రక్కల సమానముగా వ్యాపించియున్నది. ఇది పెద్దఖండములలో మూడవది. దీనివైశాల్యము 80 లక్షల చ. మైళ్ళు. దీనికొలత ఉత్తరమునుండి దక్షిణమునకు 6,000 మైళ్లు. సంయుక్తరాష్ట్రములు ఉత్తరమున మధ్యధరా సముద్రమువరకును వ్యాపించిఉన్నను, పెక్కు విషయములలో మధ్యధరా సముద్ర ప్రాంత దేశములకన్న భిన్నములుగా నున్నవి. సంయుక్తరాష్ట్రములకు ఉత్తరమున ఉన్న కెనడా సుమారు అంతే విస్తృతమైనది. సంయుక్తరాష్ట్రములకు దక్షిణమున మెక్సికోయును, ఇతర ప్రజాస్వామ్యములును ఉన్నవి.

గ్రీనులాండు ప్రధాన ఖండమునుండి బాఫిన్ అఖాతము చేతను, డేవిసు జలసంధిచేతను, వేరుచేయబడి యున్నది. బాఫిన్‌ద్వీపము గ్రీనులాండుకును ప్రధాన ఖండమునకును మధ్య ఉన్న ధ్రువమండల ద్వీప సమూహమునందెల్ల పెద్దది. ఇది ప్రధానఖండమునుండి బూతియాహడ్సను సింధుశాఖల చేతను, హడ్సను జలసంధిచేతను విభజింపబడియున్నది. బాంక్సు, గ్రాంటు, విక్టోరియా, బూతియా

అనునవి ఈ ద్వీప సమూహామునందలి ఇతరద్వీపములు. ప్రసిద్ధములైన పడమటి ఇండియాదీవులు, కరిబియన్ సముద్రమునందలి ద్వీపసమూహములు, క్వీను ఛార్లొటీ, వాంకూవరు ద్వీపములు పసిఫిక్ తీరమునకు ఎదురుగా ఉన్నవి. అలాస్కా, కాలిఫోర్నియా, మెక్సికో, లారెన్సు, సింధుశాఖలును, హడ్సను అఖాతమును ఖండముతీరము లోనికి చొచ్చుకొనిపోయిన ప్రధాన జలభాగములు.

భౌతిక స్వరూపము : ఉత్తర అమెరికా ఖండమును (1) పసిఫిక్ పర్వతపంక్తి (2) తూర్పు ఉన్నతభూములు (3) మధ్య మైదానములు అని మూడుభాగములుగా



విభజించుట మేలు. ఇట్టి విభాగమువలన అచ్చటి శీతోష్ణ స్థితిని, వృక్షసంపదను, ఇతర పరిస్థితులను సులభముగా అర్థము చేసికొనుటకు వీలగును. ఇతర వివరములును, స్థానిక భేదములును, ప్రధానములైన ఈ అంశముల నుండి, సహజముగా ఏర్పడినట్టివే.

**1. పసిఫిక్ పర్వతపంక్తి :** ఈ పర్వతపంక్తి పసిఫిక్ తీరమునంటి ఉత్తరమునుండి దక్షిణమువరకు వ్యాపించుటయే కాక ఇంకను దక్షిణముగా దక్షిణ అమెరికాలోనికి కూడ కొనసాగుచున్నది. ఇది పసిఫిక్ సముద్రతీరము నంటియున్న పసిఫిక్ పర్వతమేఖలలోని ఒక భాగము. ఈ పర్వతపంక్తి హిమాలయము లేర్పడిన కాలముననే ఏర్పడినది. ఈ మడత పర్వతములలో పలువిధములైన గుట్టలు కనబడుచున్నవి. వీటి ఇరుపార్శ్వములందును బంగారము, వెండి, రాగి సీసము, నూనె కలవు.

పర్వతపంక్తిలో పెక్కు పర్వతములు సమానాంతరముగా వ్యాపించి, దక్షిణమున విస్తృతములై, తిరిగి మధ్యఅమెరికాలో కలియుచున్నవి. ఉత్తరమున కెనడాలో ఈ పర్వములు తీరభూమినుండియు కలవు. వీటికి తీర పర్వతములు, సెల్‌కర్కు పర్వతములు, రాకీపర్వతములు అని పేర్లు. దక్షిణమున వాని పరిశిష్టములు తీరపర్వతములు, కాస్కేడు, సిరానివాడా, రాకీపర్వతములు అని పిలువబడును. వీటిలో రాకీపర్వతములు ప్రధానములైనవి. ఈ పర్వతపంక్తుల నడుమ కొలరేడో, పెద్ద అమెరికా ఎడారి, (గ్రేటుబేసిన్)మున్నగు మైదానములు, ఎడారులు, కాలిఫోర్నియాలోయ మొదలగు సుందరములైన లోయలు కనబడుచున్నవి.

**2. తూర్పు ఉన్నతభూములు :** తూర్పు తీరమున ఉత్తరమునుండి దక్షిణమువరకును గ్రీనులాండు పీఠభూమియు కెనేడియనుషీల్డును, అప్లాషియను పర్వతములును, వ్యాపించియున్నవి.

కెనేడియను షీల్డనునది కఠినస్ఫాటిక శిలామయ ప్రదేశము. ఇది పసిఫిక్ పర్వతపంక్తికంటెను ముందేర్పడినది. ఇందు ఇనుము, రాగి, వెండి, బంగారము, కోబాల్టు, నికెలు కలవు. అప్లాషియను పర్వతముల పడమటి పార్శ్వమున ఖండమునకు సంబంధించిన ముఖ్యమైన బొగ్గు గనులును, నూనెగనులును గలవు. షీల్డుపై ఇప్పు డేర్పడిన పెక్కు సరస్సులు గొప్ప హిమయుగములలో హిమ ఫలకములచే చేయబడిన వివరములు. మధ్య మైదానములకు ఉత్తరముగా పారు మంచుప్రవాహములు, కరగిన హిమఫలకములవలన ఏర్పడినవి. ఉత్తరాన హడ్సన్‌లోయ నుండినైరృతిదిక్కుగా టెన్నీసులోయవరకును వ్యాపించు అప్లాషియనులలో కొండలును, పీఠభూములును కలవు. ఈ కొండలు పీడ్మంటు అనబడు వెడల్పయిన పీఠభూమి రూపమున అట్లాంటిక్ తీరమువరకును వ్యాపించుచున్నవి. అట్లాంటిక్ సముద్రములో పడు వేగవంతములైన నదులచే ఈ పీఠభూమి విభక్తము చేయబడుచున్నది. వేగవంతములైన నదులును, జలపాతములును విస్తారముగా గల ఈ పంక్తికి జలపాతపంక్తి (Fall Line) అని పేరు. నీలపర్వతపంక్తి (Blue Mountain ridge) పీడ్మంటుకు పడమటి సరిహద్దు. దానికి పడమట విశాలములయిన బొగ్గుగనులకు ప్రసిద్ధివడసిన ఆలిఘనీ పీఠభూమి కలదు.

**మధ్య మైదానములు :** పడమటి పర్వతపంక్తికిని తూర్పు ఉన్నతభూములకును నడుమ ఉన్న ప్రదేశమంతయు చదునయిన భూములతో కూడియున్నది. హడ్సను అఖాతమునకును, పెద్ద సరస్సులకును, మిసిసిపీ సెంటులారెన్సు నదులకును, అట్లాంటిక్ తీరమునకును చుట్టును పల్లపు భూములు గలవు. మధ్యనున్న పల్లపుభూములనుండిఅచ్చటి నేల పడమటగా ఎత్తుగా పెరిగి రాకీపర్వతములతో కలియుచున్నది. ఈ ప్రదేశమునకు పెద్ద మైదానము అని పేరు. కెనడా షీల్డుప్రాంతమునందుతప్ప మిగిలిన మధ్య మైదానముక్రింద భూగర్భములో ఇటీవలి కాలమున ఏర్పడిన మెత్తని పిండిరాళ్ళ కొండలు కనుపట్టును.

ఈ ఖండమునందలి నదులను రెండు గొప్పశాఖలుగా విభజింపవచ్చును. (1) పడమటి పర్వతపంక్తులనుండి పసిఫిక్ సముద్రములో పడు నదులు (2) మధ్యమైదానముల నుండి ఆర్కిటికు సముద్రములో కాని అట్లాంటికు సముద్రములో కాని పడు నదులు.

అలాస్కాలోని యూకను, కెనడాలోని ఫ్రేజరు, కొలంబియా నదులు, సంయుక్తరాష్ట్రము లందలి స్నేకు, కోలరేడో నదులు మొదటిశాఖకు చెందును. మెకంజీనది ఆర్కిటిక్ సముద్రములోనికి ప్రవహించును. సాస్కెచ్చివాన్ యు ఎఱ్ఱనదియును విన్నిపెగ్ సరస్సు

ద్వారా హడ్సను అఖాతములోనికి ప్రవహించును. పెద్ద సరస్సులనుండి ప్రవహించు సెంటులారెన్సునది అట్లాంటిక్ సముద్రములో పడుచున్నది. ఈ రెండవశాఖకు చెందిన ప్రధానమయిన ఈ నదులన్నియు కెనడాలోనే ఉన్నవి. మిస్సిసిపీ మహానదియు దాని ఉపనదులును మధ్య మైదానముల దక్షిణమునుండి ప్రవహించుచున్నవి. ఆ ఉపనదులలో ఆర్కన్‌సస్, మిస్సోరీ పశ్చిమ పర్వతముల నుండియు, ఓహియో పెన్నెసీనదులు తూర్పు ఉన్నత భూములనుండియు ప్రవహించుచున్నవి. అప్లాషియనుల యందు పుట్టి అట్లాంటిక్ సముద్రములోనికి ప్రవహించు చిన్న నదులు అనేకము లున్నవి. వానిలో హడ్సను, డెలావేరు, పోటోమాక్ అనునవి ముఖ్యములైనవి. రియోగ్రాం డి డీనార్టియు దాని ఉపనదులును మెక్సికో సింధుశాఖలో కలియుచున్నవి.

రాకీ పర్వతములందును అచ్చటి పీఠభూములందును పెక్కు సరస్సు లున్నవి. వానిలో పెద్ద ఉప్పు సరస్సు మిక్కిలి ప్రసిద్ధమైనది. గ్రేటుబేరు, గ్రేటుస్లేవు, అతబాస్కా, విన్నిపెగ్ సరస్సులును సుపీరియరు, మిచిగాన్, హ్యూరన్, ఈరీ, అంటారియో మొదలగు మహాసరస్సులును ఒక పెద్ద సరఃపంక్తిగా ఏర్పడి యున్నవి. ఇవి వాయవ్యమునుండి ఆగ్నేయము వరకును వ్యాపించి యున్నవి. ఇవన్నియు కెనడాలోనే ఉన్నవని చెప్ప వచ్చును. కాని పై మహాసరస్సులు కెనడా సంయుక్త రాష్ట్రముల సరిహద్దునందున్నవి. ఈశాన్య భాగమున పెద్దవియు, చిన్నవియు అగు అనేక సరస్సు లున్నవి.

**శీతోష్ణస్థితి :** శీతకాలములో క్వీనుచార్లటీ ద్వీపమునకు దక్షిణమునమన్న పడమటి తీరము, మధ్య అమెరికా, మిసిసిపీ తీరమునందలి సెంట్‌లూయీకి దక్షిణము నందలి పల్లపు భూములు, న్యూయార్కువరకును గల తూర్పుతీర ప్రదేశములు తప్ప మిగిలిన ఉత్తర అమెరికా అంతయు నీరు ఘనీభవించు ఉష్ణోగ్రతకు (Freezing Point) క్రిందుగా ఉండును. పడమటి తీరము, బ్రిటిషు కొలంబియా తీరము చేరుచున్న ఉత్తర పసిఫిక్ ఉష్ణజల ప్రవాహముచే ఆవరింపబడి యుండును. అచ్చట అది చీలి దక్షిణమున శీతజల ప్రవాహముగను, ఉత్తరమున ఉష్ణజల ప్రవాహముగను మారుచున్నది.

ఈ ఉష్ణ ప్రవాహముయొక్క ప్రభావము పడమటి తీరమున అట్లాంటిక్ తీరమునకంటె మిక్కిలి ఉత్తరము వరకును కానబడుచున్నది. ఈశాన్య తీరమునకు దూరముగా ప్రవహించు శీతల లాబ్రడారు ప్రవాహము అచ్చటి భూములను చల్లగా ఉంచును. ఈ ప్రవాహము ఉష్ణజల ప్రవాహము (Gulf stream) తో కలిసినప్పుడు ప్రమాదకరమైన పొగమంచు ఏర్పడుచుండును. ఏ పర్వత పంక్తిచేకాని అడ్డబడని శీతల ధ్రువమండల వాయువులు దక్షిణమున రియోగ్రాండ్ డీనార్టీ, సెంట్ లూయీల వరకునుగల ఖండభాగమును చల్లగా ఉంచును. న్యూయార్కు సున్నా (0°) డిగ్రీలకు క్రిందుగా ఉండును. ఖండమునకు పడమటినుండి తూర్పునకు అడ్డముగా పెక్కు వాయుగుండములు సంచరించుచు గాలి వాలుగల రాకీపర్వత భాగమునకు వర్షమును ఇచ్చును. కాని ఖండములో అవి పొడిగానే ఉండును.

ఉత్తర పసిఫిక్ తీరమున సంవత్సరమంతయు వర్షపాతము ఉండును, కాని గాలి కొట్టువైపున గల లోయ లన్నియు శుష్కములుగా ఉండును. ఉత్తర పసిఫిక్ ప్రవాహమునుండి వీచువాయువులు ఉష్ణములై నీటి ఆవిరితో గూడి పడమటి తీరమున అధికవర్షము కలిగించును. అవి ఒక్కొక్కప్పుడు రాకీపర్వత పంక్తిని దాటి మైదానములోనికిదిగి ధ్రువమండల వాయువుల చల్లదనమునకు కొంత ఉపశాంతిని సమకూర్చును. ఈ వాయువులకు "చినూక్సు" అని పేరు. శాన్‌ఫ్రాన్సిస్కో చుట్టునున్న ప్రదేశము వెస్టర్లీ వాయువుల ప్రభావమునకు గురియై శీతకాలమున దక్షిణముగా తిరుగును. వేసవిలో ఆ ప్రదేశముపై వాటి ప్రభావము ఉండదు. అందుచే ఈ స్వల్ప ప్రదేశమున మధ్యధరా శీతోష్ణస్థితి కానబడును.

వేసవిలో, వాయవ్యమున మెకంజీ ముఖద్వారము వరకును, సరఃపంక్తి వరకును, నేరుగా లాబ్రడారు రాష్ట్రము వరకును గల ఖండమునందలి చాలభాగము నందు ఉష్ణోగ్రత $60^\circ F$ కంటె అధికముగా ఉండును. మెక్సికన్ పీఠభూమిలో తాపక్రమము $90^\circ F$ కు పైగా నుండును. మధ్య మైదానములు మిక్కిలి ఉష్ణములగును. శీతకాలములో నీరు గడ్డకట్టు ఉష్ణోగ్రతకు $(0^\circ C)$

క్రిందుగాఉండు న్యూయార్కు ఇప్పుడు దక్షిణభారత దేశము యొక్క పశ్చిమతీరమువలె అధికమైన ఉష్ణము నకు గురిఅగును. మెక్సికో సింధు శాఖనుండి ఉష్ణవాయువులు (సాధారణ పవనములు) ఖండము యొక్క పైభాగమునకు వీచి, ఉత్తరమునుండివచ్చు శీతలవాయు సమూహములపైగా ప్రయాణించుచు, మధ్య మైదానములో వేసవికాలమున వర్షము కలిగించును. ఈశాన్య వ్యాపార పవనములు పడమటి ఇండియా ద్వీపములకును, మధ్య అమెరికా తూర్పుతీరమునకును, సంవత్సరముపొడుగునను అధికవర్షమును కలుగజేయును. మెక్సికన్ పీఠభూమి అధికమగు ఉష్ణోగ్రతకు తావయిన కారణమున, స్థానికమైన ఋతుపవన మొకటి బయలుదేరి మెక్సికో పడమటి తీరమునకు వర్షమునొసగును. శాన్‌ఫ్రాన్సిస్కో చుట్టుపట్ల గల ప్రదేశమున శీతకాలమున వర్షము కురియును. మధ్య మైదానములందును, మెక్సికో ఆగ్నేయ పశ్చిమతీరము లందును, వేసవిలో వర్షములు కురియుచుండును. సంవత్సరము పొడుగునను వర్షము కురియు ప్రదేశములు మూడు ఉన్నవి. 1. ఉత్తర పసిఫిక్ తీరము 2. పడమటి ఇండియా ద్వీపములు. మధ్యఅమెరికా తూర్పుతీరము, 3. ఈశాన్య-ఉన్నతభూములు. రాకీ పర్వతపంక్తి వర్షచ్ఛాయ యందును, దానిచే ఆవరింపబడిన పీఠభూములందును, చాల తక్కువ వర్షము కురియును. అందుచే అక్కడ ఎడారులు ఏర్పడినవి.

**సహజ వృక్షసంపద :** ఉత్తర అమెరికా యందలి సహజవృక్షసంపద ఆయాప్రదేశములందలి శీతోష్ణస్థితుల కనుగుణముగాఉన్నది. అలాస్కానుండి లాబ్రడారువరకు టండ్రాభాగము వ్యాపించిఉన్నది. దక్షిణమున కెనడాలో చాలభాగమందును, పడమటి కార్డిలరా దక్షిణభాగమందును సూచీ (పత్రములైన) వృక్షముల వరుస కన్పించుచున్నది. తూర్పున సరఃపంక్తికి చుట్టునుగల అల్పప్రదేశములో సూచీపత్రములును, పత్రచమోకములునగు వృక్షములు కలవు. అప్లాషియను పర్వతములందలి ఉన్నతప్రదేశములందు కూడ సూచీపత్రములున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రముల తూర్పుతీరమునను పత్రమోచక వృక్షములు గలవు. దాని పైభాగమును సమశీతలమనియు క్రింది భాగమును సమోష్ణమనియు చెప్పవచ్చును. ఆ అక్షాంశరేఖలమీదనే పడమటి తీరమున ఇట్టి సహజవృక్షసంపదగల కొంతభాగమున్నది. సంయుక్త రాష్ట్రములందలి మధ్య మైదానములును, కెనడా మధ్యభాగమందలి అల్పప్రదేశమును పచ్చికబయళ్ళచే ఆవరింపబడిఉన్నవి. వీనికి "ప్రయిరీ" లని పేరు. ఈ 'ప్రయిరీ' లలో వర్షపాతము ననుసరించి పడమట పొట్టిగడ్డియు, తూర్పున పొడుగుగడ్డియు పెరుగును. ఇవి వ్యవసాయము విస్తృతముగ జరుగుచున్న ప్రదేశములు. శాన్‌ఫ్రాన్సిస్కో చుట్టునుగల ప్రదేశమున మధ్యధరా వృక్షసంపదయు, మధ్యఅమెరికా యందలి ఉష్ణప్రదేశములందును, పడమటి ఇండియా ద్వీపములందును, ఉష్ణ నిత్యహరితములైన అరణ్యములును గలవు. పసిఫిక్ కార్డిలరా యందలి పొడివర్షచ్ఛాయలందు ఎడారులున్నవి.

**ఉత్పత్తి :** కెనడాయందు ప్రయిరీలు— ముఖ్యముగా నందలి తూర్పుభాగములు విస్తృతముగా గోధుమలు ఉత్పత్తియగు ప్రదేశములు. ఇచ్చట ఓట్లు, బార్లీ, రై, అవిసెచెట్లు (నార) (flax) పెరుగును. ఈ ప్రదేశమున వ్యవసాయమును, పశుపోషణమును కలిసి జరుగుచున్నవి. ఇది సంయుక్తరాష్ట్రములందు వసంతకాలమున గోధుమలు పెరుగు ప్రదేశము యొక్క అవశేషము. దీనికి తూర్పున పెద్ద సరస్సుల చుట్టును, ఈశాన్య రాష్ట్రములందును వ్యవసాయమును, పశుపోషణమును జతగా జరుగు ప్రదేశమున్నది. దీనికి దక్షిణమున ఖండము యొక్క పూర్వార్ధమందు మొదట ధాన్యము పండు ప్రదేశమును, తరువాత ఖండమున కడ్డుగా ధాన్యము పండునట్టియు, శీతకాలమున గోధుమలు పండునట్టియు ప్రదేశమును కలవు. టెక్సాసునుండి తూర్పుగా దక్షిణ రాష్ట్రములన్నిటియందును ప్రత్తి విస్తారముగా పండును. ఉన్నతములయిన పశ్చిమ మైదానములలో పందులను, కోళ్లను,పెంచు ప్రదేశములును, ఇంకనుపడమటగా గొఱ్ఱెలను పెంచు ప్రదేశములును ఉన్నవి. శాన్‌ఫ్రాన్సిస్కో చుట్టునుగల మధ్యధరా శీతోష్ణస్థితితోకూడిన ప్రదేశమున మధ్యధరా ఫలోత్పాదకభాగమున్నది. ఉత్తర పసిఫిక్ తీర ప్రదేశములందు మిశ్రవ్యవసాయము సాగుచున్నది. పెద్ద సరస్సులకును, సెంటులారెన్సునకు ఉత్తరమునను

కలపవ్యాపారమే ప్రధానమైన వృత్తి. కెనడా తూర్పు పడమర తీరములకు కొలది దూరమున చేపలను పట్టుటకు తగిన ప్రదేశము లున్నవి. మెక్సికో ఉష్ణతీరము లందును మధ్యఅమెరికా ప్రజాస్వామ్యము లందును చెరకు, రబ్బరు, పొగాకు, వనిల్లా (Vanilla), జనపనార మొదలగునవి పెంచబడును. సమశీతోష్ణ పర్వత పీఠము లందు కాఫీయు, విస్తారమైన మొక్కజొన్నయు పెరుగును. పీఠభూములందు ప్రత్తి, గోధుమ, మొక్కజొన్న పండును. ఇచ్చట గొఱ్ఱెలును, పశువులును పెంచబడును. క్యూబా పోర్టోరికోలు చెరకును, పొగాకును, విస్తారముగా పండించు ప్రదేశములు. జమైకా, చెరకునకును, బొంత అరటిపండ్లకును ప్రసిద్ధి. చిన్న ద్వీపములలో వివిధములయిన ఉష్ణమండలపు పంటలు పండును.

అమెరికా ఖండములో అధికమైన ఖనిజసంపద కలదు. కెనడాలో ఖనిజములుగల ముఖ్యప్రదేశము పెద్ద సరస్సులకు ఉత్తరమునఉన్నది. ప్రపంచమునందలి మొత్తము నికిల్, రాగి, లోహములలో కేవ వంతు ఇచ్చటనే ఉత్పత్తి అగుచున్నది. సుపీరియరు సరస్సు ఉత్తరతీరము లందును, క్విబెక్ లాబ్రడారు లందును విస్తృతములైన ఇనుప గనులు కలవు. పోర్క్యుపైను, కర్కులాండు సరస్సుల ప్రాంతములలో వెండి, మణిశిల, బంగారము కలవు. ఇవిగాక పడమటి కార్డిలరా పార్శ్వములందు నూనెగను లున్నట్లు తలపబడుచున్నది. కెనడాయందలి ప్రయిరీలక్రింద పెద్ద బొగ్గుగనులున్నవి (1) అప్లాషినా (2) దక్షిణ అప్లాషియన్ (3) ఇలినోయిస్ (4) కన్సాస్ (5) ఓకహోమా పెన్సిల్వేనియాలు అమెరికా సంయుక్తరాష్ట్రములందలి ముఖ్యమైన బొగ్గుగనుల ప్రదేశములు. కాలిఫోర్నియా, ఖండమధ్యరాష్ట్రములు, టెక్సాసు, ఉత్తర అప్లాషియను, సింధుశాఖాతీరము, మెక్సికోయందలి టెంపికో మున్నగునవి నూనెను ఉత్పత్తిచేయు ముఖ్య కేంద్రములు. ఇనుము, బొగ్గులకుతోడు ప్రపంచమునందలి వెండిలో సగము భాగమును, విస్తారమైన రాగియును, మెక్సికోయందలి పీఠభూమి ప్రాంతములలో ఉత్పన్నమగును. అమెరికాలో పడమటి కార్డిలరాభాగమందురాగి, జింకు, బంగారము, వెండి, సీసము మున్నగు ఖనిజములలో చాలభాగము ఉత్పన్నమగును. అప్లాషియను పర్వతములలో అల్యూమినము గనులు త్రవ్వబడుచున్నవి. మిన్నెసోటా, విస్కాన్సిన్ మిచిగాన్, అను ప్రదేశములందు ముఖ్యముగా ముతక ఇనుము కానవచ్చుచున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములు అభ్రకము, తగరము, మాంగనీసు, క్రోమియము, నికిలు, టంగ్‌స్టను, సొపీరము మున్నగు లోహములలో కొరవడి ఉన్నవనుట గమనింపవలసిన విషయము.

కెనడాలో పెద్ద సరస్సులకును, సెంటులారెన్సుకును, తూర్పుప్రదేశమున జలశక్తి ఆధారవములు అధికముగా పెంపొందింప బడుచున్నవి. అట్టివి కొన్ని అంటారియో నైరుతిభాగమున కూడ కలవు. అమెరికా సంయుక్తరాష్ట్రములందలి జలశక్తిలో అధికభాగము ఉత్తర ఈశాన్య భాగములందును, అప్లాషియను లందును, జలపాత పంక్తియందును, టెన్నెసీయందును ఉత్పన్నమగుచున్నది.

ప్రజలు - రాజకీయ విభాగములు : యూరోపియనులు రాకముందు అమెరికాలో ఎఱ్ఱఇండియనులు నివసించుచుండిరి. వీరు దేశద్రిమ్మరులయి, వేటాడుచు ముఖ్యముగా ప్రయిరీలలో నివసించుచుండిరి. అజ్టెక్కులనబడు నాగరక ప్రజలు మెక్సికో యందును, మధ్యఅమెరికా యందును నెలకొనియుండిరి.

ప్రస్తుతము అమెరికా ఈ క్రింది దేశములుగా విభజింపబడి ఉన్నవి.

1. కెనడా: ఇది బ్రిటిషు కామనువెల్తునందలి భాగము. న్యూ ఫౌండులాండు లాబ్రడారులు కూడ ఇందులో కూడిఉన్నవి. ఇవి క్రీ. శ. 1949 లో ఇందు కలసినవి.

2. అమెరికా సంయుక్తరాష్ట్రములలో వాయవ్యమున అలాస్కాయు, పోర్టోరికోయు, పెనామాకాలువ ప్రదేశమును కలిసియున్నవి.

3. మెక్సికో ఒక ప్రజాస్వామ్యరాజ్యము. ఇది అమెరికా సంయుక్తరాష్ట్రములకు దక్షిణమున ఉన్నది.

4. గాటెమలా, హాండూరాస్, సాల్వడారు, నికరాగువా, కాస్టారికా, పెనామా అనునవి మధ్యఅమెరికా యందలి ప్రజాస్వామ్యములు.

5. బ్రిటిషు హోండూరాసు బ్రిటిషువారి వలస రాజ్యము.

6. పడమటి ఇండియా ద్వీపములలో (అ) క్యూబా ప్రజాస్వామ్యము. (ఆ) రెండు నీగ్రో ప్రజాస్వామ్యముల నడుమ విభక్తమైన హిస్పానియోలా. (ఇ) బ్రిటిషు (జనతారాజ్యము) నకు చెందిన జమైకాయు ఇతర ద్వీపములు - చేరియున్నవి.

**అమెరికా వ్యాప్తి - ఆక్రమణములు :** జాతీయ రాజ్య ప్రదేశవ్యాప్తి అమెరికా ప్రాథమిక చరిత్రలో స్థిరమైన పద్ధతిగా నుండెను. కొన్ని అపవాదములున్నను దీనికి ప్రకృతిశక్తులలో ముఖ్యమైన ఇతరసమస్యలు కారణ ములై ఉండెను. అంతరములైనట్టియు, వైదేశికములైనట్టియు కష్టములను ఎదుర్కొనుటయు, రాజకీయార్థిక సమస్యలును అకారణములని చెప్పవచ్చును. ఆ వ్యాప్తి బహుళః అపరిహార్యమై ఉండెను. ఆక్రమణపద్ధతి కృత కములైన కుట్రలకు కాక, వ్యవసాయమువలన శాంత జీవితమును సంపాదించు ప్రజల సహజమైన ఆర్థిక సాంఘికాభివృద్ధికి ఫలితముగా ఏర్పడెను. ఏదోయొక యూరపు రాజ్యముయొక్క ఆలోచనలను గురించిన భయమో, ఈర్ష్యయో ఆక్రమణ పద్ధతిపై అధికమైన ప్రభావము ప్రదర్శించియుండెను. ఆక్రమణములు చాల మట్టుకు పాలనాధికారులతోడి సంప్రదింపులకో, యుద్ధము వలననో, అవసరము వలననో, భూమిని కొనుటకో ఫలితములై ఉండెను. ప్రతి ఆక్రమణమును స్వదేశీయ విదేశీయ వైరుధ్యమునకును, సంకుచితములైన భవిష్య దాలోచనలకును, తావొసంగెను. కాని కాలము గడచిన కొలదిని సింధుశాఖవరకును దూరమునందలి పసిఫిక్ వరకును వ్యాప్తిచెందుట దానికి ఎక్కువపుష్టి చేకూర్చె నని నిరూపింపబడినది. వ్యాప్తి ఈ క్రింది పద్ధతుల ననుస రించి కొనసాగెను.

(1) క్రీ. శ. 1803 లో నెపోలియననుండి లూయి సియానాను కొనుటవలన యూనియనుకు 1,171,931 చ. మై. వైశాల్యముగల ప్రదేశము చేకూరెను.

(2) క్రీ. శ. 1819-1821 లో ఫ్లోరిడా సంధివలన స్పెయిననుండి 59,268 చ. మైళ్ళ ప్రదేశము సంపా దింప బడెను.

(3) క్రీ.శ. 1845 లో సమ్మతిమీద టెక్సాసు(376,133 చ. మై.) చేర్చబడెను.

(4) క్రీ. శ. 1847 లోని యుద్ధములో. న్యూమెక్సి కోయు, ఉత్తర కాలిఫోర్నియాయు (545783 చ. మై) మెక్సికోనుండి గ్రహింపబడి ఆక్రమింపబడెను.

(5) క్రీ. శ. 1853 లో మెక్సికో ప్రభుత్వమునుండి గాడ్సడను కొనుటవలన దక్షిణ అరిజోనా న్యూమెక్సికో లలో (45,535 చ. మై.) ప్రదేశము సంపాదింపబడెను.

(6) క్రీ.శ. 1867 లో రష్యానుండి అలాస్కా (590,584 చ. మై) ప్రదేశము కొనబడెను.

(7) క్రీ. శ. 1898 లో హవాయి రాణియగు లిలియు కాలనీ అనునామెకు పరిహార మొసగి 6740 చ. మైళ్ళ వైశాల్యముగల పసిఫిక్ సముద్ర ద్వీపమైన హవాయి (Hawaii) ద్వీపము కలుపుకొన బడెను.

(8) క్రీ. శ. 1898 లో స్పెయినుతో జరిగిన యుద్ధము నకు ఫలితముగా మొత్తము (150,000 చ. మైళ్ళ వైశా ల్యముగల పోర్టోరికో, ఫిలిప్పైన్ ద్వీపములు, లాడ్రోను ద్వీపములందలి గాము (Gaum) గ్రహింపబడినవి.

(9) క్రీ. శ. 1899 లో గ్రేటు బ్రిటను జర్మనీలతో జరిగిన సంధివలన మొత్తము (54 చ. మైళ్ళు) వైశా ల్యముగల సామోను వర్గమునకు చెందిన టౌ, ఒన్‌సింగా ఓపు అను చిన్న ద్వీపములతో గూడిన టుట్యూలా (Tutuila) సంపాదింపబడెను.

(10) క్రీ. శ. 1916 లో డెన్మార్కునుండి వర్జిను ద్వీపములు కొనబడినవి.

(11) పైవానికి తోడు భిన్నకాలములందు పసిఫిక్ ద్వీపమునందలి అచ్చటచ్చటి ద్వీపములు ఆక్రమింప బడినవి.

క్రీ. శ. 1903 లో జరిగిన హేవరిల్లా సంధివలన పెనామా ప్రజాస్వామ్యము, సంయుక్త రాష్ట్రములకు కెరిబియన్ తీరమునందలి కొలోనునుండి పసిఫిక్ తీరము నందలి పెనామా వరకుగల పదిమైళ్ళ వెడల్పుగల ప్రదేశ మును శాశ్వతముగా ఉపయోగించుకొను హక్కు ఒసంగెను. సంయుక్త రాష్ట్రములకుపోలీసు, న్యాయము మున్నగు ఇతర ప్రయోజనముల విషయమున ప్రత్యేకాధి కారము కలదు. కాలువ మధ్యస్థమై ప్రపంచ వాణిజ్యము నకు ఉపయోగించునదిగా నుండవలెను.

జి. న.

**అమెరికాఖండము-2దక్షిణము (భూగోళము):** దక్షిణ అమెరికా ఖండము ఉత్తరమున వెడల్పుగాను, దక్షిణమున సన్నముగాను, మేకుకొనవలెనున్నది. ఇది 70 లక్షల చ. మై. వైశాల్యముకలిగి ఇండియాకన్నను 5½ రెట్లుపెద్దదిగానున్నది. పుదుచ్చేరియున్న అక్షాంశముపైన దీని ఉత్తరపుఅంచు, 56 దక్షిణఅక్షాంశముపైన దీని దక్షిణపు కొన ఉన్నవి. ఉత్తరఅమెరికా సరస్సులయొక్క తూర్పుఅంచులను తాకుచుపోవు 80° పశ్చిమ రేఖాంశము పై ఈ ఖండపు పశ్చిమపు అంచును, తూర్పు గ్రీన్‌లాండు గుండాపోవు 35° పశ్చిమరేఖాంశముపై దీని తూర్పు అంచును కలవు. భూమధ్యరేఖ దాదాపు మెజాన్‌నదీముఖ ద్వారమునంటి పోవుచున్నది. ఈ ఖండము యొక్క ఎక్కువభాగము ఉష్ణమండలములోనున్నది. కొద్దిభాగము మాత్రము భూమధ్యరేఖకు ఉత్తరమునమున్నను. ఈ ఖండము దక్షిణార్ధగోళమునకుచెందినది. ఈ గోళములో నున్న భూభాగము లన్నింటికంటె ఈ ఖండమే ఎక్కువ దక్షిణమునకు వ్యాపించియున్నది. ఈ ఖండములోని పేంటాఎరినాస్ (Penta Arinas) అను పట్టణము దక్షిణార్ధగోళములో నన్నిటికంటె మిక్కిలి దక్షిణమున నున్నది.

**నైసర్గిక స్వరూపము:** దక్షిణ అమెరికా యొక్క నైసర్గిక స్వరూపము శీతోష్ణస్థితులు, సులభగ్రాహ్యములు. ఆండీస్ పర్వతపంక్తి పశ్చిమతీరమునంతయు 5000 మైళ్లు వ్యాపించియున్నది. ఇందు చింబరోజో, కొటోపాక్సివంటి అగ్నిపర్వతములును ఎత్తైన పీఠభూములును, సరస్సులును కలవు. ఇది మడతలుగానుండును. భూగర్భ శాస్త్రజ్ఞులు ఇది ఇటీవలనే ఉద్భవించినదందురు. పసిఫిక్ తీర పర్వతపంక్తి చిన్నది. ఇది దక్షిణ చిలీదేశమునందలి శిలాద్వీపములలో నంతమగుచున్నది. ఖండమునకు ఈశాన్యభాగమున నున్న బ్రెజిలు గయానా ఉన్నత భూములు ఆండీస్ పర్వతములకంటెను మిక్కిలి పూర్వము ఉత్పన్నమైనవి. ఇవి మిక్కిలి కఠినమైన పురాతన శిలలతో నిర్మితమైనవి. పై రెండింటికిని మధ్య ఉత్తర దక్షిణములుగా, వ్యాపించియున్న మైదానములు మరియొక విభాగము. ఈ మైదానములను తిరిగి ఒరినాకో, అమెజాన్, పెరానా — పెరాగ్వేనదిపరీవాహక మైదానములుగా విభజించవచ్చును. వాయవ్యమున కాకా — మాగ్డలీనా నదీప్రాంతములుకూడ మైదానములే. ఖండపు దక్షిణపు కొననున్న పెటగోనియా ఎడారి పీఠభూమి ప్రాంతము. ఇదిగాక పసిఫిక్ తీరము నంటియున్న సన్నని తీరపు మైదానము మరియొక విభాగము.

ఆండీస్ పర్వతములు పశ్చిమతీరముననే ఉండుట వలనను, వర్షమునిచ్చుపవనములు తూర్పుననుండి వీచుట వలనను, ఖండము వెడల్పునను ప్రవహించి ఏకరీతి నదులన్నియు అట్లాంటిక్ మహాసముద్రమును చేరును. ఇది దక్షిణ అమెరికా యొక్క విశేష లక్షణము. గయానా బ్రెజిలు ఉన్నతభూములు నదీమైదానములకు విభజన ప్రాంతములుగానున్నవి. పసిఫిక్ తీరమున చెప్పదగిన నదులు లేవు.

**శీతోష్ణస్థితి - సహజవృక్ష సంపద :** పైన పేర్కొన్న విధమున ఆండీస్ పర్వతముల యునికియు, ఖండము చాల భాగము ఉష్ణమండలమున నుండుటయు శీతోష్ణస్థితి పైనను, వర్షపాతముపైనను, ప్రాబల్యమును వహించుచున్నవి. జూలైనెల, అనగా దక్షిణార్ధ గోళపు శీత కాలములో ఈ ఖండపు ఉత్తర భాగము వేడిగానుండి దక్షిణమునకు పోయినకొలది క్రమముగా వేడిమి తగ్గుచుండును. పర్వతములలోను ఉన్నత భూములలోను ప్రాంతీయ శీతలము వ్యాపించి యుండును. జనవరినెల అనగా దక్షిణార్ధ గోళపు వేసవిలో ఉష్ణమండలము దక్షిణముగా మధ్య బ్రెజిలుయొక్క పల్లపు ప్రాంతములకు జరుగును. కాని దాపుననేయున్న ఉన్నత భూములయందు ఆండీస్ పర్వతప్రాంతములయందు శీతము కనిపించును. రెండు కాలములయందును పెరూ శీతల జల ప్రవాహము వలన పశ్చిమతీరము చల్లగాను, బ్రెజిలు ఉష్ణజల ప్రవాహము వలన తూర్పు తీరము వెచ్చగాను ఉండును. నిరంతరము వీచు ఈశాన్య ఆగ్నేయ వ్యాపార పవనములు ప్రధానమైనవి. ఇవి ఆండీస్ పర్వతముల ప్రతిబంధకముచే అమెజాన్ పరీవాహక ప్రదేశమునకును, తూర్పు ఉన్నత భూముల ప్రతిబంధకముచే అట్లాంటిక్ తీరమునకును, బ్రెజిలు ఆగ్నేయ భాగమునకును సంవత్సరము పొడుగునను వర్షము నిచ్చును. ప్రాంతీయ ఋతుపవనముల వలన

వాయవ్యముననున్న కొలంబియా దేశపు పసిఫిక్ ప్రాంతమునను, పశ్చిమ పవనముల వలన దక్షిణ చిలీ దేశమునను, సంవత్సరమంతయు వర్షము పడును. తక్కిన బ్రెజిలు దేశమందును, ఉత్తరముననున్న దేశములందును, ముఖ్యముగా వేసవిలోనే వర్షము పడును. ఉత్తర పసిఫిక్ తీరము ఆండీస్ పర్వతములకు పశ్చిమమున వ్యాపార పవనములకు చాటున నున్నది. అందుచే నిది పొడిగనుండును. అందుచేత అటకామా (Atacama) ఎడారి యేర్పడెను. అదే విధమున పశ్చిమ పవనముల మార్గములో ఆండీస్ పర్వతముల చాటుననున్న ఖండపు దక్షిణ ప్రాంతము వర్షములేక ఎడారిగా నున్నది. దీనినే పెటగోనియా యెడారి యందురు. వాల్పరయిజో పట్టణమునకు దక్షిణముగా మధ్య చిలీదేశములో కొంత భాగమున్నది. అది సూర్యాను గుణముగా శీతకాలములో నుత్తరముగా చలించు పశ్చిమ పవనములకును వాటి వర్షపాతమునకును శీతకాలమున లోనగుచుండును. ఈ ప్రాంతమున మధ్యధరా శీతోష్ణస్థితి కనిపించును.

సహజ వృక్షసంపదగాని, సహజమండలములుగాని, శీతోష్ణస్థితిపై ఆధారపడియుండును. అమెజాను పరీవాహక ప్రాంతములయందును బ్రెజిలు తూర్పు తీరమునందును ఖండపు టుత్తర తీరములయందును సెల్వాస్ అని పిలువబడు ఉష్ణమండలారణ్యములు వ్యాపించియున్నవి. అల్పవర్షపాతముగల ప్రాంతములలో ఉష్ణమండలపు పచ్చిక బీడులు వ్యాపించి యున్నవి. వీటికే ఒరినాకో పరీవాహక ప్రాంతమున 'సవనా' లనియు, గయానా ఉన్నత ప్రాంతముల 'లానాలు' అన్నియు, బ్రెజిలు ఉన్నత ప్రాంతముల 'కాంపోస్' అనియు ప్రాంతీయముగా పేర్లుగలవు. కాంపోసుకు దక్షిణముగా పెరానా - పెరుగ్వేనదీమండలములో సమశీతోష్ణ మండలారణ్యములు గలవు. వీటికి దక్షిణముగా పెరానా - ఉరుగ్వే నదీముఖమండలముల చుట్టూ - అర్జంటీనాలో పంపాస్ అని పిలువబడు మధ్య అక్షాంశపు పచ్చికబీడులు కలవు. దక్షిణచిలీలో సమశీతోష్ణమండల పత్ర విసర్జక (Deciduous) అరణ్యములు వ్యాపించి యున్నవి. దీనికి ఉత్తరమున మధ్య చిలీలో మధ్యధరా వృక్ష సంపద కలదు. ఇంకను ఉత్తరముగా చిలీ పెరూ దేశపు పసిఫిక్ తీరములు ఉష్ణమండలపు ఎడారులుగాను దక్షిణ అర్జంటీనాలో పెటగోనియా సమశీతలపు ఎడారిగాను ఉన్నవి. ఇవికాక ఆండీస్ పర్వతములలోని సహజవృక్ష సంపద శీతోష్ణస్థితి, దాని ఎత్తు, అందలి వర్షపాతము పీఠభూములను నియమించుచుండును.

**ఉత్పత్తి :** దక్షిణఅమెరికా, వ్యవసాయము ముఖ్యముగాగల ఖండము. వృత్తులనుబట్టి ఈ ఖండమును రెండు ప్రత్యేక మండలములుగా విభజించవచ్చును. విరివిగా ఖనిజములను కలిగిన ఆండీస్‌పర్వతములు, తూర్పుననున్న ఉన్నతభూములు ఒక భాగము; వ్యవసాయము, వ్యవసాయపరిశ్రమలు ప్రధానముగా గల అట్లాంటిక్ తీరప్రాంతములు, పెరానా-పెరాగ్వే నదీమండలము, పసిఫిక్ తీరపు మధ్యధరా మండలము మరియొక భాగము.

దక్షిణ అమెరికాలో పెక్కుప్రాంతములు జన సమ్మర్దము లేనివి. ఈ క్రింది ప్రాంతములు ఖండమున అక్కడక్కడ చెదరియున్నవి. వ్యవసాయము గాని గనుల త్రవ్వటగాని అందలి జనుల వృత్తులు.

ఆండీస్ పర్వతపులోయలలోను, పీఠభూములలోను, వెనుజులా దేశములోను, కొలంబియాలోని పర్వత భాగములలోను కాఫీ, మొక్కజొన్న పండును.

కొలంబియా యందలి కాకా, మాగ్డలీనా నదుల లోయలలో కోకో, చెరకు, ప్రత్తి, అరటిపండ్లు పండును. గయనాతీర భూములందు చెరకు, వరి పండును. బ్రెజిలు దేశపు తూర్పుతీరములలో ప్రత్తి, చెరకు, రబ్బరు, కాఫీ, పండును. దక్షిణ బ్రెజిలులో ఉరుగ్వే వంటియున్న ప్రాంతములలో పశుపోషణము జరుగును. పెరానా-పెరాగ్వే నదీమండలముల యందలి ఉష్ణమండ లారణ్య ప్రాంతములలో, స్వల్పముగా ప్రత్తిపండును. అర్జెంటీనా లోని పంపాస్ ప్రాంతములో గోధుమ విరివిగాపండును. అచ్చట ధాన్యపు మరలు, మాంసమును టిన్నులలో నమర్చు కార్ఖానాలు, నూలువస్త్రముల మిల్లులు కలవు. అర్జెంటీనాలోని పంపాస్‌కు పశ్చిమప్రాంతమున చెరకును, ప్రత్తిని, పొగాకును, జనపనారను పండింతురు. వ్యవసాయ పరిశ్రమలు ఉరుగ్వేలోను, పెరాగ్వేలోను కలవు. చెరకు, ప్రత్తి, పెరూదేశపు పసిఫిక్ తీరమునందలి పంటలు.

ట్రినిడాడు దీవిలో విలువగల నూనెగనులు వెనూజులాలో మకరైబో నూనెగనులు కలవు. కొలంబియా యందలి పర్వతభాగములలో నూనెగనులు లభించు ప్రదేశములు కలవు. అర్జెంటీనాలోని ఆండీస్ పర్వతప్రాంతములలో ఇటీవల ఏర్పడిన నూనెగను లున్నవి. పెరూ దేశమందలి ఉత్తల పసిఫిక్ తీరమండలమున నూనెగనులు కలవు. బొలివియాలోని మాంటనా పర్వతములలో నూనెగను లున్నవి. గయానా ఉన్నత భూములలో బంగారము, రత్నములు, బాక్సైటు లభించుతావులు కలవు. పెరూ దేశపు ఆండీస్ పర్వతప్రాంతమునను టిటికాకా లోయలోను, పశ్చిమ బొలివియాలోను, వెండి, సీసము, బంగారము, రాగి, తగరము లభించును. అటకామా ఎడారిలో నత్రజము, అయొడిన్కు, రాగి, వెండి దొరకును.

వ్యవసాయమే ప్రధానముగా కలిగి ఖనిజోత్పత్తి యందు ప్రారంభదశయందున్న ఈ ఖండములో వాహక సౌకర్యములు చాలతక్కువ. సమశీతలమండలపు పచ్చిక బీడులయందలి వ్యవసాయపు పంటలను విదేశముల కెగుమతిచేయుటకై బాహియా, బ్లాంకా, బ్యూనస్, ఏయిర్స్ రేవులకు తీసికొనిపోవుటకై అర్జెంటీనాదేశమున రైలు మార్గములు పెక్కులు నిర్మింపబడియున్నవి. ఇచ్చటనుండి ఊరుగ్వేదేశమునకును, జనసంఖ్య విశేషముగాగల బ్రెజిలు తూర్పుతీర ప్రాంతమునకు రైలుమార్గ సౌకర్యములు కలవు. ఈశాన్యమునసున్న బ్రెజిలులో తీరప్రాంతములకు పోవు సౌకర్యములు అచ్చటి నదుల లోయలగుండాఏర్పడు చున్నవి. అర్జెంటైనానుండి ఖండాంతర్గతమైన బొలీవియా దేశమునకును, అచ్చటినుండి చిలీలోని పసిఫిక్ రేవగు అరికా పట్టణమునకును, పెరూ లోని పసిఫిక్ రేవగు మొలెండో పట్టణమునకును రైలుమార్గములు వేయబడినవి. అర్జెంటీనానుండి మరియొక రైలుమార్గము, ఆండీస్ లోని ఉస్పల్లటాకనుమ క్రిందచేయబడిన సొరంగము ద్వారా, చిలీలోనికి ప్రవేశించి వాల్పరయిజో పట్టణమునకు పోవుచున్నది. చిలీదేశములో, పసిఫిక్ తీరము పొడవునను ఉత్తరపు సరిహద్దునుండి దక్షిణముననున్న వాల్డివియావరకు రైలుమార్గముకలదు. తక్కిన ప్రాంతములలో నదులలోని స్టీమర్లపై మంచి ప్రయాణ సౌకర్యములు ఏర్పడియున్నవి. ఉత్తర అట్లాంటిక్ సముద్రము నుండి అమెజాన్ నది ఎగువన 1000 మై. దూరములో నున్న మన్నావోస్ పట్టణము వరకును స్టీమర్లు పోగలవు. అట్లే పెరానా పెరాగ్వేనదులు దాదాపు పెరాగ్వే దేశమువరకును చిన్న స్టీమర్ల ప్రయాణమునకు అనువుగా నున్నవి.

దక్షిణ అమెరికాఖండము ముఖ్యముగా వ్యవసాయోత్పత్తిని విదేశముల కెగుమతిచేసి వాటిస్థానే తయారయిన వస్తువులను, యంత్రములను, దిగుమతిచేసికొనుచున్నది, అందుచేత దీని విదేశవర్తకము, విశేషించి, అట్లాంటిక్ తీరస్థములయిన పారిశ్రామిక దేశములతోను, జర్మనీతోను జరుగుచున్నది.

రాజకీయ విభాగములు :- అమెరికన్ ఇండియన్లు అని పిలువబడు పసుపురంగు జాతివారు, ఈ ఖండమునందలి ఆదిమనివాసులు. వీరిలో ఇన్కాసులను తెగవారు నాగరకులు. తక్కినవారు చొరరానిదట్టమైన అమెజాన్ అరణ్యములందు నివసింతురు. ఆదిమనివాసుల సంఖ్య క్రముగా సన్నగిల్లుచున్నది. తోటలలో పనిచేయువారు ఆఫ్రికానుండి తీసికొనిరాబడిన నీగ్రోజాతిసలు.

దక్షిణాఫ్రికాయందలి శ్వేతజాతులు, శతాబ్దముల క్రిందనే వలసవచ్చిన స్పెయిన్, పోర్చుగలు దేశీయుల సంతతివారు. వీరితరువాత ఇటీవలనే వలసవచ్చిన ఇటాలియనులు, జర్మనులు, కొలదిమంది హిందూదేశస్థులు చైనావారుకూడ ఇచ్చటకలరు. అందువలననే బ్రెజిలు దేశమునందు పోర్చుగీసుభాషయు, తక్కిన దేశములందు స్పానిష్‌భాషయు మాట్లాడబడును.

ఈ ఖండమును కనుగొని ఆక్రమించిన తరువాత 14, 15 వ శతాబ్దములలో పోర్చుగల్, స్పెయిన్ దేశములవారు ఈ ఖండమును తమమధ్య పంచుకొనిరి. ఇప్పటి బ్రెజిలుదేశము పోర్చుగల్ వాటాకును, తక్కిన భాగము స్పెయిను వాటాకును వచ్చెను. కాని 19 వ శతాబ్ది ఆరంభములో వలసవచ్చిన ప్రజలు తమ మాతృదేశములతో సంబంధమును త్రెంచుకొని తమ స్వతంత్ర ప్రజాప్రభుత్వమును ప్రకటించుకొనుచుండిరి. అయినప్పటికి ఈనాటికికూడ ఉత్తరముననున్న మూడు గయానా రాష్ట్రములు బ్రిటిష్, ఫ్రెంచి, డచ్చి, వలసరాష్ట్రము

లుగా నున్నవి. ఇవి తప్ప తక్కిన దేశములన్నియు స్వతంత్ర ప్రజాప్రభుత్వములే.

ముఖ్యముగా నాల్గుప్రాంతములు మాత్రము విశేషమైన జనసంఖ్యతోనలరారుచున్నవి. (1) అర్జంటీనాలోని సమశీతోష్ణపు పచ్చిక ప్రాంతములు. (2) బ్రెజిలు తూర్పు తీరప్రాంతము. (3) చిలీలోని మధ్యధరా ఉద్భిజ్జమండల ప్రాంతము. (4) కొలంబియా పశ్చిమ ప్రాంతములు.

ఈ ఖండమునందలి దేశములు ఈ క్రింద పేర్కొనబడినవి :-

**బ్రెజిలులోని ఉష్ణమండల స్వతంత్ర దేశములు :** (3,275,510 చ. మై. వైశాల్యము; రియోడి-జనీరో ముఖ్యపట్టణము,) వెనిజులా (363,728 చ. మై. వైశాల్యము: కారకాస్ ముఖ్యపట్టణము.)

**కొలంబియా :** (439,997. చ. మై. వైశాల్యము; బగోటా ముఖ్యపట్టణము)

**ఈక్వెడారులోని ఆండీస్ ప్రజాస్వామ్యములు :** (226,000 చ. మై. వైశాల్యము; క్విటో ముఖ్యపట్టణము); పెరూ (532,616 చ. మై. వైశాల్యము; (లిమా ముఖ్యపట్టణము). బొలీవియా (514,400, చ. మై వైశాల్యము; లాపాజ్, ముఖ్యపట్టణము).

**చిలీయందలి సమశీతోష్ణ ప్రజాస్వామ్యములు :** (296,717 చ. మై. వైశాల్యము; సాంటియాగో ముఖ్యపట్టణము).

**అర్జంటీనా :** (1,079,965 చ. మై. వైశాల్యము; బ్యూనస్ ఎయిర్సు ముఖ్యపట్టణము).

**ఉరుగ్వే :** (72,153 చ. మై. వైశాల్యము; మాంటివీడో ముఖ్యపట్టణము).

**పరాగ్వే :** (153,447 చ. మై. వైశాల్యము. అసంసియన్ ముఖ్యపట్టణము).

**బ్రిటిషు గయానాలోని వలసరాష్ట్రములు :** బ్రిటిష్ గయనా (83,000 చ. మై. వైశాల్యము; జార్జిటవున్ ముఖ్యపట్టణము).

**డచ్‌గయానా :** (పరమారిబో ముఖ్యపట్టణము.)

**ఫ్రెంచిగయానా :** (కాయెన్ (Cayenne) ముఖ్యపట్టణము). టిరాడెల్ ఫ్యూగో ద్వీపమున కెదురుగా నున్న ఫాక్‌లెండు దీవులును, ఉత్తరమున ఒరినాకోనది ముఖద్వారమున కెదురుగానున్న ట్రినిడాడు దీవియు, బ్రిటిష్‌వారి అధీనములో నున్నవి.

జి. స.

## అమెరికా సంయుక్తరాష్ట్రములు (1 చరిత్ర) :

ఉత్తరమున కెనడాకును దక్షిణమున మెక్సికోకును నడుమ ఉత్తరఅమెరికాలోనున్న విశాలము, సారవంతము అయిన భూభాగమునకు అమెరికా సంయుక్తరాష్ట్రములనిపేరు. క్రీ. శ. 17, 18 శతాబ్దులలో, ఐరోపానుండి క్రమక్రమముగ వచ్చిన ప్రజలు, వారు తీసికొని వచ్చిన సంస్థలు, ఆ ధర్మములు, క్రొత్తగా గనిపెట్టబడి, అసంకీర్ణమైన దేశములో స్థాపింపబడి పరిణతి చెందుటవలన అమెరికా సంయుక్త రాష్ట్రములు ఏర్పడినవి. ఈ విధముగా అనేకులు ఇచ్చటకు వలస వచ్చుటకు వారి రాజకీయ స్వాతంత్ర్యకాంక్ష, మతవిషయక స్వాతంత్ర్య నిరతి, ఆర్థిక పురోగమనాభిలాష ముఖ్యకారణములు.

మొదట వలసవచ్చినవారు ఉత్తర అమెరికా తూర్పు తీరమున స్థిరపడి, స్వతంత్రమైన కొన్ని వలసలు ఏర్పరచుకొనిరి. ఈ వలసలలో మూడువిభాగములు ఏర్పడెను. ఉత్తర భాగములోనున్న వలసలు పారిశ్రామికముగా ప్రధానములైనవి. దక్షిణభాగములోనున్నవి కృషిప్రధానములైవి. మధ్యభాగములో నున్న వలసలలో వైవిధ్యము ఎక్కువగా నుండి పరిస్థితులకు అనుగుణముగా నడచుకొను మనస్తత్వము ప్రబలెను. వలసలలో ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రత్యేకతను కలిగియుండుట వలన, వలస వచ్చినప్పటినుండియు స్వాతంత్ర్యమునకు అలవాటు పడియుండుటవలన, ఇవియన్నియుకలిసి ఏకరాష్ట్రముగా ఏర్పడుట అంసంభవమాయెను.

మొదట వలసవచ్చినవారు ఉత్తర అమెరికా తూర్పు తీరమున స్థావరము ఏర్పరచుకొనిరి. వీరిలో కొందరు తరువాత వలసవచ్చినవారితో కలిసి లోభాగముననున్న సారవంతమయిన భూములను క్రమక్రమముగా ఆక్రమించుకొనసాగిరి. వీరు ఈ విధముగా పడమటగాచొచ్చుకొని పోవుటవలన (Westward expansion) ఈ దేశ చరిత్రలో ముఖ్యమైన మార్పులు కొన్ని ఏర్పడెను.

ఇంగ్లండు మొదలైన దేశములనుండి ప్రజలు తమం తటతామే అచ్చటకు వలసవచ్చిరికాని అయా దేశప్రభుత్వ

ములయొక్క ప్రోద్బలమువలన కాదు. ఇచ్చట వలసలు ఏర్పడిన తరువాతకూడ ఆంగ్లదేశ ప్రభుత్వముకాని మరి యితరదేశ ప్రభుత్వములుకాని యిక్కడి ప్రజలయొక్క స్థితిగతులతో ఎక్కువ ఐక్యము కలిగించుకొనలేదు. అందువలన ఈ వలసరాష్ట్రముల ప్రజలలో స్వాతంత్ర్యబుద్ధి, మాతృదేశము నెడల ఒక విధమైన నిర్లక్ష్యము బయలు దేరెను. 18వ శతాబ్ది మూడవ పాదములో ఫ్రెంచి వారిని ఈ ప్రాంతమునుండి తరిమివేసిన తరువాత ఆంగ్లప్రభుత్వము ఈ వలసలమీద అధికారము నెరపుచు ఒకవిధమైన క్రొత్త సామ్రాజ్య దృక్పథము అలవరచుకొనెను. మొదటినుండియు స్వాతంత్ర్యమునకు అలవాటుపడిన ఈ వలసలలోని ప్రజలు ఈ మార్పును గర్హించిరి. క్రమ క్రమముగా ఆంగ్ల ప్రభుత్వము వలన రాష్ట్రముల పరిపాలనకు అగు వ్యయములు వలసవారే భరింపవలెనను తత్త్వమును అనుసరింపగా వలస రాష్ట్రప్రజలుతమకు ప్రాతినిధ్యములేని బ్రిటిష్ పార్లమెంటు విధించు పన్నులు తామెందుల కీయవలెనని వాదింపసాగిరి. ఈ సంఘర్షణము నానాటికి తీవ్రరూపముదాల్చి క్రీ. శ. 1775 వ సంవత్సరములో ఇంగ్లాండునకును వలసరాజ్యములకును మధ్య ఒక యుద్ధముగా పరిణమించెను. దీనికే అమెరికా స్వాతంత్ర్య యుద్ధమని పేరు. జార్జివాషింగ్‌టన్ నాయకత్వమున వలసల వారు 6 సంవత్సరములకాలము హోరాహోరిగ పోరాడి తుదకు క్రీ. శ. 1783 లో విజయముపొంది తమ స్వాతంత్ర్యమును సంపాదించుకొనిరి.




స్వాతంత్ర్యము లభించిన తరువాత దాని నేవిధముగ నిలువబెట్టుకొనవలయు ననునది ప్రధానపమస్య యయ్యెను. అదియును కాక యీ వలసలలో, పరస్పరము ఏ విధమైన సంబంధము ఉండవలెనో కూడ నిర్ణయించుకొనవలసి వచ్చెను. క్రీ. శ. 1787వ సంవత్సరమున ఫిలడెల్ఫియాలో ఈ వలసల ప్రతినిధులు సమావేశమై ఒక రాజ్యాంగ ప్రణాళికను తయారుచేసి ఆమోదించిరి. ఈ ప్రణాళికలో స్థానిక స్వాతంత్ర్యము సాముదాయిక మగు అధికారము అను రెండు భిన్నసూత్రములు సమన్వయింపబడినవి. సాముదాయిక అధికారము కాంగ్రెసు అను శాసనకర్తృత్వమునకు వశముచేయబడెను. ఈ సంస్థలో రాష్ట్రములకు ప్రాతినిధ్యము వహించు సెనేటు అనియు, మొత్తము ప్రజలందరికి ప్రాతినిధ్యము వహించు ప్రజాప్రతినిధి సభయనియు, రెండు విభాగములు ఏర్పరచబడెను. ఈ విధముగా ఏర్పడిన సంయుక్త రాష్ట్రములకు యుద్ధములో విజయమునకు కారకుడైన జార్జి వాషింగ్‌టన్ మొదటి అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను.

స్వాతంత్ర్యమును సంపాదించుకొని ఒక రాజ్యాంగమును ఏర్పరచుకొనిన తరువాత అర్ధశతాబ్దికాలములో అమెరికా సంయుక్త రాష్ట్రముల చరిత్రసంస్కృతులలో చాల ముఖ్యమగు మార్పులు వచ్చెను. దేశములో ప్రభుత్వము సుస్థిరమై, పరిశ్రమలు, వాణిజ్యము, వ్యవసాయము అభివృద్ధి చెందెను. క్రమ క్రమముగా ఈ సంయుక్తరాష్ట్రములు పడమటగా వ్యాపించసాగెను. దీనిఫలితముగా క్రీ.శ. 1821 వ సంవత్సరము నాటికే మరి ఆరు క్రొత్త రాష్ట్రములు ఈ సమాఖ్యలో చేరుటయు ఒక క్రొత్త జాతీయభావము ఏర్పడుటయు జరిగెను. కేంద్రముయొక్క అధికారము ఎక్కువగా ఉండవలెనని హేమిల్‌టన్ నాయకత్వమున ఒక పక్షమును, రాష్ట్రములకు ఎక్కువ అధికారముండవలెనని జెఫర్‌సన్ నాయకత్వమున మరియొక పక్షమును బయలుదేరగా వాదోపవాదములు సాగెను. ఈ కాలములోనే వాఙ్మయము అభివృద్ధి పొంది దేశముయొక్క సాంస్కృతిక వ్యక్తిత్వమునకు దోహదమొసంగెను. పారిశ్రామికుల స్థితిగతులలో అభి-

వృద్ధి, జాతీయాభివృద్ధి, స్త్రీ స్వాతంత్ర్యోద్యమ ప్రారంభము ఈ కాలములోనే జరిగెను. వ్యవసాయములోను, పరిశ్రమలలోను యంత్రములను ప్రవేశపెట్టుటవలన దేశ మార్థికముగా అభివృద్ధిచెంది సామాన్య ప్రజల జీవితము సుఖకరముగా సాగజొచ్చెను. క్రీ. శ. 1812 వ సం॥ మొదలు 1852 వరకు గల మధ్యకాలములో అమెరికా సంయుక్తరాష్ట్రముల జనసంఖ్య 72 లక్షల నుండి 230 లక్షల వరకు పెరిగినది. వ్యవసాయ యోగ్యమయిన భూమి యూరపు ఖండమంత విస్తీర్ణతకు వృద్ధిచెందెను. ఇవి యన్నియు ఈ కాలములో అమెరికా రాష్ట్రము పొందిన అభివృద్ధిని సూచించుచున్నవి.

యుద్ధకాలములో తటస్థదేశముల హక్కులు, అధికారములు ఈవిషయములపై కొన్ని భేదాభిప్రాయములు కలిగెను. ఈ కారణమువలన క్రీ. శ. 1812 లో ఇంగ్లండు అమెరికాల మధ్య ఒక యుద్ధము ప్రారంభమయ్యెను. ఈ యుద్ధము మూడు సంవత్సరముల కాలము జరిగెను. తుదకు క్రీ. శ. 1815లో అమెరికాకు విజయము లభించెను. ఈ యుద్ధఫలితముగా అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రజలలో జాతీయ భావము, దేశభక్తి బాగుగా ప్రబలుటయే కాక అంతర్జాతీయ రంగములో అమెరికాకు కొంత ప్రాముఖ్యము లభించెను.

క్రీ. శ. 1783 లో అమెరికా సంయుక్త రాష్ట్రములు స్వతంత్రమైనప్పటినుండియు ఈ రాష్ట్రములకు దక్షిణముగానున్న లాటిన్ అమెరికన్ వలసలలోని ప్రజలలో కూడ స్వాతంత్ర్యకాంక్ష ప్రబలి విప్లవమునకు దారితీసెను. క్రీ.శ. 1824 సం॥ నాటికే లాటిన్ అమెరికాలోని వలసలు చాల భాగము స్వాతంత్ర్యము సంపాదించుకొనెను. వీరి స్వాతంత్ర్యమును అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వము గుర్తించెను. ఇది ఇట్లుండగా యూరపులో రష్యా, ఆస్ట్రియా మొదలైన కొన్ని సామ్రాజ్యవాద రాజ్యములు కలిసి హోలీ ఎలయన్స్ (Holy Alliance) అను పేరుతో క్రీ.శ. 1815 లో ఒక సంస్థను స్థాపించెను. ఈ సంస్థను స్థాపించుటలో ముఖ్యమగు ఉద్దేశము అభ్యుదయ శక్తులను అణగద్రొక్కి అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాద తత్త్వమును సుస్థిరము చేయుటయే. ఈ సంస్థ లాటిన్ అమెరికా విషయములలో జోక్యము కలిగించుకొని అచ్చటి స్వాతంత్ర్యోద్యమములను అణగద్రొక్కుటకు ప్రయత్నములు చేసెను. ఈ ప్రయత్నములను ప్రతిఘటించుచు అప్పటి అమెరికా సంయుక్త రాష్ట్రముల అధ్యక్షుడుగానున్న జేమ్సుమన్‌రో ఒక సిద్ధాంతమును ప్రతిపాదించెను. ఈ మన్‌రో సిద్ధాంతము జాతులస్వయం నిర్ణయాధికారము, ఒక దేశము ఇతర దేశముల వ్యవహారములలో జోక్యము కలిగించుకొనకుండుట, మొదలైన కొన్ని ముఖ్య సూత్రములను, పునరుద్ఘాటించెను. ఈ మన్‌రో సిద్ధాంతమే అమెరికా సంయుక్త రాష్ట్రముల విదేశాంగ నీతికి పునాదిగా పరిణమించినది.

ఈవిధముగా క్రీ. శ. 19 వ శతాబ్ది మధ్యకాలమునకు అమెరికా రాష్ట్రములలో పైచూపులకు సర్వతోముఖాభివృద్ధి కానిపించినను రాష్ట్రము లోలోపల విభేదములు బయలు దేరెను. వ్యవసాయ ప్రధానమై, బానిసవృత్తిని అమలుపరచు దక్షిణరాష్ట్రమునకును, పరిశ్రమలు ప్రధానముగా కలిగి బానిసత్వము నిషేధించు ఉత్తర రాష్ట్రములకును నానాటికిని వైషమ్యము ప్రబలసాగెను. దీని ఫలితములు సమకాలిక రాజకీయములలోకూడ కనిపింపసాగెను. రిపబ్లికన్ పార్టీ అను పేరిట ఒక రాజకీయపక్షము బయలుదేరి బానిసత్వమును నిర్మూలించవలెనని ఆందోళనము ప్రారంభించెను. బానిసల దుర్భరజీవితమును చిత్రించుచు 'అంకుల్ టామ్స్ కాబిన్' వంటి పుస్తకము శ్రీ యాందోళనమునకు చాల దోహదమొసంగెను. బానిసతనమును నిర్మూలింప బూనిన ఈఉద్యమమునకు అబ్రహాంలింకను నాయకత్వము వహించి, బానిసల పాలిటి దైవముగా ప్రసిద్ధికెక్కెను. క్రీ.శ.1861 సంవత్సరములో లింకను అమెరికా సంయుక్త రాష్ట్రములకు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడుటలో, ఏడు దక్షిణ రాజ్యములు ఏకమై బానిసత్వ సమస్యను పురస్కరించుకొని తిరుగుబాటుచేసెను. ఇది ఒక యుద్ధముగా పరిణమించి, 4 సంవత్సరముల కాలము సాగెను. తుదకు బానిసత్వము ఉండకూడదను ఉత్తరరాష్ట్రములకు విజయములభించుటతో ఈ అంతర్యుద్ధము సమాప్తమయ్యెను.

యుద్ధము సాగుచుండగనే క్రీ. శ. 1863 లో లింకను బానిసత్వమును నిర్మూలించు ఒక ప్రకటనచేసెను. యుద్ధానంతరము అమెరికా కాంగ్రెసు 13 వ సవరణ ద్వారా యీ బానిసత్వ నిర్మూలనమును రాజ్యాంగ ప్రణాళికలో

చేర్చెను. దక్షిణ రాష్ట్రములు క్రమక్రమముగా సమాఖ్యలో తిరిగి చేర్చుకొనబడినను, బానిసల విషయములో కొన్ని భేదములను పాటించుచునే వచ్చెను. దీనికి ప్రతీకారముగా కాంగ్రెస్, రాజ్యాంగ ప్రణాళికను మరియొకసారి సవరణచేసి సమాఖ్య అధికారములోనున్న భూభాగములో పుట్టినవారందరికిని, చిరకాలముగా నివసించుచున్న వారందరికినికూడా సమాఖ్యలోను, ఆయా రాష్ట్రములలోను కూడ వర్తించు పౌరసత్వమును ఇచ్చెను. క్రీ.శ. 1870 లో మరియొక సవరణద్వారా జాతివర్ణ విభేదములు పురస్కరించుకొని పౌరులెవ్వరికిని ఓటింగు హక్కు నిరాకరింపబడకూడదని కాంగ్రెసు తీర్మానించెను. దీనితో నీగ్రోలకు తెల్లవారితో సాంఘికముగను, రాజకీయముగను, శాస్త్రరీత్యా సమానత్వము ప్రాప్తించెను. ఈ సమానత్వము వాస్తవముగా కూడ వర్తించునట్లు చేయుటకై అప్పటినుండి ప్రయత్నములు జరుగుచున్నవి.

అంతర్యుద్ధము నుండి మొదటి ప్రపంచయుద్ధమువరకు గల మధ్యకాలములో అమెరికా సంయుక్త రాష్ట్రములు చాల అభివృద్ధిచెందెను. ఈ కాలములో అనేక క్రొత్త యంత్రములు, పద్ధతులుకనిపెట్టబడి వస్తూత్పాదన బాగుగ ఈఅభివృద్ధి చెందెను. ఆ కారణముగ పరిశ్రమలు, వాణిజ్యము అభివృద్ధిచెందెను. ఈ అభివృద్ధికి ముఖ్యకేంద్రములైన నగరములుకూడ సంఖ్యలోను, సంపదలోను చాల వృద్ధిపొందెను. అదేవిధముగ సాగుబడిలో నున్న భూమి కూడ రెండు రెట్లు ఎక్కువయ్యెను. పంట ఆరురెట్లు పెరిగినది. రాష్ట్ర పరిమితి పడమటి సముద్రము వరకు వ్యాపించెను. ఈ మార్పుల ఫలితముగా పరిస్థితులు తారుమారై అన్యోన్య సంబంధములను సంస్కరించవలసిన అవసరమేర్పడెను. ఈ సంస్కరణోద్యమమునకు పురోగమవాభిలాషులైన అమెరికా అధ్యక్షుడురూజువెల్టు మొదలయినవారు దోహదమిచ్చిరి. ఇది ఇట్లుండగా క్యూబా ద్వీపమును గురించి ఆమెరికాకు స్పెయినుతో యుద్ధము తటస్థించెను. ఇందులో అమెరికా విజయము పొంది తత్ఫలితముగా క్యూబా, పోర్టోరికో, గువమ్, ఫిలిప్పైన్స్‌లను సంపాదించెను.

మొదటి ప్రపంచయుద్ధము క్రీ.శ. 1914 లో ప్రారంభమైనప్పుడు అమెరికా దీనిలో దిగుటకు సంసిద్ధముగను, సుముఖముగను లేకుండెను. కాని జర్మనులు విచక్షణ లేకుండ సాగించిన నిర్దాక్షిణ్యయుతమైన జలాంతర్గాముల యుద్ధము తటస్థరాష్ట్రములకు కూడ అపారనష్టము కలిగించుటతో జర్మనుల ఆగడములను అరికట్టు నిమిత్తము, అమెరికా యుద్ధములో దిగవలసివచ్చెను. దిగిన తరువాత జర్మనీయొక్క ప్రతికూల రాష్ట్రములకు విజయము లభించుటకు ఈదేశము తీవ్రకృషిచేసెను. దీనికిఫలితముగా యుద్ధానంతరము జరిగిన సంప్రదింపులలో అమెరికాకు ప్రముఖస్థానము లభించెను. భవిష్యత్తునందు ప్రపంచ శాంతిభద్రతలను సుస్థిరముచేయు నుద్దేశముతో స్థాపింపబడిన నానారాజ్య సమితి, అమెరికా అధ్యక్షుడైన విల్సను యొక్క ప్రత్యేక కృషికి ఫలితము. అయినప్పటికిని అమెరికా క్రమక్రమముగా అంతర్జాతీయ రాజకీయములనుండి తొలగి తన దృష్టిని తన అభివృద్ధిమీదనే కేంద్రీకరించెను.

యుద్ధానంతరము దశాబ్దులకాలము అమెరికాఅభివృద్ధికరముగానే సాగెను. వాణిజ్యములో, పరిశ్రమలలో, వ్యవసాయములో పెక్కు మార్పులు వచ్చి ఉత్పత్తి చాల అభివృద్ధిచెందెను. క్రీ.శ. 1930 లో ప్రపంచమంతట వ్యాపించిన ఆర్థికమాంద్యము వలన అమెరికా కూడ చాల నష్టపడెను. తరువాత రూజువెల్టు అధ్యక్షత క్రింద బహుముఖమైన సంస్కరణ కలాపము జరిగెను. దీనికి ఫలితముగా అమెరికా సంయుక్తరాష్ట్రముల ఆర్థిక స్థితిగతులు చక్కబడినవి. ఇంతవరకు అంతర్జాతీయ రాజకీయములతో తన కేమియు సంబంధములేనట్లుగా నున్న అమెరికాను ఇప్పుడు తిరిగి విదేశాంగ నీతి ఎక్కువగా ఆకర్షించినది. దీనికి కారణము జర్మనీ, ఇటలీ, జపానుదేశముల నియంతృత్వముల విదేశాంగవిధానము వలన ప్రపంచ శాంతి భద్రతలకు ప్రమాదము కలిగించు పరిస్థితి ఏర్పడుటయే.

ఐరోపాలో జర్మని ఇటలీల ఆధ్వర్యవమునను, ఆసియాలో జపాను ఆధ్వర్యవమునను ప్రబలిన నియంతృత్వ విధానము, వీని విదేశాంగ విధానమునకు ఫలితముగ సంభవించిన రెండవ ప్రపంచయుద్ధము మొదట అమెరికా దృష్టి నంతగాఆకర్షించలేదు. కాని క్రీ.శ. 1940 జనవరి 7 వ తేది జపాను ఆసియాలోని అమెరికా సైన్య స్థావరములలో ముఖ్యమైన పెరల్ హార్బరుపై బాంబులు వేయుటతో అమెరికా యుద్ధములోనికి దిగవలసివచ్చెను. ఈ

యుద్ధములో ముఖ్యముగా పసిఫిక్ మహాసముద్రము మీద జరిగిన పోరాటములో, మిత్రరాజ్యముల వారికి విజయము లభించుటకు అమెరికా ముఖ్యకారణమయ్యెను. 1945 సెప్టెంబరులో యుద్ధము అంతమైన తరువాత, అంతకు పూర్వము జరిగిన మిత్రరాజ్యములవారి సంప్రదింపులలో అమెరికా ప్రధానపాత్ర నిర్వహించెను. మొదటి ప్రపంచయుద్ధానంతరము అమెరికా అధ్యక్షుడు విల్సను కృషిఫలితముగ ప్రపంచములో శాంతి స్థాపన కొరకు ఏర్పడిన నానా రాజ్యసమితి స్థానములో ఇప్పుడు ఐక్యరాజ్యసమితి స్థాపింపబడినది. ఈ సంస్థను స్థాపించుటలో ఉద్దేశము కూడ భవిష్యత్తులో యుద్ధములను అరికట్టి ప్రపంచములో శాంతి భద్రతలను సుస్థిరము చేయుటయే. ఈ సమితి స్థాపన విషయములో కూడ అమెరికా ప్రముఖ పాత్రను వహించినది.

యుద్ధము ముగిసినప్పటినుండియు క్రమక్రమముగా అంతర్జాతీయరంగములో అమెరికా ఒకవిధమైన ఆదర్శమునకు, రష్యా మరియొక ఆదర్శమునకు చిహ్నములై వైషమ్యమును పెంపొందించుకొనుచు వచ్చినవి. ఒకవైపున రష్యా తనకు అందుబాటులోనున్న రాష్ట్రములలోను, ముఖ్యముగా యుద్ధములో నష్టపడిన రాష్ట్రములలోను, కొన్ని శతాబ్దుల కాలము పాశ్చాత్యదేశముల సామ్రాజ్యవాద శృంఖలములలో బంధింపబడి యుండుట వలన ఆర్థికముగాను, రాజకీయముగాను వెనుకబడియున్న రాష్ట్రములలోను సామ్యవాద సిద్ధాంతములను, నిర్మాణ విధానమును వ్యాపింపజేయుటకు, ప్రయత్నము చేయుచుండగా, ఇంకొకవైపున అమెరికా ఇట్టి దేశములకే కోట్లకొలది ద్రవ్యము సహాయముచేయుచు అవి కమ్యూనిస్టుల వశము కాకుండునట్లును, తమ శక్తిపై తాము ఆధారపడియుండునట్లు చేయుటకును ప్రయత్నించుచున్నది. ఈ ప్రయత్నముల ఫలితము ఎట్లుండునో నిర్ణయించు అధికారము భవిష్యత్తునకు మాత్రమేకలదు.

ఆర్. ఎస్. ఆర్.

**అమెరికాసంయుక్తరాష్ట్రములు(భూగోళము):** క్రీ. శ. 1776వ సంవత్సరము జులై 4వ తారీఖున 13 రాష్ట్రములు తమ స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిన నాటి నుండి అమెరికా సంయుక్తరాష్ట్రములు ఏర్పడి ఉత్తరఅమెరికాలో విశిష్ట స్థానమును ఆక్రమించి ఉన్నవి. క్రమముగా విశాలమై అవి నేడు 48 రాష్ట్రములతో కూడియున్నవి. అలాస్కా, హవాయ్, పోర్టోరికో మొదలైన పరిసర ప్రాంతాలు కూడ చేరియున్నవి. ఇవి సుమారు 30 లక్షల చదరపుమైళ్ల వైశాల్యము కలిగియున్నవి. జనాభా 1950లో 15 కోట్ల 42లక్షల 33 వేలు ఉండెను. ఇందులో 13 కోట్ల 47 లక్షల 80 వేలమంది తెల్లజాతికి చెందినవారును, 1కోటి 50లక్షల 42 వేల మంది నీగ్రోలును ఉన్నారు. అందువలన నీగ్రోలు జాతిభేదముకలవారగుటచే వారిసమస్యను అమెరికావారు శ్రద్ధతో పరిష్కరించుకొనుచున్నారు.

**పరిపాలన :** అమెరికా ప్రజాస్వామ్యదేశము. అధ్యక్షుని పరిపాలనలో ఉండును. 1787 లో ఏర్పడిన రాజ్యాంగ చట్టము ఈనాటివరకు ఎన్నో సవరణలను పొందుచు పరిపాలనను అభివృద్ధిచేయుచున్నది. రాజ్యపాలనాధికారము అధ్యక్షుని చేతిలో ఉండును. ఈయనను, ఉపాధ్యక్షుని, ప్రతి రాష్ట్రములోను శాసనసభ్యుల సంఖ్యకు సమానమైన ఓటర్లు ఎన్నుకొందురు. జాతీయపతాకములో 48రాష్ట్రముల గుర్తులు ఇమిడ్చినారు. అది 7 ఎర్రగీతలు, 6 తెల్లగీతలతో కూడిఉన్నది. 1814 లో యఫ్.యస్.కీ. రచించిన జాతీయ గీతము అవలంబించినారు. అధ్యక్షుడుకాక మిగతావారు కార్యదర్శులని పిలువబడుచున్నారు. రాష్ట్ర కార్యదర్శి (Secretary of State), కోశ కార్యదర్శి (Secretary of the Treasury), రక్షణకార్యదర్శి(Secretary of Defence) పోస్టుమాస్టరు - జనరల్, అటార్నీ జనరల్, అంతరంగిక కార్యదర్శి (Secretary of the Interior), వ్యవసాయ కార్యదర్శి (Secretary of Agriculture), వ్యాపార కార్యదర్శి (Secretary of Commerce), కార్మిక కార్యదర్శి (Secretary of Labour) మొదలైన వారితోకూడిన మంత్రాంగము (Cabinet) ఉండును. శాసనాధికారము కాంగ్రెసు అను సంస్థ చేతిలో ఉన్నది. ఇందులో ఉన్నత సభ (సెనేటు), ప్రజాప్రతినిధి సభ (House of Representatives) అను రెండు సభలున్నవి. సెనేటులో ప్రతి రాష్ట్రమునకు ఇద్దరు ప్రతినిధులుందురు. వారు 6 సం.లు అధికారములో ఉందురు. శాసనములు చేసే అధికారముతోపాటు, అధ్యక్షుడు ఇతర దేశాలతో చేసికొనెడు అన్ని ఒడంబడికలను 2/3 వంతు ఓట్లతో ఆమోదింపవలెను.

అది లేనిచో ఆసంధిచెల్లనేరదు. అధ్యక్షుడుచేసెడు నియామకాలను ఆమోదించవలసిఉండును. దీని క్రింద నేడు 15 స్థాయీ సంఘాలు (Standing Committees) పనిచేయుచున్నవి. ప్రజాప్రతినిధిసభ (House of Representatives) కు ప్రతిరాష్ట్రము ఓటుచేయ నర్హతగలవారితో ఎన్నుకొని ప్రతినిధులను రెండేండ్ల అధికార పరిమితితో పంపుకొనును. ఓటుచేయు అధికారాలు ఆ యా రాష్ట్రాలలో వేరు వేరు విధముల నిర్వచింపబడిఉన్నవి. 1952 లో అమెరికాలో 9కోట్ల 84లక్షల మంది ఓటర్లుగా నిర్ణయింపబడిరి. 1953-55 సంవత్సరాలకు ఎన్నుకోబడిన మొత్తము ప్రతినిధులు 435 గురు ఉన్నారు. శాసనసభలలో ఉన్నవారు ఉద్యోగములో ఉండకూడదు. 1924 సంవత్సరములో ఇండియను లనబడు స్థానికవాసు లందరికిని ఓటు హక్కు ఇయ్యబడినది. రాష్ట్రాలలో కూడ రెండు శాసన సభలు ఉన్నవి. వాటిని కూడ ఉన్నత సభ (సెనేటు) ప్రజాప్రతినిధిసభ (House of Representatives) అందురు. రాష్ట్రాలన్నియు కేంద్ర ఫెడరలురాజ్యానికి కేటాయింపబడిన విషయాలు తప్ప మిగతా అన్ని విషయాల మీద శాసనాధికారము కలిగిఉండును. ప్రజలలో ఓటుచేసెడు వారందరు కలిసి గవర్నరును ఎన్నుకొందురు. వీరి అధికారాలు ఆ యా రాష్ట్రాల నిబంధనలను అనుసరించి ఉండును.

**సాంఘిక పరిస్థితులు :** అమెరికాలో 1951 లో 36,489,54 గురు జన్మించినారు. 14,31,119 గురు మరణించినారు. 15,94,904 వివాహాలు జరిగినవి. అందులో 3,71,000 రద్దుఅయినవి. ఇప్పుడు 1000 కి జన్మించెడివారి సంఖ్య 245, మరణించెడువారి సంఖ్య 9.7 మాత్రమే. 1952 లో 2,65,520 మంది ఇతర దేశాల నుండి వచ్చి యిక్కడ ఉండిపోయినారు. పురుషులలో 1950 లో 100 కి 26.2 మంది అవివాహితులున్నారు. స్త్రీలలో 19.6 మంది అవివాహితలు. అయినను నూటికి 66.2 మంది మాత్రమే సంసారము చేయుచున్నారు. 1940 లో 2,50,000 కు మించిన జనాభా గల పట్టణములు 37 ఉన్నవి. ఒక లక్ష జనాభాకు పైగా ఉన్నవి 55 ఉన్నవి. ప్రొటెస్టెంటు శాఖకు చెందిన క్రైస్తవులు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. విద్యాప్రచారము ఎక్కువగా ఉన్నది. 7మొదలు 16సంవత్సరాల బాలబాలికలకు చదువు నిర్బంధముగా నేర్పబడుచున్నది. 1951 లో 1859 కళాశాలలు పనిచేసినవి. ఇవిగాక వృత్తివిద్యలు నేర్పెడు పాఠశాలలున్నవి. విద్య యావత్తు రాష్ట్రము చేతులలో ఉండును. మతప్రసక్తితో కూడిన విద్యాలయాలకు ప్రభుత్వ విరాళాలు ఉండవు. అట్టి విద్యాలయాలలో 100 కి 10మంది చేరిఉన్నారు. 1951 లో 1773 ఇంగ్లీషు దినపత్రిక లున్నవి. న్యాయస్థానాలు రాష్ట్ర సంబంధులుగాను, కేంద్ర ఫెడరలు సంబంధులుగాను ఉన్నవి. సర్వోన్నత న్యాయస్థానము కూడ ఉన్నది. అపీలు న్యాయస్థానాలు 11 ఉన్నవి. 1951 లో 6,820 హత్యలు, 5,510 పొరపాటు హత్యలు, 16,800 మానభంగాలు, 52,090 దొంగతనాలు జరిగినవి. 1950 లో 2,09,040 మంది డాక్టర్లున్నారు. 1951లో 6,637 ఆసుపత్రులున్నవి.

**సైన్యము :** 1951 లో 15,61,212 మందిసైనికులున్నారు. 20 డివిజనులు, 18 రెజిమెంట్లు ఉన్నవి. పదాతి సైన్యము, వాయు విమానసైన్యము, కవచ సైన్యము అను మూడు రకాల సైన్యములున్నవి. నావికా సైన్యములో 3,20,000 ఆఫీసర్లున్నారు. 1952 లో వాయువిమాన వాహకనౌకలు 3 పెద్దవి, 11 చిన్నవి, 5 ఇంకను చిన్నవి ఉన్నవి. 10 పెంబడించు నౌకలు, 4 యుద్ధనౌకలు, 15 బరువు ఓడలు, తేలిక ఓడలు 450 విధ్వంసక నౌకలు, 100 జలాంతర్గాములు, 880 ఇతర రకాల ఓడలు ఉన్నవి. 1951 లో 7,87,000 మంది విమానబలములో ఉండిరి. షుమారు 16,909 విమానము లున్నవి.

**ఆర్థికపరిస్థితులు :** ఫెడరలు ప్రభుత్వము 1953 లో 68,736 లక్షల డాలర్లు ఆదాయమును, 79,028 లక్షల డాలర్ల ఖర్చును కలిగి ఉన్నది. 48 రాష్ట్రాలు 28,083 లక్షల డాలర్ల ఆదాయమును కలిగి ఉన్నవి.

**ఆర్థిక సంపద :** ప్రపంచములో భాగ్యవంతమయిన దేశాలన్నిటిలోను అగ్రగణ్యమయినది సంయుక్తరాష్ట్ర ప్రాంతము. 1950 లో 5,95,92,000 మంది కష్టపడి పనిచేయుచుండిరి.

**వ్యవసాయము :** ఆధునిక పద్ధతులమీద చేసెడు వ్యవసాయమువల్ల వ్యవసాయఫలితము అత్యధికముగా ఉన్నది

58,82,162 వ్యవసాయ క్షేత్రము లున్నవి. 1952 లో వేల బుషెల్సులో ఇవ్వబడిన లెక్కల ప్రకారము వ్యవసాయోత్పత్తి ఈ విధముగా ఉన్నది. మొక్కజొన్న, 33,06,735; ఓటుధాన్యము 12,68,280; గోధుమ 12,91,477; బంగాళాదుంపలు 3,47,051; బార్లీ 2,27,008; సోయా 2,91,682. ఇవి దేశము మొత్తము మీద అన్ని రాష్ట్రిలలో పండుచున్నవి. పొగాకు 2,32,82,26,000 పౌనులు పండినది. 1951 లో ప్రత్తి 151,44,000 బేళ్ళు పండినది. 1952 లో 18,864,667,000 డాలర్ల విలువగల పశువులున్నవి.

**అడవులు :** అమెరికా సంయుక్త రాష్ట్రములలో 46,10,44,000 ఎకరాల అడవి ఉన్నది. అందులోనుండి ఏటేటా 1,600,972,000,000 బోర్డు అడుగుల చెక్కను కోసెదరు. అందులో అన్ని రకాల కట్టెలు ఉన్నవి.

**ఖనిజములు :** 1951 లో అమెరికాలో ఈక్రింద పరిమాణమున ఖనిజ ఉత్పత్తి జరిగినది. ఇనుము 1159 లక్షల టన్నులు; వెండి 397 లక్షల ఔన్సులు; బంగారము 17 లక్షల 41 వేల ఔన్సులు; రాగి 9,28,329 టన్నులు; సీసము 3,88,143 టన్నులు; జింకు 6,71,525 టన్నులు బాక్సైటు 18,48,676 టన్నులు; పాదరసము 7,293 బుడ్లు ఉత్పత్తి చేయబడినవి.

**పరిశ్రమలు :** 1950 లో అమెరికాలో 2,50,000 ఫ్యాక్టరీ లున్నవి. అందులో 1,17,66,056 మంది పని చేయుచున్నారు. 20 రకాల పరిశ్రమ విభాగాలు ఏర్పాటు చేయబడినవి. అందులో ఆహారపరిశ్రమ, పొగాకు, గుడ్డల నేత, కొయ్యపని, కాగితపు పరిశ్రమ, అచ్చుపనులు, రాసాయనిక పదార్థాలు, గాజుపనులు, యంత్రపు పనులు, రవాణా యంత్రసామగ్రి ఉన్నతస్థితిలో ఉన్నవి. ఇనుప పరిశ్రమ చాల గొప్పది. అమెరికా సంయుక్తరాష్ట్రిల కార్పొరేషను ప్రపంచములో నెల్ల గొప్పసంస్థ.

**టినెస్సిలోయ సంఘము :** ఇది అమెరికా కంతటికిని ముఖ్యమయిన ఆర్థికాభివృద్ధి ప్రణాళిక గలది. టి. వి. ఎ. అను పేరుగల సంస్థ. 1951 లో టినెస్సి అనెడు నదికి 18 వ ఆనకట్ట పూర్తిచేసినారు. ఇప్పుడు దానికి 28 పెద్ద ఆనకట్ట లున్నవి. 630 మైళ్ల నీటి ప్రయాణ సౌకర్యము ఉన్నది. 600 మిలియన్ టన్నుల - మైళ్ల మోటారులు, ఇనుము, ఉక్కు, గోధుమ, మొక్కజొన్న, బొగ్గు, పెట్రోలియం మొదలయిన యితరసామగ్రి ప్రయాణము చేసినది. ఇందులో 1500 మిలియన్ కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అయినది. దానిధర 1.35 సెంట్లు ఖరీదు ఉన్నది. ఈ లోయలో ఎరువుల ఉత్పత్తి బ్రహ్మాండమైనది. 1950లో ఈలోయ ప్రజల ఆదాయము 5 రెట్లు పెరిగినది.

**వర్తకవ్యాపారము :** 1952 లో 15,642,415,000 డాలర్ల ఎగుమతులు - 10,353,255,000 డాలర్ల దిగుమతులు జరిగెను. ఎగుమతులలో ధాన్యాలు, ధాన్యపు వస్తువులు, వ్యవసాయ యంత్రసామగ్రి, పారిశ్రామిక యంత్రసామగ్రి, మోటారు యంత్రసామగ్రులు, ప్రత్తి, దానివస్తువులు చాల ముఖ్యమైనవి. దిగుమతులలో కాఫీ, ఇనుముజాతికి చెందని ఖనిజవస్తువులు, పెట్రోలియం వస్తువు, వార్తాపత్రికలకాగితము, రబ్బరు, ఉన్ని ముఖ్యమైనవి. బ్రిటను ముఖ్యమైన వ్యాపారదేశము అయినను అమెరికా వ్యాపారము ఆసియాతో ఎక్కువ జరుగుచున్నది. తరువాత ఆఫ్రికాఖండము ఎన్నదగినది. అమెరికాతో వ్యాపారముచేయని దేశము లేదని చెప్పవచ్చును.

**రహదారులు :** 1952లో అమెరికా సంయుక్త రాష్ట్రిలలో 3,312,975 మైళ్ల రోడ్లున్నవి. అందులో 1,700,000 మైళ్ళ రోడ్లు సరిగా నిర్మింపబడిన ఉపరిభాగము కలిగి ఉన్నవి. 1950 లో 223,779 మైళ్ల రైలు మార్గము ఉన్నది. ప్రపంచములో అది నూటికి 29 వంతులున్నది. 1951 లో 88,545 విమానాలు వర్తకములో ఉన్నవి.

డి. వి. కె.

**అమ్మరాజ విజయాదిత్యుడు (క్రీ. శ. 945-970) :-** క్రీ. శ. 625 నుండి సుమారు నాలుగు శతాబ్దులకాలము ఆంధ్రదేశమును అతివైభవముతో పరిపాలించిన తూర్పు చాళుక్యవంశజులలో ప్రఖ్యాతిచెందిన వారిలో రెండవ అమ్మరాజు ఒకడు. ఈతడు రెండవ చాళుక్యభీమునకు లోకమాంబికవలన జన్మించెను, క్రీ. శ. 945 లో తండ్రి మరణానంతరము తనకు అగ్రజుడును, సవతితల్లి కుమారుడును అయిన దానార్ణవుని త్రోసిపుచ్చి విజయాదిత్యు డను బిరుదువహించి అమ్మరాజు వేంగీ సింహాసనమును అధిష్ఠించెను.

రాజ్యాధికారము వహించునప్పటికి అమ్మరాజు వయస్సు 10, 12 సంవత్సరములు మాత్రమే. రాజ్యమునకు వచ్చిన వెంటనే ఇతనికి దాయాదియయిన రెండవ యుద్ధమల్లునితో పోరు ప్రారంభమాయెను. యుద్ధములో అమ్మరాజునకే విజయము లభించినది. కాని ఇంతలో అతని కష్టములు కడతేరలేదు. దేశములో బలవంతులయిన సామంతులు పెక్కురు అమ్మరాజుయొక్క ఆధిపత్యమును నామమాత్రముగా మాత్రమే గుర్తించిరి. దాయాది మత్సరమువలన ప్రమాదముకూడ పూర్తిగ సమసిపోలేదు. రెండవ యుద్ధమల్లుని కుమారులైన బాదపుడు, రెండవ తైలపదేవుడు, అమ్మరాజును పదచ్యుతుని చేయుటకు ప్రయత్నించిరి. వీరు అమ్మరాజు సామంతులయిన వారిలో కొందరను తమ పక్షమునకు త్రిప్పుకొనిరి. అంతేకాక, రాష్ట్రకూట రాజయిన మూడవ కృష్ణుని సహాయమునుగూడ సంపాదించుకొనిరి. రాష్ట్రకూట సైన్యములు వేంగీ సామ్రాజ్యములో అడుగు పెట్టగానే గండనారాయణునివంటి సామంతులును, పాండురంగునివంటి సేనానాయకులును అమ్మరాజును విడిచి పారిపోయిరి. యుద్ధములో ఓడిపోయి ప్రాణము రక్షించుకొనుటకై అమ్మరాజు రాజ్యమును విడిచి పారిపోయెను.

అమ్మరాజును రాజ్యమునుండి తరిమివేసిన తరువాత, బాదపుడు వేంగీ సింహాసనమును అధిష్ఠించెను. కొంత కాలము రాజ్యముచేసి బాదపుడు మృతినొందిన తరువాత అతని తమ్ముడు రెండవ తైలపదేవుడు విష్ణువర్ధనుడను బిరుదముతో రాజ్యమునకు వచ్చెను. తరువాత కొద్ది కాలమునకే అమ్మరాజు ప్రవాసమునుండి వెలువడి వేంగీ దేశములో ప్రవేశించెను. రాష్ట్రకూటులు వేంగిపై దండెత్తి వచ్చినప్పుడు అమ్మరాజును విడిచి పారిపోయిన సామంతులును సైన్యనాయకులును తిరిగివచ్చి అతని యండ చేరిరి. తైలపదేవుని ఓడించి అమ్మరాజు సింహాసనమును అధిష్ఠించెను, తరువాత కొంతకాలము ఒడుదొడుకులు లేకుండ అమ్మరాజు పరిపాలన సాగినది. క్రీ.శ. ౯౫౫ లో రాష్ట్రకూటులు తిరిగి వేంగిపైకి దండెత్తి వచ్చిరి. యుద్ధములో ఓడిపోయి అమ్మరాజు కళింగదేశమునకు పారిపోయెను.

అమ్మరాజును పారద్రోలి, అతని సవతిసోదరుడయిన దానార్ణవునకు రాజ్యము కట్టబెట్టి, రాష్ట్రకూట సైన్యములు వేంగిని విడచి పోయెను. రాష్ట్రకూట రాజునకు సామంతుడుగా కప్పము చెల్లించుచు దానార్ణవుడు కొంత కాలము పరిపాలన సాగించెను. ఇంతలో కళింగము నుండి అమ్మరాజు, పైతృకమయిన సింహాసనము సంపాదించుటకు తిరిగి వేంగిలో ప్రవేశించెను. పోరువల్ల ప్రయోజనము లేదని తెలిసికొని దానార్ణవుడు అమ్మరాజునకు రాజ్యమును వశపరచెను, అప్పటికిని అమ్మరాజుయొక్క కష్టములు కడతేరలేదు. తరువాత కొంత కాలము ఒడుదొడుకులు లేకుండ పరిపాలన సాగినను అతని రాజ్యావసాన కాలములో తిరిగి అంతఃకలహములు చెలరేగెను. అంతవరకు అణగిమణగి యుండిన దానార్ణవుడు తిరిగి విప్లవము లేవదీసెను. ఈ విప్లవము యుద్ధముగా పరిణమించెను. తుదకు యుద్ధములో అమ్మరాజు మరణించెను. అమ్మరాజు తనతండ్రి సింహాసనము నధిష్ఠించి ౨౫ సం॥రము లయ్యెను, ఒడుదొడుకులతో నిండిన అమ్మరాజు జీవితము ఈ విధముగా యుద్ధరంగములో సమాప్తమయ్యెను.

అమ్మరాజ విజయాదిత్యుడు గొప్పయోధుడు. దక్షత గల పరిపాలకుడు. పరమతసహనము కలవాడు. విధి ప్రాబల్యముచే యుద్ధములో ఓడిపోయి రెండుసార్లు రాజ్యము విడచి పారిపోవలసి వచ్చెను. కాని ఇందులకు కారణము పిరికితనము కాదు. అతని పరిపాలన సాగినంత కాలము దేశము సుభిక్షముగా నుండెను. అమ్మరాజు ఏ మతస్థుడయినది ఇదమిత్థమని నిర్ణయించుటకు తగిన ఆధారములు లేవు. అతడు అన్ని మతస్థులను సమానదృష్టితో ఆదరించెను. అటు హిందూమతమునకు చెందినశాఖలలో ఆ కాలములో ముఖ్యమయిన కాలాముఖశైవమునకును, ఇటు వివిధ జైనసంఘములకును సమానప్రతిపత్తి నిచ్చి ఇతడు ఆదరించెను. తన సామంతులలో ఒకడయిన దుర్గరాజు అనునతడు ధర్మపురికి దక్షిణమున కట్టించిన కటకాభరణ జినాలయమను జైనదేవాలయమునకు అమ్మరాజు మలియంపూడి అను గ్రామమును సర్వకర పరిహారముగా దానము చేసెను. అమ్మరాజుయొక్క భోగస్త్రీ అయిన "చామెక" అను వేశ్య కలుచుంబర్రు అను గ్రామమును సకల లోకాశ్రయ జినభవన మను జైన దేవాలయము

లోని భోజనశాలను బాగు చేయించుటకు దానము చేసి నట్లు ఒక శాసనమునల్ల తెలియవచ్చుచున్నది. అమ్మరాజు సామంతవర్గములోని వారైన భీముడు, నరవాహనుడు అను ప్రభుసోదరు లిరువురు విజయవాటిక అనుచోట రెండు జైనదేవాలయములు కట్టించినట్లును, ఆ దేవాలయముల పోషణార్థము అమ్మరాజు ఇప్పటి తెనాలి తాలూకాలోనున్న పెద్దగావిడిపర్రు అను గ్రామమును దానము చేసినట్లును మరియొక శాసనమువల్ల తెలియవచ్చుచున్నది.

ఈ విధముగా తన రాజ్యములోని అన్ని మతముల వారిని సమానముగా ఆదరించి దేశముయొక్క సర్వతోముఖాభివృద్ధికి సర్వదా పాటుబడుచు అమ్మరాజ విజయాదిత్యుడు క్రీ. శ. 970 లో వీరస్వర్గమందెను.

ఆర్. ఎన్. ఆర్.

**అయస్కాంత శాస్త్రము** :- కొన్ని ఇనుప ముడి ఖనిజములయందు తొలుత కనుగొనబడిన ఒక వింతయగు గుణమును అయస్కాంతత్వ మందురు. క్రీ. పూ. 470సం. దాపులో, ఏషియామైనరు దేశములో నొక భాగమగు మాగ్నిషియా అను ప్రదేశములో 'మాగ్నిటైటు' (స్కాంతాయితము) అను ఖనిజము కనుగొనబడినట్లు ఊహింపబడుచున్నది. స్వేచ్ఛగా వ్రేలాడతీయబడిన ఈ ఖనిజపు ముక్క, ఎల్లప్పుడును సామాన్య ఉత్తర దక్షిణ దిశలను చూపుచుండుట పరిశీలించిరి. ఒకేకొన ఎల్లప్పుడు ఉత్తర దిశను చూపుచుండుట వలన అది 'దిక్సూచిక శిల' (Lode Stone) అని పిలువబడినది. ఉత్తర దక్షిణ దిశలను చూపుకొనలు 'ఉత్తర ధ్రువము' అనియు 'దక్షిణ ధ్రువము' అనియు పిలువబడుచున్నవి. ఈ విషయ మెప్పు డావిష్కరింపబడినదో చెప్పుట కష్టముకాని, 1600 సం.లో డాక్టర్ గిల్బర్టు అను వైద్య శాస్త్రజ్ఞుడు ప్రచురించిన డిమాగ్నెట్ (Demagnete) అను గ్రంథము ప్రాచీనగ్రంథములలో నుత్కృష్టమైనది. స్వాభావికముగా అయస్కాంతత్వము కలిగియుండని పదార్థములు, ఏదైన ప్రత్యేక విధానము వలన ఆధర్మమును పొందినచో అట్టి పదార్థములను కృత్రిమఅయస్కాంతము లందురు.

అయస్కాంతత్వము, ఇనుములో గాని, ఉక్కులో గాని వివిధ పద్ధతుల వలన ఉత్పత్తిచేయవచ్చును. ఉదా: ఈ రెండు లోహపు కడ్డీలలో దేనినైనను శక్తిమంతమగు అయస్కాంతముతో రుద్దినపుడు, అది అయస్కాంతీకరణము చేయబడును. ఒక ఇనుపముక్కకు, విద్యుత్ప్రవాహము గలిగి విద్యుద్బంధముచేయబడిన తీగ చుట్టుటవలన దానిని అయస్కాంతముగా చేయవచ్చును. అప్పుడు ఇనుపముక్కను 'విద్యుదయస్కాంత' మందురు. పదార్థములు, అయస్కాంతీకరణము చేయబడినపుడు వానికిగల ప్రవేశ్యతను, అయస్కాంతత్వధారణ శక్తిని బట్టి అవి వివిధములుగా నుండును. ఉదా: మెత్తని ఇనుము ఎంత సులభముగా అయస్కాంతీకరణము నొందునో అంత సులభముగా దానిని కోల్పోవును. కొన్ని ఉక్కులు, అట్లుకాక అతి కష్టముతో అయస్కాంతీకరణము చేయబడి, ఆధర్మమును చాలకాలము నిలువబెట్టుకొనగలవు. అట్టి ఉక్కుతో తయారుచేయబడిన అయస్కాంతములు 'శాశ్వతాయస్కాంతము'లని పిలువబడును. సామాన్యముగా అట్టివి కడ్డీరూపమున గాని, లేక గుఱ్ఱపునాడ ఆకారమున గాని, పట్టీరూపములో గాని చేయబడును. ఒక కడ్డీ అయస్కాంతము, ఇనుప రజములో ముంచబడినప్పుడు, దాని కొనల చుట్టును చాల ఇనుపరజము అంటుకొనును. కాని కడ్డీ మధ్యభాగము నందు అట్లుగాక చాల కొద్ది అయస్కాంత చర్య మాత్రమే కనబడును. దీనిని బట్టి అయస్కాంతముయొక్క కొనలు 'అయస్కాంత ధ్రువములు' అని నామకరణము చేయబడినవి. అవి ఉత్తర దక్షిణ దిశలనుచూపుటచే ఉత్తర దక్షిణ ధ్రువము లనియు పిలువబడును. ప్రయోగముల ఫలితముగా ఈ క్రింది విషయములు తెలియును :

1. '*l*' పొడవుగల అయస్కాంతపు కడ్డీలో రెండు ధ్రువముల మధ్య దూరము దాదాపు ⅚ *l* ఉండును.

2. సజాతి ధ్రువములు (రెండు ఉత్తర ధ్రువములు, మరియు రెండు దక్షిణ ధ్రువములు) ఒకదానిని ఇంకొకటి వికర్షించును. విజాతి ధ్రువములు (అనగా ఉత్తర దక్షిణ ధ్రువములు) ఒకదానిని ఇంకొకటి ఆకర్షించును.

దిక్సూచిసూదివంటి అయస్కాంతీకరణము చేయబడిన వస్తువును ఒక శక్తిమంతమగు దండాయస్కాంతము దాపులో నుంచిన, 1 వ పటమునందువలె ఒక ప్రత్యేక దిశకు మెరలును.

దిక్సూచి యొక్క స్థానము మార్చినచో అది చూపు దిశ కూడా మారుచుండును (ప. 1) అట్లు దానిని త్రిప్పు




పటము 1. అయస్కాంతక్షేత్రము, అయస్కాంత శక్తిరేఖలు.
N S=శక్తిమంతమగు దండాయస్కాంతము
N S=దిక్సూచియొక్క సూది ఉండు దిశ.

శక్తిగల ప్రదేశమును 'అయస్కాంత క్షేత్రము' అందురు. ఆవిధముగా అయస్కాంతము చుట్టును అయస్కాంత క్షేత్రము ఉండును. దానియొక్క గాఢత, వైశాల్యము, NS అను దండాయస్కాంతము యొక్క బలముపై ఆధారపడియుండును. స్వేచ్ఛగా తిరుగు అయస్కాంతపు సూది ప్రతిబిందువుదగ్గర తిరిగినదిక్కుగా గీతలను గీసినచో ఆ గీతలు 'అయస్కాంత శక్తిరేఖ' లనబడును. ఈ గీతలు వాస్తవముగ లేనప్పటికి అవి నిజమైనవనియు, అవి కొన్ని ధర్మములను కలిగియున్నవనియు ఊహించుకొనుట మంచిది. ఉత్తర ధ్రువమునుండి దక్షిణధ్రువము వైపు అవి ఎల్లప్పుడును వచ్చుచున్నట్లుగా ఊహింపబడుచున్నవి. ఆ రేఖలకు ఒక విధమగు బిగుపు కలదనియు, అవి ఒక దానినొకటి వికర్షించు శక్తికలవనియు భావించుట అనుకూలముగా నుండును. ఒక బిందువు దగ్గర ఉంచబడిన ప్రమాణ ధ్రువముపైగల శక్తి చర్యను, ఆ క్షేత్రమునకు లంబముగా ఉండు ఉపరితలముపై ఒక చదరపు సెంటిమీటరులో గీయబడిన రేఖల సంఖ్య వలన, కనుగొనుట ఆచారముగా నున్నది. ఒక ప్రమాణపు అయస్కాంత క్షేత్రమును, ఒక ప్రమాణధ్రువముపై దాదాపు ఒక మిల్లీగ్రాము బరువుగల ఒక 'డైను' శక్తిచూపునట్టి క్షేత్రముగా నిర్వచింతురు.

నిత్యజీవితము నందలి ప్రయోగాత్మక విషయములలో అయస్కాంతపు చర్య యొక్క ప్రాముఖ్యము చాలవరకు విద్యుత్ప్రవాహపు దృగ్విలాసముతో దానికిగల సన్నిహిత సంబంధమును బట్టి యున్నది. ఎట్టి పరిస్థితులలో నైనను, నిజముగా అయస్కాంత క్షేత్రము ఉత్పత్తి కాకుండ ఒక వాహకమునందు విద్యుత్ప్రవాహమును ప్రవహింపచేయుట సాధ్యముకాదు. విద్యుత్ప్రవాహమును తీసికొనిపోవు పొడుగైన తిన్నని తీగలో అయస్కాంత రేఖలు వలయాకారముగ ఉండి, ఆ వృత్తముల యొక్క కేంద్రములు తీగయొక్క ఇరుసుపై పడుటయు, వాని సమతలములు దానికి లంబముగా నుండుటయు సంభవించును. (ప. 2)



పటము 2. విద్యుత్ప్రవాహముకల తీగను చుట్టియుండు అయస్కాంత క్షేత్రము.

తరచుగా నాళాభము (solenoid) అని పిలువబడు తిన్నని స్తూపాకారములో చుట్టలుగా చుట్టబడిన తీగగుండా ప్రవాహమును పంపినపుడు, కడ్డీ అయస్కాంతముతో తయారైన క్షేత్రముయొక్క సాదృశ్యము కల క్షేత్రము ఉత్పత్తియగును. (ప. 3) ఆ శక్తిరేఖలు పూర్తిగా గాలిలో నుండుటయు, ఇనుముయొక్క వింతధర్మములచే మార్పబడకపోవుటయును మాత్రమే భేదము.



పటము 3. దట్టముగా చుట్టబడిన నాళాభముయొక్క అయస్కాంత క్షేత్రము.

విద్యుత్ప్రవాహపు బలమును వృద్ధిచేయుటచేతను, తీగ యొక్క చుట్లసంఖ్య పెంచుటచేతను, బలతరమైన విద్యుత్ క్షేత్రము కేంద్రమునందు ఉత్పత్తి చేయబడును. ఆ తీగ చుట్టలోనికి మెత్తటి ఇనుపముక్కను ప్రవేశపెట్టినచో అది శక్తిమంతమగు తాత్కాలికాయస్కాంతముగా మారును. పదును చేయబడిన ఇనుప ముక్కలను గాని ఉక్కుముక్కలనుగాని ఉంచిన, అవి అదేవిధముగా బలమైన శాశ్వతాయస్కాంతములుగా నగును.

నవీన విద్యుత్ - విధానముల యొక్క అవసరములను బట్టి విద్యుత్‌శక్తి ఉత్పత్తికిని, ప్రచారమునకును సంబంధించి ఇనుము యొక్క అయస్కాంత ప్రవర్తనములు జాగ్రత్తగా పరిశీలింపబడినవి. ప్రధానమగు లక్షణములను గూర్చి సంక్షేపముగా మాత్రమే ఇచట వివరింపబడును. విద్యుత్ ప్రవాహము, పొడుగైన నాళాభము (సాలినాయుడు) ద్వారా ప్రవహించుచున్నదనుకొనుము. నాళాభము లోపలనుండు అయస్కాంత క్షేత్రము యొక్క బలము, ఆ తీగచుట్టల సంఖ్యలను విద్యుత్ప్రవాహపు విలువనుబట్టి తెలిసికొనవచ్చును. ఇనుపముక్క లేనపుడు ఆ అయస్కాంత క్షేత్రబలమును తెలుపుటకు సాధారణముగా H గుర్తుగా ఉపయోగించబడును. ఇది $0.4\pi ni$ కి సమానముగా నుండును. ('n' అనగా 1 సెంటిమీటరునందు తీగచుట్ల యొక్క సంఖ్య. 'i' అనగా విద్యుత్ ప్రవాహము విలువ అంపియరులలో) ఇప్పుడు ఒక ఇనుపముక్క నాళాభములోనికి ప్రవేశపెట్టబడినపుడు, అయస్కాంత క్షేత్రము వృద్ధిచెందినట్లు తెలియును. ఇనుప ముక్కగాని, మరి యే ఇతర అయస్కాంత పదార్థము యొక్క సమక్షమునగాని అయస్కాంత క్షేత్రము యొక్క బలము, B చేత గుర్తింపబడును. ఇనుము సమక్షములో H కన్న B అధికముగా నుండును. B, H ల నిష్పత్తి '$\mu$' ప్రవేశ్యత అని పిలువబడును. ఈ ప్రవేశ్యత, ఇనుము యొక్క స్వభావముపైనను, అయస్కాంత క్షేత్ర శక్తిపైనను ఆధారపడి మారుచుండునట్టి కారణరాశి. ప్రథమ క్షేత్రమగు H, 'అయస్కాంతీకరణ క్షేత్ర' మనియు, రెండవదియగు B 'అయస్కాంత ప్రేరణము' అనియు పిలువబడుచున్నవి. అనగా, ఒక చదరపు సెంటిమీటరు వైశాల్య ప్రమాణముగల గాలి యందలి అయస్కాంతశక్తి రేఖల సంఖ్యను H గాను, ఒక్క చదరపు సెంటిమీటరు వైశాల్యముగల ఇనుము లేక మరి ఇతర అయస్కాంతపదార్థములోని అయస్కాంతపు శక్తిరేఖల సంఖ్యను B గాను, వివరింపనగును. H పరిమాణముల సమమగు అయస్కాంత క్షేత్రమునందు ఒక పదార్థము పెట్టబడినపుడు, ఆ పదార్థము అయస్కాంత ప్రేరణము వలన, అయస్కాంతీకరణము చేయబడునని చూపింపనగును. ఆ పదార్థముగుండా పోవునట్టి అయస్కాంత శక్తిరేఖల మొత్తపు సంఖ్యను 'B' వలన తెలియనగును.

$B = H + 4\pi I.$

I అయస్కాంతీకరణము యొక్క గాఢత్వమును సూచించురాశి. (m అనునది అయస్కాంత ధ్రువము యొక్క శక్తిగాను, l అనునది అయస్కాంత ధ్రువముల మధ్యదూరముగాను తీసికొనిన, 'ml' అను గుణిజము "అయస్కాంతబిభ్రమిష" (Magnetic moment) గా పరిగణించనగును.) పై సూత్ర మొత్తమును H చేత విభజించిన ఎడల మనకు $\frac{B}{H} = 1 + 4\pi\frac{I}{H}$ అగును. $\frac{B}{H}$ అను నిష్పత్తి ప్రవేశ్యత '$\mu$' గాను, $\frac{I}{H}$ అను నిష్పత్తి గ్రహణశక్తి 'K' గాను, పిలువబడుచున్నవి. అందువలన అయస్కాంతపు ప్రవేశ్యతకును గ్రహణశక్తికిని గల మధ్య సంబంధము $\mu = 1 + 4\pi K$ గా నుండును.

అయస్కాంత తటస్థస్థితిలోనుండు ఇనుమును, ఒక నాళాభములో నుంచి, క్రమముగా సున్న నుండి విద్యుత్ప్రవాహమును వృద్ధిచేసిన ఆ ఇనుము యొక్క అయస్కాంత క్షేత్రము క్రమముగా పెరుగుచుండును. B, H లకు గల విలువల తారతమ్యములను బట్టి కొన్ని చిత్రమైన ఫలితములు వచ్చును. B, H సంబంధమును చూపు గ్రాఫ్ చిత్రమును అయస్కాంతీకరణ లేఖ్యము అందురు (ప. 4).

H= సున్నగా నున్నపుడు, B సున్నగాను, H పెరుగు కొలది B విలువ తొలుత క్రమేణ పెరుగుచు, తరువాత అతి త్వరితముగా వృద్ధియగు క్షేత్రముతో, విరివిగా కోబాల్టు (cobalt) కు 80 అగునంతవరకు పెరుగును. 80 వచ్చిన తరువాత, B యొక్క వృద్ధియందలి వేగము H తో, త్వరితముగాను, కొలదిగాను పడిపోవుటకు ప్రారంభించి, అంతకంటె ఎక్కువ యగుటకు వీలులేనట్టి విలువను




పటము 4. H. అయస్కాంత క్షేత్రబలము - ఓరుస్టెడ్‌లలో సాధారణ ఇనుము, కోబాల్టు, నికెలులయొక్క అయస్కాంతీకరణపు రేఖాచిత్రములు.

B పొందును. అప్పుడు ఆ పదార్థము సంతృప్త అయస్కాంతీకరణము నొందినదని చెప్పవచ్చును. అట్టి సంతృప్త స్థానమును పొందిన తరువాత అయస్కాంత క్షేత్రమును తగ్గించినచో B యొక్క విలువలు, H వృద్ధినొందునపుడు ఉన్నదాని విలువలతో సమముగా నుండవు.

H సున్నగాచేయబడి, మరల అధికమైన విలువలోనికి తేబడినపుడు B, a b c d e అను వంపును కలుగజేయును. క్షేత్రము క్షీణింపచేయబడినపుడు ఏర్పడు అయస్కాంత ప్రేరణముయొక్క వింతయగు ఈ మందత్వమును (వెనుకబడినతనమును) 'హిస్టెరిసిస్' (Hysteresis) 'మందాయనము' అందురు. H ని సున్నగా తగ్గించినపుడు, B సున్నగా కాక, *ob* అను ఒక విలువను కలిగియుండునని స్పష్టముగా తెలియుచున్నది. ఈ విలువను 'శేషాయస్కాంతత్వము' (Residual Magnetism) అందురు (ప. 5). ఈ మందాయనముయొక్క చుట్టు వైశాల్యము ఒక పూర్తి పరివర్తనములో అయస్కాంతీకరణము జరిగినపుడు జనించు ఉష్ణశక్తిని కనుగొనుటకు ఉపయోగించును. ఇది విద్యుత్ మోటారుల నిర్మాణము లందును, విద్యుత్ పరివర్తన యంత్రముల నిర్మాణములకు సంబంధించిన నిర్మాణాత్మకమైన ప్రయోజనములను కలిగియున్నది.

పైన చెప్పబడిన విధముగా విద్యుత్ప్రవాహము ఎల్లప్పుడును అయస్కాంత క్షేత్రముతో కూడుకొని యుండును. అయస్కాంతత్వమునకు విద్యుత్ప్రవాహమునకును ఉండునట్టి సంబంధ దృగ్విషయమును, తొలుత 1819 సం లో విద్యుత్ప్రవాహమును తీసికొనిపోవు తీగకు పరిసరములో లంబముగా నుంచబడిన అయస్కాంతపు సూది కొన విక్షేపమును పరిశీలించినట్టి ఓరుస్టెడ్ అను శాస్త్రజ్ఞుడు కనిపెట్టెను.

1845 సం. వరకు అయస్కాంతముచే ప్రభావము నొందింపబడు పదార్థములు ఇనుము యొక్క జాతికి సంబంధించిన పదార్థములు మాత్రమే యని నమ్మబడు




పటము 5. B, H. రేఖాచిత్రము

చుండెడిది.(అనగా ఇనుము,నికెలు, మణిశిల లేక కోబాల్టు.) 1845 సం. లో ఫారడే, వేరొక ఫలితము కొరకు ప్రయోగములు జరుపుచుండగా అయస్కాంత క్షేత్రమునందు ఉంచబడిన గాజు, ఇనుము కనబరచుచున్నట్టి అయస్కాంత ధర్మములకు వ్యతిరేకముగా నుండు ధర్మములను చూపించుటను కనుగొనెను. బిస్మత్ అను లోహము కూడ ఎక్కువ బలముగా అట్టి ధర్మములనే ప్రదర్శించినది. అతడు ఘన, ద్రవ, వాయు స్థితులలో నుండు చాల పదార్థములను వానికి గల అయస్కాంత ధర్మములకై పరీక్షించి, అన్ని పదార్థములును మూలకములైనను సంయోగములైనను, ఇనుమువంటి లేక గాజువంటి అయస్కాంతత్వములు పొందియున్నవని వివరించుచు, అయస్కాంత రసాయన శాస్త్రమునకు పునాదివేసెను. అతడు ఈ క్రింది విధముగా వర్గీకరించెను.

1. ఇనుము, మణిశిల (కోబాల్టు), నికెలు స్ఫటము (అల్యూమినియం,)క్రుసుమము(క్రోమియం), పొటాసియం, సోడియం, మగ్నము(మగ్నీషియం), మాంగనము(మాంగనీసు), తగరము, అమ్లజని మొదలగు పదార్థములను అయస్కాంత క్షేత్రమునందుంచిన, అవి క్షేత్రమునకు సమాంతరముగా నుండునట్లు ఏర్పాటగును. అట్టి పదార్థములను ఏకాధిచుంబక (Paramagnetic) పదార్థములందురు.

2. సీసము, బంగారము, రజతము, కర్బనము, తామ్రము, గంధకము, అంజనము (అంటిమొని), బిస్మత్, నీరు మొదలగు పదార్థములు, అయస్కాంత క్షేత్రమునందుంచబడినపుడు, క్షేత్రమునకు లంబముగా ఉండునట్లు ఏర్పాటుకావించుకొనును. (ప. 6) అట్టి పదార్థములను ఏకోనచుంబక (డయామాగ్నెటిక్) పదార్థములందురు. అట్టి పదార్థములు అయస్కాంతముచే వికర్షింపబడును. పేరామాగ్నటిక్ పదార్థములు అయస్కాంతముచేత ఆకర్షింపబడునవి. ఇనుము, కోబాల్టు, నికెలు మొదలగు



పటము - 6. అయస్కాంతక్షేత్రమున ద్రవము

నవి అయస్కాంతము చేత గాఢంగా ఆకర్షించబడును. అట్టి పదార్థములను ఫెర్రోమాగ్నటిక్ (ferromagnetic) పదార్థములందురు. ఈ విధముగా ఫారడే, ప్రతి పదార్థమును ఏదోఒక రూపములో కొంచెముగనో, ఎక్కువగనో చుంబ



పటము - 7
షీక ఇనుప కడియము వలన ఏకరూప ఒత్రము చెందుమార్పు

కీయ పదార్థమని చూపించెను. అతడు ఇంకను డయామాగ్నటిక్, పేరామాగ్నటిక్ పదార్థములు, వాటి అయస్కాంతత్వమును, బయట నుండు క్షేత్రప్రభావము వలననే ఉంచుకొనగలవని నిర్ణయించెను. (ప. 7)

అయస్కాంతత్వవిషయములో అతి విజయవంతములగు పరిశోధనలలో నొకటి, మేరీక్యూరీ భర్తయగు పీరీ క్యూరీ చేసినది గలదు. 1895 సం. లో అతడు అధిక సంఖ్యాకములగు పదార్థముల యొక్క అయస్కాంత గ్రహణ శక్తులను, ఉష్ణోగ్రతల వలన వానికి కలుగు మార్పును కొలిచెను. అతడు ఈ పనిని డయా, పేరా, ఫెర్రో మాగ్నటిక్ పదార్థములపై ఉష్ణోగ్రతా ప్రభావము, వాటియందుండు అయస్కాంతత్వము మూడురకములా లేక, భౌతికముగా ఒకేరకమా అనువిషయము నిర్ధారణ చేయవలయు నను అభిప్రాయముతో ప్రారంభించెను. క్యూరి యొక్క ప్రాథమిక పరిశోధనలవలన ఈ క్రింది విషయములు సిద్ధాంతీకరింపబడెను.

1. డయామాగ్నటిక్ గ్రహణశక్తులు సామాన్యముగా ఉష్ణోగ్రత పైనను, అయస్కాంత క్షేత్ర బలముపైనను ఆధారపడియుండవు.

2. పేరామాగ్నటిక్ గ్రహణశక్తులు నిరపేక్షిక ఉష్ణోగ్రత (absolute temperature) తో విలోమముగా నుండును. (దీనినే 'క్యూరీసూత్రము' అందురు.)

3. అధిక ఉష్ణోగ్రతలలో, ఫెర్రోమాగ్నటిక్ పదార్థములతో చేసిన ప్రయోగములవలన, అతడు, ప్రతి ఫెర్రో

మాగ్నటిక్ పదార్థమునకు ఒకవిధమగు సందిగ్ధఉష్ణోగ్రత (critical temperature) కలదనియు, ఆ ఉష్ణోగ్రతయందు అది డయామాగ్నటిక్‌గా రూపొందుననియు సిద్ధాంతీకరించెను. ఇంతియేకాక, ౯ వ చిత్రములో చూపించబడినట్లు ఫెర్రోమాగ్నటిక్ పదార్థముల యొక్క గ్రహణ శక్తులు ఉపయోగించబడిన క్షేత్రముల శక్తులను బట్టి మారుచుండును. మరియు అయస్కాంతీకరణము జరిగిన తరువాత అవి మందాయనము (Hysteresis) అను విశేషమును చూపించును.

భౌమాయస్కాంతత్వము : భౌమాయస్కాంతత్వ శాస్త్రము యొక్క పరిజ్ఞానము, భూమి యొక పెద్ద అయస్కాంతమను అభిప్రాయముమీద ఆధారపడి యున్నది. 'భూమి యొక్క ఉపరితలముపై నుండు దిక్సూచి కొనలు సామాన్యముగా ఉత్తర దక్షిణ దిశలకు ఉండునట్లుగా ఏర్పాటుచేసికొనును. ఆ ధ్రువములు, సరిగా భౌగోళిక ఉత్తరదక్షిణములను చూపించకపోవుట వలన, ఆయస్కాంతిక, భౌగోళిక ధ్రువములు రెండును ఒకదానితో నొకటి కలియవు(ప. 8). ఈ రెండింటికి మధ్యగా నుండు కోణము 'దిక్పాతము' (Declination) అని పిలువబడును. ఒక ఉక్కుసూదిని సన్నని సిల్కుదారముతో మధ్యప్రదేశమున కట్టి గాలిలో వ్రేలాడదీసిన, అది క్షితిజసమాంతరముగా ఆగును. ఆ సూదిని అయస్కాంతీకరణము నొందించిన, అది ఇందాకటి స్థితికి ఏటవాలుగా నిలువుగానుండు స్థితిలో ఆగును. ఆ సూది యొక్క క్షితిజసమాంతరముగా నుండు స్థితికిని, ఏటవాలుగా నిలువుగానుండు స్థితికిని (దిశలకు) మధ్యనుండు కోణమును 'అవపాతము' (Dip or Inclination) అందురు. ఒక ప్రదేశమునందుండు అవపాతమును, దిక్పాతమును, భూ అయస్కాంతము యొక్క గాఢత (Intensity) ను ఆ ప్రదేశమందలి అయస్కాంత మూలకములందురు (Magnetic Elements). నావికాదిక్సూచి ఉపయోగము, అయస్కాంతపు మూలకముల పరిజ్ఞానముపై సంపూర్ణముగ ఆధారపడియుండును. ఆ విషయజ్ఞానము కొరకు క్రమములేని గీతలతో పటములు వ్రాయబడి యున్నవి. ఆ గీతలనుబట్టి భూమిపై ఏయే ప్రదేశములలో ఒకే దిక్పాతముండునో తెలిసికొనవచ్చును. అట్టి గీతలు 'సమవినత రేఖలు' (Isogonic lines) అని పిలువబడు చున్నవి. 'గౌసు' అను శాస్త్రజ్ఞునిచే 18 వ శతాబ్దములో ప్రతి దినము దిక్సూచి యొక్క దిక్పాతము మారుచుండునని కనుగొనబడినది. ఇది దైనందిన మార్పు (Diurnal variation) అని పిలువబడుచున్నది. ఈ అయస్కాంత మూలకములలో హఠాత్తుగాకూడా మార్పు సంభవించును ; అట్టివి 'అయస్కాంతపు తుపానులు' (Magnetic Storms) అనిపిలువబడును. తరచుగా సంభవించునట్టి ఇట్టి మార్పులు వాతావరణ విద్యుత్ పరిస్థితులు, సూర్యునియందలి మచ్చలు మొదలగు వానితో సంబంధించి యుండును. ఇట్టి క్లిష్టమగు విషయములను గ్రహించుటకు గాను, రాత్రింబవళ్ళు అయస్కాంత శక్తుల యొక్క




పటము - 8.
భూమియొక పెద్ద అయస్కాంతమని చూపు ఊహాచిత్రము. ఈ భౌగోళిక అయస్కాంత క్షేత్రము భూమ్యుపరిభాగమున చాల ఎత్తువరకు వ్యాపించి యుండును.

అసంఖ్యాకములగు ఒడుదుడుకులను రికార్డుచేయునట్టి అతిసున్నితములగు పరికరములతో అయస్కాంతావలోకనశాలలు ఏర్పాటుచేయబడి యున్నవి.

ఏ. యమ్. జ.

**అరబ్బీ భాషాసాహిత్యములు :-** అరబ్బీ భాష సెమెటికు భాషా కుటుంబమునకు సంబంధించినది. ఇందు హీబ్రు, ఫినీషియన్, అరమెయిక్, అస్సీరియన్ మున్నగు ఉత్తర, దక్షిణ ప్రాంతముల భాషా సమూహములు చేరియున్నవి. పురాతత్త్వశాఖవారి పరిశోధనల ఫలితముగా క్రీ. పూ. 4000 సం.ల నుండియు అరబ్బుల నాగరికతా చరిత్ర కనబడుచున్నది. హిమ్యరిటిక్ అనబడు దక్షిణ అరేబియా ప్రాంతమునందలి శాసనములు క్రీస్తుపూర్వము నుండి మొదలుకొని క్రీస్తు తరువాత 6 వ శతాబ్ది వరకును లభించుచున్నవి. ఇవి అత్యంత వికాసవంతమయిన వారి సంస్కృతిని, వారి ఆర్థికసంపదను, హిందూదేశమువరకు వ్యాపించిన వారి విశాల వాణిజ్య సంబంధములనుగూర్చి తెలుపుచున్నవి. ఈ శాసనములు, వా రుపయోగించు చుండిన భాష ఉత్తమ సంస్కార భూయిష్ఠమైనదనియు, క్రీ. పూ. 1500 ప్రాంతమునందే లేఖనకళ వారిలో పరిపూర్ణ వికాసము చెందినదనియు, రుజువు చేయుచున్నవి. అదే విధముగా ఉత్తర అరబ్బీభాష నగర సంస్కృతిని (Urban culture) పెంపొందించెను. అజ్ఞాత కాలము నుండియు మక్కా పట్టణము వాణిజ్యమునకును, మతములకును కేంద్రముగా నుండెను. దక్షిణ అరబ్బీ తెగలవారి యొక్కయు, మెసపుటేమియాలోని పారసీక ప్రభావితు లయిన అరబ్బుల యొక్కయు ప్రభావము, ఉత్తర అరబ్బీభాషలో భాషాభివృద్ధికిని, ఉన్నతమైన నాగరకతకును దోహద మొసగినది. అరబ్బీభాషలో ఇప్పుడు వాడబడుచున్న అరబ్బీ అక్షరములు క్రీ. శ. 6 వ శతాబ్దపు శాసనములందు మాత్రమే కనబడుచున్నవి.

ఏడవ శతాబ్దము మొదలుకొని, ఇస్లాం మత వ్యాప్తితో పాటు ఉత్తర అరబ్బీభాష ప్రజాజీవనమునందును, నాగరకత యందును ప్రగాఢముగ నెలకొనెను. ఇట్లిది అరేబియా ద్వీపకల్పమునందేకాక ఆసియా దేశములలోను, ఆఫ్రికాలోని ప్రాగుత్తర ప్రాంతములలోను, స్పెయిన్, సిసిలీ మున్నగు పాశ్చాత్య దేశములలోను కూడ వ్యాప్తి చెందెను. ఈ ప్రాంతములలో అరబ్బీభాష వాడుక భాషగా నుండుటయేగాక అది ఈజిప్టు, మాల్టా, ఈరాన్, జావా మొదలగు దేశములందును, ఏదో విధమున స్థానిక భాషలనుకూడ త్రోసి రాజని పైకి వచ్చెను. దూర దూరములందున్న విశాల ప్రాంతములయందు వ్యాప్తి చెందినందున ఆయా స్థానిక ప్రభావములు కారణముగా అరబ్బీభాషయందు పెక్కు మాండలిక భేదములు (dialects) రూపొందెను. కాని ఈ దేశము లన్నింటిలోను గ్రంథభాష ఒకేవిధముగా నిలచియుండెను. పదమూడు శతాబ్దముల వెనుకనుండియు అది ఖురాను శైలిని, రచనా క్రమమును ఆధారముగా గొనుటయే యిందులకు కారణము. ఇది మధ్యప్రాచ్య దేశములలో పెక్కింటికి మాతృభాషగా నుండుటయేగాక ముస్లిం ప్రపంచములోని మత వ్యవహారములకును ప్రకృతి శాస్త్ర విజ్ఞాన ప్రసారమునకును వాడబడుచుండెను.

**అరబ్బీ వాఙ్మయోత్పత్తి-వికాసము (క్రీ. శ. 500-750):-** ప్రపంచములోని మహావాఙ్మయము లన్నింటి యందు వలెనే ఇస్లాముమత ప్రారంభమునకు పూర్వపు అరబ్బుల విజ్ఞానవిలసితజీవితము పద్యరచనలలో ప్రత్యక్షమయ్యెను. అరబ్బీ పద్యములు అంత్యానుప్రాసాత్మకమగు గద్యగా ప్రారంభించెను. ఈ గద్య విధానమునే విమతారాధకు లగు (Pagans) గణాచారులు (సోదెచెప్పువారు-Oracles) తమ మంత్రోచ్చాటనా సందర్భములందు ఉపయోగించుచుండిరి. రానురాను అదియే అధికముగ లయానుబద్ధమైన రూపమును పొందెను. తరువాత నిది పదునారు ఛందస్సులుగా విభక్తమయ్యెను- ఈ ఛందస్సుల మారు రూపములీ పరిగణనలో చేరలేదు. ప్రాచీనకాలములో ఉకాజు పట్టణము నందును, మక్కా పట్టణమునందును జాతరలు జరుగుచుండెను. అప్పుడు కవులు సమావేశమయి ఒకరి నొకరు మించునట్లుగా కవిత ల్లిల్లి పోటీపడుచుండిరి.

వారు అల్లిన పద్యకవిత్వమును ఖసీదా (గేయగీతిక) అందురు. ఈ గేయగీతికలు ఆంగ్లభాషలోని ఓడ్స్(Odes) వంటివి. ఇందు 60 నుండి 100 వరకు పంక్తు లుండ వచ్చును.

ఇస్లాము మతమునకు పూర్వయుగమున రెండు రాజాస్థానములు అరబ్బులకుండెను. ఇందొకటి "ఘస్సనీద్"

(ghassanid) వంశ పరిపాలితము. ఈరాజ్యము అరేబియా యొక్క ఈశాన్య భాగమున వ్యాపించియుండెను. మరి యొకటి "లఖ్మిద్" వంశ పరిపాలితము. ఈ రాజ్యము యూఫ్రటిస్ నదికి పడమటి దిశయందు వ్యాపించియుండెను. ఘస్సనీదుల సంస్కృతీ సభ్యతలు రోమను ప్రభావముల తాకిడికి గురియైయుండగా, లఖ్మిదులు పారసీక (సస్సేనియన్) సంస్కృతిచే ప్రభావితులయిరి. ఈ రెండు రాజ్యములు పెర్సియా, రోము దేశముల మధ్య జరిగిన యుద్ధములందు ఘనమైన పాత్రను వహించెను. తమ రాజాస్థానములకు ఏతెంచు కవులను, ఈ రెండు రాజ్యముల ప్రభువులును సత్కరించుచుండిరి.

ఇస్లాం పూర్వ యుగ కవితనుబట్టి, ఈ ఎడారి ప్రజలు తమ తమ విశ్రమస్థానముల (encampment) కనువగు గడ్డి మైదానములను, సారవంతములగు భూములను వెదకుచు దేశద్రిమ్మరులుగా తిరుగుచుండెడివారని తెలియుచున్నది. వీరు ప్రకృతి పరీక్షయందు నిపుణులై వాస్తవిక దృష్టిగలవారై యుండిరి.

ఇస్లాం పూర్వయుగ కవితలో వేదాంతధోరణి గాని, గంభీర ధార్మికచింతనగాని లేదు. బిదూయీన్ అరబ్బులు నీతిప్రవర్తన యందును, సాంఘికజీవనము నందును తమ తెగసంప్రదాయములనే గౌరవించిరి. శౌర్యము, ప్రేమ, ఇష్టజన వియోగముచేనైన దుఃఖము, అవమానము, ఘనత, ఆతిథ్యము అనునవి వారికవితకు వర్ణనాంశములు. ఇవి ప్రజారంజకములగు విషయములై యుండెను. వీటిని గూర్చియే వారెక్కుడుశ్రద్ధ గనుపరచుచుండిరి.

అయినను, ఇస్లాం పూర్వయుగకవితలో యుద్ధములు; సాహసకార్యములు, ఆతిథ్యనిరతులగు దాతల సంకీర్తనములు, పిసినిగొట్టుల యొక్కయు, పిరికిపందల యొక్కయు నిందాపూర్వకవర్ణన లేయున్నవి. ఈ విధముగా ఈ కవిత్వము అప్పటి సాంఘికపరిస్థితులను స్పష్టముచేయు మూలసాధనముగను, అరబ్బుల జాతిలోని తెగల చరిత్రను జాటు నదిగాను ఉపకరించుచున్నది.

కొన్ని ఉపన్యాసక్రమములును, సోదెకాండ్రు వచించు అనుప్రాసయుక్తములగు మాటల ధోరణులును తప్ప ఇస్లాము పూర్వయుగమున వచన వాఙ్మయమున్న జాడ కనుపించదు. ఖగోళశాస్త్రము, శీతోష్ణస్థితిశాస్త్రము (climatology) ముఖలక్షణ (సాముద్రిక) శాస్త్రము (physiognamy), వంశానుచరితము (geneology) — ఈ శాస్త్రములతో అరబ్బులకు పరిచయమున్నట్లు తోచుచున్నది. ఏమైననేమి ? అరబ్బీ వాఙ్మయములో మొదటి గ్రంథముగా మనకు కనబడునది ఖురాను గ్రంథమే. ఈ గ్రంథములో న్యాయ్యముగను, దైవచింతనముతోను జీవితము గడుపుటకు వలయు ధార్మిక నీతిసూత్రములును, సాంఘిక నియమములును ప్రవచింపబడినవి. సాహిత్య దృష్టిలో ఉదాత్తగ్రంథముగా ఖురాన్ విశిష్టతను కలిగి యున్నది.

మహమ్మదుప్రవక్త జీవించియున్న కాలములో ఇస్లాం పవిత్రగ్రంథము నిర్మితమైనప్పుడు అరబ్బీ లిపి దోషభూయిష్ఠముగా నుండెను. గ్రంథ విషయములు భ్రష్టము కాకుండ కాపాడుటకు తగు లిపిని, వ్యాకరణ సూత్రములను పునర్నిర్మించుట అత్యవసర కార్యమయ్యెను. ఖురాను వాక్యార్థనిర్ణయమునకు వ్యాకరణశాస్త్ర పఠనము, శబ్దరాశి జ్ఞానము అవసరమయ్యెను. పదముల యొక్క సరియైన అర్థము ఇస్లాం పూర్వయుగ కవుల రచనల ననుసరించి నిర్వచింపబడుచువచ్చెను. ఇందుమూలమున ఇస్లాం పూర్వయుగకవుల రచనలను సంకలించుట అవసరమయ్యెను. ఈ విధముగా శబ్దతత్త్వశాస్త్రము (philology), నిఘంటు నిర్మాణము ఆవిర్భవించెను. మహమ్మదు ప్రవక్తయొక్క ఉపదేశములు, కృత్యములు మనస్సునకు తెచ్చుకొని, తదనుసారముగా ఖురాను సిద్ధాంతముల ఆచరణ విధానము నిర్ణయింపబడెను. తత్ఫలితముగా "పవిత్ర సంప్రదాయ" మనబడు శాస్త్రము = (Hadith) ప్రచలితమయ్యెను.

మొదటి నలుగురు ఖలీఫాల కాలముముగిసిన తరువాత ఇస్లామీ విజ్ఞాన ప్రబోధ కేంద్రము ధర్మనిష్ఠాపరులైన ఖలీఫాల రాజధాని అగు మదీనానుండి డమాస్కసు పట్టణమునకు మారెను. అప్పుడు డమాస్కసునందు, లౌకికభావ సమన్వితులును, మక్కా కుటుంబమువారును అయిన "ఉమ్మయ్యాదు"లు, అంతకుముందున్న ప్రజారాజ్య విధానమును నెట్టివైచి, ఆస్థానమున రాజవంశ పరిపాలనా విధానమును నెలకొల్పిరి. ఉమ్మయ్యాదులు రాజ్యాధికారము వహించినప్పటినుండియు ఇస్లాం పూర్వ

యుగ ఆచారములు, ఆదర్శములు తిరిగి తలఎత్తి వ్యాపింపసాగెను. అంతకు ముందుండిన ధర్మతత్పరత్వము యొక్క స్థానమును స్వేచ్ఛావిలాస జీవితము ఆక్రమించెను. గ్రామీణ రాజకీయ పక్షములలో అంతర్యుద్ధములు పొడసూపెను. ఈ అంతర్యుద్ధములు బిదూయిన్ అరబ్బులకు పట్టణ జనులతో సంపర్కము కలిగించినవి. వీరిద్వారా బిదూయిన్ కవితయొక్క ప్రాచీన రీతులు పట్టణములలో ప్రవేశించెను. ఈ కవిత సామాన్యముగా ఉద్రేకాత్మకము, ప్రకోపనాత్మకము అగుటచేత అచ్చట వర్ధమానమగుటకు దానికి అనుకూల వాతావరణము లభించెను. కాని, విమతస్థుల ఆక్షేప కావ్యములును (Satire=Hija), స్తోత్ర కావ్యములును (Eulogy= Fakhr) ఇప్పుడు రాజకీయ వాసనకలవియై రాజకీయ కవిత్వము, రాజకీయ ఆక్షేప కావ్యములు ప్రత్యక్షము కాజొచ్చెను.

విలాస జీవితవిధానము ప్రేమభావ పుష్టమై శృంగారాత్మకమైన, కావ్యములు ప్రభవించుటకు కారణమయ్యెను. విశుద్ధ ప్రేమాత్మక కావ్యములు ముఖ్యముగా ఎడారి జనపదములందు వర్ధిల్లుచుండెను. నగరవాసుల ప్రేమ కవిత్వమునకు విరుద్ధమైన ప్రేమానుభవములను ఎడారికవి వర్ణించుచుండెను. బుతానియా ప్రేమికుడగు జమిత్బునూమరు " (Jamit-b-Ma'mar. d. 82 A. H.), లుబ్నా ప్రియుడగు ఖైస్బుజారిహ్ (Qais-b-Jarih); లైలా వలపుకాడగు మజ్నూ - వీరు పవిత్రప్రేమ కవిత్వమునందు నాయకులు. విమతస్థుల కాలములో 'గజల్' అను ఛందస్సు, ఓడ్ అను ఛందస్సునం దంతర్భాగముగ నుండెను. దానికి స్వతంత్ర అస్తిత్వము లేకుండెను. కాని ఉమ్మాయ్యాదుల కాలములో అది యొక స్వతంత్ర ఛందస్సుగా రూపొందెను.

ఇస్లాం మతము సాహితీ సంస్కృతులయొక్క అభివృద్ధిని పురికొల్పెను. అది క్రమముగా బలపడెను, అప్పుడు విద్వాంసులు ప్రాచీన కవితా గ్రంథముల సేకరణ ప్రయత్నమునకు పూనుకొనిరి. "రావిస్" (Rawis) అను వారు ప్రాచీన కవితాగాయకులు. వీరు ఆ గీతములను వల్లెవేసి గానము చేయుచుండెడివారు. ఈ రావిసులు ప్రాచీన కావ్యసేకరణ భారమును వహించిరి.

**అరబ్బీ వాఙ్మయ లక్షణములు :- (750—1258)** క్రీ. శ. 750లో అబ్బాసిదులు రాజ్యారోహణ మొనరించిన నాటి నుండి అరబ్బుల రాజకీయ, సంస్కృతి జీవితములందు ప్రధానమయిన మార్పులు వచ్చెను. ఖలీఫాల రాజధాని డమస్కసునుండి బాగ్దాదుకు మార్చబడెను. బాగ్దాదులో రాజకీయ, పరిపాలన, సంస్కృతి, జీవితరంగములందు పారసీక ప్రభావము ప్రాబల్యమునొందెను. ఈవిధముగా నూతన విధమైన వాఙ్మయసృష్టికి రంగము సిద్ధమయ్యెను. అరబ్బుల ప్రాచీన రాజకీయ సంప్రదాయముల నభివృద్ధి పరచుటకు బదులుగా "అబ్బాసిదులు" పద్య గద్యములను ఆదరించుచు, అపార భౌతికశాస్త్ర వాఙ్మయమునుగూడ అభివృద్ధిపరచి "సంస్కృతి" ఆశయమును విశాల పరచిరి. ఈ యుగమందలి వాఙ్మయమును మతము, భాషా తత్త్వము, గద్యము, పద్యము, చరిత్ర, భూగోళ శాస్త్రము, వేదాంతము, భౌతికశాస్త్రములు– అను శాఖలుగా విభజింపవచ్చును.

ముస్లిముల ప్రథమ కర్తవ్యము ఖురానుతోపాటు మహమ్మదు ప్రవక్తయొక్క ఉపదేశములు, చర్యలు సంపాదించుటయై యుండెను. ఎందుచేతనన ఈ సంప్రదాయములు మత విశ్వాసముల సంబంధమునను, మత విధుల ఆచరణము నందును ఏది ప్రామాణికమో, ఏది తప్పక యాచరింపదగినదో తెలుపునవిగా నుండెను. నిత్య జీవితమునందు ఖురాను సిద్ధాంతములను ఆచరణలో పెట్టు విధానమును ఈ సంప్రదాయములు మాత్రమే నిరూపించును. రానురాను హాదిత్తుల (సంప్రదాయముల) సంచయములు పెరుగసాగెను. అల్ప ప్రామాణికము లయిన కొన్ని విషయములుకూడ వాటియందు ప్రవేశించెను. కాబట్టి వాటి నన్నిటిని పరిశీలన పూర్వకముగ విచారణ సల్పి, గాలించి, ఏవి ప్రామాణికములో, ఏవి కల్పితములో నిశ్చయించిరి. ఇట్టి విమర్శనాత్మక పరిశోధనము మూలమున, ఈ సంప్రదాయములను పరంపరగా అందిచ్చుచు వచ్చిన వారి జీవితచరిత్రలు తెలిసికొని, వారిలో ఎవ్వరు నమ్మదగినవారో, ఎవ్వరు నిరాకరింపదగినవారో గుర్తింపవలసి వచ్చెను. మత ధర్మ వాఙ్మయమునకు సంబంధించిన ఈ వర్గమునకే ఖురాను వ్యాఖ్యానము (భాష్యము) చెందియున్నది. మూల

గ్రంథముయొక్క చారిత్రక సమాలోచనలు, దాని వ్యాకరణ భాష్యములు, దాని సాహిత్యాలంకార గుణ గ్రహణము, దాని నిబంధనల యొక్కయు, న్యాయ సూత్రముల యొక్కయు ప్రాముఖ్యము, సిద్ధాంతముల మత ధర్మ నిరూపణము — ఇవియే ముఖ్య పఠనాంశము లయి యుండెను. ప్రారంభమున నిది హాడిత్ (పవిత్ర సంప్రదాయ) వాఙ్మయ భాగముగా నుండెను. తరువాత నిది స్వతంత్రము, క్రమబద్ధము నగు శాస్త్రముగా పెంపొందెను. గత పరిశోధన ఫలితముల నన్నింటిని సమీకరించి, ఒక మహాసంపుటములో క్రోడీకరించిన సుప్రసిద్ధ పండితుడు ఇబ్నుజారిర్ అల్ తహరీ అనునతడు. ఖురాను నుండియే విధ్యాత్మకములగు నియమములు ఏర్పరుప బడెను. అవియే ధర్మశాస్త్రముగా పరిణతిచెందెను. ధర్మ శాస్త్ర విధులను గూర్చి షఫాయి; హనఫీ శాఖలవారు పెక్కు గ్రంథములను నిర్మించిరి.

**భాషా తత్వశాస్త్రము (philology) :** అరబ్బులు కాని వారు ఇస్లాంమత ప్రవిష్టులగుట, అరబ్బులు దూరదూర మందున్న ముస్లిందేశ ప్రాంతములలో స్థిరనివాస మేర్పరచుకొనుట కారణములుగ నిర్దుష్టమైన ఖురాను గ్రంథ పఠన క్రమమును ఏర్పరచుట అవసరమయ్యెను.

ఖలీఫా ఆలీ యాజ్ఞను పురస్కరించుకొని అబుల్ ఆస్వాద్ అద్ దుఆలి (Abdul Aswad ad Duali 685) అనునాతడు మొట్టమొదట వ్యాకరణ పద్ధతుల గూర్చి చర్చించినట్లు తెలియుచున్నది. అరబ్బీ భాషా వ్యాకరణమును గూర్చిన విచారణము ఇరాకులోని కూఫా, బాస్రా అను రెండు పట్టణములలో సాగినది. ఈ చోటులందే భాషా నియమములను గూర్చియు, అరబ్బీజాతీయములను గూర్చియు పండితులకు గల పరస్పర విరుద్ధభావములను పురస్కరించుకొని వ్యాకరణ విషయములో రెండు వాదములు ఏర్పడెను.

భాషా శాస్త్ర విషయములను, నిఘంటు సామగ్రిని సేకరించు పని బెడూయినులు గావించిరి. వన్య మృగములను గూర్చి యొక గ్రంథము, ఆశ్చర్యములను గూర్చి యొక గ్రంథము, ఒంటెలను గూర్చి యొక గ్రంథము, వర్షమును గూర్చి యొక గ్రంథము, మానవుని వైజమును గూర్చి యొకగ్రంథము రచితములయ్యెను. ఇవి తొలుతటి గ్రంథములు. తరువాత కొంతకాలమునకు క్రమబద్ధమైన విస్తృత నిఘంటువులలోనికి ఈ గ్రంథములు చేర్చబడెను. బాస్రా మతాచార్యుడైన అబుబకర్ ఇబ్ను దురాయిదు (Abu Bakar ibn Duraid)అనునతడు జమ్‌హారా, కితాబ్ అల్ ఇష్తిఖాఖ్ అను బృహత్కోశమును సంకలనముచేసి అందు శబ్దముల మూలములను, వాటి నుండి ఏర్పడిన అవాంతర రూపములను వివరించెను. ఈ వర్గమునకు చెందినవాడే అల్ ముబారద్ రాదు (al-mubarrad 898). ఈతని రచన యగు కితాబు అల్ కామిల్ (Kitab al Kamil) అను గ్రంథము అరబ్బీ భాషా, సాహిత్యములను గురించియే గాక, ప్రాచీన చరిత్ర, సంప్రదాయములను గురించి కూడ వివరించు నొక విజ్ఞాన సర్వస్వము.

**గద్యపద్యములు :** అబ్బాసీదులు విజ్ఞానాత్మక కృషుల యెడ తమ ఆదరాభిమానములను జూపుచుండుటయేగాక పద్యవాఙ్మయాభివృద్ధికిని తగు ప్రోత్సాహము కల్పించిరి. ఒకవంక పూర్వ ధోరణిలో ఖసీదా ప్రక్రియలతో విమతానుసారములగు రచనలు సాగుచుండగా, మరియొక వంక పద్యరచనలలో క్రొత్తఫక్కికపనము తలయెత్త సాగెను. ఈరాను ప్రభావమున మారిన పరిస్థితుల కనుగుణముగా మృదుత్వమలవడినను కవితారీతిమాత్రము పూర్వ ప్రమాణమునే యనుసరించెను. విదేశ ప్రభావము వలన ప్రబలిన మతవ్యతిరేకోద్యమములు కవుల నెక్కుడుగ ప్రభావితులగావించెను. ఇట్టివారిలో కొందరు జిండిక్కులు (నాస్తికులు) అని పిలువబడిరి. ఈరానుల అద్వైతసంప్రదాయముచే ప్రభావితులయిన కవులు బాష్‌షారు ఇబ్ను బుర్డు (783), సాలీఇబ్నె అబ్దిల్ ఖుద్దుసు (813) అనువారలు. పూర్వకవులు కొందరు మాత్రమే గాక, ఈ యుగమున అత్యంత ప్రసిద్ధికి చెందిన కవులు అబునవాస్, అబుల్ అతాహియా, అబూతమ్మామ్, అల్-బహుతూరి అనువారలు. అబుల్‌నవాస్ (810) రచించిన "దివాన్" అను గ్రంథమునందలి జుహుదియాత్ (పవిత్ర) ప్రకరణముమబట్టి వృద్ధాప్యములో నీతడు గభీరవిషయ తత్త్వాన్వేషియైయుండినట్లు కనబడుచున్నను, ఈతడు విశృంఖలుడగు కవి. అయినను, ఈతని త్రాగుబోతు పాటలు, శృంగారపద్యములు గొప్పకీర్తిని గడించినవి. ఇక అబుల్ అతాహియా (828) కవి జుహుద్ (పవిత్రత), పవిత్ర

వర్తనములను గూర్చిన రచనల యెడ ఎక్కుడు అభినివేశముకలవాడై నీతిబోధక పద్యములను సరళభాషలో ప్రబోధాత్మకముగ రచించెను. పద్యకవిత్వముతో సరిసమానముగ సంగీతవిద్యయును వృద్ధిచెందెను. సంగీతశాస్త్రముమీద, వాద్యసాధనములమీద గ్రంథములు రచింపబడెను. సంగీతపాఠకుల ప్రత్యేక రాగఘణుతులు, వారి జీవచరిత్రలు సుప్రసిద్ధమైన కితాబె-అల్ అఘాని యందు నిక్షిప్తములైనవి.

అబ్బాసీదు ఖలీఫాల ఆధిపత్యము ఛిన్నాభిన్నమయిన తరువాత ఇస్లామీ సామ్రాజ్యమున నెలకొనియున్న అల్ప రాజ్య సభాస్థలులు విద్యావ్యాసంగములకు కేంద్రము లయి వెలసెను. అలెప్పోయందలి సైపుద్దౌలా యొక్క హందానిద్ సభాస్థానము అరబ్బీ వాఙ్మయ కేంద్ర రాజములలో నొక్కటిగా విలసిల్లెను. ఇచ్చటనే అల్ ముతానబ్బీ (965) అను కవిపుంగవుడు వర్ధిల్లెను. ఈతని కవితకు ప్రజలు ముగ్ధులయి, దానిని పఠించుచు, వ్యాఖ్యానించుచుండెడివారు. పండితమండలిలో దానికెక్కుడుగ మాన్యతలభించుచుండెను. సైపుద్దౌలా అలెప్పో రాజ్యాధిపతిగా గ్రీకులతో నలుబది యుద్ధములు సల్పినవాడు. ఈ సైపుద్దౌలా దండయాత్రలనుగూర్చి అల్ ముతానబ్బీ, తన సమకాలిక కవియగు అబుఫిరాస్ అల్ హందానితో గలిసి కవితాగానము చేయుచుండెడువాడు. పూర్వ సంప్రదాయసిద్ధమయిన కవిత్వ విధానము "అల్ మా అర్రి" (1054) అను అంధకవితో అంతమొందెను. ఈ అంధకవి ఇస్లామీ శాస్త్రములందును, గ్రీకు, హిందూ తత్వశాస్త్రములందును విశేష జ్ఞానసంపన్నుడై సిరియా, బాగ్దాదులందు గణుతికెక్కెను. సారస్వత పత్రలేఖనము చేతనేగాక, "సఖత్ అల్ జందు; లుజుం మా లాయల్జుం" అనెడు రెండు పద్యకావ్య రచనలచేగూడ నీతడు ప్రసిద్ధి కెక్కినాడు. ఈ కావ్యములందు అల్ మా అర్రి, సమకాలికుల భావములను, సంఘజీవనమును, ప్రభుత్వమును, మతమును మొగమోటము లేకుండ, ధైర్యముగా ఖండించినాడు. జుహాదునందు (పవిత్రతా సూత్రములు) ప్రతిపాదించిన ఆదర్శములను అల్ మా అర్రి తన జీవితమునందు కార్యరూపమున ప్రవేశపెట్టినాడు. మాంసాహారమును, వివాహమును వ్యతిరేకించుటకుగూడ నితడు పూనెను. అతని భావములందు బౌద్ధమత ప్రభావము కూడ కనబడెను.

అరబ్బీ వాఙ్మయమున రమణీయ వచనరచనా ప్రారంభమునకు అబ్బాసీదు, ఖలీఫాలే ముఖ్యకారకులు. వీరు పెర్షియన్, గ్రీకు, సిరియా భాషలనుండి అరబ్బీ లోనికి అనువాదములను చేయుటను మిగుల ప్రోత్సహించిరి. పారసీనుండి కాలక్షేప వాఙ్మయమును, (Light Literature), గ్రీకునుండి తత్త్వశాస్త్ర గ్రంథములను, భౌతికశాస్త్ర గ్రంథములను, ఇండియానుండి గణితశాస్త్రమును అనువాదము చేయు నుద్యమము ముమ్మరముగ సాగెను. సంస్కృత గ్రంథమగు పంచతంత్రము అరబ్బీలోనికి అనువదింపబడెను. దీనికి అరబ్బీలో "కలిలా వ దిమ్మా" అని పేరు. ఈ అరబ్బీ అనువాదము పరిష్కృత పహ్లావీ గ్రంథమునుండి చేయబడినది. అనువాదకుడు ఇస్లాము మత ప్రవిష్టుడును, పర్షియా దేశీయుడు నగు "ఇబ్నె అల్ ముఖఫ్ఫా" (757) అను నాతడు. ఇతడు పారసీక చరిత్ర గ్రంథమగు "ఖుదాయినామా" అను దానినిగూడ అరబ్బీ భాషలోనికి అనువదించినాడు.

ఇట్లు వివిధ విషయములను గూర్చి కళాత్మకమైన వచనశైలిలో రచింపబడిన పెద్ద గ్రంథములేగాక, ప్రజలలో సామాన్య విజ్ఞాన ప్రసారమున కుపయోగించెడు విజ్ఞానకోశ (సర్వస్వ) గ్రంథములుకూడ ప్రచారము లోనికి వచ్చెను. ఇట్టి వానిలో "ఇఖ్దు అల్ వరీద్" అను గ్రంథమొక్కటియై యున్నది. దీనిని "ఇబ్నె అబ్దు రబ్బీ" (939) అను స్పెయిన్ దేశీయుడు రచించెను. ఇందు 25 అధ్యాయములు కలవు. ఈ అధ్యాయములలో ప్రాగిస్లామిక చరిత్రము, ఇస్లామిక చరిత్రము, కవిత్వము (Poetry), ఛందశ్శాస్త్రము, సామెతలు, సారస్వత, ఐతిహాసిక గాథలు మున్నగునవి కూర్పబడినవి. ఇట్టి రచనా విధానము కలవియై తరువాతి కాలమునకు చెందినవి రఘిబ్ అల్ ఇఫహాని (1108) రచించిన "ముహాదరాత్, అల్ ఉదబా", అల్ జమఖరి (1143) రచించిన "రబీ అల్ అబరుహో" అను గ్రంథములు.

పరిపాలకుల రాజకీయ వ్యవహారపత్రములు, రాజ్య విషయక లేఖావళులు పెరిగినకొలది, అందమయిన వచన రచనయొక్క ఆవశ్యకత అధికము కాజొచ్చెను. ప్రాత

కాలపు నిరాడంబరమైన శైలి స్థానమున అలంకార యుక్తమైన శైలి ప్రభుత్వ వ్యవహారములందు ప్రవేశించెను. ఈ అలంకారిక గద్యరచనలలో ఛందోచిత్రములు, సాజా, (అనుప్రాస యుక్త గద్యము) విరివిగా నుపయోగమునకు వచ్చెను.

అలంకారయుక్త రచనలు మఖమా (Maqama) అను పేరుగల విచిత్ర వాఙ్మయ సృష్టికి దారితీసెను. ఇది ఒక ఏకాంకిక నాటకమువలె నుండును. ఇందులో కథానాయకుడు ప్రచ్ఛన్న వేషముతో రంగమును ప్రవేశించును. ఈ వేషధారినిగూర్చి సూత్రధారుడు వివరించును.

"మఖమా" అనునది కథాకథన కళయందు అభివృద్ధి విధానముగా గనబడుచున్నది. ఈ విధానము అరబ్బీ మాటాడు దేశములలో అభిమానాత్మకమై యొప్పుచుండెను. పలుతెగలవారి యుద్ధములను గూర్చిన ప్రాగిస్లామిక పురావృత్తముల వలెనే, అంతారా (Antara's) యొక్క సాహసకార్యములు, దక్షిణ అరేబియా రాజగు సెయుఫ్ ఇబ్నెయాజన్ యొక్క శృంగార విహారములు, బానుహిలాల్ అనువాని శృంగార కథలు-ఇట్టి కథావాఙ్మయము నలుమూలలకు ప్రాకెను. వీటిని ప్రజ లుత్సాహముతో పఠింపసాగిరి. ఈ వర్గమునకు చెందినది, అరేబియా వాఙ్మయములోనేగాక ప్రపంచ వాఙ్మయమునందును సుప్రసిద్ధమైన "వేయిన్నొక్కటిరాత్రులు" కథాగ్రంథము. ఈ కథలు భారతీయ వస్తుమూలకములై "హజారు అఫసానా" అను శీర్షికతో వ్రాయబడిన పారసీక కథలని తెలియుచున్నది.

**తత్వశాస్త్రము - భౌతికశాస్త్రములు :-** అరబ్బీ గద్యవలెనే భౌతికశాస్త్ర వాఙ్మయము కూడ గ్రీకు గ్రంథముల అనువాదములతో ప్రారంభమయ్యెను. ఖలీఫాహరూన్-అల్-రషీదుచే స్థాపితమై, అతని పుత్రుడగు అల్-మామున్‌చే విస్తరింపబడిన "బెయిత్ అల్ హిక్మా" అను పేరుగల విద్యాసంస్థ ఏర్పడినప్పుడు అనువాద కార్యక్రమములు మరింత వృద్ధిచెందెను. ఖుస్తా-బి-లుఖా (885) అనువాడు అరిస్టాటిల్ రచనలనేగాక గణిత, ఖగోళశాస్త్రగ్రంథములను ముఖ్యముగా "యూక్లిడు" గ్రంథమును (క్షేత్రగణితము) అనువదించెను. హునైన్ ఇబ్నె ఇసాఖ్ (973) వైద్య గ్రంథములతోపాటు ప్లేటో రచనలకు అనువాదము చేసెను. హుబై అనువాడు వృక్ష, వైద్య శాస్త్ర గ్రంథములను అనువదించెను. ఈ యుగములో పుట్టిన భౌతికశాస్త్ర గ్రంథ సంపద ఎట్టిదియో ఇబ్నెనదీం (995) సంకలితము చేసిన కితాబు అల్-ఫిహరిస్తు (గ్రంథముల పట్టిక) అను గ్రంథమును చదివినచో తెలిసికొనవచ్చును. ఇతడు సాహిత్య, భౌతిక శాస్త్ర గ్రంథములను గూర్చిన విశేషాంశములను దొరకినంతవరకు సమకూర్చి, విషయ దర్పణముగా నుపకరించుటకు ఈ గొప్ప గ్రంథమును సిద్ధముచేసెను. అరిస్టాటిలు గ్రంథములేగాక ప్లేటో గ్రంథములు పెక్కు గూడ భాషాంతరితములయ్యెను. ఇస్లామీ తత్త్వవేత్తలపయి ప్లేటోమతము ఎక్కుడు ప్రభావము కలిగించెను. వారి భావాదర్శము (Ideology) నాలుగవ శతాబ్దములోని ఇఖవాన్-ఎస్-సఫా అనువాని సాహచర్యమున విశేష క్రమానిత్వమయిన పద్ధతిగా వృద్ధిచెందెను. ఈ ప్రతిష్ఠాపనము యొక్క ఉద్దేశము నవప్లేటోనికదర్శనము ననుసరించి ఇస్లామిక తత్త్వభావములను రూపింపజేయుటయే. వారు తమ తత్త్వభావములను సంగ్రహపరిచి, రసైల్ "ఇఖ్వానాస్ సఫా" అను గ్రంథములో పొందుపరచిరి. ఈ గ్రంథ సంపాదకుని పేరు తెలియదు.

తత్త్వశాస్త్రమును గూర్చి మొట్టమొదట గ్రంథరచన గావించినవాడు "అబు యూసుఫ్ యాకూబు అల్ కిండి" (862). ఇతడు తత్త్వశాస్త్రము, వైద్యము, ఖగోళశాస్త్రము, గణితము, గానము మున్నగువాని మీద రెండువందల గ్రంథములు వ్రాసినాడు. ఆ కాలపు ప్రసిద్ధ తత్త్వవేత్తలలో నొకడగు "అబునసర్ అల్ ఫరాబి" (950) అనువాడు అరిస్టాటిల్ మీద, గణిత, గాన శాస్త్ర గ్రంథముల మీద వ్యాఖ్యానములు వ్రాసెను. అబు అలీ ఇబ్నె సీనా అనువాడు వేదాంతము, తత్త్వజ్ఞానము, వైద్యము, ఖగోళశాస్త్రము, భౌతిక శాస్త్రము మున్నగు సమస్త విజ్ఞానశాఖల మీద గ్రంథములు రచించెను. తత్త్వ విషయ ప్రతిపాదకమగు కితాబె అష్-షిఫా, వైద్యవిషయ వివరణాత్మకమగు అల్ ఖనూనా పిట్ టిబ్ అను నీ గ్రంథములు మిగుల ప్రసిద్ధిచెందినట్టివి. ఇవి లాటిన్ భాషలోనికి అనువదింపబడినప్పుడు ఆ యనువాదములు మధ్యయుగ

మున యూరపుఖండములో కూడ అత్యంత ప్రామాణిక మైనవిగా పరిగణింపబడెను.

ఇబ్రహీం అల్ ఫజారి అనువాడు ఖగోళశాస్త్ర విషయక కోష్ఠములను (Tables) సిద్ధముచేసెను. ఖలీఫా అల్ మన్సూరు ఆజ్ఞప్రకారము భారతీయగణితశాస్త్ర సంబంధములగు 'సిద్ధాంత' గ్రంథములు అరబ్బీభాషలోనికి అనువదింపబడెను. అల్ "ఖవారిజ్మీ" అనువాడు ఈ గ్రంథముల సారములను రచించెను. అలెగ్జాండ్రియా పట్టణవాసియు గణిత, జ్యోతిష శాస్త్రవేత్తయునగు 'టాలెమీ' అను గ్రీకు పండితుడు రచించిన అల్ "మెజెస్టు" (al majest) అను గ్రంథమును ఇబ్నె మేటరు (829) అనునతడు అరబ్బీలోనికి భాషాంతరీకరణముచేయగా, జ్యోతిశ్శాస్త్రవాఙ్మయము వెన్నులువేసి మరింత వృద్ధిచెందెను. అరబ్బీ జ్యోతిశ్శాస్త్రజ్ఞులలో గణనీయులు అల్ ఫరఘాని, అల్ బాథాని, ఇబ్నె యూనుసు, ఇబ్నె అల్ హైథాం, జేబరు ఇబ్నె అఫ్లా అనువారలు. బాగ్దాదు, డమాస్కసు, కైరోలందు నక్షత్రశాలలు నిర్మాణము నొందుటచే ఈ విద్యకు మిక్కిలి ప్రోత్సాహము కలిగెను.

ఇతర భౌతికశాస్త్రముల వలెనే అరబ్బుల వైద్యశాస్త్రము గూడ అనువాదములతోను గ్రీకు భిషఙ్మణుల పద్ధతి నవగాహన చేసికొనుటతోను ప్రారంభమయ్యెను. కాని, అరబ్ విద్వాంసుల ప్రత్యక్షావలోకనము, స్వానుభవము, వైద్యవిజ్ఞానమునకు ఎంతయు తోడ్పడి, అది విశాలము, స్వతంత్రము అగు శాఖగా పుష్టినొందెను. అరబ్ వైద్యశిఖామణులు ఓషధీతంత్రశాస్త్రమునందును (Pharmocology), రోగలక్షణశాస్త్రమునందును (Symptomatology) గొప్ప ప్రావీణ్యమును బొందిరి. వారి వైద్యశాలలు, వైద్యవిద్యాశాలలు పాశ్చాత్యులకు మార్గదర్శకములుగా నెగడెను. జేబర్ ఇబ్నె హయ్యాణ అనునతడు రసాయనశాస్త్రమునకు పునాదివేసెను. అది క్రమక్రమముగా వృద్ధిచెంది క్రొంగ్రొత్తవిషయములను కనుగొనుటకు మార్గమేర్పడెను. ఇప్పటి రసాయన శాస్త్రమునకు గల పరికరములును, పరిభాషయు అరబ్బీయ రసాయనపండితులు పెట్టిన భిక్షయే. భౌతికచరిత్రయందు (Natural History), వృక్షశాస్త్రమునందు, వ్యవసాయ శాస్త్రమునందు అదేవిధముగ ప్రవృద్ధికలిగెను.

తత్త్వవేత్తల యొక్కయు, వైద్యవేత్తల యొక్కయు జీవితచరిత్రలు నిర్మితము లయ్యెను. ఖిఫ్తి రచించిన "తారీఖ్-అల్-హుకమా" అను గ్రంథమును, "ఇబ్నె అబి ఉసైబిఅ" రచించిన కితాబె - అల్ - ఉయూన్ - అల్ - అంబా" అను గ్రంథమును తత్సంబంధము లయినవే.

**భూగోళము—చరిత్ర :** ఖలీఫాలయొక్క తపాలాశాఖా వ్యవస్థ, సమర్థమగు ప్రభుత్వవిధానమును భౌగోళికాంశములను గ్రంథస్థముచేయుటకు పురికొల్పెను. ఇక పుణ్యస్థల సందర్శనాభిలాషులకు తాము పోయెడి దేశములకు సంబంధించిన విజ్ఞానము అవసరము కాజొచ్చెను. ఈ భౌగోళిక లేఖనములు రహదారులు, వర్తకవాణిజ్యములు, తత్ప్రతిష్ఠాపనములనుగూర్చి మాత్రమే వర్ణించుటతో తృప్తిపడలేదు. అచ్చటి ప్రజల ధార్మిక, సాంఘిక, సంస్కృతీజీవిత విషయములనుగూర్చిన యథార్థ విషయములను గూడ వర్ణించుచుండెను. ఇబ్నుఫాడ్లణ, అబుదులాఫ్, ఖాస్రాజి, ఇబ్ను జబీరు, ఇబ్ను బతూతావంటి దేశపర్యటనపరులు వ్రాసిన గ్రంథములు అరబ్బుల ధార్మిక, సాంఘికవిషయ పరిస్థితులనుగూర్చి వివరణాత్మకములయి యుండుటయే గాక, తాము పర్యటించిన దేశముల ఆచారములు, సంప్రదాయములు, వ్యవస్థలు మున్నగునవి తెలుపుచుండెను. భూగోళశాస్త్ర పదజాలమును అకారాదిగ వ్రాసి వివరించిన కోశములు, నిర్మితములయ్యెను. బక్రి రచియించిన "మూజం మాస్తాజం" అను గ్రంథమును, యాఖుత్ రచించిన "ముజాం అల్ బుల్దాన్" అను గ్రంథమును ఇట్టి తరగతిలోనివే.

ప్రాచీనయుగ కవిత్వమును గూర్చిన గాథలు, ఆయా తెగల వంశావళి నివేదికలు చరిత్ర పఠన పాఠనములకు దారితీసెను. ఇస్లాం ప్రారంభచరిత్ర జ్ఞానమునకు ప్రవక్త యొక్క జీవిత చరిత్రమును, ఇస్లాం యుద్ధములను (Maghazi) గూర్చిన సామగ్రిని సమకూర్చవలసిన అగత్యమేర్పడెను. ప్రవక్తయొక్క జీవితచరిత్రను మహమ్మదు ఇబ్ను ఇషాఖ్ అను నతడు రచించెను. ఇది విషయ క్రమబద్ధమయిన గ్రంథము. అరబ్బీయుల చరిత్ర- భూగోళ రచనలు ఒక అపూర్వ శాస్త్రప్రాయముగా రూపొందెను. చరిత్రకారులు తమ కథనమునందు వేర్వేరు పద్ధతుల నవలంబించిరి. ఐతిహాసికుల పరంపర చెప్పినది చెప్పి

నట్లుగనే లిఖించుట ఒక విధముగాను, స్థానిక విషయములు, మహాపురుషుల జీవిత పరిశీలనములు మొదలుకొని ప్రపంచ చరిత్రలవరకు కాలక్రమానుసారముగా కథనము చేయుట మరియొక పద్ధతిగా నుండెను.

మంగోలుల దండయాత్రల ఫలితముగ 1258 లో బాగ్దాదు పతనము చెందిన తరువాత, సంస్కృతీకేంద్రము తిరిగి సిరియా, ఈజిప్టులకు మారెను. ఆ కారణమున వాఙ్మయ స్వరూప స్వభావములనుమార్పులనుబొందెను. రాజకీయ కల్లోలములు, అశాంతికర పరిస్థితులు ఎన్ని ఉన్నప్పటికిని విద్వాంసులయినవారు పూర్వకవి ప్రణీత గ్రంథములను పరిశీలించుచు, వాటిపయి వ్యాఖ్యానములను రచించుచునే యుండిరి. ఈ యుగము నూతన రచనాసృష్టికిగాక క్రోడీకరణమునకు ఎక్కువగ ప్రఖ్యాతి చెందియున్నది. హిజరి 8 వ శతాబ్దములో నూత్నభావములను, నూతన విధానమును అరబ్బీయ చరిత్ర - భూగోళ రచయితలకు చూపిన చరిత్ర కళానిపుణుడు ఇబ్ను ఖాల్డూన్ (1406) అనునతడు. చరిత్ర సంఘటనలను ఎట్లు పరిశీలించవలెనో ఇతడు కొన్ని నిబంధనలను ఏర్పరచెను. సాంఘికశాస్త్ర విషయ సిద్ధాంతములను ప్రతిపాదించెను. ఈ సిద్ధాంతముల ననుసరించి ప్రాచ్యులెగాక పాశ్చాత్యులును ఇప్పటికిని నడచుచున్నారు.

ఇండియాలో ప్రభవించిన అరబ్బీ సాహిత్య స్వభావము :- ప్రాగిస్లామిక కాలమందును, ఇస్లామిక కాలమందును ఇండియా దక్షిణ తీరములు అరేబియాతో వ్యాపార సంబంధములను కలిగియున్నను, సింధు, ముల్తాన్, బెలూచిస్థానము తప్ప, ఇతర భాగములు అరబ్బీ భాష మాట్లాడువారి ప్రభుత్వములో ప్రత్యక్షముగ లేకుండెను. కావున పారసీ మాతృభాషగా గల ప్రభువుల పోషణ భాగ్యము అరబ్బీ భాషకు లభించలేదు. ఏడవ శతాబ్దమునాటికే అరబ్ సామ్రాజ్యమునకు చేర్చబడిన ఇండియా ఉత్తర భాగములుకూడ ఎంతోకాలము వారి రాజకీయాధిపత్యమున నుండలేదు. ఈ కారణమునను, దక్షిణ భారతములోని అరబ్బుల వాసస్థానములును వ్యాపారములును వర్తక వాణిజ్యములవరకే పరిమితము లగుటచేత, ఆ నాటివారి విద్యావివేక పరిశ్రమములను గూర్చి ఏమియు తెలియదు. కాని స్థానిక భాషలలోనుండి తీసికొనబడి అరబ్బీభాషలో చేరిపోయిన కొన్ని పదములు మాత్రము కనబడుచున్నవి. భౌగోళిక, రాజకీయ అవరోధము లెన్నియున్నను, భారతీయ ముస్లిములలో మత సంస్థలయొక్కయు, మతాధ్యయనము యొక్కయు భాషగా అరబ్బీ భాషయే వాడుకలో నుండెను. ఉమయ్యాద్, అబ్బాసీదులకాలములో కొందరు భారతీయ మహమ్మదీయులు అల్-హిజాజుకును, ఇరాకునకును పోయి అచ్చట స్థిరనివాస మేర్పరచుకొని కవులుగా, గద్య రచయితలుగా ప్రసిద్ధికెక్కిరి. ఇట్టి వారిలో అబు అతా అల్‌సింధి యను నతడు కవి; హసన్ అల్ సఘాని (1252) అను నతడు శబ్దశాస్త్రవేత్త (Philologist); సఫీ యుద్దీన్ అల్ హింది (1315) అను నతడు న్యాయశాస్త్ర పారగుడు. అల్లే అరబ్బు విద్వాంసులును ఇండియాకు ఏతెంచి, అరబ్బీ భాషలో అమూల్య గ్రంథములను రచించిరి. అల్బెరూని హిందువుల సంస్కృతిని, విద్వత్తును, గ్రహించుటకును, తాను వ్రాయదలచిన కితాబె - అల్ - హింద్ అను పుస్తకమునకు విషయసేకరణార్థము ఇండియాకు వచ్చెను. ఇండియాలో హాడిత్ ప్రవచనములను వ్యాప్తికి దెచ్చుటకు షంసుద్దీన్ అనువాడు ఈజిప్టు నుండి ముల్తానుకు వచ్చెను. అయినను, ఘజనవీడ్ (988 క్రీ. శ.) మొదలుకొని మొగలు వంశము (1539) వరకును ఇండియాలోని ముస్లిం ప్రభుత్వముల కాలములో భారతీయ ముస్లిములు అరబ్బీ వాఙ్మయములో ఎట్టి ఉపజ్ఞాయుతములయిన గ్రంథములను రచింపలేదు. వచనము, పద్యము, తత్త్వశాస్త్రము, భౌతికశాస్త్రములు మున్నగువానికి సంబంధించిన అరబ్బీ వాఙ్మయ శాఖలలో హైందవ ముస్లిములు ప్రసిద్ధిపొందలేదు. ఈ వాఙ్మయ శాఖా గ్రంథములమీది వ్యాఖ్యానములను సమీకరణ చేయుటయే తమ కర్తవ్యముగా వీరు పరిగణించుకొనిరి. భారతీయ ముస్లింల హృదయమునకు తర్కశాస్త్రము నచ్చినది. ముహిబుల్లా బిహారి (1707) సుల్లం అల్ ఉలూం అను గ్రంథమును వ్రాసెను. ఇది యిప్పటికిని తర్కశాస్త్రమున ప్రామాణిక గ్రంథముగా పరిగణింపబడుచున్నది.

సద్ బె సాలమన్ నిజాముద్దీన్, అలియా, నాసిరుద్దీన్ చిరాగ్ దిహిలెవి, షిహాబుద్దీన్, అమీరు ఖుస్రు అనువారి

అరబ్బీ పద్యఖండములు మనదనుక వచ్చియున్నవి. వీరే గాక, అరబ్బీలో తమ కావ్యముల యొక్క దివానులను (ఖూర్పులను) సంతరించిపెట్టిన కవులును గలరు. మొహమ్మదు బి అబ్దుల్ అజీజు, (మలబారు, 10 వ శతాబ్దము), సయ్యదు ఆలీఖాన్ ఇబ్నుమాసం (1705), సయ్యదు అబుదుల్ జలీల్ బిల్గ్రామి (1715) సయ్యదు గులాం ఆలీ ఆజాదు (1785) అనువారు అట్టి కవులు. ఈ కవులందరును పార్శీ కవిత్వము వలన ప్రభావితులయి యుండిరి. వీరి కందరకును, శబ్దార్థాలంకారముల యందును, పార్శీ పద్య విన్యాస నైఖరి యందును ప్రీతి మెండు. మలబారు కవియగు మొహమ్మదు అరబ్బీ భాషలో ఒక మత్నవి (ఇందు 500 పద్యములు గలవు) అను కావ్యమును రచించెను. ఈ కావ్యమునందు కాలికట్ జామొరిన్ బుడతకీచులతో జరిపిన పోరాటములును, అతనికి ఇస్లాంమతము నెడ గల ప్రీతియు వర్ణితములైనవి. ఇబ్నెమాసం కవియొక్క "అల్ బదీయాల్" అను కావ్యమునందు, అలంకార చిత్ర కల్పనలకు ఉదాహరణములు సంకలితముచేయబడినవి. ఇతర కవుల వలెనే ఆజాదు కూడ అలంకార గర్భితముగా వ్రాయుట యందు అమితేచ్ఛ గలవాడు. ఈతడు హిందీ భాషలోను, సంస్కృత భాషలోను గల ఉపమానములను, అలంకారములను తన అరబ్బీ కవిత్వములో ప్రవేశపెట్టినాడు. భారతీయ ముసల్మానులు ధార్మిక గ్రంథ పఠన, పరిశీలనములకు కలిగించినదోహదము మిగుల విలువగలది.

**నూత్న భావోదయము (1798-1955) :** 1798 లో అరబ్బులకు పాశ్చాత్య సంస్కృతీసంసర్గము మరల కలిగిన నాటినుండియు అరబ్బీ వాఙ్మయమునందు ఆధునిక విధానముల కనుగుణములయిన మార్పులు ప్రారంభమయ్యెను. ఈ నవీనత ఇప్పుడిప్పుడే ఈజిప్టు రంగమందు ప్రారంభమయినది. యూరోపియన్ పద్ధతుల ప్రకారము పాఠశాలలు స్థాపించుట, వార్తా పత్రికలు వేగముగా వ్యాప్తి చెందుట, ఆధునిక ఐరోపీయ గ్రంథరాజములను అరబ్బీ భాషలోనికి అనువదించుట - ఇవియే నవీనతావ్యాప్తికి కారణభూతములు. అనుప్రాసాలంకార భూయిష్ఠమైన ప్రాచీన గద్య రచనా విధానము విడువబడినది. ఇప్పటి పారిశ్రామిక యుగమునకు తగినట్లుగా సులభ, సరళ రచనలు ఆ స్థానము నాక్రమించినవి. షేకు మహమ్మదు అబ్దుల్ అఝురు నందు గావించిన ప్రబోధ ఫలితముగా ఖురాన్, న్యాయ శాస్త్రము, ఇస్లామిక తత్త్వశాస్త్రములపై వ్రాయబడిన భాష్యములు, నూత్నపద్ధతిలో సమన్వయము పొందసాగెను. ప్రవక్తల యొక్కయు, కవుల యొక్కయు, పండితుల యొక్కయు రచనలను తులనాత్మకముగను, పరిశీలనాత్మకముగను, పఠించుటచే శాస్త్రీయ పరిశోధనకును, ఆధునిక విమర్శన విధానమునకును, అంకురార్పణము జరిగెను. కాల్పనిక కథా (fiction) రంగమునందు అరబ్బీ సాహిత్యము మీద యూరోపియను ప్రభావము స్పష్టముగా కానిపించుచున్నది. కళాత్మకముగ కథావిరచనము చారిత్రక నవలలతో ప్రారంభమైనది. ఐరోపా దేశములలో విద్యార్జనము చేసిన అరబ్బుపండితులు ఫ్రెంచి, ఇంగ్లీషు, జర్మన్, ఇటాలియన్ భాషలలోని గ్రంథములను అరబ్బీభాషలోనికి అనువాదము చేయసాగిరి. అల్ మాన్ ఫాలూటి, అజ్జయ్యాత్, అల్ మాజిని అనువారలు యూరోపీయ అద్భుత కథాసాహిత్యమును (Romance) తమ అభిరుచుల కనుగుణముగా అనువదించుటకు మార్గదర్శకులయిరి. తరువాత తౌఫిఖ్ అల్ హకీం, అల్ మాజిని, అహమదు తైమూరు అనువారు కేవలము ఈజిప్టు దేశమునకు చెందిన స్వతంత్ర కల్పనాకథలను నిర్మించిరి. ఈజిప్టులో నాటకశాల ఏర్పాటయినతరువాత, ఫిల్ము కంపెనీలు, రేడియో కేంద్రములు, నాటక సాహిత్య పరంపర, నాటకకథలు, ఫిల్ముకథలు బయలువెడలినవి.

గద్యవలెనే ఆధునిక పద్యరచనయు ఫ్రెంచికవుల రచనలను పల్లెటూరి పాటలుగా (zagal) అరబ్బీకరణము చేయుటతో ప్రారంభమయినది. సంప్రదాయ సిద్ధముగా వచ్చుచున్న ఖసీదాపద్ధతిని అదే ఛందోలంకారములతో సాగించుచుండినను, ఆధునిక భావ విశేషములును, ఇస్లామిక యూరోపీయ తత్త్వసమ్మేళనమును పద్య కవిత్వములోనికి గొనితేబడెను. ప్రాతపద్ధతుల ప్రకారము గేయగీతికలు (Odes), శోకరసాత్మక గీతికలు (Elegy), స్తోత్రములు (Panegyrics), గీతమాలికలు (Sonnets) యథాతథముగా రచితము లగుచున్నను, వాటితోపాటు దేశభక్తి, భౌతిక, రాజకీయ, సామాజికవిషయములు కావ్యవస్తువులుగా నుండుట హర్షణీయము. అల్-బరూది

(1839-1904) హాఫీజు, షోఖి (1868-1932) వంటి ఈ యుగపు కవి శిరోమణులు అరబ్ జాతీయతను గూర్చిన గీతములను గానముచేసి, అరబ్బులకు వారి నాగరికత యొక్క గత వైభవోదంతమును స్మరణమునకు తెచ్చిరి. ఆధునిక కవులు ఛందోరహితమయిన (Blank) కవితను అనుసరించుటకు ప్రయత్నించుచున్నారు. శబ్దాలంకారములకు గణములకు సంబంధించిన కట్టుబాట్లను త్రెంచి వేయుటకు ఉద్యమించుచున్నారు. ఈ ప్రయత్నములు సఫలమగునా యనునది ఊహాకు వదలవలసిన విషయము. కాని అరబ్బీపద్యములకు (ఛందస్సుకు) గల ప్రత్యేక లక్షణములు మాసిపోకుండ నిలుపుట, అరబ్బీలోనికి యూరోపియన్ విధానములను ఎక్కువగా ప్రవేశపెట్టుట ఆధునికోద్దేశము లయి యున్నవి.

డా. ఎం. అ. ఎం.

**అరవిందుడు :-** కొన్నగరు అనునది హుగ్లీ జిల్లా యందు ప్రజాబాహుళ్యముతో గూడిన ఒక చిన్న పట్టణము. ఇక్కడనే జగద్విఖ్యాతులయిన రామకృష్ణ పరమహంస, రాజా రామమోహనరాయలు - ఉభయులు జన్మించిరి. అందుచే ఈ ప్రదేశము సుప్రసిద్ధి నందినది. ఆ కొన్నగరులో, ఒక సుప్రసిద్ధమగు "ఘోష్" కుటుంబములో, క్రీ. శ. 1840 సం.న కృష్ణధనఘోష్ అనునతడు జన్మించెను. అతడు ఋషి రాజనారాయణ బోసు యొక్క పెద్దకూతురగు శ్రీమతి స్వర్ణలతాదేవిని వివాహమాడెను. కృష్ణధన ఘోష్ యం. బి. బి. యస్. డిగ్రీని పొందిన తరువాత ఉన్నతతర వైద్య విద్యను సంపాదించు నిమిత్తమై ఇంగ్లాండునకు పోయి అచటి అబర్డీన్ విశ్వవిద్యాలయమునందు యం. డి. డిగ్రీని సంపాదించుకొని భారతదేశమునకు తిరిగివచ్చెను. ఇతనికి పాశ్చాత్య నాగరకతయందు అత్యంతమయిన ఆదరము, భారతీయ సంస్కృతియందు అనాదరము ఏర్పడెను.

**జననము :-** 1872 సం.రం ఆగస్టు 15 వ తేది గురువారం ఉదయం 5 గంటలకు కలకత్తాలో ఈ దంపతులకు మూడవ కుమారుడుగా శ్రీ అరవిందఘోషు జన్మించెను. కృష్ణధనఘోషు పాశ్చాత్య విద్యావిధానమునందు సంపూర్ణాభిమానము గలవాడు. అందుచే అతడు అరవిందుని, అతని సోదరులను డార్జిలింగులోని లోరెటో కాన్వెంటు పాఠశాలకు పంపించెను. అప్పటికి అరవిందుడు 5 సంవత్సరముల ప్రాయము కలవాడు. పాఠశాల యందును, భోజనశాలయందును ఘోషు సోదరుల యొక్క స్నేహితు లందరును ఆంగ్లశాలకులై యుండిరి. తనదేశములోనే ఒకవిధముగా ప్రవాసియై అరవిందుడు 5 వ ఏట ఇంగ్లీషులోనే తొలిమాటలు ఉచ్చరింప మొదలిడెను.

**విద్యార్థిదశ :-** 1879 సం. న కృష్ణధనుడును, అతని భార్యయు తమతో అరవిందుని, ఆతనిసోదరులను ఇంగ్లండు దేశమునకు తీసికొనిపోయిరి. అచ్చట మాంచెస్టరునందు అరవిందుని, అతని సోదరులను డ్రెవెట్సు అను ఆంగ్ల దంపతుల సంరక్షణమునం దుంచిరి. అరవిందునికి ఆ దంపతుల వలన వ్యక్తిగత శిక్షణము లభించెను. డ్రెవెటు లాటిను భాషయందు గొప్ప విద్వాంసుడు. అందుచే అరవిందుని కాతడు లాటినునందు గట్టి పునాదిని నిర్మించెను.



డ్రెవెటు దంపతులు ఆస్ట్రేలియాకు పోయిన సందర్భమున అరవిందుడు లండనునందలి సెయింట్ పాల్ పాఠశాలకు పంపబడెను. అరవిందుని యోగ్యత, ప్రతిభ, అచ్చటి ప్రధానోపాధ్యాయుని ఆకర్షించెను. ప్రధానోపా

ధ్యాయుడు అరవిందునికి స్వయముగా గ్రీకుభాషను బోధింప మొదలిడెను. సత్వరముగ ప్రధానోపాధ్యాయునిచే ఉన్నత తరగతులలో అరవిందునకు ప్రవేశము కల్పింప బడెను. ఇట్లు అరవిందుడు బాల్యముననే గ్రీకు, లాటిన్ భాషలలో పాండిత్యము సంపాదించుకొనెను. పిదప లండనునందలి కింగ్స్ కళాశాలలో ప్రవేశించెను. అచ్చట అతనికి సంవత్సరమునకు 80 పౌనుల చొప్పున విద్యార్థి వేతనము లభించెను.

ఆంగ్ల సారస్వత మండలి పద్యకవితను, కల్పనాత్మక వాఙ్మయమును, ఫ్రెంచి సారస్వతమును, ఐరోపాయొక్క ప్రాచీన - మధ్య - ఆధునిక యుగముల చరిత్రమును చదువుటయందు అరవిందుడు ప్రత్యేక శ్రద్ధను వహించెను. కింగ్స్ కళాశాలయందు గ్రీకు, లాటిను భాషలలో పద్య రచనా విషయమున సంవత్సరమునకుగల బహుమతుల నన్నింటిని అతడు పొందెను. 1895 సంవత్సరములో గ్రీకు, లాటిన్ భాషలలో ఉత్కృష్టావధిక - అంకములను కూడ అతడు పొందెను. పిదప ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షయందు ప్రతిష్ఠతో ఉత్తీర్ణుడయ్యెను. కాని, ఆ విషయమున అతనికి సహజమైన అభినివేశము లేదయ్యెను. అందుచే ఆ బంధనము నుండి విముక్తిని పొందదలచి స్వయముగ ఐ. సి. యస్. పరీక్షను నిరాకరింపక యుక్తి యుక్తముగ గుఱ్ఱపు స్వారియందు తనకు యోగ్యతలేదను విషయమును అధికారుల దృష్టికి తెచ్చెను.

అరవిందుడు ఇరువది సంవత్సరముల ప్రాయముననే అసాధారణమయిన విద్యాయోగ్యతలను గడించుకొనెను. జర్మను, ఇటాలియను మున్నగు ఇతరములయిన ఐరోపా భాషలయందు కూడ అతడు గొప్ప ప్రావీణ్యమును పొందెను. సంగ్రహముగా చెప్పవలయునన్న అసంఖ్యాకములయిన పాశ్చాత్య సంస్కృతి నిధానములను స్వవశ మొనర్చుకొనుటకు అవసరమయిన ఉత్తమ జ్ఞాన సాధనములను అతడు ఆర్జించెను.

తండ్రి యొక్క ఆర్థిక దౌర్బల్యమును బట్టి అరవిందుడు ఉద్యోగ సంపాదనము కొరకు యత్నింపవలసి వచ్చెను. ఇంతలో బరోడా మహారాజు ఐన స్వర్గీయ శ్రీ సాయాజీ రావు గాయక్వాడ్ ఇంగ్లండునకు వచ్చుట తటస్థించెను. అయ్యవకాశమును పురస్కరించుకొని జేమ్సుకాటను సహాయమున అరవిందుడు గాయక్వాడ్‌తో పరిచయమును ఏర్పరచుకొనెను. ఇంగ్లండులో నుండగనే అరవిందునిచే ఆంగ్లములో రచింపబడిన పద్య సముదాయము అతడు భారతదేశమునకు వచ్చినతోడనే పుస్తకరూపమును ధరించెను. అరవిందుడు రచించిన కావ్యములలో మిర్లిటా గీతములు, విషాదాంత ప్రేమ అనునవి పేర్కొనదగినవై యున్నవి. బరోడాలో రాజకీయోద్యోగిగను, కళాశాలాచార్యుడుగను ఉన్నపుడు అరవిందుడు బహువిధములగు సారస్వత రచనలను కావించెను.

**రాజకీయ జీవితము :** మొట్టమొదటి నుండియు వ్యక్తిగత మోక్షము గాని, వ్యక్తి సంపత్తిగాని, శ్రీ అరవిందునకు ఉన్నత లక్ష్యముగా తోచలేదు. మిక్కిలి అవమానకరమగు సేవా ధర్మమునుండియు, అజ్ఞానాంధకారము నుండియు, స్వదేశీయులను విముక్తులను ఒనర్చుటకై యత్నించుట తన ముఖ్య కర్తవ్యముగా అతడు గుర్తించెను. తనపేరు వెల్లడించకుండ ప్రజాపత్రికలలో రాజకీయ విషయములను గురించి అతడు వ్రాయుచువచ్చెను. 1902 మొదలుకొని శ్రీ అరవిందుడు రాజకీయాందోళనములలో ప్రవేశించుటకై యత్నించెను. రాజకీయ చర్యలకై సంఘములను నిర్మించుటకు ఉద్యుక్తులై యున్న పురోగాములగు నాయకులతో అతడు చేతులు కలిపెను. బహిరంగముగా అతడు చేయగలిగినది తక్కువగా నుండెను. ఈ రహస్య రాజకీయ సంస్థయొక్క కార్యక్రమమునందు స్వరాజ్య సంపాదనము, విదేశవస్తు బహిష్కరణము, స్వదేశోద్యమము అనునవి ప్రధాన లక్ష్యములై యుండెను. స్వరాజ్యమనగా శ్రీ అరవిందుని దృష్టిలో మితవాదుల భిక్షుకవిధానము కాదు. సంపూర్ణ స్వాతంత్ర్యమే జాతీయ సంస్థయొక్క ప్రధానలక్ష్యము కావలయు నని అతడు విశ్వసించెను.

లార్డుకర్జను యొక్క వంగవిభజన రూపమైన దురహంకార చర్య వంగదేశము నంతటిని ఏకముఖముగ కలవరపరచెను. ఈ వంగదేశ విభజన విషయకమైన శాసనము రద్దగువరకు పోరాటమును సాగించుటకై నిశ్చయింపబడెను. 1905 వ సం॥రం అక్టోబరు 16 వ తేది ఉపవాసములతోను, శోకములతోను, ప్రతీకార సూచకమగు దినముగా జరుపబడెను. శ్రీ అరవిందుడు

1904 - 1906 సం॥లలో జరిగిన కాంగ్రెసు సభలకు హాజరయి, అతివాదపక్షముయొక్క చర్చలయందును, చతుస్సూత్రప్రణాళికా నిర్మాణము నందును ప్రముఖమైన పాత్రను వహించెను. స్వరాజ్యము, జాతీయ విద్య, స్వదేశీయత, విదేశవస్తు బహిష్కరణము అనునవి చతుస్సూత్రములు.

1906 వ సం॥లో శ్రీ అరవిందుడు బరోడాయందలి ఉద్యోగమునుండి విరమించుకొని కలకత్తాకు వచ్చి "వందే మాతరం" అను పత్రికయొక్క సహాయ సంపాదకత్వమును స్వీకరించి, జాతీయపక్షమునందు సభ్యుడుగా ప్రవేశించెను. ఆత్మవిశ్వాసములేక చెల్లాచెదరైయున్న కాంగ్రెసు పక్షములలో ఆతడు తన ఉజ్జ్వలాదర్శములను, సంధిపరతుల నంగీకరింపని తన జాతీయ భావములను, కొంతవరకు రగుల్కొలిపెను. జాతీయ నాయకులను సమావేశపరచి దేశమునకు ఆతడు ఒక విప్లవాత్మక కార్యక్రమమును సిద్ధపరచెను. శ్రీ అరవిందు డిట్లు ఆకస్మికముగా అతివాద జాతీయతయొక్క మహాతత్త్వవేత్త అయ్యెను. వంగ విభజనముయొక్క ప్రతి ఘటనమునకు చిహ్నముగా ఏర్పడిన జాతీయ కళాశాల కతడు తొలి ప్రధానాచార్యుడాయెను. కాని త్వరలో ఈ కళాశాలను వదలి సంపూర్ణముగ రాజకీయములలో నిమగ్నుడయ్యెను.

తెరమరుగునుండి 'వందే మాతరమ్' అను గీతము బయలువెడలి ఒక్కుమ్మడిగా వ్యాపించి ప్రతి భారతీయుని జిహ్వాగ్రమున నాట్యమాడ దొడగెను. నిజమునకు 'వందే మాతరమ్' అను పత్రికకు వెనుకనున్న శక్తి శ్రీ అరవిందునిదే. ఇతని సంపాదకీయములును, ఇతర రచనలును ప్రజల ప్రశంసల నందుకొనెను. ఆంగ్లో-ఇండియన్ పత్రికలకు నైరాశ్యమును కల్పించెను. కాని ప్రభుత్వమిక 'వందేమాతరమ్' అను పత్రికను ఉపేక్షింపజాలక పోయెను. అందుచే న్యాయవిచారణ సభలో అరవిందునిపై నేరారోపణము (Prosecution) ప్రారంభమయ్యెను. క్షణకాలములో శ్రీ అరవిందుని పేరు సమస్తజాతియొక్క పెదవులపైనను నడయాడ దొడగెను. భరతఖండముయొక్క నలుదెసలనుండియు ప్రశంసలు, అభినందనములు ప్రతిధ్వనింప సాగెను. స్వర్గీయ టాగూరు కవియు ఆతని కభినందనములు వెల్లడించెను. రాష్ట్రీయ ప్రధాన దండనాధికారి శ్రీ అరవిందుని నిర్దోషిగా నిర్ణయించుచు తీర్పుచెప్పెను.

1907 లో, లోకమాన్య బాలగంగాధర తిలకుయొక్కయు, శ్రీ అరవిందుని యొక్కయు నాయకత్వములో నడచు జాతీయ పురోగాములకును, మితవాదులకును మధ్యగల ఆదర్శ విషయకములయిన భేదములు అంతకంతకు ప్రస్ఫుటములు కాసాగెను. 1907 లో సూరతు కాంగ్రెసులో, తుదకీ వైషమ్యములు ఒక పరిణతరూపము నొందెను. సూరతు కాంగ్రెసునుండి అరవిందుడు వాస్తవమునకు యావద్భారత నాయకుడుగా వెలువడెను. అప్పటినుండియు ఇతనియందు జనతకు శ్రద్ధాభక్తులు, లక్ష్యాగౌరవములు, నమ్రభావము ఇనుమడించెను. వెడలినచోటనెల్ల ఇతడు మహారాజోచితమయిన గౌరవ ప్రపత్తులను పొందుచుండెను. తిలకు, లజపత్ రాయ్, బిపిన్ చంద్రపాలు మున్నగు మహనీయులతో సరాసరిగా చేతులుకలిపి ఇతడు పనిచేయసాగెను.

రాజకీయ సిద్ధాంతములు :- శ్రీ అరవిందుడు వంగదేశములో తేజోవంతమును, ఆత్మశక్తి సంపన్నమును అగు ప్రయత్నముయొక్క జ్వాలను రగుల్కొలిపి దానిని విద్యుదుజ్జ్వలితము గావించెను. చాలవర కతడు గాంధీ మహాత్ముని రాజకీయ చర్యా విధానములను, ముఖ్యముగా సాత్త్వక నిరోధమును, ఆతనికంటె ముందుగనే ప్రవేశపెట్టెను. దేశములో నిద్రాణమునైయున్న ఆధ్యాత్మిక శక్తులను మేలుకొల్పెను. కాని, గత్యంతరము లేనిచో దౌర్జన్యమును ప్రయోగించికూడ స్వేచ్ఛనుపొందు హక్కు జాతికి కలదను స్వాభిప్రాయమును ఆత డెన్నడును దాచియుంచలేదు. శ్రీ అరవిందుని ఈ భావము లోకమాన్యతిలకుయొక్క భావముతో తుల్యమైనదిగా నుండెను. "అత్యున్నతాదర్శములో 'శాంతి' ఒక భాగము; కాని, అది ఆధ్యాత్మికముగాని, కనీసము మానసికముగాని అయిన మూలముపై ఆధారపడియుండవలెను. మానవ స్వభావము మారనిచో శాంతిమార్గ మేమాత్రము ఫలప్రదము కాజాలదు. జనులు శాంతిమార్గమును ఒక మానసిక సూత్రముగాగాని, అహింసాతత్త్వముగాగాని అనుష్ఠింప జూచిననాడు అది అపజయమును పొందును.

అపుడు పూర్వమునందుకంటెను గురుతరమయిన అనర్థ మేర్పడవచ్చును" అని అరవిందుడు వాదించెను. సామరస్య సంపాదనమునందుగూడ అరవిందుడు వెనుదీసి యుండలేదు. కాంగ్రెసునందలి రెండు పక్షములను మరల ఒకే సామాన్య నాయకత్వముక్రిందికి దెచ్చుటకు ఆతడు సర్వశక్తులను వినియోగించుటకు సంసిద్ధుడై యుండెను. గ్రామ సమితుల నేర్పరచి స్వరాజ్య సిద్ధాంతమును వాటి ద్వారమున దేశమున వ్యాపింపజేయుటయందుగల ప్రాముఖ్యమును ఆతడు గ్రహించెను. "స్వరాజ్యసాధనమందు మనము గ్రామమును పునాదిగా జేయవలెను. 'గ్రామమును నిర్లక్ష్యముచేయుట' అను పాత పొరపాటును మనము తిరిగి పడకూడదు. గ్రామమును మనము పరిసర భాగముల జీవనముతో అనుబంధింప చేయవలెను. ఐకమత్యము స్వరాజ్యసౌధ నిర్మితికి మూలము" అని శ్రీ అరవిందుడు నొక్కి వక్కాణించెను.

సంఘటన లిప్పుడు పూర్వ నిర్ణీత సిద్ధాంతములకు అనుగుణముగా శీఘ్రముగా చలింపనారంభించెను. రాజద్రోహము హద్దుమించి చెలరేగ నారంభించెను. దీనితో అధికారులు, భయభ్రాంతులై 1908 మే, 5 వ తేది ఉదయము 5 గం. లకు శ్రీ అరవిందుని బంధించి మిత్రవర్గముతో ఆతని ఆలిపూరునకు పంపి అక్కడ నున్న చెరసాలలో నుంచిరి. సుప్రసిద్ధుడును, క్రిమినల్ న్యాయవాదియునగు స్వర్గీయ ఎర్డ్లీ నార్టన్ ప్రభుత్వపక్షపు న్యాయవాదిగా నియమింపబడెను. జిల్లా మేజిస్ట్రేటు స్థానములో పనిచేయుచున్న బర్లీ నేరారోపణములను ధ్రువపరచి, సెషన్సుకు శ్రీ అరవిందుని, తదితరులను విచారణకై పంపించెను. సెషన్సు న్యాయాధికారియగు బీచ్‌క్రాఫ్టు నెదుట విచారణ జరిగెను. "దేశబంధు" అని తరువాత సుప్రసిద్ధినొందిన చిత్తరంజన్‌దాసు అరవిందునికి కారాగార విముక్తి సంపాదనమున మిగుల తోడ్పడెను. ఆలిపూరు కారాగారమున గడచిన సంవత్సర పరిమితకాలము శ్రీ అరవిందుని జీవితమునందు మిక్కిలి ప్రధానమైనది. ఇచట అతని జీవితము అంతర్ముఖమై అనంతరీతుల ఆధ్యాత్మిక జీవితము యొక్క సంపూర్ణ వికాసమునకు దోహదమొసగినది. ఇచ్చట వీరికి లభించిన దివ్యానుభవములు వీరి భవిష్యజ్జీవిత మార్గమును నిర్ణయించినవి. ఈతడు వీటిని "కర్మయోగి" పత్రిక ద్వారమున లోకమునకు అందిచ్చెను.

**ఆధ్యాత్మిక జీవితము :** ప్రభుత్వము అరవిందు నేదో వ్యాజమును పురస్కరించుకొని నిర్బంధింపవలయునని పట్టుపట్టి యుండుట స్పష్టమైనప్పటి నుండియు అతడు ఎచటనో అజ్ఞాత వాసమునందుండియే తన కార్యములను నిర్వహించుచుండెను. కడకు ఒకటి రెండు మాసములు చంద్రనగరునందుండి, 1910 ఏప్రిల్ 4 వ తేదినాడు అతడు పుదుచ్చేరియందు ప్రవేశించెను. ఇచటనే నిర్యాణ పర్యంతము అతడు తన యోగసాధనమునుకొనసాగించెను.

పుదుచ్చేరిలో శ్రీ అరవిందుడు గడిపిన కాలమందు బాహ్య ఘటనలుగా లోకమునకు తెలుపదగిన అంశములు మిక్కిలి స్వల్ప సంఖ్యాకములు. 1914 వ సంవత్సరమున ప్రారంభింపబడిన 'ఆర్య' అను మాసపత్రిక ద్వారమున అరవిందుడు తన తత్త్వ దర్శనయోగమార్గములను గూర్చి లోకమున కెరిగించెను.

శ్రీ అరవిందుల తత్త్వదర్శనము ప్రాచీనకాలము నుండియు మనకు సంక్రమించిన ఆధ్యాత్మిక సత్యములపై ఆధారపడి యున్నది. అరవిందుని తత్త్వదర్శన మిది : ఈ సకలసృష్టికిని కారణమైన మూలతత్త్వ మొక్కటియే - ఏకం సత్ - దీనిని సచ్చిదానందమని వర్ణింపవచ్చును. ఇదియే అద్వితీయమైన చైతన్యము లేక బ్రహ్మము. అనంతప్రకారమై సతత పరిణామములకు లోనై, కొంత జడమై, కొంత సప్రాణమై, అజ్ఞానము, శోకము, మోహము మున్నగు అశుభములకు క్షేత్రమై తోచు ఈ సర్వమును, అద్వైతమును, నిత్యము, అనంతమును ఐన చైతన్యమే. 'బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం'. ఇంత అనుభవ విరుద్ధమైన మాటయొక్క సత్యమును గ్రహించుట, చేరుట, మానవుని చేతన ద్వారముననే జరుగవలయును. (ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః). మానవుడు తన ఉనికి యొక్క సత్యమును తాను గ్రహించినయెడల అనగా, తన యాత్మను తాను గ్రహించినయెడల ఒక యద్భుత మతనికి యథార్థమై గోచరించుచున్నది. తన యందలి ఈ యాత్మయే, సర్వభూతములందును గల యాత్మ ; అనగా తన ఆత్మనే సర్వభూతముల యందును అతడు చూచుచున్నాడు. అట్లే సర్వభూతములను తన ఆత్మ

యందే చూచుచున్నాడు. సర్వమునకును తానాత్మయై తాను సర్వమును అగుచున్నాడు. సర్వాత్మభావమును లేక సర్వభావాపత్తిని చేరుచున్నాడు. మరియు ఈ ఆత్మయే బ్రహ్మము (అయ మాత్మా బ్రహ్మ). మనుజుడు తన యాత్మను సమగ్రముగా నెరిగినవాడై, బ్రహ్మమును తెలిసికొనుచున్నాడు ; బ్రహ్మమే యగుచున్నాడు. (సయోహవై పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి). పర బ్రహ్మము నెరుగుటయన, బ్రహ్మమును తనయందును విశ్వ మందును తెలిసికొనుటయేగాక అద్దానిని విశ్వాతీతమైన దానినిగా తెలిసికొనుట (పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యా ఽమృతం దివి). ఆ బ్రహ్మము అచింత్యము, అవ్యపదేశ్యము, ఏకాత్మప్రత్యయ సారము, ప్రపంచోప శమము, శాంతము, శివము, అద్వైతము అని తెలియ నగును.

ఈ భూమిపై మనకు గోచరించు భౌతిక ప్రాణ మనో ధాతువులు మూడు. పరిణామ క్రమమున ఇచట యోగ్య మైన భౌతికాధారము నిష్పన్నమై అందు ప్రాణము వెలువడుచున్నది. యోగ్యమైన ప్రాణాధారము వెలు వడిన పిమ్మట అందు మనోధాతువు వ్యక్తమగుచున్నది. ఆవిర్భావమున పూర్వావశ్యకమైన స్థితి అంతర్హితముగా నున్నది. భౌతికధాతువునందు ప్రాణ మనోధాతువులు అంతర్హితములై యున్న కారణముచేతనే పరిణామ క్రమమున వాటి ఆవిర్భావము సాధ్యపడుచున్నది. శ్రీ అరవిందులచే ఈ ధాతువు అచేతనమైన జడముగా గాక అంతర్నిమగ్నమైన చేతన కలదిగా గ్రహింపబడుచున్నది. శ్రీ అరవిందుల ఈ పరిణామదృష్టికి పాశ్చాత్య విజ్ఞానముల అనురోధమున్నను లేకపోయినను, ప్రాచీన ఋషిజ్ఞానము యొక్క అవలంబము సంపూర్ణముగా కలదు.

"తపసా చీయతే బ్రహ్మ తతోఽన్న మభిజాయతే।
అన్నాత్ప్రాణో మనఃసత్యం లోకాః కర్మసుచామృతం॥"

అతి దీర్ఘకాల పర్యాప్తమైన ఈ పరిణామమునందు గోచరించెడు ప్రధాన లక్షణము చేతనా విర్భావము యొక్క క్రమాతిశయము. మనుష్యుడిపుడు భౌతిక శరీర మాధారముగా గల మనోమయప్రాణి. ఇప్పుడొక ప్రశ్న సహజముగా ఉత్థితమగుచున్నది. అది 'ఇక నిచట ఈ పరిణామ కార్యము మానవునియందు మానసిక చేతనయొక్క ఆవిర్భావముతో ముగిసినట్లే తలపవల యునా? లేక దీనికంటె అధికతరమైన అభివ్యక్తి యేదేని భవితవ్యమునందు గలదా ?' అనునది. ఈ ప్రశ్న కొసగ దగిన సమాధాన విషయముననే అరవింద దర్శనము పూర్వమతములకంటె భిన్నమై గోచరించుచున్నది.

మన స్తత్త్వమున కూర్ధ్వమునందున్నది విజ్ఞాన తత్త్వము. (Super mind). విజ్ఞానశబ్ద మిచట ప్రత్యే కార్థముతో, తాను వివరించిన లక్షణములు గల భూమికను తెలుపుటకై, శ్రీ అరవిందునిచే వాడబడు చున్నది. ఇది మానవునియం దభివ్యక్తము కావలసి యున్నది. ఈ అభివ్యక్తిని సాధించుటయే మానవజీవితము యొక్క పరమోద్దేశము. మరియు ఇచటి ఈ పరిణామ గతియొక్క చరితార్థత. మనోభూమికను పూర్తిగా దాటినగాని ఆత్మయొక్క సమగ్రజ్ఞానము సాధింపబడదు. సచ్చిదానందముల యాసంత్యమును మనోభూమికపై నొకవిధమైన ప్రతిబింబముగా గాని, లేక చైతన్యము నందు మనోమయసత్త తన్నుదాగోల్పోయెడు నిమజ్జన ముగా గాని యెరుగ వీలుపడును. కాని ఈజ్ఞానము క్రియాసమర్థము కానేరదు. దివ్యకర్మలను ప్రవర్తింప జేయలేదు. మనోమయ సత్తయందలి ఉనికికి కేంద్రమై ఇచటి కర్మలకు ప్రవర్తకమగుచున్న 'అహంత' పృథక్త్వ మును అవలంబించి యుండుటచే, పూర్వోక్తములయిన అనుబంధము లందు విలీనమగుచున్నది. దివ్యసత్తతోడి ఐక్యమునందుండి దివ్యకర్మల నాచరింపగల సామర్థ్యము విజ్ఞాన సత్తయందలి దివ్యవ్యక్తికి గలదు. మన 'అహంత' దాని మలిన ప్రతిబింబము. ఈ ప్రతిబింబము తన స్వరూపములోనికి పరిణమింపవలయును. విజ్ఞాన భూమికలోని దివ్య వ్యక్తి యందు తన వ్యక్తిత్వానుభవ ముతో పాటు సర్వాతీతత్వ-సర్వాత్మ్యానుభవములు ఏక కాలికములై సామంజస్యము నొందగలవు. విజ్ఞానమయు డైన పురుషుడు అనంత సచ్చిదానందములను అనుభవిం చుటయే గాక వాటి శక్తిచే తన మనః ప్రాణ శరీరముల ధర్మమును మార్పగలడు. వీటిని గూడ దివ్యసత్తయొక్క ప్రకారములనుగా పరిణమింపజేయగలడు. నిత్యముక్త మును, నిత్య శుద్ధమును, అనంతమును, అమృతమును అగు ఆత్మయొక్క స్వరాట్త్వ-సంరాట్త్వములను బడయ

గలడు. మానవజాతి యందు విజ్ఞానమయసత్త యొక్క అవతరణమునకు మార్గము నేర్పరుపగలడు. ఇదియే అమృతత్వము; ఇదియే దివ్యత్వము; ఇదియే ముక్తత్వము, ఇదియే మానవుడు సాధింపవలసిన లక్ష్యముగా శ్రీ అరవిందునిచే నిరూపింపబడినది.

అరవిందుని యోగము : శ్రీ అరవిందుని యోగ సాధనయు ఈ లక్ష్యము కలదగుటచేతనే పూర్వ మార్గములకంటె విశిష్టమగుచున్నది. సత్త యొక్క అపరార్ధము నందు మనః ప్రాణ శరీరములును, పరార్థమున విజ్ఞాన సచ్చిదానందములును కాననగును. మనుష్యుడు విజ్ఞాన భూమిక కారోహించి, తన మనోమయ సత్తను విజ్ఞానమయ సత్తగా పరిణమింపజేయగలడు. అపుడు తన వ్యష్టి చేతనతోపాటు విశ్వచేతనతోడను విశ్వాతీతత్వము తోడను యుగపత్సంబంధమున నిలువగలడు. విజ్ఞాన భూమిక యందలి జ్యోతిశ్శక్తులను క్రింది మూడు భూమికలలోనికి అవతరింపజేసి అచట వాటిని నెలకొల్పగలడు. ఈవిధమున వాటి స్వభావమును, శరీరము యొక్క భౌతిక ధర్మమును గూడ సంపూర్ణముగా మార్చివేయగలడు. మనుష్యుడపుడు దివ్యుడై మానుష్యకమునందు దివ్యత్వ ప్రతిష్ఠాపనమునకు కేంద్రమై, దివ్యకర్మల నాచరింపగలడు. ఇదియే శ్రీ అరవిందుని విజ్ఞానయోగము.

శ్రీ అరవిందుడు పూర్వమార్గముల ప్రత్యేక లక్ష్యములను గూర్చియు, సాధనలను గూర్చియు వివరించి, వాటి నుండి ఏయే సాధనల నేదృష్టితో స్వీకరింపదగునో తనపూర్ణ యోగమున దెలిపియున్నాడు. చిత్తమందు శాంతిని నెలకొల్పుటకై రాజయోగమును స్వల్పముగా నవలంబించి అటుపై కర్మ, జ్ఞాన, భక్తి మార్గములను చక్కని సంయోజనము నందు భగవద్గీత సమీకరించినది. కాని ఇందలి ఏదో ఒక మార్గము యొక్క ఉత్తమత్వమును, మిగిలినవాని యొక్క అవరత్వమును స్థాపింపబూనుకొనిన మతాభినివేశములచే ఈమూడు మార్గములును తిరిగి విడిచి వేయబడినవి. భగవద్గీతచే ఉద్దేశింపబడిన సంయోజనము మరల శ్రీ అరవిందుల యోగమునందు ఉద్ధరింపబడినది. ఆత్మ సమర్పణము అన్ని యోగములకును ప్రథమమును, అంత్యమును అగు సోపానము; యోగశక్తి నావాహింప నేర్చుటకు పూర్వావశ్యకమైన స్థితి చిత్తస్థిర శాంతియై యున్నది. ఇది సాధింపబడిన పిమ్మట యోగము తనను తానే నడుపుకొని ముందునకు బోవుననవచ్చును. "యోగో యోగస్య ప్రవర్తకః".

నిర్యాణము : శ్రీ అరవింద యోగీంద్రులు 1950 డిసెంబరు 4 రాత్రి 1-30 గంటల సమయమున (5-12-1950 మంగళవారము) మహాసమాధి ప్రవిష్టులయిరి. పరాసు దేశీయురాలును శ్రీ అరవిందాశ్రమమున కధిష్ఠాత్రియునగు మాత శ్రీ గురుదేవుని నిర్యాణమును గూర్చి ఇట్లు చెప్పెను :- "శ్రీ అరవిందుడు తన శరీరమును విడిచిపెట్టుటలో మహనీయమగు స్వార్థత్యాగమును ప్రదర్శించెను. సాముదాయకమగు అనుభవ సిద్ధికాలమును త్వరపరచుటకుగాను ఆయన తన శరీరములో పొందిన అనుభవ సిద్ధిని పరిత్యాగముచేసెను."

శ్రీ అరవిందుల నిర్యాణ విధానము సామాన్య మానవ దుర్లభముగనుండి అద్భుతము గొల్పెను. ఆతని భౌతిక శరీరము ఎట్టి వికారములకు లోనుగాకుండా ప్రశాంతముగా నుండి, దివ్యకాంతిని వెదజల్లుచుండెను. ఇట్టి పరిస్థితి 78 గంటలవరకును ఉండెను. మృతకాయ మిట్లు జ్యోతిఃప్లుతముగా ఇంత దీర్ఘకాలము నిత్య నూతనముగా కనిపించుట అద్భుత విషయముగదా! ఆయన మహామూర్తి శయ్యపై నిద్రపోవుచున్నట్లుగానో, సమాధిలోనున్నట్లుగానో కనబడుచుండెను. ఎటువంటి వికారములను చెందని ఆయనశరీరమునుండి హంస లేచిపోయినదో లేదో తెలియరాని పరిస్థితి యేర్పడెను.

పుదుచ్చేరిలోని ఫ్రెంచి ప్రభుత్వ శాసనముల ప్రకారము ఏ మృతకళేబరము 47 గంటలకు మించి ఆవాస స్థలములో నుండగూడదు. పుదుచ్చేరి ప్రధాన వైద్యాధికారి 8-12-1950 నాడు వచ్చి శ్రీ అరవిందులను పరీక్షించి విభ్రాంతుడయ్యెను. అరవిందయోగి భౌతికావశేషాలకు ఎప్పుడు ఎట్లు అంత్యక్రియలు జరుపవలెనను విషయములో ఆశ్రమమున పరిపూర్ణ మౌనము అవలంబింపబడెను. వాతావరణము పవిత్రముగా నుండెను.

శ్రీ అరవిందులవారు భారతదేశానికిచెందిన మహావ్యక్తి అగుటచే భారత పార్లమెంటులో శ్రీ అరవిందునియెడ గౌరవసూచకముగా ఒక నిమిషము సభ్యులందరు లేచి మౌన ప్రార్థనలు గావించిరి. లోక సభాసభ్యులు కాని

వారి కిట్టి గౌరవము కలుగుట కవకాశము లేదు. అయినను శ్రీ అరవింద యోగీంద్రుని ఘనతను పురస్కరించుకొని ఆ నియమమున కపవాదముగా లోకసభాధ్యక్షులు ప్రవర్తించిరి.

1908 లో శ్రీ బాబు అరవిందఘోషు రాజద్రోహ నేరముక్రింద విచారింపబడియుండెనుగదా! ఆ విచారణాంతమున శ్రీ అరవిందుల పక్షమున న్యాయవాదిగా నుండిన దేశబంధు బాబు చిత్తరంజనదాసుగారు ఈ క్రింది విధముగా తమ వాదోపన్యాసమును ముగించిరి:—

"ఈ వివాదము సద్దుమణిగిన తరువాత, ఈ సంక్షోభము, ఆందోళనము ఆగిపోయిన తరువాత, ఈయన మరణము పాలయి, అదృశ్యుడయిన తరువాత, ఈతడు దేశభక్తి కవితామూర్తి యనియు, జాతీయతా ప్రవక్త యనియు, మానవతా ప్రేమపూరితు డనియు పరిగణింపబడును. ఆతని ప్రవచనములు ఇండియాలోనే కాదు దూరదూరాననున్న సముద్రాలలోను, దూరదూరాననున్న భూములలోను ధ్వనించుచు, ప్రతిధ్వనించుచు ఉండగలవు.

వి. భ. - వే. చం.

**అరసవెల్లి:-** భారతదేశముననున్న యొకటిరెండు సూర్యదేవాలయములలో పేరెన్నిక గన్నది అరసవెల్లిలోని సూర్యదేవాలయము. కోణార్కమున సూర్యదేవాలయ మొకటి కలదు. కాని ఆ యాలయము శిథిలమయినది. పూజా పురస్కారము లందు లేవు. ఇవికాక యెక్కడనో యుత్తర భారతమున నొక సూర్యదేవాలయము కలదట. అది యంత ప్రసిద్ధమైనదికాదు. పేరొందిన సూర్యదేవాలయము ఆంధ్రదేశములో నుండుట ఆంధ్రుల పుణ్యము. 'అరసవెల్లి' యొక చిన్నగ్రామము. ప్రస్తుతము శ్రీకాకుళమండలములోనున్నది. శ్రీకాకుళమున కీక్షేత్రము రెండు మైళ్ళు. ఇంగ్లీషు అక్షరములలో నీ గ్రామమునకు 'అరసవిల్లి'యని వర్ణక్రమముచెల్లుచున్నది. శాసనములలో 'అరిశవెల్లి' యనియు, 'అరినవెల్లి' యనియు కలదు. దీనికే సంస్కృతమున "హర్షవిల్లి" యని వాడుక. బహుశః 'అరసవెల్లి' యే సంస్కృతీకరింపబడి యిట్లయినదేమో!

ఏడవ శతాబ్దపు టుత్తరభాగముననో, ఎనిమిదవ శతాబ్దపుప్రారంభముననో కళింగరాజయిన 'దేవేంద్రవర్మ' అరసవెల్లిలో సూర్య దేవాలయమును స్థాపించి యుండును. కాని ఆ దేవాలయమే యీ దేవాలయ మనుటకాధారములు లేవు. శాసనములలోని సరిహద్దు లీ దేవాలయపు టునికితో సరిపడకున్నవి. దేవాలయ నిర్మాణము కూడ అంత ప్రాచీనమైనదికాదు. నిజమునకు దేవాలయ గోపుర కుడ్యాదులందు శిల్పము లేనేలేదు. బోడిగోడలే యున్నవి. కాని గర్భగుడిలోని సూర్యదేవమూర్తి చెక్కబడిన శిలవంటి శిలకాని, అందలి శిల్పమువంటి శిల్పము కాని దేవాలయప్రాంతములో నెచ్చటనులేదు. ఈదేవాలయము బహుశః తురకలు ధ్వంసము చేయగా తిరిగి నిర్మింపబడియుండును. మూలదైవత విగ్రహము మాత్రము దేవేంద్రవర్మ నిర్మింపజేసినదే యని విశ్వసింపవచ్చును. ఇప్పటి దేవాలయమును క్రీ.శ. 1778 లో శ్రీ ఎలమంచి పుల్లాజీపంతులు నిర్మింపజేసిన ట్లొక శిలాశాసనము గర్భగుడి ద్వారముపై నున్నది.

అరసవెల్లి సూర్యదేవాలయము తూర్పు ముఖముగా నున్నది. విశాలమయిన ప్రాంగణము కలదు. ముందుగా పెద్ద ద్వారముతో నొక గోపురము కలదు. తరువాత ధ్వజస్తంభము కలదు. దాని ప్రక్కనే సంతాన గోపాలస్వామి యంత్రము గల ఒక కంబము, దానిపై గరుడ చిహ్నమును గలవు. తరువాత ముందునకుపోవ వేరొక గోపురము, ద్వారమును గలవు. దాని తరువాత విశాలమగు కల్యాణ మండపము కలదు. లోన గర్భగుడియు, గర్భగుడిలో సూర్యదేవుని విగ్రహమును కలవు.

సూర్య విగ్రహము సుమారు మూడడుగుల యెత్తున ఆకర్షణీయమైన శిల్పసౌందర్యముతో అలరారుచుండును. విగ్రహమున అడుగున సప్తాశ్వములు చెక్కబడినవి. తదుపరి రథము కలదు. కమలహస్తుడైన సూర్యదేవుడు నిలువబడియుండును. సూర్య విగ్రహమునకు ప్రక్కగా ఛాయ, ఉష, పద్మిని అను స్త్రీల మూర్తులు చెక్కబడినవి. వీరు ఆతని భార్యలు. సనకాది మహర్షులు వింజామరలు వీయుచున్నట్లును, మాఠర పింగళకులు ద్వారపాలకులుగా నున్నట్లును చెక్కబడియున్నవి. ఈ దేవాలయమున ఆదిత్య, అంబికా, విష్ణు, గణేశ, మహేశ్వరు లను పంచాయతనము కలదు.

అరుణములో చెప్పినట్లు సర్వ వ్యాధ్రోగములు, నేత్ర రోగములు తగ్గుటకు, శరీరారోగ్యము కలుగుటకు

ఎందరో భక్తులు ప్రతిదినమును వచ్చి సూర్యదర్శనము చేసికొని, తీర్థప్రసాదము లారగించిపోవుదురు. ఈ ప్రదేశమున మూడు చెరువులు గలవు. ప్రస్తుతము దేవాలయమునకు తూర్పుగా నొక పెద్ద కొలను గలదు. దీనిని సూర్య పుష్కరిణి యందురు. ఇందే స్నానమాచరించి తైర్థికులు దేవదర్శనమొనరించెదరు. తైర్థికుల సౌకర్యము కొరకు ఉదారులు నిర్మించిన సత్రములు కలవు. ప్రత్యాది వారము పర్వదినము. మాఘమాసము సూర్యప్రీతికరమయిన మాసము. రథసప్తమి సూర్యదేవుని పర్వదినములలో శ్రేష్ఠమైనది. దేవాలయమున నమకచమకసౌర త్రిచలతో సూర్యనమస్కారములు ప్రతిదినము జరుగును. ఇందు అర్చకులు సంప్రదాయబద్ధులు. అర్చనా విధానమున ఆరితేరినవారు, పరిశుద్ధులు నగుట ప్రశంసాపాత్రమైనది.

అరసవెల్లిలోని సూర్యభగవానుని సందర్శించి హర్షము వెల్లునలు కాక యరిగినవారు లేరు.

ది. రా.

**అరిస్టాటిల్ (384 - 322 క్రీ. పూ.) (విద్యా విషయము)** :- జీవిత సంగ్రహము :- ప్రాచీన గ్రీకు విజ్ఞానమునకు మూలపురుషులు ముప్వురు. సోక్రటీసు, ప్లేటో, అరిస్టాటిల్. ఇదియొక అసాధారణ గురు శిష్య పరంపర. వీరిలో చివరివాడగు అరిస్టాటిల్ ప్రపంచచరిత్రయందు మొదటి మేటి శాస్త్రవేత్తయనియు, విజ్ఞానమును వ్యవస్థీకరించి శాస్త్రరూపము నిచ్చుటలో నద్వితీయుడనియు నెంచబడుచున్నాడు. ఈతని జీవితమునందు మూడు విస్పష్ట దశలు గమనింపదగును. ఈ దశలలో ఈతని మానసికాభివృద్ధియందుగూడ అంతరములు కనిపించును.

ప్రథమదశ :- (క్రీ. పూ. 384 నుండి 347 వరకు) మేసిడోనియా సరిహద్దులపైనున్న థ్రేసు రాష్ట్రము నందలి "స్టాజిరా" యను నూర క్రీ. పూ. 384 లో అరిస్టాటిల్ జన్మించెను. ఈతని తండ్రియగు "నికోమాకస్" మేసిడోనియారాజగు "అమిన్టాసు"నకు ఆస్థాన వైద్యుడుగను, ఆప్తమిత్రుడుగను ఉండెను. ఈతని తల్లి పేరు "ఫేస్టిస్". బాల్యముననే తలిదండ్రులను కోల్పోయి నందున నీతనిని, బంధువగు "ప్రోక్సినస్" పెంచి పెద్దవానినిజేసి, విద్యాబుద్ధులు చెప్పించెను. 17 వ యేట ఏథెన్సు నగరములో ప్లేటోయొక్క పాఠశాలను (ఎకాడమీ) ప్రవేశించి, 61 సంవత్సరముల వయస్సుగల గురువు పాదముల యొద్ద సకలవిద్యల నభ్యసించెను. తుద కాపాఠశాలయందే సహాయోపాధ్యాయుడయ్యెను. కళలు, శాస్త్రములు, రాజకీయ, తత్త్వశాస్త్రములు మత గ్రంథములు మొదలగునవన్నియుపఠించెను. క్రీ.పూ.347సం.న ప్లేటో కాలధర్మము నొందుటచే అరిస్టాటిల్ ఆ పాఠశాలను వీడెను.



అరిస్టాటిల్

ద్వితీయదశ :- అటనుండి "జనోక్రేట్స్" అను ముఖ్య సహచరునితో గలిసి "ఏసస్" నగరమును జేరి, అందు పాఠశాల నొకదానిని నెలకొల్పెను. ఎకాడమీలో తన సహపాఠియగు "హెర్మియస్" యొక్క మేనకోడలు "పిథియస్" అను నామెను వివాహమాడెను. ఈతని సహాయమువలననే అరిస్టాటిల్ మేసిడోనియా రాజగు "ఫిలిప్" కుమారుడయిన "అలెగ్జాండరునకు పెల్లా నగరమందు దేశికుడయ్యెను. క్రీ పూ. 335 వరకు ఈ పదవి నత్యంత సమర్థతతో నిర్వహించెను. ప్రపంచచరిత్రయందు ఇట్టిమహాప్రజ్ఞావంతులగు గురుశిష్యులు కానరారు. సహపాఠియును, బంధువునగు హెర్మియస్‌ను పర్షియనులు చంపిరను క్రోధమున నీతడు అలెగ్జాండరును తూర్పుదేశములపై దాడికై పురికొల్పెనని సందేహింపవచ్చును. క్రీ. పూ. 335 అలెగ్జాండరు సింహాసన మధిష్ఠింపగనే ఈతడు మరల ఏథెన్సు నగరమును చేరెను.

తృతీయదశ :- ఇప్పటినుండి ఏథెన్సునందలి సామాన్య పాఠశాల యగు "లైసియం" నందు అరిస్టాటిలు ఉపాధ్యాయుడయ్యెను. ఈ కాలమం దీతడు ఉదయమున వ్యాయామము, ఉన్నత శాస్త్ర విషయములు మొదలగు

వాటినిగూర్చి కొద్దిమంది విద్యార్థులకు ఉపన్యసించుటయు మధ్యాహ్నము సామాన్య విషయములపై ప్రజాబాహుళ్యమునకు ఉపన్యసించుటయు చేయుచుండెను. రెండవ సారి ఏథెన్సు చేరినతరువాత పిథియస్ చనిపోయెను. తరువాత అతడు హెర్పిలిస్‌ను వివాహమాడెను. వారికి 'నికొమాకస్' అను కుమారుడు కలిగెను.

ఈతడు మేసిడోనియానుండి వచ్చినవాడగుటచేత "ఏథెన్సు" నగరవాసు లీతనిని ద్వేషించుచుండిరి. కాని అలెగ్జాండరు జీవితకాలమున నీతని కెట్టిహానియు సలుప జాలరయిరి. తూర్పు దండయాత్రలనుండి వచ్చుచు అలెగ్జాండరు క్రీ. పూ. 323 లో మరణించినట్లు తెలియగనే అసూయాపరు లీతనిపై నాస్తికుడను నింద మోపిరి. ఏథెన్సు నగరవాసులకు సోక్రటీసు హత్యాపాపముతోపాటు ఇంకొక పాపకార్యాచరణమున కవకాశ మీయరాదని ఈతడే ఏథెన్సును వీడి "కాల్సిస్" అను ఊరుచేరెను. కొంతకాలము ఉదరరోగముతో బాధపడి క్రీ. పూ. 322 లో దేహము చాలించెను. పిదప నీతని అస్తికలను జన్మస్థానమగు "స్టాజిరా"కు తీసికొనిపోయి, చిరస్మరణీయముగా నొక సమాధియందు నిక్షేపించి, ప్రజలు తమ భక్తిశ్రద్ధ లను చాటుకొనిరి.

అరిస్టాటిల్ బట్టతలను, పల్చని పాదములను, చిన్న కనులను కలిగియుండెడివాడని చెప్పబడుచున్నది. ఆతఁ డెల్లప్పుడును ఆకర్షణీయమైన దుస్తులను ధరించెడివాడట. బంధువులకు బానిసలకు తన యాస్తి చెందవలెనని అరిస్టాటిల్ మరణశాసనమునుగూడ వ్రాసెను.

రచనలు : తండ్రి వైద్యుడగుటచేత ఇతనికి భౌతిక, జంతు, జీవశాస్త్రములందు సహజాభిమానము కలదు. అకాడమీయందున్నప్పుడు జంతుశాస్త్రమునుగూర్చి నూతనములగు పరిశోధనములు కావించెను. తత్త్వశాస్త్రము నభ్యసించెను. అలెగ్జాండరునకు గురువుగానున్నప్పుడు రాజకీయశాస్త్రమునందును, సాహిత్యశాస్త్రమునందును విశేషముగా కృషిసాగించెను. ఇంక రెండవసారి ఏథెన్సు నందున్న కాలమున (క్రీ. పూ. 335-322) ఇతడు తన ముఖ్యరచనలు గావించెను. తర్కశాస్త్రము, తత్త్వశాస్త్రము, నీతిశాస్త్రము, రాజకీయశాస్త్రము, సాహిత్యశాస్త్రము, జంతు భౌతిక శాస్త్రములు మున్నగు వాటి యందు నేటికిని ఈతని గ్రంథములే అగ్రస్థాన మలంకరించుచున్నవి. పెక్కు శాస్త్రములకు పేరును, రూపమును కల్పించి నేడు మన వాడుకలో నున్న పెక్కు పారిభాషిక పదములను సృష్టించినవాడు ఈ "విజ్ఞాన శాస్త్ర జనకుడే" అనదగును. ఈతడు రచించిన "ఆర్గనమ్" అను గ్రంథమును మించి, ప్రయోగ తర్కశాస్త్రము నేటికిని పురోగమించ లేదు. ప్రతిష్ఠాపన తర్కశాస్త్రమును గూడ నీతడు సమగ్రముగా రచించి యుండవలెననుటకు ఆధారములు గలవు. కాని మానవజాతి దురదృష్టమువలన ఆ గ్రంథ మెటులో నశించినది. ఆశాస్త్రభాగమును మరల బేకను మహాశయుడు మనకు ప్రసాదించినాడు. వ్యక్తి, సంఘము, ప్రభుత్వము అను వాటియొక్క పరస్పర బాధ్యతలను హక్కులను గురించి తన సిద్ధాంతములను, "నీతిశాస్త్రము" "రాజకీయశాస్త్రము" అను గ్రంథములందు ఇతడు స్పష్టపరచెను. ఈతని "నీతిశాస్త్రము"నందు మానవుని మంచి లేక సుఖమును గురించిన చర్చయు, "రాజకీయశాస్త్రము" నందు దీనిని సాధించు విధానములు నుగలవు. మధ్యయుగములం దీపువేసముహుని గ్రంథములు తక్క తక్కినవన్నియును నిర్మూలబడినవని చెప్పవచ్చును.

విద్యా విధానము : ఈతడు ప్రాచీన విద్యావేత్తలయందగ్రగణ్యుడు. విద్యావిధానమును శిశుదశనుండి విశ్వవిద్యాలయ దశవరకు చాల వివరముగ నిర్ణయించెను. నేటి మన యభివృద్ధి సూచకములయిన శిశుపాఠశాలలు గూడ ఇతని యాదర్శమునకు నెనుబడినవే యగును.

ప్రాథమిక విద్య : శిశువుయొక్క తలిదండ్రుల వివాహమునకు ముందునుండియు ఈతని ప్రణాళిక మొదలగును. ఆరోగ్యమును, బలమునుగల యువతీయువకులే వివాహమునకును, జాతిని వర్ధిల జేయుటకును అర్హులు. స్త్రీకి 18 సం. లును, పురుషునకు 37 సం. లును, వివాహమునకు యుక్తవయస్సు. గర్భిణియగు యువతికి లఘుపరిశ్రమయు, లఘ్వాహారమును తగును. ఆ కాలమున దేవతా దర్శనమును, పూజలును అవసరము. ఒక్కొక్క మిథునమునకు సంతానపరిమితిని ప్రభుత్వము నిర్ణయించవలెను. అనారోగ్యవంతులగు శిశువులను అంత మొందింపవలయునను నాటి యాచారము నీతడు సమర్థించెను. దేహదార్ఢ్యమునకై శిశువులు శీతవాతాతపము

లకు గురికావలెనని ఈతని మతము. వారెంత యేడ్చిన నంత యారోగ్యకరము. 5 సం. వయస్సు వరకును కథలు, ఆటలు, సత్సహవాసము, వినోదములకు తగిన యవకాశము అవసరము. అవినీతికర శిల్పములు దేవళములందు తప్ప నింకెక్కడ నుండరాదు. తప్పుచేసిన బాలురను బహిరంగముగా శిక్షించవలెను. 5 సం. నుండి 7 సం. వయస్సుగల బాలబాలికలు వారు ముందు చేర బోవు పాఠశాలలను సందర్శించుచుండవలెను.

7 సం. నుండి 21 సం. వరకు : దీనియందు రెండు అంతర్దశల నేర్పరచెను, యౌవన పూర్వదశ, యౌవనపర దశ. ఈ 14 సంవత్సరముల కాలములో చదువుట, వ్రాయుట వ్యాయామమును, గానమును, చిత్ర లేఖనమును, నాటకకళను బోధించుటవలన ఉద్రేకములకు తగిన శిక్షణ నొసంగవలెను. చిత్రలేఖనమును జీవనోపాధికి మాత్రమే యుద్దేశింపక, ఆనందోత్పాదనమునకును వ్యాయామమును పశుబల సంపాదనమునకుగాక దేహ సౌష్ఠవమునకును ఆరోగ్యమునకును అవసరము. యౌవనమునకు పూర్వము తేలిక వ్యాయామమును, తరువాత ఆహార నియమములతోగూడిన కఠినమగు కసరత్తులను ఆదేశించెను. గానము ఆత్మకు తగినకసరత్తు; అది విశ్రాంతిని సంస్కారయుతముగా గడపుటకు ఉపకరించును. గానమువలన సుఖదుఃఖములయెడ సమభావము కలుగును. దేహమునకు ఔషధ మెట్టిదో, ఆత్మకు గాన మట్టిది. చిత్రలేఖనముకంటిద్వారా దేహముపై మాత్రము ప్రభావము కల్గింపగా, గానము చెవిద్వారా యాత్మపై ప్రసరించును. చిత్రలేఖనముకన్న గానము ఉన్నతకళ. కనుక బాలబాలికలకు ప్రారంభమునందు చిత్రలేఖనము కన్న గానమే లాభదాయకము. వారికి నీతిదాయకము లగు గీతములనే బోధింపదగును.

ఈతడు విద్యా విషయములను, ప్రయోగాత్మకములు, సృజనాత్మకములు, జ్ఞానాత్మకములని మూడు తరగతులుగా విభజించెను. మొదటిదానియందు నాట్యము, పరుగెత్తుట, దుముకుట, కసరత్తు చేయుట, కుస్తీ పట్టుట, కవాతు, స్వారి చేయుట, గురిజూచుట, బల్లెములను, చక్రములను విసరుట గలవు. రెండవదానియందు గానము చిత్రలేఖనము గలవు. మూడవదియగు జ్ఞానాత్మకము నందు వ్యాకరణము, తర్క మీమాంసలు, సారస్వతము, గణితము, ఖగోళశాస్త్రములు గలవు.

21 సంవత్సరముల వయస్సు పిమ్మట దశ : శరీర సౌఖ్యమునకు ఆరోగ్య మవసరమైనట్లు, మానసిక సౌఖ్యమునకు సన్మానసికత్వము ఆవశ్యకము. ఈ దశ యందు యువకులు ప్రత్యక్షముగా చట్ట నిర్మాణ, నిర్వాహక కార్యములందు పాల్గొనుచు శిక్షణము బొంద వలయును. వారు సరిహద్దులపై కొంతకాలము సేవ చేయుట అవసరము, అటుపిమ్మట ఆధ్యాత్మికాభిరుచిగల వారిని మతబోధన కార్యములలోనికి తీసికొనవచ్చును.

అరిస్టాటిల్ చెప్పిన యీ విద్యా ప్రణాళికయంతయు స్వతంత్ర పౌరులకై యుద్దేశించబడినదే. ఆనాటి బానిస ప్రజల కొరకుగాదు. తన గురువర్యుడగు ప్లేటో యభిమతమునకు భిన్నముగా నీతడు స్త్రీలకు ఉన్నతవిద్య యనవసరమని తెలిపెను. ఇతనిగ్రంథ మిచ్చట అకస్మాత్తుగా నిలచిపోయినది. కనుక ఉన్నతవిద్యా ప్రణాళిక యందలి వివరములు లేవు.

ఈతని ప్రభావము : ఆనాటి గ్రీసునందు అరిస్టాటిల్ ప్రభావ మంతగా కానరాదు. ఈతని అనుయాయులు కొన్ని గ్రంథ భాగములపై విమర్శనలను, టీకలను వ్రాయుటకన్న ఇంకేమియు జేయరైరి. క్రీ.పూ. 287 లో నీతని గ్రంథములు ఆసియామైనరుకు గొంపోబడినవి. అచట నివి రెండు శతాబ్దముల కాలము ఉపయోగ రహితముగ నుండెను. పిమ్మట ఆ గ్రంథములు అలెగ్జాండ్రియాకును, రోమునకును చేరినవి. అరబ్బీ భాషాంతరీకరణముల వలన బాగ్దాదులోను, వారి సామ్రాజ్య విస్తరణచే స్పెయిను నందును ఈతని రచనల జ్ఞానము వ్యాప్తి చెందెను. మధ్య యుగములందు అన్ని పాఠశాలల యందును ఈతని రచనలే ప్రధాన పాఠ్య గ్రంథములుగా నుండెను. 15 వ శతాబ్దము నందలి "రినైసాన్సు" అన బడు పూర్వ విద్యా పునరుద్ధరణము వరకును అరిస్టాటిలు పూర్వ విద్యావేత్తలందరిలో ప్రాధాన్యము వహించెను. నేటికిని సర్వశాస్త్రములందును అరిస్టాటిల్ చూపిన శాస్త్రీయ పరిశోధన మార్గము, హేతువాద విధానము అనునవే యనుసరింపబడుచున్నవని చెప్పక తప్పదు.

సో. రా.

**అరిస్టాటిల్ (2. జంతు విషయము)**:- తనతండ్రి వైద్యుడగుటవలననో, లేదా ప్రతి విషయమును విపులముగా తెలిసికొనవలయునను ఆసక్తిగలిగినందు వలననో, అరిస్టాటిల్ తన జీవితముయొక్క చరమదశలో శారీరకశాస్త్రమునందును, జంతుశాస్త్రమునందును, మిక్కుటమగు అభిరుచిని చూపినవాడాయెను.

అరిస్టాటిల్ ప్రపంచమునకు తెలిసిన జంతుశాస్త్రజ్ఞులలో గొప్పవాడుగను, ప్రథముడుగను ఎన్నబడు చున్నాడు. గ్రీసు, మాసిడోనియా, ఏషియామైనరు అను దేశములలో నివసించు పెక్కు జంతువుల నిర్మాణములు, అలవాట్లు మున్నగు వివిధవిషయములను తెలిపెడు బృహద్గ్రంథము నొకదానిని వ్రాసెను. దీనినే హిస్టోరియా ఏనిమాలియం **(Historia Animalium)** అందురు. అనగా 'జంతుచరిత్ర' అని యర్థము. ఇందు తొమ్మిదిభాగములు కలవు.

ఇతడు సూక్ష్మగ్రాహి. ఇతని వర్ణనలలో అధికాంశములు స్వయముగా చేసిన పరిశీలన ఫలితములయి నిర్దుష్టముగా నుండును. అయినను, ఇతర ఆధారముల ననుసరించి ఇతడు వ్రాసిన కొన్ని విషయములు అసత్యములుగాను, విపరీతమైనవిగాను ఉన్నవి. గ్రీకు దేశమునకు సంబంధించిన దాదాపు 520 జాతుల విషయములు ఇతని రచనలలో గుర్తింపబడినవి. జంతువులను వాటి నిర్మాణములను బట్టియు, అలవాట్లను బట్టియు విభజింపవచ్చునని నిర్ణయించెను. కాని వర్గీకరణ పద్ధతిని ఇతడు పేర్కొనలేదు. మిగిలినవారు ఇతని వ్రాతలనుండి వర్గీకరణ పద్ధతులను పేర్కొనిరి. ఇతడు సంపూర్ణమగు పరిశీలనాదృష్టి కలిగినవాడు. కోడిగ్రుడ్డునందలి పిండము పిల్లగా మారుటయు, మగ తేనెటీగలు సంయోగక్రియ లేకయే వృద్ధిచెందుటయు, కొన్ని పార్కు చేపలు తల్లి గర్భమునందే పెరుగుటయు మున్నగు విషయములను చక్కగా పరిశీలించెను.

ఇతడు క్రమానుసారియైన ప్రకృతిశాస్త్రవేత్త. పరిశీలనముయొక్క ప్రాముఖ్యమును నొక్కి వక్కాణించెను. జీవశాస్త్ర సంబంధమగు దృశ్యములందలి క్రమనియమములను గుర్తించెను.

ఇతడు పరిశీలించిన విషయములనుండి నిర్ణయములను చేయుటలో అనుమాన ప్రమాణమును ఆశ్రయించెను. తులనాత్మకములైన చర్యలయందు మానవ దేహమును ప్రమాణముగా గ్రహించెను. శారీరశాస్త్ర విషయములందు కొంతవరకు ఇతడు పొరపాటు పడియుండెను. ఆకాలమున రసాయనశాస్త్ర పరిజ్ఞానము లేకపోవుటచే ఇట్టి పొరపాటు సహజమైనదియే. జీవకోటి అల్పత్వము నుండి అధికత్వమునకు పరిణామము చెందుచుండునని అతడు విశ్వసించెను. ఈ పరిణామమునకు చిచ్ఛక్తి యొక్క అనుశాసనమే కారణమని అతడు అభిప్రాయ పడెను.

డా. బా. రె.

**అరిస్టాటిల్ (3. రాజకీయము)**:- అరిస్టాటిల్ ప్లేటోకు శిష్యుడైనను ప్లేటోకును వీనికిని ఎంతేని వ్యత్యాసము కలదు. ప్లేటోయొక్క నైతికదృష్టి అరిస్టాటిల్‌యందును కలదు. కాని ప్లేటోయొక్క కవితాశక్తియు, భావచాతుర్యమును అరిస్టాటిల్ గ్రంథములయందగపడవు. ప్లేటో రచనలు సంభాషణ రూపమున నుండుటచే అతి మనోహరములై యున్నవి. కాని అరిస్టాటిల్ గ్రంథములు శాస్త్రరీత్యా వ్రాయబడినవి. కవితాశక్తిగాని, అపూర్వమైన శైలిగాని అందు కానరావు. అతని ఉపన్యాసముల నుండి శిష్యులు గ్రహించిన విషయములను అనంతరము వారే, గ్రంథరూపమునకు దెచ్చిరని పలువురి అభిప్రాయము.

అరిస్టాటిల్ పద్ధతి శాస్త్రపద్ధతి. భావనాశక్తి ప్లేటోయందు ప్రధానమైనది. అరిస్టాటిల్ గ్రంథములయందు వాస్తవిక దృష్టి ప్రధానము. ఆదర్శములు, భావములు ప్లేటోకు సత్యమైనచో, వాస్తవ ప్రపంచముకూడ అరిస్టాటిల్‌కు ముఖ్యమైనది. దేశకాల పరిస్థితులకు సంబంధము లేని ఆదర్శములు, తత్త్వములు అతనికి పనికిరావు. అతనిది శాస్త్రపద్ధతి కనుక రాజ్యమునుగూర్చి వ్రాయబూనుటకు మునుపు అతడు నాటి రాజ్యాంగములను, వాని చరిత్రను, చక్కగా పరిశీలించెను. అతడు రచించిన "పొలిటిక్సు" అను గ్రంథము ఆకాలపు పరిస్థితులపై ఆధారపడి వాస్తవికముగ నున్నది.

మానవుని అనేక వాంఛలను తృప్తిపరచుటకుగాను నానాసంస్థలు ఏర్పడును. కాని ఈ సంస్థ లన్నిటికన్నను రాజ్యము ఉత్తమమైనది. ఇతరసంస్థలు మానవుని ప్రత్యేక వాంఛల కొరకును, సంకుచితములయిన కోర్కెల కొర

కును ఏర్పడి యుండవచ్చును. కాని రాజ్య మను సంస్థ మానవుని ఉత్కృష్ట ఆశయములకొరకు ఏర్పడినది. ఉత్కృష్ట ఆశయములు, వాక్ఛక్తి—ఇవియే మానవుని జంతుజాలమునుండి ప్రత్యేకించునవి. ఇవి మానవునకు స్వాభావికములు. కనుక రాజ్యముకూడ మానవునకు స్వాభావికమైనది. రాజ్యము లేకున్న మానవునకు వాస్తవముగ నైతిక జీవన మసంభవము. రాజనీతి సకలశాస్త్రములకును మూలము. నైతిక ఆదర్శములు రాజనీతి యందలి భాగములు.

మానవులందు కొందరు బలవంతులు, ఇతరులు దుర్బలులు ; కొందరు ధీమంతులు, ఇతరులు జడులు కనుక బలవంతులును, ధీమంతులును యజమానులుగ నుండుటయు, దుర్బలులు, జడులు సేవకులుగ నుండుటయు సహజమును, న్యాయమును. అల్పకార్యములను సేవకులు నెరవేర్చుకున్న యజమానులకు ఉత్కృష్టజీవనము కాని, రాజ్యమునకు శ్రేయము కాని చేకూరవు. రాజ్య వ్యవహారములందు పాల్గొను పౌరులు అల్పవ్యవహారముల యందు నిమగ్నులగుట రాజ్యమునకు నష్టము.

పాలిటిక్సు అను గ్రంథమునందు అరిస్టాటిల్ ప్లేటో యొక్క ముఖ్యాభిప్రాయములను తీవ్రముగ విమర్శించి యున్నాడు. రాజ్యైక్యము రిపబ్లిక్‌లోని ముఖ్యాంశము. సామూహిక జీవన మిందులకు ముఖ్యమార్గము. రాజ్యైక్యము ముఖ్యమైనదేకాని వ్యక్తి ప్రత్యేకతయును ముఖ్యముకదా యని అరిస్టాటిల్ వాదించెను. వ్యక్తులను సంపూర్ణముగ రూపుమాపి ఐక్యమును సాధించునట్టి రాజ్యమునకు విలువ యుండునా ? అంతియ కాదు. ప్లేటో సూచించినట్టి సామూహిక జీవనపద్ధతి సాధ్యము కానిది. సంసారము, ఆస్తి, స్వామ్యము అను వాటి యందు మానవులకు ఆసక్తి నశించుననుటకూడ అసంభవము.

పౌరుల సమాజము రాజ్యమనియు, రాజ్యమును నిర్వహించు పౌరవర్గము ప్రభుత్వమనియు అరిస్టాటిల్ నిర్వచించి రాజ్యమునకును, ప్రభుత్వమునకును గల వ్యత్యాసమును స్పష్టపరచెను. రాజ్యభారమును వహించుటయు, ప్రభుత్వమునకు లోబడి ప్రవర్తించుటయు పౌరుని ముఖ్య లక్షణము లని, అతని అభిప్రాయము. ప్రభుత్వమునకు సంబంధించిన సమస్యల నతడు అతి సూక్ష్మముగ విమర్శించి, ఆదర్శ రాజ్య రచనయందు ముఖ్యముగ గమనింపవలసిన విషయములను విపులముగ పేర్కొనెను. పరిస్థితుల కన్వయింపని ఆదర్శములు నిరర్థకములు. అంతియకాక అరిస్టాటిల్ రాజ్యముల చరిత్రను, ఆకృతిని చక్కగ పరిశీలించెను. కనుక రాజ్యములను వర్గములుగ విభజించుట కనుకూలమైన మార్గములను, ప్రమాణములను కూడ అతడు సూచించి యున్నాడు.

ఇక రాజ్యములయందు సంభవించుచుండు మార్పులు క్రాంతులు మరియొక ముఖ్యమైన సమస్య. ఈసమస్యను కూడ అరిస్టాటిల్ సంపూర్ణముగ పరిశోధించి వీనిని నివారించు మార్గమును వర్ణించి యున్నాడు. ప్రజలయందు సమత్వ వాంఛయే వీటికి కారణము. ఆర్థిక విభజనమందును, అధికార విభజనమందును, న్యాయదృష్టియే రాజ్యముల అంతఃకలహముల నివారణకు పరమౌషధము. నానావిధములయిన రాజ్యముల లక్షణములను సమన్వయించునట్టి రాజ్యమే సుస్థిరముగ నుండగలదని అరిస్టాటిల్ మతము.

జి. ఎన్. యస్.

**అరిస్టాటిల్ (4. సాహిత్య శాస్త్రము)** :- తక్కిన శాస్త్రములం దెంత ప్రామాణికముగా తన రచనలను సాగించెనో సాహిత్య శాస్త్రమునందును అంత ప్రామాణికముగా అరిస్టాటిల్ తన రచనను సాగించెను. ఈ శాస్త్రమునందు నేటికి మనకు నిలిచినవి అతని రచనలలో రెండు మాత్రమే. (1) పొయెటిక్స్ (**Poetics**) ; (2) రిటారిక్ (**Rhetoric**). మొదటి రచన ప్రధానముగా దుఃఖాంత నాటకములకు లక్షణ గ్రంథము ; కాని, అనుషంగికముగా మహాకావ్య, సుఖాంత నాటకాదులకుగూడ లక్షణములు చెప్పబడినవి. రెండవ రచన 'ఉపన్యాస' విధానమునకు, భాషా వైచిత్ర్యములకు లక్షణగ్రంథము.

అరిస్టాటిల్‌కు పూర్వము సాహిత్య చర్చను సోక్రటీస్, ప్లేటో మొదలగువారు చేసినారు. కాని ఒక క్రమపద్ధతిలో ప్రణాళికానిబద్ధముచేసి శాస్త్రీయముగా చర్చించిన ప్రథమ గౌరవము అరిస్టాటిల్ కే దక్కును. కొన్ని సందర్భములందితడు తన గురువైన ప్లేటో అభిప్రాయములకు అతనిని పేర్కొనకయే మార్పులను గూడ సూచించియున్నాడు.

(1) పొయెటిక్స్ : ఇది సంపూర్ణగ్రంథము కాదనియు తన ఉపన్యాసముల కొరకు ఆతడు సిద్ధముచేసికొన్న చిత్తు ప్రణాళిక మాత్రమే యనియు కొందరి అభిప్రాయము. ఏది యెట్లున్నను దీని విలువ మాత్రము వాచ్యాతీతమైనది. అర్వాచీన సాహిత్య చర్చకంతయు నిదియే పునాది యని చెప్పవలెను. అరిస్టాటిల్‌కు తెలిసిన సాహిత్యము — హోమర్ మొదలగువారి కావ్యములు, గ్రీకుల ప్రాచీన దుఃఖాంత నాటకములు మాత్రమే. ఉత్తమమైన వచన వాఙ్మయమును కాని, షేక్స్పియరు వంటి మహానాటక రచయితల నాటకములను కాని ఆత డెరుగడు. అయినను ఉన్నవానినే ఆధారముగా జేసికొని ఇంచుమించుగా సార్వకాలిక మనదగిన ఉత్తమలక్షణ గ్రంథము నాతడు రచింపగలిగినాడు. ఇది క్రీ. పూ. 330 ప్రాంతముల రచింపబడినది. ఇం దైదు భాగములున్నవి. ఒక్కొక్క భాగమునందు మరల విభాగములు కలవు. కళాస్వరూపము, మానవుని యనుకరణాభిలాష, సుఖ దుఃఖాంత నాటకముల యుత్పత్తి, దుఃఖాంతనాటక నిర్వచనము, అందలి షడ్భాగములు, వానిని గూర్చిన విపులమగుచర్చ, ఇతివృత్త విచారము, దుఃఖాంత నాటకముల ప్రయోజనము, శైలి, ఐక్యత్రయము, విషాదాంతనాటక నాయకుడు, మహాకావ్య లక్షణము, నాటక రచనలో సంభావ్యములగు దోషములు, వానిని తొలగించుకొను మార్గములు మొదలగునవి చర్చింపబడినవి. ఇట్లొక క్రమపద్ధతిలో శాస్త్రీకముగా సాహిత్యశాస్త్రమును రచించిన ప్రథముడు అరిస్టాటిల్. అరిస్టాటిల్ సిద్ధాంతములు నేటికిని శిరోధార్యములే యనుటలో నతిశయోక్తి లేదు.

దుఃఖాంతనాటక ప్రయోజనమును గూర్చి నిర్వచింపకయే ఆత డుపయోగించిన "కథార్సిస్" అను పదమును, ఐక్యత్రయ సిద్ధాంతమును పెక్కు వాదోపవాదములకు, వ్యాఖ్యానములకు గురియైనవి. 'బుచెర్' అను నతడు 'పొయెటిక్స్' కు ఆంగ్లానువాదముతోబాటు విపులము, ప్రామాణికము, ఉత్తమము నగు వ్యాఖ్యానమును గూడ రచించి ప్రకటించియున్నాడు.

(2) రిటారిక్ : ఇందు మూడు భాగము లున్నవి. ఒక్కొక్క భాగమునందు మరల పెక్కు విభాగము లున్నవి. చక్కగా నుపన్యాస మిచ్చుటయే నా డొక కళగా పాటింపబడినది. నాడు రాజకీయ, సాంఘిక వ్యవహారములందు పాల్గొనెడి ప్రతి గ్రీకు పౌరునకును ఉపన్యాస పాటవము ముఖ్యావసరమై యుండెను. ఉపన్యాస ప్రయోజనమేమి? శ్రోతలను వశముచేసికొనుటయే కదా? దానిని సాధించుటకు ఉపన్యాసకుని శైలి, వాదసౌలభ్యము, క్రమపూర్వకమైన విషయ ప్రకటనము - ముఖ్యమైనవి. వీనిని గూర్చిన విపులమగు చర్చయే యిందలి విషయము.

పో. శ్రీ. అ.

**అరిస్టాటిల్ (5. తత్త్వవిషయము):**-అరిస్టాటిల్ యుగ యుగముల యందలి మహోత్తమ ప్రతిభాశాలురలో నొకడు. మనస్సంబంధమైన పాండిత్యములో అతనికి సమానులగువారు మిక్కిలి కొలదిమందిమాత్రమే కలరు. ఫలవంతమైన ఆతని అసాధారణ క్రియాకలాపమునుండి ఉద్భూతమైన రచనము చాల విస్తారమైనదిగా నుండెను. కాని అతని రచనలు చాల కొలదిమాత్రమే నేడు పదిలపరుపబడి యున్నవి. శాస్త్రీయతా లక్షణముచే అవి ప్రత్యేకముగా మిక్కిలి ప్రాధాన్యముగలవై యున్నవి. ఆతడు చేసిన సంవాదములలో కొన్నిమాత్రమే ఖండ ఖండములుగా నేటికి నిలిచియున్నవి. అరిస్టాటిల్ రచనలు ప్లేటోరచనలయొక్క నాజూకుతనముతో గూడిన అందమును, ఒక మతప్రవక్త కుండెడి రసానుభూతిని కలిగి యుండవు. అయినను నిజముగా ఒక శాస్త్రీయతా బుద్ధి ప్రకర్షను ఒక విషయమును సావయవముగా పరిశీలించెడి అత్యుత్తమమైన మనస్సును అరిస్టాటిల్ రచనలు ద్యోతకము చేయుచున్నవి. అరిస్టాటిల్ యొక్క తర్కము (Logic) మానవ భావనయొక్క పరాకాష్ఠ యనియు, కొలది మార్పులు చేయుటకు గూడ అవకాశ మీయనంత పరిపూర్ణతను తనలో ఇముడ్చుకొన్నదనియు అనేక శతాబ్దములు భావింపబడియుండెను. అరిస్టాటిల్ తర్కము నెడల కాంట్ (Kant) గూడ ప్రశంసాభావమును కలిగి యుండెను. ఈ ప్రశంసాదృష్టి అతిశయోక్తితో గూడి యున్నదని ఎవరుచెప్పినను అరిస్టాటిల్ రచనయొక్క నిర్వివాదమైన ప్రాముఖ్యమును మాత్రము ఇది సూచించుచున్నది. శాస్త్రీయజ్ఞానమునకు తర్కమును ఒక సాధనాంగముగ అరిస్టాటిల్ భావించియుండెను. ఆ పద్ధతి

క్రమ ప్రణాళికాబద్ధమైన ప్రాధాన్యమును కలిగియున్నది. ప్లేటోవలెనే, అరిస్టాటిల్ కూడ సామాన్య ధర్మమే (the universal) వాస్తవమైన సత్యమనియు, దాని జ్ఞానము 'భావరూప దర్శనము' (concept) లో మాత్రమే లభింపగలదనియు, భావించుచున్నాడు. కాని యీతడు సర్వసామాన్య ధర్మము (the universal) ను, ప్రత్యేక ధర్మము (the particular) ను ఎట్టి సంబంధమునులేక యున్నవని ప్లేటోవలె భావింపక, అతనితో భేదాభిప్రాయమును కలిగియున్నాడు. సామాన్యధర్మమునుండి అవశ్యముగా 'ప్రత్యేకధర్మము' ను గ్రహింపగలుగుట ఎట్లో చూపుటయే తర్కముయొక్క పనియై యున్నది' ప్రతిపాదనాత్రయ హేతువాదము (Syllogism) అరిస్టాటిల్ యొక్క తర్కసిద్ధాంతమునకు కేంద్రస్థానమై యున్నది. ఒక మధ్యపదముద్వారా మరి రెండింటినుండి ఒక న్యాయమును పరిగ్రహించుటయే అంత్యమున సాధింపబడు ఫలితము (Conclusion) గానున్నది. కావున సామాన్య ధర్మముక్రింద ప్రత్యేక ధర్మమును ప్రతిక్షేపించుట (Substitution) అను సంభావ్యతమీద అరిస్టాటిల్ యొక్క తర్కము తన దృష్టిని కేంద్రీకరించుచున్నది. "విరుద్ధతాధర్మము" (The law of contradiction అనున దొక్కటిమాత్రమే ఇతడు ప్రతిపాదించిన సాధారణ సూత్రము (General Principle). ఒకే 'భావరూప దర్శనమునకు చెందిన సంబంధము' (Conceptual Relation) యొక్క అస్తిత్వ, నాస్తిత్వములు మరియొక సంబంధమునకు అవకాశ మీయ వనియు, ఒక వస్తువు 'ఉండగలదు, లేకుండగలదు' అనిచెప్పుట సాధ్యముకాదనియు ఈ సూత్రము చెప్పుచున్నది.

విభిన్నమైన సత్య ప్రపంచము మరియొకటి దృశ్యమానమగు ప్రపంచమునకు కారణమని అరిస్టాటిల్ భావింపలేదు. 'పరిణామ' (Evolution) సిద్ధాంతమును ప్రవేశపెట్టి, "సారము"నకును, "కనబడుదానికి"ని (Essence and appearance) గల సంబంధము నాతడు తెలియ చెప్పుచున్నాడు. పదార్థములలో (Matter) "సారము" (Essence) తన "సంభవత" (Possibility 'Potentia')తో గూడినదై మనకు దగ్గరగా నున్నది. రూపముయొక్క ప్రాప్తిచేత, అది 'నిజమైనది' ('Actu') అగుచున్నది. 'సర్వసామాన్యమైనది' (the universal) ప్రత్యేకమైన (the particular) దానిచేత మాత్రమే నిజమైనది అగుచున్నది. 'ప్రత్యేకమైనది' 'సర్వసామాన్యమైనదాని' యొక్క సత్య సంసిద్ధి యగుచున్నది. 'దృశ్యమానము' (Appearance) లో 'సారము' (Essence) యొక్క ఆత్మీయ సత్య సంసిద్ధినే అరిస్టాటిల్ 'వాస్తవికత' (Entetechy) అని పిలుచుచున్నాడు. ప్లేటో అభిప్రాయమునకు విరుద్ధముగా అరిస్టాటిల్ 'ప్రత్యేక వస్తువు' మాత్రమే సంపూర్ణ సత్యముగలది యని వాదించుచున్నాడు. 'వస్తువే' (Substance) మొట్టమొదటిదియు, పరమ ప్రధానమైనదియు నని అతని అభిప్రాయము. వస్తువు దృశ్యమానమయ్యెడి భిన్నరీతులనుబట్టియు అందుండి సంభవమగు 'అభిధానము' లను బట్టియు (predications) "జాతిభేదము" (categories) ఏర్పడుచున్నవి.

అరిస్టాటిల్ యొక్క పరిణామ తత్త్వశాస్త్రము (Metaphysics of Evolution) ననుసరించి, రూపము (Form) నకును, పదార్థము (Matter) నకును పరస్పర సంబంధము కలదు. తక్కువ స్థాయిలోని జీవికి (being) ఏది రూపమగుచున్నదో, అది అంతకంటెను పైస్థాయిలోని జీవికి 'పదార్థము' అగుచున్నది ('Form' and 'Matter'). వస్తువులు వాని జాతులు ఇట్లు ఒక 'కొలబద్ద' (Scale) గా ఏర్పడుచున్నవి. ఇటునటు రెండువైపులను గూడ వానికి పరిమితులు గలవు. రూపముగా ఏర్పడని పదార్థము, లేదా స్వచ్ఛ సంభవత్వము (Pure possibility), మరియు స్వచ్ఛరూపము లేదా స్వచ్ఛక్రియ (Pure form or pure act). ఇవి రెండును జీవియొక్క క్రమములోని రెండు చివరల యందును గల హద్దులుగా నున్నవి. స్వచ్ఛ రూపమునకు పదార్థ మేమియును అవసరములేదు. అత్యుత్తమమైన సత్యము (Highest reality) తో నది సమానము. స్వచ్ఛ సంభవత్వముగా నున్న పదార్థము చలన సూత్రమును (Principle of movement) గాని, తనంతట తాను సత్యసిద్ధిని గాని కలిగియుండదు. స్వచ్ఛ పదార్థము (The pure matter) స్వయముగా చలనములేనిదిగా నుండును. ప్లేటో తత్త్వశాస్త్రమునందలి భగవంతుని భావనవలె అది శాశ్వతమై మార్పులేనిదియు, చలనము లేనిదియుగా నున్నది. అది పదార్థ రహితమును, పరిపూర్ణమును అగు

జీవముగా నున్నది. అది భగవంతుడు. అది స్వచ్ఛక్రియ ; భావనకు భావన. అది ఆత్మ పరిజ్ఞానము (Self-consciousness). అది స్వయం సమగ్రమై, స్వచ్ఛమైన ఆనందమై యున్నది. అది ప్రపంచమునందు తన స్వకీయమైన క్రియా శక్తి వలన పనిచేయుటలేదు ; భగవంతుని కొరకు పదార్థము యొక్క ఆవేదనయే ప్రపంచమును కదలునట్లుగా చేయునదై యున్నది. భగవంతునికిని పదార్థమునకును మధ్యను, స్వచ్ఛరూపమునకును స్వచ్ఛ పదార్థమునకును మధ్యను వస్తువులతో నిండిన ప్రపంచమంతయును గలదు; దీనికే ప్రకృతి యని అరిస్టాటిల్ నామకరణము చేసెను. ఈ అంతర్భాగమున నున్న వస్తు ప్రపంచము చలనముల ననుభవించును. మరియు అతని తత్త్వశాస్త్ర వికాసములో చలనమును ప్రేరేపించును. అరిస్టాటిల్ ప్రాచీనమైన పైథాగరస్ భావనావిధానమునుండి కొన్ని విచిత్రము లైన అభిప్రాయములను స్వీకరించియున్నాడు. ప్రపంచము యొక్క ఆకృతి వర్తులము గాన, వర్తులాకారచలనమే మిక్కిలి పరిపూర్ణమైనది. గ్రహములు మానవాతీతమైన తెలివిని కలిగియున్నవనియు, అవి దైవత్వమును పోలినవనియు, వాని ప్రభావములే క్రిందనున్న భూమిపై పడుచుండు ననియు నీతడు చెప్పెను.

కాని గుణసంబంధమైన భేదములన్నింటిని (Qualitative differences) పరిమాణ సంబంధమైన భేదములనుగా (Quantitative) మార్చుటకు చేసిన డెమాక్రిటస్ యొక్క సనాతన ప్రయత్నమును (classical attempt) అరిస్టాటిల్ ప్రతిఘటించుట ఎక్కువ ముఖ్యమైనది. గుణవిశేషణము నూతనమైనది, పరిమాణముగా మార్చుటకు శక్యము కానిది.

అరిస్టాటిల్ తన మానసిక శాస్త్రమునందు, మానసిక జీవనము వివిధములైన అంతరువుల (layers) చే నిర్మింపబడినదని చెప్పుచున్నాడు ; క్రింద అంతరువు లేదా పొర అంతకంటె పైనున్నదానికి పదార్థముగా నేర్పడుచున్నది. వృక్ష సంబంధమును, పశు సంబంధమును అగు ఆత్మను (Vegetive and animal soul) ఆధారముగా జేసికొని హేతువాదము లేక 'రౌస్' (Reason or rous) మానవునిలో వృద్ధిపొందుచున్నది. హేతువాదము తిరిగి క్రియావంతము, క్రియావిరహితము (active and passive aspects) అను భేదములచేత ద్వివిధముగానున్నది. క్రియా విరహితమైన బుద్ధి వ్యక్తిగతమును, వ్యక్తిసంబంధమైన అనుభవముచే ఏర్పడునదియునై యున్నది. క్రియావంతమగు బుద్ధి వ్యక్తులందరకును సాధారణమై యున్నది ; అందుచే నది అమరమైనది. క్రియావిరహితమైన బుద్ధి వ్యక్తిగతజీవితముతో దృశ్యమానమై, దానితోనే అదృశ్యమగుచున్నది. మానవజీవితము యొక్క లక్ష్యము సుఖస్థితిగా నుండుట (well-being). అందుచేత అరిస్టాటిల్ 'ఆనందవాది' (hedonist) అను పదముచే సాధారణముగా సూచింపబడువర్గమునకు చెందినవాడని చెప్పుటకు వీలులేదు. సుఖస్థితిగానుండుట అనగా ప్రకృతితో సమ్మేళనము పొందు క్రియాకలాపము అని అతడు భావించుచున్నాడు. జ్ఞానము సౌశీల్యమునకు (Virtue) కేవలము మార్గదర్శకమగుటకు చాలియున్నదని సోక్రటీస్ తలచినంతగా అరిస్టాటిల్ తలచియుండలేదు. వాంఛలు, భావాతిరేకములు (Passions)—— వీని ముట్టడి నెదిరించుటకు మన వివేకముతో గూడిన అంతర్దర్శనము నిజముగా శక్తిమంతముగానుండవలెను. ఆత్మనిగ్రహము (Self-control) ఇట్టి శక్తి నొసంగగలదు ; దానిని సంపాదించుటకు అలవాటుల వలనను, సాధనల వలనను మానవుడు తనకుతాను విద్యాశిక్షితుడు కావలసియున్నాడు. సౌశీల్యము (Virtue) రెండు పరమావధులకు ఒకసాధనమైయున్నది. ధైర్యము, తొందరపాటునకును పిరికితనమునకును ఒక మధ్యస్థానములోనున్నది కనుక, అరిస్టాటిల్ యొక్క నీతిశాస్త్రము (Ethics) సమభావమునకును, ప్రశాంతస్థితికిని (Balance and equillibrium) చెందిన నీతిశాస్త్రమై యున్నది. అరిస్టాటిల్ యొక్క "నిచ్‌మాచ్‌లన్" (నీతిశాస్త్రము) శీలవంతమైన జీవనమును గూర్చిన చక్కనియుదాహరణములతో నిండియున్నది ; అంతియే కాక మైత్రి యొక్క విలువ కది యిచ్చెడి ప్రాముఖ్యమును బట్టి అది గ్రీకు సంప్రదాయమునకొక నిదర్శనమై యున్నది. మానవుడు సుశీలవంతమును, నీతిమంతమును అగు జీవనమును ప్రభుత్వపాలనములో మాత్రమే సంపూర్ణముగా నడుపగలడని అరిస్టాటిల్ ప్లేటో వలెనే పూర్తిగా నమ్మియున్నాడు. నీతిశాస్త్రము రాజకీయములలో ఒక భాగమని నిర్ధారణ చేయబడినది. నైతికమైన మార్గములో

వ్యక్తిని పెరుగనిచ్చుటయే ప్రభుత్వము యొక్క ప్రధాన కర్తవ్యమైయున్నది. సంఘము యొక్క సుఖస్థితి లక్ష్యముగా నున్నంతవరకు ప్రతి రాజ్యాంగ ప్రణాళికయు సరియైనదే ; ప్రభుత్వము పరమోత్తమమైన ఈ లక్ష్యము నుండి విడివడినచో సరియైనది కాజాలదు. వ్యక్తి పరిపాలన రాజ పరిపాలనవలె మంచిది కావచ్చును, నిరంకుశ పాలనవలె చెడ్డది కావచ్చును; కొలదిమందిచే చేయబడు పరిపాలన ప్రభువర్గ పరిపాలన (Aristocracy) వంటిదై మంచిదగును. కొలదిమంది పెద్దల కూటమి (Oligarchy) వంటిదై చెడ్డదియగును; అందరిచే చేయబడు పరిపాలన ప్రజాప్రభుత్వము వంటిదై మంచిదిగా నుండును; జన సమూహము యొక్క అరాజకమువంటిదై చెడ్డదిగా నుండును. ప్లేటో వలెనే అరిస్టాటిల్ కూడ మానవుని, ఆదిమ ప్రాకృతికస్థితినుండి నైతికమును, వైజ్ఞానికమును అగు సంస్కృతికి తీసికొనిరాగల విద్యను ఇచ్చుట ప్రభుత్వపు బాధ్యతయే యని నిర్దేశించుచున్నాడు. బానిసత్వమును సమర్థించినందులకు అరిస్టాటిల్ అతి తీవ్రముగా విమర్శింపబడియున్నాడు. కాని ఇందులకు కారణము అతని కాలమునందలి చారిత్రకపరిస్థితులే యని సమర్థింపవచ్చును.

డా. వ.

**అరేబియా (చరిత్ర)** :- అరేబియా చరిత్ర యనగా అరబ్బుల చరిత్ర. అరేబియాదేశపు ప్రజలు అరబ్బులు అనబడుదురు. కాని "అరబ్బులు" అను పదమును విశాలదృష్టితో నుపలక్షించినయెడల, ఇందు అరేబియా దేశవాసులు మాత్రమేకాక, ఇతరదేశములలో నివాసముగనున్న మరికొందరు ప్రజలుకూడ చేరుదురు. ఆయా కాలములందు అరేబియా దేశవాసులు పరరాష్ట్రములను జయించి, అచ్చట పరిపాలకులుగ శాశ్వత నివాసము లేర్పరచుకొనిరి. మరికొందరు అరబ్బులు, వ్యాపారము కొరకును, ఇతర కారణములవలనను ఇతర రాజ్యములకు వలసపోయి, అచ్చటనే శాశ్వతముగ నిలచిపోయిరి. వీరు కాలక్రమమున స్థానికులగు ప్రజలతో కలసిపోయి నందున, ఒక సమష్టిప్రజ యేర్పడినది. ఆ మిశ్రజాతులు కూడ నేడు అరబ్బు ప్రజలుగ పరిగణింపబడుచున్నారు. ఈ నూతన అరబ్బులు ఆకార లక్షణములందు అరేబియా నివాసులకంటె భిన్నులుగ నున్నను వారిని అరబ్బీభాష, అరబ్బీ సభ్యత, ఇస్లాంమతము అను మూడు స్వర్ణ సూత్రములు ఏకస్థుల గావించి బంధించుచున్నవి. కేవలము అరేబియా దేశవాసులు 80 లక్షలకు పైబడియున్నారు. వీరుకాక ఇరాకు, సిరియా, లెబనాన్, పాలస్తీనా, ట్రాన్స్ జోర్డాన్, ఈజిప్టు, ఉత్తర సూడాన్ ప్రాంతములలో అరబ్బీభాష మాట్లాడువారు 3½ కోట్ల ప్రజలుకలరు. లిబియా, ట్యునీసియా, అల్జీరియా, మొరాకో ప్రాంతములందుకూడ అనేకులు అరబ్బులు నివసించుచున్నారు. కాని ప్రస్తుతము మన మీ విశాలమగు అరబ్బుజాతి చరిత్రను కాక, పరిమితమగు అరేబియా నివాసుల కథను సంగ్రహముగ తెలిసికొనగలము.

అరేబియా నివాసుల చరిత్రను మూడు భాగములుగ విభజింపనగును. అతి ప్రాచీనకాలమునుండి క్రీ. శ. 622 వరకు మొదటియుగము. క్రీ. శ. 622 నుండి 1750 వరకు మధ్యమ యుగము. 1750 తరువాతయుగము ఆధునిక యుగము.

ఆదికాలమున అరేబియాయొక్క దక్షిణ భాగమున నాగరకులగు ప్రజలు నివసించుచుండిరి. వారికి ప్రత్యేకమగు రాజ్యమును, మతమును, భాషయు, విజ్ఞానమును ఉండెడివి. వీరు స్వచ్ఛమగు అరబ్బీజాతివారనియు, ఉత్తర అరేబియాయందు నివసించుచు, సంచారశీలురుగానున్న బదాయూన్ అరబ్బులు మిశ్రమజాతివారనియు, ఆ దేశములో వాడుక గలదు. చాలకాలము వరకును ఔత్తరాహులగు అరబ్బులు, దాక్షిణాత్యుల యాధిక్యమును, వారి విజ్ఞానమును అంగీకరించి మెలగుచుండెడివారు. కాని క్రీస్తుశకము ప్రారంభమైన వెనుక, అరేబియాకు ఉత్తరముననున్న, సిరియా, మెసపొటోమియా రాజ్యముల వారి ప్రభావము, ఉత్తర అరబ్బు ప్రజలపై ప్రసరింపసాగెను. ఉత్తర అరేబియాలో క్రొత్త రాజ్యములు బయలుదేరెను. ఇవి లఖ్మిడ్, ఘసానిడ్ అను పేర్లుగలవి. ఇవి క్రైస్తవులచే పాలింపబడెను. క్రీస్తుశకము అయిదు ఆరు శతాబ్దులు అరబ్బుల చరిత్రయందొక స్వర్ణయుగము. ఆకాలమునాటి అరబ్బులు వీరులును, దేశభక్తులును, ఉదారులునైయుండిరి. అతిథి పూజనము వారి ముఖ్య సద్గుణములలో నొకటి. ఆ కాలమున హాతింతాయివంటి

మహాపురుషులు అరబ్బులలో జన్మించిరి. కాని ఈ యుగమున అరబ్బులలో అనేక దురాచారములుకూడ వ్యాపించెను. సురాపానము, ద్యూతము, పసిబాలికలను సజీవముగ పాతివేయుట, స్త్రీలకు సమాజములో అర్హస్థానము లేకుండుట మున్నగు గొప్ప లోపములు వీరియందుండెను. ఈ కాలమున యెమెన్, జీమన్, హెజాజ్, నెజ్ద్ ప్రాంతములలో కొన్ని చిన్న చిన్న స్వతంత్రరాజ్యములు నెలకొనియుండెను. అందు కొన్ని కేవల నగర రాజ్యములు. వానిలో హెజాజ్‌నందలి మక్కాపట్టణము ముఖ్యమైనది. ఇది పవిత్రమగు యాత్రాస్థలముగను, వ్యాపార కేంద్రముగనుకూడ ఖ్యాతివహించెను. ఇట్టి మక్కా నగరమున ప్రవక్తయగు మహమ్మదు జన్మించెను.

ప్రవక్తయగు మహమ్మదు నూతనమగు నొక మతమును స్థాపించుటయేకాక, అరేబియాయం దొక బలమగు ప్రభుత్వమును నెలకొల్పి, అరబ్బు ప్రజలను సంఘటితపరచుటకై యత్నించెను. ఆయన మరణించునరికి పశ్చిమ అరేబియా అంతయును, మక్కా మదీనా పట్టణములును ఆయన వశమయ్యెను. మహమ్మదు తరువాత రాజ్యమునకు వచ్చిన మొదటి ఖలీఫాయగు అబూబకర్ అరేబియా రాజ్యమునంతను జయించి, ప్రభుత్వమును బలపరచెను. క్రమక్రమముగా అరబ్బులు పశ్చిమమునకు వ్యాపించి, ఆఫ్రికా, ఐరోపాఖండములలో తమ సామ్రాజ్యమును విస్తృత పరచిరి. అనేక కారణములవలన అరబ్బు రాజ్యములో అంతఃకలహము లుప్పతిల్లెను. క్రీ. శ. 660 వ సంవత్సరమున, డెమాస్కస్ నగరము అరబ్బు రాజ్యమునకు ముఖ్యస్థాన మయ్యెను. ఇచ్చటినుండి పరిపాలనము కావించిన ఒమయ్యాదు ఖలీఫాలు అరేబియా సామ్రాజ్య సర్వస్వమునకును ఏలికలుగ నుండిరి. వారి యనంతర మధికారమునూనిన అబ్బాసీ ఖలీఫాలు తమ కేంద్రమును బగ్దాదు నగరమునకు మార్చిరి. అందువలన క్రమముగా అరేబియా ప్రజలకును, ఖలీఫాల రాజ్యమునకును సంబంధములు తెగిపోయెను. అరేబియాయందు కేంద్రప్రభుత్వము లేదయ్యెను. అంతఃకలహములు చెలరేగి, దేశమున చిన్న రాజ్యములు నెలకొనెను. మహమ్మదు ప్రవక్త వారసులగు షరీఫు వంశీయులు, ఈ అంధకార యుగములో కొంత ప్రాముఖ్యమును సంపాదించిరి. కాని వారుకూడ ఈజిప్టు రాజులకును, ఆపైన కాన్‌స్టాంటినోపిలునుండి గొప్ప సామ్రాజ్యమును పాలించిన తురుష్క చక్రవర్తులకును వశులైరి. ఇది మధ్యయుగపు చరిత్ర.

అరేబియా దేశము యొక్క ఆధునిక చరిత్రలో వహాబీ ఉద్యమము పేర్కొనదగినది. ఈ ఉద్యమమును ప్రారంభించిన యాతడు మహమ్మద్ ఇబ్న్ అబ్దుల్ వహాబ్. ప్రవక్త మహమ్మదుచే బోధింపబడిన ఇస్లాము మతమునందు కాలక్రమమున ప్రవేశించిన లోపములను సంస్కరించి, సత్యమగు ఇస్లాము మతమును మరల నెలకొల్పవలెననియు, ఆనాడు అరేబియాలో వ్యాపించియున్న అంతఃకలహములను తుదముట్టించి, బలమైన యొక అరబ్బు రాజ్యమును స్థాపింపవలయుననియు, ఈ సంస్కర్త ఆశయములు. వహాబీ ఉద్యమము 18 వ శతాబ్దియందు ప్రారంభమై క్రమముగ బలపడెను. మొదటినుండియు సౌదీ వంశమువారు వహాబీ ఉద్యమమును బలపరచి, అరబ్బు జాతీయ రాష్ట్ర స్థాపనకై యత్నింపసాగిరి. ఈ ప్రయత్నములో తురుష్కులు పిరిని ప్రతిఘటించిరి. ఈ కథా కాలమునాటికి అరేబియా, తురుష్క సామ్రాజ్యములో నొక భాగముగ నుండుట గమనింపదగినది. అయినను సౌదీయ వహాబీలు రియాధ్ అను చోట తమ ముఖ్యస్థానమును నెలకొల్పి, నూతనరాజ్య స్థాపనమునకై ప్రయత్నములు సాగించిరి. 1902 సంవత్సరము నాటికి అబ్దుల్ అజీజ్ ఇబ్న్‌సౌద్ అనునాయకుడు వహాబీ ఉద్యమమునకు నేతయై దానిని బలపరచెను. ఇతడు క్రమముగ తన రాజ్యమును పెంపొందించుకొని, మొదటి ప్రపంచయుద్ధమున ఆంగ్లేయుల పక్షము వహించి, తురుష్కులతో పోరాడి వారి నోడించెను. ఈ విధముగ ఇబ్న్ సౌద్ బలపడెను. ఈ రాజు మిక్కిలి రాజనీతి కుశలత గలవాడు. ఈతడు తన దేశములోని తిరుగుబాటుదారుల నణచివైచియు, బలవంతులగు నాంగ్లేయులతో స్నేహభావము పాటించియు, నేటిబలవత్తరమగు సౌదీఅరేబియా రాజ్యమును నెలకొల్పగల్గెను. ఈతడు ఎఱ్ఱ సముద్ర తీరమునను, పారసీక గుడ ప్రాంతమునందును గల నూనె గనులను అమెరికా కంపెనీలకు కౌలుకిచ్చి విశేషధనమును సేకరించెను. ఆ ధనమును వ్యయపరచి, అతడు తన రాజ్యమునందు గనులను త్రవ్వించియు, నీటి పారుదల

నదుపాయముల గావించియు, అరబ్బు ప్రజల క్షేమము నకై పాటుపడెను. ఇబ్న్‌సౌద్ తన రాజ్యములోని వివిధ భాగములకు స్వపరిపాలనాధికారము నొసంగి, ప్రజాస్వామిక సిద్ధాంతముల నంగీకరించెను. రెండవ ప్రపంచయుద్ధములో ఇబ్న్‌సౌద్ రాజు తటస్థభావమును వహించి, యుద్ధపు దుష్ఫలితములనుండి తనరాజ్యమును కాపాడెను. అరేబియా యొక్క ఆధునిక చరిత్రలో ఇబ్న్‌సౌద్ రాజు పరిపాలన మొక ముఖ్యఘట్టము.

అరబ్బులు కేవలము వీరులుమాత్రమే కారు. వారి యందు విజ్ఞానపిపాస కూడ మిక్కుటముగ కలదు. అరబ్బీ భాష ప్రపంచములోని ఉత్తమ ప్రామాణిక భాషలలో నొకటిగ పరిగణింపబడుచున్నది. ఈ భాషయందు ప్రవక్త మహమ్మదునకుపూర్వమే ఉన్నతస్థాయికిచెందిన కవిత్వము ఆవిర్భవించెను. ఇస్లాము మతము దేశ దేశాంతరములలో వ్యాపించిన కాలమున అరబ్బీభాషకూడ మిక్కిలి అభివృద్ధి గాంచెను. అబ్బాసీ వంశపు ఖలీఫాల కాలమున అరబ్బీ భాష యందు అనేక శాస్త్ర గ్రంథములు రచింపబడెను. అల్ మన్సూర్, హారూన్ అల్ రషీద్ అను ఖలీఫాలు గొప్ప విద్యాపోషకులుగ ఖ్యాతివహించిరి. వారి ప్రోత్సాహము వలన గ్రీకు, పారసీక, సిరియన్ భాషలలోని అనేక ఉత్తమ గ్రంథములు అరబ్బీ భాషలోనికి అనువదింపబడెను. ఈ ఖలీఫాలు బాగ్దాదు, బాస్రా, క్యూఫా, బొఖారా, అలెగ్జాండ్రియా నగరములందు ఉత్తమ విద్యా కేంద్రములను గ్రంథాలయములను నెలకొల్పిరి. అరబ్బులు చారిత్రిక రచనము, భూగోళశాస్త్రము, గణితశాస్త్రము, తత్త్వశాస్త్రము, ఖగోళశాస్త్రము, వైద్యశాస్త్రము మున్నగు విద్యలందు గొప్ప ప్రజ్ఞను సాధించి, చక్కని గ్రంథములను రచించిరి. అరబ్బులు శిల్పకళను కూడ మిక్కిలి అభివృద్ధి కావించిరి. స్పెయిను దేశమున అరబ్బులచే నిర్మింపబడిన ప్రాచీనపు కట్టడము లిందులకు నిదర్శనము.

ఖ. ఖా.

**అరేబియా (భూగోళము) :-** **స్థాన నిరూపణము :** అరేబియా ఆసియా యొక్క నైరృతి దిక్కునందు 34° 30′ ఉ; 12° 45′ ఉ. యొక్కయు, 32° 30′; మరియు 60° తూ. ల యొక్కయు నడుమ వ్యాపించి యున్నది. అది పశ్చిమమున ఎఱ్ఱ సముద్రముచేతను; దక్షిణమున హిందూ మహాసముద్రము చేతను, ఏడెన్ సింధు శాఖ చేతను; తూర్పునందు ఓమెన్, పర్షియన్ సింధుశాఖల చేతను చుట్టుకొనబడియున్నది. ఉత్తరమున ఇరాక్, ఇస్రాయిల్ దేశములు అను భూభాగములు ఎల్లలుగా నున్నవి.

వాయవ్య దిశనుండి ఆగ్నేయ దిశవరకు ఈ ద్వీపకల్పము యొక్క గరిష్ఠ - దైర్ఘ్యము కాననగును. మొత్తము విస్తీర్ణము దాదాపు 12,00,000 చదరపు మైళ్ళు.

**సామాన్య లక్షణములు :** అరేబియా ఒక పీఠభూమి. అది నైరృతి దిశనుండి ఈశాన్య దిశవైపునకు ఏటవాలుగా నున్నది. దాని నైరృతి దిగగ్రము మిక్కిలి ఉన్నతమైనది. నిట్రముగానున్న పడమటి అంచు ఎఱ్ఱసముద్రమట్టము నుండి 4000 అడుగులు మొదలుకొని 8000 అడుగుల ఎత్తును కలిగియున్నది. 30 మైళ్ళకు మించని వెడల్పు గలిగిన మండలమొకటి సముద్రతీరమునకును, పర్వతపాదములకును నడుమ నేర్పడుచున్నది. ఈ పీఠభూమియొక్క పూర్వోత్తరభాగము క్రమముగా, యూఫ్రటీసు నదివైపునకును, పర్షియన్ సింధుశాఖ వైపునకును వాలియున్నది. పూర్వ దిశాంతమునందు జెబెల్-అఖ్దర్ పర్వత పంక్తి ఈ వాలును అడ్డగించుచున్నది.

నీటివసతి లేకపోవుటవలనను, అనిశ్చితమైన వర్షపాతము వలనను ఎడారిమొత్తములో $\frac{1}{8}$ భాగము మాత్రమే స్థిర నివాసమునకు యోగ్యమైయున్నది. నైరృతి ఋతుపవనముల మార్గమునకు ఎడముగా నుండుటవలనను, ఎత్తైన కొండలు లేకపోవుటవలనను, ఇచట చాలినంత వర్షము పడదు. కాబట్టి అది పట్టి శుష్కమైన పీఠభూమి. నదులు అప్పుడప్పుడు వరదలై పారును కాని సాధారణముగ అవి ఎండియే యుండును. అరేబియాను మూడు నైసర్గిక భాగములుగా విభజించవచ్చును.

(i) ఉత్తరభాగము, (ii) మధ్యభాగము, (iii) దక్షిణ భాగము.

(i) ఉత్తరభాగము :- ఇంచుమించు ఉత్తరభాగమంతయు ఇసుకతోను రాళ్లతోను నిండియుండును. కాని కొన్ని ఋతువులలో ఉత్తమమైన పచ్చికబయళ్ళు అక్కడ కనిపించును. జనులందరును దాదాపు స్థిరనివాసములు

లేక ద్రిమ్మరుచుందురు. గోపాలకవృత్తి నవలంబించు చుందురు.

(ii) మధ్యభాగము:- ఇది శుష్కమైనది. ఇసుకస్టెప్‌ల తోను, రాళ్ళతోను నిండియుండును. అచ్చటచ్చట కొన్ని బావులు కనిపించును. ఎప్పుడును సంచరించు స్వభావము గల జనులీప్రాంతము నాక్రమించియుందురు. ఇక్కడ సేద్యము చేయుటకు కొంత అవకాశము కలదు.

(iii) దక్షిణభాగము -ఇందుఆసియాఖండపు ఎత్తయిన పీఠభూములు కలవు. పశ్చిమమున ఎమెన్‌ను, తూర్పున జెబెల్ అఖ్దర్ అను పర్వత పంక్తులు కలవు. ఉన్నత ప్రదేశ మగుటవలనను, సముద్రము సమీపమున నుండుటచేతను, ఇచటి శీతోష్ణస్థితి సమముగా నుండును. జనులు వ్యవసాయమే వృత్తిగా గల వారు. ఈద్వీపకల్పముతో ఓమెన్ ప్రాంతమునందలి బాటినా తీరము మిక్కిలి సారవంతమయిన. మండలము ఆమండలము జెబెల్-అఖ్దర్ కొండల నుండి పారు ఏరుల సహాయముతో సాగు చేయబడుచున్నది.




ఉద్భిదజాలము : వేసవికాలములో అన్ని ప్రాంతములందును జొన్నలు, ధురా, దుఖాన్ మున్నగు ఆహారధాన్యములను ఇచట పండింతురు. పీఠభూములలో మొక్కజొన్న, గోధుమ, బార్లీ, చలికాలమునందు పరిమితముగా పండింతురు. గుమ్మడికాయలు, ముల్లంగి గడ్డలు, దోసకాయలు, కర్బూజాకాయలు బంగాళా దుంపలు, ఉల్లిగడ్డ, వీక్సు (ఒకవిధమైన ఉల్లి) మున్నగు శాకములు పండింతురు. గులాబీ, మల్లె, వాముచెట్టు, లవెండరు మున్నగు సువాసనగల మొక్కలను ఇచట పరిమళద్రవ్యములను తయారు చేయుటకయి పెంచుదురు. 4000 నుండి 7000 అడుగుల ఎత్తుగల ప్రదేశములలో కాఫీ ఉత్పత్తి జరుగును. అరేబియా ఖర్జూరపు చెట్లకు సుప్రసిద్ధము.

జనులు : ఇచటి జనులు రెండు తెగలకు చెందినవారై యున్నారు. అచ్ఛమైన అరబ్బులనియు, ముస్తారబ్ లేక స్వదేశస్థులుగా అంగీకరింపబడిన వారనియు. ఇచటి మొత్తము జనాభా 60 లక్షలు. ఇందులో సంచరణశీలురైనవారు పదిలక్ష లుందురు. జనులు విశేషముగా ద్వీపకల్పముయొక్క తీరప్రాంతమందు నివసింతురు. వారు వర్షపాతమున్న ప్రాంతములలో భూమిని దున్ని వ్యవసాయము చేసికొందురు.

జంతుజీవనము : ఒంటె అరబ్బులకు మిక్కిలి ఉపయోగకరమైన పెంపుడు జంతువు. ఇది దప్పికను సహించగలుగును. అందుచేత ఇది ఎడారిలో దీర్ఘమైన ప్రయాణము చేయగలదు. దీనిపాలు మనుష్యులకును, గుర్రములకును జీవనాధారము. సాధారణముగా, 400 పౌనుల బరువును మోయును. ఎండకాలములో దినమునకు 20, 25 మైళ్లవరకు ప్రయాణము చేయగలదు. మూడు నాలుగు దినముల కొకసారి దీనికి నీరు అవసరమగును. చలికాలమున 25 దినములు మీరి నీరు త్రాగకుండ ఇది బ్రతుకకలదు. సవారి చేయువానిని సవారిబంటె దినమునకు నూరుమైళ్లు మోసికొనిపోగలదు. ఎడారివేడిమిని తుఫాను గాలులను తట్టుకొనగలదు. కావున దీనికి 'ఎడారి ఓడ' అను పేరు కలిగినది.

ప్రముఖులైన షేకులు, అమీరు కుటుంబములవారు మాత్రమే గుఱ్ఱములను పోషింతురు. దాడులు జరుపుటకు మాత్రము వీటిని ఉపయోగించుచుందురు. వీటికి కావల

సిన మేతను నీటిని ఒంటెలపైన తీసికొనిపోవుచుందురు. ఉత్తరభాగమునందలి ఎడారిలోను, మెసపొటోమియా లోను, అనేజ, షమ్మర్ అను జాతులవారు అధికసంఖ్యలో గుఱ్ఱములను పోషింతురు. ఇచ్చట కొన్ని ఉత్తమజాతికి చెందిన గుఱ్ఱములును కలవు. కాని అవి దప్పికను ఓర్చు కొనజాలవు. అరేబియా దేశమందంతటను గాడిదలను పెంచుదురు. పట్టణములందు ధనికులు వీటిపై నెక్కు దురు. వీటి పాలను కూడా జనులు ఉప యోగింతురు. ఈ దేశమునందుగలజనుల ఆస్తులలో గొఱ్ఱెలు, మేకలు ముఖ్యమైనవి. ఎండకాలమున నివి రెండు దినములకొక సారి నీరు త్రావును. ఇచటి స్త్రీలు దినమున కొకసారి సంజవేళ పాలు పితుకుదురు. పురుషులు ఒంటె పాలను పితుకుదురు.

వి. యజ్ఞ. చ.

**అర్జెంటైనా :-** 1516 వ సంవత్సర ములో రయోడిలా ప్లాటా అను ప్రదేశ మును డాన్ జువాన్ డయాజ్ డిసోలిస్ అను యాత్రికుడు కను గొనెను. ఈ దేశము దక్షిణ అమెరికా ఖండ ములోనిది. 1816 లో అర్జెంటైనా రిపబ్లికా అను రాజ్యము స్పెయినువారి పరి పాలనము నుండి స్వాతంత్ర్యము సాధించుకొనెను. ఇది 27 లక్షల చదరపు కిలోమీటర్ల వైశాల్యముకలిగి, ఒకకోటి 78 లక్షల ప్రజ లతో నిండియున్నది.

**జనులు, పరిపాలనము :** ఇది ప్రజాస్వామ్యదేశము. 1949లో రాజ్యాంగనిర్ణయము జరిగినది. ఈ దేశములో 16 రాష్ట్రాలు, 8 ప్రదేశాలు, 1 ఫెడరలు జిల్లా ఉన్నవి. ఈ దేశములో నున్నవారిలో ఎక్కువమంది ఐరోపా



ఖండము నుండి వచ్చినవారే. వారిలో ఇటలీ, స్పెయిను దేశాలవారు ఎక్కువమంది ఉన్నారు. ఇండియనులు అను స్థానిక వాసుల సంఖ్య 30,000 లకు మించిలేదు. ప్రజలలో పెక్కురు క్రైస్తవులు కలరు. వీరు రోమను కాథలిక్ శాఖకు చెందినవారు. 6 మొదలు 12 సంవత్స రాల వరకు పిల్లలకు ఇచట ఉచితవిద్య ఒసగబడును. 1950 లో 90,201 మంది విద్యార్థులు విశ్వవిద్యాల యాలలో చదువుచుండిరి. ఇచటి ఫెడరలు న్యాయ స్థానము, రాష్ట్రి న్యాయస్థానాలు వివాదాలను తీర్చు చున్నవి. బ్యూనాస్ ఐర్స్ అను పట్టణము అర్జెంటైనాకు రాజధాని. అక్కడ సర్వోన్నత న్యాయస్థానము (Federal Court) ఉన్నది. సైన్యములో నౌకాబలము ఎక్కువ. దానిలో 500 ఆఫీసర్లు, 11,000 నావికులు ఉన్నారు. 50 నౌకలు పనిచేయుచున్నవి. అమెరికా నుండి యుద్ధ నౌకలు కొనబడినవి.

ఆర్థిక పరిస్థితులు : అర్జెంటైనాలో ముఖ్య పరిశ్రమ పశువులను పెంచుట. ఇచ్చటి పశుసంఖ్య 4 కోట్ల 75లక్షల పరిమితి గలిగి, ప్రపంచములో చతుర్థస్థానమును ఆక్ర మించుకొనుచున్నది. అర్జెంటైన్ పశువులసంస్థద్వారమున ఈ పశు పరిశ్రమ జాతీయము చేయబడినది. ఇచటి నుండి జరుగు మాంసము యొక్క ఎగుమతి ప్రపంచములో ప్రథమ స్థానమును ఆక్రమించినది. బ్యూనాస్ ఐర్సులో ప్రపంచములో నెల్ల మాంసము నిలువచేయు గొప్ప యంత్రాగార మొకటి ఉన్నది. అందులో ప్రతిదినము 5000 పశువులు, 10,000 గొఱ్ఱెలు వధింపబడి, వాటి మాంసము నిలువచేయబడుచున్నది. ఇచట గోధుమపంట ఇటీవల వృద్ధియయినది. నూనెగింజల ఉత్పత్తిలో, వ్యాపా రములో అర్జంటైనాకు అగ్రస్థానము ఉండెడిది. ఇప్పుడు నూనెను ఈ దేశములోనే తీయుచున్నారు. గోధుమ రవ్వను తయారుచేయుట ఈ దేశములో రెండవ పెద్ద పరిశ్రమ. ఆధునిక పరిశ్రమలు స్వల్పముగా స్థాపింపబడినవి. ఇచటి విదేశ వర్తకమంతయు ప్రభుత్వమే చేయుచున్నది. అర్జెంటైనా, పారిశ్రామిక వస్తువులను చాల భాగము దిగుమతి చేసికొనుచున్నది. ఇది ఇంచుమించు పూర్తిగా బ్రిటను దేశముతోనే విదేశ వ్యాపారమును చేయుచుం డును. కాని, వ్యాపారము అంతయు ఇప్పుడు అమెరికా సంయుక్త రాష్ట్రములతోనే జరుగుచున్నది. పెక్కు రైలు మార్గాలు కలవు. 46,000 కిలోమీటర్ల రైలు మార్గము ప్రభుత్వము అధీనములో ఉన్నది. నౌకా వ్యాపారము ఎక్కువగా నున్నది.

డి. వి. కృ.

**అర్థశాస్త్ర ప్రమేయము :-** మానవునకు గల శక్తి, సాధనములు బహు పరిమితములు. కాని అతనికి పెక్కు కోర్కెలు గలవు. కావున ఆ అవసరములలో ఏదిముందు, ఏది వెనుక తీర్చికొనవలయునని యోచించుట అవసర మగుచున్నది. అట్లు పరిమిత శక్తిసాధనములను వివిధ అవసరములకు వినియోగించుటలో మిక్కిలి తక్కువ ప్రయత్నముతో అత్యధికమగు సంతృప్తి నొందుటకు ప్రయత్నము జరుగుట సహజము. కావున కోర్కెలు, వాని సంతృప్తి, అందులకు జరుగు ప్రయత్నము-అనునవి ఆర్థిక సమస్యలయందు ప్రధానభాగములు. నాలుగవది యైన 'మార్పిడి' (exchange) ఈనాటి ఆర్థిక సమస్య లందు ప్రాబల్యము వహించుచున్నది.

ఆర్థికశాస్త్రము సంఘజీవియగు మానవునియొక్క ధన సంబంధమగు సమస్యలకు సంబంధించి యున్నది. ఇది ఒక సాంఘికశాస్త్రము. ఎకానొమియా అను గ్రీకు పదమునుండి పుట్టినది. గృహనిర్వహణ శాస్త్రమని ఈ పదమునకు అర్థము. మార్క్సు అను రచయిత యావత్ చరిత్రను ఆర్థికదృష్ట్యా వ్యాఖ్యానించుటను బట్టియే ఈనాడు ఆర్థిక సమస్యలెంత ప్రాముఖ్యమైనవో తెలియ గలదు. రాజకీయ స్వాతంత్ర్యమును పొంది, ఆర్థిక స్వాతంత్ర్యము కొరకు ప్రణాళికలద్వార మనము తీవ్ర ప్రయత్నములు చేయు మనదేశమున ఈ విషయ ప్రాము ఖ్యమును గూర్చి నొక్కిచెప్పవలసిన పనిలేదు.

ఒక శాస్త్రప్రమేయమును స్థూలముగా గుర్తించుట వేరు; సూక్ష్మముగా నిర్వచించుట వేరు. మరి ఆర్థిక శాస్త్రము నిర్వచించుటెట్లు? అరిస్టాటిల్ ఏనాడో దీనిని గృహనిర్వహణ శాస్త్రముగ పరిగణించెను. అతనిదృష్టిలో కోర్కెలను తృప్తిపరచుకొనుటకు సంబంధించిన అందలి భాగము సహజము; డబ్బు మార్పిడి మొదలగునవి అసహజములు. నవీనార్థిక సిద్ధాంతములకు జనకుడని చెప్పబడెడు ఆడమ్‌స్మిత్ జాతుల సంపదల స్వభావము,

అందుకుగల కారణములు వీనికి సంబంధించిన విచారణగ దీనిని పరిగణించెను. దాని నాధారముగ జేసికొని 19వ శతాబ్దములోని రస్కిన్, కార్లయిల్ మొదలగు సాహితీపరులు దీనిని "భయంకరశాస్త్ర" మని వర్ణించిరి. కాని అర్థశాస్త్రరీత్యా సంపద యన కేవలము ధనమని మాత్రమే అర్థముకాదు. ప్రజల అవసరములను తీర్చు పరిమితము లగు వస్తువులు, పనులు అని అర్థము. ఆల్‌ఫ్రెడ్ మార్షల్ "సంక్షేమమునకు వలయు భౌతిక వస్తుసంచయమును సంపాదించి, ఉపయోగించుటకు సన్నిహితముగ సంబంధించినట్టువంటి వ్యక్తిగత సాంఘిక చర్యలోని భాగము" ఇందలి విషయమని వర్ణించినాడు. ఇతని దృష్టిలో అది కేవలము సంపదకు సంబంధించినదే కాక అంతకంటెనుముఖ్యముగా మానవునకు సంబంధించి యున్నది. ఈ నిర్వచనము యొక్క ముఖ్య గుణము ఏమన అది సంపదకు, సంక్షేమమునకు పరస్పరసంబంధము కల్గించుచుండుటయే. పెగూ మొదలగు ఆర్థిక శాస్త్రవేత్తలీ యంశమునే విస్తరింపచేసిరి. ప్రసిద్ధ భారతీయ ఆర్థిక శాస్త్రవేత్తయగు డా. వి. కె. ఆర్. వి. రావుగారు "ఆర్థిక కార్యముల స్వభావము - ఉద్దేశము" అను ఉపన్యాసములో ఆర్థికశాస్త్రము ఉత్పత్తి, మార్పిడి మొదలగువానిని పరిశీలించుట, కేవలము పరిశీలనకొరకే కాక, మానవ వ్యక్తిత్వ వికాసము అను ఆదర్శసాధనకుమాత్రమే యని వక్కాణించియుండిరి. ప్రొఫెసర్ కానన్ "భౌతిక సంక్షేమ కారణముల పరిశీలన" యని ఆర్థికశాస్త్రమును నిర్వచించెను. ఈ నిర్వచనమును లయొనెల్ రాబిన్సు అను ఆర్థిక శాస్త్రవేత్త విమర్శించుచు ఆర్థిక శాస్త్ర దృష్ట్యా ఏవి భౌతికవస్తువులో, ఏవి కావో వాటిని చెప్పుట కష్టము అని వాకొనినాడు. ఉదాహరణకు గాయకుని గానము వంటివి భౌతికవస్తువులు కాకపోయినను అవిగూడ ఆర్థిక శాస్త్రరంగములోనివే. మరియు సాంఘిక సంక్షేమమునకు దోహదకరములుగాని (ఉ: సారాయము తయారు చేయుట) అనేక విషయములు గూడ అర్థశాస్త్రరంగము లోనివే అని రాబిన్సు వాదించెను. సంక్షేమము అను పద ప్రయోగములో నైతిక విషయము ఇమిడియున్నది. అట్టి తీర్పు చెప్పు అధికారము ఆర్థికశాస్త్రమునకు లేదు అనునది రాబిన్సు చేసిన మరియొక విమర్శ. ఈ నిర్వచనము ఆదర్శవాదముపై ఆధారపడినదనియు, ఏ శాస్త్రమును అట్టి పునాదులపై ఆధారపడరాదనియు కూడ ఆక్షేపింపబడినది. హిక్సు మొదలగు ఆర్థిక వేత్తలకు ఈ విమర్శనము అంకుశమువలె నాటుటచేత సంక్షేమ ఆర్థిక శాస్త్రమునకు శాస్త్రయుక్తమైన పునాది నిర్మించుటకు వారు కంకణధారులైరి.

కానన్ నిర్వచనమును ఇట్లు చీల్చి చెండాడిన రాబిన్సు, ఆర్థిక శాస్త్రమును, "కోర్కెలకును, బహువిధోపయోగములుగల పరిమితవస్తు సంచయమునకుమగల పరస్పర సంబంధముగా మానవ ప్రవర్తనమును పరిశీలించుట" అని నిర్వచించెను. కేవలము ఆశయములుగాని, సాంఘికపరిస్థితులుగానిగాక వాటిపరస్పర సంబంధమే ఆర్థికశాస్త్రము యొక్క పరిశీలనాంశమని రాబిన్సు అభిప్రాయము. అతనిదృష్టిలో ఆర్థిక వేత్త, ఒక మార్గమునకు సంబంధించిన వివిధాంశములను చర్చింపగలడే కాని ఆ మార్గము ఉచితమైనదా యను విషయముపై తీర్పు చెప్పజాలడు.

ఈ నిర్వచనమునగూడ లోపములు లేకపోలేదు. పై నిర్వచనము ఒక ప్రత్యేకరకపు మానవ కార్యములకు పరిమితమైయుండ, ఇది ఒక ప్రత్యేక ప్రవర్తనమునకు పరిమితమైయున్నది. అంతేగాక రాబిన్సు పేర్కొనినట్లు "పరిమితత్వము" ఆర్థికవిధాన మంతటియొక్కయు సామాన్య లక్షణమని చెప్పుట సాహసము. అంతేగాక ఆర్థికవేత్త ఆదర్శములపై తీర్పు చెప్ప నని మడిగట్టుకొని కూర్చుండుట అసాధ్యము, అవాంఛనీయమునుగూడ. పెగూ చెప్పినట్లు ఆర్థికవేత్తకు ఇందలి కుతూహలము తత్త్వవేత్తకువలె విజ్ఞానము విజ్ఞానము కొరకేయను జిజ్ఞాసవలన కలిగినదికాదు. రోగిని నయముచేయవలయు నను ఆసక్తిగల శరీర శాస్త్రవేత్తయొక్క కుతూహలము వంటి దది. అట్టిపని అవాంఛనీయ మనుటకు కారణము ఆర్థికవేత్త తీర్పుచెప్పుటయగునేమో అని భయపడినంత కాలము అది కేవలము ఒక సాంకేతిక శాస్త్రముగనే మిగిలియుండి అందుండి మానవ సమస్యల పరిష్కార మార్గములు లభించుట దుర్లభ మగుటయే.

అంతమాత్రముచేత రాబిన్సుయొక్క నిర్వచనములో సుగుణము లేదని చెప్పరాదు. ఆ నిర్వచనము పరిమితత్వము (Scarcity), ఎన్నిక (Choice) అను ప్రాతిపదిక

లపై నాధారపడి ఆర్థికశాస్త్రరంగమును సువిశాలము చేసినది.

ఆర్థిక శాస్త్రమును ఇంకను పెక్కుమంది పెక్కు విధముల నిర్వచించిరి. ఉదాహరణకు బెవరిడ్జి దీనిని "భౌతికావసరములు తీర్చుకొనుటకు మానవు లొకరితో నొకరు సహకరించు సామాన్యపద్ధతుల యొక్క పఠనము" అని నిర్వచించెను.

ఆర్థిక శాస్త్ర స్వభావము : ఆర్థికశాస్త్ర నిర్వచనము తర్వాత ప్రధానమైన ప్రశ్న, ఆర్థికశాస్త్రము ఒక శాస్త్ర మగునా, కాదా యనునది. శాస్త్రము (Science) అను అర్థములో తీసికొనినచో పారిశ్రామిక విప్లవమునకు పూర్వము గల ఆర్థిక శాస్త్రమునకు అర్థశాస్త్ర మనిపించుకొనుటకు పూర్తిగ అర్హత లేదు. ఈ విప్లవారంభములోనే ఆడమ్‌స్మిత్ మహాశయుని కృషివలన ఈ శాస్త్రమునకు పునాదులు వేయబడినవి. ఆర్థికశాస్త్ర మొక సాంఘిక శాస్త్రము; సంఘములోని మానవు డిందలి విషయము; గమనించిన విషయసామగ్రి ఆధారముగ సంఘమందలి సామాన్య లక్షణములను కనుగొనుటయే యిందు జరుగు ప్రయత్నము. ఐతే దీనిని ఒక కళ (art) అను వారును లేకపోలేదు. పెగూ యను ఆర్థికవేత్త దీనిని నీతిశాస్త్రమునకు సహకారిణి (A hand maid of ethics) అని వర్ణించినాడు. ఇతని దృష్టిలో ఆర్థికశాస్త్రమనగా మెదడుతో వ్యాయామము చేయుట కారాదు.

అయితే ఈ రెండు అభిప్రాయములును రెండు అతివాదములై యున్నవి. స్వచ్ఛరూపములో ఆర్థికశాస్త్ర మొక శాస్త్రమే. అది పెగూచెప్పినట్లు ఆచరణలో పనికివచ్చు సూచనలిచ్చు బాధ్యతకల్గి యుండుటయు నిజమే. కావున "కళకు ఆధారము కాజాలు శాస్త్రము" అను వర్ణనము సమంజసముగా నుండును.

ఇది శాస్త్రమే యగునెడల ఈ శాస్త్రములందలి నిరూపణముల స్వరూపమెట్టిది యను ప్రశ్నము ఉదయింపగలదు. భౌతికశాస్త్రము రసాయనశాస్త్రము మొదలగు శాస్త్రములందలి సిద్ధాంతముల యంత నిర్దిష్టములు కావు. కాని మార్షల్ చెప్పినట్లు ఇతరసాంఘిక శాస్త్రములందలి నిరూపణములకన్న ఇవి మిగుల నిర్దుష్టములయినవని [illegible] మొదలగు

శాస్త్రముల సహకారముతో ఆర్థికశాస్త్రము మరింత శాస్త్రయుక్తమగుచున్నది.

**ఆర్థిక శాస్త్రము - ఇతర సాంఘికశాస్త్రములు :** (1) ఆర్థికశాస్త్రము - సంఘశాస్త్రము (Sociology) :— కామ్టే అనునతడు ఆర్థికశాస్త్ర మొక ప్రత్యేక శాస్త్రము గాదనియు అది సాంఘికశాస్త్రమందు అంతర్భాగమనియు చెప్పెను. ఇది కొన్ని విషయములం దట్లు కనబడినను, దీని ఉద్దేశములు వేరు. ఈ రెండు శాస్త్రముల యొక్క అవకాశ, ప్రమేయములలోనే భేదము గలదు.

(2) ఆర్థికశాస్త్రము - రాజకీయ శాస్త్రము : పై రెండును సన్నిహితములుగా గోచరించినప్పటికినీ భేదము లున్నట్లే. ఈ రెంటియందును భేదము లెంత సుస్ఫుటములుగా నున్నప్పటికిని వీటి పరస్పర సంబంధము బహు సన్నిహితము. 'పొలిటికల్ ఎకానమీ' అను పేరు ఈ శాస్త్రమునకు ఇటీవలివరకు ప్రయోగింప బడుటయే యిందులకు ప్రబలసాక్ష్యము. నవీనార్థిక శాస్త్ర జనకుడగు ఆడమ్‌స్మిత్ దీనిని ప్రభుత్వమునకు రాబడి తెచ్చు సాధనముగ పరిగణించెను. ఆర్థిక కార్యములు రాజకీయ చట్టము లోలోపలనే జరుగును. మరియు అనేక రాజకీయ సమస్యల పునాదులు ఆర్థికములగుటయు కద్దు. అంతేగాక ఈ రెండు శాస్త్రములకు సంబంధించిన విషయములు పెక్కుగలవు. ఈనాడు ఎల్లెడల వినబడు సామ్యవాద వ్యవస్థను అందుకు ఉదాహరణముగా పేర్కొనవచ్చును.

(3) ఆర్థికశాస్త్రము, నీతిశాస్త్రము - ఏదితప్పు, ఏది ఒప్పు అని నిర్ణయించునది నీతిశాస్త్రము. ఆర్థికశాస్త్రము ఆ విషయములో మూకీభావము వహించును. కాని అర్థశాస్త్ర విషయములనుండి నీతిశాస్త్ర - ఆదర్శములకును, నీతిశాస్త్ర - ఆదర్శములనుండి సంక్షేమ - ఆర్థికశాస్త్రమునకును పుష్టి కలుగుచున్నది. ఐతే మద్యపాన నిషేధము వంటి కొన్ని సమస్యలపై ఆర్థికశాస్త్రవేత్త చూపు వేరు, నీతిశాస్త్రవేత్త దృక్పథము వేరు.

ఇంతవరకును ఆర్థికశాస్త్ర స్వరూప, స్వభావముల గూర్చి స్థూలముగ చర్చించితిమి. ఇట్టి చర్చవలన మనము నినాదములకు వ్యామోహితుల మగు ప్రమాదము తప్పగలదు. మనకు ఈ శాస్త్రమువలన వాస్తవికదృష్టి అలవడునను టకు ఎన్నో ఉదాహరణము లీయవచ్చును.

మన జాతీయోద్య మారంభములో రేనడీ మహాశయుని గ్రంథములు, దాదాభాయి నౌరోజీ భారతీయ దారిద్ర్య మునుగూర్చి వ్రాసిన గ్రంథము - ఇవి మన కనులను విప్పిన అమూల్య గ్రంథములు. కేవలము భారీ పరిశ్రమలే త్రవ్వి తలకెత్తునను వ్యామోహములో చిక్కుకొనియున్న మనకు డా. కుమారప్పవంటి గాంధేయ ఆర్థిక శాస్త్ర వేత్తలు, మహాత్ముని యొక్క వికేంద్రీకరణ సూత్రమును వివరించి మేలుచేసిరి. అంతేగాక "స్వచ్ఛమగు ఆర్థిక శాస్త్రము" మేధకు ఆసవము వంటిది. సంక్షేమ ఆర్థిక శాస్త్రము పరిపాలకులకును, శాసనసభ్యులకును చక్కని సూచనల నీయజాలును. ఆర్థిక సమస్యలకు ఈనాటి ప్రపంచములోగల ప్రాధాన్యమును గుర్తించినవారికి ఈశాస్త్రపఠన మెంత ప్రయోజనకరమో సుస్పష్టమగును. ప్రపంచశాంతిని కాపాడుటయే ఆశయముగాగల ఐక్య రాజ్య సమితి ఆధ్వర్యమున ఆర్థిక విషయములలో పని చేయుటకు ప్రత్యేక శాఖలు నెలకొల్పబడినవి.

ఈ యంశము లన్నియు ఆర్థిక శాస్త్రమునకు నేటి జీవితములోగల ప్రాధాన్యమును స్పష్టపరచుచున్నవి. చిన్న పంచాయితీసంస్థ, రాబడి సమస్య మొదలుకొని పార్లమెంటు చర్చించు ఆదాయ వ్యయ పట్టిక వరకును ప్రతిచిన్న సమస్యను, పెద్ద సమస్యను గ్రహించుటకు ఆర్థిక విజ్ఞానము అవసరము. ముఖ్యముగా ప్రభుత్వము నకు ఆర్థికరంగమున గల స్థానము వికేంద్రీకరణము - మొదలగు సమస్యలపై తర్జన భర్జనలు జరుగు నీనాడు భారత యువకుల కీ శాస్త్రములో సమగ్ర విజ్ఞాన మావశ్యకము.

డా. ఆర్. వి. రా.

**అర్థశాస్త్ర సిద్ధాంతముల చరిత్ర :-** **ఆర్థికసిద్ధాంత వికాసము :** అతి ప్రాచీనకాలమందలి ఆర్థికసిద్ధాంతములు మత, నైతిక, రాజకీయ, న్యాయశాస్త్ర సిద్ధాంతము లతో మిశ్రితములై యుండుటచే ఏదేని యథార్థ వ్యాఖ్యా నమును ఎత్తి చూపుటయే పెక్కు సందర్భములందు కష్టసాధ్యము. ప్రాచీన ప్రపంచపు భావనయే అన్యవిధ ముగ నుండెను. ఆచారములు, అధికారములు చెలా యింపు కలిగియున్న యుగ మది. పరిశ్రమము బానిసలు చెయ్యవలసిన పనియనియు, యజమాని దాని ఫలితము లకు హక్కుదారుడనియు ఆనాటివారు భావించెడువారు. అట్టి పరిస్థితిలో నేడు ఆర్థికశాస్త్రము అని పిలువబడు రీతిని ఆర్థికశాస్త్రము అభివృద్ధి చెందుటకే అవకాశము లేకుండెను.

**అతిప్రాచీన నాగరకతలు :** ప్రకృతిమాత యొక్క అను గ్రహమునకు లోనై, మానవుని అత్యల్ప కృషివలనకూడ అతని అవసరములను మించిన ఫలసాయముల నొసగు దేశములందే అతి ప్రాచీనములగు మానవ నాగరకతలు ఉద్భవించినవి. అట్టి అదనపు ఫలసాయమున్నపుడే అభి వృద్ధి సాధ్యమగును. మనకు తెలిసిన వాటిలో, మిక్కిలి ప్రాచీనము లగు ఈజిప్టు, బాబిలోనియా నాగరకతలు, మహానదీ లోయలలో, సారవంతమగు భూములలో, వెచ్చని శీతోష్ణస్థితిలో, స్వల్పకృషితోనే మానవులు, జీవ నము చేయగల ప్రదేశములందే ఉత్పన్నమైనవి.

**గ్రీసు, రోము :** గ్రీకులు ఈజిప్టుదేశస్థులతో తమకు కల్గిన సంపర్కమువలన, పెక్కు విషయములు తెలిసి కొన్నవారే యైనప్పటికిని, నవీన కాలపద్ధతులకు మార్గ దర్శకులు అయి యున్నారు. ఆర్థిక విషయములను సిద్ధాంతీకరించుట, గ్రీకుపండితుల రచనలయందే మొదట ప్రారంభమైనది. ఫినీషియన్నను మినహాయించినచో అప్పటివరకు ప్రపంచమందు మిక్కిలి ఎక్కువగా వర్తక వాణిజ్యములు నడిపినదియు గ్రీకువారే. కాని వారి యొక్క పరిశ్రమలు విశేష ప్రాముఖ్యముగలవి కావు. అవి ఉన్నతశ్రేణి పౌరులు ఆచరించుటకు అర్హములుగ పరిగణింపబడలేదు. గ్రీకు సాంఘిక ఆర్థిక తత్త్వవేత్తలందు మిక్కిలి ప్రముఖుడగు ప్లాటో, "రిపబ్లిక్" అను పేరు గల గ్రంథమును రచించెను. ఆదర్శసంఘమునందు ఆర్థిక విజ్ఞానమునకు సంబంధించిన కొన్ని విషయములు అందు గలవు. ధనమును ఫలరహితముగను (Barren), తత్కా రణమున వడ్డీని అసమంజసముగను పరిగణించిన అరిస్టాటిలు ఈ శాస్త్రము ఆ పిమ్మట వృద్ధిపొందుటకు కారకుడయ్యెను.

గ్రీకుల కాలమునుండి రోమనుల కాలమునాటికి ఈశాస్త్రము మరొకఅడుగు ముందుకు సాగినది. రోమను సామ్రాజ్యమునకును అంతకుముందున్న సామ్రాజ్యము లకును అనేక విషయములలో సామ్యమేలేదు. అందలి

పరిశ్రమలు ప్రాముఖ్యము గలవి. అందలి విదేశ వాణిజ్యము మిక్కిలి గొప్పది. అందు నాణెములు ముద్రించు విధానము విస్తృతమైనది. కాని పరిశ్రమ లింకను బానిసల పనిగనే యుండెను. తన్మూలమున రోమను ఆర్థికశాస్త్రము కూడ నవీన పరిస్థితులనుండి భేదించియే యుండెనని చెప్పవచ్చును.

విజ్ఞాన పునరుజ్జీవనము - మర్కంటైల్ సిద్ధాంతము : విజ్ఞాన పునరుజ్జీవన కాలమువరకు దీనిని క్రమబద్ధముగ విభజించుట కెట్టి తీవ్రప్రయత్నమును జరగలేదు. ఆర్థిక విచారముపై మత రాజకీయ విచారణల నీడలు ప్రసరించు చుండెను. పదునైదవ శతాబ్దియందలి విజ్ఞాన పునరుజ్జీవనము, నూతన ప్రపంచము కండ్లబడుట, విజ్ఞాన పునరుద్భవము, ప్రొటస్టెంట్ మత సంస్కరణము, ముద్రణయంత్రము కనుగొనబడుట మొదలగు కారణముల వలన ప్రపంచము తీవ్రగతిని పురోగమించుచున్నట్లు కనబడెను. క్రొత్తప్రపంచము కనుగొనబడుటవలన పాత ప్రపంచము వారి అందుబాటులోనికి వచ్చిన అపార సంపదకై జరిగిన సంఘర్షణలో స్పెయిన్, పోర్చుగల్ దేశములకు అత్యధికభాగము లభించెను. కాని వారి ఐశ్వర్యమే వారి వినాశహేతువయ్యెను. త్వరలోనే వారి కంటె బలవంతములైన హాలెండు, ఫ్రాన్సు, ఇంగ్లండు దేశములు వారిస్థానము నాక్రమించినవి. తుదకు ఫ్రెంచి వారిపై, యూరపునందును, భారతదేశమందును ఏకకాలములో విజయము సాధించి ఇంగ్లండుదేశము నావికా బలమున అసమాన ప్రాబల్యమును సంపాదించెను.

ఈ కాలమందే వాణిజ్యము బహు విస్తృతమయ్యెను. ప్రభువు భూమిని తన ప్రత్యేకోపయోగమునకు ఉపయోగించుకొను విధానము స్థానే జాతీయార్థిక వ్యవస్థ అవతరించినది. ఆంగ్ల వర్తకులు సామ్రాజ్యస్థాపనకు పునాదులు నిర్మింపదొడగిరి. ఈనాటి ఆర్థికశాస్త్ర గ్రంథము లన్నిటి యందును ఆంగ్లదేశపు విదేశ వ్యాపారము, నావికా విధానములకు సంబంధించిన ప్రసక్తి, మెండుగా గాన వచ్చును. మర్కంటైల్ సిద్ధాంత మీ విధముగా ఉద్భవించి ఆంగ్లేయ వ్యాపారకృషియందు రెండు శతాబ్దుల కాలము ప్రముఖస్థానము నాక్రమించినది. దేశములోనికి బంగారము తీసికొని రాగల ఎగుమతులను ప్రోత్సహించుట, దేశము తన బంగారము వెచ్చింపవలసిన దిగుమతుల నిరుత్సాహపరచుట, విదేశ వ్యాపారము యొక్క ఆశయమై యుండవలెనని వ్యాపారశీలురు (Mercantilists) భావించిరి. వాణిజ్య విధానము పలువైపులుగ వ్యాపించి, ఆర్థిక అభ్యుదయములో జాతీయశక్తిగ పరిగణింపబడ నారంభించినది. ఎగుమతులు ప్రోత్సహింపబడి, దిగుమతులు కొన్ని నిషేధింపబడుట మరికొన్ని ఎక్కువ సుంకములకు గురిచేయబడుట జరిగెను. ప్రతి మారకములోను ఒక పక్షమువారికి లాభము కల్గిన, మరియొక పక్షమువారికి నష్టము కలుగునను భావనపై ఈ సిద్ధాంతము ఆధారపడి యున్నది. ఈ విధమైన స్వజాతీయ - ఆర్థికాభిమానము ఆంగ్లదేశమునకే పరిమితముగాదు. పదునేడవ శతాబ్దపు ఐరోపాఖండపు జాతులన్నిటికినీ, ముఖ్యముగా ఫ్రాన్సు ప్రష్యాలకును ఇది విశిష్టలక్షణము.

నవీన ఆర్థికశాస్త్రము - సనాతన వర్గము:- ప్రముఖుడును స్కాట్లండు దేశస్థుడును అగు ఆడముస్మిత్తు ఆర్థికశాస్త్రమునకు తండ్రిగాను స్థాపకుడుగాను పరిగణింపబడుచున్నాడు. కాని ఇది పూర్తిగా యథార్థము కాదు. ఈ శాస్త్రమునకు నిర్దిష్టమగు సంపూర్ణరూపమిచ్చిన వారిలో ప్రథముడితడే యనుమాట వాస్తవమేయైనను, అర్థికాభివృద్ధికి మూలము స్వాతంత్ర్యమే అను భావమును మొదట కలిగించినవారు బహుశః ఫిజియోక్రాట్సు అను ఫ్రెంచి అర్థిక శాస్త్రవేత్తలని అంగీకరింపవలసి యుండును. ప్రకృతి నిర్దేశ సూత్రము (rule of nature) అనుసరింపవలయు నని వారు బోధించుటయే అట్లు పరిగణించుటకుగల కారణము. ఈ వర్గమువారి నాయకులు క్వాస్నే, టర్గెట్ అను వారలు. ప్రకృతి నిర్దేశమునకు మానవుల చర్యలన్నియు లోబడి యుండుననియు, అనిర్దేశము అందరికిని సుకరముగ నుండురీతిని వారిని నడుపు ననియు వీరి అభిప్రాయము. స్వచ్ఛందపు పోటీ సూత్రము ప్రధానాతి ప్రధానము. ప్రభుత్వపు జోక్యమునకై చేయబడు ప్రయత్నముల నిరసింపవలసి యుండును. లెసేఫేర్ (Laissez Faire) అను వ్యక్తి స్వాతంత్ర్య వాదమునందు వారి సిద్ధాంతము ఇమిడియున్నది. వ్యక్తికి ఏది అత్యంత ప్రయోజనకారియో అదియే సంఘమునకును ప్రయోజన కారియని వారు భావించిరి.

ఆడమ్ స్మిత్తుయొక్క "ప్రపంచజాతుల సంపద" (Wealth of Nations) అను గ్రంథమున ఆర్థికస్వేచ్ఛ అను నూతన సిద్ధాంతము మరింత సమగ్రముగ వెల్లడింపబడి సవిస్తరముగ వర్ణింపజేయబడినది. ఆయనకుగల ప్రాముఖ్యము అసామాన్యము. దాదాపు ఏ యుగములోను ఏ రచయితయు తన తోడిమానవుల భావములపై ఇంతకన్న నెక్కువ ప్రాబల్యము కలిగియుండలేదు. అతడాకాలమునాటి పరిస్థితులకు అతీతమైన ముందు చూపును కనపరిచినవాడు. ఈనాడు ఆర్థికశాస్త్రములో సత్యములుగ పరిగణింపబడు విషయములలో కొంచెముగనో గొప్పగనో ఆయన దృష్టికి గోచరించనిది లేదు. వీటి నన్నిటికిని మించి అతడు ఆర్థికశాస్త్రములో మానవ సంబంధమైన లేక వ్యక్తిగతమైన విషయముయొక్క ప్రాముఖ్యమును గమనించెను. ఆర్థిక సిద్ధాంతములందు ఆయన కృషివలన నూతన శకము ప్రారంభమైనది. ఆర్థిక సూత్రములను విస్తరింపచేసి, మున్ముందు ఆర్థికవేత్తలు కట్టడము నిర్మింప వీలయిన శాస్త్రీయమగు పునాదిని ఏర్పరచుటకు జరిగిన ప్రథమయత్నము ఆతనిదే.

అతని పిమ్మట వచ్చినట్టి ఆర్. మాల్ థస్ (1766-1854) సాధారణ ఆర్థిక శాస్త్రముపై ఒక గ్రంథమును రచించెను. జనసంఖ్యను గూర్చిన అతని సిద్ధాంతమునకు ప్రబల వ్యతిరేకత ఉద్భవించి అర్థశాస్త్రము "భయంకర శాస్త్ర"మని పేరు వచ్చుటకు చాలవరకు కారణ మయ్యెను. ఆ పిమ్మట వచ్చినవాడు డేవిడ్ రికార్డో అను నాతడు (1772-1823). అద్దెనుగూర్చిన సిద్ధాంతము ఇతడు ప్రవచించిన ముఖ్య విషయము. ఇది ఇప్పటికిని అతనిపేరుననే పిలువబడుచున్నది. అర్థశాస్త్రమందలి అముక్తతర్కమునకు ఇతనిపేరు ప్రధాన-ఉదాహరణముగ పేర్కొనుట ఇప్పటికిని అలవాటు.

ఆపిమ్మట వచ్చిన రచయితలలో ప్రధానముగ పేర్కొనవలసినవాడు జాన్ స్టూఆర్టుమిల్ (1806-73). సనాతన ఆర్థికశాస్త్రవేత్తలందలి శెట్టిలలో కడసారివా డితడే. అర్థశాస్త్ర సూత్రములు (ప్రిన్సిపల్స్ ఆఫ్ పొలిటికల్ ఇకానమీ) అను ఇతని గ్రంథము ఆర్థికశాస్త్ర చరిత్రలో నూతనశక మారంభ మగుటకు కారణమైనది.. అందు, ఎల్లరును ఆర్థికశాస్త్రము పరిపక్వమై సంపూర్ణస్థితికి వచ్చినట్లు పరిగణింపసాగిరి. సాంఘిక తత్వవేత్తకూడనై యుండి ఆర్థికశాస్త్రముయొక్క దృష్టిని విస్తృతము గావించుటకు ఇతడు ఎంతో కృషిచేసెను.

"ప్రపంచ జాతుల సంపద (Wealth of nations) అను గ్రంథమునకును "అర్థశాస్త్ర సూత్రములు" అను గ్రంథమునకును నడుమ యూరపుఖండమునందలి అనేక మంది ఆర్థిక శాస్త్రవేత్తలు ఆశాస్త్రాభివృద్ధికి తోడ్పాటు చేయుచుండిరి. వారిలో ఫ్రాన్సు నందలి సే, కౌర్నట్, సిస్ మోండీ బెస్టైటు అను వారలును జర్మనీయందలి హెర్మన్, థూనెన్, రే అనువారలును ముఖ్యులు. వీరిలో పెక్కుమంది సనాతన సిద్ధాంతములు వెలువడిన పిమ్మట వచ్చినవారై, వాటినిమరింత అభివృద్ధిలోనికి తెచ్చినవారే. అముక్తతర్కము, అనుమేయవిధానము (Deduction) వారు అనుసరించిన పద్ధతులు. వ్యక్తిస్వాతంత్ర్య అంగీకారము (Laissez Faire) ను సమర్థించుటకుగాను సనాతన ఆర్థికవేత్తలయొక్క సిద్ధాంతములను ఉపయోగించుకొనిన మాంఛస్టరు ఆర్థికశాస్త్రవర్గమునకు చెందిన పండితులుకూడ ఈ విధానములనే అనుసరించిరి.

చారిత్రకవర్గము : సంప్రదాయ వర్గమువారి ఆర్థిక పరిశోధనా విధాన పద్ధతుల కన్న అన్యములను అనుసరించు ఉద్యమము రానున్నదని జాన్ స్టూఆర్టు మిల్ యొక్క రచనలు సూచించినవి. కేవలము సిద్ధాంతానుసార భావములపై ఒక విధమగు వ్యతిరేకభావమును ఈ శాస్త్రమును వాస్తవిక, చారిత్రక పునాదులపై నిర్మింపవలెనను ఆకాంక్షయు క్రమక్రమముగా పెంపొందదొడగెను. డేవిడ్ రికార్డో అనునాతడును అతని యనుచరులును యథార్థరహితములు లేక రుజువుకాని విషయములను ఆధారములుగ చేసికొని, ఆర్థికశాస్త్రమును కేవలము ఒక ఊహాధారమైన శాస్త్రముగ పరిగణించి రనియు, అట్టి వాటిలో సాధ్యమైనంత యెక్కువ సంపదను బడయుట, సాధ్యమైనంత తక్కువ శ్రమను పొందుట, అను రెండు ఆశయములు గల "ఆర్థిక వ్యక్తిత్వము" అను భావన ముఖ్యమైన దనియు, మిల్ నొక్కి చెప్పెను.

ఈ లోపములను సవరించుటకు తీవ్రప్రయత్నము సలిపినవారిలో ప్రథముడు ఆగస్టేకాంటే (1798-1857) అను ఫ్రెంచిదేశస్థుడు. యూరపు ఖండమందలి చారిత్రక

ఆర్థిక శాఖలకు ఇతనిని స్థాపకునిగ పరిగణింపవచ్చును. అతని దృష్టిలో సాంఘికశాస్త్రమనునది ఒకే శాస్త్రము. ఇతర విధానములను పూర్తిగా వర్జింపక చారిత్రకమయిన పోలికలను గమనించుట ఇందు అవలంబించవలసిన ప్రధాన విధానము. విపులార్థములో యావత్తు చరిత్రయు, నేటి పరిస్థితులకు సంబంధించిన విషయ సామగ్రియు, ఆర్థిక పరిశోధనకు ముడిసరుకు నియ్యగల సుక్షేత్రములు. ఈ నూతన విధానము, విస్తృత అంగీకారమునొంది ఫ్రాన్సు నుండి యూరపు ఖండమునందలి ఇతర దేశములకు వ్యాపింప జొచ్చెను. జర్మనీలో ముఖ్యముగా ఈ చారిత్రక పద్ధతులు సామ్యవాద సిద్ధాంతముల బలపరచుటకు ఉపయోగింపబడెను. ఈ సందర్భమున కారల్ మార్క్సు ఏగిల్సు, రాడ్ బెర్‌టస్, లాసల్లేల నామములను ముఖ్యముగా పేర్కొనవలసి యున్నది. అదనపు విలువ సిద్ధాంతము (Theory of Surplus Value) ను, పెట్టుబడిదారీ పారిశ్రామిక విధానమును నశింపచేయగల విషక్రిములు దాని గర్భమునందే కలవను సిద్ధాంతమును వట్టువిడువక సమర్థించుటలో మార్క్సు ప్రసిద్ధుడు. వంపకములో పెట్టుబడిదారునకును, కార్మికునకును వైరుధ్యము నాతడు నొక్కి వక్కాణించెను. పెట్టుబడిదారీ కృషి నశించుట అనివార్య మనియు అంతటితో కార్మికులు అధినేతలై, ఉత్పత్తి, జాతీయమగుటయు, పరిశ్రమపై కమ్యూనిస్టు అధికారము సాధ్యమగుటయు జరుగు నని అతడు అభిప్రాయపడెను. శాస్త్రాధార సామ్యవాదమునకు మిక్కిలి దోహదమిచ్చినవా డితడే. అప్పటినుండియు ఇతని భావములే సామ్యవాద ప్రపంచమునందెల్లెడలను ప్రధాన స్థానమును ఆక్రమించెను.

లాసెల్లే పేరు వేతనమునకు సంబంధించిన జీవనభృతి సిద్ధాంతము (Iron law) తో అనుబంధింపబడియున్నది.

నవీన రూపములో ఆర్థికశాస్త్ర తత్వము పరిణతి నొందుటకు శాస్త్రదృక్పథము విశేషముగా గల డబ్లియు. యస్. జేవన్సు (1835-82) ముఖ్యకారకుడు. ఆయన ఆ విధానమునే అవలంబించి అమూల్య ఫలితములను సాధింపజాలెను. "ప్రభుత్వము - కార్మికులు" (The state in relation to labour) అను ఇతని గ్రంథము వ్యక్తి స్వాతంత్ర్య సూత్రము (Laissez-faire) నందలి నిర్బాధ్యమును స్పష్టపరిచెను. "ధనము-మారకపు (Exchange) సాధన యంత్రము" (money and the mechanism of exchange) అను ఇతని గ్రంథమొక ఆదర్శగ్రంథము. అతడు ఫైనల్ యుటిలిటీ అని పేర్కొనిన "మార్జినల్ యుటిలిటీ" అను సూత్రమునకును, మరియు "వ్యాపార చక్రములు (Trade cycles), మూల్య చలనగతులు అనువాని చరిత్రకు సంబంధించిన సిద్ధాంతములకును ఆర్థికశాస్త్రవేత్త లెంతయు ఋణపడియున్నారు.

ఆస్ట్రియన్ వర్గము : "మార్జిన్ (margin) అను భావమును శాఖోపశాఖలుగా ఆర్థిక పరికరముగా నుపయోగించుటతో ఆస్ట్రియన్ వర్గమువారిపేరు అనుసంధింపబడినది. అతిస్పష్ట భావావళి ఈ శాఖవారిలో పరాకాష్ఠ చెందినది. వారి సిద్ధాంతమునందలి ప్రధాన విషయములు మూడు.

(1) ఉత్పత్తి - వ్యయములు వెలను నిర్ణయించునను సిద్ధాంతములను అంగీకరింపక ప్రయోజనమును బట్టియే వెల నిర్ణయమగునని వారు భావించిరి. అది, ఆవశ్యకమని భావించిన వ్యక్తియొక్క ఉద్దేశమందు ప్రతిబింబించు నని వారి ఉద్దేశము.

(2) ఈ విలువ 'మార్జిను' వద్ద నిర్ణీతమగును, అనగా తదుపరి భాగముల ప్రయోజనము తగ్గుదలలో నుండును. నిరుపయోగకర మగుచున్న వస్తుజాతము యొక్క విలువను దాని లభ్యతను బట్టి నిర్ణయించునది, దానిని ఉపయోగమును పొందుచున్న అంత్యము అముఖ్యమైన ప్రయోజనమే.

(3) ఖర్చుఅయిన వస్తువుల విలువనుబట్టి వాటియొక్క ఉత్పత్తి సాధనములకు విలువ ఏర్పడును. అనగా విలువను బట్టి ఖర్చులు నిర్ణయమగునుగాని ఖర్చులనుబట్టి విలువ నిర్ణయింపబడదు. ఈ వర్గమునందలి ప్రముఖులు కార్లు మెంజరు, వెయిజరు, బోహాం బియార్కు అనువారు.

ఆల్‌ఫ్రెడ్ మార్షల్ : ఆర్థిక వేత్తలలో నవీనమైన ఆర్థిక శాస్త్రమునకు గొప్ప ప్రయోజనము కలిగించిన వాడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునకు చెందిన ఆల్‌ఫ్రెడ్ మార్షలు. ఇతడు ఆధునికశాస్త్రమునకు జనకుడని పేర్కొనదగిన మహావ్యక్తి. రికార్డోయొక్క ఉత్పత్తి వ్యయసంబంధమైన విలువ సిద్ధాంతమును మార్షల్

త్రోసి రాజనినప్పటికిని అతడు దానిని జవాన్సు యొక్క మార్జినల్ యుటిలిటీ సిద్ధాంతముతో జోడించి ప్రయోగించి, దాని మూలమున తన వెలను నిర్ణయించు ప్రాతిపదిక సిద్ధాంతమును నిర్మించెను. అది అర్థశాస్త్రశాఖలకు అన్నిటికిని వర్తించునని చూపెను. విలువ, ప్రత్యేకముగా అపేక్ష, సరఫరా అనువాటిలో ఏ ఒక్కదానిపైనను ఆధారపడదు. అది ఆ రెంటిపైననుగూడ ఆధారపడునని తన శాస్త్రీయ విభజన, సమ్మేళనములద్వారా మార్షలు నిరూపించెను. పంపకమునుగూడ అదేరీతిని విభజించి, అదేవిలువ సిద్ధాంతమును అన్ని ఉత్పత్తిసాధనములకును వర్తింపజేయవచ్చునని మార్షలు నిరూపించెను. తన్మూలమున అతడు ఆర్థికవిలువకు సంబంధించిన మన భావములకు పరస్పరానుగుణ్యమును, ఐక్యమును కల్గించెను. ప్రతిఉత్పత్తిసాధనమునకును లభించు ప్రతిఫలము, అపేక్షకు సంబంధించినంతవరకు మార్జినల్ ప్రొడక్టివిటీ మీదను, సరఫరాకు సంబంధించినంతవరకు ప్రతిసాధనము యొక్క ఉత్పత్తి వ్యయముపైనను, ఆధారపడునని నిరూపించుటకు, 'మార్జిన్' అను అతి ముఖ్యమైన సూత్రమును అతడు ప్రవేశపెట్టెను.

మార్షలు యొక్క సిద్ధాంతములు, "పరిశ్రమకు సంబంధించిన ఆర్థికవిషయములు" "అర్థశాస్త్రసూత్రములు" "పరిశ్రమ - వ్యాపారము," "ధనము - అప్పు - వాణిజ్యము" అను విశ్వవిఖ్యాతములైన ఉద్గ్రంథములందు పొందుపరుపబడియున్నవి.

జే. యం. కీన్సు : ఆడమ స్మిత్, జే. యస్. మిల్, అల్‌ఫ్రెడ్ మార్షలు అనువారియొక్క కోవకు చెందిన ఆర్థికశాస్త్రవేత్తలలో కీన్సు ఒకడు. ఒక తరమునుండియు ఆర్థికసిద్ధాంతములకు సంబంధించిన ప్రధాన పరిణామముతో ఇతనిపేరు జోడింపబడియే కన్పడుచున్నది. అర్థశాస్త్రమునకు సంబంధించిన సిద్ధాంత చర్చలయందే కాక ఆ శాస్త్రమునకు సంబంధించిన అంతర్జాతీయ చర్చలయందును ఇతని ప్రాబల్యము చూపట్టుచున్నది.

కీన్సు 1931 లో "ధనము" ను గూర్చి వ్రాసిన గ్రంథము (Treatise on money) అర్థశాస్త్రమునకు ఆయన అర్పించిన అమూల్యమైన కానుక. ఐతే కీన్సియన్ బైబిలు అని పరిగణింపబడు "ఉద్యోగము-వడ్డీ, ధనము వీటికి సంబంధించిన సాధారణతత్వము" అను గ్రంథము బోధనాకార్య నిమగ్నులగు ఆర్థిక శాస్త్రవేత్తలందు కలిగించినంతటి సంచలనమును ఆడమ స్మిత్తుయొక్క "ప్రపంచజాతుల సంపద" అను గ్రంథము తర్వాత ఏ ఇతర గ్రంథము కల్గించలేదు.

కీన్సు వెల్లడించిన భావములు ప్రపంచమందంతటను అంగీకృతములైనవి. నిరుద్యోగమునుగూర్చి ఇతడు చేసిన కృషి ఆ తర్వాత వెలువడిన అనేక గ్రంథములకు మూలాధారమైనది. ఆర్థికశాస్త్రము చాలవరకు రాబడి వ్యయముల ప్రవాహములయొక్క పరస్పర సంబంధమును పరిశీలించుటయే అనియు, పరస్పర సంబంధములో గల్గిన మార్పులే ఆర్థిక స్థిరత్వముపై తమ ప్రాబల్యమును కనపరచుననియు ఇతడు నిరూపించెను. నిరుద్యోగము అనునది పొదుపుచేయబడిన మొత్తము పెట్టుబడులయొక్క సంబంధమునకు సంబంధించిన సమన్వయనియుకూడ అతడు చూపెను. వీటియొక్క సమన్వయము కొరవడినచో నిరుద్యోగము పెరుగును. పై రెంటిని సమపాళములో నుంచగల చర్యలను తీసికొను బాధ్యత ప్రభుత్వమే కలిగింపవలెను.

ఉపసంహారము : ఆర్థికశాస్త్రవేత్తలు తమ వ్యాసంగమందలి ప్రాతిపదికల విషయములో ఏకభావము కలిగియున్నను, కొన్ని విషయములపై వారియందు పూర్వమున్నంత ఏకగ్రీవాభిప్రాయము లేదు. ఆర్థిక విషయముపై నేడు వెల్లడింపబడిన భావములు సనాతన వర్గమువారి రోజులలోవలె నిష్కర్షగ చెప్పబడుటలేదు. ఆర్థిక శాస్త్ర సిద్ధాంతములలో అంతిమ నిర్ణయమనునది ఉండదని ఈనాడు గుర్తింపబడుచున్నది. ఆర్థిక విధానము బహుసమస్యలతో నిండినది. ప్రతి రంగములోను ఆర్థిక శక్తుల ఫలితములు బహుక్లిష్టములై ఏ ఆర్థిక సూత్రమునకు లోబడకున్నవి.

జి. రా. రె.

**ఆర్హీనియస్ :-** స్వాంతె అగస్టస్ ఆర్హీనియస్ (1859-1927) పేరుపొందిన స్వీడన్ దేశపు రసాయన శాస్త్రజ్ఞుడు. ద్రావణములలో విద్యుత్ప్రసరణమును గురించిన ఇతని సిద్ధాంతములు ఎన్నియో సమస్యలకు ఉపకరించినవి. వీటికై 1903 లో ఇతనికి నోబెల్ బహు

మాన మీయబడినది. స్టాక్‌హోముల్లో ప్రొఫెసరుగా నుండి తదుపరి నోబెల్ ఇన్స్టిట్యూటులో భౌతికరసాయన శాఖకు డైరెక్టరుగా చనిపోవువరకు పనిచేసెను.

అర్హీనియస్ స్వీడన్‌లోని రైతు కుటుంబమునకు చెందినవాడు. ఇతడు 1859 సంవత్సరము, ఫిబ్రవరినెల 19 వ తేదీనాడు ఉప్సాలా పరిసరములో జన్మించెను. స్కూలు చదువు పూర్తి అయిన తరువాత 17 వ ఏట ఉప్సాలా విశ్వ విద్యాలయములో ఉన్నతవిద్య నభ్యసించెను. అచట క్లీవ్ వద్ద రసాయన శాస్త్ర పరిశోధనమునందు శిక్షణ పొంది, స్వతంత్రముగా పరిశోధనములు జరుపుటకు స్టాక్ హోమ్‌లో ఎరిక్ ఎడ్లుండ్ అను భౌతిక శాస్త్రజ్ఞుని వద్ద చేరెను. ఆ రోజులలో శాస్త్రజ్ఞులకు ద్రావణముల ధర్మములపై మోజు ఎక్కువగా నుండెను. వాంటుహాఫ్ కోల్రాష్ ఓస్ట్వాల్డ్ మున్నగు శాస్త్రజ్ఞులు ద్రావణముల వివిధధర్మములపై పరిశోధనలు జరుపు చుండిరి. అందుచే అర్హీనియస్ తన డాక్టరేట్ కొరకు ద్రావణముల విద్యుద్వాహకత్వము (Conductivity of Solution) గురించి ప్రయోగములు ప్రారంభించెను. 1884 లో స్వీడిష్ అకాడమీకి విద్యుత్కణముపై తన పరిశోధన ఫలితములు సమర్పించెను.



డాక్టరేటు లభించినను అర్హీనియస్ పరిశోధనములకు తగిన గౌరవము దొరకలేదు. అయినను ఇతరదేశములలో ఆలివర్‌లాజ్, ఓస్ట్వాల్డ్ మున్నగు శాస్త్రజ్ఞులు ఇతని పరిశోధనములను మెచ్చుకొనిరి. అదే సంవత్సరములో ఉప్సాలాకు ఓస్ట్వాల్డు రాకవలన అర్హీనియస్‌కు కొంత గౌరవము లభించెను. 1885 లో ఎడ్లుండ్ ప్రయత్నముపై ఇతనికి అయిదేళ్ళవరకు యూరప్‌లోని వివిధ దేశముల ప్రయోగశాలలలో పనిచేయుటకు స్వీడిష్ అకాడమీనుంచి వేతనము లభించెను. ఈ అవకాశమును పురస్కరించుకొని ఓస్ట్వాల్డు, కోల్రాష్, వాంట్‌హాఫ్, బోల్ట్జమన్ వంటి ప్రముఖశాస్త్రజ్ఞులవద్ద పెక్కు పరిశోధనములు జరిపెను. తరువాత లెప్సిగ్‌లో ఓస్ట్వాల్డ్‌కు అసిస్టెంటుగా చేరెను.

ఈ రోజులలోనే తనకు ఖ్యాతినిచ్చిన అయానీకరణ (Electrolytic dissociation) సిద్ధాంతమును విశదీకరించెను, ద్రావణముల విద్యుద్వాహకత్వముపై తాను సాగించిన ప్రయోగముల ఫలితముగా అర్హీనియస్ కొన్ని నిర్ణయములకు రాగలిగెను. ఇతని సిద్ధాంతమును క్రింది విధముగా తెలుపవచ్చును.

లవణములు, ఆమ్లములు, లవణాధారములు ద్రావణ రూపములో అయాన్ల (Ions) క్రింద విచ్ఛేదింపబడును. ఈ అయనవిచ్ఛేదనము సజలతతో అధికమగును. అనంత సజలీకృత ద్రావణములో అయానీకరణము సంపూర్తి యగునని అర్హీనియస్ సిద్ధాంతము. విద్యుత్ప్రసరణము అయాన్లద్వారా జరుగును. గనుక, సజలతతో విద్యుద్వాహకత్వము కూడ హెచ్చును. అర్హీనియస్ సిద్ధాంతము ప్రకారము గరిష్ఠ విద్యుద్వాహకత్వము సంపూర్ణ-అయన విచ్ఛేదనము సూచించును. ఏదైన గాఢత (సాంద్రత) గల ద్రావణములోని విచ్ఛేదనాంశమును కనుగొనుటకై ఈ క్రింద నిష్పత్తిని అర్హీనియస్ తన ప్రయోగములద్వారా సాధించకలిగెను.

$$\frac{\Lambda r}{\Lambda \alpha} = L$$

ఇందు L విచ్ఛేదనాంశమునకు గుర్తు. $\Lambda r$ ద్రావణము యొక్క విద్యుద్వాహకత్వముపైన, $\Lambda \alpha$ అనంత సజలీకృత స్థితిలో ద్రావణముయొక్క విద్యుద్వాహకత్వముపైన ఆధారపడి ఉండును.

ఈ విధముగా విద్యుద్వాహకత్వము ద్వారమున కొలువబడిన విచ్ఛేదనాంశములు ఇతర ప్రయోగముల ద్వారమున కొలవబడిన విలువలతో సరిపోయెను. అంతేగాక ఇతనిపరిశోధనములు ద్రావణముల ఇతరధర్మములను అర్థము చేసికొనుటకు ఎంతో తోడ్పడినవి.

ఇతడు ప్రతిపాదించిన, ఉపయోగకరమైన మరియొక సిద్ధాంతము రసాయన ప్రక్రియా వేగమునకు-ఉష్ణోగ్రతకు సంబంధించినది. రసాయనప్రక్రియలు భిన్న అణువుల

సంయోగమువలన జరుగును. ఈ సంయోగము అణువుల మధ్య సంఘర్షము ద్వారమున ఫలించును. కాని అణువులమధ్య జరుగు ప్రతిసంఘర్షము సంయోగమునకు దారి తీయలేదని అర్హీనియస్ వాదము. మామూలు అణువులకన్న హెచ్చు శక్తిగల అణువులమధ్య జరుగు సంఘర్షములే ప్రక్రియకు తోడ్పడును. అనగా సంఘర్షమునకు పూర్వము కొంతశక్తి సంపాదించవలెను. ఇట్టి శక్తిని సంపాదించిన అణువులను ఉత్తేజిత అణువులనియు ఈ శక్తిని ఉత్తేజనశక్తి అనియు నందురు. సాధారణ - ఉష్ణస్థితిలో ఈ ఉత్తేజితాణువుల సంఖ్య బహు స్వల్పము. కాని ఉష్ణోగ్రత పెరిగినచో వీటి సంఖ్య చాల త్వరగా పెరుగును. అనగా రసాయన ప్రక్రియ వేగము హెచ్చును. ఈ విధముగా ఉష్ణోగ్రతకు ప్రక్రియావేగమునకుగల సంబంధము విశదీకరించుటేగాక, ఉత్తేజనశక్తిని కొలుచుటకు ఒక సమీకరణమును కనిపెట్టెను. ఈ సమీకరణము రసాయనమార్పుల విధానమును అర్థము చేసికొనుటకేగాక, రసాయనమార్పును పొందించుటకు కావలసిన ఉష్ణశక్తి కొలుచుటకుగూడ ఉపయోగపడుచున్నది. శక్తిశాస్త్రము (Thermodynamics) ద్వారా కూడ ఈ సమీకరణము రుజువు చేయబడినది.

ఇదిగాక ఎన్నియో విషయములపై అర్హీనియసు జరిపిన పరిశోధనములయొక్క ఫలితములు ఓస్ట్వాల్డ్ సంపాదకత్వముక్రింద వెలువడిన పత్రిక "సైట్ ప్రిఫ్ట్" (Zeitschrift) లో ప్రచురింపబడెను. ఈ పరిశోధనముల ద్వారమున భౌతికరసాయన శాస్త్రజ్ఞుడుగా గొప్ప పేరు పొందుటేగాక, వందలకొలది విద్యార్థులకు భౌతిక రసాయనములో పరిశోధనలు జరుపుటకు ఇతడు ఉత్సాహము కలుగజేసెను.

1891 లో స్వీడనుకు తిరిగివచ్చెను కాని, అర్హీనియస్‌కు గౌరవముగల ఉద్యోగ మేదియు దొరకలేదు. అయినను స్వదేశాభిమానముగల అర్హీనియస్ పరదేశములలో దొరకుచున్న ఉద్యోగములను కాలదన్ని స్టాక్‌హోమ్ విశ్వవిద్యాలయ కళాశాలలో అతికష్టముమీద ఉపన్యాసకుని ఉద్యోగము సంపాదించుకొనెను. 1895 లో ప్రొఫెసర్ పదవి పొందెను. అప్పటినుండి అర్హీనియస్ జీవితము ఒడుదొడుకులు లేకుండ సాగినదని చెప్పవచ్చును.

1903 లో నోబెల్ బహుమానము పొందెను. ఎన్నియో దేశములనుండి గౌరవము పడసెను. బ్రిటను నుంచి డేవీపతకము (శాస్త్రజ్ఞునకు దొరుకు గొప్ప గౌరవ చిహ్నము) లభించెను.

అర్హీనియస్‌ను స్వీడనులోనే ఉంచుటకు ఆ దేశపు రాజు ఇతనిని నోబెల్ సంస్థలో భౌతిక రసాయనశాఖకు డైరక్టరుగా నియమించెను. ఈ లేబరేటరీలో తనకు నచ్చిన విషయములపై పరిశోధనములు సాగించుటకు అర్హీనియస్‌కు స్వాతంత్ర్య మియ్యబడెను. రసాయనమే గాక, వాతావరణ విషయములలోను (Meteorological), రోగ నివారక రసాయన (immuno chemistry) శాఖలోను కూడ ముఖ్యమైన పరిశోధనములు ఇతడు జరిపెను. ఈ పదవిలో 1927 వ సంవత్సరము వరకు పనిచేసి, అనారోగ్య కారణముచే పదవినుండి విరమించుకొనెను. ఒక వారమురోజులు జబ్బుచేసిన తరువాత 1927 అక్టోబరు 2 వ తారీఖున ఇతడు మృతినొందెను.

అర్హీనియస్ తన చివరిరోజులను శాస్త్రీయ విజ్ఞానము జనసామాన్యమునకు అందచేయు నుద్యమములో గడిపెను. వివిధ దేశములలో జరుగు విజ్ఞాన వేత్తల సమావేశములకు హాజరై అక్కడి శాస్త్రజ్ఞులతో ముచ్చటించుటయన్న ఇతడు ఎక్కువ ప్రీతి చూపించుచుండెడివాడు. స్వీడను శాస్త్రజ్ఞులలో బెర్జీలియస్ తరువాతి స్థానము అర్హీనియస్‌దే అని చెప్పవచ్చును.

జె. జో.

**అలంకరణ కళ (Decorative Art) :-** 'అలంకార ప్రియో విష్ణుః' అని హిందువులు విశ్వసింతురు. అలంకరణము మానవుని స్వభావము కూడ. తాను ఉపయోగించు వస్తువులను బుద్ధికింపగురీతిని కూర్చుట లేక చిత్రించుట మానవునికి సహజమైనపని. ఇదియే అలంకరణము. కాగితాలతో పూవులుచేయుట, ముగ్గులువేయుట, జిలుగు కుట్టుట మొదలగు పనులు అలంకారములు అనబడును.

అలంకరణము మానవుని హృదయమును రంజింపజేసి ఆహ్లాదమును కూర్చును. మనకు నిక్కమైన ధనము అలంకరణమే. మనము డబ్బుచేత డాబును కొనుచున్నాము. గౌరవమును, భోగమును, కీర్తి ప్రతిష్ఠలను కలిగించునది ఈ కళయే. నేటి పెడంతస్థులమేడ, సోఫాసెట్లు, అల్మా

గీలు, పట్టు తివాచీలు, నాటి దర్బారు వైభవాలు, రాజ దండములు, రాజ చిహ్నములు – ఇవన్నియు అలంకరణ ఫలితములే. వీటినిబట్టియే ప్రపంచమున గౌరవమేర్పడు చున్నది. వేయేల? వెండి రూపాయిగా మారుట, కాగితము నోటుగా మారుట అలంకరణ కళా ప్రభావమే. సభ్యత యనునది ఈ కళకు బుట్టిన బిడ్డయే.

పై కళా విషయ మంతయు మానవుని సృష్టియై యున్నది. కాని ఆకాశము, మబ్బులు, పర్వతాలు, పృథ్వి, అగ్ని, జలము, చెట్లు చేమలు మొదలగునవన్నియు బ్రహ్మ సృష్టికి చెందినవి. ప్రకృతి యొక్క అనుకరణము మానవుని సృష్టిలో గాంచెదము. సర్వస్వతంత్ర సృష్టి సర్వేశ్వరునిదే. సర్వ స్వతంత్రమై, పరిపూర్ణమైన సర్వేశ్వరుని సృష్టిలోని నిరుపమాన సౌందర్యమును కళాకారుడు ఖండఖండములుగా చిత్రించుకొనుచున్నాడు. 'సత్యం' 'శివం' 'సుందరం' అనునట్టి ఆ పరతత్త్వ పరిణత దశను సౌందర్య స్వరూపముననే ఆరాధించుట గాంచగా, సౌందర్యము ఇహ పరములు రెంటికిని సాధన మని తెలియగలదు. సౌందర్యము ప్రతి వస్తువులోను అంతర్గతముగ వెలుగుచున్న యొక తీపి. దానిని రేఖలచే వ్యక్త పరచి రంగులతో ఉజ్జ్వలపరచుటకు చేయు ప్రక్రియయే చిత్రకళ అనబడును.

బ్రహ్మ సృష్టిలోని దృశ్యములను పరిశీలించినచో వాటి నిర్మాణములో నొక క్రమము, విన్యాసము, కనిపించును. సృష్టియనునది పునరావృత్తికలిగి దేశకాలమానములచే నొప్పుచున్నది. చిత్రకళలో అలంకరణము ఒక భాగము మాత్రమే అయియున్నది. కేవలాలంకరణము సౌందర్యమును మాత్రమే సృష్టించును. సందేశమునిచ్చు చిత్రములు వేరుగా నుండును. బుద్ధుడు బోధివృక్షము క్రింద జ్ఞానము నార్జించిన దృశ్యము సందేశ చిత్రము. ముగ్గులు, లతలు, ద్వారబంధములపైని నగిషీలన్నియు అలంకరణ చిత్రములు.

ప్రకృతిలోని కూర్పు, క్రమము, మనకు ఆశ్చర్యమును, ఆహ్లాదమును కలిగించును. వీటిని మనము మన అవసర పూర్తికై ఉపయోగించుకొనుటయేగాక ఇచ్ఛానుగుణముగ వాటిలో మార్పులు చేసినచో నవ ప్రయోజనాలంకారము లగును. సృష్టిలోని వస్తుజాల మంతయు నాలుగు మూలాకృతులలోని పరస్పర సమ్మేళనములలో కాంచవచ్చును.

1. వృత్తము, 2. చతుష్కోణాకృతి, 3. త్రిభుజాకృతి, 4. బహుకోణాకృతి. ఎట్టి ఆకృతినయినను రేఖయే నిర్దేశముచేయును. కావున చిత్రకళకంతటికిని మూలము రేఖయే. ఈ రేఖ ఏడువిధములుగ పరిణమించును. వీటిని 'మూలరేఖ' లందుము. ఇవి అలంకరణమునకు బీజప్రాయములు.

ప్రథమరేఖ సుడి (Spiral). ఇది సీటిలోను, నెత్తిపైనను, నత్తగుల్లలపైనను కానవచ్చును.

రెండవది సున్న లేక వర్తులము. దీనిని సూర్యుని ఆకృతియందు లేక వలయములందు గనవచ్చును.

మూడవది చంద్రవంక లేక అగసున్న. దీనిని విదియనాటి చంద్రునియందును, ఇంద్ర ధనుస్సునందును జూచెదము.

నాలుగవది 'కాటాకొండి'. ఇది మంటలలోను, పొగలోను, గాలమందును కానవచ్చును.

ఐదవది 'తరంగరేఖ' దీనిని అలలయందు లేక అరాళకుంతలములయందు గాంచెదము.

ఆరవది 'క్రకచరేఖ'. దీనిని రంపపుపండ్లు, కొండకొనలు, విద్యుత్‌రేఖలు మున్నగు వాటియందు గాంచెదము.

ఏడవది సాధారణమైన 'సూటిగీత'. (straight line) దీనిని బట్ట అంచులలోను, బల్లలందును, ప్రాటియందును, దిక్చక్రము (Horizon) నందును చూడవచ్చును.



పటము 1

ఈ మూలరేఖలు మనము నిత్యము దర్శించు వస్తువులలో గోచరించును. ఈ రేఖలు అలంకరణకళకు ప్రధానమయినవి. వీటియొక్క వివిధ సమ్మేళనములచేతను, బంధములచేతను అనేక ఆకృతులు ఉత్పన్నమగును.

వీటిని కలుపుటలో రెండుపద్ధతులు గమనింపదగి యున్నవి.

1. ఒకరేఖ మరొకదానిని కోయకూడదు. లేక ఒక రేఖ మరొకరేఖకు అసంగతముగా నుండక సుసంగతముగా నుండవలయును.

2. ఒకే జాతిరేఖను అనేకసార్లు అంచులో నుపయోగించునపుడు సమానాంతరముగా (parallel) ను సమదూరముగాను వేయవలెను. ఇవి సామాన్యసూత్రములు.



పటము 2.

**తోరణములు - Running Designs.** : ఈ మూలరేఖలలో ఒకదానిని మరొకదానిచే జోడించినచో భిన్నభిన్న రూపము లేర్పడును.

మూలరేఖలను కుదింపవచ్చును, సాగదీయవచ్చును.

**కుదింపబడిన రేఖలు** **సాగదీసిన రేఖలు**



పటము 3.

దిగువ నుదాహరింపబడిన బంధయుక్తి ననుసరించి గీచినచో అనంతములయిన అలంకార ఖండములను సృష్టింప వీలగును.



పటము 4.

**ఆల్పన (ముగ్గులు)** : ఈ కళ నెరుగని ఆడుబిడ్డలు ఆంధ్రదేశములో లేరనవచ్చును. అక్షరము వ్రాయలేని ఆడువారికి అలంకరణము వెన్నతోబెట్టిన విద్య. మన దేశములో మూగ మగువలకుగూడ ముగ్గులువేయుట ఉగ్గుపాలతోనే నేర్పిన విద్య. ఈ కళ సర్వసాధారణమై నేటికిని జీవించియున్నది.

ఒక్క తరంగరేఖను ఎన్నివిధాలుగా మలచవచ్చునో ఈ దిగువ నిరూపింపబడినది.



పటము 5.

**'లయ' (Rhythm)** : అలంకరణ కళను దృశ్యసంగీత మనవచ్చును. సంగీతమునకువలె స్వరము, రాగము, తాళము అలంకరణ చిత్రమునకుకూడ ఆవశ్యకములు. రేఖయొక్కయు, స్థలము (Space) యొక్కయు, క్రమ విభాగమువలన లయ ఏర్పడును. రేఖయొక్క సమగతియు, క్రమగతియు లయ యనబడును. ఇది సంగీతములో తాళమువంటిది.

స్థల విభాగము, (1) మంద, మధ్య, త్వరితగతి రేఖలచే ఇరుకుగాను, విశాలముగాను క్రిందివిధముగా చేయవచ్చును. మొదట చుక్కలు సమదూరములోపెట్టి ఏదైన ఒక మూలరేఖచే కలిపినచో నీ క్రిందివిధముగా నుండును.



పటము 6.

పైతావున బిందువులు క్రకచరేఖలచే కలుపబడినవి.

పైవానికి ఇతర మూలరేఖలచే క్రమపద్ధతిలో జోడించినచో అంచులోని అలంకరణము అధికతరమగును. రేఖాగతియందు మార్పుండియు సరిపోటీ క్రమముగానున్నది.

సాధారణముగా జంగమ రేఖ ఒకటిగా నుండదు. ఇట్టి రేఖలు క్రమబద్ధమైన ఎడమును, గతియు కలిగి యుండి అలంకరణ ప్రక్రియతో లయను సృష్టించును. ఇట్టి రేఖల సమూహ ప్రవాహగతిలో కొంచెము మార్పు గల్గించినచో లయలో నవీనత ఏర్పడి క్రిందివిధముగా నది ఎక్కువ ఆకర్షణీయముగా నుండును.



1. తాటిమట్ట పటము 7. 2. కొబ్బరిమట్ట

సృష్టిలోని లయ అనేక రీతులనుండును. కాని సాధారణ ముగా దానిని నాలుగు విధములుగా విభజింపవచ్చును.

1. సమానాంతరత. 2. చతురస్రత. 3. ప్రసరణము. 4. క్రమరేఖ.

1. సమానాంతరత :



పటము 8.

2. చతురస్రత :



పటము 9.

3. ప్రసరణము :



పటము 10.

4. లయరేఖ :



పటము 11.

**అంచులు :** అంచులలోను తోరణములలోను 'ముఖ్య రేఖ' యొక్క లయగతియు దానిననుసరించియున్న ఇతర రేఖలును సుసంగతి (**Harmonious**) గా నుండుట అత్యావసరము. అంచు ముందు సాగిపోవుచు పెరుగుచుండవలెను. ఏడు మూలరేఖలలోను ఏదైననొక దానిని ముఖ్యరేఖగా గొని, దాని కిరువైపుల ఇతర రేఖలను జోడించినచో అంచులో గతి, లేక చలనము గలుగును. ఉపరేఖలు ఎల్లప్పుడును 'మధ్యధారా రేఖ'నుఆధారముగా జేసికొని ప్రవర్తించును.



పటము 12.

పై తరంగరేఖ ప్రవాహరేఖయై ముఖ్యరేఖయైనది. దానికి సుడులు జోడింపగా, ఉపరేఖలైనవి.

**రేఖలస్థితులు :** మూలరేఖ లన్నియు ప్రధానముగా నాలుగు స్థితులు కలవిగా నుండును.



1



2

3





4

5



1. అడ్డముగా
2. నిలువుగా
3. ఎడమవాలుగా
4. కుడివాలుగా
5. గుండ్రముగా



పటము 13.

ఈ వలయావస్థయొక్క కూర్పులచేత అనేకరకాలైన పుష్పాకృతులు సృష్టియగును. వీటిలోని రేఖలు గానుగ గతిచే ప్రవహించి కట్టుబడి, సంపూర్ణ దృశ్యములను నిర్దేశించును.

**అనురూపత :** అలంకరణ చిత్రములలో లేక ప్రకృతిలోని దృశ్య పదార్థముల యందును రెండు భాగములు సమమై, ఒకదానికి నొకటి పోటీగా స్థాయి (Balance) గలిగి ప్రతిబింబించినచో అనురూప (symmetrical) చిత్రములు, లేక దృశ్యములు అనబడును. ఇట్టి చిత్రములోని ప్రతి సూక్ష్మ వివరము గూడ ఎదుటి భాగములో ప్రతిబింబించునట్లుండును. ఈ రెండు ప్రత్యర్థిభాగములయొక్క కలయికచే ఒకే చిత్రమగును. అది చూచుటకు అందము గూర్చును.



పటము 14.

చక్కగా పరిశీలించినచో ప్రకృతిలోని అనేకపదార్థములయందు అనురూపత వ్యక్తము కాగలదు. పోకలు, పండ్లు, ఉల్లిగడ్డలు, కట్టె మొదలగువాటిని కోసి రెండు భాగముల నక్కే యుంచి చూచినచో, రెండు భాగముల లోని వివరములు కూడ ఒకదాని కొకటి ప్రతిరూపముగా నుండును. సమాన ప్రతిభ గలిగిన ఇద్దరు గాయకుల పోటీ గానమును, సమశక్తిగలిగిన ఇద్దరు మల్లుల కుస్తీని వీక్షించు వారికి అవిచెవులకు కన్నులకు విందొనగూర్చునట్లు అనురూపచిత్రములును సౌందర్యమును అందించును. ఈచిత్రములలో సంపూర్ణమైన'స్థాయి' (Balance) ప్రకటితమగును. వీటిలోని రేఖలన్నియు దృష్టిని తమతోబాటు అటు నిటు త్రిప్పి చివరకు మధ్యభాగమువరకు తెచ్చి వదలివేయును. దీనిచే దృష్టికి 'స్థైర్యము' ఏర్పడును.

**స్థాయి (Balance) :** అనురూప చిత్రములలోని రెండు భాగముల్లలో సంపూర్ణ స్థాయి యుండును. కాని సరి సమానము కాని భాగములలో స్థాయి యుండినచో అది ఆశ్చర్యమును కల్గించును. బాట్లు చిన్నవే గాని భారము సమానముగా నుంచుటలేదా ? సమాన స్థాయిని నిర్ణయించుటకు కొంత ప్రయత్నము అవసరము. చిత్రములలోను, అలంకరణ చిత్రములలోను కొలది స్థలమును ఆక్రమించిన ఆకృతి, అధిక ప్రమాణము గలిగిన ఆకృతికి, లేక స్థలమునకు, సమతూనికగా నుండును. కాని చిన్న ఆకృతికి అధిక ప్రాముఖ్య ముండుట అవసరమైయుండును. ఒక స్తంభపు నీడ దాని కన్న పెద్దగా నున్నను, దాని నీడతో కలిసి దృష్టికి స్థాయిని ఒనగూర్చును. చూచు వాని దృష్టి స్తంభము వైపే లగ్నమగుచుండును. దీనికి కారణము స్తంభముపై నున్న వెలుతురు ఛాయలు చుట్టుప్రక్కల ప్రదేశములలో కంటె ప్రగాఢమైయుండును. ఇటులనే తామర పుష్పము దాని చుట్టు వ్యాపించిన విశాల పత్రముల పరిసరములలో ప్రధానమై ఆకర్షణీయముగా వెలుగొందును. దీనికి కారణము ఛాయల వ్యత్యాసమే కాక వర్ణ వ్యత్యాసము కూడ నైయుండుట.

సాలెపురుగు నేతలోని నడిమిభాగములోని తంతు రేఖలు అధికముగా నుండుటచే వివరములు అధికమగును. దీనిచే ఆకర్షణ అధికమై ఇతర విశాల భాగములతో విశేషించి తులతూగుచుండును. రేఖలు ఒకచోటు నుండి మరొక చోటికి ప్రవహించునపుడు ఒక ప్రత్యేక దిశను సూచించును. అనేక రేఖలు ఒకేబిందువు వైపు నుండి పారుచున్నను, అనేక దిశలనుండి బిందువు వైపు ప్రసరించినను, ఆ దిశకు ప్రత్యేక ఆకర్షణము ప్రాప్తించును. ఇట్టి రేఖల ప్రయోజనము అలంకార చిత్రములలోనే గాక, సమస్త చిత్రములలో గూడ మెక్కు లుండును. రెండు అసమానభాగములు సమానమగుటకు కారణము ఆ రెండు కూడ సమానాధిక్యమును కలిగియుండుటయే.

**పరివ్యాప్త - అలంకరణము (All over Design) :** అడవులలోను, ఊరి బయళ్ళలోను, చేలలోను, తోటలలోను పూలు విరగబడి పూయును. ఇవన్నియు స్థలము నాక్రమించుచు వ్యాపించుచుండును. వీటి కూర్పునందు క్రమబద్ధత కనబడుట దుస్తరము. కాని ఇవ్వన్నియు వ్యాపించి, కిలకిల నగి, గిలిగింతలు పెట్టును. ఇది పరివ్యాప్త - అలంకృతిలోని క్రమపద్ధతి. ఇటులే ఆకాశముపై తారలు, నేలపై రాలిన ఆకులు, పూలు, జముడుమీది ముండ్లు, కోమటి రాళ్ళు భిన్నవర్ణము లయిన భిన్నఛాయా (tones)

భూమికలపై చూచియున్నారము. వాటికి క్రమబద్ధముగ పడియుండు అవకాశములు లేవు. కాని వాటి కూటమి కొంతస్థల మాక్రమించుచున్నది. ప్రతికూటమిలోని రూప భూమియు, విరామభూమియు తప్పనిసరిగా జ్యామితి రేఖాకృతి విశేషములు ((geometrical details) కలిగి యుండి, వివిధ దిక్కులను పునరావృత్తిని లయలను, స్థాయిని గూర్చు వెలుతురు ఛాయలను కలిగియుండును.

ప్రపంచమునందలి అన్నిదేశములలోని ఉత్తమ అలంకరణ కళాఖండములలో క్రమములేని పరివ్యాప్తములైన అలంకృతులు చాల అరుదుగా నుండును. ఒకవేళ ఉన్నను అవి చాలవరకు ప్రకృత్యనుకరణ (Realistic) పద్ధతిలోనే ఉండును. కాని వివరములన్నియు ఒకానొక అలంకార సూత్రమును అనుసరించి, బిగించి, శైలీకరింపబడును. - కొన్నిసార్లు గుచ్ఛము లన్నియు ఒక నిర్దిష్ట ఆకృతియందు నిండునట్లు వేయుటయు గలదు. ఐనను అది పరివ్యాప్త అలంకారమే అగును.

ఈ అలంకరణము సమముగా విభజింపబడిన భూమికపై వేయబడును.



పటము 15

మూలాకృతులును, గుచ్ఛములును (units) సంతరణ స్థానములందు (crossings) సమదూరములందుండి భూమికను సమముగా విభజించును. 16 వ పటములోని 1 వ పటములో మాదిరి ఏకాంతరిత (Alternative) స్థలములందైనను, 2 వపటముమాదిరి చిన్నని మూలాకృతులు ఖాళీస్థలములందైనను వేయబడును. 3, 4 లో మాదిరి వట్టిగీతలు లేక చుక్కలు మలుపబడవలయును.







పటము 16

పునరావృత్త - అలంకరణము (Repeated Design): సాధారణముగా గోడలపై నతికింపబడు కాగితములలోను, నేతబట్టలలోను అచ్చకములలోను పునరావృత్త అలంకరణము కనిపించును. ఏదేని ఒక అలంకరణ గుచ్ఛము క్రమబద్ధమైన ఎడమిచ్చి (Regular Intervals) సంతరణ పద్ధతిలో చిత్రింపబడును. దీనిచే అలంకరణము పరివ్యాప్తమై విశాలప్రదేశముల సమముగా నాక్రమించునదిగా నుండును. ఇట్టిపై క్రమబద్ధమైన కొలత గలిగిన కూర్పుచే అందమును స్పందింపచేయును. కొన్ని అలంకృతులలో ఖండికలకూర్పు సన్నిహితమగుటచేత అల్లిక లున్నవన్నైమై నేతపనిగను, గూనపెంకులు పేర్చినట్లును, ఇటుకపెడ్డల నతికినట్లును ద్యోతకమగుచుండును. ఈ విధముగా ఖండికల వివిధబంధములచే విశాలప్రదేశములు వింత భూమికలుగా మారును.

పునరావృత్త అలంకారము వ్యామోహకరముగా నుండును. నిత్యము మనము దర్శించు వస్తువులలో నిట్టి క్రమము గాంచవచ్చును. ఈ కూర్పు అనేక రకములుగా నుండును. అనాసపండు చర్మము చతుష్కోణమయముగా నుండును. దేవదారు చెట్లు, చేపల పైపొలుసులు, తేనె తెట్టెపై తొరటలు ఒకదాని నొకటి రాచుకొని జ్యామితి రేఖాకృతులు కలిగి వ్యాపించియుండుట చూతుము. ఇట్టి ఏక ఖండికా పునరావర్తనమే పునరావర్తిత - అలంకరణ మనబడును.

ఇట్టి అలంకరణము గచ్చు, లోహము, చర్మము, కడవలు, కప్పులు, కఱ్ఱలు మున్నగువాటిపై కాన వచ్చును.





పటము 17

పై చిత్రములలో అలంకరణము అడ్డదిడ్డముగా నుండక ఒకేచాలు ననుసరించి కచ్చితమై క్రమముగానున్నది.

కొన్ని అలంకరణములలో రేఖాగణితముననుసరించిన బంధములు కానవగును. కాని యందలి పునరావర్తన తంత్రము సులువుగా నుండక చిత్రఖండిక ఒకటిగా నుండక, అనేకాకృతులుగల గుచ్ఛములను సమప్రమాణ మును ఛాయను మాత్రము గలిగియుండును. గుచ్ఛ సమూహములు వంకరటింకరగా (zig-zag) పునరాగ మించుచు పోటీగా (Reverse) ప్రత్యక్షమగును.

ప్రయోజనాలంకరణము. (Functional Design.): నభోభాగాన పారెడు పక్షుల తోరణమును గమనించినచో ఒకదృశ్య కవిత్వము గోచరించును. అది బాణాగ్రాకృతిని పోలు చాలు గలిగియుండును. ఇట్టి ఆకృతిలో సౌందర్య మును, ప్రయోజనమును రెండును కలిసియున్నవి. బలిష్ఠమైన నీటిబాతొకటి ముందుగా గాలిని చీల్చుకొని పోవుచుండ, దానివెన్నంటిపోవు బాతులు మొదటిదానంత శ్రమకు గురికావలసిన అవసరము ఉండదు. వీటి వ్యూహ బంధములోనున్న అలంకారము 'ప్రయోజనాలంకరణ' మనబడును. అనగా అలంకారము, ప్రయోజనము ఏక వస్తువునందు మిశ్రితమైనపుడు అది ప్రయోజనాలంకరణ మగును. వ్యూహము సరియైనచో దాని పరిణామము గూడ సరియగును. ప్రయోజనాలంకరణము ఒకవస్తువు యొక్క ప్రమాణముతోను, బరువుతోను, గట్టితనము తోను, దాని రంగుతోను సంబంధము కలిగియుండును. కెమెరాను చేతులలో తేలికగా నుండునట్లు నిర్మించుట ప్రయోజనదాయకము. దీనియొక్క ఆకృతిని కుంచిం చుట, అవసరమునుబట్టి పెంచుట, బరువుతక్కువగా నుండుట, మలచి చంకలో తగిలించినను సుందరముగా నుండుట, అనునవి దీని ప్రయోజనములు. అట్టి ప్రయో జనములలో దాని నల్లనిరంగు, దాని బిరుసుదనము (Rough texture) కూడ పేర్కొనదగినవి. పులులు, పక్షులు, లేళ్ళు, సీతాకోక చిలుకలు మున్నగు వాటి యందున్న మచ్చలు, వాటిని పరిసరములనుండి కప్పి పుచ్చుటకు ఉపయోగించుచున్నవి. యుద్ధ విమాన ములపై, ఆయుధములపై, సైనికుల దుస్తులపై మేఘ చ్ఛాయలను, చెట్లరంగులను, చిత్రించుటవలన శత్రువుల బారినుండి ఆత్మ రక్షణము చేకూరుచున్నది. ఇటులే, పెన్సలు, పలకలుపలకలుగా నున్నచో నది పొరల కుండును. ముంగిటిలోవేసిన పిండిముగ్గులు అందమును కూర్చుటయేగాక, చీమలకు ఆహారముగా నుపకరించును. నావకు ముందు వెనుకల సన్నముగా చెక్కుటచే నది నీటిని కోయగలుగును. వివిధ మతస్థులు ధరించు ఊర్ధ్వ పుండ్రములు, విభూతి, బెండకాయబొట్లు, మొదలగునవి వారివారి మతచిహ్నము లగుటయేగాక అలంకార ములుగ కూడ ఎన్నతగియున్నవి. ప్రయోజనము ననుస రించి మలచిన పనిముట్లన్నియు వాటియందిమిడియున్న లయగతిరేఖల చేతను, రంగులచేతను స్వతఃసిద్ధముగా అలంకృతములై యుండి కన్నులకు విందొనగూర్చును.

శ్లేషాలంకరణము : భారతీయ శిల్పములలోను, చిత్ర ములలోను అచ్చటచ్చట ఈ వింతచిత్రములు కానవచ్చును. అజంతాలో నాలుగు జింకల కొకేతల చిత్రింపబడినది. ఇది చిత్రకారుని అధికశ్రమను తగ్గించి, సందర్భపూర్వకముగా

చిత్రింపబడుటచే ఆశ్చర్య మొనగూర్చును. ఇటులే భువనేశ్వర శిల్పములో నలుగురు వీరుల బంధములో రెండే తలలున్నవి. ఎటు త్రిప్పిచూచినను దేనికదే వేరుగా కనిపించును. దేవాలయములపై కోణములలో అనగా రెండు గోడలు కలియుచోట రెండుకోతులు లేక సింహములుండి ఒకేతల మధ్యభాగములో చెక్కబడును. రామప్ప దేవాలయ మంటప స్తంభముపై చెక్కబడిన భజనమండలిలో మధ్యభాగమున నాట్యముచేయుచున్న వ్యక్తి యొక్క పాదములు కుడి ఎడమల నున్నవారిలో నొక్కొక్కరి పాదముతో కలిసి రెండేపాదములుగా మలచబడినవి (ప. 16). కవి ఒకే పదమునకు సందర్భానుసారముగ రెండు మూడర్థములను గల్పించునట్లు చిత్రమునందును, శిల్పమునందును ఒకే రూపములో అనేక రూపములు కల్పనచేయుట రూపశ్లేష అనబడును.



పటము 18. రామప్ప దేవాలయ శిల్పము

బంధములు (compositions) : మూల రేఖలచే తయారైన అలంకృతు లన్నియు రెండు తరగతులలో విభజింపబడును. వాటిలో మొదటి తరగతివి దృష్టికి విశ్రాంతి నిచ్చుచు, నిశ్చలమై స్థాయి గలిగియుండును. ఇవి 'స్థావరములు' (static arrangement) అనబడును. రెండవ తరగతివి కదలిక గలిగి విస్తరించి పెరుగుచుండునవి. ఇవి జంగమము లనబడును. (Dynamic arrangement)).



పటము 19. స్థావర బంధములు

స్థావరములన్నియు విశ్రాంతి భావమును సూచించును. రేఖలన్నియు ఒకదానికొకటి తులదూగుచుండి స్థలమును సమానముగా నాక్రమించును.

రెండవతరగతి జంగమ బంధములు, అంచులు, తోరణములు మొదలగువానికి ఉపయోగించునవి. రేఖలన్నియు ఒకచోటనుండి మరొక చోటికి పారుటచే మన దృష్టిని తమతో లాగుకొనిపోవును. వీటిలో చలనము ప్రధానాంశము.

సామాన్యముగా కదలిక అనునది ఎడమనుండి కుడి దిక్కునకు చూపబడును. అవిధముగానే భావింపబడును కూడ. ఉపరేఖలు ముఖ్యరేఖను కలియునపుడు ప్రవాహపు దిక్కునుండియే కూడును.



పటము 20.

సుసంగతి (Harmony) : ఆకులు, పూవులు, కొమ్మలు ఒక క్రమములో అభివృద్ధిని, ఉయమును కలిగియుండుట గమనింపదగినది. ఒక పత్రమునకును ప్రక్కనున్న మరొక పత్రమునకును రూపములో అత్యంత స్వల్పభేద

ముండుటచే అవి చూచుటకు అందముగ నుండును. హార్మోనియమునందలి 'స' అనుస్వరము ప్రక్కనున్న రీడును నొక్కినచో 'రి' అను స్వరము పలుకును. ఇటులనే 'రి' అను స్వరమునకు ప్రక్కననున్న రీడును నొక్కినచో 'గ' అను స్వరము పలుకును. ఇట్లు సప్తస్వరములు ఒకదాని ప్రక్కన నొక్కటి ఇల్లు కట్టుకొనినట్లే, రేఖలు రూపమును స్వల్పభేదములచే ఒకదాని ప్రక్కన నొక్కటి ఉన్నచో వాటి సుసంగతి మనకంటికి గోచరించుచుండును.

ఏకాంత రితము. ఇట్లే ఏకాంతరిత (;Alternative) రేఖాదృశ్యములలో కొంత సుసంగతి దృగ్గోచరమగుచుండును.



పటము 21.

చిత్రములో రేఖలు రెండింటికంటె అధికముగా నున్నచో, వాటి పరస్పర స్నేహామే సుసంగతి యగును. ఒకరేఖ మరొకరేఖతోను, ఒక వర్ణము మరొక వర్ణముతోను, గుణ ధర్మమునందు సంపూర్ణ వ్యతిరేకముగా నున్నను, ఖండించుచున్నను అసంగత రేఖలు (Contrasting lines) లేక వర్ణములు అనబడును.

ఉదా :




పటము 22.

పై పటములో 1, 2, 3, 4, 5 అనునవి ఒకదాని ప్రక్కన ఒకటి యున్నచో సుసంగతములు అనబడును. కాని 1, 5 లు అసంగతములు. ఎందుకనగా, 1 వృత్తము; 5 సూటిగీత. ఈ రెంటి గుణధర్మములు వేరు. కాని 5, 4; 4, 3; 3, 2; ఇవన్నియు సుసంగతములే.

ఇటులే వర్ణములయందు సుసంగతి గాంచనగును. నారింజ - ఎరుపు; ఎరుపు - ధూమ్రము; నీలము - ఆకుపచ్చ; పసుపు - నారింజ; మొదలగు వర్ణములన్నియు సుసంగతములే. ఎందుకనగా, ప్రతి జంటవర్ణములో ఏదో యొకరంగు రెంటిలో కలిసియుండుటచే, స్వల్పభేదము వలన రెండును ఇంపుగానే కన్పించును. ఎరుపు, నారింజలలో, ఎరుపురంగు ఈ రెంటిలో నుండి, నారింజలో కొంచెము పసుపువన్నెతో కలిసియుండును. కావున చూచుటకు స్వల్పభేదముండి కూడ ఆకర్షణమును కలిగించును. కాని ఎరుపు, నీలము, పసుపు అను వర్ణములు యథాతథముగా పరస్పరము భిన్నవర్ణములు. ఈమూడు వర్ణములను సమన్వయపరచుటకు ఏదైన నొకవర్ణము అన్నిటిలో కలిసియుండినచో చిత్రములో ఏకత్వము (unity) కుదిరి సుసంగతి వ్యక్తమగును. లేనిచో అసంగతి తోచును. ఉదా :-





పటము 23.

సుసంగతియు క్రమవృద్ధిక్షయములును ఈ క్రింది వస్తునిర్మాణములలో గాంచనగును.



పటము 24.

పరిప్రేక్షిత దృష్టితో (perspective) చూచిన ద్వారములు, వరుసగానున్న కుండలు కూడ సుసంగతి నొనగూర్చును.

**ప్రసాధక రూపము (Decorative Form) :** ఏ రూప మైనను ప్రథమదర్శనములో సంక్షిప్తముగ గోచరించును. అనగా గుండ్రముగానో, త్రిభుజముగానో, చతుష్కోణము గానో ఫలకములుగానో కనబడును. ఇదియే సంక్షిప్త రూపము. కాని దీనినే తదేకదీక్షతో తిలకించినచో అపుడు అనేకవివరములు గోచరించును. దానితోబాటు అనేక వంకలును, వికృతులును కనబడును. ఒక కమలమును చూడుడు. చూచినచో దాని సంక్షిప్తరూపము 'గుండ్ర ముగా కాన్పించును. కాని ప్రకృతిలోని విరోధశక్తుల వలన దాని దళములు మూడియో, ఊడియో, క్రమరహితముగా కనబడును.

చిత్రకారుడు ఒకానొక వస్తువుయొక్క ఆకృతి యందలి వికారమును తొలగించుటకై, ఒక సులభపద్ధతి నాశ్రయించును. దానికై మూలరేఖలను, రూపములను బోలు ఆకృతులను మలచును. దీనిచే సంగ్రహరూపములు సృష్టియగును. కమలమును చిత్రించుటకు దానిరూపములు బోలిన వలయమును చిత్రకారుడు వ్రాసియందు రేకుల క్రమబంధమును చిత్రించును. దీనిచే శ్రమలేకయే దాని రూపము సులభగ్రాహ్యమగును. ఇదియే ప్రసాధకరూప మనబడును.

**భూమికా బంధము :** చిత్రించవలసిన భూమిని నిర్దేశించిన తర్వాత దానిలో చిన్నవియు పెద్దవియునైన అనేక అలంకార ఖండికలను కూర్చుటకు అవలంబింపవలసినపద్ధతి బంధ మనబడును.

1. అన్నిటికంటె ప్రధానరూపము మొదట సాధారణముగా మధ్య భాగములోనైనను దానికి సమీపమునందైనను చిత్రింపబడును. పిమ్మట అంతకంటె తక్కువ ప్రాధాన్యముగల రూపము చిత్రించబడును. తుదియందు చుక్కలు మొదలగు అల్పాకృతులు అవసరమైనచో ఖాళీ స్థలములలో నింపబడును.

2. అలంకరణ చిత్రములో ప్రమాణములు (Proportions) పరిగణనీయములు కావు.

3. చిత్రితమైన భాగము ఎక్కువ స్థలమును ఆక్రమించి యుండవలయును. (కొన్ని చోట్ల చిత్రిత భాగము ఖాళీ భాగముతో సమానముగా నుండ వచ్చును.)





పటము 25.

4. రంగులు, రేఖలు, ఛాయలవ్యత్యాసములు, పరస్పరముగా సుసంగతిలో నుండవలయును.

5. చిత్రములో స్థాయి ఉండవలయును.

పరిప్రేక్షణము (perspective) సాధారణముగా అలంకార చిత్రములలో తక్కువ. అలంకారఖండములు ఒక దానిపై నొకటి చేరి కలిసిపోకుండుటకై ఖండికలమధ్య భాగమున కొంత ఎడముంచవలయును.





పటము 26.

ఒప్పు　　　　తప్పు

6. అలంకరణ చిత్రములో చేయబడు వస్తువులను యథాతథముగ చిత్రించక అతిశయ రూపములు (Exaggerated forms) గా మార్చవలయును.

7. చిత్రకారుడు చిత్రకళాసూత్రములను పాటించుటతోబాటు స్వప్రతిభను ప్రయోజనానుసారముగా ఉపయోగించవలయును.

అలంకరణములో సందేశముకన్న సౌందర్యమే ప్రధానమైనది. కావున వస్తు ప్రమాణముల నెట్లు మార్చినను చిక్కులేదు. అవి క్రమగతములైన చాలును. వస్తు ప్రమాణములందును, రంగులయందును, భావమందును కారణ మీమాంస తగదు. ఇది చిత్రకారుడు కన్న 'కల'.

కలలో కారణములుండవు. అదిసుఖస్వప్నమైతే చాలును. కావుననే వక్రతుండము నోటినుండి తీగెలు జారినవి. మకరములు మకరతోరణాలైనవి. హంసలకు తోకలు పెరిగినవి. పొన్నవాహనము సున్నయైనది. హనుమంతునికి వట్టైనామాలు, నగిషీగల జెట్టిలాగు, ఉంగరాలు, శంఖచక్రాది చిహ్నములు పెరిగినవి. ఇట్టి అలంకరణము శిల్పకారుని చిత్తము ననుసరించియే చేయబడును.

రంగులు - ఛాయలు (Colours & Tones)

అలంకరణములో భావ ప్రాధాన్యములేనపుడు రంగుల వాడుకను గురించి శాసనాలు చేయుటకు వీలులేదు. వర్ణలేపనము చిత్రకారుని స్వేచ్ఛపై నాధారపడి యుండును. భావమే ప్రధానమైనచో రంగులు దానిననుసరించి వాడనగును.

ఛాయ : ప్రతివర్ణము కనీసము మూడువిధములుగా నుండును. (1) గాఢచ్ఛాయ (నలుపు) (2) మధ్యచ్ఛాయ (3) మందచ్ఛాయ (శ్వేతమిశ్రణము).

మనము ఒకేరంగుమీద అరంగునే, వేరువేరు ఛాయలలో వేసినచో నది దృగ్గోచరమగును.

మిశ్రవర్ణములు : ఒక వర్ణములో మరొక వర్ణము కలిసినచో మిశ్రమ వర్ణ మనబడును. మిశ్రవర్ణములు చూచుటకు ప్రాథమిక వర్ణముల (Primary colours) కంటె తక్కువ దీప్తికలిగి యుండును. కాని ఉత్తమ కళాఖండములన్నియు ఇట్టి మిశ్రవర్ణ సమన్వితములే అనవచ్చును. అలంకరణ చిత్రమునందలి వస్తువులను సహజ వర్ణరూపయుతములుగా చిత్రింపవలయునన్న నియమము లేదు.

కొం. శే.

**అలంకారశాస్త్ర చరిత్ర :-** రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో అలంకారశాస్త్రమును తొలుత శివుడు బ్రహ్మ కొనగెననియు, బ్రహ్మనుండి అది ఇతరులకు లభించుచు వచ్చెననియు చెప్పెను. సంస్కృతాలంకార శాస్త్రమునకు భరతముని వ్రాసిన నాట్యశాస్త్రమే పురాతనమైన మూలగ్రంథమని భావింపబడుచున్నది. నాట్యశాస్త్రమునందలి మొదటి ఐదు అధ్యాయములు క్రీ. శ. 5 వ శతాబ్దికి పూర్వము రచింపబడినట్లు తెలియుచున్నది. సంస్కృతమున అలంకార శాస్త్రమును గూర్చి వ్రాసినపండిత ప్రకాండులు పెక్కురుకలరు. వ్రాయబడిన ఉద్గ్రంథములును పెక్కులుకలవు. అవి యెవ్వియన-భామహుని కావ్యాలంకారము (క్రీ. శ. 6 వ శతాబ్దికి పూర్వము); దండికావ్యాదర్శము (క్రీ. శ. 6 వ శతాబ్ది); ఉద్భటుని అలంకార సారసంగ్రహము. (క్రీ. శ. 8 వ శతాబ్ది); వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి (క్రీ. శ. 8 వ శతాబ్ది); రుద్రటుని కావ్యాలంకారము (క్రీ. శ. 825-875); ఆనందవర్ధనుని ధ్వన్యాలోకము (క్రీ. శ. 840-870); రాజశేఖరుని కావ్య మీమాంస (క్రీ. శ. 870-950); ముకులభట్టు అభిధావృత్తిమాతృక (క్రీ. శ. 9 వ శతాబ్ది - అంత్యభాగము); భట్టతౌతుని కావ్యకౌతుకము (క్రీ. శ. 950-980); భట్టనాయకుని హృదయదర్పణము. (క్రీ. శ. 900-1000); కుంతకుని వక్రోక్తి జీవితము (క్రీ. శ. 925-1025); ధనంజయుని దశరూపకము. (క్రీ. శ. 10 వ శతాబ్ది మధ్యభాగము); రాజానకమహిమ భట్టువ్యక్తి వివేకము. (క్రీ.శ. 1020-1060); భోజుని సరస్వతీ కంఠాభరణము, శృంగార ప్రకాశము. (క్రీ. శ. 1030-1050); క్షేమేంద్రుని ఔచిత్య విచార చర్చ, కవికంఠాభరణము. (క్రీ. శ. 1000-1063); మమ్మటుని కావ్యప్రకాశము (క్రీ. శ. 1050-1150 శతాబ్ది ఉ. భా.); రుయ్యకుని అలంకార సర్వస్వము (క్రీ. శ. 1150 పిదప); వాగ్భటుని వాగ్భటా లంకారము (క్రీ. శ. 1150 తరువాత); హేమచంద్రుని కావ్యానుశాసనము. (క్రీ. శ. 1106-1150 కి తరువాత - 1172); జయదేవుని చంద్రాలోకము (క్రీ. శ. 1200-1250); విద్యాధరుని ఏకావళి (క్రీ. శ. 1285-1325); విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణము (క్రీ. శ. 1296-1325); వాగ్భటుని కావ్యానుశాసనము (క్రీ. శ. 14 వ శతాబ్ది); విశ్వనాథుని సాహిత్య దర్పణము. (క్రీ. శ. 14 వ శతాబ్ది); భానుదత్తుని రసమంజరి, రసతరంగిణి (క్రీ. శ. 13 వ శతాబ్ది - అంతమున, 14 వ. శ. ఆదియందు); రూపగోస్వామి భక్తిరసామృత సింధువు, ఉజ్జ్వల నీలమణి (క్రీ. శ. 1470-1554); కేశవమిశ్రుని అలంకార శేఖరము (క్రీ. శ. 16 వ శతాబ్ది ఉత్తరార్ధము); అప్పయ దీక్షితుని వృత్తివార్తికము, కువలయానందము, చిత్ర

మీమాంస (క్రీ. శ. 16 వ శతాబ్ది అంతము - 17 శ. ఆది); జగన్నాథుని రసగంగాధరము (క్రీ. శ. 1620-1660).

అలంకార శాస్త్రమనగా కావ్యమును కావ్యాంగములను గూర్చి వివరించు శాస్త్రము. ఇండోయూరపియను భాషలలో ఋగ్వేదము అత్యంత ప్రాచీనమైన ప్రథమ గ్రంథము. అది ప్రధానముగా దేవతలను గూర్చి చేయబడిన స్తోత్రాత్మకమైన మంత్రగ్రంథమైనప్పటికిని దానియందు కావ్యలక్షణములు విశేషముగా కాన్పించుచున్నవి. అందు ఉషస్సును వర్ణించు ఋక్కులు సుందర కావ్యఖండములు - కొన్ని ఋక్కులలో ఉపమా-వ్యతిరేక అతిశయోక్తి-శ్లేష - ఉత్ప్రేక్షాద్యలంకారములు మిగుల మనోహరములుగా ప్రయోగింపబడినవి. తరువాతి లౌకిక కావ్యములలో వలెనే వేదవాఙ్మయములో కూడ ప్రకృతి మున్నగువాటి వర్ణనము మనోహరముగ చేయబడినది. నాటక బీజములుకూడ వైదిక సాహిత్యమునందు కన్పట్టుచున్నవి. నాటక నిర్మాణముకొరకు ఋగ్వేదమునుండి పాఠమును, సామవేదమునుండి గీతములును, యజుస్సులనుండి అభినయమును, అథర్వవేదమునుండి రసములను గ్రహింపబడినవని భరతుడు నాట్యశాస్త్రములో చెప్పెను.

వేదకాలము తరువాత క్రీస్తునకు అనేక శతాబ్దులకు పూర్వమే ఉత్కృష్టమైన కావ్యనిర్మాణము సంస్కృత వాఙ్మయములో చేయబడినది. రామాయణ మహాభారతములలో అత్యున్నతమైన కావ్యరచన సాగెను. అలంకార శాస్త్రములో ఉద్గ్రంథములైన ధ్వన్యాలోక, కావ్యప్రకాశములలో మహాభారతమునుండి గృధ్రగోమాయు సంవాదాదులైన అనేక విషయములు ఉదహరింపబడినవి, రామాయణమునుండికూడ కొన్ని శ్లోకములు ఈగ్రంథములలో తీసుకొనబడినవి.

**అలంకార శాస్త్రారంభము :** క్రీ. శ. రెండవ శతాబ్ది నాటివియు, ఆ తరువాతివియు నగు శాసనములను బట్టి అంతకు పూర్వమే అలంకార శాస్త్రరచనము ఆరంభింపబడినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 150 వ సంవత్సరపు రుద్రదాముని జునగఢ్ శాసనమునుబట్టి అప్పటికే కావ్యము గద్య పద్యాత్మకమయి యుండెననియు "స్ఫుట-మధుర-కాంత-ఉదార" అను కావ్యగుణ ములు తెలిసియుండెననియు స్పష్టమగుచున్నది. ఈ యంశమునే అంతకు కొంచెము పూర్వపుదైన "సిరిపులుమాయి" నాసిక శాసనముకూడ తెల్పుచున్నది. అది ప్రాకృతభాషలో నున్నది. ఈ రెండు శాసనములేగాక క్రీ. శ. మొదటి రెండుశతాబ్దులలోని సంస్కృత ప్రాకృత శాసనములు ఈ విషయమును ధ్రువపరుచుచున్నవి. ఇంతియేగాక ఈ శాసనములలో ''గంధర్వవేద-నట-గీత-వాదిత్ర-ఉత్సవసమాజ" ఇత్యాది శబ్దములు వాడబడినవి. వీటిలో శబ్దాలంకారములు, దీర్ఘ సమాసములు కలవు. పూర్వపు గద్యప్రబంధములు ఈ శైలిలోనే వ్రాయబడుచుండెడివి. వీటినిబట్టి చూచినచో ప్రాచీనకాలమునందే అలంకార శాస్త్రము ఎంతో అభివృద్ధి చెందినట్లు కనిపించుచున్నది.

నిరుక్తమును వ్రాసిన యాస్కముని, ఋగ్వేదములోని "ఇదమివ, ఇదంయథా, అగ్నిర్న, తద్వత్" మొదలయిన ఉపమాలంకారద్యోతకములగు పదములను ఉదాహరించెను. ఇవియేకాక అనేక ఉపమలు వేద వాఙ్మయములో ఉన్నట్లు తెలుపుచు యాస్కముని ఉపమాభేదములనుకూడ వివరించెను. పాణిని వ్యాకరణ సూత్రములకు పూర్వమే ఉపమాలంకారమునకు అంగములైన ఉపమాన, ఉపమేయ, సామాన్యధర్మ, ఉపమావాచకములు తెలిసియుండినట్లు "ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యా ఽ ప్రయోగే; 'ఉపమానాని సామాన్య వచనైః' " ఇత్యాది సూత్రములవలన మనకు స్పష్టమగుచున్నది. వ్యాసుని బ్రహ్మ సూత్రములలో ఉపమా రూపకాలంకారములు పేర్కొనబడినవి. క్రీ. శ. ఒకటి రెండు శతాబ్దులలో రచింపబడిన అశ్వఘోషుని బుద్ధ చరితము, సౌందరనందము అను కావ్యముల వలన పూర్వమే కొన్ని అలంకారములు ప్రచారములో నుండినట్లు తేటబడుచున్నది. భరతుని నాట్యశాస్త్రములో రససిద్ధాంతము, నాటక లక్షణము, నాలుగు అలంకారములు, గుణములు వివరింపబడినవి. బాణుడు తనకాదంబరిలో అక్షరచ్యుతక, మాత్రాచ్యుతక, బిందుమతి మొదలగు ప్రహేళికలను, శ్లేష - ఉత్ప్రేక్ష - ఉపమ - దీపకము ఇత్యాద్యలంకారములను గుర్తించెను. పైన పేర్కొనబడిన అంశములను బట్టి క్రీ. శ. 6 వ శతాబ్దివరకే లౌకిక సంస్కృత వాఙ్మయములో అలంకారములు, కావ్యభేదములు ఏర్పడి ఉండినట్లు మనకు తెలియుచున్నది.

**శాస్త్రనామము :** ప్రాచీనాలంకారికులయిన భామహ, వామన, రుద్రటులు తమగ్రంథములకు సాధారణముగా "కావ్యాలంకారము" అనుపేరునే పెట్టిరి. ఈ గ్రంథములకు ఈ పేరు పెట్టుటకు ముఖ్యముగా వీటిలో అలంకారములకు ప్రాధాన్యమిచ్చుటయే ఐయుండును. అలంకారము అనగా అలంకరించునది. కావ్యశోభా హేతువైనది. కావ్యాలంకారముల గూర్చి లక్ష్యలక్షణములను తెలుపునట్టిది. కాబట్టియే, ఈ శాస్త్రమునకు 'అలంకారశాస్త్రము' అని పేరుపెట్టబడినది. కొందరు లాక్షణికులు తమగ్రంథములకు అలంకారశాస్త్రమని పేరు పెట్టలేదు. ఉదా:- దండికావ్యాదర్శము. ధ్వనికారుడు అలంకార శాస్త్రకర్తలను కావ్యలక్షణ కర్తలు అనియే వ్యవహరించెను. ఈ లక్షణ గ్రంథములకు సాహిత్య శాస్త్రమని కూడ మరియొక పేరు కలదు. తరువాతి లక్షణగ్రంథకర్తలు సాహిత్యశబ్దమును కావ్యము అను నర్థమునందే. వాడినారు. బిల్హణుడు 'సాహిత్య పాథోనిధి మంథనోత్థం' అని సాహిత్యశబ్దమును తన విక్రమాంకదేవచరితమునందు కావ్యము అను నర్థమునందు ఉపయోగించినాడు. రాజశేఖరుడు సాహిత్యశాస్త్రము అయిదవ శాస్త్రమనియు అది చతుశ్శాస్త్రముల సారమనియు తన కావ్య మీమాంసలో తెల్పినాడు. సాహిత్యమనగా శబ్దార్థములు సహితములై యుండుట అని నిర్వచనము చెప్పవచ్చును. సాధారణముగా కావ్యలక్షణములను తెలుపు శాస్త్రమును సాహిత్యశాస్త్రమని కూడ వాడుట పరిపాటియై వచ్చుచున్నది.

**అలంకారశాస్త్ర విషయములు :** 1. కావ్యప్రయోజనములు, 2. కావ్యహేతువులు, 3. కావ్య విభాగములు 4. శబ్దార్థములు శబ్దశక్తులు, 5. కావ్యలక్షణములు, రస, అలంకార, రీతి, ధ్వని, ఔచిత్య, వక్రోక్తివాదములు, 6. కైశిక్యాది వృత్తులు, 7. దోషములు మున్నగునవి అలంకార శాస్త్రమునందు చర్చింపబడు విషయములు.

పైన సూచింపబడిన విషయములను అన్నింటిని సాధారణముగా అలంకార శాస్త్ర గ్రంథములన్నియు చర్చించినవి. ఈ శాస్త్రగ్రంథములు అనేక వర్గములుగా నున్నవి. (1) విశ్వనాథుని సాహిత్య దర్పణము, విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణము - ఈ రెండు కృతులును పై విషయములను నాటక లక్షణములతోపాటు సమీక్షించినవి. (2) దండికావ్యాదర్శము, వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి, భామహ, రుద్రట, వాగ్భటుల కావ్యాలంకారములు, మమ్మటుని కావ్య ప్రకాశము. జగన్నాథ పండితుని రసగంగాధరము - ఈ మొదలయిన అనేక సుప్రసిద్ధ అలంకార శాస్త్రగ్రంథములు ఒక నాటక లక్షణమును తప్ప కావ్య విషయములనన్నింటిని ప్రాయికముగ చర్చించినవి. (3) భరతుని నాట్యశాస్త్రము, ధనంజయుని దశరూపకము మొదలగు కొన్ని గ్రంథములు నాటక లక్షణములు, రసస్వరూపమును మాత్రమే చర్చించినవి. (4) అలంకార సారసంగ్రహము, అలంకార సర్వస్వము, కువలయానందము, చిత్రమీమాంస, మొదలగు అనేక కృతులు అలంకారములను మాత్రమే చర్చించినవి. (5) కొలది గ్రంథములు ప్రత్యేక సిద్ధాంతములను చర్చించినవి. వాటిలో ధ్వన్యాలోకము ధ్వనిచర్చను, వ్యక్తివివేకము వ్యంజనావృత్తి ఖండనమును, వక్రోక్తి జీవితము వక్రోక్తిచర్చనుచేసెను. క్షేమేంద్రుని ఔచిత్య విచారచర్చ ఔచిత్యమే కావ్యజీవితము అను విషయమును ప్రతిపాదించెను.

1. **కావ్య ప్రయోజనములు :** కావ్యము కళాత్మకము. దానివలన భావుకులకు వెంటనే రసానందము కలుగును. సంస్కృత కావ్యవిమర్శకులు పురాతన కాలమునుండియు రసానందమునే కావ్యప్రయోజనముగా పేర్కొనిరి. ధ్వన్యాలోకవ్యాఖ్యాతయగు అభినవగుప్తుడు, కావ్యమునకు ప్రీతియే ప్రయోజనము, అదియే రసాత్మగా నుండునని చెప్పినాడు. అలంకార శాస్త్రకర్తలు కావ్య ప్రయోజనమును అనేక విధములుగ తెలిపినారు. (1) దుఃఖశాంతి. (2) మతవిజ్ఞానము, తత్వశాస్త్రజ్ఞానము (3)కళానైపుణ్యము, వ్యవహార జ్ఞానము ఈ ప్రయోజనములు కావ్య పఠితకు చేకూరును. కావ్యరచనవలన కవికి కీర్తియు, ధనమును చేకూరును. నాట్యము, శ్రమము చేతను దుఃఖాదులచేతను పరితప్తులైన వారికి శాంతిని చేకూర్చును అని భరతముని చెప్పెను. సత్కావ్యము పఠితకు పురుషార్థము లందును, కళలందును, నైపుణ్యమును కీర్తిని, ప్రీతిని కలిగించునని భామహుడు చెప్పెను. కావ్య ప్రకాశకారుడు కావ్యమువలన కీర్తి, ధనము, విజ్ఞానము,

లోకజ్ఞానము, అమంగళశాంతి, ఆనందము, సదుపదేశము అను ప్రయోజనములు కలుగునని వివరించెను. ఆనందము, యశస్సు, సదుపదేశము అనునవిమాత్రమే కలుగునని హేమ చంద్రుని మతము. చతుర్వర్గ ఫల ప్రాప్తి. శాస్త్రములవలన కలిగినప్పటికిని శాస్త్రములు నీరసములు, దుర్గమములు కనుక సులభమును, మృదువునైన కావ్యమునే ఫలప్రాప్తి సాధనముగా పలువు రాదరింతురని, రుద్రటుని సిద్ధాంతము. ఏకావ్యము ఏవిధముగ ఉపదేశించినను, రామునివలె నడుచుకొనవలెను, రావణునివలె నడువకూడదు అనియే తెల్పుతు. కావ్య పఠనమునకు ఆనందమే ముఖ్యమని ఆలంకారికు లందరును భావించిరి.

2. కావ్యహేతువులు : అలంకార శాస్త్రకర్తలు పలువురు ప్రతిభా, వ్యుత్పత్తి, అభ్యాసములను కావ్యమునకు ముఖ్యహేతువులనుగా వక్కాణించిరి. ఈ మూడింటిని కొలది భేదములతో దండి, భామహుడు, రుద్రటుడు, మమ్మటుడు, ఏకావళీకారుడు, అలంకార శేఖరకారుడు కావ్యహేతువులనుగా అంగీకరించిరి. సమర్థుడైన కవి యగుటకు ఒక్క ప్రతిభయేచాలును అని రాజశేఖరుడు, వాగ్భటుడు, జగన్నాథ పండితుడు భావించిరి. ప్రతిభ యనగా అతి విశిష్టమైన శక్తి. ప్రతిభావంతుడైన కవి సహృదయుడైన ప్రతిత యొక్క హృదయమునకు అతి మధురములు, అపూర్వములు అయిన అనుభవములను కలిగించును.

'ప్రజ్ఞా నవనవోన్మేష శాలినీ ప్రతిభామతా'

'ప్రతిభా అపూర్వవస్తు నిర్మాణ క్షమా ప్రజ్ఞా'

'స్ఫురంతీ సత్కవేర్బుద్ధిః ప్రతిభా సర్వతోముఖీ'

అని బహుముఖముగా అనేకులు ప్రతిభను నిర్వచించినారు. ప్రతిభ యన త్రైకాలికములైన విషయములను గోచరింపజేయు ప్రజ్ఞ. అది సహజము, అనేక జన్మ సంస్కారజన్యము అని అందరు అంగీకరించినారు. కావ్య పఠితకు గూడ భావనాశక్తి, సంస్కారము ఉండవలెను. అవి కలవానికే కావ్యరసానుభూతి బాగుగా కలుగును. 'సుకవియైనవాడు కావ్యములందు స్వతంత్రించి అచేతన వస్తువులను చేతనములనుగాను, చేతనములను అచేతనములనుగాను, యథేచ్ఛముగా సహృదయులకు గోచరింపజేయును అని ధ్వనికారుడు నుడివెను. కావ్య, శాస్త్ర, లోకజ్ఞానములు కలిగియుండుటయే వ్యుత్పత్తి యన బడును. మహాకవులయొద్ద కావ్యశిక్షను పడయుటయు, నిరంతర కావ్యరచనా వ్యాసంగము చేయుటయు అభ్యాస మనబడును. ఇట్లు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము, ఈ మూడును సత్కావ్యరచనకు ఆవశ్యకములుగ చెప్పబడుచున్నవి.

3. కావ్యవిభాగములు : పాశ్చాత్యులు కావ్యమును ఇతిహాసము, గేయము, నాటకము అని విభజించినట్లే, సంస్కృతములో కూడ అట్టి విభాగములు వివిధ విషయములనుబట్టి చేయబడినవి. దండి కావ్యమును గద్యము, పద్యము, మిశ్రము అని మూడు విధములుగా విభజించెను. వామనుడు 'గద్యం కవీనాం నికషం వదంతి' అని చెప్పుటవలన, గద్యరచన కవిప్రతిభకు నికషోపలము వంటిదని స్పష్టమగుచున్నది. దండి, తన కావ్యాదర్శములో పద్యకావ్యము, సర్గబంధము (మహాకావ్యము), ముక్తకము (ఒక పద్యము), కులకము (అయిదు పద్యములు), కోశము, సంఘాతము (పరస్పర సంబంధము లేని అనేక పద్యముల కూర్పు), అని అయిదు విధములుగ నుండునని చెప్పెను. మిశ్రకావ్యము, నాటకము మొదలయిన రూపకములు. గద్యప్రబంధము, కథ, ఆఖ్యాయిక మున్నగు భేదములు గలది. సంస్కృత, ప్రాకృత, అపభ్రంశాది భాషాభేదములచే గూడ కావ్యము విభజింపబడుచున్నది. వామనుడు కావ్యము గద్యపద్యాత్మకమని చెప్పి, గద్యము, వృత్తగంధి (పద్యమువలె నుండునది), చూర్ణము, ఉత్కలికాప్రాయము అని మూడు విధములనియు, పద్యప్రబంధము అనేకవిధములుగా నుండునని యు వచించెను. గద్యపద్యములను అనిబద్ధ (సంబంధము లేనివి), నిబద్ధ (సంబంధముకలవి) భేదముచే రెండు విధములుగ సూచించి, ప్రబంధము అన్నిటిలోను దృశ్య ప్రబంధము సర్వోత్తమమైనదని 'సందర్భేషు దశరూపకం శ్రేయః' అను వాక్యముచే నతడు స్పష్టపరచెను. హేమచంద్రాదులు కావ్యము ప్రేక్ష్యము. శ్రవ్యము అని రెండు విధములుగచెప్పి, ప్రేక్ష్యమునకు పాఠ్యగేయ రూపములచే ద్వైవిధ్యమును సూచించి, ఈ రెండును అనేక భేదములు కలవి అనిచెప్పిరి. వస్తువును బట్టి కావ్యము

ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అనికూడ విభజింప బడినది.

4 శబ్దార్థములు, శబ్దశక్తులు : శబ్దములు వస్తువులను, భావములను బోధించును. అర్థమును తెలుపగల సామర్థ్యమునే శక్తి యనుచున్నారు. శబ్దమునకు మూడుశక్తులు కలవు. అవి అభిధ, లక్షణ, వ్యంజన అనబడుచున్నవి. అభిధాశక్తిచే తెల్పబడు అర్థము వాచ్యార్థము అనబడును. దీనికే ముఖ్యార్థము, సంకేతికార్థము అనికూడ పేళ్లు. లక్షణా శక్తిచే తెలుపబడు అర్థము లక్ష్యార్థము. వ్యంజనా శక్తిచే బోధింపబడు అర్థము వ్యంగ్యార్థము. శబ్దము లన్నియు ప్రధానముగా వాచ్యార్థమును తెల్పును. కొన్ని వాక్యములందు శబ్దమునకు వాచ్యార్థము మాత్రము చెప్పికొన్నచో, అర్థము కుదరదు. అనుపపత్తి ఏర్పడును. అప్పుడు ఆ శబ్దమునకు సంబంధించిన మరియొక అర్థము రూఢిప్రయోజనములనుబట్టి చెప్పబడును. ఇదియే లక్ష్యార్థము. వ్యంగ్యార్థమనబడునది వాచ్య లక్ష్యార్థములకంటె భిన్నమైనది. వాక్యమునందలి పదములు తమతమ ముఖ్యార్థములను బోధించి విరతవ్యాపారము లయిన తరువాత ఏ శబ్దశక్తిచే రమణీయమయిన మరొక అర్థమువాటినుండి స్ఫురించునో అట్టి శబ్దశక్తి వ్యంజనావృత్తి యనబడును. శబ్దశక్తులనే శబ్దవృత్తు లనియు వ్యవహరించుచున్నారు.

5. కావ్యలక్షణములు : ప్రాచీనాలంకారికులు కావ్య లక్షణములను అనేక విధములుగా నిర్వచించిరి. శబ్దార్థములు రెండును కలిసి కావ్యమని భామహ, వామన, రుద్రట, వక్రోక్తిజీవితకార, మమ్మట, హేమచంద్ర, విద్యానాథాదులు నిర్వచించిరి. శబ్దమే కావ్యమని దండి, అగ్నిపురాణకర్త, జగన్నాథ పండిత, చంద్రాలోకకారాదులు నుడివిరి. 'రసాత్మకమయిన వాక్యమే కావ్యమని అలంకార శేఖరకార, విశ్వనాథ, సరస్వతీ కంఠాభరణ కారాదులు చెప్పిరి.

కావ్యాత్మనుగూర్చి భిన్నాభిప్రాయములు కలవు. భరతుడు రసమును, వామనుడు రీతిని, ఆనందవర్ధనుడు ధ్వనిని, వక్రోక్తిజీవితకారుడు వక్రోక్తిని, క్షేమేంద్రుడు ఔచిత్యమును కావ్యాత్మగా వర్ణించిరి. మహిమభట్టుఅను ఉద్దండ తర్కపండితుడు ధ్వనిని ఖండించి దాని స్థానములో అనుమానమును సిద్ధాంతీకరించెను. అతని ననుసరించు వా రెవరును లేనందున అతనిది ఒక మత మని చెప్పుటకు వీలులేదు, వక్రోక్తిజీవితకారుడుగూడ ఈ గణములో చేరినవాడే.

రస సిద్ధాంతము : ఈ వాదమును ప్రప్రథమముగా ప్రతిపాదించినవాడు నాట్యశాస్త్రకర్త అయిన భరతుడు. అయితే అంతకు పూర్వము ఈ వాదము లేదని తలచ కూడదు. నాట్యశాస్త్రము ప్రధానముగా నాటక లక్షణమును తెలుపుచున్నది. ధ్వన్యాలోకమునకు, నాట్య శాస్త్రమునకు, వ్యాఖ్య రచించిన అభినవగుప్తుడు, 'నాట్యమే రసమని, రసమే నాట్యమని' వచించినాడు. కావ్యము దశరూపకాత్మకమే అనికూడ అత డనినాడు. ధ్వన్యాలోక రచన జరుగువరకు కూడ కావ్యమునకు రసముతో గల సంబంధము ఒక పద్ధతి ప్రకారము వివరింపబడలేదు. ప్రాచీనాలంకార శాస్త్రకర్తలు రసప్రాముఖ్యమును గూర్చి 'ఎరుగరు' అని చెప్పుటకు వీలులేదు. 'సర్వాలంకారములు రసములోనే పర్యాప్తములు' అని దండి తన కావ్యాదర్శములో చెప్పినాడు. అతడు రసములను, స్థాయి భావములను బాగుగా ఎరిగినవాడు. భామహుడు రసతత్త్వమును సమగ్రముగ ఎరిగినవాడే కాని అతడు కావ్యములో రసములకు ప్రాధాన్యమును ఈయ లేదు. మొదటిసారిగా తన కావ్యాలంకార గ్రంథములో రసప్రశంస చేసినవాడు రుద్రటుడు. రుద్రటునికి దాదాపు ఒక శతాబ్ది పూర్వపువాడైన మాఘుడు 'శిశుపాలవధ' కావ్యములో రసములను గూర్చి నాటక సందర్భములో వర్ణించెను. నాటకముతో. రసమునకు సంబంధము కలదు గనుక భరతుడు నాట్యశాస్త్రములో రసమును గూర్చి చర్చించెను. నాటకము చతుర్విధాభినయముల ద్వారమున రసాభివ్యక్తిని సామాజికునకు కలిగించును అని భరతుడు చెప్పెను.

నాట్యశాస్త్రము, దానిపై అభినవగుప్తుడు వ్రాసిన వ్యాఖ్యానము, సరస్వతీ కంఠాభరణము, శృంగార ప్రకాశము, దశరూపకము, శృంగార తిలకము, భావ ప్రకాశము, రసతరంగిణి - ఈ మొదలైన గ్రంథములు రసవాదమును సిద్ధాంతీకరించినవి. ఈ గ్రంథము లన్నింటిలోను రససిద్ధాంతమును గూర్చి కొలదిభేదము చూచింపబడినది. అన్నిటికన్న ప్రాచీనమైన నాట్య శాస్త్రములో

భరతుడు 'విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రస నిష్పత్తిః' అని రససూత్రమును రచియించెను. దీనికి నలుగురు వ్యాఖ్యాతలు భిన్న భిన్న మార్గములతో వ్యాఖ్యానము చేసిరి. వీరిలో భట్టలోల్లటుడు, శ్రీశంకుకుడు, భట్టనాయకుడు అను ముగ్గురి మతములను మనము అభినవగుప్తుని వ్యాఖ్యానమువలన తెలిసికొనవలసిదే కాని వారు రచించిన గ్రంథములు లభించుటలేదు. ఈ సూత్ర వ్యాఖ్యాతలలో నాలుగవవాడైన ఆచార్య అభినవ గుప్తపాదుడు ముఖ్యుడు. అతడు రసమునకు అభివ్యక్తి వాదమును లేవదీసెను.

ఈ వాదమును ఆధారముగా చేసికొని అతడు తక్కిన ముగ్గురియొక్క 'ఉత్పత్తివాదము, అనుమితివాదము. భుక్తివాదము' అను సిద్ధాంతములను ఖండించెను. 'విభావాను భావసాత్విక వ్యభిచారి భావములతో పరిపుష్టమైన రత్యాది స్థాయిభావములే రసరూపముగ అభివ్యక్తిని పొందును అని ఇతని సిద్ధాంతము. లోకములో రస శబ్దము, మధుర ఆమ్లాదులకు కూడ వాడబడును. అవి రుచులు. కావ్యరసముకూడ రస్యమానమే కనుక దానికి రసశబ్ద వ్యవహారము కలిగినది. స్థాయిభావము రసాభివ్యక్తి పర్యంతము స్థిరముగా నిలచునది. దానికి ఆలంబన, ఉద్దీపన విభావములు, సాత్విక భావములు, అనుభావములు, వ్యభిచారి భావములు పరిపోషకములుగా ఉండును. ప్రతి రసమునకు ఒక స్థాయిభావము వేరుగా నుండును. రసానుభవము సహృదయునకు మాత్రమే కలుగును. 'శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము వీరము, భయానకము, భీభత్సము, అద్భుతము,' అని ఎనిమిది రసములను మాత్రమే ప్రాచీనులు అంగీకరించినారు. కాని ఆ తరువాత శాంతరసము వాటితో చేర్చబడి రసములు తొమ్మిది అయినవి. అది కావ్యమైన రామాయణమునందు కరుణరసము ప్రధానముగ సమగ్ర రూపములో అభివ్యక్తమగును. 'శాంతరసమును తొమ్మిదవ రసముగా చేర్చవలెనా లేదా' అను విషయమును గూర్చియు, రసముల సంఖ్యను గూర్చియు ఆలంకారికులలో భిన్నాభిప్రాయములు కలవు. రసము సామాజిక నిష్ఠమేకాని నటగతముకాదు. నటుడు శిక్షాభ్యాసము వలన భయ కోపాది భావములను అభినయించుచున్నప్పుడు ఆయా భావముల సంస్కారము సామాజికులకే కలుగును.

భోజుడు తన శృంగార ప్రకాశములో శృంగారమొకటే రసమని విపులముగా చర్చించి నిర్ణయించినాడు. ఆనందమయము బ్రహ్మాస్వాద తుల్యమునైన రసము ఆత్మకు నిరతిశయానందమును కలిగించును. అది ఒక శృంగారమే అని భోజుని మతము. స్త్రీ పురుషుల అనురాగాత్మకమగు లౌకిక శృంగారమును భోజుడు పరిగణింపలేదు. ఆత్మకు కలుగు నిరతిశయమైన శాశ్వతానందమే శృంగారమని అతడు చెప్పెను. ఈ రసానందము ఇతరు లంగీకరించిన నవవిధ రసములలో సమానమేగనుక అన్ని రసములవలన కలుగు ఫలము ఒకటేయని అతడు భావించెను. కొందరు అద్భుతము ఒక్కటే రసమని అనిరి. భవభూతి కరుణ మొక్కటే రసమని నుడివెను.

అలంకారవాదము : కావ్యము సౌందర్య మయము. అలంకారములు అనగా కావ్యసౌందర్య వర్ధకములు అని భామహునిమతము. రూపకాది - అలంకారములు బాహ్యములే యగును. కావ్యశోభాకరములయిన ధర్మములు అలంకారము లని దండి నిర్వచించెను. వామనుడు తన కావ్యాలంకార సూత్రవృత్తిలో అలంకారములకు ఉచిత స్థానము నిచ్చెను. కావ్యముయొక్క ఉపాదేయతయే అలంకారముమీద ఆధారపడును అని ఆతని మతము. (కావ్యగ్రాహి అలంకారాత్). వామనుని అలంకార నిర్వచనము మిగుల సమంజసముగా కనిపించుచున్నది. "సౌందర్యమే అలంకారము" అని అతని లక్షణము. 'అలంక్రియతే అనేన' అను వ్యుత్పత్తినిబట్టి అలంకార శబ్దము అనుప్రాస - ఉపమాదులయందు వర్తించును. అలంకారముల శబ్దార్థములయొక్క అస్థిర ధర్మములు, కావ్యశోభాతిశయ కారములు; రసోపస్కారకములు అని విశ్వనాథుని లక్షణము. "చారుత్వ హేతుః అలంకారః" అని ప్రతాపరుద్రీయము.

కవి సౌందర్యోపాసకుడు. కవి నిర్మితియగు కావ్యము సౌందర్యరాశియగును. అలంకారశాస్త్రములో కావ్యము సౌందర్యవతియగు సుందరితో పోల్చబడినది. అందు అలంకారములు విద్యమానమగు సౌందర్యమును వృద్ధిపరచును. కొందరు ఆలంకారికులు అలంకారములు

ఆవశ్యకము లనిరి. కొందరి మతమున అలంకారములు అత్యంతావశ్యకములు కావు. "వనితాముఖము కాంత మయినప్పటికిని నిరలంకారమగుచో భాసిల్లదు. అటులనే కావ్యముకూడ రమ్యమయినను అలంకారముల నపేక్షించును" అని భామహుని మతము. గుణప్రాధాన్యవాదియు రీత్యాచారుడును అగు వామనునకు ఇది రుచింపలేదు. "కావ్యము యువతియొక్క రూపమువంటిది. అది కేవల గుణాత్మకమయినను రసికులకు మనోజ్ఞమే. అలంకార యుక్తమగుచో మిక్కిలి రుచికరము. గుణహీన మగు కావ్యము యౌవనము గడచిన అంగనయొక్క శరీరము వంటిది. అలంకారములు మాత్రమే శోభాకరములు కావు" అని అతడు వాదించెను. అర్వాచీనాలంకారికులు కావ్య శరీరమునకు అలంకారములు అంగద - కుండల - హారాదులవంటివే యను నభిప్రాయమును వ్యక్తీకరించిరి.

అలంకారములను గుణములనుండి పృథక్కరించి భామహుడు భావికము అను నలంకారమును గుణముగా పరిగణించెను. గుణములను మొదట చూపినవాడు వామనుడు. దండి దశగుణములను కూడ అలంకారములుగా పరిగణించెను. "కాశ్చిన్మార్గ విభాగార్థ ముక్తాః ప్రాగప్యలంక్రియాః' వామనుని మతమున "కావ్యము యొక్క శోభాకరములగు శబ్దార్థధర్మములు గుణములనబడును. అవి ఓజః ప్రసాదాదులు, యమకోపమాదులు కావ్య శోభను అతిశయింపజేయును. కేవలాలంకారములు శోభాకరములు కావు. గుణములు నిత్యములు. అవి లేనిచో కావ్యశోభయే లేదు. అలంకారములు అనిత్యములు. అలంకారవాదము మిగుల ప్రాచీనమైనది. భామహుడు, ఉద్భటుడు, దండి, రుద్రటుడు మొదలగువారు అలంకారప్రాధాన్యమును అంగీకరించిరి.

అలంకారములకును రసమునకును గల సంబంధము ప్రాచీనకాలముననే గుర్తింపబడినది. భామహుడు మహాకావ్యము "సకల రసయుక్తము కావలెను" అనెను. భామహాదులు రసవత్, ప్రేయ, ఊర్జస్వి - ప్రభృతులను అలంకారములనుగా పరిగణించిరి. రసవదలంకారమును "దర్శిత స్పష్ట శృంగారాది రసమ్" అని భామహుడు నిర్వచించెను. అర్వాచీనాలంకారికులలో పెక్కురు వీటిని అలంకారములుగా గణింపలేదు. వీరికి అలంకారములే కావ్యములో ప్రధానముగా గోచరించెను. వీరికి సునిశ్చితమగు ధ్వని సిద్ధాంతము (ప్రతీయమానార్థవాదః) సువిశదము కాకపోయినను, ధ్వనిమాత్రము వీరికి విదితమే. వీరి మతమున అలంకారములే ప్రధానములు.

భరతుని నాట్యశాస్త్రములో ఉపమ, రూపకము, దీపకము, యమకము, అను నాలుగు అలంకారములు పేర్కొనబడినను. అలంకారముల సంఖ్య క్రమముగా పెరుగుచు వచ్చెను. దండి 35 అర్థాలంకారములను పేర్కొనెను. యమకమునుగూడ వివరించెను. మమ్మటుడు 61 అర్థాలంకారములను విశదీకరించెను. అర్వాచీనాలంకారికులలో కొందరు అలంకారముల సంఖ్య రెండు వందలకుపైగా నుండవచ్చును అనిరి. అలంకారమనగా ఉక్తి వైచిత్ర్యము. ఈవైచిత్ర్యము అనంతముగాన అలంకారములుగూడ ననంతములే యనుచో నతిశయోక్తి కాదు.

భామహుడు, దండి మొదలగువారు వక్రోక్తి అతిశయోక్తి అను నీరెండును అలంకారములకు మూలము లని నుడివిరి. భామహుని మతమున "వాక్కుయొక్క వక్రార్థ శబ్దోక్తి అలంకారోత్పాదకము. అలంకృతి యనగా వక్రాభిధేయ శబ్దోక్తి యగును." శబ్దార్థముల వక్రత యనగా లోకోత్తర రూపముగా వాటి అవస్థానమే. భామహుడు వక్రోక్తికి ప్రాధాన్య మిచ్చెను. "వక్రోక్తియే సర్వస్వము. వక్రోక్తి మూలముననే అర్థము విభావింపబడును. కవి వక్రోక్తికొరకు యత్నము చేయవలెను. వక్రోక్తిలేనిచో అలంకారమే లేదు." అందుననే ఈయన స్వభావోక్తిని అలంకారముగా పరిగణింపలేదు. "స్వభావోక్తి రలంకార ఇతి కేచిత్ ప్రచక్షతే' అని మాత్రము పేర్కొనెను. దండి అతిశయోక్తి సర్వాలంకార పరాయణమని వచించెను. "అలంకారాంతరాణామప్యేకమాహుః పరాయణమ్ । వాగీశ మహితాముక్తిమిమామతిశయాహ్వయామ్." అలంకారములను వైజ్ఞానికపద్ధతిచే విభజించిన ప్రథమ అలంకారికుడు రుద్రటుడు. ఈయన అలంకారములను వాస్తవ, ఔపమ్య అతిశయ, శ్లేషమూలకములుగ విభజించెను. కొన్ని అలంకారములు రెండు వర్గములకు చెందును. ఉదా: ఉత్ప్రేక్షాలంకారము

ఔపమ్యాతిశయమూలము. ఉపమాదులు సాదృశ్య గర్భములు. విభావనాదులు విరోధగర్భములు. కావ్య లింగాదులు తర్కన్యాయమూలములు. యథాసంఖ్యాదులు కావ్యన్యాయమూలములు. ప్రతీపాదులు లోకన్యాయ మూలములు. సూక్ష్మాదులు గూఢార్థప్రతీతిమూలములు. కారణమాలాదులు శృంఖలాబంధమూలములు- అని అర్థాలంకారముల వర్గీకరణము. అనేక అలంకారముల యొక్క కలయిక సంశ్లేష మనబడును. అర్థాలంకారములు చతుర్విధములు. అవి (1) ప్రతీయమానవస్తువులు. (2) ప్రతీయమాన ఔపమ్యములు. (3) ప్రతీయమాన రస భావాదులు- (4) అస్ఫుట ప్రతీయమానములు అని. ఇందు అతిశయోక్తి మొదలగునవి మొదటివర్గమునకును, రూపకాదులు రెండవవర్గమునకును, రసవదాదులు మూడవవర్గమునకును, అర్థాంతరన్యాసాదులు నాలుగవ వర్గమునకును చెందును. అలంకారములు శబ్దగతము లనియు అర్థగతములనియు మరియొక విభాగము. అందు శబ్దాలంకారము, అనుప్రాస, యమకము అని ద్విధా భిన్నము. ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాస, శ్రుత్యనుప్రాస, అంత్యానుప్రాస మొదలగునవి అనుప్రాసభేదములు. లాటానుప్రాసాదులు ఉభయగతములు అని కొందరి మతము. అర్థాలంకారములు ఉపమాదులు. అర్థాలంకారములలో ఉపమాలంకారము సర్వాదరణీయము. "ఉపమా కవిలోకస్య మాతా" కవికుల గురువగు కాళిదాసుని ఉపమలు జగత్ప్రసిద్ధములు.

**రీతి వాదము :-** ఈ వాదమును ప్రవేశపెట్టిన వారిలో వామనుడు అతి ముఖ్యుడు. దండి దీనినే 'మార్గము' అని వ్యవహరించెను. అతడు వైదర్భ, గౌడ అను రెండు మార్గములను నిర్దేశించెను. భామహుడు రీతిద్వయ వాదమును అంగీకరింపలేదు. కావ్యమునకు ఆత్మరీతియని వామనుడు సిద్ధాంతీకరించెను. రీతియనగా గుణసహిత మైన విశిష్టపద రచన యని అతనిభావము. రీతి గుణాత్మకమే. అతడు వైదర్భి, గౌడి, పాంచాలి, అను మూడు రీతులను పరిగణించెను. వామనుడు గుణములు పదియని పేర్కొనెను. ఓజస్సు, ప్రసాదము, సమత, శ్లేష, సమాధి, మాధుర్యము, సౌకుమార్యము, ఉదారత, అర్థవ్యక్తి, కాంతి అనునవి పదిగుణములు. వామనుడు ఈ గుణములను శబ్దగతములుగను, అర్థగతములుగను విభజించెను. భరతుని నాట్య శాస్త్రములోగూడ పదిగుణములే గ్రహింపబడినవి. భరతుడు గుణాలంకారములను రసమునకు అంగములుగా వర్ణించెను. దండి గుణాలంకారములకు భేదమును పాటింపలేదు. వామనుడు అవి భిన్నము లని చెప్పెను. వైదర్భీరీతిలో అన్ని గుణములు ఉండు ననియు, గౌడీ రీతిలో ఓజస్సు, కాంతి మాత్రము ఉండు ననియు, పాంచాలీ రీతిలో మాధుర్య, సౌకుమార్యములు ఉండుననియు వామనుడు వివరించెను. ఈ రీతులు విదర్భమున్నగు దేశములలో ఎక్కువగా వ్యవహరింపబడుటచే వాటికి ఆపేళ్ళు వచ్చియుండునని సూచించెను.

గుణముల లక్షణములను నిర్వచించుటలో భరతుడు దండి, వామనుడు, భిన్నమార్గములను త్రొక్కిరి. ఎట్లన సమాసవత్తులయిన విచిత్ర పదములతో గూడినది ఓజో గుణమని భరతుడు నిర్వచించెను. సమాస భూయస్త్వము ఓజస్సు అని దండి మతము. గాఢ బంధత్వము, అర్థప్రౌఢి, ఓజోగుణము అని వామనుడు విస్తరించెను. కావ్యమునందు గుణములు నిత్యములు. అలంకారములు అనిత్యములు. కాన అలంకారములు లేకున్నను కావ్యమునకు కావ్యత్వ భంగము కలుగదు. రీతి ఒకవేళ వాస్తవమైన కావ్య సారమును అందుకొనలేక పోయినను దానికి అతి సమీపమునకు చేరగలదు. వామనుడు చెప్పిన మూడు రీతులకు భోజుడు అవంతి, మాగధి, లాటి, అను మరి మూడు రీతులను చేర్చెను.

గుణములు నిజముగా కావ్యాత్మయైన రసాదులకు చెందినవి. మాధుర్య గుణము ప్రత్యేకముగా శృంగార రసమునకు చెందినదనియు, ఆ గుణము విప్రలంభ శృంగారములోను, కరుణములోను పరాకాష్ఠ నందుకొనుననియు ఓజోగుణము రౌద్ర, వీర, అద్భుతములుగల కావ్యములలో ప్రత్యేకముగా ఉండు ననియు, ప్రసాదగుణము సర్వరస సామాన్యమనియు ధ్వనికారుడు స్పష్టపరచెను. భామహుడు గుణములనుగూర్చి చాల సంగ్రహముగా వివరించి. మాధుర్య, ఓజః, ప్రసాదగుణములను మాత్రమే సూచించెను. తరువాతి శాస్త్రకర్తలైన హేమచంద్రాదులు గుణములను పై మూడింటివరకు తగ్గించి 'తక్కిన గుణములు ఈ మూడింటిలోనైనను చేరును. లేదా నిజ

ముగా దోషాభావమే గుణము' అను సిద్ధాంతమునైన అనుసరించవలెను అని నుడివిరి.

ధ్వనివాదము :- కావ్యమార్గ (ఆత్మ) నిరూపణము నందు భామహ, దండి, వామన, ఆనందవర్ధనులు ఒకరి కంటె నొకరు ఒక్కొక్క అడుగు పురోగమించిరి. వీరిలో వామనుడు ప్రప్రథమమున కావ్యమునకు ఆత్మ అనునది కలదనియు, అది రీతియనియు వచించెను. ఆనంద వర్ధనుడు ధ్వన్యాలోక మను గ్రంథమును వ్రాసెను. అతడు పూర్వాలంకారరికులకు పరిచితము కానట్టియు, అభిదా లక్షణలకంటె భిన్నమైనట్టియు ఒకానొక వ్యంజన అను వృత్తిని ప్రతిపాదించెను. ఎట్లన గంగాయాం ఘోషః(గంగయందు గొల్లపల్లె) అనుచోట లక్షణచేత తీరము లక్షితము కాగా, శీతత్వ - పావనత్వాదులు ఈ వ్యంజనావృత్తి చేతనే తెలుపబడును. లక్షణ, లక్ష్యార్థమునుచెప్పి విరతి నొందగా, శీతత్వ, పావనత్వాది బోధార్థమై తప్పక మరియొక వృత్తిని అంగీకరింపవలసి యుండును. అది వ్యంజనావృత్తియే, మరియొకటికాదు అని చెప్పెను.

ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమునందు ఒక క్రొత్త సిద్ధాంతమును ఆవిష్కరించెను. "ధ్వనతీతి ధ్వనిః (కావ్యం) ధ్వన్యతే ఇతి ధ్వనిః (వ్యంగ్యార్థము); ధ్వననం ధ్వనిః (వ్యంజనా) అని అభినవ గుప్తాచార్యుడు ధ్వని శబ్దమునకు మూడు రీతుల వ్యుత్పత్తులను గ్రహించి, కావ్య పరముగా, వ్యంగ్యార్థపరముగా, వ్యంజనావృత్తిపరముగా వ్యాఖ్యాన మొనర్చెను. ధ్వని జీవితము అనుచోట ధ్వని శబ్దమునకు వ్యంగ్యార్థమనియే అర్థము." ఆనందవర్ధనుడు ధ్వని ప్రాధాన్యవాది. ఆతని సిద్ధాంత మిది :- "కావ్యస్యాత్మా ధ్వనిః." కావ్యమునకు ధ్వని ఆత్మ. లోకమున జీవితము ఉన్నపుడే శరీరమునకు అలంకారములు మున్నగునవి సౌందర్య సంపాదకము లగుచుండుటచేత, అలంకారాదుల కంటె జీవితము ప్రాముఖ్యమును వహించు చున్నది. అట్లే కావ్య శరీరమునకు ధ్వని యనునది జీవితము. అనగా ఆత్మ. అదియే ప్రధానమయినది. ఆ ధ్వని వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని అని మూడు తెరగులు. వీటిలో రసధ్వని, ఉత్తమోత్తమము. అలంకార-గుణ-రీతులు అనునవి ధ్వనికి ఉపస్కారకములుగా (తోడ్పడునవిగా) నుండదగును అని వచించి, అలంకారగుణరీతి సిద్ధాంతములను ధ్వనికారుడు, తన ధ్వని సిద్ధాంతమునకు అంగములుగా సమన్వయించెను. అతడు శబ్దార్థ - ఉభయము కావ్యశరీరము కాదనియు, చారుత్వాతిశయముతో కూడి, అర్థ ప్రకాశకమయిన శబ్దవిశేషమే కావ్యమనియు గ్రహించినట్లు తెలియుచున్నది.

"పూర్వాలంకారికులు భరతుని రస సిద్ధాంతమును రూపకమునకుమాత్రమే సమన్వయించియుండిరి. ఆనంద వర్ధనుడు దృశ్యములు, శ్రవ్యములు అను ఉభయ విధ కావ్యములకును రసము సాధారణ మని వచించెను. రూపకమునకువలెనే శ్రవ్యకావ్యమునకును, రసమే ప్రధానమైనది. రసము వాచ్యరూపముగాగాక, వ్యంగ్య రూపముగా నుండదగును. రసభంజకములయిన దోషములు గ్రాహ్యములు కావు. రసవ్యంగ్యమువలెనే వస్త్వలంకార వ్యంగ్యములుకూడ స్వీకరింపదగినవే. రసము అలంకారములో (రసవదలంకారము)చేరదు. కావ్యాత్మయైన రసమును అలంకారముగ గ్రహింపకూడదు." అని ఉద్ఘోషించెను. తరువాతి ఆలంకారికులు పెక్కురు ఆనంద వర్ధనుని సిద్ధాంతమును స్వీకరించిరి.

అభినవగుప్తుడు వస్త్వలంకార ధ్వనులయందుకంటె రసధ్వనియందే, అదరాతిశయమును చూపెను. రసము చేతనే కావ్యము జీవించును. రసములేని కావ్యముండదు. త్రివిధ ధ్వనులలో రసధ్వనియే కావ్యాత్మ. వస్తుధ్వని, అలంకారధ్వని అనునవి రెండును, రసపర్యవసాయులు కావలయును - అని అతడు సిద్ధాంత మొనర్చెను. విశ్వనాథుడు 'రసాత్మకమగు వాక్యమే కావ్యము' అని కావ్య నిర్వచన మొనర్చి, వస్త్వలంకార ధ్వనులకు ప్రత్యేకత్వమును అంగీకరింపలేదు. జగన్నాథుడు 'రమణీయార్థమును (చమత్కారమును గలిగించు నర్థమును) ప్రతిపాదించు శబ్దమే కావ్యము' అని కావ్యనిర్వచనము చెప్పెను. పూర్వాలంకారికులు శబ్దమునకును, అర్థమునకును - రెండింటికిని ప్రాధాన్యము నొసగిరి. జగన్నాథుడు శబ్దమునకే ప్రాముఖ్య మిచ్చెను. ఆ శబ్దము వాచకము, లక్షకము, వ్యంజకము అని త్రివిధము. ఆ మూడును క్రమముగా వాచ్యార్థమును, లక్ష్యా

ర్థమును, వ్యంగ్యార్థమును ప్రతిపాదించును అని అతడు నుడివెను.

ఔచిత్యవాదము : ఒక్కొక్క కాలమున ఒక్కొక్క ఆలంకారికుని రుచిభేదమునుబట్టి ఒక్కొక్క కావ్యాంగమునకు ప్రాముఖ్యము లభించుచు వచ్చెను. కాశ్మీర దేశీయుడును, అవంతివర్మ యొక్క ఆస్థాన విద్వాంసుడు నగు క్షేమేంద్రుడు (క్రీ. శ. 1010-1020) ఔచిత్యము అను నొక సిద్ధాంతమును లేవదీసెను. క్షేమేంద్రుడు సుమారు నలువది గ్రంథములను రచించెను. వాటిలో ఔచిత్యవిచారచర్చ, కవికంఠాభరణము అనునవి అలంకార శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములు.

క్షేమేంద్రుని 'ఔచిత్యవిచార చర్చ' మృదుమధుర భాషా నిబద్ధము. సహృదయ రంజకము. అందు ఆతడు ఔచిత్యమునుగూర్చి ఇట్లు విచారణచేసెను. ఔచిత్యము రసమునకు జీవితభూతము. చమత్కారకారి. అది రసప్రసిద్ధమైన కావ్యమునకు స్థిరమైన జీవితము. (ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం) కావ్యమునందు జీవితభూతమైన ఔచిత్యము లేకున్నచో, బాహ్య శోభాకరములయిన అలంకారములుగాని, గుణములుగాని ప్రయోజనకారులు కాజాలవు. కాబట్టి రసవంతమగు కావ్యమునకు ఔచిత్యమే జీవితభూత మగుచున్నది.

ఔచిత్యమును క్షేమేంద్రు డిట్లు నిర్వచించెను. ఏది దేనికి తగునో అది ఉచితము. ఉచితము యొక్క భావమే ఔచిత్యము.

(ఉచితం ప్రాహు రాచార్యాః సదృశంకిల యస్యయత్।
ఉచితస్యహి యోభావః తదౌచిత్యం ప్రచక్షతే॥)

లోకమునందు శరీరాలంకారములు ఉచితస్థానములందు విన్యస్తములై ఔచిత్యమును పోషించును. గుణములు ఔచిత్యయుక్తములైనప్పుడే గుణము అగును. కంఠమునందు మేఖలను, నితంబఫలకమునందు హారమును, పాణియందు నూపురమును, చరణమునందు కేయూరమును ధరించుట, ప్రణతుడైన శత్రువునందు శౌర్యమును చూపుట మున్నగు కృత్యములు, హాస్యమునకు హేతువు లగుచున్నవి. అట్లే అలంకారములు, గుణములు, ఔచిత్యరహితములైనచో రుచికరములు కాజాలవు అని అతడు చెప్పెను.

క్షేమేంద్రుడు అనౌచిత్యమును పద, వాక్య, ప్రబంధార్థ, గుణ, అలంకార, రస, క్రియా, కారక, లింగ, వచన, విశేషణ, ఉపసర్గ, నిపాత, దేశ, కాల, నామాది భేదములచే విభజించెను. విభజించుటయే గాక, ఆ పదవాక్యాది - ఔచిత్యములను నిర్వచించి, వాటినన్నిటిని సోదాహరణముగ వివరించెను. కాళిదాసాది మహాకవుల గ్రంథములలోని అనౌచిత్యదోషములను నిర్దాక్షిణ్యముగా విమర్శించెను.

క్షేమేంద్రుడు తన ఔచిత్య విచార చర్చయందు పూర్వాలంకారికులకు ఋణపడి యున్నట్లు విదితమగుచున్నది. ఎట్లన - దండి, 'కామం సర్వోప్యలంకారో రసమర్థే నిషించతి। తథా ప్యగ్రామ్యతైవైనం భారం వహతి భూయసా'.(సర్వాలంకారములును నిస్సందేహముగా రసస్ఫోరకములే. ఐనను అగ్రామ్యతయే అనగా అనౌచిత్యాభావమే సర్వభారమును వహించును) అని నుడివెను. అనౌచిత్యాభావ మన ఔచిత్యస్థితియని అర్థము. ఔచిత్యస్థితిచే రసస్ఫురణ మేర్పడు ననుచో అనౌచిత్యము రసభంజకమని తేటపడుచున్నది. ఆనందవర్ధనుడు ఈ భావమునే,

'అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్।
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిష త్పరా॥'

(అనౌచిత్యముకంటె రసభంజకమైన హేతువు మరియొకటి లేదు. ఔచిత్య విశిష్టమయిన కావ్యము రసోపనిషత్తే) అని వచించెను. ఆనందవర్ధనుని ఈ కారికార్థమునే స్వీకరించి క్షేమేంద్రుడు 'ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్' అను తనవాదమును ప్రతిష్ఠించెను. అందుచే క్షేమేంద్రుని ఔచిత్యవాదములో నువజ్ఞ లేదనియు, దానినాతడు పూర్వాలంకారికులనుండి గ్రహించి విపులీకరించి దానికొక ప్రత్యేకస్థానమొసగెననియు విదితముకాగలదు.

వక్రోక్తి సిద్ధాంతము :- వక్రోక్తి యను శబ్దము సాహిత్యములో చాల ప్రాచీనకాలమునుండియు పెక్కు అర్థములలో ప్రయోగింపబడుచు వచ్చెను. బాణుడు 'వక్రోక్తి నిపుణేన విలాసిజనేన' అని ప్రయోగించెను. దండి తన కావ్యాదర్శములో వక్రోక్తిని స్వభావోక్తికి వ్యతిరేకముగా వాడెను. శ్లేష వక్రోక్తికి పోషకమని యాతడు పల్కెను. వక్రోక్తియనగా ఉక్తివైచిత్ర్యము. అది తరచుగా శ్లేషపై ఆధారపడియుండి, ఋజుభాషణము

నకు భిన్నముగానుండును. భామహుడు ఈ యర్థము లోనే దీనిని ప్రయోగించెను. కావ్యమునందును వ్యవహారమునందలి పదములే ప్రయోగింపబడుచున్నను, కావ్యమునందు అవి విశిష్టపద్ధతిలో వాడబడుచున్నవి. దీనినే వక్రత యందురు.

వక్రోక్తి కావ్యజీవితము అని నుడివినవాడు కుంతకుడు. ఈతని గ్రంథము 'వక్రోక్తి జీవితము'. వక్రోక్తియనగా 'వైదగ్ధ్య భంగీ భణితిః' అని ఇతడు నిర్వచించెను. వక్రోక్తి కవియొక్క వాక్నైపుణ్యముచే నేర్పడునని ఈతని యభిప్రాయము. స్వభావోక్తిని అలంకారమనిన వారిని ఈతడు పరిహసించెను. వక్రోక్తి ఆరువిధము లని ఇతడు నిరూపించెను. అవి వర్ణవిన్యాస, పదపూర్వార్ధ, ప్రత్యయ, వాక్య, ప్రకరణ, ప్రబంధ గతములు,

ధ్వనికారుడు 'సంభాషణ వైచిత్రియే వక్రోక్తి'యని చెప్పి అది అలంకార మని నుడివెను. వామనుడు వక్రోక్తి 'సాదృశ్య లక్షణ' యని నిరూపించెను. రుద్రటుడు వక్రోక్తి శబ్దాలంకారమనిచెప్పి అది కాకు వక్రోక్తి, శ్లేష వక్రోక్తి అని రెండువిధములుగ నుండుననెను. భోజుని సరస్వతీ కంఠాభరణములో వాఙ్మయమంతయు వక్రోక్తి, రసోక్తి, స్వభావోక్తి యని మూడు విధములనియు, రసోక్తి సహృదయ హృదయాకర్షకమనియు చెప్పబడినది. వక్రోక్తిని గురించి ఈ విధముగా చెప్పుటవలన అది విలక్షణమైన కావ్యస్వరూపమును తెలుపుచున్నదని భావించవలెను. సాధారణ ప్రసంగములలో వాడబడు పదములను గైకొను కావ్యమునం దైనను వక్రోక్తి కొరకు పదములను ఏరుకొను పద్ధతి ఇతర సామాన్య సంభాషణలోకన్న వేరుగానుండును.

కైశిక్యాది వృత్తులు: ఇప్పుడు 'వృత్తి, ప్రవృత్తి' అనువాటినిగూర్చి చర్చించి వాటికి రీతులతోగల సంబంధమును చర్చించుట చాల ఆవశ్యకము. 'భారతి, సాత్వతి, కైశికి, ఆరభటి అను నాలుగు వృత్తులను, వాటి అంగములనుగూర్చి భరతుడు నాట్యశాస్త్రములో వివరించెను. అతడు వృత్తులు నాట్యమునకు తల్లులవంటివని చెప్పెను. కైశికీవృత్తి శృంగార, హాస్యరసములలోను, సాత్వతి, వీర, రౌద్ర, అద్భుతములలోను అవశ్యముగా వాడవలెనని భరతుని మతము. రసార్ణవ సుధాకారుడు వృత్తులకు పైనియమములనే సూచించి, 'భారతీ' అను పదము 'భారీ' శబ్దమునుండియు, 'కైశికీ' అను పదము 'కేశ' శబ్దమునుండియు ఉత్పన్నములయిన వని వాటికి పౌరాణిక వ్యుత్పత్తులను తెలిపెను. ఒక రసమునకు అనుగుణములయిన శబ్దముల, అర్థముల ప్రయోగమునుగూర్చి తెలిపి, ధ్వనికారుడు ఆవృత్తులే ఔచిత్యయుక్తములై వివిధములుగా తెలియనగు నని కూడా చెప్పెను. వృత్తియనగా వ్యవహారము అని యర్థము. రసానుగుణమై, ఔచిత్యవంతమయిన వ్యవహారముగల కైశిక్యాది వృత్తులు అర్థాశ్రయములనియు, ఉపనాగరికాదులు శబ్దాశ్రయములనియు అభినవగుప్తుడు తెలిపెను. అతడు 'రసాదుల దృష్ట్యా వాడబడిన వృత్తులు నాట్యమునకు, కావ్యమునకు ఒక అపూర్వమయిన శోభను కలిగించును. ఆ రెంటికిని రసాదులు జీవితభూతములు. ఇతి వృత్తాదులు శరీరభూతములు' అని చెప్పెను. కనుక నాట్యమునకుగాని కావ్యమునకుగాని ఇతివృత్తము శరీరమని స్పష్టమగుచున్నది. కైశిక్యాదులు అర్థవృత్తులని, ఉపనాగరికాదులు శబ్దవృత్తులనికూడ స్పష్టమైనది. భరతుడు కైశికీవృత్తిని స్త్రీలుమాత్రమే బాగుగా నటించగలరని అనెను. ఉద్భటుని మతములో వృత్తులు పరుష, ఉపనాగరిక, గ్రామ్య భేదముచే మూడు విధములు.

నాట్యశాస్త్రములో భరతుడు అవంతి, దాక్షిణాత్య, పాంచాలి, ఓఢ్ర, మాగధి, అను ప్రవృత్తులను చెప్పి, ప్రవృత్తియనగా నానాదేశ వేషభాషా-ఆచారవార్తలను ప్రఖ్యాపన చేయునది అని తెలిపెను. దాక్షిణాత్య ప్రవృత్తిలో అనేక నాట్యములు, గానము, సంగీతము కలవనియు ఆతడు వచించెను. కావ్య మీమాంసలో వేష విన్యాసక్రమము ప్రవృత్తి యనియు, విలాస విన్యాస క్రమము వృత్తి యనియు, వచన విన్యాసక్రమము రీతి యనియు ఈ మూడింటికిని గల విశేషమును అతి స్పష్టముగా తెలిపెను. సాగరనంది వైదర్భి, గౌడి. పాంచాలి, అను రీతులకు భారతీ వృత్తియు, పాంచాలికి సాత్వతియు, వైదర్భికి, కైశికి, గౌడికి ఆరభటియు, క్రమముగా అంగము లని చెప్పెను.

కావ్యదోషములు : అలంకారశాస్త్ర గ్రంథము లన్నిటిలోను, దోషములనుగూర్చి చర్చ జరిగినది. కుకవి

యగుటకంటె అకవిగానుండుటయే మేలనియు, కుకవి యగుట మరణప్రాయమే యనియు భామహుడు వచించెను. భరతుడు పదిదోషములను పేర్కొనెను. అవి - 'అర్థహీన, ఏకార్థ, గూఢార్థ, అర్థాంతర, విసంధి, శబ్దచ్యుతి (శబ్దహీన), విషమ, భిన్నార్థ, అభిప్లుతార్థ, న్యాయాదపేత' అనునవి. దండి పదిదోషములను, భామహుడు పదునొకండు దోషములను చెప్పిరి. దోషములు సాధారణముగా పదగతములు, వాక్యగతములు, పదార్థగతములు, వాక్యార్థగతములు, ఛందోవ్యాకరణగతములు, రసగతములు, దేశకాలగతములు అయి యుండును. అర్థదోషముల భేదములను మమ్మటుడు, ఆ తరువాతి గ్రంథకర్తలు వామన మతానుసారముగా నంగీకరించిరి. మమ్మటుడు కావ్యప్రకాశములో, అలంకారదోషములనుకూడ చెప్పి అన్ని దోషములను అరికట్టజాలము గనుక ఘోరములయిన దోషములను నిరోధింపవలె ననియు, అన్నింటిలోను ఘోరాతిఘోరములయిన రసదోషములను కవి ప్రయత్నాతిశయముచే దొరలకుండ చేయవలెననియు, విశదీకరించెను. కావ్యమును నిర్దోషముగా కూర్చుట అసంభవమని విశ్వనాథు డనెను. 'దోషదృష్టి పరముగా మనస్సును అతిగా ప్రవర్తింప చేయకూడదు. దోషైక దృక్కులకు దోషము లేని చోటకూడ దోషము కనిపించును' అని కుమారిలుడు తేటపరచెను.

క. ల. శా.

**అలంపురము :-** అలంపురము తుంగభద్రాతీరమున ఉన్న ప్రాచీన పట్టణము. ఇది రాయచూరు జిల్లాలోని ఒక తాలూకా కేంద్రము. ఇందలి జనసంఖ్య 7000. ఇప్పుడీ గ్రామ మంతయు శిథిలావశేషములతో నిండియున్నది. విశాలమైనకోట, పురాణ ప్రసిద్ధములైన నవబ్రహ్మాలయములు, మనోహరశిల్పఖండములు, అనేక శిలాశాసనములు మనకిప్పటికినీ కనబడుచు నాటివైభవమును స్మరణకు తెచ్చుచున్నది.

**చరిత్ర :** ఈ ప్రాంతము చాల ప్రాచీనమైనది. ఇచటికి సమీపమున ఉన్న గొందిమళ్ళ, చాగటూరు శివారులలో కెయిరనులు (cairns) అనబడు ప్రాగైతిహాసిక యుగపు సమాధులు విశేషముగానున్నవి. అవి శిలాయుగమునకు చెందినవి. వాటిని త్రవ్వించి పరిశోధనలు జరిపినచో క్రొత్తవిశేషములు బయటికివచ్చును.

అలంపురమనుపే రెట్లువచ్చెనో ఇందలికోటను దేవాలయములను ఎవరు ఎప్పుడు నిర్మించిరో తెలుపగల ఆధారములు లభింపలేదు. పురములోని దేవద్రోణి తీర్థమున కోటగోడకు వేయబడిన విజయాదిత్య సత్యాశ్రయుని శాసనమునుబట్టి కోట 7 వ శతాబ్దము తరువాత కట్టబడెననియు, స్వర్గ బ్రహ్మాలయ ద్వారపాలకుని మీదగల వినయాదిత్య సత్యాశ్రయుని లేఖనమునుబట్టి ఆలయములు 7 వ శతాబ్దమునకు ముందు నిర్మింపబడి యుండెననియు గట్టిగా చెప్పవచ్చును.

స్థలపురాణములో, హేమలాపురమనియు, శాసనములలో హతంపుర మనియు నిది పేర్కొనబడినది. 11 వ శతాబ్దపు శాసనములలో అలంపురము పేరు కానవచ్చును. నిఖిలభారత ఆయుర్వేద విద్యాపీఠము (లాహోరు) వారు ప్రకటించిన "ఆనందకందం" అను వైద్యగ్రంథమున అలంపురము ప్రస్తావింపబడినది. ఆ గ్రంథకాల నిర్ణయమున అభిప్రాయభేదములు కలవు. భారత ప్రభుత్వ-అర్కి శాఖవారి 1937 వ వార్షిక నివేదికలోని గురిజాల ప్రాకృత శాసనమందు 'హాలంపురస్వామి' ఒకడు అచటి బౌద్ధ స్తూపమునకు దానముచేసిన విషయము కలదు. ఆ హాలంపురము ఈ అలంపురమేయైనచో 3 - 4 శతాబ్దములనాటికే అలంపురము ప్రసిద్ధినంది యుండవలెను.

పరిసరములలోనున్న తక్కసిల, ఉండవెల్లి, శాతన కోట గ్రామనామము లీప్రాంతముయొక్క ప్రాచీనతను అస్పష్టముగ తెలుపుచున్నవి. అలంపురపు శిలాలేఖనములను బట్టి, వాస్తు శిల్పములనుబట్టి ఆలయములు 6-7 శతాబ్దములలో బాదామీ చాళుక్యులకాలమున నిర్మింపబడి యుండునని ఊహింపవచ్చును.

ఈ ప్రాంతములు వరుసగా బాదామీ చాళుక్య, రాష్ట్రకూట, కల్యాణీ చాళుక్య, కాలచుర్య, కాకతీయ, విజయనగర రాజులచే పాలింపబడినవని శాసనములు చెప్పుచున్నవి. తరువాత కుతుబుషాహీ, మొగలు పాదుషాలకు లోబడి బిజ్జులవారు కొంతకాలము పాలించినారు. ఆంధ్రానర్ఘరాఘవ కావ్యకర్తయగు బిజ్జుల చినతిమ్మభూపాలుడు అబుల్ హసన్ కుతుబ్‌షా సామంతుడై అలం



గణపతి - అలంపురము

ఇచట బాదామీచాళుక్యులు వినయాదిత్య, విజయాదిత్య, సత్యాశ్రయులు, రాష్ట్రకూట ప్రభూతవర్ష, ధారావర్ష మహారాజులు, కల్యాణీ చాళుక్యులగు త్రైలోక్యమల్ల, జగదేకమల్ల, భువనైక మల్ల, త్రిభువనమల్లుల కాలమున వారి పట్టమహిషులు, ప్రధానులు, సామంత మండలేశ్వరులైన తెలుగుచోడ, వైదుంబరాజులు, కలచురి భుజబల మల్లుని కాలమునందలి అయ్యావొళైనూర్వర్ స్వాములు కాకతీయ ప్రతాపరుద్ర దేవుని కాలపు వీరబలంజ్యసమయ ధర్మ ప్రతిపాలకులు, అంతెంబరగండ పెర్మాడి రాయని ప్రధాని అయితరాజు, అంతెంబరగండ రాయిదేవమహారాజు, విజయనగర సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు మొదలయినవారు వేయించిన శిలాశాసనము లనేకము లున్నవి. వీటి వలన నాటి విద్యాపీఠములు, వ్యాపార శుల్కములు, అర్చావిశేషములు, రాజవంశప్రశస్తులు, మొదలయిన అపూర్వ చారిత్రకాంశములు తెలియవచ్చుచున్నవి. ఇచటి వీరగల్లుల పై విగ్రహములపై గూడ లేఖనములుండిచారిత్ర కాంశములను వెల్లడించుచున్నవి.

పురమును ఏలినాడు పిదప 19 వ. శతాబ్దమున పాయారుల్ ముల్కు అను జాగిరుదారు కొన్నాళ్ళు ఏలినాడని పార్సీ లేఖనములు తెలుపుచున్నవి.

**శాసనములు:** అలంపురము ఆలయములలో పెక్కు శాసనము లున్నవి. అవి దక్షిణాపథ చరిత్రకు ముఖ్యముగా పశ్చిమాంధ్ర చరిత్రకు మిగుల ప్రధానమైనవి. ఇంతవరకు లభించిన శాసనములలో వినయాదిత్యుని లేఖనలే ప్రాచీనమైనవి.



దేవాలయ శిల్పము - అలంపురము

అలంపురములో నందుల మతము, మబ్బు మతము, అను శైవమతములు కలవు. నందుల మతములో మల్లికార్జునరాయల సేనాని కాచ ప్పొడయలు దానమిచ్చిన తామ్ర శాసనము కలదు. అలంపురములోను పరిసర గ్రామాలలోను ఉన్న తామ్ర శిలాశాసనములు ప్రకటింప బడినచో ఇదివరకు తెలియని యనేక విశేషములు బయల్పడ గలవు.

పుణ్యక్షేత్రము : అలంపురము దక్షిణ కాశి యనియు, భాస్కర క్షేత్రమనియు ప్రసిద్ధిపొందినది. శ్రీశైలక్షేత్రమున కిది పశ్చిమద్వారము. తుంగభద్రాతీర మందలి 64 ఘట్టములతో, అష్టాదశ తీర్థములతో, జోగుళాంబా బ్రహ్మేశ్వరులతో, మాధవ, గణేశ, కాలభైరవ, మణికర్ణికాతీర్థములతో అలంపురము వారణాసితో నన్నివిధముల పోలి యున్నది. ఇచట కోటిలింగము లున్నవని ప్రతీతి. ప్రస్తుత మిచట నరసింహస్వామి, సూర్యనారాయణస్వామి, చెన్నకేశవ, నీలకంఠేశ్వర, బ్రహ్మేశ్వరాలయము లున్నవి. అన్నియుసుందర శిల్ప విలసితములు. వీనిలో బ్రహ్మేశ్వరాలయము ప్రధానమైనది.



నటరాజు - అలంపురము

అలంపురమునకు 9 మైళ్ళ దూరములో కృష్ణా తుంగభద్రా సంగమేశ్వరమును, 18 మైళ్ళలో సప్త నదీ సంగమక్షేత్రమును కలవు.

బ్రహ్మేశ్వరాలయ పశ్చిమద్వారమున 'షాఅలీ పాదుషా' దర్గా ఉన్నది. దానికి "జిలఖాత్" నెలలో గొప్ప 'ఉరుసు' జరుగును. మహమ్మదీయుల కిది పవిత్రమైనది.

దేవతామూర్తులు : ఈ క్షేత్రమున సూర్యుడు, సప్త మాతృకలు, కుమారస్వామి, మహిషాసుర



అలంపురము దేవాలయములు

మర్దని, నటరాజు, నాగరాజు, విఘ్నేశ్వరుడు, నరసింహుడు, భైరవులు, ఆంజనేయుడు, నంది, గౌరీ శంకరమూర్తులు, వివిధాకృతులతో కానవచ్చుచున్నవి. ఇవిగాక, కామాక్షి, పరశురామ, వేంకటేశ్వర, చెన్నకేశవ, పాండురంగ, గోపాలకృష్ణ, శ్రీరామ, దత్తాత్రేయ, దుర్గామూర్తులు కూడ పూజింపబడుచున్నవి. ఇచట శైవ, వైష్ణవ, శాక్తేయ, సౌర, గాణాపత్య, స్కాందాది మతశాఖలకు సంబంధించిన అన్ని దేవతా మూర్తులును ఉండుట గమనింపవలసిన విషయము.

ఇచట బాలబ్రహ్మ, కుమారబ్రహ్మ, అర్కబ్రహ్మ, వీరబ్రహ్మ, విశ్వబ్రహ్మ, తారకబ్రహ్మ, గరుడబ్రహ్మ, స్వర్గబ్రహ్మ, పద్మబ్రహ్మ లను నవబ్రహ్మలయములు కలవు. అన్నియు శివలింగములే. వీటిలో బాల బ్రహ్మేశ్వరుడు క్షేత్రస్వామి. ఈ దేవునకు శివరాత్రి సమయమున బ్రహ్మోత్సవ రథోత్సవములతో తిరునాళ్ళు జరుగును. ఇందలి ప్రధాన దేవీమూర్తి జోగులాంబ. అష్టాదశ దేవీ పీఠములలో చేరిన ఈ దేవత జోగాంబ యని ఆనందకందమునందును, యోగేశ్వరి యని రసరత్నాకరమునందును, 'విశృంఖలా' యని లలితా సహస్రనామ భాస్కరరాయ భాష్యమునను ప్రస్తుతింపబడినది. నవరాత్రులలో నీమెకు రథోత్సవాదులు జరుగును.

బ్రహ్మేశ్వరాలయమున కెదురుగ నంది ప్రక్కనఉన్న చిన్న గుడిలో 'నగ్నకబంధము' భూదేవి యనుపేర వంధ్యాస్త్రీలచే సేవింపబడుచున్నది. ఈమూర్తి షోడశీ తంత్రమున చెప్పబడిన "ఛిన్నమస్తాదేవి" కాదు. ఇట్టి మూర్తు లీ తీరమున నాలుగున్నవి. మహేంజోదారో త్రవ్వకాలలో ఇట్టిమూర్తి బయటపడిన దట.

**వాస్తు పద్ధతి :-** ఇచటి ఆలయ నిర్మాణపద్ధతి దాక్షిణాత్య సంప్రదాయమునకు చెందినదికాదు. కొన్ని దేవాలయములు దీర్ఘచతురస్రములుగను, కొన్ని చతురస్రములుగను ఉండి రథాకృతిలో కట్టబడిన గర్భాలయములు, వాటిముందు ముఖమంటపములు కలిగియున్నవి. ద్వార బంధముపై కొన్నిటికి గజలక్ష్మి, కొన్నిటికి ఆయా



నాగబంధము - అలంపురము

గర్భాలయ మూర్తులను సూచించు చిహ్నములున్నవి. ఇరుప్రక్కల ద్వారపాలకులతోబాటు మకర కచ్ఛపములపై ఆరోహించిన గంగా యమునామూర్తు లుండును. ముఖమంటపము పైకప్పునకు సాధారణముగా నాగరాజుగాని, వికసిత పద్మముగాని ఉండును. కొన్నిటిపై దశావతారములు, అష్టదిక్పాలకుల విగ్రహములు చెక్కబడియున్నవి. ఇందలి గోపుర నిర్మాణము విశిష్టమైనది. గోపురము లన్నియు చదరములై నాలుగు మూలలలో ఆమలకములను, శిఖరమున గొప్ప ఆమలక గోళమును కలిగియున్నవి. బాదామీ, పట్టదకల్లు మొదలయిన స్థలములలో నిర్మింపబడిన వానివలె నీ యాలయములును చాళుక్య వాస్తు పద్ధతిలో నిర్మింపబడియున్నవి. వీనిపై అజంతా ప్రభావము విశేషముగ కలదని శిల్ప శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

శిల్ప విశేషములు :_ ఆలయ ద్వారబంధముల మీదను, వివిధాకృతులతో తీర్చబడిన స్తంభములమీదను, దూలము పైకప్పులమీదను, ఆలయ కుడ్యములమీదను సిద్ధహస్తులైన శిల్పులు మనోహర శిల్పమును వెలయింప జేసినారు. గరుడ, స్వర్గ, విశ్వబ్రహ్మాలయములలో శిల్పలక్ష్మి తాండవము చేసినది. ఇనుకరాతిపై చెక్కబడిన లతాకృతులు, దేవతామూర్తులు, పూర్ణకుంభములు, వివిధ జంతు పక్షి రూపములు, తోరణప్రాయములుగ చెక్కిన గంధర్వ మిథునములు, విచిత్ర భంగిమములతో ఒప్పిన మానవసింహ ముఖములు, దర్శనీయములై చూపరులను ఆకర్షించుచున్నవి. ఇందలి స్తంభరచన ప్రత్యేకమైనది. స్తంభములు, దిగువభాగమునను పైభాగమునను పూర్ణకుంభములను, మధ్యభాగమున అర్ధపద్మమును కలిగియున్నవి. గాలి, వెలుతురు వచ్చుటకై అమర్చబడిన రాతి కిటికీలపై స్వస్తికాది ముద్రలు, లతలు సుందరముగా చెక్కబడినవి. చాళుక్యులు శివకేశవులకు భేదము పాటింపని వారగుట చేత ఆలయ కుడ్యములపై శైవ వైష్ణవ గాథలు చెక్కబడినవి. లింగోద్భవ, త్రిపురాసుర సంహార, వామనావతార, రత్నాసురసంహార, కిరాతార్జునీయ, గజేంద్ర మోక్షణగాథలు మనోహరముగ తీర్చబడినవి. విమతీయుల క్రూరకృత్యములచే కుడ్యశిల్పము చాలవరకు పాడైపోయినది.

వస్తుప్రదర్శనశాల : హైదరాబాదు ప్రభుత్వ - అర్షశాఖవారు ఈ ఆలయములను శ్రద్ధతో రక్షించి ఇచట దొరకిన శిల్పఖండములతో నొక పురావస్తు సంగ్రహాలయమును స్థాపించినారు. అందుగల నాగరాజు, నటరాజు, మహిషాసురమర్దని, ప్రదోషమూర్తి, సూర్యుడు, లకులీశ్వరుడు, కార్తికేయుడు, నగ్నకబంధము, భైరవ మూర్తులు మనోజ్ఞములయినవి.

స్కాంద పురాణమునందును, నిత్యనాథసిద్ధుని రసరత్నాకరమునందును, పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రయందును, శేషాచార్యుని పర్వత పురాణమునను ఈ బ్రహ్మేశ్వర క్షేత్రవర్ణనము విశేషముగ కలదు.

ఇట్లు అన్ని విధముల ప్రసిద్ధిపొంది తైర్థికులకు, శిల్పులకు, చారిత్రకులకు యాత్రాస్థలమైనసంస్కృతికేంద్రమైవిలసిల్లిన అలంపురము ద్రోణాచలం - సికింద్రాబాదు రైలుమార్గమున కర్నూలు ప్రక్కన నున్నది. గ. రా. శ.

**అలాస్కా :-** అమెరికా సంయుక్తరాష్ట్రములలో రాజకీయముగా అలాస్కా ఒక భాగముగ పరిగణింపబడు చున్నది. ఉత్తర అమెరికా పశ్చిమోత్తరపు తుదిభాగమున 54°–40° ఉ. నుండి 71°–50° ఉ. అక్షాంశములలోను, 141° నుండి 169° పశ్చిమ రేఖాంశములలోను అలాస్కా వ్యాపించి ఉన్నది. దీని వైశాల్యము 5,86,400 చదరపు మైళ్ళు. అల్యూషను దీవులలో ఉన్న అనాటిగ్ నక్ ద్వీపము అలాస్కాకు దక్షిణపుకొన. ఇచ్చటినుండి అలాస్కాకు ఉత్తరపుకొన అయిన బరోకు 1400 మైళ్ళ దూరమున్నది. ఈ దేశమునందలి ముప్పాతికవంతు భూభాగము ఉత్తర సమశీతోష్ణ మండలములో నున్నది. అలస్కా యొక్క తీరప్రాంతపు పొడవు 26,000 మైళ్ళు. అలాస్కాలోని భూమి సమతలముగ లేదు. ఇందు దాదాపు 20,000 చ. మైళ్ళు హిమానీ నదములచే **(glaciers)** కప్పబడును. వాటిలో మిక్కిలి పెద్దది మలాస్పినా అను నది. అది 18,008 అడుగుల ఎత్తైన మౌంటు సేంటు ఇలియాసు అను పర్వతముయొక్క పాదభాగమున ఉన్నది.

నైసర్గిక లక్షణములు, శీతోష్ణస్థితి :- అలాస్కా చాల విశాలమైన దేశము. అక్కడి శీతోష్ణస్థితి అడుగడుగునకు మారుచుండును.

దక్షిణ అలాస్కా :- ఇది బ్రిటిషు కొలంబియాకు సమాంతరముగా నున్నది. దీనిని బ్రిటిషు కొలంబియాతో కలుపుచున్న దీవులకు అలెగ్జాండరు ద్వీపసముదాయ మని పేరు. దక్షిణ అలాస్కాలో సుమారు 10,000 అడుగుల ఎత్తైన పర్వత శిఖరములు కలవు. ఇందు సమతల ప్రదేశము చాల తక్కువ. అపుడపుడు శీతకాలములో చలి ఎక్కువగను, వేసవిలో ఎండలు తక్కువగను ఉండినను, మొత్తముమీద ఇచ్చట సమశీతోష్ణస్థితి ఉండును. ఈ ప్రదేశమునందు వర్షపాతము చాల ఎక్కువ. వివిధ ప్రాంతములలో ఈ క్రిందివిధముగ వర్షించును: బారను దీవియొక్క దక్షిణాగ్రమున సుమారు 200 అంగుళములు, కెచ్చికాన్‌లో 150 అంగుళములు, జూనియన్‌లో 84 అంగుళములు, యాకుటాటాలో 130 అంగుళములు. ఈ ప్రదేశమునకు ఉత్తరపు చివరయందు వాన బొత్తిగాతగ్గిపోవుచున్నది.

**మధ్య అలాస్కా :-** ఈ మండలము యుకానుకు అలాస్కాకు సరిహద్దగు 141 వ రేఖాంశమునుండి పశ్చిమముగా అలాస్కా పర్వతశ్రేణికిని పసిఫిక్ సముద్రమునకును మధ్యనున్నది.

**శీతోష్ణస్థితి :-** ఇచ్చట ఉష్ణోగ్రత తగుమాత్రముగ నుండును. వర్షపాతము ఎక్కువగ నుండును. తీరప్రాంతమున అధికముగా వర్షించినను లోనికి పోవుకొలది వర్షపాతము తక్కువగుచుండును. ఉదా: లటౌషులో సగటున 185 అంగుళముల వాన పడును. ఆంకొరేజిలో 15 అంగుళముల వాన మాత్రమే.




**పశ్చిమ అలాస్కా:** ఇందులో బ్రిస్టలు, కుస్కోక్విమ్- అఖాత మైదానములు చేరియున్నవి. ఇది అలాస్కా పర్వత పాద భూమినుండి పశ్చిమముగా బేరింగు సముద్రపు వైపు వ్యాపించినది. ఈభూభాగమునందే యూకాను, కుస్కోక్విమ్ అను నదులు పారుచున్నవి. ఇందులో టుండ్రా ప్రాంతమే అధికము.

**శీతోష్ణస్థితి :** వానమితముగా పడును. తరచుగా ఆకసము మేఘావృత మగును. తీరప్రాంతమున పొగమంచు కనిపించును.

**అలాస్కా ద్వీపకల్పము, అల్యూషను ద్వీపము :** ఈ మండలము మెరక పల్లములతో నుండును. ఇందు చెట్లు చేమలు లేని కొండలు నిండియుండును. ఈ ద్వీపకల్పము యొక్క దిశాంతమందు 80 మైళ్ళ పొడవుగల ఇలియామ్నా అను మంచినీటి సరస్సు ఒకటి ఉన్నది. ఇందు 58 అగ్నిపర్వతము లున్నవి. వాటిలో పెక్కు పర్వతములు ఇప్పటికిని నిప్పులను గ్రక్కుచుండును. అల్యూషనులలో పెక్కు ద్వీపము లున్నవి. వీటిలో 13 పెద్దవి. ఇవికూడ అంతర్విభాగములను పొందియున్నవి. ఫాక్సు ద్వీపములు, ఆండ్రినాఫ్ ద్వీపము, రాట్ ద్వీపము, నియర్ ద్వీపము తూర్పున నున్నవి.

**శీతోష్ణస్థితి :** ఈ మండలమునందలి వాతావరణము తరచుగా మారుచుండును. వేసవియందు పొగమంచు కనిపించును. తుపానులు చెలరేగును.

**ఉత్తరదేశము :** ఇక్కడ ఉత్తరదేశ మనగా ఆర్కిటికుపర్వత మండలము. ఆర్కిటికు ప్రాంతమందలి ఏటవాలుగా నున్న టుండ్రాభూమి బేరింగు సముద్ర తీరమువరకు వ్యాపించి యున్నది. ఇందలి బీళ్ళు టుండ్రా మాదిరివి.

**శీతోష్ణస్థితి :** ఇది గొడ్డునేల. ఇందలి వర్షపాతము 10 అంగుళములకంటె తక్కువ. వేసవియందలి ఉష్ణోగ్రత సహ్యముగ నుండును. శీతకాలమునందలి చలి దుర్భరము.

**ఆహార ధాన్యములు :** ఇచటి తీరమండలములు సేద్యమునకు పనికిరానివి. తనానా లోయవంటిదక్షిణప్రదేశములందు గోధుమలు పండును. అచ్చటనే యవలు, ఓటు ధాన్యములుకూడ పండించుటకు వీలున్నది. ఫెర్ బాంక్సు జిల్లాలో ధాన్యోత్పత్తికై ప్రయోగశాలలు నెలకొల్పబడినవి.

**చేపల పరిశ్రమ :** సాల్మన్ చేపల పరిశ్రమ అలాస్కా దేశమున ఎక్కువ ప్రాముఖ్యమును వహించినది. ఈ రకపు చేపలు దేశమందు అంతటను, ముఖ్యముగా ఫియర్డు తీరములందు అధికముగాను లభించును. పసిఫికు అమెరికాలలో దొరకు సాల్మనుచేపల మొత్తములో 5 వ భాగము అలాస్కాలోనే లభించును.

**ఖనిజములు :** ఇచ్చటి రాళ్ళలో ఖనిజములు దొరకును. ఇందు బంగారపు గనులు చాల ముఖ్యమైనవి. ఇచ్చట రాగి కూడ విరివిగా లభించును. బొగ్గుకూడ దొరకును. చిటినా నది లోయలో నున్న కెన్నికాటు రాగి గనులు ముఖ్యమైనవి. అలాస్కాలోని ఈశాన్య దిక్కున నున్న కెచికన్‌కూడ తామ్రోత్పత్తికి ప్రాముఖ్యమును వహించినది. కాటలా, మాటనుస్కా అనునవి బొగ్గునకు ముఖ్యమైన గనులు. కాటలాగనిలో ఆంత్రోసైటు రకపు బొగ్గు పొరలుపొరలుగా దొరకును. మాటనుస్కా గనిలో మెత్తని బొగ్గు (Bituminous), కొలదిగ గట్టియయిన బొగ్గు (Sub - bituminous) లభించును. నానాయిమా గనిలో కొంత హీనమైనబొగ్గు దొరకును.

జూనో, విల్లోక్రీకు, ప్రిన్సువిలియం సౌండు అను గనులలో బంగారము దొరకును. ఇందులో కొంత బంగారము ఇసుకతోను, మట్టితోను కలిసి లభించును. మరికొంత గనుల పొరలనుండి లభించును.

**రవాణా సౌకర్యములు :** ఈ దేశమున పెక్కు నదులున్నవి. అందుచేత నౌకాయానమునకు ప్రాముఖ్యము చేకూరినది. బొగ్గు ఉత్పత్తి కారణముగా రైల్వేలుగూడ అభివృద్ధి చెందినవి. భారీ సరకులు సముద్రమార్గమున రవాణా చేయబడుచున్నవి. ప్రయాణించువారికిని, తేలిక సరకుల రవాణాకును విమానములు అధికముగ ఉపయోగపడు చున్నవి.

**జనులు :** ఎస్కిమోలు, హైడాలు, ట్లింకిట్లు, అథొపాస్కనులు అను నాలుగుతెగల జనులు ఇచ్చట నివసించుచున్నారు. జపానీయులు, చైనీయులు ఇక్కడకు వలసవచ్చి యున్నారు. ఇచ్చటి జనులు యూరోపియనుల మతాచారములను అవలంబించుచున్నారు.

రెడ్డు ఇండియనులు అఫోగ్నికు ద్వీపములో నివాసములను ఏర్పరచుకొనిరి. సముద్రతీరమందును ఇతరపట్టణములందును తెల్లజాతివారు నివసించుచున్నారు. వారు తరచుగా తమ నివాసములను మార్చుకొను చుందురు. సిట్కా, డగ్లసు అను నగరములు ముఖ్యమైనవి. ఈ పట్టణప్రాంతములందు ఖనిజ ఉత్పత్తి విరివిగా జరుగును.

ఇచ్చటి సైనికోద్యోగియులలోను రాష్ట్ర పరిపాలన ఉద్యోగియులలోను పెక్కురు అమెరికా సంయుక్తరాష్ట్రములనుండి వచ్చినవారే. ఈ ప్రదేశము యుద్ధవ్యూహములకు సహజముగ తగియున్నది.

వి. యజ్ఞ. చ.

**అలెగ్జాండరు :-** అలెగ్జాండరు చక్రవర్తి క్రీ. పూ. 356 లో గ్రీసులో జన్మించెను. ఇతని తండ్రి మాసిడోనియా రాజగు ఫిలిప్పు. తల్లి యెపిరట్ రాకుమార్తెయగు ఒలింపియస్. సుప్రసిద్ధ వేదాంతవేత్తయైన అరిస్టాటిల్ ఇతని గురువు. 18 వర్షముల ప్రాయమున అలెగ్జాండరు చెరోనా యుద్ధములో అశ్వదళాధిపత్యమువహించి శత్రు సైన్యముల చెండాడి తన భావి యసమాన సమర నైపుణ్యమునకు దగిన సూచన లను చూపెను. ఇరువది యేండ్ల వయసున అలెగ్జాండరు సింహాసన మధిష్ఠించెను.



శత్రువుల తిరుగుబాటులను అణచెను. ఒక సంవత్సరములో ఐరోపాను జయించి ఆసియాపై దండెత్తుటకు సంసిద్ధుడయ్యెను. అలెగ్జాండరు 30,000 కాల్బంటులతో, 5000 ఆశ్వికదళములతో ఆసియా జైత్రయాత్రకై బయలు వెడలెను. ఇతని జీవితములో మిగిలిన 12 ఏండ్లు ఆసియాయందే గడచెను. ఇతడు తాను విడిసిన చోటులందెల్ల పూర్వులను గౌరవించి, దేవతల నారాధించెను. ట్రాయి పట్టణములో ఎథీనా దేవాలయములో బలియిచ్చెను. మిలెటస్‌ను గెల్చిన తరువాత తన నౌకాదళమును విచ్ఛిన్నముచేసెను. ఇజస్ యుద్ధములో పర్షియన్ రాజగు డరియస్‌ను పరాజితుని జేసెను. తన విజయ చిహ్నముగా ఇజస్ సమీపమున ఇతడు అలెగ్జాండ్రియా పట్టణమును కట్టించెను. ఈజిప్టును గెల్చి, అలెగ్జాండ్రియా రేవుపట్టణమును సృష్టించెను. ఈ ప్రాంతములందు గ్రీకు నాగరకతను, వ్యాపారమును వృద్ధిచేసెను. టైగ్రెస్‌నదిని దాటి బాబిలోనియాను గెల్చెను. పెర్సిపోలిస్‌ను వశపరచుకొనెను.

అలెగ్జాండరు తక్షశిల జేరి అచటి రాజును వశపరచుకొనెను. హిడాస్పెస్ యుద్ధములో పురుషోత్తముని ఓడించెను. శతద్రూనదిని సమీపించుటతో అలెగ్జాండరు




సైన్యములు ముందడుగువేయ నిరాకరించెను. ముల్తాను ప్రాంతములందలి యాటవిక జాతులు అలెగ్జాండరునకు అనేక కానుకలు సమర్పించెను.

అలెగ్జాండరు డరయస్ కుమార్తె స్టాటిరాను పెండ్లి యాడెను. ఇతని ప్రథమ కళత్రము సోగ్దియానా యను నామె. ఈ బహుభార్యాత్వములో ఇతడు తండ్రివలె ప్రాచ్యపద్ధతి నవలంబించెను. టైగ్రెస్‌ను దాటి, ఓపిస్ (Opis) దగ్గర సైన్యములను ఇంటిదారి పట్టించెను. బాబిలోనును తన సామ్రాజ్యమునకు కేంద్రముగ చేయగోరి ఇతడచట గొప్ప నౌకాశ్రయమును గట్టించెను. క్రీ.పూ. 323 లో 33 సం. లు నిండక పూర్వమే అలెగ్జాండరు మితిమీరి త్రాగుటవలన మరణించెను.

ఆఫ్ఘనిస్థానమును, ఆక్షస్ (Oxus) నది కీవలి భాగమును, సింధునదీ ప్రాంతము వరకును జయించిన పరదేశీయులలో మొదటివాడు అలెగ్జాండరు. ఇతని శిబిరము ఒక మహానగరమువలె నుండెడిది. కవులు, గాయకులు, చరిత్రకారులు, నట్టువరాండ్రు, స్త్రీలు, ఇందు ఉండిరి. దర్బారు దినచర్యలో దైనందిన విషయము లన్నియు వ్రాయబడుచుండెను. షుమారు 13 ఏండ్లలో అలెగ్జాండరు అప్పటికి తెలిసిన ప్రపంచములో నర్ధభాగమును జయించెను. ఇతడు 12 గురు దేవతలకు కట్టించిన గుడులు కాలగర్భమున లీనమైనవి. ఇతని కాలపు శిలాప్రతిమా శిల్పచ్ఛాయలు బౌద్ధశిల్పములో లీనమై యుండవచ్చును. అసమాన సైన్య విజయములను గాంచిన యీ జయశీలి సామ్రాజ్యము ఇతని అనంతరము 8 ఏండ్లలోనే విచ్ఛిన్నమయ్యెను.

-డా. వి. య.

**అల్యూమినియము (స్ఫటము)** :- ఉనికి ప్రకృతిలో ఆమ్లజని, సైకతము (Silicon) తరువాత అల్యూమినియము సమృద్ధిగా దొరకును. భూమియొక్క గట్టిగానున్న పై భాగమున అది 7.4 శాతము ఉండును.

అల్యూమినియము యొక్క ముఖ్య ఖనిజములను ఈ క్రింది విధముగా వర్గీకరింప వచ్చును.

1. సైకతీయములు (శైలితములు) :- అల్యూమినియము చాలవరకు సైకతీయముల రూపమున దొరకును. వానిలో అన్నిటికంటె ముఖ్యమైనది కయొలిన్ (ప్రమృత్). పొటాశీయ అభ్రకము, పొటాశీయ భూ స్ఫటికము. **(Potash felspar)**

2. ఆమ్లజనిదములు :- బాక్సైట్ (స్ఫోదిజము) అనునది అల్యూమినియము యొక్క అమ్లజనిద ఖనిజములలో అన్నిటికంటె విరివిగా దొరకును. వాణిజ్య సంబంధమగు అల్యూమినియము అంతయు ఈ మూలాధారము నుండి లభించుచున్నది. కురువిందము (వర్ణరహితము), కెంపు (మాణిక్యము-ఎరుపు), ఇంద్రనీలము (నీలిరంగు) మరకతము (ఆకుపచ్చ) అనునవి ముఖ్యమయిన ఇతర ఆమ్లజనిద ఖనిజములు.

వీటికి సుందరత, ప్రకాశము, ఉండుటచే ఈ ఖనిజములు రత్నములుగా ఉపయోగపడుచున్నవి. స్ఫటామ్లజనిదము యొక్క (Alluminium oxide) అపరిశుద్ధ రూపమగు కురువిందశిల పొడి చాల గట్టిగా నుండును. అది రాపిడిచేయు పదార్థముగా ఉపయోగపడుచున్నది.

3. స్ఫటీయములు :- కొన్ని ధాతు స్ఫటీయములు కూడ ప్రకృతిలో దొరకును. అవి "భాజా స్ఫటీయములు" (Spinels) అనబడును.

4. ఇతరములు :-సహజముగా దొరకు స్ఫటఖనిజములు- వైడూర్యము, జాస్ఫతిజము (cryolite) స్ఫాళ్మము (alunite or alum stone)

అల్యూమినియము యొక్క ధాతునిస్సారణము (Extraction) : సామాన్యమగు రేగడిమట్టినుండి అల్యూమిన ధాతు నిస్సారణముచేయు విధానము కష్టమైనది. 1886 వ సం. న ఛార్లెస్ మార్టిన్ హాల్ అను అమెరికను రసాయన శాస్త్రజ్ఞుడు బాక్సైడు (స్ఫోడిజము) అను ఖనిజమునుండి విద్యుత్కరణ విధానమున అల్యూమినియమును తయారు చేసెను. ఈ విధానము రెండు దశలలో జరుగును.

(1) స్వచ్ఛమైన స్ఫటకామ్లజనిదమును (అల్యూమినా) తయారు చేయుట.

(2) స్ఫటకామ్లజనిదము యొక్క విద్యుత్కరణము.

1. స్వచ్ఛ స్ఫటకామ్ల జనిదమును తయారుచేయుట : ఇనుము యొక్క అమ్లజనిదము, ఇసుక, స్ఫోడిజములో నుండు ముఖ్యమగు కలుషములు. స్ఫోడిజమును పరిశుద్ధము చేయుటకు రెండు విధము లగు ప్రక్రియలను ఉపయోగింతురు.

*బేయరు ప్రక్రియ :* బాగుగా చూర్ణము చేయబడిన స్ఫోడిజము గాఢ దాహకసోడా ద్రావణమున కరగింపబడును. స్ఫటకామ్లజనిదము కరగి, ఇనుప ఆమ్లజనిదము కరుగక నిలచిపోవును. దానిని వడపోత పోయుదురు. ఈ




స్ఫటకామ్లజనిదముయొక్క విద్యుత్కరణము

ద్రావణములో నజలీకరణము (dilute) చేసిన స్వచ్ఛ స్ఫట కామ్లజనిదము లభించును.

*సెర్పెక్ ప్రక్రియ :* ఈ ప్రక్రియలో ఖనిజమును కర్బనముతో కలిపి నత్రజని వాయు ప్రవాహమున 1800° ల ఉష్ణప్రమాణమున వేడి చేయుదురు. అప్పుడు స్ఫట నత్రిదము (Alluminium Nitride) ఏర్పడును. దానిని నీటిచే విశ్లేషించినచో అల్యూమినియము యొక్క ఉదజామ్లజనిదము వచ్చును.

2. స్ఫటకామ్ల జనిదముయొక్క విద్యుత్కరణము (Electrolysis): స్వచ్ఛమగు అల్యూమినా లేక స్ఫటకామ్లజనిదమును క్షారస్ఫతిజము (Cryolite) తో కలిపి ఒక ఇనుప తొట్టిలో విద్యుత్కరణము చేయుదురు. దీనిలో కర్బన విద్యుద్ద్వారములను ఉపయోగింతురు. విద్యుదంశ్యము (విద్యుత్కరణము చేయబడు పదార్థము) యొక్క ఉపరితలమును కొంత కారుబొగ్గుతో కప్పియుంచెదరు. విద్యుదంశిక (Electrolytic) కోశములో కరగిన అల్యూమినియమును అడుగుభాగముననుండి బయటికి తీసెదరు.

**అల్యూమినియమును శుద్ధిచేయుట :** అల్యూమినియము హూప్ ప్రక్రియచే శుద్ధి చేయబడును. విద్యుదంశిక కోశము (Electrolytic cell) యొక్క అడుగుభాగమున రాగి, అల్యూమినియము, సైకతము యొక్క ధాతు సమ్మేళనముండును. అది ధనధ్రువమార్గముగా (Anode) పనిచేయును. మధ్యపొర సోడియ, అల్యూమిన, క్షార ప్లవదము ((Barium) లు కరగి కలసిన సమ్మేళనమును కలిగియుండును. అది విద్యుదంశ్యము (Electrolyte) గా పనిచేయును. విద్యుత్ప్రవాహము కరగిన లవణ మిశ్రమమునుండి అల్యూమిన అయనులను విడుదలచేయును. ఈ విధముగ విడుదలయైన స్వచ్ఛమగు అల్యూమినియము పైకి లేచును. అదే సమయమున ముతుక అల్యూమిన సమ్మేళనమునుండి సమాన ప్రమాణములో అల్యూమినియము ద్రావణములో చేరును. ముతుక అల్యూమినియము అడుగుపొరలో ప్రవేశపెట్టబడును.

**అల్యూమినియముయొక్క ధర్మములు :** *భౌతిక ధర్మములు :* ఇది నీలిడాలుతో వెండివలె తెల్లగానుండు ధాతువు. దీని తారతమ్యసాంద్రత 2.7. తేలికగానుండు లోహమగుటచే దానిని విమాన నిర్మాణమునకును, దాని ఇంజను భాగములను చేయుటకును ఉపయోగింతురు. దీని విస్తార్యత హెచ్చుగా నుండుటచే, దీనిని చాల పలుచని రేకుగా సాగకొట్టవచ్చును. ఇది చాల హెచ్చు జిగిగల లోహము. ఉష్ణ విద్యుత్తులకు అల్యూమినియము వాహకము.

*రసాయన ధర్మములు :* సాధారణ ఉష్ణోగ్రతకు అల్యూమినియముపై ఎట్టి చర్యయును లేదు. ఎందుచేతననగా పలుచని అమ్లజనిదపుపొర ఈ ధాతువుపై ఏర్పడి దానిని కాపాడుచుండును. అమ్లజని గల వాతావరణములో అల్యూమినియమును వేడిచేసినచో, అది మండి, స్ఫట కామ్లజనిదమును ఇచ్చును. అందుచే స్ఫటకామ్లజనిదముతో ఉక్కును అతుకు ప్రక్రియలో అల్యూమినియము ఉపయోగపడును.

**ఉపయోగములు :** అల్యూమినియము చవుకగాదొరకు ధాతువగుటచేతను, సులభముగా హరించనిది అగుటచేతను ఇండ్లలో పాత్రసామానులు చేయుటకు ఉపయోగింపబడుచున్నది. అల్యూమినియముయొక్క చూర్ణమును అవిసె నూనెలో మరగించి అల్యూమినము పూతగా నుపయోగింతురు. అల్యూమినియము మంచి విద్యుద్వాహక మగుటచే, దానిని ప్రసారరేఖలకును, డైనమో యంత్రములలోను, మోటారులలోను, కదలుచున్న తీగ చుట్టలు చుట్టుటకును ఉపయోగింతురు.

ఈ దిగువ పేరొనిన అల్యూమిన మిశ్రలోహములు ఉపయోగకరములైనవి:

**మాగ్నాలియం (మగ్నస్ఫటము) :-** అల్యూమినియముతో తరిమెన దొడ్డిపై పనిచేయుట కష్టము; ఎందుచేతననగా అది పనిముట్లకు అంటుకొనుచుండును. ఈదోషము లేకుండ చేయుటకు అల్యూమినియముతో 2 శాతము మగ్నమును కలుపుదురు. అల్యూమినియమును, మగ్నమును కలిసిన మిశ్రలోహము 'మాగ్నాలియం' అనబడును. దీనితో తరిమెన దొడ్డిపై పనిచేయుటకు ఉపయోగపడును. ఇది చవుకరకపు త్రాసులు చేయుటకును ఉపయోగపడును.

**అల్యూమినియపు కంచు :-** 5 శాతము మొదలు 12 శాతము అల్యూమినియమును రాగితో కలిపినచో అది శీఘ్రముగా కరిగి కలిసిపోవును. దానికి ప్రకాశ

వంతమగు బంగారుకాంతి ఉండును. అది హరించిపోదు. అది ఫోటో చిత్రములు చేయుటకును, ఇతర అలంకరణపు పనులకును ఉపయోగపడును. ఫ్రెంచి ప్రభుత్వము వారు ఈ మిశ్రలోహమును నాణెములు చేయుటకు ఉపయోగించుచున్నారు.

స్థిరస్ఫటము (డ్యురాలుమిన్) :- దీనిలో 95 శాతము అల్యూమినియము, మిగిలినది రాగి, మగ్నము, మాంగనము ఉండును. ఇది సముద్రపుటోడల నిర్మాణమునకును శస్త్రచికిత్సోపకరణములు చేయుటకును ఉపయోగపడును.

అల్యూమినియము స్ఫటతాప విధానమునందు కూడ ఉపయోగపడును.

గోల్డుష్మిట్ యొక్క స్ఫటతాప ప్రక్రియ :- క్రుమము (Chromium), మాంగనము వంటి ధాతువుల యొక్కయు టంకము, సైకతమువంటి అధాతువుల యొక్కయు, ఈ ధాతువులు ఇనుము కలిసిన అయోమాంగనము, అయోక్రుమమువంటి మిశ్రలోహముల యొక్కయు కర్బన రహితము లగు నమూనాలను సంపాదించుటకై గోల్డుష్మిట్ విధానము ఉపయోగింపబడును. హెచ్చు ఉష్ణోగ్రతలలో అల్యూమినియమునకు తనకంటె తక్కువ ధనాత్మక విద్యుల్లక్షణముగల ధాతువులను వాటి ఆమ్లజనిదములనుండి వేరుచేయు శక్తి కలదు. ఈ క్రియలో ఉష్ణ విసర్జనము చాల బలముగా నుండుటచే వేరు చేయబడిన ధాతువు కరగి ద్రవరూపమున లభించును. ఈ ప్రక్రియ స్ఫటాకామ్ల జనిదముతో ఉక్కును అతుకుటకును, సముద్రముపై ఓడలను మరమ్మతు చేయుటకును వినియోగింపబడును.

స్ఫటకామ్ల జనిదము :- ఇది 'అల్యూమినా' అనబడును. స్ఫోదిజమును (Bauxite) ధనురాకారపు విద్యుత్కొలిమిలో 3000° ల ఉష్ణోగ్రతవద్ద కరగించి పెద్ద మొత్తముపై స్ఫటవిందము (స్ఫటము+కురువిందము) అను కృత్రిమ మగు ఒరపిడి రాతిని ఉత్పత్తి చేయుదురు, అది సహజమగు కురువిందముకంటె కఠినముగా నుండును. అది ఆత్మవహము లగు బండ్ల కవాటికలను (volves) ఉక్కుతో చేయబడిన ఇతర యంత్రభాగములను తరిమెన పట్టుటకును ఒరపిడి చక్రములను తయారు చేయుటకును ఉపయోగింపబడును. అది వక్రీభవన (Refractory) పదార్థముగాకూడ ఉపయోగపడును.

ఖనిజ కురువింద రూపమున స్ఫటకామ్ల జనిదము ఒరపిడి చేయుటకును, మెరుగు పెట్టుటకును చాల ఉపయోగింపబడును. ఇప్పుడు సూక్ష్మముగా చూర్ణము చేయబడిన అల్యూమినా, ఒక రంగు పదార్థములతో కృత్రిమ రత్నములు తయారుచేయబడు చున్నవి.

అల్యూమిన ఉదజామ్ల జనిదము నీటిని శుభ్రపరచు విధానమున ఆతంచన ప్రక్రియ (Coagulation process పేరుకొనునట్లు చేయుట)కును, కాగితమును సజ్జీకరణము చేయుటకును, వస్త్రములను జలప్రవేశ నిరోధకములుగా చేయుటకును ఉపయోగింపబడును. అది వస్త్రములకు రంగువేయుటయందును, వానిపై క్యాలికో ముద్రణము చేయుటలో వర్ణస్థాపకముగా ఉపయోగపడును; రంగు చక్కెరను విరంజనము చేయుటకుగూడ అది ఉపయోగించును.

రంగువేయుటలో స్ఫటసంయోగద్రవ్యముల ఉపయోగము :- రంజక ద్రవ్యములలో ఉన్ని, పట్టువంటి జంతు సంబంధమగు పోగులకు నేరుగా రంగువేయుటకు వీలగును. కాని ఉద్భిజ సంబంధమగు పోగులకు "వర్ణస్థాపకములు" అను కొన్ని పదార్థములలో ముంచిన తరువాతనే రంగు వేయుదురు. వస్త్రమును మొదట స్ఫట సంయోగ ద్రవ్య ద్రావణములో ముంచెదరు. తరువాత రంగు వేయుదురు. దీనివలన వస్త్రమునకు రంజకద్రవ్యము పట్టును. ఇట్టి స్ఫట సంయోగ ద్రవ్యములను "వర్ణస్థాపకములు" అందురు.

పటిక : రెండుధాతువుల ద్విలవణము 24 అణువుల నీటిని స్ఫటిక జలముగా కలిగియున్నచో అది 'పటిక' అనబడును. పొటాశియము, అల్యూమినియముల, గంధకితములచే నేర్పడిన ద్విలవణమును 'పొటాష్‌పటిక' లేక 'సాధారణ పటిక' అందురు.

పటిక తయారుచేయుటకు పొటాశియ, అల్యూమినియ గంధకితముల అణుప్రమాణములను, మరగుచున్న నీటిలో కరగించి, చల్లారనిచ్చినచో పటిక స్ఫటికములు వేరుగా నేర్పడును.

పటిక తెల్లగా, స్ఫటికాకారమున నుండు పదార్థము. వేడిచేసినచో అది కరగి, స్ఫటిక జలమును పోగొట్టుకొని

కాల్చిన పటికగా మారును. అది అల్యూమినియ గంధకితముగా నుపయోగపడును.

**స్ఫటసైకతీయములు :** ప్రమృత్తు (Kaolin), పొటాశియ భూస్ఫటికము, అభ్రకము - ఇది స్ఫటసైకతీయములకు ఉదాహరణములు.విస్తారముగదొరకునట్టియు, అధికముగ ఉపయోగింపబడునట్టియు, అల్యూమినియముయొక్క సంయోగద్రవ్యమే రేగడిమట్టి. రేగడిమట్టి జిగటగా సాగును. కాల్చినచో నది గట్టిపడును. ఈ కారణములచే నది పోతపోయు వస్తువులకు ఉపయోగపడును.

**అల్యూమినియమును గుర్తించుట :** స్ఫట సంయోగ ద్రవ్యమును సోడియ కర్బనితముతో మిశ్రమము చేసి కట్టెబొగ్గుపై ఆమ్లజని హారకమగు జ్వాలలో వేడిచేసినచో తెల్లని విలక్షణమగు అవశేషము వచ్చును. దానిని తరువాత మణిశిలా నత్రిత ద్రావణపు చుక్కతో తడిపి మరల ఎక్కువగా కాల్చినచో నీలిరంగుగల పదార్థమేర్పడును.

అల్యూమినియముగల ద్రావణమునకు సోడియ ఉదజామ్లజనిదముగాని, పొటాశియ ఉదజామ్లజనిదముగాని కలిపినచో, అల్యూమినియము, అల్యూమినియ ఉదజామ్లజనిదముగా అవక్షేపము నొందును. అది అమ్మోనియా హారిదములో కరగును,

డి. హ.

**అల్బెరూని :-** అబుర్ రైహాన్ మహమ్మద్ ఇబిన్ అహమ్మదు అల్బెరూని 973 సెప్టెంబరులో సోవియట్ రిపబ్లిక్‌లో ఉన్న టర్కమనిస్తాన్‌లో ప్రస్తుతము-ఖివా అని పిలువబడు ఖ్వారిజిమ్ యొక్క పరిసర ప్రాంతములలో జన్మించెను. ఇతడు ప్రస్తుతపు ఆఫ్‌గనిస్థాన్‌లోని "గజినీ" పట్టణములో 75 సంవత్సరముల వయస్సులో చనిపోయెను. ఇతని పితృసంబంధమైన గృహము బెరూన్ అను చోటి పరిసర ప్రాంతములలో ఉండుటవలన ఈయనకు అల్ బెరూని అని పేరు వచ్చినది. పురాతనకాలములో మధ్య యుగమునందు ఖ్వారిజిమ్ శాస్త్రములలో, కళలలో, ప్రసిద్ధికెక్కిన పండితులకు జన్మస్థలమైయుండెను. అటువంటి వారిలో బీజగణిత శాస్త్రమును కనుగొన్న ఆల్ ఖ్వారిజిమి అను గణితశాస్త్రజ్ఞు డొకడు. గజినీలోని యామినీ వంశీయుల ఆస్థానములో ఇతనిపేరు ఎక్కువగా వినబడుచుండును. సుల్తాన్ మహమ్మదు గజినవి ఆవంశీయులలో ప్రముఖుడై, బాగ్దాదులోని అబ్బాసిద్ కాలిఫ్ వలన "యామినుద్దౌలా" అను బిరుదమును పడయుట వలన ఆ వంశమునకు యామినీవంశమని పేరు వచ్చినది.

క్రీ. శ. 1000, 1026 సంవత్సరముల నడుమ మహమ్మదు భారతదేశముపై పెక్కుసారులు దాడి చేసెను. తూర్పువైపున తన సామ్రాజ్యమును విస్తరింప జేయుటతో తృప్తిపడని ఆతనికి పడమటివైపున కూడ తన రాజ్యమును వ్యాపింప జేయవలెనను ఆశ కలిగెను. 1017 వ సంవత్సరములో అతడు ఖివాపై దాడిచేసినపుడు అల్బెరూని, అచ్చటి పరిపాలకునకు ముఖ్య సలహాదారుగా ఉండెను. అందువలన అతడు సహజముగా సుల్తాన్ గజినవీయొక్క తంత్రములకు ఎదురు ఎత్తులు వేయదొడగెను. మహమ్మదు ఆడంబర సహితుడును, నిరంకుశుడును కాడు. అతడు శాస్త్రములను, కళలను ఎక్కువగా పోషించుచుండెను. దూరదేశములనుండి విఖ్యాత పురుషులను యుద్ధ ఖైదీలుగా తనవెంట తీసికొని వచ్చి, తన సామ్రాజ్యమును జ్ఞానసంపన్నముగా చేయవలెనని అతనికి ఉద్దేశము ఉండెను. మహమ్మదు మధ్య ఆసియా రాజ్యమగు ఖ్వారిజిమును జయించి ఖ్వారిజిమ్‌నుండి గజినీకి తెచ్చినట్టి ఖైదీలలో అల్బెరూని ఒకడు. స్వస్థలమును విడుచునప్పటికి అల్బెరూని వయస్సు 40 సంవత్సరములు. అతడు తన జీవితములో శేషించిన భాగమును గజినవీలోనే గడపెను,

గజినవీలో ఎక్కువమంది భారతీయులు అల్బెరూనికి కనిపించిరనుటకు సందేహములేదు. అప్పటికే పంజాబును మహమ్మదు తన సామ్రాజ్యములో చేర్చుకొనెను. 1017 వ. సంవత్సరములో పశ్చిమమున, మహమ్మదు అమూరు దర్యావరకును, తూర్పున పురాతన భారతీయ విజ్ఞానమునకు కేంద్రమైన 'కనూజ్' (కన్యాకుబ్జము) వరకును ఆక్రమించెను. అల్బెరూనియెడ మహమూదునకు ఒకవిధమైన వైరభావము ఉండెను. అందుచేత అతడు బ్రతికి ఉన్నరోజులలో అల్బెరూనికి తగిన ఆస్థాన గౌరవము లభ్యము కాలేదు. కాని అతని పరిపాలన కాలములోనే, అల్బెరూనికి పురాతన భారతీయ సాహిత్యమునందు పండితులైనవారిని కలిసికొనుటకు అవకా

శము దొరికినది. ఇతరులకు తమ విజ్ఞానమును అందజేయు సత్స్వభావముగల హైందవపండితుల సహాయముతో, తన పూర్వ శత్రువైన అల్బెరూనికి, భారతీయ విద్యాభ్యాస మొనర్చుకొను నవకాశ మొసగిన సుల్తాను యొక్క సహనప్రవర్తనము, విశాలహృదయము ప్రశంసాపాత్రములు.

అల్బెరూని అన్ని విద్యాశాఖలందును ప్రావీణ్యము గడించెను. అతడు వ్రాసిన గ్రంథములు ఇంచుమించు 150 వరకు కలవని అంచనా వేయబడినది. కాని దురదృష్టవశమున సుమారు 27 గ్రంథములే మనకు లభ్యము లయినవి. అతడు కాలనిర్ణయశాస్త్రము, సంస్కృతిచరిత్ర, భౌతిక భూగోళము, తులనాత్మక మతచరిత్ర, భౌతిక శాస్త్రము, రసాయన శాస్త్రము, ఖనిజ శాస్త్రము, జంతు శాస్త్రము, వృక్ష శాస్త్రము, త్రికోణమితి శాస్త్రము, ఖగోళ శాస్త్రము, తదితర అనుబంధశాస్త్ర గ్రంథములను వ్రాసెను. ఇతడు బహుభాషాకోవిదుడుగా ప్రఖ్యాతికెక్కెను. ఇతని రచనలన్నియు శుద్ధమైనఅరబిక్ భాషలో నున్నవి. ఐనను ఇతని మాతృభాష ఖ్వారిజ్మి అనబడు పురాతన టర్కీభాష. అరబిక్, సంస్కృతము లందేకాక హిబ్రు, సిరియాక్, పహ్లావి, సాగ్దియన్ భాషలలోకూడ ఇతడు అగాధమైన విజ్ఞానమును సంపాదించెను. ఇతనివద్ద అత్యుత్తమమైన సంస్కృత గ్రంథాలయ ముండెను. అందలి గ్రంథముల నన్నిటిని ఇతడు మిక్కిలి కష్టపడి చదివెను. "నాకుగాని, అర్థముచేసికొని నాకు బోధింపగల హైందవ పండితులకుగాని పనికివచ్చు సంస్కృతగ్రంథములు, ఎంత దూర ప్రదేశమునందున్నవని నాకు తెలిసినను వాటిని సేకరించుటలో ఎట్టి శ్రమమైనను, ఎంత ధనము వ్యయమైనను నేను లెక్కజేయను," అని అల్బెరూని అనుచుండెడివాడు. పంజాబు పరిసరములు దాటి, పురాతన భారతీయ విజ్ఞానమునకు కేంద్రమైన కాశీపట్టణమువరకైన, ఇతడు వెళ్ళియున్నటుల తెలియకపోవుటచే, సంస్కృత భాషయందును, భారతీయ పురాతన గ్రంథములయందును ఇతనికిగల జ్ఞానము కొంత విచిత్రముగా కనబడును.

ఇతడు వ్రాసిన గ్రంథముల తారతమ్యమును వివక్షించుట మిగుల కష్టము. కాని భారతదేశమునకు సంబంధించినంతవరకు, ఇతడువ్రాసిన 'అసరుల్ బఖియా' అను (పురాతన దేశముల కాలనిర్ణయము) గొప్ప గ్రంథము, "కితాబుల్ - హింద్" లేక 'ఇండికా' అను సుప్రసిద్ధగ్రంథము - ఈ రెండును పురాతన భారతీయ విజ్ఞానమునందు అభిరుచికలవారికి మిక్కిలి ముఖ్యములైన గ్రంథము లని చెప్పవచ్చును. "కితాబుల్ - హింద్" అను గ్రంథమును వ్రాయుటకుముందే, సంస్కృతము నుండి అనేక గ్రంథములను అరబిక్ భాషలోనికి ఇతడు అనువదించెను. వీటిలో కపిలునిసాంఖ్యము, పతంజలిగ్రంథము ముఖ్యమైనవి. వేదములనుండి, ఉపనిషత్తుల నుండి, భగవద్గీతలనుండి ఇతడు విశేషముగా ఉదాహరించెను.

"కితాబులు - హింద్" అను గ్రంథమును సంకలన మొనర్చుటకు అల్బెరూనిని ప్రేరణముచేసిన కారణమును గూర్చిన వృత్తాంతము నాతడిట్లు చెప్పెను. ఒకప్పుడు 'టిప్లిస్' (Tiflis) లోని అబుసాహిల్‌ను అల్బెరూని సందర్శించెను. ఆ తరుణమున దర్శనములనుగూర్చియు, మతముల చరిత్రను గురించియు చర్చలు జరిగెను. మహమ్మదీయులు అతని అభిప్రాయములతో నేకీభవింపరైరి. అపుడతడు వారితో ఇట్లనెను. "ఇతరదేశీయులసిద్ధాంతములను గూర్చియు, మతవిశ్వాసములను గూర్చియు మీకు తెలిసినది మిక్కిలి తక్కువగా నున్నది. అందుచే మీరు ఆ సిద్ధాంతములను తప్పుగా తెలియచెప్పుటకు చాలా అవకాశ మున్నది. వివరములు చాల తక్కువ దొరకుచుండుట వలన, పరిశోధనముకూడ మిక్కిలి కష్టము". అతడిట్లు చెప్పినను అక్కడ నున్నవారు, హిందువుల వేదాంత సాహిత్యములను గురించి విమర్శింపదొడగిరి. అల్బెరూని చాల బాధపడి, "మీకు హిందువులనుగురించి పూర్తి విషయములు తెలియవు. హిందువుల విశ్వాసములను, ప్రవర్తనమును గురించి యథార్థముగా తెలిసికొన దలచినచో, వారి మూలగ్రంథములను పరిశీలించుట అవసరము" అని ఉద్ఘోషించెను. తరువాత జరిగిన సభలోకూడ ఇదే విషయము ప్రస్తావనకు రాగా అల్బెరూనిని, అబుసహిల్, హిందువులనుగురించి "నీకేమి తెలియు"నని అడిగెనట! ఆ ప్రశ్నయే "కితాబుల్ - హింద్" అను గ్రంథ రచనమునకు మూల మయ్యెను.

పైన చెప్పిన విధముగ హిందూదేశమునుగురించి ఈ గొప్పదగు గ్రంథముయొక్క సంకలనమునకు పూర్వమే,

అల్బెరూనికి హిందువుల విద్యలయందుఎక్కువ ఆసక్తి ఉండెడిది. భారతదేశములో అడుగిడుటకు పూర్వమే జర్జన్‌వద్ద ఇతడు తన మొదటి గ్రంథాలలో పేరెన్నికగన్న "తూర్పుదేశముల కాలనిర్ణయము" అను గ్రంథమును సంకలిత మొనర్చెను. హిందువులు కాలమును నిర్ణయించు రీతి, వారి అధికమాసగణనా రీతులు, చంద్రుని స్థానములు, జ్యోతిషము మొదలగువాటినిగురించి, ఈ గ్రంథమునందు సమృద్ధిగా విజ్ఞానము లభించును. మొత్తము మీద పురాతన కాలమునందలి అన్నిదేశములవారును, కాలనిర్ణయము చేయుటలో అవలంబించిన అన్ని పద్ధతుల గురించియు సమాచారము ఈ గ్రంథమునందు కలదనుట నిక్కము. ఐనను ఇతడు సేకరించి, అచ్చటచ్చట ఇతర దేశీయ సంస్కృతులతో పోల్చుచు, భారతదేశమునుగూర్చి వ్రాసిన నూతన విశేషము లన్నియు ఈ గ్రంథనామము సూచించునట్లు, ఇందు కలవు. ప్రాచీనమయిన భారతీయ వేదాంతమునుగురించి ఇతడు చేసిన వర్ణనలు అసమానములు. సంస్కృత సాహిత్యము, నాటి భారతీయుల ఆచార సంప్రదాయముయొక్క భౌతిక స్వరూపము, మొదలగు విషయములను గురించి ఇతడు రచించిన అధ్యాయములు అపూర్వములు. ఇతని వాదములు, ప్రతిపాదనలు, విషయ ప్రధానములు. తాను వర్ణింప దలచిన ప్రజలయొక్క మానసిక ప్రవృత్తులను అనేకోదాహరణములతో ఇతడు విశదీకరించును. సంకోచము, పక్షపాతము లేకుండ, హిందువుల సంస్కృతి ఇతడు చిత్రించెను. సాధారణముగా గ్రంథమునందు ప్రతి అధ్యాయములో మూడుభాగములుకలవు. మొదటిభాగము అధ్యాయము నందలి ముఖ్యాశయమును ప్రతిపాదించును. రెండవభాగమున (అధ్యాయమున గల) విషయముపైగల సిద్ధాంతములు, ఆ విషయమునందలి వివిధాంశములపై ప్రాచీన హిందూగ్రంథములనుండి ఉద్ధృతములైన వాక్యములు ఉండును. మూడవభాగమునందు, భారతీయ సిద్ధాంతములను, గ్రీకులు, పారశీకులు మొదలగు ఇతర ప్రాచీన దేశీయుల సిద్ధాంతములతో పోల్చి ఇతడు పరిశీలించును. ఇతని గ్రంథములందు విషయసంపత్తి కలదు. భావయందు అసమగ్రత, పునరుక్తులు ఉండవు. విషయ ప్రతిపాదనము నిపుణముగా నుండును. పైనచెప్పిన విధముగ "కితాబుల్-హింద్" ఒక్కటే ఇతడు భారతదేశమును గురించి వ్రాసిన గ్రంథము కాదు. ఇత డీ దేశమును గురించి వ్రాసిన గ్రంథములు ఇరువదివరకు కలవు. వీటిలో కొన్ని సంస్కృతానువాదములు. మరికొన్ని గ్రంథములు ఆద్యములయిన సంకలనములు, వాటికి ఉత్తమమును, విశ్వాస్యమునయిన ఉపాదేయసామగ్రి (data) ఆధారము.

మహమ్మదు కొడుకయిన సుల్తాన్ మసూద్ పోషణలో 1030 వ సం. న అల్బెరూని రచించిన "కానూన్‌మాస్ ఉది" అను ప్రఖ్యాతగ్రంథమే ఇతడు వ్రాసిన వాటిలో నెల్ల ఉద్గ్రంథమని చెప్పవచ్చును. తండ్రివలెనే ఇతడు విద్యాపోషకుడు. ఈ ఉద్గ్రంథమును అల్బెరూని మసూద్ నకు అంకితము చేసెను. ప్రకృతి శాస్త్రములకు సంబంధించిన పుస్తకము లెన్నియో అప్పటికే అతడు ప్రచురించియుండెను. ఈ విశాలమయిన ఉప భూఖండమంతయును ఒకప్పుడు నీటియందుండెననికూడ అతడు ఊహించెను. గ్రీకులయొక్కయు, భారతీయులయొక్కయు ఖగోళశాస్త్రములందు అనంతములైన పరిశోధనములు కూడ ఇతడు జరిపెను. మసూద్, "గజినవీ సింహాసనమును అధిష్ఠింపగా, తన ఖగోళశాస్త్ర విజ్ఞానమును సమీకరించి క్రొత్త సిద్ధాంతములు చేయుటకు అనువయిన కాలము ఆసన్నమయ్యెనని అల్బెరూని భావించెను. ఈ మొత్తము పుస్తకములో నాలుగు సంపుటము లున్నవి. ఇందు ఖగోళ-వైజ్ఞానిక శాస్త్రములకు సంబంధించిన గూఢ వివరములు కలవు. ఇది అముద్రితముగానుండుట, కొంతవరకు మాత్రమే అనువదింపబడుట, దురదృష్టము. ఇప్పుడయినను ఇది ముద్రింపబడినచో చాల సముచితముగా నుండును. మొత్తముమీద ఈ "కానూన్" అను గ్రంథము, త్రికోణ మితిశాస్త్రము, భౌతికభూగోళశాస్త్రము, ఖగోళశాస్త్రము మొదలగు శాస్త్రములందలి విషయములను ప్రతిపాదించునదై, అల్బెరూని కాలము నాటి వివిధ విషయములను గురించిన విజ్ఞానమునకు ఆధిక్యమును చేకూర్చుచున్నది. తన ఈ గొప్ప గ్రంథారంభమున ఇతడు ఈ విధముగ వ్రాసెను. "ఏ శాస్త్ర విషయమున నయినను ప్రతివ్యక్తియు నెరవేర్పవలసిన కర్తవ్యమును నేమును నెరవేర్చితిని. పూర్వులు అందిచ్చిన ఆద్య

మయిన విజ్ఞానమును కృతజ్ఞతతో స్వీకరించితిని. నాకు తోచిన తప్పులను నిర్భయముగా దిద్దితిని. నన్ను అనుసరించు ఉత్తరకాలికుల ఉపయోగము కొరకు నా పరిశోధనా ఫలితమును వ్రాత రూపమున రచించి యుంచితిని.

ఒకప్పుడు అంగీకరింబడిన సిద్ధాంతమునకు వ్యతిరేకముగా భూమి గుండ్రముగా నున్నదని ఊహింపబడినది. మహమ్మదు యొక్క ఆస్థానమందున్న మహమ్మదీయ ఖగోళ శాస్త్రజ్ఞులు మధ్యాహ్న రేఖ యొక్క వృత్తాంశమును (arc of the meridian) కొలుచుటకు ప్రయత్నించిరి. కాని క్లిష్టమైన త్రికోణమితి శాస్త్ర పద్ధతితో పూర్వమునందలి తప్పులను సరిదిద్ది భూమి యొక్క వ్యాసార్ధమును, వ్యాసమును, పరిధిని కొలిచి, దిఙ్మండలము యొక్క లోతును ఆధారము చేసికొని ఖగోళము యొక్క పూర్తి విస్తీర్ణమును, ఘనఫలమును (Volume) నిర్ణయించు గౌరవము అల్బెరూనికే దక్కెను. పంజాబులో ఉన్న నందానా అను శిఖరము యొక్క ఉచ్ఛ్రితిని (Altitude) ఆధారము చేసికొని ఈ గణనలు (Calcula tions) నిర్ణయింపబడినవి. అల్బెరూని నిర్ణయించిన భూమి వ్యాసార్ధము నేటి గణనలకంటె డెబ్బదిమైళ్ళచే తక్కువగుచున్నదనుట స్పష్టము. నేటి ఖగోళ శాస్త్రజ్ఞులకు లభ్యమగు కొలతపరికరముల సాయము లేకుండ అల్బెరూని ఈ నిర్ణయము చేయగలుగుట ఆశ్చర్యకరము.

"కానూన్ మసూద్" అను గ్రంథమునందలి మూడవ భాగమునందు త్రికోణమితి శాస్త్రమునకు సంబంధించిన ఆకృతులు, త్రిజ్య, (Sine) జ్య, (cosine) స్పర్శరేఖ మొదలగునవి ప్రతిపాదింపబడినవి. ఇతడు భారతదేశములో ఉద్భవించిన కొన్ని సిద్ధాంతముల నాధారముగా గొనియున్నట్లు కనిపించును. ఐనను యథాక్రమమయిన ఆధునిక రూపమును వాటి కొసగినవా డితడే. వర్తుల స్తంభాకారము కలిగిన (astrolaba) అను దూరనిర్ణయ సాధనమును ఇతడే కనిపెట్టెను. ఈ పరికరము యొక్క సహాయముతో నక్షత్రాదులను (Heavenly bodies) పరిశీలింపగలుగుటయేగాక, దూరమునందలి వస్తువుల యొక్క ఎత్తును, దూరమునుకూడ అల్బెరూని నిర్ణయింపగల్గెను. ఘనమూలము, నిష్పత్తి (ratio), అనుపాతము (Proportion), సంధ్యాకాలము, గ్రహణములు తెలిసికొను పద్ధతి కూడ అల్బెరూని కనిపెట్టెను. తోకచుక్కలు ఉత్పాతములు మున్నగు అనేక విషయముల జ్ఞానమునందు ఇతడు నిష్ణాతుడు. వీటిలో ఒక్కొక్క విషయమే పరిశోధకుని యావజ్జీవమును హరింపదగి యున్నది.

అల్బెరూని అన్ని కాలములకు చెందిన అత్యుత్తమ శాస్త్రజ్ఞులలో నొకడుగా నిస్సందేహముగా పరిగణింపబడదగినవాడు. మరియు భారతీయ విజ్ఞానమునందతడొనర్చిన పరిశోధనములు, ప్రదర్శించిన విపుల దూరదృష్టి, పరాభిప్రాయ సహిష్ణుత, మున్నగువాటిచే భారతదేశమునకును, నాటి ముస్లిము రాజ్యములకును మధ్య అతడు దృఢమైన సంబంధానుబంధములను కల్పించినవాడునై యున్నాడు.

హెచ్. కె. షె.

**అల్బేనియా :-** ఇది ఐరోపాఖండము యొక్క ఆగ్నేయభాగములో బాల్కన్ ద్వీపకల్పమునందు ఏడ్రియాటిక్ సముద్రతీరముననున్న రాజ్యము. దీనికి పశ్చిమమున ఏడ్రియాటిక్ సముద్రమును, పూర్వోత్తరభాగములలో యుగోస్లేవియాయు, దక్షిణమున గ్రీసును ఉన్నవి. దీని వైశాల్యము 10,629 చ. మై. జనసంఖ్య 13 లక్షలు. ఇది పర్వతమయమగు దేశము. సముద్రతీరమున మాత్రము సారవంతమయిన సన్నని మైదాన మున్నది. ఉత్తరదిశయందుగల పర్వతములు సుమారు 8 వేల అడుగుల ఎత్తుగలవి. ఉత్తరభాగములో "డ్రిన్" అనునదియు దక్షిణమున "వొయుట్సా" అనునదియు, ప్రవహించును. "ష్కుంబి" అను మరియొక నది అల్బేనియా నట్టనడుమ భాగములో ప్రవహించుచు, దేశమును రెండు భాగములుగా విభజించుచున్నది. ఉత్తరార్ధములో "ఘెగ్" భాష మాట్లాడువారు, దక్షిణార్ధములో "టోస్క్" అను భాష మాట్లాడువారు నివసించుచున్నారు.

అల్బేనియా పర్వతమయమగు దేశము అగుటవలన ముఖ్యనగరములను కలుపు కొలదిపాటి రోడ్లు తప్ప వేరు రాకపోకల సౌకర్యములు లేవు. డురాజో, వలోనా, సారాండే, అనునవి ఏడ్రియాటిక్ తీరమున ముఖ్యమయిన రేవుపట్టణములు. రాజధాని "స్కూటారి". అది ముప్పది వేలజనాభాగల నగరము. కోరిట్సా, ఎల్బాసాని, అర్గిరో

కాస్ట్రిన్, చెరాటి పేర్కొనదగిన నగరములు. వ్యవసాయమే జనుల ప్రధాన వృత్తి. గోధుమలు, పొగాకు, ఇతర ధాన్యములును పండును. ప్రత్తికూడ కొలదిగా పండును. ఇటీవల దేశములో పరిశ్రమలుకూడ అభివృద్ధి చెందుచున్నవి. రాగి, బొగ్గు ముఖ్యమయిన ధాతువులు. ఇవికాక పెట్రోలియం, లిగ్నైట్, అలుమోనియం, ఆస్ఫాల్టుకూడ లభించును. పెట్రోలియం ఉత్పత్తి బాగుగా పెంచుటకు ప్రయత్నములు సాగుచున్నవి.

1951 లో అల్బేనియా ప్రభుత్వము ఒక పంచవర్ష ప్రణాళికను సిద్ధముచేసికొని, దానిప్రకారము ఉత్పత్తి పెంచుటకు కృషిచేయుచున్నది. 1955 వ సంవత్సరాంతము నాటికి 11.1 బిలియను లెక్కు విలువగల వ్యవసాయ పదార్థముల ఉత్పత్తిని; 8. 2 మిలియను లెక్కు విలువగల పారిశ్రామిక వస్తూత్పత్తిని చేయవలెనని అంచనా వేయబడినది. గనులనుండి ధాతువుల త్రవ్వకముకూడ ఎక్కువ చేయుచున్నారు. దేశములో భూసంస్కరణలు అమలుపరచినారు. 1954 వ సంవత్సరములోనే 70 వేల సేద్యపు భూఖండములు భూమిలేని రైతులకు పంచిపెట్టబడినవి. 1954 వ సంవత్సరపు బడ్జెటు అంచనాల ప్రకారము అల్బేనియా ఆదాయము 1020 కోట్ల లెక్కులు. వ్యయము 990 కోట్ల లెక్కులు. (50 లెక్కులు=1 డాలరు.)




విద్య : ఈ దేశములో విద్య ప్రభుత్వాధీనములో ఉన్నది. బాలబాలికలందరు ఏడు సంవత్సరముల నిర్బంధ ప్రాథమిక విద్య పొందుదురు. ఇచ్చట సుమారు 2 వేల 5 వందల ప్రాథమిక పాఠశాలలు కలవు. ముఖ్యపట్టణములలోను, జిల్లా కేంద్రములలోను పెక్కు సెకండరీ పాఠశాలలు కలవు. ఇచ్చట విశ్వవిద్యాలయము లేదు. వృత్తివిద్యాసంస్థలు మూడు కలవు. నిరక్షరాస్యతా నిర్మూలనమునకు అనేకములైన వయోజన విద్యాప్రణాళికలు అమలుపరచుచున్నారు. అయినను, నిరక్షరాస్యత దేశములో ఎక్కువగానే ఉన్నది. దేశమందంతటను 12 దైనికవార్తా పత్రికలును, 20 ఇతరపత్రికలును కలవు. అన్నియును ప్రభుత్వాధీనములోనే ఉన్నవి.

భాష : జనులభాష అల్బేనియన్ భాష. ఇది ఇండో యూరోపియన్ భాషా కుటుంబములోని ఇల్లిరియన్ తెగకు చెందినది. ఘెగ్, టోస్క్ అనునవి రెండును మాండలికములు. ఉత్తరదేశస్థులందరు ఘెగ్‌ను మాట్లాడుదురు. దాక్షిణాత్యులభాష టోస్క్. మరియు, దక్షిణదేశములో గ్రీకుభాషమాటాడువారుకూడ కొందరున్నారు.

జనులలో 68% ముస్లిములు, 23% గ్రీకు - ఆర్థో డాక్సు క్రైస్తవులు. 11% రోమన్ క్యాథలిక్కులు ఉన్నారు.

ప్రభుత్వము : అల్బేనియా కమ్యూనిస్టు ప్రజాస్వామిక రాజ్యము. "కమ్యూనిస్టు పీపుల్సు రిపబ్లిక్" ప్రభుత్వము కార్మికుల చేతులలో ఉన్నది. దేశము 10 జిల్లాలుగా విభజింపబడి ఉన్నది. 17 ఏండ్లు నిండిన స్త్రీ పురుషు లందరకును వోటింగు హక్కుకలదు. 10 వేల జనాభాకు ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకొనబడి "పీపుల్సు ఎసంబ్లి" ఏర్పడును. ప్రధానమంత్రికాక పదుగురు మంత్రులుగల మంత్రిమండలి పరిపాలనమును నిర్వహించును. 1954 నుండి మహమత్ షెహూ ప్రధానమంత్రిగా ఉన్నాడు. 1953 లో హాజీలెచీ (Hadji Lechi) పీపుల్సు అసెంబ్లీకి అధ్యక్షుడుగా నియమింపబడెను.

చరిత్ర : ప్రాచీన ఇల్లీరియా మరియు ఎపిరస్ ప్రాంతములతో కలిసి ఉన్న అల్బేనియా క్రీస్తునకు పూర్వము నుండియే ఎందరో పాలకుల అధికారములో ఉండుచు వచ్చినది. కాని ఎవరి అధికారమైనను తీరప్రాంతములకే

పరిమితమై ఉండెడిది. కాని అంతర్భాగములోని కొండ జాతులవారిని లోబరచుకొనలేకపోయినది. ఎపిడామ్నస్, అపొలోనియా తీరనగరములు, కార్ఫా, కార్నిత్ రాజ్యముల వలసలుగా ఉండెడివి. లోపలి కొండజాతుల సరదారులు స్వతంత్రులుగానే ఉండెడివారు. క్రీ. పూ. 3 వ శతాబ్దమువరకు అల్బేనియా ఉన్నత దశకు వచ్చినది. ఆ తరువాత మాసెడోనియా, రోమను దేశముల పరస్పర ఘర్షణలో రాపిడిపడెను. క్రీ. శ. మొదటి శతాబ్దము నాటికి పేరునకు మాత్రము ఇది రోమన్ పరిపాలనలో ఉండినది. 5 వ శతాబ్దములో "ఆస్ట్రోగోత్స్" (తూర్పు జర్మనులు) ఈ దేశమును అక్రమించిరి. మొదటి జస్టినియన్ చక్రవర్తిచే జయింపబడి ఈ దేశము 535 లో బైజాంటైన్ సామ్రాజ్యములో నొక భాగమైపోయినది. కాని అప్పుడుకూడ తీరప్రాంతములవరకే విజేతల పరిపాలన పరిమితమయి ఉండెడిది.

11 వ శతాబ్దము తరువాత అల్బేనియా అంతర్జాతీయ సంఘర్షణలకు రంగస్థలమైనది. 1082 లో రాబర్టు గైస్కార్డ్ యొక్క నాయకత్వమున నార్మనులు బైజాంటైన్ సామ్రాజ్యముతో పోరునకు దిగిరి. 1272 లో నేపుల్సు రాజయిన మొదటి చార్లెసు అల్బేనియా రాజయ్యెను. డురాజోరేవు వెనీస్ అధికారములోనికివచ్చెను. తరువాత కొలదికాలమునకు అల్బేనియా టర్కీ హస్తగత మయ్యెను. అల్బేనియా జాతీయ వీరు డయిన స్కాండర్ బర్గు టర్కీవారిని తీవ్రముగా ప్రతిఘటించెను. వెనీస్, నేపుల్సు రాజ్యములు అతనికి తోడ్పడినవి. 1478 నాటి టర్కీలో ఆటోమన్ సామ్రాజ్యము ఏర్పడెను. అల్బేనియా, ఆ సామ్రాజ్యములో చేరిపోయినది. డురాజోనును, 1501 వరకు వెనీస్‌వారు తమ చేతిలో నిలుపుకొనిరి. ఆటోమన్ సామ్రాజ్యాధికారము చాలకాలము సాగినది. ఈ కాలములోనే అధిక సంఖ్యాకులు ఇస్లాం మతమును స్వీకరించిరి.

1912 లో మొదటి బాల్కన్ యుద్ధము జరిగెను. దానితో అల్బేనియా వారికి స్వాతంత్ర్య సంపాదనావకాశము లభించినది. అంతర్జాతీయ సంఘమొకటి అల్బేనియా సరిహద్దులను నిర్ణయించినది. ఇంతలో 1913 లో రెండవ బాల్కన్ యుద్ధము తటస్థించెను. తత్ఫలితముగా అల్బేనియా సర్బులచే ఆక్రమింపబడెను. 1914 లో విలియమ్‌అను నతడురాజయ్యెను. అతని మంత్రి ఎసాద్ పాషా అనునతడు రాజును తరిమివేసి తానే పాలకుడయ్యెను. ఇంతలో మొదటి ప్రపంచ మహా సంగ్రామము ప్రారంభమయ్యెను. సర్బులు, గ్రీకులు, ఇటాలియనులు అల్బేనియాను ఆక్రమింప మొదలిడిరి. 1916 లో బల్గేరియనులు ఆస్ట్రియనులును ఈ దేశములో ప్రవేశించిరి. యుద్ధము ముగియు వరకు అల్బేనియా రణరంగముగా నుండెను.

1928 లో అహమదుజంగు అను ముస్లిం నాయకుడు తాను అల్బేనియా రాజునని ప్రకటించుకొని నిరంకుశముగా పాలించెను. రెండవ ప్రపంచ మహా సంగ్రామము ప్రారంభము కాగానే అల్బేనియా మరల యుద్ధ రంగముగా మారెను. 1939 లో ఈ దేశముపై ఇటలీవారు దురాక్రమణ జరిపిరి. ఇటలీ రాజైన మూడవ ఇమ్మాన్యుయల్ చక్రవర్తిగా ప్రకటింపబడెను. 1940 లో ఇటాలియనులు గ్రీసుపయి దాడిచేసిరి. దక్షిణ అల్బేనియా రణరంగముగ మారెను. దేశమున ఫాసిస్టు వ్యతిరేక వర్గము లేర్పడెను. స్వాతంత్ర్యము కొరకు ఇటాలియనులపయి గొరిల్లా యుద్ధము సాగించిరి. వీరిలో ఎన్వర్ హాక్సుహా **(Envar Hoxha)** అను నతని నాయకత్వమున వామ పక్షము ఏర్పడి విజృంభించినది. 1946 వరకు హాక్సుహా సైన్యములు అల్బేనియాలో చాల భాగమును ఆక్రమించి 1946 సం. 11 జనవరినాడు "రిపబ్లిక్"గా ప్రకటించెను. హాక్సుహా అధ్యక్షతలో కమ్యూనిస్టు ప్రభుత్వము ఏర్పడెను. నాటినుండియు ఈ దేశమును నియంతగా హాక్సుహా పరిపాలించుచున్నాడు. 1946 సం. మార్చి 7 వ తేదీనాడు నూతన రాజ్యాంగము ఆమోదింపబడినది. నాటినుండి అల్బేనియా సోవియట్ కూటమిలో చేరిఉన్నది. యూగోస్లావియా సోవియట్ రష్యానుండి విడిపోయిన తరువాత అల్బేనియాకూడ యూగోస్లావియాతో విడిపోయి ఆర్థికముగాను, వ్యాపార దృష్టిలోను చాల చిక్కులపాలయినది. 1954 వ సంవత్సరములో యూగోస్లావియాతో స్నేహపు ఒడంబడిక చేసికొన్నది.

1946 నుండి నిరాఘాటముగా సాగుచు వచ్చిన హాక్సుహా ప్రభుత్వము 1953 లో కూలిపోయినది.

ఉ. రా.

**అల్లసాని పెద్దన :-** స్వారోచిష మనుసంభవ కర్తగా అల్లసాని పెద్దన యాంధ్రసాహిత్య లోకమున సుప్రసిద్ధుడు. ఈయన నందవరీక బ్రాహ్మణుడు. ఋగ్వేది. ఆశ్వలాయన సూత్రుడు. వశిష్ఠసగోత్రుడు. తండ్రిపేరు చొక్కనామాత్యుడు. బళ్ళారి మండలమునందలి 'దోరాలయము' లేక 'దోరాల' యను గ్రామ మీ కవి జన్మస్థాన మని జనశ్రుతి కలదు. ఈతని బాల్యమునుగూర్చియు విద్యాభ్యాసమును గూర్చియు మన కంతగా తెలియదు. శఠకోపయతి తనకు గురు వని తెలిపి, మనుచరిత్ర పీఠికలో పెద్దన గురుస్తుతి కావించెను. తన కవిత్వము శఠకోపయతి ప్రసాదాసాదిత మని యితడు వాకొనెను. శిష్యుడయిన పెద్దన కీ శఠకోపస్వామి హయగ్రీవ మంత్రము నుపదేశించెననియు, తత్ప్రసాదమున నతనికి కవితాధార సిద్ధించెననియు గొందరు వ్రాసిరి. ఏది ఎట్లున్నను విద్యాభ్యాసానంతరమున పెద్దన యెట్లో కృష్ణరాయల యాస్థానమును జేరి అష్టదిగ్గజములలో నగ్రగణ్యుడని పేరొందెను. పారిజాతాపహరణ కర్త యగు నంది తిమ్మన, రాజశేఖరచరిత్రమును రచించిన మాదయగారి మల్లనయు, కాళహస్తి మాహాత్మ్య రచయిత యగు ధూర్జటియు నితనికి సమకాలికు లగుటయేగాక, రాయల యాస్థానమునందే యుండిరి. అష్టదిగ్గజములలోనివారే యగు మాదయగారి మల్లన్నయు వసుచరిత్ర కర్త రామరాజభూషణుడును, పెద్దనకు శిష్యులని ప్రసిద్ధి.

సంస్కృతాంధ్రములయందు పెద్దన గొప్ప పండితుడు; కర్ణాటక భాషా పరిచితియు కలవాడు. పురాణాగమేతిహాస కథార్థశ్రుతియుతుడు. చతుర్విధ కవితా విశారదుడు. చతుర వచోనిధి. కవి పండిత మండిత మగు నిండుసభలో నసమాన మగు నాశుకవితాధోరణిచే 'సాహిత్య సమరాంగణ సార్వభౌము' డగు కృష్ణరాయలను మెప్పించి, బిరుదు గండపెండేరమును తన పాదమున తొడిగించుకొనిన మేటి. ఆస్థాన కవిశ్రేష్ఠుడుగను, పరీక్షాధికారిగనుఉండియు ఈర్ష్యారహితుడై యనేకాంధ్ర కవులకు రాయలచే సన్మానము చేయించిన యుదార శీలుడు. శ్రీకృష్ణదేవరాయ లతనిని 'ఆంధ్రకవితా పితామహ' బిరుదముతో బహూకరించెను. ఈ బిరుదము పెద్దనకు పూర్వమునను, పరమునను నున్నదేయైనను నిది యితనిపట్ల నన్వర్థమైన ట్లన్యులయెడ కాలేదు. తన పోషకుడగు రాయలచే నితడందిన గౌరవ మసాధారణము. ఈ కవి యెదురయినచో రాయలు తన మదకరీంద్రము డిగ్గి కేలూత యొసగి యెక్కించుకొను చుండెనట మను చరిత్రమును కృతినందువేళ పల్లకిని తన కేలబట్టి యెత్తెనట. ఇంతమాత్రమేకాక రాయ లితనికి నడిగిన సీమలం దనేకాగ్రహారములిచ్చి మన్నించెను. విశేషముగ రాజసన్మానము లందిన యాంధ్ర కవులు శ్రీనాథ, పెద్దన లిరువురే.

శ్రీనాథుని వలెనే పెద్దనయు యౌవనమున సమస్త భోగభాగ్యము లనుభవించెను. కాని వార్ధక్యమున నతని వలె నిడుమల బడలేదు. రాయలు పెద్దనకొసగిన యగ్రహారము లనేకములు. వానిని జీవితాంతము దాననుభవించుటేకాక, కోకట గ్రామమునకు 'శఠకోపపుర' మని పేరుపెట్టి దానిని దేవబ్రాహ్మణుల కగ్రహారముగా నొసగి పెద్దన తన గురుభక్తిని ప్రకటించుకొనెను. శఠకోపయతికి శిష్యుడయిన పిదప నీకవి వైష్ణవ మతాభిమానిగా మారెనని తెలియుచున్నది. అట్లయ్యు నితడు పరమత ద్వేషములేక యద్వైతభావము గలిగియుండెను. పెద్దన తన యగ్రహారములలోని కొంత భూమిని శివకేశవులకు నిరువురకును ధూపదీప నైవేద్యాది అంగరంగ భోగములకు దానముచేసి యుండుటయు, మనుచరిత్రాదిలో నీశ్వరస్తుతి గావించుటయు నిందుకు తార్కాణములు. ప్రభువులవలన నగ్రహారములు పడసిన కవులు పలువురు కలరు. కాని వారిలో ననేకములను దేవబ్రాహ్మణ వినియోగమునకు శాసన పూర్వకముగా దానముచేసిన యాంధ్ర కవిశిఖామణి పెద్దన యొక్కడే! పెద్దన మనుచరిత్రమను ప్రబంధమును మాత్రమేకాక హరికథాసారమను గ్రంథమునుగూడ రచించినట్లు రంగారాట్ఛందాదుల వలన తెలియుచున్నది. కాని యీ గ్రంథము లభింపలేదు. ఇవికాక యితడు సీసపద్య శతకమును రచించెనని కొందరును, రామస్తవరాజము, అద్వైత సిద్ధాంతము అను మరిరెండు కృతులను వ్రాసెనని కొందరును వ్రాసిరి. కాని వీనినిగూర్చి మనకేమియు తెలియదు. సత్యావధూ ప్రీణనాది సంస్కృత గ్రంథములు 'ఆముక్త మాల్యద' యను నాంధ్ర ప్రబంధముగూడ

పెద్దన విరచితములేయని పూర్వలాక్షణికులును, వ్యాఖ్యాతలును వ్రాసిరి. ఈ వ్రాతలు నిజము కావనియు శ్రీకృష్ణదేవరాయలే పై గ్రంథముల రచించెననియు నాధునిక పండిత విమర్శకులు నిర్ధారించిరి. అనేకులు దీని నామోదించిరి.

పదునారవ శతాబ్దమునకు పూర్వపు టాంధ్రకవు లందరును నన్నయ మార్గము ననుసరించి సంస్కృత పురాణములనో, కావ్య నాటకాదులనో తెనిగించుచు నాంధ్ర సారస్వతము నభివృద్ధి కావించిరి. కాని వీరు స్వతంత్ర రచనలకు పూనరయిరి. ఇట్టియెడ పదునారవ శతాబ్ది ఆరంభమున అల్లసాని పెద్దన మనుచరిత్రమును రచించి ప్రబంధ కవులకు మార్గదర్శి యయ్యెను. మను చరిత్రమునకే స్వారోచిష మనుసంభవ మనునది నామాంత రము. ఇందలి కథ మార్కండేయ పురాణాంతర్గతము. ఈ పురాణమును పెద్దనకు పూర్వుడగు మారనకవి తెని గించెను. ఇయ్యుభయ పురాణముల ననుసరించి పెద్దన మనుచరిత్రమను మహా ప్రబంధమును రచించెను. మూలములోని కథను చాలవర కీకవి యథాతథముగ గైకొనెను. ఔచితీ పోషణమునకై కొన్ని చిరుమార్పులు కావించెను. స్వారోచిషుడను ద్వితీయ మనువుయొక్క జన్మ వృత్తాంత మిందలి యితివృత్తము. ఈకథ మూలము నందు స్వారోచిషుని పితరుడగు స్వరోచియొక్క సంభవ మునకు హేతుభూతమగు వరూధినీ ప్రవరుల వృత్తాం తముతో ప్రారంభమయి, స్వారోచిషునకు మనుత్వము సిద్ధించుటతో ముగియుచున్నది. పెద్దనయు నీకథ నిట్లే చిత్రించెను. ఈ కారణముననే కొందరిందు వస్త్వైక్యము లేదనుటకు వీలయ్యెను. కాని నాటకములందిది పాటింప బడినంతగా కావ్యములందు పాటింపబడక పోవుటచేత దినియొక లోపము కాజాలదు. పురాణ కథనే చేపట్టినను పెద్దన యిందు లాక్షణిక నిర్దిష్టములగు నష్టాదశ వర్ణన లను సందర్భోచితముగా కల్పించి మిక్కిలి రసవంత ముగా వర్ణించి మూలకథను నాల్గురెట్లు పెంచి మను చరిత్రము నొక స్వతంత్ర ప్రబంధముగా నిబంధించెను. ఇందలి వర్ణనములలో పెక్కులు స్వకపోల కల్పితము లగుటచే నిది యనువాద గ్రంథముకాదు. కథ పురాణ ప్రసిద్ధమగుటవలన కల్పితమునుకాదు. ఇందలి ప్రధాన రసము శృంగారము. ఇతర రసములును యథోచితముగ పోషింపబడెను. మొదటిదగు ప్రవర వరూధినీ వృత్తాంత మును పెద్దన మిక్కిలి మనోహరముగను రసవంతము గను రచించి కృతకృత్యుడయ్యెను. రససమంచిత కథ లతో కూడిన స్వారోచిషమను సంభవ కథను చతుర రచనతో ప్రబంధముగ రచించుటయే కృతిభర్త యొక్కయు కృతికర్త యొక్కయు ఉద్దేశమని మను చరిత్ర పీఠిక వలన తెలియుచున్నది.

కవి యిందు నాటకఫక్కి ననుసరించి కూర్చిన వరూ ధినీ ప్రవరుల సంభాషణము హృద్యాతిహృద్యము. ఇట్టి సంభాషణములు, సంవాదములును కల సందర్భము లీప్రబంధమున మరికొన్ని గలవు. ఐనను ప్రవరవరూధినుల సంభాషణ రూపపద్యములు పెద్దన రచనాచాతుర్యము నకును ఔచితీనిర్వహణనైపుణికిని చక్కని నిదర్శన ములు. అందును వారి తొలిసంభాషణములోని 'ఎవ్వతె వీవు' 'ఇంతలు కన్నులుండ' అను రెండు పద్యములును రెండు రత్నములు. ఉత్కృష్టమైన వ్యంగ్యవైభవశోభిత ములు. 'అల్లసానివాని యల్లిక జిగిబిగి' వీనియందు పరా కాష్ఠనంది వ్యక్తావ్యక్తముగా కానవగును. ప్రవరునిపాత్ర యాంధ్రసాహిత్యమునందు విశిష్టమైనది. అతని మనోజ్ఞ మూర్తి, ధర్మకర్మదీక్ష, ఏకపత్నీవ్రతము, పరస్త్రీవైము ఖ్యము, శాంతరసమొల్కు బ్రహ్మతేజస్సు, వైరాగ్య వహ్ని తప్తమై పుటములుదేరిన యతని మనోనైశ్చల్యము మున్నగు ధీర శాంతగుణములు మనుచరిత్ర ప్రథమ ద్వితీయాశ్వాసములలో కన్నులగట్టినట్లు చిత్రింపబడినవి. ననవిల్తు శాస్త్రంపు మినుకులను వెన్నతో నభ్యసించిన ప్రౌఢయగు వరూధినీ వచోవైదగ్ధ్యమును కామశాస్త్రో పాధ్యాయిత్వముక్రింద కట్టివేసిన అకాముకు డితడు. ఆమె మేని జవ్వాది పసగదంబించు నొడలు గడిగికొని వార్చి శుచియైన వాసనారహితుడు. పెద్దనవంటి సిద్ధ హస్తుని చేతిలో పడుటచేత ప్రవరుడు కేవలప్రబంధ మాత్రోపజీవికాక, యాంధ్రుల హృదయప్రపంచమున శాశ్వత సజీవవ్యక్తిత్వమును సంపాదించుకొన గలిగెను. దేవవేశ్యయగు వరూధినియందు, తాము వలచినవారిని వలలో వైచుకొనుటకై వారవనిత లుపచరించు వగలు, వలపులు చూపి, యవి నిష్ఫలము లైనపుడు వానిని

లకు మార్చి, ప్రస్వభావము నత్యంత సహజముగ చిత్రించెను. కావుననే 'పాటున కింతులోర్తురె' యని పెద్దన వ్రాసిన పద్యము ననుసరించి తర్వాతి ప్రబంధములలో రోదనపద్యము లనేకములు పుట్టినవి.

తృతీయాశ్వాసమున మాయాప్రవరుని వంచకస్వభావమును గ్రంథకర్త నేర్పుతో జిత్రించెను. ఈ ప్రబంధము నందలి మొదటి మూడాశ్వాసములు రసవత్తరములు. మధురభావ విలసిత చతుర కవితాశోభితములు. నాల్గవ ఆశ్వాసమునందలి స్వరోచికృతమైన వేటయంతయు పెద్దన కల్పించినదే. పెద్దన శృంగారశాకుంతలములోని వేట ననుసరించి దీనిని సృష్టించి పెంచి వ్రాసెను. భావయు, శైలియు ప్రత్యేకమై యుండుటయేగాక యిది కవియొక్క లోకజ్ఞానమునకు గీటురాయివంటిది. మనోరమా వృత్తాంతము నీయాశ్వాసముననే కలదు. మనోరమా స్వరోచుల వివాహము సంప్రదాయానుసారముగా విపులముగా వర్ణింపబడినది. కడపటి దగు నారవయాశ్వాసమున కళావత్యాదుల శాపమోచనము, స్వరోచితోవారి పరిణయము, వనదేవతయందు స్వారోచి జననము, తపస్సు, విష్ణుసాక్షాత్కారము, స్వారోచికి మనుత్వసిద్ధి, అతని రాజ్య పరిపాలనము అను విషయములు కలవు.

ఈ ప్రబంధమున సందర్భానుసారముగ ననేకనీతులుపదేశింప బడినవి. చతుర్థ పురుషార్థకామి యగు వైదిక గృహస్థునకు ప్రవరు డాదర్శ పురుషుడు. ప్రవరసిద్ధుల సంభాషణమునందు గార్హస్థ్య సన్న్యాస ధర్మములను వాని యౌత్కృష్ట్యమును తెలుపబడినవి. వరూధినీ ప్రవరుల ఘట్టమున బ్రహ్మానందమును గోరువారు శమదమాదిగుణ సంపన్ను లగుటతోబాటు పరవిత్త పరనారీ విముఖులు కావలెననియు ధర్మకర్మాద్యనుష్ఠానములచే నివి సుసాధ్యము లనియు, నిశ్చల వైరాగ్య చిత్తులగు ధీరుల చిత్తముల నెట్టిపరిస్థితియందును స్త్రీల మాయలు కలంచజాలవనియు, కవి సూచించెను. మరియు ధర్మకామములకు సంఘర్షము కలిగినపుడు యత్నముచే ప్రవరునివలె ధర్మమునే రక్షించుకొనవలెననియు కవి బోధించెను. దివ్య జ్ఞాన సంపన్ను లయ్యును కేవల కాముకు లెట్లు పరుల మోసములకు లోనగుదురో, పరవంచన కెట్లు తలపడుదురో ఈ విషయముల వరూధినీ మాయాప్రవర వృత్తాంతములు క్రమముగా నెరిగించుచున్నవి. ధర్మ సమ్మతమయ్యును బహుభార్యాత్వము నింద్య మనియు, స్వకళత్రమునం దయినను నమితభోగేచ్ఛగల వాని బ్రతుకుపై పశుపక్ష్యాదులకు సైతము రోత కలుగు ననియు స్వరోచి వృత్తాంతమువలన తెలియుచున్నది.

ఒక్క ప్రవరునిపాత్ర తక్క యిందలి పాత్ర లన్నియు నతి మానుషము లయిన గంధర్వాప్సరాది దేవతాపాత్రలు. స్వరోచిపాత్ర మనుజ గంధర్వ సమ్మిశ్రితముగా గోచరించును. అట్లయ్యును వాని సుఖదుఃఖాదులందు మనకు సంపూర్ణ సానుభూతి కలుగునట్లు కవి వానిని నిపుణముగ పోషించెను. కోపస్వభావులును శాపాయుధులు నగు మునులును నిందుగనుపింతురు శాంత స్వభావుడగు ప్రవరుని పాత్రకు వన్నె దెచ్చుటకే వీరి కథలు పెంచి వ్రాయబడినట్లు తోచును. ఇట్లీ మహాకవి మూల కథను పెంచి రసభావపూరిత మహాప్రబంధముగ తీర్చి దిద్దుటచే నాంధ్రకవితాపితామహ బిరుద మితనియందు సార్థకము. దీనికితోడుగా చక్కని ప్రకృతి చిత్రములను, సుందర సన్నివేశములను, సందర్భానుకూలము లయిన సరస సంభాషణములను పొందుపరచి, నుడికారములను వాడి, జాతీయములను సంతరించి, శబ్దార్థాలంకారములను సవరించియు పెద్దన తనప్రబంధమునందలి యందము నధిక మొనర్చెను. ఈ కారణముననే రామరాజభూషణుడును తదితర ప్రబంధ కవులును మనుచరిత్రము ననుసరించి తమ రచనలను సాగించిరి. పెద్దనయు శ్రీనాథాది పూర్వుల ననుసరించుటయేకాక మనుచరిత్రమున నవ్య దేశీయముల నందముగ ప్రయోగించెను.

పోషకు డగు శ్రీకృష్ణదేవరాయలచే నితడత్యంతముగ మన్నింపబడి, రాయల యనంతరమున 'కృష్ణరాయలతో దివి కేగలేక బ్రతికి యుంటిని జీవచ్ఛవంబువోలె' అని దుఃఖించెనేకాని 'మరిహేమపాత్రాన్న' మెచట గలుగునని విలపింపలేదు పెద్దన. రాయలులేని రాజధానియందుండలేక వైరాగ్యచిత్తుడై తన గురువర్యుడగు శఠకోప యతి యున్న కోకటగ్రామ సమీపమున పెద్దనపాడను గ్రామమును జేరి యందే జీవిత శేషమును గడపెను. హరికథాసారమును పెద్దన యీ కాలమున రచించి

యుండెనేమో ? పెద్దనయందలి గౌరవముచే నాగ్రామమున నాటికి నేటికిని అల్లసానివారికి నగ్రతాంబూల సన్మానము నిలచియున్నట్లు చెప్పుదురు. ఈ కవి వంశీయు లిప్పటికిని గొందరు జీవించియున్నారు.

ప. దు.

**అల్లూరి సీతారామరాజు :-** భారతీయ తత్త్వదర్శనాంశములను పూర్వజన్మ సంస్కారమున గ్రహించి, ఆంధ్రత్వము నిలువబెట్టుటకు పరిశ్రమించిన విరాగి, త్యాగి, పరోపకారపరాయణుడు, దీనజనావనుడు అల్లూరి సీతారామరాజు. బ్రిటిషుప్రభుత్వమువారి దమననీతి నసహ్యించుకొని, దుష్టపరిపాలనమునకు ఎదురుతిరిగి, బ్రిటిషు ప్రభుత్వమును ముప్పు తిప్పలుపెట్టి మూడుచెరువులనీరు త్రాగించిన యోధుడు అల్లూరి సీతారామరాజు.

ఇతని స్వగ్రామము పశ్చిమ గోదావరిజిల్లా, భీమవరముతాలూకాలోని మోగల్లు గ్రామము. క్షత్రియవంశమువాడు. తండ్రిపేరు వేంకట్రామరాజు. తల్లిపేరు నారాయణమ్మ. ఇతనికి తల్లిదండ్రులు పెట్టినపేరు శ్రీరామరాజు. కాని యితడు వలచిన కన్య సీత యను యువతి అకాలమృత్యువు వాతబడుటచే, ఆమె జ్ఞాపకార్థము తన పేరును సీతారామరాజుగా మార్చుకొనెను.



విద్యార్థి దశలో అల్లూరి సీతారామరాజు

శ్రీరామరాజు చిన్నతనమునుండియే ఎప్పుడును ఏదో ఆలోచించుచు ఉండెడువాడు. చదువుసంధ్యలయందు దృష్టి లేకుండెడువాడు. ఇంగ్లీషు పాఠశాలలలో చెప్పెడు విద్య విద్య కాదనియే అతడు భావించుచుండెను. సీతాకన్య మరణానంతరము వివాహకార్యము తలపెట్టక, వైరాగ్యశీలియై, అడవులువట్టి తపస్సు చేయసాగెను.

అతడు గోదావరీనదీతీరమందలి పాపికొండల గుహలలో ఏకాంతవాసము చేయుచుండెను. అప్పుడు అచ్చటి ఆటవికు లయిన సవరలతో అతనికి పరిచయము కలిగెను. సవరలు అతనికి సపర్యలుచేయుచు, తమగురువుగానెంచి ఆతనిని మన్నింపసాగిరి.

సవరలు చేయునది పోడువ్యవసాయము. ప్రభుత్వాధికారులు లంచములియ్యని సవరలభూములను లాగుకొని తాము ఏర్పాటుచేసిన ముఠాదారులకు సంక్రమింపజేసి ధనము గడింపసాగిరి. వండ్లు కోసినారనియు, కట్టెకొట్టినారనియు, వెట్టిచేయలేదనియు ఏవేవో నేరములు మోపి ఆయారణ్యకులను తహసీలుదారు, పోలీసువారు బాధలు పెట్టుచుండిరి. ఈ ప్రభుత్వాధికారులకు క్రైస్తవమిషనరీలు తోడ్పడు చుండిరి. ముఠాదారులకును, సవరలకును విభేదములు ఏర్పడి తగవులు ప్రబలము కాసాగెను.

ఈ ఆటవికుల దుర్భర జీవనమును గమనించి సీతారామరాజు ఆ యమాయకులపక్షమున నిలచి ప్రభుత్వాధికారులతో వాదించసాగెను. ప్రభుత్వమునకు ఈ సీతారామరాజు కంటకుడయ్యెను. అంత ప్రభుత్వము సీతారామరాజును గూడనిర్బంధములపాలు చేయుటకు సంకల్పించెను. సీతారామరాజు క్రమముగా ప్రతిఘటించి సవరలను సంస్కరించి యుద్ధసన్నద్ధుల గావించెను. తమ పూజ్యగురువునకు ఎట్టి అపాయము జరుగకుండ సవరలు వేయికన్నులతో కనిపెట్టుచు, అంగరక్షకభటులుగా నిలుచుండిరి. పోలీసుబలముతో సవరలకు ముఖాముఖి పోరాటము 1922లో ప్రారంభమయ్యెను. అడవిలోని దుంపలను తీయగూడదనియు, గొడ్లకు గడ్డిని కోయగూడదనియు,దొరతనమువారుఆజ్ఞలను కావించిరి. ఆకలిమంట లొక్కసారి విజృంభించుటచే సవరలు గండ్రగొడ్డండ్లతో అరణ్యములోని చెట్లను నరకుటకు కడంగిరి. ఇదియే పోరాటమునకు కారణము.

సాధు సీతారామరాజు బోధనానుసారము సవరలు సాయుధవిప్లవమునకు సంసిద్ధు లగుచున్నారని పోలీసు సిబ్బందితో అధికారులు గ్రామములపయి దండెత్తిరి.

కొంపలను తగులబెట్టిరి. సీతారామరాజును, నూరుగురు సవరముఖ్యులను పట్టుకొనిపోయి, విచారణతంతు నడిపి, జెయిలుకు పంపిరి. కాని సీతారామరాజు జెయిలునుండి విచిత్రముగా అంతర్ధాన మయ్యెను. పర్లాకిమిడి, జయపూరు, గోదావరి అరణ్యములు అప్పుడాతనికి ఆటపట్టులయ్యెను. సవరలకును, ఖాండులకునుతప్ప సీతారామరాజెక్కడ నున్నాడో ఎవ్వరికిని తెలియకుండెను. నమ్మిన బంట్లగు సవరలు, ఖాండులు రహస్యమును కాపాడిరి.

ఆటవికులు సాయుధ, నిరాయుధ వర్గములుగా నేర్పడిరి. సాయుధవర్గము ప్రభుత్వముతో పోరాడునట్టిది. నిరాయుధవర్గములో కార్మికులు, కర్షకులు ఉండుచుండిరి. నిరాయుధవర్గమువారు సమ్మెలుకట్టి, పన్నులు ఎగబెట్టి విధినిర్వహించెడువారుగా ఉండిరి. ఈ విధముగా విప్లవము సిద్ధమయ్యెను. సీతారామరాజు ఈ విప్లవమునకు అధినాయకుడు.

ఈ విప్లవసేన విండ్లు, బాణములు, కత్తులు, బల్లెములు ధరించి 1922 లో చింతపల్లి గ్రామమునకు పోయి పోలీసుస్టేషనును ముట్టడించెను. పోలీసువారు గడగడ వడకిరి. రాజు ఒక కుర్చీలో కూర్చుండి, అచ్చట ఎట్టి ఆయుధము లున్నవో ఇనస్పెక్టరు నడిగి తెలిసికొనెను. సీతారామరాజునకు కుడి, ఎడమ భుజములుగానున్న గాము గంటం దొర, గాము మల్లుదొర అను గాముసోదరులు పోలీసు ఠాణా యంతయు గాలించి, ఆయుధసామగ్రి తెచ్చి, రాజు సమక్షమున ప్రోగుపరచిరి. రాజు వాటిని వివరముగా రికార్డు పుస్తకములో వ్రాసి, దస్కతు చేసి, తప్పుడు రికార్డులను చించిపారవైచెను. అచ్చట దొరకిన ఆయుధసామగ్రితో సపరివారముగా రాజు వెడలిపోయెను. ఎవరిని హింసించలేదు, గ్రామజనము గుమిగూడి తమాషాగా చూచుచు నిలుచుండిరి. పోలీసులు గండము గడచిన దని, ప్రాణములతో బయటపడ్డామని ఊపిరిపీల్చిరి. తరువాత రాజు కృష్ణదేవిపేటలో పోలీసులను చెట్లకు బంధించి, స్టేషనులోని తుపాకులను గైకొని వెడలిపోయెను.

మొట్టాడం వీరయ్యదొర ఒక ధీరుడు. ఇతనిని "లాగరాయి" పితూరీ జరిగినప్పుడు పట్టుకొనిపోయి నానాకష్టముల పాల్చేసిరి. వీరయ్యదొర తప్పించుకొనిపోయి అరణ్యములలో సవరల రక్షణలో రహస్యముగా నుండగా ప్రభుత్వమువారు వేగులవారిద్వారా గాలించి పట్టుకొని "రాజవొమ్మంగి" ఠాణాలో నిర్బంధించిరి. వెంటనే సవర నాయకులు ఠాణాపై దాడి సలిపి, కొట్టు పగులకొట్టి, వీరయ్యదొరను విడిపించిరి. అచ్చటి ఆయుధము లన్నియు దోచుకొనబడెను. వీరయ్యదొర విప్లవ సైన్యమునకు ఉపనాయకు డయ్యెను (1922). ఈ విధముగా 26 తుపాకులు, 2500 రౌండ్ల మందుగుండ్లు, 10 కత్తులు, 10 మందుసంచులు, 12 పెద్దగొలుసులు, 28 బయొనెట్లు, 9 ఖడ్డీలు - ఇంకను పోలీసుదుస్తులు, ఇతర వస్తువులు సీతారామరాజు వశమయినట్లు సర్కారు లెక్కలలో వ్రాయబడియున్నది.

విప్లవకారుల చర్యలు దొరతనమువారికి తెలియగనే వందలకొలది పోలీసులు అచ్చటికి పంపబడిరి. తెల్ల అధికారులుగూడ వచ్చిపడిరి. ఒకవైపున విప్లవసైన్యము వీరమర్యాదలు పొందుచుండగా, వేరొకచోట ప్రభుత్వదళము ప్రజలను భయపెట్టసాగెను. విప్లవకారుల గుంపుజాడ దొరతనమువారికి తెలుపువారు ఎవ్వరును కనబడక పోయిరి. పైగా తప్పుత్రోవ చూపుచుండిరి.

ఒకసారి రామరాజు నిరాయుధుడుగా నున్నప్పుడు సైనికుల కెదురయ్యెను. వా రతనిని గుర్తింపజాలరైరి. తమ మూటలను మోయుమని రాజున కాజ్ఞాపించిరి. రా జొకమూటను నెత్తిపై పెట్టుకొనెను. అతని యనుచరులును మూటల నెత్తుకొనిరి. వారందరును అరణ్యమధ్యములో ఒకచోట విశ్రమించిరి. నడిరాత్రివేళ సైనికులు గాఢనిద్రలో నుండగా, వికృత కోలాహల మొనర్చుచు, ఆ మూటల నెత్తుకొని అనుచరులతో సీతారామరాజు అంధకారబంధుర మగు ఘనారణ్యమధ్యము చొచ్చెను. సైనికులు విచారకుపడిపోయిరి.

ఒకసారి 'క్రెమన్‌హోరు' అనువాని నాయకత్వమున సర్కారు సైన్యదళము అరణ్యములో పితూరీదారులను వెదకుచుండెను. విప్లవకారులు "రామరాజునకు జై" అని కేకలువేసిరి. సైనికులు తుపాకులు సరిపెట్టుకొను నంతలో కూలీలు పరుగిడిపోయిరి. సైనికులు తుపాకులు కాల్చిరి. అయినను భయపడక విప్లవకారులు తుపాకులు కాల్చుచు ముందుకు వచ్చిరి. బాణవర్షము గురియించిరి.

శ్రెమన్‌హోరుకు బాణములు తగిలెను. అందరును పిరికిపడి ఎవ్వరి అనుమతిలేకయే పరుగిడిపోయిరి. విప్లవకారులు మందుగుండ్లు, తుపాకులు, కత్తులు, దుస్తులు మూడబెరికి తీసికొనిపోయిరి. దీనిని ప్రథమ సమరమని యెదరు.

మోటువారిని సత్యపథమున నడిపించుటకు దేవీ భక్త్యారాధనలు మహోపకారకములుగా నుండెను. కావున సీతారామరాజు "గూడెము" అను గ్రామములో దేవీపూజలు సలుపుటకు ఏర్పాటు చేసెను. ఈ సంగతి తెలిసి శాండర్సుదొర సైన్యముతో గూడెమునకు బయలుదేరెను. ఇతనికి సహాయముగా టాల్బర్టుదొర రిజర్వు దళముతో "పెదవలస" అను గ్రామములో మకాం చేసెను. దేవీపూజ నిర్విఘ్నముగా సాగుటకై ఒక యుక్తి చేసి రామరాజు కొందరు విప్లవకారులను టాల్బర్టు మీదికి పంపెను. వారు ఏమరుపాటుననున్న సైనికులపై బడి బాగుగ మర్దించి తరిమివైచిరి. విప్లవకారుల వేగులవాడు శాండర్సును సమీపించి టాల్బర్టు పరిభవము ఎరింగించెను. శాండర్సు వెనుకకు మరలెను. పెదవలసకు పోయి విప్లవకారులను పట్టుకొన తలంచెను. కాని వారు గూడెముకుపోయి దేవీ పూజలో పాల్గొనిరి.

ఒకనాడు దమనపల్లిలో విప్లవకారులు వంట చేసికొనుచుండిరి. సైన్యముల రాక వారికి తెలిసెను. వెంటనే గాముసోదరులు అనుచర సమేతముగా త్రోవగాచిరి. కొండల నొరసికొని ఒక ఏరుపారుచుండును. ఏటి యొడ్డుననుండి బాట పోవును. ఆ బాట మిగుల ఇరుకయినది. గాముసోదరులు ఈ బాట ప్రక్కన కొండల పై గుబురుచెట్టుల చాటున తుపాకులు బారుపెట్టి కూర్చుండిరి. ఒకరి వెనుక నొకరుగా సైనికులు పోవుచుండిరి. నల్లసిపాయిలు దాటిపోయిన తరువాత కవర్డు, హైటరు అను నిద్దరు సేనానులు నడచుచుండిరి. వీరిద్దరు విప్లవకారుల తుపాకుల గుండ్లకు గురియై నేలకూలి దొర్లి, ఏటిలోబడి కొట్టుకొని పోయిరి. మిగిలినవారు పారిపోయిరి. గాముసోదరులు చేసిన హత్యావ్యవహారము రామరాజునకు తెలియదు. ఆతడప్పుడు పర్వతముపై తపస్సు చేయుచుండెను. ఈ హత్యావిషయ మాతనికి తెలిసినప్పుడు గాముసోదరులను కోపగించి, చీవాట్లు పెట్టెను. రామరాజు అహింసాప్రియుడు.


మరణసమయమున అల్లూరి సీతారామరాజు

కవర్డు, హైటరుల మరణము తెల్లవారిలో గొప్ప అలజడిని కలిగించెను. ప్రబల సన్నాహముతో మలబారు పోలీసులతో, పటాటోపముతో మిస్టర్ నాఫ్‌దొర దిగి వచ్చెను. ఇట్టి బ్రహ్మాండమయిన ప్రయత్నమంతయు నెందులకు? రామరాజు యొక్క ఎనుబదిమంది అనుచరులను పట్టుకొనుటకే. "రామరాజు రాజత్వవాది. గూడెము తాలూకాకు తాను ప్రభువు కాదలచి యీ పితూరీని లేవనెత్తెను. గ్రామములను దోచి ప్రజలను హింసించుచున్నాడు" అని ప్రభుత్వమువారు పచ్చి అబద్ధపు ప్రకటన చేసిరి.

రామరాజు చింతపల్లి, కృష్ణదేవిపేట, రాజవొమ్మంగి స్టేషనులను హఠాత్తుగా ముట్టడించెను. కాని తరువాత తరువాత కలెక్టరుకు నోటీసు ఇచ్చి, ఆప్రకారము చేయుచుండ మొదలుపెట్టెను. గ్రామోద్యోగులకు తాను ఎచ్చటెచ్చటికిపోవుచుండెడిది, ఎప్పుడెప్పుడు పోవుచుండునది తెలుపసాగెను. అడ్డతీగల, వైడిపుట్టి, రంపచోడవరము, ఏనుగగుంట, పాతమల్లుపేట, అనుమలపూడి, అన్నవరము మొదలగు గ్రామములలోని ఠాణాలను ముట్టడించి దోపిళ్ళు జరిపెను. కాని రాజు కార్యక్రమము ముందుగా తెలిసియుండియు అధికారులుగాని, సేనానులుగాని జంకి రాకపోయిరి. వచ్చినవారు విప్లవకారులను చూడగనే పలాయనము చిత్తగించెడివారు.

రామరాజు ప్రభుత్వపు గూఢచారులను బట్టుకొని, భయపెట్టి వదలెడువాడు. వస్తుసామగ్రి, ఆయుధాలు,

మందుగుండ్లుగల బండ్లను ఆపి అంతయు కాజేసెడివాడు. తలపడి యుద్ధము చేయవలసి వచ్చినప్పుడు విప్లవకారుల చాకచక్యమునకు సైనికులు విభ్రాంతులగుచుండిరి. విప్లవకారులు ఒక నిమిషమున కొండలమీద, మరు నిమిషమున సమతలముమీద కనబడుచుండిరి. పారిపోవు చున్నారని తరుముచుపోగా. వెనుకనుండి విప్లవకారుల పోటు దుర్భరము కాజొచ్చెను. ఇది రామరాజుయొక్క రణనీతి విధానము.

పెద్దగడ్డపాలెము యుద్ధములో ప్రభుత్వపు సైనికులు మారణ యంత్రములను, అగ్నిగోళములను విచ్చలవిడిగ ప్రయోగించిరి. విప్లవకారులు కొందరు మడిసిరి. లింగ పురము ఏటిదగ్గర రాత్రి యుద్ధము జరిగెను. చాలమంది విప్లవకారులు హతులైరి. తరువాత ఎవరిమార్గమున వారు పలాయితు లయిరి. ఇది ఆరవయుద్ధము.

గాయపడిన విప్లవకారులను గ్రామీణులు తమ ఇండ్లలో నుంచుకొని చికిత్సలు జరిపెడివారు. ఉపచర్యలు సల్పెడి వారును గ్రామీణులే. అందుచే ప్రభుత్వమువారు ప్రజలను వేధింప గడంగిరి. క్రూర శాసనములు గావించిరి.

రామరాజు అన్నవరము సత్యనారాయణస్వామి దర్శనార్థము కొండమీదికి వెళ్ళెను. ఈ వార్త పొక్క గానే జనులు గుంపులు గుంపులుగా వచ్చిరి. రాజును దర్శించి ప్రేమ, భక్తి, గౌరవములను ప్రకటించిరి. పూల మాలలు వేసిరి. మంగళహారతులు పట్టిరి. కానుక లొసం గిరి. పాలు, పండ్లు సమర్పించిరి. అచట రాజు స్నానము చేసి, సంధ్య, జపము, తపము ఆచరించెను. శంఖవరము వెడలినపుడును ప్రజలు ఇట్లే ఆతనిని సమ్మానించిరి.

ఒకసారి రామరాజు తన ముఖమునకు మసిపూసి కొనెను. విప్లవకారులు మలబారు పోలీసు దుస్తులను ధరించియుండిరి. వీరిని చూచి తమవారే అని తెల్లదొర భ్రమపడి మోటారులు ఆపెను. వెంటనే తుపాకులు గురిపెట్టి అసంసిద్ధులైయున్న సైనికులపై విప్లవకారులు విజృంభించిరి. తరువాత వారిని నిరాయుధులను చేసి, యుద్ధసామగ్రి నంతయు గ్రహించి పారిపోయిరి.

సర్కారువారు విప్లవకారులకు ఆహారపదార్థములు దొరకకుండ కట్టుదిట్టములు చేసిరి. నదిమార్గములు, భూ మార్గములు, రైలుమార్గములు కావలాకాచి వర్తకులను నిర్బంధించిరి. కాని యెట్లో ఆహారపదార్థములు మాయమగుచునే యుండెను. ప్రభుత్వమువారు పన్నా గములు పన్ని జనులలో విభేదములు కలిగించుటకు ఆరంభించిరి.

రామరాజు యుద్ధములందు జయాపజయములను పొందినవాడు. ఓడినప్పుడు కొండల కెగ్రాకి, అనువగు తావులను చేరి, మరల యుద్ధము ప్రకటించుచుండెను. గ్రామోద్యోగులను, సివిలు ఉద్యోగులను బాధించలేదు. వారికి జరిమానాలు మాత్రము విధించెడివాడు. వారు సంతోషముతో జరిమానాలు చెల్లించుచుండిరి. రాజు వదలిపెట్టినవారిని ప్రభుత్వమువారు శిక్షించసాగిరి. ఎటు లయినను మనకు కష్టములు, అవమానములు తప్పవుగదా యని ప్రజలు విప్లవకారులయెడ విముఖులైరి. ప్రజలలో నిరుత్సాహ మధికమయినది.

ఇట్లు పదునారు మాసములు యుద్ధభీతి ప్రవర్తిల్లెను. విప్లవకారులసంఖ్య పలుచబడెను. అందుచే క్రొత్తబలగము సమకూర్చుకొనుటకై రాజు పర్లాకిమిడి పోయెను. గంటన్నదొర నాయకత్వమును వహించెను. గంటన్న దొర తప్పత్రాగి ఒక యుంపుడుకత్తె యింటికిపోయెను. ఆ యుంపుడుకత్తె మోసముచేసి వానిని సర్కారువారికి పట్టియిచ్చెను. గంటన్నదొర పరమవిధేయు డయినబంటు. త్రాగుబోతుతన మొక్కటే వానియవగుణము. ఆ యవ గుణమును మాన్పుటకు రామరాజు ఎంతో ప్రయత్నిం చెను. చివర కా గుణమే వానికి ముప్పుతెచ్చినది.

రామరాజు పర్లాకిమిడినుండి బలగముతో తిరిగివచ్చి శంఖమును పూరించెను. కాని అంతయు నిరాశాజనక ముగా పరిస్థితులు మారియుండెను. అస్సాము రైఫిల్సు పటాలము రంగమున ప్రవేశించెను. లార్డువెల్లింగ్‌డన్ మద్రాసు గవర్నరుగా విచ్చేసెను.

రామరాజును పట్టియిచ్చువానికి పదివేలరూపాయల బహుమానమును ప్రభుత్వము ప్రకటించెను. మన్యము చుట్టును రాకపోకలు ఆపివైచిరి. వర్తకము స్తంభిం చెను. రాజు విప్లవము నాపివైచితినని ప్రకటించెను. రాజు ప్రజలను రక్షించుటకును, పితూరీదారులకు తిండి సంపా దించుటకును అశక్తుడయ్యెను. 1924 మే నెలలో రామ రాజు అనుచరులనెల్ల చేరబిలిచి వారికెల్లరకు వీరమర

ణము శాసించెను. విప్లవవీరులు ఒక్కొక్కరే సైనికుల నెదిర్చి హాహాకారములతో యుద్ధముసలిపి వీరమరణము నొందిరి. రామరాజు కనబడుటలేదు.

ఒకయోగి ఒక యేటిదగ్గర ఒక కోయబాలునకు గన్పించెను. ఆ యోగి ఒక లేఖవ్రాసి దానిని సేనాధిపతి కిడుమని వానికిచెప్పెను. ఒక పోలీసు ఉద్యోగి ఉత్తరము ను చదువుకొని యోగివద్దకు వచ్చెను. అతని యొద్ద ఎట్టి ఆయుధమును లేదు. నిశ్చలముగా తపస్సు చేసికొనుచుండెను. ఇంతలో సైన్యమువచ్చి ఆతని చుట్టుముట్టెను. వారికి తానే సీతారామరాజునని యోగి చెప్పెను. ఆ యోగిని మేజరు గుడాలు అను తెల్లసేనానికడకు తీసికొనిపోయిరి. ఇతడు రామరాజు అగునా, కాడా అని ఆలోచించుటకు గుడాలు పూనుకొనలేదు. గొలుసులతో యోగిని చెట్టునకు కట్టించెను. యోగి మాట్లాడనుండగా గుడాలు తుపాకి గురిపెట్టెను. కుడియెడమల వరుసగా పాదములనుండి పైపైకి తుపాకి కాల్చుచుండెను. పాదములు, మోకాళ్ళు, తొడలు, నడుము, నాభి తుపాకి గుండ్లతో గాయము లయి రక్తము ప్రవహింపసాగెను. విశాలవక్షముపై కాల్చుటతో యోగి శాశ్వత నిద్ర చెందెను.

గుడాలు శాసనవిరుద్ధమయినపని గావించెను. గుడాలు ఖూనీచేసెను. మరణించినవాడు రామరాజగునో కాడో తెలిసికొనుటకును, శవమును బహిరంగ పరచుటకును, వీలుగా లేకపోయెను. పరీక్షార్థము ఈ మాంసపుముద్దను ఎచ్చటికి పంపిన ఏమి ప్రమాదమో యని అధికారులు చేతులు పిసికికొనిరి. గుడాలు నాక్షేపించుచు నెత్తి, నోరు గొట్టుకొనిరి. తమ యపరాధరహస్యము వెల్లడికాకుండ నుండుటకై గప్‌చుప్‌గా శవదహనము గావించిరి. (మే 7, 1924).

ఆయోగి రామరాజు కాదనియు, పృథ్వీసింగు అను అనుచరుడయి యుండియుండుననియు, అల్లూరి సీతారామరాజు చిరంజీవియనియు జనులు ఇప్పటికిని తలంచుచున్నారు. ఈతనినిగూర్చి పాటలు, పద్యములు, బుఱ్ఱకథలు, రచితములై ప్రచారములో నున్నవి.

అల్లూరి సీతారామరాజు గొప్ప మేధావి, తేజస్వి. శివాజీ, రాణాప్రతాపసింహ, ఝాన్సీ లక్ష్మిబాయి మున్నగువారి శ్రేణిలో చేరతగిన జాతీయవీరుడు. లోకహితైక పరాయణుడు.

ఆ. వీ.

**అవనీంద్రనాథఠాకురు:-** డాక్టరు అవనీంద్రనాథ ఠాకురు ఆధునిక భారతీయ చిత్రకళోద్యమమును స్థాపించిన వాడు. అతడు 1871 ఆగష్టు 7 వ తేదీయందు కలకత్తా నగరమునందు ఠాకురువంశమున తదీయమైన "జోరశంకో" అను భవనములో శ్రీకృష్ణాష్టమినాడు జనన మొందెను. అతడు కీ. శే. రాజా గుణేంద్రనాథ ఠాకురు కనిష్ఠపుత్రుడు. రాజా ద్వారకనాథఠాకురు ద్వితీయపుత్రుడగు గిరీంద్రనాథఠాకురు పౌత్రుడు. ఆతని జ్యేష్ఠసోదరు డగు గగనేంద్రనాథఠాకురుకూడ సుప్రసిద్ధ చిత్రకారుడై వరలెను.

చరిత్రపత్రములను వెనుకకుత్రిప్పి చూచినచో, నెపోలియను కాలమునందు చిత్రకళాభ్యుదయముకాని, వాఙ్మయాభ్యుదయముకాని ఘటిల్లినట్లు తెలియదు. అది క్రియాత్మక కాలము కాని, నిర్మాణాత్మక కాలము కాదు. సామాన్యముగా శాంతితోగూడిన కాలమునందే పూర్వాచార పరాయణుల స్తబ్ధత, విద్వత్సభల నిబంధనములు అను శృంఖలములను భేదించుకొని నవ్యములయిన చిత్రకళోద్యమములు ఉదయించుచుండును. నిర్మాణాత్మకమయిన ఇట్టి ఉత్సాహ సంచలనము విక్టోరియా శకము యొక్క అంత్యభాగమున చూపట్టెను. తత్ఫలితముగా కళాసాహిత్యములందు అనేకములును, భిన్నములును, అయిన ఫిం-డు-సీకిల్ ఉద్యమములు తలలెత్తెను.

వర్తమాన శతాబ్ది ఆరంభమున భారతదేశమునందు రాజకీయములలోను, సాహిత్యములోను, కళలలోను, 'ఫిం డు-సీకిల్' ఉద్యమతత్త్వము గోచరించుచున్నది. రవీంద్రనాథఠాకురు కవిత్వము ప్రాచీన కవితా సంప్రదాయములయు, రచనలయు తిరస్కారాత్మకమైనది. సురేంద్రనాథబెనర్జీగారి రాజకీయక్రమము బహుకాలము నుండి అంగీకృతమైయున్న ప్రభుత్వ పరిపాలనా విధానము నెడ అసహనముయొక్క ప్రారంభదశను సూచించును. అవనీంద్రనాథఠాకురుయొక్క కళా విజ్ఞానము రసలుబ్ధులగు భారతీయుల హృదయములందు బహుకాలమునుండియు దాగియున్న నిర్మాణాత్మకమయిన

ఉత్సాహాతిరేకమునకు ప్రాణముపోసెను. ఇప్పటివరకు వంగదేశీయులు పాశ్చాత్య సంస్కృతి అను మద్యమును విశేషముగా క్రోలియున్నారు. పైతరగతికి చెందిన వంగ దేశీయుల ఆలోచనా విధానము, వారిభాష - సర్వము ఆంగ్లేయ సంప్రదాయానుకారి అయ్యెను. దీనికి అనివార్యమయిన ప్రతిక్రియ ఈ శతాబ్ది ఆదియందు పొడచూపెను. సాహిత్యమునందువలెనే కళలయందును మనజాతికి స్వతస్సిద్ధమైన ధర్మములకు అనుకూలముగ మనఃప్రవృత్తిని అవిష్కరించుట ఉత్తమకృత్య మని తొలుదొల్త నిరూపించినవాడు అవనీంద్రనాథ ఠాకురే. పాశ్చాత్య సంస్కృతికి విలక్షణఫలమయిన పాశ్చాత్యకళ పాశ్చాత్యులకు హితకర మగును. టక్సెడో (tuxedo) అనునది ప్రాచ్యులవిందులలో అనుచితమగురీతి ప్రాచ్యదేశీయ కళావిన్యాసమున పరిపూర్ణముగాను, ఆనందసంజనకముగాను, అనర్గళముగాను, స్వీయభావములను ఆవిష్కరించుపట్ల పాశ్చాత్య కళారీతులను అవలంబించుట అనుచితమగును. శిథిలములయిన ప్రాచీనభారతీయ చిత్రకళా సంప్రదాయ తంతువులను గుమిగూర్చుటచేతను, జాతీయము లయిన వ్యవస్థల యొక్కయు, సంకల్పముల యొక్కయు, శక్తిని పునరుద్ధరించుట చేతను, దేశీయ కళాలక్ష్మికి మోక్షము సిద్ధింపగలదని మొట్టమొదట గ్రహించినవాడు అవనీంద్ర ఠాకురే.

అవనీంద్రనాథ ఠాకురు అనేకరీతుల అసదృశమైన వ్యక్తిత్వము కలవాడు. పారమార్థిక జీవితము అను దేవాలయమునందు ఒక ప్రత్యేకమైన గూడుగా విరాజిల్లుచున్న సమకాలిక సంస్కృతియందు అతడు ఎల్లప్పుడును ఒక ప్రముఖస్థానము నాక్రమించి యుండగలడు. భారతదేశముయొక్క అన్యప్రాంతములలో అపుడపుడు ప్రదర్శింపబడుచుండు అతని చిత్రములు అతని చిత్రకళా కౌశలమునకు సరియగు నిదర్శనములు కావు. (అతని ఉత్తమోత్తమ చిత్రము లింకను ప్రచురింపబడలేదు.) అతడు మోటుగను, సరికాని వర్ణములతోను, రచించి ముద్రింపించిన హాఫ్‌టోన్సు చిత్రములే అందరెరిగినవి. అట్టి చిత్రములు వివాదోపశమముకంటె వివాదోత్పత్తికే, గుణగ్రహణముకంటె దోషావిష్కరణమునకే విశేషముగా సాధనము లయ్యెను. ఠాకురు సంచార విముఖుడు. గృహము నాశ్రయించియుండు నలవాటు కలవాడు. ఆంగ్లేయ భాషలో వ్రాయుటకు సమ్మతి లేనివాడు. అందుచేత అసాధారణ సౌందర్యము, గౌరవము కలిగి, సౌందర్య రసగ్రహణ పారీణుడయి, భారతీయ కళయందు అత్యంత ప్రతిభాన్వితుడయిన అతనితో భారతదేశమునందలి ఇతర ప్రాంతములందుండు నాగరక శిఖామణులకు పరిచయ భాగ్యము లభించుట సాధ్యపడదయ్యెను.

ప్రాచ్యఖండమునందలి ప్రాచీన విద్వద్వర్యులచే గ్రంథస్థముచేయబడి, పరిపుష్టమై, పాశ్చాత్య కళకు ఏవిధమున తీసిపోక, అత్యంత వికాస భాసురమై సంపూర్ణముగ ఉపజ్ఞాయుతమై, సౌందర్య మీమాంసా విషయకమైన భాషను ఠాకురు కనిపెట్టెను. ఇట్టి ఆవిష్కరణములో లారెన్సు బన్‌యన్, రోజర్ ఫ్రై అను విమర్శకులు కనిపెట్టిన విషయములను బహు సంవత్సరములకు ముందుగనే డాక్టరు అవనీంద్రనాథ ఠాకురు కనిపెట్టినవాడయ్యెను. చీనా, జపాను దేశములకు సంబంధించిన అనేక కళారూపములకు పెక్కు భంగుల భారతదేశమే గురుత్వమును పూర్వ భావిత్వమును కలిగియుండెను. ఖిజిల్ (Qyzyl) హారియోజి (Horioji) ప్రాంతమునందలి ఫ్రెస్కోస్ (తడిగోడలపై చిత్రించు రంగు బొమ్మలు) సాక్షాత్తుగా భారతీయ చిత్రానుకరణములై యున్నవను విషయమును డాక్టరు ఠాకురు తాను సంపాదించిన పెక్కు చిత్రకళా ఖండములనుబట్టి ధ్రువపరచెను.

1897 వ. సంవత్సరప్రాంతమున అవనీంద్రనాథ ఠాకురు ఇరువదియైదు సంవత్సరముల ప్రాయమున నుండి ఇటాలియను కళావేదియగు సీనారు, గిల్‌హార్డి యొద్దను, పిదప కలకత్తా నగరమునందలి దొరతనము వారి చిత్రకళాశాలయొక్క ఉపప్రధానాధికారి యొద్దను ఛాయావిశేష చిత్రణములు, రూపచిత్రణములు, వర్ణ చిత్రణములు, పరిపూర్ణాకార వివరణ చిత్రణములు మున్నగువాటిని అభ్యసించెను. పిదప ఇంగ్లండునుండి ఏతెంచిన చార్లెను ఎల్ పామరు అను కళావేదియొక్క చిత్రకళామందిరమున పాఠముల నభ్యసింపనారంభించెను. ఇట్లు ఠాకురు మూడునాలుగు సంవత్సరముల పర్యంతము పామరువద్ద గాఢమయిన శిక్షణము నొందినపిదప

రూపచిత్రణమున మిక్కిలి కుశలుడయి రెండేసి గంటలలో ఒక్కొక్క చిత్రమును పూర్తిచేయ గలుగునట్టి సమర్థుడయ్యెను. ఠాకురు ఈ కాలమున బహువిషయములకు చెందిన తైల చిత్రములను చిత్రించెను. 1900 సంవత్సరములో అవనీంద్రనాథ ఠాకురు మాంఘీరు పట్టణమున కేగెను. ఆ పట్టణముననున్న కాలమున, ఆతని చిత్రకళాప్రవృత్తియందు సంపూర్ణమైన మార్పు ఏర్పడుటచే, అతడు పాశ్చాత్యశైలి ననుసరించి తైలచిత్రములను చిత్రించుటమాని, నీటి రంగులతో చిత్రించుటకారంభించెను.

ఠాకురు కలకత్తాకు తిరిగివచ్చి మరికొంతకాలము వరకు పామరువద్ద నీటిరంగు చిత్రణమున శిక్షణము నొందెను. పిదప అతడు మాంఘీరునకు పోవునపుడు పామరుయొక్క శిక్షణ కాలమున తాను సిద్ధమొనర్చియున్న చిత్రములను తనవెంట కొనిపోయెను. 'జోరా శంకో' మందిరమున నున్న తన పూర్వుల గ్రంథాలయములో, చిత్రములతో నొప్పారుచున్న పురాతనమైన యొక ఇండో - పార్సీ గ్రంథముయొక్క వ్రాతప్రతి నాతడు ఒకనాడు చూచుట తటస్థించెను. దానితో ఠాకురుయొక్క చిత్రకళా చరితమున గొప్పమార్పు ఘటిల్లెను. ఆ వ్రాతప్రతియందలి అత్యద్భుతమైన వర్ణచిత్రములు, సుందరమైన లేఖనకళ, ఆతని కల్పనాశక్తికి ఉత్తేజము కలిగించెను. దాన నాతడు చిత్రకళయందు నైజశక్తి నావిష్కరింప సమర్థుడయ్యెను. తదాదిగ ఠాకురు దివ్యగోపాలుడగు శ్రీకృష్ణుని జీవితమునందలి, లీల లనబడు సుప్రసిద్ధ దృశ్యములను వర్ణించునట్టి విఖ్యాతములయిన చిత్రమాలికలను రచింపదొడగెను. ఈ చిత్ర రచనలు మాంఘీరు పట్టణమున అనుభూతమయిన ఆతని చిత్రకళాదర్శమునందలి సూక్ష్మపరివర్తనముయొక్క పరిణామములై యుండవచ్చును. దీనితో వెనీసు పట్టణములోని టిటియన్ వలెనే తానును వంగదేశమునందు సుప్రసిద్ధ చిత్రకారుడుగా పేరుపొందవలయునను ఆతనిఆశ అడుగంటెను. ఇది నలుబది సంవత్సరముల క్రిందటజరిగిన విషయము. అప్పటికి ముప్పదిసంవత్సరములవాడయిన అవనీంద్రనాథఠాకురు పాశ్చాత్య చిత్రకళా శైలికి స్వస్తి చెప్పి స్వీయకళాశైలిని పెంపొందించుకొనెను.

కొన్ని సంవత్సరములకు పిమ్మట ఠాకూరునకు. ఇ బి. హావెల్ అను పేరుగల కలకత్తా నగరమునందలి చిత్రకళా ప్రధానాధికారిని కలిసికొను అవకాశము లభించెను. అత్యుత్సాహ సంభరితుడగు ఠాకురునకు హావెలు అనుకూల్యము, సానుభూతి కల మిత్రుడుగా గోచరించెను. అప్పటినుండి అయ్యిరువురును ఆ సంస్థయందు కలిసి పని చేసిరి. తదాదిగా వంగ చిత్రకళాశాఖ, పరంపరాగతమయిన భారతీయ చిత్రకళా సంప్రదాయము యొక్కయు తద్ధ్యేయముల యొక్కయు పునరుజ్జీవనమునకై సర్వదా యత్నించెను.

పూర్వోక్తరీతిగా అవనీంద్రనాథ ఠాకురు యొక్క అద్వితీయ ప్రతిభ మొట్టమొదటిసారి "రాధాకృష్ణ" అను చిత్రమాలికయందు ఆవిష్కృత మయ్యెను. ఈ మాలికా చిత్రములు ఆతవి జీవిత దశయందేకాక ఆధునిక భారతీయ చిత్రకళా క్షేత్రమునందుకూడ నొక నూతన శకమును ప్రవేశపెట్టెను.

అవనీంద్రనాథుని చిత్రకళాభివృద్ధిని పురస్కరించుకొని స్థూలముగా ఆతని చిత్రములను మూడు అంతరములుగా విభజింప వచ్చును.

(1) 1895 వరకు పాశ్చాత్య చిత్రకళాశైలి ననుసరించి వ్రాయబడిన చిత్రములు.

(2) 1895 వ సంవత్సరమున ఆధునిక కాలికమైన రచనా విధానముతో నొప్పారిన భారతీయ చిత్రముల సంగ్రహ గ్రంథ మొకటి (లక్నో ఖలం)అతనికి బహుమానముగా లభించెను. ఇట్టి సంఘటనముచే నాతనికి తొలిసారిగా భారతీయ చిత్రకళా పరిచయ మేర్పడెను. ఠాకురుయొక్క చిత్రములకు రాజపుత్ర - మొగలు చిత్రములతో సామ్యము తక్కువ. పాశ్చాత్య లఘుచిత్రములతో సామ్యముమెండు. ఐనను అవి వర్ణనాత్మకములు కాసాగెను. ఇట్టి రచనా విధానము నాతడు తరువాత ఎన్నడును ఆశ్రయించిన వాడు కాడు.

(3) 1897 మొదలుకొని 1900 వరకుగల మధ్య కాలముననే అతని చిత్రకళయందు హిందూకళా సంప్రదాయములతోను రాజపుత్ర చిత్రములతోను సామ్యాభివృద్ధి ఘటిల్లెను. 1901, 1902 సంవత్సరములలో అతడు ఆధునిక జపానీయ పారగులతోను, వారి రచనల

తోను, పరిచయమునుపొంది స్వీయ కళా విధానమును పెంపొందించుకొనెను. శిల్పశైలియందు కొంత భేదము స్థూలదృష్టికి గోచరించినను, ఇప్పటినుండి మొత్తము మీద అతని రచనయందు చెప్పదగినంత మార్పేమియు లేదనవచ్చును.

ఠాకురు భిన్నములైన ద్రవ్యసాధనములతో అసంఖ్యాకము లయిన చిత్రములను చిత్రించెను. వాటిలో ఒక్కొక్క చిత్రము యొక్క ప్రత్యేక శైలీ నైపుణ్యములను వివక్షించినచో అది చిత్రకళకు ఒక అమూల్య ఉపహారముగా పరిగణింపబడదగి యుండును.

1930 లో అవనీంద్రనాథుడు "అరేబియన్ రాత్రులు" అను చిత్రమాలికను ప్రారంభించెను. ఈ చిత్రమాల అతని సృజనాత్మకమయిన చిత్రకళా జీవితమునందలి చరమదశాసూచకమై యున్నది. జపానీయకళాపారగుల పరిచయ మేర్పడిన కాలమునుండి ఠాకురుయొక్క చిత్రములందలి ప్రసాధకగుణము అప్రధానమయ్యెను. కాని 'అరేబియన్ నైట్సు' అను మాలికాచిత్రములలో మరలప్రసాధకగుణము అతిశయించెను. దీనికి కారణ మతడు తద్రచనమున బుద్ధిపూర్వకముగా నొనర్చిన యత్నమే. ఇవ్విషయమున అతడు పొందిన జయము అపూర్వము.

చిత్రకారుడుగా డాక్టరు ఠాకూ రొనర్చిన కృషిని సమగ్రముగ ప్రశంసింప శక్యముకాదు. అతని కళ బహుముఖములతో, వివిధ రీతులతో సంకలితమైయున్నది. 1898 వ సంవత్సర ప్రాంతమున ఠాకూరు ప్రారంభించిన చిత్రకళోద్యమము యొక్క ఆరంభావస్థయందు అతడు చిత్రించిన చిత్రములు పాశ్చాత్య చిత్రకళా ప్రభావమును నిరసించుటకును, దేశీయ కళాశైలి సాధనముగా ప్రాచీన భారతీయ చిత్రకళ నుద్ధరించుటకును, ఉద్దిష్టము లయినవి. (భారతీయ చిత్రకళా ప్రవృత్తియందు) పాశ్చాత్య కళాధిపత్యమును సహింపని తిరుగుబాటుదారుగాను, భారతీయ చిత్రరచనయందలి అతి సూక్ష్మతత్త్వములను అత్యంత సామర్థ్యముతో నిరూపించుచు వ్యాఖ్యానించువాడుగను, అతడు రంగమున ప్రవేశించెను. అట్లనుటచే నతడు కేవలము ప్రాచీనకళారీతుల నుద్ధరించుటకై యత్నించె నని అనుకొనుట సరికాదు. అతడు అన్ని దేశములందలి చిత్రకళారీతులను, విధులను, కల్పనాసంప్రదాయములను సమీకరించుకొనగల ఒకానొక అద్భుతశక్తితో విశిష్టమైన ప్రతిభ కలవాడు. ప్రాచ్య - ఆసియాయందును పాశ్చాత్యదేశములందును గల కళాప్రవీణుల చిత్రరచనాక్రమమును సాదరముగా, యథేచ్ఛముగా అత డవలంబించెను. అతడు తన చిత్రసృష్టియొక్క ఆరంభదశయందు ప్రాచ్య - పాశ్చాత్యదృక్పథములను రెండింటిని అనిర్వచనీయమైన సంయోగముతోను సమీకృతమైన మైత్రితోను ఉపయోగించెను.

డాక్టరు అవనీంద్రనాథ ఠాకురు ఉపాధ్యాయుడుగా అసదృశుడు. మిక్కిలి పసివారయిన శిష్యులయెడ కన్నతల్లివలె అపరిమితమైన ఓపికను, కన్నతండ్రివలె వాత్సల్యమును, అనుకంపను అతడు చూపెను. సాధారణులయిన శిష్యులయొక్క హృదయములందు లీనమైయున్న శక్తులను బహిర్గతము చేయుటయం దీతనికిగల శక్తిసామర్థ్యములు అద్భుతావహములు. తనశిష్యులపై తన రచనావిధానము నెన్నడు అతడు విధించియున్నవాడు కాడు.

అవనీంద్రనాథుడు చిత్రకళకు సంబంధించిన నూతనోద్యమమునకు నాయకుడుగా ఎడతెగని కృషిసల్పెను. తన అనుయాయులకును, సన్నిధాన వర్తులగు శిష్యులకును ఉత్సాహావేశములను కల్పించెను. వారి కాతడు ఉత్తమ హైందవ కళాచిత్రములను అవగతము చేసికొను విధానమునందును, నూత్నాలోచనలు కల ఆధునికుల భావప్రకృతులకును, అవసరములకును, పరిస్థితులకును అనువగు రీతిగా నూతనకళారీతులను పునర్నియోజన మొనర్చుటకై, భావములను, ద్రవ్యములను, సంగ్రహించు విధానమునందును సాకల్యమైన శిక్షణ మొసగెను. 1906 వ సంవత్సరములో అవనీంద్రనాథుడు తన శిష్యుల కొసగిన ఉపన్యాసమునందు చిత్రకళపై తనకుగల ఆశయములను ఇట్లావిష్కరించెను. "మీరొక సుందరమైన ప్రదేశ చిత్రమును వ్రాయు సంకల్పముతో ఒక ఉద్యానమునకుగాని, నదీ తీరమునకుగాని పోయి అచ్చటి మొక్కలను, పువ్వులను, జంతువులను రంగులతో చిత్రించుట నేనెరుగనిది కాదు. అట్టి సులభసాధనములతో సౌందర్యమును మీ యధీన మొనర్చుకొనుటకు మీ రొనర్చు యత్నములు నాకాశ్చర్యమును కలిగించుచున్నవి. సౌందర్యము బహిరుపాధుల నాశ్రయించునదికాదు. అది అత్యంతముగా

అంతరమైన హేతువును ఆశ్రయించునది. మీరు ముమ్మందు కాళిదాసకవితా వైశిష్ట్యమునందు మగ్నమనస్కులు కండు. పిదప ఆకసమును తిలకింపుడు. అపుడు నిత్య నూతనమైన మేఘ సందేశము యొక్క శాశ్వత సౌభాగ్యమును మీరు గ్రహింప గలుగుదురు. మొదట వాల్మీకి కృతమైన సముద్ర వర్ణనమున మగ్నులు కండు. పిదప యథేష్టముగా సముద్రమును చిత్రింపుడు."

అవనీంద్రనాథుడు దివికేగినాడు. అతని మరణముచే ఆధునిక చిత్రకళోద్యమమున నొక మహానాయకుని, ఒక దేశాభిమానిని, ఒక చిత్రకళా ప్రబోధకుని భారత దేశము కోల్పోయినది. చిత్రకళోద్యమమున మిక్కిలి ప్రతిభావంతుడును, సమకాలిక మహాపురుషులలో నొక్కడును, మానవ సంస్కృతి చరిత్ర పత్రములందు మాసిపోని చిహ్నములను నిలిపినవాడును అగు అవనీంద్ర నాథునకు భారతదేశము స్తుత్యుపహారాభివందనములను అర్పింపవలసి యున్నది.

అవనీంద్రనాథునకు కీర్తిని తెచ్చిన శిష్యులు పెక్కురు కలరు. వారిలో నందలాల్ బోసు, అసితకుమార్, హాల్దారు, వకీలు, దేవీప్రసాదరాయ్ చౌదరి, ప్రమోద కుమార్ చటర్జీ పేర్కొన దగినవారు.

వి. ము.

**అవిసెన్నా - క్రీ.శ. 980-1037 :-** ఇతడు పర్షియా దేశస్థుడు. బొఖారాకు సమీపమునగల ఒక ప్రదేశమున జన్మించెను. వైద్యులందు అగ్రేసరు డని పేరు పొందెను. ఇరువది నాలుగేండ్ల లేత్రాయముననే ఆస్థాన వైద్యపదవిని పొందిన ప్రతిభాశాలి. ఇతనికి సాహిత్యాభిలాష మెండు. యూరపుఖండమునందలి వైద్యశాస్త్రముపై కనపరచిన ఇతని కృషి ప్రాబల్యము మిక్కుటము. 1650 సంవత్సరమువరకుకూడ 'కానన్' అను పేరుగల ఇతని వైద్య శాస్త్ర గ్రంథము వైద్యశాస్త్ర బోధనాలయములందు పాఠ్యగ్రంథమై యుండెను. నీటిసరఫరా, శీతోష్ణస్థితి, ఋతువులు, వీనిఫలితముగ మానవుల ఆరోగ్యమునందు కనబడు మార్పులను ఇతడు గుర్తించెను. ప్రయాణించు వారికి సలహాలు, వృద్ధుల విషయమై వహించవలసిన శ్రద్ధగూడ ఈ గ్రంథమున పేర్కొనబడినవి.

డా. వే. రా.

**అశోకుడు - క్రీ. శ. 273-232 :-** అశోకుడు మౌర్యచక్రవర్తులలో అగ్రగణ్యుడు. సుమారు క్రీ. పూ. 304 వ సంవత్సరమున రెండవ మౌర్యచక్రవర్తి యగు



బిందుసారునకును, సుభద్రాంగికిని జన్మించెను. ఇతడు తండ్రి జీవితకాలములో తక్షశిల రాజధానిగాగల ఉత్తరాపథమునకు రాజప్రతినిధిగా నుండి క్రీ. పూ. 273 లో తండ్రి మరణానంతరము చక్రవర్తి యయ్యెను. కాని క్రీ. పూ. 269 వరకు అనగా తండ్రి మరణించిన నాలుగు సంవత్సరముల వరకు పట్టాభిషిక్తుడు కాలేకపోయెను. ఈ మధ్యకాలములో అతనిపై కత్తిగట్టిన అతని సోదరులతో యుద్ధము చేయవలసివచ్చుట ఈవ్యవధికి కారణము కావచ్చును. అతని మంత్రియగు రాధాగుప్తుడు అతడు చక్రవర్తి యగుటకు చాల సహాయపడెను.

కళింగయుద్ధము : చక్రవర్తి అయినపిమ్మట అశోకుడు ఒకయుద్ధము చేసెను. క్రీ. పూ. 262 వ సంవత్సరమున అనగా పట్టాభిషిక్తుడయిన 8 సంవత్సరములకు అతడు కళింగదేశముపై దాడివెడలెను. ఈ యుద్ధములో 1 న్నర లక్షమంది ఖైదీలుగా పట్టుబడిరి. 1 లక్షకు పైగా మరణించిరి. దీని కెన్నోరెట్లు మిక్కుటముగ జనులు యుద్ధ కారణమున చనిపోయిరి. ఇట్టి ప్రాణహాని, హింస అతని జీవితములో గొప్పమార్పును తెచ్చెను. ఈ విజయము వేరు దిగ్విజయములకు పురికొల్పుటకు బదులు అతనికి

యుద్ధముపై ద్వేషమును జనింపజేసెను. యుద్ధమువలన పెక్కుమంది సైనికులు మరణించుటయో' గాయపడుటయో. శత్రువులచే జిక్కుటయో తటస్థించును. వారి కుటుంబములకు మిక్కిలి కష్టనష్టములు కలుగును. ఇవి వారి సన్నిహితులను కలచివైచి పెక్కు విషాదములకు దారితీయును. ప్రజానీకమును ఇట్టి కష్టములపాలు చేయుట అశోకుని కెంతమాత్రమును ఇష్టములేదు. కావున కళింగ యుద్ధానంతరము ఆతడు రణభేరికి బదులు ధర్మభేరిని ప్రయోగించెను. కొన్ని ఆధారములనుబట్టి కళింగ యుద్ధానంతరము బౌద్ధసన్యాసి ఐన ఉపగుప్తుడు అశోకునకు చేసిన బౌద్ధమతోపదేశము ఈ పరివర్తనమునకు చాలవరకు తోడ్పడెనని తెలియుచున్నది. తత్ఫలితముగా నతడు జీవితశేషమున రణరంగమున కాలిడనని ప్రతినపట్టుటయేగాక మానవకల్యాణమునకు మార్గమును చూపునట్టి అహింసను, నిగ్రహమును, సచ్ఛీలమును ప్రజలందరికిని అలవరుచుటకు పూనుకొనెను, ఈ విధముగ తన జన్మమును సార్థకము చేసికొని, "దేవానాం ప్రియ" "ప్రియదర్శి" అను బిరుదములను పొందెను. అశోకుడు క్రీ. పూ. 232 సంవత్సరమున మరణించెను.

**అశోకుని పరిపాలనము :** అశోకుని రాజ్యము మిక్కిలివిస్తీర్ణము కలిగియుండెను. దక్షిణమున కొంతగభాము తప్పభారతదేశమునంతను ఆతడు పరిపాలించెను. మన దేశముతో పాటు అరియా, అరోకోషియా, గెడ్రోషియా పారోపానిసాడై రాష్ట్రములుకూడ అతని అధీనమున నుండెను. పెషావర్‌లోని షాబజ్‌గర్హి, మనసహోరాలోను, డేరాడూను దగ్గరనున్న కాల్సిలోను. ధారో రాష్ట్రములోని సోపారాలోను, కథియవాడులోనున్న గిర్‌నారులోను, పూరీ జిల్లాలోని ధేలీలోను, గంజాములోని జౌగడలోను, మైసూరులోని చితల్‌దుర్గములోను, జబ్బల్‌పూరు దగ్గరనున్న రూప్‌నాథ్‌లోను, బీహారులోని సహస్రనామ్‌లోను, తదితర ప్రదేశములలోను ఉన్న అశోకుని శాసనముల ఆధారముగా అతని రాజ్య విస్తీర్ణము నిర్ణయించుటకు వీలైయున్నది. కాని కళింగ దేశముతప్ప మిగతా సామ్రాజ్య మంతయు అశోకుని తండ్రి యగు బిందుసారుడును, తాతయగు చంద్రగుప్తుడును జయించినదే.

అశోకుని సామ్రాజ్యమునకు పాటలీపుత్రము రాజధానిగా నుండెను. అశోకుడు తన రాజ్యమును నిరంకుశముగా పరిపాలించినను తన ప్రజలను తండ్రివలె నాదరించెను. స్మృతులను గమనించి, శిష్టాచారపరాయణుడై, పెద్దల సలహాలను మన్నించుచు, తన ప్రభుత్వమును మంచి పునాదులపై నిలిపెను. మరియు హిందూ రాజ్య సంప్రదాయము ననుసరించి అశోకుడు ప్రజల యోగ క్షేమములను తెలిసికొనుటకు వివిధ ప్రాంతములకు యాత్రలు వెడలుచుండెను. అతని క్రిందనున్న సామంతులు ప్రజలను కష్టపెట్టకుండ, వారికి క్షేమకరములగు పనులు చేయుటయందు అలసతను వహింపకుండ, కనిపెట్టుటకు గూఢచారులను నియమించెను. ఇన్ని ఏర్పాట్లు గావించినను ఒక్క ప్రభువు రాజ్యమంతయు స్వయముగా పరిపాలించుటకు వీలుకాదని యెరిగి అశోకుడు తన రాజ్యమును అనేక రాష్ట్రములుగా విభజించి సరిహద్దు రాష్ట్రములలో తన రాజకుటుంబములోనివారిని రాజప్రతినిధులుగ నెలకొల్పి తక్కిన రాష్ట్రముల పరిపాలనకై బిరుదుగల



అశోక స్తంభాగ్రము

రాజప్రతినిధులను ఏర్పాటు చేసెను. తక్షశిల, ఉజ్జయిని, తోసాలి, సువర్ణగిరి అను ఈ నాలుగు పరగణాలును సరిహద్దు రాష్ట్రములుగా పేర్కొనబడినట్లు కళింగ శాసనముల మూలమున తెలియుచున్నది.

**అశోకుని మతము :** అశోకుడు కళింగ యుద్ధానంతరము బౌద్ధమతము నవలంబించె నని తెలియుచున్నది. అతడు ఒక శాసనములో తాను బౌద్ధశాక్యుడ నని చెప్పుకొని యున్నాడు. అంతేకాక క్రీ. పూ. 253 వ. సంవత్సరమున బౌద్ధధర్మముల నన్నింటిని సదుద్దేశముతో విమర్శించుటకు మొగలిపుత్ర టిస్సాయొక్క అధ్యక్షతలో మూడవ బౌద్ధ సమావేశమును ఏర్పాటు చేసెను. బౌద్ధులకు పవిత్రస్థలములైన బుద్ధగయ, లుంబినీవనము, కపిలవస్తు, సారనాథ్, శ్రావస్తి, కుశీనగరము మొదలగు స్థలములకు యాత్రవెళ్లెను. బౌద్ధధర్మవ్యాప్తికై ధర్మమహామాత్రులను నియమించెను. జంతువులను బలియిచ్చుట మొదలగు అలవాటులను మాన్పించెను. బౌద్ధులకు ముఖ్యమైన దినములను ఉత్సవదినములుగా పరిగణించెను. ఇట్టి ప్రమాణములవలన అశోకుడు బౌద్ధమతాభిమాని యని ఘంటాపథముగా చెప్పవచ్చును.

అశోకుడు బౌద్ధమతాభిమాని అయినను, పరమతములయెడ ద్వేషభావము లేనివాడై అన్నిటిని సమభావముతో చూచెను. ఈ విధముగ అశోకుడు ధర్మసంస్థాపనార్థము తన సర్వస్వము త్యాగముచేసి విజయముగాంచి ప్రపంచచరిత్రలో అద్వితీయ స్థానమును పొందెను.

**అశోకుడు - ధర్మము :** అశోకుడు బోధించిన ధర్మము ఆచరణ సౌలభ్యము కలదనియు, సర్వజన సమ్మతమైనదనియు చెప్పవచ్చును. తల్లిదండ్రులయందు భక్తికలిగి యుండుట, పెద్దలను గౌరవించుట, బ్రాహ్మణులయెడ, శ్రమణులయెడ మర్యాదగా ప్రవర్తించుట, దాసులను దయతోచూచుట. అహింస, సత్యము, శౌచము, దానము దయ, మార్దవము, సాధుత, సంయమనము, భావశుద్ధి, కృతజ్ఞత, దృఢభక్తి, ధర్మరతి మొదలగు అంశములతో కూడిన ధర్మమును అశోకుడు ప్రజలకు బోధించెను. అశోకుడు తాను నమ్మిన ఈ ధర్మములను దేశములోను, దేశాంతరములలోను ఉన్న ప్రజానీకమునకు అందజేయుటకు అనేక మార్గములను, పద్ధతులను అనుసరించెను.

1. ప్రప్రథమముగా అశోకుడు తాను నమ్మిన ఆదర్శముల లక్ష్యములను స్వయముగా ఆచరణలో పెట్టెను. రాజులకు ప్రీతికరమగు మృగయావినోదములకు స్వస్తి చెప్పెను. వేటకు మారుగా రాజ్యములోని ప్రజలక్షేమ మరయుట, పవిత్రస్థలములను, జనులను సందర్శించుట ధర్మబోధచేయుట, దేశయాత్రచేయుట, మొదలగు పనులలో కాలము గడపెను. మాంసభక్షణమును మానివేసెను. ఈ ఆదర్శములతోనే అశోకుడు మనుష్యులకు, జంతువులకు వైద్యశాలలు కట్టించెను. ప్రయాణించువారికి సౌకర్యార్థము బాటలను వేయించెను. దారికి ఇరుప్రక్కల చెట్లు నాటించి బావులను త్రవ్వించి చలి పందిళ్ళను వేయించెను.

2. అశోకుడు తన సామంతులు తమ తీరిక వేళలయందు ప్రజలకు ధర్మోపదేశము గావించుచుండవలెనని శాసించుటయేగాక తన ధర్మమును ప్రజలకు సులభముగ అందజేయుటకు ధర్మమహామాత్రులను నియమించెను.

3. అశోకుడు తన ధర్మము జగమందంతటను వ్యాపింపజేయుటకై బౌద్ధ ధర్మోపదేశములను కాశ్మీరము, గాంధారము, యవనము, హిమాలయప్రదేశము, బర్మా, సింహళము మొదలగు దేశములకు పంపెను. ఈ సందర్భములోనే అశోకుని కుమారుడైన మహేంద్రుడు, కుమార్తె అయిన సంఘమిత్ర సింహళమునకు వెళ్ళినట్లు తెలియుచున్నది.

4. అశోకుడు ధర్మాభివృద్ధికై ధర్మశాసనములను చెక్కించి దేశములోని ముఖ్యమయిన ప్రదేశములలోను, సరిహద్దులందును ప్రతిష్ఠించెను. ఈశాసనములు ప్రాకృత భాషలో కొన్ని, ఖరోష్ఠిలిపిలో కొన్ని, మిగిలినవి బ్రాహ్మీలిపిలోను వ్రాయబడి యున్నవి. అశోకుని శాసనములను ఎనిమిదివిధములుగా విభజింపవచ్చును. పదునాలుగు శిలా శాసనములు, రెండు కళింగశాసనములు, మూడు గుహాశాసనములు, రెండు టిరాయి స్తంభశాసనములు, ఏడు స్తంభశాసనములు, పరిశిష్ట స్తంభశాసనములు, లఘుశిలా శాసనములు, భాబ్రాశాసనములు అనునవి.

ఆ. వై.

**అశ్వశాస్త్రము :-** భారతీయులకు మిక్కిలి ప్రాచీన కాలమునుండియు అశ్వములు పరిచితములై యున్నవి. వైదికముగాను, లౌకికముగాను అశ్వములు ప్రాధాన్యము వహించినవి. అశ్వమును ప్రధానముగా గ్రహించి చేయునట్టి అశ్వమేధమను మహాయజ్ఞము వేదములలోనే వర్ణితమగుట వేదకాలమునకు పూర్వమే అశ్వపరిజ్ఞానము భారతీయులకు లెస్సగానుండెనని తెలియుచున్నది. తైత్తిరీయ వాజసనేయి సంహితలు, తైత్తిరీయ, శతపథ, ఐతరేయ బ్రాహ్మణములు, ఆపస్తంబ, కాత్యాయన, సాంఖ్యాయన శ్రౌతసూత్రములు అశ్వమేధ ప్రశంస గావించినవి. అశ్వమేధీయమైన యశ్వమునకు 'యయు' వని పేరట. దానినే శ్యామకర్ణమని యందురనియు, అది యొడలెల్ల తెల్లనై చెవులు మాత్రము నల్లనై యుండుననియు శివతత్త్వ రత్నాకరము పేర్కొన్నది. అశ్వసంబంధముగల అశ్వినీదేవతలు ఋగ్వేదములో పేర్కొనబడినారు. సూర్యుని భార్యయయిన సరణ్యు ఆడుగుఱ్ఱము రూపము ధరింపగా సూర్యుడు మగగుఱ్ఱమై వెంట దవిలెననియు వారికి అశ్వినీకుమారులు పుట్టిరనియు వర్ణింపబడినది. పురాణేతిహాసాదులలోను అశ్వముల ప్రశంస యెక్కువగా గలదు. లౌకికముగా రాజుల చతురంగ బలములో అశ్వము ముఖ్యమైనది. అశ్వపతులకు ప్రసిద్ధిగలదు. దండయాత్రారంభములో 'వాజి నీరాజనవిధి' చెప్పబడినది.

**అశ్వశాస్త్రము :-** తమ కనేకవిధములుగా అవసరములైన గజములను గురించియు, అశ్వములను గురించియు, భారతీయులు ప్రత్యేకముగా కృషిసలిపి గ్రంథములను రచించిరి. గజశాస్త్రములు, అశ్వశాస్త్రములు ఇట్టివే. వీనిలో గజాశ్వముల స్వభావ స్వరూపాహారాదులు వివరింపబడినవి. ఆయాగ్రంథములు సప్రమాణములుగా నేటికిని స్వీకరింపబడుచున్నవి. అశ్వశాస్త్ర ప్రవర్తకులలో శాలిహోత్రుడు ముఖ్యుడుగా కనబడుచున్నాడు. శివతత్త్వ రత్నాకరములో శాలిహోత్రుడు పేర్కొనబడినాడు. అశ్వలక్షణసార కర్త మనుమంచిభట్టు 'అనఘుడు శాలిహోత్రుడు హయంబులకున్ మునుజెప్పినట్టి యా యనుపమ లక్షణంబులు...తెనుగున నెల్లవారలకుఁ దేటపడన్ రచియింతు' నని శాలిహోత్రుడు అశ్వలక్షణ శాస్త్రమును చెప్పియున్నట్లు నుడివినాడు. మహాభారతమున ద్వితీయాశ్వాసములో 'ఈతండు శాలిహోత్రుడో, మాతలియో, నలుడోయని హయనీతి కోవిదులలో మునుముందుగా శాలిహోత్రుడే యుగ్గడింపబడినాడు. నలుడు, నకులుడు, అశ్వశాస్త్ర పారంగతులుగా ప్రసిద్ధి చెందినారు. నల మహారాజునకు అశ్వ హృదయ మను విద్య తెలిసియున్నట్లుగా భారతము చెప్పినది.

**అశ్వోత్పత్తి :-** అశ్వములకు అమృతము, బాష్పము, అగ్ని, దేవతలు, అండము, గర్భము, సామ అనునవి యుత్పత్తిస్థానములుగా చెప్పబడినవి. దేవదానవు లమృతార్థము సముద్రమును త్రచ్చునపు డమృతముతోగూడ ఉచ్చైశ్శ్రవ మను అశ్వము పుట్టెను. అదియే యమృత సంభవము. యుగముల కాదిని బ్రహ్మదేవుని ముఖము నుండియు, అగ్నిదేవుని నాలుకనుండియు బాష్పములు రాలెను. వానినుండి కొన్ని యశ్వములు పుట్టెను. అవి బాష్పజాశ్వములు. తొల్లి పద్మజుడు హవనము చేయుచుండగా ఆ హోమాగ్నినుండి యొక వాహ ముద్భవించెను. అది యగ్నిసంభవ హయము. దేవతలు సృష్టింపబడగనే యందు ముఖ్యులైన ఇంద్రాద్యష్ట దిక్పాలకులు తమకొరకు గుఱ్ఱములను సృష్టించుకొనిరి. అవి దేవసముత్పన్నము లనబడినవి. ప్రజాపతి యొకప్పుడు ఉలూకరూపమును పొందెను. దాని యండముల నుండి యశ్వము లుదయించెను. అవియే యండజాశ్వములు. మగ గుఱ్ఱము వలన ఆడుగుఱ్ఱమునందు కలిగిన యశ్వము గర్భజము. సృష్టికాలమున సామలతో సృష్టికర్త అశ్వములను సృజించెను. అవియే సామజములు.

**గుఱ్ఱములకు తొల్లి రెక్కలుండెనట :** తొలుత అశ్వములకు పక్షము లుండెను. అశ్వములకు పక్షము లుండెనని మన వాఙ్మయములోను, ప్రాచీన చిత్రములలోను, కన్పడుచున్నది. అవి యాకాశమున యథేష్టముగా సంచరించుచుండెను. అవి దేవతలకును లోబడక తిరుగుచుండెను. ఇంద్రుడు కోపించి వీని రెక్కలను గొట్టుమని శాలిహోత్రు డను ముని నాజ్ఞాపించెను. శాలిహోత్రుడు ఇషీకాస్త్రమును ప్రయోగించి యశ్వముల రెక్కలను ముక్కలుచేసెను. పాప మా గుఱ్ఱములు జాలిగొలువ ఆ శాలిహోత్రుని ప్రార్థించెను. దయాళు వగు నా ఋషి "మీ రెక్కలబలము పిక్కలకు వచ్చును పొం"డని వర

మిచ్చెను. అప్పటినుండి అశ్వములు దేవేంద్రునకును, భూమీంద్రునకును వాహనము లయినవి. జంతువులలో వేనికాళ్ళకును లేనిబలము, వేగము అశ్వములకు గలుగుట కిదియేకారణము. పరిణామ శాస్త్ర నిష్ణాతు లయిన యాధునికులే పెద్దపెద్ద జంతువులకు తొలుత రెక్కలుండెననియు, కాలక్రమ పరిణామ దశవలన వానికి రెక్కలు పోయె ననియు సిద్ధాంతీకరించు చున్నారు. ఇటీవలి బెల్జియన్ కాంగోలో వేటాడిన యొకమత్తేభమునకు నాలుగు దంతము లున్నవట !

**అశ్వములలో చాతుర్వర్ణ్యము :** గుణకర్మ విభాగమును బట్టి అశ్వములలోను బ్రాహ్మణాది చతుర్వర్ణములు గలవని శాస్త్రజ్ఞులు చెప్పినారు. (1) మంచిగుణముకలవి, మంచి యలవాట్లుగలవి, శూరములయినవి, గంధర్వ బలము గలవి, తెల్లనివి, ఎఱ్ఱనివి, తేనెవన్నెగలవి, ఉసిరికనేయి, పేలాల వాసనవంటి వాసనగలవి, అలంకారము లందును, పాయసాజ్యములందును ఆసక్తిగలవి బ్రాహ్మణజాతి హయములు. (2) తేజస్సుగలవి, కొంచెము కోప స్వభావము గలవి, పెద్ద ధ్వనిగలవి, పెద్ద శరీరముగలవి, బలముగలవి, తెల్లనిదిగాని, నల్లనిదిగాని యగునట్టి మంచి వన్నెగలవి, పువ్వుల వాసనగలవి, మల్లెపూవులవంటి కన్నులుగలవి, సువిభక్తములయిన యవయవములుగలవి క్షత్రియజాతి గుఱ్ఱములు. (3) ఎండకు, గాలికి ఓర్చునవి, మిక్కిలి బరువు మోయజాలినవి, సంతోషమునుగాని, దుఃఖమునుగాని ప్రకటింపనివి, మధ్యవేగము గలవి, పానప్రియము లయినవి, చిగురుటాకు రంగుగలవి, మేకకంపు, కోతికంపుగలవి, రాజసతత్త్వము గలవి, వైశ్యజాతి తురంగములు. (4) దుర్గుణములుగలవి, ఇతర జంతువులు తినివదలిన యాహారమునుగూడ తినునవి, అపరిశుభ్ర వస్తువులనుగూడ విడువనివి, తన్నుపోషించువానినే తన్నునవి, చెట్టు విరుగునప్పటి సవ్వడిగలవి, తాటికంపు గొట్టునవి శూద్రజాతి తురగములు. ఆయా జాతివానిని గుణచేష్టాదులవలన గుర్తించి వేరువేరుగానుంచుట మేలు.

**అశ్వముల ప్రకృతి - ఋతువులు :** గ్రీష్మాంతమున సారహీనమైన గడ్డి, తీగలు, ఆకులు తినుటవలన అశ్వములు వాతప్రకృతి గలవి యగును. వాని కప్పుడు వాతరోగములు వచ్చును. అవి బలముడిగి కృశించి, వికిర రోమములు గలిగి నిద్రమత్తు గలవియై యుండును. వర్షర్తువు అంతమునను, హేమంతమునను హయము లెక్కువగా పచ్చగడ్డి తినును. అపుడవి పిత్తప్రకృతిగల వగును. వీని కీఋతువున శూలరోగములు కలుగును. అవి నీటి నెక్కువగా త్రాగును. హయముల కీసమయమున కోప మధికముగా నుండును. శిశిరర్తువులో గుఱ్ఱములు కండపట్టి మిక్కిలి బలముగలవై కార్యదక్షములై యుండును. ఎంతపని చేసినను అలసట చెందవు. ఏ రోగములకును గురికావు. అవి చూచుట కెంతయు నింపుగా నుండును. శ్లేష్మప్రకృతిగలవై యొప్పారును.

**అష్టవిధములయిన యశ్వలక్షణములు :** శరీరము, సుడులు, కాంతి, గతి, వాసన, స్వరము, వర్ణము, సత్త్వము అని యశ్వలక్షణము లెనిమిది విధములుగా నున్నవి.

శరీరము : సర్వలక్షణములకును స్థానము శరీరమే గావున ముఖ్యమైనది హయశరీరము. తొలుత దానిలక్షణ మెరుంగుట యవసరము. కొంచెము ఎఱ్ఱనివియు, గట్టివియు, ముడుతలుపడనివియు నగు పెదవులును, ఎఱ్ఱనిదియు, పల్చనైనదియు నగు నాలుకయు, ఎఱ్ఱని దవుడలును ప్రశస్తములు. దంతములు గట్టిగను, నున్ననైనవిగను, ఒకదానితో నొకటి చేరినవిగను, హెచ్చుతగ్గులు లేనివిగను ఉండవలెను. మిక్కిలి పెద్దవియు, పొడవైనవియు గానట్టి చెక్కిళ్ళు మంచివి. మెత్తని రెప్పలు గలిగి విశాలములై, తేనె రంగు గల కనులు శోభావహములు. మంచి సుడి గలిగి, విశాలమై యున్న నుదురు, సమమై, గుండ్రమై రెండు సుడులతో వెలయు శిరస్సు శుభప్రదములు. చెవులు పొట్టివియై, పల్చనివియై, సూటిగా నిక్కినవియై యున్న మేలు. మిక్కిలి దృఢమై, దీర్ఘమై యున్న మెడ శ్రేష్ఠ మయినది. పొడవైనట్టిదియు, జడలుగట్టనిదియు నగు జూలు మేలు. మూపు మేలు సుడులు గలిగి గట్టిదియై యుండవలెను. ఱొమ్ము సువిశాలమై, దీర్ఘమై యొప్ప దగును. చంకలు ఎత్తుగను, నిడుదలుగను నుండ నొప్పును. తొడలు గుండ్రమైనవియు, సమమైన వియునై యుండవలెను. మోకాళ్ళుగూఢముగా నుండుట తగును. గుండ్రముగా నుండి కండలేని పిక్కలు శ్రేష్ఠములు. గట్టివియు, నున్ననివియు, గుండ్రనివియు, పెద్దవియు నగు గిట్టలు ప్రశస్తములు. కొంచెము వ్రేలుచుండి

గుండ్రనిదియైన పొట్ట తగినట్టిది. ఎక్కువ దీర్ఘమైనదిగాక, బల్లపరుపుగానుండి, కొంచెముగా వంగియున్న వీపు శుభమైనది. పిరుదులు పెద్దవియై యుండవలెను. మెత్తనివియు నిగనిగలాడునట్టివియు, పొడవైనట్టివియు నగు వాలములతో గుండ్రని కుచ్చుగా నున్న తోక ప్రశంసనీయమైనది.

**అవయవముల పరిమాణము :** ముప్పది రెండంగుళముల ముఖముగలది యుత్తమాశ్వము. అంతకన్న రెండంగుళముల్కు తక్కువ ప్రమాణము గల ముఖము గలది మధ్యమాశ్వము. తక్కినది కనిష్ఠము. ఉత్తమాశ్వమునకు మెడ ఏబదియారంగుళముల పొడవు గలదై యుండును. నలుబదియారు, ముప్పదియారు అంగుళముల మెడలుగలవి మధ్యమ,కనిష్ఠములు. వక్షస్థలము, పృష్ఠము, కటి యనునవి ముఖముతో సమానప్రమాణముగలవి. చెవులు ఏడంగుళములు, తాలువులు ఆరంగుళములు, గిట్టలు ఏడంగుళములు ఉండవలెను. ఎనిమిది యడుగుల యెత్తు గలది యుత్తమాశ్వము. ఏడడుగుల యెత్తు గలది మధ్య మాశ్వము. ఆరడుగుల ఎత్తు గలది కనిష్ఠము. పది యడుగుల యడ్డుపుకొలత గలది శ్రేష్ఠమైనది. ఎనిమిది యడుగులది మధ్యమము. ఏడడుగులది హీనాశ్వము.

**వర్ణము :** తెల్లనివి, నల్లనివి, ఎఱ్ఱనివి, పసుపుపచ్చనివి శుద్ధవర్ణములు. మిశ్రవర్ణము లనేక విధములు. జూలు, తోకవెండ్రుకలు, రోమములు, చర్మము, గిట్టలు, తెల్లనైన గుఱ్ఱము **శంఖాభ** మనబడును. ఇది విప్రజాతి గుఱ్ఱము. జూలు మున్నైనవి తెల్లనై, చర్మము నల్లనైనది కర్తల మను హయము. సర్వావయవములు నల్లనైనది కాల మను గుఱ్ఱము. ఇది శూద్రజాతిది. సమస్తావయవములు ఎఱ్ఱనైనది కుంజాభ మను తురంగము. ఇది క్షత్రియజాతిది. జూలు, రోమములు, వాలము సర్వము బంగారువన్నె గలది శేరభము. ఇది వైశ్యజాతిది. రోమములు పసుపుపచ్చ, ఎరుపు కలిసియుండి, ముఖము, కాళ్ళు, తోక, జూలు ఎఱ్ఱనైనది చోర మనబడును. వాలము కాళ్ళు, ముఖము నల్లనైనది రురువు. తెలుపు, నలుపు కలిసియున్న రోమములు గలది పీలము. కలిగొట్టు పువ్వు వన్నె గలిగి పిక్కలు నల్లనైనది మేఘ మనబడును. పక్వమైన నేరేడుపండు వన్నెగలది జాంబవము. ఇట్టి చిత్రజాతులలో రుచిరము, సుమనము, శ్యామకర్ణము, కల్యాణ పంచకము, అష్టమంగళము, మల్లికాతుము, ధౌతపాదము, హాలాభము, కరంజము, బింబకము మున్నగునవి కలవు. వీనిలో శ్యామకర్ణ మనునది మిక్కిలి ప్రశస్తమైనది. ఇది శరీర మంతయు తెలుపు, చెవులు మాత్రము నలుపువన్నె గలిగిన గుఱ్ఱము. ఈ శ్యామకర్ణమే యశ్వమేధ యాగమున ప్రధాన పశువుగా నుపకరించునట్టి యశ్వరాజము. నాలుగు పాదములు, ముఖమధ్యము తెల్లనైనది కల్యాణ పంచకము. ఇది కల్యాణప్రదమైన తురంగము. జూలు, తోక, రొమ్ము, ముఖము, నాలుగు కాళ్ళు అను నెనిమిది యవయవములు తెల్లనైనది అష్టమంగళము. ఇదియు మిక్కిలి ప్రశస్తమైన గుఱ్ఱము.

**వర్జనీయములగు అశ్వములు :–** శరీరమంతయు తెల్లగా నుండి, నాలుగు పాదములు నల్లగానున్న యశ్వము యమదూత వంటిది. సర్వనాశనకారి. ఇట్టిది వర్జనీయము. తోకగాని శిరస్సుగాని హీనవర్ణమైనది త్యాజ్యము. శరీరమంతయు నొకవర్ణమై శిరముగాని, తోకగాని వేరొక వర్ణమైనది యశుభము. తక్కువ దంతములు గలదియు, ఎక్కువ దంతములు గలదియు విడువదగినవియే. నల్లనైన తాలువులు గలది కీడు. నమలునపుడు క్రింది దంతములతో పై దంతములుగాని, పై దంతములతో క్రింది దంతములుగాని రాపిడి పడిన గుఱ్ఱము నిలుపదగనిది. మూడుకాళ్ళు నల్లనై, ఒకకాలు తెల్లనైనదానిని ముసలి యందురు. ఇది యశుభంకరము. చెవుల చెంత కొమ్మువంటి సుడిగలది శృంగిక మనబడును. పెద్దపులివంటి వర్ణముగలది వ్యాఘ్రాభము. స్తనమువంటి చర్మము వ్రేలాడునట్టిది స్తని. ఆవుగిట్టవలె చీలిన గిట్ట గలది ద్విఖురము. మూపున సుడిగలది కకుది. ఒక అండమే కలది ఏకాండకము. బూడిదవన్నె ముఖము, తోకగలది భస్మాభము. ఇవియన్నియు దూష్యములు. సర్వము నల్లనైనది నింద్యము. సర్వము తెల్లనైనది శుభదము.

**ఛాయలు :–** నునుపుగా నిగనిగలాడుచున్నవి, చూడ ముచ్చటైన ముదురురంగుగలవి పార్థివచ్ఛాయలు. క్రొత్త మేఘములు, తామరపూలు, నీరువంటి కాంతి గలవి వారుణములు. బంగారము, చిగురుటాకులవంటి వన్నెలు

గలవి ఆగ్నేయీచ్ఛాయలు. విడివిడిగా పరుషమయిన కాంతి గలవి వాయవీచ్ఛాయలు. ఆకాశకాంతి గలవి నాభసీచ్ఛాలు.

గమనము : సింహము, వ్యాఘ్రము, ఏనుగు, హంస, నెమలి, శరభము, వృషభము, ముంగిస, కోతి, లేడి, ఒంటె యనువాని గమనములవంటి గమనములుగల గుఱ్ఱములు శుభదములు. వంకరనడకలుగలవి, విషమగతుల నొప్పునవియు, తొట్రుపాటు గలవియు, నిబ్బరములేని నడకలు గలవియు నగు గుఱ్ఱములు హీనజాతులు.

గంధము : కన్నులు, చెవులు, మోము, ముక్కురంధ్రము లనువానియందును, చెమ్మటయందును, మూత్ర పురీషములయందును సుగంధము గలవి ప్రశస్త హయములు. దుర్గంధముగలవి దుర్జాతివి. మద్దిచెట్టు, కడిమిచెట్టు, కొండమల్లెలవంటి పరిమళము గలవి యుత్తమాశ్వములు. నేతివాసన, పాలవాసన కలవియు శ్రేష్ఠములు.

స్వరము : వీణ, పిల్లనగ్రోవి, మద్దెల, భేరులధ్వనులవంటి సకిలింతకలవి శ్రేష్ఠాశ్వములు. గజము ఘీంకరించునట్లును, వ్యాఘ్రము బొబ్బలిడినట్లును, సింహము గర్జిల్లినట్లును వినవచ్చు హేషారవము ప్రశస్తము. త్రుటితమైనదిగను, గద్గదమైనదిగను, పరుషమైనదిగను వినబడు హయస్వరము చెడ్డది. రాబందులు, ఒంటెలు, అరచునట్లరచునవి హీనాశ్వములు. ఇట్టి దుష్టాశ్వములు యజమానుని సంపదలను హరింపజేయును.

సత్త్వము : బ్రహ్మ, ఈశ్వరుడు, మహేంద్రుడు, కుబేరుడు, యమధర్మరాజు, గంధర్వుడు మున్నగువారి సత్త్వమువంటి సత్త్వము గలవి యుత్త మాశ్వములు. రాక్షసులు, పిశాచములు, పితృదేవతలు, మహాసర్పముల సత్త్వముగలవి మధ్యమాశ్వములు. వీనిలో దేవసత్త్వములును, రాక్షసాది సత్త్వములును గల తురంగములు గ్రాహ్యములు. భీరువులు, కలహపరములు, శుచిరహితములు నగు హీనసత్త్వములు త్యాజ్యములు.

ఆవర్తములు : అశ్వలక్షణములలో ఆవర్తము లత్యంతము ముఖ్యములయినవి. శిశువు గర్భమునం దుండగా గర్భవాయువు మిక్కిలి వేగముగ తిరుగుచు, శిశు శరీరము నందలి రోమములను సుడులుగా త్రిప్పుటవలన సుళ్ళు ఏర్పడుచున్నవి. ఆవర్తము, శతపాది, శుక్తి, అవలీఢకము, పాదుక, అర్ధపాదుక, సమూహము, ముకుళము - అని యావర్తములస్వరూప మెనిమిదివిధములు. నీటి సుడిగుండమువలె నుండు సుడి ఆవర్త మనబడును. జెఱ్ఱికి శతపాది యనిపేరు. అట్టి జెఱ్ఱివలెనుండు సుడి శతపాది. ముత్యపుచిప్ప యాకారముగలది శుక్తి యను సుడి. దూడ నాలుకతో నాకినట్లున్న సుడి అవలీఢకము. పాదుకవంటిది పాదుక సుడి. సగము పాదుకవలె నున్నది అర్ధపాదుక. మంచుగుట్టవంటిది సమూహావర్తము. మొగ్గవంటి యాకృతిగల సుడి ముకుళము.

ఆవర్తముల ప్రమాణము : నీటిగుండమువంటి సుడి ముప్పావంగుళము ప్రమాణము గలదియై యుండవలెను. శతపాది సుడి నాలు గంగుళములు. శుక్తి రెండంగుళములు. అవలీఢకము మూడు అంగుళములు. పాదుక నాలు గంగుళములు. అర్ధపాదుక ముప్పా వంగుళము. సమూహమను సుడి అష్టాంగుళము. ముకుళావర్తము ముప్పావంగుళ ప్రమాణము గలదియై యుండవలెను. ఈ ప్రమాణముగల సుళ్ళు వానివాని ఫలముల నొసగును. ఉక్తప్రమాణములకంటె యెక్కువయై యున్నను తక్కువయైన నైనను వాని ఫలముల నొసగవు.

ముఖ్యములయిన కొన్నిసుళ్ళు : గుఱ్ఱములకు ముఖ్యముగా పదిచోట్ల సుళ్ళుండవలెను. ఉరమునందును, రంధ్రోపరంధ్రములయందును, శిరమునందును రెండేసియు, నుదుటిమీదను, మూతిమీదను, ఒక్కొక్కటిగాను మొత్తము పది సుళ్ళుండవలెను. పదిసుళ్ళకు తక్కువ యున్న గుఱ్ఱ మల్పాయు వగును.

శుభావర్తములు : సెలవులయందును, నుదుటియందును, ముంగాళ్ళ యందును, నొసటను, కంఠముననుు, జూలు నందును, చెవిగూబలయందునుగల సుళ్ళు శుభప్రదములు. జూలునందు ముత్తెపుచిప్పవంటి సుళ్ళున్న హయము మిక్కిలి ప్రశస్తము. చెవిగూబలయందలి సుడికి వృషభావర్తమని పేరు. అట్టి వృషభావర్తమను సుడిగల తురంగము నెంత వెలయిచ్చియైనను కొనవలె నని యందురు. నాలుగుపూలల నాలుగు సుళ్ళున్న తురంగము చాతురంతిక మనబడును. ఏ యశ్వము నెన్నొసట చాతురంతికావర్తము చూపట్టునో ఆ హయము యజమానునకు రాజ్యలాభమును చేకూర్చును. ఒకదానిపై నొకటి నిచ్చెన

మెట్లవలెనున్న సుళ్ళకు నిశ్రేణిక యనిపేరు. అట్టి నిశ్రేణిక నొసటగల అశ్వము తనస్వామికి విభవైశ్వర్యముల నొసగజేయును. వక్షస్థలమున నాలుగు సుళ్ళున్న గుఱ్ఱమును శ్రీవక్షకి అందురు. ఇది ఉత్తమోత్తమ హయము. ఉరమున మూడు శుక్తులుగల గుఱ్ఱము నెక్కువానికి జయము సిద్ధించును. పద్మము, కులిశము, కలశము, తోమరము, చక్రను, ముసలము, ముకురము, శంఖము, చంద్రుడు, మణి, ఖడ్గము, అంకుశము మొదలయిన రూపములలోనుండు తెల్లనిబొల్లియుండు గుఱ్ఱములు శ్రేష్ఠము లయినవి.

**అశుభావర్తములు :** హృదయమున నొకటే సుడిగల గుఱ్ఱము యజమానుని యుద్ధమున మడియజేయును. కణ్ఠావర్తముకూడ అశుభమైనదే. మూపురస్థానముననున్న సుడి చెడ్డది. మోకాళ్ళమీదనుండు సుళ్ళు శుభప్రదములు కావు. వెన్నున సుడిగల యశ్వము నెక్కరాదు. గండస్థలముల రెండిటను సుళ్ళుండకూడదు. శంఖమువంటి సుడిచెడ్డది. దండావర్తము, క్రోడావర్తముఅనునవి దూష్యములు. ముక్కురంధ్రముల సమీపమునగల సుళ్ళు అమంగళకరములు. ముక్కుదూలమునకు నడుమ సుడియున్న తురంగము మృత్యుదేవతవంటి దని హయలక్షణవేత్త లందురు. పై పెదవులమీదనున్న సుళ్ళు చెడ్డవి, మెడమీదనుండు గ్రీవావర్త మనునది కీడుకలిగించును. పల్లైడ పెట్టుచోటగల సుడి హాని కలిగించును. గుదము, నాభి, కటిస్థలము, ఉదరము, తొడలు, బీజములు, చెవులు, పృష్ఠభాగమం దున్న సుళ్ళు దుష్టములు.

**అశ్వదంతోద్భేదము - వయోజ్ఞానము :-** దంతములను బట్టి అశ్వముల వయస్సును గుర్తింపవచ్చును. పుట్టిన మాసమున హయమునకు రెండు దంతములు తోచి, రెండవ మాసమున నవి పూర్ణములగును. మూడవనెలలో నడిమి దంతములు రెండు పొడమి నాల్గవ నెలలో నవి నిండుగా గన్పడును. అయిదవ నెలలో ప్రక్కదంత యుగ్మము వచ్చి ఆరవనెలలో గట్టిపడును. ఇట్లే పుట్టినది మొదలుగా పండ్రెండవ మాసము పూర్తియగువరకు హయములకు దంతము లన్నియు వచ్చును. ఒకయేడు వయస్సుగల గుఱ్ఱమునకు దంతములు తెల్లగానుండును. రెండవయేట ఆ దంతములు కషాయ వర్ణములుగా మారును. హయమునకు అయిదవయేటనుండి మూడేసి యేండ్ల కొక వ్యంజనముగా తొమ్మిది వ్యంజనములు తోచును:— కాలికము, హారిణి, శుక్లము, కాచము, మాక్షికము, శంఖము, ఉలూఖము, చలనము, పతనము. మొదటి యైదువర్షములకు బిమ్మట, మూడేండ్ల కొకసారి హయముల దంతముల వర్ణములు మారుచుండుటయు, కడపటి దశలో కదలుటయు, రాలుటయు సంభవించును. హయమునకు సంపూర్ణాయుర్దాయము ముప్పది రెండేండ్లు. చెవికొనలు నలుపగా రక్తచ్ఛాయ, సిందూర వర్ణముగాగన్పడు గుఱ్ఱములు దీర్ఘకాలము జీవించును.

**అశ్వసాముద్రికము :-** హస్తరేఖలను జూచి మానవుల యాయుః ప్రమాణాది ఫలములను జెప్పినట్లే గుఱ్ఱపు ముక్కుమీది (పోథముమీది) రేఖలనుబట్టి దాని యాయుః ప్రమాణాదులను జెప్పుదురు. ముక్కునడుమ బుట్టి పైకి వ్యాపించిన రేఖవలన ఆ గుఱ్ఱము ముఖరోగము వలన సంవత్సరార్ధమున మృతిచెందు నని చెప్పనగును. అట్టి యూర్ధ్వరేఖలు రెండంగుళముల ప్రమాణము గలవి రెండున్నచో ఆ హయము రెండేండ్లు మాత్రమే జీవించునని చెప్పవచ్చును. ఆ రేఖలే అడ్డముగా నున్నయెడల మూడు సంవత్సరములకు దౌడలు పట్టుకొనిపోవు రోగము వలన ఆ గుఱ్ఱము చచ్చును. ఆ రేఖలే వంగినట్లున్న నాలుగేండ్లకు మృతి సంభవించును. ఊర్ధ్వరేఖ ముక్కుమీద ఎడమవైపుననుండి కొన వాలియున్నదైనచో ఆ తురంగము పంచమాబ్దమున పంచత్వము నొందును. రెండంగుళముల ఊర్ధ్వరేఖ గలదానికి ఆరేండ్లయాయువు. అర్ధాంగుళము పొడవుగల్గి నడుమ ఎత్తుగానున్న రేఖగల యశ్వము ఏడేండ్లకు చచ్చును. మూడంగుళముల పొడవు గల ముక్కుగీతవలన ఆ గుఱ్ఱము ఎనిమిదవయేట జ్వరముతో మరణించునని తెలియ దగును. మధ్య స్థూలమైన గీతగలది తొమ్మిదవయేటను, వంకరరేఖ గలది పదియవయేటను, రెండంగుళముల వెడల్పున ఊర్ధ్వరేఖగలది ద్వాదశవర్షమునను, లావు పొడవు నుండు రేఖ గలది త్రయోదశాబ్దమునను, కాకికాలిగుర్తు రేఖగలది పదునాల్గవ యేటను, రెండంగుళములకు మించిగాని, తగ్గిగాని యున్న రెండురేఖలు గలది పంచదశవర్షమునను, ఆ రేఖయే యొకటి తెల్లగుఱ్ఱమునకైన అది పదునారవ

యేటను, నల్లగుఱ్ఱమునకైన అది పదునేడవ యేటను, యూపస్తంభమువంటి రేఖగాని, చైత్యాకార రేఖగాని యున్నచో ఆ హయము పదునెనిమిదవ వర్షమునను, కపిశవర్ణమైన రేఖగలది పందొమ్మిదవ సంవత్సరమునను మరణించును. చక్రరేఖ, వజ్రరేఖ, అర్ధచంద్ర రేఖలు కూడ హయమున కరిష్ట సూచకములే. శ్రీవృక్షము, స్వస్తికము, నంద్యావర్తరేఖలు శుభప్రదములు.

**అశ్వచేష్టలు - శుభాశుభములు :-** మోర పైకెత్తి పెద్దగా సకిలించుట, గిట్టలతో నేలను త్రవ్వుట యను చేష్టలు యజమానునకు యుద్ధమున విజయమును సూచించును. పదేపదే మూత్రపురీషములను విడచుట, కన్నీరు గార్చుట, అపజయమునకు సూచకము. అకారణముగా తెల్లవారుజామున సకిలించుట పరులు దాడివెడలి వచ్చుటను తెలుపును. తోకమీది గగుర్పాటు యజమానునికి ప్రవాసము కలుగు ననుటకు గుర్తు. ఎడమకాలితో భూమిని త్రవ్వుట, దీనముగా చూచుచు సకిలించుట, తత్స్వామి పరాజయమును సూచించును. మోమున దుమ్ము చిమ్ముకొనుట, ఎండుగడ్డిని, పుల్లలను కరచుట, భయపడినట్లు సకిలించుట, తోకవెండ్రుకలను జల్లిగా విప్పుట యను చేష్టలు అశుభ సూచకములు. జూలు నిగిడ్చి, కుడికాలితో నేలతాచుట విజయహేతువు.

**ఏబదినాలుగు హయజాతులు :-** భారత దేశీయములగు హయములను అవి యుద్భవించిన ప్రాంతములనుబట్టి యేబదినాలుగు జాతులుగా విభజించినారు. వానివాని స్వరూపము, స్వభావము భిన్నభిన్నములై యుండును. వీనిలో కాంభోజ, బాహ్లిక, వనాయుజ, గాంధార, చాంపేయ, సైంధవ, తిత్తిల, పాటలీపుత్రక, యవన, కాశ్మీరాద్యశ్వములు శ్రేష్ఠములు. దాక్షిణాత్య హయములు ప్రశస్తములు కావు. కళింగాశ్వములు - స్థూల పాదములు, దీర్ఘకర్ణములు, వంకరమెడలు, అల్పవేగములు గలవిగా చెప్పబడినవి. అట్లే త్రిలింగదేశజములైన గుఱ్ఱములు కోపము గలవిగాను, వందివలె ఘుర్ఘురధ్వని చేయునట్టివిగాను, పెద్ద వక్షస్థలము గలవిగాను, స్తబ్ధములై యల్పవేగము గలవిగాను వర్ణింపబడినవి.

**అశ్వారోహణము :-** మంచి రూపము, మంచి సుళ్ళు, బలము మొదలైన యుత్తమగుణము లెన్నియున్నను హయము వేగహీన మగుచో నిరర్థకముగా భావింపబడును. కనుక అశ్వారోహకుడు వేగవంతమైన యశ్వమునే యేరుకొనవలెను. మిక్కిలి లావైనవాడు, ముక్కోపి, మూర్ఖుడు, భయముగలవాడు, తొందరపాటు గలవాడు, తల నిలుకడ లేనివాడు, కొట్టతగని చోట కొట్టువాడునైన యశ్వారోహకుడు నింద్యుడు. అట్టివానికి హయము వశవర్తియై మెలగదు.

అశ్వారోహకుడు ఆయాజాతి గుఱ్ఱముల స్వభావాదులను లెస్సగా ఎరిగి యుండవలెను. బ్రాహ్మణజాతి గుఱ్ఱమును దానికి ప్రీతికరములగు తినుబండారములు పెట్టి లాలించియు, క్షత్రియజాతి గుఱ్ఱమును మేను నిమిరి బుజ్జగించియు, వైశ్యజాతి గుఱ్ఱమును నోటితో గద్దరించియు, శూద్రజాతి తురంగమును దండించియు నేర్పుతో తన యంకెకు తెచ్చుకొని నడుపవలెను. మాటిమాటికి సకిలించినను, భయముతో ముందడుగు వేయని యప్పుడును, త్రోవతొలగి నడుచునపుడును, కోపముతో రుసరుసలాడునపుడును, మతిచెడినట్లు ప్రవర్తించినపుడును గుఱ్ఱమును దండింప వలెను. మిక్కిలిగా సకిలించునపుడు ముట్టిమీదను, తొట్రుపడునపుడు కణతలకడను, భయపడినప్పుడు బొమ్మున్నను, దారి తొలగినపుడు తొడలపైనను పిక్కలపైనను, కోపగించినపుడు పొట్టమీదను, మతిచెడినట్లున్నపుడు చెవులమీదను కొట్టవలెను. ఆయా స్థానములను గుర్తింపక ఇష్టము వచ్చినట్లు బాదినచో గుఱ్ఱము మొద్దుబారి యనేక దోషముల కాకరమగును. ఎంతటి యుత్తమాశ్వ మయినను ఎప్పుడును స్వారిచేయక కట్టి యుంచినచో చెడిపోవును. అట్లని మితిమీరి తట్టుతెగ పరువు లెత్తించుటయు తగదు. మితము, హితము పాటించి అశ్వమును నడుపుకొనవలెను.

**అశ్వధారలు :** విభ్రమము, ప్లుతము, పూర్ణకంఠము, త్వరితము, తాడితము ననునవి యైదు ముఖ్యములైన యశ్వగతులు. వీనినే ధారలనియు నందురు. ఇవియేగాక మయూరీగతి, హంసీగతి, తిత్తిరీగతి, చతుష్కగతి యని యశ్వగతులు మరికొన్నియు గలవు. తలను, మెడను, తోకను పైకెత్తి పరుగెత్తుటకు మయూరీగతి యని పేరు. ప్రక్కల నెగురవేయుచు, తలను కదల్చుచు పోవుటను హంసీగతి యందురు. తొందరగా నడచుచు తోకకదల్చ

నిచో తిత్తిరీగతి యందురు. నాలుగు పాదములు సమముగా వైచుచు తొట్రుపడని లలితగమనమును చతుష్కగతి యందురు. మరియు అమరకోశానుసారము—

'ఆస్కందితం ధోరితకం రేచితం వల్గితం ప్లుతం
గతయోఽమూః పంచధారాః......'

అని అశ్వధారలు ఐదుగలవు. (1) ఆస్కందితము = అతి వేగమును, అతి మందమును గాక నడితరముగా పరుగెత్తుట. (2) ధోరితకము = ఆస్కందితముకంటె అధికమై చతురమైన అశ్వగతి. (3) రేచితము = వంకర లేక తిన్నగా మిక్కిలి వేగముతో పరుగుదీయుట. (4) వల్గితము = మీదికి కాళ్ళెత్తి వేగముగా పరుగెత్తుట. (5) ప్లుతము = పరువెత్తినంత మేరయు సమమైన వేగముతో పోవుట.

అశ్వశాల : అశ్వరక్షణ విషయమున నతిజాగరూకులై యుండవలెను. వాస్తు శాస్త్రానుసారముగా అశ్వశాలను నిర్మింపవలెను. అశ్వపాలకులు తమ యశ్వశాలలు సురక్షితములై యుండునట్లును, పరిశుద్ధములై యుండునట్లును చూచుకొనవలసి యుందురు. నెమలి, హంస, కోడి, తొండ, మేక, పిల్లి, ఎద్దు మొదలయిన కొన్నింటిని అశ్వశాలకడకు రానీయకూడదు. అశ్వములకు దృష్టి దోషము తగులకుండుటకును, కొన్ని రోగములు సంక్రమింపకుండుటకును అశ్వశాలలలో ఒండు రెండు కోతులను పెంచుట హితమని చెప్పబడినది.

అశ్వవైద్యము : అశ్వములకు రోగములు రాకుండ కాపాడుట యశ్వపాలకుని విధియై యున్నది. ఒకవేళ ఏకారణమువలన నైనను రోగములు సంభవించినచో వాటికి తగిన యౌషధములు ప్రయోగించి చికిత్సోపచారములు గావించుటయు వాని కర్తవ్యము. కావుననే వివిధములైన యశ్వరోగములను, తత్తచ్చికిత్సలను వివరించు వైద్యగ్రంథములు పుట్టినవి. అశ్వశాస్త్రమును రచించిన శాలిహోత్రుడు మేటివైద్యు డనియు తెలియుచున్నది. అశ్వవైద్యశాస్త్ర గ్రంథములలో గణపండితుని అశ్వాయుర్వేదము, జయదత్తుని అశ్వవైద్యకము, దీపంకరుని అశ్వవైద్యము, వర్ధమానుని యోగమంజరి, నకులుని అశ్వచికిత్సితము గ్రంథస్థములై గన్పట్టుచున్నవి. సిద్ధయోగ సంగ్రహమను వైద్యగ్రంథమును పేర్కొనుచు సుప్రసిద్ధ వ్యాఖ్యాత కోలచెలమ మల్లినాథసూరి '— పూర్వాహ్ణకాలే చాశ్వానాం ప్రాయశో లవణం హితం! శూలమోహ విబంధఘ్నం లవణం సైంధవం వరమ్—' అను శ్లోకము నాగ్రంథమునుండి యుదాహరించి అశ్వములకు పూర్వాహ్ణవేళ కొంత ఉప్పును ఆహారముగా పెట్టుట హితమని రఘువంశ కావ్యమున పంచమ సర్గమునందు డెబ్బదిమూడవ శ్లోకవ్యాఖ్యానావసరమున వివరించియుండెను.

అశ్వప్రశస్తి : సర్వలక్షణ సంపన్నములగు అశ్వములు పుణ్యవిశేషమునగాని లభింపవని విజ్ఞులందురు. మత్తమాతంగములు, సుందరాశ్వములు గృహద్వారములకడ నిల్చుట మంగళకరము. అశ్వలక్షణసారములో అశ్వప్రశస్తి కనిపించుచున్నది.

చ. రం.

**అష్టోత్తర శతతాళములు :-** భారతదేశమునందు సంగీతము సమగ్రముగా విలసిల్లినది. సంగీతమునందు గేయ వాఙ్మయము, వర్ణగణబద్ధమును, మాత్రాగణమూలకమునై యున్నది. పెక్కురీతుల గణములకు పెక్కు విధము లయిన తాళము లుండును. మనదేశమున వివిధ గేయములకు గల తాళములు ఇతరదేశములందు కానము. ఇతరదేశములవారికి మన తాళములు ఆశ్చర్యకరములును, ఆదర్శప్రాయములును అగును. ప్రాచీన కాలముననే మన సంగీతశాస్త్రమునందలి అష్టోత్తర శత తాళములు బహుళవ్యాప్తినొందె. ఇప్పుడు అజ్ఞాతవాసమున నున్నవి. అట్లయ్యు నివి క్లిష్టములు, అసాధ్యములు, అగ్రాహ్యము లనదగదు. ప్రజ్ఞావంతులగు సంగీత విద్వాంసులకు ఇవి కొట్టిన పిండివలె నుండును.

సంగీతమందలి రాగములు, గమకరీతులు మున్నగు వాటివలె తాళములు ఒక్కరీతిగ నుండక దేశ కాల పరిస్థితుల ననుసరించి మారుచుండుట విదితము. ప్రాచీనము లయిన భరతుని నాట్యశాస్త్రమునందలి చచ్చత్పుటాదులు తరువాత శార్ఙ్గదేవుని కాలమున (1210-1247) మార్గ తాళములుగ చెప్పబడెను. వీటిని పాలకుర్కి సోమనాథుడు శుద్ధము లనెను. శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరమున వింశత్యధికశతతాళములను పేర్కొనగా సోమనాథుడును, తక్కినవారును అష్టోత్తరశతతాళములనుమాత్రమే

చెప్పిరి. కోహలుని తాళలక్షణము, తాళకళావిలాసము, తాళప్రకరణము మున్నగు గ్రంథములందు 108 తాళములే లిఖింపబడెను. శార్ఙ్గదేవుడు స్వకల్పితము అయిన తాళములను కొన్ని చేర్చినట్లు దీనిచే విదితము. నారదుడు 108 తాళములనే చెప్పెను.

అష్టోత్తరశతతాళములు ప్రాచీనకాలమునుండియు బహువిధ గేయములందు విలసిల్లినట్లు శార్ఙ్గదేవాది సంగీత శాస్త్రవేత్తల ప్రబంధములందలి ప్రబంధరీతుల ననుసరించి తెలియుదుము. గీతప్రబంధములు ఛందస్సు, తాళము, నాదము, లయ మున్నగువాటితో కూడియుండును. తాళములచే ధాతుమాతువులు (స్వర సాహిత్యములు) వర్ధిల్లును. తాళాంగములు తాళమును నిరూపించును. మాతువు మాత్రావృతమై ఆయా తాళాంగములను గుర్తింపజేయజాలును. అనుభవమున మాతువు ననుసరించి గేయము,త్రిపుట,రూపకము, ఝంప మున్నగుతాళములు కలవని ఎంచనగును. గీతము తాళము నధిష్ఠించి తాళావర్తములతో పెరుగుచుండును. ఈ విధముగా కలిగినవే అష్టోత్తర శతతాళములు, శార్ఙ్గదేవుడు త్రివిధ ప్రబంధములను చెప్పి అష్టవిధసూఢలు పేర్కొనుచు, మత్యతాళము ద్వితీయ తాళము, కంకాళ తాళము, ప్రతితాళము మున్నగు వాటిని వివరించెను. ప్రబంధవిధముల ననుసరించి తాళముల కీ పేళ్ళేర్పడెను. అభిసంశ్రయ ప్రబంధములందు తురంగలీల, గజలీల, ద్విపద, పంచతాళేశ్వరము అనువాటిని, విప్రకీర్ణ ప్రబంధముల ననుసరించి శ్రీరంగము, విజయ, త్రిపద, చతుర్ముఖ, సింహలీల, హంసలీల, దండకము, ధవళము మున్నగువాటిని చెప్పెను. ఈ పేళ్ళతోనే తాళములుకూడ వెలయింపబడెను.

అష్టోత్తర శతతాళములు దశప్రాణాత్మకములు. ముఖ్యముగ నివి కాల, మార్గ, క్రియా, అంగ, గ్రహ, జాతి, కళాలయ - యతి ప్రస్తారయుతములు, మార్గకళలు ప్రాచీన చచ్చత్పుటాదులందే కలవు. శార్ఙ్గదేవుని కాలపు దేశీయతాళములందు చతురశ్ర, త్రిశ్ర అను రెండు జాతులే కలవు. శార్ఙ్గదేవు డిట్లు చెప్పెను: "చతురశ్రస్తథా త్ర్యశ్ర ఇతి తాళో ద్విధా మతః". పూర్వము ద్రుత, లఘు, గురు, ప్లుతాంగముల ప్రస్తారముచే అష్టోత్తర శతతాళము లేర్పడెను. అట్లయ్యు నీ తాళములు క్రమ ప్రస్తారమున లేవనితెలియగలము. కొన్నిట ప్లుతము లేదు. ఇట్టివి 67 తాళములు గలవు. ఒక ద్రుతము, రెండు, నాలుగు, ఆరు ద్రుతములు గలట్టివియు, ఒక లఘువు, రెండు, నాలుగు లఘువులు గలట్టివియు తాళములు గలవు. ద్రుత, లఘువులు మాత్రము గలట్టివి 35 తాళములు కలవు. ఈ సంఖ్య చొప్పుననే ఇప్పటి మన సూళాదులున్నవి. ద్రుతములేకయే లఘు, గురు, ప్లుతములు గలవి 43 తాళములు కలవు. మూడు, ఆరు అక్షరకాలము లెంచుటకు ద్రుతవిరామము, లఘు విరామము అను తాళ - అంగములు కూడ చేర్పబడెను. అందుచే పెక్కు అంగములతో తాళము లెంచవలసియుండెను. అనంతరము "తాళలక్షణమ్" "తాళ కళా విలాసమ్" మున్నగు గ్రంథముల కాలములందు ఈతాళములు కొన్నిటియందు అనుద్రుతమును చేర్చి చెప్పబడెను. తాళములందు అంగముల పేళ్ళు చేర్చి పేర్కొనుటకు మారుగ వాటికి అంగసంజ్ఞ లేర్పరచి, వాటినివివరించుట ప్రాచీనకాలమునుండి తెలియుదుము, ఒక అక్షరకాలము గల అనుద్రుతమునకు U గుర్తును, ఇట్లే రెండక్షరముల కాలముగల ద్రుతమునకు O గుర్తును, నాలుగక్షరములు గల లఘువునకు I గుర్తును, ఎనిమిది అక్షరములుగల గురువునకు S గుర్తును, పండ్రెండక్షరములుగల దానికి Ś గుర్తును చెప్పబడెను. విరామమును ఎంచుటకు అంగ సంజ్ఞకు శిఖరముచేర్చి 39 గుర్తులు చెప్పబడెను.

దేశీయములగు పూర్వపు అష్టోత్తరశత తాళములు అంగసంజ్ఞలతో నిట్లున్నవి: (1) ఆదితాళము 1 (2) ద్వితీయతాళము OOI (3) తృతీయతాళము OOÓ (4) చతుర్థ తాళము IIO (5) పంచమ తాళము OO (6) నిశ్శంకలీల తాళము ŚŚSSI (7) దర్పణతాళము OOS (8) సింహవిక్రమ తాళము SSSIŚISŚ (9) రతిలీల తాళము IISS (10) సింహలీల తాళము OOOI (11) కందర్పతాళము OOISS (12) వీరవిక్రమ తాళము IOOS (13) రంగతాళము OOOOS (14) శ్రీరంగ తాళము IISIŚ (15) చచ్చరితాళము OÓOÓOÓOÓOÓOÓOÓI (16) ప్రత్యంగ తాళము SSSII (17) యతిలఘ్న తాళము OI (18) గజలీల తాళము IIIÍ (19) హంసలీల తాళము ÍÍ (20) వర్ణభిన్న

తాళము OOIS (21) త్రిభిన్న తాళము ISŚ (22) రాజ చూడామణి తాళము OOIIIOOIS (23) రంగద్యోత తాళము SSSIŚ (24) రంగప్రదీపిక తాళము SSISŚ (25) రాజ తాళము SŚOOSIŚ (26) త్రిశ్రవర్ణ తాళము IIOOII (27) మిశ్రవర్ణ తాళము OOOÓOOOÓOOOÓ ŚSOOSIS (28) చతురశ్రవర్ణ తాళము SIOOS (29) సింహావిక్రీడిత తాళము ISŚŚSSISŚIŚ (30) జయ తాళము ISIIOOŚ (31) వనమాలీ తాళము OOOOI OOS (32) హంసనాద తాళము IŚOOŚ (33) సింహనాద తాళము ISSIS (34) కుడుక్క తాళము OOII (35) తురంగలీల తాళము ÓÓOO (36) శరభలీల తాళము IIOOOOII (37) సింహానందన తాళము SSIŚISOOSSIŚIŚSII (38) త్రిభంగి తాళము IISS (39) రంగాభరణ తాళము SSIIŚ (40) మత్స్య తాళము IIS (41) కోకిలప్రియ తాళము SIŚ (42) నిస్సారుక తాళము IÍ (43) రాజ విద్యాధర తాళము ISOO (44) జయమంగళ తాళము IISIIS (45) మల్లికామోద తాళము IIOOOO (46) విజయనందన తాళము IISSS (47) క్రీడ తాళము ÓÓ (48) జయశ్రీ తాళము SISIS (49) మకరంద తాళము OOIII (50) కీర్తి తాళము IŚSIŚ (51) శ్రీకీర్తి తాళము SSII (52) ప్రతి తాళము IIOO (53) విజయ తాళము ŚSŚI (54) బిందుమాలి తాళము SOOOS (55) సమతాళము IIÓÓ (56) నందనతాళము IOOŚ (57) మంఠిక తాళము SOŚ (58) దీపక తాళము OOIISS (59) ఉదీక్షణ తాళము IIS (60) ఢేంకీ తాళము SIS (61) విషమ తాళము OOOÓOOOÓ (62) వర్ణమంఠిక తాళము IIOOIOO (63) అభినంద తాళము IIOOS (64) నందీ తాళము IOOIISS (65) మల్లతాళము IIIIOÓ (66) పూర్ణకంకాల తాళము OOOOSI (67) కందుక తాళము IIIIS (68) కుముదతాళము IOOIIS (69) ఏక తాళము O (70) చతుస్తాల తాళము SOOO (71) ఖండ కంకాళ తాళము OOSS (72) డోంబులి తాళము ÍÍ (73) అభంగ తాళము IŚ (74) రాయబంగాళ తాళము SISOO (75) వసంత తాళము IIISSS (76) లఘుశేఖర తాళము Í (77) ప్రతాపశేఖర తాళము ŚOÓ (78) ఝుంపతాళము ÓÓI (79) గజఝుంప తాళము SOOÓ (80) చతుర్ముఖ తాళము ISIŚ (81) మదన తాళము OOS (82) ప్రతిమఠ్య తాళము IISSII (83) పార్వతీలోచన తాళము SSSIŚSSOO (84) రతి తాళము IS (85) లీలా తాళము OIŚ (86) కరణ యతి తాళము OOOO (87) లలిత తాళము OOIS (88) గారుగి తాళము OOOÓ (89) రాజనారాయణ తాళము OOISIS (90) లక్ష్మీశ తాళము OÓIŚ (91) లలితప్రియ తాళము IISIS (92) శ్రీనందన తాళము SIIŚ (93) జనక తాళము IIIISSIISS (94) అనంగ తాళము IŚIIS (95) వర్ధన తాళము OOIŚ (96) షట్ తాళము OOOOOO (97) అంతర క్రీడ తాళము OOS (98) ఉత్సవ తాళము IŚ (99) విలోకిత తాళము SOOŚ (100) వర్ణయతి తాళము IIOO (101) కరణ తాళము S (102) స్కంధ తాళము SISOOSS (103) అడ్డ తాళము OII (104) కలధ్వని తాళము IISIŚ (105) సమకంకాళ తాళము SSI (106) విషమ కంకాళ తాళము ISS (107) ఖండ కంకాళ తాళము OOSS (108) సింహ తాళము IOIII.

శార్ఙ్గదేవుడు దేశీయతాళములందు మరి పండ్రెండు స్వకల్పితములనుచేర్చి 120 తాళములను చెప్పెను. ఈయన చెప్పిన హంస, గజ, సారస, చండ, చంద్రకళ, లయ, దంతా, ద్వంద, కువింద, గౌరీ, సరస్వతీ కంఠాభరణ, భగ్న, రాజమృగాంక, రాజమార్తాండ, నిశ్శంక శార్ఙ్గదేవాది తాళములను తదితరులు చెప్పలేదు. పూర్వోక్తములయిన తాళము లిట్లు కాలానుసారముగ గొంత మార్పునకు లోనగుచుండెను. నారదుడు తెలిపిన జనత, మల్ల, కంకాళములు అను తాళములను శార్ఙ్గదేవుడు చెప్పలేదు.

ఇంచుమించు శార్ఙ్గదేవుని కాలమునాటికి పాలకుర్కి సోమనాథుడు (క్రీ. శ. 1190-1265) ఆంధ్రదేశమునందు విశ్రుతములని కాబోలు మిశ్రవర్ణ, చతురశ్రవర్ణ, ప్రభృతి తాళములు వేరు పేరులు గలట్టి వాటిని భిన్న

విధమున చెప్పెను. ఈతడు చచ్చత్పుటాదులను ప్రథమ న_ష్టకములుగ జెప్పి యిరువదియేడు శుద్ధ తాళములను, 74 దేశీయ తాళములను పేర్కొనెను. ఈతని ధ్రువలయ ధ్రువ, మఠ్య తాళములు నేటి ధ్రువతాళాదులకు కారణముగ గన్పట్టును. వివిధ కంకాళములు, మఠ్యలు చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండవర్ణ తాళములు ఈతడు పేర్కొనుటచే ఆ కాలమున ఆంధ్రదేశమున ఈ తాళములు వ్యాప్తియం దుండినట్లు తెలియుచున్నది. మరియు సోమనాథుడు రూపకతాళమును చెప్పుటచేతను, శార్ఙ్గదేవుడు ఈ రూపకతాళమును పేర్కొనకపోవుటచేతను ఔత్తరీయ సంగీతవిధానమున నీ తాళము లేకుండినట్లు ఎంచనగును. ఆంధ్రప్రాంతమునకు చేరువనున్న ఉత్కళదేశమునందు జయదేవుడు రూపకతాళమును తెలిసి అష్టపదులందు వాడినాడు.

జయదేవుడు ఇరువదినాలుగు అష్టపదులలోను, యతితాళమును పదకొండు గేయములందును, ఏకతాళమును ఆరింటియందును, రూపక తాళమును ఐదింటియందును, అష్టతాళమును, నిస్సారుక తాళమును, ఒక్కొక్క గేయమునందును చేర్చినాడు, అష్టతాళమును అడ్డతాళములుగ నెంచ నగును. ఈతని నిస్సారుకతాళము పది మాత్రలు కలదిగను, యతితాళము IIOO ఇట్లు 12 మాత్రలు కలదిగను ఎంచబడును. ఇటీవల కుంభరాణ అనునతడు కొన్ని గేయములందు ప్రతితాళమును చేర్చి అష్టపదులకు వ్యాఖ్యానము రచించెను. ప్రతితాళము శార్ఙ్గదేవుడు చెప్పినట్లు IIOO ఇట్టి అంగములతో నుంటచే నిది మన అటతాళమునకు తుల్యమగుచున్నది. ప్రతి అను తాళము ఆ కాలమున ప్రాధాన్యమును వహించినట్లు కుంభరాణ తెలిపినాడు.

కోహలుని తాళ లక్షణము, "తాళప్రకరణము" "తాళకళావిలాసము" "తాళదీపిక" మున్నగు గ్రంథములందు చెప్పబడిన సమకంకాళ, విషమకంకాళ, ఖండ కంకాళ, పరాక్రమ, చలమంఠిక, సగుణమంఠిక, వక్ర, గరుడ, కుంభ, భరణమంఠిక తాళములను శార్ఙ్గదేవుడు చెప్పలేదు. వీటిని కొన్ని సోమనాథుడు చెప్పెను. వక్ర, గరుడ, కుంభ, ప్రభృతి తాళములు అంత వ్యాప్తినొంది యుండలేదు.

రాగములవలె తాళము లన్నియు ఏకాలమందయినను వ్యాప్తియం దున్నట్లు ఎంచవీలులేదు. కొన్ని కల్పితములుగనుండి విజ్ఞానవంతులగు నేర్పరులకుమాత్రమే సువిదితము లగుచున్నవి. అందుచే అట్టివాటిని అసాధ్యములుగను, అవేద్యములుగను చెప్పుటకు వీలులేదు. అష్టోత్తర శతతాళము లిట్టివే. ఇవన్నియును ఏకాలమందయినను విశేష వ్యాప్తిగలవానిగ నెంచనేరము. కొన్ని ఆది, మఠ్య, ఝంప, యతి, ఏక, ప్రతి, నిస్సారుక, రూపక, అడ్డాది తాళములు బహుళ వ్యాప్తినొందియున్నవి. ఇక్లే అధునిక సూళాదు లన్నియు బహుళవ్యాప్తి నొందినవి కావు. అట, త్రిపుట మున్నగు తాళములు తెనుగు గేయములందు మిక్కిలి వాడుకలో నున్నవి. వీటిలో ఖండ, మిశ్ర, సంకీర్ణ జాతులతోగల తాళముల ప్రచారము అల్పముగ నున్నది.

క్రీ. శ. 15 వ శతాబ్దియందు కుంభరాణా అనునతడు (క్రీ. శ. 1433-1468) ఝంప, ఆది, ప్రతిమఠ్య, అడ్డ, చతుర్మాత్రమఠ్య, పర్ణయతి, నవమాత్రమఠ్య, నిస్సారుక రూపక, ద్రుతమంఠిక, ప్రతి, ఏక, త్రిపుట, అను 18 తాళములను చెప్పెను. ఆ కాలమునాటి గోపీంద్రతిప్పభూపాలుడు రచించిన "తాళదీపిక" అను గ్రంథమందుకూడ ఈ విషయము కలదు. ఆ కాలమునుండి వెలువడిన గేయ వాఙ్మయ రీతులయందలి యక్షగానములు, కురవంజులు మున్నగుపాటలు ఆది, అడ్డ, తివడ, ఏక, మఠ్య, రూపక, ఝంప తాళములలో చెప్పబడినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 16 వ శతాబ్దియందలి తాళ్లపాకవారి గేయములందును రూపక, ఝంప, తివడ, పంచఘాత, మఠ్య, అట, ఏక, చాపు, చేతాళము అనునవి గలవు. 17 వ శతాబ్దియందలి సుగ్రీవవిజయము మున్నగు యక్షగానములందు అట, ఏక, రూపక, ఝంప, ఆది, తివడ తాళములు చెప్పబడినవి. కంకంటి పాపరాజుగారి యక్షగానమున త్రిపుటతాళము ఎక్కువగా వాడబడెను. ఆది, ఝంప తాళములును కలవు. తంజావూరు రఘునాథరాయలు (క్రీ. శ. 1614-1637) ఆది, ద్వితీయ, జయమంగళ, రంగ, శ్రీరంగ, రతి, హంసలీల, కంకాళ, ఖండ, కుడుక్క, శంకిక, జయనందన, విజయము అను తాళములను పేర్కొనెను. ఇట్లు ముఖ్యములగు కొన్ని

తాళములు బహుళవ్యాప్తిలోనికి వచ్చుచుండెను. అష్టోత్తర శతములందలివి కొన్ని ఇప్పటి మనసూళాదులందు కలవు. ఇప్పటి అది, మఠ్య, అడ్డ, ఏక, ఝంప, రూపక తాళములు ప్రాచీన తాళములందు తెలియవచ్చినను, ఇప్పటి తాళములందలి అంగములు వాటియొక్క మాత్రాకాలములు పూర్వపు తాళములందుకంటె భిన్నములుగ నున్నవి. ఆదితాళ మిప్పుడు IOO అంగములతో ఎనిమిది అక్షరములు కలిగియున్నది. కాని పూర్వమియ్యది ఒక్క లఘువునుమాత్రము కలిగియుండెను. ఇప్పటి అట IIOO అంగములతోనుండగా పూర్వమియ్యది IO మాత్రలుగల OII అంగములు గలదైయుండెను. ఇప్పట ఏకతాళము ఒక్క లఘువుతోనుండగా పూర్వము అది ఒక్క ద్రుతమునే కలిగియుండెను. ఇప్పుడు మఠ్య తాళము IOI అంగములతో నుండగా పూర్వము ఇది SOS ఇట్లు అంగములు కలిగియుండెను. మన ఝంప తాళము IUO అను అంగములతోనుండగా పూర్వమున నిది IO మాత్రలుగల SSI అను అంగములతో నుండెను.

మరియు నిప్పటి కొన్ని సూళాదులకును పూర్వపు తాళములకును కొన్నిపోలికలు కలవు. కొన్ని అంతర్భూతములుగ నుండునట్లు ఎంచవగును. శార్ఙ్గదేవుడు తెలిపిన యతిలఘ్ను ఇప్పటి రూపకముకు తుల్యముగ నున్నది. ప్రతిఅనుతాళము ఇప్పటి అటతాళమునకును, ఝంప తాళము ఇప్పటి మిశ్ర ఝంపతాళమునకును, తురంగ లీల తాళము ఇప్పటి ఆదితాళమునకును, సమచాపు తాళమునకును తుల్యముగ నున్నవి. తక్కిన తాళము లను గూడ ఇట్లే పోల్చి ఎంచవగును.

ధ్రువతాళము గీత ప్రబంధమునందలి ధ్రువఖండము ననుసరించి గ్రహింపబడియుండును. సోమనాథుడు ధ్రువ లయ, ధ్రువమఠ్యలు అనువాటిని తెలిపెను. ఆధునిక తాళములందు ఇవి చెప్పబడినను గీతములందు మాత్రమే వీటిని మనవారు చేర్చిరి.

త్రిపుట లేక తివడ (తేవడ) అన్నమాచార్యుల కీర్తన లందు ప్రప్రథమముగ చెప్పబడెను. పదప్రబంధమున కను గుణముగ నీతాళము చెప్పబడియుండును. ఇది శార్ఙ్గదేవుని తృతీయలేక తురంగలీల తాళమునకు తుల్యమగును. తాళ్ళపాకవారు చెప్పిన చౌతాళము, జౌత్తరీయ తాళములందు కలదు. ఇయ్యది IIOO అను అంగములతో నుండుటచే దీనిని మన అటతాళమునకు తుల్యముగ నెంచనగును.

నేడు సూళాది సప్తతాళములు వాడుకలో నున్నవి. పూర్వపు అష్టోత్తరశతతాళములు మరుగుపడినను అయ్యవి అంతరించినట్లు ఎంచుటకు వీలులేదని తెలిపితిమి. శతవర్షములకు ముందుండిన రామస్వామి దీక్షితులు సప్తతాళములతో మరి యేబదివాల్గు తాళములను అష్టోత్తరశత తాళములనుండి చేర్చి అరువదొక్క తాళములతో రాగమాలికను పాడి విఖ్యాతుడయ్యెను. పూర్వపు తాళములు అసాధ్యము అనువారి కయ్యవి సుసాధ్యము లని ఇతడు ప్రకటించుచు, వాటితో రాగమాలికను నేర్పుతో చెప్పగలుగుట ఇతని వైశిష్ట్య మన చెల్లును. ఈరాగమాలికయందలి తాళములు (1) ధ్రువ (2) మఠ్య (3) రూపక (4) ఝంప (5) త్రిపుట (6) అట (7) ఏక (8) లలిత, (9) లక్షణ (10) రతిలీల (11) జయ, (12) దర్పణ (13) రాజచూడామణి (14) మదన (15) రతి (16) రాజ (17) కీర్తి (18) కుందర (కందుక) (19) మదన (20) క్రీడ (21) విజయనందన (22) రంగ (23) అనంగ (24) వీరవిక్రమ (25) సింహలీల (26) పరిక్రమ (27) సంపద్వేష్ట (28) సమ (29) సింహ విక్రమ (30) చతుర్ముఖ (31) శ్రీనందన (32) విషమ (33) లఘుశేఖర (34) వసంత (35) వనమాలి (36) శ్రీ కీర్తి (37) తృతీయ (38) అంతర క్రీడ (39) అభంగ (40) పార్వతీ (లోచన) (41) కోకిల ప్రియ (42) హంసనాద (43) కందర్ప (44) శ్రీరంగ (45) ప్రతాపశేఖర (46) రాగవర్ధన (47) లలిత (48) శ్రీకీర్తి (49) విలోకిత (50) ముకుంద (51) రాజవిద్య (52) చతుర్థ (53) కుడుక్క (కుటుంబ) (54) విజయ (55) తురంగలీల (56) మకరంద (57) నందన (58) రాజబంగాళ (59) నంది (నది) (60) కళ (61) శ్రీ అనుపేళ్ళతో నున్నవి. ఇందు లక్షణ, శ్రీ కళ అను తాళములు అష్టోత్తర శతతాళము లందు లేవు. ఈ తాళములందలి అంగములకు సశబ్ద, నిశ్శబ్ద క్రియలను పాటించుచు గానము చేయుట విద్వాం

నులకే సాధ్యపడగలదు. ఆ విధముగా గానము చేయ బడినపుడే వాటికి ప్రయోజనము కలదు.

వి. వ. న.

**అస్సామీభాషా సాహిత్యములు:-** అస్సాము నందు అనేక అనాగరకజాతులకు చెందిన భాషలు వ్యవ హారమున గలవు. ఈ ముఖ్యకారణమునుబట్టి దానికి 'భాషా శాస్త్రజ్ఞుల స్వర్గము' అను పేరు వచ్చెను. 'అసా మియా' (అస్సామీభాష) అనునది అస్సామునందలి ముఖ్యభాష. దేశమునందలి ఈభాగమునకుగల 'అస్సాము' అను ప్రాచీన నామమునుబట్టి ఆభాష కీపేరు కలిగినది. అస్సామునకు, కామరూపము, ప్రాగ్జ్యోతిషము అనునవి ప్రాచీనతరము లయిన పేళ్ళు. అస్సామియా అనునది సంపూర్ణవికాసము నొందిన అర్వాచీనమైన ఇండో - ఆర్యనుభాష. అది మాగధి అను అపభ్రంశము (భాషా విశేషము) నుండి పుట్టియుండవచ్చును. అందలి వ్యాకర ణమునందును, పదములందును టిబెట్టుభాష యొక్కయు, బర్మాభాష యొక్కయు ప్రభావము విశేషముగా గోచ రించును. అందలి పదజాలమున స్వల్పముగా ఆస్ట్రికు భాషాసంబంధముకూడ కలదు. క్రీ. శ. 7 వ శతాబ్ది యొక్క పూర్వార్ధమునాటికే కామరూప రాజగు భాస్కరవర్మ యొక్క ముఖ్యపట్టణమును యువాన్ ఛాంగు దర్శించెను. అక్కాలమున అచ్చటి భాష మధ్య భారతమునందలి భాషకంటె కొంచెము భిన్నముగా, అనగా, అప్పటి ఆర్య - టిబెట్టు - బర్మాభాషల యొక్క మిశ్రముగా - అతనికి గోచరించెను.

క్రీ. శ. 8-10 శతాబ్దులలో ఇరువదిముగ్గురు సిద్ధపురు షులు 'చర్యా' లేక 'చర్యాపదములు' అను గూఢతత్త్వ బోధకము లయిన గేయములను వ్రాసిరి. ఆ గేయము లందు సహజయానమునకు సంబంధించిన గూఢతత్త్వ ములును, శృంగార సంప్రదాయములును ముఖ్యవిషయ ముగా ప్రతిపాదింపబడినవి. అవి మొత్తముమీద ప్రాగ్భా రతమునకు చెందినవై యున్నవి. ఈ చర్యాపదము లకు గాని, చర్యాపదములను వ్రాసిన కవులకుగాని బౌద్ధమతము యొక్క గూఢతత్త్వమునకు కేంద్రమై వర్తిల్లిన కామరూపముతో సంబంధము ఊహింపబడు చున్నది.

అస్సామీ సాహిత్యయుగము ప్రశస్తమైన పద్యవాఙ్మ యోత్పత్తితో ప్రస్ఫుటముగా బయలువెడలెను. దాని కాధారములు భారతీయములై సుప్రసిద్ధములైన రెండు వీరకావ్యములును, పురాణములునై యున్నవి. 'మాధవ కందళి' (క్రీ. శ. 1400) అను నాతడు ఆయుగమునందలి కవులలో మిక్కిలి యెన్నదగినవాడు. అతడు శ్రీమద్రా మాయణాంతర్గతము లయిన మధ్యకాండము లైదింటిని సజీవమును, సహజమునైన అస్సామీ భాషలో పద్యరూప ముగా అనువదించెను. హరివరవిప్రుడు, హేమసరస్వతి అను నిరువురు కవులును రాజగు దుర్లభనారాయణుని (క్రీ.శ.1300) కి సమకాలికులు. దుర్లభనారాయణుని కొడు కగు ఇంద్రనారాయణుడు పరిపాలించుకాలమున "కవి రత్న సరస్వతి" కావ్యరచన యొనర్చెను. 'రుద్రకందళి' అను మరియొకకవి ఈ యుగమునకుచెందిన తామ్రధ్వజు డను నింకొకరాజును పేర్కొనెను. 'హరివరుడు' ఈ యుగమునందలి ఉత్తమకవులలో రెండవస్థానము నాక్ర మించినవాడు. జైమినీయ - అశ్వమేధపర్వమున వర్ణింప బడిన శ్రీరామునకు కుశలవులతోను, అర్జునునకు తన కుమారుడయిన బభ్రువాహనునితోను, ప్రవర్తిల్లిన - యుద్ధ ముల వృత్తాంతమును అతడు పునఃకథన మొనర్చెను. 'హేమసరస్వతి' వామనపురాణమునందలి ప్రహ్లాద హిర ణ్యకశిపుల కథను నూరు పద్యములుగా అనువదించెను. అనేక పురాణములు ఆధారముగా రచితమైన 'హర- గౌరీ సంవాదము' అను రెండవ గ్రంథముకూడ ఆతని రచనగానే ఊహింపబడు చున్నది. కవిరత్న సరస్వతీ రుద్రకందళులు మహాభారత - ద్రోణపర్వమునగల జయ ద్రథవధ అనెడి పర్వమునకు సంబంధించిన స్వల్పభాగము ను అస్సామీ పద్య కావ్యముగా కూర్చిరి.

క్రీ. శ. పదునేనవ శతాబ్ది యొక్క అంతమందు శంకర దేవుని అభినవ వైష్ణవోద్యమ (1449-1568) రూప మున దేశమున నొక మహాశక్తితోగూడిన (మత) పునరు ద్ధరణము ఆరంభమయ్యెను. ఇయ్యుద్యమముతో సంబం ధము లేని మంకరుడు, దుర్గావరకాయస్థుడు, పీతాం బరుడు అను ముగ్గురు కవులు పదునారవ శతాబ్ది ప్రథమ భాగమున తమ రచనలు కావించిరి. వారిలో మంకరకవి దుర్గావరకవి-ఇరువురును 'మనసా' అను పేరుగల సర్ప

దేవతయొక్క ఆరాధనమునకు సంబంధించిన యొక నూతన మతసిద్ధాంతమును ప్రతిపాదించు నిమిత్తమై అస్సామీ భాషలో నొక గేయకావ్య పరంపరను వ్రాసి, తన్మూలమున నొక నూతన పురాణమును సృజియింప యత్నించిరి. దుర్గావరకవి రామాయణమునందలి కరుణ రసాత్మకములయిన ఘట్టములను ఎడనెడ సాధారణ పద్యములతో మేళవించుచు, నొక చిన్న కీర్తనావళిగా రచించెను. పీతాంబరకవియు ఈ రచనా విధానము ననుసరించి, ఉషా పరిణయము, భాగవత దశమస్కంధము చండీ-అఖ్యానము అను గ్రంథములను వ్రాసెను. ఈ ముగ్గురు కవుల గ్రంథములకును, వారి సమకాలికులగు ఇతర వైష్ణవకవుల గ్రంథములకును రూపమునందును, విషయమునందును భేదముకలదు. పాచాలి లేక పాంచాలి అనబడెడి ఈ (రచనా) రూపము ఆనాడు వంగదేశము నందు సర్వసాధారణమయిన రీతియై యుండెను. ఆనాటి (కావ్య) విషయము బుద్ధికికంటె ఇంద్రియములకే ఎక్కుడు ప్రీతికరమయినదై ఉండెను.

శంకరదేవకవి ప్రతిపాదించిన నూతన వైష్ణవ సంప్రదాయమునందలి ముఖ్యసిద్ధాంతము అద్వైతతత్త్వము. ఈ సంప్రదాయమునకు చెందిన భక్తులు విష్ణు - కృష్ణుని నామమును లో నావృత్తిచేయుట (జపించుట), అతని నామములను ఉచ్చరించుట, లేక అతని దివ్యలీలలను గాన మొనర్చుట, ఆ భగవంతుని చేరుటకు ముఖ్యమార్గములని విశ్వసించిరి. దీనికి 'ఏకశరణ నామధర్మము' అనిపేరు. ఈ మతము ఏకేశ్వరోపాసనమునే విధించి, తదనుయాయులు ఇతర దేవతారాధనమును చేయగూడదని నిషేధించును. ఈ వైష్ణవ సంప్రదాయము రాధాకృష్ణమత సంప్రదాయముతో నేకీభవింపదు. ఈ యుద్యమము దానితోబాటొక సారస్వత విప్లవమునుగూడ కల్గించెను. శంకరదేవ కవియు, అతని ప్రియశిష్యుడును, మాధవ దేవ కవియు అనేకములయిన కీర్తనములను, రూపకములను, పద్యకథలను తదితర సారస్వత ప్రక్రియలను రచించిరి. ఈ సాహిత్యయుగము ఏకమతగ్రంథ యుగము అనగా భాగవతయుగము; ఏకదేవయుగము అనగా విష్ణు - కృష్ణ యుగము అనిపేర్లు. శంకరదేవకవి భాగవత పురాణము నందలి పండ్రెండుస్కంధములలో ఎనిమిది స్కంధములను అనువదించినట్లు తెలియుచున్నది. ఆ పురాణము నందలి శేషించిన స్కంధములను అనువదించుటకయి ఇతనిచే నితర విద్వాంసులు ప్రోత్సహింపబడిరి. శంకరదేవ కవి కృతులలో అత్యుత్తమ రచనయైన 'కీర్తనఘోష' అను గ్రంథము భాగవతసారరూప మనవచ్చును. శంకర దేవకవి భాష చాలవరకు సరళమైనది. అందలి స్వర మాధురిలో సౌందర్య గాంభీర్యములు రెండును ప్రవ్యక్తము లగు చుండును.

వరగీతములు (Bargitas) అను అనేక కీర్తనములను, పత్నీప్రసాదము, కాళీదమనము, కేళీగోపాలము, రుక్మిణీ హరణము, పారిజాతహరణము, రామవిజయము, అను నాటకములను రచించుపట్ల ఇతడు సృజనాత్మక ప్రతిభతోను, ధైర్యముతోను భాషయొక్క పరిధిని విస్తృత మొనర్చి 'వ్రజబులి' భాషయందు నూతనమైన జాతీయ (idiom) ప్రయోగసంప్రదాయమును కల్పించెను.

మాధవదేవకవి వరగీతములను 'చోరధరా' 'పింప రాగుచువా' మున్నగు నాటకములను వ్రాసెను. వాటి యందు ఆతని గురువుయొక్క కృతులందుకంటె ఎక్కుడు కోమలమైన శిల్ప కౌశలము కనిపించును. శంకరదేవకవి కృతులందు దాస్య భావము ప్రవ్యక్తమగుచుండ, మాధవ దేవకవి రచనలందు వాత్సల్యము అతిశయించును, మాధవదేవకవి శ్రీకృష్ణుని బాల్య క్రీడలను అమితోత్సాహముతో వర్ణించెను. బాలకృష్ణదేవుడు తన తల్లియగు యశోదకును, బృందావనమునందలి గోపికలకును ప్రదర్శించిన లీలలును, ఆతడు వారి ఆజ్ఞకు బద్ధుడగుటయు ఆ కవికి అనిర్వాచ్యమైన ఆశ్చర్యమును కలిగించెను. 'నామఘోషా' అనునది ఆతడు రచించిన మహోత్కృష్ట మైన కావ్యము. అందాతని ఉత్తమ భక్తియు, తత్వజ్ఞతయు తేటపడుచున్నవి.

శంకరదేవ కవికి సమకాలికులయిన మరి యిరువురు ప్రముఖ కవులు కలరు. వారు అనంత కందళి, రామ సరస్వతి అనువారలు. వారిలో మొదటికవి వైష్ణవ గుర్వాదేశమును పురస్కరించుకొని భాగవతముయొక్క ఉత్తరార్థమునందలి దశమస్కంధమును అనువదించెను. రెండవకవి వినమ్రతతో ఆ సాధువునకు అనుయాయియై ఆతని నుపాసించెను. కందళికవి రచించిన 'కుమార

హరణము' లోకప్రసిద్ధమైనది. అందు ఉషానిరుద్ధుల ప్రణయకథ వర్ణితమైనది. అతడు భాగవతమునందలి అనేక స్కంధములను అనువదించెను. రామాయణమును స్వతంత్ర కావ్యముగా రచించెను. మాధవ కందళి కవి యొక్క భావాది చౌర్య మీతని కృతులందు కొంతవరకు కనుపించును. రామసరస్వతి కవి ప్రచురముగా మహాభారత విషయములను చేపట్టి వ్రాసెను. వాటిలో నతడు ముఖ్యముగా వనపర్వమును విపులముగా పెంచుచు కొన్ని విషాదాంత కావ్యములుగా రచించెను. (ఇట్టి రచనయందు అతనికి 'సాగర్ ఖరి' వంటి అనుయాయులు అనేకులు కలరు. సాగర్ ఖరి కవి 'ఖటాసుర వధ'ను వ్రాసెను.) సరస్వతీకవి 'భీమ చరితము, అను మృదుహాస్య భరితమైన కావ్యమును రచించెను, శ్రీధర కందళికవి రచించిన 'కాన్ ఖోవా' (కర్ణభతుకుడు) అను రచన మరియొక రమ్యమై హాస్యరస విశిష్టమైన కావ్యము. ఇక్కవి ఘును (గుండి) చా - యాత్రా అను కావ్యమును కూడ నిర్మించెను.

గోపీనాథ పాఠకకవి (క్రీ. శ. 17 వ శతాబ్ది ప్రారంభము), దామోదర దాసకవి, లక్ష్మీనాథ ద్విజకవి, పృథు రామ ద్విజకవి మున్నగు నితర రచయితలు మహాభారత భాగములను పద్యరూపమున అస్సామీ భాషలోనికి అనువదింప గడగిరి. హృదయానంద కాయస్థ కవియు తదితరు లయిన అప్రధానకవులును రామాయణ భాగములను భాషాంతరీకరించిరి. 19 వ. శతాబ్ది యొక్క ఆదియందు శ్రీకంఠ సూర్య విప్రకవి, హిందీ భాషలోని తులసీదాసు యొక్క 'రామచరిత మానస' మను గ్రంథమును పద్య కావ్యముగా అస్సామీ భాషలో వ్రాసెను. గోవింద మిశ్రుడు, రత్నాకర మిశ్రుడు, భగవద్గీతను అత్యంత సామర్థ్యముతో పద్యరూపమున రచించిరి. గోపాలచరణ ద్విజుడు (క్రీ. శ. 16. వ. శతాబ్ది), భవానంద మిశ్రుడు (క్రీ. శ. 16 వ. శతాబ్ది), విద్యాచంద్ర భట్టాచార్యుడు (18 వ. శతాబ్ది) అను కవులు హరివంశమును చక్కగా అనుసరించి వ్రాసిరి. పిదప పురాణములు అనేక పద్య రచయితల దృష్టి నాకర్షించెను. కాని అత్యుత్తమకవులు తమ దృష్టిని భాగవతపురాణముపై ప్రసరింపజేసి రని చెప్పవచ్చును. శంకరదేవకవి, అనంతకందళికవి, అనిరుద్ధ కాయస్థకవి, కేశవదాస కాయస్థకవి, నిత్యానంద కాయస్థ కవి (క్రీ. శ. 17 వ శతాబ్ది), తదితరులును భాగవత పురాణ రచనా నిమగ్నులైరి. ఇతర పురాణములను అనువదించినవారును, అనుసరించి వ్రాసిన వారును ఈ క్రింద పేర్కొనబడుచున్నారు. విష్ణుపురాణమును భాగవత మిశ్రుడును (క్రీ. శ. 17 వ. శతాబ్ది); బృహన్నారదీయ పురాణమును భువనేశ్వర వాచస్పతి మిశ్రుడును (క్రీ. శ. 18 వ శతాబ్ది ఆదియందు); ధర్మపురాణమును కవిచంద్రద్విజుడును (క్రీ. శ. 18 వ శతాబ్ది); బ్రహ్మవైవర్తపురాణమును బలరామద్విజ - దుర్గేశద్విజులును (క్రీ. శ. 18 వ శతాబ్ది) ; మార్కండేయ పురాణమును రుచినాథ కందళియు (కీ. శ. 18 వ శతాబ్ది), రంగనాథ చక్రవర్తియు (క్రీ. శ. 17 వ శతాబ్ది) వ్రాసిరి.

ప్రాచీనమైన అస్సామీ సాహిత్యమునందు పెక్కు పద్య కథా కావ్యములు (Verse Romances) ను కలవు. కలాపచంద్ర కృతమైన 'రాధా చరితము,' రామద్విజ కవి రచితమైన మృగావతీ చరితము, ద్విజవరప్రణీతమైన మాధవసులోచనోపాఖ్యానము, ప్రకృతమునకు ఉదాహరణములు. సంచారకవియగు రాజసూర్య విప్ర కృతమైన శియాల్ గోసాయీ (The fox-Saint C 1616) అనునది ఒక అద్వితీయమైన పద్యకథా కావ్యము. రామానందద్విజకవి వ్రాసిన మహామోహాకావ్యము కృష్ణ మిశ్రుని ప్రసిద్ధమైన ప్రబోధచంద్రోదయము నాధారముగా చేసికొని వ్రాయబడినది. హితోపదేశమును. 'ద్వాత్రింశత్పుత్తళిక'ను రామమిశ్రకవి అనువదించెను. (1654-68)

శంకరదేవుడును, మాధవదేవుడును రచించిన వర గీతములను అస్సామునగల వైష్ణవ మహాంతులు అనేకులు అనుకరించిరి. ఇట్టి అనుకరణమునందు గోపాలదేవుడు, అనిరుద్ధుడు, శ్రీరాముడు, యదుమణి. రామానందుడు. అను కవులు కొంత విశిష్టతను గాంచిరి. ఈ కృష్ణగీతములకు 18 వ శతాబ్ది ఆరంభమున రచితములైన శాక్త గేయములును, రాధాకృష్ణగేయములును చేరినవి. ఈ గేయములను రుద్రసింహుడు (క్రీ. శ. 1696-1714), శివసింహుడు (క్రీ. శ. 1714-44) అను రాజులును, వారి రాజ్యకాలములందున్న కవులును వ్రాసిరి. అట్టి కవులలో

విఖ్యాతుడు రామనారాయణకవిరాజ చక్రవర్తి. అతడు గీతగోవిందమును, బ్రహ్మవైవర్త పురాణమునందలి కృష్ణజన్మ ఖండమును, ఆ పురాణాంతర్గతమేయైన ప్రకృతిఖండమునందలి తులసీ - శంఖచూడ ఉపాఖ్యానమును అనువదించెను. అతడు శాకుంతల కావ్యమును కూడ వ్రాసెను. రామచంద్రవరపాత్రుడు అను రాజకీయోద్యోగి యోగినీ తంత్రమును కొంతవరకు అనువదించెను. ఆనందలహరిని అనంతాచార్యుడు అస్సామీ పద్యకావ్యముగా వ్రాసెను. 'మనసా' అను సర్పదేవత యొక్క పూజావిధానము నారాయణదేవుడు రచించిన పద్మపురాణమునందు ప్రశంసింపబడినది. శంకరదేవకవియొక్క శైలిని మహాదేవకవియొక్క శైలిని, పురస్కరించుకొని వైష్ణవ సంస్థలకు చెందిన పెక్కురు ఉత్తమ పురోహితులు రూపకములను రచించిరి.

దైత్యారిభూషణుడు, వైకుంఠుడు అను కవులు జీవిత చరిత్ర రచనకు ఆరంభకులు. వారందరును శంకరదేవకవియొక్క జీవిత చరిత్రలు రచించిరి. పిమ్మట వచ్చిన కవులు ఆ యాచారమును పాలించిరి. సూర్యఖరి దైవజ్ఞుడును (క్రీ. శ. 1798), రతీకాంతుడును (క్రీ. శ 18 వ శతాబ్ది) తదితరులును అస్సామీయులయిన కోచి రాజుల వృత్తాంతములను పద్యకావ్యములుగా వ్రాసిరి, 19 వ శతాబ్దియందుకూడ విశ్వేశ్వరుడు, దుతిరాముడు అను నిగువురు కవులు పద్యరూపమున 'ఆహోమరాజ్య పతన చరిత్ర'ను రచించిరి. వ్యావహారిక (useful) కళలను గూర్చి వ్రాయుటకుకూడ పద్యమే ఉపయోగింపబడెను. వకుళకాయస్థకవి వ్రాసిన కితాబత్ - మంజరి (క్రీ. శ. 1434 సం.) ఇందుల కుదాహరణము. అందు గణితము, ఆయవ్యయ లేఖనము (Book keeping), క్షేత్ర పరిమాపనము (Land Survey) వివరింప బడినవి.

అస్సామీ వచనకావ్యము ప్రబలమైన సంప్రదాయము కలది. ఆ వచనమునకు శంకరదేవుడు, మాధవదేవుడు రచించిన రూపకములు ముఖ్యోదాహరణములు. అవి వ్రజబులి భాషాసంప్రదాయానుసారముగా వ్రాయబడినవి. వైకుంఠనాథకవి (క్రీ. శ. 1558-1638) భాగవతమును, భగవద్గీతను ప్రౌఢమయిన వచనములో అనువదించెను. వాటిలో నతడు ప్రాచీనకవుల కృతకశైలిని వాక్యప్రక్రియలను అనుసరించెను. ఆ కాలమునందే గోపాలచంద్రుడను కవివర్యుడు శంకరదేవకవి రచించిన భక్తిరత్నాకరము అను సంస్కృత గ్రంథమును అతి రమ్యమయిన వచన శైలిలో అనువాద మొనర్చెను. రఘునాథమహంతకృతమయిన (క్రీ. శ. 1658) కథా రామాయణము; పద్మపురాణము ; క్రియాయోగసారము (కవిపేరు తెలియదు); కృష్ణానందుని సాత్వతతంత్రము, కథా ఘోష - ఇవి అనంతర శతాబ్దులలో పుట్టిన మత విషయకము అయిన ప్రాచీన వచన కావ్యములు.

వైష్ణవ గురు చరితములయందును బురంజీ (Buranji) అను పేరుగల ఆహోమరాజ్య చరితములయందును, నిత్య వ్యవహారమునగల వచనము ఉపయోగింపబడినది. 17 వ శతాబ్దియొక్క అంత్యభాగమునుండి ఈ రెండురకముల వచన వాఙ్మయములు ఎడతెగకుండ పెంపొందినట్లు కనిపించును. పురణి, అసమ, బురంజీ అనుగ్రంథములకు సంపాదకుడు గోస్వామి (క్రీ, శ. 1922). అసమ బురంజీ అనుకృతికి సంపాదకుడు డాక్టరు భూయాన్ (క్రీ. శ. 1945) అనునాతడు. కథాగురుచరితమునకు ప్రకాశకుడు లేఖరు (క్రీ. శ. 1952) అనునాతడు. ఈ కృతులు రచనా సౌందర్యమును బట్టియు; విషయ ప్రతిపాదనమును బట్టియు తొలుదొల్త రచింపబడిన చరిత్ర. బురంజీ వచన కావ్యములకు ఉత్తమ నిదర్శనములు. ఈ రీతిగల చరిత్ర రచనము 19 వ శతాబ్ది ఆరంభమువరకును కొనసాగుచుండెను. ఈ కాలమున కాశీనాథ పుకన్‌కవియు, మణిరామ, దివాన్‌శారువా హరకాంతశారువా అనువారు అస్సామీ చరిత్ర గ్రంథములను సంకలన మొనర్చిరి.

వ్యావహారిక కళలనుగూర్చిన గ్రంథములందుకూడ ఈ నూత్న వచనరీతి ఉపయోగింపబడెను. సుకుమార బరకాథు అను కవి వ్రాసిన హస్తివిద్యార్ణవము (క్రీ. శ. 1734 - ఇది ఏనుగులనుగూర్చి తెలుపు గ్రంథము. దీనికి మూలమొక సంస్కృత కృతి); అశ్వచికిత్సను బోధించు ఘోరా-నిదానము (ఘోటక నిదానము) అను గ్రంథము; గణితమును ప్రతిపాదించునట్టి కాశీవాథకవిరచితమైన అంకర్ - ఆర్యా అను గ్రంథము - ఇవి ఈ జాతికి చెందిన వచన కావ్యములు. ఈ కాలమునకు చెందిన మరియొక

ప్రసిద్ధమైన గ్రంథముకూడ కలదు. అది శుభంకరకవి వ్రాసిన 'హస్తముక్తావళి' కి అనువాదరూపమునను, వ్యాఖ్యాన రూపమునను ఉన్నది.

**ఆధునిక యుగము :** క్రీ. శ. 1926 వ సంవత్సరము నందు జరిగిన యాండాబు **(yandabu)** సంధి ననుసరించి అస్సాము బ్రిటిషు రాజ్యములో కలుపుకొనబడెను. పిదప పాతిక సంవత్సరములవరకు అస్సాము పెక్కు ఆపత్తు లకు గురియయ్యెను. క్రీ. శ. 1836 వ సంవత్సరమున విద్యాలయములలోను, న్యాయస్థానములందును వంగ భాష అస్సామీభాషయొక్క స్థానము నాక్రమించెను. కాని ఆ శతాబ్ది మధ్యభాగములో జాతీయతాభిమానము నిద్రనుండి మేల్కొని గర్జింపదొడగెను. అమెరికను బాప్టిస్టు మిషనరీలు అస్సామీభాషయందును, అస్సామీభాష పైనను గ్రంథములను ప్రచురించి, జాతీయ చైతన్యము నకు నూతన ప్రాబల్యము చేకూర్చిరి. కాశీనాథపుకన్ రచించిన చరిత్ర (క్రీ. శ. 1844) యు; రెవరెండునాథను బ్రౌను వ్రాసిన అస్సామీ భాషావ్యాకరణ వ్యాసములును (క్రీ. శ. 1844); డాక్టరు మైల్సు బ్రాన్సనుయొక్క అస్సామీనిఘంటువును (1867), ఆనాటి మిషనరీ ప్రచు రణములకు ఉదాహరణములు. క్రీ. శ. 1813 వ సంవ త్సరము నాటికే వంగదేశమునందలి శ్రీరామపురమున నున్న మిషనరీలు అస్సామీభాషలో బైబిలును ప్రక టించిరి. క్రీ శ. 1846 వ వత్సరమునందు బాప్టిస్టులు 'అరుణోదయ' అను మాసికపత్రికను వెలువరించిరి. అస్సామీ భాషలోనికి ఆధునిక శైలి ప్రవేశించుట కీపత్రి కయే ముఖ్యకారణ మయ్యెను. ఆనందరామ ఫుకను అనునాతని యొక్కయు, ఈ మిషనరీల యొక్కయు ప్రయత్నములే ముఖ్యముగా క్రీ. శ. 1872 వ సంవత్సర మున అస్సామీభాషకు రాజకీయ గౌరవము తిరిగి లభించుటకు కారణములయ్యెను. అందుచే ఈ కాలమున నొక సారస్వతోజ్జీవనము మొదలయ్యెను.

హేమచంద్రబారువా అనునతడు అర్వాచీనమయిన అస్సామీసారస్వతమునకు ఆద్యుడగు కవివర్యుడు. అతడు వ్యాకరణములను, నిఘంటువులను రచించి తన్మూ లమున అస్సామీభాషకు ప్రామాణికత్వమును స్థిరపర చెను. అతడు అవహేళనాత్మకమయిన **(Satires)** బాహిరి రంగ్‌చంగ్ భితరి కొవా భాతురీ అను వ్యాసమును (1861), కానీయా - కీర్తన అను నాటికను రచించి సంఘమునందుగల దురాచారములను రూపుమాపుటకు ప్రయత్నించెను. ఆధునిక సాహిత్యమున మొట్టమొదటగా చరిత్రను, జీవిత చరిత్రను వ్రాసినకవి గుణాభిరామ బారువా అనునాతడు. రమాకాంత చౌధురీ తన అభి మన్యువధ (క్రీ. శ. 1875) అను కావ్యమునను, భోలా నాథదాసు అను కవి తన సీతాహరణ కావ్యమునందును, (క్రీ. శ. 1888) మొదటిసారిగా ప్రాసరహితమయిన పద్యరచన **(Blank verse)** నవలంబించిరి.

లక్ష్మీనాథబారువా అను కవి ఆధునికమైన అస్సామీ వాఙ్మయమునందు మిక్కిలి గొప్ప వ్యక్తి. అతడు క్రీ. శ. 1889 వ సంవత్సరమున తన మిత్రులయిన చంద్రకుమార అగర్‌వాలా, హేమచంద్ర గోస్వామి అనువారి సహకా రముతో 'జోనాకీ' అను నొక సంచికను ఆరంభించెను. అతడు హేమచంద్రబారువా యొక్క శైలికి సంపూ ర్ణతను గూర్చి అద్దానిని వివిధములును, ఆధునికములు అయిన అస్సామీసాహిత్యప్రక్రియలను రచించుటకు ముఖ్యసాధనముగా నొనర్చెను. అతడు రచించిన సాంఘి కములును, రాజకీయములును, సారస్వత విషయక ములును అయిన అవహేళనాత్మక కావ్యములందు హేమ చంద్రకవి ప్రభావము ప్రస్ఫుటముగా కనిపించును. అతడు రచించిన కథానికలందును, నాటకములందును, ప్రహ సనములందును, నవలలయందును ముఖ్యముగా అస్సామీ పాత్రలే వర్ణితములగుట ప్రీతిని గొలుపుచుండును. బజ్ వరువా, గోస్వామి, అగర్వాలా అను కవులు 19 వ శతాబ్ది ప్రారంభములో ఆంగ్లేయ సారస్వతమునందు వెలసిన కాల్పనికతాభిరుచిని **(Romanticism)** అస్సామీ కావ్య రచనయందు ప్రవేశపెట్టిరి. ఇప్పటి కావ్యములందు లౌకి కత కంటె ఆత్మాశ్రయత అధికమయ్యెను. కావ్య విష యము మిక్కిలి విస్తృతమయ్యెను. సోనెట్సు **(Sonnets)** (పదునాలుగు పాదములుగల వృత్తము) మొట్టమొదట వ్రాసినవాడు గోస్వామియే. కాని తరువాతి కాలములో అతడు దేశమునందలి పురాతన వస్తుపరిశీలనమునందు నిమగ్నుడయ్యెను. అగర్‌వాలా రచించిన కావ్యములందు ఆదర్శకత్వము అను గుణము అత్యంత ప్రస్ఫుటముగా

గోచరించును. కమలాకాంత భట్టాచార్యుని అపరిణతము అయిన పద్య కావ్యముల యందును, ప్రౌఢములయిన వచన కావ్యములయందును, దేశభక్తియు, బుద్ధి వైభవమును ముఖ్య గుణములుగా భాసిల్లెను. పద్మనాభ గోహైం బారువా అను ప్రఖ్యాతకవి చరిత్రాత్మకము లైన నాటకములను, నవలలను సృజించుటయందు విజయము గాంచెను. కవితావిశారదు డగు నతడు స్వీయ విషయములను కథాత్మక కావ్యములుగ వర్ణించెను. పిదప నతడు తన జీవిత శేషమును మత విషయక గ్రంథములను నిష్ఠతో వ్రాయుటకు వినియోగించెను. మరియు నీతడు వచన రచనయందొక ప్రత్యేకతను గడించెను. లంబోదరవరా, సత్యనాథవరా అనువా రిరువురును వచన రచనయందు వైశిష్ట్యమును సంపాదించినవారే. వారిలో సత్యనాథవరా తన రచనలలో కొన్నింటికి బేకన్‌కవి వ్యాసములను ఒరవడిగా గ్రహించెను. రజనీకాంత - వరదలై అనునాతడు చరిత్రాత్మకములును కల్పనాత్మకములైన తన నవలలయందు స్కాటు కవిని బంకించంద్ర ఛటోపాధ్యాయుని మించుటకై యత్నించెను. హితేశ్వర్ బర్ బారువా అనునతడు కథాకావ్య రచనయందు వాసి గాంచినాడు. దుర్గేశ్వరశర్మ సహజమును కావ్యోచితమునైన భాష నుపయోగించుట యందు విశిష్టతను గన్నవాడు.

ఇరువదియవ శతాబ్దియందలి రచయితలు ముఖ్యముగా 'జోనాకీ' (అను సంచిక) యొక్క ఆదర్శములను అనుసరింప యత్నించిరి. వాహి (Bahi) అను పేరుగల బజ్‌వరువా యొక్క మాస సంచిక వాఙ్మయరంగమున క్రొత్త రచయితలను ప్రవేశ పెట్టుటకును, వారిని సరిదిద్దుటకును ముఖ్యసాధన మయ్యెను. రఘునాథ చౌధురీ అను కవి పక్షులను గురించి వ్రాసిన కావ్యములు అసాధారణ కళాకౌశల్యమున పరాకాష్ఠ నొందెను. వాటి యం దాతడు ప్రకృత్యారాధనమును సంకీర్తించెను. అంబికాగిరి, రే, చౌధురి రచించిన కావ్యములయందు గూఢ ప్రేమతత్త్వము, జీవితముయొక్క దుర్దాంతమైన శక్తి సంపద, ఉత్కటమైన దేశభక్తి, వాటి దశాంతరములు అను లక్షణములు లక్షితములయ్యెను. జితీంద్రనాథుదువరా అను కవి రమ్యము అయిన గేయములను రచించెను. వాటియందు నిరంతర శోకభావ మొకటి వ్యాప్తమై కన్పడును. అతడు భిన్నదేశములలో భిన్న కాలములలో ప్రవర్తిల్లిన కవితారచనలయందలి అందచందములను తనలో జీర్ణించుకొని వాటిని విన్యాస విశేషములచే నవ్యములుగా చిత్రింపగల్గిన సునిశితబుద్ధి వైభవముకల కవివర్యుడు. ఇతని 'ఓముర్ తీర్థ' అను గ్రంథము ఉమర్ ఖయ్యామునకు వివరణాత్మకమైన అనువాదము. సూర్యకుమారభూయా, రత్నకాంతవరకాకతీ, లక్ష్మీనాథఫుకను, శైలధవరాజ్‌ఖోవా, నళినీబాలాదేవి అను కవుల గేయములు రూపమునందును, విషయమందును ప్రత్యేకగుణవిశేషములు కలవి. డింబేశ్వర నియోగ్, బినందచంద్రబారువా, అతుల్‌చంద్ర హాజరికా, దైవచంద్ర తాలూక్‌దార్ అను నుత్తమకవుల బృందము 1920 ప్రాంతమున వెలసెను. 1930 వ సంవత్సర ప్రాంతమున వెలసిన కవులలో నెల్ల దేవకాంత బారువా అనునాతడు అత్యుత్తముడు. ఆతని ప్రణయ కావ్యములందు నూతనమైన మీమాంస, విషయ నవ్యత గోచరించును. గణేశచంద్ర గోగోయి ప్రణీతములయిన ప్రేమగీతములలో హృదయ మార్దవము, దుఃఖాత్మత ప్రవ్యక్తము లగును. విస్తరభీతిచేత ఈ యుగమునకు చెందిన ఇతరకవులలో, చంద్రధర బారువా, పద్మధర చలిహా, నీలమణిఫుకను, ఉమేశచంద్ర చౌధురీ, కమలేశ్వర చలిహా అను కవులపేళ్ళు మాత్రమే పేర్కొనబడినవి.

నాటకక్షేత్రమునందు అతులచంద్ర హాజరికా అను కవి బహుగ్రంథకర్తయై విలసిల్లెను. జ్యోతిప్రసాద అగర్వాలా అనుకవి పౌరాణికమైన శోణితకుంవరీ, అను నాటకమును, చారిత్రకము. సాంఘికముకూడ నగు 'కారేంగర లిగిరీ' అను నాటకమును రచించెను. అవి లక్షణమునందును కళాశిల్ప విషయకముగాను, పరాకాష్ఠ నొందిన నాటకములు. మిత్రదేవమహాంత, ఇంద్రేశ్వర్ బర్‌ఠాకూరు, నకులచంద్ర భూయా ప్రసన్నలాల్ చౌధురీ అను నాటకరచయితలును, తదితరులును అస్సామునందలి కళాభిమానయుతములైన (Amateur) నాటకశాలలయొక్క ఉపయోగార్థమై విరివిగా నాటకరచనను సాగించిరి. అస్సామీ నవలారచన ఎక్కుడు ఫలప్రదమైనది కాలేదు. దండినాథ కలితా, దైవచంద్ర

తాలూక్‌దార్ మున్నగువారు నవలారచయితలలో పేర్కొనదగినవారు.

ఇయ్యుగమున కథానికా (Short Story) రచనము విశేషముగా పెంపొందెను. శరచ్చంద్ర గోస్వామి నిరంతర శ్రద్ధతో నీవాఙ్మయ ప్రక్రియ నారాధించెను. 1930 వ. సంవత్సర ప్రాంతమున ఉత్తమకథకు లనేకులు బయలుదేరిరి. మహిచంద్రవరా, హాలిరామడేకా అను కవులు హాస్యరస విశిష్టములును, అవహేళనాత్మకములును అయిన కథలను రచించిరి. బీణాబారువా, రమాదాసు, మునీన్‌బర్కటకీ, కృష్ణభూయా, నగేంద్ర నారాయణ చౌధురీ, త్రైలోక్యనాథ గోస్వామి అను వారు కథారచనయందు ప్రసిద్ధినొందిన మరికొందరు. లక్ష్మీధర శర్మ వ్రాసిన కథలలో వివేక గాంభీర్యము, అసాధారణ భాషాపటిమ తేటపడును. అబ్దుల్ మాలిక్ అనునతడు తన కృతులందు ప్రవ్యక్తములయియున్న బీదవారియందలి సానుభూతి, అనర్గళ భాషా విభుత్వము అను గుణములచే అత్యంత సమర్థుడగు కథకుడుగా గణుతికెక్కెను.

లక్ష్మీనాథ బజ్‌బారువా అను కవి రచించిన సారస్వత వ్యాసములకు పిదప చిత్రసేన జఖరియా అనునాతడు సుబోధ మగు వ్యాసగుచ్ఛమును వ్రాసెను. తరుణరామ్‌ఫుకను అనుకవి వేటనుగూర్చి వ్రాసిన కథలు రమ్యమయిన ధారాశుద్ధితో నలరారుచున్నవి. సూర్యకుమార భూయా, సోణారామ, చౌధురీ, ఆనంద చంద్ర ఆగర్వాలా మున్నగు రచయితలు విశిష్టములైన పెక్కు వ్యాసములను వివిధములయిన పత్రికలలో ప్రచురించిరి. వాణీకాంతకాకతికవి ప్రాచీనమును, అర్వాచీనము నయిన అస్సామీసారస్వతమును ఆధునిక విమర్శనదృష్టితో పరామర్శించెను. విరించికుమార్ బారువా, ఉపేంద్ర చంద్రశేఖారు, తీర్థనాథశర్మ, మహేశ్వర్‌నియోగ్ మొదలగు యువకవులు 1930-40 సారస్వత రంగమున కృషి చేయగడగిరి.

సుమారు 1940 వ సంవత్సర ప్రాంతమున నూతన విమర్శన దృష్టిగల క్రొత్తతరమునకు చెందిన కవులు అప్పటికి అమలులోనున్న సారస్వత నియమములపై తిరుగుబాటు కావించిరి. అప్పటికే కథానికారచనయందు మానసికవృత్తి పృథక్కరణమునకు (psycho-analysis) స్థానము లభించెను. స్వేచ్ఛా వృత్తములను అల్పసంఖ్యాకు లయిన కవులు వాడిరి. లక్ష్మీనాథ బజబారువా రచించిన నూతనజీవిత చరిత్రయందు ఈ నూత్న విమర్శన దృక్పథము ప్రకాశమునొందెను.

ద్వితీయ ప్రపంచ సంగ్రామమువలన అస్సామీజనుల సుఖమయ జీవితమున నొక విలక్షణమయిన అలజడి కలిగెను. సారస్వతాభివృద్ధి కుంఠిత మయ్యెను. మరల ప్రచురింపబడదొడగిన పుస్తకముల యొక్కయు, పత్రికల యొక్కయు— ధోరణినిబట్టిచూడ వాటియందలి ప్రాచీన సారస్వత - ఆదర్శభంగము భయావహమయి కన్పట్టెను. కృశించిన అస్సామీ సారస్వతముపై దూరస్థములును, సమీపస్థములు నయిన అనేక సారస్వతముల యొక్క ప్రభావము పడుటచే నది మిక్కిలి వికృతి నొందెను. అట్టి వికృతి ముఖ్యముగా కవిత యందు గోచరించెను. ఈకవిత్వమును కవులు ఉత్సాహముతో జయప్రదముగా సాగించిరి. అమూల్యబారువా, నవకాంత బారువా, హేమ బారువా, హరివర కాకతి మున్నగు కవులు విశ్వవాఙ్మయము యొక్క భిన్నభిన్న ప్రక్రియలను సోత్సాహముగ ప్రచురింపదొడగిరి. ఈ కవి బృందములో నవకాంతబారువా అను కవి అత్యుత్తముడుగా ప్రశంసనొందెను. బీణాబారువా అనునతడు రచించిన జీవనర్ బాటాత్ అను రచనయు, రాధికా మోహన గోస్వామికృతమైన చాకనైయా అనుకృతియు, నవకాంతబారువా అను కవిచేరచింపబడిన కపిలీ-పరీయా సాధు అను రచనయు, అత్యుత్తమ నవలలుగా నెన్నదగియున్నవి. మహమ్మదు పియారు మొదలగువారు చిన్న చిన్న నవలలను ప్రచురించిరి. కథానికా రచనము ఇప్పటికిని ప్రబలముగానున్నది. జోగేశదాసప్రభృతులు కథానికా రచనయందు కృతహస్తులైరి.

అస్సామీ వాఙ్మయమున ఏకాంకికా రచనమింకను పరిణతినొందియుండలేదు. కళాభిమానులయిన (Amateur) నటకులు దీనిని ప్రదర్శనయోగ్యముగా గ్రహించిరి. అలిండియా రేడియో గుహావాటి (Gauhati) వారొసగిన దోహదముచే ఏకాంకికా రచన పెంపొందుచున్నది. బీణాదేవి రచించిన 'ఏబేలార్ నాట్' అనునది ఒక అత్యుత్తమ కృతియై యున్నది. అందు ఒక చిన్న సంఘటనము అనగా

నొక మధ్యమతరగతి కుటుంబమునకు చెందిన రెండుతరముల వారికి ఘటిల్లిన భావసంఘర్షణము చక్కగా వివరింపబడినది.

అస్సామీ వాఙ్మయమునందలి జానపద కవితాసంపత్తి చెప్పదగినది. అది గుణముచేతను, విషయముచేతను వైవిధ్యమునొందినది. వనగీతములు, బిహుగీతములు, వివాహగీతములు, డోలపాటలు, బాలక్రీడా గీతములు, బారమాహీగీతములు, ద్వాదశమాసగీతములు, పడవ పాటలు మున్నగునవి ప్రకృతమునకు ఉదాహరణములు. అనేక జానపదకథలును కలవు! వాటికి నడుమ నడుమ లలితములును కరుణ రసాత్మకములునైన పాటలు ఇమిడియుండును. అస్సామీ వాఙ్మయమున వీరగీతములును పెక్కులు గలవు. చరిత్రాత్మక గీతములలో వదనబరవు కనరగీతము పేర్కొనదగినది (క్రీ. శ. 19-వ శతాబ్ది). అస్సామీ వాఙ్మయమున సారస్వత వ్యాసములను వ్రాసిన వారిలో మహేశ చంద్రదేవ గోస్వామియు, తదితరులైన యువకులు అనేకులును కలరు. ఈ వాఙ్మయమున సారస్వత విమర్శనముకూడ విశేషముగా పెంపొందినది. ఉపాధ్యాయ వృత్తికి చెందిన కొందరు విమర్శకులు ఆధునిక సమస్యలపై వ్రాయుటకు బదులుగా ప్రాత విషయములను గూర్చి మాత్రమే వ్రాసిరి. మొత్తముమీద ఆధునిక సారస్వత వాతావరణము సజీవముగా, వీర్యవంతముగా, ఆశాజనకముగా నున్నదని చెప్పనగును.

డా. మ. ని.

**అస్సీరియా :-** అస్సీరియాయను నామముతో నేడు మనము వ్యవహరించుచున్న దేశమునకు అస్సీరియా భాషలో "అషుర్" అనియు, పారసీక భాషలో "అథుర" అనియు పేళ్లు ఉండెను. ప్రాచీన కాలమున ఈ దేశీయులు గొప్ప రాజ్యమును స్థాపించి వీరులని పేరుగాంచుటయే గాక, చక్కని నాగరికతను పెంపొందించుకొనిరి. ఐరోపాఖండ చరిత్రలో రోమకజాతివారి కెట్టి ప్రశస్తి గలదో, ఆసియా ఖండమునందు అస్సీరియావారికికూడ అట్టి విఖ్యాతియే కలదు.

అస్సీరియా నేటి మెసొపొటేమియా దేశములోని ఉత్తర భాగము. దీనికి ఉత్తరముననను, తూర్పునను కొండల వరుసలును, దక్షిణమున ప్రాచీన బాబిలోనియా రాజ్యమును, పశ్చిమమున సిరియా ఎడారియు కలవు. అస్సీరియా రాజ్యముగుండ టైగ్రిసునది తన ఉపనదులతో కూడ ప్రవహించి, అచ్చటి భూమిని సారవంతముగా చేయుచున్నది. పురాతన కాలమునుండియు అచ్చటి జనులు ఆవులు, గొఱ్ఱెలు మున్నగు పాడి జంతువులను గుఱ్ఱములు, ఒంటెలు మున్నగు భారవాహక జంతువులను పెంచెడివారు. అస్సీరియా దేశమున భరింపరాని వేడిమికాని, చలికాని లేక సమశీతోష్ణస్థితి యుండును. కావున ఇచ్చటి ప్రజలు దృఢగాత్రులుగను వీరులుగను ఉందురు.

ప్రాచీనకాలపు అస్సీరియా నగరముల శిథిలములు ఇటీవలనే బయలుపడినవి. ఇందు టైగ్రిస్ నదీతీరమున నెలకొనిన అషుర్ పట్టణమును, అస్సీరియా రాజ్యమునకు ముఖ్య పట్టణముగనుండి విఖ్యాతిగాంచిన నైనివా నగరమును, కాలా, దుర్ షరూకిన్, అను ప్రాచీన నగరములు ప్రత్యేకముగ పేర్కొనదగినవి. ఇచటి శిథిలావశేషములను పరీక్షించుటవలన, అస్సీరియాదేశపు ప్రాచీన చరిత్రనుగూర్చి అనేక నూతనాంశములు తెలియవచ్చినవి. ఆ ప్రాచీనయుగమువారొక ప్రత్యేకమగు లిపినివాడెడివారు. ఇటుకలవంటి మట్టిదిమ్మలపై ఆ లిపితో అనేక ముఖ్యాంశములు వ్రాయబడియున్నవి. ఆ వ్రాతలనుండియు, పురాతనయుగమునాటి కట్టడములనుండియు వాటి యందలి శిల్పములనుండియు, అస్సీరియా జాతి చరిత్ర సంగ్రహింపబడినది.

సుమారు ఆరువేల సంవత్సరములకు పూర్వము అస్సీరియా దేశమున జనులు నివసించుచుండినట్లు నిదర్శనములు కలవు. ఈజాతివారికిని బాబిలోనియాలోని సుమేరుజాతివారికిని పెక్కు సామ్యములు కలవు. కావున వీరు సుమేరులై యుండవచ్చును. ఈప్రజలు మిక్కిలి ప్రాచీనమగు "అషుర్" అను పట్టణమును నిర్మించిరి. కొన్ని శతాబ్దులు గడచిన వెనుక ఈ పట్టణము అగ్నిపాలై నశించెను. క్రీ. పూ. 2500 ప్రాంతమున అస్సీరియా దేశమునకు అక్కాడులు అను ఒక నూతన జాతివారు వలస వచ్చిరి. వీరు స్థానికులగు ప్రజలతో కలసిపోయి ఒక నూతన జాతిగ మారిరి. ఈ నూతనజాతివారు స్థానికపరిపాలనములలో స్వతంత్రులుగనుండియు, బాబిలోనియా రాజుల

ఆధిక్యమును అంగీకరించిరి. అస్సీరియా బాబిలోనియా ప్రజలకు ఆనాడు వ్యాపారసంబంధములు మెండుగ నుండెను.

కాలక్రమమున అస్సీరియా ప్రభువులు బలపడి స్వతంత్రులగుటయే కాక, ఇతర దేశములను ప్రజలను జయించి తమ రాజ్యమును విస్తృత మొనర్చిరి. అస్సీరియా రాజులు తరచుగ బాబిలోనియా ప్రభువులతోను, ఆనటోలియా ఆర్మీనియా కొండల లోని ఆటవిక జనులతోడను, సిరియా పాలస్తీనములతోడను, ఈజిప్టు పాలకులతోడను యుద్ధములు సాగించెడివారు. క్రీ. పూ. 1300 నుండి క్రీ. పూ. 606 వరకును గల ఏడుశతాబ్దుల కాలములో అస్సీరియా రాజ్యమును సుమారు నలుబదిమంది రాజులు పాలించిరి. వీరిలో షమ్షి అదాద్ (క్రీ.పూ. 1870), మొదటి షాల్మెనాసిర్ (క్రీ.పూ. 1300), టిగ్లాథ్ పిలాసిర్ (క్రీ. పూ. 1120), మూడవ అషుర్ నసిర్ పాల్ (క్రీ. పూ. 884-859), సారగాన్ (క్రీ. పూ. 722-705), సెన్నాచరబ్ (క్రీ. పూ. 705-681), అషుర్ బనిపాల్ (క్రీ. పూ. 668-626) అనువారు ప్రత్యేకముగ పేర్కొనదగినవారు. వీరు గొప్ప పరాక్రమము చేతనేగాక ఇతర ప్రశస్త గుణములచేత గూడ విఖ్యాతి గాంచిరి. షాల్మెనాసిర్ అనునాతడు తన రాజధానిని అషుర్ పట్టణమునుండి మార్చి టైగ్రిస్ నదీ తీరమున నలుబదిమైళ్ళ యెగువన తాను కట్టించినట్టి "కాలా" అను పట్టణమున ప్రతిష్ఠించెను. ఈ నూతన నగరమున ఈరాజు అనేక సుందర భవనముల నిర్మింపించెను. సారగాన్ అను రాజును, అతని కుమారుడు సెన్నాచరబ్ అను నతడును శిల్పకళను చక్కగ పోషించిరి. సారగాన్ అను రాజు దురూషరూకిన్ అను నూతన నగరమును ప్రతిష్ఠించి అందు అనేక రాజ ప్రాసాదములను కట్టించెను. భారతీయ శిల్పకారుల వలెనే అస్సీరియా శిల్పులు కూడ దేవతలఆకృతులను, మహోన్నతములగు విగ్రహములను మలచుచుండిరి. సెన్నాచరబ్ రాజు కాలమున నైనివా నగరము మరలనిర్మింపబడెను. ఇచ్చటి ప్రాసాద కుడ్యములు అపూర్వ కళా భాసురములై చూపరులకు అద్భుతానందముల నొనగూర్చుచుండెను.




అషుర్ బనిపాలు రాజుకాలమున విశేషముగా శిల్పకళాభివృద్ధి అయ్యెను. ఆ కాలమునాటి శిల్పులు రాతిపైనను, దంతముపైనను, లోహములపైనను తమ పనితనమును ప్రదర్శించి, జీవకళ లుట్టిపడు చిత్తరువులను చిత్రించెడివారు. ఈ రాజు మిక్కిలి విజ్ఞాన ప్రియుడు. ఈతడు తన రాజ్యమందును, బాబిలోనియా రాజ్యమందునుగల గ్రంథములకు ప్రతులు వ్రాసికొనిరండు అని

సమర్థులగు వ్రాయసగాండ్రను పంపెను. వారు వ్రాసి తెచ్చిన ప్రతులలో శాస్త్రములకును, మతమునకును వాఙ్మయమునకును చెందిన గ్రంథములు పెక్కులు చేరి యుండెను. ఈ గ్రంథజాలమును తన ప్రాసాదమందలి పుస్తక భాండాగారమున ఈరాజు భద్రము చేయించెను. పై గ్రంథములనుండి అనేక అపూర్వ విషయములను నేటి చారిత్రక పరిశోధకులు తెలిసికొని యున్నారు.

అస్సీరియా ప్రభువులును, ప్రజలునుకూడ గొప్పవీరులు. కాని ధైర్య సాహసములతోపాటు వారియందు క్రూరత్వముకూడ మిక్కుటముగ నుండెను. వీరు అనేక దేశముల జయించి, తమ శత్రువులను ఖైదీలుగ బంధించి, విదేశములకు పంపివేయుటయో, లేక వారిని అతిక్రూరముగ చంపుటయో కావించుచుండిరి. తాము జయించిన దేశములు ఎల్లప్పుడు తమకు వశమైయుండుటకొరకు అస్సీరియా పాలకులు ఒక విచిత్రమగు భేదతంత్రమును అవలంబించుచుండెడివారు. జయింపబడిన దేశములో పలువురను బలవంతముగ విదేశములకు పంపివైచి, వారిస్థానమున విదేశీయులను ప్రతిష్ఠించుట అస్సీరియా విజేతల నీతియై యుండెను. అస్సీరియా రాజుల క్రూరపద్ధతుల వలనను, వారి కృత్రిమ రాజనీతివలనను, వారు జయించిన రాజ్యములో అశాంతి నిరంతరము ప్రబలి యుండెడిది. అనవరత సంగ్రామములవలన అస్సీరియా వీరులు పలువురు మడసిరి. దేశము నిర్వీర్యమయ్యెను. అస్సీరియా సేనలో కొలువునకు కుదిరిన విదేశీయ సైనికులలో స్వామిభక్తికాని దేశభక్తికాని లేకుండెను. ఈ కారణములచేత అస్సీరియా రాజ్యము బలహీనమయ్యెను. "మీడులు" అను అనాగరక ప్రజలు అస్సీరియాపై దండెత్తివచ్చి, ముఖ్యపట్టణమగు నైనివా నగరమును ముట్టడించిరి. అస్సీరియా రాజు మూడు సంవత్సరములకాలము శత్రువులతో పోరాడి, తుదకు అపజయము అనివార్యమని నిశ్చయించుకొని, రాజభవనములకు నిప్పు పెట్టించి, పుత్రకళత్ర సమేతముగ అందు భస్మీభూతుడయ్యెను. ఈవిధముగ క్రీ.పూ. ౬౦౬వ సంవత్సరమున అస్సీరియా సామ్రాజ్యము నాశనమయ్యెను. అస్సీరియా రాజులు నిరంకుశులుగ రాజ్యపాలనము చేసెడివారు. వీరు తమ ప్రజలకు మతగురువులుగను, న్యాయాధీశులుగను, సేనానాయకులుగనుకూడ వర్తించెడివారు. వీరు తమ విశాల రాజ్యమును పరగణాలుగ భాగించి, ఒక్కొక్క పరగణాపై ఒక్కొక్క ఉన్నతాధికారిని నియమించుచుండిరి. ఈతడు తన యేలికకు, ఏటేట నిర్ణీతమగు కప్పమును చెల్లించుచు, స్థానిక విషయములలో స్వేచ్ఛగ పరిపాలనము సాగించెడివాడు. అస్సీరియా రాజ్యమునకు వారి సేన మూలస్తంభముగ నుండెను. ఈ సేనయందు రథికులు, అశ్వికులు, పదాతులు ఉండెడివారు. సేనాతతులు సుశిక్షితములును సువ్యవస్థితములును అయినందున, అవి యెంతటి దుర్గమ ప్రదేశములయందయినను ప్రవేశించి, ఎంతటి బలవంతులయిన వైరులనయినను సులభముగ జయించుచుండెను. అస్సీరియా ప్రభుత్వమువారు రాచబాటలను నిర్మించియు ఆనకట్టలద్వారమున నీటి పారుదలకు సదుపాయముల గావించియు, ప్రజానీకమునకు సేవకావించిరి.

ఖ. బా. శే.

**అహోబలపండితుడు :-** అహోబలపండితుడాంధ్రశబ్దచింతామణికి సమగ్రముగను, విపులముగను సంస్కృతములో గొప్ప వ్యాఖ్యానమును రచించెను. దానికి "కవిశిరోభూషణ" మ్మని అహోబలుడు పేరిడెను. కాని అది గ్రంథకర్త పేరుతో "అహోబలపండితీయ" మని వ్యవహరింపబడుచున్నది. సంస్కృతమున పాణిని విరచితమగు అష్టాధ్యాయికిని, పతంజలి విరచితమగు మహాభాష్యమునకును ఎట్టి సంబంధముకలదో యట్టి సంబంధమే ఆంధ్ర శబ్దచింతామణికిని, అహోబలపండితీయమునకును గలదని పలువురు పండితులు అభిప్రాయ పడుచున్నారు.

అహోబలపండితుడు ఇట్లు చెప్పుకొనెను. "వాతూలవంశేఽవతతారభూయ శ్రీనన్నవిద్వానహమేవ సోఽస్మి" వాతూలవంశమున నన్నయపండితుడు మరలనవతరించెను. అతడే నేను అని ఉపోద్ఘాతమునందును, 'ప్రభంజనవంశాబ్ధి రాకాశశాంకేన' అని పరిచ్ఛేదాంత గద్యము లందును సూచించెను. అహోబలుడను పేరును, (వాతూల) ప్రభంజనాన్వయమను నింటిపేరును కల్పితములనియు, మొదటిపేరు నరసయ్య, ఓబళయ్య అనియు ('అకుటిలకీర్తి నిర్మలత నంచితు డౌబళపండితుండు' అను ఉపసంహారములోని పద్యభాగమువలన) "ఔబళపండితుడనియు, ఇంటి

పేరు గాలివారనియు కొందరు తలంచుచున్నారు. గాలి నరసయ్య అను పేరు పేలవముగా నుండుననియు ప్రౌఢతకై అట్లు వానిని సంస్కృతీకరించి యుపయోగించె ననియు తలచుచున్నారు. పరిచ్ఛేదాంత గద్యమున "శ్రీమత్పోలూరి మాధవయజ్వ చంద్రసముజ్జ్వల తత్కృపో క్షిత కటాక్షాసాదిత సాధు పాండిత్యాభరణ" అని చెప్పు కొనుటచే పోలూరి మాధవ సోమయాజి ఈతని విద్యా గురువనియు, "శ్రీమ త్సీతారామచంద్ర చరణారవింద మిళిందాంతఃకరణ" అనుటచే ఇతడు శ్రీరామభక్తుడనియు తెలియుచున్నది.

నియోగులయిన గాలివారును, పోలూరివారును గుంటూరి మండలమున నున్నవారట. అహోబలపతి మొదట మైదవోలులో నుండగా గుండ్లకమ్మ వరదవచ్చి ఇండ్లు పొలములు పాడుకాగా నాతడు నర్సారావుపేట జమీందారులయిన మల్రాజువారి నాశ్రయించి అగ్రహార మును పొందినట్లు తెలియుచున్నది.

అహోబలుడు ఆత్మస్తుతిపరాయణుడుగా కనిపించును. అతడు తన్నిట్లు భూషించుకొనెను.

"యన్మూర్త్యా కవితామూల కంద వాగను శాసనౌ
జాగృతోఽహోబలపతీ రాజతే సవిలక్షణః"

కవితకు మూలకందమగు వాల్మీకియు, నన్నయభట్టును ఎవనిరూపముచే నొప్పుచున్నారో యట్టి విలక్షణుడగు నహోబలపతి ప్రకాశించుచున్నాడు.

కాలము : ఆంధ్రశబ్ద చింతామణి బాలసరస్వతి పండితునకు కీలక సంవత్సరమున దొరకెనని అప్పకవియు, అహోబల పండితుడును ఈవిధముగా వ్రాసియున్నారు.

"ఆలోకనుతుఁడు మొన్నటి
కీలక సమయమున మతంగగిరికడ నొసగెన్"-అప్పకవి
"జగ్రాహవ్యాకృతిం తస్మాత్కలి ర్బాల సరస్వతీ
ఎలకూచి కులాంభోధి శరద్రాకానిశాకరః.
సమస్తకవితా దక్షో వత్సరే కీలకాహ్వయే -" అహోబలుడు. అప్పకవి మొన్నటి కీలక సంవత్సరమున బాల సరస్వతికి ఆంధ్రశబ్ద చింతామణి దొరికెనని చెప్పియున్నాడు. అందుచే బాలసరస్వతికి గ్రంథము దొరికిన కీలక సంవత్సరము తరువాత మరల కీలక సంవత్సరము వచ్చులోపల 'అప్పకవీయము' 'అహోబలపండితీయము' రచింపబడెననుట స్పష్టము. మరియొక కీలక సంవత్సరమేని మొన్నటియని చెప్పుట అసంగతమగును. బాల సరస్వతికి గ్రంథము దొరకిన కీలక సంవత్సరము క్రీ. శ. 1608 అని మనము అప్పకవీయముయొక్క కాలమును బట్టి నిర్ణయింపవచ్చును. మరల కీలక సంవత్సరము క్రీ. శ. 1668 లో వచ్చును. కావున అహోబలపండితీయ మునకు చివరమితి క్రీ. శ. 1668 యై యున్నది. అహోబలపతి తన గ్రంథమునందు అప్పకవిని పేర్కొనుటయు, అప్పకవీయమునందలి పద్యముల నుదాహరించుటయు జూడ నప్పకవీయము వ్రాయబడిన తరువాత కవిశిరోభూషణము వ్రాయబడినదనుట స్పష్టము. అప్పకవీయము క్రీ. శ. 1656 సం॥లో వ్రాయుటకు నారంభింప బడినది. ఆ గ్రంథము పూర్తియగుటకును, దేశమునందు వ్యాప్తి నొందుటకును రెండు సంవత్సరములు పట్టిన వనుకొన్న యెడల క్రీ. శ. 1658-1668 మధ్య కాలమున 'అహోబలపండితీయము' వ్రాయబడెనని మనము నిశ్చయింపవచ్చును. 'అప్పకవియు, అహోబల పండితుడును సమకాలికులనియు, సమీపగ్రామములందుండువారనియు పరస్పరేర్ష్యాప్రేరితులనియు పూర్వము నుండి వదంతికలదు. అదియు నీ కాల నిర్ణయమునకు సహకారియే. అందుచే అహోబలపండితుడు క్రీ. శ. 17 వ శతాబ్దివాడని పెద్దలు నిశ్చయించిరి.

గ్రంథ కర్తృత్వము :- ఎలకూచి బాలసరస్వతీ మహోపాధ్యాయుడు నన్నయభట్ట విరచితమును, 'శబ్దానుశాసనము' అను నపరనామముగలట్టి ఆంధ్రశబ్ద చింతామణికి 'బాలసరస్వతీయ' మను నొక టీక వ్రాసియుండెను. ఈ మహోపాధ్యాయుడు అప్పకవిని, అహోబలపండితునకును పూర్వుడు. ఆంధ్ర శబ్దచింతామణి నన్నయభట్ట విరచితమేయని పలువురు ప్రామాణిక వైయాకరణుల యాశయము. బాలసరస్వతి నన్నయభట్టారకుని సకలకవితాప్రవర్తకుడుగాను, శబ్దశాసనముగాను, ఆంధ్ర శబ్ద చింతామణిని శబ్దశాసనముగాను జెప్పియున్నాడు.

బాలసరస్వతికి దరువాతివాడగు అప్పకవి ఆంధ్ర శబ్ద చింతామణిలోని సంజ్ఞాసంధి పరిచ్ఛేదములకు మాత్రమే తెలుగు గద్య పద్యములలో వివరణమును వ్రాసెను. అహోబలుడు బాలసరస్వతి స్వీకరించిన ఆంధ్రశబ్ద చింతా

మణి ప్రతిని తన వ్యాఖ్యానమునకు మాతృకగా నంగీకరించెను. అప్పకవి చేపట్టిన మాతృకయందలి పాఠ బేధములను గూడ అథర్వణోక్తి ప్రకారము సంగ్రహించెను.

1. పాఠభేదాస్తు బహావో దృశ్యంతే పుస్తకద్వయే,
మయాప్రాయ స్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే.
2. అప్పార్య పుస్తకారూఢ పాఠ భేదా ద్యదుత్థితం,
మయా సంగృహ్యతేరూపం తదప్యాథర్వణోక్తితః.

—కవి శిరోభూషణ గ్రంథాది పీఠిక

ఆంధ్రశబ్ద చింతామణి బాలసరస్వతీ పండితునకు లభించిన విధమును గూర్చి యొక అద్భుతకథ చెప్పబడు చున్నది. నన్నయభట్టు దీనిని రచించెననియు రాజరాజ నరేంద్రుని కుమారుడయిన సారంగధరుడు బాల్యమున దాని నభ్యసించి, కాలుచేతులు నరకబడి సిద్ధులలో కలిసి కాలాంతరమున బాలసరస్వతికి ప్రత్యక్షమై చింతామణి గ్రంథమును వ్యాఖ్యానింపుమని ఆతని కొసగినట్లు కథ కల్పింప బడినది. అప్పకవియు, అహోబలపండితుడును ఈ కథనే తమ గ్రంథ పీఠికలయందు అనూదించిరి. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయభట్ట కృతము కాదను వాదము విమర్శక లోకమున కలదు. దీనిని మొదట లేవనెత్తినవారు కం. వీరేశలింగము పంతులుగారు. శ్రీ వఝ్ఝుల చిన సీతారామస్వామి శాస్త్రిగారు తమ బాలసరస్వతీయ - అథర్వణకారికావళీ పీఠికల యందును చింతామణి విషయపరిశోధక గ్రంథమునందును పెక్కుహేతువులచే చింతామణి నన్నయ కర్తృకమే యని స్థాపించియున్నారు. అథర్వణకారికావళి అథర్వణ కర్తృకమే అనియు, అది ఆంధ్రశబ్ద చింతామణికి శేషగ్రంథమే అనియు చింతామణియందలి సూత్రములు సామాన్య సూత్రము లనియు, కారికావళి సూత్రములు విశేష సూత్రము లనియు వారిమతము.

అహోబలపండితుడు బాలసరస్వతీయ, అప్పకవీయ ములనేగాక అథర్వణ కారికావళినిగూడ ఆధారముగా గొని యాంధ్రశబ్ద చింతామణికి అహోబలపండితీయమను సంస్కృతభాషామయమును, విపులమును, శోదతమమునగు వ్యాఖ్యానమును రచించి యాంధ్రభాషకు మహోపకార మొనర్చెను.

తత్ర పంచ పరిచ్ఛేదా
శ్శబ్దశాస్త్రే నియంత్రితాః।
ఆర్యాఖ్య పద్యై స్తత్సంఖ్యా
సమ్మితా స్యా ద్గజైర్గజైః॥

బాలసరస్వతి పరిగ్రహించిన ఆంధ్రశబ్ద చింతామణి యందు ఆర్యావృత్తములుగల అయిదు పరిచ్ఛేదములు కలవు. అవి సంజ్ఞా, సంధి, అజంత, హలంత, క్రియా పరిచ్ఛేదములు. ఈ అయిదు పరిచ్ఛేదములందును 88 ఆర్యావృత్తములు కలవని అహోబలపండితుడు నుడివెను. కాని "ఆద్యం ప్రకృతిః ప్రకృతి శ్చాద్యే" అను శ్లోక వివరణ సందర్భమున మరియొక శ్లోకమును ఇతడు ఉదాహరించి యున్నాడు. "శాస్త్రమ పౌరుష మాద్యం" అను శ్లోకము బాలసరస్వతి స్వహస్త లిఖితమయిన ప్రతియందు తనకు లభించెనని అహోబలుడు సూచించెను. ఇట్లు ఆంధ్రశబ్దచింతామణియందలి శ్లోకములు 89 అగుచున్నవి. ఈ విశేష శ్లోకమును బాలసరస్వతికాని అప్పకవిగాని వివరించి యుండలేదు. అప్పకవి గ్రహించిన ప్రతియందు 82 ఆర్యావృత్తములే కనిపించుచున్నవి. ఈ యంశము క్రింది శ్లోకమువలన తెలియనగుచున్నది.

మతంగశైల విప్రేంద్రా దన్యం వ్యాకృతి పుస్తకం।
కాకునూ ర్యప్పకవినా గృహీతం తత్ర షడ్గతాః॥

మతంగపర్వతమందున్న బ్రాహ్మణునివలన చింతామణియొక్క మరియొకప్రతిని అప్పకవి సంగ్రహించెను. దానియం దారు శ్లోకములు పోయినవి. (అహోబలపండితీయ పీఠిక)

ఇల నెనుబదిరెం డార్యలు
గలుగు పరిచ్ఛేద పంచకంబునఁ దగు....

(అప్పకవీయము 1 వ ఆ. 54. వ. ప.)

కవిశిరోభూషణము అను వ్యాఖ్యానము మూలము ననే యథర్వణ కారికావళి అను వ్యాకృతియు లోకమునకు తెలియవచ్చెను. దీనికి 'వికృతి వివేకము' నామాంతరము. ఆంధ్రశబ్దచింతామణి సాధారణముగా తత్సమశబ్ది నిరూపణ పరమయినది. అట్టి తత్సమ శబ్దరూప సాధన విషయముననుగూడ కొంత పూరింపవలసి యుండుటచే, తచ్ఛేషభూతమగు ఆంధ్ర వ్యాకరణ విషయ జాలమును విపులముగా అథర్వణాచార్యుడు వివరించి ఆంధ్రభాషకు

సమగ్రమగు వ్యాకరణము లేని కొరతను చాలవరకు తీర్చెను. వేయేల! వికృతి వివేకము (అథర్వణ కారికావళి) లోని విషయబాహుళ్యము నేటి బాలవ్యాకరణ త్రిలింగ లక్షణ శేషాదులలోగూడ లేదనుటకు సందేహము లేదు.

అహోబలుడు తన వ్యాఖ్యానమున అథర్వణ కారికలను పేర పెక్కు శ్లోకముల నుదాహరించి యున్నాడు. పతంజలి మహాభాష్యమున వ్యాకరణ సంబంధమయిన కొన్ని శ్లోకములు ఉదాహరింపబడినవి. వాటికిసమానముగా నిందు అథర్వణ కారికలు చేర్చబడినవి.

యస్సారో ఽథర్వణగ్రంథే సోప్యత్రైవ విధీయతే।
తేన తత్ఫక్కికాలోకలోలతా త్యజ్యతాం బుధైః॥

'అథర్వణాచార్యుని గ్రంథమునందలి సారమంతయు నిందుచేర్చితిని. కావున పండితులు దానిని చూడవలయునను కోరిక వీడవలయును' అని అతడు వ్రాసెను (కవిశిరో.పీ.). అథర్వణకారికావళిముద్రితప్రతి ద్విత్రింత్రిణీ (రెండుచింతల) సీతారామకవి వ్యాఖ్యగలదై ప్రస్తుతము లభించుచున్నది. ఈ కారికలను అథర్వణుడు రచింపనే లేదనియు స్వపక్షమండనార్థమై అహోబలుడే వ్రాసి తన వ్యాఖ్యానమున జొప్పించెననియు విమర్శకులు తలచుచున్నారు. ఆంధ్రవ్యాకరణ విషయమున నన్నయ ప్రథమాచార్యుడనియు, అథర్వణుడు ద్వితీయాచార్యుడనియు పండితవ్యవహారము కలదు.

శైలి:- అహోబలపండితుని కవిశిరోభూషణపు శైలి మృదుమధురమై సరళమై ప్రసాదగుణ భూయిష్ఠమై సంస్కృత కావ్యవ్యాఖ్యాతలును, లక్షణగ్రంథ వ్యాఖ్యాతలు నగు మల్లినాథ, సోమపీథ్యాదుల శైలికన్న రసవత్తరముగా నుండును. ఇది అహోబలుని సంస్కృతాంధ్ర పాండిత్యమును దెలుపు వ్యాకరణ సంబంధమైన యుద్గ్రంథము. లక్షణములు సంస్కృతమునందును, లక్ష్యములు తెలుగునందును చెప్పబడుటచే నిది చదువుటకొక వింత గ్రంథముగా నుండును. ప్రాకృత వ్యాకరణ లక్ష్యలక్షణము లిర్లేయుండుటచే అవి చూచినవారికి నిది విపరీతముగా గన్పట్టదు.

"విశ్వశ్రేయః కావ్యం, తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ, సావాగ్వ్యారస వృత్తిః, సాధ్యోహిరసో యథా యథం కవిభిః" - ఇత్యాది సూత్రవ్యాఖ్యా సందర్భమున తనకుగల సర్వశాస్త్ర-దర్శనములందలి కూలంకషములైన పాండిత్య ప్రతిభా విశేషాదులు ద్యోతకమగునట్లుగా అహోబలుడు వ్రాసియున్నాడు. ఈ సందర్భముననే "వ్యాకరణస్యాపి బ్రహ్మపరత్వమేవ తథాహి పస్పశాహ్నికే భగవత్పతంజలినా చత్వారి శృంగేతి మంత్రస్యార్థో వివృతః." పస్పశాహ్నికమందు (వ్యాకరణ భాష్యభాగము.) 'చత్వారి శృంగేత్యాది' మంత్రమునకు వ్యాకణ పరముగా నర్థమును వివరించెను. పతంజలిమహర్షి సంస్కృత వ్యాకరణావశ్యకతను మహా భాష్యమునందు చర్చించినట్లే అహోబలుడును ఆంధ్రవ్యాకరణావశ్యకతను గూర్చి ఇందు చర్చించెను. సంస్కృతభాషయందు మాత్రమే కావ్యములను రచింపవలెను. తదితర భాషలన్నియు అపభ్రంశములు. వాటి నుచ్చరించుట పాపము. దేశభాషల లోని పురాణాదులను విన్నందున పాపక్షయము లేదు. అను నీ మున్నగు పూర్వపక్షములఖండించి ఏదేశమువారి కాభాష సంస్కృతమువలెనే పవిత్రమనియు, స్త్రీ శూద్రులకు జ్ఞానాధికారము గలదనియు 'నా నృషిః కురుతేకావ్యం' ఋషి కానివాడు కావ్యమును రచింపలేడనియు, నన్నయభట్టును ఋషిగా నెంచవలెననియు, ఆతని వ్యాకరణము ప్రమాణమే యనియు, వివరించి యున్నాడు.

వ్యాఖ్యాన విశేషములు:- అప్పకవి "నిత్యమనుత్తమ పురుషక్రియాస్వితః" అను సూత్రమును వివరించుచు ఇట్లు చెప్పెను. భూతకాలక్రియలగు ప్రథమపురుష బహువచనము, మధ్యమపురుష ఏకవచన బహువచనములు, ఉత్తమపురుష బహువచనము, ఇకార మంతమందు గల వాటికి అచ్చు పరమగునపుడు సంధి నిత్యమని ఈ యుదాహరణముల నిచ్చెను— దీవించిరట; దివిజునేలితివట; మీరు కట్టితిరట; వింటి మీవార్త. ప్రథమోత్తమ పురుషైకవచనములు, భూతకాలమునందలివి, ద్రుతాంతములగునని ఈ యుదాహరణముల నిచ్చెను—. భరియించెనుపేంద్రుడు; ఏను బ్రతికితి ననగన్.

విరచించెను శ్రీనాథుఁడు
ధరణిని శృంగార నైషధంబునఁ గూర్చుం

డిరి యొండొరునని కానక
పరపురుష క్రియలఁ బ్రకృతిభావము గలదే ?
(అప్ప. 5 వ. ఆ. 64 వ ప.)
"బలభిద్వహ్ని పరేత రాజవరుణుల్
బర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుంగదిసి."
(శృంగార నైషధము.)

ఈ సూత్ర సందర్భమును పురస్కరించుకొని శ్రీనాథుడు అపప్రయోగము చేసెనని అప్పకవి విమర్శించెను. భూతకాలిక ప్రథమ పురుష బహువచనమునకు సంధి నిత్యము కాదగియుండగా ప్రకృతిభావము చేసెనని యాతడాక్షేపించెను.

అహోబలపండితుడు తన వ్యాఖ్యానమునందు అప్పకవి శ్రీనాథునిపై చేసిన యాక్షేపణను పరామర్శించి, శ్రీనాథుని ప్రయోగము లాక్షణిక సమ్మతమేయని సమర్థించెను. ఎట్లన "ప్రథమే చోత్తమేచైవ క్రియేతోవా భవేత్ చ్యుతిః। నిత్య మన్యస్య వికృతౌ క్త్వార్థేతో నభవేత్సదా," అను నాథర్వణకారికను అహోబలు డీసందర్భమున పేర్కొనెను. ప్రథమ పురుషయందును, ఉత్తమ పురుషయందును క్రియా సంబంధియగు ఇకారము వికల్పముగా జారిపోవును. మధ్యమపురుష 'ఇ' కారమునకు సంధి నిత్యముగా నగును. క్త్వార్థేకారమున కెల్లపుడు సంధిలేదు. దీనిప్రకారము శ్రీనాథుని ప్రయోగము ప్రామాణికమే యనెను. ద్రుతాంతమైన భూతకాలిక ఉత్తమ పురుషైక వచనక్రియకు సంధి వైకల్పికమని అహోబలపండితుడు వివరించెను, దీనిని "ప్రాయస్తు స్యాత్కి మాది కస్యేతః" అను సూత్రమునకు విషయముగా చేసెను. సేవించితి నచ్యుతు; సేవించి తచ్యుతు; అని యుదాహరణములు. అథర్వణుడును, కవిమండన కారుడును దీనిని అనుమతించిరి. కొందరమతమున ద్రుతాంతమైన 'తి' ప్రత్యయమునకు సంధి చెల్లదు. కొలిచితిని+అబ్ధిజను, కొలిచితినబ్ధిజను, కొలిచితిని నబ్ధిజను అని రూపము లేర్పడవలెను. "నస్యాత్ తద్ధర్మేతః" అను సూత్రవివరణ సందర్భమున అహోబలుడును, అప్పకవియు భిన్నమార్గముల ద్రొక్కినారు. అహోబలుని వివరణము "సంధిరితి సర్వత్రానువర్తతే. తద్ధర్మేకార స్యాచ్చి సంధిర్నస్యాత్. తద్ధర్మపదేన తద్ధర్మక్రియా, తజ్జన్య విశేషణంచ గృహ్యేతే. వెలయునవనికీర్తి సకల దిగ్వలయమునను, రక్షణమొనర్చు నంబుజాతాక్షు గొలుతు నిత్యా ద్యుదాహరణం" (సంధియను శబ్దము అంతట ననువర్తించుచున్నది. తద్ధర్మేకారమున కచ్చుపరమగుచుండగా సంధిలేదు. తద్ధర్మపదముచేత తద్ధర్మ క్రియయును, తజ్జన్య విశేషమును గ్రహింపబడుచున్నవి. వీటిరెంటికి నుదాహరణములు వెలయు నిత్యాదులు.) అహోబలపతి ఇట్లు వ్యాఖ్యానించుటకు మూలము అథర్వణుడు. వికృతి వివేకమునం దిట్లున్నది. "ప్రథమశ్చోత్తమశ్చైవ తాసు తద్ధర్మ సౌంజ్ఞికే। భూతాద్య విషయా తత్రచైక త్వార్థాభి ధాయకౌ। ఉదంతేచ సదానాంతౌ న సంధిస్తత్ర కల్ప్యతే". అనగా పూర్వోక్త క్రియలయందు భూతాద్య విషయకములై నాంతములు, ఉదంతములు నైన ప్రథమోత్తమ పురుషైక వచనములు తద్ధర్మ సంజ్ఞితము లగును. వాటికి సంధి రాదు. ద్రుతాంతములైన వీటికి సంధి రాకుండగా, కళలగు నితర తద్ధర్మ క్రియారూపములకు సంధి కలుగవచ్చును. ఉదా: వారు ఘటింతురనుచు; ఘటింతు మెంత పనియైన, ఘటింతు వనిశము. అప్పకవి ఈ సూత్రమును మరియొక విధమున నన్వయించెను. అతడు "నః స్యాత్" అను పాఠమును కల్పించుకొని

ఱితిని బైపదములకు విశేషణంబు
అగు క్రియాపదంబుల తుదినమరు శృంగ
మునకు వచ్చు నాగమమయి పొల్లద్రుతము
ప్రాణపరమైన కర్మధారయమునందు.

ఉత్తర పదమునకు విశేషమైన తద్ధర్మరూపము తుది 'ఉ' కారమున కచ్చుపరమగునప్పుడు కర్మధారయమున పొల్ల 'న' కారము ఆగమముగా వచ్చును.

ఈత డీవిధముగా వ్యాఖ్యానించుటచేతనే తరువాతి లాక్షణికులందరు తద్ధర్మార్థక విశేషణోకారమునకు అచ్చుపరమగునప్పుడు నకారాగమము వచ్చునని సూత్రించుచు వచ్చిరి. ఈ సూత్రమునకు పూర్వాపర సూత్రములీ సూత్రము సంధినిషేధ పరముగా చాటుచుండ, నకారాగమ విధాన పరముగా అప్పకవి వ్యాఖ్యానించెను.

భావార్థక 'ట' వర్ణ విధాయకసూత్ర వివరణ సందర్భమున అహోబలుడు మహాకవుల ప్రయోగములను పరామర్శించి తప్పు పట్టుటకు సాహసించెను. "భావే టవర్ణకోంతే సర్వేషాం క్రియాపదానాం స్యాత్" అని ఆంధ్రశబ్దచింతామణి సూత్రించినది. అన్ని క్రియాపదములకును భావార్థమున 'ట' వర్ణమగును. అతడు ఘటించుట, వచ్చుట మొదలగునవి ఉదాహరణములు. అథర్వణుడు దీనిపైకొన్ని విశేషములను సూచించెను. "పూర్వస్య నవికారో నోస్తస్మిన్ లోపశ్చకస్యచిత్" భావార్థక 'ట' వర్ణమునకు పూర్వమునందున్న 'ను' వర్ణమునకు లోపమురాదని దీని భావము. అనుట, వినుట వంటి రూపములే భావార్థమున సాధువులనియు, అంట, వింట, కంట, వంటి రూపము లసాధువులనియు అహోబలుని నిర్ణయము. ఈ ప్రకారము శ్రీనాథుని ప్రయోగము ప్రామాదికమని యీతడు ఖండించెను. "ఏతేన— మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి పనిఁ గొంట నీకుఁ బ్రాభవము కాదె"— ఇత్యాది వచనస్య ప్రామాదికత్వమే వేత్యవధేయం. ఆంధ్రభాషాభూషణే "వినుటకు వింటయగు" నిత్యాది వచనేన వింటే త్యాదీనాం సాధుత్వముక్తం. తదనేన పరాస్తం- "ఘటించుట కొరకున్, వచ్చుట కొరకున్" ఇత్యాద్యాకారేణ సర్వత్ర 'ట' వర్ణకాదేవ విభక్తయః. ఏవం స్థితే "సుతులఁ గనియెడు కొరకు నీవు ఘటించుకంటె ఇత్యాదీనాం భాస్కర తిక్కయజ్వాదీనాం వచనానాం కిం మూలమితి వయం నవిద్మః" ఘటించుట కొరకు ఇత్యాదిగా 'ట' వర్ణకము మీదనే విభక్తి రావలసియుండగా, భాస్కర తిక్కయజ్వలు 'కనియెడుకొరకు, ఘటించుకంటె' మొదలగు రీతిని ప్రయోగించుటకు మూల మేమియు మే మెరుగలేకున్నారము. ఇట్లహోబలపతి తిక్కనాదులకుగూడ తప్పులు వట్టెను. శాస్త్రమునకును మహాకవిప్రయోగములకు వైరుద్ధ్యము కలిగినపుడు శాస్త్రమే బలీయమని అహోబలుడు విశ్వసించెను. ఈ సందర్భమున అథర్వణ కారిక యొకటి ఇట్లున్నది. "శాస్త్రప్రయోగ వచసో శ్శాస్త్రం బలవదుచ్యతే। అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం బలం"—దీని నాధారముగా గొని అహోబలుడు మహాకవి ప్రయోగములకూడ సరిదిద్దుటకు వెనుదీయలేదు. వసుచరిత్రయందలి "అప్పుపాలయిన శుభ్రాబ్జంబు రుచి యెంత; కనకూర్మి ఱేని అప్పునసె ముంచె" అను ప్రయోగములను అహోబలుడు విమర్శించెను. నిత్యబహువచనమయిన అప్ఛబ్దమును అప్పు అని ఏకవచనముగ ప్రయోగించుట దోషమని పై పద్య పాఠమును అతడు ఇట్లు సవరించెను. "అప్పుల పాలయిన య బ్జంబు రుచియెంత; అలకూర్మి ఱేని అప్పులసె ముంచె." తుదకు అహోబలుడు నన్నయ మహాకవి ప్రయోగములనుకూడ సవరింపబూనెను. ఎట్లన— "తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు" ఇత్యత్ర బు వర్ణకానంతరం నకార శ్రూయతే తత్ర కాగ తిరితిచేత్— "తత్క్రతు శతంబున కెన్న సుతుండు మేలు"— ఇత్యేవ పాఠ స్సాధుః. అహోబలుడు దిద్దినపాఠము ఏ భారతియందును కాన్పించదు. "ప్రయోగ మూలం వ్యాకరణం"; "ప్రయోగ శరణా వైయాకరణాః" అను నుత్తమ పద్ధతిని ఇతడు పాలించినవాడు కాదు. శాస్త్రమునకు ప్రాధాన్యమును ప్రయోగమునకు గౌణత్వమును ఇచ్చుటచే అహోబలుడు విమర్శనమునకు గురియగుచున్నాడు.

మొత్తమునకు అహోబలపండితుని కవిశిరోభూషణ వ్యాఖ్య ఆంధ్రశబ్దచింతామణి— అథర్వణ కారికావళులకు సమగ్రమును, విమర్శాత్మకమునగు వ్యాఖ్యానమై మహాభాష్యమువంటి యుద్గ్రంథమునై, తరువాతి యాంధ్రలాక్షణికులకు సర్వతోముఖముగా మార్గదర్శియయ్యెననుట సత్యము.

పె. లిం. శా.

**అహోబలుడు** :- క్రీ. శ. 1500 సంవత్సరము ప్రాంతమువాడు. ఆంధ్రుడు. అహోబలక్షేత్ర ప్రాంతీయుడు. ఇతడు వెలనాటి వైదిక బ్రాహ్మణోత్తముడు. శ్రీకృష్ణ పండితుని కుమారుడు. వేద, వేదాంత, తర్క, వ్యాకరణ శాస్త్రనిష్ణాతుడు, సంగీతశాస్త్ర పండితుడు. గొప్ప వైణికుడు. తనకు చేకూరిన సమగ్రమైన అనుభవమును పురస్కరించుకొని 'సంగీత పారిజాతము' అను చక్కని సంగీతలక్షణ గ్రంథమును రెండు కాండములలో రచించెను. అందు మొదటి కాండమున రాగగీతములను రెండవ కాండమున వాద్యతాళములను చెప్పెను.

క్రీ. శ. 1210 వ సంవత్సరమున నిశ్శంక బిరుదాంకితుడగు శార్ఙదేవ మహామహుడు రచించిన సంగీత రత్నాకరమునందలి విషయములను కొంతవరకు అనుసరించి పై గ్రంథమును ఇతడు రచించెను. ఇతడు తాను రచించిన 'సంగీత పారిజాతము' అను గ్రంథమును

శ్లో॥ సంగీత పారిజాతోఽయం సర్వకామ ప్రదోనృణాం।
అహోబలేన విదుషా క్రియతే సర్వసిద్ధయే॥

అను శ్లోకముబట్టి సందేహములను తీర్చి సమస్తమైన కోరికలను సిద్ధింపజేయు దానినిగా ఉద్దేశించి రచించినట్లు తెలియుచున్నది. వీణయందు స్వరస్థానము కొరకు సారికలను మెట్లను పెట్టు పద్ధతిలో క్రొత్త సంప్రదాయమును మొదట వెల్లడి చేసినది అహోబల పండితుడే. దీనినిబట్టి వీణయందు ఇంత కొలతలో ఈస్వరము ఉన్నదను విషయము తెలియగలదు. రత్నాకరుడు ఏడు శుద్ధస్వరములు పండ్రెండు వికృతిస్వరములు కలవని చెప్పెను. అహోబలుడు ఇరువదిరెండు వికృతి స్వరములను పేర్కొనెను. హిందూస్థానీ గానములో శుద్ధ వికృతిస్వరములకు క్రమముగ కోమల తీవ్ర అను నామములు కలవు. కర్ణాటక పద్ధతిలోని సాధారణ గాంధారమును తీవ్రగాంధారముగా, కైశికి నిషాదమును తీవ్రనిషాద ముగా, అంతర గాంధారమును తీవ్రతర గాంధారముగా కాకలి నిషాదమును తీవ్రతర నిషాదముగా, మృదుపంచమమును అనగా వరాళి మధ్యమమును తీవ్రతర మధ్యమముగా, శుద్ధమధ్యమమును అతితీవ్రతమ గాంధారముగా పేర్కొనెను.

హిందూస్థానీ గానమును అనుష్ఠించువారలకు సంగీత పారిజాతము ప్రమాణ గ్రంథము. దీనినే ఇప్పటికిని హిందూస్థానీ గాయకులు కొంతవరకు అనుసరించుచున్నారు,

సో. నా.

**అహోబిలము :-** శ్రీశైలము, అహోబిలము, సంగమేశ్వరము, మహానంది కర్నూలు జిల్లాలోని సుప్రసిద్ధ క్షేత్రములు. అహోబిలము తప్ప మిగిలినవన్నియు శివపరమైనవి. అహోబిలము వైష్ణవక్షేత్రము. విశిష్టాద్వైత మతస్థుల కియ్యది పవిత్ర యాత్రాస్థలము మాత్రమేకాక, తదితర మతములవారికిని ఆరాధ్యమయ్యెను.

అహోబిలము కర్నూలు మండలములోని శిరువెళ్ళ తాలూకాలో రుద్రవరమను గ్రామమునకు అయిదుమైళ్ల దూరమందు కలదు. నల్లమల కొండలలో మనోజ్ఞమైన ప్రకృతి దృశ్యముల మధ్య ఈ క్షేత్ర మొప్పుచుండును.

హిరణ్యాకశిపుడు తన కుమారుడైన ప్రహ్లాదునిపై దురాగత మొనర్చు ఘట్టమునందు విష్ణువు నరసింహావతారమెత్తి తన భక్తుని కాపాడిన పవిత్రస్థలమిదియే అని పారంపర్యముగా వచ్చిన కథ గలదు. నరసింహస్వామి కంకితముగా నిర్మితమైనట్టి ముప్పదిరెండు పుణ్యతీర్థములో ఇదియే ప్రముఖమయినది. ఇచ్చట నరసింహస్వామికి అంకితమయిన తొమ్మిది దేవాలయములు గలవు. ఆ దేవాలయము లన్నియు పదిమైళ్ళ చుట్టుపట్లనే కలవు. అందుచే ఈ ప్రదేశమునకు పంచక్రోశ తీర్థమనియు పేరుగలదు.

ఈ క్షేత్ర ప్రాంతములోనున్న నవ నరసింహులకు ప్రహ్లాదవరద నరసింహస్వామి, ఛత్రవట నరసింహస్వామి కరంగి నరసింహస్వామి (యోగానంద నరసింహస్వామి), ఉగ్రనరసింహస్వామి, గుహానరసింహస్వామి, క్రోధనర సింహస్వామి, మలోల నరసింహస్వామి, జ్వాలా నరసింహస్వామి, పవన నరసింహస్వామి అను పేర్లు ఉన్నవి. వీరిలో "మలోల నరసింహస్వామి శాంత స్వరూపుడు. లక్ష్మీదేవితో సదా సరస సల్లాపములాడుచు నుండును. కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు బంగారు ఉత్సవ విగ్రహమును సమర్పించినాడు. అహోబిలం మఠము జియ్యరు తన మఠములో ఇష్ట దైవముగా పూజించుటకు దానిని తీసికొని వెళ్ళిపోయెను. ఇక్కడ ఒక విశేషమేమనగా స్వామివారు కూర్చుండియుండును. కుడికాలు క్రిందికి వ్రేళ్ళాడుచుండును. దానికి పాదుక తొడిగియున్నది. అందుచేత మఠాధిపతి విగ్రహమును ఎక్కడికి తీసికొని వెడల దలచితే అక్కడికి వెళ్ళుటకు స్వామి సంసిద్ధులై యున్నారను ప్రతీతి వచ్చినది.

దట్టమైన వృక్షముల మధ్య నల్లమల కొండల నానుకొని ఉన్నదానిని దిగువ అహోబిలమనియు, 2800 అడుగుల యెత్తుగల పర్వతముపై నున్నదానిని ఎగువ అహోబిలమనియు అందురు. వేదాద్రి, గరుడాద్రి అను పేర్లతో ఆ రెండు పర్వతములు పిలువబడుచున్నవి. వాటి

మధ్య భవనాశి, అను సెలయేరు ప్రవహించుచు. కుందు నదిలో పడును. పర్వత దక్షిణ ప్రాంతమందుగల ఉగ్ర నరసింహస్వామిదేవాలయపు మొదటిగుహాచెంత ఒక ఇనుపస్తంభ ముండుటచేత నరసింహస్వామి ఇచ్చటనే పుట్టెనని చెప్పుచుందురు.

పెద్ద అహోబిలము (దిగువ) రాతిలో ఏర్పడినది. దానికి చెంత పెండ్లికూతురుగనున్న చెంచెత కలదు. ఆమె కారణముగనే అడవిలోనుండు చెంచులందరు నరసింహస్వామికి ముఖ్య భక్తులు. వారికి నేటికిని ఫాల్గున మాసములో జరుగు తిరునాళ్ళయందు కొన్ని ప్రత్యేక సౌకర్యములు కలవు. ఆ చెంచెతను చూచి లక్ష్మి తన భర్తయొక్క విశ్వాస ఘాతుకత్వమునకు చింతించి పర్వతమెక్కి 'మొనకొండ' అనుచోట నివాస మేర్పరచుకొనెను. అక్కడ ఒకవైపు భయంకరమయిన పెద్దలోయ కలదు. దానిచెంత గల ఇనుపస్తంభము చుట్టు సంతానము లేని ఆడువారు ప్రదక్షిణ మొనర్చిన సంతానభాగ్యము నొందుదురని ప్రతీతి.

ఈ దేవాలయము 14 వ శతాబ్దియందు ప్రతాపరుద్రుని చేత నిర్మింపబడినదని చెప్పుచున్నారు. ఇంతవరకు అందుకు కావలసిన సాక్ష్యము లభింపలేదు. అది శఠకోప జియ్యంగారు మొదటి ఆచార్యుడుగా నున్నందున అతని వారసులే ఇప్పటికిని అహోబిల మఠాధిపతులుగ నున్నారు. ఇప్పుడు వారు పూజాది కార్యక్రమములను దేవస్థానమునందు నడిపించుచున్నను, మద్రాసు రాష్ట్రమందలి తిరువళ్ళూరులోనే వారి నివాసము. విజయనగరరాజులు దేవాలయమునకు కొన్ని గ్రామములు, భూములు ఇనాములుగా ఇచ్చిరి. అందులో శిరువెళ్ళ, కోవెలకుంట్ల, బద్వేలు (కడపజిల్లాకు చెందినది) తాలూకాలలో 40 ఎకరముల భూమియు, అనంతపురంజిల్లా తాటి పత్రి తాలూకాలోని గుండాల హోబుల అగ్రహారము అను ఇనాము గ్రామములును మాత్రమే ఇచ్చట కలవు. ఒకప్పుడు దేవాలయము చాల వైభవ మనుభవించుచుండెను. ఇందు కాకతీయ, విజయనగరపు రాజుల కాలమునాటి శిల్ప సంపద దృగ్గోచరమగును. 16 వ శతాబ్దమందు గోల్కొండ సుల్తాను ఇబ్రహీం కుతుబ్‌షా చేతులలో ఈ దేవాలయము పడినప్పుడు విలువగల ఆభరణాదులు అపహరింపబడెను. 18 వ శతాబ్దములో కర్నూలు నవాబ్ అగు మున్వార్ ఖాన్ యొక్క స్వాధీనములోనికి వచ్చినప్పుడు యాత్రికులపై పన్నుకూడ విధింపబడి యుండెనట!

కంచిలో శ్రీనివాసాచార్యుడనునాతడు చదువుకొనుచున్నపుడు నరసింహస్వామి కలలో కనబడి అహోబిలమునకు వెళ్ళి సన్యాసాశ్రమము స్వీకరింపుమనెనట! ఆ దేవాలయపు ధర్మకర్తయైన ముకుందరాయలకు కూడ అదేసమయమున కలలో కనబడి కంచినుండి ఒక భక్తుడు రానున్నాడు. స్వీకరింపుమనెనట. శ్రీనివాసాచార్యులు, ముకుందరావు మాట్లాడుకొనుచుండగ నరసింహస్వామి సన్యాసిరూపమున వచ్చి, శ్రీనివాసాచార్యునికి సన్యాసాశ్రమమిచ్చి "శఠకోపయతి" అని నామకరణము చేయుటవలననే వారి పరంపరకు ఆపేరు కల్గెనని అందురు.

మొదటి శఠకోపయతి జీవిత కాలము క్రీ. శ. 1378 నుండి 1458 వరకు అని నిర్ణయము చేయబడినది. ఆ తర్వాత అహోబిలములోగల శాసనములలో నొకదాని వలన క్రీ. శ. 1555 లో సదాశివరాయలు షష్ఠపరాంకుశ శఠకోపయతికి ఖాష్యాపురమను గ్రామమును దానముగా ఇచ్చినట్లు తెలియవచ్చుచున్నది. తరువాత క్రీ.శ. 1578-79 సంవత్సరముల మధ్య గోల్కొండ సుల్తాన్ ఇబ్రహీం కుతుబ్‌షా విజయనగరముపై దండెత్తివచ్చి పెనుగొండవరకును దాడిసల్పెను. అప్పుడు అహోబిలము అతని స్వాధీనమగుటచేత అయిదారు సంవత్సరములు మహమ్మదీయుల వశములో నుండిపోయెను. విజయనగర చక్రవర్తి రెండవ వేంకటపతిరాయలు క్రీ. శ. 1584 85 సంవత్సరములో మరల అహోబిలమును స్వాధీనము చేసికొన్నట్లు అచటగల శాసనము ధ్రువపరచుచున్నది. చంద్రగిరిలో సాళువ వంశీయుల కాలమునుండి శ్రీకృష్ణదేవరాయలవరకు ఈ క్షేత్ర మన్ని విధముల ప్రాశస్త్యమును గలిగి ఉండెనని చెప్పవచ్చును.

ఇనుపస్తంభము విడెము కొమ్మరాజు అనువానిచేత 14 వ శతాబ్దియందే నిర్మింపబడినదని చెప్పుదురు. దేవాలయమందు 15, 16 శతాబ్దులకు జెందిన అనేక దాన శాసనములు కొండవీటి రెడ్డిరాజుల నాటివి విజయనగర రాజులనాటివి కలవు. వానివలన కొంతవరకు చరిత్రను

తెలిసికొనగలుగుచున్నాము. అహోబిలము మత కార్య కలాపాలకు ప్రధానకేంద్రముగా నుండుటచేత ఆంధ్ర దేశమునందలి రాజకీయ, సాంఘిక, సారస్వత జీవితము లలో దాని కొక ప్రత్యేకస్థానము లభించినది. ఆ దేవు నకును, ఆ ప్రాంతమునకును సంబంధించియున్న జాన పద గేయము లనేకములు నేటికిని విరివిగా జనబాహుళ్య మందు ప్రచారముల్లో గలవు. అందులో కొన్ని చెంచెత యొక్కయు, నరసింహస్వామి యొక్కయు ముగ్ధ ప్రణ యమును వర్ణించు కళాఖండములు మనోజ్ఞములు. పద కవితారచనలో సుప్రసిద్ధుడైన తాళ్ళపాక అన్నమా చార్యుడు తన అమేయమైన సంగీత ప్రభావమున శ్రీ వేంకటేశ్వరస్వామిపై కీర్తనలు రచించి, తెలుగుభాషకు అమరత్వమును చేకూర్చిన మహానుభావుడు. ఈతడు అహోబిల మఠాధిపతియొక్క ప్రోత్సాహమును తొలు దొల్త నందుకొన్నా డట!

విశిష్టాద్వైత మత ప్రచారకేంద్రముగ నుండి ప్రకృతి సౌందర్య విశేష శోభితమై, చారిత్రక సంపత్తి గలిగి, ఆంధ్ర జానపద జీవితములో నంతర్భాగమై ఉత్తమ వాఙ్మయ వికాసమునకు తోడ్పడిన అహోబిల క్షేత్రము ఆంధ్రజాతికి గర్వకారణము. ఈ మధ్య ఉదారులయిన భక్తుల సహాయమువలన మంటపములు, గోపురములు ప్రాకారములు వెలసినవి. సులభ ప్రయాణసౌకర్యములు చేకూరుచున్నవి. ప్రభుత్వ హిందూధర్మాదాయశాఖకు చెందిన శాసనముక్రింద ఆ దేవాలయ పరిపాలనము ఒక ధర్మకర్తృత్వ సంఘముచేత నిర్వహింప బడుచున్నది. ఫాల్గున మాసములో జరుగు తిరునాళ్ళకు వచ్చు యాత్రి కులకు అన్నివిధము లయిన సౌకర్యములు గలిగింప బడు టయేగాక నరసింహస్వామి ఉత్సవము ఒక్క మాసము పాటు చుట్టుపట్టు గ్రామములలో అతి వైభవముగా జరుపబడుచుండును.

దం. వే. సు.

**అళియ రామరాయలు :-** అళియ రామరాయని జీవితము విజయనగరసామ్రాజ్య చరిత్రలో ఒక ప్రధాన ఘట్టము. విజయనగర చక్రవర్తులలో సర్వశ్రేష్ఠుడగు శ్రీకృష్ణరాయని జామాతయై, అతని యనంతరము రామరాయలు సర్వాధికారి అయ్యెను. యుద్ధతంత్రము నందును, రాజనీతిలోను సమకాలికులలో అసమాను డని ప్రఖ్యాతిగడించి, దక్కను సుల్తానులను తన చేతి కీలు బొమ్మలను గావించుకొని, దక్షిణాపథమున విజయ నగరము ప్రముఖస్థానము వహించునట్లు అత డొన ర్చెను. కాని అతని స్వార్థపరతయు, అధికారకాంక్షయు, కుటిల తంత్రములును విజయనగర సామ్రాజ్య విధ్వంస మునకు దారితీసెను.

రామరాయని వంశము : 'అళియ' యను మాటకు కన్నడభాషలో "అల్లుడు" అని అర్థము. శ్రీకృష్ణరాయని పుత్రికయైన తిరుమలాంబికను వివాహమాడుటను పుర స్కరించుకొని ప్రజలు వాత్సల్యముతో అల్లుడని పిలచు టచే అళియ రామరాజని అతడు ప్రసిద్ధికెక్కెను. అతడు ఆరవీటి వంశస్థుడు. ఆరవీటి వంశజులకు నరపతివారని గూడ వ్యవహారము గలదు. చంద్రవంశ క్షత్రియుల మనియు, కలచురి బిజ్జలుని సంతతివార మనియు, వీరు చెప్పుకొనిరి. ఆరవీడు మండలాధిపతు లయిన తరువాత నరపతి వంశజులు ఆరవీటి వారయిరి. ఈ వంశమునకు మూలపురుషుడు వీరహొమ్మాళిరాయడు లేక బొమ్మ రాజు. ఇతని పౌత్రులయిన కొటిగంటి రాఘవుడు, సోమ దేవరాజు ఆంధ్రదేశమున క్రీ. శ. 1323-1336 ల మధ్య జరిగిన స్వాతంత్ర్య మహోద్యమమున సుప్రసిద్ధ మగు పాత్రను నిర్వహించిరి. కంపిలరాజ్యముయొక్క పత నానంతరము (1328) ఢిల్లీ సుల్తానుకు ప్రతినిధియైన మాలిక్‌నాయబును పారద్రోలి, తురుష్క పరిపాలనను వీరు తుదముట్టించిరి. సోమదేవరాజు మనుమడయిన పిన భూపాలుడే ఈ వంశమున మొదటి ఆరవీటి ప్రభువు. ఇతని పుత్రుడయిన బుక్కరాజు "సాళువ నరసింహరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్యు" డయ్యెను. బుక్కరాజు కుమారుడయిన రామరాజు కందనవోలు నేలెను. అతని కుమారుడయిన శ్రీరంగరాజునకు తిమ్మాంబయందు ఐదు గురు సుపుత్రులు ఉద్భవించిరి. అందు మూడవవాడు అళియ రామరాయలు. క్రీ. శ. 1565 లో జరిగిన తళ్ళి కోట యుద్ధమునాటికి రామరాయలు 80 సంవత్సర ములవా డని తెలియుచున్నది. అందుచేత అతడు క్రీ. శ. 1485 ప్రాంతమున జన్మించియుండు నని ఊహింప వచ్చును.

**రామరాయలు, శ్రీకృష్ణదేవరాయలు :** రామరాయల బాల్యచరిత్రను గురించి తెలియుటలేదు. "గోల్కొండ సుల్తానైన కులీకుతుబుషావలన కందనవోలు మండలమును బడసి. కొంతకాలమునకు ఆదిల్‌షా (బీజపూరు)చే ఓడింపబడి ఆ మండలమును కోల్పోవుటచేత, కుతుబ్‌షా ఆగ్రహించి రామరాయలను తన కొలువునుండి బహిష్కరించెను. తరువాత అతడు శ్రీకృష్ణరాయల కొలువునందు చేరెను," అని ఒక ముస్లిము చరిత్రకారుడు వ్రాసియున్నాడు. పై సంఘటనలు కృష్ణరాయలు సింహాసనము ఎక్కుటకు (క్రీ. శ. 1509) పూర్వము జరిగియుండును. క్రమముగా రామరాయలు కృష్ణరాయనిఆస్థానమునందలి ప్రముఖవ్యక్తులలో ఒకడయ్యెను. అతని శక్తిసామర్థ్యములను రాజనీతిపై శారద్యమును గుర్తించి కృష్ణరాయలు అతనికి తనకుమార్తెనిచ్చి వివాహమొనర్చెను. అనంతరము దిగ్విజయ యాత్రలలోను, తెలుగు, బడగ రాజ్యములను ఏలుటలోను రామరాయలు కృష్ణరాయలకు తోడ్పడెను. తన మరణకాలమున (1530) సామ్రాజ్యపాలనా భారమును రామరాయలకు అప్పగించి, తన తమ్ముడైన అచ్యుతదేవరాయలకు పట్టాభిషేక మొనర్చుటకు కృష్ణరాయలు ఆతనిని ఆజ్ఞాపించెను.

**రామరాయలు, అచ్యుతదేవరాయలు :** కృష్ణరాయల మరణముతో రామరాజునందు అధికార వ్యామోహము పెంపొందెను. చేజిక్కిన సామ్రాజ్యమును అచ్యుతరాయలకు అప్పగించుటకు ఇష్టపడక, అత్యల్పవయస్కుడైన కృష్ణరాయల కుమారుని సార్వభౌమునిగా ప్రకటించి రామరాయలే పరిపాలన సాగించెను. కాని అచ్యుతరాయని పక్షమువారు కొందరు రామరాయలను ప్రతిఘటించి రాజ్యసింహాసనమును అచ్యుతునకు అప్పగించిరి. అచ్యుతరాయలుకూడ రామరాయల బలాధిక్యమును గుర్తించి, కృష్ణరాయని కుమారునితోపాటు రాజ్యమేల సాగెను. క్రీ. శ. 1533 ప్రాంతమున కృష్ణరాయని కుమారుడు మరణించుటచేత రామరాజు పలుకుబడి వెనుకంజ వేయసాగెను. ఆ రహస్యమును కనిపెట్టి అచ్యుతరాయలు, తన బావమరదియైన సలకరాజు తిరుమలయ్యను ప్రధానిగా నియమించి (1534) రాజ్యము చేయసాగెను.

రామరాజు ఈ పరిణామములను ముందుగనే ఊహించి ఎదురెత్తు లెత్తుటకు తగిన జాగరూకతను వహించియుండెను. సామ్రాజ్యమున బలవంతులైన ప్రభువులు అనేకులు ఆతనికి అండయై నిలచిరి. ఆతని తమ్ములైన తిరుమలరాజు, వేంకటాద్రిరాజు, గుత్తి, కందనవోలు, రాజ్యములను ఏలుచుండిరి. ఆతని పినతండ్రులలో తిమ్మరాజు అవుకు రాజ్యమునకును, కొండరాజు ఆదవాని రాజ్యమునకును అధిపతులుగ నుండిరి. గండికోట పెమ్మసాని తిమ్మానాయకుడు, అనంతపురము హండె హనుమప్పనాయకుడు, నడిమిదొడ్డిపాలెము మెసా పెద్దానాయకుడు, ఆతని చెప్పుచేతలలోనివారు. వీరి సాయముతో రామరాయలు అచ్యుతుని చెరగొనెను. తిరుమలదేవియు చిన్నాదేవియు (శ్రీకృష్ణరాయని భార్యలు) రామరాయల పట్టాభిషేకమునకు సన్నాహములొనర్చిరి. కాని సలకరాజు తిరుమలయ్య అతని పట్టాభిషేక విపర్యయ మొనరించి, అచ్యుతుని బంధవిముక్తుని గావించి సింహాసనమున ఆతనిని పునః ప్రతిష్ఠించెను. ఈ పరిస్థితులలో విజయనగరముపై దండెత్తివచ్చి, స్వదేశమున విప్లవము చెలరేగుటచే వెంటనే మరలిపోవుచున్న ఆదిల్‌షా అచ్యుతరాయ రామరాజుల నడుమ ఒడంబడికను కుదిర్చెను. దాని ననుసరించి రామరాజు తన జాగీరును స్వతంత్రముగ నేలుకొనుటకు అచ్యుతరాయలు సమ్మతించెను.

**రామరాయలు, సలకము తిరుమలయ్య :** అచ్యుతరాయల అనంతరము (1542) ఆతని కుమారుడు వేంకటపతిరాయలు సార్వభౌముడయ్యెను. అతడు బాలుడైనందున అధికారము సలకము తిరుమలుని హస్తగతమయ్యెను. దుర్మార్గుడగు తిరుమలయ్య సింహాసనమును ఆక్రమింప యత్నించుటను గ్రహించి సార్వభౌముని తల్లియగు వరదాంబిక, ఆదిల్‌షాయొక్క సహాయమును అర్థించెను. ఈలోగా అచ్యుతరాయల అన్నకుమారుడును, గుత్తి దుర్గమున బందీగా నున్నవాడును అగు సదాశివరాయలను సార్వభౌమునిగా ప్రకటించి రామరాయలు కూడ ఆదిల్‌షా సహాయమును కోరెను. ఇట్లు ఇరుపక్షముల ప్రార్థనలను అంగీకరించి ఆదిల్‌షా దండెత్తివచ్చెను. అట్టి ఆదిల్‌షాను ఓడించి పారద్రోలి వేంకటపతి

రాయలను సకుటుంబముగ తుదముట్టించి, భయభ్రాంతులైన ప్రజలను ఒడబరచి సలకము తిరుమలయ్య విజయనగర సింహాసన మధిష్ఠించెను. నానాటికి అతని దౌష్ట్యములు మితిమీరుటచే ప్రజలు ఆదిల్‌షాను ఆహ్వానించిరి. కాని అతడు తన దురహంకారముచే ప్రజల అభిమానమును గోల్పోయి ప్రాణభీతితో తన రాజ్యమునకు పారిపోయెను. ఇట్టి పరిస్థితులలో తిరుమలయ్యయొక్క దుష్ట పరిపాలనమును తుదముట్టించి, దేశమున శాంతి భద్రతలను నెలకొల్పుము అని ప్రజలు అనేకవిధముల రామరాయలను ప్రార్థించిరి. రామరాయలుగూడ ఇట్టి తరుణమునకై వేచియుండెను. అందుచేత తన పక్షమువారిని కూర్చుకొని విజయనగరమునకు సరియైన పెనుగొండను వశపరచుకొని అటనుండి బయలుదేరి కోమలి, బేతంచర్ల, జూటూరు, బెడగల్లు, ఆదవాని యుద్ధములందు తిరుమలయ్యను ఓడించి తుద కాతనిని మిత్రబృందముతో తుంగభద్రానదీతీరమునవధించి విజయగర్వముతో రామరాయలు విజయనగరమును ప్రవేశించెను. సదాశివరాయలు పట్టాభిషేకమహోత్సవ మత్యంతవైభవముగ జరిగెను (1543).

రామరాయలు, సదాశివరాయలు : సదాశివరాయలు పేరునకుమాత్రమే సార్వభౌముడు, ప్రభుత్వభారమంతయు రామరాయలే వహించెను. మొట్టమొదట దండనాథుడుగ నున్న రామరాజు క్రమముగ సర్వాధికారి అయ్యెననియు, రాజాధిరాజ, రాజపరమేశ్వర, వీరప్రతాప మహారాజాది సార్వభౌమోచిత బిరుదములను ధరించెననియు, యువరాజపదమునుగూడ బడసెననియు స్థానిక చరిత్రలు నుడువుచున్నవి. చివరకు సదాశివరాయలను చెరసాలలోనుంచి సంవత్సరమున కొకమారు మాత్రము అతనిని ప్రజలకు ప్రదర్శించి, సార్వభౌమోచిత మర్యాద లొనర్చుచుండెను అనికూడ తెలియుచున్నది.

సదాశివరాయల పట్టాభిషేకానంతరము రామరాజు తనకు శత్రువులైనవారిని తొలగించి, తన అధికారమును బలపరచుకొనెను. అతని అధికారవ్యామోహమును నిరసించుటచే గాబోలు, నాటివరకును విజయనగర సామ్రాజ్యమును భక్తివిశ్వాసములతో కొలుచుచుండిన సాళువాది వంశములు పదచ్యుతినందెను. స్వార్థపరుడై రామరాజు అనుసరించిన ఈ ఆంతరంగిక విధానము, అరవీటి వంశస్థాపనకు సుగమమార్గ మేర్పరచినను, అది విజయనగర సామ్రాజ్యపు పునాదులను భేదించివైచెను.

రాజధానిలో తన మార్గము నిష్కంటకమైన వెంటనే రామరాయలు దక్షిణదేశమున ప్రబలిన అశాంతి నడచుటకు నిర్ణయించెను. ఈ కాలమున దక్షిణదేశమున స్థానిక ప్రభువులతోబాటు పోర్చుగీసువారుకూడ అల్లరులకు కారకులైరి. పోర్చుగీసువారు మతప్రచార మొనర్చుటయే గాక, దేవాలయములను పడగొట్టి చర్చిలను నిర్మింపసాగిరి. చోరమండలతీరమందలి పల్లెవాండ్రకు కిరస్తాని మత మొసగి వారిని విజయనగరాధీశులపై దుండగములకై పురికొల్పుచుండిరి. రామేశ్వరమున కేగు యాత్రాపరులను అనేకవిధములైన హింసలకు గురిచేయుచుండిరి. సుప్రసిద్ధములయిన తిరుపతి, కాంచీనగరము మున్నగు హైందవ క్షేత్రములనుగూడ కొల్లగొట్టుటకు ప్రయత్నించిరి (1545). అందుచేత వారి దుష్కృత్యములను మాన్పుట అత్యావసరమై యుండెను. రామరాజు ఇది గ్రహించి చిన తిమ్మరాజు, విఠలరాజు అను సోదరులను దక్షిణదేశదండయాత్రకు పంపెను. వీరు మధుర, తంజావూరు, నాయకుల సహాయముతో తన్నరసునాడు, టూటికొరన్, తిరువాడి రాజ్యములందు తిరుగుబాటుల నణచి కన్యాకుమారికడ విజయస్తంభమును ప్రతిష్ఠించిరి. పోర్చుగీసువారి దుండగములు తగ్గెను, 1546 లో పోర్చుగీసు గవర్నరయిన డకాస్ట్రో రామరాయలతో సంధి గావించుకొనెను. కాని రామరాయలు పోర్చుగీసువారిని విశ్వసింపక 1548 లో తాను సెయింటు థోమ్‌పై దండెత్తి విఠలరాజును గోవాపైకి పంపెను. పోర్చుగీసువారు ఓడిపోయి రాయలకు కప్పము చెల్లించిరి.

రామరాయలు, మహమ్మదీయులు : రామరాయలు మహమ్మదీయులపట్ల అనుసరించిన రాజనీతి విచిత్రమైనది. హిందూమతవిధ్వంసమే మహమ్మదీయుల ఆశయమనియు వారిని అరికట్టుటకును, హిందూధర్మములను రక్షించుటకును విజయనగర సామ్రాజ్యము వెలిసెను అను సత్యమును రామరాయలు విస్మరించినట్లు కన్పించును. తన్నెదిరించిన హిందూసర్దారులపై ప్రతీకారమునకో అనునట్లు తన కొలువున ముస్లిము ఉద్యోగుల సంఖ్యను ఇతడు పెంచెను. ఐన్ - ఉల్ - ముల్కులవంటివారు ఉన్నత

పదవులంది విజయనగర సైనికబలమును, రక్షణను గురించిన విశేషములను గ్రహింపగలిగిరి. విజయనగర, బహమనీ రాజ్యములమధ్య యుద్ధము సంభవించిన క్లిష్టసమయములందు ఈ మహమ్మదీయులు విశ్వాసఘాతకులగుదురనియైన రామరాయలు ఊహింపకపోవుట అనర్థదాయకమయ్యెను. అదియునుగాక డక్కనుసుల్తానుల అంతఃకలహములందు జోక్యముకలిగించుకొని రామరాయలు ఒకరిపైనొకరిని రెచ్చగొట్టి, అందరిని తానోడించుటయేగాక విజయనగరమునకు అగ్రస్థానమును సాధింపగల్గెను. ఈ విషయమున రామరాయలు చాలవరకు కృష్ణరాయల అడుగుజాడలలోనే నడచెను, కాని ఆవిధానమును చరమస్థానమునకు కొనిపోయి, సుల్తానులకు విజయనగరము నందు అసూయాద్వేషములను వారిలో వారికి ఐకమత్యమును పెంపొందించెను. రామరాయల జోక్యము వలన సుల్తానులలో కలిగిన నూతన చైతన్యమే రాక్షసి-తంగడి యుద్ధమునకు దారితీసెను. ఈ ఘోర సంగ్రామమునకు రామరాయలు మహమ్మదీయమతముపై చూపిన ద్వేషమే కారణమని ఫెరిస్తావంటి ముస్లిము చరిత్రకారులు వ్రాసినవ్రాతలు విశ్వసింపదగవు. రామరాయలు మహమ్మదీయులను అత్యంత గౌరవముతో చూచెను. తన సోదరుడయిన జంషీద్‌షాకు భయపడి శరణుచొచ్చిన మాలిక్ ఇబ్రహీమునకు ఆశ్రయ మొసగి అతనికి జాగీరు ఇచ్చుటయేగాక (1548-1550), జంషీదుమరణానంతరము అతడు గోల్కొండ సుల్తాను అగుటకు రామరాయలు చేసిన ఉపకారము అమూల్యమయినది. బీజపూరు సుల్తానయిన ఆలీఆదిల్‌షాను రామరాయలు పుత్రసమానముగా ప్రేమించెను. అతనిని అనేక పర్యాయములు రక్షించెను. తన ఆస్థానమునందలి మహమ్మదీయుల మతవిశ్వాసములను ఏ మాత్రము అతడు తృణీకరింపలేదు. వారు కాఫరునకు నమస్కరింప రని తెలిసికొని, రామరాయలు తన సింహాసనముపై కొరానుయొక్క ప్రతిని ఉంచుకొనెడివాడట! అందుచే రాయల మతద్వేషముగాక, హిందూ మహమ్మదీయుల మధ్యగల సహజద్వేషమే, విజయనగర అధికారవైభవాభివృద్ధి, సుల్తానులలో కలిగించిన భయోద్రేకములే, రాక్షసి-తంగడి యుద్ధమునకు కారణములు అనుట నిస్సంశయము.

మొట్టమొదట 1548 లో రామరాయలు నిజాంషాతో (అహమ్మదు నగరము) చేరి ఇబ్రహీంఆదిల్‌షా (బీజపూరు)తో పోరాడెను. ఇబ్రహీం సంధిచేసికొని యుద్ధము నుండి విరమించెను. 1556 లో అహమ్మదునగరు, గోల్కొండ సుల్తానులు కలిసి బీజపూరుపై దండెత్తి, గుల్బర్గాను ముట్టడించిరి. ఇబ్రహీం ప్రార్థనపై రామరాయలు జోక్యము కలిగించుకొని సుల్తానులమధ్య సంధికుదిర్చి యుద్ధమును మాన్పెను. ఇబ్రహీం మరణానంతరము అతని కుమారు డయిన ఆలీ అదిల్‌షా, బీజపూరు సింహాసన మెక్కెను. ఆలీ బాలుడగుట సదవకాశముగా గ్రహించి నిజాంషా బీజపూరుపై దండెత్తెను. ఆలీ విజయనగరమునకు పారిపోయి రామరాయల సహాయము అర్థించెను. కుతుబ్‌షాను (గోల్కొండ) కూడ గట్టుకొని రాయలు నిజాంషాపై దండెత్తి దౌలతాబాదువరకును సేనలను నడిపించెను. నిజాంషా పరాజయమంది, కల్యాణిదుర్గమును ఆలీ అదిల్‌షా కొసగి సంధిచేసికొనెను.

రామరాయల విజయ పరంపరలు, గోల్కొండ సుల్తానైన ఇబ్రహీం కుతుబ్‌షాలో అసూయాద్వేషములను ప్రజ్వలింప జేసెను. రామరాయలు తన కొనర్చిన మహోపకారమును గూడ విస్మరించి అతని తుదముట్టించుటకై ఇబ్రహీం కుతుబ్‌షా ప్రయత్నింపసాగెను. పై యుద్ధమున రాయలు అహమ్మదు నగరమును ముట్టడించు సందర్భమున కుతుబ్‌షా రహస్యముగ నిజాంషాతో సంధిచేసికొని దుర్గరక్షకులకు సహాయ మొనరించెను. అదియునుగాక, కొండపల్లి దుర్గము నొసగుదు నని రాయలను నిజాంషాతో సంధి కొడబరచెను. కాని ఆవాగ్దానమును మన్నింపలేదు. రామరాయలుగూడ కుతుబ్‌షాపై తిరుగుబా టొనరించిన జగదేవరావునకు ఆశ్రయ మొసగి అతని ఆగ్రహమును రెచ్చగొట్టెను. అందుచే కుతుబ్‌షా నిజాంషాతో సంధిచేసికొని తన కుమార్తెను అతని కొసగుటకు నిర్ణయించెను. ఈ వివాహము కల్యాణదుర్గమున జేయవలె నని కుతుబ్‌షా నిజాంషాలు 1558 లో కల్యాణిని ముట్టడించిరి.

ఆదిల్‌షా, బరీదుషా (బీదరు) లతో కలిసి రామరాయలు కుతుబ్‌షా, నిజాంషాలతో యుద్ధమునకు

దిగెను. తన తమ్ముడైన వేంకటాద్రిని గోల్కొండపైకి బంపి రామరాయలు కల్యాణిపై సేనలను నడిపించెను. ఇది విని నైజాంషా, కుతుబ్‌షాలు ముట్టడిని విరమించి తమతమ రాజ్యముల కేగిరి. రాయలు అహమ్మదు నగరము వరకు నేగి, నిజాంషా తన ఆధిపత్యమును అంగీకరించున ట్లొనరించి గోల్కొండపైకి మరలెను. ఇంతలో రాయలు ఆజ్ఞపై కొండవీటి ప్రభువైన సిద్ధి రాజు, తిమ్మరాజు, కొండపల్లి, మచిలీపట్టణములమీదను, వేదాద్రి, సీతాపతు (చిత్తాపఖాను) లు ఏలూరు, రాజ మహేంద్రవరములమీదను దండెత్తిరి. ఇట్లు తనరాజ్యము నాలుగు మూలలపై శత్రువులు దండెత్తుటను కుతుబ్‌షా గమనించి రాయలదృష్టి మరలించుటకు కొండవీటిపై దండయాత్రకు ఉద్యమించెను. కాని గోల్కొండ సైన్యమును ఓడించి తరుముచు యెరతిమ్మరాజు, వెలుగోటి చిన తిమ్మరాజు అనువారు దేవరకొండ, దేవులపల్లి, నల్లగొండ, ఇంద్రకొండ మున్నగు దుర్గములను ఆక్ర మించిరి. కోవిలకొండ, పానగల్లు, గణపురము రాయల స్వాధీనమయ్యెను. గత్యంతరములేక కుతుబ్‌షా రాయలకు గణపురమును, పానగల్లును ఒసగి ఆతనితో సంధి చేసికొనెను.

ఈ విధముగ దక్కను సుల్తానులందరును రామరాయల శౌర్య పరాక్రమములకు దోసిలొగ్గి, ఆతని ఆధిపత్యమును అంగీకరింపవలసినవారైరి. దక్షిణ రాజకీయములందు ఆతనిక త్తికి ఎదురుకత్తి లేకుండెను. కాని ఈమహోత్కృష్ట బలగౌరవములే విజయనగర సామ్రాజ్యపతనహేతువులు అయ్యెను. రామరాయల విశృంఖల వీరవిహారములను అరికట్టనిచో తమకు ముప్పుతప్పదనియు, దినదినాభివృద్ధిని పొందుచున్న విజయనగర సామ్రాజ్యము తమరాజ్యములను కబళింపగలదనియు, దక్కను సుల్తానులు భయపడి పరస్పర విద్వేషములను మాని హుస్సేన్ నిజాంషా, ఇబ్రహీంకుతుబ్‌షాల ప్రోత్సాహముతో, ఒకకూటమిగా ఏర్పడిరి. ఆలీఆదిల్‌షాకూడ కృతఘ్నుడై వారితో కలిసెను.

**రాక్షసి - తంగడియుద్ధము : 1565 :-** సుల్తానులకూటమి రామరాయలపై యుద్ధమును ప్రకటించి దండెత్తివచ్చెను. రాయలు ఆ వర్తమానమును విని అపారసైన్యముతో వారినెదుర్కొనెను. కృష్ణానదికి దక్షిణమున 10 మైళ్ళ దూరమునందున్న రాక్షసి - తంగడి అను గ్రామములకు మధ్యనున్న మైదానముపై ఉభయసైన్యములును తారసిల్లెను. 1564 డిశెంబరు 26 నుండి 1565 జనవరి 24 వరకు యుద్ధము జరిగెను. దీనినే తళ్ళికోట యుద్ధమని సాధారణముగ వ్యవహరింతురు. రామరాజు వృద్ధుడైనను యుద్ధభూమిలో వీరవిహార మొనరించి, సైనికులలో ధైర్యోత్సాహములను ఇనుమడింప జేసెను. ప్రథమమున విజయలక్ష్మి రాయలనే వరించెను. నిజాంషా, కుతుబ్‌షాలు యుద్ధభూమి నుండి సుమారు ఇరువది మైళ్ళు వెనుకకునడచి, మాయోపాయమున రామరాయలను జయించుతలంపుతో, సంధికై సంప్రతింపులు ప్రారంభించిరి. విజయనగర సైన్యములు ఈ మోసమును గ్రహింపక విజయగర్వముతో శిబిరరక్షణ విషయమున ఏమరియుండిరి. ఇంతలో రామరాయల పక్షమందలి మహమ్మదీయ సర్దారు లిద్దరు సుల్తానులతో చేరిరి. తుదకొక అర్ధరాత్రమున మహమ్మదీయులు విజయనగర సైన్యముపై బడిరి. హిందువులు ధైర్యసాహసములతో పోరాడిరి కాని. లాభము లేకపోయెను. రామరాయలు పట్టుబడి నైజాంషాచేత వధింపబడెను. మహమ్మదీయులు భయభ్రాంతులైన హిందూ సైనికులను చుట్టుముట్టి వధించిరి. అనాయకమై, రక్షణరహితమైన విజయనగరము మహమ్మదీయులకు వశమై నామరూపములు లేకుండ ధ్వంసము చేయబడెను. ప్రపంచమున సాటిలేనిదని కీర్తి నార్జించిన మహానగరము రామరాజు మరణముతో హఠాత్పరిణామమును బొంది శ్మశానముగ మారిపోయెను.

**రామరాజుకుటుంబము :** రామరాజునకు నలుగురు భార్యలుండిరి. అందు కృష్ణరాయల కుమార్తెయగు తిరుమలాంబ అగ్రమహిషియై యుండెను. జిల్లేళ్ళ పెదనంది రాజయ్య - దేవమహారాజు పుత్రికయగు అప్పలాంబయు, పోచిరాజు తిమ్మరాజయ్య కుమార్తెలయిన కొండమ్మ, లక్ష్మమ్మలును, ఇతర భార్యలు. రామరాయలకు కృష్ణరాజు, పెదతిమ్మరాజు, కొండరాజు అనుకుమారులుండిరి. రాయలతోపాటు వీరు సుల్తానులతో జరిగిన యుద్ధములందు పాల్గొనిరి. రాక్షసి - తంగడి యుద్ధానంతరము పెదతిమ్మరాజు విజయనగరమున అధికారము

వహించుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను. రాయల సోదరులలో తిరుమలుడు, వెంకటాద్రి అనువారు సుప్రసిద్ధులు. నిజాంషా, కుతుబ్‌షాలతోటి యుద్ధములందు అసహాయశూరుడని పేరువడసిన వెంకటాద్రి, రాక్షసి - తంగడియుద్ధమున వీరస్వర్గ మలంకరించెను. ఆ యుద్ధానంతరము, తిరుమలరాయలు చంద్రగిరిలో ఆరవీటి వంశమును స్థాపించి, జీర్ణకర్ణాట సామ్రాజ్య పునరుద్ధరణమునకు పూనుకొనెను,

**రామరాయలు - భాషాపోషణ:** రామరాయలు పరాక్రమవంతుడు, రాజతంత్రజ్ఞుడు, ధర్మతత్పరుడు, విష్ణుభక్తియుతుడు. అతడు అనేక దేవాలయములను కట్టించి పోషించెను. అగ్రహారము లొసగి వేదవేదాంగవిదులైన బ్రాహ్మణులను గౌరవించెను. అతనిలో మతసహనము మూర్తీభవించెను.

రామరాయలు సంస్కృతాంధ్రములందు పండితుడు. సంస్కృతాంధ్రకవులను పోషించెను. మాధ్వమత బోధకులైన విజయేంద్రస్వాములవారు రాయలవలన అగ్రహారములను బడసెను. అహోబిల మఠాధీశు లయిన షష్ఠపరాంకుశులు రాయలకు కార్యకర్తలుగానుండి సిద్ధాంతమణిదీప, ప్రపత్తియోగ, నృసింహస్తవాది గ్రంథములను రచించిరి. రాయల ఆస్థానకవులలో సుప్రసిద్ధుడు రామరాజభూషణుడు. రామరాజు ఆస్థానమునకు భూషణమువంటి వాడగుటచే అతనికి ఆపేరు వచ్చియుండును. పదకవిత్వప్రసిద్ధులయిన తాళ్ళపాక తిరుమలయ్యయు, అతని కుమారుడయిన తిరువెంగళనాథయ్యయు రాయలచే ఆదరింపబడిరి.

నానా కళాపారీణుడైనను రామరాయలు సంగీతమునందు ప్రత్యేకాభిమాన - అభినివేశములు గలవాడు. అతని మంత్రియైన రామయామాత్యుడు సంస్కృతమున "స్వరమేళకళానిధి" అను సంగీతశాస్త్రగ్రంథమును రచించి, రామరాయలకు అంకితము చేసెను.

బి. యస్. యల్. హ.



**ఆంగ్లభాషాసాహిత్యములు :- 1. భాష :** భాష మానవుని ఆంతరంగిక జీవితముతో సన్నిహిత సంబంధము కలది. మన భావములు, కోరికలు, అనుభవములు సమస్తము శబ్దజాలముద్వారా వెలిపుచ్చ కలుగుచున్నాము. ఈ శబ్ద సముదాయముచే ఏర్పడిన భాషమీద సంపూర్ణమయిన అధికారము కలిగియుండుట మానవుని మహాశక్తులలో ఒకటి. భాషమీద అధికారము సంపాదించినపుడు ఆ భాషను సద్వినియోగపరచి మానవుని జీవితమునందలి పరమపవిత్ర సత్యసుందర విధానముల వ్యాప్తికొరకై దాని నుపయోగించు సద్బుద్ధికూడ మానవునకు ఉండవలెను. భాషను సక్రమముగా నియమబద్ధముగా వాడుట నేర్చినపుడే భావమునందుగూడ స్పష్టత, సరళత, సార్థకత ఏర్పడగలవు. భావములను సుస్పష్టముగా విశదపరచుటకై ఉపయోగ పడుటయే భాషకు సార్థక్యము.

భాష సజీవమయిన వస్తువు. మానవుల జీవితము మనస్తత్వము మారుచు పెరుగుచుండుకొలది భాషకూడ మారుచుండును, పెరుగుచుండును. భాషకును, భావమునకును యిట్టి విడదీయరాని అన్యోన్య సంబంధము కలదు.

అంగ్లభాష ఆర్యభాషా కుటుంబమునకు చెందినది. ప్రథమమున వేరువేరు భాషలు ప్రచారమునం దుండెను. వెస్సెక్సుప్రాంతీయభాష కొంత కాలమునకుప్రాధాన్యము కాంచెను. డేన్సు అనువారు ఇంగ్లాండుపై దాడిచేసిన కారణముచే ఏర్పడినవారి సంపర్కముచేత నూతన శబ్దజాలము అంగ్లభాషలోనికి వచ్చిపడెను. నార్మనులు ఇంగ్లాండును జయించిన తరువాత ఇంగ్లీషుభాషయొక్క ప్రాధాన్యము తగ్గుటయు, నార్మనుభాష ప్రచారములోనికి వచ్చుటయు తటస్థించెను. 1204 వ సంవత్సరములో ఇంగ్లాండుకును, నార్మండికిని సంబంధము తెగినతరువాత నార్మనుభాషకు ప్రాధాన్యముతగ్గి ఇంగ్లీషు మరల ప్రధానస్థాన మాక్రమించుకొనెను. 1349 వ సంవత్సరమున అన్ని పాఠశాలలలోను నార్మనుభాష అంతరించి ఇంగ్లీషు వాడుకలోనికి వచ్చెను. 1362 లో న్యాయస్థానములయందు నార్మనుభాష వాడరాదనియు ఇంగ్లీషు భాషనే

వాడవలయు ననియు శాసన మేర్పడెను. 15 వ శతాబ్దమునందలి కడపటి దశలో అనేకము లయిన మార్పులు కలిగెను. కాక్సటన్ ఇంగ్లాండులో ముద్రణ విధానమును ప్రవేశపెట్టెను. పాశ్చాత్యులు అమెరికా ఖండమును కనుగొనిరి. గుడ్ హోప్ అగ్రముద్వారా ఆసియాకు నూతన మార్గము కనుగొనబడెను. నేడు ప్రపంచమున విశేషముగా వాడుకలోనున్న ఆంగ్లభాష యొక్క స్వరూప నిర్ణయము 16 వ శతాబ్ది ప్రారంభముననే జరిగెను. లండను, ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి అను తావులలో వాడబడుచు ఛాసరు, విక్లిఫ్ అను ఇరువురచే తమ గ్రంథములయందు వాడబడిన భాషయే ఆంగ్లేయుల రాజభాషగా ఏర్పడెను. ఆంగ్లేయుల జీవితములో ఈ సమయమున నూతన భావసంచలనము బయలుదేరెను. ప్లూటార్క్ అను కవి వ్రాసిన 'మహాపురుషుల జీవితములు' అను గ్రంథమునకు నార్తు అనునాతడు రచించిన అనువాదము, బైబిలుగ్రంథమునకు ప్రభుత్వమువారి ఆమోదముతో రచింపబడిన అనువాదము, "సామాన్య ప్రార్థనాపుస్తకము" (Common Prayer Book) - ఇవన్నియు వెలసెను. నూతన భావమును ప్రకాశము చేయుటకు ఉపకరించునట్లుగా ఆంగ్లభాష బహువిధముల సంస్కరింపబడెను. అచ్చుయంత్రముల రాకచే, భాషకు ఒక స్థిరరూపము చేకూరెను. ప్రాంతీయ భాషా (Dialects) ప్రచారముతగ్గి రాజభాషాప్రచారము వ్యాపించెను. లండను నగరప్రాంతమున విద్యాగంధము గల కుటుంబములలో నిత్యము వాడుకయందున్న భాషయే రాజభాషగా ఏర్పడెను.

ఇట్టి ఆంగ్లభాష కలితిలేని భాషకాదు. అనేకభాషల నుండి శబ్దజాలమును ఆంగ్లేయులు గ్రహించి తమభాషలో జీర్ణింపచేసికొనిరి. దేశముమీదికి దండెత్తివచ్చిన విజాతీయులవలనను, వాణిజ్యాది అవసరములనుబట్టి యితరదేశములకు ప్రయాణమొనర్చి తిరిగివచ్చిన ఆంగ్లేయులవలనను అన్యభాషామిశ్రమము ఏర్పడెను. అనవసరములైన ప్రత్యయములను విసర్జించి, భాషను సరళముగా చేసిరి. ఉచ్చారణ సులభసాధ్య మయ్యెను. అన్యభాషలనుండి వేరువేరు శబ్దములు గ్రహింపబడెను. సముద్రమునకు నౌకాయానమునకు సంబంధించిన శబ్దములు గ్రీకు, డచ్చి, డేనిషు భాషలనుండియు; ఆహారము, వంటపాత్రలు, దుస్తులు, గృహసంబంధమైన సామానులు మున్నగువానికి చెందిన శబ్దములు ఫ్రెంచిభాషనుండియు; దేవాదాయ, ధర్మాదాయ విషయములకు సంబంధించిన పదజాలము, శాసనవిషయములకు చెందిన శబ్దములు లేటిను (Latin) భాషనుండియు; వాణిజ్యమునకు వ్యాపారమునకు సంబంధించిన శబ్దములు 'స్పానిష్' భాష నుండియు; లలితకళలకు సంబంధించిన శబ్దజాలము "ఇటాలియన్" భాషనుండియు; రాజ్యాంగవిధానమునకు చెందిన శబ్దములు 'గ్రీకు' భాషనుండియు; పౌరసత్వ సంబంధమైన శబ్దములు 'రోమను' భాషనుండియు ఆంగ్ల భాషలోనికి స్వీకరింపబడెను. భాషాసాంకర్యము ఏర్పడును అను భయముచే మడికట్టుకొని కూర్చుండక, వివిధ భాషలనుండి శబ్ద సముదాయమును స్వీకరించి, భాషను పటిష్ఠత, వైశాల్యము కలదానినిగా చేసికొనిరి.

ఆంగ్లేయులలోనే ఎందరోకవులు గ్రంథకర్తలు నూతన శబ్దజాలము సృష్టించి భాషాసంపదను పెంపొందించిరి. అట్టివారిలో ప్రథముడు 'ఆచార్య జాన్సన్'. సంఘ మర్యాదలకు చెందిన పదములను చెస్టరుఫీల్డు, ఆధ్యాత్మికతకు చెందిన మాటలను షెల్లీ మహాకవి, రాజకీయనిర్మాణము, ప్రాతినిధ్యము, వలసరాజ్యవిధానము, రాజ్యతంత్రము-మున్నగువాటికి సంబంధించినపదములను బర్కు, మెకాలే అను మహారాజ్యాంగవేత్తలు, వేదాంతవిషయకములైన మాటలను 'కోల్రిడ్జి' అను మహాకవియు, తీవ్ర సాంఘిక విమర్శన కవసరమైన పదజాలమును 'కార్లైలు' మహర్షియు, ఈశ్వర ప్రతిభా ప్రకాశములకు చెందిన మాటలను 'మిల్టను' కవిరాజును, విజ్ఞానశాస్త్రములకు సంబంధించిన శబ్దములు ఆయా విజ్ఞానవేత్తలును ఇంకను ఇండియా, మలయా, పర్షియా, చైనా, జపాను, ఈజిప్టు మున్నగు నాగరకదేశములయందు సంచారముచేసిన ఆంగ్లేయులును అనేక మార్గములచే భాషాసంపదను పెంపొందించిరి. "No one of the modern languages has acquired a greater force and strength than the English through the derangement and relinquishment of its ancient laws of sound. The unteachable profusion of its middle tones has conferred upon it an intrinsic power of expression such as

no other human tongue has ever possessed. Its entire, thoroughly intellectual, and wonderfully successful foundation and perfected development issued from a marvellous union of the two noblest tongues of Europe, the Germanic and Roman; their mutual relation in the English language is well known since the former furnished chiefly the material basis, which the latter added the intellectual conceptions. The English language, by and through which the gratest and most eminent poet of modern times—as contrasted with ancient classical poetry was begotten and nourished, has a just claim to be called the language of the world, and it appears to be destined, like the English race, to a higher and broader sway in all the quarters of the earth, for in richness, in compact adjustment of parts, and in pure intelligence, none of the living languages can be compared with it." అని సుప్రసిద్ధ భాషావేత్తయైన 'జాకబ్ గ్రిమ్' అనునతడు వాక్రుచ్చినాడు. "That exquisite amalgam and shining mosaic of Anglo-Saxon, Danish, Greek, Latin, Dutch and French words and idioms which makes our language—the speach of shakespeare—the most composite, varied, eloquent, and in many ways the most beautiful form of human utterance" అని పియర్సాల్ స్మిత్తు ప్రవచించియుండెను. భాషయొక్క ఆంతరంగికనిర్మాణమునందు సంస్కరణములు చేయుటచేతను భాషలోనికి బాహ్యము నుండి నూతన శబ్దజాలమును చొప్పించి భాషా సంపద్ధను వృద్ధిపొందించుటచేతను, ఆంగ్లభాష మానవకోటి యుపయోగించు సమస్త భాషలలోను సంపన్నమయినదిగా, విశాలమయినదిగా, ఉద్వేగముకలదిగా మానవ హృదయమునందలి అతిక్లిష్టమైనవృత్తులను కూడవ్యక్తము చేయుశక్తికలదిగా వృద్ధిపొందినది. ఇది యావత్ప్రపంచమునందును వాడబడుచు, అన్ని విశ్వవిద్యాలయములలోను అభ్యసింపబడుటయేగాక, ఐక్యరాజ్యసమితి యందలి వివిధ రాజకీయ సంప్రదింపులను ప్రకటించుటకు గూడ ఉపయోగింపబడుచున్నది. 1928 సం.మున ఆంగ్లభాషకు సమగ్రమైన నిఘంటువును ఏర్పరచునుద్దేశముతో 50 సంవత్సరముల కృషిఫలితముగా 'ది ఆక్స్ఫర్డ్ డిక్షనరి' అను మహా నిఘంటువును డా. ముర్రే ప్రధానుడుగా గల సంపాదకీయవర్గమువారు ప్రకటించిరి. వెనువెంటనే యీ యేబది వత్సరములలో గలిగిన అర్థవిశేషములను, ప్రవేశించిన నూతన శబ్దములను నిర్వచించుటకు ఒక అనుబంధసంపుటము కూడ ప్రచురించిరను విషయమును జ్ఞప్తికి తెచ్చుకొనినప్పుడు, భాషయన్నది ఎంత సజీవమో, ఎంత త్వరితగతితో మారుచు పెరుగుచుండు స్వభావము కలదో, మనము గ్రహింపగలము. ఈ విధముగా సర్వప్రపంచవ్యాప్తమై పటిష్ఠమయిన ఆంగ్లభాషలోనికి యావత్ప్రపంచభాషలలోని సాహిత్యసంపదను తర్జుమా చేసి రనిన ఆంగ్లభాషాసాహిత్యముల యొక్క సమగ్రత మనకు సంపూర్ణముగా గ్రాహ్యమగును.

2. సాహిత్యము: ఏభాషయందైనను ప్రాథమికదశయందలి సాహిత్యము అక్షరరూపమున లిఖితముగాక మానవుల స్మృతివీధులందే నివసించియుండును. ఆంగ్లభాషయందుగూడ ఆస్థితియే కాననగును. ఈ భాషయందు అత్యంత పురాతనమైన ప్రథమకావ్యము 'బియోవుల్ఫ్' అను పద్యకావ్యము. ఏ ఆరవశతాబ్దమునందో కథ ప్రారంభమైయున్నను అది ఏడవశతాబ్దమునందు లిఖిత గ్రంథముగా రూపొందినది. 670 ప్రాంతమున 'కాడ్మన్' అనునతడు బైబిలు కథను పద్యకావ్యముగా రచించెను. 700 ప్రాంతమున 'బీడ్' అను వృద్ధపండితుడు 'ఎక్లిషియాస్టికల్ హిస్టరి' అను గ్రంథమును, ప్రవక్తయైన జాను (St. John) వ్రాసిన సువార్తకు అనువాదమును రచించెను. కాని "ఆల్ఫ్రెడ్ మహారాజు" తాను స్వయముగా గ్రంథములను రచించియు, ఇతరులను రచింప ప్రోత్సహించియు, సాహిత్యసేవ అపారముగా చేసెను. 9 వ శతాబ్ది మధ్యమున ప్రారంభమై 12 వ శతాబ్ది మధ్యవరకును వ్రాయబడుచు వచ్చిన సాక్షను చరిత్ర యందుగూడ కొంత ఆల్ఫ్రెడ్ వ్రాసియుండెను. మొత్తముమీద 14 వ శతాబ్దమువరకును అనువాద

వాఙ్మయమే ఎక్కువగా ఏర్పడినట్లు కానవచ్చుచున్నది.

14 వ. శతాబ్దమునందు సాక్సను, నార్మను భాషలు రెంటును మిశితముచేసి ఆంగ్లభాషగా రూపొందించిరి. 'సర్ జాన్ మాండెవిల్' అనునతడు తన యాత్రలను గురించి యొక చరిత్రను రచించెను, ఇది ప్రథమవచన గ్రంథమై యున్నది. ధర్మసంస్కర్తయైన 'విక్లిఫు' కొంత గద్యరచన సాగించెను.

నవయుగ సాహిత్యమునందు మొదటి గొప్పకవి 'ఛాసరు'. అతడు పండితుడుగా, సిపాయిగా, రాజ్యాంగవేత్తగా, రాయబారిగా యూరపునందు అనేక ప్రాంతములందు ముఖ్యముగా ఇటలీదేశమునందు విశేషసంచారము సలిపి అధికమైన లోకజ్ఞానమును సంపాదించెను. అతడు వ్రాసిన 'కాంటర్బరీ కథలు' అనేకకారణములచే సుప్రసిద్ధ గ్రంథముగా పరిగణింపబడుచున్నది. ఆనాటి ఆంగ్లేయుల జీవితము, వారి ఆచారములు, అభిప్రాయములు, విశ్వాసములు, వారి వేషభాషలు అన్నియు అద్దమునందువలె ఇందు మనకు స్పష్టముగా గోచరమగుచుండును. ఆంగ్లపద్యవాఙ్మయమునకు పదిమాత్రల పంక్తిని పునాదిగా వేసినది ఈతడె. 15 వ శతాబ్దపు చివరిభాగమున మొదటి అచ్చుయంత్రమును స్థాపించి 'కాక్సటన్' అచ్చువేసి ప్రకటించిన 64 గ్రంథములలో మాలరీ వ్రాసిన 'మార్ట్ డీ ఆర్థర్' అను గ్రంథమును, ఛాసర్ వ్రాసిన 'కాంటర్బరీ కథలును' కలవు. 16 వ శతాబ్దమునందు వైయట్, సర్రే అను నిద్దరు సుప్రసిద్ధకవులు అగ్రగాములైరి. వైయట్ అనునతడు ఫ్రెంచి, ఇటాలియన్ భాషలయందలి వాఙ్మయమును చదివి అందలి కవితాసంప్రదాయములను ఆంగ్లమునందు ప్రవేశపెట్టెను. సర్రే అనునతడు 'బ్లాంక్ వర్స్' అనెడి, పంక్తికి పదిమాత్రలుగల సుప్రసిద్ధ ఛందస్సునకు సృష్టికర్త. రాజ్యాంగవేత్తఅయిన సర్ థామస్ మూరు 'యుటోపియా' అను గ్రంథమును రచించెను. 'విలియమ్ టిండేలు' అనునాతడు బైబిలును ఆంగ్లములోనికి అనువదించెను. 'The Poets' Poet అని ప్రఖ్యాతిగాంచిన ఎడ్మండ్ స్పెన్సరు 'ది ఫేరీక్వీన్' అను కథారూపకమును రచించెను. ఛాసర్ రచించిన కాంటర్బరీ కథలకు గద్య ప్రపంచముననున్న ప్రముఖస్థానమే కావ్యప్రపంచమున ఫేరీక్వీనునకు కలదు. ఇందలి శైలి శోభాయమానమై కడు శ్రావ్యమైనదిగా నున్నది. ఎలిజబెత్తు మహారాణి కాలమునందు ఆంగ్లేయులుపొందిన ప్రతిభా గౌరవములు ఈ గ్రంథమునందు ప్రతిబింబితములు. ఇది 20 సంవత్సరముల కృషిఫలితము. బెంజాన్సను,మార్లో యీ కాలపువారు. 'Every man in his humour', 'Volpone' అను రెండు గొప్పనాటకములను బెన్‌జాన్సను రచించెను. **Tamborlaine the Great, Dr. Jaustus, The Jew of Malta** అను మూడు విషాదాంత నాటకములను 'మార్లో' రచించెను. ఈతనికి భగవంతుడు చిరాయువునే ప్రసాదించియుండినయెడల ఎంతగొప్ప నాటకములను వ్రాయగలిగియుండెడివాడో ! 'The Laws of Ecclesiastical Polity' అను గ్రంథమును వ్రాసిన Hooker అను కవియు, **Arcadia, Apology for Poetry** అను రెండు మహావ్యాసములు రచించిన **Sir Philip Sydney** యును ఈ యుగమునందలి గద్యరచయితలలో ప్రముఖులు. 'సిడ్నీ' యొక్క శైలి మిక్కిలి ప్రసిద్ధికాంచెను.

ఈ యుగమునాటి విద్వత్కవులలో సర్వవిధముల శిరోభూషణమువలె ప్రకాశించువాడు 'షేక్స్పియరు' మహాకవి. ఆతని ప్రతిభ వర్ణనాతీతము, అగ్రాహ్యము. ఆమహాపురుషునకుగల ప్రకృతి పరిచయము, మానవహృదయ పరిజ్ఞానము అసామాన్యములు. భాషమీద అతనికిగల అధికారమును, ప్రేమతత్త్వ సంబంధమైన ఆంతరంగిక దృష్టియు అపారములు. భావసంచలనములను గూర్చి ఆతడు గడించిన జ్ఞానము నిజముగా అద్వితీయము. స్త్రీ పురుషుల హృదయములు ఏయే పరిస్థితులయందు ఎట్టెట్టి పరిణామములు చెందుచుండునో - వానిని గ్రహించుటయందును, చిత్రించుటయందును, ఇతడు అపూర్వ ప్రతిభగలవాడు. సుఖాంతములును, విషాదాంతములును, చారిత్రకములు నయిన రసవత్తర నాటకము లనేకములు అత్యంత సామర్థ్యముతో నవరసభరితముగా రచించిన ప్రతిభాశాలి ఇతడు. నాటికిని నేటికిని ఇంగ్లాండుకు ఉత్తమ పుత్రుడై, ఆంగ్లభాషకు వాఙ్మయమునకు తలమానికమై, ఆంగ్లభాషావేత్తల హృదయములను బంధించు ఏకసూత్రమై, అతీఇ ప్రతిభతో అలరారుచున్నవాడు షేక్స్పియరు మహాకవి.

17 వ శతాబ్ది పూర్వార్ధమునందు ప్రధానమైన గద్య రచయితలు రాలే, బేకను అనువారలు. రాలే మహా తేజశ్శాలి. ఎలిజబెత్తు కాలమునాటి సర్వతోముఖ వికాసమును స్వాయత్త మొనర్చుకొనిన ప్రతిభాశాలి ఇతడు. బేకను అధిక మేధావంతుడు. భావగర్భితములై సూత్ర ప్రాయములైన వాక్యములుగల గద్యశైలిని వ్రాయుదిట్ట. అతడు రచించిన 'Advancement of Learning' అను గ్రంథమును, 'వ్యాసావళి'యు ఉద్గ్రంథములు. ఈ శతాబ్దపు ఉత్తరార్ధమునం దుండిన పద్య గద్య రచయితలందరిలోను మహోన్నత పర్వత శిఖరమువలె కన్పట్టువాడు 'మిల్టను' మహాకవి. అతడు రచించిన Paradise Lost, Paradise Regained, Samson Agonistes అను మూడు గ్రంథములు ఆంగ్లభాష యున్నంతకాలమును మనగల గ్రంథరాజములు. అతడు ఆంగ్ల పద్యకావ్య ప్రపంచమునందు అత్యంత గంభీరమైన శైలియు, ప్రమాణమైన ఛందస్సును కల్గిన మహాకవి. హాస్యరస ప్రధానమైన హ్యూడిబ్రాసు అను కావ్యమును రచించినవాడు బట్లరు. అధిక్షేప వాఙ్మయమును వ్రాయుటయందు అగ్రస్థానము నాక్రమించి, గద్య పద్య కావ్యములందు అసమానమైన ప్రతిభను ప్రదర్శించినవాడు డ్రైడెను. ఆంగ్ల గద్య రచనయందు ఇతడొక నవశకమును ప్రారంభించెను. 'Heroic Couplet' అను ఒక క్రొత్త ఛందస్సునకు ప్రఖ్యాత స్థానమును సంక్రమింపజేసినవా డీప్రోఢ. గద్య రచనయందు అప్రతిమానమైన ప్రతిభగలవాడు Jeremy Taylor, Essay on Human Understanding అను మహా వ్యాసమును రచించిన తత్త్వవేత్త 'లాకు'—ఈ యిరువురుగూడ ప్రముఖ రచయితలలోనివారే. ఈ యుగమునందలి అసమాన ప్రతిభావంతులలో ముఖ్యమైనవాడు 'జాన్ బనియను'. ఇతడు సామాన్య సంసారి. బీదవాడు. బైబిలు గ్రంథమును జీర్ణించుకొనుటచే పాండిత్యమును పొందినవాడు. కారాగారమునందున్న కాలమున 'ది పిల్‌గ్రింస్ ప్రోగ్రెస్' అను అద్భుత ద్వ్యర్థికావ్యమును రచియించి ఆ మహా గ్రంథమునందు, సుఖదుఃఖములతో కూడిన మానవ జీవితయాత్రను అత్యంత సౌందర్యవంతముగను, భావగర్భితముగను చిత్రించినా డీ కవివర్యుడు.

18 వ శతాబ్ది పూర్వభాగము గద్యరచనా ప్రధానమయిన యుగము. 'రాబిన్‌సన్ క్రూసో' అను సుప్రసిద్ధ బాలసాహిత్య గ్రంథముతోపాటు అనేక ప్రౌఢ గ్రంథముల రచించిన డీఫో, నేటి వార్తాపత్రికలకు పితామహుడు. కాని యీ యుగమునందలి ప్రధాన గద్యరచయిత 'స్విఫ్టు'. మత వైషమ్యములను గూర్చిన ప్రహసనమగు 'A Tale of a Tub' ను, మానవ ప్రకృతిని దెలుపు గల్లివర్స్ ట్రావెల్స్‌ను రచించి, గద్యరచనయందు అసమానుడనిపించుకొనిన వా డీ కవి. సులభమై, సుందరమై, హాయిని గూర్చునది అయిన గద్యరచనయందు ఆరితేరినవాడు 'ఎడిసను'. ఆతని 'స్పెక్టేటరు' (Spectator) వ్యాసములు, అందు అతడు సృష్టించిన 'సర్ రోజర్ డీ కావర్లీ' అను పాత్ర చిరకాలముండునది అనుటలో అతిశయోక్తి లేదు. కావ్య ప్రపంచములో ఈ యుగమున పేరెన్నికగన్న కవి పోపు. ఈతని కవితా శిల్ప చాతుర్యము ప్రశంస్యము. సుప్రసిద్ధ గ్రీకు మహాకవియైన హోమరు వ్రాసిన ఇలియడ్ అను మహాకావ్యమును ఆంగ్ల పద్యకావ్యముగా అనువదించినవాడును, క్షుద్ర రచయితలయిన సమకాలికులను 'డన్సియడ్' (Dunciad) అను ప్రహసనమునందు తీవ్రముగా హేళన పూర్వకముగా విమర్శించిన వాడును ఇక్కవి చంద్రుడు. గంగాప్రవాహమువలె ప్రవహించు శైలి, స్ఖాలిత్య రహితమయిన ఛందస్సు ఈతని రచనా విశేషములు. సూత్రప్రాయముగ నుండి విశ్వజనీనములయిన వ్యావహారిక సత్యములను నిరూపించు వాక్యములను అత్యంత శిల్పచాతుర్యముతో నిర్మించిన మహా శిల్పి ఈ కవి వరేణ్యుడు.

ఈ యుగమునందలి గద్యపద్య కావ్యము లన్నియు నాగరక ప్రపంచమునకును రాజకీయ వాతావరణమునకును సంబంధించినవే. వాటియందు ప్రకృతి పరిచయము ఎచ్చటను మందునకయిన కానరాదు. 'The Elegy in a Country Churchyard' అను అద్వితీయఖండకావ్యమును రచించిన 'గ్రే' అనునతడు 'Ode to the Evening' ను రచించిన 'కాలిన్సు' - ఈ యిరువురు కవులును ఆంగ్ల కావ్య ప్రపంచమునందు ప్రకృతి రహస్యములకు భాష్యములు కల్పించినవారలు.

18 వ శతాబ్దియొక్క ఉత్తరార్ధమునందలి ప్రధాన గద్యరచయితలు గోల్డుస్మిత్తు, జాన్సను, బర్కు, గిబ్బను, కౌపరు, బర్న్సు, బ్లేకు, క్రాబు అనువారు. నీతివిషయక మైన అనేక సూత్రములను ప్రవచించి లలితమైన అమృత శైలి ప్రదర్శించినవాడు గోల్డుస్మిత్తు. ఇతడు The Deserted Village అను పద్యకావ్యమును, She Stoops to Conquer అను నాటకమును హాస్యరస భరితముగా రచించెను. ఇతని 'ది వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు' అను కావ్యము ఆంగ్లభాషయందలి ప్రధాననవలగా శాశ్వత కీర్తిని కాంచెను. బహు విషయక విజ్ఞానభరితమై సమయ స్ఫూర్తిగల సంభాషణయం దారితేరి, అమరకోశమును బోలిన మహానిఘంటువునకు నిర్మాతయై, సాహిత్య-సమ్రాట్టు అనిపించుకొన్న ప్రతిభాశాలి జాన్సను. మహా రాజ్యాంగవేత్తయు, మహామేధావియు నగు బర్కు, సాహిత్య సౌరభోపేతములైన మహోపన్యాసముల మూలమున 'ది ఫ్రెంచ్ రెవల్యూషన్' దిఅమెరికన్ రెవల్యూషన్' అను రెండు రాజకీయ విప్లవముల విషయమున ఆంగ్లేయు లవలంబించిన విధానమును విమర్శించెను. ఆ యుపన్యాసములు రాజకీయవేత్తలచే ఈనాటికిని వేదగ్రంథములుగా పరిగణింప బడుచున్నవి. The Decline and Fall of the Roman Empire అను చారిత్రక గ్రంథరాజమును గంభీరమైన శైలితో రచించిన 'గిబ్బను' మహాశయుడు సుప్రసిద్ధుడు. The Task అను కావ్యమును రచించిన మధురకవి కౌపరు, బీదసాదల జీవితమును చక్కగా చిత్రించిన క్రాబు, రసభరితములైన గీతములను స్కాట్లండు ప్రాంతీయ భాషయందు రచించి సుప్రసిద్ధుడయిన 'బరన్సు', అమాయిక శిశుస్వభావముతో కూడిన భక్తిగీతములను రచించిన బ్లేకు మున్నగువారి కవితలందు రాగల నూతన సాహిత్య విప్లవ చిహ్నములు స్పష్టముగా కనుపించుచుండును.

19 వ శతాబ్దము ఆరంభము కాకమునుపే దాని లక్షణములు తత్పూర్వార్ధ శతాబ్దమునందే కన్పడెను. 1789 వ సంవత్సరమున ఫ్రాన్సుదేశమందు ఏర్పడిన మహావిప్లవముచే యూరపు రాజ్యములయందలి సమస్త జీవిత వ్యాపారములయందును నూతన శకము ఆరంభించెను. అపూర్వశక్తులు ప్రజా సామాన్యమునందు కన్పట్ట సాగెను. మేధావంతులును, ఉదార స్వభావులును అగు మహాపురుషు లెందరో దేశదేశములందు బయలుదేరిరి. ఎలిజబెత్తురాణి యుగమునాడు కన్పించిన ధీశక్తి, మనోవేగము, హృదయావేశము తిరిగి చూపట్ట నారంభించెను. నూతనోత్సాహముతో కూడిన భావకవు లెందరో బయలుదేరిరి. వర్డ్స్వర్తు, కోల్రిడ్జి అను ఇద్దరు కవులును కలిసి 'Lyrical Ballads' అను పద్యకావ్య సంపుటము ప్రకటించిరి. అది కావ్యప్రపంచమున నూతన శక ప్రారంభమునకు శంఖారావమువంటి దయ్యెను. సామాన్య వస్తువులను, జీవితమును ఆవరించు సౌందర్యము శోభను, వెల్లడిచేయుట వర్డ్స్వర్తు కవివర్యుని ఆశయము. అసామాన్య వస్తువులను, విషయములను వర్ణించునపుడు వాటిని విశ్వసనీయముగా చిత్రించుట కోల్రిడ్జి కవి ఆశయము. ఈ కావ్యసంపుటియొక్క ఉద్దేశమును వర్డ్స్వర్తే ఇట్లు నిరూపించెను. "దుఃఖాక్రాంతులైన వారిని ఉపశమింపజేయుట, సంతోషాంతరంగులను మరింత సంతోషపరచుట, ఆలోచనాశీలురై ధర్మకాంక్షను అభివృద్ధి చేసికొనునట్లు యువకులను పురిగొల్పుట." సాంఘిక సమస్యలనుగూర్చి ఆలోచించుట, ప్రకృతివైపునకు దృష్టిని మరల్చి, మానవ హృదయముయొక్క ఆంతరంగికము లయిన అనుభవములనుగూర్చి తెల్పుట అనునవి కావ్యాదర్శములు. తన కావ్యములు భయోత్పాదకములయిన విషయములను చిత్రించుటకొరకుకాక ఆలోచనాపరుల దృష్టిని ఆకర్షించుటకొరకే ఉపయోగించునని ఆతడు నిర్భయముగా చెప్పెను, "The Excursion; The Prelude, అను బృహద్గ్రంథములును, The immortality Ode, The Ode to Deity అను చిన్న కావ్యములును, మరికొన్ని సానెట్సును అతని రచనలలో శ్రేష్ఠములైనవి. కోల్రిడ్జి మహాకవి Biographia Literaria అను విమర్శనాత్మక గ్రంథమును, The Ancient Mariner, Christabel, Kublakhan అను ఉన్నతశ్రేణికిచెందిన కావ్యములను రచించెను. స్వాతంత్ర్య ప్రియుడయిన బైరను, చారిత్రక నవలలు అనేకములు వ్రాసి భూతకాలమును, వర్తమానమునందు పునస్సృష్టి కావించిన స్కాటు మహాశయుడు ఈ యుగమునందలివారే. షెల్లీ ఒక అద్వితీయ మహాకవి. నిరంకుశపరిపాలనము మానవులను పీడించు

మహావ్యాధులలో నొకటియనియు, ప్రేమ యనునది పరమ పవిత్రమయిన వస్తువనియు, అది జీవితము ఉద్ధరింపగల మహాశక్తియనియు ఇతడు బోధించెను. పక్షి పాడినట్లు అప్రయత్నముగా అనర్గళధారతో పాడగల సహజ కవిత్వ మితనిది. ఇతడు గ్రీకుపద్ధతి ననుసరించి 'Prometheus Unbound' అను మహానాటకమును రచించెను. కీట్సు మరణించెనని వినగనే ఇతడు Adonais అను నొక కావ్యమును The Cloud, Ode to the sky lark, Ode to the west wind మున్నగు అమూల్యములైన చిన్న కావ్యములనుగూడ రచించెను. కీట్సు అసామాన్య ప్రతిభాశాలి. సౌందర్యోపాసకుడు. అతడు అకాల మృత్యువు వాతను బడుట శోచనీయము. పంచకావ్యములు అనదగు ఆతని Odes ఆంగ్ల సాహిత్య చరిత్రయందు అపూర్వ శోభతో వెలుగొందుచున్నవి.

చారిత్రక నవలాకారుడయిన స్కాట్ అనునాతడును, అనన్యసామాన్య వ్యాసరచయితయగు లాంబు (Lamb)ను, సాంఘిక సాంసారిక విషయములను చిత్రించు నవలలను రచించిన జేన్ ఆస్టెన్, సొగసైన శైలిలో 'The Confessions of an English Opium Eater, అను ప్రసిద్ధ గ్రంథమును రచించిన 'డిక్వెన్సి'యు గద్య రచనయందు పేర్కొనదగిన ప్రముఖులు. కార్లైల్ మహర్షి మరియొక అద్వితీయ రచయిత. ఇతడు వ్రాసిన ప్రముఖ గ్రంథము Sartor Resartus అనునది. ఇతని చారిత్రకశైలి అనన్యసామాన్యము. ఇతడు అనేక నూతనపదములను సృష్టించిన భాషానియంత. సజీవమైన చారిత్రకశైలితో నొప్పి విమర్శకాగ్రణియైన మెకాలే (Macaulay) మహాశయుడు, సర్వతోముఖ సంస్కర్తయైన శ్రీ రాజా రామమోహనరాయలు, మన దేశమునందు ఆంగ్లేయ విద్యావిధానమును ప్రవేశపెట్టుటకు కారకులైనవారు.

19 వ శతాబ్దపు టుత్తరభాగమున పేర్కొనదగిన ఆరుగురు గొప్పకవులుకలరు. వీరిలో అమెరికా కవులలో అగ్రగణ్యుడైన లాంగ్ ఫెలో అనునతడు హాయవాథా, ఇవాంజ్‌లైన్ అను కావ్యములను రచించెను. ఆంగ్లేయ ఆస్థానకవియైన టెన్నిసను వాస్తముగా ఒక మహాకవి. అతని ఉద్గ్రంథములలో ప్రధానమైనవి 'In Memorium' అను స్మృతి కావ్యమును, 'Idylls of the king' అను కావ్యములై యున్నవి. ఆతని కవిత్వమునందు గొప్ప శిల్పచాతుర్యము కానవగును. 'మిసెస్ బ్రౌనింగ్' అను నామె ఆంగ్లేయ కవయిత్రులలో అగ్రస్థాన మధిగమించెను. 'Auroraleign' అను పెద్దకావ్యము, The cry of the children అను చిన్న కావ్యము, Sonnets ఆమె కృతులలో సుప్రసిద్ధములు. ఆమె భర్త అయిన రాబర్టు బ్రౌనింగు టెనిసనుతోపాటు ఈ శతాబ్దమునందు కవితా సదనమున అగ్రస్థానము నలంకరించెను. ఇతడు అసామాన్య మేధావంతుడు. సంక్షిప్తమై భావగర్భితమైన శైలి కలవాడు. 'The Ring and the Book' అను అపరాధ పరిశోధక కావ్యము ఆతని యుద్గ్రంథము. అందు పండ్రెండు పర్వములుకలవు. రక్బీపాపెల్ Rugby Chapel, సొహరాబ్ అండ్ రుస్తుమ్ అను కావ్యములను రచించిన మాచ్యూఆర్నాల్డును, The Earthly Paradise ను రచించిన విలియం మారిస్సు అనునతడును ఈయుగము నందలి ప్రముఖ కవులలో పేర్కొనదగినవారు.

గద్య రచనయందు మహామహులగువారు గూడ ఈ యుగమునందు ఉద్భవించిరి. Vanity Fair, The New Comes, Henry Edmond అను గొప్పనవలలు రచించిన థాకరీ కవియు, The Pickwick Papers, David Copperfield మొదలగు గ్రంథములను రచించిన డికెన్సు, Adam Bede, The Mill on the Floss అను నవలలను రచించి జార్జి ఇలియట్ (George Eliot) అను పురుషనామ ధారిణియైన మేరియన్ ఇవాన్సు (Marian Evans), The Ordeal of Richard Feveril, Evan Harrington అను వాటిని రచించిన మెరిడిత్తు, అత్యద్భుత నవలారాజమగు Tess ను రచించిన థామస్‌హార్డీ—వీరు ఈ గద్యకాలము నాటి ప్రధాన నవలాకారులు. మరియు అధిక సుందరమైన శైలిని నిర్మించిన వాల్టర్ పీటరు, సౌందర్య తత్త్వమును పరిశోధించి దానిలక్షణమును 'The seven lamps of Architecture','The Stones of Venice', అను గ్రంథములలో నిరూపించిన రస్కిను, On Liberty అను వ్యాసరాజమును వ్రాసిన 'జాన్ స్టూవర్టు మిల్లు', అను వారిని పేర్కొనుటతో ఈ శతాబ్ది సింహావలోకనము ముగింపవచ్చును.

20 వ శతాబ్దమునందలి రచయితలలో పెక్కుమంది జీవులై యున్నవారే. కొంద రిటీవల కాలముచేసి యుందురు. Wells, Bennet, Galsworthy, Conrad అను నవలా రచయితలు Kipling, Yeats, Iliot వంటి మహాకవులు, Oscarwilde, Bernard shaw, Galsworthy · Priestley, Drink Walter, Synge, Yeats మున్నగు నాటక కర్తలు, Chesterton, Joyce, Belloc Max, Beerbhohm, Churchill, Lytton Strachey వంటి గద్య రచనా చతురులు, అసంఖ్యాకులు గలరు.

ఆంగ్ల సాహిత్యస్రవంతి జీవనదియై యింకను విరివిగా ప్రవహించుచున్నది. క్రొత్తపోకడలు కన్పట్టుచున్నవి. ప్రకృతిశాస్త్రముల ప్రభావముచే క్రొత్త వాఙ్మయము అనంతముగా బయలుదేరుచున్నది. అమెరికా, ఇండియా మొదలగు దేశములందు అనేక గొప్పరచయితలు గలరు. ఇమర్సన్ (Emerson) వంటి వ్యాసకర్త, సింక్లర్ (Sinclair) వంటి నవలారచయిత, రవీంద్రనాథ్ వంటి బహుముఖసాహిత్యనిర్మాత, సరోజినీనాయుడు, హరీంద్రనాథ ఛటోపాధ్యాయుడు మున్నగు మహాకవులు ఏ వాఙ్మయమునకైనను శోభను కూర్చువారే. Whittier, Lowell వంటి అమెరికన్ కవులుకూడ సుప్రసిద్ధులుగా పేర్కొన తగినవారు. ఆధునికులైన కవుల నిచ్చట పేర్కొనుట లేదు.

ఇట్లు నిత్యనూతన శోభతో విలసిల్లుచు, శాఖోపశాఖలచే యావత్ప్రపంచమును ఆవరించుచు, సమస్తేతర వాఙ్మయములందలి ఉత్తమ సాహిత్యమును తనలోనికి నిమిడ్చుకొనుటచే నిరంతరాభివృద్ధి నొందుచున్న ఆంగ్ల సారస్వత రసాస్వాదనమే భారత జాతీయాభ్యుదయమునకు దారితీసిన ప్రబల కారణములలో ప్రధానమైనది. దైవికముగా మనకు లభించిన అందలి పాండిత్య ప్రభావమును బుద్ధిపూర్వకముగా విడనాడుకొనుట భారత జాతీయాభివృద్ధికి అంతరాయము కాగలదనుట నిర్వివాదాంశము. వివిధ భారతజాతీయ భాషలందలి సర్వతోముఖ వికాసమునకును ఆంగ్లసాహిత్యప్రచారమే కారణమనుట చారిత్రక సత్యము.

పె. రా.

**ఆంద్రియాస్ వెసేలియస్ (1514-1564)**:-ఇతడు బ్రసెల్సు పుర నివాసి, వైద్యవృత్తిలో నిమగ్నమైన ఒక కుటుంబమున జన్మించెను. లోవియన్ విశ్వవిద్యాలయములో ఉన్నతవిద్య నభ్యసించెను. పిమ్మట వైద్యశాస్త్రాభ్యాసమునకై పారిస్ విశ్వవిద్యాలయమున కేగెను. విషయ సామగ్రి ప్రోగుచేయు కుతూహలమున శవములను రహస్యముగ చేజిక్కించుకొనుట కితడు చేసిన ప్రయత్నము లీతనిని పెక్కు పర్యాయములు ప్రమాదావస్థలోనికి దింపినవి. 1537 వ సం॥న పడూరాయందు శస్త్రచికిత్సాచార్య పదవి ఇతనిని వరించినది. 1543 వ సం.న ఫేబ్రికాయను ఉద్గ్రంథమును ప్రచురించెను. అది పెక్కువర్ణచిత్రములుగల గ్రంథము. గాలన్ అను ప్రసిద్ధ వైద్యశాస్త్రవేత్త యందలి తప్పులను సవరింప సాహసించినందున కొంద రితని భావములకు ప్రబల వ్యతిరేకులైరి. పిమ్మట అతడు తన ఆచార్య పదవికి స్వస్తిచెప్పి అయిదవ ఛార్లెస్ చక్రవర్తియొద్ద ఆస్థానవైద్యుడుగ పనిచేయుటకు మాడ్రిడు పట్టణమున కేగెను. 1564 వ సం.న ఒక నౌకాప్రమాదమందీ వైద్యశాస్త్రవేత్త జీవిత మంతమయ్యెను.

డా. యస్. వేం. రా.

**ఆంధ్రజాతీయ కళాశాల**: సుమారు ఏబదిసంవత్సరముల క్రితమే ఆంధ్రజాతీయ కళాశాల అను పదము సృష్టింపబడినది. క్రమపద్ధతి లేక అసంగతముగా ఉన్న పూర్వయుగ జీవితము అప్పుడే భారత జాతీయతా సంయోగమునకు దారి తీయుచుండెను. పందొమ్మిది వందల ఏడు, నవంబరు, 17 వ తారీఖున మచిలీపట్నములో ప్రస్తుతము బియ్యపు మిల్లుగా పనిచేయుచున్న అప్పటి అయ్యంకివారి థియేటరులో ప్రభుత్వముతో సంబంధములేని, విశ్వవిద్యాలయమునకు అనుబంధము కాని ఒక జాతీయ విద్యాసంస్థను నెలకొల్పవలెనని ఒక బహిరంగసభ జరుపబడెను. సాహిత్య, శాస్త్రీయ, సాంకేతిక విషయముల సమరస సంయోగముతోకూడిన ఒక చక్కని విస్తృత పథకమునకు అనుగుణముగా విద్యావిధానము పునర్నిర్మించుటకు ఈ సంస్థ ఉపయోగపడవలెనని ఉద్దేశము. ఈ రోజున కూడ దేశములోని విద్యాప్రణాళికలో వాస్తవమైన మార్పు లేదు. బెంగాలు విభజన (16-10-1905), అఖిలభారత

రాజకీయాలనుండి ముస్లింజాతి తప్పుకొనుట, ప్రత్యేక ఓటింగు పద్ధతిలో మహమ్మదీయులకు ప్రాతినిధ్యము, స్త్రీలకు, బ్రాహ్మణేతరులకు, క్రైస్తవులకు ఓటింగుకు స్థానములు ప్రత్యేకించుట, మొదలగువాటిని గురించి నూత్న ఉత్సాహము ప్రదర్శింపబడినప్పటినుండికూడ విద్యావిధానములో ఏ మార్పునులేదు. విద్యావిధానమున రాజకీయ శక్తులద్వారమున మన రాజకీయోద్దేశములకై, మార్పుకలిగించుటకు ప్రయత్నము చేయుచున్నారని ప్రజలపైని, కాంగ్రెసుపైని ప్రభుత్వము నిందారోపణము చేయుచుండెడిది. కాని నిజముగా ప్రభుత్వమే రాజకీయ చర్యలద్వారా, రాజకీయోపాయములద్వారా, భారత జాతీయతయొక్క అభ్యుదయశక్తులు పురోగమించకుండ చేయుచుండెను. 8 కోట్ల జనసంఖ్య కలిగిన బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రములను (1) పశ్చిమబెంగాలు (2) అస్సాముతో కూడిన తూర్పు బెంగాలు అని రెండు రాష్ట్రములుగ విభజించుటలోని ప్రభుత్వము యొక్క ఉద్దేశము, అత్యధికముగ ముస్లిం ప్రజలు కలిగిన రాష్ట్రమును భారతదేశములో సృష్టించవలెననియే. ఎప్పుడో ఒకప్పుడు త్వరలో భారత దేశము ఒక సంయుక్త పద్ధతిని పునర్నిర్మించబడునను సంగతి ప్రభుత్వమునకు తెలియును. సమాఖ్యలలో ఒండొంటితో కలసి ఉండు రాష్ట్రములు ఉండుటకు అవకాశము కలదు. కావున ఒకేజాతి అన్ని రాష్ట్రములలో అధిక ప్రభావము కలిగి ఉండకూడదను భావము, భావి దృష్టియు, తెలివితేటలును గలవారికి కలుగకమానదు. అందువలననే తూర్పు బెంగాలు, అస్సాము కలిపి ముస్లిం ప్రజలు అత్యధిక సంఖ్యలో ఉండునట్లు ఒక రాష్ట్రము ఏర్పరుపబడినది.

ఇక ఉద్దేశముల క్రమవిధానమును పరిశీలింతము. విదేశీయునిదృష్టిలో రాజకీయముగ భారతదేశములో అత్యధిక సంఖ్యగల ఒకేజాతితోకూడిన రాష్ట్రములు ఉండకూడదు. అందు భావిసమాఖ్యను ఊహించి జన సంఖ్యా విభాగములనునిర్ణయించిరి. అవిధముగా బెంగాలు బీహారు, ఒరిస్సా రాష్ట్రములు (1) పశ్చిమ బెంగాలుగా (2) అస్సాముతోకూడిన తూర్పు బెంగాలుగా, విభజించబడెను. ఈ విభజనము విద్యలో, ఉద్యోగములో, రాజకీయ జీవితములో భారతదేశమునకు నాయకుడుగా ఉన్న బెంగాలీయుని వెన్నెముకకు పెద్ద దెబ్బ కలిగించవలెనను ఉద్దేశముతోడనే చేయబడినది. బెంగాలీయుని నాయకత్వము ఇకముందు ఉండకూడదని దాని ఉద్దేశము. అందు కనుగుణముగ ముస్లిం జనులు అత్యధికముగా ఉన్న రాష్ట్రము ఏర్పరుప బడినది. ఈ దూరదృష్టితో కూడిన ఈ కుటిలోపాయమునకు విరుగుడుగా బెంగాలీయుడు ప్రతిక్రియ చేయమొదలిడెను. అతడు భారత జాతీయతను బలహీనము చేయవలెనను బ్రిటిషువారి పన్నుగడను నాశము చేయుటకు పూనుకొనెను. ఆంగ్లేయునికి, బెంగాలీయునకు మధ్య సిద్ధాంత సంబంధమైన పోరాటము జరిగినది. 1905 అక్టోబరు 16 వ తారీఖున ప్రారంభమయిన ఆ యుద్ధము వంగదేశమునందేగాక, భారతదేశమంతటను వ్యాపించినది. భారతదేశములో ప్రాథమిక, మాధ్యమిక ఉన్నతవిద్యలను ఏ విధముగా రూపొందించవలెను? భారతీయుడు ఒక సారస్వత పారిశ్రామికుడుగా మాత్రమే శిక్షణము పొందవలెనా? లేక తన కర, నేత్రములయొక్క ప్రయోజనము అభివృద్ధి చేసికొని, ఇంద్రియములకు, శక్తులకు సరియైన శిక్షణమొసగి సాంకేతిక విషయ శాస్త్రములు నేర్చుకొని యంత్రములను నిర్మించుట, బోయిలర్లను, ఇంజనులను, యంత్ర చక్రములను నిర్మించుట మున్నగు భారతదేశపు అవసరములను తయారుచేయుటయందును, వాటినినడపుటయందును ప్రావీణ్యము సంపాదించుకొనవలెనా? ఈ కారణను చేతనే భారతదేశములోని విద్యావిధానము విస్తృతమై, సాహిత్య, శాస్త్రీయ, సాంకేతిక విషయ సంబంధమగునట్లుగ సంస్కరింపవలసిన అగత్య మేర్పడినది.

ఈ ఉద్దేశముతోడనే మచిలీపట్నములోని ప్రజలు, 'బిపిన చంద్రపాల్' చే బోధింపబడి, అరవిందఘోష్, సతీశ్‌చంద్ర ముఖర్జీలచే ప్రచారము చేయబడిన బెంగాల్ ఉద్యమమును జాగ్రత్తగా పరిశీలించిరి. హైకోర్టు ఉద్యోగమునుండి విరమించిన గురుదాస్‌బెనర్జీవంటి న్యాయాధికారులు తమశక్తిని, తెలివిని, విరామకాలమును, జాతీయ విద్య స్థాపించుటకై వినియోగించి, ముఖ్యముగా తూర్పుబెంగాలులో ఇంచుమించు 24 జాతీయ ఉన్నత పాఠశాలలను స్థాపించిరి. బెంగాలులో తీవ్రముగ వ్యాపిం

చిన ఈ ఉద్యమము భారతదేశమందంతటను అల్లుకొన్నది. బెనారసులో 1905 వ సంవత్సరమున కాంగ్రెసు సమావేశమైనది. ఆ కాంగ్రెసు సభలకు శ్రీ గోపాలకృష్ణ గోఖలే అధ్యక్షత వహించెను.

ఆ సమయమున ప్రముఖపాత్రవహించి, జాతీయ విద్యా, స్వదేశీ, సందేశములు అందించినవాడు లాలా లజపతిరాయ్. ఇవి ఆ తరువాత సంవత్సరములో కలకత్తాలో, స్వదేశీ, స్వరాజ్యము, జాతీయవిద్య, బహిష్కరణము అనుసూత్రములతో కూడిన తీర్మానములుగ పరిణమించినవి. 1907 ఆగస్టు 7 వ తారీఖున బహిష్కరణ పతాకము ఎగురవేయబడినప్పుడు, రాజకీయ వాతావరణమంతయు ఉద్రిక్త విప్లవశక్తులతో నిండిపోయియుండెను. 1908 ఏప్రిల్ 30 వ తారీఖున, ఖుదీరామ్‌బోస్ అను 18 సంవత్సరముల యువకుడు కింగ్స్‌ఫర్డు అను ముజఫర్ పూర్ జిల్లా మేజస్ట్రీటుపై బాంబు విసరెను. కెన్నెడీ కుటుంబమునకు చెందిన తల్లి, కూతురు తక్షణమే చనిపోయిరి. దేశములో విప్లవశక్తులు ఉద్భవించుచున్నవని ఈ సంఘటన ప్రభుత్వమునకు వెల్లడిచేసినది. ఒక్క బెంగాలు, బీహారులలోనేకాక, దక్షిణమునకూడ ఈ స్థితి వ్యాపించెను. తిన్నెవేలిజిల్లాలో మిస్టర్ ఆష్, ఐ. సి. యస్. పిస్టల్‌తో చంపబడెను. దేశమంతయు ఉద్రేకముతో అట్టుఉడికినట్లుడికి పోయినది. ఒక ప్రాంతములో జరిగిన సంఘటనలకు ప్రతిఫలములు మరొకప్రాంతములో కనుపించసాగెను. ప్రజాప్రభుత్వముల నడుమ నిజముగా ఒక యుద్ధము చెలరేగెను. 13 జూలై 1908 లో లోకమాన్య బాలగంగాధర తిలకును బొంబాయిలో నిర్బంధించి, 18 తారీఖున ఆయనకు ఆరు సంవత్సరముల కఠిన కారాగార శిక్ష విధించిరి. జాతీయ కళాశాలా స్థాపనకు పూనుకొన్న మచిలీపట్నములో శ్రీ కోపల్లె హనుమంతరావు, ఎం.ఏ., బి.ఎల్., సూరత్‌లో జరిగిన కాంగ్రెసు సభకు హాజరయిన పిదప, 1908 జనవరిలోనే తన వకీలువట్టా వదలివేసినట్లు ప్రకటించెను. 1908 జూలై 13 వ తారీఖున శ్రీ జి. హరిసర్వోత్తమరావు, ఎం.ఏ. ను నిర్బంధించి చాలకాలము విచారణ జరిగినపిదప 1908 నవంబరులో 6 నెలల కఠిన శిక్ష విధించిరి. దీనిపై పునర్విచారణ జరిగి ఆ శిక్షను మూడు సంవత్సరముల కఠిన కారాగార శిక్షగా పొడిగించిరి. హరిసర్వోత్తమరావుగారు కళాశాలలో పని చేయుటకు వాగ్దానముచేసిరి. ఆయన ఉపాధ్యాయుడుగా నియమితుడయ్యెను. ఆ విధముగా కళాశాలా పథకమునకు, రాజకీయములకు సంబంధము ఏర్పడినది. ఆరోజు నుండి ప్రభుత్వమునకు విరుద్ధముగ పెద్ద పోరాటము బయలుదేరినది. శ్రీ కె. హనుమంతరావు కళాశాలకు మొట్టమొదటి ప్రిన్సిపాలు. 1901లో స్థాపించబడిన జాతీయ వారపత్రికయగు 'కృష్ణాపత్రిక' కు సంపాదకులయిన శ్రీ ఎమ్. కృష్ణారావుగారిని మచిలీపట్టణములో రాజకీయ తత్త్వవేత్తగ అప్పుడు పరిగణించుచుండిరి. కళాశాలకు ఈ రచయిత కార్యదర్శిగా ఉండెను. కళాశాలా నిర్వాహకుల వెనుక పోలీసులు ఎప్పుడును తిరుగుచుండిరి. అప్పుడు ప్రోగుచేసిన ధనములోని ప్రతి రూపాయను ఎట్టి తలపాగా పోలీసువాడు జాగరూకతా దృష్టితోపరిశీలించుచు వెన్నంటుచుండెడివాడు.

కళాశాల విశ్వవిద్యాలయమునకు అనుబంధము కాకుండుట, ప్రభుత్వముచే గుర్తింపబడకుండుట, రాజకీయ దృష్టికి అనుమానము కలిగించినవి. వివిధములైన యంత్రములతోడను, బోయిలర్ల తోడను కూడిన ఒక పెద్ద కర్మాగారమును నిర్మించుట, అందులో పోతపనులు రంధ్రములు చేయుట, కత్తిరించుట, సమముచేయుట మొదలగు పనులు జరుగుచుండుటచే ప్రభుత్వముయొక్క అనుమానము ద్విగుణితమై ఇచ్చట బాంబులు తయారు చేయు పన్నుగడలు జరుగుచుండెనని భావింపబడినది. ప్రభుత్వముతో కళాశాలా నిర్మాతల సంబంధములు ఒక మాదిరిగా ఉండెడివి. ప్రభుత్వపు కాలువలనుండి వీరు నీరు తెప్పించుకొనెడివారు. ఒకవైపున కలెక్టర్లు, గవర్నరు పాఠశాలను సందర్శించుటతోపాటు పోలీసులు కూడ రహస్యముగా కళాశాలాధికారులను అనుమానించి తనిఖీ చేయుచుండిరి అయినప్పటికి వీరు కృష్ణస్వామి అయ్యర్, సుందర్ అయ్యర్, శంకర్ నాయర్, సదాశివ అయ్యారు, గురుస్వామి అయ్యారు, శేషగిరి అయ్యారు, శ్రీనివాస అయ్యంగారు మొదలైన రాజభక్తులైన న్యాయవాదుల ఇంటికి వెళ్ళుచుండెడివారు, అనుమానము అభ్యుదయము అనువానిమధ్య జీవితము పురోగమింపసాగెను. ఈ కళాశాల క్లాసులలో హరిజనులకు

ప్రవేశము ఇయ్యబడెను. వారు తోడి హిందువులతో సమానముగా చూడ బడుచున్నారని సాంఘిక, ఆర్థిక, మత రంగములయందు నిరసన బయలుదేరినది. కర్మాగారముల నిండ వివిధ జాతులవారు మిశ్రమముగా ఉండెడివారు. అది సంవత్సరమునకు అయిదారువేల రూపాయల నష్టముపై నడుపబడు చుండెడిది. మొట్ట మొదట ప్రజలు చూపిన ఉత్సాహము క్రమముగా తగ్గిపో సాగినది. అయినను కళాశాలలో కుటీర పరిశ్రమలు, చేనేత, కంబళీలు తయారుచేయుట, రంగులు వేయుట, ముద్రించుట మొదలగు పనులను కూడ ప్రవేశపెట్టి పురోగమించుటకు ప్రయత్నములు సాగెను. వైపుపని, పొర్టుపోండు, భూమికొలత డ్రాయింగు, చిత్రలేఖనము, కాగితపు చేతిపరిశ్రమ మొదలగు వాటికి కూడ ప్రవేశము కలిగెను. వీటికన్నిటికి చాలాధనము కావలసి వచ్చెడిది. కార్యకర్తలు అప్పులు చేయుచు, వీలునుబట్టి తీర్చుచుం డెడివారు. 1917 వ సంవత్సరములో స్వపరిపాలనోద్యమము (**Home Rule movement**) వీరిని కాపాడినది. జాతీయవిద్య స్వపరిపాల నోద్యమములో ముఖ్యాంశముగా మిసెస్ బీసెంటు ప్రకటించి, కళాశాలకు 20 వేల రూపాయలు సహాయము చేసెను. ఆ సొమ్ముతో అప్పులు తీర్చనయ్యెను. ఈ ఉద్యమము తీవ్రత తగ్గి పోగానే గాంధీ సిద్ధాంతములు రంగములో ప్రవేశించెను. దీనివలన కళాశాలకు మరల 25,000 రూపాయల సహాయము లభించినది. 1921 జూలైలో శ్రీహనుమంతరావు హృద్రోగముతో అస్వస్థులైరి. 1922 ఫిబ్రవరి 2 వ తారీఖున ఆయన చనిపోయిరి. అప్పుడు ఈ రచయిత ఒంటరిగానే కళాశాలను నడుపవలసి వచ్చినది. ధనము సంపాదించి, ఆ సంస్థను నిలబెట్టుటకు చాల క్లేశకరమైన ప్రయాణములు చేయవలసి వచ్చెడిది. శ్రీ హనుమంతరావు మరణించిన పదిదినములలోనే ఉపాధ్యాయులు తమ జీతమును హెచ్చింపవలెనని ఒక పథకము ప్రతిపాదించిరి. "సంపాదించి, తీసికొమ్ము" అను సిద్ధాంతము నేను నాస్నేహితుల కందరకు నచ్చచెప్పితిని. ఈ సిద్ధాంత సాధన చాల కష్టమయినది. ఉపాధ్యాయులకు ఇది ఒక సవాలుగా పరిణమించినది. కళాశాలనుండి రంగూనుకు వెళ్లిన ఒక నాటకబృందము చాలనష్టపడి తిరిగివచ్చినది. ఈ నష్టమును పూర్తిచేయుట ఒక సమస్య ఆయెను. క్రమముగా విద్యార్థులు తగ్గిపోయిరి. ప్రభుత్వముచే గుర్తింపబడిన పరీక్షలలో కృతార్థులయి ఉద్యోగములు సంపాదించుకొనవలెనని విద్యార్థులు కాంక్షించిరి. మొట్టమొదట మూలవిద్యయందు ఉపాధ్యాయులకు ఇచ్చు శిక్షణము చాల జనరంజకమై కనుపించెను, కాని కాలక్రమమున శిక్షణ కాలమున ఉపాధ్యాయులకు ఈయబడు వేతనము మానివేసినప్పుడు ఆ విద్యార్థులసంఖ్య తగ్గిపోయినది. ఆ మూలవిద్య విద్యార్థులకు ఆకర్షణము కలిగింపనందున సాంఘిక శాస్త్రములు నేర్పు తాతాస్కూలులో ఉండునట్టి ఒక సాంఘిక విద్యావిధానము ప్రవేశపెట్టబడెను. తాతాస్కూలు ఆఫీసర్లకు, ప్రోఫసర్లకు, ప్రజలతో కలిసిమెలిసి పనిచేయు స్త్రీపురుషులకు మాత్రమే శిక్షణము ఇచ్చుచుండెనని ఈ రచయిత అనుమానము. అయినను ఇటువంటి విద్యావిధానము ఆ కాలమునకు సరిపడునది కాదు. స్వాతంత్ర్యము లభించిన పిదప కాని ఇటువంటి విద్యావిధానము ప్రజా ప్రశంస పొందలేదు. ఇప్పుడు మనకు స్వాతంత్ర్యము లభించుటయు రెండు పంచవర్ష ప్రణాళికలు అమలులోకి వచ్చుటయు జరిగినది. కనుక, ఇటుసంటి విద్యావిధానము తప్పక జనరంజక మగును.

కళాశాలాజీవితములో ఒక ఛిద్రము ఏర్పడినది. ఎటువంటి విద్యాపద్ధతియైనను, తగు ప్రతిఫలము కలిగింపక, ప్రభుత్వముచే గుర్తింపబడకుండ ఉండినచో, అది ప్రజాదరమును పొందజాలదు. కళాశాలాకర్మాగారము నష్టమునకు గురియైనది. చేతితో చేయబడిన కాగితమునకు బజారులో అమ్మకము లేకపోయినది. చిత్రలేఖనము తదితర కళాత్మక విద్యలు విద్యార్థులను ఆకర్షింపలేకపోయినవి. ఒకటి తరువాత మరొకటి కారణములుగ కళాశాల విద్యార్థుల ఆకర్షణమును పోగొట్టుకొన్నది. మొత్తముమీద కళాశాలకు పదెనిమిది లక్షల రూపాయల విలువైన ఆస్తి ఉండినది. ఈ సొమ్ము, ఇతరమైన ఆస్తి భద్రపరువవలసి వచ్చినది.

శ్రీ హనుమంతరావుగారు ఆ కళాశాలకు మొదటి ప్రిన్సిపాలు. కళాశాల ప్రారంభింపబడిన 1910 ఫిబ్రవరి, 21 వ తారీఖునుండి, 1922, ఫిబ్రవరి, 2 వ తారీఖున

మరణించువరకు, ఆయన ప్రిన్సిపాలుగా పనిచేసిరి. తరువాత, ఉపాధ్యాయులుగా పనిచేయుచుండిన శ్రీ చిల్లరిగె శ్రీనివాసరావు కొంతకాలము పనిచేసి 1925 లోనో 1926లోనో రాజీనామా ఇచ్చిరి. తరువాత ఈ సంస్థ కొంతకాలము సరిగా పనిచేయలేదు. శ్రీ రామ కోటీశ్వరరావు కొంతకాలము ఈ సంస్థను నడపిరి. కాని ఆయనకూడ త్వరలోనే రాజీనామా ఇచ్చిరి. ఆ కళాశాల యొక్క ప్రథమదశలో శ్రీ హనుమంతరావుగారు బ్రతికి ఉన్న రోజులలో అనగా 1916 వ సంవత్సర ప్రాంత మున ప్రొఫెసర్ ఛెటర్జీ ఆధ్వర్యవమున చిత్రలేఖన విభాగ మొకటి ఏర్పరచబడెను. ఆయన బెంగాలీ పద్ధతికి చెందిన చిత్రలేఖనములో ఉత్తమవిద్యార్థులను పెక్కుమందిని తయారుచేసిరి. శ్రీ ఛెటర్జీ మూడు సంవత్సరములు పనిచేసిరి. ఆ తరువాత శ్రీ రమేశ్‌చక్రవర్తి ఆయన స్థానములో రెండు సంవత్సరములు పనిచేసిరి. శ్రీ కౌతా రామమోహనశాస్త్రి, భారత లక్ష్మీబ్యాంకు నడపించు చున్న శ్రీ బి. వెంకటరత్నం, చిత్రలేఖన కళాశాలను స్థాపించిన శ్రీ గుర్రం మల్లయ్య, శ్రీ బెజవాడ గోపాల రెడ్డి, ఈ కళాశాలలోని విద్యార్థులే. ఈ కళాశాలతో కొంత సంబంధము కలిగి చెప్పుకోదగిన మరొకవ్యక్తి శ్రీ కురుగంటి సీతారామయ్య. ఈయన సంస్కృతాంధ్ర భాషలలో ప్రసిద్ధ పండితుడు.

చిట్టచివరకు రాజకీయవాతావరణము ప్రశాంతత చెందినది. కాని కళాశాలమాత్రము మూయబడినది. స్వాతంత్ర్యము ప్రకటించబడినది. ఆంగ్లేయులు భారత దేశము విడిచిపోయిరి. ఒక విద్యాసంస్థను యుద్ధచిహ్న ముగాగాని, యుద్ధకేంద్రముగాగాని నడపించుటలో సమంజసత్వము లేదు. ఈ లోపుగా విద్యాభివృద్ధికై జీవితమంతయు పాటుబడిన కొందరు మిత్రులు ఈ కళా శాలను ప్రథమతరగతి కళాశాలగా నడపింతుమని అడిగిరి. ఇది ఒక్కటే కళాశాల ఆస్తిని, సొమ్మును, సంరక్షించు టకు సరియైన మార్గ మనిపించినది. ఇదైనను ఒక చిన్న కార్యముగా పరిగణింపబడరాదు. ఈ సంస్థను విశ్వవిద్యా లయము త్రొక్కు పాతబాటలోనే, ఆ పద్ధతులలోనే నడి పించుటకు ఇష్టములేనివారిలో నేను ముఖ్యుడను. కాని నేను చివరకు ఈ అభ్యంతరము మానితిని. ఇప్పుడు ఈ కళాశాల ఆంధ్ర విశ్వవిద్యాలయముతో అనుబంధము కలిగి, ప్రతి సంవత్సరము వేల విద్యార్థులకు శిక్షణము ఇచ్చుచు పురోగమించుచున్నది. భారతదేశములో చదువు కొన్నవారిసంఖ్య 16⅔%. వీరిలో 6% మాత్రమే శుభ్ర ముగా చదివి వ్రాయగలరు. అందులో 4% మాత్రమే చదువుటయందును, వ్రాయుటయందును ఉత్సాహము కలవారు. 96% జనమునకు ఉన్నత పాఠశాలలను, కళా శాలలను, పుస్తకములను, పరికరములను, ఉపాధ్యాయు లను, తదితర సామగ్రిని, సమకూర్పవలెను. ఈ భావి విద్యాభివృద్ధినిర్మాణమునకు ఈ కళాశాల తగినవిధముగా ఉపకరించునని నేను భావించుచున్నాను. వీలయిన సహా యము లన్నియు కూడగట్టుకొని ఈ కళాశాల అభ్యు దయముతో ప్రయోజనకరమైన సంస్థగా మన స్వరాజ్య ములో నేడు సేవ జేయుచున్నది.

భో. ప.

## ఆంధ్ర జానపద గేయ వాఙ్మయము :-

పద్యముకన్న పదమే ముందు పుట్టినదనియు, ఆ పదము (గేయము) కూడ నాగరకతాప్రారంభమున మానవుడు సంతోషసమయమున చిందులు వేయుచు కూనరాగముల నాలపించుచు లయాన్వితముగా మనోభావముల వెలార్చు టచే, ఉద్భవించిన దనియు, సాహిత్య తత్త్వజ్ఞుల అభి ప్రాయము. కొందరు పండితులు పనిపాటలుచేయు మాన వులు తమ కష్టము కనబడకుండుటకై అప్రయత్నముగా నేవో మాటలు లయాన్వితముగా గేయరూపమున బహి ర్గత మొనర్చిరని తెల్పిరి. ఇం దేది సిద్ధాంతమయినను కవి త్వము ఉల్లాసమునకును కష్ట నివారణమునకును పుట్టిన దని భావింపవచ్చును. భారతదేశమున పూర్వమును, ఇప్పుడును జనపదములే కనుక ఇట్టి గేయములకు పుట్టి నిండ్లును జనపదములే యగును. జానపదు లందే ప్రచా రమున నుండుటచే ఇట్టి గేయములకు జానపద గేయము లని సర్వసాధారణ మగు పేరు కలిగినది. జనపద, జాన పద శబ్దములు క్రమముగా దేశవిభాగమునకును అందుండు ప్రజలకును మన ప్రాచీన వాఙ్మయమున వాడబడినవి. జానపద గేయములనే పల్లెపాట లనుటకూడ కలదు. ఔత్తరాహులు వీటిని లోకగీతము లందురు. ఇంగ్లీషులో వీటినే ఫోక్ సాంగ్సు అందురు. ఇది జర్మను భాషా

జన్యము. పాశ్చాత్య దేశములందు సాహిత్యాభిమానులును, మానవ శాస్త్రవేత్తలును కడచిన రెండు శతాబ్దములనుండి ఇట్టి గేయములను, వాఙ్మయమును సేకరించి పరిశోధనములు చేయుచున్నారు. ఆయా జాతుల సంస్కృతులకును, భాషాసాహిత్యములకును ఇట్టి గేయములే మూలకందము లని వారలు అభిప్రాయపడియున్నారు.

జానపద గేయమునకు ముఖ్యలక్షణములు 1. అజ్ఞాత కర్తృకత్వము లేదా సామూహిక కర్తృకత్వము 2. స్థిరరూపరాహిత్యము. 3. రచనాకాలము తెలియకపోవుట, 4. మౌఖిక ప్రచారము, 5. అకృతక శైలి, 6. గేయత్వము, 7. ఆశురచన, 8. పునరావృత్తి, 9. జనసామాన్య పరిచిత వస్తువు. ప్రతి గేయమునందును ఈ లక్షణము లన్నియు ఉండనవసరము లేదు. కాని ఈ లక్షణము లన్నింటికి కూడలియగు ప్రధాన తత్త్వము—అజ్ఞాత శిల్పము, సార్వజనీనత ఉన్న చాలును. కనుక ప్రాక్తనమానవుని మనోగత భావ వ్యక్తీకరణములును లయాన్వితములునగు నుడుగులును, అఖండపాండితీమండితుల జనామోదముగల పదకవితలును, జానపద గేయములే అగును. ఒక్కొక్క లక్షణమునుబట్టి ఏది జానపద గేయమో, ఏది కాదో, నిర్ణయించుటకన్న సాహిత్య తత్త్వము ననుసరించి కవిత్వము నంతటిని రెండు పెద్ద విభాగములుగా చేయవచ్చును. ఒకదాని తత్త్వము జ్ఞాత శిల్పము. మరియొకదాని తత్త్వము అజ్ఞాత శిల్పము. మొదటిది భావుకుడయిన కళాకారుని ప్రయత్నమున తీర్చి దిద్దబడినది. రెండవది జానపదుని సృష్టి, మరియు అప్రయత్నముగా ఒకనోటినుండి ఇంకొక నోటికెక్కి ఒక ప్రాంతమునుండి ఇంకొక ప్రాంతమునకు ప్రాకి తనకు తానే రూపు దిద్దుకొన్నట్టిది. మొదటిది ఏక కర్తృకము. రెండవది అజ్ఞాత కర్తృకము లేదా అనేకకర్తృకము. మొదటిది నాగరకతా మందార సౌరభ్య సంవాసితము. రెండవది ప్రాకృతత్వ పృథ్వీ గంధబంధురము. మొదటిది రెండవదాని క్రమపరిణామ వికాసరూపమని విజ్ఞుల అభిప్రాయము. ఆంధ్రకవిత్వముకూడ ఇట్టి క్రమపరిణామమునకు వెలియైనది కాదు. జానపద గేయములే దేశకవితగా పరిణమించినట్లు మనకు అనేకాధారములున్నవి. సీసము, గీతము, రగడ, ద్విపద, మధ్యాక్కర, తరువోజ మున్నగు దేశీయచ్ఛందములు కొన్ని జానపదగేయముల నుండియే కొలది మార్పులతో ఏర్పడినట్లు భావింపనగును.

జానపద సాహిత్యమునకు నిత్యజీవితమును అలవు కొను శక్తి హెచ్చు. ఈ వాఙ్మయము కేవలము ప్రజానీక మిచ్చిన కేలూతవలననే కాలు నిలద్రొక్కుకొన్నది. నిత్యజీవితమందు వాడుకొనెడు వ్యావహారిక భాషయందు సులభశైలిలో సాధారణరీతిలో మనోభావములు వెలార్చునట్టి ఈ గేయములు జానపదులకు ప్రీతిపాత్రము లయినవి. ఇదిగాక, జానపద గేయములు ఆయా దేశములందలి మతపరిణామములను, మనస్తత్త్వములను, వీరుల ఉదంతములను, పతివ్రతల కథలను, అత్యాచారములకు గురియైనవారి గాథలను, ఆచార వ్యవహారములను, విశ్వాసములను, వినోదములను, విందులను, వేడుకలను, అన్యోన్యానురాగములను, సంయోగ వియోగములను, సౌందర్య సౌభాగ్యములను, సుఖదుఃఖములను, జాతీయతను ప్రతిబింబించుటచే ఈ జానపద గేయములు నిసర్గమనోహరములుగా నుండును. జాతీయత నింతగా పుంజికొన్నవి కనుకనే ఈ పదకవితలు దేశికవితలుగా పరిణతి నొందినవి. దేశీయులగు కవులు మార్గకవిత్వముపై తిరుగుబాటొనర్చి దేశీయేతివృత్తములను తీసికొని దేశిచ్ఛందములందు దేశీయులకు అనువైనట్లు కవితను చెప్పిరి.

గేయసాహిత్యము చిరకాలమునుండి తెలుగునాట వృద్ధియైనదనుటకు శిష్టకవులు పేర్కొన్న సమకాలిక గేయములే గొప్పసాక్ష్యము. గేయములన్నియు మాత్రాఛందమున నుండును. నన్నయకు పూర్వపు శాసనములందే మనకు దేశికవితారీతులు కాన్పించును. నన్నయభట్టు స్వయముగా తరువోజ, మధ్యాక్కర, అక్కర, మధురాక్కర అను వాటిని వాడెను. అంకమాలికలు, ఊయెలపాటలు, ఆలతులు, గౌడుగీతములు, రోకటి పాటలు మున్నగునవి నన్నెచోడుడు పేర్కొనెను. ఈ గేయముల జాడ మన కధికముగా కనబడువది పాల్కురికి సోమనాథుని రచనలయందు. సోమనాథుని కవిత్వమునకు ఆధారము లానాడు ప్రజలు భక్త్యుద్రేకములతో పాడుకొన్న గేయములేనట. "ఆతత బసవపురాతన భక్త గీతార్థ సమితియే మాతృక" గాగ ఆతడు కవిత్వరచనకు

కడంగెను. సోమనాథుడు రోకటిపాటలను, తుమ్మెద, ప్రభాత, పర్వత, ఆనంద, శంకర, నివాళి, వాలేశు, గొబ్బి, వెన్నెల - ఇత్యాది పదములను పేర్కొనెను. ఏగంటివారి కాలజ్ఞానవచనములందు తుమ్మెదపదములు, ఏలపదములు, లెల్లెపాటలవంటివి గలవు. లక్షణకారులు ఉదాహరించిన నాచనసోముని జాజరపాట ఛందమునసే ఇప్పటికిని తెలంగాణమున జాజరపాటలు కామునిపున్నమ పండుగు సందర్భమున జానపదులు పాడెదరు. కేతన దశకుమారచరిత్రమున మూలమందు లేని పాటల ప్రసక్తి కలదు. శ్రీనాథుడు యక్షగానములను జాదుర (జాజర) లను తడవెను. మంచనశర్మ, టిట్టిభసెట్టి యను మిత్రద్వయము ఓరుగల్లు చూడబోయి ద్విపద ప్రబంధమున వీరానీకమును పాడు వనితను, పరశురాముని కథలను పాడు బవనీల చక్రవర్తిని, కామవల్లీమహాలక్ష్మి కైటభారుల వలపును పాడుచు వచ్చు జక్కుల పురంధ్రిని కాంచెను. పోతన్న గోవిందుమీది పాటలు వినెను. కొరవి గోపరాజు వెన్నెలగుడి పాటను పేర్కొనెను. తాళ్ళపాక అన్నమాచార్యులవారు తమ కాలమందు వినబడుచుండిన జానపదగేయముల మాదిరుల కన్నిటికిని సరిపోవునట్లు సంకీర్తనలను రచించి పెట్టిరి. ఈయనభార్యయగు తాళ్ళపాక తిమ్మక్కయొక్క కృతి సాగినది ఈపాట బాటయందే. చిన తిరుమలాచార్యుడు పదములు వ్రాయుటయే కాక సంకీర్తన లక్షణముగూడ రచించెను. జానపద గేయములు కాకపోయినను తాళ్ళపాకవారి రచనలు గేయస్వరూపములను, వాటి పరిణామమును మాత్రము సూచించును. సంకీర్తనలక్షణమునందు ఏలలు, గొబ్బిళ్ళు, చందమామ పదములు, అర్ధచంద్రికలు మొదలగు గేయముల లక్షణములు వివరింపబడినవి. దిగ్విజయార్థము బయలుదేరనున్న శ్రీకృష్ణదేవరాయలకు ఒక జానపద గేయము కలిగించిన అపరిమితోత్తేజనమును గూర్చిన ఐతిహ్యము అంద రెరిగినదే. స్వయముగా ఆ మహారాజు ప్రాతర్వేళల "నంధు యంత్ర నతిక్వత్రోద్గీత గేయాఘము" ల్వినెను. రుద్రకవి సుగ్రీవవిజయమను యక్షగానమునందు వివిధములగు గేయఫణుతులు కాననగును. దామెరల వెంగళభూపాలుడు జాజరపాటలను, ధవళములను కల్యాణపు పాటలను పేర్కొనెను. కదరీపతి నాయకుడు "సువ్వాలు న్శోభనములు ధవళాలు న్మొదలయిన పాట"లే కాక ఏలపదములు, రాట్నముపాటలు, పరశురామునిపై పాటలు తడవెను. నాయకరాజుల కాలమందు రంగాజి, రామభద్రాంబ, విజయరాఘవనాయకుడు మొదలగువారు పదకవిత లల్లిరి. భద్రాచలరామదాసు పాడినపాటలు జానపదగేయములుగా ప్రచార మందినవి. క్షేత్రయ్యపదములు, త్యాగరాజకీర్తనలు కర్ణాటకసంగీత సరస్వతికి తలమానికములై వరలినవి. ఎలకూచి బాల సరస్వతి, కంకంటి పాపరాజు, గోగులపాటి కూర్మనాథకవి ఆలూరి కుప్పన మున్నగు పండితకవులుకూడ పదరచనమునకు దోహదమొనర్చిరి. వీరి కవిత్వమంతయు పదకవిత్వమే యైనను ప్రౌఢమైనది. ఇది దేశిసారస్వతమున జేరును. గేయ కవితా పరిణామమును కనుగొనుటకు కూడ ఉపకరించును.

త్యాగరాజు తరువాత స్వయముగా జానపదులు రచించినవి లేదా జనపదములందు ప్రచారముగాంచిన గేయము లనేకములు మనకు దక్కిన వనుకొనవచ్చును. కొన్ని కాలగర్భమున కలిసిపోయి యుండును. ఏ వాఙ్మయమునకును ఈ విపత్తు తప్పినదికాదు. భద్రపరచెడువా రుండినచో యాగంటి లక్ష్మయ్యగారి వచనములవంటి అతి ప్రాచీన గేయములు మనకు మరికొన్నియైనను దక్కియుండును. ప్రాత తాళపత్ర గ్రంథములందు అచ్చటచ్చట కొన్ని పాటలుమాత్రము కనబడుచున్నవి. ముద్రణ సౌకర్యములు కలిగిన తరువాత ఈ గేయ వాఙ్మయము కొంత ముద్రింపబడినది. ముద్రిత గేయములందు అధికభాగ మాధునికమే. మౌఖిక ప్రచారమున నున్న చిన్నచిన్న గేయములు ఆధునికు లగు ఉత్సాహవంతులు సేకరించి ప్రకటించుచున్నను సేకరింపవలసినవి ప్రకటింపవలసినవి ఇంకను పెక్కులున్నవి. వాటిసంఖ్య లక్షల కెక్కును. వాటి చావుపుట్టుకలు, పెరుగుట విరుగుటలు జానపదుల జిహ్వాంచలములందే జరుగుచున్నవి. ఏ గీత మెప్పటిదో, ఎన్ని యెన్ని మార్పుల నందినదో తెలిసికొనజాలము.

ఇట్టి జాతీయ సంపదనుగూర్చి తొలిసారిగా ఆంధ్ర లోకమునకు పరిచయము కలిగించినవాడు బ్రౌను మహాశయుడు. అతని తరువాత ముప్పదేండ్లకు మరల

జన్యము. పాశ్చాత్య దేశములందు సాహిత్యాభిమానులును, మానవ శాస్త్రవేత్తలును కడచిన రెండు శతాబ్దములనుండి ఇట్టి గేయములను, వాఙ్మయమును సేకరించి పరిశోధనములు చేయుచున్నారు. ఆయా జాతుల సంస్కృతులకును, భాషాసాహిత్యములకును ఇట్టి గేయములే మూలకందము లని వారలు అభిప్రాయపడియున్నారు.

జానపద గేయమునకు ముఖ్యలక్షణములు 1. అజ్ఞాత కర్తృకత్వము లేదా సామూహిక కర్తృకత్వము 2. స్థిరరూపరాహిత్యము. 3. రచనాకాలము తెలియక పోవుట, 4. మౌఖిక ప్రచారము, 5. అకృతక శైలి, 6. గేయత్వము, 7. ఆశురచన, 8. పునరావృత్తి, 9. జన సామాన్య పరిచిత వస్తువు. ప్రతి గేయమునందును ఈ లక్షణము లన్నియు ఉండనవసరము లేదు. కాని ఈ లక్షణము లన్నింటికి కూడలియగు ప్రధాన తత్త్వము—అజ్ఞాత శిల్పము, సార్వజనీనత ఉన్న చాలును. కనుక ప్రాక్తనమానవుని మనోగత భావ వ్యక్తీకరణములును లయాన్వితములునగు నుడుగులును, అఖండపాండితీమండితుల జనామోదముగల పదకవితలును, జానపద గేయములే అగును. ఒక్కొక్క లక్షణమునుబట్టి ఏది జానపద గేయమో, ఏది కాదో, నిర్ణయించుటకన్న సాహిత్య తత్త్వము ననుసరించి కవిత్వము నంతటిని రెండు పెద్ద విభాగములుగా చేయవచ్చును. ఒకదాని తత్త్వము జ్ఞాత శిల్పము. మరియొకదాని తత్త్వము అజ్ఞాత శిల్పము. మొదటిది భావుకుడయిన కళాకారుని ప్రయత్నమున తీర్చి దిద్దబడినది. రెండవది జానపదుని సృష్టి, మరియు అప్రయత్నముగా ఒకనోటినుండి ఇంకొక నోటికెక్కి ఒక ప్రాంతమునుండి ఇంకొక ప్రాంతమునకు ప్రాకి తనకు తానే రూపు దిద్దుకొన్నట్టిది. మొదటిది ఏక కర్తృకము. రెండవది అజ్ఞాత కర్తృకము లేదా అనేకకర్తృకము. మొదటిది నాగరకతా మందార సౌరభ్య సంవాసితము. రెండవది ప్రాకృతత్వ పృథ్వీ గంధబంధురము. మొదటిది రెండవదాని క్రమపరిణామ వికాసరూపమని విజ్ఞుల అభిప్రాయము. ఆంధ్రకవిత్వముకూడ ఇట్టి క్రమపరిణామమునకు వెలియైనది కాదు. జానపద గేయములే దేశ కవితగా పరిణమించినట్లు మనకు అనేకాధారములున్నవి. సీసము, గీతము, రగడ, ద్విపద, మధ్యాక్కర, తరువోజ మున్నగు దేశీయచ్ఛందములు కొన్ని జానపదగేయముల నుండియే కొలది మార్పులతో ఏర్పడినట్లు భావింపనగును.

జానపద సాహిత్యమునకు నిత్యజీవితమును అలవుకొను శక్తి హెచ్చు. ఈ వాఙ్మయము కేవలము ప్రజానీక మిచ్చిన కేలూతవలననే కాలు నిలద్రొక్కుకొన్నది. నిత్యజీవితమందు వాడుకొనెడు వ్యావహారిక భాషయందు సులభశైలిలో సాధారణరీతిలో మనోభావములు వెలార్చునట్టి ఈ గేయములు జానపదులకు ప్రీతిపాత్రములయినవి. ఇదిగాక, జానపద గేయములు ఆయా దేశములందలి మతపరిణామములను, మనస్తత్త్వములను, వీరుల ఉదంతములను, పతివ్రతల కథలను, అత్యాచారములకు గురియైనవారి గాథలను, ఆచార వ్యవహారములను, విశ్వాసములను, వినోదములను, విందులను, వేడుకలను, అన్యోన్యానురాగములను, సంయోగ వియోగములను, సౌందర్య సౌభాగ్యములను, సుఖదుఃఖములను, జాతీయతను ప్రతిబింబించుటచే ఈ జానపద గేయములు నిసర్గమనోహరములుగా నుండును. జాతీయత నింతగా పుంజికొన్నవి కనుకనే ఈ పదకవితలు దేశికవితలుగా పరిణతి నొందినవి. దేశీయులగు కవులు మార్గకవిత్వముపై తిరుగుబాటొనర్చి దేశీయేతివృత్తములను తీసికొని దేశిచ్ఛందములందు దేశీయులకు అనువైనట్లు కవితను చెప్పిరి.

గేయసాహిత్యము చిరకాలమునుండి తెలుగునాట వృద్ధియైనదనుటకు శిష్టకవులు పేర్కొన్న సమకాలిక గేయములే గొప్పసాక్ష్యము. గేయములన్నియు మాత్రాఛందమున నుండును. నన్నయకు పూర్వపు శాసనములందే మనకు దేశికవితారీతులు కాన్పించును. నన్నయభట్టు స్వయముగా తరువోజ, మధ్యాక్కర, అక్కర, మధురాక్కర అను వాటిని వాడెను. అంకమాలికలు, ఊయెలపాటలు, ఆలతులు, గౌడుగీతములు, రోకటి పాటలు మున్నగునవి నన్నెచోడుడు పేర్కొనెను. ఈ గేయముల జాడ ఘన కధికముగా కనబడునది పాల్కురికి సోమనాథుని రచనలయందు. సోమనాథుని కవిత్వమునకు ఆధారము లానాడు ప్రజలు భక్త్యుద్రేకములతో పాడుకొన్న గేయములేనట. "అతత బసవపురాతన భక్త గీతార్థ సమితియే మాతృక" గాగ ఆతడు కవిత్వరచనకు

కడంగెను. సోమనాథుడు రోకటిపాటలను, తుమ్మెద, ప్రభాత, పర్వత, ఆనంద, శంకర, నివాళి, వాలేశు, గొబ్బి, వెన్నెల - ఇత్యాది పదములను పేర్కొనెను. ఏగంటివారి కాలజ్ఞానవచనములందు తుమ్మెదపదములు, ఏలపదములు, లెల్లెపాటలవంటివి గలవు. లక్షణకారులు ఉదాహరించిన నాచనసోముని జాజరపాట ఛందముననే ఇప్పటికిని తెలంగాణమున జాజరపాటలు కాముని పున్నమ పండుగు సందర్భమున జానపదులు పాడెదరు. కేతన దశ కుమారచరిత్రమున మూలమందు లేని పాటల ప్రసక్తి కలదు. శ్రీనాథుడు యక్షగానములను జాదుర (జాజర) లను తడవెను. మంచనశర్మ, టిట్టిభసెట్టి యను మిత్ర ద్వయము ఓరుగల్లు చూడబోయి ద్విపద ప్రబంధమున వీరానీకమును పాడు వనితను, పరశురాముని కథలను పాడు బవనీల చక్రవర్తిని, కామవల్లీమహాలక్ష్మీ కైటభారుల వలపును పాడుచు వచ్చు జక్కుల పురంధ్రిని కాంచెను. పోతన్న గోవిందుమీది పాటలు వినెను. కొరవి గోపరాజు వెన్నెలగుడి పాటను పేర్కొనెను. తాళ్ళపాక అన్నమాచార్యులవారు తమ కాలమందు వినబడుచుండిన జానపదగేయముల మాదిరుల కన్నిటికిని సరిపోవునట్లు సంకీర్తనలను రచించి పెట్టిరి. ఈయనభార్యయగు తాళ్ళపాక తిమ్మక్కయొక్క కృతి సాగినది ఈపాట బాటయందే. చిన తిరుమలాచార్యుడు పదములు వ్రాయుటయే కాక సంకీర్తన లక్షణముగూడ రచించెను. జానపద గేయములు కాకపోయినను తాళ్ళపాకవారి రచనలు గేయస్వరూపములను, వాటి పరిణామమును మాత్రము సూచించును. సంకీర్తన లక్షణమునందు ఏలలు, గొబ్బిళ్ళు, చందమామ పదములు, అర్ధచంద్రికలు మొదలగు గేయముల లక్షణములు వివరింపబడినవి. దిగ్విజయార్థము బయలుదేరనున్న శ్రీకృష్ణదేవరాయలకు ఒక జానపద గేయము కలిగించిన అపరిమితోత్తేజనమును గూర్చిన ఐతిహ్యము అంద రెరిగినదే. స్వయముగా ఆ మహారాజు ప్రాతర్వేళల "నంధు యంత్ర నలిక్పత్రోద్గీత గేయాఘము" ల్వినెను. రుద్రకవి సుగ్రీవవిజయమను యక్షగానమునందు వివిధములగు గేయఫణుతులు కానవగును. దామెరల వెంగళభూపాలుడు జాజరపాటలను, ధవళములను కల్యాణపు పాటలను పేర్కొనెను. కదరీపతి నాయకుడు "సువ్వాలు నోక్షితనములు ధవళాలు నొదలయిన పాట"లే కాక ఏలపదములు, రాట్నముపాటలు, పరశురామునిపై పాటలు తడవెను. నాయకరాజుల కాలమందు రంగాజీ, రామభద్రాంబ, విజయరాఘవనాయకుడు మొదలగువారు పదకవిత లల్లిరి. భద్రాచలరామదాసు పాడినపాటలు జానపదగేయములుగా ప్రచార మందినవి. క్షేత్రయ్యపదములు, త్యాగరాజకీర్తనలు కర్ణాటకసంగీత సరస్వతికి తలమానికములై వరలినవి. ఎలకూచి బాల సరస్వతి, కంకంటి పాపరాజు, గోగులపాటి కూర్మనాథకవి ఆలూరి కుప్పన మున్నగు పండితకవులుకూడ పదరచనమునకు దోహదమొనర్చిరి. వీరి కవిత్వమంతయు పదకవిత్వమే యైనను ప్రౌఢమైనది. ఇది దేశిసారస్వతమున జేరును. గేయ కవితా పరిణామమును కనుగొనుటకు కూడ ఉపకరించును.

త్యాగరాజు తరువాత స్వయముగా జానపదులు రచించినవి లేదా జనపదములందు ప్రచారముగాంచిన గేయము లనేకములు మనకు దక్కిన వనుకొనవచ్చును. కొన్ని కాలగర్భమున కలిసిపోయి యుండును. ఏ వాఙ్మయమునకును ఈ విపత్తు తప్పినదికాదు. భద్రపరచెడువారుండినచో యాగంటి లక్ష్మయ్యగారి వచనములవంటి అతి ప్రాచీన గేయములు మనకు మరికొన్నియైనను దక్కియుండును. ప్రాత తాళపత్ర గ్రంథములందు అచ్చటచ్చట కొన్ని పాటలుమాత్రము కనబడుచున్నవి. ముద్రణ సౌకర్యములు కలిగిన తరువాత ఈ గేయ వాఙ్మయము కొంత ముద్రింపబడినది. ముద్రిత గేయము లందు అధికభాగ మాధునికమే. మౌఖిక ప్రచారమున నున్న చిన్నచిన్న గేయములు ఆధునికు లగు ఉత్సాహవంతులు సేకరించి ప్రకటించుచున్నను సేకరింపవలసినవి ప్రకటింపవలసినవి ఇంకను పెక్కులున్నవి. వాటిసంఖ్య లక్షల కెక్కును. వాటి చావుపుట్టుకలు, పెరుగుట విరుగుటలు జానపదుల జిహ్వాంచలములందే జరుగుచున్నవి. ఏ గీత మెప్పటిదో, ఎన్ని యెన్ని మార్పుల నందినదో తెలిసికొనజాలము.

ఇట్టి జాతీయ సంపదనుగూర్చి తొలిసారిగా ఆంధ్ర లోకమునకు పరిచయము కలిగించినవాడు బ్రౌను మహాశయుడు. అతని తరువాత ముప్పదేండ్లకు మరల

నొక పాశ్చాత్య పండితుడు తొలిసారిగా జానపద గేయములను సేకరించెను. ఆయన జె. ఎ. బాయ్‌ల్ గారు. తరువాత ఇరువదియవ శతాబ్ది ప్రారంభమున ఉత్సాహవంతులగు పండితులును, ప్రచురణ కర్తలును ఈ గేయములను సేకరించి ప్రకటించిరి.

ఇప్పటికి లభించిన ముద్రితాముద్రిత జానపద గేయముల నన్నింటిని విమర్శన సౌలభ్యమునకై కొన్ని భాగములుగా విభజించుకొనవచ్చును.

**పౌరాణిక గేయములు:** జానపద గేయములుకూడ మన శిష్టసాహిత్యమువలెనే వివిధ పురాణేతివృత్తములు కలవి, బహుళ ప్రచారమందున్నవి. అనువాదములగు రామాయణ భారతాది గ్రంథములందు మూలమున లేని కథలు పెక్కులున్నవి. అట్టివి జానపదగేయములందుకూడ నుండుటచే ఇట్టి కూర్పులు సంస్కృతమునుండి ఆంధ్రానువాదమొనర్చిన శిష్టులు చేసిన తరువాత ఆగాథలు విని జానపదులు వాటిని స్వీకరించిరో లేక జానపదులలో ప్రచారమందున్న ఈ మూలాతిశాయి విషయములు తమకు రుచించుటచే పండితులు చేపట్టిరో ఇదమిత్థముగా చెప్పజాలము. జానపదగేయములలో మనము శిష్ట సాహిత్యమందున్న ప్రసిద్ధ పౌరాణిక గాథలన్నియు చూడగలము. పౌరాణిక గాథలపై జానపదులకు అమితమైన భక్తి కలదు. రామాయణ భారత భాగవతాదులందలి కథలును, అష్టాదశ పురాణములందలి ప్రసిద్ధ కథలును జానపదుల చిత్తవృత్తి ననుసరించి మలచబడినవి. కూచకొండ రామాయణము, శారద రామాయణము, ధర్మపురి రామాయణము, రామాయణకథాసుధార్ణవము, మోక్షగుండ రామాయణము, సూక్ష్మ రామాయణము, సంక్షేప రామాయణము, గుత్తెనదీవి రామాయణము, చిట్టి రామాయణము, శ్రీరామదండములు, రామాయణ గొబ్బిపాట, శ్రీరామ జావిలి, అడవి, శాంత, పెండ్లి, సేతు— గోవిందనామములవంటివి రామాయణగాథా పాథః ప్రపూరములు. ఇంకను "విద్దికూచి రామాయణ మారుకాండముల నచ్యుత జాగరవేళ బాడి" నట్టి వెన్ని మృగ్యమైపోయెనో తెలియదు. ఇక రామాయణమునందలి కొన్నికొన్ని భాగములనే తెలుపునవి శాంతా కల్యాణము, పుత్రకామేష్టి, కౌసల్య బైకలు, శ్రీరాముల ఉగ్గుపాట, రాఘవ కల్యాణము, రాములవారి అలుక, సుందరకాండపదము, ఋషుల ఆశ్రమము, సుగ్రీవ విజయము, కోవెల రాయబారము, అంగద రాయబారము, లక్ష్మణమూర్ఛ, లంకాయాగము, గుహ భరతుల అగ్నిప్రవేశము, శ్రీరామ పట్టాభిషేకము, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, కుశలాయకము, కుశలవకుచ్చెల కథ, కుశలవ యుద్ధము, వేపూరి బ్రతుకమ్మ కుశలవ పాట, పాతాళహోమము, శతకంఠ రామాయణము వంటివి అసంఖ్యాకములు కలవు. ఒక్క సీతాదేవిని గురించియే - సీతపుట్టుక, సీతాకల్యాణము సీత నత్తవారింటి కంపుట, సీత సమర్త, సీత శుభగోష్ఠి, సీత గడియ, సీత వామనగుంటలు, సీతామ్మవారి అలుక, సీత వసంతము, సీత దాగిలిమూతలు, సీత సురటి, సీత ముద్రికలు, సీత ఆనవాలు, సీత అగ్నిప్రవేశం, సీత వేవిళ్ళు మున్నగు పాటలు ఎన్నియో కలవు. సీతమ్మ చెర, మాయలేడి పాట మున్నగునవి అముద్రితములుగా నున్నవి. ఈ పాటలయందలి భాష, భావము, కల్పనలు జానపద వాసనను వెలార్చుచుండును.

రామాయణగాథల తరువాత భారతగాథలు లెక్కింపదగినవి. నలచరిత్ర, దేవయాని చరిత్ర, సుభద్రా కల్యాణము, సుభద్ర సారె, ధర్మరాజు జూదము, ద్రౌపది వలువలు, పండుపాట, విరాటపర్వము, పద్మవ్యూహము, విశ్వరూపము, భగవద్గీత కథాగీతము, సావిత్రి బ్రతుకమ్మ పాట, శశిరేఖా పరిణయము, గయోపాఖ్యానము, పరాశర మత్స్యగంధి సంవాదము వంటివి జానపదుల నోళ్ళయందు బ్రతికియున్న భారత గాథలును, విరాట, కర్ణ శల్య, పర్వములును, ఉత్తర, దక్షిణ గోగ్రహణములును పెద్ద పదములు.

ఇటులే అనేకములయిన భాగవత గాథలను కూడ జానపదులు పాడుకొందురు. భక్తి శృంగారములవలె జానపదులను శ్రీకృష్ణుని చిలిపిచేష్టలు మరింత పరవశులను చేసినవి. భాగవతమునకు సంబంధించిన కథలందు ప్రహ్లాద చరిత్ర పదము, వామన విజయము, వామన చరిత్రము, అంబరీషోపాఖ్యానము, గజేంద్రమోక్షము, శ్రీకృష్ణ జననము, కాళింగమడుగు పాట, శ్రీకృష్ణుని చల్దులు, బాలకృష్ణ లీలలు, గుమ్మడు పాట, యశోద

కొంగపాట, గోపికాస్త్రీల జలక్రీడలు, రుక్మిణీకల్యాణము, చిలుక రాయబారము, సత్యభామ సరసము, రుక్మిణీదేవి ముచ్చట, రుక్మిణీదేవి సీమంతము, పారుజాత వల్లవి, ఉషాస్వప్నము వంటివి ముఖ్యములు. కుచేలోపాఖ్యానము, భ్రమర గీతలు మున్నగు పాటలు అముద్రితములు.

సత్య హారిశ్చంద్ర, చంద్రమతీదేవి బ్రతుకమ్మపాట, గోవు పాట, దత్తాత్రేయ జననము, దక్షయజ్ఞము, గంగా వివాహము, గంగాగౌరి సంవాదము, సవతుల కయ్యము, ఈశ్వర భృంగి వాదము, మేనకా పార్వతీ సంవాదము, లక్ష్మీ పార్వతుల సంవాదము, త్రిపురాసుర సంహారము, సురాభాండేశ్వరము, మార్కండేయ జననము, సిరియాళ మహారాజు చరిత్రము. భల్లాణరాయ కథ, కొమిరెల్లి మల్లన్నకథ. వరదరాజుపెండ్లి పాట, అండాళ్ చరిత్రము, శ్రీరంగ మహాత్మ్యము, తిరుమంత్రము పాట, దశావతారముల పాట, లక్ష్మీదేవి సొగటాలాట, లక్ష్మీదేవి వర్ణనము, వేంకటేశ్వరుల వేట, చెంచెత కథ, ఏకాదశీ మాహాత్మ్యము, వరహావతార చరిత్రము, నూటయెనిమిది దివ్యస్థలములు, వేంకటేశ్వర మాహాత్మ్యము వంటివి ఇతర పురాణములకును మాహాత్మ్యములకును సంబంధించిన గేయములై యున్నవి. ఇట్టి గేయములందు అంతటను మనకు కన్పించునది జానపదుల తాదాత్మ్యము. మూలకథలకును గేయములందలి కల్పనలకును గల భేద మరసి దానిని జానపదుల జీవితముతో పోల్చిచూచిన జానపదుల చిత్తవృత్తులు వారికి ఆ యా పురాణపురుషుల యెడ గల అభిమానము భక్తి ప్రేమలు తెల్లమగును.

౭. చారిత్రక గేయములు :- జానపదగేయ వాఙ్మయమున చరిత్రకు సంబంధించిన గేయములకు ఒక విశిష్ట స్థానము కలదు. వస్తువునందును, శైలియందును, కథా కథన పద్ధతియందును, తక్కిన జానపద గేయములకన్న ఇవి భిన్నముగా నుండును. వీటినే వీరగీతము లందురు కూడ. చారిత్రక వీరగీతములు తత్తదుచిత వీరసంఘటన మేదియో జరిగినవెంటనే ఉద్భవించును. ఆ సన్నివేశమును కన్నులార గాంచియో, చెవులార వినియో జానపదు డొకడు ఉద్వేగముతో గాన మొనరించును. ఆ పాట అంతటను ప్రాకిపోవును. ఇట్లు విస్తరించుటలో పాటయొక్క వస్తువు కాలక్రమమున మార్పుల నొందును. ఒక క్రొత్త పాటయందు అభివర్ణింపబడిన సంఘటనములకు ప్రాత కాలపు గాన ప్రవాహమందలి సంఘటనలు తోడై ఊహింపరాని మార్పులు కలుగును. ఎప్పుడో లిఖితమై పోయిన ఇట్టి చారిత్రక గేయములందు సిసలైన చరిత్రము లభించును. కానిచో ఇవి రానురాను మారిపోయి గుర్తించుటకు వీలుగాక అస్పష్టచరిత్రములుగా వరిణమించి మరికొన్ని దినములకు పుక్కిటి పురాణములుగా కల్పిత కథలుగా మారిపోవును. చారిత్రక వీరగేయములకును తదితర జానపద గేయములకును ధ్యేయములు వేరువేరు. ఉత్సాహోల్లాసములకు గాక వీరగీతములు అవబోధమునకై పాడబడును. ఆంధ్రదేశము తొలినుండి వీరప్రసువు. తెలుగువారికి వీరాభినివేశము మెండు. కనుకనే తెలుగునాట వీరపూజలు పాదుకొన్నవి. తదితర జానపదగేయములవలెనే తెలుగుదేశమున చారిత్రకగేయములు కూడ అసంఖ్యాకములుగా నున్నవి. "తెలంగాణమందే మియాసాబ్, సోమనాద్రి, రామేశ్వరరావు, రాణి శంకరమ్మ, సవై వెంకటరెడ్డి, కుమారరాముడు, కర్నూలు నవాబు, మున్నగువారి కథ లున్న"వని కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు అనిరి. ఇవిగాకను సదాశివరెడ్డి, పర్వతాల మల్లారెడ్డి, సర్వాయి పాపడు, బల్లూరి కొండ్రాయుడు ఇటువంటి తెలంగాణపువీరుల కథలును బహుళ ప్రచారమందిన గేయములే. చారిత్రకముగా పల్నాటి వీరుల కథలు ప్రాచీనములు. శ్రీనాథుని, బాలచంద్రుని యుద్ధ మొక్కటియే ఇప్పటికి ముద్రింపబడినది. ప్రాచ్య పుస్తక భాండాగారమున ఈ వీరుల కథలు అనేకములు మూలుగుచున్నవి. కోళ్ళ పోట్లాట—గోవు యుద్ధము, రాయబారము, యుద్ధ సన్నాహము, గురజాల యుద్ధము పూర్వభాగము, కల్లు ప్రతిష్ఠ, బాలుని కథ, బాలుని యుద్ధము, కన్నమనేని యుద్ధము—గోవు సంస్కారము, కొమ్మరాజు యుద్ధము, బ్రహ్మనాయని విరుగు వంటి కథలు పాఠభేదములతో అందు కాననగును. వీటి తరువాత ప్రసిద్ధికెక్కినది కాటమరాజు కథ. ఎఱ్ఱగొల్లలు, మందుచ్ఛువారు ఈ కథలను చెప్పుదురు. శ్రీనాథుడు వ్రాసినట్లు ప్రతీతిగల కాటమరాజు కథ లభింపలేదు. కాని "పినయెల్ల యనువాడు ప్రియము దీపింప వలనొప్ప

శ్రీనాథు వచన పద్ధతిని" యదుశాస్త్రమంతయుపాడెను. ఈ కాటమరాజు కథ, దీని కనుబంధముగా భట్టు రాయ బారము, కోటపాటి తాటివృక్షము తెచ్చు కథ, ఎఱ్ఱగడ్డ పోట్లాటలు ముద్రింపబడినవి. కాటమరాజు కథకు సంబంధించిన మరికొన్ని గేయములు అముద్రితములు. గోరంత చారిత్రకాంశము కొండంత పురాణముగా పెరిగిన కథ లందు కుమారరాముని కథ అగ్రగణ్యము. "రెడ్డొచ్చె రెడ్డొచ్చె రెడ్డొచ్చె నమ్మా" అను చిన్నచారిత్రక గేయము రెడ్లనాటి యశఃప్రాభవములను ప్రజా జీవితమును చాటునట్టిది. "కొండవీడు మనదేరా" అను గేయము శ్రీకృష్ణరాయల కాలపు ఆంధ్రుల వీరప్రతిభకు జయపతాక. కథాస్థలము తమిళదేశమైనను తెలుగు దేశమున ప్రాకినకథ దేశింగురాజుకథ. తెలుగువారి శౌర్యము అఖండ మని చేయెత్తి చాటునట్టిది బొబ్బిలికథ. వీర గేయములందు ఇంత సార్వజనీనతకలది మరియొకటిలేదు. సిసలైన జానపద గేయమునకు ఉండవలసిన లక్షణము లన్నియు దీనికి గలవు. ప్రాంతీయముగా ప్రచారమందినది పెద్దాపురపు కోడిపందెములపాట. ఇరువదియవ శతాబ్ది ప్రథమ పాదమునకు చెందినది అల్లూరి సీతారామరాజు కథ. హైద్రాబాదు స్వాతంత్ర్య సమరమున ప్రాణము లొడ్డిన వీరుల చరిత్రములు ఇప్పుడిప్పుడే సముద్రతరంగము లట్లు వ్యాపించుచున్నవి. బంగారు తిమ్మరాజుకథ, ఆరె మరాటీలకథ, బల్గారి కొండప్రాయునికథ, పర్వతాల మల్లారెడ్డికథ వంటివి అస్పష్ట చారిత్రకములు. జానపదుల దృష్టిలో శౌర్య పరాక్రమములనగా ఎట్టివో తెలిసికొనుటకు ఈ చారిత్రక వీరగేయములు తోడ్పడును.

**పారమార్థిక గేయములు :** భక్తి, కర్మ, జ్ఞానమార్గములు మూడింటికినిసంబంధించిన గేయములు లక్షోపలక్షలున్నవి. భక్తిగేయములను శైవ వైష్ణవము లని విభజించుకొన వచ్చును. పూర్వశైవుల తుమ్మెద పదములలో ఇప్పటికిని కొన్ని నిలిచియున్నవి. తాళ్ళపాకవారు, క్షేత్రయ్య, త్యాగరాజు వ్రాసిన కీర్తనలు, పరిమళరంగని పదములు, ఘట్టుపల్లి ధర్మపురి, ఛత్రపురి, జావళీలును సంగీతజ్ఞుల సొమ్మైపోయినవి. అధ్యాత్మ రామాయణకీర్తనలు అటు నిటు ప్రమొగ్గినవి. జానపదులందు అధికాదరణము పొందిన వారిలో భద్రాచల రామదాసు అగ్రేసరుడు. తూము నృసింహదాసు, వరాంకుశదాసు, నిట్టల ప్రకాశదాసు, తాటంకము వేంకటదాసువంటి భక్తుల గేయములను హరిదాసులు పాడుచు పొట్టపోసికొనుచున్నారు. గురు పూజాకీర్తనలు, రామనామము, రామనామ మాహాత్మ్యము, భగవన్నామ సంకీర్తనలు, హరిభజనకీర్తనలు, శ్రీరామ భజనామృత సంకీర్తనలు, భజనకీర్తనలు, హరినామ సంకీర్తనలు, తిరునామములు, పాండురంగ బృందావన కీర్తనలు, భక్తిసార సంగ్రహ కీర్తనలు, భజన మాల, కాలేషా మస్తాన్ దేవుని కీర్తనలు, కుసుమ హరనాథ కీర్తనలు, భగవన్నామ సంకీర్తనలు, భ్రమరాంబికాష్టకము, నూతనభజన కోలాట కీర్తనలు, రాకమచెర్ల కీర్తనలు, మున్నగు భజనకీర్తనల పుస్తకములందును స్త్రీలపాటల సంపుటము లందును, శ్రీ గంగాధరంగారి ప్రచురణము లందును, ఇట్టిభక్తి సారస్వతము ముద్రణ మునొందినను, మౌఖికప్రచారమున ప్రాణములు నిలుపుకొనుచున్న గేయము లింకను కలవు. సంకీర్తనములు, పదములు, దరువులతోపాటు మేలుకొలుపులు, లాలి పాటలు, జోలపాటలు, కోలాటములు, మంగళహారతులును భక్తిగేయములలో చేరిపోవును. కోలాట పాట లందు మధురభక్తిమెండు. వీటిలో సంగీత సాహిత్యములతోపాటు కొంత నృత్యముండును. పాల్కురికి పేర్కొన్న ప్రభాతపదములు మేలుకొలుపులైయుండును. మేలుకొలుపులనే భూపాలము లందురు. ఇవి భూపాల రాగమున పాడబడుట సాధారణము కనుక వీటికి ఈపేరే వచ్చినది. వేదాంత పరములగు మేలుకొలుపులుకూడ కలవు. కృష్ణపరమగు మేలుకొలుపులందు మధురభక్తి కాంచనగును. మంగళహారతులు అన్నిదేవతలకు సంబంధించినవి కలవు. ఇవి వర్ణనరూపమునను స్తోత్రరూపమునను, సేవారూపమునను భక్తివేదాంత శృంగార రూపమునను ఉన్నవి.

భక్తిగేయముల వలెనే వేదాంత గేయములు కూడ పెక్కులు గలవు. తత్త్వవిషయములు కలవగుటచే ఇట్టి గేయములకు తత్త్వములను పేరుకూడ కలిగినది. ఈ తత్త్వములు అధికముగా నద్వైత వేదాంతపరములు. తత్త్వములను వ్రాసినవారును ప్రచారము చేసినవారును అధికముగా బ్రాహ్మణేతరులు. అద్వైతమున జీవబ్రహ్మై

క్యము ప్రతిపాదితమగుటచే సంఘవ్యవస్థ యందున్న ఎక్కువతక్కువలు వేదాంత విచారమున నుండవు. కనుక అధికారులు బోధనమునకై, అనధికారులు సంతుష్టికై ఇట్టి పాటలు పాడుట యాచారమైనది. అగ్రవర్ణములవారి వర్ణాశ్రమాచారవిధులు పూజా పురస్కారములు ప్రవచనములు మున్నగునవి కొన్నితత్త్వము లందు గర్హింపబడుట కాననగును. తత్త్వములందు కొంత మర్మకవిత్వముకూడ కలదు. ఏగంటివారు, పోతులూరి వీరబ్రహ్మము, వేమనయోగి, సిద్దప్ప, శేషాచలస్వామి, పరశురామపంతుల లింగమూర్తి, భోజదాసు, ఎడ్ల రామదాసు మున్నగు. అనుభవజ్ఞులైన యోగులెందరో తత్త్వములను, వేదాంతగేయములను వ్రాసియున్నారు. సీతపాట, నారాయణ శతకము, రామరామ శతకము, ఆత్మబోధామృత తత్త్వములు, కవిప్రమాణ తత్త్వ కీర్తనలు, కాలజ్ఞాన తత్త్వములు, శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థ దరువులు, తారకామృతసారము, శ్రీరామగీత, గురుజ్ఞానామృతము, వేదాంత కుచ్చెలకథ, బ్రహ్మానంద కీర్తనలు ఇత్యాది ముద్రిత గ్రంథములందలి గేయములు జానపదుల నోటికెక్కినవి. సాధారణముగా ఈ తత్త్వము లందు రాజయోగము, అచలవేదాంతము, గురుభక్తి, నీతిబోధము, సంఘసంస్కార పరాయణత్వము, వర్ణాశ్రమాచార నిరాసము, వైరాగ్యబోధనము, అహింస, సత్ప్రవర్తనము మున్నగు విషయము లుండును.

పురాణోక్తముగా నున్న కర్మకాండయు, వ్రతములు నోములు మున్నగునవి అందరి అందుబాటులో నుండుటచే అట్టి వాఙ్మయముకూడ బాగుగా ప్రచారమందినది. ఇట్టి కర్మకాండ స్త్రీలకు మిక్కిలి అభిమానపాత్ర మగుటచే స్త్రీలపాటల రూపముననే ఇట్టి వాఙ్మయము అధికముగా గలదు. నన్నయనాటినుండి మన కీ నోములు వ్రతములు ఉన్నటులు కాననగును. ఇవి స్త్రీలకును చాతుర్వర్ణ్యముల వారికిని పూజాధికారము కల్పించుటకు ఉద్దేశింపబడినవి. వీరశైవ వీరవైష్ణవ మతోజ్జృంభణ ఫలితముగా ఇట్టి సంస్కారమునకు తావులభించినదని ఊహింపనగును. మదనద్వాదశీవ్రతము, నిత్యదానము నోము, దీపదానము నోము, మోచేటి పద్మమునోము, చాతుర్మాస్యవ్రతము, కృత్తికదీపాలనోము, పెండ్లిగుమ్మడి నోము, వరలక్ష్మి పాట, తులసినోము, లక్షవత్తులనోము, కామేశ్వరీవ్రతము, శ్రావణశుక్రవారపునోము, శ్రావణమంగళవారవ్రతము మున్నగువాటికి సంబంధించిన పాటలు అధిక ప్రచార మందినవి. వీటిలో కామేశ్వరిపాట క్రీడాభిరామకాలము నుండి వినబడుచున్నది. అగ్రవర్ణములవారికి లక్ష్మిగౌరీ వ్రతములు పూజలు ఉన్నటులే శూద్రులకు ఎల్లమ్మ, మైసమ్మ, పోచమ్మ, బాలమ్మ, మున్నగు క్షుద్రదేవతల పూజలు కలవు. ఈ దేవతల కొలుపులు పల్లెటూళ్ళయందు బవనీలు మున్నగువారు చేయుదురు. ఎల్లమ్మయే రేణుకా దేవి. క్రీడాభిరామమున బవనీలచక్రవర్తి "పరశురాముని కథలెల్ల ప్రౌఢి బాడి" నట్లున్నది.

**స్త్రీల పాటలు :** సంసారయాత్రలో గృహలక్ష్మికే అధిక ప్రాధాన్యము కలదు. అటులే గృహజీవనమున కవిత్వము నకును స్త్రీలే అధికముగా ఆలంబనములు. ఇట్టి పాటలను స్త్రీలపాటలని పిలువవచ్చును. వీటిలో కల్పనకన్న వాస్తవికత హెచ్చు. మాతృత్వము నాధారముగ చేసికొని ఎన్నియో గేయములు పుట్టినవి. సంతానమునకై స్త్రీలు పడెడు బాధలు, నోచెడు నోములు, మ్రొక్కెడి మ్రొక్కులు, గొడ్రాండ్ర స్థితి, అట్టి పాటలందు వర్ణితములు. సంతానము కలిగినవెంటనే లాలిపాటలు, జోలపాటలు వచ్చును. ఈ పాటలందు తల్లులు తమ సంతానమును రాముడుగనో, కృష్ణుడుగనో, శంకరుడుగనో, సీతగనో, రుక్మిణిగనో, పార్వతిగనో వర్ణించుకొందురు. వివాహము నాధారముగా చేసికొని వెలసిన పెండ్లిపాటలు అనంతములు. కొట్నాల పాటలు, నలుగు పాటలు, గంధము పాటలు, కల్యాణపు పాటలు, తలుపు దగ్గరపాటలు, బంతుల పాటలు, బువ్వము పాటలు, వధూవరుల పాటలు, అలక పాటలు, ముఖముకడుగు పాటలు, కట్నాలపాటలు, మిథునవిడెముల పాటలు, అవిరేణి పాటలు, అప్పగింతల పాటలేకాక ప్రతి స్వల్ప విషయమునకు— అనగా పసుపునకు, తిలకమునకు తలంటులకు, ఊయలకు, వసంతములకు పాన్పులకు సంబంధించిన పాటలుకూడ కలవు. అత్తమామల భక్తిని, పతిభక్తిని, ఆడుబిడ్డల భక్తిని, తోడికోడండ్రతో, బావ మరదులతో, ఇరుగుపొరుగు వారలతో మెలగవలసిన రీతిని దెలుపు పాటలు కొన్ని కలవు. అత్తల ఆరండ్లు, కోడండ్ర

సాధింపులు, ఆడబిడ్డల ఘాతుకచర్యలు, మున్నగువాటిని ఆశ్రయించిన గేయములును కలవు. ఇట్టి స్త్రీల పాటలందు సాంఘిక జీవనము సమగ్రముగా కాననగును.

**శ్రమిక గేయములు :** కవిత్వము ఉల్లాసమును కలిగించుటకేకాక కష్ట నివారణమునకు గూడ నుదయించుననుట పలువురు సాహిత్య తత్త్వజ్ఞులు అంకగీరించిన విషయము. మానవులు శ్రమించునప్పుడు కష్టము కనబడకుండుటకై, అలసిపోకుండుటకై, అప్రయత్నముగా కూనరాగములు తీయుట లయాన్వితములగు నేవో మాట లుచ్చరించుట జరుగును. సామూహిక కర్తృత్వమున అట్టి రాగములు మాటలు జానపద గేయములుగా పరిణమించి వ్యాప్తి గాంచును. వివిధములగు పనులు చేయువారు ఆయా సందర్భములందు శ్రమాపనోదనమునకై పాటలు పాడుచుండుట కాంచనగును. కొందరిట్టి గీతములను 'పాటకజన' సారస్వతమనిరి. కొందరు కార్మిక కర్షక గీతము లనిరి. ఇట్టి శ్రమిక గీతములందు వస్తు వెద్దియైన నుండవచ్చును. వృత్తికి సంబంధించిన పాటలు, శృంగార గేయములు, స్థానిక వృత్తాంతములు, విషాద గాథలు, భక్తి గేయములు, మున్నగు తీరుతీరుల పాటలు శ్రమికులు పాడుకొందురు. శ్రమిక గేయము లన్నియు సాధారణముగా వారివారి కృషికి సంబంధించిన లయకు సరిపోవునట్లుండుట గమనింపదగిన విషయము. శ్రమికుల పాటలందు "లిబిడో" స్ఫుటముగా ధ్వనించుచుండుట మరియొక విశేషము. శరీర సుఖమునకు సంబంధించిన ఊహాలు శ్రమికులకుఉత్సాహ మొసగును. కనుక నే విషయ వాంఛ ఇట్టి పాటలందు తరచుగా కాననగును. గారడి వానిపాటలందు ఆకర్షించుటకువలెనే బరువులు లాగెడు పాటలందు శ్రమాపనోదవమునకై బూతులు ప్రవేశించును. శ్రమికుల పాటలందు ఇట్టి బూతుపాటలెన్నియో కలవు. ఇట్టిపాటలు "ఘుమఘుమాపాట" ల పేరుతో కొన్ని ప్రచురింపబడినవి.

**బాలగేయములు :** జానపదగేయ వాఙ్మయమునందు బాలగేయములు ఒక ప్రత్యేకశాఖకు చెందినవి. ఇవి రెండు విధములు. బాలురకొరకై పెద్దలచే రచింపబడి తరతరములనుండి వచ్చునవి ఒక విధము. బాలురచేతనే రచింపబడి ఒక తరమునుండి మరియొక తరమువారి నోటి కందునవి మరియొక విధము. పెద్దలు పిల్లలకొరకు రచించిన పాటలందుకూడ రెండువిధము లున్నవి. పిల్లలను లాలించుటకును నిద్రపుచ్చుటకును పాడెడు లాలిపాటలును ఉయ్యాల పాటలును ఒకతీరువి. పిల్లలనే వస్తువుగా గ్రహించియో లేక ఏవేని కథావిషయములనో, ప్రపంచమందలి మనోహరవిషయములనో గ్రహించి పిల్లలకానందమును గూర్చుటకై, ఆటలాడించుటకై, రచింపబడినవి ఇంకొకతీరువి. లాలిజోలపాటల భావములను పిల్లలెంతమాత్రము అనుభవింపరు. కేవలము అందలి సంగీతము మాత్రము వారిని నిద్రపుచ్చుటకో, ఊరడించుటకో ఉపకరించును. ఇక రెండవతీరు పెద్దల పాటలు పిల్లలు కూర్చుండుటకు అలవాటు పడినప్పటినుండి నిచ్చెనమెట్లవలె క్రమక్రమముగా పెరిగి పిల్లలు తాము తలిదండ్రులవలననో లేక ఇతరులగు పెద్దల వలననో విన్న పాటలు స్వయముగా పాడునంత వరకు సాగి ఆగిపోవును. ఆపైన వారి సొంతకవిత్వమారంభమగును. పెద్దల పాటలందు మొదట నాదము, తరువాత లయ, ఆతరువాత అభినయము పిల్లలకు అలవడునట్లుచేయు క్రమము కనుపించును. మొదటిది ఆకర్షణమును, రెండవది ఉత్సాహమును, మూడవది వారి శరీరమునకు శక్తిని కూర్చును. నాలుగైదేండ్ల వయసువచ్చునప్పటికి పిల్లలు సొంతకవిత్వ మారంభింతురు. ఈగేయములందును రెండుతీరుల పాటలున్నవి. పెద్దలను అనుకరించి వారిపాటలందు తమ కవిత్వమునుచేర్చి పాడుకొనునవి కొన్ని. పూర్తిగా స్వకపోలకల్పితములు మరికొన్ని. మొదటిరకము పాటలు రానురాను అర్థవిహీనములై పోవును. కనుకనే వీటిని Non-sense Rhymes అనుచున్నారు. పిల్లలకొరకు పెద్దలు రచించినవి Nursery Rhymes అయినచో, పిల్లలు సొంతముగా రచించిన గేయములు Non-sense Rhymes అగుచున్నవి. నాలుగేండ్ల ప్రాయమునుండి పిల్లలజీవితమంతయు ఆటపాటలమయమగును. ఈయాటలందును, మగపిల్లల ఆటలు వేరు ఆడపిల్లల ఆటలు వేరు. కొన్ని ఇరువురును చేరి ఆడుకొనునట్టివి. ఈ క్రీడలను ఆధారముగా చేసికొని వాటికి తగిన పాటలు పెక్కులు బయలుదేరినవి. చెమ్మచెక్క, తిత్తి దిరుగుట, గుడుగుడుగుంచం, బుజబుజరేకులు, గొబ్బిళ్ళు,

చిఱ్ఱగోనే, కోతికొమ్మచ్చివంటి ఆటలతోపాటు పాటలును గలవు.

శృంగారగేయములు: జానపదవాఙ్మయమున శృంగార రస ప్రధానము లయిన పెక్కు గేయములు కలవు. ఇవి యెంత బహుళసంఖ్యలో గలవో అంత విరళసంఖ్యలో ముద్రింపబడినవి. ఇట శృంగారము పరకీయమా, స్వకీయమా, ఉత్తమ నాయికానిష్ఠమా లేక ప్రాకృతనిష్ఠమా అను చర్చలతో పనిలేదు. జానపదుల - ప్రాకృతుల - వాఙ్మయమున శిష్టాలంకారిక వచనములు అంతటను పొసగవు. జానపదులు చిత్రించిన సీతారాములు మున్నగు ఉత్తమ నాయికానాయకులకు సంబంధించిన శృంగారము కూడ పామరభావ సమన్వితమే. జానపదుల పేరిటనున్న వాఙ్మయమం దంతటను గోచరించునవి వారి భావములే కాని ఆయాపాత్రముల భావములు కావు. ఎట్టి గేయము లందైనను జానపదుల ప్రేమకలాపములు, సాంఘిక నియమోల్లంఘనములు, పరస్పరాకర్షణములే కానవగును. జీవితము యథాతథముగ నగ్నతేజముతో భాసించును. కావ్యధర్మమైన ఔచిత్యవిచారమును, ఔచిత్యపోషణోద్దేశముతో పాత్రములకు మెరుగుపెట్టు పద్ధతియు జానపదగేయములందు లేవు. ఉదాత్తతయు నీచతయు, సభ్యశృంగారము, శృంగారరసాభాసము, నీచ శృంగారము, మొదలగునవి అన్నియు నొకదానితో నొకటి బుజము లొరసికొనుచు పోవుచుండును. ఐనను ధర్మావలంబనముగల ప్రేమశృంగారములతో ఒప్పు గేయములుకూడ అనేకములు గలవు. రామాయణ గేయములందు సీతగడియ, సీతామ్మవారి అలుక, సీతాదేవి వేవిళ్లు, ఊర్మిలాదేవినిద్ర, సీతాదేవి ఆనవాలు మున్నగు పాటలందు సభ్యశృంగారమునకు వెలికాని మనోహరభావము లున్నవి. సుందరకాండ పదమున వియోగ శృంగారము చక్కగా ప్రదర్శింపబడినది. భారతగాథలందు నలచరిత్ర, సుభద్రాకల్యాణము, శశిరేఖాపరిణయము, దేవయాని చరిత్రము శృంగారగేయములు. భాగవత కథలు అనేకములు రసతుందిలములు. చారిత్రకగేయములైన దేశింగురాజు కథ, బొబ్బిలికథ, సదాశివరెడ్డికథ మున్నగు వాటియందు ఆయా వీరదంపతుల శృంగారము ఉత్తమశ్రేణికి చెందినదిగా కానవగును. లక్ష్మమ్మ, సన్యాసమ్మ, మండపేట పాపమ్మ, నల్లతంగాళ్, ఎరుకల నాంచారి, వీర రాజమ్మ—ఈ గేయములందు ధర్మస్వభావులైన జానపద దంపతుల ఉత్తమశృంగారము ధ్వనించుచున్నది. గంగా వివాహమున హరుడు దక్షిణనాయకుడు. సురాభాండేశ్వరమున పరకీయ శృంగారమున్నది. వరదరాజు పెండ్లి, ఆండాళ్ చరిత్రము, వెంకటేశ్వర్ల పేట, చెంచెత కథ - ఇత్యాదులందు చక్కని శృంగారమున్నది. ఇట్టి గేయములందు శృంగార మంగముగా నున్నది. శృంగారము ప్రధానముగాగల చిన్నచిన్న గేయములు లక్షలసంఖ్యలో నున్నవి. చల్ మోహనరంగ, వెంకయ్య చంద్రమ్మపాట, నారాయణమ్మపాట, సిరిసిరిమువ్వ, రంగం పదములవంటి కొన్ని పెద్దపాటలు అచ్చైనవి. తెలంగాణమున కాముని పున్నమసందర్భమున పాడునట్టి పాటలన్నియు శృంగార కళా ఖండములే.

**అద్భుతకథలు :** జానపదులకు అద్భుతరసాభినివేశము మెండు. సాధారణ విషయములందు అలౌకికములును, అద్భుతములు నగు కల్పనలుకూర్చి పెద్దచేయుట వారికి వినోదముతోపాటు భక్తియో, భయమో, పెంపొందించు కొనుటకు ఉపకరించును. దుర్భరమగు సంఘటనము కలిగినప్పుడుకాని, అసాధ్యమగు విషయమును ఆకాంక్షించి అఱ్ఱులు సాచునప్పుడుకాని, మానవాతీత శక్తులుగల, దేవతలో, మంత్రదండమో, భూత అద్దమో, బీజాక్షరములో, పావుకోళ్ళో అడ్డుపడి చిక్కును మంచుతెరవలె తొలగించిన నెంతబాగుండు నను కోరిక అసాధ్యమైనను మానవసహజమే. ఇట్టి కోరికను ఆధారముగా చేసికొని ప్రాకృతులు అత్యద్భుత విషయములను అనేక కథలందు జోడించినట్లు కానవగును. అద్భుతకథలం దన్నింటికన్న అధికప్రచారముగాంచినది బాలనాగమ్మకథ. దీని కథా రంగము మహబూబు నగరమందలి పానుగల్లు. ఇది ప్రాంతీయమగు రామాయణగాథవంటిది. సమ్మరానంతటి ఆద్భుత కృత్యములతో, అలౌకిక విషయములతో, నిండిన గాథ - కమ్మవారి పణతి - పసల బాలరాజుకథ— ఈ కథా జీవము వర్ణాంతర వివాహము. అద్భుత కథాగేయము లందు గాంధారికథ అగ్రగణ్యము, పురాతనముగూడ. ఇటులే ధర్మాంగద పాముపాట, కాంభోజరాజుకథ, బాలరాజుకథవంటి అద్భుతకథలు జానపదులకు భయ

భక్తులను గలిగించి సత్యధర్మములకే జయము అను నీతిని చాటి చెప్పి, వారి జీవితమును దిద్దునట్టివి.

**కరుణ రసాత్మకములు :** జానపదులు శృంగారము తరువాత కరుణాద్భుతములకు రెండింటికిని సమప్రాధాన్య మిచ్చిరి. నిత్యజీవితమున దుఃఖము అధికమగుటచే తత్ప్రభావమును సహజముగా జానపదులు చిత్రింపగలిగిరి. దీనియందును వారికి శిష్టులకుండు ఆదర్శ దృక్పథము, లేదా, యౌచితీ విచారము తక్కువ. ఆయావ్యక్తుల శౌర్యమునకు ఉత్సాహము, దుర్మరణమునకు జాలి అను నీ రెండు భావములును పామరులచే వారి చరిత్రములను పాడించినవి. ఉత్సాహము తరువాత జానపదులను సులువుగా ఆవరించినది జాలి. ఆంధ్ర జానపద వాఙ్మయమున కరుణ పూరితములును చిత్తద్రుతి కారణములును నగు కథ లనేకములు కలవు. అత్తపెట్టిన ఆరడివలననో, కట్టుకొన్న భర్త యొనర్చిన అత్యాచారమువలననో, తోడికోడండ్ర అసూయచేతనో, ఇరుగుపొరుగువారి దౌష్ట్యము వలననో, దైవ దుర్విపాకమువలననో ఇడుములపాలైన స్త్రీలకథలు జానపదగేయ వాఙ్మయ సముద్రమందలి కన్నీటి కెరటములు. జరిగిన విషాదగాథలకు జానపదులు కొంత మాహాత్మ్యమునుకూడ జతపరచినారు. దేశీయేతి వృత్తములందు కరుణారసపూరితమైనగాథ కన్యకామ్మ వారికథ. ఇది ప్రాచీనమైనది. కామమ్మకథ పిచ్చుకకుంట్లకు కల్పవృక్షము. జరిగినకథ జరిగినట్లుగా, హృదయవిదారకముగా, కరుణ రసపూరితముగానున్న కథలందు లక్ష్మమ్మ కథ అగ్రగణ్యము. ఆమె సహనము, త్యాగము, తెలుగు జాతికి గర్వకారణములు. అవిభక్త కుటుంబమున కనిష్ఠులు పడెడుబాధల సూచించునది సన్యాసమ్మకథ. గోదావరీ మండలపు పేరంటాలైన మండపేట పాపమ్మకథ మరి యొకటి. కరుణరసాత్మకగాథలందు పేరంటాండ్రగాథల కొక ప్రత్యేకత కలదు. కామమ్మకథ, పాపమ్మకథ, శృంగవరపుకోట యెరుకమ్మకథ, సన్యాసమ్మకథ, తిరుపతమ్మకథవంటి పేరంటాండ్రకథలు ముద్రితములైనవి. సతి ఆచారము నిషేధింపబడిన తరువాత విశేష ప్రయత్నముతో సహగమనముచేసినట్టివారు వీరందరును. ఇది యొక విశేషము. పేరంటాండ్రందరు మ్రొక్కులుతీర్తు రనునది ఈ కథలందలి మరియొక విశేషము. తమిళదేశమునుండి వలసవచ్చినట్టిది నల్లతంగాళ్ కథ. వీరరాజమ్మకథ పలనాటి సీమకు చెందినట్టిది. ఎరుకల నాంచారి, రాములమ్మ, సరోజిని, మూసిపొంగు కథలు తెలంగాణమున ప్రశస్తి నార్జించినవి.

**హాస్యపు పాటలు :** నాగరకులకు గల సుఖ దుఃఖానుభూతులు జానపదులకును గలవు. వీటి బాహ్యాచిహ్నము లగు నవ్వు, ఏడ్పులునుగూడ కలవు. అట్టి నవ్వు జానపద గేయవాఙ్మయమున అచ్చటచ్చట చక్కగా ప్రదర్శింపబడినది. శాంతగోవిందనామములందు ఋష్యశృంగుడు, అడవిగోవిందనామములందు కుంభకర్ణుడు, సూక్ష్మ రామాయణమున శూర్పణఖవంటివారు చక్కని హాస్యమునకు ఆలంబనములుగా కనిపింతురు. సీత గడియ పాటలో హాస్య శృంగారములకు మైత్రి కలదు. సీతమ్మ పరిహాసోక్తులు "వ్యాహారము" నకు ఉదాహరణముగా చెప్పుకొనవచ్చును. ఊర్మిళాదేవి నిద్రలో సీతాశాంతల సరస సంభాషణము, శ్రీరామ పట్టాభిషేకమున శంకరుని మాటలు ఉత్తమకోటికి చెందిన హాస్యముతో నిండి యున్నవి. శశిరేఖా పరిణయమున ఘటనా వికృతికిచెందిన హాస్యము కలదు. పల్నాటి వీరచరిత్రమున వేశ్యామాత వర్ణనము ఆకార వికృతికి సంబంధించిన హాస్యము. వీర గేయములందలి యుద్ధభీరువుల వర్ణనమున వాక్చేష్టలకు సంబంధించిన హాస్యము గలదు. కాటమరాజు కథలో భట్ల సంవాదమునందు వ్యాజస్తుతి 'వ్యాజనింద, వక్రోక్తి' నర్మోక్తి, నీచోపమ, కాక్వాక్షిప్తము మున్నగు నలంకారములతో అర్థ సంబంధమగు వికృతిలో వాచ్యముగను వ్యంగ్యముగను హాస్యము భాసించును. గంగా గౌరీ సంవాదము, ఈశ్వరభృంగి సంవాదము, లక్ష్మీ పార్వతుల సంవాదము, సవతుల కయ్యము, చెంచులక్ష్మికి కృష్ణునకు జరిగిన సంవాదము. చెంచెతకు లక్ష్మికి జరిగిన సంవాదము మున్నగు పాటియందు నర్మోక్తులు, దెప్పిపొడుపులు, వ్యాజోక్తులు కలిగిన హాస్య మున్నది. లక్ష్మీ పార్వతుల సంవాదము 'మృదవము'నకును, సవతుల కయ్యము "నాళిక"కును, ఈశ్వరభృంగి సంవానము "అవస్పందితము"నకును ఉదాహరణములు. కేవలము హాస్య పూరితము లగు గేయములు కొలదిగనే ముద్రింపబడినవి. వేడుక పెండ్లిపాటలందును, స్త్రీ జనానంద

నవీన కల్యాణ పాట లందును, స్త్రీల పాటల సంపుటము లందును పెండ్లికి సంబంధించిన వియ్యాలవారి హాస్యపు పాటలు కొన్ని ప్రకటింపబడినవి. హాస్యపు పాటలు అను పుస్తకములో తీరుతీరుల హాస్యపు పాటలున్నవి. తెలంగాణా జానపద గేయములందు చక్కని హాస్యపు పాటలు, వీటిలో హాస్యానుకృతులుకూడ కలవు. ఉద్ఘాత్యకమునకును, చలనమునకును చక్కని యుదాహరణములు అందు కలవు. జానపద సాహిత్యమున అధిక్షేప గేయములు మాత్రము కొలదిగనే యున్నవి. హాస్య పాత్రములుకూడ స్వల్ప సంఖ్యాకములు కలవు. జానపద గేయములందు కనిపించునది మనజాతీయ హాస్యము. ఇందు సున్నితమయిన హాస్యముతోపాటు మోటగు హాస్యముకూడ కలదు. స్త్రీల పాటలందు మృదువై, సభ్యమైన హాస్య ముండును. ఇట్టిహాస్యము జానపదుల నిత్యజీవితమును సుఖమయముగా నొనర్చుటకు దోహద మొసగును.

జానపద గేయముల వరుసలు: ప్రాఙ్నన్నయ యుగము నుండి ఈనాటివరకును వినబడుచున్న మనదేశి చ్ఛందోరీతులు పదములే. సంస్కృతమునుండి వచ్చిన అక్షరగణ బద్ధవృత్తములకు భిన్నముగా ఈదేశీయ రచనా రీతు లన్నియు లయానుగుణమగు మాత్రాగణ బద్ధములు. ఇట్టి దేశిరచనములు కొన్ని తమిళ కన్న డాంధ్రములకు సమానముగా నున్నవికూడ. తమిళమందలి "ఒరూఉ మోనై" "కూరై మోనై" "తొడై" మున్నగు ఛందములకును, కన్నడమందలి భామినీ షట్పదికిని, భోగషట్పదికిని, వార్ధిక షట్పదికిని, లలితకును, మందానిలమునకును, ఛందోవతంసమునకును సరిపోవునట్టి గేయములు ఆంధ్ర జానపద వాఙ్మయమున కలవు. మన ఛందోగ్రంథము లందున్న కొలదికొలతలచే జానపదగేయ వాఙ్మయమును కొలుచుట అసాధ్యము. ఇంతకన్న జానపద గేయములందలి కొన్నిరీతులను మాత్ర మే దేశికవులు తమచేతనైన వాటిని చేపట్టి దేశిచ్ఛందములుగా మలచుకొని రచనము లొనర్చిరనియు, వాటికే చిన్నకోట పెద్దనమండి అప్పకవి వరకును గల లాక్షణికులు లక్షణము లేర్పరచిరనియును భావించిన సమంజసముగా నుండును. మార్గ - దేశి యని సంగీతమును రెండు తెగలుగా విభజించినప్పుడు భరతుడు, మతంగుడు, శార్ఙ్గదేవుడు మున్నగువారు దేశిగానమున నెన్నియో తీరుల పాటలను పేర్కొనిరి. తెలుగువారి ఏలపదము ఆ సంగీతజ్ఞులకెంతగా నచ్చినదో కాని వారందరును ఏలపదములనుగూర్చి విశేషముగా వ్రాసిరి. మన జాజరపాటలే చర్చరీగీతములై సంస్కృత కవుల కావ్యములకుగూడ ఎక్కినట్లు తోచును. కనుక దేశికవితలకు మూలములయినట్టి జానపదగేయముల ఛందోరీతులను వేలకొలదిగా గణవిభజనము చేసికాని, కొలదిపాటి కొలబద్దలచే కొలిచిగాని ఇతమిత్థమని తేల్చిచెప్పుట కష్టము. నిజము విచారించినచో ఆ జానపదుల ప్రాకృత హృదయములనుండి ఇన్నితీరుల ఛందములలో ఇన్ని గేయములు వెడలవు. వా రెన్నిపాటలు పాడినను వా రెట్టి మనోభావములు వెలార్చినను, వ్రేళ్ళపై లెక్కింపదగు కొన్ని వరుసలలో మాత్రమే వెడలినవనియే భావించుటలెస్స. కవిత్వారంభదశ, నాట్యారంభదశ, సంగీతారంభదశ, ఒకచోటనే కలదు. ఆదిమానవుడు సంతోషపారవశ్యమున చిందులు ద్రొక్కినప్పుడు ముద్రితము లయిన ఆతని పాదాంకము లందే వీటి ప్రారంభదశ కాననగును. అది గమనించినచో జానపద గేయముల రీతు లొకకొన్నియే యని మనకు స్పష్టమగును. మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది మాత్రల ఆవృత్తులతో సాధారణముగా ఈ జానపద గేయములు నడచును. లేదా త్రిశ్ర, చతురశ్ర, ఖండగతి, మిశ్రగతిలో జానపద గేయము లుండునని చెప్పవచ్చును. ఈ సూత్రముతో ఎన్ని లక్షల వరుసలనైన బంధింపవచ్చును. సీత దాగిలిమూతలు, సీత ముద్రికలు, తులసీదళములు, సువ్వాలలు, మేలుకొలుపులు, వరదరాజుపెండ్లి, కామేశ్వరిపాట వంటి వన్నియును, మూడు మాత్రల ఆవృత్తులతో (త్రిశ్రగతి) నడచుపాటలు, కోలాటపాటలు, జాజరపాటలు, పిల్లలపాటలు, గొబ్బిపాటలు, బొబ్బిలికథ, దేశింగురాజుకథ, పారుజాతపల్లవి, సీత సమర్త వంటి పాటలు. నాలుగేసి మాత్రల ఆవృత్తులతో (చతురశ్రగతి) నడచునట్టివి, సంక్షేప రామాయణము, గోవిందనామాలు, కోవెల రాయబారము, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, ధర్మరాజు జూదము, అవిరేణి పాటలు, వినురురాయి పాటలు, రోకటిపాటలు— ఇటువంటి పాటలు ఐదుమాత్రల ఆవృత్తులతో (ఖండగతి) నడ

చును. ఏలపదములు సాధారణముగా ఆరుమాత్రల అవృత్తులతో నడచునట్టివి. కొన్ని మేలుకొలుపులు, గుమ్మడు పాట (ముత్యాలసరములు), ఏడుమాత్రల అవృత్తులతో (మిశ్రగతి) నడచునట్టివి. బాలక్రీడలు, రామదాసు కీర్తనలు కొన్ని ఎనిమిది మాత్రల ఆవృత్తులతో నడచినట్టి పాటలు, కనుక ఈ చిన్న సూత్రముతో వివిధ జానపద గేయముల రీతులను సులభముగా బంధింపవచ్చును.

**ఉపసంహారము :** మన జానపదవాఙ్మయ సంపద ఇప్పటికే చాలభాగము లుప్తమై పోయినది. ఉన్నదానినైన భద్రపరచుకొనుట మన కర్తవ్యము. జానపద కవితా రీతులను అందరికన్న రాజకీయపక్షములవారు ఎక్కుడుగా వాడుకొనుచున్నారు. వీరి ఆశయము కొనియాడ తగినదే. స్వరాజ్యోద్యమమునందును, సంస్కరణోద్యమమునందును వెలువడిన గేయములు అనేకములు ప్రజల సొమ్మైపోయినవి. తాత్కాలిక ప్రయోజన మాశింపబడినను వీటి ప్రభావము మాత్రము అనంతముగా పడినదని చెప్పకొనక తప్పదు. పండితులు విమర్శకులు జానపద గేయములందున్న సాహితీవిషయము లెత్తి చూపవచ్చును. సామాజిక శాస్త్రవేత్తలు ఆ సంపదలో తమకు కావలసిన అమూల్య మణులను పొందవచ్చును. సిద్ధహస్తులైన రచయితలు వాటియందలి వస్తువు గ్రహించి కలమందుకొన్నచో రవ్వలు రాల్చవచ్చును. జానపదవాఙ్మయమున నుండు జాతీయములు, నానుడులు, వింతవింత పలుకుబడులు, శిష్టులు గ్రహింపవలసిన అమూల్యసంపదలు నవ్యభారత పునర్నిర్మాణమున వివిధప్రణాళికా ప్రచారమునకును, ప్రజాప్రబోధమునకును జానపదకవితారీతులు. అత్యంతము ఉపకరించునట్టివి. పాశ్చాత్యులును, ఔత్తరాహులును ఈ మార్గమున ఎంతోదూరము సాగిపోయినారు. జానపదవాఙ్మయమున తెలుగువారు అభినివేశము కలిగించుకొన్నచో ఆంధ్రదేశమునకును, ఆంధ్రభాషామతల్లికిని, ఆంధ్రవిజ్ఞానమునకును ఇతోధికమగు వికాసము కలుగగలదు.

వి. రా.

## ఆంధ్రదేశ చరిత్రము 1 క్రీ. శ. 625 వరకు :-

**ఆంధ్రదేశము నిర్ణయము :** భరతఖండములోని దక్షిణాపథ దేశములలో ఆంధ్రదేశము సుప్రసిద్ధమైనది. ఇది 14°29' ఉత్తర అక్షాంశము, 20° ఉత్తర అక్షాంశముల మధ్య భాగమునను 78° – 85° తూర్పు రేఖాంశముల మధ్యభాగమునను ఉన్నది. ఆంధ్రదేశమునకు ఉత్తరమున ఉత్కళ మహారాష్ట్రదేశములు, తూర్పున బంగాళాఖాతము, దక్షిణమున ద్రావిడ కర్ణాటక దేశములు, పశ్చిమమున నూతన బొంబాయి రాష్ట్రము ఎల్లలుగానున్నవి. ఈ దేశవిస్తీర్ణము 1,10,260 చదరపు మైళ్లు. ఈ దేశమునకు 540 మైళ్ళు తీరభూమి కలదు. ఇందు 20 జిల్లాలు కలవు. హైదరాబాదు ఆంధ్రప్రదేశపు రాజధాని. దీనిలో ఆంధ్రరాష్ట్ర ప్రాంతము, పూర్వపు హైదరాబాదు రాష్ట్రమునందలి తెలంగాణము చేరియున్నవి. ఇందలి జనసంఖ్య 322 లక్షలు.

**ఆంధ్రులు - పూర్వ చరిత్ర :** ఆంధ్రులు చాల ప్రాచీన జాతివారు. ఐతరేయ బ్రాహ్మణములో శునశ్శేపుని కథయందు వీరు పేర్కొనబడియున్నారు. ఆ బ్రాహ్మణము క్రీ. పూ. 1000 - 800 కాలము నాటిది. ఇచ్చట వీరు పుండ్ర, పుళింద, మూతిబ, శబర జాతులతో కలిపి చెప్పబడియున్నారు. ఈ జాతులవారు వింధ్యపర్వత ప్రాంతవాసులు. రామాయణ మహాభారతములలో ఆంధ్రులు చోళ, చేర, పాండ్యులతోకలిపి పేర్కొనబడిరి. భారతదేశమందలి రాజ్యములను వర్ణించు సందర్భమున పురాణములును, బౌద్ధ గ్రంథములును ఆంధ్రుల ప్రశంస చేయుచున్నవి. అగస్త్యుడను మహర్షి ఉత్తరమునుండి దక్షిణాపథమునకు వచ్చిన ఆర్యుడని, అతడు తన భార్యయగు లోపాముద్రతో తీర్థయాత్రలకొరకు బయలుదేరి వింధ్య పర్వతములను దాటి ఆర్యులకు త్రోవచూపెనని ఒక కథ యున్నది.

ఆంధ్రశబ్ద వ్యుత్పత్తిని గూర్చి అనేక అభిప్రాయములు కలవు. విశ్వామిత్ర మహర్షి యొక్క నూరుగురు కుమారులలో జ్యేష్ఠులగు సగము మంది తమ తండ్రి ఆజ్ఞ ప్రకారము శునశ్శేపుడను వానిని అన్నగా అంగీకరింపలేదనియు, అందులకై అత డలిగి వారిని "మీరు ప్రజా భక్షకులు కండు" అని శపించె ననియు వారే ఆంధ్రులకు మూలపురుషు లైనట్లును ఐతిహ్యము కలదు.

ఐతరేయ బ్రాహ్మణమున 'ఆంధ్ర' అను పదము నీచ జాతి పరముగా ప్రయుక్తమైన దనియు, 'ఆంధ్ర' అను

పదము స్వచ్ఛమైన ఆర్యజాతి పరముగా ప్రయుక్తమైన దనియు కొందరు తలచుచున్నారు. పురాణాదులందు చెప్పబడిన ఆంధ్రరాజు అను క్షత్రియరాజుచే పరిపాలింపబడి చాతుర్వర్ణ్య వ్యవస్థతో కూడిన స్వచ్ఛమైన ఆర్యజాతి ఆంధ్రజాతి అనియు వీరి వాదము. ఆంధ్రరాజు పేరునుబట్టి ఆంధ్రదేశమని పేరు వచ్చిన దనియు, ఆంధ్రదేశమున నివసించు ఆర్యులు ఆంధ్రులని పేరు పొందిరనియు వీరు చెప్పుచున్నారు. తుషార జాతితో కలిసి ఆంధ్రులనువారు అక్షు నదీతీరమున వసించుచున్నట్లు వాయుపురాణము చెప్పుచున్నది. అక్షునదియనగా ఆక్సను నది. ఇది హిందూకుష్ పర్వతశ్రేణికి అవతల నున్నది. శ్రీమద్రామాయణ కథనమునుబట్టి విశ్వామిత్రుడు తన పుత్రులను శపించిన వృత్తాంతము పుష్కరక్షేత్ర సమీపమున జరిగినట్లున్నది. పుష్కరక్షేత్రము రాజపుత్ర స్థానము నందలి అజ్మీరునకు సమీపమున నున్నది. విశ్వామిత్రునిచే శప్తులైన ఆంధ్రగణములవారు తూర్పునకును, దక్షిణమునకును వ్యాపించియుందురు. వీరిలో కొందరు కరూశ దేశమునందు ప్రవేశించిరి. కంసుని పక్షమున శ్రీకృష్ణునితో మల్లయుద్ధముచేసి నిహతుడైన చాణూరుడు కరూశ దేశమువాడు. ఈత డాంధ్ర మల్లు డని హరివంశము పేర్కొనుచున్నది.

చంద్రగుప్తుని ఆస్థానమునయున్న గ్రీకు రాయబారి మెగాస్తనీసు ఆంధ్రుల రాజ్య విస్తీర్ణమును, సైన్యబలమును, దేశసంపదను వర్ణించియున్నాడు. ఆంధ్ర రాజ్యమున 30 దుర్గములు, నూరువేల కాల్బలము, రెండు వేల గుఱ్ఱములు, ఒకవేయి ఏనుగులు ఉండెడివని ఆతడు వ్రాసెను. అశోకచక్రవర్తి శాసనములలో ఆంధ్రు లాతని సామ్రాజ్యమునందలి ప్రజలలో నొకరుగ పేర్కొనబడి యున్నారు. అశోక చక్రవర్తి కళింగమును జయించెను. కళింగము ఉత్కళదేశములో ఒక భాగము, అశోకుడు ఆంధ్రులను జయించినట్లు ప్రత్యేకముగ చెప్పబడి యుండలేదు. కావున వారాతనికి మిత్ర సామంతులై యుందురు. అశోకుని తరువాత మౌర్య సామ్రాజ్యము దుర్బలమయ్యెను. ఈ అదను కనిపెట్టి ఆంధ్రులు సర్వ స్వతంత్రులైరి. ఆంధ్రదేశమునకు త్రిలింగ దేశము, వజ్రభూమి, నాగభూమి, మంజీరదేశము, వేగిదేశము మున్నగు పేర్లు ప్రాచీన వాఙ్మయములో కాన్పించుచున్నవి. శ్రీశైలము, దాక్షారామము, కాళేశ్వరము అను మూడు ప్రసిద్ధ శైవ క్షేత్రములీ దేశమునందుండుటచే దీనికి త్రిలింగ సంజ్ఞ కలిగెనని చెప్పుదురు. త్రిలింగ పదమునుండియే తెలుగు అను పదము పుట్టె నని పండితులు తెల్పుదురు. ఈ దేశమునందు వజ్రములుకల ప్రదేశము లుండుటచే వజ్రభూమి యనియు, ఇది నాగులను జాతివారి నివాసస్థానమగుటచే నాగభూమి యనియు, ఇది మంజీరనది ప్రవహించిన ప్రాంతమగుటచే మంజీరదేశ మనియు పేర్లు వచ్చినట్లు తోచును. వేంగి నగరము ముఖ్య పట్టణముగా నున్న కాలమున దీనికి వేంగిదేశమని ప్రసిద్ధి వచ్చియుండును. ఆంధ్రదేశమునందలి భిన్నభిన్న ప్రాంతములకు పూర్వకాలమున నాడు, సీమ, ఆహారము, రాష్ట్రము మున్నగు సంజ్ఞలు చెల్లుచుండెను. వెలనాడు, కోనసీమ, కూడూరహారము, కర్మరాష్ట్రము మొదలైనవి ఆయా మండలముల పేళ్ళు.

క్రీ. పూ. 4 వ శతాబ్దియందే ఆంధ్రరాజ్యము స్థాపింపబడినది. పురాణముల ప్రకారము ఆంధ్రవిష్ణువు అనెడు రాజు నిశుంభుడను దానవనాయకు నోడించి కృష్ణానదీ తీరమున శ్రీకాకుళము అను పట్టణమును రాజధానిగా చేసికొని రాజ్యమును స్థాపించెను. ఆంధ్రవిష్ణువు సుచంద్రుడను రాజుయొక్క కుమారుడు. ఆంధ్రవిష్ణువు జ్ఞాపకార్థము శ్రీకాకుళములో ఒక ఆలయము నేటికి ఉన్నది. ఇచ్చట దేవుడు ఆంధ్రనాయక దేవుడు.

అటుతరువాత రెండు శతాబ్దుల కాలము పాలించిన రాజులపేర్లు తెలియవు. సంతాన విహీనతచే విచారగ్రస్తుడయియున్న దీపకర్ణి అనురాజు ఒకనాటిరాత్రి ఒకకలను గనెను. ఆ కలను అనుసరించి మరునాడు దీపకర్ణి అరణ్యములోనికి పోయెను. అచ్చట ఒక సింహముపై ఒక ముద్దుబాలుడు అతనికి కనిపించెను. అంతట తన బాణముతో రాజు ఆ సింహమును కొట్టెను. అది యక్షుడుగా మారి తనపేరు సాతుడనియు, శాపమువలన తాను సింహముగా మారితిననియు, ఆ పిల్లవానిని దీపకర్ణి మహారాజు పెంచుకొనవలె ననియు తెలియజేసెను. ఆ బాలుడే సాతవాహనుడై సాతవాహన వంశమునకు మూలపురుషుడయినట్లు ఒకకథ యున్నది. శాతవాహనునే శాలివాహన

డనియు నందురు. భట్టిప్రోలు స్తూపశాసనమువలన రాజా కుబ్బీరకుడను నొకరాజు తెలియవచ్చుచున్నాడు. ఈశాసన లిపి అశోకుని శాసనలిపిని పోలియుండుటచే కుబ్బీరకుడు ప్రాచీనుడని తెలియవచ్చుచున్నది.

**ఆంధ్ర శాతవాహనులు :** ఆంధ్ర శాతవాహనులచరిత్ర తెలియుటకు అనేకసాధనములు కలవు. వీనిలో వాయు, మత్స్య, బ్రహ్మాండ పురాణములు, రాజుల శిలాశాసనములు, నాణెములు, ఆ రాజుల కాలమున రచింపబడిన ప్రాకృత సంస్కృత గ్రంథములు, అప్పటి శిల్ప నిర్మాణములు, అమరావతీ స్తూపములు, నాగార్జునకొండ స్తూపములు, నాసిక, కన్హేరి, కార్లీ గుహాలయములు, విదేశీయుల వ్రాతలు. ఇతర గాథలు ముఖ్యముగా పేర్కొనదగియున్నవి.

సుమారు నాలుగున్నర శతాబ్దములు పాలించిన ఆంధ్ర శాతవాహనులు, పురాణములలో ఆంధ్రరాజు లనియు, శాసనములలో శాతవాహను లనియు పేర్కొనబడియున్నారు. ఈ రెండు ఆధారములలో కన్పడు రాజుల పేర్లును సరిపోవుటచేత రెండును ఒకేవంశమునకు చెందిన రాజులకథ అని భావింపబడుచున్నది. శాతవాహన అను నది రాజవంశముపేరు, ఆంధ్ర అను నది జాతిపేరు. వీరినే ఆంధ్రభృత్యులనికూడ వ్యవహరించిరి. శాతవాహనుల జన్మస్థానమును గూర్చి వివాదములు కలవు. కృష్ణా, గోదావరీ నదుల మధ్యభాగమున తూర్పుసముద్ర తీరమునుండి వీరు క్రమముగా పశ్చిమముగా నాసికవరకు జయించి, దక్షిణాపథ చక్రవర్తులు అను పేరు వహించిరని ఒక అభిప్రాయము కలదు. అట్లు కాక మొదట మహారాష్ట్రప్రాంతమును పాలించి క్రమముగా కృష్ణా గోదావరుల నడిమి ప్రదేశమును స్వాధీనపరచుకొని పశ్చిమభాగమున తమ ఆధిక్యము తగ్గగనే తూర్పుప్రాంతమునేపాలించి ఆంధ్రదేశము అను నామము వారు దీని కొసగియుందురని మరియొక వాదము. అటులయిన పైఠను లేక ప్రతిష్ఠాన పురము వారి రాజధాని యగును. శాతవాహన రాజుల శాసనములు విస్తారముగా మహారాష్ట్రములోనే దొరకుటయు, తూర్పు సీమలో తక్కువగా కానవచ్చుటయు ఈ ఊహకు మూలములు. కాని బళ్లారిజిల్లాలో ఒక భాగమునకు 'సాతవాహన హారము' అని పేరున్నట్లు మ్యాకదొని శాసనము వలన తెలియుచున్నది. అందుచేత శాతవాహనుల జన్మస్థానము ఆ ప్రాంతమనియు, అచ్చటి నుండి తూర్పునకు వీరు విజృంభించిరనియు మరియొక మతము.

అశోకుని శాసనములలో రఠికులు, భోజకులు, పిటినికులు, ఆంధ్రులు, పుళిందులు మున్నగువారు ఆతని సామ్రాజ్యప్రజలలో చేరియున్నట్లు వర్ణింపబడి యున్నది. వీరిలో రఠికులు మహారాష్ట్రనివాసులనియు భోజకులు విదర్భవాసులనియు, పిటినికులు పైఠన్ ప్రాంతీయులనియు, పుళిందులు వింధ్యాద్రి గతులనియు పండితులు చెప్పుచున్నారు. ఇక మిగిలినవారు ఆంధ్రులు. వీరు దక్షిణాపథముయొక్క ప్రాక్తీరవాసులని అంగీకరించుట సులభము. లేనిచో వీరి జన్మస్థానమైన ప్రదేశమును నిరూపించుటకే వీలుండదు. ఆంధ్రులకు ఉత్తరమున కళింగ దేశము వ్యాప్తమై యుండెను. శాతవాహనులు ఆంధ్రులలో నొక శాఖవారై దక్షిణాపథముయొక్క ప్రాక్తీరమున మొదటినుండియు నివసించి రాజ్యనిర్మాణముచేసి మౌర్యుల యనంతరము పశ్చిమముగా విజృంభించి విదర్భను మహారాష్ట్రమును జయించిరనుట విశ్వసనీయముగా తోచుచున్నది. శాతవాహనరాజుల చివరికాలములో తూర్పుదేశము పైననే వారి కాధిపత్యము ఉండెననుట స్పష్టము. అమరావతి - ధాన్యకటకము, పైఠను ఆ కాలమున ప్రసిద్ధి కెక్కిన రాజనగరములు.

పురాణముల ప్రకారము ఈ వంశమునకు చెందిన 30 మంది రాజులు పాలకులై యున్నట్లు విదితమగుచున్నది. వీరిలో మొదటివాడు శ్రీముఖశాతవాహనుడు. ఈతడు క్రీ. పూ. 225 లో స్వతంత్రుడై యుండెను. అమరావతి ఇతని రాజధాని. 23 సం. ల పరిపాలన అయిన తరువాత అతని సోదరుడు కృష్ణుడు రాజయి సాతవాహన రాజ్యమును నాసికవరకు విస్తరింపజేసెను. ఇతని కాలములో నాసికలో శ్రమణుల కొక గుహ తొలిపించబడెను. చైత్యమొకటి కట్టించబడెను. కృష్ణశాతవాహనుడు 18 సం. ల కాలము పాలించెను. తరువాత శ్రీముఖుని కుమారుడు మొదటి శాతకర్ణి చక్రవర్తి యయ్యెను. ఈయనభార్య నాయనికాదేవి. ఈమె మహా

రాష్ట్రివనిత. శాతకర్ణి అనుపేరు ఇతనికిని తరువాత కొందరు రాజులకును కలదు. 'శాతకర్ణి'పదమున కనేకము లయిన అర్థములు చెప్పబడినవి. కుట్టబడిన చెవులుకలవాడు అనుట యుక్తము. రాజులు యజ్ఞయాగాది క్రతువులం దాసక్తి కలవా రగుటచే కుండలములు ధరించెడివారు. నానేఘాట్ శాసనము ఈరాజుచేసిన యాగములను చెప్పుచున్నది. అతనికి 'అప్రతిహతచక్రుడు' అను బిరుదు కూడ కలదు. ఈ శాసనము శాతకర్ణి మరణానంతరము రాణియగు నాయనికాదేవిచే వేయించబడినది. ఈకాలము లోనే కళింగరాజ్యమును పాలించిన చేతవంశపురాజు ఖారవేలుడు శాతకర్ణితో పోరాడినట్లు ఖారవేలుని హాథీ గుంఫశాసనము (క్రీ. శ. 158) చెప్పుచున్నది.

ఈ వంశములో తరువాత ప్రాముఖ్యము చెందిన రాజు రెండవ శాతకర్ణి. ఈతడు క్రీ. పూ. 152-96 సం. నడుమ పరిపాలించెను. ఈతడు మాళవమునుజయించెను. పదమూడవరాజు కుంతలశాతకర్ణి మగధపై దండెత్తి కణ్వవంశపు రాజులను జయించెను. వాత్స్యాయన కామ సూత్రములలో ఈ శాతకర్ణి పేరు వినవచ్చుచున్నది. 17వ. రాజు హాలుడు అనునాతడు ప్రాకృతవాఙ్మయమున మిక్కిలి ప్రసిద్ధికెక్కినవాడు. ఇతడు కవులను పోషించి అనేక గ్రంథముల రచింప జేసెను. ఇతడు 'గాథా సప్త శతి' అను గ్రంథరాజమును సమకూర్చెను. ఇది మహా రాష్ట్రి ప్రాకృతభాషలో 700 గాథలుగల గొప్ప కావ్యము. దీనినినే, నూనూగుమీసాల నూత్న యౌవన మున శ్రీనాథ మహాకవి తెనిగించి యున్నాడు. కాని అది నేడు ఉపలభ్యమగుటలేదు. బోదిస్స, కుల్లహ, అమ రజి, కుమారిల, మకరంద సేన, శ్రీరాజాది కవులచే వ్రాయబడిన గాథ లిందు సంకలనము చేయబడినవి. అణు లక్ష్మి, అనుపలబ్ధ, రేవ, మాధవి మొదలయిన కవ యిత్రులు కూడ కొన్ని గాథలను రచించిరి. ఈ గాథ లలో ఆనాటి సాంఘికజీవితమును, గ్రామికుల ప్రేమ విలాసములును వర్ణింపబడినవి. శృంగారమే ప్రధానమై నను ఈ గాథలు మంచి కావ్యసరళి కలిగి యున్నవి. హాలుడు భోజరాజుతోను, శ్రీకృష్ణ దేవరాయలతోను పోల్చతగినవాడు. లీలావతి అను కావ్యముకూడ అప్ప టిదే. హాలసాతవాహనుడు సింహళరాజపుత్రియైన లీలా వతిని ప్రేమించి పెండ్లియాడుట ఈ కావ్యములోని ఇతి వృత్తము. దీనికి కార్యరంగము (సప్త) గోదావరీ తీర మున ప్రసిద్ధిచెందిన భీమేశ్వర క్షేత్రము. హాలుని కాలమున పైశాచిభాషలోకూడ కావ్యరచన సాగెను. గుణాఢ్యుని బృహత్కథా కావ్యము ఈకాలముననే వెలసె నని భావింపబడుచున్నది.

హాలుని తరువాత కొంతకాలము శాతవాహనుల ప్రతిభ తగ్గినది. క్రీ. శ. మొదటి శతాబ్ది ప్రారంభము నాటికి శకజాతివారైన క్షహరాటులు లేక క్షాత్రపులు మాళవమును మహారాష్ట్రమును జయించిరి. శాతవాహ నుల రాజ్యము తూర్పుభాగమునకే పరిమితమయ్యెను. ఇట్లుండ ఇరువదిమూడవరాజగు గౌతమీ పుత్ర శాతకర్ణి శాతవాహనుల ప్రతిభను తిరిగి ప్రతిష్ఠించెను. క్రీ. శ. 78 - 102 సం॥ల నడుమ ఈతడు పాలించెను. ఈతని తల్లియగు గౌతమీ బాలశ్రీ వేయించిన నాసిక శాసనము ప్రకారము ఇతడు శకులను, పహ్లావులను, యవనులను జయించెను. క్షాత్రప నహాపణుని వంశమును ఉన్మూలిం చెను. అతని వెండి నాణెములపై తన రాజముద్రను తిరిగి ముద్రింపించెను. ఉత్తర మహారాష్ట్రమును, కొంకణ మును, నర్మదానదీ ప్రాంతమును, సౌరాష్ట్రమును, మాళవ పశ్చిమ రాజపుత్రస్థానములను గౌతమీ పుత్రుడు వశపరచుకొనెను. కళింగముకూడ ఈతని రాజ్యమునచేరి యుండవచ్చును. గౌతమీ పుత్ర శాతకర్ణికి 'శాతవాహన కులయశః ప్రతిష్ఠాపన కరు'డనియు, 'ఏకబ్రాహ్మణుడు', 'ఏకవీరు'డనియు, క్షత్రియ దర్పనాశకు'డనియు బిరుదులు కలవు. ఇతని కాలమునుండి రాజులు తమ తల్లులపేర్లతో చేర్చుకొనుట వాడుక అయ్యెను. అందుచే నీతడు గౌతమీ పుత్ర శాతకర్ణియని పిలువబడెను.

గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణి తరువాత అతని కుమా రుడు వాసిష్ఠీపుత్ర శ్రీ పులుమావి పరిపాలించెను. ఈతని రాజ్యాంతమున శకులు ఉజ్జయినీ ప్రాంతమును మరల వశపరచుకొనిరి. శకులరాజు రుద్రదాముడు శాత వాహన రాజులతో వివాహసంబంధము చేసికొన్నను, వారి రాజ్యమునుండి ఉత్తర కొంకణమును, నర్మదానదీ ప్రాంతమును తాను వశము చేసికొనెను. అమరావతి శాసనమును బట్టియు గుడివాడలో దొరకిన నాణెములను

బట్టియు, పులుమావి ఆంధ్రదేశము నంతయు పాలించినట్లు తెలియుచున్నది.

తరువాత రాజులలో ముఖ్యుడు యజ్ఞశ్రీ యను నతడు. ఈతని నాణెములు గుజరాతు, కధియవాడు, బరోడా, మాల్వా, అపరాంత, మహారాష్ట్ర ఆంధ్రదేశ ములలోను, మధ్యరాష్ట్రములోను దొరకినవి. వీటినిబట్టి ఈతని రాజ్యవిస్తృతిని ఊహింపదగును. కొన్ని నాణె ములపై ఓడయొక్క చిత్రముండుటచే శాతవాహన యుగమున సముద్రయానము విస్తారముగా సాగెడిదని ఊహింపనగుచున్నది. తరువాతి రాజులు అంతపేరుగన్న వారు కారు. యజ్ఞశ్రీ అనంతరము విజయశ్రీ, చంద్రశ్రీ. పులోమావి యనువారు శాతవాహన రాజ్యాధికారమును పూనిరి. వీరు పరాక్రమవంతులైన పరిపాలకులు కాక పోవుటచే సామ్రాజ్యభాగములు వీరి హస్తములనుండి జారిపోయి తుదకు శాతవాహన సామ్రాజ్యమే క్రీ. శ. 220 ప్రాంతమున అస్తమించెను. ఆంధ్ర రాజ్యములోని సామంతులు స్వతంత్రు లయిరి. పశ్చిమమున అభీరులు, నైబుతిని చూటువంశమువారు, తూర్పు ప్రాంతమున ఇక్ష్వాకులు, దక్షిణమున పల్లవులు స్వతంత్ర రాజ్యములను స్థాపించుకొనిరి.

**శాతవాహనుల కాలమున ఆంధ్రదేశ పరిస్థితులు :** పరి పాలన కొరకు సామ్రాజ్యము హారములుగా అహారములు (భాగములు)గా విభజింపబడెను. అహారములను అమా త్యులు పాలించిరి. అహారములు గ్రామములుగా విభజింప బడెడివి. గ్రామములు గ్రామికుల పాలనలో నుండెడివి. నగరపాలన నాగరకుల క్రింద నుండెడిది. కొన్ని మండల ములు సామంతుల అధీనములో నుండెడివి. వీరు మహా రథులు, మహాభోజులు అని పిలువబడుచుండిరి. మహా సేనాపతి యనునతడు సైన్యవ్యవహారముగేగాక రాజకీయ వ్యవహారములు కూడ చక్కబెట్టుట కలదు. ఇతర ఉద్యోగస్థులలో మహాతారక, భాండాగారిక, మహామాత్ర, నిబంధకార, అనబడువారుకూడ కలరు. రాజులు ధర్మ మార్గమున పరిపాలన చేసెడివారు.

సంఘజీవనములో చాతుర్వర్ణ్య వ్యవస్థ యుండెడిది. యవనులు, శకులు, పహ్లవులు మొదలైన విదేశీయులు సంఘములో కలిసిపోయి ఏదోయొక కులమువారమని చెప్పుకొనెడివారు. స్త్రీలకు సంఘములో ప్రముఖస్థాన ముండెను. స్త్రీలు తమ భర్తల బిరుదములనుకూడ తమ పేళ్ళతో చేర్చుకొనెడివారు.

విదేశ వ్యాపారము, వర్తకము విరివిగా జరిగెడివి. తూర్పు తీరమున కంటకొస్సల, కొడ్డూర, అల్లోసైనె అనునవి ముఖ్యమైన రేవు పట్టణములు. పశ్చిమప్రాంత మున భరుకచ్ఛము, సోపారా, కల్యాణ అను రేవులు పేరుపొందినవి. పైఠను, తగర, ధాన్యకటకము వ్యాపార కేంద్రములుగా ప్రసిద్ధి కెక్కినవి. దేశ మధ్యమునుండి వ్యాపించుచు మహారాజ పథములు అను పెద్దబాటలు ఉండెడివి. వర్తకులు శ్రేణులుగా నేర్పడెడివారు. శ్రేణికి అధ్యక్షుడు శ్రేష్ఠి. చేనేత, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, తెలిక. మొదలయిన వివిధ వృత్తులవారు కూడ నుండెడి వారు. వివిధ వృత్తులవారికి వేర్వేరు శ్రేణు లుండెడివి. రాజులును, ధనవంతులును ఈ శ్రేణులకు తక్కువ వడ్డీతో ధనము నిలువచేయుటకు ఇచ్చుచుండిరి. ఈ ద్రవ్యము మీద వచ్చు వడ్డీతో దానధర్మములకు నిబంధనము చేయు టయు కలదు. ఇది ఈనాటి సహకార పద్ధతిని ఒక విధ ముగా పోలియున్నది. నహపణుని అల్లుడును, ధర్మచింతన కలవాడును అగు ఋషభదత్తుని శాసనమువలన ఈ యంశములు తెలియవచ్చుచున్నవి. వ్యవసాయము ముఖ్య మైనవృత్తి. మతసంస్థలకు భూములను దానమిచ్చు నాచారము కలదు. భూములనుండి పన్నులు వసూ లగు చుండెను. ఉప్పును తయారుచేసి అమ్ముట ప్రభుత్వమువారి ప్రత్యేకమైన హక్కు.

రాజులు హిందూమతావలంబకులుగా నుండిరి. వారు యజ్ఞయాగాదులను చేసెడివారు. శాతవాహనులలో మూడవ రాజగు మొదటి శాతకర్ణి తన కుమారునికి 'వేదసిరి' అను పేరు పెట్టుకొనెను. జనులు శివునికూడ కొలిచెడివారు. సప్తశతిలో పశుపతిని, గౌరిని స్తుతించిన భాగములున్నవి. 172 వ గాథలో గౌరీ దేవాలయములు పేర్కొనబడినవి. గణేశుని గణాధిపతి యనిరి. రాజులు వైదిక మతాభిమానులైనను బౌద్ధమతవ్యాప్తి ఆకాల ములో జరిగినది. భట్టిప్రోలు, అమరావతి, ఘంటసాల, గుమ్మడిదుర్రు, గుడివాడ, గోలి మొదలగు ప్రదేశముల లోని బౌద్ధస్తూపములు ఆనాటివే. బౌద్ధులు నాగరాజును

కొల్పుట గలదు. నాగులు స్తూపములను చుట్టుకొని ప్రభు సందేశమును వినుచుండినట్లు శిల్పములు కలవు.

శిల్పము, చిత్రలేఖనము ఆకాలమున అభివృద్ధిగాంచినవి. బౌద్ధ స్తూపములు, చైత్యములు, విహారములు, గుహాలయములు వెలసినవి. కన్హేరీ, నాసిక్, కార్లీ, భట్టిప్రోలు, అమరావతి, ఘంటసాల, గుమ్మడిదుఱ్ఱు, గుడివాడ, గోలి, కొండాపురం, గాజులబండ, ఫణిగిరి అనునవి ప్రసిద్ధమయిన బౌద్ధ క్షేత్రములు. అమరావతిస్తూపము చుట్టును పాలరాతితో నిర్మింపబడిన ప్రాకారముండెడిది. బుద్ధుని జీవిత ఘట్టములు శిల్పముగా రూపొందెను. అజంతాలోని ప్రాచీన గుహాలయందలి వర్ణచిత్రములు అప్పటి చిత్రకారుల నైపుణ్యమును తెలియజేయును.

శాతవాహనుల కాలము ప్రాకృత భాషాభివృద్ధికి ముఖ్యమయినది. హాలుని గాథా సప్తశతి మహారాష్ట్రీ ప్రాకృత భాషలోనున్నది. లీలావతి మరియొక ప్రాకృత కావ్యము. గుణాఢ్యుని బృహత్కథను గురించి ఈక్రింది కథకలదు. సంస్కృతములో పాండిత్యముగల తన రాణితో సమాన ప్రతిభను సంపాదించుటకు సాతవాహన రాజు సంస్కృతమును నేర్చుకొని తన రాణిముందు తన ప్రతిష్ఠను నిలుపుకొనెనని ఈ గాథవలన తెలియుచున్నది. ఈ సందర్భముననే శర్వవర్మ, రాజునకు ఆరునెలలలో సంస్కృతము నేర్పుటకై కాతంత్ర వ్యాకరణమును సంస్కృతమున రచించి తన ప్రతిన నెరవేర్చుకొనెను. రాజునకు ఆరునెలలలో సంస్కృతము శర్మవర్మ బోధింప గలిగినచో తాను సంస్కృతమును, ప్రాకృతమును, దేశభాషను, వర్జింతునని గుణాఢ్యుడు శపథము చేసెను. రాజు సంస్కృతమును ఆరునెలలలో నేర్వగల్గుటచే, గుణాఢ్యుడు సంస్కృత, ప్రాకృత, దేశభాషలను వర్జించి బృహత్కథను పైశాచి భాషలో రచించెను. పైశాచి ఒకరకమయిన ప్రాకృతమందురు. బృహత్కథ ఇప్పుడు లభించుట లేదు. వాత్స్యాయన కామసూత్రము లీ కాలముననే రచింపబడెను. పురాణములుకూడ ఈ యుగముననే రచింపబడెను.

నాగార్జునాచార్యుడు :- ఆంధ్రదేశమున బౌద్ధమత వ్యాప్తికి నాగార్జునుడు ముఖ్య కారకుడు. ఈతడు క్రీ. శ. 184 వ సం. న విదర్భలో ఒక బ్రాహ్మణ కుటుంబమున పుట్టెను. పిన్న వయస్సునందే వేదశాస్త్రములు ముగించి ఇతడు విద్వాంసుడు, కవి, తత్త్వవేత్త అయ్యెను. కపిమల అను 13 వ బౌద్ధ ప్రధాన గురువునుండి బౌద్ధ ధర్మమును స్వీకరించి అతని తరువాత 14 వ ప్రధాన బౌద్ధగురువయ్యెను. ఇతడు సింహళమునుండి ప్రజ్ఞాపరిమిత సూత్రములను, వైపుల్య సూత్రములను, హిమాలయములోని వృద్ధ భిక్షువునుండి మహాయాన సూత్రములను తెచ్చెను. ఇతడు పదివేలమంది బ్రాహ్మణులను బౌద్ధులనుగా మార్చెను. నాగార్జునుడు తాను నివసించుచున్న శ్రీపర్వతముపై ఒక ప్రయోగశాలను, ఒక గ్రంథాలయమును ఏర్పరచెను. ఇతడు అమరావతి స్తూపమునకు బైటి ప్రాకారమును కట్టించెను. ఇతడు టిబెట్టు, చైనా జపానులలో ప్రఖ్యాతిపొందెను. అశ్వఘోషుని తరువాత వాఙ్మయ సేవ చేసినవారిలో ఇతడు ముఖ్యుడు. ఇతడు 24 గ్రంథములకుపైగా రచించెను. వానిలో ఈ క్రిందివి ముఖ్యమైనవి.

1. సుహృల్లేఖ :- యజ్ఞశ్రీ శాతకర్ణికి అమూల్యమైన ఉపదేశము నిచ్చుచు నాగార్జునుడు దీనిని వ్రాసెను. నీతిపథము గొప్పతనమునకు ఆధారమనియు, నిర్వాణపద్ధతు లగు త్రిగుణములకతీతమగు జ్ఞానము, అష్టాంగ మార్గములు, చతుర్విధ సత్యములు ఇందుగలవు. తల్లి దండ్రులను భక్తి శ్రద్ధలతో పోషించుచుండవలెననియు ఇందు గలదు. 2. ప్రజ్ఞాప్రదీప శాస్త్ర కారిక. 3. మహాప్రజ్ఞా పరిమిత సూత్రవ్యాఖ్య. ఇది శూన్యత్వమును బోధించును.

ఆది శంకరులు మాయావాదమును నాగార్జునుని శూన్యవాదము (బౌద్ధదర్శనము) నుండి గ్రహించెనందురు. ప్రపంచమునందలి జనులందరు ఆత్మయొక్క ఉపస్థిత్యనుపస్థితులనుబట్టి ఆస్తికులో నాస్తికులో అగుచుండగా నాగార్జునుడు మాధ్యస్థ్యమును అవలంబించెను. ఆత్మ ఉండుట, ఉండకపోవుట అనునది దానిని చూచుట, చూడక పోవుట అను పద్ధతులపై ఆధారపడియుండునను మాధ్యమిక వాదమును ఇతడు ఏర్పరచెను. ఇతని దృష్టిలో శూన్యత యనగా నిర్వాణము, నిబంధనములు లేని స్థితి. దానిలో అన్ని విరుద్ధభావములు సమసిపోవును.

ఆర్యదేవుడు, భావవివేకుడు, దేవబోధిసత్త్వుడు, బుద్ధోపలితుడు, జయప్రభ అనువారు నాగార్జునుని శిష్యులలో ముఖ్యులు. నాగార్జునుడు బౌద్ధమతములోని మహా

యానశాఖకు ప్రవక్తకు డాయెను. ఈతడు శక్తితత్వ మునుగూడ ప్రతిపాదించెను. ఈతడు శ్రీపర్వతము పైననే క్రీ. శ. 194 సం. లో సిద్ధి పొందెను. ఆతరువాత అసంవత్సరముననే నాగార్జునుని మన్ననచేసిన యజ్ఞశ్రీ శాతకర్ణికూడ మరణించెను. మరణానంతరము నాగార్జునుడు బోధిసత్త్వుడుగా కీర్తింపబడెను.

క్రీ. శ. 7 వ శతాబ్దమున 84 మంది సిద్ధులలో నొకడగు మరియొక నాగార్జునుడు రసాయన శాస్త్రజ్ఞుడు ఉండెనని తెలియుచున్నది. ఇతనిచే వ్రాయబడినట్లు తలపబడు రసరత్నాకరము అను రసాయనశాస్త్ర గ్రంథములో శాతవాహనరాజుతోడి సంభాషణము కనిపించుచుండుటచే దానిని బోధిసత్వ నాగార్జునుడే రచించి యుండునని కొందరందురు.

**వివిధ రాజవంశములు :** శాతవాహనరాజ్యము చీలిపోయిన తరువాత ఆ స్థానమున అనేక రాజవంశములు వెలసినవి. పశ్చిమమున (మహారాష్ట్రమున) ఆభీరులను వారు పరిపాలించిరి. ఈశ్వరసేను డను రాజు ఈరాజ్యమును స్థాపించెను. ఈశ్వరదత్తుడు, వీరసేనుడు అను రాజులుకూడ పాలించిరి. ఆభీరులు 67 సం. లు పాలించినట్లు పురాణములు చెప్పుచున్నవి.

**చుటువంశపు రాజులు :** శాతవాహన సామ్రాజ్యపు నైరృతి ప్రాంతము (కర్ణాటకము) చుటువంశపువారిచే పాలింపబడెను. వీరి రాజధాని 'వనవాసి' లేక 'వైజయంతి'. హారీతీపుత్ర విష్ణుస్కంద చుటుకులానంద శాతకర్ణి, హారీతీపుత్ర శివస్కంద వర్మలు ఈ వంశములో ముఖ్యులు. వివాహసంబంధమువలన కదంబులకును, పల్లవవంశీయుడగు వీరకూర్చుడు బంధువగుటచేత పల్లవులకును మధ్య ఈరాజ్యము కొరకు తగవు లేర్పడెను. చుటురాజ్యముపల్లవుల వశమైనది. చుటువంశపురాజులు శాతవాహనరాజులవలె శాతకర్ణి బిరుదును తాల్చి వారివలెనే పాలించిరి.

**ఇక్ష్వాకులు (క్రీ. శ. 220 - 260) :** ఆంధ్రదేశమును శాతవాహనుల తరువాత పాలించిన వంశములలో ఇక్ష్వాకు రాజవంశము ముఖ్యమైనది. వీరు కృష్ణానదీ తీరమునందలి విజయపురి రాజధానిగా మూడవ శతాబ్ది నడుమ 62 సంవత్సరములు పరిపాలించిరి. ఈ వంశములో నలుగురు రాజులపేర్లు తెలియవచ్చినవి. నాగార్జునకొండ, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి ప్రాంతములలో లభించిన శాసనములమూలమున ఈ వంశీయులను గూర్చి తెలియుచున్నది. నాగార్జున కొండను శ్రీ పర్వతమనుట కలదు. వీరు పురాణములలోని ఇక్ష్వాకు వంశమునకు చెందినవారనియు, దక్షిణప్రాంతమునకు వచ్చి స్థిరనివాసమేర్పరచుకొని రనియు, శాతవాహనులకు సామంతులై తత్సామ్రాజ్య పతనానంతరము స్వతంత్రులై రనియు చరిత్రకారుల అభిప్రాయము. నాగార్జునకొండ శిథిలములు బయల్పడిన తరువాత నాగార్జునకొండ ప్రక్కనే విజయపురి కలదని ఋజువైనది. అల్లూరు శాసనము ప్రకారము ఇక్ష్వాకులు శాతవాహనుల పాలనలో మహాతలవరులుగా నుండిరి. శాతవాహనుల పతనసమయమున వీరు స్వతంత్రులైనట్లు తెలియుచున్నది.

ఇక్ష్వాకు రాజవంశమునకు మూలపురుషుడు వాసిష్ఠీపుత్ర శ్రీశాంతమూలుడు. (క్రీ. శ. 220 - 230). ఈ మహారాజు గొప్ప పరాక్రమవంతుడు. యజ్ఞ యాగాదులు చేసినవాడు. కోట్లకొలది బంగారు నాణెములను, గోశతసహస్రములను దానముచేసినవాడు. ఇతడు వేలకొలది నాగళ్ళతో భూమిని సాగుబడిలోనికి తెచ్చెను. ఇతడు వైదిక మతాభిమాని. అయినను రాజవంశపు స్త్రీలు బౌద్ధ మతాభిమానము కలిగియుండిరి. ఇతని ఇద్దరి రాణులలో నొకామె మాఠరీదేవి. సోదరీ మణులగు హమ్మసిరినిక, శాంతిశ్రీలు బౌద్ధ భిక్షువులకు దానము చేసిరి. వారి ప్రోత్సాహముననే విజయపురిలో పెక్కు బౌద్ధ చైత్యనములును, విహారములును వెలిసినవి.

శ్రీ శాంతమూలుని కుమారుడు మాఠరీపుత్ర శ్రీ వీరపురుషదత్తుడు (క్రీ. శ. 230 - 250). తండ్రివలె ప్రతిభావంతుడు కాడు. ఐనను ఈతని కాలమున బౌద్ధమతమునకు విశేష ప్రాముఖ్యము కలిగినది. రాజవంశపు స్త్రీలు చెక్కించిన శాసనములు నాగార్జున కొండపై కానవచ్చును. మహారాజు భార్యలు, మేనత్తలు మాత్రమేకాక సామాన్యస్త్రీలు సయితము బౌద్ధభిక్షువులకు దానములు చేసి బౌద్ధ విహార నిర్మాణమునకు తోడ్పడిరి. బోధిశ్రీ యను నామె రేవతుడను ధనవంతుని కుమార్తై. రెండు చైత్యగృహములను, ఒక విహారమును ఆమె కట్టించెను.

ఆ కాలమున పెక్కు బౌద్ధమత శాఖీయు లుండిరి. పూర్వ శైల, అపర శైల, బహుశ్రుతీయ, మహిశాసక ప్రభృతి శాఖల వా రుండిరి. బౌద్ధారామములను నిర్మించిన వారిలో భదంతానందుడు ముఖ్యుడు. కృష్ణానది లోయ ప్రాంతమున బౌద్ధ శిల్పములు, కట్టడములు వెలయుటకు ఇక్ష్వాకుల పాలనమే కారణ మయినది.

వీరపురుష దత్తుని కుమారుడు, మహారాజ వాసిష్ఠీ పుత్ర బాహుబల శాంతమూలుడు. ఈతడు 11 సంవత్సరములు పాలించెను (క్రీ. శ. 250-260). రాజవంశపుస్త్రీలు ఇతనికాలమునకూడ బౌద్ధమతమునందు అభిరుచిని శ్రద్ధను చూపిరి. అతని తల్లి భట్టిదేవి 'దేవీవిహారము' అనుదానిని పూర్తి చేసెను. రాజుసోదరి కందబాలశ్రీ భిక్షువులను సత్కరించెను. నాగార్జునకొండ బౌద్ధ క్షేత్రములనుచూచుటకు కాశ్మీర, గాంధార, చైనాదేశములనుండి పలువురు వచ్చెడివారు. అప్పటి ప్రజాజీవితమును తెలిసికొనుటకు నాగార్జునకొండ శిల్పము లెంతయు నుపకరించును. మూడవరాజగు శాంతమూలుని తర్వాత ఇక్ష్వాకుల ప్రతిభ తగ్గెను. వారు బౌద్ధమతమునకు చేసినసేవ చరిత్రలో చిరస్థాయి అయినది. ఇక్ష్వాకుల పతనమునకు కారణము బౌద్ధమత సంస్కృతికి విరుద్ధముగానున్న రాజవంశముల ఉద్ధతియే. పల్లవులు, బృహత్ఫలాయనులు శాలంకాయనులు, విష్ణుకుండినులు, ఆనందగోత్రులు వైదిక మతాభిమానులు.

పల్లవులు :- ఇక్ష్వాకుల వెంటనే ఆధిపత్యము వహించినవారు పల్లవులు. క్రీ. శ. మూడవ శతాబ్దము మొదలుకొని తొమ్మిదవ శతాబ్దము వరకు కృష్ణా కావేరీ నదుల మధ్యభాగమును వీరు పాలించిరి. పల్లవులెవరో నిర్ధారణచేయు విషయమున భిన్నాభిప్రాయములు గలవు. ఎట్లున్నను వీరు శక యవన పహ్లావులు అను విదేశ జాతిలోనివారనియు, ఉత్తర హిందూదేశమునుండి క్రమముగా దక్షిణమునకుసాగి ఇప్పటి గుంటూరు మండలములోని పల్నాడు ప్రాంతములో వీరు స్థిరనివాస మేర్పరచుకొనిరనియు కొందరు చెప్పుచున్నారు. ఈ అభిప్రాయము సమంజసముగా నున్నది.

పల్లవ వంశములో చారిత్రక పురుషుడుగా పరిగణింపదగినవాడు వీరకూర్చ మహారాజు. నాగవంశ్యుడును వనవాసి మహారాజును అగు విష్ణుస్కందుని కుమార్తెను ఇతడు వివాహమాడి రాజ్యమును బడసెను. ఈ మొదటి పల్లవ వంశమునుగూర్చి మైదవోలు, హీరహడగల్లి, కందుకూరు ప్రాంతములలో దొరకిన ప్రాకృతశాసనముల వలన తెలియుచున్నది. తరువాత రాజులలో ముఖ్యుడయినవాడు మహారాజ శివస్కందవర్మ లేక విజయస్కందవర్మ. ఇతని తండ్రి కంచినగరమును రాజధానిగా జేసికొని అచటినుండి కృష్ణానదీ తీరమునుండి బళ్ళారి వరకు పాలించెను. మహారాజ శివస్కందవర్మ అనేక యాగములు చేసెను. యువ మహారాజగు బుద్ధవర్మ యొక్క భార్య చారుదేవి నెల్లూరుమండలమున నారాయణస్వామి దేవాలయమునకు భూదానము చేసెను. పల్లవులు వైదిక మతాభిమానులు. కంచినగరము గొప్ప విద్యా కేంద్రముగా ప్రసిద్ధికెక్కెను. గుప్త చక్రవర్తి యగు సముద్రగుప్తుడు కావించిన దక్షిణ దిగ్విజయ యాత్రా కాలమున (క్రీ. శ. 346) విష్ణుగోపుడను పల్లవ రాజు పాలించుచుండెను. సముద్రగుప్తుని అలహాబాదు శాసనము ఇతనిని పేర్కొనినది.

తరువాత పాలించిన పల్లవరాజులను గురించి సంస్కృతములో లిఖింపబడిన శాసనములనుండి తెలియుచున్నది. కుమార విష్ణువు అనునతడు చోళులనుండి కంచి నగరమును స్వాధీనము చేసికొని పాలించెను. ఇతడు కదంబులతో పోరాడవలసివచ్చెను. క్రీ. శ. 6 వ శతాబ్ది ప్రారంభమున సింహవిష్ణువు అనునాతడు తరువాత పాలించిన పల్లవమహారాజులకు మూలపురుషు డయ్యెను. పల్లవ చక్రవర్తులలో కొందరు శివుని, కొందరు విష్ణువును కొల్చెడివారు. యాగములు చేసెడివారు. కుమారవిష్ణువు అనంతరము పాలించిన రాజులలో నందివర్మ అను రాజే త్రిలోచన పల్లవుడు అను ఒక అభిప్రాయము కలదు. ఈతనికి ముక్కంటికాడువెట్టి అను పేరును కలదు. ఇతడు గర్భశత్రువు అగు చాళుక్యుల నెదిరించినవాడు. ఇతడు కరికాళచోళునితోకూడ యుద్ధముచేసెను. విజయాదిత్యుడను చాళుక్యుడు త్రిలోచన పల్లవునితో యుద్ధము చేసెను. ఆ యుద్ధమున విజయాదిత్యుడు చంపబడెను. అతని భార్య గర్భవతియై కడపమండలములోని ముడివేము అగ్రహారమున, విష్ణుభట్ట సోమయాజి ఇంట దాగి

కొంతకాలమున కొక కుమారుని కనెను. ఇతడే విష్ణు వర్ధన నామమును వహించి పల్లవుల నోడించి చాళుక్య రాజ్యము స్థాపించెనని చెప్పబడుచున్నది.

**బృహత్ఫలాయనులు :** ఈవంశము వారు కూడూరు పురమును అనగా కృష్ణానదీ ముఖప్రాంతమును మూడవ శతాబ్దిలో పాలించినట్లు కన్పట్టును. క్రి. శ. 270 నుండి 285 వరకు వీరి కాలమని తెలియుచున్నది. కొండముది తామ్ర శాసనమువలన జయవర్మ మహారాజు 'పాంటూరు' గ్రామమును దానము చేసెనని తెలియుచున్నది. పాంటూరు వీరి రాజధాని యని కొందరి మతము. కాని కొండముది శాసనమున అట్లు లేదు. మహారాజ జయవర్మ పల్లవరాజగు మహారాజ శివస్కందవర్మకు సమకాలికుడు. ఇతడు పల్లవులబారిని పడకుండ తన రాజ్యమును కట్టుదిట్టము చేసికొనెను. ఇతడు 'మహేశ్వరపాద పరిగృహీతు' డని ఇతని శాసనము తెలుపుచున్నది. శాతవాహనులయొక్కయు, ఇక్ష్వాకులయొక్కయు పద్ధతులనే ఇతడు అనుసరించెను.

**శాలంకాయనులు :** క్రి. శ. 4, 5 శతాబ్దములలో కృష్ణా గోదావరీనదుల నడిమి ప్రదేశమును పాలనచేసినవారు శాలంకాయనులు. వీరినే వైంగేయకు లందురు. వేంగి రాజధానిగాగలవారగుటచే వైంగేయకులనియు, శాలంకాయన గోత్రీయులుగాన శాలంకాయనులనియు వీరు పేర్కొనబడుచున్నారు. పలూరు శాసనము, పెదవేగి శాసనము మొదలగు తామ్రశాసనములవలన వీరినిగూర్చి తెలియుచున్నది. దేవవర్మ అనువాతడు మనకు తెలిసిన మొదటిరాజు. ఇతడు అశ్వమేధయాగము చేసి 'అశ్వమేధయాజి' అనబడెను. ఇతడు శాసనములలో 'పరమ మాహేశ్వర', 'బప్పభట్టారక పాదభక్త' అనబడెను. ఇతని తరువాత హస్తివర్మ అను రాజు 'సమరావాప్తవిజయీ' అను బిరుదు పొందెను. ఇతని కాలముననే సముద్రగుప్తుడు వేంగిపై కెత్తివచ్చెను. అతడు తిరిగిపోయిన తరువాత యథాప్రకారము ఇతడు తన రాజ్యమును పాలించెను. పిదప కృష్ణానదివరకు రాజ్యమును వ్యాపింపజేసినవాడు నందివర్మ. ఇంకను చండవర్మ, రెండవ నందివర్మ, స్కందవర్మ, అను రాజులు తదుపరి పాలించిరి. నందివర్మ మహారాజు 'వివిధ ధర్మప్రధానుడు' అని ప్రశంసింపబడెను. ఈతడు వైదికమతమును బౌద్ధమతమును సమదృష్టితో చూచి ఆదరించెను.

ఈ వైంగేయకులు చిత్రరథ స్వామిని కొల్చెడువారు. వీరు ఆ స్వామి దేవాలయమును వేంగిలో కట్టించిరి. జైన మతము, బౌద్ధ మతము కూడ ఈ రాజుల మత సహనమువలన ప్రోత్సాహము పొందినవి. బర్మానుండి వచ్చిన బౌద్ధ యాత్రికులు సత్కరింపబడిరి. బుద్ధదత్తుడను పండితుడు సింహళమునుండి వేంగి ఆస్థానమునకు ఆహ్వానింపబడెను. ఈ వంశమునందలి విజయనందివర్మ పరమ భాగవతుడు. ప్రాలూరు నందలి విష్ణుగ్రహస్వామికి ఈతడు భూదానము చేసెను.

**కందార వంశపు రాజులు, ఆనందగోత్రులు :** బృహత్ఫలాయనులు పాలించుచుండిన సమయమున కందార వంశపురాజులు గుంటూరు, తెనాలి, ఒంగోలు తాలూకాల ప్రాంతమును, కందరపురమును రాజధానిగా జేసికొని పాలించిరి. చేజెర్ల, మట్టెపాడు, గోరంట్ల శాసనములవలన వీరినిగూర్చి తెలియుచున్నది. కందరుడు వంశమునకు మూలపురుషుడు. కంతేరు అనునదే కందరపురము. వీరు ఆనంద గోత్రికులు. కాబట్టి ఆనందగోత్ర రాజు లనబడిరి. దామోదరవర్మ, అత్తివర్మ అను రాజులు ఈ వంశమున ముఖ్యులు. దామోదరవర్మ బౌద్ధమతాభిమాని. రాజులు బ్రాహ్మణులకు దానములు చేసెడివారు. శివభక్తులు. వంకేశ్వరస్వామిని కొల్చెడివారు. రాజులు పరమత సహిష్ణుతాయుతులగుటచే బౌద్ధ నిర్మాణములు ఆంధ్రదేశమున వెలిసి క్రి. శ. 7 వ శతాబ్దమున యువాన్ చువంగు అను చీనా బౌద్ధ యాత్రికుడు ఆంధ్రదేశమున గలవానిని గూర్చి వ్రాయుటకు అవకాశమిచ్చినవి.

**విష్ణుకుండినులు :-** వైంగేయకుల ఆధిపత్యము అంతరించినపిమ్మట విష్ణుకుండిన రాజులు పాలించిరి. వీరి రాజధాని వేంగికి సమీపముననున్న తెందులూరు అను ఇప్పటి దెందులూరు. చిక్కుళ్ళ, ఈపూరు, రామతీర్థము శాసనముల మూలమున వీరిని గురించి తెలియుచున్నది. వీరు శ్రీపర్వతస్వామిని కొల్చెడివారు. క్రి. శ. 5, 6 శతాబ్దులలో వీరు పాలించిరి. మాధవవర్మ అను రాజు యాగములు చేసెను. మొదటి మాధవవర్మ వాకాటక రాజు కుమార్తెను వివాహమాడెను. కావున ఈతడు

వారి ప్రాపకముపొంది బలవంతుడయ్యెను. ఈ వంశము నందలి విక్రమేంద్రవర్మయు, గోవిందవర్మయు గొప్ప పరాక్రమోపేతులైన రాజులు. తరువాతి రాజులలో మూడవ మాధవవర్మ ముఖ్యుడు. ఇతనికి 'జనాశ్రయుడ'ను పేరు కలదు. 'జనాశ్రయ ఛందో విచ్ఛిత్తి' అను గ్రంథమును రచించిన గణస్వామిని ఇతడు ప్రోత్సహించెను. గోదావరీనది దాటి ఈతడు రాజ్యము విస్తరించుకొనినట్లున్నది. ఇతడు పొలంబూరు గ్రామమును, నాలుగు నివర్తనముల భూమిని శివశర్మ అను బ్రాహ్మణునికి దానము చేసెనని ఇతని పొలమూరు శాసనము తెలుపుచున్నది. మాధవవర్మ కుమారు డయిన మంచన భట్టారకుని కాలమున చాళుక్య రాజగు రెండవ పులకేశి విష్ణుకుండినుల నోడించి వేంగీ రాష్ట్రమును స్వాధీనము చేసికొని తన తమ్ముడగు కుబ్జ విష్ణువర్ధనుని పిఠాపురములో రాజ ప్రతినిధిగా నియమించెను. ఈ కుబ్జ విష్ణువర్ధనుడే క్రీ. శ. 625 లో స్వతంత్రుడై తూర్పు చాళుక్య వంశమునకు మూలపురుషు డయ్యెను. క్రీ. శ. 638 లో ఈ చాళుక్య వంశమునకు చెందిన రాజు జయసింహుడు పొలంబూరు గ్రామమును శివశర్మ కుమారుడగు రుద్రశర్మకు దానము చేసినట్లు మరియొక పొలమూరు శాసనము చెప్పుచున్నది. విష్ణుకుండినుల అనంతరము తూర్పు చాళుక్యులు ఆంధ్ర దేశమునకు అధిపతులైరి. విష్ణుకుండినుల కాలము గుహాలయములకు ప్రాముఖ్యము కాంచినది. ఉండవల్లి, సీతానగరము, విజయవాడ, మొగలురాజపురము ప్రాంతములలోని ఏకశిలా గుహాలయ నిర్మాణములు వీరి కాలమునాటి వే.

**కదంబులు :-** సముద్రగుప్తుని దండయాత్ర తరువాత పల్లవుల ప్రతిభ తగ్గుటతోడనే కదంబులనువారు కర్ణాటక ప్రాంతమున స్వతంత్రులైరి. వీరు బ్రాహ్మణులు. యజ్ఞయాగాది క్రతువులు చేయువారు. ఈ వంశమున మయూరశర్మ అనునతడు కాంచీనగరముచేరి సంస్కృతాభ్యాసము చేయుచుండగా ఒక పల్లవ అశ్వికుడు అతనిని హేళనము చేసెనట. అంతట మయూరశర్మ క్షాత్రపథ మవలంబించి పల్లవుల నోడించి క్రీ. శ. 345 ప్రాంతమున రాజ్యము స్థాపించెను, వైజయంతి లేక వనవాసి కదంబుల రాజధాని. సుమారు 2½ శతాబ్దులు ఈ వంశపురాజులు పాలించినతరువాత వాతాపి (బాదామి) చాళుక్యులు వారి రాజ్యమును వశపరచుకొనిరి.

**వాకాటకులు :** క్రీ. శ. మూడవ శతాబ్దాంతములో వాకాటకులను వారు మధ్యప్రదేశములో స్వతంత్రులైరి. ప్రస్తుత బీరారులో వారి రాజధాని యుండెడిది. రాజ్యస్థాపకుడు వింధ్యశక్తి అనువాడు. పద్మావతిని రాజధానిగా చేసికొని మధ్యభారతములో పాలించిన భారశివనాగులకు వీరు బంధువులు. వైదిక మతాభిమానులు. గుప్త చక్రవర్తులతోను, విష్ణుకుండినులతోను, కదంబులతోను వివాహ సంబంధములు చేసికొని వీరు తమ రాజ్యమును బలపరచుకొనిరి. గుప్తులతో కలిసి శకుల నోడించిరి. వైదికమత పునరుద్ధరణమునకు సంస్కృతభాషాభివృద్ధికి గుప్తులకు మార్గదర్శకులయిరి. ప్రవరసేనుడు అను రాజు విష్ణుభక్తుడు. ఇతడు సేతుబంధమను ప్రాకృత కావ్యమును రచించెను. అజంతా గుహాలయము లందలి చిత్రలేఖనములలో వాకాటకుల ప్రతిభయు, కళాభివృద్ధికి వారొసగిన ప్రోత్సాహమునుకనబడును. తుదకు బాదామి చాళుక్యులు వారి పతనమునకు కారకులయిరి.

**కాళింగులు :** గంగా మహానదులకు మధ్యగతమయిన దేశము ఉత్కళము. అందలి జనులు ఉత్కళులు. మహానదీ గోదావరుల మధ్యదేశము కళింగదేశము. అందలి జనులు కాళింగులు. మహాభారత యుద్ధమున ఉత్కళులు పాండవులకు సాయము చేయగా కాళింగులు కౌరవులకు తోడుపడిరి. సముద్రగుప్తుని దండయాత్రానంతరము కళింగమును మాఠరవంశజులు, వాసిష్ఠీ వంశజులు, తరువాత గాంగవంశజులు పాలించిరి. కాళింగులు నేర్పరులయిన నావికులు. వారు దూరద్వీపములందు వలస లేర్పరచి తమ వైదిక, బౌద్ధమతములను, నాగరకతను, శిల్పమును తమతో గొనిపోయి వ్యాపింపజేసిరి.

ఆంధ్రదేశమున ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యము క్షీణించిన తరువాత పెక్కు చిన్నచిన్న రాజ్యములు తలలెత్తినవి. అనేక రాజవంశములు పాలించినవి. మరల తూర్పు చాళుక్యుల ఆధిపత్యమున ఆంధ్రదేశమునకు ఏకత్వము, స్థిరత్వము ఏర్పడెను.

వై. వి. ఆర్.

**ఆంధ్రదేశ చరిత్రము II (క్రీ. శ. 624-1323) :** తూర్పుచాళుక్యులు 624 - 1064 :- తూర్పుచాళుక్య రాజగు కుబ్జవిష్ణు వర్ధనుడు వేంగిలో క్రీ. శ. 624 లో రాజ్య పాలనము ప్రారంభించెను. ఈతనియొక్కయు ఈతని వంశపు వారియొక్కయు చరిత్రము వారివారి తామ్ర శిలా శాసనముల వల్లను, నాణెముల వల్లను, ఆ కాలపు వాఙ్మయము వల్లను, సమకాలపురాజుల శాసనముల వల్లను తెలియుచున్నది.

క్షత్రియులును, చంద్రవంశీయులును అగు చాళుక్యులు ప్రథమమున అయోధ్యనుండి దక్షిణాపథమునకు వచ్చిరి. జయసింహుడు వంశకర్త. అతని మనుమడు మొదటి పులికేశి బిజాపూరు జిల్లాయందలి వాతాపి లేక బాదామి నగరము రాజధానిగా జేసికొనెను అతని మొదటి కుమారుని (కీర్తివర్మ) శాసన మొకటి బాదామి గుహ యందలిది 500 శకాబ్దమును తెలుపును. బాదామి శిలాశాసనకర్త మొదటి పులికేశి 465 శతాబ్దపు (క్రీ. శ. 543) నాటి వాడు. కీర్తివర్మ కుమారుడు రెండవ పులికేశి. ఈతని సతారా శాసనమున క్రీ. శ. 618 లో తన తమ్ముడు కుబ్జవిష్ణువు యువరాజని పేర్కొనబడెను. ఈతడే క్రీ. శ. 623 - 624 లో దుర్జయుల నోడించి, వేంగి మండలమును జయించి తన తమ్ముని కుబ్జవిష్ణుని యువరాజుగా నియమించెను. కృష్ణానది దక్షిణతీరమున నున్న పల్లవులను, పిష్ఠ పురమున విష్ణుకుండినులను జయించి దేశమును స్వాధీనపరచుకొనెను. ఉత్తరమున విశాఖపట్టణము జిల్లాను స్వాధీనపరచుకొనెను. దక్షిణమున గుంటూరు, నెల్లూరు జిల్లాలను జయించెను. ఈ తీరస్థ ఆంధ్రదేశమునకు ఏలూరుకడ నున్న పెదవేగిని రాజ ధానిగా ఏర్పరచుకొని కుబ్జవిష్ణువర్ధనుడు క్రీ. శ. 624 నుండి 641 వరకు రాజ్యమేలెను. ఈతని తిమ్మాపురము, చీపురుపల్లి, చేబ్రోలు, శాసనములు ఈతని దానములనేగాక ఈతని రాజ్యవిస్తీర్ణమునుగూడ తెలుపును. ఈతని రాజ్య మునకు ఉత్తరమున కళింగగాంగులు, దక్షిణమున కాంచీపుర పల్లవులు, పశ్చిమమున చాళుక్యులు; రాష్ట్ర కూటులు పరిపాలించుచుండిరి. కుబ్జవిష్ణువు, అతనిభార్య అయ్యనదేవి ముషినికొండ గ్రామమును బెజవాడ యందలి జైన మఠమునకు, జైన గురువులకు దానమొసంగిరి. ఈ దానమును వీరి మనుమని మనుమడు మూడవ విష్ణువు స్థిరపరచెను. ఈతని కాలమున చైనాదేశమునుండివచ్చిన బౌద్ధయాత్రికుడు యు అన్ ష్వంగు తెలుగుదేశమునకువచ్చి వేంగి, ధరణికోట, అమరావతి, శ్రీశైలములను దర్శించి అప్పటి రాజకీయ, మతవిషయములను గురించి వ్రాసెను.

కుబ్జవిష్ణువర్ధనునితరువాత ఇతనికుమారుడు జయసింహ వల్లభ మహారాజు రాజ్యమునకువచ్చి క్రీ. శ. 641 మొదలు క్రీ. శ. 673 వరకు రాజ్యమేలెను. ఈతని తండ్రికి 'విషమసిద్ధి' యను బిరుదముండినట్లే ఇతనికి 'సర్వసిద్ధి' యను బిరుద ముండెను. వేంగి, దక్షిణ కళింగ, మధ్య ఆంధ్రదేశములను జయించి గిరి, వన, జల, స్థల దుర్గములను పెక్కింటిని స్వాధీనపరచుకొని పల్లవ, దుర్జయ, విష్ణుకుండిన రాజుల నోడించి తరిమివేసి, దేవబ్రాహ్మణ మాన్యముల నెక్కువగా దానముచేసి, కన్నడ, తెలుగు, సంస్కృత భాషలను, జైన, బ్రాహ్మణ గురువులను పోషించుచు తీరస్థ ఆంధ్ర దేశమున సుస్థిర పరిపాలనము చేయసాగెను. ఈతని శాసనమును, ఇంతకు పూర్వపు రాజవంశమగు విష్ణు కుండిన మాధవవర్మయొక్క శాసనమును పొలమూరు గ్రామమున దొరికినవి. విష్ణు కుండిన మహారాజు చేసిన దానమును తిరిగి ఇతడు అసనపుర వాస్తవ్యుడును, పూర్వాగ్రహారికుడును అగు శివశర్మ కొడుకు రుద్రశర్మకు స్థిరపరచెను.

ఈ తూర్పు చాళుక్యరాజుల తామ్రశాసనములనుబట్టి వీరి వంశక్రమ, రాజ్యకాలములు తెలియుచున్నవి. కుబ్జ విష్ణువు 18 సంవత్సరములు, ఆతని కొడుకు జయ సింహుడు 33 సంవత్సరములు, ఆతని తమ్ముడు ఇంద్ర భట్టారకుడు 7 రోజులు, ఆతని కొడుకు విష్ణువర్ధనుడు 9 సంవత్సరములు, ఆతని కొడుకు మంగిరాజు 25 సంవ త్సరములు, అతని కొడుకు జయసింహ 13 సంవత్సర ములు, అతని సవతి తమ్ముడు కొక్కిలి ½ సంవత్సరము, అతని అన్న విష్ణురాజు 35 సంవత్సరములు, అతని కొడుకు విజయాదిత్యుడు 18 సంవత్సరములు, అతని కొడుకు విష్ణువర్ధనుడు 35 సంవత్సరములు రాజ్యమేలిరి. వీరి కాలమున అనేక భూములు, గ్రామములు బ్రాహ్మణు లకు, దేవాలయములకు దానమివ్వబడెను. తరుచు, పశ్చిమ చాళుక్యుల నోడించి వారిరాజ్య మాక్రమించిన

(క్రీ. శ. 753 లో) రాష్ట్రకూటులు వీరి నోడించుచు వీరివల్ల కప్పములను గైకొనుచుండెడివారు.

విష్ణువర్ధనుని కొడుకగు నరేంద్ర మృగరాజ బిరు దాంకితుడగు రెండవ విజయాదిత్యుడు (క్రీ.శ. 807-846) క్రీ. శ. 834 నుండి 846 వరకు, అనగా అతని ఆఖరి 12 సం. లు రాష్ట్రకూటులతో 108 యుద్ధములు సలిపి, వారిని వారి సామంతులగు పశ్చిమ గాంగులను ఓడించి 108 శివాలయములను కట్టించెను. అనేక భూదానము లను, అగ్రహారములను, వేదాధ్యయన సంపన్నులగు బ్రాహ్మణులకు, దేవాలయములకు, యుద్ధమున మడసిన వారి ఆత్మశాంతికిని, తాను చంపిన పాప పరిహారమున కును దాన మొసగెను, ఈతని తరువాత ఈతని కొడుకు 5 వ విష్ణువర్ధనుడు 1½ సంవత్సరములును, తరువాత ఆతని కొడుకు మూడవ విజయాదిత్యుడు 44 సంవత్సర ములును రాజ్యము చేసిరి. (క్రీ. శ. 848-892) మూడవ విజయాదిత్యునే గణక విజయాదిత్యుడందురు. మూడవ విజయాదిత్యుని సేనాధిపతియగు పాండురంగడు ఈతని దానములకు కార్యకర్తగనుండెను. పాండురంగడు తన అద్దంకి దానశాసనమున 80 పుట్ల ధాన్యము చల్లుటకు వీలైన భూమిని ధర్మవరం ఆదిత్య (సూర్య) భట్టారక దేవునికి దానమిచ్చెను. ఈతడు బోయలకొండ కోటను స్వాధీనము చేసికొని వారి కొట్టములను (12 కొట్టముల భూమిని) జయించెను. ఈ గణక విజయాదిత్యుడు పూర్వ చాళుక్య రాజులలోకెల్ల సుప్రసిద్ధుడు. బహు పరాక్రమ శాలి. పరిపాలనలో కడు సమర్థత గలవాడు. తన సేనా పతి పాండురంగని సహాయమున ఇతడు పెక్కు చిన్న చిన్న రాజ్యములను జయించెను. నెల్లూరును తగుల బెట్టెను. కందుకూరు కట్టెములను స్వాధీనము చేసి కొనుచు నోలంబ రాజగు మంగిని చంపెను. పశ్చిమ గాంగులను ఓడించి తరిమెను. కన్నడ రాజును ఓడించి అతని స్నేహితుడు, దహాలరాజగు సంకిలుని మానభంగ మొనర్చెను. వారియొక్క కిరణ, అచల పురములను తగులబెట్టెను, పశ్చిమమున రాష్ట్రకూటులను, ఉత్తర మున కళింగ గాంగరాజులను ఓడించి కప్పముగైకొనెను. దక్షిణ కోసలముపై దండెత్తి చక్ర కొట్టమును కాల్చి వేసెను. ఏనుగ గుంపులను గ్రహించెను. దక్షిణమున పల్లవులను, పాండ్యులను ఓడించి వారినుండి బంగారము గైకొనెను. పంచమహాశబ్ద బిరుదమును వహించెను. కాని రాష్ట్రకూటుడగు అమోఘవర్షుని కాలమున ఆతనిచే ఓడింపబడి కప్పము గట్టెను. కాని అతడు చనిపోయిన తరువాత (888) అతని కొడుకు కృష్ణుని ఓడించి గణక విజయాదిత్యుడు సర్వదక్షిణాపథ రాజ్యమును త్రికళింగ సహితముగా జయించి పరిపాలించెను. పాండురంగ సేనాధిపతి కళింగ గాంగులను ఓడించిన తరువాత వేముల వాడ, బస్తరు రాజ్యములను గ్రహించి, బద్దెగరాజుని సామంతునిగా జేసికొని, దహాల, కిరణ, నిరాత, అచల, దశపురములను పట్టుకొని తగులబెట్టి రాష్ట్రకూట రాజగు కృష్ణుని, అతని సహాయులను, సామంతులుగా జేసెను. ఈ రాజు కాలమున అనేక అగ్రహారములు బ్రాహ్మణులకు, దేవాలయములకు, మంత్రులకు, సేనాధి పతులకు ఇవ్వబడెను. చాళుక్య రాజ్యము ఉన్నతస్థితికి పెరిగెను.

ఈతని అద్దంకి శాసనమున ఈ క్రింది తరువోజ వృత్తము (శాసనములలో దొరికిన మొదటి తెలుగు పద్యము) కలదు. జయసింహుని (641-673) విప్పర్తి శాసనముగూడ ప్రాచీన తెలుగుభాష యం దున్నది. గద్యమయము. తూర్పుచాళుక్య రాజులందరు తెనుగు ననే దానశాసనములను వ్రాయించిరి.

"స్వస్తిశ్రీమత్ సకల లోకాశ్రయ జయసింహ।
వల్లభమహారాజులకున్ ప్రవర్ధమాన విజయ రా।
జ్య సంవత్సరంబుళ్ ఎణుంబొది అన్నేణ్టి అమ్మన్ పూణ్ణ।
మనాణ్డుం మ్లావిండిరాజుల ముట్ట్యుకలిముడి రాజుళ్.

క్రీ. శ. 9 వ శతాబ్దమునాటికి పద్యమయశాసనము లేర్పడి నవి. ఈతని శాసనము వలనను, వేములవాడ చాళుక్యుల శాసనములవలనను పంపకవి యొక్క విక్రమార్జున విజ యము వలనను ఈతని చరిత్ర తెలియుచున్నది.

గణక విజయాదిత్యుని తరువాత ఆతని తమ్ముని కొడుకు మొదటి చాళుక్య భీముడు 892 నుండి 921 వరకు రాజ్యమేలెను. ఈతని అత్తిలి తామ్ర శాసనమున ఈతడు శకసంవత్సరము 814 (క్రీ. శ. 892 ఏప్రిల్ 17) మేష చైత్ర బహుళ తదియ సోమవారమునాడు పట్టాభిషిక్తు డయినట్లు కలదు. తెలుగుదేశమున శకాబ్ద

మును వాడుట ఇదియే మొదలు. తన పేరున రెండు ఈశ్వరాలయములు కట్టించెను. ఈతని శిలాశాసన మొకటి బెజవాడ ఇంద్రకీల పర్వతముమీద గోవిందమఠమునొద్ద కలదు. అది ఆతని 17 వ రాజ్య సంవత్సము నాటిది. అందు ప్రాచీన తెలుగుపదములు కలవు. దానివలన పార్థి వేశ్వరుని ప్రతిష్ఠ జరిపినట్లు తెలియును. ఈతని తరువాత ఈతని పెద్దకుమారుడు విజయాదిత్యుడు 6 మాసములు రాజ్యమేలెను. పిమ్మట అతని పెద్దకుమారుడు అమ్మరాజు రాజ్యమునకు వచ్చి 921 నుండి 927 వరకు పాలించెను. ఈతడు తనకు సహాయ మొనర్చిన సేనాధిపతులకు పెక్కు దానశాసనముల నిచ్చెను. ఎడేరు శాసనమున ఇతనికి గల 'రాజమహేంద్ర' బిరుదమును బట్టి ఇతడే గోదావరికి ఉత్తరపు టొడ్డుననున్న రాజమహేంద్రవరమునకా పేరు పెట్టెనని తెలియును. అమ్మరాజు తరువాత అతని కొడుకు విజయాదిత్యుడు చిన్నవాడగుటచే తాడప (తాళరాజు) రాజ్యమును గ్రహించెను. కాని ఆతని నోడించి చాళుక్య భీముని రెండవకుమారుడు విక్రమాదిత్యుడు రాజ్యమును గ్రహించి, రమారమి ఒక సంవత్సరము రాజ్యమేలెను. తరువాత తాడపుని కొడుకు యుద్ధమల్లు రాజ్యమును పట్టుకొని 928 నుండి 934 వరకు పరిపాలించెను. ఈతని బెజవాడ శాసనమునుబట్టి కుమారస్వామికి గుడి కట్టించె ననియు, శాసనమున ప్రాచీన తెలుగుపద్యములుగల వనియు తెలియును. అమ్మరాజు సోదరుడు రెండవ భీముడు యుద్ధమల్లుని పారద్రోలి 934 నుండి 945 వరకు రాజ్యమేలెను. ఈతడు అనేక దానములు చేసెను. ద్రాక్షారామ భీమేశ్వరాలయములు ఈతనిచే ప్రతిష్ఠితములు. ఈతని తరువాత ఈతని రెండవకుమారుడు రెండవ అమ్మరాజు 945 నుండి 970 వరకు పరిపాలించెను. ఈతని దానములు తెలుపు శాసనములు పెక్కులు గలవు. మలియంపూడి శాసనమున పాండురంగని మునిమనుమడుదుర్గరాజు కట్టించిన జైనాలయమునకు చేసిన ధర్మము కలదు. తాడికొండ శాసనము (958) దేవాలయమున కిచ్చిన 4 గ్రామముల ధర్మమును తెలుపును. ఎలవీవర్రు శాసనము స్వర్ణభాండాగార అధ్యక్షునికి చేసిన గ్రామదానము తెలుపును. కలుచుంబర్రు శాసనము అత్తిలివాడు విషయమందలి గ్రామము జైనాలయము బాగుచేయించుటకు జైనగురువు అర్హనందికిచ్చిన ధర్మము తెలుపును. వేములపాడు శాసనము దుర్గరాజుకొగ్గికపై వేదసంపన్నుని కిచ్చిన అగ్రహార దానము తెలుపును. పాములవాక శాసనము ఎలమంచి కళింగ విషయమున చేసిన భూదానమును తెలుపును. రెండవఅమ్మరాజు ఇట్లనేక దానధర్మములను చేసెను. ఆతనికి యుద్ధమల్లునికొడుకు బాడపునితోయుద్ధము ప్రాప్తించగా ఓడిపోయికళింగమున తలదాచుకొనెను. తరువాత తనసోదరుడు దానార్ణవునకు బాడపతాళపులకు 970-973 మధ్య అనేక యుద్ధములు జరిగెను. ఇదే సమయమున పశ్చిమమున రాష్ట్రకూటులు ఓడిపోవుట, తిరిగి పశ్చిమ చాళుక్యులు తమ రాజ్యమును సంపాదించి పరిపాలించుట జరిగెను. అయినను తూర్పు ఆంధ్రదేశము బాడప మహారాజు పాలనమున 999 వరకు ఉండెను. కాని దేశమున శాంతిలేకుండెను. ఈ సమయమున చోళచక్రవర్తి రాజరాజు వేంగిపై దండెత్తెను.

క్రీ. శ. 973-1000 మధ్య అనగా 27 సంవత్సరములు తూర్పు తెలుగుదేశము అరాజకముగా నుండెను. బాడపునకు తరువాత తాళపునకును, అమ్మరాజు సంతతివారికిని జరిగిన అనేక యుద్ధములవలన దేశము అధోగతి పాలయ్యెను. చోళదేశమున రాజరాజచోళుడు 985 లో సింహాసన మెక్కెను. క్రీ. 999 లో రాజరాజు వేంగిదేశముపై దండెత్తి జయించెను. ఈతడు దానార్ణవుని పెద్ద కుమారుడగు శక్తివర్మకు రాజ్య మిచ్చి తన కూతురు కుండవాంబను శక్తివర్మ తమ్ముడు విమలాదిత్యునికిచ్చి వివాహ మొనర్చి చోళ-చాళుక్య సంబంధమును దిట్టపరచెను. శక్తివర్మ పఖుపర్రు గ్రామమున శివాలయములకు భూములను ఒసంగెను. ఆతడు 12 సం.లు పరిపాలించిన తరువాత విమలాదిత్యుడు రాజ్యమునకు వచ్చెను. ఈతని రణస్థిపూడి దానశాసనమునుబట్టి క్రీ. శ. 1011 మే నెలలో తాను పట్టాభిషిక్తుడయినట్లును ఆ గ్రామమును తన మంత్రియగు వజ్రకు దానమిచ్చి నట్లును తెలియుచున్నది. క్రీ.శ. 1018 లో తంజావూరు జిల్లాలోని తిరువైయ్యారు గ్రామమున పంచనదేశ్వరస్వామికి వెండిచెంబులు సమర్పించెను. 1012 లో తంజావూరున తన మామగారితో పాటు తన బావమరది రాజేంద్రచోళుడు సింహాసన మెక్కు సందర్భమున ఆ మహోత్సవము చూచుటకై

వెళ్లెను. 1018 లో రాజేంద్రచోళుని కొడుకు రాజాధి రాజుకూడ తండ్రితోపాటు సింహాసన మెక్కగా అది చూచుటకు తిరిగి విమలాదిత్యుడు తంజావూరువెళ్ళి 1022 లో అక్కడనే మరణించెను. కనుక 1022 శ్రావణ మాసములో అతని పెద్దకొడుకు రాజరాజు, రాజ మహేంద్రవర సింహాసనమెక్కెను. కాని 1019 లోనే రాజ్యమునకు వచ్చెను. ఈతని భార్య అమ్మంగదేవి, ఈతని మేనమామయగు రాజేంద్రచోళుని కూతురు. ఇల్లే వీరి కొడుకు రాజేంద్రచోళుడు (ఉభయ కులోత్తుంగ చోళదేవుడు) తన మేనమామయగు రాజేంద్రదేవుని కూతురగు మధురాంతకిని వివాహమాడెను. ఈ మేనరికపు వివాహమువల్ల చోళ చాళుక్య సంబంధములు మరింత గట్టిపడెను. ప్రాయశః విమలాదిత్యుని రెండవ కుమారుడు సప్తమ విజయాదిత్యుడు పశ్చిమ చాళుక్య చక్రవర్తి రెండవ జయసింహుని సహాయమున రాజమహేంద్రవర సింహాసనమును పట్టుకొనుటచేత (తన తండ్రి విమలా దిత్యుడు 1018 లో తంజావూరు వెళ్ళినపుడు) చోళ రాజేంద్రుడు అతనిని, అతనికి సహాయమొనర్చిన జయ సింహుని, కళింగ రాజులను ఓడించి, 1022 సం. ఆగస్టు 16 న రాజరాజ నరేంద్రునికి పట్టాభిషేక మొనర్చెను. కాని తిరిగి 8 సంవత్సరములకు విజయాదిత్యుడు తన అన్నను పదభ్రష్టుని గావించెను. తాను 1031 జూనులో పట్టాభిషిక్తుడాయెను. అతనికి తిరిగి జయసింహుడు సహాయ మొనర్చెను. కనుక చోళరాజు రాజేంద్రుడు రాజరాజుకు సహాయమొనర్చెను. 1032 లో కలిదిండి వద్ద గొప్ప యుద్ధము జరిగెను. తుదకు చోళులు గెలిచిరి. రాజరాజ నరేంద్రునికి తుదకు 1035 లో సింహాసన మిప్పించిరి. ఇతడు పదిసంవత్సరములు శాంతియుతముగా పాలించెను. కాని 1044 లో రాజేంద్రచోళుని మరణానంతరము తిరిగి పశ్చిమ చాళుక్య చక్రవర్తి మొదటి సోమేశ్వరుడు వేంగి రాజ్యమును, కళింగమును జయించెను. కాని చోళ రాజాధిరాజు ధరణికోట కొల్లిపాక యుద్ధములలో పశ్చిమ చాళుక్యులను ఓడించెను. కాని వేంగి రాజ్యమును వారి హస్తములనుండి తీసికొనలేకపోయెను. అయినప్పటికి రాజరాజ నరేంద్రుడు సోమేశ్వరునితో సంధిచేసికొని పరిపాలింపగలిగెను. సోమేశ్వరుని ప్రధానియగు నారా యణభట్టుకు నందంపూడి గ్రామమొసంగెను. ఈతడే నన్నయకు ఆంధ్రభారత రచనయందు సహాయమొనర్చిన వాడు (1051 - 1052). రాజరాజు శివపూజా ధురంధరుడు. వైదిక మతాభిమాని. వర్ణాశ్రమ ధర్మములను నిలిపెను. వేదశాస్త్రములను పోషించెను. యజ్ఞయాగాది కర్మలకు భూములను, ధనమును ఇచ్చెను. పురాణ, ఆగమ, వేదాంత శాస్త్రములు నేర్చినవాడు. అనేక దేవాలయములు, అగ్రహారములు, సత్రములు కట్టించెను.

క్రీ. శ. 1061 లో తన పరోక్షమున తిరిగి తన సవతి తమ్ముడు విజయాదిత్యుడు రాజ్యమును గ్రహించెను. ఇతడు తన కొడుకు శక్తివర్మకు రాజ్యమిచ్చెను (1061). కాని అతడొక సంవత్సరము రాజ్యపాలన జరిపి యుద్ధమునందు చనిపోయెను. కనుక ప్రజల కోరికపై తాను రాజ్య మును స్వీకరింపవలసివచ్చె నని విజయాదిత్యుడు వేంగిని పరిపాలించెను. ఈతడు ఇంతకుముందు పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సామంతుడుగానుండి నోలంబవాడి, కోలారు దేశములలో వారి మాండలికుడుగను, సేనాధిపతిగాను ఉండి తుదకు వేంగిరాజ్యమును పట్టుకొనెను. అయినను చోళ చక్రవర్తి వీర రాజేంద్రుడు వేంగిపై దండెత్తి విజయాదిత్యుని పారద్రోలి క్రీ. శ. 1068 లో వేంగి రాజ్యమును రాజేంద్ర చోళునికే పట్టము కట్టెను. విజయాదిత్యుడు కళింగగాంగ రాజరాజు వద్ద (1069-70) శరణు జొచ్చెను. 1070 లో చోళరాజగు అధి రాజేంద్రుడు చనిపోయెను. కనుక చాళుక్య రాజ రాజ నరేంద్రుని కొడుకు రాజేంద్రచోళుడు రాజధానిని స్వాధీన పరచుకొని సింహాసన మెక్కెను. ఈ సమయ మున కళింగ గాంగ రాజరాజు తన సేనాపతియగు బణపతిని వేంగిపై దండెత్త పంపెను. అతడు చోళుల సైన్యమును ఓడించగా వారు గాంగ రాజరాజుతో సంధి చేసికొనిరి (1072). తన జీవిత కాలము వేంగిని విజయాదిత్యుడు పాలించుటకును, కళింగ రాజరాజునకు రాజేంద్రుని మరదలు రాజసుందరి నిచ్చి వివాహము చేయుటకును అంగీకరింపబడెను. వీని ఫలితముగా 1076 వరకు విజయాదిత్యుడు వేంగి రాజుగా పరిపాలించి ఆ సంవత్సరమున చనిపోయెను. అపుడు రాజేంద్రచోళ లేక కులోత్తుంగచోళ తెలుగు లేక వేంగి దేశమును,

తన రెండవ కుమారుడు ముమ్మడి చోళ రాజరాజు (1076-78), ఆతని తర్వాత మూడవ కుమారుడు వీర చోళ (1078-84), తరువాత పెద్దకుమారుడు రాజరాజ చోడగంగు (1085-89), ఆ తర్వాత తిరిగి వీరచోడ (1089-92), ఆ తరువాత విక్రమచోళ (1093-1118) రాజ ప్రతినిధులుగా వరుసగా పాలింపజేసెను. 1118 లో కులోత్తుంగుడు తన రాజధానికి విక్రమచోళుని పిలువ నంపెను. వేంగి అరాజకమయ్యెను. 1119 లో కులో త్తుంగుడు చనిపోగా విక్రమచోళుడు ద్రామిళ, వేంగి దేశములకు చక్రవర్తి యయ్యెను. కాని వేంగిపై ఆరవ విక్రమాదిత్యుడు దండెత్తి దానిని స్వాధీన పరచుకొని 1126 వరకు మాత్రమే పాలించెను. అప్పటినుండి తిరిగి వేంగి విక్రమచోళుని స్వాధీనములోనికి వచ్చెను. ఇతడు వెల నాటి చోడులను తన రాజప్రతినిధులుగా నియమించెను.

ఈకాలమున తెలుగు దేశమును వేరువేరు వంశములు పాలించెను. ఎలమంచిలి, పిష్ఠపురము, కోనమండలము, వెలనాడు, పాకనాడు, పొత్తపినాడు మొదలగు దేశ విభాగములు వేర్వేరు వంశములక్రింద పాలింపబడు చుండెను. వీరిలోకెల్ల తెలుగు చోళులు, లేక పొత్తపి చోళులు ప్రసిద్ధులు. కడపజిల్లాలోని కొంతభాగమును, చిత్తూరు జిల్లాలోని కొంత భాగమును కలిసి పొత్తపినాడన బడెను. ఈ తెలుగు చోళులు ప్రథమమున తూర్పు చాళుక్య వంశములోనివారే. కర్నూలు జిల్లాలోని పెడ కల్లు రాజధానిగా జటాచోడుని కొడుకు భీముడు పాలించెను. కైలాసనాథాలయ శాసనమునుబట్టి ఈ తెలుగు చోళులు చోళత్రినేత్ర, కరికాల రాజుల సంతతియనియు, జటాచోడ భీముడు గొప్ప రాజనియు అతడు గణక విజయాదిత్యుడు, చాళుక్య భీముడు, కొల్లభిగండ విజయా దిత్యుడు, ఆతని కూతురు సంతతివాడనియు, ఆతని చెల్లెలు అమ్మరాజు భార్య అనియు, అతనిని చంపి, దానార్ణవుడు రాజ్యమునకు వచ్చుటచేత అతనిని జయించి వధించి పొత్తపినాడులో స్వతంత్రుడయ్యె ననియు తెలియును (972). వైదుంబులను ఓడించియు, రాష్ట్ర కూటులను తిరస్కరించియు తన రాజ్యమును విస్తరింప జేసెను. ఈ వంశమువారు వేర్వేరు శాఖలై కొణిదెన, పొత్తపి, నెల్లూరు, ఏరువ, కందూరు, హేమవతి మొద లగు ప్రదేశములలో చిన్నచిన్న రాజ్యముల నేర్పరచు కొని 16 వ శతాబ్ది మధ్య భాగమువరకు ఆంధ్రదేశములో పరిపాలించిరి. వీరి శాసనములు కంచిలో దొరుకుటచేత కొంతకాలము దాని నాక్రమించిరని తెలియును. 14 వ శతాబ్దమున వీరు కాకతీయులకు కప్పము కట్టుచు వారి క్రింద సామంతరాజులుగా పరిపాలించుచుండిరి.

వీరిలో ఒకశాఖ 1050 - 1300 మధ్య గుటూరు జిల్లా లోని కమ్మనాడు నేలిరి. కొణిదెన రాజధాని. బల్లీశ్వర, కామీశ్వర, త్రిభువన మల్లీశ్వర ఆలయములు ముగ్గురు రాజులపేర వెలయించిరి. వీరు ప్రథమమున వేంగి చాళుక్యులకును, తరువాత పశ్చిమ చాళుక్యులకును, తరువాత కాకతీయులకును సామంతరాజులుగా నుండిరి. వీరు సూర్యవంశపు క్షత్రియులుగా వర్ణింపబడిరి. వీరనేక దాన శాసనములను ఇచ్చిరి. బల్లియచోళుడు 10 వ శతాబ్ది మధ్యభాగమున పరిపాలించెను. ఈతని కాలమున రేనాడు (కడప) దేశమును వదిలి తూర్పుగా గుంటూరు, నెల్లూరు జిల్లాలకు వచ్చి చేరిరి.

చోడబల్లి కుమారుడు నన్నిచోడుడు (1050 - 1100) కుమార సంభవ గ్రంథకర్త. ఈతడు నన్నయకాలము వాడు. ఈతని గ్రంథమున పేర్కొనబడిన చాళుక్యరాజు రాజరాజ నరేంద్రుడని తోచును. ఈతడు పాకనాడేలెను. పొత్తపి రాజధాని. ఈతని తరువాత కామదేవుడు (1100 - 1115) పాలించెను. ఈతని శాసనములు త్రిపురాంతకమున కలవు. మంత్రి భీమయ. ఈతడు కులోత్తుంగ చోళమహారాజునకు సామంతుడు. ఈతని తరువాత ఈతని కుమారుడు కన్నారచోడుడు 1115-1133 మధ్య పాలించెను. ఈత డనేక దానశాసనముల నిచ్చెను. గుద్దవాడి నాడు (రామచంద్రపురం తాలూకా) లోని పెద్ద డాకరేమి (ద్రాక్షారామము) భీమేశ్వరునికి తన తల్లిదండ్రుల పుణ్యము నిమిత్తము అనేక ధర్మములను జేసెను. ఇక్లే కాళహస్తీశ్వరునికి కమ్మనాడులోని దేవా లయములకు అనేక ధర్మములు చేసెను. కులోత్తుంగ, విక్రమచోళులకు సామంతుడు. వారి బిరుదములు వహిం చెను. క్రమముగా దక్షిణమునకు తన రాజ్యమును విస్త రింప జేసెను. ఈతని కాలమున రెండవ ప్రోలరాజు కాకతీయరాజ్యమును తూర్పునకు సాగించుచుండెను.

కనుకనే ఈతని ధర్మములను కొన్నిటిని అతడు స్థిరపరచెను. కామచోడుడు, అతనికొడుకు త్రిభువనమల్లుడు 1137 నుండి 1151 వరకు రాజ్యమేలిరి. ఉభయులు కలిసి కొణిదెన గ్రామమున ధర్మములు చేసిరి. వీరి శాసనము ననుబట్టి కమ్మనాడు, గుండికర్రు, మొట్టవాడి వీరిపాలన మందుండెను. వీరు వేంగి రాజ్యమునకు లోబడి పాలించు చుండిరి. పశ్చిమ చాళుక్య రాజులను వేంగినుండి పార ద్రోలిరి. వెలనాటి చోళులతో సఖ్యముగా నుండిరి. వీరి కాలమునుండి కాకతీయులు (రుద్రదేవ, గణపతిరాజులు) దేశముపై దండెత్తి ఆక్రమించుకొనిరి. బల్లిచోడుని కాల మున (1211-22) కొణిదెన తెలుగు చోళుల అధికా రము తగ్గెను. ఇట్లే వెల్నాటిచోళుల అధికారముకూడ తగ్గెను. గణపతిదేవుడు వేగిదేశమును క్రమముగా స్వాధీన పరచుకొనెను.

పొత్తపి (కడప) తెలుగుచోళులు :- వీరు కడపజిల్లా పుల్లంపేట తాలూకాలోని టంగుటూరువద్దనున్నపొత్తపి రాజధానిగా తెలుగు చోళవంశములోని వేరొకశాఖ 200 సం. లు రేనాటిని పాలించిరి. వీరు పశ్చిమ చాళు క్యులకు, తరువాత చోళులకు సామంతులుగ నుండిరి. 13 వ శతాబ్ద ప్రారంభమున కాకతీయులచే జయింపబడి సామంతులయిరి. కరికాలవంశమునకు చెందిన తెలుగు బిజ్జన మనుమడు మల్ల దేవుడు పొత్తపిని పాలించెను. వాని వంశములోని బెట్టరస 1121 నుండి 1125 వరకు పాలిం చెను. విక్రమచోళుని విజయమునకై నందలూరువద్ద దానశాసనము ఇచ్చెను. ఈతని కాలమున అత్యనచోళుడు రేనాడులో కొంతభాగము నేలుచుండెను. ఈతడుపశ్చిమ చాళుక్యులకు సామంతుడు. ఈతనిక్రింద సామంతుడొకడు ముదివేము అగ్రహారమును 108 మహాజనులకు దాన మిచ్చెను. సిద్ధరస కొడుకు విమలాదిత్యుడు 1125 లో నందలూరులోను, శ్రీ కాళహస్తిలోను చాల దాన శాసన ములను ఇచ్చెను. ఈతడు విక్రమచోళుని మహా మండ లేశ్వరుడు. ఈతని శాసనములు అరవభాషలో కొన్ని గలవు. 1130 లో మల్లిదేవు ములికె (300 గ్రామ ములు), సిందనాడి (1000 గ్రామములు) దేశములను వల్లూరు రాజధానిగా పాలించెను. ఈతడు పశ్చిమచాళుక్య సోమేశ్వరుని సామంతుడు. ఈతడు తెలుగు పల్లవులను జయించి పాకనాడులోని కొంతభాగము నేలెను. ఈతని మనుమడు మల్లిదేవు 1159 లో పాలించెను. ఈతడు నెల్లూరు తెలుగు చోడరాజగు నల్లసిద్ధిచే ఓడింపబడి (1159) వానికి సామంతుడుగా రాజ్యమేలెను. కొంత తరువాత రాజగు ఓపిలిసిద్ధి 1224 లో కమ్మనాటిని జయించి, కాకతిగణపతి అనుగ్రహమున కొణిదెన రాజధానిగా 6000 దేశమును పాలించెను (1280 వరకు). గణపతి దేవుని జయమునకై కొణిదెన శంకరేశ్వరునికి మొగలి చెరువు గ్రామమును దానమిచ్చెను. గణపతిదేవుడు తన ప్రతినిధిగా ఓపిలిసిద్ధిని పొత్తపి, పాకనాడు, కమ్మనాడు, వెలనాడులపై నియమించెను. అరవ లిపిలో పాండ్య రాజగు సుందరపాండ్యుని (1216-38) శాసనములు నందలూరు, వేపాక, అత్తిరాల, పొత్తపినాడులలో దొర కుటచేత ఈ ఓపిలిసిద్ధి అతని సామంతుడయ్యెనని తోచును. ఈతని తరువాత భీమదేవుడు కాకతిగణపతి సామంతు డుగ పాలించెను (1285). కాకతీయ రాజ్యానంతరము (1325) విజయనగర రాజులకు లోబడి ఆ తరువాత గజపతి రాజులకు లోబడి 15 వ శతాబ్దాంతమువరకు ఈ వంశపు రాజులు పశ్చిమాంధ్రదేశమును పాలించుచు దైవబ్రాహ్మణ భక్తి కలిగి వారికి అనేక భూదానము లను చేయుచు కీర్తి గడించిరి.

నెల్లూరు తెలుగు చోళులు (1100-1350) : తెలుగు చోళవంశమున ఈ శాఖమిక్కిలి ప్రసిద్ధి గాంచెను. 12 గురు రాజులు 250 సం. లు ఏలిరి. వారి రాజ్యము ఒకప్పుడు ఆంధ్రలోని చాలభాగమును హోయసల తెలుగుపల్లవ, చోళరాజ్యములలో కొంతభాగము కలిగి యుండెను. వీరు ప్రథమమున చోళచక్రవర్తులకును, తరు వాత కాకతీయులకును సామంతులుగా నుండిరి. కాని వీరు 13 వ శతాబ్దమున చాల ఉచ్చదశయందుండిరి. వీరి చరిత్ర చాలభాగము వీరి శిలాతామ్రశాసనములవల్లను, వాఙ్మయమువల్లను తెలియును. తెలుగు, సంస్కృతము, అరవము, గ్రంథ, కన్నడ భాషలయందును లిపుల యందును శాసనముల నిచ్చిరి. మరియు ఆకాలపు చోళ, హోయసల, కాకతీయ, వెలనాటి చోళరాజుల శాసన ములు, వాఙ్మయముకూడ వీరి చరిత్రమును మనకు బాగుగా తెలుపును.

కరికాల వంశమున మధురాంతక పొత్తపిచోళు డుద యించెను. ఆతని వంశమున తెలుగుబిజ్జ డుదయించి కావేరిదాటి మధురను జయించెను. ఆ తరువాత మనుమ సిద్ధి 1175 నుండి 1192 వరకు నెల్లూరు రాజధానిగా రాజ్య మేలెను. ఈతని శాసనములు శ్రీకాళహస్తి, కొవ్వూరు, నెల్లూరు, పొత్తపి గ్రామములలో దొరకినవి. నెల్లూరి శాసనమున రాజు ఎర్రంపల్లి గ్రామమును పూంగినాడులోని నెల్లూరి నాగూరీశ్వరునకుదానమిచ్చెను. ఈతడు చోళ మహారాజునకు సామంతుడు. ఈతని సమ కాలికులు చోళ రాజాధిరాజకులోత్తుంగ, కాకతిరుద్రదేవ, వెలనాటిచోడ, గొంక, పృథ్వీశ్వర కోట వంశపు భీమ కోటరాజు, యాదవవంశపు సారంగధర, తెలుగు పల్లవ వంశపు విజయాదిత్య, అల్లుతిక్క, నాగవంశపు సత్తిరాజు, కొణిదెన నన్నిచోడుడు, పొత్తపిచోడకామ, మల్లిదేవ. ఈతని తరువాత ఈతని తమ్ముడగు బెట్టదేవుని కొడుకులు దాయభీమ, నల్లసిద్ధి ఉమ్మడిగా 1187 నుండి 1214 వరకు రాజ్యమేలిరి. వీరు కులోత్తుంగుని సామంతులు. అనేక దేవబ్రాహ్మణమాన్యముల నొసంగిరి. వీరు రేనాడు, పూంగినాడు, తొండమండలముపై రాజ్యమేలిరి. కంచిని స్వాధీనపరచుకొని కప్పము వసూలుచేసిరి. 1183-1192 మధ్య స్వతంత్రు లయిరి.

ఎర్రసిద్ధ 1195-1217 మధ్య పాలించెను. గండగోపా లాది బిరుదములను పొందెను. ఈతడు మూడవ కులో త్తుంగుని సామంతుడు. ఈతని కుమారులు మనుమ, బెట్ట, తమ్ము సిద్ధుల సహాయముతో రాజ్యము విస్తరింపజేయ గలిగెను. మనుమసిద్ధి (1198-1210) అనేకదానములను అగ్రహారములను దేవబ్రాహ్మణుల కొసంగెను. ఈతడు మూడవ కులోత్తుంగుని సామంతుడుగా నుండి ఆతని చివరికాలమున స్వతంత్రుడయ్యెను (1204). తమ్ముసిద్ధి (1205-1209) శాసనములు చోళదేశమున గలవు. కంచి నెల్లూరు పట్టణముల మధ్యప్రదేశముకూడ ఈతని కైవస మయ్యెను. అయినను ఈతడు కులోత్తుంగుని సామంతు డుగా నుండెను. ఆతనితో ఓరుగల్లు కోటపై దండెత్తి గణపతి నోడించెను (1208). నల్లసిద్ధి రాజుగా పట్టాభిషిక్తు డయినను అతని తమ్ముడు తమ్ముసిద్ధి అతని కటాక్షమున రాజ్యమేలెను. యాదవరాయ వంశముతో వీరికి బంధుత్వ మేర్పడెను. ఈతని తరువాత మనుమసిద్ధి కుమారుడు తిక్క (1209-1248) రాజ్యమేలెను. ఈతనికి 'తేంక నాదిత్య', 'జగదొబ్బగండ', అను బిరుదము లుండెను. ఈతడుకూడ మూడవ కులోత్తుంగుని సామంతుడుగా రాజ్యమేలెను. ఈత డనేక దానశాసనముల నిచ్చెను. మూడవ రాజరాజు కాలమున కంచిలోని దేవాలయము లకు ఈతడు, ఈతని సామంతులు పెక్కు దానములు చేసిరి. మూడవరాజరాజు 18 వ రాజ్యకాలమున ఉత్తర ఆర్కాటు జిల్లాలోని గుడి మల్లందేవునికి గండగోపాల మాడలు దానమిచ్చుటచేత ఆ ప్రదేశము తిక్కరసకు లోబడినదని తోచును. ఈతని శాసనములు కంచి దేవాలయములలో నున్నవి. ఈతనికి చోళ తిక్క యను బిరుదము కలదు. చోళ రాజరాజునకు సామంతు డుగానుండి అతనితో కలిసి హోయసల రాజులను ఓడించెను. ఈతని అల్లుడు అల్లుతిక్క కంచినుండి పాలిం చుచు ఆత్మకూరున దేవుని ప్రతిష్ఠించి చాల ధర్మములు చేసెను (1246). శ్రీ వరదరాజస్వామి భక్తులమని వ్రాసికొనిరి. 1257 లో తిక్కభూపతి కంచిని పట్టు కొనెను. ఈతడు గొప్ప వీరుడేగాక పరిపాలనా కౌశలము కలవాడు. ఈతడు తన పేరుతో చాల నాణెములను ముద్రింపించెను. ఆ కాలపు రాజవంశము లన్నింటితోను సంబంధము కలిగి మంచి పేరును, కీర్తిని సంపాదించెను. నెల్లూరు, చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు, కడపజిల్లాలు అతని పాలనములో నుండెను. తిక్కనకవి తన నిర్వచ నోత్తర రామాయణమున తిక్కభూపతి కర్ణాట సోమేశ్వరుని, శంభురాజుని, ఇంకా ఇతర రాజులను ఓడించెననియు చోళ రాజరాజును సింహాసనాసీనుని చేసెననియు (పాండ్యరాజు బారినుండి తప్పించి), తాను కూడ కంచినుండి పరిపాలన సాగించెననియు వ్రాసెను. కేతనకవి తన దశకుమార చరిత్రలో తిక్కభూపతి పాండ్యరాజువద్ద (మారివర్మ సుందరపాండ్య) కప్పము గైకొనెననియు వ్రాసెను. తిక్క సమర్థులైన సేనాధి పతులు, మంత్రులు గలవాడు. తెలుగు చోళుల సైన్య ములు ధైర్య శూరత్వములు కలిగి గొప్ప అనుభవము తోను, నేర్పుతోను యుద్ధము చేయుచుండెను. కనుక దక్షిణదేశమునందంతటను తెలుగువారి కీర్తి ప్రతిభలు

హెచ్చెను. ఉత్తర ఆర్కాటు జిల్లాలోని శంభూవరాయ లను జయించుటలోనేమి, పశ్చిమ చాళుక్య చక్రవర్తుల సైన్యములను పారద్రోలుటలోనేమి, పాండ్యులను హాత మార్చుటలోనేమి, నెల్లూరు తెలుగు చోళులు కీర్తిని సంపాదించిరి.

1238 నుండి 1250 వరకు తిరిగి రాజేంద్ర చోళుని ప్రభ వెలిగెను. కాకతీయులతోడి స్నేహము తెలుగు చోళులకు లాభించెను. అయినను కొన్ని సంవత్సరము లయిన తరువాత జటావర్మ సుందరపాండ్య గొప్ప సేనను సమకూర్చుకొని గండగోపాల (తిక్క) నోడించి చంపెను. కంచి, నెల్లూరు మండలములు పాండ్యుల స్వాధీనమయ్యెను. కాకతి గణపతి ఓడి పరారయ్యెను. తిక్క 1239 నాటికే హోయసలరాజగు నరసింహు నోడించి కల్యాణిపురమును తగులబెట్టెను. దీనికి ప్రతీ కారముగా 1240 లో నరసింహుని కొడు కగు సోమేశ్వరుడు నెల్లూరుపై దండెత్తెను. కాని ఓడిపోయెను. తిక్కనకవి, కేతనకవి కూడ కర్నాట సోమేశ్వరు డోడి పోయి పరారి అయినాడని వ్రాసిరి. తిరిగి 1257 లో తిక్కరాజు కంచిని స్వాధీన పరచుకొని సోమేశ్వరుని చంపాపురివద్ద ఓడించెను. ఇట్లే దేవగిరి యాదవులను ఓడించెను. వెలనాటి చోడ రాజగు పృథ్వీశ్వరుని ఓడించి చంపెను. శంభూవరాయ, కాడవరాయ రాజులను ఓడించెను. వారినుండి కప్పము గైకొనెను. తన ఆఖరి రాజ్య కాలములో కొడుకగు మనుమసిద్ధి, అల్లుడగు అల్లు తిక్కలను తనతో కూడ పరిపాలించుటకు నియ మించెను. తరువాత రాజ్యమును విభజించి అల్లుతిక్కకు కంచిరాజ్యమును, మనుమసిద్ధికి నెల్లూరు రాజ్యమును ఇచ్చెను. అల్లుతిక్క స్వతంత్ర రాజుగా తన పేరుతో శాసనములను ఇచ్చెను (1248-1272).

1249 లో పాండ్యులు దండెత్తిరి. కాని కాకతీయుల సహాయమున అల్లుతిక్కవారిని కంచినుండి పారదోలెను. కాకతీయ గణపతి రుద్రమదేవులతో స్నేహముచేసెను. తెలుగు వల్లవరాజగు విజయగండ గోపాలునితో కూడ స్నేహము చేసెను. ఈ వంశములవారి శాసనములు కంచి యందు కలవు. మనుమసిద్ధి (1248-67) అనేక శాసనములు ప్రకటించెను. 1250 లో తనకు ఆరోగ్యము కలుగుటకు నందలూరిలోని దేవునికి దానధర్మములు చేసెను. ఈతడు మూడవ వీర రాజేంద్రచోళుని సామం తుడు. 1257 నందలూరు శాసనమునుబట్టి ఇతని వంశ క్రమము, ఇతని కోడూరు గ్రామ ధర్మము తెలియును. ఈతని 1258 సం. శాసనము నల్లసిద్ధికి, యాదవులకు జరిగిన యుద్ధమును తెలుపును. మనుమసిద్ధి రాజ్యాభి వృద్ధికై తెలుగుపల్లవు లిచ్చిన దాన శాసనములు కొన్ని గలవు. ఈతని దాన శాసనములు కొన్ని కంచి యందు గలవు. 1265 నుండి తన కొడుకు రెండవతిక్కతోసహా పరిపాలించెను. కాకతీయ గణపతిదేవుని సహాయముతో ఈతడు రాజ్యము చేసెనని తెలియును. చోళరాజగు మూడవ రాజేంద్రుని ప్రభ తగ్గినను, ఈ తెలుగు చోళులు ఇంకను అతని సామంతులమని పేర్కొనుచుండిరి. ఈతని ఆఖరి రోజులలో 1260 సం. నుండి ఈతనికి, ఈతని దాయాదులకు జరిగిన పోరాటములో ఈతడు కాక తీయులను, వారు పాండ్యులను సహాయము కోరగా పాండ్యులు దండెత్తి నెల్లూరును పట్టుకొని ఈతనిని సింహాసనమునుండి తొలగించగా, కాకతీయులు వచ్చి తిరిగి పాండ్యులను పారదోలి అతని సింహాసన మతని కిప్పించిరి. ఈ సందర్భముననే తిక్కన సోమయాజి కాక తీయ గణపతిని ఓరుగల్లునందు సందర్శించి తనరాజునకు సహాయము కోరెను. గణపతి తిక్కన కవిత్వము విని ఆనందించి ఆతనికి 9 లక్షల బంగారు నాణెములను 68 గ్రామములను బహుమాన మిచ్చెను. గొప్ప సేనతో వెలనాడు దేశమునుజయించి రాజధానిని(త్సందవోలును) తగులబెట్టి, నెల్లూరు ముట్టడించి, పట్టుకొని మనుమసిద్ధిని సింహాసనముపై నెక్కించెను. 24 దుర్గములు, 68 పట్టణ ములు పట్టుకొని మనుమసిద్ధికి కానుకగా నిచ్చెను. మనుమ సిద్ధికి మన్మగండగోపాల బిరుదముండెను. ఈతడు యాదవు లతో పోరాడెను. ఈతని సేనాపతి ఖడ్గతిక్కన యుద్ధమున గెలిచెను. కాని చనిపోయెను. పెన్నానదీ తీరమందు సోమశిలవద్ద యుద్ధముజరిగెను. యాదవులు సామం తులుగా నుండిరి. ఇట్లే ఖడ్గతిక్కన తెలుగు వల్లవరాజగు విజయుని ప్రాయేరువద్ద ఓడించెను. విజయు పూర్తిపేరు విజయగండ గోపాలుడు. పెంట్రాల, కడవ యందలి తెలుగు వల్లవులు మనుమసిద్ధి యధికారమునకు లోబడి

యుండిరి. దక్షిణ వల్లవరాజగు కొప్పెరుంజింగ పాండ్యుల వల్ల ఓడింపబడినను, తొండమండలము నుండి తెలుగు చోళులను తరిమివేసి వేంగి రాజ్యములోనికి చొచ్చుకొని వచ్చి ద్రాక్షారామములో శాసనములు చెక్కించెను. ఈతడు 1249 - 50 లో కాకతీయ గణపతిచే ఓడింపబడి తెలుగుదేశముపై తన యధికారమును వదులుకొనెను. కాని దక్షిణదేశమున 1243 నుండి 1259 వరకు పాలించెను. చిదంబరము దేవాలయమును బాగుచేయించెను. తుద కీతడు 1259 లో గణపతిచే పూర్తిగా ఓడింపబడెను. మనుమసిద్ధి, గణపతి పక్షమున పోరాడెను. పాండ్యులను, కాయస్థులనుకూడ ఓడించెను. హోయసాల రాజగు నరసింహ నెల్లూరుపై దండెత్తగా ఆతనిని ఓడించి పారదోలెను. రేనాడు పరిపాలించు పశ్చిమ గాంగరాజులను ఓడించెను. ఈతడు బహు పరాక్రమశాలియనుట కీతని బిరుదములే సాక్ష్యము. కేతన, తిక్కనల వ్రాతలనుబట్టి ఈ రాజు కాలమున తెలుగు చోళులు బహు పరాక్రమ శాలు లని తెలియుచున్నది.

మనుమసిద్ధి తరువాత రెండవ తిక్క 1265 నుండి 1281 వరకు పాలించెను. ఇతడుకూడ తండ్రివలె బహుపరాక్రమ శాలి. అద్దంకి యాదవులు ఈతనికి సామంతులు. ఈతడు కాకతీయుల సహాయమున శత్రువులను పరిమార్చుచుండెను. రుద్రమదేవి ఇతని సమకాలికురాలు. ఈతని తరువాత 1281-1299 వరకు తిక్కని సోదరుడు మన్మగండ గోపాలుడు పాలించెను. ఈతడు దేవాలయములకు బ్రాహ్మణులకు, కవులకు, సామంతులకు చాలదానములు చేసెను. కొణిదెన చెన్నకేశవస్వామికి 1297 లో కొంత భూదానము చేసెను. ఈతని కాలమున ఆఖరి చోళరాజు మూడవ రాజేంద్రుడు చనిపోవుటతో చోళరాజ్యము అంతరించెను. నెల్లూరు చోళులు పూర్తిగ స్వతంత్రులైరి. కాని 1296 తరువాత కాకతీయ ప్రతాపరుద్రుని సామంతులుగా పాలించిరి. 1291-96 మధ్య అనేకసార్లు మన్మగండ గోపాలుడు ఓడింపబడి పదభ్రష్టుడై తుదకు సామంతుడుగా సింహాసన మెక్కెను (1297).

కాకతీయులకు యాదవ రామచంద్రులకు జరిగిన యుద్ధములలో మన్మగండగోపాలుడు ప్రతాపరుద్రునకు సహాయ మొనర్చెను. ఇట్లే కళింగదేశముపై దండెత్తి కాకతీయ సామంతులగు కొలనిరుద్ర, అన్నయలకు సహాయపడెను. అల్లుతిక్క చనిపోయిన తరువాత కంచి రాజ్యమును నెల్లూరు రాజ్యములో కలిపివేసెను. ఈతని తరువాత రాజగండగోపాలుడు (1299-1325) పాలించెను. ఈతడు ప్రతాపరుద్రుని సామంతుడు. 1316 లో ఆతని సేనాధిపతి ముప్పిడి నాయకుడు కంచికివచ్చి, మానవీరుని (తెలుగు-చోళ) పరిపాలకునిగా నియమించి 1002 గండగోపాల మాడలు ఖరీదుగల రెండు గ్రామములు దేవునకు సమర్పించెను. ఈతడు స్వతంత్రుడుగనే శాసనముల నిచ్చెను, త్రిభువన చక్రవర్తి యను బిరుదును పొందెను. ఈతని కాలమున కాకతీయ మహారాజు ప్రతాపరుద్రుడు పాండ్యదేశమును జయించియు, కంచిని స్వాధీనపరచుకొనియు, నెల్లూరు తెలుగు చోళులను, కొలని రుద్రదేవులను సామంతులుగా జేసికొనియు, కళింగమును జయించియు, విశాలాంధ్రదేశముపై చక్రవర్తిగా నుండెను. నెల్లూరు చోళులలో వీరగండ గోపాల (1292-1302) ఆఖరిరాజు. ఈతని శాసనములు చాలా భాగము దక్షిణదేశమున దొరికినవి. ఈతనికి కూడ త్రిభువన చక్రవర్తి బిరుదము కలదు. ఈతడును, ఈతనికి ముందున్న రాజులును చోళ సంప్రదాయములను గ్రహించి దానిని దేశమున వ్యాపింపజేసిరి. దేవాలయములు కట్టు పద్ధతులు, వాటి పరిపాలన, దేశ భాషలు, మర్యాదలు, మొత్తముమీద రాజ్యపరిపాలనా విషయములు చోళులవై యున్నవి. పాండ్యుల దండయాత్రలవల్లనేమి, కాకతీయుల దండయాత్రలవల్లనేమి ఇద్దరు ముగ్గురు రాజులు ఒకే కాలమున నెల్లూరు మండలమున రాజ్యపాలన చేయుటవల్లనేమి, సామంతులు తరచు తిరుగుబాటు చేయుటవల్లనేమి, నెల్లూరు తెలుగుచోళుల రాజ్యము యొక్క ప్రభ తగ్గిపోయెను. ఓరుగల్లు రాజ్యము 1323 లో తుగ్లకు వశమయ్యెను. అప్పటికి నెల్లూరు చోళులు అస్తమించిరి.

కాకతీయాంధ్రరాజుల చరిత్రము : తామ్ర శిలాశాసనములు, శిల్పములు, వాఙ్మయము, ముఖ్యాధారములుగా ఈ రాజుల వంశక్రమ కాలనిర్ణయములు, మతవిషయములు, ఆర్థిక రాజకీయ విషయములు తెలిసికొనగలము. కాకతియను దుర్గ కులదేవతగా కలవారు కాక

తీయులు. వీరు చతుర్థకులజులు. తూర్పు చాళుక్యుల వలెనే వీరిదికూడ వరాహముద్ర. వీరిలోని మొదటిరాజులు వారిలోవలెనే జైనమత పోషకులు. జైనమతస్థులు 'కాకతి' లేక 'కూష్మాండి' ని ఆరాధించెడివారు. కనుక ఈ వంశమున కా పేరు వచ్చెను. రెండవ ప్రోలరాజు జైన మతస్థుడు. తరువాత శైవుడు. అతని తరువాతి రాజు లందరు శివభక్తులు. 10 వ శతాబ్దపు తూర్పు చాళుక్య శాసనమునుబట్టి (అమ్మరాజ దానార్ణవుల కాలమున) గుండియ రాష్ట్రకూటుని మనుమడును, ఎరియరాష్ట్ర కూటుని కుమారుడునగు గుండ్యన లేక కాకర్త్య గుండ యను నాతని ప్రేరేపణచేత నతవాటి నివాసుల నుద్దే శించి ఈ శాసన మివ్వబడినది. కాకర్త్య గుండ్యన రాష్ట్ర కూట వంశమువాడైనను, తూర్పుచాళుక్యరాజులకు సామంతుడుగ నుండెను. ఈతడే కాకతీయవంశకర్త. ఈతని కాలము: 950 ప్రాంతము. 970 నుండి 999 వరకు తూర్పు చాళుక్యవంశము అంతఃకలహములతో క్షీణిం చెను. ఈ కాలమున కాకతి గుండ్యనయు, అతని సంతతి వారు తమ రాజ్యమును వృద్ధిపరచు కొనిరి. కాకతీయ శాసనములనుబట్టి ఈక్రింది వంశావళి, కాలనిర్ణయము చేయబడినవి:

మొదటి ప్రోలరాజు (1050-1080)
|
త్రిభువనమల్ల బేతరాజు (1080-1115)
|
రెండవ ప్రోలరాజు (1115-1158)
|
రుద్రదేవ (1158-1195) — మహాదేవ (1195-1198)
|
గణపతి (1198-1261)
|
రుద్రాంబిక (1258-1296)
|
ప్రతాపరుద్ర (1290-1326)

మొదటి ప్రోల కొలవి, సబ్బిదేశములకు (ఓరుగల్లు మండలము) రాజై తూర్పుచాళుక్యరాజులకు సామంతు డయి యుండెను. ఈతని సేనాని బమ్మ దక్షిణమున కంచి చోళుల నెదుర్కొనెను. ఈతనికొడుకు 'బేత' పశ్చిమ చాళుక్యులకు సామంతుడుగ నుండి గోదావరికి పశ్చి మోత్తర ప్రాంతమున పాలించుచుండెను. అనుమకొండ రాజధాని. ఈతడు శివభక్తుడు. ఈతని కొడుకు రెండవ ప్రోల. ఈతడును మొదట పశ్చిమ చాళుక్యులకు సామం తుడుగా నుండి తరువాత తైలపదేవుని ఓడించెను. నేల కొండపల్లి నేలు గోవిందుని, మంత్రకూటపు రాజగు గుండయను, వేములవాడ జగదేవుని ఓడించి సామంత లుగా చేసికొనెను. 1158 లో బిజ్జలునికి సహాయముచేసి కళ్యాణిపురమును నాశనము చేసెను. ఈతడు వెలనాటి చోడులతో యుద్ధముచేయుచు చనిపోయెను. ఈతని కొడుకు రుద్రదేవుడు రాజ్యమునకు వచ్చెను. అప్పటికి తూర్పున చాళుక్యరాజ్యము క్షీణించి వెలనాటి చోడ, తెలుగు చోడ కొలను వంశముల స్వాధీనమునుండెను. పశ్చిమచాళుక్య రాజ్య మస్తమించి కళచురి, లింగా యితుల స్వాధీన మయ్యెను. గోదావరికి ఉత్తరమున యాదవులు తమ రాజ్యమును విస్తరింప చూచుచుండిరి. ఇట్టి సమయమున రుద్రదేవుడు పెద్ద సైన్యమును సమ కూర్చుకొని, ధర్మపురినుండి గోదావరీ తీరస్థ భద్రా చలమువరకుగల ప్రదేశము నేలు దొమ్మెరాజు నోడించి ఆ దేశమును తన రాజ్యములో కలుపుకొనెను. మైలిగ దేవుని జయించి పొలవాసదేశములు ఆక్రమించెను. భీము డేలు వర్ధమానపురమును గాల్చి అతనిని పారదోలి, చోడో దయుని సామంతునిగా జేసికొనెను. ఆఖరి వా రిద్దరును తెలుగు చోడరాజులు. తరువాత వెలనాటిచోడుల నెదు ర్కొనెను. శ్రీశైల త్రిపురాంతకములను స్వాధీన పరచు కొనెను. ఈ జయములందు ఈతని మంత్రి ఇనగాల బ్రమ్మి రెడ్డి సహాయపడెను (1162). 1186 సంవత్సరమునాటికి వెలనాటి చోడరాజులను జయించి కప్పము గైకొనెను. నతవాడి, ఇందులూరి, కొలను వంశీయుల సహాయమున కృష్ణా గోదావరీనదీ మండలముల వరకు కాకతీయ రాజ్యాధికారము వ్యాపించెను. ఆ వంశముల వారితో సంబంధ బాంధవ్యములను వృద్ధి పరచెను. రెడ్డి కులజు లగు రేచర్ల కామచమూపతి ఇతనికి కుడిభుజము. అతని కొడుకు బేతిరెడ్డి 1196-1202 మధ్య అనేక యుద్ధము

లలో సహాయ మొనర్చి, ముఖ్యముగా యాదవులతో పోరాడి తుదకు ప్రాణముల నర్పించెను. ఈతని తమ్ముని కొడుకు రుద్రసేనాని అనేక రణరంగములందు గెల్చి కాకతీయ రాజ్య విస్తరణకు కారకుడయ్యెను. కరీం నగర శాసనమునుబట్టి గంగాధరుడను బ్రాహ్మణ మంత్రి రాజ్యపాలనయందు సమర్థుడై అనేక దేవాలయములను కట్టించి సర్వ కళలను పోషించెను. ద్రాక్షారామ శాసనమునుబట్టి కాకతి రుద్రునికి 'విద్యావిభూషణ' బిరుద ముండెను. ఈతడు రచించిన నీతిసారమును బద్దెనకవి నీతిశాస్త్ర ముక్తావళియను పేర తెనిగించెను. మల్లికార్జున పండితుడును, అతని శిష్యుడు పాల్కురికి సోమనాథుడును ఈ రాజపోషణమును పొందిరి. పల్నాటి యుద్ధానంతరము (1176-1182) వెలనాటి చోడరాజుల ప్రభ తగ్గెను. 1186 లో కాకతి రుద్రుడు వెలనాటి గొంకరాజు నోడించి వారి రాజ్యమును నాశన మొనర్చెను.

పల్నాటి యుద్ధానంతరము నతవాటి, హైహాయ వంశపు రాజుల సహాయమున కాకతీయ సామ్రాజ్యము తూర్పుతీరము వరకు వ్యాపించెను. ఏకశిలానగరము లేక ఓరుగల్లు రుద్రదేవుని కాలమున నిర్మింపబడెను. రుద్రేశ్వ రాలయము మొదలగు అనేకాలయములు కట్టబడెను. చిత్రకళలు, ముఖ్యముగా శిల్పకళలు దేవాలయములందు వృద్ధిచెందెను. మంటప స్తంభములమీద శాసనములు, బొమ్మలు చెక్కబడెను. యాదవుల రాజగు జైతుగి ఆంధ్రరాజగు రుద్రునిపై దండెత్తి అతనిని చంపెను. అందుచేత రుద్రుని తమ్ముడు మహాదేవుడు రాజ్యమేలెను. ఈతని కాలమున జైతుగి తిరిగి దండెత్తివచ్చి మహాదేవుని జంపి అతని కుమారుని గణపతిని ఖైదీగా తీసికొని పోయెను, ఈతడు దేవగిరిలో 1209 వరకు ఖైదీగా నుండి ఆసంవత్సరము జైతుగి దయవల్ల విడువబడెను. ఈతడు ఖైదులోనున్న కాలమున సామంతరాజులు స్వతంత్రులైరి. కాని రేచర్ల రుద్రసేనాని, బొప్పదేవ సేనాని మున్నగువారు శత్రువుల నణచివేసిరి. 1212-1225 మధ్య గణపతిదేవుని వెలనాటి జయములు పూర్తి యయ్యెను. కోట, నతవాటివంశములతో సంబంధములను జేసెను. జాయపనాయకు నోడించి ఆతనిని తన గజ సైన్యాధ్యక్షునిగా నియమించెను. ఆతని సోదరీ ద్వయము వివాహమాడెను. కొలనిమండలమును జయించి సోమయమంత్రికి ఆదేశమునిచ్చెను. ఆ తరువాత వారి సహాయమున కళింగమును జయించెను. కొలని సోమయ మంత్రి కోడులనాడు జయించి గోదావరి దాటి, మన్య ప్రాంతములను జయించి కళింగములోని దక్షిణ భాగములను జయించెను (1235 - 53). గుంటూరు, నెల్లూరు, కడప జిల్లాలలో పరిపాలించు తెలుగు చోళరాజులను 1245 - 50 మధ్య జయించెను. ఇదేసమయమున దక్షిణ దేశమున చోళరాజులు పాండ్యులచేతను, పల్లవులచేతను ముట్టడింపబడుట చూచి గణపతి తన సేనానియగు సామంతభోజుని గొప్ప సైన్యముతో పంపి కంచి మొదలుగాగల దక్షిణ దేశములను జయించెను.

ఈతని తరువాత ఈతని పుత్రిక రుద్రాంబ 1258 నుండి 1296 వరకు రాజ్యమేలెను. ఈమె చాళుక్య వీరభద్రుని భార్య. ఈమె కూతురు ముమ్మక్క. ఆమె కుమారుడు ప్రతాపరుద్రుడు. రుద్రమదేవి రాజ్యమునకు వచ్చినవెంటనే దక్షిణ దిశనుండి చోళులు, తెలుగు చోళులు, పల్లవులు దండెత్తిరి. కాని ఆమె సేనాని త్రిపురాంతకుడు వారినందరిని పారదోలెను. ఇక ఉత్తరము నుండి యాదవులు దండెత్తిరి. దేవగిరి రాజు మహాదేవుడు దండెత్తి కొంతకప్పము గైకొని పోయెను. ఈమె ఓరుగల్లున రాతిగోడను కోటలోపల కట్టించి దానికి మెట్లు కట్టించెను. పెక్కు అగ్రహారములను భూదానములను ఇచ్చెను. ఈమె తరువాత ఈమె దత్తుడు, మనుమడు ప్రతాపరుద్రుడు 1290 నుండి 1326 వరకు రాజ్యమేలెను. ఈతడు 1254లో జన్మించుటచేత రాజ్యమునకు వచ్చునరికి 36 సం. ల వయస్సుకలిగియుండెను. 1290 నుండి 1296 వరకు రుద్రాంబకు రాజ్యపాలనమున సహాయముచేసెను. తాను స్వయముగా రాజైన తరువాత నెల్లూరు చోళులను జయించెను. వారినుండి కప్పమును గైకొనెను. ఈతడు రాజ్యమునకు వచ్చిన సంవత్సరమున అల్లాయుద్దీను ఖిల్జీ ఢిల్లీ చక్రవర్తి ఆయ్యెను. 1294 లో అల్లాయుద్దీను దేవగిరి యాదవుల నోడించి కప్పము గైకొనెను. 1303 లో తిరిగి దండెత్తి కాకతీయులచే ఓడింపబడి పరారయ్యెను. గండికోట ప్రాంతముల నేలు కాయస్థులు తిరుగుబాటు చేయగా వారిని ఓడించెను.



ఓరుగల్లు కోటలోని ద్వార తోరణములు



వేయిస్తంభాలగుడి - అనుమకొండ

1309 లో మాలికాఫరు యాదవులను లోపుమాసి ఓరుగల్లుపై దాడి వెడలెను. కాని ఓడిపోయెను. అయినను వెంటనే యింకొక దండయాత్రను సలిపి ఈసారి కోట బురుజులను స్వాధీనపరచుకొనెను. అంతట ప్రతాపరుద్రుడు సంధిచేసికొనెను. తనకున్న యావత్తుధనమును, ఏనుగులను, గుఱ్ఱములను మాలిక్ కాఫరుకు ఇచ్చెను. ప్రతిసంవత్సరము జాజియా కప్పముకట్టుటకు అంగీకరించెను. 1311-13 మధ్య గండికోటలోని కాయస్థులు, వీరికి సహాయము చేసిన కొందరు రెడ్లు ఓడింపబడిరి దక్షిణమున పాండ్యులు కంచిని పట్టుకొని కాకతీయ పరిపాలకులను పారదోలిరి. వారిని ఓడించి తిరిగి తమ బలమును స్థిరపరచుకొనుటకు కాకతీయ సేనానులు ప్రయత్నించి నెగ్గిరి. మహారాజు శ్రీశైల, త్రిపురాంతక, కంచి, జంబుకేశ్వరాది పుణ్యతీర్థములను సేవించి అనేక భూదానముల నొసర్చి 1318 నాటికి ఓరుగల్లు చేరెను. 1320 లో ఘాజీ తుగ్లకు కొడుకు ఆలుఫ్ ఖాన్ తిరిగి ఓరుగల్లుకోటను ముట్టడించెను. కాని నాడు ఢిల్లీకి పోవలసి వచ్చెను. 1322 లో తిరిగి యెక్కువ సైన్యముతో వచ్చి ఆలుఫ్ ఖాను కోటను ముట్టడింపగా చేయునది లేక ప్రతాపరుద్రుడు సకుటుంబముగా లొంగిపోయెను. అతనిని ఢిల్లీ పంపగా దారిలో మృతినొందెను (1323). ప్రతాపరుద్రుడు తన సైన్యమును, ఉత్తర దిశయందలి కోటలను వృద్ధిపరచక యుండుటయు, ప్రోలయ వేమారెడ్డు తమ స్వాతంత్ర్యమును వెల్లడి చేయుటయు, యుద్ధరంగమున పద్మనాయకులపై భారమంతయు మోపి రెడ్లు తాము పోరుసల్పక యుండుటయు ఈ అపజయమునకు ముఖ్య కారణములు.

కాకతీయ రాజులు విద్యాపోషణము చేసిరి. అనేక అగ్రహారముల నిచ్చిరి. విశేషముగా దేవాలయములను కట్టించిరి. సర్వకళలనుపోషించిరి. మల్లికార్జునుని నిరోష్ఠ్య రామాయణము, ఉదారరాఘవము, విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణముఅను అలంకారశాస్త్రము, అగస్త్యుని బాలభారతము, గంగాధర కవియొక్క భారత నాటకము, నరసింహ కవియొక్క కాదంబరీ నాటకము, విశ్వనాథుని సౌగంధికాపహరణము, అప్పయార్యుని జినేంద్ర కళ్యాణాభ్యుదయము, త్రిపురాంతకుని ప్రేమాభిరామము, మారన మార్కండేయ పురాణము, భాస్కర కవి రామాయణము, ఏకామ్రనాథుని ప్రతాప చరిత్రము, ఆ కాలపు వాఙ్మయాభివృద్ధిని తెలియజేయుచున్నవి. రాజ్యవిస్తీర్ణము, పరిపాలనా విషయములు అప్పటి శాసనములను బట్టియు, వాఙ్మయమును బట్టియు తెలియుచున్నవి. రాజ్యమున ఇప్పటి తెలంగాణము, రాయలసీమ, కోస్తా జిల్లాలు, తొండమండలము, కంచి మండలము ఇమిడియుండెను. చక్రవర్తి ఓరుగల్లున అష్టప్రధానులతో రాజ్యము చేయుచుండెను. అతడే సర్వసేనాని. న్యాయస్థానమున కధ్యక్షుడు. ఆ కాలమున 77 రాజ్యాంగ నియోగము లుండెననియు, ఒక్కొక్కదానికి ఒక్కొక్క అధ్యక్షుడుండెననియు, ఈ నియోగములన్నియు పద్మనాయకుల యాజమాన్యమున పనిచేయుచుండె ననియు తెలియును. రాష్ట్రము లేక మండలము, సీమ, నాడు, గ్రామము విభాగములు. రాజప్రతినిధులు, వారిక్రింది సామంతులు. తగు రక్షక సైన్యముతో పాలించుచుండిరి. గ్రామపరిపాలనము రెడ్డి, కరణము, తలారి వశమునునుండెను. వ్యవసాయమునకై పెద్ద తటాకములు త్రవ్వబడెను. పన్నులు ధాన్యరూపమున వసూలు చేయుచుండిరి. అనేక విధముల సుంకములు, భూమి, నీటిపన్నులు, సామంతులిచ్చెడి కప్పములు, న్యాయస్థానములందు వసూలగు రుసుములు, వర్తకము వల్లను, వస్తువుల అమ్మకముమీదను వసూలుచేయబడు పన్నులవల్లను, సముద్రమునుండియు, ఖనిజవస్తు సామగ్రినుండియు, ఆటవిక సంపదవల్లను వచ్చు ధనమంతయు ధనాగారమును నింపుచుండెను. ఆ కాలమున నాణెములను ముద్రించుచుండిరి. ఈ రాజులు శైవమతస్థులగుట చేత నంది విగ్రహముగల బంగారు, వెండి మాడలు విశేషముగా ముద్రింపబడు చుండెను. కృషీవలులకై అరణ్యములను నరకి భూములను వ్యవసాయమున కనుకూలముగ జేసిరి. పెక్కు గ్రామములను నిర్మించిరి. విశాలాంధ్రదేశము, కళింగము, దక్షిణభాగము, ఉత్తరచోళమండలము, కాకతీయసామ్రాజ్య భాగములే.

రా. సు.

**ఆంధ్రదేశ చరిత్రము III క్రీ. శ. 1324-1675:-** రాజకీయస్థితి క్రీ. శ. 1324 :- 14 వ శతాబ్ది ప్రథమ పాదమున ఆంధ్రదేశము ఉత్తర హిందూస్థానమునుండి

ముస్లిం దండయాత్రలకు తరచుగ గురియగుచుండెను. ఆంధ్రభూమినంతయు దాదాపు ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలిన కాకతీయ సామ్రాజ్యము తురుష్క జైత్ర యాత్రా దావానలమున కాహుతి యయ్యెను. క్రీ. శ. 1323 తరువాత దేశమున శాంతి భద్రతలు కొరతవడెను.

తురుష్కుల బారినుండి హైందవ ధర్మమును రక్షించుటకై ఆంధ్రావనిలో అచట నచట ప్రయత్నములు సాగుచుండెను. తత్ఫలితముగ క్రీ. శ. 1331 నాటికి తూర్పుతీరమంతయు తురకల పాలనమునుండి విడివడి స్వతంత్రమయ్యెను. పశ్చిమభాగమున చాళుక్య సోమదేవుడును, మూడవ బల్లాలదేవుడును ఢిల్లీ ముస్లిం శాని సత్వమును తొలగద్రోసి, కంపిలి ముస్లిం రాజప్రతినిధిపై తిరుగబడి యోడించిరి. ఈ కార్యమున వీరికి హరిహర రాయలు, బుక్కరాయలు సహాయపడిరి. తుంగభద్రానదీ దక్షిణ తటమున విజయనగర సామ్రాజ్యము (క్రీ. శ. 1336) ను, పూర్వపు కాకతీయరాజ్యభాగమున వెలమ రాజ్యమును, కృష్ణా గోదావరీ పరిసరములందు రెడ్డి రాజ్యమును (క్రీ. శ. 1330) వెలకొనెను. కళింగాంధ్రమున తూర్పు గాంగులును, కోరుకొండలో రెడ్లును, పిఠాపురమున కొప్పుల నాయకులును, ఓరుగల్లు పరిసరములందు ప్రోలయ, కాపయనాయకులును, పరిపాలించుచుండిరి. హిందూరాజ్యము లన్నిటికి ప్రక్కలోని బల్లెమువలె బహమనిరాజ్యము (క్రీ.శ. 1347) విజయనగర రాజ్యమునకు ఉత్తరమున స్థాపితమయ్యెను. దీనికి రాజధాని గుల్బర్గా నగరము.

**విజయనగర సామ్రాజ్యము, క్రీ. శ. (1336 - 1675) :- I. సంగమ వంశము క్రీ. శ. 1336-1486) :-** దక్షిణభారత దేశము నంతయు ఏకచ్ఛత్రముక్రిందికి తెచ్చినవారు విజయనగర సామ్రాజ్య స్థాపకులగు హరిహరరాయలు, కంపరాయలు, బుక్కరాయలు, మారప, ముద్దప అను పంచ సహోదరులు. వీరిలో హరిహరరాయలు, బుక్కరాయలు కాకతీయులకును, కంపిలి రాజునకును సేవకులై యుండిరి. వీరు క్రీ. శ. 1327 లో ఢిల్లీకి బందీలుగా గొంపోబడిరి. మరల కంపిలి రాజప్రతినిధియగు మాలిక్ మహమ్మదు అనువానికి సహాయులుగ వీరు ఢిల్లీ సుల్తానుచే దక్షిణమునకు పంపబడిరి. అప్పుడు విద్యారణ్యస్వామి ప్రోద్బలముతో వీరు విద్యానగరమును నిర్మించిరి. అదియే విజయనగరము (హంపి). హరిహరరాయాదులు సంగమ రాజపుత్రులగుటచే వీరిది సంగమవంశ మయ్యెను.

హరిహరరాయలు I (క్రీ. శ. 1336-1357) బుక్కరాయలు I ను (క్రీ. శ. 1344-77), కొన్నియేండ్లు కలిసి రాజ్యము చేసిరి. క్రీ. శ. 1344 లో బుక్కరాయలు యాదవరాజ్యమును, పశ్చిమతీరమునందలి తులునాడును జయించెను. "పూర్వ పశ్చిమ సముద్రాధీశ్వర" అను బిరుదు వహించి, హరిహరరాయలు, బుక్కరాయలు క్రీ. శ. 1346 లో తక్కిన సోదరులతోకూడి శృంగేరిలో గురుసమక్షమున విజయోత్సవము జరపుకొనిరి. ఈ మహాసామ్రాజ్య నిర్మాతలగు వీరలు హోయసల సామంతులుగాక ఆంధ్రు లనుట నిక్కువము.

బహమనీరాజ్యము (క్రీ. శ. 1347-1525) నకును తద్విచ్ఛిన్నానంతరము ఏర్పడిన గోలకొండ, బీదరు, అహమదునగరు, బిజాపూరు, బరారు అను అయిదు తురకరాజ్యములకును, విజయనగరరాజ్యమునకునుమధ్య సతతము సమరములు సాగుచునే యుండెను. రాయచూరు లోయ, తూర్పుతీరమున కృష్ణానది యుత్తర భాగము, తరచుగ చేతులు మారినను తుంగభద్రానది దక్షిణతీరము మాత్రమే ఎల్లప్పుడును విద్యానగరాధీశుల అధీనమందే యుండెను. అల్లాయుద్దీను బహమన్ షా క్రీ. శ. 1349, 1354 లలో విజయనగరముపై దండెత్తెను. కాని రెండవతూరి బుక్కరాయలచే పరాజితుడయ్యెను. బుక్కరాయలు I, బహమనీ సుల్తానులు-మహమ్మదు I ముజాహిదులతో యుద్ధముచేసి గెలిచెను. ఇతని పుత్రుడు కుమార కంపన II మధుర ముస్లింరాజ్యమును అంతమొందించెను. క్రీ. శ. 1374 లో బుక్కరాయలు చైనా చక్రవర్తికి రాయబార మంపెను.

ఇతని తరువాత హరిహరరాయలు II (క్రీ. శ. 1377-1404) రాజ్యమునకు వచ్చెను. ఈ మహారాజు తురకల నుండి చౌల్, దభూల్ రేవులను జయించెను. క్రీ. శ. 1382-85 సంవత్సరముల మధ్య కొండవీటి రెడ్లనుండి కర్నూలు, నెల్లూరు, గుంటూరు మండలములలో కొన్ని రాజ్యభాగములను ఇతడు వశపరచుకొనెను. క్రీ. శ. 1388-89 లో ఫిరోజిషా బహమనీతో యుద్ధముచేసెను.

హరిహరుని మరణానంతరము విరూపాక్ష రాయలు I ను (క్రీ. శ. 1404-1405), బుక్కరాయలు II ను (క్రీ. శ. 1405-1406) కొద్దికాలము పాలించిరి. తదనంతరము దేవరాయలు I (క్రీ. శ. 1406-1422) క్రీ.శ. 1406 లో పట్టాభిషిక్తుడయ్యెను. ఫిరోజ్‌షా పశేట విజయనగరముపై దండెత్తుచునే యుండెను.

కొండవీటిరెడ్డి రాజులు సుల్తానుపక్షమున దేవరాయలతో పోరుచుండిరి. దేవరాయల మిత్రుడు కాటయ వేమారెడ్డి యుద్ధమున హతుడయ్యెను, క్రీ. వ. 1419 లో దేవరాయలు పానుగల్లు దుర్గమును పట్టుకొనెను. దేవరాయలు చనిపోగా, పుత్రుడు రామచంద్రరాయలు (క్రీ. శ. 1422) కొన్ని నెలలు పాలించెను. తరువాత, తమ్ముడు విజయరాయలు I (క్రీ. శ. 1422 - 1426) రాజ్యమునకు వచ్చెను. బహమనీ సుల్తాను అహమదుషా విజయనగరముపై దండెత్తి అమాయిక ప్రజలను హింసించి, చంపెను, మృతిచెందిన జనులు 20,000 లకు మించగనే ఆనందోత్సవములను జేయుచుండెను, దేవాయతనములను పాడుచేయించుచుండెను. క్రీ. శ. 1426 లో దేవరాయలు II, అదివరకు తండ్రితో పాలించి రాజ్యమునకు వచ్చెను. ఇతనినే ప్రౌఢదేవరాయలందురు.

ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1422 - 1446) కొండవీటి రెడ్డి రాజ్యమును గెలిచి, రాజమహేంద్రవరపు రెడ్డి రాజ్యమును బలపరచెను. కేరళమునకుబోయి క్విలాన్‌ను, ఇతర రాజులను గెలిచెను. ఇతని రాజ్యము గుల్బర్గానుండి సింహళము వరకును, ఒరిస్సానుండి మళయాళమువరకును విస్తృతిగాంచెను. దేవరాయలు సైన్యములో తురకలను చేర్చికొని, తన సైనికులకు విలువిద్యలో ప్రావీణ్యము గరపెను. ఇతడు రాయచూరుపై దండెత్తి పుత్రి మరణము వలన వెనుదిరిగెను. ఇతనితరువాత వచ్చిన రాజులు విజయరాయలు II క్రీ. శ. (1446 - 1447), మల్లికార్జునరాయలు (క్రీ. శ. 1447 - 1465) బలహీనులగుటచే ఈయదను జూచుకొని బహమనీ అలాయుద్దీను II, కపిలేశ్వర గజపతియు విజయనగరముపై దండెత్తిరి. విజయనగర సామంతులు సాళువ నరసింహరాయలు, అతని సేనాపతి తుళువ ఈశ్వరరాయలు ప్రబలులై యుండిరి. మల్లికార్జునరాయల అనంతరము విరూపాక్ష రాయలు II (క్రీ. శ. 1465 - 1485) రాజయ్యెను. ఇతడు విషయలోలుడు. తురకలు గోవా - మున్నగు రేవులను వశపరచుకొనిరి. చంద్రగిరి అధిపతి సాళువ నరసింహరాయలు కపిలేశ్వరుని మరణానంతరము గోదావరి వరకుగల భూమినిజయించి ఓఢ్రులను తరిమెను. పురుషోత్తమ గజపతితో కలిసి మహమ్మదు III (క్రీ. శ. 1478 - 1481) లో యుద్ధముచేసెను. విరూపాక్షరాయల అనంతరము ప్రౌఢరాయలు రాజయ్యెను. (క్రీ. శ. 1485) క్రీ.శ. 1486 లో ప్రౌఢరాయలను పదభ్రష్టునిజేసి సాళువ నరసింహరాయలు విజయనగర సింహాసన మాక్రమించెను.

**II. సాళువవంశము** (క్రీ. శ. 1486-1505) : నరసింహరాయలు (క్రీ. శ. 1486-1491) బలవంతులయిన సామంతుల తిరుగుబాటుల నణచెను. క్రీ. శ. 1489 లో పురుషోత్తమగజపతి గుండ్లకమ్మవరకు వచ్చి ఉదయగిరిని ముట్టడించి గెలిచెను. నరసింహారాయలు తుళువదేశము, హనొవర్, భట్కల్, బకనూరు, మంగుళూరు రేవులను సాధించి, అశ్వముల దిగుమతి సాగించెను. తమిళదేశమును జయించెను. క్రీ. శ. 1491 లో నరసింహరాయల మరణానంతరము పెద్దకొడుకు తిమ్మభూపతి రాజ్యమునకు వచ్చెను. కాని కొద్దికాలములోనే ఇతడు హత్యగావింపబడెను. తరువాత చిన్నకొడుకు ఇమ్మడి నరసింహరాయలు (క్రీ. శ. 1491-1505) రాజయ్యెను. తుళువ నరసనాయకుడు రాజసంరక్షకుడుగ తానే రాజ్యము చేసెను.

**III. తుళువవంశము** : నరసనాయకుడు (క్రీ. శ. 1491-1503) రాయచూరులోయను గెలిచెను. క్రీ.శ. 1496లో రాజ్యమున తిరుగుబాటుల నడచుటకై కన్యాకుమారి వరకు విజయయాత్ర సాగించెను. శ్రీరంగపట్టణపు నంజరాజును గెలిచి క్రీ. శ. 1497 లో పడమటితీరమున గోకర్ణమువరకు గెలిచెను. ప్రతాపరుద్ర గజపతితో యుద్ధము చేసెను. నరసనాయకుడు సాళువ నరసింహ రాయలు ప్రారంభించిన రాజ్యవిస్తృతిని కొనసాగించి పుత్రుడు కృష్ణరాయలయొక్క సర్వతోముఖముగ ఉత్కృష్టమైన యుగమునకు పునాదులు నిర్మించెను. క్రీ. శ. 1503 లో తుళువ నరసనాయకుడు చనిపోగా కుమారుడు ఇమ్మడి నరసనాయకుడు (వీరనరసింహ రాయలు) రాజసంరక్షకుడయ్యెను. క్రీ. శ. 1505 లో రాజు సాళువ ఇమ్మడి నర

సింహరాయలు చంపబడగా, తుళువ వీరనరసింహరాయలు (క్రీ. శ. 1505-1509) తుళువ వంశపు రాజయ్యెను. ఇతని పరిపాలన కాలమంతయు యుద్ధములతో గడచెను. అరవీటి రామరాయలు, పుత్రుడు తిమ్మరాయల రాజ సేవ వలన యూసఫ్ ఆదిల్ ఖాను తుంగభద్రానది దక్షిణతీరమును వశముచేసికొన ప్రయత్నించి విఫలు డయ్యెను. వీరనరసింహరాయలు పశ్చిమతీరమున స్థిరపడుచున్న పోర్చుగీసు వారితో మైత్రి నెరపి, తన సైన్యశిక్షణమునకు అల్మైడా సహాయముకోరెను. క్రీ. శ. 1509 లో ఇతని మరణానంతరము శ్రీకృష్ణరాయలు సింహాసన మారోహించెను.

శ్రీకృష్ణదేవరాయలు (క్రీ. శ. 1509-29) రాజ్యమునకు వచ్చుసరికి అతని వయస్సు 25 సంవత్సరములు. అతడు సాటిలేని సకల కళాసమ్రాట్టు. అసమాన చక్రవర్తియు, అపజయ మెరుగని నిష్కళంక జీవియు నయిన శ్రీకృష్ణరాయల యశస్సువలననే విజయనగర నామధేయము శాశ్వతమయినదనుట నిక్కువము. విదేశీయులు ఇతనినిగూర్చి ఎంతో సహజముగ వర్ణించి యున్నారు. ప్రజారంజకుడయిన శ్రీకృష్ణదేవరాయలు చక్కని శరీర దార్ఢ్యము గలిగియుండెను. అతడు నిరుపమాన ధైర్య స్థైర్యములు గలవాడు. సైనికులచే ప్రేమింపబడినవాడు.

కృష్ణరాయలు తురుష్కులకు చక్కని పాఠము నేర్పెను. ఏటేట జరుపు దండయాత్రలు చాలించి ముస్లిములు బీదరుకు పారిపోయిరి. రాయల అనతితో ఆల్బెక్వెర్క్, భట్కల్ యొద్ద కోటగట్టించెను. గుల్బర్గాపై దండెత్తి రాయలు మహమ్మదు II బహమనీ ఖైదునుండి విడిపించి, యవన రాజ్య స్థాపనాచార్య అను బిరుదందెను. (క్రీ. శ. 1511). పెనుగొండను, ఉమ్మత్తూరును శివసముద్రమును గెల్చి, జయింపబడిన రాజ్యభాగములకు సాళువగోవిందరాయలను రాజప్రతినిధిగ నిల్పెను. కొండవీడు, విజయవాడ, కొండపల్లి దుర్గములను గెలిచెను. కళింగములో పొట్నూరు - సింహాద్రివరకు జయించి, అచట జయస్తంభమును నిలిపెను. సైన్యములు కటకము వరకు వెళ్ళగా, తాను రాజమహేంద్రవరమునకు తిరిగి వచ్చెను. ప్రతాపరుద్ర గజపతి రాయలతో సంధినెరపి కూతు నిచ్చి పెండ్లిచేసెను. రాయలు తాను గెల్చిన కృష్ణకు పడమటి దేశమును కనికరముతో గజపతి కిచ్చివేసెను. పోర్చుగీసుల సాయముతో రాయలు క్రీ. శ. 1520 లో రాయచూరు నాక్రమించి తురుష్కుల నోడించెను. క్రీ. శ. 1523 లో బీజపూరుపై దండెత్తి గుల్బర్గాను ముట్టడించెను. ఈ విజయ పరంపరల అనంతరము శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1528 లో తన ఆరేండ్ల కుమారుని రాజు చేసెను. మంత్రి తిమ్మరుసు ఆ బాలుని చంపించెనని అనుమానించి, రాయలు మంత్రిని అతని కుటుంబమును కారాగారమున నుంచెను. క్రీ. శ. 1529 లో తమ్ముడు అచ్యుతదేవరాయలకు రాజ్యము నొసంగి, కృష్ణరాయలు వార్ధక్యము రాకముందే దివి కేగెను. దక్షిణావని నంతయు నొక్కటిగ పాలించిన ఈ విజయశాలియొక్క రాజనీతిజ్ఞత స్వరచితమైన ఆముక్తమాల్యదలో రూపొందినది. కృతికర్తయు, కృతిభర్తయు నయిన కృష్ణదేవరాయలు కళలకు పట్టుగొమ్మ; కల్పవృక్షము. ఆంధ్రభోజుడు. ఈ రాజాధిరాజు ప్రపంచ మందంతటను గౌరవింపబడియున్నాడు. సార్వభౌముని యశశ్చంద్రికలు శాశ్వతముగ విశ్వమంతట నల్లుకొనినవి.

అచ్యుతదేవరాయలు (క్రీ. శ. 1530-42) కృష్ణరాయలకు సవతి తమ్ముడు. ఇతడు కృష్ణరాయలు మరణించినపుడు చంద్రగిరిలో నుండెను. కృష్ణరాయల అల్లుడు రామరాయలు అచ్యుతరాయలకు పోటీగ, కృష్ణరాయల 1½ సం. ల మగశిశువును రాజుగ ప్రకటించి అచ్యుతరాయలు రాజధాని చేరులోపల చంద్రగిరిలో తిరుపతిలో పట్టాభిషేకము చేసికొనెను. కృష్ణరాయల మృతివార్త వినగనే ఇస్మైల్ ఆదిల్‌షా రాయచూరు లోయను ఆక్రమించెను. అచ్యుతరాయలు రాజధానికి చేరినతోడనే రామరాయలతో సంధి చేసికొనెను. ఆ పసి బాలుడు మృతుడయ్యెను. అచ్యుతరాయలు గజపతి దండయాత్ర నరికట్టెను. దక్షిణదేశమున సామంతుల తిరుగుబాటుల నణచి, అచ్యుతరాయలు పాండ్యరాజు పుత్రికను పరిణయమాడెను. క్రీ. శ. 1534 లో తురకల నుండి రాయచూరు లోయను గెలిచెను. క్రీ. శ. 1535లో రామరాయలు అచ్యుతరాయలను ఖైదుచేసి, ఆ మహారాజు తమ్ముని కుమారుడగు సదాశివరాయలను రాజుగ నిల్పెను. రాజధానిలో ఇట్లు కృష్ణరాయల మరణానంతరము రామరాయలు రాజులను మార్చుటచేతను, సామం

తులు ప్రబలు లగుటచేతను తిరుగుబాటులు జరిగెను. తిరుగుబాటుల నణచుటకై రామరాయలు దక్షిణమునకు వెళ్ళగనే అచ్యుతరాయలు స్వతంత్రించెను. రామరాయలు తిరిగి వచ్చుసరికి ఇబ్రహీము ఆదిల్ ఖాను రాజధానిని ముట్టడించియుండెను. ఈ సుల్తాను రామరాయలకు, అచ్యుతరాయలకు సంధి కుదిర్చెను. సంధి ననుసరించి అచ్యుతరాయలు రాజుగను, రామరాయలు రాజ్యరక్షకుడుగను ఉండుటకు అంగీకరింపబడెను. అచ్యుతరాయల మరణమువరకు ఈ షరతులు అమలులోనుండెను.

అచ్యుతరాయల తరువాత కొడుకు వేంకటరాయలు I (క్రీ. శ. 1542) రాజయ్యెను. రామరాయలు సదాశివ రాయలను ఖైదునుండి విడిపించెను. బీజాపూరుసుల్తాను సాయ మాశించెను. తిరుమలరాయలు ప్రజలచే రాజుగ ప్రకటింపబడి బీజాపూరు ఆదిల్ షాను ఓడించి వేంకట రాయలు I, అతని వంశ్యులను చంపించెను. రామ రాయలు తిరుమలరాయలను ఓడించి చంపి, క్రీ. శ. 1543 లో సదాశివరాయలను రాజుగ ప్రకటించెను. సదాశివరాయలు (క్రీ. శ. 1543-76) రాజ్యము చేయు చుండగా, రామరాయలు క్రీ. శ. 1550 ప్రాంతమున తానే రాజ బిరుదమును వహించెను. రామరాయలు రాజ్యాంగమున అతి ముఖ్యమైన కార్యములకు తురుష్కులను నియోగించెను. పంచ ముస్లిము రాజ్యముల అంతర్గత విషయములలో తాను సంబంధము కల్పించుకొను చుండెను. రామరాయల అట్టి నడవడికయే కడకు విజయనగర సామ్రాజ్యమునకు ముప్పము తెచ్చెను. రక్షసి - తంగిడి (తళ్ళికోట) యుద్ధమునకు కీలకమయ్యెను. దక్షిణమున దేవాలయములను పాడుచేసి చర్చిలుగా మార్చి, ప్రజలను క్రైస్తవమతమునకు మార్చు చున్న పోర్చుగీసువారి దుండగముల సాపుటకై రామ రాయలు చినతిమ్మరాయలను, విఠలరాయలను పంపెను. క్రీ. శ. 1547 లో పోర్చుగీసు వారితో సంధిచేసికొనెను. క్రీ. శ. 1558 లో శాంథోమ్, గోవాలపై దండెత్తి కప్పము గొనెను. క్రీ. శ. 1560 లో అహమ్మదునగరు సుల్తాను బీజపూరుపై దండెత్తగా రామరాయలు బీజపూరు సుల్తానుకు తోడ్పడి జయమును గాంచెను. అంతియ కాక బీదరునుకూడ గెలిచెను. మరల బీజపూరు సుల్తాను రామరాయలు కలిసి, అహమ్మద్ నగర్, గోల్కొండలతో పోరుసల్పిరి. క్రీ.శ. 1563లో జరిగిన సంధివలన గోల్కొండ సుల్తాను, పానుగల్లును కోవిల కొండను, వదలుకొనెను. కాని అతనికి రామరాయలపై కసి పెరిగెను.

సుల్తానులకొండ పోరులమధ్య రామరాయలు, ఎంత భేదతంత్రమును ప్రయోగించినను, ఐదుగురు సుల్తానులు తమతమ వైషమ్యములను మరచుకొని, సంధులు చేసికొని. విజయనగరముపై యుద్ధమున కాయత్తము కాదొడగిరి. క్రీ. శ. 1564 లో ఐక్య ముస్లిము సైన్యములు బీజపూరునుండి యుద్ధమునకు బయలుదేరెను. రామరాయలు తనకు జయము నిశ్చయ మను అతిధైర్యమున నుండెను. శత్రుసైన్యములు తల్లికోటయొద్ద విడిసెను. హైందవ సైన్యములు అచటికి 30 మైళ్ళదూరమున నున్న రక్షసి-తంగడి యను గ్రామముల సమీపమున జేరెను. వీరి బలము 5 లక్షలు. ముస్లిముల సైన్యము 2½ లక్షలు. కపటోపాయమున తురుష్క సైన్యములు హైందవ సైన్యములపై బడెను. ఐనను రామరాయలు సైన్యములను నేర్పుగ నడిపించెను. రామరాయలు విజేతయగునట్లే తోచెను. కాని విధిప్రాబల్యముచే రామరాయల సైన్యములోని ఇరువురు ముస్లిము సేనానులు తమ 70,000, 80,000 సైన్యముతో విడిపోయి శత్రుపక్షమున జేరిరి. రామరాయలకు ఓటమి తప్పలేదు. అంతియ కాక రామరాయలు శత్రువుల చేజిక్కి చంపబడెను.

అపజయవార్త విజయనగరము చేరగనే రామరాయల తమ్ముడు తిరుమలరాయలు 1550 ఏనుగులమీద విలువగల వస్తువులను, ఖైదీ చక్రవర్తి సదాశివరాయలను రాణివాసమును తీసికొని పెనుగొండకు పలాయనమయ్యెను. తురకలు రాజధానియందు ప్రవేశించి విచ్చలవిడిగ చరించి, నాశనముచేసి కొల్లగొట్టిరి. సకలసంపదలతో తులదూగుచున్న విజయనగర మహాపట్టణము అకస్మాత్తుగ నేలమట్టము గావింపబడెను.

**IV. అరవీటి వంశము :** అరవీటివంశమునకు నరపతి వంశమనియు పేరు గలదు. ఆరేండ్ల అరాజకము పిమ్మట పెనుగొండలోనున్న తిరుమలరాయలు (క్రీ. శ. 1570-1571) రాజయ్యెను. మధుర, తంజావూరు, జింజి ప్రభువులు స్వతంత్రులైరి. రామరాయల పుత్రుడు పెద తిరు

మలరాయల కోరికపై బీజపూరు సుల్తాను పెనుగొండను ముట్టడించెను. తిరుమలరాయల అర్థపై అహమదునగరు నిజాముషాహ బీజపూరుపై దండెత్తగా, బీజపూరు సుల్తాను వెనుదిరిగెను. (క్రి. శ. 1567). ముప్పురు సుల్తానులుకలిసి ఆదవానిని గెలిచిరి. తిరుమలరాయలు తన పుత్రులలో ఒకడగు శ్రీరంగరాయలను తెలుగుదేశముపై పెనుగొండలోను, రామరాయలను కన్నడదేశముపై శ్రీరంగపట్టణమందును, వేంకటపతిరాయలను తమిళదేశముపై చంద్రగిరి యందును రాజప్రతినిధులుగ నిలిపెను. తాను క్రి. శ. 1570 లో పట్టాభిషేకము చేసికొనెను. రెండేండ్ల తదుపరి కుమారుడు శ్రీరంగరాయలు (కి. శ. 1572-1585) రాజయ్యెను. క్రి. శ. 1585 లో అతడు మరణింపగా, వేంకటరాయలు II (క్రి. శ. 1586-1614) రాజపదవినందెను.

వేంకటరాయలు 28 సంవత్సరములు సమర్థతతో పరిపాలించెను. తురకల నవల్చి రాజ్యములోని తిరుగుబాటుల నణచి గోలకొండ నవాబుతో యుద్ధముచేసి జయించెను. ఉదయగిరిని గెలిచెను. ఇతని కాలమున డచ్చివారు, పోర్చుగీసువారు తూర్పు తీరమున ఫాక్టరీలను కట్టిరి. డచ్చివారి ఫ్యాక్టరీలు మచిలీపట్టణము (క్రి. శ. 1605), నిజాముపట్టణము, చెన్నపట్టణము (క్రి. శ. 1608) పులికాటు అను తావులలో నుండెను. ఇంగ్లీషువారి ఫ్యాక్టరీలు మచిలీపట్టణము, నిజాంపట్టణము (క్రి. శ 1612) పులికాటు (క్రి. శ. 1621), మద్రాసు (కి. శ. 1640) అను తావులలోను ఏర్పడెను. క్రి. శ. 1614 లో వేంకటరాయలు మృతిచెందగా, ఆతని అన్నకుమారుడు శ్రీరంగరాయలు II రాజయ్యెను.

శ్రీరంగరాయలు II అవివేకి. సామంతులు ఇరు పక్షములుగ సిద్ధమయిరి. ఎదురు పక్షమువారు వేంకటరాయల కృత్రిమ సంతానమయిన కుమారుని బలపరచిరి. ఈ పక్షనాయకుడు గొబ్బూరి జగ్గరాయలు; రాజపక్ష నాయకుడు యాచమనాయడు. జగ్గరాయలు రాజును కారాగారమందుంచి వేంకటరాయల కృత్రిమ కుమారుని రాజుచేసెను. యాచమనాయడు జగ్గరాయని గెలిచి శ్రీరంగరాయల పుత్రుడయిన రామరాయలను (క్రి. శ. 1618-1630) గద్దెపై నిలిపెను. తోపూరు (తిరుచనాపల్లి జిల్లా) యుద్ధములో (క్రి. శ. 1616) జగ్గరాయలు ఓడిపోయెను, రామరాయలు గెలిచెను.

రామరాయల రాజ్యకాలమంతయు (క్రి. శ. 1618-1630) యుద్ధములతో గడచెను. క్రి. శ. 1630 లో ఈ రాజు మరణించెను. తరువాత వెంకటరాయలు III (క్రి. శ. 1630 - 1642) రాజపదవినందెను. రామరాయల పినతండ్రి తిమ్మరాయలు వెంకటరాయలను బాధించెను. తిమ్మరాయలు క్రి. శ. 1635 లో హత్యగావింపబడెను. వేంకటరాయల పక్షమువాడయ్యె శ్రీరంగరాయలు III వలన బీజపూరుసుల్తాను క్రి.శ. 1638, 1641లలో దండెత్తి వచ్చునట్లు చేసెను. మొదటితూరి తురకల నోడించుటకు దక్షిణదేశపు సామంత ప్రభువులు తోడ్పడిరి. రెండవసారి రండోలాఖాను దండయాత్రచేసి నెల్లూరును సమీపించెను. గోలకొండనవాబు తూర్పుతీరముపై దండెత్తెను. వేంకటరాయలు III నారాయణవనం (చిత్తూరుజిల్లా) అడవులకు పారిపోయి క్రి. శ. 1642 లో దివంగతు డయ్యెను.

వేంకటరాయల తమ్ముని కుమారుడు శ్రీరంగరాయలు III (క్రి. శ. 1642 - 49 - 75) రాజ్యభారము వహించెను. ఇతడు తాను పన్నిన కుట్రలకు తానే గురియయ్యెను. బీజపూరు, గోలకొండ సుల్తానులు పరస్పరము సంధిచేసికొనిరి. దక్షిణమున సామంతుల తిరుగుబాటు, వారిప్రోద్బలముపై బీజపూరు, గోలకొండ నవాబుల దండయాత్రలు, ఒక్కపెట్టున విజృంభించెను. మొగలు చక్రవర్తి కర్ణాటక రాజ్యమును గెలిచి పంచుకొనుటకు గోలకొండ, బీజపూరుల కానతిచ్చెను. క్రి. శ. 1645 లో దక్షిణమునందలి సామంతులకోడి శ్రీరంగరాయలు వేలూరు చేరెను. అచట మరుసంవత్సరము యుద్ధములో బీజపూరు సేనలచే నోడింపబడెను. శ్రీరంగరాయలు తంజాపూరు, తరువాత మైసూరు చేరుకొనెను. క్రి. శ. 1652 లో బీజపూరును కర్ణాటకమును అతడు గెలిచెను. అతడు మైసూరులో కొలువు దీర్చుచు వేలూరును జయింప కలలు గాంచుచుండెను. కట్టకడపట క్రి. శ. 1675 లో శ్రీరంగరాయలు III స్వర్గస్థుడయ్యెను. మూడు శతాబ్దములు హైందవ సంస్కృతిని సంరక్షించిన విద్యా (విజయ) నగర సామ్రాజ్యము ఈ విధముగా అంతరించెను.

# విజయనగర రాజ వంశవృక్షములు

## I సంగమ వంశము :

సంగమరాజు
- హరిహరరాయలు I (క్రీ. శ. 1336-57)
- కంపరాయలు I
- బుక్కరాయలు I (1344-77)
  - హరిహరరాయలు II (1377-1404)
    - విరూపాక్షరాయలు I (1404-05)
    - బుక్కరాయలు II (1405-06)
    - దేవరాయలు I (1406-22)
      - రామచంద్రరాయలు (1422)
      - విజయరాయలు I (1422-26)
        - ప్రౌఢదేవరాయలు లేక దేవరాయలు II (1422-46)
          - విజయరాయలు II (1446-47)
          - మల్లికార్జునరాయలు (1447-65)
            - రాజశేఖరరాయలు (1466)
        - ప్రతాపదేవరాయలు
          - విరూపాక్షరాయలు II (1465-85)
            - ?
            - ప్రౌఢరాయలు (1485)
  - కంపరాయలు II
  - విరూపణ్ణ
- మారప
- ముద్దప

## II సాళువ వంశము :



III తుళువ వంశము :




IV ఆరవీటి వంశము :




**వెలమ రాజ్యము** : ప్రస్తుతపు వేంకటగిరిరాజుల పూర్వులయిన వెలమరాజులు రేచర్ల వంశ్యులు. ఆ వంశమునకు మూలపురుషుడు చెవ్విరెడ్డి. నిక్షేపమొకటి దొరకుటవలన ఇతడు ధనికుడయ్యెనని వాడుక కలదు. వెలమరాజులు కాకతీయ సామంతులుగ నుండి, తదనంతరము కాపయనాయకుని కాలములో నల్లగొండప్రాంతములో స్వతంత్రులైరి. అశ్వపతి, నరపతి, గజపతుల తాకిడికి నిల్వలేక వారు కర్ణాటకమునకు వచ్చి రాయల సామంతులైరి.

వెలమ రాజులలో ఐదవతరమునకు చెందినవారు సింగమనాయడు I, వెన్నమనాయడు, ఏచమనాయడు అను మువ్వురు. 14 వ శతాబ్ది రెండవపాదములో ఏచమనాయడు కొలచెలమ యుద్ధములో తురకల నోడించెనట! సింగమనాయడు తక్కిన ఇర్వురితో కలిసి రాచకొండ రాజ్య మేర్పర్చుకొనెను. సింగమనాయడు కాపయనాయకుని నోడించెనట! తర్వాత జల్లిపల్లి దుర్గము ముట్టడించి క్రీ. శ. 1360 లో శత్రువుల చేతులలో మృతుడయ్యెను.

అనపోతనాయడు, I, మాదానాయడు I (క్రీ. శ. 1360-84)—వీరు ఆరవతరమువారు; వీరు సింగమనాయని పుత్రులు. వీరు మొగులూరు, ఇనుకుర్తి, జల్లిపల్లి, యుద్ధములలో (క్రీ. శ. 1361) తమ తండ్రిని చంపిన క్షత్రియ రాజులను వధించి వారి రక్తముతో తండ్రికి తర్పణములు విడిచిరట! కాపయనాయకుడు వీరి నణచుటకు ప్రయత్నించి 1369 ప్రాంతమున భీమవరమునొద్ద వెలమ రాజులచే జయింపబడెను. తర్వాత అనపోతనాయడు, ఓరుగల్లు, భువనగిరులతో సహా కాపయరాజ్యమును తన రాజ్యముతో కలుపుకొని ఆంధ్ర సురత్రాణ, అనుమన గంటి పురవరాధీశ్వర-అను కాపయబిరుదములను ధరించి స్వతంత్రుడయ్యెను. అతడు కొండవీటి రాజ్యములోని ధరణికోటపై దండెత్తి ఓడిపోయెను. ఈ అదను చూచుకొని మహమ్మదుషా I బహమని తెలంగాణముపై దండెత్తెను. కాని అనపోతనాయనిచే తరుమబడెను. మరియొకమారు ముస్లిము సైన్యములు దండెత్తిరాగా అనపోతనాయడు గోలకొండనిచ్చి సంధిచేసికొనెను.

అనపోతనాయడు, మాదానాయడు తాము దిట్టపరచిన రాజ్యమును రెండు భాగములుగ విభజించి రాచకొండ రాజధానిగ ఉత్తరభాగమును అనపోతనాయడును, దేవరకొండ రాజధానిగ దక్షిణభాగమును మాదానాయడును పంచుకొనిరి. ఇతర రాజ్యసంబంధ విషయములలో రెండు రాజ్యములు ఐకమత్యము కలిగియుండెను.

ఏడవతరము వారు— సింగమనాయడు II, వేదగిరినాయడు I తెలుగు చోడ అన్నమదేవుని పక్షమున వీరు అనవేమారెడ్డితో పోరు సల్పిరి. కాని వీరు జయించిరని చెప్పజాలము. క్రీ. శ. 1386 లో కాటయ వేమారెడ్డి వెలమరాజ్యములోని రామగిరిని గెల్చెను. అంత సింగమనాయడు. రెడ్డిరాజ్యముపై దండెత్తెను (1387). 1390 లో వెలమలకు కుమారగిరిరెడ్డికి సంధి పొసగెను. ఇదే సమయమున గజపతి వెలమరాజ్యముపై దండెత్తి ఓడి, కూతును సింగమనాయని కిచ్చి పెండ్లి చేసెనట. కుమారగిరి మరణానంతరము అన్నదేవచోడుడు దేవరకొండ కేగి వేదగిరినాయని సాయముతో రాజమహేంద్రవరమునకు బయలుదేరెను. త్రోవలో వేములకొండకడ ఐదుగురు రాజులను ఓడించెను. రెడ్లనుండి బెండపూడి గెల్చెను. అన్నదేవుని సింహాసనముపై నిల్పి, తన మంత్రి మాదానేనిని అతనికి రక్షకునిగ రాజమహేంద్రవరములో నిల్పెను.

వెలమరాజులకును బహమనీ సుల్తానులకునుగల సుహృద్భావము చెడగొట్టుటకై విజయనగర హరిహరరాయలు II 1384 లో తెలంగాణముపై దండెత్తి ఓరుగల్లును సమీపించెను. అతనిని కొత్తకొండకడ ముస్లిము సైన్యములు అడ్డగించెను. విజయనగర సైన్యములు తిరుగుబాట పట్టెను. మరల 1397 లో హరిహరరాయలు II సైన్యములను పంపెను. యువరాజు బుక్కరాయలు సుల్తానును, ఆంధ్రరాజులను ఓడించెను.

వెలమవంశమునందు ఎనిమిదవ తరమువారు-అనపోతనాయడు II, రామచంద్ర, మాదానాయడు II. రెడ్లకును తెలుగుచోడులకును జరిగిన యుద్ధములలో అన్నదేవుని పక్షమున ముస్లిము సైన్యములతోపాటు వెలమనాయకులు పోరి విజయములను గొనిరి. గుండుగొలను యుద్ధములో గజరావు తిప్ప కాటయవేముని చంపెను. కాటయవేమునికిగల 'తలగొండుగండ'అను బిరుదము వహించెను. విజయనగర సైన్యములు ఓడిపోయెను. కాని, సుల్తాను, అన్నదేవచోడుడు, నదినిదాటి రాజమహేంద్రవరము చేరలేక పోయిరి. రెడ్ల సేనాధిపతి దొడ్డయ అల్లాడరెడ్డి విజయనగర సాయముతో శత్రుసైన్యములను చెండాడెను (1417). రెడ్లకు సాయము వరికట్టుటకై సుల్తాను పానుగల్లును, నల్లగొండను, పట్టుకొనెను. రెడ్ల హస్తములలో అన్నదేవుడు హతుడయ్యెను. బహమనీ సుల్తాను వెలమలు కలిసి విజయనగర సైన్యములను బాధించిరి. కాని తూర్పుతీర నాయకత్వ మాశించి బహమనీ సుల్తాను, కొండవీటి పెదకోమటి వేమారెడ్డితో స్నేహము చేసికొనెను. ఇది సహింపక వెలమలు ధరణికోటపై దండెత్తి గెల్చిరి. పెదకోమటి వేముడు వెలమలపై దండెత్తి రామచంద్రనాయని, మాదానాయని, వేదగిరినాయని చంపెను.

అనపోతనాయడు II, దేవరాయలు I తో మైత్రి చేసికొనెను, అంత దేవరాయలు పానుగల్లు, నల్లగొండలపై దండెత్తి తురకల నోడించెను. అనపోతనాయడు తెలంగాణములోని బహమనీ రాజ్యపు స్థలములను పట్టు

కొనెను. తరువాత కొండవీటిరాజ్యముపై దండెత్తి, గెలిచి పెదకోమటివేముని యొక్క 'నందికంత పోతరాజు' అను కత్తిని తీసికొని పోయెను.

తొమ్మిదవ తరమువారు - లింగమనేడు, సర్వజ్ఞ సింగమనాయడు అనువారు. లింగమనేని విజయములు వెలుగోటివారి వంశావళిలో మిక్కుటముగ వర్ణింపబడినవి. ఇతడు రాజమండ్రి రెడ్డిరాజులగు వేమ, వీరభద్రా రెడ్లను, సింహాద్రి, సప్తమాడెము అనుతావులను గెల్చెను. తురకలగెల్చి 33 దుర్గములను పట్టుకొనెను. విజయనగర సామంతులను గెల్చి, దేవరాయలచే కానుకల నందెను. కొండవీటి మన్నీలను చెదరగొట్టెను. లింగమనేని రాజమహేంద్రవర దండయాత్ర 1427 ప్రాంతమున జరిగెను. కళింగములో ఆవంచ గెల్చెను. రెడ్డిరాజులకు దేవరాయలు II సాయపడుటవలన లింగమనేడు వెనుదిరిగెను. ఇతడు విజయనగర రాజ్యములో కొండవీడు, నాగార్జునకొండ, కర్నూలు, కంచివరకు వెళ్ళెను (1437).

బహమని అహమద్‌షా 1433 లో తెలంగాణముపై దండెత్తెను. సింగమనేడు III తలయొగ్గెను. 1435 లో సుల్తాను తెలంగాణమును తన కొడుకులకు వ్రాసి యిచ్చెను. అప్పటినుండి వెలమరాజులు బహమనీ పాలకు సామంతులై తిరుగుబాటుల నణచిరి. 1457 లో రాజ్యమునకు వచ్చిన హుమాయూను హిందువులకు శత్రువులగుటచే వెలమలు తిరుగబడిరి. తురకలు దేవరకొండను ముట్టడించిరి. లింగమనేని కోరికపై కపిలేశ్వర గజపతి హంవీరుని సైన్యములతో బంపెను. శత్రువులు ఓడింపబడిరి. రాచకొండ వెలమల వశమయ్యెను. 1460 లో హంవీరుడు ఓరుగల్లును, తురకలనుండి ఉత్తర జిల్లాలను గెలిచెను. లింగమనేడు తిరిగి వెలమరాజ్యము నంతయు గెల్చెను. కాని గజపతులకు కప్పము కట్టవలసియుండెను. దేవరకొండ చరిత్రము లింగమనేనితో ముగిసెను.

సర్వజ్ఞ సింగమనేడు III 1425 లో రాజయ్యెను. ఇతడు 1433 లో అహమద్‌షాకు లొంగిపోయెను. కాని తురక రాజప్రతినిధి అతనిని రాచకొండనుండి తరుమగా బెల్లంకొండకు పారిపోయెను. 1455 వరకు అచట నుండెను. చివరకు సింగమనేడు III గజపతి సామంతులతో జరిగిన యుద్ధములో చనిపోయెను. ఈ రాజు కవిసార్వభౌముడగు శ్రీనాథుని గౌరవించెను.

లింగమనేడు సింగమనాయని తరువాత వెలమలు కర్ణాటకమునకుపోయి రాయల సామంతులుగ నుండిరి. 15 వ తరమువాడగు రాయపనాయడు సింగమనాయని II తమ్ముని వంశ్యుడు. మధ్య 5 తరములవారు ప్రసిద్ధులుగ తెలియరారు. రాయపనేని రాజధాని వెలుగోడు, మహానంది ప్రాంతములందు యుద్ధముచేయుచు ఇతడు మరణించెను. ఇతడు గజపతుల సామంతుడు కానోపును.

17 వ తరమువాడు రాయపనేని మనుమడు గని తిమ్మానాయడు. ఇతని రాజధాని గని (కర్నూలు మండలము). ఇతడు కృష్ణరాయలకు, అచ్యుతరాయలకు సామంతుడు. శ్రీశైలమండలి భిక్షావృత్తియొక్క మఠముపై దండెత్తి గెల్చెను. విజయనగర శత్రువులైన తురకల నెందరినో గెలిచెను. తిమ్మానాయడు మల్లాపుర సమీపమున ఆంధ్ర మన్నెరాజుల నోడించెను. 1530 లో గోలకొండ నవాబు కొండవీటిని పట్టుకొనగా విజయనగరము తరపున తిమ్మానేడు పోరాడి ఓడించెను. 1544 లో హావడి ఔబల రాజుతో పోరుచు మృతినొందెను.

18 వ తరమువారు తిమ్మానాయని కొడుకులు పెద తిమ్మానాయడు, నాయననేడు, ఎరతిమ్మానేడు అనువారు. ఎరతిమ్మానేడు రామరాయల యుద్ధములలో పాల్గొనెను. 1563లో విజయనగరమునకు గోలకొండకు జరిగిన యుద్ధములలో ఇతడు పోరెను. అనేక దుర్గములను గెల్చి రామరాయలచే బహుమతులను బడసెను.

19 వ తరమువారు కస్తూరి రంగమనాయడు, చెన్నానాయడు. వీరు శ్రీరంగరాయలు I, వేంకటరాయలు II సేనలో నుండిరి. విజయనగరమునకును మహమ్మదీయులకును జరిగిన యుద్ధములలో పేరు గాంచుచు వీరు 1579 లో మట్ల తిమ్మానేనిని కోడూరు యుద్ధములో చంపిరి. గోల్కొండ, విజయనగరముపై దండెత్తి, గెలుపు అసాధ్యమగుటచే వెనుదిరిగెను. మొరసు దేశములో కోవూరు అధిపతియగు తిమ్మప్పగౌడ కప్పము కట్టకపోవుటవలన వేంకట రాయలు II కస్తూరి రంగమనాయని పంపగా అతడు ఇతరులతో కలిసి తిమ్మప్పను

గెలిచెను. అతడు కొండపీటి తురుష్క ప్రతినిధియగు అఫ్ జల్ ఖానును ఓడించెను. గోల్కొండ యుద్ధములలో వెలుగోటి చెన్నానాయడు విజయనగర రాధీశులకు జయమును సంపాదించెను. చెన్నానాయడు, యాచమ నాయడు నంజర్ ఖానును తరిమి గండికోటనుపట్టుకొనిరి.

20 వ తరమువారు వేంకటపతి నాయడు, యాచమ నాయడు. వీరిలో యాచమనాయడు, శ్రీరంగరాయలు II తరపున వేలూరిలో 1616 లో శ్రీరంగరాయల పుత్రుడు రామదేవరాయల పట్టాభిషేకమును నడిపించెను.

21, 24 తరములవారైన కుమార యాచమనాయడు, సింగమనాయడు, శ్రీరంగరాయలు III సామంతులు. వీరు అతని యుద్ధములలో పాల్గొనిరి. 1643 లో గోల్కొండ నవాబు దండెత్తినపుడు వేముగల్లు సమీప మున జరిగిన యుద్ధములలో సింగమనాయడు తురకలను చెండాడెను. 1659 లో పెనుగొండను పట్టుకొనుటకై శ్రీరంగరాయలు ప్రయత్నము చేసినపుడు కుమార యాచమనాయడు గోల్కొండ సేనలో నుండెను. అతడు పెనుగొండకు పోయి శత్రుసంహారము చేసెను.

## వెలుగోటి రాజుల వంశవృక్షము

చెవ్విరెడ్డి (బేతాళనాయడు)






రెడ్డిరాజ్యము (క్రీ. శ. 1320 - 1450): శైలపుర నామాంతరముగల కొండవీడు, నగరమని ప్రసిద్ధిగాంచిన రాజమహేంద్రవరము ముఖ్య రాజధానులుగ రెడ్డిరాజులు ఒక్క శతాబ్దముపైగా దాదాపు ఆంధ్రదేశము నంతయు స్వతంత్రముగ పరిపాలించిరి. క్షత్రియులతో సంబంధ బాంధవ్యములు కలిగియున్నప్పటికిని రెడ్డిరాజులు చతుర్థ కులజులు. వీరి మూలపురుషుడు దొంతి అల్లాడరెడ్డి స్పర్శ వేధిని సంపాదించి ధనికుడయ్యెనను నొక కథ కలదు. ఈ వంశకర్త వేమారెడ్డి. అతని కొడుకు కోమటి ప్రోలారెడ్డి; మనుమడు ప్రోలయ వేమారెడ్డి.

ప్రోలయ వేమారెడ్డి (1320 - 56) రెడ్డిరాజ్య స్థాపకుడు. ఇతడు 1320 ప్రాంతమున ధరణికోటలో ప్రతాపరుద్రుని అధికారము ధిక్కరించి స్వాతంత్ర్యమును ప్రకటించెను. తమ్ములసాయముతో రాజ్యమును విస్తరింపజేసెను. రాజధానిని అద్దంకికి మార్చెను. శత్రువులనుండి మోటుపల్లిని గెల్చెను. 1335 నాటికి తూర్పుతీరమంతయు జయించి కళింగమున విజయములను గాంచెను. 1345 ప్రాంతమున తురుష్కులనుండి బ్రాహ్మణాగ్రహారములను గెలిచి బ్రాహ్మణుల కిచ్చెను. 1352 లో కొంత రాజ్యము విజయనగరాధీశులకు ఓడిపోయెను.

కళింగ విజయములనాటికే, వేమారెడ్డి, కోరుకొండ రెడ్లను, పిఠాపుర కొప్పుల నాయకులను జయించియుండును. 1345 నాటికి కాపయ నాయకుని గెలిచెను. 'కళింగరాయమాన మర్దన' అను బిరుదు నరసింహ చక్రవర్తి (1328 - 54) పై విజయము సూచించును. ఇతని ప్రశస్తికి తార్కాణములుగ పాండ్యరాజ గజకేసరి, రాచూరి దుర్గ విభాల, చెంజిమల చూరకార - మున్నగు బిరుదులు కలవు. ఇతని ఆస్థానమున రామాప్రెగడ మహామంత్రిగను, ప్రబంధ పరమేశ్వరుడగు ఎఱ్ఱాప్రెగడ ఆస్థాన కవిగను, కొండవీటి రాచవారి సుగంధవస్తు భాండాగారాధ్యక్షుడుగ ప్రసిద్ధికెక్కిన తిప్పయసెట్టి తండ్రి అవచి దేవయసెట్టి ప్రాపుగను ఉండిరి.

అనపోతారెడ్డి (1356-1371) తండ్రి తరువాత రాజ్యమునకు వచ్చెను. ఇతని కాలమున రాజ్యపు ఉత్తర భాగమున తెలుగు చోళులు తిరుగబడిరి. ఇతని మోటుపల్లి వర్తక శాసనములు దేశ సౌభాగ్య సూచకములు. అనపోతారెడ్డి రాజధానిని కొండవీటికి మార్చెను.

1358 లో అనపోతారెడ్డికి, ముమ్మడి ప్రోలవరము రాజధానిగపాలించుచున్న ఏరువ తెల్గుచోళులతో ఘర్షణము వచ్చెను. మూరవరము యుద్ధములో అనపోతరెడ్డి

ఓడెనని చోడ శాసనములు చెప్పుచున్నవి. 1366 లో అన్నదేవచోడుడు రాజుకాగా అనపోతారెడ్డి అతనిని తరిమి తమ్ముని భీమలింగని సింహాసనముపై నిల్పెను. 1368-70 సం. మధ్య రెండుమార్లు వెలమలు ధరణికోటపై దండెత్తిరి; రెండవసారి రెడ్లు విజయము గాంచిరి.

అనవేమారెడ్డి (1371-86) అనపోతారెడ్డి తమ్ముడు. ఇతని రాజ్యకాలమున దేశము సుభిక్షముగ నుండెను. ఇతడు అన్నదేవచోడుని అడచి, భీమలింగనికి కూతునిచ్చి పెండ్లిచేసెను. 1375 నాటికి దక్షిణ కళింగమున సామంతరాజుల గెలిచెను. 1376 లో వెలమలపై దండెత్తి గెలిచెను. 1385-86 లో కొంతరాజ్యమును విజయనగర రాజుల కోడిపోయెను.

కుమారగిరిరెడ్డి (1386-1404) రాజ్యకాలమున రాజ్యము విస్తృతి నందెను. దేశమున శాంతి నెలకొనెను. ప్రజలు సుఖించిరి; 1395 లో కుమారగిరి విస్తృతమైన తూర్పు రాజ్యమును విడదీసి రాజమహేంద్రవరము రాజధానిగా కాటయవేమారెడ్డి కిచ్చెను. 1386 లో కాటయవేముడు కళింగముపై దండెత్తి మాక్లేది, వజ్రకూటము, వీరఘొట్టము, రామగిరి గెలిచెను. 1387 లో వెలమలకు, విజయనగర రాజులకు సంధి పొసగెను. 1390 ప్రాంతమున రెండవ కళింగ జైత్రయాత్రలో సింహాచల, వింధ్యపర్వతములమధ్య గల రాజులు జయింపబడిరి. గజపతి-వీరనరసింహ IV (1374-1424) ఓడి కప్పము చెల్లించెను. బహుమతులు పంపెను. కుమారగిరి వసంతరాయ బిరుదాంకితుడయి బహమనీ సుల్తాను (ఫిరోజ్‌షా 1397-1428) తో స్నేహముగ నుండెను. హరిహరరాయలు II తన కుమార్తె హరిహరాంబను కాటయవేముని కొడుకు కాటయ కిచ్చి పెండిలి చేసిరి.

పెదకోమటి వేమారెడ్డి (1404-1420) : ఇతడు సర్వజ్ఞ చక్రవర్తి అను బిరుదు వహించెను. ఈ వీరనారాయణుడు దిగ్విజయము చేసినట్లు వర్ణనము వేమభూపాల విజయములో కలదు. ఇతడు రాజమహేంద్రవర రెడ్డి రాజ్యముతో శత్రుత్వము పూనెను. వెలమలతోను, విజయనగర రాజులతోను విరోధించి రాజ్య విస్తృతినిజేసెను. అన్నదేవచోడుడు ఉండిరాజులతో స్నేహము నెరపెను. రాజమహేంద్రవరపు రెడ్లపై దండెత్తి అపజయము గాంచెను. బహమని సుల్తానుతో మైత్రి చేసికొనెను. ఉత్తరమున కాశివరకును, దక్షిణమున రామేశ్వరము వరకును పోయి దానధర్మములను జేసెను. ఇతనికి సర్వజ్ఞ చక్రవర్తి అను బిరుదు కలదు. ఈతని యాస్థానమున శ్రీనాధమహాకవి విద్యాధికారిగ నుండెను. వాణిజ్య వంశధరుడగు అవచి తిప్పయ (తిరుమలనాథ) సెట్టి సుగంధవస్తు భాండాగారమునకు అధ్యక్షుడుగా నుండెను.

రాచ వేమారెడ్డి (1420-1432) : కొండవీటి రాజులలో కడపటివాడు. 1428-29 ప్రాంతమున శ్రీనాథుని వెలమ లింగమనేని కడకంపి 'నందికంత పోతరాజు' అను రెడ్లకత్తిని తెప్పించెను. ఇతడు ప్రజారంజకుడు కానందున ఒక భటునిచే చంపబడెను. విజయనగరదేవరాయలు II కొండవీటి రాజ్యమును ఆక్రమించెను. 1432 నాటివి విజయనగర శాసనములు కొండవీటిలో గలవు.

రాజమహేంద్రవర రెడ్డి రాజ్యము (1395-1450) : కాటయవేమారెడ్డి (1395-1416) : ఇతడు కుమారగిరిరెడ్డికి ప్రధానియు, సేనాపతియునై యుండెను. తన ప్రభువు మరణించిన తరువాత కొండవీటికి శత్రువయ్యెను. అన్నదేవచోడుడు, పెదకోమటి వేమారెడ్డి యొక్కయు, వెలమరాజుల యొక్కయు సాయముతో కాటయవేముని ఓడించి, 'పూర్వ సింహాసనాధీశ్వర' అను బిరుదు వహించెను. కాటయవేముడు దేవరాయల సహాయముతో అన్నదేవుని ఓడించెను. అన్నదేవుడు తురుష్కుల సాయమును సంపాదించెను. గుండుగొలను యుద్ధములో కాటయవేముడు హతుడయ్యెను. విజయనగర సైన్యములు ఓడిపోయెను. 1407 లో కాటయవేముడు కళింగముపై దండెత్తి గెలిచెను. తురుష్కులతోపాటు పద్మనాయకరాజులు కాటయవేముని శత్రువులు. హరిహరరాయలు, దేవరాయలు I ఇతని మిత్రులు, బంధువులు.

కుమారగిరిరెడ్డి (1416) : కాటయవేముని కొమరుడు. స్వల్పకాలము పాలించి మృతుడయ్యెను. అంతట అతని సోదరి అనితల్లి రాజమహేంద్రవర రెడ్డి రాజ్యమునకు రాణి అయ్యెను.

**అనితల్లి (1416-1450) :** కాటయ వేముని కూతురు. ఈమె పక్షమున మామగారు అల్లాడ రెడ్డి (1416-25) రాజ్యమును రక్షించుచుండెను. తరువాత రాణితో నామె భర్త వీరభద్రారెడ్డి (1425-50) రాజ్యము చేసెను. అల్లాడ రెడ్డి భార్య అనవేమారెడ్డి దౌహిత్రి. అల్లాడ రెడ్డి రెండవపుత్రుడు వీరభద్రా రెడ్డి అనితల్లిని వివాహమాడెను. బహమనీ సుల్తానును, చోడులను, వెలమలను ఓడించెను. 1417 నాటికి అన్నదేవుని, అతని కుమారుడు వీరభద్రుని హతమార్చెను. కళింగముపై దండెత్తి ఖూడె సప్తమాడెములు, బారుహా, దొంతి, జంతుర్నాడు, ఒడ్డాది, రంభ అనువాటిని గెల్చి 'గజపతిదళ విభాళ'అను బిరుదును గాంచెను. 1420 లో బహమనీసుల్తాను - ఫిరోజిషాను ఓడించెను. మాల్వాసుల్తాను అల్పఖాన్ లేక హోషాంగ్ కళింగ దండయాత్రనుండి మరలివెళ్ళునపుడు అల్లాడ రెడ్డిచే ఓడినవాడయ్యెను. అల్లాడ రెడ్డికి దేవరాయలు మిత్రుడు. అల్లాడ రెడ్డి పెదకోమటి వేముని యుద్ధములో నోడించెను.

అనితల్లి, వీరభద్రారెడ్ల పాలనలో వీరభద్రుని అన్నగారు వేమారెడ్డి రాజ్యము నడిపించుచుండెను. వేమారెడ్డి విజయములు గమనింపదగినవి. రెడ్డి సైన్యములు బంగాళములో పండువా వరకు వెళ్ళెను. రెడ్డిరాజ్యము ఈ కాలమున ఉచ్ఛదశయం దుండెను. ప్రజల సౌఖ్య సంపదలను శ్రీనాథుడు తన కావ్య రాజములలో వర్ణించియున్నాడు.

1426 ప్రాంతమున వేమ వీరభద్రారెడ్లు కళింగజైత్ర యాత్రకై వెడలి జీడికోట, మాకవరము, సప్తమాడెములు, ఖూడె, కలువపల్లి, ఒడ్డాది, కటకము గెలిచిరి. వీరు శృంగవరపుకోట, తోతుగడ్డ జయించి సముద్రతీరమున జయస్తంభములను నిల్పిరి. చీకటికోట గెలిచి చిల్కాసముద్రమును దాటి, కసింకోట, కప్పకొండ గెలిచిరి. భానుదేవుడు IV రెడ్లతో సంధిచేసికొని కప్పము కట్టుచుండెను. కపిలేశ్వర గజపతి 1437-44 ప్రాంతమున రెడ్లపై దండెత్తి ఓడింపబడెను. యుద్ధములో రెడ్లకు దేవరాయల సైన్యములు తోడ్పడెను. 1426-27 లో రెడ్లు వెలమ దండయాత్రను తిరుగ గొట్టిరి. రెడ్లు బహమనీ అహమదుషా (1422 - 35) మిత్రులు. వీరభద్రారెడ్డి పండువా సుల్తాను స్నేహితులు. దేవరాయలు II, మల్లికార్జున రాయలు (1444 - 47) గజపతుల నడ్డుటకు రెడ్లకు సాయపడుచుండిరి.

1450 లో కపిలేశ్వర గజపతి రెడ్డి రాజ్యమును గెలిచి, 1455 లో కొండవీటిని గెలిచి, 1465 నాటికి తూర్పు తీరమునంతటిని తన పాలనము క్రిందికి తెచ్చెను. రాజ ప్రతినిధులను నిల్పెను. ఇటుల ఆంధ్రదేశమున రెడ్లపాలన మంతరించెను.

డా. వి. య.

## రెడ్డిరాజుల వంశములు

**I కొండవీటిరెడ్లు :**






**II రాజమహేంద్రవరపు రెడ్లు :**

(i)




(ii)



**ఆంధ్రదేశ చరిత్రము IV (1675-1900) :-** క్రీ. శ. 1675 నాటికి భారతదేశము నేలు మొగలాయి చక్రవర్తి ఆలంఘీరు పాదుషా లేక ఔరంగజేబు మిగుల బలవంతుడై దక్షిణాపథమునంతయు తన సామ్రాజ్యమున కలుపుకొన జూచుచుండెను. అప్పటికి గోదావరికి దక్షిణమున తూర్పు సముద్రతీరమువరకు గల విశాలదేశమును గోలకొండ సుల్తానులు పరిపాలించుచుండిరి. వీరి రాజప్రతినిధి శ్రీకాకుళము (చిక్కాకోలు)లో నుండెను. వీరి సేనాధిపతులు మద్రాసు చుట్టుపట్ల కర్ణాటకమని పిరువబడు దక్షిణమండలములనుగూడ క్రీ. శ. 1647 లో జయించి నప్పటినుండియు అక్కడిరాజులు, నాయకులు, పాళెగార్లు గోలకొండకు లోబడిరి. చెన్నపట్టణములో నొకకోట కట్టుకొని వ్యాపారము చేయుచున్న ఇంగ్లీషు వర్తక కంపెనీవారుకూడ గోలకొండ సుల్తానునకు కప్పముగట్టిరి. అనంతపుర మండలమును హండేరాజులు పరిపాలించుచుండిరి. కడప, కర్నూలు మండలములను నవాబులు పరిపాలించుచుండిరి. వీరందరును గోలకొండ రాజ్యమునకు సామంతులుగనే ఉండిరి.

క్రీ. శ. 1674 లో శివాజీమహారాజు స్వతంత్ర మహారాష్ట్ర రాజ్యమును స్థాపనచేసి రాయగడ దుర్గమున పట్టాభిషిక్తుడై ఒకవంక బిజాపుర సుల్తాను రాజ్యమునకును ఇంకొకవంక మొగలాయి సామ్రాజ్యమునకును ప్రక్కలోని బల్లెమై విజృంభించెను.

క్రీ. శ. 1676 లో శివాజీ గోలకొండ సుల్తానుతో సంధిచేసికొని సైన్యములతో బయలుదేరి దక్షిణమున బిజాపురమువారిక్రింద జింజి మొదలగు జాగీరుల నేలుచున్న తన సవతితమ్ముడైన ఏకోజీ లేక వెంకోజీని ఓడించి అక్కడి దుర్గములను పట్టుకొని, బళ్ళారిని, కడపను కొల్లగొని, మొగలాయి సామ్రాజ్యమువారి ఒత్తిడిలేకుండ చేసెదనని, బిజాపురపు సుల్తానుతో నొక సంధిచేసికొనుటతో ఆతనిరాజ్యము ఎక్కువగా బలవంతమయ్యెను. తన తండ్రి షాజహాను కాలముననే మొగలు సామ్రాజ్యమునకు లోబడి కప్పముగట్టుటకు అంగీకరించిన బిజాపూరు గోలకొండ సుల్తానులిట్లు శివాజీతో కుట్రలు చేయుచుండుటవలన ఔరంగజేబునకాగ్రహము కలిగినను, ఆ సమయమున అతడు ఉత్తర భారతదేశమున ఆఫ్గన్ కొండజాతులను అణచుటలో నిమగ్నుడైయున్నందున దక్షిణాపథమువైపు తనదృష్టినిమరల్పకపోయెను. శివాజీ క్రీ. శ. 1680 లో మరణించెను. ఔరంగజేబు దక్షిణాపథమునకువచ్చి అహమదు నగరమున విడిసి, క్రీ. శ. 1685 లో తన కొమారుని గోలకొండపైకి పంపగా వారొక తాత్కాలికసంధి చేసికొనిరి. ఔరంగజేబు క్రీ. శ. 1686 లో బిజాపుర సుల్తానును, 1687 లో గోలకొండ సుల్తానును ఓడించెను. ఈ రెండు రాజ్యములు మొగలాయి రాజ్యములో కలిసిపోయినవి. అంతట ఔరంగజేబు కృష్ణానదికి దక్షిణమునగల దేశమును గూడ జయించి తన రాజ్యమున జేర్చెను. ఆయన సేనాధిపతియగు గయాజుద్దీను కర్నూలును పట్టుకొనెను. బళ్ళారి, కడప మండలముల నేలు నవాబు, చక్రవర్తికి లోబడెను. కర్ణాటక ప్రాంతమంతయు మొగలాయి సామ్రాజ్యమున గలిసెను. ఈ దక్షిణరాజ్యము నేలుటకు ఔరంగజేబు గయాజుద్దీను నే సుబేదారుగ నియమించెను. అప్పుడు దక్కను సుబేదారు క్రింద 22 పరగణాలుండెను. అందులో గోలకొండ ఒక రాష్ట్రము.

మొగలాయి సుబేదారుని ఫౌజుదారు లను సేనాధిపతులే వివిధ ప్రాంతములకు పరిపాలకులైరి. అయితే పూర్వము గోలకొండ సుల్తానుల క్రింద శిస్తులు వసూళ్ళు చేయుటకు గుత్తలు తీసికొనిన ప్రాతజమీందారులు శిస్తులియ్యక పేచీలు పెట్టుచున్నందున దేశములో కొన్ని చిల్లర యుద్ధములు చేయవలసి వచ్చుచుండెను.

ఔరంగజేబు చక్రవర్తి క్రీ. శ. 1707 లో చనిపోయెను. ఆయన కుమాళ్ళును మనుమలును అతని సింహాసనము నాక్రమించుటకు తగవులాడుకొన సాగిరి వివిధ ప్రాంతములనేలు సుబేదారులును, సేనాధిపతులును బలవంతులై స్వతంత్రులు కాజొచ్చిరి.

క్రీ. శ. 1713 లో చక్రవర్తియైన ఫరుక్ షయ్యారు, మీర్ కమరుద్దీను ఆసఫ్‌జా అను నొక మహమ్మదీయ ప్రభువునకు నిజాం ఉల్ ముల్కు అను బిరుదమునిచ్చి అతనిని దక్కను సుబేదారునిగ జేసెను. తరువాత నితడు మహమ్మదుషా చక్రవర్తి ఢిల్లీ దర్బారులో వజీరయ్యెను. కాని అక్కడి కుట్రలుచూచి క్రీ. శ. 1724 లో దక్షిణము

నకు మరలివచ్చి హైదరాబాదు సుబేదారీని స్వతంత్ర రాజ్యముగ పరిపాలింపసాగెను. ఇతడు మహారాష్ట్రులకు చౌతు, సర్దేశముఖి పన్నులు చెల్లించి వారి స్నేహముతో బలవంతుడయ్యెను. చక్రవర్తి ఇతనిని ఏమనలేకపోయెను. క్రి. శ. 1739 లో పారశీక దళవరియైన నాదిర్షా, ఢిల్లిని కొల్లగొనగా, చక్రవర్తి మరింత దుర్బలుడైపోయెను. నిజాము, పేరునకు చక్రవర్తియొక్క సుబేదారుడుగ నుండెనేకాని నిజమునకు స్వతంత్ర ప్రభు వయ్యెను.

గోలకొండ రాష్ట్రమున ఆర్కాటు, కర్నూలు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము నవాబులకు చెందిన నాలుగు రాజ్యభాగములుండెను. నిజాము రాజమహేంద్రవరము, శ్రీకాకుళము (చికాకోలు) పరగణాలకు అన్వరుద్దీను అను నతని నవాబుగ జేసెను. అతనిక్రింద రుస్తుంఖాను డను జిల్లాదారుడు క్రి. శ. 1732 మొదలు ఏడు సంవత్సరములు రాజమహేంద్రవరమును, దానికి దక్షిణమునగల నాలుగు జిల్లాలను నిరంకుశముగ పాలించెను. ప్రజలను పీడించియు, భూమి శిస్తులను, మోతర్ఫాను వసూలుచేసి సర్కారుకు క్రమముగా చెల్లించని జమీందారులను పట్టి వధించియు, వారి పుర్రెలను సున్నపు రాళ్ళ స్తంభములలో పొదిగియు అతడు లోక భీకరుడయ్యెను. ఇట్టి స్తంభములను "కుల్లామినారు" లనిరి. అట్టివాటిని ఏలూరులోను ఇతర ముఖ్య పట్టణము లందును అతడు కట్టించినాడు. అతనినిచూచి జమీందారులు గడగడలాడిరి.

నిజాముఉల్ ముల్కు ఆసఫ్‌జా క్రి. శ. 1748 జూను 1 వ తేదీన చనిపోయెను. అప్పు డతని పెద్దకుమారుడు ఢిల్లీలో నుండెను. రెండవకుమారు డయిన నాజరుజంగు తనను దక్కను సుబేదారునిగ ప్రకటించుకొని, పోటీగ నిలుచున్న మేనల్లుడు ముజఫరు జంగును ఆర్కాటులో ఖైదుచేసి యుంచెను. అంతట నిజాము సింహాసనమును గూర్చిన తగవులు బయలుదేరెను.

ఆ సమయమున ఈ దేశములో వర్తకము చేసికొనుటకు వచ్చిన పాశ్చాత్యులలో ఫ్రెంచి కంపెనీవారికి మచిలీబందరులో నొక వర్తకస్థాన ముండెను. ఇది పుదుచ్చేరిలోని ఫ్రెంచికంపెనీవారి గవర్నరుజనరలుకు లోబడిన వర్తకస్థానము. అప్పుడు ఫ్రెంచి గవర్నరు జనరలుగా నుండిన డూప్లె మిక్కిలి తెలివిగలవాడు. దక్షిణభారత దేశము నందలి రాజులు, నవాబులు, బందిపోటులతో పోరాడుకొనుచుండుటయు, వారి సైన్యములు సుశిక్షితములైనవి కాక అల్లరి మూకలుగనుండి సుశిక్షితము లయిన పాశ్చాత్య సైనికుల తుపాకి దెబ్బలకునిలువలేనివై యుండుటయు గ్రహించిన డూప్లేకు వీటి నుపయోగించు నవాబుల వలనను, రాజుల వలనను రాజ్యలాభమును పొందవచ్చు నని తోచెను. అతడు రాజ్యతంత్రము ప్రయోగించి చరిత్ర ప్రసిద్ధుడైనాడు.

దక్కను సుబేదారికొరకు ఆసఫ్‌జా రెండవ కుమారుడగు నాజరుజంగు, ఆసఫ్‌జా దౌహిత్రుడయిన ముజఫరు జంగు తగవు లాడసాగిరి. నాజరుజంగు ఇంగ్లీషువారి సహాయమును పొంది ముజఫరుజంగును కారాగారమున బంధించెను. నాజరుజంగు చంపబడెను. అంత ముజఫరు జంగు ఫ్రెంచివారి సాయముతో విముక్తిచెంది సుబేదారుడయ్యెను. తనను చెరలోనుంచిన నాజరుజంగును ప్రతిఘటించి తనకుచేసిన ఉపకారమునకు ప్రతిఫలముగా ముజఫరుజంగు ఫ్రెంచివారికి మచిలీపట్టణమును, దివి సీమలను అర్పించి, వారి నాణెములు తన రాజ్యమున చెలామణి యగునట్లు శాసించి, కృష్ణానదికి దక్షిణమునగల రాజ్యమునకు డూప్లెగారిని గవర్నరునుగా నియమించెను. ముజఫరుజంగు అనంతరము ఫ్రెంచివారి సహాయముతో నిజాముల్ ముల్కు మూడవకుమారు డయిన సలబత్ జంగు దక్కను సుబేదారు డయ్యెను. ఇతడును ఫ్రెంచి వారిపట్ల కృతజ్ఞుడై క్రి. శ. 1752 లో మచిలీపట్టణ సర్కారున కంటియున్న కొండవీడు రాష్ట్రమును వారి కిచ్చెను. ఇట్లు కృష్ణానదికి రెండువైపులగల దేశమును, మచిలీబందరు, నిజాము పట్టణము, మోటుపల్లి రేవులును ఫ్రెంచివారి వశముల యుండెను. నిజాము దర్బారులో ఆయన దివానుకు కల గౌరవముకన్న ఫ్రెంచి సేనాధిపతియైన బుస్సీ దొరగారికే హెచ్చు గౌరవము జరుగసాగెను. ఫ్రెంచివారి సైన్యములను పోషించుటకై సలబతుజంగు వారికి కొండపల్లి, ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము పరగణాలను ఇచ్చెను. ఇట్లు ఫ్రెంచివారికి సముద్రతీరమునగల 600 మైళ్ళ దేశమంతయు చేజిక్కెను. అప్పటికి భారతదేశమున వ్యాపారము చేయ వచ్చిన ఏ పాశ్చాత్యులకును ఇంతరాజ్యము లేకుండెను.

ఆనాటికి విశాఖపట్టణమండలములోని విజయనగరము వారి సంస్థానము మిక్కిలి గొప్పది. క్రీ. శ. 1710 మొదలు 1752 వరకు విజయనగర సంస్థానమును పరిపాలించిన పెదవిజయరామరాజుగారు తమ రాజధానిని పొట్నూరినుండి విజయనగరమునకు మార్చి, అచట ఒక కోటనుగట్టి చుట్టుప్రక్కలందు గల జమీందారులను లోబరచుకొని ఆ ప్రాంతములలో మిగుల బలవంతులుగ నుండిరి. విజయనగరము జమీందారికి ప్రక్కగా శ్రీకాకుళములోనున్న నిజాముఫౌజుదారు డీయన సహాయము నపేక్షించుచుండెను.

పైన పేర్కొనబడిన సందర్భములో విశాఖపట్టణము, గోదావరి మండలము మొదలుగాగల దేశభాగములను నిజాము ఫ్రెంచివారి కియ్యగా వారు వానిని స్వాధీన పరచుకొనుటలో నిజాముఫౌజుదారుడు ఆటంకములు కలిగించుట జూచి, బుస్సీదొర పెదవిజయరామరాజుగారికి ఆ రెండుజిల్లాలను చౌకబారు శిస్తుకు గుత్త కిచ్చెదనని చెప్పి ఆయనను తనవైపునకు త్రిప్పుకొనెను. అంతట అక్కడి జమీందారులను అణచుటకు బుస్సీ బయలుదేరి వచ్చెను. విజయరామరాజుగారు తమ విరోధులయిన బొబ్బిలి జమీందారీ నేలు వెలమ దొరలే అక్కడి జమీందారుల ధిక్కారమునకు కారణభూతు లని బుస్సీ గారికి చెప్పగా, అతడు బొబ్బిలిమీదికి క్రీ. శ. 1757 లో దండయాత్రచేసి కోటను నేలమట్టముచేసెను. బుస్సీ పాత జమీందారీలను రద్దుచేసినట్లు ప్రకటించియు, ఫ్రెంచివారికి లోబడిన వారికి సన్నదుల నిచ్చి దేశాదాయములో పది యవవంతు చెల్లించుపద్ధతితో వారికి మామూలుగా చెల్లు మర్యాదలను, రుసుములను ఉండనిచ్చెను. బొబ్బిలివారి వంశమున మిగిలిన చినరంగారావుగారిని మరల జమీందారునిగా బుస్సీగారు చేసిరి. బొబ్బిలి యుద్ధానంతరము పెదవిజయరామరాజుగారు వధింపబడిరి. వారి తరువాత ఆనందరాజుగారు జమీందారు లయి శ్రీకాకుళము మొదలు రాజమహేంద్రమువరకు ప్రభువు లయిరి.

క్రీ. శ. 1758 లో ఫ్రెంచి గవర్నరు జనరలయిన కవుంటులాలీగారు బుస్సీగా రీ ప్రాంతములం దుండుట వలన ప్రయోజనములను గుర్తింపలేక, కర్ణాటకములో తమకున్న ఫ్రెంచిస్థావరములకు కలుగుచున్న అలజడిని తప్పించి వాటిని స్థిరీకరించు నిమిత్తమై ఆయనను దక్షిణ ప్రాంతమునకు బదలాయించెను. దీనితో ఇంతవరకు మంచి అదనుకొరకు వేచియున్న ఇంగ్లీషు వర్తకకంపెనీ వారికి పిలుచి క్కెను. ఆనందరాజుగారే వారి సాహాయ్య మర్థించిరి. అంత ఇంగ్లీషువారు ఉత్తర సర్కారులలోనికి చొచ్చుకొనివచ్చి, మచిలీపట్టణమును పట్టుకొనిరి. అంత ఎనిమిది సంవత్సరములు కష్టపడి బుస్సీ నిర్మించిన ఫ్రెంచి రాజ్యము విచ్ఛిన్న మయ్యెను.

బుస్సీ ఈ ప్రాంతములందు శిస్తు నిర్ణయముచేసి, ప్రభుత్వ పద్ధతులు చక్కగా జరుగునట్లు కట్టుబాటులు చేసెను. అతనికాలమున శ్రీకాకుళము, రాజమహేంద్రవరము పరగణాలలో శిస్తులు రెట్టింపునకు పెరిగెను. జమీందారీలు దేశములో శాంతిని, భద్రతను కాపాడుటకు బాధ్యతవహించవలసి వచ్చెను. సాలునకు మూడు పంటలు ప్రభుత్వమునకును, రైతులకును మధ్య పంపిణీ చేయుటకును, మరాటీదండు మొదలయిన శత్రువుల వలని భయములేకుండ కాపాడుటకును, జమీందారులు పంద్రెండు వేల కాల్బలమును సిద్ధముగా నుంచుటకును, బుస్సీ కట్టుబాట్లు చేసెను. బుస్సీ తన అధికార గౌరవము నిలువబెట్టుకొనుటకొరకును, తన సౌఖ్యముకొరకును, కావలసిన సొమ్ముకన్న హెచ్చుసొమ్మును తనక్రింద వినియోగించుకొనలేదు. దేశములో అక్రమములు చేయు వారికి బుస్సీ పేరు సింహస్వప్నముగా నుండెను.

ప్రభుత్వమువారి ఆజ్ఞా ప్రకారము బుస్సీ తన ఫ్రెంచి సైన్యమును తీసికొని తరలిపోగా, నిజాము సలబతుజంగు దిక్కులేని వా డయ్యెను. ఈ యదనును గ్రహించి సలబతుజంగు తమ్ముడు నిజామలీఖాను రాజపదవిపై కన్నువైచి తత్సంపాదనాప్రయత్నములు చేయసాగెను. అందుచే జయములమీద జయములను పొందుచు, ఫ్రెంచి వారికి నిలువ నీడలేకుండ చేయుచున్న ఇంగ్లీషువారిని సలబతుజంగు ఆశ్రయించి క్రీ. శ. 1759 లో వారితో ఒక సంధిచేసికొనెను. ఆ సంధిప్రకారము నిజాము సలబతుజంగు మచిలీపట్టణముక్రింద నుండిన 80 మైళ్ళ సముద్రపు భూభాగమెల్ల ఇంగ్లీషువారికి స్వాధీనము చేసెను. మిగిలినదేశము పేరునకు నిజాముక్రిందనున్నను, ఇంగ్లీషువారి పలుకుబడియే అక్కడ చెల్లుచుండెను. ఐతే

నిజామలీఖాను ఇంగ్లీషు కంపెనీవారి సహాయముతో క్రి. శ. 1761 లో నిజాము సలబతుజంగును రాజ్య భ్రష్టుని చేసెను.

క్రీ. శ. 1761 లో అసఫ్‌జా నాల్గవ కుమారుడు నిజామలీఖాను దక్కనుకు సుబేదారుడై నిజాము విరుదు వహించెను. ఇంగ్లీషు కంపెనీవారు తనకు సైనిక సహాయముచేయు పద్ధతిపై ఇతడు 1762 లో శ్రీకాకుళము, రాజమహేంద్రవరము, ఏలూరు, కొండపల్లి అను నాలుగు సర్కారులను వారికిచ్చెను. ఈరాజ్యమును వారు స్వయముగా పరిపాలించుటకు జంకి, తాము కోరినప్పుడు తమకు స్వాధీనపరచు పద్ధతిపై ఆ ప్రాంతమును నిజాము సరదారుడైన హుస్సేనల్లీ క్రిందనే యుంచిరి. ఫ్రెంచివారెవ్వరును ఈ దేశములోనికి రాకుండ చేయుటయే ఇంగ్లీషువారు అప్పుడు తలపెట్టిన ముఖ్య కార్యము.

బంగాళమున ప్లాసీయుద్ధములో విజయము పొందిన పిమ్మట క్లైవు బలవంతుడై ఢిల్లీ చక్రవర్తితో రాయబారములు జరుపగా ఇంగ్లీషు కంపెనీవారిని ఢిల్లీ చక్రవర్తి బంగాళము, బీహారు, ఒరిస్సా పరగణాలకు క్రీ.శ. 1765లో దివానులుగ జేసెను. ఆ సందర్భమున క్లైవు, చక్రవర్తి వలన ఉత్తర సర్కారులకు కూడ ఒక సన్నదు సంపాదించెను. అతడు ఈ సంగతిని మచిలీబందరులో ప్రకటించి ఫ్రెంచివారీప్రాంతములకు రాకుండ చేసెను. అయితే ఈప్రాంతములన్నింటికిని నిజముగా పరిపాలకుడు దక్కను సుబేదారుడైన హైదరాబాదు నిజామే. అందుచేత అతనితో ఇంగ్లీషు కంపెనీవారు క్రీ. శ. 1766 లోను 1768 లోను సంధి రాయబారములు జరిపి, ఆయనకు సైనికసహాయము చేయుపద్ధతితో, ఉత్తర సర్కారులకు ధ్రువమైన కౌలు పొందిరి. కాని వానిని వెంటనే తాము స్వాధీనపరచుకొనక, తమకు ఎప్పుడుకావలసిన అప్పుడు వశపరచుకొను పద్ధతిపై హుస్సేనల్లీ అను నిజాము సర్దారు క్రిందనే ఉంచిరిగదా! ఆ ఏర్పాటు 1769తో అంతమయ్యెను. అంతట కంపెనీవారు ఉత్తర సర్కారులను స్వయముగా పరిపాలింపసాగిరి. అంతవరకును గుంటూరు మండలము మాత్రము నిజామల్లీఖాను సోదరుడైన బసాలతుజంగు క్రింద నుండెను. దానిని కూడ కంపెనీవారు క్రీ. శ. 1778 లో ఆయనవలన కౌలుకు తీసికొనుటతో ఈ జిల్లాలన్నియు వారి వశమయ్యెను. అంతట ఈ ప్రాంతము చెన్నపట్టణ రాజధానిలోని భాగముగా పరిపాలింపబడసాగెను.

**ఇంగ్లీషువారి పరిపాలన:** ఉత్తరసర్కారులు ఇంగ్లీషువారి వశమగునప్పటికి గ్రామపరిపాలనము, గ్రామపంచాయతుల ద్వారమున జరుగుచుండెను. గ్రామమునసబు, కరణము, మణేదారు, తలారి మొదలగు అధికారులును, గ్రామమునకు కావలసిన పనులు చేయు వృత్తులవారును, ఆయకాండ్రనబడిరి. భూమిపంటలో వీరికి స్వల్పభాగము లొసగబడుచుండెను. పంటలో సర్కారుకు చెల్లవలసిన భాగమే ఇస్తు. అప్పుడప్పుడు జమీందారుల సిబ్బందులు ఇంకను సొమ్ముకావలెనని ప్రజలను బాధించుచుండెను.

జమీందారీ ప్రాంతమందలి భూమియంతయు జమీందారుల క్రింద నుండెడిది కాదు. ప్రతి జిల్లాయొక్క ముఖ్యపట్టణము చుట్టుపట్లనుండు భూములును సర్కారు భూములుగ నుండెను. వాటిని హవేలీ భూము లనిరి. వాటిమీదవచ్చు ఆదాయము మహమ్మదీయ సైనిక వ్యయముక్రిందను, ఉద్యోగుల జీతబత్తెముల క్రిందను వినియోగింప బడుచుండెను.

మహమ్మదీయుల కాలమున ఉత్తర సర్కారులలో నాలుగు న్యాయస్థానము లుండెను. ఏలూరులోను, రాజమహేంద్రవరములోను "ఖాజీలు" క్రిమినలు నేర విచారణలు చేయుచుండిరి. పెద్ద కేసులను విచారించుటకును, మరణదండన విధించుటకును, ఫౌజుదారులు అమలుదారులుమాత్రమే అధికారము కలిగియుండిరి.

ఈ దేశము తమ వశము కాగానే ఇంగ్లీషు కంపెనీవారు తమ ఏజంటులద్వారమునను, దుబాషులద్వారమునను, పరిపాలన జరుపసాగిరి. వీరిపైన రాష్ట్రీయకవున్సిల్లు అను కార్యాలోచనా సంఘములును, వానికి ఛీఫు అను ముఖ్యాధ్యక్షులును ఉండిరి. వీరిపైన మద్రాసులోని గవర్నరుండెను. క్రీ. శ. 1784 లో మద్రాసు గవర్నరును కలకత్తాలోని గవర్నరు జనరలు అధికారమునకు లోబరచిరి. 1786 లో చెన్నపట్టణమున నొక రివిన్యూ బోర్డు నేర్పాటుచేసిరి. 1794 లో అదివరకు అమలు జరుగుచున్న పరిపాలనా పద్ధతిని మార్చి ప్రతి జిల్లాకును కలెక్టర్ల నేర్పాటుదేసిరి. నేరములను విచారించుటకు మేజ

స్ట్రేటులును, సివిలు తగాదాలను తీర్మానించుటకు మునసబులును, సదరమీనులును, వారిపైన అదాలతు న్యాయస్థానములును ఏర్పాటు చేయబడెను. ఇవన్నియు కంపెనీవారి కోర్టులు. చెన్నపట్టణములో, ఇంగ్లాండుదేశ రాజ్యాధికారము క్రింద పరమోన్నత న్యాయస్థానము 1800 లో నెలకొల్పబడినది. క్రీ. శ. 1823లో కంపెనీవారు ఉత్తర సర్కారులపైన నిజామునకు ప్రతి ఏట చెల్లించు పేష్కషుకు బదులుగా రు. 11,66,666 రూపాయలు ఒకే మొత్తముగా చెల్లించి సర్వాధికారులయిరి. అప్పటినుండి 1859 సం. వరకును ఈ ప్రాంతము విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, మచిలీపట్టణము, గుంటూరు, నెల్లూరు అను అయిదు జిల్లాలుగా విభజింపబడి చెన్నపట్టణ రాజధానిలో చేరియుండెను.

జమీందారీలు : ఉత్తర సర్కారులు ఇంగ్లీషు కంపెనీవారి వశము లగునాటికి గంజాముజిల్లాలోని పర్లాకిమిడియు, విశాఖపట్టణములోని విజయనగరము, జయపురము, బొబ్బిలి జమీందారీలును, గోదావరిజిల్లాలోని పెద్దాపురము, మొగలితుర్రు, పిఠాపురము, నూటాల, పోలవరము, కోటరామచంద్రపురము మొదలయిన జమీందారీలును, కృష్ణాజిల్లాలోని నూజవీడు జమీందారీలును ముఖ్యమైనవిగనుండెను. నెల్లూరుజిల్లాలోని వేంకటగిరి, చిత్తూరుజిల్లాలోని కాళహస్తి, ఉత్తరార్కాటులోని కార్వేటినగరము జమీందారీలుకూడ తెలుగు జమీందారీలే.

ఉత్తర సర్కారులలోని జమీందారులు మట్టికోటలను గట్టుకొని రాజబిరుదములను వహించి, రాజలాంఛనములతో రాజభోగముల ననుభవించుచు, రైతులను పీడించి పుచ్చుకొనుచున్న సొమ్మును దుర్వినియోగముచేసి, తాము సర్కారుకు ఇవ్వవలసిన శిస్తులు బకాయిపెట్టి, పేచీలు పెట్టుచు అక్రమములు చేయుచుండిరి. పూర్వపు మహమ్మదీయ నవాబుల అధికార పురుషులు హెచ్చుసొమ్ము నొసగుడని జమీందారులను బాధించుచుండిరి. దేశము తమ స్వాధీనమైన పిమ్మట, ఇంగ్లీషుకంపెనీవారు జమీందారులు తమకు చెల్లింపవలసిన శిస్తు మొత్తములను నిర్ణయించి, వానిని కఠినముగా వసూలుచేయుచుండిరి. కొన్ని జమీందారీలవలన మొత్తము ఆదాయములో మూడింట రెండువంతులుకూడ వసూలు చేయసాగిరి. క్రీ. శ. 1786 లో అతివృష్టివలన పంటలు పాడుకాగా జమీందారులు సర్కారు శిస్తులు చెల్లించలేక బాకీలుపడిరి. కొందరు మెల్లగా బాకీలను పరిష్కరించిరి. కొందరు పరిష్కరింపలేక పేచీలుపెట్టిరి. ఆ సందర్భములో కంపెనీవారు కొన్ని జమీందారీలను వశము చేసికొనిరి.

కంపెనీవారు క్రీ. శ. 1802 లో జమీందారీ గ్రామములలోని రైతులవలన జమీందారులు వసూలుచేయతగిన శిస్తులను, జమీందారులు కంపెనీవారికి చెల్లించవలసిన పేష్కషును, శాశ్వతముగా నిర్ణయముచేసిరి. దీనికే పర్మనెంటు సెటిల్మెంటు అనిపేరు. ఈ ప్రకారము శాశ్వతముగా ఫైసలాచేసి జమీందారులకు సన్నదు లిచ్చిరి. జమీందారులు తరువాత అనేక ఉపాయముల నవలంబించి రైతులవలన వసూలుచేయు శిస్తులను హెచ్చించిరి. క్రొత్తరుసుము లనేకములు వసూలు చేయసాగిరి. అందువలన తగు కట్టుబాటులు చేయుచు ఇంగ్లీషు ప్రభుత్వమువారు జమీందారీల చట్టమును చేయవలసి వచ్చెను.

తెలుగుదేశములోని జమీందారీలలో నెల్ల గొప్పది విజయనగరము. ఇందు మూడువేల ఎకరములభూమియు, 1252 గ్రామములును ఉండెను. ఈ జమీందారీ నిజమునకొక సంస్థానమువలె నుండెను. దీని విషయమునగూడ కంపెనీవారు క్రీ. శ. 1802 లో శాశ్వతమైన ఫైసలా జరిపి సన్నదు నిచ్చిరి. తరువాత ఇంగ్లీషుప్రభుత్వమువారు క్రీ. శ. 1862 లో జమీందారుగారికి 'రాజా' అను బిరుదమును, 13 ఫిరంగులు కాల్చు గౌరవము నిచ్చిరి.

మొగలితుర్రు జమీందారీ అప్పులలోపడి శిస్తులు చెల్లించలేకపోగా కంపెనీవారు వాటిని రద్దుచేసిరి. పెద్దాపురము జమీందారీకూడ చాల గొప్పదేకాని అదికూడ ఋణగ్రస్తమై శిస్తులు చెల్లించలేక విచ్ఛిన్నమైనది. పిఠాపురము మాత్రము అభివృద్ధిచెందినది. కృష్ణామండలమున నూజవీడు జమీందారీ 1802 లో రెండుభాగము లయినది. తరువాత వ్యాజ్యములు రాగా నూజవీడు సగభాగము 1879 లో మరల ఆరుభాగము లయినది. వేంకటగిరి జమీందారులు హైదరాలీని ప్రతిఘటించి కంపెనీవారికి సహాయు లయినందువలన వారికి నమ్మినబంటు లయిరి.

ఈ జమీందారులలో కొందరు రైతులను బాధించి సొమ్మును పిండి దుర్వినియోగముచేసిరి. కొందరు పాఠశాలలు మొదలగు ప్రజోపయుక్త సంస్థలను నిర్మించి ప్రఖ్యాతిగాంచిరి. విద్యాభివృద్ధికి విజయనగర మహారాజుగారయిన ఆనందగజపతిగారు చేసిన దాన ధర్మములు మన జిల్లాలలోనేగాక చెన్నపట్టణమునగూడ నేటికి నిలిచియున్నవి.

**రాయలసీమ :** రాయలసీమలోని వివిధ మండలములు గోలకొండ సుల్తాను దండయాత్రల అనంతరము మహమ్మదీయ నవాబులకును, తరువాత మొగలు చక్రవర్తికిని లోబడెను. దేశమున రాజులు మారినను ఆయా ప్రాంతములలోని చిన్నప్రభువులు, నాయకులు, పాలెగార్లు మారలేదు. గ్రామపరిపాలనము పంచ్రెండు ఆయకాండ్ర ద్వారమునను, పంచాయతుల ద్వారమునను ఎప్పటివలెనే జరుగుచుండెను. ఔరంగజేబు చనిపోయినపిదప వచ్చిన కల్లోలములలో మహారాష్ట్రుల దండయాత్రలవలన ఈ ప్రాంతములు బాధల ననుభవించెను. అటుపిమ్మట క్రీ. శ. 1766 లో మైసూరు రాజ్యమునకు పరిపాలకుడైన హైదరాలీ క్రీ. శ. 1780 లో కడప నవాబును ఖైదుచేసి బళ్ళారి ప్రాంతముల నాక్రమించెను. హైదరాలీ అనంతరము టిప్పుసుల్తాను నిజాముతోను, కంపెనీవారితోను క్రీ. శ. 1792 లో చేసికొనిన సంధివలన కడపలోని కొంత భాగమును, బళ్ళారిలోని కొంత భాగమును నిజాముకిచ్చెను. ఈ రెండు మండలములలోని మిగిలిన భాగము, టిప్పుసుల్తాను క్రీ. శ. 1799 లో మరణింపగా, నిజాముపశమయ్యెను. అనంతపుర మండలమును పాలించుచుండిన హండేరాజులను హైదరాలీ అణచివేసి దేశాక్రమణము చేయగా, ఇదియు తక్కిన మండలములవలెనే, టిప్పుకాలమున క్రీ. శ. 1792 లో కొంత భాగము, 1799 లో తక్కిన భాగము నిజాము వశమయ్యెను. ఈ మండలముల నన్నిటిని నిజాము తాను కంపెనీవారికి సైనికవ్యయముక్రింద ఇయ్యవలసిన సొమ్ముక్రింద, క్రీ. శ. 1800 సంవత్సరమున ఇచ్చివేసెను. అందువలన వీనిని దత్తమండలము లనిరి. తరువాత సర్ బిరుదమునందిన థామస్ మన్రోగారు ఈమండలములకు కలెక్టరై, ప్రజానురంజకుడై పరిపాలించెను. 1808 లో బళ్ళారిని కడప, బళ్ళారి జిల్లాలుగా జేసిరి. 1882 లో అనంతపుర మండలములో కొంతభాగమును బళ్ళారిలోచేర్చి, మిగత భాగమును అనంతపుర మండలముగ జేసిరి.

కర్నూలుజిల్లా మొగలాయి సేనాధిపతికి జాగీరుగా నొసగబడెను. అది అప్పటినుండి మహమ్మదీయ నవాబు పరిపాలన క్రింద నుండెను. క్రీ. శ. 1755 లో కర్నూలు నవాబు హైదరాలీకి లోబడి కప్పముగట్టుట కంగీకరించెను. 1799 లో టిప్పుసుల్తాను అనంతరము కప్పముగొను నధికారము నిజామున కొసగబడెను. 1823 లో కర్నూలు నవాబైన గులాంరసూలుఖాను తమపట్ల రాజద్రోహ మొనరించె నని కంపెనీవారు 1839 లో అతనిని ఖైదు చేసిరి. కర్నూలు బ్రిటిషు జిల్లాగా మారెను. చెంగల్పట్టు జిల్లా 1687 లో తక్కిన కర్ణాటక ప్రాంతముతోపాటు మొగలుసామ్రాజ్యమున భాగమై ఆర్కాటు రాజధానిగాగల కర్ణాటక నవాబుచే పరిపాలింపబడసాగెను. కర్ణాటక నవాబు ఇంగ్లీషు వారికి స్నేహితుడై అప్పులపాలైతుద కీజిల్లాను కంపెనీవారికి 1763 లో జాగీరుగానిచ్చెను. దీనిని కంపెనీవారు పరిపాలింపసాగిరి. నెల్లూరు కర్ణాటక నవాబు తమ్మునిక్రింద నుండెను. అతడు మొదట ఫ్రెంచివారితో చేరినను తరువాత 1759లో ఇంగ్లీషువారితో కలిసెను. 1781 లో ఈ మండలముపైన శిస్తువసూలు చేయు హక్కు నవాబు కంపెనీ కిచ్చెను. 1801 లో తక్కిన కర్ణాటకముతోపాటుగా దీనినికూడ నవాబు కంపెనీవారి కిచ్చివేసెను. ఇప్పుడు కోయంబత్తూరు అని వ్యవహరింపబడు ప్రాంతమును పూర్వము బారామహాలు అనిరి. అది హైదరాలీ వశము అయ్యెను. తరువాత టిప్పుసుల్తాను ఇంగ్లీషువారితో 1793 లో చేసికొనిన సంధి షరతు ప్రకారము దానిని వారి కిచ్చెను.

**హైదరాబాదు నిజాముర్యాజము :-** హైదరాబాదు నవాబు నిజామల్లీఖాను 1803 లో చనిపోగా ఆయన కుమారుడు సికిందరుజాహ నిజామయ్యెను. దక్కను సుబేదారుడుగా ఢిల్లీ చక్రవర్తి అంగీకారమునుపొందు నాటకము యథాప్రకారము జరుపబడెను. నిజాము, మునీరు ఉల్ ముల్కును ప్రధానమంత్రిగా చేసినను దివాను పేష్కారగు చందులాలుగారే అన్ని వ్యవహారములు జరిగింపసాగిరి. ఆయన ఇంగ్లీషువారికి అను

కూలుదు. నిజాము సైన్యము ఇంగ్లీషు ఉద్యోగుల సహాయముతో సంస్కరింపబడెను. సికిందరుజాహ పరిపాలన కడపటి భాగమున పాడయ్యెను. రాజ్యములో వివిధ ప్రాంతములందు శిస్తు వసూలు హక్కులు గుత్తకియ్యబడి ఆగుత్తేదారులు కావించు ప్రజాపీడనము మితిమీరెను. ప్రభుత్వము ఋణగ్రస్తమయ్యెను. ఇంగ్లీషు వారికి బాకీపడెను. దేశములో కల్లోలము కలిగెను. దారి దోపిడిదొంగలు విజృంభించిరి. ఇంగ్లీషు సైన్యముకే కల్లోలము నడచవలసి వచ్చెను. అంతట నిజాము సర్కారువారి కోరికపై జిల్లాలను వేరువేరుగా పరిపాలించుటకు ఇంగ్లీషు కలెక్టర్లు నియమింపబడిరి. ఈ సమయముననే కంపెనీవారు నిజాముకు 11,66,666 రూపాయలిచ్చి ఉత్తర సర్కారులకు సర్వాధికారులైరి.

సికిందరుజాహ 1829 లో చనిపోయెను. నాజరుద్దౌలా నిజామయ్యెను. అతడు ఇంగ్లీషు కలెక్టర్లను తీసివేయమని కోరెను. మరల దుష్పరిపాలనము, ప్రజాపీడనము ప్రారంభమయ్యెను. అశాంతి హెచ్చెను. దౌర్జన్యములు చెలరేగెను. చందులాలు 1843 లో తన పదవికి రాజీనామా నిచ్చెను. నిజాము నియమించిన మంత్రులు అసమర్థులైరి. నిజాము సైనిక వ్యయముక్రింద చాలాసొమ్ము బాకీపడి 1853 లో హైదరాబాదులోని రాయచూరు మొదలయిన కొన్ని జిల్లాలను కంపెనీవారి వశము చేసెను.

ఆకాలమున నిజాము కొలువులోనుండిన అరబ్బులు రోహిలాలు ఆయుధజీవులై కంటబడినవారిపై నెల్ల దౌర్జన్యములు చేయుచుండిరి. వారు చేయు నేరములను వారినాయకులే విచారించవలెనుగాని సామాన్యన్యాయస్థానములు విచారింప వీలులేదు. అందువలన వారుచేయు అక్రమములకు మితిలేకుండెను.

నాజరుద్దౌలా క్రీ. శ. 1857 లో చనిపోగా అఫ్జుల్ ఉద్దౌలా (క్రీ. శ. 1857-69) నిజామయ్యెను. పూర్వపు మంత్రియైన సురాజ్ ఉల్ ముల్కుకు దగ్గరబంధువుడైన సాలారుజంగు ప్రధానమంత్రి యయ్యెను. ఇతడు చాల తెలివైనవాడు. దేశవ్యవహారములను చాల సమర్థతతో నిర్వహించుటయేగాక ఇంగ్లీషుప్రభుత్వము వారికి నమ్మిన బంటుగానుండి పేరుపొందినాడు.

**ఆంధ్రదేశ ఆర్థిక పరిస్థితులు :** భారతదేశమునకు ఇంగ్లీషువారు వర్తకము చేసికొనుటకు వచ్చునప్పటికి ఈ దేశములో చాల సున్నితములైన రవసెల్లాలు, జిలుగు వలువలు తయారగుచుండెను. మన పనివాండ్రు చాల నాజూకయిన వస్తువులను తయారుచేయుచుండిరి. పాశ్చాత్యుల కీ వస్తువులన్న చాల ప్రీతి. అందువలన వారు కోట్లకొలది విలువగల బంగారుతెచ్చి మనదేశములోని వస్తువులు కొని ఎగుమతి చేయసాగిరి. ఆ కాలమున మన దేశములోని సన్ననినూలురవసెల్లాలు జగత్ప్రసిద్ధములైయుండెను. తెలంగాణమునందలి నాందేడులోను, తూర్పు కోస్తాయందలి పొందూరు మొదలగు ప్రాంతములలోను అట్టి సన్ననిబట్టయే తయారగుచుండెను. నిజాము రాజ్యములోని వరంగల్లు, నారాయణపేట మొదలగుచోట్ల టస్సరు పట్టుబట్టలును, హైదరాబాదు, గద్వాలలో నూలు, పట్టు కలిపిన మష్రూ అను అపూర్వపు నేతబట్టలును తయారగుచుండెను. తెలంగాణమున చాలచోట్లకరిగించిన ఇనుముతోను, ఉక్కుతోను అనేకవస్తువులుచేయుచుండిరి. నిర్మల, హైదరాబాదు, గద్వాల, వనపర్తి మున్నగు చోట్ల కత్తులును, తుపాకులును చేయుచుండిరి. మచిలీబందరులో కాలికో అను బట్టలను, తూర్పుకోస్తాలో రకరకముల నూలుబట్టలను తయారుచేసి ఎగుమతి చేయుచుండిరి. ఔరంగాబాదు, వరంగల్లులలో జంపకానాలు, ఉన్ని, పట్టు తివాచీలు నేయుచుండిరి. ఇంగ్లీషువారు మన నవాబులను, రాజులను ఆశ్రయించి కొంత పలుకుబడిని సంపాదించుకొని మన పారిశ్రామికులు తమకు చౌకగా సరకుల నమ్మునట్లు నిర్బంధించుచుండిరి. ఇట్టి స్థితిలో, ఇంగ్లీషువారికి మన దేశములో రాజ్యాధికారము కలుగు సమయమునకు వారిదేశములో యంత్ర పరిశ్రమ స్థాపింపబడి, యంత్రములపైని సరకులు తయారుచేయబడుచుండెను. అంతట మనదేశమునుండి అనేక విధములుగా తీసికొనివెళ్ళిన సొమ్ముతో యంత్ర పరిశ్రమల నభివృద్ధిచేసికొని మనదేశములోని సరకులకు పోటీగా యంత్రములమీద తయారయిన సరకులను చౌకగా అమ్మి మన పరిశ్రమలను నాశనముచేసిరి. క్రీ. శ. 1825 నాటికి మనదేశములో రవసెల్లాలను ఎగుమతిచేయు వ్యాపారము పూర్తిగా ఆగిపోయినది.

మధ్యభారతములో పొలిటికల్ ఏజంటుగా నుండిన కెప్టెన్ విల్కిన్‌సన్‌గారు క్రీ. శ. 1833 లో హైదరాబాదు రెసిడెంటుగారికి వ్రాయుచు "నేతగాండ్రు బిచ్చగాండ్ర స్థితికి దిగిపోయినారు. మనము యంత్రములమీద తయారుచేసిన నూలుబట్టలను ఈ దేశములోనికి తెచ్చి ముంచెత్తివైచినందువలన ఈ నేతగాండ్రనోటి అన్నము మనము పడగొట్టినాము" అనినాడు. (Hyderabad Residency Records, Vol. 394, page 73)

ఇట్లు అనేకవిధము లయిన వస్తువులను యంత్రముల పయిన చౌకగా తయారుచేసి మన పరిశ్రమలను నాశనము చేసిరిగాని ఉత్తర భారతమునను, తెలంగాణములోను "బిద్రీ" అను పంచలోహముల పళ్ళెములు,గిన్నెలు మొదలయినవానికి అతి సున్నితములయిన నగిషీలుచెక్కి, వెండిపూత పూసి తయారుచేయు చేతిపనిని ఇంగ్లీషువారు అనుకరింప లేకపోయినందున ఇప్పటికిని అది మిగిలి యున్నది.

రాకపోకలు రవాణాలు : ఆకాలమున సూరతునుండి గోలకొండకును, అక్కడినుండి మచిలీపట్టణమునకును, చెన్నపట్టణమునకును, గండికోటకును వర్తకులు సరకులను తీసికొనిపోవుచుండిరి. ఆ కాలమున దేశములో అన్ని ముఖ్యపట్టణములకు రాకపోకలకు మార్గము లుండెను. కాని కంకరరోడ్లు లేవు. మనుష్యులు పల్లకీలలోను, గుఱ్ఱములపైనను ప్రయాణము చేయుచుండిరి. సరకులను బండ్లపైనగాక, రెండుప్రక్కలకు దిగు కంట్లములు అను సంచుల జతలను మోయు వేలకొలది ఎడ్లపైనను, కంచరగాడిదలపైనను బిడారులుగా తీసికొనిపోవుచుండిరి. ఆ కాలమున దేశమునందు శాంతిభద్రతలులేవు. దారిలో బందిపోటుదొంగలు దోచుకొనుచుండిరి. మార్గస్థులను మోసగించి గొంతుకలకు ఉరిపోసి చంపు థగ్గులువిచ్చలవిడిగా తిరుగుచుండిరి. అందువలన వర్తకులును ప్రయాణికులును ఆయుధపాణుల సహాయముతో పోవుచుండిరి.

ఈ పరిస్థితులలో పిండారీదండులు బయలుదేరి గ్రామములను కొల్లగొని, ఇండ్లను తగులబెట్టి, స్త్రీలను చెరచి ప్రజలను బాధింపసాగిరి. వీరిలో మరాఠీదండులలోనివారే గాక మొగలుల కాలములో సైనికులుగా నుండి పనిలేక తిరుగుచు దోపిడి రుచిమరగిన మహమ్మదీయులును ఉండిరి. వీరితో స్త్రీలు కూడ బయలుదేరి క్రూరకృత్యములు చేయుచుండిరి. క్రీ. శ. 1814 నాటికి పిండారీల సైన్యమున 21,000 గుఱ్ఱపుదళము, 15,000 కాల్బలము ఉండెను. పిండారీలు తెలంగాణమును, రాయలసీమను, ఉత్తరసర్కారులను దోచుకొనసాగిరి. కంపెనీవారు తమరాజ్యమున వీరి ఆగడము లెక్కుడయినందున పరిపైన యుద్ధముచేసి చెదరగొట్టిరి. క్రీ. శ. 1831-36 మధ్య కంపెనీవారు థగ్గులను పట్టుకొని ఉరితీయించిరి.

విద్యాభివృద్ధి : ఇంగ్లీషువారీ దేశమున తమంతట తాము ఇంగ్లీషు విద్య ప్రవేశపెట్టలేదు. ప్రజలలో విద్యాభివృద్ధి గావింపలేదు. కంపెనీవారు మొదట సంస్కృతము, అరబ్బీ, పారశీ మొదలయిన భాషలలో పూర్వపు విద్యావిధానమునే పోషించిరి. దేశీయులు కొందరు తమంతట తాము ఇంగ్లీషు నభ్యసించి, వారి కొలువులోచేరి ఇంగ్లీషు విద్య ప్రవేశపెట్టుడని కోరసాగిరి. ఇంగ్లీషు దొరలకు దేశభాషలు నేర్పుట అవసరమైనందున చెన్నపట్టణమున కోటలో క్రీ. శ. 1812 లో "కాలేజి" యను పాఠశాలను కంపెనీవారు దొరలకొరకు స్థాపించిరి. అందులో తెలుగు నేర్చిన దొరలు కొందరు తెలుగు వ్యాకరణములను ఇంగ్లీషులో రచించిరి. నిఘంటువులను ప్రకటించిరి. వారిలో క్యాంబెల్, విలియం బ్రౌను, సి. పి. బ్రౌను గార్లు ప్రముఖులు.

చెన్నపట్టణమున ఆంధ్ర ప్రముఖు లయిన ఏనుగుల వీరాస్వామయ్య, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళె, వెంబాకం రాఘవాచార్యులు మొదలయినవారు కలిసి "హిందూ లిటరరీ సొసైటీ"ని స్థాపించిరి. కంపెనీ పరిపాలనను గూర్చి అందులో ప్రజలు తమకష్టము లెవరికి చెప్పుకొనవలెనో తెలుపగల రాజకీయ పరిజ్ఞానమును ప్రజలకు కలిగింపదలచి చెన్నపట్టణము సుప్రీముకోర్టులో అడ్వకేటు జనరలయిన జార్జినార్టన్‌గారిచే క్రీ. శ. 1832-33 మధ్య ఉపన్యాసము లిప్పించిరి. ఆ కాలమునవచ్చిన కరవులో వీరు చెన్నపట్టణమున బీదవారికి గంజి పోయుటకు ఏర్పాటులుచేసి ప్రజాసేవ చేసిరి. పచ్చయ్యప్ప మొదలియారుగారి దానధర్మములను బయలువరచి, హిందూశాలుర విద్యాభివృద్ధికి వాటిని వినియోగించునట్లు సుప్రీముకోర్టువారి ఉత్తరువు పొందిరి.

ఈ పరిస్థితులలో తర్జనభర్జనలు జరిగినపిమ్మట ఇంగ్లీషు వారు తమకు ఇంగ్లీషునేర్చిన గుమాస్తాలు కావలసి యున్నందున ఎట్టకేలకు ఈ దేశమున ఇంగ్లీషుభాషను, విజ్ఞానమును బోధించు విద్యావిధానము స్థాపించుటకు క్రీ. శ. 1835 లో నిశ్చయించిరి. 1840 లో చెన్నపట్టణమున స్థాపింపబడిన ప్రభుత్వ పాఠశాలలో ఇంగ్లీషు, అరవము, తెలుగు బోధించుట కేర్పాటుచేయబడెను. క్రీ. శ. 1842 లో పచ్చయప్ప పాఠశాల స్థాపింపబడి అట్టి ఏర్పాటులే చేయబడెను.

క్రైస్తవమత ప్రచారము: ఇంగ్లీషు కంపెనీవారిదేశములోనికి చాలకాలముపరకు క్రైస్తవ మతబోధకులను రానియ్యలేదు. హిందువుల మతాచారములపట్ల కంపెనీవారు సానుభూతితో ప్రవర్తించుచు హిందువుల దేవాలయములను కొన్నిటిని తామే నిర్వహించుచుండిరి. ఇంగ్లీషు కలెక్టరులే దేవాలయములలోని అర్చకులను నియమించి నిత్యధూపదీప నైవేద్యముల కేర్పాటులు చేయుచు, దగ్గరనుండి ఉత్సవములు జరిపించుచుండిరి. దేవాదాయముల పరిపాలననుగూర్చి క్రీ. శ. 1817 లో ఒకచట్టముకూడ చేయబడెను.

ఇట్టిస్థితిలో 1813 తరువాత క్రైస్తవ మత బోధకులీ దేశమునకు వచ్చి విద్యాబోధనముద్వారమున క్రైస్తవ మతప్రచారము చేయసాగిరి. పాఠశాలలందలి పిల్లల మనస్సులు విరిచి వారిలో విపరీతభావములు కలిగింపసాగిరి. హిందూదేవాలయములను క్రైస్తవ పరిపాలకులు నిర్వహించుట బాగుగలేదని ఆందోళనముచేసి దానిని మాన్పించిరి. తిరుపతి మొదలగు దేవస్థానములు మహంతున కప్పగించి కంపెనీవారు తొలగిరి. క్రైస్తవ మతప్రచారకులకు కంపెనీ పరిపాలనమున పలుకుబడి హెచ్చెను. ఉద్యోగుల సహాయముతో వారు దేశీయులను క్రైస్తవమతమున గలువుకొన ప్రయత్నించిరి. ప్రభుత్వ పాఠశాలలందు బైబిలు బోధించునట్లు చేయుటకై ప్రయత్నించిరి. కాని అదిజరుగలేదు. అయినను, బైబిలునుగూర్చి ప్రశ్నలువేసి జవాబులు చెప్పలేనివారిని పరీక్షలలో తప్పించసాగిరి. తప్పినవారికి ఉద్యోగము లొసగరయిరి. కనుక బైబిలు నేర్చుకొనుట తప్పనిసరి యయ్యెను. క్రైస్తవమతమున గలిసినవారికి కుటుంబముయొక్క ఆస్తిలో హక్కులు పోకుండ శాసనము చేయించిరి. అంతట కొంతమంది విద్యార్థులు క్రైస్తవమతమును కలియగా చెన్నపట్టణమున ప్రజలలో కల్లోలము కలిగెను. ఆకాలమున చెన్నపట్టణమున తెలుగువర్తకులలో ప్రముఖులయిన గాజుల లక్ష్మీనర్సుసెట్టిగారీ అన్యాయములను జూచి వీని నరికట్టుటకు క్రీ. శ. 1844 లో "చెన్నపట్టణ స్వదేశసంఘము"అను ప్రజాసంఘమునుస్థాపించి,క్రెసెంటు అను పత్రికను స్థాపించి, దాని కొక ఇంగ్లీషు దొరను సంపాదకునిగా నేర్పరచిరి. క్రైస్తవ మతబోధకులును, కంపెనీ ఉద్యోగులును కలిసి చేయుచున్న అక్రమములను గూర్చి విమర్శించి అసమ్మతి తీర్మానములను గావించి గొప్ప ఆందోళన జరిగించిరి.

ప్రజల కష్టములు : ఆ కాలమున దేశీయులకు పెద్ద ఉద్యోగము లియ్యకుండిరి. దొరలకు దేశభాషలురావు. అధికారులు లంచగొండులయియుండిరి. న్యాయ విచారణలో సామాన్యులకు న్యాయము జరుగకుండెను. పోలీసులు అసమర్థులుగనుండి నేరములు చేయువారిని కనిపెట్టలేక నిరపరాధులను బాధించుచుండిరి. వ్యవసాయమునకు నీటిసౌకర్యములు లేవు. కాలువలు, చెరువులు మరమ్మతులు లేక పాడగుచుండెను. పన్నులు అత్యధికముగా నుండినవి. వానిని వసూలుచేయుటలో కంపెనీ అధికారులు రైతులను చిత్రహింసలకు గురిచేయుచుండిరి. దీనిని గూర్చి లక్ష్మీనర్సుగారు తమపత్రికలో విమర్శించి, చెన్నపట్టణ స్వదేశ ప్రజాసంఘములో తీర్మానములుగావించి, పై అధికారుల కంపి, సీమలోకూడ ప్రచారము చేయసాగిరి. తెలంగాణములోని పరిస్థితులు కూడ ఇట్లేయుండెను. అక్కడ శిస్తు వసూలుచేయుటకు ఇజారాలు పొందిన గుత్తెదారులును, సర్కారు నౌకరులును శిస్తులను వసూలుచేయుటలో ప్రజలను చిత్రహింసలపాలు చేయుచుండిరని క్రీ. శ. 1829 లో హైదరాబాదు రెసిడెంటుగా నున్న సర్ చార్లెసు మెట్కాఫుగారు వ్రాసినారు. ఆ రాజ్యమున నవాబుగారు మొదలుకొని చిన్న యుద్యోగివరకు కలవారికి నజరానాలిచ్చి ప్రజలు తమ పనులు చేయించుకొనవలసి యుండెను. పోలీసులు అప్రయోజకులై యుండ శాంతిభద్రతలకు భంగము వాటిల్లెను. హైదరాబాదులోను, గ్రామములలోను దొంగలు

బహిరంగముగా దోపిళ్ళు చేయుచుండిరి. నిజాము రాజ్యములో పిల్లలను పెద్దలను బానిసలుగా విక్రయించుచుండిరి.

గాజుల లక్ష్మీనర్సుసెట్టిగారు చేసిన తీవ్రమైన ఆందోళనము ఫలితముగా 1852 లో డేన్బిసేమరు అను నొక పార్లమెంటు సభ్యు డీ దేశమునకు వచ్చి శిస్తులవసూళ్ళలో జరుగు చిత్రహింసలను జూచి వర్ణించినాడు. అంతట మద్రాసులో హింసల విచారణ సంఘము నియమింపబడెను. ఆ సంఘమువారు బయల్పరచిన అన్యాయముల ఫలితముగా ఇకముందు ఇట్టి అకృత్యములు జరుగరాదని ప్రభుత్వము వారు క్రీ. శ. 1854 లో ప్రకటించుట తటస్థించెను.

కంపెనీ పరిపాలనమున ప్రజలకుగల కష్టములనుగూర్చి దేశప్రజ లెంత మొరపెట్టుకొనినను లాభములేకపోవుచుండెను. అప్పటి కేదో విచారణచేసి తరువాత ఏమియు చర్య జరుపక ఉపేక్షించుచుండిరి. కంపెనీ ప్రభుత్వ విధానము మారినగాని ఈ అన్యాయములు తొలగవని ప్రజలు గ్రహించిరి.

**సిపాయీల పితూరీ అను విప్లవము :** కంపెనీవారికి రాజ్యాధికారపు పట్టాను మరల నొసగవలదని దేశములో అన్ని ప్రాంతములనున్న ప్రజాసంఘములును ఇంగ్లీషు పార్లమెంటువారికి మహజరు లంపుకొన్నను ప్రజల మొరలను పార్లమెంటువారు పెడచెవిని బెట్టిరి. 1853 లో మరల కంపెనీవారికి ప్రభుత్వాధికారము లభించెను. అంతట ఈ దేశమునందు దుష్పరిపాలనమును ప్రజాపీడనమును పెచ్చుపెరిగినవి. దేశములోని రాజులను, నవాబులను కంపెనీ వా రేదో సాకుతో పదభ్రష్టులుగ జేసి రాజ్యములను కలుపుకొనసాగిరి. దేశములోని ప్రజలు తమకష్టములను చెప్పుకొనినను ఆలన పాలనలు చేయువారు లేరైరి. ప్రజలబాధలు దుర్భరము లయ్యెను. క్రీ. శ. 1857 లో ఇంగ్లీషు కంపెనీ కొలువులోనుండిన సిపాయిలు ముందుగా తిరుగుబాటు చేసిరి. అంతట దేశములోని ప్రజలు ఇంగ్లీషు పరిపాలనను ధిక్కరించి దౌర్జన్యములు జరిపిరి. ఇంగ్లీషువారు చాలమంది వధింపబడిరి. విప్లవకారులు ఇంగ్లీషువారి కోటలను స్వాధీనము చేసికొనిరి. దీనికి ఇంగ్లీషువారు సిపాయిల పితూరీ అని పేరు పెట్టియున్నను ఇది నిజముగా నొక ప్రజావిప్లవమే. ఇంగ్లీషువా రెట్లో ఈ గండము గడచి బయటపడిరి.

హైదరాబాదులో మతావేశపరులయిన మహమ్మదీయులు కొందరును, షోరాపూరు అను బీదరు సంస్థానమునేలు వేంకటప్పనాయకుడును ఈ సందర్భమున తిరుగుబాటు చేసిరి గాని లాభము లేకపోయెను. నిజాము ప్రభుత్వ మంత్రియైన సాలారుజంగు ఇంగ్లీషువారికి సహాయుడై దేశములో శాంతిని కాపాడెను. క్రీ. శ. 1846-1855 మధ్య గోదావరీ కృష్ణానదులకు ఆనకట్టలు నిర్మింపబడినందున ఈ మండలములు సుభిక్షముగా నుండి ఇందలి ప్రజలు ఇంగ్లీషుకంపెనీవారిపట్ల కృతజ్ఞులై యుండిరి. తెలుగు జిల్లాలనుండి కంపెనీ సైన్యములో చేరిన తెలుగు సిపాయిల దళములను "తెలింగా రెజిమెంటు" అనిరి.

1857 లో సిపాయిల తిరుగుబాటులో తెలుగు సిపాయీలు చేరక పోవుటయే గాక ఆ విపత్సమయమున ఇంగ్లీషువారికి గొప్ప అండగా నుండి వారి పక్షమున శత్రు సైన్యములతో యుద్ధముచేసి జయము చేకూర్చిరి. విప్లవము అణచు సందర్భములోనే గాక తరువాత కూడ ఇంగ్లీషువారు అనుమానమున్నవారి నందరిని విచక్షణ లేకుండ కాల్చివేయసాగిరి. ఆ సందర్భమున నెంతో రక్తపాతము జరిగెను. విప్లవానంతరము కంపెనీ పరిపాలన రద్దుచేయబడి క్రీ. శ. 1858 నవంబరు 1 వ తేదీన ఇంగ్లండు రాణియైన విక్టోరియా భారతదేశచక్రవర్తినిగా ప్రకటింపబడెను. ఇంగ్లాండుపార్లమెంటువారి మంత్రిక్రింద భారతదేశమున గవర్నరు జనరలు పరిపాలన జరుగసాగెను.

ఆ సమయమున ఇంగ్లీషు దొరతనమును సుస్థిరముగా చేయుటకు అవసరమైన శాసనములు కట్టుబాటులు అనేకములు చేయబడినవి. ఇంగ్లీషువారు భారతదేశ ప్రభుత్వము నొక ఇనుప యంత్రముగాచేసి కఠినములైన పద్ధతులతో పరిపాలన చేయసాగిరి. ఇంగ్లీషువారు విప్లవానంతరము చేయుచుండిన కఠినచర్యలను జూచి ప్రజలు భయపడిపోయిరి. ప్రజలు తమ కష్టములనుగూర్చి చెప్పుకొనుటకయిన సాహసింపలేకుండిరి. ఆకాలమున కలకత్తాలో 'హిందూపేట్రియటు' పత్రికాసంపాదకుడైన హరిశ్చంద్ర ముఖర్జీగారు మాత్రము ప్రజల కష్టసుఖములను గూర్చి

ధైర్యముగా విమర్శించుచుండిరి. ఆయన 1869 లో చని పోగా కృష్ణదాస్ పాల్ గారు సంపాదకులై పత్రిక నెప్పటి వలెనే ధైర్యముతో నడపసాగిరి.

**జాతీయ చైతన్యము :** క్రీ. శ. 1875 నాటికి భారత దేశమున అన్నిప్రాంతములలోను కొంత జాతీయచైత న్యము కలుగసాగెను. తెలుగుదేశమున కెల్ల ముఖ్య నగ రము చెన్నపట్టణము. అక్కడ విశ్వవిద్యాలయము ఉన్నత న్యాయస్థానము ఉన్నందున ఆంగ్లవిద్యాధికులు కొందరు దేశప్రజల స్థితిగతులనుగూర్చి చర్చించుటకు ఆరంభించిరి. వారిలో ప్రముఖులు సర్ టి. మాధవరావు, దివాన్ బహద్దరు ఆర్. రఘునాథరావుగార్లు. అప్పుడక్కడనున్న తెలుగువారిలో ప్రముఖులయిన పనప్పాకం అనంతా చార్యులు, సి. రంగయ్యనాయుడు, తల్లాప్రగడ సుబ్బా రావు, న్యాపతి సుబ్బారావు మొదలయినవారు దేశాభి వృద్ధికొరకు పాటుపడుచుండిరి. దేశప్రజల అభిప్రాయ ములను ప్రకటించుటకు మాధవరావుగారు స్థాపించిన 'నేటివ్ పబ్లిక్ ఒపీనియన్' అను పత్రిక కొలదికాలము లోనే అంతరించెను. అంతట పైనచెప్పబడినవారు ఆలో చించి జి. సుబ్రహ్మణ్య అయ్యరు మొదలయిన వారి తోడ్పాటుతో క్రీ. శ. 1878 లో హిందూపత్రిక నొకవార పత్రికగా స్థాపించి దేశీయులలో రాజకీయ పరిజ్ఞానమును విజ్ఞానాభివృద్ధిని కలిగించు వ్యాసములను అందుప్రకటింప సాగిరి. వీరి కృషివలన చెన్నపట్టణములో మద్రాసుమహా జనసభ యను ప్రజాసంఘముకూడ స్థాపింపబడెను.

ఆకాలమున పాశ్చాత్యులు కొందరు సంస్కృతభాష నభ్యసించి భారతీయ మతధర్మములనుగూర్చి పరిశోధనలు జరిపి, భారతీయ నాగరకతవయిన చాలగౌరవముకలిగి, మనదేశీయులలో దేశాభిమానము కలిగింపగల వ్యాసము లను, గ్రంథములను వ్రాసిరి. ప్రపంచములోని మతధర్మ ముల నన్నింటిని పరిశోధించి అందలి ప్రాశస్త్యమును ప్రచారముచేయుటకు క్రీ. శ. 1875 లో దివ్యజ్ఞాన సమా జమును అమెరికాలో స్థాపించిరి. ఆ సమాజమువారు భారతదేశ మతధర్మములపై అభిమానము కలిగి ఈ దేశములోని విద్వాంసులతోను వేదాంతులతోను ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి ఇక్కడికివచ్చి దేశములో పర్యట నము చేసి ఉపన్యాసము లొసగిరి. మనదేశములోనిప్రము ఖులు పెక్కుమంది ఆ సమాజమున జేరి, దేశాభిమానులై దేశోద్ధరణకు పాటుపడసాగిరి.

దివ్యజ్ఞాన సమాజ స్థాపకుల గౌరవమునకు పాత్రు లయిన వారిలో ఆ కాలమున మద్రాసులో న్యాయ వాదిగానుండి గొప్ప బ్రహ్మజ్ఞాని యని పేరుపొందిన తల్లాప్రగడ సుబ్బారావుగా రొకరు. వీరి ప్రోత్సాహము ననే ఆ సమాజ కార్యాలయము క్రీ. శ. 1882 లో అడ యారులో నెలకొల్పబడినది. ఆ సమాజ సభ్యులలో కొందరు వీరి శిష్యులయిరి. అందులో భారతదేశోద్ధరణ కొరకు పాటుపడిన ఎ. పి. సిన్నెటు, ఎ. ఓ. హ్యూము అను దొరలుకూడ ఉండిరని సమాజ గ్రంథములందు వివ రింపబడియున్నది. ఈ హ్యూముగారు భారతదేశములోని వివిధప్రాంతములందలి ప్రముఖుల నందరిని ఏకోన్ముఖు లను గావించి 1885 డిశంబరులో బొంబాయిలో కాంగ్రెసు మహాసభా సమావేశము నేర్పాటుచేసి కాంగ్రెసు స్థాపకు లలో నొకరయిరి. శ్రీ పనప్పాకం అనంతాచార్యులు గారు, తల్లాప్రగడ సుబ్బారావుగారు మొదలయిన ఆంధ్ర ప్రముఖులు కేవలము రాజకీయ వ్యవహారములందే నిమ గ్నులు గాక ప్రజల విజ్ఞానాభివృద్ధికొరకుకూడ పాటు పడిరి. వీరి కృషివలననే సంస్కృత రామాయణము శ్రీ చదలవాడ సుందరరామశాస్త్రిగారి తెలుగు తాత్పర్య ముతో చక్కని సంపుటములుగా ప్రకటింపబడెను. ఇంక ఎన్నో సంస్కృతాంధ్ర గ్రంథములు ప్రకటింపబడినవి.

ఆ కాలమున మద్రాసు రాజధాని కళాశాలలో తెలుగుపండితులుగ నుండిన చిన్నయసూరిగారును, బహు జనపల్లి సీతారామాచార్యులుగారును, కొక్కొండ వేంకటరత్నం పంతులుగారును, కందుకూరి వీరేశలింగం పంతులుగారును, తుని సంస్థాన విద్వాంసులుగానుండిన పరవస్తు రంగాచార్యులుగారును, తెలుగుభాషలో అనేక ఉద్గ్రంథములు రచించిరి. ఆంగ్లభాషా సారస్వతముల ప్రభావమువలన తెలుగులో క్రొత్తరచనలు బయలుదేరి నవి. వచన రచన అభివృద్ధి చెందినది. జీవిత చరిత్రలు దేశచరిత్రలు, పాశ్చాత్య ప్రకృతి విజ్ఞానశాస్త్రములు, వ్యాసములు, ప్రహసనములు, కథలు, నవలలు బయలు దేరినవి. వీరేశలింగంగారి రాజశేఖరచరిత్ర క్రీ.శ. 1878 లో ప్రకటింపబడినది. అంతకుముందు కొక్కొండ వేంకట

రత్నం పంతులుగారును, నరహరిసెట్టి గోపాలకృష్ణమ సెట్టిగారును నవలలను వ్రాసిరి. ఐనను వీరేశలింగముగారి నవలయే ఇంగ్లీషు నవలలతో సరిపోల్చ తగినదయినది.

ఆ కాలమున సంఘమునగల కొన్ని దురాచారములను రూపుమాపుటకు వీరేశలింగముగారు ప్రయత్నించిరి. అతి బాల్య వివాహములను, భోగము మేళములను, వరకట్నములను అరికట్టుటకు వారు ప్రయత్నించిరి. వితంతు స్త్రీలకు పునర్వివాహములు చేయుట శాస్త్ర సిద్ధమని నిరూపించి ఆ సంస్కారమును చేయ బ్రయత్నించిరి. ఎంతచేసినను దేశము గాఢనిద్రనుండి మేల్కొన లేదని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు తమ స్వీయ చరిత్రలో వ్రాసినారు. క్రీ. శ. 1894 డిసెంబరు నెలలో మద్రాసులో జరిగిన కాంగ్రెసు మహాసభకు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు వెళ్ళిరి. 1895 లో కాకినాడలో మొదటి గోదావరీమండల సభ జరిగినది. దానికి న్యాపతి సుబ్బారావుగా రధ్యక్షులైరి. లక్ష్మీనరసింహముగారానాటి రాజకీయ పరిస్థితులను ప్రజల స్థితిని వర్ణించుచు పదునాల్గు పద్యములు రచించి చదివిరి. సభాసదులు పరవశులైరి. ఆ పద్యములందు ఇంగ్లీషు దొరతనములోని శాంతి భద్రతలు, క్రమపరిపాలనము, రాకపోకల సౌకర్యములు మొదలగు లాభములు కొన్ని ప్రజలకు కలిగినవని వివరింపబడినవి. పన్నులు అత్యధికముగనుండి రైతులు బాధపడుచున్నారని, అధికారులు లంచగొండులైయున్నారని, మునసబు కరణములు బంట్రోతులు కూడ రైతులను పీడించుచుండిరని, అప్పులలో మునిగి సాహుకారులకు హెచ్చు వడ్డీల నిచ్చుకొనవలసివచ్చి బాధపడుచున్నారని, వారికిని, వారి పశువులకును తినుటకు గడ్డియే మిగులుచున్నదని ఆ పద్యములందు చెప్పిరి. పాలింపబడు వారికిని పాలించు దొరలకును మధ్య కాంగ్రెసు ఒక సంధి సూత్రముగను ప్రభువుల లోపములను జూపు నొక నిలువుటద్దముగ ఉన్నదనియు వారుగ్గడించిరి. (చూడు. స్వీయ చరిత్ర, పుటలు 115-121)

ది. వేం. శి.

**ఆంధ్రదేశ చరిత్రము V (క్రీ. శ. 1900 నుండి నేటివరకు) :-** క్రీ. శ. 1900 సంవత్సరము నాటికి ఆసేతు హిమాచలపర్యంతముగల భరతఖండము నందలి భూభాగమెల్ల బ్రిటిషు సామ్రాజ్యములో చేరి, హెచ్చుభాగము ఇంగ్లీషువారిచేత స్వయముగాను, మరికొంత భాగము వారికి లోబడిన సంస్థానాధీశులచేతను పాలింపబడుచుండెను. ఇంగ్లీషురాణియగు విక్టోరియా మహారాజ్ఞి పేరున పార్లమెంటువా రంపిన రాజప్రతినిధి యగు గవర్నరు జనరలు క్రింద వివిధరాష్ట్రములందలి గవర్నరులు, కేంద్ర రాష్ట్రియప్రభుత్వ కార్యాలయ కార్యదర్శులును, వారిక్రింద వివిధ జిల్లాలలోని కలెక్టరులు, ఇతర ఆంగ్లేయోద్యోగులు కలసి క్రమముతప్పని ఒక మహాయంత్రము వలె పరిపాలించుచుండిరి. సంస్థానాధీశులు రాజప్రతినిధి మాటను జవదాటక వారిక్రింది యధికారులగు రెసిడెంట్ల కనుసన్నల మెలగుచుండిరి.

పూర్వ మొకప్పుడు ఆంధ్ర చక్రవర్తులచే పరిపాలింపబడి ఆంధ్రమహా సామ్రాజ్యములో చేరిన భూభాగములలో కొన్ని ఇంగ్లీషువారి దొరతనము రాకమునుపే మొగలాయి సామ్రాజ్యమున కలుపుకొనబడి వారిక్రింద దక్కను సుబేదారుగ నుండిన హైదరాబాదు నిజాము క్రిందను, కొన్ని భాగములు కర్నాటక నవాబురాజ్యము లోను, కొన్ని భాగములు మైసూరు రాజ్యములోను, మరి కొన్ని భాగములు ఓఢ్రరాజులైన గజపతుల రాజ్యములోను కలుపుకొనబడెను. అందుచే తెలుగు ప్రజల యావాసములు కొన్ని తెలంగాణములోను, కొన్ని రాయలసీమలోను, కొన్ని ఉత్తరసర్కారులందును, కొన్ని బస్తరు మొదలైన మన్యప్రదేశములలోను చెల్లాచెదరై యుండెను. అంతియేగాక ఒకప్పుడు ఆసేతు వింధ్యాచలమును గల దక్షిణాపథమునందు వ్యాపించి, అక్కడక్కడ నెలకొన్న తెలుగుప్రజలు అరవదేశము మధ్య మధుర, తంజావూరు, సేలము, కోయంబత్తూరు జిల్లాలలోను, కన్నడ దేశము మధ్య బెంగుళూరు, కోలారు జిల్లాలలోను, మహారాష్ట్ర దేశమధ్యముననను, ఉత్కళ రాష్ట్ర మధ్యముననను, మారుమూల ప్రదేశములలోను చిక్కుకొని పోయిరి. ఆంధ్రులు తమ రాజ్యమును, అధికారమును పలుకుబడిని కోల్పోయి విజాతీయరాజులకును, నవాబులకును, తుదకు ఫ్రెంచి ఇంగ్లీషు వర్తక కంపెనీ ప్రభుత్వముల వారికిని లోబడి తమ స్వాతంత్ర్యమును ఆత్మగౌరవమును కోల్పోయి ఎక్కడివారక్కడ లేవలేక

పడియుండిరి. ఒకప్పుడు దక్షిణాపథమునందు విజ్ఞాన వికాసములకు, సంస్కృతికి మేలుబంతిగనుండి ఆంధ్రత్వము, ఆంధ్ర భాషాభ్యాసము తపఃఫలమునగాని లభింపవనిపించు కొన్న మనతెలుగుదనము, తెలుగుభాష దుస్థితిలో పడినవి.

1900 సంవత్సరమునాటికి తెలుగువారి ప్రధాన ఆవాసములు హైదరాబాదు నైజాము పరిపాలనములో చేరిన తెలంగాణపు జిల్లాలలోను, మదరాసు రాజధాని నేలు గవర్నరు పరిపాలనములో చేరిన రాయలసీమ, ఉత్తర సర్కారు జిల్లాలలోను ఇమిడియుండి ఆయా జిల్లా కలెక్టరుల పాలనముక్రింద నుండెను. మద్రాసు రాజధాని లోని భాగములన్నియు పైనుండి దొరతనము వారు జారీచేయు ఉత్తరువుల ప్రకారము ఆయా జిల్లా అధికారులచే పరిపాలింబడు చుండెనేకాని ఆయా ప్రాంతముల ప్రజల కందు పలుకుబడిలేదు. గవర్నరుల చెప్పు చేతలలో నుండువారిని కొందరిని శాసనసభలందు నియమించుచు ప్రభుత్వము వారు వారిని కీలుబొమ్మలవలె చూచుచుండిరి. జిల్లాలలోని రహదారులు, ప్రాథమికవిద్య, ఆరోగ్యము, మొదలైన వానికి సంబంధించిన వ్యవహారములను చక్కబెట్టుటకు కలెక్టరులు నియమించిన సభ్యులు గల జిల్లాబోర్డు సంఘములను, పట్టణమందలి పారిశుద్ధ్యము ఆరోగ్యము, ప్రాథమిక విద్య మొదలైన పనులు చక్కబెట్టుటకు కూడ కలెక్టరులు నియామకముచేయు పురపాలక సంఘములను ప్రభుత్వమువారు ఏర్పాటు చేసిరి. వానికి నిజమైన అధికారము లెవ్వియులేవు. అన్ని పనులను సర్కారు ఉద్యోగులే నిర్వహించుచుండిరి.

ఇంగ్లీషువా రేపని చేసినను తమ క్షేమ లాభములను, గౌరవమును ఆలోచించుకొనియే చేయుచుండిరి. వారి యధికారము క్రింద సంస్థానములను పరిపాలించు దేశీయ రాజులను, నవాబులను కనిపెట్టి యుండుటకై రెసిడెంట్లను నియమించిరి. తమ దొరతనమును బలపరచుకొనుటకై సైన్యములను దేశములో నలుమూలలను గల కంటోన్మెంటులను దండు ప్రదేశములలో నెలకొల్పి యుంచిరి. తమ సైన్యముల రాకపోకల కొరకును, తమ సరకుల రాకపోకల కొరకును, అవసరములైన రహదారులను నిర్మించిరి. బందిపోటులు మొదలైనవి లేకుండ చేయుటకును, దేశములో కల్లోలముగాని అశాంతిగాని ప్రబలకుండ నుండుటకును పోలీసుబలమును చేర్చియుంచిరి. తమ తాబేదారులైన జిల్లా కలెక్టరులకే నేరమునుమోపు నధికారమును, వాటిని విచారించు నధికారమును ఇచ్చిరి. ఈ దేశమున ఇంగ్లీషు విద్యా విధానము నెలకొల్పు విషయములో కూడ వారవలంబించిన పద్ధతి చిత్రమైనది. మొదట వా రింగ్లీషు విద్యను ప్రోత్సహించలేదు. మొదట 1812లో తెల్ల దొరలకై మద్రాసు సెంటు జార్జికోటలో నొక కాలేజీని స్థాపించి, అందులో అరవము, తెలుగు పండితులను నియమించిరి. వారు రచించిన గ్రంథములు కొన్ని ఇప్పటికిని గలవు. తరువాత తమకు కావలసినట్లు ప్రభుభక్తిగల గుమాస్తాలను, చిన్న ఉద్యోగులను తయారు చేయుటకు గావలసిన ఇంగ్లీషు విద్యను బోధించుటకు 1835 లో నిశ్చయించిరి. అందుకు కావలసిన పాఠశాలలు కళాశాలలు జిల్లా ముఖ్య పట్టణములలో స్థాపించిరి. విద్యార్థులను పరీక్షచేయుటకు విశ్వవిద్యాలయములను 1857 లో రాజధానీ నగరములందు స్థాపించిరి. ఇట్లే దేశములో శాంతి భద్రతలను క్రమ పద్ధతిని నెలకొల్పుటకు న్యాయస్థానములను నెలకొల్పి వివిధ రాజధానీ నగరములందు ఉన్నత న్యాయస్థానములను స్థాపించిరి. మన దేశములో క్రైస్తవమత ప్రచారమునకై వచ్చిన మిషనరీలు విద్యాబోధనము చేసియు, వైద్యశాలలను స్థాపించియు ప్రజల నాకర్షించి తమ మతమున కలుపుకొన బ్రయత్నించుచుండిరి.

దేశములో రైలుమార్గములను, తంతి తపాలా మార్గములను వేయుటలోకూడ ఆంగ్లేయ ప్రభువులు తమ సైన్యముల కొరకును, తమ వ్యాపారమునకును అవసరము లయినవానిని మాత్రము నిర్మించిరిగాని, దేశీయ ప్రజల యావశ్యకములను గమనింపలేదు. ఆంగ్లేయ ప్రభుత్వము వచ్చిన తరువాత పూర్వమువలె అరాజకము లేకుండ, రాచబాటలలో దోపిడిల్లులేకుండ శాంతిభద్రతలు కలిగినమాట నిజము ; ఈ ప్రభుత్వమున తెల్లవారికిని, దేశీయులకును వివాదములు జరిగినప్పుడుతప్ప న్యాయ పరిపాలనము చక్కగా జరిపినమాట నిజము ; గోదావరీ, కృష్ణానదులకు 1846-55ల మధ్య ఆనకట్టలు నిర్మించియు, మరికొన్నిచోట్ల నీటివసతులను కల్పించియు, పల్లపుసాగు వ్యవసాయము నభివృద్ధిచేసినమాట నిజము. కాని వా రవ

లంబించిన అత్యధికమయిన పన్నులను విధించు పద్ధతివలన రైతులకు చాల బాధ కలుగుచుండెను. యంత్రపరిశ్రమల నభివృద్ధి చేయనందున దేశప్రజలు ఆర్థికముగా వెనుకపడి ఇంగ్లీషువర్తకుల పోటీకి నిలువలేకుండిరి. దేశము దారిద్ర్యమున మునిగియుండెను. ఇంగ్లీషువారు తమపట్ల భక్తివిశ్వాసములుగల వ్యక్తులను తయారుచేయుటకు వారికి కొన్ని బిరుదముల నిచ్చియు, నిజమైన అధికారము లేని కొన్ని ప్రజాప్రతినిధి సంఘములందు వారిని సభ్యులుగ నియమించియు, భారతీయ ప్రభుభక్తుల వర్గమును నిర్మించుటకును ప్రయత్నించుచుండిరి. ఇంగ్లీషురాణి జన్మదిన సందర్భముననను, ప్రతి సంవత్సరాది (జనవరి 1 వ తేదీ) నాడును బిరుదుల పట్టికలు ప్రచురించి తాము బిరుదు లిచ్చినవారిని దర్బారులకు రావించి గౌరవించుచుండిరి. రాణీగారి జన్మదినోత్సవ దర్బారులు మొదలైన సభలేగాక, ఆంగ్ల రాజభక్తి యుపన్యాసము లిచ్చుటకు వీలయిన సందర్భము లనేకములు కల్పింపబడుచుండెను. క్రొత్త పాఠశాలలు, కళాశాలలు, వైద్యశాలలు, జిల్లా బోర్డులు మొదలయిన వాటి స్థాపనోత్సవములు, వాటి వార్షికోత్సవములు, ఉద్యాన కృషి సంఘముల వార్షికోత్సవములు, రెడ్‌క్రాస్ వార్షికోత్సవములు, బాలభట సంఘసభలు మొదలయిన సభలయందే ప్రభుభక్తి ప్రదర్శనము జరుపబడుచుండెను. వాని ఆహ్వాన సంఘముల కార్యదర్శుల ఉపన్యాసములు, ఆ సభ కధ్యక్షత వహించు గవర్నరులు, ప్రభుత్వకార్యదర్శులు, కలెక్టరులు మొదలయినవారి ఉపన్యాసములు, ఆ సభలందు ప్రదర్శింపబడు ఇంగ్లీషు పతాకములు, ఇంగ్లీషు అలంకరణములు, ఆ సభలకు వచ్చు వారి వేషభాషలు ఆంగ్లేయ దొరతనముయొక్క గొప్పతనమును ప్రదర్శించి రాజభక్తిని ప్రోత్సహించుచుండెను. 1897 వ సంవత్సరము నాటికి బ్రిటిష్ సామ్రాజ్యము నేలు ఇంగ్లీషు రాణియైన విక్టోరియా సింహాసన మధిష్ఠించి అరువది సంవత్సరములు నిండినవి. అంతట భారతదేశమునగల ఇంగ్లీషు ఉద్యోగులు, ప్రభుభక్తి పరాయణులు దేశమంతట వజ్రోత్సవ సభల నేర్పాటు గావించిరి. అందు ఒకరినిమించి యొకరు విక్టోరియారాణియొక్క గుణగణములను, ఆంగ్లేయ దొరతనమువలన భారతదేశమునకు గలిగిన లాభములను వివరించుచు ఉపన్యాసము లిచ్చి, పద్యములు, పాటలు వ్రాసి చదివిరి. రాజభక్తిని బోధించు నాటకములు ప్రదర్శింపబడెను. హరికథలు, సంగీత సాహిత్యసభలు ఏర్పాటు గావింపబడెను. ఆంధ్రదేశములోని ప్రముఖులగు కవులు, పండితులు ఈ ప్రదర్శనములందు పాల్గొని తమ శక్తి వంచన లేకుండ రాజభక్తిని ప్రదర్శించిరి.

తా నొకటి తలచిన దైవ మొకటి తలచును. ఆంగ్లేయులీ దేశమున నిర్మించిన ప్రభుత్వ యంత్రమునందలి కట్టుదిట్టములు, నిబంధనవులు, వీరు స్థాపించిన ప్రభుత్వ సంస్థలును భారతీయ ప్రజల కొక విధమయిన శిక్షణము నిచ్చినవి. ఆంగ్లేయ పరిపాలనా విధానములందు దేశీయులు శిక్షణముపొంది, ఆరితేరి రాజకీయ పరిజ్ఞానమును సంపాదింపసాగిరి. ఇంగ్లీషువారి విద్యా విధానము నందు స్వాతంత్ర్య భావములతో నిండిన ఇంగ్లీషు సాహిత్యగ్రంథములను చదువుటవలన భారతీయులలో స్వరాజ్యవాంఛ కలిగెను. చదువుకొన్నవారి మూలమున ఈ స్వాతంత్ర్య భావములు జనసామాన్యమునందు వ్యాపింపసాగెను.

ఆంగ్లేయ పరిపాలనమున ఆంధ్రులు మద్రాసు రాజధానిలో చేరియుండిరి. చెన్నపట్టణ స్థాపనమునందు దాని అభివృద్ధియందు తెలుగువారు భాగస్వాములుగ నుండిరి. చదువుకొరకు, న్యాయ విచారణములకొరకు, ప్రభుత్వ వ్యవహారములకొరకు, తెలుగుజిల్లాలలోని వారు తరచుగా రాజధానీ ముఖ్యపట్టణమైన చెన్నపట్టణమునకు పోవుచుండిరి. మొదట విశాఖపట్టణము, కాకినాడ, బందరు రేవులనుండి పొగయోడలలోను, బెజవాడనుండి బకింగ్‌హామ్‌కాలువద్వారా పడవలలోను, చెన్నపట్టణమునకు పోవలసి వచ్చుచుండెను. కొన్ని సంవత్సరముల తరువాత రైలుమీద పోవ వీలయ్యెను. 1900 సంవత్సరమున గోదావరిపయిన రైలువంతెన తయారుకాగా ఆ అక్టోబరు నుండి నరాసరి రైలునడువసాగెను. తెలుగు జిల్లాలలోని నలుప్రక్కలకు రాకపోకలు సులభములై ఆంధ్రులు సంఘీభావముతో తమ అభివృద్ధికొరకు కృషిచేయ వీలయ్యెను. చెన్నపట్టణమునకు ప్రయాణ సౌకర్యము లభివృద్ధి చెందుటతో తెలుగువారి జనసంఖ్య అచట ఇంకను హెచ్చు అయ్యెను. రైలుమార్గములు ఏర్పాటగుటవలన భారతదేశమునందు ఆంధ్రులకన్న ఎక్కువరాజకీయ పరిజ్ఞానము,

సాహిత్యాభివృద్ధిగాంచిన వంగ రాష్ట్రీయులతోను, మహా రాష్ట్ర ప్రజలతోను, ఇతర భారతీయులతోను కలసి పర స్పర క్షేమలాభములనుగూర్చి యోచించుటకువీలయ్యెను. 1885 లో స్థాపించబడిన కాంగ్రెసు మహాసభకు శాఖ లుగా తెలుగుదేశమందు వివిధ మండలసభలు జరుపుచు కాంగ్రెసు సందేశమును వ్యాప్తిచేయ వీలయ్యెను.

రాజధానీనగరములో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యావిషయములను పలువురతో కలిసి చర్చించుటకును, అక్కడ ప్రకటింపబడు దేశీయ ఇంగ్లీషు వార్తాపత్రికలందు తమ కష్టసుఖములనుగూర్చి ప్రకటించుటకును, ప్రభుత్వ మునకు చెప్పుకొనుటకును, తమ క్షేమలాభములకు అవ సరమయిన కృషిచేయుటకును ప్రజలకు అవకాశము కలిగెను. శాసనసభ తేర్పడిన తరువాత అందలి చర్చ లందు తెలుగు ప్రతినిధులు పాల్గొని రాజకీయ పరజ్ఞాన మును సంపాదించి ప్రజాప్రతినిధి ప్రభుత్వపద్ధతులు, ప్రజాభిప్రాయ ప్రకటనరీతులను అలవరుచుకొన కలిగిరి. రాజధానీనగరమందు స్థాపింపబడిన మద్రాసు విశ్వవిద్యా లయమునందును, కళాశాలలందును, పాఠశాలలందును అరవముతోబాటు తెలుగునకుకూడ చాల ప్రాముఖ్య మొసగబడుటవలన చెన్నపట్టణమునందు గొప్ప తెలుగు పండితులు, కవులు స్థిరనివాసముల నేర్పరుచుకొనిరి. తెలుగులో అచ్చుకూటము లుండుటవలన ఉద్గ్రంథములు ప్రకటింపబడసాగెను. కొన్ని మాసపత్రికలును వెలసినవి. 1900 సంవత్సరము నాటికి ఆంధ్రదేశములో నలు ప్రక్కలనుండి పండితులు, కవులు, గాయకులు, రాజధానీ నగరమునకు వచ్చుచుండుటవలన అక్కడ తెలుగుభాషాభి వృద్ధికి చాలా కృషి జరుగుచుండెను. బహుజనపల్లి సీతా రామాచార్యులుగారు, చెదలవాడ సుందరరామశాస్త్రి గారు, సీతారామశాస్త్రిగారు, పరవస్తు రంగాచార్యులు గారు, కందుకూరి వీరేశలింగముగారు, కొక్కొండ వేంకట రత్నముగారు, గురజాడ అప్పారావుగారు, వేదము వేంక ట్రాయశాస్త్రిగారు మొదలయినవారి గ్రంథములు, ఉప న్యాసములు, వ్యాసములు ప్రకటింపబడసాగెను. అందు వలన తెలుగువారిలో విజ్ఞాన వికాసములు కలిగెను. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నాటకములును, ప్రహ సనములును 1900 నాటికే ప్రకటింపబడెను. ఆనాటికే తిరుపతి వేంకటేశ్వరకవులు ఆంధ్రదేశములో నన్నిప్రాంత ములకు పోయి శతావధానములను జేయుచు, నానారాజ సందర్శనము చేయుచు ఆంధ్రసంస్కృతికి వ్యాప్తికలిగించు చుండిరి. ఇట్లే మహాకవియు, గాయకుడును, నర్తకుడును అగు ఆదిభట్ట నారాయణదాసుగారు తమ సుప్రసిద్ధ హరి కథలను దేశమంతట చెప్పుచు విజ్ఞానవికాసము కలిగించు చుండిరి. చాలమంది యువకులు ఆయన శిష్యులై దేశ మంతటను ఆయన సందేశమును ప్రచారము చేయు చుండిరి. 1900 నాటికి కొన్ని సంవత్సరములకు పూర్వమే నాటక ప్రదర్శనములం దారితేరిన ధార్వాడ నాటక సమాజమువారును, పారసీ సమాజము వారును, ఆంధ్ర దేశమునకు వచ్చి హిందీనాటకము లాడినందున తెలుగు దేశములో అన్ని ముఖ్యపట్టణములందును నాటక సమా జము లేర్పడి నాటక ప్రదర్శనములు వ్యాప్తి చెందెను. అందులో కొన్ని విజ్ఞానబోధకములును, దేశభక్తి పూరి తములును అయి యుండెను. ఆ కాలమునాటి కింకను మైసూరు సంస్థానమునగూడ తెలుగుభాష నాదరించు చుండిరని ఆనాడు మైసూరులోను, బెంగుళూరులోను ప్రక టింపబడిన తెలుగు లిపిలోని అసంఖ్యాకములగు సంస్కృత గ్రంథములును, ఆంధ్ర గ్రంథములును నిదర్శనముగ నున్నవి. ఇట్లే కార్వేటినగర సంస్థానమువారును, వెంకటగిరి సంస్థానమువారును, పిఠాపురము సంస్థానము వారును, ఆంధ్రభాషను, సంగీత సాహిత్యములను పోషించిరి. చిన్న సంస్థానమువా రయినను పోలవరపు జమీందారుగారైన రాజా కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుగారు "సరస్వతి" యను పత్రికను ప్రకటించుచు అందనేక పురాతన గ్రంథములను ముద్రింపించుచుండిరి. పోలవరం రాజావారు తమ యాస్థానమున తిరుపతికవిగారి కాశ్రయ మిచ్చి ఆదరించిరి. ఏలూరులోని రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారును కవులను పోషించుచుండిరి.

విశాఖపట్టణము జిల్లాలోని విజయనగర సంస్థానా ధీశులగు ఆనంద గజపతి అభినవ భోజుడని, అభినవ కృష్ణ దేవరాయ లని ప్రసిద్ధి కెక్కునంతగా సంగీత సాహిత్య కళల నాదరించెను. ఆయన తరచుగా తన ఆస్థాన కవుల తోను, గాయకులతోను, పండితులతోను, చెన్నపట్టణము నకు వచ్చి నివసించుచుండెను. 1897 లో ఆయన చని

పోవువరకను ఆయన ఆంధ్ర సంస్కృతి వ్యాప్తికి, విజ్ఞాన వికాసములకును, మూలకంబముగ నుండెను. ప్రపంచమునందు విఖ్యాతిగాంచిన దివ్యజ్ఞాన సమాజముయొక్క ప్రధాన కార్యాలయము 1882 లో అడయార్‌లో నెలకొల్పబడుటకు ముఖ్యముగా కాకినాడ కాపురస్తులును, చెన్నపట్టణ హైకోర్టులో న్యాయవాదియు నగు తల్లాప్రగడ సుబ్బారావుగారు కారకు లని దివ్యజ్ఞాన సమాజ స్థాపకులే వ్రాసియున్నారు. అందువలన ఈ సమాజమున ఆంధ్రులనేకులు సభ్యులై విదేశములనుండియు, భారతదేశములోని వివిధ ప్రాంతములనుండియు వచ్చిన సభ్యులతో కలిసి ప్రాచ్య పాశ్చాత్య మత ధర్మములను గూర్చియు సంస్కృతిని గూర్చియు చర్చించి జ్ఞాన సముపార్జనము గావించి దేశాభిమానులై కాంగ్రెసు మహాసభా స్థాపనమునకు తోడ్పడి దేశాభివృద్ధికి పాటుపడుటకవకాశము కలిగెను. ఇట్లే రామకృష్ణ పరమహంస శిష్యుడగు వివేకానందస్వామి చెన్నపట్టణమునకు వచ్చి రామకృష్ణుని సందేశమును ఆంధ్ర, ద్రావిడ దేశములందలి జనుల కందజేసినాడు. ఆయన 1902 లో దివంగతుడగునప్పటికే ఆయన బోధనములు, ఉపన్యాసములు ప్రజలలో మంచి విజ్ఞానమును దేశాభిమానమును కలిగించెను. వంగదేశమునందు వర్థిల్లిన బ్రహ్మసమాజముయొక్క పరిశుద్ధాస్తిక మత బోధనములును, సంఘ సంస్కార భావములును క్రమక్రమముగా ఆంధ్రదేశమున వ్యాపింపసాగెను. బ్రహ్మసమాజ ప్రచారకుడైన శివనాథ శాస్త్రిగారు మొదట 1881 లో ఆంధ్రదేశమునకు వచ్చిరి. తరువాత 1890 లోను 1907 లోను కూడ మరల వచ్చిరి. తరువాత వందేమాతరోద్యమమున ఆంధ్రదేశమున రాజకీయోపన్యాసము లిచ్చిన బిపినచంద్ర పాలుగారును మొదట బ్రహ్మసమాజ ప్రచారకుడుగనే వచ్చిరి. వీరేశలింగము పంతులుగారు బ్రహ్మసమాజ సభ్యులై స్త్రీ పునర్వివాహోద్యమము కొరకును, సంఘసంస్కారము కొరకును పాటుపడిరి. ఆంధ్రదేశమున రాజమహేంద్రవరము, బందరు, మొదలైనచోట్ల బ్రహ్మసమాజ శాఖలు ప్రార్థన సమాజములు స్థాపింపబడెను. ఆంధ్రదేశమునందన్నివిధములుగా విజ్ఞాన వికాసము కలిగినందు వలననే వీరేశలింగముగారి స్త్రీ పునర్వివాహసంఘ సంస్కరణోద్యమములు కొనసాగుటకు వీలు కలిగెను. ప్రజలయందు ఉదారభావములు, విజ్ఞానమును వృద్ధిచెందుటవలననే, తరువాత వంగరాష్ట్ర సందర్భమున ప్రజ్వలించిన విదేశ వస్తు బహిష్కార స్వదేశీయోద్యమములు అతి త్వరితముగ ఆంధ్రదేశము నలముకొనెను. ఒకప్పుడు మనము అనుకొనిన సంగతులే దేశములోని మత, సంఘ విషయములందు జరిగిన మార్పులకు కారణమగుచుండును. 1900 సంవత్సరమునకు పూర్వము కొన్ని సంవత్సరముల క్రిందట ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులు గారను నొక వైశ్య శిఖామణి స్త్రీ పునర్వివాహములందు జోక్యము కలిగించుకొనెనని ఆగ్రహించి, శ్రీ శంకరాచార్యులవా రాయనపై ఆంక్ష వేసిరి. అంత సోమయాజులుగా రాయనపైన అభియోగముచేసి హైకోర్టువరకును పోవగా శంకరాచార్యులవారికి రు. 200 లు జరిమానా విధింపబడెను. దీని ఫలితముగా స్త్రీ పునర్వివాహములందు పాల్గొనినవారిని గూర్చిగాని, జాతి, మత, కుల వివక్షతలేకుండ భోజనముచేసిన వారిని గూర్చిగాని, శంకరాచార్యులవారు మొదలగు పీఠాధిపతులు చర్య తీసికొనుటకు భయపడిరి. ఇందువలన దేశములో రాజకీయ సాంఘిక విషయములందు అన్ని కులముల వారును గలిసి పనిచేయ వీలు కలిగెను.

పందొమ్మిదవ శతాబ్ది అంత్యభాగమునను, ఇరువదవ శతాబ్ది ఆరంభమునను అనేక కారణములవలన భారతదేశమునం దశాంతి చెలరేగెను. అనేక రాష్ట్రములలో కాటకములు చెలరేగి ప్రజలకు దుర్భరబాధ కలిగించెను బొంబాయి రాష్ట్రమున మహామారి వ్యాధి ప్రవేశించి అనేకులు జనులను తనపొట్టన బెట్టుకొనెను. ఈ సందర్భమున ప్రభుత్వమువారి చర్యలను తీవ్రముగా విమర్శించిన నేరమునకై దేశపు టగ్రనాయకులలో నొకరగు శ్రీ బాలగంగాధరతిలకుగారు కారాగారమున కంపబడిరి. రూపాయ మారకమునకు సంబంధించిన మార్పులు దేశమున కార్థికముగా గొప్ప నష్టమును తెచ్చిపెట్టెను. ఈ కాలమున భారతదేశమునకు రాజప్రతినిధిగ నేతెంచిన కర్జన్‌ప్రభువు తన నోటి దురుసుదనమువలన భారతీయుల ననేకమారులు తిరస్కరించి, అవమానించి, వారియాగ్రహామునకు పాత్రుడయ్యెను. ఇట్టిపరిస్థితులలో వంగరాష్ట్రము

విస్తీర్ణములో చాల పెద్దదిగానున్నందునను జనసంకీర్ణమై యున్నందునను ముసల్మాను జనసంఖ్య అధికముగానున్న తూర్పు భాగమునకు ఢాకా ముఖ్యపట్టణముగజేసి, హిందువుల జనసంఖ్య అధికముగనున్న భాగమునకు కలకత్తాను రాజధానిగ చేసి రెండురాష్ట్రములుగ చేయుట బాగుండు నని అప్పటి ఆంగ్లేయ ప్రభుత్వాధికారులకు తోచగా కర్జను దీని కంగీకరించెను. బంగాళా విభజనము 1905 వ సంవత్సరము అక్టోబరునెల 16 వ తేదీన అమలులోనికి వచ్చెను. బంగాలీ మాతృభాషగాగల ప్రజల నిట్లు విడదీయవలదని ఎందరు మొరపెట్టుకొన్నను కర్జను వినలేదు. అమలులోనికి వచ్చులోపలనే కర్జను వేరొక సందర్భమువలన తనపదవికి రాజీనామా నిచ్చెను, కాని బంగాళా విభజనముమాత్రము మారలేదు. బంగాళీయులు తమకు ఘోరమయిన అన్యాయము జరిగిన దని దుఃఖపడి భూమ్యాకాశములు బ్రద్దలగునంతటి ఆందోళనముచేసిరి. హిందూదేశములోని అన్నిభాగములవారును బంగాళీల యెడల సానుభూతి కలిగి తమతమ దేశములలో గొప్ప సభలుచేసి దొరతనమువారి చర్యలు ఖండించిరి. ఈ విషయమున ఆంధ్రులు వెనుకపడలేదు. ఈ విషయములను గూర్చి చెన్నపురి రాజధానిలో రాజకీయోపన్యాసము లీయదలచి బిపినచంద్రపాలుగారు కలకత్తానుండిబయలు దేరి బరంపురము, విశాఖపట్టణముల మీదుగా రాజమహేంద్రవరము, బెజవాడ, బందరు, నెల్లూరు మొదలయిన పట్టణములందు ఆంగ్లేయ దొరతనమువారు హిందూదేశమును పాలించుచున్నపద్ధతులను ప్రబలముగా ఖండించుచు ప్రతిదినము ఇంగ్లీషులో దీర్ఘోపన్యాసము లిచ్చుచుండిరి. వాటిని ప్రతియూరను ఎవరో ప్రముఖులు తెలుగులోని కనువదింపగా వేలకొలది ప్రజ లుద్రేకపూరితులు కాసాగిరి. ఆ సందర్భమున

తే. గీ. "భరతఖండము చక్కని పాడియావు,
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవా రను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియకట్టి."

అని చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు పాలు గారి ఉపన్యాసానంతరము చదివిన పద్యమును విని రాజమహేంద్రవరములోని సభాసదులు బ్రహ్మాండము పగులునట్లు చప్పట్లుకొట్టి పలుమారులు దానిని చదివించుకొని కంఠపాఠము చేసిరి. అది అన్ని పత్రికలలోను ప్రకటింపబడి ఆంధ్రదేశమంతటను వ్యాపించి, ప్రతివారి నోటను విన వచ్చుచుండెను. హరికథలలోని కెక్కెను. ఆంగ్లేయ దొరతనమును గూర్చి ఆంధ్రు లెట్టి యభిప్రాయమును కలిగి యుండిరో దీనివలననే విదితమయ్యెను.

బిపినచంద్రపాలు ఆంధ్రదేశ పర్యటనమువలన వందేమాతరోద్యమము తెలుగుదేశమంతటను వ్యాపించెను. ఆయన ఉపన్యాసములు విన్నవారు పరవశులై తత్క్షణమే విదేశవస్తు బహిష్కారదీక్ష గైకొనసాగిరి. వానిని చూచి తక్కినవారాకాలమున ధరించుచుండిన గ్లాస్కొమల్లు బట్టలను విసర్జించి స్వదేశీ నేతబట్టలను ధరింపసాగిరి. వందేమాతర మను మాట స్వరాజ్యమంత్రమై నలుప్రక్కల ప్రతిధ్వను లిచ్చుచుండెను. ఎచ్చట చూచినను దేశభక్తి పూరితములగు పాటలు, నాటకములు, హరికథలు, భజనలు ఉపన్యాసములు; ఎచ్చట చూచినను లోకమాన్యుని తిలకధారణము; ఎక్కడ చూచినను వ్యాయామక్రీడలు: స్త్రీలు, పురుషులుకూడ నీదేశాభిమానమునందు మునిగి తేలుచుండిరి. చిన్నపిల్లలు, తుదకు గోరువంకలుకూడ "వందేమాతరమ్ మనదేరాజ్యం" అని పలుకుట పరిపాటియై పోయినది.

1907 వ సంవత్సరమున హిందూదేశములో ననేక స్థలములందు విదేశవస్తు బహిష్కారము, స్వరాజ్య సంపాదనము, జాతీయవిద్యాభివృద్ధి యను విషయమును గురించి ప్రజలు తీవ్రముగా నాలోచింప సాగిరి. ఆ కాలమున రాజమహేంద్రవరమున 'ఆంధ్రకేసరి' యను పత్రికయును, బందరులో 'కృష్ణాపత్రిక' యు నిట్టి జాతీయభావములకు తోడ్పడు వ్యాసములను ప్రచురించుచుండెను. ఈ కృషిఫలితముగా రాజమహేంద్రవరము, బందరు మొదలయినచోట్ల జాతీయపాఠశాలలు, స్వదేశపరిశ్రమలు స్థాపింపబడెను.

1907 వ సంవత్సరము మే నెల 9 వ తేదీన పంజాబు ప్రభుత్వమువారు దేశాభిమానియు, మహాపురుషుడునైన లాలా లజపతిరాయిగారిని పట్టుకొని నిష్కారణముగ బర్మాకు కొనిపోయి మాండలే చెరసాలలో నిర్బంధించి యుంచిరి. ఈయనను కాంగ్రెసు అధ్యక్షునిగా చేయవ

నని తిలకుగారి నాయకత్వమున ఆనాటి తీవ్ర జాతీయ వాదులు ప్రయత్నించిరి. ఇందుకు విరుద్ధముగ మిత వాదులు కాంగ్రెసును సూరత్‌లో సమావేశపరచి రసవిహారఘోషుగారిని అధ్యక్షునిగాచేసి యుండిరి. అందు వలననే అక్కడ అల్లరి జరిగినది. ఆనాడు ఆంధ్రదేశమున విద్యార్థులలో గొప్ప సంచలనము కలిగెను. వారు తిలక ములు ధరించి మెడలలో వందేమాతర పతకములను ధరించి, చేతులలో వందేమాతర ధ్వజములను బూని వీథులలో నూరేగుచుండిరి. కొందరు విద్యార్థు లట్టి పతక ములతో కాలేజీలకు పోవగా కళాశాలల అధికారులైన తెల్లదొరలు వారిని వెడలగొట్టి రెండేండ్లవర కేకాలేజీ లోను వారిని చేర్చుకొనరాదని శాసించిరి. వారికి ప్రభు త్వోద్యోగము లివ్వరాదని గెజెటులో ప్రకటించిరి. ఇట్లు శిక్షింపబడిన వారిలో రాజమహేంద్రవరము ఆర్ట్సు కాలేజీ విద్యార్థియైన గజవల్లి రామచంద్రరావుగారును, ట్రెయి నింగు కాలేజీ విద్యార్థి యగు గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారును ఉండిరి. ఇట్టి యువకులందరును దేశసేవా పరాయణులైరి.

సూరతు కాంగ్రెసులో మితవాదులను పరాభవించిన తీవ్ర జాతీయవాదుల నాయకుడగు లోకమాన్య బాల గంగాధరతిలకుగారే భారతదేశములోని అశాంతికి కారకు లని తలచి ఆయనను పట్టుకొని నిర్బంధించుటకు ఆంగ్లే యాధికారులు కృతనిశ్చయులైరి. ఆయన ఆకాలమున "కేసరి" అను మహారాష్ట్రపత్రికలో వ్రాసిన వ్యాసము లందు రాజకీయ హత్యలను సమర్థించెనని, వారి పత్రిక కార్యాలయమున బాంబులను తయారుచేయు కాగితము దొరికెనని ఆయనపై రాజద్రోహ నేరముమోపి ఆయ నను పట్టుకొని సంకెళ్ళు వేసి న్యాయస్థానమునకు తీసికొని వచ్చిరి. ఆయనకా నేరమునకు 22-7-1908 తేదీన ఆరు సంవత్సరములు ద్వీపాంతరవాస శిక్షయు వేయిరూపా యల జరిమానాయును విధించి ఆయనను బర్మాలో మాండలే చెరసాలలో బెట్టిరి. దీనివలన భారతదేశమున గొప్ప సంచలనము కలిగెను. గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు బెజవాడలో బోడి నారాయణరావుగారితో కలసి స్వరాజ్యపత్రికయను నొక తెలుగు జాతీయపత్రి కను నడిపించిరి. అందులో దొరలను దూషించి ఇంగ్లీషు ప్రభుత్వముపట్ల రాజద్రోహము చేసెనని ఆయనను, నారా యణరావుగారిని ప్రభుత్వమువారు పట్టుకొని 1908 లో కఠినశిక్షను విధించిరి. ఆ కేసు హైకోర్టుకు వెళ్ళినప్పుడు ప్రభుత్వ న్యాయవ్యాది కోరిక ననుసరించి హరిసర్వో త్తమరావుగారికి విధింపబడిన శిక్ష చాలదని 14-3-1909 వ తేదీన మూడు సంవత్సరముల కారాగారవాసమునకు హెచ్చుచేసిరి.

జనసామాన్యమును భయపెట్టవలెనని రాజకీయ నేరములకు పట్టుకొనబడినవారిని పోలీసువారు చాలా క్రూరముగ జూచుచు సంకెళ్ళతో ద్రిప్పి శిక్షితులైన వారి తలలు గొరిగించి మల్లచిప్పలందు పురుగుల అంబలి పోసి బాధింపసాగిరి. ఇట్టి కఠిన చర్యలు తీసికొనినందున ప్రజలు భయపడిపోయిరి. అంతట ఆంధ్రదేశమునందీ యుద్యమము అణగిపోయినదని ఆంగ్లేయ ప్రభుత్వము వారు అనుకొనిరిగాని, దేశాభిమానము ప్రజల హృద యమునందు గాఢముగా నాటుకొని అనేక రీతులుగా కార్యరూపము దాల్చసాగెను, ప్రజలలో విదేశ వస్తు బహిష్కారము స్వదేశవస్త్వభిమానము స్వరాజ్యవాంఛ హెచ్చెను. దేశములో చాలచోట్ల స్వదేశవస్తువులు చేయు కార్ఖానాలు, జాతీయ పాఠశాలలు వెలయజొచ్చెను.

ఆనాడు జాతీయ పత్రికలలో నగ్రగణ్యమైన కృష్ణా పత్రికను శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు ప్రకటింప సాగిరి. కోపల్లె హనుమంతరావుగారు న్యాయవాద వృత్తిని త్యజించి బందరు జాతీయ కళాశాలా స్థాపనమునకు దాని అభివృద్ధికి తమ జీవితమును ధారపోయసాగిరి. డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారును ఉద్యో గాభిలాష విడనాడి జాతీయవాదియైరి. కొండా వెంక టప్పయ్యగారును దేశభక్తులై దేశసేవా పరాయణులైరి. తరువాత ఆంధ్రాభ్యుదయమునకు తోడ్పడినవారు చాలా మంది ఆనాటి యువకులే. ఇట్టి పరిస్థితులలోనే కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, వారి స్నేహితులైన మాడపాటి హనుమంతరావుగారు, రావిచెట్టు రంగా రావుగారు మొదలయినవారు కలిసి 1907 లో హైదరా బాదులో విజ్ఞాన చంద్రికా మండలిని స్థాపించి, తరువాత దాని కార్యస్థానమును చెన్నపట్టణమునకు మార్చిరి. విజ్ఞాన చంద్రికామండలిలో ప్రకటింపబడిన మొదటి

గ్రంథము స్వతంత్ర అమెరికా అధ్యక్షుడగు అబ్రహాము లింకను జీవిత చరిత్ర. దానిని రచించినవారు గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారే. దానికి పీఠిక వ్రాయుచు లక్ష్మణరావుగారు వంగరాష్ట్రములోను, మహారాష్ట్ర దేశములోను వైజ్ఞానిక సాహిత్య విషయములందు దేశాభ్యుదయము కొరకు జరిగిన కృషిని వివరించి ఆంధ్రులుకూడ వారివలెనె కృషిచేయుట అవసరమని వక్కాణించిరి. ఆ గ్రంథమాలయందు ప్రకటింపబడిన గ్రంథములెల్ల తెలుగువారిలో విజ్ఞాన వికాసము కలిగించి దేశాభిమానమును పురిగొల్పగల ఉత్తమ గ్రంథములే. అందు ముఖ్యముగా 1910 వ సంవత్సరమున ప్రకటింపబడిన "ఆంధ్రుల చరిత్ర" ఆంధ్రులలో గొప్ప దేశభక్తిని పురికొల్పిన చరిత్ర గ్రంథము. దానికి శ్రీ లక్ష్మణ రావుగారు పీఠిక వ్రాయుచు "భారత ఖండాంతర్గతములైన ఒక్కొక్క దేశముయొక్క చరిత్రమును విపులముగా వ్రాయించి ప్రకటించవలెనని మండలివారు యత్నించుచున్నారు. ఆంధ్రులకు ఆంధ్రదేశ చరిత్రము అత్యంతావశ్యకముగదా. పూర్వ మొకప్పుడు రాజ్య విస్తీర్ణమునందు ఉన్నత నాగరకత యందును, బుద్ధి వైభవమునందును, ఆంధ్రులు హిందూదేశమునందలి యన్య రాష్ట్రముల వారికి దీసిపోయినవారు కారని ఈ చరిత్రవలన స్పష్టపడగలదు." అని వారు వ్రాయుటలోనే ఆంధ్రరాష్ట్ర ప్రజలు మరల పూర్వపు మహోన్నతస్థితి పొందవలెనన్న భావము ద్యోతక మగుచుండెను. శ్రీ లక్ష్మణరావుగారి మహదాశయమే ఆనాడు ఆంధ్ర దేశాభ్యుదయము కొరకు పాటుపడిన వారందరకు నుండెననుటకు సందేహములేదు.

1910 వ సంవత్సరమున గుంటూరులోని ఆంధ్ర యువజన సాహిత్య సంఘమునందలి సభ్యులు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకతనుగూర్చి ఆలోచించి ఒక తీర్మానము గావించిరి. ఈ సభ్యులలో కీ. శే. జొన్నవిత్తుల గురునాథము, కీ. శే. చల్లా శేషగిరిరావుగార్లును, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు మొదలయినవారు ఉండిరి. అయితే దీనినిగూర్చి అప్పుడు ప్రచారముగాని కృషిగాని జరుగుట కవకాశము లేకపోయెను. ఇంతలో నాంధ్ర దేశమునందు కలిగిన విజ్ఞాన వికాసముయొక్క ఫలితముగా బయలుదేరిన అనేక గ్రంథమాలలు దేశాభ్యుదయమునకు తోడ్పడగల గ్రంథములను ప్రచురింపసాగెను. అనేక పత్రికలు వెలసెను. తరువాత అనేక అముద్రిత గ్రంథములు సేకరించి, ఆంధ్రవాఙ్మయ పరిశోధనము గావించి, మన భాషకు చాల సేవజేసిన ఆంధ్రసాహిత్య పరిషత్తుకూడా 1911 లోనే స్థాపింపబడెను. దాని మొదటి వార్షికోత్సవము 1912 లో చెన్నపట్టణమున జరిగెను. తరువాత ప్రతిసంవత్సరము నొక పట్టణములో వార్షికోత్సవము జరుపసాగిరి. ఆ సమయముననే ఆంధ్ర దేశములోని ప్రతిపట్టణమునందును పుస్తక భాండాగారములు స్థాపింపబడి, గ్రంథములను, పత్రికలను ప్రజలకందించుచు, ఉపన్యాసము లేర్పాటుచేయుచు, ప్రజల విజ్ఞాన వికాసమునకు తోడ్పడసాగెను. ప్రతి సంవత్సరమును వార్షికోత్సవములు జరుపుచు ఆంధ్ర ప్రముఖుల యధ్యక్షతక్రింద మహాసభలు జరుపుట ప్రారంభమై అది త్వరలోనే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమముగ బరిణమించెను.

1912 లో ఢిల్లీ దర్బారు జరిగెను. ఆ సందర్భమున పూర్వము దేశమును కలవరపెట్టిన బంగాళా విభజనము రద్దుచేయబడి బంగాళీభాష మాట్లాడు ప్రాంతములెల్ల నొకేరాష్ట్ర మయ్యెను. భారతదేశ రాజధానిని కలకత్తా నుండి ఢిల్లీకి మార్చిరి. దేశములో నన్ని ముఖ్యపట్టణములందును ఉత్సవములు సభలు జరిగెను. ఇట్లాకాలమున వివిధసంస్థలవారు చేసిన కృషియు, వా రేర్పరచిననభలు ఉత్సవములు, ఉపన్యాసములును ప్రజలలో విజ్ఞాన వికాసమును ఆంధ్రాభిమానమును కలిగించి కార్యదీక్షను పురికొల్పుచుండెను.

"వంగరాష్ట్ర విభజనం సందర్భముననుు, తరువాత దానిని రద్దుచేయునప్పుడును జరిగిన చర్చలవలనను, ఆ కాలమున నడచిన ప్రసంగముల వలనను, రాజప్రతినిధి మొదలగువారి రాజకీయ లేఖలవలనను, భాషాసామ్యము జాత్యైక్యత, ప్రత్యేక రాష్ట్రనిర్మాణమునకు ముఖ్య కారణములని స్పష్టీకరింపబడినవి" అని శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యగారే ఆంధ్రోద్యమముయొక్క పుట్టు పూర్వోత్తరములను గూర్చిన ఒక వ్యాసమున వ్రాసినారు.

1912 వ సంవత్సరమున కృష్ణాజిల్లా మహాసభ నిడదవోలులో జరిగినప్పుడు ఆంధ్రదేశమందలి ప్రముఖులు చాలమంది అచ్చట సమావేశమయిరి. జిల్లా సభలవలెనే, ఆంధ్రదేశ మంతటికిని ప్రతి సంవత్సర మొక్కొకచోట మహాసభను జరిపించుట యుక్తమను భావము వారికి తోచినది. ఆంధ్రమహాసభా సమావేశము ఆంధ్ర వ్యక్తిత్వమును దృఢపరచి సర్వతోముఖముగా ఆంధ్రజాతి నుద్ధరించుటయే ముఖ్యోద్దేశముగ గలది యగుటచే, ఒక భాష, ఒక సంస్కృతి, ఒక చారిత్రము గలిగిన ఆంధ్రు లెల్లరు నొక రాష్ట్రములో ప్రత్యేకింపబడుట అత్యంతావశ్యక మను భావము వెంటనే ఆంధ్రయువకుల హృదయములందు మొలకెత్తినది. అట్టి యువకులలో కీ. శే. జొన్నవిత్తుల గురునాథము, కీ. శే. చల్లా శేషగిరిరావుగార్లు పేర్కొనదగినవారు. ఆంధ్రరాష్ట్ర తీర్మానము పైనచెప్పిన కృష్ణాజిల్లా మహాసభలోనే ప్రవేశ పెట్టబడెనుగాని అది సకాలములో తేబడనందున అధ్యక్షులు దానిని నిరాకరించిరి. అంతట నా యువకులును, వింజమూరి భావనాచార్యులుగారు, ఉన్నవ లక్ష్మీనారాయణ గారు మొదలగు పెద్దలును చేరి ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమును చర్చించి, దాని ఆవశ్యకతను గుర్తించి ఆంధ్రులలో ప్రబోధము కలిగించుటకు ఆంధ్రోద్యమము సాగించిరి. ఈ విషయమై ప్రచారముచేయుటకు కొండా వేంకటప్పయ్యగారు కూడ పూనుకొనిరి. ఈ సందర్భమున తమిళప్రాంతములనున్న తెలుగువారిలోకూడ ఆంధ్రోద్యమ ప్రచారము జరిగినది.

ఈ ప్రచారము యొక్క ఫలితముగా బాపట్లలో 1913వ సంవత్సరమున ప్రథమ ఆంధ్రమహాసభ జరుపబడినది. మద్రాసు రాష్ట్రీయ శాసనసభలో సభ్యులుగనుండిన శ్రీ బయ్యా నరసింహేశ్వర శర్మగారు సభకు అధ్యక్షత వహించిరి. ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయమునుగూర్చి విచారించి మరుసటి సంవత్సరము జరుగు ఆంధ్ర మహాసభకు నివేదించుటకు తీర్మానించిరి.

1914 లో ఐరోపా మహాసంగ్రామము ప్రారంభమయ్యెను. ప్రజలకు వార్తా పత్రికలయం దభిరుచి పెరిగెను. ఆదివరకు బొంబాయిలో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు నడుపుచుండిన ఆంధ్రపత్రికను చెన్నపట్టణమునుండి దినపత్రికగా ప్రకటింపసాగిరి. అది ఆంధ్రోద్యమమునుగూర్చి తీవ్రమైన ప్రచారము చేయసాగెను. 1914 లో బెజవాడలో ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుగారి అధ్యక్షతక్రింద జరిగిన రెండవ ఆంధ్ర మహాసభయందు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము గావించుట అవసరమని తీర్మానించిరి.

1915 లో కాకినాడలో శ్రీ మోచర్ల రామచంద్ర రావు పంతులుగారి అధ్యక్షతక్రింద జరిగిన మూడవ ఆంధ్రమహాసభలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము చేయవలయునని తీర్మానము గావించిరి. అప్పటినుండి ప్రతి సంవత్సరము ఆంధ్రమహాసభ ఏదోయొక ముఖ్య పట్టణమున సమావేశమగుచు ఆంధ్రరాష్ట్రము నిర్మించవలెనని తీర్మానింపసాగెను. తరువాత ఆంధ్ర సాహిత్య సభలందు, గ్రంథాలయ సభలందు, ఇతర సభలందుగూడ ఈ విషయమై తీర్మానములు గావింపబడుచుండెను. జాతి, మత కుల పక్షవిభేదములను విస్మరించి రాష్ట్రమునందు ఇతర రాష్ట్రములందుగల తెలుగువారందరును ఆంధ్రోద్యమము నభిమానించిరి. కాంగ్రెసు మహాసభకూడ భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సూత్రము నంగీకరించెను. 1918 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఏర్పరుప బడినది. 1917 లో మాంటేగు-చేమ్సుఫోర్డు రాజ్యాంగ సంస్కరణముల సందర్భమున నీ విషయమై విచారణ సంఘమునకు నివేదింపబడినది. 1919 వ సంవత్సరపు రాజ్యాంగ చట్టమునందు భాషాప్రయుక్త రాష్ట్రములు ప్రజా ప్రతినిధుల యంగీకారముపైన నిర్మింపవచ్చునని నిర్ణయింపబడెను. కాని దాని విషయమై ఎట్టి చర్యయు గైకొనబడలేదు. ఆంగ్లేయ పరిపాలకులు మరల రాజ్యాంగ సంస్కరణములు చేసినప్పుడు 1935 లో సింధు, ఒరిస్సా పరగణాలను ప్రత్యేక రాష్ట్రములుగ నిర్మాణము చేసిరేగాని ఆంధ్రరాష్ట్రమును నిర్మింపరైరి.

1917 వ సంవత్సరము నాటికే చెన్నపురి రాజధానిలో బ్రాహ్మణేతరోద్యమము ప్రబలమై జస్టిసుపార్టీ యేర్పడి కాంగ్రెసుకు వ్యతిరేకముగా పనిచేయసాగెను. ఈ యుద్యమము తలయెత్తుటకు కారకులు బ్రిటిష్ అధికారులే అని చెప్పవచ్చును. 1919 వ సంవత్సరపు రాజ్యాంగము ప్రకారము జరిగిన ఎన్నికలందు కాంగ్రెసు

పాల్గొనక బహిష్కరించినప్పుడు జస్టిసు పార్టీవారు శాసనసభలందు ప్రవేశించి చెన్నపట్టణ రాజధానియందు మంత్రులుగ నేర్పడి వారి యధీనము చేయబడిన ప్రభుత్వ శాఖలను పరిపాలింప సాగిరి, 1935 వ సంవత్సరపు రాజ్యాంగ చట్టమును బట్టి 1937 లో జరిగిన ఎన్నికలలో పరాజితు లగువరకు వారే పలుకుబడి కలిగి యుండిరి. జస్టిసుపార్టీ నాయకులైన శ్రీ పానుగంటి రామారాయణింగారును, బొబ్బిలి రాజాగారును, కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారును, పాత్రోగారు మొదలైన వారును ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సుముఖులుగనే యుండిరి. ఆంధ్ర మహాసభలందు పాల్గొనిరి కాని అధికార పదవులందున్నప్పుడు మాత్రము వారు ఈ విషయమై గట్టి ప్రయత్నము చేయరైరి.

గాంధీ మహాత్ముని నాయకత్వమున సహాయ నిరాకరణోద్యమము శాసనోల్లంఘనోద్యమములు జరుగుచుండిన కాలమున భారతదేశమునకు పూర్ణ స్వరాజ్యము సంపాదించినచో భాషాప్రయుక్త రాష్ట్రముల సమస్య పరిష్కార మగుననియు అంతవరకు కాంగ్రెసువా రిట్టి చిన్నవిషయమును గూర్చి గాక భారతదేశ స్వాంత్ర్యము కొరకు మాత్రమే కృషిచేయ వలయుననియు ప్రధాన కాంగ్రెసు నాయకులు తలంచినందున ఆంధ్ర కాంగ్రెసు ప్రముఖు లీ విషయమై తక్కిన పక్షముల వారితో గలిసి గట్టికృషి చేయరైరి. 1938 లో కాంగ్రెసు కార్యవర్గమువారు భాషా ప్రయుక్త రాష్ట్రములను నిర్మాణము చేయుట అవసరమేయనియు, తమచేతికి అధికారము వచ్చిన పిదప దీనినిగూర్చి చర్య గైకొందు మనియు తీర్మానించిరి. 1938లో కాంగ్రెసువారు ఎన్నికలందు విజయముపొంది వివిధ రాష్ట్రములందు ప్రభుత్వాధికారము వహించిరి. చెన్నపట్టణములో కూడ కాంగ్రెసు ప్రభుత్వాధికారము వహించెను. ఆంధ్ర శాసనసభ్యులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును గోరిరి. కాని ముఖ్యమంత్రియైన రాజగోపాలా చార్యులవారికి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము చేయుట కిష్టము లేకపోయెను. అందువలన మన రాష్ట్ర నిర్మాణము వెనుకబడినది. ఎట్టకేలకు భారతదేశము స్వాతంత్ర్యము పొందిన సందర్భమున ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్య మరల ముందునకు వచ్చెను. 18-4-1947 వ తేదీన మద్రాసులోని ఉభయ శాసన సభలును భాషాప్రయుక్త రాష్ట్రముల నిర్మాణము గావింపవలెనని రాజ్యాంగ నిర్మాణ సభకు శిఫారసు చేయుచు తీర్మానము గావించెను. అంతట నీవిషయమై విచారించి నివేదించుటకు రాజ్యాంగ (**Constituent Assembly**) నిర్మాణ సభవారు "థారు" కమీషను అను నొక విచారణ సంఘమును నియమించిరి. ఆ సంఘము వారు ఈ విషయమై విచారణసల్పి భారత దేశమునందు భాషాప్రయుక్త రాష్ట్రములను నిర్మాణముచేయుట యుక్తముగాదనియు, అయ్యది భారత జాతీయైక్యతకు భంగము కలిగించుననియు అభిప్రాయము నిచ్చిరి. అంతట దేశ ప్రజలలో చాల అసంతృప్తి కలిగెను. కాంగ్రెసు వారుకూడ ఆందోళనము గావించిరి. అంతట ఈ విషయమును గూర్చి పునరాలోచన చేయుటకు కాంగ్రెసు వర్కింగు కమిటీవారు జవహర్లాల్ నెహ్రూ, వల్లభాయి పటేల్, డాక్టరు పట్టాభి సీతారామయ్యగార్ల నొక ఉపసంఘముగా నియమించిరి. వారి నివేదికకు "జె. వి. పి" రిపోర్టు అని పేరు వచ్చినది. తక్కిన రాష్ట్రములమాట ఎటులున్నను, ఆంధ్రుల చిరకాల వాంఛితమైన ఆంధ్ర రాష్ట్రమును మాత్రము నిర్మాణము చేయవచ్చుననియు అయితే అట్లేర్పడు క్రొత్త రాష్ట్రమునందు మద్రాసు నగరమును చేర్చుటకు అరవవారి కభ్యంతరము కలదనియు అందువలన మద్రాసు రాజధానిలోని నిర్వివాద ప్రాంతములతోనే నూతనాంధ్రరాష్ట్రము నిర్మాణము చేయవలసి యుండుననియు ఉపసంఘమువారు అభిప్రాయపడిరి. ఈ నిర్ణయమును ఆంధ్రరాష్ట్ర సంఘమువారు 1949 నం. నవంబరు 11 వ తేదీన శిరసావహించుచు తీర్మానించిరి. భారతీయ ప్రభుత్వమువారును వీరి తీర్మానమును అంగీకరించి వెంటనే ఆంధ్రరాష్ట్రమును నిర్మింప తలపెట్టి మదరాసు ప్రభుత్వముతో నాలోచింపగా మద్రాసు మంత్రివర్గమువారు 1950 సంవత్సరము ఏప్రిల్ 1 వ తేదీకిగాని క్రొత్త రాష్ట్రము నిర్మింప వీలు కాదనియు, ఈలోపుగ కొంత చర్య గైకొందు మనియు చెప్పి 1949 డిశంబరు 7 వ తేదీన ఒక విభజన సంఘమును (**Partition Council**) నియమించిరి. ఈ విభజన సంఘమువారు 1950 జనవరి 3 వ తేదీన తమ నివేది

కను సమర్పించి నిర్వివాద ప్రాంతములతో ఆంధ్రరాష్ట్రమును నిర్మింపుడని గోరిరి. అయితే శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు మద్రాసునగర నిర్మాణాభివృద్ధులయందు తెలుగువారి ధనమెంతో వినియోగింపబడినందున ఆంధ్రరాష్ట్రమును విడదీయుటలో మద్రాసు నగరము విషయముననూ, అందులో విలువగల ఆస్తి విషయముననూ ఇంకనేక విషయములందును తెలుగువారికి కొన్నికోట్ల రూపాయలు నష్టపరిహారము రావలసియుండుననియు, అది నిర్ణయించనిది ఆంధ్రరాష్ట్రమును నిర్మింప వీలులేదనియు పట్టుబట్టిరి. ఇది న్యాయమే నని ఆంధ్రుల కందరకు తోచినందువలన ఈ విషయమున గొప్ప ఆందోళనము బయలుదేరెను. ఆంధ్రరాష్ట్రము యొక్క ముఖ్యపట్టణము ఎక్కడ నుండవలెనను విషయమున గూడ తెలుగువారిలో అభిప్రాయ భేదములు కలిగెను. ఈ విషయములను గూర్చిన వాదోపవాదములు తీవ్రముగా చెలరేగెను. ఇట్టి పరిస్థితులలో భారత ప్రభుత్వమువారు ప్రస్తుతము ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును నిలుపుదల చేసినట్లు 1950 వ సంవత్సరము జనవరి 16 వ తేదీన ప్రకటించిరి. ఇట్టి పరిస్థితులలో శ్రీ పొట్టి శ్రీరాములుగారు మద్రాసుతోకలిపి ఆంధ్రరాష్ట్రనిర్మాణము కావింపవలెనని పట్టుబట్టి ప్రాయోపవేశమును జేసిరి. ఆయనకు ప్రాణాపాయస్థితి కలిగెను. 1952 డిశెంబరు 9 వ తేదీన మద్రాసు నగరమును మినహాయించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణము చేయుటకు అభ్యంతరము లేదని శ్రీ నెహ్రూగారు ప్రకటించియుండిరి. ఐనను శ్రీరాములుగారు తమ దీక్ష వదలక ప్రాణముల బాసిరి. దేశములో అశాంతి కలిగెను. అంతట డిశంబరు 19 వ తేదీన శ్రీ నెహ్రూగారు ఢిల్లీ లోకసభలో మద్రాసు నగరము గాక చెన్నరాష్ట్రములోని ప్రస్తుతపు తెలుగు ప్రాంతములను కలిపి ఆంధ్రరాష్ట్రముగా నిర్మించుటకు భారతదేశ ప్రభుత్వమువారు నిశ్చయించినారనియు దానినిగూర్చి అవసరమైన చర్యలు తీసికొనబడుచున్న వనియు తెలిపిరి. నూతనరాష్ట్ర నిర్మాణము చేయుటలో పరిష్కరింపవలసిన ఆర్థిక సమస్యలు మొదలైన వానిని విచారించుటకు రాజస్థాన ప్రధాన న్యాయమూర్తియగు వాంఛూగారిని నియమించినట్లు నెహ్రూగారు ప్రకటనము చేసిరి.

అటుతరువాత ఆంధ్రరాష్ట్రముఖ్యపట్టణమును కర్నూలులో నెలకొల్పవలెననియు, హైకోర్టు గుంటూరులో నెలకొల్పవలెననియు మద్రాసు శాసనసభలోని తెలుగు సభ్యులు నిర్ణయించిరి. దీని ఫలితముగా 1953 అక్టోబరు 1 వ తేదీన ఆంధ్రరాష్ట్రము నిర్మింపబడి దానికి కర్నూలు ముఖ్యపట్టణ మయ్యెను. ఈ క్రొత్తరాష్ట్రమునకు మొదటి గవర్నరుగ శ్రీ సి. యమ్. త్రివేదిగారిని నియమించిరి. భారతదేశ స్వారాజ్యోద్యమమునందు తన సర్వస్వమును ధారపోసిన మహాత్యాగియు, దేశభక్తుడును కర్మవీరుడును, కార్యశూరుడును అగు శ్రీ టంగుటూరి ప్రకాశము పంతులుగారినే ఆంధ్రరాష్ట్రమునకు మొదటి ముఖ్యమంత్రిగ నెన్నుకొనిరి. ఆయన ఒక సంవత్సరము పాటు ఆ పదవిలోనుండి నూతన ఆంధ్రరాష్ట్రమును సుస్థిరముగ జేసెను.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణము రాష్ట్రముల పునర్విచారణ సమస్యను భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణ సమస్యను పునరుజ్జీవింపజేసెను. భారతదేశములోని ఇంగ్లీషువారి పరిపాలనముక్రింద నుండిన వివిధరాజ్య భాగము లొక్కసారిగా నేర్పడినవి కావు. ఆయా ప్రాంతములు ఇంగ్లీషువారి వశమైనప్పుడెల్ల అందు తమ పరిపాలనము నేర్పర్చుచు తరువాత వాని పరిసరప్రాంతములు తమ వశమైనప్పుడు పూర్వపు రాజ్యభాగముతో గలుపుచుండుటవలన ఒకే జాతి మతధర్మములు గలిగి ఒకే భాష మాట్లాడు వారిలో కొందరు ఒక పరగణాలోను, మరికొందరింకొక పరగణాలోను చేర్చబడుట తటస్థించెను. ఇట్లే కొందరు ఇంగ్లీషువారు స్వయముగా పరిపాలించు రాజ్యభాగములందును, మరికొంద రింగ్లీషువారికి సామంతులయిన స్వదేశ సంస్థానాధీశులు పరిపాలించు రాజ్య భాగములందును చేర్చబడిరి. ఇంగ్లీషువారు కేవలము పరిపాలనాసౌకర్యముల వాలోచించి వివిధ రాజధానుల నేర్పరచిరేకాని దేశములోని నైసర్గిక పరిస్థితులనుగాని, ప్రజల సంస్కృతినిగాని, వారు మాటలాడు భాషలుగాని ఆలోచించి అట్లు చేయలేదు. ఇట్లు అరవ, కన్నడ, మలయాళీభాషలవారిని, తెలుగువారిని కలిపి చెన్నరాజధానిలో కలిపి పరిపాలించుచుండిరి. రాజధానులు పెద్దవైనప్పుడు వాటిని రెండుగ విభజించుట గాని

అందులో కొన్నిజిల్లాలను ప్రక్క రాజధానిలో చేర్చుటకాని చేయుచుండిరేగాని ప్రజల సౌకర్యముల నాలోచించి ఈ రాజ్యభాగముల నన్నిటిని పునర్నిర్మాణము గావించుట అవసరమని ఇంగ్లీషువారు తలచలేదు. రాజ్యాంగసంస్కరణములు జరిగినప్పుడు ప్రజలు ఆంగ్లేయాధికారులకు తమ కోర్కెలనుగూర్చి చెప్పికొనిరి గాని రాష్ట్రముల పునర్నిర్మాణ సమస్య పరిష్కరింపబడలేదు. భారతీయులు స్వాతంత్ర్యముకొరకు ఆంగ్లేయులతో పెనుగులాడుచున్న కాలమున భారతదేశములోని వివిధప్రాంతములందు నివసించుచు ఒకేభాష, ఒకేసంస్కృతి, ఒకేచరిత్ర కలిగియున్న ప్రజలను ఏకముచేసి వారి కొక ప్రత్యేరాష్ట్రీకము నిర్మించవలెనను ఆశయమును ప్రచారము చేసినయెడల వారలో జాతీయభావము వర్థిల్లి విజాతీయప్రభువులను ప్రతిఘటించుటకు తోడ్పడగలదను నుద్దేశముతో మన జాతీయనాయకులు భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణమును గూర్చిన ఉద్యమము లేవదీసియుండిరి. ఆంధ్రోద్యమము వలన దేశాభిమానము వర్థిల్లి ఇంగ్లీషు ప్రభువులతో పోరాడుపట్ల ఆంధ్రులు గొప్ప ధైర్యసాహసములు పట్టుదల చూపినసంగతి జగద్విదితము. భారతదేశమునకు స్వాతంత్ర్యము లభించిన పిమ్మట వివిధరాష్ట్రములలోని ప్రజల క్షేమమేగాక, యావద్భారతదేశముయొక్క క్షేమలాభములనుగూర్చియు జాతీయైక్యతనుగూర్చియు భారతదేశమునకు ప్రపంచ రాజ్యములం దుండవలసిన గౌరవ ప్రతిపత్తులను గూర్చియు ముఖ్యముగా ఆలోచించవలసిన అవసరము కలిగెను. వివిధ సంస్థానములు స్వతంత్ర భారతదేశములో లీనమైనందున భారతఖండాంతర్గతము లయిన వివిధ రాజ్యభాగములలోను, రాజధానులలోను, పరగణాలలోను వసించు ప్రజల క్షేమలాభములను, కష్టసుఖములను ఆలోచించి భారత రాజ్యభాగములను పునర్నిర్మాణము గావింపవలసిన అవసరముకలిగెను. పై సంగతు లన్నియు ఆలోచించియే కేవలము భాషాప్రయుక్త రాష్ట్రముల నిర్మాణముచేయుట మంచిది కాదని థార్ కమీషనువారు అభిప్రాయపడిరి. భారత జాతీయ నాయకులలో చాలమంది కిట్లే తోచెను. ఆంధ్ర రాష్ట్రము ప్రత్యేక కారణములవలన నిర్మాణముగావింపబడినదనియు, ఇకముందు కేవలము భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణము చేయుట పొసగదనియు భారత ప్రభుత్వమువారు ప్రకటించిరి. భారత రాజ్యాంగసమితిలోని ప్రజల క్షేమలాభములను, భారతజాతియొక్క సమష్టి క్షేమలాభములకు తోడ్పడగలందులకుగాను భారతదేశములోని వివిధ రాజ్యభాగములను పునర్నిర్మాణము చేయు విషయమునుగూర్చి నిష్పక్షపాత బుద్ధితోను, వాస్తవికదృష్టితోను పరిశీలించుటకు ఒక విచారణ సంఘమును భారతదేశ ప్రభుత్వమువారు నియమించదలచినట్లు 1953 డిశంబరు 22 వ తేదీన మన ప్రధానమంత్రి శ్రీ నెహ్రూగారు పార్లమెంటులో చెప్పిరి. ఈ రాష్ట్రముల పునర్నిర్మాణ సమస్యయొక్క పరిస్థితులను దీనికి పునాదియైన దేశచరిత్రను, ప్రస్తుత పరిస్థితులను దానికి సన్నిహిత సంబంధముగల అన్ని ముఖ్య విషయములను ఈ సంఘమువారు విచారించెదరనియు, ఈ పునర్నిర్మాణమును గూర్చి ఎవరే సూచనను గావించినను, దానిని విమర్శించెదరనియు రాష్ట్రముల పునర్నిర్మాణము చేయవలసిన విధానములను గూర్చిన నివేదికలను విచారణ సంఘములవారు ప్రభుత్వమువారి ఆలోచన కొరకు పంపుదురనియు భారతప్రభుత్వమువారు డిశంబరు 29 వ తేదీన తీర్మానించిరి.

విచారణసంఘమువారు ఫజుల్ ఆలీగారి నాయకత్వమున ఈ సమస్యనుగూర్చి విచారణచేసి తమ నివేదికను 1955 సెప్టెంబరు 30 తేదీన భారతప్రభుత్వము వారి కందజేసిరి. ఇది దేశమునందలి అన్ని పత్రికలలోను ప్రకటింపబడి ప్రజలచేతను, రాష్ట్రి శాసనసభ్యులచేతను చర్చింపబడెను. ప్రజాభిప్రాయమును జాగ్రత్తగా కనుగొని భారతదేశ ప్రభుత్వమువారు రాష్ట్రముల పునర్నిర్మాణము చేయుటకు ఒక చట్టము తయారుచేసి రాష్ట్రప్రభుత్వముల అభిప్రాయములనుగూడ మరల సేకరించి దానిని పార్లమెంటులో ప్రవేశపెట్టి తీర్మానించినారు. ఆ చట్టము ప్రకారము భారతదేశములోని ప్రస్తుత రాజ్యభాగములు 1956 నవంబరు 1 వ తేదీన పునర్నిర్మాణము గావింపబడెను. ప్రభుత్వమువారు రాజ్యాంగ పునర్నిర్మాణముబిల్లులో సూచించిన ప్రకారము హైద్రాబాదు రాష్ట్రము విచ్ఛిన్నముచేయబడెను. అందలి కన్నడ మహారాష్ట్రభాగములు నూతన కర్ణాటక, మహారాష్ట్రములతో

కలిపివేయబడెను. తెలంగాణము ఆంధ్రరాష్ట్రమునకు చేర్చబడెను. నిజాము ప్రభుత్వము అంతరించినది.

రాయలసీమలోను, ఉత్తరసర్కారులలోను, తెలంగాణములోను గల తెలుగుజిల్లాల నన్నింటిని కలిపి 1956 వ సంవత్సరము నవంబరు 1 వ తేదీన "ఆంధ్రప్రదేశ" మను పేరుతో నొక నూతనరాష్ట్రము నిర్మాణము గావింపబడెను. ఇట్లు యావదాంధ్రదేశములోని ముక్కోటి యాంధ్రులు రాజకీయముగ ఒకే రాష్ట్రపరిపాలనలో నుండు భాగ్యము లభించినది. నూతన విశాలాంధ్ర రాష్ట్రనిర్మాణముతో ఆంధ్రుల చరిత్రయం దొక నూతన శకము ప్రారంభమగుచున్నది.

ది. వేం. శి.

**ఆంధ్రదేశపు ఖనిజసంపద I**: భారతదేశములో ఖనిజసంపద ఎక్కువగా గల రాష్ట్రములలో ఆంధ్రప్రదేశ మొకటి. ఇచ్చట ముఖ్యముగ మాంగనీసు (Manganese-ore), అభ్రకము (Mica), కట్టడపురాళ్లు; సీమెంటుకు సున్నపురాళ్ళు (Lime-stones), రాతినార (Asbestos), ముగ్గురాయి (Barytes), లభించును. వీటి తరువాత ఖనిజరంగులు, తెల్లసుద్ద (White-clay), రాచిప్పరాయి (Steatite), క్రోమైట్ (Chromite), పలకరాళ్ళు (Slates), పలుగురాయి (Vein Quartz), ఫెల్‌స్పార్ (Felspar), గ్రాఫైట్ (Graphite), చెప్పదగినవి. ఇవికాక, ఇనుము, కయనైట్ (Kyanite), సిల్లిమనైట్ (Sillimanite), మోనజైట్ (Monajite), ఇల్‌మనైట్ (Ilmanite), గంధకము మున్నగునవి స్వల్పముగ దొరకును. 18 వ శతాబ్దమువరకు ఆంధ్రప్రదేశము నుండియే, ప్రపంచపు మార్కెటులలోకి వజ్రములు ఎక్కువగ వచ్చుచుండెడివి. జగత్ప్రసిద్ధమగు కోహినూర్, హోప్, పిట్ లేక రీజంట్ వజ్రములు ఇక్కడ దొరకినవే. అనంతపురము, చిత్తూరు జిల్లాలలోని బంగారు గనులనుండి ఈ శతాబ్దములో సుమారు 1,85,800 ఔన్సుల బంగారు లభించినది. ఈ రాష్ట్రములో 1954 వరకు రూ. 17,00,00,000 ల విలువగల ఖనిజములు త్రవ్వబడినను, వీటి నిధులు ఇంకను అధికముగ తరుగలేదు. 1946 నుండి 54 వరకు ఏటా సగటున రూ. 1,08,00,000 విలువగల ఖనిజములు ఇక్కడ ఉత్పత్తియైనవి. తగు పరిశోధనవలన ఆంధ్రలో ముఖ్యముగ బొగ్గు, బంగారు, వజ్రములు, కురువిందము (Corundom), గ్లాసు ఇసుక, రాగినిధులు కనుగొనబడి, ఖనిజోత్పత్తి పెరుగు సావకాశమున్నది. ఈ ఖనిజము లన్నియు, ఇంతవరకు ఎక్కువగ పరదేశములకును, కొంత వరకు ఇతరరాష్ట్రములకును ఎగుమతి యగుచున్నవి. వీటిని ఆధారము చేసికొని, ఆంధ్రలో అనేక పరిశ్రమలు నెలకొల్పవచ్చును.

ఖనిజములనుండియే మనము వాడుకొను లోహములు, అనేక ఇతరవస్తువులు, పారిశ్రామికచరిత్రలో క్రొత్తయుగమునకు దారితీయు అణుశక్తియు (Atomic Power) ఉత్పత్తి అగుచున్నది. ఈ ఖనిజములు, ఖనిజమిశ్రమములగు రాళ్ళలో కొన్నిచోట్ల నిధులుగ నేర్పడినవి. మరికొన్నిచోట్ల రాళ్ళలో తక్కువపాలున్నను, వీటిని భౌతికపద్ధతిచే సంకేంద్రీకరించి, లాభకరముగా విడదీయవచ్చును. ఆంధ్రలో మాంగనీసు, అభ్రకము, క్రోమైటు, గ్రాఫైట్ నిధులు స్ఫటమయ విభాజీయ శిలలలోను (Crystalline Rocks and Schists), రాతినార, ముగ్గురాయి, సున్నపురాళ్ళు, రాచిప్పరాళ్ళ నిధులు, కడప కర్నూలు, యుగములలో సముద్రమునందేర్పడిన రాళ్ళలోను గలవు. మొదటివి సముద్రతీరపు జిల్లాలలోను, పశ్చిమ దక్షిణ సరిహద్దులలోను, రెండవరాళ్ళు పశ్చిమ జిల్లాలలో పెక్కు భాగములలోను, వ్యాపించి యున్నవి.

ఈ దిగువ ఆంధ్రలోని ఖనిజసంపద స్థూలముగ వివరింపబడినది. వీటి నిధుల పరిమితి తెలిసినంతవరకు తెలుపబడినది.

**మాంగనీసు**: భారతదేశములో 1900 కు పూర్వము మాంగనీసును శ్రీకాకుళం జిల్లాలోనే త్రవ్విరి. ఇక్కడ పెద్ద నిధులు చీపురుపల్లె తాలూకాలో కోడూరు, గర్భ, మున్నగుచోట్ల నున్నవి. ఒక్క కోడూరు నిధులలోనే $2\frac{1}{2}$ లక్షల టన్నుల ధాతువు (ore) కలదు. వీటిలో మాంగనీసు నూటికి 47 పాళ్ళు, గర్భ నిధులలో 45 పాళ్ళు, అన్నిటిలో సగటున 42 పాళ్ళు కలదు. ఈ నిధులు, మాంగనీసు ఖనిజములు అధికముగాగల కోడూరైట్ (Kodurite) రాళ్ళ శైథిల్యమువల్ల నేర్పడినవి. వీటిలోని ఖనిజమును భౌతికపద్ధతులచే సంకేంద్రీకరించి దీనితో

కూడిన భాస్వరమును (Phosphorus) పరిమితిలో నుంచ గలిగినచో త్రవ్వదగిన నిధులు అధికమగుచేగాక, దీని ధరకూడ పెరుగగలదు. భారతదేశములో ఉత్పత్తియగు మాంగనీసు చాలభాగము పరదేశములకు ఎగుమతి యగు చున్నది. కొంత ఉక్కుపరిశ్రమలలో ఫెర్రో మాంగనీసు (Ferro - Manganese) అను లోహమిశ్రమముకును, మరికొంత గ్లాసు పరిశ్రమలోను, డ్రై బాటరీలలోను వాడు డయాక్సైడ్ (Dioxide) ను చేయుటకును, విని యోగించుచున్నారు.

**అభ్రకము (Mica) :** అభ్రకపుగనులు నెల్లూరుజిల్లాలో ముఖ్యముగ రాపూరు, గూడూరు, పొదలకూరు, ఆత్మ కూరు, కావలి, పరిసరాలలో నున్నవి. పెక్కుగనులు 300 అడుగులల్లోతు మించినవి. పా గనిలో 900 అడుగుల లోతున పనిచేయుచున్నారు. ఇక్కడ మస్కొవైట్ (Mus-covite) రకపు అభ్రకము, అభ్రకహార్న్‌బ్లెండ్ విభా జీయశిలలను (Mica and Hornblende Schists) చొచ్చిన పెగ్మటైట్లు అను (Pegmatites) వెడల్పగు నాళములలో (Veins) పుస్తకములరీతిని దొరకును. పెగ్మటైట్లు పలుగు రాయి, ఫెల్‌స్పార్, అభ్రకముల సమూహము. వీటిలో కొద్దిగ, టూర్మలీన్ (Tourmaline), గార్నెట్ (Garnet) అపటైట్ (Apatite) బెరిల్ (Beryl), జిర్కాన్ (zircon), ఖనిజములుండవచ్చును. ఈ రాతిలో అభ్రకము నూటికి సుమారు 6 పాళ్ళుండి త్రవ్వినమీద అమ్మదగిన భాగము ఒక్కపాలు తేలును. అభ్రకపుస్తకములు కొన్ని అంగుళ ములనుండి కొన్ని అడుగుల వరకు వెడల్పు గలిగి యుండును. పలుచని రేకులు రంగులేనివై యుండును. నెల్లూరు అభ్రకపుస్తకములు ఆకుపచ్చవన్నె గలిగి "గ్రీన్ మైకా" అని పేరుపొందినవి. బీహార్‌లో దొరకు "బెంగాల్ రూబీ" అను ఎరుపువన్నెగల అభ్రకము ఇచ్చట కొన్నిచోట్ల స్వల్పముగ లభించును. ఈ పెగ్మటైట్లు 60 మైళ్ళ పొడవున 15 మైళ్ళ వెడల్పున గూడూరు, నెల్లూరు, సైదాపురము, ఉదయగిరి మున్నగు పట్టణ ప్రాంతములలో వ్యాపించి యున్నవి. ఇవి సాధారణ ముగ 1000 అడుగుల పొడవు, నూరు అడుగుల వెడ ల్పును మించవు. చిన్న మస్కోవైట్ నిధులు కృష్ణాజిల్లా తిరువూరు తాలూకాలోను, ఫ్లొగొపైట్ (Pholgopite) రకము విశాఖపట్టణంజిల్లాలోని కూడియా, మాజీ గూడెం, బొర్రా మున్నగుచోట్ల కలవు.

అభ్రకములో వేడి, విద్యుత్తు ప్రవహింపదు గనుక దీనిని ఎన్నో రీతుల వాడవచ్చును. భారతదేశములో ఉత్పత్తియగు అభ్రకములో 60, 70 హండ్రడ్ వెయిట్లు (3-3½ టన్నులు) తప్ప శేషించిన దంతయు పరదేశము లకు ఎగుమతి యగుచున్నది. ఆంధ్రలో అభ్రకపు రేకుల నుండి మైకనైటును (Micanite) చేయ మొదలిడినచో అభ్రకోత్పత్తి తిన్నగ సాగుచుండును. కాని ఇది భారత దేశములోని విద్యుత్పరికర పరిశ్రమలపై నాధారపడి యున్నది.

**కట్టడపురాళ్ళు (Building stones) :-** స్ఫటమయ శిల లన్నియు గట్టి కట్టడపురాళ్ళు: వీటిలో స్ఫటికము (Quartz), ఫెల్‌స్పార్, సూక్ష్మముగ ఇతర ఖనిజముల కణములతో నిండిన లేతరంగు రాళ్ళగు గ్రానైట్లు (Granites), నైసులు (Gneisses), అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరు, గుంటూరు, కృష్ణా జిల్లాలలోను, గార్నెట్ (Garnet) ఖనిజమువలన ఎర్ర చుక్కలుగల ఖోండలైట్లు (Khondalites), హైపర్‌స్తీన్ (Hypersthene) ఖనిజముల వలన కంచువాగుగల చార్నో కైట్లు (Charnokites) శ్రీకాకుళము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా జిల్లాలలోను కట్టడములకు వాడబడు చున్నవి. ఆంధ్ర విశ్వవిద్యాలయ భవనములను ఖోండ లైట్లతో కట్టిరి. విశాఖపట్టణముజిల్లా, అనంతగిరి, మాడుగుల ప్రాంతమునను, గుంటూరుజిల్లా పల్నాడు లోను పలురంగుల చక్కని పాలరాళ్ళు దొరకును. పశ్చిమజిల్లాలలో కడప-కర్నూలు సహంతులకు (Cuddapah and Kurnool Systems) చెందిన క్వార్ట్జైట్లు (Quartzites), ఇసుకరాళ్ళు, లైంస్టోన్లు విరివిగా వాడు దురు. కడపజిల్లాలో అనిమల, గండికోట, కర్నూలు జిల్లాలో రామల్లకోటవద్ద అద్భుత శిల్పకళాచాతుర్య మును చూపించు దేవాలయములను క్వార్ట్జైట్లు, ఇసుక రాళ్ళతో కట్టిరి. లైం స్టోన్లలో పొరలులేని పెద్ద బండ లను గోడలకు, "నాపరాళ్ళ"ను పలుచని చపటలను నేలపై పరచుటకు, అరుదుగ మిద్దెలకు నుపయోగిం తురు. కొన్నిచోట్ల రాతిద్రవము (Magma) నుండి ఘనీభ


బొమ్మ 1. క్వార్ట్జైటులో చెక్కిన స్తంభములు
వంగమేశ్వరస్వామి దేవాలయము.
అజిమల (కడప జిల్లా.)


బొమ్మ 2. సున్నపురాతి శిల్పములు
చెన్నకేశ్వరస్వామి దేవాలయము.
పుష్పగిరి (కడప జిల్లా.)


బొమ్మ 3. నల్లరాతి (ట్రాప్) తులసికోట.
రామల్లకోట (కర్నూలు జిల్లా.)


బొమ్మ 4. నాపరాతిగని.
నిడుజువ్వి (కడప జిల్లా.)

వించిన నల్లని స్ఫటమయ శిలలగు ట్రాప్ (Trap) అను కూడ వాడుదురు. రామల్లకోట దేవాలయములోని తులసికోట ట్రాపులో చెక్కబడినది.

**సీమెంటుకు సున్నపురాళ్ళు (Lime-stone for cement):-** సీమెంటు పరిశ్రమలో టన్నుకు 1·48 టన్నులు సున్నపురాళ్ళు కావలెను. సీమెంటు కుపయోగపడుటకు, సున్నపురాళ్ళలో సున్నము (Lime) 43 శాతము; సిలికా (Silica) 14·5 శాతము, లోహామ్ల జనిదములు (Iron Oxides) 1·5 శాతము, అల్యూమినా (Alumina) 3·5 శాతము పాళ్ళు సుమారుగా ఉండి, మెగ్నీషియా (Magnesia) 2·6 కు మించరాదు. కర్నూలు సంహతికి చెందిన సున్నపురాళ్ళు కడపజిల్లా కమలాపురం తాలూకాలో 64 కోట్ల టన్నులు, జమ్మలమడుగులో 300 కోట్లు, కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకాలో 500 కోట్లు, బంగనపల్లెలో 66 కోట్లు, ద్రోణాచలములో 47·5 కోట్లు, కర్నూలులో 125 కోట్లు, నందికొట్కూరులో 77 కోట్లు టన్నులున్నవి. గుంటూరు కృష్ణా జిల్లాలలో కృష్ణ కిరుప్రక్కల యందును, గోదావరి

లోయలోను, సిమెంటు కుపయోగపడు సున్నపురాళ్ళు చాల గలవు. గుంటూరు జిల్లాలో మంగళగిరి మున్నగు చోట్ల త్రవ్వు కంకర సిమెంటు పరిశ్రమలో వాడబడు చున్నది. వీటి నాధారము చేసికొని ఆంధ్రలో సిమెంటు పరిశ్రమ ఎక్కువగా అభివృద్ధి కాగలదు. ఈ పరిశ్రమలో టన్నుకు 0·42 టన్నులు కావలసిన బొగ్గు సింగరేణి నుండిగాని, తూర్పు రాష్ట్రముల బొగ్గుగనుల నుండిగాని తెప్పించుకోవలసి వచ్చును.

సిమెంటులో 4 శాతముగల హరశోతము (Gypsum) నెల్లూరు జిల్లాలో సుళ్ళూరుపేటవద్ద పులికాటు సరస్సు నానుకొని నూరుమైళ్ళ వైశాల్యముగల పల్లపు భూమిలో చాలమేరగలదు. ఇచ్చట దీనికై శోధించబడిన 20 చదరపు మైళ్ళలో ప్రతి అడుగు లోతునకు 10 వేల టన్నులు గలదని లెక్కవేయబడినది.

52 శాతముకన్న ఎక్కువ సున్నము ఉన్న గుల్లరాయి (Calcareous Tufa) అనంతపురం జిల్లాలో కోన రామేశ్వరస్వామి వద్ద 8 లక్షల టన్నులు, మెత్తని పొడి కర్నూలుజిల్లా బంగనపల్లె తాలూకాలో నందవరం, పల్కూరు, రామతీర్థం వద్ద 8·8 లక్షల టన్నులు కలదు. ఇది గ్లాసు, పింగాణి, ఖటికము (Calcium) రసాయన పరిశ్రమలలోను, ఇనుప కొలుములలో ధాతువును కరగించుటకును ఉపయోగపడును.

రాతినార (Asbestos) :- రాతినారలో క్రైసొటైల్ (Chrysotile) అను మృదువగు రకము, ట్రిమొలైట్ (Tremolite) అను బిరుసగు రకమును గలవు. వీనిలో విద్యుత్తు, వేడి ప్రసరింపవు గనుకను, దీనిపై ఆమ్లములు పనిచేయవు గనుకను, క్రైసొటైల్ నిప్పు అంటనిబట్టలకు, ట్రిమొలైట్ నిప్పు అంటని రంగులు, సిమెంటు రేకులు, స్విచ్ బోర్డులు మున్నగువాటికి వాడబడు చున్నవి. ఆంధ్రలో క్రైసొటైల్ నిధులు మాత్రమే ఇంతవరకు కనుగొనబడినవి. ఇవి కడపజిల్లా పులివెందల తాలూకాలో లింగాలనుంచి బ్రాహ్మణపల్లె వర కున్న 7 మైళ్ళలో, చిన్నకుడాల, బ్రాహ్మణపల్లె పరిసరాలలోనే కనీసము 2,56,000 టన్నులు, కమలాపురం తాలూకాలో రాజుపాలెం వద్దను, కలవు. ఇవి వేంపల్లె సున్నపు రాళ్ళలో ట్రాప్ పొరల నానుకొని 7 అంగుళముల లోపు మందముగల నాళములుగ నేర్పడియున్నవి. నార నాళముల కడ్డముగ 0.3 అంగుళములోపు పొడవుగ నుండును. ఈనారనుండి బట్టలనేత పరిశోధించ దగినది. ఇది ఎక్కువభాగము ప్రాంతీయ సిమెంటురంగు పరిశ్రమలలో నుపయోగపడగలదు.

ముగ్గురాయి (Barytes) :- మన దేశములోకెల్ల పెద్ద ముగ్గురాతి నిధులు అనంతపురం జిల్లాలో కొండపల్లె, నెరిజాముపల్లె, ముత్సుకోట, కడపజిల్లా పులివెందల తాలూకాలో కొత్తపల్లె, తాళ్ళపల్లె, నందిపల్లె, వేముల, కర్నూలుజిల్లా ద్రోణాచలం తాలూకాలో ఎర్రగుంట్ల, గట్టిమానికొండ, బలపాలపల్లె, బుక్కాపురం- బోయనపల్లె, రహిమాన్‌పురం, రామాపురం, వలసల, హుస్సేనాపురంవద్ద వేంపల్లె సున్నపురాళ్ళలోను, వాటిలో చొచ్చిన ట్రాప్ పొరలలోను, అడ్డదిడ్డముగ వ్యాపించిన నాళములుగ, పలుగురాతిలోకూడి పెద్ద నెర్రెలను (Fissures) నింపుచును ఉన్నవి. కొన్ని నిధులు 30 అడుగులు వరకు వెడల్పుండినను, నాళములు 7 అడుగుల మందము మించవు. వీటి వెడల్పు కొద్ది దూరములోనే హెచ్చు తగ్గులగుచు, ఇవి అంతమగుచుండును. ఇక్కడ లభించు ముగ్గురాయి 90 పాళ్లు లేత ఎరుపు వన్నెగలిగి యుండును. తెల్లని ముగ్గురాయి రంగులకును, వన్నెగలది నూనె (Petroleum) బావులలోను విరివిగా వాడబడుచున్నది. మంచు తెలుపు ముగ్గురాయి బేరియం (Barium) రసాయనముల కుపయోగపడును. ఆంధ్రలో ముగ్గురాయి రంగు, బేరియం రసాయన పరిశ్రమలను పోషించగలదు.

ఖనిజరంగులు (Ochres) :- ఎర్రసుద్ద (Red Ochre) నిధులు తెల్లసుద్ద, పచ్చసుద్ద (Yellow Ochre) లో గూడి కడపజిల్లాలో నందలూరు, కర్నూలు జిల్లాలో బేతంచర్లవద్ద సుద్దరాళ్ళలో కలవు. ఎఱ్ఱసుద్ద విశాఖపట్టణం జిల్లాలో అరకులోయలోను, గోదావరిజిల్లాలో కొవ్వూరు, రాజమహేంద్రవరం ప్రాంతమునకూడదొరకును. మెత్తని ఎర్రలోహమ్లజనిదము (RedOxide) కడపజిల్లాలో చాబలి వద్ద, కర్నూలు జిల్లాలో రామల్లకోట, వెల్దుర్తిప్రాంతము లోను ఇనుపరాళ్ళతో కూడియున్నది. పచ్చసుద్ద నిధులు కర్నూలుజిల్లాలో ఉయ్యాలవాడవద్ద 3½ లక్షల టన్నులు

తెల్లసుద్దతో కూడి రామల్ల కోటవద్ద 3½ లక్షల టన్నులు, బేతంచర్లవద్ద 18 లక్షల టన్నులు, అంబాపురం వద్ద 20 లక్షల టన్నులు కలవు. కడపజిల్లాలో మిట్టమీదపల్లె, ఉప్పులపల్లె వద్దకూడా పచ్చసుద్దనిధు లున్నవి. ఈ ఖనిజ రంగుల నుపయోగించుచు, ఆంధ్రలో రంగు పరిశ్రమ అభివృద్ధి చెందగలదు.

తెల్లసుద్ద (White Clay) :- తెల్లసుద్ద కడపజిల్లా రాజం పేట తాలూకాలో అనంతరాజుపేట, హస్తవరం, చిన్న వోరంపాడు, ఖాకరాపేట, కోడూరు, నందలూరువద్ద 15 లక్షల టన్నులు, కర్నూలు జిల్లాలో ప్రేమ, రామల్ల కోట, బేతంచర్ల వైబగలవద్ద 20 లక్షల టన్నులు కలదు. ఇది 1,200° సెం. నుంచి 1,300° సెం. వేడికి కరుగును. తూర్పు గోదావరి జిల్లాలో పుణ్యక్షేత్రం జగ్గంపేట, పశ్చిమ గోదావరి జిల్లాలో ద్వారకా తిరుమల, నెల్లూరు జిల్లాలో జానకమ్మపేట, నరసాపురంవద్ద కూడ పెద్ద నిధు లున్నవి. ఇవన్నియు సుద్దరాళ్లు, శైథిల్యముచెంది ఏర్పడి నవి. ఈసుద్దనిధులు ఆంధ్రలో జాడీ, పింగాణి పరిశ్రమ లను పోషించగలవు.

1770° సెం. వేడికికూడ కరుగని చైనా సుద్ద (kaolin) నెల్లూరు జిల్లాలో ప్రభగిరి పట్టణము, వడ్లపూడివద్ద పెగ్మటైట్లలోని ఫెల్స్పార్ కాలగతిన రాసాయనిక పరిణామముచెంది, కొంత ఏర్పడినది. విశాఖపట్టణము జిల్లాలో కొన్ని చిన్న నిధులున్నవి. చైనాసుద్ద పింగాణి, బట్టలు, కాగితముల పరిశ్రమలలో వాడబడుచున్నది.

రాచిప్పరాయి (Steatite) :- రాచిప్పరాయి టాల్క్ (Talc) అను ఖనిజముతో చాలభాగము నిండియున్నది. దీని ఉపయోగము దీనిలోని టాల్క్ పరిమితిపై నాధార పడి యున్నది. రాచిప్పరాయినిధులు ముఖ్యముగ అనంత పురంజిల్లాలోజూలకాలువ, కర్నపూడి,తాబ్జులా,కర్నూలు జిల్లాలో ముద్దవరం, మునలయ్య చెరువువద్ద సెర్పెంటైన్ చెద రిన వేంపల్లెమున్నవురాళ్లలోగాని, వాటిలో ట్రాప్ రాళ్లకు సమీపమునగాని కలవు. రాచిప్పరాయి నెల్లూరు జిల్లాలో ఎడవల్లి, జోగిపల్లె శ్రోత్రియం, గుంటూరు జిల్లాలో కొన్నిచోట్ల, స్ఫటమయ విభాజీయ శిలలలో దొరుకును. దీనిని రాచిప్పలు, బొమ్మలు, పౌడర్లకేకాక, రంగులు, సబ్బులు, విద్యుత్ పింగాణి, రాతి వారపలకలలోను, వినియోగపడును. జూలకాలువవద్ద లభించు మేలైన "లావా" రకపు రాచిప్పరాయితో రేడియో టెలివిజన్ మున్నగువాటిలోవాడు విద్యున్నిరోధక పరికరములను చేయవచ్చును.

క్రోమైట్ (Chromite) :-ఇండ్లలోవాడుకొను స్టెయిన్ లెస్ స్టీల్ (Stainless Steel) లో నూటికి 18 పాళ్ళున్న క్రోమియం (Chromium) లోహము క్రోమైట్నుండి లభించును. క్రోమైట్ నిధులు కృష్ణాజిల్లాలోని కొండపల్లె కొండలలో పైరాక్సీన్ (Pyraxene) ఖనిజముతోనిండిన పెరాక్సినైట్ (Peroxenite) రాళ్ళలో నాళములుగ నున్నవి. అచ్చటచ్చట ఖనిజరేణువులు రాతిలో వెదజల్లి గూడ నున్నవి. ఈ రాతిలోని ఖనిజము అమ్మదగునట్లు చేయుటకు, దీనిని పొడిచేసి వాలుకట్టడములపై ప్రవహింప జేసిన నీటిలో ఖనిజభాగమును సంకేంద్రీకరించుదురు. క్రోమైట్తో ఇనుపకొలుములకు లోపై పుపేర్చు ఇటుకలు, తోళ్ళను శుభ్రపరచుటకు రసాయనములు, లోహ మిశ్రమములు చేయుదురు. కృష్ణాజిల్లాలో క్రోమైట్ నిధులు చాల యున్నవని తేలిన, క్రోమైట్ రసాయన ములను చేయపూనుకోవచ్చును.

పలకరాళ్ళు (Slate) :- పలకరాళ్ళు కర్నూలు జిల్లా కంభం తాలూకాలో చిన్నవోబనామనిపల్లెనుండి మార్కా పురం తాలూకాలో నాయుడుపల్లె, పెద్దయాచవరం మీదుగా మల్లపేటవరకు 24 మైళ్ళ పొడవు 2 మైళ్ళ వెడల్పుగల ప్రాంతమున చిన్నచిన్న నిధులుగ నున్నవి. ఇవి సాధారణముగ 10 అడుగులపొడవు మించవు. పలక రాళ్ళు గుట్టుపుశాల, గణపవరం అడవిలో కూడ కలవు. ఈ గనులను త్రవ్వవలసినరీతి తెలియనందున నూటికి 90 పాళ్ళు, పలకరాయి చిన్నచిన్న ముక్కలయి వృధా యగుచున్నది. ఈ నష్టమును కొత్తపద్ధతులతో తప్పించుట యవసరము. ఇవి బడి పలకలు, బలపములు, రంగులకే కాక, గ్రాఫైట్ లోహమ్లజనిదములులేని దట్టమగురాళ్ళు విద్యున్నిరోధక పరికరములను చేయుట కుపయోగ పడును.

పలుగురాయి (Quartz), ఫెల్స్పార్ (Felspar), చవిటి సోడా (Saline Efflorescence) :- పలుగురాయి, ఫెల్స్పార్ నెల్లూరుజిల్లా అభ్రకపు గనులవద్ద వేలటన్నులు

వదలివేయబడుచున్నవి. పలుగురాతినాళములు అన్ని జిల్లాలలోను గలవు. వీటిని వాడినచో గూడూరు గ్లాసు పింగాణి పరిశ్రమలు పెంపొందగలవు. గ్లాసు కుపయోగించు 10 అడుగుల మందపు తెల్లటి ఇసుకపొరయొకటి గుంటూరుజిల్లాలో చీరాల సమీపమున 3, 8 అడుగుల లోతులో కలదు. ఇది 9 మైళ్ళ పొడవున, 2 ఫర్లాంగుల వెడల్పున వ్యాపించియున్నది. ఇట్టి పొరలు సముద్ర తీరముపొడవుననున్న ఇసుకలో అనేకచోట్ల బయలుపడు అవకాశము కలదు. గ్లాసు పరిశ్రమలో టన్నుకు పావు టన్ను వాడబడు సోడా, చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకాలోను, కర్నూలుజిల్లాలో ముక్కమళ్ళ, సోమిదేవిపల్లె, కాశినేపల్లెవద్ద, అనంతపురం, గుంటూరుజిల్లాలలో కొన్నిచోట్ల చవుడుగ పొంగుచుండును. కాళహస్తి తాలూకాలో పొంగు సోడాను గాజుల పరిశ్రమలో వినియోగించుచున్నారు. ఈ ప్రాంతాలలో ఏటా ఎంత ఉప్పు లభించునది తెలిసికొనుట యవసరము. పలుగు రాతితో ఉక్కుకొలుములకు లోన పేర్చు ఇటుకలు, ప్రయోగశాలలలో (Laboratories) వాడు పాత్రలను చేయుదురు. దీనిపొడితో మెరుగుకాగితములు చేయుదురు.

గ్రాఫైట్ (Graphite) :- పెన్సిళ్ళ ములికికి, యంత్రములలో కందెనగను వాడెడు గ్రాఫైట్, లేక మెరుగు మట్టినిధులు శ్రీకాకుళం జిల్లాలో సాలూరు, కేసర, విశాఖపట్టణం జిల్లాలో చర్లోపాలెం, కాశీపురం, తూర్పు గోదావరి జిల్లాలో కొత్తాడ, మరిన్‌పాలెం, వెలగలపల్లె, ఊట్ల, కలతనౌరు, వేటకొండ మున్నగుచోట్ల, పశ్చిమ గోదావరి జిల్లాలో రెడ్డిబోదేరువద్ద, ఖోండలైట్, గ్రానైట్‌నైసులలో నాళములుగ నున్నవి. వీటిలో కొన్ని నిధులను అప్పుడప్పుడు పనిచేయుచువచ్చిరి. వీటి అన్నిటికి సమీపమువనుండు స్థలములలో ఖనిజమును సంకేంద్రించు సాధనము లేర్పరచి, గ్రాఫైట్‌మూసలు మున్నగునవి చేయ పూనుకోవచ్చును.

బొగ్గు (Coal) :- గోదావరిలోయలో లింగాల, గవిరిదేవిపేట, బెడదనూరు, జంగారెడ్డిగూడెం ప్రాంతమున బోరింగులవలన గోండ్వనరాళ్ళల్లో పలుచనిబొగ్గుపొరలు కొన్నిచోట్ల కనిపెట్టబడినవి. కాని ఇచ్చట ఎంతబొగ్గున్నది నిరూపింపబడలేదు. కృష్ణాజిల్లాలో కోనవద్ద ఒక ఊబ స్థలమునుండియు, గోదావరి డెల్టాలో అమలాపురం, జగ్గన్నపేట, కవితం, ర్యాలి మున్నగుచోట్లను, తాటిపాకవద్ద బావికై వేసిన ఒక 70 అడుగుల బోరింగు నుండియు, మీథేన్ (Methane) అను బొగ్గువాయువు వెడలుచున్నది. గోదావరిలోయలో 2 వేల అడుగుల బోరింగులతో బొగ్గుకై శోధించి, విరివిగా నున్నట్లు నిరూపించగలిగిన, అది పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడును.

బంగారము (Gold) :- బంగారు గనులు అనంతపురం జిల్లాలో రామగిరి, రామాపురం, వెంకటాంపల్లె, చిత్తూరు జిల్లా కంగుండి తాలూకాలో చిన్నపర్తికుంట, బిసనత్తమునొద్ద ధార్వాడ సంహతికి చెందిన క్లోరైట్ (Chlorite) హార్న్‌బ్లెండ్ విభాజీయ శిలలలో కలవు. బిసనత్తం, చిన్నపర్తికుంటవద్ద కొన్ని రాళ్ళలో బంగారము చిన్నటన్నుకు (2,000 పౌనులు) సుమారు 4 పెన్నివెయిట్లు (dwt), అనగా $\frac{1}{5}$ తులం (16 చిన్నాలు, లేక $21\frac{1}{3}$ వాల్లు) కలదు. ఈ ప్రాంతములు శ్రద్ధతో పరీక్షింపదగినవి. రాళ్ళశైథిల్యమువలన బంగారు రేణువులు విడివడి, తుంగభద్రా కృష్ణా నీటి ఉరవడిలో కొట్టుకొని వచ్చి, కొన్నిచోట్ల ఒండ్రులో నిమిడియున్నవి. ఈ ఒండ్రులో ఘనగజముకు 3 గ్రెయిన్లు అనగా అరచిన్నము లేక క్షివాల్, బంగారమున్నచో, దీనిని లాభకరముగ తీయవచ్చును.

వజ్రములు (Diamonds) :- ఆరవ శతాబ్దమునుండియు ఆంధ్రప్రదేశమునకు రత్నగర్భయని పేరు. ప్రపంచములోని గొప్ప వజ్రములు ఎక్కువగ ఇచ్చట లభించినవే. కోహినూర్, హోప్ వజ్రములు దొరికిన కొల్లూరుగనుల వద్ద 1652 లో 60 వేలమంది పనిచేయుచుండిరట. పిట్ లేక రీజంటు వజ్రము పరిటాల గనులలో దొరికినది. గ్రానైట్‌నైస్ ప్రాంతమగు అనంతపురం జిల్లా గుత్తి తాలూకా, కర్నూలుజిల్లా పత్తికొండ తాలూకాలో, వజ్రకరూరు, కొంగనపల్లె మున్నగుచోట్లను, కర్నూలు జిల్లాలో ముఖ్యముగ బంగనిపల్లె, రామల్లకోట, రామవరం పల్లెలు, గుంటూరుజిల్లాలో మల్లవరంవద్ద నున్న బంగనపల్లె గుండ్లపొర (conglomerate) లోను, కుందు, పెన్న, హింద్రి, తుంగభద్ర, కృష్ణానదుల గుండ్ల పొరలలో ననేకచోట్లను, వజ్రపుగను లున్నవి. భద్రాచలము

నొద్ద గోదావరిలోకూడ రవ్వలు దొరకినవి. బంగనపల్లె గుండ్లపొరనుంచి లభించిన వజ్రములు ఎక్కువభాగము చిన్నవైనను దీనికి దూరముననున్న కృష్ణానదిగర్భము లోను, గ్రానైట్ నైసులలోను పెద్దవజ్రములు దొరికేవట. కోల్లూరు, పరిటాల గనులు గుంటూరు, కృష్ణాజిల్లాలలో కృష్ణ ఒడ్డుననే యున్నవి. ఇప్పటికి పాతగను లున్న చాల చోట్ల వర్షము కురిసిన వెంటనే రవ్వలు భూమిపై మెర యును. ఈ నదీశయ్యలలోను, గుత్తి, పత్తికొండతాలూ కాలలోను, బంగనపల్లె గుండ్లపొరలోను, వజ్రములకై వెదుకదగిన ప్రాంతము చాలగలదు.

ఇనుము (Iron) :- ఆంధ్రలో ఉక్కుపరిశ్రమకు చాలిన లోహమ్లజనిదము లేక హిమటైట్ (Haematite) నిధులు లేవు. అనంతపురం జిల్లా రాయదుర్గము తాలూకాలోని రాగికొండలలో నూటికి 60 పాళ్ళు ఇనుమున్న హిమ టైట్ ధాతువు 5 లక్షలటన్నులు కలదు. ఇది ధార్వార సంహతికి చెందిన హిమటైట్ క్వార్ట్జైట్లలో ( Haematite Quartzites) నున్నది. కర్నూలుజిల్లాలో రామల్ల కోట, వెల్దుర్తి ప్రాంతమున భూకంపములతో బ్రద్దలైన కడపరాళ్ళలో 51 నుంచి 65 పాళ్ళు ఇనుమున్న హిమ టైట్ ధాతువు 37 లక్షల టన్నులు దొరకును. ఇనుము తక్కువపాలుగల చిన్న హిమటైట్ నిధులు కడప జిల్లాలో చాబలివద్ద పులివెండ్ల క్వార్ట్జైట్లలోను, మాగ్న టైట్ క్వార్ట్జైట్లు విరివిగా గుంటూరు, నెల్లూరు జిల్లాల లోను ఉన్నవి. కృష్ణాజిల్లాలో జగ్గయ్యపేట పరిసరాలలో నేలమట్టమునందు కూడిన పలుచని ఇనుపరాళ్ళ పొర యొకటి కలదు. ఇక్కడ 61 పాళ్ళు ఇనుముకల హిమ టైట్ ధాతువు 25 లక్షల టన్నులు దొరకును.

రాగి (Copper), సీసము (Lead) :- విజయనగర సామ్రాజ్యపు రోజులనాటి పాత రాగిగనులు నెల్లూరు జిల్లాలో గిరిమెనపెంట, కర్నూలుజిల్లాలోగని, గుంటూరు జిల్లాలో అగ్నిగుండాలవద్ద కలవు. ఈ చోట్ల రాగి ఖనిజ మగు మాలకైట్ (Malachite) తో కూడిన పలుగురాతి నాళములు వేర్వేరు రాళ్ళను చొచ్చియున్నవి. 1800 తరువాత గరిమెనపెంట గనియొద్ద తిరిగి త్రవ్వెదు ప్రయత్నాలు జరిగి, కొన్ని నిష్ఫలమై, కొన్ని ఇతర కారణముల వలన ఆగిపోయినవి. ఈ స్థలములలో భూభౌతిక పరిశోధనలు జరుగుచున్నవి. కాని ఇంతవరకు లాభకరముగా త్రవ్వదగ్గ నిధులున్నట్లు నిరూపింపబడలేదు.

వెండితోకూడిన సీసగంధకిదము, గెలీనా (Galena), కడప, కర్నూలు, గుంటూరు, చిత్తూరు జిల్లాలలో కొన్ని చోట్ల సూక్ష్మముగ గలదు. కర్నూలు జిల్లా ద్రోణాచలము తాలూకాలో చిత్యాలవద్ద గ్రానైట్ నెరెలలో చెదరి వ్యాపించిన చిన్న నిధులను 30 ఏండ్లక్రిందట త్రవ్వి, నష్టకరమని మానివేసిరి. *ఈ గనులున్న కొన్నిచోట్ల బోరింగులతో లోతున ధాతువెంతయున్నది తెలిసికొ నగును.

కురువిందము (కోరండం), ఎఱ్ఱరాయి (గార్నెటు) :- కోరండం, గార్నెట్ మిక్కిలి కఠినమైన ఖనిజములు గనుక, వీనిని మెరుగు పనులకును, కురువిందమును (corundum) సానచక్రములకును, వాడుదురు. కురువింద నిధులు అనంతపురం జిల్లాలో అనంతపురం, కల్యాణదుర్గం, ధర్మవరం, హిందూపురం తాలూకాలలో అతి క్షారశిలల లోను (Ultrabasic Rocks), సయనైట్లలోను (Syenites), కొన్నిచోట్ల కలవని వ్రాసిరి. ఇవి పరీక్షింపదగినవి. ఇదివరకు హిందూపురం తాలూకాలో పరిగినుండి చాల ఖనిజము ఎగుమతి చేయబడినది. గార్నెట్ నెల్లూరు జిల్లాలో గిద్దలూరు, సైదాపురము మున్నగుచోట్ల అభ్రక విభాజీయ శిలలలోను, తూర్పు కనుమలలో ఖోండలైట్ చార్నొకైట్లలో ప్రవహించు వాగుల ఇసుకలోను విరివిగ లభించును. విద్యుత్తు చౌకగాదొరకినప్పుడు, ఇతర పరి శ్రమలతోపాటు ఈ ఖనిజములనుండి మెరుగు పదార్థ ములను అధికముగ తయారు చేయవచ్చును.

ఇతర ఖనిజములు :- 1,800° సెం. వేడిని, విద్యుత్తును నిరోధించు కయనైట్, సిల్లిమనైట్ ఖనిజములు గ్లాసు కొలుములలోను, విద్యుత్ప్రింగాణి మున్నగువాటిలోను, నుపయోగపడుచున్నవి. కయనైట్ నిధులు నెల్లూరు

---

*గుంటూరులో కారెంపూడి సమీపమున గెలీనా ఇతర గంధకిద ఖనిజములతోకూడి, కడపసంహతికి చెందిన డోలోమైట్ లైంస్టోన్లలో ( Dolomitic-Limestons) కొంతదూరము వ్యాపించి యున్నది. ఈచోట్ల గెలీనా లోతులో అధికముగా నుండు అవకాశములున్నవి.

జిల్లాలో చుండి, ఛత్రం, సైదాపురంవద్దవిభాజీయ శిలలలో కలవు. చుండి, ఛత్రము నిధులలో ప్రతి 10 అడుగులకు 2 వేల టన్నుల కయనైట్ దొరకునని లెక్కవేసిరి. సిల్లిమనైట్, ఖోండలైట్లలో నొకముఖ్య ఖనిజము గనుక, వాటిలో దాని నిధులను కనుగొను అవకాశము కలదు. సిల్లిమనైట్ రేణువులు సముద్ర తీరపు ఇసుకలలో గూడ నున్నవి.

అణుశక్తిని జనింపజేయు ఖనిజమగు మోనజైట్, తెల్లరంగుచేయు ఇల్మనైట్ 2300° సెం. వేడినిపట్టు జర్కాన్ రేణువులుకూడ శ్రీకాకుళం, విశాఖపట్టణము, గోదావరిజిల్లాల సముద్రతీరపు ఇసుకలలో అచ్చటచ్చట నున్నవి. మోనజైట్ విశాఖపట్టణము, భీమునిపట్టణము మధ్య ఇసుకలలో 3 నుంచి 8 పాళ్ళవరకు కలదు. వీటిని ఇసుకనుండి లాభకరముగ విడదీయ వీలగు పద్ధతులు పరిశోధింపబడుచున్నవి.

అల్యూమినముయొక్క ముడిపదార్థమగు బాక్సైట్ (Bauxite) నిధులు విశాఖపట్టణము, గోదావరి జిల్లాలలో ఖోండలైట్ కొండల పైభాగమున చదునుగనుండు ఇష్టికాశిల (Laterites) లెచ్చటైనా కనబడు అవకాశమున్నది.

ఎరువుల కుపయోగపడు అపటైట్ (Apatite) అను ఫాస్ఫేట్ (Phosphate) శ్రీకాకుళం జిల్లాలో దేవాడ, గర్భం, రామభద్రపురం మున్నగుచోట్ల మాంగనీసు గనులనుండి లభ్యమగును. ఇది కోధూరైట్ రాళ్ళకు చెందిన ఖనిజము. సీతారామపురపునిధిలో 30 అడుగుల లోతులోనే 6 వేల టన్నుల ఖనిజము కలదు. అపటైట్ నెల్లూరుజిల్లా పెగ్మటైట్లలో సూక్ష్మముగ నుండుటచే, అభ్రక గనులనుండి కొద్దిగ లభించును.

స్ఫటికములు (Quartz crystals) :- అన్నిజిల్లాలలోను శిలలలో చొచ్చిన పలుగురాతి నాళములలో అచ్చటచ్చట దొరకును. శుద్ధమగు పెద్ద స్ఫటికములు రేడియో, టెలిఫోను పరికరములలోను, చిన్నవి ఆభరణములలో రాళ్ళుగను వినియోగపడును.

చవుడు (Saline Efflorescence) :- కొన్ని స్థలములలో ఎక్కువ ఉప్పుగను (Sodium chloride), మరికొన్నిచోట్ల ఎక్కువ బట్టలసోడాగను పొంగుచుండును. చవిటి ఉప్పు (Earth salt) అనంతపురముజిల్లాలో అనంతపురము, పెనుకొండ తాలూకాలయందు, కడపజిల్లాలో జమ్మలమడుగు తాలూకాయందు, కర్నూలుజిల్లాలో ముఖ్యముగ కంభం, కోయిలకుంట్ల తాలూకాలయందు, గుంటూరుజిల్లాలో నరసారావుపేట, వినుకొండ, సత్తెనపల్లి తాలూకాలయందు అచ్చటచ్చట పొంగుచున్నది. దీనిని మాడలలో కరగించి, వడబోసి, కయ్య (మళ్ళ) లలో నెండనిచ్చి, శుభ్రపరచుదురు. ఈ ప్రాంతాలలో ఏటా ఎంత ఉప్పు లభించునది తెలిసికొనుట అవసరము.

గంధకము (Sulphur) :- ఇది కృష్ణాజిల్లాలో కోనవద్ద కొద్దిగ లభించును. ఇక్కడ 30 ఎకరాల మేర వర్షాకాలములో సముద్రపు నీటితో నిండు పల్లపుభూముల లోని బంద్రులో, సూక్ష్మజీవులచే నేర్పడు గంధక కణములు 2 అడుగుల లోతువరకు కలవు. గంధక మేర్పడు పరిస్థితులు ఇతరచోట్ల కలుగజేయగలిగినచో గంధకోత్పత్తి అధికమగును.

మిక్కిలి వేడిని, విద్యుత్తును నిరోధించు మాగ్నెసైట్ (Magnesite) ను, కొలుములకు లోపైపు పేర్చు నిటుకలకు, విద్యున్నిరోధక వస్తువులకు, సిమెంట్లలోను వాడుదురు. ఇది కర్నూలుజిల్లాలో ముద్దవరము, ముసలయ్య చెరువువద్ద రావిప్పరాతితో కూడి, వేంపల్లి సున్నపు రాళ్ళలో నాళములుగ దొరకును. కాని ఇది సున్నపు రాళ్ళతో నెక్కువగ కలిసిపోయి, లాభకరముగా విడదీయ వీలుకాకున్నది.

బెరిల్ (Beryl) :- ఇది శ్రీకాకుళం జిల్లాలో జీరికివలసవద్ద ఒక పెగ్మటైట్‌లో కనుగొనబడినది. ఇక్కడ సుమారు 10 టన్నుల బెరిల్ దొరకగలదు. బెరిల్‌నుంచి తీయు అతి విలువైన బెరిల్లియం (Beryllium) లోహము అల్యూమినయముకన్న చాల తేలికై, మిక్కిలి వేడి పట్టు శక్తి, దృఢత్వము గలిగి శిథిలముకానందున, దీనిని లోహ మిశ్రమములు, విద్యుత్పింగాణి మున్నగువాటిలో నుపయోగింతురు.

ఈ ఖనిజసంపదనుబట్టి, ఆంధ్రలో సిమెంట్లు, రంగులు, డిటెంపర్లు, మైకనైట్, గ్లాసు, జాడీ, పింగాణి, విద్యున్నిరోధక పరికరములు, బేరియం, కాల్షియం, సోడియం రసాయనములు, మెరుగు సామానులు తప్పక

చేయ వీలగును. బొగ్గు, బంగారు, వజ్రములు, రాగి, సీసము, కురువిందము నిధులకై పరిశోధించవలయును. ఈ పరిశ్రమల అభివృద్ధికి చౌకగలభించు విద్యుత్తు ఎంతయో తోడ్పడగలదు.

| ఖనిజము త్రవ్విన సంవత్సరాలు జిల్లాలు | 1954 వరకు మొత్తం ఉత్పత్తి (టన్నులు) | 1954 వరకు మొత్తం విలువ (రూపాయలు) | 1954 లో ఉత్పత్తి (ట) | 1954 లో విలువ (రు) | ఇతర రాష్ట్రాలలో ఉత్పత్తి చేయు జిల్లాలు |
|---|---|---|---|---|---|
| 1. అభ్రకము 1892-1954 | సుమారు 6,70876 హండ్రడు వెయిట్లు* | సుమారు 4,45,26,670 | 11,496 హం. వై. | 23,01,406 | బిహార్ - హజారిబాగ్, గయ రాజస్థాన్ - మేవాడ్ |
| ముఖ్యముగ నెల్లూరు స్వల్పముగ కృష్ణా, విశాఖపట్టణము. | సుమారు (42,78,226 హం. వై.) | సుమారు (35,15,48,486) | (1,03,381 హం. వై) | 1,55,91,884 | |
| 2. ఇనుము 1952-54 | | | | | |
| కృష్ణా, కర్నూలు, చిత్తూరు, కడప. | 3,41,529 (1,20,88,649) | 21,71,595 (8,88,60,046) | 2,48,672 (43,08,273) | 14,67,864 (2,89,36,036) | బిహార్ - సింగ్‌భూం. ఒరిస్సా - మయూర్‌భంజ్, కిమొణార్ఘూడ్, కట్టక్. మైసూర్ - బళ్ళారి, చిక్కమాగళూరు. హైద్రాబాదు - ఖమ్మముమెట్టు. బొంబాయి - రత్నగిరి. |
| 3. కయనైట్ 1939-48-54 | | | | | |
| నెల్లూరు | 3,875 (2,09,093) | 1,95,479 (2,89,95,002) | 32 (42,330) | 1,625 (37,80,362) | బిహార్-సింగ్‌భూం, మణభూం మైసూరు - హాసణ. ఒరిస్సా - మయూర్‌భంజ్. |
| 4. కాల్సైట్ 1951-54 | | | | | |
| అనంతపురము | 5,688 (12,578) | 48,579 (1,47,301) | 2,284 (5,029) | 27,408 (41,728) | సౌరాష్ట్ర. రాజస్థాన - పలి, జైపూర్. |
| 5. క్రోమైట్ 1941-54 | | | | | |
| కృష్ణా | 19,927 (3,45,492) | 7,25,836 (1,20,23,113) | — (45,507) | — (13,59,607) | మైసూరు- హాసణ, మైసూరు, ఒరిస్సా-కిమొణార్ఘూడ్, కట్టక్ బిహార్ - సింగ్‌భూం. |

*20 హండ్రడు వెయిట్లు = 1 టన్ను = 2240 పౌనులు

| ఖనిజము త్రవ్విన సంవత్సరాలు జిల్లాలు | 1954 వరకు మొత్తం ఉత్పత్తి (టన్నులు) | 1954 వరకు మొత్తం విలువ (రూపాయలు) | 1954 లో ఉత్పత్తి (ట) | 1954 లో విలువ (రు) | ఇతర రాష్ట్రాలలో ఉత్పత్తి చేయు జిల్లాలు |
|---|---|---|---|---|---|
| 6. ఖనిజ రంగులు<br>1946<br>కర్నూలు | పూర్వము జిల్లాలవారీ లెక్కలు దొరుకలేదు. | | 54,367<br>(75,506) | 2,26,836<br>(5,47,139) | వింధ్య ప్రదేశ్ - సత్నా.<br>మైసూరు - బళ్ళారి.<br>మధ్యప్రదేశ్ - జబ్బల్‌పూర్, చాందా.<br>సౌరాష్ట్ర - గోహిల్ వాడ్. |
| 7 గ్రాఫైట్<br>1949-52-54<br>తూర్పు గోదావరి<br>విశాఖపట్టణము | 467<br>(6,262) | సుమారు<br>48,000<br>(6,43,670 | 200<br>(1,479) | 20,000<br>(1,36,561) | ఒరిస్సా - బొలంగీర్, కోరాపుట్, ఢేంకనాల్, సంబల్‌పూర్.<br>బిహార్ - పలామా. |
| 8. జిప్సం<br>1943<br>నెల్లూరు | 193<br>(82,267) | 3,910<br>(2,72,650) | —<br>(6,12,120) | —<br>(41,59,388) | రాజస్థాన్-బికనీర్, జోధ్‌పూర్<br>మద్రాసు - తిరుచిరపల్లి. |
| 9. తెల్లసుద్ద.<br>1953 | పూర్వము జిల్లావారీ లెక్కలుదొరకలేదు. | | 3,246<br>(1,46,144) | 14,875<br>(25,20,084) | |
| 10. పలకరాయి<br>1921-24,47,49<br>కర్నూలు | 3,512 | 19,015 | | | |
| 11. బంగారము<br>1893-1900, 1954<br>చిత్తూరు<br>1910-27<br>అనంతపురం | సుమారు<br>1,85,300<br>ఔన్సులు<br>(93,72,898<br>ఔన్సులు) | 1,15,45,096<br>(58,77,57,785) | 105 ఔ.<br>(2,39,168ఔ.) | 23,780<br>(5,62,06,814) | మైసూరు- కోలారు.<br>హైదరాబాదు - హట్టి. |
| 12. మాంగనీసు<br>1892-1954<br>ముఖ్యముగా శ్రీకాకుళం, స్వల్పముగా విశాఖపట్టణము, కర్నూలు. | 23,54,331<br>(3,82,76,436) | సుమారు<br>10,35,63,936<br>(సుమారు<br>196,94,77,968) | 58,107<br>(16,13,847) | 81,69,430<br>(19,54,17,452) | మధ్యప్రదేశ్ - బాలాఘాట్, భండారా, నాగపూర్.<br>ఒరిస్సా-కియోంఝర్ఘాడ్, బోనై<br>బొంబాయి - పంచ్ మహాల్, ఉత్తర కెనరా. |

| ఖనిజము త్రవ్విన సంవత్సరాలు జిల్లాలు | 1954 వరకు మొత్తం ఉత్పత్తి (టన్నులు) | 1954 వరకు మొత్తం విలువ (రూపాయలు) | 1954 లో ఉత్పత్తి (ట) | 1954 లో విలువ (రూ) | ఇతర రాష్ట్రాలలో ఉత్పత్తి చేయు జిల్లాలు |
|---|---|---|---|---|---|
| 13. ముగ్గురాయి 1918-54 | | | | | |
| కడప, అనంతపురము, కర్నూలు | 3,30,223 (3,54,454) | 42,31,298 (44,51,322) | 16,283 (18,792) | 2,61,379 | రాజస్థాన్ - జైపూర్ |
| 14. రాగి 1926.27.32.43 | | | — | — | |
| నెల్లూరు | 405 | 7,852 | (3,42,750) | | బిహార్ - సింగ్‌భూం |
| 15. రాచిప్పరాయి 1910-54 | | | | | |
| కర్నూలు, నెల్లూరు, అనంతపురం, గుంటూరు. | 47,684 (6,00,706) | 4,10,519 (1,66,51,988) | 722 (42,326) | 16,788 (18,28,191) | రాజస్థాన్ - జైపూర్, ఉదయపూర్, భిల్‌వాడా. మధ్యప్రదేశ్ - జబ్బల్‌పూర్. బిహార్ - హాజారిబాగ్, సింగ్‌భూం. మైసూరు - హాసన్. హైదరాబాదు - కరింనగరు. |
| 16. రాతినార 1924-54 | | | | | |
| కడప | 1,460-75 (8,322,55) | 18,88,551 (24,92,198) | 121-9 (389) | 1,88,011 (2,28,734) | రాజస్థాన్ - ఉదయపూర్, బిహార్-సింగ్‌భూం, మణభూం. మైసూర్ - హాసన. బొంబాయి-బిజాపూర్. |
| 17. వజ్రములు 1909-13 | | | — | | |
| | శతాబ్దముల పూర్వపు లెక్కలు | దొరకలేదు. | | | వింధ్య ప్రదేశ్ - పన్నా. |
| కర్నూలు | 191.79 కారట్లు (421.49 కా.) | 1,440 (66,885) | (1,955 కా.) | (4,74,326) | |
| 18. సమర్స్కైట్ 1911-14, 17, 18, 20 | | | | | |
| నెల్లూరు | 103.6 హం. వె. | 4,668 | — | — | — |

బ్రాకెట్లలోవి సంఖ్యలు ఆ గడువులకు చెందిన భారతదేశపు వివరములు.

**ఆంధ్రదేశపు ఖనిజసంపద II : తెలంగాణము :** కృష్ణా గోదావరి తీరములు తప్ప తెలంగాణ మంతయు స్ఫటమయ విభాజీయ శిలలతో నిండియున్నది. గోదావరి వర్ధానదుల పొడుగునను గోండ్వన శిలలు, వీటిప్రక్కన, కృష్ణా తీరమున, కడప, కర్నూలు శిలలును కలవు. గోండ్వన శిలలనుండి బొగ్గు, ఇనుప గంధకిదము, కట్టడపురాళ్ళు. కొలిమిసుద్ద— కర్నూలు శిలలనుండి సిమెంటుకు సున్నపురాళ్ళు, షాహాబాదు బండలు, కట్టడపురాళ్లు, తెల్లసుద్ద, పలక— స్ఫటమయ విభాజీయ శిలలనుండి కట్టడపురాళ్ళు, ఇనుపరాళ్ళు, పలుగురాయి, ఫెల్స్పార్, రాచిప్పరాయి, సర్పెన్‌టీన్, క్రోమైట్, గ్రాఫైట్, అభ్రకము, మెరుగుడు ఖనిజములు, సీసము, రాగి— లేటరైట్లనుండి ఖనిజపు రంగులు లభించుచున్నవి. 1954 లో తెలంగాణమునందు ఉత్పత్తియైన ఖనిజముల విలువ సుమారు 3·34 కోట్ల రూపాయలు. దీనిలో బొగ్గు విలువయే రు. 3·16 కోట్లు. ఇచ్చటి ఖనిజసంపద దిగువన సూచింపబడినది.

**బొగ్గు (Coal) :** వర్ధా గోదావరినదుల వెంబడి తెలంగాణములో 3,600 చదరపుమైళ్ళు వ్యాపించిన గోండ్వన శిలలయందు బొగ్గుపొర లనేక ప్రదేశములందు కనుగొనబడినవి. కాని ఈ రాళ్ళలో బొగ్గు ఎంతయున్నది సంపూర్ణముగ పరీక్షింపబడలేదు. ఖమ్మముమెట్టుజిల్లా పాలవంచ తాలూకాలో కొత్తగూడెం, ఇల్లిందల తాలూకాలో సింగరేణి, ఆదిలాబాదుజిల్లా ఆసీఫాబాదు తాలూకాలో తాండూరు గనులనుండి బొగ్గు విరివిగా (14½ లక్షల టన్నులు) ఉత్పత్తి యగుచున్నది. ఈగనులయందు 15 వేలమంది కార్మికులు పనిచేయుచున్నారు. ఈప్రాంతమున సుమారు 100 కోట్ల టన్నులు బొగ్గు గలదని లెక్క వేసిరి. ఈ బొగ్గు ఉక్కు పరిశ్రమలో ప్రస్తుతము వాడబడు 'కోకింగ్' (coking) రకము కాదు. ఇది ముఖ్యముగ రైలు ఇంజన్లలోను, విద్యుత్ సిమెంటు, జాడీ, పింగాణీ, బట్టలపరిశ్రమలు మున్నగువాటిలోను దక్షిణ భారతదేశమునందెల్ల వాడబడుచున్నది. హైదరాబాదులోని కేంద్ర పరిశోధనాలయ కృషివలన, దీనినుండి పొగ లేకుండా ఎక్కువ వేడితోనుండు "కోల్‌సైట్ (coalsite) తదితర పదార్థములు తయారగుచున్నవి. ఈ బొగ్గు యొక్క ఇతర ఉపయోగములుకూడ పరిశోధింపబడుచున్నవి.

**సిమెంటుకు సున్నపురాళ్ల (Limestones for Cement) :** సిమెంటు కుపయోగించు సున్నపురాళ్లు కర్నూలు శిలలలో విరివిగా కలవు. గుల్బర్గా జిల్లాలోని అసోసియేటెడ్ సిమెంటుకంపెనీలవారి షాహబాద్ సిమెంటువర్క్సులో వాడు సున్నపురాళ్ళు హైదరాబాదుజిల్లా తాండూరు, వికారాబాద్ తాలూకాలనుండియు, మహబూబ్‌నగరు జిల్లా కొడంగల్లు తాలూకానుండియు కూడ లభించుచున్నవి. ఇట్టిరాళ్ళు మహబూబ్‌నగరుజిల్లా అలంపూరు, కొల్హాపూరు తాలూకాలలోను, నల్లగొండజిల్లా మిరియాలగూడ, హుజూర్‌నగరు తాలూకాల యందును, కరీంనగరుజిల్లాలో సుల్తానాబాదు తాలూకాయందును, ఆదిలాబాదు జిల్లాలో ఆదిలాబాదు, ఆసిఫాబాదు తాలూకాలయందును ఎక్కువగానున్నవి.

**కట్టడపురాళ్ళు (Building stones) :** తెలంగాణములో విలువయైన కట్టడపురాళ్ళగు గ్రానైట్లకు కొరతలేదు. హైదరాబాదులోని లింగంపల్లి గనుల గ్రానైట్లతోనే బొంబాయి హార్బరును, ఉస్మానియా విశ్వవిద్యాలయ భవనములను నిర్మించిరి. కర్నూలు సంహతికిచెందిన చక్కని సున్నపురాళ్ళు, షాహాబాదు బండలు (చపటలు) తీయు గనులు పైనపేర్కొనిన ప్రాంతములలో ననేక చోట్ల గలవు. కర్నూలు, గోండ్వన శిలలలో కట్టడములకు ఉపయుక్తమగు క్వార్ట్‌జైట్లు, ఇసుకరాళ్ళు చాలయున్నవి. మేలువన్నెలుగల పాలరాళ్ళు ఖమ్మముమెట్టుజిల్లా మధిర, ఖమ్మముమెట్టు, ఇల్లిందల తాలూకాలలో స్ఫటమయ శిలలయం దచ్చటచ్చట లభ్యమగును. గ్రానైట్లలో గోడలవలె (Dykes) ఏర్పడిన నల్లటి స్ఫటమయ శిలలుకూడ వరంగల్లు కోటలోను, నల్లగొండజిల్లాలో సూర్యాపేట సమీపమున నున్న పిల్లలమర్రిలోను చెక్కడములకు వాడబడినవి.

సున్నపుకంకర ముఖ్యముగ హైదరాబాదు జిల్లాలో తూర్పు పశ్చిమ తాలూకాలు, షహాబాదు, ఖమ్మముమెట్టు తాలూకాలలోను, ఇసుక, నదులనుండి, పెద్దవాగులనుండి లభించుచున్నవి.

**ఇనుపరాళ్ళు (Iron ore) :** ధార్వాడ శిలలనుండి విడివడిన ఇనుప రాతిగుండ్లను (float ore ఇనుము

నూటికి 55-65 పాళ్ళు) ఖమ్మముమెట్టు తాలూకాలో అప్పనరసింహాపురము, ఇల్లిందల తాలూకాలో బయ్యారం మున్నగుచోట్ల 1954 నుండి త్రవ్వ మొదలిడిరి. ఈ సంహతికి చెందిన తక్కువరకపు ఇనుపరాళ్ళు (ఇనుము 35-40 పాళ్ళు) కరీంనగరుజిల్లా హుజూరాబాదు తాలూకాలో యడవల్లి ప్రాంతమున, జగ్తియాల తాలూకాలో ఛందోలి, ఆదిలాబాదు జిల్లా ఖానాపూర్ తాలూకాలో చిత్యాల, కల్లెడ, దస్తూరబాదు వద్దసుమారు 4కోట్ల టన్నులుండును. వీటినుండి ఉక్కు చేయు విధానమును రాష్ట్రప్రభుత్వము పరిశీలింప జేయుచున్నది.

పలుగురాయి(Quartz) ఫెల్స్పార్ (Felspar) : హైదరాబాద్ పశ్చిమ తాలూకా పెగ్మటైట్లనుండి పలుగురాయి, ఫెల్స్పార్ కొంత హైదరాబాదు గ్లాసు పింగాణీ పరిశ్రమలలో వాడబడుచు, కొంత బొంబయి మున్నగు బయటి కేంద్రములకు పంపబడుచున్నది. ఈ ఖనిజములు మహబూబ్ నగరు జిల్లాలో పాద్‌నగరు, మఖ్తల్, నల్లగొండ జిల్లాలో మిరియాలగూడ, దేవరకొండ తాలూకాలలోను. మెదకు జిల్లాలో చాలచోట్ల పెగ్మటైట్లనుండి లభ్యమగును, మహబూబ్‌నగరు జిల్లా కొడంగల్లు తాలూకాలో శుద్ధమగు క్వార్ట్జైట్లు, ఇసుకరాళ్ళుకూడ నున్నవి.

చవిటిసోడా (Saline efflorescence) : మఖ్తల్ తాలూకాలో చాలచోట్ల, దేవరకొండ తాలూకాలో పెద్దసర్లపల్లి. గోండ్లపల్లివద్ద చేయుచున్నారు.

తెల్లసుద్ద (Kaolin) కొలిమిసుద్ద (Fireclay) : పింగాణి పరిశ్రమ కుపయోగించు తెల్లసుద్దను మెదకుజిల్లా జహీరాబాదు తాలూకాలో మైఖాపూరు, హైదరాబాదు జిల్లా తాండూరు తాలూకాలో గింగుర్తి. మహబూబునగరు జిల్లా పరిగి తాలూకాలో శ్రీరంగాపురం, కుందుర్గు వద్ద వేర్వేరు రాళ్ళనుండి త్రవ్వుచున్నారు. నల్లగొండజిల్లా హుజూరునగరు తాలూకాలో చింత్రియాలవద్ద కర్నూలు సుద్దరాళ్ళలో (Shale) 80 వేల టన్నుల తెల్లసుద్దగలదని అంచనా వేసిరి. వరంగల్లు జిల్లా పాకాల (నర్సంపేట) తాలూకాలో మద్దిగూడెం, ఖమ్మముమెట్టుజిల్లా ఇల్లిందల తాలూకాలో మిరియాల పెంటవద్దకూడ తెల్లసుద్ద కొద్దిగా దొరకును.

ఆదిలాబాదు జిల్లా ఆసీఫాబాదు తాలూకాలో పచ్‌గాంవ్ ప్రాంతమున గోండ్వన శిలలయందున్న మేలు రకపు కొలిమి సుద్ద రాళ్ళుపేటవద్ద త్రవ్వబడుచున్నది. ఈ సుద్ద పచ్‌గాంవ్ వద్దనే 50 లక్షల టన్నులు, బుత్కమల్ వద్ద 2 లక్షల టన్నులు గలవని లెక్క వేసిరి.

రాచిప్పరాయి (Steatite) : కరీంనగరు తాలూకాలో మక్దుంపూరు, ఖమ్మముమెట్టు జిల్లా ఇల్లిందల తాలూకాలో రాగబోయినగూడెం మున్నగుచోట్ల స్ఫటమయ విభాజీయ శిలలలో త్రవ్వు రాచిప్పరాయి అధిక భాగము శిర్పూరు పేపరుమిల్లులో తొట్లకు లోవైపు పేర్చుటకు వాడబడుచున్నది. కరీంనగరు జిల్లాలో మెట్టపల్లి, సుల్తానాబాదు తాలూకాలో తురకల మద్దిగుంట, నిజామాబాదు జిల్లా ఆర్మూరు తాలూకాలో ఛోటపల్లి, నల్లగొండ జిల్లా దేవరకొండ తాలూకాలో కొలకపల్లి, ఇల్లిందల తాలూకాలో జస్తయపల్లివద్ద లభించు రాచిప్ప రాయితో జాడీలు, రాతిపాత్రలు మున్నగునవి చేయుదురు. మహబూబునగరుజిల్లా మఖ్తల్ తాలూకాలో అభంగ పట్టణము హైదరాబాదు జిల్లాలో ఆరేమట్ల, లామూరుల వద్దను మలినమగు రాచిప్పరాయి దొరుకును.

సర్పెంటైన్ (Serpentine) : నల్లగొండజిల్లా హుజూర్ నగరు తాలూకాలో బత్తులపాలెం, మహబూబ్‌నగరుజిల్లా కలవకుర్తి తాలూకాలో జూపల్లివద్ద రాచిప్పలు చేయుటకు వాడబడుచున్నది.

ఖనిజపు రంగులు (Ochres) : ఎర్రసుద్ద మెదకుజిల్లా జహీరాబాదుతాలూకాలో మైఖాపూరువద్దను, పచ్చసుద్ద హైదరాబాదు జిల్లా వికారాబాదుతాలూకాలో నైదాలిపుర వద్దను, దక్కన్ లావాలపై (ఇష్టికాశిల) (లేటరైట్లలో) త్రవ్వబడుచున్నది.

క్రోమైట్ (Chromite) : మధిర తాలూకాలో ప్రవేశించిన కొండపల్లి కొండలలో క్రోమైట్ అచ్చటచ్చట గలదు. 1954 లో దెందుకూరువద్ద దీనిని త్రవ్వ నారంభించిరి.

గ్రాఫైట్ (Graphite) : గ్రాఫైట్ ఖమ్మంమెట్టు జిల్లా పాలవంచ తాలూకాలో గుండ్లమడుగు, మందులబుడవ మున్నగుచోట్ల గార్నెట్‌తో కూడిన నైసులలో 2 అడుగులలోపు మందముగల నాళములనుండి లభించుచున్నది.

గంధకము (Sulphur) : తాండూరు, కొత్తగూడెం, బొగ్గుగనులనుండి ఉత్పత్తియగు బొగ్గులో పొరలమధ్యన అక్కడక్కడ నుండు ఇనుపగంధకిదమును (pyrite) ఏరి తీయుదురు. తాండూరు గనులవద్ద ఈ రీతిని ఒక్క బొగ్గు పొర (seam) నుండియే ప్రతినెలా 40 టన్నుల గంధకిదము దొరుకుచున్నది.

అభ్రకము (Mica) : కెంపు వన్నెగల మస్కొవైట్ అభ్రకము ఖమ్మముమెట్టుజిల్లా పాలవంచ తాలూకాలో పూజారి మొక్కొడివద్ద, మధిర తాలూకాలో కల్లూరు సమీపముననుు, హార్న్‌బ్లెండ్ అభ్రక నైసులను చొచ్చిన పెగ్మటైట్లలో లభ్యమగును.

పలక (Slate) : ఇల్లిందల తాలూకాలో తుమ్మల చిలకవద్దను, నల్లగొండజిల్లా మిరియాలగూడ తాలూకాలో వజీరాబాదువద్దను పలకలు కోయుటకు వీలయిన గట్టి సుద్దరాళ్ళు గలవు.

మెరుగుడు (Abrasives) ఖనిజములు : ఆభరణముల కుపయోగించు పారదర్శకమగు ఎరుపు గార్నెట్, కయనైట్ పాలవంచతాలూకాలో గరికపేట, కాకెర్ల ప్రాంతముల లభించును.

పాలవంచ తాలూకాలో రంగాపూరువద్ద 2500 టన్నుల కురువిందము నయసైట్లలో గలదు. ఇది మిరియాలగూడ తాలూకాలో పెద్దగూడెము ప్రాంతమున, ఖమ్మముమెట్టు తాలూకాలో గుబ్బగుర్తివద్దను, పాలవంచ తాలూకాలో కన్నెగిరి కొండలయందునుకూడ నున్నది.

వజ్రములు (Diamonds) : ఆంధ్రదేశములో కొంత భాగ మొకప్పుడు, గోల్కొండ రాజ్యములో చేరియుండెను. ఇక్కడి వజ్రములు గోల్కొండ మార్కెటు నుండి ప్రపంచమంతయు వ్యాపించుటచే, వీటికి గోల్కొండ వజ్రము లని పేరువచ్చెను. పాతవజ్రపుగనులు కృష్ణ కుత్తరపు టొడ్డునను, మహబూబునగరుజిల్లాలోను చాలచోట్ల నున్నవి.

సీసము (Lead) : గెలీనా నల్లగొండజిల్లా దేవరకొండ తాలూకాలో పెద్ద అర్సిల్లపల్లి, చిన్న అర్సిల్లపల్లి చింతకుంట, మల్లెపల్లి, కొన్నెరిగూడెం, మిరియాలగూడ తాలూకాలో నందికొండవద్ద కాల్సైట్, వలుగురాతి నాళములలో కొద్దిగగలదు.

రాగి (Copper) : పాలవంచ తాలూకాలో యాలంబయలువద్ద, నల్లగొండజిల్లా హుజూర్‌నగరుతాలూకాలో చింత్రియాలవద్ద, మహబూబ్‌నగరుజిల్లాలోని గద్వాల, మక్తల్, అచ్చంపేట తాలూకాలలో కొన్నిచోట్ల పాత రాగి గనులున్నవి.

## 1954 లో తెలంగాణా ఖనిజోత్పత్తి

| ఖనిజము | జిల్లా - తా. | ఉత్పత్తి (ట) | | విలువ (రు.) | |
|---|---|---|---|---|---|
| | | తాలూకావారి | మొత్తము | తాలూకావారి | మొత్తము |
| ఇనుము : | కరీంనగరు-జి. | | | | |
| | హుజూరాబాద్-తా. | 800 | — | 8,000 | — |
| | ఖమ్మముమెట్టు-జి. | | | | |
| | ఇల్లిందల తా. | 2,810 | — | 28,100 | — |
| | ఖమ్మముమెట్టు-తా. | 36,099 | 39,709 | 3,60,990 | 3,97,090 |
| క్రోమైట్ : | ఖమ్మముమెట్టు-జి. | | | | |
| | మధిర-తా. | 69 | 69 | 2,760 | 2.760 |
| ఖనిజరంగులు : | మెదకు-జి. | | | | |
| | జహీరాబాద్-తా. | 85 | — | 1,700 | — |
| | హైద్రాబాదు-జి. | | | | |
| | వికారాబాదు-తా. | 100 | 185 | 2,000 | 3,700 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| గ్రాఫైట్ : | ఖమ్మముమెట్టు-జి. | | | | |
| | పాలవంచ-తా. | 28 | 28 | 2,150 | 2,150 |
| తెల్లసుద్ద : | మహబూబునగరు-జి. | | | | |
| | పరిగి-తా. | 2 | 2 | — | — |
| కొలిమిసుద్ద : | ఆదిలాబాదు-జి. | | | | |
| | ఆసీఫాబాద్-తా. | 715 | 715 | 7,394 | 7,394 |
| పలుగురాయి : | హైద్రాబాదు-జి. | | | | |
| | పశ్చిమ-తా. | 3,666 | 3,666 | 73,320 | 73,320 |
| ఫెల్స్పార్ | పశ్చిమ-తా. | 1,230 | 1,230 | 16,400 | 16,400 |
| బొగ్గు: | ఆదిలాబాదు-జి. | | | | |
| | ఆసీఫాబాదు-తా. | 4,72,982 | — | 1,03,73,579 | — |
| | ఖమ్మముమెట్టు-జి. | | | | |
| | ఇల్లిందల-తా. | 1,45,440 | — | — | — |
| | పాలవంచ-తా. | 8,39,765 | 14.58,187 } | 2,11,83,899 | 3,15,57,478 |
| రాచిప్పరాయి : | కరీంనగరు-జి. | | | | |
| | కరీంనగరు-తా. | 75 | — | 4,737 | — |
| | ఖమ్మముమెట్టు-జి. | | | | |
| | ఇల్లిందల-తా. | 10 | 85 | 150 | 4,887 |
| సున్నపురాళ్లు : | ఆదిలాబాదు-జి. | | | | |
| (సిమెంటుకు | ఆదిలాబాదు-తా. | 1,398 | — | 7,616 | — |
| షాహాబాద్ | ఆసీఫాబాదు-తా. | 15,011 | — | 8,073 | — |
| బండలు) | కరీంనగరు-జి. | | | | |
| | సుల్తానాబాదు-తా. | 1,910 | — | 877 | — |
| | మహబూబునగరు-జి. | | | | |
| | కొడంగల్లు-తా. | 422 | — | 2,700 | — |
| | హైద్రాబాదు-జి. | | | | |
| | తాండూరు-తా. | 87,882 | — | 8,34,175 | — |
| | వికారాబాదు-తా. | 516 | 1,07,139 | 2,200 | 8,60,441 |
| | | | 16,11,390 | | 3,29,25,620 |
| కట్టడపురాళ్ళు, సున్నపుకంకర, ఇసుక | | | 1,76,274 | | 2,29,606 |
| (సగము వివరములు తెలియవు.) | | | 16,11.390+ | | 3,29,25,620+ |
| మొత్తం ఖనిజసంపద. | | | (1,76,274×2) | | (2,29,606×2) |
| | | | =19,63,938 | | (=3,33,84,832) |
| | | | | | లేక 3.34 కోట్లు |

ఎన్. వి. బి. యస్. డి.

**ఆంధ్రప్రదేశము : I ఆంధ్ర :** ఆంధ్ర దేశము 14° మొదలు 20° డిగ్రీలు ఉత్తర అక్షాంశములమధ్యను, 77° మొదలు 85° డిగ్రీలు తూర్పు రేఖాంశములమధ్యను వ్యాపించి ఉన్నది. ఇంతకుపూర్వము మదరాసురాష్ట్రములో ఉండి, 1953 లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రముగా ఏర్పాటుకాబడిన నూతనాంధ్రదేశము 63,417 చ. మైళ్ల వైశాల్యముతోను, 20,507,801 జనాభాతోను నిండి ఉన్నవి. వైదామ్‌కొలత ననుసరించి ఇది మధ్యరకపు వైశాల్యముగల భూభాగము అగును.

**ఉనికి, సహజస్థితి, భూ విభాగము:** ఆంధ్రదేశము హిందూస్థానము యొక్క దక్షిణ ప్రాంతముయొక్క మధ్యభాగములో తూర్పుతీరానికి అనుకొని ఉన్నది. పశ్చిమాన ఈ భూఖండము దక్కను పీఠభూమిలోనికి చొచ్చుకొని ఉండి, తూర్పు కనుమలనెడు విచ్ఛిన్న పర్వత శ్రేణుల కాలవాలమై ఉన్నది. స్థూలదృష్టిలో ఈ దేశము (i) తీరప్రాంత మైదానము, (ii) తూర్పుకనుమల సమోన్నత మైదానము (iii) దక్కను పీఠభూమికి సంబంధించిన ఉన్నతప్రదేశము అను మూడు ప్రాంతాలుగా ఉన్నప్పటికి భూగోళ శాస్త్రజ్ఞులు వారి దశసూత్ర విభాగము ననుసరించి ఆంధ్రదేశమును ఈ క్రింద నుదహరించిన ఆరు సహజ భౌతిక ప్రాంతాలుగా నిర్ణయించుచున్నారు. (1) కృష్ణా - గోదావరి డెల్టాప్రాంతము. (2) తీరప్రాంత మైదానము. (3) తూర్పుకనుమల ఉత్తరప్రాంతము. ఇది గోదావరి - వంశధారానదులమధ్య నున్నది. (4) తూర్పు కనుమల - దక్షిణప్రాంతము - ఇందులో నల్లమలలనెడు కొండలు - వెలికొండ, పాలకొండ పర్వతాలు ఉన్నవి. (5) పశ్చిమ - పీఠభూమి. (6) నూగూరు - భద్రాచల ప్రాంతము అను ఈ ఆరు భాగాలు ఈ రాష్ట్రముయొక్క భౌతికస్థితిని తెలుపుచున్నవి. ఆంధ్రదేశములో కృష్ణా గోదావరీనదులు ప్రజలకు జీవనాధారము లనుటలో నతిశయోక్తి లేదు. వీటి రెంటినీ కలుపుచు కొల్లేరుసరస్సు ఉన్నది. ఈ సరస్సు తమ్మిలేరు మొదలైన జలవాహినుల నుండి జలమున్వీకరించి ఉప్పుటేరుద్వారా సముద్రము లోనికి వ్యాపించి ఉన్నది. ఈ రెండు నదులయొక్క సంపూర్ణాభివృద్ధిమీదనే ఆంధ్రదేశముయొక్క భవిష్యత్తు ఆధారపడి ఉన్నది. తూర్పుకనుమల కొండలు ఎత్తు తక్కువ, మధ్యమధ్య మైదానాలున్నవి. నిమగిరి కొండలు 5,000 అడుగుల ఎత్తువరకు ఉన్నవి. దేవగిరి, మహేంద్ర గిరి శిఖరాలు, దక్షిణములో నల్లమల, ఎర్రమలకొండలు, మంటికొండ, భైరవికొండ శిఖరాలు ముఖ్యమైనవి. పీఠభూమి ప్రాంతము సముద్రమునకు 1,500 మొదలు 1800 అడుగులవరకు ఎత్తున ఉన్నది.

**వర్షపాతము : శీతోష్ణస్థితి :** ఆంధ్రదేశములోని శీతోష్ణస్థితి, వర్షపాతము బంగాళాఖాతములోని ఋతుపవనముల ప్రభావముననుసరించి మారుచుండును. తీరప్రాంతము ఉభయ మాన్‌సూనులనుండి వర్షమును పొందుచున్నను, ఎండకాలపు నైరృతి పవనాలనుండి అత్యధికవర్షమును పొందుచున్నది. డెల్టాప్రదేశాలయందు వర్షము ఎక్కువ. పశ్చిమానికి వెళ్ళినకొద్దీ వర్షము తగ్గిపోవుచుండును. దక్కను పీఠభూమిలో ఉన్న రాయలసీమ ప్రాంతము పశ్చిమ కనుమలయొక్క వర్షచ్ఛాయలో (Rain shadow) ఉండుటవల్ల క్షామానికి గురి అవుచున్నది. మేనెలలో ఎండకాలము ఉచ్చదశ నందుకొనును. డిశంబరులో చలి ముదురును. విశాఖలో 92°, నెల్లూరులో 104.6°, కడపలో 105.9°, గుంటూరులో 115°, విజయవాడలో 120°, భద్రాచలములో 125° వరకు ఉష్ణోగ్రత పోవును. జనవరిలో అల్పఉష్ణము విశాఖలో 68°, నెల్లూరులో 67°, కడపలో 65.2° ఉండును. వరి పండుటకు వీలైన ఉష్ణోగ్రత జూన్, జులై మాసాలలో కోస్తాప్రాంతము అంతటను ఉండుటవల్ల అచట వరిపంట ఎక్కువగా ఉన్నది. వర్షము దక్షిణములో 35″, నైరృతిలో 20″ నుండి బయలుదేరి ఉత్తరములో 40″ వరకును, ఈశాన్యములో 55″ వరకును పెరుగును. నెల్లూరులో నవంబరులో 11.7″ లును, కాకినాడలో జులైలో 6.4″ లును, అక్టోబరులో 8.6″ లును, విశాఖపట్టణములో అక్టోబరులో 8.9″ లును వర్షము పడుచున్నది. దక్షిణ పీఠభూమిలో బళ్లారిలో సెప్టెంబరులో 4.8″ లును, కర్నూలులో 6.0″ పడుచున్నది. దక్కను పీఠభూమిలో మొత్తముమీద 20″ వర్షముకన్న ఎక్కువ పడదు. దేశములో ఎక్కువభాగములో 25″ మొదలు 30″ వర్షము పడుటవలన తీరభాగములో పల్లపు వ్యవసాయమును, మధ్యభాగములో మెట్టవ్యవసాయమును ముఖ్యస్థానమును ఆక్రమించియున్నవి.

భూసారము : వృక్షసంపద : ఆంధ్రదేశములోభూములు మొత్తముమీద చాల సారవంతమయినవి. తూర్పున కృష్ణా, గోదావరి డెల్టాలలో నల్లటి ఒండ్రుమట్టినేలలు అత్యధిక సారవంతమయినవి. సామాన్యపు నల్లమట్టి మొదలు చిక్కటి రేగడలవరకు నేల సారవంతముగాను, నీళ్ళు ఇంకునదిగాను ఉండును. ఇందులో కొన్ని బురద నేలలుకూడ ఉన్నవి. పర్వతప్రాంతము తగిలినప్పుడు ఎర్రటినేలలు విస్తారముగా కనబడుచుండును. వాటిలో మామిడితోపులు విస్తారముగా నుండును. తూర్పుతీరపు ఇసుకనేలలలో కొబ్బరిచెట్లు వాటి అంతట అవే పెరుగును. కొన్ని నెలలు పీఠభూమిమీద గోదుమరంగుతో నుండు చుండును. పశ్చిమమునకు పోయినకొద్ది నేలయొక్క సారము తగ్గుచున్నట్లు కనుపించినను అక్కడకూడ నీరు తగిలినప్పుడు భూమి అన్నిపంటలు పండగల శక్తిని చూపించినది. చెరువులక్రింద సాగయ్యెడు మాగాణి భూములను, తోటలను, చిన్నచిన్న మడులను చూచి నప్పుడు ఈ సంగతి స్పష్టమగును. పీఠభూమియావత్తు ప్రత్తి పండించుట కనువయిన పాతకాలపు నల్ల నేల లున్నవి. కొండనేలలలో అనేక ఖనిజ మిశ్రితములయిన నేలలు పంటలకు వీలుగా ఉండి, అనేక రకాలుగా వృక్ష సంపదకు తోడ్పడుచున్నవి. చక్కనినేల, సామాన్య వర్షముగల అన్నిదేశాలలో ప్రకృతిసిద్ధమయిన వృక్ష సంపద పెరిగియుండును. ఆంధ్రదేశములో అడవిమొదలు తుప్పవరకు వృక్షలతాసంబంధమయిన చెట్లు పెరుగు చుండుట కనబడును. దక్కను వర్షచ్ఛాయలో 15 మొదలు 20 అంగుళముల వర్షము ఉండుటవలనను, నేల మంచిది యగుటవలనను, ఆ ప్రాంతము యావత్తు అడవితో నిండియున్నది. ఇక్కడ మేలుజాతి కర్ర లేక పోయినను అనేకరకాలచెట్లు ఈ అడవులలో ప్రసిద్ధముగా ఉండియున్నవి. తూర్పుతీరములోని అడవులను కొట్టివేసి భూమిని వ్యవసాయమునకు ఉపయోగించుచున్నారు. ఇంకా విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలలో నర్సీపట్నం భద్రాచలము ప్రాంతములు అటవీమయముగా ఉన్నవి. పశ్చిమమునకు వెళ్ళినకొద్ది అడవి పలుచబడి, బీడుభూము లుగా మారును. బీడనగా, అక్కడక్కడ చిన్నచిన్న చెట్లతో విశాలమై రాతినేలలతోకూడి ఉండే విశాల ప్రదేశము. ఇది హైదరాబాదు రాష్ట్రమునం దంతటను నిండి ఉన్నది. ఇటువంటి ప్రదేశాలే నీటివసతిపొంది ఆధునిక యంత్రవ్యవసాయమునకు అనుగుణమయిన భూములుగా మారుచున్నవి. మిగతా చెట్లు వంటచెరకుకు పనికివచ్చే సన్నరకపు చెట్లు. ఆంధ్రదేశములో నాలుగవవంతుగాని, అయిదవవంతు గాని అడవుల పెంపకానికి కేటాయించా లని కేంద్ర సంస్థ సూచించినది. ప్రస్తుతము అడవులు 16.5 వంతులు మాత్రమే ఉండి నూటికి ఆరు వంతులు తోటలుగా ఉన్నవి. వ్యవసాయ క్షేత్రము నూటికి 18.2 వంతులు. ఏ విధముగాను ఉపయోగింపబడకుండ ఉన్న భూమి 15.4 వంతులుండును. వ్యవసాయముచేసే భూమి తలకు ఒక యెకరము మాత్రము వచ్చును. ఈ భూము లన్నియు వృద్ధిచెందుటకు నీటి వసతి అత్యవసరముగా ఉన్నది.

నీటిపారుదల - ప్రణాళికలు : ఋతుపవనములయొక్క వర్షము అనేకవిధాల మానవాభివృద్ధికి వ్యతిరేకమైన పంథాలో ఉన్నది. ఒక సంవత్సరము ఎక్కువగాను, ఇంకొక సంవత్సరము తక్కువగాను కురియుచుండును. ఈ అతివృష్టి, అనావృష్టి దోషము అలాఉండగా, కురిసిన నీరు నదులుగా ఏర్పడి, వేగము ఎక్కువగా లేని పీఠ భూముల మీద ప్రవహించి, వరదలకు కారణము అవు చున్నది. కొన్ని సమయాలలో వర్షముకురిసే చోటనే పంటలకుపనికిరాని కొండప్రదేశము ఉండుటవల్ల అక్కడ ఉపయోగపడదు. ఈ యిబ్బందులను అన్నిటిని సర్దుబాటు చేయవలెనన్న పెద్దఎత్తున నీటి పారుదల ప్రణాళికలను ఏర్పాటుచేయవలసిఉండును. ప్రస్తుతము దేశములో ఈ క్రింది నీటిపారుదల సౌకర్యాదులున్నవి. (1) గోదావరి డెల్టా కాలువలు—సుమారు 10 లక్షల ఎకరాలు సాగు చేయుచున్నవి. (2) కృష్ణాడెల్టా కాలువలు— 8.4 లక్షల ఎకరాలు. (3) కృష్ణా తూర్పుతీరపు కాలువ పులిగడ్డ వంతెనతో సహా 61,000 ఎకరాలు. (4) పోలవరం లంక— 13,000 ఎకరాలు. (5) నాగావళి— తోటపల్లి ప్రాంతములో 27,000 ఎకరాలు భూమి సాగగుచున్నవి. (6) పశ్చిమాంధ్రములో కర్నూలు — కడప కాలువ 80,000 ఎకరాలకు నీరు అందించుచున్నది. సర్ ఆర్థరు కాటను అను సుప్రసిద్ధ ఇంజనీరు యొక్క కృషిఫలిత

ముగా ఈ డెల్టా ప్రణాళికలు ఫలవంతము అయినవి. ఈ కాలువలలో ప్రయాణసౌకర్యాలుకూడ కలిసివచ్చును. సంవత్సరములో 10 నెలల పాటు వీటిమీద స్వల్ప ధరగల సరకుల రవాణా సాధ్యమగుచున్నది. ఇటువంటి ప్రయాణ ప్రాముఖ్యముగల కాలువలలో బకింగ్‌హాం కాలువ ఒకటి చాల ముఖ్యమైనది. దీని మొత్తము పొడవు 258 మైళ్లు. తూర్పుతీరములో రైలుమార్గానికి దగ్గరగా పోవుచుండును. దీనిమీద 134 లక్షల రూపాయలు విలువగల వస్తువులు ప్రయాణము చేయుచున్నవి. ఇవిగాక పశ్చిమాంధ్రములో తుంగభద్రాప్రాజెక్టు చాల ఉపయోగముచేసే ప్రణాళిక. ఇందులో 2,94,000 ఎకరాలు సాగుకావలయును. గోదావరికి కట్టదలచిన రామపాదసాగరము 24 లక్షల ఎకరాలకు నీరు అందించును. నాగార్జునసాగరము అనే నందికొండప్రాజెక్టు మధ్యాంధ్రములోని గుంటూరు, నెల్లూరు, జిల్లాలలో నీటిపారుదలను కలిగించును. ఇవిగాక, పులిచింతల, వంశధార మొదలైన చిన్నచిన్న ప్రణాళికలున్నవి. దక్కను పీఠభూమి అంతటను బావులు, చెరువులు ప్రసిద్ధికెక్కిన వ్యవసాయ కేంద్రాలు.

వ్యవసాయము : ఆంధ్రదేశములోని 404·9 లక్షల ఎకరాలలో 158·1 లక్షల ఎకరాలు సాగుబడిక్రింద ఉన్నవి. 34·4 లక్షల ఎకరాలు సాగుక్రిందికి రావలసి ఉన్నవి. ఇందులో 45 లక్షల ఎకరాలకు నీటివసతి ఉన్నది. ఆంధ్రదేశములో ఆహారధాన్యాల ఉత్పత్తికి నూటికి 80 వంతులుపైగా భూమిని ఉపయోగించెదరు. అందులో ధాన్యానికి 42,87,146 ఎకరాలు అత్యధిక స్థానమును పొందిఉన్నవి. 1951 లో వ్యవసాయము క్రిందనున్నభూమి ఉత్పత్తి ఈ క్రిందివిధముగా ఉన్నది.

| వంటపేరు | ఎకరాలు | ఉత్పత్తి (టన్నులు) |
|---|---|---|
| 1. వరి | 42,87,146 | 27,68,850 |
| 2. చోళము | 25,76,824 | 5,22,360 |
| 3. వేరుసెనగ | 22,85,436 | 8,58,810 |
| 4. కొర్ర | 10,23,186 | 1,30,610 |
| 5. కుంబు | 8,94,036 | 2,00,960 |
| 6. పప్పుదినుసులు | 8,26,752 | 58,308 |
| 7. రాగి | 5,92,767 | 2,31,057 |
| 8. ప్రత్తి | 5,85,812 | 72,387 |
| 9. ఇతరధాన్యములు | 4,40,200 | 73,012 |
| 10. పొగాకు | 3,35,240 | 1,10,337 |
| 11. పెసలు | 3,55,546 | 34,860 |
| 12. మిరపకాయలు | 2,69,265 | 1,06,550 |

వరి చాల ముఖ్యమైన పంట. ఇది కృష్ణా గోదావరి డెల్టాలలో ప్రధానముగా పండింపబడుచున్నది. కాని దేశము అంతటను కొద్దిగానో, గొప్పగానో పండించుచున్నారు. ఎకరమునకు 1800 పౌనుల పంట పండును. వరిగాక సజ్జ, లేక గంటి, చోడి లేక రాగి ముఖ్యమయినవి. ఇవిగాక అరికెలు, సామలు, వరిగెలు, ఉండలు అనే తిండిగింజలు ఉన్నవి. తరువాత పప్పుదినుసులు. ఇందులో కందులు, పెసలు, సెనగలు, మినుములు, జనుములు ఉన్నవి. అనుములు, అలచందలు, మిటికెలు ఈ జాతిలోవే. నూనెగింజలలో వేరుసెనగకు ఎక్కువ స్థానము ఉన్నది. నువ్వులు, అవిసెలు, ప్రత్తిగింజలు నూనెకు మాత్రమేగాకుండ క్రొత్తగా ఏర్పడిన డాల్డా పరిశ్రమకు దోహదము ఇచ్చుచున్నవి. ప్రత్తి పీఠభూమిమీదను, మధ్యాంధ్రములోను వ్యాపించియున్నది. పొగాకువ్యాపారపు పంటలలో చాల ముఖ్యమయినది. గుంటూరు, కృష్ణా జిల్లాలలో ఇది విశేషముగా పండింపబడి విదేశాలకు ఎగుమతి అగుచుండును. పంచదార, చెరకు ఆంధ్రదేశము అంతటనువ్యాపించియున్నది. చిత్తూరు, గుంటూరు, కృష్ణా జిల్లాలలో దీనికి ప్రత్యేకస్థానము ఉన్నది.

పశుసంపద : ఆంధ్రదేశములో పశుసంపద విస్తారముగా ఉన్నది. ఎద్దులు 25 లక్షలు, ఆవులు 20 లక్షలు, దున్నపోతులు 7 లక్షలు, బర్రెలు 17 లక్షలు, గొర్రెలు 48 లక్షలు, మేకలు 25 లక్షలు ఉన్నవి. మధ్యాంధ్రదేశములో ఉన్న గడ్డిప్రాంతాలు ఈ పశువుల గ్రాసమునకు అవకాశము ఏర్పాటుచేయబడినది. సరియైన ఆహారపుష్టిలేక పశువులు బలహీనముగా ఉన్నవి. ఒక కోటి పది లక్షల ఎకరాల భూమి పశువులకు గడ్డిభూములుగా ఉన్నవి. ఆంధ్రదేశములో ఒంగోలుజాతి పశువులు ప్రసిద్ధికెక్కినవి. పాలకు, వ్యవసాయమునకు పేరుపడ్డవి. 2500 పౌనుల పాలు ఇచ్చుచున్నవి. పశువులు ప్రతి వ్యవసాయదారునికి అవసరముగా ఉండుచున్నవి.

**ఖనిజసంపద :** ఆంధ్రదేశములోని ఖనిజసంపద కొన్నిటిలో ఉత్తమముగా ఉన్నది. మాంగనీసు 3276 టన్నులు బంగారము 361 ఔన్సులు, క్రోమైట్ 500 టన్నులు, మైకా 11,670 హండ్రడువైటులు; స్టియటైట్ 209 టన్నులు, తైమురాయి 3740 టన్నులు, రాయి 16,822 టన్నులు, ఆస్‌బెస్టాస్ 1150 టన్నులు, బారైట్సు 1800 టన్నులు 1944 సం. లో ఉత్పత్తి అయినవి. ఖనిజాలలో మాంగనీసు, మైకా ఆంధ్రదేశములో ముఖ్యస్థానమును ఆక్రమించినవి. రాయలసీమలో ఖనిజములు ఎక్కువ. మాంగనీసు, విశాఖపట్నం, కర్నూలు, బళ్ళారి జిల్లాలలోను, మైకా నెల్లూరుజిల్లాలోను, బారైట్స్ కడపజిల్లాలోను ఉన్నవి. సమగ్ర పరిశోధనలు జరిగినయెడల ఆంధ్రదేశములోను, ఖనిజములు చాల ఉన్నవని తేలగలదు. ఇనుము ఇంకను దొరకవలసియున్నది.

**పరిశ్రమలు :** ఆంధ్రదేశము పరిశ్రమల విషయములో వెనుకబడి ఉన్నది. తూర్పు ఆంధ్రములో కొన్ని పరిశ్రమలకు ప్రారంభము జరిగినదిగాని, పశ్చిమాంధ్రములో పరిశ్రమలు ప్రారంభముకూడ కాలేదు. అయితే, విశాఖపట్నమువద్ద నౌకానిర్మాణశాఖ స్థాపింపబడుట గొప్ప విశేషము. మాచ్‌ఖండ్ విద్యుచ్ఛక్తి నిర్మాణము పూర్తి అయినతరువాత, దేశములో పరిశ్రమ అవకాశాలు లభింపగలవు. మద్రాసులో నుండిన ఆంధ్రుల పరిశ్రమలు కొన్ని పరిశిష్ట మద్రాసు రాష్ట్రమునకు చెందిపోయినవి. పెద్దపరిశ్రమలలో బెజవాడలో సిమెంటు పరిశ్రమ, గూడూరులో మైకా పరిశ్రమ, గుంటూరులో పొగాకు పరిశ్రమ ఎన్నదగినవి. చిన్నపరిశ్రమలలో బియ్యపుమరలు ఇంజనీరింగ్ వర్కుషాపులు, డాల్డాఫ్యాక్టరీలు, గూడూరులోని పింగాణీ పరిశ్రమ, బెజవాడలో రైల్వేపని, చెప్పదగినవి. ఇవిగాక కుటీర పరిశ్రమలని చెప్పదగినవి వరసాపురములో, కుట్టుపని, పెద్దాపురములో, పాలకొల్లులో పట్టుపరిశ్రమ; నెల్లూరు, గుంటూరు, గోదావరి, విశాఖ జిల్లాలలోని చేనేత పరిశ్రమ, నర్సారావుపేటలోని కుర్చీలపరిశ్రమ, విశాఖలోని చందనపు బొమ్మల పరిశ్రమ, కొండపల్లి బొమ్మలపరిశ్రమ, పెదవలసలోని పేముపనులు బెజవాడలో తోళ్ళపరిశ్రమ, పలకల పరిశ్రమ మొదలయినవి ఎన్నో ఉన్నవి.

**రాకపోకల సౌకర్యాలు :** ప్రయాణసౌకర్యాల రీత్యా గూడ ఆంధ్రదేశము వెనుకబడియున్నది. రోడ్లు తక్కువ. రైలుమార్గాలుకూడ ఇప్పుడిప్పుడే ఆలోచింపబడుచున్నవి. ఆంధ్రదేశములో హుబ్లీ - మచిలీపట్నానికి మీటరుగేజ మార్గమును, మదరాసు-కలకత్తా, మదరాసు-ఢిల్లీ, మదరాసు-బొంబాయి మార్గాలు బ్రాడ్‌గేజి లయిను ఆంధ్రదేశముగుండా వెళ్ళుచున్నవి. రోడ్లుకూడ ఇదేమార్గాలను అనుసరించి ఉన్నవి. ఇతర రాష్ట్రాలతో పోల్చినయెడల, ఆంధ్రలో రైలుమార్గములు తక్కువ. కాలువలు, నదులు చెప్పదగినంతగా ప్రయాణాలకు ఉపకరించవు.

**వర్తక వ్యాపారాలు :** అంతరంగికముగ వ్యాపారము ఎగుమతులు, దిగుమతులు ఆంధ్రదేశములో నలుమూలలకు వ్యాపించుట గాక, ఇతర రాష్ట్రాలతో కూడ వ్యాపారమున్నది. పప్పులు, ధాన్యము, బొగ్గు, వేరుసెనగ, నూనెగింజలు, మాంగనీసు, ఉప్పు, పంచదార రైల్వే రవాణా సౌకర్యాలమీద ఆధారపడిఉన్నవి. ముడి ప్రత్తి, గుడ్డలు, దినుసులు మొదలైనవాటితో కూడ వ్యాపారము సాగింపబడుచున్నది. కొబ్బరి, కొయ్య సామాను, మందులు, కాగితము కూడ చెప్పదగిన వ్యాపారము కలవే. ఇవికాక బొంబాయి, మదరాసు రేవుల నుండి వచ్చు దిగుమతులకు ఆంధ్రదేశములో తగిన స్థానమున్నది. 1939-40 లో 10 కోట్ల 40 లక్షల మణుగుల వ్యాపారము ఆంధ్ర జిల్లాల. ద్వార జరిగినదని అంచనా వేయబడినది.

**రేవు పట్టణములు :** ఆంధ్రదేశమునకు తీర భూమి ఉండుటవల్ల రేవుల అభివృద్ధి ముఖ్యముగా జరుగవలసి యున్నది. 1946 లో ఆర్మ్‌స్ట్రాంగు కమిటీవారి నివేదిక ననుసరించి విశాఖపట్నము యొక్క అభివృద్ధి జరిగినది. కాకినాడ, బందరు, కొత్తపట్టణము మొదలైన చిన్న రేవులు కూడ ముఖ్యమైన వ్యాపారము చేయుచున్నవి.

**జనసంఖ్య :** ఆంధ్రదేశములో తూర్పు జిల్లాలలో జనసంఖ్య ఎక్కువగానున్నది. కాలువలున్న జిల్లాలలో 900 మొదలు 1200 వరకును చదరపుమైలుకు జనాభా ఒత్తిడి ఉన్నది. విజయవాడ, గుంటూరు, విశాఖపట్టణము, చీరాల, కాకినాడ, రాజమండ్రి, కర్నూలు ఆంధ్రదేశములో ముఖ్యమైన పట్టణములు.

**రాజకీయ పరిస్థితులు:** ఆంధ్రదేశములో రాజకీయవాతావరణము ఎక్కువ. కాంగ్రెసు, కమ్యూనిస్టు, ప్రజాపార్టీలకు ఆదరణము ఉన్నది. విశాఖపట్టణము, తిరుపతులలో విశ్వవిద్యాలయాలు ఏర్పడ్డవి. డి. వి. కె.

**ఆంధ్రప్రదేశము II (తెలంగాణము):** తెలంగాణములో 9 జిల్లా లున్నవి. అవి ఆదిలాబాదు (9,02,522 మంది), నిజామాబాదు (7,73,158 మంది), మెదక్ (10,27,293 మంది), కరీంనగరు (14,28,168 మంది), వరంగల్లు (13,25,984 మంది), నల్లగొండ (12,52,810 మంది), ఖమ్మం (7,00,006 మంది), హైదరాబాదు (15,11,336 మంది), మహబూబునగరు (11,86,496 మంది). తెలంగాణ వైశాల్యము 43,282 చ. మై.

తెలంగాణ ప్రాంతము దక్కను పీఠభూమిలో వ్యాపించియున్నది. సరాసరిని 1500 అ. ఎత్తు కలిగి తూర్పునకు వాలియున్న పీఠభూమి ప్రాంతము. పశ్చిమమున నున్న పర్వతములు తెలంగాణములోనికి చొచ్చుకొని వచ్చినవి. ఇవి 3000 అ. కంటె తక్కువ ఎత్తుగల చిన్న పంక్తులు. ఆదిలాబాదు జిల్లాలో సాత్మలా, నిర్మలా పంక్తులు, నిజామాబాదులో సిర్నపల్లి పంక్తులు, మహబూబునగరు జిల్లాలో షహాబాదు, అమరాబాదు కొండలు, నల్లగొండ జిల్లాలో దేవరకొండ, భువనగిరి కొండలు కలవు. హైదరాబాదు జిల్లానుండి పాకాల కొండల వరకు, అక్కడినుండి ఆగ్నేయదిశగా ఖమ్మం జిల్లా మధ్యగా వ్యాపించిన గోలకొండ జలగ్రహ క్షేత్రము (Water shed) అని పిలువబడు ఎత్తైన ప్రదేశము గోదావరీ కృష్ణా జలములను వేరుచేయుచున్నది. దీని కుత్తరముననున్న భూతలము తూర్పు ఈశాన్యములకు వంగియున్నది. దక్షిణమున నున్న భూతలము ఆగ్నేయముగా వంగియున్నది. తూర్పుననున్న గోదావరితీరము ఎత్తు 200 అ. కంటె తక్కువ. ఆదిలాబాదు, నిజామాబాదు, కరీంనగరు, మెదకు జిల్లాలు గోదావరి పరీవాహక ప్రదేశములోను, మిగిలిన అయిదు జిల్లాలు కృష్ణా పరీవాహక ప్రదేశములో నున్నవి. మంజీర, మానేరు, కడం, పెనుగంగ, ప్రాణహితనదులు గోదావరికిని; దిండి, పెద్దవాగు, మూసి, పాలేరు, మునేరు, వైరా నదులు కృష్ణకును ముఖ్యమయిన ఉపనదులు.

**శీతోష్ణస్థితి : వర్షపాతము :** తెలంగాణప్రాంతము ఉత్తరార్ధగోళపు ఉష్ణమండలములో ఉండుటచే ఎక్కువవేడిగా ఉండును. కాని ఈభూభాగము 1200 అడుగులుపైన ఎత్తుగా నుండుటచే దీని ఉష్ణోగ్రతలు కోస్తా ఆంధ్ర ప్రాంతముకంటె భిన్నముగా నుండును. తక్కిన ఆంధ్రదేశములోవలెనే ఇక్కడకూడ నాలుగు ఋతువులు కన్పట్టును. (1) మార్చినుండి మే నెలవరకు మిక్కిలి వేడిగా నుండు వేసవి, (2) జూనునుండి సెప్టెంబరు నెలవరకు వర్షకాలము, (3) అక్టోబరు నవంబరునెలలు శరదృతువు, (4) డిశంబరునుండి ఫిబ్రవరివరకు శీతకాలము.

మార్చి, ఏప్రిలు నెలలలో ఉష్ణము 100° ఫా. ప్రాంతమువరకు పెరుగును. ఏప్రిలు నెలలో, ఈశాన్యమున ముఖ్యముగా రామగుండమువద్ద, సరాసరి అధికోష్ణము 105° ఫా. ప్రాంతముననుండును. అదేకాలములో హైద్రాబాదులో సరాసరి అల్పోష్ణోగ్రత 75° ఫా. మే నెలలో సూర్యుడు నెత్తిమీద నుండుటచే మిక్కిలి వేడిగా నుండును. ఈ నెలలో రామగుండమువద్ద సరాసరి అధికోష్ణము 111° ఫా. వరకు పెరుగును. ఖమ్మము మెట్టువద్ద వేడి 120° ఫా. వరకు కూడ ఉండును. వేసవిలో మొత్తముమీద, దక్షిణ జిల్లాలలో 83° ఫా. ఉత్తర జిల్లాలలో 99° ఫా. కు తక్కువ ఎప్పుడును ఉండదు.

జూను నెలలో అన్ని జిల్లాలలోను ఉష్ణము తగ్గును. ఈ నెలలోనే ఋతుపవనములు ప్రారంభమగును. కాని వర్షములేక ఆకాశము నిర్మలముగానున్న రోజులలో ఉష్ణము, ఖమ్మముమెట్టువంటి పల్లపు ప్రాంతములలో 102° ఫా. వరకుకూడ ఉండును. జూలై, ఆగస్టు నెలలలో వేడి క్రమేపి తగ్గును. కాని సెప్టెంబరులో తిరిగి కొద్దిగా పెరుగును.

అక్టోబరు, నవంబరు నెలలు శరదృతువు. ఈకాలములో ఆగ్నేయ ఋతుపవనములు వీచుట మానివేయును. అక్కడక్కడ కొద్దిగా వర్షములు పడును. ఉష్ణోగ్రత పశ్చిమప్రాంతములందు కంటె తూర్పు ప్రాంతములందు కొద్దిగా ఎక్కువగా నుండును.

డిశెంబరునుండి ఫిబ్రవరివరకు శీతకాలము. ఈ కాలములో తెలంగాణమంతయు చలిగాను, పొడిగాను ఉండును. డిశెంబరు ఆఖరిరోజులు మిక్కిలి చలిగానుండు

కాలము. రాత్రిళ్ళు చలి ఎక్కువగానున్నను పగలు మాత్రము సమశీతలముగా నుండి హాయిగానుండును. గోదావరీమండలములో 86° ఫా. లకును, కృష్ణా మండలములో 93° ఫా. లకును ఉష్ణము మించదు. ఫిబ్రవరి నెలనాటికి క్రమముగా వేడి ఎక్కువగును.

సముద్రమునకు దూరముగా ఖండాంతరమున నుండుటచే దైనిక ఉష్ణోగ్రతల హెచ్చుతగ్గులు ఎక్కువగా నుండును. దినములో అధిక అల్పోష్ణోగ్రతల మధ్య వ్యత్యాసము దక్షిణప్రాంతములలో 20°. ఫా. వరకును, ఈశాన్య ప్రాంతములలో 30° ఫా. వరకును ఉండును. తెలంగాణము ఉష్ణమండలములో నుండుటచే సంవత్సరమునకు 8, 9 మాసములు వేడిగానుండును. అందుచే ఈ ప్రాంతమున వాయుమండలము పల్చగానుండి ఒత్తిడి తక్కువగానుండును. శీతకాలములో నీమండలము, ఉత్తర హిందూస్థామునకంటె వెచ్చగా నుండును. అందుచే ఉత్తర హిందూస్థానములో ఎక్కువగాను, తెలంగాణములో అంతకంటె తక్కువగాను 30 అంగుళములవరకును వాయుపీడనము ఉండును. తెలంగాణములో ప్రాంతీయ పీడనము ఆగ్నేయమునుండి ఈశాన్యముదిశలో ఎక్కువగా నుండును. అందుచే గంటకు 5 మైళ్ళలోపు వేగముతో చిన్నగాలులు ఎప్పుడును ఈశాన్యమునుండియు, తూర్పు నుండియు, తెలంగాణపు ఆగ్నేయభాగమునకు వీచును. వర్షకాలములో నీపరిస్థితులు తలక్రిందు లగును. ఈ కాలములో గాలులు ఋతుపవనముల ప్రాబల్యమువలన బలముగా వీచును. సామాన్యముగా వీటి వేగము గంటకు 15, 20 మైళ్ళవరకు ఉండును. వేసవిలో అధికపీడన మండలము అంతముకాగా, అల్పపీడన మండలము ప్రారంభదశలో నుండుటవలన దేశమంతటను వాయు పీడనములో వ్యత్యాసములు చాల తక్కువగా నుండి గాలులు వీచవు.

గోదావరీనదీ ప్రాంతములలో సంవత్సరమునకు 40 అం. కృష్ణానదీ ప్రాంతములలో ముఖ్యముగా మహబూబ్‌నగరుజిల్లా పశ్చిమభాగమున, 20 అం. వర్షము పడును. ఎక్కువ వేడిగాను, తేమగాను ఉండుటయు, బంగాళాఖాతమునుండి వచ్చు తుఫానుగాలులు గోదావరి లోయలగుండా నీ ప్రాంతమునకు వ్యాపించుటవలన ఉత్తరమున వర్షమెక్కువ. 30 అం. కు పైన వర్షము పడు ఉత్తరభాగములను, అంతకంటె తక్కువ వర్షము పడు దక్షిణభాగములను గోలకొండ జలగ్రహక్షేత్రము (Water shed) వేరుచేయుచున్నది. ఉత్తరమున అధిక వర్షము జులై నెలలోను, దక్షిణమునను, పశ్చిమమున అధికవర్షము సెప్టెంబరులోను పడును.

శీతోష్ణస్థితులనుబట్టియు, నైసర్గిక స్వరూపమును బట్టియు తెలంగాణమును రెండుగా విడదీయవచ్చునని పైన పేర్కొన్న విషయములవలన విశదమగును. (1) ఉత్తర, ఈశాన్య ప్రాంతములు ముఖ్యముగా గోదావరినదీ పరిసరములు, (2) దక్షిణ, ఆగ్నేయ ప్రాంతములు ముఖ్యముగా కృష్ణానదీ పరిసరములు.

మొదటి విభాగములో, 40 నుండి 45 అం. వర్షము పడును. ఇక్కడ అడవులు ఎక్కువ. వరి సాగు ఎక్కువగా జరుగును. అడవులు నిర్మూలించబడుటవలనను, వర్షపాత మెక్కువగా నుండుటవలనను ఈ భాగమున నేలలో సారము చాలవరకు క్షీణించినది. ఇక్కడ ఖరీఫ్ పంట ప్రధానమయినది. రెండవ విభాగములో రబ్బి పంట ప్రధానము.

నల్లరేగడినేలలు, ఎర్రనేలలు, ఇసుకనేలలు, తెలంగాణములో కనుపించు ముఖ్యమయిన నేలలు. హైదరాబాదులో పశ్చిమజిల్లాలనుండి నదులవలన తేబడిన నల్లరేగడి మట్టి కృష్ణా గోదావరీతీరములందు ఇరుప్రక్కలను కనుపించును. ఈ నేలలు, వృక్షజాలమునకు కావలసిన ఖనిజములను కలిగి ఎక్కువసారవంతమయినవి. ఇంతకంటె తక్కువ సారవంతమయిన నేలలు తెలంగాణము పశ్చిమ సరిహద్దులోను, ఆదిలాబాదుజిల్లా ఉత్తర సరిహద్దులలోను ఉన్నవి. నల్లరేగడి నేలలు చాల సారవంతమగుటవలన ప్రత్తి, గోధుమ విరివిగా పండును. సాగుచేయుటకు వీలున్నచోట్ల వరి, చెరకుకూడ పండును. మిక్కిలి ఎరుపు నుండి గోదుమరంగువరకు మార్పులుగల ఎర్రనేలలు, మెదక్, నిజామాబాదు జిల్లాలలో కలవు. పండ్లతోటలకు, నూనెగింజలను, అవరాలను పండించుటకు చాల తగినవి. ఆదిలాబాదుజిల్లా దక్షిణప్రాంతములోను, నిజామాబాదులో చాలభాగములోను, కరీంనగరు, మెదకు, నల్లగొండ, వరంగల్లు, ఖమ్మం, హైదరాబాదు, మహబూబ్

నగరు జిల్లాలలోను ఇసుకనేలలు ఎక్కువ. ఇవి చాల తక్కువ సారవంతమైనవి.

**వృక్షజాలము :** తెలంగాణములో సహజముగా పెరుగునవి ఉష్ణమండల అరణ్యాలు, చిట్టడవులు, ముండ్లపొదలు గడ్డిమైదానములు. వర్షపాతము ఎక్కువగనున్న తూర్పు భాగములో అరణ్యములు కనుపించును. కాని పశ్చిమముగా పోయినకొలది, ఎత్తయి, వర్షపాతము ఎక్కువగానున్న ప్రాంతములలో తప్పితే, ముండ్లపొదలు, గడ్డి కనిపించును. ఆదిలాబాదు, కరీంనగరు, మహబూబునగరు, వరంగల్లు, ఖమ్మం, నిజామాబాదు జిల్లాలలో అడవులు సహజముగా ఎక్కువ. గోదావరీ కృష్ణాతీరములలో తుమ్మచెట్లు ఎక్కువ. వరంగల్లు జిల్లాలోని ములుగు, నరసంపేట, ఆదిలాబాదు జిల్లాలోని మహాదేవపూరు, కరీంనగర్ జిల్లాలోని మానమూరు, మహబూబ్‌నగరుజిల్లాలోని అమరాబాదు తాలూకాలలో, వేసవిలో ఆకులురాల్చు జాతిచెట్లతో నిండిన అడవులు కలవు. ఈ అరణ్యములలో చెట్లు రమారమి 50 అడుగుల ఎత్తువరకు పెరుగును. గంధపుచెట్లు, టేకు, నల్లమద్ది మొదలగు ఉపయోగకరమయిన చెట్లు ఈ అడవులలో పెరుగును. హైదరాబాదు, మహబూబునగరు, నల్లగొండ, మెదక్ జిల్లాలలో చెదరుచెదరుగా నున్న చెట్లతోను, పొదలతోను, సీతాఫలము, తాడి మొదలగువానితోనుకూడిన చిట్టడవులు పెరుగును. వర్షము బాగుగా తక్కువగా నున్నచోట్లయందును కొండ వాలులలోను గడ్డి పెరుగును. దీనిలో వాసనగల గడ్డిరకములుకూడ కలవు. ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లాలలో పెరిగెడు గడ్డియే కాగితములు తయారుచేయుటకు చాల తగినది. వరంగల్లు, ఆదిలాబాదు జిల్లాలలోని అడవులలోనుండి టేకు ఎక్కువగా లభించుచున్నది.

**నీటిపారుదల, వ్యవసాయము :** తెలంగాణమున మొత్తముమీద సంవత్సరమునకు 33 అం. వర్షము పడునని చెప్పవచ్చును. ఈ వర్షము తూర్పుప్రాంతములలో ఎక్కువగాను, పశ్చిమ ప్రాంతములలో తక్కువగాను ఉన్నది. వర్షపాతము తక్కువగుటచే పంటభూములు సాగుచేయవలసిన అవసర మున్నది. పెద్ద నూతుల, చెరువుల సహాయముతో భూములను సాగుచేయుట తెలంగాణములో గమనింపవలసిన విశేషము. ఆంధ్రదేశపు తీర ప్రాంతములతో సరిపోల్చినచో తెలంగాణములో కాలువలు లేవని చెప్పవచ్చును. 700 సంవత్సరముల పురాతనమయిన పాకాల సరస్సు చాలపెద్దది. మునేరునదికి 4000 అ. పొడవున వేసిన అడ్డకట్టవలన నిది ఏర్పడినది. దీనిలోతు 50 అ. పరిమాణము 325 కోట్ల ఘనపు టడుగులు. హైదరాబాదు సికింద్రాబాదుల మధ్యనున్న హుస్సేనుసాగరు చెరువు 400 సంవత్సముల పూర్వము నిర్మింపబడినది. దీని కట్టపొడవు 7000. అ., లోతు 75 అ. పరిమాణము 290 కోట్ల ఘనపుటడుగులు. 50 అ. లోతు కలిగిన రామప్పచెరువు 120 కోట్ల ఘ. అ. పరిమాణము కలది. 50 అ. లోతుకలిగిన లక్నవరం చెరువుకూడ ప్రసిద్ధమయిన పురాతన తటాకము. ఈ చెరువులవలన వేలకొలది ఎకరములు సాగుచేయబడుచున్నవి.

నీటిపారుదలకు, విద్యుచ్ఛక్తికి ఉపయోగపడు నదీ ప్రాజెక్టులు తెలంగాణములో చాలకలవు.

ఉస్మాన్‌సాగరు, హిమాయత్ సాగరు సరస్సులు హైదరాబాదు, సికిందరాబాదు నగరములకు నీటిని సప్లయిచేయుటకు ఉపయోగించుచున్నవి.

మంజీరనదికి కట్టబడిన ఘనపురం ఆనకట్టవలన సుమారు 25 వేల ఎకరములు సాగు అగుచున్నవి. ఆలేరు నదికి కట్టబడిన పోచవరం ఆనకట్టవలన 18 వేల ఎకరములు, మహబూబునగరు జిల్లాలోని దిండి ప్రాజెక్టు వలన 39 వేల ఎకరములు సాగుచేయబడుచున్నవి. కామారెడ్డి పట్టణమునకు 18 మై. దూరములో మానేరు నదిపై నిర్మింపబడ్డ చెరువువలన 12 వేల ఎకరములు సాగుచేయుటకు, 1000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి తయారుచేయుటకు వీలున్నది. 15 చ. మై. వైశాల్యము, 3000 కోట్ల ఘనపుటడుగుల పరిమాణము, 100 అడుగుల లోతు కలిగిన నిజామసాగరు చెరువు, మంజీరనదికి అడ్డముగా 2 మై. పొడవున కట్టబడిన అడ్డకట్టవలన ఏర్పడినది. దీనివలన 6 లక్షల ఎకరములు సాగు అగుచున్నవి. 3,000 నుండి 11,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి తయారు అగును.

17 వేల ఎకరములు సాగుబడిచేయు, వరంగల్లులోని వైరా ప్రాజక్టు, సుమారు 20 వేల ఎకరములు సాగుచేయుటకు వీలగు పాలేరు ప్రాజక్టు, చెప్పదగినవి. ఇవిగాక తుంగభద్ర, నాగార్జునసాగరు ప్రాజెక్టుల వలన

తెలంగాణమునకు నీరు, విద్యుచ్ఛక్తి విస్తారముగా లభించును.

తెలంగాణములో పంటక్రింద నున్నభూమి ఈ క్రింది విధముగా నున్నది.

| | లక్షల ఎకరములు |
|---|---|
| వ్యవసాయము క్రింద నున్నది. | 116.85 |
| నీటిపారుదల వసతులు గలది. | 16.67 |
| వ్యవసాయమునకు అనువైనను | |
| ఖాళీగా నుండిపోయినది. | 10.06 |
| బంజరుభూమి | 36.44 |
| సాగులోనికి తీసికొని రాతగినది. | 20.40 |

పైన చెప్పిన భూములలోని పంటలు ఈ క్రింది విధముగా నున్నవి.

| | లక్షల టన్నులు |
|---|---|
| ధాన్యము | 11.15 |
| అపరాలు | 1.57 |
| చెరకు | 1.76 |
| ఆముదము | 0.51 |
| వేరుసెనగ | 2.42 |
| మిరపకాయలు | 0.15 |
| ఉల్లి | 0.37 |
| పొగాకు | 8500 టన్నులు |
| ప్రత్తి | 39,000 బేళ్లు |

**ఖనిజసంపద :-** (ఆంధ్రదేశపు ఖనిజసంపద చూడుము).

**పరిశ్రమలు :-** సింగరేణి మొదలగు గోదావరిలోయ బొగ్గుగనులు కారణముగా, తెలంగాణములో పరిశ్రమలు నెమ్మదిగా నభివృద్ధి చెందినవి. ప్రాంతీయముగా కావలసిన వస్తువులు తయారుచేయు భారీపరిశ్రమలు, గృహ పరిశ్రమలు చాలకలవు. వీటిలో ముఖ్యమయినవి ఈ క్రిందివి :

హైద్రాబాదులోని డి. బి. ఆర్. మిల్లులోను, వరంగల్లులోని అజంజాహిమిల్లులోను నూలు ఉత్పత్తి యగుచున్నది. ఇదికాక వస్త్రములుకూడ నేయుమిల్లు హైద్రాబాదులో నొకటి యున్నది.

సిర్‌పూర్‌లో కృత్రిమపు సిల్కు తయారుచేయు ఫ్యాక్టరి కలదు. దీనిలో రోజునకు 5 టన్నుల రయాను తయారు అగును. దీనితో రమారమి 50,000 గజముల సిల్కుదారము తీయబడును.

బోధనులోనున్న నిజాము పంచదార ఫ్యాక్టరిలో 2,40,000 రూపాయలు విలువగలిగిన 21,000 టన్నుల పంచదార సాలీనా తయారగుచున్నది. ఈ ఫ్యాక్టరిలో నుపయోగించగా మిగిలిన చెరకుపంట ఇతరరాష్ట్రములకు ఎగుమతి చేయబడుచున్నది. ఈ ఫ్యాక్టరీలోనే సంవత్సరమునకు 5 లక్షలగాలన్ల సారాయికూడ తయారగును. ఇది యంత్రములు నడుపుటకుపయోగించు ప్రత్యేకమైన సారాయి.

హైదరాబాదులోనున్న కోహినూర్, తాజ్‌గ్లాసు ఫ్యాక్టరీలలో గాజుసామానులు తయారగును.

ఆస్బెస్టాసు తయారుచేయు హైదరాబాదు ఆస్బెస్టాసు సిమెంటు ప్రోడక్ట్సుఫ్యాక్టరీ హైదరాబాదులో నున్నది.

సిరుపూరులో కాగితములు తయారుచేయు ఫ్యాక్టరి యున్నది. దీనిలో సాలీనా 6,000 టన్నుల కాగితములు తయారగును.

హైదరాబాదులోని చార్‌మినార్ సిగరెట్టుకంపెనీ తెలంగాణములో ముఖ్యమయినది. దీనిలో రోజుకు 40 లక్షల సిగరెట్లు తయారగును. వజీర్‌సుల్తాను సిగరెట్టు కంపెనీ మరియొక ముఖ్యమైన ఫ్యాక్టరీ.

నేత పరిశ్రమ తెలంగాణములో ముఖ్యమయిన గృహ పరిశ్రమ. ఇందుకు కావలసిన ప్రత్తి, నూలు ఇతర ప్రాంతములనుండి వచ్చినను తెలంగాణములో నేతపరిశ్రమ చాల అభివృద్ధి చెందినది. ఈ పరిశ్రమకు ముఖ్యమయిన జిల్లాలగు నిజామాబాదు, నల్లగొండ, మహబూబునగరు, వరంగల్లులలో సుప్రసిద్ధమైన ఉన్నికంబళ్ళు నేయబడును. వీటిని దేశములో నితరప్రాంతములకు ఎగుమతి చేయుదురు.

ఆటవస్తువులు, ఇతరములయిన కళాప్రాధాన్యమైన వస్తువులు తయారుచేయుటలో దేశమునందంతటను ప్రసిద్ధిగాంచినది నిర్మలపట్టణము. హైదరాబాదులో అనేకము బత్తాముఫ్యాక్టరీలు ; బెల్లంపల్లి, ఆజమాబాదు పట్టణములలో రసాయనపదార్థములుచేయు ఫ్యాక్టరీలుకలవు. ఇవిగాక పింగాణి, తదితరవస్తువులుచేయు ఫాక్టరీలు తెలంగాణములో నున్నవి. హైద్రాబాదు ఆల్విన్ మెటల్‌వర్క్సు, ప్రాగాటూల్సు కార్పొరేషనులలో ఇనుపసామానులు,

యంత్రపరికరములు, మొదలగునవి తయారుచేయబడు చున్నవి.

ముఖ్యమయిన పారిశ్రామికోత్పత్తి, ఈక్రింద సీయబడినది. నూలువస్త్రములు 415.20 లక్షల గజములు; నూలు 138.26 లక్షల పౌనులు (తూకము); సిల్కుగుడ్డ 9.39 లక్షల గజములు; సిల్కుదారము 25.78 లక్షల పౌనులు (తూకము), పంచదార 61 వేల టన్నులు; కాతగిము 2.68 లక్షల హండ్రడు వెయిటులు; సిగరెట్లు 473.7 కోట్లు; సారాయి 3.67 లక్షల గాలన్లు. ఇవిగాక 15.28 లక్షల టన్నులబొగ్గు, 68.3 మిలియన్లవాట్లు విద్యుచ్ఛక్తి 39.700 టన్నుల ముడి ఇనుముకూడ ఉత్పత్తి యగుచున్నది.

జీ. స.

**ఆంధ్రబ్యాంకు చరిత్ర :** ప్రతిదేశపు ఆర్థికవ్యవస్థయందు అందలి బ్యాంకింగ్ సంస్థలు నిర్వహించవలసిన పాత్ర మిగుల ప్రముఖమైనది. ఆర్థికముగా ముందుకు వచ్చిన దేశములయొక్క పరిస్థితులను గమనించినవారు ఉత్తమమైన బ్యాంకింగ్ విధానము ఆర్థికాభ్యుదయమునకును వర్తక వాణిజ్యముల పెంపుదలకును పరమావశ్యకమను విషయమును విస్మరింపజాలరు.

ఆంధ్ర బ్యాంకు నేటి ఆంధ్రదేశపు ఆర్థికజీవితమునను, వర్తకవాణిజ్యములందును ప్రాముఖ్యముగల సంస్థ. ఈసంస్థను స్థాపింపవలయునను సంకల్పము దీనిస్థాపకులును ఆంధ్రనాయకులును అగు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారికి 1923 వ. సం॥ సెప్టెంబరులో కలిగినది. అదే సంవత్సరము నవంబరు 20 వ తేదీని బందరులో ఆంధ్ర బ్యాంకు పని ప్రారంభించినది. 1929 నవంబరునెలలో కాకినాడపట్టణమునందు మొదటి శాఖను తెరచినది. 25 సం.లు జయప్రదముగా వ్యవహరించి నిండుగర్వముతో 1948 వ సంవత్సరమున రజతోత్సవము జరుపుకొన్నది. ఇది ఆంధ్రబ్యాంకుయొక్కసంక్షిప్తగాథ.

"పెద్ద నదులు ప్రారంభములో చిన్నవిగా నుండును" అను సామెత ఈ సంస్థకును వర్తించును. అదేవిధముగా ఈ సంస్థయు కొలదిపెట్టుబడితో ప్రారంభమై క్రమక్రమముగా పెద్దదై, నేడు ఆంధ్రదేశములోను వెలుపలను పెక్కుశాఖలతో అలరారుచున్నది.

**సంస్థాపనోద్దేశములు :** "ఆంధ్రులచే నిర్వహింపబడి ఆంధ్రులకు ముఖ్యముగా ఉపయుక్తము కాగలుగుచు విపులమైన వ్యాపారమునకు నిలయమై ఉండెడు ఒక కమర్షియల్ క్రెడిట్ సంస్థను స్థాపించవలె"నను ఆశయముతో నిది ఉద్భవించినట్లు ఈ బ్యాంకు సంస్థాపకులగు డాక్టర్ పట్టాభిగారు చెప్పియుండిరి. ప్రస్తుత మేనేజింగ్ డైరక్టరు అగు శ్రీ తాడేపల్లి శ్రీరాములుగారి మాటలలో ఈ సంస్థయొక్క ఆశయములు :

(i) దేశములోని ఆర్థికబలమును సమీకరించి వాణిజ్యపరుల అవసరాలకు సహకరించుట.

(ii) వ్యవసాయదారులకు అల్పవ్యవధి ఋణములు ఒసగుట.

(iii) పరిశ్రమల అభివృద్ధికి పెట్టుబడులను ఒసిగి చేయూతగానుండుట.

**నిర్వహణములో కల్గిన కష్టములు :** ఈ 33 సం. ల కాలము అనగా 1923 నుండి 1956 వరకు గల కాలములో ఈ సంస్థ నిర్వహణమునందు పెక్కుచిక్కులు కల్గినవి. ఇది సాధారణకాలముకాదు. ఆర్థిక మాంద్యము మొదలు ద్రవ్యోల్బణమువరకు వివిధ ఆర్థిక పరిస్థితులును, ఒక మహాయుద్ధము, దేశములో రాజకీయ సంక్షోభము మొదలు స్వాతంత్ర్య ప్రదానమువరకు గల రాజకీయ సంఘటనములును సంభవించిన సమయము.

1923 లో ఈబ్యాంకు స్థాపింపబడునప్పటికి ఆంధ్రదేశ పరిస్థితులు ఇందులకు అనుకూలముగా లేవు. ప్రజలు బ్యాంకింగ్‌యొక్క ఉపయోగమును ప్రాముఖ్యమును గుర్తింపలేదు. డాక్టరు పట్టాభిగారు మొదట ఈ సూచన చేసినపుడు 'ఎవరుగాని తగినంత పెద్దమొత్తములు విరాళము లిచ్చుటకు సాహసింపకపోవుటవలన కొంత నిరుత్సాహము కలిగినది. కాని వారి మిత్రులగు తాడేపల్లి సుబ్బారావుగారు, ఉదయగిరి గోపాలరత్నంగారు, మొదలగు వా రిచ్చిన తోడ్పాటువలన ఈ సంస్థ 1920 వ సం. నవంబరు 20 వ రిజిస్టరు కాగలిగినను, అనేక బాలారిష్టముల నెదుర్కొనవలసివచ్చినది. ఇంపీరియల్ బ్యాంకుకు అప్పుడుగల యూరోపియను ఏజంటు వ్యతిరేక ప్రచారము, ఆ బ్యాంకు హెడ్డాఫీసువారు ఓవర్ డ్రాఫ్టు ఇచ్చుటకు నిరాకరించుట, ఇందుల కుదాహరణములు.

ఆతర్వాత 7 సంవత్సరములకే ప్రపంచము నావహించిన ఆర్థికమాంద్యము, 1935 లో ట్రావన్కూరు నేషనల్ అండ్ క్విలన్ బ్యాంకు పతనము, 1942 లో యుద్ధ కాలమున జపానుదాడుల గూర్చిన ప్రజల భయములు, ఇవన్నియు బ్యాంకు అభివృద్ధి కార్యక్రమములపై ఒత్తిడి కలుగజేసినవి. కాని అదృష్టవశమున ఆ దుమారములకు ఈ సంస్థ తట్టుకొనజాలినది. అనేక పర్యాయములు విస్తరణ కార్యములను వాయిదా వేయవలసివచ్చినది. ఉదాహరణకు 1934 లో రిజర్వుబ్యాంకు సంస్థాపనము నిశ్చయింపబడెను. కాని అందు షెడ్యూలు బ్యాంకుగా చేరు అర్హతయుండుటకు వసూలయిన మూలధనము విలువలు కలసి కనీసము 5 లక్షల రూపాయ లుండవలెను. మూల ధనము పెంపుదలకు బ్యాంకుచేసిన ప్రయత్నము ఫలింపక ఆ ప్రయత్నమును వాయిదా వేయవలసివచ్చినది. కాని 1943 లో ఆ యాశయము నెరవేరి రిజర్వు బ్యాంకు ఆక్టు రెండవ షెడ్యూలులో ఈ బ్యాంకుపేరు నమోదు చేయబడెను. దేశములో ప్రారంభమైన ద్రవ్యోల్బణముకూడ ఈ బ్యాంకు అభివృద్ధికి తోడ్పడెను. 1944 నాటికి ఇందలి డిపాజిట్లు ఒక కోటిరూపాయలకు పెరిగెను. శాఖలుకూడ స్థిరముగ అభివృద్ధి చూపదొడగినవి. అయితే, కొన్నిమాత్రము లాభసాటిగా లేనివి మూసి వేయవలసివచ్చెను. ఉదాహరణమునకు ఈ బ్యాంకి రెండవశాఖ హైదరాబాదులో 1930 లో తెరువబడెను, అది లాభసాటిగా లేనందున 1940 లో మూసి వేయవలసివచ్చెను.

విజయకారణములు : ఇంతవరకు ఈ సంస్థ ఆశయములను దీని నిర్వహణమునం దుద్భవించిన సమస్యలను పరిశీలించితిమి. కాని ఈ సంస్థ ఖాలారిష్టములను జయప్రదముగా ఎదుర్కొనుటకుగల కారణములను పేర్కొనవలసియున్నది.

అందులకు మొదటికారణము ఈసంస్థకేవలము కొందరి వ్యక్తులకైకాక ఆంధ్రదేశ ఆర్థిక స్వయంపోషకత్వ కార్యక్రమములో ఒక అంగముగా ఉన్నతాశయములతో నుద్భవించుట. ఐతే కేవలము ఉన్నతాశయములవల్ల ఏసంస్థయు వర్ధిల్లదు. ఉన్నతాశయములతోపాటు దూర దృష్టి, సామర్థ్యము కావలయును. ఈసంస్థకు 7 సంవత్సరములు మేనేజింగ్ డైరక్టరుగా, డైరక్టరుగా పనిచేసిన డా. పట్టాభిగారు మితవ్యయము, జాగరూకత అను విధానములకు పునాదులు వైచిరి. ఉదాహరణమునకు ప్రారంభమున సంవత్సరమునకు ఒకటికంటె ఎక్కువ శాఖలు తెరువకుండను, అదికూడ అంతకుపూర్వము తెరచినది లాభసాటిగా నడుచుచున్నట్లు తెలిసినపిమ్మట నే మరియొకశాఖ తెరచునట్లును తగిన జాగ్రత తీసికొనబడినది. అంతేగాక ఈసంస్థ నిర్వహణబాధ్యత వహించిన శ్రీయుతులు డి. యస్. శాస్త్రి, కె. సుబ్బారావు, వారణాసి కృష్ణమూర్తి, ఇ. రామచంద్రమూర్తి మొదలగు నిపుణుల కృషికూడ ఈసంస్థయొక్క విజయమునకు మరొకహేతువు. ఆంధ్రదేశములోని వివిధరంగములకు చెందిన ప్రముఖులు డైరక్టర్, మేనేజింగ్ డైరక్టర్, చైర్మన్ మొదలగు పదవులను అలంకరించి, ఈ సంస్థ అభివృద్ధికి దోహదముచేసిరి. ఈ సంస్థ వాటాదార్లకు ప్రతి సంవత్సరము లాభములు పంచుట, ఇందలి పేర్లు ఏ కొద్దియోతప్ప దళారీలచేతులలో లేకుండుట, ముఖ్యముగా బ్యాంకింగ్ సూత్రములు శ్రద్ధాసక్తులతో పాటింపబడుటకూడ ముదావహములైన విషయములు.

డా. ఆర్. వి. రా.

**ఆంధ్రభాషా చరిత్రము :-** నేటి ఆంధ్రదేశమున ఆంధ్రులు మాటాడు వ్యావహారిక భాషకు ఆంధ్రమనియు తెనుగనియు, తెలుగనియు మూడుపేళ్ళు వాడుకలో నున్నవి. ఈ భాషను మాటాడు జనసంఖ్య సుమారు మూడుకోట్ల ముప్పది లక్షలు. నేటి మన భారతదేశమున వాడుకలోనున్న భాషలలోనికెల్ల అత్యధిక సంఖ్యాకులయిన జనులు మాట్లాడునది హిందీభాష. దాని తరువాత గొప్పసంఖ్య తెలుగు మాట్లాడువారి సంఖ్యయే. ఈ భాషయందు నన్నయాది మహాకవుల రచనలుగల గొప్ప వాఙ్మయము గలదు. నవ్య నాగరికత వలన ప్రపంచమున బయలుదేరిన అనేక క్రొత్త వాఙ్మయ ప్రక్రియలు, వార్తా పత్రికలు మొదలైన విజ్ఞానదాయక రచనలు తెనుగునను గలవు. ఇట్టి విశాలభాషా ప్రపంచము యొక్క చరిత్రమును అనగా భూత భవిష్యద్వర్తమాన స్వరూపములను సంగ్రహముగానైన నెరుగవలయును.

పాశ్చాత్య దేశమునుండి మనకు వ్యవహారములోనికి వచ్చిన క్రీస్తు శకముయొక్క ప్రారంభ దశనుండి నేటి వరకును అనగా సుమారు రెండువేల సంవత్సరముల వరకు నుండిన ఆంధ్రభాషయొక్క చరిత్రమును తెలివిడి కొరకు కొన్ని యుగములుగా అప్పుడప్పుడు కలిగిన పరిణామ విశేషములనుబట్టి విభజింపనగును. మన తెనుగు భాషలో మొట్టమొదట బయలుదేరిన గ్రంథము నన్నయ కృతమయిన మహాభారతము. ఇంతకంటె ప్రాచీనము లయిన గ్రంథములు ఉన్నవాలేవా అను వివాద మొకటి చాలకాలమువరకు నడచినదిగాని అట్టి గ్రంథములున్నట్లు నిర్ణాయకములైన సాక్ష్యముగాని, వాటి స్వరూపముగాని లభింపలేదు. తెనుగు సారస్వతమున నన్నయ ఆదికవి యనియు, ఆతడు చేసిన భాషా నియమములనే నేటికిని ప్రామాణికులు అవలంబించుచున్నారనుటయు ఎల్లరెరిగి నది. నన్నయ వ్రాసిన భాషను ఎల్ల విధములను పోలి యున్న భాషనే మనము వ్రాయుచున్నామనుట ఒప్పు కొన వీలులేదుగాని, ఆనాటి భాషయందలి జీవము, స్వభావము, చాల వరకును నేటి భాషయందును నిలిచియే యున్నవి. ముప్పదియేండ్ల వయసున మనమొక పురుషుని చూచి ఆ తరువాత మరి ముప్పదియేండ్లకు అనగా షష్టిపూర్తియైన తరువాత నాతనిని తిరుగ చూచినచో నాతని బహిరంగ స్వరూపమునను, వైజ్ఞానిక స్వరూపమైన మానసిక వృత్తియందును గొంతమార్పు కనుపట్టక తప్పదుకాని ఆతనిని వేరుపురుషునిగాగాని, యాతని ఆత్మ వేరనిగాని భావింపము. కాలగతిని పూరుష స్వరూపాదికమున మార్పు కలిగినట్లే భాషయందును మార్పు గలుగు చునే యుండును. ఆతని వయస్సు నంతటిని బాల్య యౌవనాదిగా నెట్లు విభజించుచున్నామో అట్లే తెనుగు స్థితినిగూడ విభజింప వచ్చును.

భారతము బయలుదేరిన కాలము పదునొకండవ శతాబ్దము. ఆనాటినుండి నేటివరకును ఒక భాగముగాను దానికి పూర్వకాలమును వేరు భాగముగాను విభజింప వచ్చును. ఈ రెండు భాగములనే మరల అప్పటి విశేషము లనుబట్టి విభజింపగా ఐదు యుగము లగుచున్నవి.

I క్రీస్తు పూర్వము II క్రీ. శ. 1 నుండి 7 వ శతాబ్ది వరకును, III 7 వ శతాబ్దినుండి 11 వ శతాబ్ది వరకును, IV 11 వ శతాబ్దినుండి 19 వ శతాబ్ది వరకును V 19 వ శతాబ్దినుండి నేటి వరకును, పై రీతిని విభజింపబడిన అయిదు యుగములలో మొదటి మూడును వాఙ్మయోత్పత్తికి పూర్వ స్వరూపమును నిరూపించును. తరువాతి రెండును తదనంతర స్వరూపమును నిరూపించును.

పై వాటిలో మూడవయుగమయిన 7 మొదలు 11 వ శతాబ్దము వరకునుగల కాలములో తెనుగులో వ్రాయబడిన గద్యమయ శాసనములును, కొన్ని దేశీయఛందస్సులతో అనగా సీసము, తరువోజ, అక్కర అనునట్టి పద్యబంధములతోకూడిన శాసనములును లభించుచున్నవి. ఈ శాసనములు రాజాజ్ఞ ననుసరించి దేవాలయములకును, బ్రాహ్మణులకును, రాజసేవచేసిన మరికొందరకును ఇయ్యబడిన భూములు, వాటి హక్కులు, ఎల్లలు మొదలైన వివరములతో గూడినవి. అంతియేగాని భారతమువలె ఉదాత్తమైన నీతులు, కథలు, కల్పనలు గలిగిన కావ్యములుగాని, రచనలుగాని లభింపలేదు. ఈకాలమున ఏవైన దీర్ఘములైన కావ్యములును, సంస్కృతఛందస్సులైన ఉత్పలమాల, శార్దూలము మొదలైన వాటివంటి పద్యబంధములును ఉండియుండవచ్చునుగాని అవి నశించి పోయియే యుండనగునని కొందరు ఊహించుచున్నారు. దీనికిప్రమాణముగాని బలమయిన యుపపత్తిగాని కనుపింపదు. ఈ యుగమునందలి శాసనస్థభాషనుబట్టి ఆనాటి తెలుగుయొక్క స్వరూపస్వభావములను, వ్యాకరణమును మనము తెలిసికొనవచ్చును. ఇంకొక విశేషమేమనగా ఈ కాలమున తెనుగునకు రాజాదరణమేర్పడి శాసనములయందు వాడబడుటకు తగిన యధికారము, గౌరవము ఆ రాజులవలననే గలిగినదనుటయే. ఇట్లు తెనుగును గౌరవించినరాజులు తూర్పు చాళుక్యవంశపు రాజులు. ఈవంశమునకు మూలపురుషుడయిన కుబ్జవిష్ణు వర్ధనుడు క్రీ. శ. 615-633 వరకు పరిపాలించెను. ఈ వంశములో 27 వ పురుషుడైన రాజనరేంద్రుడే తెనుగునకు వాఙ్మయస్థితిని కల్పించి యుగప్రవర్తకుడయ్యెను.

దీనికి పూర్వయుగమయిన రెండవయుగము (క్రీ. శ. 1–600)నందు తెనుగుభాషాశాసనములు లేవనియే చెప్ప వచ్చును. ఏవేని కొన్ని సందిగ్ధములయిన శాసనములు

ఉన్నను అవి ఈ రెండవయుగము తుదిభాగమునాటివి. ఈయుగమునందలి శాసనములన్నియు సంస్కృతప్రాకృత భాషలలోనే యుండుటచేత ఆనాటి తెలుగుస్వరూప మెట్లున్నదో మనకు చక్కగా తెలియబడదు. తెనుగు ఉండెనా లేదాయని సందేహించువారును నుండిన నుండ వచ్చును. కాని అంతవిశాలమయిన తెనుగునాట నొక్క మారుగా నీభాషయంతయు పుట్టియుండె ననుట అసంభ వము. ఈ భాషయొక్క పూర్వరూపము వాడుకలో నుండియుండకతప్పదు. కాని అది రాజాదరణములేక శాసనముల కెక్కియుండక పోవచ్చును.

ఈ రెండవ యుగమునందలి శాసనములను పరిశీలించి నచో మీది విషయమే సత్యమని తెలియగలదు. అప్పటి సంస్కృత ప్రాకృత శాసనములలో తెనుగునాట నాడుండిన గ్రామనామములు పేర్కొనబడినవి. అవి చాలవరకు తెనుగుపేళ్ళే. 'విరిపఅ', 'చిల్లరెక', 'తాంటి కొంట', 'వేంగీ', 'కెందులూర', 'ఒంగోడు' అనుపేళ్ళు ఆనాటి శాసనములలోనివి నేటి 'విప్తర్తి' 'చిల్లరిగె', 'తాటికొండ' 'వేంగి', 'దెందులూరు', ,'ఒంగోలు' అను పేళ్ళకు పూర్వరూపములు. ఈపేళ్ళయందలి మార్పు కాలక్రమమున సంభవించినది.

క్రీస్తునకు పూర్వమునసుండిన మొదటియుగమునందలి తెనుగు భాషాస్వరూపము నూహించుటకీమాత్రపు టాధా రముగూడ గనుపట్టదు. ఆనాటి శాసనములులేవు. కొన్ని యున్ననుగూడ వాటివలన తెనుగు ఉనికిఊహింపవీలులేదు. కాని క్రీస్తు శ. ప్రథమ శతాబ్దినుండియు నుండియున్నదని పై ఆధారములవలన మనము కనుగొనిన తెనుగుభాష యొక్క పూర్వరూపము ఆనాడును నుండియుండవలెను. తెనుగు, అరవము, కన్నడము, మలయాళము అనబడెడు ద్రావిడభాష లన్నియును ప్రాచీనకాలమున అనగా క్రీస్తు శకమునకు పూర్వము కొన్నిశతాబ్దముల క్రింద ఈ పద్వైవిధ్యముతో నొక్కరూపముననే యొక్క భాష గనేయుండి కాలక్రమమున వేరుపడి ఈరీతి విభిన్నరూప ముల నందియుండిన వను సిద్ధాంత మెల్లరచేతను అంగీక రింపబడినది. ఈ సిద్ధాంతను ననుసరించి నాటి తెలుగు ప్రాచీన తమిళ కర్ణాటాది భాషలతో సమానరూపము గలిగియుండి యుండవలె నని యూహించుట సులభము.

క్రీ. శ. ఏడవశతాబ్ది వరకును తెనుగుదేశమున సంస్కృత ప్రాకృతములకే ప్రాధాన్యమేర్పడియుండుట చేతను, తెనుగుభాషకు ఉన్నతప్రయోజనము లేకుండుట చేతను ఆభాషయొక్క స్వరూప మంతగా మనకు తెలియక పోయినది. ఆంధ్రరాజులు అనబడెడి శాతకర్ణి రాజులు తెనుగుదేశమును క్రి. పూ. 284 మొదలు క్రీ. శ. 207 వరకు అనగా 4 శతాబ్దులుపాలించిరి. ఈ రాజులకు ప్రాకృత భాషమీదనే అభిమానము ఉండెను. వారి శాసనములు, వారి గ్రంథములు, వారి దైనిక వ్యవహారము ప్రాకృత భాషయందే జరుగుచుండెను. వారు తెనుగు నాదరింప లేదు. వారితరువాత సుమారు ఏడవశతాబ్దివరకు తెనుగు నాటిని వేరువేరు వంశముల రాజులు కొంతకొంత కాలము పాలించిరిగాని ఆనాటి వివాదము సంస్కృత ప్రాకృతముల ప్రాముఖ్యమును గురించియేగాని, తెను గును గూర్చినది గాదు. ఈ శతాబ్దినాటికి ఆరంభమయిన చాళుక్యుల పాలనమునుండి తెనుగునకు రాజాదరణ మేర్పడినది. మరినాలుగు శతాబ్దులకు వాఙ్మయావస్థయు రాజాదరణము వలననే వచ్చినది. ప్రాకృతముయొక్క ప్రాముఖ్యము పూర్తిగా నశించిపోయెను. సంస్కృత భాష కేవలము పండితులకేగాని, సామాన్యులకు సాధ్యము గాకపోయెను. కావుననే తెనుగు ముందునకు రాగలిగినది.

ఇక నాల్గవ యుగము క్రీ. శ. 1000-1800. ఈ యుగమును నన్నయ యుగము అనవచ్చును. తనకు పూర్వము అవ్యవస్థితముగా (కానట, బీసటగా నున్న దని యొక ప్రాచీనకవి) నున్న తెనుగుభాషను సంస్క రించి భారతమును తెనుగున వ్రాయుటకు నన్నయ ప్రారంభించెను. ఇందులకు వలసిన పదములను సంస్కృ తమునుండి సేకరించెను. తెనుగునందలి వాక్యరచనా పద్ధతి, విభక్తి విధానము మొదలగునవి చాల సంకుచిత ముగా నుండగా వాటిని సంస్కృతముయొక్కయు, నాటి కర్ణాట వాఙ్మయముయొక్కయు మార్గముల ననుసరించి పెంచి క్రొంగ్రొత్తదారులను నన్నయ కల్పిం చెను. ఒకసారి ఆతడు ఆ మార్గమును కనిపెట్టగా దానినే ఇతరు లయిన తరువాతి మహాకవులును అనుసరించి పరి పూర్ణతను పొందించిరి. ఇందలి ముఖ్య లక్షణములు

సంస్కృతము ననుసరించుట, అందలి వాఙ్మయమును అనువదించుట అనునవియే. నన్నయ సూచించిన వ్యాకరణ విధానమునుగూడ తరువాతివారు అనుసరించి దానిని విశాల మొనరించిరి. 19 వ శతాబ్దితో ఈభాష కొక క్రొత్తమార్గ మేర్పడు పరిస్థితి సంభవించెను.

ఆంగ్ల పరిపాలనము దేశములో స్థిరపడుట, ఆంగ్లేయ విద్వాంసులు కొందరు మనభాష నాదరించుట, మన దేశములోని బుద్ధిమంతు లందరును ఆంగ్లమునే చదువుచుండుట, భారతదేశమునందలి భిన్న దేశభాసలను మాటాడువారి కందరికిని సంబంధము మగలమరల కలుగుటకు అనువుగా దేశమునందు రైలుప్రయాణములకు సౌకర్యము లేర్పడుట, విద్యాప్రణాళిక ననుసరించి ఐహిక విద్య నెల్లరును విరివిగా నేర్చుట, అచ్చుపుస్తకములు బయలువెడలుట, వార్తాపత్రికలు ప్రచారములోనికి వచ్చుట, ప్రజాసాహిత్యము, ప్రజాభిప్రాయము అనువాటికి ప్రాముఖ్యము గలుగుట మొదలగునవి తక్కిన భారతీయ భాషలనువలెనే తెనుగుభాషనుగూడ మార్చినవి.

క్రీ. శ. 1817-55 వరకును సివిలుసర్వీసులో నుండిన సి. పి. బ్రౌను మచిలీ బందరులో స్థిరపడి తమ ధనమును, బుద్ధిని ఆంధ్రభాషా సంరక్షణకును, అభివృద్ధికిని మిక్కిలిగా వినియోగించెను. ఆతడు ఆనాడు దొరకిన తాటాకు వ్రాతప్రతుల నన్నిటిని సంపాదించి సంరక్షించెను. తెనుగులోని మహాకావ్యములను భిన్నమార్గములలో నుండిన వ్రాతప్రతులనుండి ఉద్ధరించి, ప్రామాణికమైన ప్రతులను సిద్ధపరచి అచ్చువేయించుపద్ధతి నతడు తెనుగున నెలకొల్పెను. తెనుగున కొక నూత్నమార్గమున నేటి అకారాది కోశమువంటి దాని నొకటి తయారుచేయించెను. వాఙ్మయచరిత్ర, కవుల కాలమును కనుగొను పద్ధతి మొదలగువాటి నేర్పరచెను. నేటి తెలుగు వ్యాకరణ రచనా పద్ధతికి దారిచూపెను.

1800 సంవత్సరమునుండియు మనభాష ఆంగ్లభాషా వాఙ్మయ సాహచర్యమువ పెరుగదొడగెను. దానివలన ఆంగ్లపదములు, ఆంగ్ల వాక్యరచన, ఆంగ్ల వ్యాకరణ విధానము, ఆంగ్ల శాస్త్రమర్యాదలు, ఆంగ్ల వాఙ్మయ ప్రక్రియలు తెనుగున జొచ్చి విశాలముగా వ్యాపించెను. ఈ మార్గమును స్థాపించి ప్రచురించుటలో శ్రీ కందుకూరి వీరేశలింగముగారు ప్రధానులు. ఇతనిని ఈ యుగ ప్రవర్తకునిగా పేర్కొనవచ్చును. ఈ యుగమున తెనుగు భాషా వికాసమునకు సంస్కృతభాషా సాహాయ్యము మాత్రమేగాక, ఆంగ్లభాషా సాహాయ్యమును, ఇతర భారతదేశభాషల విషయములును ఉపకరించెను.

భాషాపరిణామ విషయమున ప్రబలమైన సహాయము వ్యాకరణము. నన్నయనాటి వ్యాకరణ విభజనము కేవలము సంస్కృతము ననుసరించియే జరిగినది. తెనుగు భాషయొక్క స్వభావము సంస్కృతముకంటె చాల భిన్నము. అది మిక్కిలి సరళము, తిన్ననైనది. సులభమయిన మార్గముతో కూడినది. విశాలమై పెరిగిన పద్ధతులతో గూడిన సంస్కృతవ్యాకరణ మర్యాదలను తెనుగున కతికించుచు నన్నయమార్గము 19 వ శతాబ్దివరకును నడచినది. ఆ తరువాత ఆంగ్లవ్యాకరణ మర్యాద ఆనాటి వ్యాకరణ రచనకు అంటుకట్టుటచేత నేటి తెనుగువ్యాకరణములు చాలవరకు ఆంగ్లవ్యాకరణ మర్యాదనుగూడ ననుసరించుచున్నవి. వ్యాకరణ విషయమున నుండవలసిన ప్రధానభావములు అనేకములు మారిపోయినవి.

తెనుగునందలి పదజాలము చాలవరకు మార్పు నొందినది. నన్నయ తన భారతమును రచియించుటకుముందు తెలుగు చాల నల్పసంఖ్యాకములయిన పదములతో గూడియుండెను ఈ పదములు ద్రావిడములు అనగా తెనుగునకు స్వాభావికములై మొదటినుండియు నందు ఉత్పన్నములయినవియే. ఈ పదములన్నియు నేటి తమిళ, కర్ణాట, మలయాళ భాషలలోని ఆదిమ పదజాలముతో అభిన్నములు. ఒక్క పదమే అన్ని భాషలలోను నేడును ఒక్క రూపముననే, ఒక్క యర్థముననే వాడబడుచున్నది. కొన్ని కొంచెము మాత్రము మారి పూర్వకాలమున ఈ రూపములన్నియు ఒక్కదానినుండి ఏర్పడినవేయని తెలియదగినట్లు కనుపట్టుచుండును. మొదట తెనుగులో నుండిన పదజాలమంతయు నిట్టిదే. నన్నయ తన భారత రచనకు తగిన పదములు తెనుగున లేకుండుటచేత అనాటి వాడుక ననుసరించి సంస్కృతపదములనే తెనుగు విభక్తులనుచేర్చి సంస్కృతమునందలి యర్థముననే వాడెను. ఏవేని కొన్ని పదములు అర్థమునను, రూపము

నను మారియున్న యెడల వాటినిగూడ స్వీకరించెను. ఈ పద్ధతినే తరువాతివారును పందొమ్మిదవ శతాబ్దము వరకును, నేడును గూడ ననుసరించుచున్నారు. కాని మన దేశమును పదమూడవ శతాబ్దినుండియు మహమ్మదీయులు పరిపాలించుచుండుటచే హిందూస్థానీ, అరబ్బీ, పారసీక భాషలలోని పదములు అనేకములు వ్యవహార వశమున ప్రవేశించెను. ఆ తరువాత కన్నడ, తమిళ, మలయాళ భాషలనుండియు కొన్నిపదములు వచ్చి ప్రవేశించెను. 18 వ శతాబ్దినుండి మనకు పాశ్చాత్యుల సంపర్కము కలుగుటచేత కొన్ని ఫ్రెంచిపదములు, పోర్చుగీసు పదములు, ఒలాందుల పదములుకూడ తెనుగున ప్రవేశించెను. ఆ పదములు కొన్ని నేటికి తెనుగున వాడుచునే యున్నారు. కాని యవి మిక్కిలి యెక్కువగాలేవు. ఆంగ్లపదములుమాత్ర మట్లుగాక, యాంగ్లేయ విజ్ఞాన ప్రభావముననుఁ, వారి పరిపాలనముననుఁ విశేషముగా ప్రవేశించినవి. చాల పదములు మారుపడి తెనుగులో స్థిర పడినవి. తత్సమములుగా కొన్నివేల పదములు మనవా రందరును దినదినమును వాడుకలో నుపయోగించుచునే యున్నారు అవి వాడుకలో నున్నంత విరివిగా గ్రంథములలోనికి మాత్రము ఎక్కలేదు. సంస్కృతపదముల నన్నిటిని మనము తెనుగు రచనకు తెచ్చుకొని వాడుకొను నాచారము ఏర్పడినట్లు ఆంగ్లేయపదములు తెచ్చుకొని తెనుగురచన చేయుటలేదు. అనగా సంస్కృతము తెనుగులో నొక భాగమయిపోయినది. కాని యాంగ్లభాష మాత్ర మట్టిస్థితిని పొందలేదు.

తెనుగుభాషావికాస చరిత్రను తెలిసికొనుటలో మిక్కిలి యుపకరించునది మూడవయుగములోని భాష. ఇది కేవల శాసనస్థముమాత్రమే. విరివియందు కొంచెము. కాని ఒక ప్రక్కన తెనుగున కితర ద్రావిడభాషలతోగల సంబంధమును, నేటి తెనుగుయొక్క రూపమేర్పడిన విధమును జక్కగా వివరించుట కుపయోగించును. నేటి తెనుగు ప్రత్యయములయిన డు, ము, వు, లు, మొదలయినవాటి పూర్వరూపములు స్పష్టముగా భిన్నములయిన పరిణామములతో వందు గనుపట్టుచుండును. కావున తెనుగు చరిత్రము నెరుగదలచిన పండితుల కిది యుపకరించును.

తెనుగుభాషావికాస చరిత్రమును జూచినచో అది క్రీ. శ. మొదటి యేడుశతాబ్దులలో దాని యునికియే తెలియనంతటి అప్రధానావస్థయందు సంస్కృత ప్రాకృతముల ఛాయనుబడి యుండినట్లు స్పష్టపడుచున్నది. కాలక్రమమున సంస్కృతప్రాకృతములు మూలబడిపోగా తెనుగునకు చాళుక్య రాజావలంబనమున ప్రాముఖ్యము ఏర్పడకలిగినది. గొప్ప వాఙ్మయమును నిర్మించుకొన గలిగెను. తెనుగు సంస్కృతప్రాకృతములనుండి అనేక విషయములను స్వీకరించెను. ఆ తరువాత ఆంగ్లభాషా సాహచర్యమువలన కొంత విస్తృతినిపొంది అది నేడు ఆంధ్రజాతికంతటికిని విజ్ఞానదాయకమైన ముఖ్యసాధనముగా వెలయుచున్నది. భాషాప్రయుక్తమైన రాష్ట్ర విభజనమునకు తెలుగే మొదటిమెట్టు వేసినది.

ఇక నేటివరిస్థితిని, భావిని కొంచెము పరిశీలింపవలసి యున్నది. మనము పుస్తకములలో వ్రాయు భాషకును, దైనిక వ్యవహారమున ఎల్లరును మాటాడు భాషకును గొంతభేదము కన్పట్టుచున్నది. పుస్తకములలోని భాష విశేషము మార్పులేక అఖిలాంధ్రదేశమున నొక్కరూపముననే యుండును. దీని స్వరూపము వ్యాకరణము, కోశము, కవిప్రయోగము, శిష్టభాషలోని పలుకుబడి అను వాటి నన్నిటి నాధారముగా చేసికొనియున్నది. దీనినే ప్రామాణిక భాషయందుము. ఈ ప్రామాణిక భాష యొక్క స్వరూపముగూడ కాలముననుసరించి కొంచెము కొంచెముగా మారుచునే యుండును. నన్నయ తన భారతమున వ్రాసిన వాడుకలు కొన్ని మన రచనలలో కనిపింపవు. ప్రతిదినము వాడుకలో నసలేలేవు. ఇట్లు నన్నయ నాటిభాష మనభాషకంటె కొంత భిన్నముగానున్నను మనకర్థముకానంతగా అది మారలేదు. నన్నయకు ముందుభాష పండితులకుగూడ బోధపడనంత అస్తవ్యస్తముగా మాత్రముండెను. నేటివ్రాతలో 'చేయుచున్నాడు, చేసినాడు' అను రూపములవంటివాటిని మనము వాడుదుము. మాటాడునప్పుడు మాత్రము 'చేస్తున్నాడు, చేస్తండు ; చేశాడు, చేసిండు' అనునట్లు వివిధములయిన రూపములను ప్రదేశమునుబట్టియు, మాటాడువారి సంఘమునుబట్టియు వెలయించు చుందుము. ఇట్టిభేదము వ్రాతకును, నోటి మాటకును, అరవము, కన్నడము

మొదలయిన యెల్ల భాషలయందును నుండునదియే. కాని మనము మాటాడునట్లే వ్రాయవలయు ననియు, గ్రంథములలో నుండునట్లు వ్రాయరాదనియు కొంతమంది పలుకుచున్నారు. అట్లు వ్రాయుచున్నవారును గలరు. ఇట్లు చేసినచో భాష నేర్చుకొనుటయందు కొంత సౌలభ్యము కలుగవచ్చును. కాని దేశమున కంతటికిని ఒక రూపమయిన ప్రామాణికభాష యుండవలయు నను పట్టుదల పోయినచో దేశమున భేదము భాషావిషయమున నేర్పడి తెలుగునారి ఐక్యమునకు భంగముకలుగవచ్చును. మన ప్రాచీనుల వాఙ్మయమునకు మనము మరికొంత దూరమయినవారము కావలసివచ్చును. క్రొత్త ప్రామాణికభాషను సృజించుకొనినచో క్రొత్తవాఙ్మయమును సృజించుకొనవలయును. ఇట్టిది ఒకనాడు సంభవము కాదు. జాతియంతయు ఏకముఖముగా ప్రయత్నముచేసి ప్రామాణికరూపములను నిరూపించుకొనినతరువాత కొన్ని తరములవరకు మేధావులయిన మహాకవులు వాఙ్మయసృష్టికి నిరంతరకృషి చేయవలయును. ఉన్న ప్రామాణికభాషనే గ్రహించి యందు దేవైన అలంతిమార్పు లేర్పడినచో వాటి నంగీకరించి ఆరూపమును నిలువబెట్టుకొనుట గూడ నొకమార్గమే. ఇది భావిని జరుగవలసినది.

ఇకముందీ భాషలో నవ్యప్రపంచవిజ్ఞానమంతయు వెలయించి మన తెలుగువారిని విద్యావంతులుగా చేయవలసిన బాధ్యతయు తెలుగువారిపై గలదు. ఇట్టి బాధ్యతయే నన్నయపై బడగా నానాటి తెనుగున తగిన శబ్దజాలము లేకుండుటచేత సంస్కృతపదముల నన్నిటిని తెచ్చి తెనుగున చేర్చెను. నేటి పాశ్చాత్య శాస్త్రములలోని విజ్ఞానమునంతటిని తెనుగునకు తేవలసినచో పదము లెచ్చటినుండి రావలెను. ఇదియొక సమస్య. తెనుగులో పదములు కల్పింపవీలులేదు. సంస్కృతమున పదములు కల్పించి తెనుగులోని పూర్వపద్ధతినే ప్రయోగింపవలెనా లేక ఆంగ్లభాషనుండి వేలకొలది సాంకేతికపదములను తెచ్చి చేర్చుకొనవలెనా అను నదియు నొక సమస్య. ఇంకొక విషయ మేమనగా, ఈ సాంకేతిక పదములు ఏభాష కాభాషలోనే భిన్నముగా నేర్పడవలెనా లేక భారతదేశములోని ఎల్లభాషలకును ఒక్క రూపముననే యుండవలెనా యనునదియు నొకసమస్యయే. ఈ సమస్యలన్నియు ముందుముందు పరిష్కరింపబడవలయును. వీటి పరిష్కారముకొరకు పండితులును ప్రభుత్వమును ప్రయత్నించుచునే యున్నారు. మార్గములును ఏర్పడుచున్నవి. మనదేశమున నింక హిందీభాష కొక నవ్యప్రాముఖ్య మేర్పడుచున్నది. ఆ భాష యొక్క పెరుగుదలగాని, ప్రాముఖ్యముగాని తెలుగును, ఇతరదేశభాషలను ఎట్లు మార్చును అనునదియు భావిని తేలవలసినదయే.

మొత్తముమీద ఆంధ్రభాష నవ్యవిజ్ఞానము నంతటిని తనలో నిముడ్చుకొని ఈ భాషను మాటాడువారి కందరికిని ఆ జ్ఞానము సులభముగా నలవడునట్లును, తెనుగుదేశమునం దంతటను ఈ భాషకుగల ఏకస్వరూపమును, ఐక్యమును నిలువబెట్టుకొనునట్లును, వాడుక భాషకును రచనలలోని భాషకును గల దూరము వీలయినంతవరకు తగ్గునట్లును, ఇతర భారతీయభాషలతో పోల్చిచూచినచో సాధ్యమయినంతవరకు సమాన పదజాలము ఉండునట్లును పెరుగవలసి యున్నది.

ఇట్లు భూతభవిష్య ద్వర్తమాన స్వరూపములను వివరించినతరువాత తెనుగుభాషకు నేటి వాడుకలోని పేళ్ళెట్లు వచ్చినవి అని వివరింపవలెను. నేడు వాడుకలో నున్నవి మూడు పేళ్ళు, 1. ఆంధ్రము, 2. తెనుగు, 3. తెలుగు. ఈ మూడింటియందును మొదటిది సంస్కృత పదము, తక్కినరెండును తెలుగుపదములే. ఈ ఆంధ్రము అను పదము ఒకజాతి జనసంఘమునకు వాచకముగా ఐతరేయబ్రాహ్మణమునందు పేర్కొనబడినది. అంతియే గాక ఈ ఆంధ్రరాజులనుగూర్చి పురాణములును, భారతదేశమునకు ప్రాచీనకాలమున వచ్చిన కొందరు చరిత్రకారులును పేర్కొనిరి. దీనినిబట్టి ఈపేరు మొదట జనుల పేరుగా నుండుట నిశ్చయము. వీరితరువాత ఈప్రదేశమునకు ఆంధ్రపథమనియు, ఆంధ్రదేశమనియు వ్యవహారము శాసనములలో గనుపట్టుచున్నది. ఇది క్రీ. శ. మూడు నాలుగు శతాబ్దులనుండియుండినవిషయము. అంతకుముందీదేశభాగమునకు దక్షిణాపథమనియే వ్యవహారము. ఆ తరువాత దేశమునుండి "ఆంధ్ర"పదము భాషకు వాచకమయినది. నన్నయ తాను వ్రాసిన శాసనములలో ఆంధ్రభాషను పేర్కొనెను. తన భారతమున దీనినే 'తెనుగు' అని వ్యవహరించెను. 'తెలుగు' అను పేరును తరువాతి

గ్రంథములలో గనుపట్టుచున్నది. నేటి తెనుగుదేశములో సుప్రసిద్ధములయిన దక్షారామము, శ్రీశైలము, కాళహస్తి అను మూడు క్షేత్రములలో మూడు శివలింగము లుండుటవలన ఈదేశమునకు 'త్రిలింగములుకలది' అను నర్థమున "త్రిలింగదేశము" అను వ్యవహారము కలదని ప్రతాపరుద్రీయము (క్రీ. శ. 1300) మొదలగు గ్రంథములలో చెప్పబడినది. ఈత్రిలింగమనుశబ్దము వాడుకలో మారుపడి 'తెలుగు' అను రూపమును పొందినదని సిద్ధాంతము. దీనికి బలము శాసనములలో 'తిలింగ, తెలుంగ, తేలుంగ, తెలింగ' అనుపేళ్ళు ఈ దేశమునుగూర్చి వాడబడినవి కనుపట్టుటయే. కాబట్టి వాడుకలో తిలింగపదము మారి యుండవచ్చుననునది దృఢమగుచున్నది. ఈతెలుగులోని 'ల'కారము ఉచ్చారణమున మారి 'న'కారమయి తెనుగు అనురూప మేర్పడిన దని కొందరి యూహ. కాని తెనుగు అను శబ్దము స్వతంత్రముగా తెలుగు శబ్దముకంటె ముందుగనే వాడియుండినట్లు నిదర్శనములు గలవు. 'తెనుగు' అను శబ్దమునకు ద్రావిడభాషలలో 'దక్షిణము' అని యర్థము. ఈదేశభాగమునకు దక్షిణాపథమనియు 'దక్కన్' అనియు పేరుండుటవలన ఆ దక్షిణ శబ్దమునకు 'తెనుగు' అను పదము అనువాదముగా వాడబడుటవలన ఈదేశమునకును, భాషకును తెనుగు అను పదము వాచకమయి కాలక్రమమున ఆంధ్రపదమువలెనే వాడుకలో స్థిరపడెను. ఈ మూడును తెనుగు పేళ్ళుగా ప్రసిద్ధములు.

గం. జో.

**ఆంధ్ర లక్షణ గ్రంథములు :** లక్షణ మనగా "లక్ష్యతే జ్ఞాయతే అనేన" అను వ్యుత్పత్తిచేత ఒక వస్తువును లేక ఒక విషయమును గుర్తుపట్టి తెలిసికొనుటకు పనికివచ్చు సాధనమని యర్థము. ఇతర వ్యావర్తకముగా (ఒకదానికి చెప్పిన లక్షణము మరియొక దానినుండి వేరుపరచునట్లుగా) ఒక వస్తువును నిర్దేశించుట లక్షణము. లక్షణ మనగా 'గుర్తు' అని స్థూలముగా అర్థము చెప్పవచ్చును. ఏ వస్తువునకైనను ప్రత్యేకమగు లక్షణము లేనిచో దానిని చక్కగా గ్రహింపజాలము. లక్షణమును జెప్పునప్పుడు అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవము అను దోషములు లేకుండునట్లు చెప్పవలయును. అట్టి లక్షణ జ్ఞానమువలన లక్ష్యజ్ఞానము సులభముగా గలుగును. కనుక పూర్వులు ప్రతి శాస్త్రమునందును లక్ష్య లక్షణ సమన్వయ పద్ధతి నవలంబించి యున్నారు. ఛందోఽలంకార వ్యాకరణ శాస్త్రములను రచించుచపట్టున తెలుగు లాక్షణికులు సైతము అట్టి పద్ధతినే అవలంబించిరి. ఆంధ్ర భాషయందు లక్ష్య లక్షణ సమన్వయ పద్ధతితో గత శతాబ్దులందు వెలసిన శాస్త్రములలో "వ్యాకరణ శాస్త్రము, అలంకార శాస్త్రము, ఛంద శ్శాస్త్రము నిఘంటువులు" అనునవి ముఖ్యములు. ఈ శాస్త్రములు నేటివరకును పెరుగుచున్నవి. కనుక వీటిని గురించిన అంశములను తెలిసికొనుట మనకు ప్రస్తుతము.

**I వ్యాకరణ శాస్త్రము :-** పదములను ప్రకృతి ప్రత్యయ విభాగ పురస్సరముగా నిరూపించుటచే ఈ శాస్త్రమును 'వ్యాకరణ' మని అనుచున్నారు. "వ్యాక్రియంతే శబ్దాః సంస్క్రియంతే అనేన ఇతి వ్యాకరణమ్" అని వ్యుత్పత్తి. శబ్ద సంస్కార సాధనమని యర్థము. ఋగ్వేద పదకారుడగు శాకల్యుడు మొదలుకొని బహువ్యాకర్తలు సంస్కృత భాషకు వ్యాకరణమును రచించిరి అవి నామ మాత్రావశిష్టములు. ఇప్పుడు లోకవ్యవహార సాధనమైన ప్రాచీన వ్యాకరణము పాణినీయమే. పాణిని రచించిన అష్టాధ్యాయి, 3981 సూత్రములతో వైదిక, లౌకిక భాషా ప్రపంచమును సంస్కరించునట్టి ఉత్తమ వ్యాకరణము. అదియే దేశభాషా వ్యాకరణములకు మార్గదర్శకమైనది. తెలుగు వ్యాకర్తలు పాణినీయ పరిభాషనే అవలంబించిరి.

"ప్రయోగమూలం వ్యాకరణమ్"; "ప్రయోగశరణా వైయాకరణాః" అను లోకోక్తుల వలన శిష్ట వ్యవహారము వ్యాకరణ రచనకు ఆధారమనుట స్పష్టము. ప్రాచీనాంధ్ర వైయాకరణులు కవి ప్రయోగములను, వాటిచే తెలియవచ్చు నితరాంశములను, కవిమార్గ విరుద్ధములు కానట్టి లోక వ్యవహార సిద్ధములను ఆధారముగాగొని వ్యాకరణములను రచించిరి జీవద్భాషలగు తెలుగు మున్నగు వాటియందు పూర్వకవి ప్రయుక్తములు గాకున్నను, వ్యాకరణ లక్షణమునకు దూరముగా నున్నను, తత్తత్కాలములయందలి కవులు ప్రయోగించిన శబ్దములు శిష్టవ్యవహారము అను శాణమున వన్నెలు దీరినవై

యుండెనేని వాటిని స్వీకరించి, వానికొరకై వ్యాకరణ మును విస్తరించుటకు అనుమతించిరి. ఇరువదవ శతాబ్ది యందు రచింపబడిన వ్యాకరణ గ్రంథములలో నిట్టి దూరదృష్టితో నుద్భవిల్లినవి కొన్ని కలవు.

శబ్దమును ప్రకృతి ప్రత్యయ విభాగ పురస్సరమైన యర్థమునందు చక్కగా నెరిగి ప్రయోగించుట వలన ఇష్టార్థము (ఉద్దేశింపబడిన యర్థమని లౌకికముగా నర్థము చెప్పుకొనవచ్చును) సిద్ధించును. సంస్కృత విద్వాంసు లలో ఇట్టి యాచారమున్నది. కనుకనే వారు

"ఏకశ్శబ్దః సమ్యక్ జ్ఞాతః శాస్త్రాన్వితః
సుష్ఠుప్రయుక్తః స్వర్గేలోకే కామధుక్ భవతి"

అను దానిని సర్వదా స్మరించుచుందురు. సమ్యక్ జ్ఞాతమైన సుశబ్దమును ప్రయోగించుటవలన స్వర్గము వచ్చునని వారి విశ్వాసము. తెలుగుభాషనుసయితము సంస్కృతము వలె ఉన్నతదశకు తెచ్చుటకై నన్నయభట్టారకాది వ్యాకర్తలు మార్గమును చూపియున్నారు. జీవద్భాష యైనంత మాత్రమున స్వేచ్ఛగా శబ్దమును ప్రయోగించు టకు వీలుండదు. రచయితస్వసంకేతమాత్రప్రసిద్ధములయి, నేయార్థాది దోషజుష్టములయిన పదప్రయోగములుచేసి భాషను కల్మష పరుపరాదు. శిష్టవ్యవహారము లోకా దరము- అను గీటురాళ్ళ ఒరపిడితో నిగ్గులుదేరిన శబ్దము లను మాత్రమే ప్రయోగించి భాషా సరస్వతిని అలంక రించుచుండవలెను. అట్టి రచయితయొక్క ప్రయోగ ములు ముందురాబోవు వ్యాకరణములందు చేరును. కనుక జీవద్భాషల విషయమున కవిత గీతవంటిదనియు, వ్యాకరణము దానిని ప్రకాశింపజేయు పందిరివంటిదనియు కవులును, పండితులును తలపవలసియుండును. ఇకమన తెలుగు వ్యాకరణములలో కొన్నిటి చరిత్రను తెలిసి కొందము.

**ఆంధ్రశబ్ద చింతామణి :** ఇది ఆంధ్రభాషా వ్యాకరణ ములలో మొదటిది. 'వాగనుశాసన' బిరుదాంచితుడైన నన్నయభట్టారకు డీగ్రంథమును రచించెను. దీనిని 'నన్నయ భట్టీయ' మనియు కొందరు వ్యవహరింతురు. ఇది సంస్కృత భాషయందు శ్లోకరూపమున (ఆర్యావృత్త ములలో) వ్రాయబడినది. తరువాతి వ్యాఖ్యాతలు అందలి సూత్రములను విడివిడిగా తీసి వ్యాఖ్యానములను రచించిరి. చింతామణి వ్యాఖ్యాతలలో ఎలకూచి బాల సరస్వతి, పారనంది రామశాస్త్రి మున్నగువారు గలరు. వఝుల చిన సీతారామస్వామిశాస్త్రిగారు విమర్శాత్మక ముగా 'చింతామణి విషయ పరిశోధనము'ను రచించి పెక్కువిషయములను స్పష్టపరచిరి. చింతామణి తరువాత వచ్చిన వ్యాకరణములు కొన్ని అనువాదములుగాను, కొన్ని దాని నాధారముగా జేసికొని విస్తరిల్లినవిగాను ఉన్నవి. చింతామణియందు సంజ్ఞా, సంధి, అజంత, హలంత, క్రియా పరిచ్ఛేదములు గలవు. 'విశ్వశ్రేయః కావ్యమ్' అను కావ్య లక్షణముతో నీవ్యాకరణము ప్రారంభమగును. నన్నయభట్టారకుడు తెనుగువ్యాకరణ శాస్త్రమునకు ప్రథమాచార్యుడు. ఇతడు క్రీ. శ. పదునొకండవ శతాబ్దివాడు. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతము అగునా ? కాదా ? అను విషయమున విమర్శకులలో అభిప్రాయభేదము కలదు.

**అథర్వణ కారికావళి :** ఇది నన్నయయొక్క ఆంధ్ర వ్యాకరణమగు చింతామణి సూత్రములతో జోడించి లక్ష్య సాధనచేయుటకు పనికివచ్చు కారికలు (శ్లోకములు) గల యుత్తమ వ్యాకరణ గ్రంథము. అథర్వణాచార్యుడు కర్తయగుటచేత అథర్వణ కారికావళియని దీనికి పేరు వచ్చినది. 'వికృతి వివేక' మనియే దీని నామధేయము. పరిచ్ఛేదాంతములయందు "ఇతి శ్రీమదథర్వణాచార్య కృతే వికృతి వివేకే" అని యున్నది.

అథర్వణాచార్యుడు నన్నయతరువాత వచ్చిన ప్రామా ణికుడయిన గొప్ప వ్యాకర్త. చింతామణి సూత్రముల యొక్క గాంభీర్యమును విశదపరచుటయందును, చింతా మణి దృష్ట్యా అసాధువులనుటకువీలైన మహాకవి ప్రయో గములను సాధించుటయందును, అథర్వణకారికావళి మిక్కిలి తోడ్పడును. చింతామణి నన్నయకృతము కాద నియు, వికృతివివేకము అథర్వణకృతము కాదనియు, వీటిని ఎలకూచి బాలసరస్వతియు, అహోబల పండితు డును రచించిరనియు ఒక వాదము కలదు. కాని చింతా మణి వికృతివివేకములు నన్నయాథర్వణ కృతములేయని కొందరు పండితులు భావించుచున్నారు.

అథర్వణ కారికావళియందును చింతామణియందు వలెనే సంజ్ఞా, సంధి, అజన్త, హలన్త, క్రియాపరిచ్ఛేద

ములు వరుసగా కలవు. ఈ గ్రంథమునకు ద్వితింత్రిణీ సీతారామకవి 'కవిజనమండనము' అను వ్యాఖ్యను రచించెను. ఇతడు అహోబలపండితుని తరువాతివాడని విమర్శకుల అభిప్రాయము. ఈద్వితింత్రిణీ సీతారామకవివ్రాసిన టీక బాలవ్యాకరణకర్తకు నూతన వ్యాకరణ రచనమునందు ఉపయోగించియుండునని సోదాహరణముగా వఝుల చిన సీతారామస్వామిశాస్త్రిగారు నిర్ణయించిరి. వికృతి వివేకకర్తయైన అథర్వణుడు ఆంధ్రవ్యాకరణ శాస్త్ర ద్వితీయాచార్యుడు ఈతడు వ్రాసిన మరియొక గ్రంథము "త్రిలింగ శబ్దానుశాసనము" ఇది కారికావళి కన్న చిన్నదియగుటచేత దీనిని రచించిన పిమ్మట బహుశాంశములుగల కారికలను ఇతడు రచించెను. సుమారు 240 కారికలతో చింతామణి ప్రతిపాదితాంశములను 'ఉక్తానుక్త దురుక్త చింతనపురస్సరము'గా సమర్థించునట్టి అథర్వణకారికావళి, (వికృతివివేకము) ఆంధ్రభాషా వ్యాకరణములకు తలమానికము వంటిది. అథర్వణుడు నన్నయకు సమకాలికుడని కొందరును, క్రీ. శ. 13 వ శతాబ్దివాడని కొందరును నిర్ణయించిరి.

**ఆంధ్రభాషాభూషణము :** ఇది మూలఘటిక కేతనకవి ప్రణీతము. ఏకాశ్వాస పద్యకావ్యముగా ఇది రచింపబడినది. ఇందు 189 పద్యములు కలవు. కేతనకవి మహాకవి యగు తిక్కనకు సమకాలికుడు. కనుక పదుమూడవ శతాబ్దివాడు. ఇతనికి 'అభినవదండి'అను బిరుదముకలదు. దండి కవికృతమైన దశకుమార చరితమును ఆంధ్రీకరించుటచేత ఇతనికీబిరుదము వచ్చెను. ఆంధ్రవ్యాకరణమును తెనుగునందే రచించినవారిలో ఇతడు ప్రథముడు. ప్రాచీనములైన చింతామణి వికృతివివేకములను కేతన చూచినట్టు లేదు. తానే తొలిసారిగా తెలుగువ్యాకరణమును రచించుచున్నట్లు గ్రంథాదిని తెలిపినాడు. ఇది స్వతంత్రమైన గ్రంథము. ఆంధ్రభాషాపదములు అయిదు విధములుగా ఇందు విభజింపబడినవి. 'తెనుగు' దేశ్యము, భిన్నము అని కేతన యభిప్రాయము. కాని తత్సమము తప్ప ఇతరములయిన నాలుగును కలిసి అచ్చతెనుగగునని అంగీకరించినాడు. నన్నయభట్టీయాదులందువలె విపులార్థ సంగ్రహముగాని, చక్కని వ్యాకరణ పరిభాషగాని ఇందులేదు. లక్ష్యజ్ఞానము కలుగుటకుమాత్రము ఉపయోగించును. పద్యకావ్య మగుటచేత కంఠస్థము చేయుటకు అనువైన గ్రంథము.

**అహోబల పండితీయము :** ఈ గ్రంథమునకు "కవిశిరోభూషణము", "అహోబల పండితీయము" అని రెండు నామధేయములు కలవు. ఇది నన్నయభట్టారకుని చింతామణికి విపులమయిన (భాష్యమువంటి) సంస్కృత వ్యాఖ్యానము. నన్నయ యొక్క సూత్రములకు లొంగని కవిప్రయోగములను అథర్వణకారికలతో సమన్వయించి లక్ష్యసాధన చేయుచు, కేతనాదులను అచ్చటచ్చట ఖండించుచు, బహుశాంశములను చర్చాపూర్వకముగా ప్రతిపాదించుచు, అహోబలపతి ఈ వ్యాఖ్యానమును రచించెను. సంస్కృతమునందు పాణిన్యాచార్యుడు సూత్రములను, వరరుచి వార్తికములను, పతంజలి మహర్షి భాష్యమును రచించినట్లు, తెనుగు వ్యాకరణమును సంస్కృత భాషయందు సూత్రములుగా నన్నయభట్టారకుడును, వార్తికములుగా అథర్వణాచార్యుడును, భాష్యముగా అహోబలపండితుడును రచించిరి. కావున పాణిన్యాదులవలె వీరును తెనుగు వ్యాకరణమునకు "మునిత్రయము" అనబడుచున్నారు.

అహోబలపండితుడు, ఎలకూచి బాలసరస్వతి, అప్పకవి మున్నగు లాక్షణికులకన్న తరువాతివాడు. ఇందు ఆంధ్ర వ్యాకరణాంశములు సంస్కృతభాషయందు ఉదాత్తముగా చర్చింపబడినవి. ఈ గ్రంథము ఆంధ్రభాషకు శిరోభూషణము వంటిది. అర్వాచీన వ్యాకర్తలకిది మిక్కిలి ఉపయోగపడినది.

**ఆంధ్రకౌముది :** గణపవరపు వేంకటపతికవి ప్రణీతమయిన "సర్వలక్షణ శిరోమణి"లోని వ్యాకరణాంశములను తెలుపునట్టి సీసమాలికకు "ఆంధ్రకౌముది" అని పేరు. ఆంధ్రకౌముది ప్రత్యేక గ్రంథముగా ఆంధ్రసాహిత్య పరిషత్తు (కాకినాడ) వారిచే ప్రకటింపబడినది. ఇది వేయి చరణములుగల సీసమాలిక. ఇందు తద్భవ, తత్సమాది పదభేదములు, సంస్కృత సంజ్ఞాప్రకరణము, విభక్తి స్వరూపములు, అవ్యయ స్త్రీ ప్రత్యయ సమాస స్వరూపములు, తద్ధితణిజంతములు, క్విబంతములు, పూర్వప్రయోగములు, త్రికూలబంధ-పంచచామరము మున్నగు నంశములు గలవు. గ్రంథకర్త ప్రాచీన వ్యాకరణములను

పూర్వకవి ప్రయోగములను చక్కగా నెరిగినవాడు. పదునెనిమిదవ శతాబ్ది ఆరంభముననున్న ఇతడు కూచిమంచి తిమ్మకవికి సమకాలికుడుగా తలపబడుచున్నాడు.

మండ లక్ష్మీనరసింహాచారి (1670 ప్రాంతము) కృతమయిన "ఆంధ్ర కౌముది" ఇంకొకటి కలదు. ఇది ఆంధ్రభాషకు సంస్కృతసూత్రములలో వ్రాయబడిన వ్యాకరణము. ఉదాహరణములు తెలుగునం దున్నవి.

సర్వలక్షణసార సంగ్రహము: కూచిమంచి తిమ్మకవి ఈ గ్రంథమును రచించెను. ఇతడు క్రీ. శ. 1700-1757 ప్రాంతమున జీవించియుండెను. పీఠికాపుర సంస్థానమునకు చెందిన కందరాడ అతని గ్రామము. సర్వలక్షణసార సంగ్రహమునందు తత్సమ, శుద్ధాంధ్ర వర్ణ, సంధి, విభక్తి, సమాస, క్రియావిశేషణ ప్రకరణము లనెడి విభాగములతో వ్యాకరణాంశములును, ప్రాస, విశ్రమ, ప్రకరణ నామధేయములతో ఛందో విషయములును, శబ్ద ప్రకరణము అనుపేరుతో శబ్దముల రూపభేదములును; రేఫద్వయ నిర్ణయ మను పేరుతో రేఫ, ఱ కారముల భేదమును తెలుపబడినవి. ప్రతి విభాగమునందును ప్రాచీనకవి ప్రయోగములు పుష్కలముగా నీయబడినవి. బమ్మెర పోతరాజు రేఫ, ఱ కార భేదమును పాటింపలేదని అప్పకవి మున్నగువారు చేసిన విమర్శనము సమంజసము కాదని ఇతడుచెప్పెను. తిమ్మకవి బహుగ్రంథకర్త. "కవి సార్వభౌమ" బిరుదాంకితుడు.

బాలవ్యాకరణము: పరవస్తు చిన్నయసూరి (క్రీ. శ. 1806-1862) ఈ గ్రంథమును రచించెను. తెలుగు వ్యాకరణ సూత్రములలో ఇంత బిగిగల రచన మరియొక దానియందు లేదు. బాలవ్యాకరణ రచనకు నన్నయభట్టీయాది గ్రంథము లాధారములు. ఇందు సంజ్ఞా, సంధి, తత్సమ, ఆచ్ఛిక, కారక, సమాస, తద్ధిత, క్రియా, కృదంత, ప్రకీర్ణక పరిచ్ఛేదములు గలవు. సూరిగారు ప్రాచీన వ్యాకరణములనేకాని అర్వాచీన కవి ప్రయోగములను పాటింపమి కొన్ని ప్రయోగములు బాల వ్యాకరణము ననుసరించి అసాధువు లగుచున్నవి. కాని వ్యాఖ్యాతలు బహుళాంశములను చేర్చుటచేత సవ్యాఖ్యానమగు బాల వ్యాకరణము తెలుగు విద్యార్థులకు అత్యంతోపకారముగ ఉన్నదనుట నిస్సంశయము. బాల వ్యాకరణమునకు ప్రథమమున "గుప్తార్థ ప్రకాశిక" అను పేరితో వ్యాఖ్యానమును కల్లూరి వేంకట రామశాస్త్రిగారు రచించిరి. పిమ్మట దూసి రామమూర్తి శాస్త్రిగారు 'గ్రాంథికాంధ్ర కల్పకము', లేక 'బాల వ్యాకరణ సారసర్వస్వపేటిక' అను వ్యాఖ్యను రచించిరి. దూసి వారు కల్లూరివారి నచ్చటచ్చట విమర్శించిరి. ప్రక్రియాంశములకు గుప్తార్థ ప్రకాశికయు, విశేష చర్చలకు దూసి వారి వ్యాఖ్యయు, ఉపయోగించునవియై బాలవ్యాకరణమునకు వన్నె పెట్టినవి. వ్యాకరణ సూత్రములను వచన రూపమున వెలయించుట బాల వ్యాకరణ వైశిష్ట్యములలో నొకటి. చిన్నయసూరి బాల వ్యాకరణమునే కాక (1) సూత్రాంధ్ర వ్యాకరణము (2) ఆంధ్రశబ్ద శాసనము; (3) పద్యాంధ్ర వ్యాకరణము అనెడి మరి మూడు వ్యాకరణములను గూడ రచించెను, వీటిలో సూత్రాంధ్ర వ్యాకరణము సంస్కృత సూత్రములతో ఉన్నది. సూరిగారికి సమకాలికులగు శిష్టు కృష్ణ మూర్తి శాస్త్రిగారిచేత రచింపబడిన 'హరికారికలు' అను సంస్కృత సూత్ర గ్రంథము ఈ కాలముననే వెలసినది. బాల వ్యాకరణమునకు ఈకారికలే మూలమనికొందరును, బాల వ్యాకరణమే హరికారికలకు మూలమని మరి కొందరును భావించుచున్నారు.

ఆంధ్ర ధాతుమాల:- ఇది ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిచేత ప్రకటింపబడినది. దీని కర్తను గురించి సంశయము గలదు. చిన్నయ సూరిగారు 'ధాతుమాల' అను గ్రంథమును రచించి యుండిరని మాత్రము పండితులు విశ్వసించుచున్నారు. అది ఇదియేయని చెప్పుట కాధారములు లేవు. ఈ గ్రంథమునందు గ్రామ్యధాతువులు సైతము కలవు. పరమ లాక్షణికుడైన చిన్నయసూరి ఇట్టి గ్రంథమును రచించునా? అని సంశయము. శ్రీ కట్టి సాంబ మూర్తి శాస్త్రిగారు ఈ గ్రంథమునకు పీఠికను వ్రాయుచు అందులో చిన్నయసూరి కృత ధాతుమాలతో తరువాతి వారు కొన్ని గ్రామ్యములను చేర్చియుందురని యూహించిరి. వారి ఊహ సయుక్తికముగా నున్నది, ఏమైనను కర్తృ నిర్ణయ మింతవరకు జరుగలేదు. గ్రంథ మాంధ్ర భాషా జిజ్ఞాసువులకు ఉపయోగించుననుటయం దెంత మాత్రమును సంశయములేదు. అకారాద్యనుక్రమణికతో

నిందు సుమారు రెండువేల తెనుగు ధాతువులు కూర్పబడినవి. ప్రతి ధాతువునకును సంస్కృతార్థము, తెలుగర్థము, సకర్మక, అకర్మక నిర్దేశమును ఉండును. ఉదా: (ధా) కులుకు (సం) శృంగార చేష్టాయాం (తె) శృంగార చేష్ట చేయుట (అకర్మకము). సులభముగా ధాత్వర్థములను గ్రహించుటకు ఈ గ్రంథము మిక్కిలి తోడ్పడును.

**ప్రౌఢ వ్యాకరణము :** "త్రిలింగ లక్షణశేషము", లేక "ప్రౌఢ వ్యాకరణము" అని దీనికి పేరు. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు (1827-1891) దీనిని రచించిరి. బహుగ్రంథ పరిశోధకులును, శబ్దరత్నాకరా ద్యనేక గ్రంథ రచయితలు నగు శ్రీ సీతారామాచార్యులవారు బాలవ్యాకరణముచేత సాధింపబడని అనేక కవి ప్రయోగములను సేకరించి వాటియందలి సాధుత్వము గోచరించునట్లుగా సూత్రములను రచించిరి. గ్రంథమునకు త్రిలింగ లక్షణశేషమని నామకరణముచేసిరి. అనగా బాల వ్యాకరణమున కిది పరిశిష్టరూపమన్న మాట. బాలవ్యాకరణమునకు ప్రతిగా 'హరికారికలు' (సంస్కృత శ్లోకములు) విలసిల్లినట్లే ప్రౌఢవ్యాకరణమునకు ప్రతిగా 'హరికారికాశేష సర్వస్వము' అను గ్రంథము సంస్కృతమున వెలువడినది. ప్రౌఢవ్యాకరణ కర్త రచించిన ఇతరగ్రంథములు : అలఘుకౌముది (రేఫ, శకటరేఫ నిర్ణాయకము), వైకృత దీపిక (తద్భవపద వివరణాత్మకము). ప్రౌఢవ్యాకరణమునకు తాతూర్కు ఆర్మగంపిళ్ళెగారు "కుమారదేవ పండితీయము" అను పేరుతో ఒక వ్యాఖ్యానమును ప్రకటించిరి.

**నారాయణీయాంధ్ర వ్యాకరణము :** చర్ల నారాయణ శాస్త్రిగారు ఈగ్రంథమును పద్యరూపముగా రచించిరి. నన్నయాథర్వణ వ్యాకరణముల కిది తెలుగుచేత. చింతామణి యందలి పరిచ్ఛేదక్రమమును విడిచి సౌలభ్యము కొరకు బాలవ్యాకరణ పరిచ్ఛేదక్రమము ననుసరించిరి. వారి కుమారులైన గణపతిశాస్త్రిగారు ఆ పద్యములకు అర్థమును వ్రాయుటయేగాక విశేషాంశములను తెలుపుటకై గద్యములో సూత్రములను రచించి వాటికి వ్యాఖ్యనుకూడ రచించిరి. ఇట్లు నారాయణశాస్త్రిగారి పద్యములును, గణపతిశాస్త్రిగారి సూత్రరచనాపూర్వకమైన వ్యాఖ్యానమును కలిసి నారాయణీయాంధ్ర వ్యాకరణమైనది. ఈగ్రంథమునందు అనేకములగు పూర్వకవి ప్రయోగములు సాధింపబడినవి.

**వైయాకరణ పారిజాతము :** ఇది 'కళాప్రపూర్ణ' వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి విరచితము. ఆంధ్రశబ్ద చింతామణిని, వికృతివివేకమును జోడించి, 'నన్నయాథర్వణీయ'మని మూలమునకుపేరిడి దానికి వైయాకరణ పారిజాతము లేక సీతారామపండితీయము అను పేరుతో వ్రాసిన వ్యాఖ్య ఇది. బాలసరస్వతీయ టీకను, అహోబలపండితీయమును, పెక్కు తాళపత్రప్రతులను శోధించి వ్రాసిన వ్యాఖ్యానము. ప్రాకృతభాషలనుండియు, తమిళ కన్నడ భాషలనుండియు పెక్కు పదములను సేకరించి, పట్టికలుగా చేర్చి తెలుగు పదముల స్వరూపనిరూపణము చేయుటయందు గ్రంథకర్త మిక్కిలి పరిశ్రమించెను.

**ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము :-** వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారే ఈ గ్రంథమునుకూడ రచించిరి. ఇది రెండు సంపుటములుగా వెలువడినది. బాల వ్యాకరణమునందలి సంజ్ఞా సంధ్యాది పరిచ్ఛేద క్రమము తోనే ఇది నడచినది. నన్నయాథర్వణుల సూత్రములకు 'కల్పతరువు' అను వ్యాఖ్యానమును, బాల వ్యాకరణమునకు "సంజీవని" అను వ్యాఖ్యను రచించుచు ప్రాసంగికముగా ప్రాచీన వ్యాకరణములను, వ్యాఖ్యానములను, టీకలను విమర్శించుచు, ప్రయోగములను జూపుచు, బహుశాస్త్ర పరిశోభితముగా గ్రంథకర్త దీనిని రచించెను. ఇది పూర్వపక్ష సిద్ధాంతములును, చర్చలునుగలిగి విపులమై ప్రామాణికమై ఉన్నది.

**ఆంధ్ర భాషానుశాసనము :-** 'అభినవ వాగనుశాసన' బిరుదాంకితులైన మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఈ గ్రంథమును సులభమైన శైలిలో రచించినారు. ప్రాచీన వ్యాకరణ ఫక్కిని వదలి పరిచ్ఛేద కల్పనమును నూతనముగా చేసిరి. కృత్తద్ధితక్రియాది ప్రకరణములలో అపూర్వములైన ప్రయోగముల నిచ్చి లక్ష్యజ్ఞానము సుబోధ మగునట్లు కావించినారు.

**తత్సమ చంద్రిక :-** ఈ గ్రంథమును సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు రచించిరి. ప్రాచీనార్వాచీన - ఆంధ్ర వ్యాకరణము లన్నియు తద్భవదేశ్యాదు లయిన పదములను గురించిన విపులాంశములను తెలుపుచు,

తత్సమ పదములు తెలుగున పొందు రూపభేదములను, దిఙ్మాత్రముగా సూచించినవి. తత్సమపదముల రూప నిష్పత్తి ఈ గ్రంథమునందు విపులముగా ప్రదర్శింపబడినది. మరియు ప్రక్రియావిధానము సులభము చేయబడినది. ఇందలి కృదంత ప్రకరణము ధాతువివేకమును కరతలా మలకము గావించును. ఇందు సంధి, కృదంత, ఉపసర్గ, తద్ధిత, స్త్రీ - ప్రత్యయ - అవ్యయ, సమాస ప్రకరణ ములును, రూపభేద, లౌకికన్యాయ ప్రకరణములును గలవు. ఆంధ్ర వాఙ్మయమునందలి సంస్కృతపద, సమా సాది జ్ఞానమును కూలంకషముగా ఇది కలిగించును.

**ఇతరములు :-** గత శతాబ్ది - అంతము మొదలుకొని నేటివరకును విద్యార్థిజన సౌకర్యార్థమై చిన్నచిన్న వ్యాకరణము లెన్నియో బయలుదేరినవి. పురాతనకాల మున రచింపబడిన వాటిలో పెక్కుగ్రంథములు మనకు లభింపలేదు. కొన్ని ముద్రితములుగాక తాళపత్రముల యందే విశ్రాంతిని చెందుచున్నవి. కనుక ఈ వ్యాకరణ శాస్త్రము కావ్యరచన ఆరంభమైన నాటినుండి నేటి వరకును సాగుచున్నదనియే మనము గ్రహింపవలయును. వెంకయ్య వ్యాకరణము, కందుకూరి వీరేశలింగము పంతులుగారి సంగ్రహ వ్యాకరణము, వావిలికొలను సుబ్బారావుగారి సులభ వ్యాకరణము మొదలుకొని పాఠ శాలల ఉపయోగార్థమై ఆధునిక ఆంగ్ల సంప్రదాయాను సారముగా రచింపబడిన వ్యాకరణము లెన్నియో కలవు. ప్రతిదానియందును గుణ విశేషము జిజ్ఞాసు జనోప యోగకరమై యున్నది.

పైన పేర్కొనబడినవేకాక ఆంగ్లభాషయందు రచింప బడిన ఆంధ్ర వ్యాకరణములు కూడ కలవు. ఆంధ్రభాషను నేర్చుకొనెడి ఆంగ్లేయుల సదుపాయముకొరకు వ్రాసిన గ్రంథము లివి. ప్రప్రథమముగా సివిలు సర్వీసు ఉద్యోగి యగు ఎ. డి. కాంబెలుదొర 1816 వ సంవత్సరమున ఒక వ్యాకరణమును; తరువాత మామిడి వెంకయ్యగారి సాయమున విలియం బ్రౌనుదొర 1817 వ సంవత్సర మున ఇంకొక వ్యాకరణమును; సి. పి. బ్రౌనుదొర 1840 లో ఒక వ్యాకరణమును, ఆర్డెనుదొర 1873 వ సంవత్సరమున మరియొక వ్యాకరణమును రచించిరి. కాంబెలు వ్యాకరణము తెలుగు వ్యాకరణముల పద్ధతిని కొంత పోలియున్నది. కాని సి. పి. బ్రౌను వ్యాకరణము క్రొత్తమార్గమును త్రొక్కినది. తెలుగు వ్యాకరణముల పద్ధతి క్రొత్తగా భాషను నేర్చుకొను పాశ్చాత్య విద్యా ర్థికి భయమును కలిగించుచున్న దనియు, అట్టివానికి మొదట వ్యావహారిక భాషను గూర్చిన వ్యాకరణమే ఉపయుక్త మగు ననెడి తలంపుతో బ్రౌను దీనిని రచిం చెను. పండితులతోకంటె సామాన్యులతో కలిసిమెలసి నివసించుట వలననే భాషా హృదయము పట్టుబడునని అతని విశ్వాసము. (ఇందు 12 భాగములు కలవు.) ఆర్డెన్ దృష్టికూడ ఇట్టిదే. తెలుగు నేర్చుకొనెడి పాశ్చాత్య విద్యార్థి ప్రారంభించుటకు, క్రమముగా వ్యావహారిక భాషను స్వాధీనము చేసికొనుటకు పిమ్మట గ్రాంథిక భాషను పరిచయము చేసికొనుటకు వీలుగా ఇతడీ వ్యాకర ణమును మూడు భాగములుగా రచించెను. ఈ వ్యాకరణ రచనలో ఇతనికి పైరెండు వ్యాకరణములేకాక కొన్ని ఇతర ఆంధ్ర వ్యాకరణములు కూడ సాయపడినవి.

**II *అలంకార శాస్త్రము* :-** కావ్య లక్షణములను నిర్దే శించెడి శాస్త్రమునకు అలంకార శాస్త్రమని పేరు. సంస్కృతమునందు దీనివిషయమై అపారమైన కృషిజరిగి ఎన్నియో ఉద్గ్రంథములు వెలువడినవి. ఆంధ్రభాష యందు కూడ అలంకార శాస్త్రవిషయముపై కొన్ని గ్రంథములను ప్రాచీనులును, అర్వాచీనులునుగూడ రచిం చిరి. అవి వరుసగా సమీక్షింపబడుచున్నవి.

**కావ్యాలంకార చూడామణి :** విద్యానాథ కృతమయిన ప్రతాపరుద్రీయమును, ఆచార్య దండికృతమైన కావ్యా దర్శమును ఆధారముగా గొని స్వీయ కల్పనలతో విన్న కోట పెద్దయకవి ఈ గ్రంథమును రచించి, చాళుక్య వంశీయుడగు విశ్వేశ చక్రవర్తికి అంకిత మిచ్చెను. విశ్వేశచక్రవర్తి క్రి. శ. 1407 ప్రాంతమువాడు. విన్న కోట పెద్దయకవి శాలివాహన శకవర్షము 1324 తరు వాతనే ఈ గ్రంథమును రచించినట్లు చారిత్రికుల అభి ప్రాయము. విన్నకోట పెద్దయ నియోగి బ్రాహ్మణుడు. తండ్రి గోవిందామాత్యుడు. నివాసము రాజమహేంద్ర వర ప్రాంతము. విద్యానాథుడు ప్రతాపరుద్రునకు అంకిత ముగా ప్రతిలక్ష్యమును రచించినట్లే ఇతడు చాళుక్య విశ్వనాథునికి అంకితమగునట్లుగా ప్రతిలక్ష్యమును రచిం

చెను. కావ్యాలంకార చూడామణియందు తొమ్మిది ఉల్లాసములు కలవు. భావమును, భావభేదములను తెలుపుటతో గ్రంథ మారంభమయినది. ప్రథ మోల్లాసమున విభావాదులును, స్థాయి భావములును తెలుపబడినవి. ద్వితీయమున రసస్వరూప నిరూపణము చేయబడినది. తృతీయోల్లాసమున నాయికా నాయక లక్షణములు, సప్త విధ కవులు, అష్టాదశ వర్ణనములు వివరింపబడినవి. చతుర్థోల్లాసమున ముక్తకాదికావ్య భేదములు, ఉదాహరణ లక్షణము, విభక్తుల దేవతలు, సద్ధళి మొదలయిన కావ్యములు, పాకశయ్యాదులు, కావ్యరీతులును చెప్పబడినవి. పంచమోల్లాసమున అర్థాలంకారములు వివరింపబడినవి. దండికృత కావ్యాదర్శ పద్ధతితో ఈయలంకార క్రమమున్నది. షష్ఠోల్లాసమునందు సంకరాద్యలంకారములు, శబ్దాలంకారములు, చతుర్విధ కందములు, బంధకవిత్వ లక్షణములు, పదదోషములు, వాక్యదోషములు, అర్థదోషములు మున్నగు నంశము లున్నవి. సప్తమోల్లాసము నందును, అష్టమోల్లాసము నందును ఛందస్సు చెప్పబడినది. యతిప్రాసలక్షణములు, వృత్తలక్షణములు మున్నగు విషయములు ఇందుగలవు. నవమోల్లాసము వ్యాకరణ విషయములు కలది. తత్సమాది శబ్దస్వరూపములు క్రియాప్రకరణము మొదలయిన విశేషము లిం దున్నవి.

ఇట్లు కావ్యాలంకార చూడామణి సర్వసాహిత్య లక్షణములను గలిగియుండుటచే దీనిని వ్యాకరణ గ్రంథమనియు, ఛందోగ్రంథమనియు, అలంకారగ్రంథమనియు చెప్పవచ్చును.

ఆంధ్రచంద్రాలోకము : విజయనగరరాజుల కాశ్రితుడై రామచంద్రపురము, చీపురుపల్లి అను గ్రామములందుండిన అడిదము సూరకవి ఈగ్రంథమును రచించెను. ఇది జయదేవకృతమైన సంస్కృత చంద్రాలోకమునకు అనువాదము. సంస్కృతకవులలో జయదేవులు కొందరు గలరు. వారిలో ప్రసన్నరాఘవనాటకకర్తయు, చంద్రాలోక రచయితయునగు జయదేవు డొక్కడేయని విమర్శకుల యభిప్రాయము. జయదేవుని చంద్రాలోకమును ఆధారముగా జేసికొనియే అప్పయ్యదీక్షితుడు కువలయానందమును రచించెను. అప్పయ్యదీక్షితుడు గ్రహించిన పాఠభేదముల ననుసరించియే అనగా అప్పయ్యదీక్షితకృత కువలయానంద మూలము ననుసరించియే ఇది యనువదింపబడినది. అడిదము సూరకవి (క్రీ. శ. 1720-1785) గొప్ప తెలుగుపండితుడు. ఇతడు కవిసంశయ విచ్ఛేదము, ఆంధ్రనామశేషము, కవిజనరంజనము, రామలింగేశ శతకము మున్నగు గ్రంథములను రచించెను. సూరకవి ఆంధ్రీకరణము, మూలమువలె సుబోధము గాకపోయినను, పద్యములు కంఠస్థముచేయుటకు యోగ్యముగా నున్నవి. అలంకారశాస్త్రము తెలుగున స్వతస్సిద్ధముగాక అనువాదరూపమగుటచేత మూలమువలె నుండనిలోపము అన్నింటియందునువలె ఈ గ్రంథమునందును గలదు. ఉన్నవాటిలోనెల్ల చిన్నదై విద్యార్థులకు ఉపయోగకరమైన దీగ్రంథము. ఇందు నూరలంకారములకు లక్ష్యలక్షణములు గలవు. తాడూరి లక్ష్మీనరసింహారావు, నేలసూతుల శివరామయ్యకవి, గని శేషయ్యాశాస్త్రి అనువారు సైతమీ చంద్రాలోకము ననువదించిరి. ఆంధ్రచంద్రాలోకము అక్కిరాజు ఉమాకాంతముగారి వ్యాఖ్యతో మిక్కిలి ఉపయోగకరమై యున్నది.

కావ్యాలంకార సంగ్రహము : వసుచరిత్రకారుడయిన రామరాజభూషణు డీగ్రంథమును రచించెను. అతడు తన నామధేయము నిందు "మూర్తికవి" అని పేర్కొనెను. శ్రీకృష్ణదేవరాయల అల్లు డయిన అళియరామరాజునకు అల్లుడగు తొరగంటి నరసభూపాలునకు ఈగ్రంథమంకితము చేయబడుటచేత దీనికి "నరసభూపాలీయ" మను వ్యవహారము కలిగినది. ఈ నరసరాజు తండ్రి 'ఓబళు' డగుటచేత పెక్కుతావుల కవి, కృతిపతిని 'ఓబయ నారసింహ' 'ఓబయ నరసధీర' అని పేర్కొనెను. ఈ కృతికర్తయు, కృతిభర్తయు క్రీ. శ. 16 వ. శతాబ్దివారు. రామరాజభూషణుడు యువకుడుగా నున్నప్పుడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందుండి చరమవయస్సున వసుచరిత్రను అళియరామరాజు తమ్ముడగు తిరుమల దేవరాయలకు అంకిత మిచ్చెను. ఈ మధ్యకాలమున నెప్పుడో ఓబయ నరసరాజునకు అంకితముగా ఈ నరసభూపాలీయమును, రచించెను. ఐదాశ్వాసముల గ్రంథము. ప్రతి పద్యమునందును నరసరాజు పేరుండును. ఒక్క నాటక లక్షణము తప్ప తదితర కావ్యలక్షణములును, రసభావాది నిరూపణమును ఇందుగలవు. విద్యానాథుడు రచించిన

సంస్కృత ప్రతాపరుద్రీయమున కిది అనువాదమే అన దగియున్నను కొన్ని యంశములు ఇతర అలంకార గ్రంథములనుండి సంగ్రహింపబడి యున్నవి. నాటక ప్రకరణము మాత్ర మనూదితము కాలేదు. మధురమైన శైలిలో కావ్యలక్షణములుగల ఉత్తమ గ్రంథమని దీనిని పేర్కొనవచ్చును. పరంపరాయాతమగు పాఠప్రవచనా దులచే ఈ గ్రంథ మాంధ్రదేశమునం దంతటను ప్రచార ములో నున్నది.

ఈ గ్రంథమునకు ప్రాచీనమైన వ్యాఖ్యానములేదు. సుమారు ముప్పది సంవత్సరములకు పూర్వము కీర్తిశేషు లయిన వెల్లాల సదాశివశాస్త్రిగారు (వీరు హైదరాబాదు రాష్ట్రిమునందలి జటప్రోలు సంస్థానముననుండిన గొప్ప వైయాకరణులు) నరసభూపాలీయమునందలి నాయక రసప్రకరణములకు మాత్రము వ్యాఖ్యను రచించిరి. అందు వారు విశేషించి మూలమును విమర్శించిరి. ఇంచు మించుగా వారికి సమకాలికు లనదగిన వింజమూరి కృష్ణ మాచార్యులవారును, ప్రౌఢవ్యాకరణకర్తయగు బహు జనపల్లి సీతారామాచార్యులవారును కలసి యొక లఘు టీకను రచించిరి. ఇవి తప్ప ప్రాచీనవ్యాఖ్యలు లేవు. ఇటీవల శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు ఈ గ్రంథమునకు విపులమై, సకలసాహిత్య లక్షణ సమ్మిశ్రితమైన వ్యాఖ్యానమును రచించినారు. ఇందు వీరు మూలమునందలి గుణదోషములను చర్చించు టయే కాక సల్లక్షణములను, ఉచితోదాహరణములను చేర్చిరి. ప్రతిఘట్టమునందును ప్రాచీనార్వాచీన ఆలంకా రిక సిద్ధాంతములను సవిమర్శగా పొందుపరచిరి. రసా లంకార ధ్వనులలో అవసరమైన విషయముల నన్నిటిని వివరించిరి.

**ఆంధ్ర కావ్యాదర్శము :-** ఆచార్య దండి కృతమైన సంస్కృత కావ్యాదర్శమునకు ఇది అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి పద్యానువాదము. సరళమైన రచన, చక్కని అన్వయ సౌలభ్యము గల ఈ గ్రంథము పఠితలకు అత్యం తోపకారియై యున్నది.

**ఆంధ్రకావ్య మీమాంస :** ఇది రాజశేఖరకవి సంస్కృత మున బహుశాంశములతో కావ్య జిజ్ఞాసువుల ఉపయో గార్థమై రచించిన "కావ్య మీమాంస"కు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు ఒనర్చిన అనువాదము. సరళ రచనా ధురీణులగు శాస్త్రిగారిగ్రంథమును చక్కగా ననువదించి యున్నారు.

**లక్షణ దీపిక :-** క్రీ. శ. 15 వ శతాబ్దివాడైన గౌరన ఈ గ్రంథమును రచించెను. దీనికి ప్రబంధ దీపిక యనియు నామాంతరము గలదు. ఇందు కొన్ని అలం కారములు తదితర కావ్య లక్షణములు నున్నవి.

**అలంకార మంజరి :-** ఇది మమ్మటభట్టు రచించిన కావ్య ప్రకాశమునకు వివరణముతో రచింపబడిన అనువాదము. దీనిని శ్రీ శేట్టులూరి వేంకట రాఘవ అయ్యంగారు రచించిరి.

**ఔచిత్య విచారచర్చ :-** ఇది క్షేమేంద్రుని సంస్కృత రచనకు శ్రీ తిరుపతి వేంకట కవుల శిష్యులయిన వేంకట రామకృష్ణ కవుల అనువాదము. ఈ గ్రంథమున వీరు లక్ష్యముల నన్నిటిని తెలుగు ప్రబంధములనుండి చూపి చదువరులకు ఆంధ్రలక్ష్య జ్ఞానము కలుగుటకై మిక్కిలి కృషి చేసిరి. ప్రాచీనాలంకారికులు తత్తద్విషయములు (గుణాలంకార రీతి ధ్వనులు) కావ్య జీవితమని చెప్పిరి. ఔచిత్య మొక్కటియే కావ్య జీవితమని సిద్ధాంతీకరించిన క్షేమేంద్రుని మత మిందు చక్కగా తెలుపబడినది. క్షేమేంద్రుని మరియొక గ్రంథమగు కవి కంఠాభరణ మును సైతము వీరు ఆంధ్రోదాహరణములతో అనువ దించిరి.

**రసమంజరి :** సంస్కృతమున భానుదత్తకృతమయిన ఈ గ్రంథమును గణపవరపు వేంకటకవియు, గుడిపాటి కోదండపతియు అనువదించిరి. కాని అవి లుప్తము లయి నవి. తాడూరు లక్ష్మీనరసింహరావుగారు అర్వాచీనముగా దీని నాంధ్రీకరించిరి. ప్రాచీను డని చెప్పదగిన మంచెళ్ళ వాసుదేవకవియు "గంధవహము" అనుపేరుతో దీని ననువదించెను. చింతలపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రిగారు అచ్చతెలుగున దీనిని వ్రాసిరి. వేదము వేంకటరాయశాస్త్రి గారు సంస్కృత మూలమునకు ఆంధ్రవ్యాఖ్యానమును రచించియున్నారు. ఇది ముప్పదియారు భేదములతో నాయికా లక్షణములను, నాయక లక్షణములను వివరించి యున్నది. నాయికా లక్షణములను ఇంత విపులముగా చర్చించిన గ్రంథము మరియొకటి లేదు.

**సాహిత్య దర్పణము :** ఇది విశ్వనాథ కవిరాజు వ్రాసిన సంస్కృత సాహిత్యదర్పణమునకు వేదము వేంకటరాయ శాస్త్రిగారి అనువాదము. ఇందు వీరు లక్ష్యలక్షణము లను సూత్రములుగాను, వ్యాఖ్యానముగాను తెలుగున వివరించిరి, ఇది సాహిత్య దర్పణమునకు ఆంధ్రవ్యాఖ్యా నముగా నున్నది.

**కావ్యాత్మ :** ఇది కావ్యాత్మనుగురించిన ప్రాచీనాలం కారికుల మతములను తెలుగున విపులముగా చర్చించి తెలుపునట్టి వచన గ్రంథము. దీనిని శేట్టులూరి వీరరాఘవ అయ్యంగారు రచించిరి. ఇది డాక్టరు. సుశీలకుమారదే గారి ఆంగ్ల రచనకు అనుసరణము.

**అలంకార శేఖరము :** ఇది జయదేవకవి రచించిన సంస్కృతాలంకార గ్రంథమునకు చక్కని తెలుగు సేత. శ్రీ అవధానము చంద్రశేఖరశర్మగా రీ గ్రంథమును రచించియున్నారు. మూలమునందలి లక్షణశ్లోకములకు తెలుగున సూత్రములను రచించియున్నారు. ఇవి బాలవ్యా కరణ సూత్రములవలె చక్కనిశైలితో అలరారుచున్నవి. లక్ష్యములకు స్వీయపద్యములను (అనువాదములు) రచించి యున్నారు. ఈ గ్రంథము అముద్రితము.

**కావ్యప్రకాశవివృతి :** ప్రొద్దుటూరు వాస్తవ్యులయిన కాండూరి నరసింహాచార్యులవా రీగ్రంథమును రచించిరి. ఇందు మమ్మటుని కావ్యప్రకాశమునందలి మొదటి నాలుగు ఉల్లాసములు మాత్రమే అనువదింపబడినవి. సంస్కృతమూలమునకుగల వివరణములు మాత్ర మనువ దింపబడినవి. లక్ష్యలక్షణములు సంస్కృతమునందలివే. వివరణము వ్యాఖ్యానప్రాయముగా సులభగ్రాహ్య ముగా నున్నది.

**కవికల్పలత:** ఇది దేవేశ్వరుని సంస్కృతకృతికి కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారి అనువాదము. ఇందు సాహిత్య విషయములు చక్కగా చర్చింపబడినవి. ఇది కవి శిక్షాగ్రంథము.

**కువలయానంద ప్రకాశము :-** అప్పయ్య దీక్షితులవారు రచించిన కువలయానందమునకు ఇది కటికనేని రామయ కవి యొనర్చిన తెలుగుసేత. కటికనేనివారు పద్మనాయ కులలో (వెలమలు) గలరు. కవి పుట్టుపూర్వోత్తరములు అంతగా తెలియవు. ఇతనితాత గోపరాజు. తండ్రి సూర శౌరి. తల్లి బుచ్చమ్మ. ఇది మూడాశ్వాసముల గ్రంథము. మూలగ్రంథమంతయు అనువదింపబడినది. (1893.)

**కువలయానంద సారము :-** శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు దీనిని రచించిరి. ఇదియు అప్పయ్య దీక్షితుని కువలయానందమునకు కొన్ని శాస్త్ర చర్చలు విడిచి చేయబడిన అనువాదము. ఉదాహరణములు తెలుగు ప్రబంధముల నుండి ఈయబడినవి. కొన్ని యలంకార ములకు చక్కని వివరణమును వ్రాసియున్నారు. కర్నూలు జిల్లా నందికోట్కూరు తాలూకా కరివెన గ్రామ వాస్తవ్యులయిన శ్రీధర పరశురామశాస్త్రిగారు సయితము కువలయానందమును సమగ్రముగా నాంధ్రీకరించి యున్నారు. కాని ఇంకను అది ముద్రితము కాలేదు.

**ఆంధ్ర దశరూపకము :-** ఇది క్రీ. శ. ఎనిమిదవ శతాబ్ది వాడగు ధనంజయుడు రచించిన గ్రంథమునకును, ధనికుని వివరణమునకును, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారి యనువాదము. ఇందు నాటక లక్షణములును, రస భావాది నిరూపణమును గలవు. శ్రీ శాస్త్రిగారు సుమారు నలువది సంవత్సరములక్రింద ఈ గ్రంథమును రచించిరి. మూలమునందలి కారికలు సూత్రరూపమున తెనిగింపబడినవి. సంస్కృత వివరణమునందలి చర్చలను సంగ్రహించి యున్నారు.

**ప్రతాప రుద్రీయము :-** ప్రాచీనుడగు గణపవరపు వేంకటకవి 'నంజరాయ యశోభూషణము' అను పేరున విద్యానాథుని కృతి ననువదించెను. కాని అది లభ్యము కాలేదు. శ్రీ చలమచర్ల రంగాచార్యులుగారు "ప్రతాప రుద్ర యశోభూషణము" అను పేరుతో దీని ననువదించిరి. మూలగ్రంథము పేరుసయిత మదియే. ఇందు వీరు లక్ష్య లక్షణములను పద్యరూపమున అనువదించి యున్నారు. పద్యరచన, వివరణము సులభగ్రాహ్యములుగా నున్నవి. శ్రీ రంగాచార్యులుగారి మరియొక గ్రంథము "అలంకార వసంతము". ఇది ప్రధానముగా క్రీ. శ. పదునేడవ శతాబ్ది వాడైన వారణాసి ధర్మసూరి సాహిత్య రత్నాకరము నాధారముగాగొని రచింపబడినది, అలంకార వసంతము "విశ్వనుతనామ గోపాలపేటరామ" అను మకుటముగల సీసపద్యమయము. ఒక్కొక్క పద్యములో ఒక్కొక్క అలం కారమునకు లక్ష్యమీయబడినది. లక్షణములు గద్యమునం

దీయబడినవి. శ్రీ రంగాచార్యులుగారు క్షేమేంద్రుని ఔచిత్య విచారచర్చనుసైతము ననువదించిరి. అది అముద్రితము.

నవరస గంగాధరము :- శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మగారీ గ్రంథమును రచించిరి. ఇది జగన్నాథ పండితరాయల రస గంగాధరముయొక్క ప్రథమా ననమునకు ఆంధ్ర వివరణము. ఉదాహరణ శ్లోకములు మూలమునందలివే. విషయ వివరణము, చర్చ శిష్ట వ్యావహారికాంధ్రభాషలో రచింపబడినవి. శ్రీ శర్మగారిదేవిధముగా విద్యానాథుని ప్రతాపరుద్రీయమును అనువదించిరి.

నాట్య శాస్త్రము :- ఇది ప్రథమ సంస్కృతాలంకార గ్రంథము. భరతముని ప్రణీతము. నాట్యోత్పత్తి, నాట్యశాల, పూర్వరంగము, తాండవము, రసములు, భావములు, ఆంగికాభినయము, వాచికాభినయము, ఛందస్సు దశరూపకములు, ముఖాధి సంధులు, ఆహార్యాభినయము, సంగీతము, వాద్యములు మొదలగు విషయములు ఇందు 36 అధ్యాయములలో విపులముగా చర్చింపబడినవి. డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దీనికి విపులమైన వ్యాఖ్యానమును రచించి "భారతి" యందు వరుసగా ప్రకటించి యుండిరి. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు నాట్యశాస్త్రమును సంగ్రహించి తెనిగించిరట. ఇది అముద్రితము. శ్రీ భాగవతుల కుటుంబ శాస్త్రి కూడ దీనిని అనువదించి త్రిలింగలో రెండు అధ్యాయములు ప్రచురించిరి. శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు సంగీతశాస్త్ర భాగమును వదలి తక్కిన 30 అధ్యాయములను తెనిగించి "సంస్కృతి"లో వరుసగా ప్రకటించుచున్నారు. వీరు భామహుని "కావ్యాలంకారము"ను గూడ తెనిగించి వ్యాఖ్యానమును రచించిరి. ఇది అముద్రితము. ఇవన్నియును గద్యానువాదములే.

ఆంధ్ర కావ్యాలంకార సూత్రవృత్తి :- ప్రాచీనాలంకారికులలో కావ్యాత్మ 'రీతి' యని సిద్ధాంతీకరించిన వామనుని కావ్యాలంకార సూత్ర వృత్తికిది అనువాదము. దీనిని వేదాల తిరువేంగళాచార్యులుగారు రచించిరి. శ్రీ ఆచార్యులుగారు సూత్రములను, వృత్తిని వచన రూపమున అనువదించినారు. సూత్రసంఖ్యలతోసహా తెలుగు సూత్రములు రచింపబడినవి. ఉదాహరణములను తెలుగు కావ్యములలో ప్రాచీనార్వాచీన రచనలనుండి సేకరించినారు.

ధ్వన్యాలోకము :- "కావ్యాత్మధ్వని" యని స్థాపించి లోకమున సాహిత్యాచార్య మూర్ధన్యుడుగా పరిగణింపబడిన ఆనందవర్ధనుని ధ్వన్యాలోకమును కొందరు అనువదించి యున్నారు. వారిలో పేర్కొనదగినవారు శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు. వీరు మూలమును జక్కగా ననువదించుటయేకాక ఉదాహరణములను తెలుగు ప్రబంధములనుండియు, ఆధునిక రచనలనుంకియు ఎత్తి చూపించినారు. ఇది వీరిరచనలోని వైశిష్ట్యము. ఇక నీగ్రంథము నాంధ్రీకరించినవారిలో బొడ్డపాటి కుటుంబరాయశర్మ, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి (విజయనగర సంస్కృత కళాశాలా పండితులు), భాగవతుల కుటుంబశాస్త్రి గారలు ప్రశంసింప దగినవారు. వారి రచనలు యథామూలముగా నున్నవి. కుటుంబ శాస్త్రిగారి అనువాదము సుబోధముగా నున్నదికాని గ్రంథము కొంతవరకే రచింపబడినది. ఇక నందరికన్న ముందుచెప్పదగినవారు అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ధ్వన్యాలోకమునందు 'ధ్వని' యని మాత్రము పేర్కొనదగిన మూలభాగమునకు వీరి రచన పద్యానువాదము.

రసాభరణము :- అనంతామాత్యు డీ గ్రంథమును క్రీ. శ. 1434 లో రచించెను. భోజరాజీయము, ఛందోదర్పణము, అనునవి ఇతడు రచించిన మరి రెండు గ్రంథములు. రసాభరణము శృంగార రసమును, తత్సామగ్రిని సమగ్రముగ నిరూపించునట్టి గ్రంథము. ఇందు నాలుగాశ్వాసములు గలవు. మొదటి ఆశ్వాసమున స్థాయిభావముల యొక్కయు, విభావానుభావ సాత్త్వికభావముల యొక్కయు లక్ష్య లక్షణములును నవరసముల ఉదాహరణములును గలవు. రెండవ యాశ్వాసమున ఆలంబనోద్దీపనవిభావలక్షణములును; సాత్త్విక సంచారి భావముల లక్షణోదాహరణములును గలవు. హావభావాది శృంగార చేష్టలు ఉద్దీపన విభావాంతర్గతములు అను విషయ మిందు నిరూపింపబడినది. మూడవ యాశ్వాసమునందు శృంగార భేదములును, చతుః ప్రీత్యాది ద్వాదశావస్థలును, నాట్యశాస్త్ర ప్రోక్తములయిన శృంగార భేదములును, భావోదయాదులును, రస

సాంకర్యములును చెప్పబడినవి. నాల్గవ యాశ్వాసము నాయికా నాయక లక్షణములు గలిగియున్నది. కావ్యాలంకార చూడామణి తరువాత ఆంధ్రలక్షణ గ్రంథములలో పేర్కొనదగినది రసాభరణమే.

శృంగార రసాలవాలము : ఇదియు ప్రాచీనమగు లక్షణ గ్రంథమే. వెణుతుర్ల వడ్డికవి దీనిని రచించెను. ఈకవి శుక్ల యజుశ్శాఖీయుడు. తండ్రి మంగళగిరి. తాత వెంగనార్యుడు. ఇతని నివాసముగాని, కాలముగాని తెలియదు. శృంగారరసాలవాలము మూడాశ్వాసముల గ్రంథము. ప్రథమాశ్వాసమున కావ్యలక్షణమును, రత్యాదిభావ స్వరూపములు మొదలయిన శృంగారసామగ్రివర్ణనమును గలవు. ద్వితీయాశ్వాసమున నాయికా భేదములును, తృతీయాశ్వాసమున ప్రోషిత భర్తృకాది - అష్టవిధ శృంగార నాయికాదిభేదములును తెలుపబడినవి. ఇతని మరియొకకృతి బాలగోపాలవిలాసము.

ఆంధ్రనటప్రకాశిక : శ్రీ పసుపర్తి యజ్ఞనారాయణ శాస్త్రి దీనిని రచించెను (1930). ఇతడు నాటకకర్త గాయకుడు, నాట్యాచార్యుడు, కవి. తన స్వీయానుభవమును పురస్కరించుకొనియు, కొంతవరకు ప్రాచీన శాస్త్రకర్తల ననుసరించియు, రూపకాభినయ గాంధర్వ విద్యాసూత్రములను నిర్దుష్టమును, శాస్త్రసిద్ధమునైన శైలిలో క్రోడీకరించెను. ఇది పది ప్రకరణములుగా విభజింపబడినది. అవి అభినయము, సంగీతము, నాయకులు, రసము, నాటకము, ప్రయోగము, రంగము, కావ్యము, నటుడు, పాత్రము అనునవి. ఇందు ఆయానటుల వేషధారణమునకు సంబంధించిన పెక్కుచిత్రములుకూడ కలవు.

శ్రీ పురాణం సూరిశాస్త్రి నాటకవిమర్శనమును చేయుచు పెక్కు గ్రంథములను ప్రకటించెను. 1. నాట్యాంబుజము (తెలుగునాటక, రంగస్థలాది విమర్శనము); 2. నాట్యోత్పలము (పాశ్చాత్య నాటకవిమర్శనము): 3. నాట్యాశోకము; 4. నాటకసంఘ సంస్కరణము మొదలగునవి. శ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు 'ఆంధ్రనాటకరంగము' అనునొక గ్రంథమును ప్రకటించిరి. శ్రీ బళ్లారి రాఘవాచారిగారు 'నాటక దీపిక' అను చిన్నగ్రంథమును రచించిరి. ఇవి యన్నియును ఆంధ్రనటప్రకాశికకు ఇంచుమించుగా సమకాలికములే.

దశరూపక సంగ్రహము :- క్రీ. శ. 1891 ప్రాంతముల శ్రీ కొమండూరు అనంతాచార్యులు దీనిని రచించిరి. ఆంధ్రీకృత సంస్కృత నాటకములు పాఠ్యగ్రంథములుగానుండెడివి. కాని రూపకలక్షణమును దెల్పు ఆంధ్రగ్రంథము లేకుండెను. అందుచేత వీరు ధనంజయకృత 'దశరూపకము'ను సంగ్రహించి దశరూపక సంగ్రహమను పేర వచనములో వ్రాసినారు.

అలంకారతత్త్వ విచారము :- దీనిని శ్రీ కురుగంటి సీతారామయ్యగారు రచించినారు (క్రీ. శ. 1915). కావ్యము, శబ్దాలంకారములు, అర్థాలంకారములు అను విషయములు ఇందు చర్చింపబడినవి. స్వతంత్ర విమర్శనమునకు దొరకొనిన ప్రథమ గ్రంథములలో నిదియొకటి. జక్కన 'విక్రమార్క చరిత్రము'ను గూర్చిన లఘువిమర్శనము కూడ ఇందు చివరను గలదు.

ఆంధ్ర కువలయానందము :- శ్రీ కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి దీనిని రచించెను. (క్రీ. శ. 1947) అప్పయ దీక్షితుని కువలయానందమున కిదియొక్కటియే సమగ్రానువాదము. అనువాదము సుబోధము కావలెనను తలంపుతో వచనమందు రచించి నలుగురును వాడుకొను పదములనే ఎక్కువగా వాడియున్నారు. ద్వితీయ ముద్రణము మరింత సుబోధకముగా నున్నది.

గీర్వాణ రూపకము :- శ్రీ తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు దీనిని రచించిరి. కేవల నాటక లక్షణములను దెలుపునట్టి గ్రంథముగా దీనిని పరిగణింప వచ్చును. రూపకములు, ఉపరూపకములు, వాని లక్షణములు, ఉదాహరణ గ్రంథముల నామములు ఇందు వివరింపబడినవి. ఈ గ్రంథము వచనరూపము. "ప్రాదుర్భావము, రూపకభేదములు, రూపకశబ్దము, నృత్తాదికము, రూపకభేదములు, లక్షణము, రూపక వివరణము, వ్యుత్పన్న రూపకములు, రూపక పరిణామము, ప్రేక్షాగృహము (Theatre), ఉపరూపకములు, కొందరు నాటక కర్తలు, పరిభాషలు అను విషయములతో సులభ గ్రాహ్యముగా ఈగ్రంథము రచింపబడి యున్నది.

ఇట్లు లక్షణ గ్రంథముల శ్రేణియందు చేర్పదగిన మరికొన్ని చిన్న యలంకార గ్రంథములు, కందుకూరి వీరేశలింగము పంతులు మున్నగువారు రచించినవి కలవు.

III *ఛందశ్శాస్త్రము :-* పద్యరూపమయిన కవిత్వము ప్రాచీన కాలమునుండియు మన భాషలో కన్పట్టు చున్నది. నన్నయకు పూర్వపు శాసనములందు దేశీయ ఛందస్సులైన తరువోజ, అక్కర, సీసము, ఆటవెలది మొదలగునవి వాడబడియున్నవి. ఇవి మాత్రాగణయుత ములు. తరువాత నన్నయభట్టు అక్షరగణ బద్ధములైన ఉత్పలమాలాది వృత్తములను గూడ ఉపయోగించి, ఆంధ్ర ఛందస్సామగ్రిని విస్తరింప జేసెను. నన్నయ భట్టారకుడు చింతామణియందు కొన్ని ఛందో విషయము లను "ఆద్యోవశః" మున్నగువాటిని సూచించెను. మొత్తముమీద కొన్ని తెలుగు కావ్యములు రచింపబడు వరకును ఛందో లక్షణము గ్రంథరూపమున లేకుండె నని యూహింప వచ్చును.

కవిజనాశ్రయము :- భీమన ఛందస్సు అను ప్రసిద్ధిని బడసిన ఈ గ్రంథమే ప్రథమాంధ్ర చ్ఛందో గ్రంథము. వేములవాడ భీమకవి ఈ గ్రంథమును క్రీ. శ. 12 వ శతాబ్దమున రచించెను. జైన వైశ్యుడైన మల్లియరేచన ఇందలి ప్రతి పద్యమునందును రేచా ! రేచన ! శ్రావకా భరణాంక ! ప్రభృతి నామములతో సంబోధింపబడినాడు. కవిజనాశ్రయము భీమకవి కృతము కాదనియు రేచనయే దీనిని రచించెననియు నొక వాదము కలదు. శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు ఇది రేచన కృతమని భావించి నారు. వారి మతము ప్రకారము నైత మీ గ్రంథము క్రీ. శ. 12, 13 శతాబ్దములనాటిదే. "వేములవాడను వెలసిన, భీమేశ్వర కరుణగల్గు భీమసుకవినే, గోమటి రేచనమీదను, నీమహిఁగవులెన్న ఛంద మెలమి రచింతున్" ఇత్యాది పద్యములను ఉదాహరించియు, లోకప్రతీతి ననుసరించియు, విమర్శయుతముగా శ్రీ జయంతి రామయ్య పంతులుగారు భీమకవి హైదరాబాదు రాష్ట్రమునందలి వెలిగందల వేములవాడయందుండి కవిజనాశ్రయమును రచించెనని నిశ్చయించియున్నారు. వారి మతమే పరంపరాగతమై బహుజనాదరమునొంది యున్నందువలన భీమకవి కవిజనాశ్రయమును రేచనకు అంకితముగా రచించె నని విశ్వసింతము.

ఇది ఛందోలక్షణములను దెలుపు గ్రంథమేయైనను ఇందు కావ్యప్రయోజనములు, కావ్యదోషములు మున్నగు మరికొన్ని విశేషములును గలవు. మొదటిది యగు సంజ్ఞాధికారమున గురులఘు వివేకము, గణస్వరూ పము, యతిప్రాసముల నిర్ణయమును గలవు. రెండవది వియతిఛందోఽధికారము. ఇందు 26 ఛందములు, యతి రహితవృత్తములు, వాటి లక్షణములు వివరింపబడినవి. మూడవదియగు యతిఛందోఽధికారమున యతిని పాటింపదగిన వృత్తములు చెప్పబడినవి. నాలుగవదియగు ఉద్ధరమాలా వృత్తాధికారమునందు లయగ్రాహి, లయ విభాతి, త్రిభంగి, లయహారి, దండక అను వాని లక్షణ ములు చెప్పబడినవి. ఐదవది అర్ధసమవృత్తాధికారము. ఇందు నారీప్లుత, రతిప్రియాదివృత్తములు తెలుపబడినవి. ఆరవది విషమవృత్తాధికారము. ఏడవదియగు జాత్యధి కారమునందు కందము, ఆర్య, గీతిభేదములు, సీసము, ఉత్సాహము, తరువోజ, గీదియ, అక్కరలు, ద్విపద, త్రిపద, చౌపద, షట్పద ఇత్యాదులు వివరింపబడినవి. (రగడ లక్షణము కవిజనాశ్రయమునందు లేదు. అది యర్వాచీనము. మరికొన్ని పద్యభేదములు అర్వాచీన లాక్షణికులచే నిరూపింపబడినవి). ఎనిమిదవ అధికారమున ఛందశ్శాస్త్రమునకు సంబంధించిన షట్ప్రత్యయములును, తొమ్మిదవ అధికారమున కావ్యదోషములును తెలుపబడి నవి. ఇట్లు నవాధికార పరిమితమైన ఈ ఛందోగ్రంథము మనకు లభించినవాటిలో ప్రాచీనతమమగుటచేత వ్యాకర ణమునందు నన్నయవలె ఛందశ్శాస్త్ర విషయమున భీమకవి ప్రామాణికుడుగా నేటికిని ఎన్నుకొనబడు చున్నాడు.

ఛందోదర్పణము : 'అనంతునిఛందస్సు' అను నామాం తరముగల ఈ గ్రంథమును రసాభరణకర్తయగు అనంతా మాత్యుడు రచించెను. ఛందోదర్పణము నాలుగాశ్వాస ముల గ్రంథము. మొదటి యాశ్వాసమున సంజ్ఞా, యతి, ప్రాస, ప్రకరణములు గలవు. రెండవ యాశ్వాసమున గద్యలక్షణము, వృత్తలక్షణములును, వివరింపబడినవి. మూడవ యాశ్వాసమున జాతులు, షట్ప్రత్యయములును చెప్పబడినవి. నాలుగవ యాశ్వాసమున దోషవివరణము, వ్యాకరణాంశములైన సంధి-సమాస- వివరణములును గలవు. ఇది కవిజనాశ్రయము నాధారముగాగొని వ్రాసిన గ్రంథమువలె నున్నది. కాని సులభగ్రాహ్యముగా నున్నది.

**లక్షణసార సంగ్రహము :-** చిత్రకవి పెద్దనార్యుడు దీనిని రచించెను. ఇది మూడాశ్వాసముల గ్రంథము. ఈ కవి 16 వ. శతాబ్ది మధ్యకాలమున నున్నవాడు. "పార్శంచాల" అనునది ఇతని ఇంటిపేరని గ్రంథపీఠికను బట్టి తెలియుచున్నది. కాని అది "పార్మంచాల" అయి యుండవలెను. పార్మంచాల గ్రామము కర్నూలుకు 40 మైళ్ళ దూరమున నున్నది. ఈ గ్రంథమునందు అక్షర జాత్యాది లక్షణము మొదలుకొని ఛందోలక్షణములును, పద్యలక్షణములును, రేఫ, ఱకార భేదములును, చిత్ర కవిత్వ లక్షణమును, షట్ప్రత్యయ విశేషమార్గములు మున్నగు విషయములును గలవు. ఏ తెలుగు లక్షణ గ్రంథమునందునులేని దశరూపకముల (నాటకాదుల) లక్షణము లిందుగలవు. దీనినే కొందరు పూర్వులు సర్వ లక్షణసారసంగ్రహ మనిరి. రమణకవి సాంబవిలాసము నందు "సర్వలక్షణసార సంగ్రహం బొనరించి తనరె పీతాత పెద్దన కవీంద్రు" డని వ్రాసెను. (కూచిమంచి తిమ్మకవి వ్రాసిన సర్వలక్షణసార సంగ్రహము దీనికంటె భిన్నము) ఈ లక్షణసార సంగ్రహము అప్పకవికి మార్గ దర్శకమై యుండునని విమర్శకులు తలంచుచున్నారు. ఇతర చ్ఛందోగ్రంథములందు రెండుమూడు పాదములలో గాని ఇముడని వృత్తలక్షణములు ఈ గ్రంథమున నొక్క పాదముననే ఇముడ్పబడి యుండుటచేత సులభముగా కంఠస్థము చేయుటకు అనువుగానున్నవి. చిత్రకవితా రీతులయందీకవి మిక్కిలిచాతుర్యమును జూపియున్నాడు.

**లక్షణ శిరోమణి :-** ఇది పొత్తపి వేంకటరమణ కవిచే రచింపబడినది. ఈ కవి తాము నందవరమున నుండినవార మనియు, క్రమముగా తమ ఇంటిపేరు "గ్రంథాలవారు, రాయనప్రగ్గడవారు, పొత్తపివారు, దుర్గరాజువారు"గా మారిన దనియు తెలిపియున్నాడు. ఇది నాలుగాశ్వాసముల గ్రంథము. దీనియందు వర్ణగణ వృత్తవిశ్రమాధికారములు గలవు. వర్ణగణములను గురించి మిక్కిలి విపులముగా వ్రాసియున్నాడు. ఇతడు కేవల లక్షణస్వరూపమునే తెలుపుచు తాను వ్రాసిన లక్షణములకు సంబంధించిన ఇతర కవుల లక్షణములను సైతము తెలిపియున్నాడు. తా నెరిగిన లక్షణగ్రంథ ముల నిట్లు పేర్కొనియున్నాడు. "భీమన ఛందస్సు అనంతుని ఛందస్సు, లక్షణసారసంగ్రహము (చిత్రకవి పెద్దన), లక్షణదీపిక (వార్తాకవి రాఘవయ్య), అధర్వణ ఛందస్సు, శ్రీధర ఛందస్సు, గోకర్ణ ఛందస్సు, కవిసర్ప గారుడము, కవిరాజ గజాంకుశము, వాదాంగ చూడా మణి" మున్నగునవి. గణపవరపు వేంకటకవిచే రచింప బడిన పెద్ద లక్షణగ్రంథమగు 'లక్షణ శిరోమణి' కంటెను ఇది భిన్నమని వ్యక్తమగుచున్నది. ఈ గ్రంథమున యతి ప్రాస విషయము మిక్కిలి విపులముగా నున్నది. పూర్ణ-అర్థబిందు ప్రాసము మొదలయిన పెక్కు నూతనాంశ ములు ఇందు గలవు.

**లక్షణ శిరోమణి :-** ఇది గణపవరపు వేంకటకవి రచితము. ఇందు ఛందోవ్యాకరణాలంకారములను గూర్చి తెలుపునట్టి పది యుల్లాసము లుండినట్లు తెలియుచున్నది. కాని అన్నియు లభింపలేదు. అయిదుల్లాసములు మాత్రము "ఆంధ్ర సాహిత్య పరిషత్తు" వారికి లభించినవి. ప్రథమోల్లాసమున మహాకావ్య స్వరూప మును, ద్వితీయోల్లాసమున వేంకటేశాంధ్ర నిఘంటు వును, తృతీయోల్లాసమున ఆంధ్ర కౌముదియు, చతు ర్థోల్లాసమున ఛందో విషయమును, పంచమోల్లాస మున రేఫ ఱకార నిర్ణయమును గలవు. ప్రథమా శ్వాసముయొక్క చివరనున్న గద్యమందు గ్రంథకర్త పేర్కొన్న బహుళాంశములుగల ఇతర గ్రంథభాగము దురదృష్టవశమున లభింపలేదు. ఆంధ్ర వాఙ్మయము నందలి లక్షణ గ్రంథములలో ఈ లక్షణ శిరోమణి ద్వయము ఛందోవ్యాకరణములను గురించి సమగ్ర ముగా తెలుపుచున్నది. ఈ గ్రంథకర్తలు క్రీ. శ. 17 వ శతాబ్దమువారు. అయినను అపూర్వములయిన ప్రాచీన గ్రంథముల నుద్ధరించిరి. ఇవి ముద్రింపబడినచో ఆంధ్ర వాఙ్మయమున నూతనాంశము లెన్నియో భాషాసేవకు లకు తెలియగలవు. పరిషత్పుస్తక భాండాగారమువారు మరికొన్ని లక్షణగ్రంథములను పట్టికలో నిచ్చియున్నారు. వాటిలో ముద్రితములు, అముద్రితములును గలవు. సంగ్రహవిజ్ఞానముకొరకై వాటినిగురించి తెలిసికొందము.

**సకల లక్షణసారసంగ్రహము :-** ఇది కొన్ని గ్రథంముల సంపుటి. ఇందు ముఖ్యముగా రత్నాకరము గోపాల కవి ప్రణీతమైన "సకల లక్షణసార సంగ్రహము" గలదు.

ఇందు రాజనరేంద్ర చరిత్రము, కమలాకర చరిత్రము అంబాల భాణము మున్నగు నపూర్వ గ్రంథములనుండి ప్రయోగములు గైకొనబడినవి. ఛందోలక్షణములు సులక్షణసారమునుండియే గ్రహింపబడినవి. ఈ కవి క్రీ. శ. 1630 తరువాతి వాడని పరిశోధకులు తలచుచున్నారు.

సుకవి కర్ణామృతము : ఇది కౌలూరి ఆంజనేయకవి రచితము. దీనికి 'కుకవికర్ణ కఠోరము' అను నామాంతరము గలదు. ఇందు యతిప్రాస ప్రకరణములుమాత్రమే కలవు. గురు లఘు నిర్ణయము, గణవిభజనము గ్రంథాదిని తెలుపబడినవి. లింగమగుంట తిమ్మన్నకృతమైన బాలబోధచ్ఛందస్సునుండియు, చిత్రకవి పెద్దన వ్రాసిన లక్షణసార సంగ్రహమునుండియు లక్షణములు స్వీకరింపబడినవి. ఈ కవి క్రీ. శ. 16 వ శతాబ్ది ప్రాంతము వాడని పరిశోధకు లూహించుచున్నారు.

లక్షణమంజరి: ఇది నైషధము తిమ్మకవి ప్రణీతము. ఏకాశ్వాస గ్రంథము. ఛందోవిషయక గ్రంథమైనను కొన్ని వ్యాకరణాంశములు సైత మిందు చేరియున్నవి. లక్ష్యలక్షణములు స్వయముగా కవి రచించినవే. ఈ గ్రంథము గరళపురీశ్వరున కంకితము చేయబడుటచే దీనికి "గరళపురిచ్ఛంద" మను పేరు సైతము కలదు. ఈ గరళపురము మైసూరు రాష్ట్రమునగలదు. కవి ఆ ప్రాంతమువాడేయని విశ్వసింపబడుచున్నది."యతులును, గణములు, ప్రాసము, లతులం బగు సంధివిధము లక్షర ఫలముల్, వితతాంధ్ర మహిమలెల్లను, జతురత వివరింతు సుకవిజాలము మెచ్చన్" అని కవిచేసిన ప్రతిజ్ఞవలన మనకు గ్రంథస్థ విషయములు ఊహింప వీలగుచున్నవి. ఇతడు ఇతర లాక్షణికులకంటె విలక్షణముగా ఏబది యతులను బేర్కొనియున్నాడు. విషయము ఏకీభవించినను యతులపేర్లు క్రొత్తగా నున్నవి. "శుద్ధస్వర యతి, గూఢస్వర యతి, ఋత్వహిత యతి, ప్రకారసంధి యతి, తద్భవయతి, చిత్రయతి, శకంధు యతి, ఆదేశ యతి, సహోర్థ యతి, చతుర్థీవిభక్తి యతి, పంచమీవిభక్తి యతి, ప్రభునామ యతి, సంయుక్తోష్మ సహోర్థయతి" ఈ రీతిగా ఏబదియు క్రొత్తపేర్లతోనున్నవి. ఇదియును అముద్రితమే.

కవితాలక్షణసారము : రామయకవి దీనిని రచించెను. ఇది ఏడధ్యాయముల అముద్రితగ్రంథము. కవిచింతామణి మొదలగు లక్షణగ్రంథములనుండి ఉదాహరణములు గ్రహింపబడినవి. భోగావళి, బిరుదావళి, గుణావళి, చక్రవాక, చతుర్భద్ర, చతురంతర, చౌశోత్తర, త్యాగఘోష, జయఘోష మొదలయిన రగడలక్షణము లును, లక్ష్యములును సంస్కృతాంధ్రములలో రచింపబడినవి. ఈకవి హరితసగోత్రుడు. తండ్రిపేరు అనంతయామాత్యుడు.

లక్షణదీపిక : ఇది గౌరనవిరచితము. నవనాథ చరిత్రము మున్నగు ద్విపద కావ్యములను రచించిన గౌరనకు ఈలక్షణదీపికా కర్తయగు గౌరనకు సంబంధమేమేని గలదా అను విషయ మింకను బరిశోధకులు నిర్ణయింపవలసిన విషయముగా నున్నది. "గౌరన లక్షణదీపిక" అను పేరుతో నధికముగా చాటుప్రబంధ లక్షణములను దెలుపునట్టి మరియొక సంస్కృతగ్రంథప్రతి యున్నట్లు పరిషత్పుస్తకభాండాగారపట్టిక తెలుపుచున్నది. ఈ లక్షణదీపికయందు ఐదు పరిచ్ఛేదములు గలవు. అక్షరములు, వాటి శుభాశుభఫలములు, వర్ణాధిదేవతలు, రూక్షస్నిగ్ధ వర్ణవిచారము, గణములు, గణాధిదేవతలు, వాటి శుభాశుభ ఫలములు, నక్షత్రములు, రాసులు, మాతృకార్చన మున్నగు నంశము లిందు క్రమముగా చర్చింపబడినవి. గ్రంథము పద్యములు, శ్లోకములు, సంస్కృత వాక్యములు కలిగి యున్నది.

కావ్యచింతామణి : "కవిచింతామణి", "కావ్యానుశాసనము" అనునవి దీనికి నామాంతరములు. వెల్లంకి తాతంభట్టు దీనిని రచించెను. తాతంభట్టు "సాహిత్య చక్రవర్తి", "అష్టభాషాప్రక్రియా లబ్ధవర్ణుడు" అని అతడు వ్రాసికొన్న పద్యమువలన తెలియుచున్నది. కావ్యచింతామణియందు "దోషాధికారము, ప్రాసాధికారము, భాషాలక్షణాధికారము" ఈరీతి విభాగము కలదు. పావులూరి మల్లనగణితము, భాస్కరరామాయణము, అనంతుని ఛందము మొదలయిన గ్రంథములనుండి లక్ష్యలక్షణములు గ్రహింపబడినవి. ఇదియు అముద్రితమే.

కవిసర్పగారుడము : కాచన బసవన దీనిని రచించెను. "ఇతి శ్రీమన్నందవరకుల కలశపారావార - అత్రేయస గోత్ర పవిత్ర, సుజనవిధేయ, కుకవిక్షుద్రవేయ వైనతేయ, కాచన బసవననామధేయ ప్రోక్త శ్రీగిరి మల్లి

కార్జున నామధేయాంకితంబైన కవిసర్పగారుడంబున గణాక్షర ఫలంబన్నది ప్రథమాశ్వాసము" ఇత్యాది గద్యములచే ఈ కవినిగురించిన యంశములు తెలియుచున్నవి. ఈ గ్రంథమునందు గణాక్షర దేవతా ఫలాదివిషయములు, ఛందశ్శాస్త్రము, మంత్రశాస్త్ర మనదగినంతగా తెలుపునట్టి పూజాక్రమాదులు, వాటితోపాటు శృంగారాది రసభావములు వివరింపబడినవి. యతుల ఉదాహరణములతో ఈ తాళపత్రప్రతి ముగిసినది.

ఆనంద రంగరాట్ఛందము : ఇది కస్తూరి రంగయ ప్రణీతము. నాలుగాశ్వాసముల గ్రంథము. "లక్షణ చూడామణి" అని దీనికి నామాంతరము. "ఇది శ్రీ మదుమామహేశ్వర కరుణాకటాక్ష లబ్ధ సాహితీ విభవ ధర్మ వెచ్చకుల జలధి కుముదమిత్ర, వేంకటకృష్ణార్య పుత్ర, విద్వజ్జనమిత్ర, కుకవిజనతాలవిత్ర, ఆర్వేల కమ్మెని యోగి కులీన లక్షణకవి కస్తూరి రంగయ ప్రణీతంబయిన ఆనంద రంగ చ్ఛందంబను లక్షణచూడామణియందు సర్వంబును చతుర్థాశ్వాసము" అను గ్రంథాంత గద్యము కవినిగురించి తెలుపుచున్నది. ఇది కేవల చ్ఛందోగ్రంథమనదగి యున్నది.

సులక్షణ సారము : ఇది లింగమకుంట తిమ్మకవి విరచితము. కాని ఈ గ్రంథము వెల్లంకి తాతంభట్టు ప్రణీతమయినట్టు ముద్రింపబడి నేటివరకును సులక్షణసార మనగానే తాతంభట్ట రచితమన్న విషయము పాఠకుల హృదయమున నాటుకొనిపోయినది. అది సత్యము కాదు. సులక్షణసారమును రచించినవాడు తిమ్మకవియే. వెల్లంకి తాతంభట్టు 'కవిచింతామణి'ని రచించిన ప్రాచీన విద్వాంసుడు. తిమ్మకవి అర్వాచీనుడు. గత సంవత్సరమున వావిళ్ళవారు సులక్షణసారమును సంస్కరించి పునర్ముద్రితము గావించినారు. దానిమీద లింగమకుంట తిమ్మకవి పేరును ముద్రించి పూర్వముద్రణమున జరిగిన పొరపాటును పీఠికలో వివరించియున్నారు. "శ్రీరామాకుచ మండలీమిళిత..." ఇత్యాది పద్యములు మార్చి తాళపత్ర పరిశోధనమువలన లభించిన క్రొత్తపద్యములను గొన్నిటిని చేర్చి పూర్వ సులక్షణసారముకన్నను మంచి ప్రతినిగా సిద్ధము చేసినారు,

అప్పకవీయము : కాకునూరి అప్పకవి ఈగ్రంథమును రచించెను. ఇది నన్నయభట్టారక రచితమయిన 'ఆంధ్ర శబ్దచింతామణి'ని ఆధారముగా గొని బహుళాంశము లను జేర్చి, కూర్చి రచించిన గ్రంథము. కవి యుద్దేశమున నిది వ్యాకరణ ప్రధానమయిన సమగ్ర లక్షణగ్రంథమే. కాని ఛందోవిషయములు విపులముగా నుండుటయు, తదితర భాగములు తక్కువగా నుండుటయు, గ్రంథ మసంపూర్ణ మగుటయు కారణములుగా ఛందోగ్రంథము గానే దీనికి బహుళప్రచారము కలిగినది.

ఆంధ్రశబ్ద చింతామణి యందలి సంజ్ఞా, సంధి, తత్సమ, దేశ్య, క్రియాపరిచ్ఛేదములు అను ఐదింటిని విస్తరించి భాషా పరిచ్ఛేదము, వర్ణపరిచ్ఛేదము, వళిప్రాస పరిచ్ఛేదము, పద్య పరిచ్ఛేదము, సంధి పరిచ్ఛేదము, తత్సమ పరిచ్ఛేదము, దేశ్య పరిచ్ఛేదము, క్రియా పరిచ్ఛేదము అను నామములతో ఎనిమిది ఆశ్వాసములుగా రచించుటకు అప్పకవి యుద్దేశించెను. కాని తత్సమ దేశ క్రియా పరిచ్ఛేదములు గ్రంథమునందులేవు. సంధి పరిచ్ఛేదము వరకే అయిదాశ్వాసములతోనే అసమగ్రముగా నిలిచిపోయినది. (పరిషత్పుస్తక భాండాగారమున నొక అప్పకవీయ తాళపత్ర ప్రతికలదు. అందు సంధి తత్సమ పరిచ్ఛేదములకు సంబంధించిన లక్ష్య లక్షణములున్నవి. ఆ భాగము నేటి ముద్రిత ప్రతులందు లేనిది. అది అప్పకవీయము యొక్క మిగిలిన భాగము కావచ్చునేమో యని యూహించుటకు వీలున్నది.) గ్రంథము పూర్తిగా రచింపకముందే అప్పకవి దివంగతుడై యుండవచ్చునని పలుపురు తలచుచున్నారు. కాని పరిషత్పుస్తక భాండాగారము పేర్కొన్న తాళపత్ర ప్రతినిబట్టి యూహించినచో అప్పకవీయము పూర్తిగా మనకు లభింపలేదేమోయని చెప్పుటకు వీలున్నది. ఉన్న గ్రంథములో వళిప్రాస, పద్య పరిచ్ఛేదములుగల భాగము మిక్కిలి విస్తృతమై ఉపయోగకరముగా నుండుటచేత ఇది ఛందో గ్రంథముగా ప్రచారమును గాంచుట సమంజసముగానే యున్నది.

అప్పకవికి శాలివాహనశకము 1578 మన్మథనామ సంవత్సర శ్రావణ బహుళ అష్టమినాడు (క్రీ. శ. 1656 సం. ఆగష్టు 8 వ తేదీ) కామేపల్లిలో నుండగా కల వచ్చినట్లును, చింతామణికి విపులమగు వ్యాఖ్యానము వ్రాయవలెనని స్వప్నమున కనిపించి విష్ణువు కవికి ఆజ్ఞ నిచ్చినట్లును అప్పకవీయమున గలదు. అప్పకవి పలనాటిసీమ

(గుంటూరుజిల్లా) వాడని ఇంతవరకు ప్రకటించిన విమర్శలయం దన్నిటను గలదు, కాని ఇటీవల ప్రకటితమైన "వ్యాస ముక్తావళి" అను గ్రంథమునందు డాక్టరు బూర్గుల రామకృష్ణారావుగారు అప్పకవి గ్రామమును గురించి చర్చించి స్థల నిర్దేశమును చేసినారు. వారి యభిప్రాయము ప్రకారము 'కాకునూరు' హైద్రాబాదు రాష్ట్రమునందలి మహబూబు నగరము జిల్లాలో చేరుచున్నది. అంతేకాక మహబూబునగరము జిల్లా వేదుల గ్రామములో "కాకునూరు" ఇంటిపేరుగాగలవారున్నారనియు, అప్పకవి తమ వంశీయుడైనట్లు వారు చెప్పుకొందురనియు తెలియవచ్చుచున్నది. ఈ విషయము పైవాదమును బలపరచుచున్నది.

అప్పకవి గొప్ప లక్ష్య లక్షణవేత్త. ప్రాచీనములైన లక్షణ గ్రంథముల నన్నింటిని పరిశీలించి, తత్సారభూతముగా అప్పకవీయమును రచించెను. ఆతడు తాను పరిశీలించిన పెక్కు గ్రంథములను పేర్కొనుటయేకాక ప్రథమాశ్వాస ప్రారంభమునందు లక్షణ గ్రంథములు లక్షోప లక్షలు గలవనెను. అప్పకవి పేర్కొన్న గ్రంథములన్నియు మనకు లభింపలేదు. వ్యాకరణాంశముల యందును, యతివిస్తృతి యందును నేటి విమర్శకులు కొందరు అప్పకవిసిద్ధాంతములను విమర్శించియున్నారు. మతభేదములు, విమర్శలు, నిరవధికములు గనుక మన కున్న ఛందోగ్రంథములలో కవితాభ్యాసము చేయువారికి అప్పకవీయము కల్పతరువువంటి దనుట నిర్వివాదాంశము.

IV *నిఘంటువులు :-* సంస్కృత భాషయందువలెనే తెనుగునందు పూర్వలాక్షణికులు కొందరు నిఘంటువులను రచించిరి. అవియన్నియు పద్యాత్మకములు. కంఠస్థము చేసికొన్నవారికే వాటియుపయోగము. అవసరమువచ్చినప్పుడు చూచుకొనుట· కాధునిక నిఘంటువులవలె అవి ఉపయోగింపవు.

ఆంధ్రనామ సంగ్రహము :- ఇది పద్యాత్మకమై ఆంధ్రుల జిహ్వారంగమున తాండవించునట్టి నిఘంటువు. "తెనుగు పేళ్ళరసికూర్చి" అని చెప్పుకొనుటచేత గ్రంథకర్తయైన పైడిపాటి లక్ష్మణకవి ఈ గ్రంథమును స్వోపజ్ఞముగ రచించెనని ఊహించుటకు వీలున్నది.

ఆంధ్రనామ శేషము : అడిదము సూరకవి ఈ నిఘంటువును రచించెను. ఆంధ్రనామ సంగ్రహామునకిది పరిశిష్ట రూపము. దానియందు చెప్పబడని తెనుగుమరుగు శబ్దములను కూర్చెదనని గ్రంథకర్తయే చెప్పుకొన్నాడు. సూరకవి 18 వ శతాబ్దివాడు ; లక్ష్మణకవితత్పూర్వుడు.

సాంబ నిఘంటువు :- ఇది కస్తూరిరంగకవిచే రచింపబడినది. ఇతడీగ్రంథమును గణపవరపు వేంకటకవి ప్రణీతమైన వేంకటేశాంధ్రమును జూచి రచించి యుండునని విమర్శకుల యభిప్రాయము. ఆంధ్రనామ సంగ్రహమునందువలెనే దీనియందును దేవ, మానవ, స్థావర, తిర్యక్, నానార్థవర్గులు కలవు. కాని వేంకటేశాంధ్రమువలె ఇది ప్రౌఢముకాదు. ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రనామ శేషము, సాంబనిఘంటువు నను నీ మూడును ఎక్కువ ప్రచారమును పొందిన నిఘంటుత్రయము. ఇవి మూడును కలిపియే ముద్రితములగుచున్నవి. పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రనామ సంగ్రహమునేకాక "ఆంధ్ర రత్నాకరము" అను మరియొక నిఘంటువును సైతము రచించినాడు. అదియు పద్యాత్మకమే. గణపవరపు వేంకటకవిచే రచింపబడిన "వేంకటేశాంధ్రము" సాంబనిఘంటువుకన్న విపులము, ప్రౌఢము, సలక్షణమునై యున్నది. ఇతడు "దేశీయాంధ్ర నిఘంటువు" అను మరియొక నిఘంటువును గూడ రచించెను. పూసపాటి వీరపరాజు "ఆంధ్రపదాకరము" అను నొక పద్యాత్మక నిఘంటువును రచించెను. క్రెగడపువారి కందము లొకకాలమున నిఘంటుజ్ఞానమునకు ఉపయోగించునవియై ప్రచారమునందుండినవి. చౌడప్పసీసములు సయితము తెనుగుపదముల నెరుకపరచునవియై యొకనాడాంధ్రుల జిహ్వారంగమున తాండవించెను. నుదురుపాటి వేంకటకవి రచించిన "ఆంధ్రభాషార్ణవము" ఉత్తమమైన ప్రాచీనాంధ్ర నిఘంటువు. దీనికి అకారాది క్రమములో పట్టిక తయారుచేసినచో ఎక్కువగా ఉపయోగపడగలదు. ఇది అమరకోశ పద్ధతిలో రచింపబడినది. మన పూర్వులు పద్యాత్మకములుగా రచించిన నిఘంటువులలో ఇంతవరకు పేర్కొన్నవి మనకు లభించినవి. వీటిలో ముద్రితములు, అముద్రితములును గలవు. ఇక మనకు లభింపక ఎన్ని కాల గర్భమున గలిసిపోయెనో తెలియదు. పై నిఘంటువు

అన్నియును పద్యాత్మకములై, పర్యాయపదములను మాత్రమే తెలుపుచున్నవి.

ఈ కాలమున ఆంగ్లనిఘంటు పద్ధతి తెలుగునందును అనుసరింపబడుటచేత ప్రాచీనాంధ్ర నిఘంటువులను చదువువారు బహుస్వల్ప సంఖ్యాకులు. నవీనపద్ధతికి మార్గదర్శకమైన మొట్టమొదటి తెలుగు నిఘంటువును విలియంబ్రౌను అను నతడు 1807 లో "A Vocabulary of Gentoo and Telugu" అను పేరుతో ప్రకటించెను. అకారాది వర్ణక్రమమున వెల్వడిన తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులలో ఇదియే మొదటిది. ఆనాడు తెలుగుదేశములో వ్యవహారమునందున్న పెక్కు శబ్దములు అనగా తెలుగువారు సాధారణముగా ఇంటను, బయటను వాడుక చేసెడి పదములేకాక కోర్టుకచ్చేరీలలో వ్యవహారరీతిగా వాడుకొనెడి పదములుకూడ ఇందున్నవి. మరియు ఉపయోగ సరణి ఎక్కువ స్పష్టముగా తెలయజేయబడినది. ఇందు "అ" "ఆ" లతోగల పదముల తరువాత కకారముతోగల పదములే యున్నవి. ఇ, ఈ, ఎ, ఏ లతో నుండవలసిన పదములు యి, యీ, యె, యే లతోను; ఉ, ఊ, ఒ, ఓ లతో నుండవలసిన పదములు వు, వూ, వొ, వో లతోను; ఋకారముతో నుండవలసినవి, రుకారముతోను ఆయా స్థలములందున్నవి. ఇది వ్యవహారమునందలి ఉచ్చారణ పద్ధతిని అనుసరించియున్నది.

ఈ విలియంబ్రౌను నిఘంటువు వెనువెంటనే ఎ. డి. కాంబెల్ రచించిన ఇంకొక 'తెలుగు-ఇంగ్లీషు' నిఘంటువు 1810 ప్రాంతమున వెల్వడినది. ఇదికూడ అంతగా చెప్పదగిన సమగ్రనిఘంటువు కాదు. ఇవి తెలుగు నభ్యసింపదలచిన ఆంగ్ల విద్యావంతులకుమాత్రము ఉపయోగపడును. ఇంగ్లీషురాని తెలుగువారి కుపయోగపడునట్లుగా 'తెలుగు-తెలుగు' నిఘంటువును అకారాదిగా మొట్టమొదట రచించినవాడు మామిడి వెంకయ్య. ఇతని 'ఆంధ్రదీపిక' 1848 లో ముద్రితమయినను 1816లోనే రచింపబడినదట. శ్రీ చుండూరి రంగనాయకులుశ్రేష్ఠి రచించిన 'ఆంధ్రదీపిక' మరియొకటి గలదు. ఇది శాలివాహన శకము 1771 లో అనగా క్రీ. శ. 1849 లో ముద్రితమయినది. ఇవి రెండును భిన్నము లగునో, కావో తెలియదు.

ఈ నిఘంటువుల పిమ్మట సి. పి. బ్రౌను నిఘంటువులు ప్రకటితములయినవి (1852-54). ఈతడు పై ఇద్దరు పాశ్చాత్యులకంటె ఎక్కువవిద్యాధికుడు. తెలుగుభాషలో అపారమయిన కృషిచేసిన పండితుడు. పెక్కురు పండితుల సాహాయ్యముతో ఆతడు 'ఇంగ్లీషు-తెలుగు', తెలుగు-ఇంగ్లీషు' అను రెండు పెద్దనిఘంటువులను ప్రకటించెను. అంతేకాని తెనుగుభాషయందు వ్యవహారములోనున్న హిందూస్థానీ, ఆంగ్లము, తమిళము, మరాఠి మొదలగు భాషలకు చెందిన పదములను కూర్చి, మిశ్ర నిఘంటువను పేర ఇంకొక నిఘంటువునుకూడ రచించెను.

తెలుగు-ఇంగ్లీషు నిఘంటువునందు తెలుగు పదములకు ఆంగ్లార్థములేకాక, తెలుగు అర్థములుకూడ ఒసగబడినవి. శబ్దార్థములను స్పష్టముచేసెడి లోకోక్తులను పూర్వకవి ప్రయోగ విశేషములను చక్కగా విరించెను. ఇట్లు ఈ నిఘంటువును రచించి సి. పి. బ్రౌను ఆంధ్రభాషకు మహోపకార మొనర్చినాడు. ఈ నిఘంటువే తరువాతి ఆంధ్ర నిఘంటువుల కెంతేని ఉపయో పడినదనుటలో అతిశయోక్తి లేదు. అంతేకాక బూజుపట్టి చెదలపాలగుచున్న పెక్కు ప్రాచీనాంధ్ర గ్రంథములను ప్రకటించిన ఖ్యాతియును బ్రౌనుకే దక్కినది.

చిన్నయసూరి నిఘంటువు: పై నిఘంటువులలో లోపములను తొలగించి పండితాదరణ పాత్రమయిన సగ్రాంధ్ర నిఘంటువును సమర్థతతో రచించుటకు పరవస్తు చిన్నయసూరి సమకట్టెను. కాని, పదముల యొక్క పకను తయారుచేయువరకే చిన్నయసూరిజీవించియుండెను. ప్రతి పదమునకును, ప్రతియర్థమునకుమ నిర్ధారకమయిన ప్రయోగములను మాత్రమే ఇతడు సేకరించుటకు మొదలుపెట్టెను. శబ్దస్వరూప నిర్ణయమునకుతోడ్పడ యతిప్రాసాదులందు వాడబడిన ప్రయోగములనే సూగ్రహించెను. ఈ ఉత్తమ నిఘంటువు పూర్తియైయున్నచో ఆంధ్రభాషకు మహోపకారము జరిగియుండెడిది.

శబ్దరత్నాకరము: శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు దీనిని 1885లో ప్రకటించిరి. చిన్నయసూరి నిఘంటువుయొక్క మహాప్రారంభమునుగాంచి అ పరిపూర్తి యగుటకు బహుకాలము చెల్లుననియు, ప పూర్తి అయినను అందు తెనుగుపదములు మాత్రమే

చేర్చబడియుండుటచేతను విద్యార్థుల సహాయార్థము వారి యుపయోగమునకు చాలునంతటిదిగాను, లక్ష్యావిరుద్ధముగాను ఉండునట్లు తెనుగుపదములతోగూడ తదపేక్షితములయిన సంస్కృత పదములను జేర్చి అకారాదిగా ఈ నిఘంటువును రచించుచున్నట్లు వారేపేర్కొనిరి. ఇంతకు పూర్వమందున్న సర్వాంధ్ర నిఘంటువులును వీరికి ఉపయోగపడినవి. ప్రామాణికమును, సంపూర్ణమును అయిన ఆంధ్రనిఘంటువు ఇప్పటికిని ఇదియొక్కటియే.

వైకృతదీపిక : ఇదికూడ శ్రీ బహుజనపల్లి సీతారామాచార్య కృతమే. ఇది క్రీ. శ. 1900 లో మూడవ ముద్రణము పొందినది. ఇందు అకారాది క్రమములోనున్న 2,400 వికృతిపదములకు అర్థములును, ఆద్యప్రకృతులగు సంస్కృత పదములును వ్రాయబడినవి.

శబ్దరత్నాకరముకూడ సమగ్రముకాదనియు, ఇంకను తెనుగు శబ్దములును, అవసరమైన సంస్కృత శబ్దములును మిగిలియున్నవనియు శ్రీ వీరేశలింగము పంతులు మున్నగువారు తలచిరి. ఇట్టి తలంపుతోనే శబ్దరత్నాకరము తరువాత మరికొన్ని నిఘంటువులు చిన్నవియును, పెద్దవియును బయలుదేరినవి.

**ఆంధ్రవాచస్పత్యము:** కొట్ర శ్యామలకామశాస్త్రిగారు ఈ నిఘంటువును రచించి ప్రకటించిరి. (1934--1940 మధ్య) పర్యాయ పదాత్మక పద్యరూప నిఘంటువులు, నానార్థ నిఘంటువులు, అకారాది శబ్దక్రమముతో రచింపబడిన ఆధునికనిఘంటువులును ప్రత్యేక మొక్కొక్క గుణము కలవగుటచేత ఆగుణములన్నియు గలిసివచ్చునట్లును, విశేషార్థములు, వ్యుత్పత్తులు తెలియునట్లును ఇది రచింపబడినది. ఇది ఆధునికపద్ధతిలో నున్న సమగ్ర నిఘంటువు.

**సూర్యరాయాంధ్ర నిఘంటువు :** 1911 వ సంవత్సర ప్రాంతమున స్థాపితమైన ఆంధ్రసాహిత్య పరిషత్తు ఆధ్వర్యవమునను, శ్రీ పీఠికాధీశుని ఔదార్యముతోను ఈ నిఘంటునిర్మాణము ప్రారంభమైనది. ఆంధ్రదేశమునందలి అనేక సుప్రసిద్ధపండితుల దీర్ఘకాల విశేష పరిశ్రమకు ఫలితముగా 1936-44 మధ్య ఈ నిఘంటు సంపుటములు నాల్గు ప్రకటితములైనవి. 'అ' మొదలు 'స్రస్థిమాలి' అను పదము వరకును ఇది ముద్రితమైనది. ఇది పూర్తియగుటకు ఇంకను మూడు సంపుటములు ప్రకటితములు కావలసియున్నవి.

ఇది చాల శాస్త్రీయమగు పద్ధతిలో నిర్మితమైన నిఘంటువు. వీలైనంతవరకు సమానార్థకములగు తమిళము, కన్నడము మొదలగు భాషాపదములుకూడ నొసగబడినవి. ఒకే పదమునకుగల భిన్నార్థములను వివరించుచు ప్రయోగములు ఉదాహృతములైనవి. జయంతి రామయ్య పంతులుగారు దీనికి సంపాదకులు. పిమ్మట డాక్టరు గిడుగు సీతాపతిగారు సంపాదకత్వమును వహించిరి.

**వావిళ్ళ నిఘంటువు :-** సూర్యరాయాంధ్ర నిఘంటువు పెక్కుసంపుటములలో నుండుటచేత అందరకును అందుబాటులో నుండవలెననెడి ఉద్దేశముతో వావిళ్ళసంస్థవారు దీనిని ప్రకటించుటకు పూనుకొనిరి. ఆదిలో దీనిని రెండు సంపుటములుగా ముద్రింప దలపెట్టిరి, కాని ఇప్పటికే ఇది మూడుసంపుటములుగా ముద్రితమైనది. ఇందుకూడ 'అ' మొదలు 'స్రస్థిమాలి' వరకు మాత్రమే పదములుకలవు. ఇది ఇంకను రెండు సంపుటములైనను పట్టును. సూర్యరాయాంధ్ర నిఘంటు పద్ధతియే ఇందును అనుసరింపబడినది. అందులేని కొన్ని క్రొత్తపదములుకూడ ఇందుగలవు. అకారాది "ఇంచు" వరకును ఈ నిఘంటువును శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు రచించిరి. వారు పరమపదించుటచేత శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు దీనిని పూర్తిచేసిరి.

**లక్ష్మీనారాయణీయము :-** దీనిని శ్రీ కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రిగారు రచించిరి (1907 లో ప్రకటితము). ఇది శుద్ధాంధ్రపద నిఘంటువు. ఇందు అచ్చతెలుగు పదములకుమాత్ర మర్థములు వ్రాయబడినవి. అచ్చతెలుగు పదముల కర్థము నెరుగగోరువారికిని, అచ్చతెలుగుపదము లేవియో తెలిసికొనదలచిన వారికిని ఇది యుపయోగించును. ఇదియు ఆధునికపద్ధతి నిఘంటువే.

**ఆంధ్రపద పారిజాతము :** ఇది అకారాదిగా ప్రయోగ సహితముగ వ్రాయబడిన శుద్ధాంధ్రపద నిఘంటువు. దీనిని శ్రీ ఓగిరాల జగన్నాథకవి; శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారలు రచించిరి; వారి మిత్రులగు పిడుగు సుబ్బరామయ్యా, మరికొందరుపండితులు దీనిని పరిష్కరించి 1888 లో ప్రకటించిరి.

శబ్దార్థచంద్రిక :- మహాకాళి సుబ్బారాయ రచితము (1906 ప్రాంతము). శబ్దరత్నాకరమునలేని కొన్ని శబ్దము లీ నిఘంటువున గలవు. ఇందు చక్కని యర్థము లీయబడినవి. ఇది విద్యార్థులకు మిక్కిలి ఉపయుక్తము.

శబ్దార్థచింతామణి :- హైదరాబాదు రాష్ట్రవాసియైన తాటికొండ తిమ్మారెడ్డి దేశాయి దీనిని రచించెను. క్రీ.శ. 1906 లో ఇది ముద్రితమైనది. ప్రతిపదమునకును సులభమైన తెలుగర్థము, దానితోపాటు ఉర్దుపదము దీనియందుండును. తెలుగుపదములకు ఉర్దుపదముల నెరుగని ఆంధ్రుల ఉపయోగార్థ మీ నిఘంటువు రచింపబడినది. ఉదాహరణము.

"అంతరాయము - విఘ్నము - ఖలల్
అందకత్తె - సౌందర్యవతి - హసీనా."

ఇట్లే గ్రంథమంతయు అకారాదిక్రమముతో నున్నది.

శంకరనారాయణ నిఘంటువు :- ఇది ఇంగ్లీషు పదములకు తెలుగర్థములను దెలుపు నిఘంటువులలో బహుళ ప్రచారమును పొందిన ఉత్తమనిఘంటువు. తెలుగు పదములకు ఆంగ్లార్థముల నొసగెడి నిఘంటువునుకూడ వీరు రచించిరి.

ఉర్దు తెలుగు నిఘంటువు :- హైదరాబాదు వాస్తవ్యులయిన శ్రీ ఐతంరాజు కొండలరావుగారు ఈ నిఘంటువును వ్రాసిరి. ఇంగ్లీషుకు శంకరనారాయణ నిఘంటువు వలెనే, ఉర్దుపదముల అర్థము నెరుగగోరిన ఆంధ్రుల కిది మిక్కిలి ఉపయోగకరమైన నిఘంటువు.

పారిభాషిక పదకోశములు :- శ్రీ తిరుమల వేంకట రంగాచార్యులుగారు పదములను సేకరింపగా శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగా రీనిఘంటువును ప్రకటించిరి. ఆంగ్లమునందలి వివిధశాస్త్రములకు సంబంధించిన ఇంగ్లీషు పదములకు తెలుగర్థము లీయబడినవి. దిగవల్లి వెంకట శివరావుగారును ఒక పారిభాషికపద నిఘంటువును వ్రాసిరి. ఇందు వ్యవహారకోశము, శాస్త్రపరిభాష అను రెండుభాగములు కలవు.

విద్యార్థి కల్పతరువు :- శ్రీ ముసునూరి వేంకటశాస్త్రిగారు దీనిని రచించిరి (1936 ప్రాంతమున). దీనికి వారే 'ఆంధ్రభాషా విషయ సర్వస్వము' అను పేరిడిరి. ఇది అతిశయోక్తి కాదు. ఇది ఆంధ్ర విద్యార్థిలోకమునకు అత్యంతోపకారి యగుటయేకాక పండితులకును సహాయకారి కాగలదు. శ్రీ శాస్త్రిగారు 'శబ్దార్థదీపిక' అను మరొక తెలుగు - తెలుగు నిఘంటువును కూర్చిరి (1956). దీనిలో శబ్దముల రూపాంతరములును వివిధార్థములును, పర్యాయ పదములును, ఇయ్యబడుటయేగాక సంస్కృత న్యాయములు కూడ విశేషముగా చేర్చబడి సులభరీతిని అర్థవివరణము గావింపబడెను.

పంచభాషి :- రెంటాల వెంకట సుబ్బారావుగారు దీనిని రచించిరి. ఒక తెలుగుపదమును గ్రహించి దానికి సరియైన కన్నడము, తమిళము, హిందూస్తానీ, ఇంగ్లీషు పదములు చేర్చబడినవి. ఐదుభాషలు ఒకేసారి నేర్చుకొనుటకు ఉపయోగించునట్టి చిన్న నిఘంటువు. దీని రెండవ భాగమున ఇదేవిధముగా వాక్యములుసైత మైదుభాషలలో నీయబడినవి. ఇట్టిదే "షడ్భాషామంజరి" యను కలదు. దీనిని వెష్టువార్డు అండ్ కంపెనీవారు ప్రచురించిరి. పై ఐదుభాషలకు తోడు మరాఠీ భాషాపదములు కూడ ఇందున్నవి,

గెలిటి తెలుగు నిఘంటువు : అసిస్టెంటుకలెక్టర్లు, యువకోద్యోగులు, మిషనరీలు, వ్యాపారస్థులు మొదలగువారి ఉపయోగార్థ మిది శ్రీ ఎ. గెలిటి అను సివిలుసర్వీసు ఉద్యోగిచేత రచింపబడినది (1888). ఇందు తెలుగు పదములకు ఆంగ్లార్థము లీయబడినవి. తెలుగుపదములు రోమను లిపిలో వ్రాయబడుటయు వ్యవహారమునందు లేని పదములను విడిచివేయుటయు ఇందలి విశేషములు.

తెలుగు సామెతలు : దీనిని కెప్టెన్ కార్ అనునతడు రచించెను. 1185 తెలుగు సామెతలను అకారాదిగా కూర్చి, వాటిని ఆంగ్లమున వివరించియున్నాడు. తెలుగు సామెతలకు సమానార్థకములయిన లాటిన్, రోమన్ మొదలగు భాషలయందలి సామెతలనుగూడ తరచుగా చేర్కొనెను. గ్రంథాంతమున 82 సంస్కృత న్యాయములను గూడ ఆంగ్లమున వివరించియున్నాడు. సంస్కృత న్యాయములనుగూర్చి డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు ఒకగ్రంథమును; కూచిభొట్ల నరసింహశాస్త్రి, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి కలిసి ఒక గ్రంథమును ప్రకటించినారు. తెలుగు సామెతలను తెలుగునందే వివరించుచు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి యొక చిన్న

గ్రంథమును, శ్రీ నాళం కృష్ణారావు మరియొక గ్రంథమును ప్రకటించియున్నారు.

**ఆంధ్రవిజ్ఞానసర్వస్వములు :-** ఇవికూడ నిఘంటువుల వంటివే అయినను విషయవిస్తృతినిబట్టి వీటిని ప్రత్యేక జాతిగా గ్రహింపవలసియున్నది. పాశ్చాత్యదేశములందలి విజ్ఞానసర్వస్వములు (Encyclopaedias) ఈజాతి గ్రంథములకు మార్గదర్శకములైనవి.

**ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము :-** ఆంధ్రవాఙ్మయములో ఇది మొట్టమొదటి విజ్ఞానసర్వస్వము. శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు, వారిమిత్రులును కలిసి దీనిని రచింప ప్రయత్నించిరి. ప్రథమసంపుటము 1915 లోను; ద్వితీయ, తృతీయ సంపుటములు 1916-17 లలోను ప్రకటితములైనవి. ఈమూడు సంపుటములందును 'అ' నుండి 'అహి' వరకును అకారాదిక్రమణికలోగల పదములకు సంబంధించిన వ్యాసములుకలవు; నాల్గవసంపుటమునుఆంధ్రసంపుటముగ ప్రకటింప ప్రయత్నము చేయుచుండగా, 1923 లో లక్ష్మణరావుగారు చనిపోయిరి. అంతటితో ఈ మహత్తరకార్య మాగిపోయినది. దీనిని పునరుద్ధరింపవలెనను తలంపుతో, ప్రథమ ముద్రణప్రతులు శీఘ్రకాలముననే అలభ్యములగుటచే, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఈమూడు సంపుటములను రెండుగా భాగించి నూతనాంశముల ననేకములచేర్చి రెండుసంపుటములుగా 1932, 1934 లలో ప్రకటించిరి. పిమ్మట నాగేశ్వరరావుగారి మరణముతో ఈ ద్వితీయ ప్రయత్నము నిలిచిపోయినది. విశ్వవిజ్ఞానమును భారతీయ దృక్పథమునుండి సందర్శించి వివరించుటయే దీనిలక్ష్యము. ఇది అసమగ్రమైనను ఉన్నంతలో ఆంధ్రులకు కల్పవృక్షము వంటిది.

**పురాణనామచంద్రిక :** దీనిని రచించినవారు ఎనమండ్రం వేంకటరామయ్యగారు. ఇది ప్రాచీన ఆంధ్రగ్రంథ పఠనమందు అభిరుచిగల విద్యార్థులకును, ఉపాధ్యాయులకును తోడ్పడుటకు ఉద్దిష్టమైనది. ఇందు హిందువుల దేవతలు, సిద్ధపురుషులు, రాజులు, తీర్థయాత్రాస్థలములు, షడ్దర్శనములు మున్నగువాటిని గురించిన విశేషములు వివరింపబడినవి. పురాణములందలి ప్రధాన పురుషుల వంశవృక్షములుకూడ అనుబంధముగ ఇందు చేర్పబడినవి. ఇందలి విషయము సమగ్రము గాకున్నను ప్రాచీన గ్రంథములను చదువువారికి మిక్కిలి ఉపకరించునదిగా నున్నది. దేవతలు, ఋషులు, రాజులు, కవులు, దేశములు, పట్టణములు, నదులు, గ్రంథములు, మతాచార వ్యావహారిక పదములు మున్నగునవి ఇందు అకారాదిక్రమమున కానవగును. పురాణగాథలను వివరించు గ్రంథములలో ఇది మిక్కిలి ప్రాచీనమయినదనవచ్చును (సం. క్రి.శ. 1879).

**పూర్వగాథాలహరి :** దీనిని శ్రీ వేమూరి శ్రీనివాసరావుగారు రచించిరి. దీని రచన 1917 లో ప్రారంభమయినది. ఇది 1926 నాటికి పూర్తియై ముద్రితమైనది. ప్రారంభమునుండి అంతమువరకును అనన్యసహాయులై, పదునెనిమిది పురాణములందును, రామాయణ భారతాది కావ్యేతిహాసములందును గల కథల సారాంశములను సేకరించి అకారాది క్రమములో ఆయానామములక్రింద వివరించియున్నారు. ఇది మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథము.

**ఆంధ్ర విజ్ఞానము :-** 'దేవిడి' జమీందారైన శ్రీప్రసాద భూపాలుడు దీనిని ఏడు సంపుటములుగా రచించెను. దీనిముద్రణము 1938 లో ప్రారంభమై 1941 లో పూర్తయైనది. విజ్ఞాన సర్వస్వములు సాధారణముగా పలువురు మేధావులచేరచింపబడి, ఒకవ్యక్తిచేత క్రోడీకరింపబడును. కాని ఇది శ్రీ ప్రసాదభూపాలుని ఒక్క చేతిమీదుగానే ఆదినుండి అంతమువరకును వ్రాయబడి సంపుటీకరింపబడినది. ఇట్లు విశ్వతోముఖ విజ్ఞానమయ మగు గ్రంథరాజమును ఒకవ్యక్తి రచించి పూర్తిచేయుట అత్యంత విశిష్ట విషయము. మనకున్న విజ్ఞాన సర్వస్వములలో ఇప్పటికి సంపూర్ణమైనది ఇది యొక్కటియే.

**ఆంధ్రసర్వస్వము :-** దీనికి శ్రీ మాగంటి బాపినీడుగారు సంపాదకులు. ఆంధ్రదేశమునకును, ఆంధ్రులకును సంబంధించిన అన్ని విషయములను అందించుటకు చేసిన ప్రథమప్రయత్నమిది (1943).

**తెలుగు విజ్ఞాన సర్వస్వము :-** 'తెలుగుభాషా సమితి' (మద్రాసు) వారి ఆధ్వర్యవమున ఈ తెలుగు విజ్ఞాన సర్వస్వము రచింపబడుచున్నది. ఇప్పటికి సంపుటములు — (1) చరిత్ర - రాజనీతి 1954; (2) భౌతిక - రసాయనిక శాస్త్రములు (1955) అనునవిప్రకటితములైనవి.

సాధారణముగా విజ్ఞాన సర్వస్వములు అకారాది క్రమములో రచింపబడును. కాని విషయానుక్రమణికను బట్టి విజ్ఞానసర్వస్వ రచన సాగించి, ఒకటితర్వాత ఒకటిగా పంౘ్రెండు సంపుటములలో ఎల్ల గ్రంథమును ఇమిడ్చి ప్రకటించుటకు సమితివారుపూనుకొన్నారు. "ప్రతిసంపుట మందును మొదటి రెండు మూడు వందల పుటలలోను ఆ సంపుటమునకు చెందిన విషయమును ఆమూలాగ్రము సంక్షిప్తముగా తెలియజేసి తక్కిన గ్రంథమందు ఆవిషయ మందలి అంశములను సంప్రదాయ సిద్ధమైన విజ్ఞానసర్వస్వ రచనావిధానమును అనుసరించి, నిఘంటువులోని పద ములవలె అకారాది క్రమమును పొందుపరచి వివరించి నారు. అందుచేత ఒక్కొక్క సంపుటి ఒక్కొక్క పెద్ద విషయమునకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వముగా తయా రగు చున్నది. ఈ విధానమువలన ఎవరి కేవిషయమందు అభిరుచియుండునో, వా రా విషయమునకు సంబంధించిన సంపుటమును చదువుకొనుటకు సౌకర్య మేర్పడు చున్నది.

ప్రపంచదర్శిని :- దీనినే Andhra Directory and year book అందురు. ప్రతిసంవత్సరమును సంవత్సరాదికి నూతన ముద్రణము వెలువడుచున్నది. ప్రఖ్యాత ప్రపంచ విషయములు, ముఖ్యముగా భారతదేశ విషయములు విషయానుక్రమణికలో వివరింపబడుచుండును. ఏ సంవత్స రమున కాసంవత్సరము నూత్న విశేషములిందు చేర్ప బడుచుండును.

ఆంధ్రదర్శిని :- ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము ఆంధ్రదేశమునుగూర్చిన సమగ్ర సమాచారమును ఏర్చి కూర్చి ఆంధ్రప్రజల కందించుట తన కర్తవ్యముగా ఎంచి దీని ప్రచురణమునకు విశాలాంధ్ర ప్రచురణాలయము (బెజవాడ) పూనుకొన్నది. (ఏప్రిలు 1954.)

కే. న. శా.

**ఆంధ్రలిపి పరిణామము** :- 'లిపి' అను పదము నకు తెనుగున వ్రాఁత అని అర్థము. వ్రాయు ధాతువునకు కృదంతరూపమే "వ్రాఁత". వ్రాయు అనుదానికి 'వ్రా' అనునది తొలిరూపము. ఇదివరై అను ద్రవిడధాతువు నుండి పుట్టినది. కావుననే తోడిభాషలగు తమిళమున 'వరై' అనియు, కన్నడమున 'బరె' యనియు, మల యాళమున 'వరె' అనియు, దీనికి రూపములుగలవు. వీటిలో కన్నడమున గల బరె అనునది తెలుగున నేటికిని వ్యవహారమున నున్నది. 'నీ కైదు బర్లు వచ్చినవా ?' అని ప్రశ్నించుట పరిపాటియై యున్నది.

'వరై' అను మూలద్రవిడధాతువు తెలుగున 'వ్రా' అయినది. దానికి రేయి ప్రభృతులవలె బహువచన ప్రత్యయము 'లు' చేర్పగా వ్రాలు అయినది. వ్రాత మూలమున భాషలోనున్న, అక్షరముల స్వరూపము మనకు గోచరమగును. కాబట్టి వ్రాలు అనగా అక్షరములు అను సంజ్ఞ యేర్పడినది.

నేటి తెలుగు భాషలోని అక్షరములన్నియు గుండ్ర దనము గలిగి అన్నియును హెచ్చుతగ్గులులేక నొకేతీరుగా నుండి వ్రాతలో ముచ్చట గూర్చుచుండును. తెలుగు లిపిని చూచుటతోడనే యొకేరకమునకు జెందిన ముత్యము లేకసూత్రమున కూర్చబడినట్లు మనోహరముగా నుండును. తెలుగు వ్రాతను మన పూర్వులొక కళగా పరిగణించిరి. దానిని తీర్చి దిద్దుటకు వారెంతయో పరిశ్రమ చేసిరి. వారి దృష్టిలో మనోహరములైన ఊహలను దాచుటకు తెలుగక్షరములు బంగారపు బరిణెలవంటివి. కావుననే గుండ్రకత్తుగా వాటిని మలచిరి. ఈ అక్షర స్వరూపమునకు తగినట్లే తెలుగుభాషయు మాధుర్య గుణమున మన్నన కెక్కినది. అక్షరముల తీరు, భాష యొక్క తీయదనము అవినాభావసంబంధము గలిగిన వగుటచే తెనుగు తీరు తీయములు గల భాషయైనది. "తీరును తీయముంగలుగు తేట తెనుంగను" వ్రాల పూలతో తెలుగు తల్లిని కవులు పూజించిరి. తీయదనము గలిగియుండుటచే వీనులకు విందు. తీరుదనము గలిగి యుండుటచే కనులకు పండుగ. ఇట్లు శ్రోత్రేంద్రియ, నేత్రేంద్రియములకు ఏకకాలమున నానంద మొదవించునది తెనుగుభాష.

మనోహరమగు తెలుగులిపినిగూర్చి ప్రాచీనకాలము నుండియు కవులు విశేషముగ ప్రశంసించియున్నారు.

ఉ. వ్రా లివిగోఁ గనుంగొనుము

వన్నియమీఱఁగ వ్రాల కేమి నా

వ్రాలు సుధారసాలు కవి

రాజుల కెల్ల మనోహరాలు వ

జ్రాలు సరస్వతీ విమల
చారు కుచాగ్ర సరాలుఁ జూడఁ జి
త్రాలు మిటారి మోహన క
రాలు నుతింపఁ దరంబె యేరికిన్. చాటువు.

సీ. అణిముత్తెముల సోయగము మించినవ్రాలు
వరుసతో నిరుగేల వ్రాయనేర్చె.
జక్కన - విక్రమార్క చరిత్ర
(సిద్దనమంత్రిఁగూర్చి చెప్పినది.)

సీ. అణిముత్తెంబులై యపరంజి మువ్వలై
కనుపట్టు వ్రాల చొక్కపుమెఱుంగు
(మించుపల్లి - తెలుఁగు పొలుపు.)

సీ. పట్టె వ్రతువయును.........
వృద్ధి ప్రియంబును విశదగతియు.
గీ. గీలు కొన వ్రాయనంబులు వ్రాయ వ్రాయఁ
గొంకు కొసరులు చేతప్పు గొనకయుండు
లలిత ముక్తా ఫలాకార విలసనమున॥
పాండు 1.72.

అని రామకృష్ణకవి వేదాద్రిమంత్రి లేఖన నైపుణ్యమును ప్రస్తావించినాడు.

ఇట్టి గుండ్రమైన స్వరూపమును దాల్చిన తెలుగులిపి చరిత్రను పరిశీలించినచో నది తొలుత చతురస్రముగా అనగా నేటి దేవనాగర లిపివలె నలుచదరముగా నుండిన వ్రాతనుండి పరిణామము చెందిన దని తెలియును. కాని ఈ సందర్భమున మొదట 'లిపి' 'వర్ణము' 'అక్షరము' అనువాటి రూప నిష్పత్తులను గూర్చి తెలిసికొనుట అప్రస్తుతము కాదు.

లిపి :- "లిఖితాక్షర సంస్థానే లిపిర్లిఖి రుభేస్త్రియా" అని యమరము. (ద్వి. కాం. క్షత్రవర్గము 16.) దీని తెలుగు వ్యాఖ్యలో నిట్లున్నది :- ఇచ్చట లిఖితం అక్షర సంస్థానం అని విభాగించి ఈ నాలుగుశబ్దములు లిపికే పేళ్ళని కొందరు, లిఖితాక్షర విన్యాసే అనుపాఠమువందు, లిఖితా, లిపిః, లిఖిః - ఈ మూడును వ్రాతపేళ్లు. లిప్యతేఽన యాపత్రం లిపిః. లిఖిశ్చ - ఇ. సీ. లిపి, ఉపదేహే. దీనిచేత పత్రము వ్రాయబడునది గనుక లిపి, పా. లిపీ. లిఖీ. ఈ. సీ. 1. 2. వ్రాయబడిన అక్షరముల యాకారము పేళ్లు (వ్రాఁత).

వర్ణము :- వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ స్తుతౌ వర్ణంతు వాక్షరే.

(త్రి. కా. నా. వ. 49)

వర్ణ్యతే వర్ణయతి చ వర్ణం వర్ణస్తుతౌ; కొనియాడబడునది : 'కొనియాడునది గనుక వర్ణము'.

"వర్ణస్తాల విశేషేస్యాద్ బ్రహ్మచర్యే విశేషణే ; విలేపనే కుథాయాంచ" ఇతి శేషః.

అక్షరము :- "అక్షరంతు మోక్షేఽపి" (త్రి. కా. నా. వ. 4183.) మోక్షమునకును, అపిశబ్దమువలన కకారాది వర్ణములకును పరబ్రహ్మమునకును పేరు. "నక్షర తీత్యక్షరం" క్షర సంచలనే చెడనిది గనుక అక్షరము. "వర్ణే బ్రహ్మణ్యక్షరం స్యాత్." ఇతి శేషః.

పైవాటి వివరణము నీ క్రింద పొందుపరచుచున్నాను : ధ్వని 'క్షరము' నశించునది. లిపి అక్షరము స్థిరముగ నుండునది. ధ్వని అవర్ణము, లిపి వర్ణము. ఇట్లు లిపినిబట్టియే, లిపి వచ్చినతరువాతనే 'అక్షర' 'లిపి' శబ్దములు భాషలోనికి వచ్చినవి. ఇట్లని మొదట లిపిసూచకములు తరువాత సాహచర్యముచే ధ్వనిసూచకములు కూడనయ్యెను మొదట అవర్ణమనగా అకారపువన్నె (రంగుతో వ్రాయబడిన ప్రతిమ) యని యర్థము. తరువాత నది అకార ధ్వనిని కూడ సూచింపదొడగెను. వర్ణపదము సంస్కృత భాషయందు 'రంగు' అను నర్థముగలది. అది క్రమముగా జాతివాచకము, అక్షరవాచకము నయ్యెను. కొందరు ఎఱ్ఱగను, కొందరు నల్లగను ఉండగా వారిని వేరువేరు జాతులుగా నేర్పరచినందున 'వర్ణ' పదమునకు జాత్యర్థము సంప్రాప్తమయ్యెను. అక్షరములు నల్లరంగుతో వ్రాయుట వలన వానికి వర్ణనామము వచ్చెను. లిపివాచకమైన వర్ణపదమునకు వేరు వ్యుత్పత్తిలేదు. మొదట వ్రాసెడు వాటికి వర్ణములనియు, చెక్కెడువాటికి అక్షరములనియు పేర్లు ఏర్పడియుండును. క్రమముగా నవి సమానార్థకములై లిపితోపాటు ధ్వనినిగూడ బోధింపదొడగెను. లిపి పుట్టుటకు పూర్వము భాషయందు ధ్వని సూచకవర్ణము లెట్లు వ్యవహృతము లగుచుండె ననిన, స్వరములు అన్న పద మీయర్థమున వాడబడుచుండె ననుట సమంజసము. తరువాతికాలమున నీ పదము అచ్ పర్యాయమైనది. కాని సంగీతశాస్త్రమున స్వరము అను పదము కేవలము

ధ్వని పరముగనే యుపయుక్తమగుచున్నది. దీనినిబట్టి వర్ణాక్షర శబ్దములు ఏనాడు భాషలోనికి వచ్చినవో ఆ నాటికి కొంతకాలమునకు పూర్వముననే ఆ భాష గల దేశమునందు లిపి యుండియుండు ననుట స్పష్టము.

లిపిచరిత్రనుబట్టి చూడగా మనదేశములో స్థూలముగా రెండువిధములగులిపులు వెలసినవని చెప్పవచ్చును. ఒకటి- ఖరోష్ఠి లిపి. ఇది కుడివైపునుండి యెడమవైపునకు వ్రాయబడును. రెండవది- బ్రాహ్మి లిపి. ఇదియెడమవైపునుండి కుడివైపునకు వ్రాయబడును. ఈ రెండింటిలో బ్రాహ్మిలిపియే మనదేశమున బాగుగా వ్యాపించి ప్రచారములోనికి వచ్చినది. మనదేశమున ప్రప్రథమమున లభ్యమయిన శిలాశాసనములు అశోకుని కాలమునాటివి. అంతకుపూర్వమే బ్రాహ్మి లిపియందు కొన్ని పరిణామదశలు సంభవించియుండును. వాటి చరిత్ర పూర్తిగా తెలిసికొనుటకు సాధన సామగ్రి లభింపలేదు. నేడతి ప్రాచీనములగు మొహంజెదారో, హరప్పా మొదలగు స్థలములలో దొరకిన శిలాఫలకములందలి లిపి బ్రాహ్మి లిపియొక్క పూర్వస్వరూపమును కొంతవరకు తెలియజేయుచున్న దని యూహించుట కవకాశ మున్నది. అయితే, ఇది ఔత్తరాహిక భాషలకు సంబంధించినది.

మన తెలుగుభాష దాక్షిణాత్య భాషావర్గమునకు సంబంధించినది. కాని ఈ భాగమునుకూడ తొట్టతొలుతగా లిపిబద్ధము చేయబడిన శాసనములలో అశోకుని శాసనములే ప్రాచీనతమములు. తర్వాత వెలసిన భిన్నభిన్న ప్రాంతములలోని శాసనములందలి లిపిని పరిశీలించిచూడగా, దాక్షిణాత్యలిపులకు కూడ మాతృక అశోకుని శాసన లిపియే యని వ్యక్తమగును. దీనినే మౌర్యలిపి అనికూడ నందురు. ఈ లిపుల పరిణామము ఈ క్రింద చూపబడినది :

## దాక్షిణాత్య లిపులు




దాక్షిణాత్యలిపులకు అశోకలిపియే మూలాధారమనియు నిది బ్రాహ్మిలిపినుండి పుట్టినదనియు ముందు చెప్పియుంటిని. ప్రాచీన శాస్త్రములలోని కొన్ని పదములనుబట్టి తెలుగుభాషలో క్రీ.శ. 350 నాటికి లిపి యేర్పడినదని చెప్పవచ్చును. దీనిని వేంగీలిపి అని అందురు. ఆలిపి క్రీ. శ. 900 నాటికి పూర్వ చాళుక్యలిపిగా పరిణమించినది. క్రీ. శ. 1000 ప్రాంతమున గల లిపిని సంధికాలపు లిపి అని యనవచ్చును. ఆ వెనుక క్రీ. శ. 1300 ప్రాంతమునాటికి ప్రాత తెలుగులిపి యేర్పడినది. అప్పటినుండి నేటివరకు తెలుగులిపిలో మార్పు కలుగలేదు.

మన వాఙ్మయచరిత్రనుబట్టి చూచినచో రేనాటి చోళుల శాసనములు వేంగి లిపిలోను, అద్దంకి, ధర్మవరము శాసనములు పూర్వ చాళుక్యలిపిలోను, నన్నయకాలపు శాసనములు సంధి లిపిలోను కానవచ్చుచున్నవి. తిక్కన కాలమునాడు పూర్ణపరిణతినందిన తెలుగులిపి కానవచ్చుచున్నది. తిక్కన కాలము మహాభారత రచనచే వాఙ్మయ

పరిణామ దృష్టిలో మహత్తరమైనది. లిపి పరిణామదృష్టిని గూడ నిదియొక చరిత్రాత్మక ఘట్టము. సలయన, ఇంత వరకు తెలుగు కన్నడముల కొకేలిపి యుండెడిది. అనగా నన్నయభట్టు ఉపయోగించిన లిపియందేకన్నడకవిత్రయపు వారి రచనలును వ్రాయబడినవి. తిక్కన కాలమున తెలుగు లిపి ప్రత్యేక స్వరూపముదాల్చి కన్నడమునుండి వేరుపడి నది. కొంత కాలము తెలుగు కన్నడముల కొకేలిపి యుండిన కారణముననే నేటికికూడ కొన్ని తెలుగు తాళపత్ర ప్రతులు కన్నడలిపిలో కానవచ్చుచున్నవి. తిక్కన కాలమునాటి పాతతెలుగులిపి శ్రీనాథుని కాలమునాటికి వ్రాత పరికరముల కారణమున సర్వాంగ సుందరమై ముత్యాలచాలువలె ముచ్చటగూర్ప సాగినది.

తెలుగులిపి తొలుత నలుచదరముగ నుండెడిదనియు, ఆవెనుక గుండ్రదనముకలిగి లిపిగా పరిణామము పొందిన దనియు, ముందు చెప్పబడినది. దీనికి కారణము మన వ్రాతసాధనములే యని చెప్పవచ్చును. మొదట మన వ్రాతసాధనము - శిల - లేక రాయి. వీటిపైని చెక్కబడిన వ్రాతలకే "శిలాశాసనములు" అని పేరు. ఇది శిలా యుగము లేకరాతియుగముయొక్క చిహ్నము. అపైని రాగిరేకులు ప్రచారములోనికివచ్చి వ్రాతసాధనములైనవి. ఇది లోహయుగము లేక ఇనుపయుగ చిహ్నము అని చెప్ప వచ్చును. రాగిరేకులు ప్రచారములోనున్న కాలముననే తాటియాకు ప్రధానమయిన వ్రాతసాధనముగా పరిణ మించినది. అప్పుడే చతురస్రముగా నుండెడు మన లిపి గుండ్రదనము దాల్చుచు వచ్చినది.

శిలలపైని, రాగిరేకులపైని ఉలితో అక్షరములు చెక్కెడివారు. చతురస్రముగనుండు లిపిని అట్లు ఉలితో చెక్కుట సులభము - చతురస్రముగ నుండు లిపిలో అక్షర ములకు తలకట్లు అడ్డుగీతవలె అనగా "—" నిట్టి యాకారముతో నుండును. తాటియాకు ప్రచారము లోనికి రాగానే దానికి ఉలివలె చివరభాగముననుండి కొంచెము పొడుగుగానుండు మరియొక వ్రాతసాధనము కావలసివచ్చెను. దానినే గంటము అందురు. గంటముతో తాటియాకుమీద వ్రాయునప్పుడు తలకట్లు గీతవలె వ్రాసినచో తాటియాకు చినిగిపోవును. కాబట్టి యవి గుండ్రముగా వ్రాయవలసిన యావశ్యకత యేర్పడినది. దానినిబట్టి అక్షరములకును గుండ్రదన మేర్పడినది.

మన లిపిచరిత్రను పరిశీలించినచో క్రీ. శ. 1000-1050 ప్రాంతము అనగా నన్నయభట్టారకుని కాలమునుండి ఈ గుండ్రదనము ప్రారంభమైన ట్లాతని నందమపూడి శాసనము తెలుపుచున్నది.

తిక్కన కాలమునాటికి మన తెలుగులిపి గుండ్రదనము చేత నొక విశిష్టత సంపాదించినది. దాక్షిణాత్యలిపులలో తెలుగునకు గల యీ విశేషమును, తిక్కనకాలమునాటి కవియగు మంచన కేయూరబాహు చరిత్రమున నిట్లు వ్యక్తముచేసి యున్నాడు.

కృతపతియగు గుండనామాత్యుడు "వాచకత్వము లేఖ నోచితంబును నంధ్రలిపిరీతిగా సర్వ లిపులయందు, ఫణితి భాతియుఁ దీవ్రభంగియు" వ్రాయగలిగినవాడట (1-18).

శ్రీనాథుని కాలమునాటికి తెలుగులిపి, యొకకళగా పరిగణితమైనది. కుడియెడమల రెండు చేతులతోడను వ్రాయగల వ్రాయసకాండ్రు ఉండెడివారు. జక్కన విక్రమార్క చరిత్రలో

"ఆత్మీయ లిపియట్లు లన్యదేశంబుల
లిపులను జదువంగ నిపుణుఁడయ్యె" (1-50)

శా. శ్రీ కర్ణాట మహామహీశ్వర
సదాసేవా ప్రధానోత్తమా
నీ కస్తుత్యలిపి క్రియానిపుణ పాణి
ద్వంద్వ పంకేరుహా. (3-137)

అని లిపినిగూర్చి తెలిపినాడు.

శ్రీకృష్ణరాయని యుగమున - లిపి పరిణతి చెందినది. పాండురంగమాహాత్మ్యమున రామకృష్ణకవి—

"పట్టెవట్రువయును పరిపుష్టి తలకట్టు
గుడిసున్న కియ్యయు సుడియు ముడియు
నైత్వంబు నేత్వంబు నందంబు మందంబు
గిలుకయు బంతులు నిలుపు పొలుపు
నయము నిస్సందేహతయు నొప్పు మురువును
దిద్దిచ్చి వేసినయట్లు తనరుటయును
షడ్వర్గశుద్ధియు జాతియోగ్యతయును
వృద్ధిప్రియంబును విశదగతియు—"

గలిగి తెలుగులిపి కళాసంపన్నమైనది.



పండరంగని అద్దంకిశాసనము క్రీ. శ. 849





కందుకూరి శాసనములు క్రీ. శ. 850 ప్రాంతము



చాలుక్యరాజరాజు నందంపూడి శాసనము. శ. స. 966. క్రీ. శ. 1053



చేబ్రోలు శాసనములోని భాగము క్రీ. శ. 1145



శ్రీనాథునికాలమునాటి లిపి

ఆంధ్రలిపి వికాసము

| నేటి తెలుగు లిపి | మౌర్యలిపి లేక అశోకశాసన లిపి. | రేనాటి చోళులు - వేంగి చాళుక్య లిపి. | అద్దంకి బెజవాడ శాసనములు పూర్వచాళుక్య లిపి. | నన్నయ నందంపూడి శాసనము - సంధికాలపు లిపి | తిక్కన ప్రాత తెలుగు లిపి. |
|---|---|---|---|---|---|
| అ | 𑀅 | అ | అ | అ | అ |
| ఆ | 𑀆 | ఆ | ఆ | ఆ | ఆ |
| ఇ | 𑀇 | | ఇ | | ఇ |
| ఈ | 𑀈 | | ఈ | ఈ | ఈ |
| ఉ | 𑀉 | | ఉ | ఉ | ఉ |
| ఊ | | | | | |
| ఋ | | | | | |
| ౠ | | | | | |
| ఌ | | | | | |
| ౡ | | | | | |
| ఎ | | ఎ | ఎ | | |
| ఏ | 𑀏 | | | | |
| ఐ | | | | | |
| ఒ | 𑀑 | | | | |
| ఓ | | | | | |
| ఔ | | | | | |

| నేటి తెలుగు లిపి | మౌర్యలిపి లేక అశోకశాసన లిపి | రేనాటి చోళులు - వేంగి చాళుక్య లిపి | అద్దంకి బెజవాడ శాసనములు పూర్వచాళుక్య లిపి | నన్నయనందంపూడి శాసనము - సంధికాలపు లిపి | తిక్కన ప్రాత తెలుగు లిపి |
|---|---|---|---|---|---|
| 3 = క | 𑀓 | క | క | క | క |
| ఖ | 𑀔 | ఖ | ఖ | ఖ | ఖ |
| గ | 𑀕 | గ | గ | గ | గ |
| ఘ | 𑀖 | ఘ | ఘ | ఘ | ఘ |
| ఙ | 𑀗 | ఙ | | | |
| చ | 𑀘 | చ | చ | చ | చ |
| ౘ | | | | | |
| ఛ | 𑀙 | ఛ | | ఛ | ఛ |
| జ | 𑀚 | జ | జ | జ | జ |
| ౙ | | | | | |
| ఝ | 𑀛 | | | | |
| ఞ | 𑀜 | ఞ | ఞ | ఞ | ఞ |
| ట | 𑀝 | ట | ట | ట | ట |
| ఠ | 𑀞 | ఠ | | | |
| డ | 𑀟 | డ | డ | డ | డ |
| ఢ | 𑀠 | | | | |

| నేటి తెలుగు లిపి | మౌర్య లిపి లేక అశోక శాసన లిపి | రేనాటి చోళులు - వేంగి చాళుక్య లిపి | అద్దంకి బెజవాడ శాసనములు పూర్వచాళుక్య లిపి | వన్నయ నందంపూడి శాసనము- సంధి కాలపు లిపి | తిక్కన ప్రాత తెలుగు లిపి |
|---|---|---|---|---|---|
| ఠ | | | | | |
| త | | | | | |
| థ | | | | | |
| ద | | | | | |
| ధ | | | | | |
| న | | | | | |
| ప | | | | | |
| ఫ | | | | | |
| బ | | | | | |
| భ | | | | | |
| మ | | | | | |
| య | | | | | |
| ర | | | | | |
| ఱ | | | | | |
| ల | | | | | |
| ళ | | | | | |

| నేటి తెలుగు లిపి | మౌర్యలిపి లేక అశోక శాసన లిపి. | రేనాటి చోళులు - వేంగి చాళుక్య లిపి | అద్దంకి బెజవాడ శాసనములు పూర్వచాళుక్య లిపి. | నన్నయ నందంపూడి శాసనము-సంధి కాలపు లిపి | తిక్కన ప్రాత తెలుగు లిపి |
|---|---|---|---|---|---|
| వ | [illegible] | [illegible] | [illegible] | [illegible] | వ |
| శ | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| ష | [illegible] | | [illegible] | [illegible] | ష |
| స | [illegible] | [illegible] | [illegible] | స | స |
| హ | [illegible] | [illegible] | [illegible] | [illegible] | హ |

అచ్చులు

ప్రాచీనలిపి వివరణము : (అక్షరవిన్యాసము పటమును చూడుడు.)

అ ఆ :- అకారచిహ్నము తలకట్టు. మొదట తలకట్టు గీత యిప్పటికంటె వెడలుపుగను హ్రస్వముగను ఉండెను. అక్షరముల తలకు కట్టబడినవి లేక తగిలింపబడినవి కావున వాటికి "తలకట్టు" అని పేరువచ్చినది. ఈతలకట్టు కుడి వైపునకు పొడిగించి, కొన క్రిందికి వంచివేసినయెడల అది అకారచిహ్నమగును. నేటి లిపిలో ఈ వంపు సున్నగా మారినది. దీనికి తలకట్టు తిరిగి తగిలించిన 'ఆ' కార మైనది.

ఇ :- హల్లులమీద వచ్చు ఇకారమునకు 'గుడి' అని పేరు. ఈపేరున కనుగుణముగా ప్రాచీనలిపిలో ఇకార చిహ్నము కేవల చక్రాకారముగ నుండును. పూర్వమిది యక్షరమునకు తగిలించినట్లు స్పష్టముగా నుండెడిది. నేడిది యక్షరములలో కలిసిపోయినది.

ఈ :- ఇ చిహ్నమునకు నెడమవైపున నారంభించి గుడిచుట్టు నపుడు కొనల రెండింటిని గలుపవలసి వచ్చి నపుడు, అట్లు కలపక మీదికొన కొంచెము లోపలకు వంచినయెడల నది 'ఈ' కారమగును. దీనికి "గుడిదీర్ఘము" అనిపేరు. ప్రాచీనలిపిలో 'ఇ' వలె నిదియు గుడి యాకారముగా నుండెను. ఆ వెనుక 'అ' కార చిహ్నమగు గురుతును నీవలావల చేర్చిరి. అది క్రమముగా గుడి మధ్యనుండి వ్రాయు నలవా టేర్పడెను.

ఉ :- ఉకారచిహ్నమునకు తెలుగులో "కొమ్ము" అని పేరు. పూర్వలిపిలో ఉకారచిహ్నము ఆవుకొమ్మును పోలియుండును. ఇప్పటి లిపిలో కొమ్ములో కుడివైపు గీటు పొడవుగాను, ఎడమవైపు గీటు పొట్టిగాను ఉండును.

ఊ :- 'ఉ' అక్షరమునకు, ఆకారచిహ్నపు గురుతు కలుగుటచేత "ఊ" ఏర్పడినది. హ్రస్వరేఖలకు వంపులు పెట్టినచో, ప్రాచీనలిపిలో, దీర్ఘములుగా పరిగణితము లగుచుండెడివి.

ఎ, ఏ; ఒ, ఓ :- పూర్వ లిపిలో నీ రెండింటికి హ్రస్వ దీర్ఘములలో భేదములేదు. సంస్కృత భాషలో నీరెండింటికి దీర్ఘోచ్చారణమేగాని హ్రస్వోచ్చారణములేదు. దీర్ఘముగా వ్రాసినను, ఉచ్చారణలో తెలుగువారు సందర్భము ననుసరించి హ్రస్వముగా పలికెడివారు. సంస్కృత భాషా వ్యాప్తి హెచ్చిన వెనుక, ఏ కారములోని కొమ్మును (దీర్ఘ చిహ్నము) తొలగించి హ్రస్వ 'ఎ' కారమును 'ఓ' కారములోని కొమ్మును తొలగించి హ్రస్వ'ఒ'కారము నేర్పరచిరి. ఈ హ్రస్వ 'ఒ' కార చిహ్నమగు '^' అను నది తరువాత హల్లులకు తగిలింపబడినది. కొ, చొ, మొదలైనవి.

ఐ :- ప్రాచీన లిపిలో దీనికి గుర్తులేదు. ఇది వ్రాయ వలసి వచ్చినపుడు 'అయ్, అయి' అని వ్రాసెడివారు. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనములోని 'ఒయ్యారల' అని యీ యక్షర స్వరూపము గలదు. అప్పకవి దీనిని చెప్పియున్నాడు.

ఋ, ఋా; ఌ, ౡ :- ఇవి తెలుగున లేవు. ఇవి అచ్చులు గావున ఎల్లప్పుడు హల్సంయోగముతో వ్రాయబడు చుండెడివి.

నృ - తృ - క్ష :- ఋకారమునకు 'ృ' ఇట్టి చిహ్నము ఉండుటచే దీనికి వట్రువసుడి యని పేరువచ్చినది. రెండవ దానికి ప్రచారము లేకపోవుటచే, ప్రత్యేకచిహ్న మేర్పడ లేదు.

హల్లులు

క :- తలకట్టు మొదటినుండి కలది.

ఖ :- తలకట్టు లేదు..దీని చివరవంపు నేడు కొంచెము క్రిందికి వ్రాయబడుచున్నది.

గ :- తలకట్టులేదు. తరువాత నేర్పడినది.

ఘ:- తలకట్టులేదు. ఒత్తక్షరపు గురుతులేదు.

ఙ :- ఇది గ్రంథాక్షరలిపి. మొదట ఙ ఒకటే గీత- అది పూర్వాక్షరములోని మొదటి వంపు క్రమముగా రెండవ వంపునకు మరియొక గీత చేర్చబడినది. అప్పుడు 'ఙ' అయినది.

చ:- తలకట్టు మొదటినుండి కలది.

ఛ :- తలకట్టు మొదటినుండి కలది. ఒత్తక్షరపు గురుతు లేదు.

జ :- తలకట్టులేదు.

ఝ:- తలకట్టులేదు.

ట :- మొదట తలకట్టులేదు.

ఠ :- మొదట తలకట్టులేదు.

డ :- మొదట తలకట్టులేదు.

ఢ :- మొదట తలకట్టులేదు. తలకట్టు, ఒత్తు తరువాత నేర్పడినవి.

ణ :- మొదట తలకట్టులేదు.

త :- తలకట్టు మొదటినుండి యున్నది.

థ :- తలకట్టులేదు.

ద :- తలకట్టు మొదటినుండి యున్నది.

ధ :- తలకట్టులేదు.

న ;- తలకట్టు మొదటినుండి యున్నది.

ప :- తలకట్టు మొదటలేదు.

ఫ :- తలకట్టు మొదటలేదు. ఒత్తులేదు. తరువాత ఏర్పడినది.

బ :- తలకట్టు మొదటినుండిలేదు.

భ :- తలకట్టు మొదటినుండి కలది.

మ:- తలకట్టు మొదటినుండి కలది.

య:- తలకట్టు మొదటలేదు.

ర :- తలకట్టు మొదటినుండి కలది.

ల :- తలకట్టులేదు.

వ :- తలకట్టు మొదటినుండి కలది.

శ :- తలకట్టు మొదటలేదు. కన్నడ సంప్రదాయము నుండి వచ్చినది.

ష :- తలకట్టు మొదటినుండి కలది.

స :- తలకట్టు మొదటినుండి కలది.

హ:- తలకట్టు మొదటినుండి కలది.

ఱ :- తలకట్టులేదు. ఇది మొదట 'ఆ' అను నక్షరము వలె నుండెడిది. క్రమక్రమముగా మీది రెండు గుడులును పెద్దవిగామారి వానిమధ్య అడ్డగీత గల ఆచిహ్నము వ్రాయబడుటచేత ప్రస్తుత రూపము దాల్చినది. మొదటి రెండుగుడులును బండిచక్రములమాదిరిని 'ఱ' యుండుటచేత దీనికి "శకటరేఫము" అను పేరు గలిగినది.

పైదానిని బట్టి తలకట్టునకు గల ప్రాధాన్యము గ్రహింపవచ్చును. శరీరమునకు తలప్రధానము. "సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్" అని సూక్తి. అక్షరశరీరమున కును తలకట్టు అట్టిదియే.

1. కొన్ని లిపిసంప్రదాయములు :- ఌ—అనునొక వింత యక్షరము యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనమున మూడుచోట్ల నున్నది. అది బండిఱాలో కొమ్ములు కలప కుండ అడ్డుగీత రెండింటికి తగులునట్లు లేకుండనున్న 'ఱ' అను ణాకారముతోనున్నది. 'ఱ' స్సి (14 వ పంక్తి) అఱిపిన (21 వ పంక్తి) అఱపుట (35 వ పంక్తి). దీనిని డకారముగానే మనము పలుకవలయును. ఈ శాస నమునందే 28 చోట్ల 'డ' కారము వచ్చినది. కాని పై

మూడుచోట్ల నున్నవానికంటె విలక్షణముగ నున్నది. కాబట్టి యిది 'డ' కారముకన్న వేరనియు నితరద్రావిడ భాషలనుండి వచ్చినదనియు గ్రహింపదగును.

తమిళమున అఱ్ ధాతువునకు నాశనము చేయుట, పాడుచేయుట, ధ్వంసముచేయుట అను నర్థములు కలవు. తెలుగున వెంపఱి మొదలగువానిలో నీయఱ నిలిచియే యున్నది. కాని ప్రాచీన కాలమున, నీ అఱ్ ధాతువు కన్నడభాషలో అళిగా మాఱినది. దాని ననుసరించి తెలుగున 'అడి' అయినది. అందుచేతనే తెలుగులిపిలో, సహజవర్ణమగు 'డ' కారమునకు, ఇతర భాషాపరిణామ మూలమున వచ్చిన యీ 'ఱ' కారమునకు లిపిభేదము కలిగినది. రేనాటి చోళుల ప్రాచీనశాసనములో చోఱ - చోడ - ఏఱు - ఏడు - అని యీ యక్షరము గుపడుచున్నది.

నన్నయ ఈ యక్షరమును వాడుకచేయలేదు.

అడ్డిచిన - బోడిచిన - చెడు - వె ప్పుడు. అని తెను గున గల సహజ 'డ' కారముతో ప్రాసలో వ్రాసి యున్నాడు. (భార. ఆది. 1. 138)

నన్నయతరువాత శాసనములలో నీయక్షరము లేదు.

ఈ యక్షరమునకును, ఈ రూపముతో నుండు ఇత రాక్షరములకు గల భేదమును ఈక్రింద చూపుచున్నాను.

| శకటరేఫము | వింతయక్షరము | డకారము |
|---|---|---|
| [illegible] | [illegible] | ఓ |
| ,, | [illegible] | ,, |
| [illegible] | [illegible] | ,, |
| [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | ఓ |

2. వలపలిగిలక :- "ప్రాచీనలేఖనమున బ్రాహ్మీలిపిలో J అను రీతిగను నంతకంతకు ꟻ అను రీతిగను రేఫ ముండెడిది. అది ఇతర వర్ణముతో కలిసినపుడు, వర్ణ ముల మీద నిల్చుటలో కాలక్రమమున J, S, ౕ అను రీతిని పరిణమించినది. రేఫముమీద తలకట్టుపోయిన "ౕ" అను నాకారము గిలకవలె నుండుటచే దానికి గిలక యను పేరువచ్చెను. ఉ: [illegible] దమ్మ్రు (యుద్ధమల్లుని బెజవాడ శాసనపు తుది పంక్తి.) నాగరలిపిలో నేటికిని నిట్లే గిలకయున్నది. [illegible] ఇట్టి తలమీది గిలక తలమీది యనునాసికలిపి యనుస్వారరూపమున వలపలికి దిగినట్లే కాలక్రమమున వర్ణము వలపలికి దిగి 'ౕ' అను రూపము లోనికి పరిణామము చెందినది. ఈసందర్భమున నింకొక విషయము చెప్పవలసియున్నది.

అనుస్వారము ప్రాచీనకాలమున ద్వివిధముగా వ్రాయ బడెడిదిగాన, నది ద్వివిధముగా వలపలికిని, దాపలికిని దిగుట సంభవించెను. గిలకయన్నట్లో వలపలికే దిగినది. అర్క=అక్కర. అను నాసికాక్షరములకు బదులుగా పరాక్షరము తలపై వ్రాయబడెడి యనుస్వారము దాపలికి దిగుచు వచ్చెను. (రాముణ్డు=రాముడు - రాముండు) తక్కినచోటులందలి తలమీది యనుస్వారము వలపలికి దిగుచు వచ్చెను. ఉ: వశము=వంశము. రేఫము వలపలి కే దిగుటచేతనే దానికి 'వలపలిగిలక' యను పేరు వచ్చెను." (వైయాకరణ పారిజాతము. పుట 277)

ప్రాచీనులగు నన్నయాది మహాకవులును, నన్నెచోడ, పాల్కురికి సోమనాథాది శివకవులును నీ వలపలిగిలక సంప్రదాయమును చక్కగా పాటించినారు. రేఫ సంయుక్తాక్షరము లన్నియు, వలపలిగిలక సంప్రదాయ ముచే తొలుత ద్విత్వాక్షరములుగా వ్రాసి ఆవెనుక రేఫోచ్చారణ చిహ్నమగు వలపలిగిలక వ్రాయుదురు. ఉచ్చారణములో మనకు రేఫధ్వని వినబడుచున్నను వ్రాతలో రేఫకన్నా ద్విత్వాక్షర ధ్వనికే ప్రాధాన్యము.

ధర్మము - అని యిట్లు వ్రాసిన రకారధ్వని మనకు స్పష్టముగ తెలియును. కాని ధమ్మ్రము-అని వలపలిగిలక వ్రాసిన మకారమునకే ప్రాధాన్యము.

ఇచట ముఖ్యముగ మనము పరిశీలింపవలసినదేమనగా, పై వ్రాతలు, ప్రాసవిషయమున సరిపోవచ్చునుగాని యతి విషయమున సరిపోవు. వలపలిగిలక సంప్రదాయము ననుసరించిన రేఫకు యతియెట్లు పొసగును ?

ఈక్రింది యుదాహరణమువలన పై విషయము స్పష్ట మగును.

శ్రీ వాణీంద్రామరేంద్రార్చిత (ద్రార్చిత) - అనిన యతిసరిపోవును. (శ్రీ...చి) గాని శ్రీ వాణీంద్రామరేంద్రార్చిత యని నవీనరీతిగా పాఠనిర్ణయదృష్టితో ముద్రించిన యతి యెట్లును సరిపోవదు. చూడుడు. పూర్వరీతిగా వ్రాసిన పైముద్రిత పాఠము. శ్రీవాణీంద్రామరేంద్రార్చిత అని వలపలిగిలక సంప్రదాయముతో వ్రాయవలసినరీతిగా వ్రాసినచో యతి తప్పుచున్నది.

తెలుగు భాషలో యతి ప్రాసలకును, లిపి పరిణామ క్రమమునకును సన్నిహిత సంబంధము కలదని నిరూపించుటకు పై వలపలిగిలక సంప్రదాయ మొక్కటియే చాలును. ఈ నియమము తిక్కన కాలమునాటినుండి సడలినది.

3. ఁ - అర్ధానుస్వారము లేక అరసున్న :- ప్రాచీన లిపిలో అరసున్న లేదు. మొదట వర్గపంచమాక్షరములు, ఆ వెనుక బిందువులును వ్రాయబడుచుండెడివి. వర్గపంచమాక్షరములలో బిందువే తెలుగులో నియతముగా నిలుచునని యాంధ్ర లాక్షణిక సంప్రదాయము. కేతన మొదలగు ప్రాచీన వైయాకరణులు, పూర్ణబిందువులే లిఖింపబడుననియు, నవి యూది పలుకుట, తేలి పలుకుట యను నుచ్చారణ సంప్రదాయముచే రెండువిధములైనదనియు తెలిపిరి. తాళపత్రములమీది వ్రాతయందును ఇది కానరాదు. మొట్టమొదట అచ్చుపడ్డ పుస్తకముల లోను ఇది కానరాదు. ప్రాచీన గ్రంథములు నవీనరీతిని ముద్రించుకాలమున క్రీ. శ. 1840 ప్రాంతమునుండి అరసున్న సంజ్ఞ ఏర్పడి క్రీ. శ. 1858 నుండి బాల వ్యాకరణము మూలమున నేటి వ్రాతలో స్థిరత్వము సంపాదించినది. ఇది గ్రాంథిక భాషలో నియతముగా పాటింపబడుచున్నను వ్యావహారిక భాషలో పాటింపబడుటలేదు.

4. ఋ, ౠ, ఌ, ౡ :- ఇవి రు, రి యని యిరుతెరగుల వ్రాతలలో నుండెడివి. ప్రాచీన కాలమునుండి నేటి కాలమువరకు కవులు, యతిస్థానమున, 'ఋ' కు 'రు' తోడను 'రి' తోడను యతులు వాడిరి. కొందరు లాక్షణికులు మొదటిదాని నంగీకరింపలేదు. దేశి సంప్రదాయము ననుసరించి రెండును సరియైనవియే. దీనిని గూర్చి, అప్పకవీయ పంచమ ముద్రణ పీఠికయందును భాషా పరిశోధన ప్రయోగవిశేషములు అను గ్రంథమునను విపులముగా చర్చింపబడియున్నది.

ని. వేం.

**ఆంధ్ర వాఙ్మయ చరిత్రము - I (క్రీ. శ. 1503 వరకు)** :- ఋగ్వేదమునందును రామాయణ భారతము లందును ఆంధ్రుల ప్రశంస కనవచ్చుచున్నది. మౌర్య చంద్రగుప్తుని కొలువునకు గ్రీకు రాయబారిగా వచ్చిన మెగస్తనీసు ఇండికాలో ఆంధ్రుల బలప్రాభవములను గూర్చి వ్రాసి యుండెను. క్రీస్తు శకమునకు ముందు వెనుకల సుమారు నాలుగున్నర శతాబ్దుల కాలము ఆంధ్ర రాజులు శాతవాహను లను పేరుతో పెద్ద సామ్రాజ్యమును పాలించి యుండిరి. ఈ విధముగా అతి ప్రాచీన కాలమునుండియు ఆంధ్రజాతి ఉండినట్లు తెలియుచున్నను, ఆంధ్ర భాషయని తరువాత ప్రసిద్ధి వడసిన తెలుగు, మాతృకయైన మూల ద్రావిడమునుండి యెప్పుడు విడివడి ప్రత్యేక రూపమున పరిణామ మొందుటకు మొదలిడెనో చెప్పుటకు వీలుగాకున్నది. శాతవాహను లాంధ్రులైనను తమ శాసనము లందు ప్రాకృతభాషనే వాడియుండిరి. వారి తరువాత ఆంధ్రదేశమును పాలించిన ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, ఆనంద గోత్రికులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, మున్నగువారి శాసనములలోకూడ ప్రాకృతమో, సంస్కృతమో వాడబడియుండెను. కాని యందలి వేపూరు, విరిపఱ, పెణుకపఱ్ఱు, తెమ్దులూరు, తాన్తికొన్త, చెన్నేరువు, కంబుగాఞ్చేరువు, కడాకుదురు, మున్నగు గ్రామములు కొన్ని తెలుగుపేర్లుగా కానవచ్చుటయు, శాతవాహన రాజులలో నొకడైన హాలుడు కూర్చిన గాథాసప్తశతిలోని గాథలలో ప్రాకృతపదములనడుమ నక్కడక్కడ పొట్ట, పిల్ల, అత్త, కరణి, పంది మున్నగు తెలుగు శబ్దములు దొర్లియుండుటయు, అమరావతీ స్తూపమునందలి ఒక రాతిపలకపై నాగబు అను తెలుగు ప్రత్యయముతో కూడినమాట గోచరించుటయు చూడ క్రీస్తు శకారంభమునుండియు తెలుగుభాష దేశమున వ్యవహారములో నుండెనని వ్యక్తమగుచున్నది. చాళుక్య రాజులకు, ముందుండిన తెలుగు భాషాపరిస్థితినిగూర్చి యింతకంటె నేమియు చెప్పజాలము.

రేనాటి చోళులును, తూర్పు చాళుక్యులును పరిపాలనము నెరపుకాలమున మొదటిసారి శాసనములు తెలుగు భాషలో వ్రాయబడినవి. క్రీ. శ. 7, 8 శతాబ్దులందలి తూర్పు చాళుక్యుల శాసనములలో ప్రాకృత భాషా సంపర్కము కొంత అధికముగా కానవచ్చును. తరువాత క్రమముగా ఆప్రాకృతపదముల స్థానమును సంస్కృత సమాసము లాక్రమించినవి. క్రీ. శ. 848 లో తూర్పు చాళుక్యరాజైన గుణగ విజయాదిత్యుడు వేయించిన అద్దంకి శాసనములో ఒక తరువోజయు, పిమ్మట కొంత వచనమును వ్రాయబడినవి. కొంచెమించుమించుగా ఆకాలముననే చెందిన కందుకూరు ధర్మవర శాసనములలో సీసపద్యములు కనబడుచున్నవి. తరువాత క్రీ. శ. 934 నాటి యుద్ధమల్లుని బెజవాడ శాసనములో ఐదు మధ్యాక్కరా పద్యములు చూపట్టుచున్నవి. క్రీ. శ. 1000 ప్రాంతము నాటిదని తలంపబడు విరియాలకామసాని గూడూరు శాసనములో మూడు చంపకమాలలును, రెండుత్పలమాలలును వ్రాయబడినవి. నన్నెచోడుడు కుమారసంభవములో వ్రాసిన

మునుమార్గ కవితలోకం
బున వెలయఁగ దేశికవిత పుట్టించి తెనుం
గును నిల్పి రంధ్రవిషయం
బునఁజన జాళుక్యరాజు మొదలగు పలువుర్.

అను పద్యమంతకు పూర్వమే తెలుగున కవిత్వముండెనను విషయమును వ్యక్తము చేయుచున్నది. ఇరుగు పొరుగు దేశములందు కన్నడము మున్నగు భాషలలో మార్గకవిత్వము వ్రాయబడి ప్రచారము నొందుచుండగా గుణగ విజయాదిత్యుడో, మరేచాళుక్యరాజో తెలుగు దేశమున దేశికవిత పుట్టించి, తెలుగును నిలిపెనని ఈ పద్యమున కర్థము చెప్పవలయును. దీని కనుగుణముగా క్రీ. శ. 9, 10 శతాబ్దులలో వ్రాయబడిన శాసనములలో సంస్కృత వృత్తము లేమియులేక కేవల దేశిపద్యములే గోచరించుచున్నవి. సంస్కృతాభిమానులైన పండితులీ దేశికవిత్వము నంతగానాదరింపని హేతువున తరువాత తెలుగుదేశమునకూడ మార్గకవితాపద్ధతియే అవలంబింపబడినట్లు తోచుచున్నది. కామసాని గూడూరుశాసనము నందలి పద్యములు ఇందుకు దృష్టాంతములు. లభించిన ఈపద్యములు రెండుమూడుకంటె నెక్కువగా లేకపోవుట చేతను, పైశాసనములందలి పద్యములు వ్యక్తుల వీరావదానములను, దానములను మాత్రము వర్ణించునట్టివగుటచేతను వానియందలి సారస్వతగుణము నెత్తిచూపుట కవకాశములేకున్నది. కాని దేశి మార్గములు రెండింట చెప్పబడిన ఏదో యొక రకమైన కవిత్వమును, తరువాత నన్నయ భారతమున నవలంబించిన చంపూపద్ధతియు అంతకుముందే ప్రచారమున నుండెననుట కివి నిదర్శనములుగా నున్నవి. అద్దంకి ధర్మవరము శాసనములు గద్య పద్యములతో కూడియుండుటచే చంపూపద్ధతికి చెందిన వని చెప్పవచ్చును. పైని పేర్కొనబడిన పద్యములేకాక దేశిమార్గమునకుచెందిన పలురకములపదములుకూడ నప్పుడు వ్రాయబడుచుండెనని తెల్పుటకు కొన్ని ఆధారములు లభించుచున్నవి. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రమున భక్తులు, తుమ్మెదపదములు, వెన్నెలపదములు, ప్రభాతపదములు మున్నగు పదములు పాడుచుండి రని వ్రాసియుండెను. మరియు నతడు తాను రచించిన బసవపురాణమునకు "ఆతతబసవపురాతన భక్తగీతార్థ సమితియే మాతృక"యని తెల్పియుండెను. ఆతని నాటి కంతబహుళ ప్రచారములో నుండిన పదములును, గీతములును తత్సదృశములైన యితరపద గీతాదులును అంతకు పూర్వముకూడ ప్రచారములో నుండె ననుకొనుటలో విప్రతిపత్తి ఉండదు. క్రీ.శ. 11 వ శతాబ్దిలో రచింపబడిన 'యాప్పిరంగలమ్' అను తమిళ చ్ఛందోగ్రంథమున తత్కర్త వాంచయ్య వ్రాసిన తెనుగు ఛందమును పేర్కొనెను (వాంచియార్ వడఘుచందవుమ్). అప్పటికే తెలుగున ఛందోగ్రంథమొకటి వెలువడియుండుట అంతకు పూర్వమే ఆభాషలో ఛందోబద్ధమైన రచన విరివిగా నుండెనని చెప్పకచెప్పుచున్నది. కాని ఆ కవిత్వము గ్రంథస్థము కాకపోవుటచేతను, గ్రంథస్థమైనను మతవైషమ్యాది కారణములచే నష్టమైపోవుటచేతను దాని గుణగణములను నిర్ణయించుటకు వీలులేకపోవుచున్నది.

ఇట్లు నన్నయకు పూర్వమే కొంత కవిత్వముండెనని నిశ్చయముగా తెలియవచ్చుచుండ నాతడు రచించిన భారతమే తెలుగున ఆదికావ్యమనుటకు హేతువేమి అను ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. ఆతనికి

పూర్వముండిన కవిత్వము ప్రధానముగా దేశిమార్గమునకు చెందినది. భాషాచ్ఛందో విషయముల నదిదేశిపద్ధతి నవలంబించి సంస్కృత లక్షణమునకు విరుద్ధమై యుండుటచే పండితాదరమును బడయక ప్రాకృత జనైక రంజకమై యొప్పారెను. అట్లుగాక సలక్షణమైన భాషలో దేశి మార్గములు రెండింటికి చెందిన పద్యములతో నుదాత్త వస్తుకమైన మహాకావ్యమును రచించి నన్నయ పండిత పామరులందరికిని ప్రీతి నాపాదింపజాలెను. ఇంతవరకు లభ్యములైనవానిలో నట్టిరచనతోకూడిన ప్రథమకావ్య మాతని భారతమే. అందుచేతనే దాని కాంధ్రమున నాదికావ్య మను ప్రసిద్ధి కలిగినది.

ఆ యారంభ దినములలో నన్నయ ఆంధ్రభాష కొనరించిన సేవ యింతింతనరానిది. ఆతడు జనవ్యవహారము నందలి పదజాలము నంతను పరిశీలించి, సంస్కరించి, సంస్కృతపదములను తెలుగున వాడుపద్ధతిని నిర్ణయించి, ధారాళమైన నడకగల కొన్ని సంస్కృత వృత్తములను గ్రహించి, తననాటికే ఉత్తమకావ్యములతో నొప్పారుచుండిన కన్నడవాఙ్మయమునుండి ప్రశస్తలక్షణములు సేకరించి తెనుగున నుత్తమమైన కావ్యరచనా మార్గము తీర్చిదిద్దెను. ఇది అనన్యసామాన్యమైన ఆతని ప్రతిభా మహత్త్వమునకు తార్కాణము.

నన్నయ ఆంధ్రభారతమునం దాది సభాపర్వములను, అరణ్యపర్వమునందు మూ డాశ్వసములవయి 142 పద్యములను మాత్రమే రచించెను. అతడు వ్యాసుని సంస్కృత భారతమునందలి కథ ననుసరించినమాట నిజమే యైనను అందు తన కనవసరములని తోచిన భాగములను తగ్గించి, అవసరములని తోచినపట్ల పెంచి, ఔచిత్య దృష్టితో కొన్ని మార్పు లొనరించి, తన కృతిని సర్వ విధముల నొక స్వతంత్రకావ్యమా అనునట్లు సాగించెను. అతని కవిత్వము ప్రసన్న కథా కలితార్థ యుక్తికిని, అక్షర రమ్యతకును, నానారుచిరార్థసూక్తి సంపదకును నెలవై వీనులవిందు చేకూర్చుచుండును. ఉదంకోపాఖ్యానము, శకుంతలోపాఖ్యానము, నలోపాఖ్యానము, సౌగంధికాహరణము, రురుప్రమద్వరల కథ మున్నగు వృత్తాంతముల రచించుటలో నాతడు చూపిననేర్పు అప్రతిమానమైనది. ఆతని కవిత్వము సంస్కృతపదబహుళమయ్యును క్లిష్టాన్వయములు లేక ధారాశుద్ధికిని ధ్వని గాంభీర్యమునకును నిధానమై చదువరుల కానందము కూర్చుచుండును. ఆంధ్రమున గురుపద్య విద్యకువలెనే గద్యవిద్యకును నన్నయయే ఆద్యుడని చెప్పవచ్చును. ఆతని వచనము సులలిత పదఘటితమై అతిధారాళమై ఒప్పారుచుండును. అతడు చంపకోత్పలమాలాది వృత్తములనే కాక తరువోజ, మధ్యాక్కర మున్నగు దేశిపద్యములను గూడ వ్రాసియుండెను. ఆంధ్రమున కావ్యములను వ్రాసిన తరువాతి కవులెల్లరు నాతని గురుప్రాయునిగా భావించి కొనియాడియుండిరి.

రాజరాజు మరణించినపిమ్మట కొన్ని రాజకీయ మత సాంఘిక కారణములచే ఆంధ్రభారతరచన కొనసాగుట కంతరాయ మేర్పడెను. రాజరాజు కుమారుడైన కులోత్తుంగచోడుడు తండ్రి తరువాత వేంగీ సామ్రాజ్యమును పాలింపక మాతామహునిరాజ్యమయిన చోళరాజ్యమున కధిపతి అయ్యెను. అది తమిళ భాషాప్రచారముగల దేశమగుటచే నాత డచ్చటనుండి ఆంధ్రభాషను పోషించుట కవకాశము లేకపోయెను. క్రీ. శ. 12 వ శతాబ్ది ఆరంభమున కన్నడదేశమున బసవేశ్వరు డవతరించి, వీరశైవ మతమును స్థాపించెను. ఈ క్రొత్తమతము వర్ణాశ్రమ వ్యవస్థనుగాని, వేదప్రామాణ్యమునుగాని అంగీకరింపక భక్తిప్రధానమై యుండెను. దీని ప్రభావము కన్నడదేశము నుండి క్రమముగా దక్షిణమునం దంతటనుప్రాకెను. ఇట్లొకవంక వీరశైవము వ్యాప్తిచెందుచుండ, ఆంధ్రదేశమున దానికి ప్రతియోగముగా రామానుజ స్థాపితమయిన వైష్ణవముకూడ పెంపొంద నారంభించెను. భక్తిప్రధానములైన ఈ మతముల నవలంబించి తత్ప్రచారమునకై యత్నించుచుండిన కవులు వైదికమత ప్రధానమైన భారతమును కొనసాగింప పూనినవారు కాకపోయిరి.

నన్నయ తరువాత చెప్పదగిన తెలుగుకవి నన్నెచోడుడు. ఈతడు నన్నయకు పూర్వుడని కొందరును, సమకాలికు డని కొందరును, తిక్కన తరువాతివాడని కొందరును, నన్నయ తిక్కనల నడిమికాలమువాడని కొందరును చెప్పుచున్నారు. ఇం దేది సత్యమో నిశ్చయముగా చెప్పుటకు తగిన ఆధారములు లేవు. కాని చివరివాదమే కొంచెము యుక్తియుక్తముగా కనబడుచున్నది.

అనగా అతడు క్రీ. శ. 12 వ శతాబ్ది ఆరంభమువాడని చెప్ప వచ్చును. ఈ కవిరాజ శిఖామణి వ్రాసిన కావ్యము కుమార సంభవము. ఇందు పన్నెండాశ్వాసములున్నవి. శివపురాణము, కాళిదాసోద్భటుల కుమార సంభవములు చదివి, అందలి పార్వతీ పరమేశ్వరుల ప్రణయ వృత్తాంత మును తారకాసురవధ యను వీర రసప్రధానమైన కథ నంగముగా జేసి యాతడు రసాలంకార వర్ణన పరిపూర్ణముగా నీ కావ్యమును నిర్మించినాడు. ఇందు కాళిదాసాదుల భావము లచ్చటచ్చట గోచరించుచున్నను మొత్తముమీద నిది స్వతంత్రకావ్యమనియే చెప్పవలెను. ఇందు కన్నడ కవితా సంప్రదాయములు హెచ్చుగా గోచరించును. తిక్కనాదుల రచనలో తరువాత కాన వచ్చు షష్ఠ్యంతములను తెలుగున తొలుదొల్త వ్రాసిన వాడీ నన్నెచోడుడే. ఇతనికి వర్ణనప్రీతి హెచ్చు. ఇతని వర్ణనలు సహజములును, దేశీయ సంప్రదాయానుకూల ములునై మనోహరముగా నుండును. తిక్కన యుద్ధవర్ణనల కీతని కావ్యము తుదనున్న యుద్ధవర్ణనమే మేలు బంతియై యుండవచ్చును. రతిమన్మథుల సంభాషణము, పార్వతీ కపటవటువుల సంభాషణము ఈతని సరస సంభాషణ రచనాసామర్థ్యమునకు తార్కాణములు. ఈ విధముగా నీతని కావ్య మాంధ్రమందలి తొట్టతొలి ప్రబంధమని చెప్పదగియున్నది. దేశిమార్గములు, వస్తుకవిత మున్నగు పదముల నాంధ్రవాఙ్మయమున వాడినవాడీత డొక్కడే. వాని నీతడు కన్నడ వాఙ్మయమునుండి గ్రహించియుండెను. ఇట్లే ఈతడు తమిళ వాఙ్మయము నుండి గ్రహించిన దేశీయ సంప్రదాయములును కొన్ని గలవు. ఇతడీ గ్రంథమును తన గురువయిన జంగమ మల్లికార్జునున కంకితము చేసి, అపారమైన గురుభక్తిని ప్రకటించెను. ఈతని శైలి నన్నయ శైలికంటె నించుక భిన్నమైనది. ఇతడు సంస్కృత సమాసములను సాధ్యమయినంతవరకు తగ్గించి జానుతెను గనుపేరుతో చమత్కార గర్భితము లయిన తెలుగుపలుకుబళ్ళ నెక్కువగా ప్రయోగించెను. ఇతని కావ్యమున నర్థశబ్దాలంకార ప్రీతియేకాక బంధకవిత్వమును, ఛందో వైవిధ్యమును గూడ కానిపించును. అట్లయ్యు నాతని పద్యముల నడకలో భంగపాటెచ్చటను గోచరింపదు. ఇతని రచనలో లాక్షణికులు వ్యాకరణ విరుద్ధములుగా పరిగణించు కొన్ని ప్రయోగము లచ్చటచ్చట కానబడును. కాని పద భావ సంపదను, రచనా ప్రౌఢిమను, ధారాశుద్ధిని పరికించిచూడ నీతనికిగల కవిరాజ శిఖామణి యను బిరుద మన్వర్థ మనుటకు సందేహింప బనిలేదు.

మల్లికార్జున పండితారాధ్యుడు (1120-1180) శివతత్త్వసారము, లింగోద్భవ గద్యము, రుద్రమహిమ, గణసహస్రమాల, అమరేశ్వరాష్టకము, పర్వత వర్ణనము మున్నగు కావ్యములను రచించినట్లు పండితారాధ్య చరిత్రవలన తెలియుచున్నది. ఈతడు కన్నడ సంస్కృతములందు కూడ పండితుడగుటచే నిందు కొన్ని ఆ భాషలలో రచింపబడినవి కూడనై యుండవచ్చును. శివతత్త్వ సారము శివా ! అజా ! రుద్రా ! మహేశా ! అను సంబోధనములతో కూడిన కందపద్యములలో రచింపబడినది. ఇందలి పద్యముల సంఖ్య కొన్ని వందలున్నను స్వభావమునుబట్టి దీనిని శతకమనియే చెప్పవచ్చును. సోమనాథుడు దీనిని శతకమనియే పేర్కొనెను. మల్లికార్జున పండితు డిందు శివదీక్షను గూర్చియు, పాశుపతశైవ సిద్ధాంతములను గూర్చియు విపులముగా వర్ణించినాడు. ఇందద్వైతుల మాయావాద మనేక యుక్తులచే ఖండింపబడినది. ఇత డచ్చటచ్చట వేదములనుండి కూడ ప్రమాణములను చూపుచు అద్వైత పరములైన వాక్యములకు సైతము ద్వైతపరముగా నర్థము చెప్ప యత్నించెను. శివతత్త్వసారమునందలి శైలి లక్షణానుగుణమై పెక్కువిధముల నన్నయ శైలినే పోలియుండును. వలపలగిలక ప్రాసము, కొన్ని వింతశబ్దముల ప్రయోగము ఈ గ్రంథమున కలవు. కాని మొత్తముమీద పండితుడు మతమున వలెనే రచనమునకూడ సంప్రదాయానురక్తినే యెక్కువగా ప్రకటించెను.

దేశిమార్గమునకు చెందిన ద్విపద కవిత్వమునకే కాక శివకవి సమూహమునకును, వీరశైవమత సిద్ధాంతములకును గురుపీఠ మని చెప్పతగినవాడు పాల్కురికి సోమనాథుడు. (క్రీ. శ. 13 వ శతాబ్ది ఉత్తరార్ధము) ఇతడాంధ్ర సంస్కృత కర్ణాట భాషలు మూడింటను గ్రంథములు రచించెను. అందు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, సోమనాథ స్తవము, అనుభవసారము,

చెన్నమల్లు సీసములు, వృషాధిప శతకము, బసవోదాహరణము అనునవి తెలుగు కృతులు. వీటిలో బసవపురాణ పండితారాధ్య చరిత్రలకును, వృషాధిప శతకమునకును విశేష ప్రఖ్యాతి కలదు. బసవపురాణము, వీరశైవ మత ప్రతిష్ఠాపకుడైన బసవేశ్వరుని జీవిత చరిత్రము. ఇందు ప్రసక్తానుప్రసక్తముగా పలువురు శివభక్తుల చరిత్రలు కూడ వర్ణితములైనవి. సోమనాథుడిందలి వస్తువును వృద్ధులనుండియు, ప్రాచీనభక్తులు బసవేశ్వరుని గూర్చి రచించిన గీతముల నుండియు గ్రహించినట్లు తెల్పియున్నాడు. శివతత్త్వ సారమున సంగ్రహముగా చెప్పబడిన శివభక్తుల చరిత్రములు బసవపురాణ పండితారాధ్య చరిత్రములందు విపులముగా వర్ణింపబడినవి. బసవేశ్వరుడును, ఇతర భక్తులును ఒనరించిన లోకోత్తరములైన కార్యము లెన్నో ఇందు వివరింపబడినవి. ఇందలి బెజ్జ మహాదేవి కథ, కన్నప్ప కథ, సూరసానమ్మ కథ, చిరుతొండనంబి కథ మిక్కిలి రసవంతములై ఉండును. శ్రీనాథుని హరవిలాసమునందలి సిరియాళుని కథ కిందలి చిరుతొండ నంబి కథయే మాతృక. ఆంధ్రదేశమునసే కాక కర్ణాట దేశమునకూడ మతగ్రంథముగా బసవ పురాణమున కమితమైన ప్రచారము కలదు. ఇది కన్నడ, తమిళములలోనికే కాక సంస్కృతమునకు కూడ పరివర్తనము చేయబడినది. దీనికి తెలుగున మూడు పద్యరూపానువాదములు కలవు. పండితారాధ్య చరిత్రమునందు శైవమతమున కాచార్యుడని చెప్పదగిన మల్లికార్జున పండితారాధ్యుని జీవిత చరిత్రము వివరింపబడినది. ఇది సోమనాథుని రచనలోనికెల్ల కడపటిదైనను కవితా పాటవమునం దగ్రగణ్యమైనది. పండితుడు వెలనాటి చోడుని సభలో జైన బౌద్ధ చార్వాకాది మతముల ఖండించి వీరశైవమును ప్రతిష్ఠించిన వృత్తాంత మిందలి ప్రధాన విషయము. ఇందు దీక్షా పురాతనవాద మహిమ పర్వత ప్రకరణములు అను నైదు ప్రకరణము లున్నవి. ద్విపదచ్ఛందోబద్ధమైనను మహాకావ్య లక్షణ సమగ్రత యందును, నవరస పరిపోషణమునందును ఈ కావ్యము మిక్కిలి వాసికెక్కి యున్నది. ఇందు పెక్కుచోట్ల పండితారాధ్యుని కృతులలోని భాగములు యథాతథముగా నుద్ధరింపబడి యున్నవి. సంగీతము, నాట్యము, వైద్యము, రసవాదము మున్నగు విషయములును, వివిధ దేశాచారములును, ఇందు వివరింపబడినవి. దీనిని శ్రీనాథుడాంధ్ర పద్యకావ్యముగను, గురురాజకవి సంస్కృత కావ్యముగను సంతరించి యుండిరి. వృషాధిప శతకము బసవా! బసవా! వృషాధిపా! అను మకుటముతో రచితమైన శతకము. ఇందు బసవేశ్వరాదులగు శివభక్తుల చరిత్రములు సంగ్రహముగా వర్ణింపబడినవి. ఇందున్న తమిళ, కన్నడ, మహారాష్ట్రి మణిప్రవాళ భాషాపద్యము లితని బహుభాషా పాండిత్యమును వెల్లడించు చున్నవి. మనకు లభ్యమగుచున్న శతకములలో మకుట పద్య సంఖ్యా నియమములతో కూడిన ప్రథమశతక మిదియే. ద్విపదచ్ఛందమును మహా కావ్యోపయోగిగా తీర్చిదిద్దిన మహాకవి సోమనాథుడు. ఇతడును నన్నెచోడునివలె జాను తెనుగును వాడినట్లు చెప్పుకొని యున్నాడు. పాత్రుల భావన కించుకైనను విడివిపెట్టక ఈతడు దేనినైనను విస్తృత తరముగా వర్ణించుచుండును. అందును శివునో, బసవునో వర్ణించు సందర్భమున ఇతని రచన ఆవేశపూరితమై గిరినదివలె ఉరవడితో ప్రవహించుచుండును. ఇతడు కొన్ని ద్విపదలలో ప్రాసయతిని వాడెను. ద్విపదకు ద్విపదకు తెగచెప్పవలెనను నియమమును పాటింపక వాని నేకధారగా నడపించెను. లాక్షణికులు దోషముగా పరిగణించు పదములును, సంధులును, సమాసములును ఇతని రచనలో నచ్చటచ్చట కాననగును. అయ్యు, వస్తుచ్ఛందో భాషా విషయముల కనవచ్చు దేశీయతయు, వర్ణనాదుల గోచరించు తన్మయతయు, దాని కొక అసాధారణ సౌందర్యమును చేకూర్చు చున్నవి. ద్విపదను రోకంటి పాటగా కాక బహుభంగుల వైవిధ్యముతో నడపించి ఆ తదాఖండమున కఖండమైన ప్రతిష్ఠ సంపాదించెను. అందుచేతనే ద్విపద కావ్యకర్తలలో కాలము చేతనే కాక కవితాప్రతిభచే కూడ నీతని కగ్రస్థానము లభించెను.

క్రీ. శ. 12వ శతాబ్దిలో నాంధ్రదేశమున శైవ వైష్ణవ మతములు రెండును వ్యాప్తిచెంది పలువు రనుయాయుల నాకర్షించెను. హరన్యోన్య దర్శన స్పర్శన భాషణాదులను కూడ నుజ్జగించి ఒండొరుల ద్వేషించుకొనుచు సంఘమున కొంత అలజడి కలిగించిరి. అది చూచి ఆ

రెండుమతములవారికి సామరస్యము కలిగింప ప్రయత్నించినవారిలో తిక్కన సోమయాజి ప్రథమగణ్యుడు. (క్రీ. శ. 1210-1290). ఈతని వంశము పండితులకును, మంత్రి దండనాథులకును నెలవై వన్నె వాసిగాంచినట్టిది. ఇతనితాత భాస్కరమంత్రి రామాయణము రచించినట్లు ప్రతీతి. కాని ఆ కావ్య మిప్పుడు లభించుటలేదు. తిక్కన క్రీ. శ. 13 వ శతాబ్ది పూర్వార్థమున నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధికి మంత్రియు, ఆస్థానకవియునై అలరారెను. అతడు తన తొలికృతియైన నిర్వచనోత్తర రామాయణమును ఆ మనుమసిద్ధికే అంకితము కావించెను. ఆ కావ్యము నాతడు చంపూ పద్ధతినిగాక నిర్వచనముగా రచించెను. ఇం దారంభమున నాతనికి కవితారచనమునగల వివిధములయిన అభిప్రాయములు వెల్లడింపబడినవి. ఇది వాల్మీకి రచిత రామాయణోత్తరకాండమున కనువాదము. ఇందు జనాపవాద భీతిచే రాముడు సీత నడవికి పంపుట, సీత కుశలవులను ప్రసవించుట మున్నగు వృత్తాంతములును, రావణాదుల జనన వర్తనాదులును వర్ణింపబడినవి. అనువాదవిషయమున తిక్కన యిందు చాల స్వతంత్రత వహించెను. ఇందు విష్ణువు రాక్షసుల వధించిన ఘట్టమున వీరరసమును, సీతాపరిత్యాగ సందర్భమున కరుణరసమును చక్కగా పోషింపబడినవి. ఇందలిశైలి భారతములోనిదానివలె నంత పరిపక్వము కాకపోయినను మిక్కిలి రసవంతముగానే యుండును. తిక్కన యిందు రామ నిర్యాణకథ నెందుచేతనో తెనింగింపక విడిచివైచెను. తరువాత దానిని జయంతి రామభట్టను నాత డేకాశ్వాసముగా రచించి భద్రాద్రిరామున కంకితము కావించెను. తిక్కనరచించిన రెండవగ్రంథము భారతము. ఇం దాతడు విరాటపర్వము మొదలుకొని పదునైదు పర్వములు తెనిగించెను. ఆంధ్రీకరణవిధానమున నిం దాతడు నన్నయపద్ధతినే అవలంబించెను. పాత్ర రసౌచిత్య పోషణమున నాత డిందు ప్రదర్శించిన ప్రతిభ అపారమైనది. కీచకుడు ద్రౌపదిని వలచిన సందర్భమున శృంగారరసమును, ఉత్తర గోగ్రహణము నందును, యుద్ధపర్వములందును వీరరసమును, స్త్రీ పర్వముననను, అభిమన్యువధ ఘట్టముననును కరుణరసమును, శాంత్యనుశాసనములందు శాంతరసమును ఆత డెంతో నిపుణముగా వర్ణించియుండెను. ఉద్యోగపర్వమున కృష్ణుని ముఖమున నాతడు ప్రదర్శించిన రాజనీతి నైపుణ్యము అద్వితీయముగా నుండును. పాండవులయు, ధృతరాష్ట్ర దుర్యోధనులయు, కర్ణశకునులయు, భీష్మ విదుర ద్రోణాదులయు, కుంతీ ద్రౌపదులయు పాత్రముల నాతడు సుస్పష్ట రేఖలతో తీర్చిదిద్దెను. ఆతడు చిత్రించిన కుంతీ ద్రౌపదులలో క్షత్రియకాంతోచితమయిన మనస్విత నిండారియుండును. కీచకు నాతడు పాశవమైన కామమునకు వశుడయిన మోహాంధుడుగాకాక విషాద నాయకునిగా చిత్రింప యత్నించి కృతకృత్యు డయ్యెను. మంత్రియు, యుద్ధనీతి విశారదుడును అగుటచే నాతని యుద్ధవర్ణనములు సహజములును, గంభీరములునై నిజముగా యుద్ధము జరుగుచున్నప్పటి వివిధ పరిస్థితులును పఠితలకు సాక్షాత్కరింప జేయును. తిక్కనశైలి ప్రధానముగా సంవాదశైలి. పాత్రల సంభాషణ ద్వారముననే ఆతడు కథను రమ్యముగా నడిపించుచుండును. అలతి అలతి దేశ్యపదముల వాడుటయందును, రసోచిత పదవృత్త ప్రయోగమునందును ఆతడు మిక్కిలి నిపుణుడు. ఆంధ్రు లందరును మోదము పొందవలెనను ఉద్దేశముతో నాతడు దీర్ఘసమాసములను తగ్గించి దేశి మార్గము నవలంబించెను. ఆ కారణముచే నతనిరచన తెలుగుతనమున కునికిపట్టయి సరససుందరమయి ముద్దు గొల్పుచుండును. క్లిష్టములయిన ఆధ్యాత్మిక విషయములనుకూడ స్పష్టముగా వ్యక్తము చేయగల శక్తి తెనుగు భాష కున్నదని మొట్టమొదట ప్రదర్శించినవా డాతడే. అతడు తన భారతమును హరిహరనాథ దేవుని కంకితము గావించి, తద్ద్వారమున శివకేశవా భేదమును ప్రచారము చేసి ధర్మాద్వైతమును స్థాపింప ప్రయత్నించెను.

అభినవదండి బిరుదాంకితుడైన మూలఘటిక కేతన తిక్కనకు సమకాలికుడు. ఇతడు సంస్కృతమున దండి రచించిన దశకుమార చరితమును చంపూ కావ్యముగా ననువదించెను. ఇది శృంగార హాస్యముల కాలవాలమై చక్కని సాహస కథలతో నిండారి యుండును. కేతన కథాకథన నైపుణ్య మిందు సర్వతోముఖముగా గోచరించును. ఇదిగాక ఈతడు విజ్ఞానేశ్వరమను ధర్మశాస్త్ర గ్రంథమును, ఆంధ్రభాషా భూషణ మను వ్యాకరణ

గ్రంథమును గూడ రచించెను. తెలుగు వ్యాకరణమును తెలుగు భాషలో రచించిన మొదటి లక్షణకర్త ఇతడే. ఇతడు దశకుమార చరితమును తిక్కన కంకితము చేసి యందు దాతని వంశమును, పూర్వులను చక్కగా వర్ణించెను. తాతచెప్పి ఉభయకవిమిత్రు మెప్పించితి నని ఇతడు సగర్వముగా చెప్పుకొని యుండెను.

మారన, తిక్కన సోమయాజి శిష్యుడు. ఇతడు మార్కండేయ పురాణమును తెనిగించి గోన గన్నారెడ్డి కంకితము చేసెను. ఇతని శైలి ఆడంబర రహితమై సరసముగా నుండును. తెలుగున తరువాత వెలసినమను చరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము, కువలయాశ్వ చరిత్రము మున్నగు ప్రబంధములందలి కథావస్తు విందుండియే గ్రహింపబడినది.

ఈ యుగమున వెలసిన పండిత కవులలో అథర్వణా చార్యు డొకడు. ఇతడు భారతము నాంధ్రీకరించెనని ప్రతీతి. ఇది యిప్పుడు లభ్యమగుటలేదు. దొరకిన కొలది పద్యములనుబట్టి ఈతని రచన విరాటపర్వమునుండి ఆరంభించు ననియు, మిక్కిలి ప్రౌఢమైన దనియు తెలియు చున్నది. అథర్వణకారికావళి అను తెలుగు వ్యాకరణము నీతడు సంస్కృత శ్లోకములుగా రచించెను. ఇతడు త్రిలింగ శబ్దానుశాసన మను చిన్న వ్యాకరణమునుగూడ రచించె నందురు.

క్రీ. శ. 1260 ప్రాంతమున బద్దెభూపాలుడు నీతిసార ముక్తావళి అను నీతిపద్యములతో కూడిన గ్రంథమును రచించెను. సుప్రసిద్ధమైన సుమతిశతకమును గూడ నీతడే రచించి నట్లిందు చెప్పబడినది. ఇది ఎంతవరకు సత్యమో తెలియదు. ఇతని పద్యములు సరళసుందరములై పండిత పామర హృదయరంజకములుగా నుండును. తెలుగున వెలసిన మొదటి రామాయణము రంగనాథ రామాయణము. దీనిని రంగనాథుడను కవి వ్రాసి బుద్ధారెడ్డిపేర ప్రకటించె ననియు, తండ్రియుపదేశముచే బుద్ధారెడ్డియే రచించె ననియు పతత్కర్తృత్వ విషయమున రెండు వాదములున్నవి. ఆశ్వాసాంతములందు గోనబుద్ధారెడ్డియే (1200 - 1250) తండ్రియైన విఠలనాథుని పేర నీ గ్రంథమును రచించినట్లు స్పష్టముగా చెప్పబడియుండు టచే ఆవాదమునే పలువురు విమర్శకు లంగీకరించు చున్నారు. ఇది వాల్మీకి రామాయణము ననుసరించి తెలుగున వ్రాయబడిన ద్విపద కావ్యము. ఇందు కవి జన శ్రుతినుండి గ్రహించి చొప్పించిన అవాల్మీకములైన గాథలు కొన్ని గలవు. అందు జంబుమాలి, కాలనేమి, సులోచన అనువారి వృత్తాంతములు ముఖ్యములైనవి. ఇవి ఇందలి కథాభాగమున కెంతో మెరుగు చేకూర్చుచు రసవంతములై యున్నవి. రావణ, విభీషణ, కుంభకర్ణాదుల శీలములును, చిత్తవృత్తులును ఇందు చక్కగా వర్ణింపబడినవి. ఇందలి వర్ణనములు మిక్కిలి సుందరములై ఉదాత్తములుగానుండును. ఇందలి శైలి లాక్షణికమును, ప్రసన్నమునై ద్విపదయయ్యు నెచ్చటను విసుగుగొల్పక చాల మనోహరముగా నుండును. ద్విపద కావ్యములలో శైలీపాటవముచేతను, కథా గౌరవముచేతను రంగనాథ రామాయణమున కొక విశిష్టస్థానము చేకూరినది. ఇందలి ఉత్తరకాండమును బుద్ధారెడ్డి ఆనతిచే ఆతని కుమారులైన కాచవిఠలవిభులు రచించి రామాయణమును పూర్తి కావించిరి. వీరి రచన తండ్రి రచనయంత ఉత్తమము కాకపోయినను రసవంతముగానే ఉండును.

తిక్కన తరువాత యుగకర్త అని చెప్పదగినవాడు ఎఱ్ఱాప్రెగ్గడ. ఈతని యుగమున వెలసిన తొలికావ్యము భాస్కర రామాయణము. ఇదియును భారతమువలె నైకకవికర్తృక మగుట సంభవించినది. హుళక్కి భాస్కరుడు, ఆతని కుమారుడైన మల్లికార్జునభట్టు, శిష్యుడైన కుమార రుద్రదేవుడు, మిత్రుడైన అయ్యలా ర్యుడు దీనికి కర్తలు. వీరిలో వయః పాండిత్య ప్రతిభలచే పెద్దయైనవాడు భాస్కరుడగుటచే కావ్య మాతని పేరనే వెలయింపబడినది. ఈ రామాయణమున తిక్కన తాతయగు భాస్కరుని రచనకూడ నున్నదని కొందరి తలంపు. అతడు వాల్మీకి రామాయణమును చాల సంగ్రహముగా రచించెననియు, దానితో తృప్తినొందక హుళక్కి భాస్కరాదులచ్చటచ్చట పెంచి ఈరామాయణ మునకు రూపమొసగిరనియు వారివాదము. వారుచెప్పు హేతువులనుబట్టి చూడ ఈ వాదము కొంత యుక్తి యుక్తముగానే కానవచ్చుచున్నది. మంత్రిభాస్కరుని రచన సుందరకాండమువరకు గల అన్ని కాండములందు ఎంతో కొంత కలదని వీనివలన తెలియుచున్నది.

హుళక్కి భాస్కరు డారణ్యకాండమును, యుద్ధకాండమున 1133 పద్యములను రచించెను. ఈతని రచన రెండవ ప్రతాపరుద్రుని అశ్వసేన కధ్యక్షుడైన సాహిణిమారన (1295-1323) కంకితము చేయబడినది. ఈతనిశైలి సమాసభూయిష్ఠమయ్యు, సుబోధమై నన్నయ కవితను బోలియుండును. యుద్ధకాండమున నీతని రచనలో తిక్కన అనుకరణములు గోచరించుచున్నవి. మల్లికార్జున భట్టు తండ్రి అంతకవి కాకపోయినను ప్రతిభావంతుడు. ఇతని రచన బాలకాండమునకంటె కిష్కింధా సుందర కాండములలో శ్రేష్ఠతరముగా నుండును. వాలిభార్య అయిన తార శోకము నీతడు కరుణరస నిర్భరముగా వర్ణించెను. కుమార రుద్రదేవునికి సంగ్రహరచనపై ప్రీతి మెండు. ఇతడు రచించిన అయోధ్యాకాండము భావ సంగ్రహమునకు, భాషామాధుర్యమునకును నెలవై మనోహరముగా నుండును. అయ్యలార్యుడు భాస్కరుడు రచింపగా మిగిలినయుద్ధకాండమును పూర్తిచేసెను. ఇతడు ప్రౌఢసమాసములతో కూడిన శైలియం దభిమానము చూపెను. వీరరసప్రధానమైన యుద్ధకాండమున కాశైలి అనుగుణముగానే ఉన్నది. మొదటినుండి తుదిదాక ఒక చేతిమీద సాగమిచే భాస్కరరామాయణమునందలి శైలి ఏకధారగా నుండక సమవిషమముగా గోచరించును.

ఎఱ్ఱన రెడ్డిరాజుల ఆస్థానమున నుండిన మహాకవి (క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వభాగము). ఇతడు ప్రతిభా పాండిత్యములందు నన్నయ తిక్కనల కెనయై భారతారణ్య పర్వశేషము నేకాక హరివంశమునుగూడ సమర్థతతో నిర్వహించి, కవిత్రయములో స్థానము సంపాదింప జాలెను. ఇత డారణ్యపర్వ శేషమును నన్నయ పేరుమీదుగనే తెనిగించి రాజరాజునకే అంకితముచేసెను. ఇది అతనికి సహజమయిన వినయమును, నన్నయపైగల భక్తిని చాటుచున్నది. ఈత డారణ్యపర్వశేషమును నన్నయశైలితో నారంభించి, తిక్కనశైలితో ముగించెను. అందుచే ఇతనిరచన నన్నయ తిక్కనల రచనలు అను మహాసముద్రములను కలుపు జలసంధివలె గోచరించును. ఆరణ్య పర్వమునందలి ఘోషయాత్ర, రామోపాఖ్యానము, సావిత్ర్యుపాఖ్యానము, యక్షప్రశ్నలు అను భాగములు మిక్కిలి పేరుగాంచినవి. అరణ్యపర్వశేషమున ఎఱ్ఱన సంస్కృతాంధ్రములను సమభాగములుగా వాడియుండెను. ఎఱ్ఱన రామాయణమునుగూడ రచించి తన ప్రభువయిన ప్రోలయ వేమారెడ్డికి అంకితము కావించెను. అది ఇప్పుడు లభ్యమగుట లేదు. హరివంశమున నీతని శైలి పరిపక్వము నొందినది. ఇందు శ్రీకృష్ణుని చరిత్రము సంపూర్ణముగా వర్ణింపబడినది. గోకులమును వర్ణించుపట్ల ఎఱ్ఱన జానపద జీవితము నెంతో రమ్యముగా చిత్రించెను. హార్దమైన అనురాగమున కాలంబనమైన సాత్త్విక శృంగారమును వర్ణించుటలో ఎఱ్ఱన మేటి. ఉషానిరుద్ధుల చరిత్రము, రుక్మిణీకల్యాణము, ఇందు మిక్కిలి రసవంతములుగా నుండును. అనువాద విషయమున ఎఱ్ఱన నన్నయ, తిక్కనల మార్గమునే అవలంబించెను. ఎఱ్ఱన రచించిన స్వతంత్ర కావ్యము లక్ష్మీనృసింహ పురాణము. బ్రహ్మాండ పురాణమునుండి వస్తువును గ్రహించి ఎడనెడ చక్కని వర్ణనలు చేర్చి, దాని నాత డొక హృద్యమైన ప్రబంధముగా సంతరించెను. ప్రహ్లాదచరిత్ర మిందలి ప్రధాన కథ. భక్తివర్ణనమునం దీతడు పోతన కీడుకాక పోయినను ప్రహ్లాదచరిత్ర వర్ణించుటపట్ల నాతని కీతని రచన ఒజ్జబంతి యయ్యెననుటలో నతిశయోక్తి ఉండదు. ఈతనిశైలి సత్త్వశుద్ధికి నెలవై, సత్త్వప్రధానమయిన యితని శీలమున కాదర్శమువోలె గోచరించును. శ్రీనాథు డితని సూక్తివైచిత్రిని ప్రశంసించెను. ఇతనికి ప్రబంధ పరమేశ్వరు డనియు, శంభుదాసు డనియు బిరుదనామములు గలవు.

విక్రమసేనము అను కావ్యమునురచించిన చిమ్మపూడి అమరేశ్వరు డీ కాలమువాడే. పలువు రాంధ్రకవు లీతని మహాకవిగా స్తుతించియుండిరి. ఈతని కావ్య మిప్పుడు లభించుటలేదు. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి యను లక్షణ కావ్యమును రచించి రాజరాజు వంశీయుడయిన చాళుక్య విశ్వేశ్వరరాజున కంకితము చేసెను. ఇందు సాహిత్యవిషయములతోపాటు వ్యాకరణ చ్ఛందో విషయములుకూడ నున్నవి. లక్ష్యముల నిచ్చు సందర్భమున నీతడు కృతిపతినిగూర్చిరచించిన పద్యములు రసవంతములుగా నున్నవి. ఉద్దండ రచనా ధురంధరుడని శ్రీనాథునిచే ప్రశంసింపబడిన వేములవాడ భీమకవి ఈ కాలమునందే ఉండెను. ఇతడు కవిజనాశ్రయమను ఛందో

ప్రబంధమును రచించెనని ప్రతీతి. కాని ఇవియెల్ల పరిశోధనములవలన దానికర్తృత్వము వేరొకరికే ఆరోపింపబడుచున్నది. ఇతడు రాఘవపాండవీయ మను ద్వ్యర్థికావ్యమును, నృసింహపురాణము, శతకంధర రామాయణము హారవిలాసము మున్నగు ఇతర గ్రంథములను రచించెనని చెప్పుదురు. కాని అవి యిప్పుడు లభ్యము లగుటలేదు. ఈతని చాటువులుమాత్రము కొన్ని లభించుచున్నవి. వానివలన నీతడు ఉత్తమశ్రేణికిచెందిన కవియే అనియు, శాపానుగ్రహ సమర్థు డనియు తెలియుచున్నది. ఇతడు గోదావరి మండలమునందలి ద్రాక్షారామమునకు చెందిన వాడని కొందరును, తెలంగాణమునందలి కరీంనగర మండలమునకు చెందినవాడని కొందరును చెప్పుచున్నారు. సంస్కృతమున రాజశేఖరుడు రచించిన విద్ధసాలభంజిక అను నాటకము ననుసరించి మంచన (1350) కేయూర బాహు చరిత్రమను కావ్యమును రచించి నంపూరి గుండయామాత్యుని కంకితము చేసెను. విద్ధసాలభంజిక యందలి పెక్కు పేర్ల నీతడు మార్చుటయే కాక ప్రసక్తానుప్రసక్తముగా పంచతంత్రమునందలి కథలనుబోలిన కథల నిందు చొప్పించెను. ఈతనిది క్లిష్టాన్వయములు, దీర్ఘ సమాసములులేని మనోహరమైన కథనశైలి. నీతి మంతములయిన కల్పితకథలనింత మనోహరముగా వ్రాసినవారు పూర్వులలో కానరారు.

ఈ యుగమునందలి కవి మండలిలో నెట్టినతో సాటికి, పోటికి నిల్వజాలువాడు నాచన సోమనాథుడు (1370). ఈతడు హరివంశమునందలి ఉత్తరభాగమును ఉత్తర హరివంశమనుపేర రచించి, హరిహరనాథుని కంకితము చేసెను. ఈతడు పూర్వహరివంశమును వ్రాసెనో లేదో తెలియదు కాని ఉత్తర హరివంశమునందలి యారంభ మును జూచిన దానినికూడ రచించినట్లే తోచును. ఇతడు వసంత విలాసమును, హారవిలాసమును రచించెనని చెప్పుదురు. కాని అవి లభ్యము లగుటలేదు. ఉత్తర హరి వంశము ఆరాశ్వాసముల ప్రబంధము మూలమునందలి. రసవత్తరములైన భాగములను మాత్రమే గ్రహించి కొన్ని మార్పు చేర్పు లొనరించి అతడీ గ్రంథము నొక స్వతంత్ర గ్రంథముగా సంతరించెను. ఎట్టిన విడిచిన హంస డిభకోపాఖ్యానము నీతడు విపులముగా వర్ణించెను. రసపోషణమున నీతడు మిక్కిలి నేర్పరి. సత్యా నరకాసురుల సంభాషణము ఉషానిరుద్ధులకలయిక యాదిగాగల శృంగార రసపోషణాభినివేశమునకు నిదర్శనములు. రసావేశ పరవశుడై ఈతడొక్కొక్కయెడ ఔచిత్యమునకు భంగము కలిగించునని చెప్పినను దోషముండదు. నరకాసుర సంహారమున వీరశృంగారముల నితడు ఉచితమైన మేళనము కల్పించెను. యుద్ధవర్ణనములం దీతడు తిక్కనను తలపించును. వీరశృంగారములనే కాక రౌద్రకరుణ హాస్యములను కూడ నితడు చక్కగా పోషించెను. ఇతనికి సర్వజ్ఞ, సకలభాషాభూషణ, సాహిత్యరసపోషణ, సంవిధాన చక్రవర్తి, నవీన గుణసనాథ బిరుదములున్నవి. కథాకల్పనమందును, వర్ణనములందును ఇతడు పురాణ పద్ధతిని విడిచి ప్రబంధ మార్గము ననుసరించెను. ఈతని శైలి శబ్దార్థాలంకార భూయిష్ఠమును, దీర్ఘసమాస బంధురమునై ఓజోగుణమున కాదర్శముగా నుండును. ఎడనెడ ఈతడు వాడు లోకోక్తులు, సామెతలు మిక్కిలి మనోహరములుగా నుండును. ఇతని ధారాశుద్ధి చాల గొప్పది. ఇతని వచనములు కొన్నిచోట్ల దీర్ఘతరములై యమకాను ప్రాసాదులతో కూడి క్లిష్టముగా నుండును. రసపోషణమున నీతడెట్టినతో సమానుడేయైనను ఔచిత్య పోషణమునందును, ఆవేశ నిగ్రహమునందును, ఆతని కీడు కాజాలడు.

రావిపాటి త్రిపురాంతకుడను కవికూడ రెండవ ప్రతాపరుద్రుని కాలమున నుండెనని విమర్శకులు తలంచుచున్నారు. ఇతడు సంస్కృతమున ప్రేమాభిరామమను వీథి నాటకమును, తెలుగున అంబికా శతకము, చంద్ర తారావళి, మదనవిజయము, త్రిపురాంత కోదాహరణము అను గ్రంథములను రచించెను. శ్రీనాథునిక్రీడాభిరామము నకు మూల మీతని ప్రేమాభిరామమే. ఇతడు శివభక్తి పరాయణుడు. అంబికా శతకమున నీతడు శివపార్వతుల శృంగారమును భక్తి సమ్మిళితముగా వర్ణించెను. మదన విజయము కామశాస్త్రమునకు సంబంధించిన గ్రంథముగా కానవచ్చుచున్నది. ఇతని త్రిపురాంత కోదాహరణమునకు ఆజాతి వాఙ్మయమునఅత్యుత్తమ స్థానమున్నది. ఇందీతడు సమాసాడంబరము లేని చక్కని శైలిలో కుమారగిరి మందిరుడైన శివుని ప్రస్తుతించి యుండెను.

ఆంధ్రవాఙ్మయమున ఎట్టిన యుగముతో పురాణ పరివర్తనము సన్నగిల్లినది. తరువాతియుగమున కొందరు కవులు సంస్కృత కావ్య నాటకానువాదమునకును, కొందరు స్వతంత్రకావ్యరచనకును ఆరంభించిరి. ఈ యుగమునకు కర్త అని చెప్పదగినవాడు శ్రీనాథ కవిసార్వభౌముడు. ఆంధ్రమున కవిత్రయము తరువాత వారితో సమానమైన కీర్తిప్రశస్తులను సంపాదించిన వాడీ మహాకవియే. దాని కితని బహుగ్రంథ కర్తృత్వమును, అసామాన్య పాండితీ ప్రతిభలును, నిరర్గళ ప్రౌఢశైలియు కారణములు. ఇతని రచనలలో మరుత్తరాట్చరిత్రము, సప్తశతి, పండితారాధ్య చరిత్రము నష్టములైపోయినవి. శృంగారనైషధము, భీమఖండ కాశీఖండములు, హరవిలాసము, క్రీడాభిరామము, శివరాత్రి మహాత్మ్యము, పల్నాటి వీరచరిత్రము అనునవి లభించుచున్నవి. శృంగారనైషధము సంస్కృతమునందలి శ్రీహర్షుని నైషధకావ్యమున కనువాదము. ఔచిత్యము పాటించుచు, అనౌచిత్యము పరిహరించుచు నతడీ అనువాదమున చూపిన నేర్పు అనితర సామాన్యమై ఉన్నది. ఈ కావ్య మా మహాకవి ప్రౌఢశైలికిని, పాండిత్య ప్రకర్షకును నికషోపలమని చెప్పతగియున్నది. ఇందలివస్తువు నలదమయంతుల పరిణయ వృత్తాంతము. భీమఖండమున గోదావరీ మండలమునందలి ద్రాక్షారామ భీమేశ్వర క్షేత్ర మాహాత్మ్యము వర్ణింపబడినది. దీనికి మూలము స్కాందపురాణము. శ్రీనాథుడిందు ఆ క్షేత్రమును తత్పరిసర ప్రదేశములను ఎంతో విశదముగా వర్ణించి తన ఆంధ్రాభిమానమును ప్రకటించినాడు. వ్యాసుడు కాశీ విడిచిన వృత్తాంతము, హాలాహల భక్షణము సరసముగా వర్ణింపబడినవి. కాశీఖండమున సుప్రసిద్ధ శైవక్షేత్రమయిన కాశీక్షేత్ర మహాత్మ్యము వివరింపబడినది. ఇదియు స్కాందపురాణమునుండియే గ్రహింపబడినది. శ్రీనాథుడు పెదకోమటి వేమునితో కాశీయాత్ర కేగి, అందలి తీర్థదేవతాదులను నిశితముగా పరిశీలించియుండుటచే నిందలి వర్ణనలకు కూడ నెంతో సహజత్వ మలవడినది. క్షేత్రమాహాత్మ్య రూపములై పురాణప్రాయములయిన ఈ రెండు గ్రంథములకును శ్రీనాథుడు తన ప్రతిభాపాటవముచే సుందరమయిన కావ్యత్వము నాపాదింపజాలెను. కాశీఖండమున వింధ్యగర్వాపహరణము, గుణనిధి చరిత్ర, వ్యాసుడు కాశిని బాసిన కథ, సుశీలచరిత్ర సరసముగా వర్ణింపబడినవి. ఇం దీతని శైలి ప్రౌఢతా పరాకాష్ఠను చెందినది. హరవిలాసము, శివుని విలాసములను వర్ణించు కావ్యము. చిరుతొండనంబికథ, పార్వతీ పరిణయము, దారుకా వనవిహారము, హాలాహల భక్షణము, కిరాతార్జునీయము, ఇందు వర్ణింపబడిన విలాసములు. చిరుతొండనంబికథను శ్రీనాథుడు పాల్కురికి సోమనాథుని బసవపురాణమునుండి గ్రహించి, పెంచి ఎంతో సరసముగా వర్ణించెను. పార్వతీ పరిణయము కాళిదాసుని కుమారసంభవమునందలి 3, 4, 5 సర్గము లందలి భాగములకు సంగ్రహానువాదము. మిగిలిన వాతని స్వతంత్ర రచనలే. శ్రీనాథుని స్వతంత్ర రచనా సామర్థ్యమును, శైలీసౌష్ఠవమును హరవిలాసమునందే హెచ్చుగా కాంచనగును. శివరాత్రి మాహాత్మ్యమున సుకుమారుని కథ కలదు. పల్నాటి వీరచరిత్ర, పల్నాటి వీరుల శౌర్యమును వర్ణించు జాతీయ ద్విపదకావ్యము. బాలచంద్రుని శౌర్య మిందు విశదముగా వర్ణింపబడినది. శ్రీనాథుడు పండిత రంజకమయిన ప్రౌఢరచనయందు వలెనే పామరరంజకమైన దేశీయరచనయందుకూడ మహానిపుణుడనుట కీ కావ్యము నిదర్శనము. క్రీడాభిరామము గోవింద మంచనశర్మ, టిట్టిభసెట్టి అను మిత్రుల సంభాషణ రూపమున వెల్వడిన శృంగారవర్ణనలతో కూడిన కావ్యము. ఇందు రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము ననుసరించి ఆనాటి ఓరుగంటినగరము చక్కగా వర్ణింపబడినది. ఇది వినుకొండ వల్లభరాయ కృతమని అందున్నది కాని ప్రతిపద్యమునందు శ్రీనాథుని ముద్ర స్పష్టముగా కానవచ్చుటచే నతడే దానిని వ్రాసి వల్లభరాయనిపేర ప్రకటించియుండునని యూహింపవచ్చును. శ్రీనాథుడు వివిధదేశములను, వివిధ రాజాస్థానములను దర్శించినప్పుడు చెప్పిన చాటువు లెన్నో ఉన్నవి. అవి ఆతని నిశిత పరిశీలనమును, పరిహాస ప్రియత్వమును స్వేచ్ఛావర్తనమును వ్యక్తము చేయుచున్నవి. శ్రీనాథుని శైలి ప్రౌఢ గంభీరమయినది. ఈతని పద్యముల నడక మత్తేభయానమున కెనయై చదివినకొలది చవులూరించుచుండును. ఈతడు కావించిన బహుప్రయో

గాము లీతనికి వ్యాకరణాది శాస్త్రములందు గల పాండి త్యమును వెల్లడించుచున్నవి. ఈతని కావ్యములు పెద్ది నాదుల కొజ్జబంతులై ప్రబంధ నిర్మాణమునకు దారి చూపిన వనుటలో నతిశయోక్తి లేదు.

మహాభక్తుడును, కవి శిరోమణియు నైన బమ్మెరపోతి రాజు శ్రీనాథునికి సమకాలికుడేకాక బంధువుకూడ నని చెప్పుదురు. (1400-1450) ఇతడు రచించిన గ్రంథములు మూడు. భోగినీ దండకము, వీరభద్ర విజయము. శ్రీమదాంధ్ర మహాభాగవతము. వీరభద్రవిజయ కర్తృత్వ విషయమున భిన్నాభిప్రాయములు కలవు. కాని భాగ వతశైలికిని, అందలి శైలికిని గల సామ్యమునుబట్టి విమర్శ కులది ఆతడు బాల్యమున రచించిన కవిత్వమై యుండు నని భావించుచున్నారు. ఇది దక్షాధ్వరధ్వంసమును వర్ణించు ప్రబంధము. భోగినీదండకమునందలి శైలి సర్వదా పోతన దానివలెనే యున్నది. ఇందలి వస్తువును బట్టి ఇది ఆతని యౌవనమందలి రచన యని చెప్పవచ్చును. ఇంక మూడవదియగు భాగవతము ఆంధ్ర వాఙ్మయ మునకు అలంకార ప్రాయమైనది. ఆంధ్రమున మహా భారతమునకుకూడ దీనికున్నంత ప్రచారమును, విశ్వజనీ నతయు లేదని చెప్పవచ్చును. దాని కిందలి మధురమంజుల మైన శైలియు, భక్తిరసమయమయిన వస్తువును కారణ ములు. ఇది సంస్కృతమున వ్యాసుడు రచించిన భాగ వత పురాణమున కాంధ్రీకరణము. ఆంధ్రీకరణమున పోతనయు కవిత్రయమువారి పద్ధతినే అవలంబించెను. కాని ఈతడు సహజముగ భక్తుడగుటచే భక్తులచరిత్రము లను వర్ణించునప్పుడును, భక్తి తత్త్వాదులను వివరించు నప్పుడును ఆవేశవరుడై గ్రంథమును మూలముకంటె విస్తృత తరము గావించియుండెను. ఇందు పంద్రెండు స్కంధములున్నవి. కాని పోతరాజు రచించిన గ్రంథమున కొంతభాగము శిథిలమైపోవుటచే ఆ శిథిలిత భాగముల నితరులు పూరించిరి. వీరిలో ఏర్చూరి సింగన షష్ఠ స్కంధ మును, గంగన పంచమస్కంధమును, వెలిగందల నారయ ఏకాదశ, ద్వాదశ స్కంధములను రచించినట్లు తెలియుచున్నది. తృతీయ, చతుర్థ, దశమస్కంధోత్తర భాగములందుగూడ నచ్చటచ్చట నారయ రచనమున్న దని చెప్పుదురు. భాగవతమున విష్ణుని ఏకవింశత్యవతార ములు వర్ణింపబడినవి. ఇందా దేవుడు భక్తులను రక్షించిన గాథలును, రాక్షసులను సంహరించిన వృత్తాంతములును, సర్గ ప్రతిసర్గ రాజవంశ మన్వంతరముల చరిత్రములును విపులముగా వర్ణింపబడినవి. గజేంద్రమోక్షము, ప్రహ్లాద వామనచరిత్రలు, ధ్రువాంబరీషుల ఉపాఖ్యానములు, రుక్మిణీ కల్యాణము మున్నగు నిందలిభాగము లాంధ్ర మున ఆ బాల విదితములైనవి. ఇందు కర్మజ్ఞాన మార్గ ముల ప్రసక్తికూడ లేకపోలేదు కాని భక్తిమార్గ ప్రశంస హెచ్చు. ఇందలి దశమస్కంధమున శ్రీకృష్ణుని బాల్య క్రీడాదు లెంతో మనోహరముగా వర్ణింపబడినవి. పోతన ఇందు గోపికల మధురభక్తిని హృదయరంజకముగా వర్ణించెను. ఇందు పోతన ఆత్మీయాంశ మెక్కువగా గోచరించును. అందుచేతనే ఈ భాగ మద్భుతమైన ఒక గీతి కావ్యము (Lyric) వలె కానవచ్చును. పోతన వర్ణనలు మిక్కిలి విశదములై వర్ణ్యమును పఠితలకు సాక్షాత్కరింప జేయుచుండును. ఇతనిశైలి అతిమధుర మైనది. తెలుగుభాషకు నిసర్గమైన సంగీత మాధుర్యము లీతని కావ్యమున సర్వతోముఖముగా గోచరించును. ఇతని కలంకార ప్రీతిమెండు. వర్ణన సందర్భముల నీత డంత్యానుప్రాసముల నధికముగా వాడుచుండును. అందుచే నీతని కవిత మృదంగధ్వన్యనుగతమైన మృదుల సంగీతమువలె వినిపించును. పండితులనక, పామరులనక, వృద్ధులనక, బాలురనక స్త్రీలనక, పురుషులనక ఎల్ల ఆంధ్రుల ప్రీతిని చూరగొన్న మహాకావ్యము భాగవతము. నారయాదులు తమ రచనలందు పోతననే అనుకరింప యత్నించిరికాని అందు కృతకృత్యులు కాజాలకపోయిరి. వీరు ముువ్వురిలో సింగన మిగిలిన యిరువురికంటె సమర్థ డుగా కానిపించును.

జక్కన విక్రమార్కచరిత్ర మను కథా కావ్యమును వ్రాసి దేవరాయల కడ గణకుడుగానుండిన సిద్ధనా మాత్యున కంకితముచేసెను (1408-1422). ఈతడు మంచి పండితుడేకాక అవధాన నిర్వహణాది ప్రజ్ఞలుకూడ కల్గిన వాడు. ఈకావ్యమున శకప్రవర్తకుడైన విక్రమార్కుడను మహారాజు చేసిన అద్భుతకృత్యములు వర్ణింపబడినవి. ఇందలి వీరాద్భుత రసమయములైన విచిత్ర కథా వృత్తాంతము లప్పటివారి కట్టి గాథలపైగల మక్కువను

వ్యక్తముచేయుచున్నవి. ఇందలి శైలి సరళమై రసవంతముగా నుండును. ఋతువులను వర్ణించుపట్ల జక్కన సూక్ష్మపరిశీలనము ప్రకటించెను. ఇందు గల శ్రీశైలాది పుణ్యక్షేత్రముల వర్ణనము జక్కన భక్తితత్పరతను వ్యక్తముచేయుచున్నది.

అనంతామాత్యుడు రసాభరణము, అనంతునిఛందస్సు, భోజరాజీయము అను గ్రంథములను రచించెను. ఇందు మొదటి రెండును లక్షణగ్రంథములు. అనంతుడు రసాభరణమును శా. శ. 1356 లో (క్రీ. శ. 1434) ముగించినట్లు తెల్పియున్నాడు. ఇతడు గురుదేవతాభక్తియుతుడు. తన భోజరాజీయమును గురూపదేశము ననుసరించి అహోబలదేవుని కంకితము కావించెను. ఇందు విక్రమార్కచరిత్రమందువలెనే భోజునిగూర్చిన కథలు వర్ణింపబడినవి. ఈ కథలన్నియు నీతిప్రధానములై ఉన్నవి. ఆంధ్రదేశమున సుప్రసిద్ధమై సత్యప్రభావమును నిరూపించు గోవ్యాఘ్రసంవాద మీ గ్రంథములోనిదే. ఇందు కరుణరసము చక్కగా పోషింపబడినది. ఇతనిశైలి ద్రాక్షాపాకమై మిక్కిలి మృదుమధురముగా నుండును. ఇతడక్కడక్కడ గృహజీవితమును, స్త్రీల సంభాషణాదులను చక్కగా వర్ణించియున్నాడు.

గౌరన (క్రీ. శ. 15వ శతాబ్ది పూర్వార్థము) తెలుగున హరిశ్చంద్రోపాఖ్యాన నవనాథచరిత్రలు అను ద్విపద కావ్యములను, సంస్కృతమున లక్షణదీపిక అను ఛందోగ్రంథమును రచించెను. ఇతడు పద్మనాయకరాజులు పాలించిన రాచకొండ రాజ్యమున నివసించెను. ఇతడు శ్రీశైలమల్లికార్జునదేవుని భక్తుడు. ఇతని హరిశ్చంద్రోపాఖ్యానమునందలి కథకు మూలములు స్కాంద, మార్కండేయపురాణములు. తెలుగున ఈ కథను స్వతంత్రప్రబంధముగా రచించిన మొదటికవి ఈతడే. ఇం దితడు వివిధపాత్రలను విస్పష్టరేఖలతో తీర్చిదిద్దెను. ప్రకృతివర్ణన అను రూపవర్ణనలను పొగనుగా నిర్వహించుటలో ఇతడు మిక్కిలిదిట్ట. నవనాథచరిత్ర సిద్ధినొందిన శివయోగుల చరిత్ర. ఈ నవనాథులలో మీననాథుడను వా డపార మహిమాన్వితుడు. రాజరాజు కుమారుడని లోకమున ప్రసిద్ధుడైన సారంగధరునికథ ఇందు మాళవదేశమున జరిగినట్లు వర్ణింపబడినది. ఖండితాంగుడైన సారంగుని మీననాథుడు కాపాడి సిద్ధులలో కలుపుకొనెను. గౌరన శైలి మృదువై జాతీయోక్తులకును, సామెతలకును ఆలవాలమై మిక్కిలి సరసముగా నుండును. హాస్యరస పోషణమున ఈత డందెవేసిన చేయి. నవనాథ చరిత్రము నందలి వంచక పురోహితుని కథయు, హరిశ్చంద్రోపాఖ్యానమందలి కలహకంఠీ కాలకౌశికుల వృత్తాంతమును ఇందుకు తార్కాణములు.

మడికి సింగన పద్మపురాణోత్తరఖండము, వాసిష్ఠ రామాయణము, భాగవత దశమస్కంథము అనువానినే కాక సకలనీతి సమ్మతమను సంకలన గ్రంథమునుగూడ రచించెను. పద్మపురాణోత్తరఖండము సంస్కృతము నందలి ఆ పురాణభాగమున కనువాదము. ఇందు మాఘస్నాన మాహాత్మ్యమును గురించిన కథలును, శ్రీకృష్ణ చరిత్రమును మనోహరముగా వర్ణింపబడినవి. ఈ కథలను వసిష్ఠమహర్షి దిలీపునకు చెప్పియుండెను. ఈ కావ్యము తెలంగాణమునందలి సబ్బి మండలమునకు ప్రభువైన ముప్పయభూపాలుని మంత్రి అగు వెలిగందల కందన మంత్రికి అంకితము చేయబడినది. వాసిష్ఠ రామాయణము సంస్కృతమునందలి జ్ఞాన వాసిష్ఠమునకు తెలుగు. వసిష్ఠ మహర్షికిని, శ్రీరామునికిని జరిగిన ఆధ్యాత్మిక సంవాదము లిందు సరళశైలిలో వర్ణింపబడినవి. భాగవత దశమ స్కందము ద్విపద కావ్యము. ఇతర స్కంధముల నాతడు తెలిగించినట్లులేదు. ఇతనిద్విపదరచన మిక్కిలి సరసముగా నున్నది. సకలనీతి సమ్మతమున పంచతంత్రము, నీతిసారము, కామందకము, బద్దెననీతి, భారతము మున్నగు పూర్వగ్రంథములనుండి చక్కని నీతిపద్యములు సంగ్రహింపబడినవి. నడుమనడుమ సింగన స్వయముగా వ్రాసిన పద్యములుకూడ నిందుగలవు. ఈతనిశైలి సరళమై సర్వజన సుబోధముగా నుండును.

దగ్గుపల్లి దుగ్గయ్య తాను శ్రీనాథుని బావమరదిననియు, తన కా మహాకవి వలననే కవిత్వ మలవడెననియు వ్రాసికొనియున్నాడు. కఠోపనిషత్తు నందును, భారతానుశాసనిక పర్వమునందును గల నాచికేతుని కథను వస్తువుగాగ్రహించి ఈతడు చక్కని ప్రబంధముగా సంతరించెను. ఇందు శాంతరసము ప్రధానమై యున్నది ఇందలి శైలి సులభ జాతీయ పదములతోడను, సామెత

తోడనుగూడి చాల రమణీయముగా ఉండును. ఇందలి కథయు అవి వెల్లడిచేయు నీతులును మిక్కిలి ఉదాత్తములుగా నుండును. ఈ యుగమునందలి ప్రశస్త రచనలలో ఇది ఒకటి.

కొరవి గోపరాజు (క్రీ. శ. 15వ శతాబ్ది పూర్వార్ధమున) సింహాసన ద్వాత్రింశిక అను కథాకావ్యమును రచించెను. భోజరాజు విక్రమార్కుని సింహాసనము నధిరోహింపబోవు నప్పు డందలి సాలభంజిక లతనిని వారించుచు చెప్పిన ముప్పదిరెండు చక్కని కథ లిందు వర్ణింపబడినవి. ఇందు గోపరాజు ఆయా సందర్భములందు ఆ కాలమునందలి విద్యల స్వభావమును, ఆచారములను ప్రదర్శించి తన సర్వజ్ఞతను సూక్ష్మపరిశీలనమును వ్యక్తము చేసినాడు. ఇందలి శైలి సహజమై కథనమార్గమున నడచుచుండును.

జగత్ప్రసిద్ధమైన సంస్కృత పంచతంత్రమును దూబగుంట నారాయణకవి అనువదించి (1470) మాధవవర్మ వంశీయుడయిన బసవ భూపాలుని కంకితము కావించెను. ఈ కావ్యము ప్రపంచమునందలి ఎల్లభాషలలోని కనువదింపబడి ఉండుటయే దీని అప్రతిమాన ప్రశస్తికి తార్కాణము. ఇందు మిత్రభేదము, సుహృల్లాభము, సంధి విగ్రహము, లబ్ధనాశము, అవిమృశ్యకారిత్వము, అను ఐదు భాగము లున్నవి. ఇందలి పాత్రలు చాలవరకు పశుపక్ష్యాదులే.అవి యొనరించు సంభాషణములు నీతి ధర్మములతో నిండారి అద్భుతములుగా నుండును. వీటి మూలమున కవి మానవుల మానసములకు నొప్పికలుగకుండ నీతి ధర్మములే కాక జీవిత రహస్యములను, రాజనీతి విశేషములను బోధించియున్నాడు. నారాయణకవి శైలి కథాకథనమున కనుగుణమై, సరళమై, ఎడనెడ హాస్యరసముతోకూడి మనోహరముగా నుండును.

ఈ యుగమునకు చెందిన విద్వత్కవులలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రు డొకడు (1490). ఇతడు పెక్కు గ్రంథములు రచించినను శృంగారశాకుంతల మను శకుంతలాపరిణయము, జైమిని భారతము అను రెండుకావ్యములు మాత్రమే ఉపలభ్యము లగుచున్నవి. ఇందు శృంగార శాకుంతలము, శకుంతలా దుష్యంతుల వివాహమును వర్ణించు శృంగార ప్రబంధము. పినవీరభద్రు డిందు భారతమునందలి కథనేకాక కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలమునందలి కథనుకూడ అనుసరించెను. ఆ నాటకమునందలి పెక్కు శ్లోకము లిందు సందర్భానుసారముగా ననుసరింపబడినవి. సంస్కృతమునందలి నాటకము ప్రబంధరూపము నొందుట కిది రెండవ ఉదాహరణము. శ్రీనాథుని శృంగార నైషధమువలె శృంగార శాకుంతలము కూడ తరువాత వెలసిన ప్రబంధరచనకు మార్గదర్శక మయ్యెనని చెప్పవచ్చును. జైమినిభారతమున భారతమునందలి అశ్వమేధపర్వములోని కథయే విపులముగా వర్ణింపబడినది. ఇందు విస్తృతములయిన కథ లనేకము లున్నవి. అశ్వమేధాశ్వముతో వేగిన భీమార్జునులు దానిని నరికట్టినవారి నోడించి, దిగ్విజయము కావించుట యిందలి ప్రధానవృత్తము. ప్రమీలకథ, బభ్రువాహనుని కథ, చంద్రహాస చరిత్ర, ఉద్దాలక సుహార్ష్ఠికథ, కుశలవోపాఖ్యానము మున్నగున వీందలి కథలలో ప్రసిద్ధములయినవి. పినవీరభద్రుని శైలి ఈ కావ్యమున పరిపక్వత నందినది. దీనిని రచించు సందర్భముననే అతడు 'వాణి నారాణి' అని చెప్పె నందురు. ఈ కావ్యము విజయనగరము పాలించిన సాళువ నరసింహరాయల కంకితము చేయబడినది. ఈతని రచనలో శ్రీనాథుని ఛాయలు పెక్కుచోట్ల గోచరించును.

నంది మల్లయ, ఘంట సింగనలు తెలుగునందలి మొదటి జంటకవులు (క్రీ. శ. 15-వ శతాబ్ది ఉత్తరార్థము) ప్రబోధ చంద్రోదయము, వరాహపురాణము అనునవి వీరి రచనలు. ఇందు ప్రబోధ చంద్రోదయము సంస్కృతమున కృష్ణమిశ్రుడను కవి రచించిన ఆపేరుగల వేదాంత బోధకమైన నాటకమునకు ప్రబంధరూపమైన అనువాదము. ఇందలి ప్రధానరసము శాంతము. కామ క్రోధ లోభమోహా వివేకాదులు, శ్రద్ధా విష్ణుభక్త్యుపనిషదాదులు ఇందలి పాత్రలు. మానవుని అంతరంగమునందు ఉత్తమ ప్రకృతులకును, దుష్ట ప్రకృతులకును జరుగు నైతిక సంగ్రామ మిందు వర్ణింపబడినది. తామసప్రకృతుల ఓటమియు, వివేకుని గెలుపును, ప్రబోధ చంద్రుని ఉదయమును చివర చక్కగా నిరూపింపబడినవి. క్లిష్టమైన వేదాంత విషయమునుకూడ నీజంటకవు లిందు రమణీయముగా సర్వజన సుబోధముగా వర్ణించుటతో తమ ప్రతిభను ప్రదర్శించినారు. ఈ ప్రబంధము చాల

కేతోపాఖ్యాన కృతికర్తయైన అనంతామాత్యుని గంగయకే అంకితము చేయబడినది. వరాహ పురాణమునందలి విశేషభాగము వ్రతదాన మహిమలతో నిండియుండును. అందుచే మల్లయ సింగన లందలి రసవంతములైన భాగములను మాత్రమే గ్రహించి వర్ణనాదులను పెంచి ఈ పురాణమును ప్రబంధమార్గమున రచించిరి. ఇందు దుర్జయరాజు వృత్తాంతమున శృంగారరసము చక్కగా పోషింపబడినది. విరహ మృగయా విహారాదు లిందు ప్రబంధోచితముగా వర్ణింపబడినవి. ఇందున్న అర్జునకి అను భిల్లాంగనకథయు, గౌతమమహర్షి కథయు, గౌరీకల్యాణ వృత్తాంతమును మిక్కిలి హృద్యములుగా నుండును. ఈ కావ్యము కృష్ణదేవరాయల తండ్రి అయిన నరసరాయల కంకితము చేయబడినది. కవులు శివభక్తి తత్పరులైనను వైష్ణవావతారకథాప్రధానమైన పురాణమును వర్ణించుట వారి సమబుద్ధికి తార్కాణముగా ఉన్నది. ఈ జంటకవుల రచన బాగుగాకలసి హెచ్చుతగ్గులు లేక ఏకకవి కర్తృకమువలెనే భాసిల్లుచుండును. వీరి కావ్యములలో కథా సందర్భమునుబట్టి ప్రౌఢమైన సంస్కృత శైలియు, సరళమైన యచ్చతెలుగు రచనయు, కూడ కానవచ్చుచుండును. ఘంట సింగనకు మలయమారుతకవి యను బిరుదముగలదు. నంది తిమ్మన ఇతని మేనల్లుడు.

వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము నాంధ్రీకరించి గుడ్లూరున కధిపతియైన రావూరి రాఘవరెడ్డి కంకితము చేసెను. (క్రీ. శ. 16-వ శతాబ్ది పూర్వార్ధము.) విష్ణు పురాణము సంస్కృతమున పరాశరకృతమని సూరన్న తెల్పియుండెను. ఇందు పూర్వభాగమున విష్ణుని అవతారకథలును, ఉత్తరభాగమున వ్రతధర్మ వేదాంతజ్యోతిశ్శాస్త్రములకు సంబంధించిన విషయములును వర్ణింపబడి యుండును. అందుచే సూరన రసప్రచన కనుకూలమైన పూర్వభాగమును మాత్రమే ఆంధ్రీకరించెను. ఇందలి కథలు పెక్కు భాగవతమునం దున్నట్టివే. ప్రహ్లాదుడు తన విష్ణుభక్తి మహిమచే హిరణ్యకశిపుని గూడ విష్ణుభక్తునిగా మార్చెనని ఇందు వర్ణింపబడినది. భాగవతమున వలెనే ఇందును శ్రీకృష్ణుని చరిత్రము మిక్కిలి రమణీయముగా నుండును. సూరన జడభరతోపాఖ్యానము, మాంధాతృ చరిత్రము, తారాశశాంకవృత్తాంతము అనువాని నిందు నేర్పుతో వర్ణించెను. కృష్ణరాయలు ఆముక్తమాల్యదయందలి ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము నిందుండియే గ్రహించెను. సూరనశైలి పురాణశైలి. ఇతని రచన దీర్ఘశృంగార వర్ణనల జోలికిపోక, ఔచిత్యమును విడువక, సంగ్రహమై సరళముగ నుండును.

ఆంధ్ర వాఙ్మయము మొదట పురాణానువాదములతో నారంభించినది. శివకవి యైన నన్నె చోడుడు స్వతంత్ర మార్గము నవలంబించి కుమార సంభవమున ప్రబంధబీజములు వెదజల్లెను. ఎఱ్ఱన సోమనలు పురాణములందే ప్రబంధసౌధమునకు పునాదులు తీర్చిరి. శ్రీనాథుని కావ్యములలో ఆ పద్ధతి పరిపుష్టినొంది స్థిరమైన ఆకృతిని దాల్చినది. అతని కాలమున కావ్యనాటకములకు అనువాదములేకాక పెక్కు స్వతంత్ర కావ్యములు కూడ వెలువడినవి. ఈరీతిగా రాయలకాలమునాటికి స్వతంత్ర ప్రబంధరచనానుకూలమైన పరిస్థితి ఏర్పడినది.

ది. వేం. అ.

**ఆంధ్రవాఙ్మయ చరిత్రము-II (క్రీ. శ. 1509-1800):-** క్రీ. శ. 15 వ శతాబ్దిచివరకు వెలసిన ఆంధ్ర వాఙ్మయమున ఎడనెడ కొన్ని స్వతంత్ర కావ్యములుకూడ కనబడుచున్నను బాహుళ్యముమీద అప్పటి రచనలు పెక్కు సంస్కృతమునుండి అనువదింపబడినవే. తరువాత పెద్దనాదులు పురాణములనుండి ఇతివృత్తమును గ్రహించి, వర్ణనాదులచే దానిని పెంచి ధీరోదాత్తనాయకములును, శృంగార రసప్రధానములును, పంచమాశ్వాస పరిమితములును ఐన కావ్యములను, అలంకారికమైన శైలిలో వ్రాయుట కారంభించిరి. వీటికే ప్రబంధములని పేరు. ఉత్పత్తినిబట్టి చూచినచో ప్రకృష్టమైన బంధము (కూర్పు) గలఏకావ్యమునైనను ప్రబంధమని చెప్పవచ్చును. తిక్కన తాను రచించిన భారత భాగమును ప్రబంధమండలి యని పేర్కొనెను. ఎఱ్ఱన తన నృసింహపురాణమును ప్రబంధమని వ్యవహరించెను. నన్నిచోడుడు, నాచనసోమన శ్రీనాథుడు, పినవీరభద్రుడు మున్నగువారి రచనలలో ప్రబంధ లక్షణములు పెక్కు కానవచ్చును. కాని అట్టి కావ్యములసంఖ్య ఆ రోజులలో రచింపబడిన ఇతర రచనల సంఖ్యతో పోల్చిచూచినచో మిక్కిలి స్వల్పమగుటచేతను క్రీ. శ. 1500 తరువాత అట్టికావ్యములే విరివిగా రచిం

బడుటచేరను, ఈయుగమునకు (క్రీ. శ. 1500-1600) ప్రబంధయుగమను రూఢినామ మేర్పడినది. దీనిని రాయల యుగము, నాయకరాజ యుగము లేక దక్షిణాంధ్ర యుగము అని రెండు భాగములుగా విభజింపవచ్చును.

అష్టదిగ్గజములని ప్రసిద్ధివడసిన మహాకవుల నాదరించి, వారిచే రసవత్తరములైన మహాప్రబంధములను రచింప జేసి, ఆంధ్రవాఙ్మయమున దనకాలము సువర్ణయుగమై యలరారు నట్లొనర్చినవాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు. ఇతడు క్రీ. శ. 1509 మొదలు 1530 వరకును విజయనగర సామ్రాజ్యమును పాలించెను. సంస్కృతమునకు భోజమహారాజువలె ఆంధ్రమునకీ మహారాజు అనన్యసామాన్యమైన అభ్యుదయమును కలిగించుటచే ఇతనికి ఆంధ్రభోజుడను సార్థకనామము కలిగినది. ఇతడు పలువురు పండితులను కవులను పోషించుటయేకాక, తానుకూడ విద్వత్కవియై సంస్కృతాంధ్రములందు బహుగ్రంథములు రచించుట ఇతని కావ్యగీతీప్రియత్వమునకు తార్కాణము. ఇతడు స్వరచితమైన ఆముక్తమాల్యదయను ఆంధ్రప్రబంధము నవతారికలో, మదాలస చరిత్ర, సత్యావధూప్రీణనము, సకలకథా సార సంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి మొదలైన సంస్కృత గ్రంథములను రచించినట్లు చెప్పుకొని యున్నాడు. కాని అవి ఇప్పుడు లభ్యము లగుటలేదు.

రాయలు రచించిన ఆంధ్రప్రబంధము ఆముక్తమాల్యద. గోదాదేవీ శ్రీరంగేశ్వరుల ప్రణయ వృత్తాంతమిందలి ప్రధాన వస్తువు. గోదాదేవి మొదట ధరించిన పూలమాలలు తరువాత శ్రీరంగేశ్వరుని కర్పింపబడిన హేతువుచే ఆమెకు ఆముక్తమాల్యద అను పేరు కలిగినది. రాయలు సహజముగా వైష్ణవమతమునందు అభిమానము కలిగి తన్మత ప్రచారమునం దాసక్తి వహించినవాడగుటచే ఆముక్తమాల్యదయందు ప్రసక్తానుప్రసక్తముగా విష్ణుపారమ్యమును ప్రదర్శించు నుపాఖ్యానములు కొన్ని చేర్చియుంచెను. ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము, యామునాచార్య చరిత్రము, మాలదాసరి కథ అందు ముఖ్యములైనవి. అవాంతర ప్రవేశితములైన ఈ కథలచేతను, రాయలు కావించిన దీర్ఘములైన గ్రీష్మ వర్షా శరద్వసంతర్తు వర్ణనములచేతను, యామునాచార్యునిచే కుమారునికి చెప్పించిన రాజనీతివిస్తారముచేతను, చివరి రెండాశ్వాసములలో తప్ప మిగిలినవానిలో ప్రధాన కథకు సంబంధించిన వృత్తాంతము మృగ్యమై యుండుటచేతను ఈప్రబంధమున వస్త్వైక్యమున కించుక భంగము వాటిల్లినదని చెప్పవచ్చును. ఇందలి కథావర్ణన పరిపాటిని పరికించినచో ఇది యొక చిన్న విష్ణు పురాణమువలె కనిపించును.

ఉపాఖ్యాన వర్ణనావిస్తృతులచే ప్రధానకథ మరుగు పుచ్చబడినను ఆముక్తమాల్యదకు ప్రబంధవాఙ్మయమున ఉన్నత స్థానము కల్పించు గుణవిశేషము లందు పెక్కులున్నవి. రాయలు వర్ణించిన గోదాదేవి విరహము ఇతర ప్రబంధములందలి విరహవర్ణనకంటె విశిష్టమై దైహికమును, నీచమునైన మోహమును కాక హార్దమును, పవిత్రమునైన అనురాగమును ప్రకటించుచున్నది. ఇందలి ఋతువర్ణనములు సూక్ష్మాతిసూక్ష్మ వివరములతో కూడి ఆయా ఋతువులను పఠితలకు ప్రత్యక్షము చేయుచు రాయల ప్రకృతిపరిశీలన పాటవమును ప్రకటము కావించుచున్నవి. ఋతువుల నింత విస్తృతముగను, సహజ మనోహరముగను వర్ణించిన కవు లాంధ్రవాఙ్మయముననే కాక సంస్కృతమునకూడ లేరనినచో అతిశయోక్తి కాజాలదు. రాయల రాజనీతివర్ణనము కేవల గ్రంథపఠనజన్యము కాక అనుభవసిద్ధ మగుటచే మిక్కిలి సహజమై అలరారుచున్నది.

ఉపాఖ్యానములను రచించుటలో రాయలు గొప్ప నేర్పు ప్రదర్శించెను. ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానమును, మాలదాసరి కథయు కథానిర్మాణ శిల్పమునకును, పాత్ర చిత్రణమునకును, సంభాషణ నైపుణ్యమునకును నెలవులై మిక్కిలి హృద్యములుగా నున్నవి. ఖాండిక్య కేశిధ్వజులయు, మాలదాసరియొక్కయు, పాండ్యరాజుభార్యయొక్కయు శీలములు అతి పవిత్రములై ఆదర్శప్రాయములుగ నున్నవి. రాయలు మహారాజయ్యు సామాన్య ప్రజల గృహజీవితమును, సుఖదుఃఖములను, ప్రకృతి యందలి వివిధప్రాణుల స్వభావములను చక్కగా వర్ణించి యుంచెను. ఆనాటి ప్రజాజీవితమునకు ఆముక్తమాల్యద ఆదర్శమై భాసిల్లుచున్నది.

ఆముక్తమాల్యదలో పలుచోట్ల రాయలకు వేదవాఙ్మయముతోడను, ఉపనిషత్తులతోడను, జ్యోతిష ప్రభృతి

శాస్త్రములతోడను, పురాణములతోడను గల గాఢ పరిచయము వ్యక్త మగుచున్నది. విష్ణుచిత్తుడును, యామునాచార్యుడును అన్య మతములను ఖండించుచు విష్ణుమహత్త్వమును ప్రదర్శించునపుడు రాయలు బ్రహ్మసూత్రములనుండియు, ఉపనిషత్తులనుండియు పెక్కు వాక్యములను ఉద్ధరించి యుండెను. వైష్ణవమత రహస్యముల నెరుగుటకై అతడు ప్రస్థానత్రయమునే కాక దివ్య ప్రబంధములను కూడ క్షుణ్ణముగా పఠించినట్లు తోచును. ఆ యా సందర్భములం దాతడు ప్రదర్శించిన కవి సమయ పురాణకథాపరిజ్ఞాన మచ్చెరువు కలిగించుచుండును.

ఆముక్తమాల్యదయందలి శైలి మిక్కిలి ప్రౌఢముగా నుండును. రాయలు దీర్ఘసమాసములను వాడుటయే కాక పలుచోట్ల వాక్యయోజనయందు సంస్కృతభాషా సంప్రదాయమునే అనుసరించుచుండును. ఎడనెడ ద్రావిడ పదములును, మారుమూలపదములును కూడ గోచరించును. అతడు చిన్న సమాసమున గంభీరమైన యర్థము నిమిడింప యత్నించినచోట్లు పెక్కు కలవు. అందుచేతనే ఈ కావ్యము పండితైకవేద్యమై సామాన్యులకు దురవగాహమగుట సంభవించినది. ఇట్లని రాయలు ఆముక్తమాల్యదలో సులభ జాతీయపదములను రమణీయముగా నుపయోగించినచోట్లు కొన్ని లేకపోలేదు. "కుంపటిలో తామర", "గుమ్మడికాయంత ముత్తెము", "ఇంటిలో నేదుమల్లు", జక్కుల బోనంబులు" మొదలగు చక్కని జాతీయములతోడను, సరస సరళ సంభాషణములతోడను, నిసర్గ వర్ణనలతోడను కూడిన పద్యములు పెక్కు అతడు రచించియుండెను. కాని మొత్తముమీద ఆముక్తమాల్యదయందలి పాకము నారికేళపాక మనియే చెప్పనగును. తెలుగునందలి ప్రౌఢ ప్రబంధములలో ఆముక్తమాల్యద ఉత్తమస్థానము నాక్రమించి ప్రత్యేక గౌరవము నార్జించిన దనుటలో అత్యుక్తి యుండజాలదు.

రాయల ఆస్థానమున అష్టదిగ్గజము లను పేరుతో ఎనమండుగురు మహాకవులుండి రని ప్రసిద్ధి. వీరందరును తెలుగుకవులే యని నిశ్చయముగా చెప్పజాలము. అప్పటి తెలుగుకవులలో వయస్సుచేతను పాండిత్యముచేతను మొదట పేర్కొనదగినవాడు అల్లసాని పెద్దన్న (క్రీ. శ. 1475-1535). ఇతడు "స్వారోచిషమనుసంభవ"మను మను చరిత్రను, హరికథాసార మను మరియొక గ్రంథమును రచించెను. హరికథాసారమింతవరకు ముద్రితము కాలేదు. పెద్దన తన మనుచరిత్రమును రాయలవారికే అంకితము కావించెను. రాయలు పెద్దనను సమ్మానించినవిధము అనన్యసామాన్యమైనది. అతడామహాకవిని కోకటగ్రామాద్యనేకాగ్రహారములొసగియు, గండపెండేరమును స్వయముగా కాలికి తొడిగియు, ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూతయొసగి ఎక్కించుకొనియు, పలు విధముల మన్నించుటయేగాక "ఆంధ్రకవితాపితామహ" యను బిరుదమును ఒసగి ఆదరించెను. ఆంధ్రదేశమున భారత భాగవతముల తరువాత మనుచరిత్రమునకే ప్రజాదరము హెచ్చు. అందుకు పెద్దన ఆకావ్యమున ప్రదర్శించిన రచనాకౌశలమును, పాత్రపోషణ విధానమును కారణములు. అతడు మనుచరిత్రమునందలి కథను మార్కండేయ పురాణమునుండి గ్రహించి, వర్ణనాదులచే పెంచి, చక్కని ప్రబంధముగా రూపొందించెను. ఇందు మొదటి రెండాశ్వాసములందును శృంగార రసాభాసముతోకూడిన వరూధినీ ప్రవరాఖ్యుల కథయు, తరువాత వరూధినీ గంధర్వుల సంభోగశృంగారమును, పిమ్మట స్వరోచి వృత్తాంతమును వర్ణింపబడియుండుటచే ఈ ప్రబంధమున వస్త్వైక్యము కొరవడియున్నదని విమర్శకులు తలతురు. ద్వితీయాశ్వాసమున శ్రోత్రియుడు, జితేంద్రియుడు ఐన ప్రవరుని శాంత ప్రవృత్తికిని, స్వేచ్ఛాచరితయైన వరూధిని కామ ప్రవృత్తికిని సంఘర్షము చక్కగా వర్ణింపబడినది. వరూధినీ ప్రవరుల పాత్రలను సజీవములుగా వర్ణించుటలో పెద్దన చాలనేర్పు ప్రదర్శించెను. ఈతనిశైలి ప్రౌఢమై ధారాశుద్ధి శోభితమై, ఎడనెడ జాతీయములతోడను, సామెతలతోడను గూడి అల్లసానివాని అల్లిక జిగిబిగి అను ప్రసిద్ధినిగడించినది. హిమవత్పర్వతమును, స్వరోచి వేటను, స్వరోచికిని రాక్షసునికిని జరిగిన యుద్ధమును వర్ణించుటలో పెద్దనయొక్క ప్రకృతి పరిశీలనమును, సహజవర్ణన పాటవమును, భావనాశక్తియు వెల్లడియగును. యుద్ధ వర్ణన సందర్భమున పెద్దన రసానుగుణముగా శబ్దాలంకార ప్రీతిని, ఛందోవైవిధ్యమును ప్రకటించెను. మానవ హృదయమున జరుగు వివిధభావసంఘర్షములను వర్ణించుటలో ఇతడు దిట్ట. రాయల ఆస్థానమున గండపెండే

మును గ్రహించుటకు ముందుచెప్పిన ఉత్పలమాలికనుబట్టి ఇతడాశుధారాకవిత్వమునకూడ నేర్పరియని తెలియు చున్నది.

రాయల దేవేరులలో నొకతెయైన తిరుమలదేవితో నందితిమ్మన అరణముగా వచ్చెనని చెప్పుదురు. ప్రస్తుతము వసుచరిత్రలో కనవచ్చు "నానాసూనవితాన వాసనల" అను ముక్కును వర్ణించు పద్యమును భట్టుమూర్తి ఇతని నుండియే గ్రహించెననియు, అందుచే ఇతనికి ముక్కుతిమ్మన అను పేరుకలిగెననియు ప్రవాదముకలదు. కాని ఇందెంత సత్యమున్నదో చెప్పజాలము. ఇతడు రచించిన ప్రబంధము పారిజాతాపహరణము. ఇందవతారికలో మనుచరిత్రలోవలెనే కృతిభర్తయైన కృష్ణరాయలయు, తత్పూర్వులయు గుణగణములును పరాక్రమాదులును విపులముగా వర్ణింపబడినవి. ఈ రెండు గ్రంథములలో కావింపబడిన రాయల దిగ్విజయములను బట్టి మను చరిత్రము కంటె పారిజాతాపహరణమే ముందు రచింప బడియుండు నని (క్రీ. శ. 1515) విమర్శకులు ఊహించు చున్నారు. పారిజాతాపహరణమునందలి కథ సంస్కృత హరివంశమునుండి గ్రహింపబడినది. తిమ్మన కథలో చేసిన మార్పులు చాలతక్కువ. అందు కృష్ణుడు సత్యభామను అనునయించుచు ఆమెకు నమస్కరింపగా ఆమె తన యెడమకాలితో నతనితల తన్నుటయు, అట్టి సందర్భమున కూడ కృష్ణుడు కుపితుడుకాక రసజ్ఞుడై ఆమెతో సందర్భోచిత సరససల్లాపములొనరించుటయు ముఖ్యము లైనవి. రాయ లేదోకారణమున తిరుమలదేవిపై కోపించి ఆమెతోమాటాడుట మానివేయగా అతనికి ప్రియానునయ విధానమును ప్రబోధము కావించుటకై తిమ్మన అమూలక మైన ఈఘట్టమును కల్పించెనని చెప్పుదురు. పారిజాతాప హరణమునందలి ప్రథమాశ్వాసము శృంగారరసపూరితమై మిక్కిలి మనోహరముగా నుండును. ఇందు సత్యభామ ప్రౌఢత్వమును, మానినీత్వమును చక్కగా వర్ణింపబడినవి. తక్కిన ఆశ్వాసములలో చంద్రోదయ, సూర్యోదయ, ప్రయాణ, వనవిహార, యుద్ధాదులు ప్రబంధోచితములుగా వర్ణితములై యున్నవి. ప్రకృతివర్ణనమున తిమ్మన చాల మెలకువచూపెను. పారిజాతాపహరణ ప్రబంధమున చివర పుణ్యకవ్రత వృత్తాంతము కలుపుట అనావశ్యకమని కొందరందురు. తిమ్మనశైలి మృదుమధురమై, ఎక్కడను కుంటుపడక, మకరంద ప్రవాహమువలె సాగిపోవును. అందుచేతనే 'ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు' అను వాడుక కలిగినది. ఈతని వర్ణనలు భావగంభీరములును, ఔచిత్య శోభితములునై యొప్పారును. కాని ద్వితీయ తృతీయాశ్వాసములందలి వర్ణనలు అతిదీర్ఘములై కథా గమనమున కించుక ఆటంకమును కలిగించుచున్నవి. మృదువులైన శృంగార భావములను రసానుగుణమైన శైలిలో, మనోహరముగా వర్ణించుటలో తిమ్మన కృత హస్తుడు.

మాదయగారి మల్లనకూడ రాయలవారి ఆస్థానమం దుండినట్లు రాయవాచకము వలన తెలియుచున్నది. ఇతడు రాజశేఖర చరిత్రము అను ప్రబంధమును రచించి తిమ్మరుసు మంత్రికి అల్లుడైన నాదెండ్ల అప్పామాత్యునికి అంకితముచేసెను. హేమధన్వుని కుమారుడైన రాజశేఖ రుడు సింధురాజు కూతురైన కాంతిమతిని వివాహ మాడుట ఇందలి ఇతివృత్తము. ఇందలి కథాకల్పనలో వైచిత్రి అంతగా కానరాదు. కాని రాజశేఖరునకును కాంతిమతికిని కాళికాదేవి ఇచ్చిన చిలుక నడిపిన రాయ బారము రమ్యముగా నుండును. పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమునందలి శుచిముఖి ఈ చిలుకకు శిష్యురాలని చెప్పవచ్చును. రాజశేఖర చరిత్ర పరిమాణ మున చిన్నదయ్యును మిక్కిలి రసవంతముగా నుండును. రసవంతముగా కవిత్వము చెప్పజాలనిచో అసలుకవిత చెప్పకయేయుండుట మేలని మల్లన వ్రాక్రుచ్చెను. ఈతని గ్రంథమున వర్ణనలు నాతిదీర్ఘములును ఔచిత్యపూరిత ములునై యుండును. శృంగారరసవర్ణనమునకూడ ఇతడు చాల నిగ్రహము ప్రదర్శించెను. ఈతనిశైలి ప్రసాదగుణ భూయిష్ఠమై ముద్దులొల్కుచుండును. పాత్రోచితముగను సహజముగను భావములను వర్ణించుటలో ఇతడు కడు నేర్పరి.

"స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కుల కేలకల్గెనో యతులిత మాధురీమహిమ" అని రాయలవారిచే ప్రశం సింపబడిన ధూర్జటి మహాకవి శ్రీ కాళహస్తి మాహాత్మ్యము అను క్షేత్రమాహాత్మ్యమును రచించెను. శ్రీ కాళ హస్తీశ్వర శతకమితడు రచించినదా కాదా అని కొందరు

సందేహించుచున్నారు. కాని కవితాధోరణినిబట్టిచూడ అది ఈతని కృతియేయని తోచుచున్నది. ఈశతక మాంధ్ర శతక వాఙ్మయమునకు తలమానిక మని చెప్పదగినది. ఇందు కవి పూర్వజీవితమున తాను గడపిన వర్తనమును గూర్చి అనుతాపమును వెల్లడించుచు ఆత్మపరీక్ష కావించు కొని యున్నాడు. మదాంధులైన రాజులయుద్ధతిని, వారవనితాసక్తిని, భోగభాగ్యములను ఇం దతడు నిరసించిన విధముచూడ వయస్సు పరిణత మగుకొలది అతడు విషయ పరాఙ్ముఖుడై వైరాగ్య తత్పరుడగుట తోచుచున్నది. ఇందలిశైలి ప్రౌఢమై ఎడనెడ స్వతంత్ర ప్రయోగములతోగూడి అత్యంత రమణీయముగానున్నది. ఇందలి పెక్కుపద్యములు ధూర్జటి శివభక్తి విశేషమును వెల్లడించుచున్నవి. తాను రచించిన శ్రీకాళహస్తిమాహాత్మ్యమును అతడు శివునికే అర్పించెను. అందు దక్షిణ కైలాస మని ప్రసిద్ధిగన్న శ్రీ కాళహస్తి క్షేత్రమహాత్త్వ మును దెల్పు కథలు వర్ణింపబడినవి. సంస్కృతమున స్కాందపురాణమున గల శ్రీ కాళహస్తి మాహాత్మ్యమే దీనికి మూలము. ఇందు మానవులేకాక తిర్యక్కులుకూడ శివభక్తిని ప్రదర్శించి ఎట్లు కైవల్యము నందజాలెనో వర్ణింపబడినది. ఇందలి కథలలో భక్తిపరవశుడై శివునికి తన రెండుకన్నులను పెరికియిచ్చిన తిన్నడను పుళిందరాజ కుమారునికథయు, మహాకవియై శివుడు వ్రాసిన పద్య ములో కూడ తప్పుపట్టిన నత్కీరుని కథయు రసపూరిత ములై అతి మనోహరములుగా నుండును. ధూర్జటిశైలి సమాసభూయిష్ఠమయ్యు ఎడనెడ, లలితపదకోమలమై రసానుగుణ పదప్రయోగముతోకూడి సహృదయరంజ కముగా నుండును. ఈ కావ్యమునందలి వర్ణనలు మిక్కిలి సహజములై కవిప్రకృతి పరిశీలనపాటవమును వెల్లడించు చున్నవి. తిన్ననికథయందలి ఆటవికజీవిత వర్ణనమును, నత్కీరుని కథయందలి దుర్భిక్షవర్ణనమును, స్వర్ణముఖీ ప్రవాహవర్ణనమును ఇందుకు నిదర్శనములు. ధూర్జటి పోతనాదులవలె కవిత్వమొక దివ్యకళావిశేష మనియు, దానిని ఈశ్వరారాధనమునకే వినియోగించుట యుక్త మనియు తలచిన మహనీయుడు.

అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయ మను కావ్యమును వ్రాసి రామరాయల మేనల్లుడైన గొబ్బూరి నరసరాజున కంకితము కావించెను. ఇతడు రాయలు సంస్కృతమున వెలయించిన సకలకథాసారసంగ్రహ మును తెలిగించి ఆతనికే అంకితము చేయదలచె నని చెప్పు దురు. ఆగ్రంథ మిప్పుడు లభ్యమగుటలేదు. రామభద్రుడు రామాభ్యుదయమున రామాయణకథను ప్రబంధరీతిని రచింపదలచినవా డగుటచే అందు ఉద్యానవిహార పుష్పాప చయ జలక్రీడాదు లగు ప్రబంధోచితము లగు వర్ణనలు ప్రవేశపెట్టెను. అవి మనోహరముగనే యున్నను కొన్ని చోట్ల ఔచిత్యదూరములుగా నున్నవి. విశ్వామిత్రమహర్షి సీత సౌందర్యమును వర్ణించుపట్లను, ఋష్యశృంగుని కథలో వేశ్యలమాయలను, విభ్రమములను వర్ణించు పట్లను, ఇతడు కొంచెము మేరమీరినట్లు కానిపించును. ఇతనిరచన ప్రౌఢమైన సంస్కృతసమాసములకును లలిత కోమలములైన తెలుగుపదములకును నెలవై మనోహర ముగా నుండును. ఇతనికి శ్లేష యమకానుప్రాసాది శబ్దా లంకారములందును, చిత్రకవిత్వమందును ప్రీతిమెండు.

పింగళిసూరనార్యుడుకూడ అష్టదిగ్గజములలోని వాడే అని లోకమున వాడుక. కాని అతడు క్రీ. శ. 16 వ శతాబ్ది ఉత్తరార్ధమున జీవించెనని కొందరును క్రీ. శ. 17 వ శతాబ్ది మొదటిపాదమువరకుకూడ నుండెనని కొందరును చెప్పుచున్నారు. రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము అను ఇతని మూడురచనలు మాత్రమే ఇప్పుడు ఉపలభ్యము లగు చున్నవి. ఇతడు తాను వ్రాసితి నని చెప్పుకొన్న గరుడ పురాణము నష్టమైనది. సూరన మిక్కిలి ప్రతిభావంతుడు. ఇతని కావ్యములు మూడును క్రొత్తదనముతో విలసిల్లుచు అతని పాండిత్య ప్రతిభాకళాభిజ్ఞతలను చాటుచున్నవి.

రాఘవపాండవీయము ద్వ్యర్థికావ్యము. వేములవాడ భీమకవి ఇట్టి కావ్యమొకటి వ్రాసె నని ప్రతీతికలదు గాని అది లభ్య మగుటలేదు. ఇందు రామాయణభారత కథలు రెండును జోడింపబడినవి. ఇది చదువునప్పుడు పఠిత ఎట్టి క్లేశమును లేకుండనే ఒకసారి రామాయణ కథను ఒకసారి భారతకథను స్పష్టముగా గ్రహింప జాలును. సూరన ఇందు వివిధములైన శ్లేషలను వాడి సంస్కృతాంధ్రములందు తనకుగల పాండిత్యవిశేషమున ప్రకటించెను. సామాన్యముగ ద్వ్యర్థికావ్యములందు రస

భావౌన్నత్యము ప్రకటించుటకు అంతగా అవకాశ ముండదు. కాని సూరన ఇందు కావించిన కొన్ని వర్ణనములందును, ప్రకటించిన భావములందును సామాన్య కావ్యములందువలెనే కవితా చమత్కార మెంతో కాన బడుచున్నది. ఈకావ్యమును అతడు అకుపీటి పెద్ద తిమ్మ రాజునకు అంకితము కావించెను.

సూరన కీర్తిసౌధమునకు మూలస్తంభమని చెప్పదగినది కళాపూర్ణోదయము. ఇది కల్పితకథావస్తుకమైన అద్భుతకథాకావ్యము. ఇంతకుపూర్వము ప్రఖ్యాతవస్తుకములైన కావ్యములనేకాని ఇట్లు కల్పితకావ్యములను వ్రాసిన కవు లెవ్వరును లేరు. ఇందు కలభాషిణి అను వేశ్య నాయిక. ఇందలి కథాకల్పనాచాతుర్యము అప్రతిమానమైనది. కథాకథనమున నిందు కాలక్రమపద్ధతిని కాక నవలలోవలె కార్యకారణపద్ధతిని సూరన అవలంబించి కథామధ్యవృత్తాంతముతో కావ్యము నారంభించెను. ఇందాతడు శృంగారరసమునకు సంబంధించిన వైవిధ్యమును వివిధమనఃప్రవృత్తులను చక్కగా ప్రదర్శించెను. ఈతడు రచించిన సుగాత్రీశాలీనుల కథ అమలిన శృంగారమున కాలవాలమై అతిరమణీయముగా నుండును మాయాసత్య రంభానలకూబరుల కథలో అతడు చూపిన చమత్కారము అద్భుతావహముగా నుండును. మాయాసత్యరంభల వాగ్వివాద మెంతో సహజమై సవతుల స్వభావమును స్పష్టము చేయుచున్నది. ఇచ్చటి సంఘటనము ఆంగ్లనాటకకవిసార్వభౌముడైన షేక్స్పియరు యొక్క కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్సులోని సంఘటనమును పోలియుండు నని విమర్శకుల అభిప్రాయము. పాత్ర నిర్మాణమునను, రసపోషణమునను ఇందు సూరనచూపిన నేర్పు అనన్యసామాన్యమైనది. ఇట్లు కల్పితకథాకావ్యమును అద్భుతముగా సృష్టించియు నతడు చివరి ఆశ్వాసములలో మధురలాలసా కళాపూర్ణుల శృంగారమును వర్ణించుపట్ల సాధారణ ప్రబంధపద్ధతినే అవలంబించెను. ఈ కావ్యము నతడు నంద్యాల కృష్ణరాజునకు అంకితము చేసెను.

ప్రభావతీప్రద్యుమ్నమున శ్రీకృష్ణుని కుమారుడగు ప్రద్యుమ్నుడు వజ్రనాభుడను రాక్షసరాజుకుమార్తెయగు ప్రభావతిని వలచి పరిణయమాడిన కథ వర్ణింపబడినది. ఇది శ్రవ్యప్రబంధ మే యయ్యును ఇందలి కథ యంతయు పాత్రల సంవాదరూపమున సాగుటచే ఒక దృశ్యకావ్యమువలె కనిపించును. ప్రభావతీ ప్రద్యుమ్నుల నడుమ ప్రణయదౌత్యము నడపిన శుచిముఖి అను రాజహంసి వాక్చాతుర్యమును కార్యసాధన కౌశలమును వర్ణించుటలో సూరన అప్రతిమానమైన నేర్పు ప్రదర్శించెను. అతడీచక్కని ప్రబంధమును తన తండ్రిపేర నంకితము కావించి అపూర్వమైన పితృభక్తిని వెల్లడించెను.

సూరన మహాపండితుడు. కథారసానుగుణముగ ఇతని శైలి ప్రౌఢత్వము నొందుచుండినను అది సాధారణముగా మృదుమధురమైన సరళగతినే నడచుచుండును. జాతీయములను, సామెతలను వాడుటలో ఇతడు కడునేర్పరి. సంభాషణముల నడుపుటయందును, పాత్రల చిత్తవృత్తుల చిత్రించుటయందును ఈతడు తిక్కన సోమయాజికి సాటి కాజాలును. శ్లేషరచనయం దీతడు అద్వితీయుడు. ప్రతిభావంతులైన ఆంధ్రమహాకవుల శ్రేణిలో సూరనకు ఉన్నతమైన స్థానము కలదు.

రామరాజభూషణుడను బిరుదనామముగల భట్టుమూర్తికూడ అష్టదిగ్గజకవులలో నుండెనో లేదో చెప్పజాలము. కృష్ణదేవరాయల అల్లుడయిన అళియరామరాయల కొలువున కీతడు భూషణమై ఉండుటచే ఇతనికి రామరాజభూషణు డను బిరుదము కలిగినది. ఇతని మొదటిపేరు మూర్తి యనియు బట్టుకులమువా డగుటచే బట్టుమూర్తియను ప్రచారము కలిగె ననియు చెప్పుదురు. ఇతడు గొప్పపండితుడు. అవధానములందును, ఆశుకవిత్వమునందును ఆరితేరినవాడు. ఇతడు మొదట హనుమంతునికిని, తరువాత శ్రీరామచంద్రునికిని భక్తుడు. సంగీతకళా రహస్యనిధి. ఇతని రచనలలో ఇతనికిగల బహుశాస్త్రపాండిత్యము వ్యక్తమగును.

ఇతడు నరసభూపాలీయ మను నామాంతరముగల కావ్యాలంకారసంగ్రహమును, హరిశ్చంద్రనలోపాఖ్యానమను ద్వ్యర్థికావ్యమును, వసుచరిత్రమను మహాప్రబంధమును రచించెను. ఇందు మొదటిది సంస్కృతమున విద్యానాథుడు రచించిన ప్రతాపరుద్ర యశోభూషణము ననుసరించి వ్రాయబడిన లక్షణగ్రంథము. ఇందు కావ్యధ్వని రసాలంకారములను గూర్చియు నాయికానాయకు

లను గూర్చియు, గుణదోషములను గూర్చియు వివరింప బడినది. ప్రతాపరుద్ర యశోభూషణమున నున్న నాటక ప్రకరణ మిందు లేదు. అందు లక్ష్యములన్నియు ప్రతాప రుద్ర వర్ణనపూర్వకములై యుండ ఇందు అళియరామ రాయల మేనల్లుడును, ఓబయరాజు కుమారుడు నగు నరస భూపాలుని వర్ణించునట్టివిగా నున్నవి.

భట్టుమూర్తి రచనలలో శ్రేష్ఠమైనదియు ఆంధ్ర వాఙ్మయమునకు అలంకారమని చెప్పతగినదియు వసు చరిత్రము. ఇది రామరాయల తమ్ముడును, తాళికోట యుద్ధమైనపిమ్మట, విజయనగర రాజ్యము నేలినవాడును అగు తిరుమలరాయలకు అంకితము చేయబడినది. వసు మహారాజు శుక్తిమతీకోలాహలుల పుత్రిక యైన గిరికను వలచి పెండ్లియాడిన వృత్తాంతము ఇందలివస్తువు. భట్టు మూర్తి, కథను మహాభారతమునుండి గ్రహించి, ఎడనెడ వర్ణనములనుచేర్చి ఈ మహాప్రబంధమును నిర్మించెను. ఇందు కథారామణీయకమంతగా కానరాదుకాని, కవితా పాండిత్య ప్రకర్షయందును, భావోన్నతియందును, రస పోషణమునందును, శ్లేషధ్వని కల్పనలందును ఇది అద్వి తీయముగా నుండును. ప్రబంధలక్షణములన్నియు ఇందు కానవచ్చును. ద్వితీయాశ్వాసమున శుక్తిమతీకోలాహలుల వృత్తాంతము వర్ణించువట్ల భట్టుమూర్తిచూపిన కవితా చమత్కారమును, నాయికా నాయకత్వా రోపణమును అద్భుతములుగా నుండును. తృతీయాశ్వాసమునందలి విరహాదివర్ణనలు అనన్యసామాన్యములు. లతికాసంవృత గాత్రుడైన వసురాజు కపటముని వేషధారియగు తన నర్మసఖుని సూచన ననుసరించి బయల్పడుపట్టున దృశ్య కావ్యలక్షణములు గోచరించును. ఇందలి ప్రకృతివర్ణనలు సహజసుందరములై యుండును. భట్టుమూర్తిశైలి ప్రౌఢమయ్యు మృదుమధురమై సంగీతమున కనువుగా గోచరించును. లలనాజనాపాంగేత్యాది సీసపద్యముల నడక అత్యంత హృద్యముగా నుండును. వసుచరిత్ర సంస్కృతమునకు కూడ అనువదింపబడుటయే దీని ఔత్కృష్ట్యమునకు తార్కాణము. ఆంధ్రప్రబంధ వాఙ్మయ తారహారమున కిది నాయకమణి యని చెప్పవచ్చును. తరువాతి కవు లెందరో దీని ననుకరించి యుండుటచే వారి రచనలకు పిల్ల వసుచరిత్ర లనుపేరు కలిగినది.

హరిశ్చంద్రనలోపాఖ్యానమను ద్వ్యర్థికావ్య మీతని తుదిరచన. ఇందు నల హరిశ్చంద్ర మహారాజుల కథలు చక్కగా జోడింపబడినవి. రామాయణ భారతకథలకువలె ఈ రెండు కథలకు నన్ని పోలికలు పొత్తు మంతగాలేకపోయినను భట్టుమూర్తి తన అపూర్వ పాండిత్య ప్రతిభావిశేషములచే అద్భుతమైన శ్లేష కూర్చి వాని నేకసూత్రమున సంధింప జాలెను. ఇతని శ్లేషసంఘటన వైఖరిని పాండితీ వైభవ మును చూచి అచ్చెరువు పొందనివా రుండరు. శ్లేష కావ్యమయ్యు ఇందలి వర్ణనలు సహజసుందరము లును, రసవంతములునై యొప్పారును. ఈ కావ్య ప్రారంభమున భట్టుమూర్తి భక్తిభావము లెస్సగా వ్యక్తము చేయబడినది.

అష్టదిగ్గజములలోని వాడుగా ప్రసిద్ధినందియు రాయల కాలమున ఉండెనా లేదా అను సందేహము కలిగించు వారిలో తెనాలిరామకృష్ణు డొకడు. ఈతని చాటుపులును, హాస్యోక్తులును ఆంధ్రదేశమున చాల ప్రచారము పొంది నవి. ఇతడు రచించిన గ్రంథములు రెండు- ఉద్భటారాధ్య చరిత్రము, పాండురంగ మాహాత్మ్యము. ఉద్భటారాధ్య చరిత్రము శైవప్రబంధము. దీనిని రచించిన రామలింగ కవి రామకృష్ణునికంటె భిన్నుడని కొందరందురు. కాని ఇతడే మొదట రామలింగ డయ్యు తరువాత వైష్ణవమును స్వీకరించి రామకృష్ణు డయ్యెనని తోచుచున్నది. అప్పుడు కూడ శైవమన్న అతనికి వైముఖ్యము లేదు.

పాండురంగ మాహాత్మ్యము భీమనదీతీరమునందలి పుండరీక క్షేత్రముయొక్క మహత్త్వమును వర్ణించు క్షేత్ర మాహాత్మ్యము. ఇందలి కథ స్కాందపురాణము నుండి గ్రహింపబడినది. క్షేత్రము, తీర్థము, దైవము, అను మూడును ఉదాత్తములై యుండు ప్రదేశమేది యను ప్రశ్నకు ఉత్తరముగా ఇందలికథ చెప్పబడినది. ఇందలి ద్వితీయాశ్వాసమునందలి పుండరీకుడను పరమ భక్తాగ్రే సరుని వృత్తాంత మతిరమణీయముగా నుండును. పాండు రంగ క్షేత్ర మాహాత్మ్యమును సూచించు నితరకథ లెన్నియో ఇందుగలవు. వానిలో నిగమశర్మకథయు, సుశీల కథయు ముఖ్యములైనవి. వీటియందును, అయుత నియుతుల కథయందును రామకృష్ణుడు చూపిన కథా కథనపద్ధతి మిక్కిలి రమ్యముగా నుండును. పాండురంగ

మాహాత్మ్యము కడుంగడు ప్రౌఢమైన ప్రబంధము. దీర్ఘ సంస్కృత సమాసములతోడను, అపరిచిత పద ప్రయోగముతోడను కూడి ఇందలి శైలి పఠితకు కొంత క్లేశము కలిగించును. ఇట్లని రామకృష్ణు డచ్చట చ్చట ముచ్చటగొల్పు తెలుగు రచన సాగింపకపోలేదు. ఈ కావ్యమున పెక్కు సామెతలును జాతీయములును సందర్భోచితముగా పొదుగబడినవి. గంభీర భావప్రకటన మందును, రసపాత్ర పోషణమునందును రామకృష్ణుడు మిక్కిలి నేర్పరి.

అష్టదిగ్గజ కవులలోనివాడు కాకపోయినను రాయల వారి కాలమున నుండిన మహాకవులలో సంకుసాల నృసింహకవి యొకడు. ఇతడు కవికర్ణ రసాయన మను నామాంతరముగల మాంధాతృ చరిత్రమును రచించి శ్రీరంగేశ్వరునికి అంకితము చేసెను. ఇతడు భట్ట పరాశరుని శిష్యుడు. ఈ పరాశరుడు క్రీ. శ. 1586 వ. సంవత్సరములో నుండెననుటకు శాసనసాక్ష్యము కలదు. అందుచే నృసింహకవి క్రీ. శ. 16 వ శతాబ్ది పూర్వార్థ మున నుండెనని చెప్పుటకు అవకాశము కలుగుచున్నది.

కవికర్ణరసాయనము ఆరాశ్వాసముల శృంగార ప్రబంధము. ఇందు మాంధాతృచక్రవర్తి చరిత్రమును, అతడు విమలాంగిని వివాహమాడిన వృత్తాంతమును చక్కగా వర్ణింపబడినవి. తన కావ్యమునందలి శృంగార రసవర్ణనమును విన్నమాత్రమున యతి విటుడు కాకపో డనియు, అందలి వైరాగ్యవర్ణనాకర్ణనమాత్రమున విటుడు యతి కాకపో డనియు ఆతడు చెప్పుకొని యుండెను. ఇందు కొంత అతిశయోక్తి యున్నను ఈకవి ప్రతిభాశాలి యనుటకు సందేహము లేదు. ఈతని వర్ణనలు గంభీర భావశోభితములై మిక్కిలి మనోహరములుగా నుండును. ఇతడు కావ్యారంభమున రాజులను నరకృతిని నిరసించి యుండెను. ఈతనిశైలి సంస్కృత సమాస భూయిష్ఠ మయ్యును ధారాళమై మిక్కిలి రసవంతముగా నుండును.

తెలుగున కవిత్వమువ్రాసి పేరుగన్న వనితారత్నము లలో అతుకూరి మొల్ల మున్నెన్నదగి యున్నది. ఈమె కాలమును సరిగా నిర్ణయించుటకు ఆధారములు లేవు. కాని పూర్వకవిస్తుతిలో ఈమె శ్రీనాథుని తరువాత నుండిన కవీంద్రుల నెవ్వరిని పేర్కొనియుండకపోవుటచే, ప్రబంధకవుల కాలముననే యుండె నని యూహింప వీలగు చున్నది. ఈమె తాను గోపవరపు శ్రీకంఠమల్లేశుని దయచే కవితాకౌశలము నేర్చితినని చెప్పుకొనియున్నది. ఈమె మిక్కిలి వినయముకలది. తనకు నిఘంటువులు, వ్యాకరణాలంకారాది శాస్త్రములు తెలియవనియు, శ్రీరామచంద్రుని ప్రేరణముచే తా నిహపర సాధన మునకై రామాయణమును రచించితిననియు, సవినయ ముగ తెల్పియున్నది. తెలుగు కవిత్వము దుర్బోధములైన సంస్కృత సమాసములతో కూడియుండక తేటతెలుగు మాటలతో ధ్వని ప్రధానమై యుండవలె ననియు, తేనె సోకినంతనే నోరు తీయనగురీతిని విన్నతోడనే యర్థమెల్ల తోచునట్లుండవలెననియు, అట్లుగాక గూఢశబ్దములతో కూర్చిన కావ్యము మూగ చెవిటివారి ముచ్చటవలె నుండుననియు, ఈమె కవిత్వమును గూర్చి తన అభిప్రాయ మును వెల్లడించెను. ఈమె తన రామాయణమును శ్రీరామునికే అంకితము కావించెను.

మొల్ల తనకంత విద్యాసంపన్నతలేదని చెప్పుకొని యున్నను ఈమె కావ్యమున పాండిత్యలోప మెచ్చటను కానిపింపదు. ఈమె వర్ణనలన్నియు ప్రబంధోచితములై మిక్కిలి ప్రౌఢముగా నుండును. అందును సాకేతనగర వర్ణనము శ్లేష శబ్దాలంకార పూరితమై ఈమె పాండితీ విశేషమును పలువిధముల సూచించుచున్నది. అయోధ్యా కాండము మొదట ఈమె కావించిన ప్రకృతివర్ణనము మిక్కిలి రమణీయముగా నున్నది. ఈమె సుందర, యుద్ధ కాండములను కొంచెము విస్తృతముగ వ్రాసినను మిగిలిన కాండములను చాల సంగ్రహించివైచినది. ఈమె రామా యణమున కథ మిక్కిలి వేగముగా సాగిపోయినది. సీతాప హరణానంతరము రాముడు పొందిన దుఃఖము నీమె కరుణరస నిర్భరముగా వర్ణించినది. అట్లే సుందరకాండ మున హనుమంతునితో సీత తన వృత్తాంతమును చెప్పు కొన్న ఘట్టముకూడ మిక్కిలి జాలిగొల్పునదై మొల్ల స్త్రీహృదయమును వెల్లడి చేయుచున్నది. ఔచిత్యపోషణ మున నీమె అందెవేసినచేయి. ఈమెశైలి మృదుమధుర పదగుంఫితమును, భావబంధురమునై సర్వజన రంజ కముగా నుండును.

తెలుగున సంకీర్తనము లనబడు భక్తిగేయములను వ్రాసినవారిలో మొదటివాడు తాళ్ళపాక అన్నమాచార్యుడు. ఈతడు క్రీ. శ. 15 వ శతాబ్ది ఉత్తరార్ధమున జీవించియుండెను. ఇతడును, ఇతని సంతతివారును శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామివారి సన్నిధిని సంకీర్తనాచార్యులుగ నుండిరి. ఇతడు భక్తిశృంగారమయములైన కీర్తనలెన్నో రచించి స్వామిసన్నిధిని పాడుచుండెడివాడట. ఇతని గేయములు భావపూరితములును మృదుమధుర పదబంధురములునై మిక్కిలి హృద్యముగా నుండును. ఇతడు తన గేయములలో సందర్భోచితముగ వ్యావహారిక భాషనుగూడ వాడియుండెను. ఇతనికి పదకవితాపితామహుడను సార్థకమైన బిరుదనామముకలదు.

అన్నమాచార్యుని కుమారుడు పెదతిరుమలాచార్యుడు. ఇతడు కృష్ణదేవరాయలకు సమకాలికుడు. తెలుగున వచనైక రచనలు వెలయించినవారిలో సింహగిరి వచనములను రచించిన కృష్ణమాచార్యులు మొదటివాడు. రెండవవాడు పెదతిరుమలాచార్యుడు. ఇతడు రచించిన వచనములకు వేంకటేశ్వర వచనములనిపేరు. ఇవియును సింహగిరి వచనములవలెనే భక్తుడుభగవంతునికి కావించిన విన్నపములు. ఇవి ఛందోరహితములైనను తాళరాగ సమన్వితముగా పాడుటకు అనువైనవి. ఆత్మనివేదన రూపములును, ప్రపత్తిపూరితములునైన ఈ వచనములు భక్తిభావభరితములై శతకములందలి పద్యములను బోలియున్నవి, ఇందలి రచన అలతియలతి వాక్యములతోగూడి నిర్దుష్టమై మిక్కిలి శ్రవణానందకరమై యుండును. ఇది కాక ఇతడు శృంగారకీర్తనలు, శృంగార దండకము, శృంగార వృత్తశతకము, వేంకటేశ నీతిశతకము, వేంకటేశోదాహరణము, చక్రవాళమంజరి అను కృతులను కూడ రచించియుండెను. ఇతని కవిత ధారాశుద్ధి కలిగి ద్రాక్షాపాకమై విరాజిల్లుచుండును.

తాళ్ళపాక తిమ్మక్క (తిరుమలాంబ) సుభద్రాకల్యాణమను ద్విపదకావ్యమును రచించెను. ఈమె పెదతిరుమలాచార్యునకు సవతితల్లి. ఈ సుభద్రాకల్యాణము పరిమాణమున చిన్నదయ్యు రసవంతముగా నుండును. సుప్రసిద్ధుడయిన చేమకూర వేంకటకవి తన విజయవిలాసమందలి సుభద్రాపరిణయమున ఈమె కావ్యమును పెక్కుచోట్ల అనుసరించినట్లు కనబడుచున్నది. సుభద్రాపాత్రను చిత్రించుటలో వేంకటకవికంటె తిమ్మక్కయే ఎక్కువనేర్పు చూపెనని విమర్శకుల అభిప్రాయము.

తాళ్ళపాక చిన్నన్న పెదతిరుమలాచార్యుల తనయుడు. ఇతడు అష్టమహిషీకల్యాణము, పరమయోగివిలాసము, ఉషాపరిణయము, అన్నమాచార్యచరిత్రము అను నాలుగు ద్విపద కావ్యములను రచించెను. "చిన్నన్న ద్విపద కెరగు" నను పద్యమున పేర్కొనబడిన చిన్నన్న ఈతడే. మధుర మంజులములగు పదములతో ద్విపదలనుకూడ విసువు జనింపకుండ రచించుటలో ఈకవి చాల నేర్పరి. దినమునకు వేయి ద్విపదలు రచింపగల నని ఈతడు చెప్పకొనియున్నాడు. అష్టమహిషీకల్యాణారంభమున ఈతడు తాను ద్విపదరచనలో అవలంబించిన లక్షణములను వివరించి యున్నాడు.

చిన్నన్న అన్నయైన చినతిరుమలాచార్యులుకూడ కవియే. ఇతడు అధ్యాత్మ శృంగార కీర్తనలు, అష్టభాషా దండకము, సంకీర్తన లక్షణము అను పద్యకావ్యము రచించెను. ఈసంకీర్తన లక్షణ మితని తాతయైన అన్నమాచార్యులు సంస్కృతమున రచించిన గ్రంథమునకు తెలుగుచేత. ఇతడు అష్టభాషాదండకమున తనకు సంస్కృత ప్రాకృతాద్యష్టభాషలయందు కల పాండిత్యమును ప్రదర్శించెను. ఇతని కుమారుడైన తిరువెంగళప్ప మమ్మటుని కావ్యప్రకాశికకు సుధానిధి అను వ్యాఖ్యానమును, అమరకోశమునకు బాలప్రబోధిక అను తెలుగు టీకను రచించెను. ఆంధ్రామరుకముకూడ ఇతని రచనయే అని కొందరి అభిప్రాయము.

వెలగపూడి వెంగయామాత్యుడు (క్రీ. శ. 1580) బిల్వమంగళుడను నామాంతరముగల లీలాశుకుడను కవి సంస్కృతమున రచించిన శ్రీకృష్ణకర్ణామృతమునందలి మూడువందల శ్లోకములను మూలమునందలి భావములు చెడకుండ అతి మధురముగ అనువదించి యుండెను.

కానె సర్వప్ప సిద్ధేశ్వరచరిత్రమను చారిత్రక కావ్యము రచించెను. దీనికే ప్రతాపచరిత్రము, కాకతీయరాజ వంశావళి అని నామాంతరములు కలవు. సర్వప్పకాల మిదమిత్థమని నిర్ణయించుటకు వీలులేదుకాని ఈతడు ప్రతాపరుద్రుని ఆస్థానమునందలి కవులను పేర్కొనుచు

కుమ్మరి మొల్లనుగూడ పేర్కొని యుండుటచే ఆమెకు అర్వాచీనుడై యుండెనని ఊహింపవచ్చును. దీనినిబట్టి ఇతడు క్రీ. శ. 16 వ. శతాబ్ది పూర్వార్థమున నుండెనని చెప్పనగును. ఏకామ్రనాథుడు చెప్పిన కథను అనుసరించియు, నాగనాథుని అనుమతి వడసియు తాను ఆ రాజవంశావళిని రచించితి నని సర్వప్ప చెప్పియుండెను. పార్వతీపరమేశ్వరులు కైలాసమును విడి పద్మాక్షీసిద్ధేశ్వరులుగా అవతరించిన వృత్తాంతముతో ఈగ్రంథము ఆరంభమగుచున్నది. సోమదేవరాజు కుమారుడైన మాధవ వర్మ కటకబల్లహు నోడించి శా. శ. 280 వత్సరమున సింహాసనము నధిష్ఠించినట్లు సిద్ధేశ్వరచరిత్ర చెప్పుచున్నది. ఈతని వంశముననే భువనైకమల్లుడు జనించెను. ఆతని కుమారుడు త్రిభువనమల్లుడు. ఇతని సుతుడు కాకతి ప్రోలరాజు. ఇతడు క్రీ. శ. 1068 ప్రాంతమున ఓరుగల్లు పట్టణమును స్థాపించెను. రుద్రదేవుడు, మహాదేవుడు అను వారు ప్రోలరాజు కుమారులు. సిద్ధేశ్వర చరిత్రనుబట్టి గణపతిదేవుడు రుద్రదేవుని కుమారుడేమోయని సందేహము కలుగుచున్నది. నెల్లూరునుండి తిక్కన సోమయాజివచ్చి గణపతిదేవుని దర్శించినట్లును, గణపతిదేవుడు సేనలను పంచి మనుమసిద్ధుని రాజ్యస్థాపితుని కావించినట్లును ఈ గ్రంథము చెప్పుచున్నది. రుద్రమ్మ గణపతిదేవుని భార్యయని ఈ గ్రంథమున చెప్పబడినది. ఇట్టివే ఇంకను పెక్కు పొరపాట్లిందు కలవు. ప్రతాపరుద్రుని చరిత్రమిందు విపులముగ వర్ణింపబడినది. ఈసందర్భమున అద్భుతములు పుక్కిటిపురాణములు మెండుగా నున్నవి. ఇచ్చట ఓరుగల్లు నగరము సవిస్తరముగా వర్ణితమైనది. ఆనగరము వైభవము, అందలి గుడులు, గోపురములు, వివిధవర్ణముల ప్రజలు, ప్రతాపరుద్రుని ముఖ్యోద్యోగులు అప్పుడు ప్రసిద్ధికెక్కిన కవులు మున్నగు విషయము లెన్నో ఇందు వివరింపబడినవి. మహమ్మదీయులు ఏడు సారులు ఓరుగల్లునగరమును ముట్టడించియు ప్రతాపరుద్రుని ప్రతాపమున కాగలేక పారిపోయి రనియు పద్మాక్షీదేవి కాకతీయ వంశమున కొసగిన వేయిఏండ్ల పరిమితి నిండిపోవుటచే చివరియుద్ధమున ప్రతాపరుద్రుడు చెరపెట్టబడెననియు, తరువాత అతడు విడువబడి గోదావరీ నదియందైక్యమయ్యెననియు సిద్ధేశ్వరచరిత్రము మడువు చున్నది. సిద్ధేశ్వర చరిత్రమున కొంతభాగము వచన రూపముననుకొంతభాగము ద్విపద రూపముననువ్రాయబడినది. ద్విపదభాగముకంటె వచనభాగమే సరసముగా నున్నది. మొత్తముమీద రచన అప్రౌఢమును బహుదోషదూషితమునై యున్నది. ఈ గ్రంథమున విషయ ప్రాధాన్యమేకాని కవితాప్రాధాన్యమంతగా కానరాదు.

అంముగుల వెంకయ్య అను కవి (క్రీ. శ. 1630) నరపతి విజయ మను నొక చారిత్రక కావ్యమును వ్రాసి అళియ రామరాయల మునిమనుమడైన కోదండరామ రాజునకు అంకితమిచ్చెను. ఈ గ్రంథమునకు రామరాజీయ మను నామాంతరము కలదు. ఆ కాలమున విజయనగర రాజులకు నరపతులను పేరుండెను. అందుచేతనే కవి తన గ్రంథమునకు నరపతి విజయ మని పేరుపెట్టెను. ఇందు ఆర్వీటి వంశమువారి విక్రమవైభవములు వర్ణింపబడినవి. తాళికోట యుద్ధమున రామరాయలు మరణించిన వృత్తాంత మీగ్రంథమున చెప్పబడియుండలేదు. రామరాయల తమ్ముడైన తిరుమలరాయలయు, అతనికుమారుడైన వీరవేంకటపతిరాయలయు పరిపాలనము లిందు వర్ణింపబడినవి. ఇందు చెప్పబడిన చారిత్రకాంశములు పెక్కు యథార్థములుగానే కానబడుచున్నవి. ఇందలి వస్తువు చరిత్రప్రధానమైనను వెంకయ్య దీనిని కడు సరసముగ రచింపజాలెను. ఇం దాత డచ్చటచ్చట గర్భ కవిత్వమునుకూడ వ్రాసియుండెను. ఇతనిశైలి సులభ సుందరమై సర్వజన సుబోధముగ నున్నది.

ఈ కాలమున రచింపబడిన మరియొక చారిత్రక కావ్యము కృష్ణరాయ విజయము. దీనిని రచించినవాడు వేంకటార్యుడు. ఇతనికి కుమారధూర్జటి అను నామాంతరము కలదు. శ్రీ కాళహస్తిమాహాత్మ్యము రచించిన ధూర్జటి తన పెదతాతయని ఈతడు చెప్పుకొనెను. ఇతడు నరపతి విజయ కృతిపతియైన కోదండరామరాజు కుమారుడైన ఆర్వీటి చినవేంకటరాయని ప్రేరణముచే ఈ గ్రంథమును రచించి శ్రీరామునికంకితము కావించెను. దీనినిబట్టి ఈతడు క్రీ.శ. 1650 సంవత్సరము ప్రాంతమున ఉండెనని చెప్పవచ్చును. ఇందు కృష్ణరాయల పరాక్రమమును పరిపాలన క్రమమును విపులముగా వర్ణింపబడియున్నవి. రాయలు తిమ్మరుసు సాయమున రాజ్యమునందలి అంతర

వ్యవస్థను చక్కపెట్టి తరువాత దండయాత్రలకు బయలు దేరెను. ముందాతడు దక్షిణమునకేగి ఉమ్మత్తూరు, శివ సముద్రములనేలు గంగరాజు నోడించెను. పిమ్మట రాయ చూరు, ముదగల్లు కోటలను స్వాధీనము చేసికొని కృష్ణా నదీతీరముల మహమ్మదీయుల సంయుక్తసేనల పరాభ వించెను. తరువాత అతడు కటకము జయించి కళింగరాజు కూతురైన తుక్కాదేవిని పెండ్లియాడెను. ఈవిధముగా ఇందు శృంగారరసమునకుకూడ సుంతప్రవేశము లభించు టచే కుమారధూర్జటి ఈసందర్భమున ప్రబంధోచితము అయిన వర్ణనలు కావించెను. వీరరసపోషణమున ఇతడు మిక్కిలి నేర్పు ప్రదర్శించెను. ఇతనిశైలి సులభమును సరసమునై యొప్పారును. కావ్యారంభమున ఇతడు కావించిన విద్యానగర నిర్మాణ వృత్తాంతమును, ఆ నగర వర్ణనమును మిక్కిలి రమణీయములుగా నున్నవి. ఇతని గ్రంథమున చారిత్రకముగా చూచిన కొన్ని పొరపాట్లు కానబడుచున్నవి. తుళువ నరసనాయకుని తరువాత వీరనరసింహరాయలుకాక కృష్ణరాయలే సింహాసనము నధిష్ఠించెనని ఈతడు వ్రాసెను. ఈ గ్రంథమునందలి అంశ ములు పెక్కులు రాయవాచకమునందలివానితో సరిపోలుచున్నవి. కృష్ణరాయ విజయమునకు ముందు కుమారధూర్జటి సావిత్రీ చరిత్రము, ఇందుమతీ వివాహము అను కావ్యములనుకూడ రచించియుండెను.

కందుకూరి రుద్రకవి క్రీ. శ. 17 వ. శతాబ్ది పూర్వార్ధ మున నుండెనని కొందరును క్రీ. శ. 1550 నుండి 1580 వరకు పాలించిన ఇబ్రహీంషావలన చింతలపాలెమును అగ్రహారముగా పడసిన రుద్రకవి ఈతడే యగుటచే క్రీ. శ. 16 వ శతాబ్ది ఉత్తరార్ధమున నుండెనని కొందరును చెప్పుచున్నారు. ఇతడు సుగ్రీవ విజయ మను యక్షగాన మును, నిరంకుశోపాఖ్యాన మను ప్రబంధమును రచిం చెను. సుగ్రీవవిజయ మింతవరకు లభించిన యక్షగాన ములలో మొదటిది. సీతాన్వేషణ పరాయణులై వచ్చిన రామలక్ష్మణులను హనుమంతుడుదర్శించుటతో ఇది మొద లిడి వాలివధానంతరము సుగ్రీవుడు పట్టాభిషిక్తుడగుటతో ముగియుచున్నది. వాలిమరణదుఃఖితయై తార శ్రీరాముని దూరినఘట్ట మిందు కరుణరస భరితమై హృదయ ద్రావకముగా నున్నది. ఇట్లే వాలిసుగ్రీవుల యుద్ధము, సప్తతాళభంజనము మున్నగు ఘట్టములందు వీరరసము పోషింపబడినది. ఇందు ద్విపదలు, దరువులు, అర్ధచంద్రి కలు, ఏలలు మున్నగు దేశిరచనలు కలవు. నిరంకుశో పాఖ్యానము కందుకూరు గ్రామమున వెలసిన సోమేశ్వ రున కంకితము చేయబడినది. ఈ ప్రబంధమున నిరంకుశు డను సార్థక నామధేయుడగు బ్రాహ్మణధూర్తుని సాహసిక ప్రవృత్తి వర్ణింపబడినది. ఈ కథ పెక్కువిధముల తెనాలి రామకృష్ణుని నిగమశర్మకథను పోలియుండును. సంభోగ వ్యసనమున తగుల్కొనియు, పాపమునొందనివాడు కలడా యని ధర్మశీలుడను రాజు అడుగ దానికి సమా ధానముగా పులస్త్యమహర్షి ఈ కథ నెరిగించెను. వేశ్యమాతయొక్క క్రౌర్యమును, నిరంకుశుడు జీర్ణ దేవాలయమున శివలింగమును చూచి తనతో జూదమాడ రమ్మని బలవంతపెట్టిన ఘట్టమును ఇందు మిక్కిలి రమణీయముగా వర్ణింపబడినవి. పురవర్ణనాదుల సందర్భ మున ఇందు వసుచరిత్రరీతులు స్ఫుటముగా కనిపించును. రుద్రకవి ఈ కథాద్వారమున ప్రకటించిన పరమార్థ మేమియు లేకపోయినను, సరసమైన శైలిచేతను, అందందు కానబడు ప్రౌఢ సంస్కృతరీతులచేతను, జాతీ యములైన నానుడులచేతను, ఈ ప్రబంధమును పఠితృ జనానంద సంధాయకమును కావింపజాలినాడు.

ఈ యుగమున తెలంగాణమునందు కొన్ని ఉత్తమ కావ్యములు వెలువడినవి. అందు పెక్కుకావ్యములు మహమ్మదీయ రాజులయు వారి సామంతులయు పోషణము నందియుండుట గమనింపదగినది. చరిగొండ ధర్మన్న చిత్రభారతమును వ్రాసి చిత్తాపుఖానుని మంత్రి యైన ఎమ్మలపల్లి పెద్దామాత్యునికి అంకితము చేసెను. ఓరుగల్లులో దొరకిన యొక శాసనమునుబట్టి చిత్తాపు ఖానుడు ఆంధ్ర వీరశేఖరు డనియు, క్రీ: శ. 1504 సం॥ ప్రాంతమున మహమ్మదీయులనుండి ఓరుగల్లుకోటను వశపరచుకొని సమర్థతతో పాలించె ననియు తెలియు చున్నది. చిత్రభారతమునందలి కథ బ్రహ్మాండపురాణము నుండి గ్రహింపబడినది. పేరునకు తగినట్లిది మిక్కిలి చిత్రముగానుండును. ఇందెడనెడ చిత్రకవిత్వముకూడ కాననగును. కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారు రచించిన ప్రసిద్ధమైన గయోపాఖ్యాన నాటకము

నందలి కథకు మూలములైన గ్రంథములలో ఇదియు నొక్కటి. ఇందు శృంగారరసము మిక్కిలి నిపుణముగా వర్ణింపబడినది.

హరిభట్టు అను కవి (క్రీ.శ. 1580) వరాహపురాణము మత్స్యపురాణము, భాగవతమునందలి షష్ఠైకాదశ ద్వాదశస్కంధములు, నరసింహ పురాణము అను గ్రంథములను రచించెను. ఇందు మత్స్య నరసింహపురాణములు మాత్రమే ముద్రితములైనవి. ఇందు వరాహ నరసింహ పురాణములుతప్ప మిగిలినవన్నియు భగవదంకితములు చేయబడినవి. వరాహపురాణము నిజాము రాష్ట్రము నందలి ఖమ్మంమెట్టు గ్రామమునకు కరణమైన కొలిపాక ఎఱ్ఱయామాత్యున కంకితము కావింపబడెను. హరిభట్టు మత్స్యపురాణమును పూర్తిగా అనువదించి యుండలేదు. అందలి విష్ణుధర్మోత్తర ఖండమును మాత్ర మైదాశ్వాసములలో రచించెను. ఇందు విష్ణుపూజాఫలము, తులసీ మాహాత్మ్యము మొదలగు భక్తిప్రధానములగు కథలు వర్ణింపబడినవి. ఈగ్రంథము శ్రీరంగేశునికి అంకితము చేయబడినది. ఎఱ్ఱాప్రెగడ నరసింహ పురాణమునందలి పూర్వభాగమును మాత్రము రచించియుండుటచే, హరిభట్టు ఉత్తరభాగమును మాత్రము అనువదించి యుండెను, ఈగ్రంథము వచనకావ్యమని పేర్కొనబడినది. నిజమునకిది పద్యగద్యాత్మకమైన చంపూకావ్యమే కాని వచన కావ్యముకాదు. హరిభట్టు రచన సమ సంస్కృతాంధ్ర పద భూయిష్ఠమై మిక్కిలి మధురముగా నుండును.

తెలుగునందలి మొదటి అచ్చతెలుగు కావ్యము యయాతి చరిత్ర. దీనిని రచించినవాడు పొన్నికంటి తెలగన్న (క్రీ.శ. 16వ శతాబ్ది ఉత్తరభాగము). ఇతడీకావ్యమును ఇబ్రహీం కుతుబ్షాకు సామంతుడైన అమీనుఖాను అను మహమ్మదీయ సరదారున కంకితము చేసెను. ఇట్లు మహమ్మదీయ ప్రభువున కంకితము చేయబడిన మొదటి గ్రంథ మిదియే. ఇందలికథ భారత భాగవతములనుండి గ్రహింపబడినది. తెలగన్న యయాతి చరిత్రము నందలి శృంగారభాగములకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చెను. అచ్చతెలుగను పేరున్నను ఇందు తద్భవములైన పదములును కృత్రిమములైన సమాసములును పెక్కు కానిపించును. తెలుగున అచ్చతెలుగు కవిత్వము అను ప్రత్యేక సంప్రదాయమునకు దారిచూపి దానిని సాధ్యమైనంతవరకు రసోత్తరముగా వెలయించిన తెలగన్న ఎంతయు ప్రశంసనీయుడు. ఇతని ప్రకృతివర్ణనలు రమణీయములును ఉదాత్త భావపూరితములునై మనోహరములుగా నుండును.

అద్దంకి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానమను శృంగార ప్రబంధమును రచించి గోలకొండ నవాబైన ఇబ్రహీం కుతుబ్షా కంకితము చేసెను. ఇందలి కథ భారతమునుండి గ్రహింపబడినది. ఈప్రబంధము నవరస బంధురములైన కల్పనలలోకూడి వసుచరిత్రను తలపించుచుండును.

వైజయంతీ విలాస మనుపేర విప్రనారాయణచరిత్రమను ప్రబంధమును రచించిన సారంగు తమ్మయ మహమ్మదు కుతుబ్షాకాలములో గోలకొండకు కరణముగా నుండెను. ఇతడు వైష్ణవమతాభిమాని, తన కావ్యమును శ్రీరామునికి అంకితము చేసెను. ఈప్రబంధము అత్యంత శృంగారమయమై అచ్చటచ్చట సభ్యతామర్యాదనుకూడ అతిక్రమించునట్లుండును. ఐనను ఇందలికథ రమ్యము. భావములు గంభీరములు. రచన మధురము. వేశ్యాలోలత్వమువలని కీడ్లు ఇందు చక్కగా ప్రదర్శింపబడినవి.

మల్లారెడ్డి అను కవి క్రీ. శ. 16 వ శతాబ్ది అంతమున మెదకు సమీపమునందలి బిక్కనవోలు రాజధానిగా రాజ్యముచేసిన రెడ్డిరాజులవంశమునకు చెందినవాడు. ఇతడు షట్చక్రవర్తి చరిత్రము, శివధర్మోత్తరము, పద్మ పురాణము అను గ్రంథములను రచించెను. షట్చక్రవర్తి చరిత్రమున హరిశ్చంద్రాదు లగు ఆర్గురు చక్రవర్తుల కథలు వర్ణింపబడినవి. ఇందు ప్రబంధసామాన్యములగు వర్ణన లన్నియు గోచరించును. ఇందలి రచన శ్లేషశబ్దాలంకారములతోకూడి వసుచరిత్రరచనను తలపించుచుండును. శివధర్మోత్తరము శివపారమ్యమును బోధించు గ్రంథము. ఇందు శైవమతధర్మము, వేదాంతము, శైవాచారములు వర్ణితములై యున్నవి. మల్లారెడ్డి శ్లేషాదులకై అంతగా యత్నింపనికతమున అతని పద్మపురాణమునందలి కవిత్వము సులభమును సహజమునై అలరారుచుండును. ఇందలి నాల్గవ ఆశ్వాసమున రామాయణకథ చెప్పబడినది. వాల్మీకిరామాయణము

నందలి కథకును ఇందలి కథకును కొన్ని భేదములు కాన వచ్చుచున్నవి. మల్లారెడ్డియు అతని వంశీయులును శివ భక్తిపరాయణులు. ఈతని సోదరులలో కామిరెడ్డి, ఎల్లా రెడ్డి అనువారు సాహిత్యప్రియులై కవులను పోషించి వారివలన కావ్యము లంకితము పొందినట్లు తెలియు చున్నది. మల్లారెడ్డి కావ్యములం దతని వినయశీలమును భ్రాతృభక్తియు చక్కగా వెల్లడిచేయబడినవి.

దక్షిణాంధ్రయుగము :- ఈ యుగమున ఆంధ్రదేశ మునకేకాక మధుర, తంజావూరు, పుదుక్కోట, జింజి, మైసూరు మున్నగు దక్షిణదేశపు రాజ్యములందు కూడ ఆంధ్రవాఙ్మయము వర్ధిల్లినది. ఇందు ముఖ్యముగా పేర్కొనదగినవి మధుర, తంజావూరు నాయక రాజ్య ములు. ఈ రాజ్యముల స్థాపనమునుగూర్చి శ్రీ డా. నేలటూరి వేంకట రమణయ్యగారిట్లు చెప్పుచున్నారు:- విజయనగరరాజు లారంభమునుండియు మహమ్మదీయ రాజులతో పోరాడవలసి వచ్చుచుండెను. అందుకై వారికి విస్తృతమైన సేనయు, ధనమును ఆవశ్యకము లగు చుండెను. భూమినుండివచ్చు ఆదాయమును సైన్య పోషణమునకై వినియోగించు విషయమున రాయలొక పద్ధతి నవలంబించెను. దేవదేయ, బ్రహ్మదేయములు కాక మిగిలిన గ్రామము లన్నిటిని ఆతడు భండారవాడ గ్రామములు, అమర గ్రామములు అని రెండురకము లుగా విభజించెను. రాజు దళనాయకులకు కొన్ని నిబంధ నములమీద ఇచ్చు గ్రామములకు అమర గ్రామము లని పేరు. యుద్ధము సంభవించునప్పుడు నిర్ణీత సంఖ్యగల గజాశ్వబలముతో వచ్చి సాయముచేయుట, ఏటేట నిర్ణీతమైన కొంత ధనమును కప్పముగా నొసగుట అను రెండును ఈ అమరపద్ధతి యందలి ముఖ్య నిబంధనములు. రాయలమరణానంతరమును, రాక్షసతంగడి (తళ్ళికోట) యుద్ధానంతరమును విజయనగర సామ్రాజ్యమున వర్తి ల్లిన అరాజక పరిస్థితుల నవకాశముగా గైకొని ఈ అమర నాయకులు పరిసరములందలి అమరరాజ్యముల నాక్రమించుకొని నూతన సంస్థానములను స్థాపించిరి. ఇట్టి వానిలో మధుర, తంజావూరు, జింజి రాజ్యములు ముఖ్యములైనవి. ఈ రాజ్యములు దక్షిణమున నుండు టచే వీనికి శత్రుభయ మంతగా లేకుండెను. అందుచే సారవంతములైన రాష్ట్రములనుండి వచ్చు ఆయమును యథేచ్ఛముగా అనుభవించుచు సంగీత సాహిత్యములతో కాలక్షేపము చేయుటకు ఆ రాజుల కవకాశ మేర్పడెను. రాక్షస తంగడి యుద్ధానంతరము విజయనగర సామ్రా జ్యము మహమ్మదీయుల దుండగములకు నెలవయ్యెను. ఆ బాధ పడలేక పలువురు బ్రాహ్మణులు, కవి, గాయక నర్తకాదులు తమ నివాసములను వీడి దక్షిణమునకు వలసపోయిరి. రసికులైన నాయకరాజులు వారి కాశ్రయ మిచ్చి పోషించిరి. ఈ విధముగా దక్షిణదేశము ఆంధ్ర వాఙ్మయాభివృద్ధి కాస్పదమగుట సంభవించెను.

దక్షిణాంధ్ర సాహిత్యమును గూర్చి ముఖ్యముగా మూడు అపవాదములు కలవు. అప్పటి కవులు భాషా విషయమున వ్యాకరణ సంప్రదాయమును సరిగా ననుస రింప లేదనియు, వారు సభ్యతా మర్యాద నతిక్రమించి దుర్నీతికరమును జుగుప్సాకరము నగు శృంగార రస మును హెచ్చుగా వర్ణించిరనియు, ఈ యుగమున స్తుత్య మైన ప్రతిభ క్షీణించి హేయమైన అనుకరణమే ప్రబలిన దనియు ఆ మూడపవాదములు. నిజమునకీ అపవాదము లప్పటి సాహిత్యమునందలి ఏకదేశమును బట్టియే ఏర్పడి నట్టివి కాని సర్వ వ్యాపకము లనదగినవి కావు. మరియు సాహిత్యమున రసమునకే ప్రాధాన్యము కాని కేవల భాషకు కాని ఉపదేశమునకు కాని అంత ప్రాధాన్యము లేదను విషయము దృష్టియం దిడికొని చూచినచో ఇది తొలగిపోవును. ఈ కాలమునందలి కవులు సృజించిన వివిధ నూతన కావ్య ప్రక్రియలను పరికించు వారికి వారు ప్రతిభాహీనులు కారని స్పష్టము కాకమానదు. ప్రబంధ ములేకాక యక్షగానములు, గేయములు, వచనములు ఈ కాలపు సాహిత్యమునకు వైవిధ్యమును పుష్టిని చేకూర్చినవి. మరియు మధుర మంజులమైన భాష, సంగ్రహములు భావబంధురములునై కథాగమనమున కాటంకము కల్పింపని సుందర వర్ణనములు, రమణీయ కల్పనతో కూడిన కథానిర్మాణము తత్పూర్వ సాహిత్య ముతో పోల్చిచూచినచో ఈ కాలపు సాహిత్యమునకు వైశిష్ట్యము చేకూర్చుచున్నవి. అందుచే దక్షిణాంధ్ర వాఙ్మయ మాంధ్రభారతి కలంకారమే కాని అపవాదము కాదనుటలో సందేహములేదు.

మధుర నాయకరాజ్యము రాక్షస తంగడి యుద్ధానంతరమును, తంజావూరు నాయకరాజ్యము అంతకు పదునైదేండ్లకు పూర్వమును, స్థాపింపబడినట్లు ఇటీవలి పరిశోధనముల వలన తెలియుచున్నది. మొట్టమొదట ఆంధ్ర వాఙ్మయమును దక్షిణదేశమున ప్రవేశించుటకు నాయకరాజులే కారణభూతులని పలువురు తలంతురు. కాని అంతకుముందే ఆ వాఙ్మయ మచ్చట అడుగుపెట్టె ననుటకు నిదర్శనము లున్నవి. అచ్యుతదేవరాయలు (క్రీ.శ. 1529-42) ఆంధ్రభాషాభిమానియై ప్రతి సంవత్సరము శ్రీ వేంకటేశ్వరస్వామికి సత్కావ్య ప్రబంధపుష్పమును సమర్పించెడివాడట. అతని అడుగుజాడల ననుసరించి మంత్రి, నాయక సామంతాదులుకూడ కవులను పోషించి వారిచే రసవంతములైన కావ్యములు రచింపజేసి భాషాసేవ కావింప మొదలిడిరి. అట్టివారిలో రామనాథపుర మండలమునందలి శివపురి ప్రాంతమును రాయల పక్షమున పాలించుచుండిన గోళ్ళవంశపు నాయకులు ముఖ్యులు. వారు గోళ్ళ బసవేంద్రుని కుమారులు. వారిలో చినరామప్ప అనునతడు తన అన్నయగు పెదరామప్పపేర వచ్చకప్పురపు తిరువేంగళ కవిచే తమ ఇలవేల్పైన చొక్కనాథుని చరిత్రమును ద్విపద కావ్యముగా చెప్పించెను. ఈ కారణముచే ఆంధ్ర సరస్వతిని తొలుదొల్త దక్షిణమున కాకర్షించిన గౌరవ మీ గోళ్ల నాయకులకే చెందవలసి ఉన్నది. కాని ఆమె నచ్చట స్థిరముగా ప్రతిష్ఠించి వివిధ కావ్యపుష్పహారములచే నారాధించినవారు మధుర తంజావూరు నాయకులే యనుటకు సందేహింప నవసరములేదు.

దక్షిణాంధ్రయుగమున వాఙ్మయవాహిని వివిధ వేణికలతో ప్రవహించినది. అందు పద్యములు, గేయములు, వచనములు, యక్షగానములు ముఖ్యములైనవి. అప్పటి పద్యకావ్యములు ప్రబంధములే. గేయరచన అప్పుడు విరివిగా సాగుటకు యక్షగానములలో అవి ప్రధానస్థాన మాక్రమించుటయే కారణము. సంకీర్తనలు, అధ్యాత్మ కీర్తనలు, ఏలలు, దరువులు, పదములు అందు ప్రధానములైనవి. కొరవంజి, దేశి, చౌపదము, జక్కిణి, జోగి, చిందు మున్నగు నాట్యభేదములకు అనుగుణముగా ప్రత్యేకములైన గేయములను పాడుచుండెడివారు. క్షేత్రయ, విజయరాఘవుడు, రంగాజమ్మ, సీనయ్య మున్నగువారు పదరచనయందును, త్యాగరాజు సంకీర్తన రచనయందును వాసికెక్కిరి.

వచనైక రచనలు 15వ శతాబ్దికి ముందుకూడ ఒకటి రెండు వెలసినమాట సత్యమేయైనను అవి కొల్లలుగా రచింపబడుట దక్షిణాంధ్రయుగముననే. ఇప్పటి వచనరచనలు రెండు తెరగులు - వాడుకభాషలో వ్రాయబడినవి, గ్రాంథికములు. రాయవాచకము వంటి చారిత్రక వచనములలో వాడుకభాష వాడబడినవి. గ్రాంథిక రచనలు పెక్కు పురాణములకును ప్రబంధములకును వచనీకరణములు. ఇది అప్పటివారికి ప్రాచీన గ్రంథములపై గల అభిమానమును తేటతెల్లమొనరించుచున్నది.

యక్షగాన మొక నాటక విశేషము. విజయరాఘవుడు మున్నగువారు తమ యక్షగానములను నాటకములనియే వ్యవహరించిరి. ఇవి క్రీ.శ. 12వ శతాబ్దినుండియు ప్రచారమున నున్నను అప్పకవికి పూర్వపు లాక్షణికు లెవ్వరును వానిని పేర్కొనియుండలేదు. ద్రావిడ భాషలందలి దృశ్యరచనలు కొరవంజులనబడుననియు, కొరవలు అను ఆటవికజాతివారు ముందు వానిని ప్రదర్శించెడివారనియు, పిమ్మట జక్కులు లేక యక్షులు అనువారు వానిని చేబట్టుటచే వానికి యక్షగానము అను పేరువచ్చెననియు, కీ. శే. ప్రభాకర శాస్త్రిలుగారు తెల్పియున్నారు. కొరవంజిని అనగా ఎరుకతను మొదట యక్షగానములలో ప్రవేశపెట్టినవారు తంజావూరివారే అగుటచే కొరవలమూలమున యక్షగానము లుత్పన్నము లయ్యె ననుట యుక్తము కాదనియు, అవి మతప్రచారము నిమిత్తమై ప్రభవించి తోలుత కొయ్యబొమ్మల మూలముననను తోలుబొమ్మల మూలమునను ప్రదర్శింపబడి తరువాత మనుజులచే ప్రదర్శించిన మూగనాటకములై పిమ్మట గద్యపద్యగేయములతోకూడి యక్షగానము లయ్యె ననియు, బౌద్ధయుగమునుండియు ఆంధ్రదేశమున జక్కులులేక యక్షులు అను ఒక తెగవారు నివసించుచుండి రనియు, వారికిని యక్షగానముల యుత్పత్తికిని సంబంధముండుననియు ఇట్టివి సంస్కృతమునకూడ నుండె ననుట కాధారము

లుండుటచే కేవల దేశిరచన లని చెప్పుటకు వీలు లేదనియు, తెలుగు యక్షగానములను చూచి తమిళు లును, కన్నడులును తమతమ భాషలలో వానిని రచించి రనియు, తంజావూరు కవులు వానిలో పెక్కుమార్పులు చేసి వానికి వన్నె కలిగించి రనియు, యక్షగానములలో పాత్రపోషణమునకే కాని కథాకల్పనమున కంత ప్రాధా న్యము లేదనియు, శ్రీ డా. నే. వేంకటరమణయ్యా గారభిప్రాయ పడుచున్నారు.

తంజావూరు నాయకరాజ్యముమాటవిన్నంతనే స్మృతి పథమున తోచువాడు రఘునాథనాయకుడు, (క్రీ. శ. 1614 - 1633). ఇతడు సర్వవిధముల రాయలవారి కెనయని చెప్పదగినవాడు. ఇతడు సుమారు వంద గ్రంథ ములు రచించెను. వానిలో రామాయణము, వాల్మీకి చరిత్రము అను రెండు గ్రంథములు మాత్రమే లభించు చున్నవి. ఈ రామాయణమైనను సమగ్రముగా లేదు. ఇందు బాలకాండమున వాల్గవ ఆశ్వాసములో కొంత భాగము మాత్రమే కానబడుచున్నది. కథ కోసలదేశ వర్ణనతో నారంభమై పుత్రకామేష్టితో ముగియుచున్నది. ఇందలి కవిత్వము రసవంతములైన వర్ణనలతోడను, మధురమంజులమైన పదప్రయోగము తోడనుకూడి మనో హరముగానున్నది. రఘునాథు డిందలి ద్వితీయాశ్వాస మున ఋశ్యశృంగుని కథను చాల హృద్యముగా రచించి యున్నాడు. మధురవాణి తాను రఘునాథుని రామాయ ణము నొకదానిని సంస్కృతీకరించినట్లు చెప్పుకొన్నది. అది పరిమాణమున చాల చిన్నదగుటచే పై రామాయణ మగునో కాదో అని సందేహ ముదయించుచున్నది. వాల్మీకి చరిత్రము మూడాశ్వాసములతోకూడిన ప్రబంధము. ఇం దాదికవియైన వాల్మీకి మహాముని పూర్వ జీవితము వర్ణింపబడినది. ఇందు వస్త్వైక్యము కొరవడినట్లు కానిపించును. గ్రంథారంభమునందలి తీర్థాదుల వర్ణన మతిదీర్ఘమై కొంత విసుపుకలిగించుచున్నది. తృతీ యాశ్వాసమునందలి రంభోర్వశీ పరాభవ వృత్తాంతము రమ్యముగా నున్నది. శృంగార సావిత్రియను రెండా శ్వాసముల ప్రబంధ మొకటి రఘునాథునిపేర ముద్రిత మైనది. అది అతని రచనమగునో కాదో చెప్పజాలము. యజ్ఞనారాయణ దీక్షితుడు తన సాహిత్య రత్నాకరమున రఘునాథుడు యామద్వయమున పారిజాతాపహరణ కావ్యమును చెప్పి తండ్రిచే కనకాభిషేకము నొందెనని తెల్పియున్నాడు. దీనినిబట్టి ఈ కవిరాజు ఆశుకవిత్వమున కూడ నిపుణుడని తెలియుచున్నది.

పై పద్యకావ్యములనేకాక రఘునాథుడు అచ్యు తాభ్యుదయము, నల చరిత్ర అను రెండు ద్విపద కావ్య ములనుకూడ రచించియుండెను. ఇందలి నలచరిత్ర ఆంధ్ర భాషోల్లాసినీ అను మాసపత్రికయందు ముద్రితమైనది. ఇం దెనిమి దాశ్వాసములలో నల దమయంతుల కథ సంపూర్ణముగా చెప్పబడినది. ఇందు వర్ణన విధానమును, రసపాత్రపోషణ చాతుర్యమును రఘునాథుని అప్రతిమాన మైన ప్రతిభను చెప్పక చెప్పుచున్నవి. నల దమయంతుల వనసంచారవర్ణనము పఠించినచో ఈ విషయము తేటతెల్ల మగును. అచ్యుతరాయాభ్యుదయము పేరునుబట్టి రఘు నాథుని తండ్రి చరిత్రను వర్ణించు కావ్యమని తెలియు చున్నది. రఘునాథుడు రుక్మిణీ పరిణయము అను యక్ష గానమునుకూడ రచించినట్లు యజ్ఞనారాయణ దీక్షితులు చెప్పియున్నాడు. (శ్రీ రుక్మిణీ కృష్ణవివాహ యక్షగానం ప్రబంధానపినైక భేదాన్) కాని అది ఇంకను ముద్రితము కాలేదు

రఘునాథుని ఆస్థానమునందలి కవులకేకాక దక్షి ణాంధ్రయుగమునందలి కవీంద్రులకెల్ల తలమానికమని చెప్పదగినవాడు చేమకూర వేంకటకవి. ఇతడు రచించిన ప్రబంధములు రెండు. సారంగధర చరిత్రము, విజయ విలాసము. ఈ రెండు ప్రబంధములును రఘునాథ భూపాలునికే అంకితముచేయబడినవి. సారంగధర చరిత్రము మాళవరాజగు రాజమహేంద్రుని భార్య చిత్రాంగి తన సవతి కుమారుడగు సారంగధరుని వలచి వలపింప యత్నించిన కథ. ఇది వేంకటకవి ప్రథమరచన. ఇది శృంగార రసాభాసముతోకూడివస్తుస్వభావమునుబట్టి కొంత జుగుప్సను కలిగించుచున్నది.

విజయవిలాస మాంధ్రసరస్వతి కపూర్వమైన అలం కారము. ఇందు పాండవ మధ్యముడైన విజయుడు ఉలూచి, చిత్రాంగి, సుభద్ర అను ముగ్గురు జవ్వనుల చెట్టవట్టి కావించిన విలాసములు మూడాశ్వాసములలో వర్ణింపబడినవి. భారతమునందలి కథనే గ్రహించి దానిని

సరసమనోహరములైన వర్ణనలతోడను, మధుర గంభీరములైన భావములతోడను, మృదుమధురములైన పదములతోడను, అద్భుతావహములైన శ్లేషచమత్కారములతోడను, ఒహో అనిపించు యమకానుప్రాసాద్యలంకారములతోడను కూర్చి ఈ ప్రబంధమున వేంకటకవి కావించిన సృష్టి అనన్య సామాన్యమై అలరారుచున్నది. రసపాత్ర పోషణమునను, సాభిప్రాయ పదప్రయోగమునను అతని కతడేసాటి. "ప్రతి పద్యమునందు చమత్కృతి కలుగగ చెప్ప నేర్తు" నని రఘునాథుడే అనెనో అతడే వ్రాసికొనెనో కాని అందిసుమంతయు నతిశయోక్తి కానరాదు. శబ్దార్థాలంకారము లమితముగా వాడుచునే రసభావముల నద్వితీయముగా పోషించిన మహాకవు లాంధ్రవాఙ్మయమున నిర్వురే. ఒకడు భట్టుమూర్తి; రెండవవాడు వేంకటకవి. వేంకటకవి తెలుగుపదముల విరుపులలో భట్టుమూర్తికన్నను మిన్న అనిపించును. అతని పదప్రయోగ చాతుర్య మపూర్వమైనది. "క్షితిలో నీమార్గ మెవరికిన్ రా"దనుట సత్యము. ఇంతటి మహాకవి కావుననే రసిక శేఖరుడైన రఘునాథ భూపాలు డాతని నాదరించి మేదురములైన సత్కారము లాచరించినాడు.

రఘునాథుని ఆస్థానమున విద్వత్కవియై బహు గ్రంథములు రచించి వాని నన్నిటిని అతనికే అంకితము చేసినవాడు కృష్ణాధ్వరి. రఘునాథ భూపాలీయము, నైషధ పారిజాతావతారిక, కల్యాణ కౌముదీ కందర్ప నాటకము, శృంగార సంజీవని, తాళ చింతామణి, నైషధ పారిజాతీయము అను ఆరు గ్రంథములను రచించితినని అతడే చెప్పుకొని యున్నాడు. వీనిలో రఘునాథ భూపాలీయ నైషధ పారిజాతీయములు రెండే కానవచ్చుచున్నవి. ఇందు రఘునాథ భూపాలీయము ప్రతాపరుద్రీయమువలె కావ్య స్వరూప రసధ్వన్యలంకారాదులను తెల్పు లక్షణ గ్రంథము. ఇందు లక్ష్యములైన పద్యములందన్నిట రఘునాథుడే వర్ణింపబడియున్నాడు. నైషధ పారిజాతీయము ద్వ్యర్థికావ్యము. ఇందు నలచరిత్రయు పారిజాతాపహరణ కథయు జోడింపబడినవి. సన్నిహిత సంబంధములేని ఈ రెండు కథలను సమానాంతరముగా సాగించుటలో ఈ కవి చూపిన నేర్పును పాండిత్యమును అనన్య సామాన్యములై యున్నవి. ద్వ్యర్థికావ్య నిర్మాణ నైపుణ్యమున నీతను సూరన భట్టుమూర్తులను కూడ మించినాడని విమర్శకుల అభిప్రాయము. ఇతడు వ్రాసిన ఇతర రచనలు తెలుగు గ్రంథములో సంస్కృత గ్రంథములో తెలియరాదు. శృంగార సంజీవని అమరుకాహంకారహారియని ఆతడు తెల్పియున్నాడు. కల్యాణ కౌముదీ కందర్ప నాటకము బహుశః యక్షగానమై యుండవచ్చును. తాళ సంజీవని సంగీత శాస్త్రమునకు సంబంధించిన గ్రంథముగా తోచుచున్నది.

కాళయ్యకవి వ్రాసిన రాజగోపాల విలాసమను నైదాశ్వాసముల కావ్య మిటీవలనే ముద్రితమైనది. ఇది మన్నారుగుడి క్షేత్రమహాత్మ్యమును తెల్పు శృంగారరస ప్రధానమైన ప్రబంధము. ఇందు మొదటి నాలుగాశ్వాసములలో శ్రీకృష్ణునికి ఆతని అష్టమహిషులతోడి కూటమియు, పంచమాశ్వాసమున మన్నారుగుడి క్షేత్ర మాహాత్మ్యమును వర్ణింపబడినవి. కాళయ్య అష్టమహిషులను అష్టవిధశృంగార నాయికలుగా వర్ణించియున్నాడు. రుక్మిణి స్వీయ, సత్యభామ స్వాధీనపతిక, కాళింది ప్రోషితభర్తృక, లక్షణ జారిణీ, జాంబవతి విప్రలబ్ధ. ఇతని రచనలో సంస్కృత పదములు హెచ్చు. ఈతని సమాసములు కొన్ని యెడల శ్రీనాథుని సమాసములను తలపించుచుండును. ఈతని ధారాశుద్ధి మిక్కిలి మెచ్చదగియున్నది. మధుర తంజావూరు రాజ్యములందు వెలసిన శృంగార ప్రబంధముల కొక విధముగా ఈ రాజగోపాల విలాసము మార్గదర్శకమని చెప్పవచ్చును.

రఘునాథుని కుమారుడైన విజయరాఘవుడుకూడ కవియే. ఇతడు ప్రహ్లాద చరిత్ర పీఠికయందు తాను పది కృతులను రచించినట్లు చెప్పుకొనియున్నాడు. అందు పెక్కు యక్షగానములు. పాదుకాసహస్రము, రఘునాథాభ్యుదయము అనునవి ద్విపద కావ్యములు. మోహినీ విలాసము అను ద్విపదకావ్యముకూడ ఇతని రచనయే యని కొందరి తలపు. ఆతడా ద్విపదకృతిని యక్షగానముగా సంతరించినమాట సత్యము. కాని ఆకృతి యతడే రచించినదో ఇతరులు రచించినదో తెలియదు. ఈ ద్విపద కావ్యములలో రఘునాథాభ్యుదయ మొక్కటే ముద్రితమైనది. ఇందు విజయరాఘవుడు తన తండ్రి యగు రఘునాథుని రాజ్యవైభవమును, తంజా

పురమును, రాజగృహమునందలి నిత్యజీవిత విధానమును విపులముగా వర్ణించియున్నాడు. రఘునాథుడు వాహ్యాళి కరుగుచుండగా చిత్రలేఖ యను వారకాంత యొక్కతె అతని వలచి తనకోరిక తీర్పుమని చిలుకచే వర్తమాన మంపుటయు, రఘునాథు డా రాత్రి ఆమె యింటి కరిగి కేళిసల్పుటయు నిందలి ఇతివృత్తము. రస దృష్టి కీ కావ్యమంత ఉత్తమముగా కనబడకపోయినను చారిత్రకదృష్టితో చూచినచో మిక్కిలి ఉత్కృష్టముగా గోచరించును. ఆనాటి రాజకీయ సాంఘిక విషయములును, రాచనగరి మర్యాదలును, సంగీత నాట్య విద్యా వినోదములును ఇందు చక్కగా వర్ణితములై యుండుటచే నాయకయుగ చరిత్ర నిర్మాణమున కీ గ్రంథ మెన్నియో విధముల తోడ్పడజాలును.

ఈ పై ద్విపద కావ్యములే కాక విజయరాఘవుడు రచించితివని చెప్పుకొన్న లఘుకావ్యములలో గోపికా భ్రమర గీతముల తెనిగింపులును, ఫాల్గుణోత్సవ గోపాల దండకములును, వీరశృంగార సాంగత్యమును, సంపంగి మన్నారు సాంగత్యమును ముఖ్యములైనవి. పై గీతములు పద్యరూపమున తెనిగింపబడినవో, ద్విపద రూపమున తెనిగింపబడినవో తెలియదు. ఫాల్గుణోత్సవము రగడలో వ్రాయబడినది. చివరి రెండు సాంగత్యములును కర్ణాటక సాంగత్య చ్ఛందమున రచింపబడినవి. ఆంధ్రమున ఈ ఛందములో రచన సల్పినవా డితడొక్కడే.

విజయరాఘవుని ప్రతిభ అతడు రచించిన యక్షగానములలో ఎక్కువగా గోచరించును. వాని సంఖ్య సుమారు ఇరువది వరకుండును. అవి అన్నియు నాటకము లనియే పేర్కొనబడినవి. వానిలో రఘునాథాభ్యుదయ విప్రనారాయణ చరిత్రలుమాత్రము ముద్రితములైనవి. మిగిలినవి కొన్ని అముద్రితములు; కొన్ని నష్టములు. విజయరాఘవుడు వైష్ణవ మతాభిమాని. వైష్ణవాపచార మాతనికి గిట్టదు. అందుచేతనే కాబోలు వైష్ణవకథలలో చోళరాజు విప్రనారాయణుని శిక్షింప నాజ్ఞాపించెనని యుండగా అతడు విప్రనారాయణుని కథ తన రాజ్య మందలి మన్నారు గుడియందే జరిగినట్లును, తాను వైష్ణవాపచారముచే విప్రనారాయణుని శిక్షించుటెట్లని సందేహించుచుండగా శ్రీ రాజగోపాలస్వామి ప్రత్యక్షమై సత్యమెరిగించి, విప్రనారాయణుని గౌరవించి తన్ను మెచ్చుకొనెననియు వ్రాసియుండెను. ఇట్లే ఈ నాటకమున అతడితర సందర్భములందు నైత మధిక స్వాతంత్ర్యము ప్రదర్శించినాడు.

విజయరాఘవుడు సంస్కృతాంధ్ర భాషలందు మేటి పండితుడు. అతడు సంస్కృత నాటకములు బాగుగా చదివి అందలి రచనా పద్ధతులను చక్కగా అవగాహనము చేసికొన్నవాడు. ఆ కారణముచే అతడు తననాటి యక్షగానములందున్న కొన్ని పద్ధతులను మార్చి నూతన పద్ధతులను ప్రవేశపెట్టి వానికెంతో వన్నె చేకూర్చినాడు. యక్షగానముల ఆరంభమున కవియే కృతిపతిని ప్రస్తుతించి, షష్ఠ్యంతములు చెప్పి, కథాక్రమమును వివరించినట్లు చెప్ప బడియుండును. ఈ పద్ధతి ప్రబంధోచితమైనదే కాని నాటకోచితమైనది కాదని గుర్తించి విజయ రాఘవుడు తన యక్షగానములందు దేవతా స్తోత్రానంతరము మేళ గాండ్రచే కైవారము చెప్పించి, వారి మూలముననే కథాక్రమమును ప్రకటింపజేసినాడు. ఇది కొంచె మించు మించుగా సంస్కృత నాటకములందలి నాందీ ప్రస్తావనలను పోలియుండును. ఇట్లే విజయ రాఘవుడు తన నాటకములలో కొన్నింటి చివర భరతవాక్యమును ప్రవేశ పెట్టినాడు.

విజయ రాఘవుడు తన యక్షగానములలో త్రిపుటాది తాళములను గేయములతోకూడ వ్రాసియుండినను, రగడలను విడిచి వాని స్థానమున దరువు పదము మున్నగ నూతన రచనలను ప్రవేశపెట్టినాడు. అతడు ప్రవేశపెట్టి మరియొక ముఖ్యమైన మార్పు సంభాషణ పద్ధతి అంతకుముందున్న యక్షగానములలో మధ్యమధ్య ఆ పాత్ర ఈ పాట పాడుచున్నదను కవి వచనములు కా బడుచుండును. ఇదియును ప్రబంధ పద్ధతియే. విజయ రాఘవు డీ పద్ధతిని విడిచి సంస్కృత నాటకములందువ పాత్రోచితమైన భాషలో ఆ యా పాత్రముల నొండొ టితో సంభాషింప జేసినాడు. తరువాతివారు పలువు ముఖ్యముగా రంగాజమ్మ తమ యక్షగానములలో విధానము నవలంబించినారు.

విజయ రాఘవుని కొలువు నలంకరించిన విదు షణులలో రంగాజమ్మ అగ్రగణ్య. ఆమె అష్టభా

కవితా సర్వంకష మనీషా విశేష శారద. రాజనీతి విద్యా విశారద. విజయరాఘవ మహీపాల రచిత కనకాభిషేక. ఈమె సంగ్రహ భారతము, సంగ్రహ భాగవతము, సంగ్రహ రామాయణము, ఉషా పరిణయము, మన్నారుదాస విలాసము అను ప్రబంధములు, మన్నారుదాస విలాస యక్షగానము అను ఆరు గ్రంథములు రచించెను. ఇవిగాక ఆమె రచించిన పాటలు పదములు పెక్కులు గలవు. మన్నారుదాస విలాస యక్షగాన మొక్కటే ఇటీవల ముద్రణ మందినది. మన్నారుదాస విలాస ప్రబంధమున నాయకుడు విజయ రాఘవుడు. అతనికి మన్నారుదాసు డను నామాంతరము కలదు. ఉషా పరిణయమందలి కథ హరివంశమునుండి గ్రహింపబడినది. కథా నిర్మాణమందును, కవితా పటిమయందును ఇందు కవయిత్రి చాల నేర్పు ప్రదర్శించినది.

రంగాజమ్మ మన్నారుదాస విలాస ప్రబంధమునందలి కథనే గ్రహించి ఆపేరుతోడనే యొక యక్షగానముకూడ రచించినది. రాజగోపాలస్వామి బ్రహ్మోత్సవములసందర్భమున కాంతిమతి యను కన్య విజయరాఘవుని కాంచి కామించి అతనిని పెండ్లియాడినకథ ఇందలి వస్తువు. ఇందలి కథ విజయరాఘవుడు రచించిన రఘునాథాభ్యుదయమందలి కథ కించుమించుగా ప్రతిబింబము. కథా చమత్కార మంతగా లేకపోయినను, ఈకాలమున వెలువడిన యక్షగానములలోనెల్ల ఇది మిక్కిలి ప్రశస్తి గాంచినది. ఇందు పాటలు, పదములు, దరువులు మున్నగువానితో పాటు పద్యములుకూడ హెచ్చుగా కనిపించును. రంగాజమ్మ తన మన్నారుదాస విలాస ప్రబంధమునందలి పద్యములనే సందర్భానుసారముగా నిందు జొప్పించియుండునని పండితుల అభిప్రాయము. ఈమె సంభాషణములు హాస్యరస చమత్కారముల తోడను, పాత్రోచిత భావముతోడను గూడి మిక్కిలి సహజముగా నుండును.

కోనేటి దీక్షితుడను శ్రీ వైష్ణవ పండితుడు విజయరాఘవుని కొలువుననుండి అతనికి రామాయణ ముపదేశించి వివిధములైన సత్కారములను బొందెను. విజయరాఘవుడు మదనమంజరిని వివాహమాడిన వృత్తాంతమును కైకొని విజయరాఘవ కల్యాణము అను యక్షగానము రచించెను.

విజయరాఘవుని పట్టంపు కవి యగు కామరసు వేంకటపతి సోమయాజి విజయరాఘవ చంద్రికావిహార మను యక్షగానమును రచించెను. విజయరాఘవుని చంద్రికా విహారము అందు మనోహరముగా వర్ణింప బడినది.

పురుషోత్తమదీక్షితు డను మరియొక కవి సత్రమహల్ అను నామాంతరముగల తంజాపురాన్నదాన మహానాటకమును వ్రాసెను. ఇది శృంగార హాస్యరసాద్భుత రస ప్రధానమని కైవారమును బట్టి తెలియుచున్నది.

విజయరాఘవుని కుమారుడైన మన్నారు దేవుడు విజయ రాఘవాభ్యుదయము, హేమాబ్జనాయికా పరిణయము అను రెండు గ్రంథములు రచించెను. ఇందు విజయరాఘవాభ్యుదయము ప్రబంధమో, యక్షగానమో తెలియదు. రెండవది యక్షగానమే. క్షీరసముద్రమున పుట్టిన అమృతమును సురలకొసగి సముద్రుని కూతురగు రక్తాబ్జ యనునామెను మన్నారుదేవుడు వివాహమాడిన వృత్తాంత మిందలి విషయము.

విజయరాఘవుని తరువాత తంజావూరు రాజ్యము మొదట మధుర నాయకులకును, పిమ్మట మహారాష్ట్రులకును వశమైనది. ఈ మహారాష్ట్రి రాజులు తెనుగు నభ్యసించి ఆ భాషను మాటాడుటయే కాక అందు కావ్యములు నాటకములు రచించిరి. పలువు రాంధ్రకవులను, పండితులను, గాయన గాయనీమణులను ఆదరించి పోషించిరి. వీరి కాలమున పెక్కు ద్విపద కావ్యములును, యక్షగానములును రచింపబడినవి.

తంజావూరు సంస్థానమునకు చెందినవాడు కాకపోయినను విజయరాఘవునకు సమకాలికుడును జింజిరాజ కుటుంబమునకు చెందినవాడును అగు ఒక మహాకవిని గూర్చి ఇచ్చట చెప్పవలసియున్నది. అతడు పవరము చిన నారాయణరాజు (క్రీ. శ. 1600-50). ఇతడు రచించిన కావ్యము 'కువలయాశ్వ చరిత్రము'. ఇందలి కథ మార్కండేయ పురాణమునుండి గ్రహింపబడినది. చిన నారాయణరాజు ఆ కథయందు పెక్కు మార్పులు కావించెను. ఋతుధ్వజుడనురాజు మదాలసయను గంధర్వ రాజకన్యను వివాహమాడిన వృత్తాంత మిందలి ప్రధాన కథ. తాళకేతువను రాక్షసుడు ఋతుధ్వజుని వంచించి మదాలసను గొనిపోయిన కథ, అశ్వతరుడు కైలాసమున

తన సంగీతనైపుణ్యమును ప్రదర్శించిన కథ, తారా జయంతుల కథ, ఇందు అంగములుగా వర్ణింపబడినవి. పింగళి సూరన కళాపూర్ణోదయముతరువాత ఇంత కథా రామణీయకము గల ప్రబంధము మరొకటి లేదని విమర్శకుల అభిప్రాయము. కథా కల్పనమునందును, సహజ వర్ణనములందును, ఔచిత్య పోషణమందును, సహజ సంభాషణ నిర్మాణ నైపుణ్యమునందును చిననారాయణ రాజు అద్వితీయుడు. "ప్రతిభాతిశయముననూ, కల్పనా సామర్థ్యముననూ వీరిరువురును (సూరన, చిననారాయణ రాజులు) సమానులే. ఐనను చిననారాయణరాజు కవిత్వమందలి శిల్పపరిపాకమును, ప్రసన్నతయు, నిగ్గును సూరనార్యునందు కానరా"వని శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారి అభిప్రాయము. ఇతడు సూరనవలె సంస్కృతమందు గొప్ప పండితుడే అయ్యును దీర్ఘసమాస ములజోలికి పోక, తంజావూరు కవులకు సాధారణమైన తియ్యని తేటతెలుగుమాటల ప్రయోగించుటయందు ఎక్కువ నేర్పు ప్రదర్శించెను. ఈత డీ కావ్యమును తన పెంపుడు తండ్రియైన నారాయణరాజునకు అంకితము కావించెను.

తంజావూరు నాయక రాజ్యమునందలి సారస్వతమునుగూర్చి చెప్పునప్పుడు క్షేత్రయ్య, త్యాగయ్య, అను భక్తులు రచించిన పదములను, గేయములను కూడ వేర్కొనవలయును. క్షేత్రయ్య కృష్ణామండలమునందలి మొవ్వగ్రామ నివాసి. ఆ గ్రామమునందలి గోపాలదేవుఁ డాతని ఇలవేలుపు. ఆ దేవునిగూర్చి అతడు రచించిన పదములు భక్తి శృంగారములకు నిధానములు. ఇందలి భాష మిక్కిలి జాతీయమై తెలుగు తియ్యదనము నొల్కబోయుచుండును. క్షేత్రయ్య పలు క్షేత్రములను దర్శించి ఆయా చోట్ల గల దేవతలనుగూర్చి భక్తి భరితములైన పదములు రచించెను. ఈ సందర్భముననే ఆతడు విజయ రాఘవుని గూడ దర్శించి ఆతనిపై కొన్ని పదములు కల్పించెను. ఈతని పదములు భావగంభీరములై అభినయమునకు మిక్కిలి అనువుగా నుండును.

త్యాగరాజు మహాభక్తుడు. భక్తి సంగీతము లాతని సొమ్ములు. ఆతడు తంజావూరు నాయకులు గతించిన పిమ్మట ఆ రాజ్యము నాక్రమించిన మహారాష్ట్రుల కాలమున నుండెను. ఆతని కృతులందలి సహజమాధుర్య మొక్క ఆంధ్రులనేకాక దాక్షిణాత్యుల నందరిని ఆకర్షించినది. ఆతని కీర్తనలలో అపూర్వమైన సంగీత పాండిత్యమే కాక సాహిత్య సంపదయు గోచరించుచుండును. ఆతని భాష మార్దవ మాధుర్యములకు పెట్టినది పేరు.

త్యాగరాజు భక్తి భరితములైన పెక్కు కీర్తనలనే కాక ప్రహ్లాద భక్తవిజయము, నౌకా విజయము అను రెండు యక్షగానములను కూడ రచించెను. మొదటి దానిలో భక్తవరేణ్యుడైన ప్రహ్లాదుని అపూర్వ భక్తియు, రెండవ దానిలో శ్రీకృష్ణుడు గోపాంగనలతో యమునా నదిపై విహరించుటయు వర్ణింపబడినవి. ఇందలి కథలను కూర్చుటలో త్యాగరాజు మిక్కిలి స్వాతంత్ర్యము వహించెను. భాగవతమునందలి కథలకును, వీనికిని గల తారతమ్యమే ఇందుకు దృష్టాంతము.

తంజావూరురాజ్య మంతరించిన పిమ్మట మధుర పుదుక్కోట సంస్థానములు కవుల కాశ్రయము లయ్యెను. మధుర నాయకులలో మొదట నాంధ్రకవుల నాదరించి సత్కరించినవాడు ముద్దళగిరి (క్రీ. శ. 17 వ శతాబ్ది యుత్తర భాగము). ఇతనిపేర అంకితము చేయబడిన కృతులు మూడు కానబడుచున్నవి. అందు మొదటిది పెద్దళిరి విజయము. ఇది తంజావూరు కోటయొక్క నాలుగు గోడలపై చెక్కబడిన 580 పాదములు గల ఉత్పల మాలిక. ఇందు అళగిరి మహారాష్ట్రుడైన ఏకోజీ నోడించి పొందిన విజయము వర్ణింపబడినది.

అళగిరికి అంకితమైన రెండవ గ్రంథము తిరుకామ కవి అని నామాంతరముగల లింగనమఖి కామేశ్వరకవి రచించిన సత్యభామా సాంత్వనము. ఇందలి కథ నరకాసుర సంహారము. కృష్ణుడు పదునారువేల స్త్రీలను పెండ్లియాడిన పిమ్మట సత్యభామ కోపింపగా ఆత డామె నోదార్చుటతో కావ్యము ముగియుచున్నది. కామేశ్వర కవి ఉభయభాషా పాండిత్యము కలవాడే యయ్యు తన కావ్యమున పెక్కు వ్యాకరణ స్ఖాలిత్యములకు తావొసగినాడు. మరియు ఆతడు అసభ్య శృంగారముతోకూడిన పద్యము లనేకములు రచించి అందలి యౌచిత్యమునకు భంగము కలిగించినాడు. ఆతడు నాలుగైదుచోట్ల నంది తిమ్మన పారిజాతాపహరణమునందలి పద్యముల ననుక

రింప యత్నించెను. కాని అంచుసంపూర్ణముగా కృతార్థుడు కాజాలకపోయెను.

కామేశ్వరకవి ధేనుకా మాహాత్మ్యము, ఆచార్య విజయము అను రెండు వచనకావ్యములనుకూడ రచించెను. ఇందు మొదటిగ్రంథ మొక్కటే కనబడు చున్నది. "ధీరులు పాకవైరి లోక వికచ కల్పక స్తబక గంధ ధురంధర సూక్తియుక్తి నౌనవునని మెచ్చ నావుల మహత్త్వమొనర్చితి" నని ఆతడే చెప్పుకొనియున్నాడు.

ముద్దళగిరి కృతినందిన మూడవకృతి విద్యావతీ దండకము. దీనిని రచించినవాడు గణపవరపు వేంకట కవి (క్రీ. శ. 17 వ శతాబ్ది మధ్యభాగము). ఇతడు బహు గ్రంథకర్త. అపారమైన పాండిత్యము, అద్వితీయమైన శాస్త్రవిజ్ఞానము, అనంతమైన లోకానుభవముకల్గి ఈతడు కర్ణాట తుండీర చోళ పాండ్య మండల ప్రముఖాఖిల మండలాఖండులచే సత్కారము లందియుండెను. ఇతడు వ్రాసిన గ్రంథములలో లక్షణ గ్రంథము లెక్కువ. బాల రామాయణ ద్విపద, జాంబవతీ విలాస చిత్రకావ్యము, పరమభాగవత చరిత్ర, పురాణసారము, కృష్ణమల్ల కథ అను పేర్లుగల ఈతని కావ్యము లిప్పుడు లభించుటలేదు. లభ్యమగుచున్నవానిలో ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము మహత్తరమైనది. ఇదియు "అమూల్యమైన లక్షణ గ్రంథమేకాని తన్మూలమున నతని కవితా శక్తి కొంతవరకు కనుగొననగు" నని శ్రీ డా. వేలటూరి వేంకటరమణయ్యగారు తెల్పుచున్నారు. గర్భచిత్ర కవిత్వ రచనయందును, పదముల కూర్పునందును ఇతడు ప్రదర్శించిన నేర్పు అపూర్వమైనది. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమునందలి 808 వ సీసపద్యమున అరువదికి పైగా వృత్తాదులుగర్భితములై యున్నవనియు, అట్టి పద్యమును తెలుగు కబ్బములలో నెవ్వరును రచించి యుండలేదనియు కీ. శే. పూండ్ల రామకృష్ణయ్యగారు ప్రశంసించియున్నారు. లింగానుశాసనము, తెనుగు ప్రతాపరుద్రీయము, రసమంజరి, వేంకటేశాంధ్ర మనబడు అభినవాంధ్ర నిఘంటువు, ఆంధ్రకౌముది, గణయతిప్రాస సీసమాలిక, రేఫ ఱకార నిర్ణయ పద్ధతి, షట్ప్రత్యయ ప్రస్తారసరణి, అలంకార సారము, ఆంధ్ర ప్రయోగ రత్నాకరము, ఇర్వదారు ఛందముల వచనము, ఆంధ్ర ద్విరూప కోశము, ఆంధ్రప్రక్రియా కౌముది, అనునవి ఇతడు రచించిన లక్షణ గ్రంథములు. సర్వలక్షణ శిరోమణి అను గొప్ప లక్షణ గ్రంథమును కూడ ఇతడు రచించినట్లు తెలియుచున్నది. ఇది పది ఉల్లాసములకు తక్కువకాని వివిధ లక్షణ లక్షితమైన అమూల్య లక్షణ కావ్యము. నిజమునకు దీనిని లక్షణ రత్నాకర మని చెప్పనగును. పైన పేర్కొనబడిన లక్షణ గ్రంథములలో పెక్కులు ఇందలి ఉల్లాసములే-వేంకటేశాంధ్రమందలి ద్వితీయోల్లాసము, ఆంధ్ర కౌముది తృతీయోల్లాసము, ఆంధ్ర ద్విరూప కోశము దశమోల్లాసము. ఈ మహాకవి కవితా విశేషముల నెరుగుటకు ఈ గ్రంథమంతగా ఉపయోగ పడక పోయినను అతని పాండితీ పాటవమున కిది భాండాగారమని చెప్పుటకు సందేహింప నక్కరలేదు. ఈగ్రంథము సమగ్రముగా లభింపకపోవుట విచారకరము. ఇది వేంకటేశ్వరున కంకితము.

విజయరంగ చొక్కనాథుడు కవిపండిత పోషణ మొనరించుటయేకాక తాను స్వయముగా మాఘ మాహాత్మ్యము, శ్రీరంగ మాహాత్మ్యము అను వచన గ్రంథములను రచించెను. ఇతని సంస్థానమునందలి కవులలో మొదట పేర్కొనదగినవాడు సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు. ఇతడు అహల్యా సంక్రందనము, రాధికా సాంత్వనము అను పద్యకావ్యములను, జైమినీ భారత మను వచన కావ్యమును రచించెను. రాధికా సాంత్వనము ఏకాశ్వాస ప్రబంధము. ఇందు అసభ్యములైన శృంగారపద్యము లెన్నియో కలవు. ఇందలి పద్యములన్నియు ముద్దుపళని రాధికా సాంత్వనమునందు కూడ నున్నవట. ఆమె వానికి మరికొన్ని పద్యములు చేర్చి నాలుగాశ్వాసములుగా విభజించి యున్నదట. ఇదే సత్యమైనచో ముద్దుపళని వేంకటకృష్ణ నాయకుని పద్యములను హరించినదని చెప్పవలసి వచ్చును. ఈ పద్యము లెవరు రచించినవైనను ఇందలి కవిత్వము మృదుమధురమై తేటతెలుగు తియ్యదనమున కాలవాలమై యలరారుచున్నవనుటకు సందేహింప నక్కర లేదు. నీతి బాహ్యములైన కొన్ని శృంగార పద్యములను వర్ణనలను తొలగించినచో ఇట్టి సుకుమార కావ్యము మరొక్కటి లేదని చెప్పవచ్చును.

అహల్యా సంక్రందనము ఇంద్రాహల్యల శృంగార వృత్తాంతమును వర్ణించు ప్రబంధము. వేంకట కృష్ణ నాయకుడు పురాణ మందలి కథను కొంతమార్చి శృంగార రసమునకు ఎడనెడ హాస్యమును కూడ జోడించి ఈ ప్రబంధమును నిర్మించినాడు. ఇందలి శృంగారము రాధికా సాంత్వనమందలి దానివలె నౌచిత్య మర్యాద నతిక్రమింపక మిక్కిలి సభ్యముగా ఉన్నది. ఇందలి కవిత్వము మృదుపద సంకలితమే అయ్యు, అచ్చటచ్చట శబ్దాలంకారములతోకూడి కడు రసవంత ముగా నున్నది. వేంకటకృష్ణప్ప నాయకుడు రచించిన జైమిని భారతము, సారంగధర చరిత్ర అను వచన కావ్యములు రెండింటిలో రెండవ దింకను ముద్రితము కాలేదు. జైమిని భారతము నాతడు పిల్లలమఱ్ఱి పినవీర భద్రుని పద్యకావ్యము ననుసరించియే వ్రాసెను. అందలి పదములు, సమాసములు పెక్కు యథాతథముగ ఇందనువదింపబడినవి. ఈకావ్యము విజయరంగ చొక్కనాథున కంకితముచేయబడినది. ఇందాశ్వాసాద్యంతము లందు పద్యములు కూర్పబడినవి. సారంగధర చరిత్రము శ్రీరంగనాథున కంకితముచేయబడినది. ఇందు మూడాశ్వాసము లున్నవి. ఇది వేంకటకవి కృత సారంగధర చరిత్ర ననుసరించి వచనీకరింపబడియుండునని విమర్శకుల తలంపు. ఇతరులగ్రంథములందలి పదములనెక్కువగా గ్రహింప యత్నించుటచే కాబోలు ఈతని వచన కావ్యములలో పద్యకావ్యములందున్న సౌకుమార్యము కానరాదు.

శేషము వేంకటపతి తారా శశాంకుల ప్రణయగాథను ఐదాశ్వాసముల ప్రబంధముగా రచించి విజయరంగ చొక్కనాథుని మంత్రియగు వంగల సీనయామాత్యునికి అంకితముచేసెను. ఈ సీనయమంత్రికూడ కవియేయనియు రామానుజ చరిత్రను, మన్నారు రంగాంకిత గేయమును రచించియుండెననియు వేంకటపతి చెప్పియున్నాడు. దాక్షిణాత్యాంధ్ర కవులలో చేమకూరకవి తరువాత చెప్పదగినవాడు శేషము వేంకటపతి. ఈతడు తారా శశాంక విజయమున శృంగారమును స్వేచ్ఛగా వర్ణించుట చేతను, పరాంగనా ప్రణయమును సమర్థించు పద్యములు కొన్ని రచించుటచేతను, ఆధునిక విమర్శకు లీతనికి ఔచిత్య దృష్టిలేదని తెగడుచుందురు. ఆకాలపు పరిస్థితు లను దృష్టిలో నుంచుకొని చూచినచో ఆ కావ్యము నందలి శృంగారవర్ణనమంత మితిమీరలేదనియే తోచును. మరియు గ్రంథస్థ పాత్రల నోటచెప్పించిన భావము లన్నింటిని గ్రంథకర్త కంటగట్టుటయు నంతయుక్తము కాదు. ఇందలి కథ కొంత నీతిబాహ్య మనుమాట సత్యమేయైనను కవిత్వము మాత్రము మృదుమధురమై, లలితపదఘటితమై గంభీర భావశోభితమై సహృదయ హృదయానంద సంధాయకముగా నుండు ననుటకు ఆంధ్రదేశమున ఆ గ్రంథమునకు గల బహుళ ప్రచారమే తార్కాణము.

వెలగపూడి కృష్ణయ్య మాలతీ మాధవము, గౌళికా శాస్త్రము, భానుమద్విజయము అను పద్యకావ్యములను, చతుర్విధ కంద శతకమును, వేదాంతసార సంగ్రహము అను వచనకావ్యమును రచించెను. ఇందు భానుమద్విజయ మొక్కటే లభించుచున్నది. భానుమంతుడను విప్ర యువకుడు ఉజ్జయినీ రాకుమారిని వివాహమాడిన వృత్తాంత మిందలి వస్తువు. ఇందైదాశ్వాసములు కలవు. ఇందలి ఐదవ ఆశ్వాసమున యోగశాస్త్రము వివరింప బడినది. ఇది శైవమత ప్రతిపాదకమైన గ్రంథము. ఆ మత ప్రాధాన్యము చేతనే కాబోలు ఇది తమిళ భాష లోనికి కూడ అనువదింపబడినది. ఇందలి కవిత్వము ప్రౌఢముగా నుండును. బ్రౌన్‌దొర ఈ కావ్యమును ప్రశంసించి యుండెను.

విజయరంగ చొక్కనాథుని ఆస్థానమున కథాశుకవి నని చెప్పుకొన్న కుందుర్తి వేంకటాచలపతి మిత్రవిందా పరిణయము, భారత భాగవత వచన కావ్యములు, పెక్కు నాటకములు, చాటు కృతులు చెప్పియుండెనని తెలియు చున్నది. ఇందు మిత్రవిందా పరిణయ మొక్కటే లభించు చున్నది.ఇది ఆరాశ్వాసముల ప్రబంధము. శ్రీకృష్ణు డష్ట మహిషులలో నొకతెయైన మిత్రవిందను పరిణయమాడుట ఇందలి విషయము. ఇందు ప్రబంధ లక్షణము లన్నియు కానిపించును. ప్రబంధోచితములైన సర్వ వర్ణనలను చొప్పించుటకు అనువుగా కవి కథను కల్పించెను. అందుచే కథయు కవిత్వమును కూడ జీవకళకు దూరమై కృత్రి మములుగా కనిపించును.

ఈ కాలమున వ్రాయబడిన చారిత్రక వచన కావ్యములలో రాయ వాచకమును మొదట పేర్కొనవలయును. ఇందు కృష్ణదేవరాయల చరిత్రము వాడుక భాషలో చెప్పబడినది. ఇది విశ్వనాథ నాయకునకు అజ్ఞాతనామధేయుడైన అతని స్థానాపతి వ్రాసిన విన్నపమని అందు గలదు. తాను సుజనులచే విన్న సూనృత వాక్కులను రచించితినని గ్రంథకర్త చెప్పియున్నాడు. ఇందు మొదట పేర్కొనబడిన విశ్వనాథ నాయకుడు మధుర రాజ్యస్థాపకుడైన విశ్వనాథ నాయకుడు కాడనియు, క్రీ. శ. 1595 నుండి 1601 వరకు పాలించిన రెండవ కృష్ణప్ప తమ్ముడనియు శ్రీ డా. నేలటూరి వేంకటరమణయ్యగారు అభిప్రాయపడుచున్నారు. కృష్ణరాయల కాలమున అధికార వర్గమునందు వాడుకలో నుండిన భాషయే ఈ గ్రంథమున ఉపయోగింపబడినది. ఫార్సీ భాషయందలి రాజకీయ పారిభాషిక పదములు పెక్కింటు ప్రవేశించి యున్నవి. వాక్యములు అతి దీర్ఘములుగా నుండుటచేతను, వాక్య యోజన ప్రాతపద్ధతిని సాగుటచేతను అచ్చటచ్చట కొంత అర్థక్లేశము కల్గుమాట సత్యమే. ఐనను మొత్తముమీద ఇందలిభాషవ్యర్థపదములు కాని, అనవసరాడంబరముగాని లేక సరళమై మిక్కిలి శక్తిమంతముగా నున్నది.

రాయవాచకమువంటి చారిత్రక వచన గ్రంథమే మరొకటి కలదు. దాని నాంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించియున్నారు. ఇందలి భాషయు రాయవాచకమందలి భాషయు నొకే విధమున నున్నవి. కాని ఇందలి చారిత్రకాంశముల యాథార్థ్యము సందేహాస్పదముగా నున్నది. ఇది యత్కర్తృకమో తెలియదు.

చొక్కనాథుని భార్యయైన రాణి రంగమ్మ మనుమడగు విజయరంగ చొక్కనాథుని పక్షమున మధుర రాజ్యమును క్రీ. శ. 1689 నుండి 1706 వరకును పాలించియుండెను. ఆమెను గర్హించుచు, ఆమె మన్మథ క్రీడలను వర్ణించుచు. అశ్లీల పదములతో కూడిన యొక వచన గ్రంథము కానబడుచున్నది. దాని పేరు మధుర మంగాపుంశ్చలీ విలాసము. దీనిని రచించిన వారెవ్వరో తెలియదు. ఆతడే కారణముననో రాణి కోపమునకు గురియై అందందు తిరుగుచు కసితీర్చుకొనుటకై బూతుల బుంగయైన ఈ గ్రంథమును రచించినట్లు తోచుచున్నది. అప్పటి దేశపరిస్థితులు కొన్ని ఇందు వర్ణితము లగుటచే ఇది చరిత్రకారులకు మిక్కిలి ఉపయోగకరముగా నుండును. ఇందలి భాష రాయవాచకము నందలి భాషనే పోలి యున్నది. ఇందు అందందు కొన్ని ద్విపద పంక్తులు గలవు.

రాయవాచకము వంటిదే తంజావురాంధ్ర రాజుల చరిత్ర అను వచనగ్రంథ మింకొకటి కలదు. దీని కర్త కూడ అజ్ఞాతుడే. తంజావూరు రాజ్యము నాక్రమించి ఏలుటకు మధుర నాయకులకు హక్కు కలదని నిరూపింప యత్నించుటచే ఆతడు మధుర నాయకుల కాశ్రితుడై యుండునని తోచుచున్నది. తనపై తిరుగబడిన నాగమనాయని తండ్రియని చూడక బంధించి తెచ్చిన విశ్వనాథ నాయకునికి రాయలు చోళపాండ్య రాజ్యములు పంచి యిచ్చెననియు, తరువాత అచ్యుతరాయలు తన మరదలైన మూర్తమాంబను చెవ్వప్పకిచ్చి పెండ్లిచేసి విశ్వనాథ నాయకుని ఏల్బడినుండి చోళ రాజ్యమును గ్రహించి ఆమెకు అరణముగా నిచ్చెననియు పై గ్రంథమున వ్రాయబడి యున్నది. ఇందు చెంగమలదాసు మనుమడు విజయ మన్నారప్పనాయడు తన చెల్లెలిని విజయరంగ చొక్కనాథుని (క్రీ. శ. 1706-1782) కిచ్చి పెండ్లి చేసిన వృత్తాంతము వ్రాయబడి యుండుటచే ఈ గ్రంథము క్రీ. శ. 18 వ శతాబ్ది మధ్య భాగమున రచింపబడినట్లు గోచరించుచున్నది. ఇందలి రచనా విధానము, చిన్న చిన్న వాక్యముల కూర్పు, స్పష్టమైన భాష, ఇది రాయవాచకముకంటె అర్వాచీనమని చెప్పక చెప్పుచున్నవి. ఇందు అన్యభాషా పదము అంతగా కానరావు. భాష చాల వరకు దోషరహితమై ఉన్నది.

తుపాకుల కృష్ణప్ప నాయకుని కుమారుడును, మధుర రాజుల యొద్ద దళవాయిగా ఉండినవాడును అగు అనంత భూపాలుడు పెక్కు వచన గ్రంథములు రచించెను. (క్రీ. శ. 17 వ శతాబ్ది ఉత్తరార్ధము) ఇతడు భారత వచన రచనమున కళువె వీరరాజునకు కొంత తోడ్పడి యుండెను. ఇతడు విష్ణుపురాణము, మహాభారతాను శాసనిక పర్వము, రామాయణ సుందరకాండము, భగవద్గీత అను వచన గ్రంథములు విరచించెను. ఇందు విష్ణుపురాణమొక్కటే ముద్రితమైనది. అనంతభూపాలుడు

సంస్కృతాంధ్రములందు గొప్ప పండితుడు. ఇతని విష్ణు పురాణము సంస్కృత గ్రంథమును చక్కగా అనుసరించు చున్నది. ఇందలి రచన సంస్కృత సమాస భూయిష్ఠమును, ప్రౌఢమునునై నిర్దుష్టముగా నున్నది. దాక్షిణాత్య గ్రాంథికాంధ్ర రచయితలలో ఇత డగ్రగణ్యుడు.

మధుర సంస్థానాశ్రితులు కాకపోయినను, విజయరంగ చొక్కనాథుని కాలముననందేయుండిన శ్యామరాయకవి, వేంకటసుబ్బకవి అనువారు వచనమున రామాయణ ములను రచించిరి. రామభద్రకవి అను నతడు హాలాస్య మాహాత్మ్యమును వచనకావ్యముగా వ్రాసియుండెను.

పుదుక్కోటను పరిపాలించిన రాజులు ఆంధ్రనాయకులు కాకపోయినను, ఆంధ్రభాషపై అభిమాన మూని అందు కవులను పండితులను పోషించుటయేకాక స్వయముగా గ్రంథరచనకూడ కావించిరి. క్రీ. శ. 1682 నుండి 1730 వరకు పరిపాలించిన రఘునాథునిపై ఆంధ్ర కవులు రచించిన చాటువులు పెక్కు కానబడుచున్నవి. అతని తమ్ముని కుమారుడైన రామస్వామినృపాలుని నాయకు నొనర్చి ఉద్దండ విద్వత్కవియైన శేషయార్యుడు శృంగారవాణీదండకము రచించెను. అతని పుత్రుడైన తిరుమలనాయకుడును, మనుమడైన రాజగోపాల నాయ కుడును పలువు రాంధ్రకవులను పోషించిరి. విజయ రఘునాథుడు (క్రీ. శ. 1730 - 69) నుదురుపాటి కవుల నాదరించి వెంకన రచించిన ఆంధ్రభాషార్ణవమను నిఘంటువును కృతిపొందెను.

నుదురుపాటి వెంకన పైనిఘంటువునే కాక రాజవంశ ప్రశస్తి, మల్లు పురాణము, రఘునాథీయము అను గ్రంథ ములనుకూడ రచించెను. ఇందలి తుదిరెండు గ్రంథములును అముద్రితములు. ఇతడు విద్వత్కవి. ఇతని తండ్రి మహోద్దండకవి అని ప్రశస్తిపొందిన సీతారామార్యుడు. ఇతని రచన లేవియు లభించుటలేదు.

రఘునాథుని పుత్రుడగు రాయ రఘునాథుడు (క్రీ. శ. 1769 - 89) వేద వేదాంతముల తోడను వాత్స్యాయనాది శాస్త్రములతోడను పరిచయముగల వాడును నిరంకుశప్రతిభా భాసురుడునై పార్వతీ పరిణయ మను ప్రబంధమును రచించెను. ఇతడు ఉద్దండకవి. సీతా రామార్యుని శిష్యుడు. వెంకనకు సతీర్థ్యుడు. ఇతని పార్వతీ పరిణయము నూతనములైన కల్పనలతోడను, మధురమంజులములైన పదములతోడను, లోకోత్తరము లైన వర్ణనములతోడను కూడి మిక్కిలి సరసముగా నుండును. ఇందెడనెడ కాళిదాసుని కుమారసంభవ శ్లోక ములకు అనువాదములు కానవచ్చును. అచ్చటచ్చట వ్యాకరణ మర్యాద నతిక్రమించి ప్రయోగములుకూడ నున్నవి. ఈ కావ్యము నుదురుపాటి వెంకనయే రచించి రాయ రఘునాథునిపేర ప్రకటించెనను ఐతిహ్య మొక్కటి కలదు. కాని దానిని సమర్థించుటకు తగిన ఆధారములు లేవు.

రాయ రఘునాథుని తరువాత పుదుక్కోట సింహాసనము నధిష్ఠించిన విజయరఘునాథుడుకూడ కవిపండిత పోష కుడే. వెంకన కుమారుడగు సాంబకవి ఈతని సమకాలి కుడు. రఘునాథుని గురువును, మహాపండితుడు నగు గొనసూరి నారాయణయ్యంగారు భానుమిశ్రుని రస మంజరి యను శృంగార శాస్త్రగ్రంథమును తెనిగించెను. ఇందలి కవిత్వము ప్రౌఢమై మిక్కిలి సరసముగా నుండును.

విజయ రఘునాథుని తమ్ముడైన రఘునాథుడును (క్రీ. శ. 1835-39) కవులను పోషించి వారి ప్రశంసలకు పాత్రుడయ్యెను. ఇతనికి "His Excellency" అను బిరుదము కలదు. ఇతని కుమారుడగు రామచంద్రుడు వెంకన మనుమడైన చిదంబరకవిని పోషించెను. ఇతడు రామచంద్రునిపేర చంద్రాననా దండకమును రచించెను.

విజయనగర రాజ్యమంతరించిన పిమ్మట స్వతంత్రము లైన సామంతరాజ్యములలో మైసూరు రాజ్యమొకటి. ఇచ్చటకూడ కొందరు కవులు పద్యగద్య కావ్యములను రచించి ఆంధ్రవాణి నలంకరించిరి. ఇచ్చటి పద్యకావ్య ములలో ప్రధానమైనది శుకసప్తతి. దీనిని రచించినవాడు పాలవేకరి కదిరీపతి (క్రీ. శ. 1660). ఇతని పూర్వులు కోలారు ప్రాంతమున సామంతరాజులుగా నుండిరి. శుక సప్తతి చక్కని కథాకావ్యము. చిలుక చెప్పిన కథ లగుటచే దీని కీపేరు కల్గినది. సప్తతి అనగా డెబ్బది. కాని ఇందు పూర్తిగా డెబ్బది కథలు లేవు. స్త్రీల మనశ్చాం చల్యమును ప్రదర్శించుటకై ధౌమ్యు డీకథలను చిలుకచే ధర్మరాజునకు చెప్పించెను. ఇందు కొన్ని కథలతి శృంగార

ములై నీతిబాహ్యములుగ నున్నవి. పూర్వకావ్యము లందలి కథలుకూడ కొన్ని ఇందు కానవచ్చును. లీలావతి అను రాజకుమారి కథ గౌరన నవనాథ చరిత్ర నుండి గ్రహింపబడినది. చపలయను విప్రయువతి కథకును కళాపూర్ణోదయమునందలి సుగాత్రీ శాలీనుల కథకును పోలిక ఉన్నది. వసుమంతుడను వణిజుని కథ నీలిమయమై రమ్యముగా నున్నది. కదిరీపతి కథాకథనమున మిక్కిలి నేర్పరి. క్రీ. శ. 15వ శతాబ్దిలో కొరవి గోపరాజు వ్రాసిన సింహాసన ద్వాత్రింశిక యందలి కథలకంటె ఈతని కథలు సహజతరములుగ ఉన్నవి. సులభమైన శైలిలో సహజ వర్ణనములు కావించుట యందును, స్త్రీ పురుషుల చిత్తవృత్తులు వర్ణించుటయందును ఇతడు చాల సమర్థుడు. ఈతని గ్రంథము వలన తత్కాల ప్రవృత్తులను లోకస్వభావమును చక్కగా తెలియవచ్చును.

మైసూరు రాజ్యమున పద్య గ్రంథములకన్న గద్య గ్రంథము లెక్కువగా వెలసినవి. వీనిని రచించిన కళువ వంశపు దండనాథులు పేర్కొన దగినవారు. అందు కళువె వీరరాజు భారతమును వచనముగా వ్రాసెను. ఇతని తండ్రి దొడ్డరాజు. చిక్కదేవరాయలకడ దళవాయిగా నుండెను. (క్రీ. శ. 1673-1704). వీరరాజు కన్నడమునను, సంస్కృతమునను కూడ గ్రంథరచన కావించెను. ఇతని వచన భారతమునందలి సభా భీష్మ పర్వములు మాత్రమే ఇప్పుడు లభించుచున్నవి. ఈతని రచన సంస్కృత భారతమునకు సరియైన అనువాదము. ఇందలి వాక్యములు కొంచెము దీర్ఘతరములుగా నున్నను ఇతని శైలి సరళమై మనోహరముగా నుండును. ప్రథమా విభక్తియందలి ముపర్ణకమును బిందుపూర్వకబు వర్ణముగా వ్రాయుట ఈతనికి అలవాటు. భారత వచన రచనమున వీరరాజునకు విష్ణుపురాణ వచన కర్త యగు తుపాకుల అనంత భూపాలుడు తోడ్పడియుండెను. వచన భారతము మైసూరు రాజ్యమందలి కళువె గ్రామమందలి గోపాల కృష్ణుని కంకితము చేయబడినది.

వీరరాజు కుమారుడైన నంజరాజుకూడ ఆంధ్ర కర్ణాట భాషలలో కావ్యములు వ్రాసెను. ఇతడును తండ్రివలెనే మైసూరు రాజ్యమున దండనాథుడుగా ఉండెను (క్రీ. శ. 1724). ఇతని కన్నడ వచన భారతమును, తెలుగు హాలాస్య మాహాత్మ్యమును లభించుచున్నవి. హాలాస్య మాహాత్మ్యము శైవ గ్రంథము. దక్షిణ మధురాపురి మహిమ వర్ణింపబడినది. ఇందలి రచన సులభమై సలక్షణముగా నుండును.

ఇంత వరకును దక్షిణాంధ్ర యుగమున దక్షిణ దేశమున రచింపబడిన ఆంధ్రవాఙ్మయమును గూర్చి చెప్పబడినది. ఈ కాలమున తెలంగాణమునను, ఆంధ్రదేశమునను కూడ పలువురు కవులు పలురకములైన కావ్యములను రచించి యుండిరి.

దామెర్ల వేంగళనాయకుడు (క్రీ. శ. 17 వ శతాబ్ది నడుమ) కృష్ణ చరిత్రము, బహుళాశ్వ చరిత్రము అను గ్రంథములను రచించెను. ఇందు బహుళాశ్వ చరిత్రము ప్రౌఢమైన ప్రబంధము. ఇందలి కథ కడు స్వల్పము. శ్రీకృష్ణుడు తన భక్తుడైన బహుళాశ్వుని ఇంటికి విందారగింప బోవుట ఇందలి ఇతివృత్తము. కృష్ణుని పరోక్షమున ద్వారక యందలి గోపికలు పొందిన విరహమును కవి విపులముగ వర్ణించెను. ప్రబంధోచితములైన వర్ణనలన్నియు ఇందు కనుపించును. బహుళాశ్వుడు చేసిన విందును వర్ణించు సందర్భమున ఆ కాలమునందలి రాజ కుటుంబములలోని భోజన మర్యాదలు వివరింపబడినవి. పంచమాశ్వాసమునందలి కళానిధి అను వైశ్య యువకుని కథలో వేశ్యాలోలతవలని యనర్థములు వర్ణితములైనవి. కళానిధి వలపుకత్తెయైన మణిమంజరి నృత్య నైపుణ్యమును వర్ణించుపట్ల కవికి కల నాట్యకళా పరిచయము వెల్లడి యగుచున్నది. కవి రామభక్తుడగుటచే కావ్యమున నెట్లో ప్రసక్తిని కల్పించి రామభక్తిని వర్ణించెను. ఈ కావ్యము శ్రీరామునకే అంకితము చేయబడినది. వేంగళనాయకుడు సంస్కృతాంధ్రములందు మంచి పండితుడు. కవిత్వమున కాళిదాసాదులు తప్ప ఇతరులు తన కీడు కారని ఈతడు వ్రాసికొనెను. శ్లేష శబ్దాలంకార ఘటనమున ఈతనికి ప్రీతి మెండు.

ఈ కాలపు కవులలో బహు గ్రంథములు రచించి కవి సార్వభౌముడని ప్రశస్తిగాంచినవాడు కూచిమంచి తిమ్మకవి (క్రీ. శ. 1700-1756). రుక్మిణీ పరిణయము, రాజశేఖర విలాసము, నీలాసుందరీ పరిణయము, అచ్చ తెలుగు రామాయణము, రసికజన మనోభిరామము,

సాగరసంగ మాహాత్మ్యము, సర్పపుర మాహాత్మ్యము, శివలీలా విలాసము, సర్వలక్షణసార సంగ్రహము, సారంగధర చరిత్రము, కుక్కుటేశ్వర శతకము మున్నగునవి ఈతని కృతులు. ఇందు సర్పపుర మాహాత్మ్యము సర్పవరమునందలి భావనారాయణస్వామికిని, మిగిలినవి పిఠాపురమునందలి కుక్కుటేశ్వర స్వామికిని, అంకితము చేయబడినవి. ఈ కవి బమ్మెర పోతనవలె తన కావ్యములను నరులకు కృతియిచ్చుట కంగీకరింపక భగవంతునికే ఒసంగెను. ఇతడు శివభక్తి తత్పరుడయ్యును పరదైవతములను ద్వేషింపక అద్వైత భావముతో మెలంగెను.

ఇతని రాజశేఖర విలాసమునకే భిల్లాణరాజ చరిత్రమని నామాంతరము. జంగము అడిగిన దేదియైన నిత్తునని గురువునెదుట ప్రతిజ్ఞచేసి యుండుటచే, భిల్లాణరాజు మాయజంగమ వేషమున వచ్చినశివునకు తన పట్టమహిషియైన చల్లమాంబ నర్పించుటయు, శివుడామె చేతిలో శిశువుగామారి ఆ దంపతుల ననుగ్రహించుటయు ఇందలి విషయములు. రసికజన మనోభిరామము శృంగార రస ప్రధానమైన ప్రబంధము. ఇందు స్త్రీవర్ణనము విపులముగా చేయబడినది. వసుచరిత్ర నాదర్శముగా గ్రహించి కవి ఈ ప్రబంధము రచించెను. ఋతుధ్వజుడను రాజు సుశ్యామ అను గంధర్వకన్యను మోహించి పరిణయమాడుటయు, వారికి జన్మించిన కుమార్తె గౌతమి మహర్షిని పెండ్లియాడుటయు, ఇందలి ప్రధాన కథాంశములు. ఈకావ్యవస్తువు బ్రహ్మ పురాణమందలి గోదావరీ ఖండమునుండి గ్రహింపబడినదని తిమ్మకవి తెలిపియున్నాడు. తిమ్మకవి వర్ణన ప్రియుడే అయ్యును, ఔచిత్యము నెచ్చటను అతిక్రమించి యుండలేదు.

నీలాసుందరీ పరిణయము, అచ్చతెనుగు రామాయణము అనునవి అచ్చతెనుగున వ్రాయబడిన కావ్యములు. నందుని భావ అగు కుంభకుని గోష్ఠమునందుండిన వృషభములు కొన్ని మదించి చెలరేగి గ్రామస్థులను బాధింప దొడగెను, వానిని నిగ్రహించువారికి తనకూతు నిచ్చెదనని కుంభకుడు ప్రకటించెను. కృష్ణుడు వానిని సంహరించి నీలను పెండ్లియాడెను. అచ్చతెనుగున రచింపబడినదయ్యు ఈ కావ్యము సరసమై మనోహరముగా నుండును. ఇందు మూడాశ్వాసములున్నవి. అచ్చతెనుగు రామాయణము కూడ ఇట్లే సహజమైన వర్ణనలకును, సరసమైన పద ప్రయోగమునకును నెలవై హృద్యముగానుండును. ఈ అచ్చతెలుగు కావ్యములు రచించుటచే ఇతనికి అభినవ వాగనుశాసనుడను బిరుదము కలిగెనని చెప్పుదురు.

రుక్మిణీ పరిణయము తిమ్మకవి ప్రబంధరచన. ఇందలి శైలి సంస్కృతసమాన భూయిష్ఠమై ప్రౌఢముగానుండును. శివలీలావిలాసము ఇతని తుదిరచన. లక్షణ సారసంగ్రహము మూడాశ్వాసముల లక్షణగ్రంథము. పూర్వలక్షణ గ్రంథములలో లేని క్రొత్తవిషయములు కొన్ని తానిందు చేర్చితినని కవి చెప్పియున్నాడు. తిమ్మకవి గ్రంథములందు ప్రబంధయుగచ్ఛాయలే హెచ్చుగా గోచరించును. క్రొత్తదనమేదియు కానరాదు. ఇతని కవిత్వము మిక్కిలి ధారాళమైనది. పాండిత్య ప్రకర్షకై ఈత డచ్చటచ్చట శ్లేషయమకాదులను గర్భకవిత్వమును ప్రదర్శించి యుండెను. ఈతని తొలిరచనలలో స్త్రీవాచక అకార సంధులు మున్నగు కొన్ని దోషములు కన్పించినను తరువాతి రచనలు మిక్కిలి నిర్దుష్టములుగానే యుండును. బహుకావ్యరచనా ధురంధరుడయ్యు ఈ మహాకవి రాజాశ్రయము నాసింపక భగవంతుని నమ్మి స్వతంత్ర జీవితము సాగించెను.

కూచిమంచి తిమ్మకవి సార్వభౌముని రెండవ తమ్ముడు జగ్గకవి (క్రీ. శ. 1700-1760). జానకీ పరిణయము, ద్విపద రాధాకృష్ణ చరిత్రము, సుభద్రా పరిణయము, చంద్రరేఖా విలాపము, సోమదేవ రాజీయము మున్నగు గ్రంథములను రచించెను. సుభద్రా పరిణయమున అర్జునుడు సుభద్రను పెండ్లియాడిన వృత్తాంతము చక్కగా వర్ణింపబడినది. ఇం దారాశ్వాసము లున్నవి. చంద్రరేఖా విలాపము దూషణకావ్యము. పూసపాటి విజయరామరాజుగారి భావమరది అగు చింతలపాటి నీలాద్రిరాజ సత్కారము చేసెద నని కావ్యము వ్రాయించుకొని పిమ్మట తిరస్కారము చూపుటచే, కోపించి అతని దూషించుచు జగ్గకవి ఈ బూతుకావ్యమును రచించెను. తిట్టు కవిత్వమున నీతనికి గల అసమానపాండిత్య మిందగోచరించును. సోమదేవరాజీయము కాసెసర్వప్పసిద్ధేశ్వరచరిత్రము ననుసరించి వ్రాయబడినది. ఇది కాకతిప్రతాపరుద్రునివంశమును వర్ణించు మూడాశ్వాసములగ్రంథము

తిమ్మకవికి సమకాలికుడో ఇంచుక తరువాతివాడో అని చెప్పదగిన ఏనుగు లక్ష్మణకవి బహు గ్రంథములు రచించి ప్రసిద్ధికెక్కెను. రామేశ్వర మాహాత్మ్యము, సుభాషిత రత్నావళి, విశ్వామిత్ర చరిత్రము, రామ విలాసము, గంగా మాహాత్మ్యము, గీర్వాణ సూర్య శతకము, విశ్వేశ్వరోదాహరణము, నృసింహ దండకము, మున్నగునవి ఈతని కృతులు. ఇతడును, ఇతని పూర్వు లును పెద్దాపుర సంస్థానము నాశ్రయించి ఆ రాజులచే వివిధ సత్కారములు గ్రహించిరి. ఇతడు తిమ్మ జగపతి గారి కాలమునందును వారి తండ్రియైన రాయ జగపతి రాజుగారి కాలమునందును నివసించెను. రామేశ్వర మాహాత్మ్యమున శ్రీరాముడు సేతువునొద్ద రామేశ్వర లింగమును స్థాపించుటయు, తత్క్షేత్ర మాహాత్మ్యమును వర్ణింపబడినవి. ఇందలి కథ స్కాంద పురాణగత రామే శ్వర ఖండమునుండి గ్రహింపబడినది. కవి దీనిని గురుజాన వల్లి యందలి మల్లేశ్వర దేవునికి అంకితము చేసియుంచెను. ఈ కవి రచించిన కడపటి గ్రంథము రామవిలాసము. దీని నితడు తిమ్మజగపతి రాజుగారి సన్నిహిత బంధువైన వత్సవాయ గోపరాజునకు (1759-1797) అంకితము చేసెను. ఇతడు రచించిన గ్రంథములలోని కెల్ల మిక్కిలి ప్రసిద్ధి నొందినది సుభాషిత రత్నావళి. ఇది సంస్కృత మున భర్తృహరి యోగీంద్రుడు రచించిన సుభాషిత త్రిశతికి అనువాదము. ఇందు నీతిశతకము, శృంగార శత కము, వైరాగ్య శతకము అను మూడుశతకములున్నవి. ఒక్కొక్క శతకము పదేసి పద్ధతులుగా విభజింపబడినది. ఇది పెద్దాడపురీ నిలయుడైన సోమశంకర స్వామికి అంకి తము చేయబడినది. ఇది అనువాద మయ్యు చక్కని ధారాశుద్ధియు, భావసౌష్ఠవమును గల్గి ఆంధ్రదేశమున మిక్కిలి ప్రచారము నందినది. అన్వయకాఠిన్యము కాని, ప్రౌఢ దీర్ఘసమాసబాహుళ్యము కాని లేక ఇందలి రచన ద్రాక్షాపాకమై అలరారుచున్నది. అనువాదాంతరము లున్నను దేశమున బహువ్యాప్తి గాంచుటయే దీని ప్రశస్తికి కారణము.

సుభాషిత త్రిశతి నాంధ్రీకరించిన ఇతరకవులు ఎలకూచి బాలసరస్వతియు, పుష్పగిరి తిమ్మనయు. తిమ్మన (క్రీ. శ. 1780-1790) రచనలో ఒక్క నీతిశతకమే లభించు చున్నది. ఇతడును తన గ్రంథమును శివార్పితమే కావిం చెను. ఆతడన్ని శ్లోకములను చంపకోత్పలములందే తెనిగిం చెను. ఇట్టి నియమము పెట్టుకొన్న వాడగుట చేతనే ఇతడు చిన్న శ్లోకములను అనువదించునట్లు వృత్తమునకు సరిపోవునట్లందలి భావములను పెంపుచేయవలసివచ్చెను. అయ్యును, ఇతని రచన మిక్కిలి సరసమును జాతీయమునై యొప్పుచున్నది. ఇదికాక ఇతడు సమీరకుమార విజ యము అను పదాశ్వాసముల ప్రబంధమును కూడ రచించెను.

బాలసరస్వతి తన అనువాదమునందలి పద్యములను 'సురభిమల్లా నీతివాచస్పతీ' అను మకుటముతో రచిం చెను. ఈ సురభిమల్ల భూపతి జటప్రోలు సంస్థానాధిపుడని విమర్శకులు చెప్పుచున్నారు. బాలసరస్వతి కవిత్వము ప్రౌఢమై కొంచెము మర్థక్లేశము కల్గించును. నన్నయ రచిత మని ప్రసిద్ధమైన ఆంధ్రశబ్ద చింతామణికి ఇతడు టీక రచించెను. ఇదికాక చంద్రికాపరిణయమను ప్రబంధమును కూడ ఇతడు వ్రాసెనని చెప్పుదురు. కాశీరాజు కూతురైన చంద్రికను భీముడు వివాహమాడుట ఇందలి కథ. ఈ గ్రంథము సురభి మాధవరాయల చంద్రికాపరిణయము కంటె భిన్నమైనది.

అడిదము సూరకవి విజయనగర సంస్థానమున పూస పాటి (రెండవ) విజయరామరాజుగారి కాలమున (క్రీ.శ. 1780-80) ఉండినట్లు తెలియుచున్నది. కవిజన రంజనము, రామలింగేశ శతకము, కవి సంశయ విచ్ఛేదము, ఆంధ్ర చంద్రాలోకము, ఆంధ్ర నామశేషము అనునవి ఈతని కృతులు. ఇవిగాక ఇతడు రచించిన చాటువు లును, దూషణ పద్యములును, పెక్కు గలవు. కవి సంశయ విచ్ఛేదము మూడాశ్వాసములతో కూడిన చిన్న లక్షణ గ్రంథము. ఆంధ్ర నామశేషము అచ్చ తెలుగు నిఘంటువు. పైడిపాటి లక్ష్మణకవి రచించిన ఆంధ్ర నామ సంగ్రహమున కిది శేషగ్రంథము. ఆంధ్ర చంద్రా లోకము జయదేవ కృతమైన సంస్కృత చంద్రాలోక మున కాంధ్రీకరణము. రామలింగేశ శతకము "రామ లింగేశ రామచంద్ర పురవాస" అను మకుటము గల సీసపద్య శతకము. ఈ శతకమున ఆ కాలపు రాజుల దుశ్చర్య లన్నియు వర్ణింపబడినవి. ఇందలి దూషణమునకు

గురియైనవాడు పూసపాటి సీతారామ చంద్రరాజు అను విజయనగర సంస్థానమంత్రి యని చెప్పుదురు. ఈతని గ్రంథములలోనికెల్ల ఉత్తమమైనది కవిజన రంజనము. చంద్రమతీ పరిణయ మిందలి కథ. ఇందలి పద్యములు పెక్కు వసుచరిత్రము నందలి పద్యములను తలపించు చుండుటచే దీనికి పిల్లవసుచరిత్ర మను పేరు కల్గినది. ఇందు మూడాశ్వాసము లున్నవి. ఈ కవి తన కృతుల నన్నిటిని రామచంద్రపురము నందలి రామలింగేశ్వరున కంకితము చేసెను. సూరకవి శైలి లాక్షణికమును, సమాస భూయిష్ఠమునై రమ్యముగా నుండును. ఈతని తిట్టు కవిత్వము "సూరకవి తిట్టు కంసాలి సుత్తెపెట్టు" అని ప్రసిద్ధి కెక్కినది.

క్రీ.శ. 18 వ శతాబ్ది యందలి ఆంధ్ర కవులలో మిక్కిలి ప్రౌఢుడని పేరందినవాడు కనుపర్తి అబ్బయా మాత్యుడు. ఇతడు సూరకవికి సమకాలికుడు (1780). మంగళగిరి పానకాలరాయని భక్తుడు. ఇతడు అనిరుద్ధ చరిత్రము, కవిరాజ మనోరంజనము అను రెండు ప్రబంధములు రచించెను. ఇందు మొదటిదాని కంటె రెండవది మిక్కిలి ప్రౌఢమై పిల్లవసుచరిత్ర మని ప్రసిద్ధి గాంచినది. పురూరవశ్చక్రవర్తి చరిత్ర మిందలి విషయము. "వసు చరిత్రమునకు తరువాత నీతని కవిరాజ మనో రంజనముతో సరితూగదగిన ప్రబంధము లొకటి రెంటి కంటె నెక్కువగాలేవని కీ.శే. వీరేశలింగం పంతులుగారు దీనిని గూర్చి చెప్పియున్నారు. ఈ కవి భట్టుమూర్తివలె సాహిత్యమునందే కాక సంగీతమునందు కూడ మిక్కిలి ప్రవీణుడైనట్లు తెలియుచున్నది.

ఈ కాలమున మిక్కిలి ప్రసిద్ధికెక్కిన మరొక కవి కంకంటి పాపరాజు. ఇతడు నెల్లూరు మండలము నందలి ప్రళయ కావేరిపట్టణమున అమీనుగా లౌక్యాధికారమం దుండినవాడు (క్రీ.శ. 1750-1800). తిక్కన సోమ యాజి నిర్వచనముగా రచించిన ఉత్తరరామాయణమునే ఇతడు ప్రబంధ రీతిని చంపూకావ్యముగా నంతరించెను. అచ్చటచ్చట కొన్ని లాక్షణిక దోషములున్నను ఇది మిక్కిలి రసవంతమై సహృదయ హృదయరంజకముగా ఉండును. దీనికి మూలము రామాయణము నందలి ఉత్తర కాండము. తిక్కన మూలమును సాధ్యమైనంతవరకు సంగ్రహించుటకు యత్నింపగా పాపరాజు దానిని విస్తృత మొనరించినట్లు కాననగును. ఇందలి వర్ణనలు ప్రబంధో చితములై మిక్కిలి ప్రౌఢముగా నున్నవి. రావణ కుంభ కర్ణాదుల పూర్వ చరిత్రలును, శ్రీరాముడు జనాపవాద కారణమున సీతను పరిత్యజించుటయు ఇందు చక్కగా వర్ణింపబడినవి. సీతా పరిత్యాగము, రాముని అశ్వమేధా చరణము, కుశలవుల రామాయణ గానము, నిండుసభలో సీత భూగర్భము చొచ్చుట మున్నగు ఘట్టములను వర్ణించుపట్ల పాపరాజు మిక్కిలి నేర్పు ప్రదర్శించెను. గ్రంథారంభమున ఇతడు శబ్దాలంకారములం దెక్కువ మక్కువ చూపినను, పోను పోను రసపోషణమునకే ఎక్కువ ప్రాధాన్య మొసగియుండెను. ఈ కావ్యమున వృత్తముల సంఖ్య హెచ్చు. రచన సంస్కృత సమాస భూయిష్ఠమై మిక్కిలి ధారాళముగా నుండుదు. ఈ కావ్యమును రచించుటలో తనకు పుష్పగిరి తిమ్మన సాయ మొనరించెనని పాపరాజు చెప్పుకొనియుండుటచే కొందరీ గ్రంథమంతయుకూడ అతడే రచించి, పాపరాజు పేర ప్రకటించెనని యభిప్రాయపడుచున్నారు. ఈ కావ్య మును రచించుటకు ముందు పాపరాజు విష్ణు మాయా విలాసము అను యక్షగానమునుగూడ రచించియుండెను. ఈ రెండు గ్రంథములును అతని ఇష్టదైవమగు మదన గోపాలస్వామి కంకితము చేయబడినవి.

దిట్టకవి నారాయణకవి రంగారాయ చరిత్రమను మూడాశ్వాసముల చారిత్రక ప్రబంధమును రచించి (1790) బెల్లంకొండ దుర్గాధిపతియు, పద్మనాయక వంశజుడును అగు మల్రాజు రామారాయనింగారి కంకి తము కావించెను. ఇది వీరరసప్రధానమైన ప్రబంధము. బొబ్బిలి సంస్థానాధిపతియైన రావు రంగారావుగారి సేనల కును, బుస్సీ ఆధిపత్యమునందలి ఫ్రెంచిసేనలతోగూడిన పూసపాటి విజయరామరాజుగారి సేనలకును క్రీ.శ. 1757 వ సంవత్సరమున బొబ్బిలికోట దగ్గర జరిగిన యుద్ధ మిందు వర్ణింపబడినది. ఈ యుద్ధమున బొబ్బిలివారే ఓడిపోయినను వారందు ప్రదర్శించిన శౌర్యధైర్యములు నిరుపమానములు. వానిని నారాయణకవి మహోత్సాహ మున వర్ణించెను. లక్షణదోషము లెడనెడ గోచరించు చున్నను ఈకావ్యము హృద్యమైన రచనతోకూడి మిగుల

రసవంతముగా ఉన్నది. ఇందు సందర్భానుసారముగా నా కాలమున వాడుకలో ఉన్న ఉరుదు పదములు పెక్కు ప్రయోగింపబడినవి.

మంగళగిరి ఆనందకవి (1760 ప్రాంతము) బ్రాహ్మణుడయ్యును క్రైస్తవ మత మవలంబించి, వేదాంతరసాయన మను గ్రంథము రచించి, తనవలెనే క్రైస్తవమత మవలంబించిన నిడిమామిళ్ళ దాసామాత్యుని కంకితము చేసెను. ఈ గ్రంథమున క్రైస్తవ మతస్థాపకుడైన ఏసు క్రీస్తు చరిత్రము వర్ణింపబడినది. ఇందలి శైలి నిర్దుష్టమై మిక్కిలి ప్రౌఢముగా నుండును. వర్ణనలు ప్రబంధకవుల వర్ణనల ననుసరించుచుండును. పింగళి ఎల్లనార్యుడను కవికూడ ఇట్లే క్రైస్తవమత సంబంధియగు సర్వేశ్వర మాహాత్మ్యము అను తోభ్య చరిత్రమును మృదుమధుర పాకమున రచించి పేరు గాంచెను.

మహాకవి అను పేరు గడింపకపోయినను వేలకొలది పద్యములు రచించి సర్వాంధ్రజనుల హృదయములందు స్థిరనివాస మేర్పరచుకొన్నవాడు వేమనయోగి. ఇతడు క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వభాగమున నివసించెనని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు నిర్ణయించి యున్నారు. ఇతడు వ్రాసిన పద్యములలో పెక్కు ఆటవెలదులు. కొన్ని కందములును, వృత్తములునుకూడ ఉన్నవి. ఆటవెలదుల చివర "విశ్వదాభిరామ వినురవేమ" అను మకుటము గోచరించును. ఈతడు రచించిన పద్యములు శతకసంఖ్యా నియమమునకు లోబడక పోయినను కథావస్తు వేమియు లేకుండుట, మకుటము గోచరించుట అను హేతువులచే శతక పద్యములుగానే పరిగణింపబడుచున్నవి. ఈ విషయమున ఈతని పద్యములను శివతత్త్వసారమునందలి పద్యములతో పోల్చవచ్చును. ఈతడేదో గ్రంథమును వ్రాయవలెనను తలంపుతో పద్యములను వ్రాసినవాడు కాడు. దేశమునందలి వివిధప్రాంతములందు స్వేచ్ఛగా తిరుగుచు అడిగినవారికెల్ల అనువుగా ఆయాయి విషయములనుగూర్చి ఆత డాటవెలదులలో సమాధానములు చెప్పియుండెను. వాటిని శిష్యులు వ్రాసికొని ప్రచారముచేసి యుండిరి. వేమన మిక్కిలి స్వతంత్రుడు. సంఘమువందును, వ్యక్తులందును తనకు గోచరించిన దోషములనెల్ల ఆతడు నిశితముగా విమర్శించి యుండెను. ఆకాలపు బ్రాహ్మణు లొనరించు దురాచారముల నతడు తీవ్రముగా ఖండించెను. మతముపేర జరుగు అత్యాచారములు చూచి ఆత డసహ్యించుకొనెను. ఆతని పద్యములలో నీతులు కొల్లలుగా గోచరించును. ఆ నీతుల కాతని అనుభవమే మూలము. వేదాంత తత్త్వమును బోధించు పెక్కు పద్యములుకూడ అతడు చెప్పియుండెను. అందు కొన్ని గూఢభావగర్భితములై యుండుటచే దురవగాహములుగా ఉండును. వేమన హాస్యప్రియుడు. ఇతని విమర్శనమునకు గురియగువారుకూడ విచారము నొందక వికసిత హృదయములతో నేగుట కితని పద్యములందుండు మృదుల నిర్మలమైన హాస్యమే కారణము. భావముల తీవ్రత, నీతి నిర్భరత, ధారాశుద్ధి, నిశితవిమర్శనము ఈతని పద్యములందలి గుణవిశేషములు. ఈతడెచ్చటను పాండిత్య ప్రదర్శనమునకై పాటుపడి యుండలేదు. సర్వజన సుబోధములు, జాతీయములు, సరళమంజులములు ఐన పదములనే ఈతడు వాడియుండెను. పామరులుసైతము ఈతని పద్యములయెడ ప్రీతికలిగి యుండుటకీ సౌలభ్యమే ముఖ్యకారణము. ఇతడు జీవితము నందువలె కవిత్వమునకూడ అంతర్యమున కిచ్చినంత ప్రాధాన్యము బాహ్య విషయముల కిచ్చి యుండలేదు. అందుచే ఇతని రచనలో వ్యాకరణాది దోషము లచ్చటచ్చట గోచరించును. పండితు లెవ్వరును ఈతని మహాకవియని మన్నించక పోవుట కిదియే కారణము. కాని పండితులనక, పామరులనక, స్త్రీలనక, పురుషులనక, వృద్ధులనక, బాలురనక ఆంధ్రు లెల్లరును ఆప్యాయముతో పఠించు పద్యములు వేమన పద్యములే అని చెప్పినచో అత్యుక్తి ఉండనేరదు.

పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము అను నామాంతరము కల లంకావిజయ మను ద్వ్యర్థి కావ్యమును రచించెను. ఇందు రెండే ఆశ్వాసము లున్నవి. రావు ధర్మారాయ డను వెలమకులజు డీతని లంకనేల కొంత అపహరింపగా ఇతడాగ్రహమున నతనిని రావణుని తోడను తత్ సీతాపహరణ వృత్తాంతమును రామాయణ కథతోడను పోల్చి ఈ ద్వ్యర్థికావ్యమును రచించెను. తిట్టుకవితయం దీతడు దిట్ట. భీమకవి, శ్రీనాథుడు మున్నగువారుకూడ తనవలె తిట్టజాలరని ఈతడు చెప్పుకొని యుండెను. ఈతని కావ్యము రాఘవపాండవీయాదులంత ప్రౌఢ

మైనది కాదు. ఇందు అర్థశ్లేషయే పలుచోట్ల కానిపించును. అందందు వ్యాకరణదోషములుకూడ ఉన్నవి. ఇతడు పెక్కు చాటుపద్యములు చెప్పినట్లు తెలియుచున్నది.

లక్ష్మణకవికి సమకాలికు డని చెప్పదగిన శిష్టు కృష్ణమూర్తికవి సంస్కృతాంధ్రములందు మహాపండితుడై పెక్కుగ్రంథములురచించెను. సంగీతశాస్త్రమునకూడ ఇతని కపారమైన పాండిత్యము కలదు. పురాణప్రవచనమునందును, ఆశుకవిత్వమునందును ఇతడారితేరి యుండెను. ఇతడు తన జీవితకాలమున పలువురధికారులను, భూస్వాములను దర్శించి, వారిచే గొప్పసత్కారములు పొందెను. సర్వకామదాపరిణయము, వేంకటాచల మాహాత్మ్యము, పీఠారణ్య మాహాత్మ్యము, పంచతంత్రము, స్త్రీనీతి శాస్త్రము, వసుచరిత్ర వ్యాఖ్యానము మున్నగున వీతని తెలుగు రచనలు. సంస్కృతమునకూడ ఇతడు రచించిన గ్రంథము లనేకము లున్నవి. అందు హరికారిక లను వ్యాకరణగ్రంథము పేర్కొనదగి యున్నది. చిన్నయసూరి బాలవ్యాకరణమునకును దీనికిని చాల పోలిక యున్నది. చిన్నయసూరి బాలవ్యాకరణమునకు గల ప్రసిద్ధి చూచి దాని నవకీర్తిపాలు చేయుటకై కృష్ణమూర్తి కవియే ఈ కారికలను రచించి హరిభట్టకృత మను శంక కలిగించుటకై హరికారిక లను పేరుపెట్టె నని విమర్శకులు అభిప్రాయపడుచున్నారు.

మండపాక పార్వతీశ్వర కవి (1833-1897) శిష్టు కృష్ణమూర్తి కవి వలెనే గొప్ప విద్వాంసుడు. ఇతడు బొబ్బిలి సంస్థానమున ఆస్థానకవియైయుండెను. రాధాకృష్ణ సంవాదము, కాంచీపుర మహత్త్వము, అమరుక కావ్యము, శ్రీకృష్ణాభ్యుదయము మున్నగు కావ్యములే గాక పెక్కు శతకములు, దండకములు, వంశచరిత్రములు రచించెను. ఇతడు సుమారెనుబది గ్రంథములు రచించెనని చెప్పుదురు. ఇతని గ్రంథములలోనికెల్ల రాధాకృష్ణ సంవాదము సుప్రసిద్ధమైనది.

గోపీనాథము వేంకటకవి వేంకటగిరి సంస్థానమున ఆస్థానకవిగాఉండి పెక్కు గ్రంథములు రచించెను. అందు వాల్మీకి రామాయణమున కాంధ్రీకరణమైన గోపీనాథ రామాయణము, కృష్ణజన్మఖండము, శిశుపాలవధాంధ్రీకరణము ముఖ్యము లైనవి. కృష్ణజన్మఖండము బ్రహ్మవైవర్త పురాణమునందలి భాగము. భాస్కరరామాయణాదులు యథామూలముగా లేవని వేంకటకవి దానిని మూలానుగుణముగా తెనిగించెను. ఇతని రచన సులభమును సరళమునై మనోహరముగా ఉండును.

ఈ యుగమున ఆంధ్రదేశమున వర్తిల్లిన కవయిత్రులలో తరిగొండ వేంకమాంబ (1840) పేర్కొనదగినది. ఈమె వేంకటాచల మాహాత్మ్యము, జ్ఞానవాసిష్ఠ రామాయణము, రాజయోగసారము అను గ్రంథములను రచించి, తరిగొండ నృసింహస్వామి కంకితము కావించెను, జ్ఞానవాసిష్ఠము ద్విపద కావ్యము. తరణోపాయముగా తా నీగ్రంథము రచించినట్లు కవయిత్రి చెప్పుకొన్నది. వైరాగ్య ప్రభావమును, ఆత్మానాత్మ వివేకమును తెలుపు కథ లింద నేకము లున్నవి. గూఢ వేదాంత విషయములను గూడ వేంకమాంబ మృదుమధురముగను, స్పష్టముగను వివరించియున్నది. మడికి సింగన అనుకవి ఈ గ్రంథము నింతకు పూర్వమే పద్యకావ్యముగా రచించియుండెను. రాజయోగ సారము కూడ ద్విపద కావ్యమే. ఇందు రాజయోగ విశేషములు చక్కగా వివరింపబడియున్నవి. వేంకమాంబ రచించిన గ్రంథములలో ప్రసిద్ధమైనది వేంకటాచల మాహాత్మ్యము. ఇది వేంకటగిరి క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించు కావ్యము. వరాహ భవిష్యోత్తర పద్మ పురాణములందలి వేంకటాచల మాహాత్మ్యము లీ కావ్యమునకు మూలములు. క్షేత్ర మాహాత్మ్యమును వెల్లడించుటకై ఇందు చెప్పబడిన మాధవుడను బ్రాహ్మణ యువకుని కథ మిక్కిలి హృద్యముగా నున్నది. ఇట్లే ఇందలి పద్మావతీ శ్రీనివాసుల వివాహ వృత్తాంతము కూడ రమణీయమై యొప్పారుచున్నది. శ్రీనివాసు డెరుకసాని వేషమున అంతిపురము చొచ్చుటయు, అతనికిని లక్ష్మీదేవికిని, జరిగినసంవాదమును మిక్కిలి సహజముగా వర్ణింపబడినవి. తన భర్త ద్వితీయ వివాహము చేసికొనబోవునపుడు - లక్ష్మి అనుభవించిన వేదనను వేంకమాంబ నిపుణతతో వర్ణించి స్త్రీహృదయమును గ్రుమ్మరించినది. ఈమె శైలి వేదాంత విషయ వివరణ సందర్భములందు కూడ లలిత మధురమై వ్యవహారమునకు సన్నిహితముగా ఉండును. ఈమె రచనలో అచ్చటచ్చట వ్యాకరణ స్ఖాలిత్యములు గోచరించును.

ఈమె గొప్ప విద్వాంసురాలయ్యును వినయవతి. శృంగార రసమును వర్ణించుటయందీమె మైముఖ్యము ప్రదర్శించెను. ఈమె రచనలు ఆత్మవిజ్ఞానమునకును ఔచిత్యమునకును ఆటపట్టులు.

ఈ యుగమున తెలంగాణమున వెలసిన కొందరు కవి పుంగవులను గూర్చి చెప్పవలసియున్నది. జటప్రోలు సంస్థానాధిపతియైన సురభి మాధవరాయలు చంద్రికా పరిణయ మను ప్రబంధము రచించెను. ఈతడు సర్వజ్ఞ సింగమనీని వంశమునకు చెందినవాడని ప్రతీతి. ఈ చంద్రికా పరిణయము పిల్లవసుచరిత్ర అని చెప్పదగినట్టిది. ఇందు చంద్రికా సుచంద్రుల ప్రణయము వర్ణింపబడినది. భట్టుమూర్తి వలెనే ఈ కవియు శ్లేష యమకాదు లందును. ఇతర శబ్దాలంకారములందును ప్రీతి ప్రదర్శించెను. ఈతని శ్లేషలు వసుచరిత్ర శ్లేషలంత భావపూరితములును, సుందరములును కాకపోయినను ఈతడు ప్రదర్శించిన పాండిత్య పాటవము అమేయమని చెప్పుటకు సందేహింపబనిలేదు.

పరశురామ పంతుల లింగమూర్తి కవి ఓరుగల్లులో జన్మించెను. ఇతడు యౌవనమున రతిమన్మథ విలాసమనెడి శృంగార ప్రబంధమును రచించినను క్రమముగా భక్తి వైరాగ్య భావములకు నిలయమై సీతారామాంజనేయ సంవాద మను వేదాంత గ్రంథమును రచించెను. ఇందు జీవబ్రహ్మైక్య సిద్ధాంతము నిరూపింప బడినది. ఇందలి మూడాశ్వాసములలో వరుసగా తారక యోగము, సాంఖ్య యోగము, అమనస్క యోగము అను మూడు యోగములు వివరింపబడినవి. గూఢమైన వేదాంతమును కూడ రసవంతమైన కావ్యముగా చెప్పజాలుట ఈ కవి యందలి విశేషము. సందర్భోచితములును, అనుభవ సిద్ధములు నైన ఉపమానములనుకూర్చి ఈ కవి వేదాంతమును కూడ సర్వజనసుబోధముగా సంతరించెను. తెలుగున వెలసిన వేదాంత కావ్యములలో దీనికి సాటివచ్చునది వేరొకటి లేదు. ఈ కవి కుమారుడైన రామమూర్తి కవి శుక చరిత్రమను వేదాంతగ్రంథమును రచించెనట! దీనినిబట్టి వేదాంత విచార మీ వంశమువారి కమ్ముకుతమని తెలియుచున్నది.

దేవరకొండ ప్రాంతములో నుండిన మరింగంటి వంశమున పలువురు పండితకవు లుదయించిరి. వీరు వైష్ణవులు. విశిష్టాద్వైతాచార్యులుగా చిరకాలముమండి ప్రసిద్ధి వహించినవారు. వీరిలో మరింగంటి సింగరాచార్యులు అను కవి దశరథరాజనందన చరిత్ర మను పేర నిరోష్ఠ్య రామాయణమును రచించెను. ఈయనకు శతఘంటావధాని అను బిరుదు కలదు. ఈయన కవిత సలక్షణమై పలువురు పండితులయు, విమర్శకులయు ప్రశస్తులొందినది. మరింగంటి వెంకట నరసింహాచార్యు డను కవి శ్రీకృష్ణ శతానందీయము, చిలువపడి గెరేని పేరణము అను రెండు కావ్యములు రచించెను. ఇందు మొదటి దానియందలి కథ భాగవతము నుండి గ్రహింపబడినది. ఈ కవి కళాపూర్ణోదయమును చూచి కాబోలు ఇందొక విచిత్రమైన కల్పన కావించెను. కృష్ణుడు మాయాబ్రహ్మయై సరస్వతి కడనుండ సత్యబ్రహ్మ యటకరిగి అతనితో వాదించుట ఈ కల్పనయందలి ముఖ్యాంశము. రెండవది అచ్చ తెనుగు కావ్యము. ఇందు నాగకేతనుడైన దుర్యోధనుని వివాహము వర్ణింపబడినది. మరింగంటి వంశమునకు చెందిన మరియొక కవి నరసింహాచార్యులు. ఇతడు తాలాంక నందినీ పరిణయమును ప్రబంధముగా రచించెను. మేనరికపు వివాహముల పరిస్థితి ఇందు చక్కగా వర్ణింపబడినది.

పురాణ యుగమునందలి ఆంధ్రకవిత్వమున శబ్దార్థములకు సమప్రాధాన్యము కనిపించును. ప్రబంధయుగము నాటికి అర్థభావములపై కంటె శబ్దములపై కవులకు మక్కువ పెరిగినది. దక్షిణాంధ్ర యుగమున అది మరింత యభివృద్ధియైనది. చివరకు క్రీ.శ. 19వ శతాబ్దినాటికి ఆంధ్రకవిత రసభావములందు కొరవడి శబ్దార్థాలంకార ప్రధానమై బౌదాత్త్యమును కోల్పోవుట సంభవించినది. కవులు పలువురు స్వతంత్ర ప్రక్రియలకు పూనక పెద్దన, రామరాజభూషణాదుల ప్రబంధములను అనుకరించుటయే పరిపాటియైనది. ఈ కారణముచే ఆంధ్రసరస్వతి యమక శ్లేషానుప్రాసాద్యలంకార శృంఖలలో తగుల్కొని సహజ స్వచ్ఛంద సంచారమునకు దూరము కావలసివచ్చినది. శ్రీ వీరేశలింగం పంతులుగారు రచించిన సరస్వతీ నారద సంవాదమను ఖండకావ్యములో అప్పటి కవితా పరిస్థితి చక్కగా వర్ణింపబడినది. సాహిత్యరంగమున చైతన్యము లోపించి అనుకరణమే ఆధిపత్యము వహించుచుండి ఆంగ్లభాషా నిష్ణాతులగు పండితులును, [illegible]

నూతన మార్గముల నన్వేషించి అనుసరింప యత్నించిరి. సంప్రదాయ సిద్ధమైన కవితావాహిని ఏదో యొక విధముగా ప్రసరించుచునే యున్నను వారి అన్వేషణ ప్రయత్నములకు ఫలితముగా నూతన కవితా ప్రవాహము లేర్పడి దేశము నలుమూలల వ్యాపించినవి. వాని పరిణామ వికాసముల వివరణమే ఆధునికాంధ్ర వాఙ్మయ చరిత్రమున ప్రధానస్థాన మాక్రమించును.

డి. వేం. అ.

**ఆంధ్ర వాణిజ్య మండలి :-** ఒక దేశము యొక్క ఆర్థిక జీవితములో వాణిజ్యమునకుగల ప్రాముఖ్యమును ప్రత్యేకముగా నొక్కిచెప్ప నవసరములేదు. ఆంగ్లదేశ చరిత్ర చదివిన వారెల్లరికిని వాణిజ్య మొక జాతిని ఎంతటి మహత్తర స్థితికి తేగలదో సుస్పష్టమే. ఒక ఆంగ్లేయ రచయిత చెప్పినట్లు ఆంగ్లేయుడు త్రాగు ప్రతి కప్పు తేనీటిలోను పడు దినుసులలో ఒక్క నీరు తప్ప తక్కినవన్నియు విదేశములలో పండించబడి ఆంగ్లేయుల వాణిజ్య నైపుణ్య మూలమున సంపాదింపబడినవే.

అనాదిగా ప్రాచీనకాలమునుండియు మన దేశీయులు వాణిజ్య నిపుణులై విదేశములతో కూడ వర్తకము సాగించిరి. ఐతే విదేశప్రభుత్వము మనదేశమునుపాలించు కాలమున మన వర్తక వాణిజ్యములు దెబ్బతినినవి.

నేడు వర్తక వాణిజ్యముల విషయములో అనేక నూతన సమస్య లుద్భవించినవి. ప్రభుత్వము ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమములో నిమగ్నమగుటచే ప్రభుత్వమునకు వాణిజ్యమునకు గల సంబంధము సన్నిహితమైనది. వర్తకము కేవలము వ్యక్తులసంపాదనామార్గము అను భావము పోయి అది జాతిసంపదను పెంపొందించు సాధనముగా పరిగణింపబడుచున్నది. దీనికి తోడు పన్నుల విధింపు కార్మికసమస్యలు మొదలగునవి నూతన ప్రాముఖ్యమును వహించినవి. అట్టి పరిస్థితిలో వాణిజ్యములో నిమగ్నులైనవారు ఒక సంస్థగా నేర్పడుటవలన వారికినీ, వారితో సంప్రదించుటకు ప్రభుత్వమునకును సౌకర్యకరము. ఆ యుద్దేశముతోనే ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛేంబర్సు ఆఫ్ కామర్సు (భారత వాణిజ్య మండలుల కూటమి) అను సంస్థ దేశమంతటకును కలిసి వ్యవహరించుచున్నది.

అయితే భారతదేశము మిగుల పెద్దదేశము. ప్రతి ప్రాంతమునకును ప్రత్యేక అవసరములు, ప్రత్యేక అవకాశములు, ప్రత్యేక సమస్యలు గలవు. ఉదాహరణమునకు ఆంధ్రదేశమున పుగాకుపంటకుసంబంధించిన ప్రత్యేక సమస్యలున్నవి. ఆంధ్ర ప్రాంతములో ముడిసరకునకు కొదువలేకున్నను పెట్టుబడిలవకాశములు పరిమితములు. కావున స్థానికావసరములకై స్థానిక వాణిజ్యమండలులు ప్రతి ప్రాంతమునందును ఉండుట అవసరము.

ఈ అవసరము 1928 వ సం. నందే గుర్తింపబడి ఆంధ్ర వాణిజ్యమండలి స్థాపింపబడెను. ఈ సంస్థ ప్రథమఅధ్యక్షులు కీ. శే. కొమ్మిరెడ్డి సూర్యనారాయణ మూర్తిగారు, ఆ పిమ్మట వరుసగా కీ. శే. నారాయణదాస్, గిరిధరదాస్ (1930, 1935-43), కీ. శే. శ్రీ పి.టి. కుమారస్వామి చెట్టి (1931-34), శ్రీ సి. శేషాచలం, (1944-46) శ్రీ యన్. రామారావు, (1947), శ్రీ గుంటూరు నరసింహారావు (1948-50), శ్రీ టి.వి. యతిరాజులు చెట్టి (1951), శ్రీ పి. సూర్యనారాయణ (1952-53) శ్రీ జె. వి. సోమయాజులు (1954) గార్లు అధ్యక్షులైరి. 1953 వ సంవత్సరములో ఈ వాణిజ్యమండలి రజతోత్సవము జరుపబడెను. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు ఈయుత్సవముల కగ్రాసనాధిపతులుగానుండిరి. ఈసందర్భమున కీ. శే. డాక్టర్ బి.వి. నారాయణస్వామి నాయుడుగారి అధ్యక్షత నొక ఆర్థిక మహాసభయు జరుపబడెను. ఈ సంస్థ ఆంధ్ర వాణిజ్యమండలి యను పేరున పిలువబడినప్పటికిని ఇందు మదరాస్, హైదరాబాద్, ఒరిస్సా, తిరువాన్కూరు, కొచ్చిన్, పశ్చిమబెంగాలు, బొంబాయి రాష్ట్రములకు చెందిన సభ్యులు కూడ గలరు. 1954 వ సంవత్సరపు వార్షికసమావేశ అధ్యక్ష ప్రసంగమున చెప్పబడినట్లు ప్రాంతీయ సమస్యలను అఖిలభారత దృక్పథముతోపరిష్కరింపవలసిన ఆవశ్యకతను ఈ మండలి ఎన్నడునువిస్మరించి యుండలేదు. చెన్నపురిలో నుండియే వ్యవహరించుట మూలమున ఇదివరకటివలెనే ఆంధ్ర, మదరాసురాష్ట్రములనడుమ సంధానకర్తయై, యావత్తు దక్షిణభారతదేశ శ్రేయస్సునకు పనిచేయగలనని ఈ సంస్థ ఆశించుచున్నది.

1954 వ సంవత్సర ప్రారంభము నాటికి మండలి సభ్యులసంఖ్య 649. అందు 4 గురు గౌ. సభ్యులు. 40 మంది

యావజ్జీవ సభ్యులు 24 మంది అనుబంధ సభ్యులు, 278 మంది స్థిరనివాస సభ్యులు, 303 మంది స్థిరనివాసేతర సభ్యులు, 1954 వ సంవత్సరము తుదికి మండలి సభ్యుల సంఖ్య 757 వరకు హెచ్చినది. అనగా పై వివిధశాఖలకు చెందినవారి సంఖ్య వరుసగా 4, 40, 24, 315, 374 గా మారినది. మండలి యొక్క కార్యవర్గసభలు చెన్నపురి యందే గాక కర్నూలు, తిరుపతి మొదలగు ప్రదేశములలో కూడ జరుపబడి, ఆయాప్రాంత వాసులకు మండలి కార్యక్రమమందు ఉత్సాహము కల్గించబడినది.

ఆంధ్ర వాణిజ్య మండలినుండి సభ్యులకు లభించు ప్రయోజనములను పేర్కొనవలసి యున్నది. వాణిజ్యమునకు అవసరమగు విషయములలో ముఖ్యమైనది విషయ విజ్ఞానము. ఏ వస్తు వెచ్చట లభ్యమగును? విదేశ స్వదేశ వాణిజ్యమునకు సంబంధించిన నిబంధన లెట్టివి? పరిశ్రమలు, జనసంఖ్య, ఎగుమతి దిగుమతులు మొదలగు విషయములకు సంబంధించిన వివరము లెట్టివి? ఇత్యాది విషయములపై అవసరమైన అంశములను సభ్యులకు అందచేయుచున్నది. వర్తకపు ఒప్పందములు మున్నగువానిలో ఇతర సోదర వాణిజ్య మండలుల సహకారముతో సభ్యులకు చేయూత నిచ్చుచున్నది. వివాదలు వచ్చినపుడు సర్వేలు, మధ్యవర్తిత్వముచేసి వాటి పరిష్కారమునకై తోడ్పడుచున్నది. ప్రతి వారము వివరముల పత్రికను వెలువరించుచున్నది. జాతీయ, అంతర్జాతీయ, ఆర్థిక వాణిజ్య పరిస్థితులను గూర్చియు, క్రమవిక్రయావకాశములను గూర్చియు విషయసామగ్రిని సభ్యుల కందచేయుచున్నది. వాణిజ్యసంబంధమైన సాధకబాధకములను ప్రభుత్వపు దృష్టికి తెచ్చుచున్నది.

అంతేగాక ప్రాంతీయ సైన్యము, కార్మిక సమస్యలు, అమ్మకపుపన్ను, పరిశ్రమలు, రవాణా మున్నగు విషయములలో ఆంధ్రప్రభుత్వముచే నెలకొల్పబడిన సలహాసంఘములలోను, చట్టరీత్యా వేంకటేశ్వర విశ్వవిద్యాలయ సెనేటు సభయందును, ఆంధ్ర పరిశ్రమల బోర్డునందును ఈ మండలికి ప్రాతినిధ్య మొసగబడెను. పోస్టల్ శాఖవారును, దక్షిణ రైల్వేవారును, మదరాస్ పోర్టు ట్రస్టువారును ఏర్పాటుచేసిన, సలహా సంఘములలో కూడ వాణిజ్య మండలికి స్థాన మివ్వబడినది. అందులో మండలి ప్రతినిధులున్నారు. విశాఖపట్టణము రేవునుండి ప్రభుత్వపు లెక్కలో దిగుమతియగు ఆహారధాన్యములను సర్వేచేయు పనికి ఈ వాణిజ్యమండలిని భారతప్రభుత్వమువారు నియమించిరి. సర్వేచేసి యుత్పత్తిసంబంధమగు ధ్రువపత్రముల నిచ్చు కార్యక్రమము నింకను విస్తృతము చేయవలెనని మండలి యుద్దేశించుచున్నది.

అంతేగాక వివిధ పాశ్చాత్య ప్రభుత్వముల యొక్క వాణిజ్య ప్రతినిధులు, ఇంగ్లండు, అమెరికా మొదలగు విదేశములకు వెళ్ళనున్న భారతప్రభుత్వ వాణిజ్య ప్రతినిధులు ఆంధ్ర వాణిజ్య మండలివారితో సంప్రదింపులు జరిపియుండిరి. ప్రభుత్వము నియమించిన పెక్కు విచారణ సంఘముల ముందు మండలి ప్రతినిధులు వాఙ్మూలమునను, లిఖితరూపమునను సాక్ష్య మొసగిరి. అమరజీవి పొట్టి శ్రీరాములుగారి స్మారకచిహ్న నిర్మాణమునకై వాణిజ్య మండలి 1116 రూప్యముల విరాళము ప్రకటించి యున్నారు.

ఇట్లు ఆంధ్ర వాణిజ్య మండలి పెక్కురీతుల ఆంధ్రదేశములోని వర్తక వాణిజ్యములకు తోడ్పడుచున్నది. మండలి యొక్క కర్నూలు కార్యాలయ వార్షికోత్సవములో ప్రసంగించుచు నాటి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు చెప్పినట్లు వాణిజ్యాభివృద్ధికై ఒక మండలి స్థాపనయే క్లిష్టమైన కార్యముకాగా దానిని ప్రజానురంజకముగా ఉత్తమ సాంప్రదాయానుగుణ్యముగా నిర్వహించుట మరింత దుర్ఘటమైన కార్యము. ముఖ్యముగా ఆంధ్రదేశము పారిశ్రామికముగా వెనుకబడిన ప్రాంతము. ఇది ఇటీవలనే నిర్మితమైన రాష్ట్రము. ప్రాంతములో పారిశ్రామికాభ్యుదయము పెంపొందించుట, ప్రజల జీవనప్రమాణము హెచ్చుటకు దోహదము చేయుట, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదముగా అమలు జరుగుటకు తోడ్పడుట యను పవిత్ర కార్యములోకూడ ఆంధ్ర వాణిజ్య మండలి ఉజ్వలపాత్ర నిర్వహించునని ఆశించెదము గాక.

ఆర్. ఎన్. ఎన్.

**ఆంధ్ర విశ్వవిద్యాలయము :-** భారత స్వాతంత్ర్యోద్యమమునకు పూర్వము మద్రాసు రాష్ట్ర పాలన

ములో నున్న ఆంధ్రులకు చిరవాంఛితములు మూడు. ఇవి వారి భాషాసంస్కృతి వికాసముల కొరకొక విశ్వవిద్యాలయము, ఆంధ్ర జాతీయ సైనికదళము (Andhra Regimental corps), వారి భాషాప్రాంతములతో కూడిన ఆంధ్రరాష్ట్రము. ఈ మూడింటిలో మొదటి వాంఛకు ఫలసిద్ధి 1926 నాటివరకు కలుగనేలేదు.

పూర్వ రంగము : అధునాతన భారతీయ విద్యాచరిత్రములో మొట్టమొదటి విశ్వవిద్యాలయములు మూడు. మద్రాసు, బొంబాయి, కలకత్తా. వీటిని 1857 లో స్థాపించిరి. అర్ధశతాబ్ది అనుభవముపైన విశ్వవిద్యాలయములు కేవల పరీక్షాధికార సంస్థలుగా మాత్రమే గాక బోధనా సంస్థలుగా కూడ పెంపొందవలయునన్న అభిప్రాయము ప్రబలమైనది. అది కారణముగా 1919 లో సర్ మైకేల్ శాడ్లర్ (Sir Michael Saddler) అధ్యక్షతను కలకత్తా విశ్వవిద్యాలయ పర్యవేక్షక సంఘము నియమింపబడినది. వారి సూచనల ప్రాతిపదికపై లక్నో, ఢక్కా, ఢిల్లీ, అలీఘర్ విశ్వవిద్యాలయములు వెలసినవి. మద్రాసు ప్రభుత్వము వారు కూడ తమ రాష్ట్రములోని ప్రతి భాషా ప్రాంతమునకు ఒక్కొక్క విశ్వవిద్యాలయముండవలయు ననియు, ముఖ్యముగా తెలుగు భాషా ప్రాంతమునకు ఆంధ్ర విశ్వ విద్యాలయము అత్యవసరమనియు నిర్ణయించిరి. శ్రీ ఎల్. ఏ. గోవిందరాఘవయ్యర్ గారి అధ్యక్షతను 20 మంది సభ్యులు గల ఒక సంఘమును నియమించిరి. అదే సమయమున ప్రాచ్య పాశ్చాత్య ఖండములందలి విశ్వవిద్యాలయముల నన్నిటిని సందర్శించి వచ్చి స్వదేశ రాజకీయములందు అడుగిడిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిని కూడ ఒక సభ్యునిగా పునరాలోచనా ఫలితముగ నియమించిరి. ఆ సంఘపు నివేదికను రచించు బాధ్యత సర్వము వారిపైననే బడినది. గోవింద రాఘవయ్యర్ సంఘమువారు తమ నివేదికను ప్రభుత్వమున కందజేసిరి.

శాడ్లర్ నివేదిక ననుసరించి మద్రాసు విశ్వవిద్యాలయ చట్టమును సవరించిరి గాని ఆంధ్రవిశ్వవిద్యాలయ నిర్మాణ విషయమును గూర్చి ప్రభుత్వమువారు ఉదాసీనత వహించిరి. 1925 సంవత్సరమున శ్రీ (తరువాత సర్) ఆర్. యం. స్టాథమ్‌గారు తమ నివేదికను ప్రచురించుచు ఆంధ్ర విశ్వవిద్యాలయ నిర్మాణ ఆవశ్యకతను, ఏతత్పురోభివృద్ధికి వలయు మార్గములను స్పష్టముగా వివరించిరి. ఇప్పటికి విశ్వకళా పరిషత్తు స్థాపన నిర్ధారణమైనది. కాని దాని స్వరూప నిర్ణయమును గూర్చి ఎన్నియో తగవులు వచ్చినవి. ఇది ఏకైక బోధనా సంస్థగా నుండవలయునా లేక కేవల పరీక్షాధికార సంస్థగా నుండవలయునా లేక ఉభయ బాధ్యతలను నిర్వహింపవలయునా యన్నది ఇదమిత్థమని నిర్ణయము కాలేదు. చివరకు ఆనర్సు యమ్.ఏ., యమ్.యస్.సీ. మొదలగుపట్టములకు వలయు శిక్షణము కేంద్రమునందు మాత్రమే యొసంగి బి.ఏ. వరకు శిక్షణ నొసంగు కళాశాలలు ఎల్లెడల నెలకొల్పుటకు నిశ్చయించిరి. ఐనను కేంద్రమునుగూర్చి పెక్కు తగవులుండుటచే విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, అనంతపురము పట్టణములు మూడు కేంద్రములుగను, విశ్వవిద్యాలయ కార్యస్థానము బెజవాడలో నుంచుటకును నిర్ణయించిరి. ఇంతవరకు వచ్చిన తరువాత నామకరణ విషయములో "ఆంధ్ర" శబ్దమునకు బదులు "తెలుగు" నుపయోగింపవలె నను వాదము చెలరేగెను. ఈ సందర్భములో ప్రసంగించుచు శ్రీ రామలింగారెడ్డిగారు ఇట్లు నుడివిరి. "ఆంధ్ర మహాభారతకర్తల నాటినుండియు ఆంధ్రశబ్దము తెలుగు మాట్లాడువారిని గూర్చియే ఉపయోగింపబడినది. ఇది సర్వజనాంగీకారము వడసినది. ద్రావిడాభిమానమును పురస్కరించుకొని భాష, సంస్కృతి ప్రాతిపదికగా గల సంకుచితాదర్శములు లేకయుండుటయే మేలు" అనిరి. దానితో తెలుగువారి విశ్వవిద్యాలయమునకు "ఆంధ్ర విశ్వవిద్యాలయము" అని పేరు స్థిరపడినది.

ప్రథమ ఘట్టము : ఆంధ్ర విశ్వవిద్యాలయ చట్టము 1926 వ సం. ఏప్రిలు 26 వ తేదీన గంజాము, విశాఖపట్టణము, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, బళ్లారి, అనంతపురము, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలలో అమలులోనికి వచ్చినది. మొదటి ఛాన్సలర్ మద్రాసు గవర్నరైన లార్డ్ గోషన్ మొదటి ప్రోఛాన్సలర్ శ్రీ బొబ్బిలి రాజావారు, విశ్వవిద్యాలయ నిర్వహణకు గౌరవ ఉపాధ్యక్షులు కాక సర్వవిధముల సమర్థుడైన ఒక వైస్ ఛాన్సలర్‌ను ఉద్యోగిగా నియమించుట అవసరమని గుర్తెరింగి ప్రభుత్వము

వారు మేధావులు, అనుభవజ్ఞులు అగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిని ఆ పదవికి నియమించిరి. శ్రీ సి.డి. యస్. చెట్టిగారు మొదటి రెజిస్ట్రారు. 1926 సం. ఆగస్టు 30 వ తేదీన బెజవాడ మ్యూజియమ్ హాలులో సెనేట్, అకాడమిక్ కౌన్సిలు మున్నగు కార్యవర్గములకు ప్రారంభోత్సవమైనది. సంస్కృతాంధ్ర భాషాపోషణమునకు గాను శ్రీ బొబ్బిలి మహారాజావారు ఒకలక్ష రూపాయల భూరివిరాళమొసంగిరి. నాటికి విశ్వవిద్యాలయాధికారము క్రింద రాజమహేంద్రవరములోని టీచర్సు ట్రయినింగు కాలేజి, విశాఖపట్టణములోని మెడికల్ కాలేజి కాక 12 కంటె తక్కువ కళాశాలలు మాత్రమే ఉన్నవి. మొదటి సంవత్సరములోనే కొన్ని క్రొత్త కళాశాలలను స్థాపించుటకు, ప్రాత కళాశాలలను ఉన్నత స్థాయికి తీసికొనివచ్చుటకును ఆయా కార్యనిర్వాహక వర్గములు చేసిన విజ్ఞప్తులను విశ్వవిద్యాలయపు అధికారులు సానుభూతితో పరిశీలించిరి. సుప్రసిద్ధ ఆంధ్ర చిత్రకారులగు శ్రీ కౌతా రామమోహన శాస్త్రిగారు శ్రీ రెడ్డిగారి సూచనల ప్రకారము విశ్వవిద్యాలయ ముద్రను చిత్రించిరి. ఈ ముద్ర ఆంధ్రజాతి ఔన్నత్యమును, ఆశయములను ప్రస్ఫుట మొనరించుచున్నది. 64 కోణములుగల చక్రమున్నది. దాని కిరు కెలంకుల రెండు సర్పరాజము లున్నవి. లోపల స్వస్తిక, "తేజస్వినావధీతమస్తు" అను సూక్తి తెలుగు లిపిలోను ఉన్నవి. చక్ర మధ్యమునందు సంద్రము, సప్తకిరణు డగు ఉదయ భానుడు, పద్మము కలవు. ఈ చక్రమున కడుగున రేఖామాత్రముగా బాలచంద్రు డున్నాడు. బాలచంద్రునకు దిగువున, నాగుబాముల తోకలకు పైనగల చోటులో తెలుగు లిపిలో "ఆంధ్ర విశ్వకళా పరిషత్" అని లిఖింపబడియున్నది. ఈ ముద్ర అత్యంత సుందరము ప్రతిభా సమన్వితము అయి కన్పట్టుచున్నది.

విశ్వకళా పరిషత్తు స్థాపించునాటికి ఆర్ట్సు, సైన్సు, బోధనాభ్యసనము(Teaching), వైద్యము మొదలగు శాఖలు మాత్రమే గలవు. గణితము, భౌతిక శాస్త్రము, పదార్థ విజ్ఞాన శాస్త్రము, వృక్ష శాస్త్రము, జంతు శాస్త్రము, భూగర్భ శాస్త్రము, మానవశరీర శాస్త్రము మున్నగు శాఖలలో బి.యస్.సి. డిగ్రీని నెలకొల్పుటకు వలయు ప్రయత్నములను చేసిరి. బెజవాడ పురపాలక సంఘము కృష్ణా, గుంటూరు జిల్లాబోర్డులు ఒసంగిన విరాళము నుండి విద్యార్థులకు ఉపకార వేతనముల నెలకొల్పిరి ఆనర్సు డిగ్రీ కోర్సులను స్థాపించుటకు వలయు ప్రయత్నము లన్నిటిని చేయ నారంభించిరి. ఇంతలో మంత్రివర్గము మారినది. శ్రీ పానగల్లు రాజావారి స్థానే డాక్టర్ సుబ్బరాయన్‌గారు మద్రాసునందు మంత్రిగా నాయకత్వము వహించిరి. 1927 వ సం. డిశంబరు 5 వ తేదీన ఆచార్య శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు ప్రథమ పట్ట ప్రదానోత్సవ సందర్భమున స్నాతకోపన్యాసము నొసంగినారు. 1928 లో శ్రీ సి. ఆర్. రెడ్డిగారు ప్రథమ ఉపాధ్యక్షులుగా ఎన్నికయినారు. ఈ ప్రథమ దశ పెక్కు బాలారిష్టములతో గూడియుండెను. ఉన్నత విద్యయందు శిక్షణము నొసంగు సంస్థలు ఒకేచోట కేంద్రీకరించుటయా లేక, వివిధ శాఖలను వివిధ కేంద్రములయందు నెలకొల్పుటయా అను విషయముపై తర్జనభర్జనలు సాగెను 1929 సం. జనవరి నెలలో మద్రాసు కౌన్సిల్‌వారు ఉన్నత విద్య యావత్తు ఒకే కేంద్రమునందు గరపవలయునని తీర్మానించిరి.

ఇక విశ్వవిద్యాలయ కార్యస్థాన మెక్కడ అను విషయముపై ఎడతెగని చర్చలు జరిగినవి. తుదకు ఈ కార్యస్థానమును విశాఖపట్టణములో నెలకొల్పుటకు నిశ్చయించిరి. వైద్యకళాశాల యుండుటవలనను, హార్బర్ నిర్మాణము కొనసాగుటవలనను విశాఖపట్టణమునకు రానున్న ఆధిక్యమును గుర్తించి వాల్తేరు కొండలపై ఆదర్శ విద్యా సంస్థా నిర్మాణమునకు తగిన వాతావరణ ముండుటను గమనించి 1930 సంవత్సరము సెప్టెంబరు 6 వ తేదీన "హోటల్ సెసిల్" భవనమును అద్దెకు గైకొని విశ్వకళా పరిషత్కార్యాలయమును వాల్తేరులో స్థాపించిరి. ప్రభుత్వము వారు ఇంతకుముందు కంటె ఈపైన ఏటేట ఎక్కువధన మొసంగుట కంగీకరించుటయే గాక భవన నిర్మాణమునకుగాను 7½ లక్షల రూప్యముల నొసంగిరి. 1928-29 నాటికి విశ్వవిద్యాలయ పుస్తకభాండాగారముగూడ ఒక విధముగ చెప్పుకో దగిన స్థితికి వచ్చినది. రావుబహద్దర్ శ్రీ డి. లక్ష్మీనారాయణగారు ఒసంగిన 6400 ప్రతులతో పుస్తక భాండాగా

యము మరికొంత పెరిగినది. ధనాభావముచే ఇంతకంటె విస్తృతిచెందలేదు.

ద్వితీయ ఘట్టము : బెజవాడనుండి వాల్తేర్‌నకు మారుటలోనే విశ్వవిద్యాలయ జాతకమునందే కొంత మార్పు కానిపించినది. రాయలసీమ కళాశాలలు ఆంధ్ర విశ్వవిద్యాలయము నుండి విడిపోయి మద్రాసులో చేరెను. "హోటల్ సెసిల్" చుట్టుప్రక్కల నున్న 22½ ఎకరములను ప్రభుత్వమువారు సేకరించి, 3 లక్షల పై చిల్లర రూప్యములకు కొని విశ్వవిద్యాలయమున కొసంగినారు. ఇదే సమయమున గాంధీమహాత్ముని దండి సత్యాగ్రహము ప్రారంభమయినది స్వాతంత్ర్యోద్యమము నణచుటకు ప్రభుత్వమువా రనుసరించిన విధానము పట్ల నిరసనము తెలుపుచు శ్రీ రామలింగారెడ్డిగారు తమ పదవీ త్యాగము చేసినారు. విశ్వవిద్యాలయపు సెనేటు వారు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారిని శ్రీ రెడ్డిగారి స్థానే ఎన్నుకొనిరి. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితులు పదవీ స్వీకార మాదిగా తను కార్యాచరణ దక్షతను, దూరదృష్టిని, దృఢ సంకల్పమును కార్యరూప మొందించిరి. విశ్వవిద్యాలయములో తెలుగునందు, చరిత్రయందు ఆనర్సు కోర్సులను స్థాపించిరి. 1933 సంవత్సరము జులై నెలలో రెండు అధ్యాపకులతో విశాఖపట్టణము మహారాణి పేటలోని బొబ్బిలిహాలులో ఆంధ్ర విశ్వకళా పరిషత్కళాశాల యవతరించినది. భౌతిక విజ్ఞాన శాఖలతో పాటు ఇటు ఆర్ట్సుకళాశాలలో వేదాంత శాఖ, గణిత శాఖ గూడ నెలకొల్పబడినవి. 1933నాటికి ఉపాధ్యాయ వర్గము 17 వరకు పెరిగినది. 1934 లో "బ్రిటానియా బిల్డింగ్ అండ్ ఐరన్ కంపెనీ"వారు విశ్వవిద్యాలయ భవన నిర్మాణమును ప్రారంభించిరి. సమున్నతమైన వాల్తేరు కొండలపై ఇరు పార్శ్వముల బంగాళాఖాతము, ఎదుట ఋషికొండ, డాల్ఫిన్స్‌నోస్ పర్వతములు కన్పట్టుచు నున్న విశాల ప్రదేశములో భవన నిర్మాణము ప్రారంభమైనది. ఇదే వత్సరములో జయపురాధీశ్వరులగు శ్రీ శ్రీ విక్రమదేవ వర్మగారు 50 వేల రూప్యముల భూరి విరాళ మొసంగిరి. మరుసటి సంవత్సరము దానిని 75 వేలకు పెంచిరి. తదనంతరము ప్రతియేట ఒకలక్ష రూప్యముల నొసంగుటకు అనుమతించిరి. వారి అనంతరము వారి వారసులు ప్రతియేట ఒక లక్షగాని దానికి బదులుగా ఒకేమారు 15 లక్షల రూప్యముల నొసంగుటకు గాని ఏర్పాటు నొనర్చిరి. ఇట్టి మహాశయుని విద్యాపోషణాభిలాషకు గాని వారివారి ఔదార్యమునకు గాని ఆంధ్ర దేశములో సాటిలేదు. అప్పటినుండియు వారిపేర సైన్సు కళాశాల 'జయపూర్ విక్రమదేవ కాలేజ్ ఆఫ్ సైన్స్ అండు టెక్నాలజీ' అనుపేర విలసిల్లుచున్నది. ఈ సుందర భవనమునకు పైన ముందు భాగమున 80 వేల రూప్యములు వ్యయమొనర్చి నిర్మించిన గడియార స్తంభ మున్నది. శ్రీ విక్రమదేవ వర్మగారిపై గల భక్తి విశ్వాసములను ప్రకటించుటకు గాను ఆ కళాశాలావరణలో శ్రీవారి కంచువిగ్రహమును ప్రతిష్ఠాపనముచేసిరి. కళాశాల పుస్తక భాండాగారము, పరిశోధనాలయములు నానాటికి అభివృద్ధి చెందినవి. తొలుదొల్త విస్తృతమగుచున్న కళాశాలలకు ప్రిన్సిపాల్‌గా ప్రొఫెసర్ (సర్) జె. సి. కొయాజీ అను విఖ్యాత అర్థశాస్త్రవేత్తను నియమించిరి. డాక్టర్ లుడ్‌విగ్ వుల్ఫు అనువారు సైన్సు కళాశాలాధ్యక్షులైరి. 1938 నాటికి శ్రీ సూరి భగవంతముగారు ఉభయ కళాశాలలకు ప్రిన్సిపాల్ అయినారు. అప్పటి కప్పుడే విశ్వవిద్యాలయము బహుముఖ వ్యాప్తిని బొంది పేరుప్రతిష్ఠల నందినది. చెప్పుకోదగిన పరిశోధనము భౌతిక విజ్ఞానశాఖలయందు సాగినది. అంతేగాక శ్రీ రవీంద్రులు "మానవుడు" అను శీర్షిక పైనను, శ్రీ సి. వై. చింతామణిగారు "సిపాయీల కలహానంతరమునుండి భారత రాజకీయములు" అను శీర్షిక పైనను ఘనమగు ఉపన్యాసముల నొసంగిరి. ఈ ఉపన్యాసావళి శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారి భూరివిరాళ ఫలితముగ వ్యవస్థాపితమైనవి. విశ్వవిద్యాలయ ప్రచురణ శాఖవారు ఎన్నియో ఉద్గ్రంథములను ప్రచురించినారు. ఈ రచయితలలో శ్రీ రామలింగారెడ్డిగారు, ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్యగారు, బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులుగారు, డాక్టర్ కె. ఆర్. సుబ్రహ్మణ్యంగారు మున్నగువారు ఎందరెందరో విద్యాధికులున్నారు. శ్రీ రాధాకృష్ణయ్యగారి పదవీకాలమున పసిబిడ్డయైన ఆంధ్ర విశ్వవిద్యాలయము సుందర స్వరూపమును దాల్చి నవ విలాసముతో ప్రత్యేకతమగడించి విద్యాసేవ యొనర్చినది

**తృతీయ ఘట్టము :** స్థలనిర్దేశమైనది. భవననిర్మాణమైనది. కళాశాలలు వెలసినవి. విఖ్యాత ప్రచురణములు వెలువడినవి. విశ్వవిద్యాలయమునకు దేశములో ఒక స్థాయి, గౌరవము ఏర్పడినవి. డాక్టరు రాధాకృష్ణయ్యగారు ఉపాధ్యక్ష పదవినుండి విరమించిరి. తిరిగి శ్రీ రామలింగారెడ్డిగారు ఉపాధ్యక్షులైనారు. వీరి ఉపాధ్యక్షత, శ్రీ జయపుర మహారాజావారి ప్రోఛాన్సలర్ పదవి నిర్విరామముగా 12 ఏండ్లపాటు కొనసాగి విశ్వవిద్యాలయమునకు అమిత శుభముల నొనగూర్చినవి. శ్రీ రెడ్డిగారి ఆధ్వర్యమున విశ్వకళా పరిషత్తు బహుముఖ వ్యాప్తి నొందుటయేగాక దేశములోని విశ్వ విద్యాలయములలో తనకు గల ప్రత్యేకతను నిరూపించుకొన్నది. ఆధునిక శాస్త్ర విజ్ఞానములో పరిశోధనలు జరిపి శాస్త్ర విజ్ఞానమును పెంపొందించినగాని దేశమునకు ముక్తిలేదని దృఢముగా నమ్మినవారిలో శ్రీ రెడ్డిగారొకరు. దానికి తార్కాణముగ తమ విశ్వకళా పరిషత్తులో భౌతిక విజ్ఞానశాఖల అభివృద్ధికిగాను ప్రత్యేకశ్రద్ధ చూపి పెక్కుమందికి డాక్టర్ పట్టములు ప్రసాదించి, విశ్వవిద్యాలయమునకు కీర్తితెచ్చిరి. విశ్వవిద్యాలయములోని విద్యార్థుల సంఖ్య, అధ్యాపకుల సంఖ్య, అనుబంధ కళాశాలల సంఖ్య, నిరంతరము పెరుగుచునే వచ్చినవి. ఆంధ్రదేశమునందలి ప్రతిపట్టణమందును ఒక కళాశాల వెలసినది. వాల్తేరులో "ఎర్స్కిన్ కాలేజి ఆఫ్ నేచురల్ సైన్సు" క్రొత్తగా స్థాపించిరి. ఇందు జంతుశాస్త్ర, వృక్షశాస్త్ర, భూగర్భ శాస్త్రాది ప్రకృతి శాస్త్రములలో శిక్షణము నొసంగుచున్నారు. ఇంకను శ్రీ రామలింగారెడ్డిగారి అభీప్సితములలో కొన్ని నెరవేరకయే పోయినవి. స్త్రీలకు గృహనిర్వాహకశాస్త్ర కళాశాల స్థాపింపలేక పోయిరి. సంస్కృత భాషాశాఖ, ప్రాచ్య విద్యాబోధనా నిలయము రూపొందలేదు. ఆంగ్లభాషయందు ఆనర్సు తరగతుల నెలకొల్పలేదు. ఐనను నిజాంప్రభువుగారు లక్షరూపాయలు, తిరువాన్కూరు మహారాణియగు సేతు పార్వతీబాయిగారు లక్షరూపాయలు విరాళమిచ్చిరి. శ్రీ తిక్కవరపు రామిరెడ్డి ప్రభృతులనుండి, ఇతర స్థానిక సంస్థలనుండి మరికొన్ని విరాళముల చేకూర్చి శ్రీ రామలింగారెడ్డిగారు సకల విధముల విశ్వకళా పరిషదభివృద్ధికి కారకులైరి. 1942 లో అట్టివారి షష్టిపూర్తి ఉత్సవము జరిపి విశ్వవిద్యాలయము తన్నుదాను గౌరవించుకొన్నది.

**యుద్ధకాలము - గుంటూరు :-** సర్వాంగ సుందరమైన విశ్వవిద్యాలయము తన పనిని సక్రమముగ కొనసాగించుకొను సమయమునకు రెండవ ప్రపంచ సంగ్రామము సంభవించినది. జపాను దేశస్థులు విశాఖపట్టణముపై బాంబులు వేయుటచే విశ్వవిద్యాలయము గుంటూరునకు తరలింపవలసి వచ్చినది. 1943 వరకు రసాయనశాస్త్ర శాఖ మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో ఉండవలసి వచ్చినది. గుంటూరులోనున్న కాలములో సహితము అనేక నూత్న శాఖలు నెలకొల్పబడినవి. బందరులో లా కాలేజి స్థాపించిరి. ఇంగ్లీషులో ఆనర్సుకోర్సును నెలకొల్పిరి. ఇంకను ఎన్నియో నూతనశాఖలను స్థాపించుటకు, ఉన్నవానిని పెంపొందించుటకు ప్రణాళికలు తయారుచేసి, ప్రభుత్వమున కందజేసిరి. ఈ కాలములో శ్రీ చెట్టిగారి అనంతరము శ్రీ వి. యస్. కృష్ణాగారు, వారి తర్వాత శ్రీ కె. వి. గోపాలస్వామిగార్లు రెజిస్ట్రారులైరి. ఎందరో మహానుభావులకు గౌరవ పట్టముల నొసంగి విశ్వకళా పరిషత్తు తన గౌరవమును పెంపొందించుకొనినది. శ్రీ రామలింగారెడ్డిపేర స్థాపించిన జాతీయ బహుమానములను, సర్ సి. వి. రామన్, ప్రొఫెసర్ యస్. చంద్రశేఖర్ (గణితము) సర్ సాహెబ్‌సింగ్ షోకీ, సర్ శాంతి స్వరూప్ భట్నాగర్, శ్రీ బీర్‌బల్ సహానీ, మహర్షి శ్రీ అరవిందయోగి మున్నగు ఘనుల కొసంగినారు. ఈ కాలములో ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ఎన్నియో దిక్కులనుండి ధనసహాయము లభించుటయు, బహుముఖ వ్యాప్తినొందుటయు సంభవించినది. కేంద్రప్రభుత్వమువారు భూతత్త్వ పరిశోధన శాఖకు, టెక్నాలజీ మొదలగు వైజ్ఞానిక శాఖలకు మిక్కుటముగ ధనసహాయమొనరించుచున్నారు. 1946 లో తిరిగి వాల్తేరుకు వచ్చి, ఇల్లు చక్కపెట్టుకొని విశ్వవిద్యాలయము తన కార్యనిర్వహణమును అత్యంతోత్సాహముతో త్రోవ సాగించినది. ఎన్నియో నూతన శాఖలు వెలసినవి. అందు ముఖ్యముగ మీటియరాలజీ, ఫార్మస్యూటిక్సు మొదలగునవి చెప్పతగినవి. స్వాతంత్ర్యోద్యమము, ఆంధ్ర

రాష్ట్రావతరణము దేశమంతటితోపాటు విశ్వకళాపరిషత్తునకు అత్యంత శుభోదర్కము లైనవి. సంస్కృత శాఖను నెలకొల్పుటకు సుప్రసిద్ధులగు శ్రీ కున్హన్ రాజాగారిని నియమించిరి. అన్నిటికంటెను ప్రత్యేకమైన విషయము పరమాణుశాస్త్ర పరిశోధననిలయ స్థాపనప్రయత్నము. సుప్రసిద్ధ శాస్త్రవేత్త యగు శ్రీస్వామి జ్ఞానానందుల వారిపై ఈ భారము నుంచిరి. శ్రీ రామలింగారెడ్డిగారి అనంతరమువిశ్వవిద్యాలయములో చిరకాలమునుండి పని చేసి సకలానుభవములనుపొంది ఎల్లరిమన్ననలకు పాత్రులైన డాక్టర్ వి.యస్. కృష్ణాగారు ఉపాధ్యక్షులైరి. అట్లే అత్యంత ప్రజ్ఞావంతులు అనుభవజ్ఞులు అగు డాక్టర్ రంగధామరావుగారు కళాశాలాధ్యక్షులైరి. వీరిరువురి కృషి వలనను తిరుపతి విశ్వవిద్యాలయము రూపొందినది. ఈనాడు (1955 డిశంబరు నాటికి) ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు 8 వృత్తి కళాశాలలు, 18 డిగ్రీ కళాశాలలు, 7 ఇంటర్మీడియేట్ కళాశాలలు, 10 ప్రాచ్యవిద్యా కళాశాలలు గలవు. ప్రాచ్యవిద్యా కళాశాలలలో గాక మిగిలిన కళాశాలలలో మొత్తము 21,500 విద్యార్థులున్నారు. అందు 1200 స్త్రీలు.

సర్. సి. వి. రామన్‌గారు భౌతికశాస్త్రమందు అనరరీ ప్రొఫెసరుగా నుండి ఆంధ్రుల యెడ తమకు గల అభిమానము చాటియున్నారు. డాక్టరు లక్కరాజు సుబ్బారావుగారు సెనేటు సభ్యులుగాను, అనరరీ లీగల్ అడ్వయిజరుగాను విశ్వవిద్యాలయ నిర్వహణమున గణనీయమగు కృషి సలిపిరి. డాక్టరు లక్కరాజు సుబ్బారావుగారు, డాక్టరు టి. యస్. తిరుమూర్తిగారు, శ్రీ ఉబుళంపల్లి పుల్లారెడ్డిగారు, శాశ్వాలికోపాధ్యక్షులుగా నుండి విశ్వవిద్యాలయ ప్రతిభకు దోహదము కలిగించినారు.

**ఉపసంహారము :** ఏబది సంవత్సరముల పూర్వము నుండి ఆంధ్రులు కాంచిన కలలు వారి కృషి ఫలితముగ 1926నాటికిఫలసిద్ధిగాంచినవి. 1951నాటికి 25ఏండ్లు నిండగనే విశ్వవిద్యాలయము 52 డిసెంబరులో అమితోత్సాహముతో రజతోత్సవ మొనరించుకొనినది. విశ్వవిద్యాలయ చరిత్రలో 25 ఏండ్ల కాలము చాల తక్కువైనను ఎన్నియో అడ్డంకులను, ధనాభావమును, నిరుత్సాహకరములగు పరిస్థితులను ఎదుర్కొని నేటికి విశ్వవిద్యాలయము బహుముఖ వ్యాప్తినొంది, అమితమగు కీర్తిని సంపాదించి, ఆంధ్రజాతికి గర్వకారణమై, భారత దేశమునందు తన ధర్మమును శక్తితో, ప్రాభవముతో, గౌరవముతో నిర్వహించుచున్నది.

పి. యల్. యన్. శర్మ.

**ఆంధ్రవిష్ణువు :-** బ్రహ్మాండాది పురాణములందు కీర్తింపబడి, సత్కవుల మన్ననలందుకొని, శ్రీకాకుళాధినాథుడై, ఆంధ్రుల ఆరాధ్యదైవమై, ఆంధ్రభోజునికి ఆముక్తమాల్యద కావ్యరచనకు ప్రోత్సాహ మొసగి, కాసుల పురుషోత్తమకవి నిందాస్తుతులకు పాల్పడిన ఆంధ్రవీరుడే ఆంధ్రవిష్ణువు. ఇతడే ప్రప్రథమమున ఆంధ్ర సామ్రాజ్యమును స్థాపించిన మహనీయుడు. పరాక్రమ సంపన్నుడు. ఆంధ్రులచరిత్రలో స్వర్ణాక్షరములతో లిఖింపదగిన దీ యాంధ్రరాజ్యస్థాపనోదంతము. ఆంధ్రవిష్ణువు చరిత్రకు దీనికి అవినాభావసంబంధము కలదు.

సాధారణముగ శాతవాహన సామ్రాజ్యము మొదటి ఆంధ్ర సామ్రాజ్యమని, చరిత్రకారులు పేర్కొనుచున్నారు. పురాణములందు ఈ రాజులచరిత్ర వర్ణింపబడియున్నది. ఐనను వీరికిముందేఆంధ్రసామ్రాజ్య సంస్థాపనము జరిగినదని వీ రంగీకరించుచునే యున్నారు. చంద్రగుప్తునకు పూర్వమే ఆంధ్రులు సామ్రాజ్యమును నిర్మించుకొనిరనియు, వా రధికబలాఢ్యులై చతురంగబలసము పేతులై శత్రుదుర్భేద్యములగు ముప్పది దుర్గముల కధిపతులై యుండిరనియు మెగస్తనీసువ్రాతలవలన స్పష్టమగుచున్నది. క్రీ. శ. 4 వ శతాబ్దికిముందే ఆంధ్రసామ్రాజ్యముండినదని వేరుగా చెప్పనవసరములేదు. ఒక్క ఆంధ్రవిష్ణువుతప్ప తదితరులనుగూర్చి విశేషాంశములు లభ్యములు కాకపోగా చారిత్రికాంశములతో సమన్వయపరచ నగు సంఘటనలు సైతము దొరకనప్పుడు, అటులూహించుటలో నాశ్చర్య మేమియు లేదు. ఇవి ఇటులున్నను కావ్యములందును, తదితరగ్రంథము లందును గల యితి వృత్తములం దచ్చటచ్చట ఆంధ్రవిష్ణువునకు, రాజ్యస్థాపనోదంతమునకు, ఆంధ్రులకు సంబంధించిన విషయము లుదాహరింపబడిన వాటిని గ్రహించి ప్రథమచారిత్రిక సంఘటనను గూర్చి వివరించుటకు చరిత్రకారులు ప్రయత్నించుచునే యున్నారు. ప్రథమాంధ్ర రాజ్యస్థాపనోదంతమునుగూర్చి

బ్రహ్మాండపురాణమునందు సుచంద్రునిగాథ యొకటి గలదు.

"ఆంధ్రనాథో మహావిష్ణు ర్నిశుంభదనుజాపహో
పురా స్వాయంభువమనోః కాలే కలియుగే హ్యహః
కాకులే రాజవర్యస్య సుచంద్ర స్సతనూభవః
అభవత్సర్వదేవైశ్చ వేష్టితో లోకపూజితః."
శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారంతు మహత్కృత్వా త్రీణిద్వారాణిచాకరోత్
త్రిలోచనో మహేశ స్స త్రిశూలంచ కరే వహన్
త్రిలింగరూపీ న్యవసత్ త్రిద్వారేషు గణై ర్వృతః
ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశుంభునా
యుధ్వాత్ర యోదశయుగాన్ హత్వాతం
రాక్షసోత్తమం
అవస త్తత్ర ఋషిభిర్యుతో గోదావరీతటే
తత్కాలప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతం.

పై గాథప్రకారము సుచంద్రునికుమారుడు ఆంధ్రవిష్ణువు నిశుంభుడను రాక్షసుని జయించి, కాకులమునందు రాజ్యమును స్థాపించి, తన రాజ్యమునందలి శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరము అను మూడు క్షేత్రములను ద్వారములుగ నెంచి పరిపాలన సాగించెననియు, అప్పటి నుండియే ఆ దేశము త్రిలింగక్షేత్ర మయ్యెననియు తెలియుచున్నది. ఆంధ్రవిష్ణువు అను వీరుడు నిశుంభుడు అను నాగాంధ్రుని జయించి కాకుళమున రాజ్యమును స్థాపించెనని చరిత్రకారులు సమన్వయపరచి యున్నారు. తరువాతివారు సామ్రాజ్యస్థాపకుడగు ఆంధ్రవిష్ణువును దైవసమానముగ భావించి పూజించుచుండిరి. మన దేశమున వీరపూజ సాధారణముగ జరుగుచుండెననుట కీ వృత్తాంతము ప్రబలతార్కాణముగ నున్నది.

ఈ కాకుళమే శ్రీకాకుళముగ మారినది. కృష్ణాతీరమునగల దివ్యక్షేత్ర మిది. కాకుళాంధ్రనాథుడే ఆంధ్రవిష్ణువు.

బ్రహ్మాండపురాణముకాక ఆంధ్రవిష్ణువునుగూర్చి తదితర గ్రంథము లుదాహరించు గాథల నీ సందర్భమున సమన్వయపరచుట సమంజసము. చారిత్రికాంశముల సమకూర్చు కావ్యములు మన భాషలో కొద్దిగా నున్నవి. ఉన్న కావ్యములు పౌరాణికపద్ధతిని రచింపబడియుండుట వలన చరిత్రకారునికి విషయ సమన్వయమున పెక్కు చిక్కులు ఏర్పడుచున్నవి. వే రాధారములు లేనప్పుడు వాటినే యాధారముగ గ్రహించకతప్పదు. ఆంధ్రవిష్ణువు చరితముగూర్చి ఇట్టిపరిస్థితి యేర్పడుచున్నది. ఏలన ఆంధ్రవిష్ణువునుగూర్చి ప్రత్యేకముగా ఒక్కకావ్యమే యున్నది. దానినుండియే చరిత్రను కూర్చవలసి యున్నది.

1. విష్ణుమూర్తి యనుజ్ఞనొంది బ్రహ్మ గంగాతీరము నుండి కృష్ణాతీరమునకు విచ్చేసి కన్నులపంతువుగా నొప్పుచున్న పరిసరములకు ముగ్ధుడై, బహురూపములధరించి, యచటనే తపమొనర్చి, ఆ ప్రాంతమునకు కాకులమని పేరిడి భద్రకోట విమానమున శ్రీపతిని ప్రతిష్ఠించెను. కొన్నాళ్ళకు విశాల అను పేరుగల నగరము నేలు సుమతి యను నరపాలుడు శ్రీకాకుళక్షేత్ర సందర్శనాభిలాషియై చతురంగబల పరివారసమేతుడై యేతెంచ అచటి సన్మునీశ్వరులు ఆ రాజన్యుని యుచితరీతి సత్కరించి, యచట గల యొక విగ్రహమునుజూపి, ఆలయగోపురాదుల నిర్మించ ప్రభువును కోరిరి. ఆ విగ్రహము ఆంధ్రవిష్ణువు విగ్రహమని సుమతి యాసందర్భమున వెల్లడించెను.

"ఈదేవుండు మదీయసత్కులధనం బీయిందిరాధాముడే
దేదీవ్యంబగు నాంధ్రనాథుడు......"

అని నుడువుటయేగాక తాను ఆంధ్రనాయక దాసుడనని తెల్పెను. అప్పటినుండియే "కాకులాధిప శ్రీనాథున కాంధ్రనాథాభిధానంబు యథార్థంబయ్యె". సుమతి కళావేదుల నాహ్వానించి దేవతాగార ప్రాకారనిర్మాణంబు లొనరింపజేసెను. నిర్మల జలసమృద్ధిలేమి రాజన్యుడు చింతాకులస్వాంతుడై యుండ హరి ప్రత్యక్షమై సుదర్శన చక్రమున "భూతలమతి రయంబున భేదించి గంగాప్రవాహంబు మనోవేగమునం గొనివచ్చి సరోవరంబొనర్చె. అది కారణంబుగా న త్తీర్థరాజంబు చక్రతీర్థం బనంబరగె".

సుమతి ఈ విధముగా ఏర్పాట్లు ఒనరింపజేసి తన నగరమునకు వెడలిపోయెను. అప్పటినుండి యాదేవుని "ఆంధ్రనాథుడు", "ఆంధ్రవల్లభుడు", "తెలుగువల్లభుడు" అను పేర్ల అచ్చటివారు పూజించుచుండిరి. చైత్రశుద్ధ దశమి నుండి పౌర్ణమివరకు అచ్చట మహోత్సవములు జరుగుచుండును. ఆ దివ్య వైష్ణవక్షేత్రమును సందర్శించుటకు దూరదూరములనుండి ఎందరో వచ్చుచుందురు.

2. కటకపురిరాజు అనంగభీము డను గజపతి ఒకనాడు వేటకై వెడలి అరణ్యప్రాంతమున నాగరాజుపడగనీడను సురక్షితుడై యున్న యొక బాలుని గాంచెను. రాజును జూచి ఆ పాము అదృశ్యమయ్యెను. అనంగభీము డా శిశువును చేరదీసి, అనంతపాలుడని నామకరణ మొసంగి, ఆతనిపాదమున గట్టబడిన తాళపత్రమునందలి వ్రాతవలన అతని కులగోత్రములను గ్రహించి పోషించెను. అనంత పాలుడు పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు నేర్చుకొని అనంగభీమునకు విశ్వాసపాత్రుడయ్యెను. ఒక సందర్భమున అనంతపాలుడు రాజునానతిని కంచిపై దాడి వెడల వలసి వచ్చెను. మార్గమధ్యమున శ్రీకాకుళమును సందర్శించుచు అనంతభూపాలుడు తనతల్లిదండ్రుల జూడ నుత్సుకుడై యచటి భూసురులకు దానధర్మము లొసగుటకు సంకల్పించి తద్వృత్తాంతమును జాటెను. బ్రాహ్మణులు దానమును పరిగ్రహించుటకై వచ్చి తమ కుల గోత్రములను చెప్పుచుండిరి. అనంతపాలుడు బాల్యమున తనపాదమునకు గట్టబడియుండిన తాళపత్రమునం దుల్లేఖింపబడిన కులగోత్రముల నుదహరించు వానిని తనతండ్రిగా నెరింగి, ఆతనికి నిజవృత్తాంతం బెరింగించి మాతా పితరులకు మహానందమును గూర్చెను. అచ్చటనే వారివలన వామనశర్మ యింటిలో కాకరపాదుక్రింద ఆంధ్రవల్లభుని విగ్రహ మున్నటుల విని, దానిని మహావైభవముతో ప్రతిష్ఠ చేయించెను.

3. కళింగదేశస్థుడు యజ్ఞశర్మ తనయుడు సోమశర్మ యనువాడు యౌవనగర్వమున "కలుషేంద్రియుడై పితృవిరోధంబుగా నటించుచు, తగని సహవాసమున తలిదండ్రుల నిరంతర విషాదాకులచిత్తులం జేయుచు, విప్రాన్వయ సంజాతుండయ్యు వైదికకర్మల విడచి స్వేచ్ఛావిహారియై నిషాదవృత్తి జరించుచు ఒక్కనాడు వనమున సంచరించుచు, అధిక క్షుత్పిపాసాకులుడై యుండ, యచటి ముని యాతనిం గని, కాకుళేశ్వరసమర్పిత పాద మొసగి, శ్రీకాకుళ క్షేత్ర మహాత్మ్యం బెరింగించిరి. సోమశర్మ యత్యంత ప్రమోదంబున దివ్యక్షేత్రమును జేరి లోక పవిత్రంబగునట్టి కృష్ణానదిజలంబుల గ్రుంకి చక్రాహ్వయ సరోవర తీర్థంబుల దోగుచు కేశవదేవు సందర్శించి, పరిశుద్ధ మనస్కుండై కొన్ని వర్షంబు లుత్కృష్టంబుగా నిలచి దేహావసాన సమయంబున యింద్రాదుల కందని నిరంతర సంపత్కరంబగునట్టి శ్రీవిష్ణుసాయుజ్యముం బ్రాపించె."

ఆంధ్ర విష్ణువునకు సంబంధించినంతవరకు వల్లభాభ్యుదయమున వర్ణితములయిన పైమూడు గాథలందలి చారిత్రికాంశముల సమన్వయపరచుచు తత్కావ్య పీఠికలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు కొన్ని విశేషముల నిర్ధారించిరి. ఆంధ్రవిష్ణువు గంగాతీరమునందుండి శ్రీకాకుళక్షేత్రమునకు వచ్చెను. ఆత డచ్చట దైవసమానముగా నెంచబడి ప్రతిష్ఠింపబడి పూజింపబడెను. మధ్య మధ్య ఆ క్షేత్రము కృష్ణ వెల్లువలకు నాశనమైపోవ ప్రభువు లుద్ధరించిరి. వేరొండు ప్రాంతమున నున్న ప్రభువులు, ఆంధ్రనాయక దాసులు ఈ క్షేత్రమును సందర్శించి అవసరమగునప్పు డెల్ల పునరుద్ధరించి సకలోపచారంబులకు సంసిద్ధులై యుండిరి.

ఆంధ్రుల చరిత్రయందలి యంశముల కివి ఏమాత్రము విరుద్ధములుగా లేవు. ఆంధ్రులు గంగాతీరమునుండి (అహిచ్ఛత్రపురమునుండి) కృష్ణాతీరమునకు వచ్చుట— తిరిగి వెళ్ళుట — మరల రాజ్యమును స్థాపించుట— అను విషయము లన్నియు పౌరాణిక గాథల రూపమున వల్లభాభ్యుదయ కావ్యము నిరూపించుచున్నదని శ్రీ కోరాడవారు స్పష్టపరచియున్నారు.

నాటినుండి నేటివరకు ఆంధ్రవిష్ణువును సేవించి ధన్యులయిన మహానుభావు లెందరో కలరు. విజయనగర సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు కళింగదేశవిజిగీషామనీషన్ దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుం డగు మధుమథను సేవింపబోవ స్వప్నమున ఆంధ్రజలజాక్షుడు సతీసమేతుడై చిరునవ్వుతోడ ప్రత్యక్షమై "నేను తెలుగురాయడను, నాకు ప్రియముగా కృతినిర్మింపు" మని యానతిచ్చెను.

కృష్ణరాయలకు పూర్వము అచ్చటచ్చట ఈ క్షేత్ర ప్రశంస కానవచ్చుచున్నది. కాకతీయుల శాసనములందును, అనంతామాత్యుని భోజరాజీయమునందును శ్రీకాకుళ శ్రీహరిశతకమునందును, కాసుల పురుషోత్తముని ఆంధ్రనాయక శతకమునందును, ఆంధ్రవిష్ణు

కీర్తింపబడినున్నారు. శ్రీకాళీ రామమున శ్రీకాకుళము నందు జరుగు తిరునాళ్ళ ప్రసంగం కలదు. పురుషోత్తమ కవి ఆంధ్రనాయకాలయము పూజాపురస్కార కార్యమై హీనదశయందున్నప్పుడు మిగుల పరితపించి "సుప్రసిద్ధుడు ప్రత్యక్షమూర్తి యగు దేవున కిట్టి విపరీతస్థితి చేకూరుటకుఁ గినిసి నిత్యోత్సవము చేయించికొనక చేతగానివాని వలె నూరకుంట ప్రతిష్ఠ కాదనియు, పూర్వపుకీర్తి నిలుపుకొమ్మనియు నిందాస్తుతులతో ఆంధ్రనాయక శతకము రచించెను. చల్లపల్లి (దేవరకోట) ప్రభువు అంకినీడుగారు ఆలయ పునర్నిర్మాణము గావించిరి. ఈ క్షేత్ర మెన్ని మార్లు పునర్నిర్మాణదశల ననుభవించినదో! ఆంధ్రవిష్ణువు మాత్రము నేటికిని పూజింపబడుచున్నాడు. ఆ క్షేత్ర మాహాత్మ్య మట్టిది. "శ్రీకాకుళము భక్తలోక చింతామణి, సుకృతాకరము, మహాక్షేత్రావతంసంబు."

కె. గో.

**ఆంధ్ర సారస్వత పరిషత్తు:-** ఆంధ్ర సారస్వత సంస్కృతుల అభివృద్ధి, అక్షరాస్యతా వ్యాప్తి అను ఆదర్శాలతో ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు నగరమున 1943 సంవత్సరము మే నెల 26 వ తేది నాడు శ్రీ లోకనంది శంకరనారాయణరావుగారి అధ్యక్షతన స్థాపితమైనది. ఈ సంస్థ తన ఆదర్శాల ప్రకారము పనిజేయుట కొరకు ఈ క్రింది ఆశయములను నిర్ణయించుకొన్నది.

1. సభలు, సమ్మేళనములు, సమావేశములు.
2. దేశమందలి సారస్వతమును తత్సంబంధమైన విశేషములను గ్రహించి ప్రకటించుట.
3. పారిభాషిక మాండలిక కోశములను సిద్ధపరచుట.
4. రాష్ట్రమందలి ఇతర సారస్వత సంస్థలను జత పరచుకొని సారస్వత కృషి సాగించుట.
5. సారస్వత పరీక్షలు తెలుగులో జరుపుట.
6. రచయితలను ప్రోత్సహించుట.
7. సంబంధ శాఖలను స్థాపించుట.

1948 వ సం. పోలీసు చర్యకు పూర్వము హైద్రాబాదు రాష్ట్రములో ఆంధ్ర సారస్వత సంస్కృత్యభివృద్ధికి పెక్కు ప్రతిబంధకము లుండెడివి. ప్రతికూల పరిస్థితులలో 1948 వరకు ఈ పరిషత్తు పనిచేయవలసి వచ్చినది. ఈ సంస్థయొక్క వార్షికోత్సవాలు ఇప్పటి వరకు హైదరాబాదు, ఓరుగల్లు, నల్లగొండ, మహబూబు నగరం, తూప్రాన్, మంచిర్యాల, అలంపురములలో పలు పర్యాయములు జరిగినవి. అలంపురము వార్షికోత్సవమునకు భారత ఉపరాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు ప్రారంభోత్సవము చేసి పరిషత్తును ఆశీర్వదించిరి. ఇవిగాక పరిషత్తు జిల్లా సభలు కూడ పలు ప్రాంతాలలో జరిగినవి. ఇప్పటివరకు ఈ సంస్థకు శ్రీ లోకనంది శంకరనారాయణరావు, కీ.శే. శ్రీ సురవరము ప్రతాపరెడ్డి, శ్రీ బుక్కా వేంకటసుబ్బారాయుడు, శ్రీ ఇల్లిందల రామచంద్రరావు, శ్రీ పర్సా వేంకటేశ్వరరావు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగార్లు అధ్యక్షులుగా పనిజేసిరి. ఈ సంస్థకు ఇప్పటివరకు కార్యదర్శులుగా పని జేసినవారు శ్రీ బూర్గుల రంగనాథరావు, శ్రీ బిరుదు వేంకటశేషయ్య, శ్రీ నూకల నరోత్తమరెడ్డి, శ్రీ పులిజాల హనుమంతరావుగార్లు.

పరిషత్తు కార్యక్రమములో పరీక్షల నిర్వహణము అతి ముఖ్యమైనది. పోలీసు చర్య తరువాత యీ పరీక్షలకు వేల సంఖ్యాకులుగా అభ్యర్థులు వచ్చుచున్నారు. ప్రాథమిక, మాధ్యమిక, ప్రవేశ, విశారద అను పరీక్షలు సంవత్సరానికి రెండుపర్యాయములు జరుగును. ఇందులో ప్రవేశ పరీక్ష యందు ఉత్తీర్ణత గాంచినవారు ప్రాథమిక పాఠశాలలలో ఉపాధ్యాయ పదవిని ఆక్రమించుటకు అర్హులుగను, విశారద పరీక్షయందు ఉత్తీర్ణతనొందినవారు సెకండరీపాఠశాలలలో తెలుగును బోధించుటకు అర్హులుగను హైదరాబాదుప్రభుత్వమువారుఆమోదించియుండిరి. ఇప్పటి వరకు ఈ పరీక్షలలో నలుబదివేల వరకు అభ్యర్థులు పాల్గొనియున్నారు. ఈ పరీక్షలు ప్రతిసారి 40 నుండి 100 కేంద్రాలలో జరుగుచుండును. ఇందులో అధిక సంఖ్యాకులైన అభ్యర్థులు పల్లెటూళ్లలో నివసించువారు; పాఠశాలలలో చదువుకొనుఅవకాశము లేని వయోజనులు, తెలంగాణ జిల్లాలలోని ప్రతి పల్లెటూరికి ఈ పరీక్షలు సుపరిచితములు. ఇప్పటివరకు తెలంగాణములోని కొన్ని మార్ల పల్లెటూళ్లలో .ఈ పరీక్షలు నిర్వహింపబడినవి. అందుచేతనే శ్రీబూర్గుల రామకృష్ణారావు గా. శ్లోకముగారు పరిషత్తు కృషిని గూర్చి మాట్లాడుచు పూర్వుని వెలుతురు

వలె పరిషత్తు మన రాష్ట్రము నందలి ప్రతిపల్లెను విజ్ఞాన ముచే ప్రకాశవంతముగావించుచున్నదని తెలిపిరి. "ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు తమ ఆంధ్రోద్యమ చరిత్రలో పరిషత్తు కృషి ఒక మహోద్య మము వలె తెలంగాణమున వ్యాపించుచున్నదని వ్రాసి నారు. పరీక్షలతోపాటు అక్షరాస్యతా వ్యాప్తికి పరిషత్తు కృషిచేయుచున్నది. పోలీసుచర్య తరువాత ఇప్పటివరకు పరిషత్తు 114 రాత్రిపాఠశాలలను జిల్లాలలోని పల్లెటూళ్ల యందును, కొత్తగూడెము వంటి కార్మిక కేంద్రాలయం దును నిర్వహించినది. ఈ పాఠశాలలలో సుమారు ఎనిమిది వేల మంది నిరక్షరాస్యులు అక్షరాస్యులు గావింపబడిరి. వయోజనులను అక్షరాస్యులను గావించుటకొరకు ఉపా ధ్యాయ శిక్షణ శిబిర మొకటి పరిషత్తు 1950 వ సంవత్స రమున నిర్వహించినది. 1951 వ సంవత్సరమున ఫిబ్రవరి 17 వ తేది నుండి 21 వ తేది వరకు పరిషత్తు తెలంగాణ మున వయోజన విద్యా వారమును జయప్రదముగా నిర్వహించినది. 1950 లో జబల్పూరులో జరిగిన వయోజన విద్యా ప్రచార గోష్ఠిలో పరిషత్తు ప్రతినిధులు పాల్గొని యావద్భారతమున జరుగు వయోజన విద్యా ప్రచార పద్ధతిని ఆకళింపు చేసికొనిరి. తరువాత 1953 వ సంవత్సరమున అలహాబాదులో నిర్వహింపబడిన వయోజన శిక్షణాలయమునకు పరిషత్తు ఒక కార్యకర్తను పంపి శిక్షణము నిప్పించినది. భారత ప్రభుత్వమువారు మొదటి పంచవర్ష ప్రణాళిక క్రింద నిరుద్యోగులకు ఉద్యోగము కల్పించు ఉద్దేశముతో ఏర్పాటుచేసిన సాంఘిక విద్యా ప్రణాళిక క్రింద ప్రభుత్వ సహకారముతో పరిషత్తు హైదరాబాదు నగరమున 11 సాంఘిక విద్యా కేంద్రము లను రెండు సంవత్సరాలనుండి అత్యంత సామర్థ్యముతో నిర్వహించుచున్నది.

పరిషత్తు ఇప్పటివరకు దాదాపు నలుబది గ్రంథాలను ప్రకటించినది. ఇందులో పండిత సారస్వతము, బాల సారస్వతము, జానపద సారస్వతము చేరియున్నవి. పరిషత్తుప్రచురణములలో 15 పుస్తకాలు బాలవాఙ్మయ మునకు చెందినవి కలవు. ఈ పుస్తకాలలో శ్రీ సన్నిధా నము సూర్యనారాయణశాస్త్రిగారి నరసభూపాలీయ వివరణము ఆంధ్రసారస్వత విద్యార్థులకు పాఠ్యగ్రంథ ముగా విశేషోపకారకముగానున్నది. పరిషత్తుప్రచురణము లలో స్వర్గీయ శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర మనకు స్వాతంత్ర్యము వచ్చినప్పటినుండి ఇప్పటివరకు విశాలాంధ్రమున ఆంధ్రభాషలో ప్రకటిత మైన గ్రంథాలలో ఉత్తమమైనదిగా ఢిల్లీలోని సాహిత్య అకాడమీ వారిచే నిర్ణయింపబడి, కేంద్రప్రభుత్వమునుండి అయిదువేల రూపాయల బహుమతి పడసినది. ఇదిగాక జానపద వాఙ్మయమునకు సంబంధించిన స్త్రీల రామా యణపు పాటలు, పల్లెపదాలు అను వేయి పుటలు గల రెండు ఉద్గ్రంథములను పరిషత్తు ప్రకటించినది. తెలుగు మహాభారతముపై ప్రామాణిక పండితులు వ్రాసిన విమర్శ నాత్మక వ్యాసాలను సంపుటీకరించి పరిషత్తు ప్రకటించినది.

గ్రంథాలయోద్యమ వ్యాప్తికి పరిషత్తు బలమైన చేయూతనిచ్చినది. 1952 వ సంవత్సరములో హైదరా బాదు నగరమున జరిగిన అఖిలభారత గ్రంథాలయ మహా సభా నిర్వహణమునందు ఈ పరిషత్తు యొక్క అధ్యక్ష, ఉపాధ్యక్ష, కార్యదర్శులు ఆహ్వానసంఘ కార్యదర్శులుగ పనిచేసిరి. మాజీ విద్యాశాఖ డైరెక్టరు శ్రీ సేతు మాధవరావుగారు నిర్వహించిన గ్రంథాలయోద్యమ సందర్భమున ఈ పరిషత్తు రెండు లక్షల తెలుగు పుస్తకా లను, విద్యాశాఖ క్రిందనున్న పాఠశాలలలో చేర్చుటకు పూర్తిగా సహకరించినది.

సాహిత్యముతో పాటు ఇతర కళలను ప్రచారము గావించుటకు పరిషత్తు కృషి గావించినది. 1952 అక్టోబరు నెలలో నృత్యగానకళాసాహిత్యములనుగురించి హైదరా బాదాంధ్రులకు చక్కని పరిచయము కలుగజేయుట కొరకై శ్రీ నటరాజ రామకృష్ణగారిని ఆహ్వానించి నగరమందు పలుచోట్ల నాట్యకళా ప్రదర్శనాలను ఏర్పాటుచేసినది. 1955 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో తెలంగాణచిత్రకారుడైన శ్రీ కొండపల్లి శేషగిరి రావు చిత్రించిన చిత్రములప్రదర్శనమును హైదరాబాద నగరమున ఏర్పాటుగావించినది. ఈ ప్రదర్శనమునకు అప్పటి హైదరాబాదు ముఖ్యమంత్రి డాక్టర్ బూర్గుల రామకృష్ణారావుగారు ప్రారంభోత్సవము గావించిరి.

మన రాష్ట్రమునందలి వివిధ వైజ్ఞానిక కార్యక్రమ ములలో పరిషత్తు సహకరించుచున్నది. 1950 వ నవంబరు

నెలలో మహారాష్ట్ర, కర్ణాటక సాహిత్య సంస్థల సహకారముతో హైదరాబాదు నగరమున పరిషత్తు సంస్కృతి సంగమోత్సవమును నిర్వహించినది. 1951 వ మార్చి నెలలో ఢిల్లీలో జరిగిన అఖిలభారత సంస్కృతి సంగమోత్సవములో పరిషత్తు పాల్గొనినది. హైదరాబాదు నందలి సర్వకళాశాలా యాజమాన్యమున ప్రతి సంవత్సరము జరుగు ఆంధ్రాభ్యుదయోత్సవాలకు పరిషత్తు యథాశక్తి సహాయ సహకారముల నిచ్చుచున్నది. లక్ష్మణరాయ పరిశోధక మండలి కార్యకలాపాలను పరిషత్తు పునరుజ్జీవింప జేసినది. తెలంగాణ రచయితల సంఘ స్థాపనకు ఇది దోహదముగావించి తెలంగాణగ్రంథాలయ సంఘ కార్యాలయమునకు వసతి కల్పించినది.

పరిషత్తు రాష్ట్రములో అనేక సారస్వత సభలను నిర్వహించి ఉత్తమ కవి పండితుల నాహ్వానించి సన్మానించినది. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ మునిమాణిక్యం నరసింహారావు, శ్రీ పింగళి లక్ష్మీకాంతము, శ్రీ నేలటూరి వెంకటరమణయ్య, శ్రీ గడియారం వేంకట శేషశాస్త్రి, శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ నండూరి బంగారయ్య, శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు, శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, శ్రీ కురుగంటి సీతారామయ్య, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి మొదలయిన కవిపండితుల నాహ్వానించి సాహిత్య, చారిత్రక, వైజ్ఞానికోపన్యాసముల నిప్పించినది. 1955 వ సంవత్సరమున పరిషత్తు తెలుగు భారత మహోత్సవాలను వారమురోజులు దిగ్విజయముగా నిర్వహించినది. కేంద్ర సంస్థవలెనే పరిషత్తు యొక్క శాఖలుగూడ వార్షికోత్సవాలను, సాహిత్య సభలను జరుపుచున్నవి. ఓరుగల్లు, నిజామాబాదు, బాపట్ల బొంబాయి, ఆలూరు, ఇబ్రాం పట్నము మొదలయిన పరిషత్తు శాఖలు పేర్కొనదగియున్నవి. కీ. శే. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ఆస్థానకవి బిరుద ప్రదానసభలో పరిషత్తు పాల్గొని రజతకమలము సమర్పించినది.

పోలీసుచర్య తరువాత ఉస్మానియా విశ్వవిద్యాలయము నందలి శిక్షాప్రణాళికలో ప్రజల మాతృభాష అను నిర్బంధ పఠనీయములమగా జేయించుటకు పరిషత్తు గట్టి కృషి గావించి కొంతవరకు విజయము పొందినది. పరిషత్తు పరీక్షలు ప్రభుత్వముచే ఆమోదింపజేయుటకు ప్రాచ్యవిద్యాలయందు పట్టములు పొందిన పండితులకు విశ్వవిద్యాలయ పట్టభద్రులతో సమాన వేతనము నిప్పించుటకు, హైస్కూలు తరగతులలో కూడ మాతృభాషలద్వారమున విద్యాబోధనము చేయించుటకును, పోలీసుచర్య జరిగిన వెంటనే పరిషత్తు కృషిగావించి సఫలత పొందినది. ఇందుకొరకై ఆచార్య శ్రీ తణికెళ్ళ వీరభద్రుడుగారి నాయకత్వమున శ్రీ యం. హనుమంతరావు నాయుడు, 'ఆంధ్ర పితామహ' శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు, శ్రీ యన్. నరోత్తమరెడ్డి, శ్రీ దేవులపల్లి రామానుజరావుగార్లతో కూడిన రాయబారవర్గము ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుని, విద్యాశాఖామంత్రిని కలిసికొని నివేదికలు సమర్పించి, ప్రశంసనీయమైన కృషిగావించినది. 1951 వ సంవత్సరము రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ హైదరాబాదు వచ్చినప్పుడు పరిషత్తు ప్రతినిధులు వారిని సందర్శించి పరిషత్తు కృషిని నివేదించిరి.

పరిషత్తునకు హైదరాబాదు ప్రభుత్వము వారు నగరమందు బొగ్గులకుంటలో 1800 చ. గజాల వసతికల భూమిని ఉచితముగా నిచ్చిరి. ఈ భూమిలో పరిషత్తు కార్యాలయముకొరకు సొంతభవనమును కట్టుకొన్నది. పరిషత్తుకు నాలుగు సంవత్సరాలనుండి హైదరాబాదు ప్రభుత్వముచే ఆర్థిక సహాయములభించుచున్నది. ఈనాడు పరిషత్తు తెలుగుదేశములో సుస్థిరమైయున్న సంస్థలలో లెక్కపెట్ట దగినదిగా అభివృద్ధినొందియున్నది.

దే. రా.

**ఆంధ్ర సాహిత్యపరిషత్తు** :-- ఆంధ్ర సాహిత్య పరిషత్తు 1911 సంవత్సరము మే నెల 12 వ తేదిన చెన్నపురమున నెలకొల్పబడెను. శ్రీ జయంతి రామయ్యపంతులుగారు ఆంధ్రభాషా వాఙ్మయాభివృద్ధికై యొక సంఘము యేర్పరచుట యుక్తమని పీఠికా పురాధీశ్వరులగు శ్రీ మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావుగారికి విన్నవింపగా వారప్పుడు చెన్నపురమున నుండుటవలన నచ్చటనున్న కందుకూరి వీరేశలింగము పంతులుగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, వావిలికొలను సుబ్బారావు

గారు, మొక్కపాటి సుబ్బారాయడు గారు, చెన్నాప్రెగడ భానుమూర్తిగారు మొదలగు పెద్దలతో నాలోచించి 1911 సం. మేనెల 12 వ తేదిన చెన్నపురమున నొక సభ నేర్పాటు చేసిరి. ఆసభకు శ్రీ మహారాజావారధ్యక్షత వహించిరి. ఆ సభలో ఈ పరిషత్తు స్థాపింపబడెను. వంగీయ సాహిత్య పరిషన్నామమునుబట్టి ఈసంఘమునకు "ఆంధ్ర సాహిత్య పరిషత్తు" అని నామకరణము గావింపబడెను. "దేశభాషలందు తెనుగు లెస్స" అను వాక్యము పరిష దుద్దేశ సూచక సంగ్రహవాక్యము (Motto) గను, సరస్వతీ విగ్రహము పరిషల్లాంఛనము (Crest) గను, గ్రహింపబడెను.

నాటినుండి నేటివరకు పరిషత్తు తన యాశయముల నిర్వహించుటకై నిరంతరకృషి సల్పుచున్నది.

పరిషదాశయములలో ప్రధానమైనవి :

1. తెలుగుభాషకు సర్వంకషమగు నొక నిఘంటువును రచించి ప్రకటించుట.

2. సజాతీయేతర భాషలతో గల సాదృశ్యము నిరూపించుచు నొక వ్యాకరణము రచించుట.

3. పారిభాషికపదములను నిర్ణయించి వివరించు శబ్దకోశమును సంతరించుట.

4. తెలుగుదేశము యొక్కయు, ప్రజలయొక్కయు చరిత్రమును రచించుట.

5. తెలుగుభాషకును, వాఙ్మయమునకును సంబంధించిన విషయములనుచర్చించు నొకపత్రికను ప్రకటించుట.

6. ముద్రితాముద్రిత గ్రంథములతో నొక పుస్తక భాండాగారమును నెలకొల్పుట.

7. తెలుగు సాహిత్యమున పరీక్షలు గావించి పారితోషికాదు లొసగుట.

8. ఆంధ్రభాషా వాఙ్మయముల అభివృద్ధికి ఉపకరించు నన్నిపనులు చేయుట.

పరిషత్ప్రథమ వార్షికమహాసభ 1912 వ సంవత్సరము ఏప్రియల్ 6, 7 వ తేదులలో చెన్నపురియందు జరిగెను. నాటినుండి ప్రతి సంవత్సరము వార్షికమహాసభలు అచ్చటచ్చట జరుగుచున్నవి.

పరిషత్తు ప్రకటించు సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణమునకగు వ్యయమంతయు పరిషత్తునకు యావజ్జీవాధ్యక్షులగు శ్రీ పిఠాపురము మహారాజావారు భరించి నిఘంటునిర్మాణమును పూర్తి గావించిరి. ప్రస్తుతము 4 సంపుటములు మాత్రము ముద్రితములయినవి. తక్కిన సంపుటములు ముద్రణమునందున్నవి.

"ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక" అనుపేర నీ పరిషత్తునకు అనుబంధముగ ఆంధ్రభాషా - వాఙ్మయ, చరిత్రములను చర్చించు పత్రిక యొకటి వెలువడుచున్నది. ఈ పత్రిక రెండుమాసముల కొకమారు వెలువడుచున్నది. ఆంధ్రభాషా కోవిదులందరు దీనికి వ్యాసముల నంపుచుందురు.

ఈ పరిషత్తున కొక గొప్ప పుస్తక భాండాగారము గలదు. ఇందు ముద్రితములైన గ్రంథములు పదివేలున్నవి. ఈ భాండాగారమునందలి విశేషమేమనిన-అముద్రితములయిన తాళపత్రగ్రంథములు, కాగితపుప్రతులు దాదాపు ఆరువేలు గలవు. ఆంధ్రలోక మెరుగని అపూర్వగ్రంథములెన్నియో ఇందు గలవు. ఆంధ్రవాఙ్మయ పరిశోధకులకీ భాండాగారము పెన్నిధియని చెప్పవచ్చును. విశ్వవిద్యాలయములనుండి ఆంధ్రభాషా పరిశోధకులగు విద్యార్థులిచటి పరికరములను వినియోగించుకొనుచున్నారు. ఇయ్యముద్రిత పుస్తకభాండాగారమునుండి పరిషత్తు తన పత్రికా ముఖమున డెబ్బది అపూర్వగ్రంథముల నాంధ్రలోకమున కందిచ్చినది.

1. కవిజనాశ్రయము - వేములవాడ భీమకవి.
2. శివరాత్రిమాహాత్మ్యము - శ్రీనాథ మహాకవి.
3. శివతత్త్వసారము - పండితారాధ్యుడు.
4. విప్రనారాయణ చరిత్రము - చెదలవాడ మల్లన.
5. బాలసరస్వతీయము - బాలసరస్వతి.
6. శివలీలా విలాసము-నిశ్శంక కొమ్మనామాత్యుడు.

(మొదలగునవి)

ప్రాచీన తామ్రశిలాశాసనములు 88 విమర్శన పూర్వకముగా పరిషత్పత్రికయందు ప్రకటింపబడినవి. ఇందు శాసన ప్రతిబింబములుకూడ గలవు. ఇవి ఆంధ్రదేశ చరిత్రమున కెంతయు నుపయోగించునవి. వివిధపాఠ భేదములతో శ్రీ కాళహస్తి మాహాత్మ్యము, పారిజాతాపహరణము, క్రీడాభిరామము, భీమేశ్వరపురాణము మొదలగు గ్రంథములు ముద్రణమునకు సిద్ధముగానున్నవి.

ఇంకను పరిషత్తు చేయవలసిన భాషాసేవయెంతయు గలదు. సజాతీయేతర భాషలతో సాదృశ్యమును నిరూపించు నొక వ్యాకరణమును రచించుట, పారిభాషిక నిఘంటురచనము మొదలగు పరిషత్ప్రయోజనములు సాఫల్యము నొందవలసి యున్నవి.

చ. స. శా.

**ఆంధ్ర సినిమా పరిశ్రమ:**-పరిశ్రమలలో సినిమా పరిశ్రమ ఏడవది. ప్రపంచములో చిత్రనిర్మాణము చేసెడు దేశాలలో హిందూదేశము మూడవ స్థానమును సంపాదించుకొన్నది. మొన్నమొన్నటి వరకును అమెరికాకు తరువాతిదిగానే ఉండెడిది. కాని ఆ రెండవ స్థానమును జపాను సంపాదించుకొనుటవల్ల మూడవ స్థానమునకు మారవలసివచ్చినది.

**మూగచిత్రాల నిర్మాణదశ :** 1908 వ సంవత్సరమున "క్రీస్తు జీవితము" అను చలనచిత్రము మొదటిసారిగా హిందూదేశీయులు చూచినారు. అప్పటినుండి 1910 వరకు ఇతర దేశపు చిత్రములు చూపుచు వచ్చినారు. 1911 నాటికి "రాజదర్బారు" అను చిత్రమును, తొలిగా హిందూదేశీయులు నిర్మించినారు. 1913లో దుండిరాజ గోవిందఫాల్కే అను నాయన 'హరిశ్చంద్ర' చలనచిత్రము నిర్మించినాడు.

మద్రాసులో రఘుపతి వెంకయ్యగారు 'గెయిటీ' టాకీను మొట్టమొదట కట్టించినారు. ఇదే తెలుగువారి మొదటిసినిమా హాలు. ఆ తరువాత ఆయనే గ్లోబు(ఇప్పటి రాక్సి), క్రౌను థియేటర్లు కట్టించినాడు. ఈ సినిమా హాలులవల్ల మంచి లాభాలు రాసాగినవి. అందువలన ఆయన కుమారుడైన సూర్యప్రకాశరావును (ఆర్.యస్. ప్రకాశ్) సినిమా సాంకేతిక విద్యను నేర్చుకొని రమ్మని హాలివుడ్డుకు పంపినాడు. ప్రకాశ్ హాలివుడ్డులో సిసిల్ బి. డి. మిల్లి దగ్గర శిక్షణమును పడసినాడు. సినిమా సాంకేతిక జ్ఞానమును సాకల్యముగ గ్రహించినాడు. 'మెట్రోగోల్డ్విన్ మేయర్సు' చిత్రములో ఒక వేషము గూడ వేసినాడు.

శ్రీ ప్రకాశ్ స్వదేశమునకు వచ్చినతరువాత 1923లో "భీష్మ" అనెడు చిత్రమును నిర్మించినాడు. అది విజయవంతముగా ఆడినది. ఇతడు "స్టార్ ఆఫ్ యీస్టు ఫిల్ము కంపెని" అను పేరుతో ఒక శిల్పగృహము (స్టూడియో)ను 1926 లో నిర్మించినాడు. ఇతనితో భాగస్వామిగా మద్రాసువాసియైన ఆర్. నారాయణ చేరినాడు. "జనరల్ పిక్చరు కార్పొరేషన్" అనెడు సంస్థను స్థాపించి, వీరిరువురు చిత్రాలు దీయ దొరకొన్నారు. ఆర్. యస్. ప్రకాశ్ 'గజేంద్రమోక్షము', 'నందనారు', అను చిత్రాలను తీసినాడు. 1927 నాటికి నారాయణ ఇతర దేశములకువెళ్లి, పరిశ్రమను గూర్చి తెలిసికొని తిరిగి వచ్చినాడు. వచ్చిన వెంటనే అతడు 'ద్రౌపదీ వస్త్రాపహరణము', 'కీచక వధ' తీసినాడు.

1929 లో ఏలూరు వాస్తవ్యులయిన శ్రీ మోతే నారాయణరావు గారు "గ్యారంటీ ఫిలుమ్సు" అనెడు సంస్థను స్థాపించి, ఆర్. యస్. ప్రకాశ్‌ను దర్శకునిగా నియమించుకొని, "కన్యకా పరమేశ్వరి" అనెడు చిత్రమును దీసినారు. జనరల్ పిక్చరు కార్పొరేషన్‌లో శ్రీ వై. వి. రావు శిల్పి (ఆర్టిస్టు), దర్శకుడుగా, నటుడుగా నుండెను. వీరి ఛాయాగ్రాహకుడుగా ( కెమేరా మేన్ ) జితిన్ బెనర్జి పనిచేసెను.

మద్రాసులో నిట్లుండగా, శ్రీ హెచ్. యం. రెడ్డిగారు బొంబాయి, కొల్హాపూరులలో మూగచిత్రాలు తీయ సాగిరి. ప్రకాశ్‌గారి దగ్గరనున్న ఫోటోగ్రాఫరు రంగయ్య తోడ్పాటుతో శ్రీ సి. పుల్లయ్యగారు "మార్కండేయ" తీసినారు. దీనిలో పుల్లయ్యగారే యముని పాత్ర వహించినారు.

ఆనాటి చిత్ర పరిశ్రమ, చిత్రనిర్మాణములను గూర్చి తలచుకొనినచో నవ్వుగా నుండును. ఆ రోజులలో చిత్ర నిర్మాణశాలలు పెద్ద భవనముల ఆవరణములలో నుండుచుండెను. ఈ రోజులలో వలె సెట్సు వేసేవారు కాదు. నాటకాలలో వలె తెరలు ఉపయోగించెడువారు. నటీనటులను ఆంగ్లోయిండియనుల నుండి, వేశ్యల నుండి ఎన్నుకొనెడువారు. ఒక చిత్రమునకు నిర్మాణ వ్యయము పదునైదువేల నుండి ఇరువదివేల వరకు ఉండుచుండెను. ఒక్కొక చిత్రమునకు మూడు అచ్చుప్రతులు (ప్రింట్లు) మాత్రమే తీసెడివారు. అవి నూటయేబది సార్లు ఉపయోగించగానే నిరుపయోగమయి పోవుచుండెను. పంపకదారు (డిస్ట్రిబ్యూటరు) అనువాడు ఆ రోజులలో లేడేలేడు.

నిర్మాతే తన చిత్రమును ఆడించుకొనవలసి వచ్చు చుండెను.

1927 వ సంవత్సరము నాటికి హిందూదేశపు మొత్తమునకు 156 సినిమా ప్రదర్శనశాలలు మాత్రమే యుండెను. అయితే,మద్రాసునగరములో మాత్రము 9 సినిమా శాల లుండెను. ఈ సినిమాశాలలలో ఇతర దేశ చిత్రములే ఎక్కువగా ఆడెడువారు. ఆ చిత్రములలో సాహసము, దెబ్బలాటలు ఉన్న చిత్రములు వచ్చుటయు, ప్రజలు ఆనందించుటయు జరుగజొచ్చెను. అందుచే మనవారు పురాణ కథలతోపాటు రాజపుత్రుల చరిత్రలు, సాహసము దెబ్బలాటలు కల చిత్రాలు తీయసాగిరి.

చిత్రాలు మూగవి యగుటచే, భాష లేకపోవుటచే చిత్రముతోపాటు ఒక వ్యాఖ్యాతను పంపెడువారు. అతడు తన వాక్పటిమను, హాస్య ధోరణిని ఉపయోగించి కథ చెప్పి, ప్రేక్షకులను తన్మయులను చేసెడువాడు. కొన్నాళ్లు గడిచిన తరువాత వాద్య గోష్ఠిని గూడ చిత్రముతో పాటు పంపవలసివచ్చినది. అంతియే గాక, ప్రేక్షకులను ఆకర్షించుటకు బహుమానములు, టికెట్ సంఖ్యకు ఇచ్చుచుండెడువారు. పిల్లలకు బొమ్మలు పంచి పెట్టుచుండువారు. ఒక్కొక పట్టణములో రెండు సినిమా ప్రదర్శనశాలలు ఉండుచుండెను. అక్కడ పోటీ తప్పని సరిగా ఏర్పడుచుండెను. ఆ పోటీలో టికెట్టు ధర కానీ వరకు కూడ తగ్గించెడువారు.

1928 నుండి 1931 వరకు లాభములు తగ్గుముఖము కాజొచ్చెను. నాటక సంఘము లుండుటచే నాటకాల ప్రాముఖ్యము ఎక్కువయినది. ఆ నాటకాలముందు ఈ మూగ చలన చిత్రములు తట్టుకోలేక పోయినవి. అందుకై నిర్మాతలు మరియొక క్రొత్త ఆకర్షణమునుచిత్రముతో పాటు సమకూర్పవలసివచ్చినది. అందుకై వారు శిఖావతి వంటి ఆనాటి సినిమారంగపు నాట్యకత్తెలను గూడ చిత్రముతో పాటు పంపెడువారు. చిత్రముతో పాటు వీరి నాట్యము రెండవవిషయముగా ఉండుచుండెడిది. దానితో మళ్లీ ప్రేక్షకుల సంఖ్య పెరుగ మొదలు పెట్టినది.

వాక్చిత్రముల దశ (1931-1933) : ఖాన్‌బహాదూరు అర్దేషీర్ ఇరాని యనువాడు "ఇంపీరియల్ కంపెని" అను పేరుతో ఒక సంస్థను బొంబాయిలో స్థాపించెను. "ఆలమ్ ఆరా" అను చిత్రమును 14-3-1931వ నాటికి హిందీలో వెలువరించెను. ఆ సంవత్సరములోనే (1931) హెచ్. యం. రెడ్డిగారి దర్శకత్వమున "ప్రహ్లాద" అను వాక్చిత్రమును తెలుగులో బొంబాయిలో తీసినారు. ఇదియే మొదటి తెలుగు వాక్చిత్రము.

1932 లో 2, 1933 లో 6 వాక్చిత్రములు తయారయినవి. మొట్టమొదటి నటకులలో యడవల్లి సూర్యనారాయణగారు, సురభి కమలాబాయిగారు ముఖ్యముగా బేర్కొనదగినవారు.

ఇంతవరకు తెలుగు పెట్టుబడిదారులు లేరు. అందరును బొంబాయి, కలకత్తాలవారే. నటీనటులు మాత్రము తెలుగువారు. చిత్రము లన్నియు పురాణకథలకు సంబంధించినవే. హిందూస్థానీ సంస్థలు తెలుగువారి మేథాశక్తిని ఉపయోగించుకొని లాభములు సంపాదించుకొనుచుండిరి.

ఇప్పటికి, తెలుగువారు సినిమాలపై మోజుపడినారు. కాని, వీరు సాంకేతిక, వ్యాపారిక మర్మములు కనిపెట్ట వలెనని మాత్రము ముందుకు రాలేకపోయినారు. ఈ కాలములో చిత్రనిర్మాణ వ్యయము ముప్పదివేలు మొదలు నలుబదివేల రూపాయలవరకు ఉండుచుండెను. నటీనటులకు ప్రయాణ వ్యయములు, ఇతర వ్యయములు మాత్రమే గిట్టుచుండెను. వీరందరిని సమకూర్చెడు ప్రతినిధులకు కమీషను డబ్బులు గిట్టుచుండెడివి. కవితలో కూడ కేవలము నాటకాలను కుదించి చిత్రీకరించుటయే జరుగుచుండెను. కవులలోగూడ సాంకేతిక విజ్ఞానము లేకపోవుటచే నాటకాలపద్ధతిలోనే మాటలు వ్రాయుచుండిరి. శబ్దగ్రహణములో మాటలు సరిగా వినపడవేమో అని అసహజముగా, మెల్లగా విడివిడిగా పలికెడువారు.

ఇంతవరకు తెలుగుదేశమునుండి నిర్మాతగా ఎవరును ముందుకు రాలేదు. ఉన్న దర్శకులయినను వ్రేళ్ళమీద లెక్కపెట్టగలిగినంతమందే! తెలుగువారిలో సాంకేతిక శిక్షణము పొందవలయునను కోరికగలవారు తక్కువమందే ఉండిరి. ప్రదర్శనశాలల విషయము చూచినచో అద్దెలకు తెచ్చిన సినిమా పరికరాల అగుటవలన లాభాలు అంతంత మాత్రముగా నుండుచుండెడివి. పంపకసంస్థ ఒక్కటైనను

తెలుగువారిది లేదు. ఇది శాస్త్ర నిర్మాణమునందలి తొలి దశ.

1934-1935: ఈ కాలము తొలిదశలో రెండవభాగము. చరిత్రలో ప్రాతరాతియుగము, క్రొత్తరాతియుగము అన్నట్లు ఇది ఒక భాగముగా నున్నది.

1934 వ సంవత్సరమునందు బందరులోని చిత్రప్రద ర్శనశాల అధిపతియైన శ్రీ పి. వి. దాసు, శ్రీ చల్లపల్లి రాజావారు, మద్రాసులోని జి. డి. స్వామి, ఎం. టి. రాజన్, జి. పి. పార్థసారథిగార్లతో చేరి, "వేల్‌పిక్చర్సు" అను చిత్రనిర్మాణశాలను నిర్మించినారు. దీనివలన ఈశాల యొక్క నిర్మాతలకు మంచిలాభాలు వచ్చినవి. తెలుగువారు చిత్ర నిర్మాణములో భాగస్థులయినారు. చిత్రాల నిడివి 17 వేల నుండి 18 వేల అడుగులవరకు నుండెడిది. దక్షిణ భారతమున 'వేల్ పిక్చర్సు' చిత్ర శాలలో మొదటిసారిగా నిర్మించిన తెలుగుచిత్రము సీతా కల్యాణము.

నూతనముగా తీయబడిన చిత్రములలో పాట లెక్కు వగా నుండెడివి. ఈనాటి నాటకాలలో "ఇన్నివందల పద్యాలు చదివెదరు" అన్నట్లు, ఆరోజులలో "ఇన్ని పాట లున్నవి" అని ప్రచారము చేయుచుండువారు. ఆరు అచ్చుప్రతులు తయారుచేయుచుండిరి. ప్రెస్‌షోలు ఇచ్చెడు వారు. దానికై భోజనాదులతోసహా పెద్ద వివాహపు తంతువలె నడిపెడువారు. చిత్రనిర్మాణ వ్యయము 35 వేలు మొదలు 75 వేల వరకు పెరిగిపోయినది. చిత్రాలు వారాల తరబడి ఆడి, చిత్రప్రదర్శకులకు మంచిలాభాలు తెచ్చిపెట్టసాగినవి. ప్రదర్శనశాలల నిర్మాణము ఎక్కు వయినది. ప్రతి క్రొత్తచిత్రము తమ ప్రదర్శనశాలలకే తెప్పించుకొనవలయునను కోరికతో చిత్రనిర్మాతలకు డబ్బు ముందుగానే యివ్వసాగించిరి. ఇంతలోనే మంగ రాజుగారు "క్వాలిటీపిక్చర్సు" అను పేరుతో 1935 సం. లోనే ఒక పంపకపు సంస్థను విశాఖపట్టణములో స్థాపించినారు.

ఈ సంవత్సరముననే "మద్రాస్ ఫిలిం లీగ్" అను సంఘమును స్థాపించి బాలెట్‌ను నడపసాగించినారు. తెరమీద ముద్దులు పనికిరావనే విషయమును ఢిల్లీలో శాసనసభవారు చర్చించినారు.

ఆనాటి కృష్ణాపత్రికకు పడ్లమన్నాటి కుటుంబరావు మేనేజరుగా నుండెను. అతడు కృష్ణాపత్రికలో చిత్రా లను గూర్చి విమర్శలు వ్రాయ మొదలుపెట్టినాడు. దానితో తెలుగు ప్రముఖ పత్రికలలోను సినిమాలకై ఒక పుట కేటాయించిరి. అందు సినిమాలను గూర్చిన రచనలు వెలువడుచు వచ్చినవి.

1936—1940: 1936 లో దక్షిణదేశమున చిత్ర నిర్మాణశాల లున్నను, చిత్రనిర్మాణము చాలవరకు ఉత్తర హిందూస్థానములోనే జరిగినది. చిన్నపిల్లలకై ధ్రువ, అనసూయ అను చిత్రములను సి. పుల్లయ్యగారు నిర్మించిరి. పిదప "ప్రేమవిజయ" మను మొదటి సాంఘిక చిత్రము వెలువడినది. బెజవాడలోని వ్యాపారస్థుల సంఘమువారు ఒక నిర్మాణసంస్థను, పంపకపు సంస్థను సరస్వతీటాకీస్ అనుపేర నెలకొల్పినారు. దానికి పారేపల్లి శేషయ్య ముఖ్యుడు.

సర్కారులనుండి పెట్టుబడిదారులు ముందుకు రాసాగి నారు. ఇటు నెల్లూరునుండి కొందరు పెట్టుబడిదారులు, నిర్మాతలు వచ్చినారు. దానితో పోటీ ప్రారంభమైనది. తెలుగు పెట్టుబడిదారులు చిత్రనిర్మాణ శాలయొక్క ఉపయోగమును గుర్తించినారు. దాని ప్రతిఫలముగానే నిడమర్తి సోదరుల దుర్గాసినీటోను రాజమండ్రిలో నిర్మాణమయినది. ఆ దుర్గాసినీటోనునే సి. పుల్లయ్యగారు కౌలుకు తీసికొని "ఆంధ్రాటాకీసు" అను పేరుపెట్టి చిత్ర నిర్మాణము సాగించినారు. క్వాలిటీ పిక్చర్సు అనునది పూర్ణా పిక్చర్సు అనుపేర బెజవాడకు మార్చబడినది.

ఈ కాలము సినిమా పరిశ్రమకు ఉచ్చదశ యని చెప్ప వచ్చును. సాంఘిక చిత్రములకు, అందులోను సమస్యా చిత్రములకు మంచిలాభమున్నదని "మాలపిల్ల" చిత్రము నుండి నిర్మాతలు గ్రహించినారు. జాతీయాభ్యుదయ సందేశ చిత్రాలు వెలువడిన కాలము అది.

మద్రాసులో "జయా ఫిలిమ్సు" అనెడు ఆంధ్రుల చిత్రనిర్మాణశాల యొక్క నిర్మాణము జరిగినది. విశాఖ పట్టణములో "ఆంధ్రాసినీటోన్" అనెడు మరొక స్టూడియో నిర్మాణము జరిగినది. తమిళ చిత్రములో నటించిన ఆంధ్రుడగు వై. వి. రావును ఫిలిం బాలెట్ గౌరవించినది. మద్యపాన నిర్మూలనమునకు దోహద

మిచ్చెడు గృహలక్ష్మి యను సాంఘికచిత్రమును, మొదటి జానపద చిత్రమగు గులేబకావలియు నిర్మితములయినవి. వ్యావహారిక భాషను పురాణచిత్రములో ఉపయోగించి సి. పుల్లయ్యగారు "మోహినీభస్మాసుర" అను చిత్రమును సిద్ధపరచారు.

శారదా రాయలసీమ స్టూడియో నిర్మాణము జరిగి, పురిటిలోనె సంధిగొట్టిపోయినది. 1-8-1939 నుండి సినిమా టికట్లపై ప్రభుత్వము వినోదపు పన్ను విధించినది. సాంఘిక చిత్రాలు ఎక్కువగా వచ్చినవి. తారల గిరాకీ కారణముగా చిత్ర నిర్మాణ వ్యయము లక్ష రూపాయల వరకు పెరిగినది. 1939 లో పెట్టుబడి చాలినంత లేని సంస్థలు ఏర్పడి పెక్కు అగచాట్లపాలయినవి. కొన్ని సంస్థలు కాలగర్భములో లీనమైపోయినవి. సినిమా ఒక వ్యాపారము కాదు. అందులో మోస మెక్కువకలదు అనెడు భావము ప్రజలలో ప్రబలినది. దానితో పెట్టుబడి దారులు వెనుకకు తగ్గినారు.

1940 లో "బారిష్టరు పార్వతీశం" అను ప్రఖ్యాత నవలను అనుసరించి, సంపూర్ణ హాస్యచిత్ర నిర్మాణము జరిగినది. "చండిక", "కాలచక్రము" అను రెండు చారిత్రక చిత్రాలు వెలువడినవి.

యుద్ధము సినిమా పరిశ్రమపై దెబ్బతీయసాగినది. ముడిఫిల్ముకొరత ఏర్పడినది. యుద్ధనిధులకయి చిత్రాలు ఆడవలసివచ్చినది. యుద్ధప్రచార చిత్రములను తీయుడని ప్రభుత్వము నిర్మాతలను కోరినది. కర్మశాలా చట్టము సినిమాలకు వర్తింపచేయబడినది. ఆపరేటర్లకు అనుమతి పత్రము (లైసెన్సు) ఉండవలెనని, అది పరీక్షించి యివ్వబడునని ప్రభుత్వము శాసించినది.

చిత్రాలకుగూడ లాభాలు సరిగా రాలేదు. ప్లేబాకు పద్ధతి వచ్చినది. ఇది చిత్రమునకు ఎంతో మేలుచేసినది. ఇంతవరకు పాటను చిత్రీకరించుటగూడ మాటలను శబ్ద గ్రహణము చేసినట్టు చేసెడివారు. సెట్టుమీదనే వాద్య గోష్ఠికూడ ఉండెడిది. అయితే వాద్యగోష్ఠికి ఒకమైకు, నటునకు మరొక మైకు పెట్టి శబ్దగ్రాహకుడు సంయోగ పరచెడువాడు. అయితే, పరుగెత్తుచు, పాడుటకు వీలుండెడిదికాదు. అంతేగాక, నటులే పాడవలసివచ్చు చుండెను. అందరు నటులును పాడగలవారుగా నుండరు కదా! ఉన్నను సంగీతముమీద దృష్టి యుంచినపుడు నటనకు, నటనమీద దృష్టి యుంచినపుడు పాటకు లోపము జరుగుచుండెడిది. ఈ యిబ్బందులన్నియు ఈ 1940 నుండి తీరిపోయినవి.

ఈ కాలము నాటికి తెలుగులో సినిమా పత్రికయే లేదు. శ్రీ ఇంటూరి వేంకటేశ్వరరావు "చిత్రకళ" అను పేరుతో ఒక మాసపత్రికను ఆరంభించెను. అదే మన తెలుగు సినిమా పత్రికలలో మొదటిది.

1941—1942: 1941 లో వెలువడిన చిత్రములలో "మహాత్మాగాంధీ" అనునది మొదటి డాక్యుమెంటరీ చిత్రము. ఈ సంవత్సరమున చిత్రపరిశ్రమ యుద్ధము వలన పెద్దదెబ్బ తిన్నది. పెట్రోలు దొరకుట కష్టమైనది. ముడి ఫిలుము లభించుట కూడ కష్టమయ్యెను. సినిమా పరికరముల విషయములో ప్రభుత్వము ఎక్కువ ఆంక్షలు పెట్టినది. ప్రతి వస్తువు యొక్క ధర పెరిగి పోయినది. బర్మా, మలయా రాష్ట్రములను జపాను పట్టు కొనుటచే, అక్కడికి మన చిత్రాలను పంప వీలుకాకుండ నైనది. కులమత కలహాల వలన సినిమా చూచెడు ప్రేక్షకుల సంఖ్య సన్నగిల్లిపోయినది. వరదలు, గాలివానలు ఎక్కువైనవి.

ముడి ఫిల్ములకు కోటాసిస్టము వచ్చినది. అంతకు ముందు సంవత్సరాలలో చిత్రాలు తీయుచున్నవారికే చిత్రనిర్మాణమునకు ప్రభుత్వమునుండి అనుమతి లభించు చుండెను. అందువలన క్రొత్తవారు పరిశ్రమలోనికి రాలేక పోయినారు.

ఏ పౌరాణికకథనో తీసి నాలుగుపైసలు సంపాదించు కొనవలయుననెడు మనస్తత్వము నిర్మాతలకు ఏర్పడినది. అందువలన మరల ఈ రెండు సంవత్సరాలును పురాణ చిత్రాల యుగమయిపోయినది. అయితే, యుద్ధమువలన ప్రజల చేతులలో నాలుగు పైసలు ఉండుటచేత సంవత్స రాంతమునకు సినిమాప్రేక్షకలోకము ఎక్కువైనది.

నిజముగా చారిత్రకచిత్రమనునది 1942 లో వచ్చినది. అదియే "పత్ని". మొదటిసారిగా కవిజీవితమును ప్రతిపా దించు "పోతన" కూడ ఈ సంవత్సరమే వచ్చినది. చిత్రము నిడివి 11 వేలకు మించియుండరాదని మరల మరియొక ఆంక్ష వచ్చినది. దానితోపాటు ట్రైలర్లు గాని, ప్రచా

చిత్రాలు గాని తీయగూడదని ఆదేశ మిచ్చెను. 7-5-42 నాటికి పేపరు కంట్రోలు వచ్చినది. 23-11-42 నాటికి మద్రాసులో ఎలక్ట్రిసిటీ కంట్రోలు కూడ ఏర్పడినది. ఇన్ని ఇబ్బందులతో పరిశ్రమ ముందుకు త్వరగా సాగలేక పోయినది.

ఇంతవరకు నొకసారి సమీక్ష చేసి చూతము. ఇంత వరకు వెలువడిన చిత్రాలు 105. అందులో 75 చిత్రాలు పౌరాణికములు ; ఒకచారిత్రక చిత్రము. చారిత్రకముల వంటి చిత్రములు రెండు. 20 సాంఘిక చిత్రములు, 2 డాక్యుమెంటరీ చిత్రములు, చిల్లరమల్లర చిత్రాలు 5.

ఇంతవరకు తెలుగువారిపెట్టుబడి దాదాపు 75 లక్షలు. వచ్చిన రాబడి 50 లక్షలు. పోగా 25 లక్షల రూపాయలు నష్టము. తారలలో పురుషులకంటె స్త్రీలకు వేతనాలు అధికము. ఈ కాలమునాటికి సినిమాలమీద ఆధారపడిన తెలుగువాంధ్రకు భుక్తికి లోటులేకుండ పోయినది. పంపకము, ప్రదర్శనము (Exhibition), నిర్మాణము మున్నగు చిత్రశాలాశాఖలలో దాదాపు 25 వేల మంది తెలుగు వారు బ్రతుకుచున్నారు. స్టూడియోలు పెట్టిన తెలుగు వారికి కోలుకోలేనంత నష్టముఏర్పడినది. చిత్రనిర్మాణము లోను పెక్కు సంస్థలు తబ్బిబ్బులయినవి. పంపకదారులు గూడ పెక్కుమంది రంగము నుండి నిష్క్రమించినారు. నిపుణులగు శబ్ద గ్రాహకులు గాని, ఛాయాగ్రాహకులుగాని తెలుగువారు చాలినంత మంది లేకుండిరి. అంతటను బెంగాలీల ప్రాబల్యమే ఏర్పడినది. ఇంతవరకు సినిమా పరిశ్రమ చాలవరకు అనుభవ శూన్యులును, సంకుచిత భావములను విడువలేని వారును అయిన వ్యక్తుల చేతులలో ఉండిపోయినది.

1943-1945 : 1943 లో పరిశ్రమ దిగజారి పోయినది. తెలుగు నిర్మాతలు తమిళచిత్రాలు తీయ మొదలు పెట్టినారు. 9-10-43 నుండి చిత్రాలతోపాటు "అప్రువుడు ఫిల్ముల్ని" ఆడవలసి వచ్చినది. 1944 లో పరిశ్రమ యింకను దెబ్బతిన్నది. ఫిలిం ఛేంబర్ ఆలిండియా రేడియోతో ఒక ఒప్పందము చేసికొన్నది (7-8-44). దాని ద్వారమున సినిమా పాటను రేడియో వాడిన యెడల ఒక్కొక్క తడవకు ఒక రూపాయి చొప్పున లాభాంశము (royalty) నిర్మాతకు ఇచ్చుట జరుగసాగినది.

మొత్తము మీద ఈ మూడు సంవత్సరములు ఎక్కువగా చిత్రములు రాకుండుటకు కారణము ప్రభుత్వపు కంట్రోళ్ల వలన బాధయే కంట్రోళ్ళనన్నిటిని 14-8-1945 కు రద్దుచేసినను పరిస్థితులు చక్కబడక పోవుటవలన ప్రయోజనము లేకపోయినది. మద్రాసు ప్రభుత్వము డిప్లమాకోర్సొకటి నెలకొల్పి దానికై యొక పాలిటెక్నికు పాఠశాల పెట్టినది.

1946—1950 : ఈ అయిదు సంవత్సరముల కాలము జానపద యుగమని చెప్పవచ్చును. పరిశ్రమ కొంచెము బాగుపడెడు దారిలో పడినను, బాధలు తగ్గలేదు. ప్రభుత్వానుమతిపత్రముల పోకతో క్రొత్త నిర్మాతలు తల ఎత్తినారు. రెండవ ప్రపంచ సంగ్రామ వ్యవహారములో దేశము మునిగియుండుటవలన కొత్త చిత్ర ప్రదర్శనశాలల నిర్మాణము కాలేదు. మొదటిసారిగా ఆటవిక చిత్రము "వనరాణి" వెలువడినది. 1-10-1946నాటికి చిత్రముల నిడివిపైగల ఆంక్షను ప్రభుత్వము తొలగించినది. "ఆంధ్ర సినీ ఎంప్లాయీస్ అసోసియేషన్" అనెడు సంస్థ విజయవాడలో నెలకొల్పబడెను. ఇది సినిమా ఉద్యోగుల ట్రేడ్ యూనియన్.

1947 లో ఒక రూపాయకు 5 అణాల 4 పైసలు చొప్పున వినోదపు పన్ను ప్రభుత్వము తీసికొనసాగినది. నిర్మాణ వ్యయము మూడు మొదలు అయిదు లక్షల రూపాయల వరకు పెరిగిపోయినది. బ్రహ్మాండవిజయము సాధించుకొన్న "గొల్లభామ" తో జానపదాలవైపు నిర్మాతల దృష్టి మరలినది. కాంగ్రెసు పరిపాలనలో సెన్సారు నిబంధనలు కఠినమైనవి. ప్రభుత్వము ప్రకటించిన నిబంధనలకు కట్టుబడుటకు మొదట నిర్మాతలు కష్టపడినారు.

1948లో ద్రవ్యాభావముచేతను ముడిఫిల్ము సరిపడునంత లేకపోవుటచేతను పరిశ్రమ ప్రగతిచూపలేకపోయినది. తెలుగువారు "చంద్రా ఆర్ట్సు స్టూడియో" నిర్మించినారు గాని అది వెంటనే పడిపోయినది.

1949 లో తిరిగి "అప్రువుడు" ఫిలిములు ఆడవలసి వచ్చినది. A. (పెద్దలకు మాత్రమే) V (అందరకు) అనెడు యోగ్యతా పత్రములు సెన్సారు బోర్డు ఇయ్యసాగినది. చిత్ర ప్రదర్శనశాలలలో పొగ త్రాగరా దనెడు నిబంధన

యీ సంవత్సరమే ఏర్పడినది. ప్రభుత్వము మంచి చిత్ర ములకు బహుమతు లివ్వసాగినది. ప్రభుత్వము వారి యాజ్ఞ ప్రకారము విద్యాబోధన చిత్రాలను విద్యాల యములలో చూపుటకు అనుమతి పత్రములను (లైసెన్సు) పొంది కొందరు వ్యాపారము చేయసాగిరి.

1950 లో జానపద చిత్రము లనిన ముఖము మొత్తి నది. ఇంతలో "సంసారం" అను చిత్రము వెలువడినది. దానిమూలమున చేకూరిన లాభమునుబట్టి ఆ చిత్రములో పనిచేసిన వారందరి సంసారములును బాగుపడెను. దానితో నిర్మాతలకు "సాంఘిక చిత్రములు" లాభదాయకము లనెడు భావ మేర్పడినది. తెలుగు సంస్థయయిన శ్రీ రాజ రాజేశ్వరి ఫిలిం కంపెనీవారి "నవజీవన" అను తమిళ చిత్రమును ప్రభుత్వమువారు ఉత్తమ చిత్రముగా పరిగ ణించి దానికి ట్రోఫీని ప్రసాదించిరి. తెలుగులో మొదటి డబ్బింగుచిత్రము "ఆహుతి".

1951-1956 : 1951 లో ముడిఫిలుము ధారాళ ముగా దొరకసాగినది. ఎక్కువమంది చిత్రనిర్మాణ రంగ ములోనికి దూకినారు. జానపద చిత్రములు దెబ్బతిన్నవి. ప్రొజక్టర్లను ప్రతి పాఠశాల కొనవలయునని ప్రభుత్వము వారు ఆదేశించినను, కొన్ని పాఠశాలలుమాత్రమే కొనుట చేత ఒక లక్షరూపాయలవరకు ప్రదర్శకులకు నష్టము వచ్చినది.

1952 సినిమా పరిశ్రమకు మంచి ఉచ్చదశ. 1951 లో తీసిన చిత్రాలవలన నిర్మాతలకు కనకవర్షము కురిసినది. ఆ డబ్బు చూడగానే ఏమి చేయవలయునా అన్న స్థితికి వారు వచ్చినారు. క్రొత్త నిర్మాతలు ఎందరో రంగము లోనికి దిగినారు. మొయిలుచూచి చెరువుకట్ట తెగగొట్టు కొన్నట్లు పాతనిర్మాతలు విశేష ద్రవ్యమును వ్యయించి చిత్రనిర్మాణశాలలు కట్ట సాగించినారు. అట్లు వచ్చిన తెలుగు చిత్ర నిర్మాణశాలలు 1. భరణి. 2. నరుసు, 3. ప్రకాశ్, 4. రోహిణీ లు. అంతవరకు సహాయకులుగా నున్న వారికి ఉన్నతిని కల్పించి క్రొత్త నిర్మాణశాలలలో వారిని నిపుణులనుగా చేసికొన్నారు. ఎన్నో చిత్ర నిర్మా ణములు బయలుదేరుటతో క్రొత్త రచయితలు, నటీ నటులు, సాంకేతిక నిపుణులు రంగములోనికి ప్రవేశించి నారు. పంపకదారులు పరిశ్రమలో పాదుకొన్న వారికే డబ్బు పెట్టుచుండిరి. అందువలన, తక్కువ ధనముతో చిత్ర నిర్మాణరంగములోనికి దిగిననిర్మాతలకు ధనలోపము చేత చిత్ర నిర్మాణశాలలలో పని లేకపోయినది. పనివాం డ్రకు జీతాలు ప్రయాసమీద చిత్రనిర్మాణశాలాధిపతులు ఇయ్యవలసి వచ్చినది. పెరుగుట విరుగుటకొరకే అన్న సిద్ధాంతము నిజమయినది. సాంఘికములకే కొంత ధన లాభము ఏర్పడినది. కాని మొత్తముమీద ఈ సంవత్స రము చిత్రములు అంత విజయవంతములు కాలేదు.

స్త్రీ దర్శకత్వములో దక్షిణ హిందూస్థానము నందు బయలుపడ్డ చిత్రము "చండీరాణి". దానికి దర్శకత్వము వహించినది శ్రీమతి పి. భానుమతి. అందులోను ఒకేసారి మూడు భాషలలో నిర్మాణము సాగించినది. ఎక్కువగా డబ్బింగు చిత్రాలు బయటికివచ్చినవి. తెలుగువారు చాల మంది సాంకేతిక నిపుణులుగా తయారయినారు.

ఉపసంహారము : మొత్తముమీద సగటున సంవత్స రమునకు 35 చిత్రములు వచ్చినవి. 27-3-1955 నాటికి "ఆంధ్రా సినిమా రెగ్యులేటింగు యాక్టు" ప్రచురించినారు. 1956 నాటికి తెలుగువారి మద్రాసులో ఆరు స్టూడియో లున్నవి. భరణి, రోహిణి నరుసు, ప్రకాశ్, వీనస్, వాహిని అనునవి వానిపేర్లు వాహినిలో మాత్రమే లేబరేటరి ప్రోసెసింగులు ఉన్నవి జయా లేబరేటరి అనునదొకటి కలదు. ఆంధ్రులకు పం కపు సంస్థలు 57 వరకు ఉన్నవి. అందులో రెండ మూడు సంస్థలు పాశ్చాత్య చిత్రముల పంపకముకూ చేయుచున్నవి. ఒకటి 16 M. M. చిత్రముల పంపకమ చేయుచున్నది. విజయవాడ, గుంతకల్లు పంపకపు కేంద్ర లుగా నున్నవి.

ఆంధ్రులకు (1) ఆంధ్రసినీ ఎంప్లాయిసు అసో యేషను. (2) ఆంధ్రా ఫిలిం ఛేంబరు ఆఫ్ కామర్సు (3) పిల్లల చిత్రాలదర్శిని అనుసంస్థలు ఉన్నవి.

తెలుగులో పాతికపయిగా పత్రికలు సినిమా విష ములకు ప్రాముఖ్యము నిచ్చుచున్నవి. 1955 ను చిత్రపరిశ్రమకు మంచియోగము పట్టినట్టున్నది.

ఇప్పుడాంధ్రప్రదేశములో మూడువందల యిరువ పైగా ప్రదర్శనశాలలున్నవి. నూరు వరకు సంచరిం చిత్రప్రదర్శనశాలలు ఉన్నవి. 1918 కి పూర్వము జో

బయోస్కోపు షేడ్ సంచారము చిత్రప్రదర్శనశాలలను నడిపెడివారు. ఆరోజులలో ఇప్పటివలె డేరా లుండెడివి కావు. చుట్టును గుడ్డతెరమాత్రముండుచుండెను. తెరపైన మాత్రము చిన్న పందిరి ఉండెడిది. ప్రొజెక్టరులో ఆర్కు లాంపునకు బదులు కార్బైడులైటు ఉపయోగించెడు వారు. ప్రొజెక్టరు యంత్రము చేతితో త్రిప్పెడువారు. రెండు గ్యాసులైట్లు తెరదగ్గర పెట్టిపెట్టెడివారు. ఆట ఆరంభించుటకు ముందు ఆ రెండు లైట్లను పీపాలలోనికి దింపెడువారు.

1919 లో రఘుపతి వెంకయ్యగారు - ఇంజను డైన మోతో కూడిన సంచార చిత్రమును ఆంధ్రదేశములో ప్రథమ పర్యాయము ప్రదర్శించినారు.

సంచారచిత్రములకు ప్రభుత్వము అనుమతిపత్రములు, నిబంధనలు పెట్టుటతో కొంతవరకు ప్రదర్శన శాలాధిపతు లకు నెమ్మది చిక్కినది.

ఈ ప్రదర్శన శాలాధిపతులకు కొందరకు ఆంధ్రలో సర్క్యూట్లు ఉన్నవి. అవి :

1. ప్రసాద్ ప్రదర్శనసర్క్యూటు: వీరికివిశాఖపట్టణము, విజయవాడ, మచిలీపట్టణము, గుంటూరులలోహాలులుకలవు.

2. కాజ వెంకట్రామయ్య సర్క్యూటు : వీరికి విజయనగరము, ఏలూరు, గుడివాడ, రాజమండ్రులలో ప్రదర్శనశాలలు గలవు.

3. సెలెక్టు పిక్చరు సర్క్యూటు : ఈ కంపెనీవారికి విజయనగరము, విశాఖ పట్టణము, విజయవాడ, బందరు లలో ప్రదర్శనశాలలు ఉన్నవి.

4. నిడమర్తి సర్క్యూటు: వీరికి విజయనగరము, విశాఖ పట్టణము, రాజమండ్రులలో ప్రదర్శన శాలలు ఉన్నవి.

ప్రస్తుతము ఆంధ్రలో త్రై పరిమాణిక (Three dimensional) చిత్రాల ప్రదర్శనమునకు గాని, సినోరమాలకు గాని సరిపడెడు సినోరమిక్ తెర, కటకములు, పరికరాలు గల ప్రదర్శనశాల విజయవాడలో గల లీలామహాలే అది ప్రసాద్ సర్క్యూటు వారిది.

చిత్రనిర్మాతలు దాదాపు 40 మందికి పైగానున్నారు. తెలుగు చిత్రాలు నిర్మించెడు ఆంధ్రేతరసంస్థలు దాదాపు 15 వరకు నున్నవి.

సి. యస్. ఆర్.

వి. వి. యస్. ఎ.

**ఆంధ్రులు - చిత్రకళ :-** భారతీయులందరిలో ఆంధ్రులకు శిల్పాదికళలలో విశిష్టమైన స్థానమున్నది. మహోన్నతమైన కళాసంప్రదాయములకు ఆంధ్రదేశము నిలయము. భారతదేశమునకు కీర్తిని తెచ్చిన అజంతా, ఎల్లోరా, అమరావతి, నాగార్జునకొండ, లేపాక్షి మొదలైన కళాక్షేత్రములు ఆంధ్రుల ప్రతిభాపాటవపూరితమైన పంట మాగాణములు.

**ప్రాచీనయుగము :** మొదటి ఆంధ్రరాజులైన శాతవాహనులకాలములో ఇప్పటికి 2100 సంవత్సరముల నాడు అర్హతాచార్యు లనే బౌద్ధసన్యాసి అజంతా సంఘారామమును స్థాపించెను. వెనుకటి నిజామురాష్ట్రములోని (ఇప్పటి బొంబాయి రాష్ట్రములోని) ఔరంగాబాదు జిల్లాకు ఉత్తర సరిహద్దున అజంతా కొండలలో ఈ సంఘారామము ఉన్నది. అది ఒక మనోహర దృశ్యము. ఒక సన్నని కొండలోయలో వ్యాఘ్రనదీజలపాతము పడు చుండును. అర్ధచంద్రాకారముగా ఉవ్వెత్తున కోసిన కొండబడిలో గుహలు తొలువబడి చైత్యములు, విహారములు నిర్మింపబడినవి. ఇవి ప్రారంభింపబడినది మొదలు 900 సంవత్సరములవరకు మొత్తము 24 గుహలవరకు తొలువబడినవి. అవి శాతవాహనులు మొదలు చాళుక్యుల వరకు ఆయారాజుల పాలనలలో ఆంధ్రచిత్రకళాలక్ష్మికి కొలువుకూటములై విలసిల్లినవి. ఇప్పుడు చిత్రలేఖనము 1, 2, 16, 17 విహారాలలోను, 9, 10 చైత్యాలలోను ఉన్నది. ఈ గుహలలోని చిత్రములు తిలకించినప్పుడు చూపరులు ముగ్ధులగుట నిక్కము. చిత్రకారులకు అజంతా క్షేత్రము కాశీవంటిది!

అజంతా, ఆంధ్రచిత్రకళకు ప్రారంభమనుకొనినను అది చిత్రకళారచనలో ప్రథమ ప్రయత్నము ఎంత మాత్రము కాదు. అజంతా చిత్రములలో చిత్రకళ పరాకాష్ఠ నందుకొన్నది.

ఈ చిత్రములలో బలియమైన నిర్మాణ కౌశలము అంతట ప్రదర్శితమై ఉన్నది. ప్రాదేశిక నిర్మితిలో, రంగుల కూర్పులో రేఖల బిగువులో అజంతా చిత్రములు అద్వితీయములు.

అజంతా చిత్రములలో ఇంకొక విశేషమున్నది. ఆ చిత్రకారులు సమస్త జీవజాలము యొక్క పర్యాయాలు

ఆ గుహాకుడ్యాలపైన అపురూపమైన కళాసంపత్తితో, రసస్ఫూర్తితో చిత్రించివేసిరి. తరువాత వచ్చిన మహాయాన బౌద్ధములో అజంతా చిత్రకారుని రెక్కలు నిజముగా విడివడి అనంతపథవిహారముచేసినవి. అంతవరకు హీనయానములో 4 శతాబ్దులవరకు తూష్ణీం భావమును వహించియున్న చిత్రకారుడు ఒక్కసారి తనచుట్టునున్న సుందర ప్రపంచము నంతను అవలోకించెను. రమణీయ పరిసరస్థ ప్రకృతినంతయు తన కళాలోకములో దివ్య కాంతుల మిలమిలలాడించినాడు. వ్యవసాయ దృశ్యములు, మహానగరములు, పల్లెలు - తోటలు, కమలాకరములు - వీటిని ఒక మహాకావ్యముగా సృష్టించివేసినాడు. లేళ్ళు, గుఱ్ఱాలు, ఏనుగులు, హంసలు, కోతులు, పక్షులు, మున్నగున వన్నియు జీవకళలూరుచు చిత్రకారుని ప్రతిభచే దృశ్యములయ్యెను. పూలకారుగా విరిసిన ఇట్టి చిత్రసముస్మేషమును తిలకించియే సర్ విలియమ్ రోథెన్‌స్టైన్ ప్రాపంచిక సౌందర్యములోనుండియే అతిలోకమైన ఆధ్యాత్మిక సత్యసౌందర్యమును చూపింపగలిగెడు భారతీయ చిత్రకారులశక్తి అజంతా గుహలలో సందర్శింపగలిగినా నని అన్నారు.

స్త్రీపురుష శరీరావయవాలలో మిలమిలలాడే తారుణ్యము, వన్యమృగాలలో తూగాడే వపు, బలుపు, పూవులలో పక్షులలో వెల్లివిరిసిన పావిత్ర్యము, లావణ్యము అజంతా చిత్రకారులు అతిలోకముగా చిత్రించినారు. రంగుల రాళ్ళతో తయారుచేసికొన్న కొలదిపాటి రంగులతో, తాము కట్టుకొనిన తూలికలతో అంత లోకాద్భుతమైన చిత్రసంచయము సంతరించగలిగినా రన్నచో ఆ చిత్రకారులు మహాసమర్థు లని చెప్పవలెను. బుద్ధుని జీవితము, జాతక కథలేకాక సమస్త చరాచర ప్రకృతిని ప్రతిబింబించు అలంకార, భావ, కథాచిత్రప్రపంచము, లోకోత్తరముగా, అజంతాగుహలలో విన్యసించబడి ఉన్నది.

చిత్రలేఖనము పల్లవులకాలములో నరసింహవర్మ కట్టించిన గుళ్ళవిండ ఉండుచుండెను. అయితే అదంతయు కాలగర్భమున మునిగిపోయినది. కాని పల్లవ చిత్రలేఖనము నేటికిని "సీతన్న వాసలు" అను గుహాలయందు చూడగలము. ఆ గుహాలు పుదుకోట్టై సంస్థానములో ఉన్నవి. అందలి చిత్రలేఖనము అజంతాకు అనుగుబిడ్డ. ఈ చిత్రములు కొన్ని నూతన లాలిత్యమునుకూడ పుణికి పుచ్చుకొన్నవి.

పుదుకోట్టైదగ్గరనున్న సీతన్న వాసలు అను గుహాలు పల్లవరాజైన మొదటి మహేంద్రవర్మ (600-625) కాలము నాటివి. గుహాలయము పైకప్పున నిలచిఉన్న "పద్మసరోవరము" అత్యుత్తమ చిత్రము. అందు పద్మాల మధ్య చేపలు, హంసలు, మహిషములు, ఏనుగులు, ముగ్గురు పద్మపాణులైన గంధర్వులు చిత్రింపబడినారు. స్తంభాలమీద అచ్చరలేమల చిత్రాలు ఉన్నవి. ఒక దేవదాసి చిత్రము, అర్ధనారీశ్వర చిత్రము గలవు.

ఎల్లోరా కైలాసనాథ దేవాలయము అంతయు చిత్రలేఖనముతో నిండి ఉండినది. దానికి వేసిన వెల్లక్రింద అది మరుగుపడి ఉన్నది. ఈమధ్య నైజాము ప్రభుత్వము కృషి ఫలితముగా వెల్లక్రింద అణగిఉన్న ఈ చిత్రములు బయటపడ్డవి. కాలక్రమముగా వచ్చిన లావణ్యము ఈ రచనలలో గోచరించును.

ఎల్లోరాలో కైలాసనాథ దేవాలయము పైకప్పు మీదనే చిత్రాలున్నవి. దీనిని రాష్ట్రకూటుడైన రెండవ కృష్ణుడు 757-783 సంవత్సరాలమధ్య నిర్మించినట్లు చరిత్రకారుల యభిప్రాయము. ఈ కృష్ణరాజునకు కుష్ఠరోగమువచ్చి ఎల్లోరావద్దనున్న ఒక నూతిలోని నీటిని సేవించగా వ్యాధి నయమయిన దట. ఆ సందర్భముగా శివభక్తుడైన ఆరాజు కైలాస దేవాలయమును నిర్మించుటకు పూనుకొన్నాడట!

ఈ నిర్మాణమునకు అజంతా, మహాబలిపుర శిల్పుల వంశ్యులైన ఆంధ్ర శిల్పులను రావించి కైలాస పర్వత సౌందర్యానికి ఏమాత్రము దీటుపోని ఒక శిల్ప కైలాసమును కృష్ణరాజు నిర్మింపించెనట. ఎల్లోరా ఆంధ్రశిల్పులు, అజంతా శిల్పులకు చిత్రలేఖన ప్రావీణ్యమున ఎంతమాత్రము తీసిపోవువారు కారు అని కీ. శే. అడవి బాపిరాజుగారు వచించిరి.

మధ్య యుగము : బౌద్ధవిహారములు, దేవాలయముల లోనే కాక జనసామాన్యమునకు విజ్ఞానమును, వినోదమును సమకూర్చుటకు రాజమందిరాలలోను, నగర మధ్యమందును మేలురకముచిత్రములు సేకరించబడి ప్రదర్శించబడుచుండెడివి. నాగరకులలోని పెద్దలు, సామంతులు,

ధనికులు విలువైన చిత్రములతో గృహములను అలంకరించుకొనుచుండిరి. వాటిని చిత్రాగారము లనుచుండిరి. రాణివాసమునందు శయనాగారములందు చిత్రము లుండెడివి. స్నాన గృహములందు, సూతికా గృహము లందును, కళాఖండములను అలంకారములుగా నుంచుకొనుచుండిరి. గృహములలో శృంగార, హాస్య, శాంతరస సూచకములయిన చిత్తరువు లుండెడివి. నగరులలో, రాజప్రాసాదములలో, వేటకు, యుద్ధమునకు, రాసలీలకు, పానగోష్ఠికి సంబంధించిన చిత్రములు పలురకములవి ఉండెడివి. ఆనాటి నాగరక జీవనము, రసికత, చిత్రకళ, క్రీడాభిరామము మొదలైన గ్రంథములలో కనిపించుచున్నవి.

ప్రతాపరుద్రుని ఆస్థాన నర్తకియైన మాచల్దేవి చిత్రశాలలో శివుని దారుకావన విహారము, వాణీ చతుర్ముఖులు, గోపికాకృష్ణులు, అహల్యాపురందరులు, తారాచంద్రులు, దాశకన్యాపరాశరులు, మేనకావిశ్వామిత్రులు మొదలైన చిత్రము లుండెను.

ఉ. "తియ్యని వింటిజోదు రతి
దేవి చనుంగవ నొత్తిగిల్లి రొ
మ్ముయ్యాన వంక చక్కఁబడ
నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్
మయ్యెర వ్రాసెఁ జిత్తరువు
మాఁగిలి మాఁగిలి; చిత్రకారుడా!
దయ్యముగాక; నీవిపస
దానము టిట్టిభ! వీనికేఁ దగున్॥"

అని రతీమన్మథులను రచించిన చిత్రకారుని మలచన శర్మ అనువాడు ప్రశంసించినట్లు క్రీడాభిరామములో వర్ణితమైనది. తత్కర్తయగు శ్రీనాథుడు 15వ శతాబ్దివాడైనను, క్రీడాభిరామమునకు మాతృకయైన ప్రేమాభిరామమును వ్రాసిన సంస్కృత కవి, ఓరుగల్లు ప్రాభవమును కన్నులార చూచియున్నవాడుగనుక, క్రీడాభిరామములో అభివర్ణితమైన విషయములు యథార్థములుగ తీసికొని గ్రహింపవచ్చును.

ఆనాడు నాట్యశాలలందు మనోహరమైన చిత్తరువులు అమర్చబడి ఉండెడివి. రాయల రాజధాని యగు విజయనగరమున నాట్యశాలలను వర్ణించుచు అబ్దుల్ రజాక్ ఈ విషయములు పేర్కొని యున్నాడు. రాజకుమారులయు, రాజకుమారికలయు తస్వీరులు చిత్రకారులు చిత్రించుచుండిరి. వీటివల్ల వివాహములు కూర్చుట జరుగుచుండెను.

పింగళి సూరన రచించిన ప్రభావతీ ప్రద్యుమ్నములో కథకు జీవమైన ఒక చక్కని సన్నివేశము కలదు. రాక్షసరాజైన వజ్రనాభుని కుమార్తె కలలో, పార్వతీప్రత్యక్షమై సంకల్పమాత్ర తక్షణ సన్నిధాపితంబగు చిత్రఫలకంబు నందు నొక్క పురుషు ప్రాయంపువాని వ్రాసి, "ఇతండ నీ వల్లభుండు", అని చెప్పి యా చిత్రఫలక మిచ్చి అంతర్థాన మందెను, అంత నా ప్రభావతి చెలికత్తియతో నా వృత్తాంతము చెప్పి చిత్రఫలకము చూపును. అప్పలక పావడ యెడలించి—

"కలకల నవ్వినట్లు, తెలికన్నుల నిక్కమచూచినట్లతో
బలుకఁ గడంగినట్లు, కడు భావగభీరత లబ్బినట్లు, పెం
పొలయఁదనర్చి జీవకళ యుట్టిపడన్ శివవ్రాసినట్టియా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను
బోటియున్."

పోతన భాగవతమున ఉషాపరిణయమున చిత్రరచనా విధానముకూడ వర్ణింపబడినది. "ధళధళ మెఱుంగులు దుఱంగలిగొను పటంబు నావటంబుసేసి వజ్రంబున మేదించి, పంచవన్నియలు వేరువేరు కనక రజత పాత్రంబులనించి, కేలం దూలిక ధరించి—" చిత్రరేఖ రచన కుపక్రమించును. ఈ విధానము పశ్చిమ చాళుక్యరాజగు సోమేశ్వరుడు రచించిన అభిలషితార్థ చింతామణిలో రంగులు, కుంచెలు, వాటి ఉపయోగ పద్ధతులు వర్ణితము లయినవి. గోడలమీద, పలకలమీద, పటములమీద చిత్రరచనలు చేసెడివారని చెప్పబడినది.

వ్యక్తిగతమైన ఒకదేవతామూర్తిని ఆరాధించుట యనునది మానవ సహజమైన ప్రవృత్తి. అది హిందూమతములోనేకాక బౌద్ధ, జైనమతములలోకూడ గలదు. బౌద్ధములో మౌర్య, సంగ, పూర్వాంధ్ర యుగములలో గొప్పమార్పులు వచ్చినవి. హీనయానములో బుద్ధుడు మహా సంబుద్ధియై నిర్వాణముచెందిన ఒకవ్యక్తి – అంతే! తరువాతవచ్చిన మహాయానములో బుద్ధుడు ఒక ధర్మానికి ఆదర్శమూర్తియై అవతరించి మానవులకు ఎంతగా

ఆరాధనీయులై నాడో తరువాత చిత్రాలలో అజంతాలో చూడవచ్చును.

బుద్ధుని పూర్వజన్మములకు సంబంధించిన ధ్యాని బుద్ధులును, వారి సంతతికి చెందిన బోధిసత్వులును, తారాదేవి మొదలైన స్త్రీ దేవతలును ఉపాస్యమూర్తులైనారు. వీరుగాక హిందువుల బ్రహ్మ, ఇంద్రుడు - యక్షులు, నాగులు, బౌద్ధములో చేర్చబడినారు. వీరందరు విశిష్టమైన రూపాలతో ఉపాసించబడుచు వచ్చినారు.

బౌద్ధము తరువాత శైవము,వైష్ణవము ప్రాముఖ్యాము వహించినవి. శైవ, వైష్ణవ సామరస్యముకోసము సృష్టించబడిన హరిహరదేవుడుకూడ చిత్రాలలో స్తుతించబడినాడు.

అనంతపురం జిల్లాలో, హిందూపూరుకు 7 మైళ్ళ దూరములో లేపాక్షి అను గ్రామమున ఒక పెద్ద వీరభద్రాలయము ఉన్నది. ఆ గుడి పైకప్పుమీద, గోడలమీద చక్కని చిత్రములు ఉన్నవి. అవి విజయనగర చిత్రకళకు చక్కని తార్కాణములు. శైవ, వైష్ణవ గాథలు చక్కని దేశీయమయిన ఫక్కిలో చిత్రితమై ఉన్నవి. విజయనగర రాజుల వైభవము ఈ చిత్రములలో చూడగలము. పూవులు, లతలు అల్లిన రకరకములగు చీరలు, ఆభరణములు, కేశబంధములు రాయలనాటి తెలుగువారి నాగరకత యావత్తు కన్నులకు కట్టినట్లు ఈ చిత్రములలో చూడగలము.

లేపాక్షిలో హరిహరమూర్తి చిత్రము ప్రసిద్ధము. అందు గల కిరాతార్జునీయము నందలి కొన్ని ఘట్టములను అద్భుతముగా చిత్రించినారు. వాటిలో కిరాత వేషములో పరమశివుడు ఎరుకలతో వేటకువచ్చు చిత్రము చాల చక్కనిది. బోయజాతికి చెందిన స్త్రీ పురుష చిత్రములు, లేళ్ళు, అడవి పందులు—అవి ప్రాణభీతితో పరుగిడుచున్న ఆటవిక పరిసరములు చక్కగా చిత్రించినారు. తన బిడ్డ రాకుమారుని రథచక్రములక్రింద నలిగిపోగా రాజుగారితో మొరపెట్టుకొన బోవుచున్న గోమాత చిత్రము కరుణరసాత్మకమయినది. గోమాత రాజప్రాసాదము తలవాకిట గంట మ్రోగించుట మొదలు శివుడు ప్రత్యక్షమై వరము లొసగుటవరకు గల గాథను ఎంతో చక్కగా చిత్రించినారు.

శివపార్వతుల ప్రణయ చిత్రము మరియొక గొప్ప చిత్రము. శివుని ప్రక్కన పార్వతి శ్వేతవసన ధారిణియై సర్వాభరణ భూషితయై శయ్యపై నాసీనయైనది. చందనమును, తాంబూలమును పార్వతీ పరమేశ్వరులకు పరిచారికలు అందించుచుందురు. వింజామరలు విసరుచు ఇద్దరు పరిచారిక లున్నారు. వారి వస్త్రధారణము, అలంకరణము ఆకర్షకములుగా ఉన్నవి. వారి కొప్పులు, చీరలు, ఆభరణములు, చక్కని రేఖలలో, రంగులలో విన్యసించబడినవి. ఇవిగాక మునివాటికలో శివుని భిక్షాటన చిత్రము కాలభైరవస్వామి చిత్రము, దేవర్షి భక్తగణ పరివృతుడయిన హరిహరనాథుని చిత్రము అత్యంత మనోహరములు. దేవాలయ నిర్మాతలగు విరుపణ్ణ సోదరుల రూపచిత్రములు ఆనాటి రూపరచనకు చక్కని ఉదాహరణములు. మాచెర్లవద్ద దద్దళముమీద నున్న దశరథుని పుత్రకామేష్టి యాగము మొదలగు వానికి సంబంధించిన చిత్రములు కలవు. లేళ్ళు, నెమళ్ళు మొదలయిన అలంకార చిత్రములు గలవు. ఇచ్చట గాలికి, వానకు రూపరిపోవుచున్న ఈ చిత్రములలోని రంగులు పోయియున్నను చిత్రకారుడు వివిధ స్థాయులలో లోపల రచించిన రేఖలమూలమున అతని ప్రజ్ఞ ద్యోత మగుచున్నది. ఆ చెరగిపోవుచున్న రేఖలతో మాచెర్లలో నున్న వీరభద్రాలయము పైకప్పునకూడ ఆనాటి చిత్రములుకలవు.

అర్వాచీన యుగము : మొగలు సంప్రదాయము దక్షిణాపథమునకు వచ్చిన క్రొత్తదినాలలో కొండపల్లి, తంజావూరు, మధురలలోని ఆంధ్ర చిత్రకారులు ఆ పద్ధతిలో జాతీయ రచనా విధానమును కలిపి ఒక క్రొత్త సంప్రదాయమును సృష్టించిరి. ఆ రకము చిత్రములు మద్రాసు మ్యూజియములోను, బందరు ఆంధ్రజాతీయ కళాశాలలోను కలవు. నెలలను, తిథులను, ఋతువులను ధ్యానశ్లోకముల నాధారముగా గైకొని రచింపబడిన వాటి అధిదేవతల మూర్తులను ప్రతిపాదించు తంజావూరు చిత్రములు సుప్రసిద్ధములు. నాయకరాజుల కాలములో మధుర దేవాలయములో వెలసిన చిత్రాలు ఈ నాటికిని కలవు.

జనపదాలలో, పట్టణాలలో, రామాలయాలలో, రచ్చసావిళ్లలో స్థానికముగా కులవృత్తిగా చిత్రరచన చేసెడి



నందిపూజ - దామెర్ల రామారావు



చిత్రకారిణి : వినుపాటి సీతాదేవి



దొంగసన్యాసులు - వి. మధుసూదనరావు



యాత్రికుడు-అచంట జానకిరాం



గణేశ్వరాలంకరణ-వి. విజయలక్ష్మి



గౌరీ హిమవంత-మొక్కపాటి కృష్ణమూర్తి

ముచ్చిలు, జీనిగర్లు క్షచక్కని చిత్రాలు భారత భాగవత రామాయణాలలోని గాథలు చిత్రించుచునుందురు. నేటికీ చేర్యాలలోను, (జనగామ తాలూకా) వేములవాడలోను కాకిపడగలవాండ్ల పటాలు, కాటమరాజు కథకు సంబంధించిన బొమ్మలు, పెద్దమ్మలవాండ్ల బొమ్మలుచేసి వాటిపై రంగువేయు సంప్రదాయ చిత్రకారులు గలరు. నేటికిని తోలుబొమ్మలను చిత్రించువారు గలరు.

బందరు కలంకారీలు, కొండపల్లినకాషీలు, దేవాలయపు తెరలమీద చిత్రించిన శైవ, వైష్ణవ గాథలు హృద్యములుగా ఉండును. పేకముక్కలపై దశావతారముల బొమ్మలు కూడ చాల ప్రసిద్ధములు. నిర్మల (ఆదిలాబాదు జిల్లా) లో దక్కను చిత్రకళా సంప్రదాయము నేటికిని జీవించియున్నది. కాని ఆంగ్ల పరిపాలనలో ఈ కళలకు ప్రోత్సాహము, గౌరవము పోయి ఆ వృత్తులు నశించి పోయినవి.

నవ్యయుగము : మరల ఈ శతాబ్దారంభములో దేశ పరివ్యాప్తముగా వచ్చిన దేశీయోద్యమము ఫలితముగ దేశీయమైన కళలు తేరుకొన్నవి. పూర్వ సంప్రదాయములు పునరుద్ధరింపబడి చిత్రకళ కొక క్రొత్తవికాసము కలిగినది. బెంగాలులో అవనీంద్రుని కృతముగ తీసికొని రాబడిన ఈ కళాచైతన్యమును మొట్టమొదట ఆంధ్రదేశమున విరియించిన గౌరవము బందరు ఆంధ్రజాతీయ కళాశాలకు దక్కినది. శ్రీ ప్రమోదకుమార ఛటోపాధ్యాయుల అంతేవాసిత్వమున కొందరు యువచిత్రకారులు కళాదీక్షను కైకొనిరి. అడివి బాపిరాజు, కవుతా ఆనంద మోహనశాస్త్రి, రామమోహనశాస్త్రి, గుఱ్ఱం మల్లయ్య మొదలైనవారు అక్కడ తయారయినవారే. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు తమ సమీక్షావ్యాసముల ద్వారా ఉత్తమ భారతీయ కళాధర్మములు వివరించి, ఈ ఉద్యమమునకు మూలపురుషులయినారు. అజంతా సంప్రదాయ జనితమైన రేఖావిన్యాసములతో, అలంకారయుతమై, భావప్రధానమైన చిత్రములు ఇచ్చట తయారయినవి. బాపిరాజుగారి రేఖా చిత్రములు, కవుతా సోదరుల పెనిసిలు, ఎచ్చింగ్ రూపచిత్రములు ప్రసిద్ధములు.

ఆ రోజులలోనే గౌతమీ తీరాన రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో ఓస్వాల్డు కూల్డ్రే దొర ప్రిన్సిపాలుగా ఉండెడివాడు. ఆయన 'ఆంధ్ర సంప్రదాయములన్నను, ఆంధ్ర సంస్కృతి అన్నను పరమ పవిత్రముగా ఎన్నుకొనెడు కళాతపస్వి. ఆయన తన కాలేజీ విద్యార్థుల లేత హృదయాలలో జాతీయమైన ఈ భావములు నాటెను. ఆయన కవి, చిత్రకారుడు, కథా రచయిత. ఈమూడు ప్రక్రియలలో అతడు తన శిష్యులను ప్రోత్సహించినాడు.

చిత్రకారుడుగ ఆయన భుజమెక్కినది- కీ. శే. దామెర్ల రామారావుగారు. అతడు బొంబాయి చిత్రకళాశాలలో ప్రశంసనీయుడుగా ఉత్తీర్ణుడయి, భారతదేశము నందలి వివిధ కళాక్షేత్రములు సందర్శించుకొని, కలకత్తాలో వంగీయ చిత్రకళా ఫక్కికలు కూడ అవగాహన చేసికొని 1922 లో రాజమండ్రి చేరుకొన్నాడు. కళావిధానాలలో ఉన్న బాగోగులు చక్కగా ఆకళింపు చేసికొన్నవాడు గనుక తన వ్యక్తిత్వము, అనుభూతి, ఆంధ్రత్వము వెల్లివిరియు విధముగా ఒక క్రొత్తపంథాను అతడు ఏర్పరుచుటకు ప్రయత్నము చేసెను. 1922 లోనే "ఆంధ్ర చిత్రకళాశాల"ను స్థాపించి పలువురు యువకులను చిత్రకళా దీక్షితులను చేసెను. వారి కళాకృషి దేశములోను, ఖండాంతరములలోను ఖ్యాతి నార్జించుకొనెడు రోజులలో 1925 లోనే ఆయనకు అకాలమృతి సంభవించినది. ఆయనకు అప్పుడు 27 సంవత్సరముల వయస్సు. రామారావుగారు ప్రాక్పశ్చిమ సంప్రదాయములను సమన్వయముచేసి ఒక సంప్రదాయమును సృష్టించుటకు ప్రయత్నముచేసి ఆ మూడు సంవత్సరముల స్వల్ప వ్యవధిలో చాలవరకు కృతకృత్యులయిరి.

నిత్యజీవితము, చరిత్రలు, పురాణములు - వీటినుంచి రామారావుగారు విషయము తీసికొని నీటిరంగులతోను, నూనెరంగులతోను విస్తృతముగా చిత్రరచన చేసినారు. ఒక గురువు తీర్చిన బాటలోగాని, అనుశ్రుతమైన ఒక సంప్రదాయములోగాని గొప్ప చిత్రములు చిత్రించుట అంత విశేషముగాదు. తానుగా ఒక పద్ధతిని సృష్టించుకొని పలువురకు ఆదర్శప్రాయమైన ఆ సంప్రదాయమునకు మొనగా నిలువగలుగుట ప్రతిభా విశేషము - రామారావుగారు విశిష్టమైన ఒక ఆంధ్ర చిత్రకళా సంప్రదాయమునకు మూలపురుషుడు. రామారావుగారి శిష్యులలో వరదా వెంకటరత్నము, చేమకూర సత్య



కౌసల్య - పిలకా లక్ష్మనరసింహామూర్తి



గురుత్వము - సయ్యద్ బిన్ మహమ్మద్



మురళీగానము - దామెర్ల సత్యవాణి



ఏకాకిని - కొండపల్లి శేషగిరిరావు



జలవహనము - కె. రాజయ్య



గాజులబిత్తు - వి. శ్రీనివాసులు



గొడుగులు - టి. వెదిగాజు

నారాయణ, భగీరథి, దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ, సత్య వాణి మొదలైనవారు ఆతని సంప్రదాయము కొన సాగించినారు. వరదా వెంకటరత్నంగారు రామరాయ చిత్రకళాశాల అనుదానిని స్థాపించి నడుపుచున్నారు. భగీరథిగారు నీటిరంగులతో చిన్న చిన్న ప్రకృతి చిత్రములు రచించుటలో సిద్ధహస్తులయిరి.

వీరి సమకాలికులుగా భీమవరములో అంకాల వేంకట సుబ్బారావుగారు, పెనుగొండలో సి. యస్. వెంకట్రావు గారు, వి. ఆర్. చిత్రాగారు పేర్కొనతగినవారు. వి. ఆర్. చిత్రాగారు కుటీర పరిశ్రమలలో ప్రత్యేకముగా కృషిచేసిరి. వీరును, తేజోమూర్తుల కేశవరావుగారును, శాంతినికేతనములో చిత్రకళాభ్యాసము చేసిరి. కేశవరావు గారి దారుచిత్రములు (woodcuts) సుప్రసిద్ధములు.

ఇంతలో మద్రాసు చిత్రకళాశాలలో శ్రీ దేవీ ప్రసాద రాయ చౌదరిగారు ప్రిన్సిపాలుగా వచ్చిరి. రాయచౌదరి గారు ప్రాక్పశ్చిమ కళా సంప్రదాయములకు ప్రతినిధి. ఆయన తన శిష్యులకు ఆత్మ వ్యక్తీకరణములో చక్కని కళాభినివేశమును కలిగించి స్వేచ్ఛనిచ్చిరి. అక్కడ తయా రయినవారి చిత్రములలో జాతీయమైన తూగు, గాఢమైన కళా సంపత్తి, వస్తు వైవిధ్యము, స్వేచ్ఛ ప్రబలముగా నున్నవి. ఆయనయొద్ద సయ్యదు అహమ్మదు, సంఘం లక్ష్మీబాయి, మాధవపెద్ది గోఖలె, నారాయణరావు, మొక్కపాటి కృష్ణమూర్తి, పిలకా నరసింహమూర్తి, శ్రీనివాసులు, ఎ. పైడిరాజు, రామగోపాలు మొదలైన వారు చిత్రవిద్య నభ్యసించిరి.

శ్రీనివాసుల చిత్రములు జానపదరీతిలో ఒక సౌలభ్య మును గడించినవి. పిలకా నరసింహమూర్తి చిత్రములలో జానపదచ్ఛాయలున్నను అవి పౌరాణికముల వైపునకే మొగ్గును. మొక్కపాటి కృష్ణమూర్తి చిత్రములు పౌరా ణికమైన పరిధిలో నిలిచి నిత్యజీవనచ్ఛాయలు ప్రతిబింబించు చుండును. ఈయన తోబుట్టువులు పినుపాటి సీతాదేవి, పిలకా విజయలక్ష్మి, కవుతా స్వరాజ్యలక్ష్మి అనల్పమైన కృషిచేసి, చిత్రకళా లక్ష్మికి క్రొత్త ఒయ్యారములు కూర్చిరి. వీరుగాక స్త్రీచిత్రకారిణులలో రత్నాల కమలా బాయి, తుంగల లక్ష్మీదేవి, యమ్. నాగేశ్వరీబాయి గణ నీయలు. స్వయంకృషివల్ల స్వతంత్రముగ చిత్రకళ నభ్యసించి, అచంట జానకిరామ్, కూచి భాగేశ్వర శర్మ చక్కని చిత్రములు రచించిరి.

తెలంగాణములో ఈనాడు జరుగుచున్న చిత్రకళా కృషి ప్రత్యేకముగా ఎన్నదగినది. హైదరాబాదు పట్ట ణము అటు ఉత్తరాది-ఇటు దక్షిణాది నాగరకతలకు ఆట పట్టు. అందువలన ఆ రెండు నాగరకతల సమన్వయము వలన ఏర్పడు చక్కని సంస్కారము అక్కడి చిత్రకారుల కృషిలో సమున్మేషము చెందిఉన్నది.

తెలంగాణములో కొండలు, దుర్గములు, శిథిలములైన పురావైభవ చిహ్నములే అడుగడుగునను కనుపించును. రాళ్లుకావు, అవి రత్నము లనెదను. కొండలు చేరువౌ తున్న కొలది వాటి హృదయ స్పందములు గుండెలలో ముదురుకొనుచున్న కొలది గట్టు, కన్నము ఎరుగని మెట్ట పొలాలలో జొన్నపైరు బంగరు విస్తీర్ణాలు చూచినకొలది చూపులలో, తలపులలో, అంతస్సులో ఏదో వింతమార్పు వెల్లివిరిసివచ్చును. ఆ పరిసరాలలో నిత్యము వసించెడు కళాశీలికి ఆ దృశ్యములు ఎంత ఉత్తేజము నిచ్చి, చిత్ర నిర్మాణమునకు ఉన్ముఖుని చేయునో ఊహించలేము. అక్కడ ప్రముఖ చిత్రకారుడైన కొండపల్లి శేషగిరిరావు గారి 'రాయగిరి కొండలు' అన్న చిత్రము చూచినచో ఆ ప్రదేశాలలో తిరుగుచున్నట్లే అనిపించును. శేషగిరిరావు గారు హైదరాబాదు చిత్రకళాశాలలో చిత్ర విద్య నేర్చు కొని, ఒక సంవత్సరము శాంతినికేతనములో కూడ ఉండి వచ్చిరి. వారి చిత్రములలో ఆ ఛాయలు కనిపించును. తరువాత చీనా పద్ధతిలో ఆయన చాల చిత్రములు రచిం చిరి. కొండకొమ్మున కూర్చున్న 'కోతులు', వారి 'కాకులు' అందుకు చక్కని ఉదాహరణములు. వీరితో పాటు ఆ కళాశాలలో తయారయినవారు వి. మధుసూదనరావు కె. రాజయ్య, సయ్యద్ బిన్ మహమ్మదు ముఖ్యులు రాజయ్యగారి చిత్రములలో-జానపద శైలిలో-"గృహిణి" మొదలైనవి చక్కని ఉదాహరణములు. మధుసూదన రావు గారి 'సోదె' పల్లెజీవనమునకు చెందిన చక్కని చిత్రము. సయ్యద్ బిన్ మహమ్మదుగారు రూపచిత్రణలో సిద్ధహస్తులు.

వీరుగాక బొంబాయి చిత్రకళాశాలలో విద్యాభ్యా సము చేసివచ్చిన పి. తిరుమలరెడ్డి, దీవదయాళ్ నాయుడు

మొదలయినవారు చాల గట్టివారు. తిరుమలరెడ్డి ఆ కళా శాలలో ఛార్లెసు జెరార్డ్ (Gerard) ప్రిన్సిపాలుగా ఉన్నప్పుడు వారిచెంత కళ నుపాసించిరి. ఆయన ప్రచురించిన 'చిత్రవృంతము' (Album) చూచినప్పుడు ఆ కళాశాలలో ఇయ్యబడిన ఉత్తమ శిక్షణము బోధపడుచున్నది. గురు శిష్యులకు ఎట్టి సంబంధము ఉండెడివో జెరార్డుగారు వ్రాసిన తొలిపలుకులో తెలియుచున్నది. రెడ్డి, పాశ్చాత్య ఇంప్రెషనిస్టుల వర్ణవిన్యాసమును అలవర్చుకొన్నారు. బొంబాయిలో ఇప్పుడు ప్రసిద్ధులైన హుస్సేన్, ఆరా మొదలయిన చిత్రకారుల కృషిబీజాలు వీరి చిత్రాలలో కలవు. వీరి స్టిల్ లైఫ్ చిత్రములు చాల హృదయంగమముగా ఉన్నవి. దీనదయాళ్ సుమారు 70 సంవత్సరాల వయస్కుడు. ఐనను యువకునివలె నేటికిని చిత్రకల్పన చేయుచునే ఉండును. ఆయన దారుమూర్తులను సృజించుటలో అందెవేసిన చేయి.

అనుశ్రుతమయిన దక్కను కలమునకు చెందిన చిత్రకార కుటుంబమువారు వెంకటరామయ్య, బాణయ్య అనువారు. వీరు నిజాముఅలీఖాన్ దర్బారులో ప్రఖ్యాతి గాంచిన వెంకటాచలం అను చిత్రకారుని వంశమునకు చెందినవారు. వారి చిత్రములు అచ్చముగా పూర్వపు చిత్రములను బోలి ఉండును. సాలార్ జంగు మ్యూజియములోను, విదేశీయుల సంకలనములలోను ఆ చిత్రములు గలవు.

ప్రస్తుతము ఢిల్లీలో ఉన్న కుమారిలస్వామి తెలంగాణమునకు చెందిన చిత్రకారుడే. దేశము స్వతంత్రమై చిత్రకళ ఒక క్రొత్తతేజము వెలయించుచున్న యీ సమయములో హైదరాబాదు నగరము ఆంధ్రదేశమునకేగాక దక్షిణాపథమున కంతటికిని కళాకేంద్రము కాగల అవకాశము లెన్నో కలవు.

మొ. కృ.

**ఆంధ్రులు - నృత్యకళ (చరిత్ర)** :- నృత్యకళ ప్రారంభదశలో రెండు విధములుగా నుండెను.

1. **ఆరాధన నృత్యములు** :- ఇవి ఆలయములలో జరుగును.

2. **వినోద నృత్యములు** :- ఇవి ఆలయముల వెలుపల జరుగును.

రెండవదశలో నృత్యకళ నాలు విధములయ్యెను.

1. **ఆరాధన నృత్యకళ** :- ఇందు దేవదాసీల నృత్యములు, నరసాల నృత్యము, సేవ, కొలువు, కీర నాట్యము - మొదలయినవి చేరియుండును.

2. **ప్రచార నృత్యకళ** :- ఇందు కూచిపూడి భాగవతులు, గొల్లభాగవతులు, జక్కులభాగవతులు, బహురూపులు, యానాది భాగవతులు, మాలదాసరులు మున్నగువారి నృత్యరీతులు, కలాపనాట్యమేళములు, తోలుబొమ్మలు, బొమ్మలాట, పగటివేషములు చేరును.

3. **కచ్చేరి నాట్యము** :- ఇందు భోగము మేళము, మేజువాణి, భరతనాట్యము చేరును.

4. **జానపద నృత్యకళ** :- ఇందు గొబ్బి, కోలాటము, తప్పెటగుండు, చిరుతల భజన, బుట్టబొమ్మలు, మాయ గుఱ్ఱములు, తోగాట, బతకమ్మలాట మొదలైనవి చేరును.

ప్రాచీనాంధ్రదేశములో నృత్యకళ రెండు విధములుగా ప్రచారములో నుండినది.

1. ఆలయములలో దేవదాసీలచే చేయబడిన ఆరాధన నృత్యములు.

2. ఆలయ ఆవరణముదాటి, ఆరాధనకై వచ్చిన యాత్రికులను రంజింపజేసి, ద్రవ్యార్జనకై జేయబడెడు 'కురవంజి' ఆటవిక నృత్యములు.

దేవదాసీలు - వీరు విష్ణుదాసీలు, శివదాసీలని రెండు విధములుగా నుండెడివారు. అట్లే వారి నృత్యకళ - విష్ణుదాసీలకళ 'లాస్య' (అభినయ) ప్రాధాన్యమై, శివదాసీల కళ తాండవ (నృత్య) ప్రాధాన్యమై యుండినది.

నృత్యకళను దైవారాధనములో ఒక భాగముగా మన పూర్వులు పరిగణించిరి. ప్రభాత సమయమున స్వామికి మేల్కొలుపు మొదలుకొని రాత్రి పవళింపు సేవవరకు జరిగెడు వివిధ పూజలందు, ఉపచారములందు, ఆయాసమయములకు తగినట్లు దాసీలు నృత్యగీతాలతో భగవంతు నారాధించెడువారు. పుష్పాంజలి, మేళప్రాప్తి, పేరిణి, కౌస్తుభము, నవసంధి, సమపాద, భుజంగ, శుభ లీల మొదలైనవి వారిచే ప్రదర్శింపబడు ప్రత్యేక నృత్యములు. ఈ నృత్యములన్నియును భరతశాస్త్రము ననుసరించి, శాస్త్రీయపద్ధతిలో పెంపొందించ బడినవి. ఇందు 'లోకధర్మి' కి తావులేదు. వివిధ ఆలయములలో ఆ

దేవళములోని మూర్తి ననుసరించి, స్వామికి ప్రీతిని కలిగించునట్టి కరణాంగహారములతో కూర్చబడిన నృత్యములు మాత్రమే ప్రదర్శింపబడెడివి. అంతియేగాక ప్రాతః కాలమున కొన్ని నృత్యరీతులు, ప్రదోషకాలమున కొన్ని నృత్యరీతు లుండెడివి. అట్టివే శివాలయములలో ప్రదర్శించెడు సంధ్యానృత్యము - భుజంగత్రాస. ఆలయనృత్యము లన్నియు, నృత్తప్రాధాన్యమైనట్టివి. ఇందు రేచకములు, కరణములు, అంగహారములు, మండలములు, శాస్త్రీయ క్రమము ననుసరించి ప్రదర్శించుటయేగాక, ఈ నృత్యములలో నుపయోగించిన తాళములుగూడ - గణపతి, ఇంద్ర, విష్ణు, రుద్ర మొదలయిన అపూర్వ తాళములు, నృత్తము అయా తాళముల క్రియల ననుసరించి కూర్చెడివారు.

ఆలయము వెలుపల వినోదార్థము ప్రదర్శింపబడిన నృత్యరీతులే కురవంజి, యక్షగానములు. ఈ నృత్యములకు శాస్త్రముతో సంబంధము లేదు. 'నాట్యధర్మి' కన్న 'లోకధర్మి' యే యిందు విశేషముగా ప్రాముఖ్యము వహించును. ఇది దేశీయ విద్య. ఆలయ నృత్యములను 'మార్గ' నృత్యరీతులుగా, కురవంజి నృత్యములను 'దేశి' నృత్యరీతులుగా వేర్కొనవచ్చును. లయప్రాధాన్యమైన అంగచలనము ఈ నృత్యములలోని విశేషము. ఒక పురాణ గాథ ననుసరించి వీరు నృత్యమునల్పినను, కథను పాడుచు మధ్యమధ్యన ఉత్సాహముగా నుండుటకుగాను, ఆ గీతము యొక్క లయకు తగినట్లు అడుగులు వేయుదురు. హస్త విన్యాసము (ముద్రాభినయము) వీరికి తెలియదు. ఈ నృత్యరీతిలో తాళముకంటెను, లయ కెక్కువ ప్రాధాన్యము ఉండెడిది. కురవంజి - అనగా 'కురవలు' మొదలైన ఆటవికుల 'అంజి' నృత్తవిశేషము. దీనినే 'చిందు' అనిగూడా పిలుచుట కద్దు. అట్లే యక్షగానము-యక్షుల (జక్కుల) గానపద్ధతియై యున్నది.

కురవంజి, యక్షగానములందు ఆదిలో ఒక్కరే నృత్యమాడుచు కథచెప్పెడువారు (నేటికాలపు హరికథల వలె). అటుపై సింగి, సింగడు అను పాత్రలు సృష్టింపబడినవి. వీరిద్దరును కథలోని వివిధపాత్రలుగా మారి నృత్యమాడెడువారు. తరువాత కొంతకాలమునకు కథను నడుపుటకుగాను కోణంగి (చోడిగాడు) అనుపాత్ర ప్రవేశపెట్టబడినది, ఈ మూడుపాత్రలే కథనంతయు నడపెడువారు. నృత్యమందు వీరు పాడెడు సంగీతరచనలు - త్రిపుటలు, అర్ధచంద్రికలు, జంపెలు, ధవళములు, శోభనములు, ద్విపదలు, కందము మొదలైనవి, లయ ప్రాధాన్యము కలవై, నృత్తమునకు మాత్రము అనువైనట్టి రచనలు. గరుడాచల యక్షగానము (చెంచులక్ష్మీనాటకము) శ్రీగిరికురవంజి, సుగ్రీవ విజయము ఈ తరగతికి చెందిన ప్రాచీన యక్షగానములు.

నృత్యమందు పూర్వకథ ననుసరించి అనేక పాత్రములను ప్రవేశపెట్టి, ఆ పాత్రములచే మాట్లాడించు విధానము తరువాతవచ్చిన వీథినాటకములందు గాననగును.

కాలక్రమేణ దాసీల నృత్యము ఆలయముదాటి ఆలయ ప్రాంగణము ప్రవేశించినది. ఉత్సవమూర్తిని ఊరేగించి కళ్యాణమంటముపై అధిష్ఠింపజేసి, ఆ స్వామి కెదురుగా నృత్యము సలుపబడెడిది. ఆ నృత్యము అభినయ ప్రాధాన్యమై, ఆరాధన ప్రాధాన్యముతగ్గి అచ్చట చేరిన ప్రేక్షకుల వినోదమునకు చేయబడెడు ప్రదర్శనముగా తయారైనది. ఆలయములో మాత్రము, మూలవిరాట్టున కెదురుగా దాసీలు శాస్త్రీయ నృత్యములనే ప్రదర్శించెడువారు. పిమ్మట కొంతకాలమునకు దాసీల నృత్యకళ, గణికలద్వారా, రాజాంతఃపురము ప్రవేశించినది. దర్బారు విద్య శాస్త్రీయ కళయైనను, ఆధ్యాత్మిక భావముల కంతగా విలువ నివ్వక, రాజసభలలోని పండిత, రసిక జనులకు విజ్ఞానముతోగూడిన వినోదము నిచ్చెడిది. పామర జన రంజకముగానుండి, ప్రకృతిపై ఆధారపడుచుండిన 'దేశికళ' యగు కురవంజి, యక్షగానములకు గూడ శాస్త్రము నెరిగిన పండితుల ఆదరము లభించినది. రాజసభలలో ఈ విద్యకు ఆదరము లభించినంతనే భరతవిద్య యందు పాండిత్యముగల ఆచార్యులు యక్షగానములను రచింపమొదలిడిరి. ఈ యక్షగానములను రాజమందిరములలోను, పల్లెపట్టణములందును భరతమును, అభినయమును తెలిసిన వేశ్యలు ప్రదర్శించెడువారు. కాని ప్రభువుల రంజింప జేయుటయే వీరి ప్రథమ కర్తవ్యమగుటచే, వీరియొక్క కళయందు శాస్త్రభాగము నానాటికి క్షీణింపజొచ్చినది. ఆ విద్యతోపాటు, వేశ్యల జీవిత విధానము గూడ ఈ కళకు కళంకము తెచ్చినది.

అట్టి విషమపరిస్థితిలో మన నృత్యకళ పూర్తిగ నశించిపోకుండ కాపాడుటకు, 'నాట్యమేళములు' మన దేశములో ఉద్భవించినవి. శాస్త్రము నెరిగిన బ్రాహ్మణ పండితులు, ఈ మేళములను సృష్టించిరి. వీనియందు స్త్రీలకు స్థానములేదు సరిగదా, స్త్రీలు నృత్యమాడుట యీ మేళములవారు పూర్తిగా బహిష్కరించిరి. వీరి నాటకములందు స్త్రీ పాత్రమును గూడ పురుషులే ధరించెదరు. వీరు జట్టులుగా తయారయి, దేశములోని మారుమూల పల్లెలుగూడ సంచారముచేసి, ప్రదర్శనము లిచ్చి, నృత్యగీతములద్వారా మన పురాణేతిహాసముల లోని రసవంతమైన ఘట్టములను అభినయించి, నాట్యమాడి సామాన్య ప్రజానీకములో మతప్రచారము చేసెడు వారు. కనుక వీరికి ప్రచార నర్తకులని పేరువచ్చినది. ఆదిలో వీరు శివసంబంధమైన కథలనే నృత్యమాడు చుండిరి. కృష్ణభక్తి దేశములో ప్రబలిన తరువాత కృష్ణపరమైన భాగవత కథల నాడుట మొదలిడిరి. నాటి నుండి వీరిని భాగవతులనియు, వీరు ప్రదర్శించు నాట్యమేళ ములను భాగవతము లనియు పిలుచుట ఆచారమైనది. ఈ కాలమునుండియే దాసీల నృత్యకళను నట్టువ మేళము లనియు, నాట్య మేళములవారిని భాగవతులనియు, పిలుచుట ప్రారంభమయినది. ఈ భాగవతులలో కూచి పూడివారు ముఖ్యులు. వీరు బ్రాహ్మణులు. సంగీతము. భరతము, మంత్రశాస్త్రముల నెరిగిన వేదాధ్యయన పరులు. కూచిపూడి భాగవతులకు భరతవిద్య నేర్పినవారు యోగి సిద్ధేంద్రులవారు. వీరు 'పారిజాతాపహరణము' అను నాటకమును రచించి కూచిపూడివారికి నేర్పిరి. నాటి కూచిపూడివారు, వారి తరువాత తరములవారు కూడ నృత్యము నారాధించుటకుగాను, గోల్కొండ నేలిన తానీషా యొద్దనుండి కూచిపూడి అగ్రహారమును దాన ముగా బడసిరి. అంతియేగాక కూచిపూడిలో పుట్టిన ప్రతి బ్రాహ్మణబాలుడు యుక్తవయస్సువచ్చినంతనే, నృత్యవిద్య నభ్యసించి, తన జీవితములో నొక్కసారైనను గజ్జెకట్టి, ఆలయములో స్వామి యెదురుగా, భామకలాప మాడవలె నని శాసించిరి. ఆ సంప్రదాయమును నేటికిని కూచిపూడి వారనుసరించుచున్నారు: కలాపములతో ప్రారంభమైన వీరి విద్య కాలక్రమేణ, వీథి నాటకములలో పరాకాష్ఠ నందుకొన్నది. కథననుసరించి అనేక పాత్రములు ప్రవేశ పెట్టబడి, ఆ పాత్రములచే మాట్లాడించు విధానము వీథి నాటకములందు గాననగును. అట్లు ప్రవేశించు పాత్రముల సంభాషణములు 'దరువుల' రూపములోను, ద్విపద, సీసార్థము, సీసము, కందార్థము, కందము మొదలైన దేశీయ ఛందస్సులందును, చంపకమాల, ఉత్పలమాల, పంచచామరము, శార్దూలము మొదలైన వృత్తము లందును రచింపబడినవి. ఈ రచనలద్వారా రాగములకు ప్రాముఖ్యము హెచ్చినది. మఱియు నృత్త ప్రాధాన్యము తగ్గి, నృత్యము పెంపొందినది.

పై విధముగా భాగవత మేళములవారు కళా సంస్కరణోద్యమమును ఆరంభించి, కళయొక్క శాస్త్రీయతను, పవిత్రతను కాపాడుటకు పాటుపడుచుండ రాజ దర్బారులలోని నృత్యకళగూడ పెక్కు మార్పులను పొందినది. రాజనర్తకులు యక్షగానములలో - శాస్త్రీయ నృత్త నృత్య అభినయరీతులను ప్రవేశపెట్టినను వారు నృత్య నాటకముల ప్రదర్శనములతో సంతృప్తి చెందలేదు. యక్షగాన పద్ధతిలో ప్రదర్శింపబడిన నాటకములోని నృత్త నృత్యములు కథ ననుసరించి చేయబడుటచే ఒక క్రమపద్ధతిలోనుండ వీలులేదు. నాటకము ననుసరించి అందలి పాత్ర పోషణార్థము, దరువు లేర్పరుచబడి యుండుటచే నర్తకి కొన్ని నిబంధనములకు కట్టుబడి యుండవలెగావున నృత్త నృత్యములందు విజృంభించి తన ప్రతిభ వెల్లడించు అవకాశములేదు. ఈ లోటులను దీర్చుటకే రాజాస్థానములలోని సంగీత విద్వాంసులు నాటక కథతో సంబంధము లేకుండ, సంగీత ప్రాధాన్యమై, నృత్తనృత్యములందు పూర్తిగా నర్తకులు తమ పాండిత్య మును ప్రదర్శించుటకు అనువైన రచనలు చేసిరి. అవియే స్వరపల్లవులు, జాతిస్వరములు, శబ్దపల్లవులు, శబ్దములు, కేళికలు, పదకేళికలు, చౌపదకేళికలు, దురువదకేళికలు మొదలైనవి. స్వరపల్లవులు, శబ్దపల్లవులు, జాతిస్వరములు నృత్తమున కనువైనట్టి రచనలు. ఇందు నర్తకి పల్లవి నాధారముగా జేసికొని, వివిధరీతుల రాగమును సంచారము చేసి, వివిధ జాతులలో అడవులు ప్రదర్శించెడిది. నాటినుండే నృత్త 'అడవుల' కూర్పు ప్రారంభమైనది. తత్పూర్వము నృత్తమందు అడుగులే గాని అడవులు

ప్రదర్శించే సంప్రదాయము లేదు. 'అడవు' అనగా ఒక నృత్తహస్తమును, దానికనుగుణముగా పాదవిన్యాసము చేర్చి, వివిధగతుల ప్రస్తారముచేసి ముగించుట. అడుగులకు ఇట్టి క్రమము లేదు. మృదంగగతిని గాని, జతిని గాని అనుకరించి, లయ ప్రాధాన్యముగా పాదసంచలనముచేసి ముగించుట అడుగు. శబ్దములు, పదకేళికలు, దరువులు నృత్యమున కనువైన రచనలు. ఈ వర్ణనాత్మక రచనలకు ఆంగికాభినయము (ముద్రాభినయము) ప్రదర్శించుచుండెడువారు.

పై తరగతి రచన లన్నింటియందును నృత్త నృత్యములకు అవకాశమున్నను, భారతీయనృత్యకళకు తలమానికమైన సాత్త్వికాభినయమునకు ఈ రచనలు ఉపయోగించవు. కావున నర్తకులు నృత్త నృత్యములతో తృప్తిచెందవలసి వచ్చినది. ఆ లోటును గూడ తీర్చి, మన నృత్యకళకు సంపూర్ణత్వముచేకూర్చుటకేగాబోలు క్షేత్రయ్య పదరచన చేసెను. ఈ పదములు విలంబిత లయను గలిగి, శృంగార రస ప్రాధాన్యమై, నాయికానాయకులకు సంబంధించి యుండుటచే దేవదాసీలు పదాభినయముద్వార సాత్త్వికాభినయమును ప్రదర్శించి తమ కళకు సంపూర్ణత్వము చేకూర్చుకొన్నారు. నాటివరకు దరువుల కిచ్చిన అగ్రస్థానము ఇపుడు పదములకు లభించినది. భాగవత మేళములవారు గూడ తమ నాటకములలో రసవద్ఘట్టముల నభినయించవలసినపుడు, దరువులతోపాటు పదరచనలను గూడ అభినయించుట ప్రారంభించిరి. ఈ రీతిని ఆలయములలో ఆరాధనకళగా ప్రారంభమైన దాసీల నృత్త ప్రధానమగు కళ, క్రమముగా రాజదర్బారులలో నృత్త నృత్య అభినయాదులలో వికాసముజెంది, పరిపూర్ణత పొంది, సంపూర్ణకళగా విరాజిల్లినది. కురవంజి రూపములో నుండిన దేశీయకళ, భాగవతమేళ పండితులచే సంస్కరింపబడి వీధి నాటకములుగా ప్రఖ్యాతిగాంచినది. బ్రాహ్మణమేళములవారు అనేకవిధములైన శాస్త్రీయ విధానములను యక్షగానములందు ప్రవేశపెట్టినను, జక్కులవారి విద్య మాత్రము ఇంకను ప్రాచీనదేశి సంప్రదాయము ననుసరించియే ప్రదర్శింపబడుచున్నది. వీరి కథ నడుపువిధముగాని, దరువుపట్టుగాని అతి ప్రాచీనముగా నుండును. వీధి నాటకముల పూర్వపు 'దేశి' స్వరూపమును మనము తెలంగాణములోని 'బహురూపుల' కళయందును, ఆంధ్రప్రాంతములోని జక్కుల, యానాది, దాసరి భాగవతుల నాట్యములందును చూడగలము.

ఇవి గాక తోలుబొమ్మలాట, బొమ్మలాటగూడ మన దేశములోని ప్రచార నృత్యకళలలో ప్రాముఖ్యము వహించిన విద్యలు. తోలుబొమ్మలాట అతి ప్రాచీనమైన విద్య. క్రీస్తుపూర్వము శాతవాహనుని కాలమునుండియు తోలుబొమ్మలాట తెలుగుదేశములో ప్రచారములో నున్నట్లు చరిత్రలు చాటుచున్నవి. ఆంధ్రదేశమునుండియే యీ విద్య, మన నృత్యకళతోపాటు బలి, జావా ద్వీపములకు ప్రాకినది. హరికథ, బుర్రకథ, పంబలకథ మొదలైన వినోదములుగూడ పురాతన యక్షగాన విద్యనుండి చీలి, ప్రత్యేక కళలుగా ఏర్పడిన విద్యలు.

ఈ నృత్యరీతులేగాక నారాయణతీర్థయతీంద్రులవారిచే రచింపబడిన 'కృష్ణలీలా తరంగిణి' లోని తరంగముల నృత్యమాడు ప్రత్యేక నర్తకులుగూడ ఆంధ్రదేశములో నుండిరి. తరంగముల నృత్య మొక ప్రత్యేక కళ. తరంగ నర్తకులకు తాళ లయలు స్వాధీనమందున్నట్లు మరొకరియందు గానము, తాళమును విన్యాసము చేయుచు నృత్యముచేయుట చూచినప్పుడు, వారు 'లయతో ఆడుకొనుచున్నారా ?' అనిపించును.

భోగమువారి కచ్చేరి విద్య మూడు విధములుగా విడిపోయినది. మేళములు, మేజువాణి, ఏకపాత్రనృత్యము. భోగము మేళములందు సుమారు పండ్రెండు మంది స్త్రీ లుందురు. వారిలో శాస్త్రము నెరిగిన నర్తకి పెద్దగా (నాయకురాలుగా) నుండును. మేళములందు నృత్త, నృత్యములుమాత్రమే ప్రదర్శింపబడును. సాధారణముగా ఈ నృత్యరీతి ఊరేగింపులకు ఎక్కువగా నుపయోగించును. మేజువాణియందు ప్రతి నర్తకి తనయొక్క విద్యను ప్రదర్శించుటకు అవకాశముండును. పదములు, వర్ణములు, శ్లోకములు మొదలైన ప్రసిద్ధ రచనలు ముఖ్యముగా అభినయించెదరు. అభినయమే ప్రత్యేకముగా మేజువాణిలో చూడవలసిన విశేషము. అలంకార శాస్త్రము, భరతశాస్త్రము నెరిగి, కావ్యపురాణేతిహాసములందు పాండిత్యముగల్గిన నాయకురాలు సాధారణముగా మేజువాణిలో 'పదము' నభినయించును.

పదములోని నాయికను సాత్త్విక సంచారులతో దర్శింప చేయుచు, శాస్త్రముల నెరిగిన విద్వాంసుని ప్రశ్నలకు సమాధానము చెప్పగలిగెడు సామర్థ్యముగల నర్తకి మాత్రమే సభలో గజ్జెగట్టి పదము పట్టుట కర్హురాలు.

ఏకపాత్ర నృత్యము— ఇదే నేటికాలములో భరత నాట్య మను పేరుతో ప్రసిద్ధిగాంచినది. ఈ నృత్యరీతి సంస్థానము లున్న ప్రదేశములలో పెంపొంది ప్రచారము లోనికి వచ్చినది. తంజావూరు, కాళహస్తి, కార్వేటి నగరము, వేంకటగిరి, పిఠాపురము, పెద్దాపురము, కొల్లాపురము, విజయనగరము మొదలయిన సంస్థానములలో ఆ రాజుల పోషణములో వృద్ధిచెందినవి. ఇందును క్షత్రియ సంస్థానము లందలి (విజయనగరము, పెద్దాపురము మొదలయినవి) విద్యకును, వెలమరాజుల రాజ్యములలోని (తంజావూరు, వెంకటగిరి, పిఠాపురము, బొబ్బిలి మొదలయినవి) విద్యకును చాల భేద మున్నది. ఈ పద్ధతి నృత్యమందు ఒకే నర్తకి పాల్గొనును, నాట్యాచార్యు డామె నాడించును. నృత్యము 'మేళప్రాప్తి' లేక 'అలరింపు' అను నృత్తములో ప్రారంభమై 'జావళి' లేక 'తిల్లాన'తో ముగియును. ఈ నృత్య సంప్రదాయము నృత్తముతో ప్రారంభింపబడి, నృత్యము ప్రదర్శించిన తరువాత అభినయముతో ముగియుచున్నది. భారతదేశములోని నృత్యరీతు లన్నింటిలోను ఈ నృత్య సంప్రదాయమందు మాత్రమే, నృత్త నృత్య అభినయములు శాస్త్రీయ దృక్పథములో, చక్కగా సమపాళ్ళలో పోషింపబడు చున్నవి.

సంస్థానము లందు 'చర్మకట్టు వాద్యనృత్య'మని మరొక నృత్తరీతి ప్రచారములో నుండినది. ఈ నృత్యరీతియందు సుమారు పండ్రెండుమంది డోలు (శృంగిభేరి) వాయిద్యకులు, సన్నాయి పాటగాండ్రు ఇరుప్రక్కల ఎదురెదురుగా నిలబడి వాయిద్యముల వాయింతురు. వారిమధ్య ఏబది లేక అరువదిమంది శ్వేతాంబర ధారిణు లయిన దేవదాసీలు బారులుదీరి నిలువబడి యుందురు. సన్నాయి వాద్దెగాండ్రు అతి విలంబితలయలో 'చౌక వర్ణము'లను వాయించెదరు. శృంగిభేరి వాద్యకులు ఆ వర్ణముయొక్క లయను దెల్పుచు, కాల పై కాలము లలో ప్రస్తారము చేయుచు వివిధ జాతులందు జతులను కట్టి వాయించి తీర్మానించెడివారు. నర్తకీలు ఒండొరుసు ఒక కాలమందు ఆ పాటయొక్క లయ ననుసరించి అడుగులు పట్టి, పై కాలమందు తీర్మానించెడివారు. ఇది లయ ప్రధానమైన బృందనృత్త విశేషము.

నృత్యకళ, ఈ విధముగా కులవిద్య, వృత్తి విద్యగా తయారయి, ప్రత్యేక తరగతులకు చెందినవారే దీనిని ఆరాధించుటచే, సంఘములోని యితరజాతులవారు— స్త్రీ పురుషులు తమయొక్క వినోదార్థము, పర్వదినము లందు అందరును ఒకచోట కూడి సంతోషముగా కాలము గడుపుటకు కొన్ని నృత్యముల నేర్పరచుకొనిరి. అవియే జానపద నృత్యములు. ఈ నృత్యములకు శాస్త్రముతో ఎక్కువ సంబంధములేదు. ప్రత్యేక శిక్షణ, సాధన అవసరములేనట్టియు, అందరికిని అందుబాటులో నుండెడు విద్యలు ఈ జానపద నృత్యములు. అట్టివే పల్లెలందలి స్త్రీలు ప్రదర్శించెడుగొబ్బి, కోలాటము, బ్రతుకమ్మలాట మొదలైనవి. తెలంగాణములోని మారుమూల ప్రాంతము లలో కొన్ని తెగలకు చెందిన పురుషులు ప్రదర్శించెడు కోలాట నృత్యమందు కొంత పాండిత్యము గానవచ్చును. అట్లే విశాఖ జిల్లాలోని 'తప్పెట గుండు' నృత్యము, కృష్ణా గుంటూరు జిల్లాలలోని 'గుఱ్ఱము ఆట'. గుఱ్ఱము ఆట ఒక చిత్ర నృత్య రీతిగా పేర్కొనవచ్చును. గుఱ్ఱమునకు, మృదంగ వాయిద్యము ననుసరించి తాళ లయలలో జాతీర్ణముగా నృత్యమాడుటకు శిక్షణ ఇవ్వబడును. ఉత్సవములందు, ఊరేగింపులందు ఇవ్విధముగా శిక్షణనొందిన గుఱ్ఱము కాళ్ళకు గజ్జెలు కట్టి, పాటకుడు పాడే గీతము, తాళ లయల ననుసరించి మృదంగజతులకు గుఱ్ఱముచే నృత్యమాడించెదరు. ఇవిగాక మాయ గుఱ్ఱములు, బుట్ట బొమ్మలు మొదలైనవానిలో మనుష్యులు లోపల ఉండి వాని నాడింతురు.

తెలంగాణములో జోగుజాతికి చెందినవారు ప్రదర్శించెడు 'జోగాట' ముఖ్యముగా పేర్కొనదగిన నృత్యము. ఈ నృత్యము డప్పుల వాయిద్యముల ఆధారముతో చేయ బడును. 'జోగాట' మాలమాదిగకులములవారిలో ఎవరైన చనిపోయినప్పుడు శవమును శ్మశానమునకు గొనిపోవు నపుడు ముఖ్యముగా ఆడుదురు. వీరి నృత్యరీతు లన్నింటి లోను 'పిండోత్పత్తి' క్రమమును వర్ణించు నృత్యము

ముఖ్యముగా చూడదగ్గది. ఈ నృత్యము బాగుగా తిలకించిన సంగీత రత్నాకరములోని సారంగదేవుని పెండోత్పత్తి నృత్య క్రమమును జ్ఞప్తికి తెచ్చును.

ఆలయము లందు దేవ దాసీలు నృత్యపూజ యందు పాల్గొనినను వీరశైవము మన దేశములో ప్రబలముగా నున్నప్పుడు శైవ మతస్థులలో పురుషులు గూడ ఆరాధన నృత్యములు చేసెడివారు. ఆ నృత్యముల కే 'వీరనాట్యము'ని పేరు. చేతఖడ్గము, డాలు ధరించి ఖడ్గము లనెడు రచనలను గానముచేయుచు, గంభీరముగా వీరంగము పలుకుచుండగా వీరావేశముతో వీరముష్టి నర్తకులు నాట్యమాడెదువారు. ఈ నృత్యము తాండవ పద్ధతికి చెందినట్టిది. ఇట్టివే అమ్మవారు పూజలందు ప్రదర్శింపబడు గరగల నృత్యములు, సింహాచల స్వామి ప్రీత్యర్థముచేయబడు సేవ, పల్నాటిసీమలో వీరుల కొలుపులందు ప్రదర్శింపబడు కొలుపు నృత్యములు.

ఈ నృత్యరీతులుగాక ఆంధ్ర దేశములోని అరణ్యములలో నివసించెడు ఆటవికుల-(కోయలు, చెంచులు, గోండులు, సుగాలి, సవరలు మొదలైనవారు) నృత్యము లనేకములున్నవి. ఇందు ప్రకృతి ఆరాధన నృత్యములు, ఋతువుల నృత్యములు ముఖ్యము. ఇవన్నియును బృంద నృత్యములు. పర్వదినములందు కొన్ని వందలమంది స్త్రీలు పురుషులు ఒకచోటగూడి యీ నృత్యములందు పాల్గొందురు, వీరి నృత్యము లయ ప్రధానమయి, సాధారణముగా త్రిశ్రగతిలోనుండును.

ఇంతవరకు రాత్రులందు దీపాల వెలుగులో ప్రదర్శించెడు నృత్యకళనుగూర్చి మాత్ర ముచ్చరింపబడినది. అట్లుగాక దినమందే వివిధవేషములు ధరించి ప్రజలను రంజింపజేసెడు పగటివేషములవారు గూడ మనదేశములో నున్నారు. ఈ పగటివేషములవారు అతిపురాతన కాలము నుండి మనదేశములో నుండిరి. కళింగ గంగరాజు పగటి వేషములవారితోజేరి శత్రువులను జంపినట్లు ఒకకథ ప్రచారములో నున్నది. భాగవత మేళములవారివలెనే వీరుగూడ తమ విద్యను దేశకళ్యాణమునకు ఉపయోగించిరి.

ఆంధ్రుల నృత్యకళకు-తంజపురినేలిన నాయకరాజుల కాలము స్వర్ణయుగముగా పేర్కొనవచ్చును. ఆ కాలమునందే యక్షగానము ప్రభువుల ఆదరణములో శాస్త్రీయ నృత్య సంప్రదాయముగా వృద్ధిపొందినది. నాయకరాజులు కళాపోషకులేగాక, స్వయముగా అనేక యక్షగానము లను రచించిరి. ఆకాలములో చౌపద కేళిక, దురుపద కేళిక, పద కేళిక, నవపదము, జక్కిణి, కొరము, పేరిణి, దేశి, మదనబలద్యూతము, కందుకక్రీడ, గుజ్జరి, దండలాస్య, కోపు, చిందు, వాల్విచి, విల్వేడు, గుజరాతిదేశి, శుభలీల, కొరవంజి - అను 19 రకముల నృత్యరీతులు రాజదర్బారులోని నర్తకిణులు ప్రదర్శించెడువారు. ఆ కాలమందే కచ్చేరి నాట్యము క్రమపద్ధతిని ప్రదర్శించు విధానము ఏర్పరుపబడినది. తరువాత వచ్చిన మహారాష్ట్రి రాజులుగూడ అనేక యక్షగానముల రచననుజేసి నృత్యకళను పోషించిరి. రాయలకాలములో రాణివాసము వారు నృత్యకళ నారాధించినట్లు చరిత్రలవలన తెలియుచున్నను, నాటి నృత్యరీతుల స్వరూపము మాత్రము తెలియవచ్చుటలేదు. కాకతీయ ప్రభువుల కాలములో ఆరాధన నృత్యకళ ప్రసిద్ధిగాంచినది. కాకతీయుల నాటి ఆలయములను తిలకించిన గర్భగుడి కెదురుగా, నందికి వెనుకనే దేవదాసీలు నృత్యమాడుటకు సుమారు ఎనిమిదడుగుల వ్యాసముగల్గిన వలయాకారపు చదునైన రాతి నమర్చెడువారు. నర్తకి ఆరాతిపై నృత్యము చేసెడిది. ఇట్టి ఏర్పాటు హిందూ దేశములోని మరి ఏ ఆలయము నందును గానరాదు, కాకతీయులు నిర్మించిన ఆలయము లందు మాత్రమే యిట్టి నృత్య వేదికల యేర్పాటులున్నవి.

ఆనాటినుండి నేటివరకు ఆంధ్రదేశములో నృత్యకళ పెంపొందిన విధమునుగూర్చి యిందు సూత్రప్రాయముగ చర్చించబడినది. ఇచ్చట పేర్కొనిన నృత్యరీతులను గూర్చియు ఆయాపద్ధతులను గూర్చియు విపులముగా నిచ్చట వివరించుట కవకాశములేదు.

న. రా.

**ఆంధ్రులు - వాణిజ్యము :-** క్రీస్తుకు పూర్వకాలమున ఆంధ్రదేశము అరణ్యములతో నిండియుండి, చిరుతపులులు, పెద్దపులులు, ఏనుగులు, పాములు మొదలగు వానికి ఆకరమై అక్కడక్కడ నివాసము లేర్పరచు కొన్న జాతులతో జనపదములతో విలసిల్లి యున్నట్లు

వర్ణింపబడినది. కాని క్రమముగా జనసంఖ్య అభివృద్ధిచెంది పల్లెలు, పట్టణములు ఏర్పడి, పరిపాలనా విధానము నిర్మితమయి, ఆంధ్ర శాతవాహన రాజుల కాలములో ఉజ్జ్వలమైన నాగరికతను ఆంధ్రదేశము అనుభవించినది. నాగరకతతోపాటు వర్తక వ్యాపారాదులు అభివృద్ధిచెంది స్వదేశములోనేకాక విదేశాలలోకూడ అభిమానింపబడిన వస్తువులను ఉత్పత్తిచేసి ఓడలలో వాటిని ఇతర దేశాలకు ఆంధ్రదేశము పంపినట్లు తెలియుచున్నది. దక్షిణాపథము నకు తూర్పున, పశ్చిమమున, ముఖ్యమయిన రేవుపట్ట ణాలు అభివృద్ధి చెందినవి. ఆంధ్ర సముద్ర తీరాలలో ఓడలను కట్టుట, వాటిని మరమ్మతు చేయుట, క్రొత్త ఓడలతో సముద్రయానము సాగించుట మున్నగు పనులు విరివిగా జరిగినవి. శాతవాహనుల రాజధాని కృష్ణాజిల్లా లోని శ్రీకాకుళము. శాతవాహన రాజుల నాణెములపై ఓడను చిత్రించుటవలన విదేశయానము, వ్యాపారము విశేషముగ అభివృద్ధిగాంచినట్లు మనముఊహించవచ్చును.

శాతవాహనుల కాలమునాటి వర్తక వ్యాపారములకు ఆస్పదమైన రేవు పట్టణములు ఇప్పుడు శిథిలావస్థలో కనుపించుచున్నను ఆనాడు వైభవోపేతములైన వర్తక కేంద్రాలుగా ఉండినట్లు చరిత్రకారుల రచనలనుబట్టి తెలియుచున్నది. క్రీ. శ. 174-203 వరకు పరిపాలించిన గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి విదేశ వ్యాపారమును విరివిగా ప్రోత్సహించినాడు. ఘంటసాల రేవు, గూడూరు రేవు ప్రసిద్ధిగాంచినవి. పెరిప్లస్ అను గ్రంథములోను, టాలెమీ అనునతడు రచించిన ఆనాటి భూగోళ గ్రంథము లోను ఈ రేవులు పేర్కొనబడినవి. ఘంటసాలను 'కొంట కొసల' అనియు, గూడూరును 'కొడ్డూరు' అనియు వారు పేర్కొనిరి. కృష్ణానదీ ముఖద్వారమును మసేలియా అనియు, మచిలీపట్టణము రేవును 'మైసోలస్' అనియు వ్యవహరించినారు. ఆంధ్రదేశములో దొరకిన రోమను చక్రవర్తుల బంగారు నాణెములు ఘంటసాల రేవుపట్టణ మున జరిగిన వ్యాపారములో వచ్చినవే. పెరిప్లసు అను గ్రంథములో పశ్చిమమున 'భృగు కచ్చ'ము అను నేటి బ్రోచ్ రేవుపట్టణమును 'బారిగాజా' అని పేర్కొని దక్షిణదేశ వ్యాపారము ఇక్కడినుండికూడ విరివిగా జరిగినట్లు తెలిపిరి. ఈ దేశమును 'అరియకం' అనిరి. అందులో లంబోదరు డను శాతవాహనరాజు దీనిని పరిపాలించినట్లు చెప్పబడి ఉన్నది. రోము నగరము తోనే గాక ఈజిప్టుతో కూడ సన్నిహిత వర్తకము జరిగి నది. ఈజిప్టు దేశములోనికి వర్తక వ్యాపారాలకోసము 'సుబ్బా' అను భారతీయుడు వచ్చినాడని ఈజిప్టు శాసనము లలో పేర్కొనబడి ఉన్నది. దక్షిణమున కావేరీ పట్టణ మునందు 'కమరా' రేవు విదేశ వ్యాపారములో ఘనత కెక్కినది. ఇదిగాక క్రీస్తు పూర్వమునుండి జైన బౌద్ధమత ప్రచారమునకై విదేశాలకు యాత్రికులను చేరవేసిన కళింగపట్టణము రేవు కూడ ప్రాచీనమైనదే. ఈ రేవులో ఓడలను ఎక్కి విజయుడను కళింగరాజు 700 మంది బౌద్ధ భిక్షువులతో సింహళము చేరినాడని బౌద్ధ గ్రంథ ములు తెలుపుచున్నవి. కాకినాడకు పదిమైళ్ళదూర ములో కోరంగి అను ప్రాచీన రేవుపట్టణము ప్లినీ కాలమునాడు ప్రసిద్ధికెక్కినది. ఇక్కడ నౌకా నిర్మా ణము విరివిగా జరిగినది. శాతవాహన రాజ్యములో ఒక భాగమైన నేటి పశ్చిమ గోదావరి జిల్లాలో గోదావరి ముఖద్వారములో ప్రాలూరు అను రేవుపట్టణముండెను. దీనిని టాలెమీ తన భూగోళములో పేర్కొనెను. శాత వాహనుల కాలములో చైనా, బర్మా, మలయా, రోము, ఈజిప్టు మొదలగు దేశాలతో ఆంధ్రదేశము విరివిగా విదేశవ్యాపారము జరిగించినట్లు స్పష్టముగా తెలియు చున్నది. వ్యాపార వస్తువులలో ఆంధ్రదేశమునుండి వజ్రములు, అద్దకపు బట్టలు, ఢక్కా మజ్లినులవంటి సన్నబట్టలు, బియ్యము, ఎగుమతి అగుచుండెను. దిగు మతులలో బంగారము, వెండి ముఖ్యముగా చెప్పదగినవి. వస్తువుల వ్యాపారముతోపాటు, ఆంధ్రదేశమునుండి బర్మా, మలయా, సయాం దేశాలకు కోడూరు రేవునుండి వెడలిన యాత్రిక నౌకల ద్వారమున బౌద్ధమతము వ్యాపించినది.

శాతవాహనుల తరువాత ఆంధ్రులను సామ్రాజ్య స్థాపనకు తయారుచేసి ఆంధ్ర సామ్రాజ్యమును సుమారు మూడువందల ఏండ్లు పరిపాలించినవారు కాకతీయులు. వీరి రాజ్యకాలములో గణపతిదేవుడను రాజు విదేశ వ్యాపారమును ప్రోత్సహించినట్లు మోటుపల్లి శాసనము వలన తెలియుచున్నది. కాకతీయ సంచికలో శ్రీ బాల్ల

బండి సుబ్బారావుగారు "గణపతిదేవుని కాలమున, తూర్పు తీరము జయింపబడినతోడనే విదేశములతో వర్తకము విరివిగా సాగనారంభించెను. గుంటూరుజిల్లాలోని మోటుపల్లి గొప్ప రేవు పట్టణమై వరలెను. తూర్పునందు బర్మా, చైనా, తూర్పు దీవులు, సింహళము మున్నగువాటితోడను, పశ్చిమమునందు అరేబియా, పారశీకము, ఈజిప్టు మొదలగు దేశములతోడను, వర్తకము సాగుచుండెను. గణపతిదేవుని మోటుపల్లి శాసనమునుబట్టి విదేశ వర్తకమును వృద్ధిచేయుటకై అతడు 'కూప' శుల్కము తప్ప తక్కిన పన్నుల నన్నిటిని రద్దుచేసినట్లును, వర్తకులను, వారి యోడలను రక్షించినట్లును తెలియుచున్నది. అతడు ఓడదొంగలను శిక్షించెను; ఆయా వస్తువులపై సుంకముల నిర్ణయించెను. ఆ కాలమున శ్రీగంధము, కర్పూరము, ముత్యాలు, దంతము, లోహము, నూలు బట్టలు, కంబళ్ళు, సుగంధద్రవ్యములు, మిరియాలు, రత్నములు ఎగుమతి చేయబడుచుండెను. పట్టు సామానులు, గాజు, చీనాకర్పూరము, పంచదార, గుఱ్ఱములు, దిగుమతి యగుచుండెను. ఇట్లే మచిలీపట్టణముగూడ ఆకాలమున గొప్ప ఓడరేవుగాను, వర్తక స్థలముగాను ఉండెను."

కాకతీయుల కాలమునాటి పరిస్థితులను మార్కోపోలో అను విదేశయాత్రికుని వర్ణనల వలన తెలిసికొనవచ్చును. మోటుపల్లి రేవునుండి సాలీడు దారమువలె సన్నముగా ఉండెడు గుంటూరు పత్తిదారముతో నేసిన మల్లుసెల్లాలు ఎగుమతి అగుచుండెడివట. మోటుపల్లివద్ద వజ్రాల గను లుండెడివని 'నికోలోకొంటి' అను ఇంకొక యాత్రికుడు వ్రాసినాడు. ఈ జిల్లాలో దొరకిన రోమను బంగారు నాణెములు విదేశవర్తకములో ఆంధ్రులు సంపాదించుకొన్న వని మనకు తెలియుచున్నది. కాకతీయులు స్వయముగా నాణెములను ముద్రించి వ్యవహారములో ఉంచినట్లు వ్రాయబడి ఉన్నది. ఆనాడు దేశములో వర్తకపు వస్తువులమీద పన్నులను కాకతీయులు విధించినట్లు తెలియుచున్నది. వీటినే ఇప్పుడు మనము "వ్యాపార సుంకములు" (Commercial Taxes) అనిఅనుచున్నాము. వరంగల్లుకోటకు పోవు మార్గములో, ఖాన్‌సాహెబుతోట వద్దనున్న శాసనములో, దేశవర్తకముపై ఆనాడు విధింపబడిన పన్నులు ఈ క్రిందివిధముగా వర్ణింపబడినవి :— నీలి — మాడకు రెండువీసాలు, పోకలు లక్షకు పాతిక, కూరగాయలు బండికి పాతిక, మామిడి, కొబ్బరి మొదలయినవి — బండికి పాతిక, నూవులు, గోధుమలు, పెసలు, వడ్లు, జొన్నలు—బండికి మానెడు, ఉప్పు — బండికి పది పెరుకల మానెడు — ఆవాలు మొదలగు కొలబండాలు — మాడకు పాతిక, తగరము, సీసము, రాగి, తులము 1 కి ఒక పలము, చందనము తులము 1 కి పలము; కర్పూరము వీసెకు 2 చిన్నాలు. జవాది మాడ(కు) వరక, కస్తూరి—100 చిన్నాలకు 2 చిన్నాలు. పట్టు నూలు — తులం 1 కి చిన్నము, ఇవిగాక మంజిష్ఠము, ముత్యము, రుద్రాక్ష, గాటపూస మున్నగు వాటి యందును, పసుపు, ఉల్లి, జాజు, కంద, పెండలము మొదలగు దుంపదినుసులయందును వర్తకముజరుగుచుండెడిది.

కాకతీయుల సామ్రాజ్యానంతరము ఆంధ్రదేశములో స్థాపించబడినది విజయనగర సామ్రాజ్యము. ఆ కాలములోనే మధ్యాంధ్ర, ప్రాగాంధ్ర ప్రాంతములలో రెడ్డి రాజులు బలిష్ఠమైన దుర్గములను నిర్మించుకొని రాజ్యము చేసిరి. వినుకొండ, కొండవీడు, ఉదయగిరి, నెల్లూరు, కొండపల్లి, నిడదవోలు మున్నగు దుర్గములకు అధిపతులయిన రాజుల రాజ్యములు అవిచ్ఛిన్నములుగా సాగినవి. వర్తక వ్యాపారాలు విజృంభించినవి. లలితకళలు కొనసాగినవి. చిన్నచిన్న పరిశ్రమలు అనేకములు అభివృద్ధి చెందినవి.

పరిశ్రమలు : గ్రామము పరిశ్రమలకు మూలాధారముగా ఉండెడిది. విశ్వకర్మ పుత్రులగు కంసాలి, కమ్మరి, వడ్రంగి, కుమ్మరి, సాలె, గృహ నిర్మాణకర్త అనువారు బయలుదేరినారు. శివలింగ నిర్మాణములోను, దేవాలయ నిర్మాణములోను ఎక్కువ ప్రతిభ వ్యక్తమగుచుండెడిది. సొమ్ములు చేయుట యొక ప్రత్యేక కళగా వర్ధిల్లెను. రెడ్డిరాజుల వైభవమునకు తగినట్లుగా సొమ్ములుచేయుట విశేష ప్రతిభావంతమైన పరిశ్రమగా తయారయినది విజయనగర సామ్రాజ్యమునందలి సింహాసనమును గురించి అబ్దుర్ రజాకు అనువాతడు "చాల పెద్దదిగా బంగారుతో చేయబడిన ఈ సింహాసనము మణులతో పొదగబడి, ప్రపంచములో ఎక్కడను లేని పనితనముతో కూడినది" అ

వ్రాసెను. ఇటువంటి సింహాసనములు ఆనాడు విరివిగా తయారైనవి. రాగి, ఇత్తడి, కంచు, ఇనుము మున్నగు లోహ పరిశ్రమలు బాగుగా అభివృద్ధిగాంచినవి. అనపోతా రెడ్డి ద్రాక్షారామ భీమేశ్వరునకు పెద్దగంట సమర్పించెను. కొయ్య చెక్కడాలు, దంతపు పనులు, ఇనుముపోత, వజ్ర పరిశ్రమ ఎంతో అభివృద్ధికాంచినట్లు మార్కోపోలో వర్ణించినాడు. వినుకొండ, పల్నాడు తాలూకాలలో బట్టల పరిశ్రమ కేంద్రీకృతమయినది. రంగుల అద్దకము విస్తారముగా జరిగినది. సూరవరము, కామవరము బట్టలు అతి ప్రసిద్ధిగాంచినవి. పెక్కు రకాల పట్టుగుడ్డలు వాడుకలో నుండెను. వెలిపట్టు, నీలిపట్టు, సోంబట్టు, క్షేత్ర పట్టు, వజ్రపట్టు అను రకాలు రంగురంగుల పట్టు బట్టలను తెలుపుచున్నవి. పెదగంజాము, చినగంజాము, ఉప్పుగుండూరు, ఉప్పరాట్ల మొదలైన గ్రామాలలో ఉప్పు తయారయినది.

**వ్యాపార మార్గాలు :** విజయనగరము, కందుకూరు, అద్దంకి, కొండవీడు, కొండపల్లి, నిడదవోలు మొదలైనవి వ్యాపార కేంద్రాలుగా ఉండెడివి. నదులను "పుట్టి" అనే చిన్న చిన్న పడవలలో దాటెడువారు. కనుకనే సంసారములో ఎవరి పరిస్థితి అయినను బాగుగ నుండనిచో "వాని పుట్టి మునిగినది" అందురు. వ్యాపారములో పెరుకలు అను గోనెబస్తాలను వాడెడువారు. ఇవి అటు, ఇటు రెండు పెద్ద సంచులుగ నుండి మధ్యభాగమున మూతిని కలిగి, గాడిదమీద వేయుటకు వీలుగా ఉండును. ఈ పెరుకల వ్యాపారముచేయువాడు ఆ పేరుగల ఒక కులముగా వ్యవహరింపబడినారు. వీరు బలిజలతో సన్నిహితముగా ఉండుచుందురు. శ్రీశైలము, త్రిపురాంతకము మీదుగా అయోధ్యకు ఏకమార్గము ఉన్నదట! శాతవాహనుల కాలము నుండి ఆంధ్రదేశములో వృత్తిసంఘాలు ఉన్నట్లు శాసనాల మూలమున తెలియుచున్నది. శ్రేణులు, సమయములు అని ఈ సంఘాలకు పేర్లు. ఇవి అష్టాదశసంఖ్యాకముగా ఉన్నవట! తెలకులకు ప్రత్యేక సంఘాలు శాతవాహనుల నాటి నుండి తిలపిష్టకాలను పేరుతో ఉండెడివి. వేంగీ వరిపాలకుల కాలములో వేయికుటుంబాల తెలకులు ప్రసిద్ధులైనారు. 'వీరభలంజ్య సమయ' మనునది వ్యాపారస్థుల సంస్థ. దానిని గురించి కొంత చింతపల్లి శాసనములో ఉదహరింపబడినది. వ్యాపారస్థులు గుంపులు గుంపులుగా వర్తకమునకు బయలుదేరెదరు. ఉత్తర హిందూస్థానములో ఉన్న బేరారునకు ఆంధ్రదేశము నుండి బయలుదేరిన వస్త్రకబృందము వేయి ఎద్దులమీద సామాను వేసికొని బయలుదేరినదని ఫెరిస్టా వ్రాసినాడు. సుంకాలు కట్టుకొనుచు వెళ్ళెడువారు. సుంకాల లెక్కలు తేల్చువారిని సుంకము కరణా లందురు. వ్యాపార సమయాలకు సంబంధించిన సమావేశాలు, తీర్పులు, దేవాలయ ముఖమండపాలలో జరుపుచుండెడు వారు.

**విదేశ వ్యాపారము :** శాతవాహనులనాడే ఆంధ్రులు నౌకాయానమునకు ప్రసిద్ధిచెందినారు. చాళుక్యరాజైన మొదటి శక్తివర్మ నాణెములు బర్మాలోను, సయాంలోను దొరికినవగుటచే, ఆంధ్రులు వ్యాపారరీత్యా ఆదేశాలకు విరివిగా వెళ్ళినట్లు తెలుచున్నది. కాకతీయుల అనంతరము విదేశవ్యాపారమునకు ఊత ఇచ్చినది ప్రోలయ వేమారెడ్డి. అనపోతారెడ్డి మోటుపల్లి రేవును బాగుచేయించి విదేశ యాత్రికులను ఆహ్వానించినాడు. దొంగలనుండి కాపాడు ఏర్పాట్లుచేయించి సుంకముల విషయములో ఎన్నో సదుపాయాలు ప్రకటించినాడు. మిగత సుంకాలను ఈ క్రింది విధముగా తమిళభాషలో వ్రాయించినాడు :

"దక్షిణదేశమునుండి వచ్చు సామానులు 100 కట్టలకు - 3 కట్టలు; 100 వస్త్రాలకు - 2 నాణెములు. ఉత్తరమునుండి వచ్చెడు వస్తువులు 100 కట్టలకు - 5 కట్టలు; 100 వస్త్రాలకు - 3 నాణెములు; విదేశాలకు వెళ్లు వస్తువులు - 100 గుడ్డలమీద 3 నాణెములు. 100 ముత్యాలమీద 7½ నాణెములు." ఆ కాలములో మోటుపల్లి ప్రధానమైన రేవుగా నుండెడిది.

పడవలు నాలుగు రకాలు - కప్పలి : ఇది పాశ్చాత్య నౌకలకంటె పెద్దదిగా ఉండి బదు తెరచాపలు కలిగి ఉండెడిదట.

జొంగు : ఇది చీనా, భారతదేశాల వాణిజ్యము కోసము నిర్మింపబడిన ప్రత్యేక నౌక. ఇట్టి పడవలు చీనాలో తయారుచేయబడుచుండెడివి.

వల్లి: వాల్లిక - వీటినిగురించిన వివరాలు తెలియవు.

దిగుమతులు - ఎగుమతులు : శ్రీనాథుడు హరవిలాస ములో ఆనాటి వ్యాపారమును ఈ క్రింది విధముగా వర్ణించినాడు :

| దేశముపేరు | దిగుమతియైన వస్తువు |
|---|---|
| చీనా | ... పట్టు గుడ్డలు |
| సింహళము | ... ఏనుగులు, రత్నాలు |
| పంజార (సుమత్రా) | ... కర్పూరము |
| జలనోంగి (మలయా) | ... బంగారు మొలక |
| హురుమంజి (పర్షియాలోని హురుమజ్ పట్నము) | ... గుఱ్ఱములు |
| గోవా | ... సంకుమదద్రవము - (జవాది) |
| యంప (జాఫ్నా) | ... ముత్యాలు |
| ఖోటా (ఖూటాన్) | ... కస్తూరి |
| తరుణాసిరి | ... చందనము |
| తావాయి | ... అగరు |
| గోవా | ... కర్పూరము |
| రమణ | ... హిమాంబువు (Rose water) |
| | ... కుంకుమ రజము |
| ఇందులో తరుణాసిరి | ... Tennasirin Coast of Malaya |
| తావాయి | ... Tavoy - in Marta - ban Peninsula |
| రమణ | ... Ramanna desa in Pegu భాగవతము లోని రమణక ద్వీపము |

"చీని సింహళతవాయి హురుమంజి జోణంగి, ప్రభృతి నానాద్వీప నగరాకరంబగు ధన, కనక వస్తు, వాహన, మాణిక్య గాణిక్యంబులు దెప్పించి" అని హరవిలాస ములో చెప్పబడిన దానినిబట్టి విదేశవ్యాపారము విశేష ముగ జరుగుచుండెడిదని గమనింపవచ్చును. దిగుమతులను గురించి ఇన్ని వివరాలు తెలిపిన శ్రీనాథుడు ఎగుమతు లనుగూర్చి ఎక్కువగా చెప్పలేదు. వస్త్రములు ఎక్కు వగా ఎగుమతి అయినట్లు తెలియుచున్నది. డమాస్కస్‌లో కత్తులు తయారుచేయుటకు వీలైన ఇనుము పల్నాడు తాలూకానుండి అచటికి పంపబడినదట !

**ఆధునిక యుగము :-** ఈ విధముగా అభివృద్ధిగాంచిన విదేశవ్యాపారము యావత్తు మహమ్మదీయ బ్రిటిషు దండ యాత్రల మూలమున విచ్ఛిన్నమై ఆధునిక కాలములో నూతన రూపాలు దాల్చినది. పోర్చుగీసువారు, ఫ్రెంచి వారు, ఆంగ్లేయులు ఆంధ్రదేశములో తమ వర్తక కేంద్ర ములు నిర్మించుకొని వ్యాపారము సాగించినారు. కాల క్రమమున నౌకాయాన ప్రాబల్యము పాశ్చాత్యుల హస్త గత మయినది. వారి ఓడలు ఆంధ్ర సముద్ర తీరములో నిలిచి వ్యాపారము సాగించినవి. ఆంధ్ర సముద్రతీరము పొడుగునను కోటలు నిర్మించుకొని ఆంగ్లేయులు వర్త కము సాగించినారు.

**భీమునిపట్నం :-** ఇక్కడ 1628 లో డచ్చివారు ఒక కోటను, ఫ్యాక్టరీని నిర్మించినారు. బట్టలు ఉతికే మూడు చాకిరేవులు నిర్మించినారు. 1824 లో ఈ పట్టణము ఇంగ్లీషువారి వశము అయినది. గోనె సంచులు, నువ్వులు, నేతబట్టలు ఎగుమతి అగుచుండెడివి. ఏడు యూరోపియన్ కంపెనీ లుండెడివి.

**విశాఖపట్టణము :-** 1682 అక్టోబరులో ఈస్టుఇండియా కంపెనీవారు ఈ రేవును కౌలుకు తీసికొని ఫౌజుదారు సహాయముతో వ్యాపారము సాగించినారు. 1685 లో ఫ్యాక్టరీ నిర్మాణము జరిగినది. 1687 లో సలాబత్‌జంగ్ వద్దనుండి ఇంగ్లీషువారు ఆక్రమించినారు. 1802 లో శాశ్వత నిర్ణయము జరిగినది. పాలకొండ ఎస్టేటును ఆక్ర మించి అర్బత్‌నాటు కంపెనీకి కౌలు కిచ్చివారు. ఈ కంపెనీ, చిట్టివలసలో ఫ్యాక్టరీ నిర్మించినది. ఇది 1867లో గోనె సంచుల ఫాక్టరీగా మారినది. ఏడాదికి 20 లక్ష సంచులు ఉత్పత్తి అయ్యేడివి,

**కోరంగి :-** ప్రాతకాలపు కోరంగి రేవు ప్రాముఖ్యము తగ్గిన తరువాత 1789 లో టాపింగ్ అను మదరాసు ప్రభుత్వపు భూగోళశాస్త్రజ్ఞుడు తాను కోరంగి వచ్చి నప్పుడు అక్కడికి ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు, ఇంగ్లీష నావలు వచ్చెడి వనియు, దొంగలబాధ విపరీతముగ ఉండెడిదనియు వ్రాసినాడు. 1759 లో వెస్టుకాట్ అను ఇంగ్లీషువర్తకుడు కోరంగి రేవును మరల కట్టించినాడు. 1877-78 లో 8,22,000 రూపాయల వ్యాపారము ఈ రేవుగుండ జరిగినది.

తాళ్ళరేవు : నౌకల మరమ్మతు కొంతకాలము జరిగిన తరువాత 1802 లో ఇజెంజర్ రోబన్ అను ఇంగ్లీషు వర్తకుడు ఇక్కడ డ్రైడాక్ నిర్మించినాడు. ఆల్బాట్రాస్ అను నౌకను ఇక్కడ బాగుచేసినారు.

ఇంజరం :- ఇది కాకినాడకు 15 మైళ్ళ దూరములో ఉన్నది. 1708 లో తూర్పుఇండియాసంఘమువారు ఫ్యాక్టరీని నిర్మించినారు. 1722 లో ఈ ఫ్యాక్టరీలో ఇండియాలోకెల్ల శ్రేష్ఠమైన లాంగ్ క్లాత్ ఉత్పత్తి అయ్యేడిదని కెప్టెన్ హామిల్టన్ వ్రాసినాడు.

యానాం :- ఇక్కడ ఫ్రెంచివారు 1750 లో ఫ్యాక్టరీని నిర్మించిరి.

నీలపల్లి :- ఫ్రెంచివారు 1751 లో బట్టలమిల్లు స్థాపించినారు. 1854 లో ఫ్రెంచి ఇంజనీరు బియ్యపు మిల్లు పెట్టినాడు. నీలిమందు ఫ్యాక్టరీగా ఇది కొన్నాళ్ళు పనిచేసినది.

మాధవాయపాలెం :- 1628 లో నరసాపురములో డచ్చివారు ఇనుపకార్ఖానా పెట్టుకొన్నారు. ఇక్కడ 1677 లో ఫ్యాక్టరీని నిర్మించినారు. పెద్దపెద్ద ఓడలు ఇక్కడ మరమ్మతు అగుచుండెడివి.

బందరు :- 1611 లో తూర్పు ఇండియా సంఘము వారు ఫ్యాక్టరీని నిర్మించినారు. ఇక్కడినుండి మస్లినులు ఎగుమతి అగుచుండెడివి. 1614 లో డచ్చివారును, 1669 లో ఫ్రెంచివారును వ్యాపారమును ప్రారంభించినారు.

కృష్ణాపట్నం :- 13 వ శతాబ్దము నాటినుండి "కొల్లిత్తురై" అను పేరుతో ఇక్కడ గొప్ప రేవుపట్టణము ఉండెడిది. 18 విదేశాలనుండి వచ్చిన 500 మంది వర్తకులు ఇక్కడ చేరినారని ఒక శాసనము చెప్పుచున్నది.

ఆంధ్రరాష్ట్రము - వాణిజ్యము :- ఆంధ్ర రాష్ట్రము ప్రధానముగా వ్యావసాయిక దేశము. అందువలన వ్యవసాయమువలన వచ్చు పంటల వివరాలనుబట్టి వ్యవసాయ ఉత్పత్తిని గ్రహించవచ్చును. మొత్తముమీద 250 కోట్ల రూపాయల పంట పండుచున్నది.

| పంట | విస్తీర్ణము, వేల ఎకరములు | ఉత్పత్తి, లక్షల టన్నులు | మొత్తపు పంట విలువ, లక్షల రూపాయలు |
|---|---|---|---|
| ధాన్యము | 42,84.00 | 28.00 | 61,84 |
| గోధుమ | | 0.01 | 5 |
| జొన్నలు | 25,76.00 | 5.20 | 11,37 |
| సజ్జలు | 8,94.00 | 2.00 | 4,45 |
| జొన్న | 5,27.00 | 0.10 | 29 |
| రాగి | 5,93.00 | 2.30 | 4,83 |
| కొఱ్ఱ | 1,23.00 | 1.30 | 2,46 |
| వరిగలు | 2,63.00 | 0.50 | 80 |
| ఇతరములు | 5,50.00 | 0.90 | 1,70 |
| సెనగలు | 1,05.00 | 0.20 | 74 |
| పెసలు | 3,56.00 | 0.30 | 1,79 |
| కందులు | 1,85.00 | 0.20 | 86 |
| మినుములు | 1,50.00 | 0.20 | 93 |
| ఉలవలు | 8,27.00 | 0.66 | 2,47 |
| ఇతరములు | 56.00 | 0.03 | 14 |
| వేరుసెనగలు | 22,85.00 | 8.60 | 50,38 |
| కొబ్బరికాయలు | 83.00 | | 3,22 |

| పంట | విస్తీర్ణము, వేల ఎకరములు | ఉత్పత్తి, లక్షల టన్నులు | మొత్తపు పంట విలువ, లక్షల రూపాయలు |
|---|---|---|---|
| నువ్వులు | 3,45.00 | 0.40 | 3,91 |
| ఆముదము | 1,64.00 | 0.10 | 82 |
| చెఱకు | 1,27.00 | 3.50 | 20,14 |
| ప్రత్తి | 5,86.00 | 0.70 | 2,72 |
| కాఫీ | 0.20 | | 1 |
| పొగాకు | 3,35.00 | 1.10 | 20,71 |
| తమలపాకులు | 0.40 | | 7 |
| మిరపకాయలు | 2,69.00 | 1.10 | 22,87 |
| ఉల్లిపాయలు | 29.00 | 1.20 | 1,63 |
| బంగాళాదుంప | 0.01 | | 1 |
| పండ్లు | 2,75.00 | | 7,45 |
| అరణ్య సంపద | | | 11,44 |
| | | | 2,40,10 |

ఈ రాష్ట్రములో 420 లక్షల ఎకరములలో 210 లక్షల ఎకరములందు ఏదో ఒక పైరు వేయబడిఉన్నది.

ఆంధ్రరాష్ట్రములో వ్యవసాయసంపద, పశుసంపద, అరణ్యసంపద, ముడిసరుకులు విరివిగా ఉన్నప్పటికిని అవి ఇంకను సంపూర్ణవికాసమును చెందలేదు. అందుచేత పరిశ్రమలలో కూడ విస్తారము చెప్పుకొనదగినంత అభివృద్ధి లేదు. ఆంధ్రరాష్ట్రములోని పారిశ్రామికాభివృద్ధి సుమారు 36 కోట్ల రూపాయల విలువగల వస్తువులను ఉత్పత్తి చేయగలిగినదని ఈ క్రింది వివరములు తెల్పుచున్నవి.

| | లక్షల రూపాయలు |
|---|---|
| పంచదార మిల్లులు | 29 |
| సిమెంటు | 1,40 |
| పింగాణీ పరిశ్రమ | 11 |
| రాసాయనిక వస్తువులు | 41 |
| గుడ్డలు | 31 |
| సారా వగైరా | 5 |
| ఇంజనీరింగు | 1,28 |
| గోగునార సంచులు | 3,57 |
| లోహపు పనులు | 73 |
| కాగితము - అట్ట | 3 |
| బియ్యపు మరలు | 10,27 |
| సబ్బు | 3 |
| పంచదార | 2,46 |
| తోళ్ళు | 1,96 |
| నూనెలు | 11,66 |
| | 34,76 |

పైన ఉదహరించిన పెద్దపరిశ్రమలు కాక కుటీరపరిశ్రమలెన్నో ఉన్నవి. వాటిలో చేనేత పరిశ్రమ, తివాసీలు నేయుట మొదలైనవి ఉన్నవి. వీటి విలువ సుమారు 6 కోట్ల రూపాయలు ఉండునని తేలుచున్నది.

ఆంధ్రదేశము ఖనిజసంపదకు పేరువహించినది. అయినను ఖనిజ పరిశ్రమ ఇంకను బాగుగా అభివృద్ధిచెందలేదు ఏటేటా తీయబడుచున్న ఖనిజముల విలువ ఈ క్రింద చూపబడినది.

| | లక్షల రూపాయలు |
|---|---|
| ఆస్‌బెస్టాసు | 0.20 |
| బారైట్సు | 8.00 |
| జిప్సం | 1.20 |
| ఇనుము వగైరా | 1.00 |
| మాంగనీసు | 4.20 |

| | |
|---|---|
| మైకా | 178.60 |
| స్టియటైట్ | 0.27 |
| పలక | 0.16 |
| ఇతర ఖనిజాలు | 11.97 |
| | 200.00 |

వ్యాపారము : రాష్ట్రములో జరుగు వ్యాపారము సుమారు 225 కోట్ల రూపాయల విలువగలదనియు, రాష్ట్రము బయట జరుగు వ్యాపారము 129 కోట్ల రూపాయల విలువగలదనియు లెక్కవేసినారు. ఇందులో 68 కోట్ల రూపాయల విలువగల వస్తువులు దిగుమతిలో ఉన్నవి. రాష్ట్ర రాష్ట్రేతర వ్యాపారమును గురించి సరియైన లెక్కలు లేవు. కాని ఉజ్జాయింపుగా ఆంధ్ర రాష్ట్రము ఇతర రాష్ట్రాలతోచేయు ఎగుమతి దిగుమతులను ఈ క్రిందివిధముగా చూపవచ్చును.

| ఎగుమతులు | విలువ రూ. |
|---|---|
| పశువులు | 81,900 |
| గొర్రెలు, మేకల (సంఖ్య) | 1,02,068 |
| ఇతర పశువుల (సంఖ్య) | 37,88,600 |
| ఎముకలు | 1,24,611 |
| తోళ్ళు (పచ్చివి) | 12,42,486 |
| మేకతోళ్ళు (పచ్చివి) | 13,43,800 |
| తోళ్ళు - ఊనినవి | 69,176 |
| బియ్యము | 85,53,165 |
| ఇతర రకాలు | 6,75,380 |
| సజ్జలు | 57,70,872 |
| పప్పులు | 37,61,408 |
| నూనెలు, నూనెగింజలు | 8,40,37,924 |
| సిమెంటు | 18,35,163 |
| జనపనార | 1,16,56,855 |
| గోనెసంచి - గుడ్డ | 1,48,35,232 |
| మాంగనీసు | 50,68,100 |
| ఉప్పు | 18,59,559 |
| బెల్లము | 1,02,91,627 |
| పంచదార | 18,55,376 |
| పొగాకు | 3,47,04,180 |
| నెయ్యి | 64,07,199 |
| చేకు, కలప | 1,32,63,464 |
| రంగులు, వగైరా | 78,330 |
| పండ్లు (ఎండినవి) | 6,45,52,444 |
| నార | 5,03,232 |
| లక్క | 27,440 |
| | 27,59,07,911 |

| దిగుమతులు | విలువ రూ. |
|---|---|
| సిమెంటు | 9,17,967 |
| బొగ్గు | 85,42,765 |
| ఇనుము, ఉక్కు | 2,77,69,406 |
| లక్క | 1,42,400 |
| మాంగనీసు | 3,45,72,265 |
| కిరసనాయిలు | 36,25,376 |
| చేకు, కలప | 4,78,66,094 |
| కాఫీ | 46,38,193 |
| టీ | 35,70,850 |
| ప్రత్తి - నూలు | 1,25,78,160 |
| గుడ్డలు | 2,39,14,048 |
| నార | 4,03,899 |
| జనుము | 38,19,260 |
| వూలు | 7,05,078 |
| గోనెగుడ్డ | 78,87,040 |
| పండ్లు (ఎండువి) | 1,10,75,316 |
| నెయ్యి | 1,09,100 |
| సజ్జలు | 44,24,584 |
| పప్పుదినుసులు | 4,12,09,760 |
| ఇతరములు | 15,35,940 |
| గడ్డి | 1,15,55,426 |
| నూనెలు, నూనెగింజలు | 35,60,090 |
| పంచదార | 1,77,27,022 |
| | 27,52,83,674 |

దీనినిబట్టి పారిశ్రామికాభివృద్ధి కొరతపడ్డ రాష్ట్రాలలో దిగుమతులు ఎక్కువగా ఉండును. ఒక్క మదరాసు రాష్ట్రమునుండియే ఆంధ్రరాష్ట్రము సాలీనా పదికోట్ల రూపాయల వస్తువులను అదనముగా దిగుమతి చేసికొనుచున్నది.

**విదేశ వ్యాపారము :-** ఆంధ్ర రాష్ట్రముయొక్క విదేశ వ్యాపారము ముఖ్యముగా విశాఖపట్టణము, కాకినాడ, మదరాసు రేవులద్వారా జరుగుచున్నది.

**విశాఖపట్టణము :-** ఇక్కడినుండి 20 కోట్ల రూపాయిల సరుకు ఎగుమతి అగుచున్నది. మాంగనీసు, పొగాకు మిరపకాయలు, వేరుసెనగనూనె, ఇనుమురాయి, బెల్లము, తోళ్ళు, కాయలు, ఆముదము, స్పిరిటు, సిమెంటురాయి, కొమ్ములు, ఎముకలు, పసుపు, డివిడివి చెక్క, తివాచీలు, గ్రాఫైట్ మొదలైనవి ఉన్నవి.

**కాకినాడ :-** ఇక్కడినుండి మూడుకోట్ల రూపాయల విలువగల వస్తువుల ఎగుమతి ఉన్నది. పొగాకు, జీడిపప్పు, కాటినార, నూనెలు, తోళ్ళు, తోళ్ళు శుభ్రపరచెడు దినుసులు, ప్రత్తి, పసుపు మొదలైనవి ఇందు కలవు.

**మదరాసు :-** ఈ రేవుగుండ మొత్తము 56 కోట్ల రూపాయల విలువగల వస్తువులు ఎగుమతులుగా వెళ్ళుచున్నవి. అందులో ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించిన వస్తువుల విలువలు : మైకా రు. 188 లక్షలు ; నూనెలు, గింజలు రు. 598 లక్షలు ; పొగాకు రు. 388 లక్షలు, మాంగనీసు రాయి రూ. 51లక్షలు ; చందనము, నూనె రూ. 38 లక్షలు; ఇనుపరాయి రూ. 20లక్షలు; క్రైనైట్, స్టియటైట్ రూ. 6 లక్షలు. మొత్తము 12కోట్ల 29లక్షల రూపాయల వస్తుసామగ్రి ఎగుమతియగుచున్నది. ఆంధ్ర దేశము మొత్తము ఎగుమతులు 40 కోట్ల రూపాయలని అంచనా వేయబడినది. ఎగుమతులు ఎక్కువ భాగము యునైటెడ్ కింగ్‌డం, అమెరికా, జపాను, జర్మనీ, కెనడా మొదలైన దేశాలకు వెళ్ళుచున్నవి.

**దిగుమతులు :** పక్కలు, క్రొవ్వువత్తులు, బొగ్గు, సైకిళ్ళు, ఖర్జూరము, మందులు, విద్యుచ్ఛక్తి సామాను, ఇనుప సామాను, నూనె, పెట్రోలు, మోటారు నూనెలు, యంత్ర సామగ్రి, లోహాలు, మోటార్లు, రాసాయనికపు నూనెలు, రంగులు, వార్నీషు, గుడ్డలు, నూలు మొదలైనవి ఎన్నో ఉన్నవి. విశాఖపట్టణము, కాకినాడ రేవులలో దిగుమతి అగుచున్నవి. విశాఖపట్టణములో ముఖ్యముగా యంత్రసామగ్రి, తిండిగింజలు దిగుమతి అగుచున్నవి. కాకినాడలో తిండిగింజలే ముఖ్యమైన దిగుమతి. మిగతావి మదరాసు రేవునకే వచ్చుచున్నవి. రేవు పట్టణాల అభివృద్ధికి కూడ ఆంధ్రరాష్ట్రము ఎంతో పాటు పడవలసి యున్నది.

ఆంధ్రరాష్ట్రపు వ్యాపారము ఈ క్రింది విధముగా జరుగుచున్నది.

| | ఎగుమతులు లక్షల రూ. | దిగుమతులు లక్షల రూ. |
|---|---|---|
| రైలుమార్గం గుండా | 27,59 | 27,52 |
| మదరాసు రేవు | 22,00 | 35,00 |
| ఆంధ్ర రేవులు | 18,00 | |
| | 67.59 | 62.52 |

పై పట్టిక ననుసరించి ఆంధ్రరాష్ట్రము 5,07 లక్షల రూపాయీలు అదనముగా వ్యాపారములు కలిగిఉన్నను మదరాసు రాష్ట్రపు వ్యాపారము కూడ లెక్క చూచికొనిన మొత్తము మీద 10 కోట్ల రూపాయలు తరుగు ఉండునని అంచనా వేయవచ్చును. ఆంధ్రరాష్ట్రములో కొన్ని పరిశ్రమలను స్థాపించిననే తప్ప ఈ పరిస్థితి చక్కబడుటకు అవకాశము లేదు.

డి. వి. కె.

**ఆంధ్రేతిహాస పరిశోధక మండలి :-** "ఆంధ్రేతిహాస పరిశోధక మండలి" అనునది రాజమహేంద్రవరములో స్థాపితమయిన చరిత్ర పరిశోధక సంస్థ. ఆంధ్ర దేశములో చరిత్ర విజ్ఞానాభివృద్ధికి, ముఖ్యముగా ఆంధ్ర చరిత్ర సమాలోకనమునకు కృషిసల్పు సంస్థలు లేకుండెను. అందుచే, కీర్తిశేషులు-చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావు, డాక్టర్ చిలుకూరి నారాయణరావు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగార్లు సమాలోచనముచేసి "ఆంధ్రేతిహాస పరిశోధకమండలి" సంస్థాపనమునకు ఉద్యమించిరి. ఏతదుద్యమ ఫలితముగా ఈ సంస్థ రాజమహేంద్రవరములో

1922 సెప్టెంబరు నెలలో స్థాపితమయ్యెను. 1860 సంవత్సరము 21 చట్టము ప్రకారము ఇది నమోదు కాబడినది.

మండలి ఉద్దేశములు: (1) తామ్ర, శిలాశాసనములు, నాణెములు, పురావస్తుసామగ్రి (ఇటుకలు, బొమ్మలు, పూసలు మొదలగునవి) తాళపత్ర గ్రంథములు సంపాదించుట, (2) ఈ చరిత్ర సామగ్రిని పరిశోధించి, పండిత సభలయందు వాటి విషయమై చర్చించుట, (3) చారిత్రకోత్సవములను జరుపుట, (4) చారిత్రక వస్తుప్రదర్శనములను ఏర్పాటుచేయుట, (5) ఆంగ్లమున త్రైమాసిక పత్రికను ప్రకటించుట, (6) ఆంధ్ర రాజవంశముల చరిత్రలను ప్రకటించుట, (7) ఉచిత పఠనాలయమును, పుస్తక భాండాగారమును నెలకొల్పుట.

మండలి కార్యకలాపములు 1924 నుండి సక్రమముగా, చురుకుగా జరుగసాగెను. శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు కార్యకర్తగా నుండి మండలి యుద్దేశ సాఫల్యమునకు అవిరళకృషి సలిపిరి. శ్రీ న్యాపతి కామేశ్వరరావు, శ్రీ రాజా కాంద్రేగుల శ్రీనివాస జగన్నాథరావు, శ్రీ డా. చిలుకూరి నారాయణరావు, శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారలు ధనసహాయము చేసిరి. చారిత్రక వస్తుసామగ్రిని ఇచ్చిరి. ఇతర విధముల అభిమానించి తోడ్పడిరి. విజయనగరరాజులైన శ్రీ విజయరామ గజపతిరాజుగారు మండలి భవననిర్మాణమునకై పదమూడు వేల రూపాయల విరాళము నొసంగిరి. ఇట్లే పెక్కుమంది వదాన్యుల సహాయమున గౌతమీతీరమున మండలికి స్వంతభవనము నిర్మాణమయ్యెను.

మండలి కార్యకలాపములలో సంఘమునకు కీర్తిని, ధనమును, ప్రజారంజకత్వమును తెచ్చిపెట్టినది ఆంగ్లమున ప్రకటితమగుచున్న త్రైమాసికపత్రిక. ఈ పత్రికాప్రచురణ కార్య విభాగమున 84 సంచికలు ప్రకటింపబడినవి. వీటికి పరివర్తనగ పెక్కు పత్రికలు, గ్రంథములు, మండలికి వచ్చుచున్నవి. వీటివలన వాచనాలయమును, గ్రంథ భాండారమును పరిపుష్టి చెందుచు, ప్రయోజనాత్మకముగ ఉపచరించుచున్నవి.

ప్రస్తుతము మండలికి 140 వ్యక్తి సభ్యులును, 60 సంస్థ చందాదారులు, 80 పరివర్తన సంస్థలు గలవు. కేంద్ర, ఆంధ్రప్రభుత్వములు మండలి సేవనుగుర్తించి ధనసహాయము చేసినవి. గ్రంథ భాండారమున,

| | |
|---|---|
| 1. చరిత్ర, శాసనసంపుటములు | 3000 |
| 2. మాసపత్రికలు | 1000 |
| 3. తామ్రపు రేకులు | 24 |
| 4. బంగారు, వెండి, రాగి, సీసము నాణెములు అన్ని ఆంధ్ర రాజవంశములకు సంబంధించినవి | 200 |
| 5. తామ్రశాసనములు | 4 |
| 6. శిలాశాసనములు | 40 |
| 7. అమూల్యము, అపూర్వములు అయిన వ్రాత ప్రతులు | 35 |
| 8. తాళపత్ర గ్రంథ ప్రతులు | 1000 |

కలవు.

చారిత్రకోత్సవములు, జయంత్యుత్సవములు జరుపబడినవి. చాళుక్య (1922), కళింగ (1927), కాకతీయ (1932), రెడ్డి (1937), విజయనగర (1946), వేంగి (1947) రాజ్యములనుగూర్చి ఆయారాజ్యముల ప్రధాన నగరములందు మహోత్సవములు జరుపబడినవి. ఉత్సవ దినములలో పరిశోధక విషయచర్చలు, ప్రసంగములు, చారిత్రక వస్తుప్రదర్శనములు జరుపబడినవి. అంతియేగాక మండలి దశాబ్ది జయంత్యుత్సవము, రజతోత్సవము ఘనముగ జరుపబడినవి. పురాతత్వ పరిశోధనయందు ప్రారంభకులయిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారి అభినందన జయంత్యుత్సవముగూడ జరుపబడినది. ఈ సమ్మేళనములు చరిత్ర పఠనాసక్తికిని, చరిత్ర విజ్ఞానప్రసారమునకును దోహదమొనర్చి, మండలి కార్యక్రమమునకు శోభ తెచ్చినవి. ఈ యుత్సవముల జ్ఞాపకార్థము అమూల్యములైన ప్రత్యేక సంచికలు సర్వాంగశోభితముగ ప్రకటితము లయినవి. ఈ సంచికలయందు, ఆయా రాజ్యములకును, విషయములకును సంబంధించిన వ్యాసములు, శాసనములు మున్నగునవి కలవు.

మండలి యుద్దేశములు చాలవరకు కొనసాగినవనియే చెప్పవలయును. ఇప్పుడు మండలివారు మూడు సంపుటములలో ఆంధ్రదేశ చరిత్రను రచించుటకు సంకల్పించినారు. వస్తుప్రదర్శనశాల కొక భవనమును, పత్రికాపఠన

శాల కొక భవనమును నిర్మింపదలచి యున్నారు. ఈ ఆశయములు నెరవేర్చుటకు తగు ప్రోత్సాహము లభించు నని మండలివారాశించుచున్నారు.

రా. సు.

**ఆంధ్రోద్యమము (తెలంగాణములో)** :- రెండు నూర్ల పాతిక సంవత్సరాల ఆసఫ్జాహి పరిపాలన ఫలిత ముగ హైదరాబాదు రాష్ట్రములో ఆంధ్రుడు తౌరక్యాంధ్రుడైనాడు. అతనికి అరబ్బీ, పారసీభాషలతో అతురాభ్యాసము కావించుదుస్థితికలిగినది. ఉర్దూభాష రాజభాష, యగుటయేగాక ప్రాథమికదశనుండి విశ్వవిద్యాలయ దశవరకు బోధనాభాషకూడా అయినందున ఆంధ్రభాషకు కొన్ని శతాబ్దాల అజ్ఞాతవాసము ప్రాప్తించినది. ఈకాలమున ఆంధ్రుడు అన్ని రంగములందు వెనుకబడినాడు. పరిపాలనా రంగమున అతనికి తగిన స్థానము లభించ లేదు. పరదా, వరశుల్కము మొదలైన సాంఘికదురాచారములు ప్రబలియుండెను. తెలుగురైతు పన్నులభారముతో క్రుంగి దరిద్రదేవత పాదాలక్రింద నలిగిపోయెను. చదువుకొన్న వారిసంఖ్య నూటికి మూడింటివరకు దిగజారెను. తెలంగాణమున పాఠశాలలు, కళాశాలలు చాలాకొద్దిగా నుండెను. ఇట్టి పరిస్థితిలో ప్రారంభమైనది ఆంధ్రోద్యమము.

హైదరాబాదు నగరమున 1-9-1901 వ సంవత్సరమున స్వర్గీయ శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు ప్రోత్సాహముతో శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము స్థాపితమైనది. ఈ ప్రయత్నమున లక్ష్మణరావు గారి సహచరులుగా నిలచి పనిచేసినవారు శ్రీ మునగాల రాజాగారును, స్వర్గీయ శ్రీ రావిచెట్టు రంగారావు గారును. కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయమును తెలంగాణమందేకాక సకలాంధ్రమందును మొట్టమొదటి గ్రంథాలయముగా పేర్కొనవచ్చును. తెలంగాణమున హనుమకొండ మొదలైన పట్టణాలలో 1901 నుండి 1910 వరకు మరికొన్ని గ్రంథాలయాలు లక్ష్మణరావు గారు చూపినదారిన స్థాపితమైనవి. ఈకాలముననే విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి కూడ హైదరాబాదులో స్థాపితమైనది. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని ఆంధ్ర తెలంగాణ మధ్యదృఢమైన సాంస్కృతికబంధనముగా ఏర్పాటుగావించిన లక్ష్మణరావుగారే విశాలాంధ్ర ఉద్యమానికి కూడ పునాదులు వేసిరని చెప్పవచ్చును. హైదరాబాదులో ఆంధ్రోద్యమము ఈవిధముగా ఈ శతాబ్ది ప్రారంభమున వైజ్ఞానికోద్యమముగా ప్రారంభమయి క్రమక్రమముగ రాజకీయోద్యమమున పరిణమించినది. ఆనాడు గ్రంథాలయోద్యమముద్వార తెలంగాణమును ప్రబోధించిన వారిలో కీ. శే. ఆదిపూడి సోమనాథరావు, కీ. శే. మైలవరపు నరసింహశాస్త్రి గారలను ప్రత్యేకముగ స్మరించవలసి యున్నది. శేషాద్రిరమణ కవుల "నిజాంరాష్ట్ర ప్రశంస" అను ఖండకావ్యమును కూడ ప్రత్యేకముగ పేర్కొనవలసియున్నది.

ఇరువది సంవత్సరాల గ్రంథాలయోద్యమము తెలంగాణమును కొంత మేల్కొల్పినది. ఇట్టి సందర్భములో 1921 వ సంవత్సరమున హైదరాబాదు నగరమున సుప్రసిద్ధ మహారాష్ట్ర విద్వాంసుడైన ధోండు కేశవ కార్వే పండితుని అధ్యక్షతన జరిగిన సంఘ సంస్కరణ సభలలో అప్పుడు హైదరాబాదులో న్యాయవాదులుగా నుండిన ఆలంపల్లి వేంకటరామారావుగారు తమ ఉపన్యాసమును తెలుగులో ప్రారంభించగా మహారాష్ట్రసభ్యులు చప్పట్లతో హేళనగావించిన సంఘటనము చరిత్రనిర్మాణమునకు కారణభూతమైనది. ఈ సంఘటనమును అవమానముగ భావించిన ఆంధ్రులు ఆనాటి రాత్రి కీ. శే. టేకుమాల రంగారావు, హైకోర్టు వకీలుగారి ఇంటిలో సమావేశమై ఆంధ్రజనసంఘమును స్థాపించిరి. ఇది ఆంధ్రోద్యమ చరిత్రలో మహత్తరమైన సంఘటనము. ఆంధ్రజనసంఘ స్థాపన గావించిన సమావేశములో శ్రీ బూర్గుల రామకృష్ణారావు పంతులుగారు, మాడపాటి హనుమంతరావు పంతులుగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు మొదలైన పెద్దలు పాల్గొనియుండిరి. ఈ ఆంధ్రజన సంఘము తత్క్షణమే తనపనిని ప్రారంభించి, నూరుగురు సభ్యులను చేర్పించి 4-4-1922 నాడు తెలంగాణ నాయకులైన శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారి అధ్యక్షతన సమావేశమును ఏర్పాటుకావించి చిత్తునియమావళి నామోదించి కార్యనిర్వాహకవర్గమును ఎన్నుకొనుట జరిగినది. ఆనాటి కార్యనిర్వాహక వర్గమునకు కీ. శే. బ్యారిస్టర్ రాజగోపాల రెడ్డిగారు అధ్యక్షులుగను, ఆంధ్రపితామహ

(ఇప్పుడు పద్మభూషణ) మాడపాటి హనుమంతరావు పంతులుగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి.

**ఆంధ్రజన సంఘముయొక్క ఆదర్శములు:-**

1. ఈ సంఘమునకు నిజాం రాష్ట్రాంధ్ర జన సంఘమని పేరు.

2. నిజాం రాష్ట్రమునందలి ఆంధ్రులయందు పరస్పర సానుభూతిని కలిగించి, వారి అభివృద్ధికై ప్రయత్నించుట ఈ సంఘముయొక్క ఉద్దేశము.

3. ఈ రాజ్యములోని ఆంధ్రులకొరకు సంఘము లను సంస్థలను స్థాపించుట, ఉన్నవానికి సహాయము చేయుట, ఉపన్యాస సభలను సమావేశ వరచుట మున్నగు కార్యముల వలన పై ఉద్దేశములు నెరవేర్చ బడును.

4. ఈ రాజ్యములోని ప్రతి ఆంధ్రవ్యక్తియు, పదు నెనిమిది వత్సరములకన్న మించిన వయస్సు కలిగి, చదువను, వ్రాయను నేర్చినచో ఈ సంఘమున సభా సదుడు కావచ్చును.

ఈ ఆంధ్రజన కేంద్రసంఘము స్థాపితమైన సంవత్సర మునకు అనగా 1923వ సంవత్సరమున ఒక ఉపనియమా వళి సిద్ధము చేయబడి అందులో జిల్లాలలోను, కేంద్రము నందును ఆంధ్రజనసంఘము నెరవేర్చవలసిన విధులు ఈ విధముగా నిర్ణయింపబడినవి :

(అ) గ్రంథాలయములను స్థాపించుట, పఠన మందిర ములను పాఠశాలలను స్థాపించుట.

(ఆ) విద్యార్థులకు సహాయముచేసి ప్రోత్సహించుట.

(ఇ) విద్వాంసులను గౌరవించుట.

(ఈ) తాళపత్ర గ్రంథములను, శాసనముల ప్రతు లను సంపాదించుట, పరిశోధించుట.

(ఉ) కరపత్రముల మూలముననూ, లఘుపుస్తకముల మూలముననూ విజ్ఞానము వ్యాపింపజేయుట.

(ఊ) ఆంధ్ర భాషా ప్రచారమునకై వలయు ప్రయ త్నములు జరుపుట.

(ఋ) వ్యాయామములను, కళలను ప్రోత్సాహ పరచుట.

(ౠ) అనాథులగువారికి అత్యవసరమగుసహాయము చేయుట.

ఈ ఆదర్శములను, సాధనములను నిర్ణయించినపుడు ఈ సంస్థ నిజాంరాష్ట్రవాసులైన స్త్రీ పురుషులకు మాత్రమే పరిమితమైనట్లు స్పష్టమగుచున్నది. తరువాత నగర ఆంధ్రజనసంఘ కార్యకర్తల పర్యటన, ప్రచార, ప్రబోధ ఫలితముగ జిల్లాలలో ఆంధ్రజనసంఘములు స్థాపితమైనవి. ఈవిధముగ స్థాపితమైన (1) హైదరాబాదు, (2) సికింద్రాబాదు, (3) వరంగల్లు, (4) ఖమ్మము, (5) హుజూరాబాదు ప్రతినిధులు హనుమకొండలో 1-4-1923 నాడు సమావేశమై ఆంధ్రజనకేంద్రసంఘ నియమావళి నంగీకరించిరి. ఈ విధముగ నేర్పడిన కేంద్ర సంఘముయొక్క మొదటి సమావేశము 27-7-1923 నాడు హైదరాబాదులో జరిగి ఆంధ్రజన కేంద్ర సంఘ ములు చేయవలసిన కార్యములను నిర్ణయించినది. ఈ కార్యములను పరిశీలించినపుడు ఆంధ్రజన సంఘముల కార్యక్షేత్రము విద్యా, వైజ్ఞానిక, వర్తక, వ్యాయా మాది సమస్యలకుమాత్రమే పరిమితమైయుండి రాజకీయా లకు దూరముగా నుండినట్లు స్పష్టముకాగలదు. తరువాత కేంద్రసంఘ సమావేశాలు నల్లగొండ, మధిర, సూర్యా పేట, జోగిపేట, దేవరకొండ, ఖమ్మము, సిరిసిళ్ళ అనుచోట్ల మొత్తము ఎనిమిది సమావేశాలు జరిగినవి. ఈ కాలమున ఆంధ్రజన కేంద్ర సంఘముయొక్క కార్యక్రమమును పరిశీలించినపుడు విద్యార్థులను ప్రోత్సహించుట, గ్రంథా లయములను స్థాపించుట, గ్రంథాలయ సభలనుచేయుట, వర్తకసంఘములను స్థాపించుట, వర్తకసమస్యలను గూర్చిన లఘుపుస్తకములను ప్రకటించుట, వెట్టిచాకిరి మొదలగు సామాజిక సమస్యలనుగూర్చి ప్రబోధము కావించి తీర్మానాలుచేయుట, పాఠశాలల స్థాపనను గూర్చినసమస్యలను చర్చించుట, ప్రచారకార్యక్రమమును నిర్వహించుట ప్రధానములుగ గన్పట్టుచున్నవి. మధిర లోను, సూర్యాపేటలోను ఈ కేంద్రసంఘ సమావేశాలతో పాటు రెండు గ్రంథాలయ సభలుకూడ జరిగినవి. తాళపత్ర గ్రంథసేకరణమునుగూర్చి ఈసంఘము ప్రత్యేక శ్రద్ధను వహించి ఒక ఆంధ్ర పరిశోధక సంఘమునుకూడ స్థాపించి నది. ఇదియే ఇప్పటి "లక్ష్మణరాయ పరిశోధక మండలి." ఈ మండలివారు, విశేషించి మండలియొక్క కార్య దర్శి శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు తెలంగాణమందలి

శాసనములను సేకరించి ప్రచురించుటలో ప్రశంసనీయ మైన కృషిగావించిరి.

ఈ కాలమున ఆంధ్రోద్యమమునకు అండగానిల్చిన "నీలగిరి" (స్థాపితము 24-8-1922 నల్లగొండ), "తెనుగు పత్రిక" (స్థాపితము 27-8-1922 ఇనుగుర్తి, మానుకోట తాలూకా) అను వారపత్రికలను ప్రత్యేకముగ ప్రశంసించవలసియున్నది. 10-5-1926 నాడు ఆంధ్రోద్యమము నకు పెట్టనికోటగా "గోలకొండ పత్రిక" ప్రారంభమైనది. ఆంధ్రోద్యమవ్యాప్తికి, వికాసమునకు ఈ పత్రికలు మిక్కిలి తోడ్పడినవి. ఆంధ్రజనసంఘము కేవలము రాజకీయేతర సమస్యలనే తీసికొన్నప్పటికిని ఈ సభల సందర్భమున ప్రభుత్వముయొక్క వ్యవసాయ, పశుచికిత్స, సహకార, వైద్యశాఖల ప్రదర్శనాలు ఏర్పాటు చేసినప్పటికిని ఇతర విధములుగ ప్రభుత్వముతో సహకరించుటకు ప్రయత్నించినప్పటికిని, ప్రభుత్వమునకు మాత్రము ఇందులో ఏవో రాజకీయాలు ఇమిడియున్నవను అనుమానము అప్పుడప్పుడు కలుగుచుండెను. ఈ అనుమానముతో సభలకు అనుమతి నిచ్చుటయందు ప్రతిబంధకములు కల్పించబడినవి. అప్పుడు హైద్రాబాదులో అమలులోనుండిన వాగ్బంధన శాసనముయొక్క ప్రతిబంధకములనుగూడ ఎదుర్కొనవలసి వచ్చెను. ఈ వాగ్బంధనశాసన ప్రయోగము వలన ప్రభుత్వముయొక్క అనుమతి లేక సమావేశాలు జరుపుటగాని, పత్రికలు నడపుటగాని, సాధ్యముగాని పరిస్థితి యేర్పడి యుండెను. తుదకు ఒక గ్రామములో పాఠశాలను పెట్టవలెననినను, గ్రంథాలయము స్థాపించవలెననినను ప్రభుత్వముయొక్క అనుమతి అవసరమై యుండెను. ఈ అనుమతి సాధారణముగా దొరకుచుండెడిది కాదు. విశ్వప్రయత్నము గావించవలసి వచ్చెడిది. ఇట్టి ప్రతికూల పరిస్థితులలో ఈ ఆంధ్రోద్యమ నౌకను మిగుల జాగ్రత్తగా నడిపిన గౌరవము శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి చెందుచున్నది. క్రమ క్రమముగ ప్రత్యక్ష రాజకీయాలకు దూరముగా నున్నప్పటికిని, ప్రజల కష్ట నిష్ఠురములనుగూర్చి ఈసభలు శ్రద్ధ వహించక తప్పదయ్యెను. అందుచేత తిప్పర్తి, సూర్యాపేట, మున్నగుచోట్ల రైతుల కష్టసుఖములను విచారించుటకు రైతుసంఘములను స్థాపించుటకూడ జరిగెను. మొత్తముమీద 1930 వ సంవత్సరమువరకు అనగా మొదటి 8 సంవత్సరాలకాలము ఆంధ్ర సంస్కృతిని, ఆంధ్రభాషను కాపాడుటకు కృషిసల్పుటయే, ఆంధ్రోద్యమముయొక్క ఆశయమై యుండెను. ఈ కాలమున స్త్రీల సభలను ఏర్పాటుచేసి మహిళలలో ప్రచారము చేయు కార్యక్రమము నిర్వహించుట జరిగినది. ఆనాడు మహిళాప్రబోధము గావించినవారిలో శ్రీమతి చాట్రాతి లక్ష్మీనరసమ్మగారిని ప్రత్యేకముగ పేర్కొనవలసి యున్నది.

ఆంధ్ర జనసంఘములు ఈ విధముగా అక్కడక్కడ స్థాపితములయి కొంతపని చేయుచుండగా "అరువదిలక్షలకు మించిన నిజాం రాష్ట్రాంధ్రులయొక్క కష్టసుఖములను తెలిసికొనుటకును, వారి సమష్టి అభిప్రాయమును నిర్మించుటకును" ఒక మహాసభ అవసర మను భావము క్రమ క్రమముగ ప్రచారమై తత్ఫలితముగ 1930 సం. మార్చి 3, 4, 5, తేదీలలో జోగిపేటలో మొట్టమొదటి ఆంధ్ర మహాజనసభ ఏర్పాటు జరిగినది. ఈ మహాసభకు అధ్యక్షులు కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు. ఈ మహాసభకు ఎంతో కష్టముమీద క్రింది షరతుల ప్రకారము అనుమతి లభించినది: (1) అధ్యక్షుడు పరదేశీయుడు (గైర్ ముల్కి) కాకూడదు. (2) ఇతర మతస్థులకు మన స్తాపముగాని, అనుమానముకాని కలుగు పరిస్థితి కల్పింపకూడదు. (3) రాజకీయ ప్రసక్తి ఉండకూడదు. ఈ మహాసభతోపాటు మొట్టమొదటి ఆంధ్రమహిళాసభకూడ జరిగినది. ఈ ఆంధ్రమహాసభలో వాగ్బంధన శాసనము రద్దు చేయవలెననియు; ప్రాథమిక విద్య నిర్బంధముగ ప్రవేశ పెట్టవలెననియు, మద్యపాన దురభ్యాసమును పోగొట్టవలెననియు, రైతులకు కొన్ని అనుకూలములు కల్పించవలెననియు, వెట్టిచాకిరిపోవలెననిచేయు, మహిళా సభలో వివాహసమస్య, వితంతువుల స్థితి మొదలగు అంశములను గూర్చియు తీర్మానములు జరిగినవి. ఈ తీర్మానములను పరిశీలించినపుడు ఇవి అన్నియు రాజకీయేతర తీర్మానములే యని స్పష్టము కాగలదు. ఈ విధముగ 1930 నుండి 1946 వరకు పదుమూడు ఆంధ్రమహాసభా సమావేశాలు జరిగినవి. ఈ సమావేశాల వలన అపారమయిన ప్రబోధము కలిగినది. మొదటి పది మహాసభలతోపాటు

పది మహాసభలు కూడ జరిగినవి. ఈ మహాసభలు జరుపుకొనుటకు ప్రభుత్వమువారి అనుమతి తీసికొనుటకై భగీరథ ప్రయత్నాలు జరిపిన నిదర్శనాలు కన్పించుచున్నవి. ఆంధ్రోద్యమము సజీవమయిన ప్రజల ఉద్యమముగ అభివృద్ధి చెంది, మహారాష్ట్ర, కర్ణాటక ఉద్యమాలకు మార్గదర్శకమై 1946 తరువాత స్టేట్ కాంగ్రెస్ ఉద్యమములో లీనమైనది.

ఆంధ్రోద్యమము యొక్క క్రమక్రమవ్యాప్తి ప్రభుత్వమునకు అనుమానాలు అధికము కావింపజొచ్చెను. ఈ ఉద్యమము యొక్క పరిణామము ఆంధ్ర తెలంగాణాల ఏకీకరణముగా రూపొందగలదేమో యని 1936 వ సంవత్సరములోనే హైదరాబాదు ప్రభుత్వమునకు అనుమానము కలిగినట్లు అప్పటి హోం సెక్రటరీ నవాబ్ ఆలీయావర్జంగ్ గారు ప్రసంగవశమున నాల్గవ ఆంధ్రమహాసభ అధ్యక్షులైన మాడపాటి హనుమంతరావు గారికి తెలిపినట్లు ఆంధ్రోద్యమ చరిత్రలో గ్రంథస్థము కావింపబడినది. (91 వ పేజీ "తెలంగాణ ఆంధ్రోద్యమము" రెండవ భాగము). ఆనాటి ప్రభుత్వము యొక్క అనుమానము తుదకు ఈ నాడు సత్యస్వరూపము దాల్చుట గమనింపదగిన విశేషము.

మొట్టమొదటి అయిదు ఆంధ్రమహాసభలు రాజకీయాల జోలికి పోలేదు. ఆంధ్రమహాసభల సమావేశాలలో వ్యాయామ ప్రదర్శనాలు, నాటక ప్రదర్శనాలు, ప్రబోధాత్మకమగు పద్యపఠనము మొదలగు సాంస్కృతిక కార్యకలాపములు ప్రత్యేక స్థానము వహించుచుండెను. ఇట్టి పరిస్థితులలో 1937 వ సంవత్సరమున నిజామాబాదులో జరిగిన ఆంధ్ర మహాసభ ఆరవ సమావేశమునకు చారిత్రాత్మకమగు రాజకీయ ప్రాధాన్యము కలదు. ఇందులో కారణాలు రెండు. (1) ఆంధ్రమహాసభలలో తెలుగు మాతృభాష కానివారుకూడ పాల్గొనుట జరుగుచుండెను. ఇప్పటివరకు "మహాసభా కార్యక్రమము, చర్యలు, కవిలె ఆంధ్రభాషయందే జరుగవలెనను నియమము ఒకటియుండెను. కాని నిజామాబాదు సభలో కొందరు ఉర్దూభాషలో మాట్లాడుట, దానిపై కొందరు ఆక్షేపణములు తెలుపుట, ఈ ఆక్షేపణములపై తీవ్రవాదోపవాదములు జరిగి ఆంధ్రప్రాంతమున నివసించువారందరు వారి మాతృభాష యేమయినప్పటికి ఆంధ్రులేయనియు, ఆంధ్రభాష మాట్లాడలేనివారు సభావేదికనుండి ఇతర భాషలలో మాట్లడవచ్చుననియు అధిక సంఖ్యాక ప్రతినిధులు నిర్ణయించిరి. మొదటినుండియు ఆంధ్రోద్యమ వ్యాప్తి కుల, మత, వర్గవిచక్షణములకు అతీతముగా జరుగుచుండెను. అందుచేత మహారాష్ట్రులు, కర్ణాటకులు, ముస్లింలు ఈ సభలలో పాల్గొని ప్రసంగించుట జరుగుచుండెను. కావున భాషా విషయమై పట్టుదల వహించుట సమంజసమును, రాజనీతియు కాకుండెను. కుల, మత, వర్గ, భాషా విచక్షణములను పాటింపక నిజాంరాష్ట్రాంధ్ర ప్రాంతమున నివసించు వారందరి యొక్క అభివృద్ధికై పాటుపడుట యను ఆంధ్రోద్యమము యొక్క విశాల దృక్పథమును అసందిగ్ధముగా స్పష్టీకరించుట యీ సందర్భమున జరిగినది. తత్ఫలితముగ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి నాయకత్వమున అసంతృప్తులైన కార్యకర్తలు "అభివృద్ధి పక్షము" నొకదానిని స్థాపించిరి. కాని ఈ పక్షము చురుకుగా పనిచేసినట్లు అగపడదు. క్రమక్రమముగ ఆంధ్ర మహాసభలలో రాజకీయములు ప్రాధాన్యము వహించి, భాషకు ప్రాధాన్యము తగ్గుటవలన భాషాభిమానులకు కొంత మనస్తాపము, నిస్పృహ కలిగినవి. తరువాత మెల్లమెల్లగా ఆంధ్ర భాషాభివృద్ధికి ప్రత్యేకసంస్థ కావలెనను భావము అంకురించి, వ్యాప్తిచెంది, బలపడి 1943 లో హైదరాబాదు నగరమున ఆంధ్ర మహాసభల సందర్భమున ఆంధ్ర సారస్వత సంస్కృతుల అభివృద్ధి సాధకముగ ఆంధ్రసారస్వత పరిషత్ స్థాపన జరిగినది. అది యొక ప్రత్యేకచరిత్ర. ఆంధ్రసారస్వత పరిషత్తు యొక్క ఆశయాల మీద విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి యొక్కయు ఆంధ్ర జనసంఘము యొక్కయు ప్రభావము స్పష్టముగా కన్పడుచున్నదని యీ సందర్భమున గమనించవలసిన సత్యము. (2) ఈ కారణము మొదటిదానికన్న ముఖ్యమైనది. ఆంధ్ర మహాసభ కార్యకర్తలలో పెక్కుమంది కాంగ్రెసు భావాలు, జాతీయ భావాలు కలిగియుండిరి. కాని మొట్టమొదటిసారి ఆంధ్రమహాసభా వేదికనుండి ఈ నిజామాబాదు సమావేశములోనే బాధ్యతాయుత ప్రభుత్వము నిజాంరాష్ట్రాంధ్రుల ఆదర్శమని అర్థము నిచ్చు తీర్మానము ఆమోదింపబడినది. ఈ విధముగ ఆంధ్రోద్యమానికి

రాజకీయాలతో సంబంధము లేదను పరిస్థితి తొలగిపోయినది. క్రమక్రమముగ బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనమే ఆంధ్రమహాసభ ఉద్దేశమనునది స్థిరపడిపోయినది. ఆంధ్ర మహాసభలో మితవాద నాయకుల పలుకుబడి తగ్గసాగినది. ఈ సమావేశము తరువాత బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనకొరకు అప్పటి స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహము నడిపినది. ఈసత్యాగ్రహముతో ఆంధ్రమహాసభకు ప్రత్యేక సంబంధము లేకపోయినప్పటికిని ఆంధ్రమహాసభ కార్య కర్తలు వ్యక్తిగతముగ ఈ సత్యాగ్రహములో పాల్గొనిరి. అప్పటి ఆంధ్ర నాయకులలో ప్రముఖులుగానుండిన శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ మందుముల రామచంద్రరావు, శ్రీ జమలాపురము కేశవరావుగార్లు సత్యాగ్రహము కావించి జైలుకుపోయిరి. తరువాత 1940 లో జరిగిన మల్కాపురం ఆంధ్రమహాసభకూడ రాజకీయముగా ముఖ్యమైనది. అప్పటి హైదరాబాదు ప్రభుత్వము ప్రవేశ పెట్టిన రాజ్యాంగ సంస్కరణములను బహిష్కరింపవలెనను తీర్మానము ఈ మహాసభలో అతివాదులైన శ్రీ రావి నారాయణరెడ్డిగారు ప్రవేశపెట్టిరి. దీనిని మితవాదులైన శ్రీ మందుముల నరసింగరావు, శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ కొండా వేంకట రంగారెడ్డిగార్లు ప్రతిఘటించిరి. అయినప్పటికి తీర్మానము నెగ్గినది. ఈసందర్భమున "ఏడవ ఆంధ్రమహాసభ నాటికి యువనాయకత్వము బలపడినది" అని ఆంధ్రోద్యమ చరిత్రకారులు గ్రంథస్థము కావించియున్నారు. (తెలంగాణ ఆంధ్రోద్యమము రెండవభాగము పుట 142)

1942 లో ఓరుగల్లు సమీపమున ధర్మవరము గ్రామమందు జరిగిన ఆంధ్ర మహాసభకూడ రాజకీయముగ చాల ముఖ్యమైనది. ఇందులో శ్రీ రావి నారాయణ రెడ్డిగారు క్రొత్త ఆదర్శములచే ప్రేరేపితులై ముందునకు వచ్చిరని 'ఆంధ్రోద్యమ చరిత్ర' కారులు వ్రాసియున్నారు. క్రమక్రమముగ ఆంధ్ర మహాసభలో శ్రీ నారాయణరెడ్డిగారొక నూతన వర్గమునకు నాయకత్వము వహించిరి. తత్ఫలితముగా తరువాత జరిగిన సభలలో జాతీయ పక్షమనియు, కమ్యూనిస్టు పక్షమనియు రెండు ప్రస్ఫుటమైన వర్గాలు ఏర్పడినవి. భువనగిరిలో జరిగిన పదునొకొండవ ఆంధ్రమహాసభలో రావి నారాయణరెడ్డిగారి పక్షము ప్రాబల్యము వహించినది. మితవాదులు జాతీయ వాదులు ఇందు పాల్గొనలేదు. భువనగిరి మహాసభ తరువాత ఆంధ్ర మహాసభ రెండు మహాసభలుగ చీలిపోయినది. ఒకటి జాతీయాంధ్ర మహాసభ, రెండవది శ్రీ రావినారాయణ రెడ్డిగారి ప్రాబల్యము కలిగిన ఆంధ్ర మహాసభ. భువనగిరి మహాసభను బహిష్కరించిన ఆంధ్ర నాయకులు 1945 వ సంవత్సరమున మడికొండలో శ్రీ మందుముల నరసింగరావుగారి అధ్యక్షతన పండ్రెండవ మహాసభ కావించిరి. ఈ మహాసభకు శ్రీ కొండా వేంకట రంగారెడ్డిగారు పెట్టనికోటయై యుండిరి. ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారి ఆశీస్సులు ఈసభకు లభించినవి. శ్రీ బూర్గుల రామకృష్ణారావు పంతులుగారి సానుభూతికూడ ఈ మహాసభకు లభించినది. కీ. శే. జమలాపురం కేశవరావుగారు కూడ ఈ మహాసభనే బలపరచిరి. శ్రీ రావినారాయణ రెడ్డి వర్గమువారు పండ్రెండవ ఆంధ్ర మహాసభను ఈ సంవత్సరమే ఖమ్మం పట్టణములో జరిపిరి. ఈ విధముగ ఆంధ్ర మహాసభ రెండుగా చీలిపోయినది. తరువాత 1946 లో కీ. శే. జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన పదుమూడవ మహాసభ మెదకు జిల్లాయందలి కంది గ్రామమున జరిగినది. ఇదియే తుట్టతుది ఆంధ్ర మహాసభ. వైజ్ఞానికోద్యమముగ ప్రారంభమైన ఆంధ్రోద్యమము బాధ్యతాయుత ప్రభుత్వమే తన ఆదర్శముగా నిర్ణయించుకొన్న ఉద్యమముగ పర్యవసించినది.

కందిమహాసభ తరువాత ఆంధ్రమహాసభ స్టేటుకాంగ్రెసులో లీనమయి, స్టేటు కాంగ్రెస్ ఆంధ్రప్రాంత సంఘముగా రూపొందినది. ఈ స్టేటుకాంగ్రెస్ ఆంధ్రప్రాంత సంఘము యొక్క మొదటి సమావేశము 1947 లో జడ్చర్లలో జరిగినది. హైదరాబాదులో పోలీసుచర్య జరిగి తర్వాత స్టేటుకాంగ్రెసు హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసుగా రూపొందినతరువాత ప్రత్యేకముగ హైదరాబాదులో ఆంధ్రప్రాంతమునకు కాంగ్రెసుకమిటీకి అవకాశము లేపోయినది.

పదునారు సంవత్సరాల వయస్సుకలిగిన ఆంధ్రోద్యమ చరిత్రలో మొత్తము పదుమూడు ఆంధ్ర మహాసభలు జరిగినవి. వీని కధ్యక్షతవహించిన పెద్దలు (1) కీ. -

సురవరం ప్రతాపరెడ్డిగారు, (2) శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు, (3) శ్రీ పులిజాల వేంకట రంగారావుగారు, (4) శ్రీ మాడపాటి హనుమంతరావు గారు, (5) శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారు, (6) శ్రీ మందుముల నరసింగరావుగారు, (7) శ్రీ మందుముల రామచంద్రరావుగారు, (8) శ్రీ రావి నారాయణరెడ్డి గారు, (9) శ్రీ మాదిరాజు రామకోటేశ్వరరావుగారు, (10) శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారు, (11) శ్రీ రావి నారాయణరెడ్డిగారు, (12) (అ) శ్రీ మందుముల నరసింగరావుగారు, (ఆ) శ్రీ బద్దం ఎల్లారెడ్డిగారు, (13) కీ. శే. జమలాపురం కేశవరావుగారు. వీనితో పాటు జరిగిన పది మహిళాసభలకు శ్రీమతులు నడింపల్లి సుందరమ్మ, టి. వరలక్ష్మమ్మ, ఎల్లాప్రగడ సీతాకుమారి, మాడపాటి మాణిక్యమ్మ, బూర్గుల అనంతలక్ష్మీదేవి, నందగిరి ఇందిరాదేవి, యోగ్యశీలాదేవి, రంగమ్మ, ఓబులరెడ్డిగారలు అధ్యక్షత వహించిరి.

పోలీసుచర్య తరువాత ఆంధ్రోద్యమములో మరొక అధ్యాయము ప్రారంభమైనది. ఆనాడు 1936 లో అప్పటి హైదరాబాదు హోం సెక్రటరీ ఆంధ్రోద్యమము ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణ ఉద్యమముగా రూపొంద గలదని వెల్లడించిన అనుమానము పోలీసుచర్య తరువాత సత్యమైనది. పోలీసుచర్య తరువాత ఘనపురంలో జరిగిన హైదరాబాదు ఆంధ్రప్రాంత కాంగ్రెస్ సంఘ సమావేశములో ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణముజరుగవలెనని తీర్మానించబడినది. ఈ తీర్మానమును గోలకొండ మొదలైన తెలుగు పత్రికలు ఆమోదించి హర్షించినవి. నిజామాబాదునందు జరిగిన హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెస్ సమావేశమందు హైదరాబాదు విభజనముజరిగి ఆంధ్ర - తెలంగాణాల ఏకీకరణము జరుగవలెనని అర్థము నిచ్చు తీర్మానము చేయబడినది. ఈ తీర్మానమునే 2-6-1953 నాడు హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెస్ పునరుద్ఘాటించినది. ఈ విధముగ పోలీసుచర్య తరువాత నుండి జూన్ నెల 1954 వరకు హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెస్, కమ్యూనిస్టుపార్టి, సోషలిస్టుపార్టి, ఇతర రాజకీయ పక్షాలు విశాలాంధ్ర స్థాపనను బలపరచినవి. ప్రత్యేకముగ విశాలాంధ్రోద్యమము ప్రారంభమైనది. విశాలాంధ్ర మహాసభ అవతరించి ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణము కొరకు కృషి సాగించినది. జూన్ 1954 లో హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెస్‌లో ఒకవర్గము ప్రత్యేక తెలంగాణారాష్ట్రం కావలెనను వాదమును లేవదీసినది. తత్ఫలితముగ హైదరాబాదు ఆంధ్ర రాజకీయరంగమున విశాలాంధ్ర వర్గము, తెలంగాణా వర్గము అను రెండు పక్షాలు బయలుదేరినవి. ఉభయపక్షాలవాదనములు భారతప్రభుత్వమునకు అంద జేయబడినవి. హైదరాబాదు శాసనసభలో అధికసంఖ్యాకులు విశాలాంధ్రమును బలపరచినారు. అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గము ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణము జరుగవలెనని సలహా నిచ్చినది. అందుచేత హైదరాబాదు రాజధానిగ ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణ అతిత్వరగా జరిగి సమగ్ర ఆంధ్రరాష్ట్రము 1956 అక్టోబరు నాటికి అవతరింపగల అవకాశాలు సంపూర్ణముగ అగుపించెను. ఢిల్లీలోని రాజ్యసభలో ప్రసంగించుచు, కేంద్రప్రభుత్వ దేశీయ వ్యవహారాల మంత్రి అందరి ఆమోదముతో విశాలాంధ్రము ఏర్పడగలదని ప్రకటించినారు (23-2-1956). భారత నాయకాగ్రేసరుల ఆశీస్సులతో 1956 నవంబరు 1 వ తారీఖున దీపావళి పర్వదినమున ఆంధ్ర-తెలంగాణాలు ఏకరాష్ట్రముగ, "ఆంధ్రప్రదేశ్" నామముతో ఏర్పాటుచేయబడినవి. "ఆంధ్రప్రదేశ్" కు హైదరాబాదు నగరము రాజధాని యైనది. ఇందువలన నూటయేబది సంవత్సరాల క్రింద ఇంగ్లీషు రాజ్యవిస్తరణ ఫలితముగా విడిపోయిన మూడుకోట్ల ఆంధ్రులు తిరిగి ఏకపరిపాలన క్రిందికి వచ్చి కృష్ణాగోదావరీ నదుల జలాలతోపాటు, తెలుగు సీమలోని ప్రకృతిసంపదను తెలుగుప్రజల అభ్యుదయము కొరకు వినియోగించి "ఆంధ్రావళికి మోదము" కలుగునటుల సకలాంధ్రము యొక్క సర్వతోముఖాభివృద్ధికొరకు ప్రయత్నించు అవకాశాలు లభ్యమైనవి. "ఆంధ్రప్రదేశ్" భారతదేశమునకు పెట్టనికోటయై ఆసేతు హిమాచల భూభాగమున ఒక సుందర నందనవనముగా శోభిల్లగలదని ఆశింపవచ్చును.

దే. రా.

**ఆకృతి రచన-ఆధునిక నిర్మాణ ద్రవ్యములు:-** వాస్తుశాస్త్రము ఎచ్చటనైనను, భౌగోళిక పరిస్థితులు, శీతోష్ణములు, భూగర్భ పరిస్థితి, మత సాంఘిక రాజకీయ

వాతావరణము మొదలగువాని ప్రభావమును, ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని కలిగియుండును. అయినప్పటికిని భవననిర్మాణమునకు సునాయాసముగా లభించు నిర్మాణద్రవ్యములే అతిముఖ్యమైన అంశములు. ఏలయన: భవన నిర్మాణ పరికరములైన ఇటుకలు, రాళ్లు, కలప, కాంక్రీటు మొదలైనవాని ద్వారానే శిల్పి తనయొక్క కలలకు వాస్తవిక ఆకృతిని ఈయగలుగుచున్నాడు.

ప్రస్తుత విషయమును గురించిన చర్చకు దిగుటకు ముందు, వాస్తుశాస్త్రమునందలి వివిధరీతులయొక్క పరిణతితో, నిర్మాణ ద్రవ్యము లెట్టి పాత్రను నిర్వహించినవో అవగాహము చేసికొనుట కొరకు, పూర్వ పరిస్థితులను అన్వేషించుట మిక్కిలి ప్రయోజనకారి కాగలదు. కలపయే మానవునికి తెలిసిన అత్యంత పురాతనమైన నిర్మాణద్రవ్యముగా కనబడుచున్నది. బౌద్ధులశిలావాస్తువు అస్తిత్వములోనికి వచ్చుటకు చాల కాలముక్రిందటనే మనదేశములో దారుమయ నిర్మాణములు ఉచ్చస్థితినందుకొన్నవి. బౌద్ధయుగమునకు చెందిన (చైత్యములు, కమానులు, సూర్యవాతాయనములు, వర్తులాకారమైన పైకప్పులు మొదలైన) కళాకృతులు, నిర్మాణములన్నియు ఆకాలపు పనివారికి సుపరిచితములును, సర్వసాధారణములును ఐన కలప కట్టడములందలి వివిధ రీతులకు రాతిలో నేర్పరచినటువంటి ప్రతిరూపములే. జనులకు మొట్టమొదట తెలిసిన నిర్మాణ పద్ధతిని 'దూలముల కట్టడము' (Trabeated mode) అందురు. దీనిలో నిలువు స్తంభములు, గొడుగురాయి (Lintel) ప్రధానాంగములు.

ఈ నిర్మాణ విధానము అటుతరువాతివారిచే కూడ అనుసరింపబడినది. కాని, వారు దీర్ఘ కాలము మనునట్టి రాతినే నిర్మాణ ద్రవ్యముగా నుపయోగించిరి. ఈజిప్టు దేశపు శిల్పులు బ్రహ్మాండములైన వారి దేవాలయములను నిర్మించుటకు రాతి స్తంభములను, రాతిదూలములను, రాతి పలకలను ఉపయోగించిరి. సమున్నతమైన రాతి స్తంభములు, గొడుగు రాళ్ళు ఏ పరిమాణముగలవి లభ్యమగునో వానిని బట్టి కట్టడములుండెడివి. కనుకనే బ్రహ్మాండమైన వారి భవనములు అనేక స్తంభములతో గూడియుండి, స్తంభాల వ్యూహమో అన్నట్లు తోచును. వారు వజ్రకాఠిన్యము గల గ్రానైటురాతినే తమ భవనముల కుపయోగించిరి. భవనములయొక్క ఆధార స్తంభములను మిక్కిలి దగ్గర దగ్గరగా నిలువవలసివచ్చెను. ఇంతే కాక, నల్లరాయి మిక్కిలి కఠినమైనదగుట వలన స్తంభముల మీద గాని, దూలముల మీద గాని ఎటువంటి చెక్కడములను చెక్కుటకు అవకాశములేకపోయెను. అందుచేత ఈ కట్టడములు చూపులకు శిలాస్తూపములవలె కనుపించును.

గ్రీకులయొక్క భవనములు కూడ ఇదే సిద్ధాంతము ప్రకారము కట్టబడినవి. కాని అవి ఈజిప్టు దేశపు కట్టడముల కంటె బాహ్య స్వరూపములో భిన్నములుగా నుండెడివి. నిర్మాణములకు గ్రీకులు ఉపయోగించిన శ్రేష్ఠమైననిర్మాణ ద్రవ్యమే ఈ భిన్నత్వమునకు కారణమైయున్నది. వారు ఉపయోగించిన తెల్లచలువరాయి చెక్కడమునకు మిక్కిలి అనుకూలమైన దగుటచే గ్రీకులు దానితో సున్నితమును అతి రమ్యమును ఐన శిల్పకళను అభివృద్ధిపరచగలిగిరి. చలువరాయియే లేకపోయినచో గ్రీకు శిల్పము మరొక విధముగా నుండియుండెడిది.

ఏ ప్రదేశములలో రాయి లభ్యమయ్యెడిదికాదో, అచ్చట పూర్తిగా భిన్నమైనటువంటి నిర్మాణ విధానము అవలంబింపబడెడిది. సాధారణముగా నదులు విశేషముగా నుండు ఒండ్రుమట్టి భూములలో రాయి అరుదుగా దొరకును. అస్సీరియా, బాబిలోనియావంటి పశ్చిమాసియా దేశములలోను, యూఫ్రటీస్, టైగ్రిస్ నదీతీరముల యం దును నివసించు పూర్వజనులకు రాయి బొత్తిగా దొరకక పోవుటచే, వారు తమ భవన నిర్మాణమునకు ఇటుక నుపయోగించిరి. భవనముల పైకప్పునకును, గోడలకున ఇటుకలు మాత్రమే ఉపయోగింప వలసివచ్చెను. ఇంత పైకప్పులు నిలువంపుగా కట్టినసరంబీలుగాను, గోపురాకారముగాను ఉండెడివి. ద్వారబంధములపై నుండు అడ్డ రాయిస్థానములో కమానులు (arches) ఉపయోగిం బడుచుండెను. ఈ విధానము కమాను నిర్మాణ విధానమ ఆర్క్యుయేటెడ్ (Arcuated) అని పిలువబడుచున్న రాయి దొరకకపోవుటచే మధ్యయుగమునందలి వం దేశపు వాస్తువు మిగిలిన భారతదేశ వాస్తువు కం పూర్తిగా భిన్నముగానున్నది. మొగలాయీలకాలముల తొలుదొల్త నుండిన వాస్తువునకును, వారి ఉత్తరోత్త

వాస్తువునకును మిక్కిలి భేదమున్నది. ఇది ప్రధానముగ వారుపయోగించిన నిర్మాణ ద్రవ్యములపై ఆధారపడినది. ప్రథమ దశయందు అనగా బెంగాలు నందలి మొగలు వాస్తువునకు ఇటుకలు, ఎఱ్ఱ ఇసుకరాయి వాడిరి. వారి అనంతర శిల్పమునకు చలువరాతిని వాడిరి.

కాంక్రీటు కనిపెట్టబడుటచే, రోమనుల వాస్తువు విప్లవాత్మకముగ మారినది. వారు విలువంపుగానుండు పై కప్పులను, గోపురములను భారీయెత్తున తయారుచేసిరి. వారు నూతనవాస్తు విధానములను ఆచరణలోనికి తెచ్చిరి. చలువరాయి లోకూర్పు గలిగిన మిశ్రకుడ్యములు, సంకీర్ణ వస్తు చిత్రము (Mosaic) మొదలైనవి ఈ తరగతికి చెందినవి.

మధ్యయుగమున యూరపులో ఒక వినూతనమైన వాస్తువిధానము వృద్ధిహొందినది. ఉపయోగింపబడిన నిర్మాణ ద్రవ్యములు, ఇటుక, రాయి, కఱ్ఱ అయినప్పటికిని గోతిక (Gothic) వాస్తువులో నిర్మాణమునందు నూతన విధానములు పొడసూపినవి. పునరుజ్జీవనయుగ (Renaissance) ప్రారంభమునుండి, వాస్తుశాస్త్రము అభివృద్ధిచెందుట ఆగిపోయినది. సంప్రదాయ సిద్ధమైన కళలను పునరుద్ధరించుటయు, కేవలము సాంప్రదాయిక ఆకృతులనే అనుకరించుటయు పరిపాటి అయిపోయెను. కాని గతశతాబ్దాంతమునుండియు, వాస్తుకళ, పెద్దపెద్ద అంగలతో పురోగమన మొనర్చుట మొదలుపెట్టినది. పునరుజ్జీవనయుగమునందలి శిల్పమున స్తంభముల యొక్క తారతమ్య పరిమాణమును గురించియు, నిర్మాణమునకు సంబంధించిన వివిధ ప్రత్యేకాంశములను గురించియు, మిక్కిలిశ్రద్ధ వహింపబడెను. భవనములను ఉపయోగించువారి అనుకూలతకుగాని, ప్రయోజనాత్మకమైన ప్రణాళికకుగాని తగిన ప్రాముఖ్యము ఈయబడలేదు. ఈవిధముగా శిల్పముయొక్క ఆకృతి రచనకు సంబంధించిన ముఖ్యసూత్రములే అతిక్రమింపబడుచుండెడివి. ప్రజల జీవితములలో గొప్పమార్పులు కలిగినను, కాలానుగుణముకాని ఆకృతిరచన అనుసరింపబడుచుండెడిది. పారిశ్రామిక విప్లవఫలితముగా కలిగిన వివిధమైన, సాంఘిక, రాజకీయ, పరివర్తనములు ఈయుగమునందలి శిల్పము నెడ నూతన కళాదృష్టిని అహ్వానించునవిగా ఉన్నవి. నూతన యుగమునందలి భవనావసరములు బహుముఖములైనవి. పూర్వకాలపు కర్మాగారములు, గిడ్డంగులు, సరకులకొట్లు సాధారణముగా నుండెడివి కావు. జనబాహుళ్యము గల నగరములలో అనేక అంతస్తులుగల భవనములు ఆవశ్యకములైనవి. ఈ క్రొత్తరకమైన భవనములకు, అనాడు వాడుకలోనున్న వాస్తు విధానము పొత్తిగా అననుకూలముగా నుండెడిది. అందువలన భవన నిర్మాతలు, ప్రాత పద్ధతులను విడిచి కాలానుగుణమైన భవనములు తయారుచేయుటకై ఆలోచనలు సాగించిరి. ఈ విధముగా నిర్మింపబడిన భవనములు పురాతనమును, సంకుచితమును, కాలానుగుణము కానిదియు ఐన శిల్పవిధానముయొక్క సంకెలలనుండి విముక్తిచెందినవి. భౌతికశాస్త్ర రంగమున కలిగిన యభివృద్ధి ఇట్టి నూతన నిర్మాతలకు, వారు చేయు ప్రయోగకార్యములలో మిక్కిలి తోడ్పడినది. నూతన భవన నిర్మాణ రీతులు, నూతన నిర్మాణ ద్రవ్యములు, క్రమక్రమముగా లభ్యములు కాజొచ్చెను. ఈ విధముగా నూతన యుగమున కనుగుణమై వాస్తవికము, వివేకవంతము అయిన నూతన శిల్పవిధానము అవతరించినది.

మూలాధారమైన నిర్మాణ ద్రవ్యములు, ఎట్టిమార్పును చెందక ఆ విధముగనే నిలిచిపోయినవి. శాస్త్రానుగుణమైన నూతన విధానములు సృష్టింపబడి, క్రొత్త నిర్మాణ ద్రవ్యములు రంగములోనికి వచ్చినవి. నేడు ఆకృతి రచన చేయుటలోను, వాస్తవ్యులకు అనుకూలముగా నుండునట్టి భవనములను నిర్మించుటలోను, శిల్పులు ఎక్కువ స్వేచ్ఛను కలిగియున్నారు. సమకాలికమైన శిల్పదృక్పథమునకు ఈ ఆధునిక నిర్మాణ ద్రవ్యము మిక్కిలి తోడ్పడినది. వీనిలో అతిముఖ్యమైన నిర్మాణ ద్రవ్యములు దృఢీకృతమైన కాంక్రీటు, (Reinforced cement concrete) ఉక్కు. భవన నిర్మాతలు ఉక్కును, కాంక్రీటును చాలకాలమునుండి ఉపయోగించుచుండిరి. కాని ఈ పదార్థములకు గల 'దృఢీకృత (Reinforced)' మరియు 'నిర్మాణాత్మక (Structural)' అను విశేషణములవలన, ఇప్పుడుపయోగింపబడు కాంక్రీటు, ఉక్కు, ఇదివరలో ఉపయోగింపబడినవాటికంటె, భిన్నమైనవను

విషయమును తెలుపుచున్నవి. వీటిని నిర్మాణ ప్రయుక్తమైన ఉక్కు, దృఢీకృతమైన కాంక్రీటు అందురు. ఇదియే ఆర్. సి. సి. అనబడును. సిమెంటు-కాంక్రీటునందు నిర్దిష్టమైన కైవారముగల మెత్తని ఉక్కు ఊచలు నిర్దిష్ట సంఖ్యలో చేర్చుటచే దానికి పటుత్వము కల్పింపబడును. దృఢీకృతమైన సిమెంటు-కాంక్రీటు స్తంభములు, దూలములు మొదలగు నిర్మాణాంగములకు ఉపయోగపడుచున్నది. ఉక్కును తయారుచేయు బెస్సిమర్ విధానము 1856 లో కనిపెట్టబడినది. పోతపోసిన ఉక్కు చువ్వలు తయారుచేయబడి, ఆధార స్తంభములుగను, దూలములుగను, ద్వారబంధములపై తొడుగు రాళ్ళుగను ఉపయోగపడుచున్నవి. ఉక్కు ఆధార స్తంభముల యొక్కయు, దూలముల యొక్కయు సహాయముతో పెక్కు అంతస్తులు గల భవనములు కట్టబడుచున్నవి. ఇవి మిద్దెలు, గోడలు, ఇంటిపైకప్పులు మొదలైనవాని భారమును మోయు ఆధార పంజరములుగా నున్నవి. ఇట్టి కట్టడములు ఆధారపంజర నిర్మాణములు (Framed-Structure) అని పిలువబడుచున్నవి. అవి నిర్మాణప్రయుక్తమైన ఉక్కుతోగాని, దృఢీకృతమైన కాంక్రీటుతోగాని నిర్మింపబడును. ఈ క్రొత్త నిర్మాణ ద్రవ్యముల యొక్క సంభావ్యతను గురించిన, ప్రప్రథమ ప్రయోగములు ఫ్రాన్సుదేశమున పారిస్‌లో 1878-79 సంవత్సరములలో జరిగిన వస్తుప్రదర్శనములోను, విమానములకొరకై 1916 లో నిర్మింపబడిన హాంగరు (Hanger) లోను చేయబడినవి. ద్వారముల వెడల్పు, స్తంభముల మధ్య దూరము, రాతితోను, కఱ్ఱతోను చేయబడిన దూలముల యొక్కయు, గొడుగురాళ్ళ యొక్కయు, నిడివిని బట్టియు, ఇటుకతో గాని, రాతితో గాని కట్టబడిన కమానుల మధ్యదూరమును బట్టియు, ఎల్లప్పుడు సరిచేయబడుచుండుట మనము చూచియేయున్నాము. ద్వారముల పరిమాణమును, ఆధారస్తంభముల దూరమును, నిర్ణయించుటలో ఈ దృఢీకృతమైన కాంక్రీటు నిర్మాణ ప్రయుక్తమైన ఉక్కు, శిల్పులకు గొప్ప స్వేచ్ఛను కలిగించినవి. ఇదియే వాస్తుశాస్త్ర ప్రపంచములో గొప్ప మార్పుమ తెచ్చినది. విశాలములగు ద్వారములు, కిటికీలు సాధ్యమగుటవలన నిర్మాణాంగముల యొక్క ఆకృతి రచన అభివృద్ధిచెందె. విస్తరించుటకు అవకాశము కలిగినది. ద్వారములకు, కిటికీలకు జారుడు మడతతలుపులు ఉపయోగించుటవలన, పూర్తిగా గోడ అంతయు తెరచియుంచుటకు వీలగుచున్నది. దృష్టినిరోధకములు గాని ఉక్కు తునుకలచేత నిర్మింపబడినవగుటచేత, ఈ కిటికీలు చక్కగా చూచుటకు అవకాశము కల్పించుచున్నవి.

గాజుపరిశ్రమ భవననిర్మాతలకు అనేక ఉపయుక్తములయిన వస్తువులను ప్రసాదించినది. గోడలకు గాజుపలకలు, చపటాచేసిన నడప్రదేశములకు దీపములు, మున్నగు సుందరాలంకార నిర్మాణప్రయుక్తమైన గాజువస్తువులు వీనిలో కొన్నియని చెప్పవచ్చును. మిక్కిలి దృఢముగా చేయబడిన గాజుపలకలను కిటికీతలుపులుగాను, ద్వార కవాటములుగను, ఇప్పుడుపయోగింపబడుచున్నవి. తెరచియున్నపుడు చూచుటకు చక్కని అవకాశమును కలిగించుచు, మూసియున్నప్పుడు కన్నుచెదురు కాంతినుండి, అధికమైన రక్షణనిచ్చు పల్చని అల్యూమినియం తెరలు నేడు తయారగుచున్నవి. ఎటువంటి కట్టె పైభాగపు గట్టితనమునకు తీసిపోనివై, మన్నికగల తేలిక 'ప్లైవుడ్' బల్లలు నేడు లభ్యములగుచున్నవి. ఇవి చట్రములకు వెనుక అస్తరు పలకలుగా కూడ ఉపయోగపడును.

ఇదేవిధముగా తయారయిన దిమ్మపలకలు వేగముగా మూసి తెరచుకొను తలుపులవలె నుపయోగకరముగా నుండును. ఆరోగ్యపరికరములు, మురుగునీటి కాలువల ఏర్పాటు, మలవాహక విధానము, పరిశుభ్రమైన నీటిని పట్టణములో సరఫరాచేయు సౌకర్యములు మొదలైనవి భవననిర్మాణవిధానమునందు మార్పులు కలిగించి అతి ముఖ్యమైన అభివృద్ధిని గొని తెచ్చినవి. శబ్దోష్ణములు ప్రసరింపకుండా చేయుటకు కావలసిన వివిధనిర్మాణ ద్రవ్యములు, కట్టడములు కట్టువారికి ఇప్పుడు దొరకుచున్నవి. ఇవన్నియు, శిల్పులు తక్కువ ప్రతిబంధకములతో భవన నిర్మాణ విధానమును ఏర్పాటు చేయగలుగుటకు మిక్కిలి తోడ్పడుచున్నవి. కృత్రిమపద్ధతులపై గాలిని, వెలుతురును ప్రసరింపజేయు నవకాశములు సాధ్యపడుటవలన, భవనముల ఆకృతిరచన చేయుటలో, శిల్పులకు మహత్తరమైన స్వేచ్ఛయు, అవకాశమును లభించినవి. దుకాణములు, కర్మాగారములు, పాఠశాలలు, ఆసుపత్రులు, ఆరోగ్య

స్థానములు మొదలగువానికి, మునుపటికంటె ఉత్తమమైన ఆకృతిరచన చేయుటకును, మునుపటికంటె ఆరోగ్యవంతముగను, ప్రయోజనవంతముగను వాటిని ఉంచుటకును నేడు వీలగుచున్నది.

నూతన భవననిర్మాణవిధానమును, నిర్మాణద్రవ్యములును, పూర్వకాలపు వాస్తుపద్ధతులను పూర్తిగా మార్చివేసినవి. చట్రనిర్మాణములు పూర్వకాలపు నిర్మాణ విధానముకంటె పూర్తిగా భిన్నములై యున్నవి. వాస్తుశాస్త్ర సత్యమునుగూర్చిన పూర్వభావములు నేడు మార్పు నొందవలసి వచ్చినది. పైనుండి చూచినంత మాత్రమున మోటరుబండి ఎట్లు పరుగెత్తునో, విమానము లెట్లు ఎగురునో నిర్ణయించుట అసాధ్యమైనట్లే, కేవలము కండ్లతో భవనములను చూచినంతమాత్రమున, ఆ భవనములకు ఉపయోగింపబడిన నిర్మాణద్రవ్యములయొక్క బలిష్ఠతను నిర్ణయింపలేము. ఉదాహరణకు దృఢీకృతమైన కాంక్రీటు తీసికొందము. దీనిలో శక్తిమంతమైన అంశములు దానిలో లీనమై కన్నులకు గనుపించవు. భవనమునందలి ఒకానొక భాగము దుర్బలముగా నున్నట్లు కనుపించినప్పటికిని ఆ భాగము ఏ ఉద్దేశముతో నిర్మింపబడినదో అట్టి ఉద్దేశమునకు తగిన బలమును కలిగియుండవచ్చును. బరువు వహించుగోడలు రంగమునుండి పూర్తిగా అంతర్ధానము చెందినవి. ఇప్పుడు భవనములందలి బరువు నంతటిని దృఢీకృతమైన కాంక్రీటుతో చేయబడిన ఆకృతి పంజరములుగాని, ఉక్కుస్తంభములు, దూలములుగాని భరించుచున్నవి. స్థలములకు ఆవరణము కల్పించుటకును, శబ్దమునుండియు, గాలినుండియు వానిని దూరముగా నుంచుటకొరకు మాత్రమే ఇపుడు గోడలు కట్టబడుచున్నవి. ఇప్పటి భవనములు, తమక్రిందినుండి - వీథి, తోట, చిన్న నీటిప్రవాహము మొదలైనవి పోవుచున్నను స్థిరముగా వానికాళ్ళపై అవి నిలుచుటకు సాధ్యమగుచున్నది. ఒక గోడపై జవాబుగా మరియొకగోడ ఉండవలసిన అగత్యమేమియు నేడు లేదు. ఎక్కడకు కావలసిన అక్కడకు జరుపుకొనుటకు వీలయిన తెరగోడలవలనను, అడ్డుగోడలవలనను భవననిర్మాణము చేయుట నేడు మిక్కిలి సుకరముగా నున్నది. అది యిప్పుడు నిర్మాణస్థలమునకును మానవుల అవసరమునకును, మిక్కిలి సన్నిహితముగా నున్నది. ప్రజలయొక్క ప్రస్తుతపు వసతి అలవాట్లు పూర్వములోవలె ఎప్పుడును ఒకే విధముగా మార్పులేక ఉండుటలేదు. అందువలన ఆకృతి రచనా విధానము కూడ పూర్తిగా మారవలసియున్నది. చెరువుల, ఏరులమీదుగా ప్రేలాడు పెద్ద వితానములను ఏర్పాటు చేయుటగాని లేక భవనమునందలి ఏ అంతస్తు మీదనైనను తోటలను నాటుటగాని, ఇప్పుడు అసాధ్యమైన పనికాదు. ఇల్లు, తోట, ఇప్పుడు సులభముగా ఒకే చోట చేర్పవచ్చును. ఇండ్లలోమార్పుటకు వీలులేని నిర్బంధకరమైన పూర్వకాలపు విభాగవిధాన మంతరించినది. ఇప్పుడు ఇండ్లలోని అంతర్భాగములను అవసరమునుబట్టి శాశ్వతముగాగాని, తాత్కాలికముగాగాని ఏర్పాటు చేసికొనదగిన అవకాశము లభించినది. బల్లపరుపు మిద్దెలు ఇప్పుడు సర్వసాధారణమైనవి. ఇట్టి మిద్దెలను ఏర్పరచు విధానములు మంచుగాని, వర్షముగాని విశేషముగా కురియు దేశములందలి భవననిర్మాతలకు తెలియనే తెలియవు. బల్లపరుపు మిద్దెలను నీరు చొరనట్టివిగాను, వాతావరణ స్పర్శితములు గాకుండునట్టివిగాను చేయవచ్చును. అందుచేతనే, తడి, పొడి, చల్లదనముగల ఏ వాతావరణమునైనను లెక్కచేయక, ఎట్టి ప్రదేశములలోనైనను, బల్లపరుపు మిద్దెలను ఉపయోగించుకొనవచ్చును. భవనముల ఆకృతి రచనయందు దృఢత్వముండవలెనను పాత ఉద్దేశముపోయి దానికిబదులు తేలికదనము సమసౌష్ఠవము ఉండవలెనను భావములు వచ్చినవి. పూర్వము భవనములను తరచుగా చెట్లతో పోల్చుచుండిరి. ఈపోలిక యొక్క ఉద్దేశమేమనగా, భవనములు చెట్లవలెనే భూమిలో పాతుకొనిపోయి సుస్థిరముగా నుండవలెనని. కాని ఆధునిక భవనములు కేవలము ఇందుకు విరుద్ధముగా భూమిపై సమసౌష్ఠవముగా నున్నట్లు కనబడును. చట్రముల కూర్పుతో కట్టబడు భవననిర్మాణ విధానము అందమగునట్టి ఉపయోగకరమైన అనేక రూపములను ప్రసాదించినది. కాంక్రీటుతో చేయబడు ఆధునిక నిర్మాణపద్ధతులు పెక్కురీతుల నూతన నిర్మాణములకు తావొసంగినవి. నిర్మాణప్రయుక్తమైన ఉక్కు కాంక్రీటులు గణిత సంబంధమైన సరియైన అంచనావేయుటకుకూడ అవకాశము కల్పించుచున్నవి. దీనివలన మిక్కిలి యథార్థము

లును, ప్రయోజనకరములు నైన ఆకృతులు సిద్ధించు చున్నవి.

దీని ప్రభావము వాస్తుసంబంధమైన సౌందర్యదృష్టిపై కూడ ఎక్కువగా పనిచేసినది. అందువలన ఆధునిక వాస్తు శాస్త్రము యొక్క ఆకృతిరచన, నూతనమైన నిర్మాణ ద్రవ్యములను, పురోగమించియున్న నిర్మాణవిధానమును చక్కగా ఉపయోగించుకొను చున్నది. ఈనాటి శిల్ప కారులు ఆకార తారతమ్య రహస్యములను చక్కగా ఆకళించుకొని, ఆకృతి రచనలో నిక్కచ్చిగా అత్యావసర మైన నిర్మాణద్రవ్యములనుతప్ప మిగిలినవానిని త్యజించుట నేర్చుకొనియున్నారు.

డి. డి. వి.

**ఆకృతి రచనా సూత్రములు :-** పూర్తిగా స్వతంత్ర ములు కాకపోయినను భిన్నములైన రెండు దృక్పథ ములతో వాస్తు సంబంధమయిన ఆకృతి రచనను (Architectural Design) విమర్శింపవలసి యుండును. మొట్టమొదట కేవలము గుణములనుదృష్టియందుంచుకొని దానిని పరిశీలింపవలసియుండును; అనగా దాని ప్రయో జనముతోగాని, నిర్మాణముతోగాని నిమిత్త మేమాత్ర మును లేక దానిని సౌందర్య మీమాంసా దృష్టితో పరిశీ లించుట; రెండవ దృక్పథము భవనముయొక్క అవస రానుగుణమగు ఆకృతి రచనను ((Functional design) అనగా భవనముయొక్క ప్రత్యక్షావసరములు, నిర్మా ణము మొదలగు వాటిని దృష్టియందుంచుకొనుట, కార్య నిర్వహణార్థకమైన ఆకృతి రచనయొక్క పరిశీలన మును వాస్తు సంబంధమైన సృష్టిగా మార్చుట - ఆకృతి రచనయొక్క నిబంధనములయొక్కయు, ఆకృతి రచన యొక్క నిర్మాణక్రమమునకు సంబంధించిన సూత్రముల యొక్కయు పరిజ్ఞానము చేతనే సాధ్యపడును.

ఈ సూత్రములు ఆకృతిరచన చేయువానికి సరియగు మార్గదర్శకములుగా మాత్రమే సహాయపడును. అంతే కాని, వాటిని 'తయారుచేసి యుంచబడిన' సౌందర్య మును వాస్తుకళలో కల్పించుటకై వివేచనా రహిత ముగా నుపయోగింపదగిన నిబంధనములనుగ అపార్థము చేసికొనరాదు. భవనములను ఏ విధముగనైనను ఏ శైలి లోనైనను నిర్మింపవచ్చును; కేవల నిర్మాణ విశేషము లుగా (pieces of abstract composition) మాత్రమే, వాటి మంచిచెడుగులు నిర్ణయింపబడును. గుణావగుణ నిర్ణయమునందలి ప్రమాణములు మారుచుండును. కాని నిర్మాణ నియమములు మాత్రము మారక ఒకే విధ ముగా నుండును. శిల్పి తన మనస్సులోని భావమును చక్కగా రూపొందించు విషయమున శిక్షణమును పొందును. నిర్మాణ విషయకము లయిన నియమముల యొక్క జ్ఞానము ఈ విషయమున ఆతనికి సహాయ పడును. శిల్పి యొక్క సృష్టి ఒకకళారచన. అందుసౌందర్య మీమాంసాగుణములుండును. అవి కేవల (ఆకృతి) రచన యొక్క జ్ఞానమును, సాంకేతికత ముఖ్యభావమును వ్యక్తీకరించు సాధనములుమాత్రమే యై యున్నవి. ఆ భావము ఎక్కువ ముఖ్యమైనది. ఒక భవనమునుగూర్చి విమర్శించునపుడు, మానవుని వ్యక్తిగతమగు ఆదర్శము యొక్క యీ ఆవిష్కరణమే విమర్శింపబడుచున్నది.

వాస్తువిద్య ముఖ్యముగా ఒక కళ. అందుచే ఉత్తమ మగు వాస్తునిర్మాణము కళారచనకు అవసరమయిన ముఖ్యలక్షణముల నన్నిటిని కలిగియుండవలెను. విశిష్ట రచయితలగు టాల్‌స్టాయి, రస్కిన్ వంటివారు కళ యొక్క లక్షణమునుగూర్చి విశేషముగా వ్రాసి యున్నారు. కళారచనకు అన్వయించు ప్రధాన ధర్మము లన్నియు వాస్తుకళకుకూడ అన్వయించును.

నిష్కాపట్యము, సత్యము, కళారచనకు ముమ్ముందుఅత్యావ సరములు. వాస్తుశిల్పి తన భావములను వ్యక్తీకరించుట యందు కాపట్యమునకు తావీయకుండ నుండవలయును. వాస్తుశిల్పము ససత్యము వ్యక్తీకరింపబడవలయును. అనగా వాస్తుశిల్పి మోసముచేయరాదు. రస్కినుచెప్పినట్లు వాస్తుశిల్పమున మూడువిధములైన మోసము లున్నవి:

1. సత్యేతరమయిన నిర్మాణవిధానమును, లేక ఆధారమును సూచించుట.

2. పై భాగములపై రంగువేసి, ఒక వస్తువును అన్య వస్తువుగా ప్రదర్శించుట.

3. పోత, లేక యంత్ర నిర్మితాలంకారములను ఉప యోగించుట.

కళకు సంబంధించిన ఎట్టి రచనకైనను విశిష్ట లక్షణము అనునది రెండవ ముఖ్యావసరము.

రెండవ ముఖ్యలక్షణము కళారచన. అది కళావేత్త యొక్క ప్రత్యేకతచే ముద్రితమైయుండవలెను. రెండవ ముఖ్యలక్షణము కట్టడము యొక్క ఉద్దేశమును స్పష్టముగా వెల్లడిచేయవలెను. కళావేత్త సంపూర్ణమైన నిష్కాపట్యముతో ప్రయత్నము చేసినప్పుడే చక్కని కళాసృష్టి ఘటిల్లును. అట్టి సృష్టి ఎల్లప్పుడును కళావేత్తయొక్క వ్యక్తిత్వ విశేషమును ప్రతిఫలించుచుండును. అది రచనయొక్క చైతన్యమును, శక్తిని పెంపొందించును. కళావేత్త ఇతర కళారచనలనుండి ఉత్తేజమును పొందినను, లేక వాటిని అనుకరించినను, సావధానుడయి తన కళారచనమును స్వీయశక్తిత్వముతో మేళవింపవలయును. కేవలము ఇతరులనుండి ఎరువు తెచ్చుకొనుటగాని, అన్యులను అనుకరించుట గాని కళారచనమును చైతన్యవిహీనము గావించును.

భవన నిర్మాణమువలన దాని ఉద్దేశము వ్యక్తము కావలయునన్నచో అన్ని విషయములయందును ఆ యుద్దేశము ప్రస్ఫుటమగునట్లు జాగరూకతతోను, విమర్శపూర్వకముగాను తయారుచేయబడిన ప్రణాళిక ననుసరించి ఆ భవనమును నిర్మింపవలయును.

అకుటిలత్వము, అసందిగ్ధత అనునవి మూడవ ముఖ్యలక్షణమునకు చెందును. వ్యక్తీకరణములో ఎట్టి సంశయాత్మకతయు ఉండరాదు; అంతేగాక, వ్యక్తీకరణము స్పష్టతతో గూడియుండవలెను. డొంకతిరుగుడు పద్ధతిలో వెల్లడించుటకు ఎట్టి ప్రయత్నమును చేయరాదు.

నాల్గవ ముఖ్యలక్షణము సరళత: చూచువారికి గాని చదువువారికి గాని సులభముగా అర్థముకాని వివరములు ఏ కళారచనయందును ఉండరాదు. అనవసరములైన వివరము లుండరాదు. వివరములను తగ్గించుటవలన సరళత చేకూరును.

టాల్‌స్టాయి ఈ విషయమును చాల రమణీయముగా ఇట్లు చెప్పియున్నాడు: "ఏ కొందరకు మాత్రమో అందుబాటులోనుండు భావానుభవముయొక్క ప్రత్యేకత శ్రేష్ఠత్వముయొక్క ఆదర్శముకాదు. విశ్వజనీనతయే దాని లక్షణము. పరిమాణాధిక్యము, దుర్గ్రాహ్యత, రూపజటిలత - ఇవి నేటి లెక్కప్రకారము శ్రేష్ఠతాదర్శమునకు లక్షణములుకావు. అట్లుకాక సంక్షిప్తత, స్పష్టత, సరళవ్యక్తీకరణము - ఇవి దానికి లక్షణములై యున్నవి." అత్యుత్తమ రచనకు చేర్చబడునదిగాని దానినుండి తొలగింపబడునదికాని ఉండజాలదు, అనువిషయము ఎల్లప్పుడును జ్ఞాపకముంచుకొనదగినది.

జాగరూకతతోకూడిన ఆలోచనాపూర్ణత ప్రతి కళారచనకు వలసిన ఐదవదియు, కడపటిదియునగు ఆవశ్యకాంశము.

కళారచనమును శోభావంతముగాచేసెడి అలంకారములు, లేక వివరములు ఏరుకొనుటయందును, వాటిని అవలంబించుటయందును జాగరూకతయు సంపూర్ణాలోచనయు కావలసియున్నవి. అలంకారములు చాల నిగ్రహముతో నుపయోగింపబడవలెను. అవి అలంకార్యవస్తువునకు తగియుండవలయును. భూష్య వస్తువునకును, దానిధర్మమునకును అవి సరిపడనివిగా నుండరాదు; పొసగని స్థానములో వాటిని ఉంచరాదు.

ఎట్టికళారచనకు అయినను పైలక్షణములు అత్యంతావశ్యకములైయున్నవి. ఇవికాకవాస్తుకళావేత్త తనకట్టడముయొక్క ప్రణాళికాకృతిని రచించుటకు సాయపడు కొన్ని ప్రధాన సూత్రములను పరిశీలింపవలసియున్నాడు.

ఒక కట్టడము సాధారణముగ అనేకములగు భాగములతోగూడి యుండును. అవి వేర్వేరు పరిమాణములను, ఆకృతులను, కలిగియుండవచ్చును. రచన సుందరముగా కనబడునట్లును, ఉద్దిష్టమైన ప్రయోజనమునుకూడ నెరవేర్చునట్లును, కళావేత్త వాటిని యోగ్యముగా కూర్పు చేయవలయును. రచనలోని అంశములన్నియు అనురూపత, సమత కలవిగ ఉండవలయును. అనేక భిన్న భాగములు క్రమ రహితముగా కేవలము గుదిగ్రుచ్చినట్లు కనబడరాదు. రచన మొత్తముమీద ఏకీకృతమయిన సమష్టి వస్తువు అను అభిప్రాయమును కలిగింపవలయును. రచనలో ఒక 'ప్రధాన భావము'ను సృష్టించుట వలన ఇది సాధ్యపడును.

ఒక అంశముతో గాని భిన్నపరిమాణములుగల అనేక అంశములతోగాని అది ఏర్పడియుండవచ్చును. మొత్తము రచనలో అది కీలక స్థానముగా నుండవలెను. ఒకటికంటె ఎక్కువ స్థానములట్టివి (focal points) ఉన్నచో రచనయొక్క ఐక్యమునకు భంగమువాటిల్లును. రచనయొక్క

ఐక్యమునకు భంగము కలుగనివిధముగా రచనలోని అన్ని ముఖ్యాంశములును, విభాగములును వినివేశితములు కావలెను.

ఆలేఖకుడు (designer) జాగ్రత వహించి, విసుగుపుట్టని విధముగా తన రచనను మనోహరముగ చేయవలెను. నేర్పుతో తారతమ్యములను లేక వైవిధ్యములను ప్రవేశ పెట్టుటచే ఇది సాధ్యపడును. నిర్మాణము నందలి యుక్త మగు తారతమ్యములచే యుక్తప్రమాణములుచేకూరును. దాని ఐక్యముకూడ భంగమునొందదు. చక్కని ప్రణాళిక గల గ్రీకు, రోమను భవన భిత్తిశృంగముల (Cornices) ఆకారములు వైవిధ్య ప్రయోగమునకు చక్కని ఉదాహరణములు.

భవన భిత్తిశృంగములో దగ్గరదగ్గరగా వివిధములైన బాహ్యరేఖల ఆకృతులు ఉపయోగింపబడును. గోడ యొక్క ఉపరిభాగమున ఘనపదార్థములను, ఖాళీలను సక్రమముగా నుపయోగించుట దీనికి మరియొక ఉదాహరణము. వాస్తు రచనలోని వివిధ అంశముల యొక్క పరిమాణము లందును, రూపములందును వైవిధ్యము (లేక తారతమ్యము) చూపుట దానిని ఆకర్షణీయముగా చేయుటకు మిక్కిలి అవసరము. వాస్తు సంబంధములైన అలంకారములు వాస్తు నిర్మాణములను, సజీవములనుగా చేయుటకై ఏదోవిధమైన వైవిధ్యముతో నిండియుండును. మంచి అలంకారములు ఎల్లప్పుడును నిర్మాణాత్మక రూపమును పెంపుచేయునవిగా నుండవలెను. అవి కేవలము ఇచ్ఛవొప్పున తగిలించుటకు గాని, తొలగించుటకు గాని వీలగునట్లు అనుబంధములుగా నుండరాదు. నిర్మాణమునందు ఐక్యమును వదిలవరచుటకు వైవిధ్యము విశేషప్రకటనము అను రెండు విషయములు ఆవశ్యకములు. కేవలము (1) పదార్థ స్థూలత చేతను, (2) అలంకారసంపద యొక్క కేంద్రీకరణము చేతను, (3) రంగు యొక్కయు, ఛాయ (tone) యొక్కయు, సౌష్ఠవము చేతను, (4) రేఖ యొక్క అభిరుచి చేతగాని సూచనను లేక ఊహను స్ఫురింపజేయు సూక్ష్మతర విధానాంతరము చేతగాని అధికతర ప్రాముఖ్యమును సంపాదింపవచ్చును.

చక్కని పరిమాణములును, మాపశ్రేణి (scale) యును మంచి ఆలేఖ్యాకృతికి కావలసిన, మరి రెండు అత్యవసర విషయములు. కొన్ని పరిమాణములు మిక్కిలి తృప్తికరములుగా నున్నట్లు కనుగొనబడినవి. అందుచే ఈ పరిమాణములును, నిష్పత్తులును జ్యామితితోడను, మొత్తము మీద గణితశాస్త్రము తోడను కొంత సంబంధమును కలిగియున్నవను విషయమును కొందరు సూచించిరి. కొన్ని సుప్రసిద్ధములైన కట్టడముల యొక్కయు, అలంకారముల యొక్కయు పరిమాణములను పర్వరుచుటలో త్రిభుజము, చతురస్రము లేక వృత్తములవంటి కొన్ని రేఖాగణితపు ఆకృతులతో స్పష్టమైన సంబంధము కనబడుచున్నదని రూఢిచేయబడియున్నది. సంగీతములోని సంగీత పద రచన (Musical phrasing) యొక్క నిర్మాణమునకును, వాస్తువునకును గొప్ప పోలిక కలదని కొందరు భావించుచున్నారు. ఏమనగా, రెండును గూడ సమ్మేళనము (Harmony) యొక్కయు, విరామముల (Intervals) యొక్కయు, లయ (Rythm) యొక్కయు సూత్రములతో సంబంధము కలిగియున్నవి. సంగీతములో వేగమునకు సంబంధించిన ప్రమాణ మున్నట్లుగనే, వాస్తుకళావేత్తకూడ పరిమాణమునకు సంబంధించిన ఒకప్రమాణము నుపయోగించును. పరిమాణ సంబంధము (proportion) ఎప్పుడును "కొలత" (scale) కు సంబంధించియే యోచించవలసి యుండును. చక్కని కొలత వివిధ భాగములకును, ఒండొంటితోడను, మొత్తముతోడను పరిమాణ విషయములో క్రమమైన సంబంధము" అని నిర్వచింపబడియున్నది. ఈ నిర్వచనము పరిమాణ సంబంధమునకుగూడ ప్రత్యక్షముగా అన్వయించును. పరిమాణము (size) యొక్క ప్రమాణము పరిస్థితులపై నాధారపడియుండును. కాని సామాన్యముగా అది పురుష ప్రమాణముచే క్రమబద్ధము గావింపబడునదిగా నుండును. అనగా సరాసరి మానవుని పరిమాణమును, పరిమాణము విషయములో దానితో సంబంధించియున్న వస్తువులును అని అర్థము. 'కొలత' ను పాటింపక కట్టడముల ప్రణాళికాకృతి రచన సాగించినయెడల కొలత యొక్క అసత్యభావ మేర్పడు గొప్ప ప్రమాద మెప్పటికిని కలదు. అట్లుచేసినచో కట్టడములు అవి నిజముగా ఉన్నవానికంటె పెద్దవిగాకాని, చిన్నవిగాకాని కనబడును. ఇది కొన్ని సుప్రసిద్ధ భవనముల విషయములోకూడ తటస్థించినది.

రోమ్‌లోని సెంటుపీటరు యొక్క కేథిడ్రల్ (Cathedral) దీనికొక ఉదాహరణము. దాని నిజపరిమాణమును కనుగొనుటకు కావలసిన లక్షణములు కొరతవడియున్న విధముగా దాని లోపలిభాగము యొక్క ప్రణాళికాకృతి రచన గావింపబడి యున్నది.

వాస్తు రచన చిత్రరచన కంటెను, శిల్పరచన కంటెను భిన్నమైనదిగా నున్నది. చిత్రరచన రెండు పరిమాణములతో గూడినది మాత్రమే యై యున్నది. శిల్ప, వాస్తు రచనలు రెండును, మూడు పరిమాణములతో గూడి యున్నవైనను, కొన్ని విషయములలో తిరిగి పరస్పరము వేరుపడునవిగా నున్నవి. వాస్తు రచయిత కట్టడమును నిర్మించుటకు పూర్వము ప్రణాళికలు, తదితరములైన పటములును సిద్ధపరుపవలసియుండును. అట్లే అతడు కట్టడపు వివిధ భాగముల యొక్కయు అంతఃప్రదేశములను పరిశీలింపవలసి యుండును. రచన యొక్క ఈ అంశము వాస్తుకళకు మాత్రమే ప్రత్యేకలక్షణమైయున్నది. ప్రణాళికా రచనను గూర్చియు, ప్రణాళికకును, ఎత్తున (Elevation) కు గల సంబంధమును గూర్చియు ఇప్పుడు పరిశీలింతముగాక! కేవల ఊహ్యావసరముల దృష్టితోడను కార్యనిర్వాహణార్థకములైన ప్రత్యక్షావసరముల దృష్టితోడను, ప్రణాళిక యోచింపబడవలసినదై యుండును. నిజమునకు ప్రణాళిక అన్నది ఒక కావలసిన మట్టము లేక మట్టములవద్ద ఒక కట్టడముగుండా తీసికొనబడిన క్షితిజ సమాంతరమైన (horizontal) భాగము. ఒకేసూత్రావళి ఎట్టి ఆకృతిరచనకైనను వర్తించుచున్నను. ఎత్తు, భూతలదృశ్యము, రంగువేయుట, లేక శిల్పము—వీనిననుసరించి 'ప్రణాళిక' యొక్క అంతర్గత స్వభావము వేరువేరగుచున్నది. ప్రణాళికవిషయములో దానిని చూచు వానిదృక్పథము కేవలబాహ్యమునకు చెందినదిగా మాత్రమే యుండదు; 'ప్రణాళిక' అనగా నిజముగా క్రింది అంతస్తు యొక్క ఆకృతి అని అర్థము; వాస్తువేత్త భావన యొక్క సామాన్య ధోరణులను అది ఎల్లప్పుడును వెల్లడించును; అంతేకాక, పై అంతస్తులకు ఆధారముగానుండగల ప్రయోజనాత్మక భాగములనుగూడ నది వ్యక్తీకరించును. కాని ప్రణాళిక ఒక్కటియే వాస్తువేత్త భావనముగూర్చి సంపూర్ణాభిప్రాయము నిచ్చుటకు సరిపోదు. ఆవరింపబడిన వివిధభాగములు ఎట్లు కనబడునో అన్న విషయమును, చూచువానికి వివిధ అంతర్భాగములు ఎట్టి అభిప్రాయమును కలిగించునో అన్న విషయమును వాస్తువేత్త మనస్సులో నుంచుకొనవలసి యుండును. ప్రణాళిక అనగా గోడలు, చెత్తగోతులు (Tooms), వసారాలు మొ॥ వాటిని కాగితముమీద రచింపగా నేర్పడు ఒకానొక మాదిరి రూపము. ఈమాదిరి రూపముకూడ ఆకృతుల విషయములో సమ్మేళనమును, సమత్వ భావమును, కలిగియుండవలయును. కాని ప్రణాళికలు స్వతంత్ర విషయములు కావు. ఎత్తులతోను, విభాగములతోను, (Elevations and Sections) అవి అనుబంధితములై యున్నవి. ప్రణాళికారచనలు కూడ పొందికనుకలిగి యుండవలెను. సామాన్యములైన అవిభక్త భాగములను అవి కలిగియుండవచ్చును. అప్రధానములు లేక సహాయార్థకములు అగు ప్రత్యేకావయవములు వాటికి ఉండవచ్చును, లేకపోవచ్చును; లేదా, సామాన్య భాగములు తిరిగి తిరిగి వచ్చుక్రమము, ప్రధానములు మరియు సహాయక అనుబంధములు అను క్రమముతో గూడిన పరినిష్ఠితత్వమును కల్గియుండవలెను (Climaxes). స్మారక చిహ్నములుగా నిర్మింపబడెడి కట్టడముల ప్రణాళికలు ఉన్నతస్థాయికిచెందిన విధముగను, మహనీయతా లక్షణముతోగూడిన శైలిలోను, యోచింపబడవలెను. కట్టడము యొక్క అవసరములు జాగరూకతతో పరిశీలింపబడవలెను. మరియు ఆ అవసరముల యొక్క ప్రధానభావమును కల్పించెడి ముఖ్యభాగములకు ప్రణాళికలో ప్రత్యేక ప్రాముఖ్యము నొసంగవలెను. తక్కిన భాగములు దానికి లోబడిన ప్రధానత గలవిగా జేయబడవలెను. సరియగు పరిమాణ సంబంధము నుపయోగించుట, భేదమును చూపుట, ప్రత్యేక ప్రధానతను చూపుట (Accentration) అను లక్షణములను ప్రణాళికను సిద్ధపరచుటలో ప్రణాళికా రచయిత గమనింపవలెను. ప్రత్యేక భాగముల సాధారణ రూపమును, ప్రణాళికలో వర్గీకరణమును, పైనుదహరింపబడిన సూత్రముల సహాయముతో నిర్ణయింపనగును.

కట్టడముల యొక్క బాహ్యభాగములు అంతర్గత రూపముల కొక ఆవరణముమాత్రమే. ప్రణాళికలోని

ముఖ్యభాగములుఎంతవరకు దృశ్యవ్యక్తీకరణమునుకలిగి యుండవలెనో ప్రణాళికా రచయిత నిర్ణయింపవలయును. కట్టడమునకు అవసరమైన వ్యక్తీకరణమును బట్టియు, ముఖ్యభాగముల (Elements) ఔచిత్యమును బట్టియు, ఈ యంశము నిర్ణయింపబడవలెను. ఎత్తులు ఉద్దేశ్యము యొక్క స్పష్టమైన వ్యక్తీకరణమును ద్యోతకము చేయునట్లుగా ప్రణాళికా రచన గావింపబడవలెను.

ఈ ఉద్దేశ్యము యొక్క వ్యక్తీకరణము రూపసౌందర్యమును రచించుకృషితో సమ్మేళన గావింపబడవలెను. ప్రయోజనము (function) ప్రధానముగా ప్రణాళిక ఎట్లు రచింపబడవలెనో నిర్దేశించును.

ఉదాహరణమునకు :- ఒకానొక ఎత్తులో కిటికీలు లేని యెడల దాని అంతర్భాగము, పైనుండి వెలుతురు వచ్చునట్లు చేయబడినది, లేదా మానవనిర్మిత సాధనములచే వెలిగింపబడినది, అని మనము సులభముగా నూహింపగలము; అందుచే ఆ కట్టడము ఈ విధమైన వెలుగు అవసరమైన జాతికి జెందియున్నదని మనము తెలిసికొనవచ్చును.

లభ్యమయ్యెడి నిర్మాణ ద్రవ్యములను బట్టియు, వ్యయము యొక్క పరిమితులను బట్టియు, వాస్తువేత్త యొక్క ప్రణాళిక సాధారణముగా మార్పుచెందుచుండును. కాని అతని ప్రణాళికల యొక్క సాఫల్యము ప్రణాళికాకృతి రచనకు సంబంధించిన ఈ మూలాధారక సూత్రముల ననుసరించుటపై చాలవరకు ఆధారపడి యుండును.

డి. డి. బి.

**ఆక్వినాస్ థామస్ :-** ఇతడు ఇటలీ దేశస్థుడు. స్కాలాస్టిసిసమ్ (scholasticism) అను తత్వశాస్త్రశాఖకు చెందినవాడు. ఆక్వినోయను సుప్రసిద్ధ వంశమువాడు. నేపిల్సు పట్టణమున జన్మించెను. మాంటికాస్సినో, నేపిల్సులలో విద్య నభ్యసించి, డామినికన్ మతసంస్థలో చేరెను. ఆల్బర్టస్ మ్యాగ్నస్ అను ప్రఖ్యాతపురుషు డితని గురువు. అరిస్టాటిల్ మతపంథకు చెందినవారిలో ఆక్వినాసు అగ్రగణ్యు డనదగును. చాలకాలము ఇతని గ్రంథముల కెక్కువ ప్రచారము లేకపోయెను. కాని 19 వ శతాబ్దము నుండి వీటికి అత్యంతమైన ప్రాముఖ్యము లభించినది.

మధ్యయుగపు క్రైస్తవ మతాచార్యులలోను, విద్వాంసులలోను ఆక్వినాసు అగ్రగణ్యుడు. జీవితము నందలి



సమస్త విషయములను సమన్వయించి సృష్టికర్తకును, మానవునికిని, ప్రకృతికిని గల ఆంతరంగిక సంబంధమును వెలిబరచుటయే మధ్యయుగపు పండితుల ఆశయ మన వచ్చును. ఈ సమన్వయమును ఆక్వినాసు కన్న సంపూర్ణముగ నెవరును సాధించలేదనుట అతిశయోక్తి కానేరదు.

ఉత్కృష్టతను సాధించుట జీవితము యొక్క ధర్మమనియు, ప్రతి జీవియు తన స్వభావముచే ప్రేరేపింపబడి ఉత్కృష్టతను సాధించుననియు ఆక్వినాసు బోధించెను. సృష్టి యందలి జీవులలో శ్రేష్ఠతర కక్ష్యయనియు, శ్రేష్ఠతమ కక్ష్యయనియు, రెండు కక్ష్యలను ఏర్పరచవలెననిన, జీవులు తమ ధర్మములను ఎంతవరకు సాధింపగలుగుదురో యనునదియే మనకు ప్రమాణము. ఈ రీతిగా జూచినచో సృష్టికర్తనుండి జీవకణము వరకును గల ఆంతరంగిక సంబంధమును, పరంపరయును గుర్తింపవగును. ఈ సృష్టి పరంపరయందు మానవుని స్థానము ముఖ్యమైనది. ఎందుకన అతనికి కేవలము భౌతిక లక్షణములేగాక ఆధ్యాత్మిక లక్షణములును కలవు. వివేకము అతని ప్రత్యేకలక్షణము.

ప్రకృతికిన్ని, మానవ సంఘమునకును పోలిక గలదు. ప్రకృతియందెట్లో అట్లే సంఘమునందును ఆశయములును, తదనుగుణములైన సాధనములును గలవు. ఆశయముల నెక్కువగ సాధింపగలవా రితరులకు మార్గదర్శకులై వారిని ఏలవచ్చును. సంఘము మానవవాంఛల సంతృప్తి కొరకు ఏర్పడినదనియు, సంఘమునందు ప్రతి వ్యక్తికిని ప్రత్యేక లక్షణములును, సామర్థ్యములును గలవనియును, ప్రతియొకరును తమ తమ ప్రత్యేక కార్యములను, ధర్మములను ఆచరించుచు ఇతరులతో సహకరించినచే

సాంఘిక శ్రేయము చేకూరుననియు ఆక్వినాసు సూచించెను. అన్యోన్య శ్రేయమును చేకూర్చుటయే మానవుల ఆశయము, ధర్మము.

ప్రజల హితమును పెంపొందించుట ప్రభుత్వ కర్తవ్యము. అధికారమును ప్రభువు ఒక నిధిగ పరిగణింపదగును. పరిపాలకు లీరీతి ప్రవర్తించినచో ప్రజలకు ఇహపర సుఖములు రెండును లభించును. ఐహిక సుఖములు రాజ్యమునకు సంబంధించినవి. అంతకన్న మహత్త్వము కల పారలౌకిక సుఖములు మతసంస్థకు చెందిన విషయములు. కాని పరిపాలకులు రాజధర్మమును చక్కగ నెరవేర్చినచో ఇహమునుండి పరము కూడ లభించును.

రాజ్యమునందలి అధికారము నైతికప్రమాణముల ననుసరించియుండవలెనని ఆక్వినాసు స్పష్టపరచెను. వాటికి విరుద్ధముగ ప్రవర్తించు ప్రభుత్వమున కెదురుతిరుగుట ప్రజల హక్కు. కాని ప్రభుత్వోల్లంఘనము వలన తాత్కాలికోపద్రవముకన్న ఎక్కువకీడు పొందరాదనుట ప్రజలు ముఖ్యముగ గమనింపవలయును. కాని ఈ యంశమును గూర్చి ఆక్వినాసు విశదముగ వ్రాయలేదు. న్యాయము ప్రజల హితము కొరకు మానవుని వివేకము నుండి జనించినదనియు, ప్రజాహితమే తమ ధర్మముగ నెంచు ప్రభువులచే నిర్దేశింపబడినదనియు ఆక్వినాసు నిర్వచించెను. సృష్టి యంతయు క్రమబద్ధమైనదనియు, మానవ నీతిధర్మములకును, దైవసంకల్పమునకును అత్యంతమైన సంబంధము కలదనియును, ఆక్వినాసు యొక్క ఆశయము.

జి. ఎన్. ఎస్.

**ఆగమ శాస్త్రములు :-** భారతీయ తత్త్వశాస్త్రములలో ఆగమశాస్త్రములు మిక్కిలి ప్రధానములై, ఐహికాముష్మిక సుఖసంపాదకములై యలరారుచున్నవి.

లోకకల్యాణ సంపాదకములగు దేవాలయములయు, దేవతా విగ్రహములయు నిర్మాణప్రక్రియలను, వాని ప్రతిష్ఠలను, దేవతా సాన్నిధ్యము పెంపొందుటకై చేయవలసిన పూజా పురశ్చరణాది ప్రకారములను బోధించు శాస్త్రము - ఆగమ శాస్త్రము. భగవంతుని ఆగమమును గూర్చి తెలుపునదిగాన, దీనికీపేరు వచ్చియుండవచ్చును. ఈ శాస్త్రమునకు అనుబంధములుకానట్టి విద్యలుకాని, కళలుకాని, వీనిచే ప్రతిపాదింపబడని తత్త్వహిత - పురుషార్థములుకాని లేవనుట నిత్య సత్యమగు విషయము. వేదాంతాది శాస్త్రములు - ఆత్మ పరమాత్మలయు, ఇతర జగద్వస్తువులయు స్వరూపాదులను, పురుషార్థ - తత్సాధనాదులను విశదీకరించుచున్నవి; ఆగమ శాస్త్రములన్ననో, అందరికిని స్వానుభవగోచరమగునటుల వానిని ప్రదర్శించుచున్నవి. మొదటివి - తత్త్వబోధకములు, కడపటివి - తత్సాక్షాత్కార సంపాదకములు.

మరియు, జలమునం దంతర్నిగూఢమైన విద్యుచ్ఛక్తిని స్ఫుటముగ నావిర్భవింపజేసి, యంత్ర తంత్ర్యాది పరికరములచే నిఖిల ప్రజానీకమునకును అందుబాటుతో నుండునటుల జేయుచున్న ఆధునిక విద్యుచ్ఛాస్త్రాదుల వలె పురాతనములగు నీయాగమ శాస్త్రములును పెక్కు సంవత్సరములకు పూర్వమే క్షీర సముద్రాదుల యందు నెలకొనియుండు వ్యూహ స్వరూపాదులనుండి దేవతాశక్తిని ఆకర్షించి, పూర్ణకుంభమునను, తద్ద్వారమున యంత్రములయందును, దేవతా విగ్రహములయందును ప్రసరింపజేసి, ప్రతిష్ఠించి, పూజా పురశ్చరణాదులచే ఆశక్తిని దినదిన ప్రవర్ధమానముగ నొనరించి నిఖిల ప్రాణులకును, తత్తదభీష్టములను జేకూర్చునట్టి అద్భుత ప్రక్రియలను అనుభవ పురస్సరముగ ప్రసాదించుచున్నవి. విద్యుచ్ఛక్తి కేంద్రములవంటివే దేవతాశక్తి నికేతనము లగు దేవాలయములును.

ఆగమ పదవ్యుత్పత్తి : దేవతల ఆగమమును గూర్చి తెలుపుచున్నందున దీనికి ఆగమశాస్త్రమని ప్రసిద్ధి కలిగియుండవచ్చును. లేక, వేదమునకువలె "ఆ - సమన్తాత్ గమ్యన్తే నిఖిలాఅపి అర్థా ఇతి ఆగమః" అను వ్యుత్పత్తిచే జ్ఞాతవ్యములగు సమస్త విషయములను సమగ్రముగ దెలుపుచు, అలౌకిక శ్రేయస్సాధనరూపము లగు అనేక ధర్మములను బోధించుచు నిత్య నిర్దుష్టములుగ నుండుటచే నిట్టి వ్యవహారము కలిగియుండవచ్చును.

"భావ - రాగ - తాళ" శబ్దముల ఆద్యాక్షర సమ్మేళనమున "భరత" శబ్దము నిష్పన్నమైనటుల, "ఆగత - గత - మత" శబ్దముల ఆద్యాక్షర సమ్మేళనమువలన "ఆగమ" శబ్దము నిష్పన్నమైనదని ఆయా ఆగమముల యందే నిర్వచింపబడి యున్నది.

ఆగమముల విభాగములు : ఈ యాగమములు ప్రధానముగ శైవములు, వైష్ణవములు, శాక్తేయములు అని మూడు విధములుగ నున్నవి. శాక్తేయాగమములకు తంత్రములని ప్రసిద్ధియున్నది. ఇంకను మరి విశేషముగ తంత్రములని ప్రసిద్ధియున్నది. ఇంకను మరి కొన్ని తంత్రము లున్నవి. వీనిలో శైవ - వైష్ణవాగమములు దక్షిణదేశమునను, మిగిలినవి ఉత్తరదేశమునను బహుళప్రచారమున నున్నవి.

శైవ వైష్ణవాగమముల యందు, కేవలము మంత్ర యంత్ర-ఉపాసనాక్రమములు మాత్రమేగాక, దేవాలయ నిర్మాణము, విగ్రహనిర్మాణ- ప్రతిష్ఠాదివిధులును, వాస్తు- శిల్ప - గాన - పాకాది విశేషములును, పంచకాల పూజా పురశ్చరణాదులును నిరూపింపబడియున్నవి. శాక్తేయ - గాణాపత్య - భైరవాది తంత్రములయందు యంత్ర - తంత్ర - మంత్రోపాసనాదులే ప్రధానముగ నభివర్ణింప బడినవి.

శైవాగమములు - వాని ప్రభేదములు : శైవాగమములు సద్యోజాతము మొదలగు నీశ్వరుని యైదు ముఖముల నుండి ఇరువది యెనిమిది ఆగమములు ప్రాదుర్భూతములైనవి. ఆగమము లన్నిటికిని వక్త - సాక్షాత్పరమ శివుడే - అని శైవుల సంప్రదాయము.

1. సద్యోజాతమునుండి - (1) కామికము (2) యోగజము. (3) చింత్యము (4) కారణము (5) అజితము - అని యైదును,

2. వామదేవమునుండి - (1) దీప్తము (2) సూక్ష్మము (3) సహస్రము (4) అంశుమాన్ (5) సుప్రభేదము అని యైదును,

3. అఘోరమునుండి - (1) విజయము (2) నిశ్వాసము (3) స్వాయంభువము (4) అనిలము (5) వీరము అని యైదును,

4. తత్పురుషమునుండి - (1) రౌరవము (2) మకుటము (3) విమలము (4) చంద్రజ్ఞానము (5) బింబము అని యైదును,

5. ఈశానమునుండి - (1) ప్రోద్గీతము (2) లలితము (3) సిద్ధము (4) సంతానము (5) సర్వోత్తమము (6) పారమేశ్వరము (7) కిరణము (8) వాతులము అని ఎనిమిదియును,

ఈ రీతిగ 28 ఆగమములు ఆవిర్భవించినవి.

వీనిలో, మొదటి పది ఆగమములు శివభేదములనియు తరువాతి పదునెనిమిదియు రుద్రభేదములనియు వ్యవహరింపబడుచున్నవి. మరియు శివభేదములలో ఒక్కొక్క దానికి ప్రవర్తకులు ముగ్గురును, రుద్రభేదములలో ఒక్కొక్కదానికి ప్రవర్తకులు ఇద్దరును ప్రసిద్ధులై యున్నారు.

శైవుల సంప్రదాయము : శివసృష్టి సమారంభమున శివశక్తి సమావేశముచే నిచ్ఛాశక్తివలన భువనోత్పత్తికై యోగమాయచే సృష్టిబీజము చిలుకరింపబడుచున్నది. అందుండి నాదము, దానిక్రింద శరత్కాల చంద్రునివంటి బిందువు ఆవిర్భవించుచున్నవి. దానిక్రింద "అంబిక" అను శక్తి తోచుచున్నది. దానిక్రింద వామశక్తికి అవరరూపముగ జయ, విజయ, అజిత, అపరాజిత, నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, ఇఇంధిక, దీపిక, రేచిక, మోచిక, వ్యోమరూప, అనంతర, అనాథ, అనాశ్రిత-అను శక్తులు గలిగి వీనిచే లోకమంతయును వ్యాపింపబడినటుల స్ఫురించుచున్నది. వీనినుండి ఏబది అక్షరములు గలుగుచున్నవి. స్వరాక్షరమున శివుడును, వ్యంజనాక్షరమున శక్తియును అధిష్ఠించియున్నారు. స్వర వ్యంజన సమ్మేళనముచే వర్ణములు, పదములు, వాక్యములు ఏర్పడి అర్థప్రతీతి గలుగుచున్నది- అని శైవుల సంప్రదాయము.

పాద విభాగము : దీని యందు (1) జ్ఞాన (2) క్రియా (3) యోగ (4) చర్యాపాదము అని నాలుగు పాదములున్నవి.

అందు జ్ఞాన పాదమున : పశు, పతి, పాశమ్ - అను మూడు పదార్థముల స్వరూప లక్షణ ప్రమాణములును ; (1) శివుడు (2) శక్తి (3) సదాశివుడు (4) ఈశ్వరుడు (5) శుద్ధ విద్య (6) మాయ (7) కళ (8) విద్య (9) రాగము (10) కాలము (11) నియతి (12) పురుషుడు (13) ప్రకృతి (14) బుద్ధి (15) అహంకారము (16) మనస్సు (17) శ్రోత్రము (18) త్వక్కు (19) చక్షుస్సు (20) జిహ్వ (21) ఘ్రాణము (22) వాక్కు (23) పాణి (24) పాదము (25) వాయువు (26) ఉపస్థము (27) శబ్దము (28) స్పర్శము (29) రూపము (30) రసము

(31) గంధము (32) ఆకాశము (33) వాయువు (34) అగ్ని (35) సలిలము (36) భూమి-అని ముప్పది యారు తత్త్వముల స్వరూపమును,

(1) తత్త్వరూపము (2) తత్త్వదర్శనము (3) తత్త్వ శుద్ధి (4) ఆత్మరూపము (5) ఆత్మదర్శనము (6) ఆత్మ శుద్ధి (7) శివరూపము (8) శివదర్శనము (9) శివ యోగము (10) శివభోగము అను పది కార్యలక్షణము లును నిరూపింపబడియున్నవి.

క్రియా పాదమున: మంత్ర విభాగమున ఆ యా క్రియ లకు కావలసిన మంత్రములను, క్రియా విభాగమున-కొలతలు, గర్భన్యాసము, శిలాసంగ్రహణము, లింగ మూర్తుల ప్రతిష్ఠ, అనుజ్ఞ, విఘ్నేశ్వరపూజ, వాస్తుశాంతి, మత్సంగ్రహణము, అంకురార్పణము, రక్షాబంధము, కుంభస్థాపనము, కలాకర్షణము, యాగశాల, కుంభాభి షేకము, మహాభిషేకము, మండలాభిషేకము, ఉత్సవ ములు, ప్రాయశ్చిత్తములు, నిత్యనైమిత్తిక కామ్య పూజలు మొదలగునవి అభివర్ణింపబడినవి.

మరియు (1) మూలాధారము (2) స్వాధిష్ఠానము (3)మణిపూరకము (4) అనాహతము (5) విశుద్ధి (6) ఆజ్ఞ అను షట్చక్రముల స్వరూపము, బ్రహ్మరంధ్రము, బ్రహ్మ గ్రంథి, రుద్రగ్రంథి, విష్ణుగ్రంథి, సహస్రారము, కుండలిని, మొదలగువాని స్వరూపము, యమనియమాది స్వరూప ములు, వర్ణాశ్రమ ధర్మాదులు నిరూపింపబడియున్నవి.

చర్యాపాదమున - పూజకు కావలసిన ఉపకరణ ములు, హవిష్పాకము, ఆరాధన విధులు, ఉపచారములు నిరూపింపబడి యున్నవి.

**కాశ్మీరశైవ (అద్వైత) ఆగమములు :-** అభినవ గుప్తుడు మొదలగు కాశ్మీర శైవ సంప్రదాయ ప్రవర్త కులు ప్రత్యభిజ్ఞాదర్శనము, స్పందదర్శనము అను శైవా ద్వైత సంప్రదాయములను ప్రవర్తింపజేసిరి. ఈ శైవ సంప్రదాయాగమములు 8 విభాగములుగ నున్నవి. ఒక్కొక్క విభాగమున 8 తంత్రము లున్నవి.

1. **భైరవ (సంప్రదాయాంతర్గత) తంత్రములు :-** (1) స్వచ్ఛంద, (2) భైరవ, (3) ఛండ, (4) క్రోధ, (5) ఉన్మత్త భైరవ, (6) అసితాంగ, (7) మహోచ్చుష్మ (8) కపాలీశ.

2. **యామళ తంత్రములు :-** (1) బ్రహ్మయామళ (2) విష్ణుయామళ, (3) స్వచ్ఛంద యామళ, (4) రురు యామళ, (5) (6) అథర్వణ యామళ, (7) రుద్ర యామళ. (8) వేతాళ యామళ.

3. **మత తంత్రములు :-** (1) రక్త. (2) లంపట. (3) లక్ష్మీమత, (4) మత. (5) శాలికా, (6) పింగళా, (7) ఉత్ఫుల్ల. (7) విశ్వాద్య.

4. **మంగళ తంత్రములు :-** (1) పిచుభైరవీ, (2) తంత్ర భైరవీ, (3) లత, (4) బ్రాహ్మీకలా. (5) విజయ, (6) చంద్ర, (7) మంగళా, (8) సర్వమంగళా.

5. **చక్రాష్టక తంత్రములు :-** (1) మంత్రచక్ర (2) వర్ణ చక్ర, (3) శక్తిచక్ర, (4) కలాచక్ర, (5) బిందుచక్ర (6) నాదచక్ర, (7) గుహ్యచక్ర, (8) ఖచక్ర.

6. **బహురూప తంత్రములు :-** (1) అంధక, (2) రురు భేద (3) అజ (4) మూల (5) వర్ణబంధ (6) విడంగ (7) యాత్రోదన (8) జ్వాలిన్.

7. **వాగీశతంత్రములు :** (1) భైరవీ (2) చిత్రికా (3) హంస (4) కదంబికా (5) హృల్లేఖా (6) చంద్రలేఖా (7) విద్యుల్లేఖా (8) విద్యుమత్.

8. **శిష్టాష్టక :** (1) భైరవీశిఖా (2) వీణా (3) వీణా మణి (4) సమ్మోహ (5) డామర (6) అథర్వక (7) కబన్ధా (8) శిరశ్ఛేద.

*వైష్ణవాగమములు - వాని ప్రభేదములు :* **వైష్ణవాగమ ములు :-** వైష్ణవదేవతల యొక్క ఆరాధనాదికముల దెలుపుచున్నవి. ఇవి ప్రధానముగ వైఖానసాగమములు, పాంచరాత్రాగమములు నని రెండు విధములుగ నున్నవి.

"కథం త్వమర్చనీయోఽసి మూర్తయఃకీదృశాస్తుతే।
వైఖానసాఃకథంబ్రూయుఃకథంవాపాంచరాత్రికాః॥"

అని భారతమున నీ రెండు ఆగమములను సమానస్కంధ ముగ కీర్తించియున్నారు.

"శ్రీమహావిష్ణువే పరదైవతమనియు, వారి యారా ధనమే మోక్షహేతు" వనియు నిరూపించుచు, నీ రెండు ఆగమములును పరమైకాంతికధర్మముల్ని బోధించుచుండు టచే "భగవచ్ఛాస్త్రము భాగవతధర్మశాస్త్రము, పరమ సంహిత" అను నామధేయములతో వ్యవహరింపబడుచు

సమాన ప్రతిపత్తితో నలరారుచున్నవి. శ్రీ వైష్ణవా చార్యులు ఈ రెండింటికిని సమానగౌరవము నిచ్చు చున్నారు. శ్రీ వైష్ణవ దివ్యక్షేత్రములలో, కొందరు వైఖానసాగమములను, మరికొందరు పాంచరాత్రాగమ ములను అనుసరించుచున్నారు.

వైఖానస గృహ్యసూత్రాద్యనుసారముగ చత్వా రింశత్ సంస్కారములను పొందినవారే వైఖానసు లగు దురుగాన, వైఖానసత్వము వంశపరంపరగ రావలసి యున్నది ; ఏ సూత్రానుసారులైనను పాంచరాత్రదీక్షను స్వీకరించిన పాంచరాత్రులగుటకు నవకాశమున్నది. మంత్రతంత్రాదులయందు కొంత భేదమున్నను, భగవ దారాధనౌపయికములై రెండును ఉపాదేయములై యున్నవి. పాంచరాత్ర సంహితలలోనే వైఖానససంహిత యొకటి గలదు.

వైఖానసాగమములు : పరమాత్ముని మానసపుత్రుడు విఖనసమహర్షి. గూఢార్థముల ప్రకాశింపజేయుటచే, "విశేషేణ ఖననాత్ విఖనాః" అను వ్యుత్పత్తివలన "విఖనసు" లను పేరు వచ్చినటుల వ్యాసమహర్షి నిర్వచించి యున్నాడు. వేదములను ప్రవర్తింప జేయుటకై చతుర్ముఖబ్రహ్మను సృష్టించినటుల, ఆరాధన ప్రక్రియలను బోధించు నాగమ శాస్త్రముల ప్రవర్తింప జేయుటకై విఖనస మహర్షిని పరమాత్ముడు తన సంకల్పముచే సృష్టించెనని చెప్పబడియున్నది. అవిఖనస మహర్షి భగవంతునిచే నుపదిష్టములగు భగవదారాధన క్రమములనెల్ల తన శిష్యులగు (1) కశ్యప (2) అత్రి (3) మరీచి (4) భృగు (5) వసిష్ఠ (6) అంగిరస (7) పులస్త్య (8) పులహ (9) క్రతువు - అను తొమ్మిది మందికి నుపదేశించి, వారి ద్వారమున సంహితలను ప్రవర్తింపజేసెనని సనాతనులు చెప్పుచున్నారు.

ప్రస్తుతము అత్రి, మరీచి, భృగు, కశ్యపుల సంహితలు మాత్రము ప్రసిద్ధిలో నున్నవి.

సమూర్తార్చనాధికరణము అను అత్రి సంహితయందు భగవంతుని సమూర్తార్చనము సాంగోపాంగముగ నిరూ పింపబడియున్నది, అర్చనము సమూర్తము, అమూర్తము అని రెండువిధముల నున్నది. అమూర్తార్చన మనగా - ఆవహనీయ - అన్వాహార్య - గార్హపత్య, ఆవసథ్య - సభ్యములను పంచాగ్నులయందు ఆగమోక్త విధానము ననుసరించి హోమాదుల ననుష్ఠించుట; ఇక సమూర్తార్చన మనగా - ఆలయములయందు ప్రతిష్ఠింపబడిన పంచబేరము లగు భగవంతుని బింబములను (విగ్రహాదులను) ఆగమోక్త విధానముగ నర్చించుట కర్షణాది ప్రతిష్ఠాంత కర్మలు, ఆరాధన - ఉత్సవ క్రమములు, విగ్రహ, గోపుర, ప్రాకారాది నిర్మాణవిధులు విశదముగ నిరూపింపబడి యున్నవి. కాశ్యప మరీచి సంహితలు గద్యాత్మకములు కాగా, అత్రిభృగు సంహితలు శ్లోకరూపములుగ నున్నవి. ఈ సంహితల కన్నిటికిని పరస్పర సంవాదమున్నది.

పాంచరాత్రాగమములు : పాంచరాత్రాగమములు అసంఖ్యాకములుగ నున్నవి. అందు 108 సంహితలు ప్రధానములైనవి. ఇప్పటివరకును జరిగిన పరిశోధనల వలన 250 సంహితలవరకు బయటపడియున్నవి. పౌష్కర సంహితయందు 62 వేల శ్లోకపరిమితము అయిన పాంచరాత్రసంహిత లున్నవనియు శ్రీ ప్రశ్న, విష్ణు తిలకములయందు అర్ధకోటి శ్లోకపరిమితములైన సంహితము లున్నవనియు చెప్పబడి యున్నవి.

పాంచరాత్రాగమ నామధేయములు, వాని వ్యుత్పత్తి :- (1) ఏకాయనశాఖ, (2) మహోపనిషత్తు, (3) సాత్త్వత శాస్త్రము, (4) భగవచ్ఛాస్త్రము, (5) భాగవతా గమము, (6) పాంచరాత్రము - అని వివిధ నామ ములతో నీ యాగమములు కీర్తింపబడుచున్నవి.

"ఏక ఏవ (శ్రీమన్నారాయణః) అయన (ఆరాధ్యః) ఇతి శ్రుతిః - ఏకాయన శ్రుతిః" అను వ్యుత్పత్తిచే "శ్రీమన్నారాయణు డొక్కడే ఆరాధ్యుడు, ప్రాప్యుడు, ప్రాపకుడును" అని యుపదేశించు వేదభాగమునకు ఏకా యనశ్రుతి యని పేరు. పరమరహస్యములగు భగవత్తత్త్వ ములను, ఆత్మల తత్త్వ - హిత - పురుషార్థములను విశిష్ట క్రమమున నిరూపించుచుండుటచేతను, నాలుగువేదములు సాంఖ్యయోగములు అన్నియుచేరి ఈ పాంచరాత్ర సంహితయగుటచే మహోపనిషత్తను నామము అన్వర్థ మగుచున్నది. సచ్ఛబ్దవాచ్యుడగు భగవంతునియొక్కయు సాత్త్వతులగు భాగవతులయొక్కయు వైభవానుష్ఠా నాదుల బోధించు చుండుటచే సాత్త్వత శాస్త్రమను నామధేయము యుక్తమగుచున్నది. అందుచేతనే భగవ

హ్యాత్రము, భాగవతాగమము - అను నామధేయములు కలిగినవి. పాంచరాత్రమను నామధేయము మాత్రము - అనేక విధముల నిర్వచింపబడియున్నది. ఈశ్వర సంహిత యందు, భగవంతుని పంచాయుధాంశ సంభూతులగు నైదుగురు యోగులకు నైదు దివారాత్రములు ప్రత్యేక ముగ నీశాస్త్రము నుపదేశించియుండుటచే "పాంచరాత్ర" మను వ్యవహారము గలిగినదని చెప్పబడియున్నది. పాద్మ సంహితలో, ఈ శాస్త్రమునకుముందు సాంఖ్యయోగాది పంచమహాశాస్త్రములు రాత్రివలె నిస్తేజస్కములగుచున్న కారణమున పాంచరాత్ర మను వ్యవహారము దీనికి కలిగినది అని చెప్పబడియున్నది. విష్ణుసంహితయందు, రాత్రివలె అజ్ఞానాంధకార వర్ధకములగు శబ్ద స్పర్శ రూప రస గంధము లను నైదు విషయములును, లేక పృథి వ్యప్తేజో వాయ్వాకాశములను నైదుమహాభూతములును అనగా వానివలనగలుగు బంధము, పరమాత్మను సందర్శించినంతనే నశించి పోవును అని యుపదేశము నొసంగుచున్నందున దీనికి పాంచరాత్రమను వ్యవహారము గలిగినదని చెప్పబడి యున్నది. అహిర్బుధ్న్యసంహిత యందు, పర - వ్యూహ - విభవ - అన్తర్యామి - అర్చా స్వరూపములు అనుభగవంతుని పంచావస్థలనుగూర్చి తెల్పుచున్నందున, పాంచరాత్రమని దీనికి పేరు గలిగిన దని - నిరూపింపబడి యున్నది.

పాంచరాత్రముల యందలి అవాంతర విభాగము :- (1) ఆగమసిద్ధాంతము, (2) మంత్రసిద్ధాంతము (3) తంత్ర సిద్ధాంతము (4) తంత్రాంతర సిద్ధాంతము అని నాలుగు విభాగములున్నవి. మరియు న్యూన - మధ్యమ - ఉత్తమ భేదములచేతను, దివ్య - అదివ్య భేదములచేతను అవాంతర విభాగములుకూడ నున్నవి.

ఈ పాంచరాత్ర సంహితల గణన అగ్నిపురాణము నందును, కపిలోంజలసంహితయందును, పాద్మ సంహిత యందును, విష్ణుసంహితయందును, హయశీర్ష సంహిత మొదలగు సంహితలయందును కొంచెము కొంచెము భిన్న భిన్న క్రమములతో నున్నది. డా. ఒట్టో ష్రాడరు మహాశయుడు పాంచరాత్రోపోద్ఘాతమను ఆంగ్లవ్యాస మున ఈ ఆగమములను గూర్చి విపులముగ చర్చించి యున్నాడు. డా. ఆర్. జి. భండార్కరు ప్రముఖులు ఆధునిక విమర్శసాధనములను గొని వీని కాలనిర్ణయాదు లనుగూర్చి చర్చించియున్నారు.

ఈ సంహితలయందును జ్ఞాన - క్రియా - యోగ - చర్యాపాదములు అను విభాగము లున్నవి. ముద్రా విశేషములు, యంత్రతంత్ర విశేషములు, జపహోమాది ప్రక్రియలు, దీక్షావిధిమొదలగు విషయములు విశిష్టక్రమ మున నభివర్ణింపబడియున్నవి.

శాక్తేయాగమములు :- శాక్తేయాగమములకు "తంత్రము" అను వ్యవహారము ప్రసిద్ధమై యున్నది. తంత్రమనగా - దేవతల యనుగ్రహమును సంపాదించు టకై ఫలార్థియగు పురుషుడుచేయు ప్రయత్నము. మంత్ర దేవతోపాసనాదులకు "తంత్ర" మను వ్యవహారము రూఢి అయినది.

ఈ తంత్రములయందు మంత్ర యంత్ర దేవతోపాస నాదులు ముఖ్యముగ నిరూపింపబడి యున్నవి.

శాక్తుల సంప్రదాయము :- సనాతనుడగు శివుడు నిర్గు ణుడు, సగుణుడునుగా నున్నాడు. నిర్గుణు డనగా ప్రకృతి కంటెను పరుడు. అనగా ప్రకృతి సంబంధములేనివాడు. సగుణుడనగా ప్రకృతిసంబంధముగలవాడు. ప్రకృతికే కళ యని నామాంతరము. సకళుడై సచ్చిదానంద స్వరూపు డగు పరమేశ్వరునివలన శక్తియు, అందుండి నాదము, దానినుండి బిందువు కలుగుచున్నవి. పరమశక్తిమయ మనునది బిందువు, నాదము, బీజము అని మూడువిధము లగుచున్నది. అందు బిందువు శివాత్మకము; బీజము శక్త్యాత్మకము, నాదము రెండింటి సమవాయము. అటు పిమ్మట బిందువునుండి రౌద్రియు, నాదమునుండి జ్యేష్ఠయు, బీజమునుండి వామయు నను శక్తులు గలుగు చున్నవి. వానినుండి క్రమముగ రుద్ర - బ్రహ్మ - రమా ధిపులు గలుగుచున్నారు. వారలు ఇచ్ఛాశక్తి, క్రియా శక్తి, జ్ఞానశక్తి స్వరూపు లగుదురు. వీరలే వహ్ని-ఇందు- అర్క స్వరూపులు. శక్త్యవస్థారూపమగు ప్రథమబిందువు నుండి అఖండమైన నాదము జనించుచున్నది. దీనినే శబ్ద బ్రహ్మమని యందురు. సర్వభూతములయొక్క చైతన్యమే శబ్దబ్రహ్మము. ఇదియే దేహమధ్యగతమగు కుండలినీ రూపమునొంది గద్యపద్యాది రూపమగు వర్ణాత్మకముగ నావిర్భవించుచున్నది. బింద్వాత్మకుడును, కాలబంధువును,

కళాత్మకుడును అగు శంభువునుండి సర్వవ్యాపియగు సదాశివుడుద్భవించును. సదాశివునుండి ఈశుడు, అతనినుండి రుద్రుడు, అతనినుండి విష్ణువు, అతనినుండి బ్రహ్మయు నావిర్భవించుచున్నారు. అటుపై, మూలభూతమగు అవ్యక్తమునుండి మహత్తత్త్వము, దానినుండి త్రివిధమగు అహంకారము కలుగుచున్నవి. అందు వైకారికమగు సాత్త్వికాహంకారమునుండి పది ఇంద్రియములు, తన్మాత్రక్రమ యోగమువలన భూతాదికమగు నహంకారమునుండి పంచభూతములు కలుగుచున్నవి.

దేహమున దక్షిణభాగము సూర్యుడు ; వామభాగము చంద్రుడు ; పది నాడులలో ఇడ, సుషుమ్న, పింగళ - అను మూడు నాడులు ప్రధానములు. వాయువులు పదియు, వహ్నులు పదియు నున్నవి. ప్రాణమునకు బుభుక్షాపిపాసలు, మనస్సునకు శోకమోహములు, శరీరమునకు జరామృత్యువులు అని షడూర్ములున్నవి. వీనికి వశ్యుడై జీవుడు దుఃఖించుచుండును. అట్టితరి చైతన్యస్వరూపిణియగు పరాశక్తి కుండలీభూత సర్పాకృతిని వహించుచున్నదై, శబ్దబ్రహ్మ స్వరూపిణియై పంచాశద్వర్ణ రూపిణియై మంత్రమయమగు జగత్తును సృష్టించుచున్నది. తదుపరి ఓం, శ్రీం, హ్రీం మొదలగు బీజాక్షరములను సకల మంత్ర యంత్రాదులను సృష్టించుచున్నది. ఇదియే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపములను బొంది ఆయా వర్ణాత్మకములగు కళలను సృజించుచున్నది.

ఇట్టి మంత్రములను, మంత్రాధిదేవతలను గుర్తెరిగి, యంత్రారాధన పురస్సరముగ జప - హోమ - తర్పణాదులద్వారా సిద్ధినిబొంది అష్టాంగయోగ నిష్ఠతో కుండలిని నిధ్యానించుచు, సహస్రారమును వికసింపజేసి, ఆకుండలినీ శక్తిప్రసాదమున శివైక్యమును బొంది బ్రహ్మానందము ననుభవించుటయే పురుషార్థము-అని ఈమత సారాంశము. శారదాతిలకము మొదలగు తంత్రగ్రంథములయందీ క్రమము అత్యాశ్చర్యకరముగ నిరూపింపబడియున్నది. శైవులవలె వీరును సర్వతంత్రములకును కర్త మహేశ్వరుడే యని చెప్పుచున్నారు,

గురుశిష్యపదేస్థిత్వా స్వయమేవ సదాశివః
ప్రశ్నోత్తర పదైర్వాక్యైః తంత్రం సమవతారయత్.

అని స్వచ్ఛంద తంత్రమున గీర్తింపబడి యున్నది. ఈ తంత్రములు అసంఖ్యాకములుగ నున్నవి. "మయా కృతాని తంత్రాణి సంఖ్యయాష్టోత్తరం శతమ్" అని ఈశ్వరుడు చెప్పినటుల మేరుతంత్రమున గలదు.

శ్రీ ఆర్థర్ ఎవేలన్ (Evelyn) మహాశయుని పర్యవేక్షణమున ఆగమానుసంధాన సమితిచే కలకత్తా నగరమున అనేకములగు శాక్తేయ తంత్రములు ప్రకటింపబడి యున్నవి.

ఈతంత్రములు వామములు, దక్షిణములు అని రెండు విధములుగ నున్నవి. అందు దక్షిణతంత్రములు బ్రాహ్మణాదులకును, వామతంత్రములు పాషండాదులకును అను సరణీయములని "శక్తిజిజ్ఞాస" అను గ్రంథమున చెప్పబడి యున్నది. మేరు తంత్రాదులయందీవిషయము బాగుగ విశదీకరింపబడినది.

టి. కె. వి. యన్. యన్.

## ఆటవిక నృత్య రీతులు :-

ఆటవిక నృత్యములు రెండు విధములుగా నుండును. 1. ఆరాధన నృత్యము, 2. వినోద నృత్యము. ఆరాధననృత్యములో ఖర్మనృత్యము కొలువు నృత్యము, బైగా నృత్యము అను విభాగములు కలవు. వినోద నృత్యములో ఋతువుల నృత్యము అనుకరణ నృత్యము, ప్రకృతి నృత్యము, వివాహ నృత్యము, యుద్ధ నృత్యము, వేట నృత్యము అను విభాగములు కలవు.

**నాట్యము :** వీరి నృత్యములందు కథతో సంబంధము గల్గినట్టి ప్రదర్శనములు ఎక్కువగా కనుపించవు. అచ్చటచ్చట చెంచుల కోనలోని చెంచువారు, శ్రీశైలమునకు ఆనుకొనియున్న అరణ్యములలోని ఆటవికులు ప్రదర్శించు 'చెంచులక్ష్మి నాటకము', 'శివభిల్లి' వంటి నృత్త ప్రధానమైన నాటకములు తప్ప, మిగిలిన ప్రాంతములలోనివారు ప్రదర్శించు నాటకములను కానము.

**నృత్యము :** అనుకరణ నృత్యము, ఋతువుల నృత్యము అందు నృత్యము ప్రాధాన్యము వహించును. ఇది ఆంగికమున ప్రధానమైయుండును. అనుకరణమునందు వీరు నెమలి నృత్యము, లేడిపిల్లవేటగాని నృత్యము మొదలయినవి ప్రదర్శించెదరు. ఆహార్యము గూడ ఆయా పక్షులవలె, జంతులవలె ధరించి, అవి చేయు అంగవిన్యాసము ననుస

రించి ప్రదర్శించెదరు. అరణ్యములలో నివసించు వీరికి ప్రకృతితోను, అందు నివసించు పశుపక్ష్యాది జంతువుల తోను సన్నిహిత సంబంధముండుటచే వీరు ఆ నాట్యములందు ప్రదర్శించు అంగ విన్యాసము సహజముగా నుండును.

**నృత్తము :** నృత్తము వీరి కళయొక్క జీవము. వీరి నృత్యకళ యంతయు నృత్తప్రాధాన్యమైనట్టిది, చక్కని లయతో గూడిన సుందరమైన అంగ విన్యాసము, ఆట వికుల నృత్య కళయందు మాత్రమే చూడగలుగుదుము. పర్వదినములందు పొంగు, కడలియందలి తరంగములవలె 'లయ' వీరి శరీరములో ప్రతి అవయవములో నుండి పొంగి ప్రవహించును. ఈ లయ, లయవిన్యాసము, శాస్త్రీయ నృత్యము నెరిగిన ప్రఖ్యాత నర్తకులందును, ఒకానొకపుడు కానమనుట సాహసముగాదు. ఆటవికుల నృత్యములకు ప్రత్యేకతాళములుండవు. సాధారణముగా వీరు గతుల నాధారముగా నృత్యమాడుదురు. త్రిశ్ర (3 అక్షరముల గతి) చతురశ్రము (4 అక్షరముల గతి) లాధారముగ వీరు విరివిగా నృత్యమాడుదురు. వీరిమృదంగ వాద్యము 'లయ' ను దెల్పుచు భావ ప్రధానముగా వాయించబడును. అనుకరణనృత్యములందు, యుద్ధ నృత్యములందు వీరు ఆహార్యమును ధరించెదరు. వీరి నృత్యములు రెండు విధములు :- స్త్రీలు పురుషులు కలిసి చేసెడి నృత్యములు. పురుషులు, స్త్రీలు వేరువేరుగా చేయు నృత్యములు. మరియు వీరి నృత్యములన్నియు బృందనృత్యములే. వేణువుయొక్క రాగాలాపము వీరి నృత్యమునందు ముఖ్య సంగీతము. పాడుచు నాట్యమా డుట తరుచుగా వీరి నృత్యములందు కనిపించదు.

భారతదేశములో—తోడా, ముండా, బైగా, కురవ, చెంచు, కోయ, సుగాలి, బంజారా, గదబ, సవర, గోండు, భిల్లు, నాగ, ఒరియను మొదలయిన ఆటవికతెగలెన్నియో యున్నవి. వారందరి నృత్యరీతుల గురించి ప్రత్యేకముగా ఈ గ్రంథమందు వ్రాయుట అసాధ్యము. కాన వారం దరికిని చెందిన కొన్ని ముఖ్యనృత్యముల వివరము లిందు తెల్పబడుచున్నవి.

**వేట నృత్యము (హల్బా) :** హల్బా అను తెగవారు మధ్యప్రదేశ నివాసులు. హల్బాలు వేటాడు విధానము శాత్మకముగానుండును. కొందరు ఎనిమిదిమంది కలిసి రాత్రి చిమ్మచీకటిలో వేటకు బయలుదేరెదరు. ఒకడు చిన్న దీపము తీసికొని ముందు నడచుచుండును. దాని నీడలో వెనుకభాగమున మిగిలినవా రుందురు. వారు కాళ్ళకు గుంగునియాలు (గజ్జెలందెలు) ధరించి యాడుదురు. వారు దీపపు నీడలో నిలబడి నృత్యముచేయుచు, లయతో అడుగులు వేయుచుందురు. అప్పుడు గుంగునియాలు "ఛుణ ఛుణ ఛుణ ఛుణ" అనియు "చం చం చం చం" అనియు మధురధ్వని చేయుచుండును. ఆ మధురధ్వనులచే ఆకర్షితములై పొదలలో నిద్రించుచున్న కుందేటికూనలు అటుప్రక్కకు పరుగెత్తుకొనివచ్చి, దీపపు వెనుకనున్న మనుష్యులను జూడక, మినుకుమినుకుమని వెలుగుచున్న దీపకాంతిని జూచి ఆనందించుచు నిలుచుండును. అవి దీపము ముందునకు వచ్చినంతనే వెనుకనున్నమనుష్యులు వాటిని పట్టుకొనెదరు. ఇది వేటనృత్యము.

**ఖర్మనృత్యము :** గోండులు మొదలైనవారు పాడి పంటల అభివృద్ధికిగాను జేయు ఆరాధన నృత్యము ఖర్మ నృత్యము.

వర్ష ఋతు ప్రారంభములో (భాద్రపదము) గోండులు చిగిర్చిన 'ఇప్ప' కొమ్మనుతెచ్చి, ఒక క్రొత్త గుడ్డలో చుట్టి యిండ్లలో నుంచెదరు. ఆనాడు పెద్దపండుగ చేయుదురు. విందారగించిన పిదప భజంత్రీలు మద్దెలలు మ్రోగించుచుండ స్త్రీ పురుషులు కలిసి ఆ కొమ్మచుట్టు తిరుగుచు ప్రకృతి గీతములనో, ప్రేమగీతములనో పాడుచు నాట్యమాడుదురు. ఇదియే ఖర్మ నృత్యము. ఇది గోండు లకేగాక యితర ఆటవిక జాతులవారికికూడా ముఖ్యమై నట్టిది. ఈ విధముగా నృత్యగీతములతో ఖర్మవృక్షము నారాధించి, (బుఢ్ఢదేవ) భగవంతుని, ధర్తీ మాతను సంతోషపెట్టిన పంటలు బాగుగా పండునని వారి దృఢ విశ్వాసము.

ఈ రీతిగా కార్తికము లేక. మార్గశిర మాసములలో "భుయ్యా" తెగవారు ఒక ఖర్మవృక్షము కొమ్మను అడవి నుండి తెచ్చి దానిని పల్లెలోనుంచి దానిముందు ఖర్మ నృత్యము చేయుదురు. ఇట్టి నృత్య గీతాదులతోగూడిన ఆరాధనవలన ఇప్ప, మామిడి, పనస మొదలైన చెట్లు చక్కగా ఫలించునని వారి నమ్మకము. సోమ, బుధ,

శుక్రవారములందు వీరు ఈ పూజలు చేయుదురు. ఇట్లు ఆరాధన నృత్యములుగాక యీ తెగలవారికి వినోద నృత్యములుగూడ యెన్నియో యున్నవి.

'గోటల్ ఘర్' : గోండులలో అవివాహిత యువతీ యువకులు నృత్త గీతములతో కాలము గడుపుటకుగాను ప్రతిపల్లెయందును, ఒక గృహ మేర్పరచబడును. అదియే 'గోటల్ ఘర్'. కొన్నిచోట్ల స్త్రీపురుషులకు వేరువేరుగా రెండు గృహము లుండును. ఛత్తీస్‌ఘర్‌లో గోండువల్లెల లోని పెండ్లిగాని యువతీయువకులు, రాత్రిపూట గోటల్ ఘర్‌లో చేరి నృత్యగానములతో కాలము కడపుదురు. ప్రతి రాత్రి భోజనాదులు ముగించుకొని అవివాహితయువకులు ముందుగా నృత్యగృహము జేరుదురు. అటుపై యువతులు వెళ్ళుదురు. 'కొట్వారు' గురువు, బాలికల నాహ్వానించి, యువకుల నాయకునికి ముందుగా వంద నము లర్పింపజేయును. అటుపై ఒక్కొక్క యువతి, తనకు ఇష్టమైన యువకుని ఏరుకొని, అతని తలను చక్కగా దువ్వి, కాళ్ళుచేతులను మర్దించి, అతనితో నృత్యము మొదలు పెట్టును. ఇరువురును అలసిపోవునంతవరకు, పాడుచు నృత్యముచేసి తర్వాత విశ్రాంతి తీసికొందురు. యువతులు ఇష్టమైనచో తమ ఇండ్ల కేగుదురు లేదా తమతో నృత్యముచేసిన యువకుల ఇండ్లలోనే రాత్రుల యందు వసింతురు. ఈవిధముగా ప్రతి రాత్రి నృత్యముచేయుటచే అనేక యువతీ యువకులలో పరస్ప రానురాగ మేర్పడును. అటుపై వారు వివాహము చేసికొందురు.

గోండుల నృత్యప్రీతి : గోండుజాతికి చెందిన పురు షులు తమ మోచేతులకు మోకాళ్ళకు, మణికట్లకు 'హోళీ' అగ్నిలో మండుచున్న మోదుగ కట్టెలతో చురు కులు వేసికొందురు. అటుల చేయుటవలన నృత్యమునకు అనువైన విధముగా వారి అవయవములు లొంగుననియు ఆ కట్టెలవలె తమ దేహములు గూడ తేలికగా తయా రగుననియు, మండుచున్న మంటలయొక్క జ్వాలలవలె వారియొక్క దేహములు కదలుననియు, తొందరగా మండు మంటలవలె, తమ అంగ ప్రత్యంగములందు చురుకుదనము వచ్చుననియు వారి నమ్మకము. మరి కొందరు కుందేటి పేడతో పిడుకలుచేసి, కాల్చి, దానితో మోచేతులు, మోకాళ్ళపై చురుకులు పెట్టుకొందురు. కుందేటి కాళ్ళవలె తమ అంగములు చక్కగా వంగు ననియు, చలనము కుందేటివలె మిక్కిలి చురుకుగా నుండుననియు వారి నమ్మకము.

కోయవారి వృషభ నృత్యము (ప్రకృతి అనుకరణ నృత్యము) : ఈ నృత్యపు కథా విశేషము బాగుగా మదించి యౌవనములో నున్న ఆబోతులు ఒకటినొకటి 'ఢీ' కొని పోట్లాడుట. ఇది రౌద్రరస ప్రధానమైనట్టిది. ఈ నర్తకులుగూడ నృత్యమాడునప్పుడు తమ ముఖము లను గవ్వలతో తయారుచేసిన అలంకరణములతో కప్పి, తలకుజుట్టిన తలపాగాయందు రెండు కొమ్ములను ఇరు వైపులనుండి తమ శిరస్సులతో ఒకరినొకరు ఢీకొనుటకు అనువగు విధమున, సిద్ధమగుదురు. నృత్యమాడునపుడు నర్తకులే మృదంగములను వాయింతురు.

నృత్య వర్ణన :- షుమారు ఇరువదిమంది పురుషులు తమ మెడలందు పొడుగుపాటి పెద్ద పెద్ద మృదంగము లను వ్రేలాడవేసికొని నిలుచుందురు. తలవెంట్రుకలను గోపురములవలె ఎగకట్టి దానిపై తలపాగ, తల కిరు వైపుల ఎద్దుకొమ్ములు, అలంకార ప్రాయముగా ధరించె దరు. శరీరమున కటిభాగమునకుపైన ఎట్టి అలంకరణము లుండవు. మోకాళ్ళవరకు పంచెమాత్రము కట్టుకొందురు. పురుషులు మద్దెలలు వాయించుచు గుండ్రముగా తిరుగుచు నృత్యము చేయుదురు. స్త్రీలు వారికి కొంత దూరములో నిలబడి ఒకరి చేతుల నొకరు పట్టుకొని నృత్యమాడుచుందురు. ఈ రీతిగా కొంతతడవు నృత్య మాడిన పిదప పురుషులు రెండు భాగములుగా చీలి ఒకరి కెదురుగా ఒకరు నిలబడుదురు. నిమిషము నిశ్శబ్దము.

'ధంగ్ - ధంగ్‌త - ధంగ్ - తకిట ధంగ్ ధంగ్'

ఇరువదిమంది వారి మెడలలోనున్న మద్దెలల నన్నింటిని ఒకేసారితుఫానులో మేఘగర్జనమువలె పలికింతురు. అందరి యందును ఏదో ఉత్సాహము, ఏదో ఉద్రేకము, ఏదో ఆవేశము పుట్టును. శరీరములను కదిలించుచు, మృదంగ ములను మ్రోగించుచు, నృత్యముజేయుచు వెనుకకు వెళ్ళి మిక్కిలి తొందరగా అడుగులువేయుచు, చిన్న పరుగుతో ముందుకువచ్చి, కొట్లాడు ఆబోతులవలె

షీకొనుచు, తలలను దగ్గరగాజేర్చి, కొమ్ములతో పాడుచు కొనునట్లు అభినయము చేయుదురు. ఆ విధముగా ఇద్దరిద్దరు తలలనుజేర్చి, కొమ్ములతో పాడుచు కొన్నట్లభి నయించుచు, గిరగిర గుండ్రముగా తిరుగుచు, తాళము తప్పక నృత్యమాడుదురు.

పరుగు పరుగున వెనుకకు అడుగులు వేయుచు మరల ముందుకు పళపళమని మృదంగముల వాయించుచు పరుగెత్తుకొనివచ్చి 'ఢీ' కొందురు. ఈవిధముగా నృత్యము చేయుచు, అలసిపోయియున్న నర్తకులను, ప్రేక్షకులుగా నిలిచియున్న స్త్రీ పురుషులు ఏకకంఠముగా "హే, హే" అని కేకలు వేయుచు, చప్పట్లుకొట్టుచు ఉత్సాహపరచు చుందురు. ఇట్లు కొంతతడవు నృత్యమాడినపిదప, స్త్రీలు పురుషులుగలిసి ప్రకృతి గీతముల పాడుచు నృత్యము సల్పుదురు. ఈ నృత్యము ఆంధ్ర దేశములోని అరణ్యములలో నివసించెడు కోయవారు చేయునట్టిది.

నాగవీరుల యుద్ధ నృత్యము : నాగజాతివారు అస్సాము అడవులందును, బర్మాసరిహద్దు ప్రాంతము లందును నివసించెడు ఆటవికులు. వీరి నృత్యములు భయానక, రౌద్ర, బీభత్సరస ప్రధానములై యుండును. పూర్వకాలమందు అడవి తెగలవారు తరుచు ఒక తెగతో ఇంకొక తెగవారు యుద్ధములు చేయుచుండెడివారు. ప్రస్తుతము అట్టి యుద్ధములు లేకపోయినను, ఆ యుద్ధమును దెల్పునట్టి క్రమమే వారి నృత్యమందు కాంచ నగును. వీరెన్నియో ఇతర నృత్యములను జేసినను, వీరి, వీర నృత్యము, (యుద్ధ నృత్యము) మాత్రము ప్రఖ్యాతి గాంచినట్టిది. ఈ నృత్యమాడునప్పుడు వీరు యుద్ధమునకు బోవు నాగవీరులు ధరించెడు ఆహార్యమును ధరింతురు. డాలు, ఈటె రెండు చేతులందుండును.

నాగ నృత్యవర్ణన :

'ఢ్రంగ్ - టక్ టక్ టక్
ఢ్రంగ్ - టక్ టక్ టక్
గిట గిట గిట - గిడ గిడ గిడ
గిట గిట గిట - గిడ గిడ గిడ
ఢ్రంగ్ తక్ టక్ ఢ్రంగ్
ఢ్రంగ్ - టక్ టక్ టక్

పెద్దపెద్ద డప్పులు, మృదంగములు గంభీరముగా మ్రోగు చుండును. వారికి ప్రక్కగా నాగవీరులు బారులు దీర్చి ఒకరికెదురుగా ఒకరు నిలుచుందురు. కొందరు విల్లమ్ముల ధరింతురు. కొందరు డాలు కత్తులను పట్టుకొందురు. శరీరములను ధగధగ మెరయు పలువిధములగు రంగులతో చిత్రించుకొందురు. మెడలందు గవ్వలు, నత్తగుల్లల మాలలు, రంగులలో ముంచిన చిన్న బెండు ముక్కల మాలలు ధరించెదరు.

మాదల్ యొక్క తాళగతి ననుసరించి, వారు యుద్ధ మందు సైనికులవలె ఒకరికి దగ్గరగా నొకరు ఒక గోడవలె నిలబడి, అడుగులు వేయుచు అతి జాగ్రత్తగా నడచివత్తురు. ఇట్లు ఇరుప్రక్కల సైనికులు ఒక అడుగు దూరములో ఒకరి కెదురుగా నొకరు వచ్చినంతనే,

'త్రాంగ్ - గిడగిడ - త్రాంగ్ - గిటగిట
ద్రిత్రాంగ్ - గిటగిట - గిటగిట - దడదడ
ద్రిత్రాంగ్, త్రాంగ్ - త్రాంగ్ - త్రాంగ్'

ద్రుత లయలో అన్ని వాయిద్యములు గర్జించును.

వెంటనే ఆ వీరులు ఒకరిపై నొకరు ఉరుకుదురు. కొంత తడవైన పిదప,

'త్రాంగ్ తక్ - త్రాంగ్ తక్ - దడతంగ్'

అన్ని వాయిద్యములు ఆగి - మద్దెల మాత్రము పలుకును.

రెండు సైన్యములు విడిపోయి, వెనుకకు పోయి కొంత సమయము విశ్రాంతి దీసికొని, మరల తాళలయల ననుసరించి, అడుగులను వేయుచు ముందునకు వచ్చును. ఇది నాగవీరుల యుద్ధానుకరణ నృత్యము. రెండవసారి యుద్ధముచేసి స్వస్థలములకు బోవునప్పుడు, వీరస్వర్గము నలంకరించినటు అనుకరించు తమ సోదర సైనికులను తమ వీపులపై మోసికొనిపోవుదురు.

మరల మూడవసారి సైనికుల,

'తద్ధంగ్...............అని

నగారా ధ్వనించును. మృదంగములు విశ్రాంతిగొనును.

'క్లక్ - క్లక్ - క్లక్ - క్లంగ్
కడక్ - క్లక్ - క్లక్ - క్లంగ్' అని

కొబ్బరి చిప్పలతో చేయబడిన వాద్యములు ధ్వనించును. వీరులు స్వస్థలముల జేరి, ప్రశాంతముగా నిలబడుదురు.

'లడక్ లడక్ తుం - లకడ లకడ దుం
లడక్ లడక్ తుం - లకడ లకడ దుం'

అను గతి ననుసరించి అవ్వ తాత తొడుగులను ముఖము లకు ధరించిన యిద్దరు వ్యక్తులు, నృత్యమాడుచు యుద్ధ భూమిని ప్రవేశించి ఇరుబలములకు మధ్యన నిలబడుదురు. ఉభయ సైన్యాధిపతులు, ఆ పెద్దలను సమీపింతురు. ఆ పెద్దలు కొన్ని సంజ్ఞలు చేయగా, ఇరువురు సైన్యాధి పతులు మోకాళ్ళపై గూర్చుండి, వారి ఆజ్ఞ శిరసావ హించినట్లు భావప్రకటనను గాంచిన తక్షణమే దూర ముగా నిలబడి ఆ దృశ్యమును జూచుచున్న స్త్రీలు— 'హే... హే' అని ఉత్సాహముతో కేకలువేయుచు ఆ ప్రదేశమునకు పరుగెత్తుకొని వచ్చెదరు

'దిరత్రంగ్ - త్రంగ్ త్రంగ్ త్రంగ్
దిరత్రంగ్ - త్రంగ్ త్రంగ్ త్రంగ్ '

అను రీతిచే మృదంగము ఆనందమును వెలిబుచ్చును.

'ధంగ్ - తకిట, తకిట - తకిట
ధంగ్ - తకిట, తకిట - తకిట'

అను గతులచే అవ్వ తాతలను మధ్య నిలువబెట్టి స్త్రీ పురుషు లందరును గూడి చుట్టూ తిరుగుచు నృత్య మాడుదురు.

'లక్ లక్ లక్ బం
లక్ లక్ లక్ బం' అనుచు

కొబ్బరికాయల వాద్యములు పలుకగా, అవ్వ తాతల తొడుగులు ధరించిన వ్యక్తులు తమ తలలను దగ్గరగా తెచ్చుచు, ముందుకు వెనుకకు ఆడించుచు నృత్యము చేయుదురు.

మరల మృదంగము ధంగ్ తకిట - తకిట తకిట అనుచు మ్రోగుటయె తడవుగా అందరు భూమి దద్దరిల్లునట్లు అడుగులు వేయుచు నృత్యమాడి ముగించెదరు. ఇదియే నాగవీరుల యుద్ధనృత్యము. యుద్ధము చేయుట, సంధి చేసికొనుట మరల స్త్రీపురుషులు యుద్ధముముగిసినందుకు ఆనందముతో నృత్యమాడుట అనునవి వీరు ఇందు ప్రద ర్శించు కథావిశేషములు.

**చెంచుల నృత్యము :** చెంచుల కోనలోని చెంచువారు ప్రదర్శించెడునృత్యములలో 'చెంచిత నాటకము' ప్రఖ్యాతి గాంచినది. చెంచిత, చెంచురాజు కుమార్తె. నృసింహ స్వామి వారి ఇలవేల్పు. చెంచులక్ష్మి నృసింహస్వామిని వివాహమాడుట ఈ కథ. ఈ కథ నృత్యనృత్తములతో వీరు ప్రదర్శింతురు. ఆదిలో ఈ నృత్యము, లయప్రధాన మైన నృత్తముతో గూడియుండినను, కాలక్రమమున ఈ నర్తకులకు పట్టణములలో నివసించు ప్రజలతో పరి చయము గల్గుటచే నృత్యపద్ధతియందు అనేకమైన మార్పులుగల్గినట్లు తోచుచున్నది. ఈ ప్రదర్శనము నృత్య నాటక పద్ధతిలో నుండును. అట్టిదే 'కురవ' లు ప్రదర్శిం చెడు కురవంజి నృత్యము. ఈ నృత్యగాథ శివపార్వతికి సంబంధించియుండును. దీనికే 'శివఖిల్లి' యనికూడ పేరు. కొన్ని సమయములందు 'కిరాతార్జునీయ' కథనుగూడ నృత్యమాడుదురు. ఈ నృత్యములు బృందనృత్యములు గావు. ఇతర ఆటవిక నృత్యములందువలె ఇందు తెగవా రందరుపాల్గొనుటకు వీలుండదు గాన ప్రేక్షకులు, ప్రదర్శ కులు వేరుగా నుందురు. చెంచులకు, కురవలకు ఆరాధ్యదేవతలు వేరుగానున్నను వైష్ణవ, శైవమత ప్రభావముగల్గిన ఆలయములకు చాపున వారు నివసించు టచే ఆయా దేవతలకు సంబంధించిన కథలను నాటకము లాడుటకు అలవాటుపడిరి.

**'సవర' ల నృత్యములు :** సవరలు ఒరిస్సా అరణ్య ములలో నివసించెడు ఆటవికులు. వీరి నృత్యము లెక్కు వగా ప్రకృతిఆరాధనమునకు సంబంధించినట్టివి. ఈ నృత్య ములు ముఖ్యముగా చతురశ్ర, తిశ్ర, ఖండగతులలో నుండును. ఇవియును లయప్రధానముగ చేయబడు బృంద నృత్యములు. ఋతువుల ననుసరించి చేయబడు నృత్య ములు వీరి కళయందు ముఖ్యమైనవి. ప్రతి ఋతువునకు తగిన అంగవిన్యాసములతో నృత్యములు వీరు ప్రద ర్శింతురు. ఆ నృత్యములను చూచినపుడు ఆయా ఋతు వుల యందలి విశిష్టత వారి అంగవిన్యాసములో మనకు గోచరించును. వాద్యములందు గూడ ఆ భావము నొప్పించు ధ్వనులు పలికించబడును. ఋతునృత్యములు ఆయాకాలమందు తప్ప ఇతర కాలములందు ప్రదర్శింప బడవు.

**'సుగాలీ' ల నృత్యములు :** సుగాలీలు, బంజారాలు, లంబాడీలు— వీరందరు ఒకే తెగకు చెందినట్టివారు. పురుషుల నృత్యములకంటె, స్త్రీల నృత్యములు చాల చక్కగానుండును. అద్దములతో కుట్టిన రంగురంగుల కుచ్చుల లంగాలను ధరించి, చేతులకు దంతపు గాజులను,

మెడలందు గవ్వల మాలలను, చెవులకు గజ్జెల వెండి ఒంకాలను ధరించి, లంబాడీభాషలో గీతములనుపాడుచు చప్పట్లు తట్టుచు గుండ్రముగ తిరుగుచు, వీరు చేయు నృత్యము— మన దేశములో స్త్రీలు జేయు కుమ్మి, ఒతకమ్మలాట, గొబ్బి మొదలైన జానపద నృత్యములను పోలియుండును. వీరి నృత్యమందు పెద్దపెద్ద డప్పులు మాత్రము సుగాలీ పురుషులు వాయింతురు.

'వర్లీ' తెగవారి నృత్యరీతులు: వీరు మహారాష్ట్ర ప్రాంతములోని అరణ్యములలో నివసించువారు. వీరి నృత్యములన్నింటిలో 'ఆత్మయాత్ర' నృత్యము ముఖ్యమైనట్టిది. చనిపోయిన మనుష్యుని భూమిలో పూడ్చిపెట్టి జీవాత్మ నదులను, అరణ్యములను దాటి అలసటలేకుండ ప్రయాణము సాగించి పరమాత్మను జేరుటకు, ఆ సమాధి చుట్టు స్త్రీపురుషులు చేరి, నృత్యగీతములతో సాగనంపుదురు. వారి కంఠములలో విషాదము ప్రతిధ్వనించుచుండును. వారి అంగచలనము అతిసున్నితమై, విలంబిత లయగలిగి కరుణరస మొలుకుచుండును. ఇట్లు సంధ్యా సమయము వరకు నృత్యమునల్పి వారిండ్లకు బోవుదురు.

'కోలుల' నృత్యములు: వీరి నృత్యము లన్నింటిలోను వరికోతల నృత్యము ముఖ్యముగ చూడదగినది. వీరు ముఖ్యముగా ఛోటానాగపూరునకు సింగభూమికి మధ్య భారతమునకు చెందిన అరణ్యములలో నివసించెదరు. వీరికి నృత్యమనిన అత్యంత ప్రీతి. ఈ తెగవారందరు ఒకచోట గూడినప్పుడుగాని, ఒక పల్లెవారింకొక పల్లెలోని తమ బంధువుల జూడబోయినప్పుడుగాని నృత్యగానములతో కాలము గడుపుదురు. వీరి నృత్యములు విలంబితముగా, స్వాభావికమై అతిసుకుమారముగా నుండును. లయ తాళములందు వీరికి మంచి ప్రావీణ్య మున్నది. వీరి వరికోతల నృత్యము హృదయరంజకమైనది, తాళగతి ననుసరించిన వేణుగానముతో స్త్రీలు వరుసగా నిలిచెదరు. వారొక గీతము నాలపించుచు లయతాళముల ననుసరించి అడుగులు వేయుచు, అందరు ఒకేసారి వంగి చేతులతో కొన్ని ముద్రలు ప్రదర్శింతురు. ఆ ప్రదర్శనము అచ్చముగా పొలములలో వరివారు నాటినట్లుగా మనకండ్లకు తోచును. తరువాత కోయుట, కోసినపైరు కట్టగట్టుట, కొట్టి దులిపి కుప్పలు వేయుట మున్నగునవి తాళలయల ననుసరించి, మధురముగా పాడుచు అభినయింతురు. ధాన్యమును పేర్పరచి, చేటలతో చెరుగుచు శుభ్రపరచి, కుప్పలుగా బోసి యేడాదిగా నొనర్చిన ఫలితమును కన్నులారజూచి, ఆనందముతో తన్మయత్వమొంది, నాట్యమాడుదురు. ఇట్లు వారు వర్షఋతు ప్రారంభమున పొలము దున్నుట మొదలు ఆ పటి కృషిఫలితమైన క్రొత్తవడ్ల విందారగించు వరకును జరిగెడు దృశ్యములను, వివిధ ఘట్టములుగా పైకొని నృత్యమాడుదురు.

కోరువాల నృత్యము: మృదంగములు రణభేరులవలె గర్జించుచుండగా పురుషులు చక్రాకారముగా నిలబడెదరు. స్త్రీలు, ఆ పురుషుల మధ్య మఱొకవలయముగా నిలువబడెదరు. వారొకరినొకరు అంటిపెట్టుకొని చుట్టుచుట్టుకొని నిద్రించుచున్న పాములవలె నిలబడెదరు. అందరిమధ్యన 'ఖోర్‌గస్' కూర్చుండి తన తంత్రీవాద్యమును వాయించుచు, పాడుచు నర్తకులకు ఉత్సాహమును కలిగించును. పురుషులు తమ నిడుపైన వెండ్రుకలను ముడివేసి, అందు అమ్ముల నుంచుటచే వారు నృత్యమాడునప్పుడు వారి సిగలు, జడలు వానితో పాటు అమ్ములు లయానుగుణముగా కదలును. వారొకరి చేతుల నొకరు పట్టుకొని గుండ్రముగా తిరుగుచు నృత్యమాడుచుండ చుట్టలుగా పడుకొనియున్న పాములు తాళలయకు కదులుచున్నట్లు భ్రమగొల్పును.

వీరు 'ఖర్మ' నృత్యము గ్రీష్మఋతువులో జేయుదురు. వర్షములు లేనిచో ఈ నృత్యమును వీరు ప్రతిరాత్రి చేయుదురు. 'ఖర్మ' ఆరాధననృత్యమగుటచే భగవంతునికి ప్రీతి గల్గించవచ్చునని వారి యుద్దేశము.

'కవురు'లు కోలాటము వేయుదురు. ఏకతారలను చేతులతో పట్టుకొని గీతములను పాడుచు, నృత్యమాడుదురు. వీరి నృత్యములకును సంతాలుల యొక్కయు, కోలుల యొక్కయు నృత్యముల కెట్టి సంబంధములేదు.

బైగాలు అనువారు 'సేల', 'రేనా' అను రెండురకములైన ప్రత్యేక నృత్యములను జేయుదురు. 'సేల' అను నృత్యము బైగా పురుషులు చేయునట్టిది. 'రేనా' అనునది బైగా స్త్రీలు చేయునట్టిది. స్త్రీలు ఒకరికిదగ్గరగా ఒకరు నిలబడి, చేతులను మాత్రము పట్టుకొనక ముందుకు

వచ్చుచు, వెనుకకు వెళ్ళుచు, వంగుచు నృత్యమాడుదురు. 'బైగాలు' ఆటవికజాతులవారి పూజారులు.

ఆటవికుల నృత్యరీతు లన్నింటిలోను ముఖ్యమైనట్టివి 'ఒరియనుల' నృత్య జాతరలు. ఇట్టి నృత్యజాతరలు మన దేశమునందును, ప్రపంచములో మరెచ్చటను లేవేమో ? కొన్ని వేల మంది ప్రజలు - స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువకులు— అందరును ఒకచోట జేరి నృత్యజాతరయందు పాల్గొందురు. ప్రాతమామిడితోటలు వీరి జాతరస్థలములు తెల్లవారు సమయమున నృత్యజాతర ప్రారంభమగును. సుమారు పదిమంది బాలురు మామిడితోటకు పోవుదారిలో నాటబడిన జండాలను జూచి, ఆనందముతో వెఱ్ఱిగా కేక లిడుచు పల్లెలోనికి పరుగెత్తుదురు. ఆ చుట్టుప్రక్కల నున్న అన్ని గ్రామములవారికి తెలియుటకుగాను, పల్లెల జెండాలను దెచ్చి నృత్యము జరుగు ప్రదేశమునకు పోవు దారిలో నాటుదురు.

జాతర వార్తయు, నృత్యజాతర వార్తయు పల్లెలలోకి ప్రాకిపోవును. కొన్ని క్షణముల క్రింద నిశ్శబ్దముగానున్న పల్లెలన్నియును జాతర - జాతర - జాతర అను శబ్దములతో ప్రతిధ్వనించును.

అందు గుంపులు గుంపులుగా జనులు అన్ని పల్లెల నుండియు జాతరజరుగుతోటకు చేరెదరు. సుమారు మధ్యాహ్నము రెండు గంటలకు వా రలంకరించుకొందురు.

'డాయిడె డడా - డా రెడ డా - డా రెడ డా - డా ' అనురీతి మద్దెలలు మ్రోగమొదలిడునవి. కొమ్ము వాద్యములు ధ్వనించును.

ఒక్కొక్క పల్లెవారు ఊరేగింపుతో నృత్యస్థలమునకు తరలి వచ్చెదరు. ముందు యువకులు కత్తులు, డాలులు మున్నగు ఆయుధములను, తమ పల్లెలకు చెందిన పతాకములను పట్టుకొని నడుతురు. చిన్న చిన్న బాలురు వింజామరలను, పెద్ద పొడుగుపాటి కఱ్ఱలను పూలమాలలు మున్నగువానితో అలంకరించి, పూర్వము రాజులకు పట్టబడు గొడుగులవలె పట్టుకొందురు. ఒక పల్లెనుండి వచ్చినవారిలో ఒకడు రాజుగారి అలంకరణముతో కఱ్ఱ గుఱ్ఱమును స్వారిచేయును. మరికొందరు యువకులు ఆ గుఱ్ఱముతోచేర్చి అతనినిగూడ తమ భుజములపై మోయుదురు. వారిముందు కొందరు వేటజంతువులవలె అలంకరించుకొని నడుతురు. వారి వెనుక స్త్రీలు,పురుషులు బారులుదీరి నడతురు. మామిడితోటకుజేరి వారందరు కలిసి ముందుకు వంగుచు వెనుకకు వెళ్లుచు, సముద్ర తరంగములవలె అందరు ఒకేసారి కాళ్ళనెత్తి అడుగులు వేయుచు చక్రాకారముగా తిరుగుచు నృత్యముచేసి మరల నిలబడుదురు. (అతిరమణీయముగా శరీరములను కదిలించుచు కొంతతడవు నృత్యమాడిరి.) ఇదియే 'ఖరియా' నృత్యము. సుమారు రెండువేల జనులు - స్త్రీలు, పురుషులు, వృద్ధులు వరుసగా నిలువబడి అందరు ఒకేసారి మృదంగ తాళముల ననుసరించి కాళ్ళనెత్తి భూమిపై కొట్టెదరు. తరువాత నృత్యములో వారికి వాద్యములతో పనిలేదు. వేలకొలదిజనులు ఏకకంఠముతో పాడుచు, కాళ్ళతో తాళలయలను జూపుచు, ఒకరినొకరు అంటుకొని నిలువబడి, గుండ్రముగా తిరుగుచు నృత్యమాడెదరు. కొంతసేపు నృత్యమాడి అలసిపోయినంతనే అందరు 'హుర్ ర్....' అని నినాదము చేయుదురు. వెంటనే అందరు శిరస్సులను ముందుకువంచి, రెండు కాళ్ళనుచేర్చి, పైకెగిరి భూమి దద్దరిల్లునట్లు అడుగువేసి కూర్చుందురు. ఒక నిమిషకాలము విశ్రాంతి కలుగగా, ఒక మూలనుండి పురుషకంఠము ఉద్రేకపూరితముగా - ఓ...అని పిలిచినట్లు పాడును. ఆ రాగమునందుకొని మరల అందరు నృత్యమున కుపక్రమింతురు. ఇట్లు వారు అలసిపోవునంతవరకు నృత్యమాడి, సంధ్యవేళకు అన్ని పల్లెలవారు విడిపోయి నృత్యమాడుచు, తమ ఇండ్లకు పోవుదురు. ఇదియే 'ఒరియనుల' నృత్యజాతర.

న. రా.

**ఆదిభట్ల నారాయణదాసు:** ఆజానుబాహు విరాజితుడయి, బలిష్ఠమైన శరీరము, విశాల నేత్రములు, గొప్ప ఠీవి కలిగి హరికథ చెప్పు నవసరమున సిరిబొజ్జ నృత్యమునకు వింతగొలుప ఆడుచు, పాడుచు, సమయస్ఫూర్తిగా సభాసదులను కొనియాడుచు, ఆక్షేపించుచు, రంజింపజేయుచు'హరికథాపితామహు'డనుఖ్యాతివహించినమహావిద్వాంసులు కీ. శే. శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు.

శ్రీ నారాయణదాసుగారు శ్రీకాకుళము జిల్లా పార్వతీపుర సమీపములో సువర్ణముఖి తీరముననున్న అజ్జాడయను గ్రామములో రక్తాక్షి సంవత్సర శ్రావణ

బహుళ చతుర్దశి బుధవారమున (1864) ఆదిభట్ల వేంకట చయనులుగారి వలన నరసమాంబగారియందు అష్టమ గర్భమున సంజాతులయి యుండుటవలననే శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు ఈ రీతిగా వర్ణించిరి.

అల నారాయణుఁ డప్డు కృష్ణుఁడయి గే
యమ్మందు సంతోషముం
గొలిపెంగాని కవిత్వమందుఁ గొలుపన్
గొంతేనియున్నోచుకోఁ
డల లోపమ్మును దీర్చుకోఁ దలచి కా
దా యిట్టి రూపమ్ముతో
నిల నారాయణదాస నామమున ని
ల్లేపారె నాఁ జెల్లదే.

నారాయణదాసుగారు దాదాపు అయిదు సంవత్సరముల వయస్సున తల్లిగారితోకలసి పార్వతీపురము వెళ్లిరి. అక్కడ నొక పుస్తకముల దుకాణములో భాగవతము చూచి తనకు కొనిపెట్టుమని తల్లిని నిర్బంధించిరి. తల్లిగారి వద్ద సొమ్ము లేకపోవుటవలన కొనిపెట్టలేకపోయెను. కాని నారాయణదాసుగారు చీకాకుపడుట దుకాణదారుడు చూచి 'అబ్బాయీ! నీవు పద్యములు చదువగలవా? అటులయిన నీకు ఈ భాగవతమును ఉచితముగా నిచ్చెదను' అని పలికెను. అప్పుడు నారాయణదాసుగారు 'అయ్యా! నేను పద్యములు చదువగలను, మా యమ్మ అర్థము చెప్పగలదు' అని పలికి వెంటనే ఆ పుస్తకమును తెరచి రాగయుక్తముగ పద్యములు చదువుటయు తల్లిగారు చక్కగా అర్థముచెప్పుటయు జరిగెను. నారాయణదాసుగారి కపుడు భాగవతము బహుమతిగా లభించెను.



నారాయణదాసుగారి రెండవ అన్నగారయిన సీతారామయ్యగారు విజయనగరములో నుండెడివారు. వారు నారాయణదాసుగారి తెలివితేటలను గ్రహించి వారికి ఆంగ్లేయవిద్య చెప్పించి, పెద్ద ఉద్యోగమిప్పించవలెనని అభిప్రాయ పడిరి. అందువలన 13 ఏండ్ల వయస్సులో నారాయణదాసుగారు విజయనగర మహారాజాగారి కాలేజిలో ఆంగ్లేయ భాషను ప్రారంభించి ఆంగ్లేయ భాషయందును, సంస్కృతమందును, సంగీతమందును, విశేషముగ ప్రావీణ్యమును స్వయంకృషి చేతనే సంపాదించుకొనిరి.

శ్రీ నారాయణదాసుగారికి లయ జ్ఞానము పుట్టుకతోనే కలిగెను. వారు మెట్రిక్యులేషను క్లాసు చదువుచుండగా చెన్నపట్టణమునుండి కుప్పుస్వామి నాయుడుగారు అను హరిదాసు విజయనగరమునకు వచ్చి ధ్రువ చరిత్రమును హరికథా రూపమున చెప్పి శ్రోతలను రంజింపజేసిరి. నారాయణదాసుగారు కుప్పుస్వామి నాయుడుగారి హరికథను వినుటవలన, కవిత్వము చెప్పుటకంటెను, సంగీతము పాడుటకంటెను, శాస్త్రార్థము చేయుటకంటెను హరికథను చెప్పుటయే మిన్నయని గ్రహించిరి. గ్రహించుటయ తడవుగ హరికథను చెప్పవలెనను కోరిక వారికి కలిగెను. కలిగి విశాఖపట్టణ వాస్తవ్యు లగు ధూళిపాటి కృష్ణయ్యగారు రచించిన ధ్రువ చరిత్రమును ఆధారముగా తీసికొని భాగవతములోని కొన్ని పద్యములను, తాము స్వయముగా రచించిన కొన్ని పద్యములను, కొన్ని కీర్తనలనుచేర్చి సోదరుడగు సీతారామయ్యగారి ఇంటిలో ప్రప్రథమమున హరికథా కాలక్షేపమును చేసిరి.

సీతారామయ్యగారు ఆతని నృత్యమును వీక్షించి లెస్సగా మెచ్చి, హరికథ చెప్పునపుడు గజ్జెలు కట్టుకొని నృత్యము చేయుమని వారిని ప్రోత్సహించిరి. ఈ రీతిగా ప్రప్రథమమున తెలుగు దేశములో శ్రీ నారాయణదాసుగారు హరికథా కాలక్షేపముచేయుట జరిగెను. వారు మొదట హరిదాసులగుటయేగాక, హరికథా పితామహు డనియు ప్రసిద్ధి నొందిరి.

అప్పటినుండియు నారాయణదాసుగారు హరికథలు యక్షగానములుగ రచించి హరికథా కాలక్షేపములను ప్రారంభించిరి. నారాయణదాసుగారును వారి మరియొక అన్నగారగు పేరన్నగారును చిన్ననాటినుండియు కవలలవలె పెరిగిరి. పేరన్నగారు సంగీతములో మంచి ప్రావీణ్యమును, శ్రావ్యమగు కంఠధ్వనియు కలవారు. అందుచే వారు వెనుకపాట పాడుచు నారాయణదాసుగారి హరికథకు వన్నె తెచ్చెడివారు. నారాయణదాసుగారు మెట్రిక్యులేషను పరీక్షలో కృతార్థులయి ఎఫ్. ఏ. క్లాసులో చేరి మొదటి సంవత్సరము విజయనగరములో చదివిరి. ఆతరుణములో వారి సంగీత సాహిత్యములు విశాఖపట్టణము కాలేజీలో ప్రిన్సిపాల్ డబ్ల్యు. రామయ్యగారిని ఆకర్షించెను. అందుచే ప్రిన్సిపాలుగారి కోరికపై దాసుగారు వారిగృహమందుండి రెండవసంవత్సరము విశాఖపట్టణములో చదివిరి.

నారాయణదాసుగారు ఆంధ్రదేశములో అనేకపట్టణములలో హరికథా కాలక్షేపములుచేసి ప్రజల ఆదరాభిమానములకు పాత్రులైరి. మైసూరు మహారాజువారి యాస్థానములో హరికథలు చెప్పి వీణవాయించి గొప్ప గౌరవమును పొందిరి. మలయాళదేశములో హరికథలు చెప్పి కేరళపండితుల మన్ననలకు పాత్రులయిరి. కలకత్తాలో సంస్కృతములోను హిందీలోను హరికథా కాలక్షేపము లొనర్చి రవీంద్రనాథఠాగూరు మొదలగు వారిచే కొనియాడబడిరి. అట్లు ప్రసిద్ధిగాంచిన నారాయణదాసుగారినిగూర్చి పెక్కురు కవులు, పండితులు కావించియున్న ప్రశంసల నన్నిటిని కూర్చినచో నవి యొక మహాగ్రంథముగా పరిణమింపగలవు. శ్రీ రాంభట్ల జగన్నాథశాస్త్రిగారు నారాయణదాసుగారి నిట్లు ప్రశంసించిరి.

శ్లో. అనన్య సాధారణ శక్తి యుక్త
స్స్వయం తు నారాయణదాస ఏకః
అన్యేతు సాధారణ శక్తియుక్తా
స్సర్వేపి నారాయణదాసదాసాః.

నారాయణదాసుగారి హరికథా కథనశక్తి అనన్య సాధారణ మైనది. అట్టి శక్తికలవారు వారొక్క-రే కలరు. సాధారణ శక్తితోకూడిన శేషించిన హరికథా కథకు లందరు ఆ నారాయణదాసునకు భృత్యులవంటి వారే, అని పై శ్లోకమందలి భావము. .

1919 వ సంవత్సరములో విజయనగరపు మహారాజా వారు సంగీత కళాశాలను స్థాపించి శ్రీ నారాయణదాసుగారిని అందు ప్రిన్సిపాలుగా నియమించిరి. నారాయణదాసుగారు ప్రిన్సిపాలుగా నుండిన కాలమున కళాశాలలో ఇతరశాఖలతోపాటు 'హరికథ' నొకశాఖగా ఏర్పాటుచేసి ఎందరో హరిదాసులను తయారుచేసిరి. వారు డెబ్బది మూడు సంవత్సరములు పూర్తియయినతోడనే 1936 వ సంవత్సరమున తమ ప్రిన్సిపాలు పదవినుండి విరమించుకొనిరి. దాసుగారి అసాధారణప్రజ్ఞను గుర్తించి ప్రభుత్వమువారు వారి కంతకు ముందున్న జీతమునే ఉపకారవేతనముగా నొసగిరి.

నారాయణదాసుగారు హరిదాసుగా గొప్పపేరు పొందియుండిరి. అందుచే వారి హరికథాకథన కౌశల్య తేజస్సు వారియందలి యితర ప్రజ్ఞలను గప్పివైచెను. వారు తమ ఇరువది నాల్గవయేటనే 'శాటసారి' యను ఆంగ్ల కావ్యము ననువదించిరి. పారసీకభాషలో గొప్ప కృషిచేసిరి; ఉమర్ ఖయ్యాం రచించిన 'రుబాయతు' లను సంస్కృతములోనికిని అచ్చ తెనుగులోనికిని అనువదించిరి. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితులు సయితము ఈ గ్రంథమును చాల మెచ్చుకొనిరి. ఆంగ్ల మహాకవి యగు షేక్స్పియరు రచించిన నాటకములలోనుకాళిదాస మహాకవి వ్రాసిన గ్రంథములలోను గల నవరసములను మథించి తీసి వాటిలోని గంభీరభావములను తెలుగులోనికి మార్చి 'నవరస తరంగిణి' అనునొక మహాగ్రంథమును నారాయణదాసుగారు రచించిరి. వారు అచ్చ తెలుగులో గొప్ప ప్రావీణ్యము కలవారు. 'నూరుగంటి' అను పేరుతో ఈసప్ కథలను, 'వేల్పుమాట' యను నామముతో భగవద్గీతను, 'వెన్నుని వేయిపేర్ల వినుకలి' యను నామముతో విష్ణుసహస్రనామములను,

'నారమ్మపెండ్లి' యను నామమున పార్వతీపరిణయమును అచ్చతెనుగున రచించిరి. 'తారకము' అను సంస్కృతగ్రంథమును వ్రాసి జర్మనీదేశస్థునకు ప్రొఫెసరు కె. గెల్డెనరు అను నాతని ప్రశంసకు పాత్రులయిరి. 'జగజ్జ్యోతి' యను గొప్ప వేదాంత గ్రంథమును రచించిరి. "సీమపల్కు వహి" అను నామముతో దేశ్యాంధ్ర నిఘంటువును రచించిరి. చరమదశలో శ్రీ నారాయణదాసుగారు లలితా సహస్ర నామములను అచ్చతెనుగు లోనికి భాషాంతరీకరించిరి. ఇంకను వారి అముద్రితగ్రంథములు పెక్కులు గలవు.

నారాయణదాసుగారి ఏకైక పుత్రిక సావిత్రమ్మ. ఆమెను శ్రీ ఉపాధ్యాయుల అప్పల నరసయ్యగారు పెండిలియైరి. నారాయణదాసుగారు సహస్రమాసజీవియై 2-1-1945 తేదిని స్వర్గము నలంకరించిరి. వ. బ్ర.

**ఆదిమజనుల సంస్కృతులు :-** అల్పప్రాణులగు జంతువులవలె మానవులు రక్తమాంసాస్థులతో గూడియుండుటయే గాక, వాటికంటె కొంత యాధిక్యమును గలిగియున్నారు. మానవులకు "సంస్కృతి" ఉండుటయే ఆ ఆధిక్యము. అయితే సంస్కృతి అనగా నేమి ? "ఒకానొక సంఘ సభ్యులు ఎట్టిభావములు కలవారో, ఎట్టి విశ్వాసములు కలవారో, ఎట్టి జీవితవిధానము కలవారో, ఎట్టి కోరముట్లను తయారుచేయువారో, ఎట్లు కార్యజాతమును ముగించువారో- వీటినన్నిటిని సాముదాయికముగ తెలుపు శబ్దము "సంస్కృతి" అని బ్రెయిడువుడ్డు యొక్క నిర్వచనము. ఆచార సంప్రదాయముల నిర్ధారణమే, నిరూపణమే "సంస్కృతి" అని రెడ్‌ఫీల్డు ప్రవచనము. ఆచారములనగా సామాజికుల జీవిత విధానమునకు అనుకూలముగా నిర్ణీతమయిన నిబంధనల యొక్కయు, విశ్వాసముల యొక్కయు, ప్రమాణముల యొక్కయు సముదాయమే. ఈ ఆచారములు చిత్రకళ యందును, జనులు చేయు ఇతర నిర్మాణములందును ప్రతిబింబించుచుండును. సంప్రదాయ సిద్ధముగ ఈ ఆచారములు ఒక తరమువారి నుండి మరియొక తరమువారికి వచ్చుచుండును. వేర్వేరు మానవసంఘముల స్వభావములను సరిగా తెలుపునవియివియే. వారిసంస్థలు, ఆచారములు, పాత్రలు అనగా వారి సంస్కృతులు తెగతెగకు భేదించుచుండును.

ఆర్థిక వ్యవస్థ, అవశ్యక పూరణ విధానము : నేడు, పొలము దున్ని, పశువులకాచి జీవించు జనులుగల పెక్కు ప్రాంతాలు ఇప్పటికిని ప్రపంచములో నున్నవి. తీర్చి దిద్ది కట్టిన భవనములు, చక్కని వాతాయనములు, ఆరోగ్యవిధులు, అతివేగ గమనముగల రైళ్ళు, వివిధ వినోద కార్య కలాపములు— ఇట్టి ఆధునిక ప్రగతి ఫలితములుగా మనము చెప్పెడు ఈ లాభము లన్నియు ఈ ఆదిమజను లెరుగరు. "ఆహారసంగ్రాహకు" లనబడు కొందరు జనులున్నారు. పూరపర్శిత్వము, ఆర్థిక ప్రణాళిక అనునవి వారికి తెలియని విధానములు. వారు ఆహారపదార్థములను కూడబెట్టరు. రాతియుగమునాటి వేలసంవత్సరముల క్రిందటి తమ పూర్వులవలెనే ఆరణ్యక పుత్రులుగా నేడును జీవితములను సాగించుచు, రేపటి దినమును ఆలోచనయే లేకుండ ప్రకృతి ప్రసాదించిన దానినే పరిగ్రహించుచుందురు. అడవి కాయలు, మొక్కలు, దుంపలు ప్రోగుచేసికొందురు. కుక్కగొడుగులు, తేనె సంపాదించుటకు వెదకెదరు. ఆస్ట్రేలియా లోని ఆదిమజనులు, ఫిలిప్పయిన్సులోని, మలయా ద్వీపకల్పములోని హ్రస్వదేహులు (పిగ్మీలు), దక్షిణాఫ్రికా లోని బుష్ (పొదల) ప్రజలు, సింహళములోని వెడ్డాలు, కొచ్చిన్‌లోని కాడారులు, హైదరాబాదులోని చెంచులు వీరందరిని ఉదాహరణముగా గైకొనవచ్చును. ఆహార పదార్థములను సంగ్రహించుటతోపాటు వేటాడుట, చేపలు పట్టుటకూడ వీరు చేయుచుండిరి. పిగ్మీ, ఎస్కిమో, బుష్ మెన్, కాన్యకనాగ, మురియాగోండు, జుఆంగు, ఖారియా, బిర్హోరు జనులలో పూర్వపు వేటకాడు ఎప్పుడయినను సహజముగా గర్భదరిద్రుడునై జీవించుచుండెను. ఆహార యోగ్యములగు మొక్కలుగల ప్రదేశములను, వన్యమృగముల ఆవాసాలను, ఇంకను పెక్కు విషయములను తెలిసికొనియుండవలయును. వీరి తెచ్చుకొనియున్న వాటిని పెట్టుకొనుటకు తట్ట, బుట్ట వంటివి వారు అల్లుకొందురు. వారు వేటకొరకును, చేపలు పట్టుటకును బోనులు, చిక్కములు, బల్లెములు, ధనుర్బాణములు, వలలు మొదలగు సామగ్రిని సేకరించుకొందురు. వారు మచ్చిక చేసికొని గృహమందు పెంచిన జంతువుల సంఖ్య అల్పము. అట్టి జంతువులలో గుఱ్ఱములు, ఎద్దులు, కోణజులు, (రెయిన్

డీర్లు), ఒంటెలు, గొఱ్ఱెలు, బఱ్ఱెలు ముఖ్యములయినట్టివి. ల్యాపులాండు ప్రాంతమునుండి తూర్పు సైబీరియా ప్రాంతమువరకు ధ్రువమునకు చుట్టునున్న మండలములలో నివసించు ప్రాచీన ప్రపంచజనుల ఆర్థికవిధానమునకు కణజులే మూలాధారములై యుండెను. ఇక ఆసియా ప్రాంతపు స్టెప్పీసునుండి దక్షిణమువరకు గుఱ్ఱములును, తూర్పు ఆఫ్రికాలో పశువులును ఎక్కువగా నుండును. సహారాఎడారిలోను అరేబియా ఎడారులలోను ఒంటెయు, గుఱ్ఱమును ప్రధాన జంతువులై యున్నవి. పసులకాపరితనము చేయు పలువురు జనులకు గొఱ్ఱెలును, అట్టి చిన్న జంతువులును ఉండును. టర్కీస్థానములోని కాజకులు, ఆల్టాయి పర్వతాలలోనుండు కాల్మకుజాతి పార్వతేయులు, ఈశాన్య ఆసియాలోనున్న చక్చీలు, ఉత్తర యూరోపులోనుండు ల్యాపులు, నీలగిరిలోనుండు తోడాలు - అనువారు దేశద్రిమ్మరులై యున్నారు.

కఱ్ఱ, గసికవంటి ప్రాచీన సాధనములతో గుంటలు త్రవ్వి, విత్తులునాటి సేద్యముచేయుకాలములో వేటకానికిని, సేద్యగానికిని మధ్య అంతపెద్ద విభేదము లేకుండెను. బోరో ఇండియనులుకూడ అల్పారణ్య ప్రాంతములందు త్రవ్వుటకు ఉపయోగించెడు ఒక మోటుకఱ్ఱతో చెట్టు పుట్టలను చదునుచేసి, మిగిలిన వ్యవసాయకార్యములను స్త్రీలకు వదలెదరు. మధ్య ఆఫ్రికాలోనున్న బంబూటి తెగవారు "వృక్షమానవులు" అనదగినవారు. వారు చెట్ల దగ్గర, చెట్లలో, చెట్లమూలమున జీవించెదరు. వారు చెట్లపై కెగబ్రాకుటలో అతిసాహసవంతులు. వృక్షారోహణమున ఇది చాల ఎత్తైన చెట్టనిగాని, ఇది అపాయకరమైన చెట్టనిగాని వారు గమనించరు. వారి ఆహారధాన్యములలో ముఖ్యమైనదగు జొన్న (Finger millet) ధాన్యమును తమపీఠభూములమీది నిస్సారపు నేలలందు పండించుటకు 8—18 ఎకరాలలో నుండెడు చెట్లతలలు నరకి, వాటిని ఒకచోట కుప్పగాపేర్చి, ఆకొమ్మలను కాల్చి విత్తులు నాటుటకు యోగ్యమగు ఒక ఎకరమునేలను తయారుచేసెదరు. ఈ తోటను 4—5 ఏండ్ల వరకు ఉపయోగించి, ఏటేట ఒకపంటను పండించెదరు. అయితే ప్రతి సంవత్సరము క్రొత్తతోపులమ నిర్మాణముచేసెదరు. పొలములు మార్చిమార్చి సేద్యము చేయుచుండుట ఇండియాలో సాధారణ విషయము. ఉత్తరప్రదేశ్ బీహారులలోని కొరవలు, బెంగాలు, అస్సాములందుండు గారోలు, అస్సాములోని నాగజాతివారు, మద్రాసు రాష్ట్రములోని ఖాండులు, కురుంబాలు, హైదరాబాదు రాష్ట్రములోని కోలములు, కోయలు భూమిని గుద్దలితో త్రవ్వి మార్పిడి, ఝుం, లేక పోడువ్యవసాయమును సాగించెదరు. ఇట్టికృషివిధానముబోలినేషియా, మెలనేషియా, మలనేషియాలలో కూడ అవలంబింపబడుచున్నది. అభివృద్ధిచెందినవ్యవసాయవిధానములందు కైజీతగాండ్ర సహాయము పొందెదరు. పంటలుపండించు విషయములో నీటిపారుదల, మెట్లుగా తీర్చుట(Terracing)ముఖ్యముగాగమనింపదగిన పద్ధతులు.

సంఘ వ్యవస్థ :- ఈనాడు కుటుంబమే సంఘ వ్యవస్థయందు మొదటిమెట్టు. ఈ విధానము ఏదో ఒకరూపమున సంస్కృతి పరిణామమందు అన్ని అవస్థలలోను గనబడుచున్నది. కుటుంబగణ నిర్మాణము ఆయాకాలములందు మారుచు వచ్చినది. వేర్వేరు సంఘములలో దేశకాలము లనుబట్టి వేర్వేరు కుటుంబవిధానములు అవలంబింపబడినట్లు తెలియుచున్నది. మగవాడు ఒకేభార్యను కలిగియుండి ఏకపత్నీవ్రతుడయి యుండవలెనను భావమును చాలమంది ఆమోదించరు. మగవాడు ఒక భార్యకంటె ఎక్కువమంది భార్యలను పెండ్లాడవచ్చును. దీనిని బహుభార్యాకత్వమందురు. పెక్కుమందిపురుషులకు ఒక తియే భార్యగా ఉండి ఉపకరించుట సకృత్తుగా జరుగును. దీనినే బహుపతిత్వము అందురు. అసాధారణ పరిస్థితులలో పెక్కుమంది పురుషులు ఉమ్మడి భార్యలను కలిగియుండవచ్చును. ఈ మిశ్రసంయోగమును 'గణోద్వాహము' (Group-marriage) అందురు. ఏకపత్నీవ్రతమును ప్రాచీనులలో పెక్కుమందియు, నాగరికతకలవారిలో పెక్కుమందియు అవలంబించినారు. కాంగో, ఆసియా ప్రాంతాలలోనుండు కుబ్జులును (Pygmies), ఫిలిప్పైన్ ప్రాంతమందలి 'అయేటా'లును (Aeta), సుమత్రా ప్రాంతములందలి 'కుబు' (Kubu) జాతివారును, మలయా ప్రాంతపు సుమాంగుజాతివారును- వీరలందరిలోను మగవాడు ఒక్కభార్యనే గ్రహింపగోరును. గొల్లలలోను, వ్యావసాయికులలోను బహుభార్యత్వము అతివ్యాప్తిలో నున్నది. కాని ఇది క్రమక్రమముగా అంతరించుచున్నది.

బహుపతిత్వ వివాహపద్ధతి పరిమితమైన వ్యాప్తి కలిగి యున్నది. ఇది టిబెట్టులోను, దక్షిణ హిందూస్థానము లోను కనిపించుచున్నది. పతులైనవారు సాధారణముగా సోదరులయియుందురు. అట్టి సందర్భమున ఉమ్మడిగా నున్న భార్యను చేరుహక్కు (అధికారము) విషయమున పెక్కు విధములయిన నిబంధనలు గలవు. పడకటింటి ఏర్పాట్లలో భార్యకు విడిగా నొకగది ప్రత్యేకింపబడి ఉండును. మరియొకగదిలో భర్తలు కలిసి శయనించెదరు. సోదరులలో నొకడు భార్యగదిలోనికి పోయినపుడు వాడు తన టోపినిగాని. తన చెప్పులనుగాని గుమ్మము నొద్ద వదలివేయును. ఆ సంకేతము తీసివేయునరకు మరియొకడు అందు ప్రవేశించకూడదు. నీలగిరి కొండలలోని తోడాలలో ఒకానొకకన్య ఒక పురుషుని వివాహమాడిన దనగా అదేసమయమున వాని సోదరులనుగూడ వివాహ మాడినట్లుగనే యెంచెదరు. తొలిబిడ్డ జనింపనుండగా సోదరులు తమలోదాము ఏకాభిప్రాయమునకువచ్చి ఏడు నెలలు గర్భవతిగా నున్నపుడు ప్రత్యేక కర్మకాండ నడిపి ఆ శిశువునకు తండ్రియెవడో నిర్ణయించెదరు, కర్మకాండ జరిపినవాడే ఆ శిశువునకును, ఆమె గర్భమున తరువాత జనించిన సంతానమునకును జనకుడుగా భావింపబడును. ఏసమాజమునందును స్వచ్ఛమయిన గణోద్వాహ పద్ధతి (Pure form of group marriage) లేదు. ఉత్తర సైబీరియాలోని ఛక్చీ తెగవారిలో వినిమయ వివాహపద్ధతి (Exchange marriage) అను ఆచారము కలదు. సుమారు పంద్రెండుమందికూడి ఒండొరుల భార్యలపై సామాన్యమైన హక్కులను గలిగియుండుటకు. అంగీకరింతురు. ఈ ఏర్పాటునకు బద్ధులయినవారు భార్యల విషయములో చెలిమికాండ్రు (Companions in wives) అనబడుదురు. ఒక పురుషుడు చెలిమికాండ్ర భార్యలపయి స్వత్వము కలిగియుండును. అతడు రెండవవాని గూడెము (camp) నకు వెడలినపుడు ఇది సర్వసామాన్యముగా పాటింపబడును. అసమవయస్కులును, బ్రహ్మచారులును ఈ "వినిమయ వివాహ పద్ధతి (Exchange marriage)" సంఘమునకు ఆహ్వానింపబడరు.

వంశపారంపర్య విషయములో రెండు విధములను గూర్చి చెప్పవలసియుండును. ఒకటి పితృనుక్రమము, రెండవది మాతృనుక్రమము. తన తండ్రిద్వారా వంశము విస్తరిల్లినయెడల అది పితృనుక్రమము అనబడును. శిశువు తన తల్లి పుట్టింటివైపు సంబంధించియున్నచో, అట్లు విస్తరించిన కుటుంబము మాతృనుక్రమము అనబడును. పితృనుక్రమముగల కుటుంబవులలో తండ్రిద్వారా వంశక్రమమును గమనించెదరు. వివాహానంతరము వధువు తన భర్తతో నివసించుటకుపోవును. వారసత్వము పురుష సంతతిలోనే యుండును. తండ్రి ఆ గృహ యజమానిగా భావింపబడును. మాతృనుక్రమముగల కుటుంబములలో తల్లి ద్వారా వంశక్రమమును గమనించెదరు. అట్టి శిశువులు తమ యింటిపేరును తమ తల్లినుండియే గ్రహించెదరు. వివాహానంతరము మగవాడు పుట్టింటిలోనున్న వధువుతో నివసించుటకుపోవును, లేదా సొంతసంసారమును ఏర్పాటుచేసికొనును. మాతృనుక్రమముకల సంఘము లందున్నవాడు తన సోదరియొక్క సంతానపు క్షేమాభివృద్ధులకు బాధ్యుడయి యుండును. ఉత్తర న్యూయార్కు, ఖాసి, అస్సాంలోని గారో ప్రాంతములందలి "ఇరోఖియోలు" (Iroquios) ను, మలబారులోని నాయరులును, కొచ్చిన్‌లోని కాడారులును, మద్రాసులోని ఇరులులును, పులయనులును, హోలియా, మాదిగ, వెల్లాలకులాలవంటి వారును దీనికి విస్పష్టమైన నిదర్శనములు.

ఒక సంపూర్ణ జీవితచక్రమున పుట్టుట, పెద్దయగుట, పిల్లలను గనుట, మరణించుట అను నాలుగును, ప్రపంచమునందంతటను ప్రధానమైన క్లిష్టపరిస్థితులు. శిశుజననమైనప్పుడును, తరువాతను తల్లియు, ఆమె భర్తయు ఎన్నో నిషేధములకు గురియగుదురు. ఆమె ఎక్కుడు పదార్థములను తినగూడదు. సూర్యోదయమునకు పూర్వమే ఆమె నిద్రనుండి లేవవలయును. పగలంతయు మేల్కొనియుండవలయును. రాబోవు కఠిన పరీక్ష నెదుర్కొనుటకు ఆమె చలినీళ్ళలో ఈదులాడవలయును, నడవవలయును, పరుగెత్తవలయును. ఈ కాలములో గుఱ్ఱపుస్వారి చేసి శక్తి సంపాదింపవలయును. "కవేడ్" అనునది చాల వింతయైన పద్ధతి. శిశువు జనించగానే తల్లి లేచిపోయి గృహవిషయములలో మగ్నురాలగును. ఇక తండ్రియో ఆ శయ్యయందు జేరును. బహుళః శిశు ప్రసవానంతర ఫలితములనుండి

కోలుకొనుటకు కాబోలు ! ఇక జీవితచక్రములోని రెండవ క్లిష్టపరిస్థితి ప్రౌఢదశా ప్రారంభము. ప్రౌఢత కౌమారమునకు సంధ్యాకాలం ; యౌవనమునకు (adulthood) ఉషఃకాలము. ఆస్ట్రేలియాలో సున్నతి (circumcision), అంతశ్ఛేదన (Subincision) కార్యముల విషయమున రాతికత్తులతో బాధాకరమయిన, అపాయకరమయిన శస్త్రచికిత్సలను మోటుగా చేసెదరు. ఆఫ్రికా సూడాన్‌లోని పలు ప్రాంతములందు కన్యలపై చేయు అత్యాశ్చర్యకర లైంగిక ప్రయోగములు స్త్రీలుగా వారి పాత్రను (కృత్యము), భార్యలుగా వారి అంతరమును అమితముగను, దృఢముగను తెలుపుటకు అనుకూలించుచున్నవి. మచ్చలుపడునట్లు చేయుట (Cicatrization), ముందటి పంటిని ఆకురాతితో అరగదీయుట లేక విరగగొట్టుట, అలంకరణము కొరకును, అంతరమును గుర్తించుటకు నుపకరించుచున్నవి. యువకుల జీవిత వికాసోద్యమమునందు సమితులు, రహస్య సంఘములు, యువజన సదనములు, లేక శయనాగారములు మిక్కిలి ప్రముఖపాత్రను వహించుచుండును. గ్రామశయనాగారముల (Village dormitory) వ్యవస్థాపద్ధతి ఛోటా నాగపూరు పీఠతలము లందలి తెగవారగు ముండాలు, హోసులు, ఓరోనులు, ఖారియాలవంటి ఆదిమజాతులలో ఎక్కువగా కనిపించుచున్నది. మధ్యప్రదేశములోని 'గోండులలో, భ్వియాలలో (Bhuiyas) కూడ ఇది కనబడుచున్నది. అస్సాములోని నాగజాతులలో ఎక్కువగాను, మలనేషియా, పోలినేషియాలలోని పెక్కు తెగలయందును ఈ వ్యవస్థాపద్ధతి నెలకొనియున్నది.

వ్యక్తిజీవితమునందు మరణము చరమావస్థ. మరణము స్వాభావిక కారణములవల్ల సంభవించునని కొందరును, శత్రుజనుల మంత్రవిద్యా ప్రయోగములవల్ల సంభవించునని మరికొందరును భావించెదరు. మృతులను సాధారణముగా ఖననము చేయుటయో, దహనము చేయుటయో జరుగును. వేర్వేరు సంఘములందు వేర్వేరు విధములయిన మృతక్రియలు (అపరకర్మలు) జరుగును. ఉదాహరణముగా - తోడాలు, తడికర్మ (పచ్చికర్మ), పొడికర్మ (ఎండుకర్మ) చేయుదురు. తడికర్మ మానవులకు మృతిసంభవించగానే చేయునది. పొడికర్మ మృతిసంభవించిన పెక్కు దినములకు చేయునట్టిది. మొదటిదాని విషయములో శవదహనము జరుగును. రెండవదాని విషయములో మృతుని బూడిదను పెద్ద రాతిక్రింద పూడ్చిపెట్టెదరు. గోండులవంటి కొన్ని ఆదిమజాతులవారు ఈ సమయమున ఆవులను బలియిచ్చెదరు. మధ్యప్రదేశములో కొరుకు జాతి మొదలగువారు సమాధిపయి స్మారకస్తంభములను నిలబెట్టెదరు.

కళావాఙ్మయములు :- సౌందర్యముకొరకు పాటుపడు నుత్సుకత విశిష్టములును, ఆనందకరములునైన మానవ లక్షణములలో నొకటి. ప్రపంచమునం దంతటను మానవుడు తన పరిసరములను అలంకారభూయిష్ఠముగా నుంచుకొనుట కభిలషించును. ఒకానొకవస్తువు సర్వసాధారణముగా ప్రయోజనకరమై యుండుట ఆతనికి చాలదు. అది తన బాహ్యారూపముతో వాని కానందమునుగూడ కూర్పవలయును. ఆతడు తాను వాడుకొనునట్టి పెక్కువస్తువులకు అలంకారములు కూర్చును. లేదా వాటికి రంగువేసియో, ఆకారమును గల్పించియో వాటి విశిష్టతకు కడంగును. జుగోస్లావు స్త్రీలు తమ మొలకు జుట్టుకొను ముతకబట్టలమీద చిత్రించిన బొమ్మలును, నార్వే దేశపు పడతుల ముఖభాగములందును, పొగత్రాగెడు కామెటాన్ గొట్టముయొక్క గుంటమీదను చెక్కినచిత్రములును, సూడాన్‌దేశపు న్యూబియన్ స్త్రీలు పిరుదులపై (అలంకారార్థము) వేసికొను పుంటిమచ్చలు (Cicatrization) ను, జపానీ స్త్రీలును, తోడాస్త్రీలును చేతులమీదను, రొమ్ములమీదను పొడిపించుకొను తీరుతీరు పచ్చబొట్టులును, ఇటలీదేశములో చర్చిమందిరపు కప్పులపై చిత్రించిన బొమ్మలును - ఇట్టి వన్నియు మానవుని సౌందర్యాసక్తికి నిదర్శనములే. మానవుడు తన సృజనాత్మక భావసిద్ధికి ప్రయత్నించు విశిష్టకళారూపము లెన్నో ఉన్నవి. చిత్రరచన, రాలపయి చిత్రములు చెక్కుట, క్షేత్రగణిత రేఖాకారములు, దారువు, శిల, లోహములు, ఎముకలు మున్నగువాటిపై స్థాపత్యవిధానరచన, ఎముకలపై, దంతముపై, లోహముపై, కుండలపై కళాకౌశల్యము చూపుట, వర్ణచిత్రములు గావించుట, తట్టల్లుట, బుట్టలల్లుట, వేషధారణకళ, దేహాలంకరణకళ - ఇట్టివే కళావిధానములయి యున్నవి. ఇవేకాక సంగీ

తము, నృత్యము, కవనము, నాటకము, వాఙ్మయము - ఇవన్నియు అతి ప్రాచీనకాలపు సమాజములందును, నాగరకతా విశేషముతో కూడిన సమాజములందును మరికొన్ని కళారూపములై ఉన్నవి.

మానవుడు వృద్ధిపొందుచున్నకొలది మానవాతీతము లగు భౌతిక అద్భుత దృశ్యములు, రూపములు మొదలగు వాటితో సంబంధము పొందుచున్నాడు. వాటిని గూర్చి తెలిసికొనుటకు ప్రయత్నించుచున్నాడు. వాటిని తన ఆధీనములో (చెప్పుచేతలలో) నుంచుకొనుటకో వాటిని ప్రసన్నము చేసికొనుటకో ప్రయత్నించుచున్నాడు. ఆదిమానవుడు ప్రకృతి పరిణామములన్నియు దుష్టశక్తులచే పరిపాలితములని విశ్వసించి, వాటిని తన చెప్పుచేతలలో నుంచుకొనగోరును. ప్రతికి ప్రతి (like produces like) జనించుననుసిద్ధాంతమును పురస్కరించుకొని భౌతిక సంఘటన (Natural phenomina) లపై ఆధిపత్యము వహించు శక్తులను తన యాజ్ఞానువర్తులనుగా చేసికొనుటకు యత్నించును. ఈ సంబంధమున సంకేత విధానము (Symbolism) ప్రముఖపాత్రను వహించుచున్నది. సూర్యుడు, వర్షము, మేఘములు, పంటలు, భూసారము (Fertility), ఉత్పత్తి (Growth) మొదలగువాటి సంకేతరూపములుముఖ్యములైనవి.ఇందువలన, వర్షము కురియించు ఇంద్రుని (Sky-God), విత్తులకు దోహదమిచ్చు భూదేవతను, పైరులను పండింపజేయు సూర్యదేవతను, వీరేగాక ధాన్యదేవతను, ఉత్పత్తిదేవతను ఆదిమజనుడు పూజింపవలసి యుండెననుట స్పష్టము. నైరృతి ఆఫ్రికాలోని "నామా హటంటాట్సు" జాతివారు (Nama Hottentots), అరిజోనా ప్రాంతమందలి "హోపి" జాతివారు (Hopi), ఛోటానాగపూర్ ప్రాంతమందలి "ముండాహో" జాతులవారు వర్షపాత దృశ్యము ననుకరించుటచే వర్షము పడునట్లు చేయుదురు. దేశీయ సమాజముల అన్నిరంగములయందును కర్మకాండ వ్యాపించియుండును. వేట, కళ, విహారములు ప్రధానముగ కర్మకాండతో సంబంధించియుండును. విత్తులు నాటిననాటి నుండి పంటలకోత ముగియువరకు అన్నిసందర్భములందును మతకర్మలు కలవు. మనుజునియొక్కగాని, సమాజము యొక్కగాని జీవితరంగములందలి ప్రధాన ఘట్టములందు మతకర్మప్రత్యక్షమగుచుండును. కొన్ని తెగలలో జబ్బువచ్చినయెడల అది సహజకారణసంభవముగ, వ్యతిక్రమమని భావించక, క్షుద్రదేవతా ప్రభావఫలితమని భావించెదరు. దక్షిణ పెనామాలోని "శాన్‌బ్లాసు ఇండియను"లలో (San Blos Indians), ఒక వ్యక్తి రోగియగుట, వానియొక్కగాని, ఆతనియొక్కగాని ఆత్మను దేవతలు (Purban) ను రాక్షసులు హరించుటచే కారణమని తలంచెదరు. కరపట్టబడిన ఆయాత్మను మరల సంపాదించుట "వైద్యుడు – పురోహితుడు" అగు వాని కర్తవ్యమైయున్నది. అదేవిధముగా మధ్య ఆస్ట్రేలియాలో నివసించు "అరాండా" (Aranda) జాతివారు సహజముగా మృత్యువువాతబడుట ఊహింపజాలరు. అపమృత్యువు శత్రువుయొక్క మంత్ర తంత్ర ప్రభావమే యని వారి నిరంతర దృఢవిశ్వాసము. మంత్రప్రభావమున మరణము పాదిల్లజేయుటకు వారి కెన్నో మార్గములు తెలియును.

అయితే మంత్రవిద్యకు మరణము కల్గించుటకంటె ఇతరప్రయోజనములును కలవు. ఉదాహరణముగా రోగములను కుదుర్చుట, భార్యను సంపాదించుట, నేరస్థులను శిక్షించుట, స్త్రీలను లొంగదీయుట పేర్కొనవచ్చును. సర్ బాల్డ్విన్ స్పెన్సర్ దక్షిణాస్ట్రేలియా అరాండాలనుగూర్చి మాట్లాడు సందర్భమున "జీవయాత్రయందు తనకు ప్రముఖముగా నుండు ప్రతి విషయము – అది ఆనందాత్మకముగాని, దుఃఖాత్మకముగాని, మంచిదిగాని, చెడ్డదికాని–నిస్సంశయముగ మంత్రవిద్యకు సంబంధించినదే. క్షామము, వరదలు, ఋతుక్రమమున జంతువృద్ధి, భూమిలోనుండి చెట్లు అద్భుతముగా మొలచుట, చివరకు తనయొక్క జనన, మరణవిషయములు, తనచుట్టునుండు జనానీకపు జనన మరణ విషయములు– ఇవన్నియు మనము భావించినట్లు సహజకారణ ఫలితములుగాక ఏదో యొకరూపమయిన మంత్రవిద్యా ప్రభావమున జనించినవే యని అతని మనో నిశ్చయము" అని చెప్పిన మాట మిక్కలి సత్యము. ఈ వాక్యాలు ప్రపంచములోని పెక్కు తెగలకు అన్వయించగలవు.

రాజకీయ పరిపాలనా విధములు : రాజకీయ పరిపాలనా విధానములలో పెక్కు ఖండములందును, కొన్ని నాగరకతా (సభ్య) మండలముల యందును కూడ భిన్న

రీతులు కలవు. దక్షిణ అమెరికా రాజకీయ సంస్థలు "ఇంకాసు" నందలి కేంద్ర నిరంకుశత్వము మొదలుకొని "ఓనా" యందలి సూత్రబద్ధ రాజకీయ విధాన శూన్య పద్ధతివరకు వివిధములుగా నున్నవి. ఓనాలో వృద్ధుల యెడ గౌరవము చూపుట, త్రికరణశుద్ధిగా నుండుట, అను ప్రాతిపదికలనే ఆధారముగా గైకొని స్థానిక సమాజ అధినాయకుడు సిద్ధాచార సంప్రదాయములను ప్రవర్తిల్లజేయును. కాంగోలోని సభ్యతా ప్రాంతమందు పిగ్మి (Pygmi హ్రస్వరూపులు) తెగవారిలో నుండు అతి సామాన్యపు కట్టుబాటులకును, లుండా, పాంగో, లూబా రాష్ట్రములందు స్పష్టముగా లక్ష్య లక్షణసమన్వితమై, క్లిష్ట తరమయి ఒప్పుచుండు రాజకీయ విధానములకును చాల వ్యత్యాసము కనిపించును. పోలినేసియాలో రాజకీయ విధాన సౌధమునకు పూర్తిగ మతమే మూలాధార మని చెప్పవచ్చును. ఇచ్చటి అధినాయకులు (లేక గురువులు) దైవాంశసంభూతులనుటనుబట్టియే వారి పదవి స్థిరపడు చుండును. మాలనేసియా ద్వీపములందు యథార్థమును, సుస్పష్టమునైన నాయకత్వము కనబడుచున్నది. పోలారు మండలములోని ఎస్కిమోలు, హైదరాబాదు రాష్ట్రము లోని చెంచులు — అనువారిలో నాయకత్వము వంశ పారంపర్యముగ సంక్రమించునది కాదు. వారు తమ తెగ జనులలోనుండి నాయకుని ఎన్నుకొనెదరు. ఆనాయ కుడు శక్తి సామర్థ్యములు, పలుకుబడి, వివేకము గల వాడుగా నుండుట ఎన్నికకు ఒక యోగ్యతగానుండును. హైదరాబాదు రాష్ట్రములో ఆదిమజనుల పంచాయతులు న్యాయ నిర్ణయమునందు చాల ప్రముఖ స్థానమును వహించియున్నవి.

రా. ప్ర.

**ఆదిలాబాదు జిల్లా :-** ఆదిలాబాదుజిల్లా ఆంధ్ర ప్రదేశములో కలదు. ఇది అక్షాంశరేఖ 18·3° నుండి 19·45° వరకును, తులాంశరేఖ 77·53° నుండి 80·0° వరకును వ్యాపించియున్నది. క్రీ. శ. 1905 వ సంవత్స రమునకు పూర్వము సిరిపూర్ తాండూరు జిల్లాకు ఆదిలాబాదు సబు జిల్లాగా ఎంచబడు చుండెడిది.

ఎల్లలు :- ఈజిల్లాకు ఈశాన్య, పూర్వభాగములందు మధ్య ప్రదేశములోని చాందా జిల్లాయు, దక్షిణమున కరీంనగరము, నిజామాబాదు జిల్లాలును, నైరృతి దిక్కున నాందేడు (బొంబాయి) జిల్లాయు కలవు. పశ్చిమమునందును, ఉత్తరమునందును, మధ్య ప్రదేశము నుండియు, ఈశాన్య పూర్వములందు వార్ధా ప్రాణ హితలనుండియు ఈ జిల్లా వేరుపడుచున్నది. ఆదిలా బాదు జిల్లాయొక్క వైశాల్యము 7,358 చ. మైళ్ళు.

ఈ జిల్లాలో పదునొకండు తాలూకాలు, 1796 గ్రామములు, 13 పట్టణములు కలవు.

తాలూకాలు: 1. ఆదిలాబాదు :- వైశాల్యము 580·48 చ. మైళ్ళు. జనాభా 1,01,611, పురుషులు 49,709; స్త్రీలు 51,902: జనసాంద్రత ప్రతి చ. మైలుకు 175 మంది.

2. ఉట్నూరు : వైశాల్యము 726·40 చ. మైళ్లు. జనాభా 34,404; పురుషులు 17,462; స్త్రీలు 16,942; ఇచట విశలేశ్వరాలయ మున్నది. ఈ ఆలయ కారణముగనే దీనికి ఉట్నూరు అను పేరు కలిగినది. మొత్తము జనాభాలో ఆదిమవాసులు 3 వ వంతుకలరు. జనసాంద్రత ప్రతి చ. మైలుకు 47 మంది.

3. ఖానాపూరు : వైశాల్యము 312·96 చ. మైళ్ళు. జనాభా 43,336, పురుషులు 22,391 స్త్రీలు 20,975; జనసాంద్రత ప్రతి చ. మైలుకు 139 మంది.

4. నిర్మల : వైశాల్యము 566·40 చ. మైళ్ళు. జనాభా 1,21,029. పురుషులు 58,306, స్త్రీలు 62,723. జనసాంద్రత ప్రతి చ. మైలుకు 214 మంది.

5. బోధ్ : వైశాల్యము 708,48 చ. మైళ్లు. జనాభా 72,372; పురుషులు, 36,232; స్త్రీలు, 36,140, జనసాంద్రత ప్రతి చ. మైలుకు 102 మంది. ఈ తాలూకాలో కుంతల, పోచరా అను జలపాతములు కలవు.

6. కిన్వటు : వైశాల్యము 608·64 చ. మైళ్ళు. జనాభా 73,118. పురుషులు 36,583; స్త్రీలు 36,535. జనసాంద్రత ప్రతి చ. మైలుకు 120 మంది.

7. రాజూరా : వైశాల్యము 776·32 చ. మైళ్ళు; జనాభా 75,357; పురుషులు 38,025; స్త్రీలు 37,337 జనసాంద్రత ప్రతి చ. మైలుకు 97 మంది.




8. సిర్పూరు : వైశాల్యము 855.68 చ. మైళ్ళు; జనాభా 1,04,091; పురుషులు 52,759; స్త్రీలు 51,352; జనసాంద్రత ప్రతి చ. మైలుకు 122 మంది.

9. చిన్నూరు : వైశాల్యము 688.64 చ. మైళ్ళు; జనాభా 86,117; పురుషులు 43,666; స్త్రీలు 42,451; జనసాంద్రత ప్రతి చ. మైలుకు 125 మంది.

10. లక్సెట్టిపేట : వైశాల్యము 734.08 చ. మైళ్ళు; జనాభా 98,812; పురుషులు 50,150; స్త్రీలు 48,662; జనసాంద్రత ప్రతి చ. మైలుకు 135 మంది.

11. ఆసిఫాబాదు: వైశాల్యము 833.92 చ. మైళ్ళు; జనాభా 92,245; పురుషులు 46,599; స్త్రీలు 45,646; జనసాంద్రత ప్రతి చ. మైలుకు 111 మంది.

**పుణ్యక్షేత్రములు :** ఈ జిల్లాలోని 83 పుణ్యక్షేత్రములలో 62 హిందువులవి; 21 ముస్లిములవి; ఆదిలాబాదు తాలూకాలోని కేసలాపురము, కిన్వటు తాలూకాలోని మాహూరు ప్రసిద్ధ పుణ్యక్షేత్రములు.

రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ ఫలితముగా, నాందేడు జిల్లా యందలి ముధోలు తాలూకాలోని ముధోలు, భైన్సా, కుబేర్ సర్కిళ్లు ఆదిలాబాదు జిల్లాలో కలిసినవి. ఆదిలాబాదు జిల్లాలోని బోథ్ తాలూకా, ఇస్లాపూరు సర్కిలు, కిన్వటు, రాజూరాతాలూకాలు బొంబాయి రాష్ట్రములో చేర్చబడినవి. (1956)

**పర్వతములు :** ఈ జిల్లాలో సహ్యాద్రి ముఖ్యమైన పర్వతము. ఈ పర్వతము జిల్లాలో వాయవ్యమునుండి, ఆగ్నేయదిశకు 175 మైళ్ళు వ్యాపించియున్నది. ఇవిగాక చిన్న గుట్టలుకూడ కొన్ని తూర్పు భాగమున కలవు.

**నదులు :** ముఖ్యమైన నదులలో గోదావరి పేర్కొనదగినది. ఇది ఈ జిల్లాలో దక్షిణభాగమున ప్రవహించుచున్నది. ఆదిలాబాదుజిల్లా గోదావరీనదివలన దక్షిణమున నిజామాబాదునుండియు, కరీంనగరంలోని కొంతభాగమునుండియు వేరగుచున్నది. పెనుగంగానది ఇంకొక ముఖ్యమైననది. ఇది ఈ జిల్లా పశ్చిమ, ఉత్తర సరిహద్దులందు ప్రవహించి వార్ధాలో కలియుచున్నది. వార్ధా, ప్రాణహిత నదులుకూడ ఈ జిల్లా ఈశాన్య పూర్వ సరిహద్దులపై ప్రవహించుచున్నవి. ఇవిగాక, పెద్దవాగు, కాపనవల్లి, అలమూను, వంటి చిన్ననదులుకూడ కలవు.

**భూతత్త్వము :** ఇచట భూగర్భ నిర్మాణమున పురాణ యుగమునకు సంబంధించిన పొరల పాషాణములు, కడప, సుల్లవాయి, గోండ్వానా జాతులకుచెందిన రాళ్లు ఉన్నవి. గోండ్వానా రాళ్ళ తరగతిలో తాల్చేరు, బరాకరు, కాంప్టి, కోటమావేరి, చికియాల తలములు, దక్షిణ అగ్ని శిలాత్మకములు కూడి యున్నవి.

**అరణ్యములు :** ఈ జిల్లాలో అధికభాగమున అరణ్యములు వ్యాపించియున్నవి. ఈ అడవులలో బిలుగు, టేకు, మామిడి, చింత, బిజాసాల్, వృక్షములు పెరుగును. ఈ అడవులందలి కొండ ప్రాంతములందు పులులు, చిరుతపులులు, ఎలుగుబంట్లు, నివంగులు, తోడేళ్ళు అడవి కుక్కలు, నివసించును. అడవుల మైదాన ప్రాంతములందు ఎనుబోతులు, జింకలు తరచు కనుపించును.

**శీతోష్ణస్థితి :** అరణ్యము అధికముగా నుండుటవలన జిల్లా వాతావరణము ఆరోగ్యకరముగా నుండదు. ఉష్ణోగ్రత మే నెలలో 105° F వరకు హెచ్చును. డిసెంబరు నెలలో 56° F వరకు తగ్గిపోవును. ఇచట సగటు వర్షపాతము సంవత్సరమునకు 41 అంగుళములు.

**ఖనిజములు :** బలపపురాయి (Talc), సున్నపురాయి, ఎఱ్ఱలోహము, చల్వ ఆదిలాబాదు తాలూకాలో గలవు. సిర్పూరు తాలూకాలోని రాజులగుట్ట కొండలలో సుద్ద రాయి, సున్నము లభించును. రాజూరా తాలూకాలోని శాస్తి, పూనా గ్రామములందు నేలబొగ్గు కలదు.

1874-75 సంవత్సరములలో పరిశోధనాత్మక ఖననము కొంత జరిగినను, తరువాత కృషి లేకపోవుటచే సరియైన ఫలితము కలుగలేదు. శాస్త్రి గ్రామమున 8 బొగ్గుగను లున్నవి. ఇచట గంధకముకూడ లభించును.

జనాభా : ఈ జిల్లామొత్తం జనాభా 1951 సంవత్సరపు లెక్కల ననుసరించి 9,02,522. ఇందు పురుషులు 4,51,882; స్త్రీలు 4,50,640; వీరిలో 7,89,417 మంది గ్రామప్రాంతములందును, 1,13,105 మంది నగర ప్రాంతములందును నివసించుచున్నారు.

**కొండజాతులు :** ఇచట ముఖ్యమైన కొండజాతి ప్రజలు గోండులు. జిల్లామధ్యలో పర్వతాలలోను అడవులలోను నిండియున్న ఉట్నూరు, ఆసిఫాబాదు, రాజూరా తాలూకాలయందు ఈ గోండులు అధికసంఖ్యాకులుగానున్నారు. ఈ జిల్లాలో వీరిసంఖ్య 1951 వ జనాభా లెక్కల ప్రకారము 90,591.

**వృత్తులు :** ఈ జిల్లాలో ముఖ్యవృత్తి వ్యవసాయము. ఈ వృత్తిచే 6,40,150 మంది జీవించుచున్నారు. ఇందు 3,06,059 మంది సొంతభూములను సేద్యముచేసి కొందురు. 1,25,842 మంది యితరుల పొలములను కౌలుకు వ్యవసాయము చేయుదురు. 1,98,336 గురు వ్యవసాయకూలీలు. 9,913 మంది తమ భూములను కౌలుకు ఇచ్చి ఆ ఆదాయముతో జీవించెదరు.

వ్యవసాయేతర వృత్తులైన వ్యాపారము, రవాణా ఉద్యోగాలుకూడ ప్రజలకు జీవనాధారములుగా ఉన్నవి. వీనిలో వ్యాపారముచేసెడివారు. 24,195 మందియు, రవాణావృత్తులలో నున్నవారు 11,766 మందియు, ఉద్యోగములలో 93,275 మందియు కలరు.

**విద్య :** ఆదిలాబాదు జిల్లాను విద్యలో వెనుకబడిన దానినిగానే చెప్పవలెను. ఇచ్చట మొత్తము జనాభాలో విద్యావంతులు దాదాపు నూటికి 5 గురు మాత్రమే. ఈ జిల్లాలోని 9,02,522 మందిలో అక్షరాస్యుల సంఖ్య 51,162 మాత్రమే. ఈ జిల్లాలో 399 పాఠశాలలున్నవి. ఇందులో 8 మాధ్యమిక పాఠశాలలు, 3 ఉన్నత పాఠశాలలు, మిగతవి ప్రాథమిక పాఠశాలలు కలవు. ప్రాథమికవిద్య నభ్యసించెడి మొత్తము బాలబాలికల సంఖ్య 22,654.

**వైద్యము :** ఈ జిల్లాలో మొత్తము పదునాలుగు వైద్యశాలలు కలవు. వీనిలో ఒకటి జిల్లా వైద్యశాల, అది పెద్దది. శేషించిన వాటిలో ఒకటి ప్రాజెక్టులకు సంబంధించినది. ఒకటి జైలుకు సంబంధించినది. శేషించినవి అందరకు ఉపయోగించునవి. ఈ వైద్యశాలలలో మొత్తం 24 మంది వైద్యులు పనిచేయుచున్నారు. ఇవి కాక యూనాని వైద్యపద్ధతి ప్రకారము పనిచేయు వైద్యశాలలు మూడు, ఆయుర్వేద చికిత్సాపద్ధతి ననుసరించెడి వైద్యశాలలు మూడు కలవు. వీనిలో 7 గురు వైద్యులు పనిచేయుచున్నారు.

**పంటలు :** ఈ జిల్లాలో ఆహారమునకు పనికివచ్చు పంటలందు జొన్నపంట ముఖ్యమైనది. జిల్లా మొత్తము విస్తీర్ణములో 5,43,732 ఎకరములలో జొన్న సాగు చేయబడుచున్నది. దీని తరువాత పేర్కొనదగినది వరి పంట. 70,604 ఎకరములలో వరి సేద్యము జరుగుచున్నది. సజ్జ, గోధుమ, మొక్కజొన్నకూడ పండించుట కలదు. సెనగ, కంది, పెసర ధాన్యములు కూడ ఈజిల్లా వ్యవసాయోత్పత్తులలో నున్నవి.

వ్యాపారపు పంటలలో ముఖ్యమైనది ప్రత్తి. ఈ జిల్లాలో మొత్తము 2,69,958 ఎకరములలో ప్రత్తి పండించుట కలదు. 34,119 బేళ్ల ప్రత్తి ఉత్పత్తి యగుచున్నది. ఇదిగాక 17,767 ఎకరములందు వేరుసెనగ; 15,479 ఎకరములలో ఆముదాలు పండుచున్నవి. ఆవాలు, నువ్వులు, చెరకు, పొగాకు ఇచట అప్రధానమైన వ్యాపారపు పంటలు.

**గృహపరిశ్రమలు :** ఈ జిల్లాలో ప్రత్యేకముగా పేర్కొనదగిన చేతిపరిశ్రమలు లేవు. ఇచట సాలెవారు ముతకధోవతులు, చీరలు స్థానికుల ఉపయోగార్థము తయారుచేయుదురు. ఇచట మొత్తము మగ్గముల సంఖ్య 3,257. రంగిరేజులు వస్త్రములకు అద్దకముపని చేయుదురు. వ్యవసాయ పరికరములను స్థానికులైన కమ్మరులు చేయుదురు. సిర్పూరులో చర్మముతో నీటితిత్తులు తయారు చేయుదురు. కొయ్యతోను, కట్టిచూర్ణముతోను వివిధ వర్ణములలో తయారుచేసెడి ఆటవస్తువులకు నిర్మల చాల ప్రసిద్ధివహించినది. నిర్మలలో ఇనుపకత్తుల పరిశ్రమ కూడ కలదు.

ఆదిలాబాదుజిల్లాలో 37 యంత్రశాలలున్నవి. కార్మికుల సంఖ్య 5098. ఇందు పురుషులు 4613 మంది, స్త్రీలు 485 మంది.

ముఖ్య స్థలములు : మహూరు :- ఇది కిన్వటు తాలూకాకు 30 మైళ్ళ దూరముననున్న చిన్న గ్రామము. ఇది పూర్వము దక్కను మహమ్మదీయ రాజులకు ప్రాంతీయ రాజధానిగా నుండెను. దీనికి కొంతదూరమున మహూరు దుర్గము కలదు. ప్రాంతీయ విప్లవములను అణచుటకు వచ్చిన ఫిరోజుషాహా బహమనీ నెల దినములు ఇచ్చట నివసించినట్లు ముస్లిము చరిత్రకారుల కథనము కలదు.

మాక్కిడు : ఇది ఆదిలాబాదు తాలూకాలో నున్నది. ఇచ్చట ఒక పర్వత దుర్గము కలదు. ఈ దుర్గమున ప్రాచీనమైన ఒక మసీదును, కొండ దిగువభాగమున పాండోలేనా అను దేవాలయమును ఉన్నది.

నిర్మల : ఇది ఆదిలాబాదు జిల్లాలో చారిత్రక ప్రాముఖ్యము గల ప్రదేశములలో అతిముఖ్యమైనది. నిర్మల 18 వ శతాబ్దపు ఉత్తరార్ధమున మిర్జా ఇబ్రాహిం బేగు జఫరుద్దౌలా దీనిని స్వాధీనపరచుకొనునంతవర కిది వెలమ రాజుల స్వాధీనములో నుండెను. ఇచట గల కొండల దిగువభాగములందు ఫ్రెంచి ఇంజనీర్లు నిర్మించిన కోటగోడ లున్నవి.

రవాణా : ఈ జిల్లాలో రవాణా సౌకర్యములు చాల తక్కువగా నున్నవి. ఆసిఫాబాదునుండి బెల్లంపల్లిగుండా మంచిర్యాలకుపోయెడి రోడ్డు 75 మైళ్ళ పొడవు కలదు. చిన్నూరునుండి పశ్చిమముగా 84 మైళ్ళలో నున్న నిర్మలకు పోవుబాటలో ఇది కలియుచున్నది. ఈ త్రోవ గోదావరీనదికి సమానాంతరముగా ఉన్నది. నిర్మలనుండి ఆదిలాబాదుకు పోవు 50 మైళ్ళ రోడ్డు ఒకటే జిల్లా ముఖ్య నగరముతో కలిపెడి రహదారి. ఈ జిల్లాలో మొత్తము రోడ్ల పొడవు 306 మైళ్ళు.

కాజీపేటనుండి బల్లారుషాకు పోవు రైలుమార్గము ఈ జిల్లాగుండా వెడలును. అయోమార్గము తూర్పువైపున పారిశ్రామిక ప్రాంతములు, బొగ్గుగనులు, కాగితపు మిల్లులు కల ప్రదేశముల ననుసరించి పోవును. జిల్లా మధ్యభాగములోని ప్రత్తి, జొన్న మొదలగు పంటలను రవాణాచేయుటకు ముద్ ఖేడ్, ఆదిలాబాదు ఇనుప దారి ఈ మధ్యనే నిర్మింపబడినది. దీనిపొడవు 101 మైళ్ళు.

పట్టణములు : ఈ జిల్లాలో (1) నిర్మల, (2) ఆదిలాబాదు, (3) బెల్లంపల్లి, (4) కొత్తపేట - కాగజునగరు, (5) మంచిర్యాల, (6) చిన్నూరు, (7) ఆసిఫాబాదు, (8) కిన్వటు, (9) బోధ్, (10) సిర్పూరు, (11) రాజూరా, (12) లక్సెట్టిపేట, (13) ఖానాపూరు, అనునవి జనాభా లెక్కలప్రకారము "పట్టణములు"గా వర్గీకరింపబడినవి.

భాషలు : ఈ జిల్లాలో అధిక సంఖ్యాకులు తెలుగు మాతృభాషగా కలవారు. ఇచట మొత్తము 64 భాషలు మాట్లాడెడు జనులు ఉన్నారు. ముఖ్యమైన భాషలు, వానిని మాట్లాడువారి సంఖ్యలు - ఇట్లుండును :

(1) ఆంధ్రము 5,08,133. (2) మరాఠి 1,86,028 (3) ఉర్దు 55,449. (4) గోండి 90,204. (5) లంబాడి 35,518. (6) కోలామి 8,325. (7) హిందీ 3,965. (8) కోయ 2,975. (9) మార్వాడి 1,036. (10) గుజరాతి 1,022. (11) ఇతర 54 భాషలు 9,867.

ఎం. కు.

ఆధునిక పాశ్చాత్య చిత్రకళ :- ప్రాచ్య పాశ్చాత్య నాగరకతా సమ్మేళనమువలన ఐరోపా దేశములో నొక నూతన కళావిర్భావము ఘటిల్లిన కారణముగా చిత్రకళా జగత్తునం దా కాలము బైజంటైన్ యుగము (Byzantine Period) అనుపేర వ్యవరింపబడెను. నాటినుండి నేటివరకు నిత్యనూతన రీతులతో నీకళ సెలయేరువలె ప్రవహించుచునే యున్నది. ఈ బైజంటైన్ యుగమునకు చెందిన కళాకారులు మహమ్మదీయ కళారీతుల ననుసరించక, విలక్షణమైన పద్ధతుల నవలంబించియున్నారు. సాధారణముగ ఈ యుగ ప్రారంభకాలమునందు గాని, క్రైస్తవశక ఆరంభకాలమందు గాని, చిత్రకారులవని, కేవలము క్రైస్తవాలయ కుడ్యముల నలంకరించుటయందును, క్రైస్తవ మతసంబంధములగుగాథలను చిత్ర రూపమున చిత్రించుట యందును, మతసంబధములగు విషయములకు రూపవికాసములను కల్పించుటయందుము కేంద్రీకరింపబడి యుండెను. ఈవిధముగ క్రైస్తవ మత సంబంధమగు విషయమునే ప్రధాన వస్తువుగ గ్రహించి

నప్పటికిని, ఆ చిత్రకారు లవలంబించిన పద్ధతిమాత్రము మొదట హెల్లనిక్ (Hellanic) గను, రానురాను, సాంకేతికముగను భావనాత్మకముగను పరిణమించినది. ఈ యుగమునకు చెందిన కళాకారుడు గుడి (చర్చి)కి సంబంధించిన కొన్ని నియమములకు లొంగవలసి యుండెను. ఈ నిబంధనలే, నియమములే కళయందు అపురూపమైన ఒక నూతనత్వ మేర్పడుటకు దారితీసినవి. ఈ కాలమునాటి కళాకారులు అనవసర విషయములను తొలగించి, ప్రధాన విషయముయొక్క లోతుల నరసి, కళను సృజనాత్మకముగను, భావనాత్మకముగను, సృజించుటయందే తమశక్తులను కేంద్రీకరించిరి.

13 వ శతాబ్దమునుండి దాదాపు 500 సంవత్సరముల కాలము ఒక గొప్ప ప్రవాహమువలె ఐరోపా చిత్రకళా వాస్తవికత, శాస్త్రీయ పద్ధతుల (Scientific realism) వైపు పరుగెత్తెను. ఈ 5 వందల సంవత్సరములలో, గియాటో (Giotto) మొదలు టర్నర్ (Turner) వరకు గల మధ్యకాలముననున్న టిటియన్ (Tition), పైటర్ (Pieter), పెద్ద బ్రూఘెల్ (Brughel the Elder), రెంబ్రాంట్స్ (Rembrants), కారట్ (Corot), రేనాల్డ్సు (Reynolds), కాన్‌స్టబుల్ (Constable) మున్నగు ప్రసిద్ధ కళాకారులందరు అనేక ఉపనదులవలెవచ్చి ఈప్రధానచిత్రకళా ప్రవాహమునకు సంపూర్ణత్వమును చేకూర్చిరి. ఈ 14వ శతాబ్దము తరువాత చిత్రము కేవలము ద్వైమానమునే (Two dimensional) చూపునదిగానుండు పద్ధతి యంతరించినది. ఇప్పుడు చిత్రపటము (Painting) వస్తువుయొక్క కేవలపరిమాణ పరిమితిని(object in space)ఆకార వర్ణనలనే కాక ఆయతనము (volume) ను తెలుపునదిగా కూడ బయలువెడలినది. 13 వ శతాబ్దమునందలి సుప్రసిద్ధ చిత్రకారుడగు గియట్టో (Giotto) వలెనే 15 వ శతాబ్దమునందలి లియొనార్డ్స్ డావిన్‌సీ (Leonards davinci) అను కళాకారుడు, చిత్రకారుని దృష్టిని శాస్త్రకారుని దృష్టిపథముతో మేళవించెను. ఈ అధ్యాయమునందు స్మరింపబడిన చిత్రకారులందరిలో టర్నర్ (Turner), కాన్‌స్టబుల్ (Constable) అనువారలిద్దరు విశేషముగా స్మరణీయులు. వారి చిత్రకళారీతుల ప్రభావమునకు లోనైనవారు ఫ్రాన్సు దేశీయులు. వారి ప్రభావమే ఫ్రాన్సుదేశీయ చిత్రకారుల ఛాయావాదము (impressionism) నకు పునాది యని చెప్పవచ్చును.

19 వ శతాబ్ది అంత్యదినములలో కళాకారుడు శాస్త్రీయ జాగృతిని గుర్తించి, తత్ప్రభావ ఆవేశములకు వశ్యుడుకాక ఉండలేకపోయెను. రెండవమారు ఐరోపా దేశీయ చిత్రకళా చరిత్రలో శాస్త్రీయ పద్ధతుల విజృంభణము, జయోత్సాహములు, కళాకారుని సమస్యలను తీర్చుటకు బాసటయై నిలిచెను. నిజమైన వాస్తవికతను సృజింపవలయునన్నచో పరిశోధనాగారపు పద్ధతులను (Laboratory methods) వినియోగించవలసిన యవసర మేర్పడెను. ఘనపదార్థములను (Solid bodies) వెలుతురు మూలమున చూపవచ్చునన్న సత్యమును గ్రహించి ఛాయావాదులు నవీనమైన శాస్త్రీయ సిద్ధాంతముల సాహాయ్యమున, వర్ణదృష్టి సంబంధ విషయమును (optic & colour) గ్రహించినారు. వారు వర్ణమును విచ్ఛిన్నకిరణాంతర్గత రేఖలుగను, అపసర్పణరశ్మి వర్ణములుగను (tunes of spectrum) విభజించి, పాలెట్ (pallet) నుండి భూమిరంగులను బహిష్కరించిరి. ఛాయావాదుల కాలము వరకు చిత్రకారుడు విశ్రాంతిగ చిత్రశాల (Studio) యందు చిత్రమును చిత్రించుచుండెడువాడు. ఆతనికి చిత్రింపబోవు చిత్రముయొక్క ఆకారముయొక్క పొందికయే ప్రధాన విషయముగ నుండెను. అంగియైన ఆకారమునకు (Form) వర్ణమును అంగముగ గ్రహించి, దాని ఆకారపు పొందికయందే తన సర్వశక్తులను వినియోగించెడివాడు. తరువాత మోనోక్రోము (mono chrome) ను భూమికగ (underpaint) గ్రహించి దానిమీద వర్ణములను వేయుట చిత్రకారుల సంప్రదాయసిద్ధమైన పద్ధతిగా నుండెను. ఈ విధమైన పద్ధతియందు చిత్రకారుడు తన పనిని రెండు భాగములుగా విభజింపవలసియుండెను. మొదట తన శక్తిని చిత్రముయొక్క పొందికయందును ఆయా స్థితులయొక్క రాగముల మేలు కలయిక (disposition of tones) యందును శ్రద్ధవహింపవలసియుండెను. ఈ కూర్పు తనకు తృప్తికలిగించిన తరువాత ఆతడు తగిన వర్ణములను చిత్రించుటకు పూనుకొనువాడు. ఛాయావాదమునకు పూర్వము వెలసిన ప్రసిద్ధ చిత్రకళా ఖండములన్నియు

నీపద్ధతిపై చిత్రింపబడినవే. కాని ఛాయావాదుల యుగమునందలి చిత్రకారులు అనుక్షణము చంచలమైన వెలుతురు యొక్క ఫలితములను సహితము రాబట్టుటకు ప్రయత్నించిరి. ఈ విధమైన ప్రయత్నము సిద్ధింపవలయునన్నచో చిత్రకారుడు మోనోక్రోము (Monochrome) భూమిక యొక్క అవసరము లేకయే వర్ణమును సూటిగా ఫలకము (Canvas) నందు ఉపయోగింపవలయును. ఇది సులభరీతి కాదు. ఇది తాను చిత్రించువిషయము యొక్క పరిపూర్ణ జ్ఞానమునుపొంది, మనస్సునందు భావించి, సిద్ధహస్తుడైన చిత్రకారుడు చేయగలిగిన పద్ధతి. ఛాయావాదులు వర్ణములను ఇతర భూమికల సహాయము లేక వాడుటయే కాక, సాధ్యమైనంతవరకు మిశ్రమములుకాని (Pure) వర్ణములనే వాడిరి. పసుపు, నీలవర్ణముల కలయికవలన ఆకుపచ్చవర్ణమేర్పడినప్పటికి మిశ్రమవర్ణము, రెండు రంగుల ప్రకాశమును (Brilliance) పతనము చేయుచున్నదను జ్ఞానము కలిగినవారీపద్ధతి నవలంబించిరి. ఈవిధమైన విలక్షణ పద్ధతుల నవలంబించుటవలన ఫలితములు విజయవంతములుగా నుండి చిత్రమునకొక యపురూపమైన సౌందర్యము నిచ్చినవి. ఈ పద్ధతివలన చిత్రము కేవల ఘనపదార్థము యొక్క వస్తురూపము చిత్రించుటయేగాక ఆ వస్తువు నావరించియున్న వాతావరణమును గూడ వ్యక్తీకరింపగలిగినది. ఈ యుగమునకు చెందిన చిత్రకారులలో ప్రసిద్ధివహించినవారు మానెట్ (Manet) రినొయిర్ (Renoir) డిగాస్ (Degas) అనువారలు గత 5 శతాబ్దముల నుండి వాస్తవికతను సృజించుటకు చేసిన కృషి. వీరికాలములో ఫలవంతమైనది.

ఛాయావాదము పరిపూర్ణముగ వికసించి, తన గమ్యస్థానమును చేరకపూర్వమే కొందరు కళాకారులు నూతన పద్ధతుల ననుసరించుటకు ప్రయత్నించిరి. ఆ ప్రయత్నమే పోస్టు ఇంప్రెషనిజం (Post impressionism) అను సిద్ధాంతముపేర వెలసినది. ఈ విధమైన నూతన సిద్ధాంతమును కళా జగత్తున ప్రవేశపెట్టుటలో తోడ్పడినది క్యామెరా (Camera) యొక్క ప్రభావ ఫలితములైయున్నవి. ఈ పోస్టు ఇంప్రెషనిజం అను దానికి సంబంధించిన చిత్ర ప్రదర్శనము లండన్‌లో జరిగిన సందర్భమున రోగర్ ఫ్రై (Roger Fry) అనునాతడు—"It was a new movement in Art, a movement which was the more disconcerting in that it was no more variation upon accepted themes but implied a reconsideration of the very purpose and aim as well as the method of plastic art. It was not surprising, therefore, that a public which had come to admire above every thing in a picture the skill with which the artist produced illusion should have resented an art in which such skill was completely subordinated to the direet expression of feeling." అని వ్యక్తపరచిరి. ఈ నూతన సిద్ధాంతము నంగీకరించి సాధించినవారు సోరట్ (Seurat), పాల్ సైనాక్ (Paulsignac) అనువారలై ఉన్నారు. ఈవిధముగ చిత్రకళ శిఖరస్థానమునందినది. ఈ రోజులలో చిత్రకారునకు ఆకారము (Form) అంతప్రధానమైనదిగా కాకుండెను. చిత్రమునకు పరిపూర్ణత్వము ప్రసాదించుటలో నొకవేళ ఆకారమును విరూపముచేయవలసిన యవసరమేర్పడినచో చిత్రకారుడావిధముగనే చేయుచుండెను. దాదాపు ఈ కాలమునందే ఛాయావాద రీతులందు విరక్తిపొందిన ముగ్గురు ఆచార్య శ్రేష్ఠులు విభిన్న దృక్పథములతో మూడు నూతన విధానములకు దారితీసిరి. వీరు పాల్ గాగిన్, వాంగోఘ్, సిజానె అనువారు. సాధారణముగా ఉద్రిక్త స్వభావుడైన వాంగోఘ్ యొక్క చిత్రములందు వర్ణముల విజృంభణము అధికముగా కానవచ్చును. కాని అతడుమాత్రము తుదివరకు ఛాయావాద సిద్ధాంతములనే యనుసరించెను. ప్రాచీనాలంకారిక పద్ధతి ననుసరించిన గాగిన్ అనువానివలె సిజాన్ అనునాతడు ఛాయావాదపద్ధతులకు పూర్తిగ తిలోదకములను వదలలేదు. అతడు అవసరమైనచో తాను ప్రతిపాదింపబోవు నూతన సిద్ధాంతములయందు ఛాయావాదము యొక్క సాహాయ్యము సైతము స్వీకరించి తన వ్యక్తిత్వమును కాపాడుకొనెను. చిత్రకళ ఉదాత్తమైన కళయని ఎంచు దేశములన్నింటియందును సిజానె అను చిత్రకారుని పేరు కీర్తింపబడుచున్నది. అతడు తాను స్వయముగ (Abstract) చిత్రకళాకారుడు కాకపోయినను రాబోవు శకములో వర్ధిల్లగల (Abstract) చిత్రకారులకు ఆచార్య ప్రాయు

డయినాడు. అతని ప్రయత్నమంతయు ఎదుటనున్న దృశ్యమునకు సంపూర్ణమై శాశ్వతమైన లక్షణము (Characteristic) నాపాదించుటయందే లగ్నమై యుండెను. అతడే ఒక పర్యాయము నేను ప్రకృతిని యథారూపమున చిత్రించుటకు పూనుకొనలేదు. కాని దాని ప్రతినిధిరూపమును జూపినాను- అని అనెనట. అతడు తనకు కలిగిన (మూడవ) పరిమాణ విషయకమయిన అనుభూతిని, చిత్రముయొక్క లోతును, (depth) చిత్ర ఫలకమునందు తార్కిక దృష్టిని పునర్నిర్మితము గావించుటకు పూనుకొనెను. సాధారణముగ శాస్త్ర దృష్టిచే నావృతమైన వస్తువుల ఆకార ప్రాతిపదికలన్నియు, శంకు, స్తూపము, గోళము- వీటియొక్క ఆకారములోనుండునన్న సత్యము నాతడు పునః ప్రతిష్ఠిత మొనర్చెను. అతడు ఆరేఖాగణిత సంబంధములగు ఆకృతులన్నియు (plane by plane) విధానములో నమర్చి తగిన రంగులతో సంశ్లేషముగను, ప్రస్ఫుటముగను చూపగలిగెను. అతని సమకాలిక కళాకారులు, విమర్శకులు అందరు, అతనికళ నిపుణమైనది కాదనియు, వికాసహీనమైనదనియు విమర్శించిరి. అయినను అతడు నరకుగొనక సమకాలిక భావముల కెదురీది తన సిద్ధాంతమునకు రూపురేఖల నొసగి ఘనాత్మకత (cubism) అని ప్రపంచములో ప్రఖ్యాతినొందిన సిద్ధాంత విషయమున గురుపీఠము నధిష్ఠించెను.

ఛాయావాదముకంటె ఘనాత్మకత (cubism) అను సిద్ధాంతముయొక్క జీవనపరిమితి చాల స్వల్పమనియే చెప్పవచ్చును. సిజానె అనునాతనికి సమకాలికుడైన గాగిన్‌అనునతడు ప్రతిపాదించిన ప్రాచీనాలంకారిక పద్ధతి ననుసరించినవాడు మతిసే అను చిత్రకారుడు. తన భావములను వ్యక్తీకరించుటకు తోడ్పడు వివిధాంశములను చిత్రకారుడు సాలంకారముగ కూర్చు కళయే చిత్రరచన యని అతడు భావించెను. అతని అనుయాయి వర్గమునే ఫావులు లేక ఆటవికులు అని పిలిచిరి. ఈ ఫావుల సంచలనమీ శకమునందు ప్రారంభించి దాదాపు 1914 సం. నాటి ప్రథమ ప్రపంచ సంగ్రామము వరకు సాగెను. ఈరీతియందు ప్రసిద్ధులయిన చిత్రకారులు వ్లామింకు, డిరాయిన్, రౌనాల్టు అనువారలు. ఈఫావుల వలె పిరె, బొన్నార్డు ఎడునార్డు, విల్లార్డు అనువారు ఉద్రిక్త విధానము ననుసరింపక ప్రశాంత విధానము ను చేపట్టిరి. వీరిని ఇంటినిస్టీస్ (Intinistes) అందురు.

తరువాత, చిత్రలేఖనము యొక్క దృక్పథములు కూడ రాజకీయ దృక్పథములతో నేకీభవింపబడ వలయునను ప్రయత్నములు గావింపబడినవి. ఆయత్నముల ఫలితమే ప్యూచరిస్టు (Futurist) సంచలనము. 1909 వ సం న మారినెట్టు అనునాతడు ప్యూచరిస్టు సిద్ధాంతములను రాజకీయ సిద్ధాంతములతో మేళవించెను. మారినెట్టు, సెవరీని, అనువారు తమ చిత్రములలో చాలభాగము యంత్రములయొక్క శక్తుల నధికతరముగ కనబరచుటయందును, అతి త్వరితగమనముగల మోటారు ధ్వనికి సాంకేతిక చిహ్నములను కల్పించుటయందును, విప్లవము చేత నుద్రిక్తమయిన భావములను ప్రదర్శించుటయందును, శ్రద్ధ వహించినట్లు కానవచ్చును. ఐరోపా రాజకీయములు ముఖ్యముగా ముస్సోలినీ కాలమునాటి రాజ్యాంగ విధానములు, ఆనాటి చిత్రకళకు సామగ్రిగా గ్రహింపబడినట్లు తెలియుచున్నది. ఈ విధానము ఆనాటి ఫ్రెంచి చిత్రలేఖనముపై అధికప్రభావము కలిగించెను.

ప్యూచరిస్టులయొక్క ప్రయోగములు Shock tactics చిత్రకారుల రచనా విధానమునకు తోడుపడునట్లుగా గ్రహింపబడినవి. 'డాడిజం' అను నవీన సిద్ధాంతము ఫ్రాన్సునందు జన్మింపక జ్యూరిచ్‌నందు తలయెత్తినది. దాని ప్రముఖానుయాయి దేశములు జర్మనీ, రుమేనియా అనునవి. ఇంతవరకుగల నియమముల నుల్లంఘించుట, ఏవిధమయిన లక్షణమునకు లొంగకపోవుట అనునవియే ఈ సిద్ధాంతముయొక్క ప్రధానాశయములు. కేవలము చిత్రకళయందేకాక సాహిత్యమునందును, రాజకీయము అందును, తుదకు జీవితమందుకూడ ఏ నియమముచేతను వ్యక్తి బంధింపబడకూడదనియే వారి భావము. "అన్ని పద్ధతులను తిరస్కరించుట, జనసమ్మతినొందిన అన్ని విలువలను ధ్వంసముచేయుట, సృష్టి నిర్మాణము తదర్థమే (స్వాభావికమే) అనుట, సృష్టి నిర్మాణ కళయందు అది (ప్రకృతి) స్వయముగ నాశనమొందుట" అను సిద్ధాంతములను వారు ఉద్ఘాటించిరి. ఈ సంచలనము 1918 నాటి ప్రపంచ యుద్ధ ఫలితములగు నిరాశ, నిస్పృహ,

ప్రతీకారవాంఛ అనువాటివలన ప్రభవించిన దని చెప్ప వచ్చును.

తరువాత ప్రొఫెసరు ఫ్రెండు అనువాని సిద్ధాంతముల నాధారముగ జేసికొని అతివాస్తవికత (Surrealism) అను నూతన విధాన మొకటి చిత్రకళయందు ప్రవేశ పెట్టబడెను. ఈ సిద్ధాంత మీ సామాన్య జాగ్రజ్జగత్తునకు సంబంధించినది కాదు. ఇది మానవుని స్వప్నావస్థకును, స్పృహారహిత స్థితికిని సంబంధించినది. మానవుని మనస్సు అతార్కికముగ పరిభ్రమించినప్పటికిని అది యిట్టిస్థితిలో జాగ్రదవస్థయందు కంటె విశాలముగను, సత్యముగను, ప్రస్ఫుటముగను కనబడునని వాదించి చిత్రోపేతమయిన ప్రదర్శనము మూలమున (pictorial representation) దీని సిద్ధాంతమును వ్యక్తీకరించిరి. ఈ సిద్ధాంతమునకు సంబంధించిన చిత్రకారులగు చిరికో, మార్క్ చేగల్ అను వారల చిత్రములందు సంభావ్యము అసంభావ్యముగ గన్పట్టుట, కొన్నియాకారములు (Figures) గాలియందు తేలిపోవుట మున్నగువాటిని కవితా సౌందర్యముతో ఆకర్షణీయమయిన పద్ధతితో (design) ను, రచనా కౌశల్యముతో (draughtsmanships) ను చిత్రించుట గోచరించును.

ఆధునిక చిత్రకారు లందరిలోను తలమానికముగా ఎన్నతగినవాడును, సృజనాత్మకుడును, స్వతంత్రుడును అయిన పికాసో అనువానిని ప్రత్యేకముగ స్మరింపక చిత్రకళా పరమర్శము పూర్తి కాజాలదు. విశాలదృక్పథము కల ఇతని చిత్రకళారంగము చాల భిన్నము విపులము నైనది. ఈ యుగములో తలసూపిన అధికసంఖ్యగల ప్రాయోగిక (experimental) చిత్రకళా ఖండములకు కారణభూతుడు అతడే. అతని పేరు 'Abstract' చిత్రకళతో సంబంధముకలదై యున్నప్పటికిని, వాని చరిత్రము తమ కాలమందలి పురోగమించుచున్న కళ యొక్క ముందడుగు. "His history is very much the record of the Forward Art movement in our time" అని విమర్శకులు అభిప్రాయపడిరి. ప్రతిభావంతుడైన ఇతడొక్కొక్క అపురూపమైన చిత్రమును ఒక్కొక్క శాఖకు చిహ్నముగా వెలయించి తన సమకాలిక చిత్రకారులును, సాధారణ ప్రజలును ఆశ్చర్యపడునట్లు చేసినాడు. అతని ప్రథమ చిత్రమునందు రాఫేలును, 'అకాఫే' అను చిత్రమునందు పాత్ర చిత్రణ విధానమును "ఫెమ్మె సాల్బార్" అను చిత్రమునందును కొంతవరకు ఛాయా వాదరీతులను కొంతవరకు మనకు గోచరించును. ఇదియే అతని ప్రథమదశ (blue period) యొక్క ప్రారంభము. తరువాత నతడు నీగ్రోశిల్పము లందలి స్వతంత్ర భావమును, కళాసౌందర్యమును, కని వాటి ప్రభావమునకు లోనయ్యెను. 'విలేజి ప్రెస్ ఒ శెర్రాగోనె' అను చిత్రమునందు 'సిజానె' యొక్క రచనా సంప్రదాయమును అనుకరించెను. తరువాత ప్రౌఢదశ (Rose period) ప్రారంభమయ్యెను. ఇందు సర్కస్ ప్రదర్శకుల జీవితమును, హెరెలిక్విన్సు యొక్కయు, ఎక్రోబాట్సు యొక్కయు జీవితముల నితివృత్తములుగా గొనినాడు. ఇందు పికాసో 'బ్లూ పిరియడ్' నందుకంటె పరిపూర్ణత నొందెను. అతడు ప్యూచరిజమునుమాత్రము ఆమోదింపలేదు. తిరిగి అతడు తనదృష్టిని ప్రదర్శనాత్మక చిత్రకళా సంప్రదాయమునుండి మరలించి ప్రాచీన సంప్రదాయములకు సులభరీతిలో మెరుగులను దిద్దెను. ఫెర్నిస్ ఎఫ్రాయిజన్ బోర్డు డిలామెర్ అను చిత్రమునందు అతివాస్తవికత (surrealism) పునరుద్భవించినది. అనంతమైన నూతన రీతులతో వివిధ రంగములలో విహరింపగల ఈ దక్షుని అనంతశక్తులకు ఆధునిక కళాకారులందరు జోహారు లర్పింపవలసినదే.

ఆధునికులలో పాల్, క్లీ పాల్‌నాష్, రాబర్ట్సు, క్రిస్టఫర్ వుడ్, బెన్‌నికల్సన్, రోడ్రిగో, మొయనిహారిన్, మాథ్‌స్మిత్, వింథాం మున్నగువారలందరు ప్రాచీనాచార్యుల పద్ధతుల ననుసరించి తమకు రుచించిన మార్గమును సాధించిరి. ఈ విధముగ ఆధునిక చిత్రకళా ప్రవాహము నిలుకడలేక నూతనమార్గముల సంతరించుకొనుచు ప్రవహించుచునే యున్నది.

పి. టి. ఆర్.

**ఆధునిక భారతీయ చిత్రకళారీతులు :-** భారతీయ చిత్రకళా చరిత్రలో ఆధునికయుగను అందును స్వాతంత్ర్యప్రాప్తి తరువాత గడచిన కాలము చాల సారవంతమైనది. వ్యక్తిగత ప్రతిభల సవివర పరిశీలనకు పూనుకొనుటకుముందు ఒక సర్వంకష సమీక్షచేయుట అవశ్య

కర్తవ్యమై యున్నది. అట్లు చేయనిచో కళాప్రచలన విధానమును సరియైన సాంఘిక సందర్భములో మనము గ్రహింపజాలము.

అజంతా ప్రథమ కుడ్య చిత్రములతో రెండువేల సంవత్సరముల పూర్వమునుండి వచ్చుచున్న భారతీయ చిత్రకళా సంప్రదాయము హిందూదేశమున క్రీ. శ. 19 వ శతాబ్ది యంతమునకు అవసానదశ పొందినది.

చిత్రకళా సంప్రదాయముయొక్క చరమ వికాసము హిమాచల ప్రదేశమునందలి చారిత్రకమైన త్రిగర్తమున (మూడు లోయలలో) ప్రత్యక్షమైనది. హిమాలయ పాదములందలి మైదానముల నానుకొని రాజపుత్ర వర్గములచే స్థాపింపబడిన ఈ మూడు చిన్న రాజ్యములలో రాజస్థాన చిత్రకళా సంప్రదాయాదర్శము పర్వత వాయు నైర్మల్యముయొక్కయు, కొండ సెలయేరుల స్వచ్ఛతయొక్కయు అంశములను పుణికిపుచ్చుకొనుటచే మరింత సుందరమై ఒప్పారినది. కంగ్రా, బసోహ్లి, సుకేత, మండి, చంబ మున్నగు ప్రదేశములందలి చిత్రకళ పోషకుల సంఖ్య తగ్గుటచే క్రమముగా సన్నగిల్లెను. 1905 లో కలిగిన ధర్మశాలలోని భూకంపము ఈ మండలము నందలి కళకు స్వరూప ధ్వంసము కావించెను.

పాశ్చాత్య సంప్రదాయ ప్రభావితమును, భూస్వాముల చిత్రించు సంప్రదాయముతో కూడినదియు అగు ఒక సంకీర్ణచిత్రకళా పద్ధతి భారతదేశమునందలి కొన్ని ప్రదేశములలో కొంచెముకొంచెముగా సాగుచుండెను. లక్నో పాట్నాలయందును, దక్షిణమున మైసూరునందును దక్షతతోకూడిన చిత్రకళ నిర్వహింపబడుచుండెను. కాని పహారి చిత్రకళయందలి రసవత్తరమును ఆత్మీయాంశభూయిష్ఠమునైన పద్ధతియొక్క జాడకూడ కనిపించుట లేదు.

క్రీ. శ. 1854లో వైదేశిక సంస్కృతి ప్రభావముచే కలకత్తా కళాపాఠశాల (Calcutta School of Arts) ఆరంభమాయెను. ఈ పాఠశాల బ్రిటనును ఆదర్శముగా గ్రహించెను. ఈ యుగమున బ్రిటిష్‌వారికళ అనావశ్యక వివరములతో కూడిన భారవత్త్వమునకును, వైజ్ఞానికమైన ఉదాత్తతకును గల భేదమును వివేచింపలేక మిక్కిలి హీనస్థితిలో ఉండుటచే ఆ పరిస్థితి మిక్కిలి విషాదకరముగా పరిణమించెను. అపవిత్రాదర్శములు ఆంగ్లేయ కళను తద్ద్వారా భారతదేశమునందలి కళాశిక్షణమును మలినీకరించుట సంభవించెను.

ఈ పద్ధతికి చెందిన మధ్యరకపు ప్రతిభగల పలువురు వ్యక్తులలో పరిమిత రంగముననే ఐనను స్థిరమైన సిద్ధి నొందెనని చెప్పుటకు తగినవా డొక్కడున్నాడు. అతడు రవివర్మ. వంగదేశమునందలి పునరుద్ధరణ కాలమునకు చెందిన కళాకారులును, తరువాతి యుగమునకు చెందిన ఆధునికులును పెక్కు కారణములచే అతనిని లాఘవముతో పరికించుచుందురు. కాని రవివర్మ చిత్రలేఖనమునందలి గౌరవమును నిల్పెననుట మాత్రము యథార్థము. ఆధునిక యువకులం దిది ప్రధానలక్షణముగా కనిపింపదు. ఆతడు తన చిత్రముల అమ్మకము దృష్టియం దిడుకొనుటచే కేవల పండితాదరమునకే యధికమైన ప్రాధాన్యమిచ్చి యుండలేదు. ఆతడు పురాణములందలి అసంఖ్యాకములైన కథలకే చిత్రరూపము నొసంగెననుట నిజమే. కాని అవి లేఖన (చిత్రణ) వర్ణనవిషయములందు మిక్కిలి దక్షతతో నిర్వహింపబడినవి. ఆతని చిత్రములందలి సారస్వతాశ్రయత్వముమాట యెట్లున్నను అందలి పరిపూర్ణమైన నిష్ఠమాత్రము తరువాతి వారికి ఆదర్శముకాదగియున్నది.

భారతదేశమునందలి ఆంగ్లేయుల బలవత్తరమయిన సామ్రాజ్యవర్ధన విధానమునడుమ వైదేశికాక్రమణము వలన దేశీయ సంస్కృతికి కలిగిన హానికి ఇద్దరు ఆంగ్లేయులు పరిహారము చేకూర్చిరనుట మిక్కిలి ఆశ్వాసదాయకముగా ఉండును. వీరు కర్జను ప్రభువు, ఇ. బి. హావెల్ అనువారు. కర్జను ప్రభువు ఈ దేశమునందలి వాస్తుశిల్పముల గొప్ప సంప్రదాయమునకు అలరి, వాటి రక్షణమునకై చట్టములు కావించెను. భారతీయ కళాకారులకు అమూల్యమును వైవిధ్యముతో కూడినదియు అగు సొంత సంప్రదాయము ఉండగా వారిని వైదేశికాదర్శమును అనుకరింప ప్రోత్సహించుట వ్యర్థమును, విషాదకరమును అని కలకత్తా కళా పాఠశాల కధ్యక్షుడైన హావెల్ గుర్తించెను. అందుచే కళావిషయమున పొందబడిన సాంప్రదాయిక సిద్ధుల పరిశీలనము ఒనరింపవలెనని ఆతడు వాదించెను. విదేశములందు డాక్టరు

ఆనందకుమారస్వామిగారు "పునరుజ్జీవనము" నందలి తాత్త్వికాశయములను వివరించి, అంతర్జాతీయ ప్రజలకు అతి దక్షతతో విశదపరచిరి. ఈ పునరుజ్జీవన దృక్పథము నకు విలువ కట్టునప్పుడు చరిత్రజ్ఞుడు లోతైన దాని సాంఘిక మూలములను విస్మరింపరాదు.

భారతదేశమున డాక్టరు అవనీంద్రనాథ ఠాకూరుగారి నాయకత్వమున యువక కళాకారులు పలువురు అజంతా కళను మొగలాయి రాజపుత్ర కళాఖండములను నిశితముగా పరిశీలింప నుద్యుక్తులై హావెల్‌గారి వాదము లను సార్థక మొనరించిరి. చిత్రకళా పునరుజ్జీవనము ఈ విధముగా ఆరంభింపబడెను. సంస్కృతి విజయముగా పరిణమింపనున్న రాజకీయ విజయముచే ప్రతిహతులైన పునరుజ్జీవన యుగమునందలి కళాకారులు భారత చరిత్ర యందలి మహాయుగముల నుండి అనవద్యమైన ఆవేశ మును గ్రహింప అన్వేషించి రనుటలో ఆశ్చర్యములేదు.



అవనీంద్రనాథఠాకూరు
ఆధునిక భారతీయ చిత్రకళోద్యమ నిర్మాత

పునరుజ్జీవన కాలమునందలి కళాకారులు యథాస్థిత చిత్రణవిధానము, రూపసాదృశ్య నిర్వహణము మున్నగు పాశ్చాత్యుల విలువలను విసర్జించి కాల్పనికమును (Poetic) ప్రబోధాత్మకమును (Evocative) అగు పద్ధతిని అవలం బించిరి. రచనా విధానమునకూడ వారు యూరపునందలి తైలవర్ణ చిత్రణమును విడిచి నీటిరంగుల వైపునకు మర లిరి. ఈ తిరుగుబాటు కేవలము పాశ్చాత్యపద్ధతికే కాని సర్వవైదేశిక ప్రభావములకును గాదు. ఏలయన చైనా జపానుదేశములందలి చిత్రకళావిధానములు నిశితముగా పరిశీలింపబడెను. పునరుజ్జీవన యుగమునందలి రేఖా విన్యాస లేఖన విధానము కొంతవరకు చైనా చిత్ర కళావిధానమునుండి గ్రహింపబడినదనియు, వర్ణనైశిత్య మును సమీకృత సౌందర్యమును సంపాదించుటకై పలు మార్లు శాశనముచేయు విధానమున జపాను ప్రభావము గోచరించుచున్నదనియు చెప్పవచ్చును.

వారి తీవ్ర మనఃప్రవృత్తి దాని చారిత్రక సమర్థన ముతో అంతరించిపోయెను. కాని ఈ పునరుజ్జీవన విధా నము నుండియే భారతదేశ మునం దంతటను కళను పున రుజ్జీవింపజేయుశక్తి ప్రసరించి యుండెనని కళాచారిత్రకుడు కృతజ్ఞతతో తప్పక స్మరింప వలసి యున్నది. ఈ ఉప ఖండ మందలి కళాపాఠశాల లన్నిటికిని ఉపాధ్యాయులను సమకూర్చిన "వృద్ధకులపతి" అదియే.

ఆధునిక భారతీయ చిత్ర కారులలో ప్రథముడు అవ నీంద్రనాథ ఠాకూరు. అదే ఆతని గొప్పతనమునకును కారణము. ఆతడు నిర్జీవ సంప్రదాయములతో కుప్పకూలిపోయిన ఢిల్లీ, పాట్నావిధానముల అమితా లంకరణపద్ధతినివిడిచి, చైనా జపాను విధానములందును, పాశ్చాత్యకళయందునుగల లక్షణ పరత్వము, అపరిపక్వ దృష్టిఅనువానినుండి మరలిపోజాలెను. డా. అవనీంద్రనాథ ఠాకూరు ప్రాచీన మధ్యకాలములందలి భారతీయ కళా విధానములందలి పద్ధతిని, సిద్ధాంతములను కొనసాగించె ననుట సరియైనది కాకపోవచ్చును. ఒక క్రొత్తసమన్వయ విధానమును కనుగొని నిజప్రామాణికత్వమును నిరూ పించుట ఆతడు చేసిన ఘనకార్యము. ఆ విధానము ప్రమాణభూతమై భారతదేశమునందలి లఘుచిత్రకళా విధానము (మినియేచరు) లోని మార్దవమును, జపానీ యుల చిత్రకళా విధానమునకు చెందిన సంపన్న శిల్ప

కళా వైభవమును తనలో ఇముడ్చుకొని పాశ్చాత్య లాక్షణిక రచనా విధానమునకు చెందిన నియమములచే సమీకరింపబడి యున్నది. అవనీంద్రనాథఠాకూరు కళాచార్య వర్యుడు. ఆతడు కళాఖండములను సృజించిన మహావ్యక్తి.

అవనీంద్రుడు పలువురు శిష్యులను సుశిక్షితుల నొనరించెను. వారాచార్యుని జ్ఞానజ్యోతిని భారతదేశమందన్ని వైపులను వెలయజేసిరి. వీరిలో నగ్రేసరుడయిన నందలాల్ బోసు శాంతినికేతనములోని కళాభవనమున శిక్షకుడయ్యెను. అసితకుమార హాల్దారు లక్నో కళాపాఠశాలకు అధ్యక్షుడయ్యెను. సమరేంద్రనాథగుప్త లాహోరు కళాపాఠశాల కరిగెను. వేంకటప్ప మైసూరులో బోధకుడయ్యెను. శైలేంద్రనాథుడే జయపురమునకు వెళ్లెను. సర్దారు ఉకిల్ ఢిల్లీలో నెలకొనెను. ప్రమోదకుమార ఛటర్జీ మచిలీ పట్టణమునందలి జాతీయకళాశాలలో పని చేసెను. దేవీప్రసాదరాయ చౌధరీ మదరాసు కళాపాఠశాలను నడిపెను. పులిన బేహారి దత్తు బాల్యావస్థయందున్న బొంబాయిలోని కళను పెంపొందించెను. ముకుళచంద్రుడే కలకత్తా పాఠశాలను నిర్వహించెను. ముకుళచంద్రుని తరువాత కలకత్తా కళాపాఠశాలను నడపిన రమేంద్రనాథ చక్రవర్తి డా. నందలాల్ బోసుగారియొద్ద పరిపూర్ణ శిక్షణము పొందుటకు పూర్వము డా. ఠాకూరు గారియొద్ద కళలో ప్రాథమిక శిక్షణము పొంది ఉండెను. ఈ విధముగా సమకాలిక భారతీయ చిత్రకళ మూలములందే సుశిక్షితము కావింపబడెను. వర్ధిష్ణువయిన అనంతర చిత్రకళాకారసంతతి వంగదేశమునందలి 'క్రొత్త 'ఉద్యమమునకు సంబంధించిన సిద్ధాంతములపై ప్రోదిచేయబడినది.



నృత్యము - వినాయకమసూజి

వంగదేశము పూర్వసంప్రదాయమును జీర్ణించుకొనవలసిన ఆవశ్యకమును నొక్కి చెప్పుచుండగా విదేశములతో సంపర్కముకల రేవుపట్టణమున సాధారణముగా కవబడు విశ్వాత్మీయశాంశములకు (Cosmopolitan elements) సంతత స్థానమైన బొంబాయి విశాలతరమైన పద్ధతియు, విధానమును కావలె నని వాదించెను. బొంబాయి కళా పాఠశాలాధికారులు కళ స్వయంపోషకముగా ఉండజాలదనియు, అది ప్రజల పోషణముపై ఆధారపడి ఉండవలెననియు సూచించిరి. పోషకులందరును తమకు కావలసిన కళాఖండములు అన్నియు పునరుజ్జీవన పద్ధతినే చిత్రింపబడవలెనని కాంక్షింపరు. అట్లే చిత్రకళ నేర్చిన అభ్యాసకులు అందరును ప్రాళన విధానమునలెస్సగా చిత్రింపజాలరు. అట్లు చిత్రింపజాలిన వారిలోకూడ పలువురు అన్యాదర్శములను ఆదరించుచుందురు. మొత్తము



తల్లిబిడ్డలు - విశ్వనాథముఖర్జీ

మీద అభ్యాసకులు పలువురు అన్ని పద్ధతులను అవలంబింపగోరుచు ప్రత్యేక సమయములందు తాము గ్రహించు వస్తువులే రచనావిధానమును కూడ నిర్ణయింపవలెనని తలంతురని బొంబాయి పాఠశాల అనుభవము వలన తేలిన విషయము. ఈ విధముగా వారొక కుడ్య చిత్రమును నీటిరంగులతోకాని, తైలవర్ణములతోకాని, మిశ్రముగాకాని చిత్రింపవచ్చును. జీవితమునుండి చిత్రమును చిత్రింప అంగీకరించి, వారు పునరుజ్జీవన పద్ధతిని విడనాడి, పాశ్చాత్య పద్ధతిని అవలంబింపవచ్చును. బొంబాయి కళాసమితి అందుచే పాఠ్య ప్రణాళికలో పాశ్చాత్య రచనా విధానము కూడ చేర్పబడుట ఉపయోగకరముగా ఉండునని భావించెను. 19 వ శతాబ్ది చివరి భాగము నాటికి బొంబాయి కళార్థులకు జీవచిత్రణ తరగతులుకూడ ప్రారంభింపబడినవి.

ఈలోపుగా భారతీయ చిత్రకళా విధానమునందు సంప్రదాయమున కనవసర ప్రాధాన్యము నొసంగుటను, నిర్జీవమైన స్వాభావికతనుగూడ నిరసించు ఒక ప్రధాన తత్త్వము బయలుదేరెను. గగనేంద్రనాథఠాకూరు, రవీంద్రనాథఠాకూరు, జెమినిరాయి, అమృతషెర్‌గిల్ అను పలువురును భారతీయనవీన సంప్రదాయమునకు ప్రవర్తకులు. విశ్వకవి ఠాకూరు సృజనలు పెక్కు అతిసారళ్యముతో తీర్పబడి ఆత్మీయాంశావృతములై అగాథమైన అతీంద్రియ ప్రపంచమునుండి ఉద్ధృతమయిన అంతరార్థముతో నిండియుండును. ఆయన భ్రాతృపుత్రుడైన గగనేంద్రనాథ ఠాకూరు క్యూబిజమ్ (Cubism) అను కళా విధానమున కృషిచేసెను. అతడు వెలుగునకును చిత్రకళకునుగల సంబంధమునుగూర్చి పఠించి డామీర్ (Doumier) పద్ధతి ననుసరించి సాంఘిక వాస్తవికత్వమే తన రచనల సారమని అంగీకరించెను. వంగదేశమునందలి పునరుద్ధారకులు రాజసములైన గత సంప్రదాయములకు విముక్తి కల్పించిరి. సంపన్నము, సుందరము అగు జానపద సంప్రదాయము మరొకటి ఉండెను. జానపద కళాదర్శములలో సారళ్యము, మనోరంజకములైన రంగులు, ప్రత్యక్ష భావోద్రేకము అను గుణములు కానిపించును. జెమినిరాయి ఈ వారసత్వమును గ్రహించి దానికి ఆధునిక వివరణము నొసంగెను. అమృతషెర్‌గిల్ తల్లి హంగెరీ వనిత. తండ్రి భారతీయుడు. ఆమె పారిస్‌లో విద్య అభ్యసించెను. నవీన భారతీయ చిత్రకళా విధానమున ఆమె కళ ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయములకు చక్కని సమన్వయము కల్పించియున్నది.



రాజు - రాణి - ఎ. ఎ. ఆల్మేకర్

బహులక్షణ సమ్మేళనముతోకూడి ఉండుటచే ఆధునిక కళాపరిస్థితికి విలువకట్టుట చాల కష్టము. కాని అది ఒక విధముగా మంచి సూచనయే. నేటి భారతీయ చిత్రకళ పరుల సూచనలను అమోదించుచుండుటయందు విశ్వజనీనమును, స్వాయత్తము చేసికొని వ్యాఖ్యానించుటయందు జాతీయమును అయి కనబడుచున్నది. ఇటీవల చారిత్రక దృక్పథముకూడ పెంపొందింపబడినది. ఆధునిక కళాభిజ్ఞులు గత చారిత్రక యుగములందలి కళాతత్త్వమును లోతుగా పరిశీలింప జాలిఉన్నారు. అల్తమిరాలోని శిలాయుగపు వర్ణములందలి శక్తి సాక్షాత్కారములును, ఈజిప్టు కుడ్య చిత్రములందలి ఉదాత్తమయిన అంగిక చిత్రణమును, అజెటిక్ చిత్రములలోని అప్రకాశయుతత్వమును, ఆదిమ కాప్టిక్ కళయందలి నైశిత్యమును, సుంగ్ ప్రకృతి వర్ణచిత్రములందలి దృష్టి వైశాల్యమును, హిరోషిగె కళలోని రసపరిపూర్ణతయు, టిబెట్టునందలి ధ్వజపట చిత్రములలోని కథానక పద్ధతియు, నీగ్రో కళయందలి సాంకేతికత్వమును — దూర దేశకాలములకు సంబంధించిన ఇవన్నియు ఆధునిక భారతీయ కళపై తమ ప్రభావమును చూపి ఉన్నవి.

కొందరు భారతీయ చిత్రకారులు పరమతములకు సంబంధించిన వస్తువులనుకూడ సమర్థతతో చిత్రింపజాలుటకు ఆధునిక ప్రకృతియందలి విశ్వజనీనతయే కారణము. క్రీస్తు జననము, మాజి (Mogi) యాత్ర, సిలువపై మరణము మున్నగు కథావస్తువులను గ్రహించి భారతీయ చిత్రకారులు వర్ణచిత్రములు రచించియున్నారు. ప్రతి కళయు విశ్వజనీనమయిన అర్థమునకు వైయక్తికమయిన రూపనిరూపణమని చెప్పదగును. మత సంస్థాపకులు మున్నగు మహనీయుల విశ్వజనీనతలోని వింతయేమన వారి సందేశము ఆమోదింపబడిన ప్రదేశములందెల్ల వారు జాతీయులుగా పరిగణింప బడుచుందురు. క్రైస్తవమత సంబంధమయిన కళను భారతీయముగా నొనరించుటలో క్రైస్తవ చిత్రకారులు చాల తోడ్పడిరి.

నేడు భారతీయుల యెదుట ఉన్న ప్రధాన సమస్య పార్థక్యమును పాటించుటయా లేక పరదేశ ప్రభావముల నామోదించుటయా అనునది. జాతి బంధములచే యూరపునకు అంత సన్నిహితముగా కట్టబడియున్న అమెరికాలో గూడ ఇట్టి సమస్య ఉత్పత్తిల్లె ననుట విస్మయకరముగాఉండును. నిశితమయ్యు అసంబద్ధమయిన ఆకస్మిక దేశాభిమానముచే అమెరికను విమర్శకులు కొందరు ఆ ప్రాచీన ఖండము నందలి సంస్కృతిని అలవరుచుకొనుటకయి యూరపునకు అరిగిన ఫ్రాంకో, ట్యూటో అమెరికనులను నిరసింప మొదలిడిరి. కాని బాగుగా ఆలోచించిన పిమ్మట సమకాలిక విమర్శక తత్త్వము 1864 లో కళాపార్థక్యమునకు వ్యతిరేకముగా వ్రాసిన జేమ్సు జాక్సను జార్వెసు అను నాతని వాదముతో ఏకీభవించుచున్నది. శాస్త్రము, నీతి, భౌతికశాస్త్రము అనువానియందు ఎవ్వరును అట్టి పార్థక్యము ఉండునని కలలో కూడ తలంచి ఉండలేదని జార్వెసు సూచించి ఉండెను. "మనము ఇతర నాగరకతా విధానములందువలెనే మన కళయందుకూడ సమన్వయమునకై యత్నింపవలయును. అన్ని ఆధారములనుండియు గ్రహింపబడినట్టియు, స్థిరమయిన మన ఆత్మీయతచే జాతీయమును సధర్మమును చేయబడినట్టియు ఉదాహరణములు, జ్ఞానము, భావములు మున్నగు వానివలన కళాసంపదను పొందుట, అందు సమగ్రత్వమును సంపాదించుటకు సరియైన పద్ధతి."

భారతీయ పునరుజ్జీవనమునకు వెనుకనుండి ప్రాక్స్వాతంత్ర్య కాలభావములను ఇంకను విడువక పరదేశ ప్రభావమును అనుమానించువారు ఈ మాటలనుగూర్చి పర్యాలోచన చేయవలెను. కాని సమూల సంస్కరణము వాంఛించు భారతీయులు ఈ దృక్పథము యొక్క విజ్ఞానము తమ ప్రత్యేక సహకారముగా భావించి దానిని భారతదేశమున ఆచరణలో పెట్టుచో వారుకూడ పొరపడినవారే అగుదురు. ఏలయన పెక్కు శతాబ్దులనుండి భారతీయ సంప్రదాయములకును, ఆసియా సంప్రదాయములకును నడుమ అధికమైన సమ్మేళనము జరుగుచున్నది. భారతీయాదర్శములు సింహళము, చీనా, జపాను, ఇండోచైనా, ఇండొనీషియా మున్నగుచోట్లకు పయనించినవి. మధ్య ఆసియా ప్రభావము మన శిల్పమును చిత్రకళను అధికముగా మార్పు చెందించినది.

అనుకరణము, 'స్వాయత్తీకరణము అను వాని భేదమును గుర్తించినచో మనము సరియైన మార్గమును త్రొక్కినట్లే.

వి. ము.

**ఆధునిక వాస్తువాదములు:-** ఆధునిక వాస్తుశాస్త్రమున పూర్వమును, నేడును కలిగిన రీతులను బరిశీలించుటకు ముందు, వర్తమానోద్యమము ఐరోపాలో నెట్లు వ్యాపించినదో తెలిసికొనుట అవసరము. ఆధునిక వాస్తువు 19 వ శతాబ్దారంభమున ప్రారంభమైనది. సాంఘిక పరిస్థితులు పూర్తిగా పరివర్తనమునంది సామాజిక జీవిత విధానము మారిపోయిన సమయ మిది. ఇట్టి సమయములోను ఐరోపాఖండమున వాస్తువు పరివర్తనరహితముగా నిలిచినది. వాస్తుశాస్త్ర నిపుణులు ప్రాచీనులై, మృతప్రాయములైన పద్ధతుల పునరుజ్జీవింపజేయు ప్రయత్నమున నుండిరి. వాస్తుశాస్త్రమంతయు సామాజికముగ మరణావస్థయం దుండెనని చెప్పనగును. నాటి నిర్మాణముల బరిశీలించినచో శవసంరక్షణమే చైతన్యచిహ్నమని అప్పటి వాస్తుకారులు భావించినట్లు తోచును. మృత రీతులు మాత్రమే నిర్మాణోపయుక్తములైన రీతులని వారు తలపోయుటయే దీనికి కారణము. కాని కొందరు జిజ్ఞాసువులు వాస్తువునందు రూపకల్పనచేయు సమస్యలను గురించి ఆలోచించ మొదలిడిరి. సంఘమే వాస్తురూపము (Architectural form) నకు మూలమనియు, చైతన్యవంతము, ప్రయోజనకరము అగు సృష్టి జీవచైతన్యమునుండియే ప్రభవింపగలదనియు వీరు గుర్తించిరి. ఆధునికోద్యమము ప్రథమ ప్రపంచసంగ్రామానంతరము సంపూర్ణముగా రూపొందినది. వాస్తువున ప్రవేశించుటకు బూర్వమీ యుద్యమము కళలలో చేతిపనులలో పొడసూపి వర్ణచిత్రము, అద్దకము, ఘటనిర్మాణము, కట్టుసామానుల తయారులలో నిమగ్నమై యారితేరినది. విలియం మోరిస్, ఫిలిప్ వెబ్ ఈ యుద్యమమునకు మార్గదర్శకులు. ఫిలిప్ వెబ్ 1851 వ సంవత్సరమున 'అరుణ భవనము' (Red house) ను నిర్మించెను. దీనిలో అలంకారపుజీలుగు లన్నియు పరిహరింపబడి, ముఖ్యాంశములు మాత్రమే గ్రహింపబడెను. అవసరమునకు దగిన వస్తువులు మాత్రమే యుపయోగించుటయందును, సరళములును, యుక్తియుక్తములునగు వివరముల యుపయోగమునందును ఇది ప్రత్యేకతనుగడించినది. ఇదివరలో కీర్తి గడించిన యే రీతులనుండియు వివరముల నీతడిందుపయోగించలేదు. ఈ విధముగా నొక వాసభవనము నిర్మాణ రీతులందు వైలక్షణ్యమునకు మూలమైనది. వాసగృహవాస్తువే నూతన పద్ధతులు ప్రభవించుటకు కారణమైనది. ఇందవలంబింపబడిన సూత్రములు మూలాధారములైనవి. మానవత్వ నిర్మాణమువైపు గొనిపోవు నూతనసమాజ వ్యవస్థయే వీరి లక్ష్యాశయము. ఈ యుద్యమము ఆర్టు నోవి (Art Nowveau) అని ఫ్రాన్సుదేశమునందును జుగండిస్టిల్ (Jugendistil) అని జర్మనీదేశమునందును వ్యవహరింపబడినది. బెల్జియం దేశమున ఈ యుద్యమము హెన్రీవాన్‌డీ వెల్డియనువానితో నారంభింపబడెనని చెప్పవచ్చును. ఇది ప్రారంభమున జర్మనీలోను, క్రమముగా ఐరోపా ఖండమందంతటను వ్యాపించెను.

ప్రజల యభిరుచులలో క్రొత్త పరిణామము, శాస్త్రీయము, సాంకేతికములైన నిర్మాణాభివృద్ధి, నూతన సందర్శన సిద్ధాంతములు, ఆధునికోద్యమము బయలుదేరుటకు ముఖ్య కారణములు. స్థాపత్య (Engineering) రంగమునందు అభివృద్ధి ప్రదర్శకమైన నిర్మాణములు, ఉక్కు, గాజు, దృఢీకృతమైన కాంక్రీటు (R. C. C) మొదలగువాని ఉపయోగ జ్ఞానము, వీటి సాంకేతిక సౌందర్యావకాశములు మృతరీతుల బంధనములనుండి వాస్తువునకు విముక్తి కలిగింప కృషిచేయుచున్న వాస్తుశాస్త్రజ్ఞులకు చక్కని దోహద మొసగినవి. ఈ కాలమున నిర్మింపబడిన సుందరమైన వంతెనలు, స్ఫటిక ప్రాసాదముల (Crystal palaces) వంటి కట్టడములు, నూతన పద్ధతిలో ముఖ్యముగా పేర్కొనదగిన పొలిమేరరాళ్ళు, వాస్తు శాస్త్రజ్ఞులు తమ భావములను ప్రయోజన ధర్మము నాధారముగాగొని నిర్మింప మొదలిడిరి. నిర్మాణ రంగమున నూతన పద్ధతుల నవలంబించుటవలన, రూపపరిణామము ప్రయోజ్య వస్తువులపై నాధారపడజొచ్చెను. ఆధునిక వాస్తువునకు మార్గదర్శకులైనవారిలో అధిక సంఖ్యాకులు స్థాపత్య శాస్త్రజ్ఞులే. ప్రత్యక్షముగనో పరోక్షముగనో ఆధునిక వాస్తుకారులకు గురుప్రాయులు లికార్ బిజీయర్, గ్రోపియస్ మొదలగువారు. వీరిలో వెన్నీసుకు చెందిన యిద్దరు శిల్పులు, ఆటోవాగ్నరు (1841-1918), అడాల్ఫ లూసు (1870-1933) ఫ్రాన్సు దేశమునకు చెందిన అగస్ట్ పెరెటి, జర్మను దేశస్థుడగు పీటర్ బెహారన్సు అనువారు ముఖ్యులు. 1918 సం

తరువాత ఆధునిక వాస్తు శాస్త్ర చరిత్ర, వైతాళికులైన వ్యక్తులను బట్టిగాక, ప్రపంచమంతటను వ్యాపించిన యుద్యమమునుబట్టి నడచినది. దీనికి కారణము వాస్తు శాస్త్రజ్ఞులలో ముఖ్యులైనవారి నిరంతర ప్రయత్నములే. ఫ్రెంచి దేశీయుడును, స్విట్జర్లాండులో జన్మించినవాడును, ఆకృతి రచనావేత్తయు, తత్త్వజ్ఞుడును అగు లి-కార్-బిజీయరు, జర్మనీదేశపు వాస్తు శాస్త్రజ్ఞులైన వాల్టర్ గ్రోపియస్, మైస్ వెండర్ రోహె, ఎరిక్ మెండల్ సోహన్, డచ్ దేశీయుడగు జె. జె. పి ఔడ్ అనువారు ఈ సందర్భమున పేర్కొనదగినవారు. లి - కార్ బిజీయరు ఈ ఉద్యమ నాయకుడుగా ఎన్నబడుచున్నాడు. ఆధునిక వాస్తువు ప్రాథమిక దశయందు చిత్రకళా రంగము నందలి వివిధ మతములచే ప్రభావితమైనది.

ఈ తత్త్వము అన్నియు సందర్శన సిద్ధాంతమును **(Theory of Vision)** గూర్చిన వివిధ వాదములపై ఆధారపడియున్నవి. వీనిలో కొన్నిమాత్రమే వాస్తువునందు ప్రతిబింబించినవి. వీటిని క్యూబిజమ్, నియోప్లాస్టిసిజమ్, ఎక్స్ప్రెషనిజమ్, ప్యూరిజమ్, కన్స్ట్రక్టివిజమ్, ఫ్యూచరిజమ్ అందురు. పయిని పేర్కొనిన వాదములు వాస్తుశాస్త్రము నావరించి చాలకాలము నిలువలేదు. ఇవి ఒక నూతనరీతిలో సంయోగము నొంది ఐరోపాలో నందరిచేత నవలంబింప బడినవి. అమెరికాదేశమున సలివన్ ఫ్రాంక్ లాయిడ్ రైట్ **(Sallivan Frank Lloyd Wright)** అను వారి మార్గదర్శకత్వమున ఆధునిక వాస్తువు భిన్నమార్గ మవలంబించినది. కాని ప్రస్తుతము ముఖ్యమైన వాస్తుపద్ధతి యొక్కటే నిలిచియున్నది. ఈపద్ధతి అమెరికా ఐరోపా పద్ధతుల సమ్మేళన రూపమని చెప్పవచ్చును. మనదేశమునందలి ఆధునిక వాస్తుశాస్త్ర పద్ధతులగూర్చి సంక్షిప్తముగా అంత్యభాగమున చర్చింతము.

**క్యూబిజమ్ :** ఇది వస్తువులను రేఖాగణిత సంబంధము అయిన ఆకారములతో కూర్చి చిత్రించు పద్ధతి. వాస్తు శాస్త్రమును ప్రభావితము గావించిన విభిన్న వాదములలో క్యూబిజమ్ **(Cubism)** ముఖ్యమయినది. ఈ ప్రభావమొక యుద్యమ రూపమున కలిగినది. యథాదర్శనము **(perspective)** కనిపెట్టబడిన తరువాత అది నవజీవన **(Renaissance)** యుగవాస్తువుపై ప్రభావము కలిగించినది. ఆధునిక వాస్తువుపై క్యూబిజమ్ ప్రభావముగూడ నిట్టిదే. యథాదర్శనము కనుగొనుటతో దృక్కు (Vision) త్రైపరిమాణకముగా మారినది. ఒకే దృక్కోణము నుండి స్థలాకాశము (Space) లోతునందును, ఇతరము లయిన రెండుపరిమాణములందును గ్రహింపబడుచున్నది. నిరంతరము పరిభ్రమించు ఒకకేంద్రమునుండి స్థలాకాశము యొక్క భౌతిక భావనను గ్రహించుటను క్యూబిజము వాదులు అలవరచుకొనిరి. వీరికి ఒక దృక్కోణమునుండి చూచుట సరిపోదు. ఒకేవస్తువును వివిధ దృక్కోణముల నుండి ఏకకాలమున పరికించి సాధ్యమైనంత సన్నిహితముగ దాని ప్రత్యేకసారమును తెలిసికొనుటకు వీరు ప్రయత్నింతురు. వస్తువుయొక్క బాహ్యరూప సందర్శనముతోనే తృప్తినందక వీరు వస్తువుయొక్క అంతర రూపమునుకూడ ప్రదర్శింతురు. యథాదర్శనముయొక్క మూడు పరిమాణములకు తోడుగా నాలుగవదిగా నెన్నబడు కాలమునుగూడ వీరు చేర్చిరి. దీనిని సాధించుటకై వస్తువును అంగ ప్రత్యంగములుగా విడగొట్టి దానిని సామూహిక చిత్రముగా ప్రదర్శించుటకు క్యూబిజము చిత్రకారులు యత్నించిరి. ఈ పద్ధతి ఆధునిక వాస్తువున చాల నూతన లక్షణములు బయలుదేరుటకు కారణమైనది. గమనాగమనము లొనర్చుసమతలములు, ఒకదాని నొకటి అడ్డముగా దాటి వివిధకోణములలో చొచ్చుకొనిపోవు ఉపరితలములు, స్థలాకాశమునందు వ్రేలాడు సమతలములు మొదలగు లక్షణము లిట్టివి. దాని ప్రత్యేక పరిమాణములలో చూడబడినదై ఒక సామాన్యమైన గోడయు, ఒక రేఖాగణిత ఆకృతియు, విశిష్టస్థాయి నందుకొని మనకు ప్రత్యేక సాంద్రానందము నీయ జాలియున్నది. ఇట్టివానికి అలంకరణపు జిలుగులు అనావశ్యక భారములే యగుచున్నవి. ఇదివరకు వాస్తు కారులు భవన విషయములో పృథుత్వ దృఢత్వములను గూర్చియే యాలోచించువారు. కాని యాధునిక వాస్తు కారులు ఘనపరిమాణమును, "సమతలములచే నియమితమైన స్థలాకాశమును" దృష్టియం దుంచుకొనుచున్నారు.

1925 సం॥న గ్రోపియస్ చే నిర్మింపబడిన డెస్సౌలోని బావుహౌస్, ప్యారిస్ సమీపమున లి-కార్-బిజీయర్ నిర్మించిన సెవాయ్ భవనము, క్యూబిస్టు వాస్తురీతిని

సూచించు రెండు చక్కని నిదర్శనములు. ఆధునిక వాస్తువునకు గురుప్రాయులైన యీ యిద్దరు శాస్త్రజ్ఞులును యుద్ధానంతర కాలమునక్యూబిజముసిద్ధాంతములను వాస్తువున ప్రవేశపెట్టుటకు ప్రోత్సహించిరి. బావుహాస్ లోని ప్రయోగశాలా భవనపు గోడలు బ్రహ్మాండమైన గాజు పలకలతో నిర్మింపబడినవి. దీనివలన కలిగిన పారదర్శకత బాహ్యాంతరములకున్న భేదమును తొలగించినది. ఒకదానిమీద నొకటిగా పేర్చబడిన అంతస్తులన్నియు ఏకకాలమునందే దృష్టికి అనును. గాజుతో నిర్మింపబడిన మూలలు భవన బాహ్యముయొక్క నిరంతర క్రమమును దృష్టికి విచ్ఛేదన మొనర్చుటకు తోడ్పడుచున్నవి. ఇది యొక పెద్ద ద్రవ్యరాశి యను భావమే కలుగదు. భవనాంతర నిర్మాణము లన్నియు బాహ్యప్రదేశమునుండి కాన్పించును. స్థలాకాశములో ప్రేలాడునట్లు భ్రమకొల్పు వివిధ సమతలములే ఈ భవన నిర్మాణమునందలి మూలాంగములు. సెవాయ్ ప్రాసాదమునందుకూడ అదే పారదర్శకతయు, బాహ్యాభ్యంతరావకాశముల అన్యోన్య సంక్రమణమును చూడనగును. ఇది పారదర్శకతవలన మాత్రమేకాక, భవనముయొక్క బాహ్యప్రదేశమును లోపలిభాగమునందలి ఘనావరణము (Cube) లోనికి గొనివచ్చుటవలన సాధింపబడినది. ఇష్టము వచ్చినట్లు అమర్చుటకు వీలుగానున్న గాజుగోడలు బాహ్యాంతర్భేదమును తొలగించినవి. ఈ కట్టడము అన్ని వైపులను అభిన్నముగానుండుటకూడ దీని క్యూబిస్టు తత్త్వమున కొక నిదర్శనము. ఇది స్తంభములపై ఏకాంతముగ నుండుటచేతను, మొదటి అంతస్తును దాదాపు పూర్తిగా కాళీగా వదలుటచేతను కట్టడపు ఘనపరిమాణదృష్టియే యదృశ్యమగుచున్నది.

**నియోప్లాస్టిసిజమ్ :** ఇది బంకమన్ను, మైనము మొదలగు మృదు పదార్థములతో ఆకృతులను కల్పించు శిల్పములో నూతనరీతి. ఇదియు, ఇకముందు పేర్కొనబడు వాదములలో ఎక్స్‌ప్రెషనిజము అనునదియు తప్ప, తక్కినవన్నియును క్యూబిజమునుండి బయలుదేరినవియే. క్యూబిజమును వాస్తవికముగా మార్చుటయను ఈ వాదమును మోంద్రియం (Mondriam) అను చిత్రకారుడు స్థాపించెను. చిత్రముయొక్క సమతలముమీద దీర్ఘచతురస్రములును, సమచతురస్రములును మృదుగతితోనుండు సంబంధముపైననే చిత్రనిర్మాణమంతయు ఆధారపడి యుండునని ఈతనివాదము. మరియు మూలవర్ణములైన నీలి, ఎరుపు, పచ్చ - రంగుల సమనమ్మేళనము, వానికి నలుపుతోను, తెలుపుయొక్క వివిధ ఛాయలతోను ఉండదగిన సంబంధము అతిప్రాముఖ్యము నొందునని ఈతని భావము. రంగుల సమప్రదేశములు, రేఖాగణిత శాస్త్రానుసారముగా నున్న ఆకృతులు ఒండొంటి సరసను నిల్పుటచే ఆకర్షణ కలుగుచున్నది. మైస్ వాండర్ రోహె అను వాస్తుకారుడే నియోప్లాస్టిక్ వాదియనుటకు అధికార్హత కలిగియున్నాడు. జె. జె. పి. అవుడ్ కూడ ఈ సిద్ధాంతము నుపాసించినవాడే. దీనిప్రభావము బాన్ హౌసే పైగూడ నున్నది. గ్రోపియస్, మైస్ అనువారు శిక్షకులుగానున్న హార్వర్డు శిక్షాస్థానముపైగూడ దీని ప్రభావము లేకపోలేదు.

**ఎక్స్‌ప్రెషనిజము (Expressionism) :** యుద్ధానంతర కాలమున ప్రారంభమైన ఇంప్రెషనిజము (Impressionism) అనుదానికి ఇది ప్రతికూలముగా చిత్రకళారంగమున బయలుదేరినది. చిత్రకళయందు వ్యంగ్యరీతికి ప్రాధాన్యమిచ్చి వాస్తవికతను అంగముగాచేయుపద్ధతిని ఎక్స్‌ప్రెషనిజము అందురు. చిత్రమునందు వివరముల యొక్క సమగ్రాకృతిపై భావనను నిలుపుటఇంప్రెషనిజము అనబడును. వాస్తువునందు ఈ సిద్ధాంతము సమకాలికమైన పిడివాదములకు ప్రతివాదముగా నావిర్భవించినది. ఎక్స్‌ప్రెషనిజము అను వాదమును సమర్థించిన నిర్మాత, ప్రయోజనవాదమును తిరస్కరించి, భవనాంగములను సాంకేతిక చిహ్నముల ద్వారమున ప్రకటించుటకు యత్నించును. నేత్రవైద్యమున కుపయోగపడు పరికరముల తయారు కర్మాగారము కన్నులవంటి రెండు మహోన్నత ద్వారములచే సూచింపబడినది. ప్రథమ ప్రపంచ సంగ్రామమునుండి 1924 వరకు ఎరిక్ మెండెహసన్ (Eric Mendhe Son) అనునాతడు గొప్ప వ్యంగ్యరీతి ప్రవర్తగా భావింపబడెను. అతని చిత్రములు, పొన్‌స్టయిన్ గోపురము, ఈ వాదమునకు చక్కని నిదర్శనములు. జర్మను వాస్తుకారులందరు అల్పముగనో అధికముగనో ఈ యుద్యమముచే ప్రభావితులైనవారే.

**Purism** - నిష్కళంకతావాదము ( విశుద్ధతావాదము ): ఇది క్యూబిజమునకు మిక్కిలి సన్నిహితమైనది. దీనిని లి - కార్ బిజీయరును, ఓజెన్‌ఫాంటు అను చిత్రకారుడును ప్రవేశపెట్టిరి. రేఖాగణితపు రూపములును, సహజ రూపములును గూడ సౌందర్య స్థానములేయనియు సమకోణ చతురస్రము, గ్రుడ్డు, వక్రరేఖ మొదలగు ఆకృతులన్నియు సుందరములేయనియు ఈ వాదసారము. వాస్తువున ఈ వాదమును ప్రవేశపెట్టినవాడు లి-కార్ - బిజీయర్ అనునాతడు.

**Constructivism** - నిర్మాణత్వవాదము : భిన్న భిన్న కాలములందీ వాదమునకు భిన్న భిన్నార్థములు కల్పింపబడినవి. కాసిమిర్ మాలెవిచ్ (Kasimir Malewitch) అను రష్యా చిత్రకారుడు 1913 ప్రాంతమున దీనిని ప్రారంభించెను. ఈతడు సహజ వస్తువులన్నిటిని త్రోసిపుచ్చి, వంగ్యాత్మకములును, భావములను దెలియజేయునవియు నగు కొన్ని చిహ్నములను గ్రహించెను. ఇతడు విభిన్న వస్తువులకును, వాటి అన్యోన్య సంక్రమిత దశలకును గల సంబంధమును గుర్తించుటకు యత్నించెను. యుద్ధానంతరము రష్యాలో ప్రచారమైన వాస్తు - ఉద్యమమంతయు నిర్మాణత్వ వాదముపేర బరగుచున్నది. ఈ నిర్మాణములన్నియు భవనముయొక్క అంతరార్థమును కాల్పనిక స్థాపత్యరీతులలో ధ్వనింపచేయుటకు పూనుకొనును. ఈ ఉద్యమము ఐరోపాఖండమున అంతగా ఆమోదమును బడయలేదు. బ్రిటిషు చిత్రకారుడు గేబో దీనిని గ్రహించినను వాస్తువున నిది ప్రత్యేక కృతులను ప్రసాదించలేదు.

**Futurism** - భవిష్యతావాదము: ఇటలీ దేశీయుడైన ఆంటోనియో సాంత్ యూలియా అనునతడు (Antonio Sant Elia) 1914 సం॥ లో చేసిన ప్రకటన పత్రిక (Manifesto) తో భవిష్యతావాద మారంభమైనది. కాని త్వరలోనే ఇది ఆచరణము నుండి యంతరించినది. బోక్సియోనియొక్క శిల్పఖండములు ఈ తత్త్వమునకు నిదర్శనములని చెప్పవచ్చును. వాస్తువునందు ఈతత్త్వము ప్రయోజనతా వాదమును స్థిరపరచినది. ఇదిగాక నమ్యత్వము (Elasticity), శేలికదనము, గమనశీలము (Mobility), నిరంతర పరివర్తనము అను గుణములను గూడ ఈవాదము సమర్థించినది. సాంత్ ఈలియా యొక్క చోద్యమైన ఊహాలేకాని ఆతడు తన ఊహాలకు ఎట్టి రూపమునునొసగజాలడయ్యెను. ఈ ఉద్యమము భవన బాహ్య స్వరూపముతో సంబంధించినది మాత్రముగావేఉండెను. బాహ్య ప్రదేశమునుండి పైకిని, క్రిందకును కదలుచుండు లిఫ్టులును విభిన్న తలములలో మోటార్లు పయనించుటకు వీలగు విశాలమైన వీథులును-భూగర్భమున ప్రయాణముచేయు రైలుబండ్లును ఈ వాదము వారి ప్రధాన విషయములు.

ఆధునిక వాస్తువునకు, ప్రయోజనాత్మకము, వాస్తవికము, అంతర్జాతీయము, అను విశేషణము లుపయోగింపబడుచున్నవి. అంతర్జాతీయమని అమెరికాలో ప్రచారమధికము. ప్రయోజనాత్మకము, వాస్తవికము అను విశేషణముల ముఖ్యసూత్రములివి. నగరములకు భవనములకు ఏర్పరచిన ఆకృతులకును వాటి నిత్యోపయోగ సూత్రములకును, టెక్నికల్ అవకాశములకును వాస్తుశాస్త్రము విరుద్ధముగా ఉండరాదని వీరియుద్దేశము. ఆకృతి రచనలు మానవుల నిత్యప్రయోజనములకు సంబద్ధములై యుండవలెను. జనుల రాకపోకల అవసరములనుగూడ దృష్టిలో నుంచుకొనవలెను. ఒక దృష్టితో పరికించిన ఆధునిక వాస్తువు ప్రయోజనాత్మకమైనమాట నిజమేకాని, ప్రయోజనాత్మకతయే వాస్తువునకు మూలసూత్రము కారాదు. ఆధునికవాస్తువు అంతర్జాతీయమని చెప్ప వీలులేదు. ఇది దీని ప్రాథమికావస్థలో అంతర్జాతీయముగా నుండెను. దీనికి కారణములు ; అభిరుచుల పునరుద్ధరణము సాంకేతికముగా క్రొత్తరీతుల కనుగొనుట, మార్పులు, సామాజిక సమస్యలపై నాసక్తి, నిర్మాణ ద్రవ్యములు- ఇవన్నియు అంతర్జాతీయములు. ఇవి యాధునిక వాస్తువునకు అంతర్జాతీయత్వమును సమకూర్చినవి. నిపుణమైన వాస్తువు ఒకేకాలమునందు వివిధ ధర్మములను కలిగియుండునని ఇప్పుడు విజ్ఞులందరును అంగీకరించుచున్నారు. అది అంతర్జాతీయము, జాతీయము, ప్రాంతీయము, వైయక్తికముకూడ ఏకకాలమునందు కావచ్చును.

1928-38 వరకుగల దశాబ్దమున ఐరోపాలో ఆధునిక వాస్తువును ప్రోత్సహించిన కేంద్రములు రెండుగలవు.

అవి లి-కార్-బిజీయరుయొక్క కార్యాలయము, గ్రోపియస్‌చే నిర్వహింపబడిన బావుహౌవుస్ విద్యాలయము అనునవి. ఆధునిక నిర్మాణములందు. చక్కని కల్పనల కీదశాబ్ద మెన్నికగన్నది. ఈ దశాబ్దపు చివర నీయుద్యమము సన్నగిల్లెను. ప్రథమమున జర్మనీలోను, క్రమముగా రష్యా, ఫ్రాన్సు దేశములందును, 1938 లో ఇటలీయందును దీనికి పట్టుతప్పినది. జర్మనీ, ఇటలీ, రష్యా దేశములం దిది క్షీణించుట కాయాదేశముల రాజకీయ పరిస్థితులే కారణము. కాని ఫ్రాన్సులో దీని పతనమునకు హేతువులు భిన్నములు. ఇచట ఆధునిక వాస్తువునకు మూలమని యెంచబడిన ప్రయోజనాత్మక వాదము అసమర్థమని నిరూపింపబడినది, వాస్తవికవాదమును, ఉపయోగతా వాదమును (utilitarianism) ఉపాసించువారు ఆభాసభావనలచే కొన్ని పనులు చేయుచుండిరి. ఈ సిద్ధాంతములు, క్షీణించిన రీతుల మట్టుపెట్టుట కుపయోగకారులుగనే యున్నను, సంప్రదాయ వాదముపై విజయము సాధింపబడిన తరువాతను, వాస్తుశాస్త్రజ్ఞులు వాస్తు నిజతత్త్వమును గ్రహించిన పిమ్మటను, ఆధునిక వాస్తుశాస్త్ర వ్యాప్తిని సమర్థించుట కీ వాదములు సమర్థములు గాకుండెను. ప్రయోజనాత్మక వాదమునకు మూలభూతుడైన లీకార్బుజియర్ కూడ కళనుగూర్చి ఐంద్రజాలిక సిద్ధాంతములను ప్రతిపాదించుచు, అకలంక రూపసౌందర్యమునుగూర్చి గేయప్రశంసలు చేయుట చూచి భావుకులు కళవళపడ జొచ్చిరి. (లీకార్బుజియరు విశుద్ధతా వాదమును సమర్థించినవాడు) వాస్తుశాస్త్రజ్ఞులు ఆధునిక వాస్తువునకు మూలములని చెప్పుచున్న వివిధ దార్శనిక సిద్ధాంతములను ప్రయోజనాత్మక వాదముతో సమన్వయింప మొదలిడిరి. అందుచేతనే 1930 నుండి లికార్ బిజీయరును J. J. P. ఔడును యూరపులో తమ నిర్మాణకృషి నాపివేసిరి. గ్రోపియస్, మైస్, మెండెల్ సోహారు, జర్మనీ వదలి అమెరికా దేశమునకు వలసపోవలసి వచ్చెను. ఫిన్‌లాండు వాడగు సారినెను, స్వీడను దేశస్థుడగు రోశెన్ బర్గుకూడ అమెరికాలో ప్రవాసమేర్పరచుకొనిరి. ఆధునిక వాస్తువు స్విట్జర్లాండులోను, స్కాండినేవియన్ దేశములందును చక్కగా అభివృద్ధి నందినది. ఇది కొంతకాలము ఇటలీలోను, జెకోస్లొవేకియాలోను అభ్యుదయము గాంచినది. ఇంగ్లాండునందుదక్క తక్కిన దేశములందు అంతటను ఆధునిక వాస్తువు క్షీణదశ నెదుర్కొనవలసి వచ్చినది. ఇంగ్లాండునందు ఆధునిక వాస్తువు సిద్ధాంతాత్మకముగాగాక, ప్రయోగ దశాత్మకముగా మాత్రమే గ్రహింపబడుటచే కొంతకాలము నిలుచుటకు సాధ్యమైనది.

ఆధునిక వాస్తుశాస్త్రజ్ఞులలో రెండవ తరమువారి నిర్మాణములలో చక్కని యభివృద్ధి గానవచ్చుచున్నది, ఈ తరమునకు చెందినవారు ప్రయోజనతా వాదపు వాతావరణమున జన్మించిరి. దానిని పునాదిగా స్వీకరించి వీరు పురోగమనము సాధించిరి. విశుద్ధరూపమునకును, సాంకేతిక ప్రక్రియకును సమన్వయము కుదుర్చుట వీరికి ముఖ్య సమస్యయైనది. వీరు వాస్తువును సిద్ధాంతముల బారినుండి తప్పించి, దానికి మానవత్వము నాపాదించుటకు ప్రయత్నించిరి. యువక వాస్తుకారుల యుత్తమ నిర్మాణములం దీ యభిప్రాయము చక్కగా వ్యక్తమగుచున్నది. సామాన్య మానవుని జీవితమునకును, అతని నిత్య సమస్యలకును వాస్తువును సన్నిహిత పరచుటకు వీరు ప్రయత్నించిరి. మానవ సంక్షేమమును, మనస్తత్త్వ పరిశీలనమును వీరు దృష్టిలో నిడుకొనిరి. వీరి నిర్మాణములు ప్రయోజనతాభిప్రాయములను విపులీకరించినవి. వీరి కట్టడములందు నూతనత్వము, ఉల్లాసము, క్రీడారతియు కనిపించును. వైవిధ్యములేని చదునైన ఇంటి కప్పులకు, నగ్నకుడ్యముల కిరీతి భిన్నమైనది. సాంకేతిక దృష్టిననుసరించియు, ముఖ్యముగా నిర్మాణమునకుసంబంధించిన ఆర్థిక సమస్యలను బట్టియు వాస్తువు సామాన్య ప్రయోజనాత్మకమైనది. కాని కేవల మిదియే పరిపూర్ణ వాస్తువు కాజాలదు. వాస్తువు సామాన్యముగా మానవ కృషిక్షేత్రము నంతయు నాక్రమించును. అందుచే ఆధునిక వాస్తుకారుడు హేతువాద సూత్రములను, సాంకేతిక రంగమునుండి మానవతారంగమునకును, మానసిక రంగములకును, వ్యాపింపజేయుటకు ప్రయత్నించును. ప్రథమ దశయందలి సాంకేతిక తత్త్వ దృగ్విషయక నూతనకల్పనలను ఇపుడిది తనలో లీనము గావించుకొన్నది. సిద్ధాంతవాదములతో తృప్తిపడక నిర్మాణాత్మక చైతన్యమును చూపుచున్నది. సరిగా ఇటువంటి పరి

ణామమే భిన్నరీతులలో అమెరికాలో జరిగినది. ఐరోపా వాస్తువుయొక్క ప్రభావము గ్రోపియస్, బ్రీవర్, లెస్కేజ్, నూటరా అనువారి ద్వారమున అమెరికా యొక్క నిర్మాణ చైతన్య సంప్రదాయముపై పడినది. అమెరికాలోని చైతన్య వాస్తు ప్రభావముగూడ ఐరోపా వాస్తువుపై అధికముగనే ప్రసరించినది.

ప్రఖ్యాత అమెరికన్ వాస్తుకారుడగు ఫ్రాంక్‌లాయడ్ రైట్ (Frank Lloyed Wright) అను నాతనిచే చైతన్య వాస్తువు (Organic Architecture) అను పదము వయోగింప బడినది. పెక్కుమంది చారిత్రకులు, విమర్శకులు ఈ పదమును నిర్వచించుటకు ప్రయత్నించిరికాని దీనిని పరిపూర్ణముగా నిర్వచించిన వారెవరును లేరు. పర్యావసన్నమైన వాస్తువు అనిర్వచనీయముగా నుండుటే సహజమేమో! చైతన్య వాస్తువును అనుష్ఠించు వాస్తుకారుల కళను, వారి దృష్టిని, పరిశీలించుట ఎక్కువ ఉపయోగకరముగ నుండగలదు. జీవవాస్తువు వాస్తు సౌందర్య తత్త్వమునగాక దీని నారాధించువారి మనస్తత్త్వమునందును, వారి సామాజిక జ్ఞానమునందును, వారి మానసిక ప్రవృత్తులందును, చక్కని స్థానమేర్పరచుకొన్నది. అమెరికా, ఐరోపా వాస్తుకారులు వాస్తువునెడ కలిగియుండు మౌలికదృష్టినిబట్టి చైతన్యవాస్తువననేమో నిరూపింపవచ్చును. ఐరోపాదేశస్థుడైన ఒకరైతు తనఇంటిని నిర్మింపవలసి వచ్చినపుడు అతడు దానిని ఘనరూపముగనో, లేక మరొక రేఖాగణిత స్వరూపముగనో భావించును. ఈతడు తన యవసరముకన్న పెద్దగా గృహమును నిర్మించును. కొన్ని గదులను తన సంతానము పెరిగి నప్పుడు భవిష్యత్తులో వాడుకొనుటకై మూసియుంచును. తన ఇంటి పెరుగుదల ఒక నిర్ణీత క్రమమున ఒక రేఖాగణిత స్వరూపమును కలిగియుండవలెనని ఈతని యభిప్రాయము. ఇక నొక అమెరికా కార్మికుడు దీనికి భిన్నముగా వ్యవహరించును. ప్రథమమున నాతడొక గదిని మాత్రమే నిర్మించి తన యవసరమునుబట్టి కాలము గడచినకొలది దానిని విపులీకరించుచు ఒక గదికి మరొక గదిని చేర్చుచు, పోవును. ముందు పేర్కొనినది సిద్ధాంతితము లేక నిర్జీవవాస్తువు. రెండవది పరిణామ శీలము, సహజ వికాసవంతము, చైతన్య సహితము (Organic) అని చెప్పదగును. బాహ్య స్వరూపములన్నియు అంతరవసులైన ప్రదేశముల కనుగుణముగ ప్రభవించినవియే.

పెక్కుమంది విమర్శకులు ప్రకృతికిని, ఫ్రాంక్‌లాయడ్ రైట్ రచనలకును పోలికలను అన్వేషింతురు. ప్రకృతిపై దృష్టినుంచుట మంచిదేకాని ప్రకృతిని (Art Nonvean) నవకళారీత్యలంకరణము అనుకరించునట్లు- ఇందు అనుకరణముతగదు. ఇటులే భవనములకును, మనుష్యులకును పోలికలు చూపుదురు. కాని యివి రూపక ప్రాయములు మాత్రమే; భవనములు భావస్ఫోరకములును, మానసిక స్థితులను, మనోగతిని సూచించునవియు కావలెనను సిద్ధాంతము క్షీణవాదమునే ప్రదర్శించును. చైతన్య వాస్తువునం దిట్టి ఆత్మేతర విషయ విచారణలేదు. దీనికొక గతి శీలము, చలనభావము కలవు. ఇవి సాధింపబడినవి కూడ. కాని ఈగతిశీలము దుర్బలానుభూతి సూచకమగు రేఖామాత్ర చిత్రాలంకరణరీతులచే సాధితముకాదు. ఈ భవనములందు నివసించి, వానినుపయోగించు మనుష్యుని వాస్తవికావసరములను మూలముగా జేసికొన్న ఏర్పాటులచే ఇది సాధ్యమైనది. "గదికిగాని, ఇంటికిగాని, నగరమునకుగాని మానవుని సంతోషమును దృష్టియిందుంచుకొని ప్రత్యేకపుటేర్పాట్లు గావించిననే యది జీవవాస్తువగును. ఈ సంతోషము మానవుని భౌతిక, మనస్తత్త్వ, ఆధ్యాత్మిక సంబంధములలో నేదైన కలిగినది కావచ్చును. అందుచే నిది ఆలంకారిక కల్పనపైగాక సామాజిక అవసరములపై నాధారపడినది. మానవ కరుణాశీలమగుటకు బూర్వము, నిర్మాణము మానవ స్వభావమును కలిగియున్నపుడే దానిని మనము జీవ వాస్తు వనగలుగుదుము." భవనముయొక్క అంతర సన్నివేశము మిక్కిలి ముఖ్యమైనది. ఇది వెచ్చదనము కలిగి సొగసయి, గంభీరతగలదియై యుండవలెను. అవసరమునుబట్టి మారుటకు వీలుకలదై, విశ్రాంతికి తావలమై ఉచితాలంకృతమై యుండదగును, వీలున్నయెడల ఉల్లాసప్రదమై, వలసినట్లు దిద్దుకొనుట కత్యంత మువయుక్తమై యుండునట్లు ఉండదగును.

ఫ్రాంకు లాయడ్‌రైట్‌వకు బూర్వము లూయీ సల్లివాన్ (1856-1954) అను వాతడు వాస్తువునకు అకృత్రిమ మైనదియు, సులభగ్రాహ్య మైనదియు,

ప్రయోజనాత్మకమైనదియు అగు మార్గ మేర్పరచెను. "రూపము ప్రయోజ్యత ననుసరించును" అనున దీతని సూత్రము. ఒక కట్టడమునందు ఉపయోగించు బుద్ధి కుశలత, భావదీప్తి, భౌతిక, ఆధ్యాత్మిక క్రియాకలాపము— వీటిసముచ్చయమే 'ప్రయోజకత' అని ఆతని మతము. ఈ ఆదర్శమును ఫ్రాంక్ లాయడ్ రైట్ మరింత యభివృద్ధిపరచెను. మనమొక రూపమును కల్పించునపుడు అతిముఖ్య జీవిత సూత్రమైన పరివర్తన సూత్రమును విస్మరించరాదని యీతడు హెచ్చరించెను. ఒక నమూనా లేక ఒరవడి యేర్పరచునప్పు డది స్వతంత్రముగాను, ప్రవృద్ధినొందుట కనుకూలించునదిగాను - జీవితవికాసమును ప్రోత్సహించి దోహద మొసంగునదిగాను ఉండవలెను. ఈతని తరువాతి పెక్కురు యువక వాస్తుకారు లీతని కృతులనుండి అనేక ముఖ్య సూత్రములను గ్రహించి జీర్ణించుకొనిరి. తమకు నచ్చని విషయములకు బదులుగా కొన్నిటిని క్రొత్తగా కల్పించుకొనిరి.

కిటికీలు వరుసలలో నుపయోగించు పద్ధతిని మొట్టమొదట ప్రవేశపెట్టినవాడు ఫ్రాంక్ లాయడ్ రైటు. కాని సామాన్యముగా నీతడధిక కాంతిని కాంక్షించువాడుకాడు. తరువాత వచ్చిన యువక వాస్తుకారులు వాతాయనములను అంతకెక్కువగా వాడిరి. ఆతడు తరచు అలంకరణముల నుపయోగించువాడు. యువక వాస్తుకారులు దీనిని సంపూర్ణముగ పరిత్యజించిరి. నునుపు తీర్చని రాతిగోడలను, సంస్కార హీనమై యథేచ్ఛముగా పెరిగిన ఆటవిక ప్రకృతిని ఆత డభిమానించెను. ఇవి పందొమ్మిదవ శతాబ్దపు కాల్పనికోద్యమము యొక్క అవశిష్ట చిహ్నములు. ఐరోపా వాసులకు ప్రకృతిపై గల చిన్నచూపు నాత డాక్షేపించెను. సంస్కార రహితమైన యీ ఆటవిక ప్రకృతికి మారుగా తరువాతి యువక వాస్తుకారులు ఉద్యానవనకళాప్రీతిని ప్రవేశపెట్టిరి. ఇంటిని విలువ నీడగా సంభావించు అభిప్రాయమును సూచించుటకు కాబోలు ఆతడు భవనముల కప్పులు చూరులు సుదూరము చొచ్చుకొని వచ్చునట్లు నిర్మించెను. తరువాతి వాస్తుకారులు ఇట్టి ఫలితమునే సాధించినను పైపద్ధతి వల్లగాక వేరు విధములైన యుపాయముల నవలంబించిరి. రైట్ ఎప్పుడును ఆసనములు మొదలగు గృహోపకరణములను గూర్చి ఆలోచించినవాడుకాడు. ఆతడు నిర్మించిన భవనములలో వీనికి ప్రసక్తి అత్యల్పము. యువక వాస్తుకారులు ప్రయోజనాత్మక గృహోపకరణములపై అధికశ్రద్ధను ప్రకటించిరి. అత డొక్కొక్కప్పుడు అలంకరణ ప్రాయమైన యొకే యొక కృతిని సాధించుటకు పట్టుబట్టి, ఇతర విషయములను దానికి గౌణముగా చేసి,. సౌకర్యమువంటి యత్యవసర విషయమును గూడ విస్మరించువాడు. కాలిఫోర్నియా లోని పాల్ హాన్ అను నాతని 'తేనెపట్టు భవనమున' 60°, 120° కోణముల నిర్మాణము, నక్షాలోను (plan) ఆసనోపకరణములలోను కూడ ఒత్తి చూపబడినది. యువక వాస్తుకారులు ఇంత దూరము పోకుండగనే, భవనాకృతి రచనలో పొందికను సాధించిరి. వీరు సాంప్రదాయిక విభాగమును తిరస్కరించి యత్యవసరాంశములను మాత్రము స్వీకరించిరి. గృహాంతర్భాగము విశాలముగా నుండు ఆవశ్యకత, నక్షా గీయుటలో స్వాతంత్ర్యము, భవనము ఉద్యానములోనికి చొచ్చియుండుట, ప్రకృతిపై నాధారపడుట, వెచ్చదనము గలిగి, సహజములు, స్థానికముగా లభ్యములు అగు పరికరములనే విస్తారముగా వాడుట-ఇవి వా రాదరించిన యంశములు. వీరు పూర్వసిద్ధములైన పద్ధతులతో తృప్తిపడక, ప్రయోగాత్మక పరిశోధనచే సమస్యలకు క్రొత్త సమాధానములు కనుగొనుట అన్నిటికన్న ముఖ్యమైన విశేషము. ఇది యంతయు అమెరికాలో నివాస మేర్పరచుకొన్న ఐరోపా వాస్తుకారుల ప్రభావమే. వాస్తు శాస్త్రజ్ఞుల యొక్కయు, విమర్శకుల యొక్కయు విభిన్నాభిప్రాయములు సమకాలిక వాస్తువునందలి ప్రస్తుతాభిప్రాయమును తెలియజేయును. ఇది యొకవిధముగా అమెరికా చైతన్య వాస్తువును ఐరోపావాస్తు ఆదర్శములతో సమన్వయ పరచుటే యగును.

"మానవునకును. ప్రకృతికిని లేక ఆతని పరిసరములకును గల సంబంధమును గూర్చిన భావమే భేదకారణము. లూయీసల్లివాన్, ఫ్రాంక్ లాయ్డ్‌రైట్ అనువారి సంప్రదాయములలో ఉపకరణ ద్రవ్యములు వాని స్వాభావిక గుణముల ననుసరించి గౌరవింపబడుచున్నవి. ఇక ఐరోపాలో నన్ననో ద్రవ్యముల అభావమే కనబడు

చున్నది. అమెరికా వాస్తువునందు మానవావసరముల కొరకును, నిర్మాణాత్మకములు ద్రవ్య సంబంధములు అగు భావముల ప్రకటన కొరకును ఆకృతి యుద్దేశింపబడి పెంపొందుచున్నది. ఐరోపా వాస్తువునందది అచంచల విశుద్ధత్వము కలిగినదై, ఆకృతికొరకే ఆకృతి యన్నట్లు నిల్చుచున్నది. మానవ ప్రయోజనములు దీనిలో అలంకార ప్రాయముగా (plan libre) మాత్రమే భాసించినవి. ముఖ్యముగా ఐరోపాలో ఆధునిక వాస్తువు మానవత్వము యొక్క సారమని నా యభిప్రాయము. ఇక నిచట ప్రకృతి తత్త్వము, చైతన్యవాస్తువు ప్రబలుచున్నవి" అని డబ్ల్యు. ఎఫ్. డెక్ నేటల్ వ్రాసెను. హెచ్. హెచ్. హారిస్ అను నాతడిట్లు నుడివెను. "ఈ క్రింది లక్షణములను నా నిర్మాణములయందు గుర్తించవచ్చును. భవనము ప్రధానముగ నీడపట్టు (శీతాతపములనుండి రక్షణము నిచ్చునది). నేల, గోడ, కప్పులయొక్క సమతలములందు అది ద్యోతకము కావలెను. అది మానవ పరిమాణములో నుండును. భవనము, దానియందు నివసించువారికి సుఖావహమై గౌరవదాయకముగా నుండవలెను. నివసించువాడు స్వేచ్ఛను సుఖమును పొందునపుడు మాత్రమే వాస గృహము జయప్రదమైన నిర్మాణముగా భావింపదగును. అది జీవితావసరములకు వెనుక హంగుగా ఉండవలెను. నివాసమునకు సమీపమున సుందరమైన యుద్యానవన మున్నపుడే నివసించువానికి తృప్తియు కట్టడమునకు ఉపయోగమును కలుగును. గృహాంతర్భాగము ఉద్యానములోనికి చొచ్చుకొనియుండదగును. భవనము, అందలి ఆసన పరికరములు, గృహోద్యానము - ఇవన్నియు భావ సమైక్యమును కలిగి యుండవలెను. ఈనిర్మాణము అరలపై నాధారపడి యున్నది. ఒకయరకు మరొకదానిని అసంఖ్యాకముగ చేర్చుచు పోవచ్చును. ఇది పరివర్తనమునకు మిక్కిలి వీలగు కూర్పు. దీనికి చేర్పు కూర్పులసంఖ్యాకములు. దీనికి శాఖలు ఇష్టమునుబట్టియు అవసరమును బట్టియు ఏర్పడవచ్చును. ఎస్. వాలెట్ అనునాతడిట్లనెను : "ఐరోపాలో నాధునిక భవనములు చాలవరకు ధనవంతులకొరకు నిర్మింపబడినవి. ఇక అమెరికాలో నాధునిక భవనములం దధికభాగము మధ్యతరగతివారి కొరకు కట్టబడినవి. అందుచే అమెరికాలోని యిండ్లు అధికసంఖ్యాకుల జీవితమునకు సంబంధించినవియై జాతీయతకు చిహ్నములుగా నున్నవి."

అమెరికా యాంత్రికదేశమైనప్పటికిని, ఆధునిక మానవునకు లూ యీ మంఫర్డు ఉద్దేశించిన లక్ష్యమును సాధించుటలో నది సఫలమైనది. "యంత్రముల నధిగమించుటలో మన సామర్థ్యము యంత్రములను స్వాధీనము చేసికొని స్వోపయోగమునకు భుక్త పరచుకొనుటపై నాధారపడి యుండును. యంత్రజగత్తుయొక్క లక్షణములైన బహిర్ముఖత్వము, వ్యక్తిరాహిత్యము, తాటస్థ్యము - అను ధర్మములను మనలో జీర్ణించుకొను వరకును, మనము జీవచైతన్యము వంకకు పురోగమింపలేము. అప్పుడే సర్వసంపూర్ణ మానవత్వము సాధ్యమగుచున్నది" అని మంఫర్డు భావించెను.

ఇక మనదేశమందలి పరిస్థితులు పూర్తిగా భిన్నమైనవి. ఇచట వాస్తుశాస్త్ర చింతన క్రమపరిణామము నందలేదు. పరదేశీయ ప్రభుత్వకాలమం దభివృద్ధికి ఆటంకములు పెక్కు కలిగినవి. కాని యిపుడిపుడే జాగృతి కలుగుచున్నది. యువకవాస్తుకారులు ఆధునిక వాస్తువుయొక్క నిజతత్త్వము నాకళించుకొనుటకు ప్రయత్నించుచున్నారు. సమకాలిక వాస్తుకారులలోను, పట్టణ నిర్మాతలలోను అగ్రేసరుడుగ భావింపబడుచున్న. లి-కార్బిజీయర్ అను వాస్తుశాస్త్రజ్ఞుని దర్శకత్వమున పంజాబు రాజధానియగు చండీగఢ్‌లో ఆధునిక వాస్తురంగమునను నగర నిర్మాణమునను గొప్ప ప్రయోగమని చెప్పబడుచున్న నిర్మాణము సాగుచున్నది. ఇది వాస్తువునందు మనకుగల మహత్తరమైన వారసత్వముగ గర్వింపదగినదిగా నున్నది. ఈకాలపు మన భవనములలో భారత ప్రాచీన వాస్తువునందలి అలంకరణ చిత్రములను, ఆభరణములను అవలంబించుట విధాయకమని కొందరు నమ్మకముగా చెప్పుచున్నారు. కాని ఈ పద్ధతిని నుదూరము కొనిపోవుటకు వీలులేదు. ఎందుకనగా, వాస్తువుయొక్క సమస్య ముఖ్యముగా భవనముల అంతరస్థలమునకు సంబంధించినది. బాహ్యస్థల ప్రాముఖ్యము దీనితరువాతిది. ఆధునికవాస్తువు, ద్రవ్య పృథుత్వమును బట్టిగాక ఘనపరిమాణమును బట్టి గణ్యత నొందుచున్నది. ఘనపరిమాణమనగా, సమతలములచే ఆవరణ చేయబడిన అవ

కాళమని నిర్వచింపబడుచున్నది. కేవల రీత్యభిమానమును దాటి చూచినచో, ఆవరణ కల్పించు తలములకు తక్కువ ప్రాముఖ్యమును, ఆవృతస్థలము (అనగా గృహాంతర్భాగము) నకు ఎక్కువ ప్రాధాన్యమును ఈయవలెను. మానవుడు తన జీవితమును గడుపు అంతర్భాగమునకే ప్రాముఖ్య మీయవలెను. మన మెట్లు పరిశీలించినను అభిప్రాయ మొక్కటియే. లక్ష్యమును ఒక్కటియే. 'చైతన్యవంతము' అను పదమును ప్రముఖ వాస్తుకారుడు ఉపయోగించినాడని మనముపయోగించుటలేదు. ఈ లక్షణము విశ్వజనీనము. సమస్తదేశములు ఆధునిక నిర్మాణమున నొకే గమ్యస్థానమునకు పురోగమించుచున్నవి.

డి. డి. వి.

**ఆధునిక సంగీతము :-** ఆధునిక కాలమున గాన విద్య ముఖ్యముగా ఏడువిధములుగా ప్రదర్శింపబడుచున్నది. అవెవ్వియన 1. గానసభ, 2. రేడియో, 3. ఉత్సవములు, 4. టాకీలు, 5. నాటకములు, 6. హరికథలు, 7. భజనలు. ప్రజల వేషభాషలు, భావములు, ప్రవర్తనము మున్నగువాటియందు గలుగు ప్రబలమైన మార్పులననుసరించి సంగీతము, సాహిత్యము చిత్రరచన మున్నగు లలిత కళలతోగూడ గొప్ప మార్పులు కలిగిన వనుటకును, కలుగగలవనుటకును సందియము ఉండజాలదు.

సంగీతము మార్గమనియు దేశ్యమనియు రెండు విధములు. మార్గ సంగీతము సిద్ధాంతమునకు లోనై స్థిరమై మార్పునొందదు. దేశ్యసంగీతమనగా జనుల అభిరుచి ననుసరించి వాడుకలో నుండునట్టి సంగీతము. ప్రతాపరుద్రుని కాలములో పాడబడిన భైరవీ రాగమునకును, కృష్ణదేవరాయల కాలములోని భైరవికిని, ఇప్పుడు వాడుకలోనున్న భైరవికిని భేదముండును. భైరవీ రాగమునకుగల లక్షణములు అనగా స్వరములు, మూర్ఛనలు, ప్రయోగములు, ఇవి స్థిరములు. ప్రజల నాగరకత మారుకొలది, ప్రజలయందలి హావభావములు మారుకొలది, వారానందించు సంగీతపుబాణిలో మార్పులు రావచ్చును. ఇందున కాధారము "దేశేదేశే జనానాం యద్రుచ్యా హృదయరంజకం" అని సంగీత శాస్త్రమునందేకలదు.

దేశ్య సంగీతము ప్రజాసామాన్యమునకు గలుగు రక్తిభావముపై నాధారపడుచున్నది. కనుకనే తోడిరాగమునకు హిందూస్తానీతోడి యనబడు రూపాంతరము, సురటి రాగమునకు హిందూస్తానీ సురటి అను రూపాంతరము ఇత్యాదులు ఏర్పడుచున్నవి. ఇటులనే కర్ణాటక సంగీతమనియు, హిందూస్తానీ సంగీతమనియు సంగీతశాస్త్రము రెండు విధములైనది. ఇట్టి తారతమ్యమును మన ప్రాచీన సంగీత గ్రంథకర్తలు గ్రహించి రాగములలో శుద్ధము, ఛాయాలగము అను భేదములను సూచించియున్నారు.

పరిశుద్ధమై, పవిత్రమై, ప్రాచీన ప్రసిద్ధ వాగ్గేయకారకులచేత నిర్ణీతమైన సంగీతము గానసభలయందు మెండుగా వినదగును. ఈ సంగీతము 'శాస్త్రీయ సంగీతము'—(Classical Music)— అని వ్యవహరింపబడుచున్నది. శాస్త్రీయ సంగీతమందు ప్రకృతమున పెక్కు మార్పులు కలిగినవనుట విదితము. అర్ధశతాబ్దముక్రింద గాయకుల సంఖ్యయు, శ్రోతల సంఖ్యయు ఎక్కువగా నుండినను ప్రయాణ సౌకర్యములు విస్తారము లేమిచే గానసభలు తరచుగా జరుగక అప్పుడప్పుడు జరుగుచుండెడివి. ఈ కారణముచేత సామాన్యముగా ఒక ప్రసిద్ధ గానసభ రమారమి ఐదు గంటలు జరుగుచుండెను. పాడబడు కీర్తనాక్రమము మితముగానుండెడిది. విద్వాంసులు ఒకొక్క కీర్తనను చాలా విలంబముగను, విశ్రాంతిగను పాడుచ పల్లవిఘట్టములో విశేషకాలము పనిచేసి విస్తరించి గానమొనర్చెడివారు. పల్లవి మూడు కాలములలో పాడెడు సంప్రదాయ ముండెడిది. ఇటీవల పల్లవిగానము వాడుక నుండి ఇంచుకతొలగి మరల నిప్పుడిప్పుడే క్రొత్తరూపము దాల్చినది. ప్రస్తుత కాలములో కీర్తనల సంఖ్య ఎక్కువ చేయుటయు, కీర్తనలు, రాగాలాపములు అత్యంత వేగముగా పాడుటయు, స్వర కల్పనలు చాల వేగముగ అనగా విశేషభాగము ద్రుతకాలములో నిర్వహించుటయు, రాగాలాపన క్లుప్తముగా జేయుటయు కానగును. దీనికి కారణము ప్రజాభిరుచి పాటకుల అభిరుచి అయియున్నట్లు విదితము. పూర్వపు విద్వాంసులు స్వాతంత్ర్యముతోను, ప్రతిభా వ్యుత్పత్తులతోను గానము చేసెడివారు. వర్తమాన కాలమున విశేషముగా దీ

వ్యతిరేకముగా జరుగుచున్నది. ఒక గాయకుని చూచి, లేదా గాయనీమణినిచూచి, మరొక గాయకుడు కాని, గాయనీమణి కాని కొంత యనుకరించి, కొంత యతిశయించి చమత్కృతులతో పాడుటకు ప్రయత్నించుట నేడు సహజమైనది. విపరీతమైన రాగాలాపనము, మితమైన స్వరము, నాజూకనదగిన క్రొత్త సంగతులు, అన్య సంగీత క్రమముతో మిశ్రమమైన కళలు, ఆలోచించి అమర్చుకొన్న రాగభాగములు, లెక్కవేసి యేర్పరచుకొన్న స్వరసమూహములు, మృదంగపు వరుసల ననుసరించి వల్లించిన ముక్తాయింపు స్వరములు, మున్నగునవి ఈకాలమునందలి కొందరి శాస్త్రీయ సంగీతమునకు ప్రత్యేక లక్షణములుగా నున్నవి. ఇట్లు చేయుటచే సంగీత గౌరవమున కెక్కువ భంగమొనర్చినట్లెంచరాదు. అనేక పద్ధతులలో నిది యొకటియనియు, ఇట్లే ఇంకనుమార్పులు గలుగుననియు మన మూహింపవచ్చును. బహువిధముల మరొక పాతిక సంవత్సరములలో పూర్వపు పద్ధతులనే ఇట్టి విద్వాంసులు అనుసరించుట కవకాశము కలదు.

నేటి రేడియో కాలక్షేపము రెండు భాగములుగా నున్నది. ఒకటి శాస్త్రీయ సంగీతము. రెండు దేశీయ సంగీతము (Light Music), లఘుసంగీతము—అనగా గాలి పాటలు. పై రెంటి లక్షణములు అనగా రాగలక్షణము, లయవిధానము, తాళనిబంధనలు సమానమేయైనను, రెండవశాఖలో సంగీతవిశేషము సంక్షేపముగ రాగ విన్యాసమున కెక్కువ యవకాశము లేకుండ, సాహిత్యమునకు ఎక్కుడు ప్రాముఖ్యము ఏర్పడుచున్నది. విజ్ఞులకు శాస్త్రీయ, దేశీయ సంగీతములు రెంటియందును ఆనందము నొందుటకు అవకాశము గలదు. ఇతరులలో శాస్త్రీయసంగీతమునందు ఆనంద మనుభవించువారు అరుదుగ నుందురు. దేశీయగీతముకూడ ఆనందకరమే యగుచున్నది. ప్రజలలో సలక్షణ సంగీతమునందు రసజ్ఞత గలవారు అల్పసంఖ్యాకు లగుటచే, దేశీయ సంగీతము నర్థించువారి సంఖ్యయే యెక్కువగా గన్పట్టుచున్నది. కాని రేడియోమూలముగా ప్రదర్శింపబడు సంగీతములో శాస్త్రీయ సంగీత భాగమందు ఉన్నత కార్యక్రమములు (Concerts) ఒకగంట పదిహేను నిమిషములకు మించవు. కొన్ని కార్యక్రమములు ప్రత్యేకముగా 'రాగమునకును, తాళమునకును, పల్లవికిని వినియోగింపబడి నలుబదిఐదు నిమిషములకు మించక జరుగుచున్నవి. దేశీయ సంగీతములో ఇరువదియైదు నిమిషములకు మించుటకు వీలు లేదు. ఈ నియమముల ఫలితముగా మన కీర్తనలు, రాగములు, స్వరకల్పనలు మున్నగు గానప్రక్రియల వైశాల్యము మిక్కిలి సంక్షేపింపబడి, స్వల్పపరిమితిలో ముఖ్యమైన లక్షణములను గాయకులు కనబరచుట తటస్థించుచున్నది. షుమారు అరగంటసేపు పాడదగిన కీర్తన పది నిమిషములలో ముగియుచున్నది. ఇట్లనేక సంవత్సరములుగా జరుగుటచే, గాయకులకును, శ్రోతలకును విశ్రాంతిగను, విలంబముగను పాడదగిన కీర్తనలయందును, రాగములయందును వాంఛ తగ్గిపోవుచున్నది. ఇట్టి క్రొత్త యలవాటు చొప్పున గాన సభలలో సహితము, గాయకులు కీర్తనలను, రాగములను, కొద్దిలో ముగించుచున్నారు. పూర్వమొకప్పుడు తమిళదేశమునకు చెందిన సంగీత విద్వాంసుడు తోడి సీతారామయ్య యను నాతడు తోడిరాగమును ఎనిమిదిరోజులు పాడెడివాడని ప్రతీతి గలదు. ఇపుడన్ననో ఇరువది నిమిషములు పాడుటయే ఘనముగ నెన్నబడుచున్నది. ఇంచుమించు రేడియో సంగీత లక్షణములు గలదియే గ్రామఫోను సంగీతము. ఈ రెండువిధము లయిన సంగీత యంత్రములు మన సంగీతమును సంక్షిప్త మొనర్చినవి.

రేడియోలోని లలితసంగీతమునకు సరిపోలునదే సినీమా గానము. ప్రకృతమున ప్రజలను మిక్కిలి ఆకర్షించుచున్నది సినీమాగాన మని ప్రత్యేకముగ చెప్పనవసరము లేదు. సినిమాకు ప్రాబల్యము లభించిననాటినుండి నాటకములు క్షీణించినవి. నాటకరంగ ప్రముఖులు పెక్కండ్రు సినీమాలో చేరుటను మనము సామాన్యముగా కాంచుచున్నాము. నాటకములో గానమునకు లభించిన ప్రాధాన్యము సినీమాలో లేనందున సినీమాలో గానభాగము తక్కువయైనది. తెలుగు సినీమాలు విశేషభాగము హిందీ సినీమాలను అనుసరించుటచేతను, ప్లేబ్యాకులు, వాద్యబృందము (Orchestra), నేపథ్యసంగీతము (Back-ground music) మున్నగువాటి తోడ్పాటు అవసర మగుటచేతను సినీమాగానపుమట్లు హిందూస్థానీ సినీమా సంప్రదాయముల ననుసరించి యున్నవి. స్వచ్ఛమైన కర్ణాటక సంగీత

మునకు తెలుగు సినీమాలలో తావు లేదనియే చెప్ప వచ్చును. "త్యాగయ్య," "పోతన" ఇత్యాది ఫిల్ముల్లలో తప్ప శేషించిన తెలుగు సినీమాలలో గానము చాలా భాగము హిందుస్థానీ పద్ధతుల ననుసరించినదై యున్నది. సినీమా ప్రదర్శకులు, నిర్మాతలు, ఇచ్ఛగించినచో తెలుగు సినీమాలలో శాస్త్రీయగానము విస్తారము ప్రవేశపెట్టుటకు అవకాశము కలదనియు, అందుచేత సినీమాలోని విలువ (Entertainment Value) తగ్గదనియు చెప్ప వచ్చును. తమిళటాకీలలో శాస్త్రీయగానమునకు చాల ప్రాధాన్యము గలదు. అయినప్పటికిని తమిళ సినీమాల వినోదవువిలువ తగ్గదు. సినీమాపాటలలోని సంగీతభాగము మిక్కిలి క్లుప్తమై దేశీయగానము ప్రధాన మగుచున్నది. ఇట్టిపాటలు ప్రేక్షకులు తరచుగా వినుటచే శాస్త్రీయ సంగీతమునందు ప్రజలకు అభిలాష తగ్గిపోవుచున్నది. ఈ కారణముచేత సినీమాగానము ఆదర్శమగుచున్నదనుటకు (Ideal Music) అవకాశము కలదు.

నాటకరంగమందు శాస్త్రీయసంగీతమునకు పూర్వము ఎక్కువ ప్రాధాన్య ముండెడిది. కొన్ని నాటక సమాజములకు సంగీత విద్యాగురువు లుండెడివారు. ఈ నాడు అట్టి పద్ధతులు లోపించుటచేత నాటకములు శాస్త్రీయ సంగీతాభివృద్ధికి తోడ్పడజాలకున్నవి. మరియు నటకుడు హెచ్చయిన శ్రుతిమీద అందరును వినులాగున గొప్ప కంఠముతో పాడవలసి యున్నది. నటకుని గానమునకు విశ్రాంతి యెక్కువ గనుక ప్రసిద్ధమైనట్టిదియు, నిర్దుష్ట మయినట్టిదియు నైన శాస్త్రీయ సంగీతము నాటకరంగ మందు ఉపయోగించుటకు మిక్కిలి అవకాశము గలదు.

హరికథా కాలక్షేపములలోని సంగీతము శాస్త్రీయ సంగీతశాఖలోనికే వచ్చుచున్నది. ప్రస్తుతకాలపు కథకులు పెక్కండ్రు సంగీతమందు సుశిక్షితులు గాకున్నను, స్వర జ్ఞానము కలిగినవారు కాకున్నను, వారు పాడెడు కీర్తనలు, దరువులు మున్నగునవి సుప్రసిద్ధ సంగీత పండితులచే రచింపబడినవగుటచేతను, తొలుదొల్త ఆదిభట్లనారాయణదాసుగారు, కుంభకోణము పంచాంగ కేశి శాస్త్రియార్, మైనంపాటి నరసింగరావుగారు, రామాయణం సీతాపతిగారు మున్నగు ప్రముఖ సంగీత విద్వాంసుల ననుకరించుటచేతనేమి, వారియొద్ద కొంత గ్రహించుట చేతనేమి, శాస్త్రీయ సంగీతస్వరూపము కొందరి చేతులలో విశేషముగా పూరుటలేదు. కాని రెండవతరగతి కథకులు కొందరు స్వకీయ రచనలతో సభలు నిర్వహించుటలో, సంగీతములో తమకుగల అల్పజ్ఞానమును వెల్లడించుచున్నారు. ఇది శోచనీయము. వీరలు సంగీత కృషిచేసి స్వరజ్ఞాన మార్జించి లక్షణయుక్తమైన సంగీతముతో హరికథాకాలక్షేపములు చేయుట అవసరము.

ఉత్సవములు, ఊరేగింపులు, వివాహాది కార్యములు-ఇత్యాది సమయములలో వాద్యగాండ్రొనర్చు సంగీతము శాస్త్రీయ సంగీతమే. కాని, ద్రవిడదేశమందు నాగస్వర వాద్య (కాహళవాద్య) విద్వాంసులు బహుసంఖ్యాకులగుటచేత అచ్చట శాస్త్రీయసంగీతము మహోన్నత దశలో నున్నది. మన యాంధ్రదేశములో సహితమిప్పుడు సుప్రసిద్ధ నాగస్వరవాద్య విద్వాంసుల సంఖ్య హెచ్చుచున్నందులకు మనము సంతసింపవలెను.

భజనలు, సప్తాహములు ఇత్యాది సమయములలో శాస్త్రీయ సంగీతమునకు తావుండజాలదు. ఒక వేళ యున్నను ప్రేక్షకులు భక్తిపరులై నిమగ్నతతో ప్రవర్తించుట ఆశయమగుటచేతను, దీర్ఘకాలముగా నిట్టి తరుణములలో సంగీత విద్వాంసులు పాల్గొనకుండుటచేతను, శాస్త్రీయ సంగీతమానందించెడు అవకాశము భజనలో లేకున్నది. మరియు "హరేరామ, హరేకృష్ణ" ఇత్యాది నామములు అనేకవందల పర్యాయములు తాళములతో ఉచ్చరించుటయు, తరంగములు మున్నగునవి విశేషముగా పాడుటయు, ఈ శాఖలో నేర్పరులయినవారే భజనలలో మిక్కుటముగా పాల్గొనుటయు, ఇందులకు మరికొన్ని కారణములు. కాని ఇట్టిసమయములలో శాస్త్రీయ సంగీతము ప్రదర్శించుట కెట్టి యభ్యంతరము ఉండజాలదు.

భరతనాట్య ప్రదర్శనములలో ఈనాడు తగినంతగా శాస్త్రీయ సంగీతమునకు స్థానము లేకున్నది. ఇంతేగాక నేడు నాట్యసమయమున నటకుడే గానముచేయుట శాస్త్రీయపద్ధతి. పూర్వము ఇట్లే జరుగుచుండెడిది. ఇక బుఱ్ఱకథలు, వీథిభాగవతములు, జానపదగేయములు మున్నగునవి దేశీయగానమున వినియోగమగుచున్నవి.

ప్రభుపరిపాలన మంతరించి ప్రజాపాలనము సుస్థిరమైన నవీనయుగమందు ప్రజలే సర్వవిధముల సంగీత

సంస్థకు చేయదగిన సేవ చాలగలదు. విద్యావ్యాప్తి, వైద్యము, వ్యవసాయము, పరిశ్రమలు, ప్రజాసౌకర్యములు ఇత్యాది సర్వవిషయములయందును ప్రభుత్వము వారు మిక్కిలి శ్రద్ధవహించి, ఎట్లు నిర్వహించుచున్నారో అట్లే సంగీత విషయమందును వారు శ్రద్ధను కలుగజేసి కొనవలసిన అవసరము గలదు. ప్రభుత్వమువారు ప్రతి రాష్ట్రమందును సంగీతనాటక "ఏకాడమీలు" స్థాపన చేయుచుండుట ప్రశంసింప దగినది. కాని ఇంతమాత్రమున ప్రజలలో సంగీత విద్యావ్యాప్తి కలుగనేరదు. ప్రతి నగరమందును, గ్రామమందును, ప్రజలు సంగీత సమాజము లేర్పరచి, సంగీత విద్వాంసులను రావించి సత్కరింపవలెను. ప్రజలెల్లరు, వివాహాది శుభకార్యములందు ఉత్తమగాయకుల నాహ్వానించి గౌరవింపవలెను. దేవాలయ ధర్మకర్తలు, మఠాధిపతులు, విరివిగా సంగీత సభలు జరిపించి సంగీతపోషణకు పూనుకొనవలెను. విద్యాలయములలో సంగీతవిద్యకు ఉచితస్థానము కలుగజేయవలయును. ప్రతి గ్రామమందును సంగీతవిద్యాలయములు నెలకొల్పబడవలయును. ఇట్టి మార్గము లింక ఎన్నియో కలవు. ఇట్లొనర్చినచో సంగీతమునకు పూర్వపు ఔన్నత్యము లభించును. "ఏకం సంగీత విజ్ఞానం చతుర్వర్గ ఫలప్రదం" అనునట్లు సంగీతమున కాధారమైన నాదము నుపాసించినచో చతుర్వర్గములను పొందగలుగుదురు. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, నాదమే స్వరూపముగా గలవారు గాన వారు నాదముచేతనే యుపాసింపబడుచున్నారని

(1) త్రివర్గ ఫలదా స్సర్వే దాన యజ్ఞ జపాదయః
ఏక త్సంగీత విజ్ఞానం చతుర్వర్గ ఫలప్రదమ్.
(శివసర్వస్వం)

(2) నాదోపాసనయా దేవా బ్రహ్మ విష్ణు మహేశ్వరా
భవంత్యుపాసితా నూనం యస్మాదేతే తదాత్మకాః.
(సంగీత రత్నాకరము)

అను శ్లోకద్వయముచే విదితమగుచున్నది.

పో. రా.

**శ్రీ ఆనందగజపతి మహారాజు :-** పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమున సంగీతసాహిత్యాది విద్యలను పోషించిన వారిలో శ్రీ ఆనందగజపతి మహారాజును పేర్కొనవలెను. వీరి పోషణమున ఆంధ్రదేశమున సాహిత్యమునకు చక్కని ప్రాపు లభించినది. వీరు 31-12-1850 న జన్మించి 23-5-1897 లో స్వర్గస్థులైరి.

శ్రీ ఆనందగజపతి మహారాజు జన్మించిన రాజవంశము ఆంధ్రదేశమున చివరివరకు ఆంగ్లేయులతో పోరిన గౌరవమును పొందినది. ఈ వంశమునకు మూలపురుషుడైన మాధవవర్మ క్రీ. శ. 591 లో ఉత్తరదేశమునుండి కృష్ణాతీరమునకు తరలివచ్చి రాజ్యమును స్థాపించెనని ఐతిహ్యమొకటి కలదు. వీరి సంతతివారు గోల్కొండ నవాబుకు సహాయకులుగ నుండిరి. వీరిలో నొకరయిన పూసపాటి మాధవవర్మ 1652 లో విశాఖపట్టణ ప్రాంతమున రాజ్యమును స్థాపించెను. ఈతని తరువాత ప్రఖ్యాతికి వచ్చినవారు 1757 లో బొబ్బిలి యుద్ధము చేసిన పెద విజయరామ గజపతి.

శ్రీ ఆనందగజపతి జనకులగు శ్రీ విజయరామ గజపతి 1852 నుండి సంస్థానమును పాలించిరి. దక్షిణ భారతమున ఆంగ్ల విద్యావ్యాప్తికై కృషిచేసిన వారిలో వీరగ్రగణ్యులు. ఆంగ్ల సంస్కృత కళాశాలలను వీరు విజయనగరమున స్థాపించిరి. వీరి కృషికి మెచ్చి ఆంగ్ల ప్రభుత్వము వీరికి 'మహారాజ' 'కే. సి. యస్. ఐ.' అను బిరుదములిచ్చి గౌరవించెను.

వీరి పుత్రులు ఆనందగజపతి మహారాజుగారు. ఆనందగజపతి తల్లి శ్రీ అలక రాజేశ్వరీ మహారాజ్ఞి. భార్య, జయపూరు రాకుమారియైన శ్రీ వనకుమారి. శ్రీ ఆనందగజపతి తమకు ఔరసులు లేకుండుటచే, శ్రీ పూసపాటి విజయరామగజపతి మహారాజులన్ను దత్తపుత్రునిగ గ్రహించిరి.

శ్రీ ఆనందగజపతి మహారాజుగారు బహుభాషా కోవిదులు, సంగీత సాహిత్య వేత్తలు; సుందర విగ్రహులు. ఆంగ్లేయు లీతని (Prince Charming) అని కీర్తించిరి. ఆనందగజపతి చూపిన అభిమాన కారణముగా విజయనగరము పండితులకును, శాస్త్రవేత్తలకును, సాహిత్యకులకును కేంద్రమయినది.

శ్రీ ఆనందగజపతి మహారాజు శ్రీ భాగవతుల హరిశాస్త్రియొద్దను, ముడుంబై నరసింహాచార్యుల యొద్దను, మేజర్ థామస్ కార్లైల్, లింగం లక్ష్మాజీ పండితుల యొద్దను సర్వవిద్యల నభ్యసించిరి. మహారాజుల ఆంగ్ల

భాషా కోవిదత్వమును మెచ్చుకొని ఆంగ్లేయులు వీరికి చిన్నతనముననే గౌరవ డాక్టరు పట్టప్రదానము గావించిరి. వీరికి వీణావాదనమందు అధికమైన కౌశల్యాభిమానము లుండెడివి. పారసీకాది భాషలలో వీరికి పాండిత్యము కలదు. 'అద్యతనాంధ్రకవి ప్రపంచ నిర్మాత' లైన శ్రీ తిరుపతి వేంకట కవులు 'ఏము చూచిన రాజులందెల్లనొక్క విజయనగర మహారాజు వేత్త' యని వీరిని ప్రశంసించి స్వీయ కవితావధూటిని సమర్పించిరి. వీరి ఆస్థానములో మహాపండితులు, కవులు, గాయకులు, క్రీడా నిపుణులు, నటులు, ఎందరో మహానుభావు లుండెడివారు. ఆ తారాగణ మధ్యస్థుడయి ఈ రాజచంద్రుడు ప్రకాశించువాడు.



శ్రీ ఆనందగజపతి మహారాజునకు రూపకముల నభినయింప జేయుటయన్న మిక్కిలి యిష్టము. సంస్కృత రూపకముల నెన్నిటినో వారు ఆదరించి అభినయింపజేసిరి. అభిజ్ఞాన శాకుంతలము, రత్నావళి మొదలగు నాటకము లిందు గలవు. నటుడుగా, నాటక కర్తగా, విద్వాంసుడుగా శ్రీ గోమఠం శ్రీనివాసాచార్యులు ఈ రాజుగారి యాశ్రయమున ప్రఖ్యాతివహించిరి. వీరి పోషణమున నటకులు, నర్తకులు ఎందరో వృద్ధినొందిరి.

శ్రీ ఆనందగజపతి మహారాజు పోషించిన పండితులలో కిళాంబి రామానుజాచార్యులు, చొదిమెళ్ళ రామమూర్తి పంతులు, గురజాడ అప్పారావు పంతులు మొదలైన ప్రతిభావంతులైన ప్రాజ్ఞులు కలరు. హరికథా పితామహులైన ఆదిభట్ల నారాయణదాసుగారి ప్రతిభను చూచి మహారాజు ముగ్ధుడగుచుండెడివాడు.

శ్రీ ఆనందగజపతి మహారాజు హిందూసంఘ సంస్కరణమునందు గూడ కృషిచేసెను. హిందువులలో కన్యాశుల్కమను దురాచారము వ్యాపించియున్న కాలమది. ఈ మహారాజీ దురాచారమును రూపుమాపుటకు కన్యాశుల్కమును గురించిన లెక్కలను తన యాధ్వర్యవమున సిద్ధముచేయించి తన సాంఘిక చైతన్యమును ప్రకటించుకొనెను. మహారాజుగారి ఈ కృషి గురజాడ అప్పారావుగారి కన్యాశుల్క నాటకరచనకు దోహదమొసగినది. అప్పారావుగారి ఈ నాటకమునకు మహారాజు కృతిభర్తగా నుండి దానిని అభిమానించెను. 1897 లో మహారాజుయొక్క అకాల మృతివలన వారి సంఘసంస్కరణ కృషి తగినంతగా ఫలించలేదు. ఆనందగజపతి మహారాజుయొక్క పోషణమున 'తెలుగుహార్ప్' అను ఆంధ్ర ఆంగ్ల వారపత్రిక యొకటి ఆనాడు విజయనగరమునుండి వెలువడుచుండెడిది. ఇందు మహారాజావారి ఆస్థాన పండితులు ఆంధ్రాంగ్ల భాషలలో రచనలను ప్రకటించువారు.

శ్రీ ఆనందగజపతి మహారాజునకు సమస్యాపూరణమన్న మిక్కిలి ఇష్టము. తమ విద్వత్కవులచే, కష్టమైన సమస్యలను పూరింపించుట, చమత్కారములైన సంస్కృత శ్లోకముల నాంధ్రీకరింపజేయుట, తెలుగు పద్యములను సంస్కృతీకరించుట మహారాజుగారి నిత్యవ్యాసంగములు. తాముకూడ నెన్నియో సమస్యలను పూరించిరి. సంస్కృత శ్లోకములను, తెలుగు పద్యముల నెన్నింటినో రచించిరి. వీరి యీ రచనలు హృదయంగమముగా నుండును.

నాడు సాహిత్యాదులలో కృషి జరిగినను, పరిశోధనలు జరిగినను, ఎవరికైనను ఆనందగజపతీంద్రుల సాహ

య్యము లభించుచుండెడిది. మాక్సు ముల్లరు పండితుడు తలపెట్టిన ఋగ్వేద సంహితా ముద్రణమునకును, సంస్కృత వాచస్పత్య ముద్రణమునకును, ఎందరో కాశీ పండితుల గ్రంథ ముద్రణమునకును, మున్షీమహమ్మద్ పాచ్ఛామియా సాహెబుయొక్క "ఫరహంగే ఆనంద రాజ్" అను ఉర్దూ నిఘంటువు ముద్రణమునకును, మహారాజు కారణభూతుడు. గురజాడ శ్రీరామమూర్తి గారు రచించిన "కవి జీవితములు" అను కవుల చరిత్రకు మహారాజుయొక్క సంపూర్ణ ప్రోత్సాహము లభించినది.

మహారాజునకు సంస్కృతాంధ్ర భాషలతోబాటు లాటిన్, ఫార్సీ, ఉర్దూ, ఫ్రెంచి భాషలలోకూడ మంచి ప్రవేశము గలదట. ఈ మహారాజు వరదరాజ కృతమగు లఘు కౌముదిని కొంతవరకు తెనిగించెను. వీరి కాంగ్ల రచయితలలో జాన్ స్టూవర్టుమిల్, హెర్బర్టు స్పెన్సర్, పోప్ మొదలగువారియం దభిమానము. వీరాంగ్లమునను చాల రచనలు చేసినారు.

ఇన్ని ప్రతిభలుకల మహాప్రభువైనను ఆయనలో నాడంబరముగాని, ఔద్ధత్యముగాని లేకుండెను. వారు పండిత పామరులయం దభిమానదృష్టి కలవారు. వారి సుగుణ సంపదను గురజాడ అప్పారావుగారు తమ డైరీలలో సముచితముగ స్తుతించినారు.

ఆనందగజపతి మహారాజు తమ తండ్రివలె వైస్రాయి కౌన్సిల్ సభ్యులును, జి. సి. ఐ. ఇ. బిరుదాంకితులునై యలరారిరి.

కొ. వీ.

**ఆనందవర్ధనాచార్యుడు :-** కాలము - సమకాలికులు :- భారతీయ సాహిత్యశాస్త్రము శాఖోపశాఖలుగా విస్తరిల్లినది. సుప్రసిద్ధులైన సాహిత్య శాస్త్రకారులలో శ్రీ ఆనందవర్ధనాచార్యుడు పేరెన్నికగన్నవాడు. ఈతడు కాశ్మీర దేశీయుడు. 855-884 క్రీ. శ. లో కాశ్మీరదేశము నేలిన యవంతివర్మ యాస్థానము నీ విద్వన్మణి యలంకరించి యుండెను. ఆనాడు ప్రఖ్యాత పండితకవులకు కాశ్మీరము కాణాచియై యుండెను. సుప్రసిద్ధులయిన విద్వాంసులలో ముక్తాకణుడు, శివస్వామి, రత్నాకరుడు మున్నగువా రానందవర్ధనునితో పాటుగా అవంతివర్మ సభను భూషించియుండిరని రాజతరంగిణి చెప్పుచున్నది. సమకాలిక మహాకవులలో నాయకమణి యనదగు ఆనందవర్ధనుడు క్రీ. శ. 800 ప్రాంతమందున్న ఉద్భటుని పేర్కొనెను. క్రీ. శ. 900 ప్రాంతమందుండిన రాజశేఖరునిచే తాను ప్రశంసింపబడెను. కావున నీతడు తొమ్మిది పది శతాబ్దముల నడిమి వాడై యుండు ననియు, ఈతని కావ్యరచనాకాలము క్రీ. శ. 840-870 వరకును అయియుండు ననియు చారిత్రకులు తలంచుచున్నారు.

వంశము :- ఆనందవర్ధనాచార్యునిది రాజానక వంశము. కాశ్మీర పండిత వంశములలో రాజానక వంశము మిక్కిలి ప్రతిష్ఠగన్నది. మహా విద్వాంసులు, రచయితలు ఎందరెందరో ఈవంశమున నుద్భవించిరి. రుయ్యక మమ్మటాదులగు నాలంకారిక శ్రేష్ఠులీ కోవలోనివారే. ఆనందవర్ధనుని తండ్రి నోణపండితుడైనట్లు దేవీశతకము వలన తెలియుచున్నది.

ఆనందవర్ధనుని కృతులు :- ఈ మహాకవి రచించిన గ్రంథములలో దేవీశతకము, విషమబాణలీల, అర్జున చరితము, ధర్మోత్తమ వివృతి, ధ్వన్యాలోకము ముఖ్యములు. విషమబాణలీల, అర్జున చరితములు ప్రాకృత కావ్యములు. దేవీశతకము యమకాది శబ్దాలంకారములతోను, గోమూత్రికాది చిత్రబంధములతోను విలసిల్లుచు 'ఆనందవర్ధనుడు మహితధ్వని కర్తయే కాదు, చిత్రకవితా ధురీణుడు' నగునని యా కవీంద్రుని సవ్యసాచిత్వమును వెల్లడించుచున్నది. దీనికి కయ్యటుడను కాశ్మీరపండితు డొకవ్యాఖ్యను వ్రాసెను. ధర్మకీర్తి రచించిన ప్రమాణ నిశ్చయమను గ్రంథమునకు వ్యాఖ్య ధర్మోత్తమ యనునది. దానికి ఆనందవర్ధనుడు రచించిన వివరణమే ధర్మోత్తమ వివృతి.

ధ్వన్యాలోకము :- ఆనందవర్ధనుని విస్తార యశస్సునకు మూలకారణమయినది యాతని ధ్వన్యాలోకము. అలంకార శాస్త్రమునకెల్ల శిరోభూషణమవ నొప్పిన దీ గ్రంథరాజము. కావుననే వేదాంతశాస్త్రమునకు వ్యాస మహర్షి బ్రహ్మసూత్రము లెట్లో, వ్యాకరణమునకు పాణిన్యాచార్యుని యష్టాధ్యాయియెట్లో సాహిత్య శాస్త్రమునకు శ్రీమదానందవర్ధనుని ధ్వన్యాలోక మట్లే యని విమర్శకు లుగ్గడించినారు. లలితమైన కావ్యతత్త్వమును

నిరూపించు నీ ధ్వన్యాలోకమును రచించి యానంద వర్ధనుడు సకల సహృదయ హృదయానంద వర్ధనుడుగా నన్వర్థుడైనా డని రసిక శేఖరులు ప్రశంసించినారు. ధ్వన్యాలోకమున ప్రతిపాదింపబడిన మార్గమునే శిరసావహించి యానంతరికాలంకారికులు పలువురు సాహితీ విమర్శ ములు సాగించి గ్రంథములను వెలయించినారు.

ధ్వన్యాలోకమునే సహృదయాలోక మనియు, కావ్యాలోకమనియు వ్యవహరించుట గలదు. ఇది కారికా రూపమున నున్న ధ్వని యను మూలగ్రంథము–దానిపై ఆలోకమను వృత్తియు చేరి ధ్వన్యాలోకమైనది. ఇది నాలుగు భాగములుగ విభజింపబడినది. దీనిలోని భాగము లకు ఉద్యోతము అని పేరు.

కారికాకర్తయు ఆనందవర్ధనుడును భిన్నులు కారు: ధ్వన్యాలోకములో కారికలను సహృదయు డను నతడు రచించెననియు, ఆ కారికలకు ఆలోక మను వృత్తిని మాత్రము ఆనందవర్ధనుడు నిబంధించెననియు కొందరు విమర్శకు లొక వాదమును లేవదీసిరి. ఈ గ్రంథములో సహృదయ శబ్దము తరచుగా వచ్చుటయు, లోచన వ్యాఖ్యానమును రచించిన యభినవగుప్తు డచటచట 'కారికాకారుని మత మిది, వృత్తికారుని మత మిది'యని వేరుచేసి చెప్పుటయు ఈ వాదమునకు దారితీసినవి. కాని చక్కగా పరిశీలించిన విద్వాంసులు కారికావృత్తి రూప మైన సంపూర్ణ ధ్వన్యాలోక గ్రంథమునకు కర్త యానంద వర్ధనుడే యని నిశ్చయించినారు. ఆలంకారిక సంప్రదా యమున ఆనందవర్ధనుడే ధ్వన్యాలోక రచయిత యని ప్రసిద్ధి గలదు. రాజశేఖరుడు, కుంతకుడు, మహిమభట్టు, క్షేమేంద్రుడు, హేమచంద్రుడు, ప్రతీహారేందు రాజు మొదలగు పెక్కురుసాహిత్యశాస్త్రకారులుకూడ ఆనంద వర్ధనుడే కారికావృత్తులు రెండింటికిని రచయిత యైనట్లు తెలిపియున్నారు. ధ్వని ప్రస్థానము (గ్రంథరూపము బొందినట్టిది) స్వోపజ్ఞమైనట్లు ఆనందవర్ధనుడే రచించెను. ఈ గ్రంథమున గన్పట్టు సహృదయ శబ్దము కారికా కర్త నామధేయ మనుటకు తగిన ప్రబల ప్రమాణములు లేవు. కావ్యతత్త్వజ్ఞుడగు రసికు డనియే దాని కర్థము చెప్పుట యుక్తము. అభినవగుప్తుడు కారికాకర్తను– వృత్తికర్తను వేరుచేసి చెప్పియుండుట పాఠక సౌకర్యా ర్థమే యనియు, వస్తుతః ఆతనికి కూడ ఆనందవర్ధనుడే ధ్వన్యాలోకకర్త యనునదియే యభిమత మనియు, నాతని భరతనాట్య శాస్త్ర వ్యాఖ్య యగు అభినవ భార తిని పరిశీలించినవారికి తెలియకపోదు.

ధ్వన్యాలోకము, సాహిత్య శాస్త్రము :- శాస్త్ర మనగా శాసించునది. అనధిగతార్థ జ్ఞాపనమే శాసనము. సకల ప్రమర్థసాధకములగు రసాదులను గుఱించిన జ్ఞానసాధన మగుట సాహిత్యము శాస్త్రము. విశేషముగా ధ్వన్యా లోకము ప్రమాణాంతరమువలన తెలియరాని ధ్వని స్వరూపమును నిరూపించునదగుట దానికి శాస్త్రత్వము సుప్రసిద్ధము. "ఆనందవర్ధనాచార్యులు ఈ శాస్త్రము ద్వార సహృదయ హృదయములయందు దేవాలయాది ధర్మసంస్థానిర్మాణమునవలె శాశ్వతమైన ప్రతిష్ఠను పొందును గాక!" యని నుడివిన యభినవగుప్తాచార్యులు ధ్వన్యా లోకము శాస్త్రమని ముక్తకంఠమున చెప్పనే చెప్పిరి.

గ్రంథ ప్రతిపాద్యము :- ప్రథమోద్యోతములో ప్రతి పాదింపబడిన విషయము లివి: 1. ధ్వని యనున దొకటి లేనేలేదను ధ్వన్యభావవాదుల వాదముల యనువాదము. వాని ఖండనము. 2. వాచ్యార్థ వ్యంగ్యార్థములు. రస ధ్వనియే కావ్యాత్మ. ధ్వని సహృదయైక వేద్యము. 3. ధ్వని నిర్వచనము. ఆక్షేప సమాసోక్త్యాదు లగు నలంకారములలో ధ్వని యంతర్భూతము కాదు. ధ్వని బుధసమ్మతము. రసధ్వనియే కావ్యాత్మ యను విషయ మున అనుభవ ప్రమాణము– ఇతిహాస ప్రమాణము. 4. ధ్వని భేదములు. అవివక్షిత వాచ్యధ్వని, వివక్షితాన్య పరవాచ్య ధ్వని. 5. భాక్తవాదము. భక్తిధ్వనులు భిన్నములు. భాక్తవాద నిరసనము. 6. రసప్రతీతి. రస ప్రతీతి శబ్దములవలన గలుగదు. రసము సామాజికనిష్ఠము. ధ్వని నిర్వచింపరాని దనుట యుక్తము కాదు.

ద్వితీయోద్యోతము :- 1. అవివక్షిత వాచ్యధ్వని యర్థాంతర సంక్రమితము–అత్యంత తిరస్కృతవాచ్యము నను విధమున రెండు తీరులు, ఉదాహరణములతో తన్ని రూపణము. 2. వివక్షితాన్యపరవాచ్యము సంలక్ష్య క్రమవ్యంగ్యము– అసంలక్ష్యక్రమ వ్యంగ్యము నని రెండ విధములు. 3. అసంలక్ష్యక్రమ వ్యంగ్యము రసము భావము, రసాభాస భావాభాసములు, భావశమము

మొదలగు రూపముల విలసిల్లు విధము 4. రసపదాద్య లంకారముల స్వరూపము. 5. గుణములకు అలంకారములకు భేదము 6. శృంగారాది రసముల కనుగుణములైన పరస్పర గుణాదులు, 7. సంలక్ష్యక్రమ వ్యంగ్యములోని యవాంతర భేదములైన శబ్దశక్తి మూలధ్వని, అర్థశక్తి మూలధ్వని, 8. శ్లేషకు, అర్థశక్తి మూల ధ్వనికినిగల భేదము, 9. అలంకార ధ్వని కుదాహరణములు.

తృతీయోద్యోతము :- 1. వ్యంజకమునుబట్టి యేర్పడు ధ్వని భేదములు. 2. వర్ణపద వాక్య సంఘటనా ప్రబంధ రూపకములైన వ్యంజకముల వలన నేర్పడు వివిధ వ్యంగ్యములు. తదుదాహరణములు. 3. అసమాస, మధ్యమ సమాస, దీర్ఘసమాస రూపమైన సంఘటనా స్వరూపము. 4. రసోత్పత్తి, రసచర్వణము, ఏయలంకారము లేరసముల కనుకూలములను చర్చ. 5. ఇతి వృత్తమునకు రసమునకుగల సంబంధము, సుప్తిఙ్ విభక్తులతోను, కృత్తద్ధిత ప్రత్యయములతోను, సమాసాదులతోను అసంలక్ష్య క్రమధ్వని ధ్వనించు విధము, రసవిరోధులు. 6. ఒక కావ్యములో ముఖ్యమైన రస మొకటియే యుండును. తక్కినరసము లప్రధానములు. వాచ్యార్థ గమ్యార్థముల భేదము. గుణవృత్తి వ్యంగ్యములకుగల భేదము. వ్యంగ్య మనుమాన ప్రమాణముతో గతార్థము కాదు. 7. గుణీభూత వ్యంగ్యము. (ఇదియే మధ్యమ కావ్యము. వ్యంగ్యార్థముకంటె వాచ్యార్థము సుందరముగా నున్నట్టిది గుణీభూత వ్యంగ్యము) గుణీభూత వ్యంగ్యమున కుదాహరణములు. 8. చిత్రకావ్యము (దీనినే క్షుద్ర కావ్యమందురు) శబ్ద చిత్రములు, వాచ్య చిత్రములు, యమకాదులు - ఉత్ప్రేక్షాదులు. 9. రీతులు-వృత్తులు.

చతుర్థోద్యోతము :- 1. ధ్వని కావ్యములలోను, గుణీభూత వ్యంగ్యములలోను కవి ప్రతిభ నిత్యనూతన శోభలను వెలయించును. 2. రసభావ తదాభాస తత్ప్రశమనాది బహుప్రకారములు. 3. కావ్యమున కవి యొక రసమునకే ప్రాధాన్య మిచ్చుటవలన శోభాతిశయము కలుగును. 4. మహాభారతము శాంతరస ప్రధానము, రామాయణము కరుణరస ప్రధానము. 5. దేశకాలావ్యవస్థా భేదమువలన వాచ్యార్థములు కూడ ననంతములు. అవి నవ్యములు. 6. పలువురు కవులచే పలు విధములుగా ననుభుక్తమయ్యు కావ్య నవ్యత్వ స్థితికి హానిలేదు. 7. కవుల వాక్యములకు పరస్పర సాజాత్యము గన్పట్టినను విషయభేద ముండుటవలన అది దోషము కాదు. 8. వాక్యార్థ సాజాత్యము బింబ ప్రతిబింబ రూపమునను, వస్తుచిత్ర రూపమునను, వ్యక్తి వ్యక్త్యంతర రూపమునను గలుగును. వీనిలో మొదటి రెండును అనుపాదేయములు. పదార్థ సాజాత్యము దోషము కానేకాదు. 9. స్వతంత్రులగు మహాకవుల వాఙ్మాహాత్మ్యము.

ధ్వని ప్రస్థానము :- సాహిత్య శాస్త్రకర్తలలో ముఖ్యులు కొందరు కావ్యతత్త్వమును పరిశీలించి కావ్యాత్మను నిర్ణయించిరి. అట్టివారిలో భామహాదులు అలంకారమే కావ్యాత్మ యన్నారు. వామనుడు రీతి కావ్యాత్మయని నిశ్చయించెను. కుంతకుడు వక్రోక్తి కావ్యాత్మ యగునని పల్కెను. క్షేమేంద్రుడు ఔచిత్యము కావ్యాత్మయని భావించెను, ఆనంద వర్ధనాచార్యుడు ధ్వనియే కావ్యాత్మయని సిద్ధాంతీకరించెను. సహృదయ శేఖరుడగు నానందవర్ధనుని హృద్యమగు నీ ధ్వనిప్రస్థానము సాహితీలోకమునకు శిరోధార్యమైనది. భరత మహర్షి నిర్వచించిన రసాభివ్యక్తిమార్గమును కేవలము శ్రవ్యకావ్య విషయికముగ నేగాక కావ్య సామాన్యమునకు సమన్వయించి యీ విద్వద్రగేసరుడు రసధ్వనియే కావ్య జీవితమని సోదాహరణముగా సయుక్తికముగా నిరూపించినాడు. మహాకవులగు కాళిదాసాదుల కవితలలోకల ధ్వనిమణులను ప్రదర్శించినాడు.

ధ్వనిమార్గము - ఆనందవర్ధనునికి పూర్వమే యుండెననుటలో సందేహములేదు. కాని ధ్వని స్వరూపమును వివరించు గ్రంథమెద్దియు తొల్లి లేకుండెను. ఛాయామాత్రముగానున్న ధ్వని భావమునకు రూపుదిద్ది శంకలను పరిహరించి, హేతుపుష్టి నొసగి, సంవాదములను జూపి, శాస్త్రత్వపదవి నధిరోహింపజేసిన మహనీయుడగుట శ్రీమదానంద వర్ధనుడు ధ్వనిప్రస్థానము ప్రోవజ్ఞ మని చెప్పుకొనుట కర్హుడై యున్నాడు. 'ధ్వనిధ్వనియని ధ్వని చేయుటయేగాని విగ్గదీసి ధ్వని స్వరూపమెట్టిది ?

యని యడిగిన ఈ జడులేమి చెప్పగలరు ?-' అని పరిహసించినవారి మోములు వెల్లబార ధ్వనిగ్రంథము వెలసినది. ధ్వనిప్రస్థానము సిద్ధాంతమై మెరసినది. ఈ ధ్వని భావము తొలుత వైయాకరణుల స్ఫోటవాదముచే స్ఫురింప జేయబడినది. స్ఫోటవాదము మిక్కిలి ప్రాచీనమైనది. పాణిని మహర్షి కంటెముందే యీ వాదమున్నట్లు తెలియుచున్నది. స్ఫోటాయనుడను నాచార్యుని పాణినియే స్మరించియుండెను. ధ్వన్యాలోక గ్రంథరచనమును గురించి చెప్పుచు ఆనందవర్ధనుడు, 'ఈ గ్రంథము ధ్వని సిద్ధాంతమును నిరూపించుటకు మాత్రమే ప్రవృత్తము కాలేదనియు, కవితా ప్రయోజనమును వివరించుచు సహృదయాస్వాద్యమగు రసనిబంధనమున కవులకు మార్గదర్శకముగా కూడ నిది యుపకరించుననియు నుడివెను. ధ్వన్యాలోకము కవితానౌకకు దీపగృహము.

ఈ ధ్వనివాదమును వ్యక్తి వివేకము, హృదయ దర్పణము మున్నగు గ్రంథములలో మహిమభట్టు, భట్టనాయకుడు మొదలగువారు నిరసించిరి. కాని యాలంకారికులలో పలువురిచే నాదరింపబడిన ధ్వనిప్రస్థాన గౌరవమున కంతమాత్రమున నావంతయు లోపము రాలేదు.

ధ్వన్యాలోకము — వ్యాఖ్యలు :- ధ్వన్యాలోకముమీద చంద్రిక యను నొక వ్యాఖ్య పూర్వ మున్నట్లు తెలియుచున్నది. అది యిపుడు లభ్యము కాదు. ప్రసిద్ధమయిన ధ్వన్యాలోక వ్యాఖ్య లోచనము. దీనిని రచియించినది శ్రీమదభినవగుప్తాచార్యులు. వీరు మహాపండితులు, విమర్శకులు, కాశ్మీర శైవాచార్యులు, పాణినీయమునకు మహాభాష్య మెట్లో, అలంకార శాస్త్రమునకు లోచన వ్యాఖ్య యట్లు. లోచనవ్యాఖ్యవలననే ధ్వన్యాలోకమున కంతటి ప్రచార ప్రసిద్ధులు గలిగిన వనుట యతిశయోక్తి కానేరదు. చంద్రికా వ్యాఖ్యాత శ్రీమదభినవ గుప్తాచార్యుని పూర్వ వంశీయుడే యని తెలియుచున్నది. దానిని సమగ్రముగా అవలోకించియే యభినవ గుప్తులు లోచనమును రచించిరి. అక్కడక్కడ చంద్రికా వ్యాఖ్యను ఖండించుచు 'మా పూర్వ వంశీయునితో నిక కయ్యము చాలును-' అనుచు లోచనకర్త వాదము నుపసంహరించు చుండుటయే యిందుకు సాక్షి.

ఆంధ్ర ధ్వన్యాలోకములు :- అఖిలభారత ప్రఖ్యాతిని గని పఠన పాఠములలో మిక్కిలి ప్రచారము నొంది యున్న ధ్వన్యాలోకమునకు తెలుగులోను గొన్ని యనువాదములు వెలసినవి. ధ్వనికారికల కనువాద మగు "ఆంధ్రధ్వని" సుప్రసిద్ధ పండితులయిన శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిరి. పిమ్మట ప్రకటింపబడిన వానిలో శ్రీ విద్వాన్, సాహిత్య శిరోమణి భాగవతుల కుటుంబశాస్త్రి (ఎం. ఏ.) గారి "అఖిల వాంధ్ర ధ్వన్యాలోకము (ప్రథమోద్యోతము మాత్రమే), శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రులుగారి "ఆంధ్రధ్వని", న్యాయ శిరోమణి శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారి "ఆంధ్ర ధ్వన్యాలోకము" ప్రసిద్ధములు.

చ. రం.

## ఆనకట్టలు : నిక్షేప జలాశయ నిర్మాణము :-

1. జలాశయ నిర్మాణమునకు గల ముఖ్యోద్దేశములు :- జలాశయములు ఈ క్రింద వివరింపబడిన ఉపయోగముల కొరకై ముఖ్యముగా నిర్మించబడును.

1. వర్షములేని ఋతువులలో, లేక వర్షములు తక్కువగా నున్న కాలములో సస్యములకు అనుకూలముగా నీరు సరఫరా చేయుటకు, బెట్టకాలములో మానవులకు పశుపక్ష్యాదులకు జీవనాధారమునకై నీరు సమకూర్చుటకు,
2. పెద్దనదుల వరదలవలన దేశమునకు కలుగు ఉపద్రవములను అరికట్టుటకు,
3. దేశములో పారిశ్రామికాభివృద్ధికై అవసరమగు విద్యుచ్ఛక్తిని చౌకగా ఉత్పత్తి చేయుటకు,
4. నౌకాయానమునకు వసతులు కల్పించుటకు.

కొన్ని ప్రదేశములలో వర్షములు సంవత్సరములో చాల భాగము విరివిగా కురియుచుండును. ఇవి సామాన్యముగా సస్యానుకూలముగ నుండుటచే పంటలు పండించుటకు వర్షముల ద్వారమున దొరకు నీరు సరిపోవును. కాని యితర ప్రదేశములలో సంవత్సరములో ఏ కొద్ది కాలమో వర్షములు కురియును. మిగత కాలములో వర్షము లుండవు. వర్షాకాలములో పైరులకు అవసరమైన దానికంటె అధికముగా నీరు లభించుటయు, ఇతర కాలములో పైర్లు పెరుగుటకు చాలినంత నీరు దొరకక

పోవుటయు జరుగును. అట్టి సందర్భములలో వర్షాకాలములలో అధికముగా లభించి సముద్రమునకు నిరుపయోగముగా చేరుచున్న నీటిని నిలువచేసి పైర్లు పెరుగుటకు అనుకూలముగా నీరు అందజేయుటకు నిక్షేప జలాశయములు (Storage reservoirs) నిర్మించబడును. ఇట్టి జలాశయములనుండి కాలువలద్వారా నీరు పొలములకు అందజేయబడును.

దేశములో ప్రవహించెడు పెద్దపెద్ద నదులలో తరచుగా వర్షాకాలమునందు వరదలు వచ్చును. వీటివలన అనేక గ్రామములు అనేక చదరపుమైళ్ళ విస్తీర్ణముగల పంటభూములు చెల్లాచెదరై పోవును. జలాశయ నిర్మాణము వలన ఈ వరదల ఉధృతమును తగ్గించి, దేశమునకు కలుగు అరిష్టములను పోగొట్ట వచ్చును.

కర్మాగారములను నడపుటకు కావలసిన శక్తిని బొగ్గు, పెట్రోలు, డీజలు నూనె సప్లయి చేయును. కాని ప్రపంచములో ఇవి లభించెడు ప్రదేశములు మిగుల తక్కువ. వాటినిక్షేపములు కూడ దినదినము తగ్గిపోవుచున్నవి. ఇందువలన క్రమముగా పారిశ్రామిక పరిస్థితులు క్షీణించవచ్చును. ఈ క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనుటకు జలాశయములు ఉపయోగపడును. వీటిద్వార ఒక ఎత్తైన ప్రదేశములో నీటిని నిలువజేసి, దానిని క్రమవిధమున క్రింది ప్రదేశములకు వదలినచో ఏర్పడు జలపాతమునుంచి శక్తిని పుట్టించవచ్చును. దీనినే జలవిద్యుత్ అందురు. దీనిద్వారమున కర్మాగారములకు చౌకధరలో శక్తి దొరకును. సరకులు ఒక ప్రదేశమునుండి ఇంకొక ప్రదేశమునకు రైళ్ళు, బస్సులు, ఎద్దులబండ్లు మొదలైన వాటిమీదకన్న పడవలు, లాంచీలద్వార చాలతక్కువ ఖర్చులో రవాణా చేయవచ్చును. జలాశయముల వలనను, వాటినుండి ప్రవహించు కాలువలవలనను దేశములో నీటి రహదారులను కల్పింపవచ్చును.

2. జలాశయపు కట్టడముయొక్క నిర్మాణము :- ఏదైన ఒక నదిమీద జలాశయ నిర్మాణము కావించుటకు ముందు నదినుండి ఎంత నీరు లభించును ? ఈ నీటిద్వార ఎంత భూమి సేద్యము కాగలదు ? జలాశయముద్వార జలవిద్యుత్తును ఉత్పత్తిచేయుటకు అవకాశ మున్నదా? జలాశయ నిర్మాణమునకు అవసరమగు కట్టడమునకు తగిన పునాది ఉన్నదా ? మొదలగు విషయములను పరిశీలించవలసి యుండును. ఆనకట్ట నిర్మాణమునకు అనువగు స్థలము నిర్దేశించిన తరువాత ఏరకమైనకట్ట, ఎంత ఎత్తున కట్టవలెను అను విషయములను నిర్ధారణ చేయవలెను. జలాశయముల కట్టలను మట్టితోగాని, రాతిగచ్చుతోగాని, సిమెంటు కాంక్రీటుతోగాని, నిర్మింపవచ్చును.

3. మట్టి కట్టడములు :- మనదేశములో మట్టితో కట్టలు వేయుట పూర్వకాలము నుండి ఆచరణలో నున్నది. పాకాల,రామప్ప మొదలగుతటాకములను మట్టికట్టడముల తోనేనిర్మించి యున్నారు. మట్టికట్టలు యితర విధములైన కట్టలకంటె చాల తక్కువ ధరతో తయారగుటయు, ఈ కట్ట నిర్మించుటకు అవసరమగు మన్ను ఎచ్చటైన సులభముగా దొరకుటయు వీటిని నిర్మించుటకై ప్రత్యేకమైన నేర్పరితనముగల పనివాండ్రు అవసరము లేకపోవుటయు, మట్టి కట్టలు విరివిగా కట్టబడుటకు కారణములై యున్నవి. సుమారేబది అడుగుల ఎత్తువరకు నీటిని ఆపుటకు మట్టితోనే కట్టలు కట్టవచ్చును.

మనకు సామాన్యముగా లభించు మట్టి రెండు రకములుగా ఉన్నది. ఒకటి ఇసుకమన్ను, రెండవది బంకమన్ను. ఇసుకమన్నులో నున్న మట్టి రేణువులు పెద్దవిగాను, రేగడి, ఒండ్రు మట్టిలోనున్న రేణువులు సూక్ష్మమైనవిగాను ఉండును. మంటి రేణువులు పెద్దవిగా ఉన్నప్పుడు ఆ మట్టికి ఎక్కువ స్థిరత్వముండును. అటువంటి రేణువులు సులభముగా నీటిప్రవాహములో కొట్టుకొనిపోవు. ఎండ తీవ్రతకు పగుళ్ళు పాయవు. కాని రేణువుల మధ్యనున్న సూక్ష్మ రంధ్రములగుండ కొంత నీరు బైటికి ప్రవహించుటకు అవకాశమున్నది.

రెండవరకపు మట్టిలో, మట్టి రేణువులు సూక్ష్మమైనవిగా నుండుటచేత నీటితేమకు మెత్తబడి తేలికగా తన నిజస్థానమును వదలి కొట్టుకొనిపోవును. ఎండ తీవ్రతకు పగుళ్ళుబాసి నెఱ్ఱెలు విచ్చును. ఈ పగుళ్ళద్వారా ఆవబడిన నీరు వెలుపలకు పోవును. కాని అణువులమధ్య సూక్ష్మ రంధ్రములు బహు చిన్నవిగా నుండుటచేత నీరు సులభముగా జారిపోదు. ఈ మట్టికి జిగట స్వభావముండును. కనుక పై రెండు విధముల మన్నులలో ఏ ఒక్క దాని యందును కట్టలు కట్టుటకు అనుకూలమైన గుణములు

సంపూర్ణముగా లేవు. అందుచేత వీటిని సమభాగములుగా కలిపి కట్టిన, కట్ట మిక్కిలి పటిష్ఠముగా నుండును. కట్ట యొక్క మధ్యభాగములో నల్లమన్నును, కట్టకు అటు, ఇటు గరపమన్నును వేసికూడ బలమైన కట్టడము నిర్మింప వచ్చును. మన్ను షుమారు ఒక్కొక్క అడుగుమందము పరచి పశువులతో త్రొక్కించియైనను, లేదా యంత్రముతో నడిచెడు రోలర్లతోనైనను, గట్టి పరచుచు, కట్టను పెంచుచు పోవలెను.

కట్ట నిర్మాణమునకు అవసరమైన మట్టిని సేకరించిన పిదప కట్ట ఎంత ఎత్తు ఉండవలెను, దాని వెడల్పు ఎంత యుండవలెను అను అంశములు నిర్ణయించవలసి యున్నది. కట్ట సాధారణముగా ఒక లోయయొక్క ఒక పార్శ్వము నుండి మరియొక పార్శ్వమునకు ఆవరించి యుండవలెను. సేద్యము కాగల భూమి విస్తీర్ణత యొక్క అంచనా ప్రకారము కట్టయొక్క ఎత్తు నిర్ణయించబడును. ఎత్తు నిర్ణయమైన తరువాత కట్ట పై భాగముయొక్క వెడల్పు ఈ క్రింది పథకము ప్రకారము నిర్ణయమగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 అ — 10 అ. | ఎత్తువరకు | కట్టపై | వెడల్పు | 6 | అడుగులు |
| 10 అ — 25 అ. | ,, | ,, | ,, | 8 | ,, |
| 25 అ — 50 అ. | ,, | ,, | ,, | 15 | ,, |
| 50 అ. పైన ,, | | ,, | ,, | 20 | ,, |

కట్టకు ఒక పార్శ్వమందు నీరు నిల్చి యుండును. దానిని నీటిపార్శ్వము అని అందురు. నీటి పార్శ్వమందు ఏటవాలు $1\frac{1}{2} : 1$ ఉండవలెను. ఈ పార్శ్వముపై రాతిని బిగించిన యెడల కట్టగుండ ఏ విధమైన నీటిజాలు కలుగకుండ అరికట్టుటకు సాధ్యమగును. కట్టయొక్క వెనుక భాగము 2:1 ఏటవాలుతో నిర్మించవలెను. సాధారణముగ మట్టికట్టలయొక్క పథకము ప్రక్క చూపబడి నట్లుండును.




సాధారణమైన కట్టయొక్క పటము

వర్షాకాలములో ఒక్కసారి వర్షము ఎక్కువగా కురియుటచే చెరువులు నిండి వాటి కట్టలమీది నుండి నీరు పొర్లిపోవును. నీటి ప్రవాహమువలన కట్టలమన్ను కొట్టుకొనిపోయి కట్టలు తెగిపోవును. కావున నీటి ప్రవాహము కట్టలపైనుండి పొర్లిపోకుండ చేయుట అవసరము. దీని కొరకు మత్తడి కట్టవలసియుండును. మట్టికట్టయొక్క మధ్యభాగమందుగాని, ఇరుపార్శ్వములందు గాని యీ మత్తడి రాతితో కట్టబడును. ఇదికూడ కట్టయందు ఒక భాగమే. కాని మట్టికట్టకన్న సుమారు 5, 6 అడుగుల ఎత్తు తక్కువ యుండును. అందుచేత నీటి ప్రవాహము అధికమైనప్పుడు ఎక్కువైన నీరు మత్తడి భాగముగుండ ప్రవహించి పోవుటచే మట్టికట్టకు ప్రమాదము కలుగదు.

మట్టికట్టను నిర్మించునప్పుడు ఎంత గట్టిగా త్రొక్కించినను మట్టి రేణువుల మధ్యనున్న సూక్ష్మరంధ్రముల ద్వారా తటాకమందలి నీరు కట్టగుండ జారుచుండును. నీటిజాలు గుండ మట్టి రేణువులు గూడ కొట్టుకొనివచ్చును. మట్టి రేణువులు కట్టలో నుండిపోవుటచే కట్ట క్రమేణ బలహీనమగును. దీనిని నివారించుటకు వడకట్టు కాలువలు నిర్మింపవలసి యుండును. కట్టపొడుగున నేలమట్టముపై, ఒక గజము వెడల్పు, ఒక గజములోతు కాలువను త్రవ్వి ఇసుక, కంకర, మరియు పెద్దపెద్ద రాళ్ళతో ఈ కాలువను నింపవలెను. కట్టలనుండి వచ్చు నీటిజాలు ఈకాలువలోనికి చేరి చిన్న అడ్డకాలువద్వారా బయటికి పంపివేయబడును. ఈ అడ్డకాలువలో గూడ ఇసుక, కంకర, పెద్ద రాళ్ళను నింపవలెను.

**4. రాతికట్టలు :** రాయి, గచ్చుతో కట్టబడిన కట్టలు మట్టికట్టలకంటె ఎక్కువ బలముగా నుండును. జలాశయ

మందు నిలుపబడు నీటిలోతు ఏబది అడుగులకన్న ఎక్కువగా నున్నప్పుడు రాయి, గచ్చుతో కట్టను కట్టవలసి యుండును. అందుచేత, నీటిలోతు ఎక్కువగా ఉండవలసినప్పుడు రాతి, గచ్చుతోనే కట్టలుకట్టుట ఉచితము. ఇట్టి కట్టలు 200 అడుగుల లోతుగల నీటిని ఆపుటకుగూడ ఉపయోగపడును.

రాతికట్టలను కట్టుటకు కావలసిన ముఖ్యపదార్థము గచ్చు. దీనిని తయారు చేయుటకు సున్నము, ఇటుకపొడి, ఇసుక, సమపాళ్ళలో కలిపి గానుగలో త్రిప్పించవలెను. దీనిని 'సుర్కి' అనిగూడ అందురు. సుర్కితోనేగాకుండ సిమెంటు, ఇసుక 1:8 మొదలు 1:4 నిష్పత్తిలో కలిపి గూడ గచ్చు తయారు చేయవచ్చును.

రాతికట్టడమునకు ముఖ్యమైన పరికరములు కఠినమైన రాళ్ళు; అగ్నిశిలలు (Granite), మెట్టురాళ్ళు (Trap), ఇసుకరాయి మొదలగునవి. రాతి కట్టడము యొక్క స్వరూపము ఈక్రింది పటములో చూపబడినది.



రాయి - గచ్చుకట్ట

కట్టడము యొక్క నీటిపార్శ్వము నిట్టనిలువుగాను, లేక కొంచెము వాలుగాను ఉండును. వెనుక తట్టు యొక్క వాలు 2:3 నిష్పత్తిలో ఉండును. ఇవి నిర్ణయమైన తరువాత కట్టయొక్క అడుగుభాగపు వెడల్పు కనుగొనవలసియుండును. నీటివలన కలుగు ఒత్తిడి, కట్టయొక్క బరువు దృష్టియందుంచుకొని వెడల్పును నిర్ణయింపవలెను.

రాతికట్ట నిర్మించుటకు గట్టి పునాది అవసరము. దీని కొరకై భూగర్భములో కఠినమైనరాయి దొరకువరకును పునాది త్రవ్వవలసియుండును. గట్టి చదరపురాయి కనబడినతరువాత దానిని గరుకుగా ఉండునట్లు చేయవలెను. ఇట్లుచేసిన రాతిమీద గచ్చు గట్టిగా పట్టుకొనును. 3 అంగుళముల మందముగల గచ్చును, పునాది రాతిపై పరచి దానిపైన పెద్ద పెద్ద రాళ్ళను తెచ్చి పేర్చవలెను. రాళ్ళమధ్య చిన్న చిన్న రాతిచెక్కలను నింపి, మధ్యనున్న సందులందు గచ్చు కూరవలెను. ఒకవరుస కట్టిన తరువాత గచ్చు గట్టిపడునంతవరకు పనిని ఆపి తిరిగి రెండవ వరుసలో రాళ్లు నింపవలెను. ఈవిధముగా కట్టను పైదాక తీసికొనిరావలెను.

**5. సిమెంటు కట్టలు :-** రాతికట్టలు 200 అడుగుల ఎత్తువరకే కట్టవచ్చును. ఇంతకన్న ఎత్తైన కట్టడములకు సిమెంటు, కాంక్రీటు అనుకూలముగా నుండును.

సిమెంటు, కాంక్రీటువలన కట్టడములకు ఎంత బలము కావలెనో అంతబలము కలిగించవచ్చును. సిమెంటు కాంక్రీటు తయారుచేయుటకు తగిన యంత్రములున్నవి. సిమెంటు కాంక్రీటు పనికి శాస్త్రీయ పద్ధతులున్నవి. పరిశోధనాలయములో నిర్ణయించిన బలము సిమెంటు కాంక్రీటు కట్టడములో నమ్మకముగా కలిగించవచ్చును. కాని రాతికట్టడములోనున్న బలము నిర్ధారణగా చెప్పుటకు సాధ్యముకాదు. ఈ కారణమువలన చాల ఎత్తైన కట్టడములు కట్టవలసి వచ్చినపుడు సిమెంటు, కాంక్రీటు వాడుటయే మంచిది. సిమెంటు కాంక్రీటు తయారు చేయుటకు వివిధ రకముల యంత్రము లుండుటవలన రాతి కట్టడముకన్న సిమెంటు కాంక్రీటు కట్టడమునకు చాల తక్కువకాలము పట్టును.

సిమెంటు కాంక్రీటు తయారు చేయుటకు ఈ క్రింది పదార్థములు అవసరము. (1) సిమెంటు, (2) రాతి కంకర, (3) ఇసుక. పై పదార్థములు ఏ నిష్పత్తిలో కలిపి కట్టడములో వాడుదురో దానినిబట్టి సిమెంటు కాంక్రీటు యొక్క బలము ఆధారపడి యుండును. వివిధ నిష్పత్తులలో తయారైన కాంక్రీటు యొక్క బలము ఈ క్రింది విధముగా ఉండును:-

| కాంక్రీటు మిశ్రమము | | ఉత్పన్నమగు నిరోధక శక్తి |
|---|---|---|
| 1 : 1 : 2 | ...... | 3450 lbs. 1 Sq. Inch. |
| 1 : 1½: 3 | ...... | 2850 " 1 " " |
| 1 : 2 : 4 | ...... | 2250 " 1 " " |

సిమెంటు కాంక్రీటు శాస్త్రము చాల వృద్ధిచెంది యున్నది. దీనిని ప్రతి పనికిని అనుకూలముగా తయారు చేయుటకు వివిధ రకములైన యంత్రము లున్నవి.

కె. వి. యస్.

**అనువంశికము (Heredity) :-** ప్రపంచములోని ప్రాణికోటి, జీవితకాలములో పలువిధములగు జీవన వ్యాపారములు సలుపుచుండును. వానిలో పునరుత్పత్తి యొకటి. దీనికి కారణము ప్రాణి చిరకాలము బ్రతికి యుండజాలదు. కావున తనజీవిత పరిమాణము పూర్తి యగుటకు పూర్వము (పునరుత్పత్తి క్రియవలన) తనను బోలు సంతతినివీడి నశించును. పునరుత్పత్తి క్రియయందు ఒక మానవునకు మానవుడే పుట్టుచున్నాడు. ఒకకుక్కకు కుక్కయే పుట్టుచున్నది. ఒక గేదెకు గేదెయే జనించు చున్నది. ఇవి సర్వవిధముల రంగు, రూపు, గుణములందు తమ తలిదండ్రులను పోలియుండును. తల్లిదండ్రులనుండి దేహదార్ఢ్యము, మేధాశక్తి మొదలగు మంచిగుణములతో పాటు చెడ్డగుణములు నయితము సంక్రమించు చున్నవి. ఇట్లు తల్లిదండ్రుల గుణములు ఒక సంతతినుండి మరొక సంతతికి సంక్రమించుట అనువంశికము (Heredity) అన బడును. ఇందులో గుణముల సంక్రమణము పలువిధ ములుగనుండి వారసత్వము (inheritance) పై నాధార పడియుండును. కొన్ని గుణములు తల్లివి, మరికొన్ని తండ్రివి ఆయా సంతతిలో కాననగును. ఒక్కొక్కప్పుడు కొన్ని గుణములు ఒక సంతతిలో కనబడక రెండవతరము సంతతి (Second Generation) లో గోచరించును. ఒకే సంతతియందలి వివిధ వ్యక్తులందు పలువిధములగు వ్యత్యాసము లుండును. ఇట్టి వారసత్వమునకు కారణ ములు ఎంతో కాలమువరకు తెలియకుండెను. 18 వ శతాబ్దమువరకు దీనిని గురించి తెలిసికొనుటకు కృషి సలిపినవారే లేరు. ప్రప్రథమమున 18 వ శతాబ్దపు మధ్య కాలమున కొందరు వృక్షములలో కృత్రిమ సంపర్కము (Artificial pollination) చే సంతతి బడయగలిగిరి. కాని దానిని వివరీకరించరైరి. అటు తరువాత 19 వ శతాబ్ద ములో కృషి సాగించి కొందరు కొంతవరకు సఫలులైనారు. వీరిలో ముఖ్యులు ఆగస్టు వైజ్‌మన్ (August Weisman), గ్రెగర్ మెండెల్ (Gregor Mendel) అను వారలు.

అనువంశికమునకు భౌతికమైన పునాది (Physical Basis of Heredity :) వైజ్‌మన్ (Weisman) తన పరిశోధనల ఫలితముగ అనువంశికము (Heredity) నకు బీజరసము (Germ plasm) కారణమని 1892 వ సంవత్సరమున తెలియపరచినాడు. దీని నాతడు బీజరస సిద్ధాంతము (Germ Plasm theory) అని పేరొక్కన్నాడు. జీవ పదార్థము (Proto plasm) ను రెండు తరగతులలో విభజించెను. అవి (1) పునరుత్పత్తి కణములందుండు బీజరసము (Germ Plasm) (2) దేహముయొక్క ఇతర కణములందుండు సొమాటోప్లాజమ్ అనునవి. పునరుత్పత్తి క్రియయందు పునరుత్పత్తికణములు అనగా శుక్రగోళక ములు (Sperms) ను, అండము (Ova) లును పాల్గొనును. ఇతర కణములకు ఇట్టి క్రియతో ఎట్టి ప్రసక్తిలేదు. కావున అనువంశికమునకు కారణము పునరుత్పత్తి కణములం దుండు జీవపదార్థమే అని వైజుమను తెలిపియున్నాడు. తదుపరి పరిశోధనలవలన ఫలదీకరణము (Fertilization) న పునరుత్పత్తి కణములందలి బీజము (Nucleus) ప్రధాన మైనట్టిదనియు, ఇయ్యది లేనిచో కేవలము జీవపదార్థ ముతో ఫలదీకరణము జరుగనేరదనియు, జరిగినను పిండాభి వృద్ధి కానేరదనియు ధ్రువపడినది. ప్రతిబీజము (Nucleus) లో ఒక వలయుండును. దీనిని అభివర్ణి (Chromatin net - work) వల యందురు. ఈవల కణవిభజనకాల మందు ముక్కలు ముక్కలుగా విడిపోవును. ఈ ముక్కలు పిత్ర్యసూత్రము (Chromosomes) లనబడును. వీనిసంఖ్య నిశ్చితమై (Definite) జీవులయొక్క వివిధ జాతులందు వేరువేరుగా నుండును. ఈ పిత్ర్య సూత్ర ములను పరిశీలించగా ఇది పలువిధములైన ఆకారములు గలిగియుండునని తెలిసినది. వీటియందు ఒకజీవికి సంబం ధించిన గుణములన్నియు నిలువున పర్పరచబడియుండును. ప్రతి పిత్ర్యసూత్రము (Chromosome) నందు ఒకదాని కంటె ఎక్కువ గుణములు ఇమిడియుండును. ఒక పిత్ర్య

గుణము లేక సృజని (Gene) ఒక గుర్తు కలిగియుండును. ఇట్లు గుణములన్నియు వివిధ సృజనుల రూపమున పిత్ర్య సూత్రములపై నుండును. కాని ప్రతి గుణముయొక్క ఇచ్చట యేదిచర్చించినను సృజనిని గురించియే చర్చించవలసి యుండును. ఈ సృజనిని చర్చించుశాస్త్రము సృజన శాస్త్రము (Genetics) అనబడును. ఈ శాస్త్రమునకు










పటము 1

**B**
విభజనమగుచున్న జీవకణము
1. న్యూక్లియస్
2. న్యూక్లియోలస్
3. క్రొమోజోమ్స్

**C**
ఒక క్రొమోజోమ్
1. జీన్స్

**A**
విభజనకు పూర్వము జీవకణము
(a) న్యూక్లియస్
(b) న్యూక్లియోలస్
(c) క్రొమాటిన్‌వల

సృజని కనీసము రెండు పిత్ర్య సూత్రములపై నుండును. ఇట్లు గుణములన్ని జతలుగా వేరువేరు పిత్ర్య సూత్రములపై నుండదు. ఒకేవిధమగు సృజనులు (Genes) గల పిత్ర్య సూత్రములు జతలుగా నుండును. ఇది హ్రాసవిభాజనము (Reduction division) నకు ముఖ్య విషయము. పునరుత్పత్తికణములు అభివృద్ధిచెందునపుడు ఒక విభజనమునందు పిత్ర్య సూత్రముల సంఖ్య సగమగును. ఫలదీకరణమప్పుడు సగము పిత్ర్య సూత్రములు శుక్ర (Sperm) గోళకమునుండి, సగము అండము (Ovum) నుండి ఒకచో కలియుటచే, పిత్ర్య సూత్రముల (Chromosomes) సంఖ్య సమానమగును. ఇట్లుగానిచో ప్రతిఫలదీకరణమునందు సంఖ్య ద్విగుణీకృతమై పెరుగుచు పోవును. తుదకు దీనికి అంతు ఉండదు. సృజని (gene) సూక్ష్మాతిసూక్ష్మమై క్లిష్టతరమైన పదార్థము; ఇయ్యది న్యూక్లియో ప్రొటిన్. ఈ సృజనియే వారసత్వమునకును, ఆనువంశికమునకును కారణము కావున 19 వ శతాబ్దములో పునాది వేయబడినది. 20 వ శతాబ్దిలో అభివృద్ధి గావింపబడినది.

వైజ్‌మన్ బీజరసము వారసత్వము (inheritance) నకు మూలపదార్థమని తెలుపగలిగినాడు. కాని యిది ఎట్టి నిబంధనల ననుసరించి జరుగునో విశదీకరింపలేదు. ఆనువంశికమునకు కారణము తెలిసినపిదప దానికి సంబంధించిన నియమములను గుర్తించుటకు ప్రయత్నములు జరిపినవారిలో గాల్టన్, (Galton) మెండెల్, (Mendel) అనువారు ముఖ్యులు. గాల్టను కొన్ని వంశములందు గుణములను పరిశోధించి సంఖ్యానంబంధమైన పరిశోధనములచే మొత్తముమీద ప్రతి వ్యక్తికి సగము గుణములు తండ్రివైపునుండి, సగము తల్లివైపునుండి సంక్రమించునని తెలియచేసినాడు. అందులో ముఖ్యముగా సగము గుణములు తల్లిదండ్రులనుండి నాల్గవభాగము తాతనుండియు, ఎనిమిదవ భాగము ముత్తాతనుండియు ఇదే విధముగ క్రమముగా తగ్గుచుండునని తెలియ పరచెను. దీనితో

కొంతవరకు విషయము గ్రాహ్యమైనదే కాని ఇట్లు జరుగునని రూఢముగా తెలియలేదు. మెండెలు (Mendel) కావించిన పరిశోధనలు శాస్త్రబద్ధములై విషయమును విశద పరచుటకే గాక ముందు పరిశోధనములకు ఆధారములై నిలిచినవి.

మెండెల్ సిద్ధాంతము (Mendelism):- అనువంశికమును గురించిన సూత్రములను కనుగొన్నవారిలో గ్రెగర్ మెండెల్ (Gregor Mendel 1822-1884) ప్రథముడు. ఇతడు ఆస్ట్రియా దేశీయుడు. మొదట ఈతనికి పరిణామ సూత్రములతో గాని, వాటికి సంబంధించిన అభిప్రాయ భేదములతోగానీ ఎట్టి సంబంధము లేకుండెను. ఈతడు తెలిసికొనదలచిన విషయము ఒక్కటే. అదేమన: శిశువు అన్ని విధముల తన తల్లిదండ్రులను ఎందుకు పోలియుండవలెను ? శిశువునందుగల గుణములకు తల్లిదండ్రుల గుణములకు గల సంబంధమేమి ? అను అంశములను తెలిసికొనుటకై కృతనిశ్చయుడై తన తోటలోని సాధారణమైన చిక్కుడు చెట్టును పరిశోధన ద్రవ్యముగా గైకొనెను. చివరకు సఫలుడయ్యెను. ఈతడు తన సూత్రములను 1866వ సంవత్సరమున బ్రన్ (ఆస్ట్రియా) ప్రకృతి చరిత్ర సంఘు (Natural History Society) సమావేశములో ప్రకటించెను. కాని అప్పటంతలో ఈతని సూత్రములను అర్థముచేసికొని ఒప్పుకొనునంత శక్తిగలవారొకరును లేనందున ఆతని సూత్రములన్నియు అంధకారమునం దుండిపోయెను. మెండెల్ మరణానంతరము వేరు ప్రాంతములందు ముగ్గురు శాస్త్రవేత్తలు అవే సూత్రములను రెండవసారి కనుగొనిరి. వారు డి వెరిస్ (హాలెండు), కారెన్సు (జర్మనీ), వాన్సర్‌మార్కు (ఆస్ట్రియా). ఎన్నడో విస్మరించిన మెండెల్ సూత్రములను వీరు వెలికి తీసి పునరుజ్జీవింప జేయుటయే గాక ఒప్పుకొని, వానినే ఆధారముగ చేసికొని పరిశోధనములు సాగించిరి. ఒకనాడు అంధకార బంధురమైన సూత్రములు నేడు సృజన శాస్త్రమునకే కాక ఆధునిక జీవశాస్త్రమునకే పునాదులై పరిశోధనములను, అతి తేజోవంతములను కావించినవి. కాని చివరకు తన సూత్రము లామోదింపబడు గౌరవమును చూచి సంతసించు భాగ్యము మెండెలునకు చిక్కలేదు. ఐననేమి ? నేడు ఆతని పరిశ్రమమునకు తగిన స్థానము లభించినది.

మెండెల్ పరిశోధనములు :- మొదట మెండెలు తన తోటలోని చిక్కుడు తీగలలో ఒక పొడవుజాతిని, ఒక పొట్టిజాతిని తీసికొని పెంచి వానియందు పర పరాగ సంపర్కము (Cross Pollination) గావించి సంతతి కలిగించెను. ఇందు అన్నియు పొడవు రకపు గుణమునే ప్రకటించినవి. ఒకటైనను పొట్టిరకపు తీగ లేక యుండెను. ఈ సంతతిని మెండెల్ మొదటి పిత్ర్యమైన సంతతి (1st. filial generation) అనెను. ఈ సంతతిని పెంచి పెద్దచేసి దీనియందు స్వపరాగమునే సంపర్కము (Self pollination) గావించి, రెండవ సంతతి కలిగించెను. ఇది రెండవ పిత్ర్యమైన సంతతి (2nd filial generation) అనబడెను. ఇందులో మాత్రము కొన్ని పొడవుజాతివి, కొన్ని పొట్టి జాతివి ఉండెను. వీని నిష్పత్తి 3 : 1 అనగా మూడు పొడవుజాతి తీగలైన ఒకటి పొట్టిజాతి తీగ యుండెను. తరువాత సంతతులలో పొట్టివాటి నుండి స్వపరాగ సంపర్కమువలన పొట్టి జాతియే సదా సంభవించుచు వచ్చినది. పొడవు జాతియందు మాత్రము ఇట్లుకాక కొన్ని పొడవుజాతివి, కొన్ని పొట్టి జాతివి సంభవించినవి. వీటిని సూక్ష్మముగ పరిశీలించినచో పొడవైన మూడింటిలో, ఒకటిమాత్రము, లేక మొత్తము పొడవుజాతిలో మూడవభాగము ఎల్లప్పుడు పొడవుజాతినే ఉద్భవింపజేసెను. కాని మిగిలినవి పొడవుజాతిని, పొట్టి జాతిని రెండింటిని ఉద్భవింపజేసెను. ఇట్లు ప్రతి సంతతి యందు నాలిగింటిలో ఒకటి పొట్టిజాతిని మిగిలిన మూడింటిలో ఒకటి పొడవుజాతిని కలిగించుచుండెను. శేషించిన రెండును, పొడవు పొట్టి అను రెండుగుణములు గల జాతుల నుద్భవింప జేయుచుండెను. అనగా ప్రతి సంతతియందు 1 పొడవుజాతి, 2 పొడవు (బాహ్య), పొట్టి (అంతర) గుణములుకలజాతి, 1 పొట్టిజాతి కలుగుచుండెను. ఈయన ఈ ఫలితముల నాధారముగా జేసికొని ఈ క్రింది నాలుగు సూత్రములను బేర్కొన్నాడు.

1\. రెండు వ్యతిరేక గుణములు కలవాటియందు సంపర్కము కలుగచేసినయెడల మొదటి సంతతియందు ఒకేగుణము వెలువడును. దీనిని మెండెల్ (Mendel)

బలీయమైన (dominant) గుణమని అనెను. రెండవది మీదికి కనుపడక దాగియుండి రెండవ సంతతియందు గోచరించు దానిని ప్రచ్ఛన్నమైన (Recessive) గుణమనెను. ఇట్లు గుణముల నన్నింటిని బలీయమైనవి. (Dominant) లేక ప్రచ్ఛన్నమైనవి (Recessive) అను రెండు తరగతులలో విభజించవచ్చునని నిర్వచించెను.

తండ్రిరంగు నల్లగాను ఉన్నచో, సంతతియందు రంగునకు సంబంధించిన సృజనులజత ఉభయగుణ యుగ్మకము అగును. ఇద్దరు ఒకేరంగు కలిగియున్న సృజనులజత ఏక గుణయుగ్మక మగును.

3. ఒకదానికంటె ఎక్కువ గుణములు దృష్టియందుంచుకొని సంపర్కము గావింపజేసిన ప్రతిగుణము,

పటము 2

తల్లిదండ్రులు 1



మొదటి పిత్రీయమైన సంతతి 2



రెండవ పిత్రీయమైన సంతతి 3



2. జీవులయందు ప్రతి గుణమునకు సంబంధించిన ఒకజత సృజనులు (Genes) ఉండును. ఇందులో ఒకటి తండ్రినుండి, మరొకటి తల్లినుండివచ్చి ఒకజతగా నేర్పడునవెను. వీనియందు రెండును ఒకేజాతికి చెందినవైనచో ఆ జత ఏకగుణ సృజనయుగ్మకము (Homozygous) అనియు లేక రెండును వ్యత్యాసము కలిగియున్నచో ఆ జత ఉభయగుణ సృజన యుగ్మకము (Heterozygous) అనియు వ్యవహరింపబడును. ఉ. తల్లి రంగు ఎఱ్ఱగాను,

సంతతియందు స్వాతంత్ర్యము కలిగియుండి, తన నిష్పత్తిని తానేగలిగియుండును. ఒకదానివలన వేరొక గుణము యొక్క నిష్పత్తియందు ఎట్టి భేదమురాదు. ఈ గుణము, వారసత్వమున, మీద నుదాహరించిన మెండెల్ పరిశోధనముల ననుసరించి యుండును.

4. ఉభయగుణ సృజనయుగ్మక గుణమునకు సంబంధించిన వానియందు సంపర్కము గావింపజేసినచో మూడు విధములగు సంతతులు లభించును. ఇందులో

సగము మిశ్రమరకము. మిగత సగములో సగము బలీయమైన గుణముగలవి, సగము ప్రచ్ఛన్న గుణము గలవి. ఒక బలీయమైన గుణముగలది, రెండు మిశ్రమ గుణములుగలవి, మరొకటి ప్రచ్ఛన్నమైన గుణముకలది యుండును. మిశ్రితములగు వాటిని సంతతి బడయజేసినచో సంతతిలో తిరిగి మూడు విధములుండును. వాని నిష్పత్తి 1 : 2 : 1 : ఉండును. ఈవిధముగ ప్రతి సంతతియందు కొన్ని స్వచ్ఛమైన బలీయ (Pure dominants) గుణములు కలవి, కొన్ని స్వచ్ఛమైన ప్రచ్ఛన్న (Pure recessives) గుణములుగలవి వేరగుచుండును.

మెండెల్ మొదట తన పరిశోధనములను ఒక గుణము కొరకు జరిపెను. దీనిని ఏకప్రసంకరణత్వము (Monohybridism) అందురు. అటుపిమ్మట వివిధ గుణములకొరకు రెండు పరిశోధనములు సలిపెను. దీనిని ద్విప్రసంకరణత్వము (Di-hybridism) అందురు. గుణముల నెన్ని పెంచినను తానుమీదట సూచించిన సూత్రముల ననుసరించియే మెండెల్ కు ఫలితములు వచ్చెను.

మెండెల్ తరువాత పలువురు శాస్త్రజ్ఞులు ఈ పరిశోధనములు జరిపి వృక్షములందేగాక జంతువులందు సయితము పైన ఉదహరించిన ఫలితములను బడయగలిగినారు. దీనివలన మెండెల్ సూత్రములు సత్యములను మాట ధ్రువమైనది. ఈ పరిశోధకులలో బేట్సన్ ఇంగ్లాండునందు, మార్గన్ అమెరికా దేశమునందు ఎక్కువ ఖ్యాతి కాంచినారు. వీరి పరిశోధనములు మెండెల్ పరిశోధనములకు మెరుగుపెట్టుటయేగాక క్రొత్త విషయముల నెన్నియో తెలియజేసినవి. ఇందులో కొన్ని ముఖ్యాంశములు ఈ క్రింద వివరించబడును.

**వారసత్వము - లింగభేదము (Inheritance of Sex) :** మెండెల్ సిద్ధాంతము ప్రకారము సంతతిలో లింగభేదమును లెక్కించవచ్చును. దీని కొరకు గుణములలో ఒక ఏకగుణశీలముగల సృజనజతను ఒక ఉభయ శీలముగల సృజనజతతో సంపర్కము గలిగించుటను ఉదాహరణముగ తీసికొనవచ్చును. ఈ రెండింటిలో భేద మేమియు ఉండదు.

సాధారణముగ స్త్రీలయందు లైంగిక సంబంధమైన జతలో రెండు పిత్ర్య సూత్రద్వయము (క్రోమోజోమ్స్) ఉండును. అనగా ఈ జత ఏక గుణ సృజనయుగ్మక జాతికి చెందినదై యుండును.

పురుషులందు ఒక (క) పిత్ర్యసూత్రము దాని వెంబడి ఒక చిన్న (చ) పిత్ర్యసూత్రము ఉండును. ఇది ఉభయ




పటము 8

1. తల్లిదండ్రులు 2. పునరుత్పత్తి కణములు 3. సంతతి
మగ (xy హెటిరోజైగస్)
ఆడ (xx హోమోజైగస్)

గుణ సృజనయుగ్మక జాతికి చెందినది. ఈ రెండు రకముల జతలచే కలుగు సంతతియందు సగము తల్లినిబోలు సృజనుల జతను సగము తండ్రిని బోలు సృజనుల జతను కలిగియుండును. అనగా సగము ఆడవి, సగము మగవి సంభవించును. పక్షులందును కొన్ని కీటకములందును లింగభేదమును సూచించు సృజనుల జతలు సాధారణ జంతువులలోవలెగాక స్త్రీలయందు ఉభయగుణ సృజనయుగ్మము, పురుషులయందు ఏకగుణ సృజనయుగ్మము ఉండును.

**లింకేజ్ (Linkage) :** బోవెరి (Boveri) అను శాస్త్రజ్ఞుడు మెండెల్ యొక్క మూల సూత్రములకు కొంచెము విరుద్ధముగ ఒక విషయమును కనుగొన్నాడు ఒక పిత్ర్య సూత్రములో ఒక్కటిని మించిన గుణములుండును. ఇవియన్నియు వారసత్వమున సంతతియందు కలిసి గోచరించును. లేదా ప్రచ్ఛన్న మగును. అనగ అన్నియు స్వతంత్రముగా వ్యక్తముకావు. ఇట్లు కలి!

యుండుట సంపృక్తము (లింకేజ్- Linkage) అనబడును. ఈ కలిసి యుండుటను సామాన్య పద్ధతిలో వేరుజేయుటకు వీలుగాదు. దీనినే పన్నెట్, బేట్‌సన్ మొదలగువారు బలపరచినారు. వీరి పరిశోధనములందు 'ఫలమక్షికము' (Fruit fly) అను ఒక విధమగు ఈగను పరిశోధన ద్రవ్యముగ గైకొన్నారు. ఇందులో తెల్లని కండ్లతోబాటు పసుపు పచ్చని దేహముగలవాటిని, ఎఱ్ఱని కండ్లతోబాటు బూడిదవర్ణపు దేహముగలవాటితో సంపర్కము గావించినచో అన్నియు ఎఱ్ఱని కండ్లు, బూడిదవర్ణపు దేహము గలిగియున్న సంతతి లభించెను. అనగా ఈ రెండు గుణములు ఒకే పితృత్యసూత్రము పైనుండుటచే ఇట్లు సంభవమగును. అట్లుగాకున్న బూడిద వర్ణమును, పసుపు వర్ణమును వేరువేరుగా సంపర్కము గావించినచో పసుపువర్ణమే వ్యక్తమగును. కాని ఇచట ఎరుపురంగు కండ్లతో కలిసియున్నందున బూడిదవర్ణము వ్యక్తమైనది. ఇట్లే మానవులయందు అధిరక్తస్రావము (Haemophilia) అను రోగమునకు సంబంధించిన జీన్ ఎల్లప్పుడు పురుషులందు 'X' అను లింగజాతి పితృత్యసూత్రముతో కలసియుండును. ఇది బలీయమైనదికాదు కావున 'X' పితృత్యసూత్రము వెంబడి స్త్రీ సంతతిజేరును. అచట అది వ్యక్తముగాదు. ప్రచ్ఛన్నముగా నుండిపోవును. రెండవసారి స్త్రీయె రోగముగల 'X' సృజనిని తన మగ సంతతి కిచ్చును. అప్పుడది వ్యక్తమగును. ఇట్టివానిని లింగసంపృక్త పితృత్యసూత్రము అందురు.

పరోపగమనము (Crossing over): ఫలదీకరణమునకు పూర్వము పునరుత్పత్తికణములలో పితృత్యసూత్ర సంఖ్య ఎల్లప్పటికంటె సగముగా నుండును. ఫలదీకరణము తరువాత సంఖ్య పూర్తి యగును. పునరుత్పత్తికణముల అభివృద్ధికాలమునందు ఒక విభజన పితృత్యసూత్ర సంఖ్యను సగముచేయును. ఇది మియోసిస్ (meiosis) అర్ధసూత్ర భాజనము అనబడును. ఇట్టి విభజన జరుగునప్పుడు ఒకప్పుడు సరూప పితృత్యసూత్రములు (సిమిలర్ క్రోమోజోమ్స్) జతలుగా జేరుకొనును. దీనిని సైనాప్సిస్ (Synopsis). యుగ్మానుబంధముందురు. ఒక్కొక్కప్పుడు ఇవి మెలివడును (twist). ఆ మెలివడినచోట్ల యందివి విరిగి ఒకదానితో నొక్కొక్కటి అతుకుకొనిపోవును.




పటము 4

1. క్రోమోజోమ్సు సైనాప్సిసుకు పూర్వము 2. క్రోమోజోమ్సు మెలివడుట 3. క్రోమోజోమ్సు సైనాప్సిస్ తరువాత

దీనివలన పితృత్యసూత్రము పైనున్న గుణముల క్రమము మారును. ఈవిధముగా ముందుగా తల్లిపైపునుండి వచ్చిన పితృత్యసూత్రము పైనున్న గుణములు తండ్రిపైపునుండి వచ్చిన పితృత్యసూత్రములతో కలిసిపోవును. అట్లే రెండవ దానిలో మార్పువచ్చును.

ఈవిధముగ పరోపగమనముచేత సంతతియొక్క గుణలక్షణములలో మార్పులుగలిగి, ఒకదానితో నింకొకదానికి చాల భేదమేర్పడును. ఒక జాతికి చెందిన రెండు జీవులలో లేక ఒకే తల్లి సంతతియందు భేదముండుటకు ఇదియే కారణభూతమై యున్నది.

ఉత్పరివర్తనములు (Mutations): సృజన (Gene) శాస్త్రము క్రమక్రమముగా ప్రపంచమంతట ప్రఖ్యాతి గాంచుటయే గాక పరిశోధనములకు కేంద్రమై నిలిచినది. సృజని (Genes) అనువంశికము (Heredity) నకు భౌతికాధారము (Physical Basis) అను భావము ధ్రువతరమైనది. కదళీ మక్షికజాతి (Drosophyla) ఈగయందు పితృత్యసూత్రము యొక్క ఉనికి, ఆకారమును గూర్చి పూర్తి పరిశోధనలు జరిగినవి. ఈ పరిశోధనముల మూలమున అప్పుడప్పుడు ఒక పితృత్యసూత్రములోగల సృజనుల యందు అకస్మాత్తుగా మార్పు (Sudden change) వచ్చునని డీవెరెస్ (D'Vries) అను నాతడు కనుగొనెను. ఇట్టి మార్పును ఉత్పరివర్తనము (Mutation) అందురు. ఇట్టి మార్పులవలన జీవియొక్క స్వభావము, ఉనికి మొదలగ వాటియందు కొన్ని మార్పులు సంభవించును. ఈ మార్పులు వాతావరణమునకు అనుకూలముగనుండి లాభ

దాయకములైనచో మార్పుగల సంతతి యంతయు అభివృద్ధి చెందును. మార్పు నష్టదాయకమైనచో సంతతి క్షీణింప నారంభించును. ఇట్టి సృజన ఉత్పరివర్తనములు అనాదినుండి జీవులలోసంభవించుచు వచ్చినవి. కావుననే జీవము కాలక్రమేణ ప్రపంచమునందు అభివృద్ధి చెందుచు పరిణామము పొందినది. ఇట్లు జరుగు ఉత్పరివర్తనములు వాతావరణములోని మార్పులవలన నేమి, ఆహారము వలననేమి ప్రకృతి సిద్ధముగ జరుగుచుండును. కాని తరుచుగా మారవు. మార్పు సంభవించినపుడు మాత్ర మొక క్రొత్తతెగను సృష్టింపచేయును. ముల్లర్, స్టాడ్లర్ అనువారలు పరిశోధనములు జరిపి ఉత్పరివర్తనములు క్ష-కిరణముల (x Rays) మూలమున తేవచ్చునని తెలియజేసినారు. ఇట్టి మార్పులను పరిశోధనముల మూల మున కలుగజేసి పరిణామ వేగమును ఎక్కువ చేయ వచ్చును. ఇంతియేగాక ఆహారమునందు మార్పుతో సహితము ఇట్టి సృజన మార్పులు సంభవింపచేయవచ్చు నని తెలిసినది. ప్రతి సృజని సూచించు గుణము దాని వలన జరుగు రాసాయనిక ప్రతిక్రియకు అనుగుణముగ నుండును. దీని నాధారముగా జేసికొని ఈగలయందు స్పర్శసూత్రము (Antenna) లేక యుండు గుణమును విటమిన్ బి ఆహారముగ నిచ్చి సృజనియందు స్పర్శసూత్ర మును (Antenna) పెంచు గుణముగలదానినిగా మార్చ గలిగినారు.

**లైసింకో (Lysenko)**: మెండెల్ సిద్ధాంతములు ప్రపంచమంతట వ్యాపించి పరిశోధింపబడినవి. రష్యాలో సయితము సృజన శాస్త్రము ఇతరదేశములతో సరి సమానముగ అభివృద్ధి చెందినది. ఈ శాస్త్రమునందు పలువురు శాస్త్రజ్ఞులు ఈ ప్రాంతమున ప్రఖ్యాతిగాంచినారు. వీరిలో వావిలోవు (Vovilov) అనువాని పేరు మొదట పేర్కొనవలసి యుండును. కాని దాదాపు 1930 నుండి రష్యాదేశమున మెండెల్ సిద్ధాంతమునకు వ్యతిరేకత మొదలయినది. దీనిని ప్రతిపాదించినవాడు లైసింకో. ఈతడు మిషూ్యారిన్ అను నొక ఉద్యానపాలకుని (Horticulturist) అనుభవముల నాధారముగా చేసికొని ఒక క్రొత్త సిద్ధాంతమును ప్రవేశ పెట్టెను. దీనిని మిషూ్యారిన్ సిద్ధాంతము అందురు. ఈ సిద్ధాంతమునకు రష్యాదేశమున నేర్పడిన గొప్పప్రచారము కారణముగా ఇది మెండెల్ సిద్ధాంతము యొక్క స్థానమునాక్రమించినది. మిషూ్యారిన్ అనువాడు వారసత్వమును గురించి లామార్కు యొక్క అభిప్రాయముల ననుసరించినాడు. దానినే లైసింకో బలపరచి ప్రచారములోనికి తెచ్చెను. మిషూ్యారిన్‌కు వృక్షవర్ధి ప్రసంకరణము - (Vegetative hybridisation) నందు ఎక్కువ నమ్మకముండెను. ఒకజాతి వృక్షముయొక్క కొమ్మను ఇంకొకజాతి వృక్షము యొక్క కొమ్మతో అంటుపెట్టినచో (Grafting) ఆ అంటు నందు రెండవదాని ప్రభావము పడును. ఈ ప్రభావము అంటుచెట్టుయొక్క సంతతిలోకూడ కనబడునని తెలిపెను. ప్రభావ గుణములు మొదట అస్థిరములుగా నుండును. తరువాత గట్టిపడును. గుణములను మార్చుశక్తి వాతావరణమునందు గలదని చాటెను. మిషూ్యారిన్ సిద్ధాంతములో ఆనువంశికము విషయమున ఒకజీవిపై బడు వాతావరణ ప్రభావము కొన్ని తరముల (Generations) వరకు కొనసాగుటచే స్థిరపడిపోవును. ఈ ప్రభావములో లేక గుణములలో మార్పు ఒక్క పునరుత్పత్తికణము (germ cells) లందు జరుగుటవలనగాక దేహకణములన్నిటి యందును అనగా దేహమునందు జరుగు ఉపచయాపచయ క్రియలన్నిటియందును (Metabolic activities) మార్పు సంభవించుట వలన సంప్రాప్తమగు నని చెప్పబడినది. ధాన్యములలో వసంతీకరణ (Vernalisation) పద్ధతిచే శీతకాలపు (Winter) జాతిని వసంతకాలపు (Spring) జాతిగా మార్చవచ్చును. ఈ విషయము ఒక సంతతివరకే వసంతీకరణ (Vernalisation) పద్ధతితో మార్పులుకల్పించి ఆనువంశికముగా ఈ క్రొత్త గుణముండునటుల చేయ వచ్చునని తెలుపబడినది. ఇంతేగాక ఇదే పద్ధతిలో గోధుమలను నీవారము (Rye) గా గూడ మార్చవచ్చునని అనబడెను. ఇంతవరకు ఇట్టి పరిశోధనములు రష్యావరకే పరిమితములై యున్నవి. రష్యనులు ప్రకటించినట్టి ఫలములను పొందజాలకుండుటచే ఇతర దేశస్థులుపై సిద్ధాంతములు శాస్త్రవిరుద్ధమని తిరస్కరించినారు.

**ఆర్థిక ప్రాముఖ్యము (Economic Importance)**: ఈ శాస్త్ర పరిశోధనముల ఫలితముగ ప్రపంచమునందు గల జంతువులయొక్కయు, వృక్షములయొక్కయు సంత

తిని మెరుగుచేయుటకై కల్పితపద్ధతిలో సంతానోత్పత్తి (artificial breeding) గావించి పలువిధములగు క్రొత్త విషయములను పరిశోధకులు తెలిసికొన గలిగినారు. ఇట్టి పద్ధతులు వ్యవసాయ పరిశోధన కేంద్రములందు పశు అభివృద్ధి కేంద్రములందు విరివిగా ఉపయోగమందున్నవి. మెండెల్ సూత్రముల ననుసరించి రెండు భిన్న గుణములుగల తెగలను తీసికొని వానియందు కావలసిన లాభదాయక గుణము నొకదానినే పెంపొందజేసి ఆ సంతతినే ఇతరులనుండి వేరుచేసి, లాభదాయకమైన క్రొత్త జాతిని సంపాదించవచ్చును. జంతువులలో ఎక్కువ పాలుఇచ్చు ఆవుల తెగను లేక ఎక్కువ బలము కలిగి కష్టముచేయు కోడెల తెగలను ఇదేపద్ధతిలో అభివృద్ధి చేయవచ్చును. మానవులలో నయితము వంశపారంపర్యముగావచ్చు చెడుగుణములను వివిధరోగములను నిర్మూలింపజేయుటకుగాని, లేదా మేధాశక్తి, గాయనము, గణితము, చిత్రలేఖనము మొదలగువానిని అభివృద్ధి చేయుటకుగాని ఈ సిద్ధాంత మెంతేని సహాయపడును. ఇతర జంతువులయందువలె మానవులలో కృత్రిమ పద్ధతిలో సంతానము బడయుట సాధ్యముగాని పనియైనను సృజన శాస్త్రమును మానవాభ్యుదయమునకు వర్తింపజేయవచ్చును. దీనినిగురించి చర్చించు శాస్త్రము సృజననవిద్య (యూజెనిక్స్- Eugenics) అనబడును. ఈ శాస్త్ర సాహాయ్యమున విద్యమూలమున మానవ తెగలందుగల మంచి గుణములను అభివృద్ధిచేయుటకును, చెడుగుణములను వారించుటకును తగిన చర్యలను తీసికొనవచ్చును. వివాహములందు ఇట్టి నిబంధనలు పాటించుటకు ప్రయత్నములు సలుపవచ్చును. మీదుమిక్కిలి నిబంధనలను చట్టబద్ధము చేయవచ్చును. మానవులకు మంచి భోజనము, మంచి వాతావరణము మొదలగు సదుపాయములచే సృజనశక్తియందు తగిన ప్రభావము ప్రసరింప జేయవచ్చును. ఆహారమునకై వధింపబడు పాలిచ్చు జంతువులను అభివృద్ధి కేంద్రములందుంచి మంచి మంచి తెగలను సృష్టించుటకు యత్నము జరుగుచున్నది. ఆహారధాన్యములలో ఎక్కువ పంటనిచ్చు జాతుల అభివృద్ధికై కృషి జరుగుచున్నది. ఈ కృషి మూలముననే పశువైద్యశాలలందు మంచి విత్తనపు కోడెలనుంచి మంచి సంతతిని బడయుటకు ఉపయోగించుటయు వ్యవసాయ శాఖవారు మంచి విత్తనముల ప్రోగుచేసి రైతుల కందించుటయు మనము కాంచుచున్నాము.

వె. జ.

**ఆనెగొంది** :- తుంగభద్రానదికి ఉత్తర తీరమున నున్న ఇప్పటి శిథిలమగు ఆనెగొంది ఒకప్పు డొక ఆంధ్ర సంస్థానమునకు రాజధానిగా నుండి ఆంధ్ర చరిత్రమున ప్రముఖపాత్రను వహించి యుండెను. కన్నడభాషలో 'ఆనె' యనగ ఏనుగని యర్థము. ఆనెగొంది యనగా ఏనుగులకోన. దీనివలన నా ప్రదేశ మొకప్పుడు కాకులు దూరని కారడవిగా నుండె నని తెలియుచున్నది. ఆనెగొందియే కిష్కింధ యనెడు ఐతిహ్యము కలదు. ఋశ్యమూకము, పంపా సరోవరము, చక్రతీర్థము మున్నగు రామాయణ ప్రసిద్ధ స్థలములు ఆ పరిసరముల నుండుటచేతను, సీతాన్వేషణమున, లంకకు పోవుటకు శ్రీరాముడవలంబించిన మార్గ మదే యగుటచేతను ఆ యైతిహ్యము సమంజసమే కాగలదు.

ఆనెగొంది పూర్వ చరిత్రము అగాధ కాలగర్భమున నిగూఢముగ నున్నది. బౌద్ధమతావలంబకు లగు ఓఢ్ర యవనులీ ప్రాంతము నాక్రమించుకొని సముద్రతీరముల దనుక నాలుగు శతాబ్దముల వరకు పాలించిరను విషయము యథార్థమని చెప్పుట కవసరమగు చారిత్రక సంపద యింకను దొరకలేదు. క్రీ. శ. ౧౧ వ శతాబ్దము నుండి కొంత చరిత్రము కనుపించును.

క్రీ. శ. 1323 వ సంవత్సరమున ఓరుగల్లు పతనానంతరము అట రాజ ధనాగారాధ్యక్షులుగ పనిచేయుచుండిన హరిహర, బుక్క అను సోదరులు ఆనెగొంది నేలుచున్న జంబుకేశ్వరుని కొలువులో ప్రవేశించిరి. తమ ప్రతిభచే నాచిరకాలముననే మంత్రి, కోశాధ్యక్ష పదవులను సంపాదించుకొనిరి.

జంబుకేశ్వరుడు ముప్పదేడేడులు (క్రీ.శ. 1297-1334) సర్వజనరంజకముగా రాజ్యమేలెను. అతడు సాహసి. విక్రమోపేతుడు, త్యాగి, శరణాగత రక్షణ బద్ధకంకణుడు. 'కంపిలి' నగర మతని రాజధాని. కంపిలికి పడమట రమారమి ఎనిమిది మైళ్ళ దూరమున దుర్గమ పర్వత పంక్తుల మధ్య, శత్రుదుర్భేద్యముగ నిర్మింపబడి యున్నది

ఆనెగొంది కోట. ఆపత్సమయములందు కంపిలి రాజులు అందు ప్రవేశించి ఆత్మరక్షణము చేసికొనుచుండిరి.

బహాపుద్దీన్ ఘష్తాఫ్ అనునతడు ఢిల్లీ చక్రవర్తియగు మహమ్మదు తుగ్లకునకు మేనల్లుడు. ఆతడు తన మామపై తిరుగుబాటు చేసెను. ఆతనికి ఉత్తర హిందూస్థానమందు తలదాచుకొనుటకు వీలుకలుగలేదు. కనుక ఆతడు తురకల కందుబాటులో లేని కంపిలి నగరమున కేతెంచి జంబుకేశ్వరుని శరణు చొచ్చెను. కాని అతనిని తరుముచు మహాసేనలతో చక్రవర్తియు కంపిలిని సమీపించెను.

జంబుకేశ్వరుడు మెరికలవంటి ఐదువేల జోదులతో ఆనెగొంది దుర్గమున ప్రవేశించెను. ఆ కోటను మొగలులు ముట్టడించిరి. శరణాగతుడగు బహాపుద్దీనును జంబుకేశ్వరుడు ద్వారసముద్రపు హోయసల రాజగు వీరబల్లాలుని కడకు 'తానూరు' కు సురక్షితముగ పంపివైచెను. చక్రవర్తియొక్క సామదానభేదములు జంబుకేశ్వరుని ప్రలోభపరచజాలకుండెను. జంబుకేశ్వరుడు తనకు జయము దుర్లభమని తెలిసికొని కోటలో గొప్ప చితి నేర్పాటు చేయించెను. అందు అంతఃపుర స్త్రీలును, ఇతర సాధ్వీమణులును ఆహుతియైరి. అసంఖ్యాకులగు స్త్రీలు, శిశువులు, తురకలకు చిక్కకుండుటకుగాను తమ ఖడ్గములకు తామే బలియైరి. కోటలోని వస్తుసామగ్రి కొలది దినములలో వ్యయమై పోయినది. తన ఐదువేల సైనికులతో జంబుకేశ్వరుడు యుద్ధరంగమున ప్రవేశించి శత్రునాశన మొనర్చుచు వీరస్వర్గ మందెను.

ఈ విధముగా క్రీ.శ. 1334 లో ఆనెగొంది మునల్మానులకు వశమయ్యెను. కోటలో ప్రవేశించిన చక్రవర్తికి ఆర్గురు అధికారులును, పదునొకండుగురు రాజకుమారులును, సజీవముగ చేజిక్కిరి. చక్రవర్తి యనుమతిని జంబుకేశ్వరుని భౌతికదేహమునకు వైభవోపేతముగ దహన సంస్కారము జరిగెను. జనసామాన్యము నేటికిని అతని దేవతాంశునిగ నెంచి పూజింతురు. చక్రవర్తి జంబుకేశ్వరుని శీలమునకు సంతసించి, ఆతని కుమారులను గౌరవ మర్యాదలతో చూచెను. చక్రవర్తి ఆనెగొందిలో మల్లిక్ నాయబును తన ప్రతినిధిగ నిల్పి రాజకుమారులను మంత్రి మున్నగు నితర బందీలను తోడ్కొని ఢిల్లీ నగరమునకు తిరిగిపోయెను.

చక్రవర్తి తిరిగిపోయిన తరువాత స్వాతంత్ర్య పిపాసువులగు ఆనెగొంది ప్రజలు తిరుగుబాటు చేసిరి. వారి నణచుటకు నాయబునకు సాధ్యము కాలేదు. ఢిల్లీ చక్రవర్తి సాయ మొనర్పజాలక పోయెను. తన మంత్రుల హితోపదేశము ననుసరించి ఢిల్లీ చక్రవర్తి తన బందీయందున్న ఆనెగొంది మంత్రియగు హరిహరుని ఆనెగొంది రాజుగను, అతని సోదరుడగు బుక్కని మంత్రిగను నియమించి, వారు తనకు లోబడి యుండునట్లొడబరచి, తగు బలముతో వారిని ఆనెగొందికి పంపించెను. ఆ సోదరు లట శాంతి నెలకొల్పిరి.

జంబుకేశ్వరుని కుమారులు ఇస్లాము మతము నవలంబించుటచే వారు ఆనెగొంది రాజ్యార్హతను గోల్పోయిరి. సుప్రసిద్ధ యాత్రికుడగు ఇబెన్‌బతోతా, మతాంతరులైన ఈ రాజకుమారులకు అత్యంత సన్నిహితుడగు స్నేహితుడుగ నుండెను. వీరి సద్గుణములను గురించియు, చక్రవర్తికి వీరియెడగల గౌరవ ప్రేమలను గురించియు, అతడు తన గ్రంథములో వర్ణించినాడు.

క్రీ. శ. 1336 లో విజయనగరము స్థాపితమైనది. హరిహరుని రాజధాని ఆనెగొందినుండి విజయనగరమునకు మారినది. అప్పటినుండి క్రీ. శ. 1565 వ సంవత్సరమువరకు ఆనెగొంది విజయనగరపు దండనాయకుల పాలనమున నుండెను. తాళికోట పరాజయము తరువాత కొంతకాలమునకు మరల నిచ్చట ఒక చిన్న రాజ్య మేర్పడెను. ఆ రాజులు విజయనగర సమ్రాట్టుల వంశీకులని తెలియుచున్నది.

తాళికోట యుద్ధము తరువాత ముసల్మాను సుల్తానులు విజయనగర సామ్రాజ్యాంతర్భాగములు పంచుకొన్నప్పుడు ఈ యానెగొంది గోల్కొండ నవాబులకు భుక్తమైనట్లగుపడుచున్నది. క్రీ. శ. 1686 లో గోల్కొండతో పాటు ఆనెగొందియు మొగలులకు వశమైనది. క్రీ. శ. 1776 లో టిప్పుసుల్తాను ఆనెగొంది తిమ్మప్పరాజును సింహాసన భ్రష్టునిజేసి పట్టణమును ధ్వంసమొనర్చెను. క్రీ. శ. 1799 లో శ్రీరంగపట్టణపు యుద్ధమందు ఇంగ్లీషువారు టిప్పును చంపి ఆనెగొంది రాజును మరల ప్రతిష్ఠించి, అతనికి 1800 రూప్యముల మానభృతి నేర్పాటు చేసిరి. మైసూరు రాజ్యభాగముల పంపిణి

సందర్భమున ఆనెగొంది మరల గోల్కొండ నవాబుల భాగమునకు వచ్చెను. అప్పటినుండి క్రీ. శ. 1950 వరకు అది ఆసఫ్జాహీలకు సామంతరాజ్యముగనుండెను. ఇతర సంస్థానములవలె, జాగీరులవలె ఆనెగొందియు ఆ సంవత్సరము హైద్రాబాదు రాష్ట్రములో లీనమై పోయినది. ఆనెగొంది పట్టణము ఆనెగొంది సంస్థానమునకు రాజధానిగా తనరారుచుండెను.

కొ. భూ.

**ఆపత్స్థితి చట్టనిర్మాణము - Emergency Law :-** అసాధారణ పరిస్థితులయందు ప్రజలను, రాజ్యమును రక్షింపవలసిన బాధ్యత ప్రతి నవీన రాజ్యాంగ ప్రణాళిక యందును పేర్కొనబడి యున్నది. ఆపత్తునందు భూపాలుడో, రాష్ట్రపతియో, ముఖ్యమంత్రియో, సేనాపతియో మరియే యితర సమర్థుడో రాజ్యమును రక్షింపవలసిన విధియున్నదికదా! ఆపత్తు ఆసన్నమయినప్పుడు నిర్ణయింపబడిన విధానము "ఆపత్స్థిత న్యాయ" మందురు. ఈఅధికారము భారత రాజ్యాంగ ప్రణాళికలో రాష్ట్రపతియందు నిలుపబడినది.

ఈ సందర్భములో 'ఆపత్తు' అనగా మూడు విధముల స్థితమైన ఆపద:

1. దేశాంతర యుద్ధము, లేక దేశములో విప్లవము.
2. రాజకీయ కారణములచే రాజధానులందు రాజ్య కార్య స్తంభన.
3. ద్రవ్యలోపముచే గలుగు ప్రమాదము.

I బాహ్యాభ్యంతర యుద్ధవిప్లవములచే గలుగు ప్రమాద మాసన్నముకాగా రాష్ట్రపతి ప్రకటన యొకటి (Proclamation) గావించి, యాపత్తు రాజ్య నిర్వాహకములను తనయందాపాదించుకొని, యావచ్ఛాసనాధికారమును లోకసభయందు నిలుపునట్లుగా ప్రకటనచేయును. అట్టి సమయమందు కేంద్రాధికారమే ప్రమాణముగా వర్తింపగలదు. కేంద్ర ప్రభుత్వోద్యోగులే సర్వాధికారములను నిర్వర్తించుచు రాష్ట్రపతికిని, లోకసభకును బాధ్యులయియుందురు. ఆ సమయమందు లోకసభకు శాసనాధికారము విపులమై, నిరంకుశమై యుండగలదు. ఒకవేళ లోకసభ 'సమావేశములో' లేనిచో, రాష్ట్రపతి రెండు మాసములవరకు స్వంతముగా ఆపత్స్థితస్థితిని నిర్వహించును. కాని వెంటనే లోకసభను సమావేశపరచి లోకసభయొక్క యంగీకారమును పొందవలయును.

II రాజ్యాంగ స్తంభన: విశ్వాసరాహిత్య తీర్మానముల వలనను, రాజకీయ వర్గములలో ఒండొరుల వైషమ్యముల వలనను ఏ రాజధాని యందైనను మంత్రివర్గము స్థిరముగా పొసగజాలక యుండెనేని యట్టి పరిస్థితిని 'రాజ్య కార్య స్తంభన' యని చెప్పవలయును. (Failure of Constitutional machinery). అట్టి పరిస్థితినొక యాపత్తుగా గ్రహించి రాష్ట్రపతి ప్రకటనగావించి యా రాష్ట్రము యొక్క నిర్వాహకాధికారము తనయందును, శాసనాధికారము లోకసభయందును నెలకొల్పవలయును. కాని న్యాయాధికారములను మాత్రము ఆ రాజధాని యొక్క ఉన్నత న్యాయస్థానము (హైకోర్టు) నుండి తొలగించరాదు. రాష్ట్రపతిచేసిన ఈ ప్రకటనను లోకసభ యంగీకరించినచో ఆరు మాసములవరకు విళంబించవచ్చును. ఈ కాలమందా రాష్ట్రములో నుండిన రాష్ట్ర శాసనసభకు శాసనాధికారములు ఉండజాలవు.

III ద్రవ్యాపత్తు: ఏ దుష్టకాలమందైనను దేశములో ద్రవ్యలోపముగలిగి భారతమున కన్యదేశములలో పరపతి (Credit) తగ్గినను రాష్ట్రపతి తద్విషయమయిన 'ప్రకటన' నొకటి గావించి ప్రభుత్వోద్యోగులు, న్యాయాధిపతులు మున్నగువారలయొక్క వేతనములను, ఒరుంబడులను (allowances) తగ్గించి ద్రవ్యాపత్తునుండి దేశమును రక్షించును. మరియు రాష్ట్రపతి స్వతః పరిశీలించి సవరణలు గావించి, ఉచితరీతిగా అంగీకారమిచ్చును.

ఈ పైవిధములయిన ప్రాథమిక హక్కులకు బాధ కలిగినదని ఆరోపణలు చేయుచు న్యాయ స్థానములకు విన్నపములు చేయరాదు.

బి. సు.

**ఆపస్తంబుడు :-**

ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్ర జన్మనః
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః
వ్యవస్థితార్య మర్యాదః కృతవర్ణాశ్రమ స్థితిః
త్రయ్యాహి రక్షితో దేశః ప్రసీదతి నసీదతి.

(మనుస్మృతిః)

'ఈ భారతదేశమున పుట్టిన బ్రాహ్మణుని సమక్షమున భూమియందలి సర్వమానవులు తమ తమ ఆచారములను అభ్యసింపవలయును. నిర్ణీతార్య మర్యాదలు గలదై, ఆచరిత వర్ణాశ్రమ స్థితిగలదై, వేదత్రయ రక్షితమగు ధర్మముచే రక్షింపబడు దేశము ఉపద్రవ రహితమై శాంతి యుతముగా మనగలదు' అని మనువు వచించెను. ఇట్టి మర్యాదలను (వ్యవస్థలను) ప్రతిపాదించిన మహర్షులలో ఆపస్తంబ మహర్షి అగ్రగణ్యుడు.

ఆపస్తంబుని సూత్రములు విశేషముగా పాటించువారు ఆంధ్రులై యున్నారు. ఆంధ్ర కవులలో పెక్కురు ఆపస్తంబ సూత్రులు కలరు. కాబట్టి ఆపస్తంబుడు ఆంధ్ర జాతీయుడని తోచుచున్నది. ఇయ్యంశమును గార్బు, బర్లారు, పండితులు మున్నగు విమర్శకులును బలపరచిరి. ఈ విషయమును మరియొక విధముగా గూడ స్థాపింప వచ్చును. విశ్వామిత్రుని సంతతివారై ఆతనిచే శప్తులయిన వారలలో ఆంధ్రులుకూడ నున్నారు. శునశ్శేపుని కథ జరుగునప్పటికి విశ్వామిత్రుడు పుష్కరక్షేత్ర సామీప్య మున తపస్సు చేయుచుండినట్లు శ్రీమద్రామాయణ గ్రంథమువలన విదితమగుచున్నది. పుష్కరక్షేత్రమునకు సమీపముననే సాల్వదేశముకలదు. ఆపస్తంబుడు సీమంతో న్నయన విధియందు సాల్వదేశమును, యమునా నదిని, యౌగంధరి యను ఆ దేశపు రాజును గూర్చి గానము చేయ దగు నని ప్రత్యేకముగ చెప్పియుండుటచే ఆతనికిసాల్వ దేశమునందును తత్రత్యు లయిన జనులయందునుగల ప్రత్యేకాభిమానము తేటపడుచున్నది. ఆంధ్రగణమువారు ఇక్కాలమున సాల్వదేశ ప్రాంతమున నుండుటచే ఆప స్తంబుడుఆంధ్రజాతీయుడైనట్లు ఊహించుటసమంజసము.

ఆపస్తంబుడు ప్రాచీన మహర్షియై యున్నట్లు నిరూ పించుటకు పెక్కు సాధనములు కలవు. బోధాయన సూత్ర గ్రంథములో ఆపస్తంబుడు గోత్ర ప్రవర్తకులలో నొకడుగా పేర్కొనబడెను. పరాశర యాజ్ఞవల్క్యులు తమ ధర్మశాస్త్రములలో ఆపస్తంబుని ధర్మశాస్త్ర ప్రవర్త కునిగా పరిగణించిరి. పాణిన్యాచార్యుడు 'అనృష్యానన్తరే బిదాదిభ్యో ఽఞ్' (4-1-104) అను సూత్రమున బిదాది గణములో ఆపస్తంబ శబ్దమును పఠించెను. అందుచే ఆపస్తంబుడు పాణినికి పూర్వుడని నిరూపితమగుచున్నది. ఆపస్తంబుని గృహ్య సూత్రములలో పాణినీయ వ్యాకర ణమునకు విరోధముగల ప్రయోగములు కలవు. ఉదా :- ఆరోహతిం (5-24); తరతిం (6-2); పుం స్వాః (6.4); గృముష్టిః (20-11); అభ్యానాయన్ (12-7); త్రిస్రైస్రవృః (9-5); ప్రప్సం (11-2); కుప్త్వాం (23-7) మున్నగునవి. కొన్ని విభక్తి వ్యత్యయములుకూడ కనవచ్చు చున్నవి. ఉదా :- తస్యైవపా (22-4); అధ్యాఽస్యై దక్షిణేన (1-5); ఇయ్యంశములు కూడ ఆపస్తంబుడు పాణినికి పూర్వుడను విషయమును బలపరచు చున్నవి. ఆపస్తంబుడు నిరుక్తకారుడయినయాస్కుని, జ్యోతిషకర్త యగు లగదుని తన ధర్మసూత్రములో పేర్కొనియున్నాడు. అందుచే ఇతడు యాస్కలగదుల కనంతరీయుడని ఊహింపవచ్చును. పాణిని క్రీ. పూ. 600-800 సం. ల కాల మునకు చెందిన వాడనియు, యాస్కుడు క్రీ. పూ. 800-500 ల కాలమునకు చెందిన వాడనియు పి. వి కాణేమున్నగు పండితులు వ్రాసిరి. అందుచే ఆపస్తంబుడు క్రీ.పూ. 800-600 లకు మధ్యనున్న వాడనుటసమంజసము

మహర్షులచే ప్రతిపాదితములైన మర్యాదలు విధి, నియమ - నిషేధ రూపములచే మూడు విధములు. అంద ప్రవృత్తి ప్రయోజనకము విధి. నిషేధ, నియమములు నివృత్తి ప్రయోజనకములు. (1) విధి - 'సంధ్యోశ్చ బహి ర్గ్రామాదాసనం వాగ్యతశ్చ (1 ప్రశ్న 30 పటల, 8 సూ అను నాపస్తంబధర్మసూత్రమునుబట్టి సంధ్యోపాసనా కాలమున గ్రామమునకు వెలుపల నుండుట, వాఙ్నియ మము కలిగియుండుట అనునవి విధులు. ఇచట ప్రవృత్తి ప్రయోజనము వివక్షితమైనది (2) ప్రాఙ్ముఖోఽన్నాని భుంజీత (1-31-1) అను సూత్రముచే ప్రాఙ్ముఖుడయి భోజనము చేయవలయు నని చెప్పుటవే అన్యదిగా ముఖ్యము నిషిద్ధమైనది. ఇది నిషేధ ప్రయోజన విధియై యున్నది. (3) "యాజనాధ్యాపన ప్రతిగ్రహై రేవ బ్రాహ్మణో ద్రవ్య మార్జయేత్" యజ్ఞము చేయించుట, వేదమును చదివించుట, ప్రతిగ్రహణము- అనువాటిచేతనే బ్రాహ్మణుడు ద్రవ్యము నార్జింప వలయును అనునది నియమము. ఇట్టి నియమము వృత్త్యంతరములచే యథేష్టముగా బ్రాహ్మణునకు ద్రవ్యా ర్జనము నిషిద్ధమగుచున్నది. ఇట్లు పూర్వోక్తము లయి

మర్యాదలను, వర్ణాశ్రమ ధర్మములను, బోధించు సూత్రములు ధర్మసూత్రము లనబడును. శ్రుతిచోదితము అయిన యజ్ఞములను ఆచరించు పద్ధతిని బోధించునవి శ్రౌత సూత్రములు. ప్రత్యక్ష శ్రుతి ప్రామాణ్యము లేనిచో ఆచారగ్రాహ్యములగు వివాహాది విధులను బోధించునవి గృహ్య సూత్రములు. ఇట్లు ధర్మములను, గృహ్యములను, శ్రౌత ధర్మములను సూత్రరూపమున రచించిన మహర్షులలో ఆపస్తంబుడు అగ్రగణ్యుడు. ఈ మహర్షి రచించిన శ్రౌత సూత్రము వేదాంగకల్ప మని ప్రసిద్ధి నొందినది. ఆ శ్రౌత సూత్రమునందు 'అథాతో దర్శ పూర్ణిమాసౌ వ్యాఖ్యాస్యామః' అనునది ఆద్య సూత్రమై యున్నది. దీనిని బ్రహ్మయజ్ఞములో కల్ప స్థానములో బ్రాహ్మణులు పఠించుచున్నారు. ఆపస్తంబుని శ్రౌత సూత్రము త్రింశదధ్యాయాత్మకము. ఆదియందలి 23 అధ్యాయములలో దర్శ పూర్ణిమా సేష్టి మొదలుకొని సహస్ర సంవత్సర పర్యంతములైన యజ్ఞకర్మలు చెప్పబడినవి. ఇరువది నాల్గవ ప్రశ్నలో పరిభాషా సూత్రములు, ప్రవరఖండ, హౌత్రమంత్రములు వచింపబడినవి. 25, 26 వ ప్రశ్నలలో గృహ్య కర్మలకు ఉపయోగించు సూత్రములును, 27 వ ప్రశ్నలో గృహ్య కర్మల నొనర్చు విధానమును బోధితములైనవి. 28, 29 ప్రశ్నలు సామయాచారిక ధర్మప్రతిపాదకములు. 30 వ ప్రశ్న శుల్బ సూత్రము; ఇది వేదినిర్మాణ విధిని ఇష్టికాచయన ప్రమాణములను వివరించును. ఈ శ్రౌత సూత్రము తైత్తిరీయ శాఖకు ఉపయోగించునదియై యున్నది. ఆపస్తంబ శ్రౌత సూత్రములపై వ్యాఖ్యలు పెక్కులు కలవు. ఈ వ్యాఖ్యలు అసమగ్రములై కానవచ్చుచున్నవి. రుద్రదత్త - సూత్ర దీపిక అను వ్యాఖ్య ఈ శ్రౌత సూత్రము నందలి 15 ప్రశ్నలకే లభించుచున్నది అని గార్బు పండితుడు వ్రాసెను. ధూర్తస్వామి కృతమైన భాష్యము, శ్రౌత సూత్రము నందున్న కేవల పరిభాషా సూత్రములకే లభించుచున్నది. కపర్దిస్వామి రచించిన భాష్యము శుల్బ సూత్రాధ్యాయమునకే కనబడుచున్నది. గురుదేవస్వామి, కరవిందస్వామి, చౌండపాచార్యుడు, అహోబలసూరి, సుందరరాజు అను ఐదుగురు, శ్రౌత సూత్ర వ్యాఖ్యాతలలో పేర్కొనదగినవారు. చౌండపాచార్యుని ప్రయోగ రత్నమాల శ్రౌత సూత్ర మూలమునకు సక్రమమైన వ్యాఖ్యగా పరిగణింపబడుచున్నది.

'అథ కర్మా ణ్యాచారా ద్యాని గృహ్యంతే' అనునది ఆపస్తంబ గృహ్య సూత్రము అను గ్రంథమునందలి ఆద్య సూత్రము. ఆపస్తంబుడు స్వకృతములయిన గృహ్య సూత్రములలో జాతకర్మాది సంస్కారములకు ఉపయోగించునట్టి బుగ్యజుర్వేద మంత్రములను ఒకచో ప్రశ్నద్వయ రూపమునకూర్చి దీనికి 'ఏకాగ్ని కాండము' అని పేరు పెట్టెను. ఈ గృహ్య సూత్రములలో మంత్రప్రతీకము (స్వరూపోచ్చారణము) 'ఉత్తరయా, ఉత్తరేణ, ఉత్తరాభిః' అను అల్పపదములచే సులభముగా కర్మలను బోధించియున్న ఆపస్తంబుని వైశిష్ట్యము ఎన్నదగినది. ఆషాఢ - మాఘ - ఫాల్గుణ మాసములు తప్ప వివాహములకు శేషించిన మాసములు ప్రశస్తములని "సర్వర్తవో వివాహస్య శైశిరేమాసౌ పరిహార్యో త్తమంతునైదాఘం" అను ఆపస్తంబ గృహ్యసూత్రముచే విదితమగుచున్నది. కన్యావరణ సమయమున - శుభాశుభ పరీక్షకై వరబంధువులు, మట్టిముద్దలో నానావిధములయిన బీజములను' యజ్ఞ వేదిగతములయిన పాంసువులను, కృషిక్షేత్రమందలి లోష్టములను (మట్టిపెల్లలను) శ్మశాన భూమి యందలి లోష్టములను కలిపి, వాటిలో నొకదానిని స్పృశింపుమని కన్యనడుగగా, ఆమె బీజస్పర్శ మొనర్చినచో సంతానముచే సమృద్ధి కలుగుననియు, వేది పాంసువులను తాకినచో యజ్ఞముచే సమృద్ధి కలుగుననియు, క్షేత్ర లోష్టములను తాకినచో ధనధాన్యములచే సమృద్ధి యేర్పడుననియు, శ్మశాన లోష్టములను స్పృశించినచో అశుభము వాటిల్లు ననియు భావింపవలెనని ఆపస్తంబుని (11 ప్రశ్న - 8 వ పటలము, 3,15,16,17,18) వలన గృహ్యసూత్రములచే విశదీకృతమైనది. వరునకు వధూ విషయమున ఆనుకూల్యమును సంపాదించు నిమిత్తమై చేయదగినవిధి, సపత్నీ బాధనవిధి; రాజయక్ష్మ యను రోగము యొక్క శాంతికై చేయదగిన విధి; మావి పడుటకై చేయదగినవిధి; శ్వగ్రహ గృహీతుడైన బాలుని యొక్క గ్రహశాంతికై చేయదగువిధి; ఇత్యాదివిధులు ఆపస్తంబుని లోకజ్ఞానమును తేటపరచుచున్నవి.ఆపస్తంబ గృహ్యసూత్రము తైత్తిరీయ శాఖానుసారులకు మిక్కిలి

ఉపయోగించును. సింగాభట్టీయము, ఆండపిళ్ల, అనాకుల, తాత్పర్యదీపిక అనునవి ఆపస్తంబ గృహ్యసూత్రములపై వెలసిన వ్యాఖ్యానములు. సింగాభట్టు, అణిపిళ్ల హరదత్తుడు, సుదర్శనాచార్యుడు అనువారు క్రమముగా పైని పేర్కొనబడిన వ్యాఖ్యలను వ్రాసినవారు. ఆంధ్రదేశమున తైత్తిరీయులు తరచుగ ఆపస్తంబ సూత్రానుసారులుగా నున్నారు.

ధర్మసూత్రములలో ఆపస్తంబ ధర్మసూత్రము కృష్ణయజుశ్శాఖీయులకు ముఖ్యమైనది. "అథాతస్సామయాచారికాన్ ధర్మాన్ వ్యాఖ్యాస్యామః" (ఆ. ధ. 1) అనునీ ప్రథమ సూత్రము ధర్మశాస్త్ర స్థానమున బ్రహ్మయజ్ఞాదులందు ఉపయోగింపబడుటచేత ఈ గ్రంథము పరమధర్మ శాస్త్రమని తేటబడుచున్నది. ఆపస్తంబ ధర్మసూత్రములలో పెక్కు ముఖ్య విషయములు కలవు. ఉపనయన కాలమున వటువు పాదోప సంగ్రహణము, గురుసన్నిధియందు అధ్యయనము, భిక్షాచరణము, మున్నగు ధర్మములను సక్రమముగా ఆచరించినచో, వాతని కర్మలు సఫలము లగును. లేనిచో ఆతని సంతానము బ్రహ్మవర్చసవిహీన మగును. ఆతని సంతతిలో ఋషులు పుట్టరు. పుట్టినను శ్వేతకేతువువలె పూర్వకర్మ భోగార్థమై కొలది మంది జనన మొందుదురు. కావున బ్రహ్మచర్యమవశ్యాచరణీయము అని చెప్పబడినది. విక్రయాన్నము తినకుండుట; రసద్రవ్యములు, పచ్చిమాంసము, మధు-లవణేక్షురసములు, పృథుక-భ్రష్టయవ-సక్తు-శాక-మాంస-పిష్ట-క్షీర వికారములు, ఓషధి-వనస్పతి-మూలఫలములు మున్నగు వాటిని తినుటయు: ఆపత్కాలమున అగ్నిసువర్ణములచే స్పృశించి కృతాన్నమును గ్రహించుటయు గృహస్థధర్మములుగా పరిగణింపబడినవి. ఆర్య పోషితులయిన శూద్రులు స్నానాదులచే శుద్ధులయి త్రైవర్ణికులగు గృహస్థులు అతిథులు మున్నగు వారి కొరకు పాకము చేయవచ్చును. శూద్రుడు నిత్యము క్షౌరము చేయించుకొని సచేల స్నానమొర్చివకొని పర్వకాలమువందును, అష్టమినాడును క్షౌరము చేయించుకొని గాని, పరోక్షముగా వండి తెచ్చిన అన్నమును అగ్నిలో నుంచి, నీళ్ళతో ప్రోక్షించినచో అది దేవతార్పణమునకు అర్హమగునని చెప్పబడినది. అతిథికి గోమధుపర్కః మిచ్చినచో ఫలాధిక్యము చేకూరు నను విషయమున బ్రాహ్మణము ప్రమాణమగు చున్నదని ఆపస్తంబుడు వచించెను. అవిధిగా సన్యసించినవారు అభోజ్యాన్నులలో పరిగణింపబడిరి. వ్రాత్యశబ్దము అమరకోశమునందును (వ్రాత్యస్సంస్కారహీనః స్యాత్) 'వ్రాతేన జీవతి' అను పాణినీయ సూత్రమునందును నిందితపరముగా వ్యాఖ్యాతమైనది. ఆపస్తంబుడు దీనిని పూజ్యపరముగా ప్రయోగించెను. ఇయ్యాశయమునే సమర్థించుచు వ్రతేషుసాధు ప్రత్యః స ఏవ వ్రాత్యః అను వ్యుత్పత్తిని వ్యాఖ్యాతలు ప్రదర్శించిరి. దంపతుల నియమములను వివరించుచ భార్యాభర్తలు స్వీయ నియమాతిక్రమము చేసి రేః శిక్షార్హులగుదు రని ఆపస్తంబుడు చెప్పెను. అతడు నియో పద్ధతిని నిషేధించెను. రాజు, తపో విద్యావంతులగ బ్రాహ్మణులకు తనదేశములో జీవన క్షేత్రము లొస వారిని పోషింపవలయు నని చెప్పబడినది. ఇతర సూ కర్తలు అష్టవిధ వివాహములను చెప్పిరి. ఆపస్తంబుడ ఆరింటినే పేర్కొనెను. ఏకాగ్నికాండము నందలి కొన్ని మంత్రార్థములచే యువతీ వివాహము ప్రతిపాదిత మ చున్నను, హరదత్త ప్రభృతి వ్యాఖ్యాతలు అవ్విషయమ నంగీకరించి యుండలేదు.

రాజధర్మములలో, రాజు దేశారాధన తత్పరుడగుచ రాష్ట్రమందలి ప్రజలలో పరికిని శీతవాతాతపవ్యాధు వలన క్లేశము కలుగకుండ చేయవలయు ననియు; బాల వృద్ధ-కర్మకార-అంగవికల-శ్రోత్రియులనుండి పన్ను గ్రహింపకూడ దనియు, నగర-గ్రామ-రక్షకులు కాయస్థులను (కరణాలను) నియమింపవలయుననియ నగర గ్రామములలో దొంగలు అపహరించిన డబ్బు నష్టపడిన యజమానులకు నగర రక్షకు డొసగవలయ ననియు చెప్పబడినది. ఈ ధర్మములు అనుష్ఠించుట క సాధ్యము. ఐనను అవి శ్రద్ధతో ననుష్ఠించినవారికి ఆయు రోగ్యములను, చిత్తశుద్ధిని ప్రసాదింప సమర్థములు. హ దత్తస్వామి 'ఉజ్జ్వల' అను సమగ్ర వ్యాఖ్యను ఆపస్త ధర్మసూత్రములపై రచించెను. ఈ ధర్మసూత్రముల కొన్ని వేదాంత ప్రతిపాదకములును కలవు. వాటి శ్రీ శంకర భగవత్పాదులు వ్యాఖ్య వ్రాసిరి.

ఖం. న.

**ఆఫ్ఘనిస్థానము :-** (చరిత్రము) :- ఆఫ్ఘనిస్థానము ఇరేనియను పీఠభూమిలో ఈశాన్యదిక్కున ఉన్నది. ఈ దేశపు సరిహద్దులు - ఉత్తరమున ఆక్సస్, మధ్య ఆసియాలోయలు, తూర్పున ఉత్తర హిందూస్థానము, పడమట పర్షియాదేశము, దక్షిణమున బెలూచి స్థానపు ఎడారి. ఆఫ్ఘనిస్థాన మను పేరు 18 వ శతాబ్దములో అహ్మాద్ షా రాజ్యకాలమునుండి స్థిరపడినది. ఈదేశము నందలి ముఖ్యజాతులు - ఆఫ్ఘనులు, పఠానులు, ఘిల్జాయిలు, టర్కోమనులు, ఇత్యాదులు.

చారిత్రకముగ ఆఫ్ఘనిస్థానములో భాగములైన ఖురాసాన్, కాబూలు, బాక్ట్రియా, గజనీ, కాందహారు, హీరట్ - అనునవి. గ్రీకుల, అరబ్బుల రాజ్యములలో రాష్ట్రములుగ నుండెను. క్రీ. శ. 1000 ప్రాంతమున గజనీ రాజులు, తర్వాత ఘోరీ రాజులు ఇచట పరిపాలించిహిందూదేశముపై దండయాత్రలు సాగించిరి. ఢిల్లీలో ముస్లిము రాజ్యము స్థాపించిన బానిసరాజు కుతుబ్బుద్దీన్ ఐబక్ ఆఫ్ఘనిస్థానము వాడే. క్రీ శ. 1526 లో బాబరు మొగలు సామ్రాజ్యము స్థాపించు వరకు ఆఫ్ఘన్‌స్థానము నుండి తురకల దండయాత్రలు పరంపరగ హిందూదేశమును బాధించుచుండెను. మొగలుకు సరియైన పేరు చగతాయి. వీరి స్వదేశమగు ఫెర్గానా ఆఫ్ఘనిస్థానమందే యుండెను.




ఆఫ్ఘను చరిత్రలో కూడ అక్బరు రాజ్యకాలము (క్రీ. శ. 1556 - 1605) గొప్పది. ఆఫ్ఘనిస్థానము ఇతని కాలములో ఢిల్లీ సామ్రాజ్యమున నొక భాగముగ స్థిరపడెను. అక్బరు రాజపుత్ర సైన్యములు జస్వంత సింగు సైన్యాధిపత్యమున ఆఫ్ఘనిస్థానములోని తిరుగబాటులను అణచెను. ఔరంగజేబు తర్వాత ఆఫ్ఘను సామంతులు స్వతంత్రము ప్రకటించిరి. క్రీ. శ. 1621 లో పర్షియనులు కాందహారును జయించిరి. క్రీ. శ. 1688 ప్రాంతమునుండి కాందహారును పర్షియనులు కాని, ఆఫ్ఘనులు కాని పాలించుచు వచ్చిరి.

నాదిర్ షా ఆఫ్ఘనిస్థానమును జయించి హిందూదేశముపై దండెత్తెను. ఇతడు క్రీ. శ. 1747 లో మృతి నొందెను. తర్వాత అహమ్మద్ షా అబ్దాలీ స్థిరమైన ఆఫ్ఘన్ రాజ్యమును స్థాపించెను. ఇతని రాజ్యము మెషెడ్ (Meshed) నుండి లాహోరువరకు వ్యాపించెను. క్రీ. శ. 1773 లో అహమ్మద్ షా చనిపోయెను. ఆతని పుత్రుడు తైమూర్ షా క్రీ. శ. 1793 వరకు పాలించెను. తైమూరుషా తరువాత అతని తమ్ముడు షాహ జమాను రాజ్యమేలెను. క్రీ. శ. 1808 తరువాత షాహమహమ్మదు, అటుపిమ్మటషాహ షుజా పాలించిరి. క్రీ. శ. 1827 నుండి 1863 వరకు దోస్తుమహమ్మదు, తర్వాత షేర్ అలీ, తర్వాత అబ్దుర్ రహమాను, అతని కొడుకు హబీబుల్లా, మనుమడు అమానుల్లా పాలించిరి. తర్వాత నాదిర్ ఖాను. అతడు క్రీ. శ. 1933 లో చంపబడగా, జాహిర్ షాహ రాజయ్యెను.

అంతర్యుద్ధములలో ఆఫ్ఘన్ సామంతరాజులు బ్రిటిష్ సాయమును తరుచుగ నపేక్షించుచుండిరి. మొదటి ఆఫ్ఘను యుద్ధములో దోస్తుమహమ్మదు కాబూలు గద్దె యెక్కి హీరట్, కాందహార్ లను గెల్చెను. ఇతని పుత్రుడు గులామ్‌హైదర్ బ్రిటిషువారితో సంధి చేసెను. క్రీ. శ. 1863 లో దోస్తుమహమ్మదు చనిపోగా అతని 16 గురు పుత్రులు సింహాసనమునకై పోరాడు

కొనిరి. రెండవ ఆఫ్ఘను యుద్ధములో బ్రిటిషు సైన్యములు 3 వైపులనుండి ఆఫ్ఘను రాజ్యమున ప్రవేశించెను. కాందహారు యుద్ధ ఫలితముగ క్రీ. శ. 1880 నుండి 30 సం॥ లు ఆఫ్ఘన్ రాజు బ్రిటిషు మిత్రుడుగ నుండెను. మూడవ ఆఫ్ఘన్ యుద్ధములో ఆఫ్ఘనులు ఇండియాపై దండెత్తి యోటమిచెందిరి. 1919 లో హబిబుల్లా హత్యచేయబడెను. అమానుల్లా రాజయ్యెను. సంధి ఫలితముగ ఆఫ్ఘనిస్థానము స్వతంత్ర రాజ్యమయ్యెను.

అబ్దుర్ రహమాను రోడ్లు వేయించెను. రాజ్యాంగమున సంస్కరణలు తెచ్చెను. అమానుల్లా ఐరోపాలో పర్యటనము చేసివచ్చి దేశములో మార్పులు చేసెను. క్రీ. శ. 1928 లో శాసనసభలు అమలులోనికి వచ్చెను.

వి. య.

**ఆఫ్ఘనిస్థానము :- (భూగోళము)** :- ఆఫ్ఘనిస్థానము ఆసియాఖండపు దేశాలలో ఒకటి. దీనికి దౌలత్ ఇ-షాద్ షాహీ-యే ఆఫ్ఘనిస్థానము అని పూర్తిపేరు. ఇది 29°-38° 35' ఉత్తర అక్షాంశముల మధ్యను 60°, 50' - 71° 50, తూర్పు రేఖాంశముల మధ్యను ఇమిడియున్నది. దీని వైశాల్యము 2 లక్షల 50 వేల చదరపుమైళ్ళు ఉండును. జనాభా ఒకకోటి ఇరువదిలక్షలు సుమారుగా ఉండును. అందులో ఇరువది లక్షలమంది స్థిరనివాసము లేని చరజాతు లున్నవి. పరిషియన్, పుష్టూ భాషలు మాట్లాడుదురు.

**పరిపాలనము** :- 1914 లో జన్మించిన మహమ్మద్ జహీర్ షా ఈ రాజ్యమునకు రాజు. ఒక ఉన్నతసభ **(Senate)** 50 మంది సభ్యులతోకూడి ఉన్నది. ఇదిగాక, 171 మంది సభ్యులుగల జాతీయసభ **(National Assembly)** పరిపాలనాధికారము కలిగియున్నది. మే నెలలోను, అక్టోబరులోను సమావేశములు అగుచుండును. ఇదిగాక "లోయేజిర్గా" **(Loe jirga)** అను మహాసభ ఇంకొకటి అప్పుడప్పుడు సమావేశము అగుచుండును. రాజు ఏదైన అతిప్రాముఖ్యము గల సమస్యను తీర్మానించు నిమిత్తమే దీనిని సమావేశ పరచుచుండును. దీనిలో ఆజాతికి సంబంధించిన పెక్కుమంది నాయకులు సమావేశమునొందుదురు. గడచిన సమావేశము 1941 లో జరిగినది. ఇటీవల పాకిస్థానముతో ఏర్పడిన సమస్యల మూలముగా ఇప్పుడు మళ్ళీ సమావేశపరచబడినది. దేశము ఏడు ముఖ్యమైన రాష్ట్రములుగా విభజింపబడి ఉన్నది. కాబూలు, మజార్, కాందహారు, హీరాట్, కటఘన్, సంత్-ఇ-మష్రికి, సంత్-ఇ-జునూబి అనునవి పెద్ద రాష్ట్రములు. బదక్షాన్, ఫరా, మైమనా, పర్వాన్ అనునవి నాల్గు చిన్నరాష్ట్రములు. పెద్ద రాష్ట్రాలు నయీబ్-ఉల్-హుకుమేఅను పరిపాలకునిచేతను చిన్నరాష్ట్రములు హాకెం-ఇ-ఆలా అను పరిపాలకునిచేతను, పాలింపబడుచున్నవి. కొన్ని శాఖలు మంత్రులక్రిందను, కొన్ని అధ్యక్షులక్రిందను ఉండి, వీరిరువురితోకూడిన మంత్రి వర్గము చేతులలో అధికారము కేంద్రీకృతమయి ఉన్నది. కొద్దిమంది షియాశాఖీయులున్నను అధిక సంఖ్యాకులు సున్నీ శాఖకు చెందిన మహమ్మదీయ మతము ప్రధానముగా గలవారే. కాబట్టి న్యాయశాస్త్రము షరియత్ మీద ఆధారముచేసికొని అభివృద్ధి చెందినది. జిల్లా న్యాయస్థానాలను మహకమా-ఇ-ఇబ్తిదాయియాలు అనియు, రాష్ట్రరాజధానులలో ఉండువాటిని మహకమా-ఇ-మురాఫాలు అనియు అందురు. మహకమా-ఇ-అలీతమీజ్ అను న్యాయస్థానము హైకోర్టువంటిది. ఇది పరిపాలన న్యాయశాఖకు అనుబంధించి ఉండును. ఉన్నత సభకు అనుబంధముగా రారియ్యాసత్-ఇ-తమీజ్-ఇ-అయన్ అను సుప్రీంకోర్టుకూడనున్నది. ఆదాయపుపన్ను, భూమిపన్ను, వ్యాపార సుంకాలు దేశము యొక్క ఆదాయమును 18 కోట్ల 80 లక్షల ఆఫ్ఘనీ నాణెములవరకు పెంచినను, ప్రభుత్వాదాయము చాలుటలేదు. సామాన్యమైన సేనావాహిని 75000, కలదు. తడవకు 2,000 మంది విద్యార్థు అను తయారుచేయు మిలిటరీ శిక్షణాలయము ఒకటి పని చేయుచున్నది. కాబూలు పట్టణము దేశమునకంతకును రాజధాని. ఖ్వాజారావాష్, షెర్ పూర విమానాశ్రయాలను పురస్కరించుకొని కొద్ది విమానదళమున్నది. బ్రిటిషువారితో పూర్వము సరిహద్దులను గురించిన సంధులు **(Treaties)** పెక్కులున్నవి. 1946 లో సోవియట్ రష్యాతో ఒక సరిహద్దు నిర్ణయము జరిగినది.

**ఆర్థిక పరిస్థితులు** :- దేశము యావత్తు పర్వతమయము. వర్షరహితమైనది. అయినప్పటికిని చిన్న చిన్న జలాధారాల మూలమున వ్యవసాయము సాగుచునేయున్నది.

పండ్లు, కూరగాయలు, తిండిగింజలు, పండింపబడు చున్నవి. ప్రత్తి, ఇంగువచెట్లు ఎక్కువగా పెరుగుచున్నవి. ఊలు, చర్మములు, ముఖ్యముగా కరాకులీస్ అను గొఱ్ఱె చర్మములు ఎగుమతి చేయుచున్నారు. దేశములో కొన్ని ఖనిజములుకూడ ఉన్నవి. రాగి, ఇనుము, సీసము ఎక్కువగా దొరకునని తెలియుచున్నది. కాబూలు పట్టణములో అగ్గిపెట్టెలు, గుండీలు, చర్మము, చెప్పులు, రాళ్ళు, కుర్చీలు చేయు చిన్న చిన్న కర్మాగారాలు ఉన్నవి. కాందహారులో ఊలు ఫ్యాక్టరీ ఉన్నది. ప్రత్తి కర్మాగారాలు ఉన్నవి. ఆఫ్ఘన్ జాతీయబ్యాంకు ఆధ్వర్యము క్రింద దేశములో జలవిద్యుచ్ఛక్తి, గుడ్డలు, పంచదార, సిమెంటు, ప్రత్తి, కర్మాగారాలు నిర్మించుటకు కృషి జరుగుచున్నది. దిగుమతి సరకులలో పెక్కింటికి ప్రభుత్వానికి గుత్త హక్కు (Monopoly) ఉన్నది. వీటి పర్యవేక్షణ నిమిత్తము రియాసత్ - ఇ - ఇన్హిసారాత్ - ఇ - దౌలతీ అను పేరుగల ప్రభుత్వ గుత్త హక్కుల అభివృద్ధి సంఘమును స్థాపించి, మోటారు కారులు, పంచదార, సిగరెట్లు మొదలైనవాటిని దిగుమతి చేసికొనుచున్నారు. ఎగుమతుల విషయములో పనిచేయుటకు అనేక కంపెనీలు ప్రత్యేకముగా ఒక్కొక్క వస్తువును సేకరించి ఇతర దేశాలకు పంపుచున్నవి. నూటికి 80 వంతుల వ్యాపారము పాకిస్థానుగుండా పోవలసి ఉండును. ఆఫ్ఘను జాతీయ బ్యాంకునకు లండనులో ఒకశాఖ ఉన్నది. భారత దేశముతో వ్యాపార సంబంధాలు ఎక్కువగా ఉన్నవి. ఆఫ్ఘని స్థానములో రైళ్ళులేవు. నౌకాయానమునకు పనికివచ్చు నదులును లేవు. బరువులు మోయుటకు ఒంటెలను, గుఱ్ఱములను దేశీయులు ఇప్పటికిని ఉపయోగించుచున్నారు. మోటారు రవాణా విధానము క్రమముగా వృద్ధిచెందుచున్నది. సుమారు 6,000 మైళ్ళ రోడ్లు మోటారు రవాణాకు తగినవిగా నున్నవి.

డి. వి. కె.

**ఆఫ్రికా :-** వరిహద్దులు :- ఆఫ్రికాఖండము 37° ఉత్తర అక్షాంశమునుండి, 35° దక్షిణ అక్షాంశమువరకును, 17° పశ్చిమ రేఖాంశమునుండి, 50° తూర్పు రేఖాంశమువరకును వ్యాపించియున్నది. దీని వైశాల్యము 1,12,62,000 చ.మై. ఇదికాక 2,39,000 చ. మైళ్ళు వైశాల్యముకల ద్వీపము ఒకటి ఈ ఖండములోనున్నది. వైశాల్యమునందు ఈ ఖండము హిందూదేశమునకు సుమారు ఆరురెట్లున్నది. ట్యునీసియాలోని కేప్‌బాన్ నుండి కేప్ అగలస్ వరకు ఉత్తర, దక్షిణములుగా దీని పొడవు 5000 మైళ్ళు. అదేవిధముగా పడమరనున్న కేప్‌వెర్ట్ నుండి తూర్పున నున్న గార్డిఫ్యూ వరకు దీని పొడవు 4600 మైళ్లు. ముఖ్యమైన విషయమేమన, ఈ ఖండము భూమధ్యరేఖకు ఉత్తర దక్షిణములందు సమముగా వ్యాపించియుండుట. అందువలన ఉత్తర దక్షిణ ఆఫ్రికాల శీతోష్ణమండలములందు, మరియు అనేక ఇతర విషయములయిందు చాల పోలికలు కానవచ్చును. ఈ ఖండముయొక్క విశేషభాగము కర్కాటక మకర రేఖల మధ్యనుండుట గమనింపదగినది.

మధ్యధరాసముద్ర ముత్తరమునను, ఎఱ్ఱ సముద్ర మీశాన్యమునను, హిందూమహాసముద్రము తూర్పుదక్షిణములను, అట్లాంటిక్ మహాసముద్రము పడమరను కలిగి యుండుటచే నీ ఖండము ద్వీపఖండమనవచ్చును.

ఫ్రెంచి భూమధ్యరేఖాగత ఆఫ్రికానంటి గినీసింధుశాఖయు, అంగోలా రాష్ట్రమునంటి లోబిటో అఖాతమును, డెలగోవా అఖాతమును ఈ ఖండమునందు పేర్కొనదగిన సముద్ర వ్యాపనములు. ఈ ఖండపు సముద్రతీరము సరళమై 19,000 మై. పొడవుకలిగి యున్నది.

మెడగాస్కరు ద్వీపము మొజాంబిక్ విస్తృత జలసంధిచే భూఖండమునుండి వేరుచేయబడినది. హిందూ మహాసముద్రములోనికి చొచ్చుకొనివచ్చి కొమ్మువలె కనపడు భాగమును ఆఫ్రికా శృంగము అని అందురు.

నైసర్గికస్వరూపము :- ఆఫ్రికాఖండము 2000 అ. సరాసరి యెత్తుగల పీఠభూమి. దీనిని రెండు ముఖ్యమైన భాగములుగా విభజింపవచ్చును. 1. పీఠభూమి 2. తీరపు మైదానము. పర్వతము లని పిలువబడునవి పీఠభూమి యొక్క నిట్రమైన అంచులే. కాని వీనియందు ముఖ్యమయిన పర్వత శిఖరము లున్నవి. ఈ పీఠభూమి పడమరగా వాలి యున్నది.

మొరాకో, అల్జీరియా, ట్యునీసియా రాష్ట్రములలో 1500 మై. వ్యాపించి సరాసరిని 11,000 అ. ఎత్తుగల

అట్లాసు పర్వతములు ఉత్తరాఫ్రికాలో ముఖ్యమయిన పర్వతపంక్తులు. ఉత్తరమునుండి దక్షిణముగా నీ పర్వత శ్రేణులకు టెల్ అట్లాసు, గ్రేట్ అట్లాసు, సహారన్ అట్లాసు అనుపేర్లు కలవు. అట్లాంటిక్ తీరమునుండి నైలునదివరకు పల్లపు పీఠభూమి వ్యాపించియున్నది. దీని మధ్యభాగమున టిబెస్టి పర్వత పంక్తులుకలవు.

ఉన్నత పీఠభూమి పూర్తిగా దక్షిణ ఆఫ్రికాలోనే కలదు. పడమరనుండి తూర్పునకు దీనిఎత్తు క్రమముగా నెక్కువగును. హైవెల్డు, లోవెల్డు అను రెండు మెట్లుగా. ఈ పీఠభూమి తూర్పు అంచు తీరపు మైదానము నకు దిగుచున్నది. వీనినే కేప్ కాలనీలో గ్రేట్ కారూ, లిటిల్ కారూ అని పిలిచెదరు. ఈ పీఠభూమియొక్క ఎత్తైన అంచులనే నేటాలు రాష్ట్రములో డ్రాకెన్సుబర్గ అని అందురు.

ముఖ్యమయిన పర్వత శిఖరములన్నియు ఆఫ్రికా తూర్పుననే యున్నవి— మవెన్‌జోలి (16,800 అ.); కెన్యా (17,040 అ.); నిరంతరము మంచుతోనుండు కిలిమంజారో (19,321 అ.). సముద్రతీరమున మాత్రమే పల్లపు మైదానము లున్నవి.

ఎడారులు :- ఉత్తర ఆఫ్రికాలో 35,00,000 చ.మై వ్యాపించిన సహారా ఎడారి కలదు. ఇది అమెరికా సంయుక్త రాష్ట్రములకన్నను కొద్దిగా పెద్దది. తూర్పు పడమరలుగా దీని పొడవు 3,200 మై. ఉత్తర దక్షిణము లుగా దీని వెడల్పు 800 మై. నుండి 1,400 మై. వరకు కలదు. సామాన్యముగా మనము భావించునట్లు సహారా ఎడారి యంతయు పనికిరాని ఇసుకబీడు కాదు. పశ్చిమ సహారాయొక్క మధ్యభాగములో 6,000 అడుగుల ఎత్తుగల శిఖరములతో నిండిన ఆయిర్, హొగర్ పర్వత ములు గలవు. టిబెస్టి పర్వతపంక్తిలో 9,000 అ. ఎత్తు. గల ఉడిగిన అగ్నిపర్వతములు కలవు. మరియు బిల్మా వంటి సహజ సరస్సులు ఈ ఎడారిలో కలవు. ఈసరస్సుల చుట్టును వృక్షజాలమును, జంతుజాలమును కాననగును. ఫలవృక్షములు పెంచబడును. బావులనుండి నీటినిపారించి వ్యవసాయముకూడ చేయుదురు.

ఆఫ్రికా నైరుతి భాగముననున్న కల్‌హారి ఎడారి సహారా అంత పెద్దదికాకపోయినను పేర్కొనతగినది.

సరస్సులు :- తూర్పుననున్న పర్వత శ్రేణులయందలి చీలికలోయ (Rift valley) అని పిలువబడు పల్లపు ప్రాంతమున గొప్ప సరస్సులు ఉత్తర దక్షిణములుగా వ్యాపించియున్నవి. ఈ క్రింద పేర్కొనబడినవి ముఖ్య మైన సరస్సులు.

(క) విక్టోరియా న్యాంజా : వైశాల్యము 26,000 చ. మై., పొడవు 250 మై., వెడల్పు 200 మై., లోతు 270 అ.

(ఖ) టాంగనీకా సరస్సు : వైశాల్యము 12,700 చ. మై., పొడవు 450 మై., వెడల్పు 40 మై., లోతు 4,708 అ.

(గ) న్యాసా సరస్సు : వైశాల్యము 11,000 చ.మై. పొడవు 350 మై., వెడల్పు 45 మై.,

(ఘ) కివూ సరస్సు : వైశాల్యము — చ. మై., పొడవు 50 మై., వెడల్పు 30 మై.,

(చ) టానా సరస్సు : ఇది 5,690 అ. ఎత్తున అబి సీనియా పీఠభూమియొక్క ఉత్తరభాగమునకలదు. నైలు నదికి ఈ సరస్సు మూలజలములుగా నుపయోగపడు చున్నది.

(ఛ) రుడాల్ఫు సరస్సు : వైశాల్యము 3,475చ. మై, పొడవు 185 మై. వెడల్పు 37 మై.

(జ) చాడ్, బంగ్‌వలూ సరస్సులు : ఇవి మధ్య ఆఫ్రికాయొక్క ఈశాన్య నైరుతి భాగములయందు గలవు. వీటి నీరు ఋతువుల ననుసరించి సంకోచ వ్యాకోచ ములను చెందుచుండును.

నదులు : ఆఫ్రికా ఖండమునందలి నదులు పెద్దవైనను జలపాతములవలనను అచ్చటిప్రజల అనాగరికతవలనను అంతగా నుపయోగము లేనివిగానున్నవి. ఈ నదులవలన కొన్ని ప్రాంతములకు వాహన సౌకర్యములు కలుగు చున్నవి. నైలునదికి నాలుగు పెద్ద జలపాతములుకలవు. నైగరునదికి వేగముగల బూసా ఝరులు, కాంగో జాంబెసీ నదులకు ఎల్లాలా, విక్టోరియా జలపాతములు కలవు. వీనిలో కొన్ని 420 అ. ఎత్తుకూడ కలిగి యున్నవి. ముఖ్యమైనవి 5 నదులు :

1. నైలునది : (4,000 మైళ్ళు): ఇది ఉత్తరముగా ప్రవహించి, మధ్యధరాసముద్రములో కలియుచున్నది.

ఇది చాల ప్రాముఖ్యమైనది. ఏలయన, ఈజిప్టులోకెల్ల పురాతన నాగరకత గల ప్రాంతముగుండా ప్రవహించుచున్నది.

2. కాంగో (3,000 మై.) :- ఇది దక్షిణ అట్లాంటిక్ మహా సముద్రములో కలియుచున్నది. దీనికి నదీ పరీవాహ ప్రదేశము చాల ఎక్కువ. దీనియందు నైల్ నదిలోకంటె ఎక్కువ పరిమాణముకల నీరు కలదు. ఉపనదులతో సహా యిది మధ్యఆఫ్రికా కంతకును వాహన సౌకర్యములను కలిగించుచున్నది.

3. నైజర్ (2,600 మై.) :- ఇది బెన్వీ యను ఉపనదితో సహా దక్షిణముగా ప్రవహించి గినీ సింధుశాఖలో పడుచున్నది.

4. జాంబెజీ (1,600 మై.) :- ఇది తూర్పు దిశగా ప్రవహించి మొజంబిక్ చానలులో కలియుచున్నది. తూర్పుదిశగా ప్రవహించి డిలాగో అఖాతములో కలియు లింపునదియు, ఈనదియుకూడ ఎక్కువభాగము ఆఫ్రికా ఈశాన్య భాగమున ప్రవహించుచున్నవి.

5. ఆరెంజ్ (1,300 మై.) :- ఇది పడమరగా ప్రవహించి ఆఫ్రికా ఆగ్నేయ భాగమున అట్లాంటిక్ మహా సముద్రములో కలియుచున్నది.

ఇవికాక సెనిగల్ అను పేరుగల నది ఫ్రెంచి వెస్టు ఆఫ్రికాగుండా ప్రవహించుచున్నది. కాని యిది అంత ప్రాముఖ్యమైనది కాదు.

**శీతోష్ణస్థితి :-** ఆఫ్రికాలో ఉష్ణోగ్రతా వ్యాపనము సాధారణ విషయముగా కనబడును. ఋతువుల ననుసరించి సమోష్ణరేఖలు ఉత్తరమునకును, దక్షిణమునకును సూర్యునిగతి క్రమము ననుసరించి చలించుచుండును. వేసవిలోను, శీతాకాలమందును సమోష్ణరేఖలు తూర్పు పడమరలుగా వ్యాపించి, ఉత్తర దక్షిణమువైపున క్రమక్రమముగా ఉష్ణోగ్రతలో మార్పు సూచించుచుండును. మన శీతకాలములో మధ్యధరా సముద్రపు ఉత్తర ప్రాంతపు ఉష్ణోగ్రత 50° ఫా. నుండి 60° ఫా. మధ్య నుండును. కాని దక్షిణతీర ప్రాంతపు ఉష్ణోగ్రత దీనికంటె కొంత అధికముగా నుండును. దక్షిణాఫ్రికా పీఠభూమి యొక్క మధ్యభాగములో అత్యధిక ఉష్ణోగ్రత ఉండును. ఔన్నత్యము ననుసరించియు, సముద్ర సామీప్యమును బట్టియు ఉష్ణోగ్రత మార్పుచెందు చుండును. ఈ విధముగా దక్షిణాఫ్రికాలో చాలదగ్గరలోనే ఉష్ణోగ్రతలందు ఎక్కువ మార్పు కనబడుచుండును,

వేసవిలో ఉత్తరాఫ్రికా శీతోష్ణస్థితి దీనికి విరుద్ధముగా నుండును. అత్యధిక ఉష్ణతా మండలములు సహారా ఎడారి వైపునకు కదలును. దక్షిణతీర ప్రాంతములందు 50°-60° ఫా. ఉండుటవలన సుఖముగా నుండును. మధ్యధరా తీర ప్రాంతమందు అధిక ఉష్ణోగ్రత ఉండును.

**పవనములు :-** సూర్యగమనముతోపాటు ఉత్తరదక్షిణ దిక్కులకు చరించు భూమధ్యరేఖ యందలి అల్పపీడన మండలములయొక్కయు, కర్కట మకరరేఖల దాటియుండు అధికపీడన మండలముల యొక్కయు, ప్రాబల్యము ఈ భూఖండముపై ఎక్కువగా నుండును. అట్లాంటిక్ సముద్రమందలి అధిక పీడన ప్రదేశము అన్నియు శీతకాలములో ఉత్తర దిశయందును, అజోర్స్‌యొక్క అధికపీడన ప్రదేశము సహారా శీతల ప్రాంతమందున ఉండును. కాని భూమధ్యరేఖమీది అల్పపీడన ప్రాంతము దక్షిణదిశగా కదలును.

ఉత్తరార్ధగోళపు వేసవిలో అల్పపీడనముకల ప్రదేశములు ఉష్ణముగానున్న సహారా ఎడారి యంతయు వ్యాపించును. ఇప్పుడు ఉత్తరదిశకు మారెడు మకర రేఖా అధికపీడన మండలముయొక్క ప్రాబల్యము దక్షిణ ఆఫ్రికాకు ఎక్కువగా నుండును. ఆఫ్రికా ఈశాన్య ప్రాంతమునకంతకును హిందూ మహాసముద్రముయొక్క నుగ్రాహ్యముకాని ఋతుపవనముల ప్రాబల్యము ఎక్కువగా నుండును. ఈ క్రింద నుదహరించిన వాయుప్రవాహములు ఖండమంతటను వ్యాపించియుండును.

1. అజోర్సు అధికపీడన మండలమునుండి వెడల అట్లాంటిక్ ఈశాన్య పవనములు నైరృతి దిశగా వీచును.

2. సహారా ఎడారియందలి అధికపీడన మండలము నుండి హార్మట్టన్ అనబడు గాలులు సూడాన్ మీదుగ పశ్చిమ ఆఫ్రికా వైపునకు వీచును.

3. ఈజిప్టుదేశపు వాయుప్రవాహములు నైలులోయ వరకు వీచి, భూఖండములో చాలదూరము పోవును.

4. నైరృతి ఆసియా అధికపీడన మండలమునుం హిందూస్థానపు ఈశాన్య వ్యాపార పవనములు వీచున

5. మధ్యధరా సముద్రమందు మహా చక్రవాత నిర్మితమగు అల్పపీడనములును, ఉన్నత పీడనములును కలుగుచుండును.

6. దక్షిణ అట్లాంటిక్ మహాసముద్రపు అధిక పీడన ప్రాంతముల నుండి భూమధ్య రేఖవైపు అట్లాంటిక్ ఆగ్నేయ వ్యాపార పవనములు వీచును.

7. ఉత్తరార్ధపు గోళపు వేసవిలో "గర్జించు నలుబదులు" (వాయువ్య ప్రతికూల వ్యాపార పవనములు) ఆఫ్రికాలో దక్షిణ భాగములందు వీచును.

8. హిందూ మహాసముద్రమునుండి బయలుదేరు ఆగ్నేయ వ్యాపార పవనములు ఈ భూఖండము యొక్క ఆగ్నేయ ప్రాంతమున వీచును.

9. ఉత్తర ఖండపు వేసవిలో అట్లాంటిక్ ఆగ్నేయ వ్యాపార పవనములు భూమధ్యరేఖను దాటినతరువాత ఆఫ్రికా పడమటి భాగపు వైపునకు వంగి నైరృతి ఋతు పవనములుగా వీచును.

ఆఫ్రికా శీతోష్ణస్థితిలో ముఖ్యముగా గమనించవలసిన విషయములు:- 1. భూఖండమునకు మార్పులు తెచ్చెడు శీతల వాయురాసులు లేవు. 2. మహాసముద్ర ప్రవాహముల వలన తీరప్రాంతములందు శీతోష్ణస్థితి మార్పుచెంది అధికముగ ప్రభావితమై ఉండును.

వర్షపాతము :- ఈ భూఖండమందు మంచి వర్షపాతముగల ప్రాంతములు మూడు కలవు. 1. ఆగ్నేయ ప్రాంతము. 2. అట్లాస్ మండలము. 3. బెల్జియంకాంగో అనునవి ఆప్రాంతములు.

హిందూ మహాసముద్రమునుండి బయలుదేరు పవనములు పీఠభూమియొక్క అత్యున్నతమైన అంచునుండి పైకెగయును. ఈవిధముగా భూమధ్యరేఖకు దక్షిణవైపు నున్న తూర్పుతీర ప్రాంతమందు వర్ష మెక్కువగా నుండును. కాని ఖండాంతర్భాగమున పొడిగానుండును. మధ్యధరా చక్రవాతములు అట్లాస్ పర్వతశ్రేణి వలన ఆపుచేయబడినపుడు వాయవ్యతీర ప్రాంతమునకు శీత కాలములో వర్షమునిచ్చును. అదేవిధముగా "గర్జించు నలుబదులు" (వాయువ్య ప్రతికూలవ్యాపార పవనములు) వలన శీతకాలములో కేప్ కాలనీకి వర్షము కలుగును. గినీ సింధుశాఖలోనికి ప్రవహించు భూమధ్య ప్రతిసముద్ర ప్రవాహము మంచుతోకూడిన తీర వాయువులకు సహాయ పడును. తత్ఫలితముగా బెల్జియన్ కాంగో ప్రాంతమందును, ఫ్రెంచివారి భూమధ్యరేఖా ప్రాంత మందును, పశ్చిమతీర ప్రాంతమందును వర్ష మెక్కువగా కురియును. దక్షిణముగా ప్రవహించి "డిలాగో" అఖాత ములో పడు మొజంబక్ ప్రవాహముల వలన చల్లని, వెచ్చని తీరవాయువులు ఉద్భవించును. ఈ వాయువుచే భూమధ్యరేఖకు దక్షిణమువైపుననున్న తూర్పు తీర ప్రాంతమునకు వర్షము లభింపచేయును.

ఉత్తరాఫ్రికా పశ్చిమతీరమందలి కేనరీస్ (Canaries) ప్రవాహములు తరచుగా సంభవించు పొగమంచులకు తీరవాయువులకు కారణములు. దీనిమూలకముగా ఇచ్చట తీరప్రాంతములు పొడిగా నుండును. ఉత్తరముగా ప్రవహించు బెంగూలా (Benguela) శీతలజల ప్రవాహములవలన ఆఫ్రికా నైరృతి ప్రాంతమందుకూడ ఈ విధమైన వాతావరణ పరిస్థితులే యుండును. భూమధ్యరేఖకు ఉత్తరపువైపున నున్న తూర్పుతీరము పొడవునను ఈశాన్య నైరృతి ఋతుపవనములును, సముద్ర ప్రవాహములును ప్రభావము కలిగినవై యున్నవి. ఇవి ఆయా ఋతువులయందు వాటి కనుకూల ముగా నుండును. ఈశాన్య ఋతుపవనములు చల్లని పొడిగాలిని తెచ్చును. ఇక నైరృతి ఋతుపవనములు తీర వాయువులను కలిగించును. కాబట్టి భూమధ్యరేఖ కుత్తరపు వైపుననున్న తూర్పుతీర ప్రాంత మంతయు పొడిగా నుండును.

మొత్తముమీద ఆఫ్రికాలో వర్షపాతము నిలుకడగా నుండదు. ప్రతి సంవత్సరము భేదించుచుండును. క్రమ పరిమాణముతో వేర్వేరు విధములగు శీతోష్ణస్థితు లేర్ప డును. అయితే పొడిగానుండు ఉత్తర యీశాన్యముల మధ్యభాగము లందును, తడిగానుండు ఆగ్నేయ-ఆఫ్రికా ఉష్ణమండల మధ్యభాగముల యందును ఈ విభేదములు అత్యధికముగ గనపడుచుండును. ఉష్ణాత్మకమగు శీతోష్ణ స్థితి కలిగియుండుటయే ఆఫ్రికాయొక్క ప్రత్యేక విలక్షణత్వము.

నేలలు :- 1. భూమధ్యరేఖా ప్రాంతపు నేలలు, ఉష్ణమండల ప్రాంతపు నేలలు. ఆఫ్రికాలో భూమధ్యరేఖ

పొడవునను, ఉష్ణమండలములోని తేమప్రాంతములందును కలవు. ఇచటి నేలలు ఎట్టిగ నుండును.

2. మధ్యధరా శీతోష్ణస్థితియున్న ప్రాంతమందు మధ్యధరా ప్రాంతమునకు సహజమైన నేలలు కనబడును. అగ్ర (cape) ప్రాంతమందును, అట్లాస్ ప్రాంతములోని తేమప్రదేశములందును గోధుమరంగుగల నేలలుకనబడును. కాని దక్షిణముగా వీని నానుకొనియున్న ప్రాంతము లందును, మొరాకో మైదానములందును శాదముకాయ రంగుగల నేలలు కలవు.

3. నేటాలులోని నేలలు తేమగానుండు సమశీతోష్ణ మండల సముద్రతీర ప్రాంతముల నేలలలో ప్రత్యేకత కలిగినవి.

4. దక్షిణ ట్రాన్సువాల్ రాష్ట్రమందు ఆరెంజి. ఫ్రీస్టేటులోని హైవెల్డు ప్రాంతమందును గడ్డిమైదానపు పీఠభూములకు సంబంధించిన నల్లరేగడి నేలలు కలవు. చెర్నొజమ్సు (Chernozems) సమూహామునకు సంబం ధించిన లేతవర్ణపు నేలలు ఆఫ్రికా పీఠభూమియందలి ఎత్తైన ప్రాంతములందు కానబడును.

స్వాభావిక వృక్షములు :- అరణ్యములు, ఉష్ణమండల గడ్డిమైదానములు లేక సెవన్నాలు, ఎడారులు అనుమూడు భాగములుగా ఆఫ్రికాఖండపు సహజ ఉద్భిజ్జజాలమును విభజించవచ్చును. ఇవి వరుసగా ఆఫ్రికా ఖండములో ⅙, ⅖, ⅖ భాగములు ఆక్రమించియున్నవి. కాని సెవన్నా లను ఆఫ్రికాఉద్భిజ్జజాలమునకు మచ్చుగాభావింపవచ్చును. మిగిలిన విభాగములు ఈ క్రింద నీయబడుచున్నవి:-

1. భూమధ్యరేఖా ప్రాంతమందలి వర్షపుటడవులు:- ఇవి బెల్జియంకాంగో రాష్ట్రమందును, ఫ్రెంచి, ఆఫ్రికా అక్షరేఖా రాష్ట్రమందును, ఆఫ్రికాలో ఎక్కువగా వర్షముపడు పశ్చిమ ప్రాంతమందును కలవు.

2. సమశీతోష్ణ వర్షపుటడవులు :- ఇథియోపియా పీఠభూమి యందును, పర్వతశ్రేణులయొక్క తూర్పు మధ్యభాగములందును కలవు.

3. ఓక్-కోనిఫర్ వనములు :- మొరాకో, అల్జీరియా ట్యునీసియా రాష్ట్రములందు కలవు.

4. పొడివనములు :- ఉష్ణమండల కాలమానము గల ప్రాంతములందు కలవు.

5. కంటకారణ్యములు :- ఉష్ణమండల కాలమానము గల ప్రాంతములయొక్క పొడిప్రదేశములందు కలవు.

6. సమశీతోష్ణపు చిట్టడవులు :- అగ్ర (Cape) రాష్ట్రమునందును, ఉత్తరాఫ్రికా మధ్యధరా ప్రాంత మందును కలవు.

7. సముద్ర తీరపుటడవులు :- ఇవి సముద్రపు నీటి పాటుపోటులు కలిగిన ప్రాంతములందు ముఖ్యముగా నదీముఖప్రాంతములందు కలవు.

8. ఉష్ణమండల గడ్డిమైదానములు లేక సెవన్నాలు :- ఉష్ణమండల ప్రాంతారణ్యముల సరిహద్దులందలి 35 అం. నుండి 60 అంగుళముల వర్షము కురియుచోట్ల యందు గలవు.

9. పర్వతపు పచ్చికమైదానములు, లేక ఆల్పైన్ మైదానములు :- మధ్య ఆఫ్రికాలోని కెన్యా రాష్ట్ర మందలి ఎత్తైన పర్వత ప్రాంతమందును, ఇథియోపియ పీఠభూమియందును కలవు.

10. చిత్తడినేలల గడ్డిమైదానములు:- తూర్పు ఆఫ్రిక ప్రాంతములందును, నైలునది ఎగువప్రాంతము అందున కలవు.

11. ఉప - ఎడారులు :- ఇవి సెవన్నానుండి ఎడా రూపమునకు మార్పు చెందుటలో ఒక పరిణామద వెల్డులయొక్క మెరక భాగములయందు కలవు.

12. ఎడారి :- నిరర్థకమైన ఇసుకతలము, శిలాతలము ఇురదతలము కలిగి మృగపక్షి వృక్ష విరహితమై అచ్చపు ఎడారి ఈ ఖండమునందు 8 శాతము మే ఆక్రమించియున్నది.

ఖనిజములు :- బెల్జియం కాంగోనుండి ఉత్తర రో షియాలోనికి నైరృతి దిక్కునుండి ఈ శాన్యముగ వ్యాపించుచు, సుమారు 200 మైళ్ళపొడవున అత్యధి ముగ రాగి ఉత్పత్తిగల ప్రదేశమున్నది. ఈప్రాంతమం రేడియం, కోబాల్టు, లోహములుగూడ ప్రపంచము కెల్ల ఎక్కువగా గనులనుండి లభించుచున్నవి. ప్రపం ములో లభించు మాంగనీసులో ఐదవవంతు గోల్డుకో రాష్ట్రములో దొరకును. మొరాకో, అల్జీరియా, టు సియా రాష్ట్రములందు ఇనుము లభించుచున్న ప్రపంచములో నుత్పత్తియగు రాగిలో ఆరవభాగ

ఆఫ్రికానుండియే లభించును. ట్రాన్స్‌వాల్ రాష్ట్రమందును, జోహన్స్‌బర్గ్ దగ్గరనున్న రాండ్ అను ప్రాంతములోను కేప్ రాష్ట్రమునందలి కింబర్లీ ప్రాంతమందును వజ్రపు గనులు పనిచేయుచున్నవి. డ్రాకెన్స్‌బర్గ్ యొక్క తూర్పు, పడమర తట్టులయందు బొగ్గు లభించును. ఇవిగాక ఆఫ్రికా ఖండమందు స్ఫురితములు, రేడియం పదార్థము, క్రోమియం, ప్లాటినమ్, తగరము, పుష్కలముగా లభించును కాని యీ ఖండమందు బొగ్గు, పెట్రోల్, సీసము, తుత్తునాగమును సరిపడునంతగా లేవు.

7. జనాభా-ఆదిమవాసులు :- ఆఫ్రికాలోని జనుల నిరక్షరాస్యత వలనను, అనాగరికతవలనను ఇందలి జనాభా సంఖ్యనుగూర్చి మదింపుచేయుట కష్టము. కాని 1950లో ఈ ఖండమునందు 15 కోట్ల జనాభా యుండి యుండవచ్చును. జనసాంద్రతలో ప్రదేశములను బట్టి చాల తేడాలు కలవు; ఉదాహరణమునకు ఈజిప్టునందలి కొన్ని ప్రాంతములందు చదరపు మైలునకు 1750 జనాభా కలదు. ఎడారులలో కొన్ని ప్రాంతములందు ఒక్కరునూ లేరు.

ఆదిమవాసుల తెగలు యీ క్రింద నీయబడినవి.

1. ఇథియోపియా, సోమలీలేండ్, సూడాన్, కెన్యా రాష్ట్రములందలి తూర్పుభాగములలోను, పశ్చిమ ఆఫ్రికా యందలి కొన్ని ప్రాంతము లందును, హెమైటిస్ అను ఆదిమవాసులు కలరు.

2. సెమైటిస్ అను తెగవారు ఉత్తరాఫ్రికా, తూర్పు ఆఫ్రికాలలో కలరు.

3. భూమధ్యరేఖ కుత్తరమున పశ్చిమ తీరమునుండి సూడాన్ దేశమువరకును గల మధ్యఆఫ్రికాలో సూడాన్ భాష మాట్లాడు నీగ్రోజాతి ప్రజలు కలరు.

4. దక్షిణ ఆఫ్రికా యందంతటను, మెడగాస్కర్ ద్వీపమునందలి పశ్చిమ ప్రాంతమందును బంటూభాష మాట్లాడు నీగ్రోలు కలరు.

5. నైరృతి ఆఫ్రికాయందు "బుష్‌మెన్" హాటెన్‌టాట్ అను తెగలవారు నివసించుచున్నారు.

6. బెల్జియన్ కాంగో యొక్క ఈశాన్య ప్రాంతమందు "పిగ్మీస్" అను తెగవారు అక్కడక్కడ కలరు.

8. ఆఫ్రికా జనుల సంస్కృతి :- పరిసరములలో ప్రతిఫలించు సాంఘిక కార్థికాభివృద్ధి అవకాశముల విషయమున ఆఫ్రికాలో ప్రదేశమునుండి ప్రదేశమునకు ముఖ్యములైన వ్యత్యాసములు కనిపించుచున్నవి. మిక్కిలి వేగముగా నభివృద్ధిచెందిన సాంస్కృతిక ప్రదేశములు కొన్నియు, ఎట్టిమార్పునులేక స్థిరముగా ఉండిపోయిన ప్రదేశములు కొన్నియు గోచరించును.

నైలునది లోయ నీగ్రో ప్రభావమేమియును లేక ప్రత్యేక ఔన్నత్యమును చెందిన హెమిటిక్ సెమిటిక్ సంస్కృతినందిన ప్రదేశము. ఈ సంస్కృతి 6,000 సంవత్సరములనుండి వ్యాపించియున్నది. ఆదినుండియు పారసీక, గ్రీకు, రోమను, అరబ్బుల దండయాత్రల సారాంశమును గ్రహించి పెక్కుమార్పులతో రూపొందినది ఈజిప్టు సంస్కృతి.

ఇప్పుడు 'బెర్బరులు' అని పిలువబడు ఉత్తర హైమైట్సు ప్రదేశము ప్రత్యేకమైన సంస్కృతికి నెలవైనట్టిది. అచ్చట ఫోనీషియనులయు, ఈజిప్టుదేశీయులయు, అరబ్ మహమ్మదీయులయు ప్రభావము కనబడుచున్నది.

పశ్చిమ మధ్య ఆఫ్రికాల (నడుమయందలి) అరణ్య ప్రదేశమున మిక్కిలిపరిణితమైన దేశీయసంస్కృతి విలసిల్లుచున్నది. వ్యవసాయము, మతము, గారడీ, వివిధ సాంఘిక ఆచారములు, ఇత్తడి, ఇనుపపనులు, అందమైన కుండలు ఈ ప్రదేశమునకు ప్రత్యేక ప్రాధాన్యము కూర్చుచున్నవి.

సగము ఎడారిగను, సగము అరణ్యముగను ఉన్న ఆఫ్రికా తూర్పుభాగమున నివసించు మసై, నందిజాతులకు పశుపాలనమే ప్రధానవృత్తి. ఈ సంస్కృతికి పార్కులాండు సంస్కృతి అనిపేరు.

పై ప్రదేశములందలి సంస్కృతికి భిన్నములై ఈ క్రింది ప్రాచీన సంస్కృతులుకూడ గోచరించుచున్నవి.

ఎడారికిని, అరణ్యమునకును నడుమనున్న బహిరంగ ప్రదేశమున పశువులను, మేకలను, గొఱ్ఱెలను, గుఱ్ఱములను కలిగియుండు సంచారజీవులు కనబడుచున్నారు. ఈసంస్కృతికి "గోపాలసంస్కృతి" (Pastoral culture) అని పేరు.

లిబియా ఒయాసిస్సులలోని టూరెగు, టెబు, అరబుల సంస్కృతివి సహారాలోని ఒంటెలను మేపువారి సంస్కృతి అని చెప్పనగును. దక్షిణ ఆఫ్రికాలోని కలహారి ఎడారిలో

గుల్మనివాసుల (Bush men) మృగయా సంస్కృతి (Hunting culture) వ్యాపించిఉన్నది. వీరు వింటితోను, విషబాణములతోను వేటాడుదురు.

ఆఫ్రికా పలుదేశములందు పలువిధములైన సాంఘిక వర్తనములను అవలంబించు నీగ్రోలకు నివాసము. వారందరును ఉత్తమ మార్దంగికులుగా ఖ్యాతికెక్కియున్నారు. వారు తంత్రులతోకూడిన సాధనములను, గాలి సాధనములనుకూడ తయారుచేసి వానిపై పాడగలరు. అన్ని కర్మకలాపములందును మృదంగమును, నృత్యమును అపరిహార్యములై యుండును. వారి మానసిక పరిణామములో వెనుక నెవ్వరు నందీయకుండ కొన్ని విషయములకు సంబంధించిన గేయములను పాడజాలుట మిక్కిలి ఎన్నదగిన అంశము. అచ్చటి దేశీయ జనులు అడవులలో సమృద్ధమైన జీవితమును గడపుదురు. ఆ అడవులలో ఏనుగులు, లేళ్ళు, జిరాఫీలు, హిప్పొపోటమసులు నీటి గుఱ్ఱములు ఖడ్గమృగములు, సింహములు, చిరుతపులులు, హాయనాలు, నివంగులు విస్తారముగా ఉండును. అచ్చటి జాతులవారికి ఈ మృగములవలన ఆర్థిక ప్రయోజనము కలదు. వారి పురాణగాథలు, జానపద గేయములు సామెతలు మున్నగునవి సహజముగా వన్యమృగముల జీవితముచే ప్రభావితములై ఉన్నవి.

ఆఫ్రికాలోని భాషలు పెక్కింటికి లిపులులేవు. ఆఫ్రికా భాషలకు చిహ్నములైన అక్షరములను యూరోపియనులు ముఖ్యముగా పండితులును, పరిశోధకులును ప్రవేశపెట్టి యుండిరి. ఈజిప్టునందును, ఉత్తర ఆఫ్రికాలోని పలుభాగములందును అరబిక్ అధికారికమైన భాష; క్రీ. శ. 1300 నుండి అబిస్సీనియాలో "అమ్‌హెరిక్" అధికార భాష. ఈజిప్టునందలి పదచిత్రములకు (Wood pictures) చారిత్రక ప్రాధాన్య మున్నది. గ్రీకు ఈజిప్టు అక్షరముల కలయికతోకూడిన కాప్టిక్‌లిపిలో క్రీ.శ. 200-400 లకు నడుమ పురాతన మత గ్రంథములు వ్రాయబడినవి. టిఫినాగు అనువారు అంత ముఖ్యులు కాకపోయినను ప్రాచీన జనులలో ఎన్నదగినవారు. వారు సైబీరియాలోని ఒకజాతి భాషయైన 'తమాషెకు' ను 160 అక్షరములతో కూడిన లైబీరియాలోని 'వై' అను నీగ్రో లిపిని వ్రాయుచుండిరి.

ఆఫ్రికా పరిశోధనకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన తేదీ లీ క్రింద ఈయబడుచున్నవి.

క్రీ. పూ. 500 హనోన్ అను కార్తజీనియను కార్తేజి నుండి ఆఫ్రికా పడమటితీరము చుట్టు తిరిగి సిరాలియోన్ అను ప్రదేశమునకు అరిగెను.

క్రీ. శ. 60 తూర్పుతీరము అరబ్ వర్తకులచే పరిశోధింపబడెను. నీరో శత సేనానులచే నైలునదీ ప్రదేశము పరిశోధింపబడెను.

క్రీ. శ. 1419 గినీ సింధుశాఖలోని చిన్న ద్వీపములను, మదీరాద్వీపములను పోర్చుగీసువారు కనుగొనిరి.

క్రీ. శ. 1487 బార్థలోమియో డయాస్ గుడ్‌హోప్ అగ్రమును చుట్టివచ్చెను. కాని ఇండియా చేరలేకపోయెను.

క్రీ. శ. 1497 వాస్కో-డి-గామా గుడ్‌హోప్ అగ్రమును చుట్టివచ్చి ఇండియాను చేరగలిగెను. క్రీ.శ. 1482 కాంగోనది డయగోకామ్ చే పరిశోధింపబడెను.

క్రీ శ.. 1622 ఫాదర్ జెరోనిమో, లోబా అబిసీనియాలో చాలభాగము పర్యటనము కావించెను.

క్రీ. శ. 1825 మేజరు అలెగ్జాండరు గార్డను లైంగ్ ఉత్తరము నుండి టింబక్టు వరకు సహారా దాటెను. క్రీ. శ. 1770 జేమ్సుబ్రూసు బ్లూ నైలు నదిని పరిశోధించెను. క్రీ. శ. 1848 జాన్‌యల్ క్రాఫ్ మొంబాసా నుండి కిలిమంజారో కెన్యా పర్వతముల వరకు గల ప్రదేశమును పరిశోధించెను.

9. ఆఫ్రికా యందలి రాజకీయ చారిత్రక వాతావరణము: జగత్ప్రసిద్ధములైన పిరమిడులతో కూడిన ఈజిప్టును, అంతర్జాతీయోపయుక్తమైన సూయజు కాలువయును, ఆఫ్రికా ఈశాన్య భాగమును మిక్కిలి చరిత్ర ప్రసిద్ధినొందిన ప్రదేశములు. మధ్యధరా సముద్ర ప్రాంతమందును, మధ్య ఆసియా యందును గల జనులు ప్రాచీన కాలమున నే కావించిన దండయాత్రలు ఈజిప్టునకు అతి విస్తృతమైన చరిత్రను, మిక్కిలి పురాతనమైన నాగరకతను ఒసంగినవి. క్రీ.శ. పదమటిశిరమున 1600 నుండి 1880 వరకు పోర్చుగీసువారు పరిశోధనను, బానిసవర్తకమును సాగించిన గినీ సింధుశాఖ ఆధునిక కాలమున ప్రాధాన్యము వహించినది.

ఈజిప్టు యొక్క 6000 ఏండ్ల చరిత్ర చెప్పుటకు ప్రత్యక్ష చరిత్ర సాధ్యమున్నది. క్రీ. పూ. 9వ శతాబ్దిలో

కార్తజీనియను సంస్కృతి వచ్చినప్పటినుండియు లిఖిత చరిత్రమే లభించుచున్నది. కాని ఆఫ్రికాలో యూరోపియనులు ప్రవేశించినప్పటి నుండియు, క్రీ. శ. 15 వ శతాబ్దిలో పోర్చుగీసువారు పరిశోధించి, ఆక్రమించి స్థిర నివాస మేర్పరుచుకొన్నప్పటినుండియు ఆఫ్రికా రాజకీయార్థిక నిర్మాణము పూర్తిగా మార్పుచెందినది.

క్రీ. శ. 1500 కును, 1886 కును మధ్యకాలమును అభ్యుదయకాలమని చెప్పవచ్చును. యూరోపియనులు ఆఫ్రికాలో స్థిరపడుటయే ఇందుకు కారణము. ఆది కాలమునందలి సముద్ర పరిశోధనయు, అంతర ప్రవేశమును, ఆ ఖండమునందలి లోహవృక్షాది సంపదను వెలుగునకు తెచ్చెను. ఇది వర్తక సంఘ స్థాపనమునకును, మిషనరీల (మత ప్రచారకుల) అగనునమునకును దారి చూపెను. పై వర్తక సంఘములు దేశీయ సంపదను కొల్లగొట్టుటయు, మిషనరీలు ప్రచార కార్యమును చేయుటయు కొనసాగుచుండ, యూరపునందలి వివిధ దేశముల ప్రభుత్వములు పరస్పర స్పర్ధవహించి ఒండొంటితో యుద్ధముచేయ నారంభించెను. దీనికి ఫలితముగా క్రీ. శ. 1880 1886 సంవత్సరముల నడుమ ఆఫ్రికా ఖండము పోర్చుగీసు, ఫ్రెంచి, డచ్చి, ఇంగ్లీషు, జర్మను ప్రభుత్వముల నడుమ విభక్తమగుట సంభవించెను. ఈజిప్టు, ఎథియోపియా, లైబీరియా అనునవిమాత్రమే యూరోపియనుల చేజిక్కకుండ స్వతంత్రముగా ఉండిపోయెను.

ఈ శతాబ్దిలో ఆఫ్రికావాసులకును యూరోపియనులకును నడుమ ఎక్కువ రాజకీయ సామరస్యము ఏర్పడుటయు, ఆఫ్రికా ప్రజలకు కొంతవరకు స్వయంప్రభుత్వము పరిణమించుటయు సంభవించెను. ఈ కాలమందంతటను 4 మిలియనుల సంఖ్యగల యూరపుదేశములవారు తమ దేశములన్నియు కలిపిన భూవైశాల్యముకంటె 30 రెట్లధిక విశాలమైన ప్రదేశమున నివసించు 143 మిలియనుల సంఖ్యగల ఆఫ్రికను ప్రజల రాజకీయ భవితవ్యమును, ప్రకృతి సంపదను నిర్ణయించుచుండిరని చెప్పవచ్చును. వారిట్టి అధికారమును చలాయించుటకు వారికి ప్రకృతి సంపదపైగల ప్రాభవమే కారణము. ఉత్తర రొడీషియాలో రాగి, సీసము, తుత్తునాగము, మాంగనీసు మున్నగునవియు, బెల్జియం అధికారమునందుండిన మధ్య కాంగోలో కోబాల్టు, రాగి, బంగారము, యూరేనియము, మున్నగునవియు మరికొన్ని వాణిజ్యపు పంటలును, ఫ్రెంచి వారి అధీనములోని అల్జీరియాలో ఇనుము, సీసము, ఫాస్ఫేట్లు, తుత్తునాగము, తైలములు, మద్యము, ఊలు, కోకో, ప్రత్తి, కఱ్ఱ మొదలగునవియు పైన చెప్పబడిన ప్రకృతిసంపదలలో ముఖ్యములైనవి. దక్షిణాఫ్రికాయందలి వర్ణపృథక్కరణ సమస్యయందును, అల్జీరియాయందలి ఇటీవలి తిరుగుబాటునందును, దక్షిణాఫ్రికాయందలి పెక్కు దేశములలోని రాజకీయ సంక్షోభము అందును (మౌ, మౌ) సూయజు కాలువను ఈజిప్టు జాతీయకరణ విషయమున పడమటి యూరపుదేశములు పొందిన కలవరమునందును ఈ యైరోపియాధికారము వలన రాజకీయ ప్రతిక్రియలు ప్రతిఫలించుచున్నవి.

ఆఫ్రికాయందలి చాలభాగము బ్రిటను, ఫ్రాన్సు, బెల్జియము, పోర్చుగలు అను నాలుగు దేశముల అధీనమందున్నది. సంయుక్త రాష్ట్రముల యాజమాన్యము **(trusteeship)** క్రింద మరికొన్ని యితర భాగములున్నవి. ఆఫ్రికాఖండ మంతటికిని మూడే స్వతంత్రదేశములున్నవి. అందు ఈజిప్టు పురాతనకాలమునుండియు స్వతంత్రమై యుండెను. అమెరికానుండి విముక్తులైన నీగ్రో బానిసల కొరకు లైబీరియా ప్రజాస్వామ్యము ఏర్పరుపబడెను. ఎథియోపియా (అబిసీనియా) క్రీ. శ. **1941** లో ఇటలీ నుండి స్వాతంత్ర్యమును సంపాదించెను.

గుడ్‌హోప్ అగ్రము, ట్రాన్సువాలు, ఆరెంజి ఫ్రీ స్టేటు, నేటాలు అనువానితోగూడిన సంయుక్త దక్షిణ ఆఫ్రికా స్వయంపాలితమైన ప్రదేశము. ఆంగ్లేయులకును, డచ్చివారికిని నడుమగల స్పర్థచేతను, బహుముఖములైన దేశీయ సమస్యలచేతను, ప్రాచ్యులైన భారతీయులు వలసవచ్చుటచే నేటాలులో ఏర్పడిన స్థానిక రాజకీయ సంక్షోభముచేతను అచ్చటి రాజకీయ పరిస్థితి మరింత క్లిష్టతరమగుట సంభవించెను. పశ్చిమాఫ్రికా ప్రదేశములలో బ్రిటిషువారు దేశీయనాయకులద్వారా పరోక్షమైన పాలనపద్ధతిని అభివృద్ధికావించిరి. పశ్చిమాఫ్రికాలో యూరోపియనులు వచ్చి స్థిరపడుట అంత ముఖ్యమైన సమస్య కాదు కాని తూర్పు ఆఫ్రికాలోని బ్రిటిషుప్రాంతమున, ముఖ్యముగా కెన్యాలో వలస

వచ్చిన తెల్లవారు భూమి నాక్రమించుకొనుట మిక్కిలి తీవ్రమైన సమస్యగా పరిణమించినది. (బ్రిటిషు) ఉగాండా ఆఫ్రికా యొక్క పరిపాలన విషయమున ముందంజ వైచినది. అచ్చట దేశీయ న్యాయస్థానములకు ఎన్నదగినంత న్యాయాధికారము (legal power) కలదు. టాంగనీకాలో బ్రిటిషువారు ఒక శాసనముద్వారా దేశీయ ప్రజా సమూహమునకు తగినంత ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యము నొసంగియుండిరి. 46 వేల మంది ఆసియావాసులు (ముఖ్యముగా భారతీయులు) వచ్చి స్థిరపడుట టాంగనీకాలోని సాంఘిక పరిస్థితిని కొంతవరకు క్లిష్టము కావించినది. ఉత్తర ప్రదేశములతో పోల్చినచో ఉత్తర రొడీషియాలో తెల్లవారి సంఖ్య చాల తక్కువే. వారు గని పరిశ్రమలందు మగ్నులై యుందురు. దక్షిణ రొడీషియాలో తెల్లవారి సంఖ్యకంటె దేశీయుల సంఖ్య 20 రెట్లెక్కువ. బసుటోలాండు, బెచునాలాండు, స్వాజీలాండు అను ప్రదేశములం దొక్కొక్కచోట ఒక్కొక్క కమీషనరు కలదు. అతడు దక్షిణాఫ్రికా హైకమీషనరు ద్వారా బ్రిటిషు ప్రభుత్వమునకు బాధ్యత వహించి యుండును.

మధ్య కాంగో ప్రదేశమున బెల్జియనుకు విస్తృతమైన భూభాగము కలదు. అందు ఖనిజ జంతుసంపద విస్తారముగా కలదు. అచ్చట పామ్ నూనె, కాఫీ, కోకో, వంచదార, రబ్బరు, కోపలీ మున్నగునవికూడ లభ్యములగును.

ఉత్తర ఆఫ్రికా యందలి ఫ్రెంచి రక్షిత స్థలములు మిక్కిలి సంపన్నములైనవి. ఆల్జీరియాలోని ఖనిజ వృక్ష సంపదలు ముఖ్యముగా ఫ్రాన్సున కెగుమతి చేయబడుచున్నవి. ప్రతి సంవత్సరమును రెండుమిలియనుల టన్నుల ఇనుప యిసుక ఫ్రాన్సునకు ఎగుమతి కావలయుట ఆల్జీరియాపై ఫ్రాన్సునకు గల గొప్ప ఆకర్షణకు కారణము.

ఆఫ్రికాలో పోర్చుగీసువారికి మూడు ప్రదేశములు కలవు. అవి దూర పశ్చిమాఫ్రికాలోని పోర్చుగీసుగినియా వాయవ్య భాగము నందలి అంగోలా, తూర్పు ఆఫ్రికా యందలి మొజాంబిక్. అంగోలాలో యూరోపియనుల స్థిరనివాసమునకు తగిన శీతోష్ణ స్థితిగల ఉన్నత ప్రదేశము కలదు.

జి. స.

**ఆఫ్రికా ఖండపు భాషలు** :- ప్రధాన భాషలు - వర్గీకరణము : ఇటీవలి కాలమున వలసవచ్చిన ఐరోపావారిని వదలిపెట్టినచో ఆఫ్రికా ఖండములోని ప్రజలను నాలుగు ప్రధాన జాతులుగా విభజింపవచ్చును.

1. పిగ్మి - బుష్మన్ 2. నీగ్రో 3. హెమిటిక్ 4. సెమిటిక్. వీరికి సంబంధించి ఆఫ్రికా ఖండపు భాషలను కూడ నాలుగు వర్గములుగా విభజింపనగును. కాని యిందలి నీగ్రో వర్గము 1. సూడానిక్ 2. బంటు అని తిరిగి రెండు అంతర్విభాగములుగా తరువాత విడివడినది.

ఇట్లు ఆఫ్రికా ఖండ భాషలు ఐదు వర్గములుగా విభజింపవచ్చును :- 1. బుష్మన్ 2. సూడానిక్ 3. బంటు 4. హెమిటిక్ 5. సెమిటిక్.

స్ట్రక్ (struck) యొక్క వివరణ ననుసరించి, ఆఫ్రికా భాషల సంఖ్య ఈ విధముగా నున్నది :—

(1) బుష్మన్ వర్గము : 11 భాషలు (2) సూడానిక్ వర్గము : 264 భాషలు (3) బంటువర్గము: 182 భాషలు (4) హెమిటిక్ వర్గము : 47 భాషలు (5) సెమిటిక్ వర్గము : 10 భాషలు.

పెక్కుభాషలు కొలది వైశాల్యముగల ప్రదేశములో మాత్రమే మాట్లాడబడుచున్నవి. సుమారు 12 భాషలు మాత్రము 10 లక్షలకంటె ఎక్కువ మందిచే మాట్లాడబడుచున్నవి.

ప్రత్యక్షోపయోగము ననుసరించి, ఈ క్రింది ఆఫ్రికా భాషలు తక్కినవానికంటె ఎక్కువ ముఖ్యమైనవిగా ఉన్నవి :-

1. సెమిటిక్ భాషలు : అమ్హారిక్, అరబిక్ 2. హెమిటిక్ భాషలు : హౌసా 3. బంటు భాషలు : గండా, కికుయూ, కాంగో, లుబా-లులువా, మ్బుందు (Mbundu), న్గాలా (Ngala), న్యాన్జా, సుకుమా-న్యాంవెజీ, రుఆన్డా రుండీ, సోథో-పెడిచ్వానా, స్వాహిలీ, స్వినా - కారన్గా - న్డావ్ (Swina - Karanga - Ndao), జులూ - క్సోసా 4. సూడానిక్ భాషలు : అకాన్, డిన్కా - నూయర్, ఎఫిక్ - ఇబిబియో, యు - వన్ హోదహోం, ఇబో, కనూరీ, క్పెల్ - మెండ్, మాలిన్కే - డ్యురా - బంబారా, మోసీ - డాగోమ్బా, నూపేగ్బారి, టెంనె (Temne), వోలోఫ్, యోరుబా, జన్డే.

వర్గముల పరిశీలన : పై నుదాహరింపబడిన ఐదు ప్రధాన వర్గముల వివరములను ఇప్పుడు సంక్షిప్తముగా పరిశీలింతము :

I బుష్‌మన్ వర్గము : ఈ భాషలను తిరిగి మూడు అంతర్విభాగములుగా చేయనగును :

(i) దాక్షిణాత్యము. (ii) మాధ్యమికము, (iii) ఉత్తర దేశీయము.

1. ధ్వనివిషయములో ఈ భాషలు టర్కీ కోళ్ళ 'కటుక్కు' మను ధ్వనుల (Clicks లేక Clucks) ఎక్కువగా కలిగియుండును.

2. స్వరభేదము (Intonation) : ఈ భాషలకు మరొక లక్షణము.

ఈ లక్షణము 'హాటెన్‌టాట్', 'సూడానిక్' బంటు భాషలలోకూడ సామాన్యముగా కనిపించుచున్నది. ఒక మారుచ్చరింపదగిన అక్షర సముదాయము (Syllable) ను, ఒక్కొక్కప్పుడు ఒకే ధ్వనిగల హల్లునుగూడ స్వరభేదమును కలిగియుండును. పదమునకు ధ్వని యెంత ముఖ్యమో ఈ స్వరభేదముకూడ అంత ముఖ్యమైయుండును. ధ్వనులు ఒకేవిధముగానున్న పదము స్వరభేదములు కలిగియుండుటచే ఒకదానితో నొకటి వ్యుత్పత్తి బాంధవ్యము లేమాత్రమును కల్గియుండని క్రొత్తపదములుగా మారును.

బుష్‌మన్ భాషల యొక్క అనేక లక్షణములు సూడానిక్ భాషలకు కూడ సామాన్యములై కనబడుచున్నవి. ఇవి : (1) స్వరభేదము (2) ఏకోచ్చారణ వర్ణత్వము (Mono-syllabism) (3) క్రియకును, నామవాచకమునకును రూపభేదము లేకుండుట (4) షష్ఠీ విభక్తి ప్రత్యయము యొక్క స్థానము (5) "వారు" ఉపయోగించి బహువచన రూపము నేర్పరుచుట.

అయినను వ్యుత్పత్తి సంబంధములగు బాంధవ్యము లింతవరకును కన్గొనబడకపోవుటచే బుష్‌మన్, సూడాన్ భాష లొకే కుటుంబమునకు చెందినవని చెప్పుట కింకను మనకు తగిన ఆధారము లభింపలేదు.

పిగ్మీభాషలనుగూర్చి మనకు తగిన పరిజ్ఞానము లేదు. అందుచే వీనినిగూర్చి చెప్పుటకు మనకు వివరములు లేవు. అన్నిచోట్లను వారు పొరుగుననున్న నీగ్రో భాషను స్వీకరించి యున్నారు.

II సూడానిక్ వర్గము :- అట్లాంటిక్ మహాసముద్ర తీరమున ఉన్న 'సెనగాంబియా - కేమరూన్సు' నుండి అబిసీనియా పడమటి పీఠభూముల వరకును ఈ భాషలు మాట్లాడబడుచున్నవి.

ఉత్తరమున 'నూబా' (Nuba), 'కునామా' యును, తూర్పు ఆఫ్రికాలో గయా, నీఫా - కవిరాన్డో (Nyifwa-Kavirondo) యును పైప్రదేశములో ఈ భాషలు మాటాడబడని తావులు.

బంటువర్గమువలె ఈ వర్గపు భాషలు అన్యోన్యము, దగ్గరసంబంధము గలవిగాలేవు. ఇందలి కొన్ని భాషలు మిక్కిలి భేదభావమును ప్రదర్శించుచున్నవి.

సూడాన్ అత్యంత ప్రాచీనకాలము నుండియు ఉత్తరము, తూర్పు దిక్కులనుండి దండయాత్రలకు గురియై యుండెను. అందుచే నేటి భాషా పరిస్థితులు ఎడతెగని యీ కదలిక, మార్పులయొక్క ఫలితమై యున్నవి. ఈ మార్పులలో పాతభాష అంతరించి, క్రొత్త భాష లేర్పడినవి. క్రొత్తగావచ్చిన భాషల స్వభావమును బట్టి ఈ మార్పులు తరుచు తీవ్రములై ఆదిమలక్షణములను ఎక్కువగా మార్చివేయుచున్నవి. కనూరి, ఒలఫ్ (wolof) ఇట్టి తీవ్రములగు మార్పులకు గురియైన భాషలకుదాహరణములు.

సర్వసామాన్య లక్షణములు :- 1. ధ్వని విశేషము. 2. నిర్మాణము. 3. వ్యుత్పత్తి విషయములలో ఈ వర్గ భాషలకు సామాన్య లక్షణములు కనబడుచున్నవి. నీగ్రో ప్రజ లెక్కువగాగల తావులలో ఈ సామ్యము ప్రబలతరముగా నున్నది.

ఈ క్రింది సామాన్య లక్షణము లీభాషలలో కనబడుచున్నవి : (1) స్వరభేదముచే అర్థభేదము : ఉ॥ యు (Ewe) భాషలో : 'దో' (ఉచ్చస్వరము) = చెప్పుట; 'దో' (నీచస్వరము) = విచారముగా నుండుట - ; 'దో' (సమాన స్వరము)=నిద్రపోవుట.

2. ఏకవర్ణ ధాతువులు :- 'యు' (Ewe) భాషలో 'కు'=చావు; 'నుబా' (Nuba) భాషలో: 'టు'=బాలిక.

3. క్రియలనుండి నామవాచకములు సంబోధన (Vocative) ప్రథమావిభక్తి ప్రత్యయము, లేక అనునాసిక ప్రత్యయము ముందు చేర్చుటచే ఏర్పడుట :- 'యొరుబా' భాష:

'ర' = కొనుట; "ఓ-ర" = కొనువాడు. 'షిల్లక్' (Shilluk) భాష: 'బుగో' = గాలి తిత్తును ఒత్తుట. 'ఓ-బుక్' = గాలి తిత్తులు.

4. బహువచన నామవాచకమును లేక సర్వనామమును చేర్చుటచే నామవాచకముల బహువచనము లేర్పడుట :— 'యు' (Ewe) భాష: 'అటి' = చెట్టు, 'అటి ఓ' = చెట్లు; 'న్యుయర్' (Nuer) భాష: 'చాక్' = 'టిక్' అను ధ్వని; 'కే-చాక్' = 'టిక్' అను ధ్వనులు.

5. నామవాచకముల బహువచనము 'ఇ' లేక 'ఆ' చేర్చుటచే ఏర్పడుట : ఇబో (Ibo) భాష· 'ఓ-య' = మనుష్యుడు. 'ఆ-య' = మనుష్యులు; 'ఓ రు' = బానిస 'ఇ-రు' = బానిసలు.

6. నిర్జీవ వస్తువులకు సజీవ వ్యక్తులకు భేదము : సజీవుల విషయములో 'ఓ' అను ఉపసర్గ తరుచు చేర్పబడుచుండును. 'టుయి' (Tui) భాష· 'ఓ-నిపా' = మనుష్యుడు; 'షిల్లక్' భాష: 'ఓ' అనునది ఇతరుల సంతతివారని సూచించును: 'నాయో' = మేనమామ'; 'ఓ-నాయో' = మేనమామ బిడ్డ. వ్యాకరణ రీత్యా స్త్రీ పురుష భేదము లేదు.

7. షష్ఠీ విభక్తిలో ఒక వస్తువును కలిగియున్నవాడు కలిగి యుండబడినదానికి ముందువచ్చును :- 'ట్వి' (Twi) భాష : 'నిపా-దు ఆ' = ఒక మనుష్యుని బొమ్మ; 'కునామా' భాష: 'ఇలామూసా' = ఇలాయొక్క బల్లెము.

8. విభక్తి భేదము లేదు :- చతుర్థి విభక్తి (Dative) రూపము 'ఇచ్చుట' అనుక్రియచే పరివృతమై యుండును. 'యు' (Ewe) భాష: 'ఎది గా నో ఫో ఫో' = అతడు 'తండ్రికిచ్చు ధనము కోరెను' = అతడు తండ్రికొరకు ధనము కోరెను.

9. తర్వాతచేర్పబడు ప్రత్యయములు (Post Positions) అనగా స్థలమును సూచించు నామవాచకములు విభక్తిప్రత్యయములకు బదులుగా వాడబడును : 'యు' (Ewe) భాష: 'అటిటా' = చెట్టుతల = తలమీద; 'నూబా' (Nuba) భాష: 'కా టు' = ఇంటిగర్భము = ఇంటిలో

10. క్రియాసంయోగములు తరుచుగా వాడబడును; 'యు' (Ewe) భాష: 'టొస్ వా నా' = తీసికొని వచ్చి ఇచ్చుట.

11. క్రియ కాలభేదమునుబట్టి మారదు : కాలములు వ్యాకరణ ప్రత్యయములు చేర్చుటచే ఏర్పడును. ఈ ప్రత్యయములు చాలవరకు నామవాచకములకు గాని, క్రియలకుగాని సంబంధించియుండును. 'ట్వి' (Twi) భాష: 'బా' ('బయా' నుండి) = వచ్చుట చేర్చుటచే ఏర్పడును; 'నూబా' (Nuba) భాష: 'ఖై' = వచ్చుట; చేర్చుటచే భవిష్యత్తు ఏర్పడును.

12. ఓష్ఠ్యకంఠ్యములు (Labia-Velar) అగు 'క్వ' 'గ్వ' అనుధ్వనులు సూడానిక్ భాషలలో తరుచు వినవచ్చుచుండును.

13. పెక్కు పదధాతువులు సమానముగా నుండును: *విభాగములు :-* భూగోళ స్థితిననుసరించి సూడానిక్ వర్గమును మూడు అంతర్విభాగములు చేయవచ్చును: 1. తూర్పుశాఖ 2. మధ్యశాఖ 3. పడమటిశాఖ.

తూర్పుశాఖ :- వీనిలో అధికసంఖ్యాకములు నిలోటొ, సూడానిక్ భాషలుగా ఉన్నవి. షిల్లక్, డిన్కా, నూయర్ (Nuer), నూబా (Nuba) వీనిలో కొన్ని భాషలు.

2. మధ్యశాఖ : 30° తూ. రేఖాంశమునుండి 10° తూ. రేఖాంశము మధ్య ఈ భాషలు మాటాడబడుచున్నవి. డెలఫోస్ (Delefosse) వీనిని ఆరు అంతర్విభాగములుగా చేసియున్నాడు. (1) నైల్-కాంగోవర్గము (2) ఉబంగి (Ubangi) వర్గము. (3) షరీ-వడై వర్గము (Shariwadai) (4) షరివర్గము (Shari) (5) నైగర్ ట్షాడ్ వర్గము (Niger-Tshad) (6) నైగర్-కేమరూన్స్ వర్గము. (Niger-comeroons)

3. పడమటి సూడానిక్ శాఖ :- వీనిని గూర్చిన విశ రములు మనకు బాగుగా తెలియును. ఇవి ఈ క్రింది అంతర్విభాగములుగా చేయబడినవి. (1) 'క్వా' (Kwa భాషలు; వీనిలో చాల పదధాతువులు ఒక హల్లును, ఒక అచ్చును కల్గియున్నవి. ఉ॥ అకాన్ (Akan) భాష 'క' = ఉండుట; 'వు' = మరణించుట. సంబోధ ప్రథమావిభక్తి ప్రత్యయములను (Vocative) మరియు అనునాసికములగు ప్రత్యయములను ముందుచేర్చుట ఇందు క్రియలనుండి నామవాచకము లేర్పడును.

2 బెనూక్రాస్ నదీభాషలు :- సూడానిక్ బంటూ స హద్దులలోనుండి, వీనిలో కొన్ని ఈ వర్గముల రెండి

లోను ఒకదానినుండి మరొకదానిలోనికి మార్పును సూచించుచున్నవి.

మధ్యటోగో (Middle Togo) వర్గము :- ఇవి చాల వరకును 7°-8° అక్షాంశముల మధ్య ఉన్నవి. వీనిలో కొన్ని అంతరించి 'యు' (Ewe) 'అకాన్' (Akan) భాషలలో లీనమగుచున్నవి. ఇవి (1), (4) వర్గముల మధ్యనుండి వానితో సుస్పష్టసంబంధములు కల్గియున్నవి.

4. గుర్-గూర్ భాషలు (Gur-Goor) :- ఇవరీ గోల్డ్ కోస్ట్, టోగో, దహోంల ఉత్తరభాగము నందును; హౌటీవోల్టా (Houti Volta) పరిసరములయందును; ఈ భాషలు మాటాడబడుచున్నవి. ఇవి తిరిగి ఎనిమిది అంతర్విభాగములుగా చేయబడినవి.

5. పడమటి అట్లాంటిక్ భాషలు :- సెనిగాల్ - అట్లాంటిక్‌లమధ్య కొంతభాగములో ఇవి మాటాడబడుచున్నవి. ఇవి తిరిగి (ఏడు) అంతర్విభాగములుగా చేయనగును.

6. మాడిన్గో, లేక మన్డీ భాషలు :- పడమటి సూడాన్‌లో నున్న ఈ భాషలు 4,5 వర్గములమధ్య నున్నవి. ఇవి తిరిగి రెండు అంతర్విభాగములుగా చేయబడినవి.

III బంటు భాషలు :- ఇవి ఆఫ్రికాఖండపు దక్షిణార్ధ భాగమున మాటాడబడుచున్నవి. ఇవి సన్నిహిత బాంధవ్యములు పరస్పరమును గల కుటుంబమై సుస్పష్ట లక్షణములను కలిగియున్నవి. ముందు చేర్పబడు ఉపసర్గలచే (Prefixes) నామవాచకముల జాతిభేద మేర్పరుచుట వీనినిర్మాణములో ప్రధాన లక్షణముగా ఉన్నది. సూడానిక్ భాషలలో ఈ లక్షణము కనబడుచున్నను, బంటు భాషలలో ఇది అధికతర వికాసదశను పొందియున్నది. ఈ ఉపసర్గలు బహువచనములను గూడ ఏర్పరుచును. ఉ॥ స్వాహిల్లీ భాష (Swahilli) లో :- కి-సు. కి-హాల్లీ కి-మోజా కి-మే పొటియా". (ఒక పదునైన కత్తి పోయినది) 'సు' అనగా కత్తి; 'కి' దానికి వర్గోపసర్గ. ఇది '-సు' తో సంబంధించియున్న ప్రతిపదమునకు ముందుగా వచ్చుచుండును. 'కి' కి సంబంధించిన బహువచనోపసర్గ 'వి'. ఇట్లు వెనుక వాక్యము బహువచన రూపములో ఇట్లుండును. "వి-సు వి-కా లీ వి-నానే-వి-మే పొటియా" (= ఎనిమిది పదునైన కత్తులు పోయినవి.) టర్కీకోళ్ళ 'కటుక్కు' మను కంఠధ్వనులును (Lateral Sounds) కొన్ని దక్షిణ ఆఫ్రికా భాషలలో కనబడుచున్నవి. స్వరభేద మంత ముఖ్యముకాదు. 'ఒత్తు' (Stress) సూడానిక్ భాషలలోకంటె అభివృద్ధి చేయబడినది. రెండు వర్ణములుగల ధాతువులు విస్తారముగా ఉన్నవి. వ్యాకరణ సంబంధమగు లింగములేదు. విభక్తి ప్రత్యయములవలని మార్పులులేవు. క్రియకు అనేకములగు వ్యుత్పత్తి రూపములున్నవి. ఇందుచే ఒక విషయమును వెల్లడించుటలో వైవిధ్యమున కవకాశము కలుగుచున్నది.

హొంబర్గర్ (Homburger) ఈ భాషలను పది వర్గములుగా విడదీసి యున్నాడు:

(1) దక్షిణ లేక గండావర్గము (2) రుఆన్డా (Ruanda) వర్గము (3) ఈశాన్య లేక కిలిమంజార్ వర్గము (4). తూర్పుతీరపు ఉత్తరవర్గము (5) కాగురుకొండె, యావోమో॥ భాషలు (6) ఆగ్నేయవర్గము (7) జులూవర్గము (8-a) మధ్యవర్గము (8-b) పడమటివర్గము (9) కాంగో వర్గము (10) వాయవ్య వర్గము.

IV సెమిటిక్‌వర్గము :- దక్షిణ అరేబియానుండి వచ్చిన వలసప్రభావముచే కాబోలు ఈ భాషలు అబిసీనియాలో మాటాడబడుచున్నవి. అబిసీనియా ప్రాచీనభాషయగు గీజ్ (geez) నశించినది. దీనినుండి ఏర్పడిన 'ట్రైగ్రీ' (Tigre) ఎఱ్ఱసముద్ర రాష్ట్రములో మాటాడబడుచున్నది. 'అమ్‌హారిక్' గీజ్‌యొక్క నేటికాలమునకు అవశేషముగా నున్న అబిసీనియాలోని ప్రాచీన లిఖితభాష. ఇందుండి ఏర్పడిన రెండుభాషలు గురాగ్ (Gurague), హారార్ (Harar) అరబిక్ భాష ఈ వర్గభాషలలో ముఖ్యమైనది. ఉత్తర ఆఫ్రికా, తూర్పుసూడాన్ భాగములందు ఇది ముఖ్యభాష. ఇస్లాంప్రభావముచే తూర్పు ఆఫ్రికా, సూడాన్‌లలో ఇది వాఙ్మయ వ్యక్తీకరణ గల భాషయై యున్నది.

V హెమిటిక్‌వర్గము :-. సెమిటిక్ భాషలతో తక్కిన ఆఫ్రికాభాషలకంటె ఈ వర్గభాషలు దగ్గర సంబంధమును కలిగియున్నవి. అరబిక్ భాషాజన్యములని ఈ హెమిటిక్, సెమిటిక్ భాషలు భావింపబడుచున్నవి. "హెమిటో-సెమిటిక్" అని ఈ రెండు వర్గములయొక్కయు మూలభాష పేర్కొనబడుచున్నది.

ఈ క్రింది భాషలు హెమిటిక్ వర్గములో ముఖ్యమైనవి :- బెర్బర్ (అల్జీరియా + మొరాకో); హౌసా (Housa) (పశ్చిమ ఆఫ్రికా); తమాషెక్ (సహారాలోని టొరగ్); గల్లా, సోమలి, దనకిల్ (Danakil) (ఉత్తర ఆఫ్రికా); నిలోటిక్. నీగ్రోలు, తూర్పు ఆఫ్రికాలోని పశుపాలకులు మాటాడు భాషలు దిన్కా, షిల్లుక్, నూయర్ మొదలైనవి.

ఇవి ఈ క్రింద పేర్కొన బడిన మూడు ప్రధాన విభాగములుగా చేయబడినవి :- (1) తూర్పు హెమిటిక్ భాషలు (తూర్పు ఆఫ్రికా) (2) నిలోటో హెమిటిక్ భాషలు. (3) పశ్చిమ హెమిటిక్ భాషలు.

హెమిటిక్ భాషలు యీ క్రింది విశిష్ట లక్షణములు కలిగియున్నవి :- (1) వ్యాకరణ లింగము కల్గియుండుట ఉ॥ స్కిల్ (Schilh) భాష: 'ఓల్-డియా' = మగ కుక్క; 'ఎన్-డియా' = ఆడ కుక్క. నామా (Nama) భాష: 'యా' = వాడు; 'టా' = ఆమె.

(2) బహువచన నిర్మాణములో వైవిధ్యము : ఉ॥ హౌసా (Housa) భాష: 'కున్భా' (= వ్రేలిగోరు); బహువచన రూపములు; 'కునోభీ', 'కున్బువా', 'కునైభై'.

(3) లోపలి అచ్చులో మార్పు. షిల్హ్ (Shilh) భాష:- 'ఇలివి' (= ముల్లు); 'ఇలావ్-ఆన్' (= ముండ్లు); 'అ-ఫులు' (= దారము), 'ఇ-ఫెల్-ఎన్' (= దారములు).

(4) బంటువర్గములో వలెనే షష్ఠీ విభక్తిరూపము నామవాచకమునకు తర్వాత వచ్చును.

బంటు మరియు సుడానిక్ వర్గములకు మిక్కిలి దగ్గర సంబంధము కలదు. వర్గ ప్రత్యయములే కాక, వ్యుత్పత్తి, పదధాతువులు కూడ చాలవరకు సమానములుగా నున్నవి. రూపభేదముల నేర్పరచు 'మూలములు' ఈ రెండు వర్గములకు చాలవరకు ఒకటిగానే యున్నవి. ఒకే భాష మూలమునుండి ఇవి బయలుదేరినట్లు కనబడుచున్నది. బంటువర్గములోని ఫుల్ఫుల్డ్ (Fulfulde) భాషలోను, కొన్ని సుడానిక్ భాషలలోను గల నామవాచకముల వర్గ విభాగముకూడ ఇవి ఒకేభాష మూలముగా గలవని సూచించు చున్నవి.

అత్యధిక సంఖ్యాకములై యుండుటచే ఈ భాషలలో కొన్ని ముఖ్యభాషలు వర్తకము మొ॥ వాని కొరకు సామాన్య భాషలుగా అంగీకరింపబడియున్నవి. 1. బంటు వర్గములోని ఉంబందు (Umbundu) పోర్చుగీస్ పశ్చిమ ఆఫ్రికాలో (అంగోల్ లో) ఉపయోగించుచున్నది.

2. స్వాహీలీ (Swahilli) :- తూర్పు ఆఫ్రికాలో ఉపయోగించుచున్నది. బంటు, అరబిక్ భాషలకలయికచే ఈ భాష ఏర్పడినది.

3. హౌసా (Housa) :- పశ్చిమాఫ్రికాలో 'సిరాలియోన్' (Sierraleone) నుండి 'చాడ్' సరస్సువరకును ఉపయోగింపబడుచున్నది.

ఈనాడు ఆఫ్రికాలో విద్యావ్యాప్తికి ఈ దిగువ సమస్యలు పరిష్కరింప బడవలసినవిగా ఉన్నవి :- 1. ఆఫ్రికాభాష లన్నింటిలోను గల ధ్వనులను ప్రదర్శింపగల ఒక ధ్వనిమీద ఆధారపడిన లిపిని సృష్టించుట. 2. అధిక సంఖ్యాకములుగా మాటాడబడెడి భాషలకు బదులుగా కొన్ని ప్రధాన మూలభాషలను స్వీకరించుట.

లిపి :- లిపి విషయములో ఆఫ్రికా భాషలు వెనుకబడియున్నవి. వానిలో పెక్కింటికి - ముఖ్యముగా నీగ్రోభాషలకు - లిపిలేదు. నేటి ధ్వన్యనుకరణ వర్ణములు, లిపి, యూరప్ ఖండ పండితుల సృష్టియై యున్నది.

ప్రాచీనకాలము నాటివియును, ఆధునిక కాలమునాటివి యును అగు ఆఫ్రికా లిపులు ఈ దిగువ విధములుగా నున్నవి:- 1. ఈజిప్టుదేశపు హెయిరో గ్లిఫిక్స్ లేక పద చిత్రములు. 2. కాప్టిక్ (Coptic) లిపి. ఇది గ్రీక్ ఈజిప్టు భాషలలోని వర్ణముల మిశ్రమము. క్రీ. శ. 200-400 నాటి ప్రాచీన మత గ్రంథములలో ఇది ఉపయోగింపబడెను. 3. లిబియా శాసనలిపి. 4. టిఫినాఘ్ (Tifinagh): టుఆరెగ్ (Tuareg- సహారా)లో మాటాడబడు 'తమాషెక్' యొక్క లిపి ఇది. (5) అమ్హారిక్ లిపి ప్రాచీనసెమిటిక్ భాషయగు ఇది మధ్య అబిసీనియాలో అమ్హారావద్ద రాజభాషగా క్రీ. శ. 1800 ప్రాంతము వాడబడుచుండెడిది. (6) అరబిక్ :- ఈజిప్టులో రాభాషయై ఇది ఉత్తర ఆఫ్రికాలో చాలచోట్ల వాడబడుచున్నది. (7) వై (Vai) వైబీరియాలోని ఒక నీగ్రోలి యిది. 'డోలుబుకేరి' (Doalu bukeri) (మరణము 1850) దీనిని సృష్టించెను.

'న్జోయా' (Njoya) అను ఒక నీగ్రో నాయకునిచే కేమరూన్స్‌లో నొక లిపి సృష్టింపబడెను.

జానపద వాఙ్మయము :-ఆఫ్రికాభాషలలో ఇది సమృద్ధముగా ఉన్నది. బానిసవర్తకముద్వారా ఇది కొంత అమెరికాలోనికి దిగుమతిచేయబడెను. చరిత్రలు, వంశక్రమవర్ణనలు, నాయకుని కుటుంబములోని ప్రత్యేకోద్యోగులచే పాటలలోని కెక్కినవి. వాద్యభాష బాగుగా అభివృద్ధిచేయబడెను. అనేకములగు మైళ్లు వార్తను పంపుటకు అనుకూలపరిస్థితులలో ఇది సమర్థమై యుండును.

సంగీతము, నాట్యము :- భాషలలోని హృదయ గత వస్తువును సూచించుటచే ఈ విషయము కొలదిగా ప్రస్తావించుట సముచితమైయున్నది. నీగ్రోలు వాద్యములను వాయించుటలో నిపుణులు. తంత్రులు, గాలిచేమ్రోగు పరికరములు, ధ్వనిచేయుసాధనములు విరివిగా వాడబడుచున్నవి. వాద్యముల ప్రయోగించుట, నాట్యము అన్ని ఉత్సవములలోను కనబడును. ఆయాకాల విశేషములను బట్టి మారుచుండు పాటలను రచించుటలో నీగ్రోలు నిపుణులు. తొలుత ఆఫ్రికాఖండపు పరిసరములకు సంబంధించిన అంశములు గేయవస్తువులై యుండెడివి.

క. రా. మూ.

**ఆమ్లజని (Oxygen)** :- ఆమ్లజని రంగు, రుచి లేని వాయువు. ఇది గాలికంటె కొలది ఎక్కువ భారము కలిగియుండును. దీని విశిష్ట గురుత్వము 1·10523. ఇది నీటిలో మితముగా కరుగును. నీట కరగిన ఈ ఆమ్లజని జలచరముల శ్వాసక్రియయందు తోడ్పడుచున్నది. దీని చిహ్నము "O"; పరమాణు సంఖ్య (atomic number) 8; పరమాణుభారము (atomic weight) 16·0000.

ఆమ్లజని అనుకూల పరిస్థితులలో ఇంచుమించు అన్ని మూలపదార్థములతో సంయోగము చెందును. కాని పదార్థములు పూర్తిగా పొడి (dry) గా నున్నప్పుడు ఈ రసాయన క్రియ తరుచు జరుగక పోవుటయు కలదు. ఆమ్లజని ఉదజనితో సంయోగము చెందునప్పుడు రెండు విధములయిన సమ్మేళనములు తయారగును. మొదటిది నీరు. రెండవది ఉదజని పరామ్లజనిదము (హైడ్రోజెన్ పెరాక్సైడ్). ఈ రెండవ సమ్మేళనము బేరియం పరామ్లజనిదము ($BaO_2$) తో నీ రసగంధకికామ్లము చర్యవల్లను పెర్‌సల్ఫేట్ల విద్యుద్విశ్లేషణమువల్లను కూడ ఏర్పడును. ఇనుము సాధారణముగా తడిగాలిలో ఆమ్లజనీకరణము చెంది తుప్పుపట్టును.

ఘనలోహములయిన (noble metals) బంగారము, ప్లాటినము తప్ప మిగిలిన లోహము లన్నియు ఆమ్లజనిలో వేడిచేయబడినపుడు ఆమ్లజనీకరణము చెందును. కరగియున్న (molten) రజతము మాత్రము 22 ఘన ప్రమాణముల ఈ వాయువును రాసాయనిక సంయోగము చెందకయే తనలో ఇముడ్చుకొనును. ఈ దృగ్విషయమును ఒక్లూషన్ (occlusion) అందురు. ఈ ఇముడ్చుకొన్న వాయువు తిరిగి ఈ రజతము చల్లారునపుడు వెలువడును.

ఆమ్లజని విరివిగా దొరకు మూలపదార్థము. మిగిలిన మూలపదార్థము లన్నియు కలిసిన ఈ ఆమ్లజని పరిమాణమునకు సరిపోవును. గాలిలో ఆయతనమున నూటికి 21 పాళ్లు ఆమ్లజని యుండును. నీటిలో భారమున దాదాపు 90 శాతము ఆమ్లజని యుండును. భూమిలో అరమైలు లోతువరకు గల శిలాభారములో 50 శాతము ఆమ్లజని యుండును.చెట్లన్నియు కర్బనద్వి ఆమ్లజనిదము(కార్బన్‌డైఆక్సైడ్)ను పీల్చుకొని దానిలోని కర్బనమును గ్రహించి ఆమ్లజనిని వదలివేయును. శ్వాసక్రియకు ఈ వాయువు మూలాధారము.

**తయారుచేయు విధానము - ధర్మములు :** పొటాసియం హారితము (పొటాసియం క్లోరేటు) దాని భారములో మూడవ వంతు మంగన ద్వి ఆమ్లజనిదము (మేంగనీస్‌డైఆక్సైడు) ను కలిపి వేడిచేయుట వలన ఆమ్లజని తయారగును. మంగన ద్విఆమ్లజనిదము వియోగ సౌలభ్యమున కుపకరించును. 1886 నుండి 1906 వరకు "బ్రిన్" లేక బేరియమ్ ఆమ్లజనిద (బేరియం ఆక్సైడు) విధానముద్వార ఆమ్లజని పెద్ద మొత్తములలో తయారుచేయబడినది. బేరియ ఆమ్లజనిదమును 1000°F వరకు గాలిలో వేడిచేసిన గాలిలోని ఆమ్లజనిని గ్రహించి, ద్వి ఆమ్లజనిదముగా మారును. దీనిని 1600° F వరకు వేడిచేసిన పై గ్రహింపబడిన ఆమ్లజని వెలువడి, బేరియ ఆమ్లజనిదము తిరిగి ఏర్పడును. ఈ విధానము వలన 94% పరిశుద్ధత గల ఆమ్లజనిని తయారు చేయవచ్చును.

1902వ సంవత్సరములో "లిండే" అను వైజ్ఞానికుడు ద్రవరూపములో నున్న గాలియొక్క సవరణ విధానము (Rectification of Liquid air) వలన 98.5% పరిశుభ్రత గల ఆమ్లజనిని తయారుచేయగలిగెను.

విద్యుద్విశ్లేషణము (Electrolysis) ద్వార ఉదజనిని తయారుచేయుటలో ఆమ్లజని ఉపఫలితముగా (Bye-product) లభించును. కాని ఈ పద్ధతికి విద్యుచ్ఛక్తి విరివిగా కావలసియుండుటచే వాయు ద్రవీకరణ పద్ధతి ఎక్కువ ఉపయోగములోనికి వచ్చినది.

ఈ వాయువును 120—150 వాతావరణపీడనములో (atmosphere's pressure) ఉక్కు సిలిండరులలో నుంచి సరఫరాచేయుదురు. 1926 వ సంవత్సరములో ప్రపంచపు ఆమ్లజని ఉత్పత్తి 5000 ఘనపుటడుగులు.

పైరోగెలాల్ (Pyrogallol) యొక్క క్షారక ద్రావణము వలన గాని, అమ్మోనియాతో కూడిన అమ్మోనియా కర్బనిత (అమ్మోనియం కార్బొనేటు) ద్రావణముతో తామ్రము యొక్క చేరిక వలన గాని, భాస్వరపు కడ్డీల వలన గాని, సోడియ ఉదజగంధకితము (సోడియం హైడ్రోసల్ఫైటు) యొక్క నీరస క్షారక ద్రావణము వలన గాని, వాయువులో గల ఆమ్లజని యొక్క భాగము నిర్ణయించవచ్చును.

ఆమ్లజని లేతలేత మబ్బురంగుగల అయస్కాంత ద్రవముగా ద్రవీకరించును. ఈ ద్రవము 182.97°c వద్ద మరుగును. త్వరగా ఇగిర్చి చల్లార్చుట వలన ఆమ్లజని లేత నీలిరంగుగల ఘన పదార్థముగా ఘనీభవించును. ఇది 219°c వద్ద కరగును. వాయురూపములోనున్న ఆమ్లజనికి నిశ్శబ్ద విద్యుత్ప్రయోగము వలన (silent electric discharge) అస్థిరమైన ఆమ్లజని రూపాంతరమగు "ఓజోన్" (Ozone) తయారగును.

**ఉపయోగములు :-** చాల వరకు ఆమ్లజని లోహములను అతికించుటకు, కరగించుటకు ఉపయోగింపబడును. సాధారణముగా ఆమ్లజని ఏసిటిలీన్ (acetylene) వాయువుల మంట (Oxy-acetylene flame) సహాయముచే లోహములు అతుకబడును. జ్వలనమునకు పూర్వము ఈ రెండు వాయువులును ఊదుడు గొట్టములలోనికి సరఫరా చేయబడి బాగుగా మిశ్రమము చేయబడును.

ఆమ్లజని విస్తారముగా వైద్య విధానములోను, న్యుమోనియా, గుండెజబ్బులు మొదలగు వ్యాధులలో శ్వాసక్రియకును, విషవాయువులను పీల్చుటవలన గలుగు దుష్ఫలములను నిర్మూలించుటకును ఉపయోగింపబడును.

ద్రవరూపములోనున్న ఆమ్లజనియొక్క పారిశ్రామిక ఉపయోగములు చాల కలవు. వాయు కర్బనపు (Gas carbon) కడ్డీలను ఒక చివర ఎఱ్ఱగా వేడిచేసి ఆమ్లజని ద్రవములో ముంచినచో ఎక్కువ కాంతితో మండి అపరిమితమయిన వేడిని ఇచ్చును. అపుడు ఏర్పడిన కర్బనద్వి ఆమ్లజనిదము గడ్డకట్టి తెల్లని ఘనపదార్థముగా మారును. ఆమ్లజనితో సచ్ఛిద్ర కర్బనము (Porous carbon), కఱ్ఱబొగ్గు, దీపపుమసి, పొగమసి, బీలగబెండు చూర్ణము (Cork meal), రంపపుపొడి లేక కలపగుజ్జు కలిపిన ఏర్పడు మిశ్రమము విధ్వంసక జాంతవము (Blasting gelatin) కంటె రెట్టింపు శక్తిగల ప్రేలుడు పదార్థముగా తయారగును. తుపాకిమందు, నత్రజని సమ్మేళనములు మొదలగు ఇతర ప్రేలుడు పదార్థములలోవలె ఆమ్లజని ఇతర మూలపదార్థములో రాసాయనిక సంబంధము చెందక, స్వేచ్ఛగా నుండుటచే పై మిశ్రమము అంత శక్తిమంతమయినది. అతిశీఘ్రముగా (instantaneously) కర్బనము ఉదజని మొదలగు పదార్థములు ఆమ్లజనీకరణము చెందుటచే ఈ ప్రేలుడు ఏర్పడును.

ఆమ్లజని, సంయోగిక వాయువును—Synthetic gas— (ఉదజని కర్బన ఆమ్లజనిదము Carbon monoxide) తయారుచేయుటలో ఉపయోగింపబడును. (Methane ఆమ్లజనితో అసంపూర్ణ సంయోగముచెందినపుడు ఎసిటిలీన్ Acetylene ఏర్పడును.) నత్రికామ్లము (నైట్రిక్ ఆసిడ్) తయారుచేయు విధానములలో కూడ ఆమ్లజని ఉపయోగింపబడును.

అనావృతమగు పొయ్యిగల (Open hearth) ఉక్కుకొలిమిలో సంయోగమునకును, కార్బనును వేరుచేయుటకును, విద్యుత్ ఉక్కుకొలిమిలో కర్బన నిస్సారణమునకును (Decarbonisation), పాడువడిన యినుప వస్తువులను కరగించుటకును, గాలికొలిమిలో తక్కువరకపు ఖనిజమును కరగించుటకును ఆమ్లజనితో పరిపుష్టతచెందిన వాయువు ఉపయోగింపబడును. జా. ల.

ఆయిలర్ (1707 - 1783) :- 18 వ శతాబ్దిలో స్విట్జర్లండు దేశములోని బాసిల్ (Basle) నగర విశ్వ విద్యాలయము గణితశాస్త్రపరిశోధనలకు మిగుల ప్రసిద్ధి గాంచినది. ఇచ్చటనే లియోనార్డ్ ఆయిలర్ (Leonard Euler) అను మహాగణిత శాస్త్ర వేత్త ఉద్భవించెను. అతడు తన తండ్రియగు జెకబ్ బెర్నోలీ (Jacob Bernoulli) వద్దను, జాన్ బెర్నోలీ (John Bernoulli) వద్దను గణితశాస్త్రము నభ్యసించెను. 1725 లో తన గురువు గారి కుమారుడగు నికోలాస్ బెర్నోలీ రష్యాలోనున్న సెయింట్ పీటర్సుబర్గు పరిషత్తుకు వెళ్ళినప్పుడు అతనితో ఆయిలర్ కూడ నచ్చటికేగి 1741 వరకు అచ్చటనే యుండెను. 1741 నుండి 1766 వరకు అతడు ఘనుడగు ఫ్రెడరికు యొక్క కొలువుకాడై బెర్లిన్ విశ్వవిద్యాలయమున పనిచేసెను. తిరిగి 1766 లో అతడు సెయింట్ పీటర్సుబర్గు పరిషత్తును చేరి 1783 వరకు అనగా జీవితాంతమువరకును అచ్చటనే పనిచేసెను. ఈ 18 వ శతాబ్దపు విజ్ఞానవేత్త తన జీవితకాలమంతయు గణితశాస్త్రమునకును, అనువర్తిత గణితశాస్త్రమునకును వినియోగించెను. ఈతనికి 1735 లో ఒక నేత్రమును 1766 లో రెండవ నేత్రమును పోయినను, అతని అంధత్వము అతని అత్యద్భుత సృజనాత్మకశక్తికి ఆవంతయు ప్రతిబంధకము కాజాలక పోయెను. అంధుడగు ఆయిలర్, తన అసాధారణ జ్ఞాపక శక్తిచే, గణితశాస్త్రమున అదివరకుండిన విజ్ఞానభాండారమునంతయు తన మనోనేత్రమున కెదుట ప్రత్యక్షీకరించుకొని, అంతవరకును ఆ శాస్త్రమున కనివిని యెరుగని అనేకావిష్కరణములను తన శిష్యులకు చెప్పి వ్రాయించు చుండెడివాడు. ఈతని రచనలు 530. అవి అతని జీవితకాలముననే వెలువడినవి. అతడు చనిపోవునపుడు వదలివెళ్ళిన అనేక గ్రంథములను సెయింటు పీటర్సుబర్గు పరిషత్తు అతని మరణానంతరము ప్రకటించినది. అతని రచన లిప్పటికి 886 సేకరింప బడినవి. అప్పటికుండిన గణితశాస్త్రముయొక్క ప్రతి శాఖయందును అతని పరిశోధనలున్నవి. ఇంతటి సృజనాత్మకమగు మేధాసంపత్తిగల గణితశాస్త్రజ్ఞుడు ఇంతవరకును మరొకరు పుట్టలేదేమో. అతడు రెండుమారులు వివాహమాడి మొత్తము పదముగ్గురు సంతానమును బడసెను.

ఆయిలర్ తన పరిశోధనలను లఘు వ్యాసరూపమునను విస్తృత వ్యాసరూపమునను ప్రకటించుటయే గాక, అనేక పాఠ్య గ్రంథములను రచించెను. ఈ పాఠ్య గ్రంథములలో అప్పటి కుండిన గణితశాస్త్ర జ్ఞానమంతయు క్రోడీకరింపబడి తర్కబద్ధమగు క్రమమున నేర్పరింపబడినది. అనేక శాఖలలో ఆయిలర్ ఏర్పరచిన పద్ధతియే తుది మాటగా నిలచినది. ఉదా: నేటి కాలపు త్రికోణమితిశాస్త్ర పద్ధతి అతడేర్పరిచినదే. అత్యద్భుత ప్రఖ్యాతి గాంచిన అతని పాఠ్యగ్రంథములు, బీజగణితము నందును, కలన గణితము నందును గల సంకేతములపై అదివరకుండిన భిన్నాభిప్రాయముల నన్నిటిని తీర్చివేసినవి. లెగ్రాంజ్, లెప్లాస్, గావూస్ మొదలగు మహా మేథావులు అతని గ్రంథములను చదివి అతని పద్ధతి ననుసరించినవారే.

1748 లో అతడు రచించిన ఇంట్రడక్టియో ఇన్ ఎనలసిన్ ఇన్ఫినిటోరమ్ (Introductio in Analysin Infinitorum) అను గ్రంథము వెలువడినది. ఇది రెండు సంపుటములలో నున్నది. దీనిలో ఆయిలర్ $e^x$, $\sin x$, $\cos x$ మొదలగు వాని యపరిమిత శ్రేఢులను చర్చించి $e^{ix}=\cos x+i \sin x$ అను దానిని నిరూపించెను. ఈ గ్రంథమే విశ్లేషక రేఖాగణితమున (Analytic Geometry) మొదటి ప్రామాణిక పాఠ్యగ్రంథమని చెప్పవచ్చును. ఈ గ్రంథములో జీటా ప్రమేయము (zeta function) చర్చింపబడిన భాగమును, దానికిని అభేద్య సంఖ్యావాదమునకును (Prime number Theory) గల సంబంధము చర్చించబడిన భాగమును అత్యంత అద్భుతావహములు. 1755 లో ఆయిలర్ "ఇన్‌స్టిట్యూషనె కాల్క్యులి డిఫరెన్షియాలె" (Institutione calculi differentiales)" అను గ్రంథమును 1768, 1774లలో "ఇన్‌స్టిట్యూషనె కాల్క్యులి ఇంటిగ్రాలిస్" (Institutione calculi intigralis) అను గ్రంథమును రచించెను. వీనిలో చలకలన గణితము, చలరాశికలన గణితము అనునవేగాక చలకలన సమీకరణములు, టేలరు (Taylor) సిద్ధాంతము, దాని బహుళ ప్రయోజనములు, ఆయిలర్ సంకలన సూత్రమున, (Euler's summation farmula) ఆయిలర్ గామా, బీటా ప్రమేయములు చర్చించబడినవి.

ఆయిలర్ చే 1786 లో రచింపబడిన "మెకానికా సివె మోటస్ సైన్షియా ఎనలిటిక్ ఎక్స్పొజిటా" (Mechanica sive Motus scientia analytic exposita) అనునది న్యూటను సిద్ధాంతముపై విశ్లేషణ పద్ధతులలో వ్రాయబడిన మొదటి యంత్రశాస్త్రగ్రంథము. 1770 లో ఆతడు "వోల్ స్టాన్డిగె ఆలీటంగ్ జుర్ అల్జెబ్రా" (Vollstandige Aleitung Zur Algebra) అను గ్రంథమును జర్మనుభాషలో రచించి తనసేవకునిచే లిఖింపజేసెను. బీజగణితముపై తరువాత వచ్చిన పాఠ్యగ్రంథముల కిదియే నమూనా. 1744 లో ఆయిలర్ రచించిన "మెథడస్" ఇన్వినియండి లైనియాస్ కర్వాస్ మాగ్జిమి మినిమివె ప్రాప్రయిటేట్ గాండెంటెస్" (Methodus inveneindi lineas curvas maximi minimeve proprietate gandentes" అను గ్రంథము వైశేషిక కలనమున (calculus of variations) మొదటి గ్రంథము. దీనిలో ఆయిలర్ సమీకరణములు, వాని బహుళ ప్రయోజనములు చర్చింపబడినవి.

ఆయిలర్ కనుగొనిన అనేకవిషయములు ఆతని చిన్న వ్యాసములలో అనర్ఘరత్నములవలె విరజిమ్మబడియున్నవి. అట్టి రత్నములలో నొకటి ఆయిలర్ సంఖ్య అనబడునది.

$\lim_{n \infty} (1+\frac{1}{2}+\frac{1}{3}+\cdots \frac{1}{n} - \log n) = \cdot 577216$. ఒక్క అంకశాస్త్రమున ఆతడొనరించిన పరిశోధనలే ఆతనికి శాశ్వత కీర్తి సంపాదించి పెట్టుటకు చాలును. ఆయిలర్ తన బుద్ధిని ఖగోళశాస్త్రాభివృద్ధికై అధికముగా వినియోగించెను. ముఖ్యముగా చాంద్రవాదము, త్రివస్తుసమస్య (Problem of three bodies) ఆతని నాకర్షించెను. 1789 లో ఆతడు ఒక సంగీతశాస్త్ర గ్రంథము రచించెను. దానిలోని గణితము సంగీతజ్ఞులకును, సంగీతము గణితజ్ఞులకును బోధపడక అది వ్యర్థమైనది.

ఆయిలర్ మేధాశక్తి యాతని గ్రంథముల జదివిన ప్రతివారిని చకితుల జేయును. ఐనను ఆతనిలో కొన్ని లోపములు లేకపోలేదు. అపరిమిత శ్రేఢుల విషయమై అతడు తగు జాగ్రత వహించక, వానిని తన ఇష్టము వచ్చినట్లు విరివిగా వాడు కొనెను. వాని సంభిన్నతపై (Convergence) ఆతని దృష్టి పోలేదు. అసలు ఆ కాలము నాటికి, గణితశాస్త్రములోని సంభిన్నత, విశీర్ణత (divergence) మొదలగు అపరిమిత కల్పములు (infinite processes) సరియైన పునాదులపై నిర్మింపబడి యుండలేదు. ఆపని 19 వ. శతాబ్దములో జరిగినది. అందుచే 18 వ. శతాబ్దిలోని గణితజ్ఞు లందరును అపరిమిత శ్రేఢులు, అపరిమితగుణకార లబ్ధములు మొదలగువాటి విషయమున తమ ఇష్టమువచ్చినట్లు ప్రయోగములను గావించిరి. ఉదా: ఆయిలర్ ఈ క్రింది విధముగా వాదించెను.

$$\frac{n}{1-n} = n + n^2 + \ldots\ldots\ldots$$

$$\frac{n}{n-1} = 1 + \frac{1}{n} + \frac{1}{n^2} + \ldots\ldots\ldots$$

కావున

$$\ldots\ldots\ldots \frac{1}{n^2} + \frac{1}{n} + 1 + n + n^2 + \ldots\ldots\ldots = 0$$

ఐనను విశీర్ణశ్రేఢుల విషయమున ఆయిలర్ చేసిన వన్నియును తప్పులని చెప్పరాదు. నేటికాలపు సంభిన్నతా పరీక్షలు మాత్ర మాతడు చేయనిమాట నిజమే. ఐనను ఆతడు నిరూపించిన అనేక విషయములను నేటికాలపు గణితజ్ఞులు మార్గాంతర పద్ధతులచే బోధించియున్నారు. ఇట్లే కలన గణితవిషయమునను ఆయిలర్ త్రొక్కిన మార్గము, ఆధునికులకు మిగుల సంతృప్తికలిగింపక పోయినను, ఆధునిక గణితశాస్త్రమునకు ఆయిలర్ మూలస్తంభ మని చెప్పుటకు ఎవరికిని ఆక్షేపణము ఉండదు.

జే. వి.

**ఆయుర్వేద గ్రంథములు :-** "ఆయుర్విద్యతే ఉస్మిన్నితి, అయుర్వేదయతీతివా ఆయుర్వేదః" అను వ్యుత్పత్తిచే ఆయువునుగూర్చి బోధించు ఉపవేదము ఆయుర్వేద మని తెలియుచున్నది. ఆయుర్వేదము వైద్యశాస్త్రమనియు వ్యవహరింపబడును. కాయ - బాల - గ్రహ - ఊర్ధ్వాంగ - శల్య - విష - రసాయన - వాజీకరణ చికిత్సాభేదములచే ఇయ్యది అష్టాంగ చికిత్సయని చెప్పబడుచున్నది. ఇది ఋగ్వేదమున కుపవేదమని కొందరును, అధర్వణ వేదమునకు ఉపవేదమని కొందరును చెప్పుదురు. మొత్తముమీద ఈ విజ్ఞానభాగము వేదచతుష్టయము

నందును కన్పట్టుచున్నది. ఉదా :- ఆయుర్వేదమును గూర్చి బోధించు కొన్ని వేదభాగములు.

గర్భమునుగూర్చి తెలియవలసిన యంశములు గర్భోపనిషత్తునందు వర్ణింపబడినవి. ఋగ్వేదములో 10. వ. మండలము, 184. వ. సూక్తములోను, ఐతరేయ బ్రాహ్మణములోను, ఈ విషయము వర్ణింపబడియున్నది.

శరీరమునకు పంచభూతములు కారణములని ఋగ్వేదము 10 మం - 16 సూ 3 - 7 ఋక్కులలోను, తైత్తరీయోపనిషత్తునందు గల బ్రహ్మావల్లియందును, కానవచ్చును.

శరీరమునకు మూలమైన వాతపిత్త శ్లేష్మములను గూర్చి ఋగ్వేదము 1 మం - 34 సూ - 6 వ ఋక్కునందు "త్రిధాతు శర్మ యచ్ఛతం" అని యున్నది. ఇచ్చట 'త్రిధాతు' శబ్దమునకు వాతపిత్త శ్లేష్మములని శ్రీ విద్యారణ్యస్వామి భాష్యమును రచించిరి. శరీరాంగ ప్రత్యంగములనుగూర్చి ఋగ్వేదములోను, ఐతరేయ బ్రాహ్మణములోను వర్ణనలు కన్పట్టును. శరీరశాస్త్రమును గూర్చియు ఋగ్వేదము 10 మం - 97 సూ - 6 వ ఋక్కులో వ్రాయబడి యున్నది. రోగములను గూర్చియు, వాటి చికిత్సలను గూర్చియు ఋగ్వేదము 10 మం - 163 సూ-లోను, ఐతరేయ బ్రాహ్మణములోను, యజుర్వేద సంహిత - 2 అ - 3 పన్నం. 5 అను - నందును గానవచ్చును.

చికిత్సలకు ఉపయోగించు ఓషధులను గూర్చి ఋగ్వేదము 9, 10 మండలములలోను, యజుర్వేదమునందు బ్రా - 2 కాం - 4 ప్ర - 4వ అను - నందును, అథర్వణవేదమునందును వర్ణింపబడెను.

**అథర్వణ వేదమునందలి ఆయుర్వేద విషయ సంగ్రహము :-** అథర్వవేదము 1వ కాండ - 2వ సూ-నందును, 6వ కాం - 44వ సూ - నందును ఉదరామయ, ఆమాశయాది రోగశాంతికి ముంజగడ్డితో బంధనము చేయవలయు ననియు, కోష్ఠబద్ధ, ప్రస్రావ నిరోధములకు 1 కాం - 3 సూ - లో ఎనిమావంటి సాధనము ఉపయోగింపవలయు ననియు చెప్పబడెను. అధిక రజస్స్రావ, రక్తస్రావములకు 1 కాం - 17 సూ - లో జపము చేయవలెనని చెప్పబడినది. 1 కాం - 22వ సూక్తములో హరిద్రా అను మూలిక పాండురోగ నివారకమని చెప్పబడెను. 1 కాం - 23, 24 సూ - లలో శ్వేతకుష్ఠమును, నీలి - హరిద్రా - భృంగరాజ, ఇంద్రవారుణులు అను ఓషధులు హరించు నని చెప్పబడియున్నది. 1 కాం - 25 సూ - 5 కాం - 4-22 సూ - 6 కాం - 20, 95, 3, 102, 116, 19, 39 సూ - లలో ఏకాహిక, ద్వ్యాహిక, అన్యేద్యుష్క-వరేద్యు రుభయద్యురాది వివిధజ్వర లక్షణములు, తక్మణ అను జ్వర లక్షణములు చెప్పి, బలాస అను కాస తక్మణకు అన్నగా రనియు బహు ప్రయాస సాధ్యమనియు చెప్పి, పైసూక్త మంత్ర జపాదులను వివరించెను. "అథ భైషజ్యాని" అని ఆరంభించి "లింగోన్మూలనం భైషజ్యం" అనగా రోగకారణోన్మూలనమే భైషజ్యమనియు, కారణనాశకమే కార్యనాశకము కావున కారణాన్వేషణము చేయుట ముఖ్యమనియు నిరూపించుచు 1 కాం - 12 సూక్తములో విద్యుత్తు అను అగ్నికి శిరఃపీడను, కాస-జ్వరాదులను కారణముగా చెప్పుచు కుష్ఠము అను ఓషధి సర్వజ్వరకారణహరముగా తెలియజేయబడెను. 4 కాండలో నష్ట వీర్యోద్ధరణమునకు కపిత్థకమే ఓషధియనియు, 4 కాం - 2 సూ - లో క్షతారోగ్యమునకు అరుంధతి అను లతను, తల్లతానిష్పత్తి స్థానములుగా అశ్వత్థ - ప్లక్ష - ఖదిర - న్యగ్రోధములను వర్ణించెను. 6 కాం - 109 వ సూక్తములో క్షతారోగ్య సాధకముగా పిప్పలి వర్ణించబడెను. 6 కాం - 19 సూక్తములో అపామార్గయను ఓషధి సమస్త ఓషధులకు రాజుగా వర్ణించబడెను. 6వ కాం - 90వ సూక్తమున బలాస అను వ్యాధి నివారణకొరకు జపించవలయుననియు 6వ కాం - 25, 127వ సూ - లలో చోప్రద్రు అను ఓషధి సర్వరోగ ప్రశమనము చేయ సమర్థమైనదనియు చెప్పబడెను. 6వ కాం - 136, 137 సూ - లలో నితత్ని, శమి అను లతలను కేశవర్ధకములుగా చెప్పుచు, జీర్ణకేశములను దృఢపరచుట, అజాతకేశ జననము, జాతకేశ దైర్ఘ్య సంపాదనము, దీర్ఘీకృత కేశములకు కృష్ణవర్ణకల్పన మున్నగునవి వర్ణింపబడినవి. 19వ కాం-35వ సూ - నందును, 2వ కాం - 4వ సూ - నందును గుగ్గులు అను ఓషధి మధుమేహ నివారకమని చెప్పబడినది. ఇంకను జలోదరము, గండమాల, వంధ్యాత్వము

మున్న గువానిని నివారణము చేయు పెక్కు ఓషధులు చెప్పబడెను.

గ్రహములను గూర్చి ఋగ్వేదము 10 మం. 118, 145, 161–166 సూక్తములలోను వర్ణనలు కనుపించు చున్నవి. మానసరోగ చికిత్సను గూర్చియు, ఆరోగ్యము నకు మనస్సు ముఖ్యకారణమను విషయమునుగూర్చియు గోపథబ్రాహ్మణమున I, 30 వాక్యములో కనిపించు చున్నది. మణి మంత్రౌషధముల ఉపయోగములను గూర్చి తైత్తిరీయసంహిత 4 వ కాం - 2 ప్ర - 6వ అను-2వ మంత్రములో కలదు. శల్యశాలాక్యములను గూర్చి ఋగ్వేదము 1వ మం. 116వ సూ. 15వ ఋక్కులోను ఇంకను అనేక స్థలములలోను వర్ణింపబడి యున్నది. రసాయన వాజీకరణములను గూర్చి ఋగ్వేదము 1 మం. 117 సూ. 13వ ఋక్కులో చెప్పబడి యున్నది. ఈరీతిగ త్రిస్కంధాత్మక మగు అష్టాంగాయుర్వేదమును గూర్చి వేదములందు గల వర్ణనము దిఙ్మాత్ర ముగ సూచింపబడినది. ఆయుర్వేద గ్రంథములను మూడు రకములుగ విభజింపవచ్చును. అవి (1) వైదిక గ్రంథ ములు, (2) ఆర్షగ్రంథములు, (3) అనార్ష గ్రంథములు.

*1. వైదిక గ్రంథములు :* చతుర్ముఖబ్రహ్మ కల్పాది యందు వేదములను స్మరించినట్లుగనే ఆయుర్వేదమును గూడ స్మరించి పిమ్మట దీనిని లక్షశ్లోకరూపమగు సంహితగ చేసెనని ఇతిహాసమువలన తెలియుచున్నది. దీనికి బ్రహ్మసంహిత యని నామధేయము. ఇయ్యది వైదిక గ్రంథమని నుడువనగును. దీనిని బ్రహ్మ తన పుత్రుడగు దక్షప్రజాపతికి ఉపదేశించెను. దక్షుడును తాను గ్రహించిన యీ విద్యను అశ్వినీదేవతలకును, వారింద్రునకును బోధించిరి. వైదికగ్రంథములు పై నుదహరించిన బ్రహ్మసంహితకన్న మరివేరుగ కన్పడవు. ఆ బ్రహ్మసంహితయు భూలోకమున ప్రచారము నందలేదు.

*2. ఆర్షగ్రంథములు :* ఇవి ఋషిపుంగవులచే రచింపబడిన తంత్రములు. ఋషులు అతీంద్రియద్రష్టలు కావున వారు చెప్పిన విషయములలో సంశయములుండుటకు తావులేదు. కాన అత్యంతప్రమాణములుగ వీటిని స్వీకరింపదగును. ఋషులకు వైద్యశాస్త్రము లభించిన విధము చరకసంహితాది గ్రంథములందు ఉదహరింపబడెను.

ఈ మహాయుగముయొక్క మొదటి భాగమగు కృత యుగ సమాప్తి సమయమున అనగా ఇప్పటికి సుమారు 22 లక్షల సంవత్సరములకు పూర్వము భూలోకము నందలి ప్రజలు రోగపీడితులై ధర్మార్థకామమోక్షము లను సాధించుటకు అసమర్థులై ఉండుటను గని భరద్వాజాది ఋషీశ్వరులు హిమవత్పర్వత ప్రాంతమునందు సభ చేసిరి. ఆ సభాసదులందరును ధ్యానయోగముచే సురాధిపతియగు దేవేంద్రుడు మధ్యమలోకవాసుల బాధల తొలగించునని తెలిసికొని ఇంద్రునినుండి వైద్యశాస్త్ర మును గొనివచ్చుటకు సమర్థుడు భరద్వాజుండని నిర్ణయించి ఆతని స్వర్గలోకమునకు బంపగా ఆ యుదంతము నంతయు నాకర్ణించి ఇంద్రుడు భరద్వాజునకు తాను అశ్వినీదేవతలవద్ద నభ్యసించిన వైద్యశాస్త్రము నుపదేశించెను. భరద్వాజుడు తన విద్యను పునర్వసుడను పేరు గల ఆత్రేయుడు మొదలగువారి కుపదేశింప వారు తమ తమ పేర గ్రంథములను రచించిరి. వీటినే ఆర్షగ్రంథములని వ్యవహరించుదురు. ఆయుర్వేదమునందలి అష్టాంగము లనుగూర్చి గ్రంథములను రచించి వీరు లోకమునకు ఉప కారము గావించిరి. ఇందు ప్రధానముగ నేటివరకును పఠనపాఠములలో నున్న (1) చరకమును గూర్చియు, (2) సుశ్రుతమును గూర్చియు, (3) ఆర్షము కాకపోయి నను తత్తుల్యముగనుండు అష్టాంగ హృదయమును గూర్చియు ప్రథమమున వర్ణించబడుచున్నది.

1. అగ్నివేశతంత్రము : ఇది చరకమహర్షిచే సంస్కరింపబడి చరకసంహితయని ప్రకృతము వ్యవహరింపబడు చున్నది. భరద్వాజుని శిష్యుడగు ఆత్రేయుడు కాయ చికిత్సా ప్రధానమైన వైద్యశాస్త్రమును అగ్నివేశ, భేల, జాతూకర్ణ, పరాశర, హారీత - క్షారపాణి యను నార్గురు శిష్యుల కుపదేశించెను. వారందరును తమతమ పేర నొక్కొక్క గ్రంథమును రచించిరి. ఇవి ఆర్షవైద్యగ్రంథ ములలో మొదటివి. ఇందు అగ్నివేశతంత్రము మిక్కిలి ప్రధానమైనది. "బుద్ధే ర్విశేష స్తత్రాసీత్ - అగ్నివేశః" అని చరకమునందు వర్ణితమై యున్నది. మిగిలిన తంత్రములు చాలవరకు లుప్తప్రాయములే. వాగ్భటుని కాలముననే వీటికి పఠనపాఠనములు లేవని 'భేడాద్యాః కిం న పఠ్యన్తే' అను వాక్యముచే తెలియుచున్నది

అగ్నివేశతంత్రము కాలక్రమమున పఠనపాఠనాది ప్రచారమును బొందుచుండ నిప్పటికి సుమారు 7000 సంవత్సరములకు పూర్వము జన్మించిన పతంజలిమహర్షి దీనిని సంస్కరించియున్నాడు. పతంజలినే చరకుడని లోకము వ్యవహరించుచున్నది. కనుకనే ఈ తంత్రమునకు చరకమని పేరు వచ్చినది. మరికొంత కాలమునకు పంచనద మండలి దృఢబలు డను నతడు ఈ చరకమునందలి కొన్ని భాగములను (చికిత్సాస్థానమునందలి 17 వ అధ్యాయము మొ. సిద్ధిస్థానాంతము) పూర్తిచేసెనని ఈ గ్రంథాంతము నందలి "అగ్నివేశ కృతే తంత్రే చరక ప్రతి సంస్కృతే - దృఢబలపూరితే" అనువాక్యమువలన తెలియుచున్నది. ఈ గ్రంథము కాయచికిత్సను ప్రధానము చేసికొని అష్టాంగములను బోధించుచున్నది. ఈ తంత్రమునందు (1) సూత్రస్థానము, (2) నిదానస్థానము (3) విమానస్థానము, (4) శారీరకస్థానము, (5) ఇంద్రియ స్థానము, (6) చికిత్సాస్థానము, (7) కల్పస్థానము, (8) సిద్ధిస్థానము అని ఎనిమిది స్థానములు కలవు.

సూత్రస్థానమునందు 30, నిదాన స్థానమునందు 8, విమాన స్థానమునందు 8, శారీరక స్థానమునందు 8, ఇంద్రియ స్థానమునందు 12, చికిత్సా స్థానమునందు 30, కల్పస్థానమున 12, సిద్ధిస్థానమున 12, అధ్యాయముల చొప్పున మొత్తము 120 అధ్యాయములు కలవు. ఇది చాల ప్రమాణగ్రంథముగ కొనియాడ బడుచున్నది. 'చరకస్తు చికిత్సితే' అని దీనిని కీర్తించుచున్నారు.

**2. సుశ్రుతసంహిత :-** శల్య శాలాక్య విషయములను రెంటినిగూడ ప్రధానముగ బోధించుచు, అష్టాంగ వైద్య బోధకమగు సుశ్రుత సంహితకూడ చరకమువలెనే ప్రమాణ గ్రంథముగా గ్రహింపబడుచున్నది.

శల్యతంత్రమనగా స్థూలముగా శస్త్రవైద్యమని చెప్పవచ్చును. దీనిని సర్జరియని పాశ్చాత్యభాషలో వ్యవహరింతురు. దీనిని ప్రవర్తింపచేసినది ధన్వంతరి. ఇతనికి దివోదాసుడనియు నామధేయము కలదు. ఇతడు కాశీ పట్టణమునకు పరిపాలకుడు. ఈ మహామహుడు సాక్షాత్తుగ నమృత ప్రదాతయగు ధన్వంతరి యవతారమేయని "అహంహి ధన్వంతరి రాదిదేవో జరారుజామృత్యు హరోఽమరాణాం" అను సుశ్రుతమందలి వాక్యము వలన తెలియుచున్నది. భరద్వాజాది ఋషులు ఇంద్రుని వద్ద కాయచికిత్సా ప్రధానమైన తంత్రమును గ్రహించి నట్లుగనే, ధన్వంతరిగూడ ఇంద్రునివలన శల్యప్రధానమైన చికిత్సాశాస్త్రమును ఉపదేశము నొంది యీ లోకమున విశ్వామిత్ర సుతుడైన సుశ్రుతుడు మొదలగు వార్వురకీ విద్యను బోధించెను.

ధన్వంతరి సూర్యునివలన వైద్యశాస్త్రమును గ్రహించెననియు వర్ణనలు గానవచ్చుచున్నవి. ఏది నిజమైనను శల్యతంత్ర ప్రధానమైన యీ శాస్త్రము ధన్వంతరిచేతనే వ్యాప్తి నొందిన దనుట నిర్వివాదము. ధన్వంతరి యను పేరుకూడ "ధనుః ప్రధానస్య శల్యతంత్రస్య పారం ఇయర్తి గచ్ఛతీతి ధన్వంతరిః" అను వ్యుత్పత్తిచే శల్యశాస్త్ర పారగుడను నర్థమును బోధించుచున్నది.

ధన్వంతరివద్ద శిష్యులుగ జేరి సుశ్రుత ఔపధేనవ - ఔరభ్ర - పౌష్కలావత - కరవీర్య - గోపుర రక్షితు లను వార్గురును ఈ విద్యను గ్రహించిరి. అందు సుశ్రుతుడు కడుంగడు బుద్ధిమంతుడు. ఇతడు స్వ గురూపదేశములను గ్రంథరూపముగ రచించెను. ఈ విషయము "యథోవాచ భగవాన్ ధన్వంతరి స్సుశ్రుతాయ" యను వాక్యముచే దృఢమగుచున్నది. మిగిలిన యైదుగురుకూడ తమపేరిట తంత్రములను రచించిరి. సుశ్రుత తంత్రముదక్క, మిగిలిన తంత్రములు చక్రపాణి - విజయ రక్షితాది వ్యాఖ్యాతల కాలమునాటికి దొరకుచుండెడి వని అందు ఉపలభ్యమానములగు తంత్ర వచనములచే తెలియుచున్నది. ప్రస్తుతము సుశ్రుతగ్రంథము మాత్రము పఠన పాఠనములలో నున్నది.

సుమారు 2000 సంవత్సరములకు పూర్వముండిన సిద్ధ నాగార్జును డను బౌద్ధ రససిద్ధుడు సుశ్రుతమును ప్రతిసంస్కరించెనని 'నాగార్జున ప్రతి సంస్కృతే' యను వాక్యమువలన తెలియుచున్నది.

సుశ్రుతుని జీవితకాలమునుగూర్చి పెక్కు తర్క వితర్కములు కలవు. ఆంగ్లపండితుడు మాస్ట్రోనెల్ అను నతడు క్రీ.శ. 4 వ శతాబ్దపువాడని చెప్పెను, జోన్స్-హాన్ అనువాడు క్రీ. శ. 12 వ శతాబ్దపు వాడని చెప్పెను. కాని ఇది నిజముగా కన్పట్టదు. బి-హోలెన్ అనునతడు సుశ్రుతుడను తంత్రకర్త లేనేలేడనియు, ఉన్న యెడల

సోక్రెటిస్ అనువానికంటె భిన్నుడు కాడనియు, సాహస ముగ వ్రాయజొచ్చెను. ఇది చాల ఆశ్చర్య జనకము. సుమారు 2000 సంవత్సరములకు పూర్వుడగు బౌద్ధ నాగార్జునుడు తనచే రచింపబడిన 'ఉపాయ హృదయము' అను గ్రంథములో సుశ్రుతాచార్యులను స్మరించి యుండుటచే ఇతడంతకన్న ప్రాచీనుడని తెలియుచున్నది. శాలిహోత్ర సంహితలో వినబడుచున్న సుశ్రుతుడును, ఇతడును ఒకరుకారని నిరూపించుచున్నారు. కనిష్కుని పౌత్రుడొక సుశ్రుతు డుండెను. తంత్రకర్తయగు సుశ్రుతు డతడేయని కొందరందురు. కాని కనిష్కునికి సమకాలికు డగు నాగార్జునునిచే స్మరింపబడి యంతకుమున్నే తంత్ర మును రచించిన సుశ్రుతుడు నాగార్జునునకు పిమ్మట జనించు సుశ్రుతు డగుట యెట్లు పొసగును? కనుక వీరుభయులును భిన్నులని ధ్రువపరచవలసి యున్నది. వృద్ధ సుశ్రుతుడగు వ్యవహారమున్నదికాని ఆతని పుట్టుక మొదలగు వివరములు ఎచ్చటను కానరాకపోవుటచేత అతనిని నమ్ముటకు వీలులేదని చెప్పుచున్నారు. ఇది ఆలోచనీయమైన యంశము.

సుశ్రుతసంహితను సంస్కరించినది నాగార్జునుడను విషయము డల్హణుడు వ్రాసినను, సంశయింపవలసిన విషయముగ నున్నదని శ్రీ హేమరాజశర్మగారు తాము కాశ్యప సంహితకు వ్రాసిన యుపోద్ఘాతములో వెల్లడించు చున్నారు. సుశ్రుతసంహిత శకారంభమునకు పూర్వము 1000 సం. కాలమునందు రచింపబడినట్లు శ్రీ శంకర బాలకృష్ణ దీక్షితులు తమ భారతీయ జ్యోతిశ్శాస్త్రేతి హాసమునందు వివరించిరి. దీనియందు సూత్ర, నిదాన, శారీరక చికిత్సా, కల్ప-ఉత్తరము అను నారు స్థానములు కలవు. సూత్రస్థానమున 46, నిదానస్థానమున 16, శారీర స్థానమున 10, చికిత్సా స్థానమున 40, కల్పస్థానమున 8, ఉత్తరస్థానమున 66, అధ్యాయములచొప్పున మొత్తము 186 అధ్యాయములు. కలవు.

**అష్టాంగ హృదయము:-** కాలక్రమమున మనుజుల యల్ప మేధాశక్తులను గమనించి బహుతంత్ర పరిశ్రమ చేయజాల రను అనుకంపచే అతి మేధానిధులును, సర్వ తంత్ర పారగులును అగు వాగ్భటాది పండితవరేణ్యులు ఆయుర్వేద గ్రంథములను రచించి లోకోపకారము కావించిరి. ఇవి అనార్షములయ్యు సూక్తి భరితము లగుటచే విద్వజ్జనోపాదేయములై సంప్రదాయాఽవిచ్ఛిన్న ముగ పఠన పాఠన ప్రచారము నందుచు, వేనోళ్ళ శ్లాఘింపబడుచున్నవి. ఇట్టి గ్రంథములలో అగ్రస్థానము వహించునది అష్టాంగ సంగ్రహాము. దానికంటె సార తరోచ్చయముగ వ్రాయబడిన అష్టాంగ హృదయము గూడ సంగ్రహాముకంటె నెక్కువ పండితవాల్లభ్యము నందుచున్నది. ఈ రెండును సింధుదేశమునందు జన్మించిన సింహాగుప్తుడను వైద్యుని కుమారు డగు వాగ్భటునిచే రచింపబడినట్లు తెలియుచున్నది. కాని కొందరు అష్టాంగ సంగ్రహామును హృదయకర్తయగు వాగ్భటుని పితా మహుడగు వాగ్భటుడు రచించె నని చెప్పుచున్నారు. ఈ ఉభయమతములకును పండితవరేణ్యుల యండకలదు. శ్రీ కవిరాజు గణనాథసేనుగారు వీరుభయులు నొకరే యనియు గ్రంథగతశైలి సరిపోవుచున్నదనియును నిర్ణ యించియున్నారు.

వాగ్భటుని జన్మకాలమునుగూర్చి మతభేదములు కలవు. ఇతడు వరాహామిహిరునికి పూర్వకాలికుడని కొందరు (క్రీ. శ. 505 సం. వరాహామిహిరుని కాలము) అంతకు పూర్వము ఒక శతాబ్దమునకాని, సార్థ శతాబ్ద మునగాని వాగ్భటుడుండెనని చెప్పుదురు. గణనాథసేన్ క్రీ. శ. 5 వ శతాబ్దమువాడని నిరూపించుచున్నాడు. యాదవజీత్రికంజీ ఆచార్యగారు క్రీ. శ. 6 వ శతాబ్దము లోని వాడని యూహించుచున్నారు. ఇతడు వైదికా చార విరతుడని చెప్పుటకును, బౌద్ధుడని చెప్పుటకును, గూడ ఈ గ్రంథములో నాధారములు కలవు. ఇతడార్య మతానువర్తియయ్యు రాజశాసన భీతిచే ప్రచ్ఛన్న బౌద్ధుడుగా నుండె నని కొందరందురు.

ఇతని తంత్రమగు అష్టాంగ హృదయమందును, సంగ్రహామునందును గూడ సూత్ర, శారీర, నిదాన, చికిత్సా, కల్ప, ఉత్తర స్థానము లని యారుస్థానములు కలవు.

అష్టాంగ హృదయమునందు సూత్రస్థానమున 30, శారీర స్థానమున 6, నిదాన స్థానమున 16, చికిత్సా స్థానమున 22, కల్పస్థానమున 6, ఉత్తరస్థానమున 40, అధ్యాయముల చొప్పున మొత్తము 120 అధ్యాయ

ములు కలవు. ఈ గ్రంథమును పఠించినవో చరక-సుశ్రుతముల యావశ్యకత యుండదని ఇతడు వ్రాసియుండెను. అనుభవములో గూడ ఈ విషయము రుజువగుచున్నది.

**అంజననిదానము :-** ఇదియును అగ్నివేశ కృతమనియే తెలియుచున్నది. శ్లోకరూపముగ నున్నది. వ్యాధుల యొక్క సంఖ్యను, నామధేయములను తెలియబరచును. ఈ గ్రంథము లభ్యమగుచున్నది.

**భేడసంహిత :-** ఇది భేడఋషి ప్రణీతము. ప్రస్తుతమిది తంజావూరు ప్రభుత్వ పుస్తక భాండాగారమున ఖండితప్రాయముగ నున్నది. దీనిని ఇటీవల ముద్రించినట్లు తెలియవచ్చినది. ఈ గ్రంథముకూడ ప్రమాణముగ గ్రహింపదగియున్నది. చక్రపాణి వ్యాఖ్యానములో దీని యుద్ధారములు కనిపించును. కొందరీతంత్రమునే ఖాలుకి తంత్రమని అనుచున్నారు. కాని అది సరికాదు. రెండును భిన్నతంత్రములుగనే యున్నవి.

**జతూకర్ణసంహిత :-** ఇదియును ప్రమాణగ్రంథమే. చక్రపాణి పెక్కు స్థలములలో విషయ నిర్ధారణకై దీనినుండి వాక్యముల నుదహరించియున్నాడు. ఇది శివదాసుడను వ్యాఖ్యాత కాలమువరకు లభ్యమగుచుండెనని అతని వ్యాఖ్యానముల యందిది యుదహరింపబడుటచే తెలియుచున్నది.

**పరాశరసంహిత ; క్షారపాణి సంహిత :-** ఇవికూడ శివదాసుని నాటికి లభ్యమగుచు నిప్పుడు దొరకుటలేదు.

**హారీతసంహిత :-** ఇదియును చక్రపాణి, విజయ రక్షిత, శ్రీకంఠ, శివదాసాది వ్యాఖ్యాతల కాలములో దొరకుచు నిపుడు లుప్తప్రాయమైనది. ప్రస్తుతము హారీత సంహితయని అచ్చుబడి ప్రచారమునందున్న ప్రతి యథార్థమైన హారీత సంహితకాదు. దీనియందు చాల దోషములు కానవచ్చుచున్నవి.

**ఖరనాదసంహిత :-** దీనిని అరుణదత్త, చక్రపాణి, విజయ రక్షితాదులు ప్రమాణముగ గ్రహించియుండుటచే ఇది ప్రమాణగ్రంథమని తెలియుచున్నది. ఇప్పుడిది దుర్లభము.

**విశ్వామిత్రసంహిత :-** ఇది చాల ప్రాచీనతంత్రము. చరక సుశ్రుత వ్యాఖ్యానములలో చక్రపాణి దీనిని స్మరించెను. ఇప్పుడిది దుర్లభము.

**అగస్త్యసంహిత :-** ఇది అగస్త్యునిచే రచింపబడినది. ఈ పేరుగల ఒక ఋషి ధన్వంతరి శిష్యుడు కలడని దక్షిణాపథమున నొక ప్రచారము కలదు. అగస్త్యుని యీ గ్రంథమును పురస్కరించుకొని ఒక సంప్రదాయము ఆ దేశమునందు అగస్త్య వైద్యమనుపేర వృద్ధినంది యున్నది. ఇది రసతంత్రౌషధములను గూర్చి బహుళముగ బోధించినను కాయచికిత్సా ప్రధానముగ నుండుటచే నిట నుదహరింపబడెను. ఈ తంత్ర ప్రవర్తకులు 28 మంది అని కొందరు, 38 మంది అని కొందరు, 44 మంది అని కొందరును చెప్పుచున్నారు. వారిలో నొకడగు వంగసేనాచార్యుడు ఈ తంత్రమును సంస్కరించి తనపేర "వంగసేన" యని ప్రసిద్ధినొందిన యొక గ్రంథమును ప్రకటించెను. ఇది ముఖ్యముగ గ్రహింపబడుచున్నది. హేమాద్రి తన వాగ్భట వ్యాఖ్యానములో దీనిని ఎక్కువగా గ్రహించియున్నాడు.

**అత్రిసంహిత :-** ఇది మిక్కిలి ప్రాచీన గ్రంథమని కొందరును, ఆధునికమని కొందరును, నుడువుచున్నారు. దీనియందలి వచనములు ఏ వ్యాఖ్యానములలోను కన్పట్టక పోవుటచే, దీని యార్షత్వము సంశయింపబడుచున్నది. ఇది లభ్యమగుచున్నది. పంచనదమందు ఇంతకన్న పెద్దదియగు నొకగ్రంథము ఈ పేరుతో ప్రచారము నందున్నదని తెలియుచున్నదిగాని ఆ గ్రంథము హస్తగతము కాలేదని మహా మహోపాధ్యాయ గణనాథ సేన్‌గారు వ్రాసియున్నారు. కాయచికిత్సా గ్రంథములలో ఆర్షము లనదగినవి యింతకుమించి ప్రచారము నందు లేవని చెప్పవచ్చును.

**శల్యతంత్ర గ్రంథములు :-** శల్యతంత్రమనగా శరీరమునందు చేరి బాధించెడి శల్యముల నుద్ధరించి చికిత్సచేయు విధానము. శల్యములు బాహ్యములగు బాణములు మొదలగునవిగా నుండవచ్చును. లేదా వ్రణాదుల యందలి పూయము మొదలగు నభ్యంతరములుగ నుండవచ్చును. కనుక శస్త్రములచే చేయబడు వ్రణాదుల చికిత్సయు, బాహ్యముగ శరీరమునందు చేరిన ములుకులు మొదలగువానిని యంత్రాదులచే నాకర్షించి చికిత్సించుటయు కూడ శల్యతంత్ర మనబడును. దీనిని బోధించు తంత్రములు శల్యతంత్రములు. ఈ తంత్ర

ప్రవర్తకుడు ధన్వంతరి. ఇతని విషయమునుగూర్చి లోగడ వర్ణింపబడియున్నది.

**సౌశ్రుతతంత్రము :-** దీనికి వృద్ధసుశ్రుత సంహిత అని పేరు. ఇది మనకు ఉపలభ్యమానమగు సుశ్రుత సంహితకు మూలమని తెలియుచున్నది. ఇది ప్రస్తుతము దొరకుట లేదు.

**సుశ్రుతసంహిత :-** దీనినిగూర్చి లోగడ వర్ణింపబడి యున్నది.

**ఔపధేనవతంత్రము ; ఔరభ్రతంత్రము :-** ఇవి రెండును నామమాత్రావశిష్టములు. సుశ్రుత వ్యాఖ్యాతయగు డల్హనుడు తన వాఖ్యానములో నొకటి రెండుచోట్ల వీనిని స్మరించెను.

**పౌష్కలావతతంత్రము :-** చక్రపాణి యనునాతడు భానుమతి యను తన సుశ్రుత వ్యాఖ్యలో దీని నుదహరించియున్నాడు. ఇది దుర్లభము.

**వైతరణతంత్రము :-** ప్రాచీన వ్యాఖ్యలలో దీని యుద్ధారములు కానవచ్చుచున్నవి. కాని యిది దుర్లభము.

**భోజతంత్రము :-** దీనినే భోజ సంహిత యందురు. ఈ సంహితాకారుడగు భోజుడు, సుశ్రుతునికి సమకాలికుడగు ఋషియని డల్హణుడు తన వ్యాఖ్యలో వ్రాసియున్నాడు. వీనికి వృద్ధభోజుడని గూడ వ్యవహారము కలదు. ఇది చాల ప్రమాణగ్రంథము. దీని ప్రమాణము ననేక వ్యాఖ్యాతలు ఉల్లేఖించిరి.

**కరవీర్యతంత్రము :-** దీనిని వాఖ్యాత లరుదుగ వాడియున్నారు. వారి కాలమునకే యిది లభ్యము కాలేదని తోచుచున్నది.

**గోపురరక్షితతంత్రము :-** ఇదియు నామమాత్రావశేషముగనే యున్నది.

**భాలుకితంత్రము :-** ఇదియును వ్యాఖ్యాతలచే అరుదుగ స్మరింపబడుచున్నది. విజయ రక్షితుడు ఈతంత్రము నుండి జ్వరప్రకరణములో కొన్ని శ్లోకములను ఉదాహరించియున్నాడు. ఇది దుర్లభము.

**కపిలతంత్రము; గౌతమతంత్రము :** ఈ రెండుగూడ దుర్లభములే. వీనియందలి వచనము లచ్చటచ్చట వ్యాఖ్యానములలో కానవచ్చుచున్నవి.

**శాలాక్య తంత్రములు:-** ఊర్ధ్వాంగ చికిత్సలను బోధించు తంత్రమునకు శాలాక్యతంత్రమని పేరు. శలాకలతో నిది నిర్వర్తింప బడునుగాన శాలాక్యమని పేరుకల్గినది. దీనిని నిమిసాంప్రదాయ మనియెదరు. ఈ వైద్యులకు శాలాకిను లని పేరు. ఈ తంత్ర ప్రవర్తకులు కాంకాయన, గార్గ్య, గాలవ ప్రభృతులు.

**విదేహతంత్రము :-** ఇదియును సుశ్రుతము వలెనే సర్వాంగములతో కూడిన గొప్ప తంత్రము. ఇందు నేత్రము, శ్రోత్రము మొ. ఊర్ధ్వాంగ జనిత రోగ చికిత్స ముఖ్యముగా నున్నది. ఇదియును ప్రస్తుతము దుర్లభము. వ్యాఖ్యాతలచే చాల ప్రమాణగ్రంథముగా గౌరవింప బడు చుండెను.

**నిమితంత్రము :-** ఇది మరియొక శాలాక్య తంత్రము ఇదియును దుర్లభము.

**కాంకాయనతంత్రము :-** ఈ తంత్రకారుడు బాహ్లీక దేశస్థుడని మాత్రము తెలియుచున్నది. ఇదియును దొరకుటలేదు.

**గార్గ్యతంత్రము; గాలవతంత్రము :-** డల్హణ వ్యాఖ్యలో ఈ తంత్రముల నామములు మాత్రము స్మరింపబడినవి. కాని లభ్యమగుట లేదు.

**సాత్యకితంత్రము :-** ఇది అరుదుగా వ్యాఖ్యాతలచే స్మరింపబడినది; దుర్లభము.

**శౌనకతంత్రము :-** దీని పాఠములు డల్హణ, చక్రపాణి, దత్తులచే బహుప్రదేశములందు గ్రహింపబడినవి. సర్వాంగ పూర్ణమైన గొప్పగ్రంథము. ప్రస్తుతము లభ్యముకాదు.

**మద్రశౌనకతంత్రము :-** ఇది శాలాక్యతంత్ర భాగము మాత్రము గలిగియున్నది. దీనిని మదశౌనక తంత్ర మనియు వ్యవహరింతురు. దుర్లభము.

**కరాళతంత్రము :-** ఇది కరాళభట్టుచే రచింపబడినది. ఇది ఆర్షము కాకపోయినను అతిప్రాచీన మగుటచే నిట నుదహరింపబడినది. ఇదియును దుర్లభము.

**చక్షుష్యతంత్రము :-** దీనిని చక్షుష్యేణ్య తంత్రమనియు అందురు.

**కృష్ణాత్రేయతంత్రము :-** కృష్ణాత్రేయుడన్నను, పునర్వసురాత్రేయుడన్నను ఒక వ్యక్తియే యని కొందరు, భిన్నులని కొందరును చెప్పుచున్నారు. ఇదియు దుర్లభము.

**కౌమారభృత్యతంత్రములు** :- శిశువుల సంరక్షణ మును బోధించు తంత్రములకు కౌమారభృత్యతంత్రము లని పేరు.

**జీవకతంత్రము ; పార్వతకతంత్రము ; బంధక తంత్రము**:- ఈ మూడు తంత్రములు పూర్వకాలమున ప్రసిద్ధిగ నుండెనని డల్హణుడు సుశ్రుత సంహిత ఉత్తర స్థానములో నుదహరించి యుండెను. కాని యివి ఇపుడు నామమాత్రావశిష్టములు.

**కుమారతంత్రము** :- చక్రపాణిచే భానుమతి యను సుశ్రుత వ్యాఖ్యలో దీని పాఠములు ఉద్ధరింపబడినవి. కాని దీని కర్త యెవరో తెలియదు. ఇది ప్రస్తుతము దుర్లభము.

**హిరణ్యాక్షతంత్రము** :- మాధవనిదాన వ్యాఖ్యలో శ్రీకంఠుడు దీనిపాఠము నుద్ధరించెను. దీనినే కొందరు కుమారతంత్రము అందురు. దుర్లభము.

**గ్రహచికిత్స** :- భూతవిద్యా తంత్రములు ప్రస్తుతకాల మున లుప్తప్రాయముగ నున్నవి. చరకుని కాలమున వీటిని ఉన్మాదాది మానసికరోగముల చికిత్సలలో కొద్దిగ వర్ణించి యున్నారు. ఈ తంత్రములు ప్రస్తుతము దొర కుట లేదు.

**అగదతంత్రములు** :- స్థావర, జంగమ, కృత్రిమ విషముల స్వరూప, లక్షణ, చికిత్సలను బోధించునవి అగదతంత్రము లని చెప్పబడును. కాశ్యపాదులు వీని ప్రవర్తకులు.

**కాశ్యపసంహిత** :- డల్హణ, చక్రపాణి, శ్రీకంఠాది వ్యాఖ్యాతలచే నీ తంత్రవచనములు ప్రమాణముగా నుద్ధరింపబడినవి.

**ఆలంబాయనసంహిత** :- మాధవనిదాన టీకలో విషాధికారమున శ్రీకంఠుడు దీని యుద్ధారము నుదహ రించెను. దుర్లభము.

**ఉశనస్సంహిత** :- దీని రచయిత శుక్రాచార్యులని వృద్ధవైద్యులు చెప్పుదురు. శుక్రాచార్య మతానుయాయి యగు కౌటిల్యుడు తన యర్థశాస్త్రమున కంటక శోధ నాధికరణమున విషాది ప్రతీకారోపదేశము, ఆశుమృతక పరీక్ష యనువాటిని చూపుటచే ఈ సంహిత యున్నట్లు తర్కింపబడుచున్నది.

**సనకసంహిత** :- దీనికే శౌనక సంహిత యని పేరు కూడ కలదు. ఇది మిక్కిలి ప్రాచీనమైనది. ఇది అరబ్బీ భాషలోనికి తర్జుమా చేయబడినది. ఈ భాషాంతరీకృత గ్రంథములోనున్న విషయములు చరక, సుశ్రుతాది గ్రంథములలోనున్న విషాధికారమునందలి యంశము లకు సరిపోవుచున్నట్లు ప్రఫుల్లచంద్రరాయ్‌గారు తమ భారతీయ రసాయనశాస్త్రేతిహాసమున వ్రాసియున్నారు. దీని అరబ్బీ భాషానువాదము లభ్యము.

**లాట్యాయనసంహిత** :- సుశ్రుతకల్ప స్థానములో డల్హణుడు దీని పాఠములను ఉద్ధరించెను. దుర్లభము.

**రసాయన-వాజీకరణతంత్రములు** :- రసాయన వాజీ కరణ తంత్రములలో రసాయనతంత్ర మనునది శరీరము నందు శ్రేష్ఠమగు సప్తధాతు సముదాయము నభివృద్ధి నందించు నుపాయములను బోధించునది యనియును, వ్యాధులను నశింపచేయు నుపాయములను బోధించునది యనియును వ్యవహరించుచున్నారు. చరకాదులు రసా యన సేవావిధానమును, మూలికాప్రధానమైన రసాయ నౌషధ యోగములను, ఉపదేశించియున్నారు. ఈ రసా యన తంత్రమునకే రసతంత్రమనికూడ వ్యవహారము. ఈ వైద్యులకు రాసాయనికు లని పేరు. దీని ప్రవర్తకులు మహేశ్వర, నాగార్జునాదులు. వాజీకరణతంత్ర మనునది శుక్రదోషములను పోగొట్టి సత్సంతానముకల్గు నుపాయ ములను బోధించును. ఈ వైద్యులకు వాజీకరణికు లని పేరు. దీని ప్రవర్తకులు బాభ్రవ్య, కుచుమార, వాత్స్యాయ నాదులు.

**రసాయనతంత్రములు ; పాతంజలతంత్రము** :- శివ దాసాది వ్యాఖ్యాతలచే దీని పాఠములు ఉద్ధృతము లైనవి. ఇది దుర్లభము.

**వ్యాడితంత్రము; వాసిష్ఠతంత్రము; మాండవ్యతంత్రము**- ఇవి మూడును మిక్కిలి ప్రాచీనములైనవి. ఇపుడు దుర్లభములు.

**నాగార్జునతంత్రము** :- ఈ గ్రంథకర్త మహర్షియని కొందరు, బౌద్ధపండితు డని కొందరు చెప్పుచున్నారు. కొందరీ నాగార్జునతంత్రమనగా నాగార్జున ప్రణీతమగు రసరత్నాకరమనుచున్నారు. ఇది దుర్లభము. ఈ నాగార్జు నుడే కక్షపుటతంత్రము, ఆరోగ్యమంజరి యను మరి

రెండు గ్రంథములను రచించెనని చెప్పుదురు. ఇవి లభ్యములు. ఇతనిచే రచింపబడిన రసేంద్రమంగళ మను గ్రంథమునందు ఎనిమిది అధ్యాయములు కలవు. కాని ప్రస్తుతము 3 అధ్యాయములు మాత్రమే దొరకుచున్నవి. దీనిని ఆంధ్రభాషలోనికి పరివర్తనమొనర్చిరి.

**రసహృదయతంత్రము :-** దీనిని శంకరాచార్యుల గురువగు గోవింద భగవత్పాదులు రచించిరి. ఇది లభ్యము.

**రసార్ణవతంత్రము :-** ఇది ఈశ్వరునిచే పార్వతికి ఉపదేశింపబడినది. బహు ప్రాచీనమైనది. ఇది లభ్యము.

**వాజీకరణతంత్రములు; కుమారతంత్రము :-** ప్రాచీనమైన తంత్రము. లభ్యముకాదు.

**నందితంత్రము :-** నంది అనువానిచే ప్రథమమున వేయి అధ్యాయములలో నీ సంహిత వ్రాయబడె నని తెలియుచున్నది.

**శ్వేతకేతుతంత్రము :-** ఉద్దాలకుని పుత్రుడగు శ్వేతకేతునిచే నందిసంహిత ప్రతి సంస్కరింపబడి 5 వందల అధ్యాయములలోనికి సంక్షిప్తము గావింపబడి శ్వేతకేతు తంత్రమని వ్యవహరింపబడిన తంత్రము.

**పాంచాలతంత్రము :-** బభ్రుకుమారుడగు పాంచాలునిచే శ్వేతకేతు సంస్కృతమగు నందిసంహితాప్రతి సంస్కరింపబడి, మరికొంత సంక్షిప్తము కావింపబడి 7 భాగములలో రచింపబడినది.

**వాత్స్యాయనుని కామసూత్రములు :-** వాత్స్యాయన కృతము. వాత్స్యాయనునిగూర్చి భిన్నాభిప్రాయములు కలవు. కొందరు ఋషియనియు, కొందరు చంద్రగుప్తుని మంత్రియగు చాణక్యుడనియు అందురు.

***3. అనార్ష వైద్యగ్రంథములు;* అష్టాంగ సంగ్రహము :-** ఇదియును సూత్ర, శారీర, నిదాన, చికిత్సా, కల్ప, ఉత్తరస్థానము లను ఆరు స్థానములను కల్గియున్నది. అందు సూత్రస్థానమున 40, శారీరస్థానమున 12, నిదాన స్థానమున 16, చికిత్సా స్థానమున 24, కల్ప స్థానమున 8, ఉత్తరస్థానమున 50 అధ్యాయముల చొప్పున మొత్తము 150 అధ్యాయములు కలవు. ఈ గ్రంథమును వృద్ధ వాగ్భట మని వ్యవహరింతురు. వృద్ధవాగ్భట మను పదముచే కొందరు పండితులు వాగ్భటు లిరువురుండెడివారని నిరూపించుచున్నారు. దీనినిగూర్చి లోగడ వివరింపబడి యున్నది.

**అష్టాంగహృదయము :-** ఈ గ్రంథ ప్రాధాన్యమును బట్టి ఇది మొదటనే వివరింపబడినది.

**మాధవనిదానము :-** ఇది రోగనిర్ణయమున కుపయోగించు ప్రమాణగ్రంథము. మహారాష్ట్ర దేశజాతుడును, ఇందుకరుని పుత్రుడు నగు మాధవకరునిచే రచింపబడినది. ఇదికూడ బహు పఠన పాఠన ప్రచారములో నున్నది. ఈ గ్రంథకర్త క్రీ. శ. 7, 8 శతాబ్దములలో జన్మించెను. ఈ గ్రంథకర్త వేదవ్యాఖ్యాతయగు మాధవాచార్యుడని కొందరు వ్రాసిరి. కాని అది నిరాధారము. మాధవాచార్య ప్రణీతమగు గ్రంథము వేరొండు కలదేమోకాని అది ప్రస్తుతము సులభముగ దొరకుటలేదు. ఈ మాధవ నిదానము ననుసరించి పెక్కుగ్రంథము లుద్భవించినవి.

**యోగరత్నాకరము :-** ఇందును మాధవనిదానమందలి యనుక్రమము, శ్లోకములు గాన్పించును. ఈ గ్రంథకర్త నామధేయము అవిదితము. కాలముకూడ తెలియదు.

**శార్ఙ్గధరసంహిత :-** ఇదికూడ శారీర నిదాన చికిత్సా విషయములతో విలసిల్లుచు వైద్యుల యాదరమును పొందుచున్నది. ఇందు మూలికౌషధములు, రసౌషధములు కూడ కలవు. పంచకర్మలు వర్ణింపబడినవి. ఇందు మూడు ఖండములు కలవు. అవి పూర్వ, మధ్యమ, ఉత్తర ఖండము లనునవి. దీనిని శార్ఙ్గధరాచార్యులు రచించెను.

**భావప్రకాశము :-** ఇదియు అష్టాంగములను బోధించుట కుద్దేశింపబడినది. ఇది ద్రవ్యగుణ విజ్ఞానమును ప్రధానముగ గల్గించుచు నిదాన చికిత్సలను పరిపూర్ణముగ వివరించు గ్రంథము. ఇది భావమిశ్రకృతము. ఉత్తరదేశమునందు దీనికి విస్తృతమగు ప్రచారము కలదు. ఇందు ఫిరంగరోగమును గూర్చి వర్ణించియున్నాడు. ఫిరంగి చెక్క మొదలగు వస్తువులను గూడ వర్ణించెను. ఇతడు క్రీ. శ. 16వ శతాబ్దపు పూర్వభాగమున జనించెనని నిర్ణయింపబడెను.

విమ్మట గదనిగ్రహము, సిద్ధయోగము మొదలగు గ్రంథములు రచింపబడినవి. భైషజ్య రత్నావళి, ఆయుర్వేద విజ్ఞానము ఇంకను అర్వాచీనములగు ప్రత్యక్ష

శారీరము మొదలగు గ్రంథము లావిష్కరింపబడినవి. ఆంధ్రదేశములో ముఖ్యముగా నభ్యసింపబడునవి "వైద్య చింతామణి" "బసవరాజీయము" అను రెండు పెద్ద గ్రంథములు కలవు. ఇవి స్వతంత్రములుకావు. పూర్వ గ్రంథములలోనుండి యుద్ధరింపబడిన విషయములతో నిండియున్నవి. నాడీజ్ఞానము మొదలగు అష్టస్థాన పరీక్షలు కర్మవిపాకము, జ్యోతిషాభిప్రాయము మొదలగు విశేషములు వీనిలో వర్ణింపబడినవి.

ఇంకను చికిత్సారత్నమను బాలురకు స్త్రీలకు కలుగు రోగముల చికిత్సలను బోధించు గ్రంథమును, చికిత్సా సారమను గోపాలదాసుచే రచింపబడిన గ్రంథమును కలవు.

రసతంత్రమునందును అనార్ష గ్రంథములు కలవు. వానిలో రసరత్న సముచ్చయము (వాగ్భట విరచితము), రసేంద్ర చూడామణి (సోమదేవ విరచితము), రససారము (గోవింద భిక్షు విరచితము) రస రత్నాకరము (నిత్యానాథ విరచితము) అనునవి ముఖ్యమయినవి. ఇంకను ఆయుర్వేద ప్రకాశము, రసేంద్రసార సంగ్రహము, రస సంకేత కలిక, రసకౌముది, లోహమంజరి, మొదలగు బహు గ్రంథములు కలవు.

నో. రా. శా.

**ఆయుర్వేద ధర్మములు** :- ధర్మములు శాశ్వతములు. అనగా దేశ కాల వయః ప్రకృతి భేదముల ననుసరించి ఎప్పటికప్పుడు మార్పు చెందించుటకు వీలుచాలనివి. జగద్ధార్యమగు ధర్మపదమునకు ప్రతివ్యక్తియు నియమితమగు నిత్య కర్మాచరణమున వర్తించుటను తెలియ చేయునది యని యర్థము. ధర్మములు మానవ జీవిత సంపత్ప్రభా భాసకములు, చిరాయురారోగ్య సంపన్నములు. ధర్మము లన్నింటియందును ఆయుఃపాలనము ముఖ్యమగుటను," జీవితకాలమును తెలియజెప్పి యుక్తాచరణమున ధర్మార్థ సుఖసాధన మగు ఆయుఃపాలనము చేయుటయందు నేర్పరితనమును బోధించుటచే ఈ ధర్మములు ఆయుర్వేద ధర్మము లని పేర్కొనబడినవి.

ఆయుర్వేద ధర్మములు కేవల సామాజికములుగా గాని, వర్ణ, వర్గీకరణములుగా గాని రూపొందింపబడి నిర్ణయింపబడినవి కావు. ఇవి సర్వమానవ సౌఖ్యావహములు. ప్రాణిమాత్ర జీవనోజ్జీవనములు. శాశ్వతములు. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" ధర్మసాధనకు శరీరము మొదటిదిగా చెప్పబడినది. "శరీర రక్షణో ధర్మః" శరీరమును రక్షించుటయే ధర్మమని చెప్పబడినది.

"ధర్మసాధనంబు తనువు, ధర్మము పరి
జ్ఞానదాయి, యట్లుగాన తనువు
నోమవలయు మర్త్యుడేమిట నేమర,
కాత్మహితముగోరి యనఘచరిత"

(మహాభారతము-శాంతి.)

శరీరమనగా నశించునదియని యర్థము. "శీర్యతే రోగాదినా ఇతి శరీరః. శౄ హింసాయాం" అని నిర్వచనము. శరీరమునందు అరువది అవయవములు కలవు. ఇందే యొక్కటి కొదువయైనను లేక పనిచేయకపోయినను సౌందర్య విహీనమై శరీరముయొక్క ఉనికియే కష్టముగ తోచును. శరీరమునం దాత్మ సుస్థిరముగా నుండవలయును. ఆత్మ నిలచియుండునంతవరకు శరీరమునందన్ని అవయవములు సుసమాహితములై పనిచేయు చుండవలయును.

శరీరము - మనస్సు - ఆత్మ ఇవి ఒకదానినొకటి యెడబాయక కలసియుండునట్టి క్రియాత్మకమగు అవస్థావిశేషమునకు "ఆయువు" అని పేరు. ఆయుర్వేద ధర్మసముచ్చయమునందు మొదటి అధ్యాయము సద్వృత్తోపదేశము. (చ. సూ. 1-46-47). ఆయుర్వేదమున చెప్పబడిన ఆ సద్వృత్తము నాచరించుటవలన ఆరోగ్యము, ఇంద్రియ విజయము అను రెండుఫలములు ఒకేసారి పొందనగును. అట్టి సద్వృత్త విశేషములను సమగ్రముగా నిందు పొందుపరచుచున్నాము :

1. "దేవ గో బ్రాహ్మణ గురు వృద్ధ సిద్ధాచార్యా నర్చయేత్." దేవతలను, గోవులను, బ్రాహ్మణులను, తపోయోగ సిద్ధులను, విద్యా మంత్రోపదేశకులను, పూజించవలయును.

2. "అగ్ని ముపచరేత్." హోమాది సత్క్రియా కలాపములవలన అగ్ని నారాధించవలయును.

3. "ఓషధీః ప్రశస్తా ధారయేత్." ఆరోగ్యదాయకములు, ఆయుర్వర్ధకములు, పవిత్రములు నగు ఓషధులను ధరింపవలయును.

4. "ద్వౌ కాలా వుపస్పృశేత్." దినమును ఉదయ సాయంకాలములయందు రెండు వేళలను స్నానము చేయవలయును.

5. "మలాయ నేష్వభీక్ష్ణం పాదయో శ్చ వైతుల్యా మాదధ్యాత్." చంకలు, గజ్జలు, మున్నగు సంధులయం దును, పాదములయందును మలినము (మురికి) చేర నీయక శుభ్రముగా నుంచుకొనవలయును.

6. "త్రిఃపక్షస్య కేశ శ్మశ్రు లోమ నఖాన్ సంహార యేత్" ఐదు దినముల కొకసారి క్షౌరము చేయించు కొనవలయును.

7. "నిత్య మనుపహతవాసా స్సుమనా స్సుగంధి స్స్యాత్." ప్రతిదినము ఉదికినబట్టలను, సుగంధ ద్రవ్యము లను ధరించి ప్రసన్నాత్ముడై యుండవలెను.

8. "సాధువేషః." సభ్యతను తెలియజేయు ఉడుపులను ధరించవలెను. "వస్త్రేణ వపుషా వాచా" యన్నట్లు తన మంచి నడవడికను తెలుపునట్టి అలంకారము కల్గియుండ వలెనని భావము.

9. "ప్రసాధిత కేశః." తల శుభ్రముగా దువ్వుకొని యుండవలయును. చింపితలగా వెండ్రుకలు చిక్కువరచు కొని యుండరాదు.

10. "మూర్ధ శ్రోత్ర ఘ్రాణ పాద తైలనిత్యః" ప్రతి దినము తలకు నూనె రాచుకొనవలయును. చెవులలోను ముక్కులలోను తైలము వేసికొనవలెను. అరికాళ్ళకు తైలము రాచుకొనవలయును.

11. "పూర్వాభిభాషీ." పూజ్యులగు పెద్దలను (సకల జనులను) చూచినపుడు తానుగానే ముందు పలుకరించ వలయును.

12. "సుముఖః." సర్వదా ప్రసన్నవదనుడై యుండ వలయును.

13. "దుర్గే ష్వభ్యుపపత్తా." ఆపదలలో చిక్కినప్పుడు సమయోచిత ప్రజ్ఞచే చిక్కులను తప్పించుకొనునట్టి ధైర్యము గలిగి యుండవలయును.

14. "హోతా." హవిరాదులచే అగ్నిని ఆరాధించ వలయును.

15. "యష్టా." దేశక్షేమంకరము అగు యజ్ఞముల నొనర్పవలయును.

16. "దాతా." కలకొలది దానధర్మములను చేయ వలయును.

17. "చతుష్పథానాం నమస్కర్తా." నాలుగు త్రోవలు కలియు ప్రదేశములందు, సావధానుడై నమ స్కారము చేయవలయును.

18. "బలీనా ముపహర్తా." బలి మంగళ పూజాదులచే దేవతల నారాధించవలయును.

19. "అతిథీనాం పూజకః." అతిథుల నర్చించవలయును.

20. "పితౄణాం పిణ్డదః." పితరులకు ఇష్టమృష్టా న్నము లొసంగ వలయును.

21. "కాలే హిత మిత మధురార్థవాదీ." సమయము ననుసరించి హితముగను, మితముగను, సంతోషకరము గను మాట్లాడవలయును.

22. "ధూమపః." సుగంధ ద్రవ్యములచే ధూమ వి[illegible] ప్రకారము పొగపీల్చవలయును.

23. "వశ్యాత్మా." వశీకృత చిత్తుడై యుండవలయును

24. "ధర్మాత్మా." నియత కర్మాచరణము కలి[illegible] యుండ వలయును.

25. "హేతా వీర్ష్యుః." కార్యసాధన (హేతువు) యందు పట్టుదల కలిగియుండవలయును.

26. "ఫలే నేర్ష్యుః." ఒకనికి కలిగిన ఫలమందు అసూయ[illegible] పడరాదు.

27. "నిశ్చింతః - నిశ్చితః." ఎల్లప్పుడు విచారవ చేయకూడదు, లేక సంశయరహితమైన ఆత్మ కలిగియుం వలయును.

28. "నిర్భీకః." భయరహితుడై యుండవలయును

29. "ధీమాన్." వివేకవంతమగు బుద్ధికలిగి యుం[illegible] వలెను.

30. "హ్రీమాన్." పనికిరాని చెడ్డపనులు చేయుట[illegible] లజ్జితుడై యుండవలెను. (చేయరాదు)

31. "మహోత్సాహః." మంచిపనులు చేయుట[illegible] ముందంజవేయువాడై యుండవలయును.

32. "దక్షః." క్రియా నిర్వహణ సమర్థుడై యుం[illegible] వలయును.

33. "క్షమావాన్." ఓరిమి కలవాడై యుం[illegible] వలయును.

34. "ధార్మికః." సత్కార్యములను మాత్రమే చేయు వాడుగా నుండవలయును.

35. "ఆస్తికః." వేదవిహిత నిష్ఠలయందు నమ్మకము కలవాడై యుండవలయును.

36. "వినయ బుద్ధి విద్యాభిజన వయోవృద్ధ సిద్ధాచార్యాణా ముపాసితా." వినయము, వివేకము, విద్యా వైభవము, కులీనత, వయః పరిణతి, ఆత్మసిద్ధిగలవారిని, శాస్త్రమంత్రోపదేశకు లగు ఆచార్యులను ఆరాధించు వాడుగా నుండవలయును.

37. "ఛత్రీ." గొడుగు.

38. "దండీ." కఱ్ఱ.

39. "మౌళీ." తలగుడ్డ, (టోపి)

40. "సోపానత్కః." పాదరక్షలు కలవాడై.

41. "యుగమాత్రదృగ్విచరేత్." రెండు బారల దూరము (4 గజములు) ముందుచూపు కలిగి సంచరించు చుండవలయును.

42. "మంగళాచారశీలః." పవిత్రమగు నడవడికయు, స్వభావమును కలిగియుండవలెను.

43. "కుచేలాస్థి కంటకామేధ్య కేశ తుషోత్కర భస్మ కపాలస్నాన భూమీనాం పరిహర్తా." చింపిపీలికలు, ఎముకలు, ముండ్లు, మలమూత్రములు, వెంట్రుకలు, వరిపొట్టు, బూడిద, కుండపెంకులుగల ప్రదేశములను స్నానము చేసిననీరు ప్రవహించుప్రదేశములందును సంచరించరాదు.

44. "ప్రాక్ శ్రమాత్ వ్యాయామవర్జీ స్యాత్." బడలిక కలుగు వరకును వ్యాయామము చేయరాదు.

45. "సర్వప్రాణిషు బంధుభూత స్స్యాత్." సమస్త ప్రాణులయందును బంధుప్రేమ కలిగి యుండవలయును.

46. "క్రుద్ధానా మనునేతా." కోపము చెందినవారిని మంచిమాటలతో అనునయించవలయును.

47. "భీతానా మాశ్వాసయితా." భయపడినవారిని ఊరడించువాడుగా నుండవలయును.

48. "దీనానా మభ్యుపపత్తా." దీనులు (చెడినస్థితి గలవారు) అగువ్వారిని ఉద్ధరించి స్వస్థులగునట్లు జేయు వాడుగా నుండవలయును.

49. "సత్యసంధః." చెప్పినమాటను నిలబెట్టుకొను దీక్షగలవాడై యుండవలయును.

50. "సామప్రధానః." మంచితనము గలవాడుగా నుండవలయును.

51. "పరపురుషవచన సహిష్ణుః." ఇతరుల దుడుకు మాటలను ఓర్మితో సహింపవలెను.

52. "అమర్షఘ్నః" అసహన గుణము పోగొట్ట వలయును.

53. "ప్రశమగుణ దర్శీ." శాంతి శమదమాది గుణ ములు కలిగి యుండవలయు.

54. "రాగద్వేష హేతూనాం హన్తా." ఇచ్ఛాద్వేష ములను కలుగజేయు కారణములను విడచివేయ వలయును.

55. "నానృతం బ్రూయాత్." అబద్ధము చెప్పరాదు.

56. "నాన్యస్వ మాదదీత." ఇతరుల ద్రవ్యమును అప హరింపరాదు.

57. "నాన్యస్త్రియ మభిలషేత్." పరస్త్రీలను కోరరాదు.

58. "నాన్యశ్రియం." ఇతరుల సంపద కోరతగదు.

59. "న వైరం రోచయేత్." ఇతరులతో ద్వేషము నభిలషించరాదు.

60. "న కుర్యా త్పాపం." చెడుపనులు చేయ రాదు.

61. "న పాపేఽపి పాపీ స్యాత్." అపకృతి చేసినవారి యందైనను తిరిగి అపకారము చేయు తలపుంచ రాదు.

62. "నాన్యదోషాన్ బ్రూయాత్." ఇతరుల తప్పు లను బయలుపెట్టరాదు.

63. "నాన్యరహస్య మాగమయేత్." ఇతరుల రహస్యములను వెల్లడిచేయరాదు.

64. "నాధార్మికై ర్న నరేంద్రద్విష్టై స్సహాసీత." దుష్టప్రవర్తన గలవారితోను, రాజద్రోహులతోను కలసి యుండరాదు.

65. "నోన్మత్తైః న పతితైః న భ్రూణహన్తృభిః నక్షుద్రైః నదుష్టైః." పిచ్చివారు, కులభ్రష్టులు, గర్భపాతకులు, నీచులు, చెడ్డవర్తనగలవారలతో కూడియుండరాదు.

66. "న దుష్టయానా న్యారోహేత్." బోగరుపట్టిన వాహనములపై ఎక్కరాదు.

67. "నజానుసమం కఠిన మాసన మధ్యాసీత." మోకాటియెత్తు కలిగి కఠినముగా నున్నట్టి ఆసనములపై కూర్చుండరాదు.

68. "నా నా స్తీర్ణ మనుపహిత మవిశాల మసమం వా శయనం సంపద్యేత." పరిశుభ్రమైన బట్టలు పరువక, దిండ్లుపెట్టక, వెడలుపులేక, మెత్తదనములేకయున్నట్టి మంచముపై పడుకొనరాదు.

69. "న గిరి విషమ మస్తకే ష్వనుచరేత్." పర్వత శిఖరములందును, ఎగుడుదిగుడులుగా నుండు గట్లు మొదలగుచోట్ల సంచరింపరాదు.

70. "న ద్రుమ మారోహేత్," చెట్లపై నెక్కరాదు.

71. "న జలోగ్రవేగ మవగాహేత్." ఎక్కువ వేగముగా ప్రవహించు జలములయందు స్నానము చేయరాదు.

72. "న కులచ్ఛాయా ముపాసీత." ఇతరుల మైనీడలో నిలువరాదు.

73. "నాగ్న్యుత్పాత మభితశ్చరేత్." చెలరేగి మండుచున్న అగ్నికి దగ్గరగా పోరాదు.

74. "నోచ్చైర్హసేత్." అట్టహాసము (బిగ్గర) గా నవ్వరాదు.

75. "న శబ్దవంతం మారుతం ముంచేత్."చప్పుడగునట్లు (అపాన) వాయువును విడువరాదు.

76. "నానావృతముఖో జృమ్భాం క్షవధుం హాస్యం వా ప్రవర్తయేత్." నోరు తెరచుకొని ఆవులించుట, తుమ్ముట నవ్వుట పనికిరాదు.

77. "ననాసికాం కుష్ణీయాత్." శబ్దమగునట్లు ముక్కు నెగ పీల్చరాదు.

78. "న దంతాన్ విఘట్టయేత్." పండ్లు కొరకరాదు.

79. "న నఖాన్ వాదయేత్." గోళ్ళతో గోళ్ళను వాయించరాదు.

80. "నాస్థీ న్యభిహన్యాత్." ఎముకలతో ఎముకలను కొట్టరాదు.

81. "న భూమిం విలిఖేత్." చేతులతో భూమిని రాయరాదు.

82. "న ఛింద్యా త్తృణం." గోళ్ళతో గడ్డిని త్రుంపరాదు.

83. "నలోష్టం మృద్నీయాత్." చేతులతో మన్ను నలుపరాదు.

84. "న విగుణ మఙ్గై శ్చేష్టేత." కాళ్ళు చేతుల నడుము మున్నగు అవయవములతో వికృతచేష్టలు చేయరాదు.

85. "జ్యోతీం ష్యనిష్ట మమేధ్య మశస్తంచ నాభివీక్షేత." వెలుగుగల వస్తువులను, ఇష్టములేని వానిని అసహ్యములు పనికిరానివి యగు ద్రవ్యములను చూడరాదు. (మలమూత్రములను, శవమును చూడరాదని భావము.)

86. "న హుంకుర్యా చ్ఛవం."శవమును జూచి హుంకరింపరాదు.

87. "నచైత్య ధ్వజ గురు పూజ్యాశస్త ఛాయ మాక్రమేత్." దేవాలయము, ధ్వజస్తంభము, గురువుల పూజ్యులు మున్నగువారి నీడలయందును, కుష్ఠాది దీర్ఘరోగుల నీడలయందును నిలువరాదు.

88. "న క్షపాను అమరసదన చైత్య చత్వర చతుష్పథోపవన శ్మశా నాఘాతనా న్యాసేవేత."దేవాలయములు, యజ్ఞశాలలు, ముంగిళ్ళు, నాలుగు త్రోవలు కలిసిన చోటులు, నగరబాహ్యోద్యానములు, శ్మశానములు వధ్యస్థానములు మొదలగు చోటులందు రాత్రు వసించరాదు.

89. "నైక శ్శూన్యగృహం న చాటవీ మనుప్రవిశేత్ పాడువడిన యిండ్లయందును, అడవియందును ఒంటరి ప్రవేశింపరాదు.

90. "న పాపవృత్తాన్ స్త్రీ మిత్ర భృత్యాన్ భజేత చెడు నడవడికగల స్త్రీలను, మిత్రులను, భృత్యుల ఆదరింపరాదు.

91. "నోత్తమై ర్విరుధ్యేత." యోగ్యులగు వారి విరోధము పెట్టుకొనరాదు.

92. "నావరా నుపాసీత." హీనులగు వారి స్నేహము చేయరాదు.

93. "న జిహ్మం రోచయేత్."కపటవర్తనుల సహింపరాదు.

94. నానార్య మాశ్రయేత్." దుష్టుల నాశ్రయి రాదు.

95. "న భయ ముత్పాదయేత్." వట్టి అల్లరులను బుట్టించి జనులను భయపెట్టరాదు,

96. "న సాహ సాతిస్వప్న ప్రజాగర స్నాన పానా శనా న్యాసేవేత." తన శక్తికి మించిన పనిని చేయ బూనుట, అధికముగా నిద్రించుట, మేల్కొనుట, స్నానము చేయుట, నీళ్ళు త్రాగుట, భుజించుట యనునవి చేయ రాదు.

97. "నోర్ధ్వబాహు శ్చిరం తిష్ఠేత్" ఎక్కువకాలము గొంతు కూర్చుండరాదు. (మునిగాళ్ళపై కూర్చుండ రాదనుట.)

98. "న వ్యాళా నుపసర్పేత్."
99. "న దంష్ట్రిణః."
100. "నవిషాణినః."
పాములను, కోరలుగల క్రూరజంతువులను, నిడివియు వాడియునైన కొమ్ములుగల జంతువులదరి జేరరాదు.

101. "పురోవాతాత పావశ్యాయాతిప్రవాతాన్ జహ్యాత్." ఎదురు గాలిలోను, ఎదురెండయందును, మంచి మంచునంమను, పెద్దదగు ఎదురుగాలియందును పోరాదు.

102. "కలిం నారభేత." అనవసరముగా ఇతరులతో తగవులాడరాదు.

103. "నాసునిభృతోగ్ని ముపాసీత."
104. "నోచ్ఛిష్టో నాధఃకృత్వా ప్రతాపయేత్."
అజాగ్రత్తగా అగ్ని నారాధింపరాదు. అగ్నిని నోటితో నూది రగుల్కొల్పరాదు. స్థండిలము లేక వట్టిచోట అగ్నిని ప్రజ్వలింప చేయరాదు.

105. "నావిగతక్లమః నానాప్లుతవదనః ననగ్న ఉపస్పృశేత్." బడలికచెందియు, ముఖము కడుగుకొనకయు, దిగంబరుడయ్యును స్నానము చేయరాదు.

106. "న స్నానశాట్యా స్పృశే దుత్తమాంగమ్" స్నానముచేసిన బట్టతో తల తుడుచుకోరాదు.

107. "న కేశాగ్రా ణ్యభిహన్యాత్" తలవెంద్రుకలను జాడింపరాదు.

108. "నోపస్పృశ్య తవేవ వాససీ బిభృయాత్" కట్టి విడచిన బట్టలను తిరిగి కట్టరాదు,

109. "నాస్పృష్ట్వా రత్నాజ్య పూజ్యమంగళ సుమనోభినిష్క్రామేత్" ఇంటినుండి బయలుదేరునపుడు రత్నములు, నేయి, గోవు, పూజ్యములు, మంగళకరములు నగు ఇతర ద్రవ్యములు, పువ్వులు ఎదురైనచో వానిని చేతులతో తాకి వెళ్ళవలయును.

110. "నపూజ్య మంగళా న్యపసవ్యం గచ్ఛేత్" పూజ్యములగు గోవులు మంగళకరములగు ఇతర ద్రవ్యములు ఎదురైనపుడు వాటికి ప్రదక్షిణముగా వెళ్ళ వలయును. (గౌరవనీయులగు వారికందరికి ప్రదక్షిణీకృతముగా ఎడమవైపుగా వెళ్లవలయును.)

111. "నేతరా ణ్యనుదక్షిణం" అమంగళములగు ద్రవ్యములు, శవము, మున్నగునవి ఎదురైనపుడు వాటికి అప్రదక్షిణముగా వెళ్లవలెను. (కుడిభాగమున వెళ్లవలయును.)

112. (1) "నారత్నపాణిః" చేత రత్నాంగుళీయకములను ధరింపకయు.

(2) "నాస్నాతః" స్నానము చేయకయు,

(3) "నోపహతవాసాః" ఉతికిన బట్టలు కట్టుకొనకయు

(4) "నాజపిత్వా" సంధ్యాది ఉపాసన చేయకయు

(5) నాహుత్వా దేవతాభ్యః" దేవతలకు ఆహుతులు వేయకయు

(6) "నానిరూప్య పితృభ్యః" మాతా పితరులకు పెట్టకయు

(7) "నాదత్వా గురుభ్యః" పూజ్యులను ముందు భుజింప చేయకయు

(8) "నాతిథిభ్యః" అతిథుల కిడకయు

(9) "నోపాశ్రితేభ్యః" అనుసరించుకొనియున్న వారిని భుజింపజేయకయు

(10) "నాపుణ్యగన్ధః" సుగంధ ద్రవ్యముల వలందుకొనకయు

(11) "నామాలీ" పుష్పధారణ చేయకయు

(12) "నాప్రక్షాళిత పాణిపాద వదనః" చేతులు, కాళ్ళు, ముఖము కడుగుకొనకయు

(13) "నాశుద్ధముఖః" చక్కగా పుక్కిలించి యుమియకయు

(14) "నోదఙ్ముఖః" ఉత్తరాభిముఖముగా కూర్చుండియు

(15) "నవిమనాః" మనస్థిమితము లేకయుండియు

(16) "నాశక్తా శిష్టా శుచి క్షుధిత పరిచరః" అయి ష్టులు, అయోగ్యులు, శుచిత్వము లేనివారు, ఆకలిగొన్నవారు ఎదుట నున్నపుడును

(17) "నాపాత్రే ష్వమేధ్యాసు" అపరిశుభ్రములైన పాత్రలయందును

(18) "నాకాలే." సమయము కాని సమయమందును

(19) "నాదేశే." ఉచితముగాని స్థలమునందును

(20) "నాకీర్ణే" పదుగురున్నచోట

(21) "నాదత్వాగ్ర మగ్న యే." వైశ్య దేవాదికము లాచరించకయు

(22) "నాప్రోక్షితం ప్రోక్షణోదకైః." మంత్రోదక ముచే పవిత్రము చేయకయు

(23) "మంత్రైరనభిమంత్రితం." ఆపోశనము చేయ కయు

(24) "నకుత్సయన్." కోపముతోను (తిరస్కరింప కయు)

(25) "నకుత్సితం." చెడిపోయినట్టియు (నింద్యమై నట్టియు)

(26) "నప్రతికూలోపహిత మన్న మాదదీత" అను కూలముగ లేనివారివలన అమర్చబడి నట్టియు, అన్నమును భుజింపరాదు.

113. "నపర్యుషిత మన్యత్ర మాంసహరిత శుష్క శాకఫల భక్ష్యేభ్యః" మాంసము, పచ్చికూరలు (అల్లము, నిమ్మకాయ, కంద, ముల్లంగి మొదలగునవి హరితశాక ములని వాడబడును.) వరుగుచేయబడిన కూరలు, పండ్లు, అతిరసాలు మున్నగు ఘృతతైల పక్వములగు భక్ష్యములు తప్ప నిలవయున్న పదార్థములను తినరాదు.

114. "నాశేషభుక్స్యా దన్యత్ర దధి మధు లవణ సక్తు సలిల సర్పిర్భ్యః" భుజించునపుడు పెరుగు, తేనె, ఉప్పు, సత్తుపిండి, నీళ్ళు, నెయ్యి- అను వీటిని మిగుల్చ రాదు.

115. "న నక్తం దధి భుంజీత." రాత్రియందు పెరుగు తినరాదు.

116. (1) "న సక్తూ నేకా నశ్నీయాత్." ఒక సత్తు పిండిని మాత్రమే కడుపునిండ భుజింపరాదు.

(2) "న నిశి" రాత్రియందుగాని,

(3) "న భుక్త్వా" భుజించిన పిమ్మటగాని,

(4) "న బహూర్." అనేకసార్లధికముగా గాని,

(5) "నద్విరోన్నిదకాన్తరితాన్." భోజన కాలములందు గాని మధ్యమధ్య నీళ్లు త్రాగుచుగాని, సత్తుపిండిని తినరాదు.

117. "నచ్ఛిత్త్వా ద్విజై ర్భక్షయేత్." సరిగా పండ్లతో నమలకయే భక్షింపరాదు.

118. (1) "నాన్నృజుః క్షుయాత్." తుమ్మునపుడు

(2) "నాధ్యాత్" భుజించునపుడు,

(3) "నాశయీత." పడుకొనిన యప్పుడు శరీర మును వంకరటింకరగా మెలికలు తిప్పి యుంచక నిటారుగా నుండవలయును.

119. "న వేగితోన్యకార్యస్స్యాత్." మలమూత్రము లను బిగపట్టుకొని యితరపనులు చేయరాదు. (ఇచట వేగములు 13 కలవు; అవి యివి :

(1) అపానవాతము (2) మలము (3) మూత్రము
(4) తుమ్ము (5) ఆకలి (6) దప్పి (7) నిద్ర
(8) దగ్గు (9) బడలికవలనకలిగిన ఆయాసము
(10) ఆవలింత (11) కన్నీరు (12) వమనము
(13) శుక్రము ఇవి ఎవ్వియు నిరోధింపరాదు అని ఆయుర్వేదము.

120. 'నవాయ్వగ్ని సలిల సోమార్క ద్విజగురు ప్రతిముఖం నిష్ఠీవికావాతవర్చో మూత్రాణ్యుత్సృజేత్" ఎదురుగాలిలో, అగ్నిసమీపమున, ఉదకసమీపమున, సూర్యచంద్రులయొక్కయు, బ్రాహ్మణులు, గురువులు మొదలగు పెద్దలయొక్కయు ఎదుటను ఉమియుట, అపానవాయువు విడచుట, మలమూత్రములను చేయుట తగదు.

121. "న పన్థాన మవమూత్రయేత్" నలువుర నడచుత్రోవయందు మూత్రము చేయరాదు.

122. (1) "నజనవతి" (2) "నాన్నకాలే"

(3) "న జపహోమాధ్యయన బలి మంగళ క్రియాసు శ్లేష్మ సింఘాణకం ముంచేత్." పద గురుగల చోటను, భోజనముచేయు సమయమ నందును, జపము హోమము అధ్యయనమ చేయు సమయములందును, స్థలములందును

బలినొసగుచోటను, శుభకార్యములు జరుగుచున్నపుడును, ఉమియుట, చీదుట తగదు.

123. (1) "న స్త్రియ మవజానీత." అతివను అవమానింపరాదు.

(2) "నాతివిస్రంభయేత్." అతి చనువుచూపరాదు.

(3) "న గుహ్య మనుశ్రావయేత్." దాచతగిన రహస్యములు స్త్రీలకు వినిపించరాదు.

(4) "నాధికుర్యాత్." ఆమెకు సర్వాధికారము ఒసంగరాదు.

(5) "న రజస్వలాం" రజస్వలయైనట్టియు

(6) "నాతురాం" వ్యాధిబాధితురాలగునట్టియు

(7) "నా మేధ్యాం" అపరిశుభ్రతగలిగినట్టియు

(8) "నాశస్తాం" యోగ్యురాలు కానట్టియు

(9) "నానిష్టరూపాచారోపచారాం" అనాకారియు సహింపరాని నడవడిగలట్టిదియు, ఇష్టములేని పరిచర్యచేయునట్టిదియు అను ఈ లక్షణములు గలిగినట్టియు,

(10) "నాదక్షాం." తన శక్తిసామర్థ్యములకు తగనట్టియు,

(11) "నాదక్షిణాం" తన కనుకూలవతి కానట్టియు

(12) "నా కామాం" తనయందు ప్రీతిలేనట్టియు

(13) "నాన్యకామాం" ఇతరుని ప్రేమించినట్టియు

(14) "నాన్యస్త్రియం" ఇతరుని వశమునందున్నట్టియు

(15) "నాన్యయోనిం" తన జాతికి భిన్నమగుజాతి కలిగినట్టియు స్త్రీని

(16) "నా యోనౌ" యోనిగాని ప్రదేశమందును

(17) "నచైత్య చత్వర చతుష్పథోపవన శ్మశానాఘాత సలిలౌషధి ద్విజ గురు సురాలయేషు." ధర్మశాలలు, రచ్చపట్టులు, పురోపవనములు, శ్మశానము, వధ్యస్థానము, నీళ్ళగది, ఓషధులు భద్రపరచిన ప్రదేశము, బ్రాహ్మణగురు గృహములు, దేవాలయము, అను నిట్టిస్థలములందును

(18) "న సంధ్యయోః." (19) "నాతిథిషు." సంధ్యా సమయమందును, నిషిద్ధములగు తిథులయందును (సురతమునకు నిషేధించిన తిథులని భావము.)

(20) "నాశుచిః." తాను శుభ్రముగా నుండకయు

(21) "నాజగ్ధ భేషజః." బలకరములగు ఔషధములను సేవింపకయు

(22) "నాప్రణీతసంకల్పః." మనసునం దిచ్ఛలేకయు

(23) "నా నుపస్థిత ప్రహర్షః." సంతోషము లేకయు

(24) "నాభుక్తవాన్" భుజింపకయు

(25) "నాత్యాశితః" అతిగ భుజించియు

(26) "న విషమస్థః." వ్యత్యస్తముగ నుండియు

(27) "న మూత్రోచ్చార పీడితః." మూత్రము నిరోధించియు

(28) "న శ్రమ వ్యాయా మోపవాసక్లమాభిహతః." శ్రమచెందియు, సాముచేత, ఉపవాసముచేత బడలిక చెందియు

(29) "నారహసి వ్యవాయం గచ్ఛేత్." చాటు లేని తావులందును స్త్రీ సంభోగము చేయరాదు.

ఇట్లు మంచి నడవడికను (సద్వృత్తమును) గురించి చెప్పబడిన ప్రధాన ధర్మసూత్రములందు నూట యిరువది మూడు ధర్మములు మాత్రమే యిచట చూపబడినవి. ఈ సూత్రములలో సూ. 112 నందు 25, సూ. 116 నందు 4, సూ. 118 యందు 2, సూ. 122 నందు 2, సూ. 123 నందు 28, ప్రధాన ధర్మ గర్భితములగు మరికొన్ని విశేషధర్మములు వివరింపబడినవి. ఇందు 112వ ధర్మమున మంచి నడవడి కలవాడు భుజింప తగని అన్నవిశేషములును, 116 నందు వరి, జొన్న, మొక్కజొన్న మొదలగువాటి పేలాలపిండిని ఉపయోగింపవలసిన విధులు, 118 యందు శరీరమును వంకర టింకరగా నుంచి చేయతగని పనులు, 122 నందు ఉమియుటకు, చీదుటకు తగని ప్రదేశములు, 123 నందు అతివలయెడ వర్తింపవలసిన విధినిషేధములు చెప్పబడినవి. ఇట్లు సూత్రగర్భితములైన ధర్మములు 61 కలవు; ఇవియు మూలధర్మములును కలసి 184 అయినవి. ఇవిగాక యీ సద్వర్తనమున తెలియదగిన ధర్మము లింకను 147 కలవు. ఇవన్నియు చేరిన మొత్తము సద్వర్తనమునందు మూడువందల ముప్పదియొకటిగా ధర్మములు నిరూపించబడినవి.

ఇవి యిట్లుంచి యింకను తెలియచేయ వలసిన ధర్మ ములసంఖ్య 1180 మిగిలి యున్నవి. అవి యివ్వి :

1. స్వస్థవృత్తమునందు (ఆరోగ్యవంతుడు నిత్య జీవనమునందు) రాత్రిందివములయం దనుస రించవలసిన ధర్మములు — 40
2. షడృతువులందును అనుసరించవలసిన విశేష ధర్మములు. — 24
3. వేగధారణము, త్రివర్గసాధనము, మున్నుగా దృఢసత్వ సంపన్నమగు శరీరముతో దీర్ఘ జీవితమును సుఖమయముగా గడపి, వేదోదిత మగు మనుష్యానందమును సంపూర్ణముగ ననుభవింపగల సమర్థతను ఇహఫల సాధన ముగా బోధించు ధర్మములు — 950
4. స్వర్గసుఖ సాధన ధర్మములు — 84
5. అపవర్గానుభూతి హేతువులగు ధర్మములు — 56
6. శాశ్వత అజరామరానంద సందోహ దివ్య తనుత్వ సంసాధక ధర్మములు — 76

| | |
|---|---|
| మొత్తము | 1180 |
| పూర్వోక్తములు | 331 |
| | 1511 |

ఇట్లు పదునైదువందల పదునొకండు ఆయుర్వేద ధర్మ ములు కలవు. ఇవన్నియు చరకము ప్రమాణముగా గలవి. ఈ ధర్మములను చరక సంహిత యందలి సూత్ర విమాన, శారీర, ఇంద్రియ స్థానములందును, చికిత్సా స్థానమునగల మొదటి యధ్యాయమునందును చూడ నగును. చరక సంహితయందులేని ఆరోగ్య ధర్మములు మరెచ్చటను లేవు. పురాణములు మొదలగు ఇతరము లందు గల ఆయుర్ధర్మములు ఈ సూత్రముల ననుస రించియే సమకూర్పబడినవి.

"చికిత్సా వహ్నివేశస్య స్వస్థాతురహితం ప్రతి."
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్."
(చ. స. 10. 93)

స్వస్థ, ఆతుర, హితముగోరి అగ్నివేశునిచే రచింప బడిన ఈ సంహితయందు ఏది చెప్పబడినదో అది అన్నిం టను చెప్పబడి యుండును. ఇందు చెప్పబడని విషయము మరియెచ్చటను లభింపదు, అని యిట్లు ప్రతిజ్ఞచేసి శ్రీ అగ్ని వేశుడీ చరక సంహితను ముగించెను. అగ్నివేశునిచే సమకూర్పబడిన యీ సంహితయే, చరక సంస్కృతమై చరకసంహిత యనబడుచున్నది. చరకసంహిత యన ఆయుర్వేద ధర్మ సర్వస్వము.

సాహిత్య సమాలోచనమునకును, విశేష విజ్ఞాన సముపార్జనమునకును, ప్రజ్ఞాన్వితులగు జిజ్ఞాసువులు సావ ధానులై ఆమూలాగ్ర మొక పర్యాయము చరకసంహి తను పఠించి ఉభయలోకార్థ ఫలసిద్ధు లగుదురుగాత.

"ఆయుర్వేదోఽమృతానామ్"

వే. తి. వేం. రా. స్వా.

**ఆరణ్యకములు :-** వేదము మంత్రబ్రాహ్మణాత్మ కము. ఆ బ్రాహ్మణముల యనుబంధము లారణ్యక ములు. అథర్వబ్రాహ్మణమునకు దప్ప తక్కిన మూడు బ్రాహ్మణములకు నారణ్యకగ్రంథము కనబడుచున్నది. సామబ్రాహ్మణమునకు దాని చివరనున్న శుక్రియ కాండమే ఆరణ్యక మనబడుచున్నది. అట్లే శుక్ల యజు శ్శాఖకు శతపథబ్రాహ్మణ అంతిమకాండమే ఆరణ్యకము. కఠమైత్రాయణీయాది శాఖలకు ఆరణ్యకములేదు కాపీతకారణ్యక మన్న పేరుమాత్ర మున్నదిగాని, ఆ గ్రంథము మృగ్యము. ఇంక తైత్తిరీయారణ్యకము, ఐత రేయారణ్యకము ననెడి రెంటి విషయము. తైత్తిరీయా రణ్యకము తక్కిన అన్నిటి కంటెను ప్రాచీనము. "అరణ్యే ఽధీయారన్" అను నిందలి వాక్యమును బట్టి ఇది అరణ్య ములో అధ్యయనము చేయదగినదని తెలియుచున్నది కాని, ఇందలి - సావిత్ర - నాచికేత - చాతుర్హోత్ర వైశ్వసృజ - భాగములకు ఈ నియమములేదని పూర్వా చార్యుల మతము. ఇందలి పది ప్రపాఠకములలో కడపటి నారాయణోపనిషత్తు. మొదటి తొమ్మిదియు ప్రాచీ ములు. ఈ ఆరణ్యకము యజ్ఞోపయోగిగా కనవచ్చినను జీవేశ్వర తత్త్వబోధకములైన ఉపనిషత్తులును, వివి విజ్ఞానదాయకములైన ఇతర విషయములు నిందు క వనుట నిజము.

ఇందలి మొదటి ప్రపాఠకము 'అరుణకేతుకము' అ బడును. దీనినే, అరుణమందురు. ఆరోగ్యకాములగువా ఇందలి మంత్రములు పఠించుచు సూర్యనమస్కారవ లొనర్చెడి యాచారము నేటికిని భరతఖండమంత

గలదు. ఈ ప్రపాఠకమునందు పురాతనార్య సంస్కృతి గోచరించుననుటకు ఇందలి మేరుగత సూర్యవర్ణనమే ప్రమాణము. ఉత్తరధ్రువ గోచరమగు సూర్యవిషయక విజ్ఞానము ఆర్యపరంపరా ప్రాప్తమై ఇందు తెలియ వచ్చును. ఇందు మేరుగత కశ్యపసూర్యుడు, సప్త సూర్యులు, సూర్య మహత్త్వము, సంవత్సరస్వరూపము మొదలగు బహువిషయములు వర్ణితములు. వసంతాది ఋతువులు అతి మనోహరముగా వర్ణింపబడినవి.

స్వభావసిద్ధమైన ఇందలి ఋతువర్ణనము, సంవత్సర పరివర్తనమును, నాటి సాంఘికజీవనమును ప్రత్యక్షము గావించుచు, తరువాత బయలువెడలిన ఋతువర్ణనలకు మార్గదర్శకమైన దనవచ్చును.

ద్వితీయ ప్రపాఠకము స్వాధ్యాయ బ్రాహ్మణ మన బడును. ఇది మొదలుగా నైదు ప్రపాఠకములు వైదిక కర్మ పరములు. ఆరవది పితృమేధ మనబడును. 7,8,9 ప్రపాఠకములే శిక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లి అనబడెడి ఉపనిషత్తులు. ఈ మూడింటికిని వేదాంతము అను ఖ్యాతి కలదు. ఆత్మైకత్వ విజ్ఞానమునకు ఆధారములైన యీ ఉపనిషత్తులు దేశమంతట నేడును వ్యాప్తికెక్కియున్నవి.

బృహదారణ్యకమునందలి 7-8 అధ్యాయములవలె ఇందలి దశమ ప్రపాఠకము ఖిలమనబడును. కర్మోపాసన బ్రహ్మకాండములలో జెప్పగా మిగిలిన దానిని పూర్తిగా తెల్పెడి ప్రకీర్ణరూపమైన గ్రంథము 'ఖిల' మనబడును. అట్టి ఈ దశమ ప్రపాఠకమైన నారాయణోపనిషత్తు, పూర్వోక్తమైన వల్లీత్రయమువలె శుద్ధముగా బ్రహ్మ ప్రతిపాదకము కాదు. దీనికి యాజ్ఞికీయుపనిషత్తని ప్రసిద్ధి గలదు. అయినా, "నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్" ఇత్యాది మంత్రముల సకల జగదాత్మకుడు వర్ణింపబడుటం బట్టి దీనికి నారాయణోపనిషత్తను పేరు వ్యాప్తమైనది.

ఈదశమప్రపాఠక పాఠ సంప్రదాయము దేశమున బహువిధముగా నున్నది. ద్రావిడ పాఠమున ఇందలి అనువాకములు 64. కర్ణాటక పాఠమున 74. మరికొన్ని చోట్ల 80 అనువాకములు. సాయణాచార్యులు 64 అనువాకముల పాఠమే భాష్యమున గ్రహించిరి. ఈ పాఠ భేదమే దీని అర్వాచీనతను బలపరచుచున్నది.

ఐతరేయ బ్రాహ్మణమునకు అనుబంధమైన ఏకారణ్యకాండమం దైదు భాగములు కలవు. అందు ప్రథమ ద్వితీయారణ్యక భాగములందు ఐదేసి అధ్యాయములును, తృతీయమున రెండును, చతుర్థమున నొకటియు, పంచమమున మూడును, అధ్యాయములు గలవు.

ఇందు ప్రథమారణ్యకభాగమునందు సత్రయాగము, మహావ్రతము మొదలయినవి వర్ణితములు. ద్వితీయ తృతీయారణ్యక భాగములు జ్ఞానబోధకములు. వీటికి ఐతరేయోపనిషత్తని పేరు. నాల్గవదానిలో మహానామ్నీ మంత్రములు చెప్పబడినవి. అయిదవదానిలో మహావ్రత ప్రయోగము వివరింపబడినది. అందుచే నిది యర్వాచీన కాండమని తెలియుచున్నది. ఈ యభిప్రాయము భాష్య కర్తయగు సాయణాచార్యులు తెలిపినట్టు "పంచమారణ్యక మృషిప్రోక్తం సూత్రమ్, ప్రథమారణ్యకం త్వపౌరుషేయం బ్రాహ్మణమ్" అను భావమువల్ల ధ్రువ పడుచున్నది.

ప్రతివేదమునకును దానికి సంబంధించిన బ్రాహ్మణ మందో, ఆరణ్యకమునందో కొంచెముగానో, గొప్పగానో, ఉపనిషద్భాగముగూడా చేరియున్నమాట సత్యము. అట్లు చేరిన ఉపనిషద్భాగములు కర్మప్రతిపాదకములు గాకపోయినా, కర్మము జ్ఞానార్థమే కావున కర్మనిష్ఠులగు వారికి, జ్ఞానమార్గము ఉపదేశించుట ఆవశ్యకమను తలంపుతో తాత్కాలిక ఋషులు వానియందు చేర్చి యుందురు. అది సముచితమే కదా !

 మ. సూ. నా. శా.

**ఆర్కిమెడీసు ( క్రీ.పూ. 287-212 ) :-** క్రీస్తుకు పూర్వము మూడవశతాబ్దియందు సిసిలీదేశమునకు రాజధానియగు సైరకూసు అను నగరమును హైరో అను రాజు పరిపాలించుచుండెను. ఆర్కిమెడీసు హైరో అను రాజునకు సమకాలికుడు. అతడు ఉత్తమమైన కుటుంబములో జన్మించెను, ఆతని తండ్రియగు ఫీడిస్ (Pheidis) ఖగోళశాస్త్రజ్ఞుడు. అతడు హైరోరాజుతో ఎక్కువ పరిచయమును గలిగియుండెను.

అలెగ్జాండ్రియా నగరమున యుక్లిడు (Euclid) అను గణితశాస్త్రోపాధ్యాయుడు ఉండెను. ఆతనిదగ్గర ఆర్కిమెడీసు విద్యాభ్యాసము చేయుకాలమున ఈజిప్టుదేశ

మందు నీటిపారుదలకు గల అవశ్యకతను గుర్తించెను.



ఇదియే ఆర్కిమెడియన్ సర్పిలయంత్రము (Archemedian Screw) ను కనిపెట్టుటకు కారణమయ్యెను.



హైరోరాజుకొరకు తయారు చేయబడిన పెద్ద నౌక నుండి నీరు తొలగించుటకుగాను ఇతడు నీరు పైకెత్తునట్టి ఈ పరికరమును కనుగొనెనని మరియొక ప్రతీతి కలదు. ఆర్కిమెడియన్ సర్పిలయంత్రము మిక్కిలి స్థూల రూపములో ఒక లోహముతో చేయబడిన గొట్టము అది ఒక గట్టి స్తూపము చుట్టు సర్పిల ఆకారములో వంచబడి ఉండును. కడ్డీ స్తూపాకారపు చివరలయందు మొత్తము పరికరమును దాని ఇరుసుచుట్టును త్రిప్పుటకు వీలుగా భ్రమణ కీలకములు అమర్చబడియుండును. మెలికలు తిరిగిన గొట్టపు క్రింది చివర పైకెత్తబడవలసిన నీటిలో నుంచి స్తూపాకారముగల గొట్టమును దిఙ్మండలమునకు (Horizon) ఏటవాలుగా నుంచి, ఆ పరికరమును త్రిప్పినయెడల, క్రమముగా నీరు ఒక సర్పిలము (Spiral) నుండి మరియొక సర్పిలములోనికి ఎక్కును. ఇదే సూత్రము నేడు గోధుమలు మున్నగు ధాన్యముల విషయములో వాటిని పైకి చేరవేయు యంత్రములలో ఉపయోగించ బడుచున్నది.

ఆర్కిమెడీసుచే కనుగొనబడిన అనేక యంత్రములలో ఆర్కిమెడియన్ సర్పిలయంత్రము ఒకటియై యున్నది. అతడు తులాదండము (Lever) యొక్క సూత్రమును కనుగొనెను. కప్పీలను (Pulleys), తులాదండములను ఉపయోగించి రోమన్ దండయాత్రికులకు భయమును కలిగించునట్లు అతిభారముతో నుండు పెద్దపెద్ద నౌకలను గూడ పైకెత్తగలిగెనని చెప్పబడుచున్నది. "ఒక తులాదండమును దానిని నిలువబెట్టుటకు కొంత స్థలమును ఇచ్చినచో, నేను యావత్ప్రపంచమును కదిలింతును." అని ఆర్కిమెడీసు చేసిన సుప్రసిద్ధమగు ప్రతిజ్ఞవలన ఈ సూత్రమునుగూర్చి అతనికిగల స్పష్టజ్ఞానము తేటపడు చున్నది. గెలిలియో కాలమువరకు తిరిగి ఇతని సిద్ధాంతములను అందుకొనగల ప్రయోగ శాస్త్రవేత్త వేరొకడు జన్మించలేదు.

ఆర్కిమెడీసు తన పేరుతో వ్యవహరింపబడు ఈ దిగువ సూత్రముతో మిక్కిలి ప్రఖ్యాతిగాంచెను :

"ఒక పదార్థము ద్రవములో మునిగినపుడు అది నష్టపోవుభారము దానిచేత తొలగింపబడిన ద్రవభారమునకు సమానము." ఆర్కిమెడీస్ కనుగొనినసూత్రములలో నిది మిక్కిలి ప్రసిద్ధమగు సూత్రము. ఈ సూత్రమును కనుగొనుటకు ఏర్పడిన పరిస్థితులు వివరించు ఒక చక్కని గాథ కలదు. హిరోరాజు తన కొరకు ఒక కంసాలి చేసి యిచ్చిన బంగారు కిరీటముయొక్క పారిశుద్ధ్యమును నిర్ణయించవలసినదిగ విజ్ఞాన సమస్యలయందు ఆసక్తుడగు ఆర్కిమెడీసును ఆజ్ఞాపించెను. ఆర్కిమెడీస ఆ శాస్త్రీయ సమస్యయందు నిమగ్నుడై యుండెను ఇట్లుండ ఒక వేసవిలో ఒకనాటి సాయంకాలమున ఆర్కిమెడీసు పౌర స్నానాలయమునందు స్నానము చేయచుండెను. అట్టి సమయమున అతనికి ఆ సమస్యాపరిష్కారము స్ఫురించెను. తత్క్షణమే అతడు నగరవీధులగుండ వివస్త్రుడై 'యురేకా', 'యురేకా' (నేను కనుగొంటిని నేను కనుగొంటిని) అని అరచుచు పరుగెత్తెను. అప్పుడతనికి స్ఫురించిన ఆ సమస్యాపరిష్కారము పైసూత్రమునను సరించి ఇట్లుండి యుండవచ్చును. ఆ కిరీటముతో

సమానమగు భారముకల స్వచ్ఛమగు బంగారము నీటిలో ముంచబడినపుడెంతభారమును నష్టపోవునో కిరీటము కూడ నీటిలో ముంచబడినపుడు అంతేభారమును నష్ట పోవలెను. అపుడే ఆ కిరీటములోని బంగారము పరిశుద్ధ మగునదిగా గ్రహింపబడును. కాని అవి నష్టపోవు భారము లలో ఎట్టి వ్యత్యాసమున్నను అది కల్మషమగు బంగారముగా గ్రహింపబడును.

గరిమనాభి, (Centre of Gravity) తులాదండము, (Levers), ఉత్ప్లవనము (Buoyancy), అను మూడు విషయములలో నితడొనర్చిన పరిశోధనలు విజ్ఞానశాస్త్రాభి వృద్ధికెంతయు తోడ్పడినవి. రేఖాగణిత శాస్త్రమునందు కూడ వివిధవిషయములను గూర్చి అతడు వివరించెను. అతడు ఈ క్రింది విషయములపై గ్రంథములు వ్రాసెను.

1. 'గోళము, స్థూపము'—ఇందు గోళములు, శంఖులు, ఘన సమచతుర్భుజములు, స్థూపములు - అను వాటియొక్క కొలతలు శుద్ధరేఖాగణిత విధానము ననుసరించి చూపబడినవి. ఈ గ్రంథము రెండు భాగము లుగా నున్నది.

2. వృత్తముయొక్క కొలత.

3. ఘనశంఖులు; ఘనగోళములు ఇందు 32 ఆకాంక్షా సిద్ధాంతములు ప్రతిపాదింపబడినవి.

4. సర్పిలములు; ఇందు 28 ప్రతిపాదనలు కలవు.

5. సమతలములయొక్క గరిమనాభిత్వము. ఇది రెండు భాగములుగా నున్నది. లోగడ అరిస్టాటిలుచే వివరింపబడిన విషయములు సాపేక్షముగా అనుమానా స్పదములుగాను అశాస్త్రీయములుగాను ఉండెను. అందుచే అర్కిమెడీసు ఇందు వివరించిన విషయములు సిద్ధాంత పూర్వకములై యాంత్రిక శాస్త్రమునకు పునాదులుగా భావింపబడుచున్నవి. ఈ గ్రంథమునందలి మొదటి భాగములో పదునేను ప్రతిపాదనలును, ఏడు సిద్ధాంతములును (Postulates) కలవు. రెండవ భాగ మందు పది ప్రతిపాదనలు కలవు. (1) రెండు భారములు, (2) సమానాంతర చతుర్భుజము, (3) త్రిభుజము, (4) సమలంబ చతుర్భుజము, అను వాటియొక్క గరిమ నాభినిగూర్చి నేడు వాడుకలోనున్న నిరూపణలతో ఇతని నిరూపణలు సమానముగా నున్నవి.

6. పరవలయ (Parabola) వైశాల్యము. ఇందు ఇరువదినాల్గు ప్రతిపాదనములు కలవు. "పరవలయము యొక్క ఖండవైశాల్యము, ఆ ఖండమునకు సమానమైన కొలతలతో కూడిన ఆధారము, లంబముగల త్రిభుజము యొక్క వైశాల్యములో ⁴⁄₃ వంతు ఉండును" అనుటకు రెండు నిరూపణములు ఇయ్యబడినవి.

7. తేలెడివస్తువులు; ఇది రెండు సంపుటముల గ్రంథము.

8. సామ్మైటిను (Psamnites) ఇసుకను లెక్కించు సాధనము (Sand reckoner). ఇది సంఖ్యా పరిభాషలతో కూడిన గ్రంథము.

9. విధానము (Method) : ఇది 1906 లో కనుగొన బడినది. ఇది ఒక ముఖ్యమైన గ్రంథము. ఇందు ఆర్కి మెడీసు యాంత్రిక పద్ధతులను వివరించెను. వీటిచే అతడు అనేక నిర్ణయములు చేయగలిగెను.

10. సమతల రేఖాగణిత శాస్త్రమునందలి ప్రతి పాదనములు.

ఆర్కిమెడీసు పైన పేర్కొనబడిన విషయములేకాక త్రాసు, కప్పీలు, ఖగోళశాస్త్రము, కాంతియొక్క వక్రీ భవనము మొదలగు విషయములలో కూడ కృషి సల్పినట్లు తెలియుచున్నది.

పూర్వకాలపు యాంత్రిక నాగరకతకు ఆర్కిమెడీసు స్థాపకుడై యున్నను, సైరకూసు రక్షణ సంస్థను ఆయత్త పరచుటవలన అతనికీర్తి నల్దిక్కుల వ్యాపించియున్నను అతనికి యాంత్రికసాధనములపై ప్రబలమైన అనాదరము ఉండెడిది. కావున వాటియెడ అతనికి గల ద్వేషము -అతడు వాటిని ఎక్కడను వ్రాసిపెట్టియుండకపోవుటచే- విదితమగుచున్నది. ఇట్టి యాంత్రికపరిశోధనలు కేవల శాస్త్రజ్ఞుని కీర్తిప్రతిష్ఠలకు లోపము నాపాదించు నని అతడు తలంచెను.

రోమను సేనానాయకుడగు మార్సెలసు సైరకూసు నగరమును జయించునాటికి ఆర్కిమెడీసు తన అవసాన దశయందుండెను. విజయమునొందిన రోమనునాయకునకు ఆర్కిమెడీసుపై గాఢాభిమానము ఉండెను. అతడు ఆర్కిమెడీసును తీసికొని రావలసినదిగా ఆజ్ఞాపించెను. మార్సెలసు ఆర్కిమెడీసును ఆదరించుతలపుతోనే అతని పిలిపించెను. కాని మార్సెలసు ఆజ్ఞయందలి సద్భావ

మును గ్రహింపజాలని రోమను సైనికుడొకడు, ఆర్కిమెడీసును కలిసికొని అతనిని తనవెంట రావలసినదిగా ఆజ్ఞాపించెను. కాని మహామహుడగు ఆర్కిమెడీసు శూన్యమనస్కుడై కొంతతడవుండెను. ప్రేపితుడైన సైనికుడు ఆతని శూన్య మనస్కతను అర్థము చేసికొనలేదు. అతడు దానిని ఆజ్ఞా తిరస్కారముగా భావించి వెంటనే అతనిని కత్తితో పొడిచి చంపెను. పిదప ఆర్కిమెడీసుయొక్క దుర్మరణమునకై ఆ రోమను-సేనానాయకుడు మిక్కిలి దుఃఖించెను. సుప్రసిద్ధుడగు ఆ శాస్త్రజ్ఞుని భౌతికదేహము గౌరవపూర్వకముగా పాతిపెట్టబడెను. అతని సమాధిపై ఒక శిల స్థాపింపబడెను. ఆశిలపై నొక చిత్రము వ్రాయబడెను. అందు ఒక స్తూపము, దానిలో నొకగోళము లిఖింపబడెను. ఎందుచేతననగా ఆర్కిమెడీసు గోళముయొక్కయు దానిని ఆవరించియుండు స్తూపముయొక్కయు ఘనపరిమాణములకు గల సంబంధములో తాను కనిపెట్టియున్న విశేషము అన్నివిధముల ముఖ్యమైనదానినిగాభావించెను.

త. స. న

**ఆర్థిక ఖనిజములు*** :- ఉపోద్ఘాతము :- భూమిపై దొరకు ఖనిజసంబంధమైన వస్తువులను మానవు లనాదిగా నుపయోగించుచుండి రను విషయ మెల్లరకు విదితమే. మొట్టమొదట వాడిన వస్తువులలో గొడ్డండ్లు, కత్తులు మొదలగు సామగ్రిని తయారుచేయుట కుపయుక్తమైన చెకుముకిరాయి (flint, chert etc.), స్ఫటికపురాయి, పలుగురాయి, లేక పిండిరాయి (quartz) మొదలైన వాటిని పేర్కొనవచ్చును. బలపపురాయి (steatite) సున్నపురాళ్ళు (lime stones) మొదలైన మెత్తనిరాళ్ళు చిప్పలు, తొట్లు మొదలైనవి చేయుట కుపకరించిరి. తదుపరి పలురకములగు మన్నులతో కుండలు, పెంకులు చేయబడినవి. క్రమక్రమముగా రంగుమన్నులు, బంగారు, రాగి, మొదలగు లోహములు కూడ ఉపయోగింపబడుచు వచ్చినవి.

వివిధదేశపు ప్రజలలో నాగరకత ప్రబలుచు వచ్చిన కొలది అంతకంతకు ఖనిజములు అత్యధికముగా ఉపయోగింపబడుచు వచ్చినవి. ఖనిజముల ఉపయోగము లెక్కువైనకొలది, వాటిని వెదకి, భూమినుండి త్రవ్వితీయుపద్ధతులు గూడ క్రమముగా నభివృద్ధి చెందసాగినవి. ఖనిజములను గురించిన సమస్యలు, వాటి సాధనలు విజ్ఞాన శాస్త్రములలో నొకభాగముగా పరిణమించినవి. ఇదియే ఆర్థిక ఖనిజములకు సంబంధించిన భూగర్భ శాస్త్రము (Economic Geology).

భూగర్భశాస్త్రరీత్యా భూమి పైభాగము సుమారు 40 మైళ్ళ లోతువరకు, రాతిమయమై యున్నది. దీనిలో చాలభాగము లక్షలాది సంవత్సరముల క్రితము శిలాద్రవము (magma) ఘనీభవించుట వలన నేర్పడిన రాళ్ళు (Igneous rocks). ఇవిగాక యిసుక, ఒండుమట్టి మొదలైన పదార్థములు నీటి ప్రవాహములద్వార సముద్రములలోనికి కొట్టుకొనిపోయి అచ్చట చాల కాలము తరువాత గట్టిపడి శిలలుగామారి, యుగాంతములందు వచ్చు భూచలనములలో నీటి పైభాగమునకు వచ్చిన రాళ్ళుగూడ ఉన్నవి (Sedimentary rocks). పై రెండురకముల రాళ్ళు శీతోష్ణ పరిణామములవలనను పీడనము (pressure) చేతను మార్పుచెంది పలురకములగు ఇతరశిలలుగూడ నేర్పడినవి (metamorphic rocks).

ఇట్లు భూమిపై నున్న శిలలన్నిటిని ముఖ్యముగా మూడు రకములుగా విభజింపవచ్చును. ఈ శిలలన్నియు చాలవరకు పలువిధములగు ఖనిజసముదాయములే. ఈ ఖనిజములలో పారిశ్రామికముగ నుపయోగపడునవి చాల తక్కువ. అవిగూడ పలురకములగు శిలలతోగూడి యనేకచోట్ల నున్నను ప్రకృతిలో కొన్నికొన్ని చోట్లనే అవి కేంద్రీకరింపబడి యున్నవి. అట్లు కేంద్రీకరింపబడి లాభదాయకముగా నుపయోగింప బడగలిగినప్పుడే వానిని 'ఆర్థిక ఖనిజము' లనదగును. ప్రస్తుతము తెలిసియున్న సుమారు 1400 ఖనిజములలో 200 మాత్రము ఆర్థిక ఖనిజములుగా పరిగణింపబడుచున్నవి.

**ఆర్థిక ఖనిజములు - వాని విభజన** :- ఆర్థిక ఖనిజములను, ముఖ్యముగా మూడురకములుగా విభజింపవచ్చును (1) ధాతు ఖనిజములు (metallic ores). (2) అలోహ ఖనిజములు (non-metallic minerals). (3) అంగారిక ఖనిజములు (minerals of organic origin). ధాతు ఖని-

* భారతీయ భూతాత్త్విక సమీక్ష డైరెక్టరుగారి అనుమతితో.

ములు సర్వసాధారణముగా వానిలోనుండు పలురకము లగు ధాతువులను వివిధరూపములలో నుపయోగించు నిమిత్తమై భూమినుండి త్రవ్వి తీయబడుచున్నవి. ఇట్టి ఖనిజము లెన్నియో గలవు. ఉదాహరణకు ప్లాటినము (platinum), బంగారము, వెండి, రాగి, ఇనుము, తగరము, తుత్తునాగము (zinc) మొదలగు లోహము లకు సంబంధించిన ఖనిజములను పేర్కొనవచ్చును.

అలోహ ఖనిజములుగూడ ననంఖ్యాకములుగ గలవు. ముఖ్యముగా నిటీవల నుపయోగింప బడుచు వచ్చిన యలోహ ఖనిజముల సంఖ్య పెరుగుచున్నది. వీనిలో కొన్ని ధాతువులుగూడ రాసాయనికరీత్యా సమ్మిశ్రితమై, యున్నను ఈ ఖనిజములు చాలవరకు, ఆయా ధాతువుల కొరకు గాక భూమినుండి త్రవ్వి తీయబడిన రూపము లోనే వాడుటకై సేకరింపబడును. ఇట్టి ఖనిజముల కుదాహరణముగా నీ క్రింది వానిని పేర్కొనవచ్చును :- వజ్రములు (Diamonds), అభ్రకము (Mica), రాతినార (Asbestos), హరశోధము (Gypsum), గంధకము (Sulphur), మెరుగుమట్టి (Graphite), నీలస్ఫసైకిజము (కైనైటు Kyanite), కురువిందము (Corundūm), రాతియుప్పు (Rock salt) మున్నగునవి. ఇట్టి ఖనిజము లలో రసాయన సంఘట్టన కెట్టి ప్రాముఖ్యత లేదన్న విషయమును విశదీకరించుటకై ఉదాహరణముగా మెరుగుమట్టి, వజ్రములను పేర్కొనవచ్చును. ఈ రెండును రాసాయనికముగా కర్బనము (Carbon) తో నేర్పడినవే గాని, వాటి ఉపయోగములలోను, విలువలలోను, భౌతిక గుణములలోను చాల తారతమ్యము గలదు.

కొందరు వైజ్ఞానికుల రాసాయనిక దృష్ట్యా ఖనిజము లనబడకపోయినప్పటికిని, పలురకముల కట్టడపురాళ్ళు (Building stones), తెల్లమన్ను (Clays), ఇసుక (Sand) అంతర్జలము (Ground water) మున్నగునవిగూడ నలోహ ఖనిజములుగా బరిగణించబడుచున్నవి. అంగారిక ఖనిజ ములను గూడ అలోహ ఖనిజములలో నొక భాగముగా భావించవచ్చును గాని, వాని ఉత్పత్తివిధానముల ననుస రించి సాధారణముగ వాటినొక వేరు తరగతికి చెందిన ఖనిజములుగా చర్చించుటకద్దు. నేలబొగ్గు (రాతిసిబొగ్గు) పెట్రోలియము మొదలగునవి ఈ తరగతికి చెందినవి.

**ఆర్థిక ఖనిజములు - వాటి నైజము :-** ఆర్థిక ఖనిజ ములు సాధారణముగా ప్రకృతిలో పరిశుభ్రమైన స్థితిలో దొరకవు. వీనితోపాటు అనేకరకములైన యితర నిరుప యోగ ఖనిజములు కలిసియుండును. వీటిని 'గ్యాంగ్' (Gangue) లేక "అనార్థిక ఖనిజము'లందురు. ఒక యార్థిక ఖనిజనిధిలో చాలచోట్ల నొకే రకమైన యనార్థిక ఖనిజములు కలిసియుండును. సాధారణముగా వీటిలో నున్న ఆర్థిక ఖనిజమును మాత్రము విడదీసి ఉపయో గించుచు మిగతా ఖనిజములన్నింటిని పారవేయు చుందురు. కాని యొక్కొక్కప్పుడు ఈ యనార్థిక ఖనిజములలోగూడ కొన్ని యుపయుక్తమగుచుండును. అప్పుడు వానితో గలిసియుండు ఆర్థిక ఖనిజము తక్కు వగానున్నను, లేక తక్కువ విలువగలదైయున్నను దీనిని లాభదాయకముగనే త్రవ్వి తీసి ఉపయోగింపవచ్చును. ఇట్టి యనార్థిక ఖనిజములకు ఉదాహరణముగ నీక్రింది వానిని పేర్కొనవచ్చును. చూర్ణజము (కాల్సైటు Calcite), సున్నపురాయి (lime stone), సుద్దమన్ను (clays), స్ఫటికపురాయి (quartz), భూస్ఫటికము (ఫెల్స్పారు fellspar), మాక్షికము (పైరైటు pyrites) మొదలైనవి. వీటిలో కొన్ని, రోడ్లు మరి కట్టడములకు కావలసిన కంకరగాను, సున్నపురాయి మొదలగునవి ద్రవకారులుగాను (fluxes) మాక్షికము గంధకోత్పత్తికిని ఉపయోగపడగలవు.

చాలచోట్ల ఆర్థిక ఖనిజములు విరివిగా నుపయోగింప బడు చున్నను, అట్టి ఖనిజములు దొరకు అన్నిచోట్లలోను, అవి అన్ని సమయములందును, లాభదాయకముగా పరిగ ణింపబడక పోవచ్చును. అవి యార్థిక ఖనిజములుగా నుపయోగింపబడగలవా లేదా యను సమస్య ఎన్నియో విషయములపై నాధారపడి యుండును. మొదట, అట్టి ఖనిజములు ప్రకృతిలో తగురీతిని కేంద్రీకరింపబడి యుండ వలెను. వీలయినంత తక్కువ ఖర్చుతో వానిని భూమిలో నుండి త్రవ్వితీసి వానితోగలసి యున్న యితర అనార్థిక ఖనిజములనుండి సునాయాసముగా విడదీసి వాని నుప యోగించు స్థితిలోనికి తెచ్చునట్లుండవలెను. అట్టి ఆర్థిక ఖనిజముల యొక్కగాని, వానినుండి తయారుచేసి వాడ బడు వస్తువుల యొక్కగాని క్రయవిక్రయముల ధరలు

తగురీతి నుండవలెను. అట్టి ఖనిజముల నిధులు దొరకు చోట్లు రాకపోకల కనుగుణ్యముగా నుండు టత్యావశ్యకము.

ఇట్టి విషయములన్నియు నొక సమయమునుండి మరియొక సమయమునకును, ఒకచోటినుండి వేరొకచోటికిని మారుచు నుండవచ్చును గాన ఆర్థికఖనిజములుగా నుపయోగింపబడు ఖనిజము లన్నిచోట్లను, అన్ని వేళలయందును లాభకరముగా నుపయోగింపబడజాలక పోవచ్చును. అల్యూమినియం నూటికి 20-25 పాళ్ళు రాసాయనికముగా కలిసియున్న మన్నులు (clays) సాధారణముగా ప్రతిచోటను ఉండునుగాని వానినుండి యా ధాతువును తేలికగా విడదీయు విధాన మింతవరకు కనుగొనబడనందున నవి యార్థిక ఖనిజములు గానేరవు. నూటికి 30 వంతులు లోహము (Iron) గల ఖనిజములు ఉపయోగపడక పోవచ్చునుగాని నూటి కొక్కవంతు ధాతువులున్న తగరపు ఖనిజములను లాభదాయకముగా త్రవ్వి తీయవచ్చును. అట్లే బంగారము, ప్లాటినము, రేడియం, మొదలైన విలువగల ధాతువులు, నిధులలో కొన్ని లక్షలలో నొక వంతు ఉన్నను, అవి లాభదాయకముగ పరిగణింపబడును.

ఇవిగాక, ప్రస్తుత మెందుకు పనికిరావనుకొన్న కొన్ని ఖనిజములు కొంతకాలము తరువాత నెంతో యుపయుక్తము కావచ్చును. ఉదాహరణమునకు మనదేశమందు అభ్రకపు గనులలో దొరకు బెరిల్ (Beryl) అను ఖనిజము, చాలకాలమువరకు పనికిరానిదిగా పారవేయబడు చుండెడిది. కాని గత యుద్ధకాలములో దానికి ప్రాముఖ్యము వచ్చినందున, ఇదివరలో త్రవ్విపోసిన రాతికుప్పలనుండి కూడ పరితీయుట జరిగినది.

**ఆర్థిక ఖనిజనిధులు - వాని నైజములు - పుట్టుక :-** ఆర్థిక ఖనిజనిధులు ప్రకృతిలో పెక్కువిధములుగా నేర్పడియున్నవిగాని వానిని ముఖ్యముగా రెండుతెగలుగా విభజించవచ్చును. (1) వెయిన్ నిధులు (Vein deposits) (2) పొరల నిధులు (bedded deposits). వీనిలో మొదటివి భూమిలోపలి భాగమునుండి పగుళ్ళద్వార పైకి ప్రవహించుచువచ్చిన శిలాద్రవము (magma) మూలమున గాని, చాల వేడిమి, పీడనములతోగూడి అట్లు ప్రవహించుచు వచ్చిన ద్రావణముల (Solutions) మూలమున గాని యేర్పడినవి. శిలాద్రవము ఘనీభవించునప్పుడు తమతమ విశిష్ట గురుత్వమూలమున వేర్వేరు నిధులుగా నేర్పడిన ఖనిజములలో మాగ్నటైటు (magnetite) క్రోమైటు (Chromite)), ఇల్మెనైటు (Ilmenite) మొదలైనవి.

శిలాద్రవములలో గూడ ననేక విధములయిన ధాతువులు (metals) ఇతర మూలకములు (elements) వాయురూపమున (gaseous state) గాని, ద్రవరూపమున (fluid state) గాని యిమిడియుండి భూమిలోపలనుంచి కొంత పైకి చొచ్చుకొని వచ్చుచు చల్లబడుచు నిధులుగా నేర్పడును. ఇట్టి నిధులలో తగరము, టంగ్‌స్టన్ (Tungsten) రాగి, సీసము, వెండి, బంగారము మొదలగు ధాతుఖనిజములను పేర్కొనవచ్చును. వీటిలో గలసియుండు అనార్థిక ఖనిజము లనేకము గలవుగాని వీనిలో గొన్ని స్ఫటికము (Qnartz) చూర్ణిజము (కాల్సైటు - Calcite) భూస్ఫటికము (ఫెల్స్పారు - Fellspar) హారితుల్బిజము (బెరైట్సు Barytes) మున్నగునవి. ఇదే తెగకు సంబంధించిన అలోహ ఖనిజములలో అభ్రకము, మెరుగుమట్టి మొదలగునవి యున్నవి. ఇట్టి వెయిన్‌నిధులు సాధారణముగా భూమిలోకి చాల యేటవాలుగా నుండును.

భూతలమునకు సమీపముననుండు అంతర్జలము కొంతవరకు ఆమ్లపూరితమై యుండుట వలనను, మరి యితర కారణముల వలనను; ఇదివరలో నేర్పడిన ధాతుఖనిజములను కరగించుకొని తిరిగి భూమిలోనుండు పగుళ్ళు మొదలగువానిలో వేరురూపమున ఖనిజ నిధులను నేర్పరచుట జరుగుచుండును. ఇట్లు కేంద్రీకరింపబడిన నిధులు మొదటివానికంటె విలువగలవై యుండును. ఇట్లు రెండవతూరి ఖనిజనిధు లేర్పడుట (Secondary enrichment) అనబడును. ఉదాహరణకు రాగి, వెండి గంధకిదములను చెప్పవచ్చును. మరికొన్నిచోట్ల సున్నపురాయి (Lime stone) మొదలైన రాళ్ళను కరగించి వాటిస్థానే వేర్వేరు ఖనిజ నిధులనుగూడ నేర్పుట జరుగుచుండును. భూమిలోనుండి పైకివచ్చు నీటితోను, ఇతర ద్రావణములచేతను ఈ నిధులేర్పరుపబడు చుండును. ఇట్లు ఖనిజము లేర్పడుట (Metasomatism) అనబడును.

కొన్ని ధాతువులు, ఖనిజములు సాధారణ రాసాయనిక విధానముచే వియోగము (Decomposition) చెందకుండుట వలనను, ఇసుక మొదలగు ఇతర వస్తువులకంటె నెక్కువ విశిష్ట గురుత్వము గలిగియుండుటచేతను నీటిలో కొట్టుకొనిపోయి, కొన్ని కొన్ని చోట్ల కేంద్రీకరింపబడును. ఇవి చాలవరకు విఘటన చెందిన (Disintegrated) రాళ్ళ నుండి జనించినవి. ఇట్టి ఖనిజ నిధులను నదీనిధులు (Placer or alluvial) అందురు. బంగారము, తగరపు ఖనిజమైన త్రపుజా రేయిజము (కాసిటరైటు Cassiterite) తిరువాన్కూరు, ఆంధ్రతీరముల దొరకు మోనజైటు (Monozite) మొదలగునవి ఈ జాతికి కొంతవరకు చెందినవి.

వీటియడుగున నేర్పడిన రాళ్ళ (Sedimentary rocks) తో గూడిన ఖనిజములుగూడ చాల గలవు. ఇవి సాధారణముగా రకరకములైన రాతిపొరలలో (Sedimentary rocks) నిధులుగా నేర్పడియుండును. వెయిన్ నిధులవలె నివి యెక్కువ యేటవాలుగా నుండవు. కొన్ని నిధులు (మన్ను, ఇసుక ఖనిజములు) నీటిలో కొట్టుకొని వచ్చి యేర్పడినవి. మరికొన్ని నీటిలో రాసాయనిక అవక్షేపము (Precipitation) వలన గలిగినవి. (ఉదా: కొన్ని సున్నపురాళ్ళు, లోహఖనిజములు మొదలైనవి.) మరికొన్ని సముద్రజలము ఎండవేడిమిచే ఇగిరిపోయినందున ఆ జలములో ఇమిడియున్న లవణములు పొరలు పొరలుగా నేర్పడిన నిధులు. ఇట్టి లవణనిధులుగూడ ననేకములున్నవి. సాధారణముగా రాతియుప్పు నిధులు ఎక్కువగా నున్నను, ఒకేచోట అనేక లవణములు పొరలు పొరలుగా నుండుటగలదు. జర్మనీలో స్టాస్‌ఫర్టు (Stassfurt) అనుచోటనుండు లవణ నిధులు చాల ప్రసిద్ధి.

అంగారిక ఖనిజములుగూడ నీటయడుగున నేర్పడిన శిలలతోనే గలిసియుండునుగాని వాని పుట్టుకలో కొంత వ్యత్యాసమున్నది. పైచెప్పిన ఖనిజములన్నియు చాల వరకు అదివరకే భూమియందుండిన రాళ్ళు ఛిన్నాభిన్నములగుటవలన ఏర్పడినవి. కాని బొగ్గు మొదలగు ఖనిజములు కోట్ల సంవత్సరముల క్రితము పుట్టిపెరిగిన చెట్లు చేమలు నీళ్ళలో కొట్టుకొనిపోయి, పెద్దపెద్ద సరస్సులలో పడి యిసుక, మన్నుపొరలతో కప్పబడుటవలన జనించినవి. అట్టి చెట్లుచేమలు వేరుచోట్లనుండి కొట్టుకొనివచ్చి యిప్పుడు బొగ్గుఉన్నచోట పూడ్చబడినవనియు, అచ్చటనే పుట్టి పెరిగి పూడ్చబడినవనియు రెండు భేదాభిప్రాయములు గలవు. ఒక్కొకచోట ఇసుకరాతి పొరలమధ్య చాల బొగ్గుపొర లుండును. ఈ పొరలలో నార్థికముగా నుపయోగించునవి 2-3 నుండి 100 అడుగుల వరకు మందము గలిగియుండును.

పెట్రోలియం నిధులు అంగారక పదార్థములనుండి యుద్భవించినవనియు, అట్టి వస్తువులలో చెట్లుచేమలేగాక జంతు సంబంధమైనవిగూడ గలవనియు తెలియుచున్నది. ఇదిగాక పెట్రోలియం అనంగారక వస్తువులనుండి భూమియందే రాసాయనికముగా నుద్భవించినదనికూడ కొందరి యభిప్రాయము. కాని దీని కెక్కువ ఆధారములులేవు. బొగ్గువలెనే పెట్రోలియం కూడ నీటియందు జనించిన శిలలతోనే కలిసియుండును. కాని దీనితోగూడిన రాతిపొరలు, సరంధ్రములు (Porous) గాను, కొన్ని విధములుగా మడతలుపడి (Folded) వంగియుండవలెను. ఇది నీటికంటె తేలికయగుటచే, భూమిలోపలనే నీటిపై తేలుచుండును. పెట్రోలియం నిధుల పైభాగమున పెట్రోలియం వాయువు (Petroleum gas or natural gas) గూడ కొన్నిచోట్ల నేర్పడియుండును.

ఆర్థిక ఖనిజనిధుల పరిశీలన - వానిని త్రవ్వి తీయు విధానములు :- ఆర్థిక ఖనిజములను లాభదాయకముగా త్రవ్వి తీయుటకై మొదట ఆయాచోట్లనున్న పలురకములగు రాళ్లను, వాటి గుణములను భూగర్భశాస్త్రరీత్యా పరిశీలించి, పటములు (maps) తయారు చేయుదురు. ఆర్థిక ఖనిజము లున్నవని తెలిసినను, లేక దొరకవచ్చునని యూహించినను తగు స్థలములందు, చిన్న గోతులు (pits) కందకములు, (trenches) త్రవ్విగాని లేక డ్రిల్లింగ్ (drilling) మూలమునగాని వాటి ఉనికి యొక్క వైశాల్యమును పరిశీలించి, ఖనిజముల నిధులు, వాని నిలువ మొదలగు విషయములను సుమారుగా అంచనావేసి వాటిని త్రవ్వి తీయుటకై గనులేర్పరుచుదురు. అట్టి గనులు, నీరు, రైలుమార్గము లేక యితరశాటలు మొదలుగాగల వసతులన్నియు నరిచూచుకొనిన వెనుకనే, మొదలు పెట్టబడును.

ఆర్థిక ఖనిజపుగనులు ముఖ్యముగా రెండురకములుగా నున్నవి. మొదటిది భూమిపైనుండియే లోతుగా గోతులు త్రవ్వితీయునవి. వీనిని క్వారీలు (quarries) అందురు. రెండవది, భూమిలో సొరంగములుగా త్రవ్వి తీయునవి. వీనిలో మొదటిరకపుగనులు, ఖనిజములు భూమిపైననే దొరకుచోట్లగాని, లేక ఖనిజము లెక్కువ విలువలేనివై చాల తక్కువ ఖర్చుతో త్రవ్వి తీయబడగల చోట్లను, ఇంకా యిట్టి యితర సందర్భములలోను తీయుదురు. ఇవి సాధారణముగా 100 అడుగులకంటె ఎక్కువలోతు ఉండవు. కాని, ఒక్కొక్కప్పుడు 400-500 అడుగులవరకు కూడ లోతు ఉండుట గలదు. కొన్ని బొగ్గుగనులు, పలకరాళ్లు, కట్టడపురాళ్ళు మొదలైన ఖనిజముల గను లీతెగకు జెందినవి. ఇట్టి గనులందు భూమియందుండి వచ్చు ఊటనీరేగాక వర్షపునీరుగూడ చేరుచుండుటచేత ఆనీరు పైకి తోడుటకు వ్యయమధికముగా నగుచుండును.

సొరంగపుగనులు, భూమిలో లోతుగానున్న ఖనిజ నిధులను త్రవ్వితీయుటకును, లేక భూమి పైభాగము నుండి క్వారీలద్వారా త్రవ్వుటకు సాధ్యముగాని, నిధులను త్రవ్వుటకును ఉపయోగింతురు. భూమి పైభాగము నుండి బావులు, లేక యేటవాలుగానున్న సొరంగముల ద్వారా ఖనిజము లున్నచోట ప్రవేశించి వానిని త్రవ్వి తీయుదురు. ఖనిజనిధి జేరినపిదప దానియందే తగురీతిని వేర్వేరు సొరంగములను త్రవ్వి ఖనిజమును భూమిపైకి తీయుదురు. ఈ సొరంగములు పట్టాలమీద నడచు తొట్టి బండ్లలో ఖనిజమును పైకి తీసికొని పోవుటకును, పనివారు నడుచుటకును, పైనుండి పరిశుభ్రమైనగాలి పారుటకును తగినట్లు వెడల్పు, ఎత్తు గలిగియుండును. ఇట్టి గనులలో నొక్కొక్క ఖనిజమునకు సంబంధించిన సమస్యలు అసంఖ్యాకములుగా నుండును. సాధారణముగా నన్ని గనులలోను నీరూరుచుండును. ఆ నీటిని పైకి తోడుటకు పంపులు ఏర్పాటు చేయుచుండవలెను. ఖనిజములను, వాటి నంటియున్న శిలలను-పగులగొట్టుటకై వాడు ప్రేలుడుమందు నుపయోగించుటచే జనించు విషవాయువులను, తదితర విషవాయువులను పైకి పంపుటకై పరిశుభ్రమైన గాలి గనులలోనికి వచ్చున ట్లేర్పాట్లుచేయవలెను.

బొగ్గుగనులు సుమారు 2000 అడుగులకంటె ఎక్కువ లోతుగా నుండవు. కాని కొన్ని ధాతు ఖనిజములగనులు 10,000 అడుగులకంటెకూడ ఎక్కువ లోతుగా నుండును. అట్టి గనులలో భూమిలోనికి పోయినకొలది వేడిమి యెక్కువగుచుండుటచేత పైనుండి పంపెడు పరిశుభ్రవాయువును చల్లబరచి పంపవలసి వచ్చుచుండును. ప్రపంచములో చాలాచోట్ల బంగారపు గనులు 10 వేల అడుగులపైగా లోతుగా నున్నవి. కోలారులో నున్న బంగారపు గనులుగూడ నట్టివానియందు జేరినవే. ఇట్టి లోతుగల గనులలో, పైనున్న శిలలపీడనమువలన ఒక్కొక్కప్పుడు రాళ్ళు తమంతటతామే ప్రేలుచుండి (Rock burst) ప్రమాదములు సంభవించుచుండును. అట్లే కొన్ని బొగ్గుగనులలో కొన్ని వాయువులు అగ్ని సోకగానే ప్రేలుటగాని, మండుటగాని సంభవించి ప్రమాదములు కలుగుచుండును. ఖనిజములు త్రవ్వి తీయగానే పైనున్న రాళ్ళు విరిగి పడకుండ కర్ర, లేక యినుప దూలములు, స్తంభములు, పోటీపెట్టి యుంచుట గనులలో సామాన్య విషయమే. కొన్ని బొగ్గుగనులలో బొగ్గ తీయగానే, ఖాళీయైన స్థలమును ఇసుకతోగాని మ[..] యితరరాళ్ళ ముక్కలతోగాని నింపుచుందురు. ఇట్ల చేయుటచే గనులలోని పైభాగపురాయి విరిగి పడకుం[..]నుండును. ఇట్లిసుకతో నింపుట సేండ్ స్టోయింగ్ (San[d] stowing) అనబడును. ఇంకను ఇట్టి సమస్యలవలన ఒక్కొక్కప్పుడు, ఖనిజ నిధులు బాగుగా నున్నను వాని సేకరణ లాభదాయకముగా నుండదు. పెట్రోలియ గనులు పైజెప్పిన గనులవలెగాక, మొదట బోరింగు వల్ల నీ ఖనిజమున్నదని తెలిసినచోట, పైనుండి[..] పంపుల నేర్పరచి గొట్టముల ద్వార దీనిని పైకితీయదురు. వీటిని నూనెబావు (Oil wells) లందురు.

. . ముడిఖనిజములను శుభ్రపరచుట :- ముడిఖనిజములను గనులనుండి త్రవ్వితీసిన వెనుక వాటిలో వివిధ పరిశ్ర[మ]లకు పనికివచ్చు ఖనిజములను వేరుచేసి శుభ్రపరుచుదుర ఇట్లు శుభ్రపరచుట ఓర్ డ్రెస్సింగు (ore dressin[g]) అందురు. పైనజెప్పినట్లు అలోహఖనిజములను చాలవర ఆ రూపములలోనే పరిశ్రమలలో వాడుదురు. అందు వీటిని శుభ్రపరచుట అనగా వానితో కలసియున[్న]

అనార్థిక ఖనిజములు, రాళ్ళు మున్నగువాటిని తీసివేయుటయే. అట్టి ఖనిజములను, రాళ్లను, చేతులతో నేరివేయుట, ఖనిజములను నీటియందు కడుగుట, మొదలగు విధానములచే వేరుజేయబడుచున్నవి. ధాతు ఖనిజములను శుభ్రపరచిన తరువాత, వాటిని కరగించిగాని లేక ఇతర రాసాయనిక విధానములచే గాని, వాటిలోనుండు ధాతువులను వేరుజేయుదురు. బంగారు మున్నగు కొన్ని ధాతువులు ఆరూపములోనే రాళ్లయందు మిశ్రమై దొరకుచుండును. అట్టి ధాతువులను సేకరించుట సులభసాధ్యము. ఆ ధాతువులుండు శిలలను మెత్తగా పొడిగొట్టి నీటియందు తగురీతిని కడుగుటచే ధాతువులు చాలవరకు విడిపోవును. చివరకు మిగిలిపోయిన కొంచెము భాగమును రాసాయనిక విధానములచే సేకరింతురు.

ఖనిజములలోని ధాతువులను సేకరించుటకు ముందు ఒక్కొక్కప్పుడు వేర్వేరు విధానములచే వాటిని సంకేంద్రీకరింపజేయుదురు. ఇట్టి విధానము లనేకములు గలవు. ఉదాహరణమునకు అయస్కాంతములచే విడదీయుట (Magnetic separation), నురుగుచే విడదీయుట (Froth floatation) పేర్కొనవచ్చును. అయస్కాంతముచే నాకర్షింపబడు ఖనిజములు సునాయాసముగా వేరుచేయబడవచ్చును. నురుగుచే వేరుచేయబడు విధానము ఇటీవల కనిపెట్టబడినదే. ఇది యెక్కువగా గంధకిద (సల్ఫైడు) ఖనిజముల కుపకరించును. ఖనిజములను మెత్తగా పొడిచేసి, కొన్ని రాసాయనిక వస్తువులతో బాటు నీటిలో కలిపి చాలసేపు యంత్రసహాయమున చిలికెదరు. అట్లు చేసినప్పుడు గాలిబుడగల వలన ఏర్పడిన నురుగుతోబాటు ఖనిజకణములు వేరయి, యితర అనార్థిక ఖనిజములు నీటి యడుగుభాగమున జేరును. ఇటీవల ఈ విధానము అలోహ ఖనిజములు సంకేంద్రీకరింపబడుటకు గూడ కొలదిగా నుపయోగింపబడుచున్నది. ఉత్తర ప్రదేశములోనున్న ఖిలేరి గనులలో ఇదివరకు పనికిరాదనుకొన్న సున్నపురాయి నీవిధమున బాగుపరచి యిప్పుడు సిమెంటు తయారుచేయుచున్నారు.

ఇనుము మొదలగు లోహ ఖనిజములనుండి ధాతువులను వేరుచేయుటకై వాటిని బొగ్గు, మరికొన్ని ద్రవకరణ వస్తువులతో (Fluxes) జేర్చి కొలుములలో కరగింతురు. ఈ విధానమునందు బొగ్గు వేడిని జనింపజేయుటయేగాక రాసాయనికముగా గూడ పనిచేయును. అల్యూమినియం మొదలగు ధాతువులను ఖనిజముల నుండి విడదీయుటకై విద్యుచ్ఛక్తి విరివిగా నవసరము. ఈ విధముగా నార్థిక ఖనిజములు లాభదాయకములుగా నుండగలుగుట వాటియందున్న ధాతువులను విడదీయు పద్ధతులపై గూడ నాధారపడియుండును.

**ఆర్థిక ఖనిజములు, వానినుండి యుత్పత్తియగు పదార్థముల ఉపయోగములు:-** అర్థిక ఖనిజముల యొక్కయు, వానినుండి తీయు ధాతువుల, ఇతర వస్తువుల యొక్కయు ఉపయోగము లసంఖ్యాకములుగా గలవు. మనము ప్రతిదినము వాడుకొను పెక్కు వస్తువులందు ఖనిజము లేదో యొక రూపము వహించియుండును. ఉదాహరణకు కాగితములందు సుద్దమన్ను (China clay) పూతయుండును. పెన్సిళ్ళ ములుకులు మెరుగుమట్టితో తయారుచేయుదురు. ప్రతి చిన్న మేకుగూడ ఇనుము ఖనిజములనుండి తయారుగాబడిన యినుముతో చేసినదే.

కొన్ని ఖనిజములు చాల అరుదుగను, స్వల్పపరిమాణములలోను దొరకినను, వాటి ప్రాముఖ్యము చాల ఎక్కువగానున్నది. తేజాతువు (రేడియం) కిరణాతువు (యురేనియం), మొదలగు ధాతువుల ఖనిజము లిందుకు తార్కాణము. ఇవిగాక పెక్కు ధాతువులు, వివిధములైన ధాతుమిశ్రణములను (alloys) తయారుచేయుట యందుపకరించుచున్నవి. కొన్ని మిశ్రణముల యందు ఒక్కొక్క లోహము మిగుల కొలదిగా నున్నప్పటికిని దాని కలయిక వలన మార్పు చాల యెక్కువగానుండును. నూటికి ఒక పాలు కంటె తక్కువగా రోచాతువు (వెనాడియం) అనుధాతువు చేర్చుటవలన ఉక్కుకెంతయో బలము చేకూరును. అట్లే చండాతువు (టంగ్‌స్టన్) అను ధాతువు గట్టితనము ఎక్కువగల యనేక మిశ్రణములలో నుపయోగింతురు. భూగర్భశాస్త్రజ్ఞులకు మాత్రమే తెలిసి పరిశ్రమలలో నెందుకు పనికిరావనుకొని, తదుపరి యెంతో నుపయుక్తములైన కొన్ని ఖనిజము లిటీవల ననేకము గన్పించుచున్నవి. కృమిరూపిజము (వర్మిక్యులైటు (Vermiculite), సిల్లిమనైటు (Sillimanite)

మొదలగు ఖనిజము లిటువంటివి. ఇట్టి ఖనిజముల సంఖ్యా వాని ఉపయోగములు నానాటికెక్కువగును నే యున్నవి.

**భారతదేశపు ఖనిజసంపద - ఇతరదేశములతో గల తారతమ్యత :-** ప్రపంచములో నేదేశమందును దానికి కావలసిన ఖనిజములన్నియు దొరకవు. కొన్ని దేశము లందు ముఖ్య ఖనిజసంపద యెక్కువగా నుండును. అందుచేత వివిధదేశములమధ్య ఖనిజముల యెగుమతి దిగుమతులు సర్వసామాన్యముగా జరుగుచుండును. ఖనిజసంపద యెక్కువగా గలిగి వానిని ఉపయోగించు విధానములను బాగుగ చక్కబరచుకొనిన దేశములు, ఆర్థికవిషయములందును రాజ్యాంగ విషయములందును ముందడుగువేసి యుండును. భారతదేశములో ఇతర దేశములవలెనే కావలసిన ఖనిజము లన్నియు పూర్తిగా లేకపోయినను కొన్ని ముఖ్య ఖనిజసంపదలలో అది ఇతరదేశముల కెంతమాత్రమును దీసిపోదు. వీనిలో ముఖ్యముగా పేర్కొనవలసినవి, తిరువాన్కూరు తీరమున దొరకు మోనజైటు ఇసుక (monozite sands), అయోరజజారిజము (ilmenite), అభ్రకము (mica), మాంగనము (manganese), ఇనుము (iron), అల్యూమినియం (Alluminium) ఖనిజములు. కొలది సంవత్సరముల క్రితమువరకు మనదేశపు ఖనిజములు ఎక్కువగా ముడిస్థితిలోనే యితర దేశముల కెగుమతి యగుచుండెడివి. కాని యిటీవల వాటిని వీలైనంతవరకు మనదేశమందే యుపయోగించుచు కొన్నిధాతువులను గూడ నిచ్చటనే తయారు చేయు నేర్పాట్లు జరుగుచున్నవి. మనకు కావలసిన వాటికంటె నెక్కువగానున్న ఖనిజములను కొన్నింటిని మాత్ర మితర దేశముల కెగుమతి చేయుచున్నాము. మనకు కావలసిన ఖనిజములను దిగుమతి చేసికొనుచున్నాము.

మన దేశమునుండి యెగుమతియగు ముఖ్యఖనిజములు అభ్రకము, మాంగనము, లోహఖనిజములు, బొగ్గు మొదలైనవి. నెల్లూరు, హజారిబాగ్ జిల్లాలలో దొరకు అభ్రకము చాల ప్రసిద్ధికలది. ఇచ్చటి కార్మికులు అభ్రకమును పలుచటి పొరలుగా చీల్చి, కత్తిరించుటలో నసామాన్యమగు నిపుణత గాంచిరి. అభ్రకము ఎక్కువగా విద్యుద్యంత్ర నిర్మాణమునం దుపయోగింపబడు చుండుట చేతను ఆ పరిశ్రమ యింకా మనదేశమునం దభివృద్ధి చెందనందునను అభ్రకమింకా చాలవరకు ఎగుమతి చేయబడుచున్నది. మేలిమి రకమునకు చెందిన మాంగనము, లోహఖనిజములు మనదేశమం దపారముగ నున్నవి. ఇట్లున్నను మనదేశమం దింతవరకు మనకు కావలసిన యినుము, ఉక్కు తయారగుట లేదు. ఇటీవల మధ్యప్రదేశమునందు భిల్లాయివద్దను, ఒరిస్సాలో రూయిర్కేలావద్దను, బెంగాలులో దుర్గాపూరు వద్దను పెద్దపెద్ద యినుము, ఉక్కుకర్మాగారముల నేర్పరచుటకు ప్రయత్నములు సాగుచున్నవి. 5, 6, సంవత్సరములలో మనకు కావలసినంత యినుము, ఉక్కు ఇచ్చటనే తయారు కాగలదని యంచనా వేయబడినది. మన దేశమందు విరివిగా దొరకు బాక్సైటు (Bauxite) నుండి అల్యూమినియం తయారుచేయుటకును, మోనజైటు మొదలగు ఖనిజములనుండి పలువిధముల నుపయోగింపబడు అణుశక్తిని తయారు గావించుటకునుగూడ నేర్పాట్లు జరుగుచున్నవి. మనకు కావలసినంత పెట్రోలియం మనదేశమం దింతవరకు దొరకనందున ఈ ఖనిజమునకై తీవ్ర పరిశోధనలు జరుగుచున్నవి. అదీగాక యితరదేశములనుండి ముడి పెట్రోలియం తెప్పించి మనదేశమందు బొంబాయి, విశాఖపట్టణములవద్ద, దానినుండి పెట్రోలు, కిరోసిన్ మొదలగు నూనెలు, తదితరవస్తువులు తయారుజేయు పెద్దపెద్ద యంత్రాగారములు నెలకొల్పబడుచున్నవి.

ఈ క్రింద కొన్ని ముఖ్యఖనిజముల పేర్లు, అవి యెక్కువగా నుత్పత్తియగు దేశముల పేర్లు ఇవ్వబడినవి. వాటి క్రింద మన దేశమునందు 1954 వ సంవత్సరమున ఉత్పత్తియయిన కొన్ని ముఖ్యఖనిజములు, వాటి విలువలు ఇవ్వబడినవి.

**బొగ్గు :-** అమెరికా, జర్మనీ, ఇంగ్లండు, రష్యా.

**పెట్రోలియం :-** అమెరికా, రష్యా, వెనుజులా, రుమేనియా, ఇరాన్. (జర్మనీ, ఇటలీ, ఫ్రాన్సు, ఇంగ్లండు, జపానుదేశములలో పెట్రోలియం చాలతక్కువ.)

**ఇనుము :-** అమెరికా, రష్యా, ఇండియా, ఫ్రాన్సు, ఇంగ్లండు, జర్మనీ, బ్రెజిల్.

**అల్యూమినియం :-** ఫ్రాన్సు, అమెరికా, హాంగరీ ఇటలీ, ఇండియా.

తగరము :- మలయా, బొలివియా, డచ్చి యీస్టు యిండీస్, (అమెరికా, రష్యా, ఫ్రాన్సు, ఇటలీ, జపాను దేశములలో నిది చాల తక్కువ.)

తుత్తునాగము (Zinc) :- అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా. (ఫ్రాన్సులో తక్కువ.)

వర్ణజారేయిజము (క్రోమైటు Chromite) రష్యా, టర్కీ, దక్షిణరొడీషియా.

మాంగనము (Manganese) ;- రష్యా, ఇండియా, ఘనా (గోల్డుకోస్టు), దక్షిణ ఆఫ్రికా, (ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, జపానులలో తక్కువ.)

చండాతువు (టంగ్‌స్టన్ Tungsten):- చైనా, బర్మా, మలయా, అమెరికా (రష్యా, జర్మనీ, ఇటలీలలో తక్కువ.)

బంగారము :- దక్షిణ ఆఫ్రికా, రష్యా, కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ రొడేషియా (ఇండియాలో తక్కువ.)

వెండి :- మెక్సికో, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, పెరూ, (ఇండియాలో తక్కువ, ఇటీవల తుత్తునాగము, సీసపు గనులలో కొలదిగా దొరకుచున్నది.)

పాదరసము (Mercury) :- స్పెయిను, అమెరికా.

అభ్రకము :- ఇండియా, అమెరికా, రష్యా.

మోనజైటు (Monozite) :- ఇండియా, బ్రెజిల్.

వజ్రములు (Diamonds) :- గోల్డుకోస్టు (ఘనా), బెల్జియన్ కాంగో, దక్షిణ ఆఫ్రికా, బ్రెజిల్.

లిఖిజము (గ్రాఫైట్ (Graphite) :- కొరియా, ఆస్ట్రేలియా, జర్మనీ, సిలోన్.

కిరణాతువు (యురేనియం) :- బెల్జియన్ కాంగో, కెనడా (కొంత ఆస్ట్రేలియా, అమెరికా గూడ.)

1954 వ సంవత్సరమున ఇండియాలో నుత్పత్తియైన కొన్ని ముఖ్య ఖనిజములు, సుమారుగా అంచనా వేయబడిన వాటి విలువలు:-

మొత్తము ఖనిజముల విలువ (పెట్రోలియంగాక)

1953 లో రూ. 1,12,78,21,111. 1954 లో రూ. 1,02,51,97,252 (ఇంకా కొన్ని ఖనిజము లీక్రింది పట్టికలో నివ్వబడలేదు.)

| ఖనిజము | మొత్తము | విలువ రూ. |
|---|---|---|
| బొగ్గు | 36,866,810 టన్నులు | 53,96,92,656 |
| మాంగనము | 1.413,847 .. | 19,54,17,452 |
| అభ్రకము | 103,381 హం.వె. | 1.55.91,884 |
| బంగారము | 239,168 ఔన్సులు | 5,62,06,814 |
| ఇనుము (ఖనిజము) | 4,308,273 టన్నులు | 2,89,39,036 |
| రాగి (ఖనిజము) | 342,750 .. | 1,87,22,629 |
| ఆయోరిజజారిజము (ఇల్మెనైటు) | 240,613 .. | 79,80.210 |
| క్రోమైటు | 45,507 .. | 13,59,607 |
| జిప్సం | 612,120 .. | 41.59,388 |
| తుత్తునాగము (సంకేంద్రీకృతములు) | 3,974 .. | 10,80,998 |
| వెండి | 165,185 ఔన్సులు | 6.67,680 |
| బాక్సైటు | 74,747 టన్నులు | 8,27,785 |
| వజ్రములు | 1,995 కారట్లు | 4,74,236 |
| పచ్చలు (emeralds) | 509,180 .. | 6,70,406 |
| బెరైటీస్ | 18,792 టన్నులు | 2,61,379 |
| ఓలర్ (రంగుసుద్ద) | 75,506 .. | 5,47,139 |

పి. వేం.

**ఆర్థికభూగోళశాస్త్రము** :- పరిసరములకు సంబంధించి, మానవుని ఆర్థికచర్యలను గురించి తెలుపు శాస్త్రమును ఆర్థిక భూగోళశాస్త్రమని నిర్వచింపవచ్చును. ప్రతి భౌగోళిక ప్రాంతమునందును పరిసర ప్రకృతికి అనువగునట్లు మానవుని ప్రవృత్తి మారుచుండును. అనగా ప్రదేశభేదమునుబట్టి మానవుని ఆహారము, దుస్తులు, వృత్తి మొదలగునవి ప్రకృతి కల్పించు అవకాశములను బట్టి మారుచుండును.

ఆహారములు, ముడిపదార్థములు, ఆర్థిక ఖనిజములు ఆటవికవస్తువులు, ఖారీపరిశ్రమలు, వాటి సరఫరా, ముడిపదార్థములయొక్కయు యంత్రములచే తయారైన పదార్థములయొక్కయు పరస్పర వినిమయము అంతర్దేశీయ- విదేశీయ వర్తక వ్యాపారములు, మున్నగు అంశములయొక్క పరిశీలనమే ఆర్థిక భూగోళశాస్త్రమందలి ముఖ్యమైన విషయము.

పై విషయములను ఇంకను సూక్ష్మముగా తెలుపుటకై ఈ క్రిందివిధముగా అంతర్విభాగము చేయవగును.

ముఖ్య ఆహారమనియు, సహకారి (subsidiary) ఆహార మనియు ఆహారము రెండువిధములు, గోధుమ, వరి, జొన్నలు, సజ్జలు, రాగులు మున్నగు ధాన్యముల ఉత్పత్తి, వాటి ఖర్చు మున్నగు విషయములు ముఖ్యాహారమునకు చెందినవి. పప్పుదినుసులు, చక్కెర, ఫలములు, కూరగాయలు మున్నగునవి సహకారి ఆహారమునకు చెందినవి. పై రెండు కాక మూడవ విభాగము క్రింద వచ్చునవి - తేనీరు, కాఫీ, కోకో, ఓవలటీను మున్నగు పానీయములు.

ప్రత్తి, జనుము, నార. పొగాకు, రబ్బరు, అవిసెనార మున్నగునవి ముఖ్యమైన ముడిపదార్థములు. ఈపంటలు పండుటకు అనువగు పరిస్థితులను గూర్చి విమర్శించుట కూడ ముఖ్యమైన విషయము.

ఖనిజపదార్థములను మూడు రకములు - (1) ఇనుముతో సంబంధము గల లోహములు. ఉదా :- ఇనుము, మాంగనము, (2) ఇనుముతో సంబంధము లేని లోహములు, ఉదా :- సీసము, యశదము, రాగి, అల్యూమినియము, తగరము, (3) మిక్కిలి విలువగల లోహము లగు బంగారము, వెండి, ప్లాటినము. ఇవిగాక పెట్రోలు, బొగ్గు మున్నగు పారిశ్రామిక ఇంధనములు, రాతిఉప్పు, క్లోరియగంధకితము, రాతినార, అభ్రకము మున్నగు అనేక లోహేతర ఖనిజములుకూడ ఖనిజసంపత్తియందలి అంతర్విభాగములే. స్థూలదృష్టిచే పరిశ్రమలు కుటీరపరిశ్రమ అనియు కర్మాగారపరిశ్రమ అనియు, యంత్రపరిశ్రమ అనియు మూడు తెరగులు. యంత్రములను నడుపుటకు వలసిన శక్త్యుత్పత్త్యాధారముల సాధనములను గూర్చిన పరిశీలనముకూడ ఆర్థిక భూగోళశాస్త్రముయొక్క ముఖ్య విషయములలో నొకటి. అట్టి ఆధారములలో మానవ కృషి, జంతు సాహాయ్యము, బొగ్గు, పెట్రోలు, విద్యుత్తు, సూర్యశక్తి, అణుశక్తి మున్నగునవి లెక్కింపదగినవి. రవాణా సౌకర్యములలో రహదారులు, రైలుమార్గములు, జల వాయుమార్గములును చేరును. ఆర్థిక భూగోళశాస్త్రములో, వాణిజ్య మొక ప్రధానాంశమై యున్నది. వివిధప్రాంతముల మధ్య జరుగు ఎగుమతి దిగుమతి వస్తువులనుగూర్చి తెల్పు విషయమే వాణిజ్యము. వివిధదేశములమధ్య జరుగు ఎగుమతులనుగూర్చి ఇందు చర్చింపబడును. వ్యాపారము కొంత విలువగలదైనను ఆర్థిక భూగోళశాస్త్రమున దానికి ప్రాముఖ్యము లేదు.

ఆధునిక ఆర్థిక శాస్త్రపఠనములో మానవుని వృత్తులు ఆధారముగా కనుపడినవి. ఆ వృత్తులు పురాతన వృత్తులనియు, ప్రధాన వృత్తులనియు, సహకారి వృత్తులనియు మూడు తెరగులు.

కాయలు, దుంపలు ఏరుట, చేపలు పట్టుట, వేటాడుట ఇవి పురాతన వృత్తులు. వీటిని ఆధారముగా గొనియే పురాతన కాలములో మానవుడు జీవిత సమరమును సాగించుచుండెను.

మానవుడు తన పరిసరములకు అలవాటుపడిన కొలది. ప్రకృతి కనుగుణముగా ప్రవర్తింపనేర్చిన కొలదియు, ప్రధానవృత్తులను స్వీకరించెను. పశువులను పెంచుట, కాలక్రమమున గనులు త్రవ్వుట మున్నగునవి ప్రధాన వృత్తుల కుదాహరణము.

ప్రధానవృత్తు లాధారముగా ఏర్పడి పారిశ్రామిక విప్లవానంతరము అభివృద్ధిలోనికి వచ్చిన వృత్తులు సహకారివృత్తు లనబడును. ఉదా : రవాణాలు, వాణిజ్యము మున్నగునవి.

ప్రతిప్రాంతమునందును ఈ వృత్తులలోగల వైవిధ్యమును, మనుష్యుడు చేయు కృషికి ప్రకృతినుండి కలుగు ఫలితములును పరిశీలింపబడి, మానవుని పరిసరములకును, ఆతడవలంబించు వృత్తికిని సమన్వయము కల్పింపబడుచున్నది.

వివిధ భౌగోళిక ప్రాంతములలో మానవులెట్లు జీవించుచున్నారో, ఎట్లు సంచరించుచున్నారో, ఎట్లు తమ క్షేమమును సాధించుకొనుచున్నారో వివరించు భూగోళశాస్త్ర భాగమును ఆర్థిక భూగోళము అందురు. ఇది ఆర్థికావసరములమీదను, వాటిని సాధించు పద్ధతుల మీదను ప్రాధాన్యమును ప్రసరింప చేయును.

వి. యన్. చ

**ఆర్థిక వ్యవసాయ ప్రణాళిక (ఇండియా)**:- భారతదేశపు ప్రణాళికా విధానము ప్రజాస్వామ్య దృక్పథము కలిగియుండవలె ననువిషయము ఎల్లరిచే ఆమోదింపబడినది. ప్రజలయొక్క ఆర్థిక వసతులను

ప్రతివ్యక్తికివచ్చు స్వల్ప ఆదాయమును మనము పరిగణింప వలసియున్నది. ఉద్యోగావకాశములను పెంపొందించుటతోపాటు, ఉత్పత్తిని అధికముచేయురీతిని వ్యవసాయ ప్రణాళికలను తయారుచేసికొనుట మన ఆశయము కావలసియున్నది. మనకుగల పెట్టుబడి అవకాశములు బహుపరిమితములు అను విషయము వాస్తవమే. విదేశ నాణెములను మారకముద్వార సంపాదించుటకుగాను ఎగుమతులను ఎక్కువచేయురీతిని వ్యవసాయ ఉత్పత్తిని పెంపొందించుటకు మనము ప్రయత్నింపవలసియున్నది. మొదటి పంచవర్ష ప్రణాళికా కాలమున మనము ఉత్పత్తిని పెంపొందించుకొని సామ్యవాద వ్యవస్థా నిర్మాణ మార్గమును సుగమము చేసితిమి. భారతదేశపు ప్రణాళికా రచనా విధానము 36 కోట్లమంది ప్రజల భవిష్యత్తుకు తద్వారా కొంతవరకు ఇతరదేశముల భవిష్యత్తుకు సంబంధించిన మహోజ్వల విషయము. ప్రణాళికా నిర్మాణములో ఒకే దృక్పథమును ఒకేమాదిరి పద్ధతులను అనుసరించుట ఆవశ్యకము. మనము అనుసరించెడు ప్రణాళిక ప్రజల పురోగమనమునకు తోడ్పడవలసియున్నది. ఆపురోగమనము నిరంతరమైనది. అందులకు పెక్కు ప్రణాళికలు ఆవశ్యకములు. సాంకేతిక విషయములలో చెప్పుకొనదగిన అభివృద్ధిని సాధించనియెడల మనము ఈ 20వ శతాబ్దిలో మన గమ్యస్థానముచేర జాలము. మనకు విశిష్టమైన ఆశయములు నిర్దుష్టమైన సిద్ధాంతములు ఉన్నవి. సాంకేతిక విషయములలో అధికమైన పురోభివృద్ధి కలిగినది. కావున మనము ప్రణాళికా రచనను గురించి యోచించుచున్నాము. మన సాంకేతికాభివృద్ధిని గూర్చి యోచించవలసియున్నది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఎన్నో సత్ఫలితములను సమకూర్చినది. మన జాతీయాదాయము రు. 10,800 కోట్లు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికాకాలము ముగియు సరికి అది రు. 13,480 కోట్లు కాగలదని ఆశింపబడు చున్నది. కావున సగటునే వ్యక్తిగత ఆదాయము 281 రూపాయలనుండి 331 రూపాయలకు హెచ్చవలసియున్నది. తృతీయ పంచవర్ష ప్రణాళికద్వార యిది రు. 396 కును, చతుర్థ పంచవర్ష ప్రణాళిక ద్వార రు. 496 కును హెచ్చవలసి యున్నది. పంచమ ప్రణాళికయందు అనగా 1976 నాటికిది రు 546 కాగలదు.

మనము తయారుచేయు ప్రణాళికయందు మార్పులకు వీలుండవలెను. మనము ఆశించెడు ప్రమాణములలో మాత్రము అనిర్దిష్టత యుండరాదు. వ్యవసాయమే మన ప్రజల ముఖ్యవృత్తి. కావున వ్యవసాయ ప్రణాళిక యనగా మనమాశించెడు ఆహారోత్పత్తి ప్రమాణమునకై ప్రణాళిక తయారుచేయుటయే కాగలదు. ఆహారోత్పత్తిని మనము నూటికి 30 నుండి 40 వంతులవరకు హెచ్చించుట ఆవశ్యకము. ప్రణాళికా కాలములోనే మన జనసంఖ్యయు పెరుగుచుండును. రాబోవు 20 సంవత్సరములలో మనదేశపు జనసంఖ్య సుమారు 50 కోట్లు కాగలదు. జనసంఖ్య అభివృద్ధి, సంఘములోని నేటి ఆదాయములలో పెట్టుబడికై వెచ్చింపబడిన భాగము, ఆ పెట్టుబడిపై అధికోత్పత్తి రూపమున లభించిన ప్రతిఫలము అను విషయములపై మన ఆర్థికాభివృద్ధి ఆధారపడును. ఎంత నిష్పత్తిలో పెట్టుబడి పెట్టబడినది అనునది చాల ముఖ్యవిషయము. ఆర్థికముగా వెనుకబడియున్న దేశములలో అట్టిది స్వల్పముగా నుండక తప్పదు. వ్యక్తిగతకృషికి మన మెల్లవిషయములు వదలివేయ జాలము. ఆర్థికముగా వెనుకబడియున్న దేశములలో ప్రణాళికానుసరణము ఆవశ్యకము. కేవలము మనకు అధికముగా ఆహారము కావలసియుండుట మాత్రమే మన వ్యవసాయాభివృద్ధికి కారణముగాదు. ఆహారమును ఎగుమతి చేసి, మనకు కావలసిన వస్తు సంచయమును దిగుమతి చేసికొనుటకు గూడ వ్యవసాయాభివృద్ధి ఆవశ్యకము. విదేశ మారక ద్రవ్యము మనదేశమునకు అత్యావశ్యకము. వస్తువులను ఎగుమతి చేయు శక్తిలేనియెడల మన ఆర్థిక పతనము అనివార్యము కాగలదు. మన వ్యావసాయక పునాదులను గట్టిచేసికొనని యెడల మన ఆర్థిక వ్యవస్థ సుస్థిరము కాజాలదు. కావున వ్యవసాయోత్పత్తి ఆవశ్యకము. కావున దానిని నూటికి 30-40 పాళ్ళవరకు హెచ్చింపవలెను. నేడు ప్రపంచమున వ్యవసాయ ఉత్పత్తి మిగుల తక్కువలో నున్నది. మన ఉప జలాధారములను వృద్ధిచేసికొని, పెద్ద వానినుండి పూర్తిలాభములను పొందినయెడల అట్టిది

మనకు అసాధ్యము కాజాలదు. నేడు మన జనసంఖ్య 36 కోట్లు. జనసంఖ్య పెరిగినకొలదియు మనకు అవశ్య కము కాగల ఉత్పత్తి ప్రమాణము ఈదిగువను సూచింప బడినది:-

| సంవత్సరము | జనసంఖ్య లక్షలలో | కావలసిన వ్యవసాయోత్పత్తి లక్షలలో | అభివృద్ధి ఆశయ ప్రమాణము లక్షలటన్నులలో |
|---|---|---|---|
| 1961 | 4100 | 850 | 150 |
| 1971 | 4600 | 960 | 260 |
| 1981 | 5200 | 1080 | 380 |

ప్రజల అవసరములు తీర్చుటకై మనము ఉత్పత్తిని 1981 కి నూటికి 30-40 వంతులు హెచ్చింపవలసియున్నది. మన జలాధార ప్రణాళిక లన్నియు పూర్తియైనపుడు మన వ్యవసాయోత్పత్తి 36 లక్షల టన్నులు మాత్రమే పెరుగగలదు. ఈనాటికొరతలు తీర్చుటకు 150 లక్షల టన్నులు కావలసి యుండును. పెరుగుదలలోనున్న మన జనాభాకుగల ఆహార వసతులు మిగుల తక్కువలో నున్నవి. ఉత్పత్తిశక్తి సామర్థ్యములు తక్కువయగుటచే వారు జాతీయాదాయాభివృద్ధికి చేదోడు ఇయ్యగల వయస్సులోనే అకాలమరణమునకు గురియగుచున్నారు. వ్యవసాయాభివృద్ధి ప్రణాళిక సామ్యవాద వ్యవస్థాను గుణ్యము కావలసియున్నదను విషయము యథార్థము. సహజ సంపదలను భూ వినియోగమును గూర్చి సరియగు రీతిని ప్రణాళికలు వేసికొన వలయునని దీని అర్థము. వ్యవసాయము అందరకు పని కల్పింపజాలదు. ఆర్థికముగ ఉన్నతస్థితిలోనున్న దేశములలోగూడ అదనపు జనాభాను చేతిపనులలోను, చిన్నపరిశ్రమలలోను నియోగించు చున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికయందు చిన్న పరిశ్రమలకు, కుటీరపరిశ్రమలకు ప్రాముఖ్యము. ఇచ్చుటకు ఇదియే కారణము. ఉత్పత్తి పెరుగుదల, జాతీయాదాయము హెచ్చుట, ప్రజల జీవన ప్రమాణాభివృద్ధి యందు మూలమున సాధింపబడగలవు. జనసంఖ్యను పరిమితము చేయనియెడల ఈదేశము అభివృద్ధి పొందజాలదు.

అస్థిరమైన మన ఆర్థిక సాంఘిక వ్యవస్థపై జన సంఖ్య పెరుగుదల ఫలితములు అనునవి ముమ్ముందు మనల నెదుర్కొనబోవు ముఖ్య సమస్యలలో నొకటి. ప్రణాళికానుబంధమైన నిర్దుష్ట విధానముతో ఈ సమస్యను అనుబంధించవలెను. ఇందులో గల సాధక బాధకములు సుస్పష్టము లే. కాని మనదేశపు భవిష్యత్తునుగూర్చి ధైర్య ముగ ప్రణాళికలు వేయవలెను. వ్యవసాయమేగాక యితర వృత్తులనుగూడ వృద్ధిచేయనియెడల మనము ప్రజల అవసరములను తీర్చుట మిగుల కష్టము కాగలదు. భూ వసతులను ఖండోపఖండములుగ విభజించుట, ముక్క చెక్కలు చేయుట, భూ యాజమాన్యము, గృహపరిశ్ర మల అభివృద్ధి మనము పరిష్కరింపవలసిన ఇతర సమ స్యలు. ఖండోపఖండములుగను, ముక్కచెక్కలుగను, భూ విభజనము, భూ యాజమాన్యము విషయములలో తీవ్రములగు భూ సంస్కరణము లిదివరకే హైదరాబాదు మున్నగు వివిధ రాష్ట్రములందు ప్రవేశపెట్టబడినవి. రైతుకు సమంజసమైన ప్రతిఫలము లభించురీతిని భూ వసతుల పరిమాణమును నిర్ణయింపవలసి యున్నది. నేటి మన ప్రత్యేక పరిస్థితులను దృష్టియం దుంచుకొని భూ వసతుల గరిష్ఠ ప్రమాణము (**Maximum Holding**) ను నిర్ణయించవలెను. కాని తన్మూలమున వ్యవసాయోత్పత్తి కెట్టి ఆటంకము కలుగకుండునట్లు చూడవలసియున్నది. ఆ ప్రమాణము అత్యధికము గాని, అత్యల్పము గాని కారాదు. రైతుకు భూమిని దున్నుకొనుటకు రక్షణ యివ్వవలెను. వ్యవసాయ సహకార సంస్థల నిర్మాణము మన అంతిమ ఆశయము కావలెను. జపాన్‌పద్ధతిని వరి సాగుచేయుటవంటి నూతన ఉత్పత్తి విధానములను అనుసరించవలెను. భారత వ్యవసాయము ఋతుపవన ములతో జూదమాడుటవంటిది. కావున రైతులకు ఉప వృత్తులు కల్పించుటకై గృహపరిశ్రమలను ప్రోత్సహించ వలెను.

**వెనుకబడియున్న ఆర్థిక వ్యవస్థలో కుటీర పరిశ్రమ ప్రణాళికలు:-** ద్వితీయ పంచవర్షప్రణాళిక వంకకు ఉద్య మించుచున్న మనయొక్క భుజములపైగల బాధ్యత అపారమైనది. అది ప్రజలెల్లరియొక్క సంక్షేమమును పరిగణింపవలసి యుండును. మన ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందని అర్థికవ్యవస్థ. సంపదలు, మనుష్యశక్తి మనకు అపారముగా గలదు. అయితే అవి ఇంతవరకు సక్రమ ముగా వినియోగించుకొనబడలేదు. జీవనప్రమాణము

హెచ్చుచేయుటకు ప్రయత్నించుట అవసరము. పౌరు లెల్లరు ఆర్థికాభ్యుదయ కార్యక్రమములో ప్రముఖపాత్ర వహింపజాలెడు ఆర్థిక వ్యవస్థానిర్మాణమునకు మనము ప్రయత్నించవలెను. స్వల్ప సగటు ఆదాయము, ప్రాముఖ్యముగా వ్యవసాయాధారమైన ఆర్థికవ్యవస్థ, అధికముగా పెరిగిపోయెడు జనసంఖ్య, అధికమైన దామాషా జననమరణాలు, భారీపరిశ్రమలులేమి - ఇవి వెనుకబడియున్న ఆర్థిక వ్యవస్థయొక్క కొన్ని లక్షణములు. జనసంఖ్య పెరుగుదలను ఆపుచేసెడుచర్యలు, సంపదలను వినియోగించుటకు సాంకేతిక నైపుణ్యము అత్యవసర విషయములు. జలవిద్యుచ్ఛక్తి యంత్రముల స్థాపనకు, జలాధారముల నిర్మాణమునకు, వ్యవసాయములో యంత్ర విధానములు ప్రవేశపెట్టుటకు అభివృద్ధిచెందిన దేశములు వెనుకబడిన దేశములకు తోడ్పాటు నియ్యవలెను. దురదృష్టవశమున హద్దుపద్దులు లేక పెరిగిపోయెడు జనసంఖ్య ఆర్థికాభివృద్ధికి ఒకపెద్ద అడ్డంకియైనది. బహుముఖాభివృద్ధిని సాధించుటకు కాలవ్యవధి, పాశ్చాత్య దేశములవారి తోడ్పాటు అవసరము. కావున స్వల్పకాలములోనే సత్ఫలితముల నీయజాలెడు ఉపాయములను మనము అన్వేషించవలసియున్నది. మానవుల అనుదిన జీవితమును సుఖప్రదముచేయుట యనే మహాప్రయత్నములో మనము నిమగ్నులమై యున్నాము. నిరుద్యోగముకన్నను చాలినంత పనిలేకపోవుట భారత దేశమును, ఆసియాయందలి ఇతరదేశాలను పీడించుచున్న గడ్డువ్యాధి. జీవనప్రమాణాలు బహుతక్కువగా నుండుటకిదియే హేతువు. జనసంఖ్య పెరిగిపోవుటవలన వ్యవసాయములో నిమగ్నులయినవారిసంఖ్య సాగులోనున్న భూవిస్తీర్ణమునుబట్టి ఉండవలసినదానికంటెను అధికముగా నున్నది. దుష్టములయిన భూయాజమాన్య విధానములు, సామర్థ్యరహితములైన వ్యవసాయపద్ధతులు, మిగుల చిన్నవైన వ్యక్తిగత భూవసతులు జీవితముపట్ల అనాది సిద్ధమైన అవకతవకదృక్పథము— ఈ సమస్యను మిగుల క్లిష్టతరము చేయుచున్నవి. జనసంఖ్య వృద్ధిని తగ్గించుట అవసరము. వ్యవసాయ కూలీలసంఖ్య ఉద్యోగావకాశములను మించి పెరిగిపోవుచున్నది. మన వ్యవసాయము ఋతుపవనములతో జూదము కావున చాలినంతపనిలేకుండుట మన ఆర్థికవ్యవస్థకు పంటబట్టిన రోగమై పోయినది. పరిశ్రమలు నెలకొల్పుటద్వార ప్రజలను గ్రామసీమల నుండి పట్టణములకు మార్పుచేయగలము. కాని పెట్టుబడి నిర్మాణము శీఘ్రముగ వృద్ధిపొందకుండుటచే, అందులకు అత్యావశ్యములైన ఆర్థిక వసతులు సమకూరకున్నవి. భారతదేశమునందు ఇంతవరకు ఆంగ్లవ్యవసాయవిప్లవము వంటి విప్లవముయొక్క ఛాయలైనను బొడచూపుటలేదు. నేటి చేతిపనులలోను, చిన్నపరిశ్రమలలోను నవీన పద్ధతులను ప్రవేశపెట్టియు, వానిని తద్వారా వృద్ధిచేసి జీవనప్రమాణమును పెంచవచ్చును. అవి గ్రామసీమలందే కలవు. కావున వానిద్వార రైతులయొక్క పెక్కు అవసరములను తీర్చవచ్చును. అవి నేటికిని పెక్కుమందికి జీవనాధారములుగ నున్నవి. భారతదేశమునందు 2 కోట్ల మంది చిన్నపరిశ్రమలలో, కుటీరపరిశ్రమలలో పనిచేయుచున్నారు. కావున వానిని వృద్ధిచేయుట సమంజసమైన విషయము. చేనేత పరిశ్రమద్వార దేశమున తయారగు బట్టలో నాల్గవ వంతు ఉత్పత్తి యగుచున్నది. సింహళములో ఇట్టి పరిశ్రమలు (చిన్నపరిశ్రమలు, కుటీర పరిశ్రమలు) మొత్తము జనసంఖ్యలో పదవ వంతుకు పని కల్పించుచున్నవి. దీనినిబట్టి జనసంఖ్యలో పెక్కుమందికి పనికల్పించి, వ్యవసాయముపై నాధారపడిన జనుల జీవన ప్రమాణముయొక్క పెంపుదలకు దోహద మివ్వజాలునను విషయము స్పష్టమైనది. భారీపరిశ్రమల పోటీవలన పతనమునకు గురియైన ఈ పరిశ్రమలలో నవీన పద్ధతులను ప్రవేశపెట్టి, వాటికి నూతన శక్తి సౌష్ఠవములను చేకూర్పవలెను.

గృహపరిశ్రమలు, చిన్నపరిశ్రమలు ఆవశ్యకములా ? యని తర్జనభర్జనలు చేయవలసినకాలము గతించినది. వానికి మన ఆర్థికవ్యవస్థలో అత్యధిక ప్రాధాన్య మున్నది. వానివలన తయారగు వస్తుసంచయము హెచ్చుకాగలదు. పెట్టుబడి పెట్టుటకు మనకుగల శక్తి స్వల్పమైనది. కాని మనకు అపార మనుష్యశక్తి సంపద గలదు. భారీ పరిశ్రమలు వృద్ధిపొందరాదని ఎవరి అభిమతమును కాదు. కాని నేటి పరిస్థితులలో గృహపరిశ్రమలు, చిన్నపరిశ్రమలు మాత్రమే ఉత్పత్తిని పెంచుటలోను, ప్రజావసరములను తీర్చుటలోను స్వల్పకాల సత్ఫలితముల నియ్యగలవు.

కర్మకారుల ఉత్పత్తి పద్ధతులను అభివృద్ధిచేసినయెడల వారు చేయు వస్తూత్పత్తి యెంతయో అధికము కాగలదు. ఇంతటి శిక్షిత మనుష్యశక్తి విలువ నుపేక్షించుట, వస్తువులను, సంపదలను వ్యర్థముచేయుట మాత్రమే కాగలదు. చిన్నపరిశ్రమలద్వారాను, కుటీర పరిశ్రమలద్వారాను ఉత్పత్తిచేయువారిని అశ్రద్ధచేయుట అవాంఛనీయమైన చర్య కాగలదు. ఈ పరిశ్రమలలో నిమగ్నమైన అధికసంఖ్యలో నున్న జనులను అందుండి తొలగింపజాలము. వ్యవసాయదారులకు ఉపవృత్తుల యొక్క ఆవశ్యకతయు అంతటి ప్రాధాన్యముగల విషయమే. గృహ పరిశ్రమలను, చిన్న పరిశ్రమలను నిర్లక్ష్యముచేసి కేవలము భారీపరిశ్రమలను మాత్రమే ప్రోత్సహించు విధానమువలన అప్రధానసంఖ్య గల ఒక వర్గమువారి జీవనప్రమాణము పెరుగుటకు దోహదము కలుగుటయు, వ్యవసాయముపై నాధారపడిన తక్కిన వారిని దారిద్ర్యముపాలుచేయుటయు కాగలదు. జన సంఖ్యలో నూటికి 70 మంది గ్రామసీమలందు నివసించు చున్నారు. గ్రామసీమలందలి అదనపు జనాభాకు జీవనోపాధి చూపించవలెను. జనసంఖ్యలోని అన్నివర్గములకు పనిచూపించుటయే భారత దేశార్థికాభ్యుదయ సమస్య యొక్క కీలకము. మనదేశములోని జనులలో అధిక సంఖ్యాకులు గ్రామనివాసులగుట, వారి ప్రధాన జీవనోపాధి వ్యవసాయమే యగుట, వారికి చాలినంతపని లేకుండుట వాస్తవ విషయములు. ఈ పరిస్థితులనుండియే కుటీర పరిశ్రమల ఆవశ్యకత ఉద్భవించుచున్నది. ఈ పరిస్థితులనుండి సంభవించిన రుగ్మతకే ఈ పరిశ్రమలు దివ్య ఔషధములు.

కుటీర పరిశ్రమలు పెక్కుమందికి పని కల్పించి, సంపదను సృష్టించుటతోపాటు అది విస్తృతముగా విభజనయగుటకు దోహద మివ్వగలవు. అసమర్థుడగు కార్మికుని సృష్టి స్వల్పమే కావచ్చును. కాని శరీర సౌష్ఠవము కలవారందరికి పనికల్గించుట యనునది మనముందు గల సమస్య. ప్రజలకు స్వగృహములందే పని కల్గించుట చిన్న పరిశ్రమలయందలి విశిష్టమైన సౌకర్యము. చిన్న పరిశ్రమలలోను కుటీర పరిశ్రమలందును కూడ సాంకేతిక విధానములను వృద్ధిచేసి, గ్రామసీమలు కలకలలాడునట్లు చేయవచ్చును. నేడు జనసంఖ్యతో పోల్చిన పెట్టుబడి అవకాశములు తక్కువగా నున్నవను విషయమును మనము విస్మరింపకుందుముగాక. పెట్టుబడి అవకాశములును మిగుల మందముగా వృద్ధియగుచున్నవి. తాత్త్విక చర్చలవలన ఈ సమస్యలు పరిష్కారము కావు. పెట్టుబడి కొదువగ నున్నప్పుడు ముడి సరకులను సంపదలను సమంజసమగురీతిని వినియోగించుటకు వీలుకాదు. ఒక మొత్తమును చిన్న పరిశ్రమలకు గృహపరిశ్రమలకు పెట్టుబడిగా వినియోగించినయెడల అందుమూలమున ఎక్కువ పరిశ్రమా విభిన్నత్వము, పరిశ్రమావికేంద్రీకరణము, మరియు తొందరలో సత ఫలితములు ప్రాప్తించగలవు.

మన ఆర్థిక సమస్యను గ్రహించినవారికి జనసంఖ్య సమస్యను గూర్చియు, సంతాన నిరోధమును, పద్ధతుల గూర్చియు తాత్త్విక చర్చలవలన నిది పరిష్కరింపబడదన విషయము సుస్పష్టమే. దేశమున బహుళసంఖ్యలోగల ప్రజలకు పని కల్పించనలెనను వాస్తవికదృష్టితో ప్రణాళికలు తయారు చేయుటయే యిందులకు పరిష్కార మార్గము. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చిన్న పరిశ్రమలకు, గృహపరిశ్రమలకు ప్రాముఖ్యము ఇవ్వబడిన కారణమిదియే. జపాను, స్విట్జర్లండు దేశములందు పరిశ్రమలు అద్భుతముగ వృద్ధియగుటకు కారణము వానికై జాగరూకతతో ప్రణాళికవేసి, శ్రద్ధతో తదనుగుణ్యముగ వృద్ధిచేయుటయే. భారతదేశమున గూడ వానినట్లే వృద్ధిచేసి తద్వారా రైతుల పరిస్థితిలో మార్పు కల్గించుట అసాధ్యమగు విషయముగాదు.

చిన్న పరిశ్రమలను గృహపరిశ్రమలను గురించి ప్రణాళికలు వేయుట ఇటీవలి విషయము. మన ఆర్థిక వేత్తలలో పెక్కుమందికి వీనిలో ఇటీవలి వరకు నమ్మకము లేదు.

గత 5 సంవత్సరములలో కుటీరపరిశ్రమాభివృద్ధి హైద్రాబాదు ప్రభుత్వము మిగుల నిర్దుష్టమైన చర్యలు తీసికొనినది. పారిశ్రామిక సహకారసంఘముల సమాఖ్య వీని ఉత్పత్తికి ధనసహాయము, విక్రయ సదుపాయము కల్గించుచున్నది. ప్రభుత్వ వాణిజ్య పరిశ్రమలశాఖ ఉత్పత్తి విధానముల వృద్ధిపొందించుటకు శిక్షణ కేంద్రము

నేర్పాటుచేయుటయేగాక సాంకేతిక ప్రవీణ వ్యక్తులలో నిరుద్యోగ నిర్మూలనకై సహకారకృషి కేంద్రముల స్థాపనకుద్యమించినది. గ్రామసీమలలో పరిశ్రమల నెల కొల్పు ప్రణాళికలో గ్రామీణ కర్మకారుల సహకారము పొందుటకై విద్యుచ్ఛక్తితో నడుపబడు యంత్రముల వినియోగించు గ్రామీణ కర్మకారులకు తరిఫీదు ఇచ్చు చున్నది. అనేక జలప్రణాళికల మూలమున వివిధప్రాంత ములకు విద్యుచ్ఛక్తి సరఫరా కానున్నది. చిన్నపరిశ్రమ లను, గృహపరిశ్రమలను నవీనపద్ధతులు అవలంబించునట్లు చేయుట కిది అపూర్వతరుణము.

వ్యవసాయాభివృద్ధికి ప్రణాళిక వేయుటలో అనుసరించ వలసిన ప్రధానసూత్రములు పైన సూచింపబడినవి. పర స్పర సమన్వయము, ఐక్యతగల ప్రణాళిక మనకు కావలసి యున్నది. మున్ముందు పెక్కు సంవత్సరముల వరకు వ్యవసాయము మనప్రజల ప్రధాన జీవనోపాధియై యుండుట తప్పదు. ఈనాడు అది లాభసాటికాని పరి శ్రమ. అట్లుగాక అది రైతుకు గిట్టుబాటుగా నుండుటకు చర్యలు తీసికొనవలెను. వ్యవసాయమునుగూడ మన మొక పరిశ్రమగానే పరిగణించిననాడే అది సాధ్యమగును.

ఆర్. వి. రా.

**ఆర్యభటుడు :-** భారతీయ జ్యోతిశ్శాస్త్రములో ఆర్ష సిద్ధాంతముల తరువాత శాస్త్రీయ సిద్ధాంత గ్రంథ ములను రచించినవారిలో ఆర్యభటుడు మొదటివాడుగ చెప్పబడుచున్నాడు. ఇతడు క్రీ. శ. 476 లో జన్మించి నట్లు తన గ్రంథములోని ఈ శ్లోకమువలన తెలియ గలదు.

శ్లో. షష్ట్యబ్దానాం షష్టి ర్యదా
వ్యతీతా స్త్రయ శ్చ యుగపాదాః
త్ర్యధికా వింశతి రబ్దా స్త
దేహ మమ జన్మనో ఒతీతాః
(కాలక్రియాపాదము 10)

అనగా ఈ వైవస్వత మన్వంతరములో మూడు యుగ పాదములగు కృత, త్రేతా, ద్వాపరములును, నాలుగవ పాదమగు కలిలో $60 \times 60 (= 3600)$ సంవతరములు తన గ్రంథారంభము నాటికి గడచినవనియు, అప్పటికి తనకు ఇరువదిమూడు సంవత్సరములు నిండినవనియు అర్థము. దీనినిబట్టి అతడు శా. శ. 398 (క్రీ. శ. 476) లో జన్మించి శా. శ. 421 (క్రీ. శ. 499) లో తన గ్రంథమును రచించెనని స్పష్టము. గణితపాదములోని ప్రథమ సూత్రమునందలి 'కుసుమపురే' అను పదమును బట్టి ఈతడు పాటలీపుత్రమునకు సంబంధించిన వాడని విదితము.

ఇతడు రచించిన గ్రంథము "ఆర్యభటీయ" మని వ్యవహరింపబడుచున్నది. ఇది భారతదేశమందలి మొట్ట మొదటి అనార్షమగు జ్యోతిశ్శాస్త్రగ్రంథము. తన గ్రంథమునకు మూలభూతమైన ప్రాచీన పరిజ్ఞానమును గూర్చి ఆర్యభటుడిట్లు చెప్పెను.

శ్లో. సదసజ్ జ్ఞాన సముద్రా
త్సముద్ధృతం దేవతా ప్రసాదేన,
సజ్ జ్ఞానోత్తమ రత్నం
మయా నిమగ్నం స్వమతినావా.

ఈ శ్లోకమునుబట్టి ఆర్యభటుడు తననాటికి వాడుకలో నున్న బహుళ జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయములను తన బుద్ధి విశేషముచే పరిశీలించి వాటియందలి దోషములను పరిహరించుచు యథార్థమగు ఖగోళ సిద్ధాంతములను రచించెనని తెలియుచున్నది. జ్యోతిశ్శాస్త్ర నిర్ణయములు ప్రయోగ పూర్వక పరిశోధనములతోనే సాధ్యపడునవి యగుటచే అతడట్టి పరిశోధనలను సలిపియే శాస్త్రీయము లగు సిద్ధాంత ఫలితములను పొందగలిగెనని విదితమగు చున్నది. అతడు తన గ్రంథములో పరిశోధన ఫలితములను సూత్రప్రాయముగా చెప్పియున్నను అందుకు ప్రధాన అంగమగు గణితమును ప్రత్యేకించి చెప్పెను. ఈవిషయ మతని స్వతంత్ర పరిశోధనముల ప్రాముఖ్యమును వెల్లడించును. పాండురంగస్వామి, లాటదేవుడు, నిశ్శంకుడు, మొదటి భాస్కరుడు మొదలుగాగల శిష్యులు పెక్కురు ఇతనియొద్ద పరిశోధనాత్మకశాస్త్రము నభ్యసించినట్లు ప్రతీతికలదు. ఈ గ్రంథములో చెప్పబడిన ఖగోళ స్థిరాంకముల తులనాత్మక పరిశీలనమును బట్టి ఆర్యభటీయము స్వతంత్రగ్రంథమే అని స్పష్టమగుచున్నది. మరియు భారతీయ జ్యోతిశ్శాస్త్రము గ్రీకు సంప్రదా యము యొక్క అనుకరణమను పాశ్చాత్య విమర్శకుల వాదము అప్రాప్తమగుచున్నది. ఆర్యభటుడు తన సరి

శోధన ఫలితములతో, స్వప్రతిభా విశేషమునుబట్టి ప్రాచీన సిద్ధాంతములను సంస్కరించుచు స్వతంత్ర గ్రంథమునే రచించెనని పండితలోక విశ్వాసము.

ఆర్యభటీయములో గణితపాదము, కాలక్రియా పాదము, గోళపాదము అను మూడుభాగములుకలవు. వీటిలో వరుసగా 33, 25, 50 సూత్రములును, గ్రంథాదియందు 13 గీతిసూత్రములును మొత్తము 121 సూత్రములు ఆర్యావృత్తములలో గలవు. ఈ గ్రంథమునకు సూర్యదేవయజ్వ (1294), పరమేశ్వ రాచార్య (1430), నీలకంఠసోమసుత్వ (1550) అను వారలు సంప్రదాయసిద్ధములగు ప్రామాణిక వ్యాఖ్య లను రచించిరి. కొందరు ఆధునిక వ్యాఖ్యాతలు కూడ కలరు. వారిలో కొటికలపూడి కోదండ రామ సిద్ధాంతి (1870) సుధాతరంగ మను వ్యాఖ్యను తెలుగులో రచించెను. ఇది అముద్రితము. పాశ్చాత్యుల ఆంగ్లాను వాదములు కూడ కొన్నికలవు.

విషయ పరిశీలనము : గీతిసూత్రములు :- ఇవి గ్రంథాది యందు ఉపోద్ఘాతరూపమున జ్యోతిశ్శాస్త్రమునకు ఉప యుక్తములగు కొన్ని స్థిరాంకములను వివరించుచున్నవి. వీటిలో నొకటి పెద్దసంఖ్యలను తెలుపువిధమును గూర్చిన పరిభాష. అది ఇట్లుండును: వర్ణక్రమములోని క కారాది మకార పర్యంతము గల 25 వర్గాక్షరములు, ఒకట్లు, వందలు, పదివేలు, పదిలక్షలు మొదలగు బేసి స్థానముల లోని సంఖ్యలను, యకారాది హకారపర్యంతము గల అవర్గాక్షరములు పదులు, వేలు, లక్షలు మున్నగు సరి స్థానములలోని సంఖ్యలను తెలుపును. 'య' కారము ప్రత్యేకముగా 'ఙ్మయః' అని ముప్పదికి సమముగా (ఙ+మ=5+25=30) నిర్దేశింపబడెను. కాని ఒక స్థానములో రెండుస్థానములు గల ముప్పదిని ఇముడ్చుట అర్థరహితము గనుక 'య' కారము సరి స్థానములలో 3కు సమము. అట్లే ర=4, ల=5, వ=6, శ=7, ష=8, స=9. ఈ వర్గ, అవర్గ అక్షరములకు అనుబద్ధ ములై యుండు అ, ఇ, ఉ, ఋ, ఌ మున్నగు అచ్చులు, ఆ హల్లు ఎన్నవ బేసి లేక సరి స్థానములోని సంఖ్యకై వాడబడెనో తెలుపును. ఉదా : ఖ్యుఘృ=4,32,00,00 (ఖ్=2, య్=3). ఇవి మూడవ అచ్చు అగు ఉకార ముతో నున్నవి గనుక ఇవి మూడవ బేసి సరిస్థానములలోని సంఖ్యలగును. అనుక్తములు శూన్యములు. ఘ్=4 బేసిస్థాన ములో ఇది నాలుగవ అచ్చు అగు 'ఋ'తో కలిసియున్నది. కనుక ఆ బేసి స్థానములోని విలువకలదియగును. అట్లే

చ యగ్వి ఙు శు ఛ్లృ = 57,75,33,36

ఙి శి బు ఌష్టృ ఖ్యో = 15,82,23,75,00

(గీతి సూ. 2)

అంకానాం వామతో గతిః అను వచనమును ఈ గణనయందు గమనింపవలెను.

ఇట్టి గణనము తరువాతివారగు భాస్కరాదులచే వాడబడలేదు గనుక ఇది ఆర్యభటునినాటి పద్ధతి యని ఊహింపనగును. ఈ సూత్రములందు చెప్పబడిన యుగ భగణములు, ఆకాశ గ్రహ నక్షత్ర కక్ష్యా యోజన పరి మితులు, విషువత్తునుండి గ్రహములయొక్క అతిక్రమణ పరిమాణములు, పాత (పతన) భాగలు, మందోచ్చ భాగలు మున్నగువానిని స్థిరాంకములు అందురు. ఇవి పంచాంగ కర్తలచే నేటికిని గ్రహింపబడుచున్నవి.

గణితపాదము :- జ్యోతిషగ్రంథములలో గణిత విభాగ మును ప్రత్యేకించి చెప్పినవారిలో ఆర్యభటుడు మొదటి వాడు. సంఖ్యలయొక్క స్థానక్రమము "స్థానాత్ స్థానం దశగుణం స్యాత్" (గ. పా. 2) అను దశగుణ విధానమ ననుసరించి ఒకట్ల నుండి పది కోట్లవరకు చెప్పబడెను. అంకగణితమునకు చెందిన సామాన్య పరికర్మలలో ముఖ్యములగు వర్గీకరణము, వర్గ సమీకరణములు, ఘనమూలానయనము, త్రైరాశికము, కుట్టకము అను విశేషములు సోదాహరణముగా వివరింపబడెను. మరియు కొన్ని క్షేత్రగణిత సమస్యలుకూడ చెప్పబడెను. వృత్త వైశాల్యము, గోళ ఘనపరిమాణము, త్రిజ్యా (radian) పరిమితి మున్నగు విషయములు సోదాహరణ ముగ తెలుపబడెను. "అన్ని విధముల క్షేత్రములకును ఇక్క పొడవు వెడల్పులను నిర్ణయించి వాటిని గుణించిన క్షేత్ర ఫలములు వచ్చును (సర్వేషాం క్షేత్రాణాం ప్రసాధ పార్శ్వే తదభ్యాసః —గణితపాదము 9) అని చెప్పుట ఆర్యభటుని క్షేత్రగణిత విషయక పరిజ్ఞానము అనల్పమ చెప్పకతప్పదు. కాని ఇతడు తన గ్రంథములో అవసరాను గుణముగా మాత్రమే చెప్పెను.

శ్రేఢీవ్యవహారములో, పదముల మొత్తమును కనుగొనుట, పదముల సంఖ్యను కనుగొనుట, వర్గశ్రేఢి, ఘనశ్రేఢి మున్నగు భేదములు చెప్పబడెను (గ. పా. 20-25). ఘనమూలమును సాధించుటలో ఆర్యభటుడే ప్రథముడని ప్రతీతి. ఆ విధానము కొంత క్లిష్టమైనను చెప్పతగియున్నది (గ. పా. 5). ఉదా: 1953125 యొక్క ఘనమూలమును (cube root) కనిపెట్టుట: సంఖ్యలో రెండేసి స్థానములను విడుచుచు ఒకట్ల స్థానము నుండి గుర్తించవలెను.

| | | | |
|---|---|---|---|
| మొదటి ఘనమూలమునకు మూడురెట్లతో భాగించవలెను. (1 × 3) | 1 | 19 53 125 | 1 |
| | | 1 | |
| | 3 | 9 | 2 (తరువాత ప్రక్రియకొరకై 2నే విభక్తముగా గ్రహించవలెను |
| | | 6 | |
| విభక్తముయొక్క వర్గమును ఘనమూలముయొక్క మూడురెట్లతో గుణించి తీసివేయవలెను. $2^2 \times (3 \times 1) = 12$ | | 35 | |
| | | 12 | |
| | | 233 | |
| విభక్తముయొక్క ఘనమును తీసివేయవలెను. $2^3 = 8$ | | 8 | |
| ఘనమూలముయొక్క వర్గమునకు మూడురెట్లచే భాగించవలెను. $12^2 \times 3 = 432$ | 432 | 2251 | 5 |
| | | 2160 | |
| | | 912 | |
| మరల $5^2 \times 3 \times 12 (= 900)$ ను తీసివేయవలెను. | | 900 | |
| | | 125 | |
| విభక్తముయొక్క ఘనమును ($5^3$) ను తీసివేయవలెను. | | 125 | |

∴ 1953125 యొక్క ఘనమూలము = 125.

అవ్యక్త సమీకరణములనుగూర్చి కూడ ఆర్యభటుడు చెప్పెను (గ. పా. 30). ద్వివర్ణవర్గసమీకరణములను ప్రత్యేకించి చెప్పకపోయినను అనేక సమస్యలలో వాడియుండెను. (గ. పా. 23, 24, 25). కుట్టకమను గణిత భాగమును సృష్టించిన మొట్టమొదటి భారతీయ గణకుడు ఆర్యభటుడే. కుట్టకమనగా ఒక దత్తసంఖ్యను ఏగుణకముచే గుణించిన వచ్చులబ్ధము దత్తహారముచే నిశ్శేషముగా భాగింపబడునో అట్టి గుణకమును కనుగొనుట, లేక దత్తహారములచే ఏ సంఖ్యను భాగించిన దత్తశేషములు వచ్చునో ఆసంఖ్యను కనుగొనుట. దీనిలో ఇంకను కొన్ని ప్రభేదములు గలవు. ఇట్టి గణితభాగము నేడు అనిశ్చిత సమీకరణములు (Indeterminate equations) అని వ్యవహరింపబడుచున్నది. దీనిరూప మిట్లుండును: దత్తసంఖ్య = ద. సం; దత్తహారములు = $\text{ద. హా}_1$, $\text{ద. హా}_2$; దత్తశేషములు = $\text{ద. శే}_1$, $\text{ద. శే}_2$; $\text{వి}_1$, $\text{వి}_2$ లు అవ్యక్తములై కనుగొనవలసిన విభాజకములు అయిన,

$$\frac{\text{ద. సం.}}{\text{ద. హా}_1} = \text{వి}_1 + \frac{\text{ద. శే}_1}{\text{ద. హా}_1} \qquad \text{(i)}$$

అట్లే
$$\frac{\text{ద. సం.}}{\text{ద. హా}_2} = \text{వి}_2 + \frac{\text{ద. శే}_2}{\text{ద. హా}_2} \qquad \text{(ii)}$$
కావున

$\text{ద. సం.} = \text{వి}_1 \times \text{ద. హా}_1 + \text{ద. శే}_1 = \text{వి}_2 \times \text{ద. హా}_2 + \text{ద. శే}_2$
$= \text{వి}_1 \times \text{ద. హా}_1 - \text{వి}_2 \times \text{ద. హా}_2 = \text{ద. శే}_2 - \text{ద. శే}_1 = \pm$ ఒక స్థిరరాశి.

ఈ సమీకరణములో $\text{వి}_1$, $\text{వి}_2$ లు మాత్రమే అవ్యక్తరాసులు, వీటి విలువలో ఒకదానిని అనుసరించి మరియొకటి ఉండును. ($ax - by = \pm c$ అను $x, y$ ల ప్రథమ పరిమాణములోని అనిశ్చిత సమీకరణము వంటిది.) ఈ సమీకరణమును సాధించుటకై భాజ్య, హారములు అల్పతమము లగునంతమటుకు (గ. సా. భా. లో వలె) భాగించుచు చేయవలెను గనుక దీనికి కుట్టకమని పేరు వచ్చెను. దీనిలోని ప్రభేదములు గణితపాదములోని 32-35 లలో గలవు. ఈ విధానమును అనుసరించి ఒక గ్రహము యొక్క వ్యక్తాంశములనుబట్టి వేరొక గ్రహము యొక్క అవ్యక్తాంశములను కనిపెట్టవచ్చును.

కాలక్రియాపాదము:- దీనియందు గ్రహగతులు వివరింపబడినవి. భూకేంద్రముతో సమానకేంద్రము (concentric) గల వలయము కక్ష్యామండలమనియు, అపగతకేంద్రము (eccentric) గల వలయము ప్రతిమండలమనియు చెప్పబడును. ప్రతిగ్రహము స్వప్రతి మండలమందు తిరుగుచున్నను కక్ష్యామండలమందు మధ్యగతి ననుసరించి తిరుగుచున్నట్లు కనిపించును. ఇది మధ్యగ్రహము.

భూమికి దూరముగనుండు ప్రతి మండలస్థానము 'ఉచ్ఛ' అనియు, సన్నిహితముగనుండు ప్రతి మండల స్థానము 'నీచ' అనియు పిలువబడును. ఉచ్ఛస్థానమునకు మందగతి ఫలసాధనము చేసినపుడు 'మందోచ్ఛ' అనియు, శీఘ్రగతి ఫలసాధనము చేసినపుడు 'శీఘ్రోచ్ఛ' అనియు చెప్పబడును. ఉచ్ఛస్థానమునుండి భుజఫలమును సాధించి ధన సంస్కారమును లేక ఋణ సంస్కారమును చేసినచో ప్రతిమండల వృత్తమునందు తిరుగు గ్రహము కక్ష్యామండల మందు స్ఫుటగ్రహమై కనబడును. ఇట్టి సంస్కారములకు వలయు కొన్ని స్థిరాంకములను ఆర్యభటుడు ప్రయోగపూర్వకముగా నిర్ణయించెను. అవి నేటికిని అట్లే వాడబడుచున్నవి. (గ్రహలాఘవము - మధ్యమాధికారము)




స్ఫుటగ్రహ సాధనమును తెలుపుపటము.

భూ = భూమి
గ్ర = దృశ్యమానగ్రహము
మ = మధ్యగ్రహము
స్ఫు = స్ఫుటగ్రహము
భు. ఫ = భుజఫలము
ఉ = ఉచ్ఛ
నీ = నీచ
క. మం = కక్ష్యామండలము
ప్ర. మం = ప్రతిమండలము.

గోళపాదము :- ఇందు ప్రయోగసిద్ధికై ఖగోళ కల్పనాదికములతో కూడిన యంత్ర నిర్మాణములు చెప్పబడెను. ఈ నిర్మాణములతో ప్రయోగవులను సలిపి రాత్రింబవళ్ల ప్రమాణములు, ఉదయాస్తమయ కాలములు, రాత్రింబవళ్ల వృద్ధిక్షయములు, ఆ యా దేశము లందు మేషాది రాసులయొక్క ఉదయకాల ప్రమాణములు, ఇష్టకాల నిర్ణయము, దృక్కర్మ విధానము, గ్రహణప్రకారము మున్నగు విషయము లన్నియు చెప్పబడెను. ఈ నిర్ణయములు గోళ త్రికోణమితికి చెందినవై శాస్త్రీయ నిరూపణములకు తగియున్నవి.

గ్రంథమందలి విషయము లన్నియు సాంకేతిక భూయిష్ఠము లగుటచేతను, సంక్షిప్తముగా సూత్రప్రాయములై యుండుటచేతను సంప్రదాయసిద్ధములుగా రచింపబడిన వ్యాఖ్యానములఅవసరము అనివార్యమైయుండును తరువాతివారగు బ్రహ్మగుప్తుడు, శ్రీధరాచార్యుడు భాస్కరాచార్యుడు మున్నగువారి ప్రతిభకు కూడ ఆర్యభటుడే మూలమని చెప్పకతప్పదు. వారందరు కొన్ని మార్పులతో ఆర్యభటుని నిర్ణయవిధానములనే బహుళముగా స్వీకరించియుండిరి. ఇట్లు దైవజ్ఞమూర్ధన్యుడగు ఆర్యభటుడు జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకులలో విశిష్టస్థానమును వహించుచు అగ్రగణ్యుడై వరలెను.

ఆర్యభటుని గూర్చి విమర్శకుల దృష్టిని ఆకర్షించు మరియొక విషయము భూభ్రమణ సిద్ధాంతము. అతడు ఇరుపక్షములవారికి అనువగు రెండు వాదములను చెప్పెను. 'పడవమీద పోవువారు ఒడ్డుమీద స్థిరముగనుండు వృక్షాదులను తమకు వ్యతిరేకదిశలో పోవుచున్నట్లు గమనించుదురు. అట్లే తిరుగుచున్న భూమిమీదనున్నవారు గ్రహ నక్షత్రాదులు తిరుగుచున్నట్లు భావింతురు. కాని అవి స్థిరముగనే యున్నవి' (గో. పా. 9) అని భూభ్రమణ సిద్ధాంతమున కనుగుణముగ చెప్పెను. అట్లే 'సూర్యాది గ్రహములకు ఉదయాస్తమయములను కల్పించుచున్న నక్షత్ర పంజరము ప్రవాహవాయువు ఎల్లప్పుడును ప్రేరేపింపబడుచు లంకాస్థానమున నుండువారి శిరోభాగమున సమపశ్చిమముగా కదలుచు తిరుగుచున్నది' (గో. పా. 10) అని నక్షత్ర భ్రమణము ప్రత్యేకించి చెప్పుటచే భూభ్రమణ సిద్ధాంతము నిరసిం

బడెను. మరియు ఆర్యభటునికి భూభ్రమణమే అభిమతమై యున్నచో ఇతర గ్రహములకువలె భూమికికూడ మధ్య స్ఫుటగతులను, వాటికి హేతుభూతము లగు మందోచ్చ శీఘ్రోచ్చ మున్నగు విషయములను అతడు నిరూపణ పూర్వకముగ చెప్పియుండెడివాడు. అట్లు చెప్పియుండక పోవుటచే ఆర్యభటునకు భూభ్రమణ సిద్ధాంతమునందు విశ్వాసములే దని గ్రహించవలసి వచ్చుచున్నది.

పు. ప. శా.

**ఆర్యసమాజము :-** ఇది యొక ధార్మికసంస్థ. మతసంస్థ కాదు. సాంప్రదాయికము కాదు. వైదిక సిద్ధాంతములను విశ్వమున నలుగడల వ్యాపింప జేయుటకై యీ ధర్మసంస్థ స్థాపింపబడినది. జగద్గురు శ్రీమద్దయానంద సరస్వతీస్వామి యీ సమాజసంస్థాపకుడు. ఇయ్యది విక్రమశకము 1932 చైత్రశుద్ధ పంచమి (క్రీ. శ. 1875 ఏప్రిల్ 10 వ తేది) నాడు బొంబాయి నగరమున ప్రారంభింపబడినది.



శ్రీ దయానంద సరస్వతీ స్వామి

శ్రీ దయానంద సరస్వతీస్వామి క్రీ. శ. 1824వ సం. న మౌర్వి రాజ్యములోని టంకారా గ్రామమున జన్మించిరి. వీరి పూర్వాశ్రమ నామము మూలశంకర్; తండ్రియగు కర్షన్‌జీ వైదికసంపన్నులు, శివభక్తులు. మూలశంకరుడు తన చిన్నతనమందే వేదాధ్యయన మొనరించి జననమరణ క్లేశములతో కూడిన యీ సంసారమునుండి ముక్తిమార్గము నన్వేషించుటకై ఇల్లువిడిచి సన్న్యసించెను. ఇది మొదలు అతడు దయానందసరస్వతి యని వ్యవహరింపబడుచుండెను. దయానంద సరస్వతి వైదిక సత్య సందేశమును విశ్వమంతటను వ్యాపింపజేయ సమకట్టి ఆర్యసమాజ మను పేరనొక సంస్థను స్థాపించెను. ఈ సంస్థకు దయానంద కృతములగు యజుర్వేద భాష్యము, ఋగ్వేదములోని ఏడు మండలముల భాష్యము, సత్యార్థ ప్రకాశము మున్నగునవి ప్రమాణ గ్రంథములు.

ఆర్యసమాజమునందలి మొదటి రెండు నియమములు పరమేశ్వరునకును, అతని గుణములకును చెందినవి. మూడవ నియమము వేదము సత్యజ్ఞానములకు చెందిన గ్రంథ మనియు, దాని నెల్లరు పఠింపదగుననియు తెలుపును. వేదాధ్యయనమున స్త్రీ పురుష భేదము కాని, మానవుని రంగుభేదముకాని, జాతిభేదముకాని పాటింపబడరాదనియు ఇయ్యది తెలుపును. నాలుగవనియమము అసత్యమును విడిచి సత్యమును గ్రహించుట ప్రతివానికి కర్తవ్యమనును. ఐదవ నియమము ఎల్లరు చెడుగునువదలి మంచిని గ్రహింపవలయునననును. ఆరు, ఏడు, తొమ్మిది నియమములు మానవులెల్లరు సర్వమానవ శ్రేయస్సునకై పాటుపడుటయే తమజీవితమునకు లక్ష్యముగా నుంచుకొన వలెనని బోధించును. ఎనిమిదవనియమము అందరి యజ్ఞానము బోనాడి జ్ఞానము కల్గించుటకు యత్నింప బోధించును. పదియవనియమము వ్యక్తి తనకు మాత్రము సంబంధించిన కార్యములలో స్వతంత్రుడై యితర కార్యములందు సమాజహితము కొరకు ప్రయత్నింప బోధించును.

**ఆర్యసమాజ మంతవ్యములు :** ఆర్యసమాజము వేదమూలకము లగు సార్వభౌమ ధర్మములను ప్రబోధింప నేర్పడిన సంస్థ కాబట్టి యిది ఆస్తిక సంఘమని వేరుగ చెప్పవలసినపనియుండదు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము ననెడి నాలుగు సంహితలు ఈ సంఘ దృష్టిలో ఈశ్వరీయములు. అందువలన అవి స్వతః ప్రమాణములు. మిగిలిన గ్రంథజాల మంతయు పరతః ప్రమాణము - వేదముల కనుకూలముగ నున్నంతవరకే యవి ప్రామాణికములు.

I ఈ దృశ్యమాన ప్రపంచమునకు మూలకారణములు మూడని యీ సంఘసిద్ధాంతము. (1) ఈశ్వరుడు, (2) జీవులు, (3) ప్రకృతి. ఇందు మొదటి రెండు పదార్థములు చేతనములు. మూడవదైన ప్రకృతి జడము.

(1) ఈశ్వరుడు :- సచ్చిదానంద స్వరూపుడు. నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావుడు. సృష్టి, స్థితి, లయములకు కారణభూతుడు. అద్యంతములు లేక నిర్వికారుడై, నిరంతరము సర్వాంతర్యామియై, జీవులకు కర్మఫలముల నొసంగుచుండును. అతడే విశ్వమున కధిష్ఠాత. శివుడు, విష్ణువు, మహాదేవుడు, బ్రహ్మము, పరమాత్మ, ఇంద్రుడు, అగ్ని, వాయువు మున్నగు అనేక నామములచే వేద శాస్త్రములందు పేర్కొనబడి యున్నాడు.

"ఏకం సత్ విప్రా బహుధా వదన్తి
అగ్నిం మిత్రం వరుణ మాహు రథో
దివ్యః స సువర్ణః"

ఓంకార మతనికి ముఖ్యనామము. ఓంకారమే ప్రణవమనియు చెప్పబడును. సృష్టిప్రారంభమునుండి ఋషులీ నామముతోనే యీశ్వరుని స్మరించిరి.

"తస్య వాచకః ప్రణవః" - యోగశాస్త్రము.

ఈశ్వరుడొక్కడే. అతనికి సమానుడుకానీ, అధికుడు కానీ మరియొకడు లేడు.

"అణో రణీయాన్ మహతో మహీయాన్" అనున దీతనియం దన్వర్థము.

ఈశ్వరుడు నిరాకారుడు. కావున నతడు శరీరధారి కాడు. రాముడు, కృష్ణుడు, క్రీస్తు, బుద్ధుడు మున్నగువారు మహాపురుషులేకాని ఈశ్వరుని యవతార పురుషులు కారు. వీరెల్లరు జీవకోటిలోనివారే. ఇట్టి ఈశ్వరు నుపాసించి జీవులు పరమపదము నందగలరు. జీవులు ముక్తు లగుటకు జీవేశ్వరులకు మధ్య అవతార పురుషులనుకానీ, సందేశహరులను కానీ, దేవుని ప్రియ పుత్రులను కానీ అంగీకరింపవలసిన యవసరములేదని ఆర్యసమాజము చాటి చెప్పెను.

ఈశ్వరుడు సృష్టి ప్రారంభమునందే మానవులకు వలయు జ్ఞానము, మహర్షుల పవిత్రాంతఃకరణములందు ప్రకాశింపజేసియున్నాడు. ఆ జ్ఞానమే వేదములనబడును.

ఈశ్వరుడు సర్వవ్యాపకుడు, నిరాకారుడు కావున నతనికొక ప్రతికృతి (బొమ్మ) కానీ, ప్రతిమ (విగ్రహము) కానీ యేర్పరుపజాలము. అందువలన విగ్రహారాధనము ఈశ్వరారాధనము కాదనియు, నది యపైదికమగుటచే త్యాజ్యమనియు నార్యసమాజము బోధించును.

ఆర్యసమాజము సగుణ నిర్గుణోపాసనముల నంగీకరించును. 'భగవంతుడాయాగుణములు (ఆనందాదులు) కలవాడనిభావించుట సగుణోపాసనము. ఆయాగుణములు (రాగద్వేషాదులు) లేనివాడని భావించుట నిర్గుణోపాసనమని ఈ సమాజము చెప్పును. ఈశ్వరుడు సగుణుడయ్యు సాకారుడుకాడు. అందువలన సాకారోపాసన ఈశ్వరోపాసనము కాజాలదని సమాజ మభిప్రాయపడుచున్నది.

(2) జీవులు:- రెండవ చేతన తత్త్వము జీవుడనబడును. సుఖము, దుఃఖము, ఇచ్ఛ, రాగము, ద్వేషము, జ్ఞానము, ప్రయత్నము మున్నగు గుణములు జీవుని లక్షణము. జీవతత్త్వము, ఈశ్వర తత్త్వమువలె సర్వవ్యాపకము కాక, అణుపరిమాణము కలదియై యుండును. కాని యిదియు పుట్టుక, నాశము లేనిదై యుండును. సర్వజ్ఞము కాక యల్పజ్ఞము, సర్వశక్తిమంతము కాక యల్పశక్తిమంతమై యుండును. ఇట్టిజీవులు ప్రతి శరీరమున కొక్కటి చొప్పున నసంఖ్యాకము లని యార్యసమాజ మంగీకరించును. ఇదియే శాస్త్ర సమ్మతము.

జీవులు కర్మచేయుటలో స్వతంత్రులుగా నుందురు ఫలము ననుభవించుటలో వారికి పారతంత్ర్యము తప్పదు అందువలన నిష్టమువచ్చినట్లు శుభాశుభ కర్మల నొనరించి వానికి తగిన ఫలముల నీశ్వరు డొసంగగా తప్పనిసరిగ వారనుభవింతురు. ఆయా కర్మల ఫలముల ననుభవించుటకు జీవు లొక శరీరమును విడిచి మరియొక శరీరమున బొందుచుందురు. అందువలన క్రిమికీటాది బ్రహ్మ పర్యంతము గల శరీరములు జీవులు కర్మానుగుణ ఫలము ననుభవింప ననువగు యోనులు. జీవులకు శరీరముతో సంబంధము కలుగుటను జన్మమనియు, శరీరముతో సంబంధము విడిపోవుటను మరణ మనియు నందురు జీవునకు స్వరూపతః జనన మరణములు లేవు.

"న హన్యతే హన్యమానే శరీరే"

"జీవులు జన్మింతురుకాని, వారికి నాశములేదు. అను సిద్ధాంతము బుద్ధి విరుద్ధమని యార్యసమా

మెంచును. జీవులు వేదవిహిత ధర్మములను కర్తవ్య బుద్ధితో నాచరించి నిస్సంగులైననాడు జన్మమరణ పరంపరనుండి ముక్తులగుదురు. ముక్తులైనవారు ప్రకృతి సంపర్కములేని పరమాత్ముని నిరవధికానంద స్వరూపమున యథేచ్ఛముగ విహరించుచు ముక్తిసుఖము ననుభవింతురు. పరాంతకాలము వరకు ముక్తిసుఖము ననుభవించి జీవులు మరల జన్మబద్ధు లగుదురు. జీవుల సావధిక ప్రయత్న ఫలమయిన ముక్తి నిరవధికము కాజాలదని యార్యసమాజ మంతవ్యము.

(3) ప్రకృతి :- దృశ్యమాన ప్రపంచమున స్థూలముగ గనబడు జడపదార్థముల కన్నిటికి నుపాదాన కారణము ప్రకృతి యనబడును. ఇది యచేతనమును, అత్యంత సూక్ష్మమును, పరమాణు రూపమును, పరిచ్ఛిన్నమునై యున్నది. పరమాణు రూపమగు నీ ప్రకృతి యుత్పత్తి వినాశములు లేక సదా యునికిగలదై యుండును. ఈ పరమాణువులు ఈశ్వరసంయోగముచే క్రియావంతములై పరస్పర సంయుక్తములై స్థూలతను బొందును. క్రమముగా పృథివ్యాది పంచభూతములు నిర్మితములగును.

ఈ ప్రకృతి సత్వరజస్తమోగుణాత్మికమై యింద్రియ గోచరముకాక యవ్యక్తము, అలింగము అనబడును. వ్యాపక పరమాత్మయందు దిది యేకదేశముననుండి వ్యాప్య మనబడును.

పరమాణువులు సంయోగముచే స్థూలతను బొందుట సృష్టియనబడును. అవి వియోగమువలన సూక్ష్మతను బొందుట ప్రళయ మనబడును. ప్రకృతిలోనిట్లు సంయోగ వియోగాత్మక పరిణామము కలిగించువాడు పరమేశ్వరుడు. ఈశ్వరుడు తన సామర్థ్యముచే కారణరూపమున నున్న ప్రకృతిని కార్యరూపగత వికృతిగా మార్చును. ఇదియే సృష్టి. అట్లే ఈశ్వరుడు కార్యరూపముననున్న వికృతిని కారణరూపమున మార్చును. దీనిని ప్రళయ మందురు.

ఆర్యసమాజమిట్లు దృశ్యమాన జడచేతనాత్మక ప్రపంచమునకు మూలకారణము ముప్విధములుగా నంగీకరించును. ఆ మూడు కారణములు సంక్షిప్తముగా జీవేశ్వర ప్రకృతు లనబడును. వేదములం దిట్లే వర్ణింపబడినది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్న న్నన్యో ఽభిచాకశీతి."

అందువలన ఆర్యసమాజము శంకర, రామానుజాది సంప్రదాయములం బోలి అద్వైతమో, విశిష్టాద్వైతమో, ద్వైతమో, ద్వైతాద్వైతమో బోధింపక వైదిక సిద్ధాంతమగు త్రైతమును బోధించును. చార్వాకుడు, కార్లాయిల్, మార్క్సు మున్నగువారు చెప్పునట్లు కేవల భౌతిక వాదమును కానీ, క్రైస్తవ మహమ్మదీయాది మత సంస్థ లంగీకరించునట్లు కేవల చేతన వాదనమును కానీ యార్యసమాజము ప్రబోధింపదు. భారతీయ వేదాంతులు బోధించునట్లు ఈ ప్రపంచము మిథ్య, మాయ, ఉనికిలేనిది యని యార్యసమాజ మంగీకరింపదు. గీతయందుచెప్పినట్లు 'నాసతో విద్యతే భావః, నాభావో విద్యతే సతః" అసత్తునకు భావముకానీ సత్తున కభావముకాని యుండదనుట బుద్ధిసంగతము, యదార్థము నగును. ఇతర మతవాదులు "మతమునందు విశ్వాసముంచవలసినదే కానీ హేతువాదమునకు, తర్కమునకు తావులేదు" అని చెప్పుదురు. ఆర్యసమాజము "య స్తర్కేణానుసంధత్తే స ధర్మో నేతరః" తర్కసిద్ధము ధర్మమగును. మతాంతరుల దృష్టిలో మతము, విజ్ఞానము (Religion & Science) పరస్పర విరుద్ధములు. ఆర్యసమాజ దృష్టిలో ధార్మిక సిద్ధాంతములు విజ్ఞాన విరుద్ధములు కావు. ఇయ్యది ఆర్యసమాజ మంగీకరించు తత్త్వనిర్ణయములకు సంబంధించిన సామాన్యస్వరూపము.

II కర్మపునర్జన్మసిద్ధాంతము :- ఆర్యసమాజము వైదిక కర్మసిద్ధాంతము నంగీకరించును. మానవులు మనోవాక్కాయముల ద్వారమున చేయు చేష్టలు కర్మ లనబడును. అందు శుభకర్మలకు సుఖరూపముననూ, అశుభకర్మలకు దుఃఖరూపముననూ మానవులకు ఫలముచేకూరుచుండును. జీవులు తాము చేయు కర్మలకు ఫలము ననుభవించియే తీరవలయును. స్థూలరూపముననే జీవులు సుఖదుఃఖ రూప కర్మఫలముల ననుభవింతురు. అందువలననే "భోగాయతనం శరీరమ్" అని చెప్పబడినది. ఒకరుచేసిన కర్మలకు ఫలము మరియొకరికి చెందదు. కర్తయే కర్మ

ఫలముల ననుభవింపవలెను. జీవులకు వారు చేయు కర్మ లకు తగిన ఫలముల నీశ్వరు డొసగును. అతడు పాపము లను క్షమింపడు. జీవు లొనరించు కర్మలకు ఉద్దిష్టఫలము వెంటనే లభించునను నియమము లేదు. కావున కొన్ని కర్మల ఫలము జీవులకు జన్మాంతరమున ననుభవింపవలసి వచ్చును. పూర్వజన్మకృత కర్మలలో నెయ్యవి ప్రస్తుత శరీరమున ననుభవింపనగునో యవి ప్రారబ్ధము లనియు, శేషించిన కర్మలు సంచితము లనియు, రాబోవు జన్మములలో ననుభవింప ననువుగ ప్రస్తుత జన్మమున జేయు కర్మలు ఆగామికర్మ లనియు పేర్కొనబడును. మనుష్య జన్మమందు జీవుడు కర్మల నాచరింప స్వాతంత్ర్యముగలిగి యుండును. అన్యజన్మలు భోగజన్మలు. పశుపక్ష్యాది జన్మలందు జీవులు కర్మల నాచరించుటలో స్వతంత్రులు కారు. కావున పుణ్య పాప విభజనము మానవులకేకాని అన్యప్రాణుల కుండదు. అందువలన ధర్మాధర్మ ప్రవృత్తి నివృత్తులను బోధించి శాసించు శాస్త్రములు మానవుల కొరకే నిర్మింపబడినవి. ఈ విషయమును గుర్తించి ఫలాపేక్షలేక శుభకర్మల నాచరించి యంతఃకరణమును పరిపూత మొనర్చుకొని ముక్తిసుఖమును బడయువారు, జన్మమరణ బంధనము పరాంతకాలముదనుక తప్పించుకొనువారు ధన్యులు.

III యజ్ఞములు :- ఆర్యసమాజము వేదవిహితములైన అగ్నిహోత్రము మొదలు అశ్వమేధపర్యంతముగల యజ్ఞములు మానవులకు అనుష్ఠేయములుగ నెంచును. బ్రహ్మయజ్ఞము (సంధ్యోపాసనాదులు), దైవయజ్ఞము (అగ్నిహోత్రము), పితృయజ్ఞము (మాతాపితరుల సేవ), మనుష్య యజ్ఞము (అతిథి సత్కారము), బలివైశ్వదేవము (ఆశ్రితప్రాణుల కాహారాదుల నొసంగుట) అను పంచమహాయజ్ఞములు ఎల్లరకు కర్తవ్యములు.

వేదోక్తయజ్ఞములు హింసారహితములు. యజ్ఞములందు పశు విశసనాదులను ఆర్యసమాజ మంగీకరింపదు. ఉవ్వట, సాయణ, మహీధరాదులచే రచియింపబడిన వేద భాష్యములు యజ్ఞములందు పశు హింసాదులను అంగీకరించును. అందువలన ఆ భాష్యము లార్షములు కావు. తాంత్రికుల ఆచారములచే ప్రభావితులై భాష్యకారులు వేదముల నట్లు వ్యాఖ్యానించిరని యీసమాజ మెంచును.

యజ్ఞశబ్దము ధాత్వర్థమును పురస్కరించుకొని దేవపూజనమును, సంగతికరణమును, దానమును బోధించును. అట్లే మేధశబ్దము పవిత్ర వాచకమేకాని హింసా వాచకముకాదు. అధ్వరము హింసావాచకముకాకపోగా హింసను నిషేధించుచున్నది. (ధ్వరతిః హింసాకర్మ నధ్వరతి త్యధ్వరః) ధ్వరమనగా హింస. అదిలేనిది అధ్వరము. అనగా అహింసాత్మకమని భావము.

వేదములందు సర్వత్ర సర్వభూతహితమే కర్తవ్యముగా బోధింపబడినది. (మా హింగ్ంసీః సర్వభూతాని.) ఏ భూతమును హింసింపకుము. "అఘ్న్యా గావః" గోవులు హింసింపదగినవి కావు." అను నిట్టి వేదవిధులు లెక్కకు మిక్కిలిగా వేదములందు ఉపలబ్ధములగుచుండ యజ్ఞవ్యాజమున పశువిశసనాది హింసలు వేదములపేర జరుపుట బుద్ధిసంగతముకాదు. (వైదికీ హింసా హింసా న భవతి) 'వైదికహింస హింసకాదు.' అను నిట్టి వాక్యములు వేదవిరుద్ధములగుటచే అప్రమాణములు. కావున గోమేధమునకు ఇంద్రియములను పవిత్రము చేసికొనుట, అశ్వమేధమునకు రాష్ట్రమును పవిత్రముచేయుట మున్నగు నర్థములను గ్రహించుట యుక్తము. గావః - ఇంద్రియములు. అశ్వః - రాష్ట్రము. ఇట్టి శబ్దార్థములు బ్రాహ్మణగ్రంథములందు జూడనగును.

IV వర్ణాశ్రమ వ్యవస్థ :- విశ్వమునగల మానవులెల్లరును ఒకేజాతికి చెందినవారు. మానవులలో వివిధజాతులు లేవు. కాని మానవసంఘము సర్వాంగీణాభివృద్ధి నొందుటకు తగినట్లు చతుర్వర్ణములుగ వ్యవహరింపబడుటను ఆర్యసమాజ మంగీకరించును. అనగా వేదమూలక వర్ణాశ్రమ వ్యవస్థను సమాజ మంగీకరించును. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్ర వ్యవహారము మానవసంఘము జన్మప్రయుక్తముకాక గుణకర్మప్రయుక్తముగా నంగీకరించును. అందువలన బ్రాహ్మణత్వాదులు జాతులుకావు బ్రాహ్మణ, క్షత్రియాది శబ్దములు వర్ణబోధకములు. జాతివాచకములుకావు.

ప్రస్తుతము భారతదేశము వ్యవహారమందున్న జాతిభేదములు అవిద్యాకల్పితములు.అందువలన నవి వేదవిహితములనజనదు. మానవులందరు పరమేశ్వరునిబిడ్డలు. నరప్రాణులు పరమేశ్వరుని ప్రజ. పరమేశ్వరుడు ప్రజాపతి.

మానవజీవితము సుఖమయముగావింప ననువగునట్లు జీవితకాలము బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వాన ప్రస్థము, సన్న్యాసము అనబడు ఆశ్రమములుగా నాలుగు భాగములు చేయబడెను. ఐదేండ్ల తరువాత బాలురు ఇరువదియైదేండ్లవరకును, బాలికలు పదునారు యేండ్లవరకును గురుకులములందుండి బ్రహ్మచర్యము సలుపుచు విద్య నభ్యసించవలెను.

అటుపై శాస్త్రవిహిత గృహస్థ ధర్మములను నిర్వర్తించి ఏబదియేండ్లకు పైబడినతదుపరి వానప్రస్థు లగుట మానవుల కుచితము. తదుపరి సాంసారిక జీవనమును గడుపరాదు. వానప్రస్థులు గ్రామమునకు వెలుపలనుండి సంఘమున కుపకరించు కర్తవ్యముల నాచరించుచు స్వాధ్యాయాదులను చేయుచుండవలెను.

క్రమముగా సాంసారిక భోగములనుండి విరక్తులై సన్న్యసించి బ్రహ్మనిష్ఠులై జీవితమును సఫలమొనర్చు కొనుట సన్న్యాసాశ్రమ విధి.

**V. సంస్కారములు :-** మానవజీవితమును పరిష్కరించుటకుగాను నిషేకాది శ్మశానాంత షోడశవిధ సంస్కారములను ఆయా కాలమున జరుపుట శ్రేయస్కరమనియును సమాజ మంగీకరించును.

**VI శుద్ధి మత పరివర్తనము :-** ఏమతమునకు చెందిన వారైనను వైదికధర్మమార్గము నవలంబింతు మందురేని యట్టివారి నార్యసమాజము వైదికమార్గమున దీక్షితుల నొనర్చును. వేదధర్మముల ననుసరించుటకు సర్వ మానవులకు నధికారమున్నది. అందు జాతిభేదము కానీ, వర్ణభేదము కానీ, దేశభేదము కానీ పాటింపబనిలేదు. వేదములు సార్వకాలిక సార్వభౌమ ధర్మ ప్రతిపాదకములు. అవి ఈశ్వరీయములు. కాబట్టి ఒకరిసొత్తుగ భావింపజనదు. విశ్వమునంతటిని ఆర్యమొనర్చుటకు ఆర్యసమాజ మను దినము ప్రయత్నించుచున్నది. 'కృణ్వంతో విశ్వమార్యమ్' ఇది దానినినాదము. అందువలన నేడు క్రైస్తవ మహమ్మదీయాది నామములచే వ్యవహరింపబడువారు వేదధర్మపరులు కానెంతురేని ఆర్యసమాజమువారికి సదా స్వాగతమిచ్చి వేదమార్గమును ప్రదర్శించును.

ఆర్యసమాజము మానవజీవనమునకు సంబంధించిన ఎల్లవిషయములను వైజ్ఞానిక సూత్రానుకూలముగ పరిష్కరింప యత్నించును. అది విశ్వాసములకును మూఢాచారములకును తావీయదు. అది సర్వతోముఖ మగు మానవాభ్యున్నతికేకాక సర్వప్రాణికోటి హితము నాకాంక్షించి తదనుకూలాచరణమునకు గడంగును.

**ఆర్యసమాజ నిర్మాణము :-** సమాజ నిర్మాణము ప్రజాతంత్ర పద్ధతుల ననుసరించి చేయబడినది. పదునెనిమిది సంవత్సరములు దాటిన ప్రతి వ్యక్తియు నీ సమాజమున సదస్యుడు కాదగును. కనీసము పదిమంది సభ్యులతో నొక సమాజము స్థాపింపనగును. సమాజమున సదస్యుడు కాదలచినవ్యక్తి తన యాదాయమునందు శతాంశమునకు తక్కువకాని ద్రవ్యమును చందారూపమున సమాజమున కొసగవలసియుండును. అతడు సమాజముచే సూచింపబడిన సదాచార నియమములను పాటింపవలసియుండును.

ప్రతి సమాజమును నియమానుకూలముగ నడుపుటకు తగినట్లు సమాజ సదస్యులు తమలో కొందరిని కార్యకర్తలనుగా నెన్నుకొందురు. వారిలో అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధ్యక్షుడు, పుస్తకాధ్యక్షుడు ముఖ్యులు. వీరితోపాటు మరిముగ్గురిని చేర్చి ప్రతి సమాజమునకు నొక కార్యనిర్వాహకవర్గము (అంతరంగసభ) ఏర్పరుపబడును. సదస్యులు మిక్కిలిగానున్నచో అధికారుల (కార్యకర్తల) సంఖ్య యథోచితముగ పెంచుకొనవచ్చును.

ఇట్టి సమాజము లొక ప్రాంతమున పదికిమించి యేర్పడిన తదుపరి యా సమాజ సదస్యులద్వారమున ఎన్నుకొనబడిన ప్రతినిధులతో నొక ప్రాంతీయ ఆర్య ప్రతినిధిసభ యేర్పడును. సమాజములు ప్రతి యిరువది మంది సదస్యుల కొక ప్రతినిధి నెన్నుకొని ప్రాంతీయసభ నేర్పరచుకొనును. సమాజమున నున్నట్లు ప్రతినిధిసభ యందును అధికారు లెన్నుకొనబడుదురు. ప్రతి ఆర్య సమాజము తన యాదాయమునందు పదియవవంతు ద్రవ్యము ప్రతినిధిసభకు చేర్చును.

ఇట్టి ప్రాంతీయ ఆర్యప్రతినిధిసభలనుండి యెన్నుకొనబడిన ప్రతినిధుల మూలమున సార్వదేశిక ఆర్యప్రతినిధి సభ యొకటి నిర్మింపబడును. ఆ సభాకార్యములను నిర్వహించుటకు ప్రాంతీయ ప్రతినిధిసభలు తమ యాదాయమున పంచమాంశము చందారూపమున నిచ్చును.

ప్రాంతీయ సభలనుండి యెన్నుకొనబడిన ప్రతినిధులు సార్వదేశిక ఆర్యప్రతినిధిసభకు అధికారుల నెన్ను కొందురు. అందునను ఒక కార్యనిర్వాహక వర్గముండును.

ప్రతి ఆర్యసమాజమును సప్తాహమున కొక పర్యాయము సత్సంగ మను పేరిట సదస్యుల నెల్లరను సమావేశ పరుచును. ఆ సమావేశమున సంధ్య, అగ్నిహోత్రము, భగవద్భజనలు జరుపును. విద్వాంసుల ద్వారమున ధర్మోపదేశము చేయించును. విజ్ఞులమూలమున జ్ఞానచర్చ జరిపి వైయక్తిక, సామాజిక జీవనౌన్నత్యమునకు పాటు పడుచుండును.

వార్షిక సమావేశముల సాయమున వైదిక ధర్మ ప్రబోధము నొనరింప శక్తికొలది యత్నించును.

ఇట్టి యార్యసమాజములు భారతదేశమునం దంతటను అనేకము లేర్పడినవి. పంజాబు, ఉత్తరప్రదేశము, బీహారు మధ్యప్రదేశము మున్నగు ప్రాంతములలో ప్రాంతీయ ప్రతినిధిసభ లేర్పడి నిజధర్మమును నిర్వర్తించుచున్నవి.

విదేశములందు ఆఫ్రికా, ఇంగ్లండు, అమెరికా, బర్మా, అస్సాము మున్నగు దేశములందును ఆర్యసమాజములు నెలకొల్పబడినవి.

భారతదేశమున ఢిల్లీనగరమున నున్న సార్వదేశిక ఆర్యప్రతినిధిసభతో ఎల్లదేశముల సమాజములకును సంబంధమున్నది. భారతదేశమునుండి వెళ్ళి విద్వాంసులైన ధర్మప్రచారకులు విదేశములందు వైదికధర్మప్రచారము నొనర్చుచున్నారు.

ఆర్యసమాజము నడుపు సంస్థలు :- బాలురు, బాలికలు బ్రహ్మచర్యపూర్వకముగ జాతీయపద్ధతులతో విద్యల నభ్యసింప ననువుగ ననేకసంస్థల నెలకొల్పి విద్యావ్యాప్తికి తోడ్పడుచున్నది. అందు గురుకులములు, దయానంద ఆంగ్ల వైదిక కళాశాలలు (D. A. V. Colleges) అతి ముఖ్యములు.

ఇవికాక అనాథ శరణాలయములు కూడ స్థాపించి వానిని నిర్వహించుచున్నది. దిక్కులేని పిల్లల నందుచేర్చి వారికి హస్తకళలతోపాటు విద్యాప్రదాన మొనర్చి స్వతంత్రులై జీవనోపాధి గడుపుకొనదగిన సామర్థ్యమును కలిగించుచున్నది.

వైదికసాహిత్యమును ప్రచారముచేయు నుద్దేశముతో ముద్రణాలయములను నెలకొల్పి వేదాదిగ్రంథములను ముద్రించుచున్నది.

దేశ విదేశములందు వైదికధర్మముల నుద్బోధించుటకు యోగ్యులయిన ప్రచారకులను సిద్ధముచేయుట కనువగు ఉపదేశక విద్యాలయములను స్థాపించి నిర్వహించుచున్నది.

ఈ సంస్థలన్నియు నాయా ప్రాంతములందు ప్రాంతీయ ఆర్యప్రతినిధి సభల యధీనమున నడుచుచున్నవి. వీని నిర్వహణమునకు వలయు ధనము విశేషభాగము సమాజ కోశమునుండియే వెచ్చింపబడును. విద్యాసంస్థల నిర్వహించుటకు ప్రతి సంవత్సరమునందును సుమారు 25 లక్షల రూపాయలు వెచ్చింపబడుచున్నవి.

పం. గో.

**ఆర్షగణితము** :- ఛాందోగ్యోపనిషత్తునందు (vii. 1. 2) నారదముని సనత్కుమారునితో తానది వరకు నేర్చిన విద్యలను చెప్పుచు రాశివిద్యను, నక్షత్ర విద్యను పేర్కొనెను. రాశివిద్యయనగా గణితమనియు, నక్షత్రవిద్యయనగా జ్యోతిషమనియు అర్థము. ఆర్షసంప్రదాయమున తత్త్వజ్ఞానోపయుక్తములగు విద్యలు తక్క మిగిలిన విద్యలన్నియు తత్ప్రతిబంధకములుగా ఉపేక్షింపబడినవి. అయినను శ్రౌతస్మార్త క్రియలకు అవసరమగు నంతమటుకు ప్రతి విద్యలోను పరిపూర్ణతను ఆయా శాస్త్రములు పొందియే యున్నవి. అట్టి షడంగములలో జ్యోతిషము మూర్ధన్యమని వేదాంగజ్యోతిషము చెప్పును. అట్లే యాగములందు ప్రధానమగు అగ్నివేదియొక్క నిర్మాణమును గూర్చి బ్రాహ్మణము అందును, కల్ప సూత్రములందును చెప్పుచు గణితమును అనేక విధములుగా ఉపయోగించిరి. ఇట్లు వైదికఋషులచే ఉపయుక్తమైన గణితమందలి కొన్ని విషయము లిచట పరిశీలింపబడును. ఇచట ఆర్షగణితమనగా ఋషిప్రోక్త గణితమనియే అర్థము.

**అంకగణితము (Arithmetic)** :- ఒకటి మొదలు పరార్థమువరకుగల సంఖ్యలు వేదములో ననేకచోట్ల వాడబడుటయేగాక కాఠకసంహితాదులలో * సంఖ్యలుగా

---

*. తై. సం. 4. 4. 11; కాఠక సం. 17. 10; మైత్రాయణీ సం. II 8. 14; కపిష్ఠల సం. 26. 9.

పేర్కొనబడినవి. వాటినిబట్టి 1 మొదలు 10 వరకు, 10 నుండి 100 వరకు తరువాత సహస్ర, అయుత, నియుత, ప్రయుత, అర్బుద, న్యర్బుద, సముద్ర, మధ్య, అన్త, పరార్థపర్యంతము కనిపించును. అనగా $10^{0}$ మొదలు $10^{12}$ వరకుగల సంఖ్యలు వాడబడినవి. అథర్వ వేదములో (XIX. 22. 3; 23. 21) క్షుద్ర = 0 గను, ఋచ్ఛ. అన్నృచ్ఛపదములు వరుసగా ధన, ఋణ సంఖ్యావాచకములుగా నున్నవి. లీలావతియంు ఖర్వ ($10^{10}$), మహాపద్మ ($10^{12}$), నీల ($10^{13}$), జలధి ($10^{14}$) మొదలగునవి మరికొన్ని చేర్చబడి పరార్థమ్ అనునది $10^{17}$ గా చెప్పబడెను. ఏక, ద్వి...దశ, శత, సహస్ర మొదలగు వాటికి నిరుక్తములో (III. 10) వ్యుత్పత్త్యర్థములు చెప్పబడెను. ఈసంఖ్యలు నేటి దశాంశ పద్ధతి కనుగుణమగు స్థానక్రమమునే కలిగియున్నవి. మహాభారతమందు (134.16) 'న వైవ యోగో గణనేతి శక్యత్' అని సంఖ్యలగుర్తులు తొమ్మిదేనని చెప్పబడెను. పెద్ద మొత్తములను చెప్పునపుడు శత, సహస్ర పరిమాణములను వాడుచుండెడివారు షష్టిమ్ సహస్రాణి, ద్వాసప్తతిస్సహస్రాణి (72,000) (ఋ iv. 16. 13) మొ. సాధారణముగా 'అంకానాం వామతో గతిః' అను న్యాయమునుబట్టి 'షణ్ణవతి' (96), 'చతు స్సప్తత్యధిక చతు శ్శతాని' (47, 400) వంటి ప్రయోగములే అధికముగా నున్నను వేదములలో కొన్నిచోట్ల 'సప్త శతాని వింశతిః' (720) (ఋ. i. 164. 11); 'షష్టిమ్ సహస్ర నవతిమ్ నవ' (60099) (ఋ. i. 53. 9) వంటి ప్రయోగములుకూడ కనిపించును. వైదిక ఋషులకు అంకగణితములోని సంకలన వ్యవకలనాది ప్రధాన పరికర్మలు (fundamental operations) తెలియునని ముందుచెప్పబోవు బ్రాహ్మణాదులలోని విషయములనుబట్టి తెలియగలదు.

భిన్నములతోకూడిన సంఖ్యలు అనేకచోట్ల కనుపించును. త్రిపాద ($\frac{1}{3}$) (ఋ x. 90-4); కలా ($\frac{1}{16}$) (మైత్రా సం. iii. 7. 7.); పంచదశభాగ ($\frac{1}{15}$) (ఆ. శు. X. 3) సవాదో ($2\frac{1}{4}$), అర్ధతృతీయ ($2\frac{1}{2}$) (ఆ. శు. III. 20); సప్తభాగ ($\frac{1}{7}$), నవమీకలా ($\frac{1}{9}$) ఇత్యాది ప్రయోగములనేకములు కనుపించును. అట్లే వర్గము, వర్గమూలములతో గూడిన ప్రయోగములు కూడ కలవు శుల్బసూత్రములందును వాటికి మూలములగు బ్రాహ్మణములందును వర్గములతో కూడిన నిర్మాణము లనేకములు ఉన్నవి. వాటియందు వర్గమూలములను ద్వికరణీ($\sqrt{2}$) త్రికరణీ ($\sqrt{3}$), అనియు (ఆ.శు. V) దశకరణీ ($\sqrt{10}$), చత్వారింశత్కరణీ ($\sqrt{40}$) అనియు (కా. శు ii. 8,9) వాడిరి. కనుక కరణీశబ్దమునకు వర్గమూలమని యర్థము.† శ్రేఢీరూపములోనుండు సంఖ్యలు తైత్తిరీయ సంహిత యందనేకములు కనుపించును. రుద్రాధ్యాయములో రెండు కలవు.

(i) 1, 3, 5 ... ... ... 33

(ii) 4, 8, 12... ... ... 48

పంచవింశ బ్రాహ్మణములో (XVIII. 3) యజ్ఞ ఫలితములు భూమితి శ్రేఢిలో (Geometrical Progression) చెప్పబడెను. 24, 48, 96, ... ... ... 49152, 98304, 196608, 393216.

తైత్తిరీయోపనిషత్తులో (ద్వి. ప్ర.) బ్రహ్మజ్ఞానానికి కలుగు ఆనందము 100, $100^2$, $100^3$ ... ... ...$100^{10}$ అను శ్రేఢీరూపములో చెప్పబడెను.

శతపథ బ్రాహ్మణములో (X 5. 4. 7) ఒక అంకగణితశ్రేఢి మొత్తముచేసి చెప్పబడినది. ఆశ్రేఢియొక్క మొదటిపదము 24, భేదము 4, పదములసంఖ్య 7 ఐన మొత్తమునకు మూడురెట్లు 756 అగునని యున్నది.

కాలమానము, దైర్ఘ్యమానము బ్రాహ్మణములలో చెప్పబడినవి. శత. బ్రా. xii. 3, 2. లో కాలమానమీదిగువ విధముగా కలదు.

ప్రాణ‡:- 15 ప్రాణులు=1 ఇడ. 15 ఇడలు=1 ఇతర్హి. 15 ఇతర్హులు=1 క్షిప్ర. 15 క్షిప్రలు=1 ముహూర్తము. 30 ముహూర్తములు=1 దినము. (ము=48 నిమిషములు) ($1\frac{1}{4}$ ము=1 గంట.)

† కరణీశబ్దమునకు రేఖాగణితమందు భుజమను వర్థముకూడ కలదు.

‡ 1 ప్రాణ= $\frac{1}{17}$ సెకండు (సుమారు)

శుల్బకారులు బ్రాహ్మణములనుండి సంగ్రహించిన దైర్ఘ్యమాన మిట్లుండును:- 14 అణువులు=1 తిల; 34 తిలలు=1 అంగుళము; 12 అం.=1 ప్రాదేశము; 13 అం.=1 వితస్తి; 15 అం.=1 పదము; 24 అం=1 అరత్ని; 32 అం=1 జానువు; 36 అం=1 శమ్య; 86 అం.=1 యుగము, 120 అం.,=1 పురుషము; 400 అం.=1అక్షము.

**రేఖాగణితము (Geometry)** :- దీనిని ఆర్షసంప్రదాయమున రజ్జువనియు, శుల్బమనియు పేర్కొనుచుండెడివారు. రజ్జువనగా త్రాటితో కొలచి చేయు గణితమనియు, శుల్బమనగా సమిధలుంచుటకు తగిన వేదుల నిర్మాణమును చెప్పు గణితమనియు అర్థములు. యజ్ఞసాఫల్యము కొరకు వాట్లయం దుపయుక్తము లగు వేదియొక్క నిర్మాణములు సరియగు కొలతలతో శాస్త్రబద్ధము కావింపబడెను. వాటిలో బోధాయన, ఆపస్తంబ, కాత్యాయన శుల్బసూత్రములు ఆయా ఋషిప్రోక్తము లగు శ్రౌత సూత్రముల కనుబంధములుగా దొరకుచున్నవి. ఆర్ష రేఖాగణితమున కివియే ఆధారములు. వీటిలోని కొన్ని నిర్మాణము లిచట ఉదహరింపబడును. నవీన భాషా చరిత్రకారుల ననుసరించి బోధాయనుడు క్రీ. పూ. 1200, ఆపస్తంబుడు క్రీ. పూ. 800, కాత్యాయనుడు క్రీ. పూ. 500 ల నాటి వారని గ్రహింపవలెను.

**i. కర్ణసూత్రము** : "దీర్ఘస్యాక్ష్ణయా రజ్జుః పార్శ్వమానీతిర్యఙ్మానీచయత్ పృథగ్భూతే కురుతస్తదుభయం కరోతి" (ఆ. శు. i.8) (కొద్దిభేదముతో బో. శు. i. 48; కా. శు. ii. 11) అనగా "దీర్ఘచతురస్రము యొక్క కర్ణము (చేయు చతురస్రము) పొడవు వెడల్పులు విడిగాచేయు వాటి (చతురస్రముల) మొత్తమునకు సమానము." దీనినే ఆధునిక పైథాగరస్ (540. B. C.) సిద్ధాంతముగా చెప్పుదుము. దీని విలోమము సూత్రరూపమున లేకున్నను ఉపయోగములు కనుపించును. శతపథ బ్రాహ్మణములో (XIII. 8. 1.) పైతృకవేది నిర్మాణము దిక్కులందు లంబకోణము లేర్పడవలెనని యున్నది. దానిని కాత్యాయనుడు (ii.6) "దిక్కులవైపు భుజములుగల చతురస్రమును నిర్మించి దాని భుజముల మధ్య బిందువులను కలుపగా నేర్పడు చతురస్రము దిక్కులవైపు లంబకోణములు కలదిగను పెద్ద చతురస్రములో సగమువైశాల్యము కలదిగను ఉండు" నని చెప్పెను. EFGH చతురస్రము దిక్కులవైపు లంబకోణములు కలిగి ABCD చతురస్ర వైశాల్యములో సగముండును.




పటము 1.

ఈ కర్ణసూత్రమును చతురస్రమున కుపయోగించి ఆపస్తంబుడు $\sqrt{2}$ యొక్క విలువను కనిపెట్టెను. (ఆ. శు. I. 10; కా శు. II. 13) అది 'భుజప్రమాణమునకు దాని మూవడవంతును, దీని నాలుగవవంతును కలిపి యా నాలుగవవంతులో 34 వ వంతు తీసివేయవలెను.' అనగా

$$\sqrt{2}=1+\frac{1}{3}+\frac{1}{3\cdot4}-\frac{1}{3\cdot4\cdot34}=1\cdot4142156\ldots\ldots$$

ఆధునిక పద్ధతిలో కనిపెట్టబడిన దీనివిలువ 1.414213. ఆపస్తంబ శుల్బసూత్ర వ్యాఖ్యాతయగు కపర్దిస్వామి, దీనిని నీలకంఠాచార్యుడు ఇట్లు నిరూపించెనని చెప్పెను.

$$2.\ 12^2=288=289-1=17^2-1$$

$$12\sqrt{2}=\sqrt{17^2-1}=\sqrt{(17-0)\ (17-\tfrac{1}{17})}$$

$$=\sqrt{17-\left(\frac{1}{2\cdot17}\right)\left(17-\frac{1}{2\cdot17}\right)}$$

$$\text{సుమారు}=17-\frac{1}{2\cdot17}$$

$$=12+4+1-\frac{1}{2\cdot17}$$

$$\therefore\sqrt{2}=1+\tfrac{1}{3}+\frac{1}{3\cdot4}-\frac{1}{3\cdot4\cdot34}\ \text{సుమారు}$$

ఇట్లు కర్ణసూత్రము ననుసరించి నిర్మాణము లనేకములు శుల్బకారులచే చెప్పబడెను.

ఒక క్షేత్రమును సమాన వైశాల్యముగల మరొక క్షేత్రముగా మార్చుట :- ii. *చతురస్రమును దీర్ఘచతురస్రముగా మార్చుట*. (కా.శు. III. 4.) !చతురస్రము యొక్క

ఒక కర్ణముచే భాగింపబడిన సగమునకు రెండవ కర్ణముచే రెండవ సగములో నేర్పడు విభాగములను కలుపవలెను.' ABCD చతురస్రములో ABC భాగమునకు ADO ను GDO ను AB, BC భుజముల మీదచేర్చగా ACEF అనుదీర్ఘచతురస్రము ఏర్పడును. అది AB CD అను చతురస్రముతో సమాన వైశాల్యము కలదియగును. (పటము 2)



పటము 2

దీనినే దత్తభుజముగల దీర్ఘచతురస్రముగా మార్చవలెనన్న (ఆ. శు. iii . i) నిర్మాణ మిట్లుండును. దత్తభుజము (m) తో చతురస్ర (ABCD) భుజము (DA) ను ఖండించి ఆ బిందువు (E) నుండి (CE అను) కర్ణమును మరొక భుజము (BA ను పొడిగించగా P వద్ద) ఖండించు వరకు పొడిగించవలెను. (పటము 3)

ఈ రెండు ఖండన బిందువులనుండి చతురస్ర రెండు భుజములకు సమాంతర రేఖలు గీయవలెను (సుందరరాజీయ వ్యాఖ్య). దత్తభుజము చతురస్ర భుజముకన్న పెద్దదగుచో చతురస్రముయొక్క రెండు నిలువు భుజముల (DA, CB) ను దాని (m) కి సమానముగా పొడిగించి, ఒకదాని చివర (C) నుండి కర్ణమును గీయగా అది చతురస్రముయొక్క అడ్డభుజము (BA) ను ఖండించు బిందువు (P) వద్ద దీర్ఘ చతురస్రపు దత్త పరిమాణ భుజము (GH) గీయవలెను (పటము 4). ABCD చతురస్రములను m భుజముగల దీర్ఘ చతురస్రములుగా చేయగా GHFC లు కోరిన దీర్ఘచతురస్రము అగును. ఉపపత్తి సులభము. దీర్ఘచతురస్రమును చతురస్రముగా మార్చుట ముందు చెప్పబడును.



పటము 3

(iii) చతురస్రమును వృత్తముగా మార్చుట (ఆ. శు. iii . 2 ; కా. శు. iii . 13, 14) :- '(చతురస్ర) మధ్య



పటము 4

బిందువునుండి కోణమునకు గల దూరములో, భుజము యొక్క సగముతీసివేయగా మిగిలినదానిలో మూడవ వంతును ఆ సగ భుజమునకు కలుపగా వచ్చిన పొడవు వ్యాసార్ధముగా వృత్తమును గీయవలెను.' ఇది స్థూలముగా చతురస్ర వైశాల్యము కలిగియుండును.

ఉదా : చతురస్ర భుజము 16″ అనుకొనుము.

దాని కర్ణము $=16\sqrt{2}''=22{\cdot}6272''$

$\frac{1}{2}$ కర్ణము $-\frac{1}{2}$ భుజము $=11{\cdot}3136''-8''=3{\cdot}3136''$

వ్యాసార్ధము $=\frac{1}{2}$ భుజము $+\frac{1}{3}(3{\cdot}3136)=8''+1{\cdot}105''$
$=9{\cdot}105''$

(దీనిని బట్టి $\pi=3{\cdot}088......$)

వృత్తమును చతురస్రముగా మార్చవలెనన్న దాని వ్యాసమును 18 భాగములు చేసి వాటిలో 16 భాగముల భుజముతో చతురస్రమును నిర్మింపవలెను. (కా. శు. iii. 14. కారిక)

(దీనిని బట్టి $\pi=3{\cdot}160$ . . . వచ్చును.)

(iv) కొన్ని సమానములగు చతురస్రములను ఒకే పెద్ద చతురస్రముగా మార్చుట (కా. శు. vi. 7.) :-

'దత్త చతురస్రములను ఒకటి తక్కువగా పంక్తిలో చేర్చిన ఆ సరళరేఖ భూమి యగును. ఒక ఎక్కువగా చేర్చిన వచ్చు పొడవును రెండుసమభుజములుగా అమర్చిన దాని యెత్తు కోరిన చతురస్ర భుజమగును.' ఇచట దత్త చతురస్రముల భుజము a పరిమాణములు మరియు వాటి సంఖ్య n అయిన నిర్మించవలసిన త్రిభుజము యొక్క




పటము ౕ.

భూమి (n – 1)a పరిమాణములు. ఈ భూమి చివరలకు (n+1)a పరిమాణములు గల త్రాడును కట్టి దాని మధ్య శీర్ష కోణము వచ్చునట్లు లాగవలెను. దీని యెత్తు AD క్రొత్తగా నిర్మింపవలసిన చతురశ్ర భుజమగును. దీని విలువ √n.a పరిమాణములని కర్ణసూత్రము (పైథాగరస్ సిద్ధాంతము) తో నిరూపింపవచ్చును. (పటము ౕ).

$$n a^2 = \left(\frac{n+1}{2}\right)^2 a^2 - \left(\frac{n-1}{2}\right)^2 a^2 \ *$$

ఇట్లు త్రిభుజములను చతురశ్రములుగను, చతురశ్రములను త్రిభుజములుగను మార్చుట, పెద్ద చతురశ్రమునుండి కావలసిన చిన్న చతురశ్రమును ఖండించుట, కొన్ని అసమాన చతురశ్రములను కలుపుట మొదలగు పద్ధతులనేకములు చెప్పబడెను. ఆయా వేదుల నిర్మాణములకు కావలసిన ఇటుకల ఆకారములు, సంఖ్యలు కూడ చెప్పబడెను.

శ్యేనచితికి కావలసిన ఇటుకల ఆకారములు, సంఖ్యలు, 4 అవ్యక్తరాసులుండు సమకాలీన సమీకరణములతో గాని సాధింపబడనివిగా నుండును. ఇట్టివి బౌ. శు. iii. 24 లోను, ఆ. శు. xi లోను చెప్పబడినవి. వాటిని ఈ పరిమితమగు వ్యాసమందు వివరించుటకు వీలుకాదు.

**బీజగణితము (Algebra)** : వైదిక గ్రంథములందు రేఖాగణితము ప్రత్యేకముగా శుల్బమను పేరుతో కాన్పించినట్లు బీజగణితము విడిగా కనిపించదు. కాని బ్రాహ్మణములందును, శుల్బములందును క్షేత్రములను సాధించునపుడు బీజగణిత సిద్ధాంతములు కొన్ని వాడబడెను. ఆ యంశము లిచట ఉదాహరింపబడును.

i చతురశ్రమును దీర్ఘ చతురశ్రముగా మార్చునపుడు వెనుక చెప్పబడిన పద్ధతి ననుసరించి $ax=c^2$ ( a = దత్త భుజ పరిమాణము ) వంటి సమీకరణము ఏర్పడును.

ii శతపథ బ్రాహ్మణము (x. 2.3.7.–10) లో మహావేదిని గూర్చి చెప్పబడెను. దీని నిర్మాణము ఆపస్తంబునిచే వివరింపబడెను. (ఆ. శు. v. 1.) అది ఒక సమద్విబాహు సమలంబ చతుర్భుజము (Isosceles Trapezium). దాని భూమి 30 అడుగులు, రెండవ సమాంతర భుజము (ముఖము) 24 అ., ఎత్తు 36 అ. లు ఉండును. దీని వైశాల్యము 972 చ. అడుగులు.

వైశాల్యము కొన్ని చదరపు పరిమాణములు ఎక్కువ కావలెనన్న మొదటి దైర్ఘ్య పరిమాణము లన్నియు ఎక్కువ కావలెను. అట్లెక్కువైన క్రొత్త పరిమాణము (unit) x అయిన

$$36x.\left(\frac{24x+30x}{2}\right)=972+m$$ (m చ.ప. లు వైశాల్యములో వృద్ధి)

$$972x^2=972+m$$

లేక $x=\sqrt{1+\frac{m}{972}}$

ఇట్టి విలువ $\sqrt{\frac{101}{7}}$ అయినప్పటి నిర్మాణ క్రమమును కాత్యాయనుడు వివరించెను. (కా. శు. vi. 2)

iii శ్యేనచితి యొక్క వృద్ధిని చెప్పెడి ఒకపద్ధతి




పటము 6

* ఇది బీజ గణితములో లంబకోణ త్రిభుజములందు భుజముల విష్పత్తివి తెలుపును.

సంపూర్ణవర్గ సమీకరణమునకు చెందియున్నది. దాని ఆకారము కొలతలు పురుష ప్రమాణములో 6 వ పటములో చూపినవిధముగా నుండును. దాని వైశాల్యము $7\frac{1}{2}$ చతురపు పరిమాణములు. m చతురపు పరిమాణములు వైశాల్యములో వృద్ధియైనచో క్రొత్త దైర్ఘ్య పరిమాణము x అగు ననుకొందము.

(Increased unit of length=x) అయిన,

$2x.2x+2(x+\frac{1}{5})x+(x+\frac{1}{10})x=7\frac{1}{2}+m.$

$7x^2+\frac{1}{2}x=7\frac{1}{2}+m.$ ఈ సమీకరణములో m యొక్క పెద్ద ఘాతముల విలువల నుపేక్షించిన

$x^2=1+\frac{m}{7}$ (దాదాపు)* అగును.

కాత్యాయనుడీ విలువతోడే వేదివృద్ధిని చెప్పెను. (కా. శు. vi 4).

iv. శుల్బకారులు లంబకోణ త్రిభుజములను సాధించిన విధ మీ క్రింద సమీకరణము ననుసరించి యుండును :

$x^2+y^2=z^2$...................(1)

కాత్యాయనుడు దీర్ఘ చతురస్రమును చతురస్రము (Square) గా మార్చునపుడుకూడ ఇదేరకమగు సమీకరణమును పొందగలిగెను. దాని నిర్మాణ మిట్లుండును: (కా. శు. iii 2.) "దీర్ఘ చతురస్రపు పొడవును వెడల్పుతో ఖండించి మిగిలిన భాగమును అర్లే ద్విఖండనచేసి ఒక విభాగమును దక్షిణావైపునను, రెండవ దానిని తూర్పు వైపునను చేర్చగా నేర్పడుదానికి కొంత కలిపి (చతురస్రమును) పూర్తిచేసి తగ్గించవలెను." దీనినిట్లు వివరించవచ్చును. m పరిమాణములు పొడవు, n పరిమాణములు వెడల్పుగల దత్త దీర్ఘ చతురస్రములో $n^2$ ను ఖండించగా మిగిలిన (m−n) పొడవును రెండు సమభాగములుచేసి బొమ్మలో చూపిన విధముగా చేర్చవలెను. గీతలున్న మూలను పూరించగా నొక చతురస్ర మేర్పడును. దానిని కోరిన చతురస్రమునకు సమానముగా మరొక విధమున తగ్గించవలెను. ఈ నిర్మాణము ననుసరించి,



పటము 7

$$mn=\left\{m-\frac{m-n}{2}\right\}^2-\left(\frac{m-n}{2}\right)^2$$

$\sqrt{(mn)}^2=\left(\frac{m+n}{2}\right)^2-\left(\frac{m-n}{2}\right)^2; m=p^2, n=q^2$ గా ప్రతిక్షేపించిన †$p^2q^2+\left(\frac{p^2-q^2}{2}\right)^2=\left(\frac{p^2+q^2}{2}\right)$ అగును ఇది పైన వ్రాసిన (1) ని పోలియున్నది. ఇట్టి సమీకరణము మీద సాధారణపడు కొన్ని లంబకోణ త్రిభుజములను ఆపస్తంబుడు సాధించెను. (ఆ. శు. V 3−7) అవి

(1) $3^2+4^2=5^2$ దీని ననుసరించి

$(3+3\cdot3)^2+(4+4\cdot3)^2=(5+5\cdot3)^2$

$(3+3\cdot4)^2+(4+4\cdot4)^2=(5+5\cdot4)^2$

ఇవికూడ లంబకోణ త్రిభుజము లగును.

(2) $5^2+12^2=13^2$ దీని ననుసరించి

$(5+5\cdot2)^2+(12+12\cdot2)^2=(13+13\cdot2)^2$

ఇదికూడ లంబకోణ త్రిభుజ మగును.

ఈ విధముగా తెలిసిన లంబకోణ త్రిభుజమునుండి భుజ పరిమాణములను మార్చుచు ఇతర లంబకోణ త్రిభుజములను సాధించెను. వెనుక చెప్పబడిన సమాన చతురస్రము లనేకములను ఒకటిగాచేయు కాత్యాయనుని పద్ధతికూడ ఇట్టి సమీకరణమునే యిచ్చును. దీనినే బ్రహ్మగుప్తుడు బ్రహ్మస్ఫుట సిద్ధాంతము (XII. 33) లో

$m^2-n^2$, 2mn, $m^2+n^2$ వంటి రూపములో

లంబకోణ త్రిభుజముయొక్క భుజముల సంబంధమును చెప్పెను. శుల్బశాస్త్రములో దీని ననుసరించి చెప్పబడిన

* The science of Sulba by Bibhuti Bhushan Datta—Calcutta. P. 167.

† $(\sqrt{mn})^2=\left(\frac{m+n}{2}\right)^2-\left(\frac{m-n}{2}\right)^2$ దీనినే భుజముల సంబంధములో 2pq, $p^2+q^2$, $p^2-q^2$ గా వ్రాసిన లంబకోణ త్రిభుజమున కుపయోగించును.

లంబకోణ త్రిభుజములు పై నుదాహరించిన రెండు రక ములే కాన్పించును. తరువాత బ్రహ్మగుప్తుడు, మహా వీరుడు, భాస్కరాచార్యుడు మొదలగువారు మరికొన్ని లంబకోణ త్రిభుజములను చెప్పిరి.

శుల్బకర్తలకు రేఖాగణితము, బీజగణితము తెలిసినను వారు వాటిని సోపపత్తికముగా సూత్రీకరింపకపోయిరి. వా రుపయోగించిన నిర్మాణములను మనము నవీన గణితముతో ఉపపత్తికరించుకొనవలసి వచ్చెను. ఉపపత్తి కుపకరించు సిద్ధాంతములను వారేమియు చెప్పలేదన వచ్చును. దానికితోడు π వంటి సాంకేతిక సంజ్ఞలను కూడ వారు వాడలేదు. అందుచే వారి సూత్రములు గణితమున కంతగా తోడ్పడకపోయెను.

**జ్యోతిషము (Astronomy)** :- నక్షత్రవిద్య ప్రత్యేక విద్యగా చెప్పబడెను. గ్రహములసంఖ్య, గమనము, నక్షత్రములు, రాశివిభాగము, అయనములు, ఋతువులు మొదలగు ప్రాథమిక విషయములే గాక గ్రహణములు, అధికమాసములు మొదలగువాని వివరములుకూడ వేద ములలో కలవు. ఋ. సం. V. 40. 5-9 ఋక్కులలో అత్రిమహామునికి సూర్యగ్రహణమును గూర్చిన విషయము పూర్తిగా తెలియుననియు, వారి సంతతికికూడ పూర్తిగా తెలియుననియు ఉన్నది. అధికమాసమునుగూర్చి ఋ. సం. I. 25. 8 లో కలదు. వేదాంగ జ్యోతిషమునుబట్టి 1830 దినములలో సూర్యుడు ఆకాశవీథిని 5 చుట్లును, చంద్రుడు 67 చుట్లును తిరుగుదురు. 5 సంవత్సరములు గల ఒక యుగములో ఈ 67 చుట్లు నాక్షత్రమానము లనబడును. ఇట్టి మాసమునకు 27⅓ దినములు. కాని సావనమాసములు 5 సంవత్సరములలో 62 మాత్రమే ఉండును. సావనమాసమునకు దినములు 29½. ప్రతి 5 సం. లకు రెండు అధికమాసములు వచ్చును. అట్లే ప్రతి 62 దినములకు ఒక తిథి లోపించును. ఈవిధముగా 5 సంవత్సరముల కాలములో సూర్యచంద్రుల గమన మునుగూర్చిన విషయములు వేదాంగ జ్యోతిషమందు చెప్పబడెను. ఖగోళమునకు సంబంధించిన సూక్ష్మగణిత మేమియు దానియందు లేదనవచ్చును. పై చెప్పిన విషయ ములుకూడ స్థూలముగనే యుండుననియు, అవి అన్ని కాలములకు తగినట్టి పద్ధతులలో లేవనియు లోకమాన్య బాలగంగాధరతిలక్ తన వ్యాఖ్యానములో వ్రాసెను. ఆగ్రంథము నేటి సిద్ధాంతములకేమియు ఉపయుక్తముగా లేదు. కేవలము యజ్ఞయాగాదుల కాలనిర్ణయమునకే ఉపయోగించును.

భూమి గుండ్రముగా, నుండుననియు అది గాలిలో నిరాధారముగా సూర్యునిశక్తిచే నున్నదనియు (ఋ. iv. 53. 3; i. 33. 8) కొందరి వ్యాఖ్యాతల సమ్మతము. సూర్యు డుదయించుట కాని అస్తమించుట కాని లేక కొంతభాగమునకు రాత్రి, కొంతభాగమునకు పగలు ఏర్పరచుచు తిరుగుచుండును అని ఐతరేయ బ్రాహ్మణము (iii. 44) ను బట్టి తెలియును.

సంజ్ఞావివరణము

తై. సం.—తైత్తిరీయసంహిత

ఋ. సం.—ఋగ్వేదసంహిత

ఆ. శు.—ఆపస్తంబ శుల్బ సూత్రములు.

కా. శు.—కాత్యాయన శుల్బ సూత్రములు.

శత. బ్రా.—శతపథ బ్రాహ్మణము.

బో. శు.—బోధాయనశుల్బ సూత్రములు.

పు. వ. శా.

**ఆర్షభూగోళము** :- భూగోళస్వరూపము :- భూమి సూర్యచంద్రులవలె ఆకాశములో నున్నది. భూమి మిగుల పెద్దదగుటవలన బల్లపరపుగా గనబడును. మరియు దీని మీది జనులందరును, తాము పైనున్నటులును, కొందరు క్రిందనున్నటులును తలంతురు. ఆకసమునకు మధ్యనున్న గోళమునకు క్రిందుమీదులేవి? (భూమి విశాలము. జనులో అల్పకాయులు). అది ఎటుచూచినను చదునుగనే కన్పించును. మరియు ఆకసము భూమినంటినట్లు కన బడును. కాని యిది వెలగపండువలె గోళాకారము. ఈ గోళమునడుమ మేరువు దండాకారముగ దక్షిణోత్తర ముల వెలికులికినది. దీని ఉత్తరాగ్రము పేరు సుమేరువు. దక్షిణాగ్రము పేరు కుమేరువు. ఉత్తరమేరువునకు పైగా ఆకాశమునందు ఉత్తర ధ్రువతారయు, దక్షిణ మేరు వునకు పైగా ఆకాశమునందు దక్షిణ ధ్రువతారయు, గలవు.

**యామ్యగోళము - సౌమ్యగోళము** :- ఉత్తరాయణ దక్షిణాయ నారంభములందు సూర్యుడు సూటిగా

భూమధ్యరేఖమీదుగా పోవును. ఈ రేఖకు ఉత్తరమున నున్న భాగమునకు సౌమ్యగోళమని పేరు. దక్షిణమున నున్న భాగమునకు యామ్యగోళమని పేరు. సౌమ్యగోళమంతయు జంబూ ద్వీపము.

భూమధ్య వలయరేఖకు విషువన్మండలరేఖయని పేరు. ఈ రేఖమీద లంక కలదు. ఇది నేటి సింహళము కాదు. ఏనాడో లవణ సముద్రములో మునిగిపోయినది లంక. ఉజ్జయిని నుండి ఒక లంబరేఖ గీచినచో అది నిరక్ష రేఖనంటియున్న యీ లంకనుతాకును. ఈరేఖమీదనే లంకకు తూర్పున యమ(వ)కోటియను పత్తనము గలదు. లంకకును యమ (వ) కోటికిని 1265 యోజనముల దవ్వు (వృ. వ. సిద్ధాంతము). ఇది భూమి యడ్డు కొలతలో నాలుగవ వంతు. యమ (వ) కోటికి తూర్పుగా 1265 యోజనములదూరమున ఆ రేఖమీదనే సిద్ధపురి యున్నది. అటనుండి ఆ రేఖ మీదనే రోమకము అను పత్తనము గలదు. ఈ నాలుగు పత్తనములకును సుమేరు కుమేరువులు 1265 యోజనముల దూరముననే యున్నవి. నిరక్ష దేశముననుండు వారికి రెండు మేరువులును, రెండు ధ్రువములును క్షితిజమున కనిపించును.



పటము 1

యామ్యగోళము :- భూగోళమధ్య వలయమునకు దక్షిణమున లవణ సముద్ర మున్నది. అటనుండి యొకదాని కొకటి దక్షిణముగా (1) క్షీర (2) దధి (3) ఘృత (4) ఇక్షురస (5) మద్య (6) స్వాదునీర సముద్రములు గలవు. ఈ లవణ సముద్రమున కొకదాని కొకటి దక్షిణముగా (1) శాక (2) శాల్మల (3) కుశ (4) క్రౌంచ (5) గోమేధ (6) పుష్కరము అను ఆరు ద్వీపములు గలవు. ఈ యారు ద్వీపములును, లవణ సముద్రమునకు ఉత్తరముగా నున్న జంబూ ద్వీపమును గలిసి యేడు ద్వీపములు. కావుననే 'సప్త ద్వీపా వసుంధరా' అను సూక్తి సరియగుచున్నది.

కొన్ని పురాణములలో ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శాక, పుష్కర ద్వీపము లొకదాని కొకటి దక్షిణముగా నున్నవని కలదు. మరికొన్ని పురాణములలో నివి కొంత వ్యత్యస్తముగా నున్నవి. యోగసూత్ర భాష్యములో శ్రీ వ్యాసులు శాక, కుశ, క్రౌంచ, శాల్మల, మగధ (గోమేధ), పుష్కర ద్వీపములనుచెప్పిరి. యామ్య గోళమునం దిప్పుడు మనకు ఆస్ట్రేలియా యును, ఆఫ్రికాలో కొంత భాగమును, అమెరికాలో సగభాగమును కానిపించుచున్నవి. మలయా మొదలగునవి భరత వర్షమున అనుద్వీపము లని పురాణములలో గలదు. ఈ యామ్య గోళమునందు ఈ ద్వీపషట్కము లోని కొంత భూమి మునిగిపోయి యుండును. అట్లే జంబూ ద్వీపమునందును కొంత భూమి మునిగి యచట సముద్రము లేర్పడి యుండును.

కుల పర్వతములు :- భారత వర్షములో మహేంద్ర, మలయ, సహ్య, శక్తిమత్, ఋక్ష, వింధ్య, పారియాత్రము అను ఏడు కులపర్వతము లున్నవని వాయు పురాణము పేర్కొన్నది (57 అధ్యాయము). ఉత్తరమున గంగ పుట్టిన చోటినుండి దక్షిణమున కన్యాకుమారి వరకును వేయి యోజనములు వ్యాపించియున్న భూమినే భారత వర్షము లేక భరత ఖండము అనిరి.

అమరసింహుడు '—హిమవాన్ నిషధో విన్ధ్యో మాల్యవాన్ పారియాత్రకః గంధమాదన మన్యేచ హేమకూటాదయో నగాః—' అని జంబూద్వీపములోని కొన్ని పర్వతములను చెప్పినాడు.

1. హిమవంతము :- ఇది కింపురుషవర్షమునకు దక్షిణమందు మేరయై యుండునది.

2. నిషధము :- ఇది హరివర్షమనెడు వర్షమునకు ఉత్తరమున బాలసూర్యప్రకాశమై యుండును.

3. వింధ్యము :- ఇది భారత వర్షమందుండు కుల పర్వతము.

4. మాల్యవంతము :- ఇదియే క్రౌంచపర్వతము. ఇది మేరు పర్వతమునకు పడమట గంధమాదన సమప్రమాణమై యుండును.

5. పారియాత్రకము :- ఇది భారతవర్షమం దున్నది.

6. గంధమాదనము :- ఇది మేరుపర్వతమునకు తూర్పున నున్నది.

7. హేమకూటము :- ఇది కింపురుష వర్షమునకు ఉత్తరమునమున్నది. (ఇది లింగాభట్టుచేసిన వివరణము) జంబూద్వీపములో ఒక్కొక్క వర్షములోనేగాక నిరక్ష రేఖక్రింది ఆరు దీవులలోను దీవికి ఏడేసి కులపర్వతము లున్నవని వాయుపురాణము చెప్పినది.

కులపర్వతము లనగా ప్రధానపర్వతములని భావము. పర్వతమను పదమునకు సర్వత్ర ఉండునది, సంధులుగలది యనియు వ్యుత్పత్తియున్నది. పర్వములు లేకపోయినచో గిరియగును. అది పర్వతముకాదు. రెండు పర్వతముల నడుమనున్న నేల లోయ లేక కనుమ. సంస్కృతములో ఇదియే ద్రోణి. గిరి పగిలినచో అవగులును దరి యందురు.

భారత వర్షములో నున్న మహేంద్ర మలయాది కుల పర్వతములకు లెక్కపెట్టలేనన్ని శాఖలున్నవి. ఇవి శాఖా పర్వతములు. మందరము, వైహారము, దుర్దురము, కోలాహలము, సురసము, మైనాకము, వైద్యుతము, పాతంధమము, పాండురము, కృష్ణము, గంతుప్రస్థము, గోధనము, పుష్పగిరి, శ్రీ జయంతము, రైవతకము, కాకుపు, కూటశిలము మున్నైనవి శాఖా పర్వతములు. ఈ కొండలలో ఆర్యమ్లేచ్ఛ జనపదము లున్నవని వాయు పురాణము తెలుపుచున్నది.

కులపర్వతముల పుత్త్రికలు :- త్రిసామ, ఋతుకుల్య, ఇక్షుల, త్రిదివ, లాంగూలిని, వంశధార అను నదులు మహేంద్రమను కులపర్వతము గన్న కూతుండ్రు. వంశధార మన మెఱిగినదే. వీనిలో కొన్ని నదులు నేడు లేవు. కొన్ని నదులు నామరూపములు లేకుండ పోవుట కలదు. త్రివేణిగా ప్రసిద్ధి చెందినవానిలో సరస్వతి నేడు లేదు. నదులేమి ? అవి పుట్టిన పర్వతములే యొక్కొక యెడ మటుమాయమై పోయినవి. ఉత్తర సముద్రములో కొన్ని కొండలు మునిగిపోయినవని వాయు పురాణము వాకొనుచున్నది.

కృతమాల, తామ్రపర్ణి, పుష్పజాతి, ఉత్పలావతి అనునవి మలయపర్వతమునుండి స్రవించిన యమృత వాహినులు. వీనిలో తామ్రపర్ణి సుపరిచితము. ప్రసిద్ధమైన ఉదకమండలమే మలయపర్వతమని కొందరనుచున్నారు.

సహ్యకుల పర్వత పుత్త్రికలైన గోదావరి, భీమరథి, కృష్ణవేణి, వంజుల, తుంగభద్ర, సుప్రయోగ, కావేరులు దక్షిణ భారతము నానంద నిలయము గావించినవి.

ఋషీక, సుకుమారి, మందగ, కూసపలాశిని యను వాహినులు శుక్తిమత్కుల పర్వత సంతానము.

ఋక్షకుల పర్వతము గన్న గారాబు బిడ్డలు శోణ, నర్మద, మందాకిని, దశార్ణ, చిత్రకూట, తమస, పిప్పల, శ్రోణి, కరతోయ, పైశాచిక, నీలోత్పల, విపాశ, జంబుల, శుక్తిమతి, మక్రుణ, త్రిదివ అనునవి.

వింధ్యకులపర్వతము తాపి, పయోష్ణి, నిర్వింధ్య, మద్ర, నిషధ, వేణ్వ, వైతరణి, శితిబాహు, కుముద్వతి, తోయ, మహాగౌరి, దుర్గ, అంతశ్శిల అను జలకన్యలను గన్నది.

పారియాత్ర కులపర్వతమునుండి వేదస్మృతి, వేదవతి, వృత్రఘ్ని, సింధు, వర్ణాస, చందన, సతీర, మహతి, పర, చర్మణ్వతి, విదిశ, వేత్రవతి, శిప్ర, అవంతి, అను స్రవంతీ సంతానముద్భవిల్లినది.

ఇట్టి నదీమతల్లులకు పుట్టినింట్లైన యీమహాపర్వతముల వయస్సెంత ? ఇవి యెప్పటివి ? వీనికి తావైనభూమి వయస్సు రెండువందల కోట్లయేండ్లని భూతత్త్వవేత్తలనుడువుచున్నారు. మన పురాణములు వైవస్వతమనువు 800 కోట్ల యేండ్లవెనుకటివాడని చెప్పినవి. ఈ వైవస్వ

మనువునకు మునిమనుమడే సుప్రసిద్ధ భరతుడు. ఈతని పేరనే మనభూమి భారతవర్షమని ఖ్యాతమైనది. ఈతడును మనువే. కావున ఈ భూమి అంత వయస్సుగలదియని తేలుచున్నది. పర్వతములుకూడ కోట్లయేండ్లక్రింద నేర్పడినవే. కొన్ని కొండలు సుమారు 120 కోట్ల పైచిలుకు ఏండ్లక్రింద పుట్టినవని భూగోళశాస్త్రిజ్ఞులు నిరూపించిరి.

భారతవర్షము :- పురాణములన్నింటిలోను కడుంగడు ప్రాచీనములైనవి వాయు, విష్ణు, బ్రహ్మాండ పురాణములు. ఇవి భారతవర్షమును గుఱించి యేమి చెప్పినవి? భుగోళజ్ఞులు ఏమిచెప్పిరి ? పరిశీలింతము.

మేరువర్వతము :- మేరువు బ్రహ్మాండములో ఈశ్వర మాయ. ఇదియే దేవలోకము. మేరువు భార్య ధారిణి. ఈమె భార్త్విషదుల కూతురు. ఈమెకు మందర అను పుత్రుడేకాక మరి ముగ్గురు కూతుంద్రుకలరు. ఇది స్వాయంభువ మన్వంతరములోనిముచ్చట (వా. 30 – 35.)

వెనుకటిరోజులలో మేరు శిఖరము ధగధగలాడుచు ముల్లోకములకు కనబడుచుండెడిది. దానికి సామిత్ర మని పేరు. దాని ఒక ప్రక్క హిమవంతుని కూతురు నివసించెడిది. (వా. 30 – 81.)

మేరువు ఇలావృతవర్షము నడుమ నున్నది. మేరువునకు నాలుగువైపులను భద్రాశ్వ, భారత, కేతుమాల ఉత్తర కురుదేశము లున్నవి. ఇందు నీల, నిషధ, శ్వేత, హేమకూట, హిమవత్, శృంగవత్ పర్వతములును, హిమవత్పర్వతము నాశ్రయించి భరతవర్షమును, హేమకూటము నాశ్రయించి, కింపురుషవర్షమును, నిషధ హేమకూట పర్వతముల నాశ్రయించి హరివర్షమును, నీలశైలము నాశ్రయించి రమ్యకవర్షమును, శ్వేతపర్వతము నాశ్రయించి హిరణ్మయ వర్షమును, శృంగవత్పర్వతము నాశ్రయించి కురువర్షమును గలవు. ఇలావృతవర్షముతో నివి మొత్తము ఏడు వర్షములు.

జంబూద్వీపము :- స్వాయంభువుని కొడుకు ప్రియవ్రతుడు జంబూద్వీపమును తన పెద్దకొడుకుకగు అగ్నీధ్రునికిచ్చెను. అగ్నీధ్రుడు తన పెద్దకుమారుడైన నాభి యను వానికి జంబూద్వీపములో దక్షిణముననున్న హిమవర్షము నిచ్చెను. (వా. 33 – 37 – 45.) జంబూద్వీపమునందు సిద్ధచారణ గంధర్వులు నివసించు కొండలు గల తొమ్మిది భువనములున్నవి. లవణ సముద్రము దానిని చుట్టుకొనియున్నది. జంబూద్వీపములో భారతవర్షమునకు దక్షిణమున అంగ, యమ, మలయ, శంఖ, కుశ, వరాహ, బర్హిణము అను నేడు అనుద్వీపము లున్నవి. అంగ ద్వీపములో మ్లేచ్ఛగణములున్నవి. యమద్వీపము బంగారమునకు పుట్టినిల్లు. మలయద్వీపములో మ్లేచ్ఛులున్నారు. ఇక్కడ చందనవృక్షాలెక్కువ. ఇదికూడ బంగారమునకు, ముత్యములకు నిలయము. ఈ ద్వీపములో మందర పర్వతమున్నది. దానిమీద సురాసురపూజితుడు శ్రీ అగస్త్య మహర్షి యుండును. ఇందు త్రికూట పర్వత మున్నది. దానిమీద 3000 యోజనాల లంకాపట్టణ మున్నది. అది రాక్షస నివాసము. దీనికి తూర్పున గోకర్ణ క్షేత్రమున్నది. శంఖ ద్వీపము నూరు యోజనాల పరపు. ఇది మ్లేచ్ఛ నివాసము. కుముద ద్వీపములో మహాదేవుని సోదరియగుకుముదను, మహాద్వీపములో ఆదివరాహస్వామిని పూజింతురు.

ఇట్లు భూమికి నడుమ లవణ సముద్రము మేఖలవలె నున్నది. ఆ సముద్రములో అనుద్వీపాలున్నవి.

వాటిలో పుట్టు మీసాలవారు, మోకాలి బంటివారు, వ్రేళ్ళు వెల్లంకులు, కాయలు గనుళ్ళు తినువారు, వావి వరుసలు లేనివారు, 80 ఏండ్లు బ్రతుకువారు గలరట !

వీరు ఊరాంగ్ ఉటాన్ వంశ మూలపురుషులేమో ? ఇందలి మలయము నేటి మలయాయో నా ? బర్హిణద్వీపము నేటి బోర్నియో కావచ్చునా ?

మేరువునకు దక్షిణముగా హిమవత్పర్వతము, దానికి దక్షిణముగా సముద్రము వరకును భారత వర్షము, దీనికి ఉత్తరమున అనగా హిమాలయమున కెగువ కింపురుష వర్షము, దానికి ఉత్తరముగా హరివర్షము కలవు.

కొందఱు నవ్యపరిశోధకు లిట్లందురు :- జంబూ ద్వీపములో దక్షిణపు పెద్ద భారత ద్వీపము. కావుననిది జంబూ భారత ద్వీపము, దీని దక్షిణపుకొన భారత వర్షము. అది కూడ జంబూ ద్వీపమే. తత్సూచకముగా నేటికిని కాశ్మీరములో జమ్మూ అని కొంత ప్రదేశ మున్నది. జంబూ పదమునకు తద్భవమే జమ్మూ అనునది.

బ్రహ్మాండ పురాణములోని జంబూద్వీపము వేరుగా నున్నది. దానిలోను నవఖండములున్నవి. వాని పేర్లు :

